# తెలుగు నిఘంటువు

## (విద్యార్థుల కోసం)

పరిష్కర్త :

**ఆచార్య జి. యన్. రెడ్డి,**
ఎం.ఏ., ఎం.లిట్., పిహెచ్.డి.




ప్రచురణ :

**తెలుగు విశ్వవిద్యాలయం**
కళాభవనం, సైఫాబాదు, హైదరాబాదు-4

తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ - 100

ప్రథమ ముద్రణ : 1967
ద్వితీయ ముద్రణ : 1973 } ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ
తృతీయ ముద్రణ : 1979

చతుర్థ ముద్రణ : 1989 తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ

ప్రతులు : 3000

వెల : రు. 58-00

ప్రతులు దొరికే చోటు :

ప్రచురణ విభాగం, తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవనం, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

ముద్రణ :

రఘు ఆర్ట్ ప్రింటర్స్,
పార్శిగుట్ట, హైదరాబాదు-48.

# భూమిక

తెలుగు భాషా సాహిత్య సంస్కృతుల వికాసాభ్యుదయాల కోసం రూపుదిద్దుకున్న ఉన్నత విద్యాసంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. వివిధ అకాడమీలనూ, కేంద్రాలనూ అంతర్లీనం చేసుకుని ఇది సువిస్తృత ప్రాతిపదికపై బహుముఖంగా కార్యకలాపాలు నిర్వహిస్తోంది.

విశ్వవిద్యాలయం నిర్వహించే కార్యక్రమాల్లో గ్రంథప్రచురణకు ప్రత్యేక స్థానముంది. పూర్వం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 183 గ్రంథాలను ప్రచురించింది. "శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు" "బ్రౌణ్య నిఘంటువు" "సంస్కృతాంధ్ర పదార్ణవము" వంటి పెద్ద నిఘంటువులు ప్రచురించి భాషా సాహిత్య రంగాలకు అపార సేవచేసింది. సాంబ నిఘంటువు మొదలుకుని శబ్దరత్నాకరం వరకు పండితులకూ, సాహితీవేత్తలకూ ఉపకరించే నిఘంటువులు తెలుగులో అనేకం వున్నాయి. సామాన్య పాఠకులకూ, విద్యార్థులకూ పనికివచ్చే నిఘంటువు కొరత తీర్చేందుకు సాహిత్య అకాడమి 1987 లో 'తెలుగు నిఘంటువును'ను ప్రచురించింది. దీనిలో వివిద శాస్త్రాలకు చెందిన ఇరవై అయిదువేల పదాలు చోటుచేసుకున్నాయి. ప్రముఖులతో కూడిన సంపాదకవర్గం విశేష కృషిచేసి దానికి రూపకల్పన చేసింది. ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు పరిష్కర్తగా అమూల్య సహకారాన్ని అందించారు. ఈ ప్రచురణ విశేష జనాదరణ పొంది, లోగడ ప్రచురించిన మూడు ముద్రణ ప్రతులు శీఘ్రంగా అమ్మకమయ్యాయి.

తెలుగు విశ్వవిద్యాలయం నాలుగో ముద్రణ బాధ్యత స్వీకరించింది. యథాపూర్వంగా ఈ ముద్రణకూడా అందరి మన్ననలు అందుకుంటుందని మా విశ్వాసం.

హైదరాబాదు.
1-9-1989

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు

# తొలి పలుకు

## (మొదటి కూర్పు)

భారతదేశ సర్వతోముఖాభ్యుదయానికి ఉద్దేశించిన మన పంచవర్ష ప్రణాళికల కార్యక్రమాలలో ఆధునిక భాషల అభివృద్ధి కూడ ఒక భాగము. ఈ ఆశయముతో ఆధునిక భాషల అభివృద్ధి సంఘాల యేర్పాటు అన్ని రాష్ట్రాలలో జరిగినది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ఏర్పాటుచేసిన ఆధునిక భాషల అభివృద్ధి సంఘము తెలుగు విద్యార్థులకు ఉపయోగకరమగు నిఘంటువును ప్రచురించవలెనని నిర్ణయించి, ఈ బాధ్యతను ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీకి అప్పగించినది. ఈ బాధ్యదను ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి కార్యవర్గము సంతోషముతో స్వీకరించి, ఇందుకు సంబంధించిన కార్యనిర్వహణను పర్యవేక్షించుట కొరకు శ్రీ నూకల నరోత్తమరెడ్డి ఎం. ఏ., గారి అధ్యక్షతలో శ్రీ గిడుగు వేంకట సీతాపతి శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ నార్ల వేంకటేశ్వరరావు, శ్రీ బోయి భీమన్న గార్లతో కూడిన ఒక పర్యవేక్షక సంఘమును ఏర్పాటుచేసినది. ఈ సంఘము సమావేశమై, యీ నిఘంటువులో సుమారు ఇరువది అయిదు వేల పదాలు ఉండవలెననియు, తెలుగు బోధనా భాషగా ప్రీ యూనివర్సిటీ తరగతి వరకు విద్యార్థులు పఠించు చరిత్ర, భూగోళము, అర్థశాస్త్రము, రాజకీయశాస్త్రము, గణితశాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము, రసాయన శాస్త్రము, వృక్షశాస్త్రము, వ్యవసాయశాస్త్రము, గృహవిజ్ఞానశాస్త్రములకు సంబంధించిన పదములు ఈ నిఘంటువులో చేర్పవలెననియు తీర్మానించినది.

పైన పేర్కొనిన వివిధ విజ్ఞాన శాస్త్రములతో పాటు ఆంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన పదజాలమును ఏరి, కూర్చి, వాని అర్థములను వివరించు నిఘంటువును సిద్ధముచేయుటకు క్రింది సంపాదక సంఘమును నియమించుట జరిగినది.

1. డా. బి. విశ్వనాథం, ఎం.ఏ., పిహెచ్.డి.,
   రీడరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము
   (గణితశాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము)

2. శ్రీ బి. వి. రమణారావు, ఎం.ఎస్సి.,
   రీడరు, వ్యవసాయ విశ్వవిద్యాలయము
   (జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, వ్యవసాయశాస్త్రము.)

3. డా. సుబ్బాయమ్మ, ఎం ఏ., పి హెచ్.డి.
ప్రిన్సిపాలు, హోం సైన్సు కళాశాల
(గృహ విజ్ఞానశాస్త్రము)

4. డా సరోజిని రేగాని, ఎం.ఏ.,పి హెచ్.డి.
రీడరు ఉస్మానియా విశ్వవిద్యాలయము
చరిత్ర, భూగోళము, అర్థశాస్త్రము, రాజకీయవిజ్ఞానశాస్త్రము, వాణిజ్య విజ్ఞానశాస్త్రము)

5. శ్రీ యం. వెంకటేశ్వర రావు. ఎం.ఏ.,ఎల్.టి,
(ఆంధ్రవాఙ్మయము)

6. శ్రీ కె. నాగేశ్వరశర్మ, ఉభయ భాషాప్రవీణ
(ఆంధ్రవాఙ్మయము)

సంపాదక సంఘమువారు, పర్యవేక్షక సంఘమువారు సమష్టిగా పలుమారులు సమావేశమై యీ నిఘంటువు ప్రాతిపదికను చర్చించి, నిర్మాణములో అనుసరింపవలసిన కార్య విధానమును నిర్ణయించిరి. అక్కడక్కడ కొన్ని రేఖాచిత్రములు కూడ వేయవలెనని నిర్ణయించిరి.

సంపాదకులు తమ పనిని ముగించిన తరువాత వారు కూర్చిన శబ్దములను, అర్థ వివరణములను మరొకరు పరిశీలించి తగు సూచనలను చేయవలెనని పర్యవేక్షక సంఘము, సంపాదక సంఘము సమష్టిగా నిర్ణయించినది. ఈ నిర్ణయము ప్రకారము ఆంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన శబ్దాలను శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు; చరిత్ర భూగోళము, అర్థశాస్త్రము, రాజకీయవిజ్ఞానశాస్త్రము, వాణిజ్యవిజ్ఞానశాస్త్రము మొదలైన శాఖలకు సంబంధించిన శబ్దాలను ఉస్మానియా విశ్వవిద్యాలయము కామర్సుశాఖ అధ్యక్షులు డా.వి. రామనాధంగారు. గణితశాస్త్రము,పదార్థ విజ్ఞానశాస్త్రము,రసాయనశాస్త్రము, జంతుశాస్త్రము,వృక్షశాస్త్రము గృహ విజ్ఞానశాస్త్రములకు సంబంధించిన పదాలను శ్రీ మేడేపల్లి నరసింహస్వామి ఎం.ఏ., గారు పరిశీలించి పరిష్కరించిరి.

ఈ విధముగా పరిష్కృతమైన శబ్దార్థముల పట్టికలను అకారాదిగా ఏర్పాటుచేసి, వ్రాతప్రతిని సిద్ధముచేయు బాధ్యతను ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుశాఖలో రీడరు, డా. బి. రామరాజు ఎం. ఏ.

పి.హెచ్.డి., గారికి అప్పగించగా వారు ఈ కార్యమును నిర్వహించిరి వ్రాతప్రతి సిద్ధమైనతరువాత దానిని ఆమూలాగ్రముగా పరిశీలించి ముద్రణ వ్యవహారమును పర్యవేక్షించిన వారు డా. దివాకర్ల వేంకటావధాని, శ్రీ బి. వి. రమణారావు గార్లు.

ఈ నిఘంటువు నిర్మాణములో అకాడమీకి తమ సంపూర్ణ సహకారము లభింపజేసిన పర్యవేక్షక సంఘ సభ్యులకు, సంపాదకులకు, పరిష్కర్తలకు. ముద్రణ కార్యమును పరిశీలించిన విద్వాంసులకు అకాడమి పక్షాన అనేక ధన్యవాదములు.

హైదరాబాదు.
7-8-1967

దేవులపల్లి రామానుజరావు

# తొలిపలుకు

(ద్వితీయ ముద్రణము)

ఈ 'తెలుగునిఘంటువు' ప్రచురించిన అయిదేండ్లకే ద్వితీయముద్రణావశ్యకత యేర్పడుట సంతోషింపదగిన విషయము. దీనివలన ఈ నిఘంటువు విద్యార్థుల అవసరములను తీర్చుటలో అకాడమీ భావించిన ప్రమాణ ప్రయోజనములను సాధించినదని తలంచుటకు వీలుపడుచున్నది.

ప్రథమ ముద్రణము పి. యు. సి., తరగతి విద్యార్థుల స్థాయినుద్దేశించి పరిష్కరింపబడినది. విశ్వవిద్యాలయములలో డిగ్రీతరగతుల వరకు బోధనాభాషగా తెలుగును ప్రవేశపెట్టిన నేటి పరిస్థితుల కనుగుణముగా ఈ ద్వితీయ ముద్రణమును డిగ్రీతరగతి విద్యార్థులకుగూడ ఉపయోగపడునట్లు సిద్ధము చేయవలెనని అకాడమీ భావించి, ఆ బాధ్యతను శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులైన ఆచార్య డా. జి.యన్. రెడ్డి గారికి అప్పగించనైనది. ఈ ముద్రణలో మొదటి కూర్పుకంటె శాస్త్రీయ పదజాలముతోబాటు సాహిత్య పదజాలము పరిమాణముకూడ పెంచనైనది.

మాతృభాషలో అధ్యయనముచేయు విద్యార్థులు శాస్త్రీయ పరిభాషను అవగాహనము చేసికొని, తమభాష కనుగుణమైన పదజాలమును స్థిరీకరింప చేసికొను, ఈ సంధికాలములో ఇటువంటి నిఘంటువుల పాత్ర ప్రయోజనాత్మకముగా ఉండగలదను ఆశయముతో ఈ ద్వితీయముద్రణమును విస్తృత ప్రాతిపదికలమీద పరిష్కరించుట సమంజసమని అకాడమి అభిప్రాయపడినది.

ఆ లక్ష్యము మేరకు ఈ నిఘంటువును తమ ఆధ్వర్యవమున సిద్ధము చేయించి, మా కందించిన ఆచార్య జి. ఎన్. రెడ్డిగారికి అకడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ తెలుగు నిఘంటువు మేమాశించినట్లు డిగ్రీ తరగతుల విద్యార్థులకుకూడ ఉపయోగపడి, మా ప్రయత్నము సార్థకము కాగలదని విశ్వసించుచున్నాము.

హైదరాబాదు.
4-1-1978.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# తెలుగు - తెలుగు నిఘంటువు

(రెండవ ముద్రణ ప్రతిని పరిష్కరించిన విధానము)

1. శాస్త్ర సంబంధమైన పారిభాషిక పదాలు, నిత్యవ్యవహారంలోని ఆంగ్ల భాషా పదాలు అనేకమైనవి అదనంగా చేర్చబడ్డవి.

2. మొదటి ముద్రణలోని స్ఖాలిత్యములు సవరింప బడ్డవి.

   ఉదా : ఉండె - ఉరిడె, కలరవము - కలవరము.

3. నీళ్ళలో జాడించువంటి సామాన్య ఆరోపాలు తొలగించి, 'నీళ్ళు తాడు' 'నీళ్ళు వదలు' వంటి జాతీయాలు చేర్చబడినవి.

4. చిన్న మడత ఇస్త్రీబిల్ల - ఇత్యాది వివరణ రూపాలైన ఆరోపాలు తొలగింపబడ్డవి.

5. ప్రధానారోపాలుగా వున్న ఇంగ్లీషుపదాలకు ప్రక్కనే కుండలీకరణాల్లో ఇంగ్లీషు వర్ణక్రమంలోని రూపా లివ్వబడ్డవి.

   ఉదా : ఎంపోరియం (Emporium)

6. ఇంగ్లీషు పదాలకు సమానార్థకాలైన తెలుగు పదాలు ప్రధాన ఆరోపాలుగా వున్నప్పుడు అర్థ వివరణం చివర ఆంగ్ల పదా లుదాహరింప బడ్డవి.

   ఉదా : అవసాన సూత్రము (Filum terminate)
   అధోహనువు (Manditle)

7. రూపసాదృశ్యముండి భిన్నధాతుజన్యాలైన భిన్నార్థకపదాలను 1, 2 సంఖ్యలచే గుర్తించి వేరుగా ఇవ్వడమైనది.

8. రూపాంతరాలకు, సమానార్థకాలకు 'చూపై' గుర్తించబడింది.

9. శకటరేఫ, అరసున్న ప్రధానారోపాల్లో మాత్రమే పాటింపబడినవి. అర్థ వివరణలో పాటించలేదు. ద్విత్వరేఫ స్థానాల్లో మాత్రం శకటరేఫ వాడ బడింది.

10. సంజ్ఞా వివరణములు మొదటి ముద్రణలో నిర్దుష్టంగా లేవు. ఇందులో నిర్దుష్టత పాటింప బడింది.

11. వై. (వైకృతము) అని గుర్తించిన పదాలకు అర్థ వివరణ చివర మూలరూపా లుదాహరింపబడ్డవి.

ఉదా : కన్నడు - సం కృష్ణః.
అనతి - సం ఆజ్ఞప్తిః.

12. ఒకే శబ్దం విశేషణ, విశేష్య రూపాల్లో వున్నప్పుడు విశ, వి. అని గుర్తించి అర్థాలు వేర్వేరుగా వ్రాయబడ్డవి

ఉదా : కర్షకుడు.

13 అర్థ వివరణలో సమానార్థక పదాలమధ్య ',' వాడబడింది. నానార్థక పదాలు 1, 2 సంఖ్యలచేత గుర్తింపబడ్డవి.

ఉదా 1, 2 సంఖ్యలచేత. గుర్తింపబడ్డవి.

ఉదా ; మాట వి. 1. పలుకు, వచనము, 2. నింద. 3. వృత్తాంతము.

14. అర్థ వివరణలో చాలవరకు స్పష్టతకై విసంధి పాటింపబడింది.

15. అర్థ వివరణలో స్పష్టత అవసరమనిపించినచోట్ల వాక్యరూప వివరణము కుండలీకరణాల్లో వ్రాయబడ్డది.

16. సంస్కృత పదాల్లో కొన్ని వేర్వేరర్థా లిచ్చే ఏక పదం విడగొట్టి భిన్నరూపా లిచ్చి భిన్నార్థాలు వ్రాయబడ్డవి.

ఉదా ; ఉత్ + ధూతము.
ఉత్ + హూతము.

17. పిలైనంశవర కన్నిపదాలకు వ్యుత్పత్త్యర్థాలు వ్రాయబడ్డవి.

18. ప్రసిద్ధ పదాలకు నానార్థా లియబడ్డవి,

ఉదా : ఏకావళి, నాగరము, భ్రాంతి.

జి. యస్. రెడ్డి
పరిష్కర్త

# సంక్షిప్తరూపములు - వివరణము

అప : అపదము
అర్థ : అర్థశాస్త్రము
అలం : అలంకారశాస్త్రము
అవ్య : దేశ్య అవ్యయము
అ. సం రా : అమెరికా సంయుక్త రాష్ట్రము
ఇం. : ఇంగ్లీష్
ఉదా. : ఉదాహరణము
ఉప. : ఉపవర్గ
ఏక. : ఏకవచనము
ఐ. రా. స. : ఐక్యరాజ్య సమితి
క : కన్నడము
కీట. : కీటశాస్త్రము
క్రి. : దేశ్య క్రియ
క్రి. విశే. : క్రియాఽవ్య విశేషణము
క్రీ. శ. : క్రీస్తు శకము
క్షే. గణి. : క్షేత్ర గణితము
ఖగో. : ఖగోళశాస్త్రము
గణి. : గణితశాస్త్రము
గృహ. : గృహవిజ్ఞానశాస్త్రము
చరి. : చరిత్ర
చూ. : చూడు
చూ. పై. : చూడు పైది
ఛం. : ఛందశ్శాస్త్రము
జం. : జంతుశాస్త్రము
జాతీ. ; జాతీయము
జీవ. : జీవశాస్త్రము
జ్యోతి. : జ్యోతిశ్శాస్త్రము
త. : తమిళము
తర్క. : తర్కశాస్త్రము

నాట. : నాటకము

నాట్య. : నాట్యశాస్త్రము

ని. బహు. ; నిత్యబహువచనము

న్యా. : న్యాయము

పర్యా : పర్యాయపదము

పా శా : పారిశ్రామికశాస్త్రము

పౌర. : పౌరశాస్త్రము

ప్ర. : ప్రకృతి

ప్రత్య. : దేశ్య ప్రత్యయము

ప్రా. : ప్రాకృతము

బహు . బహువచనము

బీ. గణి. : బీజగణితము

భూగ. : భూగర్భశాస్త్రము

భూగో. : భూగోళశాస్త్రము

భౌతి. ; భౌతికశాస్త్రము

మి. వి. : మిశ్ర విశేష్యము

మీ. : మీమాంసశాస్త్రము

మొ. : మొదలగు

యోగ. : యోగశాస్త్రము

రసా. : రసాయనశాస్త్రము

రాజ. : రాజకీయశాస్త్రము

రూ. : రూపాంతరము (లు)

వాణి. : వాణిజ్య శాస్త్రము

వి. : దేశ్యవిశేష్యము

వికృ. : వికృతి

విశే. : దేశ్యవిశేషణము

వృక్ష. : వృక్షశాస్త్రము

వేదాం. : వేదాంతశాస్త్రము

వై. : వైకృతము

వైద్య. : వైద్యశాస్త్రము

| | | |
|---|---|---|
| వ్యతి. | : | వ్యతిరేకము |
| వ్యవ. | : | వ్యవసాయశాస్త్రము |
| వ్యాక. | : | వ్యాకరణశాస్త్రము |
| వ్యావ. | : | వ్యావహారికము |
| వ్యు. | : | వ్యుత్పత్త్యర్థము |
| శ. చం. | ; | శబ్దార్థ చంద్రిక |
| శబ్దా. | : | శబ్దాబ్దము |
| శ. ర. | : | శబ్దరత్నాకరము |
| శారీ | : | శారీరకశాస్త్రము |
| శాస. | : | శాసనము |
| సం. | : | సంస్కృతపదము |
| సం. క్రి. | : | సంస్కృతక్రియ |
| సంగీ. | : | సంగీతశాస్త్రము |
| సం. న్యా | : | సంస్కృత న్యాయము |
| సం. ప్రత్య. | : | సంస్కృత ప్రత్యయము |
| సం. వి. | : | సంస్కృత విశేష్యము |
| సం. విశ. | : | సంస్కృత విశేషణము |
| సం. సర్వ | : | సంస్కృత సర్వనామము |
| సంవ. | · | సంవత్సరము |
| సమా. | : | సమాసము |
| సర్వ. | : | సర్వనామము |
| సా. | : | సామెత |
| హిం. | : | హిందూస్థానీ |

# తెలుగు నిఘంటువు

## అ

**అ** అచ్చులలో మొదటి అక్షరము. అవ్య. నిశ్చయార్థకము. ఉదా. శరగతిలో రాముడ ఉత్తముడు. సం. 1. అభావార్థకము. ఉదా. అజ్ఞానము. 2 వ్యతిరేకార్థము. ఉదా. అసత్యము

**అంక** వి. పార్శ్వము, ప్రక్క. రూ. అణక

**అంకకాఁడు** విశ. 1. చలపట్టువాడు. 2 కలహప్రియుడు.

**అంకగణితమధ్యమము** నం. వి. (గణి.) రెండు రాసుల మొత్తములో సగము (Arithmetic mean).

**అంకగణితము** సం.వి. (గణి.) అంకెల నుపయోగించిచేయు గణితము(Arithmetic)

**అంకగణితశ్రేణి** సం.వి. (గణి.) వరుస పదముల (Terms) భేదము సమానముగ నుండు శ్రేణి (Arithmetical progression).

**అంకణము** వై. వి. నలుచదరపుచోటు. రెండు దూలముల మధ్య ప్రదేశము. కత్స. సం. అంగణమ్

**అంకనము** సం. వి. 1. గుర్తు. 2. గుర్తు వేయుట 3 చిహ్నము ముద్ర (వాణి.) ఉత్పాదక సంస్థ క్క విశిష్టతను తెలుపు గుర్తు (Trade ma k)

**అంకపాళి** సం. వి. 1. తొడ 2 తిన్నె 3. కౌగిలి. 4 దాడి. రూ. అంకపాలి, అంకపాలిక. అంకపాళిక.

**అంకపాళిక** సం. వి. చూ. పై. అంకపాళి.

**అంకపొంకములు** వి. (ని. బహు.) 1. కోపము 2. విరోధము. 3. అధికము. విశ ఉగ్రము. రూ. అంకాపొంకములు. అంకాపొంకాలు.

**అంకము**[1] వి. ఆక్షేపము.

**అంకము**[2] సం. వి. 1. చిహ్నము. 2. దశవిధ రూపకములలో నొకటి. 3. నాటక విభాగమునకు పేరు. 4. ఒడి. 5. సమీపము. 6 యుద్ధము. (గణి.) 1. వస్తువులెన్ని యున్నవో లేక వస్తుపరిమాణ మెంతయో తెలియజేయు గుర్తు. (Number). 2. శూన్యముతోకూడ పది లోపలనుండు సంఖ్య (Digit). 3. సంఖ్య.

**అంకవన్నె** వి. రికాబు, గుఱ్ఱము నెక్కుటకు ప్రక్కనమర్చిన మెట్టు. రూ. అంకవన్నె, అంకెవన్నె, అంకెవన్నియ.

**అంకవిద్య** సం. వి. గణితశాస్త్రము,

**అంకశోధన** సం వి (భూగో.) కొలత కుపయోగించు సాధనముపై గీయబడిన గీతలు కచ్చితమైన పరిమాణములను చూపునో లేదో పరీక్షించు విధానము (Calibration)

**అంకాపొంకములు** వి. (ని. బహు) చూ అంకపొంకములు

**అంకించు**[1] సం. క్రి. స్తుతించు

**అంకించు** క్రి. 1 సంతోషించు 2. పైకెత్తు 3. ఆడించు. 4 జళిపించు. 5. పట్టుకొను.

**అంకిణి** వి. గుఱ్ఱపు జీనునకు అలంకారము.

**అంకితము** నం విణ. గుర్తు వేయబడినది 2 ఎంచబడినది. 3. కృతియీయాబడినది (గ్రంథము)

**అంకియ** వై. వి. 1. సంఖ్య. 2. వశము. 3. సమయము. రూ. అంకె. నం అంకః.

**అంకియము** వి. 1. ఎద్దు మొ. వాని మీద ఒక వైపుననున్న బరువు 2. గుఱ్ఱము నెక్కుటకు వేయు ఇనుపమెట్టు రూ. అంకెము.

**అంకిలి** వి. 1. కలత. 2. అడ్డగింత. 3. ఆపద. 4. నాశము. 5 మర్మము. 6 దౌడకీలు (బహు.) అంకిళ్లు.

**అంకిలిపెట్టు** క్రి. 1. అడ్డగించు. 2. బాధించు 3. బంధించు.

**అంకు** వి. 1. తాలువు మూలము. 2. అంకమ్మ అను గ్రామదేవత. క్రి. లభించు

**అంకుటము** నం.వి. కుంచెకోల. తాళపుచెవి.

**అంకుడు** వి. 1. అంకుడుచెట్టు. 2. వేలుపు.

**అంకురనిరోధము** నం.వి. (వ్యావ.) విత్తులు. మొలకెత్తునపుడు వాని శీతోష్ణ పరిస్థితులలో మార్పుచేసి మొలకల వృద్ధిని అరికట్టుటకు చేయు ప్రయోగము (Vernalisation).

**అంకురము** నం. వి. 1 మొలక, బీజము. 2. నీళ్ళు 3. నెత్తురు. 4. వెంట్రుక. రూ. అంకూరము. (జీవ.) పిండము. భ్రూణము (Embryo)

**అంకురించు** నం. క్రి. 1. మొలకెత్తు. 2. పుట్టు. 3. కలుగు.

**అంకురోత్పత్తి** నం.వి. (వృశ.) బీజములోనున్న అంకురము మొలకెత్తుట. బీజోత్పత్తి (Germination).

**అంకుశము** నం వి. ఏనుగును నడుపుటకు కుంభస్థలమున పొడుచు ఆయుధము.

**అంకూరము** నం. వి. మూ. అంకురము.

**అంకె** వై. వి. 1. సంఖ్య. 2. వశము. 3. సామీప్యము. రూ. అంకియ. నం. అంకః.

**అంకెము** వి. మూ అంకియము.

**అంకెగొను** క్రి. 1. క్రమ్ముకొను- 2 స్వాధీనము చేసికొను.

**అంకెవన్నియ** వి మూ అంకవ ౨.

**అంకోటము** నం వి. ఊడుగుచెట్టు. రూ. అంకోడము, అంకోలము.

**అంకోడము** నం. వి. మూ. పై.

**అంకోలము** నం. వి. మూ. అంకోటము.

**అంగ** వి. కాలు చాచి పెట్టిన అడుగు.

**అంగకము** నం. వి. 1. శరీరము. 2. అంగము. అవయవము. (జం.) సాధారణముగా నోటిదగ్గరనుండు పొడుపైన, మృదువైన ఉపాంగము (Appendage).

**అంగజాల** వి. అంతఃపురపు కావలివాడు.

**అంగజాలుఁడు** వి. మూ. పై.

**అంగజుఁడు** నం. వి. మన్మథుడు. 2. కొడుకు.

**అంగడి** వి. 1. దుకాణము. 2. రచ్చ. న్యాయసభ. 3. అగసాలె మొ. వారు పనిచేయుచోటు.

**అంగడివాడ** వి. బజారు, అంగడివీథి.

**అంగణము** నం. వి. 1 ఇంటిముందుచోటు. ముంగిలి. 2. ప్రదేశము.

**అంగద** [1] వి. 1. ఆకలి 2. ఆపద, ఉపద్రవము. 3. కోపము. 4. దుఃఖము.

**అంగద** [2] నం. వి. దక్షిణ దిక్కునందలి వామనము అను దిగ్గజమునొక్క భార్య.

**అంగదట్టము** వి పావడ, పరికిణి.

**అంగన** నం. వి. 1. ఉత్తరదిక్కునందలి

సార్వభౌమము అను దిగ్గజము యొక్క భార్య 2. స్త్రీ.

**అంగబిల్ల** వి. ఆడుపిల్లల మొలకు గట్టెడు వెండి లేక బంగారుబిళ్ళ. రూ. అంగబిళ్ళ

**అంగభవుడు** సం.వి. 1. మన్మథుడు. 2. పుత్రుడు.

**అంగభేద రహితములు** సం. వి. (వృక్ష.) వివిధాంగములుగా విభజింపబడని శరీరములుగల ఉద్భిజ్జములు (Thallophyta). (ఈ తరగతిలో సూత్రోద్భిదములు (Algae), శిలీంధ్రములు (Fungi) కలవు).

**అంగమచ్చము** వి. ఒడలిగుర్తు 2. పుట్టుమచ్చ. 3 ఆనవాలు.

**అంగము**[1] వి 1. రీతి. విధము. 2 అందము.

**అంగము**[2] సం. వి. 1. అవయవము, దేహము. 2. ఉపాయము 3. ఒక దేశము. విశే. 1. అవయవముగలది. 2. సమీపించినది. వి. (గణి.) ఏదేని వస్తువుయొక్క ముఖ్యభాగము, మూలధర్మము, మూలకము (Element)

**అంగరకా** హిం. వి. చొక్కాయ. సం. అంగరక్షా. వ్యు. అంగములను రక్షించునది.

**అంగరాగము** సం. వి. 1. చందనాది ద్రవ్యము. 2. చందనాదుల పూత. 3 మేని మెరుపు.

**అంగలారుచు** క్రి భయాదులచే అరచు, దుఃఖించు. రూ. అంగలార్చు.

**అంగలించు** క్రి. 1. అతిక్రమించు. 2 ఉత్సహించు. 3. ప్రయత్నించు

**అంగహారము** సం. వి. అవయవముల కదలిక, అంగ విక్షేపము.

**అంగాది ఆమ్లము** సం. వి. (రసా) వృక్ష సంబంధమగు ఆమ్లము (Organic acid)

**అంగారక వారము** సం. వి. మంగళ వారము

**అంగారకుడు** సం. వి. నవగ్రహములలో కుజుడు

**అంగారధారక** సం. వి. కుంపటి. అంగారధారిక. రూ. అంగారధాని.

**అంగారము** సం వి. 1. నిప్పు 2. బొగ్గు.

**అంగారశకటి** సం. వి కుంపటి అంగారధానిక

**అంగారిణి** సం వి. కుంపటి, అంగారశకటి.

**అంగి** వై. వి పొడవైనచొక్కాయ, అంగీ సం అంగికా. సం. విశే. 1. అంగములు కలది. 2. ప్రధానమైనది. ఉదా. పారిజాతాపహరణ కావ్యమున అంగిరసము శృంగారము.

**అంగిడిముల్లు** వి. కుత్తుకలో కలుగు రోగము గళాంకురము.

**అంగిలి** వి. లోకుత్తుక.

**అంగీకరించు** సం. క్రి. 1. సమ్మతించు, ఒప్పుకొను 2. స్వీకరించు.

**అంగీకారము** సం. వి. 1 సమ్మతి, ఒప్పుకొనుట. 2. స్వీకారము.

**అంగీకృతము** సం. విశే. సమ్మతింపబడినది.

**అంగు** వి. 1. అందము. 2. రీతి, విధము. 3 అంగబలము. 4. ఇంటిలోని సామగ్రి. రూ. హంగు

**అంగుటము** వై. వి. బొటనవ్రేలు, అంగుష్ఠము. సం. అంగుష్ఠః.

**అంగుడుదుడిపి** విశే. తంటాలమారి, ఇక్కడి మాటలు అక్కడ అక్కడి మాటలు ఇక్కడ చెప్పువాడు, చాడీకోరు. రూ. అంగుడు దుడుపు.

**అంగుష్ఠము** సం. వి. బొటనవ్రేలు. (గృహ) బట్టలు చేతితో కుట్టునపుడు వ్రేలికి పెట్టుకొనుచిన్నటోపివంటి గొట్టము (Thimble).



**అంగుళము** సం వి 1. వ్రేలు, అంగుష్ఠము

బొటన వ్రేలు. 2. అడుగులో పన్రెండవ భాగము.

**అంగుళి** సం. వి. 1. వ్రేలు. 2. తొండము చివర.

**అంగుళిత్రము** సం. వి. విలుకాడు వ్రేలికి దెబ్బ తగులకుండ కట్టుకొను చర్మము అత్రము.

**అంగుళిత్రాణము** సం. వి. చూ. పై.

**అంగుళిముద్ర** సం. వి. 1. ముద్రగల ఉంగరము, ముద్దుటుంగరము. 2. బొటన వ్రేలి ముద్ర.

**అంగుళీమానము** సం. వి. అంగుళము మూల ప్రమాణముగా గల కొలత.

**అంగుళీయకము** సం. వి. ఉంగరము.

**అంగుళీయకాకారము** సం. వి. (ఖగో). ఉంగరమువంటి ఆకారము, వర్తులాకారము (Annular). ఉదా. అంగుళీయకాకార సూర్యగ్రహణము, చంద్రుని ఛాయ సూర్యబింబ మధ్య భాగమును గప్పగా చుట్టును వెలుతురు కనిపించు సూర్యగ్రహణము.

**అంగుళీశలాకలు** సం. వి. (జం.) చేతి వ్రేళ్ళకు కాలి వ్రేళ్ళకు ఉండు ఎముకలు (Phalanges).

**అంగుళులు** సం. వి. (జం.) 1. చేతివ్రేళ్ళు. 2. కాలివ్రేళ్ళు (Digits).

**అంగుళ్యస్థులు** సం. వి. (జం.) వ్రేళ్ళ ఎముకలు, అంగుళీ శలాకలు (Phalanges).

**అంగూరు** హిం. వి. ఒక రకపు ద్రాక్ష.

**అంఘ్రి** సం. వి. 1. కాలు. 2. వేరు. 3. పద్య పాదము.

**అంఘ్రిపము** సం. వి. చెట్టు, పాదపము.

**అంచనా** హిం. వి. పంట, వెల మొ. వానికి సంబంధించిన ఊహ. క్రి. అంచనా వేయు (Estimate).

**అంచనదారుడు** వి. అంచనా వేయువాడు.

**అంచలము** సం. వి. కొంగు, అంచు, కొన.

**అంచితము** సం. వి. విశే. 1. పూజింపబడినది. 2 ఒప్పిదమైనది. 3. వంగినది.

**అంచియ** వి. ప్రయాణికులు మార్గమున అక్కడక్కడ చేయు మకాము. రూ. అంచె.

**అంచె** వి. వరుస.

**అంచెలు** వి. (ని బహు) వరుసలు బారులు. ఉదా. అంచెలు కట్టు (బారులు కట్టు). (అంచెలంచెలన్ జాతీ. అక్కడక్కడ).

**అంచ**[1] వై. వి. హంస. సం. హంసః.

**అంచ**[2] వి. 1. ప్రక్క. 2. సమీపము.

**అంచపదము** వై. వి వ్రాతయందు వదలిపోయిన అక్షరములను ఎత్తి వ్రాయునపుడు ఉంచెడు గుర్తు, హంసపాదము.

**అంచయాన** వై. వి. 1. హంసనడకవంటి నడకగల స్త్రీ. సం. హంసయాన.

**అంచరౌతు** వి. హంస వాహనముగా గలవాడు. బ్రహ్మ.

**అంచల** వి. ప్రక్క, సమీపము.

**అంచలము** వి. చలము, మాత్సర్యము. 2. కోపము.

**అంచు**[1] వై. వి. 1. కొన, 2. చీరచెరగు. 2. విధము. (గణి.) రెండు సమతలములు కలియు రేఖ, ముఖములు కలియు ప్రదేశము (Edge).

**అంచు** క్రి. అజ్ఞాపించు, 2. పంపించు. రూ. అనుచు.

**అంచుబద్దె** వి. (గృహ.) నేతలో రెండు ప్రక్కల పొడవు నిలువులలో వచ్చు అంచు, గట్టి అంచు, బద్దె అంచు.

**అంచులవాడు** వి. చిత్రకారుడు, చిత్రరువులు వ్రాయువాడు, మచ్చి.

**అంజన** సం. వి. 1. హనుమంతుని తల్లి. 2. పడమటి దిక్కునందలి ఏనుగు.

**అంజనము** సం. వి. కాటుక. 2. మంత్రగాడు నిక్షేపాదులను కనిపెట్టుటకు వాడు కాటుక. 3. సిరా. 4. పశ్చిమ దిగ్గజము 5. ఒకపర్వతము. 6. ఒకజాతిబల్లి. 7. (అలం.) వ్యంగ్యార్థమును బోధించు శబ్దవృత్తి. 8. నిప్పు.

**అంజనకాడు** వి. అంజనమువేసి నిక్షేపాదులను కనుగొనువాడు.

**అంజనావతి** సం. వి. ఈశాన్య దిక్కునందలి సుప్రతీక మను దిగ్గజముయొక్క భార్య.

**అంజని** సం. వి. చందన కుంకుమాదులచే అలంకరించుకొను స్త్రీ. (వృక్ష.) కటుక రోహిణి, కాలాంజని అనెడి ఓషధులు.

**అంజనిక** సం.వి. 1. నలికండ్లపాము, 2. ఒక జాతిబల్లి. 3. చుంచు. 4. సుప్రతీకమను దిగ్గజముయొక్క భార్య.

**అంజలి** సం. వి 1. చేమోడ్పు, నమస్కారము. 2. ఒకరకపు అభినయ హస్తము.

**అంజె** వి. 1. అడుగు. 2. సమీపము

**అంజలిగుంజలి** విశే. 1. అలసట నొందినది. 2. బాధనొందినది.

**అంజాయించు** క్రి. సందేహించు.

**అంజిక** వి. భయము.

**అంజు** క్రి. 1.భయపడు, జంకు. 2. వెనుదీయు. 3. సందేహించు.

**అంజూరు** హిం. వి. 1. అత్తిపండు. 2. అత్తిచెట్టు.

**అంట** వి. అనుట. 2 విస్తర. 3. గుంపు. 4. చెట్టుపట్ట 5.అనిశ్చితార్థమును తెలుపు అవ్యయము. ఉదా. మంత్రిగారు రేపు ఈ ఊరు వస్తారంట. రూ. అఁట.

**అంటరానివేలుపు** వి. అగ్ని.

**అంటసిల్లు** క్రి.అంటు.తాకు (అంటసిలబడు-నేలకూలబడు.).

**అంటార్కిటిక్ వలయము** మి.వి. (భూగో.) దక్షిణ ధ్రువవలయము, దక్షిణ ధ్రువము నుండి $23\frac{1}{2}^{\circ}$ దూరముననున్న మకరరేఖ (Antarctic circle).

**అంటి**వి. అరటి. రూ. అనటి.

**అంటించు** క్రి. 1. అతికించు. 2. చేర్చు. 3. (తేలు)కుట్టు

**అంటు** వి. (వృక్ష.) 1. చెట్టురెమ్మను వంచి నేలలో పాతుటవలన పుట్టిన మొక్క. 2. ఒకమొక్కను వేరొక చెట్టురెమ్మను అంటగట్టి పెంచబడిన మొక్క. ఉదా మామిడి అంటు, నిమ్మ అంటు మొ॥వి. 3. స్పర్శ 4 ముట్టు,మైల.5. మిత్రుడు. స్నేహము క్రి. 1. తాకు. 2. (నూనె మొ॥వి.)రాచు. 3. అతుకు.

**అంటుకత్తియ** వి. ప్రియురాలు, విటకత్తె. రూ. అంటుకత్తె.

**అంటుకాఁడు** వి. ప్రియుడు. విటుడు.

**అంటుకొను** క్రి. 1. అగ్ని రగులుకొను. 2. ముట్టుకొను.

**అంటుగట్టు** క్రి. (వ్యవ) క్రొత్తజాతి మొక్కలను సృష్టించుటకై ఒక జాతి రెమ్మను వేరొక జాతి మొక్క కాండముతో అంటగట్టి పెంచుట. (Graft).

**అంటుజోడు** వి. చెవిపోగుల జత. కర్ణభూషణము.

**అంటుపేను** వి. తల నంటుకొని యుండు చిన్నపేను.

**అంటుపోగులు** వి. చూ. అంటుజోడు.

**అంటుమెడ** వి. అణగిన మెడ, పొట్టిమెడ.

**అంటుఱాయి** వి. సూదంటురాయి. అయస్కాంతము.

**అంటువ్యాధి** వి. ఒకరినుండి మరొకరికి(నీరు, గాలిలో నుండు రోగక్రిములవలన లేక స్పర్శవలన) వ్యాపించువ్యాధి (విషూచి, మశూచి మొ.) (Infectious disease).

**అంటుసొంటు**. వి. అపవిత్రత.

**అంట్రింత** వి. గుడ్డలకు అంటుకొను ఒక రకపు గడ్డి, అంటిన.

**అంట్లమైనము** వి. ఒక రకపు మైనము. (ఈ మైనమును గుడ్డపేలికలకు పట్టించి అంట్లు కట్టు మొక్కలకు చుట్టుదురు. (Grafting wax).

**అంట్లు** వి. 1. వంటచేసిన పిదప తోమక యుండు పాత్రలు (ని. బహు) 2. అంటు పేలు.

**అండ** వి. 1. సమీపము. 2. ఆశ్రయము. 3. ప్రాపు. 4. మట్టిపెళ్ళ.

**అండకణము** సం.వి. (జీవ.) స్త్రీసంయోగికణము (Egg-cell)


అండకోశ - అధస్థితము

**అండకోశ - అధస్థితము** సం.విశే. (వృక్ష.) అండాశయముక్రింద నుండెడు (Hypogynous).


అండకోశ - ఉపరిస్థితము

**అండకోశ-ఉపరిస్థితము** సం. విశే. (వృక్ష.) అండాశయము మీద నుండెడు (Epigynous).


అండకోశ - పరిచక్రము

**అండకోశ పరిచక్రము** సం. విశే. (వృక్ష.) అండాశయముచుట్టును ఉండెడు (Perigynous).

**అండకోశము** సం. వి. 1. (వృక్ష.) పుష్పములోని స్త్రీలింగభాగము (Pistil or gynoecium), 2. వృషణము, ముష్కము.

**అండగొట్టు** క్రి. 1. ఆలస్యము చేయు. 2. వెనుదీయు.

**అండగొను** క్రి. 1. ఆశ్రయించు. 2. వెనుదీయు.

**అండగోడ** వి. గోడకు ఆసరాగాకట్టినగోడ అడ్డగోడ, అడ్డుగానుంచిన చిన్నగోడ,

**అండగోళము** సం. వి (జీవ.) అండకణము. (Oosphere).

**అండజ** సం. వి కస్తూరి. వ్యు. కస్తూరి మృగముయొక్క బొడ్డుతిత్తి నుండి పుట్టినది

**అండజము** సం. వి 1. పక్షి. 2 చేప. 3 పాము 5. తొండ. వ్యు. గ్రుడ్డునుండి పుట్టినది.

**అంతస్త్వక్కులు** సం వి (వృక్ష) రక్షణ కొరకు బీజాండముపై ఉండు పొరలు (Integuments)

**అండదము** సం వి. (జం.) గ్రుడ్లను పెట్టు జంతువు (Oviparous organism).

**అండనము** సం. వి. కేడెము, డాలు, రూ. అడ్డనము,

**అండపీతకళ** సం. వి. (జం) అండపీతము చుట్టును ఉండు పొర (Vitelline membrane)

**అండపీతము** సం. వి. (జం.) గ్రుడ్డులోని పసుపు పచ్చని పదార్థము, సొన (yolk).

**అండమాతృకణము** సం. వి. (జం.) అండము తయారగు మాతృజీవకణము (Oocyte).

**అండము** సం వి. 1. గ్రుడ్డు 2 వృషణము (జీవ.) 3 వీర్యము శుక్లము (ovum)

**అండలంబనస్థానము** సం.వి. (వృక్ష) జరాయువు. అండాశయములో బీజాండములు అమర్చబడిన దిమ్మ (Placenta)

**అండశ్వేతము** సం. వి. గ్రుడ్డులోని తెల్లని భాగము (White of an egg).

**అండసంయోగము** సం. వి. (జీవ.) పురుష బీజములు స్త్రీ బీజములతో సంయోగము పొందుట (Oogamy).

**అండా** హిం. వి. నీళ్ళు కాచు పెద్దపాత్ర. రూ. అండీ. అండి.

**అండాకారపత్రము** సం. వి. (వృక్ష.) గ్రుడ్డు వంటి ఆకారముగల పత్రము (Obovate)

**అండాకార గవాక్షము** నం. వి. (జం.) శ్రవణ ప్రావరముయొక్క బయట గోడ నుండు రంధ్రము (Fenestra Ovalis)

**అండాశయనాళము** నం వి. (జం.) అండ కోశము నుండి అండము ప్రయాణము చేయు గొట్టము (Oviduct).

**అండాశయము** నం. వి. (జీవ) స్త్రీబీజ కోశము (Ovary).

**అండాశయయుజము** నం. వి. (జం.) పృష్ఠ భాగమున రెండుపొరలు గల అండా శయము (Meso-ovarium).

**అండాశయస్థూనిక** నం. వి. (జం.) అండా శయములో కొన్ని ప్రాండకోశములు కలిసి ఏర్పడిన నిర్మాణము (Ovarian follicle).

**అందియ** వి. చిమ్మనగ్రోవి. రూ. అందె.

**అందియము** వి. ఎద్దు మొ. వి మోసెడుభార ములో ఒక భాగము. రూ. అందెము.

**అందె** వి. మా. అందియ.

**అందెము** వి. మా. అందియము.

**అండోత్పత్తి** నం.వి. (జం.) మొదట బీజాణు కోశమునుండి అండము పుట్టి అభివృద్ధి, చెందుచు యుక్తస్థితిలోనికి వచ్చుట (Oogenesis).

**అండౌఘము** నం. వి. (జం.) గుడ్లనుపెట్టు చేప కప్ప మొ. జంతువులయొక్క అండ సముదాయము (Spawn).

**అంత** నర్వ. 1. సర్వము. 2. ఆ కొలది. 3. పరిమాణార్థక ప్రత్యయము. అవ్య. పిమ్మట. వి. అపుడు.

**అంతఃకంకాళము** నం. వి. (జం.) శరీరము లోపలనుండు ఎముకల గూడు (Endo-skeleton).

**అంతఃకరణము** నం.వి. 1. మనస్సు.2.దయ.

**అంతఃకవచము** నం.వి. (వృక్ష). ఫలకవచము యొక్క లోపలిపొర (Endocarp).

**అంతఃకుహరము** నం. వి. (జం.) దేహకుహ రము జీర్ణకోశకుహరము రెండును కలసియున్న ఒకే కుహరము. దీనికి ఒకే ద్వార ముండును. (Coelenteron).

**అంతఃఖండము** నం. వి. (గణి). రెండు రేఖలను మరియొకరేఖ ఖండించగా వాని మధ్యనుండు రేఖాఖండము (Intercept).

**అంతఃపరాన్నజీవి** నం.వి.(జీవ.) 1. పోషిత్ర జీవి (host). 2. శరీరములోపల నుండు పరాన్నజీవి (Endoparasite).

**అంతఃపార్శ్వము** నం. వి. (జం.) అంత ప్ర రము, అంతస్త్వపొర కలసి ఏర్పడినపొర (Splanchnopleure).

**అంతఃపురము** నం. వి. రాణివాసపు స్త్రీలుండుచోటు. వికృ. అంతిపురము. అంతిపురి.

**అంతఃపురి** నం. వి. అంతఃపురము.

**అంతఃప్రసరము** నం. వి. (జీవ.) జీవకణ ములో అస్థిచుట్టును ఉండు కోశరసము (Endoplasm).

**అంతఃశ్వసనము** నం. వి. (జీవ.) ప్రాణ వాయువును లోపలికి పీల్చుకొను క్రియ (Inspiration).

**అంతఃసర్తము** నం. వి. (వృక్ష.) వేరులోపల కాండములోపల అంతస్త్వచిక క్రింద నుండు ఒక జీవకణపు మందముగల పొర. (Endodermis).

**అంతకము** వై. వి. 1. మొత్తము. 2. ఎల్ల, సీమ. (నం. వి. అని కొందరు)

**అంతకుడు** నం. వి. యముడు.

**అంతపొంతములవాడు** వి. దూరపుచుట్టము

**అంతము** నం. వి. 1. తుద. 2. చావు. 3. స్వభావము. విజ. 1. సమీపము. 2. రమ్యము.

**అంతరంగము** నం. వి. 1. హృదయము. 2. ఉల్లము, మనస్సు.

**అంతరంగుడు** నం. వి. స్నేహితుడు.
**అంతరకణము** నం. వి. (*జీవ.*) జీవకణము లలో ఒక కణమునకు మరియొక కణమునకు మధ్య గలది (Intercellular).
**అంతరకృషి** నం. వి. (*వ్యవ.*) 1. పైచాలు తోలుట. 2. ముట్టినిరేపి మొక్కల మొదట మట్టిని త్రోయుట మొ॥ పనులు (Interculturing).
**అంతరఖండము** నం. వి. (*గణి.*), చూ. అంతఃఖండము.
**అంతరతలము** నం. వి. (*వ్యవ*). నేలయందున్న మట్టిరేణువుల ఉపరితల విస్తీర్ణము (Internal soil surface).
**అంతరతామర** వి. నీటిపై తేలి పెరుగు ఒక రకపు నాచు, జలవల్లి (Pistia)
**అంతరము** నం. వి. 1. ఎడము. 2 భేదము 3. సమయము, 4. సందు. 5. ఎడబాటు (*గణి*). రెండింటిమధ్య నున్న సమయము లేక దూరము (Interval). *విశ.* 1. అన్యము. *ఉదా.* ।గామాంతరము. 2. వెలుపలిది.
**అంతరములు** నం. వి. (*వ్యవ.*) పటవాలుగా నున్న ప్రదేశమును చదునుచేసి మెట్లవలె కట్టిన మళ్ళు (Terraces).
**అంతరవకాశము** నం. వి. (*వ్యవ*) నేలయందున్న మట్టిరేణువుల మధ్యనుండు ఖాళీస్థలము (Pore space in the soil )
**అంతరవృత్తము** నం. వి. (*గణి*) ఒక త్రిభుజమునందలి మూడు భుజములను తాకుచు త్రిభుజమునకు లోపల నుండు వృత్తము (Inscribed circle.)
**అంతరాత్మ** నం. వి. (*వేదాం.*) జీవాత్మతో గూడియుండు పరమాత్మ. 2. మనస్సు.
**అంతరానుపాతము** నం.వి. (*గణి.*) a : b = c : d అయిన a − b = c − d అను దానిని యోగానుపాతమందురు (Dividendo).
**అంతరాయము** నం. వి. అడ్డు. విఘ్నము. ఆటంకము.
**అంతరారంభ(దారువు)** నం. వి (*వృక్ష*) ఆది రువు కేంద్రమునకు దగ్గరగా నున్న స్థితి (Endarch).
**అంతరాళము** నం వి. 1. ఎల్లదిక్కులకు నడిమిచోటు. 2. (దేశకాలముల) నడిమి భాగము. 3. సంకీర్ణజాతి, సంకరజాతి.
**అంతరించే** నం. క్రి. 1. చచ్చు. 2. చెడు. పాడగు. 3. అతిక్రమించు, దాటు.
**అంతరిక్షనౌక** నం. వి. ఖగోళయాత్రలో రాకెట్ చోదనముచే పయనించు విమానము (Space-Ship).
**అంతరిక్షము** నం. వి. ఆకాశము. రూ.అంతరిక్షము.
**అంతరీపము** నం. వి. ద్వీపము, నీటి నడిమి దిబ్బ, లంక.
**అంతరీయము** నం.వి. కట్టుబట్ట,పరిధానము.
**అంతరువు** వై. వి. 1. తారతమ్యము. 2. కొంచెముదూరము. 3. మరుగుచోటు. నం. అంతరమ్.
**అంతర్గతము** నం విశ. 1. లోపలనున్నది. 2. దాచబడినది. 3. మరవబడినది.
**అంతర్గుహినములు** నం. వి. *జం.* దేహములో అంత కుహరమున గల జంతువులు(Coelenterata).



**అంతర్గ్రహణము** నం. వి.(*జం.*) ముఖ్యముగా ఏకకణజీవులు అంతర్గ్రహనము లోనికి ఆహారము (హైడ్రా) గ్రహించుపద్ధతి (Ingestion). (హైడ్రా)
**అంతర్జఠరము** నం. వి. (*జం.*) అన్నవాహికలో కండరములు గల ఒక భాగము (Gizzard).
**అంతర్జాతము** నం. విశ. (*వృక్ష.*) లోపలి నుండి పుట్టుకొనివచ్చినది(Endogenous).
**అంతర్జాతీయ- ఏకాంకము** నం. వి. (*గృహ*)

విటమిన్ 'A' కి, విటమిన్ 'D' కి ఈ unit ను పరిమాణముగా వాడుదురు (International unit).

**అంతర్జాతీయ కార్మికసంస్థ** సం. వి. ఈ సంస్థ నానారాజ్యసమితి ఆధ్వర్యమున 1919 లో జినీవా నగర స్థాపింప బడెను. ఇప్పుడు ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యమున పనిచేయుచున్నది. అంతర్జాతీయములైన ఒప్పందముల ద్వారా కార్మికుల కష్టనష్టములను తగ్గించుట లేక తొలగించుట ఈ సంస్థ కర్తవ్యము. (International Labour Organization).

**అంతర్జాతీయ దినరేఖ** సం. వి. (భూగో) తూర్పునుండి పడమరకు, పడమరనుండి తూర్పునకు, సూర్యగమనమునుబట్టి ప్రపంచములోని అన్ని దేశములచే నిర్ణయింపబడిన దినరేఖ (International date line).

**అంతర్జాతీయద్రవ్యనిధి** సం. వి. (అర్థ. రాజ.) 1944 లో స్థాపింపబడిన ఈ నిధి ముఖ్యోద్దేశములు: 1. శాశ్వత సంస్థ యాజమాన్యమున అంతర్జాతీయ ద్రవ్య సహకారమును నెలకొల్పుట. 2. అంతర్జాతీయ వాణిజ్యరంగమున అభివృద్ధికిపాటు పడుట 3. ఉద్యోగమును ఉన్నతస్థాయికి పెంచుట. 4. వినిమయ స్థైర్యమును స్థాపించి బహుముఖ వాణిజ్య వ్యాపారముల నెలకొల్పుట. 5 వినిమయ నియంత్రణము అక్కరలేకుండచేయుట (International fund).

**అంతర్జాతీయన్యాయసభ** సం. వి. (చరి, రాజ.) ఈ న్యాయసభ మొట్టమొదట నానాజాతిసమితిచే శాశ్వతమైన అంతర్జాతీయ న్యాయసభగా క్రి. శ. 1919 సం॥న హేగ్ నగరములో స్థాపింపబడెను. ఐక్యరాజ్యసమితి నెలకొల్పబడిన తర్వాత హేగ్ నగరములో ఈ సభ పదునైదుగురు న్యాయమూర్తులతో పునః స్థాపింపబడెను. ఐ.రా.స. సభ్యత్వములేని దేశములుకూడ ఈ సభ సమక్షమునకు ఏ సమస్యనైనను తేవచ్చును. సాధారణముగ ఈ సభ అంతర్జాతీయ సమస్యలను, సర్వజనుల హక్కులకు సంబంధించిన సమస్యలను విచారించును (International Court).

**అంతర్జాతీయబాంక్** మి. వి. (అర్థ.) దీనిని అంతర్జాతీయ పునర్నిర్మాణ వికాసకారక బాంక్ అనికూడ అందురు. 1945 లో యుద్ధఫలితముగ ధ్వంసమైన దేశముల ఆర్థికస్వాస్థ్యమును తిరిగి ఉద్ధరించుటకు, ఆర్థికముగ వెనుకబడిన దేశములకు సాధన సామగ్రి కల్పించి వానికి ఉత్పాదన సామర్థ్యమును ప్రోత్సహించుటకు ఈ బాంక్ ఏర్పడినది. ఇది తాను అప్పుగ తెచ్చుకొని కాని తనవద్ద నున్న నిల్వలనుండి కాని సభ్యదేశములకు అప్పులిచ్చును. (International Bank).

**అంతర్జాతీయ వాణిజ్య మండలి** సం. వి. (అర్థ.) అంతర్జాతీయములైన ఆర్థికవిధానముల దృక్పథములను తెలిసికొనుటకు క్రి. శ. 1920 లో పారిస్ నగరమున స్థాపింపబడిన సంస్థ. ఇప్పుడు ఐ. రా. స. సాంఘికార్థిక సభలకు సహాయముగ పని చేయుచున్నది.

**అంతర్ధానము** సం వి. మరుగుపడుట, మాయమగుట.

**అంతర్నాసావివరములు** సం. వి. (జం.) ముఖకుహరము యొక్క పైకప్పునకు ముందరిభాగమున నున్న రెండురంధ్రములు (కప్పులో) (Internal nares)

**అంతర్భూతము** సం వి.. లోపల అడగినది.

**అంతర్భూమిక** సం.వి (వృక్ష.) అంకురము గింజనుండి మొలకెత్తునపుడు బీజదళ

ములు భూమిలోనే ఉన్నస్థితి ఈ మాదిరి అంకురోత్పత్తి (Hypogeal)

**అంతర్భౌమజలము** సం. వి (వ్యవ.) గోయి నూయి మొ॥వి త్రవ్వినపుడు ఊరు నీరు (Underground water)

**అంతర్భౌమము** సం. విశే. భూమిలోపలి భాగమునకు సంబంధించినది.

**అంతర్మనస్కుడు** సం విశే 1. దుఃఖాదులచే బాహ్యవ్యాపారమున మనస్సు లేనివాడు 2. దుఃఖము నొందినవాడు 3 ధ్యాన నిమగ్నుడు

**అంతర్యామి** సం.విశే. లోపల నుండువాడు. వి. 1. పరమాత్మ. 2. జీవాత్మ.

**అంతర్యుద్ధము** సం. వి (చరి.) 1. ఒకదేశ ప్రజలలో జరుగుయుద్ధము 2. అంతః కలహము.3 మనస్సులో జరుగు సంఘర్షణము

**అంతర్లసికము** సం. వి. (జం.) కర్ణగహనము (Endolymph) లోపలనుండు ద్రవము (Auditory Capsule).

**అంతర్లిఖితము** సం. విశే (గణి) లోపల లిఖింపబడినది. ఉదా: వృత్తములోలిఖింపబడిన షడ్భుజి. ఒకే క్షేత్రభుజములను అంతర్యముగ స్పృశించెడిది (Inscribed)

**అంతర్వత్ని** సం. వి. లోపల శిశువు కలది. గర్భవతి.

**అంతర్వలనము** సం. వి. (జం.) బోలుగానున్న ఒక అవయవము యొక్క పై భాగము లోపలికి ముడుచుకొని పెరుగుట లేక ముడుచుకొని యుండుట (Invagination)

**అంతర్వలితము** సం. వి. (జం.) 1. భ్రూణములోనిసూక్ష్మఖండములు వృద్ధియగుచు లోనికి పెరుగుట, 2. అంచుపై నుండి లోనికి చొచ్చుకొని పోవుట.

**అంతర్వాణి** సం. విశే. పండితుడు, అంతరంగ ప్రబోధము (inner-voice)

**అంతర్వాహిని** సం వి భూమిలోపల పారెడు నది.

**అంతర్వృద్ధి** సం వి. లోపలనుండి జరుగుచున్న పెరుగుదల (Inter-susception).

**అంతర్వేశనము** సం వి. (గణి.) కొన్ని రాసుల స్థితులనుబట్టి మధ్యరాసులను నిర్ణయించుట (Interpolation).

**అంతర్స్పర్శవృత్తము** సం. వి. (గణి) 1. ఒక వృత్తమును అంతరముగా స్పృశించు మరియొక వృత్తము. 2. త్రిభుజభుజముల మూడింటిని అంతరము స్పృశించు వృత్తము (Internal or tangential circle).

**అంతర్హితము** సం. విశే. 1. మరుగుపడినది. 2. మాయమైనది. 3. కప్పబడినది.

**అంతశ్శయ్య** సం.వి. 1. మరణము. 2.మరణకాలమునందలి భూశయ్య. 3. శ్మశానము. 4. శవవాహనము.

**అంతశ్చర్మము** సం వి (జం.) స్యూతి భ్రూణములోనుండి జీర్ణకోశమునకు అస్తరును నిర్మించు జీవకణములపొర అధఃస్తరము (Hypoblast or Endoderm).

**అంతశ్ఛిద్రము** సం. వి. లోపలి లోపము.

**అంతశ్శూన్యము** సం. విశే. (గణి.) లోపల డొల్లగా ఉండునది. వి లోపల డొల్లగా నుండుట.

**అంతస్త్వచిక** సం. వి (వృక్ష) వల్కలము, కాండము పై క్క బహిశ్చర్మమునకును అంతశ్చర్మమునకు మధ్యనుండు భాగము (cortex).

**అంతస్త్వచిక జనకము** సం. వి. (వృక్ష.) పెరుగుచున్న అవయవములకొనలయందుగల ప్రవిభాజక జీవకణజాలములో బహిశ్చర్మ జనకము క్రిందనుండి అంతస్త్వచిక కణ సంహతిని ఉత్పత్తిచేయు కణజాలము (Periblem).

**అంతస్తు** వై. వి. 1 మేడ పైభాగము. 2. కక్ష్య తొట్టికట్టు 3 ఒకటిమీద నొకటిగా నుండెడుకట్టడము. 4. పరువు. తారతమ్యము. 5 మరుగుచోటు. సం. అంతస్థమ్.

**అంతస్థ** నం.వి రహస్యముగానిచ్చు లంచము

**అంతస్థము** నం.వి (వ్యాక.) య, ర, ల, వ లకు వ్యాకరణ పరిభాష. విశ. లోపల నుండునది.

**అంతస్సమ్మేళనము** నం. వి. (జం) కొన్ని ఏకకణజీవులలో సంయుగ్మము (Conjugation) లేకుండగనే వాని అష్ఠులలో (Nucleus) జరుగు పునర్నిర్మాణము (Endomixis).

**అంతస్స్రావము** నం. వి. (జం.) వాహిక ద్వారాకాక, తిన్నగా రక్తములోనికి గాని శోషరసము లోనికిగాని ప్రవేశించు స్రావము (Internal secretion).

**అంతిక** నం. వి. 1. అక్క. 2. ప్రొయ్యి. 3. (వృక్ష). సాతల మనెడు ఓషధి.

**అంతికము** నం. విశ. సమీపము, దగ్గరిది. వి. సామీప్యము, దగ్గర.

**అంతికలు** వి. కసవుతడికెలు, గడ్డిచాపలు.

**అంతిపురము** వై. వి. మా. అంతఃపురము

**అంతిపురి** వై వి. మా. అంతఃపురము.

**అంతిమము** నం. విశ. దగ్గరిది. సమీపించినది. 2. కడపటిది.

**అంతియ** సర్వ. అంతమాత్రమే. రూ. అంతే.

**అంతు** వై. వి. 1. మొత్తము. 2. చివర. 3. పర్యవసానము, నం. అంతః.

**అంతేవాసి** నం. వి. 1. శిష్యుడు. 2. హరిజనుడు. విశ. 1. దగ్గరనుండువాడు. 2. ఎల్లయొద్ద నుండువాడు.

**అంత్యకణము** నం. వి. (వృక్ష.) సూత్రము వలె నుండు అవయవమునకు కొన నున్న జీవకణము (Apical cell).

**అంత్యజుఁడు** నం. వి. చండాలుడు, హరిజనుడు.

**అంత్యము** నం. విశ. 1. కడపటిది. 2. అధమము.

**అంత్యములు** నం. వి. (గణి.) అనుపాతములో నున్న నాలుగు రాసులలో ఆద్యంతములందున్న రెండు రాసులు $\frac{a}{b} : \frac{c}{d}$ అను అనుపాతములో a, b, c, d అను నాలుగు రాసులు గలవు, వీనిలో a , d లను అంత్యము లందురు. (Extremes.)

**అంత్రము** నం వి. ప్రేగు.

**అంత్రయుజము** నం. వి. (జం.) పృష్ఠవంశిక జంతువులలో అన్నవాహికను శరీరభిత్తికతో కలవు రెండుపొరలుగల జీవకణజాలము అంతర్గుహినములలో ఇది ముఖపథమును శరీరభిత్తితో కలుపుచుండును (Mesentery).

**అందకత్తియ** విశ. సౌందర్యవతి. రూ. అందకత్తె.

**అందగించు** క్రి. 1. రమ్యమగు. ఒప్పు. 2. ఎంచు. 3. పర్వగచు. 4. రచించు.

**అందదుకు** విశ. 1 మిక్కిలి అతుకు గలది. 2. సంపూర్తి కానిది.

**అందనుక** అవ్య. అంతదాక.

**అందము** వి. 1. సౌందర్యము. 2. అలంకారము. 3. విధము. విశ. 1. చక్కనిది. 2. తగినది.

**అందఱు** సర్వ ఎల్లరు. రూ. అందొఱు.

**అందలము** వై. వి. 1. పల్లకి, ఆందోళిక; 2. ఒకరకపు బాలక్రీడ. నం. ఆందోళః.

**అందాఁక** అవ్య. అంతవరకు.

**అందిక** విశ. 1. సమీపము, 2. ఊత, అవలంబనము.

**అందియ** వై.వి.స్త్రీలుకాలియందు ధరించు నగ, నూపురము; 2. బిరుదు చిహ్నముగ

కాలికి తొడుగుకొను నగ. దూ. అందె నం. అందుః.

**అందు** క్రి. 1. పొందు. 2. అందుకొను 3. తాకు, 4. కను. 5 గ్రహించు. అవ్య. 1. ఆచోట. 2. వానిలో, వానిలో. 3. సప్తమీవిభక్తి ప్రత్యయము

**అందుకము** నం వి 1. అందె. 2. ఏనుగు సంకెల 5. సంకెల.

**అందుకొను** క్రి. 1. పుచ్చుకొను. 2 పట్టుకొను. 3 స్పృశించు. 4. (పడిచినపని) కొనసాగింపబూను, కైకొను.

**అందుకోలు** వి. అందుకొనుట. విణ. అతి సమీపము.

**అందుగు** వి. (వృక్ష.) సల్లకి, చిల్లచెట్టు. రూ. అందువు.

**అందుబడి** విణ. 1. సమీపమునందున్నది. 2. సులభము, 3. ప్రాప్తము.

**అందువు** నం. వి. ఏనుగు కాలికి గట్టెడు గొలుసు, 2. అందె. దూ. అందుగు.

**అందుబాటు** విణ.సమీపము. వి. సామీప్యము

**అందె** వి. మా. అందియ.

**అందెబందెలు** వి. (ని. బహు.) 1. చిక్కులు. 2. జంజాటము. 3 కట్టుదిట్టములు

**అందొఱు** సర్వ. అందరు.

**అంధకము** నం. వి. ఒక ఆయుధము.

**అంధకరిపుఁడు** నం. వి. శివుడు.

**అంధకారము** నం. వి. చీకటి:

**అంధకుఁడు** నం. విణ. గ్రుడ్డివాడు. వి. 1. ఒకరాక్షసునిపేరు. 2. బృహస్పతి అన్న కొడుకు.

**అంధకూపము** నం. వి. 1. పాడునూయి 2. ఒక నరకము.

**అంధతమసము** నం. వి. కటికచీకటి. రూ. అంధాతమసము.

**అంధాతమసము** నం. వి. మా. అంధతమసము

**అంధబిందువు** నం. వి. (జం.) 1 గ్రుడ్డి చుక్క. 2. కంటిపూవు 3. కంటియొక్క మూర్తిపటములో అక్షినాడి ప్రవేశించు చోటు (Blind spot).

**అంధము** నం వి చీకటి, విణ గ్రుడ్డిది.

**అంధస్సు** నం. వి. అన్నము, వంటకము.

**అంధిక** నం. వి. 1. చీకటి. 2. ఒకవిధమైన జూదము. 3. కంటిజబ్బు.

**అంధుఁడు** నం. విణ. 1. గ్రుడ్డివాడు. 2 వివేకము లేనివాడు; వి. బాహ్యదృష్టి లేని సన్న్యాసి.

**అంధువు** నం. వి. నూయి.

**అంధ్రము** నం. వి. 1. తెనుగుదేశము. తెనుగుభాష (ఆంధ్రమునకు మొదటి రూపము).

**అంపకట్టె** వి. బాణము.

**అంపకము** వి. పంపుట, ప్రేషణము.

**అంపకాఁడు** విణ. విలుకాడు, విలువిద్యయందు సమర్థుడు.

**అంపకోల** వి. బాణము.

**అంపగఱి** వి. బాణమునకు కట్టిన ఈక.

**అంపఱ** వి. బాణసమూహము,బాణపరంపర.

**అంపాచారము** వి. ధారాపాతము, జల ప్రవాహము.

**అంపియ** వి. చింపిగుడ్డ. రూ. అంపె.

**అంపు** క్రి. 1. పంపు. 2. ఆజ్ఞాపించు. వి. జాతర.

**అంపుడోడు** వి. ప్రయాణమందు తోడుగా పంపువాడు.

**అంపె** వి. మా. అంపియ

**అంబ** నం. వి. 1. అమ్మ, తల్లి. 2. పార్వతి. 3. కాశిరాజు కూతురు. (వృక్ష.) 1. చేదుసొర. 2. పులిచింత. 3 అడివి మామిడి.

**అంబకము** నం. వి. 1. కన్ను. 2. బాణము.

**అంబకళము** వి. అంబలి. ఒకరకపుజావ.

**అంబరము** నం. వి. 1. ఆకాశము.

2. శూన్యము. 3. వస్త్రము. 4 కుంకుమ పువ్వు. 5.అంబరుఅనెడి పరిమళద్రవ్యము. 6. ద్యూతాది వ్యసనము.

**అంబరీషము** సం. వి. 1. యుద్ధము. 2. మంగలము. 3. పశ్చాత్తాపము. 4. ఒక నరకము. (వృక్ష) అడివిమామిడి.

**అంబరీషుడు** సం. వి. 1. సూర్యవంశీయులలో విష్ణుభక్తుడగు ఒకరాజు. 2 సూర్యుడు 3. విష్ణువు. 4. శివుడు. 5. బాలకుడు.

**అంబరు** వై. వి. ఒక పరిమళద్రవ్యము. సం. అంబరమ్.

**అంబరు చరఖా** వి. ఏకాంబరనాథన్ అను నతడు కనిపెట్టిన ఒకరకపు రాట్నము. (ఆరాట్నములో నాలుగు కదురుళ్ళు గల చక్రము, లాగు యంత్రము (Carding machine) కలవు.)

**అంబలము** వి. కలకల ధ్వని.

**అంబలి** వి. ఒకరకపు జావ.

**అంబష్ఠ** సం. వి. (వృక్ష.) 1. అడవిమొల్ల. 2. పులిచింత 3. చిరుబొద్ది. 4. సరస్వతి తీగ. 5. అడవిమామిడి.

**అంబష్ఠుఁడు** సం. వి. 1. మంగలి. 2 మావటి

**అంబస్తు**వి.కపటములేనివాడు,అమాయకుడు.

**అంబారము** వి. కళ్ళములోని ధాన్యపురాశి రూ. అంబారు.

**అంబారి** వి. ఏనుగుమీద ఏర్పరచు పీఠము.

**అంబారు** వి. చూ. అంబారము.

**అంబాళము** వి. (వృక్ష.) ఆమ్రాతకము నల్లమామిడి. సం. ఆమ్రాతకః.

**అంబిక** సం. వి. 1. తల్లి. 2. మేనత్త. 3 పార్వతి. 4. ధృతరాష్ట్రునితల్లి.

**అంబు** వై. వి. బాణము రూ. అమ్ము. సం. అంబకమ్.

**అంబుజగర్భుడు** సం. వి. తామర జన్మ స్థలముగా కలవాడు, బ్రహ్మ.

**అంబుజము** సం. వి. 1. నీటినుండి పుట్టినది. తామర. 2. ఎర్రగన్నేరుచెట్టు. 3. హారతి కర్పూరము. 4. శంఖము. 5. సారస పక్షి.

**అంబుదము** సం.వి. నీటినిచ్చునది, మేఘము. మబ్బు.

**అంబుధి** సం. వి. సముద్రము.

**అంబువాహిని** సం. వి. దోనె, 2. కొయ్య బొక్కెన. 3. నీళ్ళుమోయుస్త్రీ.

**అంబువు** సం. వి. నీరు, (జ్యోతి.) లగ్నము నకు నాలుగవ స్థానము. (ఛం.) ఒకరకపు వృత్తము.

**అంబుసోప్పటము** సం. వి. నీటిబుగ్గ.

**అంబేద** వి. 1. దిట్టతనము లేనివాడు, పిరికి. 2. అసమర్థుడు. అప్రయోజకుడు.

**అంభస్సు** సం. వి. నీరు. (జ్యోతి.) లగ్నము నకు నాలుగవ స్థానము.(వృక్ష.) కురువేరు

**అంభోజము** సం. వి. 1. తామర. (జం.) సారసపక్షి, బెగ్గురుపక్షి.

**అంభోజిని** సం.వి. 1. తామరతీగ. 2.తామర కొలను. 3. పద్మసమూహము.

**అంభోదము** సం. వి. 1. మేఘము. 2.(వృక్ష) తుంగముస్త.

**అంభోధరము** సం. వి. 1. మేఘము వ్యు. నీటిని ధరించునది. 2. (వృక్ష.) ముస్త.

**అంభోధి** సం. వి. సముద్రము.

**అంభోరాశి** సం. వి. సముద్రము.

**అంభోరుహము** సం. వి. 1. తామరపువ్వు. 2. (జం.) బెగ్గురుపక్షి.

**అంశ** సం. వి. (గణి.) కోణము యొక్క పరిమాణము (Degree).

**అంశకుడు** సం. వి. 1. దాయాది, జ్ఞాతి. 2. పాలికాపు.

**అంశమాపకము** సం. వి. (రసా.) విదిత సాంద్రతగల ఇంకొక ద్రావణపు రాసాయనిక ప్రక్రియ తుదిముట్టువరకూ చేర్చి

ఒక ద్రావణపు సాంద్రతను కనుగొనుట (Literation).

**అంశము** సం. వి. 1. భాగము. పాలు, వంతు. 2. విషయము.

**అంశములు** సం. వి. (రసా.) ఏయే ద్రవ్యములు కలిసి ఒక మిశ్రమముగా ఏర్పడినవో ఆయా ద్రవ్యముల అంశములు (Components).

**అంశయిత** సం. వి. భాగించువాడు, పంచిపెట్టువాడు.

**అంశాంకనము** సం. వి. (రసా) కొలచు పరికరమునకు కొలతగుర్తులు చెక్కుట (Graduation).

**అంశాంకితము** సం. విశ (రసా.) కొలత గుర్తులు వేయబడినది (Graduated).

**అంశి** సం. వి. 1. దాయభాగము కలవాడు. 2. భాగముకలవాడు.

**అంశికస్ఫటికీకరణము** సం. వి. (రసా) మిశ్రములోని పదార్థముల ద్రావణీయతల భేదమును ఆధారము చేసికొని వానిని విడదీయుపద్ధతి (Fractional crystallisation)

**అంశికస్వేదనము** సం. వి. (రసా) ఒక మిశ్రద్రావణములోని వివిధ ఘటకములను బాష్పీకరించి అంశములప్రకారము విడదీయుట (Fractional distillation)

**అంశీకరణస్తంభము** సం. వి (రసా) అంశికస్వేదనమునకు ఉపయోగించు గాజుగోళిలతో నింపిన గొట్టము (Fractionating column).

**అంశుకము** సం. వి. 1. వస్త్రము, 2. సన్నని వస్త్రము. 3, ఉత్తరీయము, పైట. 4. మృదుకాంతి. (వృక్ష.) ఆకుపత్రి.

**అంశుమంతుఁడు** సం. వి. 1. సూర్యుడు. 2. సగరచక్రవర్తి మనుమడు. 3. ధనవంతుడు.

**అంశుమాలి** సం. వి. సూర్యుడు.

**అంశువు** సం. వి. 1 కిరణము. 2 కాంతి. 3. కొన 4 అణువు 5. దారము.

**అంసకూటము** సం వి ఎద్దుమూపురము.

**అంసచక్రము** సం.వి.(జం.) భుజవలయము, మొండెమునకు ముందు భాగమును వర్తులాకారముగ ఆవరించి చేతులకు ఆధారముగ నుండు ఎముకల కూర్పు (Pectoral girdle).



అంసచక్రము (కప్ప)



**అంసఫలకభాగము** సం. వి. (జం.) అంసచక్రములో అంస సంధి కూపము చుట్టును ఉన్న ఎముకలలో నిదియొకటి వెడల్పుగా నున్న దీని పై భాగము ఉదంసఫలక (Supra scapula) మనియు సన్నగా నున్న క్రింది భాగము అంసఫలక (Scapula) మనియు అందురు (Scapular portion)

**అంసఫలకము** సం. వి. (జం.) భుజపువెనుక ఎముక (Scapula or shoulder blade)

**అంసము** సం వి 1. మూపు భుజాగ్రము. 2. అంశము.

**అంసలుఁడు** సం. విశ. మంచిమూపు గలవాడు, బలవంతుడు.

**అంససంధికూపము** సం. వి (జం.) భుజపు కీలునకుండు గిన్నెవంటి భాగము.

**అంహతి** సం వి. 1. దానము, ఈవి. 2. విడుపు. 3. రోగము (వైదికము).

**అంహస్సు** సం. వి. పాపము, దోషము.

**అఁట** అవ్య. వృత్తాంతమును, కథనమును దెలుపు అవ్యయము. రా. అంట.

**అఋణి** సం. వి. అప్పులేనివాడు. అప్పు చెల్లించినవాడు, అనృణి.

**అక** వి. 1. అక్క. 2. పూజ్యస్త్రీ.

**అకట** అవ్య. అయ్యో, అకటా, కటకటా. (సంతాప సూచకము).

**అకటవికటము** విశే. తారుమారు. అడ్డదిడ్డము. రూ. అకటావికటము.

**అకము** సం. వి. దుఃఖము, పాపము.

**అకరణీయసంఖ్య-పరిమేయసంఖ్య** సం. వి. (గణి.) సామాన్య కారణాంకములు లేని రెండు పూర్ణాంకములచే ఏర్పడు భిన్నమునకు సమానమైన సంఖ్య (Rational Number).

**అకరము** సం.వి. ఏవిధమగు పన్ను లేనిది.

**అకరవు** వి. 1. తామరదుద్దు, కర్ణిక. 2. కేసరము, కింజల్కము.

**అకర్బన రసాయనశాస్త్రము** సం వి. (రసా.) కర్బన యౌగికముల విడిచిపెట్టి తక్కిన మూల ద్రవ్యముల యౌగికముల ధర్మముల వర్ణించు శాస్త్రము (Inorganic Chemistry).

**అకర్మకము** సం. విశే. (వ్యాక.) కర్మము యొక్క ప్రశ్నను కల్గించని క్రియ. ఉదా. గ్లాసు పగిలెను. (ఇందు పగిలెను అన్నది కర్మనుబోధించుటలేదు కాన అకర్మకము)

**అకస్మాత్తు (గా)** సం. అవ్య. ఉన్నట్లుండి. తటాలున, హఠాత్తుగా.

**అకడమీ** ఇం. వి. (Academy) పండిత పరిషత్తు, పండిత సభ, విద్వత్సభ.

**అకాలము** సం. వి. అనర్హకాలము, సరికాని కాలము. విశే.(గృహ)1.పక్వముకానిది. 2. యుక్తకాలమునకు ముందో వెనుకనో జరుగునది (Premature). ఉదా. అకాల భోజనము, అకాల మరణము.

**అకించనుఁడు** సం.విశే. దరిద్రుడు, నిరుపేద.

**అకించిజ్ఞుఁడు** సం. విశే. కొంచెము కూడ తెలియనివాడు, జ్ఞానశూన్యుడు.

**అకూపారము** సం. విశే. మేరలేనిది. వి. 1 సముద్రము. 2. ఆదికూర్మము.

**అకృతకము** సం. విశే. స్వభావసిద్ధమైనది.

**అకృత్యము** సం. విశే. చేయరానిది.

**అకో** అవ్య. సంశయార్థక ప్రత్యయము.

**అక్క**[1] వి. 1. తనకంటె పెద్దది అగు తోడబుట్టువు, జ్యేష్ఠభగిని, అప్ప. 2. పూజ్యస్త్రీ. 3. వంటలక్క. అవ్య. ఔర.

**అక్క**[2] సం. వి. తల్లి.

**అక్కజపడు** క్రి. ఆశ్చర్యపడు, వింతపడు.

**అక్కజము** వై. విశే. 1. అధికము. హెచ్చైనది. 2. శక్తికి మించినది. ఆశ్చర్యకరము. వి. ఆశ్చర్యము. సం. ఆశ్చర్యమ్.

**అక్కటిక** వి. దయ రూ. అక్కటికము.

**అక్కరము** వై.వి.అచ్చరము. సం. అక్షరమ్.

**అక్కఱ** వి. 1. అపేక్ష. 2. ప్రయోజనము. 3. శ్రద్ధ. 4. ఆవశ్యక కార్యము 5. కార్యము. 6. అవసరము. 7. కొరత. 8. ఇబ్బంది.

**అక్కఱకాఁడు** విశే. అక్కర కలవాడు.

**అక్కలకర** వై. వి. (వృక్ష.) జ్వరదోషమునకు పనికి వచ్చు ఒక మూలిక. రూ. అక్కలకఱ్ఱ. సం. అక్రారా, అకారకరభః.

**అక్కలి** వి. అల.

**అక్కళించు** క్రి. కడుపు వెన్నునకు అంటుకొనునట్లు ముడుగజేయు.

**అక్కసము** వి. 1. దయ. 2. కోపము. 3. సంతాపము.

**అక్కసి** విశే. అక్కసుగలవాడు. కోపి.

**అక్కసు** వి. 1. కోపము. ఆగ్రహము. 2. అసూయ. రూ. అక్కసు.

**అక్కిలి** వి. 1. కలత. అంకిలి. విచారము. 2. రోగము.

**అక్కు** వి. 1. రొమ్ము. 2. గుండె.

**అక్కుళ్ళు** వి. ఒక రకపు వడ్లు.

**అకౌంటెంట్** ఇం. వి. (Accountant)

పద్దులు వ్రాయువాడు. లెక్కలు వ్రాయు వాడు.

**అక్టోపస్** ఇం.వి. (జం.) (Octopus) గుండ్రని శరీరము, తీగలవంటి ఎనిమిది కాళ్ళు కలిగిన జలచరము, అష్టపాది.

**అక్టోబరిస్టులు** ఇ.వి. (రాజ) (Octobarists) రష్యా కమ్యూనిస్ట్ పార్టీ బాల సభ్యులు.

**అక్రమభిన్నము** సం. వి. (గణి.) లవము కంటె హారము తక్కువగానున్న భిన్నము ఉదా. $\frac{6}{5}$ (Improper fraction)

**అక్రమము** సం. విశే. 1. క్రమముకానిది, అన్యాయమైనది. 2 పాదములు లేనిది. వి. 1. గజిబిజి 2. ఔచిత్యములేమి.

**అక్షకంకాళము** సం. వి. (జం) 1. పుర్రె. 2. వెన్నెముక 3 రొమ్ముఎముక, వానికి సంబంధించిన ఎముక (Axial skeleton).

**అక్షకాస్థి** సం. వి. (జం.) బోర యెముక (Clavicle)

**అక్షకీకసము** సం. వి. (జం) వెన్నెముకలోని రెండవ పూస (Axis vertebra)

**అక్షతము** సం విశే. 1. నొప్పించబడనిది 2. విరుపబడనిది. 3. పగులగొట్టబడనిది. వి. 1. బియ్యము. 2. యవధాన్యము. 3 ధాన్యము. 4. శుభస్థితి.

**అక్షతలు** సం వి. పసుపుగాని, కుంకుమగాని కలిపిన బియ్యపు గింజలు, సేసప్రాలు. రూ. అక్షింతలు.

**అక్షధూర్తుడు** సం. విశే. జూదరి.

**అక్షమాల** సం. వి 1. అకారము మొదలు క్ష కారము ~~వరకు~~ గల వర్ణమాలిక, 2. జపమాల, తాపళము 3. అరుంధతి.

**అక్షము**[1] సం. వి. (భూగో.) ఉత్తర దక్షిణ ధ్రువము లనెడి స్థిరబిందువులను కలుపు 'ఊహారేఖ'. (గణి.) గణించుటకు వీలైన ఒక స్థిర రేఖ. (Axis).

**అక్షము**[2] సం. వి. 1. జూదము. 2. పాచిక. 3 పు[illegible]క్షము 4 వ్యాజ్యము 5. పదునారు మాషములెత్తు 6 తులాదండము. 7. రథము. 8. బండికన్ను. 9 ఇరుసు 10. సర్పము. 11. కణత క్రిందిభాగము 12. ఇంద్రియము. 13 కన్ను. 14 సౌవర్చలమనెడి ఉప్పు. 15. మైలుతుత్తము

**అక్షయ** సం. వి. అరువది సంవత్సరములలో కడపటిది.

**అక్షయత** సం. వి. (భౌతి) 1. క్షయము లేక ఉండుట. 2 మూసిన పరికరములో నున్న ద్రవ్యరాశి. 3. ఎన్నిరకముల మార్పు కలిగినను రాశిలో వృద్ధిక్షీణతలు లేకుండ ఉండుట దీనికి 'ద్రవ్య నిత్యతా నియమ'మనిపేరు ఇది ప్రకృతిశాస్త్రములకు ఆధార స్తంభము (Conservation)

**అక్షయపాత్ర** సం. వి. భిక్షాపాత్ర.

**అక్షయము** సం. విశే. 1. తరుగనిది, నాశము కానిది. 2. ఇల్లులేనిది. వి. పరమాత్మ.

**అక్షరచణుడు** సం. విశే. వ్రాతనేర్పరి. వ్రాతకాడు.

**అక్షరము** సం. విశే. 1. నాశములేనిది (జీవాత్మ, పరమాత్మ). 2. మారనిది. వి. 1. ఖడ్గము 2 అకారాది వర్ణము 3. ఓంకారము. 4. పరబ్రహ్మము. 5. మోక్షము.

**అక్షరాస్యుడు** సం. విశే. అక్షరజ్ఞానముకల వాడు

**అక్షుడు** సం. వి. 1. చెడనివాడు. 2. శివుడు 3. విష్ణువు.

**అక్షపతి** సం. వి జూదము, పాచికలాట.

**అక్షవాటము** సం. వి 1. జెట్టి సాధనచేయు చోటు, మల్లభూమి, గోదా. 2. జూద మాడుచోటు. 3 పెత్తపలక.

**అక్షసరము** సం. వి. జపమాల.

**అక్షసూత్రము** సం. వి. జపమాల.

**అక్షాంతి** సం. వి. 1. అసూయ, ఓర్వలేని తనము. 2. ఓర్పులేమి.

**అక్షాంశము** సం. వి. (భూగో.) భూమధ్యరేఖ నుండి డిగ్రీలలో కొలిచిన దూరము (Latitude).

**అక్షాంశరేఖ** సం. వి. (భూగో.) భూమధ్య రేఖనుండి ధ్రువముల వరకు ఒక్కొక్క డిగ్రీయందు అడ్డముగా గీయబడిన ఊహా రేఖ.

**అక్షాంశ రేఖాంశ వృత్తములు** సం. వి. (భూగో.) భూగోళముపై స్థలనిర్దేశమును చేయుటకు అడ్డముగను నిలువుగను గీయ బడిన ఊహారేఖలు.

**అక్షి** సం. వి. 1. కన్ను. 2. రెండు అను సంఖ్యకు సంకేతము.

**అక్షింతలు** వై. వి. చూ. అక్షతలు, సం. అక్షతాః

**అక్షిక** సం. వి. (జం.) కీటకము యొక్క కంటిలోగలసూక్ష్మమైనకన్ను (Ocellus).

**అక్షికూపములు** సం వి. కండ్ల గుంటలు (Eye orbits).

**అక్షిచాలకము** సం. వి. (జం.) కనుగ్రుడ్డును త్రిప్పునట్టిది (Occulomotor).

**అక్షిపటలము** సం. వి. కనుగ్రుడ్డులోని లోపలి పొర (Retina).

**అక్షీయము** సం విశే. (గణి., భౌతి.) అక్ష సంబంధమైనది (Axial).

**అక్షీయసంధి** సం. వి. (వృక్ష) అక్షము ఏర్ప డిన సంధి (Ventral suture) ఉదా: ద్వివిదారణ ఫలము.

**అక్షోభము** సం విశే. కలతలేనిది. వి. 1.కల్పన లేమి. 2. ఏనుగును కట్టుకంబము.

**అక్షోహిణి** సం. వి. 1. 21,870 రథములు, అన్ని గజములు, 65,610 గుఱ్ఱములు. 1,09,350 కాల్బంటులుగల సేన. 2.చతు రంగబలము (ఇది క్వాచిత్క ప్రయోగము). రూ అక్షౌహిణి

**అక్సన్** ఆం. వి. (జం.) (Auxin) 1. నర ముల కణములకు గల వెంట్రుకలవంటి పోగులు. 2. అవయవభాగములు నుండి వార్తలను మెదడునకు అందజేయు వెంట్రుకలవంటి నరముల కొనలు.

**అఖండ జీవకణ కోశము** సం. వి. (వృక్ష.) మధ్యమధ్య భిత్తికలు లేక ఒకటేగొట్టము వలె పొడవుగా నుండు జీవకణము (Coenocyte).

**అఖండము** సం. విశే. సంపూర్ణము, నిండై నది. ఖండము కానిది. (వృక్ష.) పండ్లు గాని తమ్మెలుగాని లేక తిన్నగా నున్న అంచుగలది.

**అఖాతము** సం. వి. మనుష్యులచే త్రవ్వ బడని సముద్రశాఖ. పల్లములో నున్న విశాల సముద్రశాఖ. భూమిలోనికి చొచ్చుకొని పోయిన సముద్రశాఖ.

**అఖిలము** సం. విశే. సమస్తము, అశేషము, అంతయు.

**అగచరము** సం. వి. కోతి. వ్యు. చెట్టు లేక కొండలపై తిరుగునది.

**అగచాట్లు** వి. (వి. బహు.) ఆపదలు. కడ గండ్లు.

**అగచాట్లపోతు** విశే. 1. అనేక ఆపదలను పొందినవాడు. 2. ఇతరులకు కష్టాలు కలిగించు స్వభావము కలవాడు (అని కొందరు).

**అగచాట్లమారి** విశే. చూ. అగచాట్లపోతు

**అగజాత** సం. వి. 1.పార్వతి. 2. వసురాజు భార్య గిరిక.

**అగదిత** వి. కోటచుట్టుత్రవ్వబడినకందకము. రూ. అగడత, అగడ్త.

**అగడు** వి. 1. నింద, రవ్వ, అపకీర్తి. తెల్గ రి. విశే. నింద్యము, నీచము. రూ. అవడు.

**అగడ్త** వి. చూ. అగడిత.

**అగణితము** సం. విణ. గణింపరానిది. విస్తారమైనది.

**అగణ్యము** సం. విణ. లెక్కింపవీలుకానిది. అమితము.

**అగతికుఁడు** సం. విణ. గతిలేనివాడు దిక్కులేనివాడు

**అగత్యము** విణ. ఆవశ్యకము,అనివార్యము తప్పనిది. వి. ఆవశ్యకత.

**అగదంకారుఁడు** సం. వి. వైద్యుడు. వ్యు. ఆరోగ్యమును కలిగించువాడు.

**అగదము** సం. విణ. 1. తెవులులేనిది. 2. పలుకనిది. వి. 1. మందు, ఔషధము. 2. ఆరోగ్యము 3. ఆయుర్వేదమున విషాదుల విరుగుడును తెలుపు భాగము.

**అగప** వి. 1. కొంకాయ చిప్ప. కొయ్యగరిటె. 2. ఓడల మురికిని గోకి శుభ్రము చేయు కొయ్యగుద్దలి రూ. అపక, అబక.

**అగపడు** క్రి. 1. కనబడు. 2 దొరుకు 3. చిక్కు, వశమగు, లోబడు.

**అగపాటు** వి. 1. అగపడుట లొంగుట, చిక్కుట. 2. తెలియుట.

**అగిమము** సం. వి. 1. చెట్టు. 2 కొండ. వ్యు. కదలలేనిది.

**అగిము** సం. వి. 1. చెట్టు 2. కొండ. 3 పాము. 4. సప్తసంఖ్య.

**అగమ్యము** సం. విణ. 1. పోవశక్యము కానిది, చేరరానిది. 2. పొందరానిది. 3. గ్రహింపరానిది.

**అగరువు** సం. వి. పరిమళద్రవ్యము. అగలు.

**అగలిక** వి. చీలిక, పగులు.

**అగలు**[1] వి. చూ. అగరువు.

**అగలు**[2] క్రి. పెల్లగిలు, పగులు.

**అగవు** వి. కార్యము, పని.

**అగసాలి** వి. కమసాలి. స్వర్ణకారుడు. బంగారుపనివాడు. రూ. అగసాలె

**అగసాలె** వి. చూ. పై.

**అగస్త్యము** సం. వి. అవిసెచెట్టు.

**అగాధము** సం. విణ. 1. చాలలోతు ఐనది. 2. తెలియరానిది. వి. (భూగో.) లోతైన గోయి (Abyss).

**అగాధసాగరము** సం. వి. (భూగో.) చాల లోతైన సముద్రము (Abysmal sea).

**అగాలనీయము** సం. విణ. వేడిచేసినను ద్రవముగా మారని స్వభావముగలది (Infusible).

**అగిసియ** వి. అగిసె.

**అగిసె** వై. వి. చూ. అగస్త్యము.

**అగు** అ. క్రి. అవు, కలుగు, సాధ్యపడు. అవ్య. సరే (అంగీకారమును తెలుపును).

**అగుడు** వి. 1. అవుసుగడ్డి. 2. వికారము. 3. పరిమళద్రవ్యము. 4. (వ్యావ.) అపనింద.

**అగుడెంచు** క్రి. గతించు, కడచు.

**అగునగు** అవ్య. సెబాస్! (ప్రశంసార్థకము).

**అగురువు** సం. విణ. బరువులేనిది. చిన్నది. వి. అగలు.

**అగులు** క్రి. ఊడు, పగులు రూ. అవులు, ఔలు.

**అగోచరము** సం. విణ. మనస్సుచేతను ఇంద్రియములచేతను గ్రహింపరానిది.

**అగౌకసము** సం. వి. 1. సింహము. 2 శరభమృగము 3 పక్షి. వ్యు. కొండ లేక చెట్టు నివాసస్థానముగా గలది

**అగ్గము** విణ 1 అధికము 2 దుస్సహము

**అగ్గలిక** వి. 1 ఆధిక్యము 2 పూనిక 3 పరాక్రమము, విజృంభణము 4 విలాసము రూ. అగ్గలికము

**అగ్గలికము** వి. చూ. పై.

**అగ్గి** వై. వి. నిప్పు, అగ్ని సం అగ్నిః

**అగ్గికంటి** వి శివుడు

**అగ్గిచూలి** వి. 1. కుమారస్వామి 2. నీరు. వ్యు. నిప్పునుండి పుట్టినవె.

**అగ్గితత్తడి** వి. అగ్నిదేవుని వాహనము, పొట్టేలు

**అగ్గించు** క్రి. స్తోత్రముచేయు. పొగడు.

**అగ్గింపు** వి. స్తోత్రము. పొగడ్త.

**అగ్గువ** వై.వి. వెలతక్కువది. చౌక. విశ. వెలతక్కువయైనది. రూ. అగ్గువ. సం. అఘ.

**అగ్ని** సం. వి. 1. నిప్పు. 2. అగ్నిదేవుడు

**అగ్న్యుత్పాదక** (అగ్ని + ఉత్పాదక) సం విశ. (రసా) నిప్పును పుట్టించు గుణము కలది. ఉదా. కొన్ని పరిస్థితులలో తయారు చేయబడిన ఇనుముగాని, సీసముగాని గాలి తాకినంతనే నిప్పుకలు రాల్చును (Pyrogenic).

**అగ్నిక్రీడ** సం. వి. (రసా.) బాణసంచు, మతాబులు, టపాకాయలు, చిచ్చుబుడ్లు, తారాజువ్వలు మొ॥వి తయారుచేయుకళ (Pyrotechnics), 2. బాణసంచు (అని కొందరు)

**అగ్నిచిత్తు** సం. వి. ఆహితాగ్ని, నిత్యాగ్ని హోత్రి.

**అగ్నిజశిలలు** సం. వి. (భూగో.) నిప్పు రాళ్ళు, భూగర్భమున నున్న వేడిచే ఏర్పడిన రాళ్లు.

**అగ్నినిరోధము** సం. వి (గృహ.) నిప్పు అంటుకొననిది అగ్నికి వశముకానిది (Flame proof).

**అగ్నిపర్వతము** సం వి. (భూగో) లోపల అత్యుష్ణమైన ఘనద్రవ పదార్థము లున్న కొండ. (అది జ్వాలాబిలము ద్వారా భూమి ఉపరితలముతో కలిసియుండును.

**అగ్నిపర్వతశిల** సం. వి. (భూగో) అగ్ని పర్వతముల నుండి పొంగి భూమి ఉపరి తలమును చేరి గట్టిబడిన లావా.

**అగ్నిభీమా** వి. అగ్నిప్రమాదము సంభవించినచో భీమాదారుడు పొందిన నష్టమును భీమాకంపెనీ పూరించవలెననుఒప్పందము (దీనికి ప్రతిఫలముగ భీమాదారుడువాయిదాలు చెల్లించుచుండవలెను).

**అగ్నిభువు** సం వి. కుమారస్వామి.

**అగ్నిమంథము** సం వి. నెల్లిచెట్టు. ఉసిరిక.

**అగ్నిమాంద్యము - మందాగ్ని** సం వి.) (గృహ) ఆకలి లేక పోవుట(Anorexia.)

**అగ్నిముఖుఁడు** సం.వి 1. బ్రాహ్మణుడు. 2. వేలుపు

**అగ్నిమృత్తిక** సం వి కాల్పినను వికారము చెందని మట్టి (Fire clay).

**అగ్నిశిఖము** సం వి. కుంకుమపూవు.

**అగ్నిహోత్రము** సం వి. 1. అగ్ని. 2. హోమము. 3. హవిస్సు

**అగ్రకార్మికుఁడు** సం వి (వాణి) వ్యాపార సంస్థలో పరిపాలకులకు, పనివాండ్రకు మధ్యపనిచేయు ఉన్నతశ్రేణి కార్మికుడు. (కార్మికుల కష్టములను గ్రహించి పరి పాలకులకు విన్నవించి పరిపాలకుల ఉత్తరువులను కార్మికులకు అందజేయును పరి పాలకుల ఉద్దేశముల ప్రకారము ఉత్పత్తి కొనసాగించుట అగ్రకార్మికుని ముఖ్య బాధ్యత. శాస్త్రీయ పరిపాలనలో అగ్ర కార్మికునికి ప్రత్యేక స్థానము కలదని ప్రత్యేకముగ గుర్తింపబడెను)

**అగ్రకోరకము** సం. వి (వృక్ష) కొమ్మ చివరనుండు మొగ్గ (Terminal bud).

**అగ్రగండాస్థి** సం వి (జం) పుఱ్ఱెలో శ్రవణప్రావర మునకు ప్రక్కగానున్న 'T'ఆకారముగల ఎముక (Squamosal bone).



కప్ప కపాలము
అగ్రగండాస్థి
చతుష్క యుగ్
యాస్థి
అగ్రహనువు

**అగ్రగణ్యుఁడు** సం విశ. శ్రేష్ఠుడు, మొదట లెక్కింపదగినవాడు.

అగ్రగామి సం. వి. ముందు నడుచువాడు. (గృహ) ఒక వస్తువుగా తయారగుటకు దానికి ముందున్నస్థితి. ఉదా. కెరొటిన్ శరీరములో విటమిన్ 'A' గా మారబడును. కనుక విటమిన్ 'A' కి అగ్రగామి కెరొటిన్.

అగ్రజుఁడు సం.వి 1. బ్రహ్మ. 2. బ్రాహ్మణుడు. 3. అన్న

అగ్రణి సం. విశ. శ్రేష్ఠుడు, మొదటివాడు

అగ్రతస్సరుఁడు సం. విశ. 1. మొదటివాడు. 2. ముందునడుచువాడు.

అగ్రమస్తిష్కము సం.వి. (జం) మెదడులో మొదటిభాగము (Procence phalon or forebrain).

అగ్రము సం.వి. 1. ఎదురు. 2. సమీపము. 3. కొన. విశ. మొదటిది. (భూగో.) సముద్రములోనికి చొచ్చుకొని పోయిన నేలకొన.

అగ్రయోజవర్ధము సం. వి. (జం.) వెన్నెముకలో నున్న చేతాకుద్వయముపై ప్రతి కీకసమునకు చెరియొక వైపున ముందు భాగమున నుండు చిన్న బొడిపెలు (Prezygapophysis). వెనుక భాగమున నున్నవి పశ్చయోజవర్ధములు(Postzygapophysis)

అగ్ర్యసరుఁడు సం. వి. చూ. అగ్రగామి.

అగ్రహనువు సం. వి. (జం.) కపాలములో హనువునకు ముందరి భాగమున నున్న ఎముక (Premaxilla).

అగ్రహారము సం. వి. పన్ను లేకుండ బ్రాహ్మణుల కిచ్చెడు ఈనాం భూమి

అగ్రిమము సం. విశ. ప్రధానము

అగ్రిముఁడు సం. విశ మొదటివాడు.

అగ్రేదిధిషువు సం. వి. 1. మారుమనువు దాని మొదటి మగడు 2. మారుమనువు దానిని పెండ్లాడినవాడు. 3. అక్క అవివాహితగా నుండగా పెండ్లాడిన చెల్లెలు

అగ్రేసరుఁడు సం. వి. చూ. అగ్రగామి.

అగ్రోరము సం వి. (జం) కీటకముల రొమ్ము భాగములో తలతరువాత నున్న భాగము (Prothorax)

అగ్రోసాన్ ఇం వి. (వ్యవ) (Agro-san) పైరులకు పట్టు శిలీంధ్రములను నివారించుటకు ప్రయోగపడు మందులలో ఒకటి (దీనిని పాదరసమునుండి తయారు చేయుదురు).

అగ్ర్యము సం విశ ముఖ్యము.

అఘటనము సం విశ. సంభవింపనిది.

అఘటితము సం విశ కూడరానిది.

అఘమర్షణము సం వి. సర్వపాపములు పోవుటకై జపించు మంత్రము. (ఋగ్వేదము 10-190)

అఘము సం. వి. పాపము.

అఘాయిత్యము వై.వి. (వ్యాక.) 1. దౌర్జన్యము, 2. క్రూరత్వము, 3. చెడ్డకీడు. రూ. ఓగాత్యము ఓగాయిత్యము. సం. అఘాత్య

అఘోరము సం. విశ. మిక్కిలి భయంకరమైనది వి. శివుని శిరస్సులలో ఒకటి భయంకరముకానిది.

అఘోరించు సం. క్రి. 1. దుఃఖించు 2 దేవులాడు.

అఘ్న్య సం. వి. ఆవు విశ చంపదగనిది.

అచరము సం విశ. కదలనిది. స్థావరము.

అచల సం. వి భూమి.

అచలము సం. వి. కొండ విశ. కదలనిది

అచలసంధి సం. వి. (జం) కదలికకు వీలులేని ఎముకలసంధి. ఉదా. పుఱ్ఱెలోని ఎముకలు కదలని కీలు (Immovable joint)

అచింత్యము సం. విశ. చింతింపరానిది ఆలోచించుటకు శక్యముకానిది

అచిరద్యుతి సం. వి. మెరుపు

**అచుంబితము** సం. విణ. 1 ముద్దు పెట్టుకొనబడనిది 2 పూర్వమెవ్వరును స్పృశింపనిది

**అచేతనము** సం విణ. చైతన్యము లేనిది

**అచ్చిక** వి. 1. కొంత 2. లోపము, 3 కల్ల

**అచ్చికబుచ్చిక** వి. కలుపుగోలుతనము, క్షేమము తెలుసుకొనుట

**అచ్చివచ్చు** క్రి అయివచ్చు, కలిసివచ్చు

**అచ్చు** సం. వి. స్వరము (అకారాదులు)

**అచ్చెరువము** వై. వి. అచ్చెరువు సం. ఆశ్చర్యమ్

**అచ్యుతుఁడు** సం వి. విష్ణువు

**అచ్చటు** వి ఆచోటు రూ అచోటు, అచ్చోటు అచ్చోటు

**అచ్ఛ** వై వి అచ్ఛమైనది కలగలుపు లేనిది సం. అచ్ఛమ్

**అచ్చనగండ్లు** వి. బాలికలాడెడి క్రీడ. రూ అచ్చనలు, అచ్చనగాయలు

**అచ్చనగుండ్లు** వి. అచ్చనలాడు గుండ్లు

**అచ్చనలు** వి రూ పై

**అచ్ఛము** వై విణ 1 స్వచ్ఛము, తెల్లనిది, 2 కేవలము రూ అచ్ఛ సం అచ్ఛమ్

**అచ్చర** వై వి. దేవవేశ్య, సం. అప్సరా

**అచ్చరము** వై అక్షరము సం. అక్షరమ్

**అచ్చళము** 1 కోపము 2 పూనిక 3 పట్టుదల

**అచ్చళించు** క్రి. ఆగ్రహించు

**అచ్చి (కు)** ? విణ. జంజాటము లేనివాడు.

**అచ్చు** క్రి. 1. అచ్చుపడు 2. ఇచ్చు. 3. దండుగ ఇచ్చు. వి. 1 అచ్చువేయు ముద్ర. 2 తిరుగలి గూటము 3. బెల్లము మొ. ని అచ్చు విణ. శుద్ధము.

**అచ్చుఁగూటము** వి. ముద్రాక్షరశాల.

**అచ్చుకుప్ప** విణ. ధనవంతుడు.

**అచ్చుటెద్దు** వి. అచ్చువేసి విడిచిన యెద్దు ఆబోతు.

**అచ్చుదల** వి. 1 అచ్చివచ్చుట. 2. అప్పు.

**అచ్చుపడు** క్రి 1. స్పష్టమగు. 2. ముద్రింపబడు.

**అచ్చుపాటు** వి. 1. అచ్చుపడుట. ఏర్పాటు. 3. కలిసివచ్చుట.

**అచ్చోటు** వి ఆచోటు.

**అచ్చొత్తు** క్రి. ముద్రించు.

**అచ్ఛభల్లము** సం. వి. ఎలుగుబంటి.

**అచ్ఛము** సం. విణ. అచ్ఛము. వి. 1. ఎలుగుబంటి 2. పటికపురాయి,

**అజ** సం. వి. ప్రకృతి. వ్యు. పుట్టుకలేనిది. శాశ్వతమైనది. 2. ఆడుమేక. వ్యు. ఎక్కువగా తిరుగునది.

**అజగరము** సం. వి. పెద్దపాము.

**అజగర్దము** సం. వి. నీటిపాము,

**అజగవము** సం. వి. శివుని విల్లు. రూ. అజీగవము. అజీగావము, అజకవము, అజీకవము.

**అజన్యము** సం. వి. ఉత్పాతము. విణ. జన్యముకానిది.

**అజప** సం. వి. సగము మగ పోలికయు సగము ఆడు పోలికయుగల రూపము.

**అజపుఁడు** సం. వి. 1. అవైదిక గ్రంథములు చదువువాడు. 2. జపము చేయనివాడు, 3. జపము చేయుటకు యోగ్యత లేనివాడు. 4. మేకల కాపరి.

**అజము** సం. వి. 1. మగమేక. 2. మేషరాశి. విణ. పుట్టుకలేనిది,

**అజయ్యము** సం. విణ. జయింప శక్యము కానిది.

**అజరుఁడు** సం. విణ. ముసలితనము లేనివాడు, వి. వేలుపు.

**అజస్రము** సం. విణ. ఎల్లపుడు.

**అజాండము** సం వి. బ్రహ్మాండము.

**అజాగ్రత్త** సం వి. జాగ్రత్తలేమి, మెలకువలేమి.

**అజాజి** సం. వి. జీలకఱ్ఱ.
**అజాజీవుఁడు** సం. వి. మేకలను మేపుకొని జీవించువాడు. గొల్లవాడు.
**అజాతశత్రువు** సం. వి. ధర్మరాజు. విశే. శత్రువులు లేనివాడు.
**అజితుఁడు** సం. వి. 1. బ్రహ్మ. 2 విష్ణువు. 3. శివుడు. విశే. జయింపబడనివాడు
**అజినము** సం. వి. తోలు.
**అజిరము** సం. వి. 1. కప్ప. 2. గాలి. 3. ముంగిలి.
**అజిహ్మగము** సం. వి. బాణము. వ్యు. వంకరగా పోనిది, తిన్నగా పోవునది.
**అజిహ్మము** సం. విశే. తిన్ననైనది. వి. కప్ప.
**అజిహ్వము** సం. వి. కప్ప. విశే. నాలుక లేనిది.
**అజీగవము** సం. వి. చూ. అజగవము. రూ. అజీగావము.
**అజీర్ణము** సం. వి. అన్నాదులు అరుగక పోవుట. విశే జీర్ణముకానిది.
**అజీవనము** సం. వి. మరణము. రూ.అజీవని.
**అజీవని** సం. వి., చూ. పై (ఈ పదము శాపమునందే వాడబడును.
**అజుఁడు** సం.వి. 1. బ్రహ్మ. 2. విష్ణువు. 3. శివుడు. 4. మన్మథుడు. 5. ఇక్ష్వాకు వంశమునకు చెందిన ఒకరాజు.
**అజెండా** ఇం. వి. (Agenda) సమావేశము మొ॥గు వానిలో నిర్ణీత కార్యక్రమము. అట్టి కార్యక్రమ పట్టిక.
**అజేయము** సం. విశే. గెలువరానిది. వి. మద్దిచెట్టు.
**అజటోబాక్టర్** ఇం. వి. -(వ్యవ.) (Azatobactor) నేలయందుండు సూక్ష్మజీవులలో నిదియొకటి. (ఇది సేంద్రియ పదార్థము నుండి చక్కెర మొ. కరనోదజనితము లను, గాలినుండి నత్రజనిని గ్రహించి పెరుగును)
**అజ్జారము** వి. మొగసాల, హజారము.
**అజ్జ** వి. 1. పాదము. 2. సమయము. అవ్య. బళి!
**అజ్జవాలు** వి కోడి చరణాయుధము.
**అజ్జము** పై. వి. కొన్ని పనసలుగల వేదభాగము. రూ. అఝుము, సం. అధ్యాయ .
**అజ్ఞత** సం. వి. తెలివిలేనితనము. రూ. అజ్ఞత్వము
**అజ్ఞత్వము** సం. వి. చూ. పై
**అజ్ఞాతరాశి** సం వి (గణి.) సమీకరణముల లోని తెలియని రాశి (Unknown Quantity).
**అజ్ఞానము** సం. వి. తెలివిలేనితనము.
**అజ్ఞుఁడు** సం. వి. మూర్ఖుడు, తెలివిలేని వాడు.
**అజ్ఞేయతావాదము** సం వి దేవుడున్నాడో లేడో తెలియ దనువాదము
**అట** వి. అక్కడ. అవ్య అవుల, పిమ్మట.
**అటకలి** వి. వలుగుపిండి.
**అటనము** సం. వి. తిరుగుట. సంచారము.
**అటని** సం. వి. వింటికొప్పు
**అటమట** వి. 1. వంచన. 2 దుఃఖము. విశే 1. వ్యర్థము 2. అసత్యము.
**అటమటకాఁడు** విశే. వంచకుడు. రూ. అటమటీఁడు.
**అటమటించు** క్రి. 1. చలించు. 2 వంచించు 3. అపహరించు.
**అటమటీఁడు** వి. చూ. అటమకాఁడు.
**అటమర** వి. పలాయనము పారిపోవుట. విశే. పనికిమాలినది.
**అటవి** సం. వి. అరణ్యము. వికృ. అడవి.
**అటాషె** ఇం. వి. (Attache)1. కాగితములు పెట్టుకొనుటకు విలగు తోలుసంచి. 2. (రాజ) దౌత్యాలయపు అధికారి. 3. సహచారి.

**అటి** విశ. అటువంటి రూ. అట్టి.
**అటిక** వి. చిన్నకుండ. రూ. అట్టిక.
**అటు** అవ్య. 1 ఆప్రకారము, 2. అక్కడకు రూ అటు, అట్టులు.
**అటుక** వి ఇంటిలో దూలములపై నేర్పరచిన మంచె. రూ, అట్టుక, అట్టుగ, అట్టువ
**అటుకులు** వి. వడ్లు నానవోసి వేయించి కొట్టినవి రూ అడుకులు.
**అటె** అవ్య ఆశ్చర్యము దుఃఖము మొ॥ భావము ను తెలుపు ప్రత్యయము రూ. అట్టె, అటే. అటో, అటో.
**అట్ట** వి. 1. మొండెము. 2 చెప్పులకు అడుగున వేయు చర్మము 3 దళసరి కాగితము.
**అట్టచెమ్మ** వి. నాలుగుగవ్వలతో ఆడెడి ఒక ఆట.
**అట్టడె** వి. కోట బురుజు మీది ఇల్లు.
**అట్టము** సం. వి. 1. వంటకము. 2. వంటచెరకు 3. మేడ వెనుకటియిల్లు. 3. అతిశయము.
**అట్టహాసము** సం. వి పెద్దనవ్వు.
**అట్టాలకము** సం. వి 1. కోట బురుజు. 2. నగరు.
**అట్టి** విశ. మా అటి
**అట్టిక** వి. మా. అటిక.
**అట్టిఁడు** విశ. (అట్టి+వాడు) అటువంటివాడు
**అట్టియ** వి. గుంపు
**అట్టు** వి. ఒక రకపు పిండిపంట. దోసె అవ్య. ఆ ప్రకా ముగా.
**అట్టుక** వి. మా. అటుక
**అట్టుగ** వి. మా. అటుక
**అట్టుపుట్టానవాలు** వి. (జాతి) సంపూర్ణ విప ణము.
**అట్టులు** అవ్య మా. అటు
**అట్టువ** వి. మా. అటువ.

**అట్టె** అవ్య. మా. అటె.
**అట్టెడ** వి. పూడికమన్ను ఎత్తుటకు ఉపయోగపడుతట్ట, జల్లెడవంటి తడక.
**అట్టము** వి. ఎనిమది వన్నములుగల వేద భాగము. సం. అష్టకమ్.
**అట్లాంటిక్ చార్టర్** ఇం. వి. (రాజ.) Atlantic Charter)అట్లాంటిక్ పత్రము, రెండవ ప్రపంచయుద్ధము జరుగుచుండగ, అమెరికాయుద్ధములో ప్రవేశింపకముందు అమెరికా సంయుక్త రాష్ట్రముల అధ్యక్షుడైన 1. 'ఫ్రాన్క్లిన్ రూజ్వెల్టు 2. బ్రిటిష్ ప్రధానియైన 'విన్స్టన్ ఛర్చిల్' కలిసి క్రీ. శ. 1941వ సంవ., అగస్టు 14వ తేది చేసిన ప్రకటన. (ఈ ప్రకటన ప్రకారము ప్రపంచములోని అన్ని దేశములకు, జాతులకు స్వతంత్రముగా బ్రతుకుట కధికారము కలదని ఉద్ఘాటించిరి. ఈ అట్లాంటిక్ ఛార్టర్ను, 'రూజ్వెల్' 'చర్చిల్' అట్లాంటిక్మహాసముద్రములో న్యూఫౌండ్లాండ్ వద్ద నున్న బ్రిటిష్ యుద్ధనౌకలో సమావేశమై ప్రకటించుటచే దీనికి 'అట్లాంటిక్ చార్టర్' అని పేరు వచ్చినది.)
**అట్లాస్** ఇం. వి. (భూగో) (Atlas) 1. దేశపటముల గ్రంథము. 2. (భూమిని మోయు) గ్రీకు దేవత. 3. లిబియాదేశ మందొక పర్వతము.
**అడ** వి. 1 ముద్ద. 2, ఆకృతి. త. అడై.
**అడఁకువ** వి. వినయము, నమ్రత. రూ. అణకువ.
**అడఁగు** క్రి. 1. తగ్గు, ఉపశమిల్లు. 2. లోబడు. 3. వంగు 4. నశించు. రూ. అణఁగు.
**అడఁది** వై. వి. పసుపురంగు. రూ. అళది. హళది. సం. హరిద్రా. క. అళది, హళది,
**అడకత్తెర** వి. వక్కలను కత్తిరించు కత్తెర.

**అడకము** విశే. లోలోపల అణగినది.

**అడకర** వి. తాలిమి, ఓర్పు.

**అడకించు** క్రి. 1. అపహసించు. 2. మోసపుచ్చు

**అడకొత్తు** వి. చూ. అడకత్తెర.

**అడగోలుకొను** క్రి. 1. అపహరించు. 2. లోబరచుకొను.

**అడచాల** వి. 1. వంటవాడు. 2.వంటలక్క.

**అడజడి** వి. 1. దుఃఖము. 2. శ్రమ. రూ. అలజడి.

**అడప** వి. తాంబూలపు బరణి పట్టుకొను సేవకురాలు.

**అడపకత్తె** వి. వక్కలాకులబరణిని మోయు స్త్రీ.

**అడపకాఁడు** వి. 1. మంగలి. 2. అడపము పట్టుకొనువాడు.

**అడపదడప** అవ్య. అప్పుడప్పుడు. రూ. ఎడపదడప. (వ్యావ.) అడపాదడపా.

**అడపము** వి. 1. వక్కలాకులు పెటుకొను సంచి. 2. మంగలి పొది.

**అడపొడ** వి. జాడ.

**అడరించు** క్రి. బాణమును ప్రయోగించు రూ. అడరుచు, అడర్చు.

**అడరు** క్రి. 1. అతిశయించు. 2. కలుగు. 3. పూను. 4. త్వరపడు. 5.వృద్ధి పొందు. 6. వ్యాపించు. వి. 1. ఒప్పు. 2. ఆపద. 3. ఆధిక్యము.

**అడరుచు** క్రి. చూ. అడరించు.

**అడర్చు** క్రి. చూ. అడరించు.

**అడలించు** క్రి. గద్దించు. రూ. అదలించు.

**అడలు** క్రి. 1. ఏడ్చు.దుఃఖించు. 2. భయపడు. వి. 1. శోకము 2. భీతి.

**అడవి** వై. వి. అరణ్యము. సం. అటవీ,

**అడవికాపు** వి. వానప్రస్థుడు.

**అడవికుక్క** వి. తోడేలు. అరణ్యశునకము.

**అడవి తిరుగుడు** వి. కోతి.

**అడసాల** వై.వి. వంటయిల్లు. సం. అట్టశాలా

**అడి** విశే. 1. అధికము, 2. వ్యర్థము.

**అడిగట్టు** వి. (అడుగు+కట్టు) పాదుక.

**అడిగొట్టు** విశే. కుత్సితుడు. కుజనుడు.

**అడిచిపడు** క్రి. 1. త్వరపడు. తమకించు. 2. మండిపడు 3. ఈర్ష్యాదులచే ఎగిరిపడు. మిడిసిపడు.

**అడిచిపాటు** వి. 1. తొందరపాటు. 2. ఈర్ష్యాదులచే ఎగిరిపడుట

**అడితి** వి. 1. వర్తకములో నూటికింత యని పుచ్చుకొను తరుగు (కమిషన్). 2. కట్టు లమ్మెడి చోటు.

**అడిత్రాగుడు** వి 1. కరవు, దుర్భిక్షము. 2. చాలీచాలని తిండి.

**అడిదపు మెకము** (అడిదము+మెకము)వి. ఖడ్గమృగము,

**అడిదము** వి. ఖడ్గము. కత్తి.

**అడిబంత** వి. దుష్టుడు: 2. అధముడు

**అడిభీరము** వి. వ్యర్థ పౌరుషము.

**అడియడు** విశే. పాదసేవకుడు. రూ. అడియరి. త. అడియాపన్. అడియాన్.

**అడియరి** విశే. 1. కింకరుడు. 2. లోభి. 3. పాదసేవకుడు.

**అడియాలము** వి. 1. గురుతు చిహ్నము. 2 రుజువు. ప్రమాణము.

**అడియాస** వి. 1. ప్రత్యాశ. 2, వ్యర్థాశ.

**అడిమొత్తు** వి. (అడుగు+ఒత్తు) పాదుక. అడిగట్టు.

**అడిసాటా** వి. తరుగుబేరము (అడితి+బేరము); అనామతు బేరము.

**అడుకు** క్రి. దొంతిగా పేర్చు. వి. 1.దొంతి. 2. వెరపు. భయము.

**అడుకులు** వి. చూ. అటుకులు.

**అడుగు** క్రి. 1. ప్రశ్నించు. 2, యాచించు. 3. కావలెనని కోరు. వి. 1. క్రింద.

2. పాదము 3. పం(డెండంగుళముల దూరము. 4. పాదప్రమాణము, 5. పద్య పాదము విశ. హీనమైనది అధమము.

**అడుగంటు** క్రి. (అడుగు+అంటు) 1. వట్టి పోవు. 2. అన్నముమొ. అడుగున మాడు.

**అడుగంటులు** విశ. అడుగున నిలిచినవి (రాళ్లు-మొ. వి).

**అడుగుపడు** క్రి. 1. క్రిందగు. 2. అధమమగు

**అడుగుపుట్టువు** వి. 1. గంగ. 2. శూద్రుడు

**అడుచు** క్రి. కొట్టు

**అడుజా** వి ఒక జాతి డేగ. రూ అడుజు

**అడువ** విశ. పాత్ర, పురాతనము. ఉదా, అడువ సరకులు. వి. లోకువయైనవాడు.

**అడువు** క్రి. 1. ప్రశ్నించు. 2. కొట్టు. వి. అడుగు, పాదము.

**అడుసు** వి. బురద.

**అడ్జుటెంట్** ఇం. వి. (Adjutant) సహాయాధికారి.

**అడ్డ** వి. 1. గుంటక మొ.ని దిండువంటి కొయ్య 2. కుంచములో సగము. అ కొలత పాత్ర. 3. నాలుగు.

**అడ్డంకి** వి. అడ్డి, అడ్డు, నిరోధము.

**అడ్డకత్తి** వి. (అడ్డము+కత్తి) వట్టాకత్తి. వటిసము.

**అడ్డకమ్మి** వి. ద్వారబంధపు పైకమ్మి, లచ్చికమ్మి, నాన.

**అడ్డకట్టు** వి. 1. అడ్డి. విఘ్నము. 2. ఒక రకపు సుఖరోగము.

**అడ్డగాలు** వి. చూ. అడ్డకట్టు.

**అడ్డగుణకారము** సం. వి. (గణి.) ద్విఘాత సమీకరణముల మూలమును కనుగొనుటకు ఉపయోగపడు ఒక ప్రక్రియ $\frac{2}{3}$, $\frac{4}{5}$ అను భిన్నాంకములలో అడ్డగా నున్న 2, 5 లను.3, 4 లను గుణించుట (Cross multiplication).

**అడ్డలము** వి. కేడెము. డాలు.

**అడ్డపట్టె** వి. (వ్యవ.) మడి చదును పరచెడి పలక. రూ. అడ్డపట్టియ.

**అడ్డపాప** వి. 1. అడ్డముగా ఎత్తుకొనదగిన శిశువు. 2. దూరవస్తువులను చూడజాలని వాని కంటిలోనిపాప,

**అడ్డబాస** వి. బులాకి, ముంగర.

**అడ్డమాను** వి. చూ. అడ్డపట్టె.

**అడ్డము** వి. 1. నిరోధము, అడ్డంకి. 2.చాటు. 3 తాకట్టు. 4. పూట. విశ. నిరోధకము. అడ్డునది.

**అడ్డవేడెము** వి. పామునడకవంటి గుఱ్ఱపు నడక.

**అడ్డసారెలు** (అడ్డము+సారెలు) వి. పాచికలు. రూ. అడ్డసాకులు, అడ్డసాళ్లు.

**అడ్డసాకులు** వి. చూ. పై

**అడ్డాకు** వి. ఒకరకపు ఆకు.

**అడ్డాదిడ్డి** విశ. (అడ్డము+దిడ్డి) అక్రమము వక్రము, వ్యతిరేకము.

**అడ్డి** వి. అడ్డంకి, విరోధము.

**అడ్డిగ** వి. స్త్రీలు మెడలో ధరించుకొనెడు ఒక నగ.

**అడ్డు** క్రి. అడ్డగించు, నిరోధించు. విశ. నిరోధకము. నిరోధకుడు.

**అడ్డుకల్లెము** వి. (వ్యవ.) పెద్ద ఇనుప నాగళ్లలో చాలువెడల్పు మార్చుటకు ఉపయోగించు భాగము.

**అడ్డుగ** వి. రూకలో సగము.

**అడ్డుగట్టు** వి. 1. అడ్డి, అడ్డంకి. విఘ్నము. 2. కొయ్యగడియ, గడియమ్రాను, విశ. విఘాతము, విఘ్నకరము.

**అడ్డుచాళ్లు** వి. (వ్యవ.) నేలను కటవటిపారిదున్నినపుడు నేల మొక్క వాటమునకు అడ్డుగా చేయు చాళ్లు. (వర్షపు నీరు సులభముగ దొరలిపోకుండ ఇవి కొంత వరకు అడ్డుకొనును) (Cross furrows).

**అడ్డుపడు** క్రి అడ్డగించు, (శత్రువులు, ఆపదలు మొ ని నుండి తప్పించుటకై) అడ్డముపడు,

**అడ్వొకేట్ జనరల్** ఇం వి (శాస) (Advocate General) ప్రభుత్వ ప్రధాన న్యాయవాది.

**అణఁకువ** వి. నమ్రత. రూ. అడకువ.

**అణఁగు** క్రి 1. తగ్గు 2 ఉపసమిల్లు 3. నమ్రమగు. 4. నశించు 5. లోపడు రూ. అడగు.

**అణక** వి ఎద్దు మెడమీది కాడిని మెడక్రిందికి తెచ్చుకొనుట.

**అణి** సం. వి. 1. ఇరుసు తుదిచీల, కడచీల. 2. అంచు. 3 ఎల్ల. 4. కొట్టు

**అణిమ** సం. వి. 1. అణుత్వము. 2. ఒక ఐశ్వర్యము అష్టసిద్ధులలో ఒకటి. రూ. అణిమము.

**అణీయము** సం. విశ. అత్యల్పము. మిక్కిలి చిన్నది, మిక్కిలి అణువైనది.

**అణకుఁడు** సం. విశ. 1, అల్పుడు. 2. సేర్పరి.

**అణుభారము** సం. వి. (రసా.) 22-41లిటర్ల వాయువు లేదా బాష్పముయొక్క బరువు (ప్రమాణ వాయు ప్రేషతాపక్రమ పరిస్థితులలో) (Molar weight).

**అణువు** సం. విశ. స్వల్పమైనది, అల్పము. వి. 1. లేశము. 2. జగత్కారణమగు సూక్ష్మ ద్రవ్యము, సహజ ధర్మమును కోల్పోకుండ విభజింపబడుసూక్ష్మాంశము (Molecule).

**అణుసంకేతికము** సం. వి. (రసా.) ఒక అణుభారములో ఎన్నెన్నిరకముల పరమాణువులు ఎన్ని ఉన్నవో తెలుపు చిహ్నము (Molar formula).

**అణూష్ణత** సం. వి. (రసా.) అణుభారము యౌగికము (సంయోగము) యొక్క తాపక్రమమును 1 డిగ్రీ సెంటిగ్రేడ్ ఎక్కువ చేయుటకు ఆవశ్యకమగు తాపరాశి (Molecular Heat).

**అణ్వంతర్గతము** సం. విశ. (జీవ) అణువులలో నుండు పరమాణువులకు సంబంధించినది (Intıamoleculaı)

**అణ్వాంతరికము** సం విశ (వృక్ష.) జీవకణములో ఉండు వివిధ పదార్థముల అణువులలో జరుగునట్టివి. (Intra-moleьular)

**అణ్వాయతనము** సం వి (రసా) ఒక అణుభారము వాయువుగాని బాష్పముగాని ప్రమాణప్రేషతాపక్రమ పరిస్థితులలో ఆక్రమించు చోటు ఇది 22-41 లిటర్లు (Molar volnme)

**అతఁడు** సర్వ. ఆయన.

**అతకరించు** క్రి. 1. క్రిందుపరచు, మించు, అతిక్రమించు. 2 ఉల్లంఘించు.

**అతగుఁడు** విశ. 1. దుర్బలుడు. 2, అవివేకి. తెలివితక్కువవాడు.

**అతనుఁడు** సం. వి. మన్మథుడు. విశ. అధికుడు, గొప్పవాడు

**అతర్కణము** వై.వి. (వ్యావ) మట్టుమీరిన కార్యము. సం. అధఃకరణమ్

**అతలకుతలము** వి. 1. నలుగుట 2. చెదరిపోవుట. 3. అలసట, శ్రమము. 4. కలగుండు.

**అతలము** సం. వి భూలోకమునకు క్రింది లోకము, సప్తపాతాలలోకములలో మొదటిది.

**అతి** సం. అవ్య. అమితము, అవల అను అర్థమిచ్చు ఉపసర్గ.

**అతిక్రమణము** సం. వి. (భౌతి.) 1. కాంతికిరణము. 2. సామాన్య మార్గమును అతిక్రమించుట (Deviatıon).

**అతిక్రమము** సం. వి. 1. మీరుట, అతిపా

తము. 2 శత్రువులపై దండెత్తి పోవుట. 3 ఆలస్యము.

**అతిక్రమించు** సం. క్రి. మీరు, దాటు, ఉల్లంఘించు.

**అతిక్రాంతము** సం విశే. 1. మీరినది, అతీతము. గతించినది.

**అతిక్రాంతి** సం వి. అతిక్రమము.

**అతిగంధము** సం. వి. గంధకము. విశే. ఎక్కువ వాసన కలది.

**అతితపనము** సం. వి. (రసా.) ఒక ద్రవము క్వథనాంకమును దాటునట్లు వేడెక్కించుట.

**అతిథి** సం. వి. 1. భోజన సమయమునకు వచ్చు పరదేశి. 2. ఆహూతుడు. 3 కుశుని కొడుకు.

**అతిదేశము** సం. వి. 1. ఒకచోట చెప్పబడిన దానిని సామ్యమునబట్టి వేరొకచోట ఉపయోగించుట, ఒకదానిధర్మమును మరొకదానియందారోపించుట. 2. బదులు.

**అతినీలలోహితము** సం. విశే. (భౌతి.) కాంతివర్ణ మాలలో నీలలోహితమండలమునకు అవలనున్న కాంతివర్ణమాలకు చెందినది (Ultra violent)

**అతి నీలలోహిత కిరణములు** సం. వి. (గృహ) సూర్యరశ్మిలోని ఒక రకపు కిరణములు. (ఇవి శరీరమును తాకిన విటమిన్ 'డి' తయారగును) (Ultra violet rays).

**అతిముక్తము** సం. వి. మాధవీలత, పువ్వుల గురివెంద. విశే. విముక్తి పొందినది.

**అతిరథుఁడు.** సం. వి. పెక్కు విలుకాండ్రతో పోరెడి యోధుడు మహారథికుని కన్న మిన్న అయినవాడు.

**అతిరసము** సం. వి. అరిసె.

**అతిరూపము** సం. విశే. 1. మిగుల సౌందర్యము గలది. 2. రూపము లేనిది.

**అతిరేకము** సం. వి. 1 ఆధిక్యము, హెచ్చు. అతిశయము. 2. భేదము. 3. ప్రాధాన్యము

**అతిరోగము** సం. విశే. అధికమైన రోగము కలది. వి 1. అధికమైన రోగము. 2. క్షయవ్యాధి.

**అతిలోకుఁడు** సం. వి. లోకాతీతుడు. మిగుల గొప్పవాడు.

**అతివ** వి. స్త్రీ.

**అతివాదము** సం. వి. 1. మితిమీరినవాదము 2, కఠిన వాక్యము 3. అప్రియ వాక్యము. విశే. 1. మితిమీరిన వాదము కలది. 2. వాదమునకు మీరినది.

**అతివాసము** వై. వి. శ్రాద్ధదినమునకు ముందుదినము, నాడుచేయు ఉపవాసము: సం. అధివాసరమ్.

**అతివృష్టి** సం. వి. 1. మితిమీరిన వాన. 2. పైరులను పాడుచేయునట్టి పెద్ద వాన, ఈతిబాధ లారింటిలో ఒకటి. వ్యతి. అనావృష్టి.

**అతివేలము** సం.విశే. అధికము, మితిమీరినది.

**అతివ్యయము** సం. వి, వృథావ్యయము, దుబారాఖర్చు.

**అతిశయము** సం. వి. ఆధిక్యము.

**అతిశీతలీకరణము** సం. వి. (రసా.) హిమాంకమును దాటునట్లు ద్రవమును శీతలీకరించుట(Super cooling)

**అతిశీతలీకృతస్థితి** సం. వి. (భౌతి.) శీతలీకరించుట వలన సంభవించు ద్రవ్యస్థితిలో మార్పు అగపడనిస్థితి. (Super cooled)

**అతిసంచయము** సం. వి. ఎక్కువ కూడబెట్టుట.

**అతిసారము** సం. వి. నీళ్లవిరేచనము లగు వ్యాధి.

**అతిసూక్ష్మగలనము** సం. వి. (రసా.) అతి

సూక్ష్మపరిమాణము గల కణములు(కొలాయిడ్ (Colloid) కణముల) వడపోయు ప్రక్రియ (Ultra filtration).

**అతిసూక్ష్మదర్శిని** సం. వి. (భౌతి) మిక్కిలి సూక్ష్మములైన వానిని చూపు సూక్ష్మదర్శని (Ultra microscope)

**అతీతము** సం. విణ. మీరినది అతిక్రాంతము, కడచినది.

**అతుకు**[1] వి. చేర్చి కుట్టుట, కత్తిరించిన వానినిదగ్గర చేర్చికుట్టిన భాగము (Seam).


అతుకు-కుట్టు

**అతుకు**[2] క్రి. 1. అతికించు, కలిసిపోవునట్లు చేయు. 2. అంటుకొను 3. సరిపడు వి. 1. అతుకుట. 2. అతికినభాగము రూ. అదుకు.

**అతులము** సం. విణ. సరిలేనిది. సాటిలేనిది.

**అతులితము** సం. విణ. చూ పై.

**అత్త** వి. 2. భర్తతల్లి 2. భార్యతల్లి. 3 తండ్రికి సోదరి. 4. మేనమామ భార్య

**అత్తడీ** వి. ఆడుగుఱ్ఱమునకు ఋతుకాలము

**అత్తపత్తి** వి. (వృక్ష) తాకిన ముడుచుకొను ఆకులుగల మొక్క, సోకుడు ముడుగు, లజ్జావతి.

**అత్తమిల్లు** పై. క్రి. 1. అను. 2. క్రుంకు 3. ఒరగు. 4. వ్యాపించు. 5. పరుండు. 6. ఉపశమించు, 7. నశించు.

**అత్తము** పై. వి. 1 అరటిపండ్ల గెల 2 అరటిపండ్ల చీపు. 3 కాయ, పువ్వు మొ.ని గుత్తి, 4. సమూహము. సం. హస్తః.

**అత్తరము** వి. ఆతురత, త్వర, తొందర. రూ. ఆత్రము.

**అత్తరు** వి. సుగంధ తైలము. రూ. అత్తరువు.

**అత్తరువు** వి. చూ. పై.

**అత్తలము** వి. 1. ఈటె. కుంతము. ప్రాసము. బల్లెము రూ అత్తళము.

**అత్తి** వి. (వృక్ష) మేడి ఉదుంబరము, పై. వి ఏనుగు సం. హస్తిః

**అత్తు** క్రి. 1. కలుగు. 2 కలిసిమెలసి యుండు. 3. యుక్తమగు. వి. మైనపుగుడ్డ.

**అత్తెము** వి. హస్తకవచము హస్తత్రాణము. రూ అత్తము.

**అత్తెసరు** వి. గంజి వార్చకుండ అన్నములో ఇగిరి పోవునట్లు పెట్టెడు ఎసరు.

**అత్యంతము** సం. విణ. మిక్కిలి.

**అత్యయము** సం. వి. 1. అతిక్రమము. 2. కష్టము 3. చేటు 4. దుఃఖము. 5. అపరాధికి విధింపబడు జుల్మానా.

**అత్యాస** సం. వి. మితిమీరిన ఆశ. పేరాస.

**అదంత్రము** పై. విణ 1 నడుమ భగ్నమైనది. సగములో చెడినది. 2. స్వాతంత్ర్యము లేనిది, పరాధీనము.

**అదటు** వి. తుళ్ళిపాటు, గర్వము, మదము. పొగరు.

**అదనపు పదను** వి. (వ్యావ.) మొక్క వేళ్లు తీసికొనుటకు వీలుగా మట్టిరేణువులపై పొరపలె నంటి యుండు నీరు, స్వేచ్ఛాజలము (Free water):

**అదనము** విణ. కావలసిన దానికంటె హెచ్చుగా నుండునది, అధికము.

**అదను** వి. యుక్త సమయము, తరి. రూ. పాదను, అదును.

**అదభ్రము** సం. విణ. విస్తారమైనది. అధికము.

**అదరము**[1] పై వి. క్రిందిపెదవి. సం అధరః

**అదరము**[2] సం. విణ. 1. భయము లేనిది. 2. లోతులేనిది.

**అదరు** . క్రి. చలించు. 2. భయాదుల వలని త్రుళ్లు. వి. 1. చలనము. 2.భయాదుల వలన త్రుళ్ళిపడుట. రూ. అదురు,

**అదరుగుండె** వి. పిరికివాడు.

**అదరులు** వి. బహు. మిణుగురులు, నిప్పు కలు.

**అదలు** క్రి. బెదరు, భయపడు, చలించు.

**అదవ** వై. వి. ఇంటి అద్దె. 2. కోన, 3. దిక్కు లేనివాడు, 4. లోకువ అయిన వాడు. సం. అథమః.

**అదవద** వి. 1. కలత, కలవరపాటు, చింత. 2. పరాభవము, అవమానము. విశ. తారుమారైనది, వ్యత్యస్తము.

**అదాటు** వై. అవ్య. ఉన్నట్టుండి, అకస్మాత్తు. సం. హఠాత్తు.

**అదాహ్యము** సం. విశ. (రసా.) మంటలో పెట్టినను మండని స్వభావము కలది (Incombustible.)

**అది** సర్వ. ఆ వస్తువు, ఆమె.

**అదిగో** అవ్య. దూరమున నున్న దానిని చూపుట

**అదితి** సం. వి 1. దేవతలతల్లి, కశ్యపుని భార్య. 2. పార్వతి. 3. భూమి. 4. పునర్వసు నక్షత్రము.

**అదిశ** సం విశ. సరిమాణమే కాని దిశను తెలుపు ఆవశ్యకతలేనిది (Scaler). వ్యతి. సదిశ (Vector).

**అదుకు** క్రి. వి. చూ. అతుకు.

**అదుపు** వి. 1. కట్టుబాటు. 2. హద్దు. 3. స్వాధీనము.

**అదుము** క్రి. అణచు, నొక్కు.

**అదురు** క్రి. వి. చూ. అదురు.

**అదువ** విశ. అస్థిరము, అస్థిరుడు, రూ. అద్దువ.

**అదృశ్యము** సం. విశ. 1. చూడసాధ్యము కానిది. చూడదగనిది, 2. కనబడనిది, మాయమైనది.

**అదృశ్యవశిసేవనము** సం. వి. (గృహ.) మంచివైపునకు కనబడకుండ వేసిన వార కుట్టు (Blind stitch or Slip stitch).

**అదృశ్య విషజీవులు** సం. వి. (వ్యవ). సూక్ష్మదర్శిని సాయమునకూడ నిరూపించరాని కొన్ని అతిసూక్ష్మజీవులు. ఉదా. వంగ. సీమవంగ మొ. మొక్కలకు తెగులు కలిగించునట్టి జీవులు. అట్టి తెగుళ్లను అదృశ్య విషరోగములు. (Virus diseasse) అందురు.

**అదృష్టము** సం. వి. అగ్నిజలాదులవలన కలిగెడు కీడు, 2. సుఖదుఃఖ నిమిత్తమైన పుణ్యపాపరూపకర్మఫలము. 3. భాగ్యము. విశ. చూడబడనిది.

**అద్ద** వై. వి. 1. సగము. 2. అరసోల. 3. నూర్చక వేసెన కుప్పయొక్క క్రింది సగము భాగము. సం. అర్ధమ్.

**అద్దకము** వి. (గృహ.) అచ్చువేయుట. 2. వస్త్రముపై నమోనాలు అద్దుట వస్త్రములకు వేయురంగు.

**అద్దగోడ** వై. వి. 1. సగముగోడ. వంటయింటిలో వడ్డన పదార్థముల మరుగుకై అమర్చిన పొట్టిగోడ. మరుగుగోడ సం. అర్ధకుడ్యమ్.

**అద్దపురేయి** వై. వి.అర్ధరాత్రము. అపరాత్రి. సగమురాత్రి.

**అద్దము** వై. వి. 1. సగము. సం. అర్ధమ్. 2. దర్పణము. సం. అబ్దమ్.

**అద్ది** సర్వ. చూ. అది.

**అద్దికము** వి. కావలి. రక్షణము.

**అద్దియ** వి. ఇంటిబాడుగ. కిరాయి. రూ. అద్దె.

**అద్దు** క్రి. 1. ముంచు. 2. రంగువేయు

**అద్దువ** విశ. చూ. అదువ.

**అద్దె** వి. చూ.. అద్దియ.

**అద్దెకొనుగోలు పద్ధతి** వి. (వాణి.) ఈ పద్ధతిలో కొనుగోలుదారుడు తనకు కావలసినవస్తువును కొంత పైకము చెల్లించి

తన ఉపయోగములో ఉంచు కొనును: వస్తువు తనవద్దనే ఉన్నప్పటికి వాయిదాల మొత్తము చెల్లించువరకు దానిపై కొను గోలు దారునకు హక్కు కలుగదు. వాయిదాల సొమ్ము మొత్తము చెల్లించ లేని పక్షమున అంతవరకు చెల్లించిన పైకము వస్తువుయొక్క ఉపయోగము కొరకు అద్దెగా పరిగణింపబడును.

**అ(ధి)ద్రావ్యము** నం. విశ. (రసా.) ద్రావకములో కరుగనిది (Insoluble). ఉదా. ఇసుక.

**అద్రి** నం వి 1. కొండ. 2. చెట్టు 3 సూర్యుడు.

**అద్రుచు** క్రి. కంపించు, రూ. అదురుచు

**అద్వయుఁడు** నం విశ సాటిలేనివాడు. అద్వితీయుడు, వి. బుద్ధుడు.

**అద్వితీయము** నం: విశ. సాటిలేనిది. రెండువది లేనిది. సజాతీయమైన వస్తువులేనిది.

**అద్వైతము** నం. వి. 1. అభేదము. 2. జీవేశ్వరుల ఐక్యమును బోధించు మతము 3. పరబ్రహ్మము. విశ. భేదములేనిది.

**అధఃకరణము** నం వి. క్రిందు పరచుట. తక్కువ పరచుట.

**అధఃస్తరము** నం. వి. (వృక్ష) బహిఃస్తరము క్రిందనుండు పొర (Hypodermis).

**అధమము** నం. విశ. తక్కువైనది. నీచము.

**అధమర్ణుఁడు** నం. వి (గృహ) అప్పు తీసికొన్నవాడు (Debtor). వ్యతి. ఉత్తమర్ణుడు (Creditor).

**అధమవాహకము** నం. వి. (భౌతి.) తన ద్వారా ఉష్ణతను ప్రసరింపనీయని వస్తువు (Bad conductor)

**అధముఁడు** నం. విశ. తక్కువైనవాడు నీచుడు.

**అధరమహాసిర** నం. వి. సిరాకోటరము లోనికి దాని క్రింది వైపునుండి ప్రవేశించు పెద్దసిర(Post caval vein or posterior vena cava).

**అధరము** నం వి. క్రిందిపెదవి. విశ 1 తక్కువైనది, 2. క్రిందిది. 3 నీచము.

**అధరహనువు** నం. వి (జం) గడ్డమునకు ఇరువైపుల నుండు భాగము క్రిందిదౌడ (Lower jaw)

**అధవా** నం అవ్య అట్లుకాకున్న పక్షాంతరమున.

**అధశ్చర్మము** నం వి (జం.) చర్మమునకు క్రింద నున్నది (Subcutaneous).

**అధశ్శ్లేష్మకపేశిస్తరము** నం. వి. (జం.) ప్రేగుయొక్క గోడలో నుండు రెండవ పొరయగు అధశ్శ్లేష్మక స్తరము (Sub-mucosa)లో నుండు పలుచని కండరపు పొర (Muscularis mucosa).

**అధస్తుండీఖాతములు** నం. వి (జం.) పైదవుడ ముందుభాగమునకుగలఅంచువెనుకఉండు పొట్టలు(కప్పలో)(Subrostral fossae.)

**అధాతువు** నం. వి. (రసా.) ధాతువుకానిది. ధాతుధర్మము లేనిది (Non-metal).

**అధి** నం. అవ్య. 1. అధికము అను అర్థము నిచ్చు ఉపసర్గము; ఉదా. అధి భోజనము; 2. కొన్ని యెడల నిరర్థకముగా ఉండును, ఉదా. అధిజననము = జననము.

**అధికతరకోణము** నం. వి. (గణి.) రెండు సమకోణలముకన్న పెద్దదియు నాలుగు సమకోణములకన్న చిన్నదియు అగు కోణము (Reflex angle).

**అధికమాసము** నం, వి, చాంద్రమానమున మూడేండ్ల కొకతూరి వచ్చు పదమూడవ నెల. సూర్యసంక్రమణము లేని చాంద్రమాన మాసము.

**అధికము** నం. విశ ఎక్కువది. పెద్దది. వి. (అలం.) ఒక అర్థాలంకారము.

**అధికరణము** నం. వి, 1. అధికారమునందు

నియోగించుట. 2. అధికారము. 3.(వ్యాక.) సప్తమీకారకము, 4. ఆధారము, 5.(మీ.) విచారణీయ విషయము. 6. న్యాయ విచారణ స్థలము.

**అధికరించు** సం. క్రి. 1.నేర్చు, అభ్యసించు. 2. ప్రధానముగా జేసికొను. 3. పూను. 4. అధికారిగా నుండి నడుపు

**అధికార పత్ర సహిత ధన లేఖలు** సం.వి. (వాణి.) సరుకును ఎగుమతి చేయునపుడు దాని ఎగుమతి దేశములోని ఒక బాంకునకు కొంత పైకము చెల్లింపుమని కోరును. దిగుమతిదారుడు తన బాంకు ద్వారా ఇట్టి పరపతిలేఖను పంపును. ఆ పరపతిలేఖలో ఆ బాంకువారు ఎంత మొత్తమునకు ఎంత గడువునకు ధనలేఖను కొనవలెనో స్పష్టముగ నుండును. ఇట్లు బిల్లు కొని పంపునపుడు నౌకా సంబంధమైన ఇతర పత్రములుకూడ దిగుమతిదారునకు ఎగుమతిదేశములోని బాంకు సేకరించి పంపును. ఉదా. నౌకా భారము. భీమాపత్రము మొ,వి. ఇట్టి అధికారపత్రములతో కూడిన ధనలేఖలే అధికార పత్ర సహిత ధనలేఖలు (Documentary bills).

**అధికారపక్షము** సం. వి. (రాజ.) ప్రభుత్వము నడుపునట్టి పార్టీ; ఎన్నికలలో శాసనసభకు అధికసంఖ్యలో నెగ్గి మంత్రివర్గము నిర్మించి తమ రాజకీయపక్ష ప్రధాన లక్ష్యములు దృష్టిలో నుంచుకొని పరిపాలనము చేయు పార్టీ (Ruling Party).

**అధికార ప్రదానము** సం. వి. కొన్ని అధికారములు ఇంకొక సంస్థకుగాని వ్యక్తికిగాని ఇచ్చుట.

**అధికారబృందతంత్రము** సం. వి. (రాజ., పరి.) రాజ్యపాలన. తమ అధికారులకు మాత్రమే బాధ్యులైన ప్రభుత్వోద్యోగులు నడుపు ప్రభుత్వము. బ్యూరోక్రసీ (Bureaucracy).

**అధికారము** సం. వి. 1. అధ్యక్షత, 2. ఉపక్రమము. 3, లెక్కించుట. 4. స్వామ్యము. 5. కర్మాచరణాదులకు అర్హత. (అధికార సూత్రము - వ్యాక.) ఉత్తర సూత్రములతో కలిసి అన్వయించు ప్రధాన సూత్రము. 6. పరిపాలనము.

**అధికార వికేంద్రీకరణము** సం. వి. (రాజ.) దేశార్థిక సాంఘికాభివృద్ధికై కేంద్రప్రభుత్వము లేక రాష్ట్ర ప్రభుత్వము అవసరమైన అధికారములను కొన్నిటిని స్థానిక పరిపాలనా సంస్థలకు ఇచ్చుట (Decentralisation).

**అధికుఁడు** సం. వి. గొప్పవాడు,

**అధికృతుఁడు** సం. విశే. అధికారమున నియమింప బడినవాడు. అధికారి,

**అధిక్షేపము** సం. వి. 1.ఆక్షేపము నింద. 2, త్రోసివుచ్చుట. తిరస్కారము. 3. స్థాపనము.

**అధిగతము** సం. విశే. 1. పొందబడినది. .2 చదువబడినది. చక్కగా నేర్చుకొనబడినది.

**అధిగమము** సం. వి. 1. పొందుట. 2. చదువుట, 3. తెలిసికొనుట. 4. లాభము. 5. ఒప్పుకొనుట,

**అధిచర్మము** సం వి. (జం.) చర్మము యొక్క బయటి పొర (Epidermis).

**అధిచర్మము** సం. వి. (జం.) దేహము పై భాగమున లోపలి భాగమున ఉండు ఒక విధమగు జీవ కణములతో నేర్పడు పొర (Epithelium).

**అధిజ్యము** సం. విశే. ఎక్కుపెట్టబడినది (విల్లు.)

**అధిత్యక** సం. వి. కొండమీది నేల.

**అధిదేవత** నం. వి. 1. అధిష్ఠించి యుండు దేవత. 2. సర్వాధిపతియగు దేవుడు.

**అధిదేశప్రదేశములు** నం. వి. (పరి. రాజ.) అధిదేశపరిరక్షణక్రింద నున్న ప్రదేశములు (Mandatory territories)

**అధిదేశరాజ్యము** నం. వి. (పరి. రాజ.) నానాజాతిసమితి ఆదేశముపై నేదేని ఒక రాజ్యము పూర్వపు వలస రాజ్యములలో బాధ్యతాయుత ప్రభుత్వము నెలకొల్పుట (Mandate). ప్రతిపత్తి రాజ్యము.

**అధినివేశ స్వాతంత్ర్యము** నం. వి. (రాజ., పరి.) ఒక సామ్రాజ్యములో అంతర్భాగముగా నుండి; అధిరాజ్యముతో సమానముగా స్వాతంత్ర్యము ప్రజాప్రభుత్వాధికారముగల రాజ్యపరిపాలనావిధానము. (Dominion Status).

**అధినేత** నం. వి. నాయకుడు, ముఖ్యుడు.

**అధిపతి** నం. వి. 1. ప్రభువు. అధిపుడు. 2. తలలోని ఒకభాగము (దీనికి గాయము తగిలిన తోడనే వ్యక్తి మరణించును).

**అధిపుడు** నం. వి. ప్రభువు అధిపతి.

**అధిభువు** నం. వి. అధిపతి. రాజు, నాయకుడు.

**అధిమూర్తము** నం. విణ. (గణి.) ఆకారముతో సంబంధము లేక మనసుతోనే గ్రహింపబడు గుణముకలది (Abstract)

**అధిమూలము** నం. వి. (వృక్ష.) ద్విదళబీజములగు మొక్కలవేళ్ళలో అన్నిటికంటె లావుగాను పొడవుగాను ఉండువేరు. తల్లివేరు (Tap root).

**అధిరోహణము** నం. వి. 1. ఎక్కుట. ఆరోహణము. 2. ఎక్కించుట. ఎత్తుట.

**అధిరోహిణి** నం. వి. నిచ్చెన. మెట్లవరుస.

**అధివసించు** నం. క్రి. నివసించు. కూర్చుండు.

**అధివాసము** నం. వి. 1. గృహము. నివాసము. 2. అడిగినది ఇచ్చువరకు వదల నని భోజనము చేయకుండ చలపట్టి కూర్చుండుట. నిరశన వ్రతము. 3. యజ్ఞమును ఆరంభించుటకు ముందుదినమున చేయు దేవతాస్థాపనాదికర్మము. 4. గంధమాల్యాదుల ధరించుట. 5. వాసెన కట్టు, 6. పరిమళము.

**అధివాసరము** నం. వి. చూ. అతివాసము.

**అధివిన్న** నం. వి. సజీవయైన మొదటిభార్య. మొదటిభార్య.

**అధివేదనము** నం. వి. భార్యయుండగా మరల పెండ్లాడుట.

**అధిశ్రయణి** నం. వి. ప్రొయ్యి.

**అధిష్ఠాత** నం. విణ. అధిష్ఠించువాడు. ముఖ్యుడు. 2. అధిదేవత.

**అధిష్ఠానదేవత** నం. వి. చూ. అధిదేవత.

**అధిష్ఠానము** నం. వి. 1. దగ్గర నుండుట; 2. వసించుట; 3. ఉనికి పట్టు; 4. ఆధారము. 5. చక్రము. 6. ప్రాభవము. ఏలుబడి. 7. ఒక్కానొక పట్టణము.

**అధిష్ఠానవర్గము** నం. వి. (శాస. రాజ.) రాజకీయపక్షములలో అత్యధికారము గల కార్యవర్గము (High Command).

**అధిస్థాపనము** నం. వి. (భౌతి.) ఒకదానిపై నొకదానిని పెట్టుట; ఉదా. రెండు త్రికోణములను ఒకదానిపై ఇంకొకటి పెట్టుట (Superposition).

**అధిసత్తాకము** నం. వి. (పరి. రాజ.) ఒక అధిరాజ్యము తనకు లోబడియున్న రాజ్యములపై చూపు అధికారము (Suzerainity).

**అధిస్ఫురితము** నం. వి. (వ్యవ.) స్ఫురము అధికముగా లభించు స్ఫురత్వంచామ్లజనిదము యొక్క లవణము (Superphosphate).

**అధీతము** సం. విశ. 1. చదువ బడినది. 2. జ్ఞప్తియందుంచుకొన బడినది.

**అధీనము** సం. విశ. ఆయత్తము, స్వాధీనము, అగ్గము.

**అధీశుఁడు** సం. వి. సామంతులచే సేవింపబడు రాజు, ప్రభువు.

**అధునాతనము** సం. విశ. ఇప్పటి కాలమునకు సంబంధించినది, ఆధునికము.

**అధోక్షకము** సం. విశ. (జం.) భుజమునకును శరీరభిత్తికకును సంబంధించినది (రక్తనాళము) (Subclavian).

**అధోక్షజుఁడు** సం. వి. జితేంద్రియులకు ప్రత్యక్షమగువాడు, విష్ణువు.

**అధోగతి** సం. వి. 1. క్రిందబడుట, 2. తక్కువ స్థితి. 3. నరకప్రాప్తి. 4. నాశము.

**అధోగ్రసని** సం. వి. (జం.) కీటకముల అన్నవాహిక యొక్క మొదటి భాగము (Hypopharynx).

**అధోగ్రీవము** సం. విశ. (జం.) కంఠము యొక్క క్రింది భాగమునకు సంబంధించినది (Innominate).

**అధోజఠరము** సం. విశ. (జం.) కడుపులోని క్రింది భాగమునకు సంబంధించినది (Hypogastric).

**అధోజల విమోచనము** సం. వి. (వ్యవ.) నేలలోనికి ఇంకిన నీరు వెంటనే క్రిందికి వడసిపోయి మొక్కలకు కావలసినంత మాత్రమే యుండునట్లు చేయుట(Under drainage).

**అధోజిహ్వానాడి** సం. వి. (జం.) వెనుపాము నుండి బయలుదేరు నాడులలో మొదటిది (ఇది నాలుక యొక్క కండరములకును, నోటి అడుగు భాగమునకును పోవును) (Hypoglossal).

**అధోబీజదళము** సం. వి. (వృక్ష.) బీజదళములకు క్రింద నున్న ప్రథమ మూలము యొక్క భాగము (Hypocotyl).

**అధోబృహత్సిర** సం. వి. (జం.) క్రిందిభాగముల నుండి మలిన రక్తమును కుడి కర్ణికకు తీసికొని పోవు సిర (Inferior Vcnacava.)

**అధోభువనము** సం. వి. పాతాళలోకము.

**అధోభూస్తారి** సం. వి. (వృక్ష.) భూమిలో నుండు కాండ భాగమునుండి బయలుదేరి పిట వాలుగా భూమి పైకి వచ్చి పైన ఆకులను క్రింద వేళ్లను వహించు కొమ్మ (Sucker.)


అధోభూస్తారి

**అధోముఖము** సం. విశ. 1. దిగుముఖము గలది, ముఖము వంచినది. 2. తలక్రిందైనది. వి. (జ్యోతి.) 1. మూలాది నక్షత్రగణము. 2. ఒకానొక నరకము.

**అధోవాహి** సం. వి. (వృక్ష) ఒక్కొక్క వాహినీపుంజములో అంతస్త్వరము (Endodermis) వైపున ఉండు కణజాలము. (Bast of pholem). ఆకులలో పచనమైన ఆహారము ఈ కణజాలము ద్వార మొక్కలోని వివిధావయవములకు పంపబడును. ఈ కణజాలములో 1. జల్లెడగొట్టములు 2 సఖకోశములు 3. అధోవాహి మృదుకోశజాలము అనునవి ఉండును. త్వగ్వాహికా పుంజము.

**అధోవృంతము** సం. వి. (జం.) కీటకముల హనువు (Maxilla)లో ఉండు మొదటి తునక.

**అధోహనువు** సం.వి (జం.) క్రింది దవుడ, కీటకముల నోటి భాగములలో ఒకటి, దీనికిపండ్లు


అధోహనువు (కప్ప)

అనుర్చబడి ఉండును, చిబుకాస్థి (Mandible.)

**అధ్యక్ష ప్రజాప్రభుత్వము** సం. వి. (రాజ. పౌర.) రాజ్యాధ్యక్షుడు సరాసరి ప్రజల చేత ఎన్నుకోబడి, ప్రజల పట్లనే బాధ్యత వహించుట (ఈపద్ధతి ప్రకారము ప్రభుత్వ వివిధశాఖలను పరిపాలించుటకు శాసన సభకు బాధ్యులైన మంత్రులుగాక అధ్యక్షునిచే నియమింపబడి, అధ్యక్షునికే బాధ్యులైన కార్యదర్శులు ఉందురు. ఈ పద్ధతి అ. సం. రా, లందున్నది.)

**అధ్యక్షుఁడు** సం. వి. అధిష్ఠాత, ప్రధానాధికారి. విశ. 1. ఇంద్రియములకు గోచరించువాడు. 2. పనులు కనుపెట్టి చూచువాడు. 3. ప్రత్యక్షమైనవాడు.

**అధ్యయనము** సం. వి. 1. గురుముఖమున వేదము చదువుట. 2. చదువుట.

**అధ్యవసానము** సం. వి. 1. పూనిక, ఉత్సాహము ప్రయత్నము, శ్రద్ధ. 2. (అలం.) ప్రకృతాప్రకృతముల యొక్క అభేద నిశ్చయము.

**అధ్యాత్మము** సం. విశ. (వేదాం.) ఆత్మ సంబంధమైనది. 2. వి. జీవాత్మపరమాత్మల సంబంధము. అవ్య. ఆత్మకు సంబంధించి.

**అధ్యాపకుఁడు** సం. వి. 1. వేదములను చదివించువాడు. 2. చదువు చెప్పువాడు, గురువు.

**అధ్యాపనము** సం. వి. వేదమును చదివించుట.

**అధ్యాయము** సం. వి. చదువుట. 2. వేద పఠనార్హకాలము. వ్యతి. అనధ్యాయము. 3. వేదపాఠము. 4. గ్రంథభాగము.

**అధ్యావృద్ధి** సం. వి. (జం.) భ్రూణములో నుండి సూక్ష్మఖండములు త్వరగా వృద్ధి చెంది మహాఖండముల మీదికి త్రోసికొని వచ్చుట (Epiboly).

**అధ్యాసనము** సం. వి. 1. కూర్చుండుట, 2. పీఠము. 3. ఆక్రమణము

**అధ్యావాహనికము** సం. వి. అరణము. సారె.

**అధ్యాహారము** సం. వి. 1. అర్థము కొరకు లోపించిన పదములను తెచ్చుకొనుట. ఆకాంక్షిత పదములను తెచ్చుకొనుట. 2. ఊహము, తర్కము.

**అధ్యూఢ** సం. వి., చూ. అధివిన్న.

**అధ్యేత** సం. విశ. చదువువాడు. విద్యార్థి.

**అధ్వగుఁడు** సం. విశ. బాటసారి. వి. సూర్యుడు.

**అధ్వనీనుఁడు** సం. విశ. 1. ప్రయాణము చేయుటకు సమర్థుడు. వేగముగా పయనము చేయువాడు. 2. బాటసారి.

**అధ్వన్యుఁడు** సం. విశ. చూ. పై.

**అధ్వము** సం. వి. 1. దారి. 2. దూరము. 3. పయనము 4. వేదశాఖ. 5. కాలము. 6. ఆకాశము. 7. పయనమునందు ఆగెడి స్థలము. 8. ఉపాయము.

**అధ్వర్యము** సం. విశ. 1. హింసారహితము. 2. సావధానము. వి. 1. యజ్ఞము, 2. సోమయాగము. 3. ఆకాశము

**అధ్వర్యుఁడు** సం. వి. యాగమునందు యజుర్వేద తంత్రమును నడుపువాడు. రూ. అధ్వర్యువు.

**అధ్వానము** సం. వి. అమార్గము, అధ్వాన్నము. (వ్యావ.) చెడినది. నీచమైనది.

**అన**[1] వి. 1. అన్న. 2. చిగురు. 3, అనకట్ట.

**అన**[2] అవ్య. 1. అనుటకు, అనగా మొ. వి; ఉత్ప్రేక్షావాచకముగా ఉపయోగింపబడును.

**అనఁగు** క్రి. కలియు, కూడికొను ('అనఁగి పెనఁగు' అనియేకాని 'అనఁగునకు' విడిగా ప్రయోగములేదని కొందరు.)

**అనఁటి** వి. అరటి. రూ. అంటి.

**అనంగము** నం. విశే. అంగములేనిది వి. 1. ఆకాశము. 2. మనస్సు.

**అనంగఁడు** సం.వి. మన్మథుడు. విశే. అంగములేనివాడు.

**అనంత** నం. వి. 1. భూమి. 2. పార్వతి. (వృక్ష) 1. ఎద్దు నాలుక చెట్టు 2. గరిక 3. ఉసిరిక. 4. తిప్పతీగ. 5. జీల 6.కఱ్ఱ. పిప్పలి.

**అనంతము** సం. విశే 1. మేరలేనిది. 2. నాశరహితమైనది. వి. 1. విష్ణుశంఖము. 2. మేఘము 3. అభ్రకము 4. (వృక్ష) వావిలి. 5. శ్రవణ నక్షత్రము. 6. అనంత చతుర్దశినాడు చేతికి కట్టుకొను తోరము, 7. ఆకాశము 8. మోక్షము. 9. పరబ్రహ్మము.

**అనంతరము** నం. విశే. 1ఎడము లేనిది 2. వెంబడిది. 3 చేరికైనది క్రి. వి. పిమ్మట. వి. సామీప్యము.

**అనంతవిజయము** నం. వి. ధర్మరాజు శంఖము. విశే. అంతములేని జయముకలది.

**అనంత విలీన ద్రావణము** నం. వి.(రసా) ద్రావ్యరాశి / ద్రావకరాశి నిష్పత్తి అనంతాల్ప మూల్యమును స్వీకరించిన ద్రావణము. అనగా ద్రావకరాశితోసరిపోల్చిచూచిన ద్రావ్యరాశి అత్యంత స్వల్పముగా నున్న ద్రావణము (Infinite dilution).

**అనంతశయనుఁడు** నం. వి. విష్ణువు.

**అనంత స్పర్శరేఖ** సం. వి. (గణి.) ఒక రేఖను పోనుపోను సమీపించుచు ఎప్పటికిని కలియని సరళరేఖ.

**అనంతుడు** నం. వి. శేషుడు. 2. విష్ణువు 3. వాసుకి. విశే. తుదిలేనివాడు.

**అనక** అవ్య. అను ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థక రూప. ముదూ. నాక.

**అనకట్ట** వి నీరు మరలించుటకు నీటికి కట్టు అడ్డుకట్ట. రూ. ఆనకట్ట.

**అనఘము** నం. విశే. 1, పాపము లేనిది. 2. దోషరహితము. 3. విపత్తులేనిది. 4. దుఃఖములేనిది. 5, నిర్మలము. వి. (వృక్ష) తెల్లఆవ.

**అనఘుఁడు** నం. వి. నిర్దోషి. పాపరహితుడు

**అనడ్వాహము** సం. వి. 1. ఎద్దు. 2 వృషభరాశి.

**అనతి** నం. విశే. కొంచెము. అల్పము.

**అనద వై** విశే. 1. దిక్కులేనిది. దిక్కులేనివాడు 2. అశక్తుడు, అల్పుఁడు 3. విధవ నం. అనాథః.

**అనన్యజుఁడు** నం. వి. మన్మథుడు.

**అనన్యము** నం. విశే. 1. ఇతరము కానిది. 2. ఏకము, సాటిలేనిది. 3. ఏకాగ్రమైనది.

**అనన్యాదృశము** నం. విశే. అసమానము. నిరుపమానము. సాటిలేనిది.

**అనన్వయము** నం. విశే. పరస్పర సంబంధము లేనిది. వి. 1. అన్వయములేమి. 2. ఒక అర్థాలంకారము.

**అనపత్యుఁడు** నం. విశే. సంతానహీనుడు.

**అనయము**[1] అవ్య. 1. మిక్కిలి. 2. ఎల్లప్పుడును. 3. మాటిమాటికి. 4. కేవలము 5. ఇంకను.

**అనయము**[2] నం. విశే. 1 నీతిలేనిది. 2.దురదృష్టవంతము. వి. 1. అవినీతి. 2. చెడు నడవడి. 3. ఇడుమ, 4. ఒకవిధమైన పాచికలాట,5. దురదృష్టము. 6.ద్యూతపానాది వ్యసనము.

**అనరు** వి. సంకటము, కష్టము, 2. జీవస్థానము.

**అనర్గళము** నం. విశే. అడ్డులేనిది.

**అనర్ఘము** నం. విశే. అధికమైన వెల గలది. అమూల్యము.

**అనర్థము** నం. విణ. 1. వ్యర్థమైనది. 2. అర్థములేనిది 3. పేద. వి 1. కీడు. 2. ప్రయోజనములేమి. 3. పేదరికము. 4. అర్థములేకుండుట

**అనర్హము** నం. విణ. అర్హముకానిది. తగనిది.

**అనలము** నం. వి. 1. అగ్ని, 2. జఠరాగ్ని 3. (వృక్ష) చిత్రమూలము, నల్లజీడి. 4. మూడు అను సంఖ్య

**అనలుఁడు** నం. వి. 1. అగ్నిదేవుడు, 2 అష్టవసువులలో ఒకడు.

**అనవటిల్లు** క్రి. అన్నము ఒక్కమై చల్లారు, ఉమ్మగిల్లు.

**అనవద్యము** నం. విణ. నింద్యము కానిది. లోపము లేనిది.

**అనవరతము** నం. విణ. ఎడతెగనిది. నిరంతరము, ఎడతెగకుండ, ఎల్లప్పుడు, ఊ. అనారతము

**అనవసరము** నం. విణ. సమయోచితము కానిది (ఆవశ్యకము కానిది అను అర్థము తెనుగున మాత్రమే వాడబడు చున్నది). వి. అనుచిత కాలము.

**అనసూయ** నం. వి. 1. అసూయలేమి. 2. అత్రిమహర్షి భార్య.

**అనాగతము** నం. వి. భవిష్యత్కాలము. నవిణ. 1. రాబోవునది. భావి. 2. పొందబడనిది.

**అనాచారము** నం. విణ. ఆచారములేనిది. యుక్త ప్రవర్తనముకానిది. వి. ఆచారము లేమి. అయుక్త ప్రవర్తనము.

**అనాచ్ఛాదనము** నం. వి. (భూగో.) 1. అచ్ఛాదనము లేమి. 2. అరుగుదల. 3. భూమిపై భాగమున ఉన్న నేల, రాళ్లు నదీప్రవాహముచే కోయబడి క్రింది భాగమున ఉన్నరాళ్లు పైకి వచ్చుట.

**అనాత్మపరాగణత** నం వి (వృక్ష) ఉభయతులింగ పుష్పములో ముఖ్యముగా సమపక్వములగు వానిలో పుప్పొడి విత్తులు కీలాగ్రము అనుకూల స్థానములలో లేకపోవుటచే స్వపరాగ సంపర్కమునకు వీలులేకపోవుట (Herkogamy).

**అనాథ** నం. విణ. నాథుడు లేనిది, దిక్కులేనిది అనాథుడు.

**అనాది** నం విణ. ఆదిలేనిది, నిత్య మైనది.

**అనాఫిలిస్** ఇం. వి. (Anophele) దోమలలో ఒకజాతి. (ఈజాతి ఆడు దోమల ద్వారా అనాఫిలిస్ మలేరియావ్యాపించును.)



**అనామత్తు కాతా** హిం. వి. ఒక పద్దు ఏ కాతాలో వ్రాయవలెనో నిర్ధారణ కానపుడు 'అనామత్తు' కాతాలో వ్రాయుదురు. అట్టి నిర్ధారణ జరిగిన పిమ్మట ఆ పద్దును తిప్పి సరియైనకాతాలో వ్రాయుదురు. సంవత్సరాంతమున లెక్క చూచుకొనునపుడు సందిగ్ధమైన కొన్ని పద్దులను ఈ కాతా ద్వారా పరిష్కరించి పిమ్మట సరిచేసికొందురు (Suspense account).

**అనామయము** నం. విణ. రోగములేనిది. వి. ఆరోగ్యము,

**అనామిక** నం. వి. చిటికెన వ్రేలికి ప్రక్కవేలు, ఉంగరపు వ్రేలు.

**అనాయాసము** నం. విణ. ఆయాసములేనిది. సులువైనది. వి. ఆయాసములేమి.

**అనారతము** నం. విణ. ఎడతెగనిది, నిరంతరము. ఎల్లప్పుడు.

**అనార్ద్రక్షారమితి** నం. వి. (భౌతి) ద్రవపదార్థము లేకయే పనిచేయు క్షారమితి, వాయుక్షారమితి.

**అనార్ద్రిము** నం. వి. (భౌతి.) ద్రవపదార్థము లేనిది. ఎండినది.

**అనావృష్టి** సం.వి పరపు, వానలేకపోవుట. వ్యతి. అతివృష్టి.
**అనాస** వి. మొగలి పనస, ఒక రకపు పండ్ల మొక్క.
**అనాహతము** సం. విణ. కొట్టబడనిది, ఉత్తరింపబడనిది. చలుపచేయబడనిది. (క్రొత్త వస్త్రము (గణి.) గుణింపబడనిది, వి. 1. దేహమండలి షట్చక్రములలో ఒకటి. 2. దౌడ మొ.ని స్పర్శలేకుండ పుట్టుధ్వని.
**అనాహూతము** సం. విణ. పిలువబడనిది.
**అని**[1] వి. 1 యుద్ధము. 2. సేన. 3. అల్లిక మొదలు.
**అని** సర్వ. అన్నియొక్క రూపాంతరము.
**అని** అవ్య. అను ధాతువు యొక్క క్త్వార్థక రూపము. (ప్రకారము, కారణము, ప్రసిద్ధి మొ., అర్థములను తెల్పును).
**అనికి** వి. 1. మూతి వెడల్పుగల కుండ 2, అల్లిక.
**అనిషవు** సం. వి నల్లచెరకు.
**అనిత్యము** సం. విణ. 1. నిత్యము కానిది, నశ్వరము. 2. నిలుకడ లేనిది. 3, సంశయాస్పదము. 4. తాత్కాలికము.
**అనిమిషము** సం. విణ. 1. రెప్పపాటులేనిది. 2 జాగరూకము. 3. వికసించినది. వి చేప.
**అనిమిషుఁడు** సం వి. వేలుపు. దేవత.
**అనియత సంచారి నౌకలు** సం. వి. నియత సంచారము లేని నౌకలు,ఎక్కడ సరకుల రవాణా ఎక్కువ అవసరమో అక్కడికి పోవునట్టి నౌకలు. ఇట్టి నౌకలు తమ ప్రయాణము లెల్ల సరకులతో నిండియే జరుగునట్లు చూచుకొని ఖర్చులను అతి స్వల్పముగ ఉంచుకొని ఎగుమతి దిగుమతి వ్యాపారమునకు తోడ్పడగలవు(Tramp)
**అనిరుద్ధుఁడు** సం. విణ. 1. అడ్డగింపబడనివాడు. 2. లొంగనివాడు. వి. 1. గూఢచారుడు. 2. ప్రద్యుమ్నుని కొడు. 3. విష్ణువు: 4. శివుడు.
**అనిర్దిష్టపౌరులు** సం. వి. (వరి., రాజ.) ఏ రాజ్యముచేతను పౌరులుగ గుర్తింపబడని ప్రజలు.
**అనిర్దిష్టభూమి** సం. వి. (రాజ.) ఏ రాజ్యమునకును చెందని భూమి (Noman's Iand )
**అనిర్ధారితము** సం విణ. (గణి.) నిర్ధారణ చేయబడనిది, నిశ్చయింపబడనిది (Indeterminate).
**అనిలము** సం. వి. 1. గాలి. 2. దేహమునందలి వాతధాతువు. 3. వాతరోగము.
**అనిలుఁడు** సం. వి. వాయుదేవుడు. 2. అష్టవసువులలో ఒకడు.
**అనివార్యము** సం, విణ. నివారింపరానిది.
**అనిశము** సం. విణ. ఎడతెగనిది, నిరంతరము. సదా, ఎల్లప్పుడు.
**అనిశ్చితము** సం. విణ. (భౌతి.) నిశ్చయము చేయబడనిది. (గణి.) సమాసములలోను సమీకరణములలోను విలువ తెలియనిది (Undetermined).
**అనిషిక్తజననము** సం వి. (జీవ.) ఫలదీకరణము కాని అండకణము భ్రూణముగా అభివృద్ధి యగుట (Parthenogenesis).
**అనిష్టము** సం. విణ 1. ఇష్టముకానిది. 2, యజింప బడనిది వి. 1. కీడు; 2. దుఃఖము. 3. పాపము.
**అనీకము** సం. వి. 1. సేన 2. సమూహము. 3. యుద్ధము.
**అనీకిని** సం. వి. 1. సైన్యము. 2. అక్షౌహిణిలో పదియవపాలు.
**అనీమియా** ఇం.వి. (Anaemia)పాలిపోవుట రక్తములో ఎఱ్ఱకణములు తక్కువగుట, రక్తహీనత, పాండురోగము.

**అను**[1] క్రి. 1. చెప్పు, వచించు. 2. అనుకరణ శబ్దములకు అనుప్రయుక్తమగును.

**అను**[2] సం. అవ్య. ఈ క్రింది అర్థములనిచ్చు ఉపసర్గ: 1. ఆశ్రయము. 2. ప్రాప్తము. 3. పోలిక. 4. తరువాత. 5. తగినది. 6. క్రమము 7. సామీప్యము. 8. సహార్థము. 9. ఆనుకూల్యము.

**అనుఁగు** వి. 1. చెలికాడు. 2. ప్రేమ. 3. ముఖ్యుడు. విశ. 1. ప్రియుడు. 2. ప్రియురాలు. 3. మనోజ్ఞము. 4. సహాయుడు. 5. మొదటిది.

**అనుఁగుకాఁడు** విశ. చెలికాడు.

**అనుఁగుఁగత్తె** విశ. చెలికత్తె.

**అనుకంప** సం. వి. దయ, కనికరము. రూ. అనుకంపనము.

**అనుకరణము** సం. వి. 1. ఇతరులు చేసినట్లు చేయుట. 2. ధ్వన్యాదులను అనుకరించునపుడు వాడుపదము. (పెళపెళ, పటపట మొ. వి.)

**అనుకరించు** సం. క్రి. ఇతరులు చేసినట్లు చేయు.

**అనుకరించుట** సం. వి. ఒకరు చేసినట్లు చేయుట.

**అనుకారము** సం. వి. పోలిక, అనుకరణము రూ. అనుకృతి.

**అనుకారి** సం. విశ. 1. పోలునది. 2. అనుకరించువాడు.

**అనుకు** విశ. 1. కొంచెము పలుచనైనది. 2. మెత్తనిది.

**అనుకూలము** సం. విశ. 1 ఇష్టము. 2. సరిపడునది. 3. సహాయమైనది. (వ్యతి). ప్రతికూలము.

**అనుకృతి** సం. వి. అనుకారము.

**అనుక్రమణిక** సం. వి. విషయసూచిక.

**అనుక్రమము**[1] సం. విశ. క్రమమును అనుసరించినది. వి. 1. యుక్తక్రమము. 2. విషయసూచిక.

**అనుక్రమము**[2] సం. వి. (గణి.) సహజ సంఖ్యలతో సదృశముగా నుండునట్లు ఒక నిర్ణీత న్యాయముచే నిర్మించబడిన సమాసములు.

**అనుక్రోశము** సం. వి. కనికరము.

**అనుక్షణము** సం. అవ్య. ప్రతిక్షణము, ఎల్లపుడును.

**అనుగతి** సం. వి. అనుసరించుట, వెంబడించుట.

**అనుగతోత్పత్తులు** సం. వి. ఒక వస్తువును తయారు చేయునపుడు దాని కొరకు వాడిన వస్తువులలో మిగిలినవానినుండి తయారగు ఇతరవస్తువులు(By-p oducts)

**అనుగమనము** సం. వి. 1. వెంబడించుట. 2. ఆశ్రయణము. 3. గ్రహించుట, రూ. అనుగతి.

**అనుగలము** విశ. 1 అనుకూలము. 2. సమానము. 3. సహాయము.

**అనుగుణము** సం. విశ. 1. సమానగుణము కలది. 2. అనుకూలమైనది. తగినది.

**అనుగుల్ఫాస్థి** సం. వి. (శరీ.) మడమ ఎముకలలో ఒకటి జంఘాస్థిక (Tibiale or Astragalus.)

**అనుగ్రహము** సం. వి. దయ. కరుణ.

**అనుచరుఁడు** సం. విశ. 1. సహాయుడు. 2. భృత్యుడు.

**అనుచితము** సం. విశ. 1. ఉచితముకానిది, తగనిది. 2. అపరిచితము.

**అనుచితాహారము** సం. వి. (గృహ.) అపోషకాహారము (Malnutrition).

**అనుచు** క్రి. 1. పంపు. 2. ఆజ్ఞాపించు, 3. వీడ్కొలుపు 4. సాగనంపు.

**అనుజన్ముఁడు** సం. వి. తమ్ముడు.

**అనుజాత** సం. వి. చెల్లెలు.

అనుజీవి సం. వి. సేవకుడు. విణ. ఆశ్రయించి బ్రతుకువాడు.

అనుజుఁడు సం. వి. తమ్ముడు.

అనుజ్ఞ సం. వి. 1. అనుమతి 2. ఉత్తరువు. ఆజ్ఞ.

అనుజ్ఞాతుఁడు సం. విణ. ఆజ్ఞాపింపబడినవాడు.

అనుతాపము సం. వి. 1. పశ్చాత్తాపము. 2. తాపము.

అనుత్తమము సం. విణ. 1. మిక్కిలి శ్రేష్ఠమైనది 2. ఉత్తమము కానిది.

అనుత్తరము సం. విణ. 1. అత్యంతశ్రేష్ఠము. 2. ఉత్తరము కానిది. 3. ఉత్తరము లేనిది. 4. చలింపనిది. 5 నీచము. వి. 1. సరికాని సమాధానము. 2. ప్రత్యుత్తరము లేకుండుట.

అనుదారువు సం. వి. దారువులో కన్పించు పెద్దనరములు (Metaxylen).

అనుదినము సం. వి. ప్రతిదినము.

అనుదైర్ఘ్యము సం. విణ. (భౌతి) పొడవు వ్యాపించియుండు దిక్కును అనుసరించునది (Longitudinal).

అనుదైర్ఘ్యచ్ఛేదనము సం. వి. (జీవ.) నిలువుకోత (Longitudinal Section).

అనుద్భూతకోరకములు సం. వి. (వృక్ష.) అణగియున్న మొగ్గలు. పైకి కనబడకయుండి అవసరమైనపుడు పెట్టు మొగ్గలు ప్రచ్ఛన్నకోరకములు(Dormant buds).

అనునదనఫలకము సం. వి. (భౌతి.) ధ్వనిని ఇనుమడింపజేయు ఫలకము. ఇది స్వనించు వస్తువుతో బంధింపబడియుండును(Sounding board).

అనునయము సం వి. 1. ఊరడింపు. 2. ప్రార్థనము, వేడికోలు.

అనునీతుఁడు సం. విణ. ఊరడింపబడినవాడు.

అనుపత్రకంటకము సం. వి. (వృక్ష). అనుపత్రము ముల్లుగా మారిన నిర్మాణము (Stipular spine).

అనుపత్రములు సం. వి. (వృక్ష.) కొన్ని మొక్కల ఆకులకు వృంతము యొక్క మొదలునకు ఇరువైపులను అగపడు చిన్న ఆకుల వంటి రెండు నిర్మాణములు (Stipules).

అనుపత్ర రహితము సం. విణ. అనుపత్రములు లేనిది (ఆకు) (Exstipulate).

అనుపదము సం. విణ. 1. అడుగుల ననుసరించునది. 2. మాటమాటను అనుసరించునది. అవ్య. 1. పాదము పొడుగునను. 2. అడుగుల వెంబడినే 3. అడుగడునకు. మాటమాటకు.

అనుపమ సం. వి. నైరృతి దిక్కునందలి కుముదమను దిగ్గజము యొక్క భార్య.

అనుపమము సం. విణ. 1. సాటిలేనిది. 2. శ్రేష్ఠము.

అనుపల్లవి సం. వి. పాటయందు రెండవ చరణము.

అనుపాత చతుర్థము సం. వి. (గణి.) $\frac{a}{b}=\frac{c}{d}$ అను అనుపాతంలో 'd' అనునది a, b. c ల యొక్క అనుపాతచతుర్థమనబడును (Fourth proportional)

అనుపాత తృతీయము సం. వి. (గణి.) $\frac{a}{b}=\frac{c}{d}$ అను అనుపాతములో 'd' ని a. b. c ల యొక్క అనుపాత తృతీయమందురు.

అనుపాత మధ్యమము సం. వి. (గణి.) $\frac{a}{b}=\frac{c}{d}$ అను అనుపాతములో b=c అయినదినినే $\frac{a}{c}=\frac{c}{d}$ అని వ్రాయ వచ్చును. అపుడు 'c' ని a. d ల యొక్క అనుపాత

మధ్యమ మని అందురు (Mean proportional)

**అనుపాతము** సం. వి. (గణి.) రెండు నిష్పత్తుల సమానత్వమును చూపు సంబంధము $\frac{a}{b}, \frac{c}{d}$ అనునవి రెండు నిష్పత్తులు. $\frac{a}{b} = \frac{c}{d}$ అనుపాతమందురు.

**అనుపాతిక కరగ్రహణ విధానము** సం. వి. (అర్థ.) తక్కువ రాబడులు కలవారి వద్ద కంటె ఎక్కువ రాబడులు కలవారి వద్ద వసూలు చేయు పన్నులు. 2. వాటి రేట్లు ఎక్కువగ నుండు పద్ధతి. (దీనివలన ధనవంతులకును పేదలకును మధ్యగల వ్యత్యాసము రానురాను తగ్గుట కవకాశము. కలదు. (Progressive taxation)

**అనుపానము** సం వి. 1 మందుతో చేర్చి పుచ్చుకొనునది. 2, అన్నముతో కూడ తిను కూర, పచ్చడి మొ.వి., వ్యంజనము.

**అనుపు** క్రి. 1. పంపు. 2. ఆజ్ఞాపించు

**అనుప్రసృష్టి** సం. వి. (జం) అనుప్రజాతి, ప్రజాతిలోని ఉపభాగము(Sub-phylum)

**అనుప్రస్థచ్ఛేదము** సం వి. (భౌతి.) ఒక వస్తువును అడ్డముగా కోయుట (Cross section).

**అనుప్రస్థపటికము** సం వి. (వృక్ష) ద్వివిదారణ ఫలమునకు ఒకగింజకు మరియొక గింజకుమధ్యనొక్కులు గాని భిత్తిక గాని ఉండి, ఒక గింజగల వివిధ భాగములుగ ఉన్న ఫలమునకు ఈ పదము వర్తించును (Lomentum).



అనుప్రస్థపటికము

**అనుప్రస్థావర్తము** సం. విశే. (వృక్ష.) ప్రక్కగా వంగియున్నది (బీజాండము) (Amphitrophous)



అనుప్రస్థావర్త బీజాండము

**అనుబంధము** సం. వి. 1. అనువర్తనము. 2. చుట్టరికము. 3. గ్రంథమునకు చివర చేర్చబడిన భాగము. 4. కట్టు; 5. తప్పు బయల్పరచుట.

**అనుబంధములు** సం. వి (గృహ.) వివిధ రకముల కుట్లు వేయుటకు సాధనములుగా మెషీన్‌కు అమర్చు వివిధ భాగములు (Attachments). ఉదా కుచ్చులు వేయు భాగము (Buffer).

**అనుబంధ సమ్మేళనములు** సం. వి. (వాణి). ఒక వస్తువును తయారుచేయుటలో గల వేర్వేరు ఉత్పాదనప్రక్రియలలో వేర్వేరు దశలలో పనిచేయుచున్న సంస్థలు ఒకటిగ వ్యవహరించుట.

**అనుభవము** సం వి. 1. [illegible] (ExPerience). 2. అనుభవించుట, [illegible]దు భాగము పొందుట.

**అనుభవించు** సం. క్రి. (సుఖదుఃఖాదులను) పొందు.

**అనుభావము** సం. వి. 1 ప్రభావము. 2 ప్రతాపము 3 భావమును తెలిపెడి ముఖవికారాది.

**అనుభావ్యము** సం విశే. అనుభవింపదగినది.

**అనుభుక్తము** సం. విశే. అనుభవింపబడినది

**అనుభుక్తి** సం వి. అనుభవము, అనుభూతి, అనుభోగము.

**అనుభూతము** సం. విశే. అనుభవింపబడినది.

**అనుభూతి** సం. వి. 1. అనుభుక్తి, అనుభవము. 2 (తర్క.) ప్రత్యక్షాది ప్రమాణ జన్యజ్ఞానము 3. భావన (Feeling).

**అనుభోగము** సం. వి. 1. అనుభవము 2. చేసిన సేవకై యిచ్చెడు మాన్య క్షేత్రము.

**అనుమతి** సం. వి. 1. సమ్మతి, అంగీకారము; 2. ఒక కళ తక్కువైన చంద్రుడు గల పున్నమ.

**అనుమరణము** సం. వి. సహగమనము.

**అనుమస్తిష్కము** సం. వి. (జం.) మెదడు తోకకు ముందు భాగమున అడ్డముగా పట్టి వలెనుండు నాడీకణజాలము.

**అనుమానము** సం. వి. (తర్క.) 1. ప్రత్యక్షాది ప్రమాణములలో ఒకటి. 2. ఊహ. 3. సందేహము. 4. (అలం) అర్థాలంకారములలో ఒకటి.

**అనుమేయము** సం. విశ. ఊహింపదగినది.

**అనుమోదము** సం. వి. 1.సంతోషము. 2. అంగీకారము, సమ్మతి.

**అనుయాయి** సం. విశ. 1. వెంబడించువాడు 2. ఆశ్రితుడు. 3. (గణి.) ఒకక్రమమును అనుసరించివచ్చునది.

**అనుయాయిక్రమము** సం. వి. (గణి) ఒకటి వెంబడి ఒకటి వచ్చు వరుస. పరంపరగా వచ్చెడు వరుస.

**అనురక్త** సం.విశ. అనురాగముకలది.

**అనురక్తము** సం. విశ. 1. అనురాగము కలది. 2. ఎఱ్ఱనిది. 3. రంగుకలది.

**అనురక్తి** సం. వి. అనురాగము, ప్రేమ.

**అనురక్తుడు** సం. విశ. అనురాగము కలవాడు.

**అనురక్షకపత్రావళి** సం. వి. (వృక్ష) ప్రత్తి కుటుంబములోని మొక్కల పువ్వులకు రక్షకపత్ర వలయముపైని పత్రికల (చిరుచటికల)తో ఏర్పడిన మరియొక వలయము (Epicaylx).

**అనురాగము** సం. వి. అనురక్తి, ప్రేమ. కూర్మి.

**అనురూపము** సం. విశ. 1. తగినది. 2. అనుగుణము. 3. సాటియైనది. 4. (గణి) ఒకదాని కొకటి అనుగుణముగా నున్నది. అనుగుణ్యము కలది. (Corresponding)

**అనురోధము** సం. వి. అనుసరించుట. అనువర్తించుట.

**అనులాపము** సం. వి. మాటిమాటికి చెప్పుట

**అనులేపనము** సం. విశ. 1. చందనాదుల పూత. 2. పూసికొనెడు చందనాదికము

**అనులోపము** సం. విశ ఆరోహణక్రమము గలది.

**అనులోమచలత్వము** సం. వి. (గణి.) రెండు రాసులు అచల నిష్పత్తిలో ఉండునట్లు మారుచుండుట (Direct variation)

**అనులోమానుపాతము** సం. వి. (గణి.) ఒకే విధముగా రెండు రాసుల సంబంధము (Direct proportion).

**అనువంశికము** (జీవ.) సం. వి. వంశపారంపర్యము (Heredity).

**అనువదించు** సం. క్రి. 1. ఒకరు చెప్పినది మరలచెప్పు, 2. భాషాంతరీకరించు. 3. ఉపన్యసించు.

**అనువర్తనము** సం. వి. 1.అనుసరించినడచుట (వ్యాక.) అన్వయార్థము పూర్వసూత్రమునుండి పదము పరసూత్రమునకు వచ్చుట.

**అనువాదము** సం. వి. 1. ఒకరుచెప్పిన దానిని మరల చెప్పుట, 2 భాషాంతరీకరణము.

**అనువు** వి. 1. విధము. 2. ఉపాయము. 3. అనుకూల్యము. 4. సామర్థ్యము. 5. అవకాశము. 6. బాగు. (విశ.) 1. యుక్తము, తగినది. 2. వరమైనది. 3. వీలైనది

**అనువుచేయు** క్రి. సిద్ధపరుచు. అయిత్తపరుచు

**అనువుపడు** క్రి 1.ఏర్పడు. 2. అనుకూలపడు. 3. నెరవేరు. 4. ఒప్పు.

**అనుశాసనము** సం.వి. 1. ఆజ్ఞ 2. ఉపదేశము 3. కలరూపు తెలుపుట.

**అనుషంగము** 1. సం.వి. సంబంధము. కలయిక. 2. ప్రకరణమునుబట్టి పదమును అధ్యాహరించుకొనుట. 3. ప్రసంగవశమున చెప్పుట

**అనుషక్తము** సం. విశే. (గణి.) మూడుగాని అంతకన్న ఎక్కువగాని సరళరేఖలు ఒకే బిందువుగుండ పోవునది. (Concurrent)

**అనుష్ఠానము** సం.వి. 1 ఆచారము. 2 నడవడి 3.వాడుక.

**అనుసంధానము** సం.వి. 1 (బాణము మొ.ని) కూర్చుట, 2. భక్తి(గ్రంథముల)పఠనము. 3. (మంత్రాదుల) చింతనము.

**అనుసరణము** సం. వి. 1. వెంబడించుట. 2. పోలుట. 3. అడ్డు రూ. అనుసారము.

**అనుసరి** వి. సుంకరి. సుంకము వసూలుచేయువాడు.

**అనుసారము** సం. వి చూ. అనుసరణము.

**అనుసారి** సం. విశే అనుసరించువాడు.

**అనుసు** వి, చేతికఱ్ఱ మొ.కి చివరవేసెడు లోహపుకట్టు పొన్ను.

**అనుస్యూతము** సం. విశే. 1. ఎడతెగనిది. 2. ఒకటిగాకూర్పబడినది.

**అనుస్వారము** సం. వి. బిందువు, సున్న.

**అనూచానము** సం. విశే. పరంపరగా ప్రాప్తమైనది.

**అనూచానుఁడు** సం. వి. సాంగవేదాధ్యయనము చేసినవాడు. విశే. వినయము గలవాడు. విచక్షణుడు.

**అనూఢ** సం .వి. పెండ్లికానిపడుచు.

**అనూనము** సం, విశే. 1 తక్కువకానిది. 2 వెలితిలేనిది. నిండైనది.

**అనూరుఁడు** సం. విశే. తొడలులేనివాడు వి. గరుత్మంతుని అన్న (సూర్యసారథి).

**అనృతము** సం· విశే అసత్యమైనది వి 1. అసత్యము. 2. సేద్యము.

**అనెక్సేషన్** ఇం.వి. (పరి.రాజ.) (Annexation) విలీనము, ఒకరాజ్యమును వేరొక అధిరాజ్యములో కలుపుకొనుట.("రాజ్య విలీనపద్ధతి లార్డ్ డల్‌హౌసి భారత సంస్థానము- యెడ అవలంబించిన పద్ధతి).

**అనేకపము** సం. వి· ఏనుగు.

**అనేకము** సం. వి. ఒకటికానిది, పెక్కు రూ. నైకము.

**అనైచ్ఛిక కండరములు** సం. వి. (జం.) అనిచ్ఛాపూర్వకముగ పనిచేయు కండరములు (Involuntary muscles). ఉదా. గుండెకాయ, పేగులయొక్క కండరములు.

**అనోకహము** సం వి. చెట్టు.

**అన్చు** వి. క్రి. అనుచు.

**అన్న** వి. జ్యేష్ఠసోదరుడు.

**అన్నకోశము** సం. వి. (జం.) ఆహారపు గొట్టమునకు క్రిందిభాగములో ఉన్న సంచివంటి ఒక అంగము (Stomach).

**అన్నగ్రహము** స. వి. (జం ) ముఖ్యముగా కీటకములలోను, పక్షులలోను అన్నవాహికలో ఉబ్బియుండు ముందు భాగము (Crop )

**అన్నభేది** సం. వి. సిరాతయారుచేయుటకు వాడు పదార్థము.

**అన్నము** సం. వి. కూడు, బువ్వ. విశే. తినబడినది.

**అన్నవాహిక** సం. వి. (జం.) ఆహారపు గొట్టము (Alimentary canal).

**అన్నా** అవ్య. ఆశ్చర్య సంతాపాదులను తెలుపునది.

**అన్ని** సర్వ. సమస్తము, సర్వము.

**అన్ను** వి. 1. ఒడలెరుగమి. 2. శోభ. 3. స్త్రీ. క్రి. మత్తిల్లు, పరవశమగు.

**అన్నుకొను** క్రి. మత్తిల్లు, పారవశ్యము నొందు.

**అన్నువ** విశే. 1. అల్పము, సన్నము 2 హీనుడు, దుర్బలుడు. కొంచెము తక్కువ. 4. చిన్నది. 5. మనోహరము. వి. స్త్రీ.

అన్నువు వి. 1. శోభ. 2. ఒడలెరుగమి పారవశ్యము.
అన్నెకాఁడు విశ. అన్యాయకారి.
అన్నెము[1] వై. సర్వ. ఇతరము, వేరగునది. సం. అన్యమ్.
అన్నెము వై. వి. పాపము. సం. అన్యాయః.
అన్యథా సం. అవ్య. మరియొక విధముగా.
అన్యము సం. విశ. 1. ఇతరము, వేరు. 2. అసాధారణము
అన్యుఁడు సం. విశ. ఇతరుడు.
అన్యోన్యము సం. విశ. పరస్పరము. వి. ఒక అర్థాలంకారము.
అన్వయము సం. వి. 1. పదములకు గాని పదార్థములకుగాని గల పరస్పర సంబంధము 2. కులము. 3. (తర్క.) సాధనమునకును, సాధ్యమునకును గల నియత సంబంధము.
అన్వర్థము సం. విశ. సార్థకము, పొసగిన అర్థము కలది.
అన్వర్త్నిక సం. వి. (జం) ముంజేతిలో నుండు ఎముకలలో ఒకటి (Radius). అరత్నిక (Ulna) ముంజేత నుండు రెండవ ఎముక. ఈ రెండును కలిసి 'Radioulna' అవబడును.
అన్వవాయము సం. వి. కులము, వంశము.
అన్వితము సం. విశ. 1. కూడుకున్నది. 2. పదాదుల పరస్పర సంబంధము కలది. అన్వయించినది. రూ. అన్వీతము
అన్వేషణ సం. వి. వెదకుట.
అన్వేష్ట సం. విశ. వెదకువాడు.
అప[1] సం. అవ్య. సమాసపూర్వ పదముగా నుండి క్రింది అర్థముల నిచ్చును 1. విపరీతము. ఉదా. అపకీర్తి. 2. అపగతము, ఉదా. అపక్రమము = క్రమము తప్పినది. 3. చెడ్డది, ఉదా. అపకర్మము = చెడ్డపని
అప[2] వి. 1. తల్లి. 2. తండ్రి. 3. అక్క. రూ. అప్ప.
అపక వి. చూ. అగప.
అపకరించు సం. క్రి. హానిచేయు.
అపకర్షణ సం. వి. 1. తొలగించుట. 2. తగ్గించుట. 3. అవమానపరచుట. (భౌతి.) ఒక వస్తువు ఇంకొకదానిని మళ్ళగొట్టు గుణము (Repultion).
అపకారము సం. వి. 1. కీడు. 2. ద్రోహము. 3. చెడ్డపని. రూ. అపకృతి.
అపకిరణము సం. వి. (భౌతి.) 1. అన్ని దిశలలోనికి వెదచల్లబడుట (Dispersion) 2. వేరుపాటుచెందుట. ఉదా. పట్టకమును ప్రవేశించిన సూర్యకిరణ శలాక వేరువేరు రంగులుగల కిరణముల క్రింద వేరుపాటు నొందుట.
అపకీర్తి సం. వి. చెడుపేరు. దుర్యశము.
అపకృతి సం. వి. చూ. అపకారము.
అపకృష్టము సం. విశ. 1. అధమము, వ్యతి. ఉత్కృష్టము. 2. తొలగింపబడినది. 3. ఆకర్షింపబడినది. 4. (వ్యాక.) పరసూత్రమునుండి అన్వయముకొరకుపూర్వసూత్రమున గ్రహింపబడినది. వ్యతి. అనువర్తనము.
అపకృష్టి సం. వి. చూ. అపకర్షము.
అపక్రమ భిన్నము సం. వి. (గణి.) ఒకటి కన్న పెద్దదైన భిన్నము (Improper-fraction). ఉదా. 6/5
అపక్రమము సం. విశ. క్రమములేనిది.
అపక్రోశము సం. వి. నింద, తిట్టు. రూ. అపక్రోశనము.
అపక్షాలకము సం. వి. (గృహ.) శుభ్రము చేయునది. శరీరము నుండిగాని వస్త్రము నుండిగాని మురికిని వేరుచేయు సబ్బు మొ.వి (Detergent).
అపగతము సం. విశ. పోయినది.
అపఘనము సం. వి. 1. శరీరావయవము.

2. శరీరము. విశే. మబ్బులేనిది.

**అపచయక్రియ** నం. వి. ఆహారమును సామాన్యపదార్థములుగా విడదీసి వానిలో నున్న శక్తిని విడుదలచేయుట. ఆహార విశ్లేషణ క్రియ (Katabolism).

**అపచయము** నం. వి. 1. హాని, నష్టము. తగ్గుట 2. పుష్పాదులను కోయుట, (రసా.) తగ్గించుట. మా. హ్రాసము

**అపచాయక జ్వాల** నం వి. (రసా) బున్సెన్ జ్వాలలో గొట్టమునకు కొంచెము ఎత్తున లోపలనుండు జ్వాలా భాగము. అట్లే లోపలిపొరలో చివరనుండు జ్వాలా బిందువు (Reducing flame)

**అపచాయక ద్రవ్యము** నం. వి (రసా) ఒక సంయోగములో ఉండు అమ్లజని పాలు తగ్గించునది (Reducing agent).

**అపచాయకము** నం వి. (రసా) ఒకయౌగికమునుండి అమ్లజనినితొలగించుసాధనము

**అపచారము** నం. వి. 1. పెద్దలయెడ చేయు తప్పు 2 లోపము. 3 అపథ్యము. 4. అపథ్యా చార్థము.

**అపచాలక కండరము** వి శరీరము యొక్క మధ్యరేఖనుండి దూరముగ ఎముకను లాగుకొను కండరము (Abducent or Abductor muscle).

**అపచితము** నం. విశే. (రసా) 1. తగ్గించబడినది. 2. అమ్లజని తీసి వేయబడినది. వి. తగ్గుట.

**అపజయము** నం. వి. పరాజయము, ఓటమి.

**అపటి** నం. వి. తెర.

**అపటువు** నం. వి. బాలుడు, నేర్పరికాని వాడు. విశే. తెపులుగొంటు.

**అపత్యము** నం వి. సంతానము.

**అపథము** నం. వి. 1. తప్పుత్రోవ, 2. అవినీతి మార్గము విశే. మంచిమార్గము లేనిది (గ్రామాదికము).

**అపథ్యము** నం. వి. 1. తినరానిది. 2. హితము కానిది, తగనిది.

**అపదిశము** నం. వి. రెండు దిక్కుల నడుమ భాగము.

**అపదూఱు** వి. నిష్కారణముగ వచ్చిన నింద, అపనింద, మా. అవదూరు.

**అపదేవత** నం. వి. పిశాచము.

**అపదేశము** నం వి. 1. నెపము. 2. నిమిత్తము. 3 కపటము. 4 ఉపదేశము.

**అపనమ్మిక** వి నమ్మకము లేకపోవుట.

**అపనయము** నం. వి. 1. కీడు, 2. తొలగించుట.

**అపనింద** నం వి. నిష్కారణముగ వచ్చిన నింద. వృథాదూషణము.

**అపనీతములు (నేలలు)** నం. వి. (వ్యవ.) నీటిచేగాని గాలిచేగాని మట్టిరేణువులు పుట్టిన చోటునుండి మరియొక చోటికి కొనిపోబడి కూడుకొనుటచే ఏర్పడిన నేలలు.

**అపనెపము** మి. వి. వట్టినెపము.

**అపనోదము** నం. వి. తొలగించుట, పోగొట్టుట.

**అపపోడి** మి. వి. అన్యాయము

**అపప్రదానము** నం. వి. లంచము.

**అపప్రథ** నం. వి. చెడ్డపేరు.

**అపభ్రంశము** నం. వి. 1. అపశబ్దము. 2. జారుట. 3. మార్పుపొందిన ప్రాకృత భాష.

**అపమార్గము** నం. వి. 1. తప్పుత్రోవ. 2 ప్రక్కత్రోవ.

**అపమృత్యువు** నం. వి. అకస్మాత్తుగా కలిగిన చావు. 2. గండము.

**అపశయము** నం. వి. అపఖ్యాతి, అపకీర్తి

**అపరంజి** వి. మేలిమిబంగారము,శుద్ధనము.

**అపరక్రియ** నం. వి. చచ్చినవానికై చేయు కర్మము.

అపరగిరి సం. వి. అస్తాద్రి.
అపరదిక్కు సం. వి. పడమటి దిక్కు.
అపరనామము సం. వి. రెండవ పేరు.
అపరపక్షము సం. వి. బహుళ పక్షము. కృష్ణపక్షము.
అపరభాగము సం. వి. 1. వెనుక భాగము 2. తరువాతి భాగము.
అపరము సం. వి. 1. ఇతరము. 2. క్రిందిది. 3. మీదిది.
అపరాంగము సం. వి. 1. వీపుతట్టునుండు దేహభాగము, 2. గుణీభూతవ్యంగ్యము లలో నొకటి.
అపరాగ ఫలనము సం. (వృక్ష.) పరాగ సంపర్కము లేకయే అండకోశము పండుగా తయారగుట (Parthenocarpy).
అపరాత్రి మి. వి. నడురేయి, అర్ధరాత్రము
అపరాలు వి. కాయధాన్యములు.
అపర్ణ సం. వి. పార్వతి.
అపరాహ్ణము సం. వి. పగలు మూడు భాగములు చేయగా వానిలో చివరి భాగము.
అపరిమితము సం వి. పరిమితము లేనిది (గణి.) ఎంత పెద్దదైన దత్తరాశికంటెను పెద్దది, ఒ రిమితము లేనిరాశి (Infinite) అపరిమితశ్రేణి-(Infinite series)
అపరివర్తనీయము సం విశ (రసా.) ఒకే దిశలో జరుగునట్టిది (Irreversible), ఉదా సల్ఫ్యూరికామ్లముపై జింకుధాతువు చర్య. ఉదజని జనించువైపుననే జరుగును $H_2SO_4 + Zn \longrightarrow ZnSO_4 + H_2$.
అపరిష్కృతధాతువు సం. వి. (రసా.) కొలిమి నుండి తయారై విశుద్ధప్రక్రియకు గురి కాని ధాతువు (Coarse metal).
అపరూపము సం. వి, వికారరూపము.
అపలపించు సం. క్రి. మరుగుపుచ్చు. నిహ్నవించు దాచు.
అపలాపము సం. వి. 1. మరుగుమాట. 2. ప్రేమము.
అపవర్గము సం. వి. మోక్షము.
అపవాదము సం. వి. 1. నింద, దూరు. 2. ఆజ్ఞ.
అపవారణము సం. వి. మరుగు.
అపవాహినాడులు సం. వి. (జం.) ప్రేరేపణను కేంద్రనాడీమండలము నుండి కండరములకు తీసికొనిపోవు నాడులు (Efferent nerves).
అపవిత్రము సం. వి. పవిత్రముకానిది.
అపవేళ సం. వి. అనమయము. అవేళ.
అపశదుఁడు సం. విశ. నీచుడు.
అపశబ్దము సం వి. వ్యాకరణ విరుద్ధ పదము, అసాధు శబ్దము.
అపసరణము సం. వి. (భౌతి.) ఒక కేంద్రము నుండి వేరువేరు మార్గములు పట్టుట (Divergence). విశ అపసృతము (Divergent), ఉదా అపసృత కిరణశలాక.
అపసరము సం. వి, తొలగుట, దూ. అపసారము
అపసర్జనము సం వి విడుపు, ఈవి, దానము
అపసవ్యము సం విశ. 1. ప్రతికూలము, కుడిభాగము.
అపస్మారము సం. వి. 1. దుఃఖాదులచే ఒడలు మరచుట, 2. మతి భ్రమించు రోగము, దూ అపస్మృతి.
అపస్మృతి సం. వి. చూ. పై.
అపస్వరము సం. వి, క్రమము తప్పిన స్వరము, తప్పజెప్పిన స్వరము.
అపహము సం. విశ. చెరచునది.
అపహరణము సం. వి. మోసగించి కొనిపోవుట, దూ. అపహృతి.
అపహర్త సం. వి. అపహరించువాడు.
అపహసించు సం. క్రి. గేలిసేయు, నవ్వు.

**అపహాసనము** నం. వి. గేలి, ఎగతాళి, రూ. అపహాస్యము.

**అపహాస్యము** నం. వి. చూ. పై.

**అపహృతము** నం. విణ. అపహరింపబడినది.

**అపహృతి** నం. వి. చూ. అపహరణము.

**అపాంగము** నం. వి. కడకన్ను, విణ. అంగహీనము.

**అపాంపతి** నం. వి. సముద్రుడు.

**అపాత్రము** నం. విణ. అనర్హుడు, అనర్హము.

**అపానము** నం వి. 1. ముడ్డి, 2. అపానవాయువు. పిత్తు.

**అపాయము** నం. వి. హాని.

**అపారదర్శకత** నం. వి. (రసా.) (భౌతి.) ఒక వస్తువుగుండా వెలుతురును పోనీయని గుణము (Opacity).

**అపారప్రజ్ఞ** నం. వి. ప్రతిభ, మహాబుద్ధి కుశలత (Ganius).

**అపారము** నం. వి. ఈవలిదరి. వి. ణ. దరి లేనిది.

**అపార్తీ** ఇం. వి. (రాజ.) (Apartheid) వేరుచేయుట. దక్షిణాఫ్రికా తెల్లవారి ప్రభుత్వము దక్షిణాఫ్రికా నివాసులైన శ్వేతేతర జాతులపట్ల అవలంబించు పరిపాలనా విధానము. (శ్వేతేతరజాతులు, వారికి ప్రత్యేకించబడిన స్థలములలో నుండి వ్యాపార వ్యవహారములు జరుపుకొనవలెను. వారికి రాజకీయ పౌరసత్వపు హక్కులు కూడ ఈయబడలేదు.)

**అపార్థము** నం. వి. తప్పర్థము.

**అపిధానము** నం. వి. మరుగు, మూత, ఆచ్ఛాదనము. రూ. పిధానము.

**అపినద్ధము** నం. వి. 1. కట్టబడినది (వస్త్రము). 2. తొడగబడినది (కవచము). 3. కట్టబడనిది 4. తొడగబడనిది.

**అపుడు** వి. ఆసమయము. రూ, అప్పుడు, అప్డు.

**అపురూపము** వై. విణ. అపూర్వము, పూర్వములేనిది, అరుదు, నం.అపరూపమ్. (వ్యావ.) ప్రాణపదము. ఉదా. నేను దాన్ని అపురూపంగా చూచుకుంటున్నాను.

**అపుష్పపర్ణము** నం. వి. పర్ణాంగముల తరగతికి చెందిన మొక్కలఆకు (Frond).

**అపూపము** నం వి. పిండివంట, అప్పము.

**అపూర్ణభాజనము** నం. వి. (జం.) కొంత భాగము మాత్రమే యుక్తాఖండములుగా విభజన చెందిన అండముయొక్క స్థితి. (Meroblastic cleavage).

**అపూర్వము** నం. విణ. చూ. అపురూపము,

**అపృష్ఠవంశినము** నం. విణ వె న్నముకలేనిది Invertebrate).

**అపేక్ష** నం. వి. కోరిక, కాంక్ష.

**అపేతము** నం. విణ. తొలగినది. పోయినది.

**అపోసానము** వై. వి. భోజనాది యందును భోజనాంతమునందును పుడిసిట జలమును పట్టి మంత్రపూర్వకముగ పుచ్చుకొనుట, అట్లు పుచ్చుకొను జలము. నం. ఆపోశానమ్, అపోశనమ్.

**అపోహ(ము)** నం. వి. లేనిది ఊహించుట, తప్పుటూహ.

**అప్ప** వి. చూ. అప1.

**అప్పగించు** వై. క్రి. ఒప్పగించు, అర్పించు.

**అప్పచి** వి. అపూపము; రూ. అప్పచ్చి.

**అప్పచ్చి** వి.. చూ. పై.

**అప్పటము** విణ. కలితిలేనిది, స్వచ్ఛమైనది.

**అప్పటి** అవ్య. అనాటి, మరల.

**అప్పడము** వై. వి. ఒకరకపు భక్ష్యము. రూ. అప్పళము, నం. అర్పటమ్.

**అప్పతి** నం. వి. వరుణుడు. వ్యు. నీటికి అధిపతి.

**అప్పన** వై. వి. 2. అనుమతి, ఆజ్ఞ, నం. ఆజ్ఞాపనమ్, 2. అర్పణము. 3. కప్పము, కానుక. రూ. అప్పనము.

అప్పనము వై. వి. 1 కప్పము, పన్ను. 2. బహుమతి, కానుక. సం. అర్పణమ్.

అప్పము వె. వి. బెల్లమును పిండియు కలిపిచేసిన గుండ్రని భక్ష్యము. గుడా పూపము. సం. అపూపః.

అప్పనము అవ్య. సతతము. వి. చిన్న నీటికాలువ.

అప్పళము[1] వి. 1. అప్పడము. 2. బాలక్రీడ లలో ఒకటి. 3. (తొడమొ.వి.) చరచుట.

అప్పళము అవ్య. బిరాన. శీఘ్రముగా, త్వరగా.

అప్పళించు క్రి. 1. ఆస్ఫాలనముచేయు, చరచు, తట్టు. 2. కొట్టు, 3. పట్టుకొను, 4. తాకు. 5. ఆక్రమించు. 6. మూయు. 7. రాచు, అద్దు. 8. తుడుచు. 9. ఉల్ల హించు. తమకించు.

అప్పీల్ ఇం.వి. (Appeal) పై కోర్టునకు గాని పైఅధికారికిగాని చేసికొను విన్నపము అప్పీలు దారు = అప్పీల్ చేసినవాడు.

అప్పు వి. ఋణము. సం. వి. ఋణము.

అప్రతిష్ఠ సం. వి. అగౌరవము, అపకీర్తి.

అప్రత్యక్షకణ విభజన సం. వి. (జీవ) ఈ కణ విభజనలో ఏర్పడిన, రెండు జీవకణ స్థానములలో క్రోమొసోములు రెండుగా చీలుటవలన సమాన సంఖ్యగల క్రోమొ సోములుండును(Mitosis indirect cell division).

అప్రత్యావర్తక అభిక్రియ సం.వి. (రసా.) వెనుకకు రానట్టి రసాయనాభిక్రియ (Irreversible reaction).

అప్రదక్షిణము సం. వి. ఎడమ ప్రక్కగా తిరిగి వచ్చుట.

అప్రమేయము సం విశ. 1, 'ఇంత' అని మితియేర్పరుపశక్యముకానిది; 'ఇది ఇట్టి' దని నిశ్చయింప శక్యముకానిది, సరిగా తెలిసికొన సాధ్యముకానిది.

అప్రవేశ్యశిల సం. వి. (భూగో.) వర్షపు నీటిని తనలో ప్రవేశించనీయని శిల.

అప్రూవర్ ఇం.వి. (శాస.) (Approver). చేసిన తప్పును ఒప్పుకొని ప్రభుత్వము తరపున సాక్షిగా మారిన అపరాధి.

అప్రెంటిస్ ఇం. వి. (Apprentice). పనిని అభ్యసించువాడు, పారిశ్రామిక విద్యార్థి.

అప్లికేషన్ ఇం.వి. (Application)దరఖాస్తు.

అప్సరస సం, వి. దేవవేశ్య. వికృ, అచ్చర.

అప్‌హోల్‌స్టరీ ఇం. వి. (గృహ.) (Upholstery) దూదిమెత్తలతో తయారుచేయు ఆసనములు, ఉదా సోఫాలు, కుర్చీలు.

అఫారెస్టేషన ఇం. వి. (Aforestation) అడవులు లేనిచోట అడవులు సృష్టించుట.

అబందర వై. విశ. తారుమారైనది, పాడైనది సం. అబంధురమ్.

అబక వి. చూ. అగప

అబద్ధము సం. విశ. 1. పొసగనిది, అసంగ తము. 2. ప్రయోజనము లేనిది, వి. పొసగనిమాట, అసత్యవాక్యము అసంగత వాక్యము.

అబల సం. వి. స్త్రీ.

అబెట్‌మెంట్ ఇం. వి. (శాస.) (abetment) అపరాధము చేయుమని ప్రోత్సహించుట. ఒకడు చేయు నేరమునకు తోడ్పడుట.

అబ్జము సం. వి. 1. తామర, 2. మారు కోట్లు, 3. ఉప్పు, 4 శంఖము. 5. హారతి కర్పూరము 6 (వృక్ష.) నీటిప్రబ్బలి. విశ, నీటబుట్టినది.

అబ్జజుఁడు సం. వి. బ్రహ్మ, తమ్మిచూలి.

అబ్జబాంధవుఁడు సం. వి. సూర్యుడు. వ్యు. తామరలకు బంధువు.

అబ్జమిత్రుఁడు సం. విశ. సూర్యుడు.

అబ్జయోని సం. వి. బ్రహ్మ. తమ్మిచూలి.

అబ్జవైరి సం. వి. చంద్రుడు. వ్యు. తామర లకు శత్రువు.

**అబ్జారి** సం. వి. చంద్రుడు.

**అబ్జుఁడు** సం. వి. 1. చంద్రుడు. 2. ధన్వంతరి. వ్యు. నీటినుండి పుట్టినవాడు.

**అబ్దము** సం. వి. 1. సంవత్సరము. 2. మేఘము. 3. తుంగముస్త. 4. ఒకకొండ 5. అద్దము. విశ. నీటి నిచ్చునది.

**అబ్ధి** సం. వి. 1. సముద్రము. 2. సరస్సు, 3. (గణి.) నాల్గవ సంఖ్య.

**అబ్ధికఫము** సం. వి. సముద్రపు నురుగు.

**అబ్ధిజ** సం. వి. 1. లక్ష్మిదేవి. 2. మద్యము విశ. సముద్రమున బుట్టినది.

**అబ్ధిపల్లవము** సం. వి. పగడము.

**అబ్ధిమేఖల** సం. వి. భూమి. వ్యు. సముద్రమే మొలనూలుగా గలది.

**అబ్బ** వి. తండ్రి. అవ్య. బాధను, ఆశ్చర్యమును సూచించు పదము.

**అబ్బరము** వై. విశ. అమితము. సం. అపారమ్.

**అబ్బాటు** వి. 1. జనసమ్మర్దముచే కలుగు కాక, ఉక్క. 2. ఆకస్మికము. రూ. డబ్బాటు.

**అబ్బాలాడు** క్రి. తడబడు.

**అబ్బు** వై. క్రి. 1. దొరకు. 2. సిద్ధించు, 3. వశమగు. 4. అలవడు

**అబ్బురము** వై. విశ. 1. అరిది. 2. ఆశ్చర్యకరము. వి. ఆశ్చర్యము. అద్భుతకార్యము రూ. అబ్రము. సం. అపూర్వమ్.

**అబ్బెసము** వై. వి. అలవాటు. సం. అభ్యాసము.

**అబ్రము** వై. వి. మా. అబ్బురము.

**అబ్రహ్మణ్యము** సం. విశ. బ్రాహ్మణునికి తగనిది (వధాదులు.) వి. చంపవలదు అని (బ్రాహ్మణుఁడు) పెట్టు మొర.

**అబ్రాశి** సం. వి. (అప్ + రాశి) నీటిప్రోగు. సముద్రము.

**అభయము** సం. విశ. భయములేనిది. వి. 1. పరమాత్మ 2. పరమాత్మ జ్ఞానము. 3 భయనివృత్తి 4. రక్షణము 5 వట్టివేరు.

**అభవుఁడు** సం. వి. శివుడు. విశ. పుట్టుకలేనివాడు.

**అభాండము** సం. వి. నింద (ఈ యర్థము తెనుగునందే కలదు).

**అభావము** సం. వి. 1. లేమి. 2. నాశము. విశ. 1. లేనిది. 2. సత్యము కానిది.

**అభి** సం. అవ్య. ఒక ఉపసర్గ. సమానపూర్వపదముగా నుండి క్రింది అర్థములను తెలుపును, 1. ఎదురు, ఉదా. అభిముఖము, అభియానము. 2. సామీప్యము, ఉదా. అభ్యాగతము = సమీపముగ వచ్చినది. 3. అంతటను ఉదా. అభిచరించు = అంతటను తిరుగు. 4. అత్యంతము ఉదా. అభిరుచి = ఎక్కువ ప్రీతి.

**అభిక్రియ** సం. వి. (రసా) రాసాయనిక ద్రవ్యములు కలియునప్పుడు పడ్డు క్రియ (Reaction).

**అభిఖ్య** సం. వి. 1. పేరు 2. కీర్తి. 3. చెప్పుట. 4. కాంతి.

**అభిగతము** సం. విశ. 1 పొందబడినది. 2. సమీపింపబడినది. 3. భోగింపబడినది.

**అభిగమనము** సం. వి. 1. ఎదురుగాపోవుట. 2. సమీపించుట. 3. పొందుట. 4. సంభోగము.

**అభిఘాతము** సం. వి. 1. దెబ్బ. 2. కొట్టుట 3. సమూలనాశము.

**అభిచారము** సం. వి. 1. శత్రువులను చంపుటకై చేయుహోమాది కర్మము. 2. పిశాచములను వదలించుటకై చేయు క్రియ. 3. పంపు.

**అభిజనము** సం. వి. 1. కులము, 2. జన్మభూమి. 3. పరిజనము, 4. కులాగతమైన పెక్కెము మొ. బిరుదు.

**అభిజాతుఁడు** సం. విశే. 1. గొప్పవంశము నందు పుట్టినవాడు. 2. పండితుడు 3. న్యాయవంతుడు. 4 శ్రేష్ఠుడు.

**అభిజిత్తు** సం. వి. 1. పగలు పదునాల్గు గడియలపై రెండు గడియల కాలము. 2. ఒక నక్షత్రము.

**అభిజ్ఞానము** సం. వి. 1. గుర్తు. 2. గుర్తు పట్టుట. 3. జ్ఞానము, తెలివి.

**అభిజ్ఞుఁడు** సం. విశే. 1. తెలివిగలవాడు. 2. నేర్పరి, 3. పండితుడు.

**అభిదిశ** సం. వి. (గణి.) సరళరేఖయొక్క దిక్కు. (Sense).

**అభిధానము** సం. వి. 1. పేరు, 2. చెప్పుట. 3. నిఘంటువు, రూ. అభిధేయము.

**అభిధేయము** సం. విశే. పేర్కొనదగినది. వి. 1. శబ్దార్థము. 2. గ్రంథ ప్రతిపాద్య విషయము, 3. నామధేయము,

**అభినందనము** సం. వి. 1. సంతోషము, 2. పొగడుట. 3. ప్రోత్సాహపరచుట.

**అభినయము** సం. వి. నటనము.

**అభినవము** సం. విశే. క్రొత్తది. వి. ముఖస్తుతి.

**అభిని** వై. వి. నల్లమందు, సం. అహిఫేనమ్, అఫేనమ్.

**అభినివేశము** సం. వి. 1. చొరవ, 2, పట్టుదల. 3. అభిలాష.

**అభిప్రాయము** సం. వి. 1. తలపు. 2. భావము, తాత్పర్యము. 3. అభిలాష, 4. వైఖరి, రీతి, సంస్థితి (Attitude).

**అభిభాషణము** సం. వి. మాటలాడుట. సంభాషణము.

**అభిమంత్రణము** సం. వి. 1. పిలుపు 2. మంత్రము పఠించుచు చేయు వీక్షణాది సంస్కారము.

**అభిమతము** సం. వి. 1. సమ్మతి. 2. కోరిక. 3. మమకారము. విశే. 1. సమ్మతము, 2. ఆదరింపబడినది, 3. ప్రియమైనది, 4. కోరబడినది.

**అభిమానము** సం. వి. 1. గర్వము. 2. ప్రేమ, 3. ఆత్మగౌరవము, 4. హింస, 5. జ్ఞానము. 6. పగతీర్చుకొనుట. 7. అజ్ఞానము.

**అభిముఖము** సం. విశే. ఎదురెదురుగా నుండునవి (Opposite).

**అభిముఖకోణము** సం. వి. (గణి.) రెండు ఋజురేఖలు ఒండొంటిని ఖండించుకొనునపుడు ఏర్పడు పరస్పరము ఎదురుగా నుండు కోణములు 1, 2 లేదా 3, 4 అభిముఖ కోణములు.




**అభిముఖపత్రములు** సం. వి. (వృక్ష.) ఒకే కణుపునకు ఒకదానికొకటి ఎదురు బొదురుగా నున్న ఆకులు, ఎదురుచేరిక ఆకులు.

**అభియోగము** సం. వి. 1. పూనిక, 2. ఆసక్తి 3. పాండిత్యము. 4, పట్టుదల. 5. వ్యాజ్యము. 6. శత్రువు నెదిరించుట. 7. ముట్టడి. 8. శపథము.

**అభిరతి** సం. వి. 1. అపేక్ష. 2. ఆసక్తి. 3. ప్రీతి.

**అభిరామము** సం. విశే. మనోహరము. ఇంపైనది. ఒప్పిదమైనది.

**అభిరుచి** సం. వి. 1. అత్యాసక్తి. 2. కాంతి 3. (గృహ). రుచి. నచ్చినచవి (Taste).

**అభిలగ్నము** సం. వి. (వృక్ష). పుష్పములో ఉన్న ఒకరకముభాగము మరియొక రకము భాగముతో కలిసియున్న స్థితి. ఉదా. ఆకర్షకపత్రములు పుంకేసరముల తో కలసియున్న స్థితి (Adhesion).

**అభిలాష** సం. వి. కోరిక. రూ. అభిలాషము,

**అభివాదనము** నం. వి. తనగోత్ర నామములచెప్పి పాదము లంటి నమస్కరించుట నమస్కారము.

**అభివాహినాడులు** నం. వి. (జం.) ప్రేరేపణను కేంద్రనాడీమండలమునకు తీసికొనివచ్చు నాడులు (Afferent nerves).

**అభివృద్ధి** నం. వి. పెంపు. పెరుగుదల.

**అభిషేకము** నం. వి. 1. తడుపుట. 2. స్నానము చేయించుట. 3. పట్టాభిషేకము. 4. స్నానము.

**అభిసరణ** నం. వి. (గణి.) అనంతశ్రేణిలోని పదముల మొత్తము అవధిని కలిగియుండుట (Convergence).

**అభిసరణము** నం. వి. (రసా.) ద్రావమునే గాని ద్రావ్యమును చొరనీయనిదియు, ద్రావణమునుండి ద్రావ్యమును వేరుపరచు నదియునగు ఒక పొరద్వారా ద్రావణములోనికి ద్రావము ప్రసరించుట (Osmosis)

**అభిసరణప్రేషము** నం. వి. (రసా.) ద్రావణమును ద్రావ్యమునుండి వేరుచేయు పొరగుండా ద్రావము ప్రసరించకుండ చేయుటకు ద్రావణముపై ఆనించవలసిన ఒత్తిడి (ప్రేషము) (Osmatic pressure).

**అభిసరించు** నం. క్రి. ప్రియులు సంకేతస్థలమునకు పోవు.

**అభీకుఁడు** నం. వి. 1. ప్రియుడు. 2. కవి. 3. ప్రభువు. విశ. 1. తమకపడువాడు. 2. కాముకుఁడు. 3. భయములేనివాడు. 4. భయంకరుడు.

**అభీప్సితము** నం. విశ. కోరబడినది. వి. కోరిక.

**అభీరుఁడు.** నం. విశ. భీరువుకానివాడు. వి. గొల్లవాడు.

**అభూతము** నం. విశ. 1. కల్లయైనది. 2. లేనిది. 3. జరుగనిది.

**అభేదము** నం.వి. భేదములేమి, ఏకీభావము.

**అభ్యంగము** నం. వి. 1. తలంటు 2. తైలము

**అభ్యంజనము** నం. వి., చూ. అభ్యంగము.

**అభ్యంతరము** నం. వి. 1. అన్నిటికి నడిమిచోటు. 2. ఆలస్యము. 3. విఘ్నము. విశ. 1. లోపలిది, 2. ఆటంకము.

**అభ్యర్థనము** నం. వి. కోరిక, మనవి, విన్నపము.

**అభ్యర్థి** నం. వి. దరఖాస్తుదారుడు, 2 ఎన్నికలలో పోటీచేయు వ్యక్తి (Applicant. candidate).

**అభ్యాగతుఁడు** నం. వి. 1. వచ్చినవాడు. 2. భోజన సమయమునకు వచ్చిన అతిథి.

**అభ్యాసము** నం. వి. 1. అలవాటు. 2. ఆవృత్తి, సాధన, 3 (గణి.)గుణించుట. విశ. దాపైనది.

**అభ్యుత్థానము** నం. వి. 1. ఆదరముచేగాని గౌరవముచేగానిలేచుట. 2. గౌరవముచే లేచి ఎదురుగా వచ్చుట. 3. పూనిక. 4. పుట్టుట. 5. పెరుగుట.

**అభ్యుదయము** నం. వి. శుభోదయము. మేలు, 2. వృద్ధి, 3. అభీష్టకార్యసిద్ధి. 4. ఉత్సవము. 5. కాన్పు.

**అభ్రంకషము** నం. వి. ఆకాశమును ఒరయునది మిక్కిలి ఎత్తైనది..

**అభ్రకము** నం. వి. (రసా.) కాకిబంగారము (రాసాయనికముగ ఇది మగ్నీషియమ్ ఇనుము, సోడియమ్, పొటాషియమ్‌తో కూడుకొనిన సిలికేట్ యౌగికము. ఇది పొరలుగా విడదీయబడ గలదు. దీనిని తాపవిద్యుత్‌నిరోధకముగా వాడుదురు) (Mica).

**అభ్రగము** నం. వి. పక్షి, పులుగు, వ్యు. ఆకాశమునందు పోవునది.

**అభ్రమణి** నం. వి. సూర్యుడు.

**అభ్రము** సం. వి. 1. మేఘము. 2. ఆకాశము. 3. అభ్రకము. 4. బంగారు. 5. హారతి కర్పూరము. 6. తుంగముస్త 7. (*గణి*) సున్న.

**అభ్రమువు** సం. వి. తూర్పున నుండు ఐరావత దిగ్గజము యొక్క భార్య.

**అమ** వై. వి. 1. తల్లి. 2. పూజ్యురాలు. రూ. అమ్మ సం అంబా.

**అమంగళము** సం.వి. 1. అశుభము కీడు. 2 ఆముదపుచెట్టు, విశే. అశుభమైనది.

**అమడలు** వై. వి. కవలు. జంటబిడ్డలు. సం. యమళః.

**అమయు** క్రి. 1. ఉపయుక్తమగు 2. పూర్తియగు.

**అమరకము** వి. 1. ఇనాము నేల. 2. ఏర్పరుచుకొన్న శిస్తునకు భూమిని వ్యవసాయముచేయు వాని కిచ్చుట. 3. అమరుటః. రూ. అమరము.

**అమరము** వి. 1. ఆవశ్యకమయినపుడు కొంత దండును తీసికొని రావలయునను నిబంధనముమీద చిన్నరాజులకు ఈయబడు భూమి. 2. సం. వి. ఒక సంస్కృత నిఘంటువు.

**అమరావతి** సం వి. 1. ఇంద్రుని పట్టణము. 2. స్వర్గము. 3. గుంటూరుజిల్లాలోని ప్రాచీన పట్టణము.

**అమరిక** వి. 1. పొందిక. 2. అందము.

**అమరు** క్రి. 1. ఒప్పు, 2. కుదురు, 3 సిద్ధమగు, సిద్ధించు, లభించు, కలుగు, 4 సరిపడు. 5. ఏర్పడు, పొసగు

**అమరుఁడు** సం. వి. 1. దేవత, 2. అమరసింహుడు (సంస్కృత నిఘంటు కర్త). విశే. మరణము లేనివాడు.

**అమర్చు** క్రి: (గృహ.) ఉపకరణములు సదుపాయము నిచ్చునట్లు అమరచేయు (furnish). 1. కూర్చు. కావించు, సిద్ధపఱచు 2. ధరించు.

**అమర్త్యుఁడు** సం. వి. దేవత. వేల్పు, విశే. చావు లేనివాడు.

**అమర్షము** సం. వి. 1. కోపము. 2. ఓర్వలేమి. విశే. ఓర్వనిది.

**అమలము** సం. విశే. 1. నిర్మలము. 2. దోషము లేనిది. 3. తెల్లనిది. వి. అభ్రకము.

**అమలుపరచు** క్రి. అచరణలో పెట్టు.

**అమవస** వై వి చంద్రుడు ప్రకాశింపని దినము. రూ. అమాస. సం. అమావాస్యా.

**అమాంతము** వి 1. చిల్లర బేరము. 2. అకస్మాత్తు.

**అమాత్యుఁడు** సం. వి. 1. మంత్రి. 2. సహచరుడు. రాజుతో నుండువాడు.

**అమానుషము** సం. విశే. 1. మనుష్యశక్తికిమించినది. 2. మనుష్య ధర్మములు లేనిది. క్రూరము. 3. మనుష్యులు లేనిది. వి. మనుష్యభిన్నమైనది-పశుపక్ష్యాదికము,

**అమాయకుఁడు** సం. విశే. మాయ. కపటము మొ. వి ఎరుగనివాడు, రూ. అమాయకుడు.

**అమావాస్య** సం. వి. (భూగో.) చంద్రుడు తన మార్గములో సూర్యునికిని భూమికిని మధ్య వచ్చినపుడు చంద్రునిపై సూర్యుని వెలుగుపడిన భాగము కనిపించని దినము. కృష్ణపక్షమున కడపటిదినము. వికృ. అమవస, అమాస.

**అమిణి** వి. వెట్టి, కూలిలేమి.

**అమితము** సం. విశే, విస్తారము, మితిలేని. మేరలేనిది.

**అమినో యాసిడ్స్** ఇం. వి. (జీవ. రసా.) (**Aminoacids**)' జీర్ణమైన మాంసకృత్తుల నుండి జనించు అమినో గుణములుగల ఆమ్లములు.

అమీబా ఇం.వి. (జం.) (Amoeba) ఏకకణ జీవులైనజంతువులలో ఇది ఒకటి.


అమీబా

అమీబాయిడ్ ఇం. విశ. (జం.) (Amoeboid) అమీబావంటిది.

అమీరు హిం. వి. 1. ధనికుడు. 2. ప్రభువు. 3. అధికారి.

అమూల్యము నం. విశ. 1. వెలలేనిది. 2. మిక్కిలి వెలగలది.

అమృతకరుఁడు నం. వి. చంద్రుడు.

అమృతము నం. వి. 1. నీరు, 2. సుధ, 3. పాలకడలి వెన్న. 4. పాలు. 5. మోక్షము. 6. స్వాదుపదార్థము. 7. బంగారు. 8. పాదరసము. 9. విషమునకు విరుగుడు మందు. 10. బ్రహ్మము.

అమృతాంధసుఁడు నం. వి. వేలుపు, దేవత. వ్యు. అమృతమే అన్నముగా గలవాడు.

అమెరికారాష్ట్రములసంస్థ నం. వి. (రాజ. వరి.) అమెరికా రాష్ట్రములలో ముఖ్యముగ లాటిన్ అమెరికా రాష్ట్రములలో కమ్యూనిస్ట్, ఫాసిస్ట్ వాదములు వ్యాపించకుండ నుండుటకును, ఉమ్మడి దేశరక్షణ కొరకును, 21 అమెరికా రాష్ట్రములు క్రి. శ. 1948లో బొగోటా నగరమునందు సమావేశమై స్థాపించిన సంస్థ.

అమేధ్యము నం. విశ. మలినము, పవిత్రము కానిది, పరిశుద్ధముకానిది. వి. పురీషము. మలము.

అమేయము నం. విశ. అపరిమితము, మితిలేనిది.

అమైలాప్సిన్ ఇం.వి. (జం.) (Amylopsin) క్లోమ (Pancreas) గ్రంధినుండి తయారగు సేంద్రియఖండము (Ferment). ఇది పిండి పదార్థమును చక్కెరగా మార్చును).

అమోఘము నం. విశ. వ్యర్థము కానిది, సఫలమైనది, తప్పనిది.

అమ్మ వై. వి. 1. తల్లి, 2. పూజ్యురాలు. నం. అంబా. అవ్య. ఆశ్చర్యాది వాచకము, ఔర.

అమ్మకచెల్ల అవ్య. ఆశ్చర్య సంతాపాదులను తెలుపును.

అమ్మకపుదారుఁడు వి. (వాణి) వస్తువులను చిల్లరగా అమ్మువాడు. (Seller or Vendor).

అమ్మకపుపన్ను వి. (వాణి.) అమ్మిన వస్తువుల ధరలమీద ప్రభుత్వము విధించు పన్ను (Sale's tax).

అమ్మకము వి. 1. అమ్ముట, విక్రయము. 2. అమ్మగా వచ్చిన ద్రవ్యము.

అమ్మవారు వి. 1. స్త్రీదేవత, గ్రామదేవత. 2. పూజ్యస్త్రీ. 3. స్ఫోటకము 4. స్ఫోటకాధిష్ఠానదేవత.

అమ్మాయి వి. 1. బాలిక, చిన్నపిల్ల. 2. కూతురు.

అమ్మి వై. వి. 1. అమ్మాయి, 2. నీచజాతి స్త్రీ. నం. అంబి

అమ్మిక వై.వి. పార్వతి, దుర్గ, నం. అంబికా

అమ్ము [1] వై. వి. 1. బాణము. 2. వీపుమీది నఖక్షతము, నం. అంబకమ్.

అమ్ము[2] క్రి. విక్రయించు, వెలకు ఇచ్చు.

అమ్మోనియాకరణము మి. వి. (భూగో., రసా.) ఈ క్రియలలలో నేలయందలి సేంద్రియ పదార్థములో నుండు . మాంసకృత్తులు కొన్ని సూక్ష్మజీవుల వలన ఆమ్లజనీకరణము నందును. దీనిఫలితముగ కర్బన ద్విఆమ్లజనిదము. $CO_2$, అమ్మోనియా $NH_3$ యును ఏర్పడును(Ammonification).

**అమ్మోనియా గంధకితము** వి. (వ్యావ.) ఇది నత్రజనిని విస్తారముగ ఇచ్చు బలమైన ఎరువు. దీనిలో నత్రజని, ఉదజని, ఆమ్లజని, గంధకము ఉండును (Ammonium sulphate) $(NH_4)_2$ $(SO_4)$.

**అమ్మోఫాస్** ఇం. వి. (వ్యావ.) ఇది సంయుక్త స్ఫురితము లగు ఎరువులలో ఒకటి. (దీనిలో స్ఫురత్పంచామ్లజనిదము నత్రజనితో సంయోగించి యుండును.) (Ammonium phosphate).

**అమ్లము** సం. వి. 1. పులుపు. 2. నాల్గవ భాగము నీళ్ళుచేరిన మజ్జిగ. 3. పులిసిన పెరుగు, 4. పులిచింత, 5. దబ్బ.

**అయ** వై. వి. 1. తండ్రి, 2. పూజ్యతను తెలుపు పదము, 3. పురుషనామములకు అనుప్రయుక్తము. రూ. అయ్య, సం. ఆర్యః.

**అయగారు** వి. 1. ఆచార్యుడు. 2. పూజ్యపురుషుడు, రూ. అయ్యగారు.

**అయనపరిమితి** సం. వి. (భూగో.) సూర్యుడు ఆరుమాసముల పరిమితిలో కర్కాటక రేఖ నుండి మకరరేఖలో, మకరరేఖ నుండి కర్కాటకరేఖలో ప్రవేశించుట.

**అయనము** సం. వి. 1. మార్గము. 2. స్థానము, 3. సైన్యవ్యూహమున ప్రవేశించు ద్వారము. 4. (జ్యోతి.) సూర్యుడు దక్షిణోత్తరదిశలకు పోవుట. 5. సూర్యునియొక్క దక్షిణోత్తర దిగ్గమనములకు పట్టుకాలము, ఆరునెలలు. 6. మోక్షము.

**అయనరేఖలు** సం. వి. (భూగో.) కర్కాటక మకరరేఖలు.

**అయనీకరణము** సం. వి. (రసా.) అణువులనుగాని, పరమాణువులనుగాని లవణములనుగాని అయనులుగా చేయుట (Ionisation).

**అయన్** ఇం. వి. (భౌతి.) (Ion) విద్యుత్ప్రవాహసమయమందు విద్యుద్ఘటములో విద్యుదగ్రములవైపు చరించు విద్యుద్విశ్లేష్య ద్రవ్యభాగము.

**అయనులు** ఇం. వి. (రసా.) (Ions) 1. విద్యుత్స్ఫారితములైన పరమాణువులు, 2. అట్టి పరమాణువుల కూటములు. (ఒక సంయోగద్రవ్యము కొన్ని ద్రవపదార్థములలో కరిగినపుడు ఆ ద్రవ్యములలోని అణువులు కొన్ని ధన (+) విద్యుత్స్ఫారితములుగను, కొన్ని ఋణ (—) విద్యుత్స్ఫారితములుగను విడిపోవును, ఉదా. ఉప్పు (సోడియం హారిదము) నీటిలో కరిగినపుడు సోడియపు అయనులు ధన విద్యుత్స్ఫారితములుగను హారిదపు అయనులు ఋణవిద్యుత్స్ఫారితములుగనువిడిపోవును.

**అయము** సం. వి. 1. శుభకర్మము, మేలు చేకూర్చెడిపని, 2. శుభము, మేలు, 3. ఇనుము.

**అయస్సు** సం. వి. ఇనుము. రూ. అయము.

**అయస్కాంత దండము** సం. వి. (భౌతి.) లోహమును ఆకర్షించెడు దండము (Bar magnet).

**అయస్కాంత ప్రేరణము** సం. వి. (భౌతి.) అయస్కాంతమునకు దగ్గరగా నుండు ఇనుపముక్కను తాత్కాలికాయస్కాంతముగ చేయు ప్రక్రియ (magnetic Induction),

**అయస్కాంత బలరేఖలు** సం. వి. (భౌతి.) అయస్కాంతము యొక్క ధనధ్రువము నుండి ఋణధ్రువమునకు అయస్కాంత శక్తి ప్రసరించు మార్గములు (Magnetic lines of force).

**అయస్కాంతము** సం. వి. (భౌతి.) సూచంటురాయి, లోహమును ఆకర్షించునది (Magnet).



అయస్కాంతము

**అయస్కాంత రేఖావృత్తము** సం. వి. (భౌతి.)అయస్కాంతసూచి ఒక ప్రదేశము నందు నిశ్చలముగా ఉన్నపుడు దాని అక్షముచే సూచింపబడు నిట్టనిలువు సమతలము (Magnetic meridian).

**అయారె** అవ్య. ఔర, ఆశ్చర్యప్రశంసాదులను తెలుపు పదము. రూ. అయ్యారే, అయ్యారె.

**అయిదు** సర్వా. ఐదు (సంఖ్యావాచకము).

**అయిమూల** వి. రెండు దిక్కుల మధ్యనుండుదిక్కు, మూలవాటు.రూ.ఐమూల.

**అయిరేని** వి. నాగవల్లి పాత్రము.

**అయుక్త బీజాణువు** సం. వి. (వృక్ష.) సంయుగ్మము లేకయే ఏర్పడిన సిద్ధబీజము (Azygospore).

**అయుగ్మము** సం. విశే. బేసి, ఉదా. రెండుచే నిశ్శేషముగా భాగింపబడని అంకె 3,7,9 మొ. వి.

**అయుతము** సం. వి. పదివేలు, విశే. 1. పదివేల సంఖ్యగలది. 2. సంబంధములేనిది.

**అయో** అవ్య. దుఃఖము, బాధ మొ. ని తెలుపును. రూ. అయ్యొ, అయ్యో.

**అయోగము** సం. విశే. సంబంధము లేనిది. వి. 1. కూడికలేమి. ఎడబాటు. 2. పొసగమి. 3. (జ్యోతి.) తిథివారాదుల దుష్టయోగము 4. గట్టి పూనిక. 5. ఇనుపసుత్తె. 6. వమనముచే ఉపశమింపదగు రోగము.

**అయోడిన్** ఇం. వి. (రసా.) (Iodine) 1. ఔషధముగాను ఛాయాచిత్రకళలోను ఉపయోగించు ఒకరాసాయనికద్రవ్యము. (సముద్రపు నీటిలోను పాచిలోను దొరుకును) 2.పరమాణుద్వయమున్న అణువు.

**అయోనిజ** సం. విశే. గర్భమున పుట్టని స్త్రీ. వి. సీత.

**అయోనిజుఁడు** సం. విశే గర్భమున పుట్టనివాడు. వి. విష్ణువు, 2. శివుడు

**అయోమయము** సం. విశే. 1. ఇనుముతో చేయబడినది. 2. కఠినము. వి. ముందు వెనుకలు తోపమి.

**అయోమార్గము** సం. వి. ఇనుపగారి.

**అయోముఖము** సం. విశే. ఇనుపమొన గలది. వి, 1. బాణము. 2. కఱ్ఱువేసిన నాగలిదుంప. 3. రోకలి.

**అయ్య** వై. వి, తండ్రి; విశే. పూజ్యుడు. రూ. అయ, సం. ఆర్యః.

**అర** వై. వి. 1. సగము, 2. కొంచెము. 3. గది. 4. పెట్టె మొ. వి లోపలి గది. సం. అర్ధమ్.

**అరక** వి. ఎద్దులుకట్టి సిద్ధపరచిన నాగలి.

**అరకాఁడు** వి. కర్షకుడు, పైరుపెట్టువాడు, రైతు.

**అరగడము** విశే. ముసలి, వృద్ధు.

**అరగలి** వి. జంకు, సందేహము.

**అరగూడు** వి, గోడయందు ఏర్పరచిన గూడు,

**అరడ** వి. 1. ఏరుదాటు సాధనములలో ఒకటి, చిన్నతెప్ప, 2. పూస, బొగడ.

**అరణము** వై. వి. వివాహకాలమందు వధూవరుల కిచ్చు ధనాదికము, సారె, సం. హరణమ్.

**అరణి** సం. వి. రాచినిప్పుపుట్టించు జమ్మికొయ్య.

**అరణ్యము** సం. వి. అడవి.

**అరణ్యరోదనము** సం. వి. 1. అడవిలోని ఏడుపు.(దానివలనెనిష్ఫలమైనదనియర్థము)

**అరతి** సం. విణ. 1. విరక్తుడు. 2. సంతోషము లేనివాడు. వి. 1. విషయములందు ఇష్టములేమి. 2 అనురక్తిలేమి. 3. సంతోషములేమి. 4. బాధ. 4. అరుచిని కలిగించు పిత్తరోగము, 6. క్రోధము. 7. (అలం) మన్మథావస్థలు పదింటిలో నారవది (దేనియందును ఇష్టము లేకుండుట.)

**అరత్ని** సం. వి. 1. చిటికెనవ్రేలు చాచిన మూరకొలత. 2. మోచేయి.

**అరదండము** వి. రెండుచేతులకు తగిలించెడు సంకెల.

**అరదము** వై. వి. తేరు. సం. రథః.

**అరదేశి** వి. 1. పరదేశి. 2. యాత్రికుడు,

**అరప** వి. చిన్నచప్పరము, మంచె.

**అరపది** వై. సర్వా. అయిదు. పదిలోసగము. సం. అర్ధపంక్తిః.

**అరపూస** వి. గుగ్గిలము (Rosin).

**అరమర** వి. 1. సందేహము, జంకు. 2. భేదము. 3 గుట్టు.

**అరమరిక** వి. చూ. పై.

**అరము** సం. వి. 1. బండికంటి ఆకు. 2. కోణము. విణ. త్వరితము, వడిగలది.

**అరయిక** వి. 1. వెదకుట. 2. విచారణ. 3. పరిశీలనము.

**అరయు** క్రి. 1. వెదకు 2. పరిశీలించు. 3. జాగ్రత్తతో చూచు. 4. తెలిసికొను. 5. పాలించు. 6. పరీక్షించు 7. నిరీక్షించు.

**అరరి** సం. వి. తలుపు.

**అరవ** వి, తమిళుడు, తమిళదేశపువాడు. రూ. అఱవ, 2. పర్వతమార్గము, కనుమ.

**అరవడి** వి. ఋణము, అచ్చుదల.

**అరవరలు** విణ. 1. శుష్కించినది. 2. ధ్వస్తమైనది. వి. తునుకలు. రూ. అఱవఱలు.

**అరవాయి** వి. 1, వెనుదీయుట, జంకు. 2. శంక. 3. అధైర్యము. 3. కొరత.

**అరవిందము** సం. వి. 1. తామర, 2. ఎఱ్ఱ కలువ. 3. నల్లకలువ. 4 బెగ్గురుపక్షి.

**అరవిరి** విణ. సగము విచ్చినది, వి. సగము విచ్చిన మొగ్గ.

**అరవుడు** వి. తునక, ఖండము.

**అరసంజె** వై. వి. అర్ధాస్తమయము, సం అర్ధసంధ్యా.

**అరసంమితీయము** సం విణ. (వృక్ష.) ఒకటి కంటె ఎక్కువ అక్షములలో రెండు సమానభాగములుగ విభజించుటకు వీలైన (పుష్ప) నిర్మాణము గలది (Actinomorphic), బహుయుగ్మకము (Radially Symmetrical).

**అరసొవు** వి. మూర్ఛ, మైమరపు.

**అరాజకము** సం. విణ. రాజులేనిది, కట్టుబాటు లేనిది. వి. అనాయకత్వము.

**అరాజకవాదము** సం. వి. (రాజ.) ప్రభుత్వముతో అవసరములేకుండ సంఘము తనంతటతాను వ్యవహారములు నడుపవలెనను వాదము.

**అరాతి** సం. వి. శత్రువు.

**అరాళము** సం. విణ. వంకరైనది. వి. 1. మదపుటేనుగు, 2. మద్దిజిగురు. 3. ఒకరకపు అభినయ హస్తము.

**అరి**[1] సం. వి. 1. చక్రము, 2. చక్రాయుధము. 3. చక్రవాకపక్షి. 4. శత్రువు. 5. (జ్యోతి.) లగ్నమునుండి ఆరవస్థానము. 6. చంద్రశేట్టు.

**అరి**[2] వి. 1. కప్పము. 2. అల్లైత్రాడు. 3. హద్దు, మర్యాద.

**అరి**[3] అవ్య. కలది, కలవాడు అను అర్థమున తెలుగు పదము చివరచేరు ప్రత్యయము, ఉదా. కల్లరి, నేర్పరి (కల్ల + అరి, నేర్పు + అరి).

**అరిందముఁడు** నం. విశే. 1. శత్రువుల నణచువాడు, 2. అరిషడ్వర్గమును గెలుచువాడు. వి. 1. శివుడు. 2. ఒకానొక ఋషి.

**అరికట్టు** క్రి. 1. అడ్డగించు, నిరోధించు, 2. చుట్టుకొను. వి. 1. అడ్డు నిరోధము. 2. దుప్పటి మెలిపెట్టి రెండు భుజముల యందును జందెపువాటుగవైచి కట్టిన కట్టు, వేటకట్టు.

**అరిగ** వి. డాలు, కేడెము.

**అరిగాఁపు** వి. 1. పన్ను చెల్లించురైతు, 2. కప్పము చెల్లించువాడు.

**అరిగాపు** వి, 1. ఇతరులు లోనికి రాకుండ ఉండుటకై పెట్టిన కావలి, కట్టుకావలి, 2. కనిపెట్టుకొని పడియుండుట.

**అరిగొను** క్రి. అడ్డుపడు.

**అరిగోలు** వి. నదిని దాటించు సాధనములలో ఒకటి. తెప్ప.

**అరిజ** వి. నీళ్ళుపోవుటకై తొలచి కాలువ మొదట నుంచెడు కాటిదోనె, రూ. అరిజె.

**అరితి** వి. ప్రేమ. కూరిమి.

**అరిత్రము** నం. వి. 1. చుక్కాని. 2. ఓడ తెడ్డు.

**అరిదళము** వై. వి పసుపు రంగుగల ఒక ఖనిజము. నం. హరితాళః.

**అరిది** విశే, 1, అపూర్వము. 2. అశక్యము. 3. ఆశ్చర్యకరము. 3. దుర్లభము. 5. దుస్సహము.

**అరిషడ్వర్గము** నం. వి. అంతశ్శత్రువులు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు).

**అరిష్టనివారణ(ము)** నం. వి. (వ్యావ.) వ్యవసాయదారుని సస్యములను పాడు చేయు వివిధ జంతువులను, శిలీంధ్రములను ప్రతీకార చర్యలచే నివారించుట (Prevention of pests and diseases).

**అరిష్టము** నం, విశే. 1. హింసింపబడనిది. 2. నిరుపద్రవము. వి. 1. రాపులుగు. 2. కాకి. 3. వెల్లుల్లి. 4. అశుభము. 5. మరణచిహ్నము. 6. శుభము. 7. పురుటిల్లు. 8. భూకంపము మొ. ఉత్పాతము. 9. రాగి.

**అరిస్టోక్రసి** ఇం. వి. (Aristocracy) 1. కులీనులు, 2. ప్రభువర్గము. 3. ప్రభుతంత్రము. 4. విశిష్ట జనపాలన.

**అరీయ సంమితి** నం. వి. (జీవ.) మధ్యవర్తిగా నుండు ఒకే కేంద్రీయ అక్షమునకు చుట్టును సదృశమైన భాగము లుంచుట (Radial symetry).

**అరుంధతి** నం. వి. 1. వసిష్ఠునిభార్య. 2. ఒకానొక నక్షత్రము. 3. దక్షుని కూతురు. వికృ. అరంజోతి.

**అరుఁగు** వి. తిన్నె. రూ. అరఁగు.

**అరుగు** క్రి. 1. పోవు. 2. కడచు. 3. నశించు.

**అరుగుదెంచు** క్రి. 1. వచ్చు. 2. వెళ్ళు. రూ. అరుదెంచు.

**అరుచి** నం. వి. 1. రోత, 2. నోటికి రుచి కాకుండుట.

**అరుణము** నం. వి. 1. ఇంచుక ఎరుపు. 2. కపిలవర్ణము. 3. సంధ్యారాగము. 4. బంగారు. 5. కుంకుమ. 6. రాగి. 7. సెత్తురు. విశే. ఇంచుక ఎఱ్ఱనిది. రూ. అరుణిమ.

**అరుణుఁడు** నం. వి. 1. అనూరుడు, సూర్యసారథి. 2. సూర్యుడు.

**అరుణోదయము** నం. వి. సూర్యోదయమునకు ముందు నాలుగు గడియలకాలము. వేకువజాము.

**అరుదు** వి. 1. ఆశ్చర్యము. 2. ఒకానొక నగ. 3. వింత. విశే. 1. ఆశ్చర్యకరము. 2. అపురూపము. 3. అశక్యము. 4. దుష్కరము. 5. దుస్సహము. 6. దుర్లభము.

**అరుదెంచు** క్రి., రూ. అరుగుదెంచు.

**అరులు** వి. వాత్సల్యము, ప్రేమ.
**అరులు మరులు** వి. 1. ముదిమిచే మనసునకు గలుగు తబ్బిబ్బు. 2. వెఱ్ఱిప్రేమ.
**అరువరి** విశే. అప్పు పుచ్చుకొన్నవాడు. అధమర్ణుడు (అరువు+అరి).
**అరువు** వి. 1. అప్పుగా వస్తువును కొనుట. 2. జ్ఞానము.
**అరువుఁబూట** వి. రొక్కపు జామీను.
**అరుసము** వై. వి సంతోషము. సం.హర్షః.
**అరుసు** వి. ప్రభువు, రాజు.
**అరుహుఁడు** వై. విశే. తగినవాడు. రూ. అర్హుఁడు. సం. అర్హః.
**అరె** అవ్య. ఆశ్చర్యాది సూచకము. రూ. అరే.
**అరెస్టు** ఇం. వి. (Arrest) బంధించు. నిర్బంధించు.
**అరోచకము** సం. విశే. 1. ప్రకాశింపనిది. 2. ఏవగలిగించునది. వి. ఆహారము ఇతవు కాకుండుట, ఒకవ్యాధి.
**అర్కజుఁడు** సం. వి. 1. శని. 2. యముడు,
**అర్కబంధువు** సం. వి. బుద్ధుడు. వ్యు సూర్యవంశీయుడు(కావుననీవ్యవహారము).
**అర్కము** సం. వి. 1. జిల్లేడు. 2. రాగి. 3. (రసా.) ఒక ద్రవ్యమునుండి స్వేదనముచేగాని ద్రావణముచేగాని లాగబడిన అంశము (Extract).
**అర్కుఁడు** సం.వి. 1.సూర్యుడు.2.ఇంద్రుడు
**అర్గళము** సం. వి. 1. తలుపుగడియ. 2. ప్రతిరోధము, అడ్డంకి. 3. పెద్దఅల.
**అర్ఘము** సం. వి. 1. వెల. 2. పూజావిధి. 3. చౌక. రూ. అర్ఘువు.
**అర్ఘ్యము** సం. విశే. 1. మిక్కిలి వెలగలది. 2. పూజకు తగినది. 3. పూజకొరకైనది.
**అర్ఘువు** సం. వి., చూ. అర్ఘము.
**అర్చ** సం. వి. 1. పూజకొరకైన ప్రతిమ. రూ. అర్చన. అర్చనము.
**అర్చన** సం. వి., చూ. పై.
**అర్చనము** సం. వి., చూ. పై.
**అర్చకుఁడు** సం. వి. పూజారి.
**అర్చి** సం. వి. 1. అగ్నిజ్వాల. 2. కిరణము. 3. కాంతి, వెలుగు. రూ. అర్చిస్సు.
**అర్జంటైట్** ఇం. వి. (భూగ.) (Argentite) అర్జెంటైనాలో దొరకెడి సిల్వర్ సల్ఫైడ్ ఖనిజము.
**అర్జునకుఁడు** సం.వి. 1. బోయ. 2. తెల్లనివాడు.
**అర్జుని** సం. వి. 1. ఆవు. 2. ఒకజాతి పాము. 3. బాహుదానది. 4. కుంటెనకత్తె. 5. బాణాసురుని కూతురు.
**అర్జునుఁడు** సం. వి. 1. పాండవులలో మూడవవాడు. 2. కార్తవీర్యార్జునుడు. 3. తల్లికి ఒకడే కొడుకైనవాడు.
**అర్ణము** సం. వి. 1. నీరు. 2. వర్ణము. అక్షరము. 3. టేకు. విశే. 1. చలించునది 2. కలతపడినది.
**అర్ణవము** సం.వి. 1. సముద్రము. 2. అల.
**అర్ణోరాశి** సం. వి. 1. జలరాశి, సముద్రము.
**అర్తి** సం. వి. 1. దుఃఖము, బాధ, పీడ. 2. వింటికొప్పు. రూ. ఆర్తి.
**అర్థన** సం. వి. 1. యాచన. 2. ప్రార్థనము.
**అర్థము** సం.వి. 1. శబ్దవివరణము. 2. వస్తువు. 3. ఇంద్రియములచేగ్రహింపదగిన విషయము (శబ్దాదులు). 4. కారణము. 5. కార్యము. 6. ధనము. 7. పురుషార్థములలో రెండవది.
**అర్థశాస్త్రము** సం.వి. 1. కౌటిల్యునిచే రచింపబడిన రాజనీతిశాస్త్ర గ్రంథము. 2. వస్తువులఉత్పత్తి, వినిమయము మొదలగు ఆర్థిక విషయములను గురించితెలుపు శాస్త్రము (Economics).
**అర్థచంద్రము** సం.వి. అర్ధచంద్రునియాకారముగల బాణము.

**అర్ధచంద్రకవాటము** సం.వి. (జం.) గుండె కాయలోని జఠరిక ధమనస్కంధములోనికి తెరచుకొనుద్వారమునకు గల అర్ధచంద్రా కార కవాటము (Semilunar valve).

**అర్ధచంద్రప్రహారము** సం. వి. మెడపట్టి త్రోయుట.

**అర్ధచంద్రాకృతి** సం.వి. (భౌతి) ద్రవ పదార్థము యొక్క స్వతంత్రతలములోని వక్రత (Meniscus).

**అర్ధపరపుష్టములు** సం. వి. (వృక్ష.) ఇవి పెర మొక్కలపై సగము పరాన్నభుక్కు లుగా పెరుగు మొక్కలు. (వీనికి ఆకులు మొ.విపనరురంగుగలఅవయవములున్నను ఇవి, వేళ్ళను ఇతర జాతిచెట్ల అంగముల లోనికి జొనిపి సారమును హరించుచుం డును (Semiparasites). ఉదా. బదనిక (Loranthus).

**అర్ధప్రవేశ్యము** సం. విశే (భౌతి. రసా.) మిశ్రద్రావణములో ఉన్న ఏవో కొన్ని స్ఫుటకముల మాత్రమేతనగుండ పోనిచ్చు నది (Semipermeable).

**అర్ధము** సం.వి. 1. సగము. 2. తునుక. విశే. అసంపూర్ణము, ఖండము.

**అర్ధరథుఁడు** సం. వి. సమరధునికంటె తక్కువ యోధుడు, ఒక విలుకానితో సరిగా నిలిచి పోరలేనివాడు.

**అర్ధవృత్తము** సం.వి. (గణి.) వృత్తము లోని అర్ధభాగము (Semi-circle).

**అర్ధసంఖ్య** సం. (జీవ.) సంయోగికణ ములలో ఉండు క్రోమొసోముల సంఖ్య (Haploid).

**అర్ధసూత్రణ** సం. వి. (జీవ.) సంయోగి కణములు ఉత్పత్తియగు క్రమములో తమకోశములో నుండు క్రోమొసోముల సంఖ్యసగముగానగువిధానము(Meiosis)

**అర్ధహారము** సం. వి. అరువది నాలుగు పేటల హారము.

**అర్ధి** సం. విశే. సగపాలు గలవాడు.

**అర్ధోరుకము** సం. వి. చల్లడము, లాగు.

**అర్పటము** సం. వి. అప్పడము.

**అర్పణము** సం. వి. 1. ఒప్పగించుట 2. పొందించుట. 3. దానము. వికృ. అప్పనము.

**అర్బుదము** సం.వి. 1. పదికోట్లు. 2 (గృహ) కొరకువుండు (Cancer). 3. నేత్రవ్యాధి. 4. హానికరమైనగ్రంధి మాంసార్బుదము. విశే. 1.పదికోట్ల సంఖ్యగలది, 2 కఠినము.

**అర్భకుఁడు** సం. వి. బాలుడు. విశే. మూర్ఖుడు.

**అర్యముఁడు** సం. వి. 1. సూర్యుడు. 2. పితృదేవతలలో ఒకడు.

**అర్శొమొలలు** వి. (గృహ.) గుదములోని రక్తనాళములు ఉబ్బి రక్తముకారుట. మూలశంక (Piles).

**అర్హము** సం, విశే. తగినది. వి. వెల,

**అఱ**[1] వి. 1. గది. 2.హస్తతలము. 3. పెట్టె మొ.ని లోనిగది.

**అఱ**[2] వై. వి. 1. కొరత. 2. కీడు. 3. కప టము. 4. సందేహము. 5. చినుగు. విశే. కొంచెము, సగము. క్రి. విశే,కొంచెముగా సం. అర్ధమ్.

**అఱక** వి. 1. మూపు, స్కంధము. 2.ఎడ్ల మెడపై వేసిన నాగలి.

**అఱకము** వి. అజీర్తి.

**అఱకాలు** వి. పాదము క్రింది భాగము.

**అఱగొడ్డియము** వి- దుండగము, దౌష్ట్యము రూ. అఱగొడ్డము. అఱగొడ్డెము.

**అఱగొడ్డెము** వి., మా. పై.

**అఱగొఱ** వి. 1. న్యూనత. 2. కపటము, 3. భేదము.

**అఱచేట్టు** వి. 1.సగము చేతులుగల చొక్కాయ. 2. పొడవు తక్కువైన షరాయి.

**అఱచు** క్రి. 1. కేకవేయు. 2. మొఱపెట్టు. 3. ఏడ్చు. 4. బిగ్గఱగా పిలుచు. 5. వదరు, వాగు.

**అఱజాతి** వి విశే. 1. హీనకులుడు. 2. దుష్టుడు.

**అఱడా** వి. 1. జడకుచ్చుమీది పూస. 2. స్త్రీలు మెడకు గట్టు పూస. 3. పల్లకి బొంగుకొనకు అమర్చు సింహతలాటపు రేకు. 4 స్తంభపు బోదిక్రింది చక్రము. రూ. అరడా, అఱడు.

**అఱడు** వి. చూ. పై.

**అఱపు** వి 1. అరచుట. 2. కూత. 3. మొర.

**అఱపోఱఁడు** వి. సగముగూను.

**అఱవ** వి. సాధువుకాని ఆవు. విశే. దుష్టుడు. దుష్టము.

**అఱవడు** వి. ఒక రకపు ధాన్యము.

**అఱవము** వై. వి. ద్రవిడభాష.

**అఱవఱలు** విశే. 1. శుష్కించినది, క్షీణించినది. 2. ధ్వస్తమైనది. వి. ఖండములు, తునుకలు.

**అఱిమెనకుండలు** వి. రంగులతో చిత్రములు వేసిన పెండ్లికుండలు, ఐరేనికుండలు.

**అఱిముఱి** వి. 1. కలత. 2. తొందరపాటు, సంభ్రమము. క్రి· విశే. 1. శీఘ్రముగా. 2. అనాలోచితముగా. 3. తబ్బిబ్బుగా. 4. బొత్తిగా. 5. తరచుగా. 6. నిశ్చయముగా. విశే. అత్యంతము, మిక్కిలి.

**అఱిసె** వై. వి. ఒకరకపు పిండివంట. రూ. అరిసియ. సం. అతిరసః.

**అఱు**[1] క్రి. నశించు, క్షీణించు.

**అఱు**[2] వి. 1. కంఠము. 2. సమీపము. 3. ముందుభాగము. రూ. అఱ్ఱు.

**అఱుఁదెవులు** వి. క్షయరోగము (అఱు + తెవులు).

**అఱుకువ** వి. అజీర్తి, అజీర్ణవ్యాధి.

**అఱుక్రమ్ము** క్రి. చుట్టునుక్రమ్ము, క్రమ్ము. మీదికి వచ్చు.

**అఱుగు** క్రి. 1. క్షీణించు, తరుగు, కృశించు. 2. (తినిన పదార్థము) జీర్ణమగు. రూ. అఱువు.

**అఱుగుళ్ళు** విశే. శిథిలము. వి. తునుకలు. ఖండములు. రూ. అఱువుళ్ళు.

**అఱుత** అవ్య. 1. సమీపమందు. 2. కంఠమందు

**అఱుము** క్రి. 1. ఎదుర్కొను. 2. బాధించు. 3. ఆక్రమించుకొను. 4. ప్రతిఘటించు. 5. తెగించు. 6. విజృంభించు. వి. ఆక్రమణము.

**అఱువండ్రు** సర్వ. అరువదిమంది.

**అఱువది** సర్వ. ఆరుపదులు.

**అఱువు** క్రి. చూ. అఱుగు.

**అఱువుళ్ళు** విశే. (ని.బహు.) 1. శిథిలము. 2. తునియలు. రూ. అరువుళ్ళు.

**అఱ్ఱు** వి. 1. అఱ, గది. 2. ప్రయాసమున పాలు పిదుకదగిన ఆవు.

**అఱ్ఱుము** వి. ముండ్లమోపు.

**అఱ్ఱాఁక** వి. 1. ఒత్తుడు. 2. మిక్కిలిఅడ్డంకి. 3. మరుగు.

**అఱ్ఱాఁకలి** వి. 1. మిక్కిలి ఆకలి (ఆకలి + ఆఁకలి). 2. సగము ఆఁకలి, ఆఁకలిపూర్తిగ తీరమి (అఱ్ఱు + ఆఁకలి).

**అఱ్ఱాడు** క్రి. 1. ఇటునటు తిరుగు, చుట్టుచుట్టు తిరుగు. 2. ఆందోళనమందు. 3. తహతహపడు.

**అఱ్ఱీయము** వి. అజీర్తి. అజీర్ణవ్యాధి. రూ. అఱ్ఱెము.

**అఱ్ఱు** వి. చూ. అఱు[2].

**అఱ్ఱెము** వి. చూ. అఱ్ఱీయము. బ్రతుకమ్మ పండుగ దినములందు ఆరవదినము (ఈనాడు బ్రతుకమ్మలాడరు).

**అల** వి. తరంగము. విశే. 1. ప్రసిద్ధిని తెలుపును, ఉదా. అలవైకుంఠపురంబులో.

2. నిర్దేశమును తెలుపును, ఉదా. చోరు డల చంద్రుడు.

**అలంకరిష్ణువు** నం. విశే. అలకరించుకొను స్వభావము కలవాడు., అలంకార ప్రియుడు.

**అలంకర్త** నం. వి. అలంకరించువాడు.

**అలంకారము** నం. వి. 1. అలంకరించుట, సింగారము. 2. హారాది ఆభరణము. 3. (అలం.) ఉపమాది అలంకారములు. రూ. అలంకృతి, అలంక్రియ.

**అలంకృతి** నం. వి. మా. పై.

**అలంక్రియ** నం. వి. మా. పై.

**అలంగము** వి. కోటచుట్టును ఆనికగా వేసిన మట్టిదిమ్మ, వప్రము.

**అలంఘనీయము** నం. విశే. 1 దాట శక్యముకానిది. 2. దాటకూడనిది. 3.అతిక్రమింప సాధ్యముకానిది. 4.అతిక్రమింపకూడనిది.

**అలంఘ్యము** నం. విశే. మా. అలంఘనీయము.

**అలఁగు** క్రి. 1. శ్రమపడు. 2. దుఃఖించు. 3. వెనుదీయు.

**అలఁత** వి. 1. శ్రమము. 2. బాధ. 3. దుఃఖము.

**అలఁతి** విశే. 1. సూక్ష్మము. 2. పలుచనిది. 3. అల్పుడు. 4. శక్యము. వి. 1. అల్పయత్నము. 2. పరిమితి, కొలది.

**అలఁదు** క్రి. పూయు.

**అలఁదురు** క్రి. 1. దుఃఖించు, కలతనొందు.

**అలక**[1] విశే. సూక్ష్మము, పలుచనిది.

**అలక**[2] నం. వి. నెరికురులు, ముంగురులు (ఇది. ని. బహు.) 2. కుబేరునిపట్టణము.

**అలకన.** వి. సూక్ష్మత. విశే. సూక్ష్మము.

**అలకము** నం. వి. మా. అలక[2].

**అలకి** వై. వి. కుండ. నం. అలుకా.

**అలకువ** వి. 1. ఆయాసము. 2. విముఖత్వము 3. సిగ్గు. 4. కొరత

**అలక్తము** నం. వి. లక్క, లత్తుక.

**అలక్ష్యము** నం. విశే. 1. చూడరానిది. 2. తెలిసికొనరానిది. 3. గురి లేనిది. 4. లక్ష్యార్థము లేనిది. వి. 1. గురికానిది. 2. లక్షార్థముకానిది. 3. లెక్కసేయమి.

**అలగ్నమధ్యసంయోగము** నం. వి. (వృక్ష.) అండాశయములో మధ్య జరాయువు నిలువుగానుండి దానిచుట్టును బీజాండములున్నస్థితి(Free cent al placentation)

**అలఘుఁడు** నం. విశే. గొప్పవాడు.

**అలచందలు** వై. వి. అలసందలు, పెద్ద బొబ్బరలు, రాజమాషములు రూ. అలసందియలు,అలసందెలు, నం.అలసాంద్రః.

**అలజడి** వి. 1. ఆపద. 2. శ్రమము. 3. చింత.

**అలపు** వి. అలయిక, శ్రమము.

**అలబలము** వి. కలకలము. సందడి.

**అలమరు** క్రి. 1. బాధపడు. 2. విలపించు.

**అలమార్చు** క్రి. బండికి ఎడ్లను మార్చికట్టు.

**అలము**[1] నం. వి. 1. తేలుకొండి. తేలుకొండి ముల్లు. 2. అరిదళము.

**అలము**[2] క్రి. 1. వ్యాపించు. 2. ఆక్రమించు 3. చుట్టుకొను. 4. కౌగిలించు. 5. కప్పు. 6. అదుము. 7. పట్టుకొను. 8. పూయు. వి. నేలపై ప్రాకు తీగ.

**అలముకొను** క్రి. 1. కలియు. 2. పైకొను.

**అలయు** క్రి. 1. శ్రమపడు.2. విసుగుచెందు. 3. ఆలసించు. 4. చింతిల్లు.

**అలరు** క్రి. 1. వికసించు. 2. సంతోషించు. 3. శోభిల్లు. 4. ఒప్పు కలుగు. వి. 1. పుష్పము. 2. సంతోషము. 3. శోభ.

**అలరుఁబోఁడి** వి. పుష్పమువలె మనోజ్ఞురాలగు స్త్రీ. రూ. అలరుఁబోణి.

**అలురువిలుకాఁడు** వి. మన్మథుడు.

**అలరువిల్తుఁడు** వి. మన్మథుడు.

**అలర్కరోగము** సం. వి. (గృహ.) వెఱ్ఱి కుక్క కరచినచో వచ్చు పిచ్చి.

**అలవ** వి. 1. కంచె. దడి. 2. పశువులకు గడ్డి వేయుటకై కట్టిన గాడి.

**అలవడు** క్రి. 1. అభ్యస్తమగు. అబ్బు. 2. పరిచితమగు. 3. కలుగు. 4. శక్యమగు. 5. సిద్ధించు. 6. తగు. 7. కలియు. 8. ఒప్పు. 9. ఉండు. 10. స్వాధీనమగు.

**అలవాటు** విశే. 1. అభ్యస్తము. 2. సిద్ధము. వి. అభ్యాసము. వాడుక.

**అలవి** వి. 1. కొలది, పరిమితి. 2 సామర్థ్యము. 3. విధము. విశే. శక్యము.

**అలవు** వి. 1. బలము. శక్తి. 2. ఉపాయము. నేర్పు 3. శ్రమము. 4. విధము.

**అలవోక** వి. 1. అప్రయత్నము. 2. విలాసము. 3. నిర్లక్ష్యము. విశే. 1. అల్పము. మందము. 2. విలాసము. 3. ఆసక్తిశూన్యము, లక్ష్యములేనిది. క్రి. విశే. 1. యాదృచ్ఛికముగా. 2. హఠాత్తుగా. 3. సవిలాసముగా. 4. అవలీలగా. 5. నిర్లక్ష్యముగా, అశ్రద్ధగా.

**అలస** సం. వి. అల్లుడుతీగ. హంసపదీలత.

**అలసందియలు** వై. వి. చూ. అలచందలు.

**అలసట** వి. అలపు, ఆయాసము, ఒడలిక, గ్లాని.

**అలసము** సం. విశే. 1. మందమైనది, సోమరి. 2. శ్రమచెందినది. వి. 1. బురదలో తిరుగుటచే కాలివ్రేళ్ళనడుమ వచ్చు పుండు, బురదపుండు, 2. ఒకరకపు అజీర్ణ వ్యాధి, 3. విషముగల ఎలుక.

**అలసు** వి. తిరస్కారము, లోకువ. రూ. అలుసు.

**అలసుఁడు** సం. విశే. సోమరి, చురుకుదనము లేనివాడు.

**అలసాంద్రము** సం. వి. చూ. అలచందలు.

**అలాతము** సం. వి. కొరవి, కొరకచ్చు. ఉల్ముకము.

**అలాబుకము** సం. వి. (వృక్ష.) ఇది మాంసల ఫలములలో ఒకరకము, అధస్థితిగల, ఒకే గదికల సంయుక్తాండాశయము నుండి బయలుదేరిన ఫలము (దీనిలో కుడ్యసంయోగము కాననగును).

**అలాబువు** సం. వి. 1. సొరకాయ, ఆనపకాయ. 2. సొరకాయబుఱ్ఱ.

**అలి** సం. వి. తుమ్మెద. 2. తేలు. 3. కోకిల. 4. కాకి. రూ. అళి.

**అలికము** సం. వి. నొసలు, లలాటము. రూ. అళికము.

**అలికిడి** వి. ధ్వని, చప్పుడు, సవ్వడి.

**అలిఖితసంవాదము** సం. వి. (రాజ.) రాజ్యాంగ నిబంధనలు సంపూర్ణముగ వ్రాయబడలేకుండుట, శాసనసభ చట్టములు. న్యాయస్థానమునందలి తీర్పులు. దేశాచారములు మొ. వానిపై ఆధారపడియుండు సంవిధానము.

**అలిపిరి** వై. విశే. 1. దుర్బలము. 2. మెల్లనిది. 3. ఒక్కది. పలుచనిది. 5. బక్కచిక్కినవాడు.

**అలిబీ** ఇం. వి. (శాస.) (Alibi) నేరము జరిగినపుడు తాను స్థలాంతరమునం దున్నట్లు న్యాయస్థానములో విచారణసమయమున నేరము మోపబడినవాడు రుజువుచేయుట.

**అలివేణి** సం. వి. 1. తుమ్మెదల బారువంటి జడగలస్త్రీ. 2. స్త్రీ.

**అలుఁగు** వి. 1. చెరువుతూము. కలుజు. పరీవాహము. 2. ఆధారినిపోవు నీరు. రూ. అల్గు. 3. బాణాగ్రము, కత్తి ఆయుధము.

**అలుక** వి. 1. కోపము. 2. ద్వేషము. 3. ద్రోహచింత. విశే. 1. అల్పుడు. 2. గౌరవహీనుడు, రూ. అలుకవ.

**అలుకు**[1] క్రి. భయపడు, జంకు, వి.భయము జంకు.

**అలుకు**[2] క్రి. 1. పేడ మొ నితో ఇల్లు మొ.ని శుభ్రముచేయు. 2. చల్లు, 3. పువ్వులు గ్రుచ్చు. 4. మొక్కలునాటు.

**అలుకుఁజుట్టు** వి. అలుకుగుడ్డ.

**అలుకుడు** వి. చూ. అలికిడి.

**అలుకువ** వి. 1. సంకోచము, జంకు, 2. కోపము.

**అలుగు** క్రి. 1. కోపించు, 2. ద్వేషించు, 3. హానిచేయు. రూ. అల్గు.

**అలుగులము** వి. వ్యాకులత, క్లేశము, నలగుడు, బాధ.

**అల్గు** వి. చూ. అలుగు.

**అలుచు** వై. విశే. అలసుడు, సోమరి సం. అలసః.

**అలైంగికము** సం. విశే. (జీవ.) స్త్రీ పురుషాంగముల ప్రమేయములేనిది(Asexual).

**అలోహము** సం. వి. (భౌతి.) సాంద్రత తక్కువ, తళుకు లేకుండుట. విద్యుత్తును ఉష్ణమును ప్రసరింపనీయకుండుట మొ. కొన్ని ధర్మములు కలిగిన మూలకము (Non-metal).

**అల్టిమేటమ్** ఇం. వి. (రాజ.) (Ultimatum) అంత్యసందేశము, యుద్ధారంభమునకు ముందు ఒక పక్షమువారు వేరొక పక్షమువారికి ఆఖరిసారిగా సంప్రదింపులకై పంపు హెచ్చరిక.

**అల్నా** ఇం. వి. (జం.) (Ulna) మోచేతి క్రింది ఎముకలలో ఎడమప్రక్కది, అరత్నిక.

**అల్నేర్** ఇం. వి. (జం.) (Ulnare) అరత్నిక క్రిందనున్న మణికట్టు ఎముక.

**అల్పకణిశము** సం. వి. (వృక్ష.) సంక్షిప్తమైన అక్షముపై ఒకటిగాని, స్వల్పముగగాని పుష్పములుగల చిన్న శూకి (Spikelet). ఉదా. తృణధాన్యములు.

**అల్పము** సం. విశే. 1.నీచము. 2.సూక్ష్మము. 3. చిన్నది.

**అల్పసంఖ్యాకవర్గము** సం. వి. (రాజ.) ఒక రాజ్యపు పౌరులలో, మతములో అల్ప సంఖ్యలో ఉన్న పౌరులు. అల్పసంఖ్యాక పౌరుల ప్రాథమికములైన హక్కులు, యథేచ్ఛగ జీవించుట, జీవనోపాధి, దైవారాధనము చేయుట, ప్రభుత్వముచే నిష్పక్షపాత దృష్టితో చూడబడుట.

**అల్పాచమానము** సం. వి. 1. మూత్రము 2. మూత్రవిసర్జనము.

**అల్పుఁడు** సం. విశే. నీచుడు.

**అల్బ్యూమినాయిడ్స్** ఇం. వి. (గృహ.-) (Albuminoids) గ్రుడ్డులోని తెల్లని మాంసకృత్తులు.

**అల్యూమినియం** ఇం వి. (రసా.) (A'uminium) తేలికగానుండు తెల్లని లోహము. (వంట పాత్రలు, విమాన భాగములు చేయుట కుపయోగింతురు).

**అల్ల** అవ్య. 1. ప్రసిద్ధిని తెలుపునది. ఉదా. అల్ల చిగురాకుఁ గటారి 2. నిర్దేశమును సూచించునది, ఉదా, అల్లఖు. రూ. అల.

**అల్లకము**[1] వి. 1. కౌపీనము. 2. అల్లుట అల్లిక.

**అల్లకము**[2] సం. వి. ధనియాలు.

**అల్లకల్లోలము** విశే. 1. తారుమారైనది. 2. కలతనొందినది.

**అల్లన** వి. మెల్లన. మాంద్యము. విశే. మెల్లగా, మందముగా.

**అల్లము** వై.వి. పచ్చిసొంటి. సం. ఆర్ద్రికమ్.

**అల్లలనాడు** క్రి. 1. చలించు.2.సంక్షోభించు.

**అల్లలాడు** క్రి. 1. చలించు. వణకు. 2. భయాదులచే క్షోభపడు. 3. తిరుగు రూ. అల్లలనాడు. అల్లాడు.

**అల్లారుముద్దు** విశే. మిక్కిలి ప్రియము. మిక్కిలి ఇంపైన.

**అల్లి**[1] విశ. మందము.
**అల్లి**[2] వి. 1. తెల్ల కలువ. 2. కలువవంటి నీటిపువ్వు. 3. ఒకానొక చెట్టు. 4. ఒక రకమైన పిల్లలయాట.
**అల్లిక** వి. 1. (చాప మొ.ని) అల్లుట. 2. (పదముల) కూర్పు. 3. నేత.
**అల్లి బిల్లి** వి. ఒద్దిక, పెనుకువ. 2. ఒక రకపు బాలక్రీడ. విశ. 1. కలసి మెలసి యుండునది. 2. సాంద్రము. 3. ప్రియమైనది.
**అల్లియ** వి. వింటినారి, మౌర్వి. రూ. అల్లె.
**అల్లియము** వి. 1. అల్లుడగుట. 2. క్రొత్త పెండ్లికొడుకునకు బెట్టెడి అత్తవారింటి విందు, ఎనుగుడువు.
**అల్లు** క్రి (జడ. చాప. మాటలు మొ.వి) 1. కూర్చు 2. నేయు. 3. అల్లుకొను 4. పెనగొను.
**అల్లుఁడు** వి. 1. కూతుమగడు 2. మేనల్లుడు. రూ. అల్లువాడు.
**అల్లుఁడుకొమాళ్లు** వి. ప్రభువునకు ప్రేమ పాత్రులై అంగరక్షకులుగ ఉండువారు.
**అల్లువాఁడు** వి. చూ. అల్లుఁడు.
**అల్లె** వి. చూ. అల్లియ.
**అల్లెము** వి. చూ. అల్లియము.
**అవ**[1] వి. 1. తల్లి తల్లి. 2. తండ్రి తల్లి. 3. తల్లి. 4. పూజ్యస్త్రీ. 5. వృద్ధురాలు రూ. అవ్వ.
**అవ**[2] నం. అవ్య. ఇది సమాసపూర్వపదమై క్రింది అర్థముల తెలుపును. 1. వంగినది. ఉదా. అవాగ్రము = వంగినఅగ్రముకలది 2. విరుద్ధము, ఉదా. అవమానము. 3. అనాదరమును సూచించునది. ఉదా. అవకర్ణనము = అనాదరముతో వినుట.
**అవంతి** నం. వి. 1. ఉజ్జయిని. 2. అక్క.
**అవకటము** నం. విశ. విరుద్ధము, వ్యత్యస్తము. వి. ప్రాతికూల్యము, విరోధము.
**అవకతవకలు** వి. తారుమారులు.
**అవకరము** నం. వి. 1. ఊడ్చిన చెత్తకుప్ప 2. హీనకృత్యము, చెడ్డపని.
**అవకరించు** నం. క్రి. పెంటకుప్పగా చేయు
**అవకర్షణము** నం. వి. 1. వెడలించుట. తరుముట. 2. బలవంతముగా పట్టి ఈడ్చుట.
**అవకలనము** నం. వి. (గణి.) ఒకవిధమైన అవధిక్రియ (Differentiation).
**అవకాశము** నం. వి. 1. తరుణము, వీలు 2. దేశకాలముల ఎడము. 3.(భౌతి.)సకల రాసులను కలిగియుండి ఆద్యంతములు లేనిది (Space).
**అవక్రయము** నం. వి. 1. బాడుగ, అద్దె. 2. వెల. 3. రాజునకు చెల్లించు పన్ను. 4. కూలి. జీతము.
**అవక్షేపకము** నం. వి. (రసా.) ద్రావణములనుండి అవక్షేపమును కలిగించు ద్రవ్యము ఉదా. విలీన సల్ఫ్యూరికామ్లము నుండి బేరియం సల్ఫేట్ అవక్షేపమును బయటికిపంపు ద్రవ్యము బేరియం క్లోరైడ్ అవక్షేపకము (Precipitant).
**అవక్షేపణము** నం. వి. (రసా.) అవక్షేపము తెప్పించు ప్రక్రియ (Precipitation).
**అవక్షేపము** నం. వి. 1. తప్పుపెట్టిత్రోసివేయుట. 2. నిందించుట. 3. ఎగతాళిసేయుట (రసా.) రెండు పదార్థముల మధ్య జరుగు రాసాయనికమైన మార్పు ఫలితముగా ఏర్పడిన కరగనట్టి వేరొక పదార్థము (Residue).
**అవగండము** నం. వి. మొగము మీద బొటిమ, మొటిమ.
**అవగడము** వి. 1. ఏమరిపాటు. 2. అపాయము విశ. 1. అపాయకరము. 2. ఇతరులకు అశక్యమైనది. 3. చెడ్డది.

**అవగణన** సం. వి. 1. ఉపేక్ష, సరకు సేయమి. 2. నిందించుట. 3. అవమానపరచుట, తిరస్కారము. రూ. అవగణనము

**అవగతము** సం. విణ. తెలియబడినది. జ్ఞాతము.

**అవగాహనము** సం. వి. 1. మునుగుట. 2. గ్రహించుట, తెలిసికొనుట. 3. లోపల చొచ్చుట. 4. స్నానముచేయుచోటు (చెరువు మొ.వి.).

**అవగుంఠనము** సం. వి. 1. మేలు ముసుగు. 2. దానిని వేసికొనుట. 3. కప్పువస్త్రము. 4. కప్పు.

**అవగుణము** సం. వి. దుర్గుణము, తప్పు

**అవఘళము** వి. 1. అతిశయము, పెంపు. 2. సామర్థ్యము. 3. వ్యాపనము. విణ. 1. హెచ్చైనది. 2. అసాధ్యము. 3. అకృత్యము.

**అవఘళించు** క్రి. 1. తుల్యమగు. 2. వ్యాపించు. 3. మీరు. 4. అడచు.

**అవఘళుఁడు** విణ సమర్థుడు, వ్యాపకుడు.

**అవచూషకము** సం. వి. (భౌతి., రసా.) ఏదైన పదార్థమును పీల్చునది (Absorbant),

**అవచూషణ మాపకము** సం. వి. (రసా.) ద్రవములలో వాయుపదార్థముల ద్రావణీయతను కొలుచుసాధనము (Absorption meter).

**అవచూషణము** సం. వి. (భౌతి. రసా.) లోపలికి పీల్చుకొనుట, ఇనికిపోవుట (Absorption). (వృక్ష.) బయట ఉన్న ద్రావణమును కణకవచముగుండా లోనికి తీసికొనుట (Absorption).

**అవచ్ఛేదము** సం. వి. 1. ఛేదనము. 2. మితిఏర్పరచుట. 3. హద్దు. 4. వేరుపాటు. 5. నిర్ణయించుట. 6. (గణి.) ఒక వస్తువును ఒక సమతలమును ఉపయోగించి అడ్డుగా కోయుటవలన లభించు సమతల ఖండము.

**అవజ్ఞ** సం. వి. అవమానము.

**అవటము** సం. వి. 1. పల్లము. 2. బొరియ. 3. బావి. 4. (దేహమునందు) కంఠమూలము, చంక మొ. పల్లపు భాగము. 5. పక్షిపిల్ల.

**అవటీటము** సం. వి. ముక్కు చప్పిడిగా నుండుట, చప్పిడి ముక్కు. విణ. చప్పిడి ముక్కు గలది.

**అవడు** విణ. నీచము, నింద్యము. వి. నింద. రూ. అగడు.

**అవతంసము** సం. వి. 1. పూగమ్మ. 2. సిగబంతి (పండితావతంసుడు మొ. చోట్ల శ్రేష్ఠవాచకము). రూ. వతంసము.

**అవతరణము** సం. వి. 1. దిగుట. 2. అవతారము. 3. దాటుట. 4. రేవు. 5. మెట్టు.

**అవతల** వి. 1. పిమ్మట. 2. అవలి ప్రదేశము.

**అవతారము** సం. వి. 1. దిగుట. 2. దేవతలు మనుష్యాదిరూపములలో పుట్టుట, వారు తాల్చిన రూపము. 3. ప్రాదుర్భవించుట. 4. రేవు. 5. అవతారిక. 6. (నది మొ.వి) దాటుట. 7. ప్రవేశము.

**అవతారిక** సం. వి. పీఠిక.

**అవదంశము** సం. వి. 1. ఊరుగాయ. 2. నంజుకొను పచ్చడి మొ.వి.

**అవదగాకి** విణ. పలుగాకి, దుష్టుడు.

**అవదాతము** సం. వి. 1. తెల్లన. 2. పసుపుపచ్చన. విణ. 1. ఇంపైనది. 2. తెల్లనిది. 3. పసుపుపచ్చనిది. 4. దోషరహితము. 5. ఖండింపబడినది. 6. శ్రేష్ఠమైనది.

**అవదారణము** సం. వి. 1. చీల్చుట. 2. గుద్దలి. 3. గడ్డపార.

**అవదాహము** సం. వి. 1. వేడిమి. 2. కాల్చివేయుట. 3. వట్టివేరు.

**అవదీర్ణము** నం. వి. 1. చీల్పబడినది. 2. కరగింపబడినది. 3. కలత పెట్టబడినది.

**అవదూఖు** వి. చూ. అపదూఖు.

**అవద్యము** నం. విణ. 1. నిందింపదగినది. 2. అధమము. వి 1.దోషము.2.పాపము. 3. నింద. 4. సిగ్గు.

**అవధరించు** నం. క్రి. 1. దయతోవిను 2. తలచు 3. ధరించు. 4. ఒనర్చుకొను. 5. శ్రద్ధపహించిగ్రహించు.

**అవధానము** నం. వి. 1. ... 2 ఏకాగ్రత, బుద్ధి ... విషయములను ...టు, ఉదా. అష్టావధానము, శతావధానము చూ.పధానము.

**అవధాని** నం. వి. 1 ఏకాగ్రతకలవాడు. 2. పెక్కువిషయములను ఏకకాలమందు ధారణచేయువాడు, ఉదా. అష్టావధాని, శతావధాని.

**అవధారణము** నం. వి. నిర్ణయము, నిశ్చయము.

**అవధారు** నం. అవ్య. వినుము, చిత్తగింపుము (హెచ్చరించుటను తెలుపును).

**అవధి** నం.వి. 1. హద్దు, మేర. 2. వేళ. 3. ఎడమ. 4. శ్రమము, కష్టము. (ఈ నాల్గవ యర్థము తెలుగు కర్ణాటక భాషల యందు మాత్రమే కలదు). (భౌతి.) 1.సరిహద్దు. 2. సంఘటనల మధ్యకాలము.

**అవధూత** నం.వి. కేవల బ్రహ్మనిష్ఠతో దండకమండలాదులనుకూడ విడిచిపెట్టిన సన్న్యాసి.

**అవధూతము** నం విణ. 1. కదల్పబడినది. 2. ఎగురగొట్టబడినది. 3. నశింపజేయబడినది. 4. త్రోసివేయబడినది.

**అవధూతుఁడు** నం. వి.. చూ. అవధూత. విణ. కదలింపబడినవాడు.

**అవనతము** నం. విణ. 1. వంగినది. 2. అణగినది. 3. మ్రొక్కినది.

**అవనతి** నం. వి. 1. వంగుట, వ్రాలుట 2. అడకువ 3. మ్రొక్కు. 4. (రసా) క్రిందికిపోవుట (Depression).

**అవనము** నం.వి. 1. కాపాడుట. 2.తృప్తిపరచుట. 3. తృప్తి. 4. కోరిక.

**అవన్యాయము** విణ. అన్యాయము, న్యాయముకానిది.

**అవని** నం.వి. భూమి, నేల.

**అవపథ్యము** నం. విణ. హితముకానిది. తినరానిది. చూ అపథ్యము.

**అవపాతము** నం.వి. 1. క్రిందికి పడుట. 2 పడద్రోయుట. 3. దిగుట. 4. పక్షి తటాలున వ్రాలుట. 5. గోయి. 6 ఏనుగునుపట్టుటకై త్రవ్వబడినవల్లము ఓదము, (భౌతి.) క్రిందికి వంగుట, ఒక ప్రదేశములోని సమస్ఫుటమునకును అయస్కాంత సూచి అక్షమునకును మధ్యగల కోణము.

**అవపాతవృత్తము** నం. వి. (భౌతి.) ఊర్ధ్వ తలముతో అయస్కాంత సూచి చేయు కోణమును కొలుచు పరికరము.

**అవపాతసూచి** నం.వి. (భౌతి.) ఒక ప్రదేశము నందలి అవపాతమును నిర్ణయించు సాధనము (Dip-ncedle).

**అవబోధకుఁడు** నం. విణ. 1. మేలుకొలుపువాడు. 2. బోధకుడు. వి. 1. సూర్యుడు. 2. రాజులను మేలుకొలుపు స్తుతిపాఠకుడు. 3. ఉపాధ్యాయుడు.

**అవబోధము** నం. వి. 1. మేలుకొనియుండుట. 2. తెలివి. 3. బోధించుట. 4. మేలుకొనుట.

**అవభృథము** నం.వి. యజ్ఞము చివర చేయు స్నానకర్మ.

**అవమతి** నం.వి. 1. అవమానము. 2. తిరస్కారము. 3. అనాదరము.

**అవమర్దము** సం. వి. 1. శత్రువులచే కలుగు రాయిడి. 2. నలగగొట్టుట. 3. ఒత్తుడు కలిగించుట. 4. చంపుట.

**అవమానము** సం. వి. అగౌరవము. తిరస్కారము, అనాదరము.

**అవయవము** సం. వి. అంగము. (జీవ.) ఇంద్రియము, శరీరములో కొన్ని రకముల జీవకణజాలముతో ఏర్పడిన ఒక ప్రత్యేక భాగము.

**అవరజుఁడు** సం. వి. తమ్ముడు.

**అవరుద్ధస్పందనము** సం. వి. (భౌతి.) స్పందించు వస్తువునకు పరిసరములందున్న వాయువువంటి ద్రవ్యములతో జనించు సంఘర్షణ వలన స్పందనాయామము క్రమముగా తగ్గి స్పందనములు ప్రతిఘటించబడుట (Damped vibration).

**అవరోధము** సం. వి. 1. అంతఃపురము. 2. అంతఃపురస్త్రీలు. 3. అడ్డగింత 4. ముట్టడి. 5. చెర.

**అవరోహణ(ము)** సం. వి. (గణి.) క్రమముగా క్షీణించుట (Descent)

**అవరోహణక్రమము** సం. వి. (గణి.) వరుస తగ్గుచుపోవు క్రమము(Descending order).

**అవరోహణము** సం.వి. 1. దిగుట. 2. చెట్టును అల్లుకొని ప్రాకుతీగ. 3. మఱ్ఱి మొ. ని ఊడ. 4. స్వర్గము. రూ. అవరోహము.

**అవర్ణకము** సం. విశే. (జీవ). రంగులేనిది (Anchromatic).

**అవర్ణేషి** సం. వి. (జీవ.) రంగులేనట్టిది (Anchromatin).

**అవర్ణకకటకము** సం. వి. (భౌతి.) కాంతిని ఎక్కువ వతనము లేకుండ, తనగుండ ప్రసరింపనిచ్చు నిర్దుష్టమగు కటకము. (ఇట్టి కటకములు దూరదర్శిని నిర్మాణమునందు. ఆవశ్యకములు). (Anchrometic lens).

**అవల** అవ్య. 1. [illegible]పైన, అనంతరము (తర్వాతి [illegible]). 2. అవతల (తరువాతి ప్రదేశ[illegible]). 3. వేరుచోట. విశే. 1. అవత[illegible]. 2. ఇ[illegible]రము. రూ. అవ్వల, ఆవల, [illegible]

**అవలంబనము** సం.వి. 1. చేపట్టుట, 2. పట్టు ఊత. 3. ఆశ్రయము, శరణము. (భౌతి. రసా.) క్రిందికి మడ్డిగా దిగిపోవని సాంద్ర కణములతో మిశ్రితమైన ద్రవము (Suspension).

**అవలంబితము** సం. వి. 1. వ్రేలాడునది. 2. ఆశ్రయింపబడినది. (రసా.) ఒక ద్రవములో ఇంకొక ద్రవ్యముయొక్క కణములు కొల్లాయిడ్(Colloid) రూపమున వ్రేలాడునట్లు చేసినస్థితి.

**అవలాంచ్** ఇం. వి. (భూగో.) (Avalanche) కొండమీదనుండి దొర్లి పడెడు మంచుగుట్ట

**అవలక్షణము** సం.వి. దుర్లక్షణము, అశుభచిహ్నము.

**అవలగ్నము** సం.వి. నడుము, విశే. తగులుకొనినది.

**అవలీల** సం. వి. సులభము, చులకన, అనాయాసము.

**అవలుంఠనము** సం.వి. 1. నేలపై పొరలాడుట. 2. దోచుకొనుట.

**అవలేపము** సం. వి. 1. పూత. 2. గర్వము. 3. సంబంధము. 4. చిమ్ముట. 5. దూషణము.

**అవలోకనము** సం. వి. 1. చూపు. 2. చూచుట. 3. కన్ను. 4. విచారణ.

**అవశిష్టము** సం. విశే. మిగిలినది. వి. శేషము.

**అవశేషకము** సం. విశే. (జం.) ఒక జంతువు యొక్క పూర్వజములలో బాగుగా అభివృద్ధిచెంది, పరిణామక్రమములో క్షీణించి నిరుపయోగమైన నిర్మాణమునకు గాని అవయవమునకు గాని సంబంధించినది (Vestigial).

**అవశ్యము** *సం. విశే.* 1. అణపరానిది, లోబడనిది. 2. తప్పనిసరియైనది. 3. నిశ్చయముగా. తప్పకుండగా.

**అవష్టంభము** *సం. వి.* 1. ఊత, 2. సామీప్యము. 3. ఆధారము, 4. గర్వము, 5 ప్రారంభము. 6. బంగారు, 7, అడ్డు. 8. పూత.

**అవసడి** *వి.* అపవాదము, అపనింద.

**అవసథము** *సం.వి.* 1. ఇల్లు. నివాసస్థానము 2. బస.

**అవసరము** *సం. వి.* 1. సమయము. 2. కార్యోచితసమయము, 3. కురియుట. 4. రహస్యాలోచనము. 5. ఆవశ్యక కార్యము. 6. నైవేద్యము. 7. తొందర (5,6,7, అర్థములు తెలుగుభాషయందు మాత్రమే కలవు).

**అవసానము** *సం. వి.* 1. చివర, 2. ముగింపు. 3. మేర, 4. చావు, 5. (వ్యాక.) విరామము.

**అవసానసూత్రము** *సం వి.* (శరీ.) దారము వలె ఉన్న వెన్నుపాము చివరిభాగము (Filum terminale).

**అవస్థ** *సం. వి.* 1. కాలానుసారస్థితి. 2. దురవస్థ. 3. బాధ.

**అవాంతరము** *సం. విశే.* 1. లోపలిది. 2. మధ్యవచ్చినది. *వి.* 1. ఆటంకము. 2. ఆపద.

**అవాచి** *సం. వి.* దక్షిణదిక్కు.

**అవాచ్యము** *సం. విశే.* 1. చెప్ప శక్యము కానిది. 2. చెప్పదగనిది. *వి.* నిందా వచనము.

**అవాప్తి** *సం. వి.* ప్రాప్తి, పొందుట.

**అవాయి** *వి.* ఆకాశబాణము, ఒక విధమగు బాణసంచా.

**అవారి** *వై. విశే.* 1. అధికము. 2. అడ్డులేనిది. *రూ.* అవ్వారి. *సం.* అపారమ్.

**అవిచ్ఛిన్నమైన తెరయిక** *వి.* (గృహ.) దుస్తులలోని 'ఓపెనింగ్'ను ఒకేపీలిక వేసి కుట్టి ముగించినది(Continuous wrap opening).



అవిచ్ఛిన్నమైనతెరయిక

**అవిచ్ఛిన్న భిన్నములు** *సం. వి.* (గణి.) గొలుసుకట్టుగా కొనసాగించబడు భిన్నములు. *ఉదా.* 2

7 + 1

9 + 3

4 + .....

**అవిచ్ఛిన్న వర్ణమాల** *సం. వి.* (భౌతి.) *చూ.* వర్ణమాల. (Continuous spectrum).

**అవిజ్ఞాతఖండము** *సం. వి.* (భూగో.) ఆఫ్రికా ఖండము.

**అవిటి** *విశే.* 1. అంగహీనుడు, వికలాంగుడు, గ్రుడ్డి. 2. వికలము.

**అవితథము** *సం. విశే.* 1. యథార్థము, 2 వ్యర్థము కానిది. *వి.* సత్యవచనము.

**అవిదారితము** *సం. విశే.* (వృక్ష.) పగులనిది (Indehiscent).

**అవిద్య** *సం. వి.* 1. అజ్ఞానము, తత్త్వజ్ఞానములేమి. 2. మాయ.

**అవిధి** *సం. వి.* 1 సంకటము, దుఃఖము. కష్టము (ఈ అర్థములు తెలుగునందు మాత్రమే). 2. నియమములేమి. *విశే.* నియమము లేనిది.

**అవిధేయుఁడు** *సం. విశే.* అణకువ లేనివాడు, విధేయత లేనివాడు.

**అవినీతుఁడు** *సం. విశే.* 1. చెడునడవడి కలవాడు. 2. గర్వము కలవాడు. 3. (విద్యాదులందు) అశిక్షితుడు.

**అవియు** *క్రి.* 1. పగులు. 2. విరియు, పొంగు, 3 చెదరు. 4. భగ్నమగు, చెడు.

**అవిరళము** *సం. విశే.* దట్టమైనది.

**అవిరి** వి. 1. ఒకనేత్ర రోగము, కంటిలో పెరుగు దుర్మాంసపటలము. 2. నీలి మొక్క. రూ. అయిరి.

**అవిలంబము** సం. వి. త్వర, వేగము.

**అవివేకము** సం. వి. అజ్ఞానము, తెలివిలేమి, మంచిచెడుగులను విభజించి తెలిసికొను సామర్థ్యములేమి. విణ. తెలివిలేనిది, మంచిచెడుగులను విభజించి తెలిసికొను సామర్థ్యము లేనిది.

**అవిసియ** వై. వి. అగిసె. రూ. అవిసె. సం. అగస్త్యః.

**అవు** క్రి. 1. అగు. కలుగు. 2. శక్యమగు 3. పరిణమించు. రూ. ఔ.

**అవుఁగాములు** వి. 1. కలిమిలేములు. 2. మేలు కీళ్ళు. 3. కష్టసుఖములు. 4. మంచి చెడ్డలు. రూ. ఔఁగాములు(అవు + కామి)

**అవుడు** వి. 1. క్రింది పెదవి, అధరము. 2. పల్లు, దంతము. రూ. ఔడు,

**అవ్యక్తిగతము** సం. వి. (గణి.) బీజగణితము.

**అవ్యక్తము** సం. విణ. స్పష్టముకానిది. వి. 1. మూలప్రకృతి. 2. అజ్ఞానము. 3. సూక్ష్మశరీరము. 4. పరబ్రహ్మము. 5. (బీ. గణి) తెలియబడని సంఖ్య.

**అవ్యక్తరాశి** సం. వి. (గణి.) తెలియబడని రాశి, అజ్ఞాతరాశి (Unknown quantity).

**అవ్యక్తవాక్కు** సం. వి. (గృహ.) వచ్చీరాని మాటలు (Babbling).

**అవ్యక్తుఁడు** సం. వి. 1. శివుడు. 2. విష్ణువు. 3. మన్మథుడు. విణ. మూఢుడు.

**అవ్యయము** సం. వి. 1. పరబ్రహ్మము. 2. శుభము. అభ్యుదయము. 3. (వ్యాక.) లింగవచన విభక్తి శూన్యపదము. విణ. 1. నాశరహితము. 2. మార్పులేనిది. 3. వ్యయము లేనిది.

**అవ్యయుఁడు** సం.వి, 1. విష్ణువు. 2. శివుడు.

**అవ్యాజము** సం. విణ. 1. కపటములేనిది, 2. సహజమైనది. వి. 1. కపటములేమి, అకృత్రిమత్వము.

**అవ్వ** వై. వి.. చూ. అవ[1].

**అవ్వల** అవ్య. చూ. అవల.

**అవ్వారి** వై. విణ. చూ. అవారి.

**అశనము** సం. వి. 1. భోజనము, అన్నము. 2. వ్యాప్తి.

**అశని** సం. వి. 1. పిడుగు. 2, మెరుపు. 3. వజ్రాయుధము.

**అశరీరవాణి** సం. వి. పురాణములలో శరీరి పలికెడి మాటలు, ఆకాశవాణి.

**అశీతి** సం. వి. ఎనుబది.

**అశుద్ధీకరణము** సం.వి. (గృహ.) కల్తీ చేయుట, వస్తువులో నాసిరకమును కలుపుట, మిశ్రణము (Adulteration).

**అశుభము** సం. వి. 1. కీడు. 2. అమంగళము. 3. పాపము, విణ. 1. అశుభసూచకము. 2. పవిత్రముకానిది. 3. దుష్టము.

**అశేషము** సం. విణ. అంతయు, సర్వము. వి. మిగులులేమి.

**అశోకము** సం. వి. 1. పొగడచెట్టు. 2 కంకేళివృక్షము. 3. పాదరసము. విణ దుఃఖములేనిది.

**అశోషకతైలములు** సం.వి. (వ్యావ.) గాలి పారినను చాలకాలము జిడ్డుగా నుండు నూనెలు. ఉదా. నూవులనూనె, వేరుసెనగనూనె మొ.వి. (Non drying oils)

**అశౌచము** సం. వి. 1. మురికి. 2. పురుడు. 3. మృతాశౌచము, మైల.

**అశ్మంతము** సం. వి. 1. ప్రొయ్యి. 2. పొలము. 3. చావు. 4. అశుభము. 5. మేరలేమి. విణ. మేరలేనిది.

**అశ్మకుట్టకుఁడు** సం. వి రాతిపనివాడు, రాలు మలచువాడు. 2. వానప్రస్థుడు.

**అశ్మగర్భము** సం. వి. మరకతము, పచ్చ

**అశ్మజము** సం. వి. 1. సిలాజిత్తు, 2. ఇనుము విణ. రాతినుండి పుట్టినది.

**అశ్మపుష్పము** సం. వి. ఒకరకపు గంధ ద్రవ్యము, రాతిపువ్వు.

**అశ్మము** సం వి. రాయి.

**అశ్మసారము** సం. వి. 1. ఇనుము, 2. నీల మణి. 3. రంపము.

**అశ్రద్ధ** సం. వి. 1. అనక్తిలేమి. 2. అసడ్డ. 3. నమ్మికలేమి.(కడపటి రెండర్థములును తెనుగునందు మాత్రమే గలవు).

**అశ్రము** సం. వి. 1. కన్నీరు, అశ్రువు. 2. నెత్తురు. రూ. అస్రము.

**అశ్రాంతము** సం. విణ. 1. ఎడతెగనిది. 2. అలయనిది. 3. ఎల్లప్పుడు.

**అశ్రువు** సం. వి. కన్నీరు, బాష్పము.

**అశ్రుగ్రంథి** సం. వి. (జం.) కన్నీటి గ్రంధి (ఈ గ్రంథులు ముక్కుకు ఇరుప్రక్కల, కండ్లకు చేరువుగా ఉండును.)

**అశ్లీలము** సం. వి. 1. (అలం.) ఒక అర్థ దోషము. 2. ఒక శబ్దదోషము. 3. అసభ్య వచనము, ఏవగింపు పుట్టించుమాట, బూతు,

**అశ్వతరము** సం. వి. 1. కంచరగాడిద, 2. పాతాళలోకము నందలి ఒకసర్పము. 3. కోడెదూడ, 4. గంధర్వులలో ఒకతెగ.

**అశ్వత్థము** సం. వి. 1. రావిచెట్టు, 2. అశ్వినీ నక్షత్రము. 3. ఆశ్వయుజ పూర్ణిమ.

**అశ్వము** సం. వి. గుఱ్ఱము. 2. ఏడు అను సంఖ్య.

**అశ్వమేధము** సం. వి. అశ్వమును బలి పశువుగా చక్రవర్తిచేయు యజ్ఞము.

**అశ్వసామర్థ్యము** సం. వి. (భౌతి.) ఒక గుఱ్ఱము చేయగల పనిని చూపు సామర్థ్యము. (భౌతికశాస్త్ర నిర్వచన ప్రకారము) 33,000 పౌన్లు ఒక నిమిషములో ఒక అడుగు ఎత్తునకు ఎత్తుటకు సరిపోవు సామర్థ్యము. (ఇది యాంత్రిక శాస్త్ర మందు ఇంజనులు పనిచేయు శక్తిని లేక సామర్థ్యమును కొలుచు ప్రమాణము (Horse-power).

**అశ్వయుక్కు** సం. వి. 1. అశ్వినీ నక్షత్రము. 2. ఆశ్వయుజ మాసము. విణ. 1. గుఱ్ఱములను పూన్చువాడు. 2. గుఱ్ఱములను కట్టునది(రథము). 3. అశ్వినీ నక్షత్రమున పుట్టినవాడు.

**అశ్విని** సం. వి. 1. 27 నక్షత్రములలో మొదటిది (Aries). 2. అశ్వినీ దేవతల తల్లి. బడబ.

**అశ్వినీ సుతులు** సం. వి. దేవతల వైద్యులు.

**అశ్వులు** సం. వి. దేవవైద్యులు.

**అష్టకము** సం. వి. 1. ఎనిమిదింటి సమూహము, 2. ఎనిమిది, 3. ఋగ్వేద మండలి ఒక భాగము, అట్టము. రూ. అష్టము.

**అష్టము** సం. వి. (భౌతి) 1. ఎనిమిదింటి సమూహము. 2, ఒక క్రింది స్వరమునకు ఎనిమిదవ మీదిస్వరము (Octave).

**అష్టపాదవర్గము** సం. వి. (జం.) సంధిపాద జంతువర్గములోని ఒక తరగతి, (ఈ తరగతికి చెందిన జంతువులకు ఎనిమిది కాళ్లుండును). ఉదా సాలీడు, తేలు మొ.వి.

**అష్టభుజి** సం. వి. (గణి.) ఎనిమిది భుజములు (ప్రక్కలు) గల సమతల చిత్రము (Octagon).

**అష్టమము** సం. వర్హ్య: ఎనిమిదవది.

**అష్టమి** సం. వి. ఎనిమిదవతిథి.

**అష్టమూర్తి** సం. వి. శివుడు. (పంచభూతములు, సూర్యచంద్రులు, పురుషుడు- అష్టమూర్తులు).

**అష్టాదశము** సం. వి. పదునెనిమిదవది.

**అష్టానీకము** సం. వి. (గణి.) ఎనిమిది తలములుగల పటిక (Alum). (స్ఫటికము ఈ ఆకారము కలిగియుండును).

**అష్టాపదము** సం. వి. బంగారము.

**అష్టావధానము** సం. వి. చదరంగము, కవిత్వము, వ్రాయుట, చదువుట, గణితము, సంగీతము, వ్యస్తాక్షరి, సంభాషణము అను ఎనిమిది అంశములను ఏకకాలమున గమనించుచు చేయు అవధానము. అట్లుచేయు వాడు అష్టావధాని.

**అష్టిఫలము** సం. వి. (వృక్ష.)



లో పెంకు కండకాయ, (ఈ మాదిరి ఫలము యొక్క చర్మము మూడుపొరలుగా ఉండును. మధ్యపొర గుంజు అష్టి ఫలము కాని పీచుకాని కలిగియుండును. కాని లోపలిపొర అంతఃకవచము) గట్టిగా పెంకువలెగాని టెంకవలెగాని ఉండును) (Drupe). ఉదా. కొబ్బరికాయ, మామిడి పండు.

**అష్ఠి** సం. వి. (జీవ.) జీవకణస్థానము, జీవకణములో వర్ణద్రవ్యముతో నిండి గుండ్రముగా ఉండు భాగము (Nucleus).

**అష్ఠికవచము** సం. వి. (జీవ.) జీవకణములో అష్ఠిచుట్టును ఉండు పలుచనిపొర, అష్ఠికళ (Nuclear membrane).

**అష్ఠికళ** సం. వి. (జీవి.) చూ. అష్ఠికవచము.

**అసంకల్పిత ప్రతీకారము** సం. వి. (గృహ.) ఇచ్ఛలేకుండగనే జరుగు శారీరక ప్రక్రియ (Reflex action).

**అసందర్భనిరూపణత్వము** సం. వి. (గణి.) వ్యతిరేక వచనము తప్పని చెప్పి నిరూపించు పద్ధతి.

**అసంపూర్ణము** సం. విశే. (గణి.) సంపూర్ణముకానిది (Partial).

**అసంపూర్ణసంధి** సం. వి. (జం.) రెండు ఎముకలు కలిసినచోట మధ్య ఒకపొ మృదులాస్థి ఉండుటచే కొంచెముగా కదల్చుటకు అవకాశము గల కీలు, ఉదా. అంసచక్రము, నితంబమేఖలము అందలి ఎముకలు (Imperfect joint).

**అసంపూర్ణస్వేదనము** సం. వి. (రసా.) మిశ్రమములో ఉన్న ద్రవపదార్థములను వాటి మసలు స్థానముల సాధా. ము చేసికొని విడదీయు పద్ధతి (Factional distillation).

**అసద్ధ** వై. వి. 1. ఉపేక్ష, శ్రద్ధలేమి. 2. తృణీకా. ము న . శ్రద్ధా.

**అసతి** సం. వి. కులట, ... లు.

**అసత్తు** సం. విశే. 1. లేనిది. 2. చెడ్డది.

**అసత్యము** సం. వి. బొంకుమాట, విశే. సత్యము కానిది.

**అసత్యఫలము** సం. వి. (వృక్ష.) నిజమైన పండుకానిది. అండాశయముగాక పువ్వులో ఉన్నమరియొక భాగము పండుగా తయారైనది (False fruit).

**అసదు** వై. విశే. 1. అల్పము. 2. సన్ననిది. 3. దీనుడు. సం. అసర.

**అసభ్యప్రవర్తన** సం ... పార్ల మెంటు సభామ ... యుద్ధప ... ప్రవర్తించుట.

**అసభ్యము.** సం. విశే. 1 ... తగని. 2 అశ్లీలము.

**అసమశరుఁడు** సం. వి. మన్మథుడు.

**అసమాకృతి** సం. వి. (వృక్ష.) పుష్పములో నున్న రక్షక పత్రములలోగాని పత్రములలోగాని ఆకారములోనైనను పరిమాణములోనైనను తేడాలు కల రూపము (Irregular form).

**అసమానత** సం. వి. (గణి.) రెండు అసమాన రాసుల మధ్య నుండు సంబంధము (Inequality).

**అసమానపక్ష** నం. విశే. (వృక్ష.) ఉపపత్రములు బేసిసంఖ్యలో గల భిన్నపత్రము (Imparipinnate).



**అసమాప్త విక్రయము** నం.వి.. అసమాన పక్ష (వాణి.) ఉత్పత్తిదారులు భిన్న ప్రాంతము తమ స్వంతబాధ్యత మీద వేర్వేరు ప్రదేశములలో తమ ప్రతినిధులద్వారా సరకులను అమ్మించు పద్ధతి. (ఈ పద్ధతిలో సరకులు గల వారికి వాటాపై స్వత్వాధికారములు లేక, వాటిని అమ్మినమేరకు ఎప్పటికప్పుడు పైకము పంపుచుండవలెను ఇట్లు అమ్మినవారికి కమీషన్ మాత్రము మిగులును).

**అసమ్మితము** నం. విశే. (వృక్ష.) అవయవానురూపత్వము (సౌష్ఠవము) లేనిది (Asymmetrical).

**అసమ్మిత స్ఫటికము** నం. వి. సౌష్ఠవము లేని స్ఫటికము(Asymmetrical crystal)

**అసమీక్ష్యకారి** నం. విశే. చక్కగా ఆలోచింపక పనిచేయువాడు.

**అసము**[1] వి. 1. అహంకారము, దర్పము. 2. ఉత్సాహము, 3. చనవు. 4. అవకాశము, వీలు.

**అసము** వై. వి. యశము, కీర్తి. నం. యశః

**అసర సంజ** వై. వి. సాయంకాలము. నం. అసురసంధ్యా.

**అసరళ పుష్పములు** నం. వి. (వృక్ష.) పుష్పదళ వలయములలో దేనియందున్న దళములైనను అన్నియు ఒకేమాదిరిగా లేని పుష్పములు (Irregular flowers).

**అసరు** వి. పసరు. విశే. 1. పసరుగలది, లేతది. 2. అల్పము.

**అసలారు** క్రి. 1. అతిశయించు. 2. ఒప్పు. రూ. ఎసలారు.

**అసలు** వి. 1. బురద. హిం. వి. (వాణి.) అప్పుగా తీసికొనిన సొమ్ము (Principal).

**అసలుబుట్టువు** వి. తామర, పంకజము.

**అసలుఖర్చు** హిం. వి. (వాణి.) ముడి వస్తువు కొరకు అయిన ఖర్చు, ధర కట్టుటలో కేవలము వస్తువుత్పత్తికి మాత్రము అయిన ఖర్చు.

**అసహాయశూరుఁడు** నం. విశే. ఒంటరిగా నిలిచి పోరు యోధుడు.

**అసహ్యము** నం. విశే. సహింపరానిది, భరింపరానిది.

**అసాదు** అవ్య. బహి. రూ హసాదు.

**అసాధారణము** నం. వి. 1. సాధారణము కానిది, అసామాన్యము. 2. (భౌతి.) సామాన్య విషయములకు వ్యతిరేకమైనది. వి. (తర్క.) హేత్వాభాసములలో ఒకటి.

**అసాధ్యము** నం. విశే. 1. సాధ్యము కానిది, 2. కారణములచే సమర్థింపరానిది. 3. నెరవేర్పరానిది.

**అసాధ్యపాండువు** నం. వి (గృహ.) చికిత్సకు లోబడని పాండురోగము, కుదుర్పరాని రక్తహీనత (Pernicious anaemia).

**అసామాన్యము** నం. వి. సామాన్యము కానిది (Abnormal).

**అసి**[1] విశే. అల్పము. కొంచెము.

**అసి**[2] నం. వి. కత్తి, ఖడ్గము.

**అసితము** నం. విశే. నల్లనిది. వి. నలుపు, నీలవర్ణము.

**అసితుఁడు** నం. విశే. నల్లనివాడు. వి. 1. శనైశ్చరుడు. 2. దేవలుడు అనుముని.

**అసిధార** నం. వి. కత్తివాదర.

**అసిధారావ్రతము** నం. వి. కత్తివాదరపై నడచుటవలె కఠిన నియమ వ్రతము.

**అసిధావకుఁడు** నం. వి. కత్తి సాన [illegible] వాడు. రూ. అసిధావుఁడు.

**అసిపత్రము** నం. వి. 1. చెరకు, [illegible] త్తిఒర.

**అసిపుత్రి** సం. వి. చురకత్తి, చిన్నకత్తి. రూ. అసిపుత్రిక.

**అసిమి** వి. సంచి, చిన్నగోనె.

**అసిమిగొల్లెన** వి. గోనెలతో నిర్మించిన చిన్న గుడారము.

**అసియాడు** క్రి. 1. చలించు, 2. అల్లలాడు. 3. సంచరించు.

**అసివాలు** వి. విహారము, మందగమనము.

**అసివోవు** క్రి. 1. తప్పిపోవు, కొంచెము తగిలి తప్పిపోవు. 2. క్షీణించు, నశించు

**అసుర** సం. వి. 1. రాక్షసుడు, 2. రాత్రి. 3. వేశ్య.

**అసురము** సం.వి. 1. ఏనుగు, 2. మాలకాకి.

**అసుర సంధ్య** సం. వి. రాక్షస వేళ, సాయంసంధ్య.

**అసురుసురు** వి. శ్రమమందగు ఊపిరిధ్వని అనుకరణము.

**అసువులు** సం. వి. ప్రాణములు.

**అసూయ** సం. వి. 1. గుణములందు దోషమును ఆరోపించుట, ఓర్వలేనితనము. 2. కోపము.

**అసూర్యంపశ్య** సం. విశే. ఎండకన్నెరుగనిది (అంతఃపురస్త్రీజనము).

**అసైజ్** ఇం. వి. (Assize) ఇంగ్లాండులోని జిల్లాన్యాయశాఖ

**అసౌకర్యము** సం. వి. 1. లోపము. 2. అడ్డంకి. 3. ఇబ్బంది, అనుకూలములేమి.

**అసౌష్ఠవము** సం. విశే. (భౌతి.) సౌష్ఠవములేనిది (Unsymmetrical).

**అస్కార్బిక్ అమ్లము** ఇం. వి. (గృహ.) (Ascarbic acid). వి. విటమిన్ 'సి'.

**అస్ఖలితము** సం. విశే. 1. చలింపనిది. 2. చెడనిది.

**అస్టిరాయిడ్** ఇం. వి. (భగో.) (Asteriod) గురుకుజగ్రహకక్ష్యల నడుమ కక్ష్యలలో తిరుగు లఘుగ్రహము.

**అస్తమయము** సం. వి. 1. (సూర్యాదులు) క్రుంకుట, 2. నాశము. 3. (జ్యోతి.) గ్రహములు సూర్యునితో కలిసియుండుట.

**అస్తము** సం. వి. 1. ప్రొద్దుక్రుంకు కొండ, అస్తాద్రి, 2 గ్రహములకు సూర్యునితోడి సంయోగము, 3. నాశము. 4. క్రుంకుట. విశే. 1. త్రోయబడినది. 2. నశించినది. 3. కనబడనిది.

**అస్తరు** హిం. వి. (గృహ.) గుడ్డతో చేర్చి కుట్టిన మఱియొక గుడ్డ (Lining).

**అస్తోకము** సం. విశే. అల్పముకానిది, అధికము.

**అస్త్రము** సం. వి. మంత్రపూర్వకముగ ప్రయోగింపబడు ఆయుధము. 2. విల్లు. 3. కత్తి.

**అస్వస్థత** సం. వి. అనారోగ్యము, జబ్బు.

**అస్థానికము** సం. విశే. (వృక్ష.) నిర్ణీత స్థలమున గాక వేరొకస్థలములో బయలుదేరినది (Adventitious).

**అస్థానికమూలము** సం. వి. (వృక్ష.) తల్లి వేరునుండికాక వేరొకస్థానము నుండి బయలుదేరిన వేరు.(Adventitious root).

**అస్థి** సం. వి. ఎముక 2. టెంక, గింజ.

**అస్థిఅంగారము** సం. వి. (రసా.) ఎముకల బొగ్గు, బొగ్గగునట్లు కాల్చబడిన ఎముక (Bone-black).

**అస్థికణజాలము** సం. వి. (జం.) ఎముకలకు కారణమైన కణజాలము (Bony tissue).

**అస్థికవచము** సం. వి. (జం) ఎముకకుపైన గట్టిగా, పీచుగా నుండు తొడుగువంటి పొర (Periosteum).

**అస్థికృతములు** సం. వి. (జం.) ఎముకకు సంబంధించిన జీవకణములు(Osteoblasts)

**అస్థిపంజరము** సం. వి. కంకాళము, ఎముకలగూడు.

**అస్థిభస్మము** సం. వి. (రసా.) ఎముకలు కాల్చిన బూడిద, (ఇందు కాల్సియమ్ పాస్ఫేట్ ఉండును) (Bone-ash).

**అస్థిమార్దవ రోగము** సం. వి. (గృహ.) విటమిన్ 'డి' లేక ఖటికలోపము వలన కలుగు వ్యాధి, ఎముకల బలహీనత. (సాధారణముగ ఇది చిన్నపిల్లలకు వచ్చు వ్యాధి. వంకరకాళ్ళు లేక దొడ్డికాళ్ళు తయారగును) (Rickets).

**అస్థిర తైలము** సం. వి. (వ్యవ.) గాలి పారినచో వాయురూపము నంది శీఘ్రముగ హరించిపోవు నూనెలు. (Volatile or essential oils). ఉదా. నిమ్మగడ్డి నూనె, గులాబినూనె మొ. వి.

**అస్థిరము** సం విశే. 1 నిలుకడలేనిది, అశాశ్వతము 2. నిశ్చితముకానిది.

**అస్థీయనము** సం. వి. (జం.) మృదులాస్థి ఎముకగా తయారగు విధానము (Ossification).

**అస్పృశ్యత** సం. వి. (చరి.) అంటరానితనము (హైందవ సాంఘిక వ్యవస్థలో అంతర్భాగము కానప్పటికి బహుపురాతనకాలమునుండి వచ్చుచున్న ఆచారము. ఆదిలో సంకీర్ణజాతులను, ప్రతిలోమ వివాహము వలన కలిగిన సంతతిని చండాలురుగా, అస్పృశ్యులుగా భావించుచుండిరి. కాలక్రమేణ వారి సంతతివారు అంటరానివారుగ ఏర్పడిన వ్యవస్థ. (Untouchability).

**అస్మదీయము** సం. విశే. మాది, మనది, నాది.

**అస్రము** సం. వి. 1. కన్నీరు. 2. నెత్తురు 3. మూల. 4. వెండ్రుక.

**అస్రప** సం. వి. 1. జలగ. 2 పిశాచస్త్రీ. వ్యు. నెత్తురు త్రావునది.

**అస్రపుడు** సం. వి. 1. రాక్షసుడు. వ్యు. నెత్తురుత్రాగువాడు. 2. నైరృతుడు.

**అస్రువు** సం. వి. కన్నీరు. రూ. అశ్రువు.

**అస్వతంత్ర** సం. విశే. (గణి.) మిగిలిన రాసులలో కొన్నింటిపైగాని అన్నింటిపైగాని ఆధారపడినది (Dependent).

**అస్సెట్స్** ఇం. వి. (అర్థ) (Assets) ఆస్తులు (దేశమునకుగాని సంస్థకుగాని వ్యక్తికిగాని చెందియుండునవి.)

**అహంకారము** సం. వి. (గృహ.) 1.గర్వము. 2. అంతఃకరణ చతుష్టయములో ఒకటి. 3 అష్టప్రకృతులలో ఒకటి. 4. ఆత్మాభిమానము (Egotism). 5. క్రోధము. (కడపటి అర్థము తెనుగున మాత్రమే కానవచ్చుచున్నది). రూ. అహంకృతి. అహంక్రియ.

**అహంకృతి** సం. వి. చూ. పై.

**అహంకేంద్రకత** సం. వి. తన్నుతాను పొగడుకొనుట. ఆత్మస్తుతి (Egocentralism).

**అహంభావము** సం.వి. 1. గర్వము, నేననుట. 2. (వేదాం.) అవిద్య. దేహాత్మభ్రాంతి.

**అహమహమిక** సం. వి. ఒకరితో నొకరు నేను ముందు, నేను ముందు అని రోషముతో పలుకుట. 2. యుద్ధాదులందు చూపు అహంకారము.

**అహము** సం. వి. 1.దినము, రేయుంబవలు. 2 పగలు. రూ. అహస్సు. 3 గర్వము.

**అహమ్మతి** సం. వి. అజ్ఞానము.

**అహరహము** సం. అవ్య. ప్రతిదినము.

**అహర్పతి** సం. వి. 1 సూర్యుడు. 2 శివుడు. 3. జిల్లేడు.

**అహస్కరుఁడు** సం. వి. సూర్యుడు.

**అహర్ముఖము** సం. వి. వేకువ, ప్రాతఃకాలము, ప్రభాతము.

**అహస్సు** సం. వి., చూ. అహము.

**అహహ** అవ్య. ఆశ్చర్య, అధిక్షేప, ప్రశంసాదులను తెలుపును. రూ. అహాహా

**అహార్యము** నం. వి. కొండ. విశే. హరింప శక్యముకానిది.

**అహి** నం. వి. 1. పాము. 2. రాహు గ్రహము. 3. వృత్రాసురుడు.

**అహిచ్ఛత్రము** నం. వి. అర్జునుడు జయించి ద్రోణాచార్యునకు సమర్పించిన దేశము.

**అహిచ్ఛత్ర(క)ము** నం. వి. కుక్కగొడుగు, పుట్టగొడుగు (Mushroom).

**అహితుండికుడు** నం. వి. పాములవాడు.

**అహిద్విషము** నం. వి. 1, నెమలి. 2. గ్రద్ద. 3. ముంగిస.

**అహిద్విషుడు** నం. వి. 1. గరుడుడు. 2. ఇంద్రుడు.

**అహిపతి** నం. వి. శేషుడు.

**అహిఫేనము** నం. వి. 1. నల్లమందు, అభిని 2. గరళము. 3. పామునోటి చొంగ.

**అహిభయము** నం. వి. 1. పాములవలని భయము, 2. రాజులకు స్వపక్షము వారి వలని భయము.

**అహిభుక్కు** నం. వి. 1. గరుడుడు. 2. ముంగిస. 3. నెమలి.

**అహింస** నం. వి. హింసచేయమి.

**అహితము** నం. విశే. 1. అనిష్టము. 2. విరుద్ధమైనది. 3. (వైద్య) పథ్యము కానిది. వి. చెరుపు.

**అహితుడు** నం. వి. శత్రువు, విరోధి.

**అహిర్బుధ్న్యుడు** నం. వి. 1. శివుడు. 2. ఏకాదశరుద్రులలో ఒకడు.

**అహోపురుషిక** నం. వి. గర్వముచే తన్ను గొప్పగా సంభావించుకొను వీరాలాపము రూ. అహోపురుషిక.

**అహోరాత్రము** నం. వి. రేపగలు ఎల్లప్పుడు.

**అళి** నం. వి. 1. తుమ్మెద. 2. తేలు. రూ. అలి.

**అళిందము** నం. వి. (గృహ.) 1 బహిర్ద్వార ప్రకోష్టము, పంచపాళి, తలవాకిటి ప్రక్క నుండు గృహము. 2 వాకిటికి వెలుపల నున్న నలుచదరపు చోటు.

**అళిని** నం. వి. 1. ఆడుతుమ్మెద. 2. తుమ్మెదల సముదాయము.

**అళీకము** నం. విశే. 1. అప్రియమైనది. 2. అసత్యమైనది. వి. 1. అప్రియము. 2. బొంకు, 3. నొసలు.

**అళుకు** క్రి. భయపడు, వెనుదీయు, జంకు. వి. భయము, జంకు, రూ. అలుకు.

# ఆ

అచ్చులలో రెండవది. కొన్ని పదాంతములకు సంబోధనము నందు చేరును. ఉదా. అన్నా. నర్వ. ఈక్రింది అర్థముల నిచ్చును. 1. పూర్వము నిర్ణయింపబడిన దానిని తెలుపును, ఉదా. ఏకశిలందు హరికీర్తింపబడు. ఆ కథలు. 2. వస్తునిర్దేశము, ఉదా. అదిగో! ఆకొండ. 3. ప్రసిద్ధి, ఉదా ఆద్వారక. అవ్య. 1. ఆశ్చర్యము, ఉదా. కన్నులా! తామరపూలు. 2, ప్రశంస. ఉదా. ఈనిర్మలం, కొండనెత్తెను. 3. ప్రశ్నము, ఉదా. పాఠము చదివితివా? 5 సంబోధనము ఉదా. ఈగయా గరుత్మంతుడా 6 ప్రార్థనము, ఉదా. నామాట వినరా. 6. వికల్పము, ఉదా. ఆనతిచ్చెనా, అది శిలాక్షరము. వయస్సా చిన్నది ప్రజ్ఞయా అనంతము. 7. సందేహము, ఉదా. రజతమా, శుక్తియా. నం. అవ్య. క్రింది అర్థములను బోధించును. 1. వరకు

ఉదా. ఆసముద్రము=సముద్రము వరకు. 2. 'నుండి' 'వరకు', ఉదా. ఆబాల గోపాలము=బాలుర నుండి గోపాలుర వరకు ఇట్లే ఆసేతు హిమాచలము,ఆపాద మస్తకము మొ. వి.

ఆంక్ష వై: వి. 1. సంఘబహిష్కారము చేయుట, వెలివేయుట 2. శాసించుట.

ఆంగము నం. విశ. 1. దేహమునకు సంబంధించినది. 2. అంగదేశము నందు పుట్టినది 3 వేదభాగమునకు చెందినది వి కోమలదేహము.

ఆంగారము సం వి బొగ్గులప్రోవు, అంగారముల సమూహము. . విశ అంగార సంబంధమైనది.

ఆంగికము నం. విశ. (నాట్య) అవయవములచే చేయబడునది. వి 1. అంగములచే చేయు అభినయము, కన్బొమలు కదలించుట మొ.వి. 2. స్త్రీలహావభావాదికము.

ఆంగిరసుఁడు నం. వి. 1 అంగిరుని పుత్త్రుడు, బృహస్పతి, 2. జీవాత్మ రూ ఆంగిరసుడు,

ఆంగిరస నం. వి. 1. ప్రభవాది షష్టి సంవత్సరములలో ఒకటి 2. పుష్యమీనక్షత్రము

ఆంజనము నం వి. కాటుక, విశ. అంజనమునకు సంబంధించినది.

ఆంజనేయుఁడు నం వి అంజనాదేవి పుత్త్రుడు, హనుమంతుడు

ఆంటిక్లైన్ ఇం. వి. (భూ శా.) (Anticline) ప[illegible] పై భాగము, [illegible] కనబడు భాగము.

ఆంతరపరావర్తనము నం. వి. (భౌతి.) ఒక కాంతికిరణము ఒక సాంద్రతర యానకమునుండి ఒక విరళయానకమును ప్రవేశించు సందర్భమున దాని పతనకోణము ఒకమేరకు (సందిగ్ధకోణము) దాటినతరువాత ఆకాంతికిరణము మొదటి యానకములోనికే సంపూర్ణముగ పరావర్తితమగుట (Internal reflexion).

ఆంతరము నం. విశ. 1. లోపలిది. 2. గూఢమైనది.

ఆంతర్యము నం. వి. 1. అభిప్రాయము, 2. మిక్కిలి సన్నిహిత సంబంధము, 3. అక్షరములకు స్థానప్రయత్నాదులచే కలుగు పరస్పర సాదృశ్యము, 4. గుట్టు, 5 హృదయము.

ఆంత్రము నం వి. ప్రేగు (జం.) అన్నవాహికలో సాధారణముగ కడుపు తరువాత నుండు భాగము (Intestine).

ఆంత్రముఖము నం. వి. (జం.) కడుపు నుండి ప్రేగులోనికి పోవు ద్వారము (Pylorus).

ఆంత్రములు నం వి (జం.) ప్రేవులు (Intestines)

ఆంత్రమూలము నం వి. (జం.) కడుపు నుండి చిన్న ప్రేవులలోనికి దారి చూపు మార్గము (ఇది చిన్న ప్రేవులయొక్క మొదటి భాగము) (Duodenum),

ఆంత్రవేష్టనము నం. వి. (జం.) ఉదరచ్ఛదము, వెన్నెముకగల జంతువులలో దేహకుహరమునకు అస్తరుగా నున్న పొర (Peritoneum).

ఆంత్రీయ ఉండుకము నం. వి. (జం) ఆంత్రముపైనుండు ప్రేలువంటి ప్రవర్ధము (Intestinal caeca).

ఆం[illegible] నం. విశ (జీవ.) అన్నవా[illegible]కలోనికి [illegible] ఉత్సర్గ నాళం [illegible] గలది (Enter

ఆందోళ[illegible] [illegible] వ[illegible] గుట. 2. (విం జామ[illegible]ము మొ ని.) విసరుట. 3. ఉయ్యాల. 4 (వ్యావ) కలత.

ఆందోళము నం. వి 1. పల్లకి. 2, ఉయ్యాల. రూ. ఆందోళిక, విప్ర. అందలము.

**ఆందోళించు** సం. క్రి. 1. ఊగులాడు, చంచలమగు. 2. డోలాయమానమగు, సంశయించు.

**ఆందోళిత** సం. వి. చూ. ఆందోళము.

**ఆంధ్యము** సం.వి. గ్రుడ్డితనము, అంధత్వము.

**ఆంధ్రము** సం. వి. 1. తెనుగు దేశము. 2. తెనుగుబాస. విశే. తెనుగుదేశమునకు సంబంధించినది.

**ఆంధ్రుఁడు** సం. వి. తెనుగువాడు.

**ఆంఫియర్** ఇం. వి. (భౌతి.) (Ampere) విద్యుచ్ఛక్తిని కొలుచుటలో ఉపయోగించు ప్రమాణము. (అంపియర్ అను ఫ్రెంచ్ శాస్త్రజ్ఞుని పేరు దీనికి ఉంచబడినది. ఒక ఓమ్ నిరోధమునకు ఎదురుగ 1 వోల్టు శక్తిగల విద్యుద్బలము పంపించగల విద్యుత్ప్రవాహము. 'అంప్' అనునది అంపియర్‌కు హ్రస్వ స్వరూపము.)

**ఆంపుల్ల** ఇం. వి. (జం.) (Ampulla) చిన్న పలుచనిసంచి.

**ఆంప్లెక్సస్** ఇం. వి. (జం.) (Amplexus) ఉభయచరజీవుల లింగసంబంధమగు ఆలింగనము.

**ఆంబికేయుఁడు** సం. వి. 1. ధృతరాష్ట్రుడు. 2. కుమారస్వామి, 3. వినాయకుడు.

**ఆంశిక** సం. విశే. (గణి.) ఒకదానిలోని ఒకభాగ సంబంధమైనది (Partial).

**ఆంశిక ప్రేషనియమము** సం. వి. అనేక వాయువుల సంమిశ్రణములో ప్రతి వాయువును ప్రత్యేకముగ ఆపాత్ర నాశ్రయించి యున్నపుడు ఎంత ప్రేషము చూపునో ఆప్రేషమే అది మిశ్రణములో కూడ చూపును. ప్రత్యేక వాయు ప్రేషములు ఆంశికప్రేషణములు, వాయుమిశ్రణముయొక్క మొత్తపు ప్రేషము దాని ఘటకముల ఆంశికప్రేషముల మొత్తమునకు సమానము అగు నియమము $p=p_1+p_2+p_3\cdots\cdots p=$ మిశ్రణప్రేషము petc.ఆంశిక ప్రేషములు.

**ఆంశికభిన్నములు** సం. వి. (గణి.) ఒక భిన్నములోని హారము యొక్క కారణాంకములు హారములుగా గల భిన్నములు (Partial fractions).

**ఆంశికస్ఫటికీకరణము** సం. వి. (రసా.) ద్రావణమునుండి ద్రావమును భాగముల చొప్పున స్ఫటికములుగా వేరు చేయుట (Fractional crystallisation).

**ఆంశిక స్వేదనము** సం. వి. (భౌతి.) ఒక ద్రవమును భాగముల వంతున బాష్పముగా మార్చి తిరిగి ద్రవీకరించుట (Fractional distillation). (రసా.) రెండు ద్రవ్యముల వేరుచేయుటకుగాని, లేదా అందలి ప్రధాన ద్రవ్యమును శుద్ధముగా వేరుచేయుటకుగాని భిన్నతాపక్రమాంతములలో జరుపు స్వేదనము (Fractinal distillation).

**ఆంహానము** సం. వి. చేతులతో చూపు అభినయము,

**అఁక** వి. 1. అడ్డు. 2. చెర. 3. కట్టుపాటు. 4. కొలియలికట్ట.

**అఁకట్టు** క్రి. 1. అడ్డగించు (అఁక+కట్టు). 2. ఆక్రమించు.

**అఁకత్రాళ్ళు** వి. కవ్వమును తగిలించుటకై తరికంబమునకు కట్టు త్రాళ్ళు.

**అఁకరము** వై. వి. 1. ఆగ్రహము. 2. మదము. సం. అహంకారః, ఆగ్రహః.

**అఁకలి** వి. తుత్తు, అన్నముతినవలెననుకోరిక.

**అఁకిడు** క్రి. (అఁక+ఇడు) అడ్డుపెట్టు.

**అఁకొను** క్రి. ఆకలిగొను.

**అఁగు** క్రి. 1. అడ్డుపడు, అరికట్టు. 2. నిలుపు. 3. ముట్టడివేయు. 4. ఆక్రమించు. 5. నిషేధించు. 6. సహించు, 7. నిలుచు. 8. ఓర్చు, 9. విరమించు. 10. అణగు,

**ఆఁచికొను** క్రి. అపహరించు, కొల్లగొను.

**ఆఁచు** క్రి. అగజేయు, ఆపు. 2 అణగించు.

**ఆఁటది** వి. ఆడుది, ఇంతి. రూ. ఆఁడది, ఆఁడుది.

**ఆఁటు** క్రి. 1. చాలు, 2. తాళు, వి. ఆడుతనము.

**ఆడంగి** వి. షండుడు. కొజ్జా. స్త్రీస్వభావము కలవాడు.

**ఆఁడది** వి., చూ. ఆఁటది, రూ. ఆడుది.

**ఆఁడపీక** వి. బాలిక (భద్రాచల ప్రాంతమున వాడుకలో ఉన్నది).

**ఆఁడారిమాట** వి. 1. చేతకాని మాట. 2. పుంస్త్వము లేనిమాట, కొజ్జావాని మాట.

**ఆఁడి** ప్రత్య. కల అను అర్థమందు వచ్చు స్త్రీబోధక ప్రత్యయము, ఉదా వగలాఁడి కులుకులాఁడి మొ.వి.

**ఆఁడు** ప్రత్య. కల అను అర్థమున వచ్చు పురుషబోధక ప్రత్యయము. ఉదా. వగలాడు మొ.వి.

**ఆఁడుతోఁడు** వి. సోదరి. తోడబుట్టువు.

**ఆఁడుది** వి., చూ. పై.

**ఆఁడుఁబడుచు** వి. 1. కూతురు 2. మగని సోదరి. రూ. ఆఁడబడుచు.

**ఆఁడుపాప** వి. 1. కన్యక, 2. ఆడుబిడ్డ, 3. స్త్రీశిశువు.

**ఆఁదోఁక** వి. (ఆవు+తోక) ఆవుతోకవలె మొదట లావుగనుండి క్రమక్రమముగ సన్నమగు రూపము.

**ఆఁదోఁకపాటు** వి. ఆవుతోకవలె ఉండుట.

**ఆఁపు** క్రి. అడ్డగించు, అగజేయు, వి. 1. అడ్డగింత. 2. ఏర్పాటుగా నుంచుట. విణ. ప్రతిబంధకము.

**ఆఁబడ్డ** వి. (ఆవు+పడ్డ) పాలు విడిచిన ఆవుపెయ్య.

**ఆఁబసి** వి. (ఆవు+పసి) ఆవు.

**ఆఁబోతు** వి. (ఆవు+పోతు). 1. ఎద్దు. 2. అచ్చుపోసి విడిచిన ఎద్దు, బసవడు.

**ఆఁబోతురౌతు** వి. శివుడు. వ్యు. ఆబోతు నెక్కువాడు.

**ఆఁబోతుసౌరము** వి. వీణయందును కంఠమునందును బుట్టు ఒక స్వరము, సప్తస్వరములలో రెండవది, ఋషభము.

**ఆకంధము** సం. వి. (వృక్ష.) గడ్డ, దుంప, బంగాళాదుంప మొ. మొక్కల యొక్క (భూమిలోనున్న ఆహారముతో) ఉబ్బిన కాండభాగము (Stem tuber). కొన్ని మొక్కల యొక్క వేరు ఆహారముతో ఉబ్బియుండును (Root tuber). ఉదా. ముల్లంగి.

**ఆకంపించు** సం. క్రి. విశేషముగ కదలు, వణకు, అదిరిపడు.

**ఆకతాయ** వై. విణ. తుంటరి, దుష్టుడు. సం. ఆతతాయీ.

**ఆకరము** సం. వి. 1. గని. 2. సమూహము. 3. ఉత్పత్తిస్థానము. 4. స్థానము. 5. వ్యాకరణ మహాభాష్యము మొ. ప్రమాణగ్రంథము.

**ఆకరువు** వి. తామరదుద్దుచుట్టు నుండునది. రూ. అకరు, అకరు.

**ఆకర్ణనము** సం. వి. వినికి. శ్రవణము.

**ఆకర్ణించు** సం. క్రి. విను, ఆకర్ణనముచేయు.

**ఆకర్షణ** సం. వి. 1. ఆకర్షించుట. 2 (భౌతి.) ఒకదానికొకటి దగ్గరగా వచ్చుట (Attraction).

**ఆకర్షణపత్రములు** సం. వి. (వృక్ష.) పుష్పములో వివిధ వర్ణములుగల రేకులు (Petals). (ఇవి కీటకాదులను ఆకర్షించుచుండును.)

**ఆకర్షణపత్రలగ్నము** సం. విణ. (వృక్ష.) ఆకర్షణ పత్రములతో కలిసియున్న (కింజల్కములు). (ఈస్థితి సాధారణ

ముగ సంయుక్తదళములుగల పుష్పము లలో ఉండును.) (Epipetalous).

**ఆకర్షణపత్రావళి** నం. వి (వృక్ష.) పుష్ప మొక్క అక్షముపై ఉండు పుష్పదళము లలో ఇది రెండవది. ఇది రక్షకపత్రము లకు లోపల నుండు వలయము ఇది పుష్ప ములలో వివిధ వర్ణములతో నుండు పత్రసమూహము (Corolla).

**ఆకర్షము** నం. వి. 1. లాగుట. 2. పాచిక 3. జూదమాడెడు పలక. 4 జూదము 5. చక్షురాది ఇంద్రియము 6 ఒరగల్లు

**ఆకర్షించు** నం. క్రి. 1. ఆకర్షణముచేయు, తివుచు. 2. రప్పించు.

**ఆకలనము** నం. వి. 1. అవగాహనము, తెలిసికొనుట. 2. పట్టుకొనుట. 3. కట్టుట. 4. ఎన్నిక. 5. బంధనము.

**ఆకల్పకము** నం. వి. 1. చీకటి. 2. దారములోని ముడి. 3. మరపు. 4. మూర్ఛ. 5. సంతోషము. 6. వలపు.

**ఆకల్పము** నం. వి. 1. వస్త్రభూషణాది అలంకరణము. 2. కల్పనము. 3. భూషణము. నం. అవ్య. కల్పాంతము వరకు.

**ఆకసనము** నం. వి. గగుర్పాటు.

**ఆకసము** వై. వి. మిన్ను. నం. ఆకాశ.

**ఆకస్మికపరివర్తనము** నం వి. (జీవ.) ఒక ప్రాణి సాధారణలక్షణములలో హఠాత్తుగా మార్పు గలుగుట (ఈ మార్పు సంతానమునకు సంక్రమించును) (Mutation).

**ఆకస్మికము** నం.విశ. అకస్మాత్తుగాకలిగినది.

**ఆకళించు** వై. క్రి. 1. అవగాహనము చేసికొను. తెలిసికొను. 2. జ్ఞప్తికి తెచ్చుకొను.

**ఆకళింత** వై. వి. 1. అవగాహనము 2. జ్ఞప్తి. చూ. ఆకళింపు.

**ఆకళింపు** వై. వి., చూ. పై.

**ఆకాంక్ష** నం. వి. 1. కోరిక, 2. (వ్యాక.) అన్వయముకొరకు క్రియనుబట్టి కర్తృ కర్మాదులను, విశేష్యములనుబట్టి విశేషణములను రాబట్టుటకై వేయు ప్రశ్నము.

**ఆకాంక్షించు** నం క్రి. కోరు అపేక్షించు.

**ఆకాంక్షితము** నం. విశ. కోరబడినది.

**ఆకాచము** నం. వి. (జం.) దంతము యొక్క కిరీటములో క్రింది భాగముపై కప్పియుండు గట్టిపొర యొక్క పదార్థము (Enamel).

**ఆకారణ** నం. వి. పిలుపు, ఆహ్వానము. చూ. ఆకారణము

**ఆకారము** నం. వి. 1. రూపము, 2. పోలిక. 3 ఒడలు. 4. హృద్గతభావములను తెలుపుచేష్ట. 5. హృద్గతభావము. ఇంగితము.

**ఆకారవిజ్ఞానము** నం. వి. (జీవ.) ఒక ప్రాణి యొక్క ఆకారము, వివిధమగు అవయవములు, అవి చేయుపనులు అను వానిని గూర్చిన జ్ఞానము (Morphology).

**ఆకారుడు** నం. వి. శవము. పీనుగు.

**ఆకాశక** నం. విశ. (భౌతి) ఆకాశ సంబంధమైన (Aerial)

**ఆకాశగంగ** నం. వి. మిన్నేరు. 1. మందాకిని 2. పాలవెల్లి (Milkyway).

**ఆకాశదీపము** నం వి. కార్తిక మాసమున రాత్రులందు ఎత్తైనచోట పెట్టు దీపము, కార్తిక దీపము.

**ఆకాశధార** నం. వి. ఆకసమునుండి కొండ పైకిని అచటినుండి క్రిందికిని ప్రవహించు ధార.

**ఆకాశపంచాంగము** నం. వి. (వ్యావ.) పరస్పరసంబంధము లేకయుండి బుద్ధిహీనునిచే వ్రాయబడిన చరిత్రాదులు. (దీనిని మెట్టపంచాంగమని కూడ అందురు. నిరాధారపుమాట లని అర్థము).

**ఆకాశపుష్పము** నం. వి (న్యాయ.) ఆకాశమందు పువ్వు, గగనకుసుమము అనగా అసంభవవిషయము. (ఇక్లే కుందేటి కొమ్ము. గొడ్రాలి కొడుకు మొ.వి.)

**ఆకాశపురాణము** నం. వి.(వ్యావ.)1.పరస్పర సంబంధములేని ప్రసంగము. 2. అవధానములలో ఒక అంగము.

**ఆకాశబాణము** నం. వి. ఆకసమువైపు విడుచుచువ్వ. బాణసంచు, (తారాచువ్వ).

**ఆకాశము** నం. వి. 1. విన్ను, మిన్ను. 2. భూతములైదింటిలో ఒకటి. 3. అభ్రకము. 4. బ్రహ్మము 5. (గణి) సున్న. శూన్యము. 6.(భౌతి.) అంతరాళము, అవకాశము. భౌతికవస్తువులు ఆక్రమించు చోటు (Space).

**ఆకాశరామన్న** వి. (వ్యావ.) ఊరు పేరు లేని మనుష్యుడు, ఉదా. ఆకాశరామన్న అర్జీ

**ఆకాశవాణి** నం వి. 1. ఆకసమునుండి వినబడుమాట, అశరీరవాక్కు. 2. భారతీయ రేడియోసంస్థ పేరు.

**ఆకీర్ణము** నం. విణ. 1. ఒకటితో నొకటి కలిసి ఎడము లేక నిండి యున్నట్టిది. 2. అంతటను వ్యాపించినది. 3. విమ్మబడినది.

**ఆకు** వి. 1. చెట్టునందలి ఆకు. 2. తమలపాకు. 3. గ్రంథములోని పత్రము. 4. ఆజ్ఞాపత్రము. 5. జాబు. 6. చెవికమ్మ. 7. వ్రాత కుపయోగించెడి తాటియాకు. 8. బండికంటి ఆకు. 9. వరి మొ.ని నారు. 10. విస్తరాకు. 11. ఇచ్చిపుచ్చుకోలు పత్రము.

**ఆకుంచనిరోధకము** నం. విణ. (గృహ.) వస్త్రము. తడిసిన తరువాత తగ్గిపోకుండ ఉండుటకు చేయునది (Sanforize).

**ఆకుంచనము** నం. వి. 1. ముడుచుట, ముడుగుట. 2. వంచుట, వంగుట.

**ఆకుకొఱుకు** వి. ఒక జాతి చిరుతపులి.

**ఆకుచిలుక** వి. తెల్లబొట్లును పెద్దరెక్కలునుగల ఒకానొక పురుగు.

**ఆకుచెప్పులు** వి. పలుచనిఅట్టచెప్పులు.

**ఆకుజెముడు** వి. ఆకులు గల జెముడు, పత్రస్నుహి. (దీని ఆకురసము కఫమును హరించును, సుఖవిరేచని).

**ఆకుటిల్లు** వి. (ఆకు+ఇల్లు) ఆకులతో కప్పిన గుడిసె, పర్ణశాల.

**ఆకుతెగుళ్ళు** వి. (వ్యవ.) మొక్కల ఆకులకు శిలీంధ్రముల వలన సంభవించు తెగుళ్ళు (Leaf diseases). (ఇవి సామాన్యముగా 1. మచ్చతెగుళ్ళు (Leaf Spots) 2. చార తెగుళ్ళు (Rusts) 3. బూడిద తెగుళ్ళు (Mibdews) అని మూడు రకములుగా ఉండును).

**ఆకుతేలు** వి. ఆకులమీద తేలువలె ఉండు పచ్చని పురుగు.

**ఆకుతోట** వి. తమలపాకుల తోట.

**ఆకుపంగ** వి. (వృక్ష.) ఆకునకు కాండమునకుమధ్య నుండు కోణము(Axil of leaf)

**ఆకుపచ్చ** విణ. పచ్చనిది, హరితము.

**ఆకుపత్రి** వి. ఒకానొక ఓషధి. లవంగపత్రి.

**ఆకుపసరు** వి. ఆకులు నలిపి పిండిన రసము.

**ఆకుమడి** వి. ధాన్యాలు నారు పోసినమడి, నారుమడి.

**ఆకుమడుపు** వి. వీడెములవుచుట్ట.

**ఆకుముఱుగు పింజె** వి. (జంతు.) ఆకుచాటున ఉండు పింజె, ఒకరి రక్షణలోనిది.

**ఆకుమిడత** వి. పచ్చని పెద్దమిడుత.

**ఆకుమొగ్గ** వి. (వృక్ష.) ఆకునుండి బయలుదేరిన మొగ్గ,పత్రకోరకము(Foliar bud)

**ఆకురాలుచెట్లుఅడవులు** వి. (భూగో.) వెడల్పు ఆకులుగల చెట్ల అడవులు. ఇవి సమశీతమండలమున పెరుగును. ఇవి ఉత్తరార్ధగోళముననుు, దక్షిణార్ధగోళము

నను 45° మొదలుకొని 55° వరకు ఉన్నవి. శీతకాలమున కలుగు మంచు శీతలత నుండి రక్షించుకొనుటకై శీత కాలము రాకపూర్వమే చెట్టు తమ ఆకులను రాల్చివైచును. ఉదా. సుందూరము, ఓక్, ఎల్మ్ మొ. వృక్షములు ఈ జాతికి చెందినవి.

**ఆకుశాయి** వి ఇనుము మొ.ని. రాచుటకు ఉపయోగించు పనిముట్టు. పత్రపరశువు. రూ. ఆకురాయి.

**ఆకులత** సం. వి. కలతపడుట, క్షోభము, వ్యాకులత.

**ఆకులపాటు** మి. వి. వ్యాకులత్వము, కలత.

**ఆకులము** సం. విశ. 1. కలతచెందినది 2. నిండినది. 3. చిక్కుపడినది (వెంట్రుకలు మొ.వి).

**ఆకుసన్నములు** వి. ఒకజాతి వడ్లు.

**ఆకూతము** సం. వి. 1. అభిప్రాయము, ఆశయము. 2. అభిప్రాయమును తెలుపు చేష్ట. రూ. ఆకూతి.

**ఆకూతి** సం. వి., మా. పై.

**ఆకృతి** సం. వి. 1. రూపము. 2. దేహము. 3. హృద్గతభావమును తెలుపు చేష్ట, అనుభావము. 4. పోలిక. (రసా., భౌతి.) ఒక వస్తువుయొక్క ఆకారము (Shape).

**ఆకృషి** సం. వి. (జం.) భుజాస్థి యొక్క క్రిందికొన. (ఇది స్పంజి ఎముకలతో ఏర్పడినది) (Trochlea).

**ఆకృషినాడి** సం. వి. (జం.) కపాలము నుండి బయలుదేరి కనుగ్రుడ్డు యొక్క కండరమునకు బోవు నాడి (Pathetic nerve).

**ఆకె** నర్వ. ఆమె. ఆయమ.

**ఆకెరువు** వి. (వ్యవ.) ఎరువుగా ఉపయోగపడు ఆకలములు (Leaf manure).

**ఆకొత్తు** వి. అడకత్తెర, పోక కత్తిరించు కత్తె, రూ. అడకొత్తు

**ఆకోచక కండరము** సం. వి. కీలునందలి ఎముకలను ముడుచుకొనునట్లు చేయు కండరము (Flexor muscle).

**ఆక్జనోమీటర్** ఇం. వి. (వృక్ష) (Auxanometer) మొక్కల పెరుగుదలను కొలుచు యంత్రము.

**ఆక్ట్** ఇం. వి. (శాస.) (Act) చట్టము. శాసనము.

**ఆక్రందనము** సం. వి 1. బిగ్గరగా ఏడ్చుట. ఏడుపు. 2. మొఱ. 3 పిలుపు రూ. ఆక్రందము.

**ఆక్రమణము** సం. వి. 1. క్రమ్ముట. ఆక్రమించుట. 2. బలిమిచే వశపఱచు కొనుట.

**ఆక్రమిక** సం. వి. (గృహ) బలవంతముగా తీసికొనుట.

**ఆక్రాంతము** సం. విశ. ఆక్రమింపబడినది.

**ఆక్రీడము** సం. వి. 1. రాజు యొక్క క్రీడోద్యానము. 2. ఆట. విశ. విహరించునది.

**ఆక్రోశము** సం. వి. 1. తిట్టు, శాపము. 2. నింద, అపవాదము. 3. (రక్షణమునకు)బిగ్గరగా అరచుట. రూ. ఆక్రోశనము

**ఆక్రోశించు** సం. క్రి. 1. తిట్టు, శపించు. 2. నిందవేయు. 3. (రక్షణకై) బిగ్గరగా పిలుచు. 4. చాటించు. 5. (భయాదులచే) అరచు.

**ఆక్విడక్ట్** ఇం. వి. (Aqueduct). 1. నాళి. 2. కాలువ. 3. పొర్లుమదుము. 4. జలపుకాలి, రసపుకాలి.

**ఆక్వియస్‌హ్యూమర్** ఇం. వి. (Aqueous humour) కంటిగ్రుడ్డులో ముందు భాగమున గల స్వచ్ఛమైన ద్రవము. జలాకార రసము.

**ఆ-క్షా-ప్రమాణము** సం. వి. (వ్యవ.) నేల యందలి ఆమ్లత్వ, క్షారత్వ ప్రమాణము. (ఇది ద్రావణములలోని ఉదజని అయనుల సాంద్రత (Hydrogen ion concentration) లేక హెచ్చుతగ్గులపై ఆధారపడి యుండును).

**ఆక్షేత్రము** సం. వి. దివ్యక్షేత్రము, పుణ్య క్షేత్రము.

**ఆక్షేపకుఁడు** సం. విశే. 1. ఆక్షేపించువాడు. 2. బోయవాడు.

**ఆక్షేపణము** సం. వి. 1. త్రోసివేయుట. 2. లాగుట. 3. అదలుపు. 4. అపవాదము. 5. అపహరించుట. 6 దోషములు ఎంచుట. 7. ఎణకురోగము.

**ఆక్షేపము** సం. వి., చూ. ఆక్షేపణము. 1. (అలం.) ఒక అర్థాలంకారము. 2. అడ్డము. 3. విరోధము.

**ఆక్సిస్ రాజ్యములు** మి. వి. అక్షరాజ్యములు, రెండవ ప్రపంచ యుద్ధములో ఇటలీ, జర్మని జపానుల కూటమి పేరు. (వీరు రోమ్, బెర్లిన్, టోక్యో అక్షము నుండి యుద్ధము నడిపించుటచే ఈ పేరు వచ్చినది).

**ఆక్సిఆమ్లము** మి. వి. (రసా.) ఆమ్లజని (ఆక్సిజన్) ఘటకముగా గల ఆమ్లము. *ఉదా.* సల్ఫ్యూరికామ్లము, క్లోరికామ్లము (Oxy-acid).

**ఆక్సీకరణజ్వాల** మి. వి. బున్సెన్ జ్వాలలో శిఖరమున ఉండు మొన, లేదా ప్రక్కన గాలి సంపర్కణము నొందు జ్వాలా భాగము.

**ఆక్సీకరించుట** మి. వి. (రసా.) ఒక యౌగికమునుండి ఉదజనిని తీసివేయుట, లేక దానికిఆక్సిజనిని చేర్చుట, ఆమ్లజనీకరణము (Oxidation).

**ఆక్సీకారకము** మి. వి. (రసా.) ఆక్సీకరించుటకు ఉపయుక్తమైన రసాయనిక ద్రవ్యము (Oxidising agent).

**ఆక్సిహీమోగ్లోబిన్** ఇం. వి. (జం.) (Oxi-haemoglobin) హీమో గ్లోబిన్ ప్రాణ వాయువుతో కలిసి ఏర్పడిన సమ్మిశ్రిత ద్రవ్యము.

**ఆక్సైడ్** ఇం. వి. (రసా.) (Oxide) ఒక మూలకముతోగాని,సంయోగముతోగాని ఆక్సిజన్ కలిసినప్పుడు ఏర్పడు సమ్మేళనము.

**ఆఖండలుఁడు** సం. వి. ఇంద్రుడు, వేలుపు రేడు. వ్యు. పర్వతములను భేదించువాడు.

**ఆఖనికము** సం. వి. 1. పంది. 2. ఎలుక. 3. గుద్దలి. 4 గడ్డపార.

**ఆఖనికుఁడు** సం. వి. 1. కన్నపుదొంగ. 2. ఉప్పరి.

**ఆఖరు** హిం. విశే. చివర.

**ఆఖుభుక్కు** సం. వి. పిల్లి. వ్యు. ఎలుకలను తినునది.

**ఆఖువాహనుఁడు** సం. వి. వినాయకుడు. వ్యు. ఎలుక వాహనముగా గలవాడు.

**ఆఖువు** సం. వి. ఎలుక, పందికొక్కు.

**ఆఖేటకుఁడు** సం. వి. వేటకాడు.

**ఆఖేటము** సం. వి. వేట, మృగయ.

**ఆఖ్య** సం. వి. సంజ్ఞ, పేరు.

**ఆఖ్యాత** సం. విశే. చెప్పెడివాడు.

**ఆఖ్యాతము** సం. విశే. చెప్పబడినది.

**ఆఖ్యానము** సం. వి. 1. చెప్పుట. 2. పూర్వవృత్త కథనము. 3. ప్రత్యుత్తరము. 4. కథ.

**ఆఖ్యాయకుఁడు** సం. వి. 1. ఒక విషయమును వివరించి చెప్పువాడు, కథకుడు. 2. దూత.

**ఆఖ్యాయిక** సం. వి. వాస్తవముగా జరిగిన కథను చెప్పెడి గద్యగ్రంథము. *ఉదా.* బాణుని హర్షచరితము.

**ఆగంతుక కోరకము** సం. వి. (వృక్ష.) ఆకస్మికముగ బయలుదేరిన మొగ్గ (Adventitious bud).

**ఆగంతుకనిధి** సం. వి. (అర్థ) నిర్ణీతమైన కొన్ని ఖర్చులకు వేరుగా నుంచిన లాభాంశము.

**ఆగంతుకము** సం. విశే. 1. కాలనియమము లేకవచ్చునది, ఆకస్మికముగా వచ్చునది. 2. ప్రక్షిప్తమైన గ్రంథభాగము.

**ఆగంతుకుఁడు** సం. వి. అతిథి, విందు.

**ఆగంతువు** సం. విశే. అకస్మాత్తుగ వచ్చునది, ఆకస్మికముగ సంభవించునది. వి. అతిథి, విందు.

**ఆగడకాఁడు** వి. (ఆగడము+కాడు) అకార్యములఁ జేయువాడు, దుండగీడు, దుష్టుడు.

**ఆగడపలు** వి. 1. మెట్లవలె ఏర్పడిన మబ్బు తునుకల వరుసలు. 2. మేఘపంక్తి.

**ఆగడము** వై. వి. 1. చెడ్డపని. 2. దుష్కార్యచిహ్నము. 3. దౌష్ట్యము. 4. వంచన. 5. అనాదరము. 6. అన్యాయము. 7. ఉత్పాతము. విశే. 1. వంచకుడు. 2. అపరాధి. సం. ఆగస్.

**ఆగడీఁడు** వి. అకార్యము చేయువాడు, దుండగీడు, దుష్టుడు.

**ఆగతము** సం. విశే. 1. వచ్చినది. 2. జరిగినది 3. పొందబడినది. వి. 1. ఆగమనము, రాక. 2. ప్రాప్తి.

**ఆగమనము** సం. వి. 1. రాక, వచ్చుట. 2. ప్రాప్తి.

**ఆగమము** సం. వి. 1. వచ్చుట, రాక. 2. ప్రాప్తి. 3. రాబడి. 4. శాస్త్రము. 5. వేదము. 6. (వ్యాక.) అధికముగా వచ్చెడి వర్ణము. 7. జనప్రవాదము.

**ఆగము** సం. వి. తప్పు, నేరము, పాపము.

**ఆగాత్యము** వి. కొంచెమును గొప్పగా చేసి కావించెడి అరవు. ఏడ్పు మొ.వి. దూ. ఆగాయిత్యము. ఓగాత్యము.

**ఆగామి** సం. విశే. 1. వచ్చునది. రానున్నది. 2. ప్రాప్తించునది. ప్రాప్తింప నున్నది. (ఆగామి సంచితార్థములు అనుభవింప వలసినవే అని పెద్ద లందురు.)

**ఆగుబ్బతిలు** క్రి. అతిశయించు.ఆగుబ్బుకొను

**ఆగుబ్బు** వి. అతిశయము. ఆధిక్యము. విశే. 1. అధికము. 2. అసంఖ్యాకము.

**ఆగ్నీధ్రుఁడు** సం. వి. అగ్నీధ్రము(యజ్ఞవేదికలో నుత్తర భాగము) నందుండు ఒకానొక ఋత్విజుడు. యాజకులలో ఒకడు.

**ఆగ్నేయ ఆసియా సమిష్టి రక్షణ సంధి** సం. వి. (వరి.,రాజ.) (SEATO ఒప్పందము)ఈ ఒప్పందము క్రీ.శ. 8 సెప్టంబర్ 1954లో మణిలాలో ఆస్ట్రేలియా, ఫ్రాన్స్. బ్రిటన్, న్యూజిలాండ్, పాకిస్థాన్, అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రదేశ ప్రతినిధులచే అంగీకరింపబడినది. దీని ముఖ్యోద్దేశము ఆగ్నేయ ఆసియాలో కమ్యూనిస్ట్. ముఖ్యముగ కమ్యూనిస్ట్ చైనా దురాక్రమణలను అరికట్టుట ఆగ్నేయఆసియా సంధి కూటమియొక్క ముఖ్య కేంద్రము థైలాండ్‌లోని బాంగ్‌కాక్ నగరమున కలదు.

**ఆగ్నేయము** సం. విశే. అగ్నికి సంబంధించినది. వి. 1. అగ్నిపర్వతము. 2. వివాహములో అరుంధతి దర్శనానంతరము యజుర్వేదులు చేయు ఒక శుభకర్మ. 3. కృత్తికా నక్షత్రము. 4. ఆగ్నేయాస్త్రము.

**ఆగ్నేయ వ్యాపార పవనములు** సం. వి. (భూగో.) భూమధ్యరేఖకును మకరరేఖకును మధ్య వీచు పవనములు (South-east monsoon).

**ఆగ్నేయాస్త్రము** సం. వి. అగ్ని దేవతాకమైన అస్త్రము.

**ఆగ్రహము** సం. వి. 1. కోపము, రోషము. 2. అనుగ్రహము, 3. ఆక్రమణము. 4. ఆసక్తి.

**ఆఘాటము** సం. వి. హద్దు, ఎల్ల.

**ఆఘాతము** సం. వి. 1. కొట్టుట. 2. దెబ్బ 3. చంపుట, 4. చంపుచోటు. 5. గాయము. 6. దుఃఖము. 7. మూత్రము అడ్డుపడుట, మూత్రాఘాతము.

**ఆఘాతించు** సం. క్రి. చంపు.

**ఆఘూర్ణనము** సం. వి. 1. తిరుగుడు. 2. కదలిక,

**ఆఘోషించు** సం. క్రి. 1. అరచు. 2. మ్రోయు. 3. చాటు.

**ఆఘ్రాణము** సం. వి. 1. వాసన చూచుట, తృప్తి.

**ఆచంద్రతారార్కము** సం. అవ్య. చంద్రుడు నక్షత్రములు సూర్యుడు ఉండు నంత వరకు, శాశ్వతముగా, ఎల్లప్పుడును.

**ఆచమనము** సం., వి. 1. పుడిసిట పట్టిన నీటిని కేశవాదినామము లుచ్చరించుచు లోనికి పుచ్చుకొనుట, ఉపస్పర్శము. 2. ఆచమించుటకైన జలము.

**ఆచరణము** సం. వి. 1, చేయుట, అనుష్ఠానము, 2. ప్రవర్తనము. 3. ఆచారము.

**ఆచరణీయము** సం. విశే. ఆచరింపదగినది, అనుష్ఠింపదగినది, నడవదగినది.

**ఆచారము** సం. వి. 1. అనుష్ఠానము. 2. సంప్రదాయము, పరంపరగా వచ్చు వాడుక. 3. ప్రవర్తనము.

**ఆచారియవాదులు** వై. వి. (చరి.) గౌతమ బుద్ధుని మరణానంతరము ఒక శతాబ్దము తరువాత బౌద్ధభిక్షువులు వైశాలీనగరములో సమావేశమై సంఘనియమము లలో కొన్ని మార్పులు చేసిరి. ఆ సవరణలను ఆమోదించినవారిని ఆచారియవాదు లందురు.

**ఆచార్య** సం. వి. 1. వేదార్థమును వ్యాఖ్యానించెడి స్త్రీ. 2. ధర్మోపదేశికురాలు.

**ఆచార్యకము** సం.వి. 1. ఉపాధ్యాయత్వము. 2. ఉపదేశము.

**ఆచార్యాని** సం. వి. ఆచార్యుని భార్య.

**ఆచార్యుఁడు** సం. వి. 1. వేదవ్యాఖ్యానము చేయువాడు. 2. వేదాధ్యయనము చేయించువాడు. 3. మతస్థాపకుడు. 4. యజ్ఞాదులందు కర్మోపదేశికుడు. 5. ఉపాధ్యాయుడు, గురువు, 6. ఏదైన ఒక విషయమున నిశిత పాండిత్యము గలవాడు. 7. ద్రోణుడు.

**ఆచ్ఛద** సం. విశే. (జం.) శరీరముయొక్క పై ఆవరణ (ఛిత్తిక)కు సంబంధించినది (Integumentary).

**ఆచ్ఛాదనకాచము** సం. వి. (రసా.) పాత్ర లపై మూతగా ఉపయోగపడెడు గాజు మూత.

**ఆచ్ఛాదనము** సం. వి. 1. కప్పుట. 2. వస్త్రము.

**ఆచ్ఛికము** సం. వి. (వ్యాక.) అచ్చతెనుగు. తత్సమ వ్యతిరిక్తమైనది. (ఆచ్ఛిక సమాసము=అచ్చతెనుగు మాటల సమాసము)

**ఆచూకీ** వి. పోలిక, జాడ, రూ. ఆచోకి.

**ఆజకము** సం. వి. మేకలమంద, మేక.

**ఆజగవము** సం. వి. శివునివిల్లు రూ., అజగవము.

**ఆజవంజవము** సం. వి. సంసారము. కుటుంబము.

**ఆజానుబాహువు** సం. వి. మోకాళ్ళవరకు వ్రేలాడు నిడుదచేతులు కలవాడు.

**ఆజానేయము** సం. వి. మేలుజాతి గుఱ్ఱము. తృ. ఆజాన్ దేశమున పుట్టినది.

**ఆజి** నం. వి. 1. యుద్ధము 2. యుద్ధభూమి. 3. క్షణకాలము, 4. మేర, 5. మార్గము.

**ఆజైట్** ఇం. వి. (భూగ.) (Augite) ఒక పెరాక్సెన్ ఖనిజము.

**ఆజ్ఞ** నం. వి. 1. ఉత్తరువు. ఆదేశము. 2. దండనము. 3. (యోగ.) కనుబొమల నడుమ నుండెడి చక్రము. వికృ. ఆన.

**ఆజ్ఞప్తి** నం. వి. ఉత్తరువు, ఆజ్ఞ. వికృ. ఆనతి.

**ఆజ్ఞాపించు** నం. క్రి. ఉత్తరువుచేయు, ఆనతిచ్చు, నియోగించు.

**ఆజ్యము** నం. వి. 1. నేయి, 2. దేవదారు బంక. 3. కర్పూరతైలము.

**ఆట** వి. (ఆడు+ట) 1. క్రీడ. 2. నృత్యము. 3. విహారము ఉదా. ఆటతోట. 4. స్నానముచేయుట. 5. చెరకు, నువ్వులు మొ.ని. గానుగతో వేసి త్రిప్పుట. 6. పలుకుట. 7. నింద. 8. పరిహాసము.

**ఆటంకము** వి. అడ్డంకి, నిరోధము.

**ఆటకత్తియ** వి. ఆటయాడునది. నటి, నర్తకి, రూ. ఆటకత్తె.

**ఆటకత్తె** వి.. చూ. పై.

**ఆటకాఁడు** వి. ఆటయాడువాడు, నటుడు. నర్తకుడు.

**ఆటగిలక** వి. (గృహ.) గలగల శబ్దము చేయు చిన్న ఆటవస్తువు (Rattle).

**ఆటగొట్టు** వి. మూడు కట్టులుగల గొట్టు.

**ఆటదిగ్గయి** వి. స్త్రీలు ఈదులాడు నడబావి. క్రీడార్థమైన దిగుడుబావి.

**ఆటతిప్ప** వి. క్రీడార్థ మేర్పరచిన కొండ, కృతకాద్రి.

**ఆటతోఁట** వి. విహారార్థ మేర్పరచిన తోట, ఉద్యానము, ప్రమదవనము.

**ఆటపాక** వి. నాటకశాల.

**ఆటలమ్మ** వి. (గృహ. వి.) తట్టు, చిన్నమ్మవారు అను ఒక అంటువ్యాధి (Chicken-pox, measles). (ఇది ఎక్కువగ చిన్న పిల్లలకు వచ్చు అంటువ్యాధి).

**ఆటవస్తువులు** వి. (గృహ.) బొమ్మలు (Toys).

**ఆటవికుఁడు** నం. వి. అడవులలో నివసించు అనాగరక మానవుడు.

**ఆటవిడుపు** వి. ఆడుకొనుటకై విద్యార్థులను విడుచుట, విశ్రాంతికై విద్యార్థులకు సెలవిచ్చుట, బడి సెలవు.

**ఆటవెలఁది** వి నర్తకి, [illegible]. 2. పద్య భేదము.

**ఆటి** నం. వి. 1. జాతి [illegible]. 2. ఆడేలు పిట్ట. 3. ఒకరకపు చేప.

**ఆటు** వి 1 అడుపు. దెబ్బ. 2. తగ్గుట.

**ఆటునైట్** ఇం. వి. (భూగో.) (Autunite). యురేనియమ్, కాల్షియమ్ సల్ఫేట్ కలిగిన ఒక ఖనిజము.

**ఆటుపోటు** వి. 1. సముద్రతరంగములు ముందుకు వచ్చుటకు పోటనియు, వెనుకకు పోవుటకు ఆటనియు అందురు. (దుఃఖము తెరలు తెరలుగా వచ్చుటకును దీనిని వాడుదురు). 2. బాధ. 3. దుఃఖము.

**ఆటోపము** నం. వి. 1. వేగిరపాటు. 2. గర్వము. 3. వ్యాపించుట.

**ఆడ** వి. (ఆ+డ) అక్కడ, ఆచోట.

**ఆడంబరము** నం. వి. 1. యుద్ధ సంరంభము. 2. యుద్ధవాద్యధ్వని. 3. సంతోషము. 4. ఉరుము. 5, ఏనుగుల ఘీంకారము. 6. కనురెప్ప పెంద్రుక.

**ఆడి** నం. వి., చూ. ఆటి.

**ఆడిక** వి. 1. నింద. దూరు. 2. ప్రతిజ్ఞ.

**ఆడికోలు** వి. నింద. దూరు.

**ఆడిట్** ఇం. వి. (అర్థ., శాస.) (Audit) ఒక సంస్థ యొక్కగాని ప్రభుత్వము యొక్కగాని పద్దులను, ఆయవ్యయము లను పరిశోధించుట. (ఇట్టి పరిశోధన

కంపెనీలకు కార్పరేషన్లకు మిక్కిలి అవసరము). అధీక్షణము.

**ఆడిటర్** ఇం: వి. (అర్థ., శాస.) (Auditor) ఒక సంస్థయొక్కగాని ప్రభుత్వముయొక్కగాని ఆయవ్యయ సంబంధమైన పద్దులు పరిశోధించువాడు, అధీక్షకుడు.

**ఆడితప్పు** క్రి ముందుగా చెప్పినదానిని మార్చిచెప్పు, మాట నిలుపుకొనలేకపోవు, చెప్పినట్లు జరుపక పోవు. మాట తప్పు.

**ఆడిపోసికొను** క్రి. నిందించు, దూరు.

**ఆడు** క్రి. 1. చలించు. 2. విహరించు 3. స్నానముచేయు, 4. క్రీడించు 5 నాట్యమాడు. 6. వచించు, చెప్పు. 7. నిందించు, 8. చేయు. ఉదా. జలకమాడు. 9. గ్రుచ్చుకొను. ఉదా. మహాభల్లము ఉరస్థలమున ఆడగన్. 10. యంత్రమున నలగునట్లు చేయు.

**ఆడుకొను** క్రి. 1. నిందించు, 2. పలుకు. 3. క్రీడించు.

**ఆడువరి** వి కోటచుట్టును వేయు మట్టిదిబ్బ, వప్రము రూ. ఆళువరి.

**ఆడెలు** వై. వి. ఆడి, ఒకజాతిపక్షి. రూ. ఆడేలు.

**ఆడేలు** వై. వి., చూ. పై.

**ఆఢకము** సం. వి. నాలుగు కుంచముల ధాన్యపరిమాణము, తూము.

**ఆఢ్యుడు** సం.వి. ధనికుడు, సమృద్ధికలవాడు.

**ఆణి**[1] సం.వి. 1. ఇరుసు తుదిచీల, 2. చాయమేకు 3. అంచు. 4. ఎల్ల. 5. మోకాలిమీద నున్న మూడంగుళముల దూరము (ఒక మర్మస్థానము).

**ఆణి**[2] వి. ఒకజాతి ముత్తెము. 2. ముత్తెపు గుండ్రదనము. విశే. మేలైనది.

**ఆణికాఁడు** వి. మర్మ మెరింగినవాడు, గుట్టు తెలిసినవాడు.

**ఆణిపూస** వి. ముత్తెము, గుండ్రని ముత్తెము.

**ఆణిపోటు** వి. జీవస్థానమునందుపొడిచినపోటు

**ఆణియ** వి. పైత్యము వలన శరీరమున బుట్టెడు దద్దురులు, దద్రురోగము. రూ. ఆణె.

**ఆణియము** వి. దేశము, రూ. ఆణెము.

**ఆణె** వి , చూ. ఆణియ.

**ఆణెము** వి., చూ. ఆణియము. మాగాణి.

**ఆతంకము** సం. వి. 1. భయము. 2. సంతాపము, బాధ. 3. రోగము. 4. సందేహము. 5. ఆరాటము. 6. పాలు తోడుపెట్టుట.

**ఆతంచనము** సం వి. చేమిరిపెట్టుట, పాలలో మజ్జిగ కలుపుట. (రసా.) పాల విరుగువలె దగ్గరపడుట (Wagulation). (జం.) (రక్తము) గడ్డకట్టుట (Coagulation).

**ఆతఁడు** సర్వ. వాడు. రూ. అతఁడు.

**ఆతతము** సం విశే. 1 విరివియైనది. 2. ఎక్కించబడినది.

**ఆతతాయి** సం. విశే. 1. దుర్మార్గుడు. 2. హింసాస్వభావము కలవాడు.

**ఆతతి** సం.వి. (భౌతి.) 1. బిగువు (Tension). 2. సాగదీసిన స్థితి. 3. వాయువుల యొక్కగాని బాష్పముల యొక్కగాని ప్రేషము. 4 విద్యుచ్చాలకబలము (రసా., భౌతి.) 1. బిగి. 2. బిగిసినస్థితి, భౌతిక శాస్త్రదృష్టిలో ఇదియొక బలరూపము.

**ఆతపత్రము** సం. వి. గొడుగు. వ్యు. ఆతపము (ఎండ) నుండి రక్షించునది.

**ఆతపము** సం. వి. 1. ఎండ. 2. వెలుతురు.

**ఆతపస్నానము** సం. వి. (గృహ) ఎండ శరీరమునకు తగులుటకై ఎండలో కూర్చుండుట లేక పరుండుట (Sunbath).

**ఆతల** వి. ఆవలిప్రదేశము. ఆవలికాలము. రూ. అవతల.

**ఆతానికబలము** సం. వి. (భౌతి.) ఒక వస్తువును విరుద్ధదిశల లాగుటకు ఉపయోగించు బలము (Stretching force).

**అదట**[1] వి. 1. ప్రేమ. 2. అపేక్ష. 3. దయ. 4. తృప్తి.

**అదట**[2] అవ్య. అనంతరము, పిమ్మట.

**అదటువోవు** క్రి. తృప్తిచెందు, తనియు.

**ఆదరణము** నం. వి. 1. సన్మానించుట, మన్నించుట. 2. లక్ష్యముచేయుట, పాటించుట.

**ఆదరణీయము** నం. విణ. సన్మానింపదగినది. ఆదరింపదగినది.

**ఆదరబాదర** విణ. మిక్కిలి తొందరగా, అతివేగముగా,

**ఆదర్శగజన్యాయము** నం. న్యా. పెద్ద ఏనుగు చిన్న అద్దములో కన్పించుట అను న్యాయము.

**ఆదర్శము** నం. వి. పరమోత్కృష్టస్థితి, మేలుబంతి. 2. అద్దము. విణ. అనుకరింపదగినది.

**ఆదానము** నం. వి. 1. పుచ్చుకొనుట. 2. రోగకారణము. 3. గుఱ్ఱము యొక్క అలంకారము.

**ఆదానశంకువు** నం. వి. (జం.) అండము పైనుండు అండపీఠ పొరకు కల శంకువు వంటి ఉబ్బెత్తునిర్మాణము. (శుక్రకోశము దీనిగుండా అండములోనికి ప్రవేశించును) (**Reception cone**).

**ఆదాయపుపన్ను** వి. (అర్థ.) వ్యక్తి యొక్క ఆదాయమునుబట్టి ప్రభుత్వమునకు చెల్లింపవలసిన పన్ను, రాబడిపై పన్ను, (ఇది వ్యక్తులు, వ్యాపార సంస్థలు చెల్లింపవలసి యున్నది. ఇది సాంవత్సరికాదాయముపై విధింపబడును. దీనిని మన దేశములో, కేంద్రప్రభుత్వము వసూలు చేయుచున్నది.( **Income-tax**).

**ఆదాయము**[1] నం. వి. 1. గ్రహించుట. 2. లాభము, లబ్ధద్రవ్యము, రాబడి.

**ఆదాయము**[2] నం. వి. (అర్థ.) ఆస్తి వలన గాని, కృషివలనగాని మానవుడు ఆర్జించు సంపాదన.

**ఆదాయ వ్యయపట్టిక** నం. వి. (గృహ.) మరు సంవత్సరపు ఆదాయవ్యయములను సూచించు జ్ఞాపనపత్రము, రాబడిఖర్చుల నియమిత పట్టీ (**Budget**).

**ఆది**[1] నం. వి. (గృహ.) 1. నగలుచేయుటకు, దుస్తులు కుట్టుటకు ఇచ్చు కొలత (**Measurements**); ఆ కొలతను దెల్పెడి వస్తువు. 2. మొదలు. 3. మూలము. 4. ప్రమాణము. నం. విణ. 1. మొదటిది. 2. మొదలుగాగల. 3. సదృశము.

**ఆది**[2] వి. గురి.

**ఆదికొను** క్రి. 1. కన్నువేయు. 2. ఎదుర్కొను.

**ఆదితాళము** నం. వి. ఎనిమిది అక్షరముల కాలము, 101 తాళములలో ఒకటి.

**ఆదిత్యవారము** నం. వి. వారములో మొదటిరోజు, ఆదివారము, భానువారము

**ఆదిత్యుడు** నం. వి. 1. సూర్యుడు. వేలుపు. 3. సూర్యమండలాంతర్గత విష్ణువు.

**ఆదిదారువు** నం. వి. (వృక్ష.) దారువులో ప్రప్రథమమున ఏర్పడిన చిన్న జీవకణములు (**Protoxylem**).

**ఆదిబిందువు** నం. వి. (గణి.) మూలబిందువు (**Origin**).

**ఆదిభిక్షువు** నం. వి. శివుడు.

**ఆదిమవాసులు** నం. వి. కొండలందు, అడవులందు ఉండు అనాగరకులు (**Aborigins**).

**ఆదియోనివృంతము** నం. వి. స్త్రీరేణుకోశములుండుశాఖ, (**Archegoniophore**).

**ఆదిలవములు** నం. వి. (వృక్ష.) జీవకణకోశరసములో ఉండు ప్రత్యేక జీవరసపదార్థములు(**Plastids**) (ఇవి గుండ్రము

గను బిళ్ళలవలెను ఉండును ఇవి హారిత కణములు(Chloroplasts),వర్ణకణములు (Chromoplasts), నిర్వర్ణకములు (Leucoplasts) అని మూడు రకములుగా నుండును.)

**ఆదిశక్తి** సం. వి. పరమేశ్వరుని మాయాశక్తి. 2. దుర్గ. 3. లక్ష్మి. 4. సరస్వతి

**ఆదిశేషుఁడు** సం. వి. సర్పరాజు.

**ఆదుకొను** క్రి. 1. ఆధారమగు. ప్రాపగు. 2. రక్షించు, ఆదరించు.

**ఆదృతము** సం. విశే. ఆదరింపబడినది.

**ఆదేయము** సం. విశే. గ్రహింపదగినది. పుచ్చుకొనదగినది.

**ఆదేశము** సం. వి. 1. ఆజ్ఞ. 2 ఉపదేశము 3. (వ్యాక.) ఒకదాని స్థానమున వచ్చు వేరొక వర్ణాదికము ఉదా. గసడదవాదేశము.

**ఆదేష్ట** సం. విశే. ఆజ్ఞాపించువాడు. వి. ఋత్విజులను నియమించువాడు, యజమానుడు.

**ఆదోకమొన** వి. (వృక్ష.) ఆవుతోకవలె సన్నముగా పొడవుగా నుండు ఆకు యొక్క మొన.

**ఆద్యంతము** సం. విశే. మొదటి నుండి చివరివరకు.

**ఆద్యము** సం. విశే. 1. మొదటిది. 2. తినదగినది. భక్ష్యము.

**ఆద్యస్తరము** సం. వి. (జం.) భ్రూణములో ఉన్న మూలాధారమగు జీవకణపు పొరలలో (బహిశ్చర్మము, మధ్యస్తరము, అంతశ్చర్మము) ఒకటి. (దీనినుండి ప్రౌఢ జంతు శరీరములో, జీవకణజాలములు. అవయవములు ఏర్పడును)(Germlayer).

**ఆద్యాంత్రము** సం. వి. (జం.) జంతు పిండములో మొట్టమొదట ఏర్పడు జీర్ణకోశ కుహరము (Archenteron)

**ఆద్యాంత్రముఖము** సం. వి. (జం.) సూ్యతి భ్రూణములోని అంత్రము నుండి తెరచుకొను రంధ్రము (Blastopore)

**ఆద్యుఁడు** సం. విశే. మొదటివాడు.

**ఆధానము** సం. వి 1. (సంస్కారపూర్వకముగా అగ్నిని) స్థాపించుట. ఉదా. అగ్న్యాధానము. 2. కలిగించుట. ఉదా. కౌతుకాధానము, గర్భాధానము. 3. ఉంచుట. ఉదా. సమిదాధానము 4. తాకట్టు పెట్టుట.

**ఆధారకణజాలము** సం. వి. (జం.) శరీరములో ఒక భాగమును మరియొక భాగముతోచేర్చి కలిపియుంచు జీవకణజాలము (Connective tissue).

**ఆధారకము** సం. వి. (జం.) వేరొక నిర్మాణమునకు ఆధారముగ నుండు జీవకణజాలము (Matrix).

**ఆధారకమూలములు** సం వి. (వృక్ష.) నేలపై నుండు కాండపు కణపుల యొద్ద నుండి బయలుదేరి నేలలోనికి దిగి, కాండమునకుఊతనిచ్చువేళ్ళు(Buttress roots)

**ఆధారము** సం. వి. 1. ఆదరవు, ప్రాపు. 2. కుదురు, పాదు. 3. నాటకపాత్రము. 4. (యోగ.) మూలాధారచక్రము.

**ఆధారరాశి** సం. వి. (క్షే. గణి.) శీర్షమున కెదురుగా నుండు భుజము (Base).

**ఆధారలగ్నము** సం వి. (వృక్ష.) కింజల్కము యొక్క దండము పుప్పొడి తిత్తి క్రింది భాగమున అంటుకొని యున్న స్థితి (Innate or basefixed).

**ఆధి** సం వి. 1. మనోవ్యథ. 2. తాకట్టు. 3. ఆధారము. 4. అత్యాశ.

**ఆధిభౌతికము** సం. వి. వ్యాఘ్రసర్పాది భూతములవలన కలిగినది. (ఇది తాపత్రయములలో ఒకటి).

ఆధునికము సం. విశ. ఇప్పటిది, క్రొత్త పద్ధతికి చెందిన, నూతనమైనది(Modern)
ఆధూతము సం. విశ. మిక్కిలి కదలింపబడినది.
ఆధేయము సం. విశ. 1. ఉంచదగినది. ఆధారముమీద ఉండునది. (ఘటము ఆధారము. అందలిజలము ఆధేయము) 2. కల్పింపదగినది. 3. తాకట్టుపెట్టదగినది.
ఆధోరణుఁడు సం. వి. మావటివాడు
ఆధ్మానసనాళము సం. వి. (రసా.) బున్సెన్ జ్వాల పైకిగా ప్రవాహమును పంపుటకు ఉపయోగపడు ఊదుగొట్టము (Blow-pipe).
ఆధ్యాత్మికము సం. విశ. 1. మనశ్శరీరాదులవలన కలిగినది. (శోక జ్వరాది దుఃఖము.ఇదితాపత్రయములలో ఒకటి). 2. ఆత్మకు సంబంధించినది. ఉదా. ఆధ్యాత్మిక విద్య.
ఆన వై. వి. ఉత్తరువు. సం. ఆజ్ఞా.
ఆనంతర్యార్థకము సం. వి. (వ్యాక.) ఒక క్రియ. ఉదా. వందుడున్.
ఆనంద సం. వి. ప్రభవాది సంవత్సరములలో నలువదియవ సంవత్సరము.
ఆనందనము సం. వి. బంధు మిత్రాదులను కుశలప్రశ్న ఆలింగనాదులచే సంతోషపెట్టుట.
ఆనందని సం. వి. బ్రహ్మపట్టణము.
ఆనందము సం. వి. సంతోషము. సుఖము.
ఆనకట్ట వి. (ఆను+కట్ట) ఏటి అడ్డుకట్ట. కాల్వలద్వారా నీటిని సరఫరాచేయుటకు ఏటిలోని సహజప్రవాహమును అరికట్టుటకు నిర్మించిన అడ్డంకి.
ఆనకదుందుభి సం. వి. 1. శ్రీకృష్ణుని తండ్రి వసుదేవుడు (భగవంతునికి తండ్రి కాబోవుచున్నాడని యీతని జన్మకాలమున దేవతలుఆనకదుందుభులుమ్రోగించినందువల్ల ఈ పేరువచ్చెను). 2. పెద్ద ఢక్క.
ఆనతము సం. విశ. వంగినది.
ఆనతి[1] సం.వి. 1. మ్రొక్కు. 2. నమ్రత. 3. వంగుట.
ఆనతి[2] వై. వి. ఉత్తరువు. సం. ఆజ్ఞప్తిః.
ఆనద్ధము సం. వి. మృదంగాది చర్మవాద్యము. విశ. కట్టబడినది (కేశభూషణాదికము).
ఆననము సం.వి.1. మొగము. 2. నోరు.
ఆనపకాయ వి. 1. ఒక కూరగాయ సొరకాయ. 2. పాములవాడు ఊదు బుఱ్ఱ కుపయోగించు సొరకాయ.
ఆనము సం. వి. ఊపిరి వెలికిబుచ్చుట. ఉచ్ఛ్వాసము.
ఆనయము సం వి. 1. తెచ్చుట. పొందించుట. 2. ఉపనయన సంస్కారము. రూ. ఆనయనము.
ఆనర్తము సం.వి. 1. నాటకశాల. 2. పోరు. 3. సౌరాష్ట్ర దేశము. (దీని రాజధాని ద్వారక).
ఆనవాలు వి. 1. గుర్తు. 2. (ఆన+పాలు) ఇగుర కాచినపాలు. రూ. ఆనాలు.
ఆనిక వి. 1. ఆశ్రయము. ఆధారము. ప్రాపు. 2. దార్ఢ్యము. 3. పానము. రూ. అనువు.
ఆనియ వి. దద్దురోగము. రూ ఆణె,ఆనె. ఆణియ.
ఆనీతము సం. విశ. 1. తీసికొనిరాబడినది. 2. పొందింపబడినది.
ఆను క్రి. 1. ఆనిక అగు. 2. పట్టుకొను. 3. పొందు. 4. మోయు. 5. అదుము. 6. అడ్డగించు. 7. ఓర్చు. 8. అనుభవించు. 9. మూర్కొను. 10. చవిచూచు. 11. విను. 12. త్రాగు. 13. తిను. 14. నిలిచి

యుండు. 15. గోచరమగు. 16. నచ్చు. ఇష్టమగు.

**ఆనుకట్ట** వి. ఊతకట్ట.

**ఆనుకూల్యము** సం. వి. ఒద్దిక. తగియుండుట, అనుకూలభావము.

**ఆనుగము** వి. సౌర. రూ. ఆనుగు.

**ఆనుగు** వి. మా. పై.

**ఆనుగుణ్యము** సం. వి. అనుగుణభావము. తగియుండుట. ఆనుకూ౦్యము.

**ఆనుడుబిళ్ళ** వి. ఒరగుదిండు.

**ఆనుపూర్వి** సం.వి. అనుక్రమము. వరుస పరంపరాగతము. పరిపాటి

**ఆనురూప్యము** సం. వి. తగియుండుట: (భౌతి.) రెండింటి మధ్యగల అంగప్రత్యంగ సాదృశ్యము (Correspondence).

**ఆనువంశికము** సం. వి. (జీవ.) వంశపారంప౦్యము. తల్లిదండ్రులనుండి పిల్లలకు లక్షణములు సంక్రమించుట (Heredity)

**ఆనువు** వి. మా. ఆనిక.

**ఆనుషంగికము** సం. విశే. ప్రసంగవశమున వచ్చినది. అప్రధానము.

**ఆనె** వి. మా. ఆనియ.

**ఆన్నేట్స్** ఇం. వి. (చరి.) (Annates) ఆంగ్ల దేశములో పార్లమెంటు అధికారము రాకపూర్వము ప్రజలురాజునకు చెల్లించుచుండిన పన్ను. ప్రథమఫలసాయము.

**ఆన్వీక్షకి** సం. వి. 1. న్యాయ వైశేషిక రూపమైన తర్కవిద్య. 2. దండనీతి. 3. రాజ్యవిద్యలు నాలిగింటిలో ఒకటి. రూ. ఆన్వీక్షికి.

**ఆపగ** సం. వి. నది. వరు. వ్యు. జలముతో పోవునది.

**ఆపగేయుఁడు** సం. వి. గంగాపుత్త్రుడు. భీష్ముడు.

**అపటైట్** ఇం. వి. (రసా.) (Apatite) కాల్సియం ఫ్లోరైడ్ లేదా కాల్సియం క్లోరైడ్‌తో మిశ్రితమైయున్న కాల్సియం ఫాస్ఫేట్ ఖనిజము.

**ఆపణము** సం. వి. 1. అంగడి. 2. బజారు

**ఆపణికుఁడు** సం. వి. వర్తకుడు. బేహారి. వణిజుడు.

**ఆపత్తి** సం. వి. 1. ఇడుమ. రూ. ఆపద. 2, అర్థాదులసిద్ధి కలుగుట. 3. (తర్క) అయథార్థజ్ఞానము.

**ఆపద** సం. వి. విపత్తు. ఇడుమ.

**ఆపదర్థనిధి** సం. వి. (వాణి.) ముస్ముందు రానున్న పెద్ద ఖర్చులు లేదా అవసరములకొరకు ఉద్యోగులువిధిగ నిల్వచేయు సొమ్ము. (ఒక్కొక్కప్పుడు సంస్థకూడ ఉద్యోగుల నిల్వమేరకు అంశదానము చేయును. ఆపదర్థనిధి నియమములు వర్తించు సంస్థలలోని ఉద్యోగులు ఎల్లరు ఆనిధిలో ద్రవ్యము నిలువ చేసికొనక తప్పదు. ఏలయిన నెలజీతములో నుండి ఆనిధిలో వేయవలసిన మొత్తము మినహాయించి మిగిలినజీతమే ఉద్యోగుల కిత్తురు) (Provident Fund).

**ఆపన్నము** సం. విశే. 1. ఆపదనొందినది. 2. లభించినది. 3. సంభవించినది.

**ఆపన్నసత్త్వ** సం. వి. గర్భిణి. వ్యు. లోపల ప్రాణిగలది.

**ఆపన్నుఁడు** సం. విశే. ఆపదనొందినవాడు.

**ఆపసోపాలుపడు** క్రి. జ్వరాదితాపకృతమగు బాధలుపడు. ఉస్సురుస్సురను.

**ఆపాతకోణము** సం. వి. (భౌతి.) పైబడిన కిరణమునకు అదిపడిన బిందువునుండి తలమునకును గీయబడిన లంబమునకును మధ్యగల కోణము. ఆపతన కోణము (Angle of Incidence).

**ఆపాతము** సం. వి. 1. పడుట. 2. తేలిక. 3. హఠాత్తుగ పైబడుట. 4. క్రిందికి. దిగుట. 5. ఆకస్మికమైనరాక. 6. సంభ

వించుట. 7. ఉపక్రమము. 8. అప్పుడు. (భౌతి.) ఒక కిరణము ఒక తలముపై పడుట (Incidence).

**ఆపాదనము** నం. వి. 1. కలిగించుట. 2. సంపాదనము.

**ఆపాదించు** నం. క్రి. 1. కలిగించు. 2. ఒనరించు.

**ఆపాదిల్లు** నం. క్రి. కలుగు.

**ఆపానము** నం. వి. 1. అనేకులు గూడి కల్లు త్రాగుచోటు. 1. కల్లు అంగడి.

**ఆపీతము** నం. విశే. 1. త్రాగబడినది. 2. కొంచెము పసుపువన్నె కలది. వి. 1. ఇంచుక పసుపువన్నె. 2. పద్మకేసరములు. 3. నందివృక్షము.

**ఆపీనము** నం. విశే. మిక్కిలి బలిసినది. వి. 1. నూయి. 2. పొదుగు.

**ఆపూర్తి** నం. వి. 1. నిండుట. సంపూర్తి. 2. సమృద్ధి. 3. తృప్తి.

**ఆపె** సర్వ. ఆమె. రూ. ఆకె.

**ఆపొసనము** వై. వి. భోజనమునకు ముందు వెనుకల పుడిసిటిలో నీరుపోసికొని మంత్రపూర్వకముగ పుచ్చుకొనుట శుద్ధాచమనము. రూ. ఆపోసనము. నం. ఆపోశనమ్.

**ఆపోక** వి. ఆపోవుట, తనివి. తృప్తి.

**ఆపోవు** క్రి. తృప్తినొందు, తనియు

**ఆపోశనము** నం. వి., చూ. ఆపొసనము. రూ. ఆపోశానము.

**ఆప్తము** నం. విశే. 1. పొందబడినది. 2. నమ్మదగినది. 3. యథార్థజ్ఞానము కలది. 4. నిండినది. 5. యుక్తియుక్తమైనది. 6 (గణి.) భాగహారముచేయగా ఏర్పడిన సంఖ్య, లబ్ధము.

**ఆప్తి** నం. వి. 1. పొందుట. 2. స్త్రీసంయోగము. 3. లాభము. 4. చెలిమి. 5. రాబోవుకాలము, ఆయతి.

**ఆప్తుడు** నం. వి. 1. బంధువు. 2. స్నేహితుడు. 3. యథార్థమును పలుకు పురుషుడు, నమ్మదగిన వ్యక్తి.

**ఆప్యాయనము** నం. విశే. 1. బలుపు కలిగించునది. 2. ప్రీతి కలిగించునది. వి. 1. బలుపుకలిగించుట. 2. సంతోషపెట్టుట. 3. బలుపు. 4. ప్రీతి. 5. అప్యాయము.

**ఆప్లవము** నం. వి. 1. మునుక. స్నానము. 2. నీళ్ళు అంతటను చల్లుట. రూ. ఆప్లావము.

**ఆప్లుతుడు** నం. విశే. 1. స్నానము చేసినవాడు. 2. వేదాధ్యయనము పూర్తిచేసి బ్రహ్మచర్య వ్రతమును తీర్థస్నానాది నియమమును పూనినవాడు, స్నాతకుడు. 3. తడిసినవాడు.

**ఆఫలోదయకర్ముడు** నం. విశే. ఫలము కలుగు నంతవరకు కర్మచేయువాడు.

**ఆఫ్రికానర్స్** నం. వి. (చరి.) (Afrikaners) దక్షిణాఫ్రికాలోని డచ్ జాతివారు.

**ఆబ** వి. 1. కంటి నల్లగ్రుడ్డు, కంటిపాప, 2. కనురెప్పల వాపు. 3. ఆత్రము, తిండిమో. పై ఎక్కువ ఆశ.

**ఆబంధము** నం. వి. 1. గట్టికట్టు. 2. పలుపు. 3. ప్రేమ. చెలిమి. 4. భూషణము.

**ఆబాలగోపాలము** నం. అవ్య. బాలుర మొదలు గోపాలుర వరకు అందరును. (ఇట్లే ఆబాలవృద్ధము. ఆసేతుహిమాచలము మొ.వి.)

**ఆబిడ** సర్వ. (ఆ+బిడ్డ) ఆపె. రూ. ఆబిడె.

**ఆబూతి** వై. వి. పెనుతిండి. నం. ఆఖుక్షి.

**ఆబూతికాడు** వై. వి. తిండిపోతు.

**ఆబ్దికము** నం. వి. తద్దినము. మరణించిన వారికి ప్రతి సంవత్సరము ఆతిథియందు చేయు కర్మము. వ్యు. అబ్దమున కొకసారి చేయబడునది.

**ఆభ** నం. వి. 1. కాంతి, వెలుగు. 2. పోలిక.

**ఆభరణము** సం. వి. 1. నగ. 2. చక్కగా పోషించుట.

**ఆభాణకము** సం. వి. లోకోక్తి. జనప్రవాదము.

**ఆభాసము** సం. వి. 1. కాంతి. 2. ప్రతిబింబము, 3. వాస్తవము కాకపోయినను పైకి వాస్తవమైన దానివలె కన్పించునది. ఉదా. హేత్వాభాసము, రసాభాసము మొ.

**ఆభిజాత్యము** సం. వి 1. మంచికులమున పుట్టుక. 2. పాండిత్యము 3. సౌందర్యము. 4. అభిమానము, గర్వము.

**ఆభీరపల్లి** సం వి. గొల్లపల్లె. వ్రేపల్లె.

**ఆభీరి** సం. వి. 1. గొల్లది. 2 గొల్లవాని భార్య 3. గొల్లలభాష.

**ఆభీరుఁడు**. సం. వి. 1. గొల్లవాడు, వ్యు మిక్కిలి పిరికివాడు 2. ఆభీరదేశవాసి.

**ఆభీలము** సం విశే. భయంకరము. వి. శరీరబాధ.

**ఆభుక్తి** సం. వి., చూ. ఆబూతి.

**ఆభోగము** సం. వి. 1. పరిపూర్ణత. 2. వైశాల్యము. 3. ప్రాంతప్రదేశము. 4. ప్రయత్నము. 5. సుఖాద్యనుభవము. 6. విప్పిన పాముపడగ. 7. వరుణుని గొడుగు.

**ఆమంత్రణము** సం. వి. 1. ఆహ్వానము 2. సంబోధనము. 3. యాత్రాదులలో బంధువుల-అనుజ్ఞ పడయుట. 3. అనుజ్ఞ 5. సంభాషణము.

**ఆమడ** వి. నాలుగు క్రోసుల దూరము, యోజనము.

**ఆమతి** వై. వి 1. సెలవు. 2. పిలుపు. సం. ఆమంత్రణమ్.

**ఆమతించు** క్రి. 1. పిలుచు. 2. పూజించు, సత్కరించు, 3. విందుపెట్టు, 4. పుట్టు. కలుగు.

**ఆమతిలు** క్రి., చూ. పై.

**ఆమద్రవ్యములు** సం.వి. పొత్తరయందుంచు కాయగూరలు. బియ్యము. తాంబూలము మొ. వస్తుసముదాయము

**ఆమనస్యము** సం.వి, ప్రసవవేదన బిడ్డకుట్టు.

**ఆమని** వి. 1 వసంతఋతువు. వసంతుడు. 2. ఫలసమృద్ధి. విశే. 1. మిక్కుటము. 2. తృప్తికరము. క్రి. విశే. 1. మిక్కుటముగా. 2. తృప్తికరముగా.

**ఆమము** సం. విశే. 1. అపక్వము. 2. పచ్చి. వి. 1. రోగము. 2 ఆమవ్యాధి.

**ఆమయము** సం వి రోగము.

**ఆమలకము** సం. వి. 1 ఉసిరికాయ. 2. ఉసిరికచెట్టు.

**ఆమవడ** వి. పెరుగు పచ్చడిలో నానవేసిన వడ లేక గారె.

**ఆమిక** వై. వి. 1. కావరము. 2. మదము. రూ. ఆము. సం. అహమహమికా.

**ఆమిషము** సం. వి. 1. మాంసము. 2. భోగ్యవస్తువు. 3. ఆశగొల్పు వస్తువు. 4. భోగము. 5. లోభము. 6. లంచము.

**ఆము** వై. వి. మదము. అవ్య. 1. అధికముగా. 2. దట్టముగా. సం. అహమ్.

**ఆముకొను** క్రి. 1. అలముకొను. వ్యాపించు. 2. పైకొను 3. క్రొవ్వు.

**ఆముక్తము** సం. విశే. 1. విడువబడినది. 2. తొడగబడినది (అంగీ మొ. వి.). 3. వేయబడినది (బాణము మొ.వి.).

**ఆముత్రికము** సం. విశే. ఆముష్మికము. పరలోకమున కలుగునది.

**ఆముదము** వై. వి. ఏరండ వృక్షము. ఏరండ తైలము, ఏరండ బీజములు. సం. ఆమండః.

**ఆమూలాగ్రము** సం. విశే. అడుగు మొదలు తుదివరకు. మొదటినుండి చివరివరకు. అంతయు.

**ఆమె** సర్వ. ఆ స్త్రీ.

**ఆమెత** వి. 1. విందు. 2. ఉత్సవము.

**ఆమోదము** నం వి. 1. సంతోషము. 2. పరిమళము.

**ఆమ్నాయము** నం. వి. 1. వేదము. 2, శాస్త్రము, 3. సంప్రదాయము. 4. వంశము. 5. సముదాయము.

**ఆమ్నిబస్ బిల్** ఇం.వి.(Omnibus bill)బహు ప్రయోజనాత్మకమైన చిత్తు చట్టము.

**ఆంప్లిఫైయర్** ఇం. వి. (భౌతి.) (Amplifier) ధ్వని మొ.వి. అధికము చేసెడి యంత్రము.

**ఆమ్మీటర్** ఇం. వి. (భౌతి) (Ammeter) విద్యుత్ప్రవాహమును కొలిచెడిపరికరము.

**ఆమ్రము** నం. వి. 1. మామిడి, చూతము.

**ఆమ్రేడితము** నం. విణ. రెండు మారులు చెప్పబడినది (పదము). వి. రెండు సారులు చెప్పుట. (వ్యాక) రెండు మారులు చెప్ప బడిన దానిలో రెండవది. ద్విరుక్తము యొక్క పరరూపము.

**ఆమ్లజనీకరణము** నం. వి., చూ. ఆక్సీకరించుట (Oxidation).

**ఆమ్లత (నేలల)** నం వి. (వ్యవ.) నేల యందున్న ద్రావణీయ ద్రవ్యముల యొక్క ద్రావణములలో నీలిలిట్మస్ ఎరుపు రంగుగామారు స్వభావము కలిగి యుండుట ఆమ్ల లక్షణము (Acidity of soils).

**ఆమ్లతామాపనము** నం. వి. (రసా.) ఒక ద్రావణమందున్న ఆమ్ల సాంద్రతను క్షార ద్రావణముల సహాయమున నిర్ధరించుట (Acidimetry).

**ఆమ్లపిత్తము** నం. వి. (గృహ.) ఒక రోగము. (ఇది అగ్నిమాంద్యము వలన జనించు కడుపులోని ఆమ్లములచే కలుగును) (Heart burn).

**ఆమ్లపు అయనులు** మి. వి. (రసా.) ఋణ విద్యుత్తు గూడిన అయనులు (Acidic ions).

**ఆమ్లము**[1] నం. వి. 1. చింతపండు పులుసు. 2 చింతచెట్టు. 3. ఆరు రసములలో ఒకటి. 4. పులితేపు. విణ. పుల్లనిది.

**ఆమ్లము**[2] నం. వి. (రసా.) లోహముల కలయికచే హైడ్రోజన్‌ను కోల్పోయి లవణములుగా ఏర్పడు పుల్లని ద్రవము. నీలి లిట్మస్‌ను ఎఱ్ఱగా చేయునది; కార్బొనేట్లతో బుసబుసలాడునది;చురుకైన ధాతువులతో ఉదజని ఇచ్చునది; క్షారములతో లవణములను ఇచ్చునది. (Acid).

**ఆమ్లమూల్యము** నం. వి. (రసా.) ద్రావణము లోని ఆమ్లముయొక్క కొలత (Acid value).

**ఆమ్లలవణము** నం. వి. (రసా.) ఆమ్లము నందలి హైడ్రోజన్ పరమాణువులను కొంతవరకే తొలగించగా ఏర్పడు లవణము (Acid salt).

**ఆమ్లలేఖనము** నం. వి. (రసా) హైడ్రోక్లోరికామ్లము నైట్రికామ్లము మొ., ఆమ్లములతో గాజు, లోహములు మొ.ని మీద గురుతులు పడునట్లు వ్రాయుట.

**ఆమ్లవేతసము** నం వి. పుల్లప్రబ్బలి మొక్క.

**ఆమ్లశిలలు** నం. వి. (భూగో.) 'సిలికా' అను పదార్థము 66% కన్న ఎక్కువకల శిలలు.

**ఆమ్లిక** నం.వి. 1. చింతచెట్టు. 2. పులితేపు.

**ఆమ్లీకరణము** నం. వి. (రసా.) 1. ఆమ్లమును కలిపి ఆమ్లగుణము కలదిగా చేయుట (Acidification). 2. కొలదిగా ఆమ్లలక్షణములు కలుగునట్లు చేయుట (Acidulation)

**ఆమ్లీకృతము** నం,విణ. (రసా.) ఆమ్లగుణము కలదిగా చేయబడినది (Acidulated).

**ఆమ్లోత్పాదకము** నం. విణ. (రసా.) ఆమ్లమును జనింపచేయునది(Acid forming).

**ఆయక** సర్వా. (ఆ+అక) 1. అపూజ్యస్త్రీ. 2. ఆకె. ఆ యక్క.

**ఆయకట్టు** మి. వి. (ఆయము+కట్టు) 1. రాబడి పరిమాణము. 2. చెరువు మొని. క్రింద సాగగు భూమి పరిమితి.

**ఆయకట్టులు** మి. వి. (జాతీ., భూగో.) (దక్షిణభారత దేశములోని వాడుక పదము) కాలువల ద్వారా లోయలో పండించు వరిపంటలు.

**ఆయకము** వి. తాకట్టు, కుదువ. ఆధి.

**ఆయకాఁడు** వి. పన్ను వసూలు చేయు కరణము మొ.గు గ్రామాధికారి.

**ఆయతము** నం. విశ. 1. వెడల్పుకన్న పొడవు ఎక్కువ కలది, దీర్ఘచతురస్రము (Oblong). 2. లాగబడినది. 3. నిరోధింపబడినది. 4. దీర్ఘము, నిడుపైనది.

**ఆయతన** నం. విశ. (రసా.) యౌగికములోని మూలద్రవ్యముల ఘనపరిమాణములనిష్పత్తి సంబంధమైన(Volumetric)

**ఆయతనము** నం. వి. 1. ఇల్లు, 2. ఆశ్రయము. 3. యజ్ఞశాల. 4. దేవాలయము. 5. బౌద్ధాలయము, 6. (భౌతి., రసా.) ఒక వస్తువు యొక్క ఘనపరిమాణము (ద్రవముల విషయమై 'ఆయతనము' ఘనపరిమాణార్థమున ప్రయోగములో ఉన్నది.) ఒక వస్తువు ఆక్రమించు చోటు, ఒక ద్రవము ఆక్రమించుచోటు(Volume)

**ఆయతనాత్మక ద్రావణము** నం. వి. (రసా.) నియతాయతనములలో విలీనమై యున్న ప్రమాణ ద్రవ్యమును ఆధారముచేసికొని. ఒక నియతాయతనము యొక్క ద్రావణములో నున్న రాసాయనిక ద్రవ్యమును నిర్ధరించుట (Volumetric solution).

**ఆయతనాత్మక విశ్లేషణము** నం. వి. (రసా.) ప్రమాణ ద్రావములను ఉపయోగించి ఒక నియతాయతనములోనున్న రసాయనిక ద్రవ్యరాశిని నిర్ణయించుట (Volumetric analysis).

**ఆయతనాత్మకసంయోగము** నం.వి. (రసా.) వాయు స్థితిలో రెండు ద్రవ్యముల నియతాయతనములు సంయోగించుట (Combination by volume).

**ఆయతము** నం. విశ. వెడల్పుకన్న పొడవు ఎక్కువ కలది (Oblong).

**ఆయతముఖము** నం విశ. (రసా.) వెడల్పైన ముఖముగల (Wide mouthed).

**ఆయతి**[1] నం. వి. 1. రాబడి. 2. నిడుపు. 3. రాగలకాలము 4. కోశ దండముల వలన రాజునకు గలుగుశక్తి, ప్రభావము. 5. ఫలము గలుగు సమయము. 6. ప్రాపణము. 7. కూడిక. 8. పని. 9. సంయమము.

**ఆయతి**[2] వి. జ్యేష్ఠాది మాసచతుష్టయము. కందాయము.

**ఆయత్తము** నం. విశ. 1. సంసిద్ధము. 2. అధీనము. 3. ప్రయత్నించునది.

**ఆయత్తుఁడు** నం.విశ. ఒకరికి లోబడినవాడు. అధీనుడు.

**ఆయమ** సర్వ. (ఆ+అమ)ఆమె. ఆపె, ఆకె.

**ఆయము**[1] వై. వి. 1. జీవస్థానము, ఆయువుపట్టు. 2. మర్మము. నం. ఆయుః.

**ఆయము**[2] నం. 1. రాక. 2. లాభము. 3. రాబడి. 4. పన్ను.

**ఆయవారము** వై. వి. 1. ఇంటింటికి తిరిగి ధాన్యముగాని బియ్యముగాని బిచ్చమెత్తుట. 2. అట్లు బిచ్చమెత్తుట వలన వచ్చిన ధాన్యము. నం. యాయావరమ్.

**ఆయసము** నం. విశ. ఇనుపది. వి. 1. ఇనుప వస్తువు. 2. ఇనుము.

**ఆయస్కాంతిక క్షేత్రము** నం. వి. (భౌతి.) అయస్కాంత ప్రభావమును కనపరచు చోటు.

**ఆయాసము** నం. వి. 1. శ్రమము. 2. ఉత్సాహము. 3. పరితాపము.

**ఆయుటి** వి. బూరుగు.

**ఆయుతము** విశే. సిద్ధమైనది. రూ. ఆయుత్తము

**ఆయుతు** విశే. 1. తగినది. 2. సాధ్యము. రూ. ఆయుత్తు.

**ఆయుర్వేదము** సం. వి. హిందూ వైద్య శాస్త్రము.

**ఆయువు** సం. వి. జీవితకాలము. ఆయుస్సు.

**ఆయుష్కరము** సం.వి. ఆయుర్వృద్ధికర మగు పని, క్షౌరము.

**ఆయుష్మంతుడు** సం. వి. దీర్ఘకాలము జీవించువాడు, చిరంజీవి.

**ఆయోగము** సం.వి. 1. తెలివి. 2. గంధ మాల్యాదుల కానుక. 3.చక్కని కూడిక. 4. ఒడ్డు. 5. కాడికి గట్టిన పశువుల జత

**ఆయోధనము** సం. వి. 1. యుద్ధము, 2. యుద్ధభూమి. 3. వధము.

**ఆర**[1] సం. వి. 1. మాదిగవాడు చెప్పులు కుట్టు సూది. 2. (వైద్యా.) శస్త్రములలో ఒకటి. 3. గుజ్జములను తోలు కొరడా.

**ఆర**[2] అవ. సంబోధనమునబహువచనముందు వచ్చు ఆగమము.ఉదా జనులారా, మగువ లార మొ. వి. రూ. ఆరా.

**ఆరంజ్యోతి** వై. వి. 1. వసిష్ఠుని భార్య. 2. ఆ పేరుగల నక్షత్రము. సం. అరుంధతీ

**ఆరంబము** వై. వి. 1. మొదలు పెట్టుట. ఉపక్రమము. 2. ప్రయత్నము. 3. కార్య ము. 4. త్వర. సం. ఆరంభః. 5. పైరు (ఇది తెనుగున మాత్రము కానవచ్చును). రూ. ఆరబము.

**ఆరంభించు** సం. క్రి. యత్నించు, మొదలు పెట్టు.

**ఆరంభము** సం. వి. చూ. ఆరంబము.

**ఆరకాఁడు** వి. కృషీవలుడు, రైతు.

**ఆరకూటము** సం. వి. ఇత్తడి.

**ఆరకోణము** సం. వి. (గణి.) అర్ధవ్యాసము నకు సమానమైన పొడవుగల వృత్త చాపమునకు వృత్తకేంద్రము వద్ద అభి ముఖముగా ఉన్న కోణము, త్రిజ్యాకోణము

**ఆరక్షకుఁడు** సం. వి. 1. తలారివాడు కొత్వాలు. 2. గ్రామ దండనాధికారి. రూ. ఆరక్షుడు. వికృ. ఆరెకుడు.

**ఆరక్షము** సం. విశే. రక్షించునది. వి. 1. రక్షణము. 2.ఏనుగు కుంభముల క్రింది చోటు. 3. సైన్యము.

**ఆరగించు** వై. క్రి. 1. భుజించు. 2. త్రాగు.

**ఆరగింపు** వై. వి. ఆహారము భుజించుట.

**ఆరఘట్టము** సం. వి. నూతినీటిని తోడు సాధనము. ఏతాము.

**ఆరజము** సం. వి. ఒకరకపు వాద్యము.

**ఆరజము** విశే. మనోజ్ఞమైనది. ఇంపైనది. వి. 1. అవ్యక్త మధుర ధ్వని. 2. విలా సము. 3. దుర్విలాసము.

**ఆరట** వి. పరితాపము, దుఃఖము, బాధ. రూ. ఆరటము. ఆరాటము.

**ఆరటము** వి. చూ. పై.

**ఆరదము** వి. ఉత్సాహము. పూనిక.

**ఆరణ్యకములు** సం. వి. (వేదాం.) అరణ్య మందు రచింపబడిన లేక పఠింపదగిన వేద భాగములు. ఉదా. ఐతరేయారణ్యకము మొ.వి.

**ఆరతి**[1] వై. వి. దేవుని సమక్షమున దీప ధూపముల త్రిప్పుట, నీరాజనము. నివాళి రూ. హారతి, సం, ఆరాత్రికమ్.

**ఆరతి**[2] సం.వి. 1. విరామము. 2. ప్రశాంతి.

**ఆరనాళము** సం. వి. పులియబెట్టిన కడుగు నీళ్ళు. రూ. ఆరనాళకము.

**ఆరబము** వై. వి. 1. తొలకరి పైరు. 2. పైరు. సం. ఆరంభః.

**ఆరబ్ధము** సం. విశే. ఆరంభింపబడినది.

**ఆరభట** సం. వి. 1. మ్రోత. 2. (అలం.) రౌద్రబీభత్సరసములలో వాడు ఒక కావ్యవృత్తి. రూ. ఆరభటము.

**ఆరభటము** నం. వి. మ్రోత.

**ఆరభటి** నం. వి. 1. మ్రోత. 2. నేర్పు. 3. (అలం.) ఒక కావ్యవృత్తి.

**ఆరయు** క్రి. 1. చూచు. 2. పరీక్షించు. 3. వెదకు. 4. ఆలోచించు. 5. రక్షించు. 6. కనుగొను. రూ. అరయు.

**ఆరవము** నం. వి. 1. ధ్వని, అరపు రూ. ఆరావము.

**ఆరవేయుట** వి. (గృహ.) తడిబట్టలనుఎండ వేయుట.

**ఆరాటము** వి. చూ. ఆరంటము.

**ఆరాధనము** నం. వి. 1. పూజించుట. 2. సంతోషపెట్టుట. 3. (దేవతాదులను) కొలుచుట. 4.వానికి సాధనము.5.ప్రాప్తి రూ. ఆరాధన.

**ఆరాధ్యుఁడు** నం. విశే. పూజింపదగినవాడు వి. 1. లింగధారి. 2. శైవమత గురువు.

**ఆరామము** నం.వి. ఉపవనము, తోట. వ్యు. విహరించు స్థలము.

**ఆరితేఱు** క్రి. నిపుణతనొందు, సమర్థుడగు.

**ఆరివేరపుఁదపసి** వై. వి. కలహప్రియు డగుముని నారదుడు.

**ఆరివేరము** వై. వి. విరోధము, కలహము నం. అరివీర్యమ్.

**ఆరు**[1] క్రి. 1. కలుగు 2. నిండు 3. ఒప్పు 4. అతిశయిల్లు. వి. 1. రొమ్ము నుండి నాభివరకు గల రోమావళి. నూగారు. 2. నింద. ఉదా. ఆరును, పోరును లేని సంసారము.

**ఆరు**[2] వి.(వ్యవ.) గుంటకయను పనిముట్టులో ముఖ్యమైన భాగము (Blade).

**ఆరుగ** వి. ఒక రకపుపైరు. రూ. ఆరిక.

**ఆరుచు** క్రి. అదించు, విసరు. ఎండించు. రూ. ఆర్చు.

**ఆరుదూఱు** వి. 1. అల్లరి. 2. నింద 3. వైకల్యము.

**ఆరుద్రపురుగు** వి. వర్షాకాలమున ఆరుద్ర కార్తెలో కన్పించెడి పట్టువంటి దేహము గల ఒక ఎఱ్ఱని పురుగు. ఇంద్రగోపము.

**ఆరుపోరు** వి. ఎడతెగని జగడము.

**ఆరురుక్షువు** నం. విశే. 1. ఎక్కనిచ్ఛకల వాడు. 2. ఉచ్చదశను పొంద నిచ్ఛగల వాడు.

**ఆరూఢము** నం విశే. 1. ఎక్కినది, 2. ఎక్కబడినది (చెట్టు మొ) 3 పొందినది. వి. 1. ఆరోహణము. 2. పెంపు అధికము.

**ఆరె** వై.వి. 1 చెప్పులు కుట్టు సూది. 2. కోడి మున్నగు పక్షుల కాలి వెనుక గోరు. 3. ఒకరకపు బాణము. నం. ఆరా.

**ఆరెకుఁడు** వై. వి. తలారి. నం. ఆరక్షకః.

**ఆరోగిణము** వై. వి. భోజనము. రూ. ఆరోగణము.

**ఆరోగ్యము** నం. వి. రోగము లేమి. స్వాస్థ్యము.

**ఆరోగ్యరక్షణము** నం. వి. (గృహ) రోగము రాకుండుటకై శుభ్రత నవలంబించుట (**Sanitation**).

**ఆరోపము** నం.వి. 1.(నిందాదులు) మోపుట. 2. నిఘంటువులలో అకారాదిగ ఇచ్చిన పదము. 3. ఒకదాని ధర్మములు అవిలేని వేరొకదాని యందు ఉన్నట్లు చెప్పుట. రూ. ఆరోపణము.

**ఆరోమేటిక్** ఇం. విశే. (రసా.) (**Aromatic**) బెంజీన్ సంబంధమైనది.

**ఆరోహకుఁడు** నం. విశే. ఎక్కెడివాడు. వి. 1. మావటీడు. 2. గుఱ్ఱపు రౌతు.

**ఆరోహణ** నం. వి. (గణి.) క్రమముగా వృద్ధిచెందుట (**Ascent**).

**ఆరోహణక్రమము** నం. వి. (గణి.) వరుసగ పెరుగుచుపోవు క్రమము (**Ascending order**).

ఆరోహణము సం. వి. 1. (అశ్వాదులను) ఎక్కుట. 2. నిచ్చెన. 3. మొలకెత్తుట. 4. నర్తనమునకై ఎత్తుగ కట్టిన రంగ స్థలము.

ఆరోహ సం. వి. ఎక్కువాడు. (భౌతి.) ఒక వస్తువును నిశితముగా తూచుటకు తులా దండముపై పెట్టబడు సన్నని తీగముక్క.

ఆరోహుఁడు సం. వి. 1. గుఱ్ఱపు రౌతు, 2. మావటీడు.

ఆర్క్ ఇండికేటర్ ఇం. వి. (వృక్ష.) (Arc Indicator) మొక్కల పెరుగుదలను కొలుచు యంత్రము.


ఆర్క్ ఇండికేటర్

ఆర్కిటిక్ వలయము వి.వి. (భూగో.) ఉత్తరధ్రువవృత్తము, 23 ½° కర్కాటకరేఖ, ఉత్తర అక్షాంశ రేఖ, ఉత్తరాయణ రేఖ.


ఆర్కియోప్టెరి

ఆర్కియోప్టెరి ఇం. వి. (జం.) (Archaeopteryx) పక్షి జాతులలో ఒకటి. (పరిణామములో సరీసృపముల నుండి పక్షులు వచ్చిన వని చెప్పుటకు ఇది యొక తార్కాణము.)

ఆర్కోజ్ ఇం.వి. (భూగో.) (Arkose) గ్రానైట్, ఇసుకలను కలిగిన ఒక శిల.

ఆర్గనైజర్లు ఇం.వి. (Organizers) వ్యవస్థాపకులు, ఏర్పాట్లు చేయువారు.

ఆర్గాన్ ఇం.వి. (రసా.) (Argon) సామాన్య వాయువులో మిక్కిలి విరళముగ కలిసి యున్న ఒక వాయువు.

ఆర్గు బ్యూరో ఇం.వి. (రాజ.) (Orgbureau) రష్యా కమ్యూనిస్ట్ పార్టీ ప్రచారములను సాగించు కేంద్ర సంఘము.

ఆర్చ్ బిషప్ ఇం.వి. (చరి.) (Archbishop) క్రైస్తవమతగురువు, బిషప్పుల పైఅధికారి.

ఆర్జనము సం. వి. సంపాదనము, గడన.

ఆర్జవము సం. వి. 1. మంచినడత. 2. సరళత్వము.

ఆర్జిరోడైట్ ఇం.వి. (భూగో.)(Argyrodite) గంధకము, జర్మేనియము రజతములను కలిగిన ఖనిజము.

ఆర్టికల్ ఇం. వి. (శాస.) (Article) 1. పరిచ్ఛేదము. 2. వ్యాసము.

ఆర్డర్ ఇం. వి. (Order) ఉత్తరువు ఆజ్ఞ.

ఆర్డర్ చెక్ ఇం.వి. (అర్థ.)(Order cheque) పేర్కొనబడిన వ్యక్తికిగాని, అతని అనుమతి పొందిన వ్యక్తికిగాని చెల్లించబడెడి చెక్. (బాంక్ నుండిచెక్ సొమ్ముతీసికొనువాడు బాంక్ వారికి తెలిసియుండవలెను)

ఆర్డినెన్స్ ఇం.వి. (శాస.) (Ordinance) అత్యవసరాదేశము, తీవ్రసమయములందు రాష్ట్రపతి లేక రాజ్యపాలుడు జారీచేయు శాసనము. (సమయతీవ్రతనుబట్టి ప్రాథమిక హక్కులను విలంబన చేయవచ్చును)

ఆర్తము సం.విశే. 1. దుఃఖము నొందినది. 2. నొప్పింపబడినది. 3. రోగము గలది.

ఆర్తవము సం.విశే. 1. వసంతాది ఋతు సంబంధమైనది. 2. స్త్రీ ఋతు సంబంధమైనది. వి. 1. స్త్రీ ఋతువు. 2. పువ్వు. 3. ఋతుస్నానమైన పిదప గర్భోత్పత్తికి అనుకూలమైన కాలము.

ఆర్తి సం.వి. 1. దుఃఖము. 2. రోగము. 3. ఆపద. 4. వింటికొప్పు.

ఆర్థిక అధిరోధము సం.వి. (అర్థ.) 1. ఘాట్ బందీ, వాణిజ్యముపై ప్రభుత్వ నిషేధము. 2. ఓడల రాకపోకల నిషేధపు ఉత్తరువు; (Embargo).

**ఆర్థిక ఆంక్షలు** వి. (అర్థ.) అంతర్జాతీయ రాజకీయ రంగములో తమతో ఏకభవించని రాజ్యమును లొంగతీయుటకై ఒక కూటమికి చెందిన రాజ్యములు దానిపై ఆర్థిక నిర్బంధములు విధించుట.

**ఆర్థిక భూగోళము** నం. వి. ఉత్పత్తి స్థానములను, పరిశ్రమ కేంద్రములను గురించి చెప్పు భూగోళ శాస్త్రము.

**ఆర్థికవృద్ధి న్యాయము** నం వి. (అర్థ.) ఉత్పత్తి ఎక్కువ చేయుటవలన ఖర్చులు తగ్గుట. (వస్తూత్పాదనలో స్థిరమైన అస్థిరమైన ఖర్చులుండును. అస్థిరమైన ఖర్చులు వస్తూత్పాదనలో పెరుగుచుండును. కాని స్థిరమైన ఖర్చులు అట్లు [illegible] కుచే ఉత్పాదన పెరిగిన [illegible] తగ్గుచుండును) (Large Scale Economics).

**ఆర్థిక స్వాతంత్ర్యము** నం. వి. (అర్థ.) ఒక వ్యక్తికాని ప్రభుత్వముగాని, దేశముకాని మరియొకరి నుండి ధన సాహాయ్యమును అర్థించు నవసరములేని స్థితి.

**ఆర్దము** వి. అరుతూములు.

**ఆర్ద్ర** నం. వి. 27 నక్షత్రములలో ఆరవది.

**ఆర్ద్రకము** నం వి. అల్లము.

**ఆర్ద్రత** నం. వి. మెత్తదనము, స్నిగ్ధత. (భౌతి.) గాలిలోని తేమ, తడి (Humidity, Moisture).

**ఆర్ద్రము** నం. విశ. (భౌతి., రసా.) తడిసినది. తడిగా నున్నది (Damp).

**ఆర్ద్రీభవనము** నం. వి. (రసా.) చెమ్మగిల్లుట, కొన్ని క్షారములు, లవణములు, గాలికి ఎదురు పెట్టునపుడు గాలిలోని నీటితో సంయోగించి ద్రవము లగుట.

**ఆర్భటము** నం. వి. అర్పుతో గూడిన విజృంభణము.

**ఆర్భటి** నం.వి. మ్రోత. 2. విజృంభణము.

**ఆర్మ్‌హోల్** ఇం. వి. (గృహ.) (Armhole) దుస్తులలోని చంకభాగము. జాకెట్లు, కమీజులు మొ. దుస్తులకు చేతుల నతుకు భాగము.

**ఆర్మేచర్** ఇం వి. (భౌతి.) (Armature) డైనమోలోని తీగచుట్ట.

**ఆర్య** నం. వి. 1. పదునారేండ్ల కన్య. 2. పూజ్యురాలు, 3. పార్వతి, 4 (ఛంద.) మాత్రావృత్తభేదము. 5. అత్త. 6. (నాట.) నటుడు భార్యను పిల్చునపుడు వాడెడి మాట.

**ఆర్యసమాజము** నం వి. (చరి.) వైదికధర్మ పునరుద్ధరణమునకై స్వామి దయానంద సరస్వతి (క్రీ. శ. 1824-1883) చే క్రీ. శ. 1975వ సంవత్సరమున స్థాపించబడిన సమాజము. హైందవ సమాజములో కులభేదము లుండరా దనియు, బాల్య వివాహములు వద్దనియు, విగ్రహారాధన కూడ దనియు, ఎవరినైనను శుద్ధిచేసి హైందవ సమాజములో చేర్చుకొనవచ్చు ననియు తెలియజేయు సిద్ధాంతములతో కూడిన సమాజము. హైందవ ధర్మపునరుద్ధరణకు చాల పాటుపడు సంస్థ.

**ఆర్యాణి** నం. వి. 1. పూజ్యురాలు. 2. పార్వతి.

**ఆర్యావర్తము** నం. వి. ఆర్యులు తమ పశు సముదాయముతో చరించిన భూమి (వింధ్యాచల హిమాచల మధ్య భూమి.) పుణ్యభూమి.

**ఆర్యుఁడు** నం. విశ. 1. పూజ్యుడు. 2. మంచివాడు. (చరి.) (Aryan). వి. 1. ఆర్యావర్త దేశపువాడు. 2. (నాట.) నటి భర్తను పిల్చునపుడు వాడెడి పేరు. నాట్య పరిభాషయందు పెసిమిటి.

**ఆర్షము** నం. విశ. 1. ఋషిసంబంధమైనది. 2. ఋషిప్రోక్తము. (వ్యతి.) లౌకికము. వి. అష్టవిధ వివాహములలో ఒకటి

(ధర్మార్థము వరునివలన గోమిథునమును పుచ్చుకొని కన్యక నిచ్చి యథాశాస్త్రముగ చేయు వివాహము).

**ఆర్సెనిక్** ఇం. వి. (రసా.) (Arsenic) పరమాణు సంఖ్య 33 గాగల ఒకమూల పదార్థము, ఒక విషపదార్థము, పాషాణము, తాలము.

**ఆర్సెనేట్** ఇం. వి. (రసా.) (Arsenate) ఆర్సెనికామ్లము యొక్క ఉప్పు.

**ఆఱడి** వి. 1. కష్టము. 2. హాని. 3. నింద. విశ. 1. వ్యర్థము. 2. దుష్టము. 3. నింద్యము.

**ఆఱడిపడు** క్రి. 1. నిందపడు. 2. వ్యర్థమగు. 3. నాశమునొందు.

**ఆఱు** క్రి. 1. ఎండు. 2. ఉపశమించు. 3. నశించు. 4. క్షీణించు. సర్వా. ఐదునొకటి.

**ఆఱుపు** వి. 1. కూత. 2. యోధుల బొబ్బరింత. 3. చల్లార్చుట.

**ఆఱున** వి. అరుకుంచముల కొలత గల మానము.

**ఆలంకి** వి. 1. కుర్చీవంటి పల్లకి. 2. బాల క్రీడలలో ఒకటి.

**ఆలంబము** సం. విశ. వ్రేలాడునది. వి. 1. ఊత. 2 ఆశ్రయము. 3. ప్రాపు. 4. వ్రేలాడుట. 5. (భౌతి.) ఉచ్చాలము కదలుటకు పనికివచ్చు స్థిరమైనఆధారము.

**ఆలంభము** సం. వి. 1. సంస్పర్శము. 2. చంపుట.

**ఆలకి** విశ. 1. నాథుడులేనిది. 2. దిక్కులేనిది.

**ఆలకించు** క్రి. 1. విను. 2. ఆదరించు. రూ, ఆలించు.

**ఆలక్షించు** సం. క్రి. 1.చూచు.2.సంభావించు.

**ఆలగోడు బాలగోడు** వి. 1. విపరీతధ్వని. 2. మొత్తుకోళ్ళు. 3. పెడబొబ్బలు.

**ఆలతి** వై. వి. రాగాలాపము. సం. ఆలప్తి.

**ఆలన్న** వి. 1. మొరవినుట. 2. ఆలించుట. 3. రక్షణము.

**ఆలపించు** వై. క్రి. రాగముతీయు. రూ. ఆలాపించు.

**ఆలప్తి** సం. వి., చూ. ఆలతి.

**ఆలము**[1] వై. వి. 1. యుద్ధము. 2. అగడము.

**ఆలము**[2] సం. వి. 1. తేలుకొండి. 2. అరిదళము. విశ. 1. చాలినది. 2. అధికము, 3. శ్రేష్ఠమైనది.

**ఆలము**[3] వి. ఉపేక్ష. విశ. 1. ఉపేక్షితము. అనాదరింపబడినది. 2. అసత్యమైనది.

**ఆలయము** సం. వి. 1. ఇల్లు. 2. స్థానము. 3. కలిసిపోవుట. 4. గుడి.

**ఆలయవనము** సం. వి. (వ్యావ.) దేవాలయములు,మసీదులు మొ.నిఆవరణలలో పెంచుతోట (Temple garden).

**ఆలరి** విశ. 1. దుశ్శీలుడు. 2. అవివేకి.

**ఆలతేఁడు** వి. ఎద్దు, ఆబోతు, బసవడు.

**ఆలవట్టము** వై. వి. వస్త్రముతో చేయబడిన గుండ్రని విసనకఱ్ఱ. 2. గుండ్రని విసనకఱ్ఱవలె నుండి రాజులకు ఎండ తగులకుండ పట్టు సాధనము. సం. ఆలావర్తమ్.

**ఆలవాలము** సం. వి. పాదు.

**ఆలస్యము** సం. వి. 1. సోమరితనము. 2. అజాగ్రత్త. 3. జాగు.

**ఆలాతము** సం. వి. (రసా.) కొరవికఱ్ఱముక్క (Red hot splinter).

**ఆలానము** సం. వి. ఏనుగును కట్టుకంబము.

**ఆలాపనము** సం. వి. 1. రాగాలాపనము. 2. మాటలాడుట.

**ఆలావర్తము** సం. వి., చూ. ఆలవట్టము.

**ఆలి** సం. విశ. శుద్ధాంతఃకరణము గలది. వి. 1. తేలు. 2 తుమ్మెద. 3 శ్రేణి. 4. చెలికత్తె. 5. ఆనకట్ట.

**ఆలింగనము** సం. వి. కౌగిలింత.

ఆలించు వై. క్రి. విను, ఆలకించు,

ఆళిగొను క్రి. 1. అపహాసించు. 2. తక్కువ పరచు.

ఆలిచిప్ప వి. ముత్తెపు చిప్పవంటి ఒకరకపు గుల్ల, వత్తగుల్ల.

ఆలీఢము సం. విణ. 1. నాకబడినది, ఆస్వాదితము. 2. గాయపడినది. వి. విలుకాడు బాణప్రయోగ సమయమున కుడికాలు ముందరికి చాచి నిలుచుట.

ఆలు[1] వి. 1. స్త్రీ. (ఉదా. బాలెంతరాలు, గుణవంతురాలు మొ వి.). 2. భార్య.

ఆలు[2] వి. బహు. ఆవులు.

ఆలు[3] హిం.వి. బంగాళాదుంప, ఉర్లగడ్డ.

ఆలోకనము సం. వి 1. చూచుట. 2. చూపు. 3. కాంతి

ఆలోచన సం. వి. 1. చూచుట. 2. ఆలోచించుట, యోచన, తలంపు.

ఆలోలము సం. విణ. 1. చంచలమైనది, 2. ఆసక్తమైనది.

ఆల్గి ఇం.వి. (జీవ.) (Algae) 1. నీళ్ళలోను తడి గోడలమీద చెట్ల కొమ్మల మీద పెరుగు జీవులు. 2. ప్రాకుడు.

ఆల్డర్‌మాన్ ఇం.వి. (రాజ.) (Alderman) ఇంగ్లాండ్, ఐర్లాండ్ మునిసిపల్ సంఘములలోని గౌరవసభ్యుడు.

ఆల్బుమిన్[1] ఇం.వి. (వృక్ష.) (Albumin or endosperum) అంకురచ్ఛదము, బీజపోషకపదార్థము, భ్రూణము పెరుగుటకు భ్రూణస్యూనములో ఏర్పడిన ఆహారము.

ఆల్బుమిన్[2] ఇం. వి. (Albumin) ఆహార పదార్థములలో ముఖ్యముగాపాలలోను, గ్రుడ్డులోను గల ఒకరకపు మాంసకృత్తు.

ఆల్బుమిన్ రహితబీజములు మి.వి. (వృక్ష.) ఆల్బుమిన్ విడిగాలేక బీజదళములలో చేరియున్నగింజలు(Exalbiminous seeds or exendospermous seeds)..

ఆల్బుమిన్ సహితబీజములు [illegible] ఆల్బుమిన్ వేరుగా [illegible] నున్న గింజలు (Albuminous or endospermous seeds).

ఆవ వి. 1 ఆవగింజ. 2.బాడవ. పల్లపునేల. 3. చీడ. 4 జ్ఞాపకము.

ఆవజము వై వి. రుంజ అను ఒక వాద్యము. ఆరజము, సం. ఆవాద్యమ్.

ఆవటము వి. పొందిక. విణ పొందికైనది.

ఆవటిల్లు క్రి. 1 పొందుపడు, 2. కలుగు. 3. (వ్యావ ) మిక్కిలి దుఃఖించు.

ఆవడ వి. 1. ఆమవడ. 2. చేదుబీర.

ఆవడి వి. 1. ఉపద్రవము. 2 బాధ. రూ. హావడి.

ఆవపోఋ క్రి. 1. జ్ఞప్తికివచ్చు. 2. తోచు.

ఆవమల్లె వి. (వ్యవ.) సంపూర్ణ పరపుష్టము లగు మొక్కలలో ఒకటి. ఇది ఆవ, గోబిమొ, మొక్కలనుండిఆహారమును గ్రహించుచు వానిని క్షీణింపజేయును(Orobanche indica).

ఆవము పై. వి. కుండలు, అటికలు మొ.ని దొంతరగా పేర్చి కాల్చుచోటు, కుమ్మర ఆవము, ఇటుకలు కాల్చుచోటు, సం. ఆవాపః.

ఆవరణ సం.వి. (వ్యవ.) వ్యవసాయదారుడు పశువుల నుండి, దొంగలనుండి పొలమును కాపాడుకొనుటకు దానిచుట్టునుఏర్పరచుకొను నిర్మాణము, కంచె (Fence)

ఆవరణము సం.వి. 1.ఇంటిచుట్టు ప్రదేశము 2. మూత. 3. కప్పు. 4. ప్రాకారము. 5. రక్షణ సాధనము. 6. అడ్డు. 7.డాలు

ఆవర్జా హిం.వి. ప్రతి దినపులెక్క, దినసరి లెక్క. (అర్థ.) రాబడి వ్యయములను తెలియజేయు రోజువారీ పద్దుల పుస్తకము (Ledger).

ఆవర్త(ము) నం. విశే. (రసా., భౌతి.) తిరిగి తిరిగి అదేస్థితికి సమయావధులలో వచ్చునట్టిది (Periodic).
ఆవర్తకము నం. వి. (గణి.) (రాత్రింబవళ్ళ వలె) తిరిగి తిరిగి వచ్చునది (Recurring)
ఆవర్తక్రమపట్టి నం. వి. (రసా.) చూ ఆవర్తక్రమము వర్గీకరణము (Periodic table).
ఆవర్తక్రమ వర్గీకరణము నం. వి. (రసా.) మూలద్రవ్యములను వాటి పరమాణ్వంకముల వరుసలో అమర్చి అచ్చటచ్చట తొలి మూలద్రవ్య ధర్మముల పర్యాయ ప్రదర్శనమును చూపు వర్గీకరణము (Periodic classification)
ఆవర్తత నం. వి. (రసా.) ఒక సంఘటన పర్యాయత్వము ప్రకటించుట (Periodicity).
ఆవర్తనము నం. వి 1. గిరగిర తిరుగుట. 2. చిలుకుట. 3. మరలుట. 4. పారమును వల్లించుట. 5. త్రిప్పుట.
ఆవర్తపత్రము నం వి. (వృక్ష.) ఒకే కణుపు దగ్గర చుట్టును మూడుగాని అంతకంటె ఎక్కువగాని ఉన్న ఆకులు(Whorled leaves)
ఆవర్తము నం. వి. 1. చుట్టుతిరుగుట. 2. నీటిసుడి. 3. వెంట్రుకలసుడి. 4. ప్రళయకాల మేఘము. 5. పాఠము వల్లెవేయుట. 6. భార్యను కోల్పోయినవాడు చేసికొను ద్వితీయ వివాహము (కొన్ని ప్రాంతములందు ఈఅర్థములో వాడుదురు. 7. (వృక్ష.) వలయాకారముగ అమర్చబడిన ఒకేమాదిరి అవయవముల సమూహము (Whorl)
ఆవర్తరూపము నం. విశే. (వృక్ష.) ఆవర్తము వలె అమర్చబడినది Whorled).
ఆవర్తి నం. విశే. (భౌతి.) ఆవృత్తికి సంబంధించినది (Periodic).
ఆవర్తిత్వము నం. వి. (భౌతి.) ఒక సంఘటన అదేరూపమున తిరిగి తిరిగి సంభవించుచుండుట (Periodicity).
ఆవల వి. 1 ఆప్రక్క. 2. (దేశకాలములందు) అనంతరము.
ఆవలి[1] నం. వి. 1. పంక్తి. 2. సమూహము. రూ. ఆవళి.
ఆవలి[2] వి. ఉపద్రవము, బాధ. రూ. ఆవడి.
ఆవలు వి. ఆవగింజలు. రూ ఆవాలు.
ఆవశ్యకము నం. వి. అక్కర. విశే. అక్కరైనది. అగత్యమైనది, ముఖ్యమైనది.
ఆవళి వి. 1. సమూహము. 2. బాధ. రూ. ఆవలి.
ఆవాపము నం. వి. 1. విత్తుట. 2. ధాన్యాదులుంచెడి ప్రాంతము. 3. పాదు.
ఆవాలు వి. (వ్యవ.) సాసువులు, సంబార ద్రవ్యములలో ఒకటి. Cruciferae అను కుటుంబమునకు చెందిన ఆవ మొక్క, గింజలు (Mustard)-
ఆవాసము నం. వి. ఇల్లు.
ఆవాహనము నం. వి. 1. పిలుపు. 2. మంత్రములచే దేవతలను పిలుచుట. 3. మంత్రోచ్చారణచే దైవశక్తిని విగ్రహాదులందు నిలుపుట. వ్యతి. ఉద్వాసనము, విసర్జనము
ఆవి[1] వి. శ్వాసము, ఊపిరి. 2. తాపము. 3. ఆవిరి. 4. చీడ.
ఆవి[2] నం. వి. 1. ప్రసవవేదన. 2. రజస్వల. 3. చూలాలు.
ఆవిరి వి. బాగుగ కాచిన నీటి నుండి లేచు ఊష్మము, ఆవి (Steam).
ఆవిర్భవము నం. విశే. పుట్టుక. రూ. ఆవిర్భావము.
ఆవిలము నం. విశే. 1. కలుషమైనది. 2. కలకబారినది (నీరు మొ.వి). 3. నల్లనిది.

**ఆవిష్కరణము** సం. వి. ప్రకటనము, వెల్లడి చేయుట.

**ఆవిష్కరించు** సం. క్రి. ప్రకటించు, వెల్లడిచేయు.

**ఆవు** వి. గోవు.

**ఆవురు** వి. రోదనధ్వని (ఆవురుబావు రని ఏడ్చుట).

**ఆవులించు** క్రి. 1. జృంభించు, ఆవులింత విడుచు. 2. పగులు. రూ. ఆవులించు.

**ఆవులింత** వి. ఆవులించుట. రూ. ఆవలింత.

**ఆవృతము** సం. విశే. 1. ఆవరింపబడినది కప్పబడినది, ఉదా. మేఘావృతము. 2. (ప్రాకారాదులచే) చుట్టుకొనబడినది.

**ఆవృత్తము** సం. విశే. 1. తిరుగుడు పడినది. 2. వల్లింపబడినది. 3. మరలినది. 4. వెనుదీసినది.

**ఆవృత్తి** సం. వి. 1. తిరుగుట. 2. వల్లెవేయుట, కంఠపాఠముచేయుట, 3. వెనుదీయుట. 4. తడవ. 5. (భౌతి.) ఒక సెకండులో సంభవించుకంపనముల సంఖ్య 6. పౌనఃపున్యము(Frequency).7.ఏ కాల వ్యవధి అంతమున సంఘటనలు పూర్వ క్రమముననే సంభవించునో అట్టి కాలవ్యవధి (Period). (భౌతి. రసా.) 1. ఒకే వరుసలో సంఘటనలు తిరిగి తిరిగి సంభవించుటకు అగు కాలవ్యవధి. 8. లోలకము వంటి ఒక వస్తువు యొక్క ఒక పరిపూర్ణకంపనమునకు పట్టుకాలము. 9. పౌనఃపున్యమునకు వ్యుత్క్రమ సంఖ్య. 10. ఆవర్త క్రమపట్టికలో అడ్డ వరుసలో అమర్చబడిన మూలద్రవ్యముల పరంపర. 11. భూగర్భశాస్త్రీయకాలము యొక్క ప్రధానఖండము.

**ఆవేగము** సం. వి. 1. తొట్రుపాటు. 2. చింత. 3. చిత్తసంభ్రమము.

**ఆవేదనము** సం. వి. 1. తెలియచేయుట. 2. వ్యాజ్యముతెచ్చుట. 3. వ్యాజ్యము.

**ఆవేశనము** సం. వి. 1. చొచ్చుట. 2. చొనుపుట. 3. పిశాచాదులు ఆవేశించుట. 4. శిల్పశాల. 5. పట్టెడ. 6. కోపము.

**ఆవేశపూరితము** సం. విశే. ఆవేశముతో నిండిన. 2. భావపూరితమైన. 3. మనోవికార సంబంధమైన.

**ఆవేశము** సం. వి. 1. ప్రవేశము. 2. పిశాచాదులు సోకుట. 3 వేగిరపాటు. 4. చలము. 5. గర్వము. 6. కోపము. 7. (భౌతి.) ఒక వస్తువుపై ప్రోగైన విద్యుద్రాశి (Charge)

**ఆవ్యూహము** సం. వి. (గణి.) సమానమైన వరుసలుగా వ్రాయబడిన కొన్నిరాసుల సముదాయము.

**ఆశ** సం. వి. 1. కోరిక. 2. దిక్కు.

**ఆశంసనము** సం. వి. 1. ఇచ్ఛ. 2. చెప్పుట, తెలుపుట.

**ఆశము** సం. వి. 1. తినుట. 2. అన్నము. 3. వ్యాప్తి.

**ఆశయము** సం. వి. 1. తలపు. 2. మనస్సు. 3. పడుక. 4. మృగములను పట్టుటకై వేటకాండ్రుత్రవ్వుగోయి. 5. ఆధారము. 6. స్థానము. 7. (వైద్య.,) దేహమునందలి శ్లేష్మాదుల స్థానము. ఉదా. పిత్తాశయము, మూత్రాశయము మొ.వి

**ఆశాసనము** సం. వి. 1. ఆశీర్వచనము, దీవన. 2. కోరుట, ప్రార్థించుట.

**ఆశి** సం. వి. పాముకోర (ఆశీవిషము, కోరయందు విషముకలది, పాము). విశే. తినువాడు. ఉదా. మాంసాశి మొ. వి.

**ఆశియా, ఆగ్నేయాశియా ఆర్థిక సంఘము** మి. వి. (అర్థ. రాజ.) ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యమున ఆశియా, ఆగ్నేయాశియా ఆర్థిక పునరుద్ధారణకై క్రి. శ. జూన్

1947వ సంవత్సరములో ప్రత్యేకముగ ఏర్పడిన సంఘము.

**ఆశిరుఁడు** సం. వి. 1 అగ్ని. 2. రాక్షసుడు. 3. సూర్యుడు.

**ఆశిస్సు** సం. వి. 1. దీవన. 2 హితము కోరుట. 3. కోరిక. 4. పాముకోర.

**ఆశుకవిత్వము** సం. వి. తలచినంత మాత్రమున వేగముగ ధారాళముగ చెప్పు కవిత్వము. (ఇట్టి కవిత చెప్పువారు ఆశుకవులు).

**ఆశుగము** సం. వి. 1. బాణము. 2. గాలి. వ్యు. వేగముగ పోవునది. రూ. ఆశుగామి.

**ఆశువు** సం. విశే. వేగము కలది,

**ఆశౌచము** సం.వి. అశుచిత్వము. అంటు. మైల ఉదా. (జాతాశౌచము, మృతాశౌచము).

**ఆశ్చర్యము** సం. వి. అచ్చెరువు.

**ఆశ్రమములు** సం. వి. 1. బ్రహ్మచర్యము. 2. గార్హస్థ్యము. 3. వానప్రస్థము 4. సన్న్యాసము.

**ఆశ్రమము** సం. వి. 1. మునుల ఇల్లు. 2. ఆకుటిల్లు. 3. మఠము. 4. బ్రహ్మచర్యాది. 5. పాఠశాల.

**ఆశ్రయము** సం. వి. 1 ఇల్లు. 2. ఆధారము. 3. శత్రువులచే పీడింపబడుచు వారి నాశ్రయించి యుండుట. సంశ్రయము. 4. ప్రాపు. 5. శరణాలయము.

**ఆశ్రితము** సం. విశే. 1. ఆశ్రయింపబడినది. 2. ఆశ్రయించినది.

**ఆశ్రితుఁడు** సం. విశే. ఒకరిమీద ఆధారపడి యుండువాడు. ఆశ్రయించినవాడు.

**ఆశ్లేష** సం. వి ఇరువదియేడు నక్షత్రములలో తొమ్మిదవది.

**ఆశ్లేషము** సం. వి. 1. కౌగిలింత. 2. కూడిక

**ఆశ్వయుజము** సం. వి. అశ్వనీ నక్షత్రముతో గూడిన పున్నమగలమాసము. శరదృతువులోని మొదటి నెల.

**ఆశ్వాసము** సం. వి 1. గ్రంథభాగము 2 ఊరడించుట. 3. బతిమాలుట.

**ఆశ్వికాక్షములు** సం. వి. (భూగో.) స్వల్ప వాయువులు గలిగి, వ్యాపార పవనముల ప్రాంతములకును, పశ్చిమ దిక్కుగ వీచు వాయువుల ప్రాంతములకును నడుమనున్న ప్రదేశము.

**ఆశ్వికుఁడు** సం. వి. గుఱ్ఱపు రౌతు.

**ఆషాఢము** సం.వి. 1. ఆషాఢానక్షత్రముతో గూడిన పున్నమ గల మాసము, చైత్రము మొదలు నాల్గవ నెల. 2. బ్రహ్మచారి ధరించు మోదుగుకోల.

**ఆస** వై. వి. అపేక్ష 2 దిక్కు. సం. ఆశా.

**ఆసంగము** సం. వి. 1. ఆసక్తి. 2. పట్టుదల. 3. సంబంధము. 4. ఆశ్రయము.

**ఆసత్తి** సం. వి. 1. సంగమము. 2. లాభము. 3. అన్వయానుకూలముగా పదములు దగ్గరగా నుండుట.

**ఆసనము** సం. వి. 1. పీఠము. 2. దేశకాలాదులను పట్టి దండెత్తిపోక నిల్చియుండుట (వ్యతి.) యానము. 3. యోగాసనము.

**ఆసనాస్థి** సం. వి. (శం.) తుంటి ఎముకలలో ఒకటి (Ischium).

**ఆసన్నము** సం. వి. దాపు. విశే. సమీపము, దగ్గరనున్నది. (గణి.) కచ్చితపు విలువకు సమీపమున ఉన్నది. (మూ. స్థూలము) (Approximate).

**ఆసరా** వై. వి. ప్రాపు, ఆశ్రయము, అండ. సం. ఆశ్రయః.

**ఆసవము** సం. వి, 1. కల్లు. 2. పూదేనె. 3. ద్రాక్షాసవము మొ. పానీయములు.

**ఆసాది** వి. 1. మాదిగవాడు, మతంగుడు. 2. గ్రామదేవతను పూజించు పూజారి

**ఆసామి** హిం. వి. వ్యక్తి. మనుష్యుడు.

**ఆసీనుఁడు** సం. విశే. కూర్చున్నవాడు.

**ఆసు**[1] వి. నేతపనిలో పడుగుతోడుటకు ఉపయోగించెడు చట్టము. సాలెవాని ఉపకరణము.

**ఆసు**[2] ఇం.వి. (Ace) పేకాటలో ఒకముక్క.

**ఆసుపోయు** క్రి. పోగువాటించు, నూలు ఆసునతోడు.

**ఆసురము** సం.వి. దన మిచ్చి కన్యను కొని చేసికొనెడి పెండ్లి. అష్టవిధ వివాహములలో ఒకటి. విణ. అసురులకు సంబంధించినది.

**ఆసురుఁడు** సం. వి. 1. నిర్బృతి. రాక్షసుడు.

**ఆసేకము** సం. వి. 1. తడుపుట. 2. చల్లుట

**ఆస్కందనము** సం. వి. 1. యుద్ధము. 2. తిరస్కారము. 3. ముట్టడి. 4. ఒక రకపు అశ్వగతి. 5. హింసించుట.

**ఆస్కందితము** సం. వి. అతివేగముగా పారెడి అశ్వగతి. విణ. ఆక్రమింపబడినవి.

**ఆస్కారము** వి. ఆధారము. అవకాశము

**ఆస్టోమలేషియా** ఇం. వి. (Ostomalacia) ఎముకల బలహీనత (సాధారణముగ ఇది చాలమంది పిల్లలను కన్న తల్లులకును, ఎండ తగులని స్త్రీలకును కలుగువ్యాధి)

**ఆస్తరణము** సం. వి. 1. పరచుట. 2. పరచెడి కంబళి మొ. 3. చిత్రకంబళి. 4. ఏనుగు మీద పరచెడి కంబళి. 5. పరుపు.

**ఆస్తి** వి. సంపాదించిన భూమి, ధనము మొ.వి., సొత్తు.

**ఆస్తిక వేదాంతము** సం. వి. (వేదాం.) వేదములను ప్రమాణములుగా తీసికొను తత్త్వశాస్త్రము. (పూర్వ మీమాంస, ఉత్తరమీమాంస. సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయ, వేదాంతములు).

**ఆస్తికుఁడు** సం. వి. దేవుడు కలడు, పరలోకముకలదు అని నమ్మువాడు. వ్యతి. నాస్తికుడు.

**ఆస్తిపరుఁడు** వి. స్థితిమంతుడు, ధనవంతుడు.

**ఆస్తీనియా** ఇం. వి. (గృహ.) (Asthenia) బలము తగ్గుట లేక బలము లేకపోవుట.

**ఆస్థ** సం. వి. 1. ఉనికి. 2. ప్రయత్నము. 3. కోరిక. 4. శ్రద్ధ, 5. సభ.

**ఆస్థానము** సం. వి. సభ. రాజసభ, సభామండపము.

**ఆస్పదము** సం. వి. 1. నెలవు. 2. పని. 3. గొప్పపదవి.

**ఆస్పరేగస్ శిల** మి వి. (భూగ.) (Asparagus stone) అపటైట్ సంబంధమగు ఒకశిల.

**ఆస్ప్రిన్** ఇం వి. (రసా) (Aspirin) అసటిల్ శాలిసిలికామ్లముతో చేయబడినమందు(ఇది కీళ్ళ నొప్పుల [illegible])

**ఆస్ఫాలనము** [illegible]

**ఆస్ఫోటన** [illegible] 2. చీలిక. 3. [illegible] పోటు. 4. [illegible] టప్పరించుట. 5. బయలుపరచుట. 6 వికసించుట. 7. ధాన్యములు పొట్టుపోవునట్లు చెరుగుట.

**ఆస్యము** సం. వి. 1. ముఖము. 2. నోరు. విణ. 1. నోట నున్నది. 2. ముఖమున ఉన్నది.

**ఆస్రము** సం. వి. 1. [illegible] 3. [illegible]

**ఆస్వాదనము** [illegible] 2. [illegible]. చూ. ఆస్వదనము.

**ఆహకము**[1] వి. కుదువ, తాకట్టు. చూ. ఆయకము.

**ఆహకము**[2] సం. వి. ముక్కున గలుగు ఒక రోగము.

**ఆహతము** సం. విణ. 1. కొట్టబడినది. 2. వాయింపబడినది (మద్దెల మొ.వి.). 3. (గణి.) గుణింపబడినది (సంఖ్య.) వి. 1. ఢక్క. 2. క్రొత్తవస్త్రము. 3. ప్రాతవస్త్రము. 4. (సంగీ.) గమకభేదము.

**ఆహరించు** సం. క్రి. 1. అపహరించు. 2. ఆకర్షించు. 3. భుజించు.

**ఆహర్త** సం. విణ. 1. అపహరించువాడు, దొంగ. 2. తెచ్చువాడు. 3.గడించువాడు.

**ఆహవనము** సం. వి. 1. యజ్ఞము. 2. హోమము.

**ఆహవనీయము** సం. విణ. హోమము చేయదగినది (హవిరాది). వి. త్రేతాగ్నులలో ఒకటి. (తక్కిన రెండు: 1. దక్షిణాగ్ని. 2. గార్హపత్యాగ్ని).

**ఆహవము** సం. వి. 1. యుద్ధము. 2 యజ్ఞము.

**ఆహా** వై. అవ్య. ఆశ్చర్యార్థకము.

**ఆహారకోశ విషములు** సం వి. (వ్యావ.) మొక్కల భాగములను తిను పురుగుల కడుపులోనికి పోయి వానిని చంపు విషద్రవ్యములు (Stomach poisons)

**ఆహారనాళిక** సం. వి. (జం) [illegible]రపు గొట్టము, గొంతునకును [illegible] నకునుమధ్యనున్న [illegible] (A[illegible] opnagus)

**ఆహారము** సం.వి. 1.[illegible] పదార్థము. 2. అపహరణ[illegible] 3. తెచ్చుట

**ఆహార్యకము** సం వి. నాట్యమున పాత్రోచిత వస్త్రాభరణములు ధరించుట.

**ఆహార్యము** సం విణ. 1. తెచ్చుకొనదగినది. 2. అపహరింపదగినది. 3. ఆకర్షింపదగినది. 4. కృత్రిమము. 5. భక్షింపదగినది. వి. 1. ఊడదీయుటచే చికిత్స చేయదగిన రోగము (దంతరోగాది). 2. ఒక విధమగు అభినయము.

**ఆహికము** సం. వి. 1. వంతుజ్వరము. 2. ఒకరకపు సుషిరవాద్యము (సన్నాయి మొ.వి.) 3. ధూమకేతువు.

**ఆహోపురుషిక** సం.వి. గర్వముచే తన్ను గొప్పగా సంభావించుకొనుట. బడాయి, కయ్యమున శత్రువును దూషించి, తన్ను పొగడికొనుట. రూ. అహోపురుషిక.

**ఆహ్నికము** సం. విణ. 1. పగలు చేయతగినది. 2.పగలు జరుగునది. వి.1. పగలు చేయదగిన కర్మము. 2. మహాభాష్య ప్రకరణము.

**ఆహ్లాదము** సం.వి. సంతోషము.

**ఆహ్వ** సం వి పేరు, నామధేయము. రూ. ఆహ్వాయము.

**ఆహ్వాయము** సం వి. 1. పేరు. నామధేయము. 2. ప్రాణిద్యూతము, (కోడి పందెము మొ) పందెము.

**ఆహ్వానము** సం. వి. పిలుపు.

[illegible] వి. 1. పంక్తి. 2. చెలికత్తె. 3 [illegible] సమూహము. 5. అనకట్ట.

[illegible] వి. నుత్తెపుచిప్పవంటి ముండ్లచే కప్పబడిన ఒకరకపు పంది. రూ. ఆళువ.

**ఆళువరి** వి. అలింగము, వప్రము. రూ. ఆలువరి, ఆడువరి.

**ఆళువారు** వి. 1. హరిభక్తుడు, 2. గరుత్మంతుడు. రూ. ఆళ్వారు.

**ఆళ్వారు** వి. చూ. పై.

**ఆళ్ల** వి అరుకలు అను ధాన్యము, అరుగలు

# ఇ

**ఇ** అచ్చులలో మూడవ అక్షరము.

**ఇంకు** క్రి. 1. నేల మున్నగు వానిలో (ద్రవపదార్థములు) ఇగిరిపోవు. 2. వట్టిపోవు, ఎండు. 3. నశించు. 4. కృశించు. రూ. ఇనుకు.

**ఇంకువ** వి. 1. స్థానము, ఇక్కువ. గురుతు.

**ఇంక్విజిషన్ సభలు** మి. వి. (చరి) (Inquisition) ధర్మవిచారణసభలు. క్రీ.శ.17వ శతా.లో రోమన్ కాథలిక్ ధర్మాధికారులు రోమన్ సిద్ధాంతములను ఎది

రించిన వారిని విచారణచేసెడి సభలు, (ఈసభలు స్పెయిన్ పోర్చుగల్ చక్రవర్తి అయిన '2వ ఫిలిప్' ఆధ్వర్యమున చాల ప్రాబల్యము పొందినవి).

ఇంగలము వై. వి. నిప్పు, సం. అంగారః.

ఇంగాలము సం.వి. బొగ్గు. అంగారము.

ఇంగితము సం. వి. 1. హృద్గతాభిప్రాయము. 2 హృద్గతాభిప్రాయమును తెలుపు చేష్ట. 3. కదలిక. విశ. కదలినది.

ఇంగిలము వై వి. చూ. ఇంగాలము.

ఇంగిలికము వై. వి. ఎఱ్ఱని ఖనిజము (దీనిని ఔషధములకు ఉపయోగింతురు) రూ. ఇంగిలీకము. సం. హింగుళమ్.

ఇంగిలీకము వై. వి. 1. ఇంగిలికము. 2. ఎఱ్ఱమూతిజాతి కోతి.

ఇంగుదము సం. వి. గారచెట్టు రూ. ఇంగుది.

ఇంగుది సం. వి. చూ. పై.

ఇంగువ వై. వి. ఇది Umbelliferac అను కుటుంబమునకు చెందిన (Fertula alliacea, F. foetida అను) మొక్కల వేళ్ళ నుండి తీయబడు జిగురు ద్రవ్యము. ఇది సంబారపు వస్తువుగను, ఔషధముగను ఉపయోగపడుచున్నది. సం. హింగుః.

ఇంచు[1] క్రి. 1. ఇంపగు, పియమగు, మనోజ్ఞమగు. 2. సంతోషించు. 3. ఒప్పు అతిశయించు. 4. అభిలషించు.

ఇంచు[2] వై. వి. 1. చెరుకు. సం. ఇక్షుః. 2. ప్రేమము. ప్రణయము.

ఇంచుబోడి వి. స్త్రీ. ఇంపగుస్త్రీ.

ఇంచుక అవ్య. కొంచెము.

ఇంచుమించు అవ్య. సుమారు, రమారమి. దా దాపు.

ఇంచువిల్తుకాఁడు వి. మన్మథుడు. వ్యు. చెరకువిల్లుకలవాడు.

ఇంచువిల్తుఁడు వి. చూ. పై.

ఇంజనీరు ఇం. వి. (Engineer) ఇండ్లు వంతెనలు మొ. వానికి సమూనాలు తయారుచేసి నిర్మించువాడు.

ఇంటరము వి. 1. ఇరుకు. 2. సంకటము. 3. సమ్మర్దము. రూ. ఇంట్రటము.

ఇంటర్‌డిక్ట్ ఇం. వి. (చరి.) (Interdict) బహిష్కార పత్రిక, మధ్యయుగములో క్రైస్తవమతాచార్యులుజారీచేసినఆజ్ఞలు

ఇంటాతఁడు వి. భర్త. రూ. ఇంటియాతడు.

ఇంటికాఁపు వి. గృహస్థుడు.

ఇంటిపట్టు వి. 1. గృహాస్థ ధర్మము. 2. స్వగృహము. 3. నివేశన స్థలము. 4. ఇంటి దగ్గర.

ఇంటిపాప వి. వెలకు కొన్న దాసి. జానిస స్త్రీ.

ఇంటిల్లపాది అవ్య. ఇంటిలో నుండు వారందరు.

ఇంట్రటము వి. చూ. ఇంటరము.

ఇండు వి. ఈతచెట్టు.

ఇండె వి. 1. పూదండ. 2. ఎముక కీలు. 2. చీలిక.

ఇండెంట్ ఇం. వి. (వాణి.) (Indent) కొను వాడు పంపు పట్టీ, (దీనిలో సరకుల పేర్లు వాని విలువలు చూపును), క్రయాదేశము.

ఇండో గ్రీకులు ఇం. వి. (చరి.) (Indo-Greeks) ఇండియాను పాలించిన గ్రీకులు

ఇంత సర్వ. 1. ఈ కొలదిది, ఈసమయము, ఇది అంతయు. అవ్య. 1. అధికముగా. ఎక్కువగా. 2 కొంచెము. 3. ఇక్కడ. 4. ఈమీదట.

ఇంతలు సర్వ. ఇంతలేసి. (సందర్భాను సారముగ ఆధిక్యమును అల్పత్వమును సూచించును).

ఇంతవట్టు వి. 1. ఇంత పర్యంతము, ఇంత వరకు. 2. ఇంత కాలము. 3. ఇంత మాత్రము.

**ఇంతవది** వి. చూ. ఇంతవట్టు.

**ఇంతి** వై. వి. 1. స్త్రీ. 2. భార్య. 3. చెలికత్తె. సం. స్త్రీ. ప్రా. ఇత్థి. ఇత్థియ.

**ఇంద** అవ్య. ఇదిగో తీసికొనుము. రూ. ఇందము.

**ఇందనుక** అవ్య. ఇంతవరకు.

**ఇంది** సం. వి. లక్ష్మి. రూ. ఇందిర.

**ఇందిందిరము** సం. వి. తుమ్మెద.

**ఇందిర** సం. వి. లక్ష్మి.

**ఇందీవరము** సం. వి. 1. నల్లకలువ. 2. నీలితామర.

**ఇందు** క్రి. 1. అణగు. ఇముడు. అవ్య. ఇచ్చట. ఈలోకమున.

**ఇందుఁడు** సం. వి. చంద్రుడు.

**ఇందుగు** వి. చిల్లగింజ. రూ. ఇందువు.

**ఇందుప్పు** వి. సైంధవలవణము, రాతిఉప్పు.

**ఇందువారము** సం. వి. సోమవారము.

**ఇందువు** వి. చూ. ఇందుగు.

**ఇంద్రగోపము**—వి. ఆరుద్రపురుగు.

**ఇంద్రజాలము** సం. వి. 1. కనుకట్టు విద్య. 2. మాయ. 3. మోసగించుట.

**ఇంద్రజిత్తు** సం. వి. మేఘనాథుడు, రావణుని కొడుకు. వ్యు. ఇంద్రుని జయించినవాడు.

**ఇంద్రధనుస్సు** సం. వి. (భౌతి.) సూర్యకిరణములు నీటి బిందువులపై బడి పృథక్కరణము చెందునపుడు ఏర్పడు వర్ణమాల. హరివిల్లు, కొఱ్ఱు (Rainbow).

**ఇంద్రనీలము** సం. వి. నీలమణి.

**ఇంద్రలుప్తకము** సం. వి. 1. బట్టతల. 2. తల వెండ్రుకలూడిపోవు ఒక రోగము. రూ. ఇంద్రలుప్తము.

**ఇంద్రాణి** సం.వి. ఇంద్రుని భార్య. శచీదేవి,

**ఇంద్రావరజుఁడు** సం.వి. ఇంద్రునితమ్ముడు. ఉపేంద్రుడు. విష్ణువు.

**ఇంద్రియజ్ఞానము** సం. వి. ఇంద్రియముల ద్వారా విషయము తెలిసికొనుట, ప్రత్యక్షజ్ఞానము (Perception).

**ఇంద్రియము** సం. వి. 1. త్వక్చక్షురాది జ్ఞానేంద్రియ కర్మేంద్రియములలో ఒకటి. 2. రేతస్సు. 3. ఐదు అను సంఖ్య.

**ఇంద్రుఁడు** సం. వి. 1. దేవతలరాజు. 2. సమాసోత్తర పదమైనపుడు శ్రేష్ఠుడు. ఉదా. రాజేంద్రుడు.

**ఇంధనము** సం. వి. వంట చెరకు, (రసా.) 1. నిప్పుచేయుటకు ఉపయోగించు ద్రవ్యము (Fuel). ఉదా. కట్టెలు, బొగ్గు మొ. వి. 2. (Feul) మండి వేడి నిచ్చెడి పదార్థము.

**ఇంధనవాయువు** సం. వి. (రసా.) ఇంధనముల నుండి లభ్యమగు వాయువు (Fuel gas). ఇది కూడ జ్వలించు స్వభావము కలది (వస్తువులను వేడిచేయుట కుపయోగించును) ఉదా. ప్రయోగశాలలందు రాతి నూనె నుండిగాని రాతిని బొగ్గు నుండి గాని తయారుచేయబడు వాయువు.

**ఇంపితము** విశే. ఇంపైనది.

**ఇంపు** వి. 1. ఇచ్ఛ. 2. ఆనందము 3. మనోజ్ఞత. విశే. ఇష్టము, ప్రియము.

**ఇఁక** అవ్య. ఈ మీద, ఇటుపైని. రూ. ఇఁగ. ఇంక.

**ఇక్క** వి. 1. ఇల్లు 2. సంకేత స్థలము. 3. చోటు.

**ఇక్కట్టు** వి. 1. ఆపద, సంకటము. విశే. ఇరుకైనది.

**ఇక్కడ** వి. ఈ చోటు.

**ఇక్కము** వి. ఇరుకటము, సంకటము. రూ. ఇక్కు, ఇఱుకు,

**ఇక్కు** వి. ఇరుకు. 2. సంకటము. 3. నడుము.

**ఇక్కువ** వి. 1. ఉనికి. 2. చోటు. 3. సంకేతస్థలము. 4. కళాస్థానము 5. జాడ.

**ఇక్షువు** సం. వి. చెరకు.

**ఇక్షుధన్వుఁడు** సం. వి. చెరకు విలుకాడు, మన్మథుడు.

**ఇక్షువనము** సం. వి. చెరకుతోట.

**ఇక్షుశర్కర** సం. వి. (రసా.) చెరకునుండి తయారైన చక్కెర (Sucrose).

**ఇక్షూదము** సం. వి. చెరకు సముద్రము.

**ఇగము** వై. వి. 1. మంచు. 2. శైత్యము, చల్లదనము. రూ. ఇవము, ఈము. సం. హిమమ్.

**ఇగిరిక** వి. 1. హావిస్సు. 2. అత్తెసరు. రూ. ఇగిరికె.

**ఇగిలించు** క్రి. పండ్లుచూపు. రూ. ఇగులుచు. ఇవులుచు, ఇవుల్చు. ఇగుల్చు.

**ఇగురఁబెట్టుట** వి. (రసా.) ద్రవపదార్థములో ఉన్న ఘనపదార్థములను వేరు చేయుటకు ద్రవమును ఆవిరి రూపమున తీసివేయుట (Evaporation).

**ఇగురు** వి. 1. చిగురు, పల్లవము. 2. పండ్ల చుట్టును మృదువుగా నుండెడి కండ. రూ. ఇవురు.

**ఇగురుఁబోఁడి** వి. చిగురువంటి మేనుగల స్త్రీ, చక్కని స్త్రీ.

**ఇగురుట** వి. నెమ్మదిగా బాష్ప మగుట (Evaporation).

**ఇగులుచే** క్రి., చూ. ఇగిలించు.

**ఇగో** అవ్య. ఇదిగో.

**ఇగ్గు** క్రి. వెనుకకు ఒరగు, లాగు. రూ. ఈగు.

**ఇగ్గులాడు** క్రి. ఒకరినొకరు లాగుకొను, పెనగులాడు. వెనుకకు లాగు.

**ఇచటు** వి. ఈ స్థలము. రూ. ఇచ్చటు. ఇచ్చోటు, ఇచ్చోటు.

**ఇచ్చ** వై. వి. 1. కోరిక. 2. చిత్తము. సం. ఇచ్ఛా.

**ఇచ్చకము** వి. 1. ముఖప్రీతి, ముఖస్తుతి. 2. ప్రియవచనము. విశే. ప్రియము, ప్రీతికరము.

**ఇచ్చకాలమారి** వి. ఇచ్చకాలాడువాడు. ముఖస్తుతి చేయు స్వభావము కలవాడు.

**ఇచ్చగొండి** విశే. ఇచ్చకాలమారి.

**ఇచ్చటు** వి. చూ. ఇచటు.

**ఇచ్చు** క్రి. 1. ఒసగు. 2. దానముచేయు,

**ఇచ్చోటు** వి. చూ. ఇచటు.

**ఇచ్చో** అవ్య. ఈ స్థలమునందు,

**ఇచ్చోటు** వి. చూ. ఇచటు.

**ఇచ్ఛ** సం. వి. అభిలాష, కోరిక.

**ఇజారాదారు** హిం. వి. (చరి.) శాశ్వతమైన శిస్తువిధానము ప్రవేశ పెట్టక పూర్వము, కొన్ని సంవత్సరముల వరకు భూమి కౌలుకు తీసికొని రైతులవద్ద పన్ను వసూలుచేసి ప్రభుత్వమునకు శిస్తుకట్టెడి ఆసామి.

**ఇజాకు** వి. శ్రమము. సంకటము. ఇక్కట్టు. ఆపద.

**ఇటిక** వై., వి. మట్టితో కాల్చి చేసిన రాయి. రూ. ఇట్టిక, ఇటుక, ఇట్టుక, సం. ఇష్టికా.

**ఇటు** అవ్య. 1. ఈ వైపు. 2. ఈప్రకారము. 3. ఇక్కడికి. రూ. ఇట్లు, ఇటులు.

**ఇటులు** అవ్య. చూ. పై.

**ఇట్టలము** విశే. అధికము. వి. ఆధిక్యము.

**ఇట్టి** విశే. ఇటువంటి.

**ఇట్టిఁడు** విశే. (ఇట్టి+వాడు) ఇటువంటి వాడు.

**ఇట్టు** అవ్య. చూ. ఇటు.

**ఇట్టులు** అవ్య. చూ. ఇటు.

**ఇట్లు** అవ్య. చూ. ఇటు.

**ఇడ** సం. వి. 1. (యోగ) ఒకనాడి. 2. మైత్రావరుణియను పేరుగల బుధుని భార్య. 3. గోవు. 4. వాక్కు. 5. హవిరన్నము. 6. దుర్గాదేవి.

**ఇడి** వి. ఒకరకపు భక్ష్యము, సేమియాలు, త. ఇడి.

**ఇడియు** క్రి. చీలు, పగులు, బ్రద్దలగు.

**ఇడు** క్రి. 1. ఉంచు. 2. ఇచ్చు. 3. పెట్టు. 4. మూయు. 5. నాటు. 6. అలదు. 7. ఆరోపించు. 8. దాచిపెట్టుకొను.
**ఇడుపు** వి. 1. గోడ. 2. చీలిక. 3. గోడ ఇరుపార్శ్వముల మీదిచోటు.
**ఇడుమ** వి. 1. ఆపద. 2. అలసట.
**ఇడ్డెన** వి. వానెనకుడుము.
**ఇతఁడు** సర్వా. ఈతఁడు.
**ఇతము**[1] సం. విశ. 1. పొందబడినది. 2. పొందినది. 3. పోయినది. సం. వి. 1. గతి. 2. జ్ఞానము.
**ఇతము**[2] వై. వి. 1. కోరిక. 2. ఇంపు. రూ. ఇతవు. సం. హితమ్.
**ఇతరము** సం.విశ. 1. అన్యము. 2. నీచము
**ఇతరేతరము** సం.విశ. అన్యోన్యము. పరస్పరము.
**ఇతవరి** వై. విశ. (ఇతవు+అరి) హితము చెప్పువాడు. మేలుకోరువాడు.
**ఇతవు** వై. వి. చూ ఇతము
**ఇతిహాసము** సం. వి. పూర్వచరిత్ర ప్రతిపాదక కావ్యము (Epic).
**ఇత్తడి** వై. వి. ఆరకూట మను లోహము. రూ. ఇత్తమ్, సం పిత్తళమ్. (రసా.) రాగి జింకుల కలయికగల ఒకధాతుమిశ్రమము
**ఇత్తిగ** సర్వా (ఇరు+తిగ) ఆరు. వి.పాచికల మీది మూడు బొట్లజత, దుందుభి (పాచికల ఆటలోని పరిభాష).
**ఇది** సర్వా. 1. ఈవస్తువు, 2. ఈమె. 3.ఈ కాలము. రూ. ఇద్ది.
**ఇద్ది** సర్వా. చూ. ఇది.
**ఇద్దుగ** వి. (ఇరు+దుగ) పాచికమీది రెండు బొట్లజత, నాలుగు.
**ఇద్దుము** వి. (ఇరు+తూములు) రెండు తూములు (ధాన్యపుకొలత).
**ఇద్ధము** సం.విశ. 1. పరిశుద్ధము. 2. కాంతిమంతము. 3. కాల్పబడినది. 4. అడ్డులేనిది. వి. 1. ఎండ. 2. ప్రకాశము. 3. ఆశ్చర్యము.
**ఇధ్మము** సం. వి. 1. సమిధ. 2. చిదుగు. వంటచెరుకు.
**ఇని** సర్వా. ఇన్ని.
**ఇనీషియేటివ్** ఇం. వి. (రాజ. పౌర.) (Initiative) తాము ఎన్నుకొనిన ప్రతినిధులు చేయే చట్టములు శాసనసభలో ప్రవేశపెట్టవలయునో వోటర్లు సూచించుట (ఈపద్ధతి ముఖ్యముగా స్విట్జర్లాండ్ దేశములో ఉన్నది.)
**ఇను** సర్వా. రెండు (సమాసమందే దీనికి ప్రయోగము). ఉదా. ఇనుమారు.
**ఇనుకు** క్రి. చూ ఇంకు.
**ఇనుపఊపిరితిత్తి** వి. (గృహ.) కృత్రిమమైన ఊపిరితిత్తి. దీనిని శస్త్రచికిత్సలో ఉపయోగింతురు (Iron lung).
**ఇనుమడి** వి. రెట్టింపు. ద్విగుణము రూ. ఇన్మడి. ఇమ్మడి. ఇబ్బడి.
**ఇనుమనుమఁడు** వి. మునిమనుమడు. ప్రపౌత్రుడు.
**ఇనుమారు** వి. రెండు మారులు. మిక్కిలి.
**ఇనుము** వి. ఒక లోహము. కాలాయసము
**ఇనూఱు** సర్వా. (ఇరు+నూఱులు) రెండు వందలు.
**ఇన్ఫ్లేషన్** ఇం. వి. (అర్థ.) (Inflation) ద్రవ్యోల్బణము దేశములోని వస్తువుల సముదాయము పెరుగకయే చెలామణి ద్రవ్యము మొత్తము పెరిగిన పరిస్థితి. (ఇందువలన ధరలు పెరిగిపోవును).
**ఇన్మడి** వి. చూ. ఇనుమడి.
**ఇన్స్టాల్మెంట్** ఇం. వి. (Instalment) వాయిదాలప్రకారము చెల్లించు సొమ్ము, కంతు.
**ఇన్స్యులిన్** ఇం. వి. (గృహ.) (Insulin) క్లోమము అను గ్రంథిలో పుట్టిన ఎంజైమ్

శరీరములో ఇది పిండి లేదా చక్కెర పదార్థములను ఆక్సీకరించి శక్తినిచ్చుటకు సాయబడును. (ఇది తక్కువైనచో చక్కెర వ్యాధి కలుగును).

**ఇపుడు** వి. 1. ఈ సమయము. 2. ఈ కాలము. ధ్యా. ఇప్పుడు, ఇప్డు.

**ఇప్డు** వి. చూ. పై.

**ఇప్ప** వి. మధూక వృక్షము:

**ఇప్పుడు** వి. చూ. ఇపుడు.

**ఇబ్బంది** వి. (ఇరు+పంది) 1. అడవి పందికి ఊరపందికిని పుట్టిన పంది. 2. ఇక్కట్టు. 3. నిర్బంధము.

**ఇబ్బడి** వి. చూ. ఇనుమడి.

**ఇభము** సం. వి. ఏనుగు.

**ఇభి** సం. వి. ఆడేనుగు.

**ఇభ్య** సం. వి. ఆడేనుగు. విశే: ఒడయురాలు, రాణి.

**ఇభ్యుడు** సం. వి. 1. ధనికుడు. 2. మావటివాడు.

**ఇముడు** క్రి. 1. పొందుపడు. 2. అణగు. 3. చొచ్చియుండు.

**ఇమ్ము** వి. 1. స్థానము. 2. విరివి. 3. అనుకూల్యము. 4. ఇంపు. 5. ఉపాయము. 6. సుఖము. విశే. 1. అనుకూలము 2. అమ్మూలము. 3. మనోజ్ఞము. 4. యుక్తము. 5. స్పష్టము.

**ఇమ్ముదప్పు** వి. (ఇమ్ము+తప్పు) ఇక్కట్టు సంకటము,

**ఇయ్యకొను** క్రి. సమ్మతించు, అంగీకరించు. రూ. ఈయకొను.

**ఇరవు** వి. చోటు. స్థానము. విశే. స్థిరము.

**ఇరాలు** సర్వ. (ఇరు+ఆలు) పండ్రెండు రూ. ఈరాలు.

**ఇరిణము** సం. విశే. 1. చవుటిది (నేల). 2. పాడైనది. రూ. ఈరిణము.

**ఇరివిలి** వి. పోగరతో చేయబడిన రంధ్రము

**ఇరు** సర్వ. (సమాసమున హల్లు పరమగు నపుడు) రెండు. ఉదా. ఇరుగడ.

**ఇరుఁదలపాము** వి. (ఇరు+తలపాము) రెండు ప్రక్కల తలలుగల పాము.

**ఇరుఁదలపులుఁగు** వి. (ఇరు+తలపులుఁగు) రెండు తలలపక్షి, గండభేరుండము

**ఇరుఁబుట్టువు** వి.(ఇరు+పుట్టువు) 1. బ్రాహ్మణుడు, ద్విజుడు. 2. పక్షి.

**ఇరుగడ** వి. రెండు ప్రక్కలు.

**ఇరుగు** వి. 1. ప్రక్కఇల్లు. 2. ప్రక్క. రూ. ఇరువు

**ఇరుగురు** సర్వ. ఇద్దరు. రూ. ఇరువురు.

**ఇరుతిగ** సర్వ. ఆరు.

**ఇరులు** వి. (ని. బహు.) చీకటి.

**ఇరులుగొంగ** వి సూర్యుడు. వ్యు. చీకటులకు శత్రువు.

**ఇరువండ్రు** వి. ఇరువదిమంది.

**ఇరువది** సర్వ. (ఇరు+పది) రెండుపదులు.

**ఇరువాఁగు** వి. ఉభయసేనలు.

**ఇరువాయి కట్టు** వి. మలమూత్రబంధరోగము

**ఇరువురు** సర్వ. చూ. ఇరుగురు.

**ఇరుస** వి. రెండు కుంచములు. అరతూము

**ఇరుసు** వి. బండి చక్రములకు అడ్డముగ వేయు ఇనుపకడ్డి, అక్షము.

**ఇరెప్సిన్** ఇం. వి. (జం.) (Erepsin) చిన్న ప్రేవుల గోడ నుండి ఊరు సేంద్రియ మండము.(ఇది పక్వ మాంసకృత్తులబ్ధములను అమైనో ఆమ్లములుగా మార్చును).

**ఇఱియు** క్రి. 1. నలగు. 2. కదియు. 3. సన్నగిల్లు.

**ఇఱుకు** క్రి. 1. కొంచెముతావులో అడగు. 2. రెంటి సందున చిక్కియదుముడు వడు. 3. కొంచెము తావున అడచు. 4. రెంటి సందున చిక్కబట్టి అదుము. వి. 1. ఇరుకటము. 2. గొంది.

**ఇఱుకుమ్రాను** వి. పశువులు పోకుండుటకై నాటు పంగలగుంజ.

**ఇఱుము** వి. మరుగు.

**ఇఱ్ఱి** వి. జింక. హరిణము.

**ఇఱ్ఱింకులు** వి. (ఇంకులు+ఇంకులు) మిక్కిలి ఇంకుటలు.

**ఇఱ్ఱిగేషన్ ప్రాజెక్ట్** ఇం. వి. (Irrigation project) నీటి పారుదల యోచన (ప్రణాళిక).

**ఇఱ్ఱిగోరజము** వి. కస్తూరి; మృగమదము.

**ఇఱ్ఱియలు** వి. (ని. బహు.) పార్శ్వము, ప్రక్క.

**ఇల** సం. వి. 1. నేల. 2. బుధుని భార్య 3. ఆవు. 4. మాట. రూ. ఇళ.

**ఇలకలచు** క్రి. 1. పండ్లుబిగించు. 2. ప్రాణము బిగబట్టు.

**ఇలకోడి** వి. ఈలపురుగు.

**ఇలాకా** హిం. వి. సంబంధము. (వ్యావ.) ప్రదేశము.

**ఇలాయి** వి. చుట్టు వత్తులు వేసెడి దివ్వటి.

**ఇలాస్టిక్** ఇం. వి. (గృహ.) (Elastic) సాగుడు గుణముగల త్రాడు లేక బద్దె. స్థితిస్థాపక గుణము గల వస్తువు.

**ఇలు** వి. గృహము. రూ. ఇల్లు.

**ఇలుకు** వి. కీళ్ల నరము బెణుకుట.

**ఇలుగు** క్రి. చచ్చు. రూ. ఈలుగు.

**ఇలుదొర** వి. గృహస్థు.

**ఇలువడి** వి. 1. మంచినడత. 2. కులీనత.

**ఇలువరము** వి. 1. గోడలులేని ఎత్తుడుగుడిసె. 2. పుట్టవంటిగూడ. రూ. ఇలువారము.

**ఇలువరుస** వి. 1. వంశానుక్రమము. 2. గృహశ్రేణి.

**ఇలువారము** వి. చూ. ఇలువరము.

**ఇలువేలుపు** వి. కులదేవత. రూ. ఇలువేల్పు.

**ఇల్లంట్రము** వి. అల్లుడు మామగారియింటనే వాస ముండుట, రూ. ఇల్లటము.

**ఇల్లడ** వి. భద్రపరచి యుంచి అడిగినప్పుడు ఇమ్మని ఏదేనివస్తువును ఒకరివద్ద ఉంచుట. న్యాసము.

**ఇల్లరి** వి. (ఇల్లు+అరి) 1. ఇంటిపన్ను. 2. అద్దె.

**ఇల్లటికము** వి. (ఇల్లు+అటికము). చూ. ఇల్లంట్రము.

**ఇల్లామల్లి** విజ. కొండెగాడు.

**ఇల్లాలు** వి. భార్య. ఇంటియజమానురాలు.

**ఇల్లి** వి. ఉపవాసము.

**ఇల్లిగ్గులు** వి. (ఇగ్గులు+ఇగ్గులు) మిక్కిలి వెనుకకు ఒరగుటలు, అధైర్యము.

**ఇల్లిముక్కు** వి. నెత్తురు కారు ముక్కు రోగము.

**ఇల్లు** వి. చూ. ఇలు.

**ఇవక** వై. వి. శైత్యము, హిమము. సం. మిహికా.

**ఇవతల** వి. 1. ఈవలి ప్రదేశము. 2. ఈ పిమ్మట. రూ. ఈతల.

**ఇవతళించు** క్రి. చల్లనగు. రూ. ఇవతాళించు.

**ఇవము** వై. వి. చూ. ఇగము.

**ఇవల** వి. ఇవతల. రూ. ఇవ్వల. ఈవల.

**ఇవసూడు** వి. సూర్యుడు(ఇవమునకుశత్రువు).

**'ఇ'విటమిన్** ఇం. వి. (గృహ.) (Vitamin E.) సంతానోత్పత్తికి తోడ్పడు విటమిన్. ఇది గోధుమ మొలకలలో ఉండును.

**ఇవురు** క్రి. చూ. ఇగురు.

**ఇవులుచు** క్రి. చూ. ఇగిలించు.

**ఇవుల్చు** క్రి. చూ. ఇగిలించు.

**ఇవ్వల** వి. చూ. ఇవల.

**ఇషణము** సం. వి. ఇచ్ఛ. రూ. ఈషణము.

**ఇషీకము** సం. వి. 1. చిత్తరువు వ్రాసెడి కుంచె. 2. ఏనుగు కనుగ్రుడ్డు. 3. ముండ్లదుబ్బు.

**ఇషుధి** సం. వి. అమ్ములపొది.

**ఇషువు** సం. వి. బాణము.

**ఇష్టక** సం. వి. చూ. ఇటిక.

**ఇష్టదేవత** సం. వి. ప్రియదేవత.

**ఇష్టము** సం. వి. 1. యజ్ఞకర్మము. 2. సంస్కారము. 3. యజ్ఞము. 4. కోరిక. విశ.

1. కోరబడినది, 2. ప్రియమైనది. 3. పూజింపబడినది.

**ఇష్టి** సం. వి. 1. యజ్ఞము. 2. యజ్వ. 3. కోరిక. 4. (వ్యాక.) పతంజలి అభిప్రాయమును తెలుపు వాక్యము. 5. సంగ్రహ శ్లోకము.

**ఇష్టుఁడు** సం. వి. 1. ప్రియుడు. 2. ఆప్తుడు. 3. విష్ణువు.

**ఇష్వాసనము** సం. వి. విల్లు.

**ఇసడిలు** క్రి. 1. విసుగు. 2. అలయు.

**ఇ. సి. ఏ.** ఇం. (అర్థ.) (E. C. A.) ఆర్థిక సహకార పరిపాలనము. మార్షల్ ప్రణాళిక ప్రకారము ఆర్థిక సాహాయ్యము. సహకారము లభించిన యూరప్ దేశములు తమ ఋణము తీర్చుటకై చెల్లించిన ధనమును అమెరికా ఇ. సి. ఏ. సంస్థ ద్వారా తిరిగి యూరప్ పునరాభివృద్ధికై ఖర్చు చేయుచున్నది (Economic Co-operation Administration).

**ఇసిరో** అవ్య. ఛీకొట్టుటను. రోతనుసూచించునది. రూ. ఇస్సిరో, ఇస్సి.

**ఇసిఱింతలు** వి. చలనము.

**ఇసీ** అవ్య. చూ. ఇసిరో.

**ఇసుక** వి. ఇసుము, సికత.

**ఇసుక గ్రరములు** వి. బంక రేణువులు, సన్న వండలి రేణువుల ప్రమాణములు నూటికి 20, 30 ఉన్న నేల

**ఇసుకతెర నేల** వి. సముద్రసమీపమునఉన్న నేల.

**ఇసుకతిన్నె** వి. ఇసుకదిబ్బ, సైకతము.

**ఇసుక నేలలు** వి. బంక రేణువులు, వండలి రేణువులు తక్కువగా నుండి ఇసుక హెచ్చుగా నున్న నేలలు (Sandy soils).

**ఇసుకపులకండము** వి. ఇసుకవలె నుండు చక్కెర, మత్స్యండిక.

**ఇసుమంత** అవ్య. కొంచెము.

**ఇసుము** వి. ఇసుక.

**ఇసుళ్లు** వి. రెక్క చెదలు. రూ ఈసుళ్లు.

**ఇస్లాము ధర్మము** వి. (చరి.) భగవంతుడు ఒక్కడే అనియు, అతని నిజమైన ప్రవక్త మహమ్మదనియు నమ్ము మతము (ఈ ధర్మము ప్రకారము ప్రతి మహమ్మదీయుడు రోజునకు 5 సారులు దైవ ప్రార్థన, రంజాన్ నెలలో ఉపవాసము, దాన ధర్మములు. మక్కాకు కనీసము ఒకసారి అయినను తీర్థయాత్ర చేయవలెను).

**ఇస్సిరో** అవ్య. చూ. ఇసిరో.

**ఇస్సీ** అవ్య. చూ. పై.

**ఇహము** సం. వి. 1. ఈలోకము. 2. ఐహిక సుఖము.

**ఇహిహీ** అవ్య. నవ్వుట యందలి అనుకరణ ధ్వని, నిందను సూచించును.

**ఇళ** సం. వి. చూ. అల.

## ఈ

**ఈ** అచ్చులలోని నాల్గవ అక్షరము. సర్వ. దగ్గర నున్న దానిని తెలుపును. ఉదా. ఈ నిఘంటువు. అవ్య. 1. ప్రశ్నార్థకము. ఉదా. ఎవరీ నీ సాటివారు? 2. ప్రార్థనార్థకము, ఉదా. నన్ను రక్షింపుమీ వేగ నళిననాభ.

**ఈంద్ర** వి. కల్లుగీచి జీవించు ఒకజాతి.ఈడిగ.

**ఈంత్రము** వి. రాపిడి, పీడనము. బాధ.

**ఈంద్రించు** క్రి. నలుగుడు పెట్టు; పీడించు.

**ఈఁక** వి. పక్షిరెక్క. రూ. ఈఁకె.

**ఈఁకకుట్టు** వి. (గృహ.) పక్షి ఈకను పోలు అలంకారపు కుట్టు (Feather stitch).

**ఈఁకు** క్రి. ఇంకు.

**ఈఁకె** వి. చూ. ఈఁక.

**ఈఁగ** వి. మక్షికము.



ఈఁక కుట్టు

**ఈఁగకుటుంబము** వి. (వ్యవ., కీట.) ఈ కుటుంబమునందలి జాతులకు పూర్ణదశలో రెండు రెక్కలు మాత్రమే యుండును. వీనికి సామాన్యముగ తొండపు నోరుండును, డింభములకు కాళ్ళుండవు. ఉదా. కోడు ఈగ, మామిడి ఈగ, సామాన్యపు టీగలు, దోమలు మొ. వి.

**ఈఁగకుట్టు** వి. (గృ.) ఈగవలె కనిపించు అలంకారపు కుట్టు ఈఁగకుట్టు (Fly stitch).

**ఈఁగపులి** వి. సాలెపురుగు.

**ఈఁగు** క్రి. 1. ప్రవేశించు. 2. దాగు. 3. తొలగించు. 4. (ఋణము, పగ మొ.వి.) తీర్చు. 5. డయ్యు. 6. చచ్చు.

**ఈఁటియ** వి. పొడిచెడి సాధనము, కుంతము. రూ. ఈఁటె.

**ఈఁటె** వి. చూ. పై.

**ఈఁడు** ప్రత్య. కల అను అర్థమునందు వచ్చు తద్ధిత ప్రత్యయము, ఉదా. సంగడీడు, అగడీడు మొ. వి.

**ఈఁత** వి. 1. ఈతచెట్టు. 2. ఈదుట. 3. ఈనుట.

**ఈఁతకాఁడు** విశే. ఈదెడివాడు.

**ఈఁద** వి. 1. చలిగాలి. 2 తుపానుగాలి. 3. ఒక రకపు ఆయుధము. రూ. ఈఁదర.

**ఈఁదర** వి. చూ. పై.

**ఈఁదు** వి. 1. ఈతచెట్టు. 2. గాలి. 3. తడి, చల్లదనము. క్రి. ఈతకొట్టు, ఈదులాడు

**ఈఁదుగాఁయ** వి. ఈదుటకు సాయపడు సొరకాయ.

**ఈఁదుఁగొయ్య** వి. ఈదుటకు సాయపడు కొయ్య, తెప్పకొయ్య.

**ఈఁతువ** వి. తడి, తేమ, ఆర్ద్రత.

**ఈతె** సర్వ. ఈమె.

**ఈకొను** క్రి. ఇయ్యకొను, అంగీకరించు.

**ఈకోలు** వి. అంగీకారము. రూ. ఇయకోలు.

**ఈక్వినాక్స్** ఇం. వి. (భూగో.) (Equinox) సూర్యుడు భూమధ్య రేఖపై నున్న సమయము. (సంవత్సరములో ఇట్లు మార్చి 21వ తారీఖున, సెప్టంబరు 22వ తారీఖున జరుగును. ఈ రోజులలో భూమియందంతటను పగలు రాత్రి సమానముగ నుండుటయేగాక, సూర్యుడు సరిగా తూర్పున ఉదయించి పడమట దిక్కున అస్తమించుట కూడ జరుగును.)

**ఈక్షణము** సం. వి. 1. కన్ను. 2. చూపు. వీక్షణము:

**ఈక్షితము** సం. విశే. 1. చూడబడినది. 2. ఆలోచింపబడినది. వి. చూపు, దృష్టి.

**ఈగడ** వి. జాడ, పోగడ, ఆచూకి.

**ఈగి** వి. త్యాగము. దానము. వితరణము. రూ. ఈవి.

**ఈగికాఁడు** విశే. ఇచ్చువాడు, దాత, త్యాగశీలుడు రూ. ఈవికాడు.

**ఈగిమ్రాను** వి. కల్పవృక్షము.

**ఈఁగు** క్రి. వెనుకకు ఒరగు, తగ్గు.

**ఈచ** విశే. 1. సన్నగిల్లినది. 2. వ్యర్థము. వి. 1. కాలుసేతులవంకర. 2. వ్యర్థపదము.

**ఈచు** క్రి. పాలు వట్టిపోవు, శోషించు, అడుగంటు.

**ఈచుకపోవు** క్రి. (పశ్వాదులు) చచ్చిన దూడను ఈను.

**ఈటూర్చు** క్రి. తడిపోజేయు, ఆరబెట్టు.

**ఈటు** విశే. పొల్లు. వ్యర్థము.

**ఈడ**[1] వి. 1. ఈచోట. 2. ఎట్టుకిత్తలి.

**ఈడ**[2] సం. వి. పొగడ్త.

**ఈడఁబోవు** క్రి. యుద్ధమునుండి పారు. వెనుదీయు.

**ఈడిగ** వి. చూ. ఈండ్ర.

**ఈడిగిలఁబడు** క్రి. చతికిలబడు, ముందుకు రానవి భయాదులచే కూలబడు.

**ఈడు**[1] వి. 1. వయస్సు. 2. యౌవనము. విశే. 1. అనురూపమైన వయస్సు గలది. 2.సామ్యము. 3.తాకట్టు.విశే.సమానము. తగినది శక్యము.

**ఈడు**[2] క్రి. 1. పాలు పిదుకు. 2. ముందు నకుబోవు. 3. వెనుకబడు,

**ఈడుపు** వి. 1.లాగుట. 2.జాగు.విలంబనము.

**ఈడుముంత** వి. పాలు పిదుకు పాత్రము.

**ఈడులేనివాడు** వి. సాటిలేనివాడు,

**ఈడె** వి. ఎఱ్ఱకిత్తిలి.

**ఈడేఱు** క్రి. (ఈడు+ఏఱు) 1. వృద్ధి నొందు. 2. నెరవేరు. 3. ప్రథమ రజస్వలయగు.

**ఈతఁడు** సర్వా. ఇతడు.

**ఈతల** వి. 1. ఈవలి ప్రదేశము. 2. ఈవలి కాలము. పిమ్మట. రూ. ఇవతల,

**ఈతి** సం. వి. 1. ఉపద్రవము. 2. ఊరు విడిచిపోవుట. 3.మారి మొ. అంటువ్యాధి. 4. అతివృష్ట్యాది ఈతిబాధ (అతివృష్టి. అనావృష్టి. మిడుతల దండు. ఎలుకల దండు. చిలుకలదండు.చేరువరాజులు అనునవి ఆరు ఈతిబాధలు.)

**ఈథర్** ఇం. వి. (రసా.) (Ether) రంగు లేక, పారదర్శకమై సులువుగా ఇగిరిపోయెడి ద్రవ్యము.

**ఈదృశము** సం, విశే. ఇట్టిది.

**ఈన** వి. ఆకులలోని నరము. చీపురుపుల్ల. రూ. ఈనియ. ఈనె.

**ఈనాముభూమి** హిం. వి. మాన్యపు భూమి. మాన్యము. బహుమతిగా ఇచ్చిన భూమి. రూ. ఇనాము.

**ఈనియ** వి. చూ. ఈన.

**ఈను** క్రి. 1. పశ్వాదులు ప్రసవించు. కలిగించు.

**ఈనెలు** వి. (వృక్ష.) 1. పత్రఫలముపై అగపడు మధ్య ఈనె. దాని శాఖోపశాఖలు (Veins).

**ఈనెవ్యాప్తి** వి.వి. (వృక్ష) పత్రఫలకముపై ఈనెలు అమర్చబడిన తీరు (Venation).

**ఈపి** వి. 1. తలయం దుండెడి అంటుపేను. పేనుగ్రుడ్డు. 2. ఈగ పెట్టిన గ్రుడ్డు. 3. ఈగ మలము.

**ఈపె** సర్వా. ఈమె.

**ఈప్స** సం. వి. ఇచ్ఛ. వాంఛ. కోరిక

**ఈప్సితము** సం. విశే. 1. కోరబడినది. 2. పొందుటః కిష్టమైనది. వి. కోరిక.

**ఈబరి** వి. నిష్ప్రయోజకుడు. అప్రయోజకుడు. రూ. ఈబరిగొట్టు.

**ఈబరిగొట్టు** విశే. చూ. ఈబరి.

**ఈబిడ** సర్వా. ఈపె.

**ఈమ** సం. వి. పుండు. వ్రణము.

**ఈమిరి** వి. తడి.

**ఈము** వై. వి. 1. మంచు. 2. చల్లదనము, సం. హిమమ్.

**ఈమె** సర్వా. ఈపె, ఈ స్త్రీ.

**ఈయ** వై. వి. అపేక్ష. కోరిక. వాంచ. సం. ఈహా.

**ఈయకొను** క్రి. అంగీకరించు. రూ. ఈకొను. ఇయ్యకొను.

**ఈయకోలు** వి. అంగీకారము రూ. ఈకోలు ఇయ్యకోలు.

**ఈయన** సర్వా. ఇతడు.

**ఈరము** వి. నికుంజము. పొదరిల్లు.

**ఈరస** వై. వి. 1. అసూయ. 2. పగ. 3. కోపము. రూ. ఈరసము. సం. ఈర్ష్యా.

**ఈరసించు** వై. క్రి. 1. అసూయచెందు. 2. పగగొను. 3. కోపించు.

**ఈరాఱు** సర్వా. (ఈరు+ఆఱు) రెండు ఆర్లు అనగా పండ్రెండు.

**ఈరిక** వి. 1. మొలక. 2. గుడ్డపేలిక.

**ఈరికలెత్తు** క్రి. అంకురించు. మొలకెత్తు. ఉదా. కోరిక లీరికలెత్తు.

ఈరిణము సం. విణ. చూ. ఇరిణము.
ఈరు విణ. అల్పము. వి. పేను గ్రుడ్డు
ఈరుఁడు సం. వి. చందురుడు.
ఈరుపెన వి. పేనుగ్రుడ్డులను ఈర్చెడు పొడవగు దువ్వెన. రూ. ఈర్పెన.
ఈరువు వి. మాంసము. ఎరచి.
ఈరేండ వి. (ఈరు+ఎండ)కొంచెము పాటి ఎండ, లేత ఎండ. నీరెండ.
ఈరెలుఁగు వి. (ఈరు+ఎలుగు)హీనస్వరము
ఈరేడు సర్వ. (ఈరు+ఏడు)పదు నాలుగు. ఉదా ఈరేడు జగంబులు.
ఈరేను సర్వ. (ఇరు+ఏను) పది.
ఈర్పెన వి. చూ. ఈరుపెన.
ఈర్ష్య సం. వి. ఓర్వలేనితనము, అసూయ.
ఈర్ష్యాళువు సం.వి. అసహనుడు. అసూయాగ్రస్తుడు. ఓర్వలేని తనము స్వభావముగా గలవాడు.
ఈఱలాఱ వి. 1. ఉయ్యాలవలె నూగుట. 2. హెచ్చుతగ్గులు. విణ 1.వక్రము.2.తారుమారైనది. 3. పరుషము. 4. పొసగనిది.
ఈఱము విణ. తరచైనది. వి. తీగలు మొవాని తఱచు. జొంపము. సాంద్రత (శ.చం.). రూ. ఈఱమి.
ఈఱువాఱు వి. వేడుకగా తిరుగుట,విహారము. వయాళి. స్వారి.
ఈల వి. 1. తస్కరాదుల సంకేతధ్వని. 2, సముద్రప్రాంతపు నేలను అంటి మొలచెడు ఉప్పనిరుచిగలకూర, ఈలకూర 3.చిమ్మట కూత. 4. సిగ్గు.
ఈలకరచు క్రి. ప్రాణముల బిగపట్టు. రూ ఇలకరచు.
ఈలకూఁతలు వి. బాలక్రీడలలో ఒకటి.
ఈలగ్రద్ద వి. ఈల వేసెడు డేగ, ఒకజాతి డేగ. విణ. లోభి.
ఈలపురుగు వి. ఈలవలె ధ్వని చేయుపురుగు ఇలకోడి. చిమ్మట. ఝిల్లి.
ఈలుగు క్రి. 1. నీలుగు. 2. చచ్చు.
ఈలువు వి. 1. మంచినడవడిక. 2.మానము. 3. పాతివ్రత్యము.
ఈలవుటాలు వి. 1. మంచినడవడికగల స్త్రీ. 2. పతివ్రత.
ఈవ వి. ఈగ.
ఈవరి విణ. ఈవికాడు. దాత.
ఈవల వి. 1. ఇద్దరి. 2. ఈప్రక్క.
ఈవి వి. 1. దానము,వితరణము. 2.వరము 3. బహుమానము. రూ. ఈగి.
ఈవు సర్వ. నీవు.
ఈవులమొదవు వి. కామధేనువు.
ఈవులమ్రాను వి. కల్పవృక్షము.
ఈవులరతనము వి. చింతామణి.
ఈశ సం. వి. 1. ఏడికోల. బండినొగ. 2. ఐశ్వర్యము. 3. ఐశ్వర్యవంతురాలు. 4. దుర్గాదేవి.
ఈశానము సం. వి. 1. కాంతి. 2. శివుని 5 ముఖములలో ఒకటి. 3. పదుశొకండు అను సంఖ్య. 4. ఆర్ద్రానక్షత్రము.
ఈశానుఁడు సం.వి. 1. శివుడు. 2. రాజు.
ఈశాన్యము సం. వి. తూర్పునకు, ఉత్తరమునకు నడుమగల దిక్కు.
ఈశాన్య వ్యాపార పవనములు సం. వి. (భూగో.) భూమధ్యరేఖకును, కర్కాటక రేఖకును. మధ్య వీచు పవనములు.
ఈశుఁడు సం. వి. 1. శివుడు. 2. ప్రభువు.
ఈశ్వర సం. వి. ప్రభవాది అరువది సంవత్సరములలో పదునొకండవది.
ఈశ్వరి సం. వి. పార్వతి.
ఈశ్వరుఁడు సం. వి. 1. శివుడు. 2. పరమాత్మ. విణ. శ్రేష్ఠుడు.
ఈషణము సం. విణ. త్వరపెట్టునది. వి. త్వర, ఇచ్ఛ (ఈషణత్రయము: దారేషణ విత్తేషణ, పుత్త్రైషణ.)
ఈషత్ సం. అవ్య. కొంచెము. రూ. ఈషతు

**ఈసడము** వి. 1. దూఱు, నింద. 2. అసహ్యాభావము.

**ఈసరుఁడు** వై. వి. ఈశ్వరుడు.

**ఈసరి** వై. వి. ఈశ్వరి.

**ఈసు** వై. వి. 1. ఓర్వలేనితనము. 2. కోపము. 3. ద్వేషము. సం. ఈర్ష్యా.

**ఈసుళ్ళు** వి. చూ. ఇసుళ్లు.

**ఈస్ట్** ఆం.వి. (వృక్ష.)(Yeast).ఏకకణశిలీంధ్రములలో ఇది ఒకటి. ఇది డైమేస్ అను మండమును ఉత్పత్తిచేయును.)

**ఈహ** నం.వి.1. కోరిక. 2.కడక, ఉద్యమము.

**ఈహామృగము** నం. వి. 1. తోడేలు. 2. ఒక విధమగురూపకము (లేడివలె అలభ్యయగు స్త్రీకొరకు కథానాయకుడు వెన్నాడినట్లు వర్ణింపబడిన కథగల నాలు గంకముల నాటకము.)

**ఈహీ** అవ్య. ఎగతాళిచేయుట యందును, నిందించుట యందును వాడబడును. రూ. ఇహిహీ.

**ఈళి** నం వి. 1. కత్తిపీట. 2. చూరకత్తి. 3. దుడ్డుకఱ్ఱ రూ ఈళిక.

**ఈళిక** నం. విణ. చూ. ఈళి.

**ఈళితము** నం. విణ పొగడబడినది.



**ఉ** వర్ణమాలలో ఐదవ అక్షరము.

**ఉంకించు** క్రి. యత్నించు. రూ. ఊకించు.

**ఉంకు** క్రి. 1. పైకెగయు. 2. భయపడు. వి. సమ్మతి.

**ఉంకుటుంగురము** వి. పెండ్లియందు వధూవరులు పరస్పరము మార్చుకొనెడి ఉంగరము.

**ఉంకువ** వి. అల్లుడు కన్యకొరకు మామ కిచ్చు ధనము, ఓలి, శుల్కము.

**ఉంగ** వి. శిశువులకు ఉగ్గుపెట్టునపుడు వారి యేడ్పు యొక్క ధ్వన్యనుకరణము.

**ఉంగరపుగొట్టము** వి. (వృక్ష.) లోపల ఉంగరముల వంటినిర్మాణముగల దారువు గొట్టము


1 2 3 4 4

**ఉంగరము** వి. చేతివ్రేలి నగ.రూ. ఉంగ్రము. 1. ఉంగరపుగొట్టము

**ఉంగిడి** వి.నాముమొ.వి.2.మఱచుట్టుగొట్టము తినుటచే పశువులకు 3. మెట్ల గొట్టము. గలుగు రోగము. 4. గుంటల గొట్టము.

**ఉంగుటము** వై. వి. బొటనవ్రేలు. నం. అంగుష్ఠః.

**ఉంచు** క్రి. 1. పెట్టు. 2. నిలువచేయు. 3. తాకట్టిడు.

**ఉంఛము** నం. వి. 1. క్రిందపడియున్న గింజలను ఏరికొని బ్రదుకుట. 2. లేకి బ్రదుకు.

**ఉంఛవృత్తి** నం. వి. రాలిన గింజలను ఏరికొని జీవించుట, ఉంఛ మను జీవనోపాయము.

**ఉంట** వి. 1.ఉండ.2.ఉండుట.విణ.గుండ్రనిది.

**ఉండ** వి. గుళిక. విణ. గుండ్రము.

**ఉండు** క్రి. 1. వసించు. 2. మిగులు.

**ఉండ్ర** వి. చంద్రచెట్టు. రూ. ఉండ్రన.

**ఉండ్రము**[1] విణ. గుండ్రనిది, వర్తులము.

**ఉండ్రము**[2] వై. వి. వేడినీళ్ళతో తడిపిన పిండిని గుండ్రని ఉండలు చేసి ఆవిరిపై ఉడికించిన భక్ష్యము, మోదకము. నం. ఉండేరకః.

**ఉండ్రాలు** వి. చూ. ఉండ్రము [2](లు).

**ఉందురము** నం. వి. 1. ఎలుక. 2. పందికొక్కు. రూ. ఊదురువు, ఉందురువు.

**ఉందురువు** సం. వి. చూ. వై.

**ఉంపరము** వి. 1. వేశ్య నుంచుకొనుట. 2. ఉంచుకొనబడిన వేశ్య.

**ఉంపుడుగత్తె** వి. భోగార్థ ముంచుకొనబడిన వేశ్యాది స్త్రీ.

**ఉంబ** వై. వి. గోవుల అంబారవము. సం. అంభా.

**ఉంబళి** విశ. పన్ను లేనిది, ఉదా. ఉంబళి గ్రామము=సర్వదుంబాలా గ్రామము.

**ఉక్క** వి. ఉమ్మ, తాపము, వేడి.

**ఉక్కిఁడు** విశ. అవివేకి, మూర్ఖుడు.

**ఉక్కడఁగు** క్రి. 1. శౌర్యము ఉడుగు. 2. చచ్చు. 3. క్షీణించు.

**ఉక్కడము** వై. విశ. శ్రేష్ఠము, గొప్పది. సం. ఉత్కటమ్.

**ఉక్కడీఁడు** విశ. శూరుడు. వి. సేనకు సహాయముగ ముందుగా పంపబడినబంటు.

**ఉక్కణము** వి. సేనలకై ఉంపబడిన కావలి.

**ఉక్కరి** విశ. 1. శౌర్యవంతుడు. 2. ధైర్యశాలి.

**ఉక్కలుఁడు** వై. వి. శౌర్యవంతుడు. రూ. ఉక్కళుడు. సం. ఉత్కలః.

**ఉత్కళము**[1] వి. శత్రువులు దండెత్తి వచ్చుటను కనిపెట్టుటకై ఉంచినకావలి.

**ఉక్కళము**[2] వై. వి. పట్టణమునకు పోవు రాజమార్గము. సం. ఉసనిష్కరమ్.

**ఉక్కళుఁడు** వై. విశ. చూ. ఉక్కలుఁడు.

**ఉక్కిరిబిక్కిరి** విశ. ఊపిరాడనిది. వి. ఊపి రాడకుండుట.

**ఉక్కివము** వి. 1. కపటము, మోసము. 2. కపటకృత్యము.

**ఉక్కివుఁడు** విశ. 1. మోసగాడు. 2. మూర్ఖుడు. 3. దుష్టుడు.

**ఉక్కిస** వి. పొడిదగ్గు, కాసరోగము.

**ఉక్కు** క్రి. చచ్చు, నలగు, క్రుగ్గు. వి. 1. కాచి శుభ్రము చేసిన ఇనుము. 2. శౌర్యము. 3. బలము. 4. గౌరవము. 5. స్థైర్యము. 6. సాహసము. 7. 2% మొదలు 1.5% వరకు కర్బనము కలిసి యుండు ఇనుము (**Steel**).

**ఉక్కుతునక** విశ. శూరుడు.

**ఉక్కుదండెకాటా** వి. దండె, గుండు, జంట కొక్కెము, రికాబు, అను భాగములు గల ఉక్కుకాటా.

**ఉక్కుమిగులు** క్రి అతిశయిల్లు, ప్రబలు.

**ఉక్కెఱ** వై. వి. చక్కెర, పిండి కలిపి చేసిన భక్ష్యము! సం. ఉపకారికా, ఉత్కారికా.

**ఉక్తము** సం. విశ. చెప్పబడినది.

**ఉక్తి** సం. వి. మాట.

**ఉక్షము** సం. వి. ఎద్దు.

**ఉగము** వి. 1. ఆయువు. 2. సంవత్సరము.

**ఉగాది** వి. సంవత్సరాది.

**ఉగ్గ** అవ్య. బిగువుగా.

**ఉగ్గఁబట్టు** క్రి. బిగబట్టు, నిరోధించు,

**ఉగ్గడించు** వై. క్రి. 1. మ్రోగు. 2. ప్రకటించు. 3. చెప్పు. 4. వర్ణించు. 5. ఉచ్చరించు. సం. ఉద్ఘాట్.

**ఉగ్గడుపు** వై. విశ. అధికము. సం. ఉత్కటమ్.

**ఉగ్గము** వై. వి. పట్టుకొని పోవుటకు వీలుగా పాత్రలకు గట్టు త్రాడు. సం. ఉద్గ్రాహః.

**ఉగ్గళించు** వై. వి. 1. నట్టుపుడు. కొలిపించు (శ. చం.) 2. కౌగిలించు, పెంచు, గొప్పదిగా చేయు.

**ఉగ్గించు** క్రి. దట్టముగా నేయు. 2. ఘూషించు.

**ఉగ్గు** వి. 1. చనుబాలతో రంగరించి పసిబిడ్డలకు పోయు ఆముదము. 2. ముడుత.

**ఉగ్గుగిన్నె** వి. పిల్లలకు ఉగ్గు పోయుటకు వాడు చిన్న గిన్నె.

**ఉగ్గుడు** వి. మర్యాద, మేర.

**ఉగ్గుపడు** క్రి. 1. ముడుతలుపడు 2. క్షీణించు.

**ఉగ్మలి** వి. 1. స్త్రీ. 2. స్నేహితురాలు. 3. ఇల్లాలు.

**ఉగ్రము** నం. విశ. 1. క్రూరమైనది. భయంకరమైనది. 2. మిక్కుటమైనది.

**ఉగ్రాణము** వి. 1. సామగ్రి యుంచెడిగది. 2. బొక్కసము.

**ఉగ్రుఁడు** నం. వి. 1. శివుడు. 2. క్షత్రియునకు శూద్ర స్త్రీయందు పుట్టిన వాడు. విశ. భయంకరుడు.

**ఉచీఁత** వి. ఉస్తెచెట్టు. రూ. ఉచ్ఛిత.

**ఉచితము** నం. విశ. 1. తగినది. 2. ఉంచబడినది, 3, తెలియబడినది. 4. మితము. 5. (వ్యావ.) వెలలేనిది.

**ఉచ్చత** నం. వి. 1. ఎత్తు, 2. అదిక్యము. 3. (భౌతి.) ఎక్కువకాలము ఎక్కువ దూరము వినబడు ధ్వనిలక్షణము (Loudness).

**ఉచ్చత్వము** నం. వి. 1. ఎత్తు. 2. (గణి.) త్రిభుజము యొక్క ఒక అగ్రముగుండి ఎదురుగా నున్న ఆధారమునకు గీయబడిన లంబరేఖ(Altitude). 3.(ఖగో.) క్షితిజమునకు మీద ఉన్న వస్తువు యొక్క ఉన్నతి.

**ఉచ్చము** నం. విశ. 1. ఉన్నతము. 2 ఉత్కృష్టము. 3. మిక్కుటము. (వృక్ష.) ఊర్ధ్వస్థితము (Superior)..

**ఉచ్చయము** నం. వి. 1. సమూహము. 2. పోకముడి. 3. పూలు మొ. ని. కోయుట. 4. అతిశయము.

**ఉచ్చరణము** నం. వి. నోట పలుకుట. 2. ఊర్ధ్వగమనము. 3. బహిర్గమనము. రూ. ఉచ్చారణము.

**ఉచ్చాటనము** నం. వి. 1. వ్రేళ్ళతో పెరుకుట. 2. లేవగొట్టుట. 3. పిశాచాదులను పోద్రోలుట.

**ఉచ్చారణము** నం. వి. పలుకుట,ఉచ్చరించుట.

**ఉచ్చారము** నం. వి. 1. ఉచ్చారణము. 2. మలము, పురీషము.

**ఉచ్చారమార్గము** నం. వి. (జన.) (Cloaca) మూత్రమునకు, పురీషమునకు కలిసి ఒకటిగా నుండు మార్గము, ఉచ్చారద్వారము (Cloacal apertu-e).

**ఉచ్చావచము** నం విశ. నానావిధములైనది. ఉచ్చనీచము. వి. (భౌతి.) తిరిగి తిరిగి క్రిందికి మీదికి అగుట (Fluctuation).

**ఉచ్చి** వి. బ్రహ్మరంధ్రము, నడితల, సోడు.

**ఉచ్చిత** వి మా. ఉచీఁత.

**ఉచ్చైశ్శ్రవము** నం. వి. ఇంద్రుని గుఱ్ఱము. విశ. నిక్కినచెవులు గలదే, చెవిటిది.

**ఉచ్చికరించు** క్రి. అనాదరముచే 'ఉచుక్కు మను.

**ఉచ్చ** వి. మూత్రము.

**ఉచ్చబుడ్డ** వి. మూత్రాశయము.

**ఉచ్చమల్లి** వి. 1. దినమొల స్త్రీ, నగ్నిక 2. రోత పుట్టించు స్త్రీ.

**ఉచ్చు** క్రి. 1. అంకురించు, పైకివచ్చు. 2. చీలు. 3. చీల్చు. వి. ఉరి, వాగుర.

**ఉచ్చాదనము** నం. వి. (రసా.) ఒకవస్తువును వెలుతురుకు ఎదుట పెట్టుట (Exposure).

**ఉచ్చిష్టము** నం. విశ. 1. ఎంగిలి, తినగా మిగిలినది. 2. పూర్వులు ఉపయోగించినది. వి. తేనె.

**ఉచ్ఛ్రయము** నం. వి. 1. పొడవు. 2. గొప్పతనము. 3. గ్రహాదుల ఉదయము. 4 అతిశయము. రూ. ఉచ్ఛ్రాయము.

**ఉచ్ఛ్రాయము** నం. వి. మా. పై.

**ఉచ్ఛ్వాసము** నం. వి. 1. ఊపిరి వెలికి వచ్చుట. 2. నిట్టూర్పు. 3. ఊరట. 4. గ్రంథభాగము.

**ఉజ్జి** వి. జత. విశ. సాటి. రూ. ఉజ్జీ. ఉద్ది.

**ఉజ్జీవనము** నం. వి. 1. బ్రతుకుట, 2, బ్రతికించుట, 3, చావునకు సిద్ధమై బ్రతుకుట,

**ఉజ్జ్వలము** సం. విణ. 1. ప్రకాశించునది. 2. తెల్లనిది. 3. అడ్డులేనిది. వి. 1. సింగారము. 2. శృంగారరసము. 3. బంగారు.

**ఉజ్జ** వి. 1. ఊహ. 2. లక్ష్యము.

**ఉజ్జగిల్లు** క్రి. పోవు, తొలగు, నశించు, రూ. ఉజ్జగిలు.

**ఉజ్జనము** వై. వి. విడుచుట, ఉత్సర్జనము. సం. ఉజ్ఝనమ్.

**ఉజ్జావకల్లు** వి. అగ్నిపర్వతమునుండి బయలు పడిన రాయి.

**ఉటంకము** వి. సంగ్రహము.

**ఉటంకి** విణ. 1. ధైర్యవంతుడు. 2. చొరవ కలవాడు. 3. నీచుడు.

**ఉటజము** సం. వి. 1. పర్ణశాల, పూరిల్లు. 2. మున్యాశ్రమము.

**ఉటము** సం. వి. 1. ఆకు. 2. గడ్డి.

**ఉట్టంకించు** క్రి. 1. ఉదాహరించు. 2. ఆక్షేపించు రూ. ఉటంకించు.

**ఉట్టి** వి. 1. పాత్ర లుంచుకొనుట ఇంట వ్రేల గట్టబడిన చిక్కము. 2. చింతపండులోని పీచు.

**ఉట్టిచీల** వి. ఇరుప్రక్కల తలలుగల చీల.

**ఉట్టిపడు** క్రి. 1. స్రవించు. 2. ఉన్నట్టుండి ఏర్పడు లేక వచ్చు.

**ఉట్టు** క్రి. 1. స్రవించు. 2. కలుగు. వి. ఉప్పు పండదగిన నేల.

**ఉతాణి** విణ. గొప్పది, ఎత్తైనది. వి. పొడుగు.

**ఉడికించుట** వి. 1. ఉడుకబెట్టుట. 2. పరిహాసముచేయుచు లోపములను చాటుట.

**ఉడిగము** వి. 1. సేవ. 2. అడకువ, రూ. ఊడిగము.

**ఉడిపోవు** క్రి. 1. నశించు. 2. వ్యర్థమగు. 3. విచ్ఛిన్నమగు. 4. తొలగు.

**ఉడుబోఁతు** విణ. ఉడుగువాడు,విరతిశీలుడు.

**ఉడుఁబోతుపిందె** వి. చెట్టు కాపుడిగిన పిమ్మట పుట్టిన పిందె.

**ఉడుక** వై. వి. ఒక విధమైన చర్మవాద్యము. రూ. ఉడుక్కు, హుడుక. సం. హుడుక్కా.

**ఉడుకాటము** వి. సంతాపము, బాధ.

**ఉడుకాడించు** క్రి. తొందరపెట్టు, బాధించు

**ఉడుకు** క్రి. 1. తపించు. 2. పచనమగు. వి. తాపము, వేడిమి.

**ఉడుకుఁగప్పు** వి. ఉడుకుడుకప్ప.

**ఉడుకుఁబోతు** విణ. 1. ఎవరైనను ఎత్తిపొడిచినను పరిహాసము చేసినను ఓర్వలేక కోపము దుఃఖము తెచ్చుకొని బాధపడువాడు, ఉడుకునట్టి స్వభావము కలవాడు. 2. అసూయాపరుడు.

**ఉడుకువ** వి. ఉడుగుట, ఊరట.

**ఉడుగర** వి.బహుమానము,కానుక,కట్నము.

**ఉడుగు** క్రి. 1. మాను. 2. ఇంకు. 3. నశించు.

**ఉడుచు** క్రి. 1. మరలించు, 2. ఆపు. 3. లయింపజేయు.

**ఉడుత** వి. చిక్రోడము. రూ. ఉఱుత.

**ఉడుపము** సం. వి. తెప్ప, పుట్టి.

**ఉడుపు** క్రి. 1. అణగించు. 2. పోగొట్టు. వి. దుస్తు.

**ఉడుపులు** వి. (గృహ.) దుస్తులు.(Clothing).

**ఉడుము** వి. బల్లివంటి పెద్ద జంతువు, గోధ. రూ. ఉఱుము.

**ఉడురాజు** సం. వి. చంద్రుడు.

**ఉడుపు**[1] క్రి. రూ. ఉడుగు.

**ఉడుపు**[2] సం. వి. నక్షత్రము.

**ఉడ్డ** వి. 1 నాలుగు. 2. రాశి. రూ. ఉడ్డా.

**ఉడ్డకేలువేలుపు** సం.వి. చతుర్భుజుడు,విష్ణువు.

**ఉడ్డమోమువేలుపు** వి. నలువ, బ్రహ్మ.

**ఉడ్డీనము** సం. వి. (పక్షి) పైకెగురుట.

**ఉడ్డుగుడుచు** క్రి. ఊపిరి తిరుగక బాధపడు, ఉక్కిరిబిక్కిరి యగు.

**ఉతక** వి. తలుపుకుసి తిరుగుటకై దాని క్రింద అమర్చెడు కొయ్యచిప్ప. ఉత్తరాసి తిరిగెడు కొయ్య.

**ఉతుకు** క్రి. మురికి పోవుటకై వస్త్రములను రాతిమీద కొట్టు. రూ. ఉదుకు.

**ఉత్కంఠ** నం. వి. కోరిన వస్తువును పొందుటకైన వేగిరిపాటు, తహతహ.

**ఉత్కటము** నం. విణ. అధికమైనది, మదించినది.

**ఉత్కము** నం. విణ. ఉత్కంఠ గలది, కుతూహలము గలది, ఉవ్విళ్లూరునది.

**ఉత్కరము** నం. వి. రాశి, గుంపు, సమూహము.

**ఉత్కర్షము** నం. వి. 1. మేలు. 2. అతిశయము. 3. అభివృద్ధి.

**ఉత్కలిక** నం. వి. 1. ఉత్కంఠ. 2. అల. 3. మొగ్గ. 4. విలాసము.

**ఉత్కలుఁడు** నం. విణ. నిర్వాహకుడు, భారవాహకుడు. వి. 1. ఉత్కల దేశస్థుడు. 2. బోయవాడు.

**ఉత్కళము** నం. వి. ఆంధ్ర దేశమునకు ఉత్తరమున నుండు ఒక దేశము, ఓఢ్ర దేశము. రూ. ఉత్కలము.

**ఉత్కృష్టము** నం. విణ. 1. మేలైనది. 2. అధికము.

**ఉత్కోలకము** నం. వి. (వృక్ష.) ఒకరకపు మాంసలఫలము (Pome), రెండుకాని ఎక్కువకాని గదులు, సంయుక్త ఫలదళము, అధస్థిత అండాశయము కలిగి పుష్పపీఠముచే పూర్తిగా కప్పబడియున్న ఫలము, ఉదా. సీమరేగు(Apple), పియర్,

**ఉత్ఖాతకులు** నం. వి. (చరి.) ప్రాచీన శిథిలములకొరకు భూమిని త్రవ్వించెడివారు (Excavators).

**ఉత్ఖాతనము** నం. వి. (చరి.) శిథిలములకొఱకు భూమిని త్రవ్వుట (Excavation).

**ఉత్క్రమణము** నం. వి. 1. పైకిపోవుట. 2. తొలగుట. 3. మీరుట.

**ఉత్క్రమానుపాతము** నం, వి. (గణి.) a : b = c : d అయిన b : a = d : c అనునది (Invertends).

**ఉత్క్రోశము** నం. వి. 1. మొర. 2. దాటింపు. 3. ఒకజాతి పక్షి.

**ఉత్క్వథనము** నం. వి. (రసా.) బుడగలు పైకి వచ్చునట్లు మరుగుట (Ebullition).

**ఉత్తవై**. విణ. 1. పట్టి. 2. కేవలము. 3. అసత్యము. 4. పనిలేనిది. 5. వ్యర్థము. నం. వ్యర్థమ్, రిక్తమ్.

**ఉత్తంభనము** నం. వి. 1. నిలుపుట. 2. ఆధారము. 3. వృద్ధిచేయుట.

**ఉత్తంసము** నం. వి. 1. కర్ణభూషణము. 2. శిరోభూషణము. 3. శ్రేష్ఠవాచకము.

**ఉత్తంసుఁడు** నం. విణ. గొప్పవాడు.

**ఉత్తమము** నం. విణ. 1. శ్రేష్ఠము. 2. ముఖ్యము.

**ఉత్తమర్ణుఁడు** నం. విణ. అప్పిచ్చువాడు. (వ్యతి. అధమర్ణుడు.)

**ఉత్తమాంగము** నం. వి. తల.

**ఉత్తర** నం. వి. 1. ఉత్తర ఫల్గునీ నక్షత్రము. 2. ఉత్తరదిక్కు. 3. విరటుని కూతురు.

**ఉత్తర అట్లాంటిక్ సంధి** (చరి. రాజ.) నాటో (NATO), ఈ సంధి ఒప్పందము క్రీ.శ. 4వ ఏప్రిల్ 1949లో వాషింగ్టన్ నగరమున సమష్టి రాజకీయ సైనిక రక్షణ భద్రతలకై బ్రిటన్, ఫ్రాన్స్, బెల్జియమ్, పోర్చుగల్, డెన్మార్క్, నార్వే, ఇటలీ, అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రతినిధులచే అంగీకరింపబడెను. ఐక్యరాజ్యసమితి 51వ నిబంధన ప్రకారము సమష్టి ఆత్మరక్షణకై యీ కూటమి కృషి చేయునని స్పష్టీకరించెను. వీరిలో ఒక్కరిపై గాని, లేక కొందరిపై గాని, అమెరికా సంయుక్త రాష్ట్రముపై గాని ఇతరులు దాడిచేసినచో, అందరిపై దాడిచేసినట్లుగా భావించి ఒకరికొకరు సైన్య సహాయము చేసికొనుటకై, సంయుక్త సైన్యములు తయారుచేసిరి

ముఖ్యముగ ఈ ఒప్పందము సోవియట్ రష్యాకును తదితర కమ్యూనిస్ట్ దేశములకును వ్యతిరేకముగ- నుండుటకై చేయబడినది.

**ఉత్తరఅతిశీతమండలము** సం. వి. (భూగో.) కర్కటరేఖకును ఉత్తర ధ్రువమునకును మధ్య నున్న ప్రదేశము. (సంవత్సరమున కనీసము ఒక్కరోజైన ఇక్కడ సూర్యోదయము ఉండదు. ధ్రువము చేరు కొలది సూర్యుడు కనబడని రోజులు అధికమై ధ్రువముదగ్గర ఆరునెలల దీర్ఘరాత్రి యేర్పడును. ఇచ్చట ఎక్కువ చల్లగా నుండి చాలవరకు హిమముచే కప్పబడియుండును.)

**ఉత్తరకృషి** సం. వి. (వ్యావ.) విత్తనములు చల్లిన తరువాతగాని, నాట్లు వేసిన తరువాతగాని చేయు గొప్పు త్రవ్వుట, కలుపు తీయుట మొ. పనులు.

**ఉత్తరక్రియ** సం. వి. అపరకర్మ.

**ఉత్తరణము** సం. వి. తరించుట, దాటుట. విశే. దాటునది, కడచునది.

**ఉత్తరధ్రువము** సం. వి. (భూగో.) భూమధ్యరేఖకు 90°దూరమున ఉత్తరమున నున్న బిందువు (North Pole.)

**ఉత్తరపక్షము** సం. వి. 1. సిద్ధాంతము (వ్యతి పూర్వ పక్షము) 2. కృష్ణపక్షము.

**ఉత్తరఫల్గుని** సం. వి. పంద్రెండవనక్షత్రము.

**ఉత్తరమహాసిర** సం. వి. (జం.) సిరాకోటరములోనికి దాని క్రింద నుండి ప్రవేశించు పెద్దసిర (Precaval or anterior venacava.)

**ఉత్తరము** సం. వి. 1. బదులు. 2. ఒకదిక్కు 3. జాబు. (ఈ అర్థము తెనుగునందు మాత్రమే కలదు. సంస్కృతమున లేదు). విశే. మీదిది.

**ఉత్తరవాది** సం. వి. 1. ప్రతివాది. 2. పూటకాపు.

**ఉత్తరవాసము** సం. వి. పై వస్త్రము., ఉత్తరీయము.

**ఉత్తరసభ** సం. వి. పై న్యాయస్థలము.

**ఉత్తర సమశీతమండలము** సం. వి. (భూగో.) కర్కాటక రేఖకును ఉత్తర ధ్రువవకును మధ్య నున్న ప్రదేశము.

**ఉత్తరసాక్షి** సం. వి. 1. సాక్షుల వాఙ్మూలములను ధ్రువపరచు సాక్షి. 2 ముద్దాయి తరవు సాక్షి.

**ఉత్తరహనుమృశము** సం. వి. (జం.) ఉత్తర హనువునకు కలిసియుండు పొడువైన భాగము (Maxillary pulp). (కీటకములలో (బొద్దింక); ఇది ఐదు చిన్న భాగములచే ఏర్పడియుండును).

**ఉత్తరహనువు** సం. వి.(జం.) పైదవుడ, (కీటకముల నోటి భాగములలో ఒకటి. కీటకములలో ఇది కార్డో స్టైపిస్, ఉత్తర హను ఉత్తరహనువు మృశము, లసినియా, గాలి (మొదటి) యా అను భాగములతో ఏర్పడి యుండును) (Maxilla).

**ఉత్తరాయణము** సం.వి.(భూగో.) సూర్యుడు డిసంబరు 22వ తేది మకర రేఖను చేరి అచ్చటినుండి ఉత్తరమునకు మరలునప్పటి నుండి ఆరునెలల కాలము, సంవత్సరమున వచ్చు రెండు అయనములలో ఒకటి.

**ఉత్తరాషాఢ** సం. వి. ఇరువది యొకటవ నక్షత్రము.

**ఉత్తరించు[1]** క్రి. ఖండించు.

**ఉత్తరించు[2]** సం. క్రి. దాటు.

**ఉత్తరుఁడు** సం. విశే. శ్రేష్ఠుడు. వి. 1.శివుడు. 2.విష్ణువు. 3.విరటుని కొడుకు.

**ఉత్తరువు** వై. వి. ఆజ్ఞ, అనుజ్ఞ, సెలవు సం. ఉత్తరమ్.

**ఉత్తరేను** వి. ముండ్లుగల కాయలు కాయు ఒక మొక్క, శైఖరిక, అపామార్గము. (దీనివేరు దంతధావనమునకు ఉపయోగింతురు) రూ. ఉత్తరేణి.

**ఉత్తరోత్తరము** సం. విశ. 1. క్రమముగా హెచ్చునది. 2. పైపై. 3. మరిమరి. 4. ఎడతెగక.

**ఉత్తలపడు** క్రి. 1. కలతపడు. 2. త్వరపడు 3. తారుమారగు. 4. పరితపించు.

**ఉత్తలము** వి. 1. కలత. 2. పరితాపము. 3. తత్తర. 4. భీతి. 5. వ్యత్యాసము.

**ఉత్తానము** సం. వి. 1. లోతులేనిది. 2. వెలికిలబడినది. 3. మాయలేనిది.

**ఉత్తారకుఁడు** సం. విశ. 1. దాటించువాడు. 2. రక్షకుడు.

**ఉత్తాలము** సం. విశ. 1. పొడవైనది. 2. వికవికయైనది. 3. బెట్టదమైనది. 4. గొప్పది. వి. కోతి.

**ఉత్తి** వి. 1. ఈడు, ప్రతినిధి, 2. చెల్లు, పరిష్కారము.

**ఉత్తీర్ణము** సం. విశ. 1. దాటబడినది. 2. పరీక్షాదులందు కృతార్థమైనది. 3. కడచినది.

**ఉత్తీర్ణుఁడు** సం. విశ. 1. దాటినవాడు. 2. పరీక్షాదులందు కడతేరినవాడు. 3. సమర్థుడు.

**ఉత్తుంగము** సం. విశ. మిక్కిలి ఎత్తైనది, పొడవైనది.

**ఉత్తుఁడు** వై. విశ. తగినవాడు, అర్హుడు, పాత్రుడు. సం. యుక్తః.

**ఉత్తేజకము** సం. విశ. ఉద్రేకమును కలిగించునది. ఉత్సాహము పుట్టించునది; (భౌతి. రసా.) ఉత్తేజనమును, చురుకుదనమును కలిగించు వెలుతురును, ఎదురు పెట్టిన హైడ్రొజన్, క్లోరిన్ వాయు మిశ్రమము ఉత్తేజింపబడి రసాయనిక సంయోగమునకు గురియగునది, లేదా వెలుతురు పైబడిన సెలెనియం ధాతువు ఉత్తేజితమై విద్యుత్తును తనగుండ ప్రవహింపనీయగలుగునది (Exciting) వి. (గృహ.) చురుకుదనము నిచ్చు పదార్థము (Stimulant), ఉదా. టీ, కాఫీ మొ.వి.

**ఉత్తేజనము** సం. వి. (భౌతి., జీవ., రసా.) విశ్రాంతిలో నున్న వస్తువును చలనమునకు గాని, లేదా చలించుచున్న వస్తువును అధికీకృత చలనమునకుగాని ప్రేరేపించు ప్రక్రియ (Stimulus).

**ఉత్థానము** సం. వి. 1. ప్రయత్నము. 2. యుద్ధము. 3. సంతోషము. 4. సమాప్తి. 5. సైన్యము.

**ఉత్థితము** సం విశ. 1. లేచినది. 2. పుట్టినది. 3. పూనినది.

**ఉత్పతనము** సం.వి. 1. ఎగురుట. 2. పుట్టుక. 3. మీదికి పోవుట. 4. (రసా.) వేడిచేసినప్పుడు ఘనపదార్థము సూటిగా వాయుస్థితికిని, చల్లార్చినప్పుడు వాయుపదార్థము ఘనస్థితికిని మార్పుచెందు ధర్మము (Sublimation).

**ఉత్పత్తి**. సం. వి. పుట్టుక. 2. పైకిబోవుట. 3. (అర్థ.) ముడి పదార్థములను అనుభోగ్యవస్తువులుగ తయారుచేయుట, జీవితమున కవసరమగు వివిధ వస్తువులు తయారుచేయబడుట (Production). ఉదా. పంటలు పండించుట, వస్త్రములు నేయుట, లోహములతో వివిధవస్తువులు తయారుచేయుట. మొ.వి.

**ఉత్పత్తి ఖరీదు కట్టుట** వి. (వాణి.) ఉత్పత్తి విలువను కనుగొనుట. ఉత్పత్తి విలువను అంచనా వేయుట, ఉత్పత్తి విలువను నియంత్రించుట. (ఉత్పత్తిఖరీదును శాస్త్రీయముగ కన్గొన్నచో ఖర్చులు ఎందుకు పెరుగుచున్నవను విషయమును, ఎక్కువ

పొదుపు చేయుటకు వీలున్నచో ఆ పద్ధతియు వివరముగ తెలియును) (Cost accounting).

**ఉత్పత్తిదారు** మి. వి. (వాణి.) వస్తువులను ఉత్పత్తి చేయువాడు (Manufacturer or Producer).

**ఉత్పత్తిమూల్య నిర్ణయ సిద్ధాంతము** సం.వి. (అర్థ.) ఉత్పత్తిచేసిన వస్తువుల యొక్క మూల్యమును ఉత్పాదనలో ఖర్చయిన మొత్తముపై ఆధారముచేసి నిర్ణయించు పద్ధతి. (Cost of Production theory)

**ఉత్పథము** సం. వి. 1. ఆకాశమార్గము 2. తప్పుదారి, తప్పు. విశ. 1. మార్గము తప్పినది. 2. న్యాయము నతిక్రమించినది.

**ఉత్పన్నము** సం. విశ. 1. పుట్టినది. 2. ఒనగూడినది.

**ఉత్పలము** సం. వి. కలువ, నల్లకలువ.

**ఉత్పార్శ్వకపాలాస్థులు** సం. వి. (జం.) పుఱ్ఱెయొక్క క్రింది భాగమున అసమానముగ నుండు రెండు ఎముకలు (Exoccipitals).

**ఉత్పాటనము** సం. వి. పెల్లగించుట. 2: కురుపు వలన గలుగు బాధ.

**ఉత్పాటించు** సం. క్రి. పెల్లగించు.

**ఉత్పాతము** సం. వి. 1. ఉల్కాపాతము మొ. అపశకునము. 2. ఎగురుట. 3. ఉపద్రవము.

**ఉత్పాదకకణములు** సం. వి. (జం.) దేహములోని పునరుత్పత్తిక్రియతో సంబంధముగల జీవకణములు (Germinating cells).

**ఉత్పాదకులు** సం.వి. (అర్థ.) 1.ఉత్పత్తిచేయువారు. 2.పరిశ్రమలలో ఉత్పత్తిచేయుటను నియంత్రించువారు.

**ఉత్పాదన(ము)** సం. వి. కలిగించుట, (అర్థ., వాణి) భూమి (ప్రాకృతికముగ లభించు సదుపాయములన్ని), శ్రమ, మూలధనము, ఉద్యమి అనునాలుగు అంశముల ఉపయోగము వలన ఒక వస్తువునుగాని, సేవను కాని, ఉపయోగమును కాని తయారు చేయు కార్యము.

**ఉత్పాదనశక్తి** సం. వి. (అర్థ.) నియత కాలములో చేయగలిగిన ఉత్పాదన కార్యము. (ఇది శ్రామికులకు, యంత్రములకు వేర్వేరుగ వర్తించును).

**ఉత్పాదిల్లు** సం. క్రి. 1. కలుగు. 2. పుట్టు. వికృ. ఉప్పతిల్లు.

**ఉత్ప్రాసము** సం. వి. మనస్సు నొచ్చునట్లు చేయు అపహాస్యము, ఎత్తిపొడుపుమాట: రూ. ఉత్ప్రాసనము.

**ఉత్ప్రేక్ష** సం.వి. 1. ఊహ. 2. హెచ్చరికలేమి 3. (అలం.) ఒక అర్థాలంకారము.

**ఉత్ప్రేరకము** సం. వి. (రసా.) తానెట్టి మార్పును చెందక పదార్థముల మధ్య రాసాయనికచర్యను ప్రేరేపించుపదార్థము (Catalytic Agent).

**ఉత్ప్లావిత్వము** సం. వి. (గణి.) ద్రవములలో కాని, వాయువులలోకాని తేలుట (Buoyancy). రూ. ఉత్ప్లవనము.

**ఉత్ఫుల్లము** సం.విశ. 1.వికసించినది (పువ్వు). 2. తెరచినది (కన్ను).

**ఉత్సంగము** సం. వి. 1. తొడ. 2. ఒడి. 3. ఆలింగనము.

**ఉత్సన్నము** సం. విశ. 1. శిథిలమైనది. 2. ప్రచారములో లేనిది.(గ్రంథము మొ.వి.). 3. ఉబికినది. 4. పెల్లగింపబడినది.

**ఉత్సరణపీడనము** సం. వి. (వృక్ష.) ఉత్సరణ క్రియవలన కలుగు ఒత్తిడి (Osmotic pressure).

**ఉత్సరణము** సం. వి. (వృక్ష.) రసాకర్షణము (అర్ధప్రవేశ్యమగు ఒక పొరగుండా తక్కువ సాంద్రత గల ద్రావణములోనికి ప్రవేశించుట) (Osmosis).

**ఉత్సర్గద్వారము** నం. వి. (జం.) ఉత్సర్గ నాళిక దేహకుహరములోనికి తెరచుకొను ద్వారము (Nephrostome).

**ఉత్సర్గనాళిక** నం. వి. (జం.) సామాన్య గొట్టమువలె నుండు విసర్జకావయవము (Nephridium).

**ఉత్సర్గము** నం. వి. 1. దానము. 2. (వృషాదులను) విచ్చలవిడిగా తిరుగ విడుచుట. 3. సామాన్యవిధి (వ్యతి. అపవాదము—విశేషవిధి). 4. (వ్రతాదుల)సమాప్తి. రూ. ఉత్సర్జనము.

**ఉత్సర్గరంధ్రము** నం. వి. (జం.) ఉత్సర్గ నాళిక బయటికి తెరచుకొను రంధ్రము (Nephridiopore).

**ఉత్సర్జనము** నం. వి. చూ. ఉత్సర్గము.

**ఉత్సవము** నం. వి. 1. ఊరేగింపు. 2. పండుగ. 3. కోపము. 4. గర్వము.

**ఉత్సహించు** నం. క్రి. 1. యత్నించు. 2. ఉత్సాహపడు. రూ. ఉత్సాహించు.

**ఉత్సారగ్రాసము** నం. వి. (వ్యవ.) హెచ్చు సారవంతములగు పశువుల దాణా మొ.వి. ఉదా. ఉలవలు,తవుడు, తెలకపిండి మొ.వి. (Concentrated food).

**ఉత్సారములు** నం. వి. (వ్యవ.) కొద్ది పరిమాణములో సారము హెచ్చుగా నుండు ఎరువులు (Concentrated manures).

**ఉత్సాహము** నం. వి. 1. ప్రయత్నము. 2. సంతోషము. 3. కోరిక. 4. ప్రభుశక్తి. 5. (అలం.) వీరరసమునకు స్థాయి. 6. ఆస్థ.

**ఉత్సాహించు** నం. క్రి. చూ. ఉత్సహించు.

**ఉత్సుకుడు** నం. విశే. 1. ఇష్టకార్యసిద్ధికై ప్రయత్నించువాడు.2 ఇష్టవస్తు ప్రాప్తికై తహతహపడువాడు.

**ఉత్సృజము** నం. వి. (జీవ.) గ్రంధి నుండి బయటికి కారు ద్రవము (Secretion).

**ఉత్సేకము** నం. వి. 1. అతిశయము. 2. గర్వము. 3. ప్రోక్షణము.

**ఉత్సేకించు** నం. క్రి. 1. అతిశయించు. 2. గర్వించు. 3. ఉప్పొంగు. 4. ప్రోక్షించు.

**ఉత్సేధము** నం. వి. 1. పొడవు. 2. బలుపు. 3. శరీరము. విశే. పొడవైనది.

**ఉత్స్వేదనము** నం. వి. (వృక్ష.) ఆకుల నుండి కాని, కాండమునుండి కాని నీరు ఆవిరిరూపమున బయటికిపోవుట (Transpiration).

**ఉత్స్ఫోటకము** నం. విశే. (వృక్ష.) పెట్లునట్టిది (Explosive).

**ఉదంచనము** నం. వి. 1. మూకుడు. 2. చేద. 3. ఎగజిమ్ముట. విశే. ఎగజిమ్ముటకు సాధనమైనది.

**ఉదంతము** నం. వి. వృత్తాంతము. సంగతి. రూ. ఉదంతకము.

**ఉదంతుడు** నం. వి. 1. మంచివాడు. 2. వడ్డీవ్యాపారము చేయువాడు.

**ఉదకము** నం. వి. నీరు. (వ్యు.) తడుపునది. రూ. ఉదము.

**ఉదగ్రము** నం. విశే. 1. పొడవైనది. 2. భయంకరమైనది. 3.(వృక్ష.) కొనసన్నముగాను పొడవుగాను తోకవలె ఉన్నట్టిది (ఆకు) (Acuminate).

**ఉదగ్రాక్షము** నం. వి. (గణి.) మీదికి తిన్నగా నున్న అక్షము (Vertical axis).

**ఉదజని** నం. వి. (రసా.) అమ్లజనితో సంయోగించి ఉదకము నిచ్చుటచే ఈ మూలద్రవ్యమునకు ఉదజని అను పేరు వచ్చినది. (Hydrogen).

**ఉదజనీకరణము** నం. వి. (రసా.) ఒక యౌగికమునకు ఉదజనిని రాసాయనికముగా కలుపుట. ఉదా. ద్రవరూపతైలములకు ఉదజనిని కలుపుటవలన గడ్డకట్టు తైలములుగా మారును(డాల్డా వేరుసెనగ నూనెనుండి తయారుచేయుటలో).

**ఉదజము** నం. విశే. నీటబుట్టినది. వి. 1. పద్మము. 2. పశువులను త్రోలుట.

**ఉదధి** నం. వి. సముద్రము.

**ఉదన్వంతము** నం. వి. సముద్రము.

**ఉదయము** నం. వి. 1. పుట్టుక. 2. వృద్ధి. 3. పొడుపుకొండ. 4. సృష్టి. 5. ఫలసిద్ధి 6. వడ్డి. 7. ప్రాతఃకాలము.

**ఉదయించు** నం. క్రి. 1. పుట్టు, కలుగు. 2. సూర్యచంద్రాదులు పొడుచు.

**ఉదరంభరి** నం. విశే. తనపొట్టను మాత్రమే పోషించుకొనువాడు.

**ఉదరకుహరధమని** నం. వి. (జం.) ఉదర కుహరమునకు రక్తమును పంపు శుద్ధ రక్తనాళము (Coeliac artery).

**ఉదరము** నం. వి. 1. కడుపు. (వ్యా.) ఆహారముచే నింపబడునది. 2. నడుము. 3. యుద్ధము. 4. మధ్యభాగము. 5. (జం.) మొండెములో రొమ్మునకు దిగువగా నుండు భాగము (Abdomen).

**ఉదరు** క్రి. 1. అదరు, చలించు. 2. భయపడు. 3. కోపించు.

**ఉదర్కము** నం. వి. 1. భావికాలము. 2. భావి ఫలము. 3. ఉన్మొత్తముల్లు.

**ఉదర్చి** నం వి 1. శివుడు. 2. అగ్ని. విశే పై కెగయు జ్వాలలు కలది.

**ఉదాత్తము** నం. వి. 1. వేదమందలి ఊర్ధ్వ స్వరము,(వ్యతి.అనుదాత్తము).2.దానము 3. పెద్దమద్దెల. 4. (అలం.) ఒక అర్థాలంకారము. విశే. 1. ఎత్తైనది. 2. గౌరవము కలది. 3. ధారాళము.

**ఉదాత్తుఁడు** నం. విశే. 1. గొప్పవాడు. 2. దాత. 3. మనోజ్ఞుఁడు. వి. (అలం.) ధీరోదాత్త నాయకుడు.

**ఉదానము** నం. వి. 1. బొడ్డు. 2. కంఠము నందలి గాలి. 3. ఒకానొకపాము

**ఉదారతావాదము** నం. వి. (రాజ ; చరి.) వ్యక్తికి స్వాతంత్ర్యము, నేనూవ ఆర్థిక అవకాశములు ఉండవలె నను వాదము (Liberalism).

**ఉదారము** నం. విశే. గొప్పది, వి. ఊదలు ఒక రకపు ధాన్యము.

**ఉదారుఁడు** నం. విశే. 1 గొప్పవాడు. 2. దాత. 3. నేర్పరి.



**ఉదావర్తబీజాండము** నం. వి (వృక్ష.) తల క్రిందుగా నున్న బీజాండము(Anattropous ovule.) ఉదావర్త బీజాండము

**ఉదాసీనమైన ఆక్సైడ్** (రసా.) ఆమ్ల ధర్మములుగాని, క్షార ధర్మములుగాని లేని ఆక్సైడ్.

**ఉదాసీన పద్ధతి** నం. వి. (చరి.) పిట్ ఇండియా చట్టము (క్రీ. శ. 1784 నం.) ప్రకారము భారతదేశములోని బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వము భారత సంస్థానాధీశుల తగవులలో కలుగజేసికొనక, తటస్థవిధాన మవలంబింపవలయు నను వాదము.

**ఉదాసీనము** నం. విశే. తటస్థముగా నుండునది.

**ఉదాసీన వక్రరేఖలు** నం. వి. (అర్థ.) రెండు వస్తువులను ఒకేవ్యక్తి అనుభోగించునపుడు తనకు లభ్యమగు ఉపయోగిత వివిధములైన వస్తురాశి మిశ్రమములనుండి లభించు ఉపయోగితతో సమాన మగును, ఇట్టిమిశ్రములన్నింటిని వక్రరేఖల ద్వారా చూపించిన అవిఉదాసీనవక్రరేఖ లగును(పలయన ఇట్టి మిశ్రములలో దేనివలన నైనను వ్యక్తికి లభించు ఉపయోగిత సమానము. అందువలన వివిధమిశ్రమములపట్ల వ్యక్తి ఉదాసీనతను చూపించును.)

**ఉదాహరణము** సం. వి. 1. దృష్టాంతము, తార్కాణ. 2.ఒకరకపు కావ్యము, ఉదా. త్రిపురాంతకోదాహరణము. రూ. ఉదాహరము.

**ఉదాహరించు** సం. క్రి. ఉదాహరణముగా చెప్పు, ఉదాహరణముగా చూపు.

**ఉదితము** సం. విశే. 1. పుట్టినది, కలిగినది. 2. చెప్పబడినది.

**ఉదియ** వై. వి. యత్నము. రూ. ఉద్దియ. సం. ఉద్యమః.

**ఉదిరి** వి. అపరంజి, మేలిమి బంగారము.

**ఉదీచి** సం. వి. ఉత్తరదిక్కు.

**ఉదీచ్యము** సం. విశే. 1. ఉత్తరదిక్కున ఉన్నది. 2. ఉత్తరకాలమున ఉన్నది. వి. 1. శరావతీనదికి వాయవ్యమున ఉన్న దేశము. 2. కురువేరు.

**ఉదీర్ణము** సం. విశే. 1. గొప్పది. 2. చెప్పబడినది. 3. అతిశయించినది. 4. పుట్టినది. 5. గర్వించినది.

**ఉదుంబరక ఫలము** సం వి. (వృక్ష.) పుష్పమంజరి అంతయు కలిసి ఏర్పడిన ఫలములలో నిది యొకటి. దీనిలో చుట్టును ఆవరించి యున్న పుష్పాసనము మాంసలమై యుండును, ఉదా. అత్తి మొ. వి.

**ఉదుంబరము** సం. వి. 1. గడప. 2. అత్తిచెట్టు. 3 రావిచెట్టు.

**ఉదుంబరుఁడు** సం. వి. పేడి, నపుంసకుడు.

**ఉదుకు** క్రి. చూ. ఉతుకు.

**ఉదుటు** వి. 1. గర్వము. 2. నీటు. విశే. 1. గర్వించినది. 2. నీటుగలది. రూ. ఉదురు.

**ఉదూఖలము** సం. వి. రోలు. రూ. ఉలూఖలము.

**ఉదూరువు** సం. వి. (జం.) కీటకముల కాలి భాగములలో ఇదిరెండవది(Trochanter).

**ఉదోష్ఠధరము** సం. వి. (జం.) కీటకముల నోటిభాగములలో ఇది ఒకటి. (పై పెదవి దీనిపై ఆధారపడి యుండును(Clypeus).

**ఉదోష్ఠము** సం. వి. (జం.) కీటకముల పై పెదవి (Labrum).

**ఉద్గతము** సం. విశే. 1. ఛేదించుకొని బయటికి వచ్చినది. 2 క్రక్కబడినది.

**ఉద్గతి** సం వి. 1. ఎగయుట, 2. పుట్టుట 3. వాంతి.

**ఉద్గమన వర్ణమాల** సం.వి (జీవ.) ఒక కాంతి ప్రభవస్థానము పైకిపంపు వర్ణమాలరేఖల సమూహము (Emission spectrum).

**ఉద్గమము** సం. వి. 1. ఎగపు. 2. పుట్టుక. 3. వాంతి.

**ఉద్గమించు** సం. క్రి. 1. ఎగపు. 2. ఊసు, పైకివచ్చు

**ఉద్గాత** సం. వి. యజ్ఞమందు సామవేద తంత్రమును నడుపు వ్యక్తి.

**ఉద్గారము** సం. వి. 1. క్రక్కుట. 2. త్రేపు.

**ఉద్గారించు** సం. క్రి. 1. త్రేచు. 2.వెళ్లగక్కు.

**ఉద్గ్రాహము** సం. వి. 1. పైకెత్తి పట్టుకొనుట 2. ఉగ్గము. రూ. ఉగ్గ్రాహణము.

**ఉద్ఘాటనము** సం. వి. 1. పైకి లాగుట. 2. పతము. 3. వెలికి చెప్పుట. 3, అడ్డము లేకుండ చేయుట. 5. తాళపు చెవి.

**ఉద్ఘాటించు** సం. క్రి. 1. ఛేదించు. 2. చంపు 3. పైకి లాగు.

**ఉద్ఘాతము** సం. వి. 1 ఆరంభము. 2. దెబ్బ. 3. ఇనుప గుదియ. 4. తొట్రుపాటు.

**ఉద్ఘోషము** సం. వి. 1. మొర. 2. పెద్దధ్వని. 3. చాటుట. 4. కింపదంతి.

**ఉద్ఘోషించు** సం. క్రి. 1. మొరపెట్టు 2.పెద్దధ్వనిచేయు. 3. చాటు.

**ఉద్ద** అవ్య. మిక్కిలి.

**ఉద్దండము** సం. విశే. 1. పొడువైనది. 2. ఎక్కువైనది. 3. భయంకరమైనది. 4. పైకి లేచిన కాడ గలది. 5. ఎత్తబడిన కఱ్ఱ గలది. వి. ఉన్నతమగు దండము.

**ఉద్దర** వి. తాకట్టు.
**ఉద్దరి** వి. 1. నిట్రముగా నుండు గట్టు. 2. నదిలో దిగుటకు యుక్తము కాని దరి. 3. కత్తెర ఒడ్డు.
**ఉద్దరువు** వి. ఉద్దర, తాకట్టు పెట్టి తీసికొనెడి వడ్డీ లేని అప్పు.
**ఉద్దవడి** అవ్య. 1. మిక్కిలివేగముగా 2 క్రమముగా, రూ. ఉద్దవిడి.
**ఉద్దవిడి** అవ్య. చూ. పై.
**ఉద్దాముఁడు** సం. విశే. 1. స్వతంత్రుడు 2. భయంకరుడు. 3. అధికుడు. వి వరుణుడు.
**ఉద్ది** వి. 1. జత, జట్టు. 2. చెలిమి. విశే. 1. సమానము. 2. ప్రతిస్పర్ధి.
**ఉద్దీఁడు** వి. 1. జతకాడు. 2. మిత్రుడు. రూ. ఉద్దికాఁడు.
**ఉద్దీపనము** సం. వి. 1. వెలుగుట. 2. వెలిగించుట. 3. (అలం.) ఆలంబన విభావ భేదము.
**ఉద్దీపించు** సం. క్రి. 1. ప్రకాశించు, 2. విజృంభించు, చెలరేగు. 3. వెలిగించు.
**ఉద్దీప్యత** సం. వి. ఉద్దీపకము (Stimuli)లకు ప్రాణి సంకోచము నిచ్చుశక్తి (Irritability).
**ఉద్దేశము** సం. వి. 1. గురి. 2. తలంపు. 3. నిశ్చయము. 4. ఎత్తైన ప్రదేశము.
**ఉద్దేశించు** సం. క్రి. 1. గుర్తించు. 2. అనుకొను.
**ఉద్ద్యోతనము** సం. వి. (భౌతి.) కాంతి వస్తువుపై బడుట. వెలుతురుకు ఎదుటపెట్టుట (Irradiation).
**ఉద్ధతము** సం. విశే.. 1. గర్వించినది. 2. ఎత్తబడినది. 3. కఠినమైనది. 4. కొట్టబడినది.
**ఉద్ధతి** సం. వి. 1. గర్వము. 2. పైకెగురుట. 3. పెద్దదెబ్బ.
**ఉద్ధతుఁడు** సం. వి. 1. గర్వి. 2. రాజునొద్ద నుండు మల్లుడు.
**ఉద్ధరణము** సం.వి. 1. పైకెత్తుట. 2. బాగుచేయుట. 3. వాంతి. 4. కక్కినఅన్నము. 5. ఋణము తీర్చుట. 6. ముక్తి. రూ. ఉద్ధారణము.
**ఉద్ధరించు** సం. క్రి. 1. పెల్లగించు. 2. మీదికెత్తు, 3. రక్షించు.
**ఉద్ధర్త** సం. విశే. 1. పైకెత్తువాడు. 2. ఆపదనుండి రక్షించువాడు. 3.నాశము చేయువాడు.
**ఉద్ధారకుఁడు** సం. విశే. చూ. పై.
**ఉద్ధారణము** సం. వి. చూ. ఉద్ధరణము.
**ఉద్ధరిణి** సం.వి. 1. ఆచమనాదులందు చేతిలో నీళ్ళు పోసికొనుటకు ఉపయోగించు మిల్లిగరిటెవంటి సాధనము. 2. పతము.
**ఉద్ధారము** సం. వి. 1. వడ్డి లేని అప్పు. 2. పైకెత్తుట. 3. రక్షించుట. 4. దాయభాగమునుండి జ్యేష్ఠున కీయదగినసొమ్ము.
**ఉద్ధూతము** సం. విశే. (ఉత్+ధూతము) 1. మీదికి కదలింపబడినది. 2. ఎగురగొట్టబడినది. 3. వణకింపబడినది. 4. (ఉత్+హూతము) గట్టిగా పిలువబడినది.
**ఉద్ధృతము** సం. విశే. 1. పైకెత్తబడినది. 2. ఉద్ధరింపబడినది. 3. చేదబడినది. 4.ఎగజిమ్మబడినది. 5. తీసి చూపబడినది.
**ఉద్ధృతి** సం. వి. 1. పైకెత్తుట. 2. ఎగజిమ్ముట. 3. రక్షించుట 4. విముక్తి. 5. గర్వము.
**ఉద్బోధము** సం. వి. 1. మేలుకొనుట. 2. వికాసము. 3. సంస్కారోద్దీపనము.
**ఉద్భటము** సం. విశే. అధికము. వి. 1. చేట 2. తాబేలు.
**ఉద్భవము** సం. వి. 1. పుట్టుక, 2. జన్మకారణము. విశే. పుట్టినది.
**ఉద్భవించు** సం. క్రి. జనించు, పుట్టు.

**ఉద్భిజ్జజాలము** సం. వి. (వృక్ష.) ఒక స్థలమునం దున్న పలురకముల ఉపజాతులకుచెందిన మొక్కలసమూహము(Flora)

**ఉద్భిజ్జమాంసకృత్తులు** సం. వి. (వృక్ష.) మొక్కల శరీరములో తయారైన మాంసకృత్తులు (Plant proteins) ఉదా. లెగూమిన్ (Legumin), గ్లూటెన్ (Gluten).

**ఉద్భిజ్జము** సం. విశ. భూమిని ఛేదించుకొని పుట్టునది. (చెట్లు, తీగలు మొ. వి.) రూ. ఉద్భిదము.

**ఉద్భిజ్జవీర్యదములు** సం. వి. (వ్యావ.) మొక్కలు జీవరసము నుండి ఉత్పత్తి చేసికొను కొన్ని ప్రత్యేక రసాయన పదార్థములు. (ఇవి మొక్కల పెరుగుదల మొ. జీవనవ్యాపారములకు ముఖ్యావసరము). ఉదా. ఇండోల్ అసిటిక్ ఆమ్లము.

**ఉద్భిదము** సం. విశ. చూ. ఉద్భిజ్జము.

**ఉద్భిదములు** సం. వి. (భూగో.) మానవ కృషివలన గాక తమంతట తాము వృద్ధిచెందు సహజ వృక్ష సంపద.

**ఉద్భిదవ్యాధిశాస్త్రము** సం. వి. (వ్యావ.) మొక్కలకు సంభవించు తెగుళ్ళను గూర్చి తెలియజేయు శాస్త్రము (Plant Pathology).

**ఉద్భిన్నము** సం. విశ. 1. వికసించినది. 2. పుట్టినది. 3. మొలచినది. 4. మోసముచే పట్టియీయబడినది. 5. వెల్లడి చేయబడిన రహస్యము కలది.

**ఉద్భూతము** సం. విశ. 1. పుట్టినది. 2. ప్రత్యక్షయోగ్యమైనది. వి. కాళ్ళు తడబడుట.

**ఉద్భ్రాంతము** సం. విశ. 1. తిరుగుడు పడినది. 2. భ్రాంతి నందినది.(మనస్సు మొ.వి.)

**ఉద్యతము** సం. విశ. 1. యత్నించినది. 2. పైకెత్తబడినది.

**ఉద్యతి** సం.వి. పైకెత్తుట. 2. యత్నము.

**ఉద్యమము** సం. వి. 1. యత్నము. 2. సిద్ధమగుట.

**ఉద్యమి** సం. విశ. 1. గట్టి పూనిక గలవాడు. 2. ప్రయాసపడువాడు. 3. (అర్థ.) ఉత్పాదనాంశములను సరియైన పాళ్ళలో కలిపి, ఉత్పాదనకార్యమును సరియైన రీతిని నడుపు వ్యక్తి (ఈ వ్యక్తి కష్టమునకు ప్రతిఫలముగ లాభము కాని, దురదృష్టవంతులకు నష్టముకాని సంక్రమించును.)

**ఉద్యమించు** సం. క్రి. 1. ప్రారంభించు. 2. యత్నించు.

**ఉద్యానకృషి** సం. వి. (వ్యావ.) పండ్లు, కాయగూరలు, పుష్పములు ఇచ్చు మొక్కలను, రమణీయముగ నుండు మొక్కలను తోటలో పెంచుట(Gardening or Horticulture).

**ఉద్యాననిర్మాణము** సం. వి.(వ్యావ.) స్థలముయొక్క అనుకూలత, నీటివసతి, బాటలు, కాలిత్రోవలు, వివిధ జాతుల మొక్కలు మొ. వి పరిశీలించి అమర్చుకొని ప్రణాళిక ప్రకారము తోటనునిర్మించుట (Construbtion of a garden).

**ఉద్యాననిర్వాహము** సం.వి.(వ్యావ.)తోటలో నాటిన మొక్కలు బలముగను, ఆరోగ్యముగను పెరుగుచట్లు తగిన దోహదములు చేయుట(Maintenance of a garden).

**ఉద్యానము** సం. వి. 1. (రాజుల) విహారార్థమైన తోట. 2.విహారముకొరకు వెడలుట 3. ప్రయోజనము.

**ఉద్యానవనము** సం. వి. రమణీయములగు అనేకవిధములైన చెట్లు, లతలు. గుల్మములు అందముగ నమర్చి పెంచుతోట (Garden).

**ఉద్యాపనము** సం. వి. 1. వ్రతసమాప్తి. 2. వెడలించుట.

**ఉద్యుక్తము** సం. విణ. 1. పూనినది. 2. సిద్ధమైనది.

**ఉద్యుక్తుఁడు** సం. విణ. 1. యత్నించువాడు. 2. సంసిద్ధుడు.

**ఉద్యోగము** సం. వి. 1. యత్నము. 2. పని. 3. కొలువు. 4. పాటుపడుట.

**ఉద్యోగవర్గకళాశాల** సం. వి. (వ్యావ.) పరిపాలనా వర్గమునకు చెందిన ఉద్యోగులకు శిక్షణ ఇచ్చు కళాశాల (Staff-College).

**ఉద్యోగసాధక కార్యాలయములు** సం. వి (వ్యావ.) పనికి తగినవారికి, తగిన పనిని చూపించు కార్యాలయము. (ఉద్యోగములు కావలసిన వారు ఈకార్యాలయములలో తమపేర్లను నమోదు చేసికొందురు. అట్లే పనివాండ్రు కావలసినవారు కూడ తమ అవసరములను ఈకార్యాలయములకు తెలియజేయుదురు. తమకు లభించిన ఈభోగట్టాను సమన్వయించి సరియైన పనికి సరియైన పనివానిని చూపించుటలో ఈకార్యాలయము తోడ్పడును) (Employment Exchange Offices).

**ఉద్యోతితము** సం. విణ. ప్రకాశితము.

**ఉద్రిక్తము** సం. విణ. 1. ఉద్రేకించినది. 2. విదితము.

**ఉద్రేకము** సం. వి. 1. అతిశయము. 2. విజృంభణము.

**ఉద్రేకించు** సం. క్రి. 1. విజృంభించు. 2. అతిశయించు.

**ఉద్వర్తనము** సం. వి. 1. నలుగు. 2. నలుగుపిండి. 3. చెడునడవడి. 4. పైకిపోవుట. 5. రాపిడి. విణ. నీతి నతిక్రమించిన నడత గలది.

**ఉద్వర్ధితము** సం. వి. పరైన ఒక అవయవముపై బయలుచేరి పెరిగినది (Outgrowth).

**ఉద్వహ** సం. వి. కుమార్తె.

**ఉద్వహనము** సం. వి. 1. పైకెత్తుట. 2. భరించుట 3. పెండ్లియాడుట.

**ఉద్వహుఁడు** సం విణ. 1. పైకెత్తువాడు. 2. మోయువాడు. 3 పితృదేవతలను నరకమునుండి రక్షించువాడు, కుమారుడు.

**ఉద్వాసనము** సం. వి. 1. ఇంటినుండిగాని పురమునుండిగాని వెడలగొట్టుట. 2. చంపుట. 3. విడుచుట. 4. దేవతాదులను పూజానంతరము స్వస్థానమునకు చేర్చుట.

**ఉద్వాహనము** సం. వి. 1. పెండ్లియాడుట. 2. పెండ్లిచేయుట. 3. పైకెత్తుట. 4. చేదుట. 5. ఇనుమారు దున్నినపొలము విణ. 1. పైకెత్తునది. 2. చేరునది.

**ఉద్వాహము** సం. వి. 1. పెండ్లి. 2. పైకెత్తుట. 3. మోచుట.

**ఉద్విగ్నము** సం. విణ. 1. భయము నొందినది. 2. మనసు కుదురులేనిది, వ్యాకులమైనది.

**ఉద్వృంతము** సం. వి. (జం.) కీటకములహనువు (Stipes maxilla) లో అధోవృంతము తర్వాత నున్న తునుక.

**ఉద్వృత్తి** సం. వి. 1. గర్వము. 2. చెడునడత. 3. వాంతి. 4. కలత. 5. మిడిసిపాటు.

**ఉద్వేగము** సం. వి. 1. భయము. 2. విరహమువలన కలుగు దుఃఖము. 3. కలత.

**ఉద్వేగిల్లు** సం. క్రి. 1. భీతిల్లు. 2. వ్యాకులపడు.

**ఉద్వేజనము** సం. వి. 1. చిత్తంచాంచల్యము. 2. విరహవ్యథ. 3. భయము. 4. భయపెట్టుట. 5. కలత. విణ. 1. భయపెట్టునది. 2. కలచునది.

**ఉద్వేలము** సం. విణ. 1. గట్టుమీరినది (నది మొ.వి.), హద్దుమీరినది. 2. అధికమైనది.

**ఉనికి** వి. 1. ఉండుట, స్థితి. 2. స్థానము, 3. నివాసము, ఉనికిపట్టు. 4 మృగము,

లకై పొంచియుండుట. రూ. ఉనుకువ. (గణి.)ఒక వస్తువుఉన్నచోటు(Position).

**ఉనికిపట్టు** వి. చూ. పై.

**ఉనుకువ** వి. చూ. పై.

**ఉన్నతము** సం. విణ. 1. పొడవైనది, ఎత్తైనది. 2. గొప్పది.

**ఉన్నతి** సం. వి. 1. ఎత్తు, 2. ఉచ్ఛస్థితి. 3. గరుడుని భార్య.

**ఉన్నతోదరబహుభుజి** సం.వి. (గణి.) రెండు లంబకోణములకు మించిన కోణములు గల్గిన బహుభుజి (Convex polygon)

**ఉన్నరూపు** వి యథార్థము. కలరూపు.

**ఉన్నామక కండరము** సం. వి. (జం) అవయవములను పైకెత్తుటకు ఉపయోగపడు కండరము (Elevator muscle).

**ఉన్ని** వి. గొఱ్ఱె మొ. ని బొచ్చు.

**ఉన్నిఅల్లిక** వి. (గృహ.) ఊలును దుస్తులుగా అల్లుట (Knitting).

**ఉన్నిద్రము** సం. విణ. 1. మేలుకొన్నది. 2. వికసించినది.

**ఉన్మత్తము** సం..విణ. 1. వెఱ్ఱియెత్తినది, 2. కైపెక్కినది 3. గర్వించినది. 4. పిశాచావేశము కలది. వి. ఉమ్మెత్తచెట్టు.

**ఉన్మాదము** సం. వి. 1. వెఱ్ఱి, పిచ్చి 2. (అలం.) సంచారీభావములలో ఒకటి.

**ఉన్మీలనము** సం. వి. 1. వికసించుట. 2. (కన్ను మొ,వి) తెరచుట. 3. బయలుపరచుట. 4. రంగువేయుట.

**ఉన్మీలించు** సం. క్రి. వికసించు.

**ఉన్ముద్రకములు** సం. వి. (వృక్ష.) గడ్డి కుటుంబములోని మొక్కల పువ్వులలో పుష్ప పరికోశమునకు బదులుగా నుండు రెండు తెల్లని సూక్ష్మమైన ఆకులు (Lodicules).

**ఉన్మేషము** సం. వి. 1. కనువిచ్చుట. 2. వికాసము. 3. కాంతి. 4. స్ఫురణము.

**ఉప** సం. అవ్య. సమీపము. సహాయము మొ. అర్థములను కలిగించు ఉపసర్గము (Sub.) ఉదా. ఉపాధ్యక్షుడు.

**ఉపఎన్నిక** వి. (వ్యావ.) (శాస., రాజ. పౌర.) ఎన్నుకొనబడిన అభ్యర్థి మరణము, వలనగాని, రాజీనామా వలనగాని, ఎన్నికలలో లోపమువలనగాని నిర్దిష్టకాలమునకు ముందుగా మరల జరుగు ఎన్నిక.

**ఉపకంఠము** సం. విణ. దాపైనది. వి.1.పొలిమేర. 2. సమీపదేశము. 3. సమీపకాలము

**ఉపకథ** సం. వి. ఒకకథలో వచ్చు అప్రధానమగు చిన్నకథ,

**ఉపకరణము** సం. వి. 1. పనిముట్టు.2. ఉపయుక్తమగుట. 3. (భౌతి.) ప్రయోగశాలలో ప్రయోగములకు ఉపయోగపడు పరికరము (Apparatus).

**ఉపకరణములు** సం. వి. (భౌతి.) సాధనములు (Appliances).

**ఉపకర్త** సం. విణ. మేలు చేయువాడు. రూ. ఉపకారి.

**ఉపకారము** సం. వి. మేలు. రూ. ఉపకృతి,

**ఉపకారహుండీ** వి (వాణి.) సరకుల అమ్మకము వలనకాక, కేవలము ధనసహాయార్థము ఒక వర్తకుడు మరియొకనికి వ్రాసియిచ్చు హుండీ. (ఇట్టి హుండీని వ్రాసియిచ్చువాడు తాను అమ్మిన సరకుల నిమిత్తమున ఈ హుండీని ఇచ్చినట్లు వ్రాయును. దానిని రెండవవాడు అంగీకరించిన పిమ్మట బాంకులో ఎవరి కెంత అవసరమో అంత వాడుకొందురు. హుండీ చెల్లించు సమయము పూర్తి అయినప్పుడు సొమ్ము చెల్లించవలసిన వానికి రెండవవాడు తాను వాడుకొన్న సొమ్మును కూడ అందజేయును. ఇట్లు తాత్కాలికముగ వ్యాపారములో సంభవించు అర్థి

కావసరములను తీర్చుకొనుటలో ఈ హుండి ఉపయోగపడును.)

**ఉపకారి** సం. విణ. 1. ఉపకారము చేయువాడు. 2. బండిసొగల క్రింద ఆధారముగ నుంచ బడినది.

**ఉపకృతి** సం. వి. మేలు.

**ఉపక్రమము** సం. వి. 1. ప్రారంభించుట. 2. విక్రమము. 3. చికిత్స. 4 సమీపించుట. 5. మంత్రులు మొ. వారిని పరీక్షించుట.

**ఉపక్రోశము** సం. వి నింద.

**ఉపగతి** సం. వి. ప్రాప్తి. 2. సమీపించు . 3 జ్ఞానము. 4. అంగీకారము.

**ఉపగమము** సం. వి. 1. అంగీకారము. 2. సమీపించుట. 3. జ్ఞానము 4. ప్రాప్తి 5. కలియుట.

**ఉపగూఢము** సం వి. 1. కౌగిలింపబడినది. 2. దాచబడినది. 3. పట్టుకొనబడినది.

**ఉపగూహనము** సం. వి. 1. కౌగలింత. 2. దాచుట.

**ఉపగ్రహము** సం. వి. 1. ఉపయోగము, 2. చెర. 3. (ఖగో.) ఒక పెద్దగ్రహము. చుట్టు తిరుగు చిన్నగ్రహము (Satellite)

**ఉపగ్రాహ్యము** సం. వి. కానుక. విణ 1. కానుకగా నీయదగినది. 2. దగ్గరపెట్టుకొనదగినది.

**ఉపచయము** సం. వి. 1. వృద్ధి. 2. ఎత్తు.

**ఉపచరించు** సం. క్రి. 1. సన్మానించు. 2. సేవించు 3. బోధించు. 4. వినియోగించు

**ఉపచారము** సం. వి 1. సేవ. 2. సన్మానము. 3. చికిత్స. 4. పూజ.

**ఉపచాలకండరము** సం. వి. (జం) శరీరము. యొక్క మధ్యరేఖ దగ్గరకు ఎముకను లాగుకొనుటకు ఉపయోగపడు కండరము (Adductor muscle).

**ఉపజాతి** సం. వి. (జీవ.) 1. తెగ. 2. ఒక్కొక్క తెగకు చెందిన ఉద్భిజ్జముగాని జంతువు గాని. 3. (ఛం.) పద్యభేదము.

**ఉపజిహ్విక** సం. వి. కొండనాలుక.

**ఉపజీవి** సం. విణ. ఒకరిననుసరించి బ్రదుకువాడు. రూ. ఉపజీవకుడు.

**ఉపజీవించు** సం క్రి. ఒకరినాశ్రయించి జీవించు.

**ఉపజీవిక** సం. వి. 1. బ్రతుకు 2. జీవనోపాయము.

**ఉపజ్ఞ** సం. వి. ఉపదేశము లేకయే తనంత కలుగు జ్ఞానము.

**ఉపత్యక** సం. వి. కొండచేరువనేల (వ్యతి అధిత్యక.)

**ఉపద** సం. వి. 1. కానుక. 2. లంచము.

**ఉపదంశము** సం. వి. 1. ఊరుగాయ. 2. మునగచెట్టు. 3. ఏరువంగచెట్టు.

**ఉపదర్శకుడు** సం. విణ. 1. తప్పునడవకుండ చూచుకొను అధికారి. 2. చూచువాడు. చూపువాడు వి. ద్వారపాలకుడు.

**ఉపదానము** సం. వి. 1. అరణము. 2. కానుక. 3. లంచము.

**ఉపదారువు** సం. వి. (వృక్ష.) వేరుగావి. కాండముగాని ముదిరిన తరువాత రెండవసారి ఏర్పడిన దారువు. (Secondary xylem).

**ఉపదేశము** సం. వి. 1. హితవచనము. 2. మంత్రోపదేశము. 3. విధివాక్యము.

**ఉపదేష్ట** సం. విణ. బోధించువాడు, ఉపదేశించువాడు.

**ఉపద్రవము** సం. వి. 1. ఆపద 2. బాధ. 3. విప్లవము. 4. పీడ. 5. రోగోద్రేక కారణమగు శ్లేష్మాది వికారము.

**ఉపధ** సం. వి. ఉద్యోగ మిచ్చునపుడు మంత్రి మొ. వారి గుణములను పరీక్షించుట. 2. (వ్యాక) కడపటి .యక్షరము నకు పూర్వాక్షరము.

**ఉపధాతువు** సం. వి. (రసా.) ధాతువుల ధర్మములు కొన్ని ధాతువులు కానివాని (అధాతు) ధర్మములు కొన్నిగల మూల ద్రవ్యము. ఉదా. ఆంటిమనీ, సెలెనియమ్ (Metalloid).

**ఉపధానము** సం. వి. 1. తలగడ. 2. స్నేహము, 3. విషము, 4. సమీపమున ఉంచుట.

**ఉపధ్మానీయము** సం.వి. (వ్యాక.) ఓష్ఠ్యవర్ణములగు ప,ఫ,బ,భ.మలకు పూర్వముందు విసర్గము. ఉదా. ప్రాతఃపవనము.

**ఉపనది** సం. వి. (భూగో.) పెద్దనదిలోనికి పోయిచేరెడి చిన్ననది,

**ఉపనయనము** సం. వి. 1. వడుగు 2. దగ్గరకు తెచ్చుట. 3. అర్పించుట. రూ. ఉపనాయము, ఉపనయము.

**ఉపనిషత్తు** సం. వి. 1. బ్రహ్మజ్ఞానము. 2. వేదాంతము, ఛాందోగ్యము, మొ.వి. 3. ధర్మము. 3. ఏకాంతము.

**ఉపనిష్కరము** సం. వి. పురమార్గము. రాజమార్గము.

**ఉపనిష్కరము** సం. వి. చూ. పై.

**ఉపనీతుఁడు** సం. విశే. 1. వడుగైనవాడు. 2. సమీపమునం దుంచబడినవాడు. 3. పొందబడినవాడు.

**ఉపన్యాసము** సం. వి. 1. దగ్గరపెట్టుట. 2. ఇల్లడపెట్టుట. 3. ఒక విషయమును విస్తరించి చెప్పుట. 4. స్వకార్యసిద్ధికి ఒనరించుకొను సంధి.

**ఉపపత్రకము** సం. వి. (వృక్ష) ద్విభిన్నపత్రముపై అగపడు ఒక్కొక్క చిన్న ఆకు (Pinnule).

**ఉపపతి** సం. వి. రంకు మగడు.

**ఉపపత్తి** సం. వి. 1. కలిమి. 2. పుట్టుక, 3. కారణము. 4. (గణి.) ఒక సిద్ధాంతమును స్థాపించుటకు లేదా రుజువు చేయుటకు కల్పించబడు సబబు.

**ఉపపత్రము** సం. వి. (వృక్ష.) పత్రకము. భిన్నపత్రములో అగపడు ఒక్కొక్క చిన్న ఆకువంటి భాగము. (Leaflet or pinna).

**ఉపపన్నము** సం. విశే. 1. పుట్టినది. 2. పొందబడినది. 3. యుక్తియుక్తము. 4. తగినది,

**ఉపపరిశ్రమలు** సం. వి. (అర్థ.) ముఖ్యవృత్తికిగాని పరిశ్రమకు గాని సహాయకారిగా నుండి రాబడిని అభివృద్ధి చేయు చిన్న పరిశ్రమలు. (Supplementary Industries)

**ఉపపాదనము** సం. వి. 1. కలిగించుట. 2. సభలో ఒక విషయమును ప్రవేశపెట్టుట.

**ఉపపాద్యము** సం. వి. (గణి. జ్యామి.)నిరూపణకు కావలసిన విషయము. (Conclusion).

**ఉపప్లవము** సం. వి. 1. ఉత్పాతము. 2. ఉపద్రవము. 2. నీటిపై తేలుట.

**ఉపఫలము** సం. వి. ఒక ప్రధాన వస్తువును తయారుచేయు ప్రక్రియలో లభించు అప్రధానఫలము. (దీనికి కూడ ఒకప్పుడు ఉపయోగ ముండును-ఉదా. చెరకునుండి పంచదారను తయారు చేయుటలో మిగిలిన చిక్కని, నల్లని పాకము) (Bye-product).

**ఉపబర్హము** సం.వి. 1. తలగడ. 2.పీడించుట.

**ఉపభోగము** సం. వి. అనుభవము,

**ఉపమ**[1] వై. వి. ఉపాయము వెరవు.

**ఉపమ**[2] సం, వి. ఒక అర్థాలంకారము. 2. పోలిక. విశే. సమానమునందు ఉత్తరపదమైనచో సమాసము.

**ఉపమరి** వై. విశే. ఉపాయశాలి.

**ఉపమానము** సం. వి. పోలిక. దేనితోపోల్చుచున్నామో అది. అప్రకృతము (చంద్రుడు మొ.వి.). రూ. ఉపమితి.

**ఉపమితి** సం. వి. చూ. పై.

**ఉపమేయము** సం. వి. దేనిని వర్ణించుచున్నామో అది, ప్రకృతము (ముఖము మొ. వి.)

**ఉవయమము** సం. వి. పెండ్లి. చూ. ఉపయామము.

**ఉపయామము** సం. వి. చూ. పై.

**ఉపయుక్తము** సం. విశే. 1. అనుకూలమైనది. సరిపడినది. 2. ఉపయోగింపబడినది. 3. న్యాయమైనది.

**ఉపయుక్తి** సం. వి. (అర్థ.) ఉపయోగిత, వస్తువు యొక్క ఉపయోగము, వ్యక్తి యొక్క వాంఛలను తీర్చగలశక్తి, ప్రయోజనము. (ఏదేని పదార్థమును అనుభోగించుట మొదలిడిన వెంటనే ఆ పదార్థరాశి వలన వచ్చు ఉపయోగిత ఎక్కువగుచుండును. అటుపై ఇంకను అదే పదార్థమును అనుభోగించిన ఉపయోగిత స్థిరముగ నుండును. అటుపిమ్మట క్రమముగ తగ్గిపోవుచుండును.

**ఉపయుక్తి** సం. వి. (అర్థ.) ఉపయోగము, ఉపయోగిత, అక్కరగల వస్తువు యొక్క అనుభవసౌఖ్యము.

**ఉపయోగము** సం. వి. 1. అనుకూల్యము. 2. వాడుక. 3. ప్రయోజనము.

**ఉపయోగితావాదము** సం. వి. (అర్థ., రాజ.) 19వ శతాబ్దములో బెంథామ్ "స్టీవర్ట్ మిల్" మొ. వారు ప్రతిపాదించిన సిద్ధాంతము. ప్రభుత్వము చేయు ప్రతికార్యము ప్రజల ఆనందమునకు ఔన్నత్యమునకు తోడ్పడవలయు నను మతము, వ్యక్తి స్వామ్యవాదమును బలపరచుసిద్ధాంతము.

**ఉపయోజనము** సం. వి. (జీవ.) నిర్మాణము నందును, శరీర ధర్మముల యందును ప్రాణి ఒక ప్రత్యేక పర్యావరణమునకు తగియుండు క్రమము (Adaptation).

**ఉపరతము** సం. విశే. ఉడిగినది. వి. 1. ఉపరతి, నిలుపుదల. 2. పురుషాయితము.

**ఉపరథ్య** సం. వి. రాకపోకలచే నేర్పడిన ఊరి ముంగిదారి, పుంత.

**ఉపరమము** సం. వి. 1. నిలుపుదల. 2. విషయవిరక్తి. 3. మరలుట. 4. చావు.

**ఉపరాగము** సం. వి. 1. సూర్యాదిగ్రహణము. 2. వ్యసనము, దుర్వ్యసనము. 3. అన్యాయము.

**ఉపరామము** సం. వి. చూ. ఉపరమము.

**ఉపరిజలవిమోచనము** సం. వి. (వ్యవ.) హెచ్చు వర్షము కురిసినపుడు నేలపై నీరు నిలువకుండచేయుట(Surface drainage)

**ఉపరిభూమిక** సం. వి. (వృక్ష.) అంకురము గింజ నుండి మొలకెత్తునపుడు బీజదళములు భూమి నుండి పైకి వచ్చిన స్థితి (ఈమాదిరి అంకురోత్పత్తి) (Epigeal).

**ఉపరిస్థానము** సం. వి. (గణి.) ఒక వస్తువుపై మరియొకవస్తువుండుట(Superposition)

**ఉపలంబరేఖలు** సం. వి. (వ్యవ.) భూమిని కొలచునప్పుడు ఒక రేఖకు రెండువైపుల నుండు స్థానములకును, ఆ రేఖకును మధ్య తీయబడు చిన్నలంబరేఖలు (off-sets).

**ఉపలంభము** సం. వి. అనుభవము.

**ఉపలబ్ధద్రవ్యములు** సం. వి. (పా.శా.) ముఖ్యమైనపరిశ్రమలో లభించు ఉపయోగకరమైన ఉప పదార్థములు (By-producis).

**ఉపలాలనము** సం, వి. బుజ్జగించుట.

**ఉపలేపనము** సం. వి. అలుకుట, పూయుట, రాచుట.

**ఉపవదము** వి. మేలుకొనుట. చూ. ఉప్పవడము.

**ఉపవనము** సం. వి. పెంచినతోట, ఉద్యానము. అవ్య. వనసమీపమున.

**ఉపవాసము** సం. వి. వస్తు, భోజనము చేయకుండుట.

**ఉపవిష్టుఁడు** సం. విశే. కూర్చుండినవాడు.

**ఉపవీతము** సం. వి. సవ్యముగా వేసికొన్న జంధ్యము.

**ఉపవృక్కము** సం. వి. (జం.) మూత్రపిండమునకు సమీపముగా నుండు వాహికలేని గ్రంథి (Adrenal gland).

**ఉపవృక్కి** సం. వి. (జం.) ఉపవృక్క గ్రంథులనుండి ఊరు రసద్రవ్యము (Adrenalin).

**ఉపవేశము** సం. వి 1. ఆసనము. 2. కూర్చుండుట.

**ఉపశమము** సం. వి 1. అడగుట. 2 రోగాదులబాధ తగ్గుట. 3. ఇంద్రియనిగ్రహము, 4. ఓర్పు. రూ. ఉపశాంతి.

**ఉపశయము** సం.వి. 1. దగ్గర పరుండుట. 2. పథ్యాదులచేత రోగోపశమనము కలిగించుట. 3. వలపన్ని దానికి దగ్గరలో దాగియుండుటకై త్రవ్వబడిన పల్లము, మాటుగొయ్యి. అవ్య. చేతిదగ్గర.

**ఉపశాంతి** సం. వి. చూ. ఉపశమము.

**ఉపశుక్రకోశములు** సం. వి. (జం.) శుక్రజనన క్రియ లో ద్వితీయశుక్రమాతృకణము (Secondary spermato-cyte). విభజన చెందుటచే నేర్పడిన అర్ధసూత్రములుగల రెండుకోశములు (Spermatids).

**ఉపశ్రుతము** సం. విశ. 1. వినబడినది. 2. అంగీకరింపబడినది, సమ్మతింపబడినది.

**ఉపశ్రుతి** సం. వి. 1. ప్రసంగవశమున ఇతరులు పలికిన శుభాశుభసూచక మగు వాక్యము. 2. సమ్మతి. 3. వినికి. అవ్య. చెవిదగ్గర.

**ఉపసంహారము** సం. వి. 1. మరలించుట. 2. సమాప్తి. (వ్యతి. ఉపక్రమము). 3. సంగ్రహము.

**ఉపసర్గ** సం. వి. సంస్కృత పదములకు మొదటచేరు ప్ర, పర, ఉప, మొ.వి.

**ఉపసర్జనము** సం. విశ. అప్రధానము. వి. 1. ఉపద్రవము. 2. త్యాగము.

**ఉపసర్‌పంచ్** (వ్యావ.) (రాజ. పౌర.) గ్రామ పంచాయతీ సభ ఉపాధ్యక్షుడు.

**ఉపసర్పణము** సం. వి. 1. సమీపించుట. 2. ఆశ్రయము, ప్రాపు.

**ఉపసర్పించు** సం. క్రి. 1. సమీపించుట. 2. ఆశ్రయించు.

**ఉపసాధనములు** సం. వి. (గృహ) సహకారి వస్తువులు, అలంకారోపకరణములు, ఉదా. పటములు, పువ్వుల పాత్రలు మొ. వి. (Accessories).

**ఉపసిద్ధాంతము** సం. వి. (గణి) సిద్ధాంతము నుండి వేరే ఉపపత్తి అవసరము లేకయే అనుసరించు గణితసత్యము, అదికరణ సిద్ధాంతము (Corollary).

**ఉపస్కరణములు** సం. వి. (గృహ.) ఉపకరణములు, కుర్చీలు, బల్లలు మొ. శయనాసనములు (Furnishings).ఇంటినిసదుపాయముగాను,అలంకారముగాను చేయు ఉపకరణములు.

**ఉపస్కారము** సం. వి. 1. సంభారము. 2. వాక్యమందలి అధ్యాహారము.

**ఉపస్పర్శము** సం. వి. 1.ఆచమనము. 2. తాకుట. 3. స్నానము.

**ఉపహతి** సం. వి. 1. దెబ్బ. 2. ఉపద్రవము 3. నాశము. 4. అడ్డగించు.

**ఉపహారము** సం. వి. 1. కానుకగా నిచ్చు ద్రవ్యము. 2. సత్కారము.

**ఉపాంగ కంకాళము** సం. వి. (జం.) కాళ్లు, చేతులు, వీనికి సంబంధించిన ఎముకల సముదాయము (Appendicular skeleton).

**ఉపాంగము** సం. వి. 1. నుతివేసెడితిత్తి 2. మీమాంసాది వేదాంగము.

**ఉపాంగుష్ఠము** సం. వి. (జం.) కూర్పాస్థులకు ఒకప్రక్క నున్న వ్రేలు వంటి అదనపు ఎముక (Calcar).

**ఉపాంతము** సం. వి. 1. సమీపము. 2. కొన 3. మూల.

**ఉపాంతోత్పత్తివేతన సిద్ధాంతము** సం. వి. (అర్థ.) కర్మాగారములో చిట్టచివరికార్మికుని యొక్క ఉత్పాదన ననుసరించి వేతనము కార్మికులకెల్లరకు నిర్ణయించవలెనను సిద్ధాంతము. (కర్మాగారములో మిగిలిన ఉత్పత్తి సాధనములను అట్లేయుంచి కార్మికుల సంఖ్యమాత్రము పెంచుచు వచ్చిన రానురాను ఒక్కొక్క కార్మికుడు చేయు అధికోత్పాదన తరుగుచువచ్చునను ఆర్థిక సిద్ధాంతముపై వేతన సిద్ధాంతము ఆధార పడియున్నది) (Marginal productivity theory of wages).

**ఉపాకరణము** సం. వి. సంస్కార పూర్వకముగ వేదాధ్యయనారంభము. రూ. ఉపాకర్మము.

**ఉపాకర్మము** సం. వి. చూ. పై.

**ఉపాఖ్యానము** సం. వి. ప్రధాన కథలో వచ్చెడి అవాంతర కథ.

**ఉపాత్తము** సం. విశే. 1. పొందబడినది. 2. ఆరంభింపబడినది. 3. సంపాదింప బడినది.

**ఉపాదానము** సం. వి. 1. కారణము. 2. భిక్ష. 3. ఇంద్రియములను విషయముల నుండి మరల్చుట.

**ఉపాదేయము** సం. విశే. 1. గ్రహింపదగినది. 2. సంపాదింపదగినది.

**ఉపాధానము** సం. వి. 1. ఉంచుట. 2. కప్పుట. 3. ధరించుట.

**ఉపాధి** సం. వి. 1. ధర్మచింత. 2. కపటము 3. కుటుంబమున మిక్కిలి ఆసక్తిగలవాడు. 4. విశేషణము. 5. ఆధారము.

**ఉపాధ్యాయ** సం. వి. చదువు చెప్పు స్త్రీ. రూ. ఉపాధ్యాయి.

**ఉపాధ్యాయాని** సం. వి. ఉపాధ్యాయుని భార్య.

**ఉపాధ్యాయి** సం. వి. చూ. ఉపాధ్యాయ

**ఉపానహము** సం. వి. చెప్పు. పాదరక్ష వ్యు. పాదములందు కట్టబడినది.

**ఉపాధ్యాయుడు** సం. వి. చదువుచెప్పువాడు.

**ఉపాయనము** సం. వి. 1. కానుక. 2. గుర్వాదుల సమీపమునకు పోవుట. 3. పొందుట.

**ఉపాయము** సం. వి. 1. సాధనము. 2. వెరవు. 3. సమాధి (ఇవి సామ, దాన, భేద, దండోపాయములని నాలుగు విధములు).

**ఉపాలంభము** సం. వి. దూషణ. ఎత్తిపొడుపు, దెప్పుట.

**ఉపాశ్రుగ్రంధి** సం. వి. (జం.) కన్నీరు ఉత్పత్తి చేయుగ్రంథులకు సహాయకారిగా నుండు గ్రంధి. (ఇది నేత్ర శుక్లమును తడిగా నుంచుచుండును.) (Hardcrian gland).

**ఉపాసకి** సం. వి. (చరి) బౌద్ధమతమును అనుసరించు చున్న గృహిణి.

**ఉపాసకుడు** సం. వి. (చరి.) బౌద్ధమతావలంబి యగు గృహస్థుడు.

**ఉపాసకులు** సం. వి. (చరి.) గృహస్థులుగా నుండి బౌద్ధధర్మ సూత్రముల ప్రకారము నడుచుకొను బౌద్ధ మతానుయాయులు.

**ఉపాసనము** సం. వి. 1 సేవ. 2. చింతనము 3. పూజ. 4. శరాభ్యాసము. 5 చిన్నపీట.

**ఉపాస్థికణజాలము** సం. వి. (జీవ.) మెత్తని ఎముకవంటి కణజాలము. (Cartilagenous tissue)

**ఉపేంద్రుడు** సం. వి. 1. వామనుడు, విష్ణువు. 2. కృష్ణుడు.

**ఉపేక్ష** సం. వి. 1. అశ్రద్ధ, 2. నిర్లక్ష్యము.

**ఉపోద్ఘాతము** సం. వి. 1. పీఠిక. 2. ఆరంభము

**ఉపోషణము** సం. వి. పస్తు. ఉపవాసము.

**ఉపోసథ** సం. వి. (చరి.) బౌద్ధసన్న్యాసులు పక్షమున కొకసారి జరుపు సమావేశకిము.

**ఉప్తము** సం. విణ. 1. విత్తబడినది. 2. గొరిగింపబడినది.
**ఉప్తి** సం. వి. విత్తుట, వెద.
**ఉప్పర** వి. చెరువులు మొ. వి. త్రవ్వి గోడలు మొ. వి. కట్టి జీవించెడు జాతి.
**ఉప్పరము** వై. వి. 1. ఆకాశము. 2. పైభాగము. మీదు. సం. ఉపరి.
**ఉప్పరవీథి** వై. వి. 1. ఆకాశమార్గము. 2 ఆకాశము. సం. ఉపరివీథి
**ఉప్పరి** వి. ఉప్పరివాడు.
**ఉప్పరించు** క్రి. (మల్లయుద్ధమునందు) పైకెత్తు. రూ. ఉప్పళించు.
**ఉప్పరిగ** వై. వి. మేడ. ఉపరిగృహము సం. ఉపకారికా.
**ఉప్పలవాయి** వి. బొటనవ్రేలికిని చూపుడు వ్రేలికిని మధ్యగల భాగము.
**ఉప్పలి** వి. 1. కీడు. ఆపద.
**ఉప్పవడము** వి. చూ. ఉపవడము.
**ఉప్పళము** వి. ఉప్పుపండు నేల.
**ఉప్పళించు** క్రి. 1. ఉప్పరించు 2. ఉదుకు. పైకెత్తు.
**ఉప్పిఁడి** విణ. ఉప్పులేనిది.
**ఉప్పిళ్లు** వి. ఉస్పుడు బియ్యము.
**ఉప్పు** క్రి. ఆవిరిపోకుండ ఉడకబెట్టు. వి. 1.లవణము. 2. ఉప్పదనము. 3. సొమ్ము
**ఉప్పుఁగండ** వి. ఉప్పురాచి ఎండబెట్టినకండ.
**ఉప్పుఁగడలి** వి. (ఉప్పు+కడలి) లవణసముద్రము.
**ఉప్పుఁగాయ**వి.(ఉప్పు+కాయ)ఊరుగాయ.
**ఉప్పుఁజేఁప** వి. ఉప్పురాచి ఎండబెట్టిన చేప.
**ఉప్పుఁబఱ్ఱ** వి. (ఉప్పు+పఱ్ఱ) ఉప్పుతనంతట పండెడి నేల, చవుటినేల.
**ఉప్పుఁబిండి** (ఉప్పు+పిండి) ఉప్పువేసి వండినపిండి.
**ఉప్పుడు** విణ. ఉడికినది, ఉడుకబెట్టినది.
**ఉప్పుడుబియ్యము** వి (గృహ.) వడ్లు కొంచెము ఉడకబెట్టి ఎండిబెట్టినపిదప దంచిన బియ్యము (Parbo·Ied rice).
**ఉప్పునీటికయ్యలు** వి. (భూగో.) సముద్రతీరపరిసరములలో సముద్రజలముచే నిండి ప్రత్యేకమగు ఇసుక ఒడ్డులచే నేర్పడిన భూప్రదేశము.
**ఉప్పునేల** వి. చవుటి నేల.
**ఉప్పురిల్లు** క్రి. ప్రాతగిలి ఉప్పుమట్టిగా రాలిపోవు. ఉప్పురిసిపోవు.
**ఉప్పెన** వై. వి. సముద్రపు పొంగు. సం. ఉల్బణమ్.
**ఉప్పొంగు** క్రి. (ఉబ్బి+పొంగు)1. మిక్కిలి ఉబుకు 2. మిక్కిలి సంతోషించు. 3. అధికమగు, విజృంభించు.
**ఉబలాటము** వి. 1. ఉత్కంఠ, తహతహ, జాలి.
**ఉబుకు** క్రి. 1. ఉప్పొంగు. 2. పైకిలేచు. వి. పొంగుట.
**ఉబుసు** వి. 1 విరామకాలము. 2. వృత్తాంతము. 3. కాలక్షేపము. రూ. ఊసు.
**ఉబ్బ** వై. వి. ఉక్క. రూ. ఉమ్మ, ఉమ్మదము. సం. ఊష్మః
**ఉబ్బకము** వి. ఉత్సాహము. హెచ్చు.
**ఉబ్బతిల్లు** క్రి. ఉబుకు, పొంగు.
**ఉబ్బనీరు** వి. ప్రసవమునకు ముందువచ్చు నీరు. ఉమ్మనీరు.
**ఉబ్బరపోవు** క్రి. (ఉబ్బ ము+పోవు) 1. నివ్వెరపడు. 2. బాధనొందు.
**ఉబ్బరము** వై. వి. 2. కడుపుబ్బు. సం. ఉల్బణమ్. 2. నివ్వెరచూటు.సం.ఉద్భ్రమః
**ఉబ్బరించు** క్రి. 1. కడుపుబ్బరించు. 2.అతిశయించు.
**ఉబ్బలి** వి. బురద. రూ. ఉమ్మలి.
**ఉబ్బసపుదగ్గు** వి. (గృహ.) ఉబ్బసము. శ్వాస మైనదగ్గు: ఊపిరాడకుండ వచ్చు దగ్గు. (Asthma)

**ఉబ్బసము** వై. వి. ఊర్ధ్వశ్వాస రోగము, వగరుపురోగము. నం. ఉచ్ఛ్వాసః

**ఉబ్బించు** క్రి. 1. స్తుతించి ఉప్పొంగజేయు. 2. వృద్ధి నొందించు.

**ఉబ్బు** వై. క్రి. 1. ఉబ్బరించు. 2. పొంగు. 3. లేచు. 4. సంతోషించు. 5. లావగు. వి. 1. సంతోషము. 2. ఉబ్బరము. నం ఉల్బణమ్.

**ఉబ్బెత్తు** వి. నడుము పైకి ఉబికి యుండుట.

**ఉబ్బెత్తుచిత్రము** వి. (గృహ.) ఉబికిన, పైకి లేచునట్లు అద్దినచిత్రము (Emboss)

**ఉబ్బెత్తుపైపింగ్** మి. వి. (గృహ.) గుండ్రని నాడాను పొడవు కత్తిరింపు పేలికలో మడచి ఉబ్బుపైపింగ్ రెండు అంచుల మధ్యలో మంచివైపునకు కనపించునట్లు పెట్టికుట్టినది. ఉదా. దిండ్లు మొ. నిలో ఉపయోగింతురు.(Cord-welding).

**ఉభయచరములు** నం. వి. (జం.) నీటియందును, నేలపైనను జీవించు జంతువులు (Amphibia). విశ. ఉభయచర సంబంధమైన (Amphibious).

**ఉభయధర్మి** నం. వి. (రసా.) క్షార, ఆమ్ల గుణములు రెండును కలిగియుండుఆమ్లజనిదము. ఉదా. అల్యూమినియమ్ ఆక్సైడ్.

**ఉభయనతోదరము** నం. విశ. (భౌతి.)రెండు వైపులలోపలకణగి యున్న(Biconcave).

**ఉభయపార్శ్వస్థవాహినీపుంజము** నం. వి. (వృక్ష.) ఈవాహినీ పుంజములో ఊర్ధ్వ, అధోవాహి కణజాలములుదారువుపైనను క్రిందను ఉండును, ఉదా. గుమ్మడి కుటుంబములోని మొక్కలు.

**ఉభయము** నం. సర్వ. 1. రెండవయవములు గలది. 2. రెండు. వి. గుడిఉత్సవము నడుపు వంతు.

**ఉభయమిశ్రణము** నం. వి. (జీవ.) స్త్రీ బీజము, పురుషబీజము ఒకదానిలోనొకటి సమ్మిళితమగుట. రెండుప్రాణుల పిత్ర్య ద్రవ్యము సమ్మిళితమగుట., ఉదా. పారమీసియమ్ అను ఏకకణ జీవులలో.

**ఉభయవియోగము** నం. వి. (రసా.) రెండు సమ్మేళనములు కలిసినప్పుడు మౌళికలను విడదీసి తిరిగి క్రొత్త సమ్మేళనములుగా నేర్పరచెడి రాసాయనికమైన మార్పు (Double decomposition)

**ఉభయోన్నతోదరము** నం. విశ. (జీవ.) చూ. ద్వికుంభీయము(Biconvex).

**ఉమ** నం. వి. 1. పార్వతి. వ్యు. తపము వలదని తల్లి చేఅడ్డుపెట్టబడినది.2. కాంతి. పసుపు. 4. యశము.

**ఉమాదము** నం. వి. వెఱ్ఱి, రూ. ఉన్మాదము నం. ఉన్మాదః

**ఉమాపతి** నం. వి. శివుడు.

**ఉమి** వి. ఉమిసిన ఎంగిలి. రూ. ఉమ్మి.

**ఉమియు** క్రి. ఎంగిలి ఉమ్ము.

**ఉముక** వి. వరిపొట్టు. రూ. ఊక.

**ఉమ్మ** వి. చూ. ఉబ్బ.

**ఉమ్మగిల్లు** క్రి. వార్చిపెట్టిన అన్నము మొ.వి. లోపలి ఆవిరిచే సరిగా ఉడుకు.

**ఉమ్మడి** వి. పొత్తు. అవ్య. ఒక్క మారుగ. విశ. (గణి.) వివిధరాసులకు సంబంధించిన (Common).

**ఉమ్మడిసగటు** వి. సగటుల సగటు.(Common average)

**ఉమ్మడివ్యాపారము** వి. కొందరు భాగస్థులు కలసిచేయువ్యాపారము(Partnership).

**ఉమ్మడిసమీకరణము** వి. (గణి.) పెక్కు అవ్యక్తరాసులను కలిగియున్న సమీకరణములు (Simultaneous equatoins).

**ఉమ్మడిసేద్యము** వి. (వ్యావ.) కొందరు కుటుంబకమతములు గల వ్యవసాయదారులు ఉమ్మడిగా సాగుచేయు పద్ధతి.
**ఉమ్మదము** వై. వి. ఉబ్బ నం. ఊష్మదమ్.
**ఉమ్మనీరు** వి. 1. ఉబ్బనీరు. 2. ప్రసవమునకు ముందువచ్చు నీరు, ప్రసవజలము (Bag of water)
**ఉమ్మలము** వి, దుఃఖము, సంతాపము.
**ఉమ్మలి** వి, చూ. ఉబ్బలి.
**ఉమ్మలించు** క్రి. దుఃఖించు, తపించు.
**ఉమ్మలిక** వి, 1. దుఃఖము. 2. బాధ. రూ. ఉమ్మలికము.
**ఉమ్మాదము** వై వి. చూ. ఉమాదము
**ఉమ్మాయము** త్రై వి. కృతకమౌక్తికము. మాయముత్యము.
**ఉమ్మి** వి. చూ. ఉమి.
**ఉమ్మెత** వై. వి. దుత్తూరము. రూ.ఉమ్మెత్త నం. ఉన్మత్తః
**ఉయాల** వి. డోల. రూ. ఉయేల, ఉయ్యాల, ఉయ్యెల, ఉయ్యేల, ఊయల, ఊయేల
**ఉయిలు** వి. (గృహ.) వీలునామా, వారసత్వమును తెలియజేయుపత్రము (will).
**ఉయ్యల** వి చూ. ఉయాల.
**ఉయ్యలపులుఁగు** వి. సారసపక్షి.
**ఉయ్యలమంచము** వి. డోలామంచము.
**ఉయ్యాల** వి. ఊగెడిడోల. రూ. ఊయెల.
**ఉయ్యాలతొట్టి** వి త్రాళ్ళఆధారమున ఊగుతొట్టి. బిడ్డలను పరుండబెట్టు తొట్టి.
**ఉయ్యెల** వి. ఉయ్యాల.
**ఉయ్యేల** వి. ఉయ్యాల.
**ఉరఃపంజరము** నం. వి. (జం) (కీటకముల) శరీరము ఏర్పడిన మూడు భాగములలో మధ్యభాగము, పాలిచ్చు జంతువులలో రొమ్ముభాగము (Thorax).
**ఉరఃపశ్చము** నం. వి. (జం.)(కీటకముల) రొమ్ముభాగములో క్రిందివైపున నున్న భాగము (Meta-thorax).
**ఉరక** అవ్య. మిన్నక. రూ. ఊరక.
**ఉరగము** నం. వి. 1.పాము. వ్యు.రొమ్ముతో ప్రాకునది. 2. ఆశ్లేషా నక్షత్రము.
**ఉరడించు** క్రి. 1. వేగిరపడు. 2. విజృంభించు. 3. పరాక్రమించు. రూ. ఉరవడించు. 3. ఉరుపడించు. ఉరువణించు.
**ఉరణము** నం. వి. పొట్టేలు. వ్యు. బిగ్గరగా మొరపెట్టునది.
**ఉరణించు** క్రి. చూ. ఉరడించు
**ఉరభ్రము** నం. వి. ఉగణము, పొట్టేలు, తగరు.
**ఉరమరిక** వి. రమారమి. రూ. ఉరామరిక.
**ఉరము** నం వి. వృక్షము. రూ. ఉరస్సు. వికృ. రొమ్ము
**ఉరలు** క్రి. 1 దొర్లు. 2. కారు. 3. రాలు. 4. వలలోచిక్కు.
**ఉరవడి** వి. 1. అతివేగము. 2. శౌర్యము. 3. విజృంభణము.
**ఉరవడించు** క్రి, ఉరవడిగొను. ఉరడించు.
**ఉరవణించు** క్రి. ఉరవడించు.
**ఉరవు** విశే. 1. తగినది. 2. అధికము. వి. ఔచిత్యము.
**ఉరస్సు** నం. వి. చూ. వక్షము.
**ఉరశించు** క్రి. ప్రకాశించు.
**ఉరామరిక** వి. చూ. ఉరమరిక.
**ఉరి** వి. 1. ఉచ్చు. వాగుర. 2.కంఠపాశము.
**ఉరిడె** వి. 1. కుమ్మరిపురుగు. 2. ఊరుమూలదేశము.
**ఉరిదీయు** క్రి. మెడకుత్రాడుకట్టి వ్రేలదీసి చంపు
**ఉరియాడు** క్రి, 1. ఊగులాడు. 2. సందేహించు. 3. కళవళపడు.
**ఉరియు** క్రి. 1. విడిపోవు. 2. చలించు. 3. దుఃఖించు.

**ఉరుచేటక** నం. వి. (వృక్ష.) కొబ్బరి, కంద, చేమ మొ. మొక్కల పుష్పగుచ్ఛములను కప్పియుండు పెద్దచేటిక.
**ఉరుముంజి** వి. ముత్తెములకు ప్రసిద్ధమైన ఒకదేశము, రూ. హురుముంజి.
**ఉరువడించు** క్రి. ఉరవడించు.
**ఉరువడు** క్రి. నెరవేరు, నెగ్గు.
**ఉరువు**[1] క్రి. 1. త్యజించు. 2. తోలుబలుచు. వి. 1 రూపము. 2. వస్తువు. 3. విధము.
**ఉరువు**[2] నం. విశ. 1. విరివియైనది. 2. అధికము. 3. పెద్దది 4. శ్రేష్ఠము.
**ఉరోంస్యాస్థులు** నం. వి. (జం.) అంసచక్రములో బోరయెముక క్రిందనుండు రెండు గట్టి యెముకలు (ఉదా. కప్ప) (Coracoids), ఉపోరస్కములు (Epicoracoids) పురోంస్యాస్థులు (Pre-coracoids).
**ఉరోజము** నం. విశ. స్తనము. వ్యు. ఉరమునందు జనించినది.
**ఉరోమధ్యము** నం.వి.(జం.)కీటకముయొక్క రొమ్మునకు గల మూడుభాగములలో మధ్యభాగము (Mesothorox)-
**ఉరోస్థి** నం. వి. (జం.) రొమ్ము యెక్క ఎముక, ఇది పూర్వోరుకాస్థి (Epesternum). పూర్వోరోస్థి (Omosternum). మధ్యోరోస్థి(Mesosternum), పశ్చోరోస్థి (Xiphisternum=Metasternum)అను నాలుగు భాగములుగ కలిసియుండును. ఉదా. కప్ప.
**ఉర్వర** నం. వి. ఎల్లపైరులు పండెడి నేల, భూమి.
**ఉర్వి** నం. వి. భూమి. వ్యు. విశాలమైనది.
**ఉర్వీపతి** నం. వి. రాజు, భూమీశుడు.
**ఉర్వీశుఁడు** నం. వి. రాజు, భూపతి.
**ఉఱిది** వి. 1. దార్ఢ్యము. 2. వేగము. 3. ధైర్యము.4.బలము. విశ. 1.దృఢము. 2. స్థిరము.
**ఉఱియ** విశ. 1. ధీరుడు. 2. సాహసికురాలు. 3. సహాయుడు. 4. క్రూరము.
**ఉఱియు** క్రి. ఇంటి పైకప్పు చెడి వాన నీరు లోనికి పడు.
**ఉఱు**[1] వై. వి. 1. శ్రేష్ఠమగు. 2. తగు. 3. కలుగు. 4. ఇష్టమగు. నం. ఉరః.
**ఉఱు**[2] క్రి. 1. లక్ష్యపెట్టు. 2. మాను. 3. జంకు.
**ఉఱుఁదాళ్లు** వి. పాలు పితుకునపుడు ఆవు వెనుక కాళ్ళకు గట్టెడి బందపు త్రాళ్ళు. రూ. ఉఱ్ఱుఁద్రాళ్ళు.
**ఉఱుకు** క్రి. 1.దుముకు, పరుగెత్తు.3.దాటు.
**ఉఱుకుడుఁగప్ప** వి. దుముకుచు పోవు ఒక జాతికప్ప.
**ఉఱుకుడుఁబొద్దు** వి. పైకి పెరిగిన బొద్దు.
**ఉఱుగొట్టు** క్రి. కోతి ఉఱ్ఱు మని ధ్వనిచేయు.
**ఉఱుత** వి ఉడుత.
**ఉఱుపు** వి. ఇంటి పైకప్పునుండి వాననీరు కారుట, ఉరియుట.
**ఉఱుము**[1] వి. చూ. ఉడుము.
**ఉఱుము**[2] క్రి. గర్జించు, వి. 1. మేఘధ్వని. 2. వీరహుంకారము.
**ఉఱ్ఱటలూఁగు** క్రి. 1. మిక్కిలి చలించు, ఉఱ్ఱాడు, వ్రేలాడు. 2. ఉత్సహించు.
**ఉఱ్ఱు** వి. కోతి ఉఱ్ఱు మని చేయు ధ్వని.
**ఉఱ్ఱుద్రాళ్లు** వి. చూ ఉఱుఁద్రాళ్లు.
**ఉఱ్ఱుకట్టు** వి. ఈఉఱ్ఱుద్రాళ్ళ కట్టు.
**ఉఱ్ఱూఁతలూఁగు** క్రి. మిక్కిలి ఊగు.
**ఉలక** విశ. చులుక, నిర్లక్ష్యము.
**ఉలగరము** వి. తడిచేత నేల ఉబుకుట. దుక్కిపదును రూ. ఉలవరము.
**ఉలవ** వి. వి. కుళుత్థము, ఒకరకపు కాయ ధాన్యము.
**ఉలవరము** వి. చూ. ఉలగరము.
**ఉలి** వి. వడ్రంగి సాధనము. విశ. అల్పము. రూ. నులి.

**ఉలిపి** విశే. 1. తులువ. 2. పొగరుబోతు. 3. శోఫరోగము కలవాడు.

**ఉలిపిగొట్టు** విశే. చూ. పై.

**ఉలియు** క్రి. 1. చలించు. 2. మ్రోయు. 3. తొలగు. రూ. ఉరియు.

**ఉలివు** వి. 1. ధ్వని, మ్రోత. 2. చలనము.

**ఉలుకు** క్రి. భయపడు. వి. భయము.

**ఉలుచ** వై. వి. మిక్కిలి చాపల్యముగల చేప. సం. ఉలూపిః.

**ఉలుచు** క్రి. ఊడదీయు. రూ. ఉలుపు.

**ఉలుప** వై. వి. కానుక. బహుమతి. రూ. ఉలుపా. సం. ఉపదా.

**ఉలుపఁడు** విశే. శోఫరోగముగలవాడు. రూ. ఉలిపి.

**ఉలుపు** క్రి. ఉలుచు,

**ఉలుము** వి. కుష్ఠరోగము. రూ. పులుము.

**ఉలూకము** వి. గుడ్లగూబ, వ్యు. నేత్రతేజస్సుచే కాకులను దహించునది, బలము గలది.

**ఉలూఖలము** సం. వి. రోలు. రూ. ఉదూఖలము.

**ఉలూఖలసంధి** సం. వి. (జం.) బంతిగిన్నె కీలు. గిన్నెవంటి భాగమునందు బంతివలె నుండు ఎముక భాగము ఇమిడి కదలునది, ఉదా. ఉలూఖల సంధి భుజముకీలు (Ball and socket joint). తొడ ఎముక తల శ్రోణిఉలూఖలము



**ఉలూపి** సం. వి. 1. ఒకనాగకన్య. 2. ఉలుచ చేప.

**ఉలేమాలు** హిం. వి. ఇస్లాముమతపండితులు. ఇస్లాము ధర్మము తెలిసినవారు.

**ఉల్క** సం. వి. 1. కొఱవికట్టె. 2. కాగడా. 3. ఆకాశమునుండి పడు తేజఃపుంజము. 4. అగ్ని కణము (Meteor).

**ఉల్కాశ్మలోహము** సం. వి. (రసా.) ఆకాశమునుండి అప్పుడప్పుడు భూతలముపైబడు ఉల్కలలో నుండు ఇనుము (Meteoric iron).

**ఉల్బణము** సం. విశే. 1. అధికమైనది. 2. ఎగుడుదిగుడుకలది. 3. డాబుకలది. వి. 1. పొంగు. 2. అతిశయము,

**ఉల్బము** సం. వి. (గృహ.) పిండములోపలి పొర (Amnion).

**ఉల్ముకము** సం. వి. మండుచున్న కొరవి.

**ఉల్లంకి** వి. చేపలను, పురుగులను తిను ఒక జాతి పిట్ట.

**ఉల్లంఘనము** సం. వి. 1. దాటుట. 2. అతిక్రమణము, మీరుట.

**ఉల్లకుట్టు** వి. మనస్సునొచ్చునట్టి పరిహాసము.

**ఉల్లడ** వై. వి. మేలుకట్టు, చాందిని. రూ. ఉల్లెడ. సం. ఉల్లాభః.

**ఉల్లము** వి. 1. హృదయము. 2. కోరిక

**ఉల్లఱము** విశే. దుస్సహము.

**ఉల్లల** వి. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము.

**ఉల్లలము** సం. వి. చలనము. విశే. 1. చలించునది. 2 పెక్కు రోగములు కలది.

**ఉల్లసము**[1] వి. 1. ఎత్తిపొడుపు. 2. ఎత్తిపొడుపుమాట. 3. పరిహాసము. 4. నింద. 5. బాధ.

**ఉల్లసము**[2] సం. వి. 1. సంతోషము. 2. ప్రకాశము. 3. వికాసము. రూ. ఉల్లాసము.

**ఉల్లాకు** వి. చీటి.

**ఉల్లాపము** సం. వి. 1. గద్గదస్వరముతో చెప్పినమాట. 2. దూషణవాక్యము. 3. బిగ్గరగా పిలుచుట.

**ఉల్లాభము** సం. వి. చూ. ఉల్లడ.

**ఉల్లారు** వి. గుఱ్ఱపుజీను మీది పరుపు.

**ఉల్లానము** సం. వి. చూ. 1. ఉల్లసము 2. ఒక అర్థాలంకారము.

**ఉల్లి** వి. 1. నీరుల్లి, ఎఱ్ఱగడ్డ. 2. వెల్లుల్లి, తెల్లగడ్డ.

**ఉల్లిపాషాణము** మి. వి. సౌవీరము.(రసా.) రాసాయనికము గానిది (White arsenic) ఆర్సెనిక్ ట్రైఆక్సైడ్.

**ఉల్లుంఠనము** నం. వి. 1. ఉపాలంభము, దెప్పుట. 2. వ్యాజస్తుతి.

**ఉల్లెడ** వై. వి. చూ. ఉల్లడ.

**ఉల్లేఖనము** నం.వి. 1.గోకుట. 2.వ్రాయుట 3. చెప్పుట.

**ఉల్లేఖము** 1. ఉల్లేఖనము. 2. (అలం.) ఒక వస్తువును పలురీతుల వర్ణించు ఒకానొక అలంకారము.

**ఉల్లోలము** నం. వి. పెద్ద అల.

**ఉవిద** వై. వి. 1. ఆడుది. 2. అందగత్తె. 3. భార్య. నం. యువతీ.

**ఉవ్వాయి** వి. 1. సంతోషము, వికాసము. 2. జయము, గెలుపు.

**ఉవ్విళులూరు** క్రి. 1. త్వరపడు, తహతహ పడు. 2. మిక్కిలి ఆసించు.

**ఉవ్వు** వి. 1. త్వర మొ. ని తెలుపు అనుకర ణము. 2. పూనిక.

**ఉవ్వెత్తు** క్రి. విణ. 1. పూర్తిగా, నిశ్శేష ముగా. 2.సునాయాసముగ.3.ఎక్కువగా.

**ఉశనుఁడు** నం. వి. శుక్రుడు. రూ.ఉశనసుడు

**ఉశీరము** నం. వి. వట్టివేరు.

**ఉష** నం. వి. 1. రేయి, 2. రాత్రిశేషము. 3. బాణాసురుని కూతురు.

**ఉషర్బుధుఁడు** నం. వి. 1. అగ్ని. 2. బిడ్డడు వ్యు.ప్రభాతకాలమున మేలుకొనియుండు వాడు.

**ఉషస్సు** నం. వి. తెల్లవారుటకు ముందు నాలుగైదు గడియల కాలము, ప్రత్యూ షము, వేకువ.

**ఉషితము** నం. వి. 1. నివాసము. 2.చలిది అన్నము. విణ. 1. కాల్పబడినది. 2.బహు కాలముంపబడినది. పర్యుషితము.

**ఉష్ట్రము** నం. వి. ఒంటె. వ్యు. ఎల్లప్పుడును ఎండచే తపింపబడునది.

**ఉష్ణకము** నం. వి వేసవికాలము.

**ఉష్ణత** నం. వి. (భౌతి) వేడిమి (Heat).

**ఉష్ణతాగతిశాస్త్రము** నం వి. (భౌతి.) ద్రవ్య ముతో సహచరించు వేడి, ఆ ద్రవ్యఘటక ములగు కణముల చలనము ఉష్ణగతివలన కలిగినది యని నిరూపించు సిద్ధాంతము (Kinetic theory of heat).

**ఉష్ణతాధారణశక్తి** నం. వి. (భౌతి.) ఉష్ణ రాశి నిముడ్చుకొను శక్తి (Thermal capacity).

**ఉష్ణతాప్రవాహము** నం. వి. (భౌతి) ఒక స్థానమునుండి మరియొక స్థానమునకు అణువులు కదలకుండగనే ఉష్ణమును వ్యాపింపజేయు పద్ధతి (Conduction).

**ఉష్ణతాప్రసారము** నం. వి. (భౌతి.) ఒక చోటి నుండి ఇంకొక చోటికి వేడి ప్రస రించుట (Transmission of heat).

**ఉష్ణతామాపకము** నం. వి. (భౌతి. రసా.) ఒక ద్రవ్యము యొక్క విశిష్టోష్ణతను, లేదా వేరొక్క భౌతిక రాసాయనిక ప్రక్రి యలలో బయటికివచ్చు ఉష్ణతను కొలుచు సాధనము (Calorimeter).

**ఉష్ణతామాపనము** నం. వి. (భౌతి., రసా.) ఉష్ణనిర్ణయము (Calorimetry).

**ఉష్ణ(తా)వాహకము** నం. వి. (భౌతి.) తన ద్వారా ఉష్ణమును ప్రసరింప 'నిచ్చెడి వస్తువు (Good conductor of heat).

**ఉష్ణతాసంవహనము** నం. వి. (భౌతి.) పదా ర్థమునందలి కణములు వేడిమిని గ్రహించి ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు

పోవుచు, ఉష్ణమును ప్రసరింపజేయు విధానము (Convection).

**ఉష్ణప్రమాణము** సం. వి. (భౌతి.) ఉష్ణము యొక్క కొలతను తెలుపునది (Temperature).

**ఉష్ణమండలపు పచ్చికబయళ్లు** వి. వి. (భూగో.) ఉష్ణదేశములలో నుండు గడ్డి మైదానములు.(వీనిని ఆఫ్రికాలో 'సవానాలు' అని, బ్రెజిల్‌లో 'కంపాస్' అని వెనిజులలో 'లావాస్' అని యందురు)

**ఉష్ణమండలము** సం. వి. (భూగో.) కర్కాటక మకర రేఖలమధ్య నున్న అత్యుష్ణ ప్రదేశము

**ఉష్ణమండలశీతోష్ణస్థితి** సం. వి. (భూగో.) మకరకర్కాటక రేఖలమధ్య నున్న ప్రదేశములోని శీతోష్ణస్థితి (ఇట్టి శీతోష్ణస్థితిలో భూమధ్య రేఖాప్రాంతమున గల శీతోష్ణస్థితిలో వలె అత్యంతమైన వర్షపాతము, ఎండలు ఉండవు. సంవత్సరములో కొంతకాలము వ్యాపారపవనముల ప్రభావముతోను,మిగిలినకాలము వర్షపాత ప్రభావముతోను ఈ శీతోష్ణస్థితి ఉండును.)

**ఉష్ణము** సం. వి. 1. వేడి. 2. ఎండకాలము. విశే. 1. వేడిగలది.2.కోపోద్రేకము గలది.

**ఉష్ణరశ్మి** సం. వి. సూర్యుడు.

**ఉష్ణవారణము** సం. వి. గొడుగు.

**ఉష్ణీయప్రక్షోభము** సం. వి. (భౌతి.) ఉష్ణ సంబంధమగు ప్రక్షోభము (Thermal agitation).

**ఉష్ణీషము**[1] సం. వి. (జం.) అంతర్జిహ్వా. Galea, lacinia అను రెండును కీటకముల నోటి భాగములలో మొదటి ఉత్తర హనువునకు చెందిన భాగములు.

**ఉష్ణీషము**[2] సం. వి తలపాగ. కిరీటము. వ్యు. వేడిని తగలకుండ చేయునది.

**ఉష్ణోగ్రత** సం. వి. (భూగో.) భూమిపరమ, అధమ ఉష్ణోగ్రతల సరాసరి. (భౌతి.) ఉష్ణపరిమితి (Temperature).

**ఉష్ణోగ్రతాసంచారము** (నేలయొక్క) సం. వి. నేల యొక్క వేడిమి, ఆ ఉష్ణోగ్రత వ్యాపించు ప్రమాణము (Range of soil temperature).

**ఉసి** వి. 1. కుక్క మొ. వానికి చేయు ప్రేరణము. 2. పొడి, నుసి. 3. అవకాశము.

**ఉసికొలుపు** క్రి. 1 పురికొల్పు. 2. కుక్క మొ. వానిని కవియించి.

**ఉసిరిక** వి. 1. ఆమలక వృక్షము, నెల్లిచెట్టు. 2. నేల ఉసిరిక.

**ఉసుక** వి. ఇసుక.

**ఉసుము** క్రి. 1. ఉదుకు. 2. తోము. 3. తుడుచు.

**ఉసురు** వి. తాపమునందగు నిశ్వాసధ్వన్యనుకరణము, రూ. ఉస్సురు.

**ఉసుఱు** వి. 1. ప్రాణము, ఆయువు. 2. ప్రాణక్షోభమువలని దుష్ఫలము.

**ఉస్సురు** వి. చూ. ఉసురు.

**ఉహూహూ** వి. చలిచే వణకునపుడు కలుగు ధ్వనికి అనుకరణము.

**ఉహ్హూ** వి. 1. నిప్పు, ధూళి మొ.ని ఊదుట యందగుధ్వనికి అనుకరణము.2.ఉస్సురు.

## ఊ

**ఊ** అచ్చులలో 6వ అక్షరము,

**ఊం** అవ్య. 1. శ్రోత వినుచున్నట్లు సూచించును, ఊకొట్టుటను తెలుపును. 2. అంగీకారమును తెలుపును. 3. *క్రోధాదులను సూచించును.

**ఊంక** వి. 1. ఊగులాట, 2. ఉమక, పొట్టు.

**ఊంకదంపు** వి. (జాతీ.) ఉపయోగము లేని సంభాషణము.

**ఊఁకబంతి** వి. ఒకరకపు బంతిచెట్టు.
**ఊఁకర** వై.వి. సంతోషాదులు గలుగునపుడు చేయు హుంకారము. సం. హుంకారః.
**ఊఁకించు** క్రి. పూను.
**ఊఁకు** వి. పూనిక, యత్నము. క్రి. పూను, యత్నించు.
**ఊఁగాడు** క్రి. (ఊగు+ఆడు) ఊగులాడు.
**ఊఁగు** క్రి. కదలు, చలించు, ఆందోళించు.
**ఊఁచ** వి. 1. జొన్న మొ.ని. కంకికాడ. 2. అరటిదూట. 3. ఇనుము మొ. నిచే చేసిన కడ్డీ. 4. కంప.
**ఊఁచపడు** క్రి 1. కృశించు. 2. ఊఁచ (దూట) కలదియగు.
**ఊఁచపోవు** క్రి. కృశించు.
**ఊఁచబియ్యము** వి. లేత జొన్నలు మొ.వి.
**ఊఁచముట్టు** క్రి. విశే. నిశ్శేషముగ. మొదలంట. మూలమట్టుగ.
**ఊఁటు** క్రి. 1. పొడుచు. 2. నొవ్వనాటు. వి. పోటు.
**ఊఁత**[1] వి. 1. ఊనిక, అవలంబము, 2. చేపలు పట్టు సాధనము.
**ఊఁత**[2] వి. (భౌతి.) దేనికైన ఆధారమగు వట్టిది (Support).
**ఊఁతకోల** వి. ఊతకొనెడి కఱ్ఱ. ఆధారముగ పట్టుకొను కఱ్ఱ. 2. రక్షణము.
**ఊఁతపదము** వి. వి. వాక్యభూషణము.
**ఊఁతాళి** వి. ఊడిరాకుండ చేయు చీల.
**ఊఁద** వి. 1. ఈర్ష్య. 2. వావు.
**ఊఁదబొడ్డు** వి. ఉబికిన బొడ్డు,
**ఊఁదర** వి. (కాయలు పండుటకును ఎలుకలు మొ.వి. చచ్చుటకును వేయు) పొగ.
**ఊఁదు** క్రి. 1. వాచు. 2. నిప్పు. మొ. వానిని రగులజేయు. 3. శంఖము మొ. వానిని శబ్దింపజేయు 4. ఉంచు. 5. ఊఁతతో చేపలుపట్టు.
**ఊఁదుగ్రోవి** వి. 1. అగసాలివాడు కుంపటిని ఊదెడి గొట్టము. 2. పిల్లనగ్రోవి.
**ఊఁదువత్తి** వి. 1. వర్తిరూపము. 2. సాంబ్రాణివత్తి అగరువత్తి.
**ఊఁదువెండి** వి. శుద్ధమైన వెండి, ఊదిన వెండి.
**ఊఁపు** వి. ఊచుట, ఊగచేయుట.
**ఊఁపురము** వి. మూపురము.
**ఊచు** క్రి. వ్యాధిచే తలవెండ్రుకలు రాలు.
**ఊట** వి. 1. ఊరుగాయరసము. 2. చేప. 3. మూలగ. 4. భూమిలోపలినుండి పీడనమువలన పైకి ఉబికివచ్చు జలము (Spring).
**ఊటవెలువడు గ్రంథులు** వి. (గృహ.) లోపల ఊరిన రసమును నాళులద్వారా బయటికి పంపుగ్రంథులు (Exocrine glands).
**ఊటాడు** క్రి. సంభ్రమించు, చలించు, తత్తరపడు.
**ఊటించు** క్రి. 1. ముఖస్తుతి చేయు. 2. వంచించు, మోసపుచ్చు.
**ఊటు** వి. వానవలన కలిగిన చెమ్మ.
**ఊడ** వి. మఱ్ఱి మొ. వాని కొమ్మల నుండి క్రిందికి దిగెడివేరు శిఫ. (ఈ యూడల వేళ్ళవలననే చెట్టున కాహార మందును).
**ఊడనీఁబాఱు** క్రి. 1. తొలగిపోవు. 2. పారిపోవు,
**ఊడిగము** వి. పరిచర్య, సేవ. రూ. ఊడెము, ఉడిగము. ఊళిగము, ఉళిగము.
**ఊడు** క్రి. 1. రాలు. 2. విడుచు. 3. జారు. 4. కారు. 5. పారు.
**ఊడుగు** వి. అంకోలవృక్షము.
**ఊడుచు** క్రి. 1. చెత్త త్రోయు, చిమ్మివైచు. 2. నారు నాటు. 3. విప్పు. 4. విడుచు 5. జారిపోవజేయు. రూ. ఊడ్చు.
**ఊడుపు** వి. 1. చెత్త త్రోయుట. చిమ్మివైచుట. 2. నారునాటుట. రూ. ఊడ్పు.

**ఊఢ** సం.వి. 1. పెండ్లియైన స్త్రీ 2. భార్య.
**ఊతి** సం. వి. 1. కుట్టు. 2. నేత. 3. రక్షణము. 4. క్రీడ.
**ఊదర** వై.వి. ఒకంకముగడ్డి. సం. ఉదారః.
**ఊదా** హిం. వి. ఎరుపు నలుపు కలిసినరంగు.
**ఊధము** సం. వి. ఆవు మొ. వాని పొదుగు. (ఇది బహువ్రీహియందు ఉత్తరపద మైనచో "ఊధ్ని" అగును. ఉదా. కుండోధ్ని).
**ఊధస్యము** సం. వి. పాలు, క్షీరము. వ్యు. పొదుగున పుట్టినది.
**ఊనము** సం. విశ. 1. తక్కువైనది. కొరవడినది. ఉదా. ఏకోనవింశతి (ఏక + ఊన + వింశతి) ఒకటి తక్కువగా ఇరువది (పందొమ్మిది) 2. (వ్యావ.) నష్టము.
**ఊనిక** వి. 1. దిటవు 2. ఆనిక.
**ఊను** క్రి. 1. వహించు.2.పొందు. 3 అవలంబించు. 4. తోలును మెత్తపరచు.
**ఊపిరి** వి. శ్వాసము, ఊర్పు.
**ఊపిరికుట్టు** వి. ఊపిరి పీల్చునపుడు బాధ కలిగించెడి ఒక వ్యాధి, యాకము.
**ఊబ** వి. 1. నపుంసకుడు, పేడి, 2. ఒకవిధమగు పాతర.విశ. గుల్లగా పెరిగి బలహీనమైనది
**ఊబి** వి. బురద. అడుసు.
**ఊయల** వి. (గృహ.) చంటిబిడ్డలను పరుండబెట్టు తొట్టె. బట్టతోగాని, వలతోగాని కట్టిన. ఊయెల. రూ. మా. ఉయాల. (Cradle).
**ఊయెల** వి. మా. పై.
**ఊరఁగంద** వి.ఊరియందు పైరుచేసెడి కంద.
**ఊరఁబంది** వి. (ఊరు + పంది) ఊరియందు తిరుగు పంది, గ్రామసూకరము.
**ఊరుఁబిండి** వి. పచ్చడి, నంజుకొను వ్యంజనము.
**ఊరఁబిచ్చిక** వి. (ఊరు + పిచ్చిక) ఊరియందు తిరిగెడు పిట్ట, చటకము. రూ. ఊరఁబిచ్చుక.
**ఊరఁబిచ్చుక** వి.(ఊరు + పిచ్చుక) చూ. పై.
**ఊరక** అవ్య. 1. అప్రయత్నముగ 2.వ్యర్థముగ. 3. విడువక. 4. ప్రతీకారము పొందక., 5. అడుగకుండ. 6. వివరణము చేయక 7. మాటాడక. రూ. ఉరక.
**ఊరజోగి** వి. ఊరియందు తిరిగి బిచ్చమెత్తుకొను సన్న్యాసి.
**ఊరవ్యుఁడు** సం. వి. వైశ్యుడు, కోమటి. వ్యు. విరాట్పురుషుని తొడలనుండి పుట్టినవాడు.
**ఊరార్చు** క్రి.(ఊరుపు + ఆర్చు) 1.ఓదార్చు. 2. బ్రతిమాలు. రూ. ఊరారుచు.
**ఊరు** క్రి. 1. లోపలనుండి నీరు బయటికి వచ్చు. 2. నాను. 3. పుట్టు. 4. పెద్దదియగు వి. 1 గ్రామము. 2. ఏడికోల లేని నాగలి. 3. దేశము.
**ఊరుకొను** క్రి. 1.ఆఘ్రాణించు. రూ.మూరుకొను. 2. (వ్యావ.) ఊరకయుండు.
**ఊరుచు**[1] వై. క్రి. నిశ్వసించు, శ్వాసించు. రూ. ఊర్పు.
**ఊరుచు**[2] క్రి.(పాత్రము సాన మొ.నిఅంటియున్న దానిని) చేతితో నొక్కితీయు.రూ ఊర్చు, ఊడుచు, ఊడ్చు.
**ఊరుపు**[1] వై. వి. ఊపిరి, శ్వాసము. రూ. ఊర్పు. సం. ఊర్జః.
**ఊరుపు**[2] వి. ఒకవిధముగా వండినకూర, ఒకరకపు వ్యంజనము. రూ. ఊర్పు.
**ఊరుపర్వము** సం.వి. మోకాలు, జానువు. వ్యు. తొడకు కణుపు చంటిది.
**ఊరువు** సం. వి. తొడ. వ్యు. వస్త్రముచే ఆచ్ఛాదింపబడునది.
**ఊరుసంధి** సం. వి. (శరీ.) తుంటికీలు, పెల్విస్ (Pelvis),తొడ ఎముకతోకలియు భాగము (Hip-joint).

**ఊరేఁగించు** క్రి. గ్రామములో త్రిప్పి ఉత్సవముచేయు, ఊరేగునట్లుచేయు.

**ఊరేఁగింపు** వి. గ్రామములో త్రిప్పిచేయు ఉత్సవము, మెరవడి.

**ఊరేఁగు** క్రి. ఉత్సవముతో ఊరిలోపల్లకి మొ. వానిపై తిరిగివచ్చు.

**ఊర్జము** నం. వి, 1. కార్తికమాసము. 2. పూనిక, 3. ఉత్సాహము. 4. ఊపిరివెలుపలికి విడుచుట. విశే. బలముగలది.

**ఊర్జస్వలుఁడు** నం. విశే. 1. మిక్కిలిబలముగలవాడు. 2. మిక్కిలి ఉత్సాహము కలవాడు. 3. గొప్పవాడు.

**ఊర్జస్వి** నం. విశే. మిక్కిలి బలవంతుడు. వి. ఒక అర్థాలంకారము.

**ఊర్జితము** నం. విశే. దృఢము. చేవగలది. వి. 1. బలము. 2. ఉత్సాహము.

**ఊర్ణనాభము** నం. వి. సాలెపురుగు. రూ. ఊర్ణనాభి.

**ఊర్ణనాభి** నం. వి. చూ. పై.

**ఊర్ణము** నం. వి. 1. నూలు, 2. కనుబొమలనడుమ సుడి, వి. ఉన్ని.

**ఊర్ణాయువు** నం వి. 1. పొట్టేలు. 2. ఉన్నికంబళి. 3. సాలెపురుగు. విశే. ఉన్నికలది,

**ఊర్ధ్వకోణము** నం. వి. (*గణి.*) నీటిమట్టమునకు పైనున్న వస్తువు చేయు కోణము (Angle of elevation).

**ఊర్ధ్వతాన** నం. విశే. (*భౌతి., గణి.*) నిటారుగా, నిలువుగా నున్న (Vertical).

**ఊర్ధ్వపుండ్రము** నం. వి. నిలువుబొట్టు.

**ఊర్ధ్వబృహత్సిర** నం. వి, (*జం.*) గుండెకు పైనున్న భాగమునుండి మలినరక్తమును కుడికర్ణికకు తెచ్చుసిర (Superior vena-cava).

**ఊర్ధ్వము** నం.విశే. 1.పొడవైనది. 2.మీదిది. 3. (*గణి.; భౌతి.*) దిక్పృక్రమునకు లంబముగా పైనున్నది.

**ఊర్ధ్వరేతస్కుఁడు** నం. విశే. 1. జితేంద్రియుడు. 2. అధఃపతనములేని రేతస్సు కలవాడు. వి. 1. సనకాది ఋషులలోనివాడు. 2. శివుడు. 3. భీష్ముడు. రూ. ఊర్ధ్వరేతుడు.

**ఊర్ధ్వరేతుఁడు** నం. విశే. చూ. పై.

**ఊర్ధ్వలోకము** నం. వి. స్వర్గలోకము పైలోకము, భువర్లోకాదికము.

**ఊర్ధ్వలోచనము** నం. వి. మీగండ్ల మెకము. శరభము.

**ఊరొ్పక** వి. ఉబుసుపోక, కాలక్షేపము.

**ఊరొ్పవు** క్రి.(ఊర్పు+పోవు)ఊపిరివిడుచు.

**ఊర్మి** నం.వి. 1. అల. 2. ఉమ్మి. 3. నొప్పి. 4. తహతహ. 5. వస్త్రపు ముడుత. 6. కడుపుమీదనుండు ముడుత. (ఆకలి, కోరిక, మోహము, దుఃఖము, ముసలితనము, మరణము - వీనిని షడూర్ము లందురు).

**ఊర్మిక** నం. వి. 1. అల. 2. ఉంగరము. 3. వస్త్రపు ముడుత.

**ఊర్మిళ** నం. వి. 1. లక్ష్మణునిభార్య, జనకమహారాజు కూతురు. 2. పెనిమిటి నెడబాసిన స్త్రీ.

**ఊర్వశి** నం. వి. ఒకానొక అప్సరస.

**ఊర్వస్థి** నం. వి. (*జం.*) (ఊరు+అస్థి) తొడ ఎముక (Femur).

**ఊలట** వి. 1. విశ్రాంతి, విరామము. 2. ఊరడించుట. 3. స్వస్థచిత్తత. విశే. విశ్రాంతి నిచ్చునది.

**ఊలడు** క్రి. 1. ఊరకుండు. 2. ఉపశమిల్లు. 3. స్వస్థచిత్తమగు. 4. అప్పగించు.

**ఊరడిల్లు** క్రి. 1. ఉపశమిల్లు. 2. స్వస్థచిత్తమగు. 3. విశ్రమించు.

**ఊలు** క్రి. నరిపోలు.

**ఊల** వి. 1. ఆర్తధ్వని, మొఱ్ఱ.

**ఊలమాలగుడుచు** క్రి. 1. తహతహపడు. 2 ఆర్తినొందు. 3. గ్రుక్కిళ్ళుమింగు.

**ఊలుకుట్టు సూది** వి. (గృహ.) పెద్దపొడుగు పాటి సూది (Crewel needle).

**ఊవాడు** క్రి. ఊగాడు.

**ఊషక్షారము** సం. వి. చవిటి ఉప్పు.

**ఊషరబీజన్యాయము** సం. న్యా. చవుటి నేలయందు విత్తిన బీజములవలె నిరుపయోగము.

**ఊషరము** సం. విజ. చవుటిది (నేల).

**ఊషరవృష్టిన్యాయము** సం. న్యా. చవుటి నేలలో వర్షముపడినట్లు నిరుపయోగము.

**ఊష్మము** సం. వి. 1. ఆవిరి. 2. వేసగి, గ్రీష్మఋతువు. 3. (వ్యాక.) ఊష్మ ధ్వనులు. (శ, ష, స, హ).

**ఊష్మలము** సం. విజ. 1. ఉమ్మగలది. 2. ఆవిరిగలది.

**ఊసరము**1 వై. విజ. చవుటిది (నేల). సం. ఊషరః.

**ఊసరము**2 విజ. కృశించినది.

**ఊసరవెల్లి** వి. మూడు వన్నెలతొండ, బింబకము (రంగులు మార్చు తొండ).

**ఊసివానము** వై. వి. ఈర్ష్య, అసూయ. సం. ఉచ్ఛ్వాసః.

**ఊసు** వి. వృత్తాంతము. ఉదా. నా ఊసు నీ కెందుకు?. రూ. ఉబుసు.

**ఊసుపోక** వి. ఉబుసుపోక; కాలక్షేపము.

**ఊహ** సం. వి. 1. యోచన, భావము. 2. వితర్కము.

**ఊహని** సం. వి. చీపురు, సమ్మార్జని.

**ఊహించు** సం. క్రి. ఆలోచించు, వితర్కించు.

**ఊహ్యము** సం. విజ. 1. ఊహింపదగినది. 2. (గణి.) ఋణరాసుల వర్గమూలము లకు సంబంధించినది (Imaginary).

**ఊహ్యసంఖ్య** సం. వి. (గణి.) ఋణరాసుల వర్గమూలములకు సంబంధించిన సంఖ్య (Imaginary number).

**ఊళ** వి. 1. నక్కకూత. 2. ఈల.

**ఊళమెకము** వి. నక్క, జంబుకము.

# ఋ

**ఋ** అచ్చులలో 7వ అక్షరము. రూ. రిల ఉచ్చారణ కలది.

**ఋక్కు** సం. వి. 1. ఛందోబద్ధమగు వేద మంత్రము. 2. ఋగ్వేదము. 3. స్తుతి.

**ఋక్షము** సం. వి. 1. ఎలుగుగొడ్డు. 2. రైవతకాద్రి. 3. నక్షత్రము. 4. మేషాదిరాశి.

**ఋక్షరాజు** సం. వి. 1. చంద్రుడు. జాంబవంతుడు.

**ఋగ్వేదము** సం. వి. నాలుగు వేదములలో ఒకటి.

**ఋజుకణ విభాగము** సం. వి. (జీవ.) జీవకణమునందు కండెపోగులు ఏర్పడకుండనే జరుగు కణవిభజన, అసూత్రభాజనము (Amitosis).

**ఋజురేఖీయము** సం. విజ. (గణి.) ఋజురేఖకు సంబంధించినది (Recti-linear).

**ఋజురేఖీయచలనము** సం. వి. (భౌతి.) ఋజురేఖ గుండా ఒక వస్తువు స్వీకరించు చలనము (Linear motion).

**ఋజువర్తబీజాండము** సం వి. (వృక్ష.) తిన్నగా, నిలువుగా నున్న బీజాండము (Orthotropous ovule) ఋజువర్తబీజాండము.



**ఋజువు** సం. విజ. 1. సరళము, వంకరలేనిది. 2. నిష్కపటము.

**ఋణకర్త** సం. విజ. అప్పుచేసినవాడు.

**ఋణదాత** సం. విణ. అప్పిచ్చువాడు.

**ఋణధ్రువము** సం. వి. (రసా.) ధనవిద్యుదావిష్టకణములను (Ions)ఆకర్షించుధ్రువము (Cathode).

**ఋణము** సం. వి. 1. అప్పు. 2. దుర్గభూమి. 3. జలము. 4 (శి. గణి.) a. తీసివేయు సంఖ్య. b. తీసివేతగుర్తు. విణ. ఋణరాశి (Negative).

**ఋణాత్మకము** సం. విణ. (గణి.) శూన్యముకన్న తక్కువైనది. (Nagative).

**ఋణార్హత** సం. వి. (గృహ.) పరపతి రొక్కము ఈయకుండ వస్తువులను కొనుట. అరువు తీసికొనుట, ఖాతా (Credit).

**ఋతంభరుఁడు** సం. వి. 1. సత్యపాలకుడు 2. పరమేశ్వరుడు.

**ఋతము** సం. విణ. 1. సత్యమైనది. 2. పూజింపబడినది. 3. ప్రాప్తము. వి. 1. జలము. 2. సత్యము. 3. మోక్షము. 4. యజ్ఞము.

**ఋతి** సం. వి. 1. గతి, పోక. 2. జుగుప్స 3. త్రోవ. 4. మంగళము. 5. శత్రువు.

**ఋతుఁడు** సం. వి. సూర్యుడు.

**ఋతుకాలము** సం. వి. 1. వసంతాదిఋతుకాలము. 2. గర్భధారణకు యోగ్యమగు కాలము.

**ఋతుపతి** సం. వి. వసంతర్తువు.

**ఋతుపవనములు** సం. వి. (భూగో.)ఏదైన ఒక ఋతువులో వీచు పవనములు. (ఇవి ఆరు నెలల కొకసారి వీచుచుండును. ఇవి ఆగ్నేయ ఆసియా,హిందూ మహాసముద్రములో ముఖ్యముగా ఏప్రిల్ నుండి అక్టోబరువరకు నైరృతి నుండియు, అక్టోబరునుండి ఏప్రిల్ వరకు ఈశాన్యము నుండియు వీచును. వ్యాపార పవనములు భూమధ్యరేఖనుదాటునపుడు అక్కడి ఉష్ణతీవ్రతచేత దిక్కును మార్చుకొని ఋతుపవనము లగుచున్నవి.) (Monsoon.)

**ఋతుపవనారణ్యములు** సం. వి. (భూగో.) 40'' మొదలు 80'' వరకు వర్షముగల ప్రదేశములలో నున్న అడవులు (వెడల్పయిన ఆకులు గలిగి,వేసవిలో ఉష్ణమునుండి తప్పించుకొనుటకై ఆకులురాల్చుచు,వర్షకాలమందు పుష్పించి ఆకులువేయుచెట్లు గల అడవులు. ఉదా. టేకు చెట్ల అడవి.)

**ఋతుమతి** సం. వి. పుష్పవతి. ముట్టుత.

**ఋతువు** సం. వి. 1. రెండు మాసముల కాలము. 2.గర్భధారణ యోగ్యకాలము. 3 స్త్రీరజస్సు. 4. వెలుగు, ప్రకాశము.

**ఋతువృత్తి** సం. వి. సంవత్సరము.

**ఋత్విక్కు** సం. వి. యజ్ఞకర్తవలన ధనము పుచ్చుకొని యజ్ఞము చేయించువాడు, యాజకుడు. రూ. ఋత్విజుడు.

**ఋత్విజుడు** సం. వి. మా. ఋత్విక్కు.

**ఋద్ధము** సం. విణ. 1.సమృద్ధముపెరిగినది. 2. నూర్చి తూర్పెత్తుటకు సిద్ధముగానుంచినది(ధాన్యము).వి.1.వృద్ధి.2.సిద్ధాంతము.

**ఋద్ధి** సం. వి. 1.వృద్ధి,2.పార్వతి.3.లక్ష్మి. 4. ఒకానొక గంధద్రవ్యము. 5.కుబేరుని భార్య.

**ఋభుక్షము** సం. వి. 1.స్వర్గము.2.వజ్రము

**ఋభుక్షుఁడు** సం. వి. ఇంద్రుడు.

**ఋషభధ్వజుఁడు** సం. వి. శివుడు.

**ఋషభము** సం. వి. 1. ఎద్దు. 2. మదించిన ఏనుగు. 3. సప్తస్వరములలో ఒకటి.

**ఋషి** సం. వి. 1. జ్ఞానముచే సంసారపారమును పొందినవాడు. 2. మంత్రద్రష్ట. 3. వెలుగు.

**ఋషిపంచమి** సం. వి. భాద్రపదశుద్ధ పంచమి, ఒక వ్రతము.

**ఋష్యమూకము** సం. వి. పంపాసరోవర తీరమందలి పర్వతము. (వాలి సుగ్రీవాది వానరులు నివసించినది).

# ఎ

ఎ ఆంధ్ర భాషలోని అచ్చులలో నొకటి. ప్రశ్నమును, వ్యతిరేకమును, ప్రశంసను దెలుపునది. వేరుపాటు దెల్పును. అడుగుట తెలుపును. ఉదా.రావే సుందరి.లేమిని తెలుపు ప్రత్యయము.

ఎంగిలి వి. 1. ఉచ్ఛిష్టము. 2. లాలాజలము.

ఎంచు క్రి 1. గణించు. 2. ఆక్షేపించు, 3. ప్రశంసించు, 4. తలంచు.

ఎంజిల్స సిద్ధాంతము (అర్థ.) కుటుంబ ఆదాయమును, ఖర్చులను గూర్చిన సిద్ధాంతము. (ఇందు ముఖ్యాంశములు మూడు. 1. రాబడి హెచ్చుకొలది అందుఆహారము నకై వినియుక్తమగు భాగము తగ్గును. 2. క్రీడ, వైద్యోపచారము, వాహనములు ఇత్యాది విలాసములకై యుపయోగపడు భాగము హెచ్చుచుండును 3. ఇంటిబాడుగ, వస్త్రములు, తక్కిన గృహోపకరణములు, వీనికై వెచ్చింపబడు రాబడిపాలు, రాబడితో మారక స్థిరముగ నుండును.

ఎంజైం ఇం. వి. (జీవ.) (Enzyme) ఒక సేంద్రియ పదార్థము, ఫేనక ద్రవ్యము.

ఎండ వి. సూర్యప్రకాశము, ఆతపము.

ఎండఁగట్టు క్రి. ఆరగట్టు.

ఎండఁగొట్టు క్రి. ఎండవేయు.

ఎండకన్నెఱుఁగని జాతి. రాణివాసమందుండి బయటికిరానట్టి (ఎండ కన్నెఱుగని పుట్టు భోగి. ఎండకన్ను, వాన కన్ను ఎరుగని వారు.)

ఎండకారు వి. (వ్యవ.) ఉష్ణకాలము. ఏప్రిల్, మేనెలల కాలము, పునాసకారు.

ఎండదొర వి. సూర్యుడు.

ఎండమావులు వి. (భౌతి.) ఎడారులలో మైదానములలో నీ రున్నట్లు భ్రాంతిని గొల్పెడి ఉష్ణ వాయు మండలము, మృగ తృష్ణ (Mirage.)

ఎండార్సుమెంట్ ఇం. వి.(Endorsement) వినిమయ సూచన, తనకురావలసిన సొమ్మును తాను పేర్కొన్నవానికి చెల్లింపు మని వ్రాయు ఆజ్ఞ.

ఎండు క్రి. 1. నీరింకు. 2. తడియారు. 3. కుష్కించు. 4. తపించు

ఎండుగులు వి. ఎండబోసిన ధాన్యము. రూ. ఎండువులు.

ఎండుతెవులు వి. దేహమును కుష్కింపజేసెడి ఒక వ్యాధి.

ఎండువుఁదట్ట వి. ఏదేని ఎండ బెట్టుటకై వెదురుబద్దలు మొ. నితో అల్లిన తట్ట, దాగర. ప్రసేవకము.

ఎండువులు వి. చూ ఎండుగులు

ఎండోథీలియమ్ ఇం.వి. (జం.) (Endothelium) శరీరములోగల అవయవములలోని లోపలిపొర.

ఎంద్రకాయ వి. కర్కటకము, పీత. రూ. ఎంద్రి 2. ఎంద్రిక.

ఎంద్రి వి., చూ. పై.

ఎంద్రిక వి, చూ. పై.

ఎండ్రిన్ ఇం. వి. (వ్యవ.) (Endrin) పురుగులను నాశనము చేయుటకు ఉపయోగించు ఒక రసాయనిక విషద్రవ్యము.

ఎంత సర్వ. ఏ కొలది.

ఎందఱు సర్వ. ఎంతమంది.

ఎందాక అవ్య. ఎంతవరకు,

ఎందు అవ్య. ఎచ్చోట, ఎక్కడ.

ఎందులకు అవ్య. 1. దేనికి. 2. ఎచ్చోటికి.

ఎం. పి. ఇం. వి. (M.P.) సంసద్ సభ్యుడు. పార్లమెంట్ సభ్యుడు(Memher of the Parliament)

**ఎంపోరియం** ఇం. వి. (వాణి.) (Emporium) వివిధ వ్యాపార వస్తువులు అమ్మే వర్తక స్థలము, భండారము. పణ్యశాల.
**ఎంఫొటెరిక్ ఆక్సైడ్** ఇం. వి. (రసా.) (Amphoteric oxide) ఆమ్లధర్మములు క్షారధర్మములు కలిగిన ఆక్సైడ్లు ఉభయధర్మి.
**ఎంబన్న** విశ. (ఎంబె + అన్న) నిష్ప్రయోజకుడు, చేతకానివాడు.
**ఎంబసీ** ఇం. వి. (రాజ.) (Embassy) రాజకీయ దౌత్య కార్యాలయము.
**ఎంబెజ్లమెంట్** ఇం. వి. (శాస.) Embezzlement) ధనాపహరణము, ప్రభుత్వమునకుగాని ఒకసంస్థకుగాని చెందినధనమును అక్రమముగ వినియోగించుట.
**ఎంబ్రాయిడరీ** ఇం. వి. (గృహ.) (Embroidery) బుటేదారిపని, చిత్రపు కుట్లు. అలంకారపు కుట్లు.
**ఎంబ్రాయిడరీ ప్లేట్** ఇం. వి. (గృహ.) మిషన్‌మీద పువ్వులు మొ. అలంకారపు కుట్లను వేయునపుడు మిషనుకు అమర్చవలసిన భాగము.
**ఎఁడు** ప్రత్య. పరిమాణార్థక ప్రత్యయము. ఉదా. గంపెడు. చేరెడు మొ.వి.
**ఎకదొట్టు** క్రి. ఎగఁగొట్టు. అతిశయించు.
**ఎకరము** ఇం. వి. (Acre) 4840 చదరపు గజములనేల, 100 సెంట్లు. రూ. ఎకరా.
**ఎకరా** వి. 1. ఏనుగును గట్టు మొగసాల. 2. ఎకరము.
**ఎకరారు** హిం. వి. ఒప్పుకొనుట.
**ఎకసకియము** వి. 1. వికటపుమాట. 2. అవమానము. 3. వంచన. 4. అపహాస్యము. విశ. వికటము. రూ. ఎకసకెము, ఎకసక్కియము, ఎకసెక్కెము, ఎకసెకియము, ఎకసెకము, ఎకసెక్కియము, ఎకసెక్కెము, ఎక్కువసకియము, ఎక్కసక్కెము, ఎక్కసెకియము, ఎక్కసెకము, ఎక్కసెక్కియము, ఎక్కసెక్కెము.
**ఎకసక్కెము** వి. చూ. పై.
**ఎకసెక్కెము** వి. చూ. పై.
**ఎకాడమి** ఇం. వి. (Academy) పరిషత్తు, ఉదా. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి.
**ఎకాయకి** హిం. విశ. ఎక్కడను నిలువకయే, అతివేగముగా, అకస్మాత్తుగా. రూ. ఎకాయెకి.
**ఎకిమీఁడు** వి. రాజు, ప్రభువు.
**ఎకిరింత** వి. వాహనము. రూ. ఎక్కిరింత.
**ఎక్కటి** పై. వి. 1. ఒకటి. 2. ఒంటరివాడు. విశ. శూరుడు. సం. ఏకః.
**ఎక్కటి కయ్యము** వి. ఒకనితో ఒక్కడే చేయు యుద్ధము, ద్వంద్వయుద్ధము, దండపోరు.
**ఎక్కటీఁడు** పై. విశ. అసహాయశూరుడు.
**ఎక్కడ** వి. (ఏ + కడ) ఏచోటు.
**ఎక్కములు** పై. వి. గుణకార పఠకము. రూ. ఎక్కాలు. సం. ఏకః.
**ఎక్కలి** వి. 1. ప్రవాహవేగమున వచ్చి కమ్ముకొనిన ఇసుక. 2. రేగడిమట్టి.
**ఎక్కాడు** క్రి. 1. పురికొలుపు. 2. ఎక్కువచేయు.
**ఎక్కిరింత** వి. చూ. ఎకిరింత.
**ఎక్కిలి** పై. వి. దప్పి మొ. నిచే గలుగు బాధ. సం. హిక్కా.
**ఎక్కు** వి. వింటినారి. క్రి. 1. అతిశయించు, 2. ఆరోహించు. 3. ఇష్టమగు.
**ఎక్కుడించు** క్రి. 1. హెచ్చించు. 2. నారి సడలించు.
**ఎక్కుడు** వి. 1. ఆరోపణము. 2. వాహనము. 3. వింటినారి. విశ. అధికము.
**ఎక్కుడుమెకము** వి. మహామృగము. ఏనుగు.
**ఎక్కువ** వి. ఆధిక్యము. విశ. అధికము.

**ఎక్స్చేంజ్ రేషియో** ఇం. వి. (అర్థ.) (Exchange Ratio) రెండు చెలామణుల మారకపు సంబంధపు నిష్పత్తి.

**ఎగఁగొట్టు** క్రి. 1. ఎగురవేయు, 2. మాను 3. అప్పు తీర్పకుండు.

**ఎగఁగ్రోలు** క్రి. పీల్చు.

**ఎగఁజేఁపు** క్రి, పొదుగు నందలి పాలు రాకుండ మీదికి చేపుట.

**ఎగఁదన్ను** క్రి. ఎగువకు తన్ను.

**ఎగఁబట్టు** క్రి. ఎత్తిపట్టు.

**ఎగఁబోఁత** వి. 1. ఎగువకు వ్యాపించుట. 2. దుర్బోధ.

**ఎగచే** క్రి. తరుము.

**ఎగతాళి** వి. గేలి, పరిహాసము.

**ఎగదువ్వు** క్రి, మీదికి దువ్వు.

**ఎగదిగ** క్రి. విశ. పైకిని క్రిందికిని, వెనుకకును ముందుకును,

**ఎగనూఁదు** క్రి. 1. పైకి ఊదు. 2. తిరస్కరించు.

**ఎగనెత్తు** క్రి. మీదికెత్తు.

**ఎగపు** వి. 1. గర్వము. 2. మండిపడుట.

**ఎగయు** క్రి. పైకిలేచు, ఎగురు.

**ఎగరొప్పు** క్రి. ఎగరోజు. వి, వగర్పు.

**ఎగవేయు** క్రి. అపహరించు,

**ఎగసన** విశ. ఎక్కువ అవ్య. ఎగువగా.

**ఎగిసిపాటు** వి. 1. గర్వము. 2.మిడిసిపాటు.

**ఎగు** విశ. 1. ఎత్తైన. 2. ఎగురగల 3, ఎగువ శబ్దమునకు సమాసమున మిగిలినరూపము,

**ఎగుచే** క్రి. తరుము.

**ఎగుడు** విశ. మిట్ట (వ్యతి.దిగుడు, పల్లము).

**ఎగుబోద** వి. రెక్కలు వచ్చి ఎగురనుంకించు పక్షిపిల్ల.

**ఎగుభుజము** మి. వి. ఉన్నత భుజము.

**ఎగుమతి** వి. ఓడ మొ. కి సరకు లెక్కించుట.

**ఎగుమతులు** వి. (అర్థ.) విదేశములకు సరకులను పంపుట.

**ఎగురఁబోఁత** వి. (వ్యవ.) నూర్చిన ధాన్యములో పొట్టు, దుమ్ము మొ.వి లేకుండ చేయుటకు ధాన్యమును గాలి వీచునపుడు కొంత ఎత్తుననుండి చేటలతో మెల్లగా క్రిందికి విడుచుచుండుట, తూర్పారపట్టుట (Winnowing).

**ఎగువ** వి. 1. మీదు. 2. ఆధిక్యము.

**ఎగువసభ** మి. వి. (రాజ.) శాసనమండలి (Legislative council).

**ఎగ్గడికత్తె** వి. అంతఃపుర కావలికత్తె.

**ఎగ్గతము** వై. వి, రహస్యస్థలము. సం. ఏకాంతః విశ. ఏకాంతమైనది.

**ఎగ్గాడు** క్రి. దూషించు. రూ. ఎగ్గులాడు. ఎగ్గించు.

**ఎగ్గు** వి 1. కీడు, అపకారము. 2.దోషము.

**ఎగ్గుఱుతు** వి. (ఎగువ+గుఱుతు) విషయ సంగ్రహము. రూ. ఎగ్గుర్తు.

**ఎగ్ బీటర్** (Egg beater) ఇం. వి. (గృహ.) గ్రుడ్డును కొట్టి నురుగుచేయుటకు ఉపయోగించు చక్రాకారపు పరికరము

**ఎచ్చిరిలు** క్రి. 1. వర్ధిల్లు. 2. బాగుపడు. రూ ఎచ్చిర్లు.

**ఎచ్చెఱు** క్రి. చూ. పై.

**ఎచటు** వి. (ఏ+చోటు) ఎక్కడ. రూ. ఎచోటు, ఎచ్చోటు,

**ఎచ్చరించు** క్రి. ఎచ్చరికజేయు. రూ. హెచ్చరించు, ఎచ్చరికించు.

**ఎచరము** వి. హెచ్చరిక.

**ఎచ్చు** వి. ఆధిక్యము, విశ. అధికము. క్రి. అధికమగు.

**ఎచోటు** వి. చూ ఎచటు.

**ఎచ్చోటు** వి. చూ. ఎచటు.

**ఎజెండా** ఇం. వి. (Agenda) సభలో చర్చింపబడె విషయానుక్రమణిక, చర్చనీయాంశముల పట్టిక.

**ఎట** వి, ఎక్కడ.

ఎటు అవ్య. 1. ఏప్రకారము. 2. ఏవైపు.
ఎట్టకునేని అవ్య. 1. కట్టకడపట. 2. అతి ప్రయాసమున రూ. ఎట్టకేని, ఎట్టకేలకు.
ఎట్టకేని అవ్య. కట్టకడకు.
ఎట్టకేలకు అవ్య. అతిప్రయాసమున.
ఎట్టపోగు వి. దండు.
ఎట్టయెదురు వి. (ఎదురు+ఎదురు) మిక్కిలి
ఎట్టి విశ. ఎటువంటి, ఎట్టిడు, ఎట్టివాడు. (బహు. ఎట్టివారు).
ఎట్టు అవ్య. ప్రశ్నార్థకము.
ఎడ[1] వి. 1. స్థానము. 2. అవకాశము. 3. దూరము. 4. గడువు. 5. భేదము 6. విఘ్నము. 7.వ్యవహారము. 8.దౌత్యము విశ. 1. అధికము. 2. ఎతప్రాయము. కలది. 3.ఎడమప్రక్కనున్న అవ్య. అందు విషయమున.
ఎడ[2] వై. వి. హృదయము. సం. హృత్.
ఎడఁద వై. వి. ఎద, హృదయము.
ఎడఁబాటు వి. వియోగము.
ఎడఁబాయు క్రి. వీడు, వదలు.
ఎడకట్టు క్రి. ఎండినపుండు మరల చీముపట్టు.
ఎడకత్తియ వి. తార్పుకత్తియ, దూతి.
ఎడకాఁడు వి. తార్పువాడు.
ఎడకారు వి. మాఘమాసమునుండి జ్యేష్ఠ మాసములోపల పండు పంట (డాకవా.)
ఎడగడ్డ వి. ఒడ్డు, తీరము.
ఎడతాఁకు క్రి. 1. చేరు. 2.వచ్చుచుపోవుచు నుండు 3. ప్రతిఘటించు.
ఎడతెగు క్రి. 1. ఎడవడు.2.విడివడు.
ఎడతెఱపి వి. వ్యవధానము, విరామము.
ఎడదవ్వు వి. అతిదూరము.
ఎడనీరు వి. లేతటెంకాయలోని నీరు. రూ. ఎలనీరు, ఎళనీరు.
ఎడనెడ అవ్య. 1. అప్పుడప్పుడు, మధ్య మధ్య. 2. అక్కడక్కడ.
ఎడపఁదడప అవ్య. అప్పుడప్పుడు.
ఎడపిల్ల వి. చంటిపిల్లకు పూర్వముజనించిన పిల్ల.
ఎడపోవు క్రి. దౌత్యముచేయు.
ఎడమ విశ. సవ్యము. వ్యతి కుడి. వి. వాను భాగము.
ఎడమడుగు వి. వ్యత్యాసము. విశ. వ్యత్యస్తము. రూ. ఎడమడువు.
ఎడమడువు మా. పై.
ఎడము వి. 1. చోటు. 2. అవకాశము 3. నడిమిభాగము.
ఎడయిక వి. ఎడబాటు.
ఎడయు క్రి. 1 తొలగు. 2. విసర్జించు.
ఎడరు క్రి. భగ్నమగు. వి. 1. ఆపద. 2. భంగము. 3. సందు. 4. ఎడారి
ఎడలు క్రి. వికలమగు, విచ్ఛిన్నమగు.
ఎడవు వి. నిర్జలప్రదేశము. విశ. దూరము.
ఎడసాల వి. వేఱైనగది. ప్రత్యేకమైనగది.
ఎడాటము వి. 1. విషయము. 2. ఆట. 3. ప్రణయకోపము. 4. భేదము.
ఎడారి వి. నిర్జనమగు ఇసుకబయలు.
ఎడారిభూములు మి. వి. (భూగో.) కర్కాటక మకరరేఖలపైన అధికపీడన ప్రదేశములో గల భూములు. (ఇక్కడ వర్షము నామమాత్రముగా నుండును. మనుష్యులుచెట్లు చేమలు లేని ప్రదేశము. సమశీతోష్ణమండలమున గల వర్షచ్ఛాయా ప్రదేశములలో కూడ ఎడారు లున్నవి). ఇసుకభూములు
ఎడ్డ వై. వి. మా. ఎడ[2].
ఎడ్డమి వి. ఆపద.
ఎడ్డము వి. అడ్డంకి, అడ్డము.
ఎడ్డియ వై. విశ. మూఢుడు. రూ. ఎడ్డె, ఎడ్డెడు.
ఎడ్డె వై. విశ. మా. ఎడ్డియ.
ఎడ్డెన వి. భోజనపాత్ర పెట్టుకొను పీట.
ఎడ్మిరల్ ఇం.వి.(Admiral) నౌకాదళాధిపతి.

**ఎతఁడు** సర్వ. 1. ఏ పూజ్యుడు. 2. ఏ పురుషుడు.

**ఎతుబరికాఁడు** వి. దొంగ. రూ. ఎత్తుబరికాడు.

**ఎత్తనగోలు** వి. ఆరంభము. మొదలు.

**ఎత్తరము** విశే. ఉన్నతము.

**ఎత్తళి** వి. కొరముట్టు. సాధనము.

**ఎత్తికోలు** వి. 1. ప్రయత్నము. 2. సంకల్పము.

**ఎత్తిపొడుచు** క్రి. దోషము నెత్తిచెప్పు.

**ఎత్తిలి** అవ్య. 1. బిగ్గరగ. 2. హాయిగా.

**ఎత్తు**[1] క్రి. 1. దండెత్తు. 2. అపహరించు 3. పైకెత్తు. 4. తీయు. 5. ప్రస్తావించు. 6. వహించు. 7. సంగ్రహించు. వి. 1. చవరంగపుటెత్తు. 2. ఉపాయము. 3. ప్రయత్నము. 4. తూనిక. 5. పూసరము.

**ఎత్తు**[2] (ఉన్నతాంశము) వి. (గణి.) దిక్క్రముతోచేయుఊర్ధ్వకోణము (Altitude

**ఎత్తుగడ** వి. 1. ఉపాయము. 2. యత్నము.

**ఎత్తుగడలు** వి. ప్రొయ్యిగడ్డలు.

**ఎత్తుగున్న** వి. ఏనుగుగున్న.

**ఎత్తుబరికాఁడు** వి. చూ. ఎతుబరికాడు.

**ఎత్తువచ్చు** క్రి. సరిపోలు. సాటివచ్చు.

**ఎత్తువడు** క్రి. 1. జవసత్త్వము లుడిగి పడిపోవు, లేవలేక పడిపోవు. 2. చెడు.

**ఎత్తెల** వి. చేపలబట్టు. వల.

**ఎద**[1] వి. పశుఋతువు.

**ఎద**[2] వై. వి. హృదయము సం. హృత్.

**ఎదగినమనిషి** వి. వయస్కుడు, వయోజనుడు. బాల్యముదాటినవాడు (Adult).

**ఎదిరి** వి. 1. విరోధి. 2. ప్రతివాది.

**ఎదుగు** క్రి. వర్ధిల్లు, వి. 1. అధికము. 2. పెరుగుట.

**ఎదురు** క్రి. ఎదురించు. వి. 1. ముందు. 2. వలపుకత్తె వలపుకాని కిచ్చు ధనము, విశే. 1. అన్యుడు, 2. సాటి. 3. బదులు. క్రి. విశే. 1. అభిముఖముగా, 2. సమానముగా.

**ఎదుటికాళ్ళతో కానుపు** వి. (గృహ.) ప్రసవసమయమున శిశువుకాళ్ళు ముందు వెలుపలికి వచ్చుట (Breach-birth).

**ఎదురీదు** క్రి. (జాతీ.) ప్రవాహామున కెదురీదునంతటి కష్టపుపని చేయు,

**ఎదురుకుత్తుకలు** వి. అంకిళ్ళు పట్టుకొనెడి వ్యాధి.

**ఎదురుకొను** క్రి. అభిముఖమగు. రూ. ఎదుర్కొను.

**ఎదురుకోలు** వి. 1. వివాహామునందు పడుచింటివారు వరుని కెదురుగా బోపుట. 2. ఎదుర్కొనుట. రూ. ఎదుర్కోలు.

**ఎదురుచుక్క** విశే 1. అశుభప్రదము. 2. అనిష్టము. 3. కూడనిది. శుక్రనక్షత్రము ఎదురగునప్పుడు ప్రయాణించుట కూడదందురు).

**ఎదురుచూచు** క్రి. ప్రతీక్షించు.

**ఎదురుచు** క్రి. 1. ప్రతికూలమగు. 2. ఎదిరించు.

**ఎదు(రు)రొమ్ము** వి. రొమ్ము నడిమి భాగము.

**ఎదుర్కొను** క్రి. 1. అభిముఖమగు. 2. ప్రతిఘటించు.

**ఎదుర్కోలు** వి. చూ. ఎదురుకోలు.

**ఎద్దడి** వి. (ఎత్తు+తడి). 1. దారిద్ర్యము. 2. శూన్యము. 3. కరవు.

**ఎద్దము** వి. పట్టుతీర్చిన యంచు (ఎద్దపు చీర).

**ఎద్దు** వి. వృషభము (బహు. ఎడ్లు).

**ఎద్దుమొద్దు** విశే. 1. మూఢుడు. 2. అరసికుడు.

**ఎన** విశే. సమానము. పోలిక.

**ఎనయు** క్రి. 1. సరిపోలు. 2 పొందు. 3. పోలు.

**ఎనామెల్** ఇం. వి. (Enamel) (గృహ.) దంతపు పైభాగము లేదా పింగాణి భాగము.

**ఎనిక** వి. గణనము. రూ. ఎన్నిక.

**ఎనిమిది** సర్వ. ఏడు నొకటి.

**ఎనియు** క్రి. కలిసికొను.

**ఎనుబండ్రు** సర్వ. ఎనిమిదిమంది.

**ఎనుబది** సర్వ. ఎనిమిదిపదులు, అశీతి.

**ఎనుము** వి. మహిషి, బఱ్ఱె. గేదె.

**ఎనుపు** క్రి. ఎనియచేయు.

**ఎన్జైమ్స్** ఇం. వి. (Enzymes) (గృహ.) జీవకణములలో నుద్భవించెడు ప్రేరక ద్రవ్యములు.(ఇవిశరీరములోఅనేకరాసాయనిక ప్రక్రియలను జరుపుచుండును).

**ఎన్నడు** వి. (ఏ+నాడు). 1. ఏకాలము. ఎప్పుడు. 2. ఎల్లప్పుడు.

**ఎన్ని** సర్వ. ఏంత సంఖ్య గలవి.

**ఎన్నిక** వి. రూ. ఎనిక.

**ఎన్నికచేయు** క్రి. లెక్కించు, లెక్కపెట్టు (ఉదా.వాడుఎన్నికచేయవలసినపనివాడు).

**ఎన్నికదారులు** వి. నియోజకులు.

**ఎన్నికలు** వి. (రాజ.) ప్రతినిధులను ఎన్నుకొనుట,నియోజనఎలక్షన్లు (Elections).

**ఎన్నిక వర్గము** వి. (శాస., రాజ.) ఎన్నికదారుల సమూహము, నిర్వచనగుణము. (Electorate).

**ఎన్ను** క్రి. 1. లెక్కించు. 2. ఆశేపించు.

**ఎన్నువ** వి. ఆడువా రేడ్చునపుడు అనుభవమును ఎంచి యెంచి పాటగా పాడెడు చచ్చినవారి చరిత్ర.

**ఎన్నెము** వి. పురుటిపురుగు. రూ. ఎన్నెమ్ము. ఎనెమ్ము.

**ఎపిగ్రఫి** ఇం. వి. (Epigraphy) (చరి.) ప్రాచీన లిపి పరిశోధన శాస్త్రము.

**ఎపిడమిక్** ఇం.వి.(Epidemic)(గృహ.)అంటువ్యాధి, ఊరంతయు వ్యాపించెడి వ్యాధి.

**ఎపిలెప్సి** ఇం. వి. (Epilepsy) (వైద్య.) స్మారకము లేకపోవుట, స్పృహతప్పుట, కాకిసోమాల, మూర్ఛరోగము,అపస్మారరోగము.

**ఎపిస్కోపసీ** ఇం. వి. (Episcopacy)(చరి.) బిషప్పులుఅనబడు క్రైస్తవమతాచార్యుల పరిపాలన.

**ఎపుడు** వి. ఎల్లప్పుడు, ఏకాలము, రూ. ఎప్పుడు, ఎప్డు.

**ఎప్పటి** అవ్య. అప్పటి,యథాపూర్వముగా, మరల.

**ఎప్డు** వి. రూ. ఎపుడు,

**ఎబేకస్** ఇం.వి. (Abacus) (గణి.) పూసలతో నున్న తీగలమర్చబడిన చట్రము. (దీనితో పూర్వము కూడిక, తీసివేతమొ॰ ప్రక్రియలు జరుపబడు చుండెడివి).


ఎబేకస్

**ఎబ్బ** అవ్య. అసహ్యసూచకము.

**ఎబ్బెట్టు** విశే. వికటము, జుగుప్స, రోత.

**ఎబ్బెరాసి** విశే. రోతకలవాడు.

**ఎబ్బెతికము** వి. రోత.

**ఎమిడిక** వి. కడుపులో కలుగు పాములవలె నుండు తెల్లని పురుగు. రూ. ఏటిక.

**ఎముక** వి. శల్యము. రూ. ఎమ్ము.

**ఎముకపొట్టు** వి. (వ్యవ.) ఎముకలను పొడి చేయునపుడు బయలుదేరు రద్దుపదార్థము (దీనిలో నూటికి సుమారు 12 వంతులు నత్రజనియు. 5 వంతులుస్ఫురత్ప్రంచామ్లజనితమును 6 వంతులు సున్నమును ఉండును) (Bone dust).

**ఎముకబూడిద** వి. (వ్యవ.) ఎముక బొగ్గు కాల్పగా వచ్చిన బూడిద (ఇది సస్యములకు స్ఫురపు తెరువుగా నుప యోగించబడును) (Bone ash).

**ఎముకలపొడి** వి. (వ్యవ.) ఇది జంతుసంబంధమైన స్ఫురపు ఎరువులలో ముఖ్యమైనది. చచ్చిన జంతువుల ఎముకలను పొడిగా చేసిన పదార్థము (Bone meal.)

**ఎముకలవట్టు** విశే. వ్యాధిచే బక్కచిక్కినది, లేక బక్కచిక్కినవాడు.

**ఎమ్మూట** వి. (ఎమ్ము+ఊట) ఎముకలలోని క్రొవ్వు, మూలగ,

**ఎమ్మె** వి. మనోహరత్వము, విలాసము.

**ఎమ్మెకాఁడు** విశే. విలాసవంతుడు,

**ఎమ్మెలాఁడి** విశే. విలాసిని.

**ఎయిదు** క్రి. 1. అనుగమించు, వెంబడించు 2.పొందు. రూ. ఎయ్దు.

**ఎయిర్‌కూలర్** ఇం. వి. (Air cooler) (గృహ.) గాలిని చల్లపరచు యంత్రము, (దీని పెద్దచావిళ్ళలో కూటములు జరుగునపుడు గాలిని చల్లపఱుచుటకు ఉపయోగింతురు).

**ఎయిర్‌ఫోర్స్** ఇం. వి. (Air force) విమానబలము, వాయుసేన.

**ఎర** వి. 1. తిండి. 2. బలి. 3. వ్యసనము.

**ఎరఁగు** క్రి. 1. దిగు.2. నమస్కరించు. రూ. ఎఱఁగు.

**ఎరగలి** వి. కార్చిచ్చు. అడివిలో మ్రాకులు ఒకటితో నొకటి ఒరసికొనగాపుట్టిఅడవిని దహించెడి అగ్ని.

**ఎరగొను** క్రి. (ఎర+కొను) 1. కబళించు. 2. పరవశమగు.

**ఎరవు** వి. ఒకటి రెండు దినములు వాడుకొనుటకై యడిగి తెచ్చుకొను సొమ్ము.

**ఎరిత్రోబ్లాస్టోసిస్** ఇం. వి. (Erythroblastosis) రక్తకణములు సరిగా పెరుగకపోవుట.

**ఎరియు** క్రి. 1. జ్వలించు, మండు, 2.పరితపించు.

**ఎరువు¹** వి. పైరుకై చేర్చియుంచిన చెత్త పేడ మొ.వి. వ్యు. ఎండచే ఎరియునది.

**ఎరువు²** వి (వ్యవ.) నేలలో తగ్గిన సారమును మరల చేర్చి సత్తువ చేయుటకు ఉపయోగించు పదార్థము (Manure).

**ఎరువుగోయి** వి. (వ్యవ.) వ్యవసాయదారుడు పశువుల ఎరువును కూడబెట్టు గోయి (Manure pit).

**ఎరువువేయుట** వి. (వ్యవ.) చెట్టుచేమలకు కావలసిన ఆహార ద్రవ్యములు ఏవేని నేలలో లోటుపడునో అవి కల పదార్థములను నేలకు చేర్చుట (Manuring).

**ఎరుసు** వై.వి. అసూయ, ఈసు. సం ఈర్ష్యా.

**ఎఱ** వి. వానపాము. విశే. ఎఱ్ఱనైనది,

**ఎఱఁగు** క్రి. మూ. ఎరఁగు.

**ఎఱక** వి. 1. ఈక. 2. పక్షము. రెక్క. 3. భుజము. రూ ఱెక్క.

**ఎఱగందు** వి. (ఎఱ+కందు) లేతశిశువు.

**ఎఱగన్ను** వి. శివుని అగ్నినేత్రము,

**ఎఱచి** వి. పొల, మాంసము.

**ఎఱబఱికము** వి. అసహ్యము, రోత.

**ఎఱసంజ** వై.వి.1.ప్రాతస్సంధ్య.1.సాయంసంధ్య.

**ఎఱిఁగు** క్రి. తెలియు.

**ఎఱుక** వి. 1. ఎఱుగుట. 2. పరిచయము. 3. సోదె, జోస్యము. 4. గురుతు. జాతీ. ఎఱుక పిడికెడు ధనము—దాచుకొన్న సొమ్ము).

**ఎఱుకపడు** క్రి. 1. తెలియు.

**ఎఱుకవాఁడు** వి. బోయవాడు.

**ఎఱుకత** వి. బోయ స్త్రీ, ఎఱుకసాని.

**ఎఱుకువ** వి తెలివి.

**ఎఱ్ఱ** వై. వి. మూ. ఎఱ.

**ఎఱ్ఱకణములు** వి. (జం.) చిన్న ఉంగరముల వలె నుండి ఎరువు రంగు నిచ్చు కణములు. (అవి ప్రాణవాయువును సరఫరా చేయును) (Red blood corpuscles).

ఎఱ్ఱకళ్లు వి. (వ్యవ.) ఇది మొక్కల కాండమునకు పట్టు తెగుళ్ళలో ఒకటి. సామాన్యముగా చెఱకుగడలకు ఎఱ్ఱని డాగులవలె ఈ తెగులు పట్టుచుండును (Red rot).

ఎఱ్ఱగందము వై. వి. రక్తచందనము.

ఎఱ్ఱగడ్డ వై. వి. నీరుల్లి.

ఎఱ్ఱగొంగళిపురుగు వి. (వ్యవ.) ఈపురుగు యొక్క డింభము వేరుసెనగ, గంటె, జొన్న నూవు మొ. జాతుల మొక్కల ఆకులను తినివేయును(Red hairy caterpillar, Amsacta albistriga).

ఎఱ్ఱనివేలుపు వి. అగ్ని.

ఎఱ్ఱనేల వి. (భూగో.) ఎఱ్ఱనినేల (శిలలు వేసవిలో వేడియై వర్షముచే తడిసి, శిథిలములై ఎఱ్ఱనేలగా మారును).

ఎఱ్ఱనేలలు వి. (వ్యవ.) ఎఱ్ఱ చెక్క నేలలు, ఎరుపురంగు గల నేలలు, కణశిల(Granite నుండిగాని, నైసశిల (Gniess) నుండిగాని సాధారణముగ పుట్టిననేలలు(Red soils)

ఎఱ్ఱరక్తకణములు వి. (జం) రక్తమునకు ఎరుపురంగు నిచ్చు కణములు (Erythrocytes).

ఎఱ్ఱరోడయిలండ్లు ఇం. వి. (వ్యవ.) ఒక విధమైన విదేశపు జాతికోళ్లు (ఇవి ఎఱ్ఱగా నుండును) (Rhode island reds).

ఎల విశే. 1. లేతది. 2. స్వల్పము. 3. యౌవనము గలది. 4. సాక్షియైనది.

ఎలక్ట్రాన్ ఇం. వి. (రసా.) (Electron) పరమాణువులోని ఋణవిద్యుత్కణము.

ఎలక్ట్రానిక్స్ ఇం. వి.(Electronics) ఋణవిద్యుత్కణముల ప్రవర్తనను పరిశీలించు లేక అన్వయించు భౌతికశాస్త్రవిభాగము.

ఎలక్ట్రిక్ హీటర్ ఇం. వి. (Electric heater) విద్యుచ్ఛక్తి వలన వేడి నిచ్చెడి పరికరము.

ఎలగోలు వి. 1. కలకలము. 2. మొదట టపటప మని వచ్చు వానజలు. విశే. 1. ముందరిది. 2. సేనాముఖమునం దుండునది. 3. ముందు నడచునది.

ఎలదోఁట వి. ఆరామము, ఉద్యానవనము.

ఎలనవ్వు వి. చిరునవ్వు.

ఎలనాఁగ వి. 1. యౌవనవతి. 2. స్త్రీ.

ఎలనీరు వి. లేతటెంకాయలోని నీరు. రూ. ఎడనీరు, ఎళనీరు.

ఎలమి వి. 1. ఆనందము. 2. వికాసము. 3. ధైర్యము.

ఎలయు క్రి. 1. పొందు. 2. చేరు. 3.కలుగు.

ఎలరారు క్రి. 1. అతిశయించు. 2. ఒప్పు.

ఎలరు వి. 1. అతిశయము. 2. వికాసము.

ఎలర్చు క్రి. 1. అతిశయించు. 2. వికసించు. 3. సంతోషించు.

ఎలుఁగు వి. 1. కంఠస్వరము. 2. ఎలుగుబంటి. రూ. ఎల్గు, ఎలువు.

ఎలుక వి. మూషికము.

ఎలువు వి. చూ. ఎలుఁగు.

ఎల్గు వి. చూ. ఎలుఁగు

ఎల్ల వి, 1. పొలిమేర. 2. సమస్తము.అవ్య. సర్వశబ్దార్థకము.

ఎల్లరు సర్వ. (ఎల్ల+వారు) అందరు.

ఎల్లాఁపి వి. (ఎల్ల+ఆఁపి) అడవిలో ఎల్లయందుండి జనుల నాపి దోచుకొనెడు వాడు. దొంగ.

ఎల్లాఁపికత్తియ వి. దొంగతనము గల స్త్రీ. రూ. ఎల్లాఁపికత్తె.

ఎల్లి వి. రేపు. 2. గొడుగు.

ఎల్లిదము వి. 1. చులుకదనము. 2. అవమానము, అగౌరవము. 3. తిరస్కారము. విశే. 1. గౌరవము లేనిది. 2.చులుకనిది. రూ, ఏలిదము.

ఎల్లిదుఁడు వి. అసమర్థుడు, అల్పుడు.

ఎల్లుండి వి (ఎల్లి+ఉండి) రేపటికి అవలి దినము.

ఎవఁడు సర్వ. ఏమనుజుడు. రూ. ఎవ్వడు. ఏవాడు. ఏడు.
ఎవత సర్వ. ఏయాడుది. రూ. ఎవతి. ఎవతుక, ఎవతె, ఎవరిత, ఎవరితి, ఎవరితె, ఎవర్తుక.
ఎవుచు క్రి. చూ. ఎగుచు.
ఎవ్వఁడు సర్వ. చూ. ఎవడు.
ఎవ్వత సర్వ. ఎవ్వతె. రూ. ఎవ్వతుక, ఎవ్వరిత, ఎవ్వరిత్తె, ఎవర్తుక.
ఎవ్వల వి. ఏప్రక్క (ఏ+వలను).
ఎస వి. 1. అధిక్యము. 2. అత్యంతము. 3. రీతి. 4. ప్రేరణ. క్రి. విశ. 1. మిక్కిలి. 2. చక్కగా.
ఎసకము వి. 1.అతిశయము. 2. ఎగిసిపాటు. విశ. 1. అధికము. 2. ప్రియము.
ఎసకొలుపు క్రి. ప్రేరేచు.
ఎసరు వి. 1. వంటకై కాగబెట్టిన నీరు. అత్తెసరు. 2. కవోష్ణజలము. క్రి. మీరు. అతిశయించు.
ఎసవిక వి. తీరిక, అవకాశము.
ఎసలారు క్రి. అతిశయించు, (ఇంపెసలారు).
ఎసవు క్రి. చూ. ఎసఁగు.
ఎసిటిలీకరణము వి. (రసా.) ఎసిటిలీన్ సంబంధమైన రసాయనిక ప్రక్రియ (Acetylation).
ఎసిడిక్ ఆక్సైడ్లు వి. (రసా.) (Acidic oxides) నీటిలో కరగి ఆమ్లముల నుత్పత్తి చేయు అధాతువుల ఆక్సైడ్లు.
ఎస్కిమోలు ఇం. వి. (చరి.) (Eskimos) ఆర్కిటిక్ దీవులలోను ఉత్తర అమెరికా మంచు ఎడారులలోను నివసించు మానవ జాతి.
ఎళనీరు వి. చూ. ఎడనీరు.
ఎళ్ళము మి. వి. (ఏడు+పలము) ఏడు పలములు.
ఎళ్లు వి. ఎడ్లు, ఎద్దులు.

# ఏ

ఏ ఒక అచ్చు. అవ్య. ప్రశ్నమును, ఉద్దేశమును, ప్రశంసను, వ్యతిరేకమును, ప్రార్థనను, నిర్ధారణమును, నిర్దేశమును తవంతట అను అర్థమును సూచించును.
ఏంటిబయోటిక్స్ ఇం. వి. (గృహ.) Antibiotics) విషక్రిమి వినాశకములు, వ్యాధిజనకక్రిములను నాశనముచేయు మందులు.
ఏఁకట వి. మిక్కిలి అపేక్ష, వేఁకరుట.
ఏఁకరి వి. కిరాతులలో ఒక తెగ.
ఏఁకరు క్రి. దాచిపోవు. రూ. వేకారు.
ఏఁకారు క్రి. చూ. పై.
ఏఁచు క్రి. బాధించు.
ఏఁటెల్ల అవ్య. సంతాపసూచకము.
ఏఁడాది వి. సంవత్సరము.
ఏఁడీ వి. ఎక్కడ నున్నాడు. రూ. ఏడీ. 2. నాగటిమేడి, ఏడికోల.
ఏఁడికోల వి. నాగలికొయ్య
ఏఁడు వి. సంవత్సరము. బహు. ఏండ్లు. సర్వ. ఎవడు.
ఏఁడుడి వి. చనిపోయినవారికి మొదటి సంవత్సరము జరుపు అబ్దికము.
ఏఁదుము వి.(ఏను+తూము)ఐదుతూములు.
ఏఁపు వి. 1. బాధ, 2.శోకము, 3. కాఠియ
ఏఁబండ్రు వి. ఏబదిమంది.
ఏఁబది వి. ఐదుపదులు.
ఏఁబలము వి. ఐదుపలములు (వాడుకలో సవాశేరు)
ఏకకణజీవులు సం. వి. (జీవ.) ఒక జీవకణమే శరీరముగా గల ప్రాణులు (Unicellular organisms).

ఏకకాష్ఠక సం. విశే. (వృక్ష.) పత్రఫలక ములో ప్రధాన మగు ఒకటే ఈనెగల (పత్రము.)

ఏకకుండలుఁడు సం. వి 1. బలరాముడు. 2. కుబేరుడు. 3. ఆదిశేషుడు.

ఏకకుఁడు సం. విశే. అసహాయుడు,ఎక్కటి.

ఏకకేంద్రవృత్తములు సం. వి. (గణి.) ఒకే కేంద్ర ముతో ఏర్పడిన వృత్త ములు (Concentric circles).



ఏకకేంద్ర

ఏకకోశినములుసం.వి.(జం.) వృత్తములు ఏకకణజీవులు (Protoza) ఉదా.అమీబా.

ఏకకోష్ఠికము సం. విశే. (వృక్ష) ఒకటే గది కలది (Unilocular).

ఏకఖటికస్ఫురితము సం. వి. (వ్యవ.) ఇది ద్రావణీయరూపములోనున్న స్ఫురితము. ఎముకల పొడిలోనున్న అద్రావణీయమగు త్రిఖటికస్ఫురితము (Monocalciumphosphate.) $Ca H_2 (Po_4)_2$. ద్రావణీయ మగుటకు Tri-calcic $phosphatcea_3 (Po_4)_2$ రూపములోనికి మారవలెను.

ఏకగురువు సం. విశే. సహపాఠి.

ఏకగ్రీవము సం. విశే. ఏకవాక్కు, భేదాభి ప్రాయరహితము.

ఏకచక్రస్థితము, ఏకచక్రీయము సం. విశే. (గణి.) ఒకేవృత్తముపై నుండెడిది (Cyclic-con-cyclic).

ఏకచరము సం. వి. 1. ఒంటరిగాడు.2.అడవి పంది. విశే. ఏకాంతమైనది.

ఏకతఃపీతి సం. వి. (జం.) అండములో నున్న అండపీతము ఒకేధ్రువముదగ్గర కేంద్రీకరింపబడినఅండము (Teleolecithal).

ఏకతమాడు క్రి. ఆలోచించు, తలంచు,

ఏకతము వై. వి. 1. ఆలోచన, 2. ఆలోచనకు దగినచోటు. సం. ఏకాంతః.

ఏకతలీయము సం. విశే. (గణి.) ఒకే తల ములో నున్నది. (Coplanar.)

ఏకదంతుఁడు సం. వి. వినాయకుడు.

ఏకదృష్టి సం. వి. కాకి, ఏకాక్షము వ్యా. ఒక చూపు కలది.

ఏకదేశము సం. వి. అంశము, భాగము.

ఏకనతము సం. విశే (భౌతి.) స్ఫటికరూప మును నిర్దేశించు మూడుఅక్షములలో ఒకటి తక్కిన రెండింటికిలంబముగానుండక ఏటవాలుగా నున్నస్థితి.

ఏకపత్ని సం. వి. 1. పతివ్రత. 2. సవతి లేని స్త్రీ. 3. సవతి.

ఏకపత్నీవ్రతుఁడు సం.విశే. త్రికరణశుద్ధిగా ఒకేభార్య యను వ్రతము గలిగినవాడు.

ఏకపదము సం. విశే. (గణి.) ఒకే పదమును గలిగినది. వి. ఒకే పదమును కలిగిన బీజ గణితసమాసము (Monomial).

ఏకపది సం. వి. 1. మార్గము. 2. ఒకడే నడువదగ్గ మార్గము.

ఏకపార్శ్వస్థ వాహినీపుంజము సం. వి. (వృక్ష.)అధోవాహిదారువు ఒకేఅక్షముపై నుండి అధోవాహి అధస్తరము దిక్కునను దారువు లోపలి దిక్కునను ఉండును. ప్రవిభాజికణజాలము కూడ ఉన్నచో అది ఏథావిపుంజము(Open bundle)అనియు, లేనిచో అనేథా విపుంజము (Closed bundle)అనియు పిలువబడును (Collateral vascular bundle).

ఏకపింగళుఁడు సం. వి. కుబేరుడు.

ఏకప్రతినిధినియోజకవర్గము సం. వి. (పౌర., రాజ.) ఒక నియోజకవర్గము నుండి ఒకే ప్రతినిధిని ఎన్నుకొను పద్ధతి.

ఏకబంధము సం. వి. (రసా.) అణువులలో పరమాణువులను పరస్పరము బంధించే సాధనము.(రెండు పరమాణువులకు మధ్య

ఒకేబంధ మున్నపుడు దానిని ఏకబంధ మందురు. (Single bond).

**ఏకబీజదళయుతములు** నం. వి. (వృక్ష.) గింజలలో ఒకటే బీజదళముగల మొక్కలు (Monocoty-ledonous plantsor mono cotyledons, ormonocots.)

**ఏకబీజస్ఫోటము** నం. వి. (వృక్ష.) శుష్కఫలమై, అవిదారణఫలమై, లోపల ఒకే గది, ఒకేగింజకలదై. ఊర్ధ్వ త పక్వాస్థి ఫలదళ, అండాశయమునుండి బయలుదేరిన ఫలము (Achene).

**ఏకభిత్తికగోళము** నం. వి. (జం.) ఫలదీకరణమైన తరువాత అండము అభివృద్ధిపొందు దశలలోనిది యొకటి, లోపల బోలుగా నుండి, చుట్టును ఒక జీవకణము మందము గల గోడతో గోళాకారముగా నున్నదశ (Blastula).

**ఏకభిత్తికాకుహరము** నం. వి. (జం.) ఏకభిత్తిక గోళములో నున్నతొఱ్ఱ(Blasto-cocle).

**ఏకభుజి** నం. విణ. (వృక్ష.) ఏకశాఖ (Uniparous).

**ఏకము** నం. సర్వ. 1.ఒక్కటి, 2.ముఖ్యము. 3. అసహాయము. 4., అద్వయము.

**ఏకరూప** నం. వి. (గణి. భౌతి.) మార్పులేని (Uniform).

**ఏకరేఖాకోణము** నం. వి. (గణి.) రెండు సమకోణములకు సమానమగు కోణము.

**ఏకరేఖాస్థితము** నం. వి. (గణి.) మూడు కాని అంతకంటె ఎక్కువకాని బిందువులు ఒక సరళరేఖపై నుండుట (Colinear)

**ఏకరేఖీయములు** నం. విణ. (గణి.) ఒకే ఋజురేఖపై నున్నవి (బిందువులు).

**ఏకలక్షణసంకరజీవి** నం. వి. (జీవ.) ఒక లక్షణములో తేడా యున్న తలిదండ్రుల సంతానము (Monohybrid).

**ఏకలము** నం. విణ. అసహాయ వి. ఊరి పంది (ఇది దేశ్యపదముగా గూడ వాడబడుచున్నది. కాని పూర్వకవిప్రయోగము మృగ్యము).

**ఏకలవణాధారీయము** నం. విణ. (రసా.) లవణాధారముచే ప్రతిస్థాపింపబడుటకు యోగ్యమగు ఒకే ఒక ఉదజని పరమాణువుగల (ఆమ్లము). (Monobasic)

**ఏకలసూత్రములు** నం. వి. (జీవ.) క్రోమొసోముల యొక్క సగము భాగము (Chromatids).

**ఏకలింగ (పుష్పములు)** నం.విణ. (వృక్ష.) పురుషభాగములు గాని, స్త్రీభాగములు గాని ఏవో ఒకటి మాత్రమే కల (పుష్పములు), (Unisexual flowers).

**ఏకలింగి** నం. విణ. (వృక్ష.) మగపువ్వులు ఒకమొక్కమీదను ఆడపువ్వులు మరియొక మొక్క మీదను గల (మొక్క) (Diocicous).

**ఏకలీఁడు** వై. వి. అడవిపంది, వరాహము. నం. ఏకలః.

**ఏకవర్ణకాంతి** నం. వి. (భౌతి.) ఒకేరకపు రంగుగల వెలుతురు కిరణముల నిచ్చు కాంతి(Mono-chromatic light), ఉదా. బున్సెన్ దీపముతో పెట్టిన సోడియం లవణము ఒక పసుపుకాంతినే ఇచ్చును.

**ఏకవర్ధ్యక్షీయము** నం. విణ. (వృక్ష.) ప్రధానాక్షము పుష్పముతో అంతముగాక, అది పొడవుగా పెరుగుచు ప్రక్కలనుండిపుష్పములుగాని శాఖలుగాని బయలుదేరునట్టిది (Racemose).

**ఏకవర్ధ్యాక్షము** నం. వి. (వృక్ష.) మధ్యాభిసారి (Raceme).

**ఏకవార్షికము** నం. వి. (వృక్ష.) ఒక ఋతువుగాని, ఒక సంవత్సరముగాని పెరిగి చచ్చిపోవు మొక్క (Annual).

**ఏకవిదారణఫలము** సం. వి. (వృక్ష.) శుష్క ఫలములలో ఇది యొకరకము. ఇది ఎండిన తరువాత ఒక సేవని (Suture) పైనే పగులును (Follicle). ఉదా.జిల్లేడు మొ.

**ఏకశాఖి** సం. వి. (వృక్ష) (Monochasium) చూ. ఏకశాఖీయమధ్యారంభమంజరి.

**ఏకశాఖీయమధ్యారంభమంజరి** సం. వి. (వృక్ష) ఈ మాదిరి పుష్పగుచ్ఛములో పుష్పదండముచివర నొక పుష్పముండును దాని ప్రక్కనుండి ఒక కొమ్మ మాత్రమే బయలుదేరి ఒకపుష్పముతో అంతమగును మరల దాని ప్రక్క ఒకకొమ్మ మాత్రమే బయలుదేరును (Monochasial cyme).

**ఏకసంమితీయము** సం. విశ. (వృక్ష.) ఒక అక్షము పైననే రెండు సమాన భాగములుగ విభజించుటకు వీలగు నట్టిది (పుష్పము) (Zygomorphic.)

**ఏకసంయోజకము** సం. విశ. (రసా.) ఒకే ఉదజని పరమాణువుతో సంయోగించగల మూలద్రవ్య పరమాణువు యొక్క స్థితి గలది. ఇట్లే ద్వి, త్రి, చతుః, పంచ మొ. వానితోడి సమాసములను బోధపరచు కొనునది(Monovalent or univalent)

**ఏకసంయోజనీయము** సం. విశ. (రసా.) ఒకే ఒక్క ఉదజనితో సంయోగించ గలది లేదా ఒకే ఒక ఉదజని స్థానమును స్వీకరించగలది. (Monovalent).

**ఏకసంలగ్నము** సం.వి. (వృక్ష) కింజల్కము లన్నియు వాని కేసరములతో కలిసి ఒకే కట్టగా నున్న స్థితి. (ఫ ప్పొడితిత్తులు విడి విడిగా నుండును) (Monadelphous).

**ఏకస్పర్శపద్ధతి** సం. వి. (భౌతి.) ఉక్కు కడ్డీని అయస్కాంతముగా మార్చు పద్ధతులలో ఒకటి (Single touch method)

**ఏకస్వము** సం. వి. క్రొత్తగా కనిపెట్టిన యంత్రము మొదలగువానిపై ప్రభుత్వము ఇచ్చు హక్కుపత్రము (Patent).

**ఏకాంకము** సం. వి. 1. (రసా.) కొలతలకు ప్రమాణముగా తీసికొనబడు రాశి(Unit) 2. (భౌతి.) ఏదేని వస్తువు యొక్క పరిమాణమును కొలుచుటకు ఉపయోగించు ప్రమాణము (Unit)

**ఏకాంగి** సం. వి. విరక్తుడగు విష్ణుభక్తుడు. విశ. ఒంటివాడు,

**ఏకాండము** వై. విశ. అతుకులేనిది. సం. అఖండమ్.

**ఏకాంతము** సం. విశ. 1. మిక్కిలి, 2. ఇద్దరకంటె ఎక్కువ జనములేనిది (చోటు). 3. రహస్యము.

**ఏకాంతరము**[1] సం.వి (భౌతి., రసా., గణి.,) ఒకటి విడిచి ఒకటి (Alternate). (వృక్ష) ఒక్కొక్కచోట ఒక్కొక్కటి మాత్రమే కలది (Alternate)

**ఏకాంతరము**[2] సం. విశ (గణి.) వస్తువుల వరుసలో ఒకదాని తరువాతిది కాక మూడవది (Alternate)

**ఏకాంతర కోణములు** సం. వి. (గణి.) రెండు సరళరేఖలను ఒక తిర్యగ్రేఖ ఖండింపగా ఏర్పడు కోణములలో రెండు రేఖల మధ్యను తిర్యగ్రేఖకు ఇరువైపుల నుండు కోణములు (Alternate angles).

**ఏకాంతరానుపాతము** సం. వి. (గణి.) $a : b = c : d$ అలున $a : c = b : d$ అను దానిని ఏకాంతరానుపాత మందురు (Alternando).

**ఏకాకి** సం. విశ. 1. అసహాయుడు. 2. ఒంటరి. 3. ఏకాంగి.

**ఏకాక్షము** సం.వి. 1. కాకి 2. ఒక కన్నుగలది.

**ఏకాణుకము** సం. విశ. (రసా.) ఒక అణువునకు పర్యాప్తమైనది(Mono-molecular) ఒక అణువుతో సంబంధించినది (Unimolecular).

**ఏకాదశము** సం. సర్వ. పదునొకండు. విశే. పదునొకండవది.

**ఏకాదశి** సం. వి. 1. పదునొకండవ తిథి. 2. పదునొకండు తంత్రులుగల పరివాదిని యను వీణ.

**ఏకాధిపత్యము** సం. వి. (పరి. రాజ.) ఏక శాసనము, ఒకడే అధిపతిగా నుండుట, ఒక రాజకీయపక్షమువారు ఇతర రాజకీయ పక్షములకుగాని, వారి ప్రతినిధులకు గాని తావీయక, తామే సర్వాధికారములతో ప్రభుత్వము నడుపుట (Totalitarianism).

**ఏకామ్లికము** సం. విశే. (రసా) ఒకే ఒక ఉదజనిని. ఒక ఆమ్లమునుండి తొలగించి దాని స్థానమున ప్రవేశించగలది (లవణాధాగము) (Monacidic).

**ఏకావళి** సం. వి. 1. ఒంటిపేటహారము. 2. (అలం.) ఒక అర్థాలంకారము.

**ఏకాహము** సం. వి. 1. ఒకదినము. 2. మృతినొందిన వానికి పదునొకండవ దినమున జేయు శ్రాద్ధము. 3. ఒక రోజున జేయు ఉత్సవము.

**ఏకీకరణము** సం. వి. ఒకటిగా చేయుట.

**ఏకీభావము** సం. వి. ఐక్యము, ఒకటియగుట.

**ఏకుడు** వి. ఏకుట.

**ఏకై** సర్వ. ఏయమ. ఏమె.

**ఏకైకము** సం. విశే. అద్వితీయమైనది. వేఱొకదానిని పోలియుండనిది (Unique)

**ఏకోత్తరాంశములు** సం. విశే. (గణి.) 1, 2, 3, 4, 5... ఈ వరుసలో మనము వ్రాయు అంకెలు (Natural numbers.) (ఈ వరుసలో సమీప సంఖ్యల భేదము) '1' కనుక వీనికి ఏకోత్తరసంఖ్యలని పేరు.

**ఏగాని** వి. టుగ్గాని.

**ఏగు** క్రి. 1. పోవు. 2. ఉత్సవములలో తిరుగు. 3. ఊరేగు.

**ఏగుదెంచు** క్రి. (ఏగు+తెంచు). 1. వచ్చు. 2. పోవు, రూ. ఏతెంచు.

**ఏగుపెండ్లి** వి. పెండ్లి యూరేగింపు.*

**ఏగురు** సర్వ. ఐదుగురు. రూ. ఏవురు.

**ఏచ** విశే. 1. గ్రామ్యము. 2. వంకర, రూ. ఏవ.

**ఏచేకంకటిమెక్క** వి. ఉత్తరాషాఢా నక్షత్రము.

**ఏచు** క్రి. 1. అతిశయించు. 2. విజృంభించు. 3. పెరుగు. 4. ఏసరేగు.

**ఏజంట్** ఇం. వి. (Agent) ప్రతినిధి, ఒకరికి బదులుగ లేక ఒకరితరఫున పనిచేయు అధికారమును పొందిన వ్యక్తి.

**ఏట** వి. పక్షము, ప్రక్క. విశే. అతిశయము. రూ. ఏటము.

**ఏటవాలు** వి. 1. పక్షపాతము. 2. వంపు.

**ఏటికపాము** వి. చూ. ఎమిడిక.

**ఏటికోళ్లు** వి. (ని. బహు.) నమస్కారములు.

**ఏటిరింత** వి. భరద్వాజపక్షి. రూ. ఏట్రింత.

**ఏటిఱేఁడు** వి. (ఏరు+ఱేఁడు) సముద్రుడు. సరిత్పతి.

**ఏటు** వి. 1. దెబ్బ. 2. బాణప్రయోగము.

**ఏటులాడు** క్రి. (ఎటులు+ఆడు) ఆయుధములతో పోరాడు.

**ఏట్రింత** వి చూ. ఏటిరింత.

**ఏడ** వి. ఎక్కడ.

**ఏడక** సం. వి. గొఱ్ఱె.

**ఏడకము** సం. వి. పొట్టేలు

**ఏడాగోడము** విశే. విరుద్ధము. రూ. ఏడాకోడము.

**ఏడాటలాడించు** క్రి. 1. సప్తవ్యసనములు కలిగించు. 2. మిక్కిలి శ్రమపెట్టు.

**ఏడికవై.** వి. చూ. ఏడకము.

**ఏడికోల** వి. (వ్యవ.) నాగలిలో నాగటి దుంపను మేడిని కలిపియుంచు పొడవైన భాగము (Shaft).

ఏడు సర్వ. ఆరునొకటి.
ఏడుఁడు నం. విఙ చెవిటివాడు.
ఏడుగడ విఙ. (ఏడు+కడ) గురువు. తల్లి, తండ్రి, పురుషుడు, విద్య, దైవము, దాత అని ఏడువిధము లైన రక్షకము. రూ ఏడ్గడ.
ఏడుగురు సర్వ. ఏడుమంది.
ఏడుచు క్రి. దుఃఖించు, రోదనముచేయు. రూ. ఏడ్చు.
ఏడుపు వి. రోదనము. రూ. ఏడ్పు.
ఏడ్గడ వి. చూ. ఏడుగడ.
ఏడ్చు క్రి. చూ ఏడుచు.
ఏడ్తెఱ వి 1. అతిశయము. 2 పరాక్రమము. 3 విజృంభణము
ఏడ్పు వి., చూ. ఏడుపు.
ఏణము నం. వి. పెద్ద కన్నులుగల నల్లజింక.
ఏణి నం. వి. పెద్దకన్నులు గల నల్ల ఆడు లేడి, జింక.
ఏతఁడు సర్వ. ఎతడు.
ఏతము[1] వై. వి. (వ్యవ.) నీటిని తోడుటకు ఉపయోగించు ఒక విధమగు సాధనము. రూ.ఏతళము.(Piccotah).నం యంత్రమ్.
ఏతము[2] నం. వి. చిత్రవర్ణము. విఙ. చిత్ర వర్ణము కలది.
ఏతరి విఙ. దుర్ణయపరుడు, కుజనుడు.
ఏతాము వై. వి. చూ. ఏతము.
ఏతు వి. ఉద్ధతి, గర్వము.
ఏతెంచు క్రి. చూ. ఏగుదెంచు.
ఏది సర్వ. ఎది.అవ్య. అట్లు ఎక్కడనున్నది. నీకు పౌరుష మేది? (ఇది 'ఏదీ' అని దీర్ఘాంతముగా నుండవచ్చును).
ఏదు[1] క్రి. నశించు. వి. ముండ్లపంది.
ఏదు[2] వై. క్రి. పెంచు, పోషించు. నం. ఏధనమ్.
ఏధ నం. వి. (వృక్ష.) వర్ధకావళి, వాహినీ పుంజములో దారువునకు, అధోవాహికి మధ్యనుండి ప్రతిభాజికణములతో ఏర్పడిన పట్టివంటి భాగము.(ఇది సామాన్యముగా ఏకబీజదళయుతము అగు మొక్కలలో నుండదు) (Cambium).
ఏనాదము వి. సముద్రతీరము.
ఏనాది వి. 1. ఒక కులము. 2. ఆకులము లోనివాడు.
ఏనాళ్ళు వి. (ఏను+నాళ్ళు) 1. అయిదు దినములు. 2. వివాహమైన పిదప పంప బడు సారె.
ఏని అవ్య. పక్షాంతరమును అనిశ్చయమును తెలుపును.
ఏనిక వై. వి. దంతి, ఏనుగు. నం. అనేకపః.
ఏనికదిండి వి. సింహము. వ్యు. ఏనుగు తిండిగాగలది.
ఏనికవోమ వి. ఒకతెగ పెద్దదోమ, ఘోణిక.
ఏను సర్వ. 1. అయిదు. 2. నేను యొక్క రూపాంతరము.
ఏనుఁగు వై. వి., చూ. ఏనిక. విఙ. పెద్దది, రూ. ఏన్గు.
ఏనుఁగుకాలు వి. కాలు లావగు వ్యాధి, బోదకాలు (Elephantiasis).
ఏనుఁగుగజ్జి వి. మూగగజ్జి (Eczema).
ఏనుఁగుగొంగ వి. సింహము. వ్యు. ఏన్గులకు శత్రువు.
ఏనుఁగుపల్లేరు వి. పెద్దపల్లేరు.
ఏనుఁగుపాఁడి వి. అమితమైన ఈవి.
ఏనుఁగుమోముసామి వై. వి. గజాననుడు. రూ. ఏనుగుమొగముసామి.
ఏనుఁగురాకాసిగొంగ వి. గజాసురవైరి, శివుడు.
ఏనుఁగుసొరము వి. సప్తస్వరములలో ఏడవది. నిషాదము.
ఏనూఱు సర్వ.(ఏను+నూఱు)ఐదువందలు.
ఏపరించు క్రి. దుఃఖపరచు, బాధించు.

ఏపారు క్రి. (ఏపు+ఆరు) 1. అతిశయించు. 2. అధికమగు. 3. విజృంభించు. 4. ఒప్పు 5. శోభిల్లు.

ఏపు వి. 1. ఆధిక్యము. 2. ఔద్ధత్యము. 3. గర్వము. 4. విలాసము. 5. మదము.

ఏపుమాపు క్రి. (ఏపు+మాపు) 1. ఓడించు, 2. చంపు.

ఏపురేగు క్రి. (ఏపు+రేగు) చెలరేగు.

ఏపె[1] వి. నల్లమద్ది.

ఏపె[2] సర్వ. (ఏ+ఆపె) ఏయమ, ఏస్త్రీ.

ఏమఱపాటు వి. 1.పరాకు. 2.ప్రమాదము. విశ. 1. అకస్మాత్తుగా. 2. వంచనగా. రూ. ఏమఱుపాటు.

ఏమఱిలు క్రి. 1. ఏమఱు. 2. ఉపేక్షించు. 3. మఱచు. రూ. ఏమరిల్లు.

ఏమఱు క్రి. ప్రమాదపడు, ఉపేక్షించు, మరచు, ఏమరిలు, ఏమరిల్లు.

ఏమఱుపాటు వి. చూ. ఏమఱపాటు.

ఏమఱుచు క్రి. ఏమరజేయు, రూ ఏమాఱుచు.

ఏమి సర్వ. ఏ. ఏది. అవ్య. ప్రశ్నార్థకము (ఏమిటి). రూ. ఏమీ.

ఏమిదములు వి. (రసా.) చెట్టుచేమలలో ఏర్పడు ఒకవిధమగు సేంద్రియ పదార్థములు. (వీనిలో కర్బనము, ఆమ్లజని, ఉదజని, నత్రజని ఉండును. (Amides).

ఏమి అవ్య. చూ. ఏమి.

ఏమె సర్వ. ఏ పూజ్యురాలు,

ఏయిర్ అటాషె ఇం. వి. (Air-attache). వైమానిక సహకారి,

ఏయిర్ కమాడోర్ ఇం.వి. (Air-commmodore) వాయుసేనాపతి.

ఏయు క్రి. (బాణము) ప్రయోగించు, (బాణముతో) కొట్టు.

ఏరండము సం. వి. ఆముదపుచెట్టు.

ఏరాది వి. ఒకదాని సంతతియైన గుత్తము.

ఏరాలు వి. తోడికోడలు.

ఏరాళము వై. విశ. 1. అధికము. 2. అసంఖ్యము. సం. హేరాళమ్.

ఏరియోలర్ టిస్యూ ఇం. వి (జం.)(Areolar tissue) ఇది ఒకరకపు సంధాయక కణజాలము.

ఏరు వి. 1. ఎద్దులనుగట్టి దున్నుటకు సిద్ధపరచిన నాగలి. 2. తలనొప్పి.

ఏరుగు క్రి. విష్ఠించు, మలము విడుచు. వి. విష్ఠ.

ఏరుపడు క్రి. 1.వేరుపడు. 2. తేటపడు. 3. బయలుపడు. 4, నిర్ణయింపబడు. 5. సిద్ధపడు. రూ. ఏర్పడు.

ఏరుపాటు వి. 1. నిర్ణయము. 2. నియమము. 3. వివరణము. 4.భేదము. రూ. ఏర్పాటు.

ఏరువాక వి. ఏటేట చేయు మొదటిదుక్కి.

ఏర్చు క్రి. 1. ఏర్పరచు. 2. తలనొచ్చు. 3. కాల్చు. 4. చక్కబరచు.

ఏర్పడు క్రి. చూ. ఏరుపడు.

ఏర్పాటు వి. చూ. ఏరుపాటు.

ఏర్పు వి. 1. మంట. 2. బాధ.

ఏఱు క్రి. 1. క్రింద నున్న వానిని ఒకటొకటిగ నెత్తు. 2. ఎంచు, గణించు, వి. నది.

ఏఱువ వి. దేశము. సీమ.

ఏల[1] వై. వి. 1. ఒక పాట, దీనినే ఏలే రందురు. 2. ఒకవిధమైన పాట(ఏలపాట.) సం. హేలా.

ఏల[2] అవ్య. ఎందులకు. రూ. ఏలా, వలదు, కూడదు,అనావశ్యకము అను అర్థములను దెలుపును.

ఏకిల వై. వి. ఏల, ఏలకితీగ.

ఏలకికాయ వి. 1. ఒక భక్ష్యము. ఏలకితీగ కాయ.

ఏలకులు వై. వి. పసుపు కుటుంబము (Zingiberaceae)నకు చెందిన Elettaria

cardamamum అను మొక్క యొక్క పండ్లలోని గింజలు. (ఇవి పరిమళద్రవ్యములుగ ఉపయోగించును). (Cardamomum.)

ఏలము[1] హిం. వి. వేలము, అమ్మకములో ఒక విధము రూ. ఏలాము.

ఏలము[2] వై. వి. కల్లుగీచువాడు ఆతోపునందు వేసికొనెడి గుడిసె.

ఏలముపట్టు వి. ఆలంబనము, ఊత.

ఏలా అవ్య., చూ ఏల[2]

ఏలాము వి. చూ. ఏలము.[1]

ఏలి విశే. కృత్రిమమైనది.

ఏలిక వి. 1. రాజు. 2. యజమానుడు

ఏలికపాము వి. (జం.) మనుష్యుల ప్రేగుల లోని పరాన్నజీవి (6-12 అంగుళముల పొడవుండును). (Round worm).

ఏలికసాని వి. దొరసాని, రాణి.

ఏలిదము వి. చులుకదనము. విశే. చులుకనిది. రూ. ఎల్లిదము.

ఏలినవాఁడు వి. ఏలిక, రాజు.

ఏలియన్లు ఇం. వి.(పౌర., రాజ.) (Alians) పరదేశీయులు, తాత్కాలికముగ ఒక రాజ్యమందుండి, వేరొక రాజ్యములో పౌరసత్వముగలవారు. తాత్కాలికముగ నున్న రాజ్యమందు వారికి కేవలము సివిల్ హక్కులు మాత్రముండును. రాజకీయపు హక్కు లుండవు.

ఏలు క్రి. 1. పరిగ్రహించు. 2. పాలించు.

ఏలుకోట మి. వి. ఏలుబడికి లోబడిన జనము.

ఏలుబడి వి. పరిపాలనము. రూ. ఏల్బడి.

ఏల్బడి వి. చూ. పై.

ఏవ వి. రోత. విశే. రోతయైనది. రూ. ఏవము.

ఏవగించు క్రి. 1. రోతపడు. 2. నిందించు. 3. విడుచు.

ఏవగింపు వి. రోత.

ఏవము వి., విశే. చూ. ఏవ.

ఏవల వి. ఏ ప్రక్క. రూ. ఎవ్వల.

ఏవాఁడు సర్వా. ఎవ్వఁడు.

ఏవారు సర్వా. ఎవ్వరు.

ఏవురు సర్వా ఐదుగురు. రూ. ఏగురు.

ఏషణి సం. వి. 1. నారాచి, 2. త్రాసు. 3. వ్రణములోని చీము., మొ. ని పైకి తీయు సాధనము.

ఏష్యము సం. విశే. 1. కాగలది. 2. పొందదగినది, కోరదగినది.

ఏస వి. విజృంభణము విశే. 1. గ్రామ్యము. 2. వక్రము. రూ, ఏచ.

ఏసరు క్రి. మీరు, అతిశయించు.

ఏసి అవ్య. 1. కొలది. 2. వంతువ. పరిమాణార్థక ప్రత్యయము. ఉదా. ఇంతలేసి, మూడేసి.

ఏహ్యము వై. వి. ఏవము, విశే. రోత పుట్టించునది. సం. హేయమ్.

# ఐ

ఐ అచ్చులలో ఒకటి. ఆకర్షింపును పిలుచుటను తెలుపును. అవ్య. అయి, అగుధాతువు యొక్క క్త్వార్థకరూపము.

ఐంగుదము సం. విశే. ఇంగుదీ వృక్షసంబంధమైనది. వి. 1. గారపండు. 2. గారపువ్వు

ఐందవము సం. విశే. చంద్రుని సంబంధమైనది. వి. 1. చాంద్రమాసము. 2. చాంద్రాయణ వ్రతము.

ఐందవి సం, వి. పలుకుచెలి. సరస్వతి.

ఐంద్రజాలికుఁడు సం. విశే.1. ఇంద్రజాలము చేయువాడు. 2. మోసగాడు.

ఐంద్రము సం.వి. 1.మాలకాకి. 2.(జ్యోతి.) ఒకానొక పంచాంగ యోగము. విశే. ఇంద్రునకు సంబంధించినది.

ఐంద్రి సం.వి. 1. జయంతుడు. 2. అర్జునుడు. 3. ఇంద్రుని భార్య. 4. జ్యేష్ఠానక్షత్రము 5. తూర్పు.

ఐంద్రుడు సం. విణ. ఇంద్రపుత్రుడు వి. 1. జయంతుడు. 2. అర్జునుడు. 3. వాలి.

ఐ-ఓ-యు ఇం. (అర్థ.) "నేను నీకు బాకీ" అని తెలుపు ఋణపత్రము. (I. O. Y = I owe you).

ఐకకంఠ్యము సం. వి. 1. ఏకకంఠత్వము. 2. ఒద్దిక.

ఐకమత్యము సం, వి. 1. ఏకమతిత్వము. ఒద్దిక.

ఐకాహికము సం. వి. 1. ఒకేదినమున సాధ్యమైనది(యాగము). 2.ఒకదిన ముండునది.

ఐక్యము సం. వి. ఏకీభావము,' మైత్రి

ఐక్యరాజ్యము సం. వి. (రాజ.) ప్రభుత్వాధికారములన్నియు ఒక చోట కేంద్రీకరింపబడిన రాజ్యము. (Unitary-state)

ఐక్యరాజ్యసమితి సం. వి. (చరి. రాజ.) రెండవ ప్రపంచయుద్ధానంతరము, మిత్ర రాజ్యముల కూటమివారు "డంబార్కటన్ ఓక్స్" సమావేశములో, భవిష్యత్ప్రపంచ సమస్యలు శాంతియుతముగా పరిష్కరించుటకు, యుద్ధమును అరికట్టుటకు, ఒక అంతర్జాతీయ సంస్థ నెలకొల్పవలె నని నిశ్చయించిరి.తత్ఫలితముగఐక్యరాజ్య సమితి క్రీ. శ. 1945లో "సాన్ ఫ్రాన్సిస్కో" నగరమున స్థాపించబడినది.ఐక్యరాజ్యసమితి ముఖ్యోద్దేశములు- అంతర్జాతీయశాంతిభద్రతలను కాపాడుట. మానవహక్కులందును, గౌరవమర్యాదలందును, స్త్రీ పురుషాదుల యొక్కయు, చిన్న పెద్ద జాతుల యొక్కయు సమాన హక్కులను విశ్వాసములను పునరుద్ధరించుట, ప్రజానీకము యొక్క సమానమైన హక్కులు స్వయంనిర్ణయ సూత్రముల సాధారముగ, తీసికొని వివిధమానవజాతులలో స్నేహభావమును పెంపొందించి, ప్రపంచశాంతిని బలపరచుట, న్యాయము, సంధిఒడంబడికలు,అంతర్జాతీయ నిర్ణయములు అమలు జరుపుటకు వలయు పరిస్థితులను కల్పించుట. విశాలమగు స్వాతంత్ర్యముతో మానవకోటిసాంఘికాభివృద్ధి జీవితప్రమాణములను పెంపొందించుట, ప్రాపంచిక ఆర్థిక సాంఘిక వైజ్ఞానిక సమస్యలను పరిష్కరించుటలో అంతర్జాతీయసహకారమును సమకూర్చి, జాతిలింగభేదములు లేకయే, ఎల్లమానవులకు జీవితమునకు సంబంధించిన హక్కులు, ప్రాథమికస్వత్వములు చేకూరుటకు తగిన ప్రోత్సాహము కలుగజేయుటకు పాటుపడుట. ఈ ఉద్దేశములు సాధించుటకు వివిధజాతులుచేయు పనులను క్రోడీకరించు కేంద్రముగ వ్యవహరించుట. ఐక్యరాజసమితికి ఇతర దేశముల అంతరంగిక విషయములలో కలుగజేసికొనుటకు అధికారము లేదు. స్వరక్షణార్థమై ప్రతి రాజ్యమునకు స్వతంత్రముగా గాని, ఉమ్మడిగా గాని చర్యతీసికొనుటకు అధికారము లేదు.

ఐక్యరాజ్యసమితి-ఆర్థికసాంఘికసభ సం. వి. (చరి., అర్థ.) ఐకరాజ్యసమితి ఆర్థిక సాంఘికసభకు సాధారణ సభనుండి పదునెనిమిది సభ్యులు ఎన్నిక అగుదురు. అంతర్జాతీయ సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, ఆరోగ్యాభివృద్ధి సాధించుట వీరి ముఖ్యలక్ష్యము, మానవస్వత్వములను, పత్రికాస్వాతంత్ర్యమును స్త్రీలహక్కులను కాపాడుట, జాతి మతవిచక్షణలేకుండ చూ ుట వీరికర్తవ్యము.ఏదేశమైనను వీని విరుద్ధముగా నడిచినచో వీరు ఐక్యరాజ్య సమితి దృష్టికి తేవచ్చును లేదా ఆదేశమునకు

ఉచితమైనసలహా ఈయవచ్చును. (UNESCO=United Nations Educational Social and Cultural Organisation)

ఐక్యరాజ్యసమితి - ఆహారవ్యవసాయసంస్థ నం. వి. (చరి., రాజ.) ఐక్యరాజ్యసమితి సభ్యదేశములలో ఆహార ఆర్థిక వ్యవస్థలను అభివృద్ధిచేయుట కొరకు గ్రామీణ ప్రజలకు, రైతులకు, వ్యవసాయ రంగములో ఉచితమైన సలహాల నిచ్చుటకు తగిన సహాయము చేయుటకు ఐక్యరాజ్య సమితి ఈ సంస్థను క్రీ.శ. 1956 సం. లో స్థాపించెను.

ఐక్యరాజ్యసమితి ధర్మాధికారసభ నం. వి. (చరి.,రాజ.) ధర్మాధికారసభ, మా. అధి దేశ రాజ్యము, అధి దేశ రాజ్య ప్రదేశములు.

ఐక్యరాజ్యసమితి సాధారణసభ నం. వి. (చరి., రాజ.) సంయుక్త జాతుల మహాసభ, ఐక్యరాజ్యసమితి ముఖ్యాంశములలో ఒకటి.అంతర్జాతీయ శాంతి భద్రతల విషయములో తప్ప తక్కిన అన్ని విషయములలో ఈ సభకు సర్వాధికారములు గలవు. దీనియందలి ప్రతి సభ్యునికి ఒక వోటు ఉండును.ఐక్యరాజ్యసమితి ముందు కొనితేబడిన ఏ సమస్య అయినను చర్చించుటకు ఈ సభకు అధికారముకలదు. ఈ సభ సంవత్సరమునకొకసారి సెప్టెంబరు నెలలో సమావేశమగును. అవసరమయినచో అత్యవసరపరిస్థితులలో ఎప్పుడైనను సమావేశమగును.

ఐక్షవధనువు నం. వి. చెరకువిల్లు.

ఐక్షవము నం. విశే. చెరకుసంబంధమైనది. వి. 1. చక్కెర. 2. చెరకునుండి తీసిన మద్యము.

ఐక్ష్వాకుఁడు నం. విశే. ఇక్ష్వాకు వంశమున బుట్టినవాడు.

ఐచ్ఛిక కండరములు నం. వి. (జం.) ఇచ్ఛాకండరములు ఇష్టము వచ్చినప్పుడు పనిచేయు కండరములు, ఉదా. చేయి, కన్ను, కాలు మొ. వాని కండరములు (Voluntary muscles).

ఐటర్ ఆం. వి. (జం.) (Iter) మస్తిష్కము లోని మూడవ కుహరమును నాలుగవ కుహరముతో కలుపు సన్నని మార్గము.

ఐణము నం. వి. ఏణము (ఇఱ్ఱి) యొక్క తోలు, మాంసము మొ. వి. (జింక మాంసము, లేడిమాంసము, దుప్పి మాంసముఐణముఅనబడును)(Venison).

ఐణేయము సం. విశే. ఏణి యొక్క తోలు, మాంసము మొ. కి సంబంధించినది.

ఐతరేయము నం. వి. ఒక బ్రాహ్మణము.

ఐతి విశే. శక్యము. రూ. అయితి.

ఐతిహాసికుఁడు నం. వి. 1. ఇతిహాసము తెలిసినవాడు. 2. చరిత్రకారుడు.

ఐతిహ్యము నం. వి. 1. పారంపర్యముగా వచ్చిన ఉపదేశము. 2. అనాదిప్రవాద.

ఐదార వి. అగ్ని.

ఐదు సర్వా. నాలుగునొకటి, అయిదు.

ఐదువదిచేయు క్రి 1. నమస్కరించు. 2. ఖండించు. 3. ఓడిపోవు.

ఐదుమోముల వేలుపు వి. పంచముఖుఁడు, శివుడు. రూ. అయిదుమోముల వేలుపు.

ఐదువ వి. ఐదు వన్నెలు కలది (మంగళసూత్రము, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు ఈ ఐదువన్నెలు సుమంగళి చిహ్నములు). జీవ భర్తృక, సౌభాగ్యవతి. రూ. ఐదువరాలు.

ఐద్దాయులు వి. (ఐదు + దాయులు)వఢ్రి కుమ్మరి, కంచరి, అగసాలె, కాసెకులస్థుల పనులు.

ఐన అవ్య. మా. అయిన.

**ఐనింటివారిబిడ్డ** వి. (జాతి.) సద్వంశమున బుట్టినది.

**ఐనిల్లు** వి. 1. నట్టిల్లు. 2 అంతర్గృహము. 3. మంచికుటుంబము.

**ఐపు** వి. 1. జాడ. 2. నేరము, తప్పు. రూ. అయిపు.

**ఐపోవు** క్రి. ముగియు. రూ. అయిపోవు.

**ఐమచ్చ** వి. లక్షణము, గుర్తు.

**ఐమూల** విశే. మూలవాటు. ఉదా. ఈ యిల్లు ఐమూలగా నున్నది.

**ఐమూలపేలిక** వి. (గృహ) అడ్డము నుండినిలువుకుపట వాలుగా కత్తిరించిన పేలిక, పట వాలు కత్తిరింపు పేలిక (Cross way piece).



ఐమూల కత్తిరింపు పేలిక

**ఐర** వి. కంటితెవులు, నేత్రరోగము. రూ. అయిర.

**ఐరకొను** క్రి. చక్కబడు, సరిపడు, యుక్తమగు. రూ. అయిరకొను.

**ఐరావణము** నం.వి. 1.ఇంద్రుని ఏనుగు(నాల్గు దంతములు కలది.) 2. అమృతము.

**ఐరావతము** నం. వి. 1. వంకరలేని నిడుపైన ఇంద్రధనుస్సు. 2. ఇంద్రునిఏనుగు. 3. మబ్బుమీద వచ్చు మబ్బు. 4, రాజమేఘము. 5. తూరుపుదిక్కేనుగు.

**ఐరావతి** నం. వి. 1. మెరుపుకోల, 2. ఐరావతము యొక్కభార్య అభ్రమువు.

**ఐరేని** వి. పంచవర్ణములతో చిత్తరువులు వేసిన పెండ్లికుండ. రూ. అయిరేని.

**ఐరిస్** ఇం. వి. (జం.) (Iris) కనుపాపలో దృష్టిని క్రమపరచు భాగము.

**ఐరిపు** వి. అగ్ని, నిప్పు

**ఐరేయము** నం.వి. 1. కల్లు, సుర. 2. నూగుదోస. విశే. అన్నముతో సంబంధించినది.

**ఐలబిలుఁడు** నం. వి. 1. ఇలబిలకొడుకు, కుబేరుడు 2. దిలీపుడు.

**ఐలారము** వి. ఒకానొకమూలిక.

**'ఐ'లు** ఇం అవ్య. (శాస) (Ayes). శాసనసభలో ప్రవేశపెట్టిన చట్టమునకు ఔనని (Aye అని) తమ అంగీకారమును సూచించుట.

**ఐలుఁడు** నం. వి. 1. పురూరవ చక్రవర్తి. 2. అంగారకుడు 3. అందగాడు

**ఐలేయము** నం. వి. 1. నూగుదోస, 2. ఒక పరిమళద్రవ్యము.

**ఐవచ్చు** క్రి. అచ్చివచ్చు. రూ. అయివచ్చు.

**ఐశాని** నం. వి. ఈశాన్యదిక్కు.

**ఐశుఁడు** నం. వి. ఈశ్వరునికుమారుడు.

**ఐశ్వర్యము** నం. వి. 1. విభూతి (అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనునవి). 2. ప్రభుత్వము, 3. సంపద.

**ఐసింగ్** ఇం. వి. (గృహ) (Icing) మెత్తని పంచదారపూత, మీగడ మొ. ని కలిపి కేకును అలంకరించుట. (మెత్తగానూరిన బాదాముపిండి రంగు మొ.ని కూడ కలిసి ఐసింగ్‌లో వాడవచ్చును).

**ఐసోలేషన్** ఇం.వి. (Isolation) వేరుచేయుట అంటు వ్యాధి గల రోగులను ఇతరులకు దూరముగా నుంచుట.

**ఐహికము** నం. విశే. ఇహలోక సంబంధమైనది. వ్యతి. ఆముష్మికము.

# ఒ

**ఒ** 1. ఒకఅచ్చు. 2. సందేహార్థకము.

**ఒంకియ** వి. చిలుకకొయ్య. రూ. ఒంకె, ఒంకె వి., మా. పై.

**ఒంజిలి** వి. దుఃఖము. విశే. దుఃఖము కలవాడు. దుఃఖము కలది. రూ. ఒందిలి.

ఒంటరమింటరములు వి. 1. పరుష వచనములు. 2. ఎక్కువతక్కువ మాటలు.

ఒంటరి విశ. 1. ఏకాకి. 2. అసహాయుడైన వంటు. రూ. ఒంటరీఁడు.

ఒంటరికాడు వి. ఒంటియై తిరుగువాడు, ఏకాకి. 2 పంది, ఏకచరము.

ఒంటరీఁడు వి. చూ ఒంటరి.

ఒంటి వి. ఏకాకిత్వము విశ. ఒకటి.

ఒంటింపు వి. 1. అనుకూల్యము. 2. పనుల యేర్పాటు. 3. మైత్రి. 4. సహాయము.

ఒంటికంటిగాము వి. శుక్రుడు.

ఒంటికాఁడు వి. పంది. విశ. 1. వియోగి 2. ఏకాకి. 3. సన్యాసి.

ఒంటికొమ్ముమేలుపు వి. ఏకదంతుడు, గణపతి

ఒంటిపోటు వి. ఏకాంతము.

ఒంటిపోఁగు వి. బలరాముడు, ఏకకుండలుడు

ఒంటిమి వి. 1. వైరము, పగ, 2. అనుకూలతలేమి.

ఒంటియ వి. ఉష్ట్రము, మహాంగము, లొట్టిపిట్ట. రూ. ఒంటె.

ఒంటు క్రి. 1. ఇముడు, అనుకూలించు,

ఒంటెద్దుకాడి వి. (వ్యావ.) ఒక యెద్దు మాత్రమే నాగలి దున్నునపుడు అమర్చు కాడి (One bullock yoke)

ఒంటె వి. చూ. ఒంటియ.

ఒండు సర్వా. 1. ఒకటి. 2. అన్యము,

ఒండునేలలు వి. (భూగో.) పసుపుపచ్చని మట్టితో కూడిన సారవంతమైన నేలలు (Loams).

ఒండె అవ్యా. అటుకానిచో కాని.

ఒండొండ అవ్యా. క్రమక్రమముగా ఒకటి తర్వాత నొకటి.

ఒండ్రుమట్టి వి. (భూగో.) నదీ ప్రవాహము వలన కొట్టుకొనివచ్చి నిల్చిపోయినసన్నని యిసుక మట్టియొక్క మిశ్రమము.

ఒండ్రుమట్టిమైదానము వి. (భూగో.) అప్పుడప్పుడు వరదల మూలముగ కొట్టుకొని వచ్చి కొన్ని అడుగుల మందమున పేరుకొన్న ఒండ్రుమట్టి గల మైదానము.

ఒందిక వి. అనుకూల్యము. రూ. ఒద్దిక, పొందిక.

ఒందిలి వి. దుఃఖము. విశ, దుఃఖము కలవాడు లేక కలది. రూ. ఒంజిలి.

ఒందు క్రి. 1. కలుగు. 2. పొందు. 3 ఒప్పు. 4. చేరు.

ఒక సర్వా. ఏకార్థకము. రూ ఒక్క,ఒకానొక.

ఒకఁడు సర్వా. 1. ఒక మనుజుడు. 2. అన్యుడు. రూ. ఒకొడు. ఒకరుడు, ఒకొరుడు, ఒకపుడు, ఒకొరువుడు, 'వీనికి'క కారద్విత్వములును (క్క) కలవు.

ఒకట అవ్యా. ఏక కాలమున, కూడ. రూ. ఒక్కట, ఒకొటు, ఒక్కొట.

ఒకటి సర్వా. 1 అన్యము. 2. ఒకడు రూ. ఒకొటి, ఒక్కటి. ఒక్కొటి, ఒక్కడు, ఒక్కొడు. సం. ఏకః.

ఒకతె సర్వా, ఒక స్త్రీ. రూ. ఒకటి, ఒకతుక. ఒకతె, ఒకరిత, ఒకరితి, ఒకరుతుక, ఒకరితె వీనికి'క' కారద్విత్వములుకలవు). ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక అను రేఫతకారసంయుక్తములును గలవు.

ఒకొ అవ్యా. సందేహార్థము. రూ. ఒకో. ఒక్కొ, ఒకొ.

ఒక్కప్రొద్దు వి. వ్రతనియమముచే చేయు ఒకపూట భోజనము. ఉపవాసము.

ఒక్కెఱ వై. వి. ఉగ్రత, కోపభావము. సం. ఉగ్రమ్.

ఒగరు వై. వి. పచ్చివెలగ. పచ్చిదానిమ్మకాయల యచివంటి రుచి. సం. తువరః.

ఒగి అవ్యా. క్రమము . రూ. మొగి.

ఒగుడు వి. జొన్న మొ. ని ఎండిన యాకు.

ఒగుడుకఱచు క్రి. కృశించు, చిక్కిపోవు.

ఒగ్గము వి. అవపాతము, ఏనుగులను పట్టుటకై త్రవ్వబడిన గోయి.
ఒగ్గు క్రి. 1. మొనయు. 2. ఒడ్డు 3. చాచు.
ఒగ్గుపల్లి వి. తతిమెన కొయ్యకు ఆధారముగ నుంచు బల్ల.
ఒచ్చెము వి. 1. న్యూనత, కొరత. 2. అవమానము. విశే. అనుచితము.
ఒచ్చెల అవ్య. సంతాప సూచకము. రూ. ఒచ్చెల్ల, ఓచెల, ఓచెల్ల.
ఒజ్జ వై. వి. 1. ఉపాధ్యాయుడు. 2. పురోహితుడు. 3. యాజకుడు. సం. ఉపాధ్యాయః.
ఒజ్జదనము వై. వి. ఉపాధ్యాయత్వము.
ఒజ్జబంతి వై. వి 1. ఉపాధ్యాయుడు చూపిన పద్ధతి. 2. మేలుబంతి రూ. ఓజబంతి.
ఒజ్జసాని వై. వి. ఒజ్జభార్య.
ఒట్టియ వి. చూ. ఒంటె.
ఒట్టు క్రి. 1. కలుగు. 2. ఉంచు. 3. రగుల్చు అంటించు. వి. శపథము.
ఒడంబడిక వి. (శాస. వాణి.) ఇద్దరి మధ్యకాని ఎక్కువమంది మధ్యకాని న్యాయబద్ధమగు ప్రతిఫలము కల ఒప్పందము. దీనివలన ఒకనికి కొన్ని హక్కులు సంక్రమించుటగాని, లేదా రెండవవాడు తన హక్కులను వదులుకొనుటకాని జరుగును. ఒడంబడిక న్యాయబద్ధ మగుటకు ముఖ్యాంశములు:- సమానాంగీకారము, ప్రతిఫలము కలిగియుండుట, ఒడంబడిక చేసికొను వారికి యోగ్యత కలిగి యుండుట.
ఒడఁగూఁడు క్రి. 1. సిద్ధించు. 2. చేరు. రూ. ఒనగూడు.
ఒడఁబడు క్రి. 1. సమ్మతించు. 2. సంతోషించు. 3. అనుకూలించు.
ఒడఁబడిక వి. అంగీకారము, ఒడబాటు.
ఒడపి వి. గండి, రంధ్రము.
ఒడమి వి. 1. ధనము. 2. భూషణము రూ. ఒడమె.
ఒడయఁడు వి. 1. మగడు. 2. ప్రభువు. రూ. ఒడయుఁడు.
ఒడలు వి. మేను. దేహము. రూ. ఒళ్ళు.
ఒడలిచూపొడయఁడు వి. ఇంద్రుడు.
ఒడి వి 1. తొడ పై భాగము, ఉత్సంగము. 2. బట్టముంగొంగు. 3. పశుయోని.
ఒడిఁబ్రాలు వి. పెండ్లికూతురి ఒడిలోపోసెడి బియ్యము.
ఒడికట్టు క్రి. 1. యత్నించు. 2. పాల్పడు. వి. 1. ఒడ్డాణము. 2. ఒడిపై ధరించిన వస్త్రము.
ఒడికము వి. ఉపాయము. 2 ఇంపు. 3. యుక్తము. 4. అందము విశే. ఇంపైనది.
ఒడిదారము వి. (స్త్రీ) మొలనూలు.
ఒడియు క్రి. 1. కొంచెముపైకెగురు. 2. ఆకర్షించు. 3. ప్రవహించు. 4. కారు 5. వ్యాపించు.
ఒడిసెల వి. రాళ్లు విసరుటకు ఏర్పరచిన త్రాడు, క్షేపణి. బహు ఒడిసెళ్ళు.
ఒడుచు క్రి. 1. ఓడించు, గెలుచు. 2 బాధించు 3. వధించు. 4. అపహరించు. 5. బలాత్కారముగ గ్రహించు.
ఒడుదొడుకు వి. 1. సమముకామి. 2. సంకటము. విశే. విషమమైనది.
ఒడుపు వి. 1. లక్ష్యముపెట్టి దాటిన దాటు. 2. పూనిక. 3. లాభము. 4. అధికము.
ఒడ్డగిల్లు క్రి. 1. ఒరగు 2. అతిశయించు.
ఒడ్డగెడవు వి. ఒకప్రక్క క్రిందికిని మరియొకప్రక్క పైకిని లేచుట.
ఒడ్డణము[1] వి. పందెము. 2. వ్యూహము.
ఒడ్డణము[2] వై. వి. జెత్తము మొ. చే చేయబడిన కేడెము. సం. అందనమ్.
ఒడ్డాణము వై. వి. నడుమునకు ధరించు నగ. సం. ఓడ్యాణమ్.

ఒడ్డారము వి. 1. ద్వేషము. 2. మారొడ్డుట, 3. మౌర్ఖ్యము. రూ. విడ్డూరము.

ఒడ్డారించు క్రి. 1. ప్రతిఘటించు. 2. ద్వేషించు.

ఒడ్డిమె వి. పందెము.

ఒడ్డియ వై. వి. ఓఢ్రదేశీయుడు. రూ. ఒడ్డె. సం. ఓఢ్రః.

ఒడ్డీఁడు వై. వి. 1. ఒడ్డెవాడు. 2. పల్లిటి. కొట్టు పావురము.

ఒడ్డు[1] క్రి. 1. పం. ముమేయు. 2. చాచు, 3. ఉంచు. 4. అడ్డగించు. వి. 1. తీరము. 2. పందెము. 3. వ్యూహము. 4. పూనిక. విణ. 1. స్థూలము. 2. అధికము. 3. విశాలము.

ఒడ్డు[2] సర్వ. అన్యుడు.

ఒడ్డుగుండ్లు వి. (భూగో.) గండశైలములు, కొండనుండి దొర్లు పెద్ద రాళ్ళు.

ఒడ్డె వై. వి. చూ. ఒడ్డియ.

ఒడ్డెనపని వి. ఒకవిధమైన నగ.

ఒడ్డోలగము వి. పేరోలగము, నిండుకొలువు.

ఒత్తగిలు క్రి. 1. ఒరగు, ప్రక్కకొరగు. 2. అంటుకొను. రూ. ఒత్తగిల్లు.

ఒత్తగిల్లు క్రి. చూ. ఒత్తగిల్లు.

ఒత్తడము వి. ఒత్తుడు. విణ. తరచు, ఒత్తు.

ఒత్తడి వి. రాపు, ఒత్తుడు, పీడనము.

ఒత్తరము వి. 1. ముమ్మరము. 2. ఉద్రేకము.

ఒత్తరించు వై. క్రి. 1. మించు. 2. ఆక్రమించు. సం. ఉత్తరణమ్.

ఒత్తిడి వి. (భూగో.) ఒక వైశాల్యముపై పనిచేయు మొత్తము బలము (Thrust).

ఒత్తిలి అవ్య. గట్టిగా.

ఒత్తిల్లు క్రి. చూ. ఒత్తగిల్లు.

ఒత్తు క్రి. 1. పొడుచుకొను, 2. ఒరగు. 3. అదుము. 4. (కాళ్లు) పిసుగు. 5. (శంఖమును) ఊదు 6. బలాత్కరించు 7. నొక్కు 8. తుడుచు. 9. త్రోయు. 10. తీర్చు 11. ఆక్రమించు. వి. 1. అదుముడు. 2. తరచుదనము. 3. ఆక్రమణము. 4. బిడ్డల చేతినగ. విణ. తరచు.

ఒదరు క్రి. 1. విజృంభించు. 2. నిందించు, 3. గర్వించు.

ఒదరుచు క్రి. ఊడదీయు, విడదీయు. రూ. ఒవర్చు.

ఒదలు క్రి. వర్ధిల్లు. రూ. పొదలు.

ఒదవు క్రి. 1. కలుగు. 2. ఉపయోగించు. 3. వర్ధిల్లు 4. లభించు. 5. ఇచ్చు.

ఒదవుబడి వి. ఉపయోగము. విణ. ఉపయుక్తము.

ఒదుఁగు క్రి. 1. తొలగు. 2. దాగు. 3. ఒదికిలు.

ఒదుగు క్రి. సమృద్ధమగు, అధికమగు. వి. సమృద్ధి. విణ. సమృద్ధము.

ఒదుగుబడి వి. సమృద్ధి.

ఒదుపు క్రి. క్రమ్ము. వి. సమృద్ధి. విణ. సమృద్ధము. రూ ఒదుగు.

ఒద్ద వి. సమీపము. చాపు. రూ. వద్ద.

ఒద్దిక వి. నాటక ప్రదర్శనకు చేయు అభ్యాసము. 2. అనుకూల్యము, పోలిక. 3. వినయము. 4. ప్రతిమానమైన పడి, వస్తువునకు సమానమైన తూకపురాయి.

ఒనగూడు క్రి. సిద్ధించు.

ఒనగూర్చు క్రి. సిద్ధించునట్లు చేయు.

ఒరరిక వి. పొందిక. పొంకము.

ఒనరు క్రి. 1. కలుగు. 2. పొసగు. 3. ఒప్పు. వి. 1. ఇంపు. 2. పొందిక. రూ. పొనరు.

ఒనరుచు క్రి. చేయు. రూ. ఒనరించు, పొనరుచు, పొనర్చు, ఒనర్చు.

ఒనర్చు క్రి. చూ. ఒనరుచు.

ఒప్పందము వి. 1. వ్యాపారుల ఒడంబడిక. 2. అంగీకారము.

ఒప్పగించు క్రి. చూ. అప్పగించు.

**ఒప్పనము** వై. వి. అప్పనము, ఒప్పించుట. సం. అర్పణమ్.

**ఒప్పము** వి. 1. సాక్షిచేవ్రాలు. 2. అందము. 3. ఆజ్ఞ.

**ఒప్పమి** వి. 1. తప్పు. 2. కీడు. 3. అనంగీకారము.

**ఒప్పరము** వి. జలదారి, తూము.

**ఒప్పరికము** వి. ఉపేక్ష, ఒప్పరికించు విధము.

**ఒప్పించు** క్రి. ఒప్పగించు, సమ్మతింపజేయు.

**ఒప్పిదము** వి. 1. అందము. 2. అలంకారము. 3. విధము. విశే. 1. మనోజ్ఞము. 2. తగినది.

**ఒప్పు** క్రి. 1. ఒప్పిదమగు, తగు. 2. సమ్మతించు. వి. 1. అందము. 2. తప్పుకానిది. 3. సమ్మతి.

**ఒప్పుకొను** క్రి. సమ్మతించు, అంగీకరించు.

**ఒప్పులాఁడి** వి. చక్కదనముగల స్త్రీ.

**ఒబ్బట్లు** వి. 1. అట్లు. 2. పోళీలు.

**ఒబ్బిడి** వి. 1. పంటనురిపిడి. 2. నాశము. 3. చక్కపెట్టుట.

**ఒమ్మిక** వి. ఇమిడిక, పొందిక.

**ఒమ్ము** క్రి. సరిపడు, వి. బలుపు. స్థౌల్యము. విశే. 1. పెద్ద. 2. క్రొవ్వినది.

**ఒయారము** వి. 1. విలాసము. 2. సౌందర్యము. 3. గర్వము. రూ. ఒయ్యారము. ఓయారము.

**ఒయారి** వి. 1. విలాసిని. 2. సుందరి. విశే. సౌందర్యముగలది. రూ. ఒయ్యారి. ఓయారి.

**ఒయాసిస్** ఇం. వి. (భూగో.) (Oasis) ఎడారులలో సరస్సులు గల ఫలవంతమైన ప్రదేశము.

**ఒయ్య** అవ్య. తిన్నగా. మెల్లగా.

**ఒయ్యన** వి. తిన్నన.

**ఒయ్యారము** వి. చూ. ఒయారము.

**ఒయ్యారి** వి. చూ. ఒయారి.

**ఒర**[1] వి. 1. ఒరపెట్టుట 2. సామ్యము.

**ఒర**[2] వి. (భౌతి.) 1. గూడు. 2. ఒక వస్తువునుంచుటకుసరిగా సరిపోవుగూడు (Socket or sheath).

**ఒరగల్లు** వి. బంగారును ఒరపెట్టు రాయి. నికషము.

**ఒరగు** క్రి. వంగు, వ్రాలు. వి. ఒరగుదిండు, 2. వంపు విశే. వంపైనది, రూ. ఒఱగు, ఒఱపు.

**ఒరగుబిల్ల** వి. ఒరగుదిండు. ఆనుకొనుటకు అనుకూలమైన పెద్దదిండు.

**ఒరపదను** వి. కొంచెము తేమ.

**ఒరపిడి** వి. రాపిడి. రూ. ఒరయిక.

**ఒరయు** క్రి. 1. ఒరబెట్టు. 2. రాచు, రుద్దు, 3. పరీక్షించు. 4. విచారించు. 5. వెదకు.

**ఒరవడి** వి. మేలు బంతి, ఒజ్జబంతి.

**ఒరిగ** వి. నమస్కారము.

**ఒరిమ** వి. ఒద్దిక. ఐకమత్యము. రూ. ఒరిమిక.

**ఒరిమిక** వి. చూ. ఒరిమ.

**ఒరుఁడు** సర్వ. చూ. ఒకఁడు.

**ఒరుదల** వి. కొండెములు చెప్పుట, పైశున్యము.

**ఒరుదలకాఁడు** విశే. కొండీడు, పిశునుడు.

**ఒరుము** క్రి. కలయు.

**ఒరువుఁడు** సర్వ. చూ. ఒకఁడు.

**ఒఱ** వి. 1. గమిసెన. ఖడ్గాదుల నుంచు కోశము. 2. నూతియొఱ — బావులకు మట్టితో చేసి దించిన కట్టడము.

**ఒఱకము** వి. 1. పల్లము. 2. సంకటము.

**ఒఱకటము** వి. 1. సమముకానిది. 2. సంకటము, విశే. విషయము. రూ. ఒఱకాటము. ఒఱగడ్డము.

**ఒఱకాటము** వి. చూ. ఒఱకటము.

**ఒఱగడ్డము** వి. చూ. ఒఱకటము.

**ఒఱగు** క్రి. చూ. ఒరగు.

ఒఱగొడ్డెము వి. మర్యాదమీరిన మాట.
ఒఱటు విశే. మొరకు, దుశ్శీలుడు.
ఒఱపరి విశే. 1. సౌందర్యవంతుడు, ఉపాయశాలి.
ఒఱపిఁడి విశే. అయోగ్యుడు.
ఒఱపు వి. 1. సౌందర్యము. 2. ఉపాయము. 3 యోగ్యత. 4. ధైర్యము. 5. తాపము, 6. ప్రతాపము. విశే. 1. దృఢము. 2. యోగ్యము. 3. విశాలము.
ఒఱలు క్రి. 1. విలపించు, 2. మ్రోగు. రూ. ఓలు.
ఒఱవ విశే. 1. వక్రము. 2. వ్యత్యస్తము. 3. వికృతము.
ఒఱవు క్రి. చూ. ఒరిగు.
ఒఱుబీజము మి. వి. ఒకబీజము వాచి పెద్దదగుట.
ఒఱ్ఱ విశే. కారమైనది. వి. కారము,
ఒఱ్ఱదనము వి. ఒఱ్ఱన, కారము.
ఒఱ్ఱన వి. చూ. ఒఱ్ఱఁదనము.
ఒఱ్ఱియ వి. 1. సాధువుకాని ఆవు. 2. వక్రస్వభావము కలవాడు. విశే. వక్రము. రూ. ఒఱ్ఱె.
ఒఱ్ఱు విశే. పెద్దది, గొప్పది. వి. 1. ఒఱుబీజము. 2. కారము.
ఒఱ్ఱె వి. చూ. ఒఱ్ఱియ.
ఒలందా వి. హాలెండుదేశము (Holland).
ఒళందులు వి. హాలెండుదేశస్థులు.
ఒళయు క్రి. 1. వ్యాపించు. 2. కలుగు. 3. ప్రవేశించు. 4. చుట్టుకొను. 5. కలయు 6. చేరు.
ఒలి వి. దోపుడు, ఒలుపు, అపహారణము.
ఒలికి వి, సొదపేర్చుచోటు, శ్మశానము.
ఒలియు క్రి. చర్మము మొ. వి ఊడు.
ఒలివడు క్రి. దోపుడుపోవు, అపహరింపబడు
ఒలుకు క్రి. 1. చిందు. 2. కారు. 3. చల్లు. 4. పోయు.
ఒలుకులమిట్ట వి. శ్మశానము, కాడు.
ఒలుచు క్రి. 1. తోలూడ్చు. 2. అపహరించు
ఒలుపు వి. అపహారణము.
ఒలె వి. వస్త్రము ఉత్తరీయము. రూ. ఒల్లె. ఒల్లియ, వల్లె, వల్లియ.
ఒల్లబాటు వి ఒల్లమి, అపేక్షలేమి.
ఒల్లఁబోక వి. 1. అనాదరము. 2. తాపము.
ఒల్లఁబోవు క్రి. మూర్ఛిల్లు, సొమ్మసిల్లు.
ఒల్లమి వి. ఇష్టపడమి.
ఒల్లియ వి. చూ. ఒల్లె.
ఒల్లె వి. చూ. ఒలె.
ఒల్లెవాటు వి. ఉత్తరీయము మెడచుట్టి వచ్చునట్లు భుజముల మీద వైచుకొనుట. రూ. వల్లెవాటు.
ఒవ్వు క్రి. గిట్టు, సరిపడు. రూ. ఓవు.
ఒసఁగు క్రి. ఇచ్చు. వి. 1. ఈగి. 2. బహుమానము. రూ. ఒసవు.
ఒసపరి విశే. 1. సుందరుడు. 2. ఉత్కృష్టము.
ఒసపు క్రి. చూ. ఒసఁగు.
ఒహో అవ్య. ఆశ్చర్య. సంబోధనార్థకము, ఏమి. రూ. ఓహో.
ఒళగు వి. 1. మర్మము, 2. లోకువ. 3. వీణాదండము. రూ. ఒళవు.
ఒళవు వి. చూ. ఒళగు.
ఒళవరి విశే. మర్మజ్ఞుడు.
ఒళ్లు వి. చూ. ఒడలు.
ఒళ్లుపెట్టు క్రి. బలియు.

## ఓ

ఓ—ఆంధ్ర భాషకు గల అచ్చులలో ఒకటి. అవ్య. సంబోధనమును, తలపును, ఆర్తిని దెలుపును, సందేహార్థకము, ప్రశ్నార్థకము.
ఓమ్ సం. వి. 1. పరబ్రహ్మార్థకము. 2. ప్రారంభార్థకము. (ఓంకారము వేదముల యొక్క సారభూతము. వేదాంత

గ్రంథము లన్నియు దీనిని ప్రశంసించు చున్నవి. ఇదియే ప్రణవము (అ + ఉ + మ). మంత్రములకెల్ల శిరోమణి. ఓంకారమునందు సమస్తజగత్తును ఇమిడి యున్న దని వేదములు చెప్పుచున్నవి).

**ఓంకారము** సం. వి. 1. ప్రణవము. 2. ప్రారంభము.

**ఓంకారేశ్వరుడు** సం. వి. శివుడు.

**ఓంద్ర** వి. గాడిదకూత.

**ఓంద్రించు** క్రి. ఓంద్ర పెట్టు, గాడిదవలెకూయు

**ఓఁక** సం. వి. పుల్లకలివెచెట్టు.

**ఓకము** సం.వి. 1. ఇల్లు. 2. స్థానము. 3. చోటు.

**ఓకర** వై. వి. 1. ధ్వనిపూర్వకమగు వాంతి, డోకు. 2. రోత. సం. ఉద్గారః.

**ఓకరించు** వై. క్రి. 1. ఓకర (డోకు) వచ్చి ఉమియు. 2. అసహ్యించు.

**ఓకస్సు** సం. వి. 1. ఇల్లు. 2. స్థానము. 3. ఆశ్రయము.

**ఓకిలి** వై. వి. ఓకర. క్రి. ఓకిలించు, డోకు, అసహ్యించు. సం. ఉద్గారః.

**ఓకు** వి. 1. దుర్భిణి. దూరదర్శిని 2. అపకారము.

**ఓక్యము** సం. వి. 1. మంచిఠావు. 2. ఇంటి కనుకూలమగు స్థానము.

**ఓగితము** వై. వి. యోగ్యము. యుక్తమైనది. సం. యుక్తమ్.

**ఓగిరము** వై. వి. అన్నము. ఆహారము. రూ. ఓరెము- ఓయిరము సం. ఆహారః.

**ఓగు** వి. 1. అశుభము. 2. కీడు (బాగోగు అని వాడుదురు బాగు + ఓగు).

**ఓగులోడుచు** క్రి. 1. దేవురించు. 2. దైన్యపడు.

**ఓఘము** సం. వి. 1. సమూహము, మూక. 2. పరంపర 3. ప్రవాహము.

**ఓచెల** అవ్య. సంబోధనార్థకము. రూ. ఓచెల్లి.

**ఓజము** సం.వి. 1. బేసి, విషమము. 2. జ్యోతి రూ. ఓజస్సు.

**ఓజస్సు** సం. వి. 1. తేజము. 2. ఉత్సాహము. 3. బలము. 4. వెలుతురు. 5. పటిమ.

**ఓజస్వంతుఁడు** సం. విశే. బలము మొ.వి కలవాడు, ఓజస్వి.

**ఓజస్వి** సం. విశే. చూ. పై.

**ఓజ[1]** వి. 1. క్రమము. 2. విధము. 3. స్వభావము, 4. ఆజ్ఞ.

**ఓజ[2]** వై. వి. 1. ఉత్సాహము. సం. ఊర్జస్. 2. ఒజ్జ. 3. భయము. సం. ఓజః.

**ఓజబంతి** వై. వి. మేలుబంతి,

**ఓజు** వి. 1. కమసాలి. 2. శిల్పి. 3. శిల్పుల పేర్ల తుదిని వచ్చు బిరుదాంకము, శర్మ, వర్మవంటిది, ఉదా. లింగోజు.

**ఓజోన్** ఇం. వి. (రసా.) (Ozone) ఆమ్లజని (ఆక్సిజని), దానిసంకేతము.

**ఓజోనీకృతము** విశే. (రసా.) (Ozonised) ఓజోనుతో మిశ్రితమైనది.

**ఓట** వి. 1. భయము, దిగులు. 2. జంకు.

**ఓటమి** వి. 1. అపజయము. 2. భంగము.

**ఓటఱు** క్రి. అశక్తియగు. నిస్సత్వమగు.

**ఓటిపలుకు** . వి. 1. ఉత్తమాట. 2. పరపతి లేని మాట.

**ఓటు** ఇం. వి. (Vote) ఎన్నిక మొ.వానిలో వ్యక్తులు ప్రకటించు అభిమతము, సమ్మతి. రూ. వోటు.

**ఓటుపడు** క్రి. 1. అపజయమొందు. 2. కోలుపోవు. 3. మోసపోవు.

**ఓట్స్** ఇం. వి. (Oats) యవధాన్యము.

**ఓడ** వై. వి. నావ, తరణి. సం. హోడః.

**ఓడంగి** వై. వి. ఓడవాడు, నావికుడు.

**ఓడకంబము** వై. వి. ఓడనడుమ వేయు నిడుపాటి కంబము.

**ఓడరేవు** వి. రేవు పట్టణము.

**ఓడిక[1]** సం.వి. నీవారధాన్యము, ఒకరకము వడ్లు.

ఓడిక[2] వి. 1. ప్రవాహము. 2. తూము.
ఓడు వి. 1. కుండ మొ. ని తూటు, బీట. 2. పరాజయము. క్రి. 1. పరుగిడు. 2. వెనుదీయు, 3. ధారపడు. 4. ఓడుగిల్లు. 5. కారు. విశే. 1, ఓటిది. 2. పగిలినది.
ఓడుబిళ్ళ వి. ఇంటి పైకప్పు పెంకు,
ఓఢ్యాణము సం.వి. ఒడ్డాణము.
ఓఢ్రదేశము సం. వి. ఉత్కలము (ఒరిస్సా).
ఓణి వి. 1. ఉత్తరీయము, కండువా. 2. యుక్తవయస్సు వచ్చిన ఆడువారు పరికిణి పైన భుజముపైకి వేసికొను పైట.
ఓతము సం. విశే. (గృహ.) 1. నేయబడినది. 2. నేతకు సంబంధించినది (Woven). సం. వి. (గృహ.) పడుగు, నేతలో నిలువుగా వేయు దారము (Warp).
ఓతువు సం. వి. పిల్లి మార్జాలము.
ఓదనము సం. వి. అన్నము.
ఓదము వి. ఏనుగును బట్టుటకై త్రవ్విన పల్లము (గుంట) అవపాతము,
ఓదారుచు క్రి. ఆశ్వాసించు. రూ. ఓదార్చు.
ఓడియ వి. కోత కోసి చేతిలో అక్కడక్కడ నుంచు చిన్నకుప్ప, రూ. ఓదె.
ఓదె వి.చూ. ఓదియ.
ఓనికట్టు వి. కొండపనడిమిపందు (లోయ వంటిది).
ఓపమి వి. 1. బద్ధకము, జడ్డుతనము. 2. అసామర్థ్యము. 3. నింద.
ఓపిక వి. 1. బలము. శక్తి. 2. ఓర్పు.
ఓపు వి. బలిమి. క్రి. 1. చాలు, 2. సహించు
ఓబెలిస్కులు ఇం. వి. (చరి.) (Obelisks) ప్రాచీన ఈజిప్ట్ దేశీయులచే కట్టబడిన నాలుగు మూలల స్తంభము. (ఈ స్తంభాగ్ర భాగము పిరమిడ్ వలె త్రికోణాకార ములో ఉండును).
ఓమటి వి. అన్నము, సాదము, ఓగిరము.
ఓమనగుంటలు వి. బాలికల క్రీడలలో ఒకటి.
ఓమము వి. జీలకఱ్ఱవలె నుండు ఒకరకపు వాసనగింజలు, దీప్యము. రూ. వాము.
ఓము క్రి. 1. కాచు, రక్షించు, ఉదా.ధర్మము నిన్నోముగాత. 2. సంస్కరించు.
ఓయారము వి. చూ. ఒయారము.
ఓయారి వి. చూ. ఒయారి.
ఓయి వై. అవ్య. 1. పురుష సంబోధనము నందు ఉపయోగింపబడునది. 2. సంప్రార్థ నంబున క్రియల కనుప్రయుక్త మగును. ఉదా 'నీయిచ్చయె మిన్నకపోవోయి మునిప్రవర'.
ఓయిరము వై.వి. అన్నము. రూ. ఓగిరము, సం. ఆహారః.
ఓర[1] వి. 1. అంచు,ఒడ్డు. 2. మేర. 3. వైపు. అవ్య. అడ్డముగా.
ఓర[2] వై.వి. అహోరాత్రము సం. హోరా.
ఓరంతప్రొద్దు వై. వి. 1. అహోరాత్రము. దినమంతయు. 2. ఎల్లప్పుడు 3. రవంత.
ఓరగచ్చు వి. (ఓర+కచ్చు) ప్రక్కకొది గించిన కౌపీనము.
ఓరగిల్లు క్రి. అవనతమగు. ప్రక్కకుఒరుగు. ప్రాలు. రూ. ఓరగిలు.
ఓరచూపు వి. 1. ప్రక్కచూపు. క్రీగంటి చూపు. 2. ఉపేక్ష. 3, మోహపుచూపు,
ఓరణము వి. ఒకవిధమగు దేగ.
ఓరపాక వి. పంచను దూలములులేక వంచి కట్టిన పాక.
ఓరి అవ్య.స్నేహ లేక నీచసంబోధనార్థకము.
ఓరిమి వి. క్షమ. శాంతము, ఓరుపు.
ఓరు[1] వై. విశే. పెద్ద. సం. ఉరుః.
ఓరు[2] వి. 1. ఎఱ్ఱమట్టివస్త్రం. 2. గాలి మొ.ని ధ్వని.
ఓరుగాలి వి. శబ్దముతో వీచుగాలి. రూ. హోరుగాలి.
ఓరుపు వి.చూ. ఓరిమి.
ఓరెము వై. వి. చూ. ఓయిరము.

ఓ త్ర సర్వ. చూ. ఒకత.
ఓ త్రి సర్వ.. చూ. ఒకత
ఓర్తు సర్వ. దూ. ఒకత.
ఓర్మి వి. క్షమ, సహనము, సహించుట. దూ ఓరిమి (Tolerance).
ఓర్వమి వి. ఓర్వలేనితనము.
ఓల వి. 1. నెపము వ్యాజము, 2. జలక్రీడా సమయమందు ప్రేరేపించుట కుపయో గించు శబ్దము. 3. జలక్రీడ.
ఓలగందము వి. 1. పూసిన పసుపు. 2. పసుపుపూత.
ఓలగము వి. 1. కొలువు. 2 కొలువు కూటము.
ఓలగించు క్రి. 1. కొలుచు. 2. సభతీర్చు
ఓలచెంగనాలు వి. అపజయము.
ఓలమానగొను క్రి. 1. శరీరము రక్షించు కొను, 2. మరుగుపడు, 3 వెనుదీయు.
ఓలము వి. 1. వృక్షములు మొ. చే మరుగగు చోటు. 2. దేహము. దూ. ఓలిమి.
ఓలలాడు క్రి. 1. స్నానముచేయు 2. ఓల ఓల యనుచు నీటిలోఆడు.
ఓలాకు వి. 1. అలసట, శ్రమము. 2. కలత.
ఓలి[1] వి. ఉంకువ, కన్యాశుల్కము.
ఓలి వై.వి. వరుస, బారు. సం. ఆళి,
ఓల్లము నం. వి. 1. అల్లము. 2. కంద.
ఓవరి వై. వి. 1. లోపలిగది. 2. చంద్రశాల
ఓవర్‌డ్రాఫ్ట్ ఇం. వి. (Over draft) బాంకులలో కరంటు కాతాయు పరపతియుగల కాతాదారులకు తమకు బాంకులోగల సొమ్ముకన్న ఎక్కువ సొమ్మును తాత్కాలికముగ తీసికొను అధికారము బాంక్ వారిత్తురు. దీనినే ఓవర్‌డ్రాఫ్ట్ అందురు.
ఓవు క్రి. చూ. ఒవ్వు.
ఓవెన్ ఇం. వి (గృహ) (Oven) కేకు బిస్కెట్లు కాల్చెడి పెనముగల పెట్టె.
ఓషధి నం వి 1. మందుచెట్టు. 2. ఫలించిన తోడనే నశించెడి అరటి మొ.వి.
ఓషధీశుఁడు నం. వి. చంద్రుడు.
ఓషధులు నం వి (వృక్ష) ఔషధములుగా నుపయోగపడు మొక్కలు ఉదా. సునాముఖి, అడ్డసరము మొ.వి. (Medicinal plants or herbs)
ఓషము నం. వి. కాలుట. 2. కాల్చుట.
ఓష్ఠము నం.వి (జం.) పెదవి (Labium). విశే. పెదవులకు సంబంధించినది(Labial). వ్యు ఉష్ణాహారముచే కందునది.
ఓష్ఠమృశములు నం. వి. (జం) కీటకములనోటి భాగములలో ఒకవిధమైనభాగములు (Labial palps)


ఓష్ఠమృశము

ఓష్ఠ్యము నం. విశే. 1. పెదవులకు దగిలి పలుకునది. (ప. ఫ. బ. భ. మ లు). 2. పెదవులకు సంబంధించినది.
ఓసరిలు వై. క్రి. 1. తొలగు. 2. విరమించు దూ. ఓసరిల్లు.
ఓసి అవ్య. స్త్రీ సంబోధనార్థకము,
ఓహటము వి. వెనుదీయుట
ఓహటించు క్రి. వెనుదీయు.
ఓహటిల్లు క్రి. వెనుదీయు.
ఓహరిసాహరి క్రి. విశే. తండోపతండముగా
ఓహో అవ్య. ఆశ్చర్య సంబోధనార్థకము.
ఓళిక వి. కపోళి, ఒకరకము భక్ష్యము. దూ. హోళిక.

## ఔ

ఔ 1. ఆంధ్రవర్ణమాలలోని ఒక అచ్చు. 2. అంగీకారమును ప్రశంసను, నిశ్చయమును తెలుపును.
ఔఁగదే అవ్య. ఔరా.

ఔఁగాక అవ్య. అట్లే కానిమ్ము.

ఔగాములు వి. (ఔట + కామి) 1. కలిమి లేములు. 2. మేలుకీళ్లు, 3. యుక్తాయుక్తతలు. రూ. అవుగాములు.

ఔచితి సం. వి. 1. ఉచితత్వము. 2. యోగ్యత.

ఔచిత్యము సం. వి. యోగ్యత.

ఔజనము సం. వి. బంగారు.

ఔజ్జ్వల్యము సం.వి. ఉజ్జ్వలత్వము, ప్రకాశము.

ఔజు వి. 1. కాలువ. 2 పనివాడు. రూ. అవుజు.

ఔడవము సం. వి. ఐదుస్వరములతోగూడిన రాగము. సం. విశే. నక్షత్రసంబంధి.

ఔడు వై. వి. పెదవిక్రిందచోటు. సం. ఓష్ఠః.

ఔత్కంఠ్యము సం. వి. ఉత్కంఠ, తహతహ వేగిరపాటు.

ఔత్కృష్ట్యము సం. వి. ఉత్కృష్టత.

ఔత్తరాహుఁడు సం. వి. ఉత్తర దేశపువాడు.

ఔత్తరేయుఁడు సం. వి. పరీక్షిన్మహారాజు.

ఔత్తానపాది సం. వి. ధ్రువుడు. వ్యు. ఉత్తానపాదునికొడుకు.

ఔత్సర్గికము సం. విశే. 1. సామాన్యవిధికి సంబంధించినది. 2. సహావము విడుచునది.

ఔత్సుక్యము సం. వి. ఉత్సుకత్వము.

ఔదనికుఁడు సం. విశే. వంటవాడు.

ఔదరికుఁడు సం. విశే. 1. తిండియందే ఆసక్తి గలవాడు. 2. ఏమియుపనిలేకుండ నున్నవాడు.

ఔదల వి. (ఔ + తల) నడితల, తల.

ఔదార్యము సం. వి. ఉదారత్వము, దాతృత్వము.

ఔదాసీన్యము సం. వి. ఉపేక్షగా నుండుట మిత్రశత్రు భావములు లేకుండుట.

ఔదు వి. రూ. ఔజు.

ఔదుంబరము సం. వి. 1. ఒకలోహము. 2. రాగి విశే. ఉదుంబర (మేడి) వృక్ష సంబంధమైనది.

ఔద్దాలకము సం. వి. పుట్టతేనె.

ఔద్ధత్యము సం. వి. ఉద్ధతత్వము, ఏపు

ఔపపత్తికము సం. విశే. ఉపపత్తి గలది, యుక్తియుక్తము, తగినది.

ఔపవిభక్తికము సం. వి. ఉపవిభక్తులు చేర్పబడు ప్రాతిపదికము.

ఔపాసనము సం. వి. గృహస్థుడగు బ్రాహ్మణుడు ప్రాతఃకాలమునందు చేయు అగ్ని ఉపాసన.

ఔర అవ్య. ఆశ్చర్యమును తెలుపును.

ఔరసుఁడు సం. వి. ధర్మపత్ని యందు బుట్టిన కొడుకు.

ఔరు వి. 1. వీరణము. 2. తృణము (అవురు గడ్డియని వాడుక కలదు).

ఔర్ధ్వదేహికము సం. విశే. చచ్చినవారికి చేయబడు కర్మకు సంబంధించినది.

ఔర్వము సం. వి. బడబాగ్ని.

ఔల వి. రూ. అవల.

ఔలు క్రి. రూ. అగులు.

ఔలెమ్ము అవ్య. 1. ఔనౌను. ఔను లెమ్ము.

ఔశీనరుఁడు సం. వి. శిబిచక్రవర్తి.

ఔశీరము సం. వి. చామరము. సురటి. విశే. వట్టివేళ్ళతో చేయబడిన మందు.

ఔషధము సం. వి. 1. ఓషధి. 2. ఓషధులతో చేయబడిన మందు.

ఔషధీశుఁడు సం. వి. 1. ఓషధుల కధిపతియైన సోముడు. 2. బుధుడు.

ఔషరము సం. వి. 1. రాతిఉప్పు. 2. సూదంటురాయి. 3. చౌటినేల.

ఔషసి సం. వి. వేకువ, ఉషఃకాలము.

ఔను వి. 1. సొగసు. 2. ఒయ్యారము. రూ. అవును.

సొగసుకత్తె విశే. 1. సొగసుకత్తియ. 2. విలాసవతి.

సొగసుకాఁడు విశే. 1. సొగసుకాడు. 2. విలాసవంతుడు

# క

క హల్లులలో ప్రథమాక్షరము.

కంకటము నం. వి. 1. కవచము. 2. శివుని త్రిశూలము.

కంకటి వై. వి. మంచము. రూ. కంగటి. నం. ఖట్టికా, ఖట్వా.

కంకటీకుఁడు నం. వి. ముక్కంటి, శివుడు.

కంకణము[1] నం.వి. 1. కడియము. చేతివగ. 2. తోరము. 3. జలబిందువు. (గణి.) అంగుళీయాకార క్షేత్రము. రెండు ఏక కేంద్రవృత్తముల మధ్యమున్న క్షేత్రము (Ring-shaped-region)

కంకణము[2] వి. ఒకరకమగు జలపక్షి. కంకణాయి.

కంకణాయి వి. చూ. పై.

కంకతము నం వి. దువ్వెన.

కంకపత్రము నం. వి. అమ్ము, బాణము.

కంకము నం. వి. 1. రాబందు 2 పద్మము.

కంకర వై. వి. కంకరరాయి. నం. కర్కరమ్.

కంకరతలమి వి. మూర్ఖుడు, అజ్ఞాని.

కంకరనేలలు మి. వి. (వ్యావ.) ఎఱ్ఱని కంకర రాళ్ళు అధికముగా నున్న నేలలు (Laterite soils) ఇష్టకాశిల (Laterite) నుండి పుట్టిన నేలలు.

కంకాళము నం. వి. ఎముకలగూడు.

కంకి వి. (జొన్నలోనగువాని) ఎన్ను.

కంకు క్రి. 1. జళిపించు. 2. తిట్టు 3. గద్దించు.

కంకుఁడు నం. వి. 1. కపటబ్రాహ్మణుడు. 2. కంకుభట్టు (అజ్ఞాతవాసమున ధర్మరాజు పెట్టుకొనిన మారుపేరు). 3. యముడు.

కంకుష్ఠము నం. వి. ఏనుగుపిల్ల రేణము.

కంఖాణము నం. వి. గుఱ్ఱము, హయము.

కంగాణము వి. కళ్ళమునందలి కావలి

కంగారు వి. 1. అపత్యమయమున గలుగు తొందర. 2. కలవరపాటు 3. యుద్ధము.

కంగాళి హిం. విశే. 1. నీచమైనది. 2. అల్పమైనది.

కంగు వి. 1. నూలిపోగుతో వంకరగా నేర్పరచిన కన్ను. 2. మ్రోగుటయందగు అనుకరణము (కంగుకంగు).

కంగేళి వై. వి. అశోకము. నం. కంకేళి.

కంచి వై. వి. కాంచీనగరము. విశే. పెద్ద.

కంచిమేఁక వి. పెద్దపొదుగు గలమేక.

కంచుకపత్రాధారము నం. వి. (వ్యావ.) కొబ్బరి మొ. మొక్కల ఆకుల మొదళ్ళు కనుపులచుట్టును ఒరవలె అమరి యుండునది (Sheathing leaf base).

కంచుకము నం. వి. 1. రవిక. 2. చొక్కాయ. 3. కవచము.

కంచుకి నం. వి. 1. అంతఃపురపు కావలివాడు. 2. విటుడు.

కంచె వి. ఆవరణముగా పెట్టిన కంప.

కంచెకత్తెర వి. (వ్యావ) కంచెలను అవసరమైనప్పుడు కత్తిరించుటకు ఉపయోగించు పెద్దకత్తెర

కంచము వై. వి. భోజన పాత్రము. నం. కంసమ్.

కంచర వై. వి. కంచుపనిచేసి బ్రతుకుజాతి. రూ. కంచరి, నం. కాంస్యకారః.

కంచరగాడిద వై. వి. కంచరము లాగు గాడిద, అశ్వతరము.

**కంచరము** వై. వి. ఒక రకపు శకటము. సం. కంచరః.

**కంచరి** వై. వి. చూ. కంచర.

**కంచెల** వై. వి. రవికె రూ. కంచెల. సం. కంచులీ.

**కంచు** వై. వి ఒక విధమగు లోహము. సం. కంసమ్ (Bronze).

**కంచుకాగడాలు** వి. జాతీ. ప్రకాశవంతమైన దీపములు.

**కంచుకొమ్ము** వి. ఒక రకపు వాద్యము.

**కంచుమించు** వి. ఒక రకపు డేగ. విణ. అగోచరము, అదృశ్యము.

**కంజంక్టైవా** ఇం. వి. (జం.) (Conjunctiva) కంటిరెప్ప లోపలి భాగము.

**కంజజుఁడు** నం. వి. నలువ, బ్రహ్మ.

**కంజనుఁడు** నం. వి. మన్మథుడు. వ్యు. సుఖమును కల్గించువాడు.

**కంజము** నం. వి. తామరపువ్వు.

**కంజాతము** నం. వి. తామర, పద్మము.

**కంజు** వై. వి. కౌజుపిట్ట. నం. కపింజలః.

**కంట** వి. 1. కనుట. 2. నాట్యబంధము.

**కంటకద్రుమము** నం. వి. 1. బూరుగుచెట్టు. 2. ముండ్ల చెట్టు.

**కంటకము**[1] 1. ముల్లు. 2. రోమాంచము. 3. వెదురు. 4. సూదిమొన. 5. కాకి. 6. తప్పు.

**కంటకము**[2] వి. విరోధోక్తి. విణ. విరుద్ధము.

**కంటకి** నం. వి. 1. రేగు. 2. ముండ్లు గల చెట్టు. 3. చేప. విణ. కంటకము గలది.

**కంటకిఫలము** నం. వి, 1. పనస. 2. ఉమ్మెత్త. 3. పల్లేరు.

**కంటకుఁడు** నం. వి. నీచబుద్ధి గల శత్రువు.

**కంటగించు** క్రి. 1. విరోధించు. 2. నొచ్చు. 3. రోతపడు.

**కంటగింపు** వి. 1. రోత, అసహ్యము. 2. ద్వేషము.

**కంటాణి** వి. కాగితములు మొ.ని కుట్టుట కనువగు ఇనుప ఊచ. రూ. కంతాణి.

**కంటిపాప** వి. కంటి నల్లగ్రుడ్డులోని చుక్క, (ఈ ద్వారముననే వెలుగు లోపలికి ప్రవేశించును) (Pupil).

**కంటియ** వై. వి మెడనగ. రూ. కంటె. నం. కంఠికా.

**కంటిలోపువ్వు** వి. నల్లగ్రుడ్డుమీద ఏర్పడు తెల్లచుక్క (పువ్వు). వైటమిన్ "A" లోపముచే కలుగు కంటి వ్యాధి (Xerophthalmia).

**కంటివాలు** వి. చక్రాయుధము.

**కంట్రోలర్** ఇం. వి. (వ్యావ.) (Controller) 1. నియంత్రకుడు, కరెన్సీ (Currency) నియంత్రకుడు. 2. (అర్థ.) ద్రవ్యము యొక్క చలామణి నియంత్రించువాడు. 3. విశ్వవిద్యాలయ పరీక్షానియంత్రకుడు. 4. గణక నియంత్రకుడు. 5. ప్రభుత్వాదాయవ్యయ నియంత్రకుడు.

**కంట్రోలుధరలు** మి. వి. (వ్యావ.) అత్యావసర సమయములందు వ్యాపారులు వస్తువుల ధరలు పెంచకుండ ప్రభుత్వముచే నియమితములైన ధరలు, నియంత్రిత మూల్యములు (Controlled prices).

**కంట్రోళ్లు** ఇం. వి. (అర్థ.) (శాస.) (Controls) ఆర్థిక వ్యవహారములపై ప్రభుత్వము విధించు నిబంధనలు.

**కంఠకర్ణనాళము** నం.వి. (జం.) నోటిలోనుండి కర్ణభేరి లోపలి వైపునకు పోవు గొట్టము (Eusta chiantube).




**కంఠగ్రహము** సం. వి. ఆహారము మొ.ని మ్రింగలేక పోవుట (Dysphagia).

**కంఠబిలము** నం. వి. గళమునుండి శ్వాస నాళికలోనికి పోవు ద్వారము (Glottis).

**కంఠమాల** నం. వి. మెడచుట్టు గడ్డలు లేచెడు తెవులు. రూ. గండమాల.

**కంఠము** నం. వి. 1. మెడముందరి భాగము, కుత్తుక. 2. కుత్తుక యొక్క ధ్వని. 3. సమీపము.

**కంఠరోహిణి** నం. వి. ఒకరకము అంటు వ్యాధి.

**కంఠశోషణము** నం. వి. 1. కుత్తుక ఎండుట. 2. వ్యర్థ సంభాషణము.

**కంఠసూత్రము** నం. వి. పుస్తె, మంగళ సూత్రము.

**కంఠస్థము** నం. విణ. కంఠపాఠముగా వచ్చినది.

**కంఠాభరణము** నం. వి. కంఠమునకు భూషణము.

**కంఠీరవము** నం. వి. 1. సింహము. 2. మదపు ఏనుగు. 3. పావురము.

**కంఠేకాలుఁడు** నం. వి. శివుడు. వ్యు. కంఠము నందు నలుపు కలవాడు.

**కంఠోక్తి** నం. వి. 1. గట్టిగా చెప్పుట. 2. స్పష్టముగా చెప్పుట.

**కంఠ్యము** నం. వి. కంఠమునందు పుట్టునది. (వ్యాక.) అ, ఆ, క, ఖ, గ, ఘ, ఙ, హ,ః అను ధ్వనులు.

**కండ** వై. వి. 1. మాంసము. 2. మాంసపు ముక్క, నం. ఖండః.

**కండకావరము** వి. 1. గర్వము. 2. అహంకారము. నం. ఖండగర్వః.

**కండచీమ** వి. పెద్దచీమ. రూ. గండుచీమ

**కండచక్కెర** వై. వి. పటికబెల్లము, కలకండ. నం. ఖండశర్కరా.

**కండని** నం. వి. 1. రోలు. 2. రోకలి.

**కండరకణజాలము** వి. మాంసపు కండ (Muscular tissue).

**కండర బంధనము** నం. వి. (జం) కండరము యొక్క కొన. (ఇది కండరము నను ఎముకతో అతికించును. ఆధారపు కణజాలము (Connective tissue)తో నేర్పడిన పట్టీ వంటి నిర్మాణము) (Tendon).

**కండరమండలము** నం వి. (జం.) శరీరములో నున్న కండరముల సంపుటి (Muscular system).

**కండరము** నం. వి. స్నాయువు, మాంసరజ్జువు.

**కండరములు** నం. వి. (జం.) మాంసపు కండెలు (Muscles).

**కండవడము** వై. వి తెర, యవనిక. నం. కాండపటః.

**కండిక** వి. లంకబొంఅము.

**కందుకము** నం. వి. బంతి, చెండు. రూ. కందుకము.

**కండువా** హిం. వి. ఉత్తరీయము.

**కండువాదూలము** వి. అడ్డదూలము.

**కండువు** నం. వి తీట. దురి.

**కండూతి** నం. వి. 1. తీట. 2. గోకుట

**కండూర** నం. వి. దూలగొండి.

**కండె** వై. వి. 1. జొన్నకంకి. 2. కండెము. 3. ఊచకు చుట్టిన నూలిచుట్ట నం. ఖండః.

**కండెతెగులు (వరి)** వి. (వ్యావ.) కొన్ని తృణధాన్య జాతుల ఎన్నులకు బట్టు ఒక తెగులు. (వరి దుబ్బులకు ఒక జాతి శిలీంధ్రము పట్టుటవలన రెల్లలన్నియు జిగురుతో అతికింపబడినట్లు నల్లనికండెగా ఏర్పడును (Spike disease).

**కండెము** వై. వి. సాముచేమిగుల గట్టిపడిన భుజముఖము. రూ. కండె. నం. ఖండః.

**కండ్రిక** వై. వి. ముక్క. నం. ఖండిక.

**కండ్లకలక** వి. ఒకరకపు నేత్రవ్యాధి, కనులు వాచి పుసులు కట్టు వ్యాధి (Sore eyes).

**కంత** వై. వి. 1. రంధ్రము. 2. సందు. 3. వీధి.

**కంతి** వై. వి. 1. దెబ్బవలనివాపు 2 బొప్పి. 3. ఒడ్డు 4 చెరకు మోని కనుపు. రూ. కడితి, కణితి సం. గ్రంథి.
**కంటు** వి. గడువు, మితి
**కంతుఁడు** సం. వి. మరుడు, మన్మథుడు.
**కంత్రీ** హిం. వి. నేర్పరి, టక్కరి.
**కంథ** సం. వి 1. గంత. 2 మట్టిగోడ.
**కంద** సం. వి. కందగడ్డ.
**కందకము** వి. అగడ్త.
**కందనకాయ** వి. గుండెకాయ.
**కందము** సం. వి 1. మేఘము. 2 వ్రణము. 3. ఒకానొకజాతి. 4. (వృక్ష.) కంద, నేమమొ. మొక్కలకు భూమిలో నుండు కాండము (Corm). (దీనిపై కోరకము లుండును).
**కందర** సం. వి. కొండబిలము, గుహ.
**కందరము** సం. వి. 1. అల్లము. 2. అంకుశము. 3. బిలము.
**కందర్పుఁడు** సం.వి. 1.మరుడు వ్యు కుత్సితమగు దర్పము కలవాడు.
**కందసారము** సం.వి. నందనవనము, ఇంద్రుని ఉద్యానవనము.
**కందసుందరము** సం. వి. పలురంగుల తామరపద్మము.
**కందళము** సం. వి. 1. క్రొత్తమొలక. 2. అవ్యక్త మధురధ్వని. 3. గ్రహణము. రూ. కందలము.
**కందళించు** సం. క్రి. మొలుచు, అంకురించు,
**కందళీకుసుమము** సం. వి. అరటిపువ్వు.
**కందాయము** వ్యా. వి. సంవత్సరమున మూడవ భాగము, జ్యేష్ఠాది మాస చతుష్టయము.
**కంది**[1] వి. ఒకరకపు సస్యము.
**కంది**[2] సం. విశ. గడ్డకలది. వి. 1. కందగడ్డ. 2. మాసగ్రంథి.
**కందు** వి. 1. తాపము. 2. నలుపు, ఉదా. చంద్రబింబములోని కందు. 3. శిశువు. క్రి. 1 తప్తమగు. 2. వాడు. 3. కృశించు.
**కందుఁడు** వై. వి. కుమారస్వామి. సం. స్కంద.
**కందుకము** సం. వి. బంతి, చెండు.
**కందుకేశ** వి. కందుకు.
**కందువ** వి. 1. సమూహము.2. ఏకాంతము. 3 చమత్కారము. 4. సామర్థ్యము. 5 జాడ.
**కందెన** వి. బండి ఇరుసునకు పూసెడు మసి, ఒక విధమగు చమురు, ఉదా. "ఇరుసునఁ గందెనఁబెట్టక పరమేశ్వరుబండి యైనఁ బాఱదు సుమతీ", (Lubricant).
**కందెఱ** వి. (కన్ను + తెఱ) కంటిని రక్షించు తెఱ, కనురెప్ప.
**కంధరము** సం. వి. 1. కంఠము. 2. మెడ. 3. మబ్బు.
**కంధి** సం. వి. సముద్రము. వ్యు. కం= నీటికి. నిధి=స్థానము.
**కంప** వి ముండ్లమండ.
**కంపనము** సం. వి. అదరు, చలనము.
**కంపనావృత్తి** సం. వి. ఒకకొననుండి మఱియొక కొనవరకు అదరుటకు పట్టుకాలము (Period of oscillation).
**కంపము** సం. వి. 1. వణకు. 2. వేపథువు.
**కంపరము** వి. పాడె, శవవాహనము వై. వి. గగుర్పాటు. సం. కంప్రమ్.
**కంపలబడ్డకాకి** వి. జాతీ. చిక్కులలో బడిన వ్యక్తి.
**కంపు** వి. వాసన, (పూర్వగ్రంథములందు ఇవి ఈ యర్థమున వాడబడినది. ఇప్పుడు దుర్గంధ మను అర్థమునందే వాడబడుచున్నది).
**కంపెనీ** ఇం. వి. (వాణి.) (Company). 1. కూటము,సమూహము. 2.వ్యాపారసంస్థ.

కంప్యూటర్ ఇం. వి. (Computer) గణిత్ర యంత్రము.

కంపోస్ట్ ఇం వి. (Compost) చీకుడు ఎరువు. (ఏ చెత్తచెదారము లైనను ముందుగా కొన్ని దినములు చీకి, క్రుళ్ళుటచే ఏర్పడు ఎరువు).

కంబమయ్య వై. వి. కంబము (స్తంభము) నందు ఉద్భవించిన నృసింహస్వామి.

కంబము వై. వి. గుంజ. నం. స్కంభః.

కంబరత్రాడు వి. కొబ్బరి పీచుతో పేనిన త్రాడు.

కంబళభోజనన్యాయము నం. న్యా. గొంగళిలో భోజనము చేయుచు వెంట్రుక లేరు పద్ధతి.

కంబళము నం. వి. 1. జలము. 2. కంబడి, గొంగడి 3. కంబళిపురుగు. 4. ఏనుగుపై పరచెడి రత్నకంబళము.

కంబళికుట్టు (గృహ.) పోగులు రేగియున్న అంచు కంబళి కుట్టు అను పోగు లూడకుండ ఉండుటకు ఉపయోగించెడి కుట్టు.

కంబాలాట వి. (కంబాలు+ఆట) బాలబాలికా క్రీడ.

కంబి నం. వి. 1. వెదురుకమ్మి. 2. గరిసె.

కంబు[1] నం. వి. 1. జలము. 2. తల.

కంబు[2] వి. సజ్జపైరు.

కంబుగ్రీవ నం. విఅ. 1. మూడు ముడుతలు గల మెడ. 2. శంఖము వంటి మెడ గలది.

కంబువు నం. వి. 1. శంఖము. 2. ఏనుగు. 3. కడియము. 4. నత్తగుల్ల.

కంసము నం. వి. 1.కంచు. 2.కంచుపాత్రము.

కంసారాతి నం. వి. శ్రీకృష్ణుడు.

కంసాలి వి. కమసాలి స్వర్ణకారుడు.

కంసుడు నం. వి. కృష్ణుని మేనమామ.

కకపాల వై. వి. సన్యాసుల జోలె. నం. కక్షపాలః.

కకవికలు వి. యథాయథలు, చెల్లాచెదరు. విఅ. మిక్కిలి చెదరినది. చూ. కకావికలు.

కకుత్తు నం. వి. 1. ఎద్దు మూపురము, కకుదము. 2. శ్రేష్ఠము.

కకుత్ప్రవర్ధము నం. వి. (జం.) (కప్ప యొక్క) క్రింది దవుడ ఎముకలలో కోణ నిపానవఅస్థి (Angulo-splenial bone) అను ఎముకకు పైకి పొడుచుకొని యుండు భాగము (Coronary process).

కకుద్మంతము నం. వి. గొప్ప మూపురము గల ఎద్దు.

కకుప్పు నం. వి. 1. దిక్కు. 2. సంపెంగ దండ. 3. కాంతి. 4. అల్లిక. 5. జడ.

కక్కరము వై. విఅ. కర్కశము, గట్టిది, కఠినమైనది. నం. కర్కశః.

కక్కసము వై. వి. కళ, కొరడా. విఅ. సంకటము, కర్కశము. నం. కర్కశః.

కక్కసించు వై. క్రి. బాధించు, సంకటపరచు.

కక్కిరి బిక్కిరి విఅ. తారుమారు.

కక్కు క్రి. 1. కడుపులోనిది వెలిపుచ్చు. వి. విసరురాయి, రోలు మొ.కి కలుగజేసెడు గరుకు.

కక్కుర్తి వి. 1. లోభము. 2. అశ్రద్ధ.

కక్కువాయి వి. ఒక తెగ కాసరోగము.

కక్కుసు వి. మరుగుదొడ్డి. పాయిఖానా.

కక్కెర వై. వి. కొంగ. నం. క్రకరః.

కక్ష నం. వి. 1. వంక. 2. పోటీ, పందెము.

కక్షపాల నం. వి. చూ. కకపాల.

కక్షాంగము నం. వి. (జం.) కీటకముల కాలి భాగములలోనిది మొదటిది (Coxa).

కక్ష్య[1] నం. వి. 1. మొలనూలు. 2. తొట్టికట్టు. 3. ఏనుగు నడుమునకు గట్టు గొలుసు. 4. పసారా. 5. (గణి.) పరిభ్రమణ మార్గము (Orbit).

కక్ష్య² నం. వి (భూగో.) భూమి సూర్యుని చుట్టు పూర్తిగా తిరుగుట
కగ్గము వై. వి. కత్తి, నం ఖడ్గః.
కగ్గు క్రి. 1.నల్లనగు, కంగు. 2 వివర్ణమగు
కంచబంధము నం. వి. జుట్టుముడి.
కచము నం. వి. జుట్టు, కేశము.
కచేరి హిం. వి కొలువుకూటము. రూ. కచ్చేరి.
కచ్చితము విశ. పూర్తిగా సరియైనది. (Exact).
కచ్చూరము నం. వి. ఎఱ్ఱకసింద. షడ్గ్రంధ.
కచ్చ వై. వి. 1. వెనకకు చెక్కుకొనెడి దోవతికొంగు. 2. గోచి. రూ. కాసె నం. కచ్ఛః.
కచ్చడము¹ వి. ఒకరకపు శకటము.
కచ్చడము² వై. వి. గోచి, కౌపీనము నం. కచ్ఛటా.
కచ్చు వి. 1. గర్వము. 2.సిగబంతి 3. రేకు.
కచ్ఛ నం వి. చిమ్మటపురుగు
కచ్ఛపము నం. వి. తాబేలు, కమఠము
కజ్జలము నం. వి. 1.మేఘము. 2. కాటుక. 3. (రసా.) దీపాంగారము, దీపపుమసి (Camp black).
కజ్జలి నం. వి. (రసా.) పాదరసము, గంధకము కలిపి నూరిన లభ్యమగుయౌగికము (Black sulphide of mercury).
కజ్జాయము వై. వి. ఒకరకపు భక్ష్యము, అరిసె. నం.ఖాద్యమ్. (వ్యావ.) కజ్జెము.
కజ్జూరము వై. వి. ఖర్జూరము.
కట అవ్య. సంతాపసూచకము. రూ. కట్టా, కటకటా.
కటకటపడు క్రి. కోపించు, 2. బాధపడు, 3. రోషించు.
కటకటాలు వి. ఇనుపకమ్ములతో ఏర్పరచిన అడ్డు.
కటకము¹ నం. వి. (భౌతి.) కాంతి కిరణము లను కేంద్రాభిముఖములుగగాని కేంద్రాభిసారులుగ గాని త్రిప్పగల పారదర్శక ఘనరూపము (Lens).
కటకము² నం. వి. 1. కడియము, 2. రాచవీడు. 3. నితంబము. 4. కొండనడుము 5. ఓఢ్రదేశపు రాజధాని కటక్.
కటము నం వి. 1. అతిశయము. 2. మొల. 3. ఏనుగు చెక్కిలి. 4. కణత. 5. పీనుగు 6. శ్మశానము.
కటపయనము నం. (గృహ.) చాప అల్లిక నేతకట్టు (Matty weave).
కటాక్షము నం. వి. 1. కడకంటి చూపు. కడకన్ను.
కటారి వై వి. 1 కత్తి. 2 బాకు. రూ. కటారు, నం కరారః.
కటారు వై. వి. చూ కటారి.
కటాహము నం. వి. 1. కడవ, బాన. 2. తాబేటి వెన్నుచిప్ప, 3. కప్పెర.
కటి నం. వి. నడుము.
కటిక వై. వి. 1. కటికవాడు. 2. బెత్తము పట్టియుండువాడు. 3. మాంసముఅమ్మువాడు.
కటికమెకము వై. వి. ఖడ్గమృగము.
కటిసూత్రము నం. వి. పురుషుని మొలత్రాడు
కటిరము నం. వి. మొల.
కటుకరోహిణి నం.వి. ఒక ఓషధి. (వ్యావ.) కటకరాణి.
కటువు నం.విశ. 2.కారముగలది. 2.వాడిమిగలది. వై. వి. పెంకె. నం. ఖాటికః.
కట్ట వి. 1. అడ్డకట్ట. 2. మోపు, అవ్య. సంతానమును దెలుపును.
కట్టకడ వి. (కడ+కడ)చిట్టచివర, తుట్టతుద.
కట్టడ వి. నియమము, ఆజ్ఞ.
కట్టడసేయు క్రి. ఆజ్ఞాపించు.
కట్టనము వి. 1. కానుక. 2. లంచము రూ. కట్నము.

**కట్టువ** వి. (వ్యావ.) ఆవరణ, ముఖ్యముగా సజీవావరణ (మొక్కలతో వేసిన ఆవరణ) (Fence)

**కట్టాణి** వి. (కడు+ఆణి) మిక్కిలి గుండ్రని తనము (గల ముత్యము)

**కట్టాయితము** విశ. (కడు+ఆయితము) సంసద్ధము, సన్నద్ధము

**కట్టిఁడి** విశ. కఠినుఁడు. ఉదా. 'కట్టిడి దైవమెంతగ జేసె'' నిర్దయుఁడు.

**కట్టు** వి 1, చోటు. 2. తొట్టికట్టు 3. కట్టుపాటు 4. నిర్బంధము. 5. బంధము 6. పొల్లు, బొత్తిగాగింజపట్టని ధాన్యము, 7. ఉడికిన కందిపప్పు మొ.ని రసము క్రి. 1. తయారుచేయు, 2. బంధించు. 3. ధరించు 4. జంతువులు గర్భము ధరించు.

**కట్టుఁగంబము** వి. ఏనుగు మొ. ని కట్టు కంబము.

**కట్టుఁగొంగు** వి. కోకయొక్క కట్టుకొను చెరగు.

**కట్టుఁగొమ్మ** వి. అడ్డకట్ట, సేతువు.

**కట్టుగొయ్య** వి. నాగటిమేడి.

**కట్టుగొట్టు** వి. పసులను కట్టుటకు పొలములో పాతినకొయ్య.

**కట్టుగోక** వి. మొలగుడ్డ, దోవతి.

**కట్టుదిట్టము** వి. కట్టుపాటు.

**కట్టుదొన** వి. కోనేరు.

**కట్టుపకాసి** వి. పోటుమగడు, యుద్ధమునకు సిద్ధుడగువాడు.

**కట్టుపకాసు** విశ. అచలుడు.

**కట్టుబండి** వి. సకలపరికరసహితమైన బండి.

**కట్టుబడి** వి. 1. బంటున కిచ్చెడు మాన్యము. 2. (వ్యావ.) ~~పాలేరున కిచ్చెడు~~ మాన్యము. 2, పంటమీదఆధారపడు శిస్తు. 4. లాభసాటి.

**కట్టుమట్టు** వి. 1., పసుల కొట్టము. 2. ఏర్పాటు.

**కట్టుమ్రాను** వి. తెప్ప.

**కట్లపాము** వి. కట్లుగలిగిన సర్పము.

**కట్లరి** ఇం, (గృహ) (Cutlery) కత్తులు, గరిటెలు, ముండ్లగరిటెలు మొ. వంట యింటిసామాను.

**కట్వర్క్** ఇం. (గృహ.) (Cut work) ఎంబ్రాయిడరి నమూనాలో కొన్ని భాగములు కత్తిరించి కుట్టుట లేక కుట్టిన తరువాత కత్తిరించుట.



కట్ వర్క్

**కఠారము** సం. వి. 1. బాకు 2. కత్తి,

**కఠినజలము** సం. (గృహ) సబ్బుతో నురుగును తేలికగా రానీయని నీరు, (నీటిలో ఎక్కువ మెగ్నీషియం, కాల్షియం లవణము ఉన్నచో నీటికి కఠినత్వము కలుగును) (Hard water)

**కఠినత్వము** సం. వి. (రసా.) సబ్బు ద్రావణముతో వెంటనే నురుగు నీయక అవక్షేపమునిచ్చునీటిగుణము(Hardness)

**కఠినము** సం. విశ. 1. పరుషము. 2. నిష్ఠురము. 3. క్రూరము వి. వంటకుండ.

**కఠిని** సం. వి. పలకమీద వ్రాయుబలపము.

**కఠోరుఁడు** సం. విశ. కఠినుడు.

**కడ** వై. వి. 1.దిక్కు 2. పార్శ్వము. 3. అంతము. 4. సమీపము. 5. స్థానము.సం. కాష్ఠా.

**కడఁగు** క్రి. యత్నించు, పూను.

**కడఁజు** వి. గోకర్ణమృగము. రూ. కణఁజు,

**కడతి** వి. గంధర్వమృగము. రూ. కడితి. కణతి, కణితి.

**కడఁబడు** క్రి. 1. నిస్సారమగు. 2. తగ్గు.

**కడకొఱవి** వి. కాలగామిగిలినకట్టె.

**కడగండ్లు** వి. కష్టములు, ఇక్కట్లు

**కడగన్ను** వి. కటాక్షము ,క్రేఁగన్ను

**కడగొట్టు** విణ. కడపటిది. క్రి చచ్చు.
**కడచను** క్రి. 1. చచ్చు 2 ముగియు. 3 తెగు. 4 దాటు 5. నశించు.
**కడచు** క్రి. 1, గతించు. 2. చచ్చు. 3. హెచ్చు. 4. దాటు.
**కడచుక్క** వై. వి. రేవతీ నక్షత్రము.
**కడతెగు** క్రి. సమాప్తమగు, పూర్తియగు.
**కడతేఱు** క్రి. 1. చచ్చు, నశించు.
**కడప** వి. దేహళి. రూ. గడప వై. వి కదంబము (చెట్టు). సం. కదంబః.
**కడపల** వై. వి. అంతము, చివర.
**కడపు** క్రి. 1. ఇయ్యక పొమ్మను. 2 చంపు. 3. త్రోలు. 4. వదలు.
**కడమ** వి 1. కొరత, 2 శేషము.
**కడమపడు** క్రి. కొరతపడు.
**కడముట్టు** క్రి. ముగియు.
**కడలి** వి సముద్రము.
**కడలికాలువ** వి. సముద్రపుపాయ.
**కడలికూఁతురు** వి. లచ్చి, లక్ష్మి.
**కడలిమీఁగడముద్ద** వి. చందమామ.
**కడలియల్లుఁడు** వి. వెన్నుడు, విష్ణువు.
**కడలిఱేఁడు** వి. వరుణుడు.
**కడలివెన్న** వి. 1.చంద్రుడు. 2 అమృతము.
**కడలు** వి. పెద్దఅల.
**కడలుకొను** క్రి. 1. అతిశయించు. 2. ఉప్పొంగు. 3.సంతోషించు. 4.వ్యాపించు.
**కడవసము** వి. తోలు. రూ. క డా స ము. కళపసము, కళాసము.
**కడవాఁడు** విణ. 1. అన్యుడు. 2. కనిష్ఠుడు.
**కడసరము** వి. ఒకానొక జాతిడేగ.
**కడాని** వి. మేలిమి. అపరంజి.
**కడాసము** వి. చూ. కడవసము.
**కడి** వి. 1. కబళము. 2. (పేడ) ముద్ద. 3. వాసన.
**కడిఁది** వి. ఆపద. విణ. 1. కఠినము. 2. అశక్యము.
**కడికండలు** వి. ఖండఖండములు ముక్కముక్కలు.
**కడిగొను** క్రి. కబళించు.
**కడిమి**[1] వి. 1.అతిశయము. 2.పరాక్రమము.
**కడిమి**[2] వై. వి. కడప (చెట్టు) సం. కదంబః.
**కడియము**[1] వై. వి. హస్తభూషణము. సం. కటకః. రూ. కడెము.
**కడియము**[2] వి. వరికుప్ప నూర్పుచేయుచు చుట్టును వేయు గడ్డివామి.
**కడిపోవు** క్రి. చెడు, నశించు.
**కడు** అవ్య అత్యంతము, మిక్కిలి. (వ్యాక.) అచ్చు పరమైనపుడు ఇందలి డకారము నకు ద్విరుక్తటకారం బగు, ఉదా. కట్టనువు, కట్టలుక, కట్టెండ, కట్టాయితము, కట్టెదురు మొ. వి.
**కడుగు** వి బియ్యము. మొ.వి కడిగిన నీరు. క్రి ప్రక్షాళించు.
**కడుజు** వి. ఒకజాతి డేగ.
**కడుపు** వి. ఉదరము, పొట్ట.
**కడుపుమంట** వి. ఈర్ష్య, అసూయ, ఓర్వలేనితనము.
**కడుపూద** వి. 1. ఈసు, కడుపుబ్బరించెడు పశురోగము.
**కడెము** వై. వి చూ. కడియము[1].
**కడ్డీ** వై. వి బంగారు మొ. ని కడ్డీ. సం ఖటికా.
**కణజాలము** వి. ఒకే వ్యాపారమును నిర్వర్తించు అనేక కణములుగూడి ఏర్పడిన నిర్మాణము (Tissue).
**కణము** సం. వి. 1. కొంచెము. 2. నూక. 3. సూక్ష్మాంశము. విణ. సూక్ష్మమైనది. సం. వి. 1. (భౌతి.) అత్యంతాల్ప ప్రమాణము కల ద్రవ్యశకలము (Particle). 2. (జీవ.) జీవకణము (Cell).
**కణవిభాగము** సం. వి. (జీవ.) జీవకణ విభజన (Cell division).

**కణసిద్ధాంతము** సం. వి. (జీవ) "ప్రాణుల శరీర నిర్మాణములో జీవకణము ముఖ్యమైన మూల ప్రమాణము" అను సిద్ధాంతము (1839లో ష్లీడెన్, ష్వాన్ అను శాస్త్రజ్ఞులు ఈ సిద్ధాంతమును చేసిరి) (Cell theory).

**కణాంతరావకాశము** సం వి. (వృక్ష) ఒక జీవకణమునకును మఱియొక జీవకణమునకును మధ్య నుండు స్థలము (Intercellular space).

**కణాంతర్గతము** సం విణ. (వృక్ష.) జీవకణము లోపల నున్నది (Intra-cellular)

**కణాంతస్థము** సం. విణ. (జీవ) చూ. కణాంతర్గతము.

**కణాభములు** సం. వి. (జీవ.) జీవకణకోశ రసములో సూక్ష్మమైన కడ్డీలవలెను, పోగులవలెను, రేణువులవలెను ఉండు ఒక విధమగు పదార్థములు (Chondriosomes or mitochondria).

**కణుపు** వి. 1. బుడిపి. 2. వెదురు, చెరకు మొ.ని కనుపు. 3. (వృక్ష.) కాండముపై ఆకు ఒయలుదేరిన స్థానము (Node).

**కత** వై. వి. చరితము. సం. కథా.

**కతము** వి. 1. కారణము. 2. గురుతు,

**కత్తరి** విణ. నానావర్ణములు గలది.

**కత్తలాని** వై. వి. తెల్లని గొరిజయు తోకయు గల నల్లని గుఱ్ఱము. సం. కరలాణః.

**కత్తవ** వి. మట్టిని పెల్లగించెడు పనిముట్టు.

**కత్తి** వై. వి. 1. ఖడ్గము. 2. మంగలికత్తి. సం. కర్త్రీ.

**కత్తియ** వై. అవ. స్త్రీ ప్రత్యయము, ఉదా. చెలికత్తియ, సొగసుకత్తియ.

**కత్తివాతియమ్ము** వై.వి. అర్ధచంద్రబాణము.

**కత్తెర** వై. వి. 1. వస్త్రాదులను కత్తిరించెడు సాధనము. 2. భరణి మూడు, నాలుగు పాదములందును, కృత్తిక యందును, రోహిణి మొదటి పాదమందును సూర్యుడుండు కాలము. 3 కృత్తికా నక్షత్రము.

**కత్తెరచుక్క** వి. కృత్తికా నక్షత్రము.

**కత్తెరనెల** వి. కార్తిక మాసము.

**కథ** సం. వి. తొల్లింటికత, వాస్తవార్థము కలది.

**కథకుఁడు** సం. వి. 1. కథలు చెప్పువాడు. 2. పురాణము తెలిసినవాడు.

**కథనము** సం. వి. చెప్పుట, వర్ణించుట, ఉల్లేఖనము.

**కథితము** సం. విణ. చెప్పబడినది.

**కద** అవ్య. ప్రసిద్ధిని తెలుపునది రూ. కదా. కాదా, కద్లే, కాదే

**కదంబకము** సం. వి. గుంపు. వై. విణ. మిశ్రము

**కదనము** సం. వి. 1. దోసము, పాపము, 2. యుద్ధము.

**కదను** హిం. వి. ఒకరకపు అశ్వగతి.

**కదరే** అవ్య. సంతాపార్థకము

**కదలనికీళ్లు** వి. (శం.) కదల్చుటకు వీలు కాని కీళ్ళు, ఉదా. తలఎముకలు (Immovable joints).

**కదలెడికీళ్లు** వి. (శం.) అవయవ భాగము వంచుటకు లేదా త్రిప్పుటకు వీలగుకీళ్ళు. ఉదా. చేతి ఎముకలు (Movable joints).

**కదష్టి** సం. వి. (జీవ.) జీవకణ స్థాన గర్భము, వర్ణి పదార్థముతో నిండి అష్టిలో నుండు గుండ్రని నిర్మాణము. (Nucleus).

**కదళి** సం. వి. అరటి.

**కదళీవంధ్య** సం. వి. ఒకసారి మాత్రమే ప్రసవించిన స్త్రీ. (అరటి చెట్టువలె, అరటి చెట్టు ఒకసారి మాత్రమే గెలవేయును).

**కదించు** క్రి. కదియజేయు.

**కదియు** క్రి. 1. దగ్గరకు వచ్చు. చేరు 2. సమానమగు.

కదుపు వై. వి. సజాతీయ పశు పక్ష్యాది సమూహము. సం. కదంబమ్.
కదుము క్రి. ఆక్రమించు. వి. బొప్పి.
కదురు వి. 1. నూలువడకు సాధనము. 2. సన్నని కమ్మి. క్రి. 1. అతిశయించు. 2. కలుగు.
కదుష్ణము నం.వి. ఇంచుకవేడి. విశ. ఇంచుక వేడి కలది.
కద్రువ సం. వి. పాములతల్లి, కశ్యపుని భార్య.
కథావత్తు సం. వి. (చరి.) మౌర్యుల కాలములో రచింపబడిన బౌద్ధ గ్రంథము.
కనకన వి. మండుట, ప్రకాశించుట మొ.నియందగు అనుకరణము.
కనకము సం. వి. 1.బంగారు. 2. ఉమ్మెత్త.
కనకాచలము సం. వి. బంగారుకొండ, మేరువు.
కనరు వి. 1. కంరదగడ్డ.మొ ని నస, దురద. 2. వెగటు.
కనలు వి. కోపము. 2. మంట. క్రి. 1. కోపగించు. 2. మండు.
కనికట్టు వి. కండ్ల కగపడకుండ జేయు గారడి. రూ. కనుకట్టు.
కనికరము వి. 1. దయ. 2. శోకము.
కనిష్ఠ సం. వి. 1. చిటికెనవ్రేలు. 2. అందరి కంటె చిన్నదగు చెల్లెలు.
కనిష్ఠము సం. విశ. (గణి.) దత్తరాసు లన్నింట చిన్నది (Least).
కనిష్ఠ సామాన్య గుణిజము సం. వి. (గణి.) దత్తరాసులన్నియు కారణాంకములుగా గల రాసు లన్నిట చిన్నది (L.C.M) = (Least common measure).
కనిష్ఠుఁడు సం. వి. చిన్న తమ్ముడు.
కనీనిక సం. వి. 1. కంటినల్లగ్రుడ్డు. 2. చిటికెనవ్రేలు.
కనీనికాపటలము వ్యా. వి. (జం.) కృపణము, కనుపాపను పెద్దదిగను, చిన్నదిగనుచేయు కండరములు గల పొర (Iris).
కనీసపుచందా వి. (వాణి, శాస.) కంపెనీ తన కార్యక్రమము మొదలిడుటకు ముందే వసూలు చేయవలసిన కనీసపు వాటా మూలధనము.
కనీసపు వేతనము వి. (అర్థ, వాణి, శాస.) కార్మికులకు చట్టము రీత్యా లభించవలసిన మిక్కిలి తక్కువ కూలి.(ఇంతకంటె తక్కువ కూలి ఇచ్చిన పారిశ్రామిక సంస్థలపై ప్రభుత్వము చర్య తీసికొనును).
కనీసము వై. విశ. తక్కువైనది, హీనము, అధమము. సం. కనీయస్.
కనీస(పు)వేతనములు వి. (అర్థ.) కార్మికులకు చట్టము రీత్యా ఇయ్యవలసిన కనీసపు వేతనములు (Minimum wages).
కను క్రి. 1. చూచు. 2. ప్రసవించు. 3. తెలియు. వి. నేత్రము.
కనుక అవ్య. హేత్వర్థకము, కావ, కాబట్టి.
కనుకట్టు వి. చూ. కనికట్టు, ఇంద్రజాలము
కనుకని వి. సంభ్రమము.
కనుకలి వి. చూపు, కానుపు.
కనుకుట్టు విశ. బాధకుడు.
కనుకుట్టుఁదనము వి. ఈర్ష్య.
కనుగీటు క్రి. కనుసైగచేయు.
కనుచీఁకటి వి. రేజీకటి, మసకచీకటి.
కనుపాప వి. (జం.) కనీనికాపటలమునకు గల రంధ్రము, (దీనిగుండా వెలుతురు కంటిలోనికి ప్రవేశించును). (Pupil.)
కనుపు వి. గనుపు, పర్వము. రూ. కణుపు.
కనుపుగొట్టు క్రి. 1. సంహరించు. 2. ఖండించు. 2. చిందరవందర చేయు.
కనుపుల విలుకాఁడు వి. చెరకు విలుకాడు, మన్మథుడు.
కనుపెట్టు క్రి. ఎదురుచూచు.

కనుబొమ. వి. కనుబొమ్మ.
కనుత్రాము క్రి. మోసపుచ్చు, కనుమూయు,
కనుమ వి. కొండలసందు, త్రోవ. (భూగో.) కొండలవరుస.
కనుము వి. 1. శరము. 2. తృణము. 3. మకరసంక్రమణమునకు తరువాతిరోజు.
కనుమూయు క్రి. 1. నిద్రించు. 2. వంచించు.
కనుమొఱఁగు క్రి. వంచనసేయు.
కనువినికి వి. పాము, చక్షుశ్శ్రవము.
కనువెచ్చ విశే. నులివెచ్చ. వి. కంటివేడిమి.
కనువేఁదుఱు వి. చూచినంతనె కలుగు వలపు, కంటిపిచ్చి.
కన్గంట అవ్య. ప్రత్యక్షముగా.
కన్న ప్రత్య. 'కంటె' అను అర్థమున వచ్చు ప్రత్యయము.
కన్నఁడు వై. వి. కృష్ణుడు. రూ. కన్నయ్య కన్నతండ్రి సం. కృష్ణః.
కన్నడ వి. 1. ఉపేక్ష. 2. రాగములలో ఒకటి.
కన్నడము వై. వి. 1. కర్ణాటదేశము. 2. కర్ణాటభాష.
కన్నడీఁడు విశే. (కన్నడ+ఈఁడు) ఉపేక్షించువాడు. వి. (కన్నడము+ఈఁడు). కన్నడదేశపువాడు.
కన్నము వై. వి. రంధ్రము. సం. ఖననమ్.
కన్నవిటి విశే. అంధుడు.
కన్నాకు విశే. మేలుతరము, శ్రేష్ఠము. వి. 1. ముఖ్యుడు. 2. తమలపాకు కట్టయందు పైననుండు పెద్ద ఆకు.
కన్నియ వై. వి. పెండ్లికాని పడుచు. సం. కన్యా.
కన్నీరు వి. హర్ష శోకముల వలన కన్నుల నుండి కారెడు నీరు.
కన్ను వి. 1. నేత్రము, 2. జాడ. 3 కనుపు. 4. చక్రము, 5. వంతెనద్వారము. 6. నెమలిపురికన్ను. 7. చూపు. 8. ఫలయందలి రంధ్రము. 9. వ్రణముల యందలి రంధ్రము.
కన్నుల మ్రాని విలుకాఁడు వి. మన్మథుడు.
కన్నుల మ్రాను వి. చెరకు.
కన్నెబావి వి. 1. పెద్దబావి. 2. నీళ్ళు లేని బావి.
కన్నెము వి. కోడిగుండెకాయ.
కన్నెఱికము వి. 1. కన్యాత్వము. 2. వారకన్యా ప్రథమ సంగమము.
కనోష్ణు వి. భయము.
కన్ఫ్యూషియస్ వి. (చరి.) (Confucius) చైనాదేశపు గొప్ప వేదాంతి. (గౌతమ బుద్ధుని సమకాలికుడు. ఈతని బోధనల ప్రభావము చైనా సాంఘిక వ్యవస్థలపై క్రీ. శ. 1911 వరకు ఉండెను క్రీ. శ. 1948కి పూర్వము చైనా సంస్కృతి యీతని బోధనల ప్రకారము మలచబడినది.)
కన్ఫెసర్ ఇం. వి. (చరి.) (Confessor) 1. పాపస్వీకర్త. 2. పాపవిమోచకుడు అగు క్రైస్తవమతగురువు. 3. మత గురువు వద్ద తన పాపములను ఒప్పుకొనువాడు
కన్య సం. వి. 1. పెండ్లికాని పడుచు. 2. కన్యారాశి. వి. కన్నియ.
కన్యాశుల్కము సం. వి. ఓలి, వధువును గ్రహించుటకు ఇచ్చు ధనము.
కపటము సం. వి. కవుడు. వ్యాజము.
కపర్దము సం. వి. 1. గవ్వ. 2. శివుని జటాజూటము.
కపర్ది సం. వి. శివుడు.
కపాలనాడులు సం. వి. మెదడు నుండి వచ్చు నాడులు (Cranial nerves).
కపాలము సం. వి. 1. తలపుఱ్ఱె. 2. సమూహము. 3. కుండపెంకు. (జం.) 1. పుఱ్ఱె. 2. పృష్ఠ వంశిక జంతువుల తలలో నున్న ఎముకల సముదాయము.

కపి సం. వి. కోతి.
కపింజలము సం. వి. కముజు అను పిట్ట.
కపిత్థము సం. వి. వెలగచెట్టు.
కపిధ్వజుఁడు సం. వి. విజయుడు, అర్జునుడు. వ్యు. కపిచిహ్నము ధ్వజమందు కలవాడు.
కపిల సం. వి. 1. ఆగ్నేయదిశయందలి ఆడేనుగు. 2. పుల్లావు.
కపిలె వి. నీరెత్తడి యంత్రము, మోట.
కపిశము సం. వి. పసుపు మించిన ఎరుపు.
కపురము వై. వి. కప్పురము. సం. కర్పూరః.
కఫోణి సం. వి. మోచేయి.
కఫోణ్యగ్రప్రవర్ధము సం. వి. (శం.) మోచేతికీలులో రేడియో అల్నాకు పైకి పొడుచుకొని వచ్చిన భాగము (Olecanon process).
కపోతము సం. వి. పావురము, గువ్వ. పారావతము.
కపోతవృక్షము సం. వి. (గృహ.) బలహీనమైన చాతీ, బలహీనత వలన నీరసముగా పెరిగిన ప్రక్క ఎముకల గూడు(Pigeon chest).
కపోలము సం. వి. చెక్కిలి.
కప్ప వి. మండూకము.
కప్పకుఋవు వి. అరకాలియందు లేచెడు గుల్ల.
కప్పడము వి. 1. కప్పుకొను వస్త్రము. 2. చినిగిన గుడ్డ.
కప్పతాళము మి. వి. పెద్దతాళము.
కప్పరపడు క్రి. సంభ్రమముపడు.
కప్పలి వి. ఓడ, నావ. త. కప్పల్.
కప్పి వి. (భౌతి.) నీళ్ళు, బరువు మొ.వానిని లాగుట కుపయోగించు చక్రము(Pulley.)
కప్పు వి. 1. ఆచ్ఛాదనము. 2. ఇంటిపై కప్పు. 3. నలుపు. 4. చీకటి. క్రి. 1. క్రమ్ము. 2. మూయు.
కప్పుకుత్తుక పులుగు వి. నెమలి, నీలకంఠము.
కప్పుఁదెరువరి వి. అగ్ని.
కప్పుమల వి. కాటుకకొండ.
కప్పుమేనిగాము వి. శనిగ్రహము.
కప్పురాయి వి. నీలమణి.
కప్పువేల్పు వి. కరివేల్పు, కృష్ణుఁడు, విష్ణువు.
కప్పెర వై. వి. 1. పుఱ్ఱె. 2. భిక్షాపాత్రము. సం. కర్పరః.
కఫము సం. వి. తెమడ, శ్లేషము.
కబంధము సం. వి. 1. జలము, 2. మొండెము. 3. సముద్రము.
కబంధుఁడు సం. వి. 1. కేతువు. 2. ఒక రాక్షసుడు.
కబరి సం. వి. కొప్పు.
కబళము సం. వి. ముద్ద, కడి, గ్రాసము.
కబాయి హిం. వి. అంగీ.
కబురు హిం. వి. సమాచారము, వార్త.
కబ్బము వై. వి. ప్రబంధము. సం. కావ్యమ్.
కబ్బిలి వి. కల్లమ్మువాడు, శౌండికుడు.
కమండలువు సం. వి. సన్యాసు లుంచుకొను గిండి వంటి పాత్ర.
కమటము వి. అగసాలెవాని కుంపటి.
కమఠము సం. వి. తాబేలు, భిక్షాపాత్రము.
కమతకాఁడు వి. కమతము చేయువాడు.
కమతపు జమాఖర్చులు వి. (వ్యవ.) వ్యవసాయదారుడు తనకమతములో చేసిన కృషికి అయిన రోజువారీ ఖర్చులు, (ఫలసాయము మొ.ని అమ్మకము వలన వచ్చు రాబడి తెలియజేయు రోజువారీ పద్దులు (Farm accounts).
కమతము వి. 1. అనేకులు శేరి చేయు సేద్యము. 2. (వ్యవ.) వ్యవసాయదారుని సేద్యములో నున్న భూమి (Farm).
కమనీయము సం. విశే. మనోహరమైనది.

కమనుఁడు సం. విశే. కాముకుడు. వి. మన్మథుడు.

కమరు క్రి. కాలు వి. 1. కాలినకంపు. 2. మొలనూలు.

కమల సం. వి. 1. లక్ష్మి. 2. పూజ్యస్త్రీ. 2. కమలాఫలము.

కమలము సం.వి. 1. తామర, ఎఱ్ఱతామర. 2. జలము. 3. రాగి. 4. మందు.

కమలాప్తుఁడు సం. వి. సూర్యుడు, విష్ణువు.

కమలాసనుఁడు సం. వి. నలువ, బ్రహ్మ.

కమలిని సం. వి. 1. తామరకొలను 2. తామరతీగ.

కమలు క్రి. 1. తపించు. 2. సంతాపించు. 3. కాలు.

కమలుఁడు సం.వి. 1. బ్రహ్మ. 2. ఇంద్రుడు.

కమాటీ హిం. వి. వ్యవసాయపు కూలి. రూ. కామాఠీ.

కమాను హిం. వి. 1. విల్లు. 2. పయనము. 3. ఫిడేలు వాయించు కొడుపు. 4.ఆర్చి (Arch).

కమి వి. 1. వంపబడిన వ్రేళ్ళుగల పుడిసిలి (కమికిలి). 2. కబళనము. 3. తృప్తి.

కమికిలి వి. వంపబడిన వ్రేళ్ళుగల పుడిసిలి.

కమిటీ ఇం. వి. (Committee). సంఘము, కార్యవర్గము.

కమిఁచు క్రి. 1. కవియు. 2. వ్యాపించు. 3. ఊఁటేయు. 4. మ్రింగు. 5. కొరుకు. 6. ఆస్వాదించు.

కమిసారియట్ ఇం. వి. (Commissariat) 1. సేనలకు ఆహారపదార్థములు మొ.వి సరఫరాచేయు సైనిక శాఖ. 2. రష్యా ప్రభుత్వశాఖ.

కమిసార్ ఇం. వి. (రాజ.) (Commissar). రష్యా ప్రభుత్వములో ఏశాఖకైనను చెందిన ఉన్నతోద్యోగి. రష్యాదేశమంత్రి, పరిషత్తులోని సభ్యుడు.

కమిషన్ ఇం. వి. (రాజ శాస.) (Commission). 2. ఒక వ్యవహారమును విచారించుటకు, ప్రభుత్వము, కొన్ని ప్రత్యేకాధికారముల నిచ్చి, నియమించిన సంఘము. 2. ఇద్దరు వ్యక్తుల మధ్య వ్యవహారమును తీర్చినందులకు మధ్యవర్తి తీసికొను ధనము. 3. ఒక వర్తకుడు మఱియొక వర్తకునికి సరకులుకొని పంపుటకు లేక అమ్మిపెట్టుటకు నూటి కింత అని తీసికొను తరుగు. 4 (వాణి.) వ్యాపారులచే వారి ప్రతినిధుల కీయబడు ప్రతిఫలము.

కమ్మ వి 1. తాటియాకు. 2. తాటంకము. స్త్రీల కర్ణభూషణము. 3. జాబు. 4. ఒక కులము. విశే. పుల్లనిది లేక కమ్మగా (ఇంపుగా) నుండునది.

కమ్మగాడుపు వి. మలయమారుతము.

కమ్మచ్చునఁదీయుట వి. (జాతీ.) లొంగదీయుట.

కమ్మటము వి. కమసాలి కుంపటి.

కమ్మటీఁడు వి. కమసాలి.

కమ్మనిమ్మ వి. తియ్యనిమ్మ.

కమ్మనీరు వి. పూదేనె. మకరందము.

కమ్మనూనియ వి. సంపెగ. మొ.ని చేర్చి చేసిన తైలము. రూ. కమ్మనూనె.

కమ్మపంజులు వి. రత్నతాటంకము, కమ్మపువ్వు.

కమ్మపిల్లి వి. పునుగు పిల్లి.

కమ్మర వై. వి ఇనుప పనిచేసి బ్రతుకుజాతి కమ్మరి. సం. కర్మారః

కమ్మరీఁడు వై. వి. బాణములు చేయువాడు, సం. కర్మారః

కమ్మవిలుకాఁడు వి. మరుడు, కమ్మవిల్తుడు.

కమ్మవిల్తుఁడు వి. మన్మథుడు.

కమ్మి వి. ఇనుము మొ.గు లోహపు కడ్డీ.

కమ్ము వై. క్రి. 1, చుట్టుకొను, 2.కమ్మిగా సాగగొట్టు.

**కమ్మెరాకు** వి. కాచపు నల్ల తమలపాకు.
**కమ్యూనిజం** ఇం. వి. (రాజ) (Communism). 'కార్ల్‌మార్క్స్' రచించినసామ్య వాద సిద్ధాంతము, సంఘసామ్యము. పుంజీ విధానమును, వర్గభేదములను విప్లవము ద్వారా నిర్మూలించి సర్వసమాన సంఘ స్వామ్యము నెలకొల్పవలయు ననువాదము.
**కమ్యూనులు** ఇం వి. (రాజ.) (Communes) చైనా కమ్యూనిస్ట్ ప్రభుత్వము నడుపు సమష్టి జీవిత విధానము.
**కమ్రము** సం. విణ. ఇంపైనది. వి. పిడకనిప్పు.
**కయి** వి. 1. చేయి, హస్తము. 2. (వై) చతుర్థీ విభక్తి ప్రత్యయము.
**కయికానుక** వి. రాజులను చూడబోవునపుడు కొనిపోవు కానుక.
**కయికొను** క్రి. 1. పూను 2. పుచ్చుకొను. 3. లక్ష్యపెట్టు.
**కయికోలు** వి. అంగీకారము, సమ్మతి.
**కయిదండ** వి. హస్తావలంబము. రూ. కైదండ.
**కయిఫీయతు** హిం. వి. వాఙ్మూలము, కవిలె గ్రంథము.
**కయిమోడుపు** వి. నమస్కారము.
**కయివడి** వి. ప్రకారము, విధము. రూ. కైవడి.
**కయివారము** వి. పొగడిక.
**కయివ్రాలు** క్రి. పతులు మొ.వి క్రిందికిదిగు. ఒరగు. వి. చేవ్రాలు.
**కయిసేత** వి. అలంకారము. రూ. కైసేత.
**కయ్య** వి. 1. చిన్ననీటికాలువ. 2. మడి.
**కయ్యపుదిండి** వి. (కయ్యము+తిండి) కలహాభోజనుడు, నారదుడు.
**కయ్యము** వి. జగడము, యుద్ధము.
**కయ్యర** వి. తక్కువజాతి ముత్యము.
**కయ్యాలమెకము** వి. జంబుకము,
**కర**[1] వి. తీరము.
**కర**[2] వై. విణ. తీక్ష్ణము. సం. ఖరమ్.
**కరంకము** సం. వి. 1. పుర్రె. 2. లోపల నేమియు లేని బొండ్లపుచిప్ప. 3. తల. 4. కంకాళము.
**కరంజము** సం. వి. కానుగుచెట్టు.
**కరండము** సం. వి. 1. కత్తి. 2. తేనెపెర. 3. పేటిక.
**కరగించు** క్రి. కరగజేయు.
**కరగు** క్రి. ద్రవమగు. వి. కరుగుట.
**కరక**[1] సం. వి. వడగల్లు.
**కరక**[2] వి. ఒకానొక అడవిచెట్టు, హారీతకి.
**కరకంచు** వి. కరక్కాయ నీటితో వ్రాసిన అంచు.
**కరకము** సం. వి. 1. ఎముకలగూడు. 2. కమండలువు. 3. దానిమ్మ. 4. పఱి. వడగల్లు.
**కరకర** వి. వ్రాయుట, నమలుట యందు గల ధ్వన్యమకరణము.
**కరగ్రహణము** సం. వి. పెండ్లి, పాణిగ్రహణము.
**కరజము** సం. వి. పులిగోరు, గోరు.
**కరట** సం. వి. 1. ప్రయాసచే పిదుకదగిన ఆవు. 2. కాకి.
**కరటము** సం.వి. 1. కాకి. 2. గోదురుకప్ప. 3. ఒకరకపువాద్యము. 4. కుసుమపువ్వు. 5. మాలేకు.
**కరటి** సం. వి. ఏనుగు, హస్తి.
**కరడు** వి. అల, కెరటము.
**కరణకమ్మలు** వి. బ్రాహ్మణులలో నొక తెగవారు.
**కరణము**[1] సం. వి. 1. గణకుడు. 2. కారణము. 3. పని. (త్రికరణములు-మనస్సు, వాక్కు, శరీరము).
**కరణము**[2] సం. వి. (వ్యాక.) పనిని సిద్ధింప చేయుటయందు ఉపయోగించు సాధనము, ఉదా. కత్తిచేత ఖండించెను. ఖండిచుట

అనెడు పనిని సిద్ధింప చేయుట యందు కత్తి ముఖ్య సాధనము కావున కత్తి కరణము

**కరణి** వి. విధము, రీతి.

**కరణిచిహ్నము** వి. (గణి.) వర్గమూలము ఘనమూలము మొ. మూలములను సూచించు గుర్తు (Radical sign).

**కరణీయము** సం. విశ. చేయదగినది, కర్తవ్యము.

**కరణీయసంఖ్య** సం. వి. (గణి.) సహజ సంఖ్యలచే గణ్యము కాని లేదా రెండు పూర్ణాంకముల భాగహార ఫలముగా కచ్చితముగా చూపుటకు వీలులేని సంఖ్య (Surd). ఉదా. $\sqrt{2}$, $\pi = 22/7$.

**కరతలము** సం. వి. అరచేయి.

**కరతలామలకము** సం. వి. జాతి. అరచేతిలోని ఉసిరికాయ,సులువుగ అధీనమగునది.

**కరతాళము** సం. వి. అరచేతులు తట్టుటచే కల్గు ధ్వని, చప్పట్లు.

**కరతిత్తి** వై. వి. వక్కపొడి పాకుల సంచి, తమలపాకులు మొ.వి. ఉంచుకొను చేతిసంచి. సం. కరదృతిః.

**కరదివియ** వై. వి. కాగడా. సం. కరదీపికా.

**కరపత్రము** సం.వి. 1. క్రకచము, రంపము 2. జలక్రీడ 3. ప్రకటన పత్రము.

**కరపాలము** సం. వి. కరవాలము, కత్తి.

**కరపుచ్ఛ** వి. కర్బూజా.

**కరభము** సం. వి. 1. మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదలుదాక చేతి వెలుపలి చోటు. 2. ఒంటెపిల్ల.

**కరభాస్థులు** సం. వి. (శం.) అరచేతి ఎముకలు. (Metacarpal Bones).

**కరభీరము** సం. వి. సింగము.

**కరమాలము** సం. వి. 1. ధూపము, 2. మబ్బు.

**కరము[1]** సం. వి. 1. చేయి. 2. కిరణము. 3. తొండము. 4. కప్పము.

**కరము[2]** అవ్య. మిక్కిలి, కడు, అత్యంతము.

**కరరుహము** సం. వి. నఖము. గోరు.

**కరవాఁడి** విశ. మిక్కిలి వాడిగలది

**కరవాలము** సం. వి. కత్తి.

**కరవీరము** సం. వి. 1 .కత్తి . 2. గన్నేరు.

**కరశాఖ** సం. వి. వ్రేలు.

**కరాళము** సం. విశ. వెరపు పుట్టించునది.

**కరాళించు** క్రి. 1. బొబ్బరించు. 2. సకిలించు, నిందించు.

**కరి[1]** సం. వి. 1. ఏనుగు. 2. కోతి.

**కరి[2]** వి. 1. నిదర్శనము. 2. మేర. విశ. సాక్షి.

**కరిణీప్రసవన్యాయము** సం. న్యా. పందికి పదిపిల్లలు పుట్టుట కన్న ఏనుగుకు ఒక పిల్ల పుట్టుట మేలు అను భావము.

**కరిబన్ సంఘము** మి. వి. (రాజ.) కరిబన్ (Caribean) సముద్ర ప్రాంతమున తమ వాణిజ్య, సాంఘిక వ్యవహారములను పెంపొందించుటకు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, నెదర్లాండ్స్ దేశముల మధ్య క్రీ.శ. 1942సం.లో జరిగిన ఒప్పందము.

**కరిముఖుడు** సం. వి. వినాయకుడు

**కరివేపాకు** వి. (వ్యావ.) పరిమళము నిచ్చుటకై ఆహార పదార్థముల యందు వాడు ఆకు. నారింజ కుటుంబము (Rutaeeae) నకు చెందిన Murraya koenigii అను చెట్టుయొక్క ఆకు (Curry leaf).

**కరిరఫలిని** సం. వి. నారికేళము.

**కరీషము** సం. వి. 1. ఎరువు. 2. పరు పిడక. 3. గోమయము.

**కరుడు** సం. వి. 1. కనికరము. 2. దయ.

**కరుణించు** సం. క్రి. కనికరించు.

**కరువలి** వి. గాలి.

కరువలిపట్టి వి. (గాలిచూలి.) 1. భీముడు. 2. ఆంజనేయుడు.

కరువలివిందు వి. వాయుసఖుడు, అగ్ని.

కరువు[1] వి. 1. ఒకతపాసెడి అచ్చు. 2.మూస

కరువు[2] వై. వి. గర్భము. సం గ ర్భః.

కరెంట్ అకౌంట్ ఇం.వి.(అర్థ.)(Current Account) ప్రస్తుతపుకాతా, బాంకులో నున్న కరెంట్ డిపాజిట్ కాతా.

కరెంటు డిపాజిట్లు ఇం.వి (అర్థ.) (Current Deposits) వ్యావహారిక నిక్షేపములు. (ఈనిక్షేపములపై సాధారణముగ ఖాతా దారునికి వడ్డీరాదు. ఇట్టి నిక్షేపములను కావలసినపుడు చెక్కు ద్వారా ఖాతా దారుడు తీసికొనవచ్చును).

కరెన్సీ ఇం. వి. అర్థ (Currency) చెలా మణిలో నున్న ద్రవ్యము, ప్రభుత్వా మోదముచే ఉపయోగములో నున్న రొక్కము.

కరెన్సీనోట్లు ఇం. వి. (అర్థ.) (Currency Notes) కాగితపు ద్రవ్యము (ప్రభుత్వాధి కారమువలన ద్రవ్యముగా పరిగణింపబడు ఈ నోట్లకు అంతర్యపువిలువ వాని చెలా మణి విలువకన్న చాల తక్కువగ నుండును).

కరేణువు సం. వి. ఆడేనుగు.

కరోడ్గిరినాకా హిం. వి. (శాస.) ఎగుమతి దిగుమతి సరకులపై సుంకము తీసుకొను స్థలము.

కరోనర్ సం. వి. (శాస.) (Coroner) దుర్మ రణ విచారణాధికారి,

కర్కటకము సం. వి. 1, ఎండ్రకాయ. 2. కర్కటరాశి.

కర్కటరేఖ సం. వి. (భూగో.) భూమధ్య రేఖకు ఉత్తరమున 23 ½° లో ఉన్న రేఖ (Tropic of cancer).

కర్కము సం. వి. 1. అందము. 2.అద్దము. 3. అగ్ని.

కర్కశము సం. వి. 1. కరకు. 2. ఇతువు. విశ. 1. గట్టిది. 2. నొప్పించునది. 3, కనికరము లేనిది.

కర్కసము సం. (గృహ.) నడుచునప్పుడు వస్త్రములుచేయు శబ్దము.

కర్కోటకము సం. వి, 1. మారేడు. 2 ఒకపాము.

కర్ణతారుఁడు వి. ఓడవాడు, సరంగు.

కర్ణధారుడు సం వి. సరంగు.

కర్ణపత్రము సం.వి. చెవితమ్మ.

కర్ణభేరి సం. వి 1. (శారీ) చెవి యొక్క మధ్యభాగము. మధ్య కర్ణకుహరమును బయటిదానినుండి వేరుచేయు పొర (Ear-Drum) 2. (జం.) శబ్దములను వినుట కుపయోగించు కంపనశక్తి గల పొర, చెవిలో నుండు డోలువంటి నిర్మా ణము (Tympanum).

కర్ణము[1] సం.వి. 1. చెవి. 2. చుక్కాను.

కర్ణము[2] సం. వి. (గణి.) లంబకోణ త్రిభుజ ములో లంబకోణమునకు ఎదురుగా నున్న భుజము (Hypotenuse).

కర్ణరసాయనము సం. విశ. (జాతీ.) చెవుల కింపైనది. కర్ణపేయము,

కర్ణసంబంధము సం. విశ. చెవికి సంబంధించి నది (Auditory).

కర్ణానుజుఁడు సం. వి. యుధిష్ఠిరుడు, ధర్మరాజు, కర్ణుని తమ్ముడు,

కర్ణాశ్మములు సం. వి. (జం.) అంతర్లసిక ములో నుండు స్ఫటికాకారమైనసున్నపు సంబంధమగు రేణువులు (Otoliclas, ear Stones).

కర్ణిక సం. వి. 1.చెవికమ్మ 2.తామరదుద్దు.

కర్ణికలు సం. వి. (జం.) 1. హృదయము లోపల జఠరికల పైభాగమున నున్న రెండుకుహరములు, 2. బయటి చెవులు.

కర్ణుఁడు నం. వి. కుంతి పెద్దకొడుకు.
కర్ణ్ణము నం. వి. గులిమి, గుబిలి.
కర్త నం. వి. బ్రహ్మ. విశ. చేయువాడు.
కర్తనము నం. (గృహ) కత్తిరించుట, గొఱ్ఱెబొచ్చు మొ నిక త్తిరించుట (Shearing)
కర్తరి నం. వి. కత్తెర.
కర్తవ్యము నం. విశ. చేయతగినది.
కర్తృత్వము నం.వి కర్తృభావము
కర్త్రర్థకవాక్యము నం. వి. (వ్యాక) క్రియ కర్తను బోధించుట గల వాక్యము దీనినే కర్తరిప్రయోగమందురు. (Active-voice) ఉదా. రాముడు రావణుని చంపెను.
కర్దమము నం. వి. అడుసు, పంకము, బురద.
కర్నల్ ఆం. వి. (Colonel) సేనాగిపతి, ఒక సైనికదళమునకు అధికారి
కర్పటము నం. వి. 1. చినిగిన బట్ట, 2. మాసినగుడ్డ.
కర్పరము నం. వి. 1. వెడల్పు ముఖము గలపాత్ర. 2. భిక్షాపాత్రము. 3. (శం.) కపాలము, పుఱ్ఱె (Cranium).
కర్పూరము నం.వి. ఘనసారము, కప్పురము,
కర్ఫ్యూ ఆం. వి. (రాజ.) (Curfew) తీవ్ర పరిస్థితులయందు ప్రజల రాకపోకలను నిషేధించుచు ప్రభుత్వము జారీచేయు కఠినశాసనము.
కర్బనద్విగంధకిదము నం వి. (వ్యావ.) ఇది కర్బనము గంధకములతో గూడిన ఒకరసాయన ద్రవ్యము ($CS_2$) corbon-di-sulphide విత్తుము ప్టట్టివ కీటకము లను నాశనము చేయుటకును నిలువ చేసిన ధాన్యమునకు పురుగు పట్టకుండుట కును ఈ రసాయనద్రవ్యము యొక్క పొగ బెట్టుదురు.
కర్బనపచనము నం. వి. (వృక్ష.) గాలిలో నుండు కర్బనద్విఆమ్లజనిదము (Carbon di-oxide)ను తీసికొని ఆహారములోనుప యోగించుకొను Corbon assimilation
కర్బనము నం. వి. (రసా) ఉద్భిజ్జ, జంతు సంబంధ మగు (సేంద్రియ) పదార్థము లన్నిటియందును గల ముఖ్యమగు మూల ద్రవ్యము. అంగారము, బొగ్గు, అధాతు మూలద్రవ్యము, ఆవర్తకమపట్టికలో నాల్గవ వర్గములోనిది. (Corbon)
కర్బనరసాయనశాస్త్రము నం. వి. (రసా.) కర్బనము ప్రధానఘటముకగా గల యౌగికముల రచన. లక్షణముల వివరించు శాస్త్రము.
కర్బనామ్లము నం. వి. (రసా.) కర్బన మూల ద్రవ్యము నుండి ఉత్పన్నమైన ఆమ్లము (Corbonic acid).
కర్బనోదజనితము నం. విశ. (రసా.) పిండి పదార్థము, కర్బనము (Corbon), ఉదజని (Hydrogen). ఆమ్లజని (Oxygen) రసాయనిక ఘటకములుగా గల పోషక పదార్థము (Carbo-hydrate), ఉదా. పిండి, చక్కెర. సెల్యులోస్ మొ. వి.
కర్బురము నం.వి. 1. జలము, 2. బంగారము విశ. చిత్రవర్ణములు గలది.
కర్మ[1] నం. (వ్యాక.) ధాతువుయొక్క అర్థమైన ఫలమునకు ఆశ్రయమైనది. ఉదా. వాడు అన్నము వండెను. వండుట అను పనికి అన్నమగుట ఫలము. ఈవాక్యములో అన్నము కర్మ.
కర్మ[2] నం. వి. (భౌతి.) పబలప్రయోగ బిందువు కొంత దూరము ఆ బలము పని చేయు దిక్కునసే జరుగునో ఆబలము సాధనముగ ఒక ఫలమును జనింపజేయు క్రియ.(Work). (బలమును బలప్రయోగ బిందువు జరిగిన దూరముచే గుణించినచో ఫలిత-కర్మ=(పని) లభ్యమగును).
కర్మంది నం. వి. యతి.

**కర్మకారుఁడు** నం. వి. ఇనుప పని చేయువాడు. వికృ. కమ్మరి.

**కర్మధారయము** నం.వి. (వ్యాక.) విశేషణమునకు విశేష్యము తోడి సమాసము, ఉదా. మంచిమాట, నల్లని పువ్వు.

**కర్మభూమి** నం.వి. కర్మాచరణమం దెక్కువ ఆదరణ గల భూమి, ఆర్యావర్తము.

**కర్మము** నం. వి. 1. ప్రయోజనము. 2. కార్యము పని, షట్కర్మములు:— యజనము, యాజనము, అధ్యయనము. అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము. షోడశకర్మములు - గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము. వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము. (వ్యాక.) ద్వితీయా కారకము.

**కర్మయుగము** నం. వి. కలియుగము.

**కర్మసాక్షి** నం. వి. సూర్యుడు. వ్యు. జీవుల కర్మలకు సాక్షియైనవాడు.

**కర్మాగారము** నం. వి. పరిశ్రమాలయము.

**కర్మాచరణ భాగస్వామి** నం. వి. కార్య నిర్వాహక భాగస్వామి. (Working partner).

**కర్మార్థకవాక్యము** నం. వి. (వ్యాక.) క్రియచే కర్మ చెప్పబడుట గల వాక్యము. దీనినే కర్మణిప్రయోగ మందురు (Passive (Voice). ఉదా. రావణుడు రామునిచే చంపబడెను.

**కర్మిష్ఠుఁడు** నం. విశే. 1. కర్మయందు అధిక నిష్ఠగలవాడు, 2. పనియందు నేర్పరి.

**కర్వటము** నం. వి. ప్రధాన నగరము. (కోట, అగడ్త అను వానిచే దుర్గమమైనది).

**కర్షకుఁడు** నం. విశే. 1. దున్నుకొని బ్రతుకువాడు. 2. ఈడ్చువాడు. నం. వి. కుజుడు, అంగారకుడు.

**కర్షణము** నం. వి. 1. ఈడ్చుట. 2. దున్నుట. 3. ఒరపిడి.

**కళ** వై. వి 1. నలుపు. 2. మరక. నం. కాలః.

**కళకంఠుఁడు** వై. వి. నీలకంఠుడు, శివుడు.

**కళకటి** వి. 1. దుఃఖము. 2. బాధ. 3. బలాత్కారము.

**కళటి** విశే. 1. దబ్బరకాడు. 2. వంచకుడు.

**కళవు** వి. కాటకము, క్షామము, దుర్భిక్షము.

**కళివేలుపు** వి. కృష్ణుడు, నల్లనయ్య.

**కఱ్ఱ** వి. కొయ్య, పుల్ల, దండము.

**కఱ్ఱి** వై. వి. అర్జునుడు, విశే. నల్లనివాడు, నల్లనిది. నం. కాలః.

**కఱ్ఱు** వి. నాగటి దుంప యందు అమర్చెడి ఇనుప పాళము.

**కల**[1] నం. వి. 1. కళ. 2. భాగము. 3. చంద్రునిలో పదునారవ భాగము. **విశే.** అవ్యక్త మధుర స్వరము.

**కల**[2] వి. స్వప్నము.

**కలంకారి** వి. 1. పాత్ర. 2. అద్దకపు పనిగల వస్త్రము.

**కలందాను** హిం.వి. వ్రాతకలములుంచు పెట్టె.

**కలఁకఁబాఱు** క్రి. కలతపడు.

**కలఁచు** క్రి. కలఁగఁజేయు.

**కలఁత** వి. 1. క్షోభము. 2. సంతాపము.

**కలకంఠము** నం. వి. 1. కోయిల. 2.పారావతము. 3. హంస. వ్యు. మధురమైన కంఠము కలది.

**కలకండ** వి. 1. మధుశర్కర. 2. పటికబెల్లము.

**కలకలము** నం. వి. గుంపున పుట్టిన పెద్ద మ్రోత.

**కలకాలము** మి. వి. ఎల్లప్పుడు.

**కలగలపు** క్రి. కలియగలుపు. వి. కల్పుగోలుతనము.

కలగుండు వి. 1. కలఁత. 2. సంతాపము.
కలధౌతము నం. వి. 1. వెండి. 2. బంగారము.
కలధ్వని నం. వి. 1. అవ్యక్త మధుర ధ్వని. 2. కోయిల. 3. నెమలి.
కలన నం. వి. 1. పొందుట. 2. జ్ఞానము. 3. విప్పుట,
కలను వై. వి. 1. యుద్ధము. 2. స్థానము. నం. 1. ఖలః. 2. ఖలమ్.
కలప వి. ఇల్లు కట్టుటకు ఉపయోగపడు దూలములు వాసములు మొ.వి.
కలపజాతి వృక్షములు మి. వి. (వ్యవ.) గృహ నిర్మాణమునకు గాని కట్టె సామ గ్రికి గాని ఉపయోగపడు కలప నిచ్చు చెట్లు (Timber trees), ఉదా. తాడి, టేకు, మద్ది, సాల, చంద్ర మొ. వి.
కలపదము వి. 1. ఒక సంఖ్యతో నింకొకటి కలుపుట, కూటము. 2. ఒకటితో నొకటి కలియుట.
కలబంద వి. 1. ఒక రకమైన మొక్క. 2. గృహకన్య.
కలభము నం వి. ఏనుగు గున్న.
కలమము నం. వి. 1. కలము. 2. వరిపైరు.
కలయంపి వి. దుమ్ము అడగుటకు చల్లు పేడనీళ్ళు. రూ. కలాపి, కలవడము
కలరవము నం. వి. పావురము.
కలరా ఇం వి. (గృహ.) (Cholera) వాంతి భేది. (ఇది నీటి ద్వారా వ్యాపించు ప్రాణాపాయకరమైన జాడ్యము.)
కలరూపు వి. యాథార్థ్యము, నిజము.
కలవరపడు క్రి. కలతపడు.
కలవరము వి. 1. సంతాపము. 2. కలత.
కలవరించు క్రి. మైమరచి మాటాడు.
కలవాఁడు విశ. 1. ఆప్తుడు. 2. ధనవంతుడు. 3. శక్తుడు.
కలశము నం. వి. ఘటము, కుండ.
కలశాబ్ధి నం. వి. పాల సముద్రము.
కలహంస నం. వి. 1. కాదంబము, ధూమ్ర వర్ణముగల రెక్కలు గల హంస, రాజ హంస, 2. హంస.
కలహము నం. వి. సమరము. వికృ. కయ్యము.
కలాదుఁడు నం. వి.1. స్వర్ణ కారుడు, కంసాలి. 2. చంద్రుఁడు 3. గురుపు, ఉపా ధ్యాయుడు.
కలాయి హిం. వి. పాత్రలకు తగరము పూయుట. రూ. కళాయి.
కలాసి హిం. వి. ఓడమీదిపనివాడు.
కలి నం. వి. 1. కయ్యము, కలియుగము, 4,32,000 సంవ. ల కాలము.
కలింగుఁడు నం. విశ. నేర్పరి.
కలికి వి. 1. ఆడుది. 2. మనోజ్ఞురాలగు స్త్రీ. విశ. మనోజ్ఞము.
కలిమి వి. 1. అతిశయము. 2. సంపద.
కలియు క్రి. పొందు.
కలిలము నం. విశ. 1. చొరరానిది. 2. ఎరుగరానిది. వి. గంద్రగోడ్డలి. రూ. కలలము.
కలుపుతీయుట వి. (వ్యవ.) చేనిలో పెరిగిన కలుపుమొక్కలను తీసివేయుట (Weeding).
కలుపుమొక్కలు వి. (వ్యవ.) మడిలో సాగుచేయబడుచున్న మొక్కలు గాక అచట బయలుదేరిన ఇతర జాతి మొక్కలు (Weeds).
కలువ వై. వి. ఉత్పలము. రూ. కల్వ. నం. కైరవమ్.
కలువకంటి వి. కలువరేకులవంటి కన్నులు గల స్త్రీ.
కలువదము వై. వి. (కలువ+వడము) ఉత్సవములలో కట్టెడు బంగారు కలువ పూదండ, నం. కైరవ వటః.

కలువము వి. మందునూరెడు రాయి. చూ. కల్వము.

కలువరాయఁడు వై. వి. చందమామ.

కలుషము నం.వి. పాపము.

కలెక్టర్ ఇం.వి. (Collector)జిల్లాకుఅధికారి.

కల్కనము నం.వి. (రసా.) మడ్డి దిగునట్లు చేయుట (Sedimentation).

కల్కము నం. వి. (రసా.) ఒక ద్రవ్యములో మడ్డివలె క్రిందికి దిగు ద్రవ్యము.

కల్కి నం. వి. దశావతారములలో ఒక అవతారము.

కల్తీ హిం. విశ. కలపడము, మిశ్రమము (Adulteration).

కల్పన నం. వి. కల్పించుట.

కల్పము నం. వి. బ్రహ్మదినము, 2. ప్రళయము. 3. శస్త్రము.

కల్పితము నం. విశ. (గణి.) ఊహింపబడినది (Hypothetical).

కల్మషము నం. వి. 1. కసటు, 2. పాపము. 3. నలుపు. విశ. 1. నల్లనిది. 2. కలకబారినది.

కల్మాషకంఠుఁడు నం. వి. ముక్కంటి. శివుడు. వ్యు. నల్లని కంఠము కలవాడు.

కల్మాషపాదుఁడు నం. వి. ఇక్ష్వాకు కులుడగు ఒక రాజు.

కల్యము నం వి. 1. వేకువ. 2. ఉపాయము.

కల్యవర్తము నం. వి. ప్రాతఃకాల భోజనము

కల్యాణము నం. వి. 1. క్షేమము. 2. శుభము. 3. పెండ్లి.

కల్యాణి నం.వి. 1. గౌరి. 2. నేల. 3. ఒకానొక రాగము. 4. ఆవు.

కల్ల వి. 1. అసత్యము. 2. పరుషవచనము.

కల్లఁడు నం. విశ. చెవిటి, బధిరుడు.

కల్లు[1] వి. 1. బండికన్ను (చక్రము). 2. శిల. 3. కన్ను.

కల్లు[2] వై.వి. మద్యము. నం. కల్యమ్.

కల్లోలము నం. వి. 1. పెద్దఅల. 2.ఆనందము

కల్లోలిని నం. వి. ఏరు, నది.

కల్వము వి. (రసా.) ప్రయోగశాలలో ఘనద్రవములను చూర్ణము చేయుటకు ఉపయోగ్యమగు పాత్ర, దీనిని పింగాణి, ఇనుము, ఏగేటురాయి వీనితో చేయుదురు (Mortar).

కల్హారము నం. వి. మిక్కిలి పరిమళము గల కలువ.

కవ వి. 1. జత. 2. కవలలు.

కవకశాస్త్రము నం. వి. (వ్యవ.) శిలీంధ్రముల జీవితమును గూర్చి తెలియజేయు శాస్త్రము (Mycology).

కవచము నం. వి. 1. బొందలము, తనుత్రాణము, 2. తప్పెట. 3. ఒక రకమైన మంత్రము.

కవట వి. పెద్దకొమ్మ. విశ. లేత.

కవనము నం. వి. కవిత్వము.

కవలు వి. జంటగా బుట్టినవారు. అమడలు (కుశలవలు, నకుల సహదేవులు).

కవాటము నం. వి. 1. తలుపు. 2. (భౌతి.) ఒకవైపునకు పోయిన వాయు పదార్థము లను గాని, ద్రవ పదార్థములనుగాని, వెనుకకు రాకుండ అడ్డుకొనుచు ఒకేవైపునకు తెరచుకొనియుండు తలుపు (Valve)

కవాటిక నం. వి. (జం.) ఒకే వైపునకు తెరచుకొను ద్వారము (Valve).

కవాతు హిం. వి. కసరతు, సైన్యముచేయు కసరత్తు.

కవాప్యము నం. వి. (వృక్ష) పాచి, ఒక శైవలము, ఒక శిలీంధ్రము, రెండును (Lichen)కలిసి సహకార జీవనము చేయు నిర్మాణము (ఇదిచెట్ల



కవాప్యము

కాండములు, కట్టె దుంగలు, రాళ్ళు, గోడలు మొ. వానిపై వివిధములగు రంగులు గల పెచ్చులుగా ఏర్పడు చుండును).

**కవి** నం. వి. 1. కావ్యకర్త. 2. శుక్రుడు 3. వాల్మీకి. 4. నీటికాకి.

**కవిత్వము** నం. వి. కవిత.

**కవిలె** వి. గంటముతో వ్రాసిన తాటాకుల లెక్క పుస్తకము, గ్రంథము.

**కవుఁగిలి** వై. వి. 1. ఆలింగనము. 2. భుజాంతరము. రూ. కౌగిలి. నం. క్రోడః.

**కవోష్ణము** నం. వి. ఇంచుక వేడిమి, మందోష్ణము. విశే. ఇంచుక వేడి గలది, నులి వెచ్చనిది.

**కవ్యము** నం.వి. పితృదేవతలకిచ్చు అన్నము.

**కవ్వపుఁగొండ** వి. (కవ్వము+కొండ) మంథరగిరి,

**కవ్వము** వి. పెరుగు చిలుకు సాధనము.

**కశ** నం. వి. గుఱ్ఱము మొ. వానిని కొట్టు కొరడా.

**కశము** నం. వి. (జం.) చలనమున కుపయోగించుచు, జీవకణమున కున్న పొడవైన కొరడావంటి అవయవము (Flagellum)

**కశ్మలము** నం. విశే. మలినము. వి. 1. మూర్ఛ. 2. బోయపల్లె.

**కషాయము** నం. విశే. (రసా.) వగరు రుచి కలది. (Astringent). ఉదా. పటిక. వి. 1. వగరు. 2. ఓషధులు వేసి కాచిన నీరు. విశే. 1. వాసనగలది. 2. ఎఱ్ఱనిది.

**కష్టము** నం. వి. 1. దుఃఖము. 2. దోషము. 3. పాపము.

**కసరు** క్రి. కోపించు. వి. వానగాలి.

**కసవు** వై.వి. గడ్డి, తృణము. నం. ఘాసః.

**కసాయి** హిం. వి. మాంసము అమ్మువాడు, కటికవాడు.

**కసాయిచెత్త** మి. వి. (వ్యవ.) కసాయి అంగళ్లలో పారవేయు పనికిమాలినచెత్త. (ఇందు నత్రజని ఎక్కువగ నుండును).

**కసి** వి. 1.కోపము. 2. దురద. 3. కోరిక.

**కసిమసఁగు** క్రి. 1. ఖండించు. 3. చంపు, సంహరించు.

**కసుఁగందు** వి. లేత బిడ్డ, పసికూన.

**కసుగందు** క్రి. (కందు+కందు) 1.మిక్కిలి వాడు. 2. బాధపడు.

**కసుగాయ** వి. లేతకాయ.

**కస్టమ్స్** ఆం. వి. (శాస,అర్థ) (Customs) ఎగుమతి దిగుమతులపై పన్ను.

**కస్టర్డ్ పుడ్డింగ్** ఆం వి. (గృహ) (Custard-Pudding) పాలు, గ్రుడ్డు, చక్కెర కలిపి ఆవిరిమీదవండినపదార్థము (ఇది భోజనానంతరమిచ్చు తీపి పదార్థము).

**కస్తి** 1. కష్టము. 2. వగ. 3. దుఃఖము. 4. విపత్తు.

**కస్తూరి** నం. వి. మృగమదము. వికృ. కస్తురి.

**కళ** నం.వి. 1. 8 సెకనులకాలము, 2. చంద్రకళ. 3. ఒకపాలు. 4. శిల్పులనైపుణ్యము 5. ద్రుతాంతము కాని పదము.

**కళంతము** నం. వి. మచ్చ.

**కళత్రము** నం. వి. 1. పెండ్లాము. 2. కోట. 3. నితంబము. (జ్యోతి.) లగ్నమునకు ఏడవస్థానము.

**కళవసము** వి. తోలు. రూ. కళాసము.

**కళకళపాటు** వి. కలతపాటు. తొట్రుపాటు.

**కళాకుశలము** నం. విశే. (గృహ.) 1. చమత్కారమైనది. 2. కళాపూర్వకమైనది. 3. నాగరికత గలది. (Artistic).

**కళాగహనము** నం. వి. (జం.) కర్ణప్రావరములో నున్న లోపలిచెవి (Membranous labyrinth),

**కళానిధి** నం.వి. చంద్రుడు.

**కళాయి** వి. ఇత్తడి మొ. పాత్రలకుపూయు సీసపు పూత. రూ. కలాయి.

కళాసము వి. చూ. కళవసము.

కళేబరము సం. వి. మేను, శరీరము.

కళ్యము వై. వి. గుఱ్ఱమునకు నోట దగిలించు కళ్ళెము రూ కళ్ళియము, కళ్ళెము. సం. ఖలీనః.

కళ్ళము వై. వి. ధాన్యము నూర్చెడిచోటు. రూ కళ్లాము సం. ఖలః

కళ్ళెము వై. వి. చూ. కళ్యము. నా. చిక్కుల గుఱ్ఱమునకు కక్కుల కళ్ళెము.

## కా

కా వి. కాకి అరచుటయం దగు ధ్వన్యనుకరణము, విశే. కుత్సిత శబ్దమునకు వచ్చు ఆదేశము. ఉదా. కాపురుషుడు మొ. వి. అవ్య. కదా.

కాంక్రీట్ ఇం. వి. (Concrete) 1. అమూర్తముకానిది. 2 గులకరాళ్లు సిమెంటు మొ.వి. కలిసిన మిశ్రమము.

కాంక్ష సం.వి. కోరిక, వాంఛ.

కాంక్షితము సం. విశే. కోరబడినది.

కాంచనకదళి సం. వి. బంగారపుఅరటి.

కాంచనగిరి సం.వి. బంగారు కొండ, మేరు పర్వతము.

కాంచనము సం. వి. 1. బంగారము, 2. ఉమ్మెత్త. 3. సంపెగ.

కాంచి సం. వి. 1. స్త్రీలు ధరించెడు ఒంటిపేట మొలనూలు. 2. కాంచీపురము (పుణ్యనగరము లేడింటిలో ఒకటి).

కాంచు క్రి. 1. చూచు, వీక్షించు. 2.పొందు.

కాంజి సం. వి. పులి కడుగు. వికృ. గంజి.

కాండకంటకము సం. వి. (వృక్ష.) శాఖగా పెరగవలసిన మొగ్గ మార్పుచెంది అయిన ముల్లు (Stem spine).

కాండకందము సం. వి. (వృక్ష.) భూమిలో నున్న కాండపు శాఖ చివర ఆహారపదార్థములతో ఉబ్బిన గడ్డ. ఉదా. ఆలుగడ్డ.

కాండత్రయము సం. వి. 1. జ్ఞానము. 2. కర్మ. 3. ఉపాసన.

కాండపటము సం. వి. తెర.

కాండపునులితీగ మి. వి. (వృక్ష.) శాఖగా పెరగ వలసిన మొగ్గ మారి అయిన నులితీగ (Stem tendril).

కాండము సం. వి. 1. గ్రంథభాగము, కావ్యపరిచ్ఛేదము.(రామాయణమునందు షట్కాండములుగలవు) 2. సమూహము. 3. బాణము. 4 జలము. 5.ఈనె. 6.బోదె. 7.గుఱ్ఱము. 8.ఏకాంతము,9.సమయము.

కాండిడేట్ ఇం. వి. (Candidate) అభ్యర్థి. ఒక పదవి కొరకు ప్రయత్నించు వ్యక్తి.

కాంద్ర వి. ఒక తెగ కసవు.

కాంద్రించు క్రి. 1. గట్టిగా గొంతు చించుకొను. 2. కాంద్రించి ఉమ్ము.

కాంద్రు వి. పెద్దపులి (బెబ్బులి) చేయుధ్వని.

కాంత సం.వి. కోరతగిన స్త్రీ. స్త్రీ.

కాంతపక్షి సం. వి. నెమలి. మయూరము.

కాంతము సం.వి. 1. ఇనుము. 2. లోహము 3. చంద్ర సూర్య పర్యాయ శబ్దములకు తరువాత వచ్చినచో రాయి అను అర్థము నిచ్చును. చంద్రకాంతశిల, సూర్యకాంతశిల మొ.వి. 4.కాంతభస్మము, ఔషధములలో ఒకటి

కాంతరజము సం. వి. కుంకుమము.

కాంతారము సం.వి. 1. పోరాని మార్గము. 2. అడవి. 3. చెరకు, 4. [illegible] వచ్చు ఆపద.

కాంతాళము [illegible] 1. ఈర్ష్య [illegible] 3. కోపము [illegible]

**కాంతి**1 నం. వి. 1. కోరిక. 2. (అలం.) ఒక కావ్య గుణము.

**కాంతి**2 నం. వి. (భౌతి.) వెలుతురు, ప్రజ్వలించు వస్తువుల నుండి వెలువడు శక్తి రూపము, వెలుగువస్తువులు కనబడునట్లు చేయునది (Light).

**కాంతికిరణపుంజము** నం. వి. (భౌతి.) కాంతికిరణములగుంపు చూ. కిరణశలాక (Beam of Light)

**కాంతిచూషణము** నం. వి. (భౌతి.) కాంతిని మ్రింగి వేయుట (Light absorption)

**కాంతి జన్య సంయోగము** నం. వి. (రసా.) తేజోరసాయన శాస్త్రములో ఒక భాగము. కాంతి ప్రభావముచే మూల ద్రవ్యములనుండి యౌగికము లేర్పడుట. దీనికి ప్రసిద్ధోదాహరణః- వృక్షములు కార్బన్ డైఆక్సైడ్ వాయువును గ్రహించి నీటి సన్నిధానమున వానికి కావలసిన పోషకద్రవ్యములను తయారు చేసి[illegible]ట (Photo-synthesis).

**కాం[illegible]** నం. వి (భౌతి.) తరంగ [illegible] చుట (L[illegible] [illegible] ఆకాశమందు ప్రసరిం[illegible]

**కాంతిపీఠము** [illegible] గురించిన ప్రయో[illegible] [illegible]తి.) కాంతిని కటకములు మొ. పరిక[illegible] చేయుటకు చేయబడిన పీఠము (Optica[illegible]

**కాంతి మాపకము** నం. వి. (భౌ[illegible] [illegible]యారు [illegible]మాపకము[illegible] కాంతి యొక్క తీక్షతల [illegible]కుపయోగించుపరికరము(Phot[illegible]

[illegible] వి. (భౌతి[illegible] కాంతి [illegible]ము, [illegible] కాంతి

పూర్వ సిద్ధాంతము నాధారముగా గొని ఈ పదము పుట్టినది (Luminiferous).

**కాంతి విద్యుత్ పటలము** నం. వి. (భౌతి.) శూన్యములో నున్న సోడియమ్, పొటాసియమ్ ధాతువుల పొరలపై కాంతి కిరణములు పడినపుడు ఆపొరల నుండి ఎలక్ట్రానులు విడివడి అందే అమర్చబడిన ఒక తీగ వలయము వంటి ధనధ్రువము పైకి ప్రవహించగా విద్యుత్ప్రవాహ మొకటి ఉద్భవించును. ఈ విద్యుత్ప్రవాహము యొక్క తీక్ష్ణత, పడిన కాంతి యొక్క తరంగ దైర్ఘ్యముతో విలోమానుపాతములో నుండును. ఈ పరికరమును చలన చిత్రమందు కాంతిని ధ్వనిగా మార్చుటకుపయోగింతురు (Photo-electric-cell).

**కాంతివిశ్లేషణము** నం. వి. (భౌతి.) తెల్లని వెలుతురును దాని ఘటకములగు సవర్ణ కాంతులుగా విడదీయుట (Dispersion of light).

**కాంతిశలాక** నం. వి. (భౌతి.) కాంతి కిరణములసమూహము (Pencil of light).

**కాంతి శాస్త్రము** నం. వి. (భౌతి.) చాక్షుష శాస్త్రము, కాంతి స్వభావమును గురించి చర్చించు శాస్త్రము (Optics).

**కాంతి సంవత్సరము** నం. వి. (ఖగో.) ఒక సంవత్సరకాలములో కాంతిప్రయాణించు దూరము(సుమారు6,880,000,000,000 (మైళ్ళు). నక్షత్రముల దూరము కొలుచుటకు వాడు ప్రమాణము (Light year).

**కాంతు[illegible]** నం వి. 1. మగడు. 2. అధిపతి. [illegible] వి. విశే. అందగాడు.

నుండి [illegible] emission) నం. వి. (భౌతి.) ఒక వస్తువు నిర్గమించుట (Light

**కాందిశీకుడు** నం. [illegible] శరణార్థి.

[illegible]చే పరుగిడు

**కాందిశీకులు** సం. వి. (వరి.) మత, రాజకీయ పీడన భరించలేక స్వదేశము వదలి, ఇతర దేశములలో ఆశ్రయము పొందువారు. (18వ శతాబ్దిలో ఫ్రెంచ్ ప్రొటెస్టెంట్ మతస్థులు (హ్యూజ్ నాట్స్) రోమన్ కాథలిక్కుల బాధ పడలేక ఇంగ్లండు, ప్రష్యాదేశాలకు వెడలిపోయిరి. భారత దేశము క్రీ.శ. 1947లో స్వతంత్రమైన తరువాత పాకిస్తాన్ ప్రభుత్వము పెట్టిన బాధలు పడలేక పాకిస్తాన్ నుండి కోట్ల కొలది హిందువులు, సిక్కులు భారతదేశమునకు తరలి వచ్చిరి).

**కాంప్ట్రోలర్** ఇం.వి (అర్థ.) (Comptroller). ఒక కార్పొరేషన్ యొక్క గాని, ప్రభుత్వ శాఖ యొక్క గాని ఆదాయ వ్యయముల లెక్కలను చూచు కార్యకర్త.

**కాంపిల్యము** సం. వి. 1. ఒకానొక పట్టణము. 2. ఒకానొక దేశము.

**కాంభోజము** సం వి. 1 ఒకానొక దేశము 2. కాంభోజ దేశపు గుఱ్ఱము.

**కాంస్యకారుఁడు** సం. వి కంచర.

**కాంస్యము** సం. వి. 1. కంచు. 2. లోహపాన పాత్రము.

**కాఁక** వి 1, జ్వరము.2.తాపము.3.కోపము. విణ. వేడియైనది.

**కాఁకర** వై. వి. ఒక తెగ కూరగాయ. సం. కారవేల్ల.

**కాఁకరవత్తి** వై. వి. ఒక రకపు బాణసంచా.

**కాఁకవెలుఁగు** వి. సూర్యుడు, ఉష్ణ రశ్మి

**కాఁగ** అవ్య. హేత్వర్థకము.

**కాఁగు** వి. పెద్దబాన. క్రి. 1, తపించు, 2. సంతాపించు 3. కోపపడు.

**కాఁగుడు** వి. 1. తపనము. 2. సంతాపము. రూ. క్రాగుడు.

**కాఁడ** వై. వి. 1. తామరతూడు. 2. కూరాకులలోని కామ. 3. తొడిమ. సం. కాండః.

**కాఁడీ** వి. 1. కడుగునీరు. 2. బండి. నాగలి మొ. ని పూన్చుటకై ఎద్దు మెడపై నుంచి కట్టెడు కఱ్ఱ.

**కాఁడిగట్టు** వి. ఒకరొకరి పొలాలకు హద్దుగా ఉంచిన కట్ట.

**కాఁడు** క్రి. నాటు. అన పుంలింగ ప్రత్యయము ఉదా. వన్నెకాడు, సొగసుకాడు.

**కాఁదారి** వి. అర్ధమరేయి, అర్ధరాత్రము. కానారి మానారి ప్రొద్దు అని వాడుక.

**కాఁపడము** వి. నొప్పికలిగినచోట వేడివస్తువుతో కాచుట.

**కాఁపు** వి. 1. గృహస్థుడు. 2. పంటపెట్టువాడు. 3. శూద్రుడు. 4. కాపురము.

**కాఁపురము** వి. 1. నివాసము 2. సంసారము.

**కాఁపురించు** క్రి. 1. కాపురము చేయు. 2 వసించు.

**కాఁబట్టి** అవ్య. (కాన్+పట్టి) కనుక, హేతువును తెలుపునది.

**కాఁబడు** క్రి. (కాన్+పడు) అగు, ఒప్పిదమగు.

**కాఁబోలు** అవ్య. (కాన్+పోలు) అగునేమో.

**కాఁక** అవ్య. 1. ఆశీరాద్యర్థకము (మేలగు గాక) 2. వినార్థకము (ఇంతేకాక).

**కాకతాళీయము** సం, న్యా. కాకి వ్రాలినంతనే తాటిపండు పడిన విధము, దైవికముగా రెండు పనులు ఏకకాలమున జరుగుట వంటిది.

**కాకత్రోటి బింబన్యాయము** సం న్యా. కాకి ముక్కున దొండపండు కట్టిన విధము. (అసమానరూప వస్తు సమ్మేళనము ఇంపు కాదనుట). ఒకన్యాయము.

**కాకదంత పరీక్ష** సం. న్యా వ్యర్థమైన పని. (కాకికి దంతము లుండవు కావున వానిని పరీక్షించుట వ్యర్థకార్యము.)

కాకపక్షము సం. వి. పిల్లజుట్టు, కూకటి.

కాకపిక న్యాయము సం. న్యా. కోయిల కాకులలో పెరిగియు తుదకు వేరుగబోవు విధము.

కాకపుష్టము సం. వి. కోయిల, వ్యు. కాకిచే పోషింపబడినది.

కాకఫలము సం. వి. 1. నింబఫలము, వేము

కాకము సం. వి. కాకి, వాయసము.

కాకలము సం. వి. కాగితము.

కాకలి సం. వి. సూక్ష్మమైన అవ్యక్త మధురాక్షరధ్వని.

కాకాక్షన్యాయము సం. న్యా. కాకి చూపువలె ఏదేని ఒక ప్రక్కకు ఒరగుట.

కాకి వై. వి. వాయసము. విణ. అల్పము సం. కాకః.

కాకికలువ వై.వి. అల్లిపూవు. కాకోత్పలము

కాకిచావు వి. ఆకస్మిక మరణము.

కాకిచిప్ప వి. ముత్తెపు చిప్పవంటి గుల్ల. శంబూక.

కాకిచెఱకు వి. చెరకు వంటి తృణము తేజనకము.

కాకిణి సం. వి. 1. కాణి, కర్షము నందు నాల్గవ పాలు. 2. గవ్వ. 3. కొలతకోల.

కాకితము హిం. వి. వ్రాయుపత్రము. రూ కాగితము.

కాకితీపు వి. ఒక రకపు మూర్ఛ వ్యాధి. ఈడ్చుకొని పడు మూర్ఛ రోగము.

కాకిబంగారము వి. పీతాభ్రకము.

కాకిఱల్లు వి. కాకివెదురు. (దీని పుల్లలను చివర సన్నముగా చెక్కి కలములుగా వాడెడివారు).

కాకినోమాల వి. (గృహ) మూర్ఛ, సంధి, అపరాని ఉద్రేకముతో పట్టినట్లు కనబడు ఒకవ్యాధి (Hysteria).

కాకు వి. 1. తిరస్కారము 2. గాసి. విణ. 1. వ్యర్థము, 2. శూన్యము.

కాకుచేయు క్రి 1 అవమానించు 2. అపహరించు. 3. ఆక్రమించు. 4. బాధపెట్టు.

కాకుత్థ్సుఁడు సం.వి. కకుత్థ్స వంశపురాజు.

కాకుదము సం. వి. తాలువు, దవుడ.

కాకువు సం. వి. స్వరము. 2. శోకభయాదులచే ధ్వని వికారము. 3 డగ్గుత్తిక.

కాకృత్యము సం. వి, అకార్యము, చెడ్డపని.

కాకోడిల్ ఇం. వి. (రసా.) (Cacodyle) ఆర్సెనిక్, కార్బన్ ఉదజనులతో కూడిన రంగులేని ఒక ద్రవము.

కాకోదరము సం. వి. 1. పాము. 2. గుడ్లగూబ.

కాకోలము సం.వి. 1. ఒకవిధమగు నరకము. 2. బొంతకాకి. 3. ఎఱ్ఱని పాము. 4. విషము.

కాగడా వి. (కాగు+గడ) కొయ్య, లేక గుడ్డతో పర్వరచిన చేతి దివ్విటి.

కాగు వి. నీళ్ళు కాచుటకు వాడు పెద్దపాత్ర (Boiler).

కాచపాత్రము సం. వి గాజుగిన్నె.

కాచబింబము సం. వి.(ఇం.) కంటి గ్రుడ్డులోని ఎదుటి భాగము.(ఇది కొంచెము ఉబ్బెత్తుగా ఉన్న స్వచ్ఛమైన పొర) (Cornea).



కన్నుయొక్క భాగములు
కాచబింబము
నేత్రశుక్లము.

కాచము సం. వి 1. గాజు. 2.గాజు మన్ను. 3.గాజు పూస. 4. కాసు.

కాచవిద్యుత్తు సం.భౌ.(భౌతి.) కనుపాప గాజుకడ్డి పై ఉన్నితో కసినికాపటలము రుద్దిన జనించుస్థిర విద్యు అంధబిందువు ద్రూపము. (ఈ భావము కటకము విద్యుచ్ఛాస్త్ర దశలో కాచరవేశ్మము కల్పించబడినది. ఇప్పుడు అక్షినాడి అది సరియైనది కాదని రుజువైనది) (Vitreous electricity).

కాచరకాస్థి సం. వి. (ఇం.) పారదర్శకమగు మృదులాస్థి (Hyaline cartilage)

కాచరజలము సం.వి. (జం.) కాచర వేశ్మములో నిండియున్న జిగురు పదార్థము (Vitreous humour).

కాచరవేశ్మము సం.వి. (జం.) కనుగ్రుడ్డులో కనీనికా పటలమునకు వెనుక నున్న గది (Vitreous chamber).

కాచు వి. (వ్యావ.) తుమ్మగణమునకు చెందిన నల్ల చండ్ర లేక కాచు తుమ్మ (Acacia catechu) అను చెట్టుయొక్క చేవకఱ్ఱ నుండితీయబడు ద్రవ్యము, కవిరి. (దీనిలో తానినము (Tannin) హెచ్చుగనుండును) (Catechw)

కాచు క్రి. 1. (కాయ) కాచు. 2. (ఎండ) కాయు. 3.రక్షించు. 4. ఓర్చు, సహించు. 5. ఎదురుచూచు.

కాజా హిం. వి. (గృహ.) బొత్తాములు దూర్చుటకు కుట్టిన పొడవుపాటిరంధ్రము (Button hole).



కాజా

కాజాకుట్టు మి. వి. (గృహ.) కత్తిరించిన రంధ్రపు అంచులనుబలపరచుటకుఉపయోగించు ముడికుట్టు Button-hole stich).



కాజాకుట్టు

కాజీ హిం వి. 1. మహమ్మదీయుల ఆచారి. 2. (వరి.) న్యాయాన్యాయ విచారణ చేయువాడు, ఇస్లాము ధర్మ ప్రకారము న్యాయము నిర్ణయించువాడు. న్యాయమూర్తి.

కాట్ (Cot)=కోటాంజంట్ (Cotangent) ఇం. వి. (గణి.) సమకోణ త్రిభుజములోని దత్తకోణమునకు సన్నిహితముగాను ఎదురుగాను ఉండు భుజముల పొడవుల నిష్పత్తి టాంజంట్ అను దానికి ఇది వ్యుత్క్రమము (Reciprocal)

కాటకము వి. కరవు, దుర్భిక్షము.

కాటిపాఁపడు వి. గొల్లవాడు. 2. కాటికాపరి.

కాటిఱేఁడు వి. శివుడు. రూ. కాట్రేడు

కాటు వి 1. మూడి అడుగంటుట. 2. కరచుట. 3. కరచిన గాయము.

కాటుక వి. 1. అంజనము. 2. జొన్న ఎన్నునకు గల్గువ్యాధి.

కాటుకతెగులు వి. (వ్యావ.) ఇది గింజలకు బట్టు తెగుళ్ళలో ఒకటి. ఈ తెగులు పట్టినకంకులలోనిగింజలు కొంచెము లావుగా గాని పొడవుగా గాని యుండి లోపల నల్లని మసిపొడుముతో నిండియుండును. కాటుకతెగులు ఉదా. వరి, జొన్న (Smut disease).



కాటుకపిట్ట వి. ఖంజరీటము.

కాటుకఱాయి వి. సౌవీరాంజనము.

కాడకుట్టు వి. (గృహ.) కొమ్మకుట్టు, పొడవు కుట్లతో కుట్టు మీద కుట్టు వేసి కుట్టుట ఒక విధమైన ఎంబ్రాయిడరీ కుట్టు (Stem-stitch)



కాడకుట్టు

కాడు వై. వి. 1. వల్లకాడు, శ్మశానము. 2. అడవి. 3. నాశము. సం. కటః.

కాడుచేయు వై. వి. నాశముచేయు.

కాడుపడు వై. క్రి. 1. కలతపడు. 2. కనబడకపోవు, 3. నశించు.

**కాడ్మియమ్** ఇం. వి. (రసా.) (Cadmium) ఒకవిధమగు ధాతువు, మూల ద్రవ్యము. (ఆవర్త క్రమపట్టికలో ఇది రెండవ వర్గమునకు చెందినది).

**కాణము**[1] వై. వి. గుఱ్ఱమునకు బెట్టెడి దాణా నం. ఖాదనమ్.

**కాణము**[2] నం. విణ. 1. ఒంటి కన్ను గలది. 2. తూటువడినది. వి. కాకి.

**కాణయాచి** వి. చిరకాల వాసస్థానము. విణ. చిరకాలానుభవము గలది. రూ. కాణాచి.

**కాణాదము** నం. వి. కణాద ఋషి వ్రాసిన న్యాయశాస్త్రము.(దీనినే వైశేషికదర్శన మందురు).

**కాణుఁడు** నం. వి. ఒంటికంటివాడు. ఏకాక్షుడు.

**కాత** అవ్య. ఆశీరాద్యర్థకము రూ. కావుత. అగుత, ఉదా. "అఖిల జనులకు సుఖమగు గాత".

**కాతరము** నం. విణ. అధీరము, పిరికి.

**కాతరుఁడు** నం. విణ. భయశీలుడు, అధీరుడు.

**కాతాళము** వి. కోపము.

**కాతోడ్** ఇం.వి (భౌతి.) (Cathode) విద్యుత్తు విడిచిపోవుకొన.

**కాత్యాయిని** నం. వి. 1. గౌరి, పార్వతి. 2. సగము వయసు చెల్లి కావిచీర కట్టిన విధవ.

**కాదంబము** నం. వి. 1. మధురముగ కూయు హంస. ధూమ్రవర్ణము లైన ముక్కు, కాళ్లు, రెక్కలుగల హంస, కలహంస. 2. బాణము.

**కాదంబరము** నం. వి. 1. పెరుగుమీది తెట్టె 2. కడిమి పూలకల్లు.

**కాదంబరి** నం. వి. 1. కల్లు. 2. ఆడు కోయిల. 3. ఆడుగోరువంక. 4. బాణ విరచిత కాదంబరీ కావ్యము. 5. సరస్వతి

**కాదంబిని** నం.వి. మేఘపంక్తి.

**కాదాచిత్కము** నం. విణ. ఏదో ఒకప్పుడు కలుగునది, కదాచిద్భవము.

**కాద్రవేయుఁడు** నం. వి. కద్రువ కొడుకు, పాము.

**కాన**[1] అవ్య. 1. కనుక. 2. సంబోధనార్థకము, ఉదా. "తల్లికాన, సామికాన".

**కాన**[2] వై. వి. అడవి. నం. కాననమ్.

**కాననము** నం. వి. 1. అడవి. విపినము. 2. ఇల్లు.

**కానని వాఁడు** విణ. గ్రుడ్డి, అంధుడు.

**కానరానిచుక్క** వి. అభిజిత్ నక్షత్రము.

**కాని**[1] అవ్య. వికల్పార్థకము. ఉదా. వాడు గాని నీవు గాని అడుగవచ్చును. విణ. సంభవింపని, తగని మొ.అర్థముల సూచించును. ఉదా. కానిపని, కాని తలపు మొ.వి

**కాని**[2] వై. వి. వీసమున నాల్గవ భాగము. కాకిణీ. కానికి గొనక (జాతీ.) = లక్ష్యపెట్టక.

**కానిక** వి. ఉపహారము· రూ. కానుక. కాన్క

**కానిపని** వి. 1. చెడ్డపని. 2. తగనిపని. 3. సంభవింపని పని.

**కానిపించు** క్రి. కనిపించు.

**కానీ** అవ్య. కానిమ్ము, ఆలాగుననే చేయుము అనుటను తెలుపును(అంగీకారమును తెలుపును).

**కానీనుఁడు** నం. విణ. కన్యకు పుట్టినవాడు. వి. 1. కర్ణుడు. 2. వ్యాసుడు

**కాను** వి నీళ్లు కలియని మజ్జిగ.

**కానక** వి. రూ. కానిక.

**కానుగు** వి. కరంజవృక్షము. రూ. క్రానుగు.

**కానుపు** వి. 1. వీక్షణము. 2. ప్రసూతి.రూ. కాన్పు.

**కాన్ఫరెన్సు** ఇం. వి. (Conference) సభ, సమావేశము, సమాలోచనము.

కాన్వకేషన్ ఇం. వి. (Convocation) పట్ట ప్రదానోత్సవము.
కాన్సల్ ఇం. వి. (అర్థ. రాజ.) (Consul) వాణిజ్య దూత, ఒక దేశములో వేరొక దేశము తరఫున నుండు దూత. ప్రణిధి.
కాన్సలేట్ ఇం. వి (రాజ.అర్థ.)(Consulate) వాణిజ్యదౌత్యకార్యాలయము, (Consul office), ప్రణిధి కార్యస్థానము.
కాపంతము వి. కుక్క మెడకు గట్టెడికొయ్య
కాపట్యము సం. వి. జిత్తు, మోసము, కపటము.
కాపథము సం. వి. 1. కుత్సితపు త్రోవ. 2. నీటివట్టి వేరు.
కాపరి వి. (కాపు+అరి) రక్షకుడు. ఉదా. పసులకాపరి.
కాపాడు క్రి. రక్షించు.
కాపాలి సం. వి. 1. కోమటిది, వైశ్య. స్త్రీ
కాపిలుఁడు సం. వి. సాంఖ్యశాస్త్రవేత్త
కాపిశము సం. వి. పువ్వులనుండి తీయబడు మద్యము, కాపిశాయనము, కల్లు, సురు.
కాపు వి. 1.కాపుగడ, రక్షణము. 2.కాయలు కాచుట.
కాపురుషుఁడు సం. వి. కుత్సిత పురుషుడు దుష్ట ప్రవర్తన గల పురుషుడు.
కాపేయము సం. వి. 1. కోతిబుద్ధి. 2. కోతి చేష్ట.
కాపోతము సం. విశ. 1. బూడిద రంగు గలది. 2. కపోత సంబంధమైనది.
కాఫీ ఇం.వి.(వ్యవ.)(Coffee)ఇది(Rubiaceae) అను కుటుంబమునకు చెందిన Coffea arabica, C. robusta, C. liberiaఅను చెట్టు. దీని గింజలను వేచి తయారుచేయబడు పొడి నుండి తీసిన కషాయము కాఫీ అను పానీయముగా ఉపయోగింతురు. కాఫీ గింజలలో కెఫిన్ (Caffiene) ఎక్కువగా ఉండును.
కాఫీనెలలు వి. వి (వ్యవ.) ఉన్నతప్రదేశముల యందు ఎక్కువ సేంద్రియపదార్థమును గలిగి కాఫీతోటలు బాగుగా పెరుగునట్టి నేలలు (Coffee soils.)
కాబినెట్ పద్ధతి సం. వి. (రాజ.)(Cabinet system) మంత్రుల పరిపాలన, బాధ్యతాయుతమగు మంత్రివర్గ పరిపాలన, పార్లమెంటరీ రాజ్యాంగ విధానము. (లోక్ సభకు, లేక విధానసభకు ఎన్నుకొనబడు ప్రజాప్రతినిధులలో, అధిక పక్ష నాయకుని మంత్రివర్గ నిర్మాణము చేయుమని రాష్ట్రపతిగాని, రాజ్యపాలకుడు గాని కోరును. అతడే కేంద్ర ప్రభుత్వపు ప్రధాన మంత్రి. లేక రాష్ట్ర ప్రభుత్వపు ముఖ్య మంత్రి. వీరు లోక్ సభ, రాజ్య సభల నుండి కాని తమ పక్షపు వారిని అనుకూలురను మంత్రిమండలి సభ్యులుగా పేర్కొందురు. వీరు, వీరిమంత్రి వర్గములు సమష్టిగా బాధ్యత వహించి, లోక్ సభ, విధానసభల ప్రజాప్రతినిధుల ఆమోదముతో ప్రభుత్వమును నడిపెదరు. ప్రజాప్రతినిధులు వ్యతిరేకముగ తీర్మానించినచో మంత్రిమండలి రాజీనామా ఈయవలెను. ప్రతిమంత్రియు తన పరిపాలన క్రిందనున్న శాఖకు వ్యక్తిగతముగ బాధ్యత వహించుటయేగాక ఇతర పరిపాలనా శాఖలలో జరిగిన ఏ ముఖ్య విషయములోనైనను ఇతర మంత్రులతో పాటు బాధ్యత పంచుకొను భారతదేశపు కాబినెట్ పద్ధతి బ్రిటిష్ పార్లమెంటరీ రాజ్యాంగ విధానమును దృష్టియందుంచుకొని సృజింపబడినది.)
కాబినెట్ మిషన్ ఇం. వి. (చరి. రాజ.) (Cabinet Mission)మంత్రివర్గపురాయబారము. రెండవ ప్రపంచ యుద్ధానంతరము (ఖైదు చేయబడిన) భారతజాతీయ

నాయకులను విడుదల చేసి దేశములో ఎన్నికలు జరిపిరి. భారతదేశ స్వాతంత్ర్యమును, తదితర రాజకీయ సమస్యలను గూర్చి భారత జాతీయ నాయకులతోను, దేశములోని వివిధ రాజకీయ పక్షముల తోను చర్చించుటకై బ్రిటిష్ ప్రభుత్వము క్రీ.శ. 1947న సంవ. మార్చినెల 24వ తేదీని పంపిన రాయబారపు మంత్రి వర్గము. ఇందులో ఇండియా కార్యదర్శి పెథిక్ లారెన్స్ ప్రభువు. సర్. స్టాఫర్డ్ క్రిప్స్, బ్రిటిష్ నౌకాదళ ప్రథమప్రభువు అలెగ్జాండర్ ప్రభువును ఉండిరి.

**కామ** వి. 1. తామర మొ.ని కాడ. 2 గొడుగు మొ.ని దండము. 3. మగగురి 4. చనుమొన

**కామంచి** వై. వి. కత్తృణము, ఒకతెగగడ్డి. రూ. కావంచి, సం. కామంజికా.

**కామంజిక** నం. వి. కత్తృణము.

**కామదుఘ** నం. వి. కామధేనువు.

**కామదేవుఁడు** నం. వి. వలపురాయడు, మన్మధుడు.

**కామధేనువు** నం. వి. వేల్పుటావు. కోరిన వస్తువులను ఇచ్చెడి ఆవు.

**కామన్వెల్త్ కూటమి** మి. వి. (చరి. రాజ.) పూర్వపు బ్రిటిష్ సామ్రాజ్యస్థ రాజ్యములైన ఇంగ్లండు, కెనడా, ఆస్ట్రేలియా, ఐర్లండు, దక్షిణాఫ్రికా రాజ్యములు బ్రిటిష్ చక్రవర్తి ఆధ్వర్యమున ఒకరితో నొకరు వాణిజ్య, రాజకీయ, ఆర్థిక వ్యవహారములలో సహకరించుటకు బ్రిటిష్ కామన్వెల్త్ అను పేరిట ఏర్పరచుకొనిన సాధనము రెండవ ప్రపంచ యుద్ధానంతరము ఒకప్పుడు బ్రిటిష్‌సామ్రాజ్యములో అస్వతంత్ర రాజ్యములుగ ఉండిన ఇండియా, పాకిస్తాన్, సింహళము, మలయా, నైజీరియా, ఘానా, రోడిషియా దేశములుకూడ జాతి విచక్షణ పాటించకుండ ఈకామన్వెల్త్‌లో సభ్యత్వమును పొందినవి క్రీ శ. 1950లో ఇండియా కామన్వెల్త్ సభ్యత్వము స్వీకరించినపుడు ఇండియా ప్రతిపాదనపై కామన్వెల్త్ కేవలముస్వతంత్రరాజ్యముల సంస్థగా, బ్రిటిష్ రాజు(రాజ్ఞి)అస్వతంత్ర రాజ్యముల సంస్థయొక్క చిహ్నముగా మాత్రమే అంగీకరింపబడెను ఈ పునర్వ్యవస్థీకరణ జరిగినపుడు కామన్వెల్త్‌ను "బ్రిటిష్ కామన్వెల్త్" అని మాత్రము పిలుచుటకు అంగీకరించిరి. ఒకప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యస్థ రాజ్యమైన బర్మాదేశము కామన్వెల్త్‌లో చేరలేదు. కామన్వెల్త్ రాజ్యములు స్వతంత్ర రాజ్యములుగ వారి వారి ప్రత్యేక రాజ్యాంగ విధానమును, విదేశ వ్యవహారములను నడుపుచు, ఒకదేశపు సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయములలో ఇతర దేశములకు కలుగజేసికొను అధికారము లేదు. (Commonwealth)

**కామపాలుఁడు** నం. వి. బలరాముడు, బలదేవుడు.

**కామము** నం వి. 1.కోరిక. 2. మోహము. 3. రేతస్సు.

**కామరూపము** నం వి. 1. కామరూప మను దేశము. (ప్రస్తుతము అస్సాందేశపు పడమటి భాగము. ప్రాగ్జ్యోతిష నగర మని ప్రతీతి.అచట నరకాసురుడు రాజ్య మేలెనని చూడుక). 2. కోరినరూపము.

**కామరేఖ** నం. వి, భోగముది, వేశ్య.

**కామల** నం. వి. కామలరోగము, కన్నులు పచ్చనగు వ్యాధి, (Jaundice).

**కామాటము** వై. వి. మోటపని, కూలిపని. నం. కర్మకః.

**కామారి** నం. వి. ముక్కంటి, శివుడు.

కామి సం.వి. 1. కాముకుడు 2 పావురము. 3. జక్కువ.

కామిని సం. వి. 1. ప్రియ సంగమమందు అధికేచ్ఛ గల స్త్రీ. 2. ఆడుజక్కువ. 3. ఆడుపావురము. 4. బదనిక, (కాముకి)

కాముఁడు సం. వి. మరుడు,-మన్మథుడు.

కామేశ్వరి సం. వి. పరాశక్తి, మహాలక్ష్మి.

కామ్యము సం. విశ. కోరదగినది.

కామ్‌సోమల్స్ సం. వి. (రాజ.) (Komsomols) రష్యా కమ్యూనిస్ట్‌పార్టీ యువ సభ్యులు.

కాయ వి. 1.చెట్టున కాచుకాయ. 2.కఠినవస్తు స్పర్శచే హస్తాదులందు కలుగు కాయ. 3.జూదమందలి సారె. 4. వీణసొరకాయ. 5. కంటిరెప్పలు.

కాయకంటి వి. కుబేరుడు.

కాయకన్ను వి. కాయకాచిన కన్ను.

కాయకము వి. బ్రదుకు, జీవనము

కాయగూరలు వి. చెట్లసంబంధమైనకాయలు. ఆకుకూరలు మొ వి (Vegetables).

కాయజలము సం. వి. మూత్రము.

కాయజుఁడు సం. వి మన్మథుడు.

కాయధాన్యములు వి. (వ్యవ.) ఉలవ, కంది, పెసర మొ వి (Pulses).

కాయమానము సం. వి. పందిరి.

కాయము[1] సం. వి. 1. మేను, శరీరము. 2 స్వభావము.

కాయము[2] వి, బాలెంతకిచ్చు మందు, సర్మ్యా.

కాయస్థుఁడు సం. వి. 1. లెక్క వ్రాయువాడు. 2. పరమాత్ముడు. 3. కాయస్థ తెగకు చెందినవాడు.

కాయిక సం. వి. వడ్డి, నానాటివడ్డి.

కాయికము సం. విశ. శరీరసంబంధమైనది.

కాయిలా హిం. వి. రోగము, జబ్బు.

కాయు క్రి. వెన్నెల ఎండ మొ.విప్రకాశించు

కార సం. వి. చెరసాల, బంధనాలయము.

కారకము సం. విశ. 1. కారణము గలది. 2 చేయునది. (వ్యాక.) కర్మాది షట్కారకములు. వి. (రసా.) ఒక రాసాయనిక ద్రవ్యమందు మార్పుతేగల ఇంకొక రాసాయనిక ద్రవ్యము. ఉదా.సిల్వర్ నైట్రేట్ ద్రావణమునకు సోడియం క్లోరైడ్ ద్రావణము చేర్చినచో విరుగువంటి అవక్షేపణ క్రిందికి దిగును. ఇచ్చట సోడియం క్లోరైడ్ ద్రావణముకారకము (Reagent)

కారణము సం.వి. 1. హేతువు, 2.పనిముట్టు.

కారణరాశిభజన సం. వి. (గణి.) దత్తరాశిని వివిధకారణాంకములుగా విభజించు పద్ధతి (Factorisation).

కారణాంకము సం. వి. (గణి.) దత్తరాశిని నిశ్శేషముగా భాగించురాశి (Factor).

కారము[1] వై. వి. 1. ఆరు రుచులలో ఒకటి. 2. బిడ్డలకు పోయు మందు. 3. చవుడు. 4. నూలు తడిపెడి ఒకానొక ద్రవ ద్రవ్యము. సం. క్షారః.

కారము[2] సం.వి. కప్పము.

కారయిత సం. విశ. చేయించువాడు.

కారాకూరము విశ. 1. కలగినది. క్షుభితము 2. మలినము. వి. క్షోభము.

కారాగారము సం. వి. చెరసాల.

కారించు సం. క్రి. బాధించు ఓడించు.

కారిక సం. వి. 1. సూత్రాది వివరణ శ్లోకములు ఉదా. అధర్వణ కారికలు. 2. నట్టువుని పెండ్లాము.

కారికము విశ. చలువ చేయని క్రొత్తది (వస్త్రము).

కారిజము వై. వి. కడుపులో నీరుతిత్తి క్రింద నుండు మాంసఖండము. రూ. కార్జము. సం. కాలేయమ్.

కారు[1] వి. 1, జ్యేష్ఠమాసముమొదలు నాలుగేసి నెలల కాలము. 2. వర్షకాలము 3. వయసు.

కారు² వి. 1. ఉప్పు. 2. అడవి. 3. నలుపు. 4. నస. 5. ముదిమి.

కారుచిచ్చు వి. దవానలము. రూ. కార్చిచ్చు

కారుచౌటినేలలు వి. (వ్యావ.) సోడియ కర్బనితము, హ్యూమస్‌తో కలిసి నల్ల పడిన చౌటినేలలు (Black alkaline soils).

కారుణ్యము నం. వి. దయ.

కారులు (పెట్టుటకు) వి. (వ్యావ.) వర్షపాత భేదములను ఇతర వాతావరణ పరిస్థితుల భేదములను బట్టి (తెలుగు) వ్యవసాయ దారులు ఆయా పైరులను విత్తి పెంచు కాలము. సంవత్సరమును పునాస (ఎండ) కారు, తొలకరి (ముంగటి వాన కారు). నడివాన కారు. వెనుకటి వానకారు. శీత కారు పయిరుకారు అని ఆరుకారులుగా విభజింప వచ్చును (Sowing seasons).

కారెట్ నం. వి. (Carat) 1. రత్నమును తూచెడి తూనిక 2. బంగారపు వన్నె.

కారెము వి. (వ్యావ.) దోకెన. తక్కువ లోతునుండి నీటిని తోడుట కుపయోగించు దోనె వంటి సాధనము (Trough lift).

కార్ఖానా హిం.వి. పనిచేయు స్థలము కర్మా గారము. (Work-Shop).

కార్కున్ నం. వి. (చరి) (Kurkun) గుమాస్తా, వ్రాతగాడు.

కార్టెల్ నం. వి. (అర్థ.,వాణి.) (Cartel) స్పర్థాపూరితమైన పరిస్థితిలో ఉత్పత్తి దారులు తమ ఉత్పాదనను తగ్గించు కొని తమ లాభములు పెంచుకొనుటకు ఉపయోగపడు ఒక పద్ధతి (ఇందు ఉత్పత్తి దారులెల్లరు ఒక అమ్మకము సంస్థకు తమ ఉత్పత్తి నెల్ల అందజేయుదురు ఎవరేని తమకు కేటాయించిన మొత్తము కన్న ఎక్కువఉత్పత్తినిఅందజేసినచో జరిమానా చెల్లింపవలసి యుండును. ఈ పద్ధతి మొదట జర్మనీ దేశములో ఉద్భవించెను.)

కార్తస్వరము నం. వి. బంగారము.

కార్తాంతికుఁడు నం. వి. జోస్యుడు.

కార్తికము నం. వి. కార్తిక మాసము,

కార్తికేయుఁడు నం. వి. కుమారస్వామి.వ్యు. కృత్తికల కుమారుడు.

కార్తె వై. వి. సూర్యుడుండు నక్షత్రము, ఉదా, చిత్తకార్తె, స్వాతికార్తె మొ, వి. నం. క్రాంతిః.

కార్న్‌లాస్ నం.వి (చరి. అర్థ.) (Corn laws) ఆహారధాన్యముల ఎగుమతి దిగుమతుల వర్తకము విషయమై ఇంగ్లండు ప్రభు త్వము క్రీ. శ. 1436 నుండి 1846వరకు విధించిన శాసనములు.

కార్పటికుఁడు నం వి. కోమటి.

కార్పణ్యము నం. వి. 1. కృపణత్వము, లుబ్ధత్వము. 2. క్రోధము.

కార్పరల్ నం. వి.(Corporal) సైన్యములో గాని, నావికాదళములో గాని ఒక చిన్న ఉద్యోగి. విశే. శారీరకమైన.

కార్పాసము నం. వి. 1. ప్రత్తి. 2. నూలు. 3.వస్త్రము. కాగితము విశే. నూలుతో సేయఁబడినది (వస్త్రము).

కార్పొరేషన్ నం.వి.(శాస.) (Corporation) శాసనప్రకారము ఒక వ్యక్తిగ వ్యవహ రించుటకు అధికారము గల సంస్థ. (ఇట్టి సంస్థలు నగరపాలన, వ్యాపారము, అభి వృద్ధి కార్యక్రమముల కొరకు మన దేశ ములో ఏర్పడి యున్నవి.)

కార్బాక్సిలికామ్లము మి. వి. (రసా.) (Corboxylic acid) COOH (కార్బాక్సిల్) అను పరమాణు గణము చివరను గల కర్బన్ యౌగికము, ఉదా.$CH_3$-COOH ఆసెటికామ్లము.

కార్బొనికామ్లము మి. వి. (రసా.) (Carbonic acid), కర్బన ద్వ్యమ్ల జనిదము

నీటిలో కరిగిన ఏర్పడు నిర్జల మైన ఆమ్లము.

**కార్ముకము** నం. వి. 1. విల్లు, 2. వెదురు. వ్యు. కర్మకారునిచే చేయబడునది.

**కార్యకర్తృత్వము** నం. వి (శాస.) వ్యవహార నిర్వహణాధికారము (గల పరిపాలక వర్గము) శాసనకర్తృత్వము నిర్మించు శాసనములను న్యాయ కర్తృక మిచ్చు తీర్పులను అమలు జరుపు వ్యవస్థ ప్రభుత్వాంగములలో ఒకటి.

**కార్యదర్శి** నం. విణ. పని నిర్వహించువాడు, (శాస) పరిపాలనములో ప్రత్యేకపరిపాలన శాఖాధికారి. తన శాఖకు సంబంధించిన విషయములలో ముఖ్య కార్య నిర్వాహకుడు, ఒక సంస్థ యొక్క కార్య నిర్వాహకుడు. కార్యాధికృతుడు.

**కార్యదర్శి** నం. వి. (వాణి.) ప్రభుత్వ పరిపాలన శాఖ యొక్క గాని, సంస్థ యొక్క గాని, కంపెనీ యొక్కగాని వ్యవహారములను నిర్వర్తించువాడు.

**కార్యము** నం. వి. 1. పని 2. హేతువు. 3. ప్రయోజనము. నం. విణ. చేయదగినది.

**కార్యవర్గము** నం. వి. రాజకీయ పక్షము మొ. వానిలో కార్యక్రమములను నిర్ణయించు వర్గము (Working Committee).

**కార్యసంబంధ శోష** నం. వి. (వృక్ష.) మొక్క నీటిలో పెరుగుచున్నను ఉప్పు నీరగుట వలన నీటిని పీల్చుకొనజాలని స్థితి (Physiological draught).

**కార్యోకైనెసిస్** ఇం. వి. (వృక్ష) (Karyo-kinesis) మైటోసిస్, పరోక్ష-అస్థివిభజనము

**కార్యోసోమ్** ఇం. వి. (జీవ.) (Karyosome) జీవకణములలో నున్న అస్థిలో నుండు క్రోమాటిన్ పదార్థము.

**కార్యోప్సిస్** ఇం. వి. (వృక్ష) (Caryopsis) కవచబీజకము, శుష్కఫలములలో ఒకే గింజగల అవిదారణఫలము. (వరి, జొన్న, మొ. ధాన్యపు ఫలములకు ఈ పదము వ్యవహరించబడును).

**కార్శ్యరోగము** నం. వి. (గృహ.) చిక్కి శల్యమగుటకు క్షీణించి పోవుట (Emaciation)

**కార్షాపణము** నం. వి. కర్ష మెత్తు వెండి టంకము. (కర్షమనగా 16 మాషముల యెత్తు).

**కార్షుడు** నం విణ. దున్నుకొని బ్రదుకువాడు

**కాజియు వై.** వి. 1. యాతన, కష్టము. 2. నలుపు, 3. దుస్థితి, నం. కారికా.

**కాలు** వి. 1. అజ్ఞానము, 2. మరపు. 3. కల్లు. క్రి. స్రవించు, రాలు. విణ. సాంద్రము.

**కాలుకొను** క్రి. 1. సందడించు. 2. నల్లనగు. 3. ఒగరుగు.

**కాలులు** వి. అనృతవచనములు. 2. పరుష వచనములు. 3. వ్యర్థవచనములు.

**కాల్ అటెన్షన్ నోటీసు** ఇం. వి. (శాస.) (Call attention notice) దేశములోని తీవ్ర సంఘటనలను శాసనసభ్యుల దృష్టిలోనికి తెచ్చుటకు శాసన సభ్యుడు చేయు అపాదన.

**కాలకము** నం. వి. పుట్టుమచ్చ.

**కాలకూటము** నం. వి. విషభేదము.

**కాలక్షేపము** నం. వి. 1. వృథాగా చేయు ఆలస్యము, విలంబము. 2. ఉబుసుపోక,

**కాలచక్రము** నం. వి. చక్రాకారముననతిరుగు కాలము.

**కాలజ్ఞము** నం. వి. 1. కోడి, 2. కోయిల.

**కాలజ్ఞుడు** నం. వి. జోస్యుడు.

**కాలత్రయము** నం. వి. 1. భూతకాలము. 2. వర్తమానకాలము 3. భవిష్యత్కాలము

**కాలధర్మము** నం. వి. కాలము యొక్క ధర్మము. 2. మరణము. ఉదా. **అతడు,** కాలధర్మము నొందెను.

**కాలపరిశీలన** నం. వి. (వాణి.) కార్మికుల ఉత్పాదన కార్యములో అంగకార్యములను నిర్వహించుటకగు కాలమును పరిశీలించుట. (దీనివలన ఒక పనిచేయుటకు ఎంత కాలము అవసరమో నిర్ణయించుట. దానివలన వేతనములను నిర్ణయించుట సులువగును).

**కాలపృష్ఠము** నం.వి. 1. కర్ణునివిల్లు, 2. విల్లు

**కాలము[1]** నం. వి. 1. సమయము, 2 నలుపు 3 చావు. ఉదా. అతడు కాలముచేసెను. విణ. నల్లనిది.

**కాలము[2]** నం. వి. (గణి) ఘటనల మధ్య దూరలు కాలము. (Time)

**కాలయాపనము** నం. వి. కాలక్షేపము

**కాలరాత్రి** నం. వి. 1. ప్రళయకాలము 2. దుర్గామూర్తిభేదము. 3. చీకటిరాత్రి

**కాలరి** వి. కాలిబంటు, పదాతి.

**కాలరీ** ఇం. వి. (భౌతి.) (Calorie) ఒకగ్రామ్ నీటి ఉష్ణోగ్రత 1°కు హెచ్చుటకు అవసరమగు ఉష్ణరాశి.

**కాలసర్పము** నం. వి. కృష్ణసర్పము, నల్లత్రాచు.

**కాలాంతకుఁడు** నం. వి. శివుడు. (వ్యావ.) అసాధ్యుడు.

**కాలానుసార వేతనము** నం వి (అర్థ. వాణి) కార్మికుడు కర్మాగారములో గడిపిన కాలమునుబట్టి అతనికి రావలసిన వేతనమును లెక్కగట్టుట.

**కాలిక** నం. వి. 1. బొగ్గు, 2. ద్రౌపది, 3. చీకటి. 4. పార్వతి, 5, క్రొత్తమబ్బు.

**కాలిత్రోవ** నడచిపోదగిన త్రోవ.

**కాలిఫ్ పంట** మి. వి. (భూ.గో. అర్థ.) ఉత్తరహిందూస్థానములోమాన్‌సూన్లలో నాటిన శీతకాలము, కోయబడు పంట.

**కాలియ** వై. వి. పిశాచము. నం, కాళికా.

**కాలిచి** నం. వి. 1. న్యాయవిచారణ సలము. కచ్చేరి. 2. బాలుడు చదువుచోటు.

**కాలీయము** నం. విణ. కాలసంబంధమైనది.

**కాలు** వి. 1. పాదము. 2. పాతిక భాగము. 3. మంచపుకోడు, క్రి. మండు.

**కాలుఁడు** నం. వి. యముడు.

**కాలువ** వి. నీరుపారు మార్గము.

**కాలుష్యము** నం. వి. కలక.

**కాలేయ ప్రసరణము** నం. వి. (గృహ) జీర్ణమైన ఆహారమును రక్తనాళములు ప్రేవులనుండి కాలేయమునకు కొనిపోవుట (Portal circulation).

**కాలేయపుసిర** సం వి. (జం.) కాలేయమునకు రక్తము నందజేయుసిర (Hepatic vein)

**కాలేయము** నం. వి. (జం.) యకృత్తు దేహకుహరములో ఎఱ్ఱగా, గోధుమరంగుగానుండు పెద్దగ్రంథి, (దీనికి రెండు పెద్దతమ్మె లుండును. పిత్తాశయము దీనితో చేరియుండును. ఇదిపైత్యరసమును తయారుచేయును) (Liver)

**కాలేయసంబంధము** నం. విణ. (జం.) కాలేయము (Liver) కు సంబంధించినది Hepatic).

**కాల్పనికము** నం. విణ. (భౌతి) వాస్తవికము కాకపోయినను కొన్ని ప్రయోజనములకు వాస్తవిక మని పరిగణింపబడుటకు వీలైనది (Virtual)

**కాల్పనిక కర్మ** నం. వి. (భౌతి.) వాస్తవముగా చేయబడినది కాకపోయినను చేయబడినట్లు పరిగణించబడుటకు వీలుగానున్న కర్మ (Virtual work).

**కాల్యము** నం.విణ. కాలము నందుయోగ్యమైనది వి. వేకువజాము.

**కాల్బలము** వి పదాతివర్గము.

**కాల్సిమియా** ఇం. వి. (జం.) (Calcimia) రక్తములో సున్నము ఎక్కువగానుండుట.

**కాల్సియమ్** ఇం. వి. (రసా.) (Calcium) క్షారమృద్ధాతువులలో ఒకటి. ఆవర్తక్రమ పట్టికలో ఇది 2వవర్గములో వచ్చునది.

**కావరము** వి. క్రొవ్వు, మదము.

**కావారి** సం. వి. మొగలియాకులతో ఏర్పర చిన గొడుగు

**కావి** వి. 1. ఎరువు. 2. కావి వస్త్రము.

**కావిఱాయి** వి. ఎఱ్ఱని సుద్దరాయి.

**కావు** వి. అరచుట, ఏడ్చుట మొ.వి, ధ్వన్య నుకరణము.

**కావేరి** సం వి. 1. కావేరీనది. 2. పసుపు.

**కావేషము** వి. (వ్యావ.) నిరోధము.

**కావ్యగుణములు** సం. వి. (అలం.) శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సమత, అర్థ దీపనము, ఔదార్యము, కాంతి, ఓజము, సమాధి, సౌకుమార్యము.

**కావ్యదోషములు** సం. వి. (అలం.) పదదోష ములు 17:- అప్రయుక్తము, అపుష్టా ర్థము, అసమర్థము, నిరర్థకము. నేయార్థము, చ్యుత సంస్కారము, సంధి గ్ధము అప్రయోజకము, క్లిష్టము, గూఢా ర్థకము, గ్రామ్యము మొ.వి.

**కావ్యపాకములు** సం. వి. (అలం.) ద్రాక్షా పాకము, కదళీపాకము, నారికేళపాకము.

**కావ్యము** సం. వి. కవికృత గ్రంథము, కవి కల్పితమైనది, గద్యకావ్యము, పద్య కావ్యము, మిశ్రకావ్యము (చంపువు).

**కావ్యుఁడు** సం, వి. శుక్రుడు.

**కాశము** సం. వి. 1. రెల్లు. 2. వెలుతురు.

**కాశి** సం.వి. 1. వారణాసి. 2. ప్రకాశము. 3. సూర్యుడు. 4. అలసట.

**కాశ్మీరము** సం. వి. 1. కుంకుమపూవు. 2. మెట్టతామరదుంప. 3.కాశ్మీరదేశము

**కాశ్యపి** సం. వి. భూమి. వ్యు. పరశురామునిచే కశ్యపునకు యజ్ఞదక్షిణగా నీయబడినది.

**కాషాయము** సం. వి. 1. కావివస్త్రము. 2. కావిచీర,

**కాష్ఠ** సం. వి. 1. పదునెనిమిది రెప్పపాట్ల కాలము. 2. దిక్కు. 3. మేర.

**కాష్ఠఫలము** సం. వి. (వృక్ష) ఒకే గతి. ఒకే గింజకలిగి, శుష్కఫలమై, ఊర్ధ్వస్థితి ద్విలేక బహు ఫల దళయుతమగు అండా శయము నుండి తయారైనది. దీని ఫల కవచము గట్టిగా, దారుయుతముగా నుండును.

**కాష్ఠము** సం. వి. కఱ్ఱ, కొయ్య.

**కాస్(Cos)కోసైన్(Cosine)** సం.వి (గణి.) సమకోణ త్రిభుజములోని దత్త కోణము నకు ఆసన్నముగా (సన్నిహితముగా) నుండు భుజము కర్ణముల పొడవుల నిష్పత్తి.

**కాస** వై. వి. దట్టి. రూ. కాసె. సం. కచ్ఛా.

**కాసము** సం. వి. దగ్గు.

**కాసరము** సం.వి. ఎనుపోతు. వ్యు. 1. గొప్ప శరీరముచే మందగతి పోవునది. 2. ఉదక మును పొందునది.

**కాసా** వి. దాసీ పుత్రుడు.

**కాసారము** సం.వి. కొలను. వ్యు.జలముకలది.

**కాసీసము** సం. వి. మయిలుతుత్తము.

**కాసు** వై. వి. దుగ్గానిలో నాల్గవ భాగము, అరవైసా, విత్తము సం. కాకణీ. కాచః.

**కాసె** వై. వి. చూ. కాస.

**కాసెయులి** వి. రాయి తొలిచెడి ఉలి.

**కాస్ట్అకౌంట్స్** ఇం. వి. (అర్థ.) (Cost Accounts) ఒక వస్తువును తయారుచేయు టకు అయిన మొత్తము ఖర్చును కనిపెట్టు శిక్షణ ఇచ్చు శాస్త్రము.

**కాస్తిరము** సం. వి. (రసా.) ఖనిజము, వంగ ద్వ్యమ్లజనిదము $SNO_2$ (First ore).

**కాస్థికము** సం. వి. (జం.) కోమలాస్థిని ఉడి కించినచో వచ్చు ఒక విధమగు సేంద్రియ పదార్థము (Chondrin).

కాస్థికర్పరము సం. వి. (జం.) పూర్తిగా కోమలాస్థితోనే ఏర్పడిన పుఱ్ఱె (Chondrocranium).

కాహళము సం. వి. 1. కోడిపుంజు. 2. శబ్దము. 3. బాకా ఊదెడు కొమ్ము.

కాళంజి వై. వి. తమ్మపడిగము. సం. కలాచీ.

కాళయుక్తి సం. వి. ప్రభవాది అరువది సంవత్సరములలో ఏబదిరెండవది.

కాళి సం. వి. 1. గౌరి. పార్వతి. ఆదిశక్తు అలో నొకతె. 2. బొగ్గు.

కాళింగము సం. వి. ఏనుగు. విణ. కళింగ దేశమున పుట్టినది.

కాళింది సం. వి. యమునానది.

కాళిందీబోధనుఁడు సం. వి. బలరాముడు.

కాళియ వై. వి. బూరగొమ్ము. రూ. కాళె. సం. కాహళికా.

కాళె వై. వి. చూ. పై.

# కి

కి షష్ఠీవిభక్తియందు వచ్చెడు ప్రత్యయము.

కింక వి. 1. రోగము (పశ్వాదులకు వచ్చు వట్టిది). 2. కోపము, రూ. కినుక.

కింకరి సం. వి. పరిచారిక. దాసి. రూ. కింకర

కింకరుఁడు సం. వి. పరిచారికుడు. వ్యు. ఏమి చేయుదు నని అడుగువాడు.

కింకిణి సం. వి. చిరుగంట. వ్యు. కొద్దిగా శబ్దించునది.

కింకరము సం. వి. 1. కోయిల. 2. తుమ్మెద. 3. గుఱ్ఱము.

కింకిరాటుఁడు సం. వి. మన్మథుడు. రూ. కింకిరాతుఁడు.

కింకిరాతుఁడు సం. వి. చూ. పై.

కింకిరుఁడు సం. వి. మన్మథుడు.

కింగిరి విణ. అల్పము, స్వల్పము,

కింగ్స్‌కౌన్సెల్ ఇం. వి. (చరి.శాస.)(Kings counsel) గౌరవ ఆంగ్ల న్యాయవాది.

కింగ్స్‌బెంచ్ ఇం. వి. (చరి.శాస.)( King's Bench) ఇంగ్లాండులోని న్యాయస్థానము. ఆంగ్ల ఉన్నత న్యాయస్థానములలో ఒకటి,

కించనము సం. వి. ఏనుగు చెవి ఆకు.

కించిత్తు సం. అవ్య. ఇంచుక కొంచెము.

కించు వై. విణ. అల్పుడు, హీనుడు. రూ. క్రించు.

కింజల్కము సం. వి. ఆకరువు, కేసరము. (వృక్ష.) పుంకేసరము, పుష్పములలోని పురుషభాగము, పుప్పొడితిత్తిగల కాడ (Stamen).

కిండర్ గార్టెన్ ఇం. వి.(Kindergarten) చిన్న పిల్లలకు బొమ్మల ఆటల ద్వారా చదువు నేర్పుబడి.

కింపచానుఁడు సం. విణ. లోభి. వ్యు. గాంచుక వంటచే బ్రతుకువాడు, పిసినిగొట్టు.

కింపాకుఁడు సం. విణ. 1. నిరర్థకుడు. 2. మూఢుడు. 3. మాతృశాసితుడు.

కింపురుషుఁడు సం. వి. అశ్వముఖమును. నర శరీరమును గల ఒక దేవజాతికిచెందిన వాడు.

కింవదంతి సం. వి. జను లాడుకొను మాట.

కింవరాటుఁడు సం. వి. అతి వ్యయము చేయువాడు.

కింశుకము సం. వి. పలాశము. మోదుగు చెట్టు.

కికిదివి సం. వి. పాలపిట్ట. రూ. కికిదీవి.

కికురించు క్రి. వంచనచేయు. మోసపుచ్చు.

కిక్కెస వి. 1. మిక్కిలి కదియిక. 2. బలాత్కారము.

**కిగ్గాడి** వై. విశ. నిష్ప్రయోజకుడు. సం. కీకటః.

**కిచిడీ** హిం. వి. చిత్రాన్నము.

**కిచ్చిలి** వి. ఒక జాతి నారింజ పండు.

**కిటకిట** వి. 1. పెక్కురు ఎడుములేకుండ కిక్కిరియుట. 2. వి ఐ ఖి ర డ త్రిప్పుట యందలి ధ్వన్యనుకరణము

**కిటి** సం. వి. పంది. సూకరము.

**కిటుకు** వి. 1. కపటము. 2. మర్మము.

**కిట్టాలము** సం. వి. 1. రాగిపాత్ర. 2. రాగి గాజు.

**కిట్టు** క్రి. 1. సమీపించు. 2. సరిపడు. 3. చంపు. 4. చచ్చు.

**కిణకము** సం. వి. (వృక్ష.) గాయమును కప్పుచు ఏర్పడిన మృదుకణముల సమూహము. (Callus).

**కిణము** సం. వి. కఠినవస్తు స్పర్శచే హస్తాదుల యందు కాచెడికాయ.

**కిణ్వములు** సం. వి. (జీవ.) ఫేనకములు, ఆహారమును జీర్ణముచేయు రసములలో నుండు ప్రత్యేకమగు సేంద్రియ రసాయన పదార్థములు (Ferments).

**కిత** వి. కళ్ళమున దేవతార్పణముగ మొదల పోయు మూడుదోసిళ్ళ ధాన్యరాశి.

**కితవము** సం. వి. ఉమ్మెత్త.

**కితవుఁడు** సం. వి. జూదరి, విశ. మత్తుడు, మోసకాడు.

**కితాబు** హిం. వి. 1. బిరుదు 2. పుస్తకము.

**కిత్తనార** వి. 1. చాగనార. 2. మోటుగుడ్డ.

**కిత్తలి** వి. నారింజ జాతికి చెందిన చెట్టు. రూ. కిచ్చిలి.

**కిత్తి** వి. అగ్ని. నిప్పు.

**కిదుకు** క్రి. 1. బిడ్డలు లేచునపుడు ఆలస్యముచే చేయు ఒక విధమగు మూలుగు. 2. (బిడ్డలు) మారాముచేయు.

**కినియు** క్రి. కోపించు, రోషించు.

**కినుక** వి. అలుక, కోపము.

**కిన్నర** సం. వి. ఒకరకము వీణ.

**కిన్నరుఁడు** సం. వి. నరముఖమును, అశ్వ శరీరమును గల దేవజాతికి చెందినవాడు.

**కిన్నరేశుఁడు** సం. వి. కుబేరుడు.

**కిన్నెర** వై. వి. రూ. కిన్నర. సం. కిన్నరా

**కిప్స్‌పరికరము** మి. వి. ఉదజని, గంధకిద ఉదజని మొ. వాయువుమ తయారు చేయుటకు ఉచితమగు పరికరము(Kipp's apparatus).

**కిమిల** సం. వి. విశేషసంతానము గల స్త్రీ.

**కిముడు** విశ. అల్పము.

**కిమ్మీరము** సం. వి. 1. చిత్రవర్ణము. 2. నారదబ్బ.

**కిమ్మీరుఁడు** సం. వి. కిమ్మీరనామక రాక్షసుడు.

**కియ్య** వి. (క్రింది+య) యావడి. ఒక అక్షరము క్రింది యక్షరము (వ్యా.)

**కిరకుఁడు** సం. వి. లేఖకుడు.

**కిరణజన్య సంయోగక్రియ** సం. వి. (వృక్ష.) వెలుతురు కిరణముల సాయముతో ముడి పదార్థములను సంశ్లేషించుట. సూర్య రశ్మిలో ఉద్భిజ్జములు బొగ్గుపులును గాలిని నీటిని సంశ్లేషించి పిండిపదార్థముగా తయారు చేసికొనుట.

**కిరణ పుష్పకము** సం. వి. (వృక్ష.)మూండక పుష్పమంజరిలో సాధారణముగ చుట్టును కిరణములవలె లేకనాలుకవలె నుండు ఆకర్షణపత్రములుగలపుష్పము (Rayfloret)

**కిరణమాలి** సం. వి. సూర్యుడు.

**కిరణము** సం. వి. వెలుగు మయూఖము.

**కిరణశలాక** సం. వి. (భౌతి.) సమాంతరముగ నున్న కిరణముల సమూహము (Pencil of rays).

**కిరము** సం.వి. పంది, రూ.కిరి. వ్యు. ముఖము (ముట్టె)చే భూమిని త్రవ్వునది.

కిరాటుఁడు సం. వి. కోమటి.

కిరాణా హిం. వి. చిల్లర దినుసులు, ఉదా. కిరాణా కొట్టు.

కిరాతుఁడు సం. వి. అటవికుడు,అడవియందు తిరిగెడు బోయ.

కిరాయి హిం. వి. బాడుగ, కూలి.

కిరీటము సం. వి. రాజు ధరించు శిరోభూషణము, మకుటము.

కిరీటి సం. వి. 1. అర్జునుడు. వ్యు. ఇంద్ర దత్తమగు కిరీటము గలవాడు. 2. కోతి.

కిరీటిపచ్చ మి. వి. మరకతము, గరుడపచ్చ.

కిరుసు వి. రెండువైపుల వాదరగల కత్తి.

కిరోసిన్ ఇం. వి. (భౌతి.) (Kerosene) మండెడి ఒకనూనె, మట్టినూనె.

కిఱుకు క్రి. త్రిప్పు. రూ. కిక్కు.

కిఱుదు విశ. తక్కువైనది.ఉదా. కిఱుదునేల.

కిఱ్ఱుఁజెప్పు వి. నడుచునపుడు కిఱ్ఱుమని శబ్దించు గాలిజోడు.

కిలకొట్టు క్రి. మ్రోగు.

కిలాటము సం. వి. దధికము, పాలనుండి పాలవిరుగు వడియకట్టి దగ్గరగ నొక్కి తయారుచేయు పదార్థము (Cheese).

కిలాడీ హిం. వి. రౌడీ, నేర్పరి. రూ. కిల్లాడి.

కిలాతము వి. గుఱ్ఱము.

కిలారము వి. పసులమంద. రూ. కీలారము.

కిలారి వి. గొల్లడు.

కిలాసము సం. వి. దేహమునందు గలుగు ఒక విధమైనపొడ,

కిలికించితము సం.వి. (అలం.) స్త్రీ యొక్క శృంగార చేష్టలలో ఒకటి (రోమహర్ష భీత్యాదులను దెలుపునది).

కిలుము వి.(గృహ.) ఇత్తడి లేక రాగిమీద పర్పడు మాలిన్యము. (ఇది ఒకవిధమైన విషము). రూ. చిలుము. (Veradigris).

కిలోగ్రామ్ ఇం. వి. (భౌతి.) (Klogram). 1. వేయి గ్రాములు. 2. 4⁰ డిగ్రీల సెంటిగ్రేడు వద్ద ఒకక్యూబిక్ డెసిమీటర్ శుద్ధజలము యొక్క భారము.(ప్లాటినమ్, ఇరిడియమ్ ధాతుమిశ్రమముతో తయారు చేసిన ఇదే బరువుగల సిలిండర్ పారిస్ వద్ద సెవర్స్ అంతర్జాతీయ విజ్ఞానసంస్థలో సంరక్షించబడుచున్నది).

కిలోమీటర్ ఇం. వి. (భౌతి.) (Kilometre) 1. వేయి మీటర్లు, 2. కరగుచున్న మంచు తాపక్రమమువద్ద నుంచబడిన ఒక ప్లాటినమ్, ఇరిడియమ్ దండముపై గీయబడిన రెండు సన్నని గీతల మధ్యదూరము. (ఈ మానదండము కూడ సెవర్స్‌లో సంరక్షింపబడుచున్నది.)

కిల్బిషము సం. వి. దోషము, పాపము.

కిల్లాకు వి. (కిల్లి+ఆకు) చీటి.

కిల్లాడీ హిం. వి. మాయచేయువాడు. రూ. కిలాడీ.

కివ్వు క్రి. 1. తునుగు. 2, మడియు.

కిశోర న్యాయాలయము సం. వి. (శాస.) యుక్తవయస్సురాని బాలబాలికలు చేసిన నేరములు విచారించు స్థలము. బాల న్యాయస్థానము (JuviniaI court).

కిశోరము సం. వి. 1. గుఱ్ఱపు పిల్ల, 2. మృగాదుల పిల్ల.

కిశోరుఁడు సం.వి. వేడివేలుపు (సూర్యుడు). విశ. యౌవనావస్థ కలవాడు.

కిష్కువు సం. వి. 1. ముంజేయి. 2. జేన. 3. మూర.

కిసమిస వి. వ్యథ, దుఃఖము.

కిసరు వి. 1. కోపవికారము. 2. అంటు సోకుటచే పసిబిడ్డలకు గలుగు దోషము.

కిసలము సం. వి. చిగురు. రూ. కిసలయము కిసాలము, కిసాలయము.

కిసలయము, కిసాలము } సం. వి. చూ. పై.

**కిస్మిసిపండు** వి. లఘుద్రాక్షాఫలము.
**కిస్తీ** హిం. వి. వంతు చొప్పున చెల్లించు సర్కారు శిస్తు.
**కిళ్లీ** వి. పరిమళ ద్రవ్యములతో గూడిన తాంబూలము.

## కీ

**కీఁకవై.** వి. 1. ఏనుగుకూత. సం. ఘీంకారః. 2. నెమలి కూత. సం. కేకా.
**కీఁచు** వి. కోతులు, పక్షులు మొ. వి చేయు ధ్వనికి అనుకరణము.
**కీఁచుఁబాయి** వి. 1. కుమ్మరిపురుగు. 2. ఇలకోడి.
**కీకటము** సం. వి. 1. గుఱ్ఱము. 2. మగధ దేశము.
**కీకటుఁడు** సం. వి. 1. లోభి. 2. పేదవాడు.
**కీకస** సం. వి. (జం.) కశేరుక. వెన్నెముకలో నుండు ఒక్కొక్క పూస (Vertebra).
**కీకసకాయము** సం. వి. (జం.) వెన్నెముక లోని వెన్నుపూసకుండు ముఖ్యభాగము (Centrum).
**కీకసము** సం. వి. 1. ఎముక. 2. నులిపురుగు
**కీచకము** సం. వి. గాలి తాకున మ్రోగెడి వెదురు
**కీచకారాతి** సం. వి. కీచకుని శత్రువు భీముడు.
**కీచకుఁడు** సం. వి. భారతములో సుధేష్ణకు సోదరుడు, విరటుని బావమరిది.
**కీటకకోశము** సం వి. (జం.) పురుగుయొక్క నాలుగుదశలలో ఏదశనైనను కప్పి రక్షించుసంచి (Cocoon).
**కీటకఖాదములు** సం. వి. (వృక్ష.) పురుగులను పట్టి జీర్ణించుకొను మొక్కలు (Insectivorous plants).



**కీటకనిరోధకము** సం. విశ. (గృహ.) పురుగు పట్టనిది. కీటకఖాదము పురుగుకొట్టనిది. (నిపెన్‌థిస్ అను మొక్క) ఉదా. నాప్తలీన్ లేక కర్పూరపు ఉండలు (Moth-proof).
**కీటకము** సం. వి. పురుగు. రూ. కీటము.
**కీటకములు** సం. వి. (జం.) ఆరు కాళ్లుగల చిన్న ప్రాణులు (పురుగులు) (Insects).
**కీటక (పరాగ) సంపర్కము** సం. వి. పురుగుల సహాయముచే పరాగసంపర్కము జరుగుట (Insect-pollination or entomophily).
**కీటకశాస్త్రము** సం. వి. (జం.) పురుగుల జీవితమునుగూర్చి తెలియజేయుశాస్త్రము (Entomology).
**కీటమణి** సం. వి. మిణుగురు పురుగు.
**కీటము** సం. వి. చూ. కీటకము.
**కీటు** వి. 1. గోడ పెట్టునపుడు ఒక తడవ పెట్టెడు మట్టివరుస. 2. ఉపేక్ష.
**కీడు** వి. 1. అశుభము. 2. తప్పు, దోషము. 3. పాపము. 4. అపకారము 5. అపరాధము.
**కీడుపడు** క్రి. 1. తక్కువగు. 2. దైన్యపడు. 3. చచ్చు. రూ. కీడ్వడు.
**కీడ్వడు** క్రి. చూ. పై.
**కీత** విశ. 1. తక్కువ, లోపము, లోకువ. 2. నికృష్టము, నీచము.
**కీతు** వి. కొబ్బరియాకుల చాప.
**కీదృశము** సం. విశ. ఎటువంటిది.
**కీనాశుఁడు** సం. వి. 1. యముడు. 2. రాక్షసుఁడు. విశ. 1. పేద. 2. పిసినిగొట్టు. 3. కటికివాడు.
**కీరము** సం. వి. 1. చిలుక. 2. ఒకానొక దేశము.
**కీర్ణము** సం. విశ. 1. కప్పబడినది. 2. చెదరినది.

కీర్తన సం. వి. 1. కీర్తి. యశస్సు. 2.పాట.
కీర్తనము సం. వి. స్తోత్రము, పొగడ్త.
కీర్తి సం. వి. 1. యశస్సు. (వికృ.) కిరితి. 2. పేరు. 3. తేట. 4. అడుసు. 5. విరివి.
కీల సం. వి. 1. మోచేతిదిబ్బ. 2. మేకు. 3. మంట, జ్వాల.
కీలక సం. వి. ప్రభవాది అరువది సంవత్సరములలో నలువది రెండవది.
కీలకము వి. కిటుకు, మర్మము.
కీలభిన్నత సం. వి. (వృక్ష.) పొడువైన కింజల్కములు పొట్టి కీలము గల పువ్వులును, పొట్టి కింజల్కములు పొడువైన కీలములుగల పువ్వులును ఒకే మొక్కపై నుండుట (Heterostyly).
కీలము సం. వి. 1. మేకు. 2. మంట. 3. లేశము. 4. మోచేయి, (వృక్ష.) అండకోశములో అండాశయముపైనున్న కాడ (Style).
కీలరి వై. విణ. (కీలు+అరి) కీలెరిగినవాడు.
కీలసంధి, వివర్తసంధి సం. వి. (గృహ.) బొంగరపు కీలు, ఒక ఎముకలో ఇంకొక ఎముక గుండ్రముగా తిరుగుటకు అమర్చిన కీలు,ఉదా. మెడ,తల కీలు (Pivot joint).
కీలాగ్రము సం. వి. (వృక్ష.) కీలము యొక్క కొన (Stigma).
కీలారము వి. చూ. కిలారము.
కీలాలము సం. వి. 1. నెత్తురు. 2. నీరు.
కీలి సం. వి. అగ్ని. వ్యు. కీలలు కలది.
కీలించు సం. క్రి. తగిలించు.
కీలితము సం. విణ. కట్టబడినది.
కీలు వి. 1.మర. 2.మర్మము. 3 ఉపాయము. 4. కట్టులకు పూసెడు నల్లనిచమురు.
కీలుకాఁడు వి. 1. సూత్రధారుఁడు. 2. యంత్రము త్రిప్పువాడు.
కీలుకొను క్రి. 1. తగులు, 2. నాటు.
కీలుగంటు వి. జారుగా విడిచిన కొప్పు.
కీలుబొమ్మ వి. 1. మరలతో అమర్పబడిన బొమ్మ. 2. వ్యక్తిత్వము లేనివాడు.
కీశము సం. వి. కోతి.
కీశవల్లి సం. వి. ఉత్తరేణి.
కీస విణ. తక్కువ,అల్పము.అవ్య. కొంచెము. కించిత్తు.
కీసర వి. తిత్తి మొ.ని లోపలిపొర. విణ. అల్పము.
కీసరబాసర వి. అర్థముకాని భాష, గానట బీసట.

# కు

కు[1] అవ. షష్ఠీవిభక్తి ప్రత్యయము.
కు[2] సం. వి. భూమి (దీనికి తెలుగున వ్యస్త ప్రయోగము లేదు. ఉదా. కుధరము, కుజము, కుతలము మొ.వి.) సం. అవ్య. 1. వృత్తియందుపాపనిందాల్పాద్యర్థముల కుత్సితశబ్దమునకు వచ్చు ఆదేశము, ఉదా. కుజనుడు, కుతర్కము, కుగ్రామము మొదలగునవి. 2. ఒకానొకప్పుడు దీనికి కదాదేశము వచ్చును, ఉదా. కదశ్వము, కదుష్ణము మొ.వి. 3. ఒక్కొక్కప్పుడు దీనికి కా, కవాదేశము వచ్చును, ఉదా. కాపురుషుడు, కవోష్ణము మొ.వి.
కుంక వి. బాలవిధవ, రండ.
కుంకటి వి. పిల్లజుట్టు. విణ. ప్రధానము. ఉదా. కుంకటివేరు = తల్లివేరు. రూ. కూఁకటి.
కుంకుడు వి. ఫేనిల వృక్షము.
కుంకుమపువ్వు మి. వి. అగ్నిశిఖయను అంగడిదినుసు. కాశ్మీరము. (వ్యవ.) 'ఇరిడేసి' (Iridaceae) అను కుటుంబము

నకు చెందిన Crocus sativus అను మొక్క యొక్క పుష్పములలోని కీలాగ్రములు. ఇవి నారింజపర్ణముతో గూడిన ఎరుపు రంగు కలిగియుండును. ఇది పరిమళ ద్రవ్యముగను, ఓషధిగను ఉపయోగింప బడుచుండును (Saffron).

**కుంకుమ** వై. వి. నుదుట బెట్టుకొను రాగ ద్రవ్యము. ఎఱ్ఱని చూర్ణము, చెందిరము. రూ. కుంకుమ, కుంకుమము. సం. కుంకుమమ్.

**కుంచము** సం.వి. నాలుగు మానికెలకొలత.

**కుంచించుకొనిపోవుట** వి. (గృహ.) ముడుచుకొని పోవుట, క్రొత్త బట్టను నీటిలో ముంచినచో లేదా ఉదికినప్పుడు అది ముడుచుకొనుటచే చిన్నదిగ నగుట (Shrinkage).

**కుంచిక** సం. వి. 1. తాళపుచెవి. 2. కుంచెకోల. 3. చిత్రములు వ్రాయు తూలిక.

**కుంచియ** వై.వి. 1. కుచ్చు. సం.గుచ్ఛః. 2. చామరము. 3. చిత్రములు వ్రాయు తూలిక. 4. గోడకు సున్నము కొట్టెడు. మట్ట. సం. కుంచికా.

**కుంచు** క్రి. కుంగజేయు. కుదించు.

**కుంజము** సం. వి. 1. పొదరిల్లు. 2. ఏనుగు కొమ్ము.

**కుంజరము** సం. వి. 1. ఏనుగు. వ్యు. కుంజము కలది 2. వెంౘుక.

**కుంజరుఁడు** సం. వి. 1. సూర్యుడు. 2. బ్రహ్మ.

**కుంట** వై. వి. 1. కొలను. 2. పల్లము. రూ. 'గుంట. సం. కుండమ్.

**కుంటముక్కు** వి. ఒకానొక చేప.

**కుంటి** విణ. 1. కాలు విరిగినవాడు, ఖంజుడు. 2.పుట్టుకతో కాలుచెడినవాడు, పంగుపు.

**కుంటికత్తె** వై. వి. తార్చునట్టి స్త్రీ. రూ. కుంటినకత్తె, కుంటెనకత్తె.

**కుంటిగ్రాము** వి. శనిగ్రహము.

**కుంటు** క్రి. చక్కగా కాలూనక నడుచు.

**కుంటుపడు** క్రి. 1. తగ్గు. 2. పొట్టపడు. 3. చెడు.

**కుంటెన** వై. వి. తార్చెడువాడు. రూ.కుంటెనీఁడు. సం. కుట్టనీ.

**కుంటెనముడి** వి. తాటాకుల పుస్తకమునకు నడుమ నుంచు దారపుముడి.

**కుంఠితము** సం. విణ. మొక్కవోయినది.

**కుండ** వై. వి. 1. మట్టిపాత్ర. 2. ఇరుసు తగిలించెడి బండికంటి నడుమ గుబ్బ. 3. ఏనుగు కుంభస్థలము. 4. స్ఫోటకపుపొక్కు. సం. కుండమ్.

**కుండక బ్రాహ్మణులు** సం.వి. మహారాష్ట్ర బ్రాహ్మణులలో ఒక తెగ.

**కుండగోఁకరి** విణ. వంటలవాడు.

**కుండమార్పు** వి. ఒక టిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట.

**కుండము** సం. వి. 1. వంటకుండ. 2. గుడిలోని గుంట. 3. నిప్పుల గుండము. 4. కొండ.

**కుండరాశి** వై. వి. కుంభరాశి.

**కుండలము** సం.వి. 1.యజ్ఞము చేసినవారు. ధరించు కర్ణభూషణము, గుండ్రనితనము.

**కుండాలాకార** సం.విణ. (వృక్ష.) గడియారపు స్ప్రింగువలెచుట్టుకొని యుండెడి(Circinate).

**కుండలాకార మధ్యారంభ మంజరి** సం. వి. (వృక్ష.) పాము చుట్టవలె నుండు ఏక శాఖీయ మధ్యారంభ మంజరి (Helicoid cyme).


కుండలాకారమధ్యారంభ మంజరి

**కుండలి** సం. వి. 1. పాము. 2. మండలాకార నృత్యము. 3. నెమలి. 4. గొండ్లి. (భౌతి.) 1. తీగచుట్టు. 2. విద్యుత్ప్రవాహమునకుచితమైన తీగచుట్ట. (Coil). విణ. పోగులు గలవాడు.

**కుండలించు** సం. క్రి. 1. సున్నచుట్టు. 2. వాక్యమునకు గాని, పదములకుగాని ఇరు ప్రక్కల వంపుగీతలు ( ) వేయు. (బ్రాకెట్లు, కుండలీ కరణము).

**కుండలీకరణములు** సం. వి. (గణి.) కొన్ని రాసుల సముదాయములను మరికొన్ని రాసుల సముదాయముల నుండి వేరు చేయు గుర్తులు, ( ), { }, [ ].

**కుండీ** సం. వి. కమండలువు. వికృ. గిండి.

**కుండిక** సం. వి. 1. రసాతలము. 2. చిన్న పాత్ర.

**కుండుఁడు** సం. వి. మగ డుండగ రంకుమగనికి పుట్టినవాడు.

**కుంతము** సం. వి. 1. ఈటె. 2. బాణము.

**కుంతలము** సం. వి. 1. వెండ్రుక. 2. ఒక దేశము. 3. నాగలి.

**కుంతి** సం.వి. పాండవులతల్లి. వికృ. గొంతి.

**కుంద** వై. వి. గుంజ, స్తంభము. సం. గుంధః.

**కుందకము** వి. 1. లోపము. 2. అభ్యంతరము.

**కుందనము** వి. అపరంజిలోహము, మేలిమి బంగారము.

**కుందము** సం. వి. 1. మొల్ల. 2. ఒక నిధి.

**కుంది** వి. 1. దీప ముంచు ప్రమిదరాతితో చేసిన కుదురు. రూ. కుందెన, కుందియన.

**కుంధియన** వి. చూ. పై.

**కుందు** క్రి. 1. దుఃఖించు. 2. వగచు. 3. క్రుంగు. 4. కాంతివిహీనమగు. 5. బాధపడు. వి. 1. తక్కువ. 2. బాధ.

**కుందుఁడు** సం. వి. విష్ణువు.

**కుందెన** వి. 1. వడ్లు దంపురోలు. 2. కుంది. 3. ఒకానొక చెట్టు. రూ. కుందెన. కుందెయన.

**కుందెనకొమ్ము** వి. కుందేటి కొమ్ము.

**కుందేటికొమ్ము** జాతి. అసంభవము. హుళక్కి. వి. ఒక తెగ గడ్డి.

**కుందేలు** వి. చెవులపోతు. శశము,

**కుంపటి** వి. చలి కాచుకొనుటకై నిప్పునుంచెడి పాత్ర, హసంతి.

**కుంపె** వి. తాంబూల పాత్రము.

**కుంపెరుగు** వి. (కుండి + పెరుగు) ద్రప్పము, అడుగున నుండు గట్టి పెరుగు.

**కుంఫిణీ ప్రభుత్వము** మి. వి. (రాజ.) ఈస్టిండియా కంపునీ వారి ప్రభుత్వము.

**కుంభకము** సం. వి. ఊపిరి బిగబట్టుట. (ఇది ప్రాణాయామమునకు ఒక అంగము.)

**కుంభకారుఁడు** సం. వి. కుండలు చేయువాడు, కుమ్మరి.

**కుంభజుఁడు** సం. వి. 1. అగస్త్యుడు. 2. ద్రోణుడు.

**కుంభము** సం. వి. 1. కుండ. 2. ఏనుగు. నెత్తిమీది గుబ్బ. 3. పదునొకండవ రాశి.

**కుంభసంభవుఁడు** సం. వి. 1, అగస్త్యుడు. 2. ద్రోణుడు.

**కుంభాకార** సం. వి. (భౌతి.) గోళకేంద్రమునకు వెలుపల నున్న తలము. విణ. పరావర్తన తలముగా పనిచేయు (దర్పణము) (Convex).

**కుంభాకార అర్ధచంద్రాకృతి** సం.వి. (భౌతి.) ద్రవపదార్థము యొక్క స్వతంత్రతలము లోని కుంభాకార వక్రత (Convex menisous).

**కుంభాకార కటకము** సం. వి. (భౌతి.)మధ్య మందముగా నుండి అంచులచద్ద పలుచగా నుండు-కటకము (Convex lens).

కుంభాభిషేకము నం. వి. క్రొత్తగా గుడిలో ప్రతిష్ఠించిన విగ్రహమునకు కుంభమునందు ఉదకము నింపి అభిషేక మొనర్చుట.
కుంభి నం. వి. 1. ఏనుగు, వ్యు. కుంభములు గలది. 2. కుమ్మరి.
కుంభిని నం. వి. నేల.
కుంభిరూపము నం. వి. (వృక్ష.) కుండవంటి ఆకారము (బీటుదుంప ఆకారము) (Napiform).
కుంభిలుఁడు నం. వి. 1. చోరుఁడు. 2 శ్యాలుడు, భార్యతోబుట్టినవాడు.
కుంభీనసము నం. వి. పాము, విషజ్వాలలు గ్రక్కు సర్పము.
కుంభీరము నం. వి. మొసలి.
కుంభీరుఁడు నం. వి. చోరుడు.
కుకుందరము నం. వి. పిరుదుమీది గుంట.
కుకూలము నం. వి. 1. పసినాటిన గుంట. 2 కుమ్ము, పొట్టునిప్పు.
కుక్క వై. వి. శునకము. నం కుర్కురః.
కుక్కగొడుగు వి. పుట్టగొడుగు. (ఇది తెల్లగా మృదువుగా చిన్న గొడుగును పోలియుండును). (వృక్ష) ఇది శిలీంధ్ర జాతిలోని ఒక ఉద్భిజ్జము (Mushroom Agaricus sp).
కుక్కమూతిపిందె వి. చెట్టుకాయ ఎదుగునపుడు కలిగెడు పనికిమాలినపిందె.
కుక్కవెఱ్ఱి వి. (గృహ.) వెఱ్ఱికుక్క కాటువల్ల కలిగెడు ఒక రోగము. జలద్వేషము (Hydrophobia).
కుక్కి వి. 1. పల్లము, 2. త్రాళ్ళు సడలి పల్లముపడిన మంచము. విణ. లోతుగలది.
కుక్కుటపాలనము నం. వి. (వ్యవ.) గ్రుడ్లకొరకును, మాంసము కొరకును, వినోదముల కొరకును కోళ్ళను పెంచుట, కోళ్ళ పెంపకము (Poultry keeping).
కుక్కుటము నం. వి. 1. కోడి. 2. కపటము. 3. కుక్క. 4 మిణుగురులు.
కుక్కురము నం. వి. 1. కుక్క వ్యు. ఎముకలు మొ.ని తెచ్చుకొనునది.2.మాచిపత్రి.
కుక్షి నం. వి. కడుపు, జఠరము.
కుక్షింభరి నం. విణ. తనకడుపు మాత్రము నింపుకొనువాడు, ఉదరంభరి.
కుచము నం. వి. చన్ను, స్తనము.
కుచేలము నం. వి. 1. చినిగిన వస్త్రము, 2. సముద్రము.
కుచ్చితము వై. విణ. 1. కపటము. 2. నీచము, నింద్యము. నం. కుత్సితః.
కుచ్చిళ్లు వి. (గృహ.) వెడల్పు బట్టను కుచ్చులవలె దగ్గరకు తీసి అమర్చుట, ఉదా ఫ్రాక్ (Frock) లేక లంగాకుచ్చిళ్ళు (Gathers).
కుచ్చెల వి. ఎనిమిది గొఱ్ఱులకొలది. (గొఱ్ఱు అనగా ముప్పది రెండు కుంటలు).
కుచ్చెళ్లఅంచు వి. (గృహ.) గలేబులు. బెడ్‌కవర్లు మొ. నికి అందముగా నుండుటకై కుచ్చెళ్ళువేసి అతికినబట్ట (Flounce of Frill)
కుచ్చెళ్లు చూ. కుచ్చిళ్ళు.
కుచ్చెలిగంత వై. వి సన్యాసులు ధరించు బొంత.
కుచ్చు వై. వి. 1. గుత్తి. 2. పూగుత్తి. 3. ఏదేని చేర్చి కట్టినది. కొనచెవి నుంచు కొనెడి భూషణము. నం. గుచ్ఛః.
కుచ్చులబఱ్ఱె వి. జడల బఱ్ఱె, చమరీమృగము.
కుజనుఁడు నం. వి. కుత్సిత పురుషుడు.
కుజము నం. వి. చెట్టు. వ్యు. భూమినుండి పుట్టినది.
కుజుఁడు నం. వి. 1. నరకాసురుడు. వ్యు. భూమికి పుట్టినవాడు. 2. అంగారకుడు (Mars).

**కుటజము** సం. వి. కొండమల్లె.

**కుటి** సం. వి. 1 గుడిసె. 2. బుడిపి. 3. నీళ్లు మోయు పనికత్తె.

**కుటిలము** సం. విశే. వంకరైనది.

**కుటీర పరిశ్రమలు** సం. వి. (వ్యాప.) కుటుంబ వృత్తులు కర్మాగారముల అవసరము లేకుండ, వ్యవసాయదారు డుత్పత్తిచేయు దినుసులనుగాని, గ్రామ పరిసరములలో లభ్యములగు ముడిపదార్థములనుగాని ఉపయోగార్థముగ జేయు పరిశ్రమలు గృహపరిశ్రమలు. (ఇట్టి పరిశ్రమలలో ముఖ్యముగ కుటుంబములోని వారే పని చేయుదురు. ఇతరులను ఇట్టి పరిశ్రమలలో నియమించుట అసాధారణము.) ఉదా. బుట్టలు అల్లుట. (Cottage industries).

**కుటీరము** సం. వి. గుడిసె. వ్యు. కుటిలమగు (వంకరయగు) ఈరము (గుడిసె).

**కుటుంబకమతములు** వి. వి. (వ్యాప.) అధమము ఒక కుటుంబ జీవితమునకు తగినంత కనిష విస్తీర్ణముగల చిన్నకమతములు (Peasant holdings).

**కుటుంబనియంత్రణము** సం. వి. (గృహ.) ఎక్కువ మంది పిల్లలు పుట్టకుండుటకై తీసికొను జాగరూకత (Family planning).

**కుటుంబము** సం. వి. పెండ్లాము, బిడ్డలు మొ. రు. భార్యాభర్తలు, వారి సంతానము. ఒక గృహములో నివసించు బంధువర్గము(Family). (వృక్ష.) సమాన లక్షణములుగల కొన్ని గణములలోని మొక్కల సముదాయము (Family) ఉదా. గుమ్మడి కుటుంబము, ప్రత్తి కుటుంబము. (జం.) కొన్ని ముఖ్యమైన సమాన లక్షణములు గలిగి కొన్ని గణములకు చెందిన జంతువులతో ఏర్పడిన సమూహము (Family). ఉదా. ఈగ కుటుంబము, కుక్క కుటుంబము.

**కుటుంబి** సం. వి. కుటుంబ పోషకుడు.

**కుటుంబిని** సం. వి. 1. పురంధ్రి, స్త్రీ. 2. భార్య.

**కుట్టనము** సం. ఛేదనము, నరుకుడు.

**కుట్టమితము** సం. వి. (అలం.) దంతపీడనాదులచే కోపభావము అభినయించినను లోపల ఆనందము జెందు స్త్రీల శృంగారచేష్ట.

**కుట్టారము** సం. వి. కొండ.

**కుట్టి** సం. వి. కోవిదుడు విద్వాంసుడు.

**కుట్టిమము** సం వి. రాతికట్టడపు నేల.

**కుట్టియ** వి. గుదస్థానము.

**కుట్టు** వి. 1. శూల రోగము. 2. కడుపునొప్పి, 3. పొయ్యిలోని బూడిద. క్రి. 1. (తేలు మొ.వి.) కుట్టు. 2. (వస్త్రము) కుట్టు. 3. (ఆకులు) కుట్టు.

**కుట్టుడాకు** వి. విస్తరి. కుట్టిన విస్తరాకు.

**కుట్టుపోగులు** వి. ఉంగరమువంటి పోగులు.

**కుట్టుసురు** వి. (కుఱు+ఉసురు) కొన ప్రాణము.

**కుట్మలము** సం. వి. 1. సగము విరిసిన మొగ్గ. 2. ఒక విధమగు నరకము.

**కుత్ర** వి. మోసము, వంచన, కుత్సితపు ఆలోచన. విశే. కుత్సితము.

**కుత్రపువాడు** వి. దుస్తులు కుట్టువాడు. కుట్టు పనిచేయువాడు. దర్జీ

**కుఠారము** సం. వి. గొడ్డలి.

**కుడపము** సం. వి మానిక.

**కుడుమ ప్రావరము** సం. వి. (జం.) జలీయక వృక్షము (Hydroid colony obelia) లో పునరుత్పాదక భాగములను కప్పియుంచు పారదర్శక కవచము (Gonotheca).

**కుడుమ సంజీవము** సం. వి. (జం.) ఒబీలియాలో మెడూసాలను ఉత్పత్తిచేయు భాగము (Blastostyle).

**కుడి** వి. కుడుచుట, కుడుపు. విశే. అపసవ్యము, వలపల.

కుడితి వి. బియ్యము మొ. ని కడుగునీరు.
కుడిపి వై. వి. వికృతరూపుడు.సం. కురూపీ.
కుడిమివాఁడు వి. 1. పాములుబట్టు ఒక తెగవాడు. 2. విషవైద్యుడు.
కుడుంగము సం. వి. పొదరిల్లు.
కుడుక వి. తక్కెడ తట్ట.
కుడుచు క్రి. 1. అనుభవించు. 2. తిను. 3. త్రాగు.
కుడుపు క్రి. కుడువజేయు.వి. 1.అనుభవము. 2. భోజనము.
కుడుము వి. మోదకము.
కుడ్యము సం. వి. 1. గోడ. 2. పూత.
కుడ్యసంయోగము సం. వి. (వృక్ష.) ఈ సంయోగములో అండాశయము నందు ఒక గదిమాత్రమే యుండును: జరాయువులు కుడ్య అండాశయముయొక్క సంయోగము లోపలి భిత్తికపై అమర్పబడి యుండి వానిపై బీజాండము లుండును (Parietal Placentation).



కుణకము సం. వి. పిల్ల.
కుణపము సం. వి. 1.పీనుగు. 2. దుర్గంధము.
కుతపము సం. వి. 1. దినమందు పదునేను భాగములలో ఎనిమిదవ భాగము, 2. ఒక రకపు వాద్యము.
కుతపుఁడు సం. వి. 1. తోడబుట్టిన దాని కొడుకు. 2. సూర్యుడు, వ్యు. భూమిని తపింపజేయువాడు.
కుతిక వి. గొంతు. రూ. కుతుక, కుత్తుక.
కుతినీ వి. ఒక దినుసుపట్టు.
కుతిల వి. 1. బాధ. 2. దుఃఖము.
కుతిలపడు క్రి. గాసిచెందు, బాధపడు.
కుతుకము సం. వి. తమి, అనుభవింపని కోరిక యందలి ఆస, కోరిక.
కుతూహలము సం. వి. 1. కోరిక. 2. ఆనందము. 2. నాయికకు మనోజ్ఞమైన వస్తువును చూచుటయందుగల లోలత్వము.
కుత్కీలము సం. వి. కొండ.
కుత్తుకబంటి విశే. కంఠము వరకు, ఉదా. కుత్తుక బంటి అన్నము తిని.
కుత్స సం. వి. నింద, దూఱు.
కుత్సించు సం. క్రి. 1.రోతపడు. 2.దూఱు.
కుత్సితము సం. విశే నికృష్టము.
కుత్సిరము సం. వి. పడ్డిబ్రతుకు.
కుథము సం. వి. 1. పవిత్రము. 2. దర్భ. 3. ఏనుగుపై పరచెడి ఎఱ్ఱ కంబళి.
కుదప వి. రొంపిదుక్కి, అడుసుదుక్కి.
కుదరము సం. వి. గుజ్జము. వికృ. కుదిర.
కుదికిలబడు క్రి. చదికిలబడు, కూలబడు.
కుదియు క్రి. 1. అడగు, క్రుంగు. 2. తగ్గు. మరల, వెనుదీయు.
కుదిర వై. వి. గుజ్జము. సం. కుదరః.
కుదిరిక వి. 1. నిలుకడ. 2. నెమ్మది.
కుదుకనగోలు వి. వంచన, మోసము.
కుదుప వి. 1. దుర్మాంస పిండము, 2. వంచన. 3. నెత్తురు. మొ. వి పేరుకొన్న ముద్ద.
కుదుపు క్రి కదలించు ఇటునటు ఊపు. వి. కదలిక. విశే. పంగువు.
కుదురు క్రి 1. అనుకూలమగు. 2 స్వస్థమగు. వి. 1. పాదు. 2. నెమ్మది. 3. అగసాలె వాని కుంపటి. 4. స్థానము. 5 ఆధారము. 6. చుట్టకుదురు.
కుదులు క్రి. 1. చలించు. 2. (నిద్రనుండి మేలుకొనునపుడు) కదలు.
కుదువ వి. తాకట్టు.
కుద్దాలము సం. వి. గుద్దలి. త్రవ్వు సాధనము. వ్యు. భూమిని చీల్చునది.
కుధరము సం. వి. కొండ.
కునుకు క్రి. నిద్రచే తూలు, తూగు, కునికిపడు.

కున్న వై. వి. బిడ్డ. రూ. కున్నె, కూన, నం. కుణకః.

కున్నడు వై. వి. బాలుడు, బిడ్డడు.

కుపసము వై. వి. 1. పాముపొర. రూ. కుబుసము, కుప్పసము, కూసము. 2. అరచట్ట, రవిక. నం. కూర్పాసః

కుపితుఁడు నం. విశే. కోపించినవాడు.

కుప్ప వి. ధాన్యము మొ. ని రాశి.

కుప్పఁగూర వి. కుప్పపడుట క్రి. విశే. కుప్పకుప్పలుగా. రూ. కుప్పనఁగూర.

కుప్పకోలు వి. అతిశయము. ఆధిక్యము.

కుప్పగూలు క్రి. 1. కుప్పగా కూలు. 2. పెక్కు దుఃఖములచే స్తంభితుడగు.

కుప్పగోలుకొను క్రి. మెండగు.

కుప్పట వి. ధాన్యము వలని ధనము.

కుప్పతించు క్రి. అధికముగా రాల్చు.

కుప్పతిప్పలుగా అవ్య. సమృద్ధిగా, కొల్లలుగా.

కుప్పతిలు క్రి. కుప్పగాచేరు.

కుప్పనఁగూర వి. చూ. కుప్పగూర.

కుప్పము వి. గ్రామము.

కుప్పసము వై. వి. చూ. కుపసము.

కుప్పిగంతులు వి. బాల బాలికల పల్లటీలు.

కుప్పీలు వి. ఒకానొక బాలికాక్రీడ.

కుప్పె వి. గాజుగిన్నె. 2. గొడుగుమీది గుబ్బ. 3. జడ నగ (జడకుప్పెలు). 4. గిన్నెమూత. (మందుకుప్పె అనియు వాడుక గలదు). 5. శిరోభూషణము. నం. కూపీ.

కుప్పెంట వి. మంటి దిబ్బలలో మొలుచు మొక్క, హరిత మంజరి.

కుప్పెకోల వి. ఒకరకపు బాణము,

కుప్యము నం. వి. వెండి, బంగారు తక్క మిగిలిన లోహము.

కుబుసము వి. 1. పాముపొర. 2. తలుపునకు క్రింది మీదుల నుంచు కూచము.

కుబేరాక్షము నం. వి. గచ్చకాయ.

కుబేరుఁడు నం. వి. ఉత్తరదిక్పాలకుడు, ధనదుడు, రావణుని అన్న.

కుబ్జ నం. వి. గొట్ల.

కుబ్జము నం. వి. 1. గజ విశేషము. 2. ఒకానొక చెట్టు. విశే. మరుగుజ్జు

కుమారస్వామి నం. వి. స్కందుడు, శంకరుని పుత్త్రుడు, దేవసేనాధిపతి. వికృ. కొమరుసామి.

కుమారి నం. వి. 1. కూతురు. 2. పెండ్లి కాని ఎనిమిదేండ్ల పడుచు. 3. పార్వతి.

కుమారిలు క్రి. కుములు, పొగులు

కుమారుఁడు నం, వి. 1. కొడుకు. 2. బాలుడు. 3. స్కందుడు.

కుముద నం. వి. 1. ఱేకు. 2. గుమ్మడు.

కుముదము నం. వి. 1. ఎఱ్ఱ తామర. 2. నైఋతి దిక్కునందలి ఏనుగు. 3. తెల్ల కలువ.

కుముదిని నం. వి. 1. తెల్లకలువ తీగ. 2. కలువలు గల కొలను.

కుములు క్రి. లోలోన తపించు.

కుమేరజ్యోతి నం. వి. (భూగో.) దక్షిణ ధ్రువము వద్ద కనిపించు ఎఱ్ఱని ఉషఃకిరణములు.

కుమ్మకుక్క హిం. వి. 1. గూడుపుఠాణి. 2. రహస్యాలోచన. 3. దొమ్మి. 4. తోడు. రూ. కుమ్ముకు.

కుమ్మరి వై. వి. కుండలు చేసి జీవించెడు జాతి. నం. కుంభకారః.

కుమ్మరపురుగు వి. అడుసునందు తిరిగియు అడుసంటుకొనక చరించు పురుగు. మట్టి పురుగు.

కుమ్మరసారెచుక్క వి. విశాఖా నక్షత్రము.

కుమ్ము క్రి. 1. నలియగొట్టు. 2. పొడుచు. రూ. క్రుమ్ము. వి. 1. పొట్టునిప్పు. 2. పోటు. 3. జగడము.

కుమ్మె వి. పోటు.
కుమ్మెలువోవు క్రి. 1. గాయమగు. 2. నొక్కులుపడు.
కుయి వి. 1. మొర. 2. రక్షణము. రూ. కుయ్యి, కూయి,
కుయ్యి వి. చూ. కుయి.
కురంగనాభి సం.వి. కస్తూరి.
కురంగపాణి సం.వి. ముక్కంటి, శివుడు.
కురంగమము సం.వి. జింక.
కురంగము సం. వి. 1. జింక. 2. కోతి. రూ. కురంగమము.
కురంట వి. సమీపము.
కురంటకము సం.వి. తుమ్మిచెట్టు.
కురంటము సం.వి. 1. పచ్చపువ్వులగోరింట. 2. పచ్చ పేమంతి.
కురండము సం.వి. అండవృద్ధి, బుడ్డ.
కురరి సం.వి. ఆడుగొఱ్ఱె.
కురవకము సం.వి. ఎఱ్ఱ గోరింట.
కురవము సం. వి. తిలకము
కురుడి వి. లోపలినీరింకిన కొబ్బెర,
కురియు క్రి. 1. గుప్పించు. 2. వర్షించు.
కురుఁజు వి. దూలము మీదనుంచు నిలువు కొయ్య, గుజ్జు, మంచె.
కురుజు వి. 1. జున్ను. 2. ఒకతెగ డేగ. 3. ఈకలు రాల్చిన పక్షి.
కురుమ వి. గొఱ్ఱెబొచ్చుతో కంబళ్లు నేయు గొల్లజాతి.
కురుమగొఱ్ఱె వి. కంబళ్లునేయుటకు పనికి వచ్చు ఉన్ని నిచ్చు గొఱ్ఱె.
కురులు వై. వి. ముంగురులు, వెండ్రుకలు, సం. కురలః.
కురువ వి. కొండమీది కాలిత్రోవ.
కురువిందము సం. వి. ఎఱ్ఱని కెంపు. అద్దము (రసా.) గనులలో దొరకు ఎల్యూమినియం ఆక్సైడ్ (ద్విఎల్యూమినియమ్ త్ర్యామ్లజనిదము). (స్వర్ణకారులుబంగారు మెరుగుపెట్టుటకు దీనిని ఉపయోగింతురు) (Corundum).
కురుళము సం. వి. ముంగురులు.
కురూపి సం. వి. అనాకారి. కుడిపి.
కుర్తా హిం. వి. (గృహ.) వదులుగా ఉండు అంగీ.
కుర్వాణుఁడు సం. వి. పనివాడు. సేవకుడు. విణ సమర్థుడు.
కుఱగలి వి. దగ్గర. రూ. కుఱఁగట.
కుఱు విణ. సమాసమందు కుఱుచ శబ్దము తుదివర్ణము లోపింపగా మిగిలినరూపము ఉదా. కుఱుగద్దియ, కుఱుమాపు.
కుఱుఁచ వి. హ్రస్వస్వరము. విణ హ్రస్వము
కుఱుకొను క్రి. త్వరపడు.
కుఱుమాపు విణ. కొంచెము మాసినది.
కుఱుపు వి. తొడ.
కుఱ్ఱ వి. 1. కొడుకు, 2. బిడ్డ, 3. బాలుడు రూ. కుఱఁడు.
కుఱ్ఱి వి. వి. పాడియావు.
కుఱ్ఱు క్రి. కూయు
కులకము సం. వి. 1. ఒక క్రియతో ముగిసెడు పద్యసమూహము. 2. పుట్ట.
కులకుఁడు సం. విణ. 1. కులశ్రేష్ఠుడు. 2. పనివాండ్రలో పెద్ద.
కులజుఁడు సం. విణ. కులీనుడు, మంచి పుట్టుక కలవాడు.
కులట సం. వి. రంకుటాలు.
కులదేవత సం. వి. ఇలవేలుపు.
కులపతి సం వి. 1. కులస్వామి. 2. పదివేల శిష్యుల పోషించి అధ్యయనము చేయించు బ్రహ్మర్షి. 3.(చరి.) విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు.
కులపర్వతములు సం. వి. హిమవంతము, వింధ్యము, నిషధము, మాల్యవంతము. పారియాత్రకము,గంధమాదనము, హేమకూటము.

**కులపాలిక** సం. వి. 1. తల్లిదండ్రులచే ఒసగబడి పెండ్లి చేయబడిన స్త్రీ. 2. తన కులమును మానమును కాపాడుకొను స్త్రీ
**కులము** సం. వి. 1. వంశము. 2. ఇల్లు. 3. తెగ. 4. శరీరము. 5. ఊరు.
**కులాయము** సం. వి. 1. పక్షిగూడు. 2. చోటు. 3. ఇల్లు.
**కులాలుఁడు** సం. వి. కుమ్మరవాడు.
**కులికుఁడు** సం. విశే. కులశ్రేష్ఠుడు.
**కులిరము** సం. వి. ఎండ్రకాయ. రూ. కులీరము.
**కులిశము** సం. వి. వజ్రాయుధము. వ్యు. కొండల రెక్కలను ఛేదించునది.
**కులీనత** సం. వి. మంచి కులమున పుట్టుట.
**కులుకము** సం. వి. నాలుక మురికి.
**కులుకు** క్రి. 1. పోయు. 2. వేయు. 3. వెదచల్లు. 4. కుదిలించు. వి. శృంగారపు కుదిలిక.
**కులుకులాడి** వి. కులుకులు గల స్త్రీ.
**కులుకులాఁడు** వి. కులుకులు గలవాడు.
**కులువ** వి. శోఫ, వాపు.
**కుల్య** సం. వి. 1. కయ్య. 2. నది నుండి త్రవ్విన కాలువ.
**కుల్యము** సం. వి. శల్యము, ఎముక, సం. విశే. 1. గొప్పది. 2. మంచి కులమున పుట్టినది.
**కుల్యికలు** సం. వి. (జం.) ఎముకలో నుండు అతి సూక్ష్మమైన శాఖలు గల చిన్న చిన్న గొట్టములు (Canaliculi).
**కువ** వి. కువ్వ. కుప్ప.
**కువలయము** సం. వి. 1. భూమండలము. 2. నల్ల కలువ. రూ. కువలము.
**కువలయేశుఁడు** సం. వి. 1. రాజు. 2. చంద్రుడు.
**కువలేశుఁడు** సం. వి. విష్ణుమూర్తి
**కువాదము** వై. వి. కపటకృత్యము, కాపట్యము. రూ. కువాళము. సం. కువాదః.
**కువిందము** సం. వి. లోహమునకు మెరుగు పెట్టుటకుపయోగించు చూర్ణము (Emery Powder).
**కువిందుడు** సం. వి. సాలెవాడు.
**కువేణి** సం. వి. చేపలబుట్ట
**కువేలము** సం. వి. 1. కలువ. 2. పద్మము
**కుశ** సం. వి. 1. త్రాడు. 2. గుఱ్ఱపు కళ్ళెము.
**కుశము** సం. వి. 1. దర్భ. 2. పలుపు. 3. ఒక ద్వీపము. 4. నీరు.
**కుశలప్రశ్నము** సం. వి. క్షేమ మరయుట.
**కుశలము** సం. వి. 1. క్షేమము, శుభము, 2. (వ్యావ.) చిన్నది. ఉదా. "మాయిల్లు కుశలము" = ఇరుకైనది. 3. తనివి. 4. పుణ్యము.
**కుశస్థలము** సం. వి. కన్యాకుబ్జ దేశము.
**కుశస్థలి** సం. వి. ద్వారకానగరము, ఉదా. "కుశస్థలీ పురమున యాదవ ప్రకరముల్ భజియింపగ నున్నవాడు"
**కుశీలవుఁడు** సం. వి. 1. చారణుడు. 2. నానాదేశ సంచారియైన నట్టువుడు. 3. వాల్మీకి. 4. బట్టువాడు.
**కుశుఁడు** సం. వి. శ్రీరామ చంద్రుని జ్యేష్ఠ పుత్రుడు.
**కుశేశయము** సం. వి. తామరపువ్వు. వ్యు. నీటియం దుండునది.
**కుష్ఠము** సం. వి. 1. పులుము. 2. చెంగల్వ కోష్ఠు.
**కుష్ఠరోగము** వి. పెద్దరోగము. (ఈ వ్యాధి వలన కండరములు క్రమముగా క్షీణించి అవయవములు వశము కాక పోవును) (Leprosy).
**కుష్మాండము** సం. వి. గుమ్మడి.
**కుసమాయోజనము** సం. వి. (గృహ.) సర్దుకొన లేకపోవుట, అమర్చుకొనలేకపోవుట.

అలవడకపోవుట, కలసిమెలసి యుండలేక పోవుట (Maladjustment).
కుసి వి. రంధ్రమున చొప్పించుటకు చెక్కిన కొయ్యకొన.
కుసిని సం.వి. (Cusine) వంటఇల్లు.
కుసిగుంపులు వి. శ్రమము, బాధ.
కుసీదకుడు సం. వి. వడ్డీ కిచ్చి జీవనము చేయువాడు.
కుసుంభము సం. వి. 1. కుసుంబపువ్వు 2. కమండలువు.
కుసుంభరాగము సం. వి. బయటికి కన బడుచు అంతఃకరణమందు లేని ప్రేమ.
కుసుమ వి. 1. ఒకరకపుధాన్యము (వడ్లలో పెద్దకుసుమ, చిన్నకుసుమ, గుత్తికుసుమ మొ.వి. 2. (వ్యావ.) గింజలనుండి 'కుసుమ' నూనెనిచ్చెడి పైరు (Safflower).
కుసుమము సం. వి. 1. పూవు. 2. నేత్ర రోగము. 3. స్త్రీరజస్సు. 4. పండు.
కుసుమాకరము సం. వి. 1. వసంతర్తువు. 2. తోట.
కుసుమాయుధుఁడు సం. వి. మన్మథుడు.
కుసుమాసవము సం. వి. తేనె. మధువు.
కుసులు క్రి. అతృప్తిచే దుఃఖించు.
కుసూలము సం.వి. ధాన్యముపోసెడు గరిసె.
కుస్తరించు క్రి. 1. ఊరడించు. 2. సవరించు, 3. బుజ్జగించు. 4. ధరించు. 5. కప్పు 6. ఆజ్ఞాపించు.
కుస్తుంబరి సం. వి. కొత్తిమిరి.
కుహకము సం. వి. మోసము, వంచన.
కుహన సం. వి. అర్థాపేక్షచేనగు కపటచర్య.
కుహాసము సం. వి. 1. ఎలుక. 2. పాము.
కుహరము సం. వి. 1. గుహ 2. రంధ్రము.
కుళాయి హిం. వి. టోపి. దూ. కులాబు, కుళ్ళాయ, కుళ్ళాయి.
కుళీరము సం.వి. ఎండ్రకాయ, పీత.
కుళుత్థము సం. వి. ఉలవలు.
కుళుపు వి. ఉంగరమున పొదిగెడు ఒకా నొక మణి.
కుళ్ళు క్రి. 1. క్రుళ్ళు. 2. చెడిపోవు. 3. లోలోన అసూయపడు.
కుళ్ళుకోనేరు వి. (గృహ.) మరుగుదొడ్డి నీరును మలములతో సహా భూమిలోనికి గొట్టములద్వారా పారజేయుటకు త్రవ్వి పైన పూడ్చిన నూయి (Septic tank)
కుళ్ళుపోతు విశే. కుళ్ళుచుండువాడు.

# కూ

కూ అవ్య. కూయి, పిలువగా పామర జను లెచ్చరించుకొనుటయందగు ధ్వని.
కూఁక వి. అరవు, కూత.
కూఁకటి వై. వి. పిల్లజుట్టు, జుట్టు, విశే. 1. ప్రధానము, 2. లేతది. సం. కూటకః.
కూఁకు క్రి. అస్తమించు.
కూఁత వి. కూయుట.
కూఁతవైదువు వి. శంఖము.
కూఁతవేల వి. 1. కూతవేటు, 2. క్రోసు.
కూఁతురు వి. కొమార్తె.
కూఁతురుబుడము వి. నూగుదోసకాయ.
కూకి వి. ఒకరకము పావురము.
కూకు వి పాల విరుగుడు.
కూకువు సం వి. ఎనిమిదేండ్లవరకు పెండ్లి కాని పడుచు.
కూచి వి. 1. యుద్ధయాత్రకై వాద్యము ప్రయోగించుట. 2.ఆడుది. విశే. 1.వాడియై నది. 2. వికసించినది.
కూచము వి. 1. గూటము. 2. స్తంభము,
కూజితము సం. వి. అవ్యక్తధ్వని.

కూజా హిం. వి. పొడుగుపాటి సన్నని మెడగల పాత్రము



కూటపాదములు సం. వి. (జం.) అమీబా వంటి ఏక కణజీవులుచలనమునకుపయోగించు కృత్రిమమైన కాళ్ళవంటి ప్రవర్ధములు. (Pseudopodia).

కూటమి వి. 1. కూడిక 2. సురతము.

కూటము[1] వి. 1. కొలువు కూటము. 2. చావడి.

కూటము[2] సం. వి. 1 అమ్ము. 2. కపటము 3. కల్ల. 4. దుఃఖము, 5. ప్రోగు. 6. బొంకు. 7. ఇల్లు. 8. కొండకొమ్ము, పర్వత శిఖరము.

కూటయుగ్మశాఖీయము సం. వి. (వృక్ష.) అగ్రకోరకము రెండు శాఖలుగా చీలినపుడు ఏదో ఒకవైపున ఉన్నశాఖ అణగిపోయినస్థితి (False dichotomy).

కూటసాక్షి సం. వి. అబద్ధపు సాక్ష్యము చెప్పువాడు.

కూటసాక్ష్యము సం. వి. తప్పుడుసాక్ష్యము.

కూటస్ఫుటి సం. వి. (వృక్ష.) ఇది శుష్కఫలములో ఒక రకము అసత్యమైనస్ఫుటము (Replun)కలిగి, క్రిందినుండి పైకి రెండుభాగములుగా కూటస్ఫుటి పగులుకాయ ఉదా. ఆవకుటుంబములోని మొక్కలు. (ఇది సన్నముగా పొడవుగా నుండును) (Siliqua).



కూటస్ఫుటికము సం. వి. (వృక్ష) పొట్టిగా వెడల్పుగా ఉన్న కూటస్ఫుటి ఫలము (Silicula).

కూటాగారము సం. వి. 1. మేడమీదియిల్లు. 2. ఇంటికప్పు.

కూటువ వి. 1. గుంపు. పోవు. 2. కూడిక. 3. సంభోగము.

కూడముట్టు క్రి. తరుముకొనిపోవు. వెన్నంటు.

కూడలి వి. రెంటి మూటి-కూడిక.

కూడలిరాయి వి. సరిహద్దురాయి.

కూడలివాయి వి. రెండు వంచలు చేరెడు మూల ఏర్పరచిన నీటిదారి.

కూడిక వి. సంయోగము చేరిక. (Addition).

కూడు వి, అన్నము క్రి. 1. ఒప్పు 2. సాధ్యపడు, 3. కూడబెట్టు 4. లెక్కకూడు. 5. కలుపు.

కూడుదల వి. లాభము.

కూన వై. వి. కున్న. కుర సం. కుణకః.

కూనలమ్మ వై.వి. సంతతినిచ్చు దేవత.

కూపకము సం. వి. (జం.) పొత్తికడుపు చుట్టునుండు అస్థిపంజరము (Pelvis).

కూపము సం. వి. 1. బెజ్జము. 2. నూయి. 3. చెలమ. 4. ఓడకంబము, 5.రంధ్రము.

కూపారము సం.వి. కడలి. సముద్రము.

కూపి సం. వి. కుప్పె, గాజుకుప్పె.

కూబరము సం. విశ. మనోజ్ఞము, సుందరము.సం.వి. 1. బండినొగ.2. మోకాయి.

కూయి వి. హూ. కుయ్యి.

కూయు క్రి. అరచు, మొరపెట్టు.

కూర వై. వి. శాకము, వ్యంజనము. సం. కూరమ్

కూరదినుసులు వి. (వ్యావ.) కూరగాయలనిచ్చు పైరులు. ఉదా. బెండ, బీర, తోటకూర. మొ.వి.(Vegetables).

కూరము సం.వి. అన్నము, వంటకము

కూరిచి అవ్య కూర్చి గురించి ఉద్దేశార్థమందు ద్వితీయా విభక్తితో చేరి వచ్చునది ఉదా "రామునిగూర్చి"

కూరు క్రి 1 కలుగు (సమకూరు), 2. దూసిపోవు 3. చొప్పించు.

కూరుకు వి. నిద్దుర. క్రి. నిద్రించు.

కూరుచు క్రి. 1. సంబంధించు. 2. ప్రియపడు. 3. కూడబెట్టు. 4. సంగ్రహించు. 5. రచించు. రూ. కూర్చు.

కూరుపరి విశే. సంధాయకుఁడు. రూ. కూర్పరి.

కూర్చము సం. వి. 1. తృణము. 2. కపటము. 3. కనుబొమలనడుమ. 4. పెరిగిన మీసములు గడ్డములు.

కూర్చాస్థులు సం వి. (జం.) మడమయందుండు ఎముకలు (Tarsals).

కూర్చిక సం. వి. 1. కుంచెకోల. 2. బిగము. 3. మొగ్గ. 4. సూది. 5. జున్ను.

కూర్చు క్రి. చూ. కూరుచు.

కూర్పసము సం. వి. 1. మోచేయి. 2. మోకాలు.

కూర్పాసము సం వి. 1. కవచము. 2. రవిక. 3, అరచట్ట.

కూర్పు వి. 1. కూరుపు. 2. ముద్రణము.

కూర్పు, చిన్నపోగు వి.(గృహ.) చిన్న చిన్న టాకాల కుట్టు (Running).



కూర్పు

కూర్మము సం. వి. కమఠము, తాబేలు.

కూలంకష సం. వి. ఏరు, నది. వ్యు. గట్టుల నొరయునది.

కూలము సం. వి. 1. గుంట. 2. మంటిదిబ్బ. 3. దరి.

కూలి వి. పనిచేసినందుల కిచ్చెడు ధనము.

కూలు క్రి. కూలబడు, చచ్చు.

కూష్మాండము సం. వి. 1. గుమ్మడి. 2. ఒకవిధమగు పిశాచము.

కూసము వై. వి. కుప్పసము, కుబుసము. సం కూర్పాసః.

కూళ వై. వి. 1. కుత్సితుడు. 2. క్రూరుడు. సం. క్రూరః.

## కృ

కృంతనము సం. వి. ఛేదనము, కత్తిరించుట.

కృకము సం వి. కంఠనాళము, కంఠపుబుడిపి, కుత్తుక.

కృకలాసము సం. వి. ఊసరవెల్లి, తొండ. రూ. కృకలాశము వ్యు. కంఠముతో ఆడునది.

కృకవాకుధ్వజుఁడు సం వి. కుమారస్వామి.

కృకవాకువు సం. వి. 1. కోడి. 2. నెమలి. వ్యు. తలయెత్తి కూయునది. 3. మైల చాయ తొండ, సరటము.

కృకాటిక సం. వి. 1. పెడతల. 2. పెడతలయందలి ముచ్చిలిగుంట.

కృచ్ఛ్రము సం. వి. 1. పాపము. 2. బాధ. 3. దోషపరిహారమునకై చేయు వ్రతము.

కృతకము సం. విశే. మనుష్యులచే చేయబడునది, కృత్రిమము.

కృతకములు (ఎరువులు) సం. వి. (వ్యవ.) కృత్రిమపు ఎరువులు, మానవునిచే తయారుచేయబడు ఎరువులు. (ఇవి సహజముగా లభింపవు (Artificial manures).

కృతకాద్రి సం వి క్రీడించుటకొరకు ఏర్పడిన కొండ, చేతగట్టు.

కృతకృత్యుఁడు సం. విశే. నెరవేరినపని గలవాడు, సుకృతి.

కృతఘ్నుఁడు సం. విశే. చేసినమేలు మరచెడివాడు, వ్యతి. కృతజ్ఞుడు.

కృతజ్ఞుఁడు సం. విశే. చేసినమేలు తలచువాడు.

కృతము సం. వి. యుగములు నాల్గింటిలో మొదటిది. విశే. చేయబడినది.

కృతహస్తుఁడు సం. విశే, 1. నేర్పరి. 2. గురితప్పక వేయువాడు.

కృతాంజలి సం. విశే. చేతులు మోడ్చినవాడు. వి. లజ్జాళువు.

కృతాంతము సం. వి. 1. అశుభకర్మ. 2. భాగ్యము 3. సిద్ధాంతము.

కృతాంతుఁడు సం. వి. యముడు.

కృతార్థుఁడు సం. విశే. ధన్యుడు, తలచినపని నెరవేర్చుకొనినవాడు.

కృతి సం. వి. 1, ప్రబంధము, సప్తసంతానములలో ఒకటి. 2. చదువరి. విశే నేర్పరి.

కృతికర్త సం. వి. గ్రంథము రచించినవాడు, కవి.

కృతిపతి సం. వి. గ్రంథమును అంకిత మందినవాడు.

కృత్తము సం. విశే. ఛేదింపబడినది,

కృత్తి సం. వి. 1. చర్మము, తోలు. 2. కృత్తికానక్షత్రము.

కృత్తిక సం. వి, ఇరువదియేడు నక్షత్రములలో మూడవది, కత్తెర.

కృత్తికాసుతుఁడు సం. వి. కుమారస్వామి.

కృత్తివాసుఁడు సం. వి. ముక్కంటి.

కృత్తు సం. వి. (వ్యాక.) విశేష్య విశేషణ రూపము లేర్పడుటకై ధాతువులపై చేరు ఇక, క మొ.గు ప్రత్యయములు, కర్తృప్రత్యయము. ఉదా. పలిక (పలు+ఇక), మొలక (మొలుచు+క).

కృత్య సం. వి. 1. ఒకానొక దేవత. 2. చేష్ట.

కృత్యము సం. వి. పని, వ్యాపారము. విశే. చేయదగినది.

కృత్రిమతంతులు వి. (గృహ.) రాసాయనిక సంయోజనమువలన తయారుచేయబడిన దారములు (Synthetic fibres).

కృత్రిమపోషణ సం. వి. (గృహ) ఆహారమును కృత్రిమ మార్గమున దేహమునకు అందజేయుట (Artficial feedιng).

కృత్రిమము సం. విశే. మనుష్యులచే చేయబడినది. (భౌతి. రసా.) ప్రకృతిలో దొరకునదికాక మానవునిచే నిర్మితమైనది (Artificial).

కృత్రిమాయస్కాంతము సం. వి. (భౌతి.) కృత్రిమముగా నిర్మించబడిన అయస్కాంతము (Artficial magnet).

కృత్రిముఁడు సం. విశే. 1. పంద్రెండుగురు పుత్త్రులలో ఒకడు 2. కపటి.

కృత్స్నము సం వి. 1. జలము. 2. కడుపు. విశే. సర్వము.

కృదంతము సం. వి. (వ్యాక.) ధాతువుల వలన గలుగు నామవాచకము, ఉదా. అలుగు-అలుక, కలుగు-కలిమి, కోయు-కోత.

కృప సం. వి. దయ, కనికరము.

కృపణము సం. వి. కీటకము. విశే. కుటిలమైనది.

కృపణుఁడు సం. విశే. 2. పిసినిగొట్టు. లోభి. 2. కుత్సితుడు.

కృపాణము సం. వి. పెద్దకత్తి, ఖడ్గము రూ. కృపాణకము.

కృపాణి సం. వి. 1. చురకత్తి 2. కత్తెర.

కృపాళువు సం. విశే. దయాళువు, దయగలవాడు.

కృపి సం. వి. ద్రోణుని భార్య.

కృపీటము సం. వి. 1. జలము. 2. కడుపు. 3. సమిధ.

కృపీటయోని సం. వి. అగ్ని. వ్యు. నీటికి ఉత్పత్తిస్థానమైనది.

కృపుఁడు సం. వి. ద్రోణుని మరిది.

కృమి సం. వి. 1. పురుగు. 2. లక్క.

కృశము సం. విశే. 1. బక్క. 2. సన్నము. 3. అల్పము.

కృశాంగి సం. వి. స్త్రీ. విశ. బక్కపలుచని దేహము కలది.
కృశానువు సం. వి. అగ్ని.
కృశానురేతస్సుడు సం. వి. శివుడు. వ్యు. అగ్నిలో పడిన వీర్యము కలవాడు.
కృషకము సం. వి. కఱ్ఱు.
కృషి సం. వి. సేద్యము, వ్యవసాయము.
కృషికుఁడు సం. వి. దున్నువాడు. వ్యవసాయి.
కృషీవలుఁడు సం. వి. కృషికుడు. వ్యవసాయము చేయువాడు, వ్యవసాయదారుడు, రైతు, కర్షకుడు, సేద్యగాడు (Cultivator).
కృష్ణ సం. ఫి. 1, కృష్ణానది, 2 యమునానది, 3, ద్రౌపది, 4. నీలి, 5. ద్రాక్ష. 6. జీలకఱ్ఱ, 7.కృష్ణతులసి, 8 నల్లావాలు
కృష్ణజన్మస్థానము సం. వి. బంధనాలయము చెరసాల, శ్రీకృష్ణ భగవానుడు జన్మించిన స్థలము.
కృష్ణద్వైపాయనుఁడు సం. వి. వ్యాసుడు.
కృష్ణము సం. వి. 1. ఇనుము, 2. మిరియము 3. నలుపు. 4. కాకి. 5. కోకిల. 6. కాలాగురువు. విశ. నల్లనిది,
కృష్ణమూర్తి సం. వి. కృష్ణావతారము.
కృష్ణలోహితము సం. వి. నలుపు ఎరుపు గలిసిన రంగు, ధూమ్రవర్ణము.
కృష్ణవర్త్మ సం వి. 1. అగ్ని. 2. రాహుగ్రహము విశ. దురాచారుడు.
కృష్ణవేణి సం. వి. కృష్ణవేణి అను నది. కృష్ణానది.
కృష్ణసర్పము సం. వి. నల్లత్రాచు.
కృష్ణసారము సం. వి. నల్లయిఱ్ఱి.
కృష్ణుఁడు సం వి. 1. విష్ణువు, 2. వ్యాసుడు 3. శ్రీకృష్ణ భగవానుడు.

## కౢ

కౢప్తము సం. విశ. 1 ఏర్పాటు చేయబడినది 2. సంగ్రహము చేయబడినది. 3. రచింపబడినది.
కౢప్తి సం. వి. 1. ఏర్పాటు. 2. రచించుట, కూర్పు. 3. నిశ్చయము.

## కె

కెంజిగురు వి.(కెంపు+చిగురు) ఎఱ్ఱనిచిగురు
కెంజాయ వి. (కెంపు+చాయ) ఎరుపు.
కెందమ్మి వి. (కెంపు+తమ్మి) ఎఱ్ఱదామర
కెందొగ వి. (కెంపు+తొగ) ఎఱ్ఱకలువ.
కెంపు వి. 1. పద్మరాగమణి. 2. ఎఱుపు. విశ. ఎఱ్ఱనిది.
కెంపుకంటి వి. కోయిల. వ్యు. ఎఱ్ఱని కన్నులు గలది.
కెంపుగాము వి. అంగారకుడు.
కెంపునవతు వి. స్వాతీనక్షత్రము.
కెటబోలిసమ్ ఇం. వి. (గృహ.) (Katabolism) అపచయము, ఆహార పదార్థముల విభజన.
కెడ వి. పార్శ్వము.
కెడయు క్రి 1 పతనమగు 2. చచ్చు.
కెమేరా ఇం.వి. (భౌతి.) (Camera) ఛాయాచిత్రములను తీయుటకు ఉపయోగించు పరికరము.
కెరకొట్టు క్రి. కలకల కూయు.
కెరటము వి. అల, కరడము.

**కెరలు** క్రి. 1. అతిశయించు, 2. ఆగ్రహించు. 3. కూయు, 4. విజృంభించు.

**కెరిబో** ఇం. వి.(భూగో.) (Caribow) మంచు ఎడారులలో నుండు 'రాన్ డీర్, (Reindeer)' అను జింక.

**కెరోటిన్** ఇం. వి. (గృహ.) (Carotene) పసుపు పచ్చని పదార్థము. 'ఏ' విటమిన్ తయారగుటకు కావలసిన పదార్థము (ఇది కనుల బలహీనతను నిరోధించును.)

**కెలఁకు** క్రి. 1. పెల్లగించు, 2. కదిలించు, కలబెట్టు.

**కెలను** వి. 1. పార్శ్వము. దిక్కు.

**కెలయు** క్రి. 1. చెలరేగు. 2. గర్వించు. 3. వికటముగా పలుకు.

**కెలవు** వి. 1. వలపు, స్నేహము, అనురాగము. 2. వైపు.

**కెలసము** వి. 1. పని. 2. కావలసినపని. అక్కఱ. 3. నిమిత్తము. 4. సేవ.

**కెలారిమీటర్** ఇం. వి. (భౌతి.) (Calorimeter) ప్రయోగశాలలో విశిష్టోష్ణమును కనుగొనుటకు ఉపయోగించు సాధనము.

**కెల్లగించు** క్రి. 1. పెల్లగించు. 2. పుర్తి. కొలువు.

**'కె' విటమిన్** ఇం. వి. (గృహ.) (Vitamen 'K') రక్తము గడ్డ కట్టుటకు తోడ్పడు విటమిన్

**కెవ్వు** వి. అరచుట మొ. యందలి ధ్వనికి అనుకరణము.

**కెళకుళి** వై. వి. నడబావి, బొడ్డనబావి. 2. క్రీడాసరస్సు. రూ. కెళాకుళి. కేళాకూళి. సం. ఖేలాకూలమ్.

**కెళవు** వి. 1. వైపు. 2. దూరము.

**కెళాకుళి** వై. వి. చూ. కెళకుళి.

## కే

**కేంద్రకము** సం. వి. (భౌతి.) ఒకవస్తువు యొక్క నట్టనడిమి భాగము (Nucleus).

**కేంద్రకీయము** సం. విశే. (భౌతి.) ఒకవస్తువు యొక్క కేంద్ర బిందువునకు సంబంధించినది (Nuclear).

**కేంద్రనాడీమండలము** సం. వి. (జం.) మెదడు, వెన్నుపాము వీనికి సంబంధించిన నాడులగుంపు (Central nervousystem)

**కేంద్రబాంక్** మి. వి. (అర్థ.) దేశములోని బాంకు లన్నింటికి బాంక్.( దీని ముఖ్య కర్తవ్యములు-బాంక్ పరపతి నియంత్రణము, కరెన్సీ నోట్లను జారీచేయుట).

**కేంద్రము** సం. వి. కేంద్ర స్థానము. (గణి.) వృత్తపరిధిలోని బిందువులకు సమాన దూరములో నుండు బిందువు (Centre).

**కేంద్రరేఖ** సం. వి. (గణి.) వృత్తముల కేంద్రముల ద్వారా పోవు సరళరేఖ (Line of centres).

**కేంద్రాభిముఖము** సం. విశే. (భౌతి.) ఒక బిందువు వద్ద కేంద్రీకరించునట్టిది. (Convergent).



కేంద్రాభిముఖము

**కేంద్రిక** సం. వి. (జం.) తారా కేంద్రము యొక్క కేంద్రస్థానమున నుండు చిన్న రేణువు (Centriole).



**కేక** సం. వి. నెమలికూత. కేంద్రికతారనాభి

**కేకయి** సం. వి. కైకేయి. అష్టి.

**కేకరించు**[1] క్రి. 1. కేకలువేయు. 2. గొంతుక సరిచేసికొనునట్లు ధ్వనిచేయు.

**కేకరించు**[2] సం. క్రి. క్రీగంటచూచు.

**కేకి** సం.వి. నెమలి.

**కేకిసలు** వి. 1. అంజలులు. 2. చప్పట్లు.

**కేకుడబ్బా** వి. (గృహ.) కేక్ కాల్చుటకు ఉపయోగించు గుండ్రని అల్యూమినియం లేక రేకు డబ్బా (Cake mould).

**కేజీన్** ఇం వి. (వ్యవ.) (Casein) పాలలో నుండు ఒకవిధమగు మాంసకృత్తు.

**కేటత్రాడు** వి.యమపాశము.

**కేటాయించు** క్రి. వేరుపరచు, పంచు.

**కేటాయింపు** వి. (వాణి.)పంపకము, పంచుట (Allotment, distribution).

**కేడ** విణ. ధూర్తుడు.

**కేడర్** ఇం.వి. (శాస.) (Cadre) 1. ఉద్యోగి వర్గము. 2. దళము. 3. స్థాయి దళము.

**కేడించు** క్రి. 1. తొలగించు. 2. అలక్ష్యము చేయు. 3. ఎడబాయు.

**కేడెట్** ఇం. వి. (వరి. రాజ) (Cadet) సైనిక శిక్షణ పొందుచున్నవాడు.

**కేడెము** వై. వి. డాలు. రూ. కేడియము సం ఖేటకమ్.

**కేతకి** సం.వి. 1. పచ్చపూవుల మొగిలి (ఇది శివపూజకు అర్హము కాదు). వికృ గేదగి. 2. జాజి.

**కేతనము** సం.వి. 1. టెక్కెము. 2. గురుతు 3. ఇల్లు.

**కేతువు** సం.వి. 1. తొమ్మిదవ గ్రహము. 2. గురుతు. 3. తోకచుక్క. 4. అగ్ని. 5. కాంతి.

**కేదారము** సం.వి. 1. వరిమడి. 2. కొండ. 3. కేదారఘట్టము (కాశిలో నొక పుణ్య స్థలము) 4. పాదు. 5. శివలింగభేదము.

**కేదారుఁడు** సం.వి. గంగాధరుఁడు, శివుడు. వ్యు. శిరస్సున భార్య కలవాడు.

**కేన్స్ ఆర్థిక సిద్ధాంతము** మి.వి. (అర్థ) జాన్ మేనార్డ్ కేన్స్ (క్రీ.శ.1883-1946) అను ఆంగ్ల అర్థశాస్త్రవేత్త చెప్పిన సిద్ధాంతము. పొదుపుద్రవ్యమును లాభదాయకమగు పెట్టుబడి రూపములో వినియోగింపనియెడల సంఘములో నిరుద్యోగము పెరుగునను వాదము.

**కేన్సర్** ఇం.వి. (వైద్య) (Cancer) పుట్టకురుపు.

**కేబల్** ఇం. వి. (వరి.) (Cabal) కుతంత్రపు కక్ష, కుట్రదారుల ముఠా.

**కేయూరము** సం. వి. భుజకీర్తులు. వ్యు. భుజాగ్రమున నుండునది.

**కేరడము** వి. 1. ఉపేక్ష. 2. తిరస్కారము. 3. వంకరమాట. 4.ఎగతాళి. 5. ఒయ్యారము.

**కేరళము** సం.వి. ఒకదేశము. రూ. కేరళము

**కేరించు** క్రి. 1. నవ్వు. హసించు 2. విజృంభించు, చెలరేగు.

**కేరింతలు** వి. నవ్వులు, హాసములు.

**కేరు** క్రి. 1. ఉత్సహించు. 2. యత్నించు. 3. తిరస్కరించు. 4. పరిహసించు.

**కేలు** వై.వి. 1.చేయి. 2. తొండము.సం.కులిః

**కేలుమొగ్గ** వై. వి. కేలుమోడ్పు. అంజలిబంధము.

**కేవలద్రవ్యము** సం. వి. మిరియము

**కేవలము** సం. వి. 1. నిర్ణయము. అవధారణము. విణ. 1. అంత, సమస్తము. 2. అచ్చము, ఒకటి. 3. ప్రధానము.

**కేవలుఁడు** సం. వి. 1. పరమాత్మ. 2. సామాన్యుడు.

**కేవు** వి. ఒడకూలి.

**కేశనాళికలు** వి. (జీవ. శారీ) వెంట్రుకల వలె సన్నగా చీలియున్న రక్తనాళములు (ఇవి ధమనిని సిరను కలుపుచుండును) (Capillaries).

**కేశబంధము** సం. వి. 1. కొప్పు 2,ముడి.

**కేశమార్జనము** సం. వి. దువ్వెన. (గృహ) జుట్టుదువ్వుట, చిక్కుతీయుట, సాపు చేయుట (Combing).రూ.కేశమార్జకము.

**కేశము** సం. వి. 1. తలవెండ్రుక. 2. కురువేరు.

**కేశవీధి** సం. వి. పాపట.

**కేశవుఁడు** సం. వి. విష్ణువు.

**కేశాకర్షణశక్తి** (నేలల) సం. వి. (వ్యవ.) నేలల పై భాగమునుండి తేమ ఆరిపోయిన కొలది మట్టి రేణువులను అంటియుండు తేమ క్రిందినుండి పైకి లేచుచుండుట (Capillarity of soils).

**కేశి** సం. వి. 1. ఒకానొక రాక్షసుడు. 2. సింహము, విణ. మంచి తలవెండ్రుకలు కలవాడు.

**కేశికాజూటము** సం. వి. (జం.) హెచ్చు తరగతి పృష్ఠవంశిన జంతువుల మూత్ర పిండములో మూత్రనాళిక చివర ఉబ్బి యుండు చోట నున్న బంతివంటి నాళికల చుట్ట (Glomerulus).

**కేశికాభాజి** సం. వి. (జం.) హృదయము నకు రక్తముసు తీసికొనివచ్చుచుమధ్యలో మరొక అవయవములో కేశికలుగా చీలిన సిర (Portal vein). ఈ మాదిరి సిరా సమూహము కేశికాభాజి మండలము (Portal System) అనబడును

**కేశిసూదనుఁడు** సం. వి. శ్రీకృష్ణుడు. వ్యు. కేశి యను రాక్షసుని చంపినవాడు

**కేసరదండము** సం వి. (వృక్ష) కింజల్కము నకు గల కాడ, శైవలసూత్రము (Filament).

**కేసరము** సం. వి. 1. అకరువు, 2. ఇంగువ 3. జూలు. 4, పొగడ. 5. పొన్న. రూ. కేశరము.

**కేసరి** సం. వి. 1. సింహము. 2 గుఱ్ఱము వ్యు. కేసరములు గలది. 3. ఒక విధమగు వరి పైరు, విణ, శ్రేష్ఠుడు.

**కేసిన్** ఇం. వి. (గృహ) (Casein) పాల కోవలోని ఒకమాంసకృత్తు.

**కేళాకూళి** వై. వి. మా. కెళకుళి.

**కేళి** సం. వి. 1. ఆట. 2. స్త్రీపురుషుల శృంగారచేష్ట.

**కేళిక** వై. వి. 1. ఆట. 2. నృత్యము. సం. కేళికా.

# కై

**కై** అవ్య. చతుర్థీ విభక్తి ప్రత్యయము (కొఱకు, కై). వి. 1.చేయి. 2.తొండము రూ. కయి.

**కైంకర్యము** సం. వి. 1. భగవంతునికి చేయుసేవ. 2. ఊడిగము.

**కైకట్టు** వి. 1. సందర్భము. 2. చేమోడ్పు

**కైకానుక** వి. మా. కయికానుక.

**కైకేయి** సం. వి. కైక, కేకయ రాజపుత్రి, భరతునితల్లి.

**కైకొను** క్రి. మా. 1. కయికొను. 2. పనిగా పెట్టుకొను 3. వివాహమాడు.

**కైకొలుపు** క్రి. 1. కైకొనజేయు. 2. ధైర్యముచెప్పు.

**కైకోల** వి. గుడ్డలు నేసి జీవించెడి ఒకజాతి రూ. కయికోల.

**కైకోలు** వి. 1. సమ్మతి. అంగీకారము. 2. స్వీకారము. 3. శపథము.

**కైచేపుఁలు** వి. అంజలి, నమస్కారములు.

కైటభజిత్తు సం. వి. వెన్నుడు, హరి.

కైతకము సం. విశే. కేతకీ పుష్పమునకు సంబంధించినది.

కైతప్పు వి. పొరపాటు, ప్రమాదము. విశే. చేజారినది.

కైతవము వి. 1. కపటము. 2. జూదము. 3. ఉమ్మెత్త. 4. వైడూర్యమణి.

కైటిన్ ఇం. వి. (జం.) (Chitin) సంధిపాద జీవుల శరీరము యొక్క పైభాగమున కవచముగా నేర్పడు కొమ్మువంటి పదార్థము.

కైదండ వి. 1. హస్తభూషణము. 2. హస్తావలంబము,

కైదువు వి. ఆయుధము.

కైనితము ఇం. వి. (వ్యావ.) (Kainite) ఇది నేలయందు లభించు పొటాసియమ్ సంబంధమగు నొకఖనిజద్రవ్యము (ఇది ఎరువుగా నుపయోగపడును. దీనిలో పొటాసియమ్ గంధకిత, హరిత రూపముల లో నుండును)

కైపదము వై. వి. కవి కిచ్చుసమస్య. చిక్కుప్రశ్న. సం. కవిపదమ్.

కైపాల వై. వి. 1. కక్షపాల. 2. మంగలికత్తి. అడపము.

కైపు వి. 1. సారాయిమత్తు. 2. అందము 3. విజృంభణము.

కైమోడ్పు వి. నమస్కృతి.

కైరవి సం. వి. 1. చందమామ. 2. వెన్నెల.

కైలాట వి. 1. మాయ ఉదా. కల్లగాదిది కైలాట గాదు నమ్మి రూ. కైలాటకము,

కైలాటము వి. 1. మ్రొక్కు నతి. 2. మోహోపాయము. రూ. కయిలాటము.

కైలాసనాథుఁడు సం. వి. 1. కుబేరుడు. 2. శివుడు.

కైలాసము సం. వి. కుబేరుని ఉనికిపట్టు. 2. శివుడుండు వెండికొండ.

కైలు హిం. వి. (వ్యావ) పండిన ధాన్యపు కొలత (Assessment of produce).

కైలుచేయుట వి. (వ్యావ.) ఆయా ధాన్యములను తగిన విధముగా నూర్పిడిచేయు విధానము (Method of threshing).

కైవర్తుఁడు సం. వి. 1. జాలరి. 2. పడవ నడుపువాడు 3. నీటిలో వర్తించువాడు.

కైవల్యము సం. వి. ముక్తి, మోక్షము.

కైవసము వి. అధీనము, వశము.

కైవారము సం. వి. వందిస్తోత్రము.

కైవ్రాలు క్రి. 1. ఒరగు. 2. దిగు, 3. పడు. వి. చేవ్రాలు.

కైశికము సం. వి. వెండ్రుకల సమూహము.

కైశికుఁడు సం. వి. చంద్రుడు.

కైశోరము సం. వి. పండ్లు మొలచినది మొదలు మూడేండ్ల వరకు గల వయస్సు.

కైసన్న వి 1. పిలుపు. 2. హస్తసంజ్ఞ.

కైసాచిమచ్చె వి. హస్తానక్షత్రము.

కైసేఁత వి. అలంకారము. రూ. కయిసేత.

కైసేయు క్రి అలంకరించు. రూ.కయిసేయు.

## కొ

కొంకనక్క వి ఒకజాతి నక్క.

కొంకర వి. వంపు.

కొంకరులువోవు క్రి. శైత్యాదులచేత కాళ్ళు చేతులు మొ.వి వంకరపోవు, ఏక. కొంకువోవు.

కొంకి వి 1. వంపుచీల. 2. కొంకిపురువు. 3. కాయలు మొ.వి కోయుటకు గడకు చివర వంకరగా కట్టు పుల్ల. రూ. క్రొంకి.

కొంకు వి. 1. భయము. 2. జంకు, క్రి. 1. వెనుదీయు. 2. భయపడు.

**కొంకె** వి. (వృక్ష.) సంపెంగవంటి కొన్ని మొక్కలకు పట్టుకొని పైకెక్కుటకై కాండముపై వంకర తిరిగియుండు సాధనము (Hook).
**కొంగ** వై. వి. బకము. సం. క్రుఞ్.
**కొంగవాలు** వై. వి. మాదిగకత్తి.
**కొంగు** వి. చెంగు, చెరగు.
**కొంగుపసిడి** వి. జాతీ. కొంగుబంగారము విణ. సులభసాధ్యము, వశమైనది.
**కొంచెకాడు** విణ. అల్పుడు.
**కొంచె** వై. వి. 1. క్రౌంచము. 2. ఒకానొక పర్వతము. సం. క్రౌంచః.
**కొంచెగుబ్బలి** వి. క్రౌంచపర్వతము.
**కొంటె** విణ. అకార్యశీలుడు, తులువ.
**కొండ** వి. మల, పర్వతము.
**కొండకాలువ** వి. సెలయేరు.
**కొండగాలి** వి. (భూగో.) శీతకాలమున ఉదయమున ఉత్తరమునుండి కాని వాయవ్యమునుండి నుండి కాని వీచు చలిగాలి (Cold wind).
**కొండగుఱుతు** వి. సామాన్య లక్షణము, స్థూలమైన ఆనవాలు.
**కొండచిలువ** వి. కొండపాము, అజగరము
**కొండచీమ** వి. పిపీలిక, ఒకరకమైన చీమ.
**కొండచెఱియ** వి. కొండపార్శ్వభాగము.
**కొండచూలి** వి. పార్వతి.
**కొండత్రిమ్మరి** వి. కోతి.
**కొండపగతుఁడు** వి. ఇంద్రుడు. వ్యు. కొండలకు శత్రువు.
**కొండమల్లయ్య** వి. శివుడు.
**కొండము** వై. వి. నిప్పుకుండము. సం. కుండమ్.
**కొండముచ్చు** వి. నల్లని మూతిగల కోతి.
**కొండయల్లుఁడు** వి. శివుడు.
**కొండఱేఁడు** వి. హిమవంతుడు.
**కొండాడు** క్రి. పొగడు, స్తుతించు.

**కొండి** వి. 1. తేలుతోక. 2. తలుపుల కమరించు ఇనుప గొళ్ళెము.
**కొండిక** వై. విణ. 1. చిన్నది. 2. అల్పము. వి. 1. చిన్నవాడు. 2. బాలుడు. 3. బాలిక. సం. కుణకః.
**కొండీయము** వి. చాడి, లేని నేరము చెప్పుట. రూ. కొండెము.
**కొండీయుఁడు** విణ. 1. చాడీలు చెప్పువాడు. కొండెకాడు. 2. పిసినిగొట్టు.
**కొండెము** వి చూ. కొండియము.
**కొండొక** వై. విణ. 1. కొంచెము. 2. చిన్నది. 3. చిన్నవాడు, 4. ఒక. క్రి. విణ. 1. కొంచెముగా. 2. కొంచెము సేపు. 3. కొంచెము దూరము. రూ. కొండిక.
**కొండ్ర** వి. మళ్ళించి దున్నినచాలు, (వ్యవ.) వ్యవసాయదారునికిగల భూమి (Land).
**కొండ్రకైదువు** వి. నాగలి.
**కొండ్రవేయుట** వి. (వ్యవ.) మడిలో నొకవైపున కొంత పెడల్పున నాగలితో దున్ను పద్ధతి.
**కొంత** వై. సర్వ. కొంచెము, సం. కించిత్.
**కొంతము** వై. వి. ఈటె, బల్లెము. సం. కుంతః.
**కొందఱు** సర్వ. (బహు.) కొంతమంది,
**కొందలపడు** క్రి. (కొందలము+పడు) 1. కలతపడు. 2. దుఃఖించు.
**కొందలము** వి. 1, కలత. 2. దుఃఖము. 3. వ్యథ. 4. సంశయము.
**కొంప** వి. చిన్నయిల్లు.
**కొంపోవు** క్రి. (కొని+పోవు) తీసికొనిపోవు.
**కొక్కరాయి** వి. కొంగ, బకము. రూ. కొక్కెర, కొక్కెరాయి.
**కొక్కు** వి. పందికొక్కు.
**కొక్కురౌతు** వి. వినాయకుడు.
**కొక్కెములు, వానికన్నులు** వి. (గృహ.) జాకెట్లు, ఫ్రాకులు, మొ.ని బంధించుటకు

ఉపయోగించు చిన్న కొక్కెములు (Hooks and eyes).

కొక్కెర వి. చూ. కొక్కరాయి

కొజ్జా వి. 1. పుంస్త్వములేనివాడు. 2. రాణి వాసపు కావలివాడు.

కొటారము వి. ధాన్యరాసు లుంచెడిచోటు. రూ. కొటారు, కొట్టరువు.

కొటారు వి. చూ. కొటారము.

కొటిక వై. వి. చిన్నగ్రామము, పల్లె. 2. నగరము. సం. కుటీ. విణ. పొట్టివాడు.

కొట్టకొన వి. (కొన+కొన) అన్నిటికి కొన. చిట్టచివర.

కొట్టడి వై. వి. సామగ్రు లుంచుగది. రూ. కొట్టు. సం. కోష్ఠః

కొట్టరవు వి. చూ. కొటారము.

కొట్టాము వై. వి. 1. పసుల గట్టెడిచోటు. రూ. కొట్టము. సం. గోష్ఠమ్. 2. కొట్టు సం. కోష్ఠమ్.

కొట్టికాఁడు వి. వేగరి, వేగువాడు రూ. కోటికాఁడు.

కొట్టు[1] వై. వి. చూ. కొట్టడి.

కొట్టు[2] క్రి. ప్రవహరించు.

కొట్నము వి. 1. ధాన్యము. 2. వడ్లదంపు. 3. ఊడిగము.

కొట్ర[1] వై. వి. వామనుడు, సం. ఖట్టేరకః

కొట్ర[2] వి. పిండి మొ ని ఉడుకబెట్టుటకు పెట్టిన ఎసరు.

కొట్వాలు హిం. వి. (వరి) పట్టణములలో గ్రామములలో శాంతి భద్రతలను కాపాడు ఉద్యోగి రూ. కొత్వాలు.

కొడవలి వి. కోయు సాధనము, లవిత్రము. (వ్యావ) చిన్న పిడితో వంపుతిరిగి, అంచునకు చిన్నరంపగరి యుండు కత్తి (Sickle).


కొడవలి

కొడి వై. వి. 1. దీపశిఖ. 2. దీపశిఖ నుండి వెడలు పొగ. 3. వత్తి మొ.వి. కాలినతుది భాగము. సం. కోటిః.

కొడిదిలి వి. పుడిసిలి.

కొడిమె వి. 1. దోషము. 2. పాపము. 3. అపదూఱు.

కొడుఁగురు వి. 1. దీపపు చిట్టెము. 2. కొంకర.

కొడుకు వై. వి. కుమారుఁడు. సం. కుణకః

కొడుపు వి. 1. గంట మొ.ని వాయించు సన్న కొయ్య. 2. హస్తకవచము.

కొడుము వి. బింకెవంటి కుండ.

కొణజా వి. వాకిటి కావలి యిల్లు.

కొణత వి. కుక్కను కట్టెడి కొయ్య. రూ. కొణతము.

కొణిగ వి. ముంజూరు.

కొణుఁజు వి. పిడుజు, పశువుల దేహమున జేరి రక్తముపీల్చు క్రిమి.

కొతిమిర వై. వి. ధనియాల మొలకలు, ధనియపు మొక్క రొట్ట. (ఇదిఆహారపదార్థములలో పరిమళము కొరకు ఉపయోగింపబడుచుండును. రూ. కొతిమెర, కొత్తిమెర, కొత్తమరి, సం. కుస్తుంబరీ (Coriander leaf).

కొతుకు క్రి. 1. సంకుచితమగు. వర్ణలోపముగా మాటాడు. 2. జంకు, వెనుదీయు, వి. జంకు, సంకోచము, విణ. వర్ణలోపము గలది (మాట మొ.వి.)

కొత్తముట్టు వి. నూలుపోగు అతుకు.

కొతితెము వి. 1. దెబ్బ. ఉదా. ఈ నేరమునకు నాల్గు కొరడా కొత్తెములు విధింపనగు. 2. తాటిపండు తొడిమ. 3. పిలక.

కొత్వాల్ హిం. వి. చూ. కొట్వాలు, పోలీసు అధికారి.

కొద వి. కొదవ, తక్కువ.

కొదమ వి. పశుపక్ష్యాదుల పిల్ల. ఉదా. సింగపుఁగొదమ, అంచకొదమ, తేటి కొదమ మొ.వి. 2. ఆడమేకపిల్ల. విశే. 1. యౌవనము తలచూపినది. 2.దృఢము 3. లేతది.

కొదరు క్రి. అతిశయించు, రేగు. వెల్లి విరియు,

కొద్ది వి. 1. పరిమితి, 2. శక్తి. విశే. 1. అల్పము. 2. ప్రమాణము కలది. ఉదా. పిండికొద్ది రొట్టె. రూ. కొలఁది, కొల్ది.

కొన వి. 1. చివర, 2. చెట్టు చివరికొమ్మ 3. గుజ్జుపుజూలు.

కొనకొను క్రి. ప్రయత్నించు. రూ.గొనకొను

కొనరిక్క వి. రేవతీనక్షత్రము, అశ్వని మొ వానిలో చివరి నక్షత్రము.

కొనలిడు క్రి. (కొనలు+ఇడు) వర్ధిల్లు.వృద్ధి పొందు.

కొనలొత్తు క్రి. (కొనలు+ఒత్తు). చూ. కొనలిడు.

కొనసాగు క్రి. 1. సనుకూడు, 2. నెరవేరు. 3. వర్ధిల్లు.

కొని సర్వ. కొంత సంఖ్యగలది. మొ. కొన్ని

కొనిపోవు క్రి. తీసికొనిపోవు.

కొనియాడు క్రి. నుతించు, స్తుతించు.

కొను క్రి. 1. అనువుపడు. 2. నాటు. 3. గ్రహించు. 4. లక్ష్యపెట్టు. 5. అపహరించు, వెలకుతీయు.

కొనుగోలు వి. 1. క్రయము. 2. నట్టువుడు. కొలిపించుట.

కొనుగోలుదారు మి. వి. (వాణి.) వస్తువులను కొనువాడు. (Buyer)

కొనుజు వి. చూ. కొణుజు.

కొపురు వై వి. 1. కొండకొమ్ము. శిఖరము. 2. ఉన్నతి. సం. గోపురమ్

కొప్పరము వై వి. 1. కొండ కొమ్ము. 2. ఉన్నతి. 3. మూపు. 4. వికసించినది.

కొప్పరించు వై క్రి. అతిశయించు.

కొప్పు వి. 1. దోపిన వెండ్రుకలముడి. 2. వింటికొన. 3. కోపు. 4. ఇంటినడికొప్పు.

కొప్పెర వై. వి. 1. పెద్ద పాత్రము. 1. తల పుఱ్ఱె. సం. కర్పరః.

కొబ్బెర వి. చిప్పతీసినటెంకాయ, టెంకాయ లోని పేశము.

కొమ వి. ఆడుది. రూ. కొమ్మ.

కొమరసామి వై. వి. స్కందుడు.

కొమరాలు వి. 1. యువతి. 2. సౌందర్యవతి,

కొమరు వై. వి. 1. మనోజ్ఞత. 2. అందము. 3. కుమారస్వామి, 3. పైదూలము మీది గుజ్జు. (కొమరుదనము, కొమరు ప్రాయము=యౌవనము).

కొమరుఁడు వై. వి. 1. కొడుకు, 2.కుమారస్వామి. సం. కుమారః.

కొమరేఖ వి. స్వామిపుష్కరిణి.

కొమారి వై. వి. కూతురు. సం. కుమారీ

కొమిరె వై. వి. కుమారి. యౌవనము గల స్త్రీ.

కొమ్మ వి. 1. శాఖ. 2. స్త్రీ.

కొమ్మంట్లు వి. (వ్యవ.) గోలెములో పెరుగుచున్న పదైన మొక్కకు వృద్ధి చేయదలచిన మొక్క కొమ్మను అతికించి పెంచబడిన మొక్కలు (Branch grafts)


కొమ్మంట్లు

కొమ్మత్రిమ్మరి వి. కోతి.

కొమ్మలకత్తెర వి. (వ్యవ.) మొక్కల కొమ్మలను కత్తిరించుటకు ఉపయోగించు కత్తెర (Pruning sicateurs)

కొమ్ము వి. 1, ఉకారముయొక్క రూపాంతరనామము, 2, ఎద్దు మొ, ని కొమ్ము. 3,చిమ్మనగ్రోవి, 4,పసుపు మొ,ని ఎండిన గడ్డ, ఉదా పసుపుకొమ్ము, శొంఠికొమ్ము,

5. పల్లకి వెదురు. 6. ఏనుగు దంతము. 7. పందికోర. 8. ఊదెడివాద్యము, కాళె 9. శిఖరము, కోన. 10. ఉత్సాహము.

**కొమ్ముకాఁడు** వి. 1. కొమ్మునూదెడు మాదిగవాడు. 2. పంది. 3. ఏనుగు. రూ. కొమ్మువాడు.

**కొయుగూర** వి. కొయ్యగూర, మాటి మాటికి కోయదగినది నల్లతోటకూర, అర కూర.

**కొయ్య** వి. కట్టె, మ్రాను.

**కొయ్యబద్ద** వి. (గృహ.) ఎముక విరిగినప్పుడు ఆసార పెట్టి కట్టుసాధనము (Splint).

**కొరడా** హిం. వి. చబుకు.

**కొరుకు పురుగులు** వి. (వ్యవ.) మొక్కల ఆకులు, చిగుళ్ళు, పూవులు. మొగ్గలు మొ. ని మొక్క లేతభాగములను కొరికి తిను పురుగు జాతులు (Biting insects).

**కొరోనర్** ఇం. వి. (శాస.) (Coroner) దుర్మరణ విచారణాధికారి.

**కొఱ** వి. 1. పారీనము. 2. చేప 3. కొఱ్ఱ ధాన్యము, 4. కొరత, వెలితి. 5. ప్రయోజనము. 6. శిల్పము.

**కొఱకచ్చు** వి. కొరవి. (కొరకంచు అని వాడుక).

**కొఱకు** అవ. చతుర్థీవిభక్తిప్రత్యయము.

**కొఱకొఱలాడు** క్రి. కోపాదులచే విసుగు కొను.

**కొఱగామి** వి. (కొఱ+కామి) 1. అకార్యము. 2. దుర్నిమిత్తము. 3. దోషము. 4. పనికిమాలినతనము.

**కొఱడు** వి. 1. ఒకరకపు ఆయుధము. 2. మ్రానిమ్రోడు. 3. స్తంభము. విణ. మూర్ఖుడు.

**కొఱప్రాణము** మి. వి. కుట్టుసురు, కొన యూపిరి.

**కొఱమాలు** క్రి. 1. పనికిమాలు. 2. దయ మాలు 3. సౌందర్యహీనమగు.

**కొఱముట్టు** వి. పనిముట్టు, ఉపకరణము.

**కొఱలు** క్రి. 1. ప్రకాశించు. 2. ఒప్పు 3 ఉండు. 4. పగగొను. 4. వలచు. 5. అభిలషించు. 6. పొందు.

**కొఱవిదాల్పు** వి. పిశాచము (కొఱవి దయ్యము).

**కొఱవోవు** క్రి. (కొఱ+వోవు) 1. మూర్ఛిల్లు, సొమ్మసిలు. 2. తెల్లవోవు నిశ్చేష్టత నందు.

**కొఱసంది** వి. ఆయము. జీవస్థానము. మర్మము.

**కొఱుకరానికొయ్య** వి. జాతి. 1. మూర్ఖుడు. 2. చెప్పినమాట విననివాడు, 3 కఠినము.

**కొఱుకు** వి. 1. ఒకరకపు మేహరోగము. 2. ఎఁ. 3. తినుట. క్రి. 1. కఱచు. 2. 2. పండ్లు పటపటలాడించు. 3.అపహరించు.

**కొల** వి. 1. కనటు, కష్టము. 2. పాపము, 2 హింస 4. పగ. 5. కొలత.

**కొలంబోప్రణాళిక** మి. వి. (అర్థ. రాజ. వరి.) కామన్వెల్త్ దేశము లయిన బ్రిటన్, ఆస్ట్రేలియా, కెనడా, సిలోన్. ఇండియా, పాకిస్తాన్ (దక్షిణాఫ్రికాతప్ప) కొలంబో నగరములో క్రీ.శ. 1950వ సంవ. జనవరి నెలలో సమావేశమై వెనుకబడిన దేశముల ఆర్థికాభివృద్ధికి సాయముచేయుటకై ప్రకటించిన ప్రణాళిక (Colombo plan).

**కొలఁకు** వై. వి. సరస్సు, చెరువు రూ. కొలను. సం. కూలమ్.

**కొలంది** వి. 1. పరిమితి. 2. బలము. 3. స్థితి. 4. విధము. విణ. 1. పరిమాణము కలది. 2.సమానమైనది. 3.అల్పము. 4.శక్యము.

**కొలగారము** వి. ధాన్యాదులు కొలిచినందుకు కొలగానికి ఇచ్చెడు కూలి.

**కొలత** వి. 1. కొలుచుట. 2. పరిమాణము (గణి.) ఒక వస్తువు పొడవు.* వెడల్పు

ఎత్తు మొ.ని కొలత. 2. రాశిపరిమాణము (Measurement).

**కొలను** వై. వి. చూ. కొలఁకు.

**కొలపగ** వి. (కొలము+పగ) జాతివైరము.

**కొలము** వై. వి. 1. వంశము. సజాతీయ ప్రాణిసముదాయము. సం. కులమ్.

**కొలాయిడల్** ఇం. వి. (రసా.) (Colloidal) పైకి చూచుటకు ద్రవములో కరిగినట్లున్నను వడబోయుటకు వీలుకానట్టి.

**కొలాయిడ్స్** ఇం. వి. (రసా.) (Colloids) ఒకవిధమైన జిగురు గల చిక్కనిద్రవములు

**కొలి** వి. బిల్ల గోడాడుటకు త్రవ్వినగుంట.

**కొలికి** వి. 1. ముక్కు నంటిన కంటిమూల. 2. హారము తగిల్చెడు వంకరకమ్మి. 3. పరిపాకము, ఉదా, ఇద్దఱకును ఈడయి యున్నది. కార్యంబును కొలికికి వచ్చినది. (కొలికిపూస = కొలికికి తగిలించెడుపూస).

**కొలిమి** వి. కమ్మరి లోహాదులను కాల్చెడు నిప్పుగుంట.

**కొలుచు** క్రి. 1. కొలతవేయు. 2. ఉపాసించు. 3. సేవించు. వి. ధ్యానము.

**కొలుపు** వి. గ్రామశక్తికి చేసెడి ఉత్సవము. జాతర. క్రి. 1. సమ్మతించు. 2. సరిపడు. 4. పురికొలుపు. 4. కలిగించు,

**కొలువడి** వి. కొలత.

**కొలువు** వి. 1. ఓలగము, ఆస్థానము. 2.సేవ.

**కొలువుకాఁడు** వి. సేవకుడు.

**కొలువుకూటము** వి. ఆస్థానమంటపము.

**కొలె** అవ. మొదలుకొని అను అర్థమును దెలుపు ప్రత్యయము. రూ. కోలె.

**కొల్లకత్తె** విశే. కొల్లపెట్టు స్త్రీ.

**కొల్లకాఁడు** విశే. కొల్లగొట్టువాడు.

**కొల్లకొట్టు** క్రి. 1. అపహరించు, 2. అధికముగా సంపాదించు.

**కొల్లాడు** క్రి. 1. దోచుకొను. 2. అపహరించు, 3. అధికముగా పొందు. 4. తనివితీర అనుభవించు, రూ. కొల్లలాడు.

**కొల్లాయపంచె** వి. చిన్న అంగవస్త్రము.

**కొల్లారము** వి. చతుశ్శాల నడుమ బయలును నాలుగుప్రక్కల కట్టడమును గల యిల్లు. రూ. కొలారము, ల్లారు.

**కొస** వి. 1. కొన. 2. కొంగు. 3. కొరడా కొననుగట్టు తోలు. విశే. చివరిది,

**కొసరు** క్రి. 1. ప్రార్థించు. 2, మఱికొంచె మిమ్మని యాచించు, 3, సంకోచించు. వి. 1. ప్రార్థనము. 2. సరకులు కొనువానికి విక్రేత యిచ్చు పెచ్చు. 3, వెనుదీయుట.

# కో

**కో** వి. అరపునం దగు ధ్వన్యనుకరణము.

**కోఁగట** వి. క్షౌరము. ముండనము. రూ. గోఁగట.

**కోఁగు** క్రి. క్షౌరముచేయు, గొరుగు.

**కోఁచ** వై. వి. పిరికితనము. విశే. పిరికి. సం. కోచః.

**కోఁచేవాఱు** క్రి. బెదరు, భయపడు.

**కోఁడు** క్రి. ధాన్యము చేటలో పోసి ప్రక్కవాటుగా ఇటునటు త్రిప్పు.

**కోఁత** వి. 1. కోయుట. 2. బాధ. 3. ఖండనము. (వ్యవ.) ఒకేసారి ఫలించు పైరును కొడవలి మొ. సాధనములతో మొదటికి కోసివేయుట,

**కోఁతి** వి. వానరము. రూ. క్రోఁతి.

**కోఁతికొమ్మచ్చి** వి. ఒకవిధమగు బాలక్రీడ.

**కోఁదాడు** వై. వి. ఒకరకపు తాటిచెట్టు. సం. కుంతాళః.

**కోఆప్పుచేయుట** మి. వి. సహనియామకము. ఒక సంఘమువారు ఇతరులు తమతో కలిసి పనిచేయుటకు వారిని సభ్యులుగా

ఎన్నుకొనుట (Coopt)
కోక వి. వలువ, చీర.
కోకనదము నం.వి. 1. చెంగలువ.2.కెందమ్మి
కోకము నం. వి. 1. జక్కవ, 2. తోడేలు. 3. కప్పు, 4. బల్లి, 5. ఈత,
కోకిలము నం. వి. కోయిల.
కోకో ఇం. వి. (వ్యావ.) (Cocoa) (Stercu-leaceae) అను కుటుంబమునకు చెందిన (The obrama cocoa) అను చిన్నచెట్టు (దీని గింజలను పొడిచేసి 'కోకో' అను ఆహార పానీయముగ తయారు చేయుదురు. ఈ గింజలనుండి ఒకవిధమగు వెన్న (Cocoa butter)నుకూడ తయారుచేయుదురు. ఇది తరచుగ చాకొలేట్ల యందు ఉపయోగించ బడుచుండును).
కోజాగరము నం. వి. ఆశ్వయుజ పూర్ణిమ.
కోట వై. వి. 1. దుర్గపురము. 2. పట్టణము. చుట్టుగల ప్రహరి. నం. కోటః.
కోటడు వి. గుడ్లగూబ.
కోటరము[1] నం. వి. చెట్టుతొఱ్ఱ.
కోటరము[2] వి. కోడంట్రము, కోడలితనము.
కోటరాళిందము నం. విశే. (ఇం.) సిరా కోటరమునకు కర్ణికకు సంబంధించినది (Sinu-auricular).
కోటరికము వి. కోడరికము.
కోటానకోటలు మి. వి. (కోటులు+కోటులు) అసంఖ్యాకములు.
కోటి[1] నం. వి. 1. అంచు. 2. వింటికొన. 3. చివర. 4. కోటిసంఖ్య, నూరులక్షలు. (గణి.) త్రిభుజ క్షేత్రమున భుజకర్ణము. లకు భిన్నమగు అవయవరేఖ.
కోటి[2] వి. వేగు, చారుడు.
కోటిజిత్తు నం. వి. కాళిదాసకవి.
కోటీరము నం. వి. 1. కిరీటము. 2. జటాజూటము.
కోతేరు వి. దుంపమీదుగా కాడికి తక్షిలించిన నాగలి.
కోట్టము నం. వి. దుర్గపురము. కోట.
కోట్టారము నం. వి. 1. కోట్టము 2.కొలని మెట్టు. 3. నూయి.
కోడంగి వి. అంగములను వికారముగా చూపి జనులను నవ్వించుచు బిచ్చమెత్తు దాసరి రూ. కోణంగి.
కోడంట్రము వి. కోటరికము. రూ. కోడంట్రికము, కోడరికము.
కోడంట్రికము వి. రూ. పై
కోడలు వి. కుమారుని భార్య.
కోడాడు క్రి. 1. గాసిచెందు, బాధపడు. 2. కుమ్ము. 3. (ప్రాణము) తీయు, రూ. కోరాడు.
కోడి వై. వి. అజ్జవాలు, నం. కుక్కుటః
కోడిగ వి. 1. ఇరువది రత్నముల సంజ్ఞ. 2. ఆహారము.
కోడిగము వి. 1. విలాసచేష్ట. 2.పరిహారము. 3. కొంటెతనము.
కోడియ వి. కోడెదూడ, గిత్త రూ. కోడె.
కోడు వి. 1. మంచము, పీట మొ.ని కాలు. 2. ఊరిదరి నీటిపల్లము. 3. రేఖ, గీత.
కోడ్ ఇం. వి. (Code) స్మృతి, సంహిత, గుర్తు
కోడుఈగ వి. (వ్యావ.)



ఈ ఈగయొక్కడింభము వరిమొక్కల మొవ్వుల మొదట తొలచుటచే కోడుఈగ ఆకులు ఉల్లికోళ్ళవంటి రూపము దాల్చును. (Silver shoot fly-Pachydiplosis oryzae)
కోడె వి. 1. కాడి మరపదగిన దూడ. 2. విటుడు.
కోడెకాడు వి. 1. యుక్తవయసువాడు. 2. విటుడు.
కోడెత్రాచు వి. 1. పురుషసర్పము. 2. పడుచుత్రాచు.

**కోడెరౌతు** వి. వృషభవాహనుడు, శివుడు.

**కోణంగి** వై. వి. అంగములను వికారముగ జూపి బిచ్చమెత్తు దాసరి.

**కోణపుడు** నం. వి. నైరృతుఁడు.

**కోణభుజములు** నం. వి. (గణి.) ఒకకోణము నేర్పరచు సరళరేఖాద్వయము(Arms of angle).

**కోణమాని** నం. వి. (గణి.) కోణములను కొలుచు పరికరము (Protractor). కోణమాని



**కోణము** నం. వి. మూల, అంచు. (గణి.) 1. రెండు భుజరేఖల వాలుతనము. లేదా. 2. రెండు వక్రరేఖలకు గీయబడిన కోణములు స్పర్శరేఖల వాలుతనము. 3. రెండు బుజురేఖలు ఖండించుకొనునప్పుడు వాని మధ్య నేర్పడు ఆకారమునకు కోణమని పేరు. 4. రెండు సరళరేఖలు ఒకబిందువు వద్ద కలియగా నేర్పడువాలు (Angle.)

**కోణాంతము** నం. వి. (గణి. భౌతి.) విస్తరణము, లోలకము యొక్క విస్తరణ కోణార్థము (Amplitude).

**కోణీయము** నం. విశే. (గణి.) కోణసంబంధమైనది. (వృక్ష.) కోణములు గలది (Angular).

**కోణీయత్వరణము** నం. వి. (భౌతి.) ఒక వస్తువు కేంద్రము చుట్టు తిరుగునపుడు అది భ్రమించు వేగమందలి వృద్ధి, ఇచ్చట వేగవృద్ధి లేదా త్వరణము, ధృతిమారనిది అయినను ఆ ధృతియొక్క దిశ మారుట వలననైనది (Angular aceleration).

**కోణుఁడు** నం. వి. శని.

**కోదండము**[1] నం. వి. 1. విల్లు (నాలుగు మూరలు గలది). 2. వెదురువిల్లు వ్యా కుత్సితమైన దండము గలది.

**కోదండము**[2] వి. బాలుఁను దండించుటకై పట్టుకొని వ్రేలాడునట్లుమీదగట్టెడి త్రాడు.

**కోన**[1] వై. వి. 1. అడవి. నం. కాననమ్ 2. కొండల యందలి మరుగుచోటు లోయ. 3. దేశభేదము. 4. కొన, మూల నం. కోణః.

**కోన**[2] వి గోసమూహము.

**కోనిఫర్ వనములు** మి. వి. (భూగో) ఈ వనవృక్షములు పొడవుగానుండి, సూదులవంటి ఆకులు గలిగియుండును వీనికాయలను కోనులందురు. వీని కలప మెత్తగానుండి టెలిగ్రాఫ్ టెలిఫోన్ స్తంభములు చేయుటకు ఉపయోగపడును. ఈ వనములు ఎక్కువగా సైబీరియా దక్షిణ ప్రాంతమున ఉన్నవి.

**కోనేఱు** వి. (కోన+ఏఱు) చుట్టుచు మెట్లు గల నలుచదరపు గుంట పుష్కరిణి.

**కోపము** నం. కినుక, క్రోధము.

**కోపు** వి. 1. కడ్డీ, 2. అందము. 3. వింటికొప్పు. 4. నాట్యము. 5 తీర్పు. 6. కట్లు 7. నిమిత్తము.

**కోబాల్ట్** ఇం. వి. (రసా.) (Cobolt) నికెల్ వంటి తెల్లని లోహము, దానినుండి తయారగు ముదురు నలుపు రంగు.

**కోమ** వి. 1. గోపురమువలె పెరిగినపుట్ట చివర. 2. స్త్రీ.

**కోమటి** వై. వి. వైశ్యుడు. నం. కార్పటికః

**కోమలము** నం. వి. 1. నీరు. 2. హారిణము. విశే. 1. మృదువైనది. 2. అందమైనది. 3. ఇంపైనది.

**కోమలాస్థి** నం. వి. (జం.) సంకోచన వ్యాకోచనశక్తిగల సున్నితమయిన(జంతు సంబంధమగు, ఎముకవంటి పదార్థము

(Cartillage).
కోమలి సం. వి. చక్కదనము గల స్త్రీ.
కోమలికము వై. వి. చక్కదనము.
కోమిన్ ఫెరన్ దేశములు మి వి. (చరి.రాజ) కమ్యూనిష్టు రష్యా ప్రభావక్షేత్రములో నున్న మధ్య యూరప్ కమ్యూనిస్ట్ దేశము లయిన పోలెండ్, హాంగేరి, జకోస్లోవేకియా, రుమానియా, ఆల్బేనియా, యుగోస్లావియా దేశములు.
కోయ వి. ఒకజాతి బోయ.
కోయష్టికము సం. వి. చీకుకొక్కెర, గ్రుడ్డికొంగ.
కోయు క్రి. 1. ఛేదించు. 2. చిదుము.3 గిల్లు
కోర వి. 1. కల్లు త్రాగెడుగిన్నె. 2. తట్ట. విశ 1. పెద్ద. 2. వంకర.
కోరమ్ ఇం. వి. (Quorum) సమావేశ వ్యవహారము నడపుటకు ఉండవలసిన నియుక్త సభ్య సంఖ్య.
కోరకపత్ర విన్యాసము సం. వి. (వృక్ష) మొగ్గలో ఆకులు అమర్చబడియున్న విధానము. (Prefoliation).
కోరకము సం. వి. 1. మొగ్గ. 2 తామర తూడు. (వృక్ష.) మొగ్గ అల్పవికసిత కాండము (Bud).
కోరకొంకె వి. ఒక ప్రక్కకు వేసెడుకొంకె.
కోరగించు వై. వి. 1. మొగ్గతొడుగు. 2. ఎఱ్ఱనగు. 3. ఉదయించు. 4. మారాము చేయు, ముకుళించు.
కోరడి వి. ఆవరణముగా వేసిన మట్టిగోడ. (వ్యవ.) కట్ట, నేలను కోసివేయకుండ నీటి ప్రవాహమునకు అడ్డుగా మట్టితో గాని రాళ్ళతోగాని వేయు ఎత్తైన నిర్మాణము.
కోరమీసము వి. పొడవైన కొన వంగిన మీసము.
కోరవాయువు వి. వాతరోగము.
కోరవోవు క్రి కొంకరలువోవు.
కోరసంధి సం. వి. మడతబందుకీలు, (Hinge Joint).
కోరసిగ వి ఒరముడి.
కోరాడు క్రి. కొమ్ములతో నేలపొడిచి దుమ్ము పైకి జల్లు.
కోరింత దగ్గు వి. కుక్కదగ్గు (Whooping cough). (ఈ దగ్గు సాధారణముగా చిన్న పిల్లలకు వచ్చును)
కోరిందపూసలు వి. ఆటవికులు ధరించుగాజు పూసలు.
కోరిక వి. ఇచ్ఛ. విశ. అభీష్టము.
కోరివేత (నేలను) వి (వ్యవ) నీటి ప్రభావముచేగాని పెద్ద పెద్ద గాలులచే గాని నేలపై నున్న మట్టి కొట్టుకొని పోవుట (Soil erosion).
కోరుడు వి. (భూగో.) రసాయనిక ప్రభావమువలన శిలలో ఏర్పడు కోతలు పగుళ్లు అరుగుడు, కోరుడు. ఇది చాలకాలము నుండి జరుగుచున్న రాసాయనిక ప్రభావము వలన కలుగును.
కోర్టు ఆఫ్ వార్డ్సు ఇం. (శాస.) (Court of wards) మైనర్ వారసుల ఆస్తిని సంరక్షించు కోర్టు, సంరక్షితులన్యాయస్థానము
కోర్టుమార్షల్ ఇం. వి. (శాస.) Court martial) 1 సైనిక న్యాయస్థానము. 2. సాధారణ న్యాయమూర్తులచే గాక, సైనికాధికారులచే సైనిక న్యాయశాస్త్ర సూత్రముల ప్రకారము విచారణజరుపుట
కోఱ వై. వి పందికోఱ, పాముకోఱ. దంష్ట్ర. సం. ఖరుః
కోఱడము వి. 1 అపహాస్యము. 2.కోపము. 3 దౌష్ట్యము
కోఱము వి కొబ్బెర తురిమెడు పనిముట్టు
కోల వి. 1. బాణము. 2. దండము. 3 వంట కట్టె. విశ. దీర్ఘము.

**కోలగగ్గెర** వి. పశువును లాడము కొట్టుటకై పాదములు బంధించి పడవేయుట.

**కోలదిండు** వి. (గృహ.) ఆనుకొని కూర్చుండుటకుఉప యోగించుగుండ్రముగా పొడవుగానుండు దిండు.


కోలదిండు

**కోలము**[1] సం. వి. 1. రేగుపండు. 2. పంది. 3. ఒడి. 4. కౌఁగిలి. 5. తెప్ప

**కోలము**[2] వి. ఒకవిధమైన నాట్యము.

**కోలలవారు** వి. వేత్రధరులు.

**కోలాటము** వి. చేతులలో కోలలుంచుకొని ఆడెడి ఆట.

**కోలాహలము** సం. వి. 1. కలకలము. 2. ఒకానొక కొండ.

**కోలు** వి. 1. అను ప్రయుక్తమైన కొను ధాతువునకు కృదంతరూపము,ఉదా. వీడుకోలు, ఇచ్చుకోలు, కొనుగోలు. 2.కొల్ల విశ. మిక్కిలిపెద్ద.

**కోలుకొను** క్రి. 1. వర్ధిల్లు. 2. తేరుకొను. 3. ఉత్సహించు.

**కోలుతల** వి. 1. ఎదుట నిలిచి యుద్ధము చేయుట,యుద్ధ సన్నాహము.రూ. కోల్తల

**కోలుపడు** క్రి. 1. నశించు. 2. పోగొట్టుకొను, కోలుపోవు. 3, చెడు.

**కోలె** వి. పైరు కోసివేయగా మిగిలినమొక్క. అవ్య. 1. మొదలుకొని, ఉండి. ఉదా. నిన్నఁటిగోలె. 2. వరకు, దాక. ఉదా. యోజనంబునంగోలె, రూ. కొలె.

**కోల్తల** వి. చూ. కోలుతల.

**కోల్పులి** వి. పెద్దపులి. రూ. క్రోల్పులి క్రోలుపులి.

**కోల్మసఁగు** క్రి.విజృంభించురూ. కోలుమసగు.

**కోవ** వి. 1. గోపురాకారముగ నుండు పుట్టచివర. 2. హారము. 3. ముత్యము. 4. హారమందలిపేట. 5. వంశానుక్రమము.

**కోవారంటోరిట్** ఇం వి. (శాస.) (Quo Warranto writ) అధికారపృచ్ఛ,ఒకరికి గల హక్కులను రుజువు చేయవలసినదిగా కోరుట.

**కోవిదారము** సం. వి. ఎఱ్ఱకాంచనవృక్షము.

**కోవిదుఁడు** సం. వి. విద్వాంసుడు. వ్యు. ఇది అది అను నియమము లేక సర్వమును ఎరిగినవాడు.

**కోవెల** వి.గుడి. వై. వి. కోకిలము.

**కోశగుదము** సం. వి. ఏకకణజీవులలో అనవసరములగుపదార్థములను త్రోసివేయుట కేర్పడిన ద్వారము (Cytopyge).

**కోశము** సం వి. 1. కత్తియొర, 2.గ్రుడ్డు. 3. పుస్తకము. 4. బొక్కసము. (పంచ కోశములు :-అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు).

**కోశముఖము** సం. వి. (జం.) ఏకకణజీవులలో నోరువలె పనిచేయు ద్వారము (Cytostome) ఇది కోసగ్రసని (Cytopharynx) అను గరాటువంటి గొట్టము లోనికి దారిచూపును.

**కోశరసము** సం. వి. (జీవ.) జీవకణములో నుండు జీవరసము(Cytoplasm). Proto-Plasmలోఅష్ఠి(Nucleus)నిమినహాయించి నచో మిగిలిన ద్రవపదార్థము.

**కోశస్థము** సం. వి. (జం) కోశితము, కొన్ని కీటకముల జీవితచరిత్రలలో డింభదశకును ప్రౌఢదశకును మధ్యనున్న చలనము లేని దశ. (ఈ దశ సామాన్యముగా గూడు కట్టుకొని ఏర్పడుచుండును (Pupa).

**కోశస్థవిదారణము** సం. వి. (వృక్ష.) బహు విదారణ ఫలము ఫలకవచము


ఫలములోని గదుల కోశస్థవిదారణము

మధ్య పగులుట, కోష్ఠ విదారణము (Loculicil dehiscence.)

కోశాధికారి సం. వి. ఒక సంస్థ యొక్క లేక ప్రభుత్వము యొక్క బొక్కసముపై అధికారి.

కోష్టు వై. వి. 1. చెంగల్వ కోష్టు దగ్గు నివారించు ఓషధి. సం. కుష్ఠమ్.

కోష్ఠము నం వి. 1. లోకడుపు. 2. గాదె. 3. సామగ్రు లుంచుకొట్టు. (జం.) అనను కూల పరిస్థితులలోగాని పునరుత్పత్తి సమయమునగాని ఒక ప్రాణిచుట్టును ఏర్పడిన నిరోధక శక్తి కల పొర (Cyst) (cneystment)=పరివేష్టనము. (వృక్ష.) కోశము, అండాశయములో నుండు గది (Locule).

కోష్ఠిత సంయుక్త బీపము నం. వి. (జం) (Oocyst) చుట్టును రక్షణకొరకుపర్పడిన పొరగల సంయుక్త బీజము (Zygote.)

కోష్ఠము నం. వి. ఇంచుకవేడి. విణ. ఇంచుక వేడిగలది.

కోసము అవ్య. కొరకు, నిమిత్తము, ఉదా. వానికోసము.

కోసలము సం. వి. ఒకానొక దేశము.

కోసు1 వై. వి. రెండు వేల విండ్ల పట్టు కొలది నం. క్రోశః.

కోసు2 విణ. దీర్ఘము. పొడుగైనది.

కోసెక్ (Cosec) కోసీకంట్ (Cosecant) ఇం. వి. (గణి.) 1. సమకోణ త్రిభుజము లోని కర్ణము. 2.దత్తకోణమున కెదురుగా నున్న భుజముల పొడవుల నిష్పత్తి. సైన్ (Sine) అను దానియొక్క వ్యుత్క్రమము (Reciprocal).

కోస్తా ఇం వి. సముద్రతీరము (Coast).

కోహటకుఁడు నం. వి. దొమ్మరవాడు.

కోహళము నం. వి. 1. కాహళ మను వాద్యము. 2. ఒకరకపు మద్యము.

# కౌ

కౌగిఁలి వి. ఆలింగనము.రూ. కవుగిలి.

కౌఁజు వై. వి. కవుఁజుపిట్ట. నం. కపింజలః

కౌక్షేయకము నం. వి. కత్తి. ఖడ్గము. వ్యు. కుక్షికి దగ్గరగా ఉంచుకొన బడినది.

కౌచింగ్ ఇం. వి. (గృహ.) (Couching) లావు జరీలేదాసిల్కుదారము ను నమూనామీద అమర్చి దూర దూరముగా కుట్లువేసిస్థాపించిన నమూనా


కౌచింగ్

కౌటిల్యము నం. వి. 1. వంకరతనము. 2. కాపట్యము.

కౌటిల్యుఁడు నం. వి. చాణక్యుడు.

కౌడు వై. వి. 1. మోసము. 2. ప్రమాదము, తప్పు. రూ. కవుడు. నం. కపటః.

కౌతుకము నం. వి. 1. తమి, తహతహ. 2. పెండ్లి యందు చేతగట్టుకొను తోరము 3. స్త్రీ పురుషుల పరిహాసము. 4. సంతోషము. 5. కల్యాణ పరంపర.

కౌతూహలము నం. వి. 1. తమి, నాయికకు మనోజ్ఞ వస్తువును చూచుటయందభిలాష. 2. సంతోషము.

కౌద్దాలికుఁడు నం. విణ గుద్దలితో (కంద మూలాదులను) త్రవ్వుకొని జీవించువాడు

కౌద్దాళికము నం. వి. (వృక్ష.) వంపుతిరిగి సన్నగా చిన్న పొరవలె నుండు ఇనుప పనిముట్టు, గుద్దలి (Small curved axe)

కౌను వి. 1. నడుము. 2. వింటినడుము.

కౌన్సిలర్ ఇం. వి. (శాస.) (Councillor) పరిషత్సభ్యుడు.

కౌన్సిల్ ఇం. వి. ( Council ) పరిషత్తు.

కౌపీనము సం. వి. 1. గోంచి. 2. గుహ్యాంగము. 3. అకారము.

కౌమారము సం.వి. మూడవయేడు మొదలు పదునారేండ్ల వరకునైన ప్రాయము.

కౌమారి సం. వి. 1. పార్వతి. 2 బ్రహ్మచర్య వ్రతమున నుండు వానిని పెండ్లియాడిన స్త్రీ. 3.సప్తమాతృకలలో ఒకతె

కౌముదము సం. వి. కార్తికమాసము.

కౌముది సం. వి. 1. వెన్నెల. వ్యు. కుముదములను వికసింపజేయునది, భూజనులను సంతోషపెట్టునది. 2, ఉత్సవము, పండుగ 3. కార్తీక పూర్ణిమ.

కౌమోదకి సం. వి. విష్ణుమూర్తి గద.

కౌరవులు సం. వి. కురువంశపు వారు.

కౌరు వి, ముదురురంగు, వర్ణాధిక్యము రూ. కవురు.

కౌలటనేయుఁడు సం. వి. భిక్షుకియగు పతివ్రత కొడుకు. రూ. కౌలటేయుడు.

కౌలటేయుఁడు సం. వి. మా. పై. కులటా. పుత్రుడు, రంకుటాలి కొడుకు.

కౌలటేరుఁడు సం. వి. రంకుటాలికొడుకు.

కౌలీనము సం. వి. 1. గొప్పవంశమునందలి పుట్టుక. 2. అపవాదము. 3. కుకార్యము విశ. వంశపరంపరగా వచ్చినది(ఆచారము మొ. వి.)

కౌలు వి. ఒడంబడిక పత్రము. హిం. వి. (వ్యవ.) 1. భూస్వామి నుండి కొంత భూమిని శిస్తు చెల్లించు పద్ధతిపై రైతు తీసికొనుట. 2 భూభాగమందు రైతుకు భూస్వామి వ్రాసియిచ్చు పత్రము. (శాస. అర్థ.) రైతులు భూస్వాముల యొద్ద నుండి (సేద్యము చేయుటకై) నిర్దిష్ట కాలమువరకు భూమిని తీసుకొను ఒప్పందము (Lease).

కౌలుదారీచట్టము వి. (శాస.) కౌలుకు సంబంధించిన చట్టము.

కౌలుదారు (వ్యవ.) భూస్వామి నుండి భూమిని కౌలుకు తీసికొన్న రైతు.

కౌలుదారు కమతము వి. (వ్యవ.) కౌలుదారు అధీనములో సాగునందున్న భూమి (Lessee's holding).

కౌశలము సం. వి. 1. నేర్పరితనము. క్షేమము.

కౌశాంబి సం. వి. ఒక పట్టణము, వ్యు. కుశాంబునిచే నిర్మింపబడినది.

కౌశికము సం. వి. 1.గుడ్లగూబ, 2. ముంగిస

కౌశికుఁడు సం. వి. 1. విశ్వామిత్రుడు, వ్యు. కుశికపుత్రుడు. 2. ఇంద్రుడు. 3. నిఘంటువు తెలిసినవాడు. 4. పాములవాడు.

కౌశేయము సం. విశ. పట్టుది. (చీర). వి. కౌశేయమను బాణము. సం. వి. (గృహ) పట్టు. పట్టుపురుగులలోనుండి వచ్చుచుగురు పదార్థముతో తయారైన నూలు (ఈ నూలుతో బట్టలను నేయుదురు).

కౌసీద్యము సం. వి. 1. ఆలస్యము. 2. కునికిపాటు. 3. వడ్డీవలన జీవించుట.

కౌసు వి. మాంసము. రూ. కవుసు.

కౌసుమము సం. వి 1. పూదేనె. 2.పుప్పొడి విశ. కుసుమ సంబంధమైనది.

కౌస్తుభము సం. వి. విష్ణువక్షస్థలము నందలి మణి. వ్యు. కుస్తుభ = సముద్రమందు బుట్టినది.

కౌస్తుభవక్షుఁడు సం. వి. విష్ణువు.

కౌశుద్ధము సం. వి. ఉలవలతో చేయబడిన చారు, పిండివంట మొ. వి.

# క్త్వా

క్త్వార్థకము సం. వి. (వ్యాక.) భూతకాలిక అసమాపక క్రియ, ఉదా. వచ్చియిచ్చెను. ఇందులో వచ్చి క్త్వార్థకము

# క్యా

క్యారమెల్ ఇం. వి. (గృహ) (Caramel) చెక్కరంగు వచ్చువరకు వండిన చక్కెర.

క్యాల్సిఫెరల్ ఇం. వి. (గృహ.) (Calsiferol) భస్మముగా చేయబడిన విటమిన్ 'డి'.

క్యాషియర్ ఇం. వి. (అర్థ.) (Cashier) ఒక సంస్థలో పైకము ఇచ్చి పుచ్చుకొను అధికారి.

క్యాష్ క్రాప్స్ ఇం. వి. (వ్యవ.) (Cash crops) ధనాదాయ మిచ్చు పంటలు. (చెరకు, పొగాకు మొ. వి.).

# క్యూ

క్యూములేటివ్ ప్రిఫరెన్స్ షేర్లు ఇం వి. (అర్థ.) (Cumulative Preference Shares) ఉపచితములగు కొన్ని వాటాలు. నిర్ణీతమైన ఒకరేటు ప్రకారము లాభభాగము పంచిపెట్టవలసిన వాటాలు. (వీనికి ఒక సంవత్సరము లాభాభావముచే లాభభాగమీయని యెడల రెండవ సంవత్సరములోనైన లాభభాగ మీయని ఏటిది కూడ చేర్చి నిర్ణీత లాభభాగము ఈయవలసి యుండును).

క్యూములేటివ్ వోటింగు పద్ధతి మి. వి. (రాజ.) ఓటరు తన అభీష్ట ప్రకారము వోట్లను అభ్యర్థులకు పంచు విధానము (Cumulative voting system).

క్యూసెక్ ఇం. వి. (వ్యవ.) (Cusec) తూములనుండి ఒక సెకనుకు వెలువడు ఒక ఘనపుటడుగు నీటి ప్రమాణము.

# క్ర

క్రంగు వి. మ్రోగుటయందగు ధ్వని. రూ. కంగు.

క్రంత[1] వి. పెండ్లికొడుకువారు పెండ్లికూతునకు తీసికొనిపోయెడు ప్రధానద్రవ్యము. రూ. కంత.

క్రంత[2] వై. వి. 1. సందుత్రోవ. 2. రాజవీధి. 3. రచ్చ. 4. రంధ్రము. సం. గర్తః.

క్రందనము సం. వి. 1. ఆర్తధ్వని, ఏడుపు. 2. (యోధుల) అర్పు. 3. పిలుపు.

క్రందు వై. క్రి. 1. ఘోషించు. 2. విలపించు. వి. 1. మ్రోత. 2. ఉపద్రవము. 3. సందడి. సం. క్రంద్.

క్రందుకయ్యము వి. దొమ్మియుద్ధము.

క్రందుకొను క్రి. 1. అతిశయించు. 2. తరచగు. 3. ప్రకటితమగు. 4. గుమిగూడు.

క్రంప వి. కంప.

క్రకచము నం. వి. రంపము.

క్రకచవత్ నం.విశ. (వృక్ష.) రంపపు పండ్లు వలెనున్న, రంపగరివలె నున్న (Serrated)

క్రకరము నం. వి. 1. రంపము. 2. కక్కెర పక్షి. 3. వెణుతురు చెట్టు.

క్రక్కు వి. కక్కు తెవులు. క్రి. వికారముచే కడుపులోనిపదార్థములను వాంతిచేయుట.

క్రచ్చఱ క్రి. విశ. ( క్రచ్చు + అఱన్ ) 1. శీఘ్రముగా. 2. నిష్కర్షముగా.

క్రచ్చు క్రి. చుట్టుకొను. వి. 1. త్రాడుపై నుండు తుక్కు, 2. కాంతి. 3 మాలిన్యము.

క్రతుధ్వంసి నం. వి. శివుడు. వ్యు. దక్ష యజ్ఞమును నాశము చేసినవాడు.

క్రతుభుజుఁడు నం. వి. వేలుపు, జన్నపుఁ దిండి. యా. క్రతుభుక్కు.

క్రతురాజము నం. వి. రాజసూయయాగము

క్రతువు నం. వి. యజ్ఞము.

క్రథనము నం. వి. వధము.

క్రన్నన విశ. 1. శీఘ్రముగా. 2. పిమ్మట. 3. మరల.

క్రమము నం. వి (గణి.) 1. 2. 3:..... అను సహజ సంఖ్యల వరుసలో ఏసంఖ్య అంకెలనైన గుణింపగా వచ్చు లబ్ధము. ఆ లబ్ధమునకు L గుర్తు. ఉదా. $L^8 = 8 \times 7 \times 6 \times 5 \times 4 \times 3 \times 2 \times 1$. $Ln = n \times (n-1), (n-2) \ldots \times 1$

క్రమచయనము నం. వి. (గణి.) క్రమవర్తనము (Permutation).

క్రమణము నం. వి. అడుగిడుట.

క్రమభిన్నము నం. వి. (గణి.) ఒకటికన్న తక్కువ మూల్యముగల భిన్నము, ఉదా. 5/6 (Proper fraction).

క్రమభుజి నం. వి. (గణి.) సమానకోణములు సమానభుజములు కలిగిన బహు భు జి (Regular polygon).

క్రమము నం. వి. 1. విధము. 2. వరుస. సొరిది. 3. విధి. 4. క్రమాలంకారము.

క్రమశిక్షణ నం. వి. (గృహ.) వినయవిధేయతలను కలిగించుట (Discipline).

క్రమస్ఫటికము నం వి. (రసా) సౌష్ఠవము కలిగిన స్ఫటికము (Symmetric crystal)

క్రమాంకనము నం. వి (భౌతి) కొలుచు పరికరముపై కొలత గుర్తును చిహ్నించుట. లేదా ఇదివరకు పరికరమున కున్న కొలత గుర్తుల యాథార్థ్యమును ప్రయోగముచే నిర్ధరించుట (Calibration) (గణి.) పరైన కొలుచు పరికరముపై చిహ్నిత మైన క్రమభాగముల నేర్పరచుట, ఉదా. అడుగుబద్ద లేదా మీటర్ బద్దపై నుండు కొలత గుర్తులు (Graduation).

క్రమాంకితము నం. విశ. (భౌతి, రసా) యా. పై. క్రమమైన కొలత గుర్తులు వేయబడినది (Calibrated).

క్రమాంకిత జాడీ మి. వి. (భౌతి.) ద్రవములను కొలుచుట కుపయోగించు జాడీ (Graduated Jar).

క్రమాకుంచనము నం. వి. (గృహ.) అన్నకోశములో కెరటములవలె చలనమువలన ఆహారము ముందుకు త్రోయబడుట (Peristaltic Movement).

క్రమిక నం. విశ. (భౌతి. గణి. రసా.) వరుస క్రమములో ఉన్న (Respective).

క్రముకము నం. వి. పోఁక.

క్రమేలకము నం. వి. ఒంటె.

క్రమ్మఱ క్రి. మరల.

క్రమ్ము క్రి. 1. కవియు. వ్యాపించు. 2. పైకుబుకు.

క్రయము నం. వి. 1. ఖరీదు, వెల. 2. వెల ఇచ్చికొనుట.

క్రయ విక్రయములు నం. వి. కొనుట. అమ్ముట.

క్రయశక్తి సమతా సిద్ధాంతము సం. వి. (అర్థ., వాణి.) రెండు దేశముల వినిమయ హారము నిర్ణయించునపుడు ఆయాదేశములలో నున్న ద్రవ్య ప్రమాణములు అపరివర్తనీయములైనచో ఈరెండు ద్రవ్యములకు తమ తమ దేశములలో కల కొనుగోలు శక్తి ఏ నిష్పత్తిలో నున్నదో ఆ నిష్పత్తిలోనే ఈ రెంటి మధ్య వినిమయ హారముకూడ నుండవలెనను సిద్ధాంతము ఈ సిద్ధాంతమును మరుగునుండి పైకి తీసిన వాడు 'గుస్టావ్ కాసెల్'

క్రయ్య వి, కుల్య. కాలువ.

క్రయ్యము సం. విశ. కొనువారలకు అంగడి యందు పరుపఁబడినది (సరకు)

క్ర్లపడు క్రి, ఎండు.

క్రవ్యము సం. వి. మాంసము.

క్రవ్యాత్తు సం. వి. రాక్షసుడు. వ్యు. మాంసము తినువాడు.

క్రవ్యాదుఁడు సం. వి. 1. మాంసము తినువాడు. 2. రక్కసుడు. చూ. క్రవ్యాత్తు.

క్రవ్యాశి సం. వి. చూ, పై.

క్రష్ట సం. విశ. 1. కృశించువాడు.2.దున్ను వాడు. 3. లాగువాడు.

## క్రా

క్రాంతి సం. వి. 1. ఆక్రమణము. 2. తిరుగుట. 3.అడుగిడుట. 4.మీరుట. 5.సూర్య మార్గము. 6. రేఖ.

క్రాంతికోణము సం. వి. (భౌతి.) ఎచ్చట కాంతి కిరణము సంపూర్ణ పరావర్తనమొందునో అట్టి కనిష్ఠ మూల్యము గల పతనకోణము (Critical angle).

క్రాంతివృత్తము సం. వి. సంవత్సరమునకొకసారి సూర్యుడు ఆకాశమునందు ప్రయాణముచేయు వలయాకార మార్గము.

క్రాగు క్రి. 1. కాగు. 2. తపించు.

క్రాయకుఁడు సం. విశ. క్రయికుడు, విలుపకాడు, కొనువాడు. క్రేత.

క్రాయు క్రి. 1. కక్కు. 2. ఉమియు.

క్రార వి. (క్రయ్య+ర) జడ్డమై ఒక అక్షరముతో కలియు రేఫము. చూ. క్రావడి, క్రారవడి.

క్రారవడి వి. చూ. పై.

క్రాలు క్రి. 1. ఒప్పు. 2. చెదరు.3.అల్లలాడు. 4. గిరగిరతిరుగు. 5. సంచరించు. 6.సంచలించు.

క్రాలుగంటి వి. 1. చలించునట్టి కన్నులుగల స్త్రీ. 2. స్త్రీ.

## క్రి

క్రించు వై. విశ. అల్పుఁడు, నీచుడు, హీనుడు. సం. కించిత్.

క్రిందినేల వి. (వ్యవ.) దుక్కిచేయబడుచుండు నేలకు అడుగుననున్న నేల (Sub-soil).

క్రింద వి. 1. అధోభాగము.2. గతకాలము

క్రిందుపడు క్రి. 1. అడుగునపడు. 2. వశమగు. 3. ఓడు. 4. తగ్గు.

క్రికక వి. బట్టువాడు, వంది.

క్రిక్కిఱియు క్రి. సందు లేకుండ వ్యాపించు ఇరుకగు.

క్రిప్సురాయబారము మి. వి. (చరి., రాజ.) బ్రిటిష్ ప్రభుత్వము తరపున భారతదేశ ప్రజలు రెండవ ప్రపంచ యుద్ధానంతరము

వారి యిచ్ఛానుసారముగ సంవిధాన మును ఏర్పరచుకొన వచ్చునని హామీ యిచ్చుచు, భారతదేశ జాతీయ నాయకు లతో సంప్రదింపులు జరుపుటకు క్రీ. శ. 1942వ సం వ. మార్చి నెలలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ నడపిన రాయబారము (Cripp's Mission).

**క్రిమి** సం. వి. 1. కీటకము. 2. లక్క. 3. సాలెపురుగు.

**క్రిమిక** సం. వి. (గృహ.) పెద్ద ప్రేవునుండి వెలువడుఒక చీలిక.(Vermiform Appendix).

**క్రిమికల్కము** సం. వి. (గృహ.) శరీరము లోని విషక్రిములను నశింపజేయు మందు (Vaccine).

**క్రిమినిరోధకము** సం. వి. పురుగుపట్టనిది, పురుగుకొట్టనిది, ఉదా. నాఫ్తలిన్ లేక కర్పూరపు ఉండలు. 2. కోరాబట్ట (Moth-proof).

**క్రిమిశైలము** సం. వి. పుట్ట, వల్మీకము.

**క్రిములు** సం. వి. (జం.) ఎముకలు, కాళ్లు లేని బహుకణజీవులు (Worms).

**క్రియ** సం. వి. 1. ధాత్వర్థము. 2. చేయుట. 3. చేష్ట, చేత. 4. యత్నము. 5. ఉపాయము. 6, చికిత్స. 7. ప్రాయశ్చిత్తము. 8. విధము (అను అర్థము తెలుగున మాత్రమే).. (భౌతి.) పని. ఒక వస్తువు తన మట్టుకుతాను చలించునపుడుగాని లేదా దూరమున నున్న మఱియొక వస్తువు మీద తన ప్రభావమును చూపునపుడుగాని జరుగుపని (Action).

**క్రియాకారుఁడు** సం. వి. క్రొత్తశిష్యుడు, విణ. పనిచేయువాడు.

**క్రియావంతుఁడు** సం. విణ. పనియందు పట్టు దలగలవాడు.

**క్రియాశూన్యుఁడు** సం. వి. పనియందు పట్టు దలలేనివాడు.

**క్రియోజోట్** ఇం. వి. (వ్యవ.) (Creozote) నిలువచేసిన గింజలకు పురుగుపట్టకుండ ఉపయోగించు ఒక రా సా య ని క ద్రవ్యము.(ఇది కఱ్ఱతారునుండి లభించును).

**క్రియోలు** ఇం. వి. (భూగో. చరి.) (Creoles) 1. వెస్ట్ ఇండీస్, మారిషియస్ దీవులలో నివసించు శ్వేతజాతి లేక నీగ్రో జాతివారు 2. ఆఫ్రికాలోగాక వెస్ట్ఇండీస్‌లో పుట్టిన నీగ్రోవారు. 3. ఉత్తర అమెరికాలో ఫ్రెంచ్ స్పానిష్ మిశ్రమజాతులకు పుట్టిన వారు. 4. అలాస్కాలో-రష్యన్ దేశీయ ఇండియన్లకు పుట్టినజాతి. 5. స్పానిష్ అమెరికాలో మిశ్రమజాతులకు వారి భాషలకు ఈపదము వాడుదురు. 6.మిశ్ర భాష.

## క్రీ

**క్రీగడుపు** వి. (క్రిందు+కడుపు) పొత్తి కడుపు.

**క్రీదొడ** వి. (క్రిందు+తొడ) తొడఅడుగు భాగము,

**క్రీడ** సం. వి. 1. ఆట. 2. ప్రియుల పరిహాసము. 3. అనాదరము. 4. వినోదము. 5. విహారము. 6. గంతులువేసి ఎగురుట.

**క్రీడనము** సం. వి. 1. ఖేలనము, విలాసము. ఆట. 2. ఆటబొమ్మ.

**క్రీడాదురము** సం. వి. అచ్చనకాయలాట. బాలికాక్రీడ.

**క్రీడాస్థానము** సం. వి. నాట్యశాల.

**క్రీడి** వై. వి. అర్జునుడు. సం. కిరీటి.

**క్రీడించు** సం. క్రి. ఆటలాడు, విహరించు.

**క్రీతకుఁడు** నం. వి. తలిదండ్రుల యొద్ద వెలకు గొన్న కొడుకు.
**క్రీతుఁడు** నం. వి. చూ. పై.
**క్రీవాయి** నం. వి. (జం.) హైడ్రా అను జంతువునకు శంకువువలె నుండు **నోటి** భాగము, హస్తకము (**Manubrium or Hypostome**).

# క్రు

**క్రుంకు** క్రి. 1. అస్తమించు. 2. మునుగు. 3. స్నానముచేయు. వి. మునుక.
**క్రుంకుగట్టు** వి. అస్తాద్రి, క్రుంకుమల.
**క్రుంకుమల** వి. చూ. పై.
**క్రుంగు** క్రి. 1. (క్రిందికి) అణగు. 2. దిగబడు. 3. తగ్గు. 4. హ్రస్వమగు. 5. నీరసించు.
**క్రుచ్చు** క్రి. 1. పేను మొ.వి గోటితో నొక్కు 2. అడచు. 3. తూరుచు.
**క్రుధ** నం. వి. క్రోధము, రోషము.
**క్రుద్ధుఁడు** నం. విశ. కోపము నొందినవాడు.
**క్రుమ్మరిలు** క్రి. 1. తిరుగు, సంచరించు 2. ఒక్కసారిగా (కడవ మొ. ని నుండి జలాదులు) క్రిందపడు. రూ. క్రుమ్మరు
**క్రుమ్మరు** క్రి. చూ. పై.
**క్రుమ్ము** వి. కొమ్ములపోటు. క్రి. పొడుచు.
**క్రుమ్ములాడు** క్రి. పోట్లాడు.
**క్రుయ్యు** వై. క్రి. 1. తగ్గు. 2. వెనుకబడు. 3. క్షీణించు. నం. కృశ్.
**క్రుళ్ళగించు** క్రి. 1. లోలోన దుఃఖించు, వగచు. 2. స్రుక్కు.
**క్రుళ్ళగింత** వి. (మనసులో) దుఃఖించుట.
**క్రుళ్ళు** క్రి. 1. మనసులో వగచు.2.అవియు. 3. పండ్లు మొ. వి చెడిపోవు.
**క్రుడ్ ఆయిల్ మిశ్రణము** మి. వి. (వ్యావ.) ఇది కీటకజాతులను నాశముచేయుటకు ఉపయోగించు మందులలో **ఒకటి** (**Crude oil emulsion**).

# క్రూ

**క్రూరదృక్కు** నం. వి. 1. పిశునుడు, లోభి. 2. శని. 3. అంగారకుడు. 4. రాహువు. విశ. క్రూరదృష్టి కలవాడు.
**క్రూరదృష్టి** నం. వి. 1. అంగారకుఁడు. 2. శని, విశ. క్రూరదృష్టికలవాడు.
**క్రూరము** నం. వి. 1. గుగ్గిలము. విశ. 1. భయంకరమైనది, గట్టిది. 2. దయలేనిది.
**క్రూరుఁడు** నం. వి. దయలేనివాడు.
**క్రూరు** విశ. వాడి.
**క్రూసెట్** ఇం. వి. (గృహ.) (**Crusset**) ఉప్పు, మిరియములపొడి మొ. వి వేసి భోజనపుబల్లపై పెట్టు బుడ్లు.
**క్రూసేడ్స్** ఇం. వి. (చరి.) (**Crusades**) క్రైస్తవమతయుద్ధములు, మధ్యయుగములో ఐరోపా క్రైస్తవసేనలకు, తుర్కీ మహమ్మదీయ సేనలకు జరిగిన మతయుద్ధములు.

# క్రె

**క్రెటినిజమ్** ఇం. వి. (**Cretinism**) మరుగుజ్జుతనము, పొట్టి, అయొడిన్ శరీరమునకు అందకపోవుటచే శరీరము పెరుగని స్థితి.

## క్రే

క్రేంకృతము సం. వి. 1. హంసాదులధ్వని. 2. అందెలచప్పుడు.

క్రేఁగన్ను వి. (క్రేవ+కన్ను) కడకన్ను. అపాంగము.

క్రేఁటుకొను క్రి. శబ్దించు.

క్రేడి వి. 1. ఎఱ్ఱవడ్లు. రూ. కేడి. 2. పరిహాసము.

క్రేడిసేఁయు క్రి. పరిహాసముచేయు.

క్రేడించు క్రి. 1. తొలగు. 2. ఉపేక్షించు, అలక్ష్యముసేయు.

క్రేణి వి. 1, పరిహాసము, 2. అధికారము. 3. ఉన్నతపదవి.

క్రేత సం. విణ. (అర్థ.) కొనుగోలుదారు.

క్రేపు వి. శిఖరము (గిరిక్రేపులు). 2. దూడ. 3. పాడిపశువు.

క్రేవ వి. పార్శ్వము.

క్రేళ్లుదాఁటు క్రి. 1. ఎగిరిపడు, లంఘించు, 2. గంతులిడు, క్రేళ్ళువారు, క్రేళ్లురుకు.

క్రేళ్లువాఱు క్రి. మా. పై.

క్రేళ్లుఱుకు క్రి. మా. పై.

## క్రై—క్రౌ

క్రైలు వి. ధాన్యము నూర్చి కొలుచుట. ఒబ్బిడి. రూ. కైలు.

క్రైస్తవమతము వి. ఏసుక్రీస్తు బోధించిన ధర్మము.

క్రైస్తవుఁడు వి. క్రైస్తవమత స్వీకారి, క్రైస్తవమతానుయాయి, క్రీస్తును ప్రవక్తగా భావించువాడు.

క్రొ విణ. సమాసమున క్రొత్త శబ్దలు ప్తశేషము, ఉదా. క్రొక్కారు (క్రొత్త+కారు), క్రొగ్గండి (క్రొత్త+గండి), క్రొంజిగురు (క్రొత్త+చిగురు), క్రొందావి క్రొత్త+తావి). క్రొంబట్టు (క్రొత్త+పట్టు).

క్రొంకి వి. కొంకి.

క్రొంచ వై. వి. కొంచ. సం. క్రౌంచః.

క్రొంజిగురువిల్కాఁడు వి. మన్మథుడు.

క్రొక్కారము వి. కోడి కూత.

క్రొత్త విణ. 1. నవీనము, నూతనము. 2. అపూర్వము.

క్రొత్తడి వి. 1. మగనాలు 2, పతివ్రత రూ. కొత్తడి, గొత్తడి.

క్రొన్నెలలు వి. బహు. చెక్కిళ్ళయందును, తొడలయంచును పిరుదులమీదను కావించు నఖక్షతములు.

క్రొమాటిన్ ఇం. వి (జీవ.) (Chromatin) వర్ణి, అక్షిలో రంగును గ్రహించి స్పష్టముగా అగపడు పదార్థము.

క్రొమ్ముడి వి. (క్రొత్త+ముడి) ఒకరకపు కేశబంధము, వేనలి.

క్రొవ్విదము వి. 1. మదించి చేసినపని, దుష్కార్యము. 2. పరుషము.

క్రొవ్వు వి. 1. మదము, కామము. 2, బలుపు. 3. శరీరధాతువులలో ఒకటియగు వస. బహు. గర్వోక్తులు. క్రి. 1. మదించు. 2. మిక్కుటమగు.

## క్రో

క్రోఁతి వి. వానరము. రూ. కోతి.

క్రోడపాదము సం. వి. తాబేలు. వ్యు. రొమ్మున నిముడ్చుకొను పాదములు కలది.

క్రోడము నం. వి. 1. రొమ్ము. 2. పంది. 3 ఒడి.

క్రోడాడు క్రి. 1. (ఎద్దు మొ. వి.) కొమ్ముతో నేలను పొడిచి దుమ్మెగజల్లు. 2. (పంది) ముట్టెతో నేలను కెల్లగించు.

క్రోడీకరణము నం. వి. 1. ఒకటిగా చేర్చుట. 2 ఆలింగనము.

క్రోడుఁడు నం. వి. శనిగ్రహము.

క్రోథము నం. వి. 1. వధ, చంపుట 2. హింసించుట.

క్రోధన నం. వి. అరువది సంవత్సరములలో పబది తొమ్మిదవది.

క్రోధము నం. వి. 1. కోపము, రోషము. 2. రౌద్రరస స్థాయిభావము.

క్రోధి నం. వి. అరువది సంవత్సరములలో ఒకటి.

క్రోమికామ్లము మి. వి. (రసా.) క్రోమియం ట్రైయాక్సైడ్ (Chromium trioxide, క్రోమియం త్రి ఆమ్లజనిదము) నీటిలో కరిగినవచ్చు ఆమ్లము (Chromic acid).

క్రోమియమ్ ఇం. వి. (రసా.) (Chromium) రమణీయమైన రంగులు గల యౌగికముల నిచ్చు ధాతువు, (ఆవర్తక్రమపట్టికలో 6వ వర్గమునకు చెందినది.)

క్రోమొసోమ్ ఇం. వి. (జీవ)(Chromosome) వర్ణిఖండము, ప్రిత్యసూత్రము.


క్రోమొసోములు

క్రోలు వి. 1. పానము చేయు. 2. తిను. 3 అనుభవించు.

క్రోలుచు[1] క్రి. 1. పఠించు. 2. అభ్యసించు. 3, కూయు.

క్రోలుచు[2] క్రి. త్రాగించు, రూ. క్రోల్చు, క్రోలించు.

క్రోవ వి. 1. సరము. 2. బిడ్డలకు గొంతుక యందు కలుగు రోగము.

క్రోవి వి. 1 తామరనాళము. 2. గొట్టము. 3. తుపాకి. 4. బుడ్డి. 5. భూమిలోపల నీళ్లు వచ్చుటకు ఏర్పరచిన తూము. 6. మూస. 7. ఊదుక్రోవి

క్రోశము నం. వి. 1. ఏడ్పు. 2. పిలుపు. 3. కూత వినిపించు నంతదూరము, కోసు.

క్రోషె ఇం.వి. (గృహ.)(Crochet) కొక్కెము గల సూది, క్రోషేలేసును అల్లుసూది.

క్రోష్టువు నం. వి. నక్క.

## క్రౌ

క్రౌంచదారణుడు నం. వి. కుమారస్వామి. గుహుడు. వ్యు. క్రౌంచపర్వతమును భేదించినవాడు.

క్రౌంచము నం. వి. 1. క్రౌంచపర్వతము. 2. ఒకానొక ద్వీపము. 3. ఒకరకపుకొంగ.

క్రౌర్యము నం. వి. క్రూరభావము. క్రూరత్వము.

## క్ల, క్లా, క్లి, క్లీ

క్లమథము నం. వి. శ్రమము. బడలిక. రూ. క్లమము.

క్లమము నం. వి. చూ. పై.

క్లాంతము నం.విశే. 1. ఒడలినది. 2. వాడినది.

క్లాంతి నం. వి. 1. బడలిక. 2. వాడిపోవుట

క్లాజ్ ఇం. వి. (Clause) 1. నిబంధన. 2. ఉపవాక్యము. వాక్యాంగము.

క్లిన్నము నం. విశే. ఆర్ద్రము, తడిసినది.

క్లియరింగ్‌హౌస్ ఇం. వి. (అర్థ.) (Clearing house) ఋణపరిష్కార సంస్థలు. (ఒక బాంక్ చాల చెక్కుల సొమ్ము ఈయ వలసియుండవచ్చును. అట్లే ఇతర బాంకుల నుండి తాను వసూలు చేసికొన వలసిన చెక్కులుకూడ ఉండవచ్చును. ఇట్లు బాంక్ తక్కిన బాంకులనుండి వసూలుచేసికొను సొమ్మును, ఇతర బాంకులకు ఇయ్యవల సిన సొమ్మును ఋణపరిష్కార సంస్థ ద్వారా పోటీపద్దులను దృష్టిలో నుంచు కొని నికర మెంత సొమ్ము నీయవలెను? ఎంత వసూలుచేసికొనవలెను అను విష యము నిర్ణయించుకొనుటకు ఉపయోగ పడు సంస్థ.)

క్లిశితము సం. విశ. దారిద్ర్యాదులచే బాధ నొందినది.

క్లిష్టము సం. విశ. 1. పూర్వోత్తర విరుద్ధ పదాన్వయము గలది. ఉదా. నా తల్లి గొడ్రాలు. 2. దూరార్థము గలది.

క్లీబము సం. వి. నపుంసకము. విశ. విక్ర యము లేనిది.

క్లీబుఁడు సం. వి. నపుంసకుడు. విశ. 1. మగతనములేనివాడు. 2. విక్రమము లేని వాడు, పిరికి.

# క్లే, క్లో

క్లేదము సం. వి. 1. తడి. 2. ఉపద్రవము. (జీవ.) చిక్కని నీరు ఎక్కువగా నుండి జారుడు లక్షణములు గల శ్లేష్మసంబంధ మగు పదార్థము, తెమడ (Mucilage).

క్లేశము సం. వి. 1. వగ. దుఃఖము. 2. కోపము. 3. కృషి, ప్రయత్నము.

క్లోమనాళము సం. వి. (శం.) శ్వాసనాళము యొక్క శాఖ (Bronchus).

క్లోమము[1] సం. వి. (శం.) 1.కడుపులోని నీరు తిత్తి.

క్లోమము[2] వి. (గృహ.) సర్వకిణ్వము. (ఇది ఒక నాళగ్రంథి. ఇందులో పుట్టు మధుర రసము చిన్న ప్రేవులలో ఆహారము జీర్ణ మగుటకు సహాయపడును). 2. తియ్యబద్ద (Pancreas).

క్లోరికామ్లము మి. వి. (రసా.) క్లోరిక్ పంచామ్లజనిదము (పెంటాక్సైడ్)నీటిలో కరిగిన లభ్యమగు ఆమ్లము (Chloric acid).

క్లోరినేషన్ ఇం.వి. (రసా.) (Chlorination) వడబోసిన నీటియందు విరంజన చూర్ణ మును (Bleaching powder) కలుపు క్రియ. ఒక రసాయనిక సంయోగము నందున్న ఉదజనికి బదులు క్లోరినును ప్రవేశ పెట్టుట.

క్లోరెల్లా ఇం. వి. (జీవ.) (Chlorella) నీళ్ళలో నివసించే ఏకకణ జీవి.

# క్వ, క్వా

క్వణనము సం. వి. వీణ, భూషణము మొ.ని మ్రోత.

క్వథనాంకము సం. వి. (రసా. భౌతి.) ఒక ద్రవము మరుగు తాపక్రమము (Boiling Point).

క్వథితము సం. విశ. చక్కగా కాగినది.

క్వాణము సం. వి. వీణాదుల మ్రోత.

క్వాథము సం. వి. బాధ, దుఃఖము. (వైద్య.) కషాయము.

**క్వారంటైన్** ఇం. వి. (Quarantine) రోగ నిరోధక నిర్బంధము, ఓడలో నున్నవారు అంటువ్యాధికి గురియై రనితెలిసి, ఓడను రేవులోనికి రానీయకుండుట.

**క్వార్ట్** ఇం. వి. (గృహ.) (Quart) రెండు పైంట్లపరిమాణము అనగానాలుగు 'టీ' కప్పులకు సమానమైనది.

# క్వి

**క్వింటాల్** ఇం. వి. (Quintal) నూరు కిలో గ్రాముల కొలత, చూ. క్వింటాల్.

**క్విట్ ఇండియా తీర్మానము** వి. వి. (చరి. రాజ.) 'ఇండియాను వదలివెళ్ళుడు,'Quit India' అను తీర్మానము, క్రిప్స్ రాయ బారము విఫలమైన తరువాత, మహాత్మా గాంధీ నాయకత్వమున భారత జాతీయ కాంగ్రెసు బొంబాయి నగరములో సమావేశమై, భారత స్వాతంత్ర్యము సాధించుటకై, శాంతియుత సహాయ నిరాకరణము సాగించవలె నని నిశ్చయించినది. సత్యాగ్రహోద్యమము సాగించ వలయునను తీర్మానముతోపాటు క్రీ.శ. 1942 వ సంవ.అగష్టు8వతారీఖున జాతీయకాంగ్రెస్ మహాసభ "క్విట్ ఇండియా" తీర్మానమునుకూడ ఆమోదించెను. ఈతీర్మానమునుసరించి వారు బ్రిటిష్ ప్రభుత్వమును ఇండియా నుండి తొలగిపొమ్మని ఆదేశించిరి.

**క్వినీన్** ఇం. వి. (వ్యవ.) (Quinine) మలేరియా జ్వరమునుపోగొట్టు మందు,(కాఫీ మొక్క కుటుంబము (Rubia ceae)నకు చెందిన(Cinchona officinalis)అనుచిన్న చెట్టు యొక్క పట్టనుండి దీనిని తయారు చేయుదురు )

**క్విల్టింగ్** ఇం. వి. (గృహ.) (Quilting) బొంతకుట్టు, దిండ్లగలేబులు మొ. నికి అస్తరువేసి మధ్యలో దూదిపెట్టి మంచి పైపున సన్నకుట్లువేసి తయారుచేసిన ఉబ్బెత్తు నమూనాలు.

**క్విస్‌లింగ్** ఇం. వి. (రాజ.. చరి.) (Quisling) శత్రుపక్షావలంబి, ద్రోహి.

# క్ష

**క్షంత** సం.విశే. ఓర్పరి, సహిష్ణుడు.

**క్షణద** సం. వి. 1. రాత్రి. 2.పసుపు. వ్యు. తీరికను వేడుకను కలిగించునది.

**క్షణప్రభ** సం.వి. మెరపు. వ్యు. అల్పకాలమే వెలుగునది.

**క్షణభంగురము** సం. విశే. అచిరము, అనిత్యము, అశాశ్వతము. వ్యు. క్షణమాత్రమున నశించునది.

**క్షణము** సం. వి.ఘటికయందు దారవభాగము.

**క్షణికము** సం. విశే. 1. క్షణకాల ముండువది. సం. వి. రెప్పపాటు కాలము.

**క్షతఘ్నము** సం. వి. లక్క.

**క్షతజము** సం. వి. 1. నెత్తురు 2. చీము.

**క్షతము** సం. విశే. 1.గాయపడినది. 2. చీల్పబడినది, 3. నాశనమైనది. సం. వి. 1. గాయము. 2. చీల్చుట. 3. దెబ్బ.

**క్షతి** సం. వి. గాయము. 2. నాశము.

**క్షత్త** సం. వి. 1. బ్రహ్మ. 2. సారథి. 3. దాసీపుత్త్రుడు. 4. శూద్రస్త్రీయందు క్షత్రియునకుగాని క్షత్రియస్త్రీయందు శూద్రునికిగాని పుట్టినవాడు. 5. చేప. 6. రోకలి.

**క్షత్రబంధువు** నం. వి. స్వధర్మము లేక క్షత్రియునకు బంధుమాత్రు డగువాడు, నీచక్షత్రియుడు. (ఇది నిందార్థమున వాడబడును.)

**క్షత్త్రియము** నం. వి. 1. క్షత్త్రియకులము, 2. శరీరము. 3. ధనము. 4. నీరు.

**క్షత్త్రియాణి** నం. వి, క్షత్త్రియ స్త్రీ. రూ. క్షత్త్రియ. క్షత్త్రియిక.

**క్షత్త్రియి** నం. వి. క్షత్త్రియుని భార్య.

**క్షత్రియుఁడు** నం. వి. రాచవాడు.

**క్షపణకుఁడు** నం. వి. బౌద్ధ సన్న్యాసి.

**క్షపణము** నం. వి. 1. అశుచిభావము. 2 ఉపవాసము విశ. సిగ్గులేనిది.

**క్షపాకర్ఁడు** నం. వి. చంద్రుడు. వ్యు. రాత్రిని కలిగించువాడు.

**క్షపాచరుఁడు** నం. వి. రక్కసుడు. వ్యు. రాత్రులందు తిరుగువాడు.

**క్షపాటుఁడు** నం. వి. 1. రాక్షసుడు. 2. యమదూత.

**క్షమ** నం. వి. 1. ఓర్పు. 2. నేల. 3. మన్నింపు.

**క్షమాపణ** నం. వి. క్షమింప వేడుకొనుట.

**క్షమించు** నం. క్రి. 1. సహించు, ఓర్చు. 2. మన్నించు. రూ. క్షమియించు.

**క్షముఁడు** నం. విశ. 1. నేర్పరి, సమర్థుడు. 2. సహించువాడు.

**క్షయకరణము** నం, వి. (రసా.) ఒక పదార్థమునందలి. ఆక్సిజన్ మొ. ఋణ విద్యుదాత్మకము లగు మూలకములను తొలగించుట లేక వాని నిష్పత్తి తగ్గించుట. న్యూనీకరణము, అపచయము (Reduction).

**క్షయము** నం. వి. 1. క్షయవ్యాధి. 2. తగ్గుదల 3. ప్రళయము, 4. క్షయనామ సంవత్సరము.

**క్షయరోగము** నం. వి. ఊపిరితిత్తులరోగము, క్షయవ్యాధి, (Tuberculosis).

**క్షరము** నం. విశ. నశించునది. వి. 1. నీరు. 2. మబ్బు.

**క్షవథువు** నం. వి. 1. కాసరోగము. 2. తుమ్ము. 3. దగ్గు, 4. ఎక్కిలి.

# క్షా

**క్షాంతము** నం. విశ. 1, ఓర్పు స్వభావము గలది. 2. మన్నింపబడినది.

**క్షాంతి** నం. వి. 1. ఓర్పు. 2. మన్నించుట.

**క్షాత్త్రము** నం. వి. క్షత్త్రధర్మము.

**క్షామము** నం. వి. కరవు. విశ. తక్కువైనది.

**క్షారకము** నం. వి. 1. పసరుమొగ్గ. 2 చేపలను పక్షులను వేయుబుట్ట.

**క్షారజలవృక్షాటవులు** నం. వి. (భూగో.) సుందరవనములు, సముద్రపునీరు నదుల యొక్క డెల్టాలద్వారా లోనికి వచ్చి చిత్తడినేల లేర్పడుటచే, ఆ చిత్తడి భూములలో, పంటచెరకుగా ఉపయోగపడు వృక్షములు పెరుగు అడవులు.

**క్షారత** నం. వి. (రసా.) క్షారగుణము కలిగి యుండుట, నేలయం దున్న ద్రావణీయ ద్రవ్యములయొక్క ద్రావణములలో ఎరుపు లిట్మస్ నీలిగా మారు స్వభావము కలిగియుండుట (Alkalinity).

**క్షారమాపణము** నం. వి. (రసా.) ప్రమాణామ్ల ద్రావణముతో ఒక ద్రావణ మందున్న క్షారసాంద్రతను నిర్ణించుట (Alkalimetry).

**క్షారము** నం. వి. 1. గాజు. 2. బూడిద. 3. కారము. (రసా.) చేతికి జిడ్డుగ తగులు

నది. ఆమ్లములతో లవణముల నిచ్చునది. ఎఱ్ఱలిట్మస్‌ను నీలిరంగుగ మార్చునది (Alkali).
**క్షారమృత్తులు** సం. వి. (రసా.) ఆమ్లజనితో సంయోగించి క్షారములనిచ్చు ధాతువులు, కాల్సియమ్, స్ట్రాంషియమ్, బేరియమ్.
**క్షారశిలలు** సం. వి (భూగో.) 'సిలికా' అను పదార్ధము 50% కన్న తక్కువ గల శిలలు.
**క్షారసింధువు** సం. వి. లవణ సముద్రము
**క్షాళనము** సం. వి. కడుగుట.
**క్షాళితము** సం. విణ. కడుగబడినది.

## క్షి

**క్షితి** సం. వి. 1. భూమి. 2. ఉనికిపట్టు.
**క్షితిధరము** సం. వి. కొండ.
**క్షితిపతి** సం. వి. రాజు, భూమీశుడు.
**క్షితిరుహము** సం. వి. చెట్టు.
**క్షిప్తము** సం. విణ. 1. త్రోయబడినది. 2. ప్రాతబడినది.
**క్షిప్రకము** సం. వి. పొడి పిండి.
**క్షిప్రము** సం. విణ. శీఘ్రము

## క్షీ

**క్షీణము** సం. విణ. క్షయించినది, కృశించినది.
**క్షీణించు** సం. క్రి. తరుగు, కృశించు.
**క్షీణించుట** సం. క్రి. (గృహ.) 1. కుష్కించుట. 2. బలహీనమగుట. 3. సన్నగిల్లుట.
**క్షీణోపయుక్తిన్యాయము** సం. న్యా. (అర్థ.) ఒకే వస్తువును అనుభోగించునపుడు, రాను రాను ఆవ్యక్తికిని దానికిని గల ఉపయుక్తి తరుగుచుండు నను న్యాయము.
**క్షీరకంఠుఁడు** సం. వి. బాలకుఁడు.
**క్షీరదము** సం. వి. (జీవ.) క్షీరగ్రంథులు గల జంతువు, పాలిచ్చు జంతువు (Mammal).
**క్షీరమాపకము** సం. వి. (భౌతి.) పాల సాంద్రతను కనుగొనుట కుపయోగపడు ఒక పరికరము (Lactometer).
**క్షీరము** సం. వి. 1. పాలు. 2. పాల సముద్రము. 3. నీళ్ళు. 4. పాలపిట్ట.
**క్షీరాన్నము** సం. వి. పరమాన్నము.
**క్షీరాశము** సం. వి. హంస. విణ. పాలుత్రాగునది.

## క్షు

**క్షుణ్ణము** సం. విణ. 1. పొడిచేయబడినది. 2. పూర్తిగా చదువబడినది, పూర్తిగా.
**క్షుత్తు** సం. వి. ఆకలి.
**క్షుద్ర** సం. వి. 1. ఈగ. 2. వేశ్య. 3. అంగహీనయగు స్త్రీ. 4. నట్టువకత్తె. 5. గయ్యాళి.
**క్షుద్రము** సం. విణ. కొంచెము, స్వల్పము.
**క్షుద్రుఁడు** సం. విణ. 1. అధముడు. 2. పనికిరానివాడు, 3. లోభి. 4. హింసకుడు.
**క్షుబ్ధము** సం. విణ. కలతపెట్టబడినది. వి. చల్లకవ్వము.
**క్షుమము** సం. వి. (గృహ.) అవిసెచెట్టునార లేదా గోగుచెట్టునార. (ఈనారను బట్టలు నేయుటకు ఉపయోగింతురు. దీనిని నార బట్ట అందురు.) క్షామము (నారబట్ట) (Linen),
**క్షురకర్మ** సం. వి. మంగలిపని, ముండనము.
**క్షురధార** సం.వి. (భౌతి.) సున్నితపుత్రాసులో తులాదండము ఇటునటు ఊగుటకు, తులా

పాత్రలు దండపు కొనల త్రేలాడదీయుటకై ఆధారముగా నుంచబడిన వాడి అంచులుగల ముక్కోణపు పట్టకములు (Knife edge).

క్షురము సం. వి. 1. చురకత్తి.2.మంగలికత్తి.

క్షురి సం. వి. మంగలి, క్షౌరకుడు.

క్షుల్లకము సం. వి. 1. నత్తగుల్ల. 2. పేదరికము, 3. నూలుపోగు.

# క్షే

క్షేడము సం. వి. కర్కోటక మను పాము.

క్షేత్రకృషి సం. వి. (వ్యావ.) భూమిని సేగు చేసి పైరులను పెంచు వ్యవసాయశాఖ. (ఈ శాఖలో సామాన్యకృషి ఉద్యాన కృషి, తరుకృషి అను ఉపశాఖలు గలవు) (Arable farming).

క్షేత్రగణితము సం. వి. (గణి.) భూతలము, వస్తు పరిమాణము మొ. వానిని గూర్చి తెలుపు గణితశాస్త్ర విభాగము (Geometry).

క్షేత్రజుఁడు సం. వి. 1. పుత్రుడు. 2. దేవరాది న్యాయము ననుసరించి భర్తచే నియమింపబడిన ఇతరుని వలన భార్య యందు గలిగిన పుత్రుడు.

క్షేత్రజ్ఞుడు సం. వి. 1. జీవుడు. 2. పరమాత్మ.

క్షేత్రమితి సం. వి. (గణి.) క్షేత్రతలముల కొలుచు విధానశాస్త్రము, కొలతల వలన లెక్కలవలన వస్తువులపొడవు. వైశాల్యము. ఘనపరిమాణమును కనుగొనుట (Mensuration).

క్షేత్రము సం. వి. 1. వరిమడి. 2. భూమి. 3. శరీరము. 4 భార్య. (భౌతి.) అయస్కాంతము చుట్టు అయస్కాంతశక్తి ప్రసరించు ప్రదేశము (Field) (గణి.) కొన్ని రేఖల మధ్యనున్న ప్రదేశము (Figure). (భౌతి. గణి.) కొన్ని రేఖలమధ్య నున్న క్షేత్రము (Figure). (భౌతి.) బలములు (Forces) పనిచేయుచున్న ఆకాశభాగము (చోటు, Field).

క్షేపము సం. వి. 1. చిమ్ముట. 2. పూత. 3. కడపుట.

క్షేమంకరుఁడు సం. విశే. శుభంకరుడు. వ్యు. క్షేమమును కలిగించువాడు.

క్షేమము సం. వి. కలిగిన శుభము చెడకుండుట. వికృ. సేమము.

# క్షై

క్షైణ్యము సం. వి. క్షీణత.

క్షైతిజము సం. విశే. (గణి.) క్షితిజ సంబంధమైనది. (ఆకాశము భూమి కలియునట్లు కనపడు వలయమునను క్షితిజమని పేరు). భూమితో సమానమైన లేదా సమాంతరమైన మట్టము గలది (Horizontal).

# క్షో, క్షౌ

క్షోణి సం. వి. 1. నేల. 2. మొల్త్రాడు. 3. ముంజ-తృణముచే నల్లిన బ్రహ్మచారి మొల్త్రాడు.

క్షోదము సం. వి. 1. నూరుట. 2. పొడి. 3. ఏనుగుల కట్టుకంబము.

**క్షోభ** సం. వి. (భౌతి.) అల్లకల్లోలము (Disturbance).

**క్షోభము** సం. వి. 1. సంతాపము. 2. కలత. 3. వికారము. 4. చలనము.

**క్షోభించు** సం. క్రి. కలతపడు.

**క్షౌద్రము** సం. వి. 1. తేనె. 2. ఉదకము. 3. సంపెంగ.

**క్షౌమము** సం. వి. 1. నారచీర. 2. తెల్లచీర.

**క్షౌరము** సం. వి. మంగలిపని.

**క్షౌరికుఁడు** సం. వి. మంగలి.

# క్ష్మా, క్ష్వే

**క్ష్మ** సం. వి. భూమి.వ్యు.భారము నోర్చునది

**క్ష్మజము** సం. వి. చెట్టు, వ్యు భూమినుండి జన్మించినది.

**క్ష్మభృత్తు** సం. వి. 1. కొండ. 2. ఱేడు. వ్యు. భూమిని మోయునది (వాడు).

**క్ష్మయిత** సం. విశే. కంపించువాడు.

**క్ష్వేడ** సం. వి. సింహనాదము.

**క్ష్వేడము** సం. వి. 1. చెవుడు. 2. మ్రోత. 3. విసము.

**క్ష్వేళము** సం. వి. విషము.

**క్ష్వేళితము** సం. వి. సింహనాదము. రూ. క్ష్వేళి.

# ఖ

**ఖ** ఒక అక్షరము సం. వి. 1. రవి. 2. బ్రహ్మము. 3. ఇంద్రియము. 4.స్వర్గము.

**ఖంగుఖంగు** విశే. ఆయుధములు ఒకటితో నొకటి తాకునపుడు కల్గుధ్వని.

**ఖంజ** సం, విశే. కుంటిది. వి, 1. పసుపు. 2. దూది.

**ఖంజనము** సం. వి. కాటుక పిట్ట.

**ఖంజము** సం. విశే. ఒక కాలు కుంటియైనది.

**ఖండగుణము** సం. వి. (జం.) మానవరక్త కణములలో జరుగు మలేరియా రోగజీవి యొక్క జీవితదశలు (Schizogony).

**ఖండనబిందువు** సం. వి. (గణి.) కొన్ని రేఖలు కలియు బిందువు (Point of Intersection).

**ఖండనము** సం. వి. నరకుట.

**ఖండపరశువు** సం. వి. 1. శివుడు. 2. పరశురాముడు.

**ఖండబిందువు** సం. వి. (వ్యాక.) అరసున్న, అర్ధానుస్వారము.

**ఖండము** సం. వి. 1. తునుక. 2.పులకండము 3. పెద్దభూభాగము (ఆసియా, అమెరికా, ఆఫ్రికా. ఆస్ట్రేలియా, ఐరోపాఖండములు). (గణి.) ఒక వస్తువును ఖండించగా లభించు భాగము, రెండు సరళరేఖల మధ్యనున్న సరళరేఖ భాగము, ఒకసరళరేఖచే నేర్పడిన వృత్త భాగము, ఒకఘనతలముచే ఛేదింపబడిన ఘనరూపభాగము. (భూగో.) పెద్ద భూభాగము, సముద్రముచే భిన్నభిన్నముగ చేయబడని భూభాగము.

**ఖండశర్కర** సం. వి. కలకండ వికృ. కండచక్కెర.

**ఖండాంతర శీతోష్ణస్థితి** సం. వి. ఖండాంతరములలో కనపడు శీతోష్ణస్థితి వేసవి కాలములో ఉష్ణోగ్రత అధికముగాను, చలి కాలములో చలి అధికముగాను కలిగి స్వల్ప వర్ష పాతము గల శీతోష్ణస్థితి.

**ఖండాభ్రము** సం. వి. మేఘశకలము.

ఖండిక వి. 1.చిన్న పల్లె.రూ ఖండ్రిక,కండ్రిక, 2.పన్ను లేకుండ గుత్తకిచ్చిన భూఖండము.

ఖండితము సం. విణ. 1. నరకబడినది. 2. స్పష్టపరచునది,

ఖండిత వృత్తములు సం. (గణి.) ఒకదాని నొకటి ఖండించుకొను వృత్తములు (Cutting circles).

ఖండ్రిక వి. (వ్యావ.) చూ. ఖండిక.

ఖంబు సం. వి. 1. ఆకాశము. 2. స్వర్గము 3. శూన్యము. 4. సుఖము.

ఖగపతి సం. వి. గరుడుడు.

ఖగము సం. వి. 1. పక్షి. 2. బాణము. 3. గ్రహము. వ్యు॰ ఆకాశమునబోవునది.

ఖగోళము సం. వి. ఆకాశ మండలము.

ఖగోళశాస్త్రము సం. వి. (ఖగో.) నక్షత్రములు, గ్రహములు మొ.గు వానినిగూర్చి తెలుపు శాస్త్రము (Astronomy).

ఖచరము సం, వి. 1. గాలి. 2. మేఘము. 3. పక్షి.

ఖచరుఁడు సం. వి. 1. దేవుడు. 2 సూర్యుడు. వ్యు. ఆకాశమున చరించువాడు.

ఖచించు సం. క్రి. చెక్కు, పొదుగు.

ఖచితము సం. విణ. చెక్కబడినది. పొదుగబడినది. సం. వి. బ్రహ్మయొక్క ఖడ్గము. వికృ. కచ్చితము.

ఖజానా హిం. వి. ధనాగారము.

ఖటిక సం. వి, 1. బలపపుపుల్ల. 2. కర్ణరంధ్రము.

ఖటికపాషాణము సం. వి. (వ్యావ. రసా.) ఖటికము, తాలము, ఆమ్లజనికలిపి పర్పడినది (Calcium arsenate).

ఖటికపుటెరువులు మి, వి. (వ్యావ.) సున్న మెక్కువగా కల ఎరువులు (Calcareous manures).

ఖటికము సం. వి. పిడికిలి. రూ. ఖటకము. (రసా.) 1. సున్నములోని ధాతుద్రవ్యము (Calcium). 2. సుద్ద (Chalk).(రాసాయనికముగ నిది కాల్సియం కార్బనేట్, ప్రకృతిలో గనులలో దొరుకును.

ఖటికశిల సం. వి. (రసా.) సున్నపురాయి (Lime stone).

ఖటిక సంబంధము సం. విణ. సున్నపు సంబంధమైనది (Calcareous).

ఖట్టిక సం. వి. 1. గద్దియ, సింహాసనము 2. మంచము.

ఖట్టికుఁడు సం. వి. 1. వేటకాడు. 2. పక్షులను వేటాడువాడు. పర్యా. మృగయుడు, వ్యాధుడు. వికృ. కటికవాడు.

ఖట్వ సం. వి. మంచము.

ఖట్వాంగపాణి సం. వి. ముక్కంటి, శివుడు. వ్యు. ఖట్వాంగము చేతియందు గలవాడు.

ఖట్వాంగము సం. వి. 1. శివుని ఆయుధములలో ఒకటి. 2. మంచపుకోడు.

ఖడ్గము సం. వి. 1. కత్తి. 2. ఖడ్గమృగము, దాని కొమ్ము.

ఖత్తు హిం. వి. 1. విధము. 2, ఉత్తరము.

ఖద్యోతము సం. వి. 1, మబ్బు. 2 మిణుగురు పురుగు వ్యు. ఆకాశమున వెలుగునది.

ఖద్యోతుఁడు సం. వి. సూర్యుడు.

ఖనకము సం. వి. 1.ఎలుక. 2. పందికొక్కు. 3. త్రోవ.

ఖనకుఁడు సం. వి. 1. ఉప్పరవాడు. 2. కన్నపుదొంగ. విణ. 1.త్రవ్వెడువాడు. 2. తప్పులెన్నువాడు.

ఖని సం. వి. రత్నములు, లోహములు. పుట్టెడిచోటు. వికృ. గని.

ఖనిజపుటెరువులు మి. వి. (వ్యావ.) సోడియ నత్రితము మొ. ఖనిజసంబంధపు ఎరువులు (Mineral manures).

ఖనిజము సం. వి. లోహము. వ్యు. గనియందు పుట్టునది. (రసా.) సమ్మేళనస్థితి

యందు లభించులోహము (Ore). (భూగ.) గనులనుండి త్రవ్వి తీయబడిన లోహము (Mineral).
**ఖనిజ లవణము** సం. వి. (రసా.) గనులలో దొరుకు ఉప్పు, (రాసాయనికముగ ఇది కూడ సాదా ఉప్పువలె సోడియంక్లోరైడ్ యౌగికమే. (Rock salt) (గృహ.) లవణ పదార్థము (Mineral salt).
**ఖనిజ విజ్ఞానము** సం. వి. (రసా.) ఖనిజముల ప్రభవస్థానములను, ధర్మములను ఉపయోగములను చర్చించు శాస్త్రము (Minerology).
**ఖనిజాంగరవాయువు** సం. వి. (రసా.) రాతిబొగ్గును కాల్చి తయారుచేయు వాయువు. చూ. తైలవాయువు (Coal-gas).
**ఖనిజాధిస్ఫురితము** సం. వి. (వ్యవ.) ఖనిజద్రవ్యములనుండి తయారుచేయబడి ఎక్కువ స్ఫురమును కలిగియుండు ఎరువు (Mineral superphosphate).
**ఖనిజామ్లము** సం. వి. (రసా.) ఖనిజ సంబంధమైన ఆమ్లము (Mineral acid).
**ఖనిత్రము** సం. వి. గడ్డపార, గుద్దలి.
**ఖర** సం. వి. అరువది సంవత్సరములలో ఒకటి (25వది).
**ఖరకిరణుఁడు** సం. వి. సూర్యుడు.
**ఖరము** సం. వి. 1. గాడిద. 2. వాడిమి. 3. వేడిమి. విశ. 1. వాడిమికలది. 2. వేడిమి కలది.
**ఖరారునామా** హిం. వి. (శాస.) ఒడంబడిక. ఒప్పందము, అగ్రిమెంట్ (Agreement).
**ఖరారునామాకూలి** మి. వి. (రాజ.) కొంతకాలము వరకు పనిచేయుటకని ఒడంబడిక చేయించుకొని, వలస తీసికొని పోబడిన వారి కిచ్చుకూలి. (భారతదేశము బ్రిటిషు ప్రభుత్వపు అధీనములో నున్నప్పుడు దక్షిణాఫ్రికా ప్రభుత్వము, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వముతో ఒడంబడిక చేసికొని భారతీయులను ఖరారునామా కూలీగా దక్షిణాఫ్రికాకు రప్పించుకొనెను) (Indent labour).
**ఖరుఁడు** సం. వి. ఒక రాక్షసుడు. ఖరదూషణాదులలో ఒకడు. విశ. 1. వాడిమి కలవాడు. 2. వేడిమికలవాడు.
**ఖరువు** సం. వి. 1. గుఱ్ఱము. 2. దర్పము. 3. శివుడు. 4 దంతము. 5. భర్తను వరించు కన్య. విశ 1. దురాచారుడు. 2. క్రూరము.
**ఖర్చు** హిం. వి వెచ్చము. వ్యయము.
**ఖర్జూరము** సం. వి. 1. వెండి. 2. తేలు. 3. ఖర్జూరపుచెట్టు, ఖర్జూరపుపండు.
**ఖర్వటము** సం. వి. 1. కోటము. 2. కొండ దొన నాశ్రయించియుండు పల్లె. 3. నన్నూరు గ్రామములు గల పరగణాకు ముఖ్యగ్రామము. రూ. ఖర్వాటము.
**ఖర్మము** సం.వి. 1. పట్టుబట్ట. 2. పౌరుషము.
**ఖర్వము** సం. వి. 1. ఒక సంఖ్య (10,000. 000, 000). 2. కుబేరుని నిధులలో ఒకటి. విశ. 1. అధమము. 2. పొట్టిది. 3. స్వల్పము.
**ఖర్వాటుఁడు** సం. వి. బట్టతలవాడు. రూ. ఖల్వాటుడు.
**ఖలపువు** సం. విశ. కళ్ళము నూడ్చువాడు.
**ఖలము** సం. వి. 1. చోటు. 2. పాపము. 3. తెలికపిండి, 4. వెదురు. 5. ఉమ్మెత్త. 6. క్రూరము. 7. నీచము. వికృ. కళ్ళము.
**ఖలీనము** సం. వి. గుఱ్ఱపు కళ్ళెము. రూ. ఖలీనము.
**ఖలీఫాలు** హిం. వి. మహమ్మదుకు తర్వాత ఇస్లాం మతరాజ్యములకు అధినేతలుగా

ఎన్నుకొనబడినవారు,

ఖలుఁడు సం. వి. 1. దుర్జనుడు, నీచుడు, అధముడు. 2. సూర్యుడు, వ్యు. ఆకాశమున నుండువాడు.

## ఖా

ఖాండవము సం. వి. ఇంద్రుని యొకానొక వనము, 2. వటిక బెల్లము. 3. ఒక తిను బండము,

ఖాణము వై. వి. గుఱ్ఱములదాణా. సం. ఖాదనమ్, ఖానమ్.

ఖాతకుఁడు సం. విశ. 1. అప్పు పడినవాడు. 2. త్రవ్వెడువాడు.

ఖాతము సం. వి. 1. గాతము, 2. అగడ్త. 3. పుష్కరిణి.

ఖాతా హిం. వి. 1. పద్దు. 2. జమ ఖర్చు చూపుపట్టిక (Account).

ఖాతాదారు హిం. వి. (వాణి.) మామూలుగా ఒక్కచోటనే వస్తువులు కొనువాడు (Customer)

ఖాదనము సం. వి. 1. తినుట. 2.ఆహారము. 2. పల్లు.

ఖాద్యము సం. వి. చిరుతిండి, తినుబండము. విశ. తినదగినది.

ఖాయము హిం. విశ. స్థిరము.

ఖాళీ హిం. విశ. 1. ఉత్తరిది. 2. ఆక్రమింపబడినది. రూ. ఖాలీ.

## ఖి, ఖు

ఖిన్నము సం. విశ. 1. ఖేదము నొందినది. 2. దీనత నొందినది.

ఖిన్నుఁడు సం విశ. ఖేదము నొందినవాడు,

ఖిర్దుపరచుట (నేలను) వి. (వ్యవ.) కోరి వేయబడిన భూమిని సాగుచేయుటకు తగినట్లుగా చేయుట (Marking soil arable).

ఖిలము సం. విశ. 1. దున్ననిది. 2. శేషము. 3. చెడినది. పాడైనది.

ఖురణసుఁడు సం. విశ. బుఱ్ఱ ముక్కుగలవాడు.

ఖురము సం. వి. 1. గొరిజ. 2. మంగలి కత్తి. 3. మంచపుకోడు.

ఖురళి సం. వి. సాము, గరిడీ. రూ. ఖురళిక.

ఖురాను హిం. వి. (వరి.) మహమ్మదీయుల మత గ్రంథము.

ఖురాలకము సం. వి. ఇనుప బాణము.

## ఖే

ఖేంఖాణము సం. వి. గుఱ్ఱము.

ఖేటకము సం. వి. 1. డాలు. రూ. ఖేటము. 2. ఒకరకపు గ్రామము. 3, శ్లేష్మము.

ఖేటము సం. వి. 1. రైతులుండుపల్లె. 2. వర్తకు లుండు పేట. 3. సూర్యాది గ్రహము. 4. శ్లేష్మము, 5. బలరాముని గద. 6. వేట. 7. చర్మము. 8. గడ్డి. 9. డాలు. విశ. 1. అధమము. 2. వర్ధి బ్రదుకునది.

ఖేదము సం. వి. దుఃఖము.

ఖేయము సం. వి. 1. అగడ్త. 2. ఆనకట్ట. సేతువు. విశ. త్రవ్వదగినది.

ఖేల సం. వి. ఆట.

ఖేలకము సం. వి. 1. శిశువు. 2. వల్మీకము. 3. కుళ్లాయి.

# ఖో, ఖ్యా

ఖోడుఁడు సం. వి. శనిగ్రహము. విశ. కుంటివాడు.

ఖోలకము సం. వి. 1. కుల్లాయి. 2. పుట్ట. 3. పోకచిప్ప. 4. ఒకరకపు వంటపాత్ర. 5. స్వర్గము.

ఖ్యాతము సం. విశ. వాసికెక్కినది.

ఖ్యాతి సం. వి. యశస్సు, కీర్తి.

# గ

గ ఒక యక్షరము.

గంగ సం. వి. 1. గంగానది. 2. నీరు. (ఈ యర్థము తెలుగున మాత్రమే కలదు). విశ. పూజ్యము (గంగగోవు).

గంగడోలు వి. ఆవులకును ఎడ్లకును మెడ క్రింద వ్రేలాడెడు తోలు, సాస్న.

గంగమైలావు వి. (గంగమైల+ఆవు). 1. పసుపును, నలుపును కలిసిన వర్ణము కల ఆవు. 2. మిక్కిలినల్లని ఆవు.

గంగలు సం. వి. కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి-వీనినే పంచగంగ లందురు.

గంగవెఱ్ఱి వి. 1. విశేషమైన మైమరపుచే ఏమియు తోపకయుండుస్థితి. 2. పశువులకు వచ్చు ఒక విధమైన నరముల జబ్బు.

గంగాధరుఁడు సం. వి 1. శివుడు. 2. సముద్రుడు.

గంగాపుత్త్రుడు సం. వి. 1. భీష్ముడు. 2. కుమారస్వామి.

గంగాళము వి. పెద్ద నీళ్ళకొప్పెర, మూతి వెడల్పు గల పాత్రము.

గంగి విశ. పూజ్యము (గంగెద్దు=గంగి+ఎద్దు). వి. సాధువైన ఆవు.

గంగెద్దు వి. (గంగి+ఎద్దు) బొంతలు వస్త్రాదులచే అలంకరించి భిక్షాటనముకై తీసకొని వచ్చెడి ఎద్దు. రూ. గంగిరద్దు.

గంజ సం. వి. 1. కల్లుపాక. 2. గని. 3. గంజాయి. 4. కల్లుకుండ. 5. గుడిసె.

గంజము సం. వి. 1. గాదె. 2. తిరస్కారము. 3. గోష్ఠము, పసులపాక. 4. అంగడి. 5. బొక్కసము.

గంజి వై. వి. అన్నము వార్చిన నీరు. సం. కాంజికమ్.

గంజాయి వి. 1. గంజాముక్క. 2. దాని ఆకు. 3. ఆ ఆకుతో తయారు చేసిన మత్తు పదార్థము, కళంజము. (వ్యావ.) ఉన్మాదక ద్రవ్యములలో ఒకటి (Hemp). (ఇది Cannabinaceae అను కుటుంబమునకు చెందిన Cannibis sativa (గంజాయి మొక్క) అను ఆడు మొక్కల పూవుల నుండి తయారుచేయుదురు. భంగు అనునది ఈ మొక్కలనుండియు, వాని కాడల నుండియు తయారుచేయబడును. గంజాయిలో 'కన్నబిన్' (Cannabin) అను ముఖ్యమైన క్షారాళము (Alkaioid) ఉండును.

గంజు వి. 1. దుకాణము. 2. కూరలు మొ.వి అమ్ము బజారు.

గంట[1] వై. వి. 1. రెండున్నర ఘడియలు. 60 నిమిషములకాలము. 2. ఒకవాద్యము. 3. చిరుగంట. సం. ఘంటా.

గంట[2] వి. గడ్డి దుబ్బు.

గంటము వి. తాటాకుపై వ్రాయుటకు వినియోగించు ఉక్కుసాధనము. ఇనుముతో

చేసిన వ్రాత పనిముట్టు.

గంటవేట వి. దీపములు, చిరుగంటలు ఉపయోగించుచు రాత్రివేళ ఆడెడు ఒక రకపు వేట.

గంటి వి. 1. గాయము. క్షతి. 2 దుఃఖము 3. కన్నము.

గంటు వి. 1. కనుపు. బుడిపి, 2. గాయము. 3. వెంట్రుకలముడి. 4. రూకలముడి క్రి. గాయపరచు.

గంటుపెట్టు క్రి. కోపముచే ముఖము ముడుచు.

గంటె వి, 1. గరిటె. 2. సజ్జపైరు, ఒక రకపు సస్యము. బహు. గంటెలు.

గండఁడు వై. వి, 1, శూరుడు. 2.మగడు. సం. గండః.

గండకత్తెర వై. వి. దాట శక్యముకాని కష్టము. 2. మెడను కత్తిరించు పెద్ద కత్తెర. 3. వాడియైన కత్తెర. సం. గండ కర్తరి.

గండిక బరిణె పురుగు వి. (వ్యవ.) కొమ్ము పురుగు, ఎన్నెమ్మ పురుగు. (ఇది బరిణె పురుగు కుటుంబములోనిది, కొబ్బరిచెట్ల మొవ్వులను కొట్టివేయును (Oryctes rhinoceros)

గండకము సం. వి. 1. విఘ్నము. 2. ఖడ్గ మృగము. 3. పులిగోరు పదకము. 4.చేప పిల్ల. 5. ఒక సంఖ్య.

గండకి సం.వి. 1. సాలిగ్రామములు పుట్టెడి నది (గంగానదికి ఉపనది). 2. ఆడు ఖడ్గ మృగము.

గండగొడ్డలి వై. వి. కుఠారము, పరశువు. రూ. గండ్రగొడ్డలి.

గండడగించు క్రి. 1. గండడచు, పౌరుషము. అడచు. 2. నశింపచేయు.

గండడఁగు క్రి. బలహీనుడగు.

గండదీపము వై. వి. మ్రొక్కుబడికై పెట్టు జ్యోతి.

గండపెండరము వి. పండితులు, శూరులు బిరుదుగా కాలను ధరించెడు అందె, రూ. గండపెండారము, గండపెండెరము. గండ పెండేరము.

గండభేరుండము సం. వి. ఒకానొక పెద్ద పక్షి అని చెప్పెదరు, కాని ప్రయోగము అందు మృగపర్యాయముగ కానవచ్చు చున్నది.

గండమాల సం. వి. గలగండ మనురోగము, మెడచుట్టును వ్రణములు లేచెడి ఒకవ్యాధి (గృహ.) కంఠకణత పెరిగిన థైరాయిడ్ గ్రంథి, కంఠగ్రంధి పెరుగుట (Goitre).

గండము సం. వి. 1. ఏనుఁగు చెక్కిలి. 2. ఖడ్గమృగము. 3. గుర్తు. 4. పుండు. 5. చెక్కిలి, 6. ప్రాణాపాయము.

గండరగండఁడు వై. వి. శూరుల కెల్ల శూరుడు.

గండశైలము సం వి. 1. పెద్దరాయి. 2. కొండనుండి భూకంపాదులవలన జారిన పెద్దరాయి. 3. కోయిల.

గండారు వి. చెరసాల.

గండి1 వి. 1. బిలము. 2.సందు. 3.నీళ్ళధిక ముగా వచ్చుటచేత తెగిన చెరువుకట్ట సందు. 4. నది పర్వతముపై వడిగా పారు నపుడు ప్రవాహవేగముచే రెండుగా కోయబడిన పర్వతభాగము.

గండి2 సం. వి. చెట్టుబోదె, స్కంధము.

గండిక సం. వి. గులకరాయి.

గందిదొంగ వి. కన్నపుదొంగ.

గండు వై. వి. 1. పౌరుషము. 2. పోతు. 3. మగకుక్క. 4. బలము, విశే. 1. పెద్దది. ఉదా. గండుముఖము. 2. మగది. ఉదా. గండుకోయిల. సం. గండః.

గండుఁగోయిల వై. వి. 1. మగకోయిల 2. క్రొవ్వెక్కిన కోయిల.

గండూపదము సం. వి. (జం) వానపాము, ఎఱ్ఱ (Earth worm)



గండూపదము, దాని సమఖండములు

గండూషము సం. వి. 1. పుక్కిలింత. 2. పుడిసిలి. 3. ఏనుగు తొండము చివర. 4. పుక్కిట పట్టిన నీరు.

గండోలి సం. వి. 1. ఎఱ్ఱ తుమ్మెద, కణుదురీగ. 2. ఆడుహంస. 3. భద్రానది.

గండోలిగాఁడు వి. వికృతవేషభాషలచే నవ్వించువాడు.

గండ్రడ[1] విణ. 1. దుష్టుడు. 2. ధృష్టుడు. 3. బోయదు. 4. పెద్దది. ఉదా. గండ్రచీమ. బహు. పరుషవచనములు.

గండ్రడ[2] వై. వి. తునుక, ముక్క సం. ఖండః.

గండ్రగుద్దలి వి. (వ్యావ) గట్టిగానున్న నేలను త్రవ్వు సాధనము (Pick axe).



గండ్రగుద్దలి

గండ్రలు వి. పరుషవచనములు వై.వి. తునుకలు

గంత[1] వై.వి. 1. ఎద్దు మొ.ని మీద వేసెడు గోనె. ప్రాతగుడ్డలు చేర్చి దట్టముగా కుట్టిన బొంత. సం. కంథా.

గంత[2] సం.విణ. 1. పోవువాడు. 2, పొందువాడు.

గంతవ్యము సం. విణ. 1, పొందదగినది 2. పోదగినది.

గంతవ్యుఁడు సం. విణ. పొందదగినవాడు.

గంతు వి. 1. దుముకు, ఒకవిధమైన గుఱ్ఱపు నడక బహు. త్రుళ్ళు, మిడిసిపాటు.

గంతుకొను క్రి. (గంతు+కొను) 1. దుముకు, దాటు. 2. చచ్చు.

గందపుఁగొండ వై. వి. (గందము+కొండ) మలయాచలము.

గందరగోళము వి. (వ్యావ.) 1. అల్లరి, గొడవ. 2. కలకలధ్వని.

గంధకము సం వి. పసుపురంగు గల ఖనిజ వస్తువు. (రసా.) ధాతువు కాని పసుపు రంగుగల ఒక మూల పదార్థము (Sulpher). చెట్లుచేనులకు కావలసిన ప్రధాన మూలద్రవ్యములలో ఒకటి, ఒక మందు దినుసు.

గంధకాశ్మము సం. వి. (రసా.) గడ్డకట్టిన గంధకము (Brim stone)

గంధకితము సం. వి. (రసా.) సల్ఫ్యూరికామ్లమునుండి ఉత్పన్నమగు లవణము (Sulphate) ఉదా. సోడియమ్‌గంధకితము

గంధకితామ్లము సం. వి. (రసా.) గంధకత్రియామ్ల జనిదము నీటిలో కరగినపుడు ఏర్పడు ఆమ్లము (Sulphuric acid).

గంధకిదము సం. వి. (రసా.) ఒక మూలద్రవ్యమును కేవలము గంధకముతో సంయోగించిన ఏర్పడు యౌగికము (Sulphide).

గంధగజము సం. వి. మదపుటేనుఁగు, ఒక రకమైన ఏనుగు.

గంధనము సం. వి. 1. ఎఱిగించుట. 2. నలుగిడుట. 3. నొప్పించుట. 4. వెలిగించుట. 5. ఉత్సాహపెట్టుట. 6. సూచించుట, 7. హింసించుట, 8. ఉద్వర్తనము.

గంధప్రావరములు సం. వి. (జం.) ఘ్రాణ సంబంధమైన కుదుపలు (Olfactory capsules).

గంధఫలి సం. వి. సంపెంగ మొగ్గ. రూ. గండఫలి.

గంధమాదనము సం. వి. 1. ఒక పర్వతము. 2. ఒకానొక కోతి. 3. మగ తుమ్మెద. 4, మదపుటేనుగు. 5. నల్లని పెద్దతుమ్మెద విణ. సుగంధముచే పరవశము చేయునది.

గంధము సం. వి. 1. గర్వము. 2. గంధకము. 3, సంబంధము. 4, చందనాదిలేపన ద్రవ్యము. (రసా.) వాసన (Odour).

గంధమూషికము సం. వి. చుంచు.

గంధమృగము సం. వి. 1. పునుగుపిల్లి. 2. కస్తూరి మృగము.

గంధర్వము సం. వి. 1. ఒకానొకమృగము. 2. గుఱ్ఱము. 3, మగకోయిల, 4. కడఁతి, మఱణమునకును పునర్జన్మమునకును మధ్యకాలమున యాతనాశరీరమును ధరించిన ప్రాణి.

గంధర్వహస్తకము సం. వి. ఆముదపుచెట్టు రూ. గంధర్వ హస్తము.

గంధర్వులు సం. వి. దేవలోకమునందు గానముచేయు ఒక తెగ దేవతలు.

గంధవతి సం. వి. 1. కల్లు. 2. వ్యాసునితల్లి 3. నేల. 4. అడవిమల్లె. 5. వాయుదేవుని పురము.

గంధవహ సం. వి. ముక్కు. రూ. గంధ వాహ.

గంధవహుఁడు సం. వి. వాయువు, గాలి. రూ. గంధవాహుడు, వ్యు. వాసనను కొని పోవువాడు.

గంధికామ్లము సం. వి. (రసా.) గంధక ద్వ్యామ్లజనిదము నీటిలో కరిగినపుడు ఏర్పడు ఆమ్లము (Sulphurous acid).

గంభీరము సం. విశే. 1. లోతుగలది. 2. దురవగాహము. 3. మంద్రము.

గగనకుసుమము సం. వి. (జాతీ.) ఆకాశ పుష్పము (అసంభవము, శూన్యము అను అర్థముల ప్రయుక్తము).

గగనము సం. వి. 1. ఆకాశము. 2. శూన్యము, సున్న. విశే. దుర్లభము.

గగురు వి. భయహర్షాదులచేత వెండ్రుకలు నిక్కపొడుచుకొనుట, పులకాంకురము, రోమాంచము. రూ. గగుర్పాటు, గగుర్పు, గగ్గురు.

గగ్గురుపాటు వి. రోమాంచము కలుగుట.

గగ్గోలు వి. 1. కలత, క్షోభము, అల్లరి. 2. పరాక్రమము. క్రి. విశే. గగ్గోలుగ = 1. అధికముగ. 2. ఆకస్మికముగ.

గచ్ఛాంకము సం. వి. (గణి.) ఒక శ్రేణిలో నుండు పదముల సంఖ్య (The period of progression).

గచ్చ వి. ఒకానొక ముండ్లతీగ.

గచ్చు వి. 1. కాంతి 2. పూత 3. గారని పూత. వై. విశే. 1. ఏకవర్ణలోపముగాని పదలోపముగాని కలిగినది. సం గ్రస్తమ్.

గజకర్ణము సం. వి. 1. ఏనుగుచెవిని బోలిన వింజామర. 2. గజకర్ణవిద్య (ఒకరకపు ఇంద్రజాలము.)

గజదొంగ వి. మేటిదొంగ. పెద్దదొంగ, గొప్పదొంగ.

గజనిమ్మ వి. పెద్దనిమ్మ, లకుచము.

గజము సం. వి. 1. ఏనుగు. 2. మూడడుగుల కొలత. 3. సేనాంగములలో ఒకటి.

గజయాన సం. వి. ఏనుగు నడకవంటి నడక గల స్త్రీ, స్త్రీ.

గజవదనుడు సం. వి. వినాయకుడు.

గజిబిజి వి. 1. కలత, క్షోభము, కలవరము. 2. సందడి. 3. ఉద్రేకము. 4 అల్లరి. విశే. 1. నలిగినది. 2. పోయినది.

గజ్జి వై. వి. తీటకురుపులు. సం. కచ్ఛూః, ఖర్జూః.

గజ్జియ వి. ఒకవిధమగు చిరుగంట. రూ. గజ్జె.

గజ్జె వి. రూ. పై.

గజ్జ వై. సం. పెద్ద. సం. గజః.

గజగజ వి. వణకుటయందగు అనుకరణము.

గజ్జ వి. తొడసందు, వంక్షణము.

గజ్జా వై. వి. 1. మదము. 2. మత్తు. సం కచ్ఛూః.

గట్టన వై. వి. గట్టించుట, దిమ్మిసచేయుట. సం. ఘట్టనా.

గట్టి వై. విశ. దృఢము, కఠినము, కర్కశము, బిగువైనది, సడలనిది, గుల్లకానిది సం. ఘట్టః.

గట్టికుట్టు వి. (గృహ.) మిషన్ కుట్టును పోలిన చేతికుట్టు (Back stitch).

గట్టివాడు విశ. నేర్పరి, సమర్థుడు,

గట్టివాయి విశ. గయ్యాళి, ధూర్తురాలు.

గట్టు వై. వి. ఒడ్డు, తీరము, కొండ, చెఱువు కట్ట, పర్వతము. సం. ఘట్టః.

గట్టుంద్రిమ్మరి వి. కోంతి. పావరము. వ్యు. గట్టులందు తిరుగునది.

గట్టుతాలుపు వి. విష్ణువు. వ్యు. మందరగిరి నెత్తినవాడు.

గట్టువాలు వి. 1. సైరంధ్రి. 2. సుగంధ ద్రవ్యములను అమ్ము స్త్రీ.

గట్టువిలుకాడు వి. శివుడు. వ్యు. మేరువు విల్లుగా గలవాడు.

గట్టుచేయుపనిముట్టు వి. (వ్యవ.) పశువులచే లాగించి పొలములో మళ్లుగట్టుట కుపయోగించు సాధనము (Bund former).



గట్టుచేయు పనిముట్టు.

గద వై. వి. 1. నిడుపాటికోల. 2. వెదురుగడ. 3. స్తంభము. 4. గణన. 5. ఒకరకపు యుద్ధ సాధనము, 6. తెరచాపకొయ్య. 7. చెరకు మొ.ని కాండము. సం. కాండః.

గడగడలాడు క్రి. (గడగడలు+ఆడు) వణకు.

గడన వై. వి. 1. ఎన్నిక. 2. స్తోత్రము. 3. సంపాదనము. 4. లెక్క సం. ఘటనా, గణనా.

గడసరత్తె వై. వి. వేశ్య.

గడబిడ హిం. వి. 1. అల్లరి. 2. తొందర, బాధ.

గడము[1] వి. కుండలోనగువాని మూత, గడి.

గడము[2] సం. వి. 1. తెర. 2. కంచె. 3. అగడ్త. 4. విఘ్నము. 5. గండె చేప. 6. ఒకానొక దేశము.

గడియ వె. వి. 24 నిమిషముల కాలము. సం ఘటికా. వి. తలుపునకు అడ్డుగ వైచు కఱ్ఱ. రూ. గడెయ.

గడియారము వై. వి. కాలపరిమాణమును దెలుపు యంత్రము. సం. ఘటికా యంత్రమ్.

గడి వి. 1. ఎల్ల, సీమ, పొలిమేర, మేర. 2. చదురంగపు బల్లమీదిగడి. 3. సమీపము. 4. దుర్గము, కోట. 5. కోటెదూడ.

గడించు వై. క్రి. 1. సంపాదించు, ఆర్జించు. 2, కల్పించు.

గడువు[1] వి. నిర్ణయకాలము, కాలము యొక్క అవధి, మేర.

గడువు[2] సం. వి. 1. బల్లెము. 2. వావపాము. 3. మెడమీదికంతి.

గడుసరి విశ. 1. అసాధ్యుడు. 2. కఠినుడు. 3. దుష్టుడు,

గడుసు వి. 1. కాఠిన్యము. 2. ధైర్యము. 3. మొండితనము. విశ. 1. అసాధ్యము. 2, కఠినము, గట్టిది. 3. గాఢము. 4. అధికము.

గడ్డ వై. వి. 1. కురుపు. 2. మంటిగడ్డ. 3. కందమూలములు. 4. ఒడ్డు. సం. గండః. కందః.

గడ్డకట్టు క్రి. ముద్దకట్టు.

గడ్డపలుగు వి. గుంటకపలుగు, గునపము.

గడ్డపాఱ వి. నేల పెల్లగించు సాధనము, గునపము.

గడ్డప్రొయ్యి వి. గడ్డలతో నేర్పరచినపొయ్యి.

గడ్డము వై. వి. 1. చుబుకము. 2. శ్మశ్రువు. సం. గండః.

గడ్డి వి. తృణము, కసవు.
గడ్డిబోద్దు వి. చుట్టకుదురు.
గడ్డు విశే. 1. అసాధ్యము. 2. మిక్కిలి. 3. అధికుడు. వి. 1. ఆధిక్యము. 2. అతిశయము.
గణకుఁడు సం. వి, 1, జోస్యుడు. 2. కరణము.
గణనము సం. వి. (గణి.) లెక్కగట్టుట, లెక్కపెట్టుట (Calculation).
గణనాయిక సం. వి. గౌరి, పార్వతి.
గణపతి సం. వి. వినాయకుడు.
గణము సం. వి. 1. గుంపు, సమూహము 2. సేనలో ఒక భాగము. వర్ణముల సమూహము. 4. గురులఘు వర్ణముల కూడిక కలది.
గణరాజ్యము సం. వి. (చరి,) ప్రాచీన భారత దేశములోని గణతంత్ర విధానము, (ఈ గణరాజ్యములలో అధికారము రాజునందుగాక గణ ప్రముఖుల సభయందుండెను.) (Republic).
గణి సం. వి. 1. సాంగముగ వేదాధ్యయనము చేసినవాడు. 2.ఉపాధ్యాయుడు. 3. లెక్కించుట.
గణిక సం. వి. 1. ఆడేనుగు. 2. వేశ్య.
గణితము సం. వి. అంకవిద్య. విశే. ఎంచబడినది.
గణితశాస్త్రనిగమనము సం. వి. (గణి.) ఒక రాశికి సంబంధించినంత వరకు ఒక సిద్ధాంతము సరియైనదైన, తరువాత రాసులకు సంబంధించినప్పుడుకూడ సిద్ధాంతము సరియైనదే యని చూచెడు పద్ధతి (Mathematical induction).
గణిల్లు వి. ఎద్దు రంకె వేయుధ్వని.
గణుతి వై. వి. 1, ఎన్నిక. 2. పొగడ్త. 3. లక్ష్యము. 4. లెక్క. సం. గణితమ్.
గణెము వి. వేషధారులు ధరించు లక్క సొమ్ము.
గణ్యము సం. విశే. (గణి.) లెక్కపెట్టుటకు వీలైన ఒకేమాసపు ఏకాంకముచే కొలుచుటకు వీలైనది. (ఒకే విభాగముచే విభజింపబడు అంకెలు—గణ్యము లనబడును, 48, 56 అంకెలకు సామాన్య విభాజకము 8. అందుచే ఈ అంకెలు గణ్యములు) (Commensurable).
గణ్యుఁడు సం. విశే. ఎంచదగినవాడు.
గతజలసేతుబంధన న్యాయము సం. న్యా. నీరుపోయిన తర్వాత సేతువు కట్టుట, గతించినదానికై విచారించుట.
గతము సం. విశే. 1. పోయినది 2. జరిగినది, 3. చచ్చినది, 4. ప్రాప్తము. 5. గ్రహింపబడినది. వి. 1. పోవుట. 2,నడక. 3. ప్రకారము.
గతి సం. వి. 1. పోక. 2.విధము. 3. త్రోవ 3. స్థానము. 5. ప్రమాణము. 6. ఆధారము. 7. ఉపాయము. (భౌతి) చలనము (Motion).
గతిశక్తి సం. వి. (భౌతి.) వస్తు చలనమునకు తోడ్పడు శక్తి (Kinetic energy).
గతిశాస్త్రము సం. వి. (భౌతి.) వస్తువుల చలనమునుగురించి చర్చించు భౌతికశాస్త్ర భాగము (Dynamics); వస్తువుల చలన రూపములకు చెందిన నియమముల చర్చించు శాస్త్రము (Kinetics)
గతిశాస్త్రీయము సం. వి. (భౌతి) గతిశాస్త్రమునకు సంబంధించినది (Dynamical).
గతిసిద్ధాంతము సం. వి. (భౌతి.) వస్తువుల చలన స్వభావ స్వరూపముల చర్చించు సిద్ధాంతము (Kinetic theory).
గతుకు క్రి. ఎంగిలితిను. వి. ఎంగిలి తినుట. బహు. ఎత్తుపల్లములు.
గత్తర వి. ఉపద్రవము. విపత్తు.

గత్తు వి. మూత్ర గంధము.

గత్యనుశీలనము సం. వి. కార్మికుడు ఒక పనిచేయుటలో అవయవముల కదలికను పరిశీలించి అనవసరమైన కదలికను నిర్మూలించుట. (దీనివలన వృథాశ్రమ తగ్గించవచ్చును కార్యనిర్వహణలో కాలము కూడ కలిసివచ్చును).

గద సం. వి. దుడ్డువలె నుండు ఒకరకపు ఆయుధము. వికృ. గుదియ.

గదాగ్రజుఁడు సం. వి. గదునిఅన్న, విష్ణువు

గది[1] వి. ఇంటిలోపలి అర.

గది[2] సం. విశే. 1. రోగి. 2. గదను ధరించినవాడు (విష్ణువు).

గదుము క్రి. గద్దించు. అదలించు.

గద్గదము సం. విశే. డగ్గుత్తిక పడినది (స్వరము).

గద్ద వై. వి. ఒకరకపు పక్షి, గరుడపక్షి రూ. గ్రద్ద. సం. గృధ్రః.

గద్దగోరు వై వి. 1. గరుడపక్షిగోరు. 2 ఒకవిధమైన గొళ్ళెము. 3. తమలపాకులు త్రుంచుటకై ఉపయోగించు ఇనుపగోరు 4. దొంగ లుపయోగించు ఒకానొక సాధనము.

గద్దరి విశే 1. నేర్పరి, నిపుణుడు. 2.పొగరుగలది. పొగరుగలవాడు, 3. దుష్టము. దుష్టుడు. 4. దట్టమైనది, సాంద్రము.

గద్దియ వై. వి. 1. సింహాసనము. 2. పీఠము. 3. పువ్వులలోని దుద్దు. రూ. గద్దె, సం. ఖట్టికా. 4. బంగారునాణెము. వరహా. రూ. గద్దె. సం. గద్యాణమ్.

గద్దె వై. వి. చూ. గద్దియ. సోదె.

గద్య వి. గ్రంథములలో ఆశ్వాసాంతమున గ్రంథకర్త బిరుదావళితో నుండు వివరణము. రూ. గద్యము.

గద్యకావ్యము సం. వి. వచన కావ్యము.

గద్యము సం. వి. 1. వచనము. 2. చెప్పదగినది. వ్యతి. పద్యము.

గద్యాణము సం. వి. చూ. గద్దియ.

గనయము వి. 1. పోకముడి. నీవీబంధము. 2. వింటికొప్పు.

గని వై. వి. 1. బంగారు మొ. వి. పుట్టుచోటు, ధాతువులను త్రవ్వి తీసెడు భూభాగము, 2. బిలము, రంధ్రము. సం. ఖనిః.

గనిమ వి. మడి చుట్టుగల చిన్నగట్టు, ఒకరకపు సేతువు.

గన్నేరు వి. ఒకరకపు పూలచెట్టు. రూ. గన్నెర, గన్నేరు.

గప్పాలు హిం. వి. బహు. గొప్పలు, డచ్చీలు. డంబాలు. అతిశయపు మాటలు.

గబ్బి వై. విశే. 1. గర్వముగలవాడు. 2. దుష్టము 3. నిక్కినది, 4. గొప్పవాడు. 5. ధీరుడు. వి. మోసము, కపటము, కవుడు.

గబ్బిలము వి. తైలపాయిక, ఇంటికప్పు మొ.నుండితలక్రిందుగా వ్రేలాడుఒకరకపు పక్షి రూ. గబ్బిడా, గబ్బిడాయి. గబ్బిలాయి.

గబ్బు[1] వి. 1. చెడుకంపు. 2. వాసన. 3. ఒకరకపు మొక్క.

గబ్బు[2] వై. వి. మదము. ప్ర. గర్వః.

గబ్బుచీఁకటి వి. గాఢాంధకారము.

గభస్తి సం. వి. 1. సూర్యకిరణము. 2. సూర్యుడు. 3. అగ్నిభార్య, స్వాహాదేవి.

గభీరము సం. విశే. 1. మిక్కిలిలోతైనది. 2. తెలియ శక్యముకానిది. 3. మంద్రమైనది (స్వరము). రూ. గంభీరము.

గమకము[1] వి. 1. యత్నము. 2. నేర్పు. విశే. 1. మనోజ్ఞము. 2. అధికము.

గమకము[2] సం. వి. (సంగీ.) స్వర విన్యాస భేదము. విశే. 1. తోపచేయునది. 2. నిరూపణచేయునది.

గమకించు క్రి. 1. యత్నించు. 2. మనోజ్ఞమగు.

గమనము నం. వి. 1. పోవుట. 2. తలవు. 3. ప్రయాణము. 4. పొందుట. 4. రమించుట,

గమనిక నం. వి. 1. విధము. 2. సూక్ష్మపద్ధతి. 3. హెచ్చరిక.

గమి¹ నం. విశే. పోవువాడు (తెరువరి).

గమి² వి. సమూహము. విశే. తరచైనది.

గమికత్తె వి. 1. అంతఃపురమున కావలియుండు స్త్రీ. 2. అంతఃపుర పరిచారికలలో ముఖ్యురాలు.

గమికాడు వి. 1. అధిపతి. 2. అల్పసేనాధిపతి. సేనాపతి. 3. ముఖ్యజనుడు.

గమికొను క్రి. ప్రోగుపడు.

గమ్మ్ర వి. వాసనకొట్టుటయ దగు అనుకరణము.

గమ్మెక్సేన్ ఇం. వి. (వ్యవ.) (Gammexane). విషద్రవ్య ప్రయోగము చేసి కీటకములను నాశనముచేయుటకు ఉపయోగించు రసాయనిక ద్రవ్యము. (దీనిని నీటిలో కలిపి కూడ చల్లవచ్చును.)

గమ్యము నం. విశే. 1. పొందదగినది. 2. తెలియదగినది.

గయ నం. వి. ఫల్గునీ నదీ ప్రాంత నగరము, బీహారు రాష్ట్రమునందలి ఒక ప్రసిద్ధ హిందూ పుణ్యక్షేత్రము.

గయాళి విశే. 1. ధిక్కరించి మాటలాడునది. 2. వదరుబోతు. రూ.గయ్యాళి. వి. ధూర్త స్త్రీ.

గయిరమ్మ వై. వి. పార్వతి. రూ. గౌరమ్మ. గవరమ్మ. నం. గౌరాంబా

గయ్యాళి విశే. చూ. గయాళి.

గర¹ వై. వి. 1. మంటిముద్ద. 2. ఊదవాడుట. కుపయోగించు ఒక విధమైన పాచిక. 3. ఒకానొక రేఖ. నం. ఖరః.

గర² నం. వి. దేవతాళవృక్షము.

గరకట్టు క్రి. గడ్డకట్టు.

గరగ వై. వి. 1. చిన్నపాత్రము. 2. గ్రామదేవతాఘటము. నం. కరకా.

గరగర విశే. 1. నిర్దోషము 2. నిర్మలము. 3. నునుపైనది, చక్కనైనది. క్రి. విశే. చక్కగా, బాగుగా, పూర్తిగా.

గరగరిక వి. 1. నైర్మల్యము. 2.అందము, చక్కదనము, అలంకారము.

గరము నం. వి. 1. కృత్రిమ విషము. 2. తడుపుట. 3. రోగము.

గరళము నం.వి. 1. సర్పవిషము. 2.విషము. 3. గడ్డిమోపు.

గరాటు వి. (రసా.) వడపోత కాగితము ఉంచుకొనుటకు పనికివచ్చు శంక్వాకారము గల పరికరము. (ఇది సాధారణముగ గాజుతో చేయబడును) (Funnel).


గరాటు

గరి వి. 1. అతిశయము. 2. పరినారు తలత్తి విస్తరిల్లు పచ్చటి భాగము. (వృక్ష.) పర్ణాంగము యొక్క పత్రము (Frond).

గరిటె వి. కఱ్ఱతో లేక ఇనుముతో చేసిన తెడ్డు. రూ. గరిఁటె, గంటె. (రసా.) ద్రవ్యము లను గ్రహించు సాధనము (Ladle).

గరిడి వై. వి. 1. సాము. 2. సామునేర్చుకొను చోటు, సాముకూటము. 3. సమీపము. నం. ఖురళీ.

గరిడిముచ్చు వి. గడిముచ్చు, మంచివానివలె దగ్గరచేరి సమయముచూచి దొంగిలించువాడు, ఆరితేరిన దొంగ.

గరిత వై. వి. 1. ఇల్లాలు. 2. పతివ్రత. 3. స్త్రీ. రూ. గర్త. నం. గృహస్థా.

గరిమ నం. వి. 1. గొప్పతనము. 2. బరువు. 3. అణిమాద్యష్టైశ్వర్యములలో ఒకటి.

4.విధము (ఈయర్థము తెలుగునమాత్రమే కలదు.)

గరిమనాభి సం. వి. (భౌతి.) గురుత్వ కేంద్రము (Centre of gravity).

గరిష్ఠము సం. విణ. 1. మిక్కిలి గురువైనది. 2. మిక్కిలి శ్రేష్ఠమైనది 3. (గణి.) దత్తరాసులన్నింటిలో పెద్దది(Greatest.)

గరిష్ఠ సామాన్య కారణరాశి సం. వి. (గణి.) దత్తరాసుల సామాన్య కారణరాసులన్నిటిలో మిక్కిలి పెద్దరాశి (H. C. F.).

గరిసె వై. వి. 1. గాదె. 2. ఒకానొక ధాన్యపుకొలత, అరువందల కుంచముల పరిమాణము. సం. గంజః.

గరుజు హిం. వి. అక్కర, అవసరము.

గరుడకంబము మి. వి. 1. విష్ణ్వాలయము నందలి ధ్వజస్తంభము. 2. నేరముచేసిన వారిని బంధించుటకై కొత్వాలుచావడి ఎదుట పాతబడిన స్తంభము.

గరుడధ్వజుఁడు సం. వి. వెన్నుడు, విష్ణువు. వ్యు. గరుడ చిహ్నము ధ్వజమున కలవాడు

గరుడపచ్చ మి. వి. ఆకుపచ్చ వన్నెగల మాణిక్యము, గారుత్మతము.

గరుత్తు సం. వి. రెక్క, పక్షము.

గరుత్మంతుఁడు సం వి. 1. గరుడుడు. వ్యు. సారవంతములైన రెక్కలు గలవాడు. 2. అగ్ని.

గరుపకొండి బంకనేలలు వి. (వ్యవ.) బంక రేణువులు, సన్నని వండలి రేణువులు నూటికి 50, 60 వంతులున్న నేలలు (Loamy clay soils).

గరుపకొండి యిసుకనేలలు వి. (వ్యవ) ఈ నేలలలో బంకరేణువులు, సన్న వండలి రేణువులు నూటికి 10, 20 వంతు లుండును, తక్కినవి ఇసుక రేణువులు (Loamy sandy soils).

గరుపనేలలు వి. (వ్యవ.) ఇసుకనేలలకును బంకనేలలకును మధ్యస్వభావము గల నేలలు.(ఈ నేలలలో ఎక్కువ జిగురుగాని బొత్తిగా జిగురు లేకుండుటగాని యుండదు. ఈ నేలలలో బంకరేణువులు సన్నని వండలి రేణువులు నూటికి 30,40. వంతు లుండును).

గరువము వై. వి. 1. గర్వము. 2. గొప్పతనము. విణ. 1. విస్తృతము. 2. పెద్దది. సం. గౌరవమ్.

గర్జనము సం. వి. 1. మేఘము మొ.ని ధ్వని 2. కోపము.

గర్తము సం.వి. 1.గుంట, క్రంత. 2. త్రిగర్త దేశము.

గర్దభము సం. వి. 1. గాడిద. 2. ఒకానొక గంధద్రవ్యము.

గర్భకవిత్వము సం. వి. ఒక ఛందో లక్షణము కల పద్యమునందు మరియొక ఛందో లక్షణముకల పద్యమును ఇమిడ్చి వ్రాయు కవిత్వము. (కవిత్వము నాలుగు విధములు:- ఆశుకవిత్వము, బంధ కవిత్వము, గర్భకవిత్వము, చిత్రకవిత్వము).

గర్భకోశము సం.వి. (జీవ.) గర్భాశయము బిడ్డతిత్తి, పిండము పెరుగునంచి.

గర్భము సం.వి. 1. కడుపు. 2. కడుపులోని పిండము, బిడ్డ. 3. అగ్ని. 4. లోపలి భాగము. 5. నాటక సంధులలో ఒకటి. 6. సంతానము. 7. బీజము.

గర్భవతి సం. వి. చూలాలు.

గర్భస్రావము సం. వి. (గృహ.) గర్భవిచ్ఛిత్తి, విచ్ఛిన్నము, నాలుగు మాసములలోపల గర్భము జారిపోవుట(Abortion).

గర్భాగారము సం. వి. 1. శయనగృహము. 2. లోపలిగది. 3. గర్భాశయము. 4. పురుటిల్లు. 5. దేవాలయములందు దేవతా విగ్రహము లుండుచోటు, గర్భగుడి.

గర్భాశయము సం. వి. (జం.) మావి, గర్భమును చుట్టుకొనియుండు సంచి, అండాశయ నాళము చివర ఉబ్బియుండు భాగము (Uterus). (అండము అభివృద్ధి చెందుటకై దీనిలో నిలిచియుండును).

గర్భిణి సం. వి. గర్భవతి

గర్హణము సం. వి. నింద. దూఱు.

గర్హించు సం. క్రి. నిందించు, దూఱు.

గర్హ్యము సం. విశే. నింద్యము.

గఱగొఱ వి. వెలితి. తక్కువ.

గఱి వై. వి. 1. గరుకుతనము. 2. లాటి కమ్మ. 3. పక్షి, బాణము మొ.ని ఱెక్క, ఈక. సం. గరుత్.

గఱిక వి. తృణము.

గలనపత్రము సం. వి. (రసా.) వడపోత కాగితము (Filter Paper).

గలన స్తంభము సం. వి. (రసా.) గరాటు తగిలించుటకు ఉపయోగించు పరికరము (Filter stand).

గలని సం. వి. (రసా) వడపోయు సాధనము (Filter funnel).

గలిబిలి వి. 1. సందడి, రొద. 2. కలత. క్షోభము.

గల్ల వి. 1. పొల్లు, 2. మాదిగవాడు తోలు నానవేసెడి కుండ.

గల్లంతు వి. గోల, అల్లరి. (వ్యావ.) అదృశ్యము.

గవయము సం. వి. 1. గురుపోతు. వనవృషభము, అడవియెద్దు.

గవాక్షప్రసాధనము సం. వి. (వాణి.) ఇంగ్లండులోని బాంకులు తమయొద్ద నున్న ధనరాసులనుగూర్చి సమాచారము నిచ్చు సంప్రదాయము కలదు. కొంత కనీసపు ధనరాశి ఉండవలె నని చట్టము రీత్యా నిర్దేశింపబడినది కనుక ఒక బాంకు తనయొద్ద నుండవలసిన ధనరాశి తక్కువగా నున్న ఎడల, పొరుగు బాంకునుండి ఆ సొమ్మును బదులు తీసికొని, తనయొద్ద నిర్దిష్టధనరాశి ఉన్నట్లు చూపించు పద్ధతి. అవసరము తీరిన పిమ్మట ఆ సొమ్మును ఆ పొరుగు బాంకుకు తిరిగి ఇచ్చి వేయుదురు.

గవాక్షము సం. వి. కిటికీ.

గవి[1] సం. వి. ఆవు.

గవి[2] వి. 1. గుహ, 2. గుంట.

గవుండ్లవాడు వై. వి. కల్లు, సారాయి అమ్మువాడు.రూ. గౌండ్లవాడు, గౌండు. సం. గోండః.

గవేషణ సం, వి. వెదకుట.

గవ్య సం. వి. 1. ఆవులమంద. 2. రెండు క్రోసుల దూరము, గవ్యూతి. 3. గోరోజనము.

గవ్యము సం. వి. 1. వింటినారి. 2. పసులు మేయు పొలము. విశే. 1.గోహితమైనది 2. గోసంబంధమైనది 3. గోవికారమైనది (పాలు మొ.వి).

గవ్యములు సం. విశే. గోసంబంధమైనవి. (పంచగవ్యములు:- గోమయము. గోమూత్రము, గోఘృతము, గోదధి. గోక్షీరము. ఇవి పవిత్రములు, పాపహరములు).

గవ్వ వి. 1. గాజువంటి ఒకానొక పురుగు చిప్ప, వరాటిక. 2. ఒకానొక చిన్న నాణెము.

గవ్వచౌకము వి.నాలుగు గవ్వల మొత్తము, వెలిగారము.

గశికము సం. వి. నూనెమడ్డి.

గసగసాలు వై. వి. ఒకదినుసు విత్తులు. (వ్యావ.) ఇవి సంబారద్రవ్యముగా వాడబడుచుండును. (ఇవి నల్లమందు మొక్కయొక్క గింజలు.వీనిలో సుమారు నూటికి 60 వంతులు చమురుండును). సం. గసకః.

గసిక వి. 1. మేకు, 2. బాణము. 3. త్రవ్వుటకు అనువుగా కొనచెక్కిన కొయ్య.

గస్తీలు వి. (గస్తు+ఈలు) కావలివారు. హిం. పస్తు.

గహనము సం. వి. అడవి. విశే. 1. ఎరుగరానిది. 2 చొరరానిది.

గహ్వరము సం. వి. 1. కొండగుహ. 2. అడవి. 3. గాంభీర్యము. విశే. 1. గాంభీర్యముకలది-లోతైనది. 2. చొరరానిది.

గళగండము సం. వి. కంఠమాల, మెడ చుట్టును గడ్డలు లేచు వ్యాధి. (గృహ.) అంగుడువాపు, ఒక తీవ్ర కంఠవ్యాధి. (ఇది విషకంఠ జ్వరము) (Diphtheria).

గళగహనము సం. వి. (జం.) గళధమని బయలుదేరుచోట ఉబ్బిన స్పంజివంటిచిన్న నిర్మాణము. దీనిలో గళధమని యొక్క అతి సూక్ష్మరక్తనాళిక లుండును) (Carotid labrynth).



గళగ్రంథి సం. వి.(జం.) ద్వితసాధనమునకు గళగ్రంధి (కప్ప) (Hyoid apparatus) ద్వితసాధనము గాని, సర్వపేటికయు గాని ఇరువైపుల నుండు అంతస్స్రావ గ్రంధి (Thyroid gland) దీనినుండి జలతిగ్మి (Thyroxin) అను స్రావము ఊరును. కాకళము, (గృహ) గవదబిళ్ళలు లేక గాలిబిళ్ళలు అనెడివ్యాధి (Mumps).

గళధమని సం వి (జం) తలలో నుండు వివిధ భాగములకు మంచిరక్తమును పంపు రక్తనాళము (Carotid artery)

గళనము సం. వి. జారుట.

గళము సం. వి. 1. కుత్తుక 2. ఒకానొక వాద్యము.

గళశుండిక సం. వి. చిరునాలుక, కొండ నాలుక.

గళసంబంధము సం. విశే. (జం.) గొంతుతో సంబంధము కలది (Phanyngeal).

గళ్ళ వి. కళ్ళ, శ్లేష్మము.

గళ్ళైము వి. పాలమీగడవంటి లేత కొబ్బెర.

# గా

గాంగము సం. విశే. 1. గంగయందు పుట్టినది. 2. గంగకు సంబంధించినవి.

గాంగుఁడు సం. వి. 1. భీష్ముడు. 2. కుమారస్వామి.

గాంగేయము సం. వి. 1. బంగారము. 2. తామర. 3. ఉమ్మెత్త. 4. ఒకానొకచేప.

గాంగేయుఁడు సం. వి. చూ. గాంగుఁడు.

గాండీవము సం. వి. అర్జునుని విల్లు, చూ. గాండీవము.

గాండీవి సం. వి అర్జునుడు

గాండ్ర వి, కాండ్రుమనుశబ్దము.(పెద్దపులి, 'కాండ్రు' మనుమ.

గాండ్రించు క్రి. 1. ఉబ్బు 2 పెద్దగా అరచు

గాండ్ల విశే. నూనె ఆడి అమ్మి జీవించువారి కులము, తెలికల కులము

గాందిని సం. వి. గంగానది 1. అక్రూరుని తల్లి

గాందినీసుతుఁడు సం. వి. 1. భీష్ముడు 2. అక్రూరుడు 3. కార్తికేయుడు కుమారస్వామి

గాంధర్వము సం వి 1 గానము, సంగీ

తము. 2. గుత్తము. 4. వధూవరులు పరస్పరేచ్ఛచేత చేసికొను వివాహము. 5. దినము యొక్క పదునేను భాగములలో ఏడవ భాగము.

గాంధర్వవేదము సం. వి. నృత్తగీతవాద్యాభినయాదుల వివరించు ఉపవేదము.

గాంధారము సం. వి. 1. (సంగీ.) ఒకవిధమగు స్వరము. 2. సిందూరము. 3. కాంధహార్ అను ఒకానొక దేశము.

గాంధారి సం. వి. 1. గంజాయి. 2 ధృతరాష్ట్రునిభార్య.

గాంధారేయుఁడు సం. వి. దుర్యోధనుడు. గాంధారికొడుకు.

గాంధికుఁడు సం వి. సుగంధ వస్తువుల విక్రయించువాడు.

గాఁడి వి. 1. తొలచినపల్లము. 2. పసులను గట్టుచోట కసవువేయుటకు గాడిగా ఏర్పరచిన స్థానము. 3. పసులు నీరు త్రాగుటకు గాడి యేర్పడ రాతితో కట్టిన తొట్టి.

గాఁడిప్రొయ్యి వి. నిడుపాటిపొయ్యి, గాడి త్రవ్వి ఏర్పరచినప్రొయ్యి.

గాఁడు వి. 1. కామమదము. 2. కండూతి. దురద.

గాజువాఱు క్రి. కాంతిహీనమగు.

గాజు వి. 1. ఒకరకమగుమన్ను, 2, గాజు మట్టితో చేసిన వలయములు-

గాజుకాయ వి. సీసా.

గాటు వై. వి. కారము (పొగాకుగాటు). విశ. కారముకలది (గాటు పొగాకు). సం. కటుః.

గాడిద వై. వి. ఖరము, గాలిగాడు. సం గార్దభః.

గాడిదకాళ్ళవాఁడు విశ ఒకదానికొకటి తగులు మోకాళ్ళవాడు, ముడికాళ్ళవాడు.

గాడిదపులి వి. 1. దుమ్ములగొండి. 2. కొర్నవ గండు.

గాడుపు వి. గాలి, వాయువు. రూ. గాడ్పు.

గాడుపుచూలి వి. 1. హనుమంతుడు. 2. భీముడు. వ్యు. వాయు సంతానము.

గాడుపుమేపరి వి. పాము, పవనాశము,

గాడుపుసంగడీఁడు వి. అగ్ని, గాలికి స్నేహితుడు.

గాడ్పు వి. రూ. గాడుపు.

గాఢత సం. వి (గృహ.) తీవ్రత, తీక్ష్ణత (Intensity)

గాఢము సం విశ 1. అధికము, హెచ్చు. 2. బిగువైనది 3 దట్టమైనది. (రసా) నీరు కలియనిది (Concentrated).

గాణ వై. వి 1. పాటకాడు. 2. పాటకత్తె. సం. గాయనః.

గాణాపత్యము సం. వి. ఒక మతము (గణపతియే ముఖ్య దైవమని విశ్వసించు మతము).

గాణిక్యము సం. వి. వేశ్యాసమూహము.

గాతము వై. వి. పల్లము, గుంత. సం. ఖాతమ్.

గాత్రము[1] సం. వి. 1. దేహము. 2. అవయవము.

గాత్రము[2] విశ. స్థూలము.

గాథ సం. వి. 1. చరిత్ర. 2. పాట. 3. పద్యము. 4. ప్రాకృతభాష, చక్కపరుపబడనిభాష.

గాదము వి. 1, పైరులోని కసవు, ఆకు. 2. బొప్పి,

గాదిలి వి. 1 ప్రేమము, ముద్దు. 2. చుట్టము. 3. ప్రియుడు. 4. భర్త. 5. భార్య. విశ. ప్రేమపాత్రము.

గాధము సం. వి. 1. లోతులేనిచోటు, మిట్ట. 2. సంపాదింపకోరిక, విశ. 1. లోతులేనిది. 2. దాటుటకు యోగ్యమైనది. వ్యతి. అగాధము.

గాథేయుఁడు సం. వి. విశ్వామిత్రుడు (గాధి పుత్త్రిడు.

గానము సం. వి. 1. పాట. 2. ధ్వని. 3. స్తుతి

గానుఁగ వి. నూనె. చెరకురసము మొ. వి. తీసెడియంత్రము. పరంజము, రూ గానిగ గానుఁగు.

గాబు వి. మూతి వెడల్పు గల పాత్రము, కొప్పెర.

గామతకియా హిం. వి. (గృహ.) గుండ్రని పొడుగుబాటి దిండు (Bolsher cushion)

గామిడి వై. విశ. 1. శ్రేష్ఠుడు. 2. పీనము బలిసినది. 3. గయ్యాళి, 4 దుష్టము. సం. గ్రామణీః.

గాము వై. వి. 1. సూర్యాది గ్రహము 2. పిశాచము. సం. గ్రహః.

గాయకము వి. 1. మర్మము, 2. మాయ, వంచన. విశ. 1. వంచకము. 2. మిక్కిలి వెలగలది.

గాయకుఁడు సం. విశ. 1. పాటపాడువాడు 2. నర్తకుడు. నటుడు. 3. ప్రౌఢుఁడు, నేర్పరి, చతురుడు.

గాయత్రి సం. వి. 1. సంధ్యావందన సమయమున జపించు ఒకానొకమంత్రము 2. సంధ్యావందన సమయమున ఉపాసింపబడు దేవత. 3. పాదమునకు ఆరేసి అక్షరములు గల ఒక వైదిక ఛ్ఛందస్సు.

గాయని సం. వి. పాటకత్తె.

గాయనుఁడు సం. వి. 1. పాటపాడువాడు. 2. గానము వృత్తిగా గలవాడు.

గాయపుధనము మి. వి. తమ నిధులు నెరవేర్చుచు గాయపడిన సైనికులకు, నావికులకు ఇచ్చుధనము.

గాయము వి. కత్తి మొ.వానితాకున గలుగు దెబ్బనరకు, క్షతి.

గార[1] వై. వి. 1. ఇసుక చేర్చి దంచిన సున్నము. సం.క్షారః. 2. పట్టు. 3.మరక. 4. ఒక రకపు రత్నదోషము.

గార[2] వి. 1. ఇంగుది వృక్షము. 2. దాని చెక్కతో తీసిన గంధము. 3.ఒకానొకచేప

గారడము వై. వి. 1. గరుడదేవతాక మైన విషయంత్రము. 2. మాయ.సం గారుడమ్

గారడీవాడు వై. వి. 1. ఇంద్రజాలికుడు. 2. పాములవాడు, గారుడమంత్రము తెలిసినవాడు.

గారము వై. వి. 1. గొప్పతనము 2. ప్రేమ,ము ముద్దు. 3. విధము. విశ. అధికము. సం. గౌరవమ్.

గారుడము సం. వి. గరుడపచ్చ. 2. పదునెనిమిది పురాణములలో ఒకటి, 12000 శ్లోకములు గలది. గరుడదేవతాకమైన అస్త్రము.

గార్దభము సం. వి. గాడిద.

గార్హపత్యము సం. వి. 1. మూడు శ్రౌతాగ్నులలో ఒకటి. (మూడుశ్రౌతాగ్నులు గార్హపత్యము. ఆహవనీయము, దక్షిణాగ్ని). 2. గార్హస్థ్యము.

గార్హస్థ్యము సం. వి. 1. గృహస్థాశ్రమము. 2. గృహస్థధర్మము. 3.గృహస్థుడు ప్రతిదినము అనుష్ఠింపవలసిన పంచయజ్ఞములు మొ. వి.

గాలము వి. 1. చేపలను పట్టు వంపు గల కొక్కెబడిశము. 2. నూతిలో పడిపోయిన చేద మొ. వి. తీయు సాధనము.

గాలి[1] వి. 1. వాయువు. 2. దయ్యము, (ఈ మెకు గాలి సోకినది). 3. మృగముల దేహవాసన, పసి. 4. ఒకవిధమైన పశు వ్యాధి.

గాలి[2] సం. వి. 1. నింద. 2. శాపము.

గాలించు క్రి. 1. బియ్యము మొ. ని రాళ్లు లేకుండ శోధించు. అన్వేషించు. వెదకు

గాలికొలిమి వి.(రసా.) ఇనుము, రాగి మొ. ఖనిజముల నుండి ధాతువులను సంపాదించు

టకు ఉపయోగపడు స్తంభము వంటి కొలిమి (Blast furnace).

గాలిగాండు వి. గాడిద.

గాలిగుడి వి. సూర్య చంద్రులకు చుట్టు ఏర్పడు మండలము. పరివేషము.

గాలిగుమ్మటము వి. ఆకాశమున పోవు విమానము నుండి సైనికులు భూమి మీదికి దిగుట కుపయోగించు గొడుగువంటి సాధనము (Parachute)

గాలిచూలి వి. 1. భీముడు. 2. ఆంజనేయుడు 3. అగ్ని.

గాలిదిండు వి. సర్పము.

గాలిదుమ్ము వి. (భూగో.) దుమ్ముతో కూడిన గాలి దుమారము. (దీనికి కారణము దుమ్ము ప్రదేశములపైన విపరీతమైన గాలి వీచుట. ఇట్టి గాలిదుమ్ము వచ్చుటకు ముందు దుమ్ము ఒక గోడవలె లేచి పరిసర ప్రాంతములు కనబడకుండునంతదట్టముగ ఏర్పడును. ఒక్కొక్కప్పుడు ఇట్టి దుమ్ముగోడ 10 వేల అడుగులఎత్తుకు కూడ పోవును. గాలిదుమ్ము సాధారణముగ ఇరాక్, ఉత్తర ఆఫ్రికా, ఇండియాలో రాజస్థాన్ ప్రాంతములోనువచ్చుచుండును).

గాలినెచ్చెలి వి. అగ్ని.

గాలిపంట వి. నిర్ణయములేని పంట.

గాలిపటము వి. బాలక్రీడ. 2. గాలిపడగ.

గాలిమాట వి. 1. లోకప్రవాదము, ఆధారము లేనిమాట. జనశ్రుతి.

గాలివాన వి. గాలితోకూడినవాన.

గాలివేళ్ళు వి. (వృక్ష.) గాలిలో వ్రేలాడుచుండువేళ్ళు (Aerial roots).

గాలిసూడు వి. మబ్బు.

గాల్వనాస్కోప్ ఆం.వి. (భౌతి.) Galvanoscope) ఒక వలయములో విద్యుచ్ఛక్తి ఉన్నదియు, లేనిదియు తెలిసికొనుట కుపయోగించు పరికరము.

గాల్వనీమాపకము మి.వి (భౌతి)(Galvanometer) విద్యుత్ప్రవాహమును కొలుచు పరికరము.

గాల్గివస్తువులు మి. వి. (జం.) కొన్ని జీవకణముల కోశరసములో నుండు ప్రత్యేకమగు జీవపదార్థములు (Golgi bodies).


గాల్గి వస్తువులు
కోశరసము
అస్థి

గావంచ వి. కొల్లాయి గుడ్డ, తుండుగుడ్డ.

గావుపట్టు వి. గట్టి పట్టు. క్రి. 1. చంపు 2. నాశనముచేయు.

గానటబీనట వి. సక్రమముగాని విద్య, సలక్షణముగాని చదువు.

గానము వై. వి. 1. ఆహారము, తిండి, 2. బత్తెము. సం. గ్రాసః.

గాసి వి. 1. అలసట. 2. వ్యథ. వెత. విశే. 1. నశించినది. 2. నలిగినది. 3. పనికిమాలినది.

గాహనము సం. వి. 1. స్నానము, మునుగుట. 2. చొచ్చుట. రూ. గాహము.

గాళకుండు విశే. 1. ధీరుడు. 2. ప్రౌఢుడు

## గి

గి వి. నిందయందు ప్రాస్వాదియైనఆమ్రేడితశబ్దముయొక్క ఆద్యక్షరమునకు వచ్చు ఆదేశము; ఉదా. డబ్బు గిబ్బు. చిలుక గిలుక.

గింగురు వి. గుంయిమను ధ్వని. ధ్వన్యనుకరణము.

గింజె వి. విత్తు.
గింజుకొను క్రి. 1. (బిడ్డలు ఏడ్చునపుడు కాళ్ళు) విదిలించు, చిమ్ము. 2. శ్రమపడు, గిజగిజలాడు.
గిండి వై. వి. సన్నని మెడగల చిన్నచెంబు. సం. కుండీ
గిచ్చు క్రి. గోటితో నొక్కు, గీచు, గిల్లు.
గిజిగాఁడు వి. పచ్చపిట్ట.
గిజగిజ వి. 1. కాళ్ళుచేతులు విదలించుట యందగు అనుకరణము.
గిజురు వి. 1. పండులో నుండు గుంజు, పేసెము. 2. కోడిగ్రుడ్డులోని పచ్చసొన. రూ. గిజరు.
గిటక విణ. పొట్టి. పొట్టివాడు.
గిట్ట వి. 1. పసులకాలిగోరు, డెక్క. 2. బాణము.
గిట్టించు క్రి. 1. గిట్టుబడియగు. 2. చంపు.
గిట్టు క్రి. 1. అనుకూలించు, పొందుపడు. 2. చచ్చు. 3. వశించు. 4. లాభించు. 5. చాలు.
గిట్టుబడి వి. అమ్మకమునందలి లాభము.
గిడస విణ. హ్రాస్వము, పొట్టి, గిటక.
గిడుగు వి. 1. కామలేనిగొడుగు. 2. కామ అక్కరలేని గొడుగు.
గిడ్డంగి వి. సరకులు నిలువచేయు ఇల్లు (Go-down).
గిడ్డి వై. వి. ఆవు, పొట్టియావు. సం. గృష్టిః
గిత్త వి. కోడె, పొట్టియెద్దు.
గిద్ద వి. 1. పావుసోల. 2. చిన్నకొడవలి.
గినీ ఇం. వి. (Guinea) 21 షిల్లింగులు.
గిన్నియ వి. 1. లోహాది పాత్రము. 2. పానపాత్రము. రూ. గిన్నె.
గిన్నె వి. చూ. గిన్నియ.
గిబ్బ వి. 1. అచ్చుటెద్దు. 2. బుడ్డకోట్టని కోడె. 3. ఎద్దు. 4. సమాసోత్తర పదమైనపుడు శ్రేష్ఠ వాచకము. ఉదా. ఱక్కవ గిబ్బలు మొ. వి.
గిబ్బరౌతు మి. వి. శివుడు, వృషభ వాహనుడు.
గిరక వి. నూతిరాట్నము. రూ. గిలక.
గిరవు వి. 1. తాకట్టు, కుదువ. 2. కానుక. హిం. గిర్వి.
గిరాకి హిం. విణ. అధికమగు వెలగలది. (వాణి.) ఒక సమయమందు ఒక నిర్ణీతమైన ధరకు కొనుగోలుదారులు కొనుటకు సిద్ధపడు వస్తువుల లేక సేవల సౌకర్యముల రాశి.
గిరాకి సరఫరా వక్రరేఖలు మి. వి. (అర్థ.) ఒక సమయమందు ఒక సరకు యొక్క వ్యాపారులకు నమ్మకమైన గరిష్ఠమైన కొనుగోలు ధరలను కనిష్ఠమైన అమ్మకపు మార్కెట్టు ధరలను చూపురేఖలు.
గిరి సం. వి. 1. కొండ. 2. అచ్చనగాయ. 3. గుండురాయి.
గిరిజ సం. వి. 1. పార్వతి. 2. కొండయరటి. 3. మల్లెతీగ.
గిరిజనులు సం. వి. (వ్యావ.) కొండజాతులు, ఆదివాసులు.
గిరిధన్వుఁడు సం. వి. శివుడు. వ్యు. మేరు పర్వతము ధనుస్సుగా గలవాడు.
గిరిధరుఁడు సం. వి. విష్ణువు. వ్యు. మందర పర్వతమును ధరించినవాడు.
గిరివిదకారి వి. (వాణి.) వస్తువు కుదువపెట్టునపుడు పెట్టుబడిదారునకు కుదువపెట్టువానికి మధ్యనుండు మధ్యవర్తి.
గిరీశుఁడు సం. వి. 1. హిమవంతుడు. 2. శివుడు.
గిలి వి. వలయాకారపురేఖ, వృత్తము. వలయము.
గిలక వి. 1. నీరు తోడుట కుపకరించు సాధనము. 2. గిలగిల మ్రోగునట్టి పిల్లల ఆట వస్తువు.

**గిలకరించు** క్రి. 1. గిలకొట్టు. 2. చిలుకు. 3. మ్రోగు. 4. కలుపు. 5. రంగరించు.

**గిలి**[1] వి. భయము.

**గిలి**[2] సం. వి. మ్రింగుట.

**గిలిగింత** వి. చక్కిలిగింత.

**గిలోటిన్** ఇం.వి. (శాస. పరి.) (Guillotine) శాసనసభలో చర్చా నిరోధముచేయుట. 2. ఫ్రెంచి విప్లవకారులు ఫ్రాన్సు దేశములోని ప్రభువర్గముల, విప్లవ వ్యతిరేకుల శిరస్సులను ఖండించుటకు ఉపయోగించిన యంత్రము. (ఈ యంత్రమును జోసెఫ్ ఇగ్నాస్‌గిలోటిన్ (క్రీ.శ. 1784-1884) అనునతడు కనిపెట్టెను.)

**గిల్ట్ ఎడ్జ్ పేపర్** ఇం. వి. (పారి.) (Gilt-edged-paper) ప్రభుత్వపు పూచీగల ఋణ పత్రము.

**గిల్డ్ సోషలిజం** ఇం. వి. (రాజ.) (Guild-Socialism) సంఘ సామ్యవాదము. రాజ్యములోని పరిశ్రమలు, కార్మికసంఘ శ్రేణుల అధీనములో నుండవలెననియు, ఎన్నికలలో ప్రతినిధులను ఎన్నుకొనునప్పుడు వృత్తి ఆధారముగా తీసికొనవలెననియు చేయువాదము.

**గిల్లకన్ను** వి. మెల్లకన్ను.

**గిల్లు** క్రి. గోటితో గిచ్చు. వి. నఖక్షతము.

**గివురు** క్రి. 1. గీకు, గీరు, గోకు. 2. భేదించు. 3. రక్కు.

**గిష్ణుఁడు** సం. వి. 1. వేదాంతి, 2. గాయకుడు. 3. సామవేదవేత్త.




**గీఁక** వై. వి. ఏనుగుకూత, బృంహితము సం. ఘీంకారః.

**గీఁకు** క్రి. రక్కు, గోరు మొ. నితో గీచు.

**గీఁటు** క్రి. 1. పండ్లు కొరుకు. 2. కన్నుగీటు. 3. చిమ్ము.

**గీటడఁగు** క్రి. 1. చచ్చు. 2. ఓడు. 3. గర్వమణగు.

**గీటు**[1] వి. గీత, రేఖ.

**గీటు**[2] వి. 1. అనాదరము. 2. ఉపేక్ష.

**గీటునఁబుచ్చు** క్రి. 1. అనాదరించు. తృణీకరించు. 2. పోగొట్టు.

**గీత** సం. వి. (వేదాం.) ఆధ్యాత్మిక తత్త్వ విషయమై ప్రశ్నోత్తరరూపమున ఉండు గ్రంథము, ఉదా. భగవద్గీత, రామగీత మొ. వి. వి. రేఖ.

**గీతము** సం. వి. పాట. విశ. పలుకబడినది. పాడబడినది.

**గీతి** సం. వి. 1. గోపకుల గీతము, పాట. 2. వృత్తభేదము విశ. 1. గానముచేయువాడు. 2. సంగీతముతో చదువువాడు.

**గీపెట్టు** క్రి. 1. ఏనుగు ఘీంకరించు. 2 మొరపెట్టు.

**గీము** వై. వి. ఇల్లు. సం. 1. గేహమ్. 2. గృహమ్,

**గీర్దేవి** సం. వి. సరస్వతి, వాగ్దేవి.

**గీఱు** క్రి. 1. నాటు. గ్రుచ్చుకొను. 2. ఛేదించు. భేదించు. 3. (పండ్లతో) చీకు. 4. (గోళ్ళతో కురులు) దువ్వు.

**గీఱునామము** వి. 1. గీతగలనామము. 2. పంగనామము. 3. గోటితో గిరి తీర్చెడి బొట్టు.

**గీలు** క్రి. స్రవించు, కారు.

**గీలుకొను** క్రి. అభిముఖమగు.

**గీష్ణువు** సం. వి. 1. నటుడు. 2. గాయకుడు,

**గీష్పతి** సం. వి. బృహస్పతి. 2. పండితుడు.

# గు

గుంజ సం. వి. 1. గురివెంద తీగ. 2.తప్పెట 3. కల్లు దుకాణము. 4. అవ్యక్త మధుర ధ్వని. 5 ఉప్పళము.

గుంజాటన వి. (వ్యావ.) 1. వ్యసనము. వెనుకముందులాడుట.

గుంజిళ్లు వి. ని. బహు. చేతులు కట్టుకొని రెండుకాళ్ళు చేర్చి కూర్చుండిలేచుట. రూ. గుంజీలు.

గుంజు వి. (గృహ.) మెదిపి పడకట్టిన పదార్థము, ఉదా. జామ్ చేయుటకు తీసిన టమాటా గుంజు 2. తాటి టెంకె మొ॥ వానిలో గుజ్జు.

గుంజ వై. వి. 1. స్తంభము. 2.కట్టుగొఱ్ఱు. సం. గుంద్రమ్.

గుంజు వి. గుజ్జు.క్రి. 1. ఈడ్చు. 2.జాడించు 3. ఉదుకు.

గుంజుకొను క్రి. 1. వెనుకకు ముందుకు తన్నులాడు. 2. లాగుకొను. 3. పెనుగులాడు.

గుండ వై. వి. 1. వల్లము. 2. చెరువు. సం. కుండమ్, మాం. (విశాఖపట్టణ ప్రాంతమున) బాలిక.

గుంటక వి. (వ్యవ.)నేలను దున్నిన తరువాత మట్టిని కదల్చుటకు ఉపయోగించు పనిముట్టు (Blade harrow), పర్యా.పాపటము, చెక్కమాను.


గుంటక

గుంటనక్క వి. 1. సృగాలము, చిన్న జాతినక్క,2.కుంతంత్రములుపన్ను వాడు.

గుంటల గొట్టము వి.(వృక్ష.) దారు నాళములలో గుంటలవలెనుండు బలవర్ధకనిర్మాణములు గల కొట్టము.

గుంటి వి. దున్నుట కేర్పఱచిన భాగము, చేనిభాగము.

గుండ[1] వి. వస్త్రము.

గుండ[2] వై. వి. పొడి సం. గుండకః.

గుండఁడు వి. దాసుడు, సేవకుడు.

గుండగొయ్య విశ. 1. దుష్టుడు. 2. పని చేయనివాడు. మోటబొక్కెనపై మోకు తగిలించు ఇనుపకడియము.

గుండము[1] వై. వి. 1. నిప్పులగుంట. 2. నీటిగుండము సం. కుండమ్

గుండము[2] సం. వి వాసనగల ఒక విధమైన గడ్డి.

గుండిగ వై. వి. పెడల్పు నోరుగల పెద్ద లోహపాత్రము. సం. కుండికా.

గుండియ వి హృదయము. రూ. గుండె.

గుండీ వి బొత్తాము, తే. గొండి.

గుండు వై. వి 1. పెద్దరాయి, 2.ఫిరంగి గుండు. 3 గుండ్రాయి. 4.తూనికరాయి. 5. కొండ. 6. వెండ్రుకలు గొరుగబడిన తల సం. గండః.

గుండుసూది వి. గుండ్రని తలగల సూది.

గుండె వి. రూ. గుండియ.

గుంపు వి. 1. ప్రాణి సమూహము. 2. సమూహము. నూలు 3. వడుకునపుడు నడుమ నడుమ వచ్చెడి ఉండ.

గుంపెన వి. 1. గంతు. 2. విజృంభణము. 3. పోటు, దెబ్బ. 4. ఒకావొక చెట్టు.

గుంఫనము సం. వి. 1. మాటలు చక్కగా అల్లుట (పదగుంఫనము), కూర్చుట, 2. విధము (ఈ యర్థము తెనుగునమాత్రమే కలదు). రూ. గుంభనము.

గుంఫితము సం. విశ. కూర్పబడినది. రూ. గుంభితము.

గుగ్గిలము వి. (వ్యాప.) ధూపద్రవ్యముగ నుపయోగించబడు ఒకపదార్థము(Burseraceae) అను కుటుంబమునకు చెందిన "Boswllia serata" అను చిన్న చెట్టు నుండి స్రవించుజిగురుపదార్థము(Indian-balsam).

గుచ్ఛకము నం. వి. 1. కుచ్చు. 2 పూగుత్తి. 3. నెమలిపురి, రూ. గుచ్ఛము.

గుచ్ఛము నం. వి. చూ పై.

గుజస్తా హిం. విశ. కడచిన, కడచిపోయిన.

గుజగుజపోవుట వి. రహస్యముగా మాటలాడుట, గుసగుసలాడుట.

గుజగుజలాడుట వి. 1. త్రొక్కులాడుట గజిబిజిపడుట. 2. గుసగుసలాడుట.

గుజారి విశ. ధనవంతుడు.

గుజ్జు వి. 1. పొట్టిదనము. 2. కోడెదూడ. 3. పాపట. 4. దూలము మీది గురుజు. 5. క్రొవ్వు. విశ. 1. పొట్టివాడు. నం. కుబ్జః.

గుజ్జువేలుపు వి. వినాయకుడు.

గుజ్జెనగూళ్లు వి. 1. బాలికలు బొమ్మలు పెట్టి ఆడుకొనునపుడుగురుగులతో వండు వంటకము. 2. బాలిక లాడుకొనెడి ఒక ఆట.

గుటక వి. గ్రుక్క.

గుటి పుంజము నం. వి. (జం.) చాల జంతువులలో అండము మొదటి దశలో అభివృద్ధి చెందుచున్నప్పుడు ఏర్పడిన గోళాకారముగనున్న జీవకణముల ముద్ద (Morula).

గుటీఫలము నం. వి. (వృక్ష.) కండకాయ, లోపల గట్టిటెంక లేకుండ, అంతయుకండ కాని గుంజుకాని యున్నఫలము (Berry)

గుట్ట వై. వి. 1. చిన్నకొండ. 2. ప్రోపు. నం. గోత్రః. విశ. ధీరుడు.

గుడక వి. టెంకాయ బుఱ్ఱ.

గుడము నం. వి. ఉండ, గోలి. 2. బెల్లము. 3. ఏనుగు కవచము. 4. పొగడచెట్టు.

గుడాకేశుడు నం. వి. 1. అర్జునుడు. 2. శివుడు. వ్యు. జెముడువలె గుబురుగా పెరిగిన జుట్టు కలవాడు.

గుడారము వై. వి. డేరా, పటకుటీరము. 2. గుణాలయము రూ.గుడారు. గూడారము, గూడారు నం. కుటీరః.

గుడారు వై. వి. చూ. పై.

గుడి వై. వి. 1. పరివేషము. 2. వలయరేఖ 3. ఇకార చిహ్నము. ( ి ) 4. దేవాలయము. నం. కుటీ.

గుడిగి వి. చెడ్డి, మోకాళ్ళవరకు తొడిగికొను వస్త్రకవచము.

గుడిదిరుగు క్రి. గుండ్రముగా దిరుగు.

గుడిసె వై. వి. గుండ్రని చిన్న ఆకుటిల్లు. నం. కుటీరః.

గుడిసెవాటు వి. (వ్యావ.) రంకులాడి, కులట. రూ. గుడిసేటు,

గుడుగుడుగుంచము వి. ఒకానొక బాలక్రీడ.

గుడుసు విశ. గుండ్రము. వి. 1. పరివేషము.2. గుడిసె. 3. ఇకారచిహ్నము,

గుడుసుకయిదువు వి. విష్ణుచక్రము. పర్యా. గుడుసువాలు.

గుడ్డ వి. 1. వస్త్రము. 2. వస్త్రఖండము

గుడ్డికన్ పాదుషా వి. కుబేరుడు.

గుడ్డు వి. (వ్యావ.) 1. అండము. 2. సున్న

గుడ్లగూబ వి. పెద్దగుడ్లుగల పక్షి, దివాంధము.

గుణకము నం. వి, 1. పెంచెడులెక్క. 2. (గణి.) ఒకరాశిని గుణించునది (Coefficient) 3. గుణించురాశి. (Multiplier).

గుణకారము నం. వి. హెచ్చువేత (గణి.) అంకగణిత ప్రక్రియలలో ఒకటి (Multiplication )

**గుణనపూర్వదశ** సం. వి. (జం.) మానవ రక్త కణములలో ప్రవేశించిన మలేరియా రోగజీవి అభివృద్ధి చెందుచు విభజనకు సిద్ధముగా నున్న దశ (Schizont).

**గుణము** సం. వి. 1. శీలము. 2. అల్లెత్రాడు. 3. దారము. 4. (అలం.) కావ్యగుణము.

**గుణాత్మకము** సం. విశ. (రసా.) రసాయనికయౌగికమున ఏరకపు మూలద్రవ్యము లున్నవో తెలుపునది (Qualitative)

**గుణాత్మక విశ్లేషణము** సం. వి. (రసా.) ఒక యౌగికములో నుండెడు మూల ద్రవ్యములను వాని గుణపరిశీలన వలన గుర్తించుట (Qualitative analysis).

**గుణాలయము** సం. వి. మా. గుడారము.

**గుణి** సం. విశ. గుణముగలవాడు వి. విల్లు, వ్యు. గుణము (అల్లెత్రాడు) కలది.

**గుణిజ నిష్పత్తి నియమము** సం. వి. (రసా.) రెండు మూల ద్రవ్యములు రసాయనికముగ సంయోగించి ఒకటి కన్న ఎక్కువ యౌగికముల నిచ్చుచో వానిలో నొక మూలద్రవ్యపు నియతరాశితో సంయోగించు రెండవ ద్రవ్యపు సంయోగ భారములు పరస్పరము గుణిజ సంబంధములో అనగా 1, 2, 3. వంటి పూర్ణాంకములచే తెలుపబడు సంబంధములో నుండునను నియమము (Law of multiple proportions).

**గుణిజము** సం. వి. (గణి.) ఇంకొకరాశిచే కచ్చితముగా భాగహారించబడుటకు వీలైన రాశి (Multiple).

**గుణితము** సం. వి. హల్లులతో అచ్చులను హల్లులను చేర్చి చెప్పుట. విశ. హెచ్చింపబడినది.

**గుణితాంగరూపత** సం. వి. (రసా.) మా. గుణితాంగ రూపనము (Polymerism).

**గుణితాంగరూపనము** సం. వి. (రసా.) ఏకజాతి అణువుల బహు సంయోగము వలన సంకీర్ణతరమును, అదే ప్రాయోగిక సాంకేతికము గలదియు అగు పెద్ద అణువుగా మార్చుట. ఉదా. ఎతిలీన్ దానితో అది బహుళముగా సంయోగించి పోలీ ఎతిలీన్ ఏర్పడుట. దీనినే ఇప్పుడు ప్లాస్టిక్ సంచుల క్రింద తయారుచేయుచున్నారు (Polymerisation).

**గుణోత్తర శ్రేఢి** సం. వి. (గణి.) మా. జ్యామితిశ్రేఢి(Geometric progression)

**గుణ్యము** సం. వి (గణి.) ఇంకొకరాశిచే గుణించబడవలసినరాశి. విశ. ప్రశస్త గుణము కలది.

**గుత్త** వై. వి. 1. అంతయును ఒకేసారి వెలకుకొనుట (జట్టీ.) 2. యజమానికి తగినఫలమిచ్చుటకు ఒప్పికొని భూమ్యాదులను తన అనుభవమున ఉంచుకొనుట. కౌలు, విశ. గుత్తకు తీసికొనబడినది. సం. గుప్తమ్.

**గుత్తము** వై. వి. బిగువు. విశ. 1. ఎచ్చుతక్కువలు లేక సరిగా నుండునది, కచ్చితము (రైక మొ. వి.). 2. గట్టిది. 3. రహస్యము, గూఢము, సం. గుప్తమ్,

**గుత్త వ్యాపారము** మి. వి. (అర్థ.) ఏకాధికార వ్యాపారము, ఒక పరిశ్రమకాని. వ్యాపారము కాని, ఒకే వ్యక్తియొక్కగాని, సంస్థ యొక్కగాని అధీనములో నుండి, ఇతర వ్యాపారులు కావలెనన్నను అట్టి వ్యాపారములో జోక్యము కలుగజేసి కొనుటకు వీలులేనట్టి వ్యాపారము (Monopolised trade).

**గుత్తి** వై. వి. 1. పూగుత్తి. 2. చీలిమండ. 3. మణికట్టు క్రింది హస్తభాగము. 4. ఒకానొక వన్యవృక్షము. 5. (కవ్వము యొక్క) బిళ్ళ. సం. గుచ్ఛః.

**గుత్తి పద్ధతి** వి, వి. (వ్యవ.) మొక్కలకు అంటుగట్టు పద్ధతులలో ఒకటి. (నిలువుగ నున్న కొమ్మకు ముదిరిన భాగమునకు ఒక అంగుళము పట్ట తీసివేసి, ఆ భాగములను మట్టితో కప్పి గోనెతోగాని, గడ్డితోకాని కట్టి తడియారకుండ నీరుపోయుచుండిన కొన్నాళ్ళకు అచట వేళ్లు పుట్టును) తరువాత క్రింది భాగమును కోసి వేరుగా నాటవలెను) (Gooty).

**గుత్తియంటు** వి. (వ్యవ.) కొమ్మమొక్క కాండముచుట్టును సుమారు 1. అంగుళము వెడల్పున పైపట్టను తీసివేసి దానిపై మట్టిని చేర్చికట్టిన అంటు (Gooty).

**గుత్సము** సం. వి. 1. ముప్పదిరెండు మణులు గ్రుచ్చినహారము. 2. కంబము. 3. పరి మొ. ని దుబ్బు 4. పూగుత్తి,

**గుదప్రక్షేపములు** సం. వి. (జం.) కీటకముల జనన రంధ్రముచుట్టునుగల కైటిన్ ప్రవర్ధములు. ఉదా. బొద్దింక(Gonapophyses)

**గుదము** సం. వి. మూడి (ముడ్డి), పాయువు. (జం.) అన్నవాహిక చివర నుండు ద్వారము (Anus).

**గుది** వి. 1. ఆకులు మొ.ని గ్రుచ్చిన సరము. 2. చీలమండ, ఈటిచెట్టు మొ.ని ఎక్కుటకు కాళ్ళకు తగిలించికొను బంధము.

**గుదిగఱ్ఱ** వి. పోట్లావు మొ.గు వానికి మెడను గట్టెడు కొయ్య.

**గుదిగొను** క్రి. 1. అతిశయించు. 2. దట్టమగు. 3. మూటకట్టుగా కూలబడు. 4. తడబడు.

**గుదిత్రాడు** వి. దూడకాలికి గట్టుత్రాడు, బంధము.

**గుదియ** వై. వి. 1. ఇనుపగద. 2. నాలుగు మూరలదండము, (యమ) దండము. 3. గుదిగఱ్ఱ, రూ. గుదె. సం. గదా.

**గుదియతాలుపు** వి. యముడు, దండధరుడు.

**గుదివడు** (గుది+పడు) క్రి. కట్టుపడు, స్తబ్ధమగు.

**గుద్దు** వి. (వ్యావ.) పిడికిటిపోటు. క్రి. పిడికిటి కొట్టు. రూ. గ్రుద్దు

**గునపము** వి. త్రవ్వుట కుపయోగించు ఇనుపకడ్డీ. (వ్యవ.) గడ్డపార (Crowbar).

**గున్న** వై. వి. 1. పిల్ల. 2 ఏనుగు మొ ని పిల్ల 3 గుబురుగా పెరిగిన లేతమొక్క, ఉదా. మామిడిగున్న. సం. కుణకః.

**గుప్తము** సం. వి. 1. దాచబడినది. 2. కావబడినది.

**గుప్తాహారము** సం. వి. (వ్యవ.) వెంటనే నీటిలో కరిగి మొక్కలవేళ్లు తీసికొనజాలు స్థితిలో నుండక క్రమముగా నట్లగుటకు తగియుండు నేలయందలి ఆహారము (Available plant food).

**గుప్తి** సం. వి. 1. కాపాడుట, 2. చెఃసాల. 3. వడ్లపాతర. 4. దాచుట. 5. గోయి త్రవ్వుట.

**గుప్తోష్ణత** సం. వి. (భౌతి.) ఒక వస్తువును వేడి చేసినప్పుడు దాని తాపక్రమమందు మార్పు చూపకుండ వస్తువునకు చేరిన వేడి, ఉదా. మంచుగడ్డను వేడిచేసిన అది యంతయు నీరగువరకు తాపక్రమములో మార్పు అగుపడదు (Latent heat).

**గుప్పళించు** క్రి. 1. వస్త్రము మొ.ని ఉసుము, 2. పుట్టించు, 3. పుక్కిలించు. 4. అతిశయించు.

**గుప్పించు** క్రి. 1. (అధికముగా) ఇచ్చు. 2. బాణాదులను (అధికముగా) ప్రయోగించు. 3. కురియు.

**గుప్పు** క్రి. 1. ఎక్కువగా ఉంచు, పెట్టు. 2. దూడ తల్లిపాదుగును పొడుచు. 3. విసరివైచు. ప్రయోగించు. మా.గుప్పించు.

వి. వాసనగొట్టుట. ధ్రమోయుట మొ. నియం దగు అనుకరణము.

గుప్పున క్రి. విణ, 1. శీఘ్రముగా. 2. అక స్మికముగా.

గుబాళించు క్రి. సువాసనగొట్టు. ఎక్కు వగా పరిమళించు.

గుబిలి వి. 1. చెవిలోనిమురికి. 2. పైడికంటి. మేలుకీళ్ళను సూచించు ఒకానొకపక్షి.

గుబురు వి. 1. దట్టము, 2. గుంపు. రూ. గుమురు.

గుబులు వి. 1. వెరపు. 2. గుప్పని కొట్టు వాసన. 3. పిచ్చి. 4. ఉడుకు.

గుబులుకొను క్రి. వాసన గుప్పున కొట్టు, పరిమళించు.

గుబుసు వి కపటము, మోసము,

గుబ్బ వై. వి. 1. కుచము. 2. బుడిసి. 3. గొడుగుమీది పొన్ను. 4. పర్వతము. 5. తలుపు గంద వస్త్రైలమీద అమర్చిన లోహము ముద్ద. విణ. గుండ్రనిది. సం. కుంభః.

గుబ్బకాయ వి. పీణకమర్చు సొరకాయ.

గుబ్బటిలు క్రి. 1. అతిశయించు. 2, ఉప్పొంగు. 3. తిరుగుపడు. 4, పరిత పించు. రూ. గుబ్బటిల్లు.

గుబ్బతిలు క్రి. 1. అతిశయించు 4. ఉప్పొంగు, 3. పరితపించు. 4. మండు. రూ. గుబ్బతిల్లు.

గుబ్బతిల్లు క్రి. చూ. పై.

గుబ్బలాఁడి వి. యువతి. రూ. గుబ్బెత.

గుబ్బలి వి, పర్వతము.

గుబ్బదొర వి. హిమవంతము.

గుబ్బలివిలుకాఁడు వి. శివుడు.

గుబ్బెత వి. చూ. గుబ్బలాఁడి.

గుమాను హిం. వి. అనుమానము.

గుమాస్తా హిం. వి. 1. లెక్కలు వ్రాయు వాడు. 2. ప్రభుత్వకార్యాలయములలో చిన్నతరగతి ఉద్యోగి.

గుమి వి. 1. గుంపు. 2. గుది. 3. మడుగు. 4. పొద.

గుమురు విణ చూ. గుబురు.

గుమ్మ వి. 1, పాలు పిండునపుడు వచ్చు ధార (గుమ్మపాలు). 2. స్త్రీ. (త.) కుమ్మలి = స్త్రీ. 3. గాడె.

గుమ్మఁడు విణ. అలంకరించుకొనువాడు. సొగసుకాడు.

గుమ్మటము వి. 1. దీప ముంచెడు కాగి తపు గూడు. 2 బెలూన్.

గుమ్మడి వై. వి. పెద్దపెద్దకాయలు కాయు తీగ. సం. కూశ్మా(ష్మా)ండః.

గుమ్మపాలు వి. అప్పుడు పిదికినపాలు, ఉష్ణధార అని వాడుక.

గుమ్ము వి. 1 పిడికటిపోటు. 2. పరిమ ళించుట. తిరుగుట మొ.ని యం దగు అను కరణము. 3. గాడె.

గుమ్మెట వి. 1. కుంభవాద్యము. 2. తుడుము. రూ. గుమ్మెత.

గురిగి వి. చిన్నపిడత.

గురిగింజ వి. గురిజపూస.

గురిజ వై. వి. గురిగింజ, గురివెంద. సం. గుంజా.

గురుఁడు సం. వి, గురువు. బృహస్పతి. (Jupiter).

గురుకోణ త్రిభుజము సం. వి. (గణి.) ఒక కోణము గురు కోణముగా గల త్రిభుజము (Obtuse angled triangle).

గురుకోణము సం. వి. (గణి.) సమకోణము కన్న పెద్దదియగు కోణము (Obtuse angle).

గురుచాపరేఖ సం. వి. (గణి.) అర్ధవృత్తము కన్న పెద్దదియగుచాపరేఖ(Major arc).

గురుజు వి. (వ్యావ.) తిరుగలికి కొట్టు కొయ్య.

**గురుధాతువు** సం. వి. (రసా.) సాంద్రత ఎక్కువగా నున్నధాతువు. ఉదా. బంగారము. అస్మిమియమ్ (Heavy metal).

**గురుత్వకేంద్రము** సం. వి. (భౌతి) ఒక వస్తువు శరీరములో ఏ బిందువుపై దాని భారము పనిచేయు నని పరిగణించబడునో ఆ బిందువు (Centre of gravity) (గణి.) త్రిభుజమునందలి మధ్యగత రేఖలు ఖండించుకొను బిందువు, మధ్యగతరేఖల అనుషక్త బిందువు (Centroid of a triangle).

**గురుత్వ జనితత్వరణము** సం. వి. (భౌతి. గణి.) భూమ్యాకర్షణ బలముచే ఏర్పడిన త్వరణము (Acceleration due to gravity)

**గురుత్వ నియమము** సం వి. (భౌతి.) రెండు భౌతిక వస్తువులమధ్య నుండు ఆకర్షణ బలము వాని ద్రవ్య సంచయ గుణన ఫలమునకు అనులోమముగను వానిమధ్య దూర వర్గమునకు విలోమముగను మారుచుండును అను నియమము (Law of gravitation).

**గురుత్వము** సం. వి. గౌరవము, గురు భావము. (భౌతి.) భూమ్యాకర్షణశక్తి (Gravity), మనము నివసించు భూమిపై నున్న వస్తువులకు, భూమికి మధ్య గల ఆకర్షణ (Gravity). దానినే మనము భారము అందుము.

**గురునానక్** వి. (చరి.) గురునానక్ (క్రీ. శ. 1469-1538) సిక్కు ధర్మ స్థాపకుడు. పంజాబు రాష్ట్రమందలి తాల్ వండీ గ్రామములో (లాహోరు నగరమువద్ద) జన్మించెను. తుర్కి ఆఫ్ఘన్ సుల్తానులు భారత దేశమును పాలించుచున్నప్పుడు ఉపనిషత్తులు బోధించిన అద్వైత సిద్ధాంతములను ఆధారముగ తీసికొని హిందూ ధర్మ సంస్కరణము చేసి, హిందూ-ఇస్లామ్ ధర్మముల మధ్య సఖ్యత నెలకొల్పు ఉద్దేశముతో ఇస్లామ్ మత సూత్రములు కూడ కొన్ని గ్రహించి.మతసహనము చాటుచు సిక్కు ధర్మమును బోధించెను. (సిక్కుల పవిత్ర గ్రంథమును 'ఆది గ్రంథము' అని పిలుతురు. వీరు విగ్రహారాధనమును కుల భేదములను అంగీకరించరు)

**గురువు** సం. వి. ఉపాధ్యాయుడు 2. కులము పెద్ద. 3. తండ్రి. 4 తండ్రితో బుట్టినవాడు. 5, తాత. 6. అన్న. 7. మామ. 8. మేనమామ. 9. రాజు 10. కాపాడువాడు. చూ. గురుడు.

**గురుపులువాఱు** క్రి (గురువులు+పాఱు) 1. అతిశయించు. 2. వేగముగా పరుగెత్తు. 3. ఉప్పొంగు.

**గురుసు** వి. 1. మార్గము అయువుపట్టు. 2. మేర. 3. కుదురు. మూలము 4. ఒక రకమైన పశురోగము. 5 తిరుగలి త్రిప్పుటకు ఆధారమగు కొయ్య.

**గుర్వి** సం వి. గర్భిణి.

**గుఱక** వి. నిద్రయందలి ధ్వని. గుఱ్ఱు

**గుఱి** వి. 1. లక్ష్యము. 2 గుర్తు 3. నిదర్శనము. 4. నమ్మిక. 4. సాక్షి. 6. నిర్ణయము. 7. యుక్తి. 8 పరిమితి, 9. కళంకము,

**గుఱుతించు** క్రి. ఆనవాలుపట్టు.

**గుఱుతు** వి. 1. చిహ్నము. 2. మేర. 3. కీర్తి. 4. పరిమితి. 5. స్థానము 6.విధము. 7. మచ్చ. 8. సాక్షి. చూ. గుర్తు.

**గుఱుములు** వి. గింజలు.

**గుఱ్ఱము** వి. అశ్వము.

**గుల** వి. దురద.

**గులక** వై. వి. సన్నని రాయి. సం. గుడికా గుళికా.

గులకరములు వి. మొలకలు.

గులకరించు క్రి. 1. కలుగు, అంకురించు. 2. ధ్వనిచేయు, 3. రమ్యమగు. 4.కలియపెట్టు 5. బయలుపరచు.

గులాబీ వర్ణపు పీకపురుగు వి. (వ్యావ.) ఇది పరువురెక్క పురుగుల తరగతిలోని కీటకము. (దీని డింభము చోడు, గోధుమ, చెరకు మొ. మొక్కలకాండములోనికి తొలుచుకొనిపోయి వాని మొవ్వులను జంపును) (Sesamin inferens).

గుల్మము వి. గుల్మరోగము. (ప్లీహము పెద్దదగు రోగము). 2. ప్లీహము ఎడమ ప్రక్కనుండు పచ్చని మాంస ఖండము. 3. పొద. 4. బోదెలేనిచెట్టు. 5. పురాభిముఖ రాజ మార్గము. 6. 9 ఏనుగులు, 27 గుఱ్ఱములు, 45 పదాతులు, 9 రథములు గల సేన, 7. పల్లెయందలితానా.

గుల్మ్ముడు నం. వి. సైనికుడు (గుల్మము=సేన-అందుండు వాడు.)

గుల్ల వై. వి. 1. నత్తగుల్ల, 2. బొబ్బ. విశే. 1. అల్పము. 2. బోలు. (గుల్ల కడియము.) నం. తుల్లః.

గుల్లకాఁడు విశే. ఏమియు లేనివాడు, వ్యర్థుడు.

గుల్లపడు క్రి. అవమానపడు, భంగపడు.

గువ్వ వి. 1. అడవిపావురము. 2. పక్షి.

గువ్వకరిగొను క్రి. 1. చుట్టుకొను. 2. విజృంభించు.

గుహ నం.వి. 1. కొండబిలము, 2. పల్లము. 3. దాగుట. 4. హృదయము. 5. బుద్ధి.

గుహాశయము నం. వి. 1. పరమాత్మ. 2. సింహము మొ.వి విశే.గుహయందుండునది

గుహుఁడు నం. వి. కుమారస్వామి. వ్యు. దేవసేవలను పొదివి రక్షించువాడు. 2. ఒక నిషాదరాజు.

గుహ్యకుఁడు నం. వి. గుహ్యక జాతివాడు. యక్షులలో నొగతెగవాడు.

గుహ్యకేశ్వరుఁడు నం. వి. కుబేరుడు.

గుహ్యము నం.వి. 1. ఏకాంతము. 2. పురీష మార్గము, 3. వంచన. 4. తాబేలు. విశే. దాచదగినది.

గుళిక నం. వి. ఉండ, మాత్ర. (రసగుళిక).

గుళుచ్ఛము నం.వి. 1. గుత్తి. 2. పూగుత్తి.

# గూ

గూండ్ర వి. 1. గుడ్లగూబకూత. 2. కడుపులో కలుగు వికారము.

గూఁటి వై. వి. పంది. నం. ఘృష్టిః.

గూఁడు వి. 1. కులాయము. 2. పంజరము. 3. గోడలో దీపముంచుటకు ఏర్పరచిన చోటు. 4.ఆకుగుడిసె. 5. చాపమొ.నితో కట్టిన బండిపైకప్పు. బహు. గూండ్లు. గూడులు.

గూఁడుకానుపు వి. పక్షి, నీడోద్భవము.

గూటము వై.వి. 1. గుంజ. 2. డేరామేకు, 3, వడ్రంగి మొ, వారు. ఉపయోగించెడు పనిముట్టు.రూ. గూటాము. నం. కూటః.

గూడ వి. 1. వానకు తడియకుండ తలపై వేసికొను (జమ్ము, తాటాకుతో అల్లిన) గొడుగు. 2, పల్లము నుండి మెరకకు నీరుతోడెడి సాధనము (శంఖ్వాకారముగ వెదురుబద్దలతో అల్లబడినది (Suring basket) 3. పూలబుట్ట. 4. దొప్ప. 5, వైష్ణవులు తిరుమణిపెట్టె మొ.వి ఉంచికొను తాటాకులబుట్ట, తిరుపగూడ.


గూడ

**గూడెము** వి. 1 కొండ ప్రాంతమందలి బోయపల్లె. 2. చిన్న గ్రామము. ఉదా. గొల్ల గూడెము మొ. వి రూ, గోడెము.

**గూఢచారి** నం. విణ, వేగులవాడు, ఇతర దేశముల రహస్యములను తెలిసికొనుటకు నియమింపబడినవాడు.

**గూఢపథము** నం. వి. 1. అంతఃకరణము, హృదయము. 2. రహస్య మార్గము.

**గూఢపాత్తు** నం. వి. పర్వము. వ్యు. కానరాని పాదములు కలది.

**గూఢపురుషుఁడు** నం. వి. వేగులవాడు. గూఢచారుడు.

**గూఢము** నం. విణ. 1. రహస్యమైనది. 2. దాచబడినది.

**గూన** వి. పెద్దకుండ.

**గూనివాఁడు** విణ. కుబ్జుడు.

**గూను** వి. నడుము మీది వంపు, నడ్డి.

**గూబ[1]** వై. వి. చెవిగూబ. కర్ణమూలము.

**గూబ[2]** వై. వి. గుడ్లగూబ. నం. ఘూకః.

**గూబరి** వి. మాదిగవాడు.

**గూహనము** నం. వి దాచుట.

# గృ

**గృత్స్నుఁడు** నం. వి. మన్మథుడు.

**గృధ్రము** నం. వి. గ్రద్ద.

**గృహదేవత** నం. వి. ఇష్టదేవత, కులదేవత.

**గృహనిర్వహణ** నం. వి. (గృహ.) ఇంటిని చక్కబెట్టుట (House keeping).

**గృహపీడకములు** నం. వి. (గృహ.)ఇంటిలో బాధించు కీటకములు మొ. వి. ఉదా. ఎలుకలు. బొద్దింకలు, పెంకిపురుగులు మొ.వి (Household pests).

**గృహమణి** నం. వి. దీపము.

**గృహము** నం. వి. 1. ఇల్లు. 2. భార్య.

**గృహమేధి** నం. వి. గృహస్థు, వ్యు.భార్యతో చేరియుండువాడు.

**గృహస్థూణము** నం. వి. నిట్రాడు, ఇంటి నడిమి కంబము.

**గృహిణి** నం. వి. ఇల్లాలు, భార్య.

**గృహీతము** నం. విణ. 1. గ్రహింపబడినది. 2. స్వీకరింపబడినది. 3. తెలిసికొనబడినది. 4, ధరింపబడినది.

**గృహోపచారము** నం. వి. (గృహ.) రోగికి చేయు ఉపచారము, వైద్య విధానమునకు అంగముగ రోగికిగృహములో చేయు సేవ (Home-nursing).

**గృహోపవనములు** నం. వి. (వ్యవ.) ఇండ్ల ఆవరణలయందు పెంచుకొను చిన్న పూలతోటలు (House gardens).

**గృహ్య** నం. వి. శాఖానగరము, పేట.

**గృహ్యకము** నం. వి. 1. పెంపుడుమృగము. 2. పక్షి. విణ. పరాధీనము.

**గృహ్యము** నం. వి. 1. పెంపుడుమృగము. 2.పక్షి. 3.ఇంటియందలి అగ్నిహోత్రము. 4, స్మార్తకర్మ విధానమును తెలుపు ఒకానొక గ్రంథము. విణ. 1. ధరింపదగినది. 2, పట్టుకొనదగినది. 3. స్వాధీనము. 4. అంగీకరింపదగినది. 5. తెలిసికొనదగినది.

# గె

**గెంటనము** వి. కష్టెవిరుపుమాట, పరుష వచనము. విణ, తీక్ష్ణము, వాడియైనది.

**గెంటించు** క్రి. 1. చలింపచేయ. 2. బయటికి నెట్టించు. 3. పాడుచేయు. 4.కొట్టు

**గెంటు** క్రి. 1 తొలగు, చలించు. 2. చెడు 3. తప్పిపోవు.4. వెనుదీయు. 5.త్రోయు

6. (అప్పు మొ. వి) తీర్చు. 7.(అస్త్రము మొ.వి) ప్రయోగించు. వి. చలనము.

గెంటెము వి. జంటనేతవస్త్రము. విణ. దట్టము. అధికము.

గెడ[1] వి. 1. జత. 2. దగ్గర. 3. పోలిక. పగిది. 4, వేటకు తగిన సాధనము.

గెడ[2] వై.వి.వెదురు. చెరకు,మొ.నికాండము. రూ. గడ. సం- కాండః.

గెడగూడు క్రి. 1. జతగాడు. 2.వెన్నంటు.

గెనయు క్రి. 1. పుష్టియగు. 2. వర్ధిల్లు.

గెనసు వి. చిలగడదుంప. రూ. గెనుసు.

గెబ్బు[1] క్రి. 1. అపహరించు. 2,గ్రహించు 4. గెంటు. 4. చంపు.

గెబ్బు[2] వై.వి, పొగరు, కావరము, తిమురు. సం. గర్వః.

గెయిపర్లు ఇం. వి. (భూగో.) (Geysers). 1. న్యూజిలాండులోని వేడినీటిబుగ్గలు.2, వేడినీటిని అందించు విద్యుచ్ఛక్తి పరికరము.

గెల వి. పండ్లుకాయలు మొ.ని గుత్తి, ఉదా. అరటిగెల రూ. గొల.

గెలవిడి వి. 1. సంతోషము, 2. ఉత్సాహము. రూ. గెలివి.

గెలుచు క్రి. 1. పోవు. 2. జయమును పొందు. 3. జయించు, గుచ్చు.

గెలుపుపేరుగలఁవాడు వి. పార్థుడు, అర్జునుడు, విజయు డను పేరుగలవాడు.

గెల్లి వి. ఉప్పుకుప్ప.

గెల్లు వి, కలకలము. రూ. గొల్లు.

గెల్లువడు క్రి. 1. రంకెవేయు. 2. విజృంభించు.

# గే

గేందుకము సం. వి. చెండు. బంతి. రూ. గేండుకము.

గేదఁగి వై. వి. 1. 1. పచ్చపూమొగలి. 2. మొగలిపూవు. సం. కేతకీ.

గేదె వి. బఱ్ఱె. ఎనుము.

గేదెచెలప వి. మూడేండ్ల యెనుపదూడ.

గేయము సం. వి. పాట. విణ. పాడతగినది.

గేలి వై. వి. పరిహాసము. సంకేళి.

గేష్ణువు సం. వి. 1, నటుడు. 2. గాయకుడు. విణ. పాడెడివాడు (అనికొందఱు.)

గేస్తు వై. వి. 1. ఇంటి యజమాని. 2.సోమయాజి. 3. భర్త. సం. గృహస్థః.

గేహము సం. వి. గృహము. ఇల్లు.

గేహళి సం. వి. గడప. రూ. దేహళి.

గేహేశూరన్యాయము సం. న్యా. ఇంటిలో డంబములు కొట్టువాడే కాని పనికిరాని వా డనుట.

గేహేశూరుఁడు సం. వి. ఇంటిలోనే డంబములు కొట్టువాడు, పిరికివాడు.

# గై

గైరికము సం. వి. 1. జేగురురాయి. 2. బంగారు. 3.గైరికధాతువు. 4. ఒకరకపు పర్వత ధాతువు.

గైరికుఁడు సం. వి. 1, కిరాతుడు. 2. గిరిజనుడు.

గైరేయము సం. వి. 1. శిలాజిత్తు.2. జేగురురాయి.

# గొ

గొంగ వి శత్రువు.
గొంగడి వి. 1. కంబళి. 2. ఒకానొక పక్షి. రూ. గొంగళి.
గొంగళి పురుగు వి. కంబళి పురుగు. (వ్యావ కీట.) శరీరముపై రోమములు గొంగళిపురుగు కల కీటక డింభము (Hairy caterpillar)
గొంజ వి. 1. గొ్రడాలు. 2. గొడ్డుటావు.
గొంటరి విణ. 1. కుత్సితుడు. 2. కఠినుడు. 3. దిట్ట.
గొంటు[1] విణ. 1. దుష్టుడు. 2. వంచకుడు. 3. క్రూరుడు. 4. దిట్ట. సం. కుంఠః.
గొంటు[2] వై. వి. మొద్దుపక్క, బందనలేని పక్క. సం. ఘోంటా.
గొండిలి వై, వి. 1.కుండలాకారనృత్యము. 2. ఆట. 3. నర్తకి. సం. క్రీడా. రూ. గొండ్లి.
గొంతెము వి తలుపు చిలుకు.రూ, గొెళ్ళెము, గొండ్లెము.
గొండోలా ఇం. వి. (Gondola) వెనీస్ నగరములో నీటి కాలవలందు ఉపయోగించు చిన్నపడవ.
గొంతి వై. వి. పాండురాజు పెద్దభార్య. సం. కుంతీ.
గొంతు వై. వి. కుత్తుక. 2. కంఠధ్వని. రూ. గొంతుక. సం. కంఠః.
గొంతెమ్మ కోర్కెలు వి. అలభ్యపు కోరికలు కోందగనికోర్కెలు.
గొంతెమ్మ వి. (వ్యావ.) ఒకానొక గ్రామ దేవర. రూ. గొంతెమ.
గొంది వి. 1. మూల. 2. కొండ యొక్క చిన్నమరుగుచోటు. 3. చిన్నసందు. 4. స్థానము.

గొగ్గి విణ. 1. ఎచ్చుతక్కువైనది. వి. 1. ఎచ్చుతగ్గులుగా నుండుట, 2,శిరస్త్రాణము. 3. ఎచ్చుతగ్గులుగల ముత్తెము.
గొజ్జంగినీరు వై. వి. పన్నీరు రూ. గొజ్జెఁగనీరు. గొజ్జఁగినీరు, గొజ్జగనీరు.
గొజ్జెఁగ వై. వి. 1. రేకులచేమంతి. 2. పసపు పూల మొగిలి. 3 పన్నీరు పూమొక్క. రూ. గొజ్జంగ. గొజ్జెఁగ. గొజ్జంగి. సం. కుబ్జకః.
గొజ్జెంగ వై. వి. చూ. పై.
గొట్టపునూయి వి. (వ్యావ.) నేలలో నీరుగల యిసుక పొరవరకును లోతుగా గొట్టమును దింపి నీరు పైకి తెచ్చు ఏర్పాటు గల నూయి (Tube well).
గొట్టము వి. క్రో వి. (భౌతి.) ఒక చోట నుండి మరియొక చోటికి, ద్రవ్యములను గాని, వాయువులనుగాని, కొనిపోవు పరికరము (Tube).
గొట్టు[1] వై. విణ.1. కఠినము. 2.దుర్లభము. 3. భయంకరము. 4. విరోధి. వి. 1. దౌష్ట్యము. 2. అల్లరి. 3. గాలి. సం. కటుః.
గొట్టు[2] ప్రత్య. తాచ్ఛీల్యాద్యర్థమున వచ్చు ప్రత్యయము. ఉదా. (తాచ్ఛీల్యమున) గొడవగొట్టు, (స్వార్థమున) పిసినిగొట్టు.
గొడఁగు క్రి. 1. మాట వినబడకుండగొణగు. 2. కసరు. 3, (పావురములు) కూయు.
గొడగ వై. వి. పిడికోలలేనినాగలి.సం.కూటకమ్.
గొడగర వి, మాదిగజాతి.
గొడగరి వి. మాదిగవాడు. రూ. గొడారి.
గొడవ వి. 1. ఆపద. 2, తప్పు 3. కలత. 4.అడ్డు. 5.దుఃఖము. 6.జోలి,సంబంధము,
గొడారి వి. చూ. గొడగరి.

గొడిగ వై. వి. గులకరాయి. సం. గుడికా. గుళికా.
గొడుగు వి. ఎండవానల కడ్డము పెట్టుకొను సాధనము, ఆతపత్రము ఛత్రము.
గొడ్డంబలి వి. నూకలులేనిగంజి.
గొడ్డగము వై.విశ. బాధకము. సం. కుట్టకమ్.
గొడ్డలి వై.వి. చెట్లునరకు సాధనము, కురారము (వ్యావ.) పెద్దచెట్లను వానిశాఖలను నరకుట కుపయోగించు ఇనుప పనిముట్టు సం. కుఠారః.
గొడ్డు వి. 1. ఈనని పశువు. 2. గొడ్రాలు విశ. శూన్యము.
గొడ్డుఁబోతు విశ. 1. నిష్ప్రయోజకుడు. 2. సంతతి లేనివాడు. 3. కాపులేనిచెట్టు.
గొడ్డుక్రొవ్వు వి. (రసా.) గొజ్జెల, ఎద్దుల క్రొవ్వు (Fallow.)
గొడ్డుచెట్టు వి. ఫలించని వృక్షము.
గొడ్డుపోవు క్రి. 1. ఫలశూన్యమగు. 2. పౌరుషహీనుడగు. 3, వ్యర్థమగు. 4. ఉత్పత్తిలేనిదగు.
గొడ్డేఱు వి. 1. నీరులేనిపరు 2. ఒక అడవి చెట్టు. క్రి. గుత్తకు తీసికొను. విశ. వ్యర్థము.
గొణిద వి. తలుపు బిగించుటకై పర్పరచినచీల
గొద[1] వై.వి. ఆకలి. క్షుత్తు. సం. క్షుధా.
గొద[2] వి. అతిశయము, త్వర.
గొదగొను[1] వై. క్రి. ఆకలిగొను.
గొదగొను[2] క్రి. 1. అతిశయించు, 2. త్వరపడు. 3. తాల్చు.
గొనకొను క్రి. 1. యత్నించు. 2. సమ్మతించు. 3. అతిశయించు, 4. కలకొను. 5. తటస్థించు.
గొనప వి. అరిగిననాగలి, విశ. పొట్టివాడు. వామనుడు.
గొనబు వై. వి. మనోజ్ఞత. విశ. 1. మంజులము. 2. మధురము. 3. శ్రావ్యము. 4. పరిమళించు. సం. గుణః.
గొనబుకాఁడు విశ. అందగాడు. సుందరుడు.
గొనము వై. వి. 1. సౌశీల్యాది గుణము 2. వింటివారి. సం. గుణః.
గొనయము వై.వి. 1. వింటినారి. 2. వింటికొప్పు. సం. గుణః.
గొప్ప విశ. అధికము. పెద్దది.
గొప్పులు వి. 1. వరిమడిలోని చిన్న మెరక స్థలములు. 2. మిరపతోట మొ.ని.యందు కొంచెము యెత్తుగా నుండెడిచోట్లు.
గొల వై. వి. 1. గొంది. 2. బిలము. 3. మూల. సం. గుహా
గొబ్బండు వి. (గొప్ప+పండు) పెద్దపండు.
గొబ్బరము వి. ఎరువు.
గొబ్బి వి.1 ధనుర్మాసమునబాలికలుచేతులు చరచుచు గుండ్రముగా తిరుగుచు పాటలు పాడువేడుక. 2. ఇక్షురకము. గొలిమిడి. మొగబీర.
గొబ్బిళ్లు వి. 1. గొబ్బి. 2. నమస్కార భేదము. 3. బాలక్రీడ. 4. గొబ్బిపాట.
గొబ్బున అవ్య. శీఘ్రముగా, రూ. గొబ్బన.
గొయ్యి వి. పల్లము. రూ. గోయి.
గొరక వై. వి. 1. ఇనుపబాణము. 2. చిన్న యీటె. 3. ఒకజాతిమృగము. విశ. 1. గరుకు. 2. బిరుసు. సం. ఖురాకః. ఖురాలకః. ఖురకః.
గొరిజ వై. వి. పశువుకాలిగిట్ట. సం. ఖురః.
గొరిల్లా ఇం. వి. (Gorilla) మానవాకారమును పోలిన పెద్దకోతి.
గొరిల్లాయుద్ధము వి. (వరి.) చాటుమాటు యుద్ధము, అకస్మాత్తుగ గుంపులు గుంపులుగ శత్రువులపై యుద్ధముచేసి నిష్క్రమించుట (Guer(r)illa war).
గొంటు వై. విశ. 1. నీచుడు, దుర్మార్గుడు, సం. క్షుల్లకః

**గొఱపము** వై. వి. 1. గుఱ్ఱమును తోమెడు సాధనము. సం. కురపః. 2. అర్ధ చంద్రాకార బాణము. సం. క్షురప్రః.

**గొఱుగు** క్రి. క్షౌరముచేయు.

**గొఱ్ఱియ** వై. వి. గొఱ్ఱె. సం. కురరః. కురరీ.

**గొఱ్ఱు** వి. (వ్య.) 1. విత్తులను వరుసలలో వేయుట కుపయోగించుపనిముట్టు, (Seed drill), 2 ముప్పది రెండు కుంటల కొలది.



గొఱ్ఱు

**గొల** వై. వి. గెల. సం. గుళుచ్ఛః.

**గొలక** వై. వి. కలకలము.

**గొలుసు** వి. 1. మెడను వ్రేలాడు నగ. 2. ఏనుగకాలికి కట్టెడు సంకెల. 3. సంకెల.

**గొలుసుకుట్టు** వి. (గృహ) గొలుసు ఆకారము గల కుట్టు (Chain stitch).



గొలుసుకుట్టు

**గొలుసుపంపు** వి. (వ్యావ.) ఒక విధమైన నీటి పంపు. (దీని భాగములలో ఒక గొట్టము, దానిలో నిముడు ఇనుప బిళ్ళలుగల గొలుసు ముఖ్యమైనవి) (Chain pump)

**గొలుసుమోడి** వి. కలిపి వ్రాసిన వ్రాత (గొలుసుకట్టు వ్రాత).

**గొల్ల**[1] వై. వి. 1. గొల్లజాతి. 2. పాడి పసరముల మేపి పాలమ్మి జీవించు జాతి. సం. గోపాలః.

**గొల్ల**[2] వి. 1. ద్వారపాలకుడు. 2, కోశాగారమును కాపాడువాడు.

**గొల్లభామ** వి. 1. గొల్లజాతికి చెందిన స్త్రీ 1.(వ్యావ. కీట) సన్నగా నుండు మిడుత కుటుంబములోని పురుగు. (కొన్ని గొల్లభామలు ఇతర కీటకములనుదినుచుండును) (Mantis).

**గొల్లము** వై. వి. 1. లోతైనస్థలము. 2. నీళ్ళగుంట, సం, ఖల్లః.

**గొల్లెన** వి. ఒకరకపు గుడారము. రూ. గొల్లియన.

**గొవరు** వి. తాపము, ఉడుకు.

**గొహారు** వి. 1. ఉపద్రవము. 2. తాపము 3. పెద్దమోత.

**గొళ్లెము** వి. (వ్యావ.) తలుపు చిలుకు. రూ. గొండెము.

## గో

**గోండుడు** సం. వి. పామర జాతివాడు. విశే. వృషభముయొక్క అండమువంటి బొడ్డు గలవాడు.

**గోండ్రించు** క్రి. పులి మొ.ని బొబ్బరించు.

**గోండ్రు కప్పలు** వి. గోదురు కప్ప.

**గోకు** క్రి. గీకు, గీరు.

**గోకుడు** వి. పాలు కాచినపుడు అడుగున తేలు సత్వము, మడ్డి.

**గోకుడుపాలు** వి. దోకుడుపాలు, కసవు చెక్కుపాలు.

**గోగు** వి. కర్ణికారము. (దీనియాకులు కూరగను, పై పట్టనారగను ఉపయోగపడును. ఇది ఊరగోగు, కొండగోగు అని ద్వివిధము.)

**గోచి** వై. వి. కచ్చడము, కాపీనము. సం. కచ్ఛః.

గోఁచికట్టు వి. బ్రహ్మచారి.

గోఁచితాఁడు విశే. నిర్ధనుడు. (గోచిపాతరాయడు అని వాడుక). వి. బ్రహ్మచారి.

గోఁజు క్రి. పీడించి యడుగు. వి. పీడ, బాధ.

గోఁటు వి. 1. కోరికయంచున చేర్చికుట్టెడు సన్నని సరిగపట్టె. 2. చేతినగ. 3, ఒయ్యారము.

గోఁటుకత్తె విశే. ఒయ్యారము గలది.

గోఁటుకాఁడు విశే. ఒయ్యారము గలవాడు.

గోఁదు వి. జిగురు, బంక (తుమ్మగోఁదు=తుమ్మబంక). హిం. గోంద్.

గోఁదురు వి. పెద్దకప్ప.

గోకర్ణము సం. వి. 1. కడితిమృగము. 2. పాము. 3. కంచర గాడిద. 4. ఆవు చెవి యాకారము గల పాత్రము. 5. దక్షిణదేశమందలి ఒక శివక్షేత్రము.

గోచారము సం. వి. సూర్యాదిగ్రహముల సంచారము.

గోటాపన వై. వి. 1. పక్షియాక 2 ఘోష. ఘోషించుట.

గోడ వై. వి. 1. భిత్తి. సం. కుడ్యమ్. 2. గుఱ్ఱము. రూ. గోడా, సం. ఘోటః

గోడాడు క్రి. దుఃఖించు, విలపించు.

గోడిగ వై. వి. ఆడు గుఱ్ఱము. సం ఘోటికా.

గోడు పట్టె వి. (వ్యావ.) దున్నిననేఃలో గాని, దమ్ము చేసిన నేలలో గాని మెఃక నుండి పల్లమునకు మట్టిని లాగి వేయుటకు ఉపయోగించు పనిముట్టు (Levelling board.)

గోణము వై. వి. గోచి, కౌపీనము. రూ. గోణాము. సం. కౌపీనమ్.

గోణాము వై. వి. చూ. పై.

గోణి[1] వై. వి. ఎద్దు. సం. గోణీః.

గోణి[2] సం. వి పెద్దగోతము. వి. గోనె.

గోతము వి. 1. జనుపనారసంచి. 2. ఒకానొక మల్లసాధనము. రూ. గోతాము.

గోత్రము సం. వి. 1. వంశము. 2. పేరు. 3. కొండ.

గోత్రుఁడు సం.విశే. 1. గోవుల కాచువాడు. 3. భూమిని రక్షించువాడు.

గోద[1] సం. వి. 1. విష్ణుచిత్తుని పుత్త్రిక. గోదాదేవి. 2. గోదావరి,

గోద[2] వి, ఎద్దు, వృషభము. (వ్యావ.) గొడ్డుగోద.

గోదా హిం. వి. కుస్తీచేయు ప్రదేశము.

గోదారి వి. 1. వెన్న కాచినమడ్డి, 2. గోదావరి.

గోదావరి సం. వి. గౌతమీనది.

గోదుమ వై. వి. గోధుమ. ఒకరకపు ధాన్యము. సం. గోధూమః.

గోధ సం. వి. 1. ఉడుము. 2. అల్లెత్రాటి దెబ్బ తగులకుండ(ఉడుము తోలుతో చేసి) వ్రేలికి తొడుగుకొను కవచము.

గోనసము సం. వి. కొండచిలువ.

గోపతి సం. 1. ఆబోతు. 2. ఇంద్రుడు. 3. రాజు. 4. శివుడు. 5. సూర్యుడు.

గోపనము సం. వి. 1. దాటుట. 2. కాపాడుట. 3. గుప్తపరచుట, రహస్యము గానుంచుట, గూఢ పఱచుట. దాచిపెట్టు, మరుగుచేయుట (Concealment),

గోపాయితము సం. విశే. 1. రక్షితము. 2. దాపబడినది.

గోపాలుఁడు సం. వి. 1. గొల్ల. 2. శ్రీకృష్ణుడు. 3. రాజు. 4. శివుడు.

గోపి సం. వి. గొల్లది (గోపిక).

గోపీచందనము సం. వి. ఒకతెగ సుద్దమన్ను.

గోపుచ్ఛము సం. వి. 1. కోతి. 2. ఆవుతోక

**గోపుఁడు** సం. విశ. రక్షించువాడు. వి. 1. రాజు. 2. గొల్లవాడు. (చరి) మౌర్య కాలమునాటి గ్రామాధికారి. (అయిదింటి పైగాని,పదింటిపై గాని అధికారము కలిగి గ్రామములలోని భూముల ఆదాయ వ్యయములను, జనాభాను, దానవిక్రయ ముల జాబితాలను తయారుచేయుట, ప్రజల ఆర్థిక సాంఘికక్షపరిస్థితుల వివరము లను గ్రహించుట యాతని ముఖ్యకర్త వ్యము లై యుండెను.)

**గోపురము** సం.వి. 1. గవను, పురద్వారము, వాకిలి. 2. గాలిగోపురము. దేవాలయ ముఖమున ఎత్తుగా కట్టినద్వారము, (గణి.)సూచ్యగ్రస్తూపము (Pyramid).

**గోప్యము** సం. విశ. రక్షింపదగినది. (వ్యావ.) రహస్యమైనది.

**గోప్యుఁడు** సం. వి. 1. ఊడిగపువాడు. 2 దాసీపుత్త్రిడు. విశ. కావదగినవాడు.

**గోము** సం. వి. సౌకుమార్యము. 2. వికా సము. 3. గారాబము. 4. విధము 5 గౌరవము, 6. గర్వము. విశ. మృదు వైనది. 2, అందమైనది.

**గోముఖము** సం. వి. 1. అలుకుట. 2. ఒక వాద్యము. 3. వంకరగా కట్టిన యిల్లు. 4. ఆవుమొగము.

**గోమేధికము** సం. వి. పసుపుపచ్చని రంగు గల రత్నము. రూ. గోమేదకము, గోమే దము.

**గోర** వై. వి. గోరంకిపిట్ట. సం. గోరంకుః. గోరికా.

**గోరంకువు** సం. వి. 1. బట్టువాడు. 2. దిసమొలవాడు. 3. గోరువంక పిట్ట.

**గోరు** వై. వి. 1. నఖము. 2. ఒకానొక చోర సాధనము. విశ. అల్పము. సం. ఖురః.

**గోరుగల్లు** వి. గోళ్లు తీసెడి లోహపు సలాక.

**గోరుగాలము** వి. చేపలను పట్టు గాలము.

**గోరుచిక్కుఁడు** వి ఒక జాతి చిన్నచిక్కుఁడు ఒక శాకము.

**గోరుచుట్టు** వి. గోటికి చుట్టు లేచెడి పుంగు.

**గోరువెచ్చన** వి. గోరువట్టు వెచ్చదనము, కొంచెము వెచ్చన.

**గోరోచక** సం. వి. పసుల నాభియందుండు పసుపుపచ్చని వస్తువు. రూ. గోరోజనము.

**గోర్పడము** వై. వి. నల్లకంబళి. రూ. గోరు పడము. సం. కాలపటః.

**గోల** సం. వి. 1, వ్రటువయగు నీటికాగు. 2. గుండ్రని పదార్థము. 3. మణిశిల. 4. చెలికత్తె, 5 గోదావరినది. వి. 1.ముగ్ధ, ముగ్దుడు. 2. కలకలము.

**గోలాంగూలము** సం. వి. 1 కొండముచ్చు. 2. కోతి.

**గోలి**[1] సం. వి. ఉడుము.

**గోలి**[2] వై. వి. కొండముచ్చు. సం. గోలాం గూలమ్. (అని కొందరు).

**గోలీ** వై. వి. పిల్ల లాడుకొను గోలీకాయ. సం. గోలకః.

**గోవ** వి. 1. యౌవనము. 2. పురుష గవ యము, గురుపోతరి. 3. పశ్చిమ సముద్ర తీరమందలి యొక పట్టణము.

**గోవిందుఁడు** సం. వి. 1. శ్రీకృష్ణుడు. 2. బృహస్పతి. 3. శ్రీ శంకరాచార్యుల గురువు.

**గోవు** సం. వి, 1. ఆవు. 2. భూమి. 3. కిర ణము. 4. స్వర్గము. 5. సూర్యుడు.

**గోష్ఠము** సం. వి. ఆవులమంద యుండు చోటు, గొట్టము.

**గోష్ఠి** సం. వి. 1. పరిషత్తు సభ. 2. ఇష్టా గోష్ఠి

**గోష్పదము** సం. వి.1.ఆవుడెక్క. 2. గోవులు తిరిగెడిచోటు. 3. గోవుపాదమంతచోటు

గోనన వై. వి. 1. చాటించుట. 2. గోల కలకలము, సం. ఘోషణా.

గోస్తనము సం. వి. 1. నలుబది పేటలుగల హారము. 2. ఆవుచన్ను.

గోస్తని సం. వి. 1. ద్రాక్ష. 2. ఒకనది.

గోస్వామి సం.వి. 1. గోపాలుడు. 2. రాజ కుమారుడు. 3. జితేంద్రియుడు.

గోహరి వి. పరాక్రమము.

గోళకుఁడు సం. వి. విధవకు రంకుమగని వలన పుట్టినవాడు. రూ. గోలకుడు.

గోళకేంద్రము సం. వి. (భౌతి.) ఒకదర్పణ మునుగాని లేక వట్టకమునుగాని ఒక భాగముగా కలిగియుండు గోళము యొక్క కేంద్రము (Centre of curvature).

గోళము సం. వి. మండలము ఉదా. భూగోళము, ఖగోళము.(గణి.) ఒక స్థిరబిందువు నుండి ఒకే దూరములో చరించు బిందువు యొక్క పథము.

గోళాకారము సం. విణ. (వృక్ష.) గుండ్ర ముగా నున్నది. (Rotund) (పత్రము.)

గోళీయ విపథనము సం. వి. (భౌతి.) ఒక కటకము యొక్కగాని, దర్పణము యొక్కగాని, మధ్య భాగము, అంచు భాగము ఏకనాభికములు కాకపోవుటచే నైనకాంతి కిరణముల వికేంద్రత (Spherical aberration),

# గౌ

గౌండ్లవాడు వై.వి. గమళ్ళవాడు, గవుండ్లవాడు. సురాజీవి. సం. గోండః.

గౌడిగేదె వి. పొట్టికొమ్ముల పెద్దబఱ్ఱె.

గౌణము సం. విణ. అప్రధానము (Secondary)

గౌతమబుద్ధుడు సం. వి. (చరి.) సిద్ధార్థుడు. (క్రీ. పూ. 566-486). బౌద్ధధర్మ స్థాపకుడు, తథాగతుడు, శాక్యముని.

గౌతముడు సం. వి. 1. గౌతమముని. 2. బుద్ధుడు.

గౌద్దాళికము సం. వి. గుద్దలికంటె బరువగు పనిముట్టు.

గౌధారము సం. వి. ఉడుముపిల్ల, రూ. గౌధేరము, గౌధేయము.

గౌధేయము సం.వి.చూ. పై.

గౌధేరము సం. వి. చూ. పై.

గౌరము సం. వి. 1. ఆకరువు. 2. తెల్లావ. విణ. 1. తెల్లనిది. 2. ఎఱ్ఱనిది. 3. స్వచ్ఛమైనది.

గౌరవము సం. వి. 1. మర్యాద, సన్మానము 2, గొప్పతనము. 3. గున్నన.

గౌరి సం. వి. దుర్గ, పార్వతి. 2. రజస్వల కానికన్యక, 3. భూమి. 4. వరుణుని భార్య.

గౌరుఁడు సం.వి. చంద్రుడు.

గౌలు వి. దుర్గంధము.

గౌసెన వై. వి. వీణ మొ.ని. యొర. రూ. గవుసెన. సం. కోశః.

గౌళి వి. బల్లి. రూ. గవుళి.

# గ్యా, గ్ర

గ్యాలరీ ఇం. వి. (Gallery) నాటకశాల లోను క్రీడామైదానములోను ప్రేక్షకులును కళాశాలలో విద్యార్థులును కూర్చుండుటకై మెట్లవలె అంచెలుగా కట్టబడిన బల్లల

వరుస. ప్రెస్ గ్యాలరీ = శాసనసభలో పత్రికా విలేఖరులకు ప్రత్యేకింపబడిన స్థలము. ప్రేక్షకులగ్యాలరీ=శాసనసభలో ప్రేక్షకులు కూర్చుండుటకై ఏర్పరచిన ప్రత్యేకస్థలము.

గ్రంథకర్త సం.వి. గ్రంథకారుడు.

గ్రంథకుటి సం. వి. 1. వ్రాసెడిగది. 2 కరణము లెక్కలు వ్రాసెడి చావడి. 3. పుస్తక భాండాగారము.

గ్రంథనము సం.వి. 1. పుష్పములు మొ వి. కూర్చుట, గ్రుచ్చుట. 2. రచన రూ. గ్రథనము.

గ్రంథము సం. వి. 1. కావ్యము, పుస్తకము 2. ధనము. 3. ముప్పది రెండక్షరముల శ్లోకము.

గ్రంథి సం. వి. 1. బుడిపి. గడ్డవలె పుట్టు రోగము, 2. చెట్టు మొ, ని ముడి 3, కీలు (జీవ.) శరీరమునకు అవసరమగు ఏదైన ఒక ద్రవమును తయారుచేసి ఉదాసర్జన చేయు (పైకి స్రవింపజేయు) జీవకణ సంహతి (Gland),

గ్రంథికుఁడు సం.వి. 1. జోస్యుడు. 2. సహదేవుడు.

గ్రంథులసిరలు సం, వి. (జం.) హెచ్చు తగ్గులుగా ఉబ్బిన సిరలు ( ఎక్కువ కాలము నిలిచి పనిచేసినచో సిరలు పైకుబికి ఉండును (Varicose veins).

గ్రక్కటిలు క్రి. 1. భయపడు, బెదరు, 2. కంపించు.

గ్రథితము సం. విశే. గ్రుచ్చబడినది.

గ్రమ్మన విశే. శీఘ్రముగ.

గ్రస్తము సం. విశే. 1. తినబడినది. 2. మ్రింగబడినది. 3. లోపించిన వర్ణములు గలది (మాట).

గ్రహ కల్లోలము సం. వి. రాహుగ్రహము

గ్రహచారము సం, వి. 1, గ్రహముల యొక్క సంచారము. 2. దురదృష్టము.

గ్రహణము సం. వి. రాహు కేతువులు సూర్యచంద్రులనుపట్టుట. 2. గ్రహించుట. 3. బుద్ధి. (భౌతి.) గ్రహమునకు వేరు గ్రహము అడ్డువచ్చి కన్పించకుండుట. (Eclipse). (భూగో.) భూమియొక్క కక్ష్య,చంద్రుని యొక్క కక్ష్య రెండు బిందువుల (రాహుకేతువుల)లో కలియును, ఆ రెండింటిలో ఏదైన ఒక బిందువు భూమికి తిన్నగా వెనుకగాని ముందుగాని, భూమికిని సూర్యునకును మధ్యగాని, వెనుకగాని వచ్చినచో గ్రహణము కలుగును.

గ్రహణి సం. వి. 1. ఒక విధమైన రోగము. జఠరాగ్నికి అధిష్ఠానమగు నాడి. (ఇది చెడిపోయినచో గ్రహణీరోగము కలుగును).

గ్రహపతి సం. వి. సూర్యుడు.

గ్రహము సం. వి. 1. రాహుగ్రహము 2, అనుగ్రహము. 3. చెర. 4. యుద్ధయత్నము, 5. పిశాచము. 6. సూర్యాది నవగ్రహములు (సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు, కేతువు). (భౌతి.) ఆకాశములో సూర్యునిచుట్టు తిరుగుచు స్థిరముగా కాంతిని వెదజల్లెడు ఖగోళరాశి (Planet).

గ్రహరాజు సం. వి. 1, సూర్యుడు. 2. చంద్రుడు.

గ్రహాము సిద్ధాంతము మి. వి. (అర్థ.) "రెండు లేక ఎక్కువ చెలామణి ద్రవ్యములు ఉపయోగింపబడినప్పుడు, తక్కువ విలువగల ద్రవ్యము, ఎక్కువ విలువ గల దానిని చెలామణి నుండి తొలగించి వేయును" అను సిద్ధాంతము.(Graham's theory).

గ్రహీతుఁడు సం. విశే. 1. గ్రహీత. 2.

కోపానురాగాదులచే పుట్టిన చలనము కలవాడు.

గ్రహీత సం. విణ. గ్రహించువాడు (గ్రహీకుడు).

# గ్యా

గ్యాలన్ ఇం. వి. (Gallon) ద్రవపదార్థములను కొలుచుటలో వాడు ఒక ప్రమాణము, సుమారు 4 1/2 లీటర్లు.

# గ్రా

గ్రాంథికము సం. విణ. గ్రంథసంబంధమైనది.

గ్రాట్యూటీ ఇం. వి. (Gratuity) ఉద్యోగమునుండి విరమించిన వ్యక్తికి లభించు ఉచితార్థ పారితోషికము.

గ్రాఫ్ ఇం. వి. (గణి.) (Graph) రెండు రాసుల పరస్పర సంబంధమును చూపు రేఖా చిత్రము.

గ్రామ్ ఇం. వి. (గణి.) (Gramme)బరువును కొలుచుటకు ఉపయోగించు పరిమాణము.

గ్రామణి సం. విణ. 1. గ్రామాధిపతి. 2. శ్రేష్ఠుడు.వి.1. మంగలి 2. వేశ్య. (చరి.) మౌర్యులకాలమునాటి గ్రామపెద్ద.

గ్రామత సం. వి. 1.గ్రామముల సమూహము. 2. త్రాళ్ళ సమూహము.

గ్రామ పంచాయతి మి. వి. (రాజ.) గ్రామమందలి ప్రజలకు సంబంధించిన వివిధ విషయములను సక్రమముగానిర్వహించుటకై గ్రామమున కొందరి పెద్దలతో ఏర్పడిన సభ.(1000మొదలు 5000వరకు జనాభా కలిగి,సాలుకు పదివేల రూపాయలు ఆదాయముగల గ్రామములో నుండు స్థానిక స్వపరిపాలనా వ్యవస్థ )

గ్రామము సం. వి. 1. ఊరు. 2. సమూహము. 3. (సంగీ.) షడ్జాది స్వరము.

గ్రామముఖము సం. వి. అంగళ్ళవీధి. బజారు.

గ్రామమునసబు మి. వి. గ్రామములో భూమి శిస్తు వసూలు తదితర ప్రభుత్వ వ్యవహారములు నిర్వహించు ఉద్యోగి. (శాస.) గ్రామములోని భూమిశిస్తు వసూలుచేసి జమా ఖర్చు లెక్కలు,వ్రాసి భూమి సర్వే మొ. పనులలో ప్రభుత్వమునకు తోడ్పడు గ్రామాధికారి. (రూ.50కి మించని స్థానిక వ్యాజ్యములను ఇతడు విచారించును. గ్రామపంచాయతీ కోర్టులు లేనిచోట్లలో ఉభయ పక్షముల సమ్మతితో రూ. 500లకు మించని వ్యాజ్యములను కూడ ఇతడు విచారింపవచ్చును.)

గ్రామమృగము సం. వి. కుక్క. (గ్రామసింహము.)

గ్రామసంఘము సం. వి. గ్రామములోని ప్రజలందరును కలసిన సంఘము (Village community).

గ్రామసభ సం. వి. (రాజ.) గ్రామ పంచాయతీ ఎన్నికలలో వోటు చేయుటకు అధికారమున్న నియోజకవర్గము.

గ్రామసేవక్ హిం. వి. (వ్యావ.) గ్రామములో జాతీయ వికాస పథకములను అమలులో పెట్టుటకై ప్రభుత్వముతరపుననియమింపబడిన ఉద్యోగి. 4,5 గ్రామములకు ఒక సేవక్ ఉండును.

గ్రామాంతము సం. వి. మాలపల్లె.

గ్రామీణ సం. వి. 1. వేశ్య. 2. పాలకూర. సం. విణ. ఊరి సంబంధమైన.

గ్రామ్యము సం. వి. 1. అశ్లీలము. 2. అసభ్యమగు మాట. 3. పామరజన వాక్యము. విశే. 1. ఊరియందు పుట్టినది. 2. తెలివిలేనిది. 3. నాగరికతలేనిది.

గ్రావము సం. వి. 1. కొండ. 2. రాయి. 3. మేఘము.

గ్రాసము సం. వి. 1. కబళము, తిండి. 2. గ్రహణము.

గ్రాహకము సం. విశే. గ్రహించునది(Receiver). వి. దేగ. (రసా.) స్వేదన ఫలిత ముల గ్రహించుటకుగాని, వాయువుల సంగ్రహించుటకుగాని. ఉపయోగించు పాత్ర, రేచకపంపుపై నుండు. గాజుపాత్ర ఇందే శూన్యము సృజింపబడును. వైద్యుత సంకేతముల ఉచితరూపములకు మార్పుటకు ఉపయోగించు పరికరము, ఉదా. రేడియో గ్రాహకము. వి. గ్రహించునది. స్వేదనమువలన ఉత్పన్నములగు ద్రవముల సంగ్రహించు పాత్ర, లేదా వాయువులను సంగ్రహించు పాత్ర.

గ్రాహకుఁడు సం. వి. పాములను పట్టుకొనువాడు, పాములవాడు.

గ్రాహము సం. వి 1. పంది. 2. చెర. 3. మొసలి. 4. గ్రహణము.5. గ్రహించుట,

గ్రాహి సం. వి. వెలగ. విశే. 1. గ్రహించునది, 2. మలబంధము కలిగించునది.

గ్రాహ్యము సం. విశే. గ్రహింపదగినది.

# గ్రి, గ్రీ

గ్రిక్కరు వి. డోకు, వాంతి.

గ్రినిచ్ మధ్యాహ్నరేఖ మి. వి. (భూగో.) గ్రినిచ్ అనునది లండనులో ఒకవీధి, దీని గుండా పోవు ఊహారేఖాంశము. 0° రేఖాంశ వృత్తము(Greenwitch meridian).

గ్రినిచ్ వేళ మి. వి. (భూగో.) సూర్యుడు గ్రినిచ్ రేఖాంశపు ఊర్ధ్వబిందువుపై వచ్చినప్పటివేళ. మధ్యాహ్నము 12 గంటలు. బ్రిటిష్ దీవులలో నిది ప్రామాణికవేళ. (దీనినిబట్టి ప్రపంచములోని యితర దేశముల వారు తమవేళను కొన్ని గంటలు ముందు వెనుకలలో సరిదిద్దుకొందురు. తూర్పు ప్రామాణికవేళ.(న్యూయార్కు) గ్రినిచ్ వేళకంటె 5 గంటలు వెనుకబడియుండును. భారతదేశ ప్రామాణికవేళ (ఐ,యస్.టి.) గ్రినిచ్ వేళకంటె 5 1/2 గంటలు ముందుగా నుండును) (Greenwich time).

గ్రీవ సం. వి. 1. కంఠము. 2. మెడనరము. చూ. గ్రీవము.

గ్రీవము సం. వి. 1. కిరణము. 2. కంఠము

గ్రీష్మఋతువు సం. వి. వేసవి (జ్యేష్ఠాషాఢ మాసములు.)

గ్రీష్మము సం, వి. 1. వేడి. 2. వేసంగి.

# గ్రు, గ్రే

గ్రుక్క వి. 1, మ్రింగుట. 2. గుటక. 3. ఊపిరి. 4. కంఠనాళ రూపమగు పరిమాణము.

గ్రుక్కలుమ్రింగు క్రి. 1. అపేక్షించు. 2. సంకోచించు, అనుమానించు. చూ. గ్రుక్కిళ్లుమ్రింగు.

గ్రుచ్చు క్రి. 1, గాఢముగా పట్టుకొను. 2. నాటించు 3. భేదించు. 4. పెల్లగించు

గ్రుడ్డి విశే. అంధుడు (రాలు), చూడశక్తి లేనిది (వాడు).

గ్రుడ్డిచుక్క వి. (గృహ.) కన్నుగ్రుడ్డులో రెటీనాకు వెనుకభాగమున దృష్టినరము బయలుదేరు చోటనున్న చుక్క (చూచిన వస్తువునీడ ఈ చుక్కపైబడిన దృష్టి కనిపించదు) (Blind spot).

గ్రుడ్డిపాటు విశే. (గ్రుడ్డి + పాటు) దైవము వలన కలిగినది. దైవికము.

గ్రుడ్డు వి. 1. కనుగ్రుడ్డు. 2. పక్షులఅండము విశే. గ్రుడ్డితనము.

గ్రుడ్డికానుపు వి. 1. పాము. 2. పిట్ట. పక్షి.

గ్రుడ్లగూబ వి. దివాంధము. ఘూకము.

గ్రుద్దు వి. పిడికిటిపోటు. క్రి. 1. పిడికిటితో పొడుచు. 2. శూలముమొ.నితో పొడుచు

గ్రుద్దులాడు క్రి. 1. ఒకరినొకరు గ్రుద్దుచు పోరాడు. 2. జగడమాడు.

గ్రేటర్ ఇం. వి (గృహ.) (Grater) కొబ్బరి లేక కాయలు, దుంపలు మొ.ని తరుగుటకుపయోగించు పరికరము.

గ్రేట్ డివైడింగ్ రేంజి ఇం. వి. (భూగో.) (Grate dividing range) ఆస్ట్రేలియాలోని తూర్పు మెట్ట భూములు 'ఆస్ట్రేలియన్ ఆల్ప్స్' 'బ్లూ మౌంటెన్స్' నీలి పర్వతములు.

గ్రేడ్ ఇం. వి. (గణి.) (Grade) లంబకోణములో నూరవ భాగము.

# గ్రై, గ్రౌ, గ్ల, గ్లా

గ్రైవము నం. వి. 1. మెడత్రాడు. 2. మంగళసూత్రము.

గ్రైవేయకము నం. వి. మెడకు పెట్టుకొను నగ, కంఠభూషణము.

గ్రొచ్చు క్రి. 1. గుద్దలిలోనగు వానితో త్రవ్వు. 2. చీల్చు. విదళించు. 3. పెల్లగించు.

గ్రొయ్యు క్రి. పల్లమువడు.

గ్లస్తము నం. వి. 1. భక్షింపబడినది. 2. గ్రస్తము.

గ్లహము నం. వి. 1. జూదపుపందెము. 2. పాచిక 3. జూదమాడుట.

గ్లాని నం.వి. 1. శ్రమచే కల్గిన దౌర్బల్యము. 2. అశక్తి. 3. రోగము. 4. నాశము.

గ్లానుఁడు నం. వి. తెవులుగొంటు, రోగముచేత కృశించినవాడు.

# గ్లై

గ్లైకోజిన్ ఇం. వి. (గృహ.) (Glycogen) కాలేయపు చక్కెర. (కాలేయము రక్తములో ఎక్కువగానున్న గ్లూకోస్‌ను గ్లైకోజిగాన్ మార్చి నిల్వచేయును కాలేయములోను, కండర జీవకణములోను నిలువచేయబడు చక్కెర రూపము)

# గ్లో గ్లౌ

గ్లోబు ఇం.వి. (భూగో.) (Globe) భూగోళము.

గ్లోసా ఇం. వి. (జం.) (Glossa) కీటకముల నోటి భాగములలో నొకటి, జివ్హా.



గ్లోబు

గ్లౌ నం. వి. 1. చంద్రుడు. 2. కర్పూరము.

# ఘ

ఘంట నం.వి. 1. గంట. 2. వాద్యము.

ఘంటాకాంస్యము నం. వి. (రసా) గంటల పోతకు ఉపయోగించు కంచు (Bell metal).

ఘంటాకారము నం.విశ. (వృక్ష.) ఘంటవలె నున్నది(Companulate or bell-shaped

ఘంటాపథము నం. వి. 1. ఘంటలతో కూడిన ఏనుగులదారి. 2. నిస్సందేహ మార్గము. 3. పదిబారలు వెడల్పుగల రాజ మార్గము. 4. మల్లినాథకృతమగు కిరాతార్జునీయ వ్యాఖ్య.

ఘంటాపాత్ర నం. వి. (రసా.) పరిచ్ఛాదకము. (కప్పియుంచునది) ఏదేని వస్తువుమ మూసియుంచుటకు తగిన గాజుపాత్ర (Bell-jar)

ఘంటిక నం. వి. 1. చిరుగంట, 2. కొండనాలుక. (గృహ.) చిరునాలుక (Epiglottis).

ఘట నం. వి. 1. గుంపు 2. ఏనుగులగుంపు. 3. గోష్ఠి. 4. కూర్పుట.

ఘటకములు నం. వి. (రసా.) యౌగికముగా ఏర్పడిన మూల ద్రవ్యములు (Constituents) ఉదా. ఆమ్లజని, ఉదజని, నీటిలో నున్న రసాయనిక ఘటకము.

ఘటన నం.వి. సంధానము, కూర్పు.

ఘటము నం. వి. 1. ఎళనీరుకాయ. 2. కడవ. 3. ఏనుగుకుంభస్థలము.

ఘటయంత్రము నం. వి. 1. నూతిగిలక. 2. ఏతము.

ఘటించు నం. క్రి. 1. ఘటిల్లజేయు. 2. సంపాదించు.

ఘటిక నం. వి. 1. 24 నిమిషముల కాలము. గడియ. 2. చిన్నకుండ. 3, ముహూర్తము. 4. ఒకానొక విద్యాసంస్థ.

ఘటిల్లు నం. క్రి. కలుగు.

ఘటీకాచము నం. వి. (రసా.) పాత్రలపై మూతపెట్టుటకు కొంచెములోతుగానున్న గాజు పలక (Clock glass).

ఘటీకారము నం. వి. కాలసూచక యంత్రము, వి. గడియారము.

ఘటీకారుఁడు నం.వి. కుమ్మరి.

ఘటోద్భవుఁడు నం. వి. అగస్త్య మహర్షి.

ఘట్టము నం. వి. 1. గట్టు, తీరము. 2. సుంకము వసూలుచేయుచోటు. 3. నద్యాదుల రేవు. 4. కదల్చుట. ల. రాపిడి.

ఘట్టితము నం. విశ. 1. గట్టింపబడినది. 2.

కదల్పబడినది. 3.నిర్మింపబడినది. 4. చిత్రపటాములకు రంగువేయుటకై యుపయోగపు గంజి మొ.ని రాచి గట్టింపబడినది (వస్త్రాదికము).

ఘనతాళము సం. వి. 1. వానకోయిల. 2. తాళభేదము.

ఘనపదార్థము సం, వి. (భౌతి.) 1. ఒక నిశ్చితమైనరూపము. 2.ఘనపరిమాణము గల పదార్థము (Solid).

ఘనమానము సం. వి. (గణి.) ఉదా. 1728 ఘన అంగుళములు = 1 ఘనపుడుగు 27 ఘనపుటడుగులు = 1 ఘనపుగజము 1000క్యూబిక్ మిల్లిమీటర్లు=1క్యూబిక్ సెంటిమీటర్ 1000 క్యూబిక్ సెంటిమీటర్లు=1లీటరు. Cubic measure).

ఘనము సం.విశే. 1. దట్టమైనది. 2. గొప్పది వి. మేఘము. (గణి) ఒకరాశి వర్గమును అదే రాశికి గుణించగావచ్చు లబ్ధము (Cube); (భౌతి) ద్రవ్యావస్థలు మూడిటిలో ద్రవము, వాయువుకానిది. దృఢమైన వస్తువు (Solid).

ఘనమూలము సం. వి. (గణి.) ఏ సంఖ్యను దానిచేతనే రెండు సారులు గుణించిన ఇష్టసంఖ్య లభించునో ఆ సంఖ్య (Cube root), ఉదా.7 అంకెను 7 చేత మరల దీని లబ్ధమును 7చేత గుణించగా వచ్చు ఫలము 343కు 7 ఘనమూలము.

ఘనరసము సం. వి. 1.నీరు. 2. కర్పూరము. 3. చల్ల, 4. చెట్టుబంక.

ఘనవల్లి సం. వి. మెరపు తీగ.

ఘనసారము సం. వి. 1. కర్పూరము. 2. నీరు. 3 పాదరసభేదము.

ఘనాఘనము సం. వి. కురియునట్టిమేఘము. 2. తొలిమొగులు. 3. హింసించునట్టి మదపు ఏనుగు.

ఘనాఘనుఁడు సం వి ఇంద్రుడు.

ఘనా(న)పాఠి సం. వి. వేదాధ్యయన సంపన్నుడు

ఘనీకరణమిశ్రమము సం. వి. (భౌతి,రసా.) ద్రవమును గడ్డకట్టించుటకు ఉపయోగించు మంచు, ఉప్పు వంటి ద్రవ్యముల మిశ్రమము (Freezing mixture).

ఘనీకరణము సం వి. (భౌతి. రసా.) గడ్డకట్టించుట (Freezing).

ఘనీభవనము సం. వి. (భౌతి) చల్లదనమును ఉపయోగించి ఒక ద్రవమును గడ్డకట్టించుట, (Freezing).

ఘనుఁడు సం. విశే. గొప్పవాడు. వి. మేఘుడు.

ఘరట్టము సం. వి. తిరుగలి.

ఘరావో హిం. వి. అధికారులను క్రింది ఉద్యోగులు లేక కార్మికులు స్వస్థానము నుండి కదలకుండచేయు నిరసన ప్రదర్శనము

ఘర్ఘరము సం. వి. 1. కొండదారి. 2. ఉరుము. 3. వాకిలి. 4. గుడ్లగూబ. 5. హాస్యము

ఘర్మము సం. వి. 1. చెమట. 2. ఎండ. 3. వేడిమి. 4. వేసగి.

ఘర్షణ సం. వి. (గృహ.) 1. ఉప్పళించుట. 2. రాపిడి, ఒరపిడి. రుద్దుట (Rubbing or scrubbing or friction).

ఘర్షణ ఫలకము సం. వి. (గృహ.) బట్టలను ఉతుకుటకు ఉపయోగించు ఒల్ల. రవాకుల మాదిరిగా నమర్చిన మెట్లబల్ల, (ఇది నూలు బట్టలుతుకుటకు ఉపయోగపడును) (Scrubbing board).

ఘర్షణము సం. వి. 1. పీడనము. 2. ఒరయిక.

ఘర్షణశక్తి సం. వి. (గణి.) రెండువస్తువుల ఘర్షణలో నేర్పడుశక్తి (Frictional forec)

ఘర్షితకాచము సం. వి. (భౌతి. రసా.) ఇసుకతో పామబడి మసకగాచేయబడిన గాజు బిళ్ళ లేదా పలక (Ground glass).

ఘస్మరుఁడు సం. విశే. 1. భక్షకుడు, తిండిపోతు. 2. చంపినవాడు.

ఘస్రము సం. వి. దినము. విశే. కర్కశము

# ఘా

ఘాంటికుఁడు సం. వి. 1. వేకువ సమయమున రాజుల మేలుకొలుపువాడు. 2. గంటవాయించువాడు.

ఘాతకుఁడు సం. విశే. హింసకుడు.

ఘాతక్షమత సం. వి. (రసా) 1. సుత్తిపెట్టుకు విరగకుండ మెత్తబడు గుణము. 2. తీగలులాగుటకు అనుకూలమైనగుణము (Malleability)

ఘాతము సం. వి. 1. దెబ్బ. 2. బాణము. (గణి.) $2^4$ అని వ్రాయునపుడు '4' '2' యొక్క ఘాతము.

ఘాతాంకము సం. వి. (గణి.) ఒక అంకెను దానిచేతనే బహుగుణితము కావించినపుడు ఆగుణితము ఎన్నిసార్లు అభ్యసింపబడినదో తెలుపు అంకెకు ఘాతాంకము అని పేరు. ఉదా. $2 \times 2 \times 2 \ldots \ldots$ nసార్లు $= 2^n$ ఇచట n ఘాతాంకము.

ఘాతిని సం. విశే. చంపునట్టిది.

ఘాసము సం. వి. తృణము, లేబచ్చిక, కసవు.

# ఘీ

ఘీత్కారము సం. వి. ఏనుగు కూత. ఘీంకృతి.

# ఘు, ఘూ

ఘుటిక సం వి. 1. గుళిక, చిన్నమాత్ర. 2. చీలమండ.

ఘుణము సం.వి. మ్రానిని తొలుచు పురుగు.

ఘుణాక్షర న్యాయము సం. న్యా. మ్రానియందు నుసిపురుగులుతొలువగా ఏర్పడిన అక్షరములన్యాయము. ఈ యక్షరములు పురువుయొక్క ప్రయత్నమువలన ఏర్పడినవికావు. అప్రయత్నముగ ఏర్పడినవి. ఉద్దేశములేక జరిగిన ఫలసిద్ధిపట్ల ఈ న్యాయము చెల్లును.

ఘుర్ఘరము సం. వి. పందికూత.

ఘుసృణము సం.వి. కుంకుమపువ్వు.

ఘూకము సం.వి. గుడ్లగూబ.

ఘూకి సం.వి. ఆడు గుడ్లగూబ.

ఘూర్జరము సం.వి. గుజరాతు దేశము.

ఘూర్ణనము సం.వి. 1. తిరుగుడు. 2. కునికిపాటు.

ఘూర్ణిల్లు సం. క్రి. పరిభ్రమించు, కలగుండుపడు.

# ఘృ

ఘృణ సం.వి. 1. కనికరము. 2. అసహ్యత.

ఘృణి సం.వి. 1. కిరణము. 2. వెలుగు.

ఘృతము సం.వి. 1. నెయ్యి. 2. నీరు.

ఘృష్టకము సం. వి. కౌగిలింత.

ఘృష్టి సం. వి. 1. పాచితీగ. 2. పోటి. 3. పంది. 4. రాపిడి. 5. కిరణము.

# ఘో

ఘోటక బ్రహ్మచర్యము నం. వి. (జాతీ.) ఎవ్వరును కన్యక నీయక పోవుటచే, గతిలేక బ్రహ్మచర్యము చేయుట, ఖూటకపు బ్రహ్మచర్యము (నక్క వినయము. జక ధ్యానము మొ.వి ఇట్టివే అసత్యములు).
ఘోటకము నం. వి. గుఱ్ఱము. వి. గోడా.
ఘోణ నం.వి. ముక్కు.
ఘోణి నం. వి. ఏనుగు. దోమ, పంది.
ఘోరదర్శనము నం. వి. 1. పులి, 2. గూబ.
ఘోరము నం. విఖ భయంకరము. నం. వి. నక్క, కుంకుమ పువ్వు.
ఘోషణ నం. వి చాటింపు.
ఘోషము నం. వి. 1, గొల్లపల్లె, 2. ఆవుల మంద.
ఘోషవతి నం. వి. వీణ.
ఘోషస్థానములు నం. వి. (జం.) మగ కప్ప గొంతునకు రెండు వైపుల గల సంచులు. (ఇవి శబ్దమును దీర్ఘముగా చేయుటకు ఉపయోగపడును (Vocal sacs).

# ఘ్రా

ఘ్రాణము నం. వి. ముక్కు. విఖ. మూర్కొన బడినది,
ఘ్రాణ సంబంధము నం. విఖ. (జం.) ఘ్రాణేంద్రియమునకు సంబంధించినది. (Olfoctory).
ఘ్రాణించు నం. క్రి. మూర్కొను, వాసన. చూచు.
ఘ్రాతము నం. విఖ. వాసన చూడబడినది. (వ్యావ.) అవాఘ్రాతము.
ఘ్రాతి నం. వి. 1. ముక్కు 2. వాసన. 3. వాసనచూచుట.

# చ

చ తెలుగు వర్ణమాలలో ఒక అక్షరము.
చంకరము నం. వి. 1. తేరు. 2. చెట్టు. రూ. చంకురము.
చంక్రమణము నం. వి. 1. దాటుట 2. కదలుట-
చంగము నం. విఖ. 1. నేర్పరి. 2. చక్కనిది.
చంచరీకము నం. వి. తుమ్మెద. వ్యు. చరించుచుండునది.
చంచల నం. వి. 1. లక్ష్మి. 2. మెరుపు.
చంచలము నం. వి. 1, గాలి. 2 మంద పిచ్చుక. 3. విఖ. చలించునది.
చంచలుఁడు నం. విఖ. 1. కాముకుడు. 2. చపలచిత్తుడు.
చంచుపాత్ర వి. (రసా.) ముక్కుగల గాజు పాత్ర (Beaker).
చంచువు నం. వి. పక్షిముక్కు.
చండము నం. విఖ. 1. భయంకరము. 2. కోపముగలది. 3.తీవ్రమైనది. 4.ఘాటయినది. 5. వేడియైనది. వి. 1. కోపము. 2. తీవ్రత. 3. వేడిమి.
చండాతకము నం. వి. వేశ్యల చల్లడము.
చండాలుఁడు నం. వి. 1. మాలవాడు. రూ. చాండాలుడు.
చండి నం. వి. 1. పార్వతి. 2. కోపము గల స్త్రీ. 3. స్త్రీ. రూ. చండిక.

**చండించు** సం. క్రి. మిక్కిలి కోపించు.
**చండిమ** సం.వి. వాడిమి, తీవ్రము.
**చండుఁడు** సం. విశే. 1. మిక్కిలి కోపము గలవాడు. 2. వాడిమిగలవాడు.
**చందనము** సం. వి. 1. కుంకుమపువ్వు. 2. గంధము. (ఇది Santalaceae అను కుటుంబమునకు చెందిన Santalum album అను మొక్కయొక్క కఱ్ఱ (Sandal wood) ముదిరిన కఱ్ఱ నుండి చందన తైలమును తీయుదురు.)
**చందా** హిం. వి. సంస్థలకు పత్రికలకు మొ. వానికి కట్టవలసిన డబ్బు (Subsbription)
**చందా పూచీదారులు** (వాణి.) కంపెనీ వాటాలు అమ్ముడుపోవునట్లు ముందుగ హామీ ఇచ్చు వ్యక్తి లేక సంస్థ. ఒక నియత సంఖ్య వాటాలను ఒక నియత ధరకు కొందుమనిగాని ఒక నియత కాలవ్యవధిలో నియతసంఖ్య వాటాలను అమ్ముడు పోవునట్లు చూతుమనిగాని హామీ ఇచ్చువారు.
**చందిరుడు** సం. వి. చంద్రుడు.
**చంద్రకము** సం. వి. నెమలిపురి కన్ను.
**చంద్రకాంతము** సం. వి. చలువరాయి.
**చంద్రకి** సం. వి. 1. నెమలి. 2. కౌజు.
**చంద్ర ఖండము** సం. వి. ఒకరకపు పిండి వంట.
**చంద్రచ్ఛందము** సం. వి. వేయి పేటలు గల హారము.
**చంద్రబీజము** సం. వి. వెండి.
**చంద్రము** సం. వి. 1. కర్పూరము. 2. నీరు. 3. బంగారు.
**చంద్రముఁడు** సం. వి. చంద్రుడు.
**చంద్రశాల** సం. వి. 1. పైమేడ. 2. వెన్నెల
**చంద్రశేఖరుఁడు** సం. వి. 1. శివుడు. నెల తాలుపు.
**చంద్రహాసము** సం. వి. 1.కత్తి. 2.రావణాసురుని ఖడ్గము.
**చంద్రాతపము** సం. వి. వెన్నెల.
**చంద్రిక** సం. వి. వెన్నెల రూ. చందిరిక.
**చంద్రుడు** సం. వి. నెల. చందమామ.
**చంద్రోదయము** సం. వి. 1. ఉల్లెడ. 2. చందురా. 3. చంద్రుని పొడువు.
**చంపకము** సం. వి. సంపెంగ, సంపెగ.
**చకితము** సం. వి. 1. భయము సం. విశే. 2. భయపడినది.
**చకోరకము** సం. వి. 1. వెన్నెల పులుగు. రూ. చకోరము. వ్యు. వెన్నెలచూచి తృప్తి పొందునది.
**చకోరము** సం. వి. చకోరకము.
**చక్రడోల** సం. వి. రంగుల రాట్నము.
**చక్రధరము** సం. వి. పాము.
**చక్రధరుఁడు** సం. వి. విష్ణువు.
**చక్రధ్వజము** సం. వి. (వ్యవ.) పెద్ద ఇనుప నాగలి యొక్క దూలమునకు చక్రమును తగిలించునిలువుకమ్మి(Standard)



చక్రధ్వజము
చక్రము

**చక్రపక్షము** సం. వి. హంస
**చక్రపాణి** సం. వి. విష్ణువు.
**చక్రము** సం. వి. 1. శ్రీకృష్ణుని ఆయుధము. 2. బండికల్లు. 3. గుంపు. 4.దండు 5. రాష్ట్రము. 6. కుమ్మరిసారె. 7. నీటిసుడి 8. జక్కవ.
**చక్రవడ్డీ** వి. (గణి.) 1. చక్రవృద్ధి. 2. అసలు పైనేకాక నియమిత కాలానంతరము వచ్చు సాధారణమైన వడ్డీపై కూడ యివ్వవలసిన వడ్డీ. (Compound Interest).
**చక్రవర్తి** సం. వి. సార్వభౌముడు, రాజులకు రాజు.
**చక్రవాకము** సం. వి. జక్కవ.
**చక్రవాళము** సం. వి. 1. గుంపు. 2. మండ

లము. 3.లోకాలోక పర్వతము. 4.చుట్టు కొండ.

చక్రవృద్ధి సం. వి. వడ్డీకివడ్డీ, చక్రవడ్డీ.

చక్రాంగము సం. వి. 1. హంస. 2.జక్కవ

చక్రాకారము సం. (వృక్ష.) ఆకారములో చక్రముపలెనున్నది (ఆకర్షణదళ వలయము) (Rotate or wheel shaped).

చక్రి సం. వి. 1. విష్ణువు. 2. రారాజు. 3. కుమ్మరి. 4. హంస. 5. పాము.

చక్రీయము సం. (గణి.) వృత్త సంబంధమైనది (Cyclic).

చక్షువు సం. వి. కన్ను.

చక్షుశ్శ్రవము సం. వి. 1. పాము. కనుపినికి

చటకము సం. వి. పిచ్చుక.

చణకము సం. వి. సెనగలు.

చతురంగము సం. వి. చదరంగము.

చతురంత యానము సం. వి. పల్లకి.

చతురము సం. వి. 1. గజశాల. 2. చతురస్రము. 3. చదరము. విణ. నేర్పుగలది.

చతుర .ము, చదరము సం. వి. (గణి.) సమ ిణ, సమబాహు చతుర్భుజము (Squ. ).

చతురాది . క్రము సం. వి. (వృక్ష.) ఒక గింజగల న లుగు భాగములుగావిడిపోవు పండు. ఉదా :- తులసి కుటుంబములోని మొక్కల పండ్లు. (Carcerulus).

చతురాననుఁడు సం. వి. చతురాస్యుడు, నలువ, బ్రహ్మ.

చతురానీకము సం. వి. (గణి.) నాలుగు సమతలములుగల ఘనరూపము (Tetra-tudron).

చతురిమ సం. వి. నేర్పరి.

చతురుఁడు సం. వి. నేర్పరి తనము.

చతుర్థి సం. వి. 1. పక్షమున నాల్గవదినము, చవితి. 2. నాల్గవది.

చతుర్దశి సం. వి. 1. పక్షమున పదునాల్గవ దినము. 2. పరివాదిని యను వీణ. 3 పదునాల్గవది.

చతుర్ద్విఘ్నిక సం. వి. (వృక్ష.) పుష్పములలో ఆరు కింజల్కము లుండి నాలుగు పొడవుగాను రెండుపొట్టిగాను ఉండు స్థితి. (Tetradynamus).


చతుర్ద్విఘ్నిక

చతుర్భుజము సం. వి.(గణి.)నాలుగు భుజములుగల సమ చతుర్భుజములు తల చిత్రము (Quadrilateral).



చతుర్భుజుఁడు సం. వి. విష్ణువు, ఉడ్డకేలు వేలుపు.

చతుష్కము సం. వి. 1. చదుకము. 2. చవిక. 3. నాల్గు.

చతుష్క యుగ్మాస్థి సం. (జం.) పైదవుడ ఎముకలలో నొకటియగు హనువు యొక్క వెనుక భాగముతో కలసియుండు సన్నని ఎముక. దీనికి పండ్లు ఉండవు (Quadrato Jugal).

చతుష్కోణాస్థి సం. (జం.) కపోలములోని ఎముకలలో అగ్రగండాస్థి యొక్క పొడవైన భాగమునకు నురోస్థి వెనుకభాగమునకును మధ్య కడ్డీవలె నుండు మృదులాస్థి (Quadrate).

చతుష్టయము సం. వి. నాలుగు, నలుగురు, 2, (వృక్ష.) సూక్ష్మబీజాణు మాతృకోశిలలో ఏర్పడు నాలుగు (పుప్పొడి రేణువుల) కణములు, (Tetrad) (ఇట్లే స్థూల బీజాణు మాతృకోశికలో గూడ నాలుగు జీవకణములు ఏర్పడును.)

చతుష్పథము సం. వి. 1. చదుకము. నాలుగు కాళ్ళ జంతువు. రూ.చతుష్పాత్తు, చతుష్పదము,

**చతుష్పాత్తు** నం. వి. 1. చతుష్పదము, 2, నాలుగు కాళ్ళ జంతువు.

**చతుష్షష్టి** నం. వి. అరువది నాలుగు.

**చతు(ఃసం) స్సంయోజకము** నం. విశే. (రసా.) నాలుగు ఉదజని పరమాణువులతో సంయోగించగలది. నాలుగు ఉదజని పరమాణువులను యౌగికములనుండి తొలగించి వాని స్థానమును ఆక్రమించగలది. (Quadrivalent).

**చత్వరము** నం. వి. ముంగిలి.

**చత్వరిక** నం. వి. బాలవిధవ.

**చదునుకుట్టు** వి. (గృహ.) కొబ్బరి ఆకును పోలి యుండు అలంకారపు కుట్టు(Flat stitch). చదునుకుట్టు

**చపటము** నం. వి. చపేటము.

**చపల** నం. వి. 1. లక్ష్మి. 2. మెరవు. 3. రంకుటాలు.

**చపేటము** నం. వి. 1. చాచిన వ్రేళ్ళుగల యరచేయి, చప్పట. రూ. చపటము.

**చమత్కారము** నం. వి. 1. నేర్పు. రూ. చమత్కృతి.

**చమత్కృతి** నం. వి. చమత్కారము.

**చమరము** నం. వి. 1. వింజామరము. రూ. చామరము. 2. సవరము. 3. చమరీ మృగము.

**చమరీ** నం. వి. ఆడు చమరీమృగము.

**చమురు గ్రంథులు** వి. (జీవ.) చమురును అందచేసి శరీరముమీద రోమములు పెరుగుటకు సహాయపడు గ్రంథులు (Sebacous glands).

**చమువు** నం. వి. 1. 729 రథములు, అన్ని ఏనుగులు, 2187 గుఱ్ఱములు, 3647 కాల్బలముగల సేన. 2. సేన.

**చమూపతి** నం. వి. సేనానాయకుడు.

**చయము** నం. వి. 1. సమూహము. 2. సంగ్రహము. 3. (గణి.) ఒక శ్రేణి యొక్క సమీప పదముల మధ్య అంతరము (D fference).

**చయాపచయక్రియ** నం. వి. (జీవ.) జీవరసములో జరుగు సంశ్లేషణ విశ్లేషణ క్రియలు కలసియున్న ధర్మము (Metabolism).

**చరణము** నం. వి. 1. తినుట. 2. తిరుగుట. 3, నడవడిక. 4. పాదము. 5. వేరు. 6. పద్యపాదము.

**చరణాయుధము** నం. వి. 1. కోడి. అజ్జవాలు.

**చరమక్రియ** నం. వి. అంత్యకర్మము.

**చరమము** నం, విశే. 1. కడపటిది. 2. పడమటిది.

**చరమాద్రి** నం. వి. అస్తగిరి, క్రుంకుమెట్ట.

**చరము** నం. విశే. 1. కదలునది. 2, తిరుగునది. 3. చలనశక్తిగలది (Mobile).

**చరరాశి** నం. (గణి.) అస్థిరరాశి (Variable).

**చరాచరము** నం. వి. 1. జగత్తు. 2. విశే. తిరుగునదియు, తిరుగనదియు.

**చరాస్తి** మి. వి. (వాణి.) ఒక చోటునుండి మరొక చోటికి తీసుకొనిపోదగిన(బంగారు డబ్బు మొ॥నవి) ఆస్తి (Movable property).

**చరించు** నం. క్రి. 1. కదలు. 2. తిరుగు. 3. చేయు.

**చరిత** నం. వి. 1. నడవడి. రూ. చరితము, చరిత్రము.

**చరితము** నం. వి. చరిత.

**చరిత్ర** నం. వి. 1. చరితము. 2, మానవ నాగరికత, గత చరిత్ర సంఘటనలతో అవినాభావ సంబంధము కలిగి భవిష్యత్ మానవ సాంస్కృతికార్థిక, రాజకీయ, సాంఘిక, పురోగమమునకు దారిచూపు శాస్త్రము.

చరిత్రయుగము నం. వి. (చరి.) దేశ చరిత్ర తెలిసికొనుటకు లిఖితాధారములు గల కాలము.

చరుఁడు నం. వి. 1. వేగులవాడు. 2. అంగారకుడు.

చరువు నం వి. 1. హవ్యము. 2. హవ్యము వండెడికుండ.

చర్చ నం. వి. 1. విచారము. 2. చింత. 3. గంధములోనగు వాని పూత.

చర్మకారుఁడు నం. వి. మాదిగవాడు.

చర్మపత్రము నం. వి. వ్రాయుటకు అనువుగచేసిన మేక, గొర్రె మొ.ని తోలు. (Parchment).

చర్మము నం. వి. 1. తోలు. 2. కేడెము, డాలు.

చర్మి నం. వి. కేడెము ధరించినవాడు.

చర్య నం. వి. 1. నడచుట, నిలుచుట, కూర్చుండుట, పరుండుటలయందు సమాహితుడగుట. 2. పని. 3. పద్ధతి. 4 ప్రవర్తన.

చర్వణ నం. వి. ఈగ.

చర్వణము నం. వి. నమలుట.

చర్వితచర్వణము నం. విశే. 1. నమలిన దానిని తిరిగి నమలుట. 2. నెమరువేయుట. 3. చెప్పిన దానినే మరల చెప్పుట.

చర్వితము నం. విశే. నమలబడినది.

చల నం. వి. 1. లక్ష్మి 2. మారుస్వభావము గల వాయువు యొక్క ఆయతనము దానిపై నుండు ఒత్తిడిని బట్టి ఉండును (తాపక్రమము మారనప్పుడు) అందుచే వాయువు యొక్క ఆయతనము ఒక చలము లేదా చలరాశి. (Variable)

చలత్వము నం. (గణి.) రాసుల విలువలు మారుచుండుట. (Variation).

చలదయస్కాంతము నం. విశే. (భౌతి.) కదలు అయస్కాంతముగలది గాల్వనీ మాపకము (Moving magnet,

చలద్వేష్టనము నం. విశే. (భౌతి.) కదలు తీగచుట్ట కలది గాల్వనీ మాపకము (Moving Coil).

చలనచిత్రము నం. వి. సినిమా (Cinema).

చలననాడులు నం. వి. (జం.) కేంద్ర నాడీ మండలమునుండి కండరములను కదలుటకు ప్రేరణను తీసికొనిపోవు నాడులు. (Motor nerves).

చలనము నం. వి. 1. కదలుట. 2. తిరుగుట (భౌతి) ఒక ప్రదేశము నుండి అన్య ప్రదేశమునకు ప్రయాణించుట. (Motion)

చలము నం. విశే. 1. చలించునది. 2. వణకునది. 3. వి. వణకు.

చలయుక్తము నం. (జం.) క్రిమివలె కదలుచుండు సంయుక్త బీజము. ఉదా:- మలేరియా రోగ జీవి యొక్క. (Ookinite).

చలసిద్ధబీజములు నం. (వృక్ష.) నీటిలో చలనశక్తి గల సిద్ధ బీజములు (Zoospores or zoogonidia).

చలించు నం. క్రి. తిరుగు.

చలికురుపులు వి. శీతకాలమందు ఎక్కువ చలిచే కలుగు కురుపులు లేక బొబ్బలు. (Chilblains).

చషక పుష్పమంజరి నం. వి. (వృక్ష.) ఇది ఒక ప్రత్యేక పుష్పమంజరి ఆముదపు కుటుంబములో నున్న యూఫోర్బియా చషకపుష్పమంజరి గణమునకుచెందిన మొక్కలలో కావలగును పుష్పదండము చివరనొక గిన్నెవంటి నిర్మాణములో పుష్పములుండును. (Cyathium).



చషకము నం. వి. 1. గిన్నె. 2. కల్లుత్రాగు పాత్ర, మధుపాత్ర.

చషాలము నం. వి. యూప స్తంభమందలి కొయ్య కడియము.

# చా

చాంచల్యము నం. వి. చపలత్వము.

చాందిని హిం. వి. మేలుకట్టు.

చాంద్రమానము నం. వి. చంద్రుని గతిని బట్టి యేర్పరచిన కాల ప్రమాణము.

చాంద్రసంవత్సరము నం. వి. చంద్రుడు అమావాస్య మొదలుకొని అమావాస్య వరకు భూమిచుట్టు తిరిగివచ్చు కాలమును బట్టి నెలను నిర్ణయించుట. చాంద్ర సంవత్సరములో 354 1/2 రోజులుండుటచే సౌర సంవత్సరమున గల 365 రోజులకు దానిని సరి పుచ్చుటకై అధిక మాసము వచ్చును.

చాంద్రాయణము నం. వి. చంద్రుని వృద్ధి క్షయముల ననుసరించి ఆహార పరిమితిదిన క్రమమున హెచ్చించుచు తగ్గించు వ్రతము.

చాంద్రి నం. వి. వెన్నెల.

చాంపేయము నం. వి. 1. బంగారము. 2. సంపెంగ.

చాకచక్యము నం. వి. 1. చకచకభావము. 2. నేర్పు.

చాకలిసోడా వి. (గృహ.) బట్టలుతుకుటకు వాడు సోడా. (ఇది మురికి బట్టలను గాని, మురికినేలనుగాని శుభ్రముచేయుట కుపయోగపడును. ఇదిసోడియం బైకార్బ నేట్ (Sodium bicorbonate) అనబడు రసాయనిక సంయోగము.) (Washing soda).

చాకిరి హిం. వి. నీచమైన కొలువు.

చాకు హిం. వి. చిన్నకత్తి.

చాక్షుషము నం.విశే. (భౌతి.) కంటిచే గ్రహింపబడునది. (Optical) దృష్టి (చూపు.) సంబంధమైనది. (Visual).

చాక్షుషపరికరములు నం. వి. (భౌతి.) కాంతి శాస్త్ర విజ్ఞానమును గ్రహించుటకు తగిన పనిముట్లు. (Optical instruments). ఉదా:-దూరదర్శిని సూక్ష్మదర్శిని మొదలగునవి.

చాక్షుషభ్రమ నం. వి. (భౌతి) వాస్తవముగ లేకున్నను కంటికి అగపడినట్లుండుట ఉదా:- ఎండమావులలో నీరు. (Optical illusion).

చాక్షుషాక్షము నం.వి. (భౌతి.) ద్వివక్రీభవన గుణముగల స్ఫటికములో ద్వివక్రీభవన మునుచూపని దిశలోనున్న స్ఫాటికాక్షము. (Optic axis).

చాటువు నం. వి. 1. ప్రియమైనమాట. 2. గ్రంథస్థముకాకున్నను లోకమున ప్రజాదరణ పొందిన పద్యము.

చాతకము నం. వి. వానకోయిల.

చాతురి నం. వి. నేర్పు.

చాతురికుఁడు నం. వి. బండితోలువాడు.

చాతుర్మాస్యము నం. వి. ఆషాఢ శుద్ధము మొదలు కార్తిక శుద్ధమువరకు అనగా నాలుగు మాసములుచేయు ఒక వ్రతము.

చాతుర్యము నం.వి. 1. నేర్పు. రూ. చాతురి.

చాతుర్వర్ణ్యము నం. వి. బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర జాతులు.

చాదస్తము ' వి. 1. ఛాందసము. 2. లోక జ్ఞానము లేకపోవుట. వింత ప్రవర్తన.

చాపము నం. వి. 1. ధనుస్సు, విల్లు. 2. (భౌతి.) ఒకవక్రరేఖ యొక్కగాని వృత్తము యొక్కగాని భాగము (Arc).

చాపరేఖ నం. వి. (గణి.)పరిధిలోని భాగము (Arc).

చాపలము నం. వి. 1. చపలభావము. రూ. చాపల్యము.

చాపల్యము నం. వి. చాపలము, నిలుకడ లేని స్థితి.

చామరము నం. వి. వింజామరము. చూ చమరము.

చామీకరము సం.వి. బంగారము.

చారణుఁడు నం. వి. 1. నానాదేశ సంచారకుడైనట్టి నటకుడు 2. దేవతలలో చారణతెగకు చెందినవాడు.

చారము నం.వి. 1.చెర. 2.నడ. 3.చారపప్పు.

చారవాయువు నం.వి. పడమటిగాలి.

చారిత్రక భూగోళశాస్త్రము నం. వి. 1. అంతర్జాతీయ భూరాజనీతి. 2. చరిత్ర యుగాలలోని భౌగోళికపరిస్థితులు.

చారిత్రము నం. వి. 1. చరిత్రము. విశే. చరిత్రకు సంబంధించినది,

చారువు నం. వి. 1. బృహస్పతి. 2. విశే. ఒప్పిదమైనది.

చార్జి ఇం. వి. (Charge) 1. సుసుము, 2. ధర. 3. నిందారోపణము. 4. బాధ్యత.

చార్జిదెఆఫేర్సు ఇం. వి. (రాజ) (Charg de Affairs) తాత్కాలిక రాజదూత.

చార్టర్డు అకౌంటెంటు ఇం. వి. (వాణి) (Chartered Accountant.) పద్దులు వ్రాయుటలో పట్టాపొందినవాడు.

చార్టిస్టుఉద్యమం మి. వి, (చరి రాజ.) క్రీ.శ. 18 వ శతాబ్దిలో (1840-48) ఇంగ్లండు పార్లమెంటుకు సార్వజనిక పౌరసత్వము కోరుచు పత్రము పంపిన ప్రజోద్యమము.

చార్టు ఇం. వి. (Chart) 1. రేఖాపటము. నశా. మ్యాపు. 2. చట్టము. 3. కులము వారీగ వ్రాయబడిన పట్టిక.

చాలకతంతువులు నం. వి, (జీవ.) మెదడు నుండి అంగములకు వార్తలనందజేయు నరములు అనగా అవి అంగముల చలనమును కలుగచేయును. (Motor fibers).

చాలనము నం. వి. 1, జల్లెడ. 2. చలింపచేయుట.

చాలని నం.వి. (రసా.) 1. జల్లెడ. 2. ఖనిజ పరిశోధనకుపయోగపడు పరికరము (Sieve).

చాలనీనాళములు నం. వి (వృక్ష.) జల్లెడ గొట్టములు, వాహినీ పుంజములోనున్న అధోవాహి కణజాలములో నుండు జల్లెడ వంటిపర్పాటుగల అధోవాహికణములు నాళములు. (Sieve tubes).


చాలనీనాళసమితి
జల్లెడపళ్ళెము
సఖకోశములు

# చి

చించు క్రి. 1. చినుగచేయు రూ. చింపు.

చింత నం. వి. 1. తలపు. 2. వ్యసనము. 3. నై.వి. చింతచెట్టు. నం. చింఛా.

చింతన నం.వి. పలుమారు తలచుట.

చింతనీయము నం. విశే. చింతింపదగినది. ఆలోచింపదగినది.

చింతామణి నం. వి. 1. కోరికలొసగు దేవమణి.

చింతించు నం. క్రి. 1. తలంచు. 2. వగచు

చింతితము నం. విశే. చింతింపబడినది.

చింత్యము నం. విశే. చింతింపదగినది.

చిందము వి. శంఖము.

చిందఱ వి. 1. విజృంభణము. 2. తూటు.

చిందఱగొను క్రి. విజృంభించు.

చిందఱరేగు క్రి, ఆవేశమెత్తు

చిందఱవందఱ వి. 1. తునాతునకలు. 2. కలగుండు. విశే. కలగుండు పడినది.

చిందఱబోవు క్రి.1.మాటువడు 2. ఖేదించు

3. చిందరసేయు.
**చిందాడు** క్రి. 1. నాట్యమాడు, చిందులు ద్రొక్కు.
**చిందియు** వి. 1. జెట్లకుల్లాయ. మల్లులు ధరించుటోపి. రూ. చిందె.
**చిందిలి** విశే. చలించినది.
**చిందిలిపడు** క్రి. సంభ్రమించు.
**చిందిలిపాటు** వి. 1. చిందిలిపడు. వేగిర పాటు.
**చిందిలు** క్రి. చలించు. రూ, చింతిల్లు.
**చిందు** క్రి. 1. నీళ్ళుతొనకిపడు. 2. రాలు. 3, వ్యాపించు 4. వెచ్చముసేయు, వి. 1. నాట్యము. 2. మాదిగలపద్ద యాచించు ఒక తెగ.
**చిందువ** వి. చిన్నపెట్టె.
**చిందువందు** విశే. చెదరినది.
**చిందె** వి. చిందియ.
**చింద్రము** వి. 1. రంధ్రము. 2. ఖండము.
**చింపాంజి** ఇం. వి. (Chimpanzee) ఆఫ్రికా దేశములోని నరవానరము.
**చింపి** విశే. చినిగినది (వస్త్రము).
**చింపిరి** విశే. వి. బిరుసెక్కి వంకరయైనవి (వెంట్రుకలు) 2. విరియబోసికొన్నది.
**చింపు** క్రి. 1. చించు. 2. వి. చినిగినవస్త్ర ఖండము.
**చింబు** వి. మేకపోతు.
**చింబోతు** వి. మేక.
**చికటారి** వి. 1. చిన్నకటారి. చిన్నకత్తి, రూ. చిక్కటారి.
**చికమక** వి. చిక్కు.
**చికిచికి** విశే. చిన్న
**చికిత్స** సం. వి. రోగమునకుచేయు ప్రతి క్రియ.
**చికిత్సకుఁడు** సం. వి, వైద్యుఁడు.
**చికిత్సించు** సం. క్రి. చికిత్సచేయు.
**చికినము** వై. వి. 1, చిక్కణము. 2. చాయ వక్క. రూ, చికిని.
**చికిని** వై. వి. చికినము.
**చికిలి** వి, 1. తుడిచి చక్కచేయుట. విశే. 1. నున్నని. 2. అందమైన
**చికిలిసాన** వి. ఒరపిడిరాయి. సానరాయి.
**చికిలు** క్రి. చనువుతో నేర్పు మారాము చేయు.
**చికీర్ష** సం. వి. చేయవలయుననెడి కోరిక,
**చికీర్షువు** సం. విశే. చేయ విచ్ఛకలవాడు.
**చికురము** సం. వి. 1. వెంట్రుక. 2. కొండ, 3. ఒకజాతిపక్షి. 4.పాము. 5. ముంగిస. విశే. కదలునది.
**చిక్కంటి** వి. తలచిక్కు తీసికొనెడి నిడుపు దువ్వెన.
**చిక్కటారి** వి. చికటారి, చిన్నకత్తి.
**చిక్కణము** సం వి, 1. చాయవక్క. విశే. 1. నునుపైనది. 2. తరచైనది. 3. చిక్కనైనది. రూ, చికినము.
**చిక్కన** వై. వి. 1. చిక్కణము. 2. తరచు 3. దార్ఢ్యము. 4. బలము,
**చిక్కము** వై. వి, శిక్యము, ఉట్టి, దారముతో అల్లిన చిన్న సంచి.
**చిక్కు** క్రి. 1. కృశించు. 2, తక్కు. 3. తగులు. 4.దొరకు, 5.మిగులు. 6.మెలి. 7. సంకటము,
**చిక్కుడు పేను** వి. (వ్యవ.) 'మొక్కల పేలు' అను తరగతికి చెందిన కీటకము. ఇది చిక్కుడు పాదులకును, ఇతర కాయ ధాన్యముల పైరులకును పట్టుచుండును. **(Aphis medicagenis).**
**చిక్కుపడు** క్రి. 1. మెలిపడు. 2. సంకటపడు. 3. చిక్కగు.
**చిక్కుపాటు** వి. 1. చిక్కుపడుట. 2. సంకటపాటు.
**చికొట్టు** క్రి. 1. చీచీయను, రూ. చీకొట్టు

చిక్కోల వి. చిక్కంటె, తలచిక్కు తీసుకొను దువ్వెన.
చిక్రోడము సం. వి. ఉడుత.
చిగురించు క్రి. చిగుర్చు, పల్లవించు.
చిగురింత వి. 1. చిగుర్చుట. 2. తృణ విశేషము.
చిగురాకుదిండి వి. కోయిల, పల్లవఖాది.
చిగురు వి. 1, పల్లవము. విణ. లేత. రూ. చివురు.
చిగురుఁబోడి వి. 1. చిగురువలె మనోజ్ఞురాలగు స్త్రీ. 2, స్త్రీ.
చిగురు విలుకాఁడు వి. మన్మథుఁడు.
చిగురొత్తు క్రి. 1. చిగుర్చు. 2. అనురక్తమగు.
చిచ్చఱ వై. విణ. 1, అగ్ని. రూ. చిచ్చుఱ, సం. శుచిః.
చిచ్చఱకంటి వి. శివుడు, అగ్నినేత్రుడు.
చిచ్చఱపిడుగు వి. అగ్గి పిడుగు,
చిచ్చు వి. 1. శిఖ, అగ్ని, 2. తాపము,
చిచ్చుఱ వై. వి. చిచ్చఱ.
చిటపొట వి. 1.ఈర్ష్యచే స్త్రీకి కలిగెడు కోపము. 2. వాన చినుకులు పడుట
చిటి విణ. 1. చిన్న. రూ. చిట్టి.
చిటిక వై. వి. 1, నడిమి వ్రేలిని పెద్ద వ్రేలిని చేర్చి ధ్వనింపచేయుట. 2. అట్లు ధ్వనింపచేయుటకు పట్టు కాలము, క్షణ కాలము,
చిటికరించు క్రి, చిటికవేయు.
చిటికెన వి, 1. చిన్నవ్రేలు. 2. కనిష్ఠిక.
చిటితాళము మి. వి. కఱ్ఱతాళము.
చిటిపొటి విణ. అల్పము.,
చిటిబొట్టు విణ. ముత్తైదువు లుంచుకొను బొట్టు.
చిటివ్రేలు వి. చిన్నవ్రేలు.
చిటుకు వి. 1. అల్పశబ్దము. రూ. చిటుక్కు
చిటులు క్రి. 1. పగులు. 2. చిట్లు. 3. మిక్కిలి కోపించు.
చిట్ట వి. 1. ఆశ్చర్యము, 2. చిన్నపొర.
చిట్టంటులు వి. నఖక్షత దంతక్షతములు.
చిట్టకము వి. 1. శృంగారచేష్ట. 2. లీల. 3. కపటము. రూ. చిటకము.
చిట్టచివర విణ. మిక్కిలి చివర.
చిట్టడవి వి. పొట్టిచెట్లతోను, పొదలతోను నిండిన అడవి.
చిట్టమిడుచు క్రి. చిటికవేయు.
చిట్టాడు క్రి. 1. సంచరించు. 2. తప్పటడుగులిడు.3. ప్రసరించు4. .చలించు.5. క్రీడించు.
చిట్టాముదము వి. చిన్న ఆముదపు విత్తుల చమురు.
చిట్టి వి. చిన్న రూ. చిటి.
చిట్టిచేఁతలు వి. విలాసము.
చిట్టియ వి. 1. వెదురు గనువు. 2, వస్త్రపు టంచుల సన్నకమ్మి. రూ. చిట్టె.
చిట్టియము వి. ఇనుము కాచునప్పుడు వచ్చు మురికి. రూ. చిట్టెము.
చిట్టు (వ్యావ.) పరిధాన్యమును దంచగా వచ్చు పొట్టు.
చిట్టుడుకునీళ్ళు వి. పొంగునీళ్ళు.
చిట్టుములు వి. గర్భిణికి కలుగు ఒక లక్షణము, వేవిళ్ళు.
చిట్టె వి. చిట్టియ.
చిట్టెము వి. చిట్టియము.
చిట్టెలుక వి. ఎలుకజాతికి చెందిన చిన్న ఎలుక.
చిట్లు క్రి. 1. చిటులు. 2. కోపించు.
చిట్లుకత్తె విణ. మిక్కిలి కోపము గలవాడు
చిడిపి విణ. 1. అల్పము. 2. పరుషము.
చిడిముడి వి. తొట్రు.
చిడిముడిపడు క్రి. తొట్రుపడు.
చిడిముడిపాటు వి. తొట్రుపాటు.
చిడుగు విణ. అల్పము.
చిడుము వి. 1. చిన్నకురుపు.

చిత సం. వి. 1. సొద. 2. ప్రోపు. రూ. చితి.
చితి సం. వి. 1. సొద. 2. ప్రోగు.
చితుకు క్రి. కురుపు మొ.వి నలగు.
చిత్త వి. 1,చిత్ర. 2.నక్షత్రము లందొకటి. 3. ఒక కార్తె పేరు.
చిత్తగించు వై. క్రి. 1. మనస్కరించు. 2. తలచు. 3. యోచించు.
చిత్తడి వి. మిక్కిలి తడి.
చిత్తడినేలలు వి. (భూగో.) 1. ఎల్లప్పుడు నీళ్ళతో నిండియుండు భూములు 2. నదుల సమీపములో నున్న భూములు (Marshes)
చిత్తడి వాయువు మి. వి. (వ్యవ.) దంప నేలలో సూక్ష్మజీవులు సేంద్రియ పదార్థమును శిథిలము చేయుటచే నుత్పత్తియగు ఒక విధమగు వాయువు.($CH_4$) (Marsh gas or Methane).
చిత్తము సం. వి. మనస్సు.
చిత్తరువు వై.వి. 1.చిత్రము. 2.ఆశ్చర్యము. 3. పటమునందలి రూపు.
చిత్తడి వి. వర్షర్తువు, వానకాలము.
చిత్తినీ వై. వి. 1. చిత్రిణి. 2. స్త్రీలలో ఒక జాతి. 3. ఆ జాతికి చెందిన స్త్రీ.
చిత్తు వం. వి. 1. జ్ఞానము. 2. వి. మొదట వ్రాసిన వ్రాత.
చిత్ర సం. వి. 1. చిత్త. ఒక నక్షత్రము. 2. మాయ.
చిత్రకంఠము సం.వి. 1.కపోతము 2. గువ్వ
చిత్రకము సం.వి. 1. చిఱుతపులి. 2.బొట్టు.
చిత్రకాయము సం. వి. చిఱుతపులి.
చిత్రకారుడు సం. వి. 1. చిత్తరువు వ్రాయువాడు. 2. ముచ్చి.
చిత్రగుప్తుఁడు సం. వి. 1. యముడు. 2. యముని యొద్ద లేఖకుడు.
చిత్రదర్శిని సం. వి. (భౌతి.) రంగురంగుల ప్రతిబింబములను చూపించెడి ఒక ఆట వస్తువు (Kaleidoscope).
చిత్రబింబము సం. వి. ఊసరవెల్లి.
చిత్రభాను సం. వి. అరువది సంవత్సరములలో నొకటి.
చిత్రభానుఁడు సం. వి. 1. అగ్ని. 2. సూర్యుడు.
చిత్రము సం. వి. 1. ఆశ్చర్యము. 2. పటమున వ్రాసిన రూపము. 3. చతుర్విధ కవిత్వములో నొకటి. 4. విశ. నానా వర్ణములు గలది.
చిత్రశిఖండీ సం.వి. సప్తర్షులలో నెవరైనను ఒకడు.(సప్తర్షులకు చిత్రశిఖండులని పేరు.
చిత్రశిఖండిజుఁడు సం. వి. బృహస్పతి.
చిత్రిణి సం వి. చిత్తిని, ఒకజాతి స్త్రీ.
చిత్రితము సం. విశ. చిత్రింపబడినది.
చిదక విశ. చప్పట. రూ. చిదుక.
చిదగొద వి. వ్యత్యాసము.
చిదియు క్రి. నలగు.
చిదుకు క్రి. చిప్పిలు.
చిదుగు వి. 1. ఎండిన సన్నపుల్ల. 2. సమిధ.
చిదుము క్రి. 1. గిల్లు. 2. పూలుకోయు. 3. త్రుంచు. 4. వైచు.
చిదురలు వి. సూక్ష్మఖండములు. రూ. చిదురపలు, చిద్రుపలు.
చిదురపలు వి. చిదురలు.
చిద్రుపలు వి. చిదురపలు.
చిన విశ. రూ. చిన్న.
చిని విశ. చిన్ని.
చినుఁగు క్రి. వస్త్రాదులు ఛిన్నమగు.
చినుకు క్రి. 1. కారు. 2. కురియు. 3. కార్చు. వి. వానబొట్టు.
చినుకుఁబూస వి. ముత్తెము.
చిన్న విశ. 1. అల్పము. 2. కనిష్ఠము.
చిన్నతాఱు వి. బాల్యకాలము.
చిన్నటనాడు వి. బాల్యసమయము.

చిన్నతనము వి. 1. బాల్యము. 2. అవమానము.

చిన్నది వి. బాలిక. విశే. చిన్నదైనది (వస్తువు).

చిన్ననాడు వి. బాల్యసమయము. చూ. చిన్నటనాడు.

చిన్నము వి. నాలుగు గురిగింజల ఎత్తు. (బంగారము మొ.వి.).

చిన్నరి పొన్నరి విశే. మనోజ్ఞము. చూ. చిన్నారి పొన్నారి.

చిన్నవాడు వి. బాలుడు.

చిన్నవోవు క్రి. ఖిన్నుడగు.

చిన్నారి విశే. చూ. చిన్నరి పొన్నరి.

చిన్న విశే. 1. చిన్న. 2. మనోజ్ఞము.

చిన్నిదపు వి. చిన్నపువ్వు. 2. బంగారు.

చిన్నిపువు వి. 1. నమస్కృతి. 2. భూషా విశేషము. చూ. చిన్నపువ్వు.

చిన్నియ వై. వి. 1. చిహ్నము, గురుతు. 2, విలాసము. చూ. చిన్నె.

చిన్నె వై. వి. చిన్నియ యొక్క రూపాంతరము.

చిన్నెలాఁడు విశే. విలాసవంతుడు.

చిన్నెలాడి విశే. విలాసవతి.

చిపిటతలము సం. వి. (భౌతి., గణి.) చదునుగా నుండెడుచోటు (Flat place).

చిపిటము సం. వి. అడుకులు విశే. చప్పట ముక్కు వాడు.

చిప్ప వి. 1. కప్పచిప్ప. 2. కల్లుత్రాగెడు గిన్నె. 3. టెంకాయచిప్ప. 4. తాబేటి చిప్ప. 5. ముత్యపుచిప్ప. 6. మోకాటి చిప్ప. 7. తలపుర్రె, 8. చేపమీదిపొలుసు. 8. తునుక. విశే. అల్పము.

చిప్పకత్తి వి. మోటకత్తి.

చిప్పకూఁకటి వి. పిల్లజుట్టు.

చిప్పగొడ్డలి వి. చెట్లునరకుగొడ్డలి.

చిప్పపెడక వి. ఇంటి పైరప్పముల కప్పు.

చిప్పముత్తెము వి. 1. కృత్రిమ మౌక్తికము, చేఁప ముత్తెము.

చిప్పమూతి వి. కళాహీనమగు ముఖము.

చిప్పిలు క్రి. 1. నీటిబొట్టులోనగునవి లోపలనుండి పైకుబుకు. 2. స్రవించు, చూ. చిప్పిల్లు.

చిప్పెవాఁడు వి. కుట్టుపనివాఁడు. దర్జీ.

చిబుకము సం. వి. గడ్డము. చూ. చిబుకము, చుబుకము.

చిబుకు క్రి. చప్పరించు.

చిమట వి. 1. వస్త్రాదులను పాడుచేయు పురుగు 2. ఝిల్లి. చూ. చిమ్మట.

చిమిడిక వి. చిమిడిన అన్నము.

చిముకు క్రి. కనుసైగచేయు.

చిముడు క్రి. 1. అన్నమధికముగ నుడికి ముద్దయగు. 2. పాకముచెడు.

చిమ్ము వి. జలకణ సమూహము.

చిమ్మచీకటి వి. గాఢాంధకారము.

చిమ్మట వి. చిమట.

చిమ్మదిరుగు క్రి. గిరగిర తిరుగు.

చిమ్మనగ్రోవి వి. జలక్రీడయందు నీళ్ళు చిమ్మెడు గొట్టము.

చిమ్మనము వి. చిమ్ముట.

చిమ్మనయంత్రము యం. వి. (వ్యవ.) పైరులను బాధించు కీటకములను నాశనము చేయుటకు నీటితో కలిపిన మందును చల్లు సాధనము (Sprayer).



చిమ్మనయంత్రము

చిమ్మిడికుట్టు వి. (గృహ.) రెండు పోగులు రేగినఅంచులను మడిచి పైని దూరముగా వేయు కుట్టు (Over casting)



చిమ్మిడికుట్టు

చిమ్మిరి వి. నువ్వులు బెల్లము చేర్చి దంచినది. రూ. చిమ్మిలి.
చిమ్మిరేఁగు క్రి. మిక్కిలి విజృంభించు.
చిమ్మిలి వి. చిమ్మిరి.
చిమ్ము క్రి. 1. వైచు, 2. పొడుచు. వి. 1. పొడచుట. 2. మీటుట.
చిమ్ముడు వి. చిమ్ముట.
చియ్య వి. కండ. మాంసము.
చిరంటి సం. వి. 1. జవరాలు. 2. ఐదువరాలు.
చిరంతనము సం. విణ. 1. బహుదినములది 2. ప్రాతది. రూ. చిరత్నము.
చిరక్రియుఁడు సం. విణ. తామసించి కార్యము చేయువాడు. రూ. చిరకారి.
చిరజీవి సం. విణ. 1. చిరకాలము జీవించువాడు. వి. 1. కాకి. 2. విష్ణువు. 3. చిరంజీవి. 4. చిరాయువు. 5. వేలుపు.
చిరత్నము సం. విణ. చిరంతనము.
చిరమర వి. భేదము.
చిరము సం. అవ్య. బహుకాలము.
చిరలగ్నము సం. విణ. (వృక్ష.) కొన్ని వండ్లవరకు ఉండునట్టిది (Persistent).
చిరాకు వి. కోపము.
చిరి సం. వి. చిలుక.
చిరుఁగు క్రి. చినుగు.
చిరుధాన్యములు బ. వి. (వ్యవ.) సజ్జ, రాగి, తమిద మొదలగునవి. ఇవి గడ్డి జాతి ధాన్యములలో చిన్నవి. (Millets).
చిరునామ వి. జాబు మొదలగు వాని మీద వ్రాయు విలాసము.
చిరుపిలకలు వి. (వ్యవ.) కిత్తనార మొదలగు మొక్కల గెలలయందు పూవులకు బదులు బయలుదేరు అకు మొగ్గలు. (Bulbils).
చిరుసాలెపురుగులు వి. (వ్యవ. కీట.) కీళ్లు కలిగి, 8 కాళ్ళతో నుండు నొక విధమైన సాలెపురుగులు. (ఇవి బెండ, ఆముదము, ప్రత్తి మొదలగు మొక్కలను పాడు చేయును.) (Mites).
చిఱచిఱ వి. కోపవికారము.
చిఱుగాలి వి. మందమారుతము.
చిఱుగూబ వై. వి. గూబవంటి చిన్నపక్షి. పైడికంటి.
చిఱుత వై. విణ. 1. చిన్న. వి. చిన్నజాతి పులి.
చిఱుతుక వై. విణ. చిన్నవయసుగలది (స్త్రీ.)
చిఱుదిండి వి. 1. భక్ష్యము. 2. అల్పాహారము.
చిఱుదొడ వి. పిక్క.
చిఱునవ్వు వి. స్మితము.
చిఱుము క్రి. 1. విజృంభించు. 2. చిమ్ము.
చిఱువాలు వై. వి. 2. ఇగురగాచిన పాలు. రూ. చిలువాలు.
చిఱ్ఱు వి. కోపము.
చిఱ్ఱుచిఱ్ఱు వి. తొట్రుపాటు.
చిఱ్ఱులు వొడుచు క్రి. తొట్రుపడు.
చిఱ్ఱుద్ది వి. చిన్నయుద్ది.
చిఱ్ఱుమను క్రి. కోపగించు.
చిఱ్ఱుముఱ్ఱాడు క్రి. 1. పెనగులాడు. 2. భేదించు.
చిలిపి విణ. 1. అల్పము. 2. నికృష్టము.
చిలిపిలిపోవు క్రి. సందడించు.
చిలుక వి. కీరము, శుకము. రూ. చిల్క.
చిలుకకొయ్య వి. 1. వస్త్రములు తగిలించుకొను కొయ్య. 2. నాగదంతము.
చిలుగడ వి. పగ్గములోనగు వాని కొనను వేయు కొలికిముడి.
చిలుకతాళి వి. చిలుకరూపేర్పరచిన పతకము.
చిలుకరించు క్రి.
చిలుకరౌతు వి. మదనుడు.

చిలుకలకొలికి వి. స్త్రీ.
చిలుకు క్రి. 1. చిందు. 2 ప్రసరించు. 3. మీరు. 4. చల్లు. 5. త్రచ్చు. వి. 1. కొలికి. 2, గొండ్లెము. 3. బాణము. 4. బాణపు అలుగు.
చిలుకుడు వి. చిలుకుట.
చిలువ వి. 1. కొంచముగ చేరి నిలిచిన నీరు. 2. జంజెవలె చుట్టిన నూలుచుట్టు. విశే అల్పము.
చిలుము వి. 1. రాగి మొదలగు లోహము లందలి మురికి. 2 విషము. 3. పొగ పీల్చుట కుపయోగించు గొట్టము.
చిలుమువాలు విశే. 1. తులువ. 2. కుత్సితుడు. 3. తుప్పుపట్టిన కత్తి.
చిలువ వి. పాము.
చిలువతాలుపు వి. శివుడు, భుజంగభూషణుడు.
చిలువతిండి వి. 1. గరుడపక్షి. 2. నెమలి.
చిలువఱేఁడు వి. సర్పరాజు, శేషుడు.
చిలువాయనము వి. 1. చిల్లర. 2. క్షుద్రము.
చిలువాలు వి. 1. ఇవురగాచినపాలు. 2. ఆనవాలు. రూ. చిలువాలు.
చిల్ల వై. వి. 1. శల్యము. 2, కతకవృక్షము.
చిల్లకోల వి. తోమరము (ఒక ఆయుధము).
చిల్లగొండి వి. కలహాకారి.
చిల్లపెంకు వి. విరిగిన కుండ పెంకు.
చిల్లమడ్డి వి. అందుగుబంకతో చేసిన ధూప ద్రవ్యము.
చిల్లర వి. 1. కొంచెపాటినాణెము. 2. చింతపండు మొదలగు సరకు. విశే. సామాన్యము.
చిల్లరవర్తకుఁడు మి. వి. (వాణి.) టోకు వర్తకుల యొద్ద చిన్న మొత్తములలో సరకులను కొని ఖోక్తల కందించు వర్తకుడు.
చిల్లి వి. రంధ్రము.
చిల్లంగి వి. 1. ఉచ్చాటనక్రియ. 2. కొంటెతనము.
చిల్లు వి. చిమ్ముట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము.
చిల్లుపొల్లు వి 1. కలత. 2. చిరాకు. 3. సంక్షోభము.
చివఁగి వి. 1 ఒక తెగ వేట కుక్క. రూ. చివ్వంగి, చివ్వగి, సివగి, సివంగి.
చివక వి. సన్నని నిడుపాటి కొమ్మ.
చివర వి. 1. కొన. 2, అగ్రము.
చివుక వి. రూపాయిలో నాల్గవవంతు.
చివుకు క్రి. 1, సారహీనమగు. వి. ఎగయుటయం దగు ధ్వని, రూ. చివుక్కు.
చివుక్కుమను క్రి. మనస్సు కలగు, మనసు బాధపడు.
చివురు వి. మా. చిగురు.
చివ్వ వి. 1. కలహము. 2. చివక, సన్నని పొడుగు కొమ్మ.
చివ్వంగి వి. మా. చివగి.
చివ్వంగి వి. సివంగి.
చివ్వఁగి వి. సివంగి.
చివ్వలాడి విశే. కలహశీలురాలు, పోట్లాడు స్వభావముకలది.
చివ్వు క్రి. 1. చెక్కు. వి. బిగువుచేయుట యం దగు ధ్వని.
చివ్వున విశే. శీఘ్రముగ)
చిహ్నము సం. వి 1, గురుతు. 2, చెక్కము.

# చీ

చీ అవ్య. తిరస్కారార్థకము.
చీఁకటి వి. అంధకారము.
చీఁకటిగాము వి. రాహువు.
చీఁకటిగొంగ వి. సూర్యుడు. వ్యు. చీకటికి శత్రువు.
చీఁకటిచెట్టు వి. తమాల వృక్షము.

చీఁకటితప్పు వి. జారత్వము, వ్యభిచారము.
చీఁకటి బజారు మి. వి.(వాణి.అర్థ.) కావలసినంత సరకు లేనప్పుడు ప్రభుత్వము విధించిన ధరకన్న ఎక్కువ ధరకు రహస్యముగ వస్తువుల నమ్ము పద్ధతి.
చీఁకటి యోఁగ వి. చిన్నదోమ.
చీఁకిలి వి చీపురుగట్ట.
చీఁకు క్రి. 1. చప్పరించు, 2. చుంబించు. వి. అంధత్వము. విణ. అంధుడు.
చీఁకుఱించు క్రి. అంధమగు.
చీఁదఱ వి. 1. ఉపద్రవము. 2. ఛిద్రము. 3. అసహ్యము.
చీఁదఱగొను క్రి. 1. ఉపద్రవపడు. 2. ఆవేశమెత్తు.
చీఁదఱరేఁగు క్రి. ఆవేశమెత్తు.
చీఁదు వి. (ముక్కు) చీదు.
చీఁపురు వి, బొరకకట్ట, సమ్మార్జని.
చీకాకు వి. 1. చివికిన ఆకు, 2. శ్రమ.
చీకాకు వి. 1. నలకువపడు. 2. శ్రమపడు.
చీకిలించు క్రి. మిరుమిట్లుగొను, కన్నులు మాటిమాటికి మూసి తెరచు.
చీకిలిమాకిలి వి. 1. కొక్కిరి చిక్కిరి. రూ చీకిరిమాకిరి.
చీకుడుఎరువు (వ్యవ.) కంపోస్టు (Compost).
చీకురువాయి వి. 1. ఒక తెగ గబ్బిలము. 2. బుసిపక్షి. 3 జతుక. రూ. చీకురాయి.
చీకొట్టు క్రి. తిరస్కరించు.
చీటకము వై. వి. లీల. రూ.చిట్టకము.
చీటి వి. 1. చిన్నజాబు. 2. ఖండపత్రిక. 3.రంగు ముద్రలు గల వస్త్రము.రూ.చీటి.
చీటికిమాటికి అవ్య. మాటిమాటికి.
చీటినిధులు మి. వి. (వాణి.) సభ్యులైనవారు ప్రతిమాసము ఒక నియమితమైన మొత్తము చెల్లించు చుందురు. ఇట్లు ప్రోగుపడిన సొమ్మునంతను సభ్యులలో ఎవరి కవసరమో వారికిగాని వేలముపాటలో ఎక్కువ వడ్డీకి పాడినవారికిగాని అందచేయుదురు. నిర్ణీత కాలాంతము వరకు సభ్యులు వారికి ముందే పైకము అందినను, అందకపోయినను నియతమైన మొత్తమును చెల్లించు చుండవలెను (Chit Funds).
చీడ వి. పైరులను చెరిపెడి పురుగు.
చీనామృత్తిక నం. వి. (ర .) పింగాణీ పాత్రలు తయారుచేయుట కుపయోగించు సన్నని తెల్లని మట్టి.ఇందు పొటాసియమ్ అల్యూమినియమ్ సిలికేట్ల సమ్మేళన ముండును, చీనీమట్టి (China Clay).
చీపు వి. 1. అరటిగెల యందలి యొక భాగము. 2. అత్తము.
చీమ వి, పిపీలిక.
చీమిడి వి. నాసామలము, శింఘాణము,
చీము వి. చెడి తెల్లనైన నెత్తురు, పూయము,
చీర వై. వి. వస్త్రము (ఇది వాడుకయందు స్త్రీవస్త్రమాత్ర పర్యాయముగ కావబడుచున్నది. నేడు "కోక" అను అర్థమున రూఢము).
చీరణము వి, చిన్నయులి. రూ. చీర్ణము.
చీరపేను వి. 1. చీరబోతు. 2. గుడ్డ నంటుకొని యుండు తెల్లపేను 3. ధేమకము,
చీరము నం. వి. 1. కౌపీనము. 2. నారచీర. 3. వలువది పూసలు గల సరము.
చీరిక వి. 1. పాయ. రూ. చీలిక.
చీరు క్రి. 1. చీలుచు. 2. చీరు. 3. పిలుచు.
చీఱు క్రి. గీరు. 2, చీల్చు.
చీల వి. 1. మేకు. 2. కీలము. రూ. సీల.
చీలమండ వి. 1, కాలిమడమల కిరుప్రక్కల నుండు కీలు, గుల్ఫము. రూ. సీలమండ (Ankle bone).

చీలిక వి. చూ. చీలిక.

చీలికలోయ వి. (భూగో.) రెండు రకముల భూభాగముల మధ్య పగులేర్పడి, భూకంపము లేక యితర కారణముల వలన భూమి దించుకొని పోయి లోయగా నేర్పడిన భూభాగము.

చీలు క్రి. బద్దలగు.

చీఱుము క్రి. 1. చీలఁజేయు. 2. విదారించు. 3 బ్రద్దలుచేయు. రూ. చీల్చు.

చీవాట్లు వి. 1. గద్దింపు మాటలు. 2. తిట్లు.

## చు

చుంబకము సం. వి. 1. త్రాసుముల్లు, 2. సూదంటురాయి.

చుంబకుఁడు సం. వి. 1. పెక్కు గ్రంథములయం దించించుక చదివినవాడు 2. ముద్దు పెట్టుకొనువాడు. 3. మోసగాడు.

చుంబనము సం. వి. ముద్దు

చుంబించు సం, క్రి. ముద్దిడుకొను.

చుక్రము సం. వి. 1. చింతపండు. 2 పులుసు.

చుచుందరి సం వి. 1. చుంచు. రూ. చుందరి

చుబుకము సం. వి. గడ్డము. రూ. చిబుకము.

చులుకము సం. వి. 1 పుడిసిలి, 2. చేర.

చుల్లి సం. వి. 1. పొయ్యి. 2. సొద రూ. చుల్లి.

## చూ

చూచుకము సం. వి. 1. స్తనాగ్రము. 2. అంచు.

చూడ సం. వి. 1. నెమలిజుట్టు. 2 జుట్టు 3. చూరు. 4. జావంపురి.

చూడాకర్మము సం. వి. పుట్టువెండ్రుకలు తీయుట.

చూడామణి సం. వి. 1. శిరోరత్నము. 2. శ్రేష్ఠవాచకము.

చూతము సం. వి. మామిడిచెట్టు.

చూపుబిల్లు మి. వి, (వాణి.) దిగుమతిదారుడు సరకులను తాను కస్టమ్స్ వారి సమక్షములో విప్పిచూచుకొనవలెనన్నచో నింపవలసిన ఒక ఫారము.

చూర్ణకుంతలము సం. వి. అలకలు. ముంగురులు.

చూర్ణప్రావరములు సం. వి. (జం.) మృదువైన



శరీరములపై రక్షణ చూర్ణప్రావరము కొరకు గట్టి గుల్ల గల నత్త. జంతువులు. (ఈ గుల్ల ఎక్కువ సున్నము కలిగియుండును). ఉదా.- నత్తగుల్ల. శంఖములు (Mollusca).

చూర్ణము సం. వి. 1. గంధపొడి. 2. సున్నము 3. దుమ్ము. 4. పొడి,

చూర్ణిక సం వి. 1 గద్యభేదము. 2. యమకము గల పద్యము.

చూలిక సం వి పిల్లజుట్టు.

చూషకపీడనము సం. వి. (వృక్ష.) ఉత్స్వేదన క్రియచే దారువాహికలలో నుండి పోషక ద్రావణములు పైకెక్కునపుడు కలుగు ఒత్తిడి (Suction Pressure).

చూషణధావక యంత్రము సం. (వి. గృహ.) నీటిని పీల్చుట వలన బట్టల నుతుకు యంత్రము.



చూషణము సం. వి. పల్చుట. 2. సం. వి. (రసా.) పీల్చుకొనుట (నీటిని స్పంజి వలె (Suction), 3. సం. చూషణధావక (జీవ ) ఆహారాదిద్రవపదార్థ యంత్రము

ములు సజీవములగు జీవకణములలోనికి ప్రవేశించుట. (Absorption).

# చె

చెంక వి. కపోలము, చెక్కిలి. రూ. చెంప.
చెంగఁగొట్టు క్రి. ఓడించు.
చెంగనాలు వి. 1. గంతులు. 2. నమస్కృతి
చెంగలి విశే. సమీపము.
చెంగలించు క్రి. 1. అతిశయించు. 2. ప్రకాశించు. 3. విజృంభించు. 4. హసించు
చెంగలువ వి. ఎఱ్ఱకలువ.
చెంగావి వి. అందమైన ఎరుపు బట్ట.
చెంగు క్రి. 1. తొలగు. 2. వెనుదీయు. వి. చెరగు.
చెంచు వై. వి. ఒక తెగ బోయ.
చెండాడు క్రి. ఖండించు.
చెండు క్రి. ఖండించు. వి. 1. కందుకము, బంతి. 2. పూబంతి.
చెంత వి. చేరువ, సమీపము.
చెందిరము వై. వి. 1. సింధూరము. 2. కుంకుమ. రూ. చెంద్రము. చందురము.
చెందిరిక వి. 1. కమ్మపైరుద్దు, రూ. చెంద్రిక.
చెందు క్రి. 1. కలుగు. 2, పొందు.
చెంద్రము. వై. వి. చెందిరము.
చెంద్రిక వి. చెందిరిక,
చెంప వి. 1. కపోలము. 2. పార్శ్వము.
చెంపకొప్పు వి. ప్రక్కకొరగ వేసికొనకొప్పు
చెంపసరులు వి. స్త్రీ భూషావిశేషము.
చెంబు వి. చిన్నలోహ పాత్రము.
చెంబుతల వి. బట్టతల.
చెకపికలాడు క్రి. తొందరపెట్టు.
చెకుముకి వి. నిప్పును కలిగించుకొనురాయి.
చెక్ ఇం. వి. (అర్థ.) (Cheque) 1. హుండి. 2. బ్యాంకు ఖాతాదారు తన ఖాతాలో ఒక నిర్ణీతమైన మొత్తమును అడిగిన వెంటనే బ్యాంకరుకు వ్రాసి యిచ్చు ఆజ్ఞాపత్రము. రూ. చెక్కు.
చెక్క వై. వి. మ్రానులోనగు వాని తునక నం. శకలః.
చెక్కడము వి. రత్నములను పొదుగుట.
చెక్కియము వి. 1. ఎముకలయందుండు నెయ్యి, రూ. చెక్కెము.
చెక్కిలి వి. 1, చెంప. కపోలము. రూ, చెక్కు
చెక్కు క్రి. 1. పొదుగు, 2. చేర్చు; 3, చెక్కులుచేయు. వి. చెంప. ఇం. వి. (అర్థ) బ్యాంకులో ఖాతాదారుడు తనకు గల సొమ్ములో కొంత భాగమును తనకుగాని తాను వ్రాసిన వానికిగాని ఇయ్యవలసినదిగా బ్యాంకుకు వ్రాసి యిచ్చు ఆజ్ఞాపత్రము.
చెక్కుడు పార వి. గడ్డిచెక్కుడు పార,
చెచ్చెర విశే. శీఘ్రముగా,
చెట్ట వై. వి. 1. కీడు, 2, చేయి, విశే, దుష్టుడు.
చెట్టపట్టు క్రి. వివాహమాడు,
చెట్టు వి. 1, గుల్మము, 2, వృక్షము.
చెట్టుఁద్రిమ్మరి వి. కోతి, వృక్షచరము.
చెట్టుగట్టు క్రి చెట్టుగా నేర్పడు (అవయవ సౌష్ఠవ మేర్పడుట).
చెట్టువ వి. 1. రెక్క. రూ. చట్టువ.
చెడగరము విశే. 1. క్రూరము, 2. క్రూరుడు.
చెడనాడు క్రి. 1, నిందించు, 2, శపించు,
చెడీప వి. రంకుటాలు,
చెడు క్రి. 1. కనబడకపోవు,2,కొల్లపోవు. 3. నశించు,

చెడుగు వి. 1. అశుభకార్యము. విశే. 1. క్రూరము. 2. దుష్టము.

చెడ్డ వై. వి. 1. కీడు. విశే, దుష్టము.

చెడ్డీ వి, మోకాలి వరకు తొడిగికొను లాగు రూ. చెడ్డీ.

చెడ్డీ వి. (గృహ.) లోపల వేసికొనెడి దుస్తు (Under wear).

చెడ్డు క్రి, తొడచరచు.

చెత్త వి. 1. తృణము. గడ్డి. 2. పనికిరానిది.

చెత్తనేలలు వి. (వ్యవ.) అడవులలో ఆకులు అలములు రాలి క్రుళ్లుట వలన సేంద్రియ పదార్థములు ఎక్కువగా నుండు నేలలు. (Organic or peaty Soils).

చెదరు క్రి. 1. నీళ్లలోనగునవి యెగిరిపడు. 2. వ్యాపించు. 3. చెదరుట.

చెదలు వై. వి. పుట్టలు పెట్టు చీమల వంటి తెల్ల పురుగులు, సం. శిథిలీ.

చెదారము వి తృణలేశము. చెత్త ( చెత్త చెదారమని వాడుక.

చెనఁగి వి. 1. పొట్టి కొబ్బరిచెట్టు, 2 ఒక తెగ వరి. రూ. చెన్నగి.

చెనఁటి విశే. 1. కుత్సితము. 2. వ్యర్థము. 3. శూన్యము. రూ. చెన్నటి.

చెనకు క్రి 1. ఎదిరించు. 2. తాకు. రూ. చెనయు. వి. గోటినొక్కు.

చెనయు క్రి. 1. ఎదిరించు, 2. తాకు. 3. సోలు.

చెనుటరి విశే. గ్రామ్యపు మాట.

చెన్నఁగి వి. చెనగి.

చెన్నఁటి విశే. చెనటి.

చెన్ను వి. 1. అందము, 2. విధము. 3. ఎరుపు.

చెన్నుఁడు విశే. అందగాడు.

చెప్పు వి. పాదరక్ష. క్రి. వచించు, అను.

చెప్పుడుమాట వి. ఒకరు చెప్పినది తాను వినినమాట, చాడీ,

చెమట వి. 1. స్వేదము. రూ, చెమరు.

చెమటకాయ వి. ఎండ వేడికి దేహమున లేచు చిన్న గుల్ల.

చెమటగొట్టు విశే. చెమటపట్టినవాడు.

చెమటపట్టు క్రి. చెమటపోయు.

చెమరించు క్రి. చెమటపోయు.

చెమరు వి. 1. చెమట. 2. చెమరుకాకి.

చెమరుఁబోతు విశే. మిక్కిలిచెమట గలవాడు.

చెమరుచు క్రి. చెమ్మరించు.

చెమ్మ వై. వి. తడి, ఆర్ద్రత. సం. స్మరః. శ్రమః.

చెమ్మగిలు క్రి. 1. తడిగలదియగు. 2, చెమ్మగిల్లు. 3. చెమ్మయురుకు.

చెమ్మగొట్టు తెగులు వి. (వ్యవ.) సామాన్యముగా మడియందు తేమ హెచ్చుగానుండుటచే, కొన్ని జాతుల నారు మొక్కల మొదళ్ళకు ఒక విధమగు బూజు తెగులు పట్టి అవి చీకి వాని తలలు వడిలిపోవుట (Damping off.)

చెయి వి. 1. హస్తము. 2, తొండము. రూ. చేయి, చే, చెయ్యి

చెయిదము వి. 1. పని, చేష్ట. రూ. చెయిది. చెయ్దిదు, చెయువు.

చెయిది వి. చెయిదము. చేష్ట.

చెయువు వి. చూ, చెయిదము.

చెయువుల సాకిరి వి. 1. కర్మసాక్షి. సూర్యుడు.

చెయ్దము వి. చెయిదము.

చెయ్దు వి. చెయిదము.

చెయ్యువు వి. చెయువు.

చెరలాటము వి. 1. విహారము. 2. క్రీడ.

చెరలాడు క్రి. 1. విహరించు. 2. క్రీడించు. 3. వ్యాపించు.

చెరికి విశే. ధూర్తుడు.

చెరుగు క్రి. ధాన్యమును చేటలో చెరుగు.

చెఱ వై. వి. 1. కారాగృహము. 2. నిర్బంధము. సం. కారా

చెఱఁగు వి. 1. అంచు, 2. కొంగు. 3. దిక్కు.

చెఱఁగుమాఁయు క్రి. బహిష్ఠయగు.

చెఱఁప వి. చెంప.

చెఱఁకటము వి. బెల్లము.

చెఱకు వి ఇక్షువు.

చెఱఁకు ఈగ వి. (వ్యావ.) చెఱకు తోట నొక్కొక్కప్పుడు అధికముగ బాధించు నొక రకపు తెల్ల పురుగు. (Sugar cane flypyrilla Perpurilla).

చెఱకు ఎఱ్ఱకుళ్లు వి ( వ్యావ. ) చెరకు గడలపై ఎఱ్ఱని మచ్చలేర్పడు తెగులు, (ఇది ఒక విధమగు బూజు తెగులు) ( Sugar Cane red rot).

చెఱకు చక్కెర వి. (వ్యావ.) చెరకు రసము నుండి తయారైన చక్కెర. (Cane Sugar).

చెఱకు విలుకాఁడు వి. మన్మథుడు.

చెఱగొను క్రి. చెరపట్టుకొను.

చెఱచెఱ విణ. శీఘ్రముగా. రూ. చెచ్చెర.

చెఱచెఱలాడు క్రి. కోపమున నుండు.

చెఱచు క్రి. 1. చెడచేయు. 2. పోగొట్టు. రూ. చెరుచు.

చెఱపనచేట విణ. 1. నాశకుడు. 2. నాశకురాలు.

చెఱపు క్రి. చెరచు. వి. కీడు.

చెఱము వి. నాసాపుటము.రూ. చెరమ.

చెఱవడు వై. క్రి. పట్టువడు.

చెఱి అవ్య, ఒక్కొక్కనికి. రూ. చెరుక.

చెఱుచు క్రి. చూ. చెరచు.

చెఱుపరి విణ. నాశకుడు.

చెఱుపు క్రి. చూ. చెరచు. వి. కీడు, చెడుగు.

చెఱువు వి. తటాకము.

చెలఁగు క్రి. 1. ఉత్సహించు. 2. సంతోషించు. 3. ఒప్పు. 4. వికసించు. 5. శబ్దించు.

చెలఁది వి. సాలెపురుగు.

చెలఁదితెర వి. సాలెపురుగు నేత.

చెలక భూమి వి. (భూగో.) ఇసుక తేఁ భూమి, (సున్నము ఇసుక కలసిన భూమి యగుటచే నీటిపదును నిలిచి యుండజాలదు.)

చెలగము వై. వి. సాలెపురుగు. సం. శలకః.

చెలగు క్రి. 1. ఖండించు. రూ. చెలవు, చెల్గు.

చెలమ వి. 1. నీటి కొఱకు యిసుకలో త్రవ్విన పల్లము, 2. కూపకము

చెలయు క్రి. 1. చిమ్ము. 2. విజృంభించు.

చెలరేఁగు క్రి. మిక్కిలి విజృంభించు.

చెలి వి. 1. స్త్రీ. 2. స్నేహితురాలు.

చెలికాఁడు వి. స్నేహితుడు.

చెలికారము వి. స్నేహము. రూ. చెలిమి.

చెలిది వి. 1. చర్మరోగము, 2. మేహరోగము. రూ. చెల్ది.

చెలిమరి విణ. 1. చెలికాడు. 2. చెలికత్తె.

చెలిమి వి. స్నేహము.

చెలిమికాఁడు విణ. మిత్రుడు.

చెలిచుక్క వి. అనూరాధ.

చెలియ వి. స్త్రీ.

చెలియలికట్ట వి. సముద్రపుగట్టు, వేల. రూ. చెల్లెలికట్ట.

చెలియలు వి. తనకంటె చిన్నదియగు తోడబుట్టువు, రూ. చెల్లెలు, చెల్లియలు.

చెలువ వి. 1. అందగత్తె. 2, స్త్రీ. రూ. చెల్వ.

చెలువము వి. 1. అందము. రూ. చెలువు.

చెలువుఁడు వి, 1. అందగాడు. 2. హితుడు.

చెల్ల అవ్య, సంతాపార్థకము. రూ. చెల్లవో, చెల్లరే, చెల్లరె.

చెల్లచెదరు విణ. 1. మిక్కిలి చెదరు. రూ. చెల్లాచెదరు.

చెల్లియలు వి. 1. చెల్లెలు. రూ. చెలియలు.
చెల్లు క్రి. 1. అయిపోవు. కడచు. 2. కొనసాగు. 3. తగు. 4. శక్యమగు. 5. చేరు. 6. చావు. 7. మారు. విశ. చెల్లినది.
చెల్లుబడి వి. 1. అధికారము. 2. మాటసాగుదల 3. చెల్లుట.
చెల్లుబడి నాణెము వి. (అర్థ.) ప్రభుత్వానుమతితో ప్రచారములో నున్న నాణెము. (ఈ నాణెమును ఎవ్వరేని ద్రవ్యముగా స్వీకరింపకపోయినచో ప్రభుత్వము శిక్షించును).
చెల్లెలు వి. చెలియలు.
చెవి వి. 1. శ్రవణము, వినెడియింద్రియము. 2. రాట్నము మొదలగు వానియందుగల యొక భాగము. 3. తాళపుచెవి.
చెవికొణక వి. కొనచెవి.
చెవి గొట్టము వి. (గృహ.) చెవి లోపలి భాగము పేరు. (Eustactrian tube).
చెవిటి విశ. 1. చెవిటివాడు, బధిరుడు.
చెవిటిమూఁగ విశ. చెవుడును, మూగతనమును కలవాడు, పడమూకుడు.
చెవియాకు వి, లక్కాకు, కమ్మ, రూ. చెవ్వాకు.
చెవుడు వి. చెవులు వినని రోగము, బాధిర్యము.
చెవ్వ వి. 1. బిడ్డలకు పుట్టిన వెంటనే కలుగు వ్యాధి విశేషము. 2. చర్మమాలిన్యము.
చెవ్వాకు వి. చెవియాకు, కమ్మ.

# చే

చే అవ తృతీయా విభక్తియందు వచ్చు ప్రత్యయము. వి. 1, హస్తము. 2. తొండము.
చేంబరు ఆఫ్ కామర్సు ఇం. వి. (అర్థ.) (Chamber of Commerce). వాణిజ్య మండలము, వ్యాపార సంఘము.
చేఁత వై. వి. 1. చేయుట. 2. చేష్ట. విశ. కృత్రిమము.
చేఁతకాఁడు వి. క్రియావంతుడు.
చేఁతగట్టు వి. కృతకాద్రి, క్రీడార్థము కృతకముగా నిర్మించుకొన్న కొండ.
చేఁతచీకము వి. కీడు.
చేఁత్రాడు వి. నీళ్ళుచేదు త్రాడు.
చేఁదు క్రి. 1. ఆకర్షించు. 2. నీళ్ళుచేదు. వి. 1. రుచులలో నొకటి. 2. తిక్తము.
చేఁప వి. మత్స్యము.
చేఁపు క్రి. స్తనములు పాలు స్రవించుటకనువగు.
చేఁపుడు వి. చేపుట.
చేకట్లు వి. చేతికట్లు, హస్తభూషణము.
చేకత్తి వి. చిన్నకత్తి.
చేకానుక వి. పెద్దల దర్శింపబోవునపుడు తీసికొనిపోవు కానుక, చేదర్శనము.
చేకుఱు క్రి. 1. లభించు, 2. సిద్ధించు. రూ. చేకూరు.
చేకూరు క్రి. చూ. పై.
చేకొను క్రి. 1. గ్రహించు. 2. ఆదరించు.
చేగ వి. 1. కొయ్య నడిమి నల్లని గట్టి భాగము 2. సారము. 3. ధైర్యము. రూ. చేవ.
చేగలమెకము వి. ఏనుగు. హస్తి.
చేగలవాడు వి. ఈవికాడు, వదాన్యుడు.
చేట వి. చెరిగెడి సాధనము, శూర్పము.
చేటకొల్లారు వి. మూడు ప్రక్కలచేరిక కట్టడము గల యిల్లు.
చేటగోళ్ళబోటి వి. శూర్పణఖ.
చేటచెవులమెకము వి. ఏనుగు.
చేటచెవులవేలుపు వి. గణపతి.

చేటరిక్క వి. విశాఖనక్షత్రము.
చేటి సం. వి. 1. పనికత్తె. రూ. చేటిక.
చేటిక సం. వి. చేటి.
చేటు వి. 1. వినాశము. 2. కీడు. 3. అశుభము, 4. మరణము.
చేటుఁడు వి. 1. పనివాడు. 2 శృంగార నాయకుని సచివుడు. విశే. నికృష్టుడు.
చేట్లకొలువి విశే. నిర్భాగ్యుడు. రూ. చిట్లకొలువి.
చేడియ వై. వి. 1. చేటి, స్త్రీ. రూ. చేడె. సం. చేటీ.
చేడె వై. వి. చూ. పై.
చేడ్పడు క్రి. 1. బాధపడు 2 చలించు.
చేడ్పాటు వి. బాధ.
చేత వై. అవ. 1. తృతీయా విభక్తి ప్రత్యయము. రూ. చేన్
చేతఇనుము వి. (రసా.) పోత యినుమును కరగించి మలినములను పోగొట్టగా మిగిలిన యినుము. (Wrought iron).
చేతనము సం. విశే. 1. ప్రాణము కలది. 2. ఆత్మ. 3. పరమాత్మ.
చేతము సం. వి. మానసము.
చేతపులు క్రి. 1. లభించు. 2. నష్టమువచ్చు
చేతస్సు సం. వి. 1. మనస్సు. రూ. చేతము
చేతాఁకు వి. సాహసము.
చేతిబిడ్డ వి. పసిబిడ్డ.
చేతిబోడి విశే. నిర్ధనుడు.
చేతివల (వ్యావ కీట.) చేనిపైనున్న కీటకములను పట్టుకొనుటకు వీలుగానుండు వలవంటి చిన్న సాధనము(Hand-net).
చేతివిప్పు వి. నమస్కారము.
చేతివెలుఁగు వి. దివ్వటీ, దివ్వెటీ.
చేతివ్రాలు వి. (ని బహు) హస్తాక్షరము, చేతితో వ్రాసినది, చేవ్రాలు, సంతకము.
చేతోభవుఁడు సం. వి మన్మథుడు, (మనసి జుడు.
చేదండ వి. హస్తావలంబనము, చేతిలోనుంచుకొను పూదండ.
చేదర్థకము సం. వి (వ్యాక) సంస్కృతమునందలి 'చేత్' అనుదానికి ఏని, చో, ఆ ఐన మొ॥గు ప్రత్యయములను తెలుగు క్రియలకు చేర్చి ప్రయోగింపబడిన క్రియా రూపము,ఉదా.వాడు కొట్టిన నేను కొట్టుదును, వాడు కొట్టెనేని, వాడుకొట్టెనా, వాడు కొట్టినచో. వ్యవహార భాషలో 'తే' అనునది చేరగా చేదర్థక క్రియ ఏర్పడును.ఉదా. వాడు, వస్తే నేను వెళతాను.
చేదర్పెనము వై. వి చేకానుక
చేదలమోట వి. (వ్యావ.) సామాన్యముగా నూతులలోనుండి నీరు తోడుట కుపయోగపడు యంత్రము (దీనిని పశువులు గానుగవలె లాగి త్రిప్పుచుండును, ఈ యంత్రమునకు చేదలదండ అమర్చబడి తిరుగుచుండును). (Persian-Wheel).
చేదివియ వై. వి. 1. దివ్వటీ, దివెటీ.
చేదోడు విశే. కార్యసహాయుడు. రూ. చెయిదోడు.
చేను వి. 1. పంటనేల. 2. అడవి.
చేపట్టు క్రి. 1. అవలంబించు. 2. గ్రహించు. 3 పెండ్లాడు. వి. 1. అవలంబము. 2. అనుగ్రహము. 3. స్థానము.
చేపడు వై. క్రి. 1. చిక్కు. 2. లభించు.
చేపనూనె (చేఁపనూనె) అరపూస సబ్బు వి. (వ్యావ.) దీనిచే తయారుచేయుటకు 10 గాలనుల నీటిలో 1పౌను చేపనూనె సబ్బును కరగించి,దానిలో1/2 పౌనుగుగ్గిలమును బాగుగా పొడిచేసి కలుపవలెను ఇది మామిడిపూత పిందె కట్టకుండచేయు తేనెమంచు పురుగు (Mango hopper) మొదలగు కీటకములను నివారించుట కుపయోగపడును.(Fish oil rosin soap.)

చేప (చేఁప) ముల్లు కుట్టు వి (గృహ) చేప వెన్నెముక వలెనకుట్టు (Fish bone stitch) చేపములుకుట్టు



చేబదులు వి. 1. చేతిఅప్పు. 2. అల్పకాలమునకు తీసినయప్పు. 3. ప్రాతమూలకము కాని అప్పు.

చేమంతి వై. వి. సేవంతి, ఒకానొక పూలచెట్టు రూ. సేమంతి. సం. సేవంతీ.

చేమగ్గము వి (గృహ) బట్టలను చేతితో నేయుటకుపయోగించు యంత్రము (Hand-loom).

చేమటియావు వి చిత్ర వర్ణముగల యావు.

చేమిరి వి పాలు తోడు పెట్టుట.

చేమోడుచు క్రి. మ్రొక్కు.

చేమోడ్పు వి. 1. నమస్కారము. రూ చేమోడుపు.

చేయమ్ము వి. చేతితో వేయు అమ్ము.

చేయలఁతి వి. సమీపము.

చేయి వి. 1. చెయి, హస్తము. 2. కిరణము. 3 తొండము. 4. పక్షము.

చేయు క్రి. 1. ఒనర్చు. 2. నిర్వహించు.

చేర వి. చాచిన అరచేయి, పుడిసిలి.

చేరిక వి. 1. కూడిక. 2. సమీపము.

చేరు క్రి. 1. ఒదుగు. 2. సమీపించు. 3. పొందు. వి. 1. చారు. 2. సమీపము. వై. వి. 1. సరము. 2. త్రాడు. 3. గొలుసు. సం. సరః.

చేరుగడి వి. 1. సమీపము. 2 దిక్కు కోణము.

చేరుగొంటి విశే. 1 నష్టము. వి. కొంచి చూడకయే వచ్చిన ఖ్యాతి.

చేరుచు క్రి చేర చేయు. రూ. చేర్చు.

చేరుచుక్క వై. వి. పాపటబొట్టు, చేర్చుక్క

చేరుచుట్టు వి. తెల్లగా దంచని బియ్యము.

చేరువ వి. సమీపము రూ. చేరువడి, చేర్వు, చేర్వ.

చేరువ వి. 1. సమీపము 2. సమూహము. 3 సేన.

చేరువకాఁడు వి. 1. సేనాపతి. 2. కావలివాడు.

చేఱు వై. వి. చేరు యొక్క రూపాంతరము. 1. సరము. 2. గొలుసు, 3. త్రాడు. సం. సరః.

చేలము సం. వి. వస్త్రము. రూ. చీల, సేల.

చేవ వి. 1. చేగ, సారము, 2. ధైర్యము. 3. (వృక్ష.) ద్వితీయ వృద్ధిచెందినదారుకణ సంహతి. (Secondary xylem).

చేవలఁతి విశే అధీనము.

చేవాటు విశే. సమీపము.

చేవిచ్చు క్రి నమస్కారము పెట్టు.

చేష్ట సం. వి. 1. పని, 2. వ్యాపారము,

చేష్టితము సం వి. 1. గతి, 2. చేష్ట.

చేసేఁత అవ్య. (చేతన్ + చేతన్) 1. ఒకరొకరిచేతి మీదుగా, 2. అప్పుడే.

## చై

చైతన్యము సం. వి. 1. తెలివి. 2. ప్రాణము.

చైత్యము సం. వి. 1. కట్టడము. 2. గుడి. 3. బౌద్ధాలయము. 4. యజ్ఞశాల. 5. రచ్చచెట్టు.

చైత్రము సం. వి. 1. నెల. 2. ఒకానొక కొండ.

చైత్రరథము సం. వి. కుబేరుని తోట.

చైత్రసఖుఁడు సం. వి. మన్మథుడు.

చైత్రసారథి సం. వి. మన్మథుడు.

చైత్రికము సం. వి. చైత్రమాసము.

## చొ

చొల్లుకార్చు క్రి. (గృహ.) పసిబిడ్డలు ఉమ్మిని మ్రింగుటకు చేతకాక నోటినుండి కార్చు. చొంగ కార్చు (Slavering).

## చో

చోక్షము సం. విణ. 1. తీక్ష్ణము. 2. పరిశుద్ధము, 3. మనోజ్ఞము. 4. సమర్థము.

చోదకుఁడు సం. విణ. 1. త్రోలువాఁడు. 2. ప్రేరేపించువాడు.

చోదనము సం. వి. త్రోలుట.

చొద్దెము వి. చోద్యము, ఆశ్చర్యము.

చోద్యము సం. వి. 1. ఆశ్చర్యము. విణ. తోలదగినది.

చోరీ హిం. వి. దొంగతనము.

చోరుఁడు సం. వి. దొంగ. రూ. చౌరుడు,

చోలము సం. వి, 1. కుప్పసము, 2, రవిక.

చోషము సం. వి. పీల్చుట,

చోష్యము సం. విణ. పీల్పదగినది.

## చౌ

చౌర్యము సం. వి. దొంగతనము.

చౌర్యోన్మాదము సం. వి. దొంగిలింపవలెనను హేతురహితబుద్ధి (Kleptomania).

చౌలము సం. వి. వెంద్రుకలు తీయు నొకానొక కర్మ, చూడాకర్మ, పుట్టు వెంద్రుకలుతీయు సంస్కారము.

## చ్యు

చ్యుతము, సం. విణ. జారినది.

చ్యుతి సం. వి. 1. జారుట. 2. విడుపు.

## చెఁ

చెఁ ఒక యక్షరము.

చెఁంక వి. కక్షము. బాహుమూలము. రూ. చంకిలి, చక్కిలి,

చెఁంకలాళ్ళు వి. చంకమూట.

చంకిలి వి. చంక.

చఁంగలించు క్రి. 1, చలించు. 2. తొలగు.

చెఁంగు వి. దాటుటయందగు ననుకరణము.

చెఁండి వై. వి. చండి, పార్వతి. విణ. 1. మూర్ఖపుట్టుగలవాడు. 2. క్రూరుడు.

చెఁండిపోతు విణ. మూర్ఖపుపట్టుగల స్వభావము గలవాడు.

చెఁందమామ వై. వి. చంద్రముడు చంద్రుడు రూ. చందురమామ సం. చంద్రమాః.

చెఁందమామపులుఁగు వి. చకోరము.

చెఁందము వై. వి. ఛందము, విధము. సం. ఛందః.

చెఁందా వి. 1. కానుక. 2. ధర్మార్థమువసూలగు పైకము, 3.పత్రికలకు చెల్లించువెల.

చెఁందిరిక వై. వి. చంద్రిక, వెన్నెల, సం. చంద్రికా.

చెఁందు వై. వి. 1. విధము. 2. అందము. 3. చంద్రుడు.

చెఁందురకావి వి. సిందూర వర్ణము. రూ. చంద్రకావి.

చెందురుమామ వై. వి. చంద్రుడు, చంద మామ,
చెందురము వై. వి. సిందూరము, కుంకుమ రూ. సిందూరమ్
చెందుర వి. చంద్రకాంతము.
చెందువ వై. వి. మేలుకట్టు, ఉల్లెడ. రూ. చందువా. సం. చంద్రోదయః.
చెంద్రకావి వి. చూ. చందురకావి.
చెంద్రము వై. వి. చందురము, సం చంద్రః.
చెంపు క్రి. చావచేయు.
చెంపుడుగట్టు వి. వధ్యస్థానము.
చెక్క విశే. 1.సుందరమైనది. 2.తిన్ననైనది.
చెక్కదనము వి. 1. సౌందర్యము. 2. ఋజుభావము. రూ. చక్కన.
చెక్కడుచు క్రి, 1. ఖండించు. 2. చంపు.
చెక్కన వి. 1. అంశము, విశే. సరియైనది.
చెక్కనయ్య విశే 1. సుందరమైనవాడు. 2. వి. మన్మథుడు.
చక్కాడు క్రి. 1. ఖండించు. 2. చంపు. రూ. చక్కడుచు.
చెక్కి వి. 1. స్థానము. 2. వాద్యవిశేషము 3. వైపు.
చెక్కియ వి. ప్రక్క. రూ. చక్కి.
చెక్కిలి వి. చూ. చంక. చంకిలి యొక్క రూపాంతరము సం. కక్షః.
చెక్కిలిగింత వి, గిలిగింత, కితకిత.
చెక్కు వై. వి. 1 షట్కము, ఆరు. సం. షట్కమ్. 2. శుల్కము. 3. తునక. సం. శకలమ్, శల్కమ్.
చెక్కెర వై. వి. శర్కర, పంచదార. సం. శర్కరా.
చెక్కెరతిండి వి. చిలుక.
చెక్కెర విలుకాడు వి. మదనుడు, ఇక్షు ధన్వుడు.
చెక్కెర పంటలు వి. (వ్యావ.) చక్కెర లభించు పైరులు ఉదా చెరకు, బీటురూట మొదలగునవి. (Sugar Crops).
చెగుడు వి కారపుమన్ను. రూ. చవుడు, చౌడు.
చెచ్చు క్రి. మరణించు.
చెచ్చౌకము వై. వి. (చౌకము + చౌకము) సరియైన చౌకము రూ. చచ్చౌకము.
చటాలు వి. 1. ప్రేయుడయం దగు ధ్వన్యను కరణము. 2. అకస్మాత్తు. రూ. చటిల్లు.
చటిల్లు వి చూ. పై.
చటులుపడు క్రి. మొక్కపోవు.
చట్ట వై. వి. 1. కవచము. 2. చొక్కాయ. 3. పూత. సం. కాటకః. వి. 1. చిన్న గోనె. 2. తొడకు వెలుపలి భాగము,
చట్టన విశే. శీఘ్రముగ.
చట్టము వై. వి. 1. న్యాయశాస్త్రము. 2. శాసనము. 3. మంచము లోనగువాని పట్టెలచేరిక. వి. పునుగు చట్టము.
చట్టలచీరు క్రి. చంపు.
చట్టలువావు క్రి. నాశముచేయు.
చట్టి వి. నోరు వెడలుపుగల చిన్న మట్టి పాత్ర.
చట్టు వి. 1. చాపరాయి. 2. రాయి. 3. వై. వి. శిష్యుడు. సం. ఛాత్రః.
చట్టువ వి. రెక్క. రూ చెట్టువ.
చట్టువము వి. 1. గరిటె. 2. తెడ్డు.
చప్టాయి వి. చాపరాయి.
చతికిలు క్రి. పిఱ్ఱలు నేలనాను.రూ. చదికిలు.
చదర వై. వి. కూర్చుండెడి చిన్నచాప. రూ. చదరిక.
చదరంగము వై. వి. 1. చతురంగము. 2. ఒక యాట. సం. చతురంగమ్.
చదరము వై. విశే. సమమైన నాలుగు మూలలుగలది, సమానమైనది. సం. చతురశ్రమ్.

చేదలము వి. 1. సైన్యము, 2. సేనవిడిసిన చోటు.
చేదలు వి. ఆకాశము.
చదలుకాఁపు వి. వేలుపు.
చేదలుమానికము వి. సూర్యుడు, ద్యుమణి. నభోమణి.
చేదలేఱు వి. ఆకాశగంగ.
చేదికిలు క్రి. చూ. చతికిలు.
చేదియు క్రి నలుగు.
చేదివించు క్రి. 1 చదువచేయు, 2. పెండ్లిండ్ల యందు వధూవరులకు కానుకలు పురోహితునిచే చెప్పించి యిచ్చుట.
చేదుకము వై. వి. 1. చతుష్కము,నాలుగు దారులు కలియుచోటు 2. శృంగాటకము
చేదుకు వి. బురద.
చేదును వి. 1. సమప్రదేశము. విశ. సమము
చేదునుచేయు క్రి. (వ్యావ.) విత్తులు చల్లుటకు ముందు దున్నిన నేలను ఎగుడు దిగుడులు లేకుండ బల్లపరుపుగా నుండునట్లు చేయు (Levelling).
చేదునుపట్టె వి. (వ్యావ.) దమ్ముచేసిన తరువాత నేలను చదును చేయుట కుపయోగించు పనిముట్టు. దీనిని పశువులులాగును (Levelling board).
చేదుపు క్రి. 1. చంపు. 2. నలుచు.
చేదుము క్రి. 1. గ్రుద్దు. 2. చంపు.
చేదుర వై. విశ. 1. చతుర. 2. సమర్థురాలు. రూ. చదురా, నం. చతురా.
చేదురాలు విశ. చతుర, సమర్థురాలు.
చేదురు వై. వి. 1. చతురము, నేర్పు, నం. చతురమ్, 1. ఆటకచ్చేరి. 3. సభ. నం. సదస్.
చేదురుఁడు వై. విశ. 1. చతురుడు. 2. సమర్థుడు. నం. చతురః
చేదువరి విశ. విద్వాంసుడు.
చేదువు క్రి. పఠించు. వి. 1. పఠనము. 2. విద్య. 3. వేదము.
చేదువుల పడఁతి వి. సరస్వతి.
చేదువుల పులుఁగు వి. చిలుక.
చేదువుల ముదుకఁడు వి. బ్రహ్మ.
చేదువులయ్య వి. ఉపాధ్యాయుఁడు
చేదువులవేలుపు వి. బ్రహ్మ.
చేనవరి విశ. చనవు గలవాడు.
చేనవు వి. 1. అధికారము. 2. అనురాగము 3. కోరిక 4. చెల్లుబడి.
చేను క్రి. 1. పోవు. 2. చెల్లు. 3. తగు. 4. కడచు.
చేను వై. వి. చన్ను. నం. స్తనః.
చేనుఁగప్పు వి. రవిక. రూ. చన్నుగప్పు.
చేనుకట్టు వి. 1. రవిక. 2. స్తనప్రదేశము.
చేనుదెంచు క్రి. 1. వచ్చు. 2. పోవు.
చేనుప వి. 1. బిడారు. 2. మార్గము.
పనుపకము వై. వి. చంపకము, సంపెగ. నం. చంపకః.
చేనుమఱు వి. చనుమొనచుట్టుగల నలుపు.
చేనుముక్కు వి. చూచుకము.
చేనువాఁడు విశ. చెల్లుబడి కలవాడు.
చేన్నీళ్ళు వి. శీతలోదకము.
చేన్ను వై. వి. 1. స్తనము. 2. మొగలియూడ, 3. తాటిముంజె.4. తాటిచన్నులు, నం. స్తనః.
చేన్నుఁగప్పు వి. చూ. చనుగప్పు.
చేప్ప విశ. 1. రసహీనము, 2. అణఁగినది. రూ. చవ్వ.
చేప్పట వై. వి. చపేటము, చఱపు, నం. చపేటః.
చేప్పటించు వై. క్రి. చరచు.
చేప్పన వి. చప్పదనము.
చేప్పర మంచము వి. చప్పర మమర్చిన మంచము.
చేప్పరము వి. 1. పైని పందిరివలె నేర్పరిచిన నలుచదరపు ప్రమానిచట్టము. 2.

చౌకము తీర్చి వేసిన పందిరి 3. గుడారము. రూ. చప్రము.
చప్పరించు క్రి. చవిచూచు.
చప్ప విణ. లోపలికణగినది.
చప్పిడి విణ. 1. చప్పనిది. 2. లోపలికణగినది.
చప్పుడించు క్రి. శబ్దముచేయు.
చప్పుడు వి. అచేతన వస్తువులు ఒకటితో నొకటి తాకుటచే కలుగుధ్వని, శబ్దము.
చప్రము వి. మా. చప్పరము.
చమరు క్రి. 1. అరచేతకొట్టు. 2. చంపు.
చమురు క్రి. రాచు. వి. నేయి నూనె మొదలగునవి. రూ. చమురు.
చమురు గింజల పైరులు వి. (వ్యావ.) నూనెనిచ్చు గింజల పైరులు. ఉదా. ఆముదము, వేరుసెనగ, కుసుమ, నూవు మొదలగునవి. (Oilseed Crops).
చమురు దినుసులు వి. (వ్యావ.) నూనె గింజల పైరులుగాక నూనె లభించు ఇతర ద్రవ్యములు, ఉదా. నిమ్మగడ్డ, చందనము, సీమబాదము, కొబ్బరి మొదలగునవి. (Oil stuffs).
చయ్యన విణ. శీఘ్రముగా.
చరలాట వి. 1. క్రీడ. 2. చర్లాట, చర్లాటము.
చరలాడు క్రి. క్రీడించు.
చరి వి. గంజి, అంబలి.
చమురు క్రి. మా. క్రి. చమురు.
చఱచు క్రి. 1. అరచేత తట్టు. 2. అరచేత కొట్టు. 3. కొట్టు. 4. ఆక్రమించు 5. తుడుచు.
చఱపు వి. 1. ఆస్ఫాలనము, అరచేతి దెబ్బ 2. రేకు.
చఱి వి. సంచరింప నశక్యమగు పర్వత శిఖరము క్రిందిచోటు. రూ. చఱియ.
చఱియ వి. మా. పై.
చలచలన విణ. ద్రవరూపము కలది.
చలపకారము వి. మాత్సర్యము.
చలపకారి విణ. మాత్సర్యశీలుడు.
చలపట్టు క్రి. మాత్సర్యముగొను. రూ. చలముకొను, చల పొడుచు.
చలపొది విణ. మాత్సర్యశీలుడు. రూ. చలమరి.
చలపొడుచు క్రి. మాత్సర్యముగొను.
చలపోరు క్రి. చలముపట్టి పోరాడు.
చలము వి. మాత్సర్యము. రూ. చలపకారము.
చలవాది వి. చావు సమాచారము తెలుపు వాడు
చలాడము వై. వి. సగము తొడవరకు తొడిగికొనుదుస్తు. రూ. చల్లడము, చల్లాడము.
చలి వి. శీతము.
చలికారు వి. శీతాకాలము, శిశిరర్తువు.
చలిగరువు వి. మీద యిసుకగల రాతిపారు నేల.
చలిగొండ వి. హిమాద్రి,చలిచట్టు, చలిమల
చలిచీమ వి. ఒక విధమగు చీమ.
చలిది వి. నీటపోసి యుంచిన అన్నము, పర్యుషితము. రూ. చద్ది.
చద్ది వి. మా. చలిది.
చలినెల వి. మాఘము, ఫాల్గునము.
చలిపందిరి వి. 1. దహనమునకు నీరిచ్చు చోటు. 2. ప్రప.
చలిపని వి. శైత్యోపచారము.
చలిపిడుగు వి. చెడగరపు మంచుగడ్డ.
చలిమిరి వి. చలువ. శైత్యము, రూ. చల్మిరి
చలియిసుక వి. హిమవాలుక, కర్పూరము.
చలివాపు క్రి. బుజ్జగించు.
చలివెలుగు వి. చంద్రుడు, శీతకిరణుడు.
చలుపు క్రి. 1. చేయు, 2. కడవు. రూ. పలుపు.

ౘలువ వి. 1. శైత్యము. 2. ఉదికిన వస్త్రము. రూ. చలువడి
ౘలువగట్టు వి. హిమవంతము.
ౘలువజోతి వి. చంద్రుడు.
ౘలువడి వి. చలువ.
ౘలువఱాయి వి. చంద్రకాంతము.
ౘలువఱేడు వి. చంద్రుడు.
ౘల్ల వి. 1. మజ్జిగ. విశే. శీతము.
ౘల్లచప్పుడు విశే. అసమర్థుడు.
ౘల్లజంపు విశే. 1. భయంకరుడు. 2. చల్లగా చంపువాడు.
ౘల్లడము వై. వి. చూ. చలాడము.
ౘల్లన వి. శైత్యము. విశే. శీతము.
ౘల్లపడు క్రి. చల్లనగు, చల్లారు.
ౘల్లరాడు వి. తరిగంబము.
ౘల్లు క్రి. 1. నీళ్లు మొ॥ వి చిలుకరించు. 2. విత్తనములు చల్లు.
ౘల్లుపోరు వి. నీళ్ళు చల్లుకొనుచు నీరాడి యయాట, చల్లులాట.
ౘవలము వి. వరహాలో నెనిమిదవ భాగము
ౘవి వి. 1. రుచి. 2. రసము.
ౘవికె వై. వి. చతుష్కి, మండపము. రూ. చవిక, చవికము.
ౘవుడు వి. చగుడు.
ౘవుడు వి. (వ్యావ.) చౌడు, ఊసరక్షేత్రములలో నేలమీద కనపడు క్షార పదార్థము (చాకలివాండ్రు దీనిని బట్టల నుతుకుట కుపయోగించుచుందురు.) ( Alkaline material).
ౘవ్వ విశే. చూ. చప్ప.
ౘవ్వంచ సర్వ. అయిదు.

# ౘా

ౘాఁగఱ వి. వినాశము.
ౘాఁగఱగొట్టు క్రి. 1. చంపు. 2. బాధించు.
ౘాఁగఱగొను క్రి. 1. కొట్టు. 2. ఖండించు.
ౘాఁగఱలాడు క్రి నాశముచేయు.
ౘాఁగిలింత వి. నమస్కారము.
ౘాఁగు క్రి. 1. దీర్ఘమగు. 2. దండాకారముగ నేలకు వ్రాలు. అవ్య. ప్రశంసార్థకము. రూ. సాగు.
ౘాఁదు క్రి. నీళ్లుపోసి రాచు. వి. బొట్టు పెట్టుకొనుట కుపయోగపడు నల్లని ద్రవ్యము.
ౘాఁప వి. 1. క్రింద పరచుకొను ఆసనము. 2. ఓడకు కట్టు తెరచాప. 3.ఒకరకపువల
ౘాఁపకట్టు వి. చాప పరపు వంటి పరపు.
ౘాఁపఱాయి వి. విశాలమైన బండ.
ౘాఁపు క్రి. 1. చాగచేయు. 2. చాచుట 3. పడుగుకొలది వస్త్రము.
ౘాకల వి. గుడ్డలుదికి జీవించుజాతి. రూ. చాకలి, చాకి.
ౘాకలి వి. రజకుడు.
ౘాకి వి. చూ. పై.
ౘాగకాడు వి. చాగి, త్యాగి.
ౘాగము వై. వి. త్యాగము, ఈవి. సం. త్యాగః.
ౘాగరతనము వై. వి. చింతామణి.
ౘాగు క్రి. 1. పోవు, 2. ప్రవర్తిల్లు. 3. యత్నించు. రూ. సాగు.
ౘాగుబడిక వి. 1. పూజ. 2. నమస్కారము.
ౘాటు క్రి. 1. విశదపరచు, 2. ఎలుగెత్తి చెప్పు. వి. మరుగు, రహస్యము,
ౘాటువ వి. చాటించుట.
ౘాడీ వి. కొండెము. రూ. చాడి.
ౘాడికొట్టు విశే. కొండెకాఁడు, చాడీకోరు.
ౘాడుపు వి. విధము. రూ. చాడ్పు.

ౘాడ్పు వి. చూ. పై.
ౘాన వి. స్త్రీ.
ౘానపి వి. కలయంపి. రూ. సాన్పు.
ౘాపరుపు వి. చాపుపరుపు.
ౘామ వై. వి. 1 యౌవనవతి, 2. నలుపు. 3. ఒకజాతిపైరు. సం. 1. శ్యామా. 2. శ్యామాక..
ౘామనచాయ వై, వి. నల్లనిరంగు.
ౘామనము వై. విశే. శ్యామలము, నల్లనిది.
ౘాయ వై. వి. 1. ఛాయ. 2. కాంతి. 3. సూర్యునిభార్య. 4. నీడ 5. పోలిక. 6. రంగు 7. వైపు. 8. జాడ. 9. సమీపము. 10, చక్కన. 11.(జీవ.) జీవ పదార్థములకు సహజమైన రంగు నిచ్చు పదార్థములు (Pigment).
ౘాయపట్టి వి. శనైశ్చరుడు.
ౘాయమగఁడు వి. సూర్యుడు.
ౘాయవాఱు క్రి. పోలు.
ౘారు వై. వి. 1. సున్నము కలిపినకల్లు. 2. మిరియము మొదలగు సంభారములు చేర్చి కాచిన చింతపండు రసము. సం. సారః.
ౘాఱ వి. గీఱ, రేఖ. రూ. చారిక.
ౘాఱల పెతము వి. పెద్దపులి.
ౘాఱిక వి చూ. చాఱ.
ౘాలమి వి. అశక్తత, అసమర్థత, అస్వస్థత.
ౘాలించు క్రి. నిలుపు, ఆపు.
ౘాలిక వి. సామర్థ్యము.
ౘాలు క్రి. కావలసినంతయగు, ఓపు. వి. 1. వరుస. 2. దున్నునప్పుడు కఱ్ఱుచే నేర్పడురేఖ, ధార. 3. (వ్యవ.) నాగటి కఱ్ఱు నేలలోనికి పోయి కొంతమట్టిని లేవదీసి యిరుప్రక్కలకు నొత్తగించగా చేర్పడిన రేఖ. (Furrow of the plough).
ౘాలుపు వి. వరుస
ౘాలుమాలి విశే. పరాధీనుడు.
ౘాలువాఁడు విశే. శక్తుడు.
ౘావఁజూఁచు క్రి. చంపు.
ౘావడి వి. 1, కొలువుకూటము. 2. మండపము.
ౘావు వి. మృతి.

# ౘు

ౘుంగులు వి. వ్రేలాడు వస్త్రపుకుచ్చు కొనలు.
ౘుంచెలుక వి. 1. చుచుందరి చుందరి. 2. కంపెలుక. రూ. చుండెలుక.
ౘుంచు వి. 1. తలకు ముందు ప్రక్కవిడిచిన పిల్లజుట్టు. 2. జూలు. సమలిపిగ.
ౘుంచు వై. వి. 1. కంపెలుక. సం. చుచుందరి
ౘుండు క్రి. (ఆకు మొ॥వి) ఎండు. వి. తలకువచ్చు ఒక వ్యాధి (Dandruft).
ౘుఁడీ వై. అవ్య. చూడుడి రూ. సుడీ, చుఁడీ, చుఁడు.
ౘుక్క వై. వి. 1. శుక్రుడు, శుక్రనక్షత్రము. 2. నక్షత్రము. 3. గుండ్రనిబొట్టు. 4. నీరు మున్నగు వాని బొట్టు. సం. 1. శుక్రః. 2, చుక్రః.
ౘుక్కకూర వి. ఒకరకమైన ఆకుకూర.
ౘుక్కచేలు వి. 1 నుదుట వ్రేలాడువైచు పతకము. 2. చుక్కలచాలు. 3 చేర్చుక్క.
ౘుక్కయెదురు విశే. 1. శుక్రనక్షత్ర మెదురుగ నుండుట. 2. అశుభమును కల్గించునది. వి. ప్రాతికూల్యము.
ౘుక్కలతెరువు వి. ఆకాశము, నక్షత్రమార్గము.
ౘుక్కలదొర వి. చంద్రుడు.

చుక్కలఱేఁడు వి. చంద్రుడు.
చుక్కాను వి. పడవనడపు తెడ్డు, అరిత్రము.
చుక్కాసు వి. 1. మేక. 2 సంతాపమునందు కలిగించు ధ్వని.
చుఱుకు విశే. చురుకుచురుకు, మిక్కిలి చురుకు,
చుట్ట వి. 1. గుండ్రముగా చుట్టినది. 2. పొగచుట్ట. 3. మోపు మోయునపుడు తల పై పెట్టుకొను చుట్ట.
చుట్టకుదురు వి. కుండలు కుదురుగా నిలుచుటకు వాని క్రింద పెట్టుకుదురు.
చుట్టము వి. 1. బంధువు, సంబంధి. 2. స్నేహితుడు.
చుట్టరికము వి. బంధుత్వము, సంబంధము,
చుట్టలుఁగు వి. (చుట్టు+అలుగు) చక్రాయుధము, చుట్టుగైదువు. రూ. చుట్టలు.
చుట్టిల్లు వి. నిట్రాడు నాటి గుండ్రముగా గట్టిన యిల్లు, చుట్టుగుడిసె.
చుట్టివచ్చు క్రి. ప్రదక్షిణముచేయు.
చుట్టు క్రి. 1. చుట్టగాచుట్టు. 2. తిరిగిరాచేయు. 3. నలువైపులు. 4. స్త్రీకాలి యుంగరము.
చుట్టుఁగొండ వి. చక్రవాళ పర్వతము, చుట్టుమల, చుట్టుగట్టు.
చుట్టుఁబులుగు వి. చక్రవాళము.
చుట్టుకొను క్రి. పరివేష్టించు.
చుట్టుగుల్ల వి. వలయాకార శంఖము.
చుట్టుదారి వి. తిరిగి తిరిగి పోదగిన దూరపు త్రోవ.
చుట్టుకూలియ వి. గుండ్రని యిల్లు.
చుప్పనాక వై. వి. శూర్పణఖ, రావణుని చెల్లెలు. రూ. చుప్పనాతి.
చుప్పనచూఱ వి. 1. మిక్కిలిచూర. 2. పెద్దకొల్ల. 2. విశే. సమృద్ధి, పుష్కలము.
చుమె వై. అవ్య. చూడుమి. రూ. చుమీ, సుమి, సుమ్మీ.
చుము వై. అవ్య. చూడమి. రూ. చుమీ, చుమ్మీ. చమ్ము, చువె, చువ్వె, సుమ్ము. సుమీ, సూవె.
చుమ్మ వి. వేదన.
చుమ్మచుట్లు వి. కడుపునందలి వేదన.
చుమ్మలుచుట్లు క్రి. చుమ్మవారు, వేదనపడు.
చురకత్తి వై. వి. ఛురిక, చిన్నకత్తి, రూ. చురి, చురియ, చూరి, చూరీ, సురియ.
చురచుర వి. కాలుటయందలి ధ్వన్యనుకరణము, చురచుర.
చురచురవోవు వి. చురచురమనుట,
చురి వై. వి. ఛురిక.
చుఱుకు వి. 1. వాడి, వాడిమి. 2. పేడిమి. 3. వేగము. 4. ఆయుధము నాటుట. 5. నిప్పు సోకుటయందగు అనుకరణము. రూ. చురుక్కు.
చుఱువుచ్చు క్రి. కాల్చు.
చుఱ్ఱు వి. కాలుట మొదలగు వానియందగు అనుకరణము.
చుఱ్ఱుకొను క్రి. కాల్చు.
చులుక విశే. తేలికగా, సులభముగా. రూ. చుల్క.
చులుకఁజేయు క్రి. అగౌరవించు.
చులుకన వి. 1. లాఘవము. 2. సౌలభ్యము. విశే. లఘువు.
చుల్లరము వి. 1. కోడెవయసు గల పంది. 2. కోడెవయసు గల మిట్టసాటు
చువ్వె అవ్య. చుమీ.

## చూ

చూ అవ్య. చూడుము, చూడుఁడు. రూ. సూ.
చూఁడి వి. గర్భము, చూలు.
చూఁడు క్రి. కాల్చు. వి. 1. చుండు. 2 వాత.

చూచాయ వి. 1. జాడ. 2. తేలిక.
చూపట్టు క్రి. కనుపట్టు.
చూపరి విశే. అందగాడు.
చూపఱు విశే. చూచువారు. ప్రేక్షకులు.
చూపు వై. క్రి. చూపించు. వి. దృష్టి.
చూపుగుడ్డిము విశే. ఉపయోగము లేని వాఁడు. రూ. చూపుడు గుడ్డిము.
చూపుడుప్రేలు వి. జుట్టనప్రేలు తర్జని.
చూపోపమి వి. అసూయ.
చూపోవు క్రి. సహించు, అసూయపడకుండ.
చూరకత్తి వి. రూ. చురకత్తి.
చూరు వై. వి. 1. ఇంటిమీది కప్పు చివర సం. చూడా. 2 ప్రవేశికస్తువు వెక్కు వాడి. సం. చూర్ణమ్. క్రి. పొగలతగులు.
చూఱ వై. వి. కొల్ల.
చూఱకాఁడుడు వి. విశే. కొల్లపెట్టినవాడు.
చూఱకొను క్రి. కొల్లపెట్టు.
చూఱలాడు క్రి. చూరకొను.
చూఱాడు క్రి. కొల్లపెట్టు.
చూలాలు వి. గర్భవతి.
చూలు వి. 1. గర్భము. 2. బిడ్డ.
చూవె అవ్య. చుమీ. రూ. చూవే.

# చొ

చొంగ వి. జొల్లు.
చొకా వి. కంచుకము, చొక్కాయ. రూ. చొకాయ, చొక్కా, చొగావి
చొకాటము వై. విశే. చొక్కాటము.
చొకాయ చొక్కా.
చొక్కము వై. విశే. 1. దోషము లేనిది. 2. స్వచ్ఛము సం. స్వచ్ఛమ్.
చొక్కా వి. చొక్కా.
చొక్కాటము వై. విశే. మిక్కిలి స్వచ్ఛమైనది.
చొక్కిలడు క్రి. మోసపుచ్చు.
చొక్కు క్రి. పరవశమగు. వి. 1. పారవశ్యము, చొక్కుపొడి. 2. మూర్ఛ. 3. మోహము. వై. విశే. శుష్కము, ఎండినది
చొక్కునీరు వి. కల్లు.
చొక్కుపెట్టు క్రి. మత్తుమందు మొగ్గనవి చల్లి చొక్కించు.
చొక్కుపొడి వి. మీద చల్లినచో పరవశముగ చేయు ఒకవిధమగు పొడి.
చొచ్చిలు క్రి. చొచ్చు.
చొచ్చు క్రి. 1. ప్రవేశించు. 2. ఆరంభించు. రూ. చొచ్చిలు, చొచ్చిల్లు, చొత్తెంచు, చొరబడు.
చొటచొట వి. కారుటలో నగువానియందగు ధ్వన్యనుకరణము. రూ. జొటజొట.
చొడచొడ వి. కారుటయందగు ధ్వన్యనుకరణము.
చొత్తెంచు క్రి. చొచ్చు, ప్రవేశించు.
చొదుగు వి. చెమ్మ, తడి.
చొదుము వి. ఎండిన యరటి పట్ట.
చొనుపు క్రి. చొరఁజేయు, చొప్పించు. రూ. చొనుపు.
చొప్ప వి. జొన్నలోనగువాని దంటు.
చొప్పడు క్రి. 1. సరిపడు. 2. దొరుకు. 3. కలుగు రూ. చొప్పిలు, చొప్పిల్లు.
చొప్పరి విశే. త్రోవ తెలిసినవాడు.
చొప్పు వి. 1. జాడ. 2. మార్గము. 3. విధము.
చొరబడు క్రి. చొచ్చు. రూ. చొరఁబారు.
చొరఁబాఱు క్రి. రూ. చొరబడు.
చొరపోఁత విశే. ఎడములేనిది.
చొరవ వి. 1. ప్రవేశము. 2. బుద్ధికుశలత.
చొరవకత్తె విశే. చొరవకలది.
చొరవకాఁడు విశే. చొరవకలవాడు.

**చొరుగు** వి. చొక్కాకు, ఎండిన ఆకు. రూ. చొరువు.

**చొరుపు** వి. చొరుగు.

**చొఱ** వి. ఒక తెగ చేప. రూ. చోర.

**చొఱగాఁడు** వి. బోయ, వ్యాధుడు.

**చొలయు** క్రి. 1. మూర్ఛిలు 2. వెనుదీయు 3. వైముఖ్యమునొందు. 4. వైరస్యము నొందు. రూ. సొలయు.

**చొల్లు** వి. చొంగ, రూ జొల్లు.

**చొళ్ళియము** వి జడచుట్ట. రూ. చొళ్ళెము.

**చొళ్ళెము** వి. చొళ్ళియము.

## చో

**చోటు** వి. తావు.

**చోళె** వి. రాగిపైరు, (బహు. చోళ్లు.)

**చోదు** వి. బ్రహ్మరంధ్రము. రూ. సోడు.

**చోదుము** వి. కష్టము. రూ. చోద

**చోద** వి. చోదుము.

**చోటె** వి. చోట. 2. అప్పుడు.

**చోపు** వై. క్రి. 1. కలచు. 2. త్రోలు. 3. తరుము. వి. కలత. సం. క్షోభమ్.

**చోపుదు** వై. వి. కలత.

**చోపుదారుఁడు** వై. వి. వేత్రధరుడు. హిం. చోబ్‌దార్.

**చోఱ** వి. రూ చోర. విశ. బాలుడు.

**చోఱబుడుత** వి. 1. చోరమీనుపిల్ల. 2. చేపలవంటి కన్నులు గల స్త్రీ.

**చోవి** వి. బూరెలమీద మూతగా పెట్టెడు పిండి.

## చౌ

**చౌ** వై. సర్వ. నాలుగు. రూ. చవు. (చౌకము నకు సమాసాంతర్గత రూపము) సం. చతుః

**చౌక** విశ. 1. అగ్గువ. 2. తక్కువ. 3. తేలిక.

**చౌకటులు** వి. నాలుగు ముత్తెములు చేర్చి కట్టినపోగులు. రూ. చౌకట్టులు, చౌకట్లు చవుకటులు, చవుకట్టులు.

**చౌకట్టులు** వి. రూ. పై.

**చౌకబారు** విశ. (వ్యావ.) న్యూనమైనది. వెల తక్కువది.

**చౌకము** వై. వి. 1. చతుష్కము, నాలుగు 2. చదరముగ నుండు తుండుగుడ్డ. రూ. చవుకము. సం. చతుష్కమ్.

**చౌకళించు** క్రి. గుఱ్ఱములు మొ॥వి నాలుగు కాళ్లు పైకెత్తి దాటు. రూ. చవుకళించు.

**చౌకళింత** వి. చౌకళింపు. రూ. చవుకళింత. అశ్వగతి విశేషము.

**చౌకాఁడిగుదియ** వి. నాలుగు ప్రక్కలు గల యినుపదండము. రూ. చవుకాఁడిగుదియ.

**చౌకారము** వి. సబ్బు, బట్టల మతుకు సాధనము. చాకలిసబ్బు. రూ. చవుకారము.

**చౌకాలిపీఁట** వి. నాలుగు కాళ్ళుగల మెత్తుపీట

**చౌకీ** వై. వి. పన్నులు వసూలుచేసెడిచోటు. సుంకరిమెట్టు. రూ. చవుకీ. సం. చతుష్కమ్

**చౌకు** వి. కొరడా. రూ. చవుకుడ, చబుకు.

**చౌగంటి** వి. 1. అగ్నిదేవుడు. 2. శరభము. రూ. చవుగంటి.

**చౌటినేలలు** వి. (వ్యావ.) పైకి ఉప్పుతేరిన నేలలు. (సామాన్యముగా యిట్టి నేలకు దగ్గరగా క్రింద రాతిపొరగాని, లోహ సంబంధమగు చట్టుగాని యుండును ) (Saline soils).

**చౌడు** వి. 1. ఊషరక్షేత్రము. 2. చౌటినేల. 3. చౌటిమన్ను.

చౌడులు వి. చతురంతడోల, ఏనుగు పీఠి అంబారి. రూ. చవుడోలు. చౌళా, చవుళా.

చౌళా వై. వి. డోలి.

చౌతి వై. వి. చతుర్థి, పక్షమందు నాల్గవ తిథి. రూ. చవుతి.

చౌదంతి వై. వి. చతుర్దంతి, ఐరావతము. రూ. చవుదంతి. సం. చతురంతీ.

చౌదరి వై. వి. గ్రామమునకు పెత్తనకాడగు కాపు, (కమ్మవారి పేర్లలో చివరిభాగము రూ. చవుదరి. సం. చతుర్.

చౌపదము వై. వి. 1. నాలుగు మూలలు రూ. చవుపదము. 2. నాల్గుపాదములు గలది. లి. గీతి. సం. చతుష్పదమ్.

చౌపుటము వై. వి. అశ్వగతి విశేషము. రూ. చవుపటము.

చౌరు వి. 1. తీపితో కలిపిన ఇంచుకఉప్పు. 2. వేడిమిచే వరి వెన్ను ఎండిపోవురోగము. రూ. చవురు.

చౌలు వై. వి. ముత్తెపు కాంతి, రూ. చవులు.

చౌషష్టి వై. సర్వ. చతుష్షష్టి. అరువది నాలుగు.

చౌసాల వై. చతుశ్శాల, నడుమ బయలును నాలుగు ప్రక్కలును గల ఇల్లు. రూ. చవుసాల.

చౌసీతి వై. సర్వ. చతురసీతి, ఎనుబది నాలుగు.

# ఛ

ఛ ఒక యక్షరము.

ఛందము సం. వి. 1. అభిప్రాయము. 2. వశము.

ఛందస్సు, సం. వి. పద్యలక్షణము తెలిపెడి శాస్త్రము.

ఛగలము సం.వి. 1. మేకపోతు. రూ.ఛాగము 2. పిడుకనిప్పు.

ఛట సం. వి. 1. గుంపు. 2. వరుస.

ఛత్ర సం. వి. పుట్టగొడుగు.

ఛత్రగంథి సం. వి. (జం.) మగ పురుగులలో నున్న శుక్రాశయములు, వానిలో కలిసి యున్న వ్రేళ్ళవంటి అంధనాళికలకట్ట కలిసి 'ఛత్రగ్రంథి' యనబడును, ఉదా.- బొద్దింక. (Mushroom shaped gland)

ఛత్రనితలము సం. వి. (జం.) ఛత్రిక యొక్క పుటాకార తలము (Sub-umbrella).

ఛత్రభంగము సం. వి. 1. రాజ్యనాశము. 2. స్వాతంత్ర్యము. 3. వైధవ్యము.

ఛత్రము సం. వి. గొడుగు.

ఛత్రాకము సం. వి. పుట్టగొడుగు. రూ ఛత్ర

ఛత్రాకార పుష్ప మంజరి సం. వి. (వృక్ష.) ఇది ఏకవర్ధ్యక్షక పుష్పమంజరులలో నొక రకము. ఛత్రాకార పుష్పములన్నియు కలిసి పుష్పమంజరి గొడుగువలెనుండును. (Umbel). ఛత్రాకార పుష్పమంజరీ సమూహము. (Compound umbel).



ఛత్రిక సం. వి. (జం.) జలియకూటము నుండి విడువడు ఒక ప్రత్యేక జీవి. మెడుసా (Medusa).



ఛత్రిక

ఛత్రోత్తలము సం. (జం.) (ఒబీలియా) (Ex-Umbrella) ఛత్రిక (Medusa). యొక్క ఉబ్బెత్తు భాగము.

ఛదనము సం. వి. చూ. ఛదము.

ఛదము సం. వి. 1. ఆకు, 2. ఈక, 3. రెక్క, 4. కప్పు. చూ. చదనము. సం. (వృక్ష) పుష్పము యొక్క మూలమున సాధారణముగ నగపడు చిన్న ఆకువంటి నిర్మాణము దీనికి ముఖ్యోపమునకును మధ్యనుండి లో పుష్పము ఒయలు దేరును (Bract.)

ఛదశూకి సం. వి. (వృక్ష) శూకి పుష్ప మంజరిపై రక్షణకొరకు ఒకటి రెండు పెద్ద చేటికలున్నచో ఆ పుష్పమంజరికీ పదము వర్తించును. (Spadix.)


ఛదశూకి

ఛద్మము సం. వి. 1. కపటము. 2. మోసము.

ఛన్నము సం విశే. 1. ఏకాంతమైనది. 2. కప్పబడినది.

ఛర్దనము సం. వి. వమనము, వాంతి

ఛర్ది సం వి వమనము, వేపచెట్టు. చూ. ఛర్దనము.

ఛలము సం వి. 1. కపటము. 2. వెను దీయుట.

ఛలోక్తి సం వి. ఒక అభిప్రాయముతో చెప్పిన పదమునకు మరియొక యభిప్రాయము చేసికొని ఉత్తరము చెప్పుట, చమత్కారపు మాట.

ఛవి సం. వి. 1. కాంతి, 2. కిరణము 3. చర్మము. 4. రంగు.

## ఛా

ఛాందసము సం. వి. 1. తెలివితక్కువ. 2. అమాయకత్వము. విశే. ఛందస్సునకు సంబంధించినది.

ఛాందసుఁడు సం. వి. 1. వేదము చదివిన వాడు. 2. శ్రోత్రియుడు. 3. లౌకికజ్ఞాన రహితుడు.

ఛాంపియన్ ఇం. వి. (Champion) ఆటల పోటీలలో ప్రథమ స్థానము సాధించిన వాడు.

ఛాగము సం. వి. మేకపోతు. పర్యా. ఛగలము, ఛగల.

ఛాగి సం. వి. మేక.

ఛాతనములు సం. వి. (రసా.) కర్రను చిత్రికపట్టునపుడు పైకిలేచు పొరలు. అట్లే ఇనుము తక్కిన ధాతువుల ఛాతనములుతయారుచేయవచ్చును.(Shavings)

ఛాత్రుఁడు సం. వి. శిష్యుడు.

ఛాదనము సం. వి 1. కప్పుట. ఛదనము.

ఛాదనము సం. వి. (రసా.) మూత (Disc)

ఛాది సం. వి. (జం.) బహిః ప్రసరణముపై కొన్ని ప్రాణులకు గల దృఢమైన సాగునట్టి పొర. (Pellicle).

ఛాన్సెలర్-ఆఫ్-ది-ఎక్స్-చెకర్ ఇం. వి. (Chancellor - of-the - exchequer) బ్రిటన్ యొక్క కోశాధ్యక్ష మంత్రి.

ఛాయ సం. వి. 1. నీడ, 2. కాంతి. 3. రంగు 4. ప్రతిబింబము. 5. సూర్యునిభార్య. 6. లంచము. 7. పరుస. 8. కొంచెము. 9. చీకటి. (భౌతి.) ఒక కాంతి నిరోధకమైన వస్తువునకు వెనుకవైపున నుండు కాంతి విహీన చిత్రము, (Shadow).

ఛాయాకరుఁడు సం. వి. గొడుగుపట్టువాడు విశే. నీడను కలుగచేయువాడు.

ఛాయాచిత్ర గ్రహణము సం. వి. (భౌతి.) ఒక వస్తువుపై బడిన కాంతి కిరణముల సంగ్రహించి కాంతి చైతన్యము గల ఫలకముపై పడనిచ్చు ఆ ఛాయాగ్రహణ వస్తువు ఛాయా ప్రతి బింబ పేటికములు గ్రహించుట, అందుల కుపయోగ



పడు ఉపకరణము, కెమెరా, ఛాయా గ్రహణపేటిక. (Photography).
ఛాయాపుత్రుఁడు నం. వి. శని.
ఛార్టరు ఇం. వి.(శాస.)(Charter) 1. పట్టా. 2 పత్రము. 3. శాసనము. కార్పరేషను లేక ఏదైనా ఒక సంస్థ స్థాపించుటకు ప్రభుత్వమిచ్చు పట్టా, ఐక్యరాజ్య సమితి మొదలగు సార్వజనిక సంస్థల సంవిధానములు తెలుపు పత్రము.

## ఛి

ఛిత్వరము నం. వి. 1.శరము, 2.బాణము. 3. కత్తి.
ఛిద నం. వి. ఛేదము. 2. నరకుడు.
ఛిద్రము నం. వి. 1. బెజ్జము. 2. తప్పు. 3, లోపము,
ఛిన్నము నం. విఇ. ఛేదింపబడినది.
ఛిన్నా(న్న)ఛిన్నములు నం. వి. ముక్కముక్కలు.

## ఛీ

ఛీజ్ స్టిక్స్ లేక ఛీజ్‌స్ట్రాస్ ఇం.వి.(గృహ.) (Cheese sticks or Cheese straws) మైదా చీజ్, (గట్టిగాఅదుసుబడిన పాలవిరుగు గుడ్డు సొన మొదలగునవి కలిపి కాల్చి తయారుచేసిన కారపు ఫలహారము.)
ఛీఫ్ జస్టిస్ ఇం. వి. (Chief Justice)ముఖ్య న్యాయాధిపతి.

## ఛు

ఛురి నం. వి. చిన్నకత్తి.
ఛురి నం. వి. చిన్నకత్తి, చురకత్తి. రూ. ఛురి.
ఛురితము నం. వి. 1.కప్పబడినది. 2. కలుపబడినది.
ఛుల్లి నం. వి. చుల్లి, ప్రొయ్యి.

## ఛే

ఛేకము నం. వి. 1. పెంపుడు మృగము, లేక పక్షి. విఇ. నాగరికము
ఛేకానుప్రాసము నం. వి. శబ్దాలంకారములలో నొకటి.
ఛేత్త నం. విఇ. ఛేదించువాడు.
ఛేత్తవ్యము నం. విఇ. ఛేదింపదగినది.
ఛేదనపు కత్తి మి. వి. (వ్యవ.) తోటలోని మొక్కల చిన్న కొమ్మలను, వేళ్ళను కోయుట కుపయోగించు చిన్నకత్తి. (Pruning Knife).
ఛేదనపు రంపము మి. వి. (వ్యవ.) లావుగా నెదిగిన తోటలోని చెట్ల మొక్కల కొమ్మలను కోయుట కుపయోగించు రంపము (Pruning Saw).
ఛేదనము నం. వి. ఛేదించుట, (వ్యవ.) వేళ్ళను, కొమ్మలను, ఆకులను కత్తిరించుట. (Pruning).
ఛేదనరేఖ నం. వి. (గణి.) ఖండించురేఖ (Secant)
ఛేదము నం. వి. (భౌతి.గణి.) 1. ఏ వస్తువునైన ఛేదించునపుడు ( ఖండించునపుడు ) ఏర్పడు సమతలము.(Section). 2.రెండు సమతలములు ఖండించుకొను రేఖ. 3. ఒక వస్తువును ఛేదించునపుడు భాగించు

వస్తువు) [illegible] భాగములలో నొకటి ! 4. సూక్ష్మదర్శినితో చేయు పరీక్షకు తయారుచేయబడిన ఒక వస్తువు యొక్క పలుచని పొర. 5. సం. వి. నరకుడు, ఛురిక. సం, '[illegible]', విచ్ఛేదనమునందు [illegible]

సంభాగము, ఖండము (Section).

ఛేదితము సం. విశే. ఛేదింపబడినది.

ఛేదితవ్యము సం. విశే. ఛేదింపదగినది. చూ. ఛేద్యము.

ఛేద్యము సం. విశే. ఛేదింపదగినది.

## ఛో

**ఛోటిక** సం. వి. చిటిక.

**ఛోరణము** సం. వి. విడిచిపెట్టుట, పరిత్యాగము.

## జ

**జ** ఒక అక్షరము.

**జంగమము** సం. విశే. తిరుగునది.

**జంగముఁడు** సం. వి. జంగమువాఁడు. జంగము.

**జంఘ** సం. వి. పిక్క.

**జంఘానుజంఘాస్థి** సం. వి. (జం.) జంఘాస్థి అనుజంఘాస్థి కలసియున్న యెముక (Tiblo-fibula).

**జంఘాలుఁడు** సం. విశే. మిక్కిలి వేగముగా నడచువాడు.

**జంఘాస్థి** సం. వి. (జం.) పిక్క ఎముకలలో లోపలివైపున నున్నఎముక. (Tibia).

**జంఘిక** సం. వి. (జం.) పిక్క యెముకలలో రెండవది, అనుజంఘాస్థి. (Fibula).

**జంటచేరిక** వి. (వృక్ష.) ఒక విధమగు పత్ర విన్యాసము. ఒక్కొక్క కణుపునకుఎదురు బొదురుగా రెండు పత్రములుండగా క్రింది కణుపు పత్రములకు పైకణుపు పత్రములు సమకోణములలో నుండు స్థితి. (Decussate).

**జండా** హిం. వి. టెక్కెము. చూ. జెండా.

**జంతుకృషి** సం. వి. (వ్యవ.) పశువులు మొదలగు జంతువుల పెంపకముతో సంబంధించిన వ్యవసాయ శాస్త్ర శాఖ. (ఈ శాఖలో పశుపాలనము, కుక్కుట పాలనము, మధుమక్షికా పాలనము, మత్స్య పాలనము అను ఉపశాఖలు గలవు.(Animal husbandry).

**జంతుజాలము** సం. వి. (జం.) ఒక కాలమునగాని, ఒక ప్రదేశమునగాని ఉన్న జంతువుల మొత్తము. (Fauna).

**జంతుమాంసకృత్తులు** సం. వి. (జం.) జంతువుల శరీరములో తయారైన మాంసకృత్తులు. (Animal protiens) ఉదా. అల్బుమిన్ (Albumen), కేసిన్ (Casein,) ఫైబ్రిన్ (Fibrin), మయోసిన్ (Myocin), జిలాటిన్ (Gelatin).

**జంతువు** సం. వి. చేతనము, ప్రాణముగలది.

**జంతుశాస్త్రము** సం. వి. (జం.) జీవశాస్త్రపు శాఖలలో నొక శాఖ, జంతువుల జీవితము లను గురించి తెలియచేయుశాస్త్రము. (Zoology).

**జంతు సంబంధమైన యెరువులు** (వ్యవ.) జంతువుల శరీరమునుండి ఏర్పడిన యెరువులు, ఉదా :- పశులయెరువు, ఎముకల పొడి మొదలగునవి(Animal manures).

**జంత్వాహార సంబంధము** సం. (జం.) క్లిష్టమగు సేంద్రియ పదార్థములను లోనికి

ఆహారము— తీసికొని ఉదరములోనికి జీర్ణము చేసుకొనునది. (Holozoic).

జంపతులు సం. వి. ఆలుమగలు. చూ. దంపతులు.

జంబాలము సం. వి 1. అడుసు. 2. పాచి.

జంబీరము సం. వి. 1. నిమ్మ. 2. మరువము.

జంబుకము సం. వి. నక్క.

జంబుకుఁడు సం. వి. 1. వరుణుడు. 2. నీచుడు.

జంబువు సం.వి. 1. నేరేడుచెట్టు. 2. నేరేడు దీవి. నేరెళ్లు

జంభభేది సం. వి. ఇంద్రుడు.

జంభారి సం. వి. ఇంద్రుడు.

జగచ్చక్షువు సం. వి. సూర్యుడు.

జగతి సం. వి లోకము. చూ. జగత్తు,జగము.

జగము సం. వి., చూ. పై.

జగ్ధి సం. వి. భోజనము.

జఘనము సం. వి. మొలి.

జఘన్యము సం. వి. 1. మగగురి. 2. తోక. విణ. 1. వెనుకటిది. 2. నిందింప దగినది.

జటి సం. వి. 1. జడ. 2. ఊడ.

జటాలము సం. వి. జడలుగలది, చూ. జటిలము.

జటి సం. వి. జడలుగల సన్యాసి.

జటిలము సం. విణ. జటాలము. వి.సింహము

జటులము సం, వి. పుట్టుమచ్చ. చూ. జడులము.

జట్టిమిడుత వి. ( వ్యవ. ) ఒక్కొక్కప్పుడు దండువలె వచ్చి సస్యనాశనముచేయు ఒక రకము మిడుత. (Locust).

జఠరము సం. వి. కడుపు. విణ. 1. ముదిసినది. 2. కఠినమైనది.

జఠరరసము సం. వి. ( గృహ. ) ఈరసము అన్నకోశములో పుట్టి, ఆమ్ల సహాయ్యముచే కొంత పిండిపదార్థమును చక్కెరగా మార్చును. (Gastric Juice).

జఠర సంబంధమైన సం. ( జం. ) కడుపునకు సంబంధించినది. (Gastric).

జఠరిక సం. (జం.) గుండెకాయలో నుండి రక్తమును బయటికి పంపునది. (Ventrice).

జఠరికలు సం. వి ( గృహ. ) గుండెలోని కింది గదులు Ventricles )

జడత సం. వి. నిశ్చేష్టత. చూ. జడత్వము, జాడ్యము, జడిమము.

జడత్వము సం. వి. (భౌతి.) విశ్రాంతస్థితిలో గాని చలించుచున్న స్థితిలోగాని ఉన్న వస్తువు దాని స్థితి మార్చుకొనక యుండ ఉండు గుణము. (Inertia.)

జడధి సం. వి, సముద్రము.

జడము సం వి నీళ్ళు, చూ. జలము. విణ. తెలివిలేనిది.

జత్వకస్వరము వి. (వ్యాక.) ఒత్తుపదము, ఉదా:- క్క, మ్మ,

జడ్జి ఆం. వి. ( Judge ) న్యాయాధికారుడు. న్యాయమూర్తి, జడ్జిమెంటు (Judgement) = న్యాయనిర్ణయము, తీర్పు.

జతుక సం.వి. లక్క, చూ. జతువు. ఇంగువ.

జత్రువు సం వి. 1. మెడఎముక. 2. కొంకులు (Collarbone or Clavicle).

జనకుడు సం. వి. 1. తండ్రి, 2. సీత యొక్క తండ్రి, (జనకర్షి ).

జనత సం. వి, జనసమూహము.

జననము సం. వి. 1. పుట్టుక. 2. వంశము.

జననవిద్య సం. వి. ( జీవ, ) అనువంశమును గూర్చి తెలియజేయుశాస్త్రము. (Genetics).

జననస్థానము సం. వి. (జం.) అండాశయ నాళము నుండి వచ్చిన అండము లుండు సంచి. (Genital pouch).

జననాంకురములు సం. వి. (జం.) వాన పాము శరీరముపై 17 వ 19 వ ఉంగర

ములమీద నుండు గుండ్రని పల్లపు భాగములు. (Genital papillae).
జననావయవము సం. వి. (జీవ.) సంతానోత్పత్తికి సంబంధించిన అవయవము. (Reproductive organ).
జనని సం. వి. 1. తల్లి. 2. దయ. 3. లక్క. 4. కోరిక.
జననేంద్రియ మండలము సం. వి. (జం.) పునరుత్పత్తి క్రియతో సంబంధము గల అవయవములు (Reproductivesystem)
జననేంద్రియ సంబంధము సం. (జం) పునరుత్పత్తిచేయు అవయవములకు సంబంధించినది. (Genital).
జనపదము సం. వి. 1. గ్రామము. 2. దేశము. రూ. జానపదము. (చరి.) ప్రాచీన భారతదేశము (క్రీ. పూ. 600 ఉత్తర హిందూ స్థానమందలి)లోని రాజ్యములు. (వీరి పరిపాలకులను 'విరాట్' అనిపిలుచుచుండిరి.)
జనపదుఁడు సం. వి. పల్లెటూరివాడు. రూ. జానపదుఁడు.
జనము సం. వి. ప్రజ.
జనయిత సం. వి. తల్లి.
జనయిత్రి సం. వి. తండ్రి.
జనరలిజిమో ఇం. వి. (Generallisimo) సర్వసైన్యాధిపతి, నౌకా వాయు సమష్టి సేనల అధిపతి.
జనరలు ఇం. వి. (General) ముఖ్య సేనాపతి.
జనశ్రుతి సం. వి. వాడుక, కింవదంతి.
జనసాంద్రత సం. (భూగో.) ఒక నిర్దిష్టమైన వైశాల్యములో సగటున ఉన్న జనసంఖ్య, చదరపుమైలుకు ఇందరు జనులు అనుట జన సాంద్రతకు ఒక ఉదాహరణ.
జనాంతము సం. వి. జనపదము, దేశము.
జనాంతికము సం. వి. చాటుమాటు.

జనాభా వి. (వ్యావ.) దేశాదుల మొత్తము జన సంఖ్య.
జనార్దనుఁడు సం. వి. విష్ణువు.
జనాశ్రయము సం. వి. మండపము.
జని సం. వి. 1. స్త్రీ. 2. భార్య. 3. కోడలు, పుట్టుక.
జనువు సం. వి. పుట్టుక.
జనుషాంధుఁడు సం. విశే. పుట్టుగ్రుడ్డి
జనోసైడు ఇం. వి. (రాజ.) (Genocide) జనవధ, ప్రజలను జాతులను మతవర్గాలను ద్వేషము వలన నిర్మూలించుట.
జన్మము సం. వి. పుట్టుక.
జన్మి సం. వి. జంతువు, శరీరధారి.
జన్య సం. వి. 1. తల్లి, చెలికత్తె. 2. తోడి పెండ్లికూతురు. 3. సుఖము.
జన్యము సం. వి. 1. యుద్ధము. 2. అంగడి. 3. నింద.
జన్యుజనకము సం. వి. (వృక్ష.) జన్యుకణములు లేక సంయోగకణములను ఉత్పత్తి చేయు ఉద్భిజ్జ భాగము (Gametophyte.)
జన్యుఁడు సం. వి. 1. తండ్రి. 2. తోడి పెండ్లి కొడుకు. విశే. పుట్టదగినవాడు. పుట్టించువాడు.
జన్యువు సం. వి. 1. జంతువు. 2. అగ్ని. 3. బ్రహ్మ.
జపము సం. వి. 1. మంత్రావృత్తి. 2. వేదాధ్యయనము. రూ. జపము
జపించు సం. క్రి. జపముచేయు.
జప్తి(జప్తు) హిం. వి. 1. నష్ట పరిహారము నియ్యకయే ప్రభుత్వము నాజ్ఞపై వ్యక్తి యొక్క ఆస్తిని స్వాధీనముచేసికొనుట. 2. ఋణము లేక శిస్తుచెల్లించనిచో కోర్టు యొక్క అనుమతి పొంది, ఋణమిచ్చువాడు, లేక ప్రభుత్వము వ్యక్తి యొక్క 'చరాస్తి'ని తమ స్వాధీనము చేసికొనుట. జప్తిచేయుట.

జమ హిం. వి. (వాణి.) లెక్కలో కట్టుట (Credit).
జమాబందీ లెక్కలు (వ్యావ. శాస.) భూములపై సంవత్సరమునకు వచ్చు ఆదాయపు లెక్కలు
జమీందారు హిం. వి (వరి) పెద్ద భూస్వామి తన అధీనములో నున్న భూములశిస్తు నేరుగా ప్రభుత్వమునకు కట్టువాడు.
జమీను హిం. వి. భూమి, ఒడంబడికపై రైతు సేద్యము కొరకు తీసికొను వ్యవసాయ భూమి.
జయ నం. వి. 1. పార్వతి. 2. పార్వతిచెలి. 3. సంవత్సరములలో నొకటి. 4. మహాభారతము.
జయంతి నం. వి. 1. ఇంద్రుని కుమార్తె. 2. పార్వతి చెక్కెము. 3. జన్మదినోత్సవము
జయంతుడు నం. వి. 1. ఇంద్రుని కుమారుడు. 2. భీముడు. 3. శివుడు.
జయఘంట నం. వి. జేగంట.
జయపెట్టు నం. క్రి. జయజయయని దీవించు
జయము నం. వి. గెలుపు. నెగ్గుట, కార్యసిద్ధి, సాఫల్యము. (Success).
జయవారము నం. వి. మంగళవారము.
జయించు నం. క్రి. గెలుచు.
జయుఁడు నం. వి. 1. ఇంద్రుని కొడుకు. 2. ధర్మరాజు. 3. విష్ణువు యొక్క ద్వారపాలకుడు.
జయ్యము నం. విఙ. గెలువ శక్యమైనది.
జర నం. వి. ముసలితనము.
జరఠము నం. విఙ. 1. ముసలిది. 2. గట్టియైనది.
జరద్గవము నం. వి. ముసలి ఎద్దు.
జరాభీరువు నం వి. మదనుడు.
జరాయుజము నం. (జం.) బాగుగా అభివృద్ధి చెందిన శిశువులను ఉత్పత్తిచేసి తల్లి శరీరములోనే వానికి ఆహారము నిచ్చుచుండుస్థితి. శిశువునకు జరాయువు ఉండును (Viviparous).
జరాయువిన్యాసము నం. (వృక్ష.) అండాశయములో నున్న జరాయువుల అమరిక (Placentation).
జరాయువు నం. వి. 1. మావి. 2. జటాయువు (వృక్ష) పుష్పముల అండాశయములో బీజాండము లమరియుండు చెమ్మ. (Placenta).
జర్జరము నం. విఙ. శిథిలమైనది. చూ. జర్జరితము.
జర్జరితము నం. విఙ. చూ. పై.
జలగ వి. (జం.) జంతువుల రక్తాన్ని పీల్చుకొని నీళ్ళలో జీవించు పరాన్న జీవి. (Leech). చూ. జెలగ.
జలగ్రాహక ప్రదేశము నం. వి. (భూగో.) నదిలోనికి గాని సరస్సులోనికి గాని వాననీటిని సరఫరాచేయు ప్రదేశము, నదీపోషక ప్రదేశము.
జలచక్రము నం. వి. (వ్యావ.) నీటినితోడి వేయుట కుపయోగపడు చక్రముగల యంత్రము. (Water wheel).
జలచరము నం వి. నీట తిరుగు జంతువు.
జలజము నం. వి. 1. తామర. 2. శంఖము.
జలతాపకము నం. (రసా.) జలమును వేడెక్కించి వస్తువునాజలముతో వేడెక్కించుట కుపయోగపడు పాత్ర. (Water bath)
జలతుల్యాంకము నం. (భౌతి.) ఏవస్తువుతోనైన సమానోష్ణ ధారణశక్తి గల జలముయొక్క బరువు. (ఇది వస్తువు యొక్క ద్రవ్యరాశి, విశిష్టోష్ణముల లబ్ధమునకు సమానము. (Water equivalent)
జలదము నం. వి. మేఘము, మొగులు.
జలపరాగ సంపర్కమునం. (వృక్ష.) నీటి సాయముచే పరాగ సంపర్కము జరుగుట (Water pollination or hydrophily).

జలపటలము [illegible] (భూగో.) [illegible] [illegible] భూమి[illegible]

జలపాతము సం. వి. (భూగో.) [illegible] కొండ[illegible] [illegible] వేగముతో [illegible] 'Water fall'.

జలమాపకము సం. వి. (భౌతి.) ద్రవముల సాంద్రతను కొలుచు పరికరము. (అది ద్రవములో తేలుచుండును. అది మునిగిన భాగమునుబట్టి ఆ ద్రవము యొక్క సాంద్రతను చెప్పును. ద్రవముల కెల్ల దృష్టాంతము జలముగనుక నిజముగా నిది [illegible] జలమాపక మని పేరు వచ్చినది. (Hydrometer)

జలము సం. వి. 1. నీరు, 2. జడము. 3. [illegible].

జలయోజనము సం. వి. (రసా.) ఒక యోగికమునకు జలాణువులను రసాయనికముగా చేర్చుట (Hydration.)

జలయోజితము సం. విశే. (రసా.) జలాణువులతో సంయుక్తమైనది. (Hydrated).

జలరోధకము సం. (గృహ.) తడుపనిది, నీరుఆనునిదినీటిచే చెమ్మగిలనిది.(Water-proof.)

జలవాయువు సం. వి. (రసా.) నీటియావిరిని కణకణలాడు రాతిబొగ్గుపై పంపి నచో లభ్యమగు వాయుమిశ్రమము(ఇందు కార్బన్ మోనాక్సైడ్, ఉదజని ముఖ్యముగా నుండును.) (Water gas)

జలవాయువు సం. వి. (భూగో.) సముద్రము నుండి భూమిమీదికి వచ్చు గాలి. (Sea-breeze).

జలవిద్యుచ్ఛక్తి సం. వి. (భూగో. అర్థ) నీరు ఎత్తు నుండి లోతునకు పడునపుడు ఉత్పత్తియగు శక్తినుండి సేకరించు విద్యుచ్ఛక్తి.

జలవిభాజన క్షేత్రము సం. వి. (భూగో.) నదిపాలు, నది ఉత్పత్తి స్థానము.

జలవిమోచనము సం. (వ్యవ.) నీటిపరుపు. (Drainage) (నేల నుండి) ఉపరిజలవిమోచనము అధోజల విమోచనము.

జలవిశ్లేషణము సం. వి. (రసా.) జలసహాయమున యౌగికమును విశ్లేషించుట (Hydro-lysis)

జలసంధి సం. వి. సన్నమైన సముద్ర మార్గము

జలస్తంభము సం. వి. (భూగో.) సముద్రము లోను, నదులలోను పెద్ద స్తంభము వలె లేచుచు పడు నీరు.

జలాంతర్గామి సం. వి. (భౌతి.) నీటి లోపల సంచరించు ఒడ (Submarine).

జలాకర్షకము సం. విశే. (రసా.) జలము లేదా వాతావరణములో నున్న నీటి యావిరిని పీల్చుకొను సామర్థ్యము గలది. (Hydroscopic).

జలానువర్తి సం. (వృక్ష.) నీరుఉన్న దిక్కుగా పెరుగు స్వభావముగలది.(Hydrotropic)

జలాపనీతములు (నేలలు) సం. (వ్యవ.) జల ప్రవాహము వలన పుట్టినచోటునుండి మట్టి రేణువులు మరియొక చోటికి తీసి కొని పోబడి అచ్చట చేర్పడిన నేలలు. (Alluvial soils),

జలాభేద్యము సం. విశే. (రసా.) నీటితాకుడుకు చెడనిది, నీటిని చొరనీయనిది. (Water proof).

జలాశయము సం. వి. తటాకము.

జలీకరణము సం. వి. (రసా) నీటితో రసాయనికసంయోగ ప్రక్రియ. (Hydration)

జలీకృతము సం. వి. (రసా) నీటితో సంయోగమునకు తేబడినది. (Hydrated)

జలీయకము నం. (జం.) అంతస్థుహీన జంతువులలో నొకటి (Hydrasp)

జలీయకాధ ప్రావరము నం. వి. (జం.) పోషి సంజీవముచుట్టును ప్రాప్తపతెనుండు పర్యావరము. (Hydrotheca).

జలీయకాధశిఫ నం. (జం.) సుకుమారము (Obelia) అను జంతువు ఏర్పైన కణ్ణాలాయి, సముద్రపు మొక్కకు అంటుకొని యుండు పాదభాగము. (Hydrorhiza).

జలీయకాధ స్తంభము నం. (జం.) సుకుమారము యొక్క కాండమువంటి శరీర భాగము. (Hydroculus).

జలీయము నం. విశే. (రసా.) నీటితో కలిసినది. (Aqueous, aqua = నీరు) (వృక్ష.) నీటిలో నుండునది. (Aquatic).

జలీయికము నం. (జం.) ఛత్రిక యొక్క పిలకము (Planula) అను డింభము క్రమముగా నొక పూర్వాంగకము Polyp) గా మారినప్పుడు దానికీ పేరు వర్తించును. (Hydrula)

జలోద్భిదము నం. (వృక్ష.) నీటిలో పెరుగు మొక్క (Hydrpohytic).

జల్పము నం. వి. అయుక్తముకాని మాట.

జల్పాకుఁడు నం. విశే. వదరుబోతు

జవనము నం. విశే. వేగముకలది. వి. వేగము.

జవనిక నం. వి. తెర, యవనిక.

జవము నం. వి వేగము.

జవాను హిం. వి. 1. బంటు. 2. బలశాలి.

జహ్నుతనయ నం. వి. గంగ.

జహ్నువు నం. వి. 1. ఒకముని 2. విష్ణువు.

## జా

జాంగలము నం. వి. మెరకనేల.

జాంగలికుఁడు నం. వి. 1. విషవైద్యుడు. 2, గారడివాడు. రూ, జాంగలికుడు,

జాంగియా ఇం. వి. గృహ.)(Jangia) క్రింది భాగములో అతుకు లేకుండ కుట్టిన చిన్నచెడ్డీ, లంగోటివంటిచెడ్డీ,

జాంఘియా

జాంబవము నం. వి. 1. నేరేడుపండు. 2. బంగారు.

జాంబూనదము నం. వి. బంగారు.

జాకీ ఇం. వి. (వ్యావ.) (Jacky) పంటెపు గుఱ్ఱపు రౌతు.

జాగరము నం. వి. మేలుకొని యుండుట.

జాగరిత నం. విశే, మేలుకొని యుండునది

జాగరూకుఁడు నం. విశే. మేలుకొనియుండువాడు.

జాగా హిం. వి. చోటు.

జాగీరు హిం. వి. రాజు బహుమానముగా నిచ్చు భూమి.

జాగీరుదారు హిం. వి. (చరి.) భూస్వామి. మొగలు పాదుషాల వద్దనుండి, తదితర సంస్థానాధీశులవద్ద నుండి యీనాముగా నీయబడిన భూముల అధిపతి.(తన అధీనములోనున్న హాములు శిస్తు రైతుల వద్దనుండి వసూలుచేసి, తనపై అధికారి అయిన ప్రభుత్వోద్యోగికిగాని సంస్థానాధీశునకుగాని కట్టుట యీతని విధి,)

జాగ్రత్త నం. వి. జాగరూకత.

జాజికాయ వి. (వ్యావ.) (Nutmeg) ఇది Myristaceac) అను కుటుంబమునకు చెందిన Myristica fragransఅను మొక్క యొక్క గింజ, ఇది పరిమళ ద్రవ్యముగ

నుపయోగపడుచుండును. (జాపత్రియను పరిమళ ద్రవ్యము జాజికాయపై నుండు బీజ పుచ్ఛము)

జాడ్యము సం. వి. జడత్వము. 2. అల స్యము.

జాతక కథలు సం. వి. (చరి.) బుద్ధుడు గౌతమబుద్ధుడుగా జన్మమెత్తక పూర్వము బోధిసత్త్వునిగా అనేకావతారము లెత్తెనని గౌతమ బుద్ధుని గురించియు, ఇతర బోధి సత్త్వులను గురించియు కథల రూపముగా తెల్పు బౌద్ధ గ్రంథము.

జాతకర్మము సం. వి. పుట్టినపుడు చేయు క్రియ.

జాతకుఁడు సం. విశే. 1. పుట్టినవాడు. 2. అదృష్టవంతుడు.

జాతము సం. వి. సమూహము. విశే. పుట్టినది.

జాతరూపము సం వి. బంగారము.

జాతవేదుఁడు సం. అగ్ని.

జాతాపత్య సం. వి. బాలెంత.

జాతి సం. వి. 1. కులము. 2. పుట్టుక. 3. సమానత్వము. 4. జాజికాయ. 5. మాలతి. 6. పద్యభేదము.

జాతి సం. వి. (జీవ.) గణము. ప్రాణులలో కొన్ని ఉప జాతులు కలసి ఒక జాతిగా వర్గీకరింపబడినది. (Genus).

జాతి సం. వి. (చరి. రాజ.) ఒక దేశములో నివసించుచు సాధారణముగ ఒకే తెగకు చెంది ఒకే భాష, సంస్కృతి, ఆచారములు కలిగి ఒకే రాజకీయ ఆర్థిక వ్యవస్థలో నుండు జనులు.

జాతికోశము సం. వి. జాజికాయ.

జాతిచరిత్ర సం. వి. (జీవ.) ఒక జాతి యొక్క పూర్వికుల వృత్తాంతము. (Phylogeny).

జాతిపత్రి సం. వి. జాపత్రి.

జాతీయ ఋణము సం. వి. (అర్థ.) దేశాభి వృద్ధి లేక రక్షణ కొరకు ప్రభుత్వము ప్రజలవద్ద తీసికొనిన అప్పు.

జాతీయకరణము సం. వి. ఒక పరిశ్రమను కాని, వ్యాపారమును కాని ప్రభుత్వ రంగములోనికి తీసికొనుట, లేక దాని పరిపాలనమును ప్రభుత్వము వశపరచు కొనుట. (Nationalisation).

జాతీయగీతము సం. వి. రాష్ట్రి గానము, దేశమును పొగడుచు దేశభక్తిని ప్రబో ధించు గీతము. (National Anthem).

జాతీయ - పొదుపు పత్రములు మి. వి. (అర్థ. వ్యాప.) ప్రభుత్వము ప్రజలవద్ద నిల్వయున్న ధనమును సేకరించుటకు ఉపయోగ పడుచున్న ప్రభుత్వ పత్ర ములు. (National Savings Bonds) ఇవి పోస్టాఫీసుల ద్వారా ముఖ్యముగా అమ్ము చున్నారు.

జాతీయ వికాస కార్యక్రమము సం. వి. భారతదేశములో గ్రామ పునరభివృద్ధికై భారత ప్రభుత్వము తయారుచేసిన పథ కము. (National extention cheme)

జాతీయ సంపద సం. వి. దేశసంపద, దేశ ములో కల అనుభోగయుక్త వస్తుసము దాయము యొక్క విలువ.

జాతీయాదాయము సం. వి. (అర్థ.) ఒక దేశములోని జనులెల్లరి కృషిఫలితముగ దేశ సంపదకు కలిపిన మొత్తము సంపద దేశములో ఉత్పత్తియైన సరకుల సేవల యొక్క మొత్తము విలువ. (National Income).

జాత్యంధుఁడు సం. విశే. పుట్టు గ్రుడ్డి.

జాత్యము సం. విశే. 1. మంచి కులమున పుట్టినది. 2. మేలైనది. 3. చక్కనిది.

జాత్యైకీకరణసమితి సం. వి. కులమత వైషమ్యములను రూపుమాపి భారత

జాతిని సుసంఘటితముగ చేయుటకై క్రీ శ. 1962 సంవత్సరములో భారత ప్రభుత్వము ఆధ్వర్యమున జరిగిన వివిధ నాయకుల సమావేశము. ( National Integration Samiti ).

జానకి సం. వి, జనకుని కూతురు, సీత.

జానపదము సం. వి. జనపదము.

జానపదుఁడు సం. వి. గ్రామస్థుడు, పల్లెటూరివాడు. రూ. జనపదుడు.

జాని సం. వి. 1. ముదిమి. 2. భార్య. 3. స్త్రీ

జానుక సం. వి. (శం.) అనుజంఘాస్థి, పిక్క ఎముకలలో బయటివైపున నున్న ఎముక (Fibula.)

జానువు సం. వి మోకాలు.

జాను ఫలకము సం. వి. (గృహ.) మోకాటి చిప్ప, తొడ ఎముక మోకాలి ఎముక కీలుపైగల బిళ్ళ. ( Knee-cap. )

జాబాలుఁడు సం. వి. 1. మేకల మేపువాడు. 2. ఒక ఋషి.

జాబితా హిం. వి. పట్టీ.

జామాత సం. 1. అల్లుఁడు. 2. పెనిమిటి.

జామీను పత్రములు మి. వి. (శాస.) పూచీ కత్తులు, ముద్దాయిని అవసరము వచ్చినప్పుడు హాజరు పరచుటకు జామీనుదారులు వ్రాసియిచ్చు పూచీ పత్రములు ( Security bonds.)

జాయ సం. వి. భార్య.

జాయమానము సం. విశే. 1. కలుగుచున్నది. 2. పుట్టుచున్నది.

జాయాజీవుఁడు సం. విశే. 1. వేషగాడు. 2. నాట్యము చేయువాడు. 3. భార్య వలన జీవించువాడు.

జాయింట్ స్టాకు కంపెనీ ఇం. వి. (అర్థ) (Joint Stock Company) కంపెనీలచట్టముల ననుసరించి స్థాపించిన సంస్థ. (ఇందు పలువురి మూలధనము సేకరించి లాభములు సంపాదించుటకై వినియోగింతురు.

జారిణీ సం. వి. రంకులాడు.

జారితబ్బా వి. (వ్యావ.) పూల మొక్కలకు నీళ్లుపోయు బిళ్ళలుగలడబ్బా (Rosecan)

జారుఁడు సం. వి. వ్యభిచరించెడి పురుషుడు, ఉప పతి.

జారెడికీలు వి. ( శం. ) వరుసగా అమర్చిన ఎముకలు ఒకదాని మీదికి ఒకటి జరుగు కీలు, ప్రసరసంధి, (Gliding Joint )

జాలకము సం. వి. 1. మొగ్గ. 2. వల. 3. కిటికీ. 4. సమూహము. 5. కపటము.

జాలతానికా ద్రవము సం. వి. (శం. ) దెబ్బ కాని, అదురుకాని తగులకుండ కాపాడుటకై వెన్నుపాము చుట్టున ఉండు సాలెపట్టు వంటి నిర్మాణము గల ద్రవము. (Arachnoid fluid ).

జాలవిద్య సం. వి. గారడీ విద్య, ఇంద్రజాలము.

జాలాకారశిరావిన్యాసము సం. వి. ( వృక్ష. ) పత్రఫలకముపై నున్న ఈనెలు వల మాదిరిగా నమర్చబడియున్న స్థితి.(Reticulate venation.)

జాలికానాళము సం. (వృక్ష.) వల గొట్టము, వాహినీ పుంజములో నున్న దారువుయొక్క గొట్టములో వలమాదిరి బలవర్ధక నిర్మాణములులోపలి జాలికానాళము వైపునగలగొట్టము. (Reticulate vessel

జాల్మఁడు సం. వి. 1. యోచింపక చేయువాడు. 2. క్రూరుడు. 3. పామరుడు.

జావాముద్రణ మి. వి. ( గృహ. ) బాటిక్ అద్దకము, మైనములేకజిగురుతో చిత్రములను బట్టమీదవేసి రంగువేయుట (Batic-print).

జాస్తి హిం. విశే. అధికము.

జాహ్నవి సం. వి. గంగ.

# జి

జింక వి. ఇఱ్ఱి.

జింకతలచుక్క వి. మృగశీర్షము,

జింకతలచుక్కనెల వి. మార్గశిరము.

జింకదాలువరి వి. 1. శివుడు 2. చంద్రుడు

జింకపొక్కిలి వి. 1. కస్తూరి. 2. మృగనాభి.

జింకరౌతు వి. వాయువు.

జింగోయిజమ్ ఇం. విణ. (Jingoism) ఔద్ధత్యము.

జిగట వి. 1. బంక. 2. బందన.

జిగటవిరోచనములు (గృహ.) మలము చీము రక్తముతో కలిసి పడుచుండుట. (దీనికి బొడ్డు దగ్గర కూడ నొప్పి యుండును. (Dysentery).

జిగమిష నం. వి. పోవు కోరిక.

జిగమిషువు నం. విణ. పోవు కోరిక గలవాడు.

జిగి వి. కాంతి.

జిగిలి విణ. చక్కనైనది.

జిగీష నం. వి. జయేచ్ఛ, గెలువనిచ్ఛ.

జిగురు వి. బంక. రూ. జివురు, జీగురు.

జిగురు వి. (వృక్ష.) కొన్ని వృక్షభాగముల నుండి పైకివచ్చు అనుంటుకొను స్వభావము గల చిక్కని పదార్థము. (ఇది సారాయములో కరగదు, ఉదా. తుమ్మజిగురు (వ్యవ.) జిగురు పదార్థములు. (Gum)

జిగురు తెగులు వి. (వ్యవ.) నారింజ గణమునందలి జాతుల మొక్కల కాండము నుండి జిగురు బయటకువచ్చు తెగులు. (Gummosis).

జిగురుపొడి వి. (గృహ.) పట్టు బట్టలకు మెరుపు, బిరుసు నిచ్చుట కుపయోగపడునది, తుమ్మబంక, (Gum arabic).

జిఘత్స నం. వి. ఆకలి.

జిఘాంస నం. వి. చంపనిచ్ఛ.

జిఘాంసువు నం. విణ. చంపనిచ్ఛ గలవాడు, శత్రువు.

జిఘృక్ష నం. వి. గ్రహింప నిచ్ఛ.

జిజ్ఞాస నం. వి. తెలియనిచ్ఛ, తెలిసికొనవలెనను కుతూహలము. (Curiosity)

జిజ్ఞాసువు నం. విణ. తెలియకోరువాడు.

జిట్ట వి. 1. వెదురు మొక్క మొన్న. 2. ఒకజాతి పక్షి.

జిట్టకములు వి. కోడిగములు, ఎగతాళి మాటలు.

జిడికరింత వి. మోసపు మాట.

జిడ్డి విణ. మోసైనది.

జిడ్డు వి. నేయి మొదలగు వాని యందలి మెరుగు.

జిడ్డుకడలి వి. పాలసముద్రము.

జితకాశి నం. విణ. యుద్ధమున జయించినవాడు, జయముచే ప్రకాశించువాడు.

జితపడు వై. క్రి. 1. స్థిరపడుడు.2. వాడుకపడు. 3. అనుకూలపడు. జితించు.

జితము నం. విణ. జయింపబడినది, వై. విణ. స్థిరము, నం. స్థితమ్.

జితేంద్రియుఁడు నం. విణ. ఇంద్రియములను జయించినవాడు.

జిత్తు వై. వి. మాయోపాయము. నం. యుక్తిః.

జిత్తులమారి విణ. జిత్తులు చేయువాడు.

జిత్వరుఁడు నం. విణ. జయశీలుడు.

జిద్దు వి. 1, జగడము, 2. కోపము.

జినుఁగు వై. విణ. 1. సూక్ష్మము. 2. అల్పము. 3. మృదువు. రూ. జిలుగు. జిలువు. నం. జాలికా.

జిష్ణుఁడు నం. వి. 1. బుద్ధదేవుడు. 2.విష్ణువు.

జిప్సమ్ ఇం. వి. (రసా.) (Gypsum)గోదంతి. ఖటిక గంధకితము (కాల్షియమ్ సల్ఫేట్). (దీని ప్రత్యణువులో అర్ధజలాణువు రసాయనికముగ సంయుక్తమై యుండును.) సాంకేతికము. $Caso_4$, $1/2\ H_2\ O$. వా. హారశోతము.

జిబ్బటి వి. గబ్బిలము. రూ. జిబ్బడాయి.

జిమ్ము క్రి. జిర్రున వెలికురుకు.

జియో పొలిటిక్సు ఇం. వి. (రాజ. భూగో.) (Geo-politics) భౌగోళిక రాజకీయ శాస్త్రము, భౌగోళిక పరిస్థితుల నాధారముగా అంతర్జాతీయ, రాజకీయ సమస్యలను, దేశరక్షణ సమస్యలను ఎదుర్కొనుట-భూ రాజనీతి.

జియ్య వై. వి. 1. దేవుడు. 2. రాజు. సం. ఆచార్యః.

జియ్యరు వై. వి. వైష్ణవ సన్యాసి. సం. ఆచార్యః.

జిరాయితి హిం. వి. (వ్యవ.) సాగుబడిలో నున్న భూమి, శిస్తు కట్టిన భూమి (Agricultural land).

జిఱ్ఱున విశే. శీఘ్రముగా

జిల వి. దురద.

జిలకఱ్ఱ వై. వి. జీరకము, ఒక సంబారపు దినుసు. రూ. జీలకఱ్ఱ, జీలకఱ.

జిలిబిలి విశే. 1. అల్పము. 2. సూక్ష్మము. 3. శృంగారయుక్తము.

జిలుఁగు వై. వి. 1. సూక్ష్మవస్త్రము. విశే. 2. అల్పము. 3. మందము. సం. జాలికా.
–ఒుగు వి. 1. గొలుసుప్రాత. 2. చిక్కు.

జిల్ల వి. కురుచని కఱ్ఱముక్క, బిల్లగోడు.

జిల్లా హిం. వి. మండలము. (పరి.) భారతదేశములో పరిపాలనా సదుపాయమునకై విభజించబడిన భూభాగము. (ఈ భూభాగముపై జిల్లా కలెక్టరు ప్రభుత్వాధికారిగాను, సెషన్సు జడ్జి న్యాయాధిపతిగాను నుండును.)

జిల్లాకలెక్టర్ మి. వి. (పరి. రాజ.) జిల్లాలోని ముఖ్య రెవిన్యూ అధికారి.

జిల్లాపరిషత్తు మి. వి (పరి. రాజ.) జిల్లా స్థానిక పరిపాలనకై ఎన్నుకోబడిన సంస్థ. క్రీ. శ. 1959వ సంవత్సరపు చట్టము ప్రకారము ఆంధ్ర రాష్ట్రములో, తదితర ప్రదేశములలో జిల్లా బోర్డుల స్థానమున ప్రవేశపెట్టబడిన స్థానిక సంస్థలు.

జిల్లాబోర్డు మి. వి. (రాజ. పరి.) జిల్లాస్థానిక పరిపాలనకై యెన్నుకొనబడిన మండలి.

జిల్లామేజిస్ట్రేటు మి. వి. (పరి. రాజ.) జిల్లా న్యాయాధికారి.

జిల్లు వి. శైత్యాధిక్యమును తెలుపుట యందగు అనుకరణము.

జిల్లేడు వి. అర్కవృక్షము. రూ. జిల్లేరు.

జివురు వి. జిగురు.

జివ్వున విశే. శీఘ్రముగా.

జిష్ణువు సం. వి. 1. ఇంద్రుడు. 2. అర్జునుడు. విశే. జయశీలుడు. రూ. జిష్ణుడు.

జిహ్మగము సం. వి. పాము. విశే. వంకరగా పోవునది.

జిహ్వ సం. వి. నాలుక. (Lingua) కీటకముల క్రింది పెదవి. (Labium) లో గల మూడు భాగములలో నొకటి. చిబుకము (Mentum) (Sub-mentum) అనునవి తక్కిన రెండు భాగములు.

జిహ్వాగ్రసని సంబంధము సం. (జం.) నాలుక గళములతో సంబంధము గలది. (Glosso-pharyngeal).

జిహ్వాసంబంధము సం. (జం.) నాలుకకు సంబంధించినది. (Lingual).

జిహ్వాచాపల్యము సం. వి. తినవలెననెడి కోరిక.

జిహ్వామూలీయము సం. వి. (వ్యాక.) 1. జిహ్వా యొక్క మూలమునుండి (మొదలు

నుండి) పుట్టు అక్షరములు. క, ఖ అను వానికి ముందున్న విసర్గ స్థానమందు వచ్చు ఒక వర్ణము. దీనిని ᳵ అను విధముగ వ్రాయుదురు. ఉదా., యశ ᳵ కాయము. 2. కవర్గము.

జిహ్వాక సం. వి. నాలుక. (వృక్ష.) తృణ పుచ్ఛము, వరి, జొన్న మొదలగు తృణ జాతి (గడ్డిజాతి) మొక్కల ఆకులకు పత్ర ఫలకము, పత్రవృంతము కలియుచోట లోపలి వైపు కనబడు చిన్న తోకవంటి లేక నాలుకవంటి నిర్మాణము. (Lingua)

## జీ

జీంద్రము వి. దురవస్థ.

జీగురు వి. చూ. జిగురు.

జీడి వి. భల్లాతకము, మామిడి మొదలగు వాని తొడిమ యందలి పాలు.

జీడిమామిడి వి. ఒక జాతిచెట్టు, ముంత మామిడి.

జీతగాఁడు విశే. జీతము గొని పనిచేయు వాడు.

జీతము వై. వి. వేతనము. సం. జీవితమ్.

జీనపటము వి. దట్టి.

జీనము వి. జీను క్రింద వైచు మెత్త.

జీని విశే. నాజూకైనది. రూ. జీను.

జీనిగిరివాఁడు వి. 1. ముచ్చివాడు, చిత్ర కారుడు. 2. చర్మకారుడు.

జీను వి. గుఱ్ఱపు పల్లము క్రిందవైచు మెత్త. రూ. జీని.

జీనుఁగ్రోవి వి. పాములవా డూదెడు బుఱ్ఱ.

జీనువ వి. చిత్రమగు గూడు కట్టుకొను ఒక జాతి పిచ్చుక. రూ. జీనువాయి.

జీబు వి. 1. అడుదానికట్టుకోక. 2. ఆకుల తీగల తరచు. 3. క్రాడులోనగు వాని మీది పీచు.

జీబుకొను క్రి. తరుచగు.

జీమూతము సం. వి. 1. మేఘము. 2. కొండ.

జీర వై. వి. రేఖ. సం. చీరమ్.

జీరకము సం. వి. జిలకఱ్ఱ. రూ. జరగము.

జీరా వి. కవచము. రూ. జిరా, జిరాయి.

జీరాడు క్రి. నేలకు తగులుట. రూ. జీరు కాడు, జీరులాడు, జీరుకులాడు.

జీరు క్రి. 1. నేలకురాయు. 2. గీరు. రూ. జీరాడు.

జీరుకు వి. 1. జరుగుడు. 2. జరుగుడాట.

జీరుకుబంతి వి. జీరుకులాడుబంతి.

జీరువాఱు క్రి. 1. జరుగు. 1. తొలగు. 3. వ్యాపించు.

జీర్ణకోశ కుహరము సం. వి. (జం.) అన్నవాహిక లోపలనుండు ఖాళీస్థలము లేక తొఱ్ఱ. (Euteron).

జీర్ణకోశ గ్రంథులు సం. వి. (జం.) ఆహార మును జీర్ణము చేయుటకు కావలసిన రసములను తయారుచేయు గ్రంథులు (Digestive glands).

జీర్ణక్రియ సం. వి. (జీవ.) శోషణము నకును ఉపయోగమునకు వీలుగా నుండు నట్లు ఆహారమురసాయనికముగా సూక్ష్మీ కరణము పొందుట. (Digestion).

జీర్ణమండలము సం. వి. (జం.) ఆహార మును శక్తిగాను, జీవకణజాలములుగాను మార్చుటతో సంబంధము గల అవయవ ములు, అన్నవాహిక, జీర్ణకోశగ్రంథులు. (Digestive system).

జీర్ణము సం. విశే. 1. అరిగినది. 2. చినిగి నది. 3. ప్రాతది. 4. శిథిలము.

జీర్ణశూల సం. వి. (గృహ.) కడుపునొప్పి

చిన్న పిల్లలకు అజీర్ణము వలన వచ్చు కడుపు నొప్పి. (Colic)

జీలకఱ వై. వి. మా. వి జిలకర, జీలకఱ్ఱ. సం జీరకః. (వ్యవ.) ఇది సంబారపు ద్రవ్యములలో నొకటి. (Cumin). ఇది umbelliferae అను కుటుంబమునకు చెందిన Cuminum Ciminum అను మొక్క మొక్క పండ్లు.

జీలుగు వి. బెండు.

జీవంజీవము నం. వి. వెన్నెల పులుగు. చకోర పక్షి.

జీవకణకవచము నం. వి. (వృక్ష.) జీవరసము చుట్టును రక్షణ నిచ్చుచుండు భిత్తిక (Cell wall). (ఉద్భిజ్జ జీవకణము లగు కణకవచముండును. ఇది సెల్యులోస్ అనుపదార్థమును కలిగియుండును.)

జీవకణజాలము నం. వి. (జీవ.) ఒకే నిర్మాణము, ఒకే వ్యాపారము గల జీవ కణముల సమూహము. (Tissue)

జీవకణము నం వి. (వృక్ష.)  జీవరసముతో నిండి యున్నగది. శరీర నిర్మాణమునకును, శరీరధర్మములు నిర్వర్తించుటకును ఇది ప్రమాణము. జీవకణములు (Cell).

జీవకణరసము నం. వి. (వృక్ష.) జీవకణములో నుండు రసధానులలో నిండి యున్న ఆహార పదార్థ ద్రావణము (Cell - Sap)

జీవకణశాస్త్రము నం. వి. (జీవ.) జీవకణ నిర్మాణమును గూర్చి తెలియ చేయు శాస్త్రము. (Cytology).

జీవకణ సంహతి నం. వి. (వృక్ష.) జీవకణ సమూహము. (Tissue).



జీవకణాశ్మము నం. వి. (వృక్ష.) కొన్ని మొక్కల ఆకుల బహిశ్చర్మ జీవకణము లలో ద్రాక్ష గుత్తి వలె నేర్పడు ఖటిక కర్బనితపు స్ఫటికములు (Calcium carbonate). ఉదా. ఇండియా రబ్బరు, మఱ్ఱి మొక్కలు. జీవకణాశ్మము

జీవగఱ్ఱ మి. వి జీవనౌషధము, జీవనాధారము.

జీవదంతము నం. వి. ఏనుగు. జీవించి యుండగా కోసికొను దంతము.

జీవదుఁడు నం. వి. వైద్యుడు.

జీవధనము నం. వి. గోవులు లోనగువది. నం. (వ్యవ.) వ్యవసాయదారుడు పెంచు పశువులు, గొఱ్ఱెలు, మొదలగు జంతు సంపద

జీవనప్రమాణము నం. వి. (అర్థ. శాస.) జీవితములో మానవుడు ఆశించెడి కనీసపు అవసరముల సముదాయము. ఒక దేశమునందు ప్రజలచే అనుభవింపబడిన వస్తువుల సవర్గాల సముదాయము. (ఈ సముదాయము ఎక్కువయినచో జీవన ప్రమాణము పెరిగినదని లేనిచో తగ్గినదని అందురు.)

జీవనచక్రము నం. వి. (జం.) అండదశ నుండి జీవి పుట్టినది మొదలు అది తిరిగి సంతానమును పునరుత్పత్తిచేయు వరకు దాని జీవితములో జరుగు క్రమచర్యలు (Life cycle)

జీవనము నం. వి. 1. బ్రతుకు తెరువు. 2. నీళ్లు.

జీవన్ముక్తుడు నం విశ. జీవించియుండియు. ముక్తి నొందినవాడు.

జీవన్మృతుఁడు నం. విశ. బ్రతికి యుండియు చచ్చిన వానితో సమానుడు.

జీవపరిణామము నం. (జీవ.) ప్రాణులు తక్కువ శ్రేణి నుండి హెచ్చుశ్రేణిప్రాణులుగా వికాసము నొందు క్రమము. (Organic evolution).

జీవము సం. వి. ప్రాణము.

జీవరత్నము సం. వి. శ్రేష్ఠరత్నము.

జీవరసము సం. (జీవ.) ప్రొటోప్లాసం. (Protoplasm). జీవకణములోనుండుకోశ రసము. (Cytoplasm). అస్థి రెండును కలసి జీవరసము అనబడును. (ఇది ద్రవ ఘన రూపములకు మధ్యస్థముగా (శ్లేషా భము (Colloid) నుండును. దీనిరసాయ నిక సంఘట్టనము క్లిష్టముగా నుండును. ప్రాణి యొక్క ప్రాణమునకు ఇది మూలాధారము.

జీవరసాయనశాస్త్రము సం. వి. (రసా.) జంతుజాలమునకు సంబంధించిన రసాయన శాస్త్రము. జీవి శరీర మందున్న ద్రవ్య ములు, ప్రక్రియల రసాయనశాస్త్ర వివ రణము ప్రదర్శించు శాస్త్రము. (Bio-chemistry).

జీవవృత్తి సం. వి. గోవులు మున్నగు వానిని కాచుకొని జీవించుట.

జీవశాస్త్రము సం. వి. (జీవ.) ప్రాణులను గురించి తెలియచేయు శాస్త్రము. (వృక్ష శాస్త్రము. జంతుశాస్త్రము కలిసి జీవ శాస్త్ర మనబడును.) (Biology).

జీవశాస్త్రములు సం. (జీవ.) జీవ భౌతిక జీవరసాయన, సూక్ష్మజీవ, వృక్ష, జంతు శాస్త్రములు. (Biological sciences).

జీవాణువిభజనము సం. (జీవ.) జీవకణ ములు ఒకటి రెండుగా రెండు నాలుగుగా విభజన చెందుట. వీనిలో తొలిదశ (Pro-phase), మధ్యదశ (Mctaphase)చలన దశ(Anaphase),అంత్యదశ(Telophase) అను నాలుగు దశలుండును. (Cell division)

జీవాతువు సం. వి. జీవగఱ్ఱ, బ్రతుకు.

జీవాత్మ సం. వి దేహి, జీవుడు.

జీవి సం. విణ. జీవించువాడు, వి. ప్రాణి.

జీవిక సం వి. బ్రతుకు తెరువు.

జీవితకాలము సం. వి. ఆయువు.

జీవితచక్రము సం. (గృహ.) చూ. జీవన చక్రము. (Life cycle).

జీవితచరిత్ర సం. వి. (జీవ) తల్లి శరీరము నుండి బయటికి వచ్చినది మొదలుపూర్ణ జీవిగా తయారగువరకు జరుగు అభివృద్ధ మార్పులు మొదలగునవి (Life-history)

జీవితభీమా మి. వి. (అర్థ. కాన.) భీమా చేసి కొనువాడు తనకు ఒక నియత కాలము లోపల మృత్యువు సంభవించినచో తాను ముందుగ పేర్కొన్న వ్యక్తికి కొంత సొమ్ము భీమా సంస్థ చెల్లింప వలెనను ఒప్పందము. ఇట్టి ఒప్పందమునకు ప్రతి ఫలముగ, భీమా చేసుకొనువాడు నిర్ణీత కాల వ్యవధిలో వాయిదాల సొమ్ము చెల్లింప వలసి యుండును. దీనిని జీవిత భీమా అందురు.

జీవితము సం. వి. 1. ప్రాణము. 2. జీవము

జీవితస్థాయి సం. (అర్థ.) వ్యక్తి తన జీవి తావసరములను సమకూర్చుకొన గలుగు పరిమితి (Standard of Life.)

జీవితేశుఁడు సం. వి. 1. ప్రాణనాథుడు. 2. యముడు.

జీవుఁడు సం. 1. ప్రాణి. 2. బృహస్పతి.

జీవోత్పత్తి క్రమము సం. (జీవ.) ప్రాణులు ఇదివరకున్న ప్రాణుల నుండియే పుట్ట గలవు గాని ఆకస్మికముగా బయలుదేరుట కవకాశము లేదను భావన (Biogenesis)

జీసస్ క్రైస్టు ఇం.వి. (చరి.)(Jesus Christ) ఏసుక్రీస్తు. (క్రీ. పూ. -8-క్రీ. శ. 29). క్రైస్తవ మతమును స్థాపించిన ప్రవక్త.

## జు

జూకోరెల్లి, జూజాన్‌థెల్లి ఇం. వి. (జం.) (Zoochlorellae - Zooxanthellae) హైడ్రా యొక్క అంతశ్చర్మ జీవకణములలో నుండు ఏకకణ ఉద్భిజ్జములు.

జుగుప్స సం. వి. 1. రోత, 2. నింద. 3. దయ.

జుబ్బా హిం. వి. చంటి పిల్లలు తొడుగుకొను చేతులు లేని అంగీ, పెద్దలు తొడుగుకొను చేతులు ఉన్న అంగీ.


జుబ్బా

జుష్టము సం. వి. ఎంగిలి. విశే. సేవింపబడినది.

జుహూరాణము సం. వి. గుజ్జము. రూ. జుహురాణము.

## జూ

జూకా వి. (వ్యావ.) ఒక విధమైన కర్ణాభరణము.

జూటము సం. వి. 1. శివుని జడముడి, 2. జడముడి.

జూటా హిం. విశే. అబద్ధము.

జూట్ ఇం. వి. (వ్యావ.) (Jute) ఇది పలాస్త్రి కుటుంబము (Tiliaceae) నకు చెందిన Corchorus capsularis C. olitorius అను మొక్కల కాండమునుండి తీయబడునార.

జూరీ ఇం. వి. (Jury) (శాస.) ప్రమాణపురుషగణము. ముద్దాయి నేరము చేసెనో లేదో యని నిర్ణయించు ప్రత్యేక న్యాయసభలోని పెద్దలు వీరు పన్నెండుగురికి తక్కువ కాకుండ ఉందురు.

జూరీపద్ధతి వి. వి. (శాస.) ముద్దాయిని న్యాయస్థానమందు విచారించినప్పుడు న్యాయాధిపతికి సలహా నిచ్చుటకు నియమింపబడిన పన్నెండుగురు సామాన్య వ్యక్తులను జూరీ యందురు. ముద్దాయిపై మోపిన నేరములను పూర్తిగా విని, తమలో తాము సంప్రదించిన తరువాత న్యాయాధిపతి యడుగగా వారి అభిప్రాయములలో ముద్దాయి నేరగాడో కాడో న్యాయాధిపతికి తెలుపుట వీరి కర్తవ్యము.

## జృ

జృంభము సం. వి. 1. ఆవులింత, ఒడలు విరుచుకొనుట, 2. వికాసము. రూ. జృంభణము.

జృంభితము సం. వి. ఆవులింత. విశే. 1. పెరిగినది. 2. వికసించినది.

## జె

జెండా హిం. వి. టెక్కెము.

జెంద్ (చరి.) ప్రాచీన ఇండో-ఇరానియన్ భాష. శుద్ధ ఆర్యభాష. (Zend).

జెందుఅవెస్తా (చరి.) పారశీక మత గ్రంథము, ఋగ్వేదముతో సన్నిహిత సంబంధము గల గ్రంథము (Zend

Avesta).

జెట్టి వి. 1. మల్లుడు. 2. శూరుడు. విశ. శ్రేష్ఠుడు.

జెన వి గ్రుడ్డులోని ద్రవపదార్థము.

జెముడు వి సింహుండము,ఒక తెగనాగదాడి.

జెలి వి, ఆధారిక. రూ. జెటి.

జెలిపోతు వి. ఒక తెగపాము. రూ. జెట్టి పోతు.

జెలవై. వి. భూమినుండి పైకులికి వచ్చు ఎడతెగని జలధార, బుగ్గ. సం. జలమ్.

జెల్లీ అచ్చులు ఇం. వి. (గృహ) నీరుపోసి పేర్కొనబెట్టు చిన్నచిన్న వివిధాకారవు అల్యూమినియము గిన్నెలు. (Jelly moulds).

జెష్ఠ వై. వి. 1. దారిద్ర్యదేవత. 2.పెద్దమ్మ. సం జ్యేష్ఠా.

# జే

జే వై. అవ్య. 1. జయ, జయజయ యను దీవెన. 2. నమస్కారము. రూ. జేజే:

జేంద్ర వి. మా. దేంద్ర.

జేగంట వై. వి. జయఘంట, జయించునపుడు వాయించు పెద్ద ఘంట.

జేగీయమానము సం. విశ. మిక్కలి కొని యాడదగినది.

జేగురు వి. ఎరువు. రూ, జేవురు.

జేగురుగండ్లు వి. కోటలో నుండి తుపాకులు కాల్చు రంధ్రములు.

జేగురుఁబురువు వి. ఆరుద్రపురుగు.

జేజె వై. వి. వేలుపు, రూ. జేజే. సం. జయజయ.

జేజే వై. వి. 1. నమస్కారము. 2. దేవుడు. 3. జయము జయము.

జేజేగట్టు వై. వి. మేరువు.

జేజేపట్టు వి. స్వర్గము. వ్యు. దేవతలుండు చోటు.

జేడియ బురదనేల. రూ. జేడె,

జేడు వి. బంకమట్టి.

జేన వి. పంద్రెండంగుళముల కొలది, వితస్తి.

జేపెట్టు క్రి. 1. నమస్కరించు. 2. స్తుతించు.

జేబు వి. రూ. జీబు, ఆడుదాని కట్టుకోక. హిం. వి. చొక్కాయ సంచి.

# జై

జైత్రుఁడు సం. విశ. జయించువాడు.

జైనధర్మము (వర.) ప్రతివస్తువునందును ఆత్మ కలదనివిశ్వసించు ధర్మము,అహింస. సత్యము, నిస్సంగము అనుషాని. ద్వారా మోక్షము పొందవచ్చునను ధర్మము. (జైనసిద్ధాంతముల ప్రకారము భగవంతుడు లేడు).

జైనాగమములు (వర.) జైన ధర్మములు చెప్పు ప్రాకృత భాషలో వ్రాయబడిన గ్రంథములు.

జైనులు (వర) జైనులు, జయించినవారు. శ్వేతాంబర జైనులు, తెల్లని వస్త్రములు ధరించిన జైనులు, వస్త్రములు ధరించని జైన సన్యాసులు. దిగంబర జైనులు,

జైవాతృకము సం. వి. 1. కర్పూరము. 2. కందకము. 3. ఇనుపగద,

జైవాతృకుఁడు సం. వి. 1. చంద్రుడు. 2. పంటకాపు 3. వైద్యుడు. విశ. దీర్ఘాయువు కలవాడు.

## జొ

జొన్నబోదు వి. (వ్యవ.) జొన్న మొదలగు తృణధాన్య జాతుల మొక్కల వేళ్ళపై పెరుగు పుష్పసహితములగు అర్ధపరపుష్పములలో నిది యొకటి ఉద్భిజ్జము. (Strigalutea).

జొన్నదొలుపుడు పురుగు వి. (వ్యవ.)(కీట.) జొన్న కాడను దొలిచి పాడుచేయు కీటకము (Chilozonellus).

జొన్నమిడుత వి. (వ్యవ.) (కీట.) లేత జొన్న మొక్కలను కొట్టివేయు మట్టి రంగు మిడుత (Grass hopper, chrotogonus soussurei).

## జో

జోనాళము నం. వి. జొన్న పైరు.

జోష నం. వి. 1. స్త్రీ. 2. యోష.

## జౌ

జౌలునేత వి. (గృహ.) ఇంటపోగుల నేత (Double weave).

జౌహకము నం. వి. తొండ.

## జ్ఞ

జ్ఞపితము నం. విశే. చంపబడినది.

జ్ఞప్తి నం. వి. 1. తెలివి. 2. తలపు.

## జ్ఞా

జ్ఞాత నం. విశే. తెలియువాడు.

జ్ఞాతము నం. విశే. తెలియబడినది.

జ్ఞాతవ్యము నం. విశే, తెలియదగినది.

జ్ఞాతి నం. వి. 1. దాయాది. 2. తండ్రి.

జ్ఞానతంతువులు నం. వి. (గృహ.) ఈనరముల తంతువులు జ్ఞానేంద్రియముల నుండి మెదడునకు వార్తలను గొంపోవును. (ఇవి చైతన్యము కలుగచేయును), (Sensory nerves).

జ్ఞానము నం. వి. తెలివి, ఎరుక.

జ్ఞాని సం. వి. 1. జోస్యుడు. 2, కోడి విశే. తెలివి గలవాడు.

జ్ఞానేంద్రియము నం. (జీవ.) ప్రత్యేకమగు ఏదైన నొక ప్రేరణకు శీఘ్రగ్రాహియైన అవయవము (Sense organ).

జ్ఞాపకము నం. విశే. తెలియ చేయునది. స్మృతి (Memory).

జ్ఞాపనము నం. వి. తెలియచేయుట.

జ్ఞాపితము నం. విశే. తెలుపబడినది. చూ. జ్ఞప్తము.

## జ్ఞే

జ్ఞేయము నం. విశే. తెలియదగినది.

## జ్యా

జ్యా నం. వి. 1. వింటి నారి. 2. భూ మి. (గణి.) వృత్తపరిధి లోని రెండు బిందువులతో నంతమగు సరళ రేఖ. (Chord).




జ్యామితిశ్రేఢి నం. వి. (గణి.) స్థిర నిష్పత్తితో పెరుగుచున్న రాసుల వరంపర, ఉదా. a, ar, $ar^2$, $ar^3$ ...... ఇచ్చట క్రమముగా పెరుగుచున్న ఏ దగ్గర రెండు రాసుల మధ్యనైన నిష్పత్తి ఒక స్థిర రాశి, (మా. గుణోత్తర శ్రేఢి) (Geometric progression).

జ్యామితిశ్రేఢి మాధ్యమము నం. వి. (గణి.) n రాసుల గుణన ఫలము యొక్క nవ మూలము $\sqrt[n]{a_1 \times a_2 \times a_3 \cdots \times a_n}$ (Geometric mean).

## జ్యే

జ్యేష్ఠ నం. వి. 1. ఒక నక్షత్రము. 2. పెద్దమ్మ.

జ్యేష్ఠము నం. వి. 1. ఒక మాసము. 2 హంస.

జ్యేష్ఠాధికారము నం. వి. (శాస.) జ్యేష్ఠాను క్రమ వారసత్వము, పిత్రార్జితమైన ఆస్తికి జ్యేష్ఠ కుమారుడే వారసుడగుట.

జ్యేష్ఠుఁడు నం. విశ. 1. అగ్రజుడు. 2. మిక్కిలి వృద్ధుడు.

## జ్యో

జ్యోతి నం. వి. 1. వెలుగు. 2. నక్షత్రము. 3. అగ్ని. 4. సూర్యుడు,

జ్యోతిరింగణము నం. వి. మిడుగురు పురుగు.

జ్యోతిశ్చక్రము నం. వి. గ్రహనక్షత్ర మండలము.

జ్యోతిషము నం. వి. జోస్యము.

జ్యోతిషికుఁడు నం. వి. జోస్యుడు.

జ్యోత్స్న నం. వి. వెన్నెలరేయి. రూ. జ్యౌత్స్న.

## జ్యౌ

జ్యౌతిషికుఁడు నం. వి. జ్యోతిషికుడు.

జ్యౌత్స్న నం. వి. వెన్నెలరేయి.

## జ్వ

జ్వరమాపకము నం. వి. (భౌతి.) మానవ శరీరోష్ణమును కను గొనుట కుపయోగించు థర్మామీటర్ (Clinical thermometer



జ్వరమాపకము

జ్వరము నం. వి. వేకి.

జ్వరితుఁడు నం. విశ. జ్వరము కల వాడు,

జ్వలత్ నం. విశ. ప్రకాశించునట్టి (ఇది సంస్కృత సమాసములందే యుండును.)

జ్వలనము నం. వి. 1. మంట. 2. అగ్ని.

జ్వలనశీల నం. విశ. (రసా.) మండెడు స్వభావము గల, ఉదా. పెట్రోల్. (Inflammable).

జ్వలనిరోధక ద్రవ్యములు నం. వి. (రసా.) మండుటకు సహాయపడక, మంటలను

నిరోధించు పదార్థములు, (Non supporters of combustion).

జ్వలించు సం. క్రి. మండు.

జ్వలితము సం. విశే. 1. మండినది. 2. ప్రకాశించినది.

## జ్వా

జ్వాల సం. వి. మంట. సం. వి. (రసా.) పరిశోధనాగారములో బున్సేన్ బర్నర్ (ఆ హాని) వంటి గొట్టముల ద్వారా పంపబడు ఇంధన వాయువును జ్వలింపచేసినపుడు లభ్యమగు తేజోవంతమైన గాలుల ప్రవాహము. (Flame).

జ్వాలాజిహ్వుఁడు సం. వి. అగ్ని.

జ్వాలాబిలము సం. వి. (భూగో.) అగ్నిపర్వతముపై గిన్నెవలె నుండు పై భాగము. దీని ద్వారా ఉపరితలమునకు గొట్టము వంటి దారి యుండును.

## ౙ

ౙంకు వై. క్రి. 1. భయపడు. 2. సంకోచపడు. వి. 1. భయము. 2. సంకోచము, శంక. సం. శంకా.

ౙంగ వై. వి. 1. పిక్క. 2. దాటు. సం. జంఘా.

ౙంగగొను క్రి. 1. దాటు. 2. దుముకు.

ౙంగాళము వై. విశే. 1. నిడువాటు. 2. వరులైనది.

ౙంగి వి. 1. అగ్ని ప్రసారణము. 2. ఒకానొక తుపాకి.

ౙంగియ వి. ఒక విధమగు గజ్జె. రూ. జంగె.

ౙంగిలి వి. గోసమూహము, పశుసమూహము.

ౙంగుపిల్లి వై. వి. అడవి పిల్లి.

ౙంగె వి. జంగియ.

ౙంౙాటము వి. తగులము.

ౙంౙాడి వై. వి. కటారి. రూ. జంజాళి. సం. యమధాటీ.

ౙంట వై. వి. జత. సం. యమళమ్. అవ్య. 1. వెంట. 2. సమీపమునకు. రూ. జమట.

ౙంటముక్కాలి వి. తుమ్మెద, షట్పదము.

ౙంటమోమువేలుపు వి. అగ్నిదేవుడు.

ౙంటి వి. సరిగపెట్టె. రూ. జంటీ.

ౙంటు వై. క్రి. జంటుపడు.

ౙంత విశే. ధూర్తురాలు.

ౙంతపట్టు క్రి. కలుపు తెగుటకు పైరు నడుమ దున్ను.

ౙంతిక వై. వి. ఒకానొక భక్ష్య విశేషము, జంతికలనుచేయు యంత్రము. సం. యంత్రికా.

ౙంతికపుండు వి. అనేక రంధ్రములు గల పుండు.

ౙంత్రికాఁడు వై. వి. సూత్రధారుడు.

ౙంత్రము వై. వి. 1. యంత్రము. 2. సూత్రము. 3. సూత్రపుబొమ్మ. సం. యంత్రమ్.

ౙందియము వై. వి. యజ్ఞోపవీతము. రూ. జంధెము, జన్నిదము.

ౙందెము వై. వి. జందియము.

ౙంపొడు క్రి. కదలు.

ౙంపొరు క్రి. మందమగు.

ౙంపోలు వి. జోలపాట.

ౙంపు వి. 1. ఆలస్యము, 2. జాఘరు. 3. గుంపు. 4. సన్నదనము. 5. పొడవు.

జంపులు వి. చెంపసరాలు.
జంపె వై. వి. ఝంప. తాళభేదము.
జంబు వి. ఒక విధమైన తుంగ.
జంబుగూడు వి. జంబుతో వల్లినగూడ. రూ జమ్ముగూడ.
జంబేలు వి. జంబూనది. వేరేదేరు.
జక్కర వి. వది.
జక్కరరాయఁడు వి. సముద్రుడు, సరిత్పతి.
జక్కళించు క్రి. గేలిసేయు.
జక్కవ వై, వి. చక్రవాక పక్షి. రూ జక్కువ.
జక్కవగొంగ వి. చంద్రుడు.
జక్కవలతేఁడు వి. సూర్యుడు.
జక్కి వి. 1. గుజ్జము. 2. తిరుగలి.
జక్కించు క్రి. కట్టువడు.
జక్కిణి వై. వి. 1. యక్షిణి. 2. కుబేరుని భార్య 3, లోకాంతర మొంది దేవత్వము వడసిన ముత్తైదువ.
జక్కినేఁడు వి. కుబేరుడు.
జక్కిమోరపేలువు వి. కింపురుషుడు.
జక్కులతేఁడు వి. కుబేరుడు.
జక్కులు వై. వి. యక్షులు, దేవతలలో నొక తెగ.
జక్కువ వై. వి. జక్కువపక్షి. సం. చక్రవాకః.
జగ వై. విశే. గొప్ప, పెద్ద. సం. జగత్.
జగజంపు వి. మిక్కిలి జంపు, జాలరు.
జగజెట్టి వి. గొప్పశూరుడు.
జగడగొండి విశే. కలహశీలుడు, కలహశీలురాలు.
జగడము వై. వి. కలహము, యుద్ధము. సం. ఝకటః.
జగతి వి. తిన్నె
జగము వై. వి. లోకము. విశే. గొప్ప. పెద్ద. సం. జగత్.
జగముకన్ను వి. సూర్యుడు.
జగముచుట్టము వి. సూర్యుడు.
జగముతల్లి వి. 1. పార్వతి. 2, లక్ష్మి. 3. లోకమాత.
జగా వై. విశే. గొప్ప. పెద్ద.
జగిలె వి. తిన్నె. రూ. జగ్గిలె
జగ్గిలె వి. జగిలె యొక్క రూపాంతరము.
జగ్గు వి. తళతళ.
జజ్జర వి. వంచన, మోసము.
జజ్జరకాఁడు విశే. వంచకుడు.
జజ్జు వి. మిక్కిలి చినిగినది.
జజ్జుకొను క్రి. బలహీనతపొందు.
జట్టి వి. 1. వెల, 2. అమ్ముట. 3. గుత్తవెల.
జడ వై. వి. 1. వెంట్రుకల యల్లిక. 2. జూలు. సం. 1. జటా. 2. సటా.
జడదారి వై, వి. జడలుధరించిన సన్యాసి. సం. జటాధారీ.
జడబఱ్ఱె వి. చమరమృగము.
జడముడి వి. 1. కపర్దము, ఈశ్వరుని జటాజూటము. 2, జడలుగంటు.
జడముడిజంగము వి. శివుడు, కపర్ది.
జడలమెకము వై. వి. సింహము. చమరము.
జడి వి.బాధ, వై. వి. వాన. విశే.నిరంతరము.
జడిగొను క్రి, 1. నిరంతరనుగు. 2. అతిశయించు.
జడియు క్రి. 1. భయపడు. 2. చలించు. 3. తొలగు. 4. మ్రోగు. 5. త్రోయు. 6. నివారించు.
జడుపు వి. భయము.
జత్త వై. వి. సంకటము. విశే. సంయుక్తము.
జత్తన అవ్య. తటాలున.
జద్ది వై.వి. మోపుమోసికొనిపోయెడి కఱ్ఱ.
జద్దిగము వై. వి. పిడతకు మూడు గొట్టము లమర్చి విత్తుట కుపయోగించు నాగలి, మదము.

జడ్డు వై. వి. 1. జాడ్యము. 2. మాంద్యము తగులము. 3. జోలి.

జత వై. వి. 1. జంట. 2. సామాన్యము. (గణి.) రెండు వస్తువుల గుంపు (Pair)

జతన వై. వి. యత్నము, ప్రయత్నము. రూ. జతనము, జతను. సం. యత్నః.

జతనపడు వై. క్రి. సిద్ధమగు. రూ.జతమపడు

జతనము వై. వి. చూ. జతన.

జతను వై. వి. చూ. పై.

జతి వి. గాన నాట్యయోగ్య శబ్దస్వరసంతతి

జతిగెలు వి. ఎద్దుల మెడను తగిలించి కాడికి గట్టెడు పట్టెము.

జత్తిగె వి. జడ్డిగము.

జద్దు వి. కఠిన హృదయత్వము.

జనపనార వి. జనుము నుండి తీయునార.

జనము వై. వి. శణము, ఒక తెగ పైరు. రూ. జనుము.

జన్నపుఁజుక్క వై. వి. మఘానక్షత్రము.

జన్నపుఁదిండి వి. వేలుపు, క్రతుభుజుడు.

జన్నపుగొంగ వి. శివుడు, క్రతుధ్వంసి.

జన్నపుఁతోజ్జ వై. వి. ఋత్విజుడు.

జన్నపురిక్కనెల వి. మాఘమాసము.

జన్నము వై. వి. యజ్ఞము, వేలిమి. హోమము, వేల్మి. సం. యజ్ఞః.

జన్ని వై. వి. సన్నిపాతము, త్రిదోష ములచే గలిగిన మోహరోగము.

జన్నిగట్టు వి. బ్రాహ్మణుడు.

జన్నిదము వై. వి. యజ్ఞోపవీతము జందెము. చూ. జందియము.

జన్నియ వై. వి. 1. దేవతాదుల నుద్దేశించి యెత్తియుంచిన వస్తువు. 2. మీదు. 3. వ్రతము.

జన్నియపట్టు క్రి. ఏదేని నొక వస్తువును దేవతాదుల నుద్దేశించి యెత్తియుంచు, ముడుపుకట్టు.

జన్నియవిడుచు క్రి. అచ్చుపోసి ఆబోతును విడుచు.

జబ్బ వై. వి. 1. భుజము. 2. తొడవెలుపలి మీది భాగము. సం. భుజా.

జబ్బు విశే. అలసము, వి. రోగము.

జమట వై. వి. చూ. జంట.

జమలించు వై. క్రి. రెట్టించు.

జమలిక వై. వి. యమలిక, ఒక విధమైన చర్మవాద్యము. రూ. జమలిగ, జమలి సం. యమలికా.

జమలిముక్కాలి వి. తుమ్మెద, షట్పదము. (జమలి = రెండు × ముక్కాలు = మూడు కాళ్లు—ఆరుకాళ్లు కలది).

జమాబంది హిం. వి. శిస్తు ఏర్పాటు చేయుట.

జమీను హిం. వి. భూమి.

జమీందారి హిం. వి. జమీందారుని వశమున నుండు భూమి.

జమీందారు హి. వి. 1. భూమి కలవాడు. 2. రాజునకు శిస్తు చెల్లించు ఒక అధికారి.

జముఁడు వై. వి. యముడు. శమనుడు. సం. యమః.

జముకాణము వి. కూర్చుండుటకు ముతక నూలితో చేసిన పట్టు. రూ.జంబుఖాణము.

జముదళము వై. వి. జముదాడి. చూ. జంజాడి. సం. యమధాటీ.

జమున వై. వి. యమున.

జమునతోఁబుట్టు (వు) వి. యముడు.

జమునయ్య వై. వి. సూర్యుడు

జమునెక్కిరింత వి. దున్నపోతు, యముని వాహనము.

జమ్మి వై. వి. శమీ వృక్షము. సం. శమీ.

జమ్ము వై. వి. చూ. జంబు.

జర వై. వి. కత్తిపిడి. సం. త్సరుః.

జరుగు క్రి. 1. రొమ్ముతో ప్రాకు, జారు. 2. జీవనము నడచు. 3. కడచు. 4. పోవు రూ. ఙరుగు.

జరత వి. జలతారు, సరిగ, రూ. జరతారు.

జరపు క్రి. జరుగచేయు.

జరి వై. వి. జరీ, వెండి బంగారు ములతో మొలాము చేసిన నూలిపోగు

జరిన విశ. శీఘ్రముగ. రూ. జరిలున.

జరుగు క్రి. మా జరగు.

జరుగుఁబాటు వి. జీవనము రూ. జరుగుబడి, జరుగుడు.

జరుపుడు వి. దినములు జరుపుట.

జర్ఘి వి. అంకుటాలు. అసతి.

జలకము వై. వి. జలకము, ఉదకము. స్నానము, సం. జలకమ్.

జలగడుగు క్రి. బంగారు రజము వెదకి యెత్తుటకుగాను ఇసుకను నీళ్ళలో పోసి గాలించు, పూర్తిగా కడుగు.

జలగరి వి. జలగడుగు వాడు.

జలతారు వి. మా.జరత.

జలదరము వై.వి. కంపము, భయముచేనగు గగుర్పాటు. సం. చలనమ్.

జలదరించు వై. క్రి. కంపించు.

జలదారి వై. వి. 1. మురికి నీరు పోవుదారి 2. ఆనీరు పోవుట కేర్పరిచిన తూము.సం. జలధారీ.

జలపోఁత వి. వెండిబంగారములనీటిమలాము రూ. జలపోసనము.

జలపోసనము వి. జలపోత.

జలుబు వై. వి. శైత్యము. సం. జలమ్. శైత్యమ్.

జలేరి వి. పానవట్టము, లింగపీఠము.

జల్లి వి. 1. నవరము. 2. చామరము. 3. కుచ్చు. 4. జాలరు. 5.అసత్యవచనము

జల్లించు క్రి. 1. కారు. 2. జల్లెడలో పోసి త్రిప్పు. 3. శోధించు.

జల్లికాఁడు విశ. అబద్ధ మాడువాడు.

జల్లిమూకుఁడు వి. నగము వరకు చిల్లులు గల మూకుడు.

జల్లిమెకము వి. చమర మృగము.

జల్లివేరు వి. వేళ్ళకొసను కుచ్చువలెనుండెడి వేరు.

జల్లు వి. ఉమియుట, రాలుట మొదలగు వానియందగు ధ్వని.

జల్లు వై. వి. వాన, వానకురియు నప్పుడు చెదరిపడు నీళ్లు. సం. జలమ్.

జల్లెడ వై. వి. జల్లిసాధనము. సం. చాలనీ.

జల్లెడకురుపు వి. రాచపుండు.

జల్లెడపళ్ళెము వి. (వృక్ష.) జల్లెడ గొట్టము లేక చాలనీ నాళములో నుండు జల్లెడ వంటి నిర్మాణము. ( Sieve-Plate ).

జల్లెకె వి. 1. చామరము. 2. కుచ్చు.

జవ వి. 1. అంచు. 2. చుట్టు. 3. రత్నాలు పొదుగుటకై కట్టిన బంగారు గూడు.

జవట వి. తాటిమట్టకు అడుగున నుండు వంగ.

జవరము వి. 1. తరచుతనము.1.సాంద్రము

జవరాలు వి. యౌవనవతి.

జవళి వి. అమ్మదగిన క్రొత్త వస్త్రము. రూ. జవిళి.

జవాజి వై. వి. సంకుమదము. రూ. జవాది. జవ్వాజి, సం. జవాదిః.

జవాజిపిల్లి వై. వి. సంకువు. జవ్వాజినొసగు పిల్లి.

జవాబు హిం. వి. ప్రత్యుత్తరము.

జవ్వనము వై. వి. యౌవనము, పదునారేండ్లకుపై ప్రాయము. సం. యౌవనమ్

జవ్వని వై. వి. యౌవనవతి.

జవ్వు వి. 1. దుర్మదజలము. 2. చర్మము. లోపలి పొర. 3. సొగసు.

జళిపించు క్రి. కత్తిని ఆడించు.

జళుకు వి. బెదరు.

# ఞా

జాగా వై. విశే. 1. పెద్దది, గొప్పది. 2. చోటు. రూ, జగ, జగా, జెగ, సం. జగత్

జాగారము వై. వి. జాగరము. రాత్రి మేల్కొనియుండుట సం. జాగరః

జాగిలము వి. పెద్దవేటకుక్క.

జాగు వి. ఆలస్యము.

జాజర వి. 1. ఒకరకపు పాటలో వాడు ఊతపదము. 2. వంచన. రూ. జజ్జర, సం. జర్జరః

జాజి వై. వి. 1. జాతి. మూలికవృక్షము ఒకతెగమల్లె 2. జాజికాయ రూ. జాది సం. జాతీ.

జాజు వై .వి. ఎరుపు రూ. జాదు. సం ధాతుః

జాజువారు క్రి. ఎఱ్ఱనగు.

జాటి వి. పశ్వాదుల నదల్చుటకై త్రాడు కట్టినకోల,

జాడ వి. 1. అడుగుల గురుతు. 2 సైగ 3. త్రోవ 4. విధము.

జాడించు క్రి విదిలించు, అటునిటుకదలించు.

జాడు వి. గింజపట్టని జొన్న కట్టె.

జాణ వై. విశే. నేర్పరి రూ.జాణడు.సం.చణః

జాతర వై. వి. 1. యాత్ర. 2. గ్రామ దేవత మొదలగు శక్త్యుత్సవము. 3. ఉత్సవము. సం. యాత్రా.

జాది వై. వి. చూ. జాజి.

జాదిలి వి. బుడుబుడుక్కలవాడు.

జాదు వై. వి. చూ. జాజు.

జాదురంబు వై. అవ్య. చాతుర్యము నేర్పరితనము.

జానక వి. కర్ణాటకపు తుపాకుల చెవియందు నిప్పు ముట్టించుత్రాడు.

జానము వి. గుఱ్ఱపు జీనుమీది మెత్త.

జాను వి. అందము. రూ. జానువు.

జానుగు వి. చెవి. రూ, జానుగ.

జానుతెనుగు వి. అచ్చతెనుగు, దేశితెలుగు.

జాపత్తిరి వై. వి. జాతిపత్రి. రూ. జాపత్రి. సం. జాతిపత్రమ్.

జాపిరము వై. వి. ఆలస్యము. జాగు. రూ. జాప్యము. సం. యాప్యమ్.

జాప్యము వై వి. చూ. పై.

జాబిలి వి. చందమామ. రూ. జాబిల్లి.

జాబిలిబాలువు వి. శివుడు, చంద్రధరుడు.

జాబిలిమేపరి వి. రాహువు.

జాబిలిఱాయి వి. చంద్రకాంతము.

జాబిలిరిక్క వి. మృగశీర్ష నక్షత్రము.

జాబు వి. లేఖ, కమ్మ, ఉత్తరము.

జామ వి. ఒకానొక చెట్టు, హిం, జాం. (జేమ అని వాడుక.)

జామారు వి. దోవతులచాపు. సెల్లా.

జామీను హిం. వి. పూట. ఒకనికై తాను అచ్చుకొనుట.

జాము వై. వి. యామము, ఏడున్నర గడియల కాలము. సం. యామః.

జారీ వి. గిండి, కమండలువు.

జారు క్రి. 1. జరగు 2. ఉడుకు. 3 వదలు. 4. స్రవించు. వి. 1. స్ఖలనము. 2.జారుట.

జారుడు వి. జారుట.

జారువు వి. 1. కొండచరియ. 2. జారుట,

జాల వై. వి. 1. జాలము, చేపలపట్టు 2. కిటికీ. సం. జాలమ్

జాలకఱ్ఱ వి. నల్ల రాతితో చేసిన కిటికీ.

జాలము వి. చాగు, ఆలస్యము.

జాలరి వై. వి. చేపల పట్టువాడు.

జాలరు వై. వి.గొడుగు మొదలగువానిచివర వ్రేలాడుకుచ్చు. రూ. జాలి.సం.ఝల్లరీ.

జాలవల్లిక వి. చిత్రపు పనిచేసిన తాంబూలపు పళ్ళెము.

జాలి వి. 1. మనః ఖేదము, విచారము. 2. కనికరము

జాలు వై.వి. ఏరు. చిన్న ప్రవాహము నీరు. రూ. జోలువు. (జామునకు బహు.)

జాలువా వి అపరంజి. రూ. జాళువ, జాళ్వ.

జాలువారు క్రి. ప్రవహించు.

జాలువు వై.వి. జాలు. సం. ఝరా.

జాలె వి. 1. ఒకతెగడేగ. 2. వరాలసంచి. 3. బొంగరపు త్రాడు. రూ. జాలియ.

జావ వై.వి. యవాగువు. పలుచగా కాచిన గంజి సం. స్రావః.

జావడము వి. 1. పిరికితనము. 2. పొట్టి గుఱ్ఱము. 3. గుఱ్ఱపుతట్టు. 4. ఒక జాతి డేగ. రూ. జావళము.

జావడి వి. చాకలివాడు.

జావళము వి. చూ. జావడము.

జావళి వి. శృంగారగీతము.

జాళియము వి. జాళెము. సంచి.

జాళువ వి. చూ. జాలువా.

## ఝ

ఝం వి. 1. గాలివీచుటయందనుకరణము. 2. తుమ్మెదలు చేయు ధ్వన్యనుకరణము.

ఝంఝరు వై. వి. 1. చింపిరి. 2. గుబురు. సం. ఝర్ఝరః.

ఝంటితేనె వి. జున్నుతేనె. ఝంటీగలు కూర్చినతేనె.

ఝంటీగ వి. చిన్నతేనెటీగ, పరఘ.

ఝఝురు వై. వి. గుబురు. సం. ఝర్ఝరః.

ఝట్టవ్రేలు వి. తర్జని. రూ. ఝట్టనవ్రేలు, ఝత్తనవ్రేలు.

ఝట్టనవ్రేలు వి. చూ. పై.

ఝట్టిలి వి. 1. ప్రాదేశము. 2. చాపబడిన బొటనవ్రేలు. చూపుడువ్రేలి నడిమి కొలత. రూ. ఝత్త, ఝత్తలి.

ఝట్టు వై. వి. సిగ. సం. జూటా.

ఝడుగు క్రి. భయముచే ఒదుగు. దాగు, వెనుదీయు. రూ. ఝణుగు,

ఝత్త వి. చూ. వి. ఝట్టిలి.

ఝత్తనవ్రేలు వి. చూ. ఝట్టవ్రేలు.

ఝన్ను వి. 1. ఈనిన మూడు దినముల లోపలిపాలు. జున్నుగడ్డ. 2. తేనెతెట్టె 3. ఒకవిధమైన మందు.

ఝన్నుఁబాలు వి. చూ. ఝన్ను.

ఝమాయించు క్రి. ఊడ్చిపట్టు.

ఝల్లు క్రి. పిల్చు. వి. పిల్చుట. పిల్చుట యందగు ధ్వని.

ఝువ్వి వి. ప్లక్షవృక్షము, ఒక చెట్టు.

ఝువ్విదీవి వి. ప్లక్షద్వీపము.

## ఝా

ఝాక వి. 1. తత్తరపాటు. 2. బెత్తము.

ఝాకించు క్రి. 1. తత్తరపడు. 2. శోకించు.

ఝాజము వై.వి. ద్యూతము. పందెము వేసి యాడెడియాట. మోసము. రూ. ఝాదము సం. ద్యూతమ్.

ఝాటు వై. వి. మోసము. సం. యుక్తిః.

ఝాదము వై. వి. చూ. ఝాజము.

ఝాలు వి. 1. సింహము మొదలగు వాని మెడ మీది వెంట్రుకలు. 2. ఏనుగుపై పరచు ఎఱ్ఱ కంబళి.

ఝావరము వై. వి. 1. జ్వరము. 2. సంతాపము.

## జొ

జొంపము వి. ఆకులు కొమ్మలులోనగు వాని గుబురు రెమ్మ. విశే. నిరంతరము.

జొంపు వి. కొండ యూటసీరు,

జొగ్గు వి. భిక్షము. రూ జోగు.

జొత్తిల్లు క్రి. 1. ఎఱ్ఱనగు. 2 రంజిల్లు.

జొత్తు వి. ఎనుపు.

జొత్తుపాప వి. నెత్తురు కందు, మిక్కిలిపసిబిడ్డ.

జొన్న వై. వి. జొన్నాళము. ఒక తెగ పైరు. జొన్న ధాన్యము.

జొబ్బిల్లు క్రి ప్రకాశించు, నిండారు. ఉప్పతిల్లు. రూ. జొబ్బిలు,

జొట్టీగ వి. ఒక తెగ పెద్ద యీగ. రూ, జోరీగ.

జొల్లు వి. చొంగ, లాల.

## జో

జో వి జోకొట్టు ధ్వని.

జోక వి. 1. సామ్యము. 2. బాగు. 3, జత. 4. విధము. 5. ఉత్సాహము. 6, మొత్తము. విశే. యుక్తము.

జోకచేయు క్రి. సంపాదించు, సిద్ధపరచు.

జోకపడు క్రి. జతపడు.

జోకు క్రి. తిట్టు. వి, తిట్టుట.

జోకొట్టు క్రి. 'జో'యని బిడ్డను నిద్రపుచ్చుటకు తట్టు.

జోక్యము వి. సంబంధము, ప్రవేశము.

జోగపట్టియ వై. వి. యోగపట్టము. సం. యోగపట్టః.

జోగము వై. వి. 1. యోగము. 2. ధ్యానము. సం. యోగః.

జోగి వై. వి. 1. యోగి. 2. భిక్షుకుడు. సం. యోగీ.

జోగిని వై, వి. యోగిని, సోదెకత్తె. సం యోగినీ.

జోగు వి. భిక్షము. రూ. జొగ్గు, ఓడ.

జోజో అవ్య. 1. జోకొట్టు. 2. దీవన.

జోటి వై. వి. స్త్రీ. రూ. జోటిక. సం. యోషిత్.

జోటిక వై. వి. చూ. పై.

జోడంగి వి ఒక తెగ వేట కుక్క. రూ. జోణంగి, జోనంగి.

జోదన వి. అశ్వగతి విశేషము.

జోదముకు వై వి. వింటితో వేయక చేతితో విసరు బాణము. సం. జోడాంబకః.

జోడించు వై. క్రి. జతచేయు.

జోడు వై. వి. 1. జత. 2. చెప్పులజత. 3. సమానము. విశే సమూహము. సం. జోడః.

జోడుకాడె విశే. 1. సమానుడు, 2. జత.

జోడువేల్పులరిక్క వి. విశాఖ నక్షత్రము.

జోణంగి వి. చూ. జోడంగి.

జోత వి, నమస్కారము. రూ. జోతము. జోహాము.

జోహాము వి. చూ, జోత.

జోతి వై. వి. జ్యోతి, కాంతి, దీపము. సం. జ్యోతిః.

జోదు వై, వి. యోధుడు, యుద్ధముచేయువాడు. సం. యోధః.

జోనంగి వి. చూ. జోడగి.

జోహిళ్లు వి. నమస్కారము, రూ. జొహిళ్ళు.

జోటీగ వి. చూ. జొట్టీగ.

జోల వి. బిడ్డల నిద్రపుచ్చుటకు పాడెడిపాట. రూ. జోవ.

జోలి వి. 1. సంబంధము. 2. వృత్తాంతము. 3, పని. 4. విధము. 5. గాథ.

జోలియ వి. చంకకు వ్రేల వేసికొను బిచ్చపు పంచి. రూ. జోలె.

జోవ వి. రూ. జోల.

జోసి వై. వి. జోస్యుడు. సం. జౌతిషకః.

జోస్యము వై. వి. జ్యోతిశ్శాస్త్రము. సం. జ్యౌతిషమ్.

జోహారు వి. నమస్కారము. రూ. జోహారువు, జోహారు, జొహారువు, జొహారు.

## జౌ

జౌకు క్రి. మిక్కిలి మెత్తగిల్లు. వి. బురద.

జౌరు క్రి. కొట్టు. రూ. జవురు.

## ఝ

ఝ ఒక యక్షరము.

ఝంకారము సం. వి. తుమ్మెదలరొద. రూ. ఝంకృతి.

ఝంఝ సం. వి. వానగాలి.

ఝంప సం. వి. 1. జంపెతాళము. 2. దూకుడు.

ఝరము సం. వి. సెలయేరు. రూ. ఝరి.

ఝల్లరి సం. వి. 1. ఉడుక. 2. జాలరు. 3. నీటిసుడి. రూ. ఝాల్లరి.

ఝల్లరి సం. వి. (జం.) కనుగుడ్డుపైనున్న పొరలలో మధ్యపొర (Choroid).

ఝషము సం. వి. 1. చేప. 2. మొసలి.

ఝషకేతుఁడు సం. వి. మన్మథుడు.

## ఝా

ఝాటము సం. వి. 1. సమూహము. 2. పొదరిల్లు. 3. చీపురుకట్ట.

ఝాటి సం. వి. పెద్ద గొంగళి.

## ఝి

ఝిల్లి సం. వి. 1. ఈలపురుగు. 2. ఈలపురుగు కూత. రూ. ఝిల్లిక. ఝీరుక.

## ట

ట ఒక యక్షరము.

టంక సం. వి. 1. పిక్క, జంఘ. 2. వెలిగారము.

టంకకము సం. వి. వెండినాణెము

టంకణగుటిక సం. వి. (రసా.) ప్లాటినమ్ తీగను బున్సెన్ జ్వాలలో కాల్చి టంకణములో పొదిగి మరల జ్వాలలో పెట్టినపుడు తీగకొనను ఏర్పడు చిన్న గోళీ (Boron bead).

టంకణము సం. వి. వెలిగారము. (రసా.) వెలిగారము. (రాసాయనికనామము: సోడియమ్ టెట్రాబోరేట్). (వ్యావ.) వెలిగారము లేక సోడియటంకణితము, ($Na_2 B_3 O_7 + 10 H_2 O$)లో నున్న (ఉప) ధాతువు, మొక్కలకు సూక్ష్మ పరిమాణములో కావలసిన మూల ద్రవ్యములలో నిది యొకటి.

టంకము వై. వి. ప్రాచీన కాలపు బంగారు నాణెము, దీనారము. సం. వి. 1. వెలిగారము. 2. కత్తి. 3. కోపము. సం. వి.

(రసా.) ధాతువును ధాతువునకు కలుపు టకు వాడుకలో నున్న సులభముగా కరగు ధాతు మిశ్రము. (Solder).

టంకసాల వై. వి. నాణెములు ముద్రించు చోటు. సం. టంకశాలా.

టంకారము సం. వి. 1. వింటినారి ధ్వని. 2. ఆశ్చర్యము. 3. ఆశ్చర్యము కల్గించు శబ్దము.

టంకు విశే. ధూర్తుడు, మాయావి.

టంకుఁడు సం. వి. గొల్ల.

టంగణా హిం. వి. మట్టసపు గుఱ్ఱము. టాంకినీ దేశపు గుఱ్ఱము.

టంగము సం. వి. 1. కత్తి. 2. త్రవ్వుకోల.

టంగు వి. గుఱ్ఱముల మీది గంత జారక బిగ కట్టెడు వారు.

టకటొంకు వి. 1. కుత్సితము, 2. మోసము. విశే. ధూర్తుడు.

టకము సం.వి. 1. ఇష్టము. 2. కౌమారము.

టక్కింగ్ ఇం. (గృహ.) మడుచుట, దోపుట, అంచులు కనబడకుండ లోనికి మడచుట. (Tucking).

టక్కు వై.వి. 1. మోసము. 2. అసత్యము. ఠెక్కు. సం. ఠకః.

టక్కులాఁడి విశే. టక్కులు చేయునది (స్త్రీ).

టక్కులాఁడు విశే. టక్కులు చేయువాడు.

టక్కులు ఇం.



(గృహ.) పొడవు దుస్తులను పొట్టి చేయుటకు కొంత బట్టను లోపలికి పెట్టి కుట్టుట. కొన్నిసార్లు చిన్న టక్కులను అందముగా నుండుటకై పైకి కనిపించునట్లే వేయుదురు. Pintucks = చిన్నవి. Double tucks = పెద్దవి.

టక్కులు

టన్ ఇం. వి. (Ton) ద్రవ్యరాసుల బరువును తెలిసికొనుట కుపయోగించు ఒక ప్రమాణము.

టపా హిం. వి. 1. ఉత్తరము. 2. ఉత్తరముల సంచి.

టర్‌టరాయణము సం.(ఇం.) కప్ప అరుపులు. (Croaking of frogs).

టర్న్‌రెస్టునాగలి ఇం. (వ్యవ.) కావలసిన వైపున అమర్చుకొనుటకు వీలుగా నుండు రెక్క రేకుగల ఇనుప నాగలి. ఈ రేకు సాయముతో కావలసిన విధముగా చాళ్ళను, గట్లను పర్చరుచుదురు. (Turn-rest plough).

టవలి వి. కల్ల, బొంకు.

టవళి వి. ధూర్తుడు, ధూర్తత్వము.

## టా

టాకు వి. 1. ఉంగరము మొదలగునవి జారి రాకుండ వేసికొను చుట్టు వంటి చిన్న యుంగరము. 2. వసారా. 3. ఒర 4. క్షణము.

టాటానగరము (పరి. భూగో.) జమ్‌షేడ్‌పూర్, బీహారులోని ముఖ్య పారిశ్రామిక స్థానము. (జమ్షెడ్జి టాటా అను పార్సీ పారిశ్రామికుని పేరిట నీ పట్టణము వెలసినది. ఇచ్చటికి సమీపమున ఇనుము, బొగ్గు గనులు కలవు. అందుచే టాటా ఉక్కు పరిశ్రమ కేంద్రము ఇచ్చట అభివృద్ధి నొందెను. ఆసియాలోనికెల్ల పెద్దయంత్రాగార మిచ్చట కలదు.)

టాటింగ్ ఇం.



(గృహ.) గుండ్రని రంధ్రములు వచ్చునట్లు చేతితో వేసిన గట్టిలేసు. (Tatting).

టాటింగ్

**టాటోటు** వి. మోసము, కపటము, విణ. దాంభికుడు. కుత్సితుడు.

**టాన్** ఇం. వి. (Tan) (గణి.) టాన్‌జెంట్ (Tangent). సమకోణ త్రిభుజములోని దత్తకోణమున కెదురుగాను,సన్నిహితము గాను ఉండు భుజముల పొడవుల నిష్పత్తి.

**టారిఫ్** ఇం. వి. (రాజ. అర్థ.) (Tariff). పన్నులు, ఎగుమతి దిగుమతుల పన్నులు, సుంకముల పద్ధతి, రైల్వే రేటు.

**టాల్క్** ఇం. వి. (రసా.) (Talc) చూ. సబ్బురాయి.

# టి

**టింగణా** విణ. పొట్టివాడు. వామనుడు.

**టికము** వై. వి. ముడ్డిపూస, సం. త్రికమ్.

**టికాణా** వై. వి. 1. గతి. 2. చోటు, హిం టికానా.

**టిట్టిభము** సం వి. లకుముకి పిట్ట.

**టిప్పణము** సం. వి. టీకకు టీక, టీక అని కొందరు చూ. టిప్పణి, టిప్పని.

# టీ

**టీక** సం. వి. అర్థ. వివరణము.

**టీకము** వి. ఒరగల్లు. నికషోపలము.

**టీకా** వి. 1. పతకము. 2. స్ఫోటకము పొడిపించుట.

**టీకాలువేయు** క్రి. (గృహ.) మశూచి రాకుండుటకై దానికి విరుగుడును శరీరము లోనికి ఎక్కించు. (Vaccination).

**టీకు** వి. నడుచుటయందలి నిక్కు, గర్వము.

**టీకోజీ** ఇం. వి. (గృహ) (Tea-cosy) టీపాట్ పైని మూయు ఉన్ని లేక దూది సంచి. తేనీరుచల్లబడకుండుటకై టీ పాత్రను మూయు మెత్త, గలేబు.


టీకోజీ

**టీట్స్** ఇం. వి. (గృహ.) (Teats) రబ్బరు పీక, చంటి బిడ్డలకు పాలుపట్టుట కుపయోగించునది.

# టు

**టుంద్రాలు** ఇం. వి. (భూగో.) (Tundras) మంచు ఎడారులు, (ఇవి చాలమట్టుకు రష్యా. సైబీరియా, ఉత్తర అమెరికా లోని అలాస్కా ప్రాంతము అర్కిటిక్ మహాసముద్రపు ఒడ్డున గలవు. సంవత్సరములో తొమ్మిదినెలలు మంచుతో భూమి కండుగట్టి యుండును. తక్కిన రోజులలో నాచు, పాచి, పల్చనిగడ్డి కలిగియుండును).

# టూ

**టూకి** వి. సంగ్రహము. రూ, టూకీ.

**టూకించు** క్రి. సంగ్రహించు.

**టూత్‌పల్ప్** ఇం. వి.(గృహ.)(Tooth pulp) దంత పోషణ భాగము.

టెంక వి. మామిడిలోనగు కాయలలోని విత్తు. రూ. తెంక.

టెంకణము వి. నమస్కారము. నతి. రూ. టెంకణము.

టెంకాయ వి. కొబ్బరికాయ (తెన్=దక్షిణము అచట ఎక్కువగాదొరుకుకాయ.)

టెంకి వి. 1. చోటు, స్థానము. 2. తాటాకులకు రంధ్రముచేయుపనిముట్టు 3.మడుగు

టెండరు ద్రవ్యము (శాన. వాణి.) సంచకర ద్రవ్యము. (Tender money).

టెండర్లు ఇం. వి. (Tenders) ఒక వ్యవహారము నడిపించుటకు పెట్టుకొను దరఖాస్తులు.

టెక్కి వి. దాసరికుల్లాయి, ఒక రకమైన పొడుగు టోపి.

టెక్కియము వి. జండా. రూ. టెక్కెము.

టెక్కు వి. 1. విలాసము. 2. మల్లయుద్ధములోని మెలకువ. 3. యౌవనాదులచే కల్గు నిక్కు.

టెక్కెపుగాము వి. 1. కేతుగ్రహము. 2. మిత్తిచూలు.

టెక్కెము వి. రూ. టెక్కియము.

టెయిగా ఇం. (భూగో.) కోనిఫర్ అడవులు. శంకులవనము.

టెరిడోఫైటములు ఇం. (వృక్ష.) పర్ణాదికములు ఈ తరగతి మొక్కలలో పర్ణాంగములు(ferns) ముద్గరహరితములు (club mosses) అశ్వవాలములు(horsetails) అను ఉప తరగతులకు చెందిన మొక్కలు చేర్చబడినవి.

## టే

టేకు వి. శాక వృక్షము.

టేకుదీవి వి. శాక ద్వీపము.

టేనిన్ ఇం (వృక్ష.) (Tanin) వృక్ష జీవకణములలో నుండు ఒక విధమగు చేదు రుచిగల పదార్థము ఉదా. తేయాకు మొ

టేప్ ఫేసెనింగ్ ఇం. (గృహ )(Tape fastening) బద్దీ లేక టేప్ కుట్టుట, నాడా ముక్కలను బట్టకు కుట్టుట.

టేబిలుస్పూన్ ఇం. వి. గృహ. (Table spoon) ఔన్సు పరిమాణము గల గరిట.

టేబిల్ నాప్కిన్ ఇం. వి. (గృహ.) (Table napkin) భోజనము తరువాత తుడుచుకొను చేతిగుడ్డ.

టేబిల్ రన్నర్ ఇం. వి. (గృహ.) (Table runner) భోజనపు బల్లపై మధ్య పరచు చిన్న అలంకారపు గుడ్డ.

టేస్ట్‌బడ్స్ ఇం. వి. (జీవ.) (Taste buds) నాలుకలోగలరసనాముకుళములు, రుచిని తెలియజేయు కణములు.

## టై

టైఫాయిడ్ ఇం.వి. (Typhoid) అపాయకరమైన విషజ్వరము. (ఇది నీటి మూలమున ఈగల మూలమున వ్యాపించును.)

## టొ

టొంప వి. 1. చిన్నకొంప. 2. వంకర, 3. గుదిబండ.

టొంపు వి. వంకర.

## టో

టోకు వి. 1. మొత్తము. 2. జెట్టి భుజము భుజముతో తాకించుట.

టోకుబేరము వి. మొత్తముబేరము, వ్యతి. చిల్లర బేరము

టోకువర్తకుడు వి. పెద్దరాసులలో సరకులు కొని చిల్లరవర్తకుల కమ్ముడువాడు.

టోకెనునాణెము ఇం. (వ్యావ.) చట్టము రీత్యానిర్ణయింపబడిన విలువకన్న ఎక్కువ విలువగల చెలామణి ద్రవ్యము (Token-money).

టోపి వి. కుల్లాయ. (వ్యావ.) మోసము, ఉదా. (వానికి బేరములో టోపీజరిగినది), చూ టోపి.

టోలి హిం. వి. 1. కానిలో ఎనిమిదవ భాగము. 2. సారములేనిది. 3. అత్యల్పమైనది.

టోలు ఇం. వి. (అర్థ.) (Toll) సుంకము పన్ను

టోస్టర్ ఇం.వి. (గృహ.) (Toaster) డబుల్ రొట్టె ముక్కలను కాల్చుట కుపయోగించు విద్యుత్ యంత్రము లేక తీగ చట్రము.

## ట్యూ

ట్యూనింగ్ఫోర్క్ ఇం. వి. (భౌతి.) (Tuningfork) తెలిసిన స్థాయిలో కంపించు రెండు పంగలు కలిగిన ఒక ఉపకరణము.



ట్యూనింగ్ ఫోర్క్

ట్యూబెక్టమీ ఇం. వి.(Tubectomy) సంతానము లేకుండుటకు స్త్రీలకు చేయు ఆపరేషను.

## ట్ర

ట్రస్టీ ఇం. వి. (Trustee) ధర్మకర్త. ఒక సంస్థయొక్క గాని, నిధియొక్క గాని ఆర్థిక తదితర వ్యవహారములను, మైనరు బాలబాలికల ఆస్తిని కాపాడుటకు నియమింపబడిన వ్యక్తి.

## ట్రా

ట్రాక్టరు ఇం. వి.(వ్యవ.) (Tractor) నాగళ్ళను లాగుటకుపయోగించు నొకవిధమగు శక్తి యంత్రము.

## ట్రి

ట్రిఫిల్ పుడింగ్ ఇం. (గృహ.) (Triffle pudding) స్పంజికేకును, పండ్ల ముక్కలను పొరలు పొరలుగా అమర్చి, మీద క్రీము (మీగడ) వేసి భోజనానంతరము

పెట్టు పదార్థము.

ట్రిప్సిన్ ఇం. వి. (జం.) (Trypsin) మాంస కృత్తు పదార్థములను సక్వ పదార్థములుగాను తరువాత వానిని తిక్త ఆమ్లముగాను మార్చు నేంద్రియ పదార్థము. ఇది సర్వకిణ్వ గ్రంథి నుండి తయారగును.

ట్రిమింగ్ ఇం. (గృహ.) (Trimming edges) రేగిన పోగులను సాపుచేయుట. ఒప్పిదముగా చేయుట. రేగిన పోగులను దగ్గరగా కత్తిరించుట.

## ట్రూ

ట్రూమను సిద్ధాంతము (చరి., రాజ.) అమెరికా సంయుక్త రాష్ట్ర అధ్యక్షుడైన ట్రూమను క్రీ. శ. 1947వ సంవత్సరములో అమెరికా కాంగ్రెసు ఎదుట ప్రపంచములోని కమ్యూనిస్టు దౌర్జన్యములకు దురాక్రమణలకు గురియైన ప్రజాస్వామ్య రాష్ట్రములను అమెరికా రక్షించునని, అట్లు రక్షించుట అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము యొక్క ప్రధాన లక్ష్యమని చాటి చెప్పెను. దీనినే ట్రూమన్ సిద్ధాంతమని అందురు.

## ట్రే

ట్రేడుమార్కు ఇం. వి. (వాణి.) (Trade-mark) వ్యాపార చిహ్నము. వర్తకపు గుర్తు. ఒక్కొక్క ఉత్పాదక సంస్థ తయారుచేసిన వస్తువుపై ఒక్కొక్క గుర్తు ఉండును.

ట్రేడ్ యూనియన్లు ఇం. వి. (అర్థ. రాజ). (Trade unions) కార్మిక సంఘములు. కార్మిక హక్కులను కాపాడుటకు, వారికి తగిన ఆర్థిక సాంఘిక సదుపాయములు కలిగించుటకు ఏర్పడిన సంఘములు.

## ట్వి

ట్విల్ నేత ఇం. వి. (గృహ.) ముదుగుబట్టలు నేయునపుడు ఉపయోగించు ఒక విధమైన నేత. దీనిని నిక్కర్లు మొదలగు దుస్తులకుపయోగింతురు. (Twill weave).

## త

తంగన విశే. పొట్టివాడు. పొట్టిది. చూ. తింగణా.

తఖాయించు హిం. క్రి. 1. అటునిటుతిరుగు 2. పనిచేయక తప్పించుకొను తిరుగు.

తకతక వి. 1. అలయిక. 2. అడ్డంకి. 3. బొంకు. 4. బాధ.

తకణిల్లు క్రి. 1. ప్రవర్తిల్లు. 2. ఒప్పు.

తకర విశే. 1. నేర్పరి, సమర్థుడు, నేర్పుగలది. సమర్థురాలు.

తకళి వి. 1. మోసము. కపటము. 2. అసత్యము.

తకళికాఁడు విశే. మోసకాఁడు.

తకిణి వి. ధక్క. ఢంక.

## ఠా

ఠాకురు వై. వి. 1. తండ్రి. 2. అధిపతి 3. గురువు. రూ. ఠాగూరు. సం. ఠక్కురః.

ఠాణము వై. వి. 1. స్థానము, చోటు. సం. స్థానమ్. 2. సుంకము వసూలుచేయు కార్యాలయము.

ఠాణా హిం. వి. 1. కావలిపండు 2 కావలి స్థలము. 3. పోలీసు స్టేషను అధికారము క్రిందనున్న భాగము, 4, పోలీసు స్టేషను

ఠాణి వై. వి. 1. ఇల్లు. 2. చోటు.

ఠావు వై. వి. 1 తావు. స్థానము రూ. తావు. సం. స్థా.

## ఠి

ఠింగణా విణ. 1. బాలుడు. 2. పొట్టివాడు.

## ఠీ

ఠీవి వి. 1. వైభవము. 2. ఒయ్యారము. 3. అందము.

## ఠే

ఠేవ వి. ఒప్పిదము, చందము, విధము.

## ఠో

ఠోళా వి. 1. సమూహము. 2. తెగ.

## డ

డ ఒక యక్షరము.

డంక విణ. 1. దిట్ట. 2. దుష్టుడు, చెనటి.

డంకా వై. వి. నగారా. డక్క. సం. ఢక్కా.

డంగు క్రి. బియ్యములోని తవుడు పోవునట్లు మెదుగు. విణ. నలగినది.

డంబము వై. వి. స్థితికిమించిన వేషము. బడాయి. 2. కాంతి. సం. దంభః, జంభః.

డంబరము సం. వి. విజృంభణము.

డంబు వై. వి. 1. గర్వము. 2. కాంతి. 3. విధము. 4. కపటము. సం. జంభః, దంభః

డగులుబాజీ వి. (వ్యావ.) 1. తుంటరి. 3. మోసగాడు. రూ. దగులుబాజీ.

డగ్గఱు క్రి. సమీపించు.

డగ్గుత్తిక వి. గద్గద స్వరము.(డగ్గు+కుత్తిక).

డచ్చెస్ సెట్ ఇం. (గృహ). (Dutches set) బంగారపు అద్దము గల బల్లమీద పౌడరు, కుంకుమ, కాటుక మొదలగు డబ్బాల నమర్చుటకు వాని క్రింద ఉపయోగించు వివిధాకారపు బట్టలు.

డచ్చీలు వి. (వ్యావ). గొప్పలు, డంబములు.

డప్పి వి. దప్పి.

డప్పు వి. దండోరావేయు తప్పెట.

డబుల్ బ్యాక్ స్టిచ్ ఇం (గృహ.) (Double back stich)నీడ కనుపించు ఎంబ్రాయిడరీ కుట్టులో నుపయోగించునది.

డబుల్ బోయిలర్ ఇం. వి.(గృహ.)Double boiler.)అవిరిమీద ఉడుకబెట్టుటకుపయోగించు పాత్ర.

దబ్బఱ వై. వి. 1. అపద. 2. బొంకు. సం. దంభః, దర్భః.

దబ్బాటు విశ. దబ్బాటు, అదరిపాటు, అక స్మాత్తుగా.

దబ్బాటు సాకిరి విశ. ప్రసంగవశమున వచ్చి అన్నియు తెలిసికొను సాక్షి.

దబ్బి వి బరణి.

దబ్బు వి. ధనము. క్రి. బొంకు.

దమరము సం. వి. దేశోపద్రవము ఉదా:- కొల్లగొట్టుట మొ॥ రూ. డామరము.

దమరుకము సం. వి, ఒక వాద్యము (డమరుగము), బుడుబుడుక్క అను శబ్ద మిచ్చునది.

దమరువు సం వి. 1. చమత్కారము. 2. డమరుకము.

దమాను హిం. వి. తెరచాప.

దయనము సం. వి. బాలకాదుల క్రీడా శకటము.

దయ్యు క్రి. బలహీనమగు, కృశించు.

దలాయతు హిం వి. బిళ్ళబంట్రోతు. హిం. ధలైత్.

దవాలీ హిం. వి. బంట్రోతు బిళ్ళ తగిలించు పట్టి.

దవిణ వి. డంకా, ఒకానొక చర్మవాద్యము

## డా

డా విశ. ఎడమ. డాకడ, డాకన్ను, డాపల. డామూపు మొదలగునవి.

డాంబికుఁడు సం. వి. మాయలుచేయువాడు.

డాఁకొను క్రి. మరుగపడు రూ. దాకొను.

డాఁగన ముచ్చులు వి. డాగిలి మూతలు.

డాఁగు క్రి. దాగు, దాగియుండు. రూ. దాగు.

డాక వి. శౌర్యము, విజృంభణము.

డాకడ వి. ఎడమవైపు, ఉత్తరదిక్కు.

డాకిని సం. వి. ఆడుదయ్యము.

డాకెటింగ్ ఇం. వి. (వాణి.) (Docketing) దాచి ఉంచవలసిన కాగితములను ఉంచు ఒక పురాతనపద్ధతి. ఒక ఖాతాదారునికి సంబంధించిన కాగితములన్ని నిలువుగ మడచి,పైని ఒక కాగితముపై లోని కాగితములలోని సారాంశము సంగ్రహముగ వ్రాసి ఒక చోట పదిల పరచుట.

డాక్టర్ ఇం వి. (Doctor) 1. వైద్యుడు. 2.పరిశోధనచేసిన వ్యక్తికి విశ్వవిద్యాలయ మిచ్చు పి. హెచ్.డి.పట్టము.

డాగు వి. 1. గురుతు. 2. కర, మరక.

డాగుతెగులు వి. (వ్యవ.) కాయ తెగుళ్ళలో నొకటి (దీనికి కొన్ని రకముల బూజులు కారణము. దీనివలన కాయలపైగాని పండ్లపైగాని డాగు లేర్పడును.) (Fruit rot).

డాటా ఇం. వి. (వ్యాప.) (Data) ఆధార సామగ్రి, భోగట్టా.

డావలించు క్రి. చుట్టివచ్చు.

డాపురము వి. దాపురము, ప్రాప్తి.

డాబా వి. బోడిమిద్దె.

డాబు వై. వి. డంబము. సం. దంభః.

డామరము సం. వి. చూ. దమరము.

డామ్ ఇం.వి.(భూగో.అర్థ)(Dam) నీటిపారుదల,విద్యుచ్ఛక్తి తయారుచేయుటకై నది లోని నీరు వృథాకాకుండ నిలుచుటకై కట్టిన ఆనకట్ట.

డార్ట్స్ ఇం. వి. (గృహ.) (Darts) టక్కులు, దుస్తులలో వదులును తగ్గించుటకై బట్టను లోపలికి పెట్టి కుట్టుట.

డార్వినిజం ఇం. వి. (జం.) (Darwinism) జీవపరిణామమునుగూర్చి ఉపజాతులపుట్టుకను గూర్చి ఛార్లెస్ రాబర్టు డార్విన్ చేసిన సిద్ధాంతములు.

డాలర్ రాజనీతి మి వి. (రాజ) ఒకదేశము తన ఆర్థిక వాణిజ్యాభివృద్ధికొరకు ఇతర దేశములలో నడుపు రాజనీతి.

డాలు వి. 1. కాంతి. 2. రంగు. 3. జెండా. 4. కేడెము.

డాల్ఫిననోసు ఇం. వి. (భూగో.) (Colpin-nose)ఆంధ్రప్రదేశ్ లోవిశాఖపట్టణములో హార్బరువద్ద 300 అడుగులఎత్తుగల గుట్ట.



డింకవేయు క్రి. చచ్చు, మరణించు.

డింకీలు వి. మొగ్గలు.

డించు క్రి. దిగచేయు. రూ. దించు.

డిండిమము సం. వి. వాద్యవిశేషము.

డిండీరము సం. వి. నురుగు.

డిందు వి. 1. అడకువ, 2. తక్కువ, 3. మందు క్రి. డిందుపడు. అడగు,

డింపు వి. దింపు.

డింభము సం. వి. పిల్ల, గ్రుడ్డు.

డింభోషణము సం. వి. (గృహ.) పొదుగుటకు అనుపగస్థితి, గ్రుడ్లుగాని, క్రిమిబీజములుగాని వృద్ధి పొందుటకు అనువగు సూచనలు అనగా తగు శీతోష్ణస్థితులు కలిగి యుండుట. (Incubation).

డింభోషణకాలము సం. (జం) గ్రుడ్డు పగిలి దానినుండి ప్రాణి బయటికి వచ్చుటకు పట్టుకాలము, శరీరమున రోగజీవులు ప్రవేశించినది మొదలు రోగ చిహ్నములు పైకి కనబడువరకు పట్టుకాలము (Incubation period)

డిక్రీ ఇం. వి. (Decree) ఆజ్ఞ, శాసనము, చట్టము.

డిగఁద్రావు క్రి. విడుచు, విసర్జించు

డిగియ వై. వి. నడశావి రూ. డిగ్గియ, దిగ్గియ. దిగియ. సం. దీర్ఘికా.

డిగు క్రి. దిగు, తగ్గు, మునుక్కు.

డిగ్గున విశ. తటాలున.

డిగ్రీ ఇం. వి. (భౌతి.) (Degree) వేడిని కొలుచు మానము, ఇం. (గణి.) సంపూర్ణ భ్రమణ జనితమైన కోణములో 360వ భాగము.

డి, డి. టి. ఇం. (రసా.) ఇటీవల కనిపెట్టబడిన కీటక వినాశక ద్రవ్యములలో నొకటి. (ఇది కృతక రసాయనిక ద్రవ్యము.)(DDT-Dichloro-dipheny-trichlorethane).

డిపాజిటు ఇం. వి. (అర్థ.) (Deposit) బ్యాంకులోగాని, ప్రభుత్వముతోగాని, పారిశ్రామికసంస్థలలోగాని ప్రజలుదాచుకొను ధనము.

డిప్పకాయ వి. (వ్యావ.) అల్లరిపిల్లవాడు.

డిప్ డ్రై ఇం (గృహ.) (Dipdry) మురికి అంటనిబట్ట (దీనిని తడిపి ఆరవేసిన ముడుతలు పడక త్వరలో ఆరిపోవును. దీనికి ఇస్త్రీ చేయవలసిన అవసరము లేదు.)

డిబెంచెర్లు ఇం. వి. (అర్థ) (Cebenture) ఋణ పత్రములు, అప్పు కావలసినపుడు వ్యాపార, పరిపాలక సంస్థలు వీనిని విక్రయించి ధనము సేకరించుచుండును.

డిమాండు ఇం. (అర్థ) (Demaad) వస్తురాశిని కొనుటకు అవసరమైన ధనము వెచ్చించుటకు సంసిద్ధతగలకోరిక, గిరాకి. అర్థనము. ఏ వ్యక్తియైన నొక నియమిత వస్తురాశికి ఎంత ద్రవ్యరాశిని చెల్లింప సంసిద్ధుడో ఆ ద్రవ్యరాశి యావ్యక్తికా వస్తువు కొరకు తనకుగల యర్థన తీవ్రతను సూచించును.

డిమానిటైజేషను ఇం. వి.(అర్థ)(Demonetization)నాణెములను లేక నోట్లను చెలామణిలో నుండి తొలగించుట.

డిమ్మరి వి. దిమ్మరి. సోమరి.
డిల్లపడు క్రి. డీలుపడు, సత్త్వహీనమగు, వెల్వెలపోవు.
డివిజను ఇం. వి (Division) 1. విభాగము. 2. సైనిక పరిపాలనా విభాగము.
'డి' విటమిన్ ఇం. (గృహ.) (Vitamin-D) సూర్య కిరణముల తాకిడిచే చర్మములో తయారగు విటమిన్.
డివిడెండు ఇం. వి.(అర్థ.) (Dividend) సంస్థ ఆర్జించిన లాభములో వాటాదారులకు పంచవలసిన భాగము.
డిసిన్‌ఫెక్షన్ ఇం. వి. (గృహ.) (Disinfection) దుర్వాయువులను పోగొట్టుట. క్రిములను నాశనముచేయుట. అంటు వ్యాధులను దూరముచేయు విధము.
డిస్కునాగలి ఇం. వి. (వ్యవ.) పళ్ళెము వంటి రేకులు ప్రధాన భాగములుగా గల యినుపనాగలి. (Disc plough)
డిస్కౌంటు ఇం. వి. (అర్థ.) (Discount) 1. ధరల పట్టీలో చూపిన ధరలో వ్యాపారస్థులకు ఇచ్చు తగ్గింపు. 2. సొమ్ము కాల వ్యవధిలో చెల్లించినందుకు ఋణదాత యిచ్చు ఆదితి.
డిస్కౌంటుచేయుట ఇం. (అర్థ.) ఒక బిల్లు వలనకాని, మరి ఏ యితర మైన వినిమయ పత్రము వలనగాని పత్రముపై నున్న తేదికి ముందుగనే దాని సొమ్మును రాబట్టు కొనుటకు బ్యాంకునకు దాని ముఖమూల్యముకన్న తక్కువకు అమ్ముట ఉదా. ఒక బిల్లు మూడు నెలల కాలము తరువాత చెల్లింపవలసినదైన, బిల్లు కల వాడు అంతకుముందే బ్యాంకునకు ముఖ మూల్యములో కొంత సొమ్ము పట్టముగ చెల్లించి మిగిలిన సొమ్మును పుచ్చుకొనుట.
డిస్టెంపర్ ఇం. వి. (గృహ.) (Distemper) గోడలకు వేయు జిగురు చేర్చిన రంగు.
డిస్సెన్‌టర్సు ఇం. వి (చరి.) (Dissenters) భిన్నాభిప్రాయము గల ప్రొటెస్టెంటు క్రైస్తవులు. (క్రీ. శ. 16, 17 శతాబ్దములలో జరిగిన మత సంస్కరణోద్యమములో వీరికి ఈనామధేయము వచ్చెను)

## డీ

డీ అవ్య. తలతో తలనుపొడుచుట(డీడిక్కులు).
డీకొను క్రి. కవియు, ప్రతిఘటించు.
డీనము సం. వి. పక్షిగతి. మీది కెగురుట.
డీలుపడు క్రి. డిల్లపడు, బలహీనమగు, చచ్చు, వ్యర్థమగు. చూ. డిల్లపడు.

## డు

డుంకు క్రి. 1. ప్రుక్కు. 2. తగ్గు 3. లొంగు.
డుండుభము సం. వి. రెండు తలల పాము. (విషరహితమైనది).
డుబుడక్కవాడు వి. బుడబుడకవాడు.
డుయ్యు క్రి. 1. పారు. 2. ఊడదీయు. 3. బాణమునాటి వెడలు. చూ. దుయ్యు.
డుల్లు క్రి. 1. పొల్లు, డొల్లు. 2. ఊడు. రాలు.

## డె

డెంకణము వి. (వ్యావ.) నమస్కారము.
డెంటిన్ ఇం. (గృహ.) (Dentine) కాల్సియమ్ లేదా సున్నముతో నిండిన దంతముల ముఖ్యభాగము. (దీనిచే దంతము

యొక్క కరిటభాగ మేర్పడును).
డెందము వి హృదయము.
డెక్క వి. గిట్ట.
డెక్కు క్రి. అడ్డగించు.
డెక్స్ట్రోజ్ ఇం. వి. (జీవ.) (Dextrose) ద్రాక్ష చక్కెర.
డెజర్ట్‌స్పూన్ ఇం. వి. (గృహ) (Dessert-spoon) సగము ఔన్సు పరిమాణము గల గరిటె.
డెప్ప వి. కొండమీది సమమైన చోటు, సెత్తము.
డెప్పరము వి. 1. కష్టము, విపత్తు. 2. అశక్యము. రూ. దెప్పరము.
డెప్పు క్రి. ఎత్తిపొడుచు. రూ. దెప్పు.
డెబ్బండ్రు సర్వ. డెబ్బదిమంది.
డెబ్బది సర్వ. సప్తతి, ఏడు పదులు.
డెరిస్‌పొడి వి. (వ్యవ.) ఇది (Deriss elliptica అను చిక్కుడు కుటుంబపు మొక్క మొక్క వ్రేళ్ళ పొడి, కీటక నాశని. (Deriss powder).
డెలిగేటు ఇం. వి. (వ్యవ.) (Delegate) నియుక్తుడు, అధికార మిచ్చి పంపబడిన వాడు.
డెల్టా ఇం. వి. (భూగో.) (Delta) నది పెక్కు పాయలుగా నేర్పడి సముద్రమున కలయునప్పుడు త్రికోణముగ ఏర్పడిన భూభాగము. అట్లు పాయలుగా చీలినప్పుడు గ్రీకు అక్షరములలో డెల్టావలె నుండుటచే ఈ పేరు వచ్చినది. డెల్టాభూము లన్నియు త్రికోణాకారముగా నుండునని భావించుటకు వీలు లేదు.
డెవ్‌లప్‌మెంట్ కమీషనర్ ఇం. (Development commissioner) రాష్ట్రము లందు ప్లానింగు శాఖ వ్యవహారములను చూచుకొనుటకు ఉండు ఉద్యోగి.
డెస్సర్ట్ ఇం. వి. (గృహ.) (Dessert) భోజనములో చివర తిను పండ్లు లేక తీయని పదార్థము.

## డే

డేగ వి. శ్యేనము.
డేగకన్ను వి. నిశితదృష్టి.
డేగిస వి. పెద్దకాగు.
డేరా వి. గుడారము.

## డై

డైకులు ఇం.వి. (భూగో.) (Dykes) హాలెండులోని సముద్రపు నీటికి అడ్డకట్టలు.
డైనమో ఇం. వి. (భౌతి.) (Dynamo) విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేయు సాధనము.
డైమన్‌గడికట్టు (గృహ.) ఒక మాదిరి చేప ముల్లును పోలుకుట్టు. (Heading - bone stitch).
డైరీ ఇం. వి. (Diary) దినచర్యను వ్రాసుకొను పుస్తకము.
డైరెక్టర్ ఇం. వి. (Director). 1. వ్యాపార సంస్థలలో నిర్వాహక వర్గములోని భాగస్వామి. 2. నాటకము, సినిమా మొగువానిలో సూత్రధారుడు.

## డొ

డొంక వి. 1. కాలిదారి, నడచుటచే పల్లముగా నేర్పడినది. 2. పొద. 3. కోన.
డొంకు క్రి. 1. ఇంకు. 2. ఎండు. 3. అడగు. వి. వంకర.

డౌంగ వి. చూ. దొంగ.

డౌకారము వి. లోను, అంతరాళము.

డౌకారముసొచ్చు క్రి. లోజడు. శరణు సొచ్చు.

డౌక్కు వి. 1. ఒడలి యెముకలగూడు 2. ప్రక్క కడుపు.

డౌప్పు క్రి. ముదియు విశే. ముదిసినది. పనికి మాలినది.

డౌగరు వి. 1. నింద. 2. అపరాధము.

డౌల్ల వి. 1. బల్లెపంటిది. 2. బుఱ్ఱ. 3. డొలక.

డౌల్లు క్రి. 1. పొర్లు 2. పడు. 3. చచ్చు.

## డో

డోకు వి, వాంతి, ఓకర (ఓకిలింత). క్రి ఓకిలించు.

డోకడాలు వి. అసలు సొమ్మును నెలలచే గుణించగా వచ్చిన సంఖ్య, నూరవపాలు.

డోయ్‌టీరియమ్ ఇం. వి. (రసా.) (Deuterium) చూ. భారోదజని.

డోరము సం. వి. 1. వ్రతసూత్రము. 2. తోరము.

డోరములు వి. కత్తిమీది చారలు.

డోరియా హిం. వి. 1. బట్టయొక్క పడుగు పేకల గళ్ళు, 2. చారలు.

డోల్‌మెన్ ఇం. వి. (చరి.) (Dolmen) చనిపోయిన వారిని పాతిపెట్టుటకై నవశిలా యుగపు మానవు లుపయోగించిన బాన.

డోల సం. వి. ఉయ్యాలవంటి అందలము, తొట్ల, ఉయ్యాల.

డోలనము సం. వి. ఊచుట.

డోలా వై. వి. ఒక చర్మవాద్యము, డోలు.

డోలు వై. వి. ఒక చర్మవాద్యము. సం. ఢోలః.

డోల్డ్రమ్స్ ఇం. వి. (భూగో.) (Doldrums) భూమధ్యరేఖ సమీపమున నున్న నిర్వాత మండలము.

## డ్రా

డ్రాఫ్టింగ్ ఇం. (గృహ.) (Drafting) కొలతలలో తయారుచేసిన ఆది.

డ్రాఫ్టు ఇం. (అర్థ.) (Draft) ఒక బ్యాంకు పేరొక్కన్న వ్యక్తికి కాని, అతని అనుమతి పొందిన మరొకనికి కాని పేరొక్కన్న మొత్తమును చెల్లింపుమనునట్టి ఆజ్ఞాపత్రము.

## డ్రె

డ్రెస్సింగ్‌గౌను ఇం. (గృహ.) (Dressing gown) ఇంటియందు వేసికొనెడి కోటువంటి పొడుగైన దుస్తు.

డ్రెస్సింగ్ టేబుల్ ఇం. (గృహ.) (Dressing table) 1. అద్దములు సమర్చిన శృంగారపు బల్ల. 2. స్త్రీలు శృంగారించుకొనుట కుపయోగించు నిలువు టద్దముగల బల్ల.

## డ్రై

డ్రైక్లీనింగ్ రీఏజెంట్ ఇం. (గృహ.) (Dry-cleaning-reapent) దుస్తుల శుభ్రతకు ఉపయోగించు ద్రవము, ఉదా. పెట్రోలు. బెన్‌జైను మొదలగునవి కలిపి తయారు చేయు ద్రవము,

## ఢ

ఢ ఒక యక్షరము.
ఢంకము నం. వి. అచ్చుపోసిన ఆబోతు.
ఢక్క నం. వి. ఢంకా, రాజులు బయలు దేరునపుడు ముందు వాయించువాద్యము.

## ఢా

ఢాకా వి. దెబ్బ. (నీ ఢాకకు ఆగలేము.) ప్రతాపము.

## ఢు

ఢులి నం. వి. ఆడుతాబేలు. రూ. ఢులి.

## ఢో

ఢోలము నం. వి. డోలు.

## ణ

ణ ఒక అక్షరము.
ణ్యము నం. వి. బ్రహ్మలోకమందలి యొక సరోవరము.

## త

త ఒక యక్షరము.
తంకము నం. వి. దుఃఖము, భయము.
తంగు మా. టంగు.
తంగేడు వి. ఒక వృక్షవిశేషము. రూ. తంగేడు.
తంట వి. 1. కలహము. 2. చాడి. 3 క్రమము. 4. మోసము. రూ. తంటా.
తంటసము వి. చిమటా యను మంగలి వాని పనిముట్టు. రూ. తండసము.
తండసము వి. మా. పై.
తండిరి వి. జనకుడు. రూ. తండ్రి.
తండు క్రి. ప్రోగుచేయు, సేకరించు.
తండులము నం. వి. బియ్యము.
తండువు నం. వి. 1. ప్రెడ్డుకొయ్య. 2. నందికేశ్వరుడు.
తండెలు వి. ఓడపెత్తనగాడు. రూ. తండేలు
తండ్రి వి. మా. తండిరి.
తంతి వై. వి. లోహపుతీగ. నం. తంత్రీ.
తంతియలు వి. మెట్లు. రూ. తంతెలు.
తంతు వై. వి. 1. తంత్రము. ఉపాయము. 2. ఉపాయము. నం. తంత్ర.
తంతు వి. వివాహాదులలో చేయు కార్య విశేషము.
తంతుకరణము నం. వి. (గృహ.) నూలు వడకుట. దారము తీయుట (Spinning).
తంతుకాష్ఠము నం. వి. కదురు.

తంతునాగము సం. వి. 1. పాము వంటి జలచరము. 2. నెగడు.

తంతునాభము సం. వి. సాలెపురుగు.

తంతువాయుఁడు సం. వి సాలెవాడు.

తంతువు సం. వి. నూలుపోగు.

తంతువు సం. వి. (భౌతి) విద్యుద్దీపములో నుండు టంగ్‌స్టన్ తీగవంటిది (Filament)

తంత్రము సం. వి. 1. ఉభయార్థసాధకమైన ఉపాయము. 2. స్వరాష్ట్రచింత, 3. కారణము 4. గుంపు 5. శాస్త్రము.

తంత్రి సం.వి. 1.కంతి 2 నరము. 3. త్రాడు.

తందనము వై. వి. 1. తానము. 2. మాటిమాటికి తానశబ్దపూర్వకముగా చేసెడు రాగాలాపము. 3. పోరు. తగవు. సం. తానః.

తందర వై. వి. తంద్ర, తూగు. కునికిపాటు. సం. తంద్రాః.

తంద్ర సం. వి. తూగు. రూ. తంద్రి,

తంపర వి. తామర మొగ్గు వాని గుంపు.

తంపి వి. 1. చాలిగుంట. 2. కలహము.

తంబళ వి. శివార్చన చేసి బ్రతికెడు ఒక జాతి. రూ. తమ్మళి,

తంబి వి. తమ్ముడు. రూ, తంబు

తంబు వి. మా. తంబి.

తంబుగ వి. మెడ నిడువగు చెంబు. రూ. తంబిగీ.

తంబుఱ వి శ్రుతికై యుంచుకొను తంత్రీవాద్యము.

తకపికలాడు క్రి. 1. ఇట్టట్టు చలించు. 2. మోసపడు.

తకరారు హిం. వి. 1. వివాదము, తగవు. 2. భేదము.

తకావి హిం. (వ్యవ.) సేద్యము చేయుటకై సాహాయ్యముగా నివ్వబడు సొమ్ము.

తక్క అవ్య. వినా, కాక అను నర్థము నిచ్చును.

తక్కటి వి. మూడు ముఖములు గల దీపారాత్రికపు తట్ట. త్రిముఖదీపిక,

తక్కావి అప్పులు మి. వి. (అర్థ.) వ్యవసాయదారులకు ఎరువు మొదలగునవికొనుటకు ప్రభుత్వ మిచ్చు తాత్కాలిక ఋణములు.

తక్కించు క్రి. 1. తొలగించు. 2. చక్కచేయు.

తక్కిడి వై. వి. 1. మోసము. 2. త్రాసు రూ. తక్కెడ.

తక్కు వి. 1. తప్పు. 2. మిగులు. 3. విడుచు. విశ. ఇతరము.వై. క్రి. టక్కుచేయు. సం. తక్కః.

తక్కుడు వి. 1. తక్కుట. 2. విడచుట. 3. మిగులుట.

తక్కులాడి విశ. 1. టక్కులాడి, వన్నెలాడి. 2. మోసకత్తె.

తక్కువ వి. కొరత.

తక్కెడ వై. వి, త్రాసు. రూ. తక్కెడ. సం. త్ర్యంకటమ్.

తక్కెఱ విశ అల్పము.

తక్కొను క్రి. పూనుకొను.

తక్రము సం. వి. మజ్జిగ, చల్ల.

తక్రాటము సం. వి. కవ్వము.

తక్షకుఁడు సం. వి. 1. నాగరాజు. 2. వడ్లవాడు. 3. విశ్వకర్మ. రూ. తక్షుడు. సం. విశ. చెక్కువాడు

తక్షణము సం. వి. చెక్కుట.

తక్షిణి సం. వి. బాడిస. చెక్కలు చెక్కు పనిముట్టు.

తక్షుడు సం. వి. మా. తక్షకుడు.

తగటి విశ. జరీ, సరిగకలది. రూ. తగటీ.

తగటు వి. సరిగ, జరీ.

తగడు వి. బంగారు మొదలగు వాని రేకు,

తగరము వై. వి. తవురము ఒక తెల్లని లోహము, రూ. తవరము. సం. తమరమ్

వై. వి. (రసా.) వంగము సులభముగా కరగు వెండివలెతెల్లనగు ధాతువు (Tin) (ఇది ఆవర్తక్రమ పట్టికలో నాల్గవ వర్గమున కననగును.) సం. వి. పొట్టేలు.
తగరు వై. వి. పొట్టే- సం. తగరః
తగరురౌతు వై. వి. అగ్ని.
తగవరి వి. 1 ధర్మజ్ఞుడు, న్యాయాధిపతి
తగవు వి. 1. తగుట, 2. న్యాయము 3 జగడము. 4. పెండ్లియప్పుడు పెండ్లికూతునకు తల్లిదండ్రు లిచ్చు బహుమానము,
తగవుగోరి విశే. సంధిచేయువాడు, మధ్యస్థుడు.
తగాదా హిం, వి. తగవు, వ్యాజ్యెము.
తగు క్రి. అర్హమగు. రూ. తవు:
తగులఁగట్టు క్రి. తగిలించు.
తగులఁబడు క్రి. 1. తగులు. 2. చిక్కు. 3. కాలు, దగ్ధమగు.
తగులఁబెట్టు క్రి. 1. తగిలించు. 2. కాల్చు.
తగులము వి. 1. ఆసక్తి. 2. తగులు. 3. అడ్డపాటు, నిరోధము. 4. ప్రేమము.
తగులాటము వి. 1. బంధము, తగులు. 2. తొడుసు.
తగులాయము వి. సంబంధి. కావలసినవాడు,
తగులు క్రి. 1. చిక్కు. 2. పట్టు. 2. తాకు. 4. సక్తమగు 5. అంటు. 9. పొసగు. 7. వెంబడించు. వి. 1. ఆసక్తి, అభిలాష. 2. తగులాటము. రూ. తవులు. తౌలు.
తగులుకొను క్రి. 1.తగులుకొనుట.2.వలపు.
తగులుకోలు వి. 1 తగులుకొనుట. 2 వలపు.
తగులుగొండి విశే. తగులుకొనునట్టిది.
తగులుచు క్రి. తగులచేయు.
తగులుడు క్రి. తగులు.
దగులుదల వి. తగులుట.
తగులువడు క్రి. 1. పట్టువడు. 2. ఆసక్తి పొందు.

తగ్గు క్రి. 1. తక్కువగు. 2. వెనుదీయు. 3. తెగిపడు. వి. తక్కువ.
తగ్గుదల వి. తక్కువ,
తచ్చన వి. కపటము. 2. పరిహాసము.
తచ్చనలాడు క్రి. 1. పరిహసించు. 2. చిక్కుపడు.
తటతా వి నిశ్చేష్టత.
తటతాపడు క్రి. నిశ్చేష్టత నొందు.
తటమట వి. 1. మోసము. 2. కలత. రూ. తటపట.
తటమటించు క్రి. 1. కలచు. 2. మోసపుచ్చు.
తటము సం. వి. 1. ఏటి యొడ్డు. 2. కొండచరియ. 3. ప్రదేశము.
తటస్థము సం. (భౌతి. రసా.) రెండు పరస్పర విరుద్ధస్థితులలో దేనికిని చెందకుండునది (Neutral), ఉదాసీనము. సం. విశే. 1. సమీపమందున్నది. 2. ఒనగూడినది.3. ఏపక్షమును చేరకున్నది,నిష్పక్షపాతముగనున్నది.
తటస్థరాజ్యములు సం. వి. (రాజ. చరి.) ప్రపంచములోని వివిధ రాజకూటములలో, సైనిక కూటములలో చేరక ప్రతి సమస్యను స్థూలదృష్టితో విమర్శించి, తమకు న్యాయమని తోచు విదేశాంగ నీతి అవలంబించురాజ్యములు.(Non-aligned countries).
తటస్థ విధానము సం వి. (రాజ. చరి.) ఒక రాజ్యము విదేశీయ యుద్ధములలో కలుగచేసికొనక, విదేశ రాజ్యకూటములలో చేరక, విదేశ వ్యవహారములలో స్వతంత్ర రాజకీయ విధానమును అవలంబించుట. (Non-alignment).
తటస్థీకరణము సం. వి. (రసా.) ఆమ్లక్షార ముల రెండింటి లక్షణములు లేకుండచేసి నీరు లవణములు ఏర్పడునట్లుచేయుట. (Neutralisation).

తటస్థుఁడు సం. విశ. న్యాయస్థుడు.
తటాకము సం. వి. చెరువు. రూ. తటాగము.
తటాన విశ అతిశీఘ్రముముగా. రూ. తటాలున
తటి సం. వి. 1. ఏటి యొడ్డు. 2 ప్రదేశము.
తటిత్తు సం. వి మెరపు.
తటిత్వంతము సం. వి మేఘము. వ్యు. తటిత్తు కలది.
తటిని సం. వి. ఏరు. వ్యు. తటముకలది.
తటుకున విశ. తటాలున. రూ. తటుక్కున, తడుకున.
తట్ట వి. 1. వెదురుబద్దలు మొదలగువానితో నల్లిన పల్లిక. 2. లోహముతో చేసిన తబుకు, పళ్ళెము.
తట్టగిల్లు క్రి. తట్టవలెనగు.
తట్టమ్మవారు వి. చర్మముపై ఎఱ్ఱనిమచ్చలు కనిపించు అంటువ్యాధి, పొంగు (Measles).
తట్టన వై. వి. 1. ధైర్యము. సం. స్థైర్యమ్.
తట్టాడు క్రి. 1. ఇటునటు తిరుగు. 2. ఊగు.
తట్టు వి. 1. కంచము. 2. తెర. 3. తడక.
తట్టు క్రి. 1. కలుగు. 2. తోచు. 3. చరచు. హిం. వి. పొట్టిగుఱ్ఱము. వై. వి. దరి, పార్శ్వము.
తట్టుముట్టాడు క్రి. 1. చుట్టుకొను.2.అపార మగు. 3. మిక్కుటమగు.
తట్టువ వై. వి. గుఱ్ఱము. రూ. తట్టువము.
తట్టువడు క్రి. బాధపడు.
తట్ర వై. వి. బంగారు పనిచేసి బ్రతుకు జాతి, అగసాలె. సం త్వష్టా.
తడ వి. 1. అడ్డు. 2. కడ. 3. దూరము.
తడఁబడు క్రి. 1. తొట్రుపడు. 2. వ్యత్యాస పడు, చలించు.
తడఁబాటు వి. తొట్రుపాటు.
తడక వి. తలుపులు మొదలగు వాని కుపయోగించుటకై బద్దలతో నల్లినది. రూ. తడిక.
తడకట్టు క్రి. అడ్డగించు, నిరోధించు.
తడగము వి. ఎద్దుమీద నీళ్ళు తెచ్చు తోలు సంచి. రూ. తణగము, తణగాము.
తడప వి. పట్టాా నూఁదునార. త. తేడల్.
తడయు క్రి ఆలస్యముసేయు.
తడవు క్రి 1. చేతులతో ప్రాకు, దోగాడు. నిమురు, వెదకు 2 ప్రస్తావించు. 3 విచారించు వి. 1. ఆలస్యము. 2. చిరకాలము. 3. సేవు.
తడవుడు వి. వెదకుట.
తడవుల నిడుపడు వి. శేషుడు, వ్యు. చిర కాలమునుండి యుండు దీర్ఘమైన శరీరము కలవాడు.
తడికె వి. చూ తడక.
తడియు క్రి. అర్ద్రమగు.
తడుకు వి. 1. వెలుగు. 2. కంచె.
తడుకున విశ. తటుకున, హఠాత్తుగ.
తడుపు క్రి. తడియచేయు. వి. 1. గోచి. 2 చిన్నవస్త్రము.
తడుపుదాలువు వి. 1. బ్రహ్మచారి. 2. 3. గోచికట్టు.
తడుము క్రి. 1. ఆలోచించు. 2. నిమురు,
తణఖాదస్తావేజు (అర్థ, శాస.) తాకట్టు పత్రము (Mortgage deed).
తణగము వి. చూ. తడగము.
తతము సం. విశ. (భౌతి.) 1. బిగించబడినది. 2. వ్యాపించినది (Stretched). వి. 1. ఇటునటు బలముగా లాగబడిన తంతువు (Stretched String). 2 బిరడాలుత్రిప్పిన లాగబడిన (బిగిసిన) తీగ. 3. వీణాది వాద్యము. 4. గాలి.
తత్తడి వి. 1. గుఱ్ఱము. 2. వాహనము.
తత్తబడ వి. 1. పరివారము. 2. సేన.
తత్తఱ వి. సంభ్రమము. రూ. తత్తరము.
తత్తఱించు క్రి. 1. భ్రమించు. 2. చలించు. తత్తరిల్లు.

తత్తిర వి. సారాయి పోసెడు తిత్తి.
తత్పరుఁడు సం. విశే. ఆసగలవాడు.
తత్రత్యము సం. విశే. అక్కడనున్నది. అచటిది.
తత్త్వము సం. వి. 1. పరమాత్మ. 2. స్వభావము. 3. సారము. సం. వి (భౌతి) మౌలికమైన, సారమైన విషయము. దేని మీద ఇతర సత్యములు ఆధారపడి యుండునో అట్టి మౌలిక సత్యము లేదా దేని నుండి ఇతర సత్యము లుత్పన్నములగునో అట్టి మౌలిక సత్యము (Principle).
తత్సమము సం. వి. (వ్యాక.) సంస్కృత ప్రాకృత శబ్దములకు తెలుగు ప్రత్యయములు చేర్పగా ఏర్పడిన పదములు, ఉదా. రాముడు, కృష్ణుడు మొ॥నవి.
తథ్యము సం. వి. సత్యము.
తదియ వై. వి. తృతీయ, పక్షమునందు మూడవ తిథి. సం. తృతీయా.
తదీయము సం. విశే. తత్సంబంధమైనది.
తద్ద అవ్య. మిక్కిలి రూ. తద్దయు.
తద్దినము సం. వి. 1. ఆదినము 2, మృతి పొందిన దినము. 3. ఆబ్దికముపెట్టుదినము.
తద్దె వై. వి. తదియ, తద్దియ, అట్లతద్దె ఉండ్రాళ్ళ తద్దె.
తద్ధర్మము సం. వి. (వ్యాక.) 1. మూడు కాలములను బోధించు క్రియాపదము. ఉదా. సూర్యు డుదయించును. 2. దాని యొక్క ధర్మము. 3. స్వభావము.
తద్ధితము సం వి. (వ్యాక) విభక్త్యంత శబ్దములకు భావార్థమందు మతుబర్థమందు విధింపబడు ప్రత్యయములు తద్ధిత ప్రత్యయములనబడును. ఉదా. రాముని తనము, మగతనము. (భావార్థమునందు) తన ప్రత్యయము. అందగాడు, అందకత్తియ (మతుబర్థమున) కలవాడు, కలది అను అర్థమున కాదు, కత్తియ ప్రత్యయములు.
తద్భవము సం. వి. (వ్యాక.) సంస్కృత ప్రాకృతముల నుండి ఏర్పడిన వికృతి రూపములైన తెలుగు శబ్దములు ఉదా. గోడ, పాత్రము మొ.నవి. (వీనినే వికృతు లందురు )
తన సర్వ. ఆత్మార్థకము
తనకవి వి. 1. చిక్కు. 2. చిక్కుపెట్టువాడు.
తనయ సం. వి. కూతురు.
తనయుఁడు సం. వి. కొడుకు.
తనరారు క్రి. 1 ఉన్నతమగు. 1. అతిశయించు. 3. ఒప్పు.
తనరు క్రి. 1. ఒప్పు. 2. అతిశయించు. విజృంభించు. రూ. తనరుచు, తనర్చు.
తనరుచు క్రి. చూ. పై.
తని వై. విశే, 1. అల్పము 2. సూక్ష్మము. సం. తనుః.
తనిఖీ హిం, వి. సరిచూచుట.
తనియు క్రి. తృప్తిపడు.
తనివి వి. తృప్తి రూ. తనివు.
తనివోవు క్రి. తృప్తిపడు.
తనిసను క్రి. తనిపోవు.
తనుకు క్రి. 1. కలుగు. 2. జ్వలించు. 3. ప్రకాశించు. 4. తపించు. రూ. తనుకు.
తనుకోశములు సం. (జం.) పునరుత్పత్తి క్రియ కాక శరీరములో తక్కిన జీవిత వ్యాపారములతో సంబంధము కల జీవ కణములు. (Somatic or body cells )
తనుత్రము సం. వి. కవచము. వ్యు. దేహమును రక్షించునది.
తనుత్రాణము సం. వి. కవచము.
తనుపార్శ్వము సం. (జం.) బాహ్యాస్తరము, ప్రాచీరస్తరము కలిసి ఏర్పడిన పొర (Somato-pleure). అన్తఃపార్శ్వము అంతస్తరము, అన్త్రస్త్యపొర కలిసి ఏర్పడిన పొర. (Splanchno-pleure).

తనుపు క్రి. తనియఁజేయు. వి. 1. తనివి. 2 శైత్యము. 3. శైత్యోపచారము. 4. ఓర్పు, క్షమ. 5 తడి.
తనుమధ్య సం వి స్త్రీ. సన్నని నడుముకలది.
తనురుహము సం. వి. 1. రెక్క. 2. వెండ్రుక. రూ. తనూరుహము.
తనువు సం వి. 1. దేహము. 2. తోలు. విణ. 1. చిన్న. 2. సన్న.
తనుజుఁడు సం వి. కుమారుడు. రూ. తనుజుఁడు, తనూభవుడు.
తనూనపాత్తు సం. వి అగ్ని. వ్యు అన్నాదులను పచనముచేసి శరీరము పడకుండ కాపాడునది.
తన్ను క్రి. 1. పాదతాడనముచేయు. 2. ఒరయు.
తన్నుఁగోల వి ఆధారముగా నుంచిన కఱ్ఱ.
తన్నులాడు క్రి. కొట్టుకొను.
తన్మయము సం. విణ. 1. ఆ స్వరూపమైనది 2. మైమరపు.
తన్మాత్రములు సం. వి. శబ్ద స్పర్శ రూప రస గంధములు.
తన్యత సం. వి. (భౌతి.) సాగతీసిన తీగవలె సాగుగుణము. బంగారు, వెండి, రాగివంటి ధాతువులు కమ్మెచ్చుతో లాగినపుడు మిక్కిలి సన్నతీగల నిచ్చును. (Ductility)
తపతప వి. రెక్కలు కొట్టుకొనుటయందగు ధ్వని.
తపన సం వి. తాపము. రూ. తపనము.
తపనీయము సం. వి. బంగారు.
తపనుఁడు సం. వి. సూర్యుడు.
తపము సం. వి. 1. ధాన్యము. రూ. తపస్సు. 2. ఎండకాలము. 3. శిశిరర్తువు.
తపస్వి సం. వి. తపస్సుచేయువాడు.
తపస్విని సం. వి. తాపసురాలు.
తపాలా హిం. వి. ఉత్తరములు మొదలవి అందించు శాఖ.

తపించు సం. క్రి. 1. తాపమునొందు. 2. తపముచేయు,
తప్తము సం. విణ. తపింపచేయబడినది, కాచబడినది.
తప్ప వి. గింజపట్టని ధాన్యము, లేక కాయ. అవ్య. వినాశకము, కాక.
తప్పఁజూచు క్రి. 1. అనాదరించు. 2. ఉపేక్షించు.
తప్పక అవ్య. తప్పకుండ్రస్థితో, చలింపక,
తప్పిదము వి. దోషము.
తప్పివారి విణ. 1. పొరపడి 2, గురితప్పి.
తప్పు క్రి. 1. చెడుగుచేయు. 2. అతిక్రమించు వి. అపరాధము. రూ. తప్పిదము. క్రి. చిక్కు.
తప్పుపడు వి తప్పుట.
తప్పుదల వి. తప్పుట.
తప్పుదారి వి. చెడుత్రోవ
తప్పుట వై. వి. ఒక వాద్యవిశేషము. సం. తమ్మటః.
తబము వై. వి. తపము, తపస్సు. సం. తపస్.
తబిసి వై. వి తపసి, ముని. సం. తపస్వీ.
తబుకు వి. 1. తములపాకుతట్ట. 3. పళ్ళెము.
తబేలా హిం. వి. అశ్వశాల.
తబ్బిబ్బు వి. తడబాటు.
తమంగము సం వి. మంచె.
తమకము వి. 1. త్వర. 2. మోహము.
తమకి విణ. 1. త్వరగలవాడు. 2. మోహము నొందినవాడు.
తమకించు క్రి. 1. త్వరపడు. 2. చలించు.
తమకు క్రి. 1. చలించు. 2. దాగు. వి. విధము.
తమగము వై. వి. మంచె. సం. తమంగః,
తమటము సం. వి తమ్మెట. రూ. తమ్మటము.
తమము సం. వి. 1. చీకటి. 2, ఒక గుణము. 3. శోకము. రూ. తమస్సు.

తమర వి. వంగ.
తమరము నం. వి. 1. తగరము. 2. సీసము.
తమలపాకు (వ్యవ.) ఈ ఆకులు తాంబూలమునకును, వైద్యమునకును ఉపయోగించును. (ఈ తీగ మిరియపు కుటుంబము (Piperaceae) నకు చెందిన Piper betle అను మొక్క.) రూ. తమలపాకు.
తమస్విని సం. వి. రాత్రి.
తమస్సు నం. వి. తమము.
తమాలము నం. వి. 1. బొట్టు. 2. కత్తి, 3. చీకటిచెట్టు.
తమి వి. 1. త్వర, 2. కుతూహలము. 3. అపేక్ష. 4. వలపు.
తమి నం. వి. రాత్రి, చీకటి.
తమిఁద వి. రాగిపైరు. రూ. తవిద, తవ్విద.
తమిరె వి. 1. కాడి వడిమిచీల, 2. కయ్య
తమిస్ర నం. వి. చీకటిరేయి, చిమ్మచీకటి.
తమిస్రము నం. వి. 1. చీకటి. 2. కోపము 3. పసుపుపొడి.
తముకు వి. తుడుము. రూ. టముకు.
తములపాకు వి. నాగవల్లిదళము.రూ. తమలపుటాకు.
తములము వై. వి. తాంబూలము, వక్కాకు. రూ. తమ్మలము. నం. తాంబూలమ్.
తమ్మ వై. వి. నమలిన తాంబూలము. నం తాంబూలమ్.
తమ్మంటు వి. కుండలము, ఆభరణ విశేషము.
తమ్మతనుకు వి. తమ్మపడిగ, తాంబూలముమియు పాత్రము.
తమ్మళ వి. చూ. తంబళ.
తమ్మి వై. వి. 1.తామరసము, 2.పద్మము, 3. పద్మవ్యూహము. రూ. తామర, నం. తామరసమ్.
తమ్మికంటి వి, 1. స్త్రీ. 2. విష్ణువు.
తమ్మికెంపు వి. పద్మరాగము. వ్యు. తమ్మివంటి కెంపు ఎరుపు కలది.
తమ్మిచూలి వి బ్రహ్మ. తమ్మియందు పుట్టినవాడు.
తమ్మిదీవి వై. వి. పుష్కరద్వీపము.
తమ్మిదొర వి. సూర్యుడు.
తమ్మిపగతుఁడు వి. చంద్రుడు.
తమ్మియ వి. చెవితమ్మె. పలుపుతమ్మె రూ. తమ్మె. తంబె.
తమ్మియింటిగరిత వి. లక్ష్మి. పద్మాలయ
తమ్ముఁడు వి. వెనుక పుట్టినవాడు. అనుజుడు. రూ. తమ్మువాడు.
తమ్ముఁగుఱ్ఱ వి. ముద్దుల తమ్ముడు.
తమ్మువాఁడు వి తమ్ముడు.
తమ్మె వి. 1. తమ్మియ, 2. చెవిఅడుగు భాగము.
తయమిన్ ఇం. (గృహ.) (Thiamine) 'బి' విటమిన్. నంజువ్యాధిని తొలగించు విటమిను. 'బి' గ్రూపు విటమినులలో మొదటిది.
తయారు హిం. వి. సిద్ధము
తరంగకము నం.వి.పిల్లతరంగము, చిన్నఅల.
తరంగగతిసంకోచము నం. (జం.) అన్నవాహిక యొక్క గోడలు సంకోచము చెందుచు ఆహారము తరంగము మాదిరిగా ముందుకు జరుగుట. (Peristalisis).
తరంగణము నం. వి. (భౌతి.) తరంగరూప చలనము. (Undulation).
తరంగము నం. వి. 1. అల, తరగ. 2 ఒక రీతిగేయము. నం. వి. (భౌతి.) ఏదైన వస్తువు వేగముగా చలించుటచే గాలిలో సంపీడనము, విరళీకరణము ఒకదాని వెంబడి ఒకటి సంభవించుటచే ఏర్పడిన చలనము. (Wave)
తరంగవంతము నం. వి. (వృక్ష.) ఆకారములో అలలవలె నున్నది. (ఉదా:- ఆకు అంచు.)

తరంగిణి నం. వి. నది, ప్రవాహము.
తరండము నం. వి. 1. ఓడ. 2. తెప్ప. వ్యు. దాటించునది. తేలునది.
తరంగ వై. వి. తరంగము, అల. నం తరంగః.
తరకట వై. విణ. అసత్యము, నం. తర్కః.
తరకటించు వై. క్రి. తర్కించు. వాదించు.
తరకసము వి. అమ్ములపొది. రూ. తరకసా
తరక్షువు నం. వి. సివంగి.
తరగతి నం. వి. నిర్ణయించిన పద్ధతి. ప్రమాణము, తరమును తెలుపు భాగము.
తరణము నం. వి. 1. దాటుట, 2.తరించుట.
తరణి నం. వి. 1. ఓడ. 2. దాటుట, 3. సూర్యుడు.
తరతరము వై. విణ. క్రమక్రమముగా. పరంపరగా.
తరపు క్రి. 1. పోగొట్టు. 2. దాటు.
తరపు హిం. వి. పక్షము.
తరము వై. వి. 1. పురుషాంతరము. 2 మానము 3. సామ్యము. 4. వరుస 5. దినుసు. 6. శక్యము, నం. అంతరమ్. నం. వి. దాటుట.
తరలు క్రి. ప్రయాణమగు.
తరవరి వై. వి. తరవారి, పట్టాకత్తి. రూ. తరవలి. హిం. తల్వార్.
తరవణి వి పుల్లనీళ్ళు.
తరవాయి వి. 1. సమయము. 2. అనుక్రమము. 3. పరిశిష్టము, 4 తడవ,
తరవారి నం. వి. చూ. తరవరి.
తరస్సు నం. వి. బలిమి. 2. వడి.
తరహా హిం. వి. రీతి.
తరళము నం. వి. నాయకమణి నం. విణ. 1. చలించునది. 2. ప్రకాశించునది. 3, అనురాగము కలది.
తరళేక్షణ నం. వి, స్త్రీ, ప్రాలుగంటి.
తరాజు హిం. వి. తూచెడి సాధనము. రూ. తరాసు, త్రాసు.
తరి వి, త్రచ్చుట. చిలుకుట, నం. వి. 1. ఓడ. 2. మబ్బు.
తరించు నం. క్రి. 1. దాటు, అతిక్రమించు,
తరికాడు విణ. త్రచ్చువాడు.
తరిగంబము వి. పెరుగు చిలుకు స్తంభము.
తరిగొండ వి మంధాద్రి.
తరిగోల వి. కవ్వము.
తరితీపు వి.1.ఉపేక్ష. 2.విలాసము 3 కోరిక.
తరితీపుసేయు క్రి. 1. గర్వించు. 2. ఉపేక్షించు 3 వలపించు.
తరుకృషి నం. వి. (వ్యవ.) కలప, వంట చెరకు నిచ్చు వృక్షముల పెంచుట. అటవీ పాలనము (Forestry) కూడ ఈ శాఖ లోనిదే. (Arboriculture).
తరుగుదల వి. (వాణి) వస్తువులను రవాణా చేయునపుడుగాని, వాడినపుడుగాని వాని విలువలో కలుగునష్టము (Depreciation)
తరచు వై. క్రి. త్రచ్చు.
తరుణము వి. సమయము. నం. విణ. క్రొత్తది, యౌవనముగలది,
తరుణి నం. వి. యువతి. స్త్రీ. రూ. తలుని.
తరుణిమ నం. వి. యౌవనము. రూ, తారుణ్యము.
తరువడి వి. తరిమెన.
తరువాయి వి. అనంతరము,
తరువు నం.వి. చెట్టు, వై. వి. ఈయవలసిన దాని నిమ్మని నిర్బంధము చేయుట నం త్వరా.
తరువుకాడు వై. విణ. తరువు వచ్చినవాడు
తరుసంబంధము నం. (జం) వృక్షములతో సంబంధముగలది, చెట్లపై నివసించునది.
తర్కము నం వి. 1. ఊహ. 2. అధ్యాహారము. 3. ఒక శాస్త్రము.
తర్కించు నం. క్రి. 1. ఊహించు 2 చర్చించు, హేతువు చూపుచు వాదించు

తర్కురూపము సం.(వృక్ష.) నూలు కండె ఆకారముగా నున్నది. (ముల్లంగి దుంప ఆకారము). (Fusiform).

తర్జనము సం. వి అదలుపు భయపెట్టుట.

తర్జని సం వి జుట్టనవ్రేలు, చూపుడువ్రేలు.

తర్ణకము సం వి. అప్పుడు పుట్టిన దూడ

తర్పణము సం వి. 1. తృప్తి. 2. పితృయజ్ఞము.

తర్ఫీదు హిం. వి 1. అభ్యాసము. 2. ఆచరణము. 3, శిక్షణ.

త(థ)ర్మామీటరు ఇం వి. (భౌతి.)(Thermometer) ఉష్ణపరిమాణమును కొలుచుటకుపయోగించు పరికరము.

త(థ)ర్మాస్‌ఫ్లాస్కు ఇం. వి. (భౌతి.)(Thermosflask) వేడి ద్రవ్యములను చల్లారకుండను చల్లని ద్రవ్యములను వేడియెక్కకుండగను నిలువయుంచుట కుపయోగపడు థర్మాస్‌ఫ్లాస్కు ఒక జాడీ.



త(థ)ర్మో ప్లాస్టిక్ ఫైబ్రో ఇం. (గృహ.) (Thermo Plastic fibreo) వేడిచే మెత్తబడి రూపము మార్పుగల పోగులు. ఈ బట్టపై వేడి ఇస్త్రీ పెట్టె పెట్టిన బట్ట కరగిపోవును,

త(థ)ర్మో స్టాట్ ఐరన్ ఇం. (గృహ.) (Thermostat Iron) థర్మోస్టాటిక్ ఇస్త్రీ పెట్టె ఉష్ణతను హెచ్చు తగ్గులుగా అమర్పగల విద్యుచ్ఛక్తి సహాయముతో పనిచేయు ఇస్త్రీ పెట్టె.

తర్జుమా హిం. వి. అనువాదము, ఒక భాషలో రచితమైన దానిని మరొక భాషలోనికి మార్చుట, భాషాంతరీకరణము.

తర్షము సం. వి. 1. దప్పి. 2. ఇచ్ఛ. రూ. తృష్ణ, 3. పడవ.

తఱక వి. 1. గింజ సరిగా పట్టని ధాన్యము. 2. కాచిన పాలమీద కట్టు సన్ననిపొర.

తఱచు విశ. 1. అధికము. 2. దట్టము.

తఱటు క్రి కొరడాతో కొట్టు.వి 1.కొరడా. 2 మౌర్ఖ్యము,

తఱతఱ వి. సంభ్రమము. రూ. తత్తర, తత్తరము.

తఱపి వి. 1. పెయ్య. 2. తారుణ్యము.

తఱలు క్రి. 1. చలించు, సంభ్రమించు. 2. విడుచు.

పఱి వి. 1. సమయము. 2, సమీపము. 3. ఒరపిడిచే గలిగిన రేఖ, తరులు (బహు.) వళులు.

తఱిగొను క్రి. ప్రయత్నించు.

తఱిమెన వి. కొయ్యను యంత్రమున పెట్ట వలసినట్లు అరుగదీయుట.

తఱియు క్రి. అతిక్రమించు, దాటు. 2, తరియబడు.

తఱియు క్రి. సమీపించు.

తఱివడు క్రి. ఒత్తుడుపడు.

తఱుఁగు క్రి. క్షయించు. రూ. తర్గు.

తఱుగరి వి. తరుగు తీసికొనువాడు.

తఱుగు క్రి. 1.ఖండించు,చించు .2. అమ్మెడువానికిని కొనెడు వానికిని ఒక సరుకును వెల కుదిర్చి వానివద్ద నూటికింతయని తీసికొను ద్రవ్యము.

తఱుఁగుదల వి. (వాణి.) వ్యాపార సంస్థకు గల ఆస్తుల విలువలో వచ్చు తగ్గుదల,

తఱుచు వి చూ. తఱచు.

తఱువు వి. 1. పడాది- వయసు చెల్లిన అడుదూడ 2. మణి విశేషము.

తఱుము క్రి, 1. కవియు. 2.త్వరపడు. 3. వెంబడించి పరుగెత్తు. 4. బలాత్కరించు. 5. తరిమెన పట్టు.

తఱుల మేకము వి. కోతి, వలీముఖము.రూ, తఱుల మోర మేకము. (ముడుతలు మొగమున గల జంతువు.)

తఖుపు క్రి. 1. ఎగ్గు 2. ఖండిగించు చూ. తఖుఁగు.
తఖుస్తలి విశ. ఉద్ధతుడు.
తజ్జు విశ. నీచుడు. చూ. తజ్జు.
తల వి. 1. చోటు. 2. రంగము. 3 పదము. సం. స్థలమ్. తలమ్. వి. 1. శిరస్సు. 2. శిరోజము. 3. కొన. 4. పూనిక. 5. ఎత్తు 6. ముందుభాగము 7. మొత్తము. 8. ఎడ. 9. సమయము. విశ మొదలు.
తలంటు వి. అభ్యంగన స్నానము చూ. తలయంటు
తలంపు వి. 1. ఊహించుట. 2. ఆలోచనము. చూ. తలఁపు.
తలంబ్రాలు వి. పెండ్లిలో వధూవరుల తలలపై పోయు నతతలు. చూ. తలఁబ్రాలు.
తలఁకు క్రి. 1. చలించు. 2. భయపడు.
తలఁగు క్రి. 1. ఒదుగు. 2. ఒదిగించు. 3. తొలగు.
తలఁచు క్రి. 1. ఎంచు. 2. ధ్యానించు. చూ. తలఁచు
తలఁపు వి. 1. తలచుట. 2. కోరిక. 3 ఆలోచనము. 4. జ్ఞప్తి. 5. హృదయము. 6. అభిప్రాయము. 7. ఊహించుట
తలఁపుచూలి వి. మన్మథుడు, భావజుడు.
తలఁపుమిన్న వి. చింతామణి. చూ. తలఁపురాయి.
తలఁపుసాకిరి విశ. నీ వెరిగియుండు మని వాది చెప్పియుంచిన సాక్షి.
తలకట్టు వి. 1. (√) ఆకార చిహ్ననామము 2. పాగా. విశ. ముఖ్యము.
తలకడుచు క్రి అతిక్రమించు.
తలకాయ వి. శిరస్సు.
తలకూడు క్రి. సిద్ధించు.
తలకెడవు విశ. తలక్రిందు. చూ. తల్లకెడవు.
తలకొట్లమారి వి. 1. శిరచ్ఛేదముపొందిన వాడు. 2. అవినీతుడు.
తలకొను క్రి. 1. కలుగు. 2. యత్నించు. 3. తాల్చు.
తలకొఱవి వి శవమునకు తలకడ నుంచు నిప్పు.
తలక్రిందు విశ. అధోముఖము, విలోమము. చూ. తలక్రిందు.
తలగడ వి. పరుండునపుడు తల యుంచు కొను దిక్కు, దిండు. చూ. తలాడ.
తలగడుగు వి. దండము.
తలగాము వి. రాహువు.
తలగుంజె వి. సిక్కాడు.
తలచుట్టు వి. పాగా, చూ. తలచుట్టు.
తలచూపు క్రి. తోచు.
తలడిల్లు క్రి. చలించు. చూ. తల్లడిల్లు.
తలతన్యత నం (భౌతి) ద్రవముల, ఘనములపై తలమందు పనిచేయు బలము. (Surface tension).
తలతల అవ్య ఒక్కొక్కనికి.
తలనట్టు వి. 1. వేరుపురుగు కొరుకుటచే మొవ్వు చెడుట. 2. చెట్లు, పైరులకు పట్టు తెగులు.
తలపడు క్రి. 1. ఆరంభించు. 2. ఎదిరించు 3. తాకు.
తలపన్ను వి. (చరి. రాజ) దక్షిణాఫ్రికా చెరకు తోటలలో మొదట పనిచేయుటకై వెళ్ళి, అచట స్థిరనివాస మేర్పరుచుకొను భారతీయులపై దక్షిణాఫ్రికా ప్రభుత్వము విధించిన పన్ను. భారతీయుల అర్థికస్తోమత పెరుగకుండ దక్షిణాఫ్రికా శ్వేత ప్రభుత్వము భారత స్త్రీ పురుషులపై 13-16 సంవత్సరముల వయసుగల బాల బాలికలకు తల ఒక్కింటికి 3 పౌనులు చొ॥ పన్ను రద్దు చేయించుటకు మొట్టమొదటి సారిగా మహాత్మాగాంధి దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహము చేసెను. (Pole tax).
తలపెట్టు క్రి. 1. ఆరంభించు. 2. ప్రస్తావించు
తలపొలము వి. 1. పొలిమేర వెంబడి నున్న పొలము. 2. ఎత్తైనస్థలము.

తలపోయు క్రి. చింతించు, ఆలోచించు.
తలమాటు వి. రాబోవుచేటు, నాశము.
తలమానికము వి. 1. శిరోరత్నము, 2 శ్రేష్ఠము.
తలమించు క్రి. 1. ముందుపోవు. 2. అతిక్రమించు.
తలమీఱు క్రి. ఎచ్చుమిగులు.
తలము వి 1. పతము 2. శక్యము. రూ. తరము. సం. వి. 1. అత్తెము. 2. స్థలము. సం. వి. (భౌతి) (గణి.) ఏవస్తువుకైన ఉపరితలమందలి సరిహద్దు. (Surface).
తలముదప్పు క్రి. అశక్యమగు.
తలమునుక వి. 1. శిరస్స్నానము. 2. శిరః ప్రమాణము, తలబంటి.
తలయంపి వి. తలగడ. రూ. తలాఁపి. తల్లఁపి
తలయెత్తు క్రి. 1. వర్ధిల్లు 2. మొలచు.
తలరు క్రి. 1. చలించు. 2. చింతించు. 3. కలగు. 4. ఒప్పు. 5. సంభ్రమించు.
తలవంపు వి. అవమానము
తలవరి వై. వి. ఊరికావలివాడు. రూ తలారి. సం. స్థలవారః.
తలవాకిలి వి. మొదటివాకిలి.
తలవీడు వి. సమీపప్రదేశము.
తలశక్తి సం. వి. (భౌతి.) ఒక వస్తువుపై తలమందుండు శక్తి. (Surface energy).
తలసావిడి వి ఇంటి ముందటి సావడి
తలా అవ్య 1. చెరి. 2. తలకు. (ప్రతియొకనికి). ఉదా. తలా యొకటి.
తలాటము వి. తురాయి.
తలారించు క్రి. మరలు, వెనుదిరుగు.
తలి వి. జనని. రూ. తల్లి.
తలిమము సం. వి. 1. దూదిపరపు. 2. రాతి కట్టడపు నేల.
తలియ వై. వి. భోజనపాత్రము. సం. స్థాలికా
తలిరు వి చిగురు.
తలిరుఁడు వి. కేవు పుచ్చుకొను అధికారి.
తలిరుదిండి వి, కోయిల
తలిరుఁబోడి వి. స్త్రీ.
తలిరువిలుతుఁడు వి. మదనుడు. రూ. తలిరువిల్తుఁడు, తలిరువిలుకాఁడు.
తళివము వై. వి. తలిమము, శయ్య. సం. తలిమమ్.
తలుగు వి. 1. పలుపు. 2. సంధానము.
తలుపు వి. కవాటము.
తలోదరి సం.వి (స్త్రీ) వ్యు. పలుచని ఉదరము కలది.
తల్పము సం. వి. దూదిపరపు.
తల్లజము సం. వి. సమాసమున రెండవ పదముగనున్న 'శ్రేష్ఠము' అని అర్థము. ఉదా. కవితల్లజుడు=కవిశ్రేష్ఠుడు.
తల్లడము వి. చలనము.
తల్లడిల్లు వై. క్రి. చలించు. రూ. తలడిల్లు.
తల్లి వి. జనని. రూ. తలి. విశే. మొదటిది. సం. వి. జవరాలు, తరుణి.
తల్లిరేకు (వృక్ష.) ఇనుపనాగలికి కర్రురెక్క రేకు అతికింపబడు ముఖ్యభాగము.
తల్లివేరు వి. మొదటి వేరు.
తవన వి. నిర్ణయకాలము, గడుపు, మితి.
తవరము వై. వి. తగరము. సం. తమరమ్
తవళి, వి. ఠవళి, అసత్యము.
తవిఁద వి. తమిద.
తప్పు వి. తగు యొక్క రూపాంతరము.
తవుడు వి. బియ్యము మీది పొట్టు. రూ. తౌడు.
తవులు క్రి. చూ. తగులు.
తవెల. వి. నోరు వెడల్పుగానుండు లోహపాత్రము.
తవ్వ వి. రెండుసోలలు.
తనుకు క్రి. ప్రేమకలిగినట్లు చేష్టించు వి. ప్రేమను నటించుచేష్ట, టక్కు.
తనుకులాడి విశే. టక్కులాడి.

తస్కరించు సం. క్రి. దొంగిలించు.
తస్కరుఁడు సం. వి. దొంగ.
తస్స వి. దుర్మాంసము.
తహతహ వి. ఉత్కంఠ.
తహసీలు హిం. వి. పన్ను.
తహసీలుదారు హిం. వి (వ్యావ. చరి.) తహసీలు. రెవిన్యూ (శిస్తు) అధికారి.
తళతళ వి. 1. మిరుమిట్లుగొలుపు. 2. కాంతి 3. మెరయుటయం దగు అనుకరణము.
తళిగ వై. వి. 1. స్థానము, భోజన పాత్రము 2. దేవునికి నివేదించు అన్నము. రూ. తళియ. సం. స్థాలికా.
తళుకు వి. మిక్కిలి ప్రకాశము.
తళుకొత్తు క్రి. ప్రకాశించు.
తళుక్కు వి. మెరయుటయం దగు ననుకరణము.

## తా

తాండవము సం. వి. ఉద్ధతమైన నృత్యము.
తాండ్ర వి. 1. విభీతక వృక్షము. 2. తాడి. 3. ఫలరసముతో చేసిన అడప.
తాంతము సం. విశ. బడలినది.
తాంతవజని సం. (జం.) రక్తములో నుండు ద్రవపదార్థములనున్న మాంసకృత్తు. దీని నుండి తాంతవము తయారగును (Fibrinogen).
తాంతవము సం. వి. (జం.) రక్తము గడ్డ కట్టినపుడు దానిలో నేర్పడిన సూక్ష్మమైన తంతుకములలోనుండు పదార్థము (Fibrin) విశ. తంతుసంబంధమైనది.
తాంత్రికుఁడు సం. వి. 1. సిద్ధాంతము నెరిగినవాడు. 2. విషవైద్యుడు. 3. తంత్రశాస్త్రము ననుసరించువాడు.
తాంబాళము వి. పెద్దలోహపు పళ్ళెము.
తాంబూలము సం. వి. వక్కాకు, తములము.
తాంబూలవల్లి సం. వి. తములపాకు తీగ. రూ. తాంబూలి.
తాఁకించు క్రి. 1. శ్రమపరచు. 2. తాక చేయు.
తాఁకు క్రి. స్పృశించు, అంటు.
తాఁకుడు వి. తాకుట. సోకుడు, స్పర్శ.
తాఁకుడువేఁకి వి. వరుసజ్వరము, పోవుచు వచ్చుచుండు జ్వరము.
తాఁకుదల వి. యుద్ధారంభము.
తాఁచు క్రి. తన్ను.
తాఁట వి. 1. చెట్టుపైపెట్ట. 2. మోసము.
తాఁటకత్తె వి. మోసకత్తె.
తాటదమ్మఁడు వి 1. జీవనార్థము సన్న్యాసి వేషము దాల్చినవాడు. 2 లింగి. 3. కపటసన్యాసి.
తాఁడి వి. తాండ్రచెట్టు.
తాఁపు వి. తన్ను, తాడనము.
తాఁబేలు వి. కూర్మము. రూ. తామేలు.
తాకట్టు వి. 1. కుదువ. ఉద్దర. 1. తణఖా. 3. ఆస్తికుదువపెట్టి ఋణము తీసికొనుట.
తాకట్టు ఉత్తరము వి (వాణి.) ఎగుమతి దారుడు తన బ్యాంకుకు దిగుమతి దారునిపై అవసరమైన చర్య తీసికొనుటకు అధికారము నిచ్చు ఉత్తరము. దీని అవసరమేమన ఎగుమతి చేయగనే బిల్లును తన బ్యాంకునకు ఎగుమతిదారుడు అమ్మి వేయును. బిల్లు వసూలుచేసికొను బాధ్యత బ్యాంకుపై నున్నది కాన అవసరమైన అధికారము కూడ దానికి ఈ ఉత్తరము ద్వారా ఎగుమతిదారుడు సంక్రమింప చేయును.
తాకీదు హిం. వి. ఆజ్ఞాపత్రము. రూ. తాఖీదు. హిం. తాఖీద్.
తాగడించు క్రి. 1. నిర్బంధించు. 2. బాధ పెట్టు.

తాగు క్రి. పానముచేయు. రూ. త్రాగు.

తాగుఁబోతు విశే. అమితముగ మద్యము సేవించువాడు.

తాచు క్రి. చెక్కు, తొలుచు, అవలంబించు.

తాటంకము సం. వి. చెవికమ్మ.

తాటాకుతెగులు వి. (వ్యవ.) ఇది వరి ఆకుల చివళ్ళను దొలిచి అందు పెరుగు చిన్న బరిబె పురుగు. (Rice hispa-hispa armigera).

తాటించు క్రి. 1. తాడించు. 2. కొట్టు.

తాటిపడగవాఁడు వి. 1. బలరాముడు. 2 భీష్ముడు.

తాటిరిక్క వై. వి. జ్యేష్ఠానక్షత్రము.

తాటిరిక్కనెల వి. జ్యేష్ఠమాసము.

తాటోటు వి. మోసము. రూ. టాటోటు.

తాడనము సం. వి. కొట్టుట.

తాడించు సం. క్రి. కొట్టు.

తాడితము సం. విశే. కొట్టబడినది.

తాడు వై. వి. తాటిచెట్టు. సం. తాళీ.

తాడు వి. దారము, రూ. త్రాడు.

తాత వి. 1. తండ్రికి తండ్రి 2 తల్లికితండ్రి. వై. వి. విధాత. బ్రహ్మ. సం. వి. తండ్రి

తాత్పర్యము సం. వి. అభిప్రాయము.

తాదృశము సం విశే. అటువంటిది.

తానకము వై. వి 1. స్థానకము. 2. చెట్టు నిలుచుండు తీరు, 3. ఉనికి. సం. స్థానకమ్.

తానము వై. వి. 1. స్థానము. 2. స్నానము. 3. చోటు. 4. మునుక. సం. వి. సంగీతమున తన్న కారముతో బాడెడు పాట.

తాను సర్వ. తాశబ్దమునకు ప్రథమైకవచనము.

తాప వి. 1. నిచ్చెన. 2. మెట్టు.

తాపక్రమము సం. వి. (భౌతి.) తాపతీక్ష్ణతను తెలుపు అంకె. (Temperature),

తాపక్షేపకము సం. విశే. (రసా.) వేడిని వెలిపెట్టునది (Exo-thermic)

తాపచూషకము సం. విశే. (రసా.) వేడిని మ్రింగునది (Endo-thermic).

తాపత్రయము సం,వి. మూడు విధములైన తాపములు - ఆధ్యాత్మికము, అధిదైవికము, ఆధిభౌతికము.

తాపదీప్తి సం వి. (భౌతి) ఇనుపగుండు వంటి వస్తువును కాల్చినపుడు అది మొదట ఎర్రగను తరువాత తెల్లగను ఉన్న కాంతిని వెలిపుచ్చును, అట్టి వస్తువుల యొక్క దీప్తి (Incandescence).

తాపనఫలకము సం. (భౌతి.) విద్యుచ్ఛక్తితో వేడిచేసిన వంటకు ఉపయోగించు యినుపరేకు, విద్యుచ్ఛక్తితో వంటచేయుట కమర్చిన పొయ్యి (Hot-Plate).

తాపము సం. వి. 1. వేడిమి. 2. బాధ. సం. వి. (భౌతి.) వేడి (Hot).

తాపవహనము సం. (భౌతి) వేడిని వహించుట. వేడిని ఒక వస్తువు(ఘనములు) ఒక చోటినుండి ఇంకొక చోటికి మోసికొనిపోవుట, ఉష్ణప్రసరణము (Heat conduction)

తాపవాహకము సం. విశే. (భౌతి.) వేడిని ప్రసరింపచేయునది: ఉష్ణతావాహకము (Heat conductor).

తాపవియోజనము సం. వి. (రసా.) ఒక సమ్మేళనమును వేడిచేసినప్పుడు అది సూక్ష్మతరమగు అణుపులుగా విభజింపబడి, చల్లార్చినపుడు తిరిగి మొదటి సమ్మేళనము ఏర్పడెడి రసాయనికపు మార్పు (Thermal d s:ociation).

తాపసతరువు సం వి. గారచెట్టు. (దీని నూనెతో తాపసులు తలంటుకొందురు).

తాపసుఁడు సం. వి. తపసి.

తాపస్థాపకము సం.వి. (రసా.) ప్రయోగ పరిసరములతాపక్రమమునుమారకుండనుంచుటకుపయోగించు పరికరము. (Thermostat).

తాపి వి 1. రాతిగోడ కట్టువాడు. 2. కరణె. దూ తాపి. వి. మర్మము, జాడ.
తాపించు వై. క్రి. 1. స్థాపించు, నెల కొలువు. 2. చెక్కు.
తాపింఛము నం.వి. చీకటిమ్రాను,తమాలము
తాపికత్తియ వి. సంధానము చేయునది.
తాపికాఁడు విణ. సంధానము చేయువాడు
తాపిత వి మేలైన పట్టుగుడ్డ.
తాపీయము నం. విణ. (రసా .భౌతి.) తాప సంబంధమైనది (Thermal).
తాపు వై. క్రి. 1. చెక్కు. 2. రత్నాదులను) పొదుగు. వి. 1. అవలంబము. 2. తన్ను.
తామర వై. వి. తామరసము, పద్మము. దూ తమ్మి వి. చర్మరోగము. (Ring worm). (ఇది చర్మమును క్రమముగా నుంచని యెడల పర్వదు అంటువ్యాధి.)
తామరచెలి వి సూర్యుడు, పద్మమిత్రుడు.
తామరతంపము వి. 1. తామరల సమూహము. 2. అభివృద్ధి. దూ. తామరతంపర
తామరతంపర వి తామరతంపము.
తామరతూపరి వి. మదనుడు.
తామర పురుగు కుటుంబము వి. (వ్యవ.) ఈకుటుంబమునకు చెందిన పురుగులు చాల చిన్నవిగ నుండును. మగపురుగులకు నాలుగు సమమైన రెక్కలుండును. ఆడు పురుగులకు రెక్కలుండవు. నోరు రసమును పీల్చుటకనుకూలముగా నుండును. ఉదా. మిరప తామరపురుగు, వరి తామర పురుగు ఇత్యాదులు, ఈ జాతి పురుగులు (Thrips) పట్టిన ఆకులు తామర పట్టిన చర్మమువలె నుండుటచే వాని కీ పేరు కలిగెను. (Thysanoptera).
తామరసము నం. వి. 1. తామర. 2. బంగారు. 3. రాగి.
తామసము వి. 1. అలస్యము. 2. పాము. నం. విణ. తమోగుణము కలది.
తామసించు క్రి. అలస్యముచేయు.
తామిస్రము నం. వి. 1. చీకటి. 2. చీకటి మయమైన నరకము.
తామేలు వి. తాబేలు.
తామ్రచూడము నం. వి. కోడి.
తామ్రపర్ణి నం. వి. 1. ఒకనది. 2. పడమటి దిక్కునందలి అంజన మను దిగ్గజము యొక్క భార్య.
తామ్రము నం. వి. 1. రాగి. 2. ఎరుపు. నం. వి. (రసా). (Copper) రాగి, పింగళ (Brown) వర్ణము గల ధాతువు. (ఇది ఆవర్తకమపట్టికలో రెండవవర్గములో వెండి బంగారముతోపాటు అమర్చబడియున్నది. మొక్కలకు కావలసిన సూక్ష్మమూల ద్రవ్యములలో నిది యొకటి)
తామ్రరోగములు నం వి. (వ్యవ.) ఎఱ్ఱగా త్రుప్పు పట్టినటుండుటచే ఈ రోగములు ముఖ్యముగ గోధుమ, సెనగ మరి కొన్ని తృణధాన్యజాతులకు సంభవించుచుండును. (ఇవి మచ్చలవలె చారలవలె నుండును, కొన్ని రకముల శిలీంధ్రములు ఈరోగములకు కారణములు) (Rusts)
తాయి నం. వి. తల్లి.
తాయెతు హిం వి. తల్లి బిడ్డలకు కట్టు రక్షాబంధము. దూ. తాయెత్తు.
తార నం. వి. 1. నక్షత్రము. 2. బృహస్పతి. భార్య. 3. వాలిభార్య.
తారకము నం. వి. 1, కంటినల్లగుడ్డు. 2. నక్షత్రము. దూ. తారక, తరింపచేయునది.
తారకాణ వి. దృష్టాంతము. దూ. తార్కాణము, తారకాణము, తార్కాణ.
తారణ నం. వి. అరువది సంవత్సరములలో నొకటి.

తారతమ్యము సం. (గణి.) రెండు రాసుల మధ్య నున్న పరస్పర సంబంధము (Relative). సం. వి. తరతమ భావము, ఎచ్చు తక్కువలు.

తారము సం. వి. 1. వెండి. 2, పులుగడిగిన ముత్తెము.

తారసము వి. 1. సమీపము. 2. తలపాటు.

తారసించు క్రి. 1. సమీపించు. 2. తలపడు.

తారసిలు క్రి. తారసించు.

తారస్వరము సం. వి. (భౌతి.) గట్టిగా వినిపించు స్వరము. (High-note).

తారహారము సం. వి. ముత్యాలసరము.

తారాకేంద్రము సం. వి. (జం.) జీవకణ రసములో కేంద్రికతో నేర్పడు ఒక ప్రత్యేకమైన భాగము. (Centrosome).

తారాడు క్రి. తిరుగులాడు, తిరాడు, తడవు.

తారానాభి సం. వి. (జం). కేంద్రిక చుట్టు నుండు గుండ్రని భాగము. (Centrosphere).

తారాపతి సం. వి. చంద్రుడు.

తారాపథము సం. వి. ఆకాశము.

తారు క్రి. 1. సంచరించు. 2. పోవు. 3. కదియు. రూ. తార్కొను.

తారుచు క్రి. కూర్చు. రూ. తార్చు.

తారుణ్యము సం. వి. జవ్వనము.

తారునీరు మి. వి. (వ్యవ.) తారు, సబ్బు నీరు వీ రెండింటి మిశ్రమము. (Tar-Emulsion). ఇది చెదపురుగులను నాశము చేయుట కుపయోగించును)

తార్కాణము వి. మా. తారకాణ.

తార్కికుడు సం. వి. తర్కశాస్త్రము తెలిసినవాడు

తార్క్ష్యుడు సం. వి. 1 అనూరుడు. 2. గరుత్మంతుడు. వ్యు. తృక్షుని కొడుకు.

తార్పుకత్తె విణ. తాపికత్తె.

తాఱు క్రి. అడగు, మరుగుపడు.

తాఱుమాఱు వి. వ్యత్యాసము.

తాలధ్వజుడు సం. వి. బలరాముడు.

తాలము సం. వి. తాటిచెట్టు రూ. తాళము.

తాలవ్యము సం. వి. (జం.) హనువును మస్తిష్కాగ్రాస్థితో కలుపు ఎముక. (Palatine). (వ్యాక.) తాలుజన్యమైన అక్షరము (Palatal) 'చ' మొదలగునవి.

తాలాంకుడు సం. వి. బలరాముడు

తాలి వి. మంగళసూత్రము. రూ. తాళి.

తాలించు క్రి. తిరుగబోయు, రూ. తాళించు.

తాలింపు వి.తిరుగబోత. రూ. తాళింపు

తాలింపు ద్రవ్యములు వి. (వ్యవ.) కొన్ని ఆహారపదార్థములకు తాలింపు లేక పోపు పెట్టుటకవసరమైన సంబారములు, ఉదా. మిర్చి ఆవాలు జీలకఱ్ఱ మొదలగునవి.

తాలిక వి. మెలిక.

తాలిబొట్టు వి. మంగళసూత్రపు బొట్టు. రూ. తాళిబొట్టు.

తాలిమి వి. 1. క్షమ. 2. ధైర్యము. రూ. తాల్మి.

తాలిమికత్తె విణ. క్షమకలది.

తాలిమికాఁడు విణ. క్షమకలవాడు.

తాలు వి. 1. ఎన్నుతీసి ఎండిపోయినపైరు. 2. పొల్లుగింజ.

తాలుచు క్రి. 1. ధరించు. 2. పురిపెట్టు. 3. దారముపేను. రూ. తాల్చు.

తాలువు సం వి దౌడభాగము (Palate).

తాలూకా హిం. వి. జిల్లాలో నొక భాగము.

తాల్మి వి తాలిమి.

తావతాళ్లు వి. పతమెత్తువాడు కాళ్ళుంచుకొను కఱ్ఱలు

తావకీనము సం. విణ. నీది, త్వదీయము,

తావడము వి. రుద్రాక్షలు మొదలగునవి కూర్చిన హారము. రూ. తావళము.

తావరము వై. విణ. స్థావరము, తిరమైనది సం. స్థావరమ్.

తావలము వై.వి. 1. స్థానము.2.ఆధారము.
తావళము వి. తావడము.
తావి వి. పరిమళము.
తావిగట్టు వి. మలయ పర్వతము.
తావిసూనె వి. అత్తరు.
తావిమోపరి వి. గాలి, గంధవహుడు.
తావివిలుకాడు వి, మదనుడు.
తావు వి. స్థానము.
తావుకొను క్రి, నెలకొను.
తాళపత్రము నం. వి. 1. తాటియాకు. 2. చెవ్వాకు: చెవికమ్మ
తాళము నం. వి. 1. బీగము. 1. పాడు నపుడు చేతులతో చరచుచరవు. 3. తాటి చెట్టు. 4. తాళముచేయు. కంచువాద్యము.
తాళవృంతము నం. వి. విసనకఱ్ఱ.
తాళి వి. పతకము, హారము. రూ. తాళి.
తాలిక వి. ఓర్పు. విశ. 1. తాలినది. 2 ఓర్వతగినది.
తాళు క్రి. తాళికయగు, సహించు. విచా రించు. రూ. తాళుకొను.
తాళువారము వి. పంచపాళ, ఇంటికి ముందు భాగమున వంచి కట్టినది.రూ.తాళ్వారము



తింట వి. తినుట.
తిండి వి. ఆహారము.
తిండికాడు విశ. ఎక్కువ తిను స్వభావము కలవాడు.
తిండిపోతు విశ. తిండీడు, తిండికాడు.
తింత్రిడి నం. వి. చింతచెట్టు తింత్రిణి.
తింత్రిడీకము నం. వి. చింతచెట్టు, తింత్రిడి.
తింత్రిణి నం. వి. మా. తింత్రిడి.
తింత్రిణీకము నం. వి. చింతపండు.
తికమక వి. కలత ,తొట్రుపాటు.
తిక్క వి. పిచ్చి. రూ. త్రిక్క.
తిక్కకొను క్రి. పిచ్చియెత్తు.
తిక్కటమక్కట వి. కలత,
తిక్తము నం. విశ. చేదైనది.
తిగ వై.సర్వ. మూడు. రూ.తివ. నం త్రికమ్.
తిగంటి వి. శివుడు. వ్యు. మూడు కన్నులు కలవాడు.
తిగలు-వై వి.ముగ్గురు బిడ్డ లొక కాన్పులో కలుగుట (Triplet).
తిగవంచ సర్వ. నాలుగు.
తిగియు క్రి. ఆకర్షించు. రూ.తిగుచు తివియు.
తిగ్మము నం. వి. వేడిమి.
తిట్ట వి. రాశి.
తిట్టు వి. 1. శాపము. 2. నింద. క్రి. 1. శపించు, నిందించు.
తితిక్ష నం. వి. ఓర్పు.
తితిక్షువు నం. విశ. ఓర్పరి.
తిత్తి వై. వి. 1. చిన్నసంచి. 2. కొలిమి తిత్తి. 3. సుతితిత్తి. నం. దృతిః.
తిత్తిరి నం. వి. తితువుపిట్ట.
తిథి నం. వి. 1. పాడ్యమి మొదలగునవి. 2. శ్రాద్ధదినము.
తిను క్రి. భుజించు.
తినుకు క్రి. ముక్కుముక్కి విస్జించు. వి. ముక్కుముక్కి విస్జించుట.
తిన్న విశ. 1. మనోజ్ఞము. 2. యుక్తము 3. స్వస్థము. 4. ఋజువు. 5. సౌమ్యము.
తిన్నియ వి. అరుగు, వేదిక. రూ. తిన్నె, తినియ, తినె.
తిన్నె వి. తిన్నియ.
తిపిరి వి.(వ్యావ.) సొరకాయ, ఆనపకాయ.
తిప్పరుకట్టు క్రి. వ్యాపించు.
తిప్ప వై. వి. 1. చిన్నికొండ. 2. కొండ. 3. దిబ్బ నం, ద్వీపః.

తిప్పతిమ్మరి వి. కోతి. తిప్పలందుతిరుగునది.
తిమి సం వి. సముద్రమందలి ఒక చేప.
తిమింగిలము సం వి. తిమిని మ్రింగెడు చేప.
తిమిరమండలము సం. వి. (రసా) క్రొవ్వువత్తి జ్వాలలో వత్తి నానుకొనియుండు కాంతిలేని అంతర్భాగము
తిమిరము సం. వి. చీకటి.
తిమిరి వి స్పష్టము తెలియని రోగము. రూ. తిమ్మిరి.
తిమురు క్రి 1. త్వరపడు. 2. ఉద్రేకించు 3. ఒడలువిరుచు 4 గర్వించు,వి.గర్వము.
తిమ్మ విశ. స్వస్థము.
తిమ్మడు వి. కోతి.
తిమ్మనము వై. వి 1. తేమనము 2.మజ్జిగపులుపు 3. పాలు. బెల్లము, పిండి ఉడికించి చేసిన పదార్థము. సం. తేమనమ్,
తిమ్మప్పడు వి వేంకటేశ్వరుడు, కొండమీది తండ్రి
తిమ్ము క్రి. దీవించు. (శ. ర.). నిందించు. (అని కొందరు).
తియ్య విశ. మధురము. రూ. తీయ.
తియ్యబోడి వి. స్త్రీ.
తియ్యగూర వి. పులుసులేని కూర.
తియ్యము వి. 1. ఓదార్పు. 2. ప్రియము రూ. తీయము.
తియ్యవిలుకాడు వి. మదనుడు.
తిరము వై విశ. స్థిరము సం. స్థిరః.
తిరస్కరిణి సం. వి. 1. తెర. 2 ఒకానొక మంత్ర విద్య.
తిరస్కృతి సం విశ. తిరస్కారము.
తిరి వి. 1. సుడి 2 ఆట 3. కలత.
తిరిక వి. మెలిక.
తిరితీవులాడు క్రి. పెనగులాడు.
తిరిపకొట్టు వి. బిచ్చమెత్తుటయే వృత్తిగా కలవాడు. రూ తిట్టిగొట్టు.
తిరిపగత్తె వి. బిచ్చకత్తె.
తిరిపగాడు వి. బిచ్చగాడు
తిరిపము వి. బిక్షము.
తిరియు క్రి. బిచ్చమెత్తు. రూ. తిరుచు.
తిరు వై. విశ. శ్రీప్రదము, పూజ్యమైన. సం. శ్రీః.
తిరుడు వై. విశ స్థిరుడు.
తిరుకాపు వి. కోవెల తలుపు.
తిరుకొలను వి. పుష్కరిణి, కోనేరు.
తిరుగడ వి. మరగొట్టము.
తిరుగలి వి. పిండి విసరు శిలాసాధనము, ఘరట్టము, భ్రమము.
తిరుగు క్రి. 1. సంచరించు, పరిభ్రమించు. 2. వెనకకు మరలు. 3. పరివేష్టించు. రూ. తిరుపు, తిర్గు.
తిరుగుడు వి. 1. తిరుగుట. 2. మారుపాటు 3. మర
తిరుగుడుచీల వి. మరచీల.
తిరుగుడు తీగ వి. (వృక్ష.) నులితీగలు మొదలగు సాధనము లేనియు లేక సన్నముగా నున్న కాండముతోనే ఏదైన ప్రాటినిగాని, గడనుగాని చుట్టుకొని పైకెగబ్రాకు తీగ (Twiner)
తిరుగుడుపడు క్రి. పరిభ్రమించు.
తిరుగుడుమోట మి వి. (వ్యావ.) నీరు తోడు సాధనము. (Circular mhote.) (పశువులు గానుగలోవలె చుట్టిచుట్టి తిరుగుచు దీనిని లాగుచుండును. ఈ మోటకు రెండు గూనలుండును)
తిరుగుబాటు వి. (వ్యావ.) ఎదురు తిరుగుట. (తిరుగబాటు).
తిరుచు క్రి. తిరియు.
తిరుచిన్నము వై, వి. సన్నగాళె. ఒకరకమైన చిన్నవాద్యము. సం. శ్రీచిహ్నమ్. శ్రీ తూర్ణమ్.
తిరుచూర్ణము మి. వి. ఎఱ్ఱబొట్టుపొడి.
తిరునాళ్ళు వి. (ని. బహు), దేవోత్సవము,

తిరుసేలు వి. బూది విభూతి.
తిరుపగూడ వి. తిరుమణిపెట్టె మొదలైనవి యుంచు తాటాకు బుట్ట.
తిరుప్పు వి తిరుగుట.
తిరుప్పలుగట్టు క్రి. వ్యాపించు.
తిరుమజ్జనము మి. వి. భగవంతునికి చేయు అభిషేకము.
తిరుమణి వై. వి తెల్లనామము. చూ. తిరుమన్ను. సం శ్రీమృత్.
తిరుమల వి. వేంకటాచలము.
తిరుమాళిగ వి. 1. గృహము. 2. వైష్ణవుల పూజాగృహము. 3. పూజ్యులుండు గృహము.
తిరుముడి వి. 1. వైష్ణవుడు. 2. జడలు కట్టిన జుట్టు.
తిరువడి వి. 1. పుణ్యస్థలము. 2. భక్తుడు. దాసుడు. 3, పూజ్యుల పాదము.
తరువడికోల వి. దాసరి దీప స్తంభము.
తిరోగమనము సం విశ. వెనుకకు వెళ్ళుట. వ్యతి. పురోగమనము.
తిరోధానము సం, వి. మరుగుపాటు చూ తిరోభావము.
తిరోహితుఁడు సం. విశ. మరుగున పడిన వాడు. అంతర్హితుడు.
తిర్యక్ సం. విశ. (గణి.) సమాంతరముగాని, లంబముగాని కానిది (Oblique). సం. విశ. (గణి. భౌతి.) అడ్డుగా నున్న, ఇంకొక దానికి సమాంతరము కానిది లంబము కానిదియగు దిక్కు (Oblique). సం వి. 1. అడ్డముగాపోవునది 2 పక్షాది.
తిర్యక్తరంగము సం. వి. (గణి.) చలన దిక్కునకు అడ్డముగ(లంబముగ)స్పందించు తరంగము (Transve . W1v
తిర్యక్ఛేదనము సం. వి. (జీవ.) అడ్డుకోత (Transverse section).
తిర్యగక్షము సం. వి. (గణి.) ఆధారతలమునకు లంబముగా లేని అక్షము (Oblique axis). సం వి (గణి.) అడ్డుగా ఉన్న అక్షము (Transverse axis).
తిర్యగ్రేఖ సం వి. (గణి) కొన్ని సరళరేఖలను అడ్డుగా ఖండించు సరళరేఖ (Transversal)
తిలకము సం. వి. 1. బొట్టు. 2. నల్లగుఱ్ఱము. 3 పుట్టుమచ్చ 4. బొట్టుగు చెట్టు. విశ. శ్రేష్ఠము.
తిలకసంధి సం వి. (జం.) (కప్పలో) కర్ణభేరి క్రింద నుండు ఎఱ్ఱని రెండు గ్రంథులలో నొకటి, ఒహాత్కోశపు పొర క్రింద నుండు అంతస్స్రావగ్రంథి(Thymus gland)
తిలకించు క్రి. 1. ప్రకాశించు 2. ప్రసన్నత నొందు 3. చూచు,
తిలఘాతకుఁడు సం. వి. గాండ్లవాడు, తెలికవాడు,
తిలతండుల న్యాయము సం. న్యా. నువ్వులు బియ్యము కలిసిన విధము
తిలయంత్రము సం. వి. గానుగ.
తిలలు సం వి. నువ్వులు,
తివ వై. సర్వ మా. తిగ.
తివాసి వి. చిత్రాసనము,
తివియు క్రి. తిగియు.
తివుట వి కోరిక.
తివురు క్రి. కోరు. వై. క్రి. 1. త్వరపడు. 2. కుతూహలపడు. 3. యత్నించు. 4. మ్రోగు
తిసెల్ గరాటు ఇం. వి. (రసా.) ఒక విధమైన గరాటు (Thistle funnel):



తీ వై. వి. సమాసమునందు తిగ శబ్దమునకు ఆదేశ రూపము. ఉదా. తీవంచ.

తీంట్రము వి. దురద. రూ. తీట.
తీండ్ర వి. 1. ప్రకాశము. 2. వేడిమి. 3. తేజము. 4. చురుకు.
తీండ్రము విశే. తీక్ష్ణము.
తీండ్రించు క్రి. ప్రకాశించు. రూ. తీడిరించు.
తీఁగ వై. వి. లత. రూ. తీఁగియ, తీఁగె, తీవ. తీవియ. సం. దీర్ఘా.
తీఁగబోఁడి వి. స్త్రీ.
తీఁగమెరుపు వి. ఉరుము లేని మెఱపు.
తీఁగమోడి వి. 1, వ్రాతపని, 2. గొలుసుకట్టు వ్రాత.
తీఁగయిల్లు వి. పొదరిల్లు.
తీఁగమెలుఁగు వి. హీనస్వరము.
తీఁగవిలుకాఁడు వి. మదనుడు,
తీఁగసాఁగు క్రి. వర్ధిల్లు.
తీఁట వి. గజ్జి, దురద.
తీఁడిరించు క్రి. ప్రకాశించు రూ. తీండ్రించు.
తీఁపురము వి. అగడము.
తీక్ష్ణక్షారము సం. వి. (రసా.) గాఢమైనది. చేతితో తాకిన పొక్కునది యగు క్షారము (Caustic alkali). ఉదా. దాహక మగు సోడా. (Caustic Soda),
తీక్ష్ణత సం. వి. తీవ్రత.
తీక్ష్ణతుండము సం. వి. దోమ.
తీక్ష్ణము సం. వి. వేడిమి, విశే. వాడియైనది. చురుకైనది.
తీక్ష్ణామ్లము సం. వి. (రసా.) సాంద్రీకృతామ్లము, చాల గాఢమైన ఆమ్లము. (Strong acid).
తీడు క్రి. 1. వాడిచేయు. 2. చీరు, చీల్చు.
తీత వి. (వ్యవ.) పెసర, మినుము, వేర సెనగ మొదలగు సస్యములను ఫలించిన తరువాత వ్రేళ్ళతో ఊడ పెరుకుట. (Rooting out the crop).
తీతువు వై. వి. తిత్తిరి, తీతువపిట్ట. (దీని కూత అపశకునముగా భావింతురు). సం. తిత్తిరిః.
తీనియ వి. చూ తిన్నియ.
తీపారు క్రి. మనోజ్ఞమగు.
తీపి వి. 1. మాధుర్యము, 2. ఇచ్ఛ.
తీపు వి. 1. మాధుర్యము. 2. గుంజెడుబాధ.
తీయ విశే. 1. తియ్యనైనది. 2. ఇంపైనది.
తీయము వి తియ్యము.
తీయు క్రి. 1. తొలగు. 2. కృశించు. 3. తగ్గు. 4. ఊడ్చు. 5. కొను. 6. వెలయిచ్చి కొను. 7. వేయు. (తీసివేయు,ఎత్తివేయు)
తీరము సం. వి. దరి. సం. వి. (భూగో.) అంచువలె సముద్రపు నీటికి తగిలియున్న భూమి.
తీరయానస్వాధీనకరణము సం. వి (వాణి). ఒక దేశపు తీరముపైనున్న ఒక రేవు నుండి మరియొక రేవునకు సరకుల రవాణా చేయుటలో ఆ దేశపు నౌకలే పని చేయవలెనని ప్రభుత్వము విధించు ప్రతిబంధకము.
తీరు క్రి. 1, చక్కబడు. 2. శక్యమగు. వి. 1. చక్కన. 2. విధము.
తీరుచు క్రి. 1. తీర్పుచేయు. 2. దిద్దు. రూ. తీర్చు, తీరుపు, తీర్పు.
తీరువ వి. శిస్తు, పన్ను, తీరవ.
తీర్ణము సం. వి దాటబడినది.
తీర్థమాడు మి. క్రి. స్నానముచేయు.
తీర్థము సం. వి. 1. పుణ్యనది. 2. రేవు. 3. పుణ్యక్షేత్రము. 4. నూతి యొద్ద కట్టిన తొట్టి.
తీర్పరి వి. న్యాయాధిపతి.
తీర్మానము వి. నిర్ణయము.
తీఱమి వి. 1. అక్కర. 2. ఇబ్బంది.
తీఱిక వి. 1. అవకాశము. 2. తీరుబడి.
తీఱు క్రి. 1. నశించు. 2. పాయు. 3. అవకాశపడు.
తీఱుగడ వి. 1. తీరిక. 2. ముగియిక.

తీఱుచు క్రి. నశింపచేయు, పోవు.
తీఱుపోటు వి. తీరిక, తెఱపి, వెసులు పాటు.
తీఱుపు క్రి. 1. తీరుపడు. 2. నశించు,
తీలగు క్రి. అడగు, క్షీణించు.
తీలు వి 1. అడగుట, తగ్గుట 2. అల్పత్వము
తీవ వి. తీగ. రూ. తీవియ. తీవె.
తీవంచ వి.నాలుగు. (తి=తిగ=మూడు+వంచ=ఒకటి).
తీవరపాటు వై. వి. తొందరపాటు.
తీవరము వై. వి. తీవ్రము, త్వరితము. సం. తీవ్రమ్.
తీవరించు వై. క్రి. తీవ్రముచేయు, తీవర పడు.
తీవియ వి, చూ, తీవ.
తీవిరము వి తీట.
తీవె వి. చూ. తీవ.
తీవ్రక్షారము సం. వి. (రసా.) చేతిమీద పడిన బొబ్బలెక్కించు తీవ్ర క్షారములు (Caustic alkalies) చూ. తీక్ష్ణక్షారములు.
తీవ్రము సం. విణ. 1. అధికము. 2. వేడిమి గలది. 3. కారముగలది. (ధాతి.) గట్టిగా వినబడునది (ధ్వని.) (Loud).

# తు

తుంగ వి. ఒక విధమైన గడ్డి.
తుంగము సం. విణ. పొడవైనది.
తుంట వి. 1. తునుక, 2. చెరకు. రూ. తూంట. వై. విణ. దుష్టుడు. తుంటరి.
తుంటరి విణ. దుష్టుడు.
తుంటవిలుకాఁడు వి. మన్మథుడు. రూ. తుంటవిలుతుడు. తుంటవిల్తుఁడు.
తుంటవిల్తుఁడు వి. చూ. పై.
తుంటి వి. కటిపార్శ్వ భాగము. రొండి,
తుండము సం. వి. 1. ఖండము. రూ. తుండు. తుండె. 2. పక్షిముక్కు. 3. నోరు. 4. మొగము. 5. గజహస్తము. రూ. తుండి.
తుండి సం. వి, 1. ఉరకు బొడ్డు' రోగముచే పెరిగిన బొడ్డు. 2. తుండము.
తుండిభుఁడు సం. విణ, ఉరుకు బొడ్డువాడు రూ. తుండిలుఁడు.
తుండిలుఁడు సం. విణ. చూ. పై.
తుండు వై. వి. ఖండము, తుండుగుడ్డ. రూ. తుండె.
తుంతుపడు వై. క్రి. మ్రోడువలెనగు, మొండియగు.
తుందము సం. వి. కడుపు.
తుంది సం. వి. 1. కడుపు. 2. ఉరుకుబొడ్డు విణ. బొజ్జకడుపు కలవాడు.
తుందిభుఁడు సం. విణ. 1. బొజ్జకడుపు గలవాడు. 2. ఉరుకుబొడ్డు కలవాడు. రూ. తుందిలుడు.
తుందుడుకు వి. 1. సంతాపము, 2. విచారము. 3. కలత. విణ. త్వరపడిచేయువాడు, రూ. దుందుడు.
తుందునుకలు వి. చిన్నచిన్న తునుకలు. రూ. తునాతునకలు.
తుంపర వై. వి. చెదరిపడు నీటిబొట్లు. శీకరము. రూ. తుంపురు, తుప్పర. సం. తుషారః.
తుంపిళ్లు వి. తుంపరలు. తుంపరవాన.
తుంపురు వై. వి. చూ. తుంపర,
తుంపెనలాడు క్రి. 1. చలించు, 2.నర్తించు.
తుంపెనలు వి. చలనము.
తుంబి సం. వి. 1. తుమ్మిచెట్టు. 2. సొరతీగ.
తుంబిక సం. వి. 1. బండిచక్రము నడిమి రంధ్రము. 2. సొరతీగ.

**తుకతుక** వి. 1. సంతాపము. 2. కోపము. 3. అన్నము ఉడుకుటలోని ధ్వన్యనుకరణము.

**తుకము** వి. 1. మదింపు. 2. విత్తనాల చల్లికపు అంచక. (శ.ర.). 3. నారుమడి. 4. స్థానము, నెలవు (అని కొందరు).

**తుచ్ఛ** విశే. 1. సూక్ష్మాంశము. 2. చెత్త.

**తుచ్ఛము** సం విశే. 1, అల్పము. 2 శూన్యము,

**తుజాగు** విశే. త్వరపడువాడు.

**తుటాయించు** క్రి. 1. అలక్ష్యపరచు. 2 నిరసించు.

**తుటారము** వి. 1. దిట్టతనము. 2. పరుష వచనము.

**తుటారి** విశే. 1. దిట్టతనముగలది, 2. పారుష్యముగలది.

**తుటారించు** క్రి. 1. అలక్ష్యపరుచు. 2. తిరస్కరించు.

**తుటుము** వి. సమూహము. రూ తుడుము.

**తుట్టతుద** వి. చిట్టచివర, కట్టకడ.

**తుట్టసుర** అవ్య. బొత్తిగా,

**తుట్టియ** వి. సమూహము. రూ తుట్టె. తుట్టియ, తుట్టె.

**తుట్టెపురుగు** వి. ఒక తెగ చిన్నపాము.

**తుట్టెగట్టు** క్రి. ధాన్యాదులు పురుగు పట్టి ఉండగట్టు.

**తుట్టు** వి. 1. నష్టము. 2. పీడ.

**తుత్రు** వి. 1. మంచువంటి తూరవాన. 2. ఊడ్చిన కుప్ప (అని కొందరు).

**తుడుచు** క్రి. 1. తడిపోవ నొత్తు, 2 ఊడ్చు.

**తుడుము** వి. తప్పెట. 2. తుటుము. 3. గుంపు.

**తుత్తినాగము** వి. బూడిదరంగు గల ఒక లోహము.

**తుత్తుంభిక** సం. వి. ఒకానొక వాద్యము.

**తుత్తునియలు** వి. మిక్కిలి చిన్న తునుకలు.

**తుత్తుమురు** వి. మిక్కిలి పొడి.

**తుత్తనాగము** సం. వి. (రసా.) యశదము (Zinc) (ఇనుపరేకులు త్రుప్పుపట్టకుండ తెల్లని పూత పెట్టుటకు ఈ లోహము నుపయోగింతురు. మొక్కలకు కావలసిన సూక్ష్మ మూలపదార్థములలో నిది యొకటి).

**తుద** వి. చివర, కడ, అంతము. రూ. తుది.

**తుదితాకు** క్రి. నెరవేరు.

**తుదిముట్టు** క్రి. 1. చచ్చు. 2. నెరవేరు.

**తుదిరేయి** క్రి. 1 కల్పాంతము. 2 చివరిరాత్రి.

**తునికోల** వి. తూనికకోల, తక్కెడకోల.

**తునియ** వి. తునుక.

**తునుమాడు** క్రి. 1. ఖండించు, 2. చంపు.

**తునియు** క్రి. ఖండమగు. రూ. తునుగు.

**తునుము** క్రి. 1. ఖండించు 2. చంపు రూ. తున్ము.

**తుపాకి** వి. మందుగుండు వేసి కాల్చు ఇనుప క్రోవి

**తుపాను** వి. గాలివాన.

**తుపాసి** వై. వి. ద్విభాషి, ఒక భాషను మరొక భాషలో చెప్పువాడు. రూ. దుబాసి. సం. ద్విభాషి.

**తుప్ప** వి. చిన్నపొద. వి. (వృక్ష.) సామాన్యమగు ఎత్తు గుబురుగా నున్న దృఢమగు శాఖలు కలిగి ప్రత్యేకమగు కాండము స్పష్టముగా లేని మొక్క (Shrub).

**తుప్పతిల్లు** వై. క్రి. తనియు.

**తుప్పర** వై. వి. తుంపర.

**తుప్పలుదూలు** క్రి. మిక్కిలి చలించు. రూ. తుప్పదూలు.

**తుఫాను** హిం. వి. (భూగో.) పెద్దగాలివాన. రూ. తుపాను. హిం. తూఫాన్.

**తుమున్నర్థకము** సం. వి. (వ్యాక.) సంస్కృతమున 'గంతుమ్', 'భోక్తుమ్' మొ॥నవి తుమున్నంతములనబడును. ఇందు తుమ్ అనునది చివర కలదు కావున, అట్లు పిలువ

ఒడుచు, ఈ యర్థమున తెలుగులో వెళ్ళన్, తినన్ ఇట్టివి సమున్నర్థక క్రియలు. వ్యవహారమున 'కన్' అనునది చేర్చి వాడుదుము. వెళ్ళగా, తినగా.

తుమురు వి 1 చిన్న తునక. చూర్ణము. పొడి. ధూళి.

తుములము సం. వి. దొమ్మియుద్ధము.

తుమ్ము క్రి. క్షుతముచేయు. వి. క్షుతము.

తుమ్మెద వి భ్రమరము.

తుమ్మెదకంటు వి. సంపెగ. వ్యు. తుమ్మెదకు కంటు గల్గించునది.

తుమ్మెదకుటుంబము మి. వి. (వ్యవ.) తుమ్మెదలు, చీమలు, తేనెటీగలు, కందిరీగలు మొదలగు పురుగులీ కుటుంబమునకు చెందినవి. (Hymeno ptera).

తురంగమము సం. వి. గుఱ్ఱము రూ. తురంగము, తురగము.

తురంగము సం. వి. చూ. పై.

తురక వై. వి, తురుష్కుడు, మ్లేచ్ఛుడు, సం. తురుష్కః.

తురకజాయి వి. బొంతరాయి.

తురా. హిం. వి. 1, నిడుపుకాడ పెట్టి కట్టిన పూబంతి. 2. తల నుంచుకొనునగ, రూ. తురాయి

తురాయి హిం. వి. చూ. తురా.

తురికి వై. వి. తురుష్కదేశపు గుఱ్ఱము. రూ. తురికి. తుర్కి. సం. తురుష్కః.

తురితము వై. అవ్య. త్వరితము, శీఘ్రము. రూ. తురిన. సం. త్వరితమ్, ద్రుతమ్.

తురీయము సం. వి. బ్రహ్మము. విశ. నాల్గవది, రూ. తుర్యము.

తురుముపీట వి. (గృహ.) కొబ్బరిమొదలగు వానిని కోయుటకుపయోగించు పరికరము. రూ, తుఱుము పీట (Grater).

తుఱంగలి వి. ప్రకాశము.

తుఱంగలించు క్రి. 1. ప్రకాశించు. 2. అతిశయించు.

తుఱుగు క్రి. క్రుక్కు.

తుఱుపు వై. విశ. త్వరితము, శీఘ్రము. సం త్వరితమ్.

తుఱుము క్రి. 1. కొప్పు ముడుచు. 2. కొప్పునను పుష్పాదులను ధరించు. క్రి. తురుము పీటతో పొడిపొడిచేయు. వి.పొడి.

తుఱుముపీట వి. చూ. తురుము పీట.

తుఱ్ఱు వి. 1. పక్షిగిడుటయం దగు అనుకరణము. 2. వేగిరపాటు. విశ శీఘ్రము.

తుల సం. వి. 1. త్రాసు. 2. పోలిక. 3. రాసులలో ఒకటి.

తులకించు క్రి. 1. ప్రకాశించు. 2. కుతూహలపడు.

తులకింపు వి. 1. ప్రకాశము. 2. కుతూహలము.

తులము వి. ఒక తూనిక మానము, రూపాయనాణెము ఎత్తు.

తులాకోటి సం. వి. అందె,

తులాదండము సం వి. (భౌతి.) ఆధారము (Fulcrum) అనబడు ఒక స్థిరమైన బిందువుపై తులాదండము స్వేచ్ఛగా తిరుగుటకు వీలుగానుండు తిన్నని లేక వంగిన కడ్డీకి ఒక వైపు దృఢమైన బలము రెండవ వైపున భారము ఉండు సాధనము, తులాయంత్రము (Lever).



తులామానము సం. వి. త్రాసున తూచు తూనిక.

తులితము సం. విశ. 1. పోల్చబడినది. 2. తూచబడినది.

తులుచు విశ. వేగముగలది.

తులువ విశ. తుంటరి.

తులువకత్తి వి. వంపు మరకత్తి.

తుల్యత సం. వి. (రసా.) ఒకదానితో నింకొకటి ఏ విధముగనైనను సమముగా

నుండెడు స్థితి (Equivalence).

**తుల్యభార నియమము** సం. వి. (రసా.) ఉదజని యొక్క ఒక ప్రమాణభారముతో సంయోగించు ఇతర మూలద్రవ్యముల ప్రత్యేక భారములు ఎల్లప్పుడు మారక కుండ ఉండును. (Law of equivalent Proportion).

**తుల్యభారము** సం. వి. (రసా) ప్రమాణముగా గ్రహింపబడిన ఉదజని భారముతో రసాయనికముగా తుల్యమైన మూలద్రవ్య భారము. (Equivalent weight)

**తుల్యము** సం. విశే. సమానము, సాటి.

**తుల్యాధికారములు** వి. (రాజ.) సంవర్థికాధికారములు. సంవిధానములో కేంద్రమునకు రాష్ట్రమునకు ఉమ్మడిగా నీయబడిన అధికారములు.

**తుల్యీకరణము** సం. వి. (రసా.) తనవలెనే చేసికొనుట. జంతుశరీరమందు ఆహారము వలె సదృశద్రవ్యముగా మార్చుకొనుట. ఉదా. వాతావరణములో నున్న కార్బన్ డై ఆక్సైడ్ నుండి కర్బనమును గ్రహించి చెట్టు తనకు కావలసిన యౌగికములుగా మార్చుకొనుట (Assimilation)

**తువర** వి. తుంపురువాన రూ.తువ్వర, తూర.

**తువరము** సం. వి. ఒగరు

**తుషములు** సం. వి. (వ్యవ.) వరి, జొన్న మొదలగు ధాన్యములపై నగుపడు ఊక పొయలు. (Glumes).

**తుషారము** సం. వి. 1. మంచు. 2. తుంపర.

**తుషార ముద్రణము** సం. వి. (గృహ) జల్లు అద్దకము,రంగు తుప్పర్ల అద్దకము(Spray printing). (రంగులుగాని ఇండియన్ ఇంక్ గాని దీనికి ఉపయోగింతురు).

**తుషారాంకము** సం. వి. (భూగో.) గాలిలో గల తేమ రాత్రులందు చల్లబడి నీటి బిందువులుగ మారి నేలపైగాని నేలకు సమీపమున నున్న ఆకులపైగాని పడును.

**తుష్టి** సం. వి. 1. తృప్తి. 2. సంతోషము.

**తుస్సు** వై. విశే. తుచ్ఛమ్ము నీచము. సం. తుచ్ఛమ్.

**తుహినకరుఁడు** సం. వి. చంద్రుడు. వ్యు. చల్లని కిరణములు గలవాడు.

**తుహినము** సం. వి. మంచు

## తూ

**తూగాఁడు** క్రి. తూగు. రూ. తూఁగియాడు.

**తూఁగు** క్రి. 1. ఊగు. 2. నిద్రించు. 3. చలించు, వి. 1. ఊగుట. 2. కునికిపాటు.

**తూఁగుమంచము** వి. ఉయ్యాలమంచము.

**తూఁచు** క్రి. తూనికవేయు,

**తూఁట** వి, తుంట, తునక. విశే. దుష్టుడు.

**తూఁటుకట్టు** క్రి. తునుకయగు,

**తూఁటరి** వై. విశే. దుష్టుడు, రూ. దూడరి. సం. దుష్టః.

**తూఁటాడు** క్రి.1.వేధించు.2.రంధ్రముచేయు.

**తూఁటు** వి. రంధ్రము, చిల్లి.

**తూఁటుకట్టు** క్రి. రంధ్రముపడు.

**తూఁడు** వి. తామరకాడ. బిసము.

**తూఁడుదిండి** వి. హంస. వ్యు. తూడే భోజనముగా కలది.

**తూఁతకొమ్మ** వి. పిల్లనగ్రోవి.

**తూకము** వి. 1. తూనిక. 2. పూనిక. రూ. తూకు.

**తూకు** వి. ప్రమాణము, కొలది. 2.బరువు.

**తూకొను** క్రి. 1. పూను. 2. చొచ్చు.

**తూణము** సం. వి. అమ్ములపొది. రూ. తూణీరము. తూణి.

తూణీరము సం. వి. చూ. పై.
తూనిక వి. 1. తూచుట. 2. పోలిక. 3. బలము
తూనికకోల వి. త్రాసుదండె.
తూనికవేయు క్రి. తూచు.
తూనీగ వి. ఒక విధమగు ఈగ. రూ. తూరీఁగ.
తూనీగకుటుంబము మి. వి. (వ్యావ) తూనీగలు, చెదపురుగులు మొదలగునవి ఈ కుటుంబమునకు చెందినవి (Neuroptera).
తూపరము వి. రంధ్రము చిల్లి
తూపరాణ వి. తూము, జలద్వారి రూ. తూపరాణము, తూపరాణి
తూపరాని వి. చూ. పై.
తూపి వై. వి. గుడిలో మూలవిగ్రహముండెడు చోటికి విమానమువలె ఎత్తుగా కట్టిన కట్టడము. సం. స్థూపః.
తూపు వి. బాణము.
తూపురిక్క వి శ్రవణ నక్షత్రము
తూపురిక్కనెల వి, శ్రావణమాసము.
తూపొడుచు క్రి. ఉమియు.
తూబరము సం. వి. కాలమున కొమ్ములు మొలవని ఎద్దు.
తూబరుఁడు సం. వి. 1. గడ్డము, మీసము రానివాడు. 2. అంతఃపురపు కావలివాడు.
తూము వై. వి. 1. నీరుపోవుటకు కట్టిన కాలువ. 2. నాలుగు కుంచముల కొలత
తూర వి వానబొట్టు. చూ. తువర.
తూరి వి. తడవ.
తూరు క్రి. 1. సన్ననివానపడు. 2. చొచ్చు. రూ. దూరు. ధాన్యములో కలిసిన పొల్లుగింజ.
తూరుపెత్తు క్రి. పొల్లుగింజలు దూరముగ పోవునట్లు గాలికెత్తిపోయు. రూ. తూరుపెత్తు, తూర్పెత్తు, తూర్పాఱఁబట్టు.
తూరుపు వి సూర్యుడుదయించు దిక్కు. ప్రాగ్దిశ. రూ. తూర్పు.
తూరుపుకొండ వి ఉదయాద్రి.
తూరుపుఁజేను వి. [illegible].
తూర్ణము సం. విశే. త్వరితము.
తూర్యము సం. వి. వాద్యము, వాద్యపు మ్రోత
తూర్పువానలు వి. (వ్యావ) ఈశాన్య పవన వాయువుచే వచ్చు వానలు. (Eastern rains).
తూఱ వి. నీరు పారుటకు తాటి పట్టెతో చేసిన తూము. క్రి. చొచ్చు రూ, దూఱు, దూఱఁబడు.
తూలఁదాఁకు క్రి చలించు.
తూలనాడు క్రి. నిందించు, తిట్టు.
తూలపుచ్చు మి. క్రి. అవమానపరుచు, లాఘవపరుచు.
తూలపోవు మి. క్రి. చిన్నపోవు,
తూలము సం. వి దూది.
తూలిక సం. వి. 1. చిన్నయీక. 2 వ్రాసెడు కలము. 3. చిత్రము వ్రాయుకుంచె రూ. తూలి.
తూలు క్రి. 1. చలించు. 2. తొలఁగు రూ. తూలఁబాఱు, తూలాడు, తూలియాడు.
తూష్ణీంభావము సం. వి మాటాడకూరకుండుట.
తూష్ణీకుఁడు సం. విశే. మాటలాడక ఊరకుండెడు స్వభావము గలవాడు.

## తృ

తృట్టు సం. వి. 1. దప్పి, 2. ఇచ్ఛ. రూ. తృష, తృష్ణ,
తృణగ్రాహి సం. వి, మరకతము, (శ.ర.) ఇంద్రనీలము (అని కొందరు.).

తృణజలూక నం. వి. కసవులో తిరుగు జలగ వంటి పురుగు.
తృణద్రుమము నం. వి. కొమ్మలు లేని తాటి, కొబ్బరిచెట్లు మొదలగునవి.
తృణధాన్యము నం. వి. (వ్యవ.) గడ్డిజాతి ధాన్యము. (Cereals) ఉదా. వరి,జొన్న. గోధుమ, చోడి మొదలగునవి.
తృణధాన్యము నం వి విత్తక పండెడు నివ్వరిధాన్యము
తృణధ్వజము నం. వి. వెదురు
తృణము నం. వి. గడ్డి, చామలోనగు పైరు.
తృణరాజము నం. వి. 1. తాటిచెట్టు. 2. కొబ్బరిచెట్టు. 3. గిరకతాడిచెట్టు.
తృణాహారము నం. విశ. (జం.) శాఖాహారము. విశ. ఆకులలములు తినునవి. (Herbivorous).
తృణీకరించు నం. క్రి. అలక్ష్యముచేయు.
తృతీయ నం. వి. 1. పక్షమునందు మూడవ దినము, తదియ.
తృతీయకము నం విశ. (గృహ.) మూడవది చూ. తృతీయము.
తృతీయనేత్రగ్రంథి నం. వి. (జం.) మస్తిష్కములో పూర్వ ఝల్లరి ప్రకాండము నకు వెనుక నుండు గ్రంథివంటి నిర్మాణము. (Pineal stalk)
తృతీయము నం.విశ.సర్వ చ.తృతీయకము.
తృప్తము నం. విశ తృప్తినొందినది.
తృప్తి నం. వి. తనివి.
తృష నం. వి. చూ. తృట్టు.

# తె

తెంకాయ వి. టెంకాయ.
తెంకి వి. స్థానము. చూ, టెంకి.
తెంచు క్రి తెగచేయు. చూ. త్రెంచు, త్రెంపు.
తెండు క్రి. పయుండు. చూ. తేదు,
తెందెగ అవ్య అధికముగా.
తెందెప్పలు విశ. అపారము. చూ తెందేపలు,
తెంపరి విశ. తెంపుగలవాడు.
తెంపాడు క్రి.నిందించు.
తెంపి వి, 1. విధవ. 2. తెగువ.
తెంపు క్రి. తెంచు. వి. 1.తెగువ. 2.తెగుట.
తెకతెక వి. 1. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము. 2. వేసవి కాలమున ఉష్ణాధిక్యమును సూచించు ధ్వన్యనుకరణము.
తెకతేర విశ. 1. వ్యర్థముగా. 2. సులభముగా. 3. నిష్కారణముగా.
తెక్కరము వి. విలాసము.
తెక్కలి వై. వి. 1. దొంగతనము, వంచన. 2. ప్రమాదము. సం. తస్కరః.
తెక్కకాడు విశ. దొంగ, వంచకుడు. చూ. తెక్కనికాడు.
తెక్కలిపోటు వై. వి. ఆపద.
తెక్కు వి. టెక్కు.
తెగ వి. 1. సజాతీయ సమూహము. 2. సమూహము. చూ. తెవ. 3. పక్షము. 4. విధము. 5. అల్లెత్రాడు ఎక్కుపెట్టుట. 6. నిడుపు. అవ్య. 1. నిశ్శేషముగా. 2. ఖండితముగా.
తెగఁగొట్టు క్రి. నరకు.
తెగఁజూచు క్రి. చంపు.
తెగఁబడు క్రి. తెగించు, సాహసించు.
తెగఁబాఱు క్రి. తెగించు.
తెగచు క్రి. కలగు, క్షోభించు.
తెగటాఱు క్రి. చచ్చు.
తెగటు క్రి. 1. త్రుళ్ళు. 2. గర్వము.
తేగడు క్రి. 1. తిరస్కరించు. 2. ఆక్షేపించు 3. నిందించు. చూ. తెవడు

తెగదెంపు వి. తెగువ, సాహసము.
తెగనాడు క్రి. 1. కఠినముగ పలుకు. 2. నశింపచేయు.
తెగవేయు క్రి నఱకు.
తెగించు క్రి. సాహసించు.
తెగు వై. క్రి. 1. ఖండితమగు. 2. ఛిన్నమగు. 3. తీఱ్పగు. 4. సాహసించు. రూ. త్రెగు త్రె. వ్యా. సం. తిగ్.
తెగుడు వై. వి. 1. తెగుట. 2. తెగువ.
తెగుదల వై. వి. 1. అంతము. 2 క్షయము.
తెగుదారి వై. విశే. 1. సాహసికుడు. 2. దాత.
తెగుదెంపు వై. వి 1. తీర్పు. 2. తెగువ, 3. ఫలితము.
తెగుపడు క్రి. వేరుపడు.
తెగుబడి వి. 1. తెగులు. 2. దుక్కి. 3. అమ్మకము.
తెగులు వి. వ్యాధి, చీడ. రూ. తెవులు.
తెగులుగొట్టు విశే. వ్యాధికలవాడు.
తెగులుకొను క్రి. రోగపడు.
తెగువ వి. 1. దాతృత్వము. 2. సాహసము.
తెచ్చు క్రి. తీసికొనివచ్చు.
తెట్టగిలు వై. క్రి. 1. నిస్సారమగు. 2. అలయు. 3. తేరుకొను. రూ. తెట్టగిల్లు, తెట్టగిలఁబడు.
తెట్టతెరువు వి. నడివీధి.
తెట్టియ వై వి. 1. తెట్టువ. తేనెపెర. 2. తృణకాష్ఠాదులకుప్ప. రూ. తెట్టె. సం. ఘట్టః.
తెట్టువ వై. వి. 1. సమూహము 2. నీటిపై గాలి కొకప్రక్కగా చేరిన తృణాదుల సమూహము. సం. ఘట్టః.
తెట్టెము వై . వి. మొత్తము.
తెట్టెలుగట్టు క్రి. రాశిపడు.
తెడ్డు వి. 1. తుండువు, 2. కొయ్యగరిటె. 3. పడవ త్రోసెడు పలక. రూ. త్రెడ్డు.
తెనమను క్రి. శయనించు, పరుండు.
తెనుఁగు వి. ఆంధ్రభాష. రూ. తెలుగు.
తెన్ను వి. దారి.
తెన్నించు క్రి పరుండు.
తెప్ప వి. 1. నీటిపై పడవవలె తేలఁగట్టిన కొయ్యలు. 2 దారి. రూ. తేప.
తెప్పలఁదేలు క్రి ఓలలాడు.
తెప్పిరిలు క్రి తెలు. రూ. తెప్పిరిల్లు. తెప్పిర్లు, తెప్పిఱు.
తెప్పున విశే. శీఘ్రముగా,
తెమట వి. శ్లేష్మము.
తెమలు క్రి. 1. చలించు. 2 తొట్రుపడు. 3. చెదరిపోవు 4. కదలు. 5 మరలు. 6. నశించు, 7. పని పూర్తి చేసికొను.
తెమ్మ వై. వి తడి. రూ. తేమ. సం. తేమః.
తెమ్మెర వి. 1. చల్లనిగాలి, 2. గాలి.
తెర వై. వి. 1. మరుగుచీర, 2. అల, 3. పరంపర. సం. 1 తిరః. 2. తరంగః. 3. పరంపరా వై. వి. (ఛాయా.) ప్రతిబింబములను పట్టుటకు వీలయిన సమతలము (Screen).
తెరలిక వి. గుంపు.
తెరలు క్రి. 1. మసలునట్లు కారు. 2. బయలుదేరు. 3 కలగు, 4. తొలగు. రూ. త్రెళ్లు.
తెరువాఁటీడు విశే దారిదోపిడికాఁడు. రూ. తెరువాటుకాఁడు
తెరువాటు వి. దొంగలు దారికట్టి కొట్టుట.
తెరువు వి. దారి రూ. తెర్వు.
తెఱ విశే. 1. తెరపయినది. మఱుగులేనిది. రూ. తెఱ్ఱ
తెఱఁగు వి. 1. విధము, క్రమము. 2. చక్కన 3. సంధి. రూ తెఱవు.
తెఱఁగువడు క్రి. సంధియగు.
తెఱకువ వి. తెలివి. ఉపాయము.
తెఱగంటి వి. 1. ఱెప్పపాటులేనివాడు, దేవత. 2. చేప.

తెరగంటిఱేఁడు వి. ఇంద్రుడు.
తెఱచు క్రి. 1. తెరపిచేయు. 2 బయటపడు.
తెఱనోటిమెకము వి. సింహము వ్యు. విస్తారముగు నోరుగల మృగము.
తెఱప వి. 1 తెఱచుట. 2. ఉపాయము విశే. మఱుగులేనిది.
తెఱపి వి. అవకాశము.
తెఱపుమఱపు వి. తబ్బిబ్బు.
తెఱలు క్రి. వాటిన బయలువెడలు.
తెఱవ వి. స్త్రీ. వ్యు. తెరపు + వా(యి) కలది. ద్వాహ్యము దాగని నోరు కలది,
తెల విశే. తెల్ల. సం. ధవళః.
తెలచు క్రి. 1. మ్రొక్కు 2. స్తుతించు. రూ. తెలుచు,
తెలవాఱు క్రి. తెల్లవారు.
తెలి విశే. 1. తెల్లనిది. 2. నిర్మలము.
తెలికపిండి వై. వి. గానుగ పిండి.
తెలికలు వై. వి. తిలలు. నువ్వులు. సం. తిలకః
తెలికవాఁడు వై. వి. గాండ్లవాడు.
తెలిగంటి వి. స్త్రీ. వ్యు. తెల్లని కన్నులు గలది
తెలిగాము వై. వి. శుక్రుడు.
తెలిగొను క్రి ప్రమాణముచేయించు.
తెలిదమ్మి వై. వి. తెల్లతామర.
తెలిపక్కము వై. వి. శుక్లపక్షము.
తెలిపిట్ట వి. హంస
తెలిమొదవు వి. కామధేనువు,
తెలియు క్రి. 1. విదితమగు. 2. మేలుకొను. 3. ప్రసన్నతనొందు. 4. తేరు. 5. ఎరుగు.
తెలియేఱు వి. ఆకాశగంగ.
తెలివి వి. 1. వివేకము. 2. ప్రకాశము. 3. కాంతి, వికాసము. 4. తేరుట. 5. తెలుపు.
తెలివిడి వి. 1. దృష్టాంతము. 2. తెలియ చేయుట.
తెలుఁగు వి. తెనుగు.
తెలుచు క్రి. 1. నమస్కరించు. 2. తేర్చు. 3. ప్రార్థించు. రూ. తెలచు.
తెలుపారు క్రి. తెల్లనగు, రూ. తెలుపువాఱు.
తెలుపు క్రి. 1. ఎరిగించు. 2 మేలుకొలుపు. 3. తేర్చు వై. వి. 1 ధావళ్యము. 2. పరిశుద్ధి.
తెలుపుడు వి. ఎరుక.
తెలుపుడుచేయు క్రి. ఎరిగించు.
తెల్ల విశే. 1. ధవళము. 2. స్పష్టము.
తెల్లచౌటినేలలు వి. (వ్యవ.) సోడియ హరిదము (ఉప్పు), గంధకితము ఎక్కువగా నుండుటవలన తెల్లగా నుండు చౌటి నేలలు. (White alkaline soils).
తెల్లడాలుమెకము వి. సింహము. వ్యు. తెలుపువన్నెకల మెకము.
తెల్లదొర వి. 1. శివుడు. 2. బలరాముడు. 3. ఆంగ్లేయుడు, పాశ్చాత్యుడు.
తెల్ల నేలలు వి. (భూగో.) సముద్రమునందలి కాని యేటియందలి కాని ఇసుకచే నేర్పడిన రంగు లేని నేలలు. (White soils).
తెల్లమి వై. విశే. నష్టము, రూ. తెల్లము.
తెల్లయేనుగు వి. ఐరావతము.
తెల్లవాఱు క్రి. 1. ఉదయమగు. 2. తెల్లనగు. 3. సారహీనమగు. రూ. తెల్లవాఱు.
తెవ వి. సమూహము. చూ. తెగ.
తెవడు క్రి తెగడు.
తెవులు వి. తెగులు.

## తే

తేఁకు వి. ఱేకు. త. తేక్కు.
తేఁకువ వి. 1. ధైర్యము. 2. భయము. 3. మెలకువ. 4. సందేహము. 5. వివేకము.
తేఁకుచెట్టు వి. టెంకాయచెట్టు. రూ. తేమ్రాను. తెన్ + చెట్టు = దక్షిణదేశపు చెట్టు.
తేఁటి వి. తుమ్మెద, తేనెటీగ.

తేఁడు క్రి. 1. తెండు. 2. శయనించు
తేగ వి. శాటిమెలిక
తేగర విశ. 1. అరిగినది. 2. లేతది. 3 పపు గలది.
తేగము వై. వి. త్యాగము. ఈవి, రూ. చాగము నం. త్యాగః.
తేజము నం. వి. 1. ప్రకాశము. 2. ప్రభావము 3. పరాక్రమము. 4, రేతస్సు. రూ తేజస్సు.
తేజస్వి నం. విశ. తేజము గలవాడు.
తేజరిల్లు నం. క్రి. ప్రకాశించు. రూ. తేజిల్లు తేజిలు.
తేజి వి. గుఱ్ఱము. రూ తేజీ.
తేజిల్లు నం. క్రి మా తేజరిల్లు.
తేజిష్ఠము నం. విశ. మిక్కిలి తేజస్సుగలది.
తేజు వై. వి. 1. తేజము, ప్రకాశము. 2 ప్రతాపము. నం. తేజః.
తేజో రసాయనశాస్త్రము నం. వి. (రసా.) రాసాయనిక యౌగికముల ప్రక్రియల పై కాంతికి గల ప్రభావము, రాసాయనిక ప్రక్రియలలో వెలుతురు విడుదలయగుట మొ. విషయముల చర్చించుశాస్త్రము (Photo chemistry).
తేట వి. నైర్మల్యము, ప్రసన్నత.
తేటతెల్లము విశ. మిక్కిలి స్పష్టము.
తేటపడు క్రి. విశదమగు.
తేది వై.వి. తిథి,దినము రూ. తేదీ. నం తిథిః
తేనియ వి. మధువు, రూ. తేనె.
తేనెదిండి వి. తుమ్మెద.
తేనెమంచుపురుగు వి (వ్యవ.) మామిడి చెట్లకు పూతసమయమున ఈ జాతిపురుగులు అమితముగ పట్టి పిందె పర్పడకుండ చేయును.(Mango hopper Idiocerus niveosparsus). (ఈ పురుగులు 'తేనె మంచు' అను జిగురుగా నుండు ద్రవమును విడుచును.)
తేప వి. తడప. రూ తెప్ప.
తేమ వై. వి. తడి. రూ. తెమ్మ.
తేమగిల్లు వై. క్రి. తడిసుకు, రూ. తేమగిలు.
తేమసము నం. వి. 1. మజ్జిగపులుసు. 2. తడియుట రూ తెమము.
తేమానము వి. . . 2. ఆలస్యము.
తేయాకు వి. తేనీరు పానీయమున కుపయోగించు ఒక ఆకు (Terestroemiaceaeఅను కుటుంబమునకు చెందిన Camelliathe అను మొక్క మొక్క చిగుళ్ళు, లేత ఆకులను ఎండబెట్టి తేయాకు తయారుచేయుదురు. ఈ ఆకుల కషాయముతో తేనీరు తయారుచేయుదురు, (Tea)-తేనీటిలో తైన్(Thein), కెఫిన్(Caffine) అను సారములుండును.)
తేయు క్రి 1. అరుగు, కృశించు. త. తేయ్.
తేర వి. 1. తేట. 2 సంబంధము లేమి. అవ్య. 1. వ్యర్థముగా 2, అనాయాసముగా.
తేరకత్తె విశ. 1. సంబంధములేనిది. 2. విటురాలు.
తేరకు విశ. 1. వ్యర్థముగా. 2. అనాయాసముగా.
తేరకుఁదేర అవ్య. మిక్కిలి అనాయాసముగా.
తేరకొను క్రి. 1. తేటపడు 2. రెప్పవేయకుండ.
తేరగాథ నం. వి (వరి) బౌద్ధభిక్షువులచే రచింపబడిన కథలు.
తేరవాదము నం. వి. (వరి.) 1. స్థావిరవాదము. 2. సనాతన బౌద్ధ ధర్మము.
తేరిగాథ నం. వి. (వరి.) బౌద్ధభిక్షువులు రచించిన బౌద్ధమతమునకుచెందిన కథలు.
తేరు క్రి. 1. కలుగు. వై. వి 1. రథము, 2. బండి. నం. రథః.

తేరకాడు వి. రక్షకుడు.

తేరుపూన్పుడి వి. సారథి.

తేఱు క్రి. 1. తేటపడు. 2. ప్రసన్నతనొందు 3. ఊరడిల్లు. 4. స్వస్థత నొందు. 5. ముగియు.

తేఱుకొను క్రి. స్వస్థతనొందు.

తేఱుగడ వి. 1. ముగియుట. 2. తెలివిడి. 3. నైపుణ్యము.

తేలగిల్లు క్రి. 1. పైకితేలు 2. పరవశమగు రూ. తేలగిలు.

తేలవేయు క్రి. తేలగిలచేయు.

తేలిక వి. చులకన, లఘుత్వము.

తేలికనేలలు వి (వ్యావ.) దున్నుటకు సులువుగా నుండు ఇసుక కొండి నేలలు.(Light soils)

తేలు క్రి 1. నీళ్ళలో మునుగక పైకివచ్చు 2. నీటిలో క్రీడించు. 3. తేలగిల్లు. 4. పొడచూపు. వి. వృశ్చికము.

తేలురాసి వి. వృశ్చికరాశి.

తేలువాఱు క్రి. పుట్టు.

తేవ వి. ఉత్సవము.

## తై

తైతక్కలాడు క్రి. 1. నాట్యమాడు. 2. ఎగిరిపడు.

తైరు వి. పెరుగు, దధి రూ. తయిరు. త. తైర్.

తైర్థికుడు సం. విశే. తీర్థసేవచేయువాడు

తైలదములు సం. వి. (రసా) క్లోరెన్‌తో రాసాయనికముగ సంయోగించు తైలము వలె కనపట్టు ద్రవ్యముల నిచ్చు కర్బనోదజనిదములు(హైడ్రోకార్బన్లు)(Olefines) ఉదా:- ఎథిలీన్.

తైలపాయిక సం. వి. గబ్బిలము. వ్యు. నూనె త్రాగునది.

తైలము సం, వి తిలలనుండి లభ్యమగు నూనె. (ఏ నూనెనైన తైలమనుట పరిపాటియైనది. (రసా.) తైలములు కార్బన్, ఉదజని, ఆక్సిజన్ గల రాసాయనిక యౌగికములు.)

తైలయంత్రము సం, వి. (వ్యావ.) నూనెచే నడుపబడు చలన యంత్రము. (Oil engine).

తైలవాయువు సం. వి. (రసా) వేడిచేసి రాతి నూనెల నుండి తయారుచేయబడు వాయువు. ఇదియే శోధనాగారములో బున్సెన్ బర్నర్‌లకు ఉపయోగించు వాయువు. (Oil gas). చూ (ఖనిజాంగార వాయువు).

తైలికుడు సం. వి. గాండ్లవాడు.

తైషము సం, వి. పుష్యమాసము.

తైక్ష్ణ్యము సం. వి. 1. పదను. 2. మిక్కిలి. వేడిమి. 3. చురుకు. 4. కాఠిన్యము.

## తొ

తొంక వి. పుచ్ఛము వ్యు. తొంగునది. వంగియుండునది. రూ. తోక.

తొంగలి విశే. 1. వాలునది. 2. స్రవించునది. వి. 1. వన్నె. 2. గొడుగు.

తొంగలించు క్రి. 1. అతిశయించు. 2. ప్రకాశించు. 3. వికసించు. 4. వర్ధిల్లు. 5. నిక్కు. 6. స్రవించు. రూ. తొంగలిగొను.

తొంగలిపొట్లు వి. నమస్కారము.

తొంగిళ్ళు వి. నీళ్ళలోనగు వాని బొట్లు.

తొలగు క్రి. పండుకొను, తొంగుండు.

తొంట వి. 1. చెట్టుపట్ట. 2. కసపువెంటి.
తొంటచేయి వి. ఈచబోయిన చేయి.
తొంటి విశే. పూర్వపు. రూ. తొల్లిటి.
తొంత వి. సఃటము.
తొండపుదోమ వి. దనుగుదోమ
తొండము వై. వి. 1. తుండము. గజహస్తము. 2 కపిలశాన తోక. సం. తుండమ్
తొండరూపురిక్క వి. పుష్యమీ నక్షత్రము.
తొండాడు క్రి. త్వరపరుచు.
తొండి వి రంధ్రము రూ. దొండి.
తొండు వి వేరుసెనగలోనగు వాని ఆకు. విశే. పోమరి.
తొంద వై. వి. తుదిలుండు, బొజ్జకడుపు వాడు. రూ. తొందు, సం. తుందీ.
తొందర వి. 1. మిక్కిలి త్వర. 2. బాధ.
తొందరచేయు క్రి. 1. బాధించు. 2 త్వరపడు.
తొందరపాటు వి త్వరపడుట.
తొంబండ్రు సర్వ. తొంబదిమంది.
తొంబ వి. మూక. గుంపు.
తొంబగిలు క్రి. గుమికూడు:
తొంబది సర్వ. తొమ్మిది పదులు
తొంబనూలు సర్వ. తొంబది నూర్లు.
తొకతొక విశే. తొక్కు (మాట.)
తొక్క వై. వి. 1. చెట్టుపట్ట 2, పండ్లమీది చర్మము. సం. త్వక్
తొక్కట వి. 1. తొక్కుడు. 2. సంకటము. రూ. త్రొక్కటి.
తొక్కటపడు క్రి. సంకటపడు.
తొక్కటపాటు వి. సంకటము,
తొక్కు వి. 1. ఉప్పుకారము చేర్చి దంచిన కాయలు (ఊరగాయ.) రూ. తొక్కుడు. 2. అవ్యక్తము (మాట.) 3. పసిబిడ్డల వచ్చియు రాని మాటలు.
తొగ వి. 1. కలువ. 2. సమూహము. 3. విధము. రూ. తొవ.
తొగకంటి వి. కలువకంటి, స్త్రీ.
తొగచెలికాడు వి. చంద్రుడు.
తొగడు వి. లోపలి కణగుట
తొగర వై. వి. 1. తువరము. 2. ఒగరు. రూ. తొగరు, తొవర. సం. తువరః.
తొగరు వి. ఎరుపు.
తొగరుకొను క్రి. ఎఱ్ఱనగు.
తొగఱేడు వి. చంద్రుడు.
తొగవిందు వి. చంద్రుడు.
తొగసూడు వి సూర్యుడు వ్యు. కలువలకు శత్రువు
తొచ్ఛ్యము వై. వి. తుచ్ఛవచనము. రూ. తొచ్ఛము. సం. తుచ్ఛమ్.
తొట్ట వి. స్థానము.
తొట్టుగిల్లు క్రి. 1. అతిశయించు. 2. కలుగు. రూ. తొట్టగిల్లపడు, తొట్రుపడు.
తొట్టి వి. నోరు వెడల్పయిన మట్టి లేక కఱ్ఱ పాత్రము, కొప్పెర.
తొట్టికట్టు వి. లోగిలి.
తొట్టియ వి. 1. నేయువాడు నూలుకండె నుంచుకొనునాడె. 2. ఉయ్యాలతొట్టె.
తొట్టియల వి. బిడ్డల పరుండబెట్టు ఉయ్యాల. రూ. తొట్టెల, తొట్ల, తొట్టియ, తొట్టె.
తొట్టు క్రి. 1. వ్యాపించు. 2. ప్రవహించు. 3. స్రవించు. 4. ఎగచట్టు. 5. నిండు. 6. నాటు. 7. స్పృశించు, 8, మొదలుకొను. 9. చెరువులోపలి పొలము.
తొట్టువ వి. తెట్టువ.
తొట్టె వి. రూ తొట్టియ.
తొట్టెనొల్ల వి. (వ్యవ.) దున్నిన నేలమీద మెరక నుండి పల్లమునకు మంటిని లాగుట కుపయోగించు తొట్టె ఆకారము గల పని ముట్టు (Buck-scraper) (దీనిని పశువులు లాగును.


తొట్టెనొల్లి

తొట్టి వి. తొఱ్ఱి.
తొట్రిలఁబడు క్రి. సంభ్రమించు.
తొట్రిల్లు క్రి. 1. సంభ్రమించు, 2, భేదిల్లు
తొట్రు వి. సంభ్రమము.
తొట్రుపడు క్రి. సంభ్రమించు.
తొడ వి. ఊరువు.
తొడఁకు క్రి 1. ఎదిరించు. 2. చిందు. రూ. తొణకు, తొలఁకు.
తొడఁగు క్రి 1. ఆరంభించు. 2. పూను.
తొడపుట్టువు వి వైశ్యుడు
తొడయు క్రి. విడుచు, కడుగు.
తొడరిక వి. అనుసరణము.
తొడరు క్రి 1. కలుగు. 2. యత్నించు 3. పక్షమగు, 4. తొట్రుపడు. 5. అనుసరించు. 6 ఎదిరించు. 7. అనుకరించు.
తొడరుపు వి. యత్నము.
తొడవు వి. భూషణము.
తొడి వి. త్వర.
తొడిఁబడు క్రి. 1. చలించు. 2. చెదరు.
తొడికలు క్రి. ఒడిసిపట్టుకొను.
తొడిమ వి. కాడ.
తొడు క్రి. 1. తొడుగు 2 సంధించు
తొడుకు క్రి. 1. పట్టు.ఒడియు. 2. తెగించు. వి. 1. ఆవు. 2. దొంగమేత. 3. ఎద్దు 4 పశువు.
తొడుకొను క్రి. తోడుకొను. 2. తొడుగుకొను.
తొడుగు క్రి ధరించు, వి. 1. ఆభరణము. 2. కవచము. 3. బాణము. 4. గవిసెన. 5. ముండ్లకంప మోపు. రూ. తొడుపు.
తొడుపు వి. 1. కవచము. 2. కఱ్ఱకువేసెడి పొన్ను లేక కడియము. 3.చెప్పినదిమరల చెప్పుట.
తొడుసు వి. సంబంధము.
తొఱకునల్లిక వి (వ్యావ) దూకు చల్లిక మాగాణి భూములలో వరి పంటను గోయుటకు ముందు పెసర, మినుము, జనుము మొదలగు విత్తులను నేలను దున్నకుండనే చల్లుట.(Free broad casting).
తొస్తు వి. 1. జానిస. 2. రంకుటాలు.
తొన వి 1, తొల. 2. నారింజ, పనస మొదలగు వానిలోని తొన. విశ. రతుకము.
తొనకు క్రి. తొలకు. వి. తొట్రుపాటు.
తొన్నుండు క్రి. శయనించు. రూ.తెన్నుండు,
తొపారము వి డేగల మొగమునకు గట్టు తోలుగంత రూ తోపా. ము
తొప్పదోఁగు క్రి. మిక్కిలి మునుగు.
తొప్పజిల్లు క్రి. ఒరగు. రూ. తొప్పజిలు, తొప్పఱు
తొప్పలుపోకలు విశ. కోటానగోట్లు.
తొప్పి వి. టోపి.
తొబక విశ. విత్తులు రాలినది (కాయ,) వి. గుల్ల.
తొమ్మండ్రు సర్వా. తొమ్మిదిమంది.
తొమ్మనూఱులు సర్వా. తొమ్మిది నూరులు. రూ. తొమ్మనూఱు.
తొమ్మాడు వి. నాశము.
తొమ్మిది సర్వా. ఎనిమిదియు నొకటి.
తొయ్యలి వి. స్త్రీ, రూ. తోయలి. త. తైయల్.
తొర వై వి. 1 త్వర, వేగిరపాటు. 2 ఆపద. సం. త్వరా.
తొరఁగు క్రి. 1. స్రవించు, 2 ప్రవహించు 3 పడు 4 వ్రాలు రూ, తొరుఁగు.
తొరలు క్రి 1, కలుగు, 2, మారు, 3,ఎదుర్కొను.
తొరుపు క్రి, 1. తొరలించు, 2, నీళ్ళు చల్లార్చు
తొఱఁగు క్రి, 1, విడుచు, 2, కారు, వి.1, విడిపడుట, 2, తొఱంపు,
తొఱట వి, కోటరము. రూ, తొఱ, తొఱ్ఱి
తొఱ్ఱి వి. చూ. పై.

**తొఱ్ఱి** వి ముందర పండ్లు లేని నోరు.
**తొఱ్ఱిద్రొక్కుఁడు** వి గట్టి త్రొక్కుఁడు.
**తొఱ్ఱు** వి. ఆవు.
**తొఱ్ఱుపట్టు** వి. 1. ఆవులమంద, 2. గోవుల సాల. 3 గొల్లపల్లె
**తొల** వి. తొన
**తొలకరివానకారు** వి. (వ్యావ.) ముంగటి వానకారు, జూన్ జూలై నెలలు. పడమటి వర్షములు పడు మొదటి భాగము. మృగశిర, ఆరుద్ర, పునర్వసు, పుష్యమి కార్తెలు గ్రీష్మర్తువు (Early monsoon time).
**తొలఁకు** క్రి. 1, తొనకు, చలించు 2, అతిశయించు, 3. ప్రకాశించు వి. 1. చలనము 2. అల
**తొలఁగు** క్రి. ఒదుగు. రూ తొలఁగఁబాఱు.
**తొలగుఁడు** వి. తొలగుట.
**తొలఁగుబావ** వి. శత్రువు, దాయ.
**తొలఁచు** క్రి. 1. తొలగచేయు. 2. కడుగు. 3. తుడుచు.
**తొలకరి** వి చైత్ర వైశాఖములందలి వాన. వర్షర్తువు రూ. తొల్కరి.
**తొలకరించు** క్రి. వానకురియు, పుట్టు. రూ. తొల్కరించు.
**తొలకరిసూడు** వి. హంస. వ్యు. వర్షాకాల విరోధి.
**తొలి** వి. 1, ముందు. 2. మొదలు. 3. రంధ్రము రూ. తొల్లి.
**తొలిక** వి. 1 రంధ్రము. 2. త్రవ్వు సాధనము. రూ తొల్లిక తొలిక.
**తొలుకారు** వి మొదటికారు, వర్షర్తువు [illegible] మొదటికారుపంట.
**తొలుకు** క్రి కురియు.
**తొలుకుపుష్ప** వి అగ్ర ప్రాశనము.
**తొలుగట్టు** వి ఉదయాద్రి
**తొలుచదువులు** వి వేదములు.
**తొలుచు** క్రి. 1. రంధ్రము చేయు. 2, తోడు.
**తొలుత** వి 1. ముందు. 2 మొదట.
**తొలుదీవి** వి జంబూద్వీపము
**తొలుపిడిరిక్క** వి. పూర్వాషాఢ.
**తొలుపంది** వి ఆదివరాహము.
**తొలుపక్కము** వి శుక్లపక్షము.
**తొలుమినుకులు** వి. వేదములు.
**తొలుమొగులు** వి వర్షించుచున్న మేఘము.
**తొలురిక్క** వి. అశ్విని
**తొలురిక్కనెల** వి. ఆశ్వయుజము,
**తొలువేలుపు** వి. 1. బ్రహ్మ. 2. అసురుడు. 3. పూర్వదేవుడు.
**తొలుసంజ** వి ప్రాతస్సంధ్య.
**తొల్కరి** వి తొలుకరి
**తొల్కరించు** క్రి తొలకరించు.
**తొల్లి** వి. తొలి.
**తొల్లిక** వి. తొలిక.
**తొవ** వి. తొగ.
**తొవర** వై. వి. తొగరు.
**తొవరు** వి. తొగరు.
**తొస్సు** వి. ఉచ్చారణ లోపము.
**తొస్సి** విశే. బోసి, బొక్కి.
**తొళసి** వై. వి. తులసి.
**తొళ్ళిక** వి. (వ్యావ.) త్రవ్వుకోల గొప్పు త్రవ్వుట కుపయోగించు చేతిపనిముట్టు (Hand hoe).


తొళ్ళిక

# తో

**తో** అవ. తృతీయా విభక్తి ప్రత్యయము. (అవ్య.) కూడ, వెంబడి.
**తోఁక** వి. తొంక.
**తోఁకచిచ్చు** వి. 1. నిప్పు రగిల్చిన పిడకల వరుస. 2. ఒకదానినుండి మరొకటిఅంటుకొనుచు వ్యాపించు అగ్ని.

**తోఁకచుక్క** వి ధూమకేతువు. (భూగో.) సూర్యునిచుట్టు తిరుగు ఘనపదార్థ కేంద్రము వెలుగుచున్న తోక గలిగిన ఒక గ్రహము. (Comet)


తోఁకచుక్క

**తోఁక మిరియము** వి. చలువ మిరియము.

**తోఁగు** క్రి. 1. మునుగు. 2. తడియు.

**తోఁచు** క్రి. 1. ఉదయించు, 2. మనసున ఏర్పడు. 3. ప్రత్యక్షమగు.

**తోఁట** వి. 1. ఉద్యానము. 2. ఆశ్రమము.

**తోఁటకాపు** వి. 1 తోటవాడు. 2. తోటమాలి.

**తోఁటమాలి** వి. తోటను సంరక్షించువాడు.

**తోటమాలియ** వి. ఆకులు, పూవులు చేర్చి కట్టిన మాల రూ. తోఁటమాలె, తోమాలియ, తోమాలె.

**తోఁటసేద్యము** వి. (వ్యవ.) ఎక్కువ నీరు నిలువకుండ తగుమాత్రము నీరు పెట్టి పైరులను సాగుచేయు పద్ధతి. దీనికి అనుకూలముగా నుండు నేలలు 'తోటనేలలు' అనబడును. (Garden cultivation).

**తోఁటీఁడు** వి. వనపాలకుడు.

**తోఁడు** క్రి. 1. కుళ్ళగించు. 2. నీళ్ళుచేదు 3. నూలిపోగు తీసిచుట్టు.

**తోఁడుబోతు** వి. వంపుచేయుట. విణ. వంపు చేయువాడు.

**తోఁడేలు** వి. 1. వృకము. 2, అడవికుక్క. రూ తోఁడెలు.

**తోఁడేటికడుపుమేటి** వి. వృకోదరుడు. భీముడు.

**తోఁతెంచు** క్రి. 1. ఉదయించు. 2. కనబడు, ప్రత్యక్షమగు. 3. వచ్చు.

**తోఁప** వి. సంకటి.

**తోఁపిక** వి. తలపు, తోచుట.

**తోఁపు** వి. 1. పెంపుడు వనము, తోట. 2. ఎరుపు, 3. తోపిక.

**తోఁబుట్టు** వి. 1. సోదరుడు. 2. సోదరి. రూ. తోబుట్టుగు, తోబుట్టువు, తోడబుట్టువు.

**తోకొను** క్రి. తోడుకొను, వెంటబెట్టుకొను.

**తోటా** హిం వి. తుపాకి మందు.

**తోటి** వి. 1. మాల, చండాలుడు 2. వేడుక.

**తోడ** అవ. తృతీయావిభక్తి ప్రత్యయము. రూ. తోడుత. అవ్య. కూడ, వెంబడి

**తోడఁబుట్టు** వి. 1. సోదరుడు. 2. సోదరి. రూ. తోడబుట్టువు,

**తోడా** వి. 1. బిరుదుగా వేసిన హస్తభూషణము. 1. అందె.

**తోడికోడలు** వి. మగని సోదరుని భార్య. పర్యా. యాత.

**తోడపూలు** వి. తోబుట్టువు.

**తోడితెచ్చు** క్రి. పిలుచుకొనివచ్చు. రూ. తోతెచ్చు, తోడ్తెచ్చు.

**తోడియల్లుఁడు** వి. షడ్డకుడు

**తోడివాఁడు** వి తోడనున్నవాడు.

**తోడు** వి. 1. అన. 2. తోబుట్టువు. 3. చేమిరి. 4. తోడుజ్జిమగ. విణ సహాయము.

**తోడుఁబాలు** వి. పాలుపిండబోవునపుడు పాత్రలో నుంచుకున్న నీరు.

**తోడుకొను** క్రి. 1. పాలుపేరుకొను. 2. పిల్చుకొను రూ. తోడికొను, తోడ్కొను.

**తోడుచల్ల** వి. చేమిరిపెట్టు మజ్జిగ.

**తోడుతో** అవ్య. వెంబడిని. రూ. తోడుతోడ, తోడ్తో, తోడ్తోడ.

**తోడుపడు** క్రి. సహాయపడు. రూ. తోడ్పడు.

**తోడుపాటు** వి. సాహాయ్యము. రూ. తోడ్పాటు.

**తోడుపెట్టు** క్రి. చేమిరిపెట్టు

**తోడుపోవు** క్రి. సరియగు.

**తోడెము** వి. కొంచెము, లేశము.

**తోడ్కొను** క్రి. తోడుకొను.

**తోడ్తెచ్చు** క్రి. తోడితెచ్చు.

**తోడ్తో** అవ్య. తోడుతో.

తోత్తర అవ్య. తోడనోడు.
తోద్పడు క్రి. తోడుపడు.
తోద్పాటు వి. తోడుపాటు.
తోత్రము సం. వి. ఎరిగోల. అంకుశము. ములుకోల.
తోదు వి. పరువుకట్టు.
తోహారము వి. మా. తోపారము.
తోపుడుచట్రము వి (గృహ.) చక్రములుగల తోపుడుబల్ల (Trolley-tray).
తోమకము వి. తోముట. రూ. తోముడు.
తోమరము సం. వి. చిల్లకోల.
తోమాలె వి. మా. తోటమాలియ.
తోము క్రి. రుద్దు.
తోయజము సం. వి. 1. తామర. 2. నీటి నుండి పుట్టినది.
తోయజాక్షి సం. వి. తమ్మికంటి.
తోయదము సం. వి 1. మేఘము. 2. నెయ్యి వ్యు. నీటినిచ్చునది.
తోయధి సం. వి. సముద్రము.
తోయము వి. 1. విధము. 2. తెగ. 3. జడవ. 4. పరివారము 5. సమయము. సం. వి. నీరు.
తోయరుహము సం. వి. తామర. వ్యు. నీటియందు జన్మించినది
తోయలి వి. తొయ్యలి, స్త్రీ.
తోరణము సం. వి. 1. పుష్పమాలాదులు కట్టుటకై గృహమునకు వెలుపల రెండు స్తంభాలచే ఏర్పరుపబడిన ద్వారము 2. ద్వారమునకు కట్టు మామిడియాకుల దండ. రూ. తోరణ
తోరము వై. వి. ప్రతిసూత్రము. విశ. 1. స్థూలము లావు బలిష్ఠము. 2 అధికము. సం. స్థూలమ్.
తోరహత్తి వై. విశ. దస్త్రిక్షము.
తోలనపాత్ర సం. వి. (రసా) ద్రవ్యము లను సరిగా త్రాసులో కొలుచుటకుద్దిష్టమైన పరికరము. (Weighing bottle).
తోలు క్రి. పశువులను నడుపు. వి. చర్మము రూ. తోలుక.
తోలుదాలుపు వి. శివుడు, చర్మాంబరుడు,
తోలువాయిదము వి. అనద్ధము: తోలుకప్పిన వాద్యము.
తోసిరాజు మి. వి. 1. తొలగదగినరాజు. 2. చదరంగమునందలి పరిభాష.

## తౌ

తౌ క్రి. 1. తగు 2. ఒప్పు. రూ. తగు. తవు.
తౌడు వి. తవుడు.
తౌర్యత్రికము సం. వి. నృత్తగీత వాద్యములు.
తౌలు క్రి. తగులు, రూ. తవులు. తగులు,
తౌల్యము సం. వి. సామ్యము పోలిక.

## త్య

త్యక్తము సం. విశ. విడువబడినది.
త్యజనము సం. వి. 1. విడుపు: విడుచుట, 2. త్యాగము.

## త్యా

త్యాగము సం. వి. ఈవి. భాగము, తేగము. విడుపు.
త్యాగి సం. విశ. ఈవికాడు.
త్యాజ్యము సం. విశ. విడువదగినది.

## త్ర

త్రంపి వి. జాలి, రూ. తంపి.
త్రపన వై. వి. 1. చిలుకుట. 2.చెక్కుట.
త్రపు వై. క్రి. చిలుకు, మథించు. రూ. తరుచు. సం. త్వక్ష్, తక్ష్.
త్రప సం. వి. సిగ్గు
త్రపుపు సం. వి. తగరము, సీసము.
త్రమ్ము క్రి. దుమ్ముచేయు. వి. దుమ్ము.
త్రయము సం. సర్వ. మూటి సమూహము రూ. త్రయి.
త్రయి సం. వి. 1. త్రయము. 2. మూడు వేదములు.
త్రయీతనువు సం. వి. సూర్యుడు. వ్యు. మూడు వేదములే మూర్తిగా గలవాడు
త్రయీధర్మము సం. వి. వేదవిహితధర్మము.
త్రయోదశము సం, సర్వ. పదుమూడవది. వి. త్రయోదశి.
త్రయోదశి సం. వి. 1. పదుమూడవది. 2. తిథులలో నొకటి. 3. పరివాదిని: పదుమూడు తీగలు గల వీణ.
త్రవ్వు క్రి 1. త్రోడు, 2. ఖననము చేయు. 3. ఖండించు. 4. పుట్టుపూర్వోత్తరముల తెత్తు. తీ. ప్రస్తావనకు తెచ్చు. రూ త్రవ్వు త్రవ్వటించు.
త్రవ్వితండము విశే. అసంఖ్యాకము, లెక్కకు మిక్కిలి.
త్రవ్వు క్రి. త్రవు
త్రవ్వుకోల వి. గుద్దలి. రూ. త్రవ్వుకోల. వి. (వ్యావ.) తొళ్ళిక, మెట్టపైరులకు గొప్పు త్రవ్వుటకుపయోగపడు పనిముట్టు (Hoe) (ఆరు కొంచెము వెడల్పుగా నున్నచో దీనిని బొరిగ యందురు. ఇది గడ్డి గోకుట కుపయోగపడును.)
త్రసము సం విశే. 1. తిరుగునది, జంగమము. 2, అడవి.
త్రసరేణువు సం. వి. 1. సంజ్ఞాదేవి. 2. ముప్పది పరమాణువుల కొలది.
త్రస్తము సం, విశే. భయపడినది.
త్రస్తరి వి. పరిహాసము.
త్రస్తరించు క్రి. పరిహసించు.
త్రప్స వై. వి. వేదాధ్యయనవేళ రాలునోటి తుంపర, 2. బ్రహ్మ బిందువు. సం. త్రప్సా.

## త్రా

త్రాఁచు వి. నాగుపాము.
త్రాగు క్రి. పానముచేయు. రూ. త్రావు.
త్రాగుడు వి. త్రాగుట. రూ. త్రావుడు.
త్రాడు వి. 1. పేనినదారము. 2.పాశము. 3, కిరణము. వెలుగు.
త్రాడుఁదాలుపు వి. వరుణుడు.
త్రాడువఁడు క్రి. 1. కృశించు.2.దారమగు.
త్రాణ వై. వి. 1. ద్రవిణము, 2.బలము.3. సత్తువ. సం. ద్రవిణమ్.
త్రాణము సం. వి. కాపు, రక్షణము. విశే. కావబడినది. రూ. త్రాతము.
త్రాత సం. వి. కాచువాడు.
త్రాయమాణము సం. విశే. కానబడుచున్నది.
త్రావు క్రి. త్రాగు.
త్రాసనము సం. వి. భయము.
త్రాసు వి. తరాసు, తరాజు.



త్రింశత్తు సం. సర్వా. ముప్పది.

త్రింశము సం. సర్వా. ముప్పదవది.

త్రికము సం. వి. 1. త్రయము. 2. ముడ్డిపూస. (వ్యాక.) ఆ. ఈ. ఏ అను మూడు సర్వనామ రూపములు.

త్రిక బిందువు సం. వి. (రసా.) ఒక ద్రవ్యము యొక్క ఘన ద్రవవాయు రూపకములు మూడును సమస్థితిలో నుండు తావ క్రమము. (Triple point)

త్రికాస్థి సం వి. (జం.) కప్పయొక్క వెన్నెముకలో నున్న యెముక, తొమ్మిదవ కీకస. వెన్నెముకలలో ముడ్డి పూస లన్నియు ఒకటిగా కలిసియున్న యెముక (Sacrum).

త్రికోణకూటము సం వి. (జం.) భుజాస్థిపై నుండు చాలు. (Deltoid ridge).

త్రికోణనిష్పత్తులు సం. వి. (గణి.) లంబకోణ త్రిభుజములోని కోణములకు సంబంధించిన భుజముల నిష్పత్తులు.(Trigonometrical Ratios).

త్రికోణపు పండ్ల చట్టము వి. వి. (వ్యవ.) మూడు కోణములు గల ఒక విధమగు పండ్ల చట్టము. (మెట్టపైరులలో చాలు తోలుట కిది ఉపయోగించును). (Triangular harrow).



త్రికోణపు పండ్లచట్టము

త్రికోణమితి సం. వి. (గణి.) త్రిభుజముల భుజములకు కోణములకు గల సంబంధముల చర్చించు గణితశాస్త్ర శాఖ. (Trigonometry).

త్రికోణము సం. వి. మూడు మొనలు కలిసిన రూపము.

త్రికోణాకృతి సం. వి (వృక్ష.) ముక్కోణాకారము గలది. (పత్రము) (Hastate).

త్రిక్క వి. తిక్క.

త్రిక్కు క్రి. 1. తక్కు. 2. చిక్కు. వి. బాధ.

త్రిజ్యకపుంజము సం. (వృక్ష). వేళ్ళలో నుండు మాదిరిగా దారుకణజాలము (Xylem) అధోవాహి కణజాలము (Phloem) వేరువేరు అక్షరములలో ఒకదాని ప్రక్క నొకటి యున్న స్థితి. (Radial bundle).

త్రిధాకరణము సం. వి. (గణి.) మూడుసమ భాగములుగా విభజించుట, సమత్రిభాజనము. (Trisection).

త్రిదండి సం. వి. మనోదండము, వాగ్దండము, కర్మదండము అను మూడు దండములు గల సన్యాసి.

త్రిదశాలయము సం. వి. స్వర్గము.

త్రిదశుఁడు సం. వి. వేల్పు, వ్యు. ముప్పది యేండ్లు వయస్సుగా గలవాడు.

త్రిదివము సం. వి. స్వర్గము.

త్రిదివేశుఁడు సం. వి. వేలుపు.

త్రిదోషములు సం. వి. వాత పిత్త శ్లేష్మములు.

త్రిద్యుస్పృక్కు సం. వి. మూడు దినములు వ్యాపించిన తిథి; అవమము.

త్రిధాముఁడు సం. వి. 1. అగ్ని. 2. విష్ణువు. 3. శివుడు. 4. యముడు.

త్రినత సం. విశే. స్ఫటికముయొక్క మూడు అక్షములు పరస్పరము ఏటవాలుగా నుండు స్థితి. (Triclinic).

త్రిపటాకము సం. వి. మూడు రేఖలు గల ఫాలము. 2. ఒక అభినయ ముద్ర.

త్రిపథగ సం. వి. 1. గంగ. 2. ముత్రోవ ద్రిమ్మరి.

త్రిపది సం. వి. 1. ఏనుగు కాలి సంకెల. 2. గాయత్రి
త్రిపరిమాణిక సం. వి. (భౌతి; గణి.) క్రిందు. మీదు, కుడి-ఎడుమ, ముందు వెనుక అను ప్రధాన దిశలు గలది. (Three dimensional).
త్రిపిటకము సం. వి. (చరి.) బౌద్ధధర్మ గ్రంథములు-వినయ పిటకము, సూత్ర పిటకము, అభిధర్మ పిటకము. ఇవి పాళీ భాషలో వ్రాయబడినవి.
త్రిపుండ్రము సం. వి. నొసట మంచుకొను విభూది మూడు రేఖలు, (నామము ఊర్ధ్వ పుండ్రము.)
త్రిపుట సం.వి. ఒక విధమైన తాళ విశేషము
త్రిప్పట వి. తిరుగుట.
త్రిప్పరి విశే. త్రిమ్మరి.
త్రిప్పు క్రి. తిరుగచేయు
త్రిప్పుతాడు వి. తరిత్రాడు. రూ. త్రిప్పుడు త్రాడు.
త్రిబంధము సం. వి. (రసా.) చూ. ఏక బంధము. (Triple bond).
త్రిభిన్న పత్రము సం. వి. (వృక్ష). మూడు ఉపపత్రములు గల భిన్నపత్రము.(Trifoliate leaf).
త్రిభుజము సం. వి (గణి.) ఒక సమతలములో ఒకే సరళ రేఖలో లేని మూడు బిందువులను కలుపగా నేర్పడిన క్షేత్రము ఇది మూడు భుజములు మూడు కోణములు కలిగియుండును. (Triangle).
త్రిమూర్తులు సం. వి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు.
త్రిమ్మట వి. 1. త్రిప్పట. 2. ప్రళయము.
త్రిమ్మరి విశే. ఇచ్చవచ్చినట్లు తిరుగువాడు: త్రిమ్మటకాడు. రూ. త్రిమ్మరీడు,
త్రిమ్మరీడు విశే. చూ త్రిమ్మరి.
త్రిమ్మరు క్రి 1. సంచరించు. 2. చుట్టివచ్చు
త్రియామ సం. వి. 1. రాతిరి. 2. పసుపు. 3. యమున.
త్రిరాత్ర సం. వి ముట్టుది.
త్రిలోచనుఁడు సం. వి. శివుడు, ముక్కంటి.
త్రివర్గములు సం. వి. 1. ధర్మార్థకామములు 2. సత్త్వరజస్తమములు 3.క్షయ స్థాన వృద్ధులు.
త్రివిక్రముడు సం వి. విష్ణువు. వ్యు. మూడు లోకముల మూడడుగులుగా కొలిచి యాక్రమించినవాడు.
త్రివిష్టపము సం. వి. స్వర్గము.
త్రివేణి సం. వి. గంగ. వ్యు. గంగ, యమున, సరస్వతి అను మూడు నదులు గలది.
త్రిశంకువు సం. వి. 1. హరిశ్చంద్రుని తండ్రి. 2. పిల్లి 3. మిడుత.
త్రిశాఖనాడి సం. వి. (జం.) ప్రపమస్తిష్కనాడులలో ఐదవనాడి. (Trigeminal nerve). (ఇది మూడు శాఖలుగల మిశ్రమనాడి )
త్రిశిఖము సం.వి. 1.త్రిశూలము.2.సిగదండ.
త్రిశూలము సం. వి. మువ్మొనల శూలు.
త్రిస్తరజనితము సం. వి. (జం ) భ్రూణము యొక్క బహిశ్చర్మము, మధ్యస్తరము, అంతశ్చర్మము అను మూడు అధ్యస్తరముల నుండి ఏర్పడినది. (Triploblastic).
త్రిస్రోత సం. వి. గంగ. వ్యు. మూడు ప్రవాహములు గలది.
త్రుంగు క్రి. 1.తునుగు. 2.నశించు. 3. చచ్చు

## త్రు

త్రుంగుడు వి. 1, నాశము. 2. ప్రళయము
త్రుంగుడువడు క్రి. నశించు.
త్రుంచు క్రి. 1. తునుకలుచేయు. 2. చంపు. 3. ఉంచు.

దిగ త్రొక్కుట, అవర. ఱూ. త్రొక్కు.
త్రొక్కుడుగమ్మి వి. కడవ క్రింది పలక.
త్రొక్కుడుపట్టె వి. కడవ క్రింది పలక.
త్రొక్కుడుపడు క్రి. మెదుగు వలగు. ఱూ. త్రొక్కువడు.
క్రొక్కుడుపలక వి. 1. సాలెవాడు నేయునపుడు కాలితో త్రొక్కు చెక్కలు. 2. రాలపనివాని కాలిక్రింది పలక.

## త్రో

త్రోచు క్రి. 1. పూను.2.మీరు. 3. త్రోయు 4. ఉపేక్షించు. 5. చంపు.
త్రోటి సం. వి. 1. పక్షి ముక్కు. చంచువు. 2. చేపముక్కు.
త్రోదోపు వి. మిక్కిలి త్రోపు.
త్రోత్రోపులాడు క్రి. మిక్కిలి త్రోపులాడు.
త్రోపడు క్రి త్రోయబడు.
త్రోవనంగొఱవి విశే. 1. ఉభయ భ్రష్టుడు. 2. ఉభయ భ్రష్టురాలు.
త్రోపరి విశే. త్రోయువాడు.
త్రోపాడు క్రి. త్రోయు.
త్రోపు వి. 1. త్రోయుట. 2.నిరాకరణము 3. నిషేధము. ఱూ. త్రోపుడు.
త్రోపుడు వి. 1. త్రోపు 2.కొయ్యలుచదును చేయు సాధనము, చిత్రిక.
తోపుసేయు క్రి. 1. త్రోపుడుతో కొయ్యను చదునుచేయు. 2. నిరాకరించు.
త్రోపుపడు క్రి. మా. త్రోపడు.
త్రోపుసేయు క్రి. నిరాకరించు.
త్రోయు క్రి, త్రోసి వేయు.
త్రోలు క్రి. పశ్వాదులను తోలు. ఱూ. తోలు.
త్రోవ వి. మార్గము.
త్రోవరి విశే. దారి తెలిసినవాడు.

## త్రౌ

త్ర్యంబక సఖుఁడు సం. వి. కుబేరుడు
త్ర్యంబకుఁడు సం. వి. శివుడు, ముక్కంటి.

## త్ర్యా

త్ర్యామ్లిక సం. విశే. (రసా.) మూడు ఉదజని పరమాణువులుగలఆమ్లమునకు సంబంధించిన. (Tribasic). చూ. బహ్వామ్లిక.
త్ర్యాహణము సం. వి. పిట్ట, పక్షి.

## త్వ

త్వక్కు సం. వి. 1. చర్మము. 2. చెట్టుపట్ట 3. లవంగపట్ట. 4. నార. ఱూ. త్వచము.
త్వక్పతనము సం. వి. (జం.) సంధిపాద జంతువులు శరీరముపై నుండు చర్మమును విసర్జించుట. (Ecdysis.)
త్వచము సం. వి. (వృక్ష.) బెరడు, బెండు (Cork).
త్వక్సారము సం. వి. వెదురు. ఱూ. త్వచిసారము.
త్వగ్దాహము సం. వి. (గృహ.) 1. చర్మదాహము. 2. కరకైన చర్మము. 3 చర్మవ్యాధి. 4 బొటిమలు పెరిగిన,పగిలి చర్మము. (విటమిన్ 'ఎ' లోపమువల కలుగు వ్యాధి. (Der matitis).
త్వర సం. వి. వేగిరపాటు.
త్వరపడు వై. క్రి. వేగిరపడు.

త్వరితము సం. విశే. శీఘ్రము, వడిగలది.
త్వష్ట సం. వి. 1. విశ్వకర్మ, 2. ద్వాదశాదిత్యులలో నొకడు, 3. వడ్రంగి.

## త్వా

త్వాదృశము సం. విశే. నీవంటిది.
త్వాష్ట్రుడు సం. వి. 1. విశ్వరూపుడు. 2. వృత్రాసురుడు 3. వనికిమాలినవాడు.

## త్వి

త్విట్టు సం. వి. 1. జిగి, కాంతి. 2. మంట. 3. వెలుగు. రూ. త్విష.
త్విషాంపతి సం. వి. సూర్యుడు.

## త్స

త్సరువు సం. వి. కత్తి మొదలగు వానిపిడి.

## త్సా

త్సారుకుఁడు సం. విశే. కత్తియుద్ధమందు నేర్పరి.

## థ

థ ఒక యక్షరము.
థర్మల్ విద్యుచ్ఛక్తి మి. వి. (వ్యావ.) వేడిచేసిన బొగ్గు లేక నూనె ద్వారా ఉద్భవించు విద్యుచ్ఛక్తి. (Thermal Electricity).

## ద

ద ఒక యక్షరము.
దంగు క్రి బియ్యములోనగునవి మెదుగు. రూ. డంగు.
దంగుడు విశే. దంచినది.
దంచేన వి. పెద్ద ఫిరంగి, రూ. దంచనము, దెంచనము
దంచే క్రి దంగచేయు, మెదగించు. రూ. దంపు.
దంట వై. విశే. దిట్టతనము గలవాడు. నేర్పరి. సం. ధృష్టః.
దంట వి. జంట.
దంటమోములదేవర వి. అగ్ని.
దంటు వై. వి. జొన్నలోనగు వాని కఱ్ఱ. సం. దండః.
దంత వై. వి. హారము, సం. దండికా.
దండ వి 1. దగ్గర, 2 ప్రాపు, ఆధారము. 3 చోటు.
దండకవిలియ వి. వ్రాత లెక్కల పుస్తకపు కట్టు, రూ. దండకవిలె,
దండగోల వి. 1. ఊత, 2. ఊతగఱ్ఱ.
దండచేయి వై. వి, సందిలి.
దండచేరు వి. సందిటకట్టుకొను తోరము.
దండధరుఁడు సం. వి. యముడు.
దండనము సం. వి. శిక్ష, దండించుట.

**దండనాయకుఁడు** సం. వి. సేనాపతి.

**దండనీతి** సం. వి. అర్థశాస్త్రము. రాజనీతి

**దండపడు** క్రి. సమీపించు.

**దండపోటు** వి. సమీపించుట.

**దండపాశికుఁడు** సం. వి. తలవరి, రక్షకభటుడు.

**దండము** వి. నమస్కారము.

**దండము** సం. వి. 1. దుడ్డుకర్ర. 2. చతురుపాయములలో నొకటి, 3. రాజశిక్ష. 4. దండు. 4. కాడ. 6. హారమునందలి పేట, 8. కప్పము. 8. జత. 9. గుంపు

**దండయాత్ర** సం. వి. 1. దిగ్విజయము. 2. యుద్ధమునకు వెడలుట. 8. అధ్వరయాత్ర

**దండలాసకము** సం. వి. కోలాటము.

**దండవిష్కంభము** సం. వి. తరిగంబము. చల్ల చిలుకుట కాధారమైన స్తంభము.

**దండసిల్లు** క్రి. మరుగుపడు, అణగు. రూ దండసిలు.

**దండాడింపు** వి. వివాహానంతరము వధూవరులు సెత్తికొని ఆడెడు ఆట.

**దండాపూపన్యాయము** సం. న్యా. చిలుక కొయ్యకు గారెలు తగిల్చిరి. ఆ చిలుక కొయ్యను ఎలుక కొట్టి వేసినది అనిచెప్పిన తరువాత గారెలు తిన్నదని వేర చెప్పనేల? దీనినే 'కైముత్యన్యాయ'మందురు.

**దండాపూపికాన్యాయము** సం.న్యా. చూ. పై.

**దండాభావన్యాయము** సం. న్యా. కర్రలేని వానిని గొర్రె కరచినదను రీతి.

**దండాహతము** సం. వి. మజ్జిగ. వ్యు. కవ్వముచే త్రచ్చబడినది.

**దండి** వి. 1. ప్రతాపము. 2. గొప్ప. సం. వి. 1, యముడు. 2. ద్వారపాలకుడు. విణ. దండముగలవాడు.

**దండించు** సం. క్రి. శిక్షించు.

**దండిక** సం. వి. 1. కిన్నెర. 2. హారమునందలి పేట

**దండితుడు** సం. విణ. దండింపబడినవాడు, శిక్షితుడు.

**దండియ** వై. వి. 1. దండిక. 2. కిన్నెర. 3 వీణ 4. పిడాదండము. 5. తంబుర. 6. పల్లకీబొంగు. 7. త్రాసుకోల. రూ. దండె.

**దండియము** వై. వి. 1 గుడ్డలారవేయుటకు కట్టిన వెదురు లేక త్రాడు. ఒకానొక గరిడి సాధనము. రూ. దండెము. సం. దండః.

**దండు** వై. వి. 1. దండన. 2. సేన. 3. గుంపు. సం. దండః.

**దండుదివియ** వై వి. దీపపు సెమ్మె.

**దండుబాట** వి. 1. ఘంటాపథము. 2. దండుదారి.

**దండువ** వై. వి. 1. దండము. 2. రాజు ధనవంతుని బలాత్కారము చేసి పుచ్చుకొనెడు ధనము. 3. అపకారి అపరాధి వలన గొనెడు డబ్బు. 4. జరిమానా. 5. నష్టము. రూ. దండుగు, దండుగ, దండువు.

**దండెత్తు** క్రి. దాడివెడలు.

**దండోర** హిం. వి. చాటింపు.రూ. తండోరా. దండూరా.

**దండ్యుఁడు** సం. వి. దండింపదగినవాడు.

**దంతగోర్దము** సం. వి. (జం.) దంతము యొక్క లోపలి భాగమున మధ్యలో నున్న తొఱ్ఱలో నుండు రక్తనాళములు ఆధారకణజాలము, నాడిపోచలు అన్నియు కలిసిన భాగము. (Pulp of the tooth)

**దంతధావనము** సం. వి. పలుదోముట.

**దంతము** సం. వి. పల్లు, కోర.

**దంతశిఖరము** సం. వి. (జం.) పంటి యొక్క పైభాగము, దంతకిరీటము, (Crown of tooth). (ఇది డెన్‌టిన్ (dentine) అను పదార్థముతో నిర్మింపబడును దీనిని ఎనా

మెల్ (enamel) అను పదార్థము కప్పి యుంచును).

దంతాకారము నం. విశే. (వృక్ష.) అంచు ముగా నున్న పండ్లుగల ఆకు యొక్క అంచుగలది (Dentate).

దంతావళము నం. వి. ఏనుగు. వ్యు. ప్రశస్త దంతములు గలది.

దంతాస్థి నం. వి. (జం.) (కప్ప) క్రింది దవడ ఎముకలతో ఒకటి. (Denta y).

దంతి నం.వి ఏనుగు. విశే. కోరపండ్లవాడు.

దంతియ వై. వి. 1. మిద్దెటింటికి అడ్డముగా వేసెడుపట్టె, దూలము. 2 వ్యవసాయపు పనిముట్టు. మా. దంతె. రూ దంతె.

దంతురచక్రము నం. వి. (భౌతి.) పండ్లుగల చక్రము, ఉదా, సావర్ట్ పండ్ల చక్రము (Toothed wheel).

దంతురము నం. విశే. 1. ప్రక్కలణగి నడుము పొడువైనది. 2.మిట్టపల్లమైనది.

దంతురుఁడు నం. విశే మిట్టపండ్ల వాడు.

దంతులు వి. (వ్యవ.) చేను ఎదిగిన తరువాత అంతర కృషికి పనికివచ్చు చిన్న గుంట కల సంపుటి. (Blade harrows)


దంతులు

దంతెన వి (వ్యవ) నీరు పెట్టి గట్లు, మళ్ళు ఏర్పరుచుటకును మొక్కల మధ్యమట్టిని కదల్చుటకును ఉపయోగించు చేతి పనిముట్టు. రూ. దంతె. (Tooth harrow).


దంతెన

దంత్యము నం.విశే. (వ్యాక.) దంతస్థానము నందు పుట్టినధ్వని, ఉదా. చ, జ,

దందడి వి. 1. తరచు. 2. సమ్మర్దము.

దందడించు క్రి. 1. తరచగు 2.క్రందుకొను.

దందడిపెట్టు క్రి. రాయిడిచేయు., ఘర్షించు. సమ్మర్దము కలిగించు.

దందన వై. వి. 1. దందనము, మాయము. 2. ఆగ్రహము. సం. దందనమ్.

దందశూకము నం. వి. పాము. వ్యు. మిక్కిలిగా కఱచునది

దందశూకుఁడు నం. వి. ఒక రాక్షసుడు.

దంధనము నం. విశే. శాశ్వతము కానిది.

దంప వి. (వ్యవ.) సాగుబడి నేల.

దంపతట్ట వి దమ్ముచాగలి. అడుసుమడక.

దంపతులు నం. వి ఆలుమగలు. రూ. జంపతులు

దంపనారు వి. (వ్యవ) దంప పరిసాగు కొరకు నారు మడికి దమ్ముచేసి, విత్తులను మొలకకట్టి చల్లి పెంచిన నారు. (Wet nursery).

దంపసాగు వి. (వ్యవ) దంపసేద్యము, నీరుపెట్టి దమ్ముచేసి పైరు వేయు విధానము. (Wet cultivation).

దంపు క్రి దంచు. వి. దంపుడు.

దంభము నం. వి. 1. కపటము. 2. తప్పు. 3. గర్వము.

దంభోళి నం. వి. 1. వజ్రాయుధము 2. రాతివాలు. వ్యు. శత్రువులను దుఃఖ పెట్టునది.

దంశఘటము నం. వి. (జం) అంతర్గుహిన జీవి శరీరములో సూచ్యాంగము వృద్ధి యగు జీవకణము. (Cnidoblast).

దంశనము నం. వి. 1. కాటు. 2. కవచము. 3. పల్లు రూ దంసనము.

దంశము నం వి. 1. అడవియీగ. 2.కాటు. 3. దంతము.

దంశాంగము నం. వి. (జం.) ఏకకణ జీవుల శరీరములో బాహ్య ప్రసరము నుండి పొడుచుకొని వచ్చు కండె ఆకారము గల నిర్మాణము. (Trichocyst).

దంశి సం. వి. 1. అడవిదోమ. 2. చిన్నఅడవి యీగ.

దంశిక సం. వి పటుకారు.

దంశోద్ధామి సం. వి. (జం.) దంశఘటము నుండి తంతువును బయటికి విసరుట కుపయోగించు చిన్న మీటవంటిసాధనము (Cnidocil).

దంష్ట్రి సం. వి. కోరపల్లు.

దంష్ట్రాయుధము సం. వి. పంది. వ్యు. దంష్ట్రలే ఆయుధముగా కలది.

దంష్ట్రి సం. వి. పంది. వ్యు. దంష్ట్రలుకలది.

దంసనము సం. వి. చూ. దంశనము.

దక్కినపురాధీశుఁడు వై. వి. యముడు. దక్షిణదిగధిపతి.

దక్కినము వై. వి. దక్షిణము, వలదెస. సం. దక్షిణా.

దక్కు క్రి. 1. అనుభవయోగ్యమగు. 2. చేకూరు. విశ. అనుభవయోగ్యము.

దక్కొను క్రి. స్వతంత్రుడగు, రూ. డక్కొను

దక్కోలు వి. వశము,

దక్షాయ్యము సం. వి. గ్రద్ద. వ్యు. దూర దూరమునకు పోవునది, హింసించునది.

దక్షిణ సం. వి. 1. కుడిదిక్కు. 2. యజ్ఞము మున్నగు వానిలో ఋత్విజులు మొదలగు వారి కిచ్చు ధనము, రూ. దక్షిణము.

దక్షిణాతిశీతల మండలము సం. వి. (భూగో.) దక్షిణ ధ్రువవృత్తమునకును దక్షిణ ధ్రువమునకును మధ్య నున్న ప్రదేశము. (ఇదియు ఉత్తర అతిశీతలమండలమువలె నుండును. ఇక్కడ హిమపవనములు ఎక్కువగా నుండును)

దక్షిణధ్రువము సం. వి. (భూగో.) భూమధ్య రేఖకు 90°ల దూరమున దక్షిణమున నున్న బిందువు. (South Pole).

దక్షిణ సమశీతలమండలము సం.వి.(భూగో.) మకరరేఖకును దక్షిణధ్రువ వృత్తమునకును మధ్యనున్న ప్రదేశము. (South Temparate Zone).

దక్షిణాపథము సం. వి. వింధ్య మొదలు సేతువు వరకు గల దేశము.

దక్షిణాయనము సం. వి. (భూగో.) సూర్యుడు జూన్ 21 తేదీని కర్కాటక రేఖను చేరి అచట తన కిరణములను లంబముగా ప్రసరింపజేసిన తరువాత దక్షిణమునకు మరలుట, (దీని పరిమితి ఆరునెలలు).

దక్షిణావర్తము సం. విశ. (వృక్ష.) కుడి నుండి ఎడమ వైపునకు చుట్టుకొనునది.

దక్షిణుఁడు సం. వి. అనేక నాయికలందు సమముగా వర్తించువాడు. విశ. 1.చక్కని మనస్సుకలవాడు, దాక్షిణ్యముకలవాడు. 2. నేర్పరి.

దగ వై. వి. 1. దాహము. 2. తాపము, 3. దప్పి. సం. దాహః.

దగర వి. చూ డగర.

దగరము వి. కీడు. రూ. డగరము.

దగ్గఱ వి. డగ్గర.

దగ్గఱు క్రి. సమీపించు. రూ. డగ్గఱు,

దగ్గు క్రి. కాసముచేయు, కాసము.రూ.డగ్గు.

దగ్గుత్తిక వి. గద్గదస్వరము. రూ. డగ్గుత్తిక.

దగ్ధపటన్యాయము సం. న్యా. మడతపెట్టిన బట్ట కాలిపోయిన మడతలు మడతలుగాను నూలిపోగులు స్పష్టముగాను కన్పించును, కాని చేత పట్టుకొనిన విడిపోవు ననురీతి.

దగ్ధపద మార్జాలన్యాయము సం. న్యా. నలుగురు దూది వర్తకులు పిల్లిని పెంచిన కథ, అందు న్యాయాధికారి తీర్పురీతి. (కాలు కాలిన పిల్లివలె).

దగ్ధము సం. విశ. కాల్పబడినది.

దఘ్నార్థకము సం. వి. (వ్యాక.) లోతును తెలుపునది, ఉదా. మోకాలిబంటి, మోకాలి కొలఁది. వీటిలో బంటి,కొలది-దఘ్నార్థక ప్రత్యయములు.

దప్పితాళ్ళమెకము వి. శరభము, అష్టాపదము.

దచ్చోక వై. సర్వ. (పంట+శోకము). ఎనిమిది. రూ. దస్స. సం. ద్వాదశకమ్.

దట్టన వై. వి. 1. అదలుపు 2. గూసట. సం. ధర్షణమ్, ధట్టనమ్.

దట్టము వి. 1. పావడ. 2. గుట్టము. విశ. తరచు పిండము. రూ. దళము.

దట్టించు క్రి. 1. అదలుచు. 2. పరియించు. 3. పూను

దట్టి వై. వి. 1. దట్టము 2. కాసె సం. ధటీ.

దట్టుఁడు వై. విశ. ధృష్టుడు, దిట్టతనము కలవాడు. సం. ధృష్టః

దడ వి. వణకు.

దడకట్టు క్రి. వడికట్టు.

దడబడ వి. ఆరోపము.

దడము వి. దట్టము రూ. గాఢము.

దడము వై. వి. 1. సేన 2 సమూహము. సం. దళమ్.

దడి వై. వి. తడక. సం. తడః.

దడిగ వై. వి. కేడెము. సం. ఢాలమ్, తడకః

దడిమము వై. వి తలిమము, పరుపు. రూ. దడిమము. సం. తలిమమ్.

దడియ వై వి. కొండచేరువ నేల, ఉపత్యక. సం. ధృష్, దర్ష్,

దడియము వి. రెండు వీసెల ఎత్తు. (240 తులముల యెత్తు). రూ. దడెము, దండియము.

దణా వై, వి. దళము, సేన. సం, దళః.

దణాయఁడు వై. వి. దళనాయకుడు, సేనాపతి. సం. దళనాయకః

ధణాయించు క్రి. 1. క్రిక్కిరియు, 2. కూర్చుండి కదలకుండు.

దణి వై. వి. 1. ప్రభువు. 2. సేనాని. సం. ధనీ.

దత్తకుఁడు సం. వి. దత్తపుత్రుడు.

దత్తము సం. విశ. ఇయ్యబడినది.

దత్తాంశము సం. వి. (గణి.) గణిత ప్రవచనమున ఇవ్వబడిన విషయము (పరతు.). (Hypothesis).

దత్తు వై. వి. 1. దత్తము. 2. స్వీకారము. సం. దత్తః.

దత్తుఁడు సం. వి. దత్తు తీసికొన్న కొడుకు.

దద్దరము వి. బోదెమిద్దె. రూ. దర్దరము.

దద్దరిల్లు వై. క్రి. 1. తల్లడిల్లు పడు. 2. నెరయు. రూ. దద్దఱు, దద్దిఱు.

దద్దు వై. వి. దద్రువు, చిన్నవాపు. రూ. దద్రువు. సం. దద్రుః.

దద్రువు సం. వి. దద్దు.

దధి సం. వి. పెరుగు.

దధిచారము సం. వి. కవ్వము.

దనియాలు వై. వి. ధన్యాకము, కొత్తిమిర విత్తులు, సం. ధనికః

దనియు క్రి. సంగమించు, కూడు.

దనివు వి. కూడిక, సంగమము.

దనుక అవ్య. పర్యంతార్థకము, వరకు. రూ. దాఁక.

దనుకు క్రి. 1. తాకు. 2. పొందు. రూ. దనుక్కు,

దనుజుఁడు సం. వి. రాక్షసుడు. వ్యు. దనువు నందు జన్మించినవాడు,

దనుక్కు క్రి. చూ. దనుకు.

దప్పము వై, విశ. దట్టము. సం. దర్పః.

దప్పళము వి. పులుసు.

దప్పి వై. వి. 1. నీరువట్టు, పిపాస. 2. శ్రమము. రూ. దప్పిక, సం. తాపః.

దబాయించు హిం. క్రి 1. అదుము. 2. అదలించు.

దబాలున (అవ్య.) (వ్యావ.) వేగముగ, దబుక్కున.

దబ్బ వి. ఒక తెగ నారింజ.

దబ్బ వై. వి. 1. బద్ద. 2. వెదురుబద్ద. 3. దర్భ. సం. దర్భః.

దబ్బకాఁడు వై. వి. మోసరి.

దబ్బడము వి. మూకుడు, సిబ్బి. రూ. దబ్బుడు.

దబ్బడించు క్రి. 1. బోరలించు. 2. చేతులతో చరచు

దబ్బనము వి. గోనెలు కుట్టెడు పెద్దసూది.

దబ్బఱ వి. 1. బొంకు. 2. మోసము. 3. పిత్తు, 4. తప్పు. రూ. డబ్బఱ.

దబ్బఱకాఁడు విశే. 1. బొంకులాడు. 2 మోసకాడు

దబ్బాటు విశే. డబ్బాటు.

దబ్బు వి. మాట.

దబ్బున అవ్య. శీఘ్రముగ.

దబ్బర వి. గిన్నె. రూ. డబ్బర.

దభ్రము సం. విశే. సన్నము. వి. 1. సముద్రము. 2. బొంకు.

దమనము సం. వి. 1. అణచుట. 2 దవనము

దమము సం. వి. 1. క్లేశమునోర్చుగుణము, 2. బాహ్యేంద్రియ నిగ్రహము, 3. అణచుట. 4. అడుసు.

దమ్మేఁడు వై. విశే. 1. ధర్ముడు. 2. కపటము లేనివాడు. సం. ధార్మికః.

దమ్మము వై. వి. ధర్మము. సం. ధర్మః.

దమ్మిడి వి. చిన్న రాగినాణెము, (ఇప్పుడు వాడుకలో లేదు).

దమ్ము వై. వి. 1. దమము. 2. అడుసు. (వ్యవ.) దంప సాగుచేయుటకు మడిలో నీరుపెట్టి నేల నానిన తరువాత నీరు స్వల్పముగ మడిలో నుండగనే నాగలితో దున్నుట. (Puddling).

దయ సం. వి. కనికరము.

దయచేయు మి. క్రి. 1. కరుణించు. 2. విచ్చేయు. 3. ఇచ్చు.

దయాళువు సం. విశే. కనికరము కలవాడు

దయిత సం. వి. 1. భార్య. 2. స్త్రీ.

దయితుఁడు సం. వి. 1. ప్రియుడు. 2. పతి.

దయివాఱు క్రి. అతిశయించు. రూ. దైవాఱు.

దయ్యము వై. వి. 1 దైవము, దేవుడు. 2. దేవత. 3. విధి. 4. పిశాచము. సం. దైవమ్.

దయ్యు క్రి. డయ్యు.

దర వై. వి. ధర, వెల. సం. ధారా ధారణా

దరణము వి. ఎనిమిది డబ్బుల నాణెము

దరము సం. వి. 1. భయము. 2. గొయ్యి 3. శంఖము అవ్య. ఇంచుక.

దరహాసము సం. వి. చిరునవ్వు.

దరి వై. వి. 1. తీరము, గట్టు. 2 మేర. 3. సమీపము. సం. తీరమ్.

దరి సం. వి. గుహ.

దరికొను క్రి. కాలు. మండు.

దరిజీ హిం. వి. కుట్టుపువాడు. రూ. దర్జీ.

దరిద్రుఁడు సం. విశే. బీదవాడు.

దరివేసి వి. 1. దీనుడు. 2. లోభి. 3. దేశి. హిం. దర్వేష్.

దరిసించు వై. వి. 1. దర్శించు, చూచు. 2. కానుక యిచ్చు.

దరిసెనము వై. వి. 1 దర్శనము. 2. పెద్దల చూడబోనిపోవు కానుక. సం. దర్శనము.

దర్జీపని వి. (గృహ.) సూచకము, దుస్తులను కుట్టుట. (Tailoring).

దరువు వై. వి. 1. పాట. 2. ధ్రువము. 3. ఒక తాళము. సం. ధ్రువా.

దర్దురము సం. వి. కప్ప.

దర్పకుఁడు సం. వి. మన్మథుడు. వ్యు. దర్పింపచేయు.

దర్పణము సం. వి. అద్దము. (భౌతి.) కాంతి కిరణమును క్రమపరావర్తనమునొందించు నునుపైన ఉపరితలము గల వస్తువు. (Mirror).

దర్పము సం. వి. 1. గర్వము. 2. కస్తూరి

దర్పించు సం. క్రి. గర్వించు.

దర్బారు హిం. వి. కొలువుకూటము.

దర్యాప్తు హిం. వి. విచారణ (Enquiry)

దర్ప నం. వి. కుశ. మా. దబ్బ.

దర్వాజాబంద్ హిం. (వ్యావ.) నియోక్తలు కార్మికులను ఏ కారణముచేతనైన కర్మాగారము పనికి రాకుండ చేయుట.

దర్వి నం. వి. 1. గరిటె, అబక. 2. పాము పడగ.

దర్వీకరము నం. వి. పాము.

దర్వికాస్థులు నం. వి. (శరీ.) స్వరపేటికలో ముద్రాకాస్థి వలయముచే చుట్టబడి అర్ధ చంద్రాకార కవాటమువలె నుండు కోమలాస్థి నిర్మాణములు (కప్ప) (Arytenoid cartilages).

దర్వీపాకరసన్యాయము నం. న్యా. గరిటె పాకమున ఉన్నను ఆ రుచి దానికి తెలియదను రీతి.

దర్శకుడు నం. వి. ద్వారపాలకుడు. విశే. 1. చూపెడువాడు. 2. నేర్పరి.

దర్శనము నం. వి. 1. చూపు. 2. కన్ను. 3. అద్దము. 4. తెలివి. 5 శాస్త్రము.

దర్శనీయము నం. విశే. చూడదగినది.

దర్శము నం వి. 1. అమావాస్య. 2. చూపు.

దలారి హిం. వి. తరగరి. రూ. దళారి.

దలిమము విశే. దడిమము, సన్నము.

దల్లు వి. జల్లు.

దల్వాయి వై. వి. 1. సైన్యాధిపతి. 2. కార్యకర్త. రూ. దళవాయి.

దవ వి. దుమ్ము.

దవంత్రి వై. వి అగడ్త, పరిఖ.

దవనము వై. వి. దమనము, సువాసనగల ఒకతెగ మొక్క. నం. దమనః.

దవము నం. వి. 1. కార్చిచ్చు. 2. అడవి రూ. దావము.

దవీయము నం. విశే. మిక్కిలి దవ్వైనది

దవ్వ వి. ప్రాణి వడిమి మెత్తని భాగము. (వృక్ష.) కొమ్మ వేరు మొదలయిన భాగముల లోపల మధ్యగా నుండు జీవకణ సమూహము (Pith or medulla).

దవ్వరేఖలు వి. (వృక్ష.) ద్విదళ బీజకము లగు మొక్కల కాండములోని దవ్వనుండి 'వల్కలము' వరకు వ్యాపించుచు చూపాని స్తంభములవలె నగుపడు మృదు కణ జాలముల రేఖలు (Medullary Rays.)

దవిష్ఠము విశే. దూరము నం. దవిష్ఠః.

దశ నం. వి. 1. అవస్థ. 2. వత్తి. 3, బద్దె.

దశకంఠుడు నం. వి. రావణుడు.

దశతయము నం. సర్వ. పది.

దశనము నం. వి 1. కవచము. 2, కాటు. 3. పల్లు.

దశమి నం. వి. 1. పక్షమున పదియవతిథి. 2. పదియవది,

దశాంశపద్ధతి నం. వి. (గణి.) పదులను పదుల వర్గములను ఉపయోగించి సంఖ్యలను వ్రాయుపద్ధతి. (Decimal system).

దశాంశభాగము నం. వి. (గణి.) సంవర్గ భాగములోని దశాంశ భాగము, ఘాతాంకము యొక్క దశాంశ బిందువు తరువాతి భాగము (Mantissa) ఉదా. 80 అను అంకెకు 10 ఆధారముగా గ్రహించబడినపుడు లఘు గణకము 1.2010 ఇందులో .2010 అను భాగము దశాంశ భాగము. 1 అనునది పూర్ణాంక భాగము.

దశాహము నం. వి. మృతిపొందిన వానికి పదియవనాడు చేయు శ్రాద్ధము.

దష్టము నం. విశే. కరవబడినది.

దశరా వై. వి. 1. దశరాత్రము. 2. దేవీ నవరాత్రము. నం. దశరాత్రమ్.

దసిలి వి. 1. వదలు. 2. ఒకరకమువట్టు. 3. పట్టువస్త్రము. రూ. దసిలీ.

దసువంది వి. గ్రుద్దులాటకు జెట్టీలను కూర్చువాడు,

దస్తరము వి. (వ్యావ.) కాగితముల కట్ట. రూ. దస్త్రము.

దస్తావేజు హిం. వి. పత్రము, లిఖితపత్రము.
దస్తు హిం. వి. పోగుచేసిన సొమ్ము. హిం.దస్తు
దస్తూరి హిం. వి. 1. వ్రాత. 2. సంతకము.
దస్యుఁడు సం. వి. 1. దొంగ. 2. శత్రువు.
దస్రులు సం. వి. అశ్విని దేవతలు.
దహనతరణి సం. వి. (రసా.) ఏదేని ఘన ద్రవమును గొట్టములో పెట్టి వేడి చేయుటకుపయోగించు చిన్న తెప్పవంటి పాత్ర. (Combustion boat)
దహననాళము సం. వి. (రసా.) ఒక ద్రవ్యమును పెట్టి కాల్చుట కుపయోగించుగాజు గొట్టము. (Combustion tube).
దహనము సం. వి. కాల్చుట. సం. వి (రసా.) పదార్థములు గాలిలోని ఆక్సిజన్‌తో కలిసి మండుట. (Combustion).
దహనాధారము సం. వి. (రసా.) ఒక వస్తువును తనలో మండనిచ్చునది. (Supporter or Combustion) ఉదా. గాలి.
దహనుఁడు సం. వి. అగ్ని.
దహనోష్ణత సం. వి. (రసా.) ఒక అణుభారము దాహ్యరాసాయనిక ద్రవ్యము కాల్చబడినపుడు వెలికి వచ్చు తాపరాశి. (Heat of Combustion).
దహించు సం. క్రి. కాల్చు.
దళకొను క్రి. (దళము+కొను). 1. దళముకొలుపు. 2. అధికమగు.
దళనము సం. వి. 1. ఖండించుట. 2. చీల్చుట.
దళము వి. ఆధిక్యము. విశే. 2. దట్టము. 3. తంచు. రూ. దడుము.
దళము సం. వి. 1. ఆకు. 2. దండు,
దళవాయి వై. వి. 1. సేనాధిపతి 2. సుంకరికి సహాయుడైన యుద్యోగి.
దళసరి వి. 1. మందము. 2 ఘనత.
దళాభము సం. విశే. (వృక్ష.) ఆకర్షణ పత్రమువలె వగుపడునది. (Petaloid).
దళారి హిం. వి. (వాణి.) ఉత్పత్తిదారునికి బజారులో వర్తకునికిమధ్యకొంత కమీషను పుచ్చుకొని పనిచేయు మధ్య మనిషి. (Commission agent).
దళిత జాతులు సం. వి. (రాజ.) భారత దేశములో సామాజికముగ పీడింపబడిన జాతులు,
దళితము సం. విశే. 1. ఖండింపబడినది. 2. వికసించినది, 3. ఛేదింపబడినది.

# దా

దా విశే. 1. ఎడము. 2. సవ్యము. డా యొక్క రూపాంతరము (దాపల-డాపల) క్రి. రమ్ము.
దాంతి సం. వి. 1. తపఃక్లేశము నోర్చు గుణము. 2. బాహ్యేంద్రియ నిగ్రహము.
దాంపత్యము సం. వి. దంపతి భావము, భార్యాభర్తృ భావము.
దాంభికుఁడు సం. విశే. దంభము కలవాడు.
దాఁక అవ్య. దనుక, పర్యంతము.
దాఁకొను క్రి. దాగుకొను. రూ. డాఁకొను.
దాఁగర వి. ఎండువు తట్ట.
దాఁగిలి మూఁతలు వి. పిలలు ఆడుకొను ఒక ఆట.
దాఁగు క్రి. మరుగుపడు. రూ డాఁగు.
దాఁగురించు క్రి. 1. దాచు. 2. మరుగు. 3. వంచించు. రూ. డాఁగురించు.
దాఁటు క్రి. 1. లంఘించు. 2. తరించు. 3. ఉల్లంఘించు. వి. లంఘనము.
దాఁటుకట్టు క్రి. 1. గుంపుగూడు. 2. సంతనకట్టు.
దాఁపన వి. దాచుట. రూ. దాఁపుడు.
దాఁపరము వి. దొంగిలించుట.
దాఁపరించు క్రి. 1. ప్రాపించు. 2. దొంగిలించు

దాఁపరీఁడు వి. 1. దొంగ. 2. వంచకుడు.

దాఁపరికము వి. గోపనము.

దాఁపు క్రి. దాచు. రూ. దాఁగు.

దాఁపురము వి. 1. మరుగుపుచ్చుట. గోపనము. 2. దాచిన సొమ్ము.

దాక వి. వెడలుపు నోరుగల యటికపాత్ర.

దాకలి వి. లోహము కాచి సాగగొట్టుటకు క్రింద ఊతముగా నుంచుకొను ఇనుప దిమ్మె. విఘాతిక రూ. డాకలి, దాగలి.

దాకన్ను వి. ఎడమకన్ను.

దాకల్లు వి. బండిచక్రపు కట్టు. నేమి. రూ. డాకల్లు.

దాకొను క్రి. సమీపించు. రూ. డాకొను.

దాక్షాయణి సం. వి. 1 పార్వతి. 2. రోహిణి నక్షత్రము.

దాక్షిణ్యము సం. వి. 1. దయ. 2. నేర్పు. 3 సామర్థ్యము. 4. దక్షిణనాయక భావము.

దాగలి వి. దాకలి.

దాడి వై. వి. 1. గడ్డము. 2 ధాటి, దండెత్తుట. హిం. దాఢీ. సం. దాఢికా, ధాటీ.

దాడికాఁడు వై. వి. 1. వేగులవాడు. 2. దండెత్తువాడు.

దాడినిమ్మ వై. వి దాడిమము. ఒక ఫలవృక్షము. రూ. దానిమ్మ. దాడిమ్మ, దాళిమ్మ.

దాడిమము సం. వి. చూ. పై

దాత సం. వి. ఇచ్చువాడు.

దాత్రబీజము సం.వి. (జం.) బీజాణుఘటము నుండి వెలువడు కొడవలి (దాత్రము) ఆకారములోగల జీవకణము. (Sporozoite).

దాత్రము సం. వి. కొడవలి.

దాదాపు వి. మిక్కిలి సమీపము. విశే. ఇంచుమించు, సుమారు.

దాది వై. వి. 1. ధాత్రి. 2. పాలిచ్చి పెంచుతలి. రూ. దాదిలి. సం ధాత్రీ.

దాదుంగ వి. చెక్కెడు మ్రానికి ఊతగా నుంచుకొను దుంప. ఉద్ఘనము.

దానము సం. వి. 1. ఈవి. 2. ఏనుగు దవుడలనుండి కారు మదము. 3. చతురుపాయములలో నొకటి. 4. ఛేదనము.

దానవుఁడు సం. వి. దనుజుడు. రాక్షసుడు.

దాని సం విశే. 1. మదముకలది, 2. దాత.

దాపరము వి. ప్రాప్తి రూ. దాపురము.

దాపరించు క్రి. ప్రాప్తించు.

దాపల వి. సమీపము. 2. భయము. 3. రక్షణ.

దాపురమగు క్రి. ప్రాప్తించు.

దామని సం వి. దామెన త్రాడు.

దామము సం. వి. 1. పలుపు. 2. హారము. దండ.

దామర వి. 1. ఉరిత్రాడు. 2. తట్ట.

దామెన వై. వి. దామని. పెక్కు తలుగులుగల నిడివి త్రాడు, సం. దామనీ.

దామోదరుఁడు సం. వి. కృష్ణుడు.

దాయ వై. వి. 1. దాయాదుడు, జ్ఞాతి. 2. శత్రువు. సం. దాయాదః.

దాయము వి. పాచికలలో నొకటి. 2. గవ్వలాట. 3 అపర. సం. వి. పంచుకొనదగిన తండ్రి సొత్తు.

దాయాదుఁడు సం. వి. 1. జ్ఞాతి. 2. పుత్రుడు.

దాయి వి. డాకలి. సం, విశే. ఇచ్చువాడు.

దాయు క్రి. సమీపించు. రూ. డాయు.

దార వై. వి. 1. ధార. 2. నీటిచాలు. 3. దానము. 4. క్రమము. సం. ధారా.

దార సం. వి. భార్య.

దారకుఁడు సం. వి. 1. బాలకుడు. 2. కృష్ణుని సారథి విశే. చీల్చువాడు.

దారణ వై. వి. ధర. వెల. రూ. దర. సం. ధారణా.

దారణము సం. వి చీల్చుట.

దారపుంత వి. (గృహ.) కొన్ని దారపు పోగులను కలిపి చుట్టకట్టిన పిడి (Skien).
దారబంధము వై. వి. ద్వారబంధము.
దారము వి. పేనినత్రాడు, నూలు, పోగు. (Yarn).
దారి వై. వి. 1. ద్వారము. 2. మార్గము 3. గతి. సం. ద్వారమ్.
దారించు సం. క్రి. చీల్చు
దారితము సం. విశే. చీల్చబడినది.
దారిద్ర్యము సం. వి. పేదతనము, లేమి.
దారుణము సం. విశే. భయంకరము.
దారుతంతువులు సం.వి. (వృక్ష.) దారువులో నుండు దీర్ఘ కణములు. (Wood fibres).
దారున అవ్య. తటాలున.
దారుపురుషన్యాయము సం. న్యా. కఱ్ఱ మొద్దును చూచి మనుష్యుడని భ్రమపడిన రీతి
దారువాయువు సం. వి. (రసా.) కఱ్ఱను గాలి లేకుండ స్వేదించిన లభ్యమగు వాయువు. (Wood-gas).
దారువు సం. వి. 1. కొయ్య. 2. ఇత్తడి
దారువు సం. వి. (వృక్ష.) వాహినీ పుంజములో నుండు ఒక భాగము. (Wood o xylem). దీని గుండా వ్రేళ్ళనుండి ప్రవణరములు ఆకులకు పంపబడును. దీనిలో (1) దారునాళములు (Wood vessels). (2) వాహికోశములు (Tracheids).(3)దారు పోచలు (Wood fibres) (4) దారుమృదు కణజాలము (Wood parenchyma)అను నవి యుండును.
దార్ఢ్యము సం. వి. దిటవు, దృఢభావము.
దార్వంగారము సం. వి. (రసా.) కఱ్ఱబొగ్గు కఱ్ఱలు కాల్చిచేసిన బొగ్గు. (Charcoal).
దార్శనీహుండీ మి. వి. (అర్థ.) 'చూపు బిల్లు' చూడగానే రొక్కము చెల్లింపవలసిన దేశీయ వినిమయ ధనపత్రము.
దాలి వి. పిడకల ప్రోగు.
దాల్చినిచెక్క వి. (వ్యవ.) ఇది Lauraceae అను కుటుంబమునకు చెందిన Cinnamomum Zeylanicum అను మొక్క మొక్క కాండముపై పట్ట (Cinnamum) పరిమళ ద్రవ్యము.
దావంతము వి. దుఃఖము. త. దావందం.
దావము సం. వి. 1. దవము. కార్చిచ్చు. 2. అడవి. 3. బాధ.
దావరము వి. దొంగతనము.
దావరి విశే. 1. పిరుడు. 2. దావరీడు.
దావా హిం. వి. 1. వ్యాజ్యము, తగవు. 2. చౌర్యము.
దాశమిక నాణక విధానము సం. వి. (అర్థ. శాస.)1957 ఏప్రియల్ నెలలో మనదేశములో ప్రవేశ పెట్టిన నాణక విధానము అణాలు బేడలు పోయి ఒక రూపాయికి 100 పైసలు అను పద్ధతి.
దాశార్హుఁడు సం వి. కృష్ణుడు. వ్యు. దశార్హుని సంతతివాడు.
దాసరయ్య వై. వి. 1. తాబేలు. 2. విష్ణు భక్తుడు.
దాసరి వై. వి. విష్ణుసేవకుడగు శూద్రుడు. రూ. దాహరి. సం. దాసః.
దాసరిపాము వి. చారలుగల పెద్దపాము.
దాసి సం. వి. పనికత్తె, పరిచారిక.
దాసుడు సం. వి. 1. పనివాడు; సేవకుడు. 2. భక్తుడు. 3. జ్ఞాని.
దాసేయుఁడు సం. వి. పనివాడు. విశే. దాసికి పుట్టినవాడు. రూ. దాసేరుడు.
దాహకము సం. విశే. (రసా.) 1. కాల్చు నట్టిది. (Caustic).
దాహకక్షారము సం. వి. (రసా.) శాకీయ పొక్కులు జనింపచేయు క్షారము. (Caustic alkali), ఉదా దాహకసోడా (Caustic soda).

దాహకచూర్ణము సం. వి. (ర సా. సున్నపు రాయి బట్టిలో కాల్చిన లభ్యమగు దాహ గుణము గల ఖటికామ్లజము (కాల్సి యమ్ ఆక్సైడు) ఇది నీటి తాకిడి వలన కుతకుత ఉడికి విచ్చిపోవును. అందుచే దీనికి చిప్పి (సున్నకైన) సున్నము అని పేరు వచ్చినది. (Quick lime).

దాహకపొటాష్ సం. వి. (రసా.) పొటాసియమ్ ఆక్సైడ్ నీటితో కలిసి ఏర్పడు క్షారము. (Caustic potash)

దాహకపు సున్నము మి. వి. (రసా.) చూ. సున్నము (Caustic lime).

దాహకపు సోడా మి. వి. (రసా.) సోడియమ్ ఆక్సైడ్ నీటితో కలిసినప్పుడు ఏర్పడు క్షారము. (Caustic soda).

దాహని సం. వి. (రసా.) దాహ్యవస్తువు లుంచెడు కాలకరిటి. (Deflagrating spoon).

దాహము సం. వి. 1. కాలుట. 2. దప్పి.

దాహ్యత సం. వి. (రసా.) ఒక వస్తువున కుండు జ్వలించు సామర్థ్యము (Combustibility).

దాళిమ్మ వై. వి. దానిమ్మ. దానమ్మ. సం. దాడిమీ

దాటు వి. 1 వస్త్రలేశము. 2 లేతపత్తి.

దాపకి వై. వి తాలువు రోడ.

దాపవాపంట వి. (వ్యావ.) వరి కోసిన పంట లేక వేసవి వరి పంట. దాళువా. (Paddy Second crop)

దాపవాహించు క్రి 1. ఒప్పు. 2. ప్రకాశించు.

## ది

దించు క్రి. 1. దిగవేయు. 2. తగ్గించు చూ దింపు. డించు

దిండు వి. 1. తలగడ. 2 పొడువుగా గుండ్రముగా చెక్కిన మ్రాను. 3. దట్టి చూ. ద్రిండు (వ్యావ.) గుంటక గొట్టు మొద లగు పనిముట్లకు గల దూలమువంటి భాగము. (Body of guntaka)

దింపు క్రి. దించు. వి. ప్రేలుట.

దింపుడు వి. దించుట.

దింపుడు కళ్ళపుఆశ వి. (వ్యావ.) 1. మధ్య మార్గమున పీనుగును దించి బ్రతుకునేమో యని చూచు ఆశ. 2. కడపటి ఆశ.

దిక్కుమొగములు వై. విశ. భయముచే దిక్కున కొకరుగా పారినవారు. చూ. దిక్కామొగములు. దిక్కొకమొకము.

దిక్కు సం. వి. 1. శరణము. 2 దిశ. స్థానము, నెలవు,

దిక్చక్రదిశ సం. వి. (గణి.) క్షైతిజదిశ, దిక్చక్రమునకు సమాంతరముగ నుండు దిశ. (Horizontal).

దిక్చక్రము సం. వి. (భూగో.) క్షితిజము, దిఙ్మండలము మన చుట్టును దృష్టి అను నంత దూరము వరకు భూమ్యాకాశ ములు కలిసినట్లు అగుపడు చక్రము (Horizon).

దిక్పాతము సం. వి. (భౌతి.) భూగోళ ధ్రువాంశ వృత్తమునకును అయస్కాంత ధ్రువాంశవృత్తమునకును మధ్యగల కోణము. (Declination).

దిక్సూచి సం. వి. నావికులు వాడు ఒక పరికరము. (Compass).

దిగంబరుఁడు సం.వి. శివుడు, విశ. నగ్నుఁడు

దిగఁదీయు క్రి. దృష్టిదోషము పోవుటకు ఉప్పు మిరపకాయలు మొదలగు వానిని చుట్టును త్రిప్పుట.

దిగఁదుడుచు క్రి. దిగదీయు.

దిగనాడు క్రి. విసర్జించు.

దిగఁబడు క్రి. 1. అడగు, 2. దిగు. 3 జారు.

దిగవిడుచు క్రి. విసర్జించు.

దిగు క్రి. 1. క్రిందికివచ్చు. 2. దిగుమతి యగు 3. ప్రయాణమునందు విడియు రూ. దిగ్గు, డిగు, డిగ్గు.

దిగుమే క్రి. 1. దించు. 2. గ్రుమ్ము.

దిగుడు విశే. 1. పల్లమైనది. 2 తక్కువైనది. రూ. దిగ్గుడు. వి. పల్లపుప్రదేశము

దిగువల వి. 1. క్రింది భాగము. 2. పండిన పంట ప్రమాణము 3 దిగుబడి.

దిగుమతి వి. 1. ఓడపై నుండి సరకులు దించుట. (అర్థ.) విదేశములనుండి సరకులను తెప్పించుట.

దిగులు వి. 1. గుండెయదరు. 2. అధైర్యము.

దిగులుపడు క్రి. దిగులొందు.

దిగువ వి. క్రింద. విశే. క్రిందైనది.

దిగువాయి విశే. తక్కువ.

దిగువాఱు క్రి. 1. క్రిందపడు 2 కారు

దిగ్గన అవ్య. తటాలున రూ. దిగ్గున.

దిగ్గియ వై. వి. డిగ్గియ, నడబావి. సం. దీర్ఘికా.

దిగ్గురమ క్రి. గుండెగతిలుమను, భయపడు

దిగ్ధము సం. విశే. పూయబడినది.

దిగ్భ్రమము సం. వి. దిక్కుల తబ్బిబ్బు. దిక్కుతోచమి, భ్రాంతి.

దిచ్చరి వై. మాయలాడి. 2. వ్యభిచారిణి. సం. దిక్చారిణీ.

దిచ్చుమొగము విశే. అస్పృశ్యము.

దిట వై. వి. 1 దార్ఢ్యము, పటుత్వ, శక్తి. 2. ధైర్యము. రూ. దిటము. దిటవు. సం. దృఢమ్.

దిటము వై. వి. చూ. పై, విశే. దృఢము.

దిటవు వై. వి. చూ. పై.

దిట్ట వై. వి. దార్ఢ్యము. శక్తి. విశే. దార్ఢ్యముకలవాడు. సం. దృఢః, ధృష్టః.

దిట్టఁడు వై. విశే. సమర్థుడు. 2. నేర్పరి. 3. ధైర్యము గలవాడు. సం. ధృష్టః.

దిట్టము వై. వి. 1. దృఢము. 2. నిర్ణయము. సం. దృఢమ్.

దిడ్డి వి పెద్దవాకిలి ప్రక్కనుండు చిన్నవాకిలి

దిద్దు క్రి. 1. శిక్షించు. 2. సవరించు 3. తీర్చు

దిద్దుగడ వి. సరిచేయు, సవరించుట.

దిద్దుపాటు వి. సరిచేయుట, సవరించుట.

దిద్దుబడి వి. సరిచేయుట, సవరించుట.

దిదృక్ష సం.వి. చూడవలెనన్న కోరిక.

దిదృక్షువు సం. విశే. చూడనిచ్ఛగలవాడు

దిధిషువు సం. వి. 1. మారుమనువుది. 2. మారుమనువుదాని మగడు 3. తనకంటె ముందు పెండ్లయిన చెల్లెలు కలది.

దినకరుఁడు సం. వి. సూర్యుడు

దినబత్తెము మి. వి. ప్రతిదినమిచ్చు బత్తెము.

దినము సం. వి. 1. పగలు. 2. రేపవళ్ళు చేరినది.

దినరేఖ సం (భూగో.) 180° రేఖాంశముతో సరిపోవు రేఖ. (పశ్చిమముగ పయనించువాడు ఈ రేఖ దాటినప్పుడు తేదీకి ఒక రోజు కలుపుకొనవలెను. అట్లే తూర్పుగ పయనించువాడు ఒక రోజు తీసివేసికొనవలెను ఈ ఊహారేఖ తూర్పునకు అలాస్కా పశ్చిమమునకు దక్షిణ సముద్ర ద్వీపములు (South Sea Islands) కలవు.

దినవెచ్చము మి. వి. ప్రతిదినమగు ఖర్చు.

దినారి వై. వి. దీనారము, ఒక బంగారు నాణెము. సం. దీనారః.

దినుసు వి. వస్తువు. 2. ప్రకారము. రూ. దినుస్సు.

దినుసురూప (పు) శిస్తు వి. (వ్యావ.) కౌలుదారు భూస్వామికి వస్తురూపమున నిచ్చెడి శిస్తు. (Rent in kind).

దిబ్బ వై. వి. ఎత్తైననేల, కుప్ప. 2. దీవి. సం. ద్వీపః.

దిబ్బర వి. శైత్యాధికముచే ముక్కుచెవులు మూసికొని పోవుటవల్ల కలుగు బాధ.

దిబ్బరము వి. మూకుడు. రూ. దబ్బరము.
దబ్బెము వై. వి. దీపము. సం. దీపః.
దిమాకు హిం. వి. గర్వము. హిం. డిమాఖ్.
దిమ్మ వి. 1. స్పృహ. 2 భ్రమ. భ్రాంతి. వై. వి. 1. స్తంభము. 2. దిబ్బ. సం. ద్వీపః.
దిమ్మదిరుగు క్రి. స్పృహతప్పు.
దిమ్మరి వై. విశే. 1. భ్రమకలవాడు, 2. మత్తుకలవాడు. రూ. దిమ్మరీడు.
దిమ్మరీడు వై. విశే. దిమ్మరి.
దిమ్మిస వి. నేలవణచి చదునుసేయు సాధనము. రూ. దిమ్మెస.
దిమ్ము వై. వి. 1. భ్రమము. 2. మత్తు 3. పొగరు.
దిమ్ము వి. సమూహము.
దిమ్మె వి. 1. తామరలోని దుద్దు. 2. కొయ్య దిండు 3. రాళ్ళు మొదలగు వానితో నెర్పరిచిన చిన్న మిట్ట. 4. లావు పొడవు గల కొయ్య.
దిరిసెనము వై. వి. 1. శిరీషము 2. బాగి చెట్టు. రూ. దిరిసనము. సం. శిరీషః.
దివిటీ వై. వి. 1. దీపయష్టి. 2. ఇనుప సలాకునకుగాని కఱ్ఱకుగాని గుడ్డలు చుట్టి ముట్టించు దీపము. రూ. దివ్వటీ. సం. దీపయష్టిః.
దివము సం. వి. 1. ఆకాశము. 2. స్వర్గము. 3. పగలు.
దివసము సం. వి. 1. పగలు. 2. దినము. రోజు.
దివాంధము సం. వి. గుడ్లగూబ.
దివాకరుడు సం. వి. సూర్యుడు. వ్యు. పగటిని కల్గించువాడు.
దివాణము వై. వి. 1. రాజభవనము 2. కొలువుకూటము. సం. దేవాయతనమ్.
దివాను వై. వి. మంత్రి. (చరి.) మొగలు సామ్రాజ్యములో సాధారణముగా రెవెన్యూ మంత్రికి ఈ పదము ఉపయోగించెడివారు. సం. దీమాన్. హిం. దీవాన్.
దివాభీతము సం. వి. గుడ్లగూబ.
దివాభీతుడు సం. వి. దొంగ.
దివాలా హిం. వి. ఒక వ్యక్తి తనకు గల అప్పులను తీర్చుకొనలేని స్థితి, ఆస్తిని మించిన అప్పులున్న స్థితి.
దివాలాతీయు వి. క్రి. అప్పులు చెల్లించలేక యుండు. వ్యవహారము చెడి నష్టము పొందియుండు.
దివి సం. వి. 1. ఆకాశము. 2. స్వర్గము.
దివిజుడు సం. వి. 1. దేవత.
దివియ వై. వి. 1. దీపము. 2. దివ్వటీ. రూ. దివె. దివ్వె దివ్వియ. దీవియ, దీవె. సం. దీపికా.
దివిషదుడు సం.వి. దేవత. స్వర్గమున నుండువాడు.
దివెకంబము వై. వి. దివెకోల. దివ్వటీ. సం. దీపికాస్తంభః.
దివెనుడి వై. వి. దీపము పెట్టుగూడు. దివ్వెగూడు.
దివౌకసుడు సం. వి. వేలుపు. రూ. దివోకసుడు. వ్యు. స్వర్గమే నెలవుగా గలవాడు.
దివౌకసము సం. వి. పక్షి. రూ. దివోకసము.
దివ్యచక్షువు సం. విశే. 1. జ్ఞానదృష్టి గలవాడు. 2. గ్రుడ్డివాడు. 3. మంచికన్నులు కలవాడు.
దివ్యజ్ఞాన సమాజము సం. వి. (చరి.) థియొసాఫికల్ సొసైటీ. ప్రాచీనములైన హైందవ, పారశీక, బౌద్ధ ధర్మములను పునరుద్ధరించి వాని బోధనల ప్రభావముచే భారతీయులలో నూతన పరివర్తనము, మనో ధైర్యము, కలుగచేయుటకు పాటుపడు సమాజము(Theosophical Society).

దివ్యపరీక్ష సం. వి. (చరి.) కఠిన పరీక్ష. ప్రాచీన కాలమందు విచారణ చేయు నప్పుడు మనుష్యుల నిజాయితీ పరీక్షించు టకు పెట్టుచుండిన అగ్ని తైలజల పరీక్షలు.

దివ్యము సం. విశే. 1. దివియందు పుట్టినది 2. ఒప్పైనది.

దిశ సం. వి. దిక్కు. దెస. (గణి.) అంత రాళములో మనము గుర్తించగల క్రిందు-మీదు, ముందు-వెనుక, కుడి-ఎడమ దిక్కు లలో నొకటి.

దిష్టము సం.వి. 1.భాగ్యము, 2. సమయము,

దిష్టాంతము సం. వి. చావు. వ్యు. జీవిత కాలము యొక్క అంతము.

దిసంతదుచు క్రి. దూరు, నిందించు.

దిసంతు వై. వి. 1. నింద. 2. రోత. సం. దూషితమ్.

దిసంతుకొట్టు క్రి. దిసంతుపడు.

దిసమొల వి. నగ్నత్వము. రూ. దిస్సమొల.

దిసమొలవాడు విశే. దిగంబరుడు.

దిసమొలవేలుపు వి. 1. శివుడు. 2. కాల భైరవుడు.

దిస్టి వై. వి. దృష్టిదోషము. సం. దృష్టిః.



దీకొను క్రి. 1. పొట్టేళ్ళు మొ॥వి తలలతో పొడుచు. 2. ఎదిరించు, 3. కవియు. 4. సిద్ధపడు రూ. డీకొను.

దీక్ష సం. వి. 1. యజ్ఞాదుల యందు ఆరంభ మున అనుష్ఠించు ఆచార నియమము, 2. పట్టుదల.

దీక్షితుఁడు సం. వి. 1. యజ్ఞదీక్ష వహించిన వాడు. 2. పట్టుదల దాల్చినవాడు.

దీటు క్రి. 1. సరిచేయు, 2. ఆకర్షించు, వి. 1. సమానము. 2. విధము.

దీటుకొను క్రి. 1. నిండుకొను, 2.నవరించు. 3. సరిపోలు.

దీదివి సం. వి. 1. అన్నము. 2. బృహస్పతి. 3. స్వర్గము.

దీధితి సం. వి. 1. కిరణము. 2. వెలుగు.

దీనారము సం. వి. బంగారు నాణెము.

దీనుఁడు సం.విశే. 1.ఖిన్నుడు. 2. దరిద్రుడు

దీనె ఇలాహి (చరి.) భగవత్ ధర్మము. మొగలు చక్రవర్తియైన అక్బరు తన సామ్రాజ్యములో మత వైషమ్యములు తుడిచివేసి సకల మానవ సౌభ్రాత్రము నెలకొల్పుటకై స్థాపించిన ధర్మము.

దీపకము సం. వి. 1. ఓమము. 2. దీపము. 3. దీమము. 4, (అలం.) సాహిత్యమున నొక యలంకారము.

దీపము సం. వి. లాంతరు, రూ. దీపిక.

దీపవంశము సం. వి. (చరి.) సింహళదేశ చరిత్రను గూర్చి తెలుపు పాళీ గ్రంథము. (క్రీ. శ. 4-5 శతాబ్దము.)

దీపవల్లి సం. వి. దీపపువత్తి.

దీపస్తంభము సం. వి. దీప ముంచుట కమ ర్చిన నిడుపు కఱ్ఱ.

దీపావళి సం. వి. నరకచతుర్దశి మరునాడు వచ్చు పండుగ. 2. దీపముల సమూహము

దీపించు సం. క్రి. 1. ప్రసిద్ధమైయుండు. 2. ప్రకాశించు,

దీప్తము సం. విశే, 1. వెలిగినది. 2. కాలినది.

దీప్తి సం. వి. కాంతి సం. (భౌతి.) ప్రకా శము. (Luminosity), కాంతి యొక్క తీక్ష్ణత. (Brightness).

దీప్తమండలము సం. వి (రసా.) క్రొవ్వు వత్తి జ్వాలలో తిమిర భాగము నావరించి కాంతిని వెదచల్లు అంతర్భాగము (Luminous zone).

దీప్యమానము సం. విశే. (భౌతి.) వెలుతురును వెడల గ్రక్కుచున్నది. (Luminiscent).

దీమము వై. వి. 1. దీపకము. 2. వేటాడుటకై వేటకాడు పెంచు పక్షి. వ్యాగము రూ. దీపము.

దీమసము వి. 1. ధైర్యము, 2. ఉపాయము రూ. దీమసము.

దీర్ఘచతురస్రము సం. వి. (గణి.). వెడల్పుకన్న పొడవు ఎక్కువగా నున్న సమకోణ సమాంతర చతుర్భుజము. (Rectangle).

దీర్ఘదర్శి సం. వి. విద్వాంసుడు. విశే. దూరపు యోచన కలవాడు.

దీర్ఘదృష్టి సం. వి. (భౌతి.) దూరమున నున్న వస్తువులే కనిపించు దృష్టి (Long-sight) (గృహ.) దగ్గర వస్తువులు సరిగా కనిపించకపోవుట, చత్వారము.

దీర్ఘనిద్ర సం. వి. చావు

దీర్ఘపృష్ఠము సం. వి. పాము.

దీర్ఘము సం. విశే. నిడుద.

దీర్ఘవృత్తము సం. వి. (గణి.) రెండు స్థిరబిందువులనుండి తన దూరముల మొత్తము స్థిరముగానుండునట్లు చరించు బిందువు యొక్క పథము, దీర్ఘవృత్తము (Ellipse).



దీర్ఘ వ్యాకోచ గుణము సం. వి. (భౌతి.) ఒక వస్తువు యొక్క దైర్ఘ్యవృద్ధికిని దాని అంగులు పొడవునకును గల నిష్పత్తి (Coefficient of linear expansion).

దీర్ఘసూత్రుడు సం. విశే. ఆలసించి పని చేయువాడు.

దీర్ఘాకృతి సం. వి. (వృక్ష.) సన్నముగా పొడవుగా గడ్డిపోచ వలె నున్న ఆకారము. (Linear shape).

దీర్ఘాయువు సం. వి. రాక్ విశే. చిరకాలము బ్రతుకువాడు.

దీర్ఘిక సం. వి. నడబావి, దిగుడుబావి. దిగియ.

దీర్ణము సం. విశే. 1. చిల్లుపడినది. 2. భయపడినది.

దీలు క్రి. డిల్లపడు. రూ. డీలు.

దీవన వి. ఆశీర్వాదము రూ. దీవెన.

దీవనప్రాలు వి. అక్షతలు.

దీవసము వి. దీమసము.

దీవి వై. వి. 1. ద్వీపము, నీటినడిమి భూభాగము. సం. ద్వీపః

దీవియ వై. వి దివియ, సం. దీపికా.

దీవెన వి. దీవన.

దీవెనకోలు వి. సముత్కాటము.

# దు

దుంకము వై. వి. రంధ్రము, చిల్లి.

దుంగ వై. వి. మ్రాని మొద్దు, తుండు సం. తుంగమ్.

దుండగము వై. వి. 1. తప్పు, 2. దౌష్ట్యము. 3. కీడు. రూ. దుండలికము. సం. దుంకుకః.

దుండగీడు వై. విశే. 1. దుష్టుడు. 2. కొంటె

దుండలికము వై. వి. దుండగము,

దుండి వి. 1 దొరసాని. 2. ప్రేయసి.

దుండుజలి విశే. సోమరి.

దుంత వి దున్న.

దుంతరౌతు వి యముడు.

దుందుడుకు వి. 1. గర్వము, ఉద్ధతి. 2. తొందర.

దుందుభి సం. వి. 1. పాచిక యందలి ఆరు చుక్కలు గల పాచిక, ఇత్తిగ. 2. భేరి. 3. 60 సంవత్సరములలో నొకటి.

దుందుము వి. చక్రాకారపు దివ్వటి.

దుందుబి వి. మా. జుంజుబి.
దుంప వి. 1. గెనుసులోనగు వాని గడ్డ. 2. వాగేటి గాడగ
దుంప ఇనుము వి. (రసా.) దుక్క ఇనుము. కొలిమి నుండి పైకి వచ్చిన వెంటనే కడ్డీల రూపములో తయారుచెయబడిన ఇనుము. (Pig Iron).
దుఃఖము నం. వి. 1. బాధ. 2. చింత.
దుకాణము వి. అంగడి.
దుకూలము నం. వి. 1. తెల్లవస్త్రము. 2. సన్నవస్త్రము.
దుక్కి వి. (వ్యవ). నాగలి మొదలగు పనిముట్లతో నేలను దున్నుట.(Tillage or tilth)
దుక్కిటెద్దు వి. దున్నుటకు పయోగపడు ఎద్దు.
దుక్కివర్షము మి. వి. (వ్యవ.) నేలను దున్నుటకు తగిన తేమ నిచ్చునంతటి వర్షము, సుమారు. 1/2 అంగుళము వర్షము. (Agronomical unit of rainfall.)
దుక్కివాలు వి. నాగలి.
దుక్కివాలుబాలుపు వి. బలరాముడు.
దుగ వై. నర్వా. ద్వికము, రెండు, రూ. దువ. నం. ద్వికమ్.
దుగమొగముల పులుఁగు వి. గండభేరుండము.
దుగమొగముల వేలుపు వి. అగ్ని.
దుగినుఁడు వై. వి. ద్రుహిణుడు, బ్రహ్మ. నం. ద్రుహిణః.
దుగుణము వై. నర్వా. ద్విగుణము రెండు, రెండింతలు. నం ద్విగుణమ్.
దుగులము వి. వరహాలో పదునారవ భాగము.
దుగ్గ వై. వి. దుర్గ, కాళి. పార్వతి. రూ. దుర్గి. నం. దుర్గా.
దుగ్గాని వై. వి. (దుగ+కాని) రెండు దమ్మిడీలు.
దుగ్గు వి. నలిచినపొడి, విణ రూపము చెడినది.
దుగ్ధము నం. వి. పాలు. విణ. పిదుకబడినది.
దుగ్ధరసకణము నం. వి. (వృక్ష.) దుగ్ధరసమును తయారుచేయుజీవకణము(Laticiferous cell).
దుగ్ధరసము నం. వి. (వృక్ష.) కొన్ని మొక్కల కాండమును, ఆకులను చరిచినచో బయటికి వచ్చు తెల్లని పాలవంటి ద్రవము.(Latex) ఉదా. రబ్బరు మొక్క మట్టి., మొదలగునవి.
దుగ్ధరసవాహిని నం. వి. (వృక్ష.) దుగ్ధరసము ఒక చోటినుండి మరియొకచోటికి ప్రవహించు గొట్టము. (Laticiferous vessel).
దుడుకు వి. 1. దౌష్ట్యము. 2. ఉద్ధతి. 3. చెడ్డపని. త. తటుక్కు. క. దుడుకు.
దుడ్డు వి. డబ్బు
దుడ్డు వై. వి. 1. లావుకఱ్ఱ, దండము.2, గద. నం. దండః.
దుడ్డుఁగఱ్ఱ వి. లావుకఱ్ఱ, దండము,
దుడ్డె విణ. 1. బాలకుడు. 2. ధూర్తుడు.3. దూడ (వాడుక).
దుత్త వి. 1, చిన్నకడవ. 2. పాలముంత.
దుత్తాయి వి. కురుచ చొక్కాయి.
దుత్తూరము నం. వి. ఉమ్మెత్త.
దుత్తూరము వై .వి. కపటము నం ధూర్తతా.
దుద్దు వి. 1. తామరలోని దిమ్మె. 2. ఒక తెగ చెవి కమ్మ. 3. తాటాకుచుట్ట.
దుద్దుపెట్టు కాశీ. (దుద్దు+పెట్టు) మోసము చేయు.
దుద్దెక్కు క్రి. (దుద్దు+ఎక్కు) 1. అతిశయించు. 2. -లావెక్కు.
దును క్రి. దున్ను,
దునుకు వి. బాధ.

దునెదారి వై. విశే. ద్రుణధారి, కత్తి తాల్చిన కూరుడు. రూ. దునేదారి

దున్న వి. మహిషము, దున్నపోతు.

దున్ను క్రి. దుక్కిచేయు.

దుప్పటము వై. వి. రెండుగల సన్నని వస్త్రము. సం. ద్విపటమ్

దుప్పటి వై. వి. ద్విపటి, కప్పుకొను వస్త్రము, నిచోళము. రూ. దుప్పటీ. సం. ద్విపటీ.

దుప్పి వి. పొడలుగల అడవిమృగము, చమూరుపు.

దుబాసి హిం. వి. భాషాంతరముచేయువాడు ద్విభాషి.

దుబ్బు వై. వి. గడ్డిలోనగువాని గంట తృణస్తంభము. సం. స్తోమః.

దుబ్బునేలలు మి. వి. (భూగో.) సాలుకు 40''లకంటె తక్కువవర్షముగల ప్రదేశము లలోముండ్ల చెట్లు, చిట్టి పొదలు మున్నగు వానితో పర్పడిన నేలలు.

దుమగతికేతు వై. వి. ధూమకేతువు, అరిష్ట సూచకమగు తోక చుక్క.

దుమదుమ విశే. 1 మిక్కిలిగా తడియుట, వి. కోపాదులచే చిరచిరలాడుట.

దుమారము వి. దుమ్ము.

దుమాలు విశే. సమూలము,

దుము వై. వి. దుమ్ము సం. ధూమః.

దుముకు క్రి. 1. ఉరుకు, గంతువేయు, దూకు.

దుముదారు వి. 1. దండు. 2. దళవాయి.

దుమ్ము వై. వి. ధూళి. రూ. దుము. సం. ధూమః.

దుమ్ములగొండి వి. ఒకానొకమృగము, కొర్నాసి గండు,

దుయ్యు క్రి. దూయు.

దురంతము సం. విశే. 1. అంతము లేనిది. 2. కడపట చెడుగగునది. వి. క్రూరపుపని.

దురతిక్రమము సం విశే. అతిక్రమింపరానిది.

దురత్యయము సం. వి. చేటులేనిది.

దురద వి. 1. తీట. 2. కసరు. 3 కీట.

దురదుర వై. విశే శీఘ్రముగ. సం, త్వరా.

దురదృష్టము సం. వి. దౌర్భాగ్యము.

దురధ్వము సం. వి, చెడుత్రోవ.

దురపిల్లు క్రి 1. శోకించు. 2. తపించు. 3. కలగు.

దురము వై. వి. 1 యుద్ధము, 2 శీఘ్రము. సం. ఉపరమ్.త్వరా.

దురా వై. వి. ఆజ్ఞ. రూ. దురాయి, సం. దురాహః.

దురాక్రాంతము సం. వి. అకృత్యము, చెడ్డపని.

దురాచారము సం వి. చెడునడవడి.

దురాతము వి. ఒకరు రెండు.

దురాత్ముఁడు సం. విశే చెడుమనస్సు కల వాడు.

దురాపము సం. విశే. పొందరానిది.

దురాయి వి. రూ దురా.

దురాలాపము సం. వి. చెడుమాట.

దురాలోకము సం. విశే. చూడశక్యము కానిది.

దురాశ సం. వి. వ్యర్థమైన ఆశ.

దురాసదనము సం. విశే. 1. పొందరానిది. 2 చేరరానిది.

దురితము సం, వి పాపము.

దురుసు వై. వి. 1 కాఠిన్యము. 2. శీఘ్రము సం. ధృష్.

దురోదరము సం వి. జూదము. 2. పందెము ప్పా చెడ్డతో నిండియున్నది.

దుర్గ సం. వి. పార్వతి రూ. దుర్గి.

దుర్గంధము సం. వి చెడువాసన.

దుర్గతి సం వి. 1. నరకము. 2. బీదతనము.

దుర్గమము సం విశే. 1. పోవుటకు కష్టతరమైనది. 2, సులువుగా పొందరానిది.

దుర్గము సం. వి. కోట.

దుర్ఘటము నం. విశే. ఘటింపరానిది, చేయరానిది.

దుర్జనుఁడు నం. విశే. దుష్టుడు.

దుర్జయుఁడు నం. విశే. జయింప వీలులేనివాడు.

దుర్జాతి నం. విశే. దుర్జనుడు. వి. చెడ్డజాతి.

దుర్జ్ఞేయము నం. విశే. ఎరుగరానిది.

దుర్దాంతము నం. విశే. 1. అడపరానిది. 2. గర్వించనిది. వి. 1. పోరు. 2. దూట.

దుర్దినము నం. వి. చెడు కలిగిన దినము. 2. మబ్బు క్రమ్మిన దినము 3 వాన.

దుర్ధర్షుఁడు నం. విశే. సమీపించరానివాడు

దుర్నయము నం. వి. 1. అన్యాయము. 2. దుర్నీతి.

దుర్నిరీక్ష్యము నం. వి. చూడరానిది.

దుర్బలలక్షణము నం. వి. (జీవ.) (Recessive character) పరస్పర వ్యత్యాసనముగల లక్షణములలో నొక బలీయ లక్షణముతో (Dominant character) కూడి సంక్రమించిన రెండవ లక్షణము, సంతానములో వైకివికాసమును చూపకుండునది.

దుర్బలుఁడు నం. విశే. బలహీనుడు.

దుర్భరము నం. విశే. భరింపశక్యముకానిది,

దుర్భిణి హిం. వి. దూర వస్తు దర్శన యంత్రము.

దుర్భిక్షము నం. వి. కరవు.

దుర్మతి నం. విశే. 1. చెడుబుద్ధి కలవాడు. వి. 60 సంవత్సరములలో నొకటి.

దుర్మరణము నం. వి. చెడు.

దుర్ముఖి నం. వి. 60 సంవత్సరములలో నొకటి.

దుర్లభము నం. వి. 1. పొందశక్యము కానిది. నం. విశే. (రసా.) విరళము, అరుదుగా దొరకునది (Rare). ఉదా. ఆర్గాన్ వంటి వాయువులు.

దుర్వినీతుఁడు నం. విశే. వినయము లేనివాడు.

దులదుల వి. వేగిరపాటు.

దులుపు క్రి. రాల్చు. విదళించు.

దుర వై. సర్వ. దుగ. నం. ద్వే,

దువారము వై. వి. ద్వారము. వాకిలి. రూ. దోరము, నం. ద్వారమ్.

దువాళము వి. గుఱ్ఱము యొక్క ఒక విధమైన నడక, ప్లుతము. రూ. దువాళి,

దువ్వటము వై. వి. దుప్పటసు. నం. ద్విపటీ

దువ్వలువ వి. 1. దుప్పటి. 2.కట్టువస్త్రము.

దువ్వి వై. వి. ద్వీపి, పులి. చిరుతపులి. రూ. దువ్వు. నం. ద్వీపీ.

దువ్వు క్రి. 1. దువ్వెనతో తల వెంట్రుకల చిక్కుదీయు. 2, నిమురు, 3. పులి.

దువ్వెన వి. దువ్వెడు సాధనము, కంకతిక.

దుష్కరము నం. విశే. చేయసాధ్యము కానిది,

దుష్కృతము నం, వి. పాము.

దుష్టము నం. విశే. చెడ్డది,

దుష్ప్రవర్తనము నం. వి. దురభ్యాసము.

దుష్ప్రాపము నం. విశే. దురాపము, పొందగూడనిది.

దుసికిలు క్రి. 1. జారు. 1. తప్పించుకొను.

దుస్తరము నం. విశే. తరింపరానిది.

దుస్తు వి, 1. ఉడుపు. 2. అందము. విశే. ఎక్కువ.

దుస్తులచెయ్యి వి. (గృహ.) మీద దుస్తుల లోని చేతి భాగము (Sleeve).

దుస్తులు వి. (గృహ), బట్టలు, వస్త్రములు ఉడుపులు (Garments or clothes).

దుస్త్యజము నం. విశే. విడువరానిది.

దుస్సాసనుఁడు వై. దుశ్శాసనుడు. ధర్యోధనుని తమ్ములలో నొకడు,

దుస్సహము నం. విశే. సహింపరానిది.

# దూ

దూఁకలి వై. వి. బాధ. సం. దుఃఖమ్.
దూఁకు క్రి. దుముకు.
దూఁకుడు వి. 1. దినుడు. 2. తొందరపాటు
దూఁకొను క్రి. 1. రుచిచూచు. 2. పొందు. 3 కలుగు.
దూఁట వి. అరటియూచ, దవ్వ
దూఁటు క్రి. పొడుచు.
దూఁటుకొను క్రి. 1. ఎగుడు. 2. వ్యాపించు
దూఁటఱదిండి విశ. మిగుల కట్టక అంతయు వెచ్చించి తినువాఁడు.
దూగఱ వి. కరదూపము, ధాన్యాదులలోని దుమ్ము.
దూడ వి. పశుశిశువు.
దూత సం. వి. రాయబారి, కుంటెనకాడు. రూ. దూతుఁడు.
దూతి సం. వి. కుంటెనకత్తె రూ. దూతిక,
దూత్యము సం. వి. దూతభావము, దూతి కార్యము. రూ. దౌత్యము.
దూది వి. ప్రత్తి.
దూదేకుట (దూది+ఏకుట) వి. (గృహ.) ప్రత్తిని పింజలుగా చేయుట, ప్రత్తి నుండి గింజలను వేరుచేయుట (Carding).
దూప వి. దప్పి.
దూపటిల్లు క్రి. 1. దప్పిగొను. 2. పరితపించు.
దూపము వై. వి. ధూపము, వాసనగల పొగ. సం. ధూపః, ధూమః.
దూపార్తి వై. వి. దూపము వేసెడు చిన్న పాత్ర.
దూపించు క్రి. దూపటిల్లు.
దూపిల్లు క్రి. దూపటిల్లు.
దూబ వై. విశ. 1. అధముడు. 2. సిగ్గువడిన వాఁడు. సం. దుర్భగః
దూయు క్రి. 1. పారు. 2. బాణము నాటి వెడలు 3. పిడికిటితో ఆకులు మొదలగు వాని కోయు. 4 తీయు. రూ. దయ్యు దూయు, దుయ్యు.
దూయుముడి వి. జారుముడి. రూ. దుయ్యుముడి దూముడి.
దూరక్రియ సం. వి. (భౌతి.) రెండు వస్తువుల మధ్య అంతరము (ఎడము) ఉన్నను అవి పరస్పరము ఆకర్షించుకొనుట. లేదా వికర్షించుకొనుట (Action at a distance)
దూరగిరిన్యాయము సం. న్యా. దూరముగా నున్న పర్వతములు నునుపుగా కాన్పించును. దగ్గరకు పోవ గుట్టలు మిట్టలు ముండ్లుగా నుండును కీతి దూరపు కొండలు నునుపు,
దూరదర్శి సం. వి 1. విద్వాంసుడు, 2. గ్రద్ద. విశ దూరపు టాలోచనకలవాడు.
దూరదర్శిని సం వి (భౌతి.) దూరమున నున్న వస్తువులను పెద్దవిగను, దగ్గరగను అగుపడునట్లు చేయు పరికరము. (Telescope).
దూరము సం. వి. దవ్వు.
దూర్వ సం. వి. గరిక.
దూఱు క్రి నిందించు. వి. నింద.
దూల వి. దురద, నవ.
దూలము వై. వి. 1. తుల, స్తంభపీఠము. 2 ఇంటికుప్పలకు ఆధారముగా వేయునట్టి మ్రాను, తలాడి. (వ్యవ.) పెద్ద యినుప నాగలిలోని ఒక భాగము (Beam).
దూషణము సం. వి నిందించుట.
దూషిక సం వి. 1 కంటిపుసి 2. సాలెపురుగు.
దూష్యము సం. వి. గుడారము. విశ. దూషింపతగినది.
దూసరి వి. ఒకజాతి గడ్డి.
దూళి వై. వి. ధూళి, దుమ్ము సం. ధూళిః.

## దృ

దృంభువు సం. వి. 1 పాము. 2. వజ్రాయుధము. 3. సూర్యుడు 4 రాజు. దూ. దృంపువు.

దృక్కు సం. వి. 1. కన్ను. 2. చూపు. 3. బుద్ధి.

దృక్పింతములు సం. వి. (జం.) మధ్యమస్తిష్కము యొక్క పార్శ్వములందు దట్టముగా నేర్పడిన భాగములు (Optic thalami).

దృఢకోణ జీవకణసమితి సం. వి. (వృక్ష) కణకవచము దట్టముగా లిగ్నిన్‌తో కూడియున్న జీవకణజాలము.(Sclerenchyma)

దృఢతానిక సం. విశ. (జం.) వెన్నెముకలో నుండు కాలువ లోపలిభాగమున అస్తరుగా నుండునట్టిదృఢమైన పొర.(Dura-mater).

దృఢము సం. విశ. (భౌతి) వంగనిది,చిన్న దెబ్బలకు వికారము చెందనిది, గట్టిది. (Rigid)ఉదా. దృఢవస్తువు(Rigid body)

దృఢరోమము సం. వి. (జం.) వలయిత ప్రాణులలో (Annelida) చలనమున కుపయోగించు సూక్ష్మమైన రోమము వంటి నిర్మాణము (Seta).

దృఢీభవనము సం. వి. (భూగో.) ఆవిరి రూపమునుండి ఒక పదార్థము ద్రవముగ మారుట (Condensation). నీరు సూర్య కిరణముల వేడివలన ఆవిరిగ మారి కొంత దూరము పయనించి అటుపై ఎత్తైన కొండల ఆటంకమువలన గాలితో పైకి పోయి చల్లారి మరల నీరుగ మారుటవలన వర్షములు కురియుట.

దృతము సం. విశ. 1. ఆదరింపఁబడినది. 2. పగిలినది.

దృతి సం. వి. 1. తిత్తి 2. తోలు, 3. చేప,

దృతిక సం. వి (జం.)(Utriculus) చెవిలో మధ్య గుహ.(Vestibule) యొక్క పై భాగము.

దృప్తుఁడు సం. విశ. దర్పించినవాడు,పొగరుపోతు.

దృశ సం. వి, చూపు.

దృశ్యము సం. విశ. చూడదగినది.

దృశత్తు సం. వి రాయి, సన్నెకల్లు.

దృషత్పుత్రి సం. వి. కల్వపు గుండు. గుండ్రాయి.

దృష్టము సం. విశ. చూడబడినది.

దృష్టాంతము సం. వి. 1. ఉదాహరణము. 2. శాస్త్రము 3. చావు. 4 (అలం.) ఒక అర్థాలంకారము.

దృష్టాంతరీకరించు సం. క్రి. ఉదాహరించు

దృష్టి సం. వి.1. కన్ను. 2,చూపు 3.బుద్ధి.

దృష్టించు సం. క్రి. చూచు.

దృష్టినాడి సం వి (జీవ.) దృష్టిజ్ఞానమును మెదడున కందచేయు నాడి (Optic nerve)

దృష్టిరేఖ సం.వి. (భౌతి.) మనచూపు పంచు ఋజురేఖ. (Line of vision)

దృష్టివైషమ్యము సం వి (జీవ.) నేత్రదోషము వలన అక్షపటలముపై బొమ్మను కేంద్రీకరించ లేకపోవుట.(Astigmatism)

దృష్టిసంబంధము సం. విశ. (జం.) చూపునకు, కనుగ్రుడ్డునకు సంబంధించినది. (Optic).

## దె

దెంచనము వి. దంచనము.

దెందము వి. డెందము.

డెత్తి వి. (వ్యావ) ఘాతము.
డెప్పము వి. బాణాసుల కెదుట నిల్పిన కృత్రిమ లక్ష్యము, గురి.
డెప్పరము వి. అపవ. విశే. దుస్సహము. అశక్యము, రూ. డెప్పరము.
డెప్పు క్రి. డెప్పు. (ఒకడు చేసిన కీడును మేలును) ఎదుట చెప్పు, ఎత్తిపొడుచు.
డెబ్బ వి తాడనము. కొట్టు.
డెబ్బాటు వి. గొప్పవాన.
డెస వై. వి. 1. దెశ, దిక్కు, పార్శ్వము. 2. అవస్థ. దురవస్థ, ప్రాపు, సం. 1 దిశా. 2. దశా.

# దే

దేంద్ర వి. నేతనేసి జీవించు ఒక జాతి, రూ. జేంద్ర.
దేకు క్రి ముడ్డితో జరుగు.
దేబె విశే. దేవురుగొట్టు. దీనుడు.
దేయము సం. విశే. ఇయ్యదగినది.
దేరిజ వి. గుడారము.
దేవత వేలుపు.
దేవతరువు సం. వి. కల్పవృక్షము.
దేవదత్తము సం. వి. అర్జునుని శంఖము.
దేవనము సం. వి. 1. క్రీడ. 2. జూదము. 3. గెలువనిచ్ఛ.
దేవభూయము సం. వి. దేవత్వము.
దేవమణి సం.వి. 1. కౌస్తుభము. 2. గుఱ్ఱపు మెడమీది సుడి.
దేవమాతృకము సం. వి, వర్షాధారమున పండెడు పైరు గల దేశము.
దేవర సం.వి. 1. దేవత. దేవుడు. 2. ప్రభువు
దేవరుఁడు సం. వి. మగనితోబుట్టువు
దేవలుఁడు సం.వి తండరవాడు, సంగీవాంఘు. పూజారి.
దేవసమాజము సం. వి. క్రీ. శ. 1887వ సంవత్సరములో లాహోరు నగరములో శ్రీ సత్యానంద్ అగ్నిహోత్రిచే స్థాపింపబడిన అజ్ఞేయతా వాదము.
దేవళము వై. వి. దేవాలయము, గుడి, సం. దేవాలయః.
దేవాంగులు సం. వి. జేంద్రవారు.
దేవాజీవి సం. వి దేవలుడు.
దేవానాంప్రియము సం వి. మేక. యజ్ఞము లందు దేవతల కర్పింపబడును గాన.
దేవానాంప్రియుఁడు సం వి. మూర్ఖుడు. (వ్యతి.) దేవతలకు ప్రియుడు, అశోకుడు.
దేవాలయము సం. వి. గుడి.
దేవి సం. వి. 1 పార్వతి 2. రాణి.
దేవు క్రి తడవిచూచు, వెదకు రూ. దేవులాడు.
దేవుఁడు సం. వి. భగవంతుడు.
దేవుడు వి. దైన్యము.
దేవురుగొట్టు విశే. దేబె, దీనుడు.
దేవేరి వై. వి. 1. దేవి. 2 దొరసాని. రూ. దేవెరి, సం. దేవేశ్వరి,
దేశపాండ్య క, వి. చిన్న జమీనుదారుడు.
దేశికుఁడు సం. వి. గురువు.
దేశ్యము సం, విశే. దేశమునకు తగినది. వి. భాషలోతత్సమాదివిభాగములలోనొకటి.
దేహగుహ సం. వి. (జం.) (Coelome) చుట్టును మధ్య స్తరము గలిగి శరీరములో ఏర్పడిన ఖాళీస్థలము లేక తొఱ్ఱ (Body cavity).
దేహగుహరహితము సం. విశే. (జం.) దేహకుహరములేని జంతువు.(A coelomate).
దేహగుహాంత్రయుజధమని. సం. వి. (జం.) దేహకుహరమునకును, ప్రేగులకును, రక్తమునువంపు నాళములు రెండును కలిసిన పెద్ద రక్తనాళము.(Coeliaco-mesente-

ricartery).

దేహమహాధమని సం.వి. (జం.) ఇది బృహద్ధమని చాపములలో నొకటి. ఇరుప్రైపుల ... సిరులు ... బృహద్ధమనిగా చెప్పుదురు. (కప్ప) (Systemic trunk).

దేహము సం. వి. శరీరము, మేను.

దేహయాత్ర సం.వి 1 తిండి. 2. జీవనము.

8. చావు.

దేహళి సం. వి. గడప; ... గడప. దూ. ...

దేహళీదీపన్యాయము సం. ... గడపమీద దీపము పెట్టిన నింటిలోన బైట గూడ నుపయోగించు రీతి, దేహళీదత్త దీపన్యాయము.

దేహి సం. విశే. దేహము గలవాడు.

# దై

దైతేయుఁడు సం. వి. దితికొడుకు. తొలి వేల్పు. రూ. దైత్యుఁడు.

దైత్యారి సం. వి. విష్ణువు.

దైన్యపడు మి. క్రి. (దైన్యము+పడు) దీనత్వమును పొందు.

దైన్యము సం. వి. దారిద్ర్యాదులచే కలుగు దురవస్థ, దీనత్వము.

దైర్ఘ్యము సం. వి. నిడుపు. (భౌతి. గణి.) రెండు బిందువుల మధ్య కనిష్ఠదూరము. (Length).

దైర్ఘ్యవృద్ధి సం. వి. (భౌతి.) ఒక వస్తువు నిలువుగా సాగగా లభించు దైర్ఘ్యములోని వృద్ధి. (Elongation).

దైవజ్ఞ సం. వి. 1. సోదెకత్తె. 2. ఖిల్లి.

దైవజ్ఞుఁడు సం. వి. 1. జోస్యుడు, 2. గణకుడు,

దైవతము సం. వి. వేలుపు. విశే. దేవతా సంబంధమైనది.

దైవము సం.వి. 1. దేవుడు. 2, అదృష్టము, 3. యజ్ఞము నడిపిన ఋత్విజు నలంకరించి కన్య నిచ్చిచేయు వివాహము.

దైవాఱు క్రి అతిశయించు, రూ.దయివాఱు.

దైవికము సం. విశే. దైవము వలన కలిగినది.

# దొ

దొంతెన వి. దొంతెన, ఒకవిధమైన ఆయుధము.

దొంగ వి. 1. చోరుడు. 2. అరటి పువ్వులోని కాడ.

దొంగకూడు వి. 1. ఇతరు లెరుగక తిన్నది. (అన్నము, లంచము మొ వి.)· 2. రంకుతనము.

దొంగగొడ్డు వి. దొంగమేతమేయుపసరము.

దొంగచూపు వి. ఇతరులకు కనబడకుండ చూచుట.

దొంగనిద్ర మి. వి. కపటపు నిద్ర.

దొంగపని వి. చౌర్యము.

దొంగబీగము వి. మారుతాళపు చెవి.

దొంగభక్తి మి. వి, భక్తిని నటించుట.

దొంగయిసుక వి. క్రింది నీళ్ళు తెలియనీక మీద వ్యాపించిన యిసుక.

దొంగరేయి వి. అర్ధరాత్రము.

దొంగసొమ్ము వి. దొంగలించిన సొమ్ము, దొంగ యొద్ద పట్టుబడిన సొమ్ము

దొంగిలించు క్రి. దొంగిలు, ముచ్చిలించు.

దొంగు క్రి. డాగు.

దొండ వై. వి. ఒక జాతి తీగ. సం. తుండీ.

దొండి వై. వి. తూటు, రంధ్రము.

దొంతర వి. పరంపర, దొంతి.

దొంతి వి. 1 ఒకటి మీఁద నొకటిగా నుంచిన కుండలులోనగు వానివరుస. 2. వరుస.

దొందడి వి (దొందు+దడి) సమ్మర్దము, సందడి

దొందడించు క్రి సందడించు.

దొందము వై వి. రోగము, వాత పిత్త శ్లేష్మములలో ఏ రెంటిచేతనైనను కలుగు రోగము. సం. ద్వంద్వమ్

దొందు వై. వి. (జత.) సం. ద్వంద్వమ్.

దొంపు వి. 1. మళ్ళవరుస. 2. పేరువురుగు వల్ల తల ఎండుట.

దొంబురిగొట్టు వి. (దొందు+పులి+కొట్టు), పిరికి.

దొఠవ విశే. కురూపి, అనాకారి.

దొడ్డ విశే. గొప్ప. రూ. దొడ్డు.

దొడ్డి వై. వి. ద్రోణి, పసులు మేయు కంచె. పసులకొట్టము, పెరడు. సం. ద్రోణీ.

దొడ్డికట్టు వి. చుట్టుకొల్లారు.

దొడ్డికాళ్ళవాఁడు విశే. మోకాళ్ళవద్ద విల్లువలె వంగిన కాళ్ళు గలవాడు,

దొడ్డువాఱు క్రి. 1. గొప్పయగు 2. లావగు.

దొత్త విశే. వ్రేలాడునది.

దొద్ద వి. కొల్ల,

దొద్దకత్తె విశే. కొల్లపెట్టు స్త్రీ, ముచ్చు.

దొద్దకాఁడు విశే. దొంగ.

దొద్దగొను క్రి. కొల్లగొను.

దొద్దపోవు క్రి. కొల్లపోవు.

దొద్దు వై. విశే, తుందిలుడు, పెద్దబొజ్జ కలవాడు.

దొన వై, వి. 1. తూణము, అమ్ములపొది. 2 ద్రోణి, కొండమీఁదిపల్లము. 3. చెరువు. సం. 1 తూణమ్, 2. ద్రోణీ.

దొన్నియ వై, వి. ద్రోణి, దొప్ప, దొన్నె, దొప్ప

దొప్పఁదోగు క్రి. తేలియాడు.

దొబ్బ వి, 1, మాంసఖండము, 2, ముద్ద,

దొమ్మ వి, 1, పశురోగము. 2. కడుపులోని ఒక అవయవరోగము.

దొమ్మరి వి. గడకట్టియాడి జీవించు ఒక జాతి, దొమ్మర, దొమ్మరిది.

దొమ్మి వై. వి. 1. అందరు కలియబడిచేయు యుద్ధము, 2 అందరు కలియబడుట. 3. సందడి, సం. తుములమ్.

దొమ్ములాడు క్రి. దొమ్మియుద్ధము చేయు, పెనగొను.

దొర వి 1, రాజు. 2. సేనాపతి. 3. యోధుడు. విశే 1 గొప్పవాడు. 2. సమానుడు.

దొరఁకునన్యాసి వి. నమ్మించి మోసపుచ్చి కొనిపోవు దొంగ రూ. దొరకోలు సన్యాసి.

దొరఁకొను క్రి. 1 యత్నించు. 2, మొదలుకొను.

దొరకు క్రి. 1. లభించు, 2. చిక్కు.

దొరకొను క్రి. 1. లభించు. 2. సంభవించు. 3 సిద్ధించు

దొరకోలు వి. 1. ఉపక్రమము, యత్నించుట 2 లభించుట,

దొరగడలు వి. గొప్ప అల.

దొరయు క్రి. 1. అంటు 2, సమానమగు. 3, కలుగు. 4. జరుగు. 5, పోలు.

దొరలు క్రి. 1. పొరలు. 2. పడు. 3. కలయు. 4. మారుకొను 5. అనుభవించు. రూ. దొర్లు.

దొరవి వి. కొలను. రూ. దొరువు.

దొరసాని వి రాణి.

దొరుగండి వి. దొరవు తూము.

దొరుపట్టెడ వి. ఎద్దులతోక క్రిందతగిలించు పట్టెడ

దొరువు వి 1 వడబావి. 2 కొలను. రూ. దొరవి

దొర్లుమాను వి. (వ్యవ.) మడిలోని గడ్డలను చితుక కొట్టుటకు ఉపయోగింపబడు పనిముట్టు. (Roller).



దొర్లుమాను

దొఱయు క్రి. పొందు.
దొలుపు క్రి. దొర్లచేయు.
దొ (తొ) లుపుపురుగులు వి. (వృక్ష.) దుంపలు, వేళ్ళు, కాండము, కాయలు మొదలగులోని వానిని తొలుచుకొనితిను పురుగులు: (Borers)ఉదా. గండక బరిజె పురుగు మొ. బరిజె పురుగు కుటుంబపు లోనివి.
దొసఁగు వి. 1. ఆపద. 2. విఘ్నము. 3. పొరపాటు. 4. తప్పు. రూ. దొసవు.
దొసఁగులఁబెట్టు క్రి. బాధించు, పీడించు.

# దో

దో సం. వి. బాహువు.
దోఁకిన వి. దోకుట, గడ్డిని చెక్కుట.
దోఁకు క్రి. 1. నేలపై కసవు చెక్కుట. 2. మోచేతితో త్రోయు. రూ. డోఁకు.
దోఁకుడు వి. దోకుట.
దోఁకుడుపాఱ వి. కసవు చెక్కునట్టి పార
దోఁగు క్రి. 1. మేనితో లొలియు 2 ప్రాకు లాడు. రూ. దోఁగియాఁడు. దోఁదాడు.
దోఁగుడు వి. దొంగతనము.
దోఁచు క్రి. 1. దొంగిలించు, అపహరించు 2. బలవంతముగా దొంగిలించు,
దోఁటుమ్ము వి. దోటివంపైన అలుగులు గల బాణము, కర్ణికరము.
దోఁటి వి. పండు కోసికొనుసాధనము, వంకర చిల్లదోపిన కోల,
దోఁటు క్రి. ఇచ్చు.
దోఁపిడి వి. దోచుకొనుట, కొల్ల. రూ. దోఁపుడు.
దోఁపు క్రి. చొప్పించు,వి.దోచుకొనుట,కొల్ల
దోఆబ్ హిం. వి. (భూగో.) రెండు నదుల మధ్య నున్న భూమి.
దోగ్ధ సం. వి. 1. గొల్లవాడు. 2. దూడ. 3. కవిత్వము చెప్పి జీవించువాడు, విణ. పాలు పిదుకువాడు.
దోగ్ధ్రి సం. వి. 1 ఈనిన ఆవు. 2. గొల్లది
దోజము వి. 1. భుజమునకు బలము వచ్చుటకై త్రిప్పెడు ఉపకరణము, 2. మ్రాను సుకరముగా చీల్చుటకై మేకులు దిగగొట్టెడు సాధనము రూ దోణాము ద్రోణము, ద్రోణాము.
దోదసి వై. వి. ద్వాదశి, ఒకానొక తిథి.
దోదుమి వి. పట్టాకత్తి. రూ. దోదుమ్మి.
దోసము విణ. అల్పము.
దోని వై. వి ద్రోణి, దొన, కాలువతూము.
దోనె వై. వి. ద్రోణి. చిన్నపడవ.
దోమ వి. చీకటీగ, మశకము.
దోమటి వి. అన్నము.
దోమతెర వి. దోమలు చొరకుండ వేయు వల గుడ్డ.
దోము వి. 1. పశువు పారుకొనుట. 2. అజీర్తిచే పారుకొనుట.
దోయి వై. వి. ద్వయి, జత. సం. ద్వయీ
దోయికట్టు క్రి. జతగూడు.
దోయిడి విణ. శూన్యము, రిత్త.
దోయిలి వై. వి. అంజలి, పంపబడిన రెండు చేతుల కెరిక. రూ. దోసిలి.
దోర వి. రాశి. విణ. 1. ఎఱ్ఱపారినది. 2. ఒరిగినది.
దోరగల్లు వి. పాటువడుట.
దోరగిలు క్రి. 1. కాయలు ఎఱ్ఱవారు. 2. వ్రాలు.
దోరణ వై. వి. తోరణము, మామిడాకులు మొదలగునవి గ్రుచ్చిన సరము. రూ. దోరణము. సం. తోరణమ్.

దోరణపు(గపెట్టె వై. ద్వారము మీది అడ్డకమ్మి.

దోరణపు(గుప్పె వై. వి. కపిలె బొక్క క్రింద యడ్డ పట్టె.

దోరణపు సొరంకట్టు వి. [illegible] దాక, తోరణమువలె నుండు నక్షత్రము.

దోరపాక వి. ఓరపాక.

దోరము వై. వి. దువారము, ద్వారము.

దోరు క్రి. 1. తాడగు. 2 చచ్చు. వి. అడ్డుగా పెట్టు ముళ్ళ కంప.

దోరుచు క్రి. చావచేయు, దోచు, పోరించు,

దోర్మధ్యము సం. వి, 1. పిడికిటిపోటు. 2. భుజముల నడిమి ప్రదేశము.

దోర్యుగము సం. వి. రెండు బాహువులు

దోల సం. వి డోల, ఉయ్యాల.

దోవతి వి. మగవాని కట్టు వస్త్రము,

దోష సం వి. 1, భుజము. 2. రాత్రి,

దోషకము సం. వి. 1. దోసె, 2 అవుదూడ. (అవి కొందరు,)

దోషకారి సం, విశ. దోషముచేయువాడు,

దోషజ్ఞుడు సం. వి. 1. విద్వాంసుడు. 2. వైద్యుడు, విశ. దోష మెరిగినవాడు.

దోషము సం. వి. 1. తప్పు, 2. పాపము.

సం. వి. (గణి) కొలతలలోని తప్పులు.

దోషయుతము సం. విశ లోపములు గలది. [illegible] కలది. (Faulty).

దోషాకరుడు సం. వి. 1. చంద్రుడు 2 దుష్టుడు.

దోషా[illegible] సం. వి. 1. [illegible] [illegible]

దోషి సం. విశ దోషము కలవాడు.

దోస వి. దోసతీగె, దోసకాయ తీగ.

దోసము వై. వి దోషము.

దోసి వై. విశ దోషి.

దోసిలి వై. వి దోయిలి, [illegible].

దోసె వి. అట్టు. చూ దోసై. వి. దోసె.

దోహదము సం వి. 1, ఇచ్ఛ 2. గర్భిణికి గల వేవిళ్ళు, 3, ఎరువు. 4. తరుగుల్మలతాదులను అకాలమున పుష్పింపచేయు స్త్రీల పాదతాడనాది క్రియ.

దోహదలక్షణము సం. వి. 1. స్త్రీల యౌవనసంధి. 2. గర్భలక్షణము.

దోహదవతి సం. వి. వేవిళ్ళు గల స్త్రీ.

దోహనము సం. వి. పాలు పిదుకుట.

దోహలము సం. వి. 1. ఉత్సాహము. 2. చూలు. 3. కోరిక. 4. అదరము.

## దౌ

దౌ వై. వి. దూరము, విశ దూరముగా. సం. దూర్. రూ. దవు, దవ్వు, దౌవు.

దౌడ వి. తాలువు. రూ. దవుడ.

దౌడు వై. వి. పరుగు. రూ. దవుడు, సం. ధావ్.

దౌత్యము సం. వి. దూత్యము రాయబారము,

దౌను వి. కాంతి. రూ. దవురు.

దౌర్జన్యము సం. వి. చెడ్డతనము, దుండగము

దౌర్బల్యము సం. వి. బలహీనత, అశక్తత. అనర్హత. (Disability).

దౌర్భాగ్యము సం. వి. దురదృష్టము.

దౌవారికుడు సం. వి. ద్వారపాలకుడు.

దౌవు వై. వి. దౌ. రూ. దవ్వు.

దౌష్ట్యము సం. వి. దుష్టత్వము.

దౌహిత్రి సం. వి. దుహితకొమార్తె. మనుమరాలు.

దౌహిత్రుడు సం. వి. దుహితకొడుకు. మనుమడు.

దౌహృదము సం. వి. వేవిళ్ళు.

దౌహృదిని సం. వి. చూలాలు, గర్భవతి.

# ద్యా

ద్యావాపృథువులు సం. వి. భూమ్యాకాశములు, ద్యావాభూములు.

# ద్యు

ద్యుతి సం. వి. 1. కాంతి. 2. కిరణము. 3. పరాక్రమము

ద్యుమణి సం. వి. సూర్యుడు, చదలుమానికము.

ద్యుమ్నము సం. వి. 1. ధనము. 2. బలము.

ద్యువు సం. వి. 1. ఆకాశము, 2. దినము. స్వర్గము.

# ద్యూ

ద్యూతము సం. వి. జూదము.

ద్యూనము సం.వి. 1. ఆడుట. 2. స్తుతించుట. 3. నిద్రించుట.

# ద్యో

ద్యోతకము సం. విశే. 1. ప్రకాశింపచేయునది. 2. ప్రకాశించునది.

ద్యోతము సం. వి. 1. ప్రకాశము. 2. ఎండ

ద్యోతించు సం. క్రి. ప్రకాశించు.

ద్యోతితము సం. విశే. 1. ప్రకాశితము. 2. స్ఫురింప చేయబడినది.

# ద్ర

ద్రప్సము సం. వి. 1. అడుగు పెరుగు. 2. నీటిబొట్టు. 3. నీళ్ళుకలిపిన పెరుగు.

ద్రవపదార్థము సం. వి. ( గణి., భౌతి. ) ద్రవము. (Liquid). ఒక నిర్ణీత ఘనపరిమాణము కలిగి అది యుండు పాత్ర రూపమునే ధరించు ద్రవ్యము.

ద్రవము సం. వి. 1. తడి. 2. పరిహాసము. 3. పరుగు. 4. యుద్ధమునుండి పారుట. 5. వేగము.

ద్రవరాజము సం. వి. (రసా.) బంగారము. ప్లాటినములను కరిగించుకొనెడి నైట్రిక్ ఆమ్లము. హైడ్రోక్లోరికామ్లముల మిశ్రమము. (Aqua Regia).

ద్రవసాంద్రతామాపకము సం. వి. (భౌతి.) ద్రవము యొక్క సాంద్రత లేక చిక్కదనము కనుగొనుట కుపయోగపడు ఒక పరికరము. (Hydr ometer).

ద్రవించు సం. క్రి. కారు.

ద్రవిడము సం. వి. 1. దక్షిణదేశము. 2. దక్షిణదేశ భాష. రూ. ద్రావిడము.

ద్రవిణము సం. వి. 1. ధనము. 2. బంగారు. 3. బలము.

ద్రవీకరణము సం. వి. (రసా.) వాయువును శీతలీకరించియో దానిపై ప్రేషము నెక్కువచేసి శీతలీకరించియో ద్రవస్థితిలోనికి తెచ్చుట. (Liquefraction.)

ద్రవీభవనగుప్తోష్ణత సం. వి. (భౌతి.) ఉష్ణోగ్రత మారకుండ ఒకగ్రాము ద్రవ్యమును

ఘనస్థితినుండి ద్రవస్థితికి మార్చుటకవసరమగు ఉష్ణరాశి. (Latent heat of fusion).

ద్రవీభవనము సం. వి (భౌతి.) ఆవిరిని చల్లార్చి తిరిగి ద్రవముగా బడయుట (Condensation). ఘనస్థితినుండి ద్రవస్థితికి వచ్చు మార్పు. (Melting).

ద్రవీభవనస్థానము సం.వి (భౌతి.) ఒక ఘన పదార్థము ఘనస్థితినుండి ద్రవస్థితికి మారుటకు ప్రారంభమగు నప్పటి యుష్ణోగ్రత. ద్రవీభవనాంకము (Melting point)

ద్రవ్యము సం. వి 1. ధనము 2 వస్తువు.

ద్రవ్యము సం వి (అర్థ.) 1. క్రయవిక్రయ కార్యములలో వినిమయమునకు ఉపయుక్తమగునట్టిది. (Money). 2. ప్రభుత్వామోదము కలిగిన ఏదైన వస్తువు 3. (భౌతి.) పదార్థము (Matter).

ద్రవ్యరాశి సం. వి. (రసా.) చలనమందలి మార్పునకిది చూపు నిరోధము మానముగా గల వస్తువునందలి భౌతికద్రవ్య సంచయము, (Mass). సం వి. (గణి. భౌతి.) వస్తువులోని మొత్తము పదార్థము (Mass).

ద్రవ్యవిధానము సం. వి. (అర్థ.) ద్రవ్య విషయములలో ప్రభుత్వ విధానము. దేశములలో ద్రవ్య మెంత యుండవలయును అను విషయముపై ప్రభుత్వ విధానము

ద్రవ్యసంచయము సం వి. (భౌతి.) ద్రవ్యరాశి. (Mass) ఒక వస్తువులో ఎంత పరిమాణము ద్రవ్యమున్నదో తెలుపు సంఖ్య. (దీనికి చిహ్నము m )

ద్రవ్యోపసంహరణము సం. వి. (అర్థ.) దేశములో గల వస్తువులు ప్రజలు వానిని అనుభవించుటతో పోల్చిచూచిన ద్రవ్యము తక్కువగనున్న పరిస్థితి దీనివలన వస్తువుల ధరలు పడిపోవును.

ద్రవ్యోల్బణము సం. వి. (అర్థ.) అవసరమైనంత కన్న ఎక్కువ చెలామణి ద్రవ్యము దేశములోనున్న పరిస్థితి. దీనివలన వస్తువుల ధరలు పెరిగిపోవును.

# ద్రా

ద్రాక్ష సం.వి. ఒకజాతి ఫలలత, ద్రాక్షపండు.

ద్రాక్షచక్కెర మి. వి. (వృక్ష) ద్రాక్ష పండ్లలో నుండు చక్కెర, గ్లూకోజ్. (G'ucose).

ద్రాఘిష్ఠము సం. వి. మిక్కిలి దీర్ఘము.

ద్రాబ విశే 1. అసారము. 2. అసారుడు. 3. అధమము. 4. అధముడు.

ద్రావకము సం వి 1. వస్తువులనుండి తీయు రసము. 2. బరువైనరాయి. వి. (రసా.) వేడివలన అతి సులభముగా కరగు ద్రవ్యము ముఖ్యముగా ఇంకొక ద్రవ్యమును ఎక్కువ సులభముగా కరగునట్లు చేయు ద్రవ్యము. (Flux). ధాతుసాధనలో నిట్టి ద్రవ్యము లావశ్యకములు.

ద్రావణము సం. వి. (రసా.) ద్రవములో ఏదైన వస్తువు పూర్తిగా కరిగిపోగా ఏర్పడిన మిశ్రమము. (Solution).

ద్రావణి సం. వి. (రసా.) కరిగించుకొను ద్రవము. (Solvent).

ద్రావణీయత సం వి. (రసా. భౌతి.) ద్రావ్యత (Solubility) ఒక నియమిత ఉష్ణోగ్రత వద్ద 100 గ్రాముల ద్రవమును సంతృప్తము చేయుటకు కావలసిన ద్రావితము యొక్క బరువు.

ద్రావణీయము సం. విశే. కరగునట్టిది. (Soluble).

ద్రావము నం. వి. (భౌతి. రసా.) ఒక ద్రావణిలో కరుగగల ద్రవ్యము. (Solute). ఇది ద్రవస్థితులు మూడిటిలో ఘన ద్రవ వాయు స్థితుల ఏదైనను కావచ్చును. (గృహ.) కరిగించు ద్రవము. (Solvent). ఉదా. నీరు, స్పిరిటు, మద్యసారము మొదలగునవి.

ద్రావ్యము నం. వి. (రసా.) కరుగు ఘన పదార్థము. (Solute)

ద్రావిడ ప్రాణాయామము నం. జాతీ. 1. సులభముగా కానిపని. 2. సూటిగా చెప్పక డొంకతిరుగుడుగా చెప్పుట.

ద్రావితము నం.వి. (రసా.) కరిగిన ద్రవ్యము.

# ద్రి

ద్రిండు వి. దిండు.

ద్రిమ్మరించు వి. (అధికముగా) ద్రుమ్మరించు, రూ. దిమ్మరించు.

# ద్రు

ద్రుణము నం. వి. 1. కత్తి. 2. విల్లు. 3. తేలు. 4. తుమ్మెద.

ద్రుతము నం విశే. 1. త్వరితము. 2. కరిగనిది. 3. జారినది. నం. వి. 1. వ్యాకరణమునందు నకారము. 2 తేలు. 3 చెట్టు.

ద్రుతప్రకృతికము నం.వి. (వ్యాక.) ద్రుతము చివరగల తెలుగు పదము: ఉదా. వచ్చెన్, కొట్టున్.

ద్రుతి నం. వి. (భౌతి) చలించు దిశను ఉపేక్షించి వస్తువు చలించు పరిమాణము. (Speed).

ద్రుపదము నం. వి. బొండ కొయ్య.

ద్రుమము నం. వి. వృక్షము.

ద్రుమిక నం. వి. మొలక, మొక్క.

ద్రుహిణుడు నం. వి. బ్రహ్మ. రూ. ద్రుఘణుడు వ్యు. అసురులను హింసచేయువాడు.

# ద్రూ

ద్రూఘణము నం వి. 1. గండ్రగొడ్డలి. 2. ఇనుపగుదియ రూ. ద్రుఘణము.

ద్రూణము నం. వి. ఎఱ్ఱతేలు, తేలు. రూ. ద్రుణము.

# ద్రొ

ద్రొబ్బు క్రి. పడద్రోయు.

ద్రొబ్బుడుపటము వి. చేపలను పట్టుట కుపయోగించు సాధనము.

# ద్రో

ద్రోణదళములు నం. వి. (వృక్ష.) పతంగాకార పుష్పము యొక్క నౌతలము (Keel) ఏర్పడిన రెండు ఆకర్షణ పత్రములు. (Keel Petals).

ద్రోణము వి: దోణము. నం. వి. 1. తూము. 2. తేలు, 3. మాలకాకి.

ద్రోణి నం. వి. 1. చిన్నపడవ. 2. దోనె. 3. పసులు మేయు కంచె. 4. కొండపల్లము.

ద్రోవది వై. వి. ద్రౌపది, ద్రుపదరాజు కూతురు.

ద్రోహము సం. వి. కీడుతలవు. 2. చంపు నిచ్చ.

ద్రోహి సం. విశే. ద్రోహము చేయువాడు.

# ద్వ

ద్వంద్వపౌరసత్వము సం (రాజ., పౌర.) ఒక రాజ్యములో పుట్టుట వలనగాని, నివాసమువలనగాని లభించిన పౌరసత్వపు హక్కుగాక తల్లి లేక తండ్రి ఇతర రాజ్య పౌరులయినచో వారి వలన ఆ రాజ్యపు పౌరసత్వము లంభించుట. ఉదా. ఫ్రాన్సు దేశీయుల సంతానమునకు కొన్ని సమాఖ్య రాజ్యములలో సమాఖ్య రాజ్య పౌర సత్వముగాక తాము నివసించు రాష్ట్రము నందు కూడ ప్రత్యేక రాష్ట్ర పౌరసత్వపు హక్కులుండును.

ద్వంద్వపరిపాలన సం.వి. (పరి.) ద్వంద్వాధిపత్యము. ప్రభుత్వాధికారములు రెండు భాగములుగా ప్రత్యేకింపబడుట. (స్వతంత్ర భారత పంచాయతీ పరిపాలనలో కూడ ఈ రీతి కన్పించును.) (Di-archy).

ద్వంద్వప్రభుత్వము సం. వి. (పరి.) రెండు ప్రభుత్వములు. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ 'రాబర్టు క్లైవ్' ఆధ్వర్యమున క్రీ.శ. 1765 సంవత్సరములో బెంగాల్ రాష్ట్రమందు ప్రవేశపెట్టిన పరిపాలనా విధానము.

ద్వంద్వము సం. వి. 1. జత. 8. స్త్రీపురుషుల జత. 3. ఇద్దరు ఒకరితో ఒకరు చేయు యుద్ధము. 3. రహస్యము. 4 శీతోష్ణాదులు.

ద్వయము సం. వి. 1. జత, రెండు.

ద్వయి సం. వి. దోయి, జత.

ద్వయోష్ఠి సం. విశే (వృక్ష.) రెండు పెదవులు (పై పెదవి క్రింది పెదవి) గల ఆకారము (Bilabiate) (ఆకర్షణ పత్రవలయము).

# ద్వా

ద్వాదశకము సం. సర్వ. పండ్రెండు.

ద్వాదశము సం. సర్వ. పండ్రెండవది.

ద్వాదశాత్ముఁడు సం. వి. సూర్యుడు.

ద్వాదశి సం. వి. పక్షమందు పండ్రెండవ తిథి, దోదసి.

ద్వాపరము సం. వి. 1. మూడవ యుగము. 2. సందేహము.

ద్వారకము సం. వి. (భౌతి.) కాంతి ప్రవేశించుట కుద్దిష్టమైన చాక్షుష పరికరమందలి ద్వారము యొక్క వ్యాసము. (Aperture).

55

ద్వారకోశికములు సం. వి. (వృక్ష.) ఆకుల బహిశ్చర్మముననుండు పత్రరంధ్రములకు గల రెండు జీవకణములు. ఇవి పత్రరంధ్రమును మూయుటకు, తెరచుటకు వినియోగపడుచుండును. (Guard-cells).

ద్వారకోశికములు

ద్వారపాత్ర సం. వి. (జం) (Pylangium or conus arteriosus) ధమనస్కంధము (Trunkus arteriosus) యొక్క రెండు కుహరములలో మొదటి కుహరము. ఇది గుండెకాయలో ఎడమ కర్ణికా భాగముచే కప్పబడియుండును. దీనిలో బృహద్ధమన కుహరము, శ్వాసత్వక్ కుహరము ఉండును. ధమన మూలము.

ద్వారపాలకుఁడు సం. వి. వాకిటి కావలి వాడు.

ద్వారబంధము సం. వి. వాకిలి కమర్చిన మ్రాని చట్టము.

ద్వారము సం. వి. 1. వాకిలి 2. ఉపాయము

ద్వారస్థితకుఁడు సం. వి. ద్వారపాలకుడు రూ ద్వారస్థుడు,

ద్విఃకరగ్రహణము సం. వి. (అర్థ., వాణి.) ఒకే వ్యక్తినుండి ఒకే పేరున రెండు సార్లు వన్ను వసూలు చేయుట

ద్వికము సం. వి 1. రెండు. 2. కాకి. వ్యు రెండు 'కా' లను గలది. 3. జక్కవ.

# ద్వి

ద్వికుంభీయము సం. విశే. (భౌతి.) రెండు ప్రక్కల ఉబ్బెత్తుగా నున్నది. (Biconvex).

కటకము (Biconvex lens)

ద్వికోష్ఠకము సం. విశే. (వృక్ష,) రెండు గదులుగలది. Bilocular). (అండాశయము).

ద్విఖండనరేఖ సం. వి. (గణి.) రెండు సమ భాగములుగచేయు సరళరేఖ.(Bisector)

ద్విగతిచర్య సం. వి. (రసా.) ద్వివిఘటనము పరావర్తనీయ ప్రతిక్రియ, రాసాయనిక వియోగము వలన ఒక పదార్థము రెండు పదార్థములుగ విడిపోయిన పరిస్థితుల మార్పు వలన మరల సమ్మేళనము చెంది మొదటి పదార్థముగా మారెడి రాసాయనికపుమార్పు. (Reversible reaction)

ద్విగుణ సం. విశే. (జీవ.) తయారైన అండము, శుక్రకోశముతప్ప శరీరమున మిగిలిన జీవకణములన్నిటిలోను క్రోమోసోములు రెండు వర్గములుగా నుండుట. (Diploid).

ద్విగుణాధిస్ఫురితము సం. వి. (వ్యవ.) సామాన్యమగు అధిస్ఫురితము (Super phosphate) అలోకంటె స్ఫురత్వంచామ్ల జనిదము సుమారు రెట్టింపు ఉండునది. (Double super phosphate).

ద్విగువు సం. వి. (వ్యాక.) సంఖ్యాపూర్వక సమాసము. ఉదా. ముల్లోకములు, ముత్తెరగులు,

ద్విజము సం, వి. 1. పక్షి. 2. పాము. 3. దంతము. 4. చేప. రూ, ద్విజన్మము వ్యు రెండు పుట్టుకలు గలది.

ద్విజరాజు సం. వి, 1. చంద్రుడు. 2. గరుడుడు. 3. శేషుడు. 4 ఉత్తమద్విజుడు,

ద్విజిహ్వము సం, వి. పాము, వ్యు రెండు నాల్కలు కలది.

ద్విజిహ్వుఁడు సం. విశే కొండెగాడు.

ద్విజుఁడు సం. వి. 1. బ్రాహ్మణుడు. 2. క్షత్రియుడు. 3. వైశ్యుడు, వ్యు, జన్మించిన పిదప ఉపనయనముచే రెండవ పుట్టుక గొన్నవాడు. రూ. ద్విజన్ముఁడు.

ద్వితచాపము సం. వి. (జం) భేక శిశువు యొక్క కపోలము క్రిందనున్న జలక్లోమ చాపములకు


ద్వితసాధనము (కప్ప)

ద్విబీజదళయుతములు సం. వి. (వృక్ష.) గింజలలో రెండు బీజదళములు గల మొక్కలు (Decotyledonous plants or Dicots).

ద్విభాగశీల సం. విశే. రెండు భాగములుగా విభజన చెందు నట్టిది (Binary).

ద్విభాషి సం. విశే. రెండు భాషలు తెలిసిన వాడు, దుబాసి.

ద్విమందిర సభావిధానము సం. (రాజ;వరి; పౌర.) రెండు శాసన సభలుగల రాజ్యాంగ విధానము, ద్విసభావిధానము.

ద్విరదము సం. వి. ఏనుగు వ్యు. రెండు దంతములు గలది.

ద్విరసనము సం. వి. పాము. వ్యు. రెండు నాలుకలు కలది.

ద్విరూపము సం. విశే. (జీవ.) రెండు రూపములలో నున్నది. రెండు రూపములు కలది. (Dimorphic).

ద్విరూపత సం. వి. (జీవ.) రెండు స్పష్టమైన రూపములలో నుండుట. (రసా.) కొన్ని ద్రవ్యములు రెండు భిన్నస్ఫాటిక రూపములు కలిగి యుండుట.(Dimorphism). ఉదా. గంధకము మొక్క మోనోక్లినిక్, రాంబిక్ స్ఫాటిక రూపములు.

ద్విరేఫము సం. వి. భ్రమరము. వ్యు. రెండు రేఫములు కలది.

ద్విలవణము సం. వి. (రసా.) రెండు లవణములు కలిసి ఒకే రాశిగా నేర్పడిన లవణము, (Double salty). ఉదా. పటిక ఇది ఎల్యూమినియమ్ పొటాసియమ్ సల్ఫేటులు కలసి ఏర్పడిన లవణము.

ద్విలింగము సం. వి. (వృక్ష.) స్త్రీపురుష భాగములు రెండును గల (పుష్పము). ద్విలింగయుతము Bisexual or hermaphrodite).


ద్విలింగ (పుష్పము)
రక్షకపత్రవలయము
ఆకర్షణపత్ర వలయము
పుంకేసర వలయము
అండ కోశము

ద్విలింగి సం. విశే. (వృక్ష.) ఆడు పువ్వులు మగ పువ్వులు ఒకే మొక్క పై నున్నట్టిది (Monoecious) ఉదా. ఆముదపు మొక్క.

ద్వివయనము సం. వి. (గృహ.) జవులినేత, రెండు పోగుల నుపయోగించిన నేత, జంటపోగుల నేత. (Double weave). ఈ నేతను దుప్పట్లు నేయుట కుపయోగింతురు

ద్వివార్షికము సం. విశే. (వృక్ష.) రెండు ఋతువులుగాని రెండు సంవత్సరములు గాని పెరిగి చనిపోవు మొక్క.(Biennial).

ద్వివిదారణ (ఫల)ము సం. వి. (వృక్ష.) రెండు సేవనుల (Sutures)మీదను పగులు నట్టికాయ. (Lugume).

ద్వివిభజనము సం. వి. (వృక్ష.) ముఖ్యముగా ఏకకణ జీవులలో అష్టి రెండుగా చీలి జీవకణము రెండు దుహితృకణములుగా విభజన చెందుట (Binary fission.)

ద్విశాఖీయము సం. విశే. (వృక్ష.) రెండు శాఖలు గలది. (Biramous).

ద్విశాఖీయ మధ్యారంభమంజరి సం. వి. (వృక్ష.) ఈ పుష్ప గుచ్ఛములో పుష్ప దండము చివర నొక పుష్పముండును, దాని ప్రక్కలనుండి రెండు మధ్యారంభ మంజరులు బయలుదేరును. (Compound cyme or Dichasial cyme).

ద్విషత్తు సం. వి. శత్రువు. చూ. ద్విషుఁడు.

ద్విసంయోజకము సం. విణ. (రసా.) రెండు ఉదజని పరమాణువులతో సంయోగించ గల మూలద్రవ్య పరమాణువు గలది. (Divalent).

ద్విసంలగ్నము సం,విణ. (వృక్ష.) పుష్పములోని పుంకేసరములు వాని దండములతో కలసి రెండు కట్టలుగా నున్నది (Diodelphous). (ఇచ్చట పుప్పొడి తిత్తులు కలిసి యుండవు).

ద్విసిరకందరము సం. వి. (జీవ.) చేతిదండ (Biceps muscle).

ద్విస్తరజనితము సం.విణ. (జం.) భ్రూణము యొక్క బహిశ్చర్మము అంతశ్చర్మము అను రెండు ఆద్యస్తరముల నుండి ఏర్పడినది. (Diploblastic).

ద్విస్పర్శపద్ధతి సం. వి. (భౌతి.) ఉక్కు కడ్డీని అయస్కాంతముగా మార్చు పద్ధతులలో నిది యొకటి. (Double-touch method).

## ద్వీ

ద్వీపము సం. వి. 1. 1. పులితోలు. 2. లంక దీవి నలువైపుల నీటిచే చుట్టబడిన భూమి.

ద్వీపపుంజము సం. వి. (భూగో.) సముద్ర మధ్యమున లేక నీటి మధ్యమున నున్న ద్వీప సమూహము.

ద్వీపవతి సం. వి. నది.

ద్వీపి సం. వి. 1. పులి. 2. చిరుతపులి. 3. సముద్రము.

## ద్వే

ద్వేషణుఁడు సం. వి. శత్రువు.

ద్వేషము సం. వి. పగ.

ద్వేషి సం. విణ. ద్వేషము కలవాడు.

ద్వేషించు సం. క్రి. పగవహించు.

ద్వేష్ట సం. విణ. ద్వేషించువాడు.

ద్వేష్యుఁడు సం. వి. పగవాడు. విణ. పగ గొనదగినవాడు.

## ద్వై

ద్వైతము సం. వి. 1. జీవాత్మపరమాత్మలకు భేదము తెల్పెడి మతము. 2. ఒక వనము.

ద్వైధవ్యాపారము సం. వి. (వాణి.) సాహసిక వ్యాపారములోవలె ఇట్టి వ్యాపారములో గూడ ముమ్ముందు ధరలు మారునని యెంచి ఒడంబడిక చేసికొందురు. ధరలు తరుగునని అనుకొని ఒకరితో ప్రస్తుతపు ధరకు సరకు నమ్మెదనని వ్యాపారి ఒడంబడిక చేసికొనును, అట్లే ధరలు పెరుగునను ఉదేశముతో ప్రస్తుతపు ధరకు సరకు కొందునని అతడు మరియొక ఒడంబడిక చేసికొనును. దీనివలన ఒక ఒడంబడిక వలన నష్టము వచ్చినను రెండవదానివలన లాభము వచ్చు నవకాశముండును.

ద్వైపము సం. విణ. ద్వీపి చర్మముచే కప్పబడినది (రథము). ద్వీప సంబంధమైనది.

ద్వైమాతురుఁడు సం. వి. 1. వినాయకుడు. 2. జరాసంధుడు వ్యు. ఇద్దరు తల్లులు గలవాడు.

# ద్వి

ద్వ్యణుకము సం. విశే. (రసా.) రెండు అణువులతో సంబంధించినది. రెండు అణువులు పొల్గొనినవి. (Bimolecular).
ద్వ్యష్టము సం. వి. రాగి, తామ్రము.

# ధ

ధ ఒక యక్షరము
ధటము సం. వి. కొయ్య త్రాసు.
ధటి సం. వి. ఒట్టి, గోచి.
ధటిని సం. వి నూలి మొలత్రాడు.
ధనంజయుఁడు సం. వి. 1. అగ్ని. 2. అర్జునుడు.
ధనదుఁడు సం. వి. కుబేరుడు. విశే. దాత.
ధనధ్రువము సం వి. (రసా.) ఋణ విద్యు దావిష్టకణములను ఆకర్షించు ధ్రువము (Anode).
ధనము సం. వి. విత్తము. 2. ఆలమంద వి. (గణి.) అంకగణిత సంజ్ఞ (Positive)
ధనాగ్రము సం. వి. (భౌతి.) విద్యుత్పేటిక యందు విద్యుత్ప్రవాహము ప్రవేశించు కొన (Anode)
ధనాత్మకము సం. విశే. (గణి.) శూన్యము కన్న పెద్దదైనది. (Positive).
ధనాధిపుఁడు సం. వి కుబేరుడు.
ధని సం. వి ధనము కలవాడు.
ధనిక సం. వి. 1. వర్తకుని భార్య. 2. యువతి.
ధనికము సం. వి. దనియాలు.
ధనికవర్గాధిపత్యము సం. వి (రాజ.) ధనిక స్వామ్యము, ధనిక ప్రభుత్వము (Plutocracy).
ధనికుఁడు సం. వి. 1. ధనము కలవాడు. 2. మంచివాడు. 3. అప్పిచ్చువాడు.
ధనియము సం. వి. (వ్యావ.) సంబార ద్రవ్యములలో నొకటి. ఇది Umbeluiferae అను కుటుంబమునకు చెందిన కొత్తిమిరి మొక్క (Coriandrum sativum) మొక్క ఎండిన కాయ. (Coriander).
ధనిష్ఠ సం. వి. నక్షత్రములయం దొకటి.
ధనుర్ధరుఁడు సం. విశే. విలుకాడు
ధనుర్వాతము సం వి. (గృహ) ఇది అంటు వ్యాధి సంబంధమైన జబ్బు. 'టిటానస్' (Tetanus) అనెడి విషక్రిముల వలన ఈ వ్యాధి కలుగును. ఇది ప్రాణాపాయకర మైన వ్యాధి.
ధనువు సం. వి. 1. విల్లు. 2. గ్రహరాసు లలో నొకటి. 3 నాలుగు మూరల కొలది. రూ. ధనుస్సు.
ధనుష్మంతుఁడు సం. విశే. విలుకాడు.
ధన్య సం. వి. దాది. విశే. ధన్యురాలు
ధన్యవాదము సం వి. కృతజ్ఞతను తెలుపు అభివందనము.
ధన్యుఁడు సం. విశే. పుణ్యవంతుడు,
ధన్వంతరి సం. వి. 1. దేవవైద్యుడు. 2. సూర్యుడు. 3. మహేశ్వరుడు.
ధన్వము సం. వి. 1. మెట్టనేల. 2. విల్లు. 3. నిర్జలనేల.
ధన్వి సం. విశే. 1. విలుకాడు. 2. నేర్పరి.
ధమకము సం. వి (రసా.) ద్రవములు వేడి చేయబడినవు డొకప్పుడు వాని క్వథ నాంకమువద్ద మరుగు చిహ్నములను చూపక ఇంకను వేడిని తీసికొని తావిత గత యెక్కువయైన హఠాత్తుగా మరు గుట కారంభించుటలో పాత్ర అడుగున

ద్రవములో ఒక్కుమ్మడి ఆవిరి ఏర్పడి పై ద్రవ స్తంభమును పైకెత్తి క్రిందికి పడవేయుట. ఇందు ధమధమ యను శబ్దము పుట్టును కనుక ఈ పేరు వచ్చినది (Bumping).

ధమనమూలము నం వి (జం) ధమన స్కంధము యొక్క రెండు భాగములలో నొకటి. ఇది పొడవుగా హృదయకుహరములోనున్న భాగము. (కప్ప) (Conus arteriosus or pylangium)

ధమనస్కంధము నం. వి. (జం) ఒరరికలో నుండి మంచి రక్తము ప్రవేశ పెట్టబడు పెద్దగొట్టము(కప్ప)(Truncus arteriosus).

ధమని నం. వి. 1. అవయవములకు గుండె నుండి నెత్తురు తీసికొనిపోవునరము. 2. మెడ. 3. అగసాలెవాని ఊదుగొట్టము నం. వి (జం.) మంచి రక్తమును తీసికొని పోవు రక్తనాళము. (Artery)

ధమనుఁడు నం. వి. అగ్ని. విశ. 1. కొలిమి తిత్తి నూదువాడు. 2. క్రూరుడు.

ధమ్మిల్లము నం. వి. కొప్పు.

ధర నం. వి. భూమి.

ధరణము నం.వి. 1.ధరించుట. 2.ఒకకొలత.

ధరణి హిం. వి. సమ్మెచేయువారు కార్యాలయముల ముందుచేయు ఆటంకము.

ధరణి నం. వి. భూమి. రూ. ధారణి.

ధరణిసురుఁడు నం. వి. బ్రాహ్మణుడు.

ధరణిధరము నం. వి. 1. కొండ. 2. నేల తాలువు.

ధరణీశ్వరుఁడు నం. వి. 1. రాజు.2. శేషుడు, 3. విష్ణువు.

ధరణీశ్వరుఁడు నం. వి. రాజు.

ధరముక్కి నం. వి. 1. కొండ. 2. వెల.

ధరాధరము నం. వి. 1. కొండ. 2. తాబేలు.

ధరావత్తు (వాణి.) (వస్తువుల కొనుగోలు, అమ్మకం, కాంట్రాక్టు వగైరా.)వానికి ముందుగా ఇచ్చుకట్టు ధనము (Deposit).

ధరించు నం. క్రి. తాల్చు.

ధరిత్రి నం వి భూమి. రూ. ధారయిత్రి.

ధర్త నం. విశ ధరించువాడు.

ధర్షితము నం. విశ. ధిక్కరింపబడినది.

ధర్మతంత్రము నం. వి. (చరి ,రాజ) థియోక్రసి(Theocracy) మత గురువులచే వాని ప్రత్యేక మత ధర్మ సూత్రముల ప్రకారముగ నాని పరిపాలింపబడు రాజ్యము.

ధర్మధ్వజి నం. వి. జీవనార్థము సన్యాసి వేషము ధరించినవాడు

ధర్మనిబద్ధమైన రాచరికము వి. (చరి.) నియమబద్ధమైనరాచరికము.సంవిధానము ప్రకారము నడచుకొను రాచరికము. (ఇచట ప్రాముఖ్యము రాజునకుగాక ప్రజలయందుండును. (Constitutional monarchy).

ధర్మము నం. వి. 1. పుణ్యము. 2. న్యాయము. రూ. ధర్మువు, 2. సామ్యము. 3. స్వభావము. 4 ఆచారము.5.అహింస. 6. వేదోక్తవిధి. 7. విల్లు. (గణి) గుణము (Property)

ధర్మములు నం. వి. (భౌతి.) వస్తువుల గుణములు. (Properties).

ధర్మరాజు నం. వి. 1. యుధిష్ఠిరుడు. 2. యముడు. 3. బుద్ధదేవుడు.

ధర్మశాస్త్రములు నం. వి. (చరి.) భారతీయ సామాజిక వ్యక్తిగత జీవితములనుశాసించు గ్రంథాలు. (బౌధాయన, ఆపస్తంబ వశిష్ట ధర్మ సూత్రములు, మనుస్మృతి యాజ్ఞవల్క్య, నారద, బృహస్పతి స్మృతులు, దేవన్నభట్టు రచించినస్మృతి చంద్రిక. క్రీ. శ. 12వ శతాబ్దము, నీలకంఠుడు రచించిన వ్యవహార ముఖము ధర్మశాస్త్రములుగా గుర్తించబడినవి).

ధర్మాధికరణము సం. వి. న్యాయ విచారణ స్థలము.

ధర్మాధికృతుఁడు సం. వి. న్యాయము విచారించువాడు. రూ. ధర్మాధికారి.

ధర్మాసనము సం. వి. ధర్మాధికారి కూర్చుండు పీఠము

ధర్మి సం. విశే. ధర్మముగలది.

ధర్ముఁడు సం. వి. 1. యముడు. 2. సోమయాజి.

ధర్మ్యము సం. విశే. ధర్మమునుండి తొలగనిది.

ధర్షణము సం. వి. 1. తిరస్కరించుట, 2. బెదరించుట.

ధర్షణి సం. వి. రంకుటాలు.

ధవతము సం. వి. కోడిగ్రుడ్డులోని తెల్లనిసొన (Albumen).

ధవళ సం. వి. ఆవు వ్యు. పరిశుద్ధమైనది.

ధవళము సం. వి. అబోతు. విశే. 1. తెల్లని 2. చక్కనిది.

ధవళిమ సం. వి. తెలుపు.

ధవిత్రము సం. వి. జింకతోలు విసనకఱ్ఱ.

ధవుఁడు సం. వి. 1. పెనిమిటి. 2. రాజు.

# ధా

ధాటి సం. వి. దండయాత్ర, దాడి.

ధాత సం. వి 1. బ్రహ్మ. 2. 60 సంవత్సరములలో నొకటి, విశే 1. ధరించువాడు 2. రక్షించువాడు.

ధాతుమలము సం. వి. (రసా) ధాతు సాధనలో ద్రవీభవించిన ధాతువుపై చేరిన తెట్టె (Slag)

ధాతుమిశ్రమము సం. వి. (రసా) అనేకలోహముల కలయిక (Alloy).

ధాతు రసాయనశాస్త్రము సం. వి. (రసా) ధాతువులకు బీజములకు సంబంధించిన రసాయనశాస్త్రము (Metallurgical chemistry) (ధాతుసాధన ధర్మములు వాని యౌగికముల ధర్మములు వర్ణించు శాస్త్రము)

ధాతువు సం. వి. 1. వాతాది ధాతువులు. 2. శిలావికారము 3. శబ్దాది గుణములు (భౌతి,రసా) లోహ (Metal) (మూల) ద్రవ్యము, (వ్యావ,) అధాతువు (Non-metal) ఉదా. గంధకము, భాస్వరము మొ. 3. (వ్యాక) ప్రత్యయములు చేర్చని క్రియారూపము. ఉదా. విను, తిను, చేయు మొ.

ధాతుసాధనశాస్త్రము సం. వి. (రసా.) ఖనిజములనుండి లోహములను తయారుచేయు పద్ధతులను చర్చించుశాస్త్రము. ధాతుశాస్త్రము (Metallurgy).

ధాత్రి సం. వి. 1. భూమి. 2. దాది. 3. తల్లి. విశే. ధరించునది.

ధాత్రేయి సం. వి. 1. దాది 2. భూమి.

ధానుష్కుఁడు సం. విశే. విలుకాడు.

ధాన్యపు నుసివురుగు వి. (వ్యావ.) నిలువచేసిన వడ్లను దొలిచి పాడుచేయు పురుగు (Sitophilus oryzae Rice wevil). (ఇది బరిణె పురుగు కుటుంబములోనిది).

ధాన్యము సం వి. 1. వడ్లు మొ.గునవి, 2. దనియాలు. 3. కొఱ్ఱ, జొన్న మొదలగు తృణధాన్యములు (Grain).

ధాన్యాకము సం. వి. దనియాలు.

ధాన్యామ్లము సం. వి. పులియబెట్టిన కడుగు నీరు.

ధామనిధి సం. వి. సూర్యుడు.

ధామము సం. వి. 1. ఇల్లు, 2. చోటు, 3. కిరణము, 4. కాంతి. 5. ప్రభావము. 6. మేను, 7. పుట్టువు.

ధార నం. వి. 1. నీటిచాలు,—2, ఆయుధముల వాదర. 3. చిల్లి. 4. అశ్వగతి విశేషము. 5. ప్రవాహము. 6. పరంపర
ధారణ నం. వి. 1. భగవంతునం దేకాగ్రచిత్తము. 2. మేర. 3. వస్తువినిమయము. 4. జ్ఞాపకశక్తి.
ధారణశక్తి నం. వి. (భౌతి.) అయస్కాంతశక్తిని నిలుపు కొనగలిగిన శక్తి (Retentivity).
ధారణి నం. వి. భూమి. రూ. ధారుణి ధరణి.
ధారవోయు క్రి. చేతనీరుగొని దత్తముచేయు.
ధారాటము నం. వి. 1. గుఱ్ఱము. 2. వానకోయిల.
ధారాధరము నం. వి. 1. మేఘము. 2. కత్తి.
ధారాళము నం. విశే. అడ్డుపాటులేనిది.
ధారాస్పర్శి నం. విశే. (వృక్ష.) పుష్ప పత్రపారస్పర్శములో నిదియొక తీరు, పత్రముల అంచులు ఒక దానితో నొకటితగులుచుండు తీరు (Valvate).
ధార్తరాష్ట్రము నం. వి. 1. నల్లని ముక్కుకాళ్ళు గల హంస.
ధార్మికుఁడు నం. విశే. 1. పుణ్యాత్ముడు. 2. విలుకాడు.
ధార్యము నం. విశే. ధరింపదగినది.
ధార్ష్ట్యము నం. వి. దిట్టతనము.
ధావకపాత్ర నం. వి. (రసా.) పాత్రలను శోధించుటకు అవక్షేపములను కడుగుటకు జలసేకము నిచ్చు పాత్ర (Wash-bottle).
ధావకుఁడు నం. వి. చాకలి.
ధావనము నం. వి. 1. పరుగు. 2. శుద్ధి.
ధావనము నం. వి. (రసా.) కడుగుట (Washing).
ధావనమృత్తిక నం. వి. (గృహ.) చవుడు, చవిటిమన్ను (Fuller's earth). (దీనిని బట్ట లుదుకుటకును జిడ్డు మరకలు తీయుటకు నుపయోగింతురు);
ధావనయంత్రము నం. వి (గృహ.) విద్యుచ్ఛక్తి సహాయముతో బట్టలుదుకు యంత్రము (Washing machine).
ధావళ్యము నం. వి. తెలుపు. రూ. ధవళిమము.

## ధి

ధిక్కారము నం. వి. తిరస్కారము. రూ. ధిక్క్రియ, ధిక్కృతి.
ధిషణ నం. వి. బుద్ధి.
ధిషణుఁడు నం. వి. బృహస్పతి.
ధిష్ణ్యము నం. వి. 1. ఇల్లు, సదనము. 2. చోటు. 3. బలము. 4. నక్షత్రము.

## ధీ

ధీ నం. వి. బుద్ధి.
ధీంద్రియము నం. వి. (ధీ+ఇంద్రియము). జ్ఞానేంద్రియము.
ధీమంతుఁడు నం. వి. 1. బుద్ధిమంతుడు. 2. విద్వాంసుడు.
ధీర నం. వి. 1. వ్యంగ్యముగా కోపప్రకాశము చేయునాయిక. 2. ధీరురాలు.
ధీరాధీర నం వి. వ్యంగ్యావ్యంగముగా కోపప్రకాశముచేయు నాయిక.
ధీరుఁడు నం. వి. విద్వాంసుడు. విశే. 1. ధైర్యము గలవాడు. 2. స్వాతంత్ర్యము కలవాడు.
ధీవరుఁడు నం వి. జాలరి.
ధీహరుఁడు నం. వి. మందుడు.

# ధు

ధుంధుమారము సం. వి. 1. కరదూషము. 2. పట్టుపురుగు.

ధుతము సం. విణ. 1. కదిలింపబడినది. 2. విడువబడినది, రూ. ధూతము.

ధుత్తూరము సం. వి. ఉమ్మెత్త.

ధుని సం. వి. ఏరు.

ధుర సం. వి. భారము.

ధురంధరము సం వి బరువుమోసెడి ఎద్దు.

ధురంధరుఁడు సం. వి. బరువు మోయువాఁడు.

# ధూ

ధూంక్ష్ణము సం. వి. తెల్ల కాకి.

ధూతము సం. విణ. ధుతము.

ధూపము సం. వి. వాసనగలపొగ, ధూపము.

ధూపనము సం. వి. కదలించుట.

ధూపాయితము సం. విణ. తపింపచేయబడినది. తప్తము.

ధూపితము సం. విణ. 1. తప్తము. 2. ధూపము వేయబడినది.

ధూమకేతువు సం. వి. 1. తోకచుక్క. 2. ఉత్పాతము. 3. అగ్ని.

ధూమము సం. వి. పొగ.

ధూమయోని సం. వి. మేఘము. వ్యు. పొగయే జన్మకారణముగా కలది.

ధూమలము సం. వి. ఎక్కువ నలుపు గలిగిన ఎరుపు. రూ. ధూమ్రము.

ధూమిక సం. వి. దట్టమైన మంచు.

ధూము హిం. వి. శాంతి భేరి వాద్యము, కలరా.

ధూర్జటి సం. వి. 1. శివుడు. 2. ఒకానొక ఆంధ్ర కవి.

ధూర్తుఁడు సం. వి. 1 జూదరి. 2. మోసకాడు. రూ. ధూర్తు.

ధూర్వహము సం వి, బరువు మోసెడియెద్దు.

ధూసరద్రవ్యము సం. వి. (జం.) వెన్నుపాము లోపలి భాగమున నుండు నాడీ కణజాలము (Greymatter).

ధూసరము సం. వి. 1. బూడిదరంగు, 2. గాడిద విణ, బూడిదరంగు గలది

ధూళి సం. వి. దుమ్ము.

ధూళిధ్వజుఁడు సం. వి. గాలి. వ్యు. దుమ్ము జెండాగా కలవాడు.

ధూళియంత్రము సం. వి. (వ్యావ.) కీటకము లను నాశము చేయుటకు మందు పొడిని చల్లు సాధనము (Duster).

# ధృ

ధృతము సం. విణ. ధరింపబడినది.

ధృతరాష్ట్రుఁడు సం. వి. 1. దుర్యోధనుని తండ్రి. 2. ఒక సర్పరాజు. 3. రాజు.

ధృతి సం. వి. 1. ధైర్యము. 2. ధరించుట. 3. సంతోషము. 4. సౌఖ్యము.

ధృష్టుఁడు సం. విణ. దిట్టతనము గలవాడు. రూ. ధృష్టుఁడు.

# ధే

ధేనుక సం. వి. 1. లేగటియావు. 2. ఆడేనుగు. 3. ఆడుగుఱ్ఱము. 4. చిన్నకత్తి. 5. పార్వతి. రూ. ధేనుష.

ధేనుకము నం. వి చిఱ్ఱేను.

ధేనువు నం. వి. లేగటి యావు.

# ధై

ధైర్యము నం. వి. ధీరత్వము.

ధైవతము నం. వి. సప్తస్వరములలో నార వది (ఇది గుఱ్ఱము సకిలించు ధ్వనివంటిది.)

# ధో

ధోరణము నం. వి. వాహనము,

ధోరణి నం. వి 1, పద్ధతి, 2. పంక్తి.

# ధౌ

ధౌతము నం. వి. కడుగబడినది,

ధౌరితకము నం. వి, జోడన, ఒక విధమైన గుఱ్ఱపు నడక. రూ, ధోరితకము,

ధౌరేయము నం. వి. ఒరుసుమోసెడి యెద్దు.

ధౌర్త్యము నం. వి. ధూర్తత్వము.

# ధ్యా

ధ్యాత నం. విశే. ధ్యానించువాడు,

ధ్యాతము నం. విశే. ధ్యానింపబడినది,

ధ్యాతవ్యము నం. విశే. 1. ధ్యానింపదగినది, 2, ధ్యేయము.

ధ్యానము నం. వి. చాంచల్యము లేక మనసున భగవంతుని తలచుట.

ధ్యానీయము నం. విశే 1. ధ్యానింపదగినది. 2. కోరదగినది.

# ధ్యే, ధ్రి

ధ్యేయము నం. విశే. ధ్యానింపదగినది,

ధ్రియమానము నం. విశే, 1. ధరింపబడుచున్నది. 2. ధరించుచున్నది.

# ధ్రు

ధ్రువకాయములు నం.వి.(జం). స్త్రీ బీజాణు కోశములు యుక్తదశలోనికి అభివృద్ధి చెందునపుడు వానిలో నేర్పడు సూక్ష్మమైన నిష్ఫలమైన జీవకణములు (Polar bodies).

ధ్రువనక్షత్రము నం వి. ఉత్తరదిక్కులో నుండు నక్షత్రము (Pole star).

ధ్రువము నం. వి. 1. ఊహ. 2. నిశ్చయము. 3. దిక్కులకొన. 4. సంగీతతాళములలో నొకటి. విశే. 1, కదలనిది, నిలుకడగలది నం.వి. (భౌతి.) అయస్కాంతదండములో ఆకర్షణ శక్తి కేంద్రీకృతమై యున్న బిందువు, దర్పణము పట్టకముల మధ్య బిందువు (Pole).

ధ్రువితము నం. విశే. (భౌతి.) కాంతి విషయమున ప్రథవస్థానము నుండి భిన్నతలములలో ప్రసరించు కాంతి తరంగములు నేదో ఒక తలములో ప్రసరించునట్లు

చేయబడినది. విద్యుత్ప్రవాహ విషయమున విద్యుత్ప్రవాహ ప్రభావమువలన విద్యుద్ఘటములో ఋణ ధన ధ్రువముల స్వభావములు తారుమారైనది(Polarised).

ధ్రువీకరణము సం. వి. (భౌతి) విద్యుద్విశ్లేషణములో నుద్భవించు ఉదజని ధన ధ్రువముగా పనిచేయుటచే ఎదురుగా వేరొక విద్యుత్ప్రవాహ ముద్భవించి మొదటి ప్రవాహమును క్షీణింపచేయు సంఘటన (Polarisation).

ధ్రువుఁడు సం. వి. 1. ఉత్తానపాదునికొడుకు. 2. విష్ణువు. 3. శివుడు.

# ధ్వ

ధ్వంసనము సం. వి. నాశము.

ధ్వంసితము సం. విశే. నాశనము చేయబడినది.

ధ్వజము సం. వి. 1 టెక్కెము. 2. టెక్కెపు కంబము. 3. గురుతు. 4. గర్వము

ధ్వజిని సం. వి. సేన.

ధ్వని సం. వి. 1. శబ్దము, చప్పుడు. 2. వ్యంగ్య ప్రధానశబ్దము. 3. వ్యంగ్యము. (భౌతి.) శ్రోత్రేంద్రియము ద్వారా గ్రహింపబడు సంక్షోభము, (Sound.)

ధ్వనికము సం. విశే. (భౌతి). ధ్వని సంబధమైనది (Acoustic).

ధ్వనితము సం. విశే. శబ్దించునది.

ధ్వనిరూపము సం. వి. (భౌతి.) ఒక ధ్వని యొక్క గుణము, తీవ్రత ఉచ్చత కన్న భిన్నమైనది, స్వరభేదము (Timbre).

ధ్వనిశాస్త్రము సం. వి. (భౌతి.) ధ్వని యొక్కపుట్టుక, ప్రసారము, స్వభావము- వీనిని గురించి తెలుపు భౌతిక శాస్త్రశాఖ. (Acoustics). శబ్ద సంబంధమైన విద్య.

ధ్వస్తము సం. విశే. 1. నశించినది. 2. జారినది.

# ధ్వా

ధ్వాంక్షము సం. వి. 1. కాకి. 2. కొక్కెర.

ధ్వాంతమణి సం. వి. మిణుగురు పురుగు. వ్యు. చీకటిలో మణివలె ప్రకాశించునది.

ధ్వాంతము సం. వి. చీకటి.

ధ్వానము సం. వి. ధ్వని.

# న

న అవ. 1. ఒక యక్షరము. 2. సప్తమ్యేక వచనమునందు వచ్చెడు ఒకానొక ప్రత్యయము.

నంకు క్రి. నేలను కోరాడు.

నంగనాచి వి. పద్లచిలుక. విశే. 1. పైకేమియు తెలియనట్లుండెడి దిట్ట. 2 గుండుమూది.

నంగి విశే. ముక్కుతో మాటాడబడినది.

నంగు క్రి. ముక్కుతో మాటాడు.

నంజనేలలు వి. (వ్యావ.) మెట్టులేక మెరక నేలలు. వర్షాధారమువనే సాగుచేయబడు నేలలు. (Dry lands.)

నంజు వి. నంజుకొను వస్తువు.

నంజు క్రి. తిను. వి. 1. విషము. 2. నెత్తురు చచ్చి తెల్లపారుట.

నంజుడు వి. మాంసము.

నంజుడుదిండి వి. రక్కసుడు. విశే. మాంసము తినువాడు.

**నంజువ్యాధి** మి. వి. (గృహ.) 'B' విటమిన్ (థాయమిన్)లోపమువలన కలుగువ్యాధి (Beri-beri). (గుండెదడతో సహా శరీరములో నీరుపట్టుట లేదా కుష్కించుట, చిక్కిపోవుట ఈ వ్యాధి లక్షణములు).

**నంటు** వి. స్నేహము. విణ. స్నేహితుడు రూ. నంటుకాఁడు.

**నందకము** సం. వి. విష్ణుఖడ్గము, విణ. సంతోషించునది.

**నందన** సం. వి. 1. కూతురు. 2. అరువది సంవత్సరములలో ఒకటి.

**నందనము** సం. వి. 1. ఇంద్రుని ఉద్యానవనము 2. ఉద్యానవనము.

**నందనుఁడు** సం. వి. కొడుకు. విణ. సంతోషించువాడు.

**నంది** సం. వి. 1. శివుని వాహనమైన వృషభము. 2. వృషభము.

**నందివర్ధనము** సం. వి. 1. ఒక జాతి పూల చెట్టు. 2. అమావాస్య లేక పున్నమ.

**నంద్యావర్తము** సం. వి. 1. పడమట తక్క తక్కినమూడు దిక్కుల వాకిళ్ళు గల రాజగృహము. 2. నందివర్ధన వృక్షము.

**నంబి** వి. విష్ణుపూజకుడు.

**నంబెరుమాళ్ళు** త. వి. శ్రీరంగనాయకుడు.

**నకనకలు** వి. ఆకలి కల్గినపుడు కడుపులో కలుగు బాధ కనుకరణము.

**నకనకలుపడు** క్రి. 1. కృశించు. 2. ఆకలిచే బాధ నొందు.

**నకలు** హిం. వి. ఒక దానిని చూచి వ్రాసినది.

**నకిషీ** హిం. వి. అలంకారపు పని.

**నకిలీపట్టీ** మి. వి. (గృహ) అంచులను ముడువకుండ వేరే పట్టీని అతికి ముడుచుట. (False-hem).

**నకీబు** వి. వెండి బెత్తమువాడు.

**నకులము** సం. వి. ముంగిస.

**నక్క** వి. జంబుకము. విణ. క్షుద్రము.

**నక్కజిత్తులు** వి. మోసపు పనులు.

**నక్కను తొక్కుట** జాతి. శుభశకునమగుట.

**నక్కవినయము** జాతి. కపటముతో కూడిన వినమ్రత.

**నక్కి** హిం. వి. మోటుజరి.

**నక్కిళ్ళు** వి. (నక్క+కీళ్ళు) ప్రక్కపండ్ల కీళ్ళు.

**నక్కు** క్రి. ఒదుగు. వి 1. మ్రానియతుకు. 2. బంగారపు బిల్ల. 3. బంగారు నపుకగా నడుమ కనుపట్టెడు నిగ్గు. 4. నాగటికఱ్ఱు.

**నక్తంచరము** సం. వి. గుడ్లగూబ. వ్యు. రాత్రులందు తిరుగునది.

**నక్తంచరుఁడు** సం.వి. రాక్షసుడు, రేద్రిమ్మరి.

**నక్తకము** సం. వి. 1. చినిగిన వస్త్రము. 2. మాసినవస్త్రము.

**నక్తము** సం. వి. రాత్రి.

**నక్రము** సం. వి. 1. అడ్డకమ్మి. 2. త్రొక్కుడుగమ్మి. 3. మొసలి.

**నక్సలైట్** ఇం. వి. (Naxalite) సాంఘిక ఆర్థిక రాజకీయాది వ్యవస్థలను మార్చుటకు హింసామార్గము నాచరించు అతివాది. (బెంగాల్ రాష్ట్రములోని నక్సల్‌బరి ప్రాంతములో భూముల దురాక్రమణలో పాల్గొనిన విప్లవవాదులను బట్టి ఈ పేరు వచ్చినది).

**నక్షత్రము** సం వి, రిక్క. వ్యు. నశింపనిది (నక్షత్రము లిరువది యేడు).

**నక్షత్రమాల** సం. వి. 1. ఇరువదేడు ముత్యముల కూర్చిన హారము. 2. ఇరువదేడు పద్యములు గల కావ్యము.

**నక్షత్రాకారము** సం. విణ. (వృక్ష.) నక్షత్రము వంటి ఆకారముగలది (Stellate).

**నక్షత్రాకారరేఖలు** సం వి. (జం.) అప్రత్యక్ష కణవిభాగముజరుగునపుడు జీవకణములో తారా కేంద్రము చుట్టును ఏర్పడు నక్షత్రమువలె నుండు రేఖలు. (Aster).

నక్షత్రేశుఁడు సం. వి. చంద్రుడు, రిక్క రాయుడు.

నఖము సం. వి. గోరు రూ నఖరము.

నఖవ్రణము సం. వి. (గృహ) జట్టు, గోరుచుట్టు, గోరుపుండు. వ్రేలికి చివరవచ్చు కురుపు.

నఖరాయుధము సం వి. కోడి. వ్యు. గోరే ఆయుధముగా కలది.

నఖోత్పాటని సం. వి. గోరుగల్లు.

నగ వి. భూషణము.

నగదు హిం వి. నాణెము రూపమైన సొమ్ము. (అర్థ.) రొక్కము, సొమ్ము, పైకము, ద్రవ్యము.

నగము సం. వి. 1. కొండ. 2. చెట్టు. రూ. అగము.

నగరభూగోళశాస్త్రము సం. వి. (భూగో.) పల్లెలయు, పట్టణములయు వివరములు తెల్పు భూగోళశాస్త్రము.

నగరము సం. వి. పట్టణము. రూ. నగరి.

నగరు వి. 1. రాజగృహము. 2. దేవగృహము, రూ. నవరు.

నగవు వి. హాసము. రూ. నవ్వు.

నగవైరి సం. వి. ఇంద్రుడు. వ్యు. కొండలకు శత్రువు.

నగారా హిం. వి. పెద్ద ఢంకా.

నగించు క్రి. నవ్వించు, నగుపించు.

నగు క్రి. హసించు, అపహసించు వి. హాసము. రూ. నవ్వు, నగవు.

నగుబాటు వి. 1. నవుబాటు, పరిహాసము. 2. తలవంపు.

నగ్గు వి, మగ్గు, వలినలియగు.

నగ్నపుష్పములు సం. వి. (వృక్ష.) రక్షకపత్రదళములు, ఆకర ణ పత్రములులేని పువ్వులు (Achlamydae).

నగ్నిక సం. వి. 1. కన్య. 2. దిసమొల ఆడుది. రూ. నగ్న.

నగ్నుఁడు సం. వి. బుద్ధుడు. విశే. దిసమొలవాడు.

నచ్చిక వి. విశ్వాసము, రూ. నచ్చిగ, నచ్చికము,

నచ్చు క్రి. నమ్ము, వి. 1. ఆలస్యము. 2. బాధ.

నచ్చుకాఁడు విశే. అలసుడు, బాధకుడు.

నచ్చుపెట్టు క్రి. 1. తొందరపెట్టు. 2. బాధించు.

నజరాన హిం. వి. సామంతుడు క్రవర్తిని సేవకుడు ప్రభువును దర్శించునపుడు. ఉత్సవ సమయములప్పుడు నిచ్చు పారితోషిక ధనము,

నజరు హిం. వి. 1. కానుక. 2. సముఖము 3. సౌందర్యము.

నజ్జు వై. వి. అణువు విశే. 1. మిక్కిలి నలిగినది. 2. చిన్నముక్క. రూ. నరుజు. సం. నష్టమ్.

నటనము సం. వి. 1. నాట్యము. 2. కపట వర్తనము.

నటి సం. వి. 1. వేశ్య. 2. నట్టువుని భార్య.

నటించు సం. క్రి. 1. వర్తించు, వర్తించు. 2. కపటముగా వర్తించు.

నట్ట వి. పాచిక

నట్టనడుమ వి. (నడుము+నడుము) 1. సరి మధ్యము,. నట్టక నడుమ. 2. నట్టక నడురేయి. 3. గృహమధ్యభాగము,

నట్టు వి. 1. వాసస్థానము. 2. స్థానము 3. ఆలస్యము 4. ఆటంకము. వై. వి. నట్టువుడు. సం. నటః.

నట్టువొజ్జ వై. వి. నాట్యోపాధ్యాయుడు.

నడ వి. గమనము. 2. ప్రవర్తనము. రూ. నడక.

నడగాఁడు వి. (నడ+కాడు) గుఱ్ఱము.

నడగొండ వి. నడచెడు కొండ.

నడగొట్టు క్రి. 1. నిలుచు, 2. ఉండు.

**నడచు** క్రి. 1. గమనించు. 2. ప్రవర్తించు. రూ. నడువు.
**నడకోదు** వి. కాలిబంటు.
**నడత** వి. ప్రవర్తనము.
**నడతెంచు** క్రి. 1. వచ్చు. 2. పోవు.
**నడదివియ** వి. దివిటీ,
**నడబావి** వి. నడచుటకు తగినమెట్లుగల బావి. డిగ్గియ.
**నడయాడు** క్రి. 1. సంచరించు. 2. చలించు,
**నడవ** వి. 1. మార్గము 2. అళిందము, (తల వాకిటికిని మధ్యగల చోటు).
**నడవడి** వి. ప్రవర్తనము, నడత, చరిత్రము రూ. నడవడిక.
**నడి** వి. నడుము అను శబ్దమునకు సమాసము నందు వచ్చు రూపము. ఉదా. నడితల. నడిరేయి. 2. మధ్యము. రూ. నడు.
**నడికట్టు** వి. 1. బిగికై నడుమునకు కట్టుకొను కట్టు, కాసెకోక.
**నడికట్టుత్రాడు** వి. 1. ఏనుగు నడుమున కట్టెడు త్రాడు. 2. కక్ష్య.
**నడికిరేయి** వి. అర్ధరాత్రము. రూ. నడురేయి.
**నడిమిరాశి** మి. వి. (గణి.) మూడు రాసుల లోని మధ్యరాశి (Middle value)
**నడివానకారు** వి. (వ్యవ.) వర్షఋతువు-ఆగస్టు, సెప్టెంబరు నెలలు, ఆశ్లేష మఖ పుబ్బ ఉత్తర కార్తెలు (Mid-rainy season).
**నడివ్రేలు** వి. (నడిమి+వ్రేలు) మధ్యమ.
**నడఁకు** వి. కంపము. క్రి. 1. కంపించు. 2. వడుకొను. 3. ఒదుగు. 4 భయపడు. 5. వంగు.
**నడుచే** క్రి. నడచు.
**నడుదిన్నె** వి. ద్వీపము.
**నడుమంతరము** మి. వి. 1. కౌను. 2. మధ్యకాలము. విశే. మధ్యకాలమున కలిగినది. రూ. నడుమంత్రము.
**నడుమంత్రపుసిరి** మి. వి. మధ్యకాలమున వచ్చిన ఐశ్వర్యము. మిడిసిపాటు కల్గించునది.
**నడుము** వి. 1. కౌను. 2. మధ్యభాగము. రూ నడ్ము
**నడుముకట్టుకొను** క్రి. సిద్ధమగు.
**నడ్డి** వి. పూర్వకాయము వెనుకకు వంగి యుండుట. గూను చప్పట.
**నడ్డిగుంట** వి. కుకుందరము, పిరిదిమీది గుంత
**నతము** సం. విశే (గణి.) వాలుగామున్నది. (Inclined). సం. విశే. 1. వంగినది. వంకరైనది. 2. లోతైనది.
**నతి** సం. వి. మ్రొక్కు. వి. (గణి.) వాలుతనము (Slope, inclination).
**నత్త** వి. గుల్లయందుండు పురుగు.
**నత్తగుల్ల పంపు** మి. వి. (వ్యవ.) యంత్రశక్తిచే నడుపుటకు వీలగు నీరు తోడు యంత్రము (Centrifugal pump). (దీనిలో నత్తగుల్ల ఆకారము గల ఒక బరిణె. దానిలోనున్న విసరు చక్రము (Fan) ముఖ్యమైన భాగములు.
**నత్తి** వి. తడబడుచు మాటాడు.
**నత్తివాఁడు** విశే. 1. నత్తిగలవాడు. 2. ఆక్షేపకుడు.
**నత్తు** వి. ముక్కుపోగు. క్రి. తడబడుచు మాటాడు.
**నత్రజని** సం. వి. (రసా.) సోడియమ్ నైట్రేట్ ను (Nitre) జనింపచేయునది. రాసాయనికముగా సాధారణ పరిస్థితులలో చురుకుగనమును చూపని వాయురూప మూల ద్రవ్యము (Nitrozen). (మొక్కలకు ముఖ్యావశ్యకమగు మూల ద్రవ్యములలో నిది యొకటి).
**నత్రజనిమాపకము** సం. వి. (రసా.) నత్రజని గల యౌగికము నుండి ఉచిత రాసాయనిక ప్రక్రియలచే విడుదల చేయబడిన

నత్రజని వాయువును కొలచు పరికరము (Nitrometer).

నత్రాయితములు నం. వి. (రసా.) నత్రామ్లము ($HNo_2$) తో ఏర్పడిన లవణములు (Nitrites).

నత్రాయితీకరణము నం.వి. (భూగో. రసా) నేలలో ఏర్పడిన అమ్మోనియా నేల యందలి కర్బనికామ్లము ($Co_2$) తో కలసి అమ్మోనియా కర్బనిదముగ మారును. 'నైట్రోసోమోనాస్' అనబడు సూక్ష్మ జీవులు అందలి నత్రజనిని ఆమ్లజనీకరణము గావించిన నత్రాయితములు (Nitrites) గా మారును (Formation of Nitrites).

నత్రితకరణము నం. వి. (రసా. భూగో.) నేలలో ఏర్పడిన నత్రాయితములను నైట్రోబాక్టరు (Nitro bacter) అనబడు సూక్ష్మజీవులు నత్రితములుగా మార్చుట (Formation of Nitrates).

నత్రితము నం. వి. (రసా) నైట్రికామ్లము నుండి ఉత్పన్నమైన లవణము (Nitrate) ఉదా. లెడ్ నైట్రేట్ [$Pb(No_3)_2$].

నత్రితోత్పాదనము నం. వి. (వ్యవ.) నత్రితములు (Nitrates) అనబడు లవణముల నుత్పత్తిచేయుట. నేలలో సహజముగ జరుగు ఈ ప్రక్రియలలో మూడుస్థాయులు గలవు:- అమ్మోనియా కరణము, నత్రాయిత కరణము, నత్రితకరణము (Production of Nitrates).

నదము నం. వి. 1. పడమరగా పారెడి యేరు. 2. మడుగు. 3. సముద్రము. 4. ప్రోత.

నది నం. వి. 1. ఏరు. 2. ఆమడకు మీరి పారెడు ఏరు.

నదీగర్భము నం. వి. (భూగో.) 1. నీటిలో గల నద్యంతర్భాగము. 2. నది లేక సరస్సు యొక్క నీటి స్థావరము. 3. నది లోపల రాళ్ళతో కూడిన భాగములను స్పష్టముగా తెలుపు స్థలము.

నదీపరివాహ ప్రదేశము నం. వి. (భూగో.) నది యొక్క నీరు పోవు స్థలము. సరస్సు లోని నీరు నిలుచు స్థలము (ద్రోణి) (River basin).

నదీపోషక ప్రదేశము నం. వి. (భూగో.) ఒక నది వలన దాని యుపనదుల వలన పోషింపబడు ప్రాంతము (River basin).

నదీమాతృకము నం. వి. ఏటి నీటిచే పండెడు భూమి.

నదీశాఖ నం. వి. (భూగో.) ఒక నది నుండి వేరుపడి ప్రవహించు శాఖోపశాఖలు, (ఇట్టి శాఖలు తిరిగి నదిలో కలియవు).

నద్ధము నం. విశే. 1. కట్టబడినది. 2. పైకెత్తబడినది,

నన వి. 1. పువ్వు. 2. మొగ్గ. 3. చివురు.

ననఁబోడి వి. అలరుబోడి.

ననకారు వి. వసంతము; పూల ఋతువు.

ననసీరు వి. మకరందము, తేనె,

ననయు క్రి. పూచు, చిగిరించు.

ననవిలుకాఁడు వి. మన్మథుడు. రూ. ననవిలుతుఁడు

ననుఁబ్రాయి వి. చక్కగా ఉడుకని బియ్యము, నత్రాప్రాయి.

ననుచు క్రి. 1. పూచు, చిగిరించు. 2. మొగ్గ దొడుగు. 3, అతిశయించు. 4. అనురాగమందు. 5. ఇంపగు. రూ. ననయు.

ననుపు వి. 1. అనురాగము. 2. అతిశయము. 3. ఇంపు.

ననుపుకత్తె విశే. ప్రియురాలు. విటి.

ననుపుకాఁడు విశే. ప్రియుడు, విటుడు.

ననుపువడు క్రి. పొత్తు కలుగు.

నన్న విశే.-కురుచ.

నన్నూఱు సర్వ. (నాలుగు+నూరు) నాల్గు వందలు.

నపుంసకలింగము సం. వి. (వ్యాక.) పుంలింగ స్త్రీలింగములు కాని శబ్దములను బోధించునది. స్త్రీలింగ, పుంలింగముల కంటె వేరైనది. ఉదా జ్ఞానము, చరిత్రము మొ॥వి.

నపుంసకుఁడు సం. వి. పేడివాడు, షండుడు,

నప్త సం. వి. 1. మనుమరాలు. 2. మనుమడు. 3. మునిమనుమడు. రూ. నప్తి.

నభము సం. వి. 1. ఆకాశము. 2. మేఘము రూ. నభస్సు.

నభస్వంతుఁడు సం. వి. వాయువు.

నమనము సం. వి. వంగుట.

నమలు క్రి. తిను.

నమసితుఁడు సం. వి. అర్చితుడు, నమస్కరింపబడినవాడు,

నమస్కారము సం. వి. మ్రొక్కు. రూ. నమస్క్రియ, నమస్కృతి.

నమస్య సం వి. 1 పూజ. 2. సపర్య.

నమస్సు సం. వి. నమస్కారము.

నమించు సం. క్రి. నమస్కరించు,

నమితము సం విశే. వంగినది.

నమిలి వి. నెమిలి. రూ. నెమిలి, నమ్మి. నెమ్మిలి. నెమ్మి.

నముచిసూదనుఁడు సం. వి. ఇంద్రుడు.

నమూనా హిం.వి. మాదిరి (వ్యావ.నమోనా.)

నమేరువు సం. వి. సురపొన్న చెట్టు.

నమోదు హిం.వి. వ్రాసికొనుట(To record).

నమ్మకము వి. విశ్వాసము, నచ్చిక, రూ. నమ్మిక, నమ్మిగ.

నమ్మిక వి. నమ్మకము.

నమ్ము క్రి. విశ్వసించు.

నమ్య సం. విశే. (రసా.) ఎటువంటిన అటు సులభముగా వంగు గుణము గలది (Pliable).

నమ్రత సం. వి. అణకువ, వినయము, అగర్వము.

నమ్రము సం. విశే వంగినది, నతము.

నయ వి. అందము, నయము.

నయగారము వి. 1. మృదుత్వము. 2. మృదువచనము. 3. అనుకూలము.

నయగారి విశే. మృదుత్వము గలవాడు.

నయనము సం వి. 1. కన్ను. 2. పొందించుట.

నయము వి. లాభము. 2. మనువు. 3. మృదుత్వము. 4. అందము. విశే. చౌక.

నయము సం. వి. 1 నీతి. 2. పొందించు.

నయించు సం. క్రి. పొందించు.

నర వి. వెంట్రుకలయందు గలుగు తెలుపు, తెల్లబారిన వెంట్రుక. రూ. నరపు.

నరకుఁడు వై. విశే. 1. దుష్టుడు. 2. దయలేనివాడు. సం. నరకగః.

నరకము సం. వి. దుర్గతి-పాపముచేసి అనుభవించునది.

నరగ వి. ఖేరె, రూ. నరగజము.

నరగజము వి. నరగ.

నరపగడ్డము వి. నరసిన గడ్డము.

నరపమీసము వి. నరసిన మీసము.

నరపాలుఁడు సం. వి. రాజు.

నరపు వి. నర, నరుపు.

నరము వి. నాడి.

నరయు క్రి. ముదిమిచే వెంట్రుకలు తెల్లవగు. రూ. నరియు.

నరవ వి. కొండ త్రోవ.

నరవాహనుఁడు సం. వి. కుబేరుడు,

నరసింహుఁడు సం. వి. 2. దశావతారములలో నొకటి. 2. నరశ్రేష్ఠుడు.

నరాజి వి. 1. కత్తి. 2. అమ్ము. రూ నరాజీ, నారాజి, నారాజీ. సం. నారాచః.

నరిచుఁడు వి. నక్క.

నరుఁడు సం. వి. 1. మనుష్యుడు. 2. అర్జునుడు. 3. ఒక ఋషి.

నరేంద్రుడు సం. వి. 1. రాజు. 2. పాములవాడు.

నర్తకి సం. వి. 1. ఆటకత్తె. 2, ఆడేగుగు,

నర్తకుఁడు సం. వి. 1. నట్టువుడు. 2. పాములవాడు విశే. ఆడెడువాడు,

నర్తనప్రియము సం. వి. నెమలి.

నర్తనము సం. వి. 1, నటనము. 2, ఆట.

నర్తించు సం. క్రి. 1. ఆడు. 2. నటించు. రూ. నర్తిల్లు, నర్తిలు.

నర్మము సం. వి. పరిహాసము.

నర్మసఖుఁడు సం. వి విదూషకుడు, వేడుక చెలికాడు.

నర్మిలి వి ఆపేక్ష, రూ ఆర్మిలి.

నర్సరిస్కూల్ ఇం. వి. (గృహ.). (Nursery-School) చిన్న పిల్లలను ఐదు సంవత్సరములకు ముందు పంపుబడి, చిన్న పిల్లలను సమవయస్సులో నుండు పిల్లలతో కలిసిమెలసి ఆటపాటలను నేర్చుకొనుటకై పంపుబడి.

నఱకు క్రి ఖండించు.

నఱకుఁడు వి. ఖండనము.

నఱవ వి. ఆరవ, సాధువుకాని యావు.

నఱుజు వి. అణువు, రూ. నజ్జు.

నఱుమాడు క్రి. నరుము, పొడిచేయు.

నఱ్ఱ వి. 1. ప్రయాణముచే విడుకదగిన యావు. 2. ప్రయాణముచే బండికి గట్టబడిన యెద్దు.

నల సం. వి. అరువది సంవత్సరములలో నొకటి. వై. విశే. నల్ల.

నలఁక వి. 1. వ్యాధి, 2. శ్రమము. 3. బాధ

నలఁకువ వి. నలక. రూ నలకువ.

నలఁగు క్రి. 1. నలియగు 2. పీడతమగు. 3. చెడు. 4. శ్రమపడు.

నలఁగుడు వి. పీడనము.

నలఁచు క్రి. నలగచేయు,

నలకూబరుఁడు సం. వి. కుబేరునికొడుకు.

నలదము సం.వి. 1. వట్టివేరు. 2. పూదేనె.

నలమేనిదొర వి. విష్ణువు.

నలి వి. 1. రోగము. 2. పొడి. విశే. 1, నలఁగినది. 2. సన్నము. అవ్య. అత్యంతము. 2. సౌభాగ్యము,

నలికండ్లపాము వి. రక్తపుచ్చిక. రూ. నలికిరి, నలికీచు.

నలికము వి. సన్నదనము.

నలిగులి విశే మిక్కిలి నలగినది.

నలిగొట్టు విశే. సన్ననిది.

నలితిండి వి. చిరుతిండి.

నలినము సం. వి. 1. తామర. 2. తామరకొలను. 2. తామరతీగ.

నలియు క్రి. నలగు.

నలు సర్వ. సమాసమందు నాలుగునకు వచ్చు రూపము. (నలుమోములు).

నలుఁగు క్రి. నలియగు, వి. ఒడలు రుద్దుకొనుటకు నూరిన సుగంధముల పిండి, ఉద్వర్తనము. రూ, నల్గు.

నలుగడ వి నాలుగు ప్రక్కలు.

నలుగురి నోళ్ళలోఁబడుట వి. జాతీ. 1. అల్లరిపాలగుట. 2. అపకీర్తి పొందుట.

నలుకువ వి, నలక.

నలుగురు సర్వ, నాలుగుమంది, రూ. నల్వురు నల్గురు, నలువురు.

నలుచు క్రి. నలియచేయు, నలుపు.

నల్తుము వి. నాలుగు తూములు. రూ. నల్దుము

నలువ వి. బ్రహ్మ, చతుర్ముఖుడు.

నలువండ్రు సర్వ. నలువదిమంది.

నలువది సర్వ. నాలుగు పదులు. రూ. నల్వది.

నలువు వి. 1. ఒప్పిదము. 2. సామర్థ్యము.

నలుసాల వి. చుట్టుకొల్లారు.

నలుసు వి, రేణువు.

నల్ల వి. నెత్తురు. వై. వి. నలుపు, 2. బొగ్గు. విశే, నలుపైనది.

నల్లగ్రుడ్డు వి. కంటిలోని నల్లభాగము, కనీనిక,

నల్లచ్చిగాండు వి (నల్ల+అచ్చునము+కాండు.) 1. భరద్వాజపక్షి. 2. ఒక చిన్న పిట్ట.

నల్లజీడి వి. (వృక్ష.) ఇది మామిడి కుటుంబమునకు(Anacardiaceae)చెందినSemicarpus anacardium అను చెట్టుయొక్క గింజ. (దీనియందుండు చమురుతో బట్టలపై గుర్తులను వేయుదురు)(Marking-nut). ఇది వైద్యమునందు కూడ నుపయోగపడును.)

నల్లదేశము వి. ఇంగ్లండులోని దక్షిణ స్టాఫోర్డు షైరులోని బొగ్గుగనుల ప్రాంతము. (ఇచటి కర్మాగారములనుండి నిరంతరము వచ్చు పొగవలన ఈ ప్రాంతమునకీపేరు వచ్చినది (Black-country).

నల్లద్రావుండు వి. రాక్షసుడు, అస్రపుడు.

నల్లనయ్య వై. వి. కృష్ణుడు, కరివేల్పు.

నల్లనేలలు వి. (వ్యావ.) నలుపు రంగుగా నుండు నేలలు(Black soils) (కృష్ణ రేవడి కొన్ని డెల్టామండలి. కొన్ని చౌటనేలలు).

నల్లమందు వి. (వ్యావ.) అభిని. అహిఫేనము (Opium). (ఇది మాదక పదార్థముగను వైద్యమునందును ఉపయోగింపబడును దీనినిPapaveraceae అనుకుటుంబమునకు చెందినన Opium poppy (అభిని లేక గసగసా) అను మొక్క కాయలను గీయగా వచ్చిన పాలతో తయారుచేయుదురు. నల్లమందులో మార్ఫిన్ (Morphine) అను ముఖ్యమైన క్షారముండును.)

నల్లరేకలు వై.వి. (భౌతి.) సూర్య కాంతి యొక్క వర్ణమాలలో నగుపడు నల్లని రేఖలు (Dark lines) (కృష్ణరేఖలు).

నల్లరేగడినేల వి. (భూగో.) వర్షవాతాతప శైథిల్యముచే అగ్నిపర్వత శిల (శిలాద్రవపునేల) నల్లరేగడి నేలగా మారును, ప్రత్తి నల్లనేల (Black cotton soil) (వ్యావ., జిగురుగా నుండు నల్లనేలలు (Black clayey soils).

నల్లవలువ జాలువు వి. నీలాంబరుడు, బలరాముడు.

నల్లవో అవ్య. వారా రూ. నల్లవో.

నల్ల సేనపురాయి వి భూమి ఉపరితలము చల్లబడుటచే నేర్పడిన పురాతన కఠిన శిల. (Granite).

నల్లి వి. మత్కుణము.

నల్లిండ్లు వి. అగ్రహారము,కొందరు ('నల్లిల్లు' -గా చూపిరి.)

నల్లిక వి, నలికంఠ్లపాము.

నల్లికుటుంబము వి (వ్యావ) బిళ్ళ పురుగులు లేక పసరు నల్లులు (Plant bugs) పిండి నల్లులు (Mealy bugs) మొక్క పేలు (Plant lice). పొలుసు పురుగులు (Scale insects). మొదలైన కీటకము లీ కుటుంబమునకు చెందినవి (Rhynchota).

నల్లె వి. జేన.

నల్లేరు వి. ఒక తెగతీగ,వజ్రవల్లి, రూ.నల్లేరు.

నవ వి. దురద రూ. నవ్వ.

నవటాకు హిం, వి. సేరులో 8వ వంతు,

నవంత వి. 1. శ్రమ. 2. దుఃఖము. 3.క్షయరోగము.

నవత్వము వి. మృదుత్వము. సం.వి. తొమ్మిది.

నవక్షారము సం. వి. నవాసారము.

నవగోజ వి. పెద్దగుడారము.

నవతి సం. సర్వ. తొంబది.

నవనము సం. వి. స్తోత్రము.

నవనీతము సం.వి. అప్పుడు చిలికి తీసిన వెన్న.

నవబిందు వృత్తము సం. వి. (గణి.) ఒక త్రిభుజములోని భుజముల మధ్య బిందువు లను, లంబపాదములను, శీర్షములను లంబకేంద్రమునకు కలుపగా వచ్చు సరళరేఖాఖండముల మధ్య బిందువులగుండా పోవు వృత్తము (Nine point circle).

నవమము సం. విశ. తొమ్మిదవది.
నవమాలిక సం. వి. విరజాజి.
నవమి సం. వి. పక్షమందు తొమ్మిదవ తిథి. విశ. తొమ్మిదవది.
నవము సం. వి. స్తోత్రము. విశ. క్రొత్త.
నవయు క్రి. రోగాదులచే కృశించు,శుష్కించు
నవరు వి. నగరు.
నవల వి. ఆడుది. రూ. నవలా. ఇం. వి. కల్పిత కథ (Novel).
నవశిలాయుగము సం. వి. (చరి.) క్రొత్త రాతియుగము. (ఈ కాలములోని మానవులచే రాతి పనిముట్లు నాణెములు వాడబడుచుండెను. వీరికి వ్యవసాయము, నూలు వడుకుట, కుండలుచేయుట,అగ్నిని ఉపయోగించు విధము తెలియును, వీరు స్థిరనివాసము లేర్పరచుకొని, పండిన పదార్థములు తినుచుండిరి).
నవాబ్ హిం. వి. 1. ప్రభువు, 2. రాజ ప్రతినిధి.
నవారు హిం. వి. మంచమున కల్లు నూలు పట్టెడ.
నవాసారము వై. వి. నవక్షారము. ఒక దినుసు ఉప్పు. వి. (రసా.) అమ్మోనియమ్ క్లోరైడ్(Salammoniac)తెల్లనిలవణము-(వేడెక్కించినచో విఘటనము చెంది అమ్మోనియా, హైడ్రోజన్ క్లోరైడు క్రింద విడిపోవును).
నవీనము సం. విశ. క్రొత్త.
నవుకరి హిం వి. కొలువు. రూ. నౌకరి.
నవుకరు హిం వి. కొలువుకాడు. రూ. నౌకరు:
నవోద్భిజ్జము సం. వి. (వృక్ష.) మొలక, చిన్న లేత మొక్క, నారుదశలో నున్న మొక్క (Seedling).
నవ్యము సం. వి. 1. నూతనము. 2. స్తుతింపదగినది.
నవ్వు క్రి. 1. హసించు. 2. వికసించు. 3. పరిహసించు, 4. అపహసించు. రూ. నవు, నగు. వి. 1. హాసము. 2. వికాసము. 3.పరిహాసము, అపహాసము. రూ నవు. నౌ.
నవ్వుఁబాటు వి. నగుబాటు.
నశించు సం క్రి. నాశమగు.
నష్టము సం. విశ. నశించినది.
నష్టి సం. వి. 1. నాశమొందినది. 2. మరుగు పడినది.
నస వి. 1. నాశము. 2. ద్రవ్యనాశము. 3. (వ్యావ.) వాగుడు. 4. దురద 5. ఉపద్రవము. సం. వి. ముక్కు,రూ.నాసిక.
నసగూఁటి విశ. కామోద్రేకము గలది-కలవాడు.
నసగూఁడు వి. కామోద్రేకము.
నసిమిరి వి. దురద.
నసుకు వి, అసత్యవచనము. విశ, అసత్యము. క్రి. అస్పష్టముగా మాటలాడు.
నశికాగంధకము సం. వి. (రసా.) రూళ్ళ కర్రలవంటి కణికల రూపమున పోత పోసిన గంధకము (Roll sulphur).

# నా

నా సర్వ. 1. నేను శబ్దమునకు ప్రాతిపదికము. 2. అవ్య. అనగా నను వర్థము నిచ్చును. ఉదా విష్ణువు కృష్ణుడు నా జనించెను.
నాంది సం, వి. 1. పెద్దలు చేయు ఆశీర్వాదము. 2. నాటక ప్రారంభమున జరపు మంగళము. 3, భేరి
నాందీకరుఁడు సం. విశ. 1. ఆశీర్వాదము చేయువాడు. 2. భేరి వాయించువాడు. రూ, నాందీవాది.

నాఁగటి చాలు పేరి యుచిప వి. సీత.
నాఁగటిచిప్ప వి. పణత, నాగటిదుంప.
నాఁగటిజోదు వై. వి. బలరాముడు హాలాయుధుడు.
నాఁగటిదుంప వి. పణత.
నాఁగలి వై. వి. దున్ను సాధనము, లాంగలము. రూ. నాఁగెలు, నాఁగేలు. సం. లాంగలః.
నాఁగు వి. ధాన్యమునకు వడ్డిగా నిచ్చు ధాన్యము.
నాఁచు క్రి. అపహరించు, నాచుకొను. వి. తీఁగపాచి.
నాఁడు వి. ఆకాలము, ఆదినము. కాలము,
నాఁడెము వై. వి. నాణెము. సం. నాణకమ్
నాకబలి సం. వి. నాగవలి.
నాకము సం. వి. 1. స్వర్గము. 2 ఆకాశము.
నాకిని సం. వి. దేవతా స్త్రీ.
నాకు క్రి. 1 నాలుకతో రుచి చూచు లేహనము చేయు.
నాకేశుఁడు సం. వి. ఇంద్రుడు.
నాకౌకసుఁడు సం. వి. 1. వేలుపు. వ్యు. స్వర్గము నివాసముగా గలవాడు.
నాక్రము సం. వి. వక్రముఖమువంటి ముఖము గల నక్క.
నాగ వై. విశే. 1. పూజ్యము. (ఉదా. నాగబెత్తము.) 2. పెద్ద (నాగగన్నేరు) సం. నాగః.
నాగఁడు వై. వి. శేషుడు. సం నాగః.
నాగదాళి వి. ఒక తెగ ముండ్ల పొద.
నాగవసాని వై. వి. నాగవల్లి నడుపు ముత్తైదువ. రూ. నావసాని.
నాగపాశము సం. వి. వరుణుని యాయుధము.
నాగబెత్తము వై. వి. మంత్రపూతమైన బెత్తము. వ్యు. పాముపంటి ఆకారముగల బెత్తము,
నాగము సం. వి. 1. వస్త్రు. 2 ... ము 3. పాము. 4 ... సుగు 5 కొండ. 6. మేఘము. ...
నాగరము సం. వి. 1. శొంఠి. 2. తుంగ, 3 ... సం. విశే. నగరమున పుట్టినది. వి స్త్రీలు తలపై ధరించు ఒక నగ.
నాగరికత సం. వి. నాగరికము, నాజూకు.
నాగరికము సం. విశే. నాగరికమైనది, నాజూకైనది
నాగలోకము సం. వి. పాతాళము.
నాగవల్లి వై. వి. పెండ్లిలో తుది దినమున జరుపు శుభకార్యము. సం. వి. తమలపాకు తీగ సం. నాగవల్లిః.
నాగవల్లి నిష్ఠురము (జాతీ.) పెండ్లియైదవ నాటి చెప్పులు, పనిలేనిపనవపోరాటము.
నాగవాసము వి. గొంగడము తగిలించెడు రెండు కొనలు వంచిన యినుప కమ్మి. వై. వి. 1. వేశ్యాసమూహము 2. ఆట మేళము. సం వి. నాగలోకము.
నాగస్వరము సం వి. పాములవాడు ఊదు క్రోవి, నాగసరము.
నాగాంతకుఁడు సం. వి గరుడుడు. వ్యు. పాములను చంపువాడు.
నాగిని వి. చూ. నాకిని.
నాగువు వై. వి. నాగము, త్రాచు. రూ. నాగుబాము, నాగులు. సం. నాగః.
నాచు వి. (వృక్ష.) బ్రయోఫిటముల తరగతిలో నొక తెగకు చెందిన ఉద్భిజ్జము (Moss )
నాజియిజమ్ ఇం. (రాజ.) (Nazi-ism) ఫాసిజమ్‌వంటి విపరీత జాతీయ వాదము (మొదటి ప్రపంచ యుద్ధము తరువాత జర్మనీ దేశములో 'అడాల్ఫ్ హిట్లర్' అధ్వర్యమున ఈ వాదము ప్రబలెను.)
నాజూకు హిం. విశే. నాణెము, సున్నితము.

నాటకము వై. వి. 1. నర్తనము. 2. ప్రవర్తనము. సం. వి. నాట్య ప్రధాన కావ్యము. (దశ విధ రూపకములలో నొకటి.

నాటకసాల వై. వి. నాట్యశాల. సం. నాటకశాలా.

నాటు క్రి. 1. గ్రుచ్చు. 2. గ్రుచ్చుకొను. వి. 1. నాటుట. 2. గడ్డపార మున్నగువానితో పొడిచిన రంధ్రము.

నాటుబాంబు మి. వి. ప్రేలుడు పదార్థములతో హాస్యముగా తయారుచేసిన బాంబు (Hand grenade).

నాట్నము వి. నాటుట. రూ నాటనము.

నాట్యము సం. వి. నృత్యము, నృత్యగీత వాద్యముల కూడిక.

నాడా హిం. వి. 1. సన్నని నూలు. 2. గుఱ్ఱములు ఎద్దులు మొదలగు వాని డెక్కలకు వేయు యినుప ముక్క.

నాడి సం. వి. 1. నరము. 2. గడియకాలము, 3. ఈనె, 4. కాడ.

నాడిక వి. దేశము. రూ. నాడు. సం. వి. గడియకాలము. రూ. నాడి.

నాడిముడి వి. (జం). కొన్ని నాడీకణములు జత ముడిగా ఏర్పడినది (Ganglin).

నాడీకణము సం. వి. (జం.) ప్రేరణలను శరీరములో నికితీసికొనుపోవు జీవకణ సంహతులలోనున్న జీవకణము(Neuron or nerve call). (దీనిలో కణశరీరము (Cell body). లాంగూలము (Axon), నాడీలోమము (Dendron or dendrite)అను మూడుభాగము లుండును.)

నాడీకణజాలము సం. వి. (జం.) నాడీ కణములు, నరములు (Nerve fibres) కలిసి ఏర్పడిన కణజాలము (Nervous tissue)

నాడీజీవకణము సం. వి. (జం.) నాడికణ శరీరము దాని కోశరసప్రవర్ధకములతో కూడియున్న జీవకణము (Neuron).

నాడీతంత్వావరణము సం. వి. (జం.) నరముపై ఆవరణగా నుండుపొర (Neurolemma).

నాడీ మండలము సం. వి. (జం) కేంద్ర నాడీ మండలము. పరిణాహా నాడీ మండలము ఆ మండరములలో నున్న నాడులు మొ॥ (Nervous system).

నాడీవ్రణము సం. వి. నారి కురుపు.

నాడీసంబంధము సం. విశ. (జం.) నాడికిగాని, నాడీమండలమునకు గాని సంబంధించినది (Neural).

నాడు క్రి. నాటు. వి. 1. దేశము. 2. గ్రామము.

నాడె వి. సాలెవాడు నూలికండె నుంచు గొట్టము.

నాణకధాతువు సం.° వి. (రసా.) నాణెము లను చేయుట కుపయోగించు ధాతువు (Coinage metal).ఉదా. వెండి,బంగారు. రాగి, నికెల్.

నాణకము సం. వి. రూపాయ మొ గు నాణెము.

నాణెము వై. వి. 1, సొగసు. 2, అలంకారము. 3. నాగరికత. రూ. నాడెము. సం. నాణకమ్.

నాతము వి. బత్తెము.

నాతి వి. (స్త్రీ). రూ. నాతుక.

నాదము సం. వి. ధ్వని

నాదస్వరము సం. వి. మేళగాండ్రుపాటలు పలికించు క్రోవి, సన్నాయి.

నాదు వై. వి నాదము, ధ్వని. సం నాదః.

నాదేయము సం, విశ. నదీ సంబంధమైనది.

నాధము సం. వి. ముకుద్రాడు.

నాథుఁడు సం. వి. 1. పెనిమిటి. 2. రాజు.

నాన వై.వి. సిగ్గు. సం. జ్ఞానమ్. త. నాణ్. క. నాణ

**నానఁబ్రాలు** వి. నీట నానిన బియ్యము.

**నానగండ** వై. విశే. సిగ్గుమాలినవాడు (నాన గండ.)

**నానబియ్యము** వి. నానఁబ్రాలు.

**నానా** సం. అవ్య. అనేకము.

**నానారాజ్యసమితి** సం. వి. (పరి. రాజ.) మొదటి ప్రపంచయుద్ధము తరువాత ప్రపంచములో శాంతి నెలకొల్పుటకై క్రీ. శ. 1920లో స్థాపింపబడిన అంతర్జాతీయ సంస్థ, రాష్ట్రసంఘము (League of Nations).

**నాను** క్రి. జలాదులందు చాలకాలముండు. వి. హారము.

**నానుచు** క్రి. నానచేయు. రూ. నాన్చు.

**నానుడి** వి. (నాను + నుడి) కింవదంతి, సామెత.

**నానుడు** విశే. తడిసినది. వి. తడియుట.

**నానుడువాన** వి. విడువక కురియు పొడి వాన

**నానుపు** క్రి. చలువచేయు.

**నాన్క్యుములేటివ్ ప్రిఫరెన్సు షేర్లు** ఇం. వి. (వాణి.) Non-cumulative Preference shares). లాభము వచ్చిన సంవత్సరములో ఇట్టి వాటాలపై నిర్ణీతమైన రేటు ప్రకారము లాభాంశము చెల్లింపవలెను. లాభములు రాని సంవత్సరములో లాభాంశమియ్య నవసరములేని వాటాలు మరుసటి సంవత్సరములో లాభము వచ్చినను గత సంవత్సరములో లాభాంశమియ్యని కారణముగ ఈసంవత్సరములో నీయనవసరములేని వాటాలు.

**నాఁపచేను** వి. నాముగలచేను.

**నాఁపరాళ్లు** వి. (భూగో.) పెక్కు వేల సంవత్సరములు భూగర్భములో నుండి నాపరాళ్ళుగా మారిన నిక్షేప శిలలు.

**నాపసాని** వై. వి. నాగవసాని నాగవల్లి నగళ్ళ పెట్టె ముత్తైదువ.

**నాపితుఁడు** సం. వి. మంగలి.

**నాప్కిన్స్** ఇం. వి. (గృహ.) (Napkins) చిన్నతువాలు, శౌకము లేక త్రికము. శౌకము = భోజనానంతరము చేయి తుడుచుకొను వస్త్రపు బట్ట. త్రికము = చంటి బిడ్డలకు పెట్టెకి ఒదులుగా ఉపయోగించు త్రికోణముగా కుట్టిన బట్ట.

**నాఫ్తలీన్** ఇం. వి. (వ్యావ.) (Naphthalene) పురుగులు కీటకములను దగ్గరకు రానీయని తెల్లని పదార్థము (దీనిని ఉండల రూపమునగాని పొడిచేసి కాని వాడుదురు.)

**నాఫ్తలీన్ ఆసిటిక్ ఆమ్లము** ఇం. వి (వ్యావ.) ఇది రాసాయనికముగ తయారుచేయబడు ఉద్భిజ్జ వృద్ధి ద్రవములలో నొకటి (Naphthalene acitic acid).

**నాభి** సం. వి. 1. కస్తూరి. 2. బొడ్డు. 3. బండి చక్రపు నడిమితూము, 4. విష విశేషము 1. (గణి.) ఒక బిందువు నొద్ద నుండి ఒక శంకుచ్ఛేదముపైనున్న బిందువునకు గల దూరము. ఆ శంకుచ్ఛేదసంబంధమైన నిర్దేశకము నుండి మరల దాని రూపము స్థిరనిష్పత్తిలో నుండునట్టి స్థిర బిందువు (Focus). 2 (భౌతి.) పరావర్తితములై కాని వక్రీభూతములై కాని కాంతి కిరణములు లే బిందువు నొద్ద ఉపసరణత (Convergence)ను చెందునో యట్టి బిందువు. ముఖ్యాక్షమునకు సమాంతరముగా నుండు కిరణములు పరావర్తనము చెంది కేంద్రీకరించెడి బిందువు. లేక వికేంద్రీకరించునట్లు కనిపించు బిందువు (Focus).

**నాభిజన్ముఁడు** సం. వి. బ్రహ్మ, పొక్కిలిచూలి. వ్యు. బొడ్డునుండి జన్మించిన వాడు.

నాభ్యంతరము నం. వి. (భౌతి) నాభి ద్రుకముల మధ్య దూరము(Focal lenth).

నామకరణము నం వి బిడ్డలకు పేరుపెట్టుట.

నామగుంట వి. గొంతుక క్రింది పల్లము, గళగర్తము.

నామధేయము నం. వి. పేరు, నామము.

నామమడచు మి. క్రి. చంపు.

నామము వి నొసట పెట్టుకొను బొట్టు.నం. వి, నామధేయము.

నామరులు వి, వారికలు.

నాము వి. 1 గింజలులేని వరి మొగు వాని ఎన్ను 2 జొన్నలోనగు వాని మొలక,

నాయంకరము వి. అధిపత్యము,

నాయంకవాడి వి. సేద్యపు పనులు చూచుకొను దివాణపు బంటు,

నాయంకుండు వై. వి. 1. అధిపతి. 2. పన్నిద్దరు భటుల కధిపతి నం నాయకః.

నాయండు వై. వి 1. ప్రభువు 2. బలిజలు మున్నగు వారి పట్టపు పేరు. వై. విణ. శ్రేష్ఠుడు, నం. నాయకః.

నాయకము నం. వి, హారమందలి నడిమి రత్నము,

నాయకుండు నం, వి. 1. అధిపతి 2.నాటకమందలి ప్రధానపాత్ర. నాయకులు కావ్య నాటకాదుల యందు నలుగురు. 3. శృంగార రసాలంబన పురుషులు నలుగురు. విణ, శ్రేష్ఠుడు.

నాయన వి. తండ్రి.

నాయము వై. విణ, 1. న్యాయము. 2. ధర్మము. నం, న్యాయః.

నాయిక నం. వి. 1. శృంగార రసాలంబన స్త్రీ. (ఈ నాయికలు ముగ్గురు.) 2. అష్టవిధనాయికలు.

నార వి, చీల్చిన చెట్టుపట్టలోని పీచు, వల్కలము,

నారంగకము నం. వి. (వృక్ష) ఇదిమాంసలఫలములలో నొక రకము. ఊర్ధ్వస్థిత సంయుక్త ఫలదళమగు అండాశయము నుండి ఈ ఫలము తయారగును. ప్రత్యేకముగా నారింజ జాతి పండ్లకీ పదమువర్తించును (Hesperidium)

నారంగము నం. వి నారింజ చెట్టు.

నారకము నం. వి. నరకము. విణ. నరక సంబంధమైనది

నారగోగు వి. (వ్యవ.) ఇది ప్రత్తి కుటుంబము (Molvaceae) నకు చెందిన గోగు (Hibiscus Cannabinus) మొక్క,దీని కాండమునుండి తీయబడు నార 'గోగు నార' అనబడును( Deccan hemp,Bombay hemp or Bhimilipatam Jute).

నారదము నం, వి. నారింజ చూ. నారంగము, నాగరంగము.

నారపంటలు వి. (వ్యవ) నారనిచ్చు సస్యములు (Fibre crops)ఉదా. ప్రత్తి,గోగు జనుము, మొదలగునవి.

నారపురుగు వి. (జం.)నీళ్ళనుండిమనుష్యుల శరీరములో ప్రవేశించి నారంకురువుకు కారణమైన పురుగు (Guinea-worm).

నారమడి వి. నారతో వేసిన మడిబట్ట.

నారము నం. వి. 1. నరసమూహము. 2. నీళ్ళు.

నారసము వై. వి నారాచము, బాణము.

నారాజి వి నరాజి, కత్తి. నం నారాచః.

నారాయణి నం. వి. 1. లక్ష్మి. 2 పార్వతి,

నారాయణుండు నం. వి. 1. విష్ణువు. 2. సూర్యుడు. 3. చంద్రుడు. 4. శివుడు. 5. అగ్ని. 6. బ్రహ్మ. వ్యు. సముద్రము లేక జనసమూహము స్థానముగా గలవాడు.

నారి వి. అల్లెత్రాడు. వై. వి. నరము. నం. నాడీ. నం. వి. స్త్రీ.

నారింజ వై. వి. నారంగము, నారింజచెట్టు. నం. నారంగః.

నారికడము వై. వి. నారికేళము, కొబ్బరి కాయ రూ. నారికేడము. సం నారికేళః.
నారికురుపు వి. నాడీవ్రణము.
నారికేడము మా నారికడము.
నాలము హిం. వి. గుఱ్ఱపులాడము.
నాలి వి. కుత్సితపు పని. విశ. 1. కుత్సితము. 2. వంచకము. 3. మందము.
నాలిక వి. జిహ్వ. రూ. నాలుక, నాల్క.
నాలిఖూతము విశ. కుత్సితుడు.
నాలిముచ్చు విశ. కుత్సితుడు.
నాలుక వి నాలిక.
నాలుగు సర్వ. మూడునొకటి. రూ. నాలువు. నాల్గు.
నాలుగు కన్నుల వేలుపు వి. అగ్ని.
నావ సం. వి. ఓడ.
నావి వి. సస్యరోగము.
నావికాదిక్సూచి సం. వి. (భౌతి.) సముద్రముపై ప్రయాణము చేయు నావికులుపయోగించుదిక్సూచి (Mariner's compass). (నావ ఎట్లొరిగినను ఇది సమతలము ననే యుండుట దీని ముఖ్య లక్షణము.)
నావికుఁడు సం. వి. ఓడ నడుపువాడు.
నావ్యము సం. విశ. నావచే దాటదగినది.
నాశము సం. వి. 1. చేటు. 2. కనబడమి, 3. అనుభవము లేమి.
నాశిల్లు సం. క్రి. నశించు.
నాస సం. వి. ముక్కు. రూ. నస, నాసిక.
నాసత్యులు సం. వి, అశ్వినీదేవతలు.
నాసామణి సం, వి. ముక్కర, ముంగర.
నాసావివరములు సం. వి. (జం.) బయటికి తెరచుకొను ముక్కుకొన ముందు రంధ్రములు (Nostrils).
నాసి వి. పిల్లి.
నాసికాసంబంధము సం. విశ. (జం) ముక్కుతో సంబంధము గలది (Nasal)
నాసిరిల్లు వై. క్రి. నశించు.
నాసీరము సం. వి, 1. సేనాముఖము, 2. దర్పము,
నాస్తికవేదాంతము. సం. వి. (వరి.) వేదము లను ప్రమాణముగా స్వీకరించని జైన, బౌద్ధ, లోకాయత, చార్వాక సిద్ధాంతములు.
నాస్తికుఁడు సం. వి. దేవుడు లేడనువాడు.
నాస్తిక్యము సం. వి. నాస్తిక భావము. వర్యా. నాస్తికత.
నాళము సం. వి. 1. తామరలోనగు వాని కాడ. 2. క్రోవి, చిమ్మనగ్రోవి.
నాళరహిత గ్రంథులు సం. వి. (గృహ). వాహికలు లేని గ్రంథులు (Ductless glands). ఉదా. పిట్యూటరీ, థైరాయిడ్ మొదలగు గ్రంథులు.
నాళీకము సం. వి. 1. తామర. 2. బాణము. 3. బాణపు ములికి.

# ని

ని అవ. ద్వితీయా విభక్తి ప్రత్యయము.
నింతెలు విశ. శీఘ్రముగా.
నింగి మా వి, ఆకాశము.
నింగిచూలు వి. వాయువు. వ్యు. ఆకాశము నుండి పుట్టినది.
నింగివడు క్రి. అస్తమించు.
నింగిసిగ వి. శివుడు, వ్యోమకేశుడు.
నించు క్రి. నిండచేయు.
నింట వి, 1. జలపూరము, వెల్లువ. 2. పొంగు
నిండు క్రి. పూర్ణమగు, నిండారు, నిండుకొను. వి. పూర్ణత.
నింద సం వి. దూరు, అపదూరు.
నిందితుఁడు సం. విశ. దూరబడినవాడు.
నింద్యుఁడు సం, విశ. దూరదగినవాడు.

నింపోది విశ. సమృద్ధము. (వ్యావ) తెప్పెక్కితి
నింపొరు క్రి. పూర్ణమగు. రూ. నినుసారు.
నింపు క్రి., మా. నించు, వి. సమృద్ధి. రూ. నినువు.
నింబము సం, వి వేపచెట్టు.
నికటము వి. నిర్బంధము సం. వి. సమీపము.
నికము వి. నిక్కము.
నికరము విశ. 1, పోవలసినదిపోగా మిగిలినది. 2, శ్రేష్ఠము. సం. వి. 1. సమూహము 2, నిధి.
నికషము సం. వి. ఒరగల్లు. 2. సాన.
నికామము సం. విశ. యథేచ్ఛము. వి మిక్కిలి కోరిక.
నికాయము సం. వి. 1. గుంపు, 2 ఇల్లు. 3. తెగ.
నికాయ్యము సం.వి. ఇల్లు. రూ. నీకాయ్యము. నికాయము.
నికారణము సం. వి వధము.
నికారము సం. వి. వంచన. 2. తిరస్కారము.
నికాశము సం. వి. నిశ్చయము. విశ. తుల్యము.
నికుంజము సం. వి. పొదరిల్లు.
నికురుంబము సం. వి. సమూహము.
నికుల్యములు సం. వి. (జం.) ఎముకలలో సూక్ష్మమగు రక్తనాళములుండు చిన్న చిన్న కాలువలు (Haversiar canals).
నికృంతనము సం. వి. ఖండనము. నరకుడు.
నికృతి సం. వి. 1. బెదరుమాట. 2. వంచన. 3. తిరస్కృతి.
నికృత్తము సం. విశ. నరకబడినది.
నికృష్టము సం. విశ. అధమము.
నికెల్ ఇం. వి. (రసా.) (Nickel) అయస్కాంత ధర్మముగల తెల్లని ధాతువు. (ఇది ఆవర్తక్రమ పట్టికలోని 8వ వర్గమున ఇనుముకోబాల్టులతోకూడ చేరియున్నది).
నికేతనము సం. వి. ఇల్లు.
నిక్కచ్చి వై. వి. 1. నిర్బంధము. 2, సారము. 3, మొగమోటమి లేమి. సం. నిష్కర్షః.
నిక్కము వి. 1. నిశ్చయము. 2. యథార్థము. 3. అన్వర్థము. రూ. నికము, నిక్కువము.
నిక్కల వి. (నిక్కము+కల) నిజమైన కల.
నిక్కవుడు వై. వి. నిష్కపటము;కపటము లేకపోవుట.
నిక్కవొడుచు క్రి. నిలువుననిలుచు; నిక్కబొడుచు.
నిక్కాక వి., (నిండు+కాక) మిక్కిలికాక.
నిక్కు క్రి. 1. ఉన్నతమగు. 2 అతిశయించు. 3. గర్వించు, 4 వర్ధిల్లు, వి. 1. ఉన్నతి. 2. గర్వము.
నిక్కుంబోతు విశ. గర్వస్వభావము గలవాడు.
నిక్కుడు వి. 1. ఉన్నతి. 2. గర్వము.
నిక్కువము వి. నిక్కము.
నిక్కువీనులజక్కి వి. ఉచ్చైఃశ్రవము.
నిక్వణము సం. వి, వీణ లోనగు వాని మ్రోత. రూ. నిక్వాణము.
నిక్షేపము సం. వి. (రసా.) కొన్ని పదార్థములు కలిసినపుడు బరువు కలిగిన పదార్థములు క్రిందికి దిగిపోవుట (Deposit). సం. వి. ఒకరు చెప్పి చూపియుంచిన యిల్లడ, నిధి.
నిక్షేపశిల సం, వి, (భూగో.) ఇట్టి శిలలు స్వరూపధారణకు ముందు ద్రవరూపములో నుండి తమలో గల మట్టి, చెత్త, రాసాయనములు మున్నగు వానితో ఘనపదార్థములుగ తయారగును. సం వి. నదులచే కొనిరాబడిన రాళ్ళు. ఒండ్రు మన్ను సముద్రపు ముఖద్వారముల యొద్ద గాని, నదులు కలియు సకస్సు

అలోగాని దిబ్బలుగా నేర్పడి, పెక్కువేల సంవత్సరముల తరువాత క్రింది పొరల నొత్తిడిచే పైపొరలు రాతికొండవలె నేర్పడి భూకంపముల వలన గాని అగ్ని పర్వతముల వలనగాని నీటి పై భాగమునకు వచ్చిన శిలాభాగములు. (విశేష శిలలు = దాచిపెట్టబడిన రాళ్ళు)

నిక్షేపించు సం. క్రి. 1. పూడ్చు 2. దాచు. 3. ఉంచు.

నిఖాతకము సం. విశ. (జం.) భూమి నుండి త్రవ్వి యెత్తబడినరాయి, లేక ఖనిజము. రాతిలో నిక్షిప్తమై యున్న పూర్వజీవి యొక్క అంశము (Fossil).

నిఖాతము సం. విశ. త్రవ్వబడినది.

నిఖిలము సం. విశ. సమస్తము.

నిగదము సం. వి. స్పష్టముగా చెప్పుట.

నిగదించు సం. క్రి. స్పష్టముగా చెప్పు.

నిగమము సం. వి. 1. వేదము, 2. అంగడి మార్గము. 3. పట్టణము. 4. వర్తక సంఘము.

నిగముఁడు సం. వి. బేహారి.

నిగరణము సం.వి. 1. మ్రింగుట. 2,కంఠము.

నిగరము సం. వి మ్రింగుట. వై. విశ. శ్రేష్ఠము.

నిగళము సం. వి. (జం.) అన్నవాహికలో గళము తరువాత నుండు భాగము(Gullet or oesophagus). సం. వి. 1. ఏనుగు కాలి సంకెల. 2. సంకెల. రూ. నిగడము

నిగా హిం. వి. దృష్టి. రూ. నిఘా. జాగరూకత.

నిగుడారు క్రి. వ్యాపించు.

నిగుడు క్రి. 1. వ్యాపించు. 2 నిక్కు. 3. దాగు. 4. విజృంభించు. 5. కవియు. 6. చక్కబడు. 7. వర్ధిల్లు. రూ. నివుడు,

నిగుడుచెంచు క్రి. నిక్కు.

నిగుఱు వి. కట్టెల నిప్పుమీది బూడిద. రూ. నివురు, నీరు.

నిగూఢము సం. విశ. రహస్యమైనది. తెలియనిది.

నిగ్గడి విశ. కఠినము.

నిగు క్రి. నిర్వహిల్లు. వి. 1. కాంతి, 2. నికషము.

నిగ్రహము సం. వి. 1. త్రోపాట. 2. బెదరుమాట. 3. చెర. 4. మేర.

నిగ్రహించు సం. క్రి త్రోపాడు. (వ్యావ) గెలుపొందు,

నిఘంటువు సం. వి. పదపదార్థముల తెలియచేయు గ్రంథము.

నిఘాతిక సం. వి. దాగలి.

నిఘ్నుఁడు సం. విశ. అధీనుడు.

నిచక్రము సం. వి. (వృక్ష.) ముండక పుష్పమంజరి చుట్టును బయట రక్షణ కొరకు ఏర్పడిన నిపత్ర (Bracts) వలయము (Involucre of Bracts).

నిచయము సం. వి. సమూహము.

నిచర్మము సం. వి. (జం) మధ్యస్తరము నుండి ఉత్పత్తియై పృష్ఠవంశీన జంతువులలో అధిచర్మముక్రింద నున్న చర్మభాగము (Dermis).

నిచితము సం. విశ. పరపబడినది.

నిచులము సం. వి. 1. కప్పుడు దుప్పటి. 2. ఎఱ్ఱగన్నేరు.

నిచోళము సం. వి. గొసెన, కప్పుడు దుప్పటి.

నిచ్చెన వై. వి. నిశ్రేణి, పై కెక్కుటకగిన సాధనము. సం. నిశ్రేణిః.

నిచ్చ వై. అవ్య. నిత్యము, సదా. ప్రతిదినము. సం. నిత్యమ్.

నిచ్చెయము వై. వి. నిశ్చయము.

నిచ్చలము వై. వి. 1. నిశ్చలము. 2. నిశ్చయము. 3. నిర్దోషము. 4. నిరంతరము.

నిచ్చెలు వై. వి. నిశ్చయము. అవ్య. సదా.

నిజము నం. వి. స్వభావము. విశే. 1. తనది. 2. శాశ్వతమైనది.
నిజమరి విశే. సత్యశీలుడు.
నిజము వై. వి. సత్యము. విశే. 1. శాశ్వతమైనది. 2. సత్యమైనది.
నిజామ్ హిం. జాతి. (చరి.) రాష్ట్రము నేలువాడు. క్రి. శ. 1724నుండి 1948 వరకు దక్కను సుబా(హైదరాబాదు రాష్ట్రము) నేలిన ఆసఫ్ జాహి వంశీయులైన దక్కను సుబేదారుల బిరుదు.
నిటలము నం. వి. నొసలు. రూ. నిటాలము.
నిటలాక్షుఁడు నం. వి శివుడు.
నిట్ట వి. 1. ప్రవాహము. 2. స్తంభము. 3. స్థానము. 4. నిక్క.
నిట్టకనిలుచు క్రి. సరిగా నిలుచు. రూ. నిట్టనిలుచు.
నిట్టకనిలువు వి. సరినిలువు. రూ. నిట్టనిలువు. నిట్టకనిల్వు.
నిట్టగమ్ము క్రి. 1. నిట్టవొడుచు, 2. ఉప్పొంగు. 3. రోమాంచితమగు. 4. విజృంభించు.
నిట్టరాడు వి. గుడిసె యింటి నడుమ నిలువు పొడవుకంబము,కవోరము, మొకరము, రూ, నిట్రాడు, నిట్రాడి.
నిట్టు వై. వి. 1. ఉపవాసము, 2. క్షామము, విశే. శుష్కము. రూ. నిట్రు. నం. నిష్ఠా. నిష్ఠురమ్,
నిట్టుపొసము వై. వి. శుష్కోపవాసము. నం. నిష్ఠురోపవాసము.
నిట్టూరుచు క్రి. (నిడుద+ఊరుచు) దీర్ఘ నిశ్వాసముచేయు.
నిట్టూరుపు వి. దీర్ఘనిశ్వాసము.
నిట్రించు క్రి. నిలువుగా నుంచు.
నిట్రిల్లు క్రి. ఉపవాసముండు.
నిట్రు వి. ఉపవాసము. విశే. శుష్కము. రూ. నిట్టు.
నిట్రుపొసము వై. వి. చూ. నిట్టుపొసము.
నిడివి వి. పొడవు.
నిడుద విశే. పొడవు. దీర్ఘము. రూ. నిడుపు.
నిడుదమోము వి. పొడవైన మొగము. రూ. నిడుమోము
నిడుదవెన్ను వి. పాము. రూ. నిడుపఁడు.
నిడువెంట్రుక వి. రోమాంచము.
నితంబము నం. వి. 1. పిరుదు, మొల. 2. కొండ నడుము. 3. మూపు. 4 దరి, ఒడ్డు.
నితంబమేఖల నం. వి. (జం.) కటివలయము. తుంటి యెముకల చక్రము·(Hip-girdle or pelvic- girdle).
నితంబసంబంధము నం. విశే. (జం.) తుంటికి సంబంధించినది (Sciatic)
నితంబిని నం. వి. స్త్రీ.
నితాంతము నం. విశే. పెల్లు. అధికము.
నిత్యత నం. వి. (భౌతి. రసా.) ద్రవ్యము యొక్కకాని, శక్తి యొక్కగాని రాశి మొత్తముమీద క్షయవృద్ధులు లేకుండుట (Conser vation). ద్రవ్య నిత్యతానియమము = Law of conservation of mass, శక్తి నిత్యతానియనుము = Law of conservation ol energy.
నిత్యము నం. విశే. ఎల్లప్పుడు, ఎడతెగనిది.
నిదర్శనము నం. వి. దృష్టాంతము. 2. (అలం) ఒక అర్థాలంకారము.
నిదాఘము నం. వి. 1. వేసగి, వేడిమి. 2. చెమట.
నిదానము వై. వి. ఆత్రపడకుండుట. నం. నిరాకరణము. నం. వి. 1. ఆదికారణము. 2. పెయ్యపలువు. 3. రోగనిర్ణయము.
నిదిధ్యాసనము నం. వి. మరిమరి తలచుట. మిక్కిలి ఆలోచించుట.
నిదుర వై. వి. నిద్ర, కునుకు, కూరుకు, రూ. నిద్దుర.

నిదురపోతు విశే. నిద్రాళువు రూ. నిద్దుర పోతు.

నిదేశము సం. వి. 1. ఆజ్ఞ. 2. చెప్పుట. 3 దాపు.

నిదేష్ట సం విశే. ఆజ్ఞాపించువాడు.

నిద్దము వై. విశే. 1. నిగ్గము, నునుపైనది. 2. స్నేహము. రూ. నిద్దా, సం, స్నిగ్ధము

నిద్దుర వై. వి నిదుర, సం. నిద్రా.

నిద్రం సం వి. కూరుకు.

నిద్రాగతి సం. వి. (వృక్ష.) నిద్రపోవు చున్నటు ఆకులుగాని పూవులుగాని ముకు ళించుకొనుట (Sleep movement).

నిద్రాణుఁడు సం. వి. నిదుర పోతు. రూ. నిద్రాళువు.

నిద్రాళువు సం. విశే. నిదురపోతు, నిద్రించు స్వభావము గలవాడు.

నిధనము సం. వి. 1. కులము. 2. చావు 3. చేటు.

నిధానము సం. వి. 1. ఉంచుట. 2. పాతర.

నిధి సం. వి. పూడ్చి యుంచిన ధనము, పాతర. (అర్థ.) ఒక యవసరము కొరకు ప్రత్యేకముగ నిలువచేసిన ధనము. (ఏ యవసరమునకై నిధి ఉపయోగింపబడునో ఆ పేరు దానికి పెట్టబడును. ఉదా. రక్షణ నిధి.)

నిధువనము సం. వి. 1. కలయిక. 2 వణకు.

నినదము సం. వి. 1. ధ్వని. 2. నినాదము.

నినుచు క్రి. నిండించు. రూ. నించు, నింపు. నినుపు.

నినుపారు క్రి. పూర్ణమగు, రూ. నింపారు.

నినుపు క్రి. నిండించు. విశే. సమృద్ధి.

నిన్న వి. నడచిన దివసము.

నిపతము సం. వి. పాతము చదువు. రూ. నిపాతము, నిపతనము.

నిపత్రము సం. వి. (వృక్ష.) చేటిక. కొన్ని పుష్పమంజరులలో ప్రతిపుష్ప వృంతము నకు మొదట పుష్పదండముపై నగుపడు చిన్న ఆకువంటి నిర్మాణము (Bract). నిపత్రసహితము = (Bracteate) నిపత్ర రహితము (Bractless).

నిపత్రికలు సం. వి. (వృక్ష.) చిరుచేటికలు, సాధారణముగ పుష్పవృంతముపై నుండు నిపత్రముకంటె చిన్నవైన పత్రములవంటి నిర్మాణములు (Bracteoles).

నిపాతనము సం. వి. దిగద్రొబ్బుట. పడ ద్రోయుట.

నిపాతము సం. వి. పడుట. (వ్యాక.) అవ్య యము. 2 సూత్రమునకు వ్యతిరేకముగ విధించు శబ్దము.

నిపానము సం. వి. పశ్వాదులు నీరు త్రాగు టకు బావి దగ్గర కట్టిన తొట్టి.

నిపుణత సం. వి. కౌశలము. నేర్పరితనము (Skill).

నిపుణుఁడు సం. వి. నేర్పరి.

నిప్పచ్చరము వై. వి. దారిద్ర్యము.

నిప్పటి వి. భక్ష్యవిశేషము.

నిప్పస్తు వి. ఉపోషవవాసము.

నిప్పు వి. అగ్ని, అగ్నికణము. రూ. నిప్పుక.

నిప్పుకోడి వి. ఉష్ట్రపక్షి.

నిబంధనము సం. వి. 1. ఏర్పాటు. 2. బంధము. 3. మార్పబడినది.

నిబంధము సం. వి. 1. మలమూత్రబంధము. బంధము.

నిబంధించు సం. క్రి. 1. బంధించు. 2. అడ్డగించు.

నిబద్ది విశే. నిజము రూ. నిబ్బద్ది.

నిబద్దించు క్రి. నిజపరుచు. రూ. నిబద్దిలించు.

నిబద్ధము సం. విశే. 1. బంధింపబడినది. 2. అడ్డగింపబడినది.

నిబర్హణము సం. వి. చంపుట

నిబిడము సం. విశే. దట్టము.

నిబిడీకరించు సం. క్రి. దట్టముచేయు.

నిబిడీకృతము సం. విశ. నిబిడముగా చేయబడినది.
నిబోధనము సం. వి. చూపు.
నిబ్బరము వై. వి. 1. అశ్వగతి, ప్లుతము. విశ. అధికము. సం. నిర్భరః
నిబ్బరించు వై. క్రి. 1. అతిశయించు. 2. నిదానించు.
నిబ్బరితము వి. కరుణ.
నిబ్బరించు క్రి. కరుణించు.
నిభము సం వి. నెపము. విశ సమానము.
నిభాయించు హిం. క్రి. సహించు.
నిభృతము సం. విశ. 1. తీర్పబడినది. 2. నిండినది. 3. కదలనిది.
నిమంత్రణము సం. వి. యజ్ఞము మొ,గువాని కాహ్వానించుట;
నిమంత్రితుఁడు సం. విశ. నిమంత్రింపబడినవాడు, ఆహ్వానింపబడినవాడు,
నిమజ్జనము సం, వి. స్నానము. రూ. మజ్జనము,
నిమయము సం. వి. వస్తువుల మారుపు. రూ. వినిమయము.
నిమిత్తము సం. వి. 1. కారణము. 2, శకునము. 3. గురి.
నిమిషము సం, వి. రెప్పపాటు. రూ. నిమేషము, నిముసము 60 సెకండ్లకు సమానమగు కాలభాగము, గంటలో అరువదియవ భాగము.
నిమీలకచ్ఛదము సం. వి. (జం.) మూడవ కనురెప్ప (కప్ప) (Nictitating membrane). (దీనిని స్వేచ్ఛగా కదల్పుటకు వీలగును). కంటిపొర.
నిమీలనము సం. వి. 1. కనులుమూయుట, 2. చావు.
నిముకు క్రి. స్తన్యపానముచేయు.
నిమురు క్రి. శరీరమును మెల్లగా తడుము, నివురు.
నిముసము వై. వి. నిమిషము. సం.నిమేషః.
నిమోనియా ఇం. వి. (గృహ.) (Pneumonia) ఊపిరితిత్తి వాపుతో కూడిన జాడ్యము, శ్వాసకోశమునకు సంబంధించిన విషజ్వరము, కఫజ్వరము, శ్లేష్మజ్వరము. పుప్పుసదాహము.
నిమ్నకోణము సం. వి. (గణి.) నీటి నుట్టముతో క్రిందనున్న వస్తువు చేయుకోణము (Angle of depression).
నిమ్నగ స్త్రీ.సం. వి. ఏరు. వ్యు. పల్లమునకు పారునది,
నిమ్నము సం. వి. పల్లము. విశ. లోతైనది విశ.(వృక్ష.)అధస్థితము (Inferior).
నిమ్నోన్నత రేఖలు సం. వి. (భూగో.) సముద్రమునకు పైని ఒకే ఎత్తున ఉన్న ప్రదేశముల నన్నిటిని కలుపు ఊహారేఖలు
నిమ్మ వి. జంబీరము.
నిమ్మళము వై.విశ.స్వస్థము. సం. నిర్మలమ్.
నియంత సం. వి. తేరునడపువాడు. విశ, నడపువాడు. సం. వి. (చరి. రాజ) సర్వాధికారి, అధినాయకుడు (Dictater).
నియంతృత్వము సం. వి (చరి. రాజ.) అధినాయక తంత్రము. రాజ్యములో అన్ని అధికారము లొకనియందే కేంద్రీకరింపబడుట. అప్రతిబంధక సత్తాకము (Dictatership).
నియత నిష్పత్తి నియమము సం. వి (రసా.) యౌగికమందలి ఘటకమూల ద్రవ్యముల రాసుల యొక్క నిష్పత్తి నియతముగ నుండునను నియమము, స్థిరనిష్పత్తి నియమము (Law of definite proportion).
నియతము సం, విశ. 1. నియమముగలది. 2. నిత్యమైనది. (గణి.) నియత పరిమాణము గలది. (Definite).
నియత సంచారి నౌక సం. వి. (వాణి.) క్రమబద్ధమైన సంచార కార్యక్రమముగల

నౌక. ఒకటి రెండు సంవత్సరముల వరకు ఏరోజున ఏరేవును తాకనున్నదో ముందే నిర్ణయింపబడిన కార్యక్రమముగల నౌక (Liner).

నియతి సం. వి. 1 నియమము. 2. భాగ్యము

నియమనము సం. వి. ఏర్పాటు.

నియమబద్ధ ప్రభుత్వము సం. వి. (రాజ) సంవిధానము ప్రకారము నడుచుకొను ప్రభుత్వము (Constitutional government)

నియమము సం. వి. (భౌతి.) కొన్ని ప్రకృతి సంఘటనల సంతతక్రమమును సూచించు సూత్రము (Law) విజ్ఞానశాస్త్రములందు ప్రత్యక్షవేక్షింపబడిన ఏదేని ఒక సంబద్ధ భూతార్థముల సమూహమును సమన్వయించి ప్రకృతి ప్రవర్తనను సూచించు సూత్రము సం. వి. (గణి) షరతు (Condition), కారణప్రక్రియల క్రైప్రవర్తమానమగునది. సం వి. 1. ఏర్పాటు, 2 కట్టు, 3. వసువు. 4. ప్రతిజ్ఞ. 5. వ్రతము. రూ, నియామము.

నియమించు సం. క్రి. 1. ఏర్పాటుచేయు. 2. ఆజ్ఞాపించు.

నియమితము సం. విశ. నియమింపబడినది.

నియమ్యము సం. విశ. నియమింపదగినది.

నియామకము సం. వి. నిర్ణయించుట. ఏర్పాటు.

నియామకుడు సం. విశ. నియమించువాడు.

నియాన్ ఇం. వి. (రసా.) (Neon) వాతావరణములో చలనములేని వాయు రూపమగు ఒక మూలపదార్థము.

నియాసిన్ ఇం. వి. (గృహ) (Niacine) నికోటినిక్ ఆమ్లము(Nicotinic acid)ఇది విటమిన్ $B_2$. (ఆహారములో నిది తక్కువైన పెల్లగ్రాయను వ్యాధి కల్గును.)

నియుతము సం. వి. లక్ష.

నియుక్తము సం. వి. వాక్యాయుక్తము.

నియోక్తవ్యము సం. విశ. నియోగింపదగినది.

నియోగము సం. వి. ఆజ్ఞ. రూ. నియోజనము

నియోగి సం. వి. 1. మంత్రి 2. నియోగ్యా. బ్రాహ్మణులలో ఒక తెగ.

నియోగించు సం. క్రి. ఆజ్ఞాపించు.

నియోగ్యుడు సం. విశ. నియోగింపదగిన వాడు.

నియోజకవర్గము సం. వి. (శాస. రాజ.) నిర్వాచన క్షేత్రము, ఎన్నిక ఫిర్కా, ఎన్నిక స్థానము

నియోజకులు సం. వి. (శాస. రాజ.) ఎన్నిక దారులు, నియామకులు, నియమించు వారు. (Elector).

నియ్యోగి వై. వి. నియోగి. సం. నియోగి.

నిరంకుశ ప్రభుత్వము సం. వి. (చరి. రాజ) నిరంకుశ పాలన (Depotism).

నిరంకుశము సం. విశ. అడ్డులేనిది.

నిరంజనము సం. విశ. 1. కాటుకలేనిది. 2. దోషములేనిది.

నిరంతరము సం విశ. 1. దట్టము. 2. ఎడతెగనిది.

నిరంతర హరితారణ్యములు సం. వి. (భూగో.) ఏకాలమునను చెట్ల ఆకులు పూర్తిగా రాలిపోని అడవులు (వర్షము 80" కంటె అధికముగ నుండు ప్రాంతములలో ఈ అడవులుండును, రబ్బరు, సింకోనా, దేవదారు చెట్లు మొదలగునవి యిందు పెరుగును.

నిరతము సం. విశ. మిక్కిలి ఆసక్తి గొన

నిరతి సం. వి. మిక్కిలి ఆసక్తి.

నిరత్యయము సం. విశ. నాశము లేనిది.

నిరపేక్షము సం. విశ (గణి.) ఒకదానితో సంబంధము లేనిది (Absolute). (నిరపేక్ష గుణకము = Absolute coefficient).

నిరపేక్ష నిశ్చరము నం. విణ. (గణి). ఏ పరిస్థితి-లోను మారనిది (Absolute invariant).
నిరయము నం వి.1.దర్గతి 2. నరకము.
నిరర్గళము నం విణ. అడ్డులేనిది
నిరర్థకము నం, విణ ప్రయోజనము లేనిది.
నిరవధికము నం విణ. మేర లేనిది.
నిరసనము నం, వి. 1. నిరస్కారము, ఆక్షేపము 2. వధము. రూ నిరాసనము.
నిరస్తము నం విణ. తిరస్కరింపబడినది వెడలగొట్టబడినది, నిరాకృతము.
నిరాకరణ నం. వి. (గృహ) విసర్జన, త్రోసివేయుట (Rejection).
నిరాకారము నం. వి. ఆకాశము. విణ. ఆకారము లేనిది
నిరాకృతము నం, విణ న్యాయముచేత్రోయబడినది, నిరస్తము.
నిరాఘాటము నం. విణ. 1. హద్దు లేనిది. 2 అడ్డులేనిది.
నిరాతంకము నం విణ. 1. భయము లేనిది. 2. వ్యాధిలేనిది.
నిరాహారి వై. వి. మౌని. నం. నిరాహారి.
నిరామయము నం. వి. 1. రోగములేమి 2. సౌఖ్యము.
నిరాయుధీకరణము నం. వి. (వరి. రాజ.) యుద్ధములను అరికట్టి ప్రపంచశాంతిని నెలకొల్పుటకై తమ సాయుధబలములు ఏకమై ఒక పరిమితిలో స్వేచ్ఛాపూర్వకముగ రాజ్యములు నియంత్రణ పెట్టుకొనుట.
నిరాహారదీక్ష నం. వి. (వ్యావ.) అన్నపానాదులు లేక యుండుట, తమ రాజకీయార్థిక సాంఘిక లక్ష్యములను సాధించుటకై నిరాహారదీక్షను ఆయుధముగ ఉపయోగించుట.
నిరింద్రియపు ఎరువులు మి. వి. (వ్యావ.) సేంద్రియ పదార్థము లేని ఎరువులు (Inorganic manures). ఉదా. బూడిద. పాటిమన్ను, వండలిమన్ను, సూపర్ కాంపు మొ.
నిరీక్షణము నం వి, చూపు.
నిరీక్షించు నం క్రి. ఎదురుచూచు.
నిరు వై. అవ్య. గతించినది. రూ. నిరుడు నం నిర్.
నిరుడు వి. గతించిన సంవత్సరము.
నిరుదజనీకరణ నం. వి (రసా.) ఒక యౌగిక మందలి ఉదజనిని ఉచిత రాసాయనిక ప్రక్రియలచే వెడలగొట్టుట (Dehydrogenation).
నిరుద్ధము నం. వి. (రసా.) ఉదకముకలిపిన యెడల ఆమ్లము నిచ్చు ఆమ్లజనిదము (Anhydride) ఉదా. ఫాస్ఫొరస్ పెంటాక్సైడ్ + ఉదకము = ఫాస్ఫారికామ్లము,
నిరుద్ధము నం, విణ. నిరోధింపబడినది.
నిరుద్యోగభీమా మి. వి. ఒకవ్యక్తి నిరుద్యోగస్థితిలో ఆర్థిక సాహాయ్యము పొందుటకు చేసికొను భీమా.
నిరుపమము నం. విణ. సాటిలేనిది.
నిరూఢి నం. వి. ప్రసిద్ధి. రూ. రూఢి.
నిరూపణ నం. వి. (గణి.) ఉపపత్తి ఒక ప్రవచన సత్యమును నిరూపించు ప్రక్రియ (Proof).
నిరూపణము నం. వి. 1. అరయిక, చూపు 2. ఆకారము. నం. వి. (గణి.) నిరూపించు విధానము,రూపకల్పనచేయు పద్ధతి (Representation).
నిర్‌ృతి నం. వి. (నిర్ + ఋతి) 1. అలక్ష్మి. 2. ఒక దిక్పాలుడు.విణ. ఉపద్రవములేనిది
నిరోధము నం. వి. 1. అడ్డు. 2. చేటు. నం. వి. (భౌతి.) ఒక వస్తువుయొక్క చలనమునకు ఇంకొక వస్తువు కల్పించు అడ్డంకి (Resistance).

నిరోధించు సం. క్రి. అడ్డగించు.

నిర్గంధకరణము సం. వి. (రసా.) వాసన లేకుండచేయుట( De-odorisation) ఉదా రిఫైన్డ్ ఆయిల్ = వాసనలేని ఆముదము)

నిర్గతము సం. విశే. నిష్క్రమించినది బయల్వెడలినది.

నిర్గతి సం. వి. వెడలబాటు. పర్యా. నిర్గమనము, నిర్గమము.

నిర్గమననాళము సం. వి. (రసా.) ఒక పరికరమునుండి వచ్చుచున్న వాయువును ఒక పాత్రలో సంగ్రహించుట కుపయోగించు నాళము. (Delivery tube).

నిర్గమించు సం. క్రి. వెడలబడు. వెళ్ళు.

నిర్గుణుఁడు సం. వి. భగవంతుడు. విశే. గుణరహితుడు.

నిర్ఘాతము సం వి. 1. పిడుగు. 2. వజ్రము

నిర్ఘృణుఁడు సం. విశే. కనికరములేనివాడు, నిర్దయుడు.

నిర్ఘోషము సం. వి. ధ్వని.

నిర్జనము సం. విశే. జనములేనిది.

నిర్జరుఁడు సం వి. వేలుపు,

నిర్జలఘటము సం. వి. (భౌతి.) నిర్మాణమందు నీటిని వాడనివిద్యుద్ఘటము( Dry-cell). ఉదా. టార్చిదీపము లందలి బ్యాటరీలు.

నిర్జలస్థలోద్భిదము సం. వి. (వృక్ష.) నీరు లభించని స్థలములో పెరుగు మొక్క (Xerophyte).

నిర్జలీకరణము సం. వి. (రసా.) నీరులేకుండ చేయుట (Dehydration)

నిర్జితుఁడు సం. విశే. గెలువబడినవాడు. ఓడినవాడు.

నిర్జించు సం. క్రి. గెలుచు, జయమును పొందు.

నిర్జీవావరణ సం. వి. ప్రాణములేని వస్తువులతో నేర్పరచిన ఆవరణ(Dead fence) ఉదా రోడ కంచె, ఇనుపకీగలు, ఇనుప కమ్మీలు మున్నగు వానితో నేర్పరిచిన ఆవరణలు మొ॥ లగునవి.

నిర్ఝరము సం వి సెలయేరు. రూ. ఝరము

నిర్ఝరిణి సం. వి నది.

నిర్ణయము సం. వి. ఏర్పాటు.

నిర్ణయించు సం క్రి. ఏర్పాటుచేయు.

నిర్ణాయక(ప)వోటు మి. వి. (రాజ.) నిర్ణాయక సమ్మతి, ఉభయ పక్షములు సమానమైనప్పుడు అధ్యక్షుడు తన అధిక సమ్మతి నొక పక్షమునకిచ్చి తీర్మానించును.(Casting vote).

నిర్ణాయకుఁడు సం. విశే. ఏర్పాటుచేయువాడు. రూ. నిర్ణేత.

నిర్ణీతము సం. విశే నిర్ణయింపబడినది.

నిర్దగ్ధము సం. విశే. చక్కగా కాలినది.

నిర్దయుఁడు సం. విశే. దయలేనివాడు.

నిర్దళనము సం. వి. చక్కగా ఛేదించుట.

నిర్దహనము సం, వి. చక్కగా కాలుట

నిర్దహించు సం. క్రి. చక్కగా కాల్చు.

నిర్దారణము సం. వి. చక్కగా చీల్చుట.

నిర్దిష్టము సం. విశే. నిర్దేశింపబడినది.

నిర్దుష్టము సం; విశే. (గణి.) ఒక సిద్ధాంతము గాని, ప్రమేయముగాని స్థాపించు విషయమున తిరుగులేనిది (Rigorous) సం. విశే. (గృహ.) కొరత లేనిది. తప్పులు లేనిది. నిష్కళంకమైనది (Faultless, perfect).

నిర్దేశకులు సం. వి. (వాణి.) కంపెనీ యొక్క దైనందిన కార్యక్రమములనుపర్యవేక్షించుటకు వాటాదారులు ఎన్నుకొన్న ప్రతినిధులు.

నిర్దేశము సం. వి. 1. ఆజ్ఞ. 2. చెప్పుట.

నిర్దేష్ట సం. విశే. నిర్దేశించువాడు.

నిర్ధారణ సం. వి. నిశ్చయము.

నిర్ధారణీయము సం విశే. నిశ్చయింపదగినది.

నిర్ధూతము సం. విణ. 1 విడువబడినది. 2. ఎగరగొట్టబడినది

నిర్నిద్రము సం. విణ. జాగరూకత గలది.

నిర్బంధ నిక్షేపము సం. వి. (వాణి., శాస.) గడువుకాలము తీరువరకు ఖాతాదారుడు తీయుటకు వీలులేని ధననిక్షేపము ఇట్టి నిక్షేపము ప్రభుత్వము యొక్క ఆజ్ఞపై జమ చేయబడును. (ప్రస్తుత భారత దేశములో ప్రభుత్వము తన ఆర్థికావసరముల కొరకు ఈ పద్ధతి నమలుపరిచినది).

నిర్బంధపుపొదుపు మి వి (అర్థ.) ప్రభుత్వపు ఆజ్ఞపైన తప్పనిసరిగా సొమ్ము మిగిల్చి దాచుకొనుట.

నిర్బంధము సం. వి, 1. బలాత్కారము. 2. కదల మెదలగూడని కట్టు.

నిర్బంధవిద్య సం. వి. (వ్యావ.) తప్పనిసరిగా కొన్ని సంవత్సరముల వయస్సు వచ్చు వరకు ప్రభుత్వము యొక్క నిర్బంధము వలన బాలబాలికలను చదివించుట.

నిర్బంధసైనిక సేవ సం. వి. (వరి., రాజ.) నిర్బంధముగా సైన్యములో చేర్చుకొనుట.

నిర్భయము సం. విణ. భయము లేకపోవుట భయములేమి,

నిర్భరము సం. విణ. పెల్లు, అధికము.

నిర్భర్త్సనము సం. వి, అదలుపు, అదల్పు.

నిర్భాగ్యుడు సం. విణ. భాగ్యములేనివాడు.

నిర్భిన్నము సం. విణ. చక్కగా భేదింపబడినది

నిర్మలము సం. విణ. మలినములేమి, శుద్ధము, నిర్మాల్యము.

నిర్మాణము సం. వి. (గణి.) నిరూపణకు సహాయపడు నిర్మాణము (Construction) సం. వి. (రసా.) వస్తువులను, పారిశ్రామికముగా తయారుచేయుటకు (Manufacture). సం. వి, 1. నిర్మితి. 2. యోగ్యత

నిర్మాణయంత్రము సం. వి. (రసా.) ముడి వస్తువుల నుండి సంస్కృత వస్తువుల తయారు చేయుటకు ఉద్దిష్టమైన యంత్ర క్రమము (Plant).

నిర్మాణశాల సం. వి, (రసా) పారిశ్రామిక వస్తువుల తయారుచేయు కర్మాగారము (Manufactory).

నిర్మాణాత్మకము సం. విణ. (గృహ) కట్టడము సంబంధమైనది (Structural).

నిర్మాత సం. విణ. నిర్మించువాడు. రూ. నిర్మాయి.

నిర్మాల్యము సం. వి. ధరించి తీసివేసిన పూలదండలు మొ॥వి.

నిర్మించు సం. క్రి. కలుగచేయు, సృష్టించు.

నిర్మితి సం. వి. నిర్మాణము, సృష్టి

నిర్మూలించు సం. క్రి. మొదలంట నాశము చేయు.

నిర్మోచనము సం. వి (జం.) శరీరముపైనున్న పొరను వదిలివేయుట (Moulting)

నిర్యాణము సం వి. 1. వెడలుట. 2, ముక్తి 3. చావు.

నిర్యుద్ధసంధి సం. వి. (రాజ.) యుద్ధము చేయమని ఉభయ రాజ్యముల మధ్యగాని రాజ్యకూటముల మధ్యగాని జరుగుసంధి.

నిర్లక్ష్యము సం. వి. (గృహ.) 1. ముందు ఆలోచనలేనిది. 2 దైవాధీనమైనది (Casual). వి. అశ్రద్ధ.

నిర్లిప్తము సం. విణ. పూతలేనిది. నిస్సంగమము. తగులుపాటు లేనిది.

నిర్వచనము సం. వి, అర్థవివరణము చేసి చెప్పుట. సం వి. (గణి.) ఏదైన విషయమునుగాని వస్తువునుగాని దాని గుణములచే లేక ధర్మములచే వర్ణించుట (Definition),

నిర్వర్ణకణములు సం. వి. (వృక్ష.) ఇది ఆది లవణములలో నొకటి. ఇవి జీవకణమునకు ఏ విధమైన రంగును కలుగ చేయవు. (Leucoplasts).

ర్వర్తించు సం. క్రి. నెరవేర్చు.
నిర్వర్తిల్లు సం. క్రి. నెరవేరు.
నిర్వహణము సం. వి. (గృహ.) చక్కబెట్టు కొనుట (Management). సంసార నిర్వహణము = House-management, కుటుంబ సహితమైన ఇంటిని దిద్దుకొనుట.
నిర్వహించు సం. క్రి. (గృహ.) నడిపించు, చేయు (Transact).
నిర్వహిల్లు సం. వి. జరుగు, నెరవేరు
నిర్వాణము సం. వి. 1. ముక్తి 2 నాశము 3 సుఖము 4. జీవిత వ్యామోహముల నుండి సంపూర్ణ విముక్తిని పొందుట.
నిర్వాతము సం. వి. చలింపనిగాలి. విశ. గాలిలేనిది (చోటు.)
నిర్వాతస్వేదనము సం. వి. (రసా.) ఒక మూసి యుంచిన పాత్రలోని ద్రవ్యము లను బాగుగా వేడిచేయుటచే ఎగిరిపోయెడి వాయు ద్రవ్యములను ప్రోగుచేయు పద్ధతి (Destructive distillation)
నిర్వాదము సం. వి. నిశ్చితవాదము, అప వాదములేమి.
నిర్వాపణము సం. వి. 1. ఈవి. 2. విత్తులు చల్లుట 3. చంపుట.
నిర్వారసత్వ సిద్ధాంతము సం. వి. (చరి) బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీతో సైన్య సహాకారపు ఒప్పందములు గల భారత సంస్థానాధీశులు పుత్రులు లేకుండ మరణించినచో వారి రాజ్యములు ఈస్టిం డియా కంపెనీకి చెందునని 'లార్డ్ డల్హౌసి' (1848-56) ప్రతిపాదించిన 'లాప్స్' సిద్ధాంతము.
నిర్వాసనము సం. వి. 1. చంపుట 2. వెడల గొట్టుట.
నిర్వాహకుఁడు సం. వి. నిర్వహించువాడు.
నిర్వాహము సం. వి. 1. శక్తి. 2 జరుగు బాటు
నిర్వాహిక రహిత గ్రంథి సం. వి. (జీవ) వాహికా నాళము లేకుండ తిన్నగా రక్తములోనికి స్రావకద్రవమును ప్రవింపచేయు గ్రంథి (Ductless gland, endocrine).
నిర్విణ్ణుఁడు సం. విశ. నిర్వేదము పొందిన వాడు.
నిర్విష్టము సం. విశ. 1. పొరబడినది. 2. పొందబడినది.
నిర్వృంతము సం విశ (వృక్ష.) కాడ లేనిది, వృంతములేనిది, అవృంతము (Sessile)
నిర్వృతి సం. వి. 1. సుఖము 2. ఊరట. 3. నాశము.
నిర్వృత్తి సం. వి 1. సంతోషము. 2. మోక్షము. 3. నెరవేరుట, విశ. వృత్తి లేనిది.
నిర్వేదము సం వి. 1. దుఃఖము, 2. వైరాగ్యము.
నిర్వేశము సం. వి. 1. కూలి 2. జీతము. 3. భోగము.
నిర్వ్యాజము సం. విశ. నెపములేనిది.
నిఱు వై. ఉప. మిక్కిలి. సం. నిర్.
నిఱునీలుగు క్రి. (నీలుగు+నీలుగు) మిక్కిలి నీలుగు. గర్వించు.
నిలక వి. నిలుపు, నిలకడ స్థితి.
నిలగ్నము సం విశ (జీవ) ఒకే స్థానము నందు అంటుకొని యున్నట్లుండునది (Sedentary).
నిలయము సం. వి. ఇల్లు.
నిలింపుఁడు సం. వి. 1. దేవత. 2. బోయ.
నిలీనము సం విశ. మిక్కిలి అడగినది.
నిలుకడ వి. 1. ఉనికి. 2. స్థైర్యము. 3.విరామము. వి. (గణి. భౌతి.) నిశ్చలముగా నుండుట (Rest).
నిలుగు క్రి. 1. ఒడలు విరుచుకొను. 2. గర్వించు వి. గర్వము. రూ. నీలుగు.

నిలుచు క్రి. 1. కాళ్ళూని లేచియుండు. 2. ప్రతిష్ఠితమగు. 3 ఉండు, 4. మిగులు.

నిలుపు క్రి. 1. నిలువబెట్టు, ప్రతిష్ఠించు 2. అడ్డగించు 3. స్థిరపరుచు, వి. 1. నిలుచుట. 2. నిష్ఠ. 3. స్థైర్యము.

నిలుపోపు క్రి. ఓర్చు.

నిలువ వి శేషము. రూ. నిల్వ.

నిలువరము విశ. స్థిరమైనది.

నిలువరించు క్రి. 1. చలింపక నిలుచు. 2. నిలుపు.

నిలువు వి. 1. నిలుపు, నిలుచుట. 2. చేయి మీది కెత్తుకొని నిలుచున్న మనుజునిపొడవు కొలది. 3 మీదియంతస్తు. 4. ఆకృతి. 5. ఒడలు.

నిలువుకళ్ళెము వి. (వ్యవ.) పెద్ద యినుపనాగళ్ళలోతు తగ్గించుటకును హెచ్చించుటకును ఉపయోగపడు భాగము (Vertical Bridle).



నిలువుకళ్ళెము

అడ్డుకళ్ళెము

నిలువుఁగొలువు వి. నిలుచుండి చేయు సేవ.

నిలువుజీతము వి. నిలుచుండి పనిచేయుటకై ఇచ్చెడు జీతము.

నిలువునీరగుట వి. జాతీ. ఒడలంతయు కంపమందుట.

నిలువుపండ్లకోల వి. (వ్యవ.) త్రవ్వుటకు పనికివచ్చు పండ్లకోల (Digging fork).

నిలువుపాఱ వి. (వ్యవ.) పొడవైన కఱ్ఱగల పార (Long spade).

నివర్తనము సం. వి. మరలుట,

నివర్తిల్లు సం. క్రి. నివర్తించు,

నివసతి సం. వి. ఇల్లు.

నివసథము సం. వి. గ్రామము,

నివసనము సం, వి. ఇల్లు.

నివసించు సం. క్రి. ఉండు, వాసముచేయు.

నివహము సం. వి. గుంపు.

నివాతము సం. విశ. 1. బాణములచే భేదింపరానిది (కవచము). 2. గాలిలేనిది.

నివాపము సం. వి. పితరుల నుద్దేశించిన తిలతర్పణాది కర్మము. సం. వి. (జం;) మస్తిష్కములో దృక్స్వాస్తికము వెనుక మధ్య మస్తిష్కము యొక్క అడుగుభాగము రెండు తమ్మెలు పొట్టపడియుండు భాగము (Infundibulum).

నివాపరూపవ[illegible] సం. విశ. (జం.) గరాటువలె ను[illegible] (Infundibuli form).

నివారణము [illegible] వి. అడ్డగింత.

నివారణీయము సం. వి. అడ్డగింపదగినది. రూ. నివా[illegible]యము

నివాసము స[illegible] , ఇల్లు. రూ. నివసనము, వాసము.

నివాసి సం. విశ. వాసముచేయువాడు.

నివాళి వి. హారతి. రూ. నివాళిక, నివ్వాళి, నివ్వాళిక.

నివాళించు వై. క్రి. హారతినిచ్చు.

నివిష్టుఁడు సం. విశ, 1. కూర్చున్నవాడు. 2 ప్రవేశించినవాడు.

నివుడు క్రి. 1. నిగుడు, పైకిలేచు. 2. వ్రవించు.

నివురు క్రి. నిమురు.

నివుఱు వి. నిగురు, బూడిద.

నివృత్తము సం. విశ. 1. మరలుట. 2.లేమి.

నివృత్తి సం. వి. 1. మరలదాటు. 2. మోక్షము.

నివేదనము సం. వి. 1. ఎరుక. 2. సమర్పణము.

నివేదిక సం. వి. ఒక విషయమును గురించి లేక కార్యక్రమమును గురించి తెలుపు రచన (statement or report).

**నివేశము** నం. వి. 1. ఇల్లు. 2. పాళెము. 3. దండు విడిసిన పాళెము. 4. పల్లె.

**నివ్వటిల్లు** వై. క్రి. 1. 1. నిర్వహిల్లు, మరవేయు 2. అతిశయించు. 3. కలుగు. 4. వ్యాపించు రూ. నివ్వటిలు.

**నివ్వరి** వై. వి. నీవారము. ఊదయను కసవు గింజలు. రూ. నివరి, నీవరి. సం నీవారః.

**నివ్వాళి** వి. నివాళి.

**నివ్వెఱ** వి. (నిండు + వెఱ) 2. పారవశ్యము 2. నిశ్చేష్టత. 3. భ్రాంతి. రూ. నివ్వెర. మిక్కిలిభయము. రూ. నివ్వెరగు.

**నివ్వెఱపడు** క్రి. 1. పారవశ్యము చెందు. 2. మిక్కిలి భయపడు.

**నిశ** నం. వి 1. రేయి. 2. పసుపు.

**నిశాంతము** న. వి. 1. పేకువ. 2. ఇల్లు.

**నిశాకరుఁడు** నం. వి. చంద్రుడు

**నిశాచరి** నం. వి. 1. రక్కసి. 2. రంకుటాలు. 3. పైడికంటి పక్షి.

**నిశాచరుఁడు** నం. వి. రక్కసుడు. రేద్రిమ్మరి.

**నిశాటుఁడు** నం. వి. రక్కసుడు. వ్యు. రాత్రులందు తిరుగువాడు.

**నిశాతము** నం. విశ. మిక్కిలి వాడిచేయబడినది. రూ. నిశితము.

**నిశాపతి** నం. వి. చంద్రుడు.

**నిశీథము** నం. వి. నడురేయి.

**నిశీథిని** నం. వి. రేయి. (నడురేయికలది.)

**నిశ్చయము** నం. వి. నిర్ణయము.

**నిశ్చయించు** నం. క్రి. నిర్ణయించు.

**నిశ్చర(ల)ము** నం. విశ. (గణి.) చలించనిది (Invariant).

**నిశ్చల** నం. వి. నేల.

**నిశ్చితము** నం. విశ. నిశ్చయింపబడినది.

**నిశ్చేష్ట** నం. వి. చేష్టలుడుగుట.

**నిశ్శ్రేణి** నం. వి. నిచ్చెన.

**నిశ్శ్రేయసము** నం వి. 1. ముక్తి. 2. మేలు.

**నిశ్శ్వాసము** నం. వి. నిట్టూర్పుట.

**నిశ్శ్వసించు** నం. క్రి. నిట్టూర్చు, నిశ్వాసించు

**నిశ్వాసము** నం వి. నిట్టూర్పు.

**నిషంగము** నం. వి. అమ్ములపొది.

**నిషణ్ణము** నం. విశ. 1. కూర్చుండినది. 2 కూర్చుండినది.

**నిషాదము** నం. వి. సప్తస్వరములలో నొకటి.

**నిషాదుఁడు** నం. వి. 1. బోయవాడు. 2. మాలవాడు.

**నిషిద్ధప్రాంతము** నం. వి (రాజ.) సాధారణప్రజానీకముపోరాని రక్షణాత్మకస్థానములు.

**నిషిద్ధము** నం. విశ నిషేధింపబడినది.

**నిషూదనము** నం. వి. చంపుట.

**నిషేకము** నం. వి. గర్భాదానము.

**నిషేచనాళము** నం వి. (జం) శుక్రాశయములు తెరచుకొను గొట్టము (Ductus ejaculatorius). పురుష కీలకములలో నున్న రెండు శుక్రాశయములు తెరచుకొను కండరములతో కూడిన నాళము (Ejaculatory duct) ఇది పురుష జ్ఞానేంద్రియ ద్వారము గుండా బయటికి తెరచుకొనును. ఛిదా. బొడ్డింక.

**నిషేధము** నం. వి. 1. త్రోసిపుచ్చుట. 2. నివర్తనము, మరలించుట.

**నిషేధించు** నం. క్రి. త్రోసివేయు.

**నిషేవణము** నం. వి. చక్కగా సేవించుట.

**నిష్కము** నం. వి. 1. మాడ, టంకము. 2. పతకము. 3. బంగారము. 4. వెండి.

**నిష్కర్ష** నం వి. నిశ్చయము.

**నిష్కర్షించు** నం. క్రి. నిశ్చయించు.

**నిష్కార్యద్రవ్యము** నం. వి. (అర్థ.) చెలామణిలో లేని బ్యాంకు నిక్షేపములు (Idle money).

**నిష్కాసనము** నం. వి. (గణి.) సమీకరణముల నుండి కొన్ని రాసులను లోపింప

చేయు ప్రక్రియ (Elimination). సం వి. వెడలగొట్టుట.
నిష్కాసితము సం. విణ. 1. వెడలింపబడినది. 2. ఉంచబడినది.
నిష్కుటము సం. వి. 1. తోట 2 అంతిపురము. 3. ఇంటితోట. 4. తలుపు. రూ నిష్కూటము.
నిష్కృతము సం. విణ. ప్రాయశ్చిత్తము చేయబడినది.
నిష్క్రమము సం, వి వెడలుట.
నిష్క్రమించు సం. క్రి. వెడలు.
నిష్క్రాంతి సం. వి బయలువెడలుట.
నిష్క్రియ సం. వి. (గృహ) ఏమియు చేయలేకపోవుట, ఊరక కూర్చుండుట.
నిష్క్రియత సం. వి. (రసా) గాఢ నైట్రికామ్లములోగాని, క్రోమికామ్లములోగాని ఒకసారి ముంచి తీసివేసిన యినుము దాని రాసాయనిక ప్రవృత్తిని కోలుపోవుట (Passvitiy).
నిష్క్రియము సం. విణ. (గృహ.) స్తబ్ధముగా నుండునది (Passive).
నిష్క్రియాభాగస్వామి సం వి. (అర్థ.) వ్యాపారములో పెట్టుబడి మాత్రముపెట్టి దైనందిన కార్యకలాపములలో కలుగచేసికొనకుండ నుండు భాగస్వామి.
నిష్ఠ సం. వి. 1. ఉనికి. 2. చేటు. 3. ముగియిక.
నిష్ఠించు సం. క్రి స్థిరమగు.
నిష్ఠితము సం. విణ. చక్కగా నుంచబడినది.
నిష్ఠీవనము సం. వి. 1. ఉమియుట. 2. నిరసనము.
నిష్ఠురము సం. విణ. కఠినము,పరుషము.
నిష్ఠ్యూతము సం విణ. 1. ఉమియబడినది. 2. త్రోయపడినది.
నిష్ణాతుడు సం. వి. నేర్పరి.
నిష్పత్తి సం.వి. సిద్ధి, పరిసమాప్తి.
నిష్పత్తి సం. వి. (గణి.) సజాతికి చెందిన రెండు రాసులలో ఒకరాశి రెండవరాశికి ఎన్నిరెట్లో లేక ఎన్నవభాగమో తెలుపు సంబంధము (Ratio) ఉదా. a,b అనునవి సజాతికి చెందిన రెండు రాసులు. వీనికి గల నిష్పత్తి a ని b చే భాగించగా వచ్చిన ఫలము అనగా a÷b దీనినే a : b అని గాని a/b అని గాని చూపుదురు.
నిష్పన్నము సం. విణ. సిద్ధించినది.
నిష్పాదనము సం వి. సిద్ధి.
నిష్పాదించు సం. క్రి సిద్ధింపచేయు.
నిష్ప్రయోజనము సం. విణ. ప్రయోజనము లేనిది.
నిష్ఫలము సం వి. ఫలములేమి.
నిసర్గము సం. వి. స్వభావము.
నిసి వె. వి. నిశ, రేయి. సం. నిశా.
నిసిఫాస్ ఇం. వి (వ్యవ.) (Niciphos) నత్రజని, స్ఫురము కలిసియుండు బలమైన కృతకమగు ఎరువు.
నిసివెలుగు వి. చంద్రుడు.
నిసుగు వై. వి. శిశువు, బిడ్డ. రూ నిసువు. సం శిశుః.
నిస్తంద్రము సం. వి. చొరవ గలది.
నిస్తప్తము సం. విణ. (రసా.) కాల్చబడినది, నిశ్చూర్ణము (Calcined).
నిస్తరణము సం. వి. దాటుట. రూ. నిస్తారము.
నిస్తరించు సం. క్రి. దాటు.
నిస్తాపనము సం. వి. (రసా.) కాల్చుట, గాలిలో కాల్చుట, నిశ్చూర్ణము (Calcination).
నిస్త్రింశము సం. వి. కత్తి.
నిస్పందము సం. వి మిక్కిలి చలనము
నిస్పృహము సం. విణ.ఆసలేనిది.
నిస్యందము సం. వి. కారుట.

నిస్వనము సం. వి. ధ్వని, మ్రోత, దూ. నిస్వానము.

నిస్సంతు వై. విణ, నిస్సంతానము, సంతానములేనిది. సం. నిస్సంతతిః.

నిస్సత్తువ వై. వి. అశక్తి. సం. నిస్సత్త్వమ్.

నిస్సరణము సం. వి. 1, ఇంటి ముందటి భాగము. 2. చావు 3. ముక్తి.

నిస్సహాణము సం వి. ఒక వాద్యవిశేషము. పర్యా. నిస్సాణము, నిస్సానము.

నిస్సారము సం. విణ. సారములేనిది.

నిహంత సం. విణ. చంపువాడు.

నిహతము సం. వి. గుణకారము. విణ. చంపబడినది. గుణింపబడినది.

నిహతి సం. వి చావు.

నిహోసమోహణము సం. వి. (జం) పుఱ్ఱెతో క్రిందిదవడ తగిల్చియుండు ఏర్పాటు (Suspensorium, (ఇది అగ్రగండాస్థి, చతుర్భుజాస్థి కోష్ఠి అను ఎముకలతో యేర్పడియున్నది.)

నిహితము సం విణ. ఉంచబడినది.

నిహ్నవము సం. వి. 1. అవిశ్వాసము. 2. కపటము. 3. తిరస్కారము. 4. దాపరికము. 5. సమీక్ష, 6. మరుగుమాట.

నిహ్నవించు సం, క్రి. ముసుగువెట్టు, దాచు.

నిహ్నుతి సం. వి. మరుగుపుచ్చుట.

# నీ

నీ సర్వ. నీవు అను పదమునకు ప్రాతిపదికము.

నీఁగు క్రి. నివర్తించు.

నీఁడు వై. వి. కమ్మరివారి బిరుదు పేరు. రూ. నాయడు. (ఉదా. అంకినీడు). సం. నాయకః.

నీకాశము సం. వి. 1. ప్రకాశము. 2. నిశ్చయము. విణ. తుల్యము.

నీచము సం. విణ. (భౌతి.) మంద్రము (ధ్వని), అధమము (Low).

నీచు వి. 1. చేపమీది పొలుసు. 2. రక్తము చెడి నీరైనది. 3. నీచుడు.

నీచుఁడు సం. విణ. అధముడు. రూ. నీచు.

నీటికానుపు వి. అగ్ని. వ్యు. నీరు బిడ్డగా కలది.

నీటికుప్ప వి. జలరాశి. రూ. నీరుకుప్ప.

నీటిచూలి వి. అగ్ని.

నీటితాత వి. వాయువు. (గాలి నుండి అగ్ని దీని నుండి నీరు పుట్టుటచే నీటికి తాత.)

నీటిదయ్యము వై. వి. జలగ్రహము.

నీటిపాఱుదల వి. మానవ ప్రయత్నము చేత కాలువల ద్వారా, ఉపనదుల ద్వారా సేద్యము కొరకు నీటిని పొలమున కంద చేయుట.

నీటిపుట్టువు వి. తామర.

నీటిబుగ్గ వి. నీరు ఊరుచోటు (Spring).

నీటిమంచు వి, గాలిలోని నీటి యావిరి ద్రవీభవన మొంది గడ్డిపరకలు, రాళ్ళు మొదలగు వస్తువులపై నేర్పడు మంచు బిందువులు (Dew).

నీటియిక్క వి. కౌస్తుభము.

నీటిరిక్క వై. వి. పూర్వాషాఢ.

నీటిఱేఁడు వి. 1. వరుణుడు. 2. సముద్రుడు.

నీటిఱేనిరిక్క వి. శతభిషము. (వరుణుడు అధిదేవతగా గలది.)

నీటివాలు వి. (భౌతి.) నీరు ఎత్తునుండి పల్లమునకు పారు వైఖరి.

నీటిఁ[ప్రాలు విణ. నిలిచియుండనిది.

నీటు వి. శృంగారగర్వము.

నీడ వి. ఛాయ

**నీడకుట్టు** వి. (గృహ.) సరియైన వైపు నమూనా నీడ కనబడుటకై వెనుక భాగమున సన్నని ఒట్టమీద చేయు ఎంబ్రాయిడరీ (Shadow work).

**నీడము** సం. వి. 1, చోటు. 2 పక్షి గూడు.

**నీడోద్భవము** సం, వి. పక్షి, గూటికానుపు.

**నీతము** వై. వి. నియతము నియమము, సం. నియతమ్. సం. విశ. 1. తేబడినది. 2. పొందింపబడినది.

**నీతి** సం. వి. న్యాయము.

**నీపము** సం, వి. కడిమిచెట్టు.

**నీరంధ్రము** సం. విశ. సందులేనిది.

**నీరజము** సం. వి. 1 తామర. 2. ముత్యము. విశ. దుమ్ములేనిది.

**నీరదము** సం. వి. మేఘము.

**నీరధి** సం, వి. సముద్రము.

**నీరము** సం. వి. జలము.

**నీరసము** సం. విశ. రసములేనిది.

**నీరాకు** వి. పాచి.

**నీరాజనము** సం. వి. హారతి.

**నీరాట** వి. స్నానము. జలక్రీడ, నీరాడుట.

**నీరాటము** సం వి. జలచరము.

**నీరాడు** క్రి. స్నానముచేయు.

**నీరామని** వి. వర్షఋతువు.

**నీరు** వై. వి. 1. నీరము, జలము, 2. మూత్రము. సం. నీరమ్.

**నీరుకట్టు** వి. మూత్రబంధరోగము.

**నీరుకాయ** వి. నీటిబుడగ, బుద్బుదము.

**నీరుకారు** వి. కమసాలి యొక్క ఒక పనిముట్టు. క్రి. దిగాలుపడు, నిరుత్సాహపడు.

**నీరుకావి** వి. కొంచెమెరుపు.

**నీరుకాళ్ళు** వి సాయంకాలమునందు తోచు ఎఱ్ఱని పచ్చని కిరణములు.

**నీరుగండి** వి. తూము.

**నీరుచిచ్చు** వై. వి. బడబాగ్ని (నీటిలో మండు అగ్ని)

**నీరుచురుకు** వి. మూత్రము దిగునపుడు మంటయెత్తు రోగము.

**నీరు తెంకి** వి. జలాశయము.

**నీరుడి** వి. అతిమూత్రము.

**నీరుతాలుపు** వి. మ్రబు.

**నీరుతిత్తి** వై. వి. మూత్రకోశము.

**నీరుపాప** వి. 1. అగ్ని. 2. నీటిమనుష్యుడు.

**నీరుపుట్టువు** వి. 1. తామర. 2. శంఖము, 3. కౌస్తుభము.

**నీరుమజ్జిగ** వై. వి. మూడుపాళ్ళు నీళ్ళు కలిపిన మజ్జిగ.

**నీరుమట్టము** వి. 1. సమమును కనిపెట్టు సాధనము. 2. జలవ్యాప్తిగల భూభాగము.

**నీరుముట్టు** క్రి. 1. మూత్రించు. 2. జలస్పర్శముచేయు.

**నీరుమోపరి** వి. 1. కడవ. 2. మేఘము.

**నీరువట్టు** వి. దప్పిక.

**నీరువాయి** వి. జలరాశి.

**నీఱు** వి భస్మము. రూ. నిగురు. నివురు.

**నీలకంఠము** సం. వి. 1, నెమలి. 2. పిచ్చుక. (నల్లని కంఠము కలది).

**నీలకంఠుఁడు** సం. వి. శివుడు.

**నీలకము** సం. వి. నల్లకోతి.

**నీలతుత్థము** సం. వి. (రసా.) నీలహరిత వర్ణముల కలగలుపు గల రాగి లవణము (కాపర్ సల్ఫేటు) మైలతుత్థము. (Blue-vitriol).

**నీలము** సం. వి. 1. నీలిచెట్టు. 2 నలుపు. 3. నల్లరాయి.

**నీలము** సం. వి. (రసా.) ఒక విలువ గల రత్నము (Sapphire)- (ఇది రాసాయనికముగ ఎల్యూమినియమ్ ఆక్సైడ్ (Corundum). దీని నీలిరంగునకు కారణము అందులో అతిసూక్ష్మరాశిగా నుండు క్రోమియమ్ ఆక్సైడ్).

నీలలోహితము సం. విణ. (రసా.) ఎఱ్ఱని ఎఱుపు కలసిన నీలపు రంగు గలది (Purple).
నీలలోహితుఁడు సం. వి. శివుడు.
నీలాంజనము సం. వి. (రసా.) ఆవర్తక్రమ పట్టికలోని తైజనివర్గము(ఐదవ వర్గము)లో నుండు ఉపధాతు గుణములు గల ధాతువు (Antimony).
నీలాంబరుఁడు సం. వి. 1 బలరాముడు. 2. నైర్ఋతి. 3. శని.
నీలాబ్జము సం. వి. నల్లకలువ
నీలాలి వి. రెండు వైపుల వత్తి వెలుగు దీపపు కుందె.
నీలి వై. వి. నల్లనూలు. విణ. నల్లనిది. సం నీలమ్ సం. వి. ఒకానొక చెట్టు. విణ. గారడము. సం. వి. (వ్యవ.) నీలిమందు (Indigo), రంగు ద్రవ్యములలో నొకటి. (Leguminose అను కుటుంబములో Papilonaceae అను కుటుంబమునకు చెందిన Indigoferatinctoria అను మొక్క యొక్క పట్టనుండి దీనినితయారు చేయుదురు).
నీలిమ సం. వి. నలుపు.
నీలీకరణము సం. వి. (గృహ.) బట్టలకు నీలి వేయుట. తెల్లబట్టలను ఉతికినప్పుడు తెల్లదనమిచ్చుటకై కొంచెము నీలి రంగు వేయుట (Bluing).
నీలుగు క్రి. 1. ఒడలు విఱుచుకొను. 2. చచ్చు. రూ. నిలుగు, ఈలుగు, ఐలుగు.
నీవరి వై. వి. నివ్వరి. సం. నీవారః.
నీవారము సం. వి. నివ్వరి.
నీవి సం. వి. 1. నంచి మొదలు (మూల ధనము). 2. పోకముడి 3. పంచెపు నొమ్ము 4 చెఱసాల.
నీవు సర్వ. నీ శబ్దమునకు ప్రథమైక వచనము రూ. ఈవు.
నీవృత్తు సం. వి. 1. దేశము, 2. గ్రామము.
నీహారము సం. వి. మంచు.
నీళ సం. వి. విష్ణు భార్యలలో నొకతె.
నీళ్ళవరుగు వి. ఉప్పు.
నీళ్ళాడు క్రి. 1. ప్రసవించు. 2. స్నానము చేయు.
నీళ్ళు వై. వి. నీరు.
నీళ్ళుతోడు క్రి. జాతీ. ద్రోహముచేయు, కీడు తలపెట్టు.
నీళ్ళువదలు క్రి. జాతీ, అప్పుగా నిచ్చినది రావని నిశ్చయము చేసికొను.

# ను

ను అవ 1. ద్వితీయా విభక్తి ప్రత్యయము. 2. క్రియాప్రత్యయము. ఉదా. తద్ధర్మార్థకము అందు ప్రథమ పురుషైక వచనమున చేరు ప్రత్యయము. సూర్యుడు తూర్పున ఉదయించును. 3. సముచ్చయార్థకము ఉదా. వాడును నీవును రండు.
నుంతు వి. పస్తు
నుక్కటు వి. చలనము.
నుగ్గాడు క్రి. ఖండించు.
నుగ్గు క్రి. నలగు. వి. 1. చూర్ణము. 2 ఖండము, 3. పిడకతునుక.
నుచ్చిళ్ళు వి. నురుగు.
నుచ్చు వి. వెంట్రుక (మేకల గొఱ్ఱెల) పెంటిక,
నుడి వి, అపవాదు, మాట. రూ. నొడి.
నుడికాఁడు విణ, మాటకారి.
నుడికారము వి. మాటచమత్కారము, పలుకుబడి,
నుడువు క్రి. చెప్పు. వి. మాట. రూ. నడుపు. నొడుగు, నొడువు.

నుడుకోఁడు వి బృహస్పతి, గీష్పతి.
నుడుపరి విశే. మాటలమారి, వాచాలుఁడు,
నుడువు క్రి. నుడుగు.
నుతము సం. విశే. నుతింపబడినది,
నుతి సం. వి. స్తోత్రము.
నుతించు సం. క్రి. స్తోత్రముచేయు.
నుదురు వి. నొసలు.
నునుపు వి. స్నిగ్ధత.
నునుసిగ్గు వి, కొంచెము సిగ్గు,
నున్న విశే. నునుపైనది.
నుయి వి బావి, రూ, నుయ్యి, నూయి.
నురుగు వి. ఫేనము. రూ, నురువు.
నురుదబ్బ వి. కాలిజము, యకృత్తు.
నురువు వి. నురుగు.
నుఱిపిడి వి. నురుచుట. రూ. నూర్పిడి నూర్పు
నుఱుచు క్రి. ధాన్యము పశువుల కాళ్ళతో త్రొక్కించి నలుపు.
నుఱుపు క్రి. 1. నురుచు. 2. చంపు.
నుఱుమాడు క్రి. నురుముచేయు.
నుఱుము క్రి. 1. చూర్ణము చేయు.2.చంపు. వి. చూర్ణము.
నులక వి. మంచమల్లెడు త్రాడు, రూ. నుల్క.
నులి వి. 1. వ్రేగులలో నొప్పి. 2. చిక్కు. విశే. అల్పము.
నులించు క్రి. నలుచు.
నులిగొను క్రి. చిక్కువడు.
నులితీఁగ వి. (వృక్ష.) కొన్ని లతలకు పైకి ప్రాకుటకు ఆధారముగా నుండు సన్నని చుట్టు కొను స్వభావము గల తంత్రి (Tendril)ఉదా



నులితీగ

గుమ్మడి కుటుంబములోని మొక్కలు.
నులిపురుగులు వి, కడుపులోని సన్నని పురుగులు.
నులియు క్రి. 1. స్థానము తప్పు. 2, పొడియగు.
నులివు వి, నులియుట.
నులివెచ్చ వి. గోరువెచ్చ.
నులివెట్టు క్రి, నులుచు.
నులిసేవనము వి. విశే, (గృహ.) పోగులు రేగిన అంచును మెలివేసి పై కుట్టు కట్టుట. (Whipping).



నులిసేవనము

నులుచు క్రి 1, పొడిచేయు, 2. నలుపు. రూ. నులుపు.
నులుము క్రి. 1. వ్రేళ్ళతో నలుపు, 2. పెల్లగించు.
నులుసు వి. న్యూనత,
నువు వి. తిల, రూ. నువ్వు. నూవు.
నువ్వు వి. ఒక రకపు పంట.
నుసలు క్రి. 1. ఆలసించు. 2. పూను. 3. ఒడలు విరుచుకొను,
నుసి వి. పురుగులు తొలువగా రాలిన పొడి. విశే. అల్పము.
నుసిపురుగు వి. ఘుణము, దూలముఁ నుతొలుచు పురుగు,
నుసుఁగు క్రి. తిరస్కరించు,
నుసుమ వి. కన్నులముందు ముసిరెడుచిన్న దోమ.
నుసుము క్రి. 1. ఆకర్షించు, 2. బట్టలను రాతిపై నలచు.
నుసులు క్రి. మెదలుట, వి. లాఘవము.

# నూ

నూఁగు వి. 1. ఆకులు లోనగువాని పై నుండు సన్నని ముండ్లు. 2. లేతదనము. విశే. లేత.

నూఁగుమీసము వి. అప్పుడే మొలచుచున్న మీసము.

నూక వి. బియ్యపు తునుక.

నూకు క్రి. 1. త్రోయు. 2. త్రోలు.

నూకుడు వి. త్రోయుట.

నూగు వి. నువ్వు. తిలసస్యము.

నూచ వి. ప్యాడి. రూ. నూచము.

నూతనము సం. విశే. క్రొత్త. రూ నూత్నము.

నూనియ వి. చమురు. రూ. నూనె.

నూనూఁగు మీసము వి. నూగు మీసము.

నూనెముడి వి. కీలుగంటు, దూముడి.

నూపురము సం. వి. అందె.

నూఱిపిడి వి. నూర్పిడి.

నూఱు క్రి. 1. వాడిచేయు, 2. మర్దించు. సర్వ. శతము, వంద.

నూఱుచు క్రి. నుఱుచు.

నూఱుపు వి నూర్పు.

నూలిగడను వి. ఒట్టురల, అంటరలుప్తకము.

నూలు వి. 1 ప్రత్తి వడికిన పోగు 2. తంతువు.

నూలుకొను క్రి. 1. ఒప్పుకొను 2. కుదురుకొను, 2. చక్కబడు. 4. పుంగొను, రూ. నూల్కొను,

నూలుకోలు వి. 1. అంగీకారము. 2. ఒక జాతి శాక విశేషము. రూ నూల్కోలు.

నూవు వి. నువు. రూ. నువ్వు, నూగు.

# నృ

నృత్తము సం. వి. నర్తనము,

నృత్యము సం. వి. శరీరహస్తనేత్రాభినయములచేత భావములను తెలుపుచు ఆడెడి ఆట.

నృపతి సం. వి. రాజు. రూ. నరపతి

నృపలక్ష్మము సం. వి. రాజునకు పట్టెడి తెల్ల గొడుగు,

నృపాలుఁడు సం.వి. రాజు.

నృపుఁడు సం. వి. రాజు.

నృశంసుఁడు సం. విశే. క్రూరుడు

నృసింహుఁడు సం. వి. నరసింహుడు. నరశ్రేష్ఠుడు,

నృహరి సం. వి. నరసింహుడు.

# నె

నెంజలి వి. మనోవ్యథ.

నెక్కొను క్రి. పాదుకొను

నెక్కోలు వి. పాదుకొనుట,

నెక్‌కర్వ్ ఇం. వి. (గృహ.)(Neck curve) దుస్తులలో మెడ కత్తిరింపు దుస్తులలో తలను దూర్చుటకు తెరుపబడిన భాగము,

నెగడి వి. మృగములు బెదరుటకును, చలి కాచునుటకుకొను వేసెడి మంట,

నెగడు క్రి. 1. బయలు మెరయు. 2. వర్ధిల్లు. రూ, నెపడు.

నెగపు వి. ఎగపు.

నెగయు క్రి. ఎగయు.

నెగులు వి. బాధ, మనోవ్యథ. రూ నెవులు

నెగ్గు క్రి. నిర్వహిల్లు.

నెటిక వి. వ్రేళ్ళు కీళ్ళ కదలిక వలని చప్పుడు రూ. నెటిక.

నెట్టన అవ్య. అనివార్యముగ,

నెటికసీల వై. విశే, నైష్ఠికశీలుడు, సదాచారసంపన్నుడు, సం. నైష్ఠికశీలః,

నెట్టియము వి. 1. చుట్టు కుదురు. 2. గుండు పాగ. రూ. నెట్టెము.

నెట్టు క్రి. పూనిత్రోయు. వి, పూనిక.

నెట్టుకొను క్రి. 1. పూనుకొను. 2 నెలకొను 3. అతిశయించు. 4, బలాత్కరించు.

నెట్టె వి. సరియగు జత. ఉద్ది.

నెత్తెకమ్మ వి, పాచికల పందెము.

నెత్తపలక వి. పాచిక లాడెడు పలక, అష్టాపదము.

నెత్తము వి. 1, పాచికలాట. 2. పందెము. 3. కొండమీది విశాల సమప్రదేశము.

నెత్తి వి, తల.

నెత్తురు వి రక్తము. రూ. నెత్రు.

నెత్తురుకందు వి. జొత్తుపాప, పసిబిడ్డ.

నెత్తురుద్రావుడు వి. రక్కసుడు.

నెత్తురుప్రొద్దు వి. సంధ్యాకాలము.

నెత్తురుబంక వి. రక్తముతో కూడిన బంక విరేచనము.

నెనడు వి. మజ్జ, మూలగ.

నెనరు వి. కృతజ్ఞత. 2. ప్రేమము.

నెన్నడుము వి. (నెఱి+నడుము) అందమైన నడుము

నెపము వై. వి. 1, వ్యాజము. కారణము. 2. తప్పు, రూ నెవము. సం. నిభ. త నిపమ్. క. నెవ. నెవమ.

నెప్పరము వి. వేగము. రూ. నెప్పళము.

నెప్పరి విశే. ఉపాయశాలి.

నెప్పరించు క్రి. మూదలించు, నిరూపించు.

నెప్పు వి. 1. స్థానము. 2. స్థైర్యము. 3. ఉపాయము.

నెప్పుకొను క్రి. పాదుకొను.

నెప్ట్యూన్ ఇం. వి. (Neptune) సూర్యుని చుట్టు తిరుగు ఒక గ్రహము

నెఫ్రైటిస్ ఇం. వి. (గృహ) (Nephritis). మూత్ర పిండములు చెడిపోవుట. (ఈ వ్యాధికిసూచనలులేవు. ఇది చాల అపాయకరమైన వ్యాధి.)

నెబ్యులా ఇం. వి. (Nebula) వాయుభరిత మేఘము వలె నుండి మెరయుచుండు ఖగోళ విశేషము, నీహారిక.

నెమరు క్రి వెదకు.

నెమకుడు వి. వెదకుట.

నెమరు వి. పశువులు మొదట తిన్న దానిని మరల నోటికి దెచ్చుకొని చక్కగా నమలుట, రోమంథము.

నెమరుచు క్రి. నెమరువేయు.

నెమిలి వి మయూరము రూ. నెమ్మిలి.

నెమ్మి వి. 1. ప్రేమ. 2, నెమ్మది. 3. సంతోషము. 4. క్షేమము. 5. నెమిలి. వై. వి. 1. తినాసవృక్షము 2. బండిచక్రముకమ్మి సం. నేమిః.

నెమ్మిరౌతు వి. కుమారస్వామి.

నెమ్మిలి వి. నెమ్మలి.

నెమ్ము వి. 1. తడి. 2. తలుపు చెక్కలు లోనగునవి ఒకదాని కొకటి చేర్చి అంటవేయ లోపల చొప్పించు మేకు.

నెయి వై, వి. ఘృతము. రూ. నెయ్యి, నేయి సం స్నేహః.

నెయ్యపుటలుక వి. ప్రణయకోపము.

నెయ్యపుతేఁడు వి. మదనుడు.

నెయ్యమాడు క్రి. స్నేహించు.

నెయ్యము వై. వి. స్నేహము. చెలిమి. 2, ఇంపు. రూ. నెయ్యమి, నేయము. సం. స్నేహః.

నెయ్యుఁడు వై. విశే. స్నేహితుడు, నెయ్యరి

నెర విశే. సమాసమందు నెరవు శబ్దమునకు మీదివర్ణములోపించగా మిగిలినరూపము. రూ. నెఱ, నెఱా, నేఱా (నెఱజాణ, నెఱజోదు).

నెరడు వి. గొగ్గి, విషమము.

నెరసు వి. 1. తప్పు. 2. కళంకము. 3. నలుసు,

నెరి వి. వంకర.
నెరికురులు వి. వక్రాలకములు, ముంగురులు.
నెఱక వి. ఇంద్రుక.
నెఱకు వి. మర్మము, జీవస్థానము. రూ. నెరను.
నెఱపు క్రి. 1. నిండించు. 2. నెరవేరచేయు
నెఱపు క్రి. 1. నిండించు. 2. పరచు. 3. నెరవేర్చు 4 వ్యాపింపచేయు. వి. వ్యాపనము. విశ. అధికము. రూ నెరపు.
నెఱయు క్రి, 1. నిండు. 2 నెరవేరు. 3. వ్యాపించు.
నెఱవాది విశ. నేర్పరి.
నెఱ్ఱువిద్దె వి. హస్తలాఘవముగల జాలవిద్య.
నెఱపు వి. 1. పూర్తి. 2 వ్యాపారము. 3. మార్గము. విశ. 1. అధికము 2. యుక్తము. 3, విశాలము. రూ. నెరపు.
నెఱవేఱ క్రి 1. మరియు. 2. సిద్ధించు.
నెఱసి విశ. శూరుడు.
నెఱా విశ. నెర. పూర్ణము, గొప్పది.
నెఱి వి. 1. అందము. 2, ఆచారము. 3. వస్త్రపుకుచ్చె. 4, క్రమము. 5. న్యాయము 6. పరాక్రమము. 7. పూర్తి 8. రెక్క. 9. వక్రత. 10. విధము.
నెఱిపడు క్రి. సిద్ధించు.
నెఱియ వి. చీలిక, నేలపగులు. రూ. నెఱ్ఱె, నెఱ్ఱియ, నెఱె.
నెల వి. 1. మాసము. 2. చంద్రుడు. 3, పున్నమ. 4. స్థానము. 5. కర్పూరము.
నెలకట్టు వి. రాతికట్టడపునేల, కుట్టిమము.
నెలకువ వి. స్థానము.
నెలకూన వి. 1. బాలచంద్రుడు. 2. నక్షత్రము.
నెలకొను క్రి. స్థిరపడు.
నెలగ వి, ధనము.
నెలచూలి వి. బుధుడు, నెలపట్టి వ్యు. చంద్రుని కుమారుడు.
నెలత వి. స్త్రీ. రూ. నెలతుక,
నెలతాలుపు వి. శివుడు, చంద్రశేఖరుడు.
నెలతాపసము వి.చకోరము,వెన్నెలపులుగు
నెలపాలు వి. చంద్రకళ,
నెలమేపరి వి. రాహువు.
నెలఱాయి వి. చంద్రకాంతశిల.
నెలవంక వి. బాలచంద్రుడు.
నెలవంకకోల వి. అర్ధచంద్రబాణము.
నెలవత్తి వి. పచ్చకప్పురపు పలుకు.
నెలవరి విశ. 1. పరిచయము కలవాడు. 2. మర్మజ్ఞుడు.
నెలవీసము వి. చంద్రకళ.
నెలవు వి. వాసస్థానము. 2. స్థానము 3. పరిచయము.
నెలవుకొను క్రి. 1. నిలుకడయగు. 2. నిలుచుండు. రూ నెలకొను.
నెలవెలుగు వి. వెన్నెల.
నెల్లి వి. ఉసిరిక.
నెల్లిబద్ధ (వ్యావ.) వి. చూరుకుట్టుబద్ద,
నెవడు క్రి. నెగడు, ఒయలుమెరయు, విజృంభించు.
నెవము వై. వి. నెపము.
నెవయు క్రి. నెగయు,
నెవిలి వి. నెమిలి.
నెవులు వి. నెగులు.
నెవ్వ వి. 1. దారిద్ర్యము, 2. ఆపద 3. వరపు.
నెళవరి విశ. 1. పరిచయము కలవాడు. 2. మర్మమెరిగినవాడు. రూ. నెలవరి.
నెళవు వి. 1. పరిచయము, 2. మర్మము, రూ. నెలవు.

# నే

నే వి. నేయి.

నేఁజెల్ల అవ్య. సంతాపార్థకము.

నేఁడు వి. ఈదినము.

నేఁత వి. నేయుట.

నేఁతకాఁడు వి. నేయువాఁడు, తంతువాయుడు.

నేఁతపురుగు వి. సాలెపురుగు.

నేఁతరి వి. నేతకాఁడు.

నేజ వి. ఈటె. రూ. నేజము, నేజో.

నేఁటించు క్రి. 1. నేటుకొను, 2. చాగిలపడు. సత్యముచెప్పు.

నేటు వి. నిశ్చయము. విశే. దృఢము.

నేత సం. విశే. ప్రభువు.

నేతిబీర వి. ఘృతకోశాతకి, ఒకవిధమైనబీర

నేత్రపర్వము సం. వి. కనులపండువు.

నేత్రమధ్యపటలము సం. వి. (జం.) కనుగ్రుడ్డుపై నున్న పొరలలో మధ్యపొర (Choroid).

నేత్రము సం. వి. 1. కన్ను. 2. తరిత్రాడు. 3. పరిపము.

నేత్రరసము సం. వి. (జం.) నేత్రరస వేశ్మములో నుండు నీటివంటిద్రవము, కన్నీరు (Aqueous humour).

నేత్రరసవేశ్మము సం. వి. (జం.) కనుగ్రుడ్డులో కనీనికాపటలమునకు ముందున్న గది (Aqueous chamber).

నేత్రశుక్లము సం. వి. (జం.) కంటి గ్రుడ్డు యొక్క కాచబింబముతో కలిసియుండు పలుచని అధిచ్ఛదపు పొర (Conjunctive).

నేత్రశోష సం. వి. (గృహ) కన్నుమసక విటమిన్ 'A' ఆహారములో తక్కువగుట వలన కలుగు వ్యాధి. (Kerophthalmia.) (ఇది ఎక్కువగా ముదిరిన కన్ను గ్రుడ్డి యగును).

నేత్రిక సం. వి. (జం.) సంయుక్తాక్షిలో నున్న కడ్డీవంటి ప్రమాణ పదార్థము (Ommatidium).

నేను సర్వ. నాశబ్ద ప్రథమైకవచనము. రూ. ఏను,

నేపథ్యము సం. వి. 1. వస్త్రాద్యలంకారము. 2. నాట్యస్థానము. రూ నైపథ్యము.

నేమకము వై. వి. 1. నియామకము, 2. నియమము. రూ. నేమము. సం. నియామకః.

నేమి సం. వి. 1. బండి కంటికడకమ్మి 2. గిరక, 3. తినాసవృక్షము,

నేము క్రి. ధాన్యము చేటలో పోసికొని యిటునటు త్రిప్పు. సర్వ. నేను యొక్క బహువచనరూపము. రూ. ఏము, మేము,

నేయము వై. వి. నెయ్యము, సం స్నేహః.

నేయి వై. వి. నెయ్యి, సం, స్నేహః.

నేయు క్రి. నేతచేయు, చాపలు లోనగువాని నల్లు.

నేరఁబోతు విశే. తెలియనివాఁడు.

నేరగాఁడు విశే. తప్పు చేసినవాఁడు.

నేరమి వి. అజ్ఞానము, దోషము.

నేరము వి. తప్పు.

నేరిమి వి. సామర్థ్యము. రూ. నేరుపు. నేర్మి. నేర్పు.

నేరుచు క్రి. 1. ఓపు. 2. అభ్యసించు., రూ. నేర్చు.

నేరుపు క్రి. 1. నెరవచేయు. 2. సామర్థ్యము

నేరుపుకాఁడు విశే. నేరుపరి. సమర్థుడు.

నేరుపులాఁడు విశే. నేరుపుకాఁడు,

నేరెటేఱు వి. జంబూనది.

నేరెడు వి. జంబూవృక్షము. రూ, నేరేడు.

నేరెడుదీవి వి, జంబూ ద్వీపము.

నేల వి. 1. భూమి. 2. ప్రదేశము. 3. దేశము.

**నేలగలుపు** క్రి. చంపు.

**నేలచూలలి** వి. సీత, భూపుత్రి.

**నేలతాలుపు** వి. భూధరము.

**నేలనుగప్పు సస్యములు** మి. వి. (వ్యవ.) పారిపోవు వర్షపునీటిని కొట్టుకొనిపోవు మట్టిని తగ్గించుచు నేలను కప్పియుంచు పైరులు (Cover crops). ఉదా. పిల్లి పెసర, వేరు సెనగ మొదలయినవి నేలపై ప్రాకు పైరులు.

**నేలపట్టి** వి. 1. అంగారకుడు. 2. నరకాసురుడు.

**నేలబొగ్గు** వి. (భూగో.) భూగర్భమందు లభించు బొగ్గు, రాకసి బొగ్గు (Coal).

**నేలమాలియ** వి. భూమిలోపలి యిల్లు. రూ. నేలమాలె.

**నేలమాళిగ** వి. 1. నేలలోపలిగది. 2. పాతర. 3. నేలమాణ్యము (Cellar).

**నేలయంటు** వి. (వ్యవ.) కొన్ని జాతుల మొక్కల కొమ్మలను నేల పైకి గాని, గోలెములలో పోసిన మట్టి లోనికి గాని వంచి దానిపై మట్టివేసి తడుపుచు అంటు గట్టిన మొక్కలు (Layers).



నేలయంటు

**నేలయందలి ఉష్ణోగ్రత** మి. వి. (వ్యవ.) పగలు సూర్యకిరణములచే గలిగిన వేడిమిలో నేలయందు నిలిచియున్న ఉష్ణోగ్రత (Soil temperature).

**నేలయొక్క స్నిగ్ధత** మి. వి. (వ్యవ.) నీటితో మట్టి తడిసినప్పుడు మట్టిరేణువులు సులభముగ విడిపోకుండ ఒకదాని నొకటి గట్టిగ నంటుకొని యుండు జిగురులేక సంశ్లేషక స్వభావము (Plasticity of the soil).

**నేలఱేఁడు** వి. రాజు.

**నేలల జలగ్రహణశక్తి** మి. వి. (వ్యవ.) నేలయందలి అంతరవకాశములు పూర్తిగ ఆవరింపబడుటకు కావలసిన నీటి ప్రమాణము (Soil capacity for water).

**నేలల జలధారణ శక్తి** మి. వి. (వ్యవ.) వర్షము కురిసినప్పుడుగాని, నీరు పెట్టినప్పుడుగాని మట్టిరేణువులు కొంత నీటిని పట్టియుంచగలశక్తి (Retention power of soil).

**నేలలోని సూక్ష్మజీవులు** మి. వి. (వ్యవ.) ఇవి అంగవిభాగ మంతగా లేక కంటితో చూచుటకు వీలులేనంత చిన్న ప్రాణులు (Soil micro-organisms) నేలలోని సూక్ష్మజీవులు —1. శిలీంధ్రములు వాని సిద్ధబీజములు (Fungi and their spores) 2. కిరణతంతుకములు (Actinomycetes) 3. సూక్ష్మదండికలు (Bacteria). 4. క్లాస్ట్రిడియమ్ (Clostridium). 5. ఆద్యజీవులు (Protozoa).

**నేలవిడిచిసాము** వి. జాతీ. నిరాధార వ్యాపారము.

**నేల వేలుపు** వి. భూసురుడు.

**నేలు** ఇం. (శాస.) (Nays) శాసనసభలో ప్రవేశపెట్టిన తీర్మానమునకు తమ వ్యతిరేకమును 'నే' అని సూచించు సభ్యులు.

**నేవడము** వి. మణులు గ్రుచ్చిన హారము. రూ. నేవళము. నేవారము.

**నేవీ** ఇం. వి. (Navy). నౌకసేన, సముద్రసేన.

**నేషనల్ కేడెట్ కోర్ప్స్** ఇం. వి. (N.C.C.) జాతీయ యువసైనిక దళము.

**నేస్తకత్తె** వై. విశే. మిత్రురాలు.

**నేస్తకాఁడు** విశే. మిత్రుడు.

**నేస్తము** వి. స్నేహము, నెయ్యము.

# నై

నైఋతి వర్షవాయువు సం. వి. (వ్యావ.) జూన్ నుండి సెప్టెంబరు వరకు నైఋతి మూలనుండి వీచు వాయువు (South-west monsoon).

నైకభేదము సం. విశే. అనేకభేదములు గలది.

నైగనిగ్యము సం. వి. నిగనిగలాడుట.

నైగమము సం. వి. వేదాంతము.

నైచికి సం. వి. 1. మంచిరూపము 2. ప్రాయము. 3. సమృద్ధి. 4. పాలిచ్చునట్టి యావు.

నైచ్యము సం. వి. నీచభావము.

నైజము సం. విశే. 1. తనది. 2. స్వాభావికము.

నైట్రసామ్లము మి. వి (రసా.) నత్రజని త్ర్యామ్లజనిదము నీటిలో కరిగిన ఉత్పన్నమగు ఆమ్లము (Nitrous acid).

నైట్రికామ్లము మి. వి. (రసా.) నత్రజని పంచామ్లజనిదము నీటిలో కరగగా వచ్చు ఆమ్లము (Nitric acid).

నైట్రోబాక్టరు ఇం. వి. (వ్యావ.) (Nitro bactor) నత్రాయితములను నత్రితములుగా మార్చు సూక్ష్మజీవులు.

నైట్రోసోమోనాస్ ఇం. వి. (వ్యావ) (Nitrosomonas). అమ్మోనియా కర్బనితము నందలి నత్రజనిని నేలలో నత్రాయితములుగా మార్చు సూక్ష్మజీవులు.

నైపథ్యము సం. వి నేపథ్యము.

నైపుణము సం. వి. నేర్పరితనము. రూ. నైపుణి, నైపుణ్యము.

నైమిత్తికము సం. విశే. నిమిత్తము వలన కలిగినది.

నైయాయికుఁడు సం. వి. న్యాయశాస్త్రము తెలిసినవాడు.

నైరాశ్యము సం. వి. ఆశలేనితనము.

నైరృతి సం. వి. నిరృతి.

నైరృతుఁడు సం. విశే. నాలవ దిక్కు నేలువాడు, నిరృతి.

నైర్ఘృణ్యము సం. వి. దయలేనితనము.

నైర్మల్యము సం. వి. నిర్మలత్వము

నైష్ఠికుఁడు సం. విశే. నిష్ఠగలవాడు,

నైసర్గికము సం. విశే. స్వాభావికము.

నైసర్గికలక్షణము సం. విశే. (భూగో.) ఒక ప్రదేశపు సహజగుణము. ఉదా. ఒక ప్రాంతము చెట్లతోగాని, కొండలతోగాని, నదులతోగాని నిండియుండు స్థితి.

# నొ

నొంచు క్రి. నొప్పించు.

నొక్కు క్రి. అదుము. వి. 1, అదుముటచే గలిగిన సల్లము. 2. ముడుత.

నొక్కుడు వి. 1. ముడుత, 2. అదుముడు నొన.

నొక్కులజుట్టు వి. (గృహ.) ముడుతలు పడినట్టుగా నగపడుజుట్టు (Crepe).

నొగ వి. కాడికి దగిలించు నిడుపు మ్రాకు, కూబరము. (వ్యావ.) గుంటక. గొర్రు మొదలగు పనిముట్లకుగల పడికోల(Shaf

నొగులు క్రి, వికలమగు, నొచ్చు. వి. 1. వికలమగుట. 2. నొప్పి.

నొచ్చిళ్ళు వి. చొంగ.

నొచ్చు క్రి. 1. నొప్పిచెందు. 2. దారిద్ర్యాదులచే పీడనొందు. రూ. నోయు.

నొచ్చుకొను క్రి. పరితాపమొందు. స్రుక్కు.

నొచ్చుకోలు వి. పరితాపము.
నొడి వి. నుడి.
నొడికారము వి. మాటచమత్కారము. రూ. నుడికారము.
నొడికారి విశే. నుడువు. చమత్కారముగా మాటాడువాడు.
నొడుగు క్రి. నుడుగు. రూ. నొడువు.
నొడుచు క్రి. 1. తప్పులుపట్టు. 2. నొడువు.
నొప్పి వి. బాధ. 2. ఆపద.
నొప్పిగుంటి విశే. వ్యాధిగ్రస్తుడు.
నొల్లి వి. (వ్యవ.) మెట్ట దుక్కి దున్నిన తరువాత మట్టిని మెరకనుండి పల్లమునకు లాగు సాధనము.



నొల్లి

నొల్లు క్రి. కిర్దలు నోట వ్రేళ్ళు కుకొని చప్పరించు
నొవ్వి వి. 1. వేదన. 2. వ్యాధి. రూ. నొవ్వు, నోవి, నోవు.
నొసలు వి. నుదురు.

## నో

నోంచు క్రి. నోము, వ్రతమాచరించు.
నోంత వి. నోచుట.
నోటిబీగము వి, దేవతా ప్రార్థనల యందు దౌడలయందు కుట్టుకొను లోహపు కమ్మి.
నోటీసు ఇం. వి. (Notice) 1, ప్రకటన, 2. ప్రకటన పత్రము, 3. సంజాయిషీ పత్రము
నోదకము సం. వి. (శాస్త్ర.) ముందుకు త్రోయునది. వాయు విమానము యొక్క ముఖమందుండు మూడు పత్రములు గల భ్రమించు పరికరము (Propeller). (ఇది విమానమును ముందుకు నడుపును.)
నోమడు ఇం. విశే. (Nomad ) దేశద్రిమ్మరి, అస్థిరవాసి.
నోము క్రి. 1. వ్రతముచేయు. 2 పాగొట్టు వి. వ్రతము.
నోయు క్రి. నొచ్చు.
నోరు వి. 1. ముఖద్వారము. 2. వచనము.
నోరుమెంగ విశే మూగ.
నోరుమెదల్చు క్రి, మాటలాడ ప్రయత్నించు
నోరూరు క్రి. 1, రుచిగల వస్తువులు తిను కోరికచే నోట నీరూరు. 2. ఆపేక్షించు.
నోరెత్తు క్రి. మాటాడ యత్నించు.
నోవరి విశే. నొప్పి కుంటి.
నోవి వి. నొవ్వు. రూ. నొవ్వి.
నోవు వి.. రూ. పై.

## నౌ

నౌ వి. నవు. నవ్వు.
నౌక సం. వి. ఓడ.
నౌకాదండము సం. వి. ఓడ నడుపు గడ.
నౌకరు హిం. వి. పనివాడు. సేవకుడు.
నౌకా(క)పన్ను మి. వి. (చరి.) దేశరక్షణ కొరకు పూర్వపు ఇంగ్లండు రాజులు నౌకలు నిర్మించు నిమిత్తము రేవుల మీద నగరముల మీద విధించిన పన్ను.
నౌకాశాఖ సం. వి. ప్రభుత్వపు నౌకాదళ వ్యవహారములను చూచుకొను శాఖ.
నౌకాస్థావరము సం. వి. యుద్ధనౌక లుండు స్థలము.
నౌకు వి. మొట్టి. రూ. నవుకు.

నౌడుకొట్టు క్రి మిణుకరించు. రూ. నవుడు కొట్టు.

నౌతలము సం. వి (వృక్ష.) పతంగాకార పుష్పములో రెండు ఆకర్షణ పత్రములతో పశుముల క్రింద నే ర్పడిన పడవ కీలువంటి భాగము (Keel).

నౌబతు హిం. వి. ఒక వాద్య విశేషము.

నౌరు విశ. మృదువు. రూ. నవురు.

# న్య

న్యంకువు సం. వి, 1. ఇఱ్ఱి. 2. ఒక ముని.

న్యక్కారము సం. వి. అవహేళనము.

న్యగ్రోధము సం. వి. 1, మఱ్ఱి 2, జమ్మి.

న్యర్బుదము సం. వి పది యర్బుదములు.

న్యస్తము సం. విశ. ఉంచబడినది.

# న్యా

న్యాయకర్తృకము సం. విశ. (శాస.) న్యాయాధీశ వర్గము, న్యాయశాస్త్రము నకువ్యాఖ్యానముచేసి ప్రజలకున్యాయము చేకూర్చుట (Judiciary).

న్యాయపంచాయతీలు మి. వి. (రాజ.) గ్రామములలో న్యాయపరిష్కారములు చేయు సభలు.

న్యాయము సం. వి 1. తగవు. 2. స్వధర్మము నుండి చలింపకుండుట. 3, తర్కశాస్త్రము

న్యాయస్థానము సం. వి. న్యాయాలయము, అదాలత్ కచేరి, కోర్టు. (Court).

న్యాయాధీశకృత న్యాయము సం. వి. (శాస.) న్యాయమూర్తులు న్యాయ నిర్ణయము చేయునప్పుడు అనుసరించు విధానము. (ఈ న్యాయ నిర్ణయము శాసనము కాకపోయినప్పటికి శాసనముగా గౌరవింపబడి భవిష్యత్కాల న్యాయాధీశులకు మార్గదర్శిగా నుండును).

న్యాయ్యము సం. విశ. న్యాయముతో కూడినది,

న్యాసము సం. వి, 1. ఉంచుట. 2. ఇల్లడ 3. వాడిక,

న్యాసర్గము సం. వి. (జం) పెద్ద జంతువులలో నిర్నాళిక గ్రంథినుండి స్రవించుచు జీవన వ్యాపారముల కవసరమగునట్టి పదార్థము (Harmone).

న్యాయసంస్థ సం, వి. (వాణి.) పారిశ్రామిక సంస్థలు కొన్ని కలిసి స్పర్థను తొలగించుకొనుటకు ఏర్పరుచుకొను ఒక సంస్థ. (ఈ సంస్థకు వ్యక్తి-సంస్థలు పూర్తిగ అధీనములై యుండును, వ్యక్తి-సంస్థల లోనివాటాదారులకులాభములో భాగము తప్ప సంస్థ ఆధ్వర్యవము ఎంతమాత్ర ముండదు.)

# న్యూ,న్ర

న్యూనము సం. విశ. తక్కువైనది

న్రస్థిమాలి సం. వి. శివుడు. వ్యు. పుఱ్ఱెల దండ ధరించినవాడు.

# ప

ప ఒక యక్షరము.

పంకజము సం. వి. తామర. వ్యు. బురదలో పుట్టినది.

పంకము సం. వి. 1. బురద. 2. పాపము. వి. పాలు.

పంకరుహము సం. వి. తామర.

పంకా హిం. వి. పెద్ద విసనకఱ్ఱ (భౌతి.) గాలిని విసరునది (Fan).

పంకించు క్రి. 1. పట్టించు. 2. చలించు. 3. లక్షించు.

పంకిలము సం. విశే. బురదగలది.

పంకేరుహము సం. వి. పంకజము, తామర.

పంక్తి సం. వి. 1. వరుస. 2. పది.

పంగ వి. 1. పలవకొమ్మ. 2. పాయగొమ్మ. 3. ఎడముగా చాపబడిన రెండు కాళ్ళ నడిమి భాగము.

పంగనామము వి. నడుమ ఎడము గలుగ పంగవలె తీర్చిన తిరుమణి.

పంగము వి. దేవ బ్రాహ్మణ వృత్తుల మీద దొరతనము వారు తీసెడు చతుర్థాంశమైన కప్పము.

పంగమొగ్గ వి. (వృక్ష.) కక్ష్యస్థ కోరకము, ఆకు పంగలో నుండు మొగ్గ(Axillary bud)



పంగమొగ్గలు

అగ్రకోరకము

పంగిడి వి. ఓదము.

పంగు వి. భయము.

పంగువు సం. వి. శని. విశే. కుంటివాడు.

పంచకము సం. వి. అయిదు

పంచక్షేత్రములు సం. వి. శ్రీశైలము, కాశి, కేదారము, కాళహస్తి, పట్టిసము,

పంచగవ్యము సం. వి. ఆవుపేడ, ఆవు పంచితము, ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి.

పంచజనుఁడు సం. వి. 1. మనుజుడు. 2 ఒక రాక్షసుని పేరు.

పంచతంత్రము సం. వి. జంతువుల కథల ద్వారా మానవునకు నీతి బోధించు సంస్కృత కథాగుచ్ఛము:- 1. మిత్రలాభము. 2. మిత్రభేదము, 3. సంధివిగ్రహము. 4. లబ్ధనాశము, 5. అసంప్రేక్ష్యకారిత్వము అనునవి యయిదు తంత్రములు.

పంచతన్మాత్రములు సం. వి. శబ్దస్పర్శ రూపరసగంధములు.

పంచత్వము సం. వి. మరణము.

పంచదశి సం. వి. 1. అమవస. 2. పున్నమ.

పంచనామా హిం. గా. అనుమాన పరిస్థితులలో మరణము కలిగిన యెడల విచారించు సంఘము.

పంచనఖము సం. వి. పులి, శార్దూలము.

పంచపాత్రము సం. వి. లోహపాత్ర విశేషము.

పంచభద్రము సం. వి. ఐదుచోట్ల మంచి సుళ్ళు గల గుఱ్ఱము.

పంచభుజి సం. వి. (గణి.) ఐదు సరళరేఖలచే సమక్షేత్రమున నేర్పడిన చిత్రము (Pentagon).

పంచమంగళము సం. వి. ఐదు మంచి సుళ్లు గల ఏనుగు.

పంచమము సం. వి. 1. కోయిల 2. రాగ విశేషము. 3. ఒక స్వరము. విశే. ఐదవది.

పంచమి సం. వి. 1. పక్షమునందు ఐదవ తిథి. 2. ద్రౌపది.

పంచముఖుఁడు సం. వి. శివుడు (ఐదు మోముల వేలుపు.)

పంచముఁడు సం. వి. మాలడు. విశే. ఐదవ వాడు.

**పంచలక్షణము** నం. వి. పురాణము-సర్గము. ప్రతిసర్గము. వంశము. మన్వంతరము వంశానుచరితము, అను లక్షణములుగలవి.

**పంచవర్ష ప్రణాళిక** నం వి. (అర్థ) దేశము యొక్క ఆర్థికాభివృద్ధి ఒక నియమిత మార్గమున సాధించుటకై ప్రభుత్వము తయారుచేయు పథకము. మొదటిసారిగా రష్యన్ కమ్యూనిస్టు ప్రభుత్వము ఈ పంచ వర్ష ప్రణాళికను తమ దేశములో ప్రవేశపెట్టి తమ ధ్యేయములను సాధింప గలిగెను. మనదేశములో పంచవర్ష ప్రణాళికలను అమలు పరుచుటలో ప్రభుత్వ రంగమునకే కాక వైయక్తిక రంగమున కూడ ప్రాధాన్యమీయబడెను క్రీ. శ. 1951 నుండి ఆర్థికాభివృద్ధికై పంచవర్ష ప్రణాళికలు చేపట్టినది. 1956 నుండి 1961 వరకు రెండవ పంచవర్ష ప్రణాళిక 1961 నుండి మూడవ పంచవర్ష ప్రణాళి అమలు జరిగెను ఇప్పుడు ఆరవది అమలులో నున్నది.

**పంచశంకము** నం. వి. (వృక్ష) పుష్పము లోని దళములు ఐదేసి చొప్పున నున్న నిర్మాణము (Pentamerous)

**పంచశరుఁడు** నం. వి. మన్మథుడు. ఉన్మా దన, తాపన, శోషణ, స్తంభన, సమ్మోహ నములను ఐదు బాణములు కలవాడు,

**పంచశీల** నం. వి. (చరి. రాజ.) క్రీ. శ. 1954సంవత్సరములో ఏప్రిల్ 29వతేదీని భారత ప్రధాని శ్రీ నెహ్రూ చైనా విదే శాంగ మంత్రి శ్రీ చౌ-ఎన్-లైతమ యుభయ దేశముల తరపున ప్రపంచ శాంతి కొరకు, ముఖ్యమైన టిబెట్టు శాంతి భద్రతల కొరకు, చేసికొనిన సూత్రములు. 1. వివిధ రాజ్యములు ఒండొరుల రాజ్య పరిధులను అధికారములను గౌరవించుట. 2. ఒకరి రాజ్యముపై నింకొకరు దురా క్రమణ చేయకుండుట. 3. ఒకరి అంత రంగిక విషయములలో నింకొకరు కలుగ చేసికొనకుండుట. 4 సమానత్వము. అన్యోన్య సాహాయ్యము. 5. శాంతియుత సహజీవనము.

**పంచసంయోజకము** నం. విశ. (రసా.) మా చతుస్సంయోజకము (Quin quiva-lent),

**పంచసారము** నం. వి. పంచదార.

**పంచాంగము** నం. వి. (గణి.) తిథి వార నక్షత్ర యోగ కరణముల తెల్పెడి పొత్తము (Almanac).

**పంచాంగుళిక** నం. విశ. (జం.) ఐదు చేతి వ్రేళ్ళుగాని కాలి వ్రేళ్ళుగాని కలది (Pentadactyle).

**పంచాణుఁడు** నం వి 1. స్వర్ణకారుడు. 2. శిల్పి.

**పంచాననము** నం. వి. సింహము. వ్యు. విశాలమగు ముఖము గలది.

**పంచాననుఁడు** నం. వి. శివుడు వ్యు. ఐదు మొగాలు కలవాడు.

**పంచామృతములు** నం. వి. ఉదకము, పాలు పెరుగు, నెయ్యి. తేనె.

**పంచాయతి** నం, వి. అయిదుగురి కూటమి.

**పంచాయతీ సమితి నిధి** నం. వి. బ్లాకు పంచాయతి సమితి యొక్క ధనాదాయపు నిధి.

**పంచితము** వి. గోమూత్రము.

**పంచి** వై, వి, పంచపాళ, పంచాది. నం. పార్శ్వః.

**పంచకరపాటులు** వి. అత్యధిక దుఃఖములు.

**పంచదార** వై .విశ. చక్కెర. నం పంచసారః,

**పంచబంగాళము** వై . విశ. 1. చెల్లాచెదరైనది. 2. దూరము.

**పంజి** వై . వి. కప్పము. నం, భంజ్-భాగః.

**పంజె** వై . వి. రవిక.

పంజరము వై.వి. పక్షులను పెంచెడుగూడు సం. పంజరమ్.

పంజా వి పెష్టుట.

పంట వి. 1, పండుట. 2. కృషి.

పంటవలంతి వి. భూమి.

పంటసాల వి ధాన్యములుంచుగాది.

పంటి వి. (గృహ.) పగ్గె. ఒట్టెను నేయునప్పుడు పడుగు దారములను విడదీయు పరికరము (Reed). (దీని పళ్ళు దువ్వెన పళ్ళను బోలి యుండును)

పండించు క్రి. 1. జాగుచేయు. 2. తడబడు,

పంత్రి వి. చిల్లులుగల అలుగులు మూడు నాలుగు కల కఱ్ఱ, పంత్రకోల.

పంట్లాము వై. వి. (గృహ) (Pantaloon) సాధారణముగా బొత్తాములు గల పొడుగు షరాయి.

పండాలు వి. జగన్నాథ క్షేత్ర పౌంతవాసులు (పురోహితులు).

పండితపుత్త్రుఁడు సం. వి (వ్యా.తి) పండితుని కొడుకు (శుంఠయని వాడుక).

పండితమ్మన్యుఁడు సం. విశే. తన్ను పండితునిగా తలచుకొను వాడు

పండు క్రి. ఫలించు వి.1.ఫలము. 2. గెలుపు.

పండుగ వి. సంబరము, ఉత్సవము, సంక్రాంతి మొదలైనవి.

పండుఁడు సం. వి. షండుడు, నపుంసకుడు.

పంౘ్రెండు సర్వా. (పది + రెండు) ద్వాదశ సంఖ్య.

పండ్లకఱ్ఱ వి. (వ్యా.వ) మట్టిని పైపైని కదల్చుటకును గడ్డిని చెత్తను ప్రోగుచేయుటకును ఉపయోగించు చేతి పనిముట్టు (Handr ake).



పండ్లగుద్దలి వి. (వ్యావ.) పొడవైనపండ్లు గలిగి త్రవ్వు పండ్లగుద్దలి చేయుటలో నుపయోగింపబడు ఒక విధమగు పండ్లుగల పనిముట్టు (Toothed rake)

పండ్లపీటము వి. (వ్యావ.) మట్టిని గెడ్డలకు దున్నిన భూమిలో గడ్డిగాదములను చేయుటకు ఉపయోగించు పీటముట్టు (Toothed harrow) (దీని పండ్లు పొడుగు.)

పండ్లజెల్లీ వి. వి. (గృహ.) పంచదారముతో తయారుచేసిన దృఢమైన పాక (Fruit jelly). (దీనిని జాడీలో కరగి శీతల యంత్రములో పెట్టిన అది గట్టిగా పేరుకొనును. భోజనానంతరము దీనిని పండ్లతోగాని పాలమీగడతోగాని వీలుని విడాక్షముగా వడ్డింతురు)

పండ్లమ్రాను వి. (వ్యావ.) పండ్లు అనుదూలమువంటి పనిముట్టు (Raek).



పండ్లమ్రాను

పంతము వై. వి. 1. స్పర్ధ, పోటి.2.విధము. సం. స్పర్ధా.

పంతులు వై. వి ఉపాధ్యాయుడు సం. పండితః.

పంద వై. విశే పిరికి. సం. బంధః.

పంది వి. సూకరము

పందికొక్కు వి. మూషికము,

పందుము వి. పది తూములు.

పందెనమందుము వి.పదునెనిమిదితూములు.

పందెము వై. వి. 1. ఒడ్డనము. 2. జూదములో ఒడ్డు ధనము. రూ. పందియము. సం. పణితమ్.

పంపకము వి. పంచుట.

పంపరపనస వి వి ఫలవిశేషము.

పంపాలు ఆం. వి. (భూగో.) (Pompas)

రతీయ అమెరికాలోని సమశీతోష్ణ ప్రపంచైక ఒయస్సు.

**పంపిణీ** వి. 1 పంచిపెట్టుట. 2 పద్ధతి. వి (గణి.) వ్యాపనము (Distribution).

**పంపు** క్రి. 1. ఆజ్ఞాపించు. 2. పంపించు. వి. 1. మారణకర్మము 2. ఆజ్ఞ.

**పంబ** వై. వి. చర్మవాద్యము (జంబలవాడు.) సం. పణవః.

**పంబు** వి. ఎద్దుమీద వేయు పెద్ద సిద్దె.

**పకీరు** హిం వి. మహమ్మదీయ బైరాగి.

**పక్కణము** సం. వి. బోయపల్లె

**పక్కి** వై. వి. పక్షి, పులుగు. సం. పక్షీ.

**పక్కియ** వై. వి. పార్శ్వము. సం పక్షకః.

**పక్కు** వి. 1. ఎండిన మెతుకు, 2 నవ్వుట యందగు ధ్వన్యనుకరణము.

**పక్కెరాలు** వి. అంతఃపురపు కావలికత్తె.

**పక్వమాంసకృత్తులు** సం. వి. (జం.) మాంస కృత్తులు, 'పాచకము' అను సేంద్రియ మండమునకు ప్రసరణకు అనుకూలముగా నుండునట్లు మార్చబడిన పదార్థములు (Peptones),

**పక్వము** సం. విణ. 1. పరపాకము పొందినది. 2. చేటుమూడినది.

**పక్షచరుఁడు** సం. వి. 1. చంద్రుడు, 2. సేవకుడు,

**పక్షదళములు** సం. వి. (వృక్ష.) పక్షిరెక్కలవలె ప్రక్కనుండు పూరేకులు (Alea or wings).

**పక్షపాతము** సం. వి. ఒక ప్రక్క కొరగుట పక్షపాత బుద్ధితో మెలగుట.

**పక్షము** సం వి. 1. నెలయందు బదునైదు దినములు(శుక్లకృష్ణ పక్షములు).2.రెక్క

**పక్షములు** సం. వి. (గణి.) సమీకరణములోని సమత్వమును చూపు గుర్తున కిరు వైపుల నున్న పదసముదాయములు (Sides).

**పక్షాంతరస్థాపన** సం వి (గణి.) ఒక పక్షము నుండి మరియొక పక్షమునకు రాసులను కొనిపోవు ప్రక్రియ (Transposition).

**పక్షాంతము** సం. వి. 1. పున్నమ. 2. అమవస.

**పక్షాంతరము** సం. వి మరియొక విధము.

**పక్షవాతము** సం. వి శరీరము నొక ప్రక్క కొంగచేసెడి రోగము.

**పక్షాకారము** సం విణ, (వృక్ష.) పక్షిరెక్క వలె చీలి యున్నది. (ఆకు) (Pinnatifid).

**పక్షాకృతి** సం. వి. (వృక్ష.) పక్షి ఈకవలె ఒక మధ్యాక్షమునుండి దానిపై నిరువైపుల ను ఉపపత్రము లమర్పబడిన రూపము (Pinnate).

**పక్షి** సం. వి. (పక్షములు గలది) పులుగు,

**పక్షిణి** సం వి. 1. (రెండు పగళ్ళతో కూడినది) రాత్రి. 2. ఆడుపక్షి.

**పక్ష్మము** సం. వి 1. రెప్పవెంట్రుక, 2 పక్షిఈక. 3. అకరువు.

**పక్ష్మములు** సం. వి. (జం.) జీవకణముపై నుండు నూగువంటి చిన్నచిన్న పోచలు (Cilia). (వీనికి సమానావశ్యకతతో కంపించు శక్తిగలదు.)

**పక్ష్మవలయడింభము** సం. వి (జం.) బేరి పండు ఆకారముతో మధ్యరేఖపై పక్ష్మముల (నూగు) పంక్తిగల వెన్నెముక లేని జంతువు యొక్క డింభము (Trochophore larva),

**పగ** వి. విరోధము.

**పగగొను** క్రి. విరోధపడు,

**పగటు** వి. ప్రకాశము.

**పగడ** వై. వి. పాచికల మీది ఒంటి చుక్క. సర్వా. ఒకటి. సం. వటికా.

**పగడపురిక్క** వై. వి. ఆర్ద్రానక్షత్రము.

**పగడము** వై. వి. ప్రవాళము, పవడము. సం. ప్రవాళః.

పగతుఁడు వి. (పగ+అతఁడు) శత్రువు, పగవాఁడు.

పగఁబట్టు క్రి. పగగొను.

పగఱు వి. (బహు.) శత్రువు (పగ+వాఱు),

పగలు వి పవలు, దినము.

పగిడి వై. వి. 1. కప్పము. 2. విధము. సం. భాగధః

పగిది వై. వి. 1. ప్రకృతి, 2. విధము, రీతి. సం. ప్రకృతిః.

పగులు వి. చీలిక. క్రి. భిన్నమగు.

పగోడా ఇం. వి. (చరి.) (Pagoda). పోర్చుగీసు భాషలోని అపభ్రంశపదము. (మొదట భారత చైనా దేశాలలోని హైందవ బౌద్ధ దేవాలయములకు వాడబడుచుండెను. ఇప్పుడు బర్మా బౌద్ధ దేవాలయములకు ప్రత్యేకముగా వాడబడుచున్నది)

పగ్గము వై. వి. పశువుల లాగిపట్టెడు త్రాడు సం. ప్రగ్రహః.

పగ్గించు వై. క్రి. ప్రజ్ఞలు పలుకు. రూ. పగ్గె.

పగ్గియ వై. వి. ప్రజ్ఞ. రూ. పగ్గె.

పచనము సం. వి. వండుట.

పచారి హిం. వి. చిల్లరదినుసు లమ్మువాఁడు.

పచేళిమము సం విశే. తనంతట పక్వమైనది అనగా చెట్టుమీదనే పండినది.

పచ్చి విశే. 1. తడిగలది. 2. ఎండనిది. 3. కాలనిది. 4 ముదురనిది.

పచ్చిక వి. (పచ్చి+కలది) శాదము.

పచ్చికపడియ వి. (వ్యావ.) అల్పసరస్సు

పచ్చికబయలు వి. (వ్యావ.) ఎల్లప్పుడు పచ్చని పచ్చికతో చదునుగా, తోటలలోను ఇండ్ల ఆవరణయందును ఏర్పరుచుకొను భూభాగము (Lawn).

పచ్చిబియ్యము వి. నానబ్రాలు.

పచ్చియము వై. వి. చూచుచుండగ దొంగిలుట. సం. పశ్యతో హరణమ్.

పచ్చియెరువు సస్యములు వి. (వ్యావ.) ఎరువుగా వేయుటకు పచ్చిరొట్టను ఇచ్చు పైరులు. ఉదా. వెంపలి, జీలుగ, జనుము మొ॥ (Green manure crops).

పచ్చీసు వి. (వ్యావ.) శాలికాక్రీడ.

పచ్చెతాఁడు విశే. పచ్చిదొంగ

పచరణ వై. వి. నటన. సం. ప్రచరణమ్.

పచారము వై. వి అంగడి. సం. ప్రసారః.

పచ్చ వై. వి. 1. పసుపుపన్నె. 2. మరకత మణి. 3. కరచరణాదుల పొడుచు పసరు రేఖ. సం. పలాశః.

పచ్చకప్పురము వై వి. చల్లదనము మంచి పరిమళము గల కర్పూరము.

పచ్చకామెర్లు వి. (గృహ) కామిల, ఒక విధమైన కాలేయపు వ్యాధి (Jaundice). (దీనిచే కన్నులు మొదలగునవి పసుపు పచ్చగా నగును )

పచ్చడము వై. వి 1. బట్ట. 2. పరపుమీది దుప్పటి. సం ప్రచ్ఛదః.

పచ్చడి వి. వ్యంజనము, ఉపదంశము.

పచ్చనేలలు వి. (వ్యావ.) పసిమిరంగుతో నుండు మట్టిచే నేర్పడు నేలలు (Yellow soils), కంకరనేలలు అడుగు పొరలలో నిట్టిమన్ను కనబడుచుండును.

పచ్చపురుగులు వి. (వ్యావ.) సామాన్యముగ ఆకుపసరువర్ణము గలిగిన కీటక డింభములు (Green caterpillars) ఉదా. సీతాకోక చిలుక యొక్క డింభము.

పచ్చఁబ్రాలు వి. శోభనాక్షతలు.

పచ్చముపాడు విశే. (పాడు+పాడు) మిక్కిలి శూన్యము.

పచ్చవిలుతుఁడు వి. మన్మథుడు.

పజ్జ వై. వి. 1. సమీపము. 2. వెనుక. సం. పశ్చాత్.

పటకారుఁడు సం వి. సాలెవాడు. వ్యు. పటముల (వస్త్రముల) తయారుచేయువాడు.

పటచ్చరము నం. వి. ప్రాతగుడ్డ.
పటపత్రము నం. వి. పత్రిక.
పటము నం వి. 1 వస్త్రము. 2. చిత్తరువు వ్రాయు వస్త్రాదికము.
పటలము నం వి. 1. సమూహము 2. ఇంటి కప్పు 3 కంటిపొర. 4. గ్రంథభాగము.
పటవాసము నం. వి. గుడారము.
పటహము నం. వి. 1. తప్పెట. 2. యుద్ధ వాద్యపు మ్రోత.
పటా వై. వి. 1. పట్టి. 2. గోనెపట్టి మొ॥వి. దూ. పట్టా.
పటాణీ వి. గుజ్జము.
పటాపంచలు వి. 1. చెల్లాచెదరు. 2. అగోచరము. 3. కకవికలు.
పటాలము నం. వి. దండు. సేన. నం. పటాలమ్.
పటి నం. వి. (జం.) రెండు నిర్మాణములను గాని, రెండు కుహరములనుగాని వేరు పరచు గోడ (Septum).
పటిక వై. వి. స్ఫటిక, బంగారమునకు మెరుగునిచ్చు ఉప్పు నం, స్ఫటికమ్. వై. వి. (రసా) పొటాసియమ్ • అల్యూమినియము డబుల్ సల్ఫేటు (Alum).
పటిమ నం. వి. నేర్పు. సామర్థ్యము.
పటిష్ఠము నం. వి, మిక్కిలి పటువైనది.
పటీరము నం. వి. చందనము.
పటువు నం. వి. 1. చోరవు. 2. నేర్పరి.
పటేలు (మహారాష్ట్రము) వి, గ్రామాధికారి.
పటోలి నం. వి. 1. పొట్లతీగ. 2. కాయ.
పట్ట వై. వి. చెట్టుమీది తోలు, బెరడు. వై. వి. (వృక్ష.) వృక్షకాండము పైభాగమున నుండు దట్టమైన బెరడు. నం. పట్టమ్.
పట్టకము నం వి. పడిగ, మూడు పలకలు గల గాజు కడ్డీ
పట్టకము నం. వి. (భౌతి, గణి.) పారదర్శక పదార్థముతో చేయబడిన ఒక ఘనరూపము (Prism) చివరలు సరూప సమాన సమాంతర బహుభుజములుగను, ప్రక్కలు సమాంతర చతుర్భుజములుగను గల ఘనాకృతి.
పట్టడ వి. కుమ్మరి పనిచేయుచోటు.
పట్టణము నం. వి. కోటచేతను, అగడ్తచేతను దుర్గమమైన ప్రధానసగరము.
పట్టపగలు వి. (పగలు+పగలు) మట్ట మధ్యాహ్నము
పట్టభద్రుఁడు నం. వి. పట్టాభిషిక్తుడు.
పట్టము నం. వి. 1. రాజ్యాభిషేకమందు నొసట కట్టెడు పట్టె. 2. రైతుల కిచ్చు పట్టా (కవులు.)
పట్టాకత్తి వి. రెండువైపుల పదను గల కత్తి.
పట్టాలు వి. (భౌతి.) అరిగిపోకుండ చక్రముల చుట్టు ఇనుముచే గాని రబ్బరుచేగాని తయారుచేయబడినవి(Tyres)చుట్టబడునవి
పట్టి అవ.పంచమీ విభక్తిప్రత్యయము వి.బిడ్డ.
పట్టికామంచము నం. వి. పట్టెమంచము
పట్టికావర్ణమాల నం, వి. (భౌతి.) పట్టికలు లేదా కాంతిచారలు చూపు వర్ణమాల (Band Spectrum).
పట్టిపట్టి వి. 1. మనుమడు. 2. మనుమరాలు. విణ. గట్టిగా నొక్కి నొక్కి.
పట్టిపురుగు వి. (గృహ) బద్దిపురుగు, అంటు వ్యాధులు కలుగచేయు ఒక విధమగు పురుగు (Tape worm).
పట్టిసము నం. వి. 1 అడ్డకత్తి. 2 ఒక దివ్యక్షేత్రము.
పట్టి నం. వి. (గృహ.) లంగా లను, ఫ్రాక్ చేతుల కుచ్చిళ్ళనులేక ప్లీట్లను


పట్టీబంధనము

జంటమడత గల పట్టీతో అమర్చి కుట్టుట (Bond).

పట్టీ నం. వి (గణి.) అడ్డుగా, నిలువుగా నున్న పట్టీలలో క్రమ ప్రకారము వ్రాయ బడిన విషయ వివరములు (Table).

పట్టీదాఖలాబ్యాంకులు మి, వి (అర్థ. వాణి. శాస.) రిజర్వ బ్యాంకు చట్టము చివర ఇచ్చిన పట్టీలో పేర్కొన్న బ్యాంకులు. (ఇవి యన్నియు 5లక్షల రూపాయల కన్న ఎక్కువ పెట్టుబడి కలవి )

పట్టు క్రి. 1. చెల్లు. 2. ప్రారంభించు. 3. కలుగు. 4 గ్రహించు. వి. 1. గ్రహణము 2. స్థానము. 3 అవలంబము.

పట్టు వై. వి. ఒక జాతిపురుగులవల్ల కలిగెడు ఒక దినుసు మేలు నూలు. నం పట్టః.

పట్టుకట్టె వి.(గృహ.) బూజుకట్టె, బూజులు మొదలగు వానిని తీసివేసి గోడలను ఇంటి కప్పులను శుభ్రముగా తుడుచుకట్టె (Ceiling crush).

పట్టుకారు వి. నిప్పున కాచిన లోహములను ఎత్తె[illegible] ఒక యినుప కొరముట్టు, సందంశము.

పట్టుకుట్టు వి. (గృహ) పువ్వులు ఆకులు మొదలగు నమోనాలను పటవాలుకుట్లతో నింపినది (Satin stich).

పట్టుకృషి మి.వి. (వ్యవ.) పట్టుపురుగులను వృద్ధిచేసి పట్టు నుత్పత్తిచేయుట (Sericulture).

పట్టుగొమ్మ వి. ఆనుకట్ట, ఊతకోల (పట్టుకారు).

పట్టుదల వి. వదలనిపట్లు, చలము.

పట్టుపురుగు వి. ఒకరకపు పురుగు, ఇంద్రగోపము.

పట్టుబడి వి. ఏదే నొకదాని క్రింద వ్యయమైన సొమ్ము. (వాణి.) ధాన్యాదులు సంచులలో నింపుట.

62

పట్టె వై. వి. 1. డాలు. 2. మంచముపట్టె, దుప్పినచాలు, నం. పట్టికా.

పట్టెడ వి, 1. నవారు. 2.పశ్వాదుల మెడకు కట్టు పట్టె. 2, కంసాలివాని దాగలి.

పట్టెవర్ధనము మి వి. వెడల్పుగా (పట్టీవలె) దళముగా పెట్టిన నామము.

పత్రు వై. వి ఒకానొక కిరాతుడు. -నం, పాటచ్చరః.

పట్వారి హిం, వి (చరి.) ప్రభుత్వపక్షమున భూమికొలతలు, పట్టాలు. శిస్తు రికార్డు ఉంచు ఉద్యోగి, కరణము.

పఠనము నం. వి. చదువు,

పడఁకు వి. 1. సందు. 2, గుహ.

పడఁత వి. 1. హానువు. 2. కాడిభారము,

పడఁతి వి స్త్రీ. రూ పణఁతి.

పడక తడుపుకొనుట వి. (గృహ) పడకలో మూత్రము విడుచుట (Enuresis).

పడకపుండు వి. (గృహ.) ఎక్కువ జబ్బుతో కదలలేకుండ పండుకొని యున్న వారికి మంచము వేడివల వచ్చుపుండ్లు(Bedsore).

పడగ వై వి. 1. పాముపడగ2. టెక్కెము. నం, 1. స్ఫటా. 2. పతాకా.

పడమర వి. పశ్చిమ దిక్కు.

పడము వై. వి అందలమున క్రింద వరచెడు రత్నకంబళము. నం. పటః.

పడవ వి. 1. ఎక్కటి కయ్యము చేయు భూమి. 2. ప్రళయము. వై. వి. చిన్న దోనె. నం. ప్లవః.

పడవలము వి. 1. సేవాముఖము. 2. పూజ్యాశ్వము,

పడవాలు వై. వి, సేనాధిపతి. రూ. పడాలు. నం. భటపాలః.

పడి వి. రెండు సోలల కొలది, తవ్వ.

పడికట్టు వి. 1. తూనికకట్టె, 2. మర్యాద. 3. సోపానము.

పడిగల్లు వి. తుపాకిమందు.

పడిగాపు వి. పంచను కాచియుండుబంటు.
పడిగాపులుండు క్రి. నిరీక్షించియుండు.
పడితరము వి. 1. ఏర్పాటు. 2. వార్షికము 3. ఏటేట వచ్చు మొత్తము (ఒత్తెము).
పడిదియ వి. చాకలి చలువలు అద్దెకిచ్చుట.
పడిదియము వి. ద్రవరూపముగు వ్యంజన విశేషము.
పడియంచు వి ఒత్తి రూప మేర్పరుచుటకై తొలిచిన యచ్చు,
పడవాగె వి. ఎక్కుటకాయత్త పరుచునపుడు చేయు గుఱ్ఱపు సవరణ.
పడిహారి వై. వి. పణిహారి, ద్వారపాలకుడు. సం. ప్రతీహారీ.
పడు వై. క్రి. 1. శయనించు. 2. పతనమగు. 3 అనుభవించు(కష్టపడు). సం. పత్,
పడుగు వి. వస్త్రము నేతయందు నిడుపు నూలు.
పడుచురాసి వి. కన్యారాశి.
పడుచు వి, 1. కన్యక, 2. కన్నెరికముగాని వేశ్య
పడుపు వి. వ్యభిచారము, పడుచుజేత. ఉదా. పడుపు కూడు.
పడవ విశ. మిక్కిలి పల్లమైనది.
పడ్డ వి. తొలిచూలియావు,
పణము సం. వి. 1. పందెము. 2. విలువ. 3. కూలి. 4 ధనము, 5. జూదము.
పణితము సం. విశ. 1, పొగడబడినది. 2. పందెముగా చేయబడినది.
పణిహారి వై. వి. పడిహారి.
పణ్యప్రత్యేకీకరణము సం. వి. (వాణి అర్థ.) వేర్వేరుసంస్థలచే తయారైన వస్తువులు యథార్థముగ ఒకేరకమైనప్పటికి, అనుభోక్తలందరకు తమ సరకులనే అమ్మువలెనను ఆదుర్దావలన విక్రేతలు అనుభోక్తల మనస్సులలో కల్పించు విభిన్న భావము; (ఇది అంకనము (Grading) వలనక్క ప్రకటనల వలన విక్రేత్ర కౌశలము వలన కల్గింతురు.)
పణ్యము సం విశ. అమ్మదగినది
పణ్యవీథి సం. వి. విపణివీథి, అంగడివీథి.
పణ్యాంగన సం. వి. వేశ్య.
పణ్యాజీవుడు సం. వి. వర్తకుడు
పణ్యారము వై. వి. నానవాప భక్షము. సం. పణ్యాహారః.
పతంగము సం. వి. 1. మిడుత. 2. పక్షి. 3. బాణము. 4. పాదరసము.
పతకము వై. వి. హారము నడుమ నుండు రతనపు బిళ్ళ, సం. పదకమ్.
పతత్రము సం. వి, 1. రెక్క. 2. పత్రము.
పతత్రి సం. వి. పక్షి. వ్యు, రెక్కలుగలది
పతనము సం. వి. పడుట. (భౌతి) ఒక వస్తువుపై కాంతి కిరణము పడుట (Incident).
పతనరేఖ సం. వి. (భూగో.) ఉత్తర అమెరికాలోని అపలేచియను పీఠభూమి నుండి నదులు తూర్పుతీరమునకు దిగునప్పుడు జలపాతము లేర్పడు ప్రదేశము. (Fall line).
పతనశీలము సం. విశ, (వృక్ష.) క్రిందికిరాలి పోవునట్టిది. సామాన్యముగా శీతకాలమున రాలిపోవునట్టిది (ఆకులు)(Deciduous).
పతాకదళము సం. వి. (వృక్ష.) పతంగాకారముగల పుష్పములో నున్న పెద్ద ఆకర్షణ పత్రము(Standard of vexillum)
పతాకము సం. వి. 1. పడగ. 2, టెక్కెము
పతాకాధికారి సం. వి. సైన్యములో జాతీయ ధ్వజమును మోయు సైనికోద్యోగి.
పతాకిని సం. వి. సేన. వ్యు. పతాకములు కలది.
పతి సం. వి. మగడు, ఏలిక, విశ. కాపాడువాడు.

పతింవర నం. వి తనంతట మగని వరించు నట్టి ఆడుది.

పతితుఁడు నం. విఱ. 1. పడినవాడు 2. పదవిచెడినవాడు.

పతివ్రత నం. వి సాధ్వి.

పత్తనము నం. వి. 1. పట్టణము, 2. చిన్న గ్రామము.

పల్తా హిం. వి. జాడ.

పత్తి వి. ప్రత్తి. నం. వి, 1. గమనము. 2. ఒక రథము. ఒక ఏనుగు, మూడు గుఱ్ఱములు, ఐదుగురు కాల్బంటు గల సైనిక దళము. 3. కాలిబంటు.

పత్తిరి వై. వి, పూజకుపయోగించు ఆకులు. నం. పత్రమ్

పత్ని నం వి భార్య.

పత్రకంటకము నం వి. (వృక్ష) ఆకు ముల్లు, ఆకు యొక్క అంచుగాని అగ్రముగాని ఆకు పూర్తిగా గాని ముల్లుగా రూపాంతరము చెందిన నిర్మాణము(Leaf spine)

పత్రకందము నం. వి (వృక్ష) మధ్యాక్షము చుట్టును ఆకులతో నేర్పడిన ఒక ప్రత్యేకమగు మొగ్గ, ఇది భూమిపైపడిన తరువాత మొక్కగా నభివృద్ధికాగలదు (Bulbil).

పత్రకము నం. వి. (జం) సలుచని రేకు వంటి పొర (Lamella)

పత్రకార్యవృంతము నం. వి (వృక్ష) వృంతఫలకము. పత్రాభవృంతము, చదునుగా వెడల్పుగాపత్రహరితము కలిగి ఆకుచేయు ఆహార పచనాది క్రియలుచేయు పత్రవృంతము (Phyllode).

పత్రకిణము నం. వి. (వృక్ష.) ఆకుమచ్చ, ఆకు రాలిన తరువాత కాండముపై పత్రాధారముతో నేర్పడినగుర్తు. (Leaf scar)

పత్రన్యాసము నం. వి. (వృక్ష) శాఖపై నున్న కణుపుల యొద్ద ఆకులు అమర్పబడియున్న విధానము (Phyllotaxis). (ఒక్కొక్క కణుపునకు ఒకటిగాని రెండుగాని మొ॥ )

పత్రపతకము నం. వి. (వృక్ష) పెద్దఆకులు క్రిందను వానిపైని చిన్నవి వాని పైని మరికొంతచిన్నవి, ఈ విధముగా ఒకే స్థానమున దొంతరులుగా ఆకులు అమరియుండుట (Leaf mosoic).


పత్ర పతకము

పత్రపరుషువు నం వి. ఆకురాయి.

పత్రపీఠము నం. వి. (వృక్ష). పత్రవృంతము యొక్క మొదలు (Leaf base).

పత్రపీతము నం, వి. (వృక్ష.) వర్ణకణములు (Chromoplasts) పసుపుపచ్చని రంగు ద్రవ్యము (Xanthophyll)

పత్రఫలకము నం. వి (వృక్ష.) పత్రములో తొడిమకాక మిగిలిన ఆకుపచ్చని నిర్మాణము (Leaf blade or lamina).

పత్రభంగము నం, వి. మకరికాపత్రము, పత్రరేఖ.

పత్రమధ్యము నం. వి. (వృక్ష). ఆకులలో పైనుండు బహిశ్చర్మమునకును క్రింది బహిశ్చర్మమునకును మధ్యనుండు జీవకణసంహతులు (Mesophyll).

పత్రము నం. వి 1 ఆకు. 2, రెక్క, 3. వ్యవహారము చెల్లుబడికై వ్రాసికొను కాగితము. 4 వాహనము. 5. బాణము.

పత్రరంధ్రములు నం. వి. (వృక్ష.) ఆకు నోళ్ళు. పత్రఫలకమునకు సాధారణ


పత్రరంధ్రములు

ముగా క్రింది ఒహిశ్చర్మముపై నగుపడు సూక్ష్మమైన రంధ్రములు (Stomata).

పత్రరథము సం. వి. పక్షి వ్యు. రెక్కలే రథముగా గలది.

పత్రరూపశాఖ సం. వి (వృక్ష.) పత్ర కార్య కాండము, ఆకువలె ఆకుపచ్చగా నుండి ఆకుచేయు పనులు నిర్వర్తించు కొమ్మ (Cladode ot phylloclade or cladophylla).

పత్రవృంతము సం, వి. (వృక్ష.) ఆకు తొడిమ. పత్రఫలకమునకు కాండము నకును మధ్యనుండు కాడ (Petıole).

పత్రసముదాయము సం, వి (వృక్ష.) మొక్క మొక్క పచ్చని యాకుల కన్నిటికి కలిసి ఈ పదము వర్తించును (Foliage).

పత్రసూచి సం. వి. ముల్లు.

పత్రస్వజము సం. వి. (వృక్ష) మధ్య గుచ్ఛముగా కొంత భాగమును వదలి చుట్టును పత్రమును పట్టియుంచు సాధ నము (Leaf clasp). దీనితో పత్రము యొక్క అడుగుభాగమునుండి ఉత్స్వే దనము ఎక్కువగా జరుగుచుండునని నిరూ పించవచ్చును.

పత్రహరితకణములు సం. వి. (వృక్ష) జీవ కణకోశరసములో పత్రహరితము కల గుండ్రని లేక బిళ్ళలవంటి నిర్మాణములు (Ch'or‹plasts). ఇవిజీవకణకోశరసములో నుండు ఆదిలవములలో నొకటి.

పత్రహరితము సం. వి. (వృక్ష.) ఆకులలో నుండు ఆకుపచ్చని పదార్థము, హరితము (Chlorophyll).

పత్రి సం. వి. 1, డేగ. 2. పక్షి. 3. బాణము 4. కొండ. 5. మ్రాను. వై వి. పత్తిరి.

పత్రిక సం. వి. 1. కాగితము. 2. పట పత్రము. 3. వార్తాపత్రిక.

పత్రికావిలేఖరి సం. విశే (వ్యావ.) పత్రికలకు వార్తలు సేకరించువాడు.

పథకము సం. వి 1. ఎక్కములు మొదలగు మానము. 2. పద్ధతి.

పథగుఁడు సం వి. భటుడు.

పథికుఁడు సం. వి. పాంథుడు బాటసారి.

పదచ్ఛేదము సం. వి. పదవిభజన

పదటము వి. సంభ్రమము,

పదడు వి బూడిద, భస్మము.

పదను వి. 1. సమయము. 2 నైశిత్యము. వాడిమి రూ. పదును 3 పరిపాకము.

పదఁపడి అవ్య మరియు అనుటకు. రూ. పదంపడి.

పదము సం. వి. 1 కాలు. 2. పద్యమందలి నాలవ చరణము. 3. చిహ్నము. 4. స్థానము 5. శబ్దము. సం, వి. (గణి) 1. ఒక సమాసములోగాని. సమీకరణ ములోగాని ఉండు నొక రాశి (Term) $ax^2+bx+c=0$ ఇందుమూడు పదము లున్నవి. 2. ఒక లెక్కచేయుటలో కనబరి చిన క్రమము (Step).

పదరము వై. వి. తమలపాకుల యడపము. సం. ప్రదరః.

పదరు వై. క్రి. 1. త్వరపడు. 2. కోపించు. 3. చలించు. 4. ఆక్షేపించు, వి. త్వరితపు మాట

పదలము వి. (వ్యావ,) అరవీసె (గోదావరి మండలములోని వాడుక పదము.)

పదవి సం. వి. మార్గము. వై. వి. ఉన్నత స్థితి సం. పదమ్.

పదాతి సం. వి. భటుడు. రూ. పదాజి.

పదార్థము సం. వి. 1 వస్తువు. 2. శబ్దముల అర్థము, పదవివరణము.

పది వై. వర్యా. దశకము. సం, పంక్తిః.

పదింబదిగ క్రి. విశే. 1. చక్కగా. 2. గట్టిగా (పదియున్ + పది + కాన్) 3. ఆదేవనిగా.

పదిలపడు వై. క్రి. స్థిరపడు.
పదిలము వై. వి. స్థైర్యము. విశే. 1. జాగరూకము. 2. స్ఫుటము సం. భద్రమ్.
పదిలుఁడు వై. విశే. 1. మేలుకొనియుండువాడు. 2. స్థిరుడు.
పదుగు వి. 1. సజాతీయ ప్రాణి సమూహము 2. కొలము 3. పంక్తి.
పదును వి. 1. తడి. 2. ఉక్కును వేడిచేసి నెమ్మదిగా చల్లార్చిన వచ్చు కాఠిన్యము. (Temper).
పదురు క్రి. త్వరపడు. వి. 1. విధము. 2. అధికారము.
పద్దియము వై వి. ఛందోబద్ధమైన వాక్య సముదాయము గలది. రూ. పద్దెము సం. పద్యమ్.
పద్దు వై. వి. 1. అంకెల అడ్డువరుస. 2 ప్రతిజ్ఞ. 3. పంతము. సం. 1. భద్రః. 2. స్పర్ధా.
పద్ధతి సం. వి. 1. మార్గము, 2, వరుస. సం. వి. (గణి. భౌతి. రసా.) సమకూర్చబడిన అవయవములు (భాగములు) కలిగి క్రమసహిత సంబద్ధ పూర్ణముగా పరిగణింపబడునది (System . లేదా ఒక పూర్ణముగా పరిగణింపబడు వస్తువుల సమూహము.
పద్మ సం. వి. 1. 1. లక్ష్మి 2. మెట్టదామర.
పద్మము సం. వి. 1. తామర. 2, ఒక నిధి 3. ఒకవ్యూహము. 4.ఏనుగు.5 ముఖము.పై గల చుక్కలు.
పద్మరాగము సం. వి. మాణిక్యము (ఉత్తమ జాతి రత్నము.)
పద్మవ్యూహము సం. వి. పద్మాకారముగ యుద్ధములో పన్ను మొగ్గరము.
పద్మాకారము సం. వి. కొలను.
పద్మాలయ సం. వి. లక్ష్మి.
పద్మాసనము సం. వి. ఆసనములలో నొకటి.
పద్మి సం. వి. ఏనుగు, హస్తి. వ్యు. మొగము మీద మచ్చలు గలది,
పద్మిని సం. వి. 1 తామరతీగ. 2. కొలను. 3. పద్మినీ జాతి స్త్రీ.
పద్య సం. వి. త్రోవ.
పద్యము సం. వి. గణయతిప్రాస నియమములు గలది.
పన వి. చేనిలో కోసియుంచిన ఓదె.
పనఁటి వి 1. కుండ. 2. వంటకుండ.
పనస వై. వి. 1. వేదభాగము, ఏఁబది పదముల సమూహము (పంచాశత్) అన బడును సం పంచాశత్. 2. ఒక ఫల వృక్షము సం. పనసః.
పని వి. 1. కార్యము. 2. వ్యాపారము, 3 ప్రయోజనము. 4. శిల్పము.
పనిగొను క్రి. నియోగించు.
పనివిను క్రి. 1. ఆజ్ఞావశవర్తియగు. 2. గౌరవముతో వచ్చు, పోవు.
పనుకు క్రి. ఆగ్రహించు.
పనుగొను క్రి, 1. గట్టిపడు 2. కలుగు.
పనుచు క్రి. నియోగించు, అనుచు.
పన్న విశే. 1. వృద్ధుడు 2,అనామధేయుడు
పన్నకము వి. రచన. రూ. పన్నిక, పన్నగడ.
పన్నగము సం. వి. పాము.
పన్నము వై. వి. వేదమునందలి అట్టమునకు అవయవము, వేదపరిచ్ఛేదము సం. ప్రశ్నః సం. విశే. జారినది.
పన్నా వి. (వ్యావ.)కాగితము, వస్త్రము మొదలగు వాని వెడల్పు.
పన్నాగము వి. ఎత్తుగడ, పన్నుగడ.
పన్నిదము వై. వి. 1 జూదమునందుఒడ్డెడు ధనాధికము. 2. పాచికల పౌరలిక. సం. పణితమ్.
పన్నిద్దఱు సర్వ. (పది + ఇద్దరు). పండ్రెండుగురు.

**పన్నీరు** వై. వి. చల్లనినీరు నం పన్నీర శ్రీ

**పన్ను** క్రి. 1. యుద్ధమునకు సిద్ధపడు. 2, కలుగు 3. చేయు. 4. ఏర్పరుచు. వి. (అర్థ.రాజ.) రాజ్యము యొక్క ఆదాయమును పెంపొందించుటకు ఆస్తిపైగాని, వాణిజ్యపు సరకులపైగాని ప్రభుత్వము ఒక నిష్పత్తి నిర్ణయించి వసూలుచేయు సొమ్ము, కప్పము.

**పన్ను మదింపు** వి. మొత్తము రాబడినిబట్టి పన్ను విధించుట

**పన్నె** వి. 1. నేత యచ్చు. 2. అంకవన్నె వెనుక భాగమున గల ముల్లు. రూ. పన్నియ (వాడుక.) 3. దువ్వెన.



పన్నె

**పప్పళి** వి వస్త్రము వంచలి చిత్రవర్ణము.

**పప్పు** వి. పొట్టుపోయి బద్దలైన కాయ ధాన్యము సూపము.

**పప్పుగుత్తి** వి. (గృహ.) వండిపప్పును లేదా కాయగూరలను మెదుపుటకు ఉపయోగించు కఱ్ఱకాడ బంతి(Smasher)

**పప్పుదినుసులు** వి. (గృహ.) కందులు, పెసలు, అనుములు, బటాణీలు మొదలగునవి, కాయధాన్యములు, శింబీధాన్యములు. (Legumes).

**పబువు** వై. విశ. ప్రభువు. నం. ప్రభు-.

**పబ్బము** వై. వి. 1. పండుగ, ఉత్సవము. 2. ఆతిథ్యము. నం. పర్వమ్

**పబ్లిక్ కార్పొరేషన్** ఇం.వి.(వాణి.) (Public corporation). ప్రత్యేకమైనశాసనమూలముగ ఉద్భవించిన ఒక ప్రభుత్వ సంస్థ. (ఇది ప్రభుత్వశాఖవలెగాక శాసనసమ్మతమగు వ్యక్తిత్వము స్వాతంత్ర్యము కలిగియుండును

**పబ్లిక్ రంగము** మి. వి (అర్థ.రాజ.) దేశములోని పరిశ్రమలు రాజ్యము యొక్క అధీనమందుండుట (Public sector)

**పబ్లిక్ వర్క్సుశాఖ** మి.వి.(వ్యావ.) ప్రభుత్వ నిర్మాణశాఖ (Public works department).

**పబ్లిక్** ఇం. విశ. సార్వజనికము. వి. ప్రజ, జనసామాన్యము (Public)

**పయంట** వై. వి స్త్రీలరొమ్ముమీదివస్త్రము చెరుగు. రూ. పయ్యంట, పైట. నం. ప్రతిష్ఠానమ్, పై రా.

**పయనము** వై. వి. ప్రయాణము. నం. ప్రయాణమ్,

**పయర** వి దక్షిణపుగాలి, వాయువు. రూ. పయ్యెర.

**పయరకారు** వి. (వ్యావ.) పయరగాలి విసరుకాలము ఫిబ్రవరి, మార్చి నెలలు, శతభిషము,పూర్వాభాద్ర,ఉత్తరాభాద్ర, రేవతి కార్తెలు,శిశిర ఋతువు.

**పయరగాలి** వి. (భూగో.) వేసవి చలికాలములయందు ఆగ్నేయదిశనుండి సముద్రమునుండి భూమిమీదికి వీచుగాలి. (South-east sea breeze).

**పయస్విని** నం. వి. 1. ఆవు 2. ఏరు. వ్యు. పాలు లేక నీరు కలది.

**పయస్సు** నం వి. 1. క్షీరము. 2. నీరు.

**పయిండి** వి. బంగారు.

**పయికొను** క్రి. 1. మీరు. 2 అతిశయించు. రూ. పైకొను,

**పయోధరము** నం. వి. 1. స్తనము 2. మేఘము.

**పయోధి** నం. వి. సముద్రము.

**పయోరియా** ఇం. వి. (గృహ.) పంటిచిగురు రోగము, ఒక విధమైన పండ్లవ్యాధి.

పన్ను కుదురులలో నుండి చీము రక్తము స్రవించు వ్యాధి.(Pyorrhoea)

పయోలసిని నం. వి. (జం) జీర్ణమైన క్రొవ్వు పదార్థములను పీల్చుటకై ప్రేగు యొక్క గోడలోనుండు శోషరసనాళము (Lacteal).

పయ్యెద వి. (పై+ఎద) పయట. రూ. పయ్యద.

పరంజ వి. పరంజా, గోడకట్టుటకు ఎత్తుగ కట్టిన కట్టడము.

పరంపర నం. వి. 1. వరుస. 2. విడువక సాగునది. నం. వి. (గణి.) ఒక వరుసలో నేర్పరుపబడిన రాసుల గుంపు (Series). ఉదా. 1, 3, 5, 7, 9...

పరక వి. రెండు వీసములు. 2.పం|డెం|డు. 3. గడ్డిపోచ.

పరకాయ ప్రవేశము నం. వి. ఒక శరీరము నుండి వేరొక నిర్జీవ శరీరమున జీవుని ప్రవేశింపచేయుట.

పరకీయ నం విశే 1. అన్యసంబంధమైనది. 2. ఒక నాయిక. వ్యతి. స్వీయ.

పరగడుపు వి (పరము+కడుపు)ఆహారము వేయని కడుపు.

పరతంత్రము నం .విశే. పరాధీనము. వ్యతి. స్వతంత్రము.

పరనిర్వాణము నం, వి. (పరి) బుద్ధుని మరణము.

పరపతి వై, వి. చేబదులుగా ద్రవ్యము పుచ్చుకొనుట, నం. పరిభృతిః. (అర్థ) ఋణదాతలు ఋణమును తీసికొను వానిలో కోరు లక్షణము. ఋణ విమోచన సామర్థ్యము—(ఇది ఒక వ్యక్తికి ఎంత ఆస్తి. అప్పు కలదు ఏయే మార్గములలో పెట్టుబడి పెట్టును,అతనికి గల నిజాయితీ మొదలగు విషయములపై నాధారపడి యుండును.)

పరపతి హుండీ వి వి. (అర్థ.) బరాతము. వ్యక్తిపై గల నమ్మకముతో ధనసాహాయ్యముచేయు పత్రము(Bill of credit)

పరపదము నం. వి, (గణి.) నిష్పత్తిలోని రెండవ పదము (Consequent).

పరపు వై. క్రి. 1. బాణము ప్రయోగించు. 2. ప్రవహింపచేయు. 3,విరివి. విశే. విరివి గలది. వి విస్తృతి.

పరపోషకము నం. వి. (జీవ.) పరాన్నజీవికి శరీరముపై గాని లోపలగాని నివసించుటకు అవకాశ మిచ్చిన ప్రాణి (Host).

పరభక్షకములు నం. వి. (వ్యవ.) ఇతర జాతుల కీటకముల దిని జీవించు పురుగులు (Predators). ఉదా. మిడుత కుటుంబములోని గొల్లభామలు. చుక్కల బరిజె పురుగు(Lady bird bettle) మొదలగునవి

పరభృతము నం. వి. కోయిల.

పరమము నం. విశే. (భౌతి.) అన్నిటికిని పరమైనది (Absolute).

పరమఉష్ణోగ్రత నం. వి. (భౌతి.) పరమ శూన్యస్థానమునుండి లెక్కింపబడు ఉష్ణోగ్రత. (Absolute temperature).

పరమపదము నం. వి. విష్ణువుండెడుచోటు. వైకుంఠము.

పరమ ప్రభుసత్తాక సిద్ధాంతము నం. వి. (రాజ.) జాన్ ఆస్టిన్ 1832లో పరమ ప్రభుసత్తాకమును గురించివ్రాసిన సిద్ధాంతము(Absolute theory of Sovereignty)

పరమమిత్రరాష్ట్రఖండము నం. వి (రాజ.) ఒడంబడిక చేసికొనునపుడు ఒక దేశము మరియొక దేశము యెడల వాణిజ్యవర్తక విషయములలో పక్షపాతము చూపనని హామీ యిచ్చుట.

పరమము నం. వి. పరమాత్మ. విశే. 1. ఉత్కృష్టము. 2.ఆద్యము. 3.ప్రధానము

పరమశూన్యము నం. వి. (భౌతి.) పరమ

తాప క్రమమానము యొక్క శూన్య చిహ్నము (Zero-absolute).

**పరమహంస** సం. వి. ఉత్తమ పదము నొందిన సన్న్యాసి.

**పరమాణుకత** సం. వి. (రసా.) ఒక మూల ద్రవ్యాణువునందుండు పరమాణువుల సంఖ్య ఉదా. నత్రజని పరమాణుకత. 2. అనగా నత్రజని అణువు రెండు నత్రజని పరమాణువుల కూర్పు (Atomicity).

**పరమాణుభారము** సం. వి. (రసా.) ఒక మూలద్రవ్యము యొక్క పరమాణు భారమనగా ప్రమాణముగా తీసికొనబడిన ఉదజని పరమాణువు కన్న దాని పరమాణువు ఎన్ని రెట్లు బరువో తెలియ చేయు సంఖ్య (Atomic weight)

**పరమాణురచన** సం. వి. (రసా.) పరమాణు శరీరములో వివిధ భాగముల విన్యాసము (Atomic structure).

**పరమాణువాదము** సం.వి. (రసా.) ద్రవ్యము పరమాణువుల కూర్పు అని తెలియచేయు వాదము (Atomic theory).

**పరమాణువు** సం. వి. సూక్ష్మముల కన్న సూక్ష్మమైన అణువు. వి. (రసా.) ఏ క్రియ చేతను అంతకంటె చిన్నదిగా విభజించుటకు వీలుకాని సూక్ష్మకణము (Atom). (ఇటీవల ఇది వివిధభాగములుగా విభజింపబడినది.)

**పరమాణూష్ణత** సం. వి. (రసా., భౌతి.) ఏదేని మూల ద్రవ్యము యొక్క పరమాణు భారమునకు తాపమును చేర్చి ఒక సెంటిగ్రేడ్ డిగ్రీ తాపక్రమమును ఎక్కువ చేయుట కవసరమగు తాపరాశి (Atomic heat) (కెలోరీలలో.)

**పరమాణ్వంకము** సం. వి. (రసా.) ఆవర్త క్రమ పట్టికలో మూలద్రవ్యము యొక్క స్థానమును తెలియచేయు సంఖ్య (Atomic number).

**పరమాణ్వాయతనము** సం. వి. (రసా.) ఒక మూలద్రవ్యము యొక్క పరమాణు భారమును – ని సాంద్రతతో భాగించిన వచ్చు ఫలము (Atomic volume).

**పరము** సం. వి. 1, మోక్షము. 2 కేవలము. విణ. 1 ఇతరము 2. దూరము. 3. మీదిది. 4. శ్రేష్ఠము.

**పరమేష్ఠి** సం. వి. బ్రహ్మ.

**పరవశము** సం. విణ. 1. పరాధీనము. 2. ఒడలెరుగకుండుట.

**పరవు** క్రి. వ్యాపించు. వి. వ్యాపనము దూ. పర్వు.

**పరశురాముడు** సం. వి. జమదగ్ని మహర్షికిని రేణుకకును పుట్టినవాడు.

**పరశువు** సం. వి. గండ్రగొడ్డలి

**పరశ్వధము** సం. వి. గండ్రగొడ్డలి. దూ. పరస్వధము.

**పరశ్శతము** సం. విణ. నూటికంటె హెచ్చు సంఖ్య గలది (పరస్సహస్రము మొ.)

**పరస్పరము** సం. విణ. అన్యోన్యము.

**పరస్మైపదము** సం. వి. సంస్కృత భాషలో క్రియాపదము యొక్క భేదము

**పరహితార్థవ్యాపృతుడు** సం. వి. (గృహ,) ఎల్లప్పుడు ఇతరులమంచినే తలంచువాడు, స్వలాభపరుడు కానివాడు (Extrovert):

**పరాకు** వి. 1. తత్పరత. 2 ప్రమాదము.

**పరాక్రమము** సం.వి.1.బలము.2. శౌర్యము.

**పరాగకోశము** సం, వి. (వృక్ష) పుప్పొడి తిత్తి, పుప్పొడి యనబడు పిండితో నిండి పుంకేసరము చివర ఉబికియుండు కోశము (కింజల్కము) (Anther).

**పరాగనాళిక** సం. వి.



(వృక్ష.) పరాగ సంపర్కమైనంతరువాత పరాగనాళిక పుప్పొడి రేణువు నుండి బయలుదేరి అండ

కోశ కీలములోనికి చొచ్చుకొని పెరుగు నాళము (Pollentube).

పరాగము నం. వి. 1. పుప్పొడి 2. దుమ్ము.

పరాగరేణు బహిఃకవచము నం వి. (వృక్ష) పుప్పొడి రేణువునకు బయటనుండు పొర (Exine).

పరాగరేణ్వాంతః కవచము నం.వి (వృక్ష.) పుప్పొడి రేణువునకు గల రెండు పొర అలో లోపలనున్న మృదువైన పొర (Intine).

పరాగసంపర్కము నం. వి. (వృక్ష.) పుప్పొడితిత్తిలో నున్న పుప్పొడి బయటికి వచ్చిన తరువాత పుష్పములోని అండకోశము యొక్క కీలాగ్రముపై పడుట. ఇది రెండు విధములు : 1, స్వపరాగసంపర్కము :— ఒక్క మొక్కపై నున్న పుష్పములోని పుప్పొడి అదే పుష్పములో గాని ఆ మొక్కపైనున్న మరి యొక పుష్పములోగాని అండకోశము యొక్క కీలాగ్రముపైపడుట (Self-pollination) 2. పరపరాగ సంపర్కము:- ఒక మొక్కపైనున్న పుష్పములోని పుప్పొడి అదే ఉప జాతికి చెందిన మరియొక మొక్కపైనున్న పుష్పము యొక్క అండకోశ కీలాగ్రము పై పడుట(Cross-pollination)పరపరాగ ఫలదీకరణము (Cross-fertilization).

పరాఙ్ముఖుఁడు నం. విశే. పెడమొగము పెట్టినవాడు.

పరాథియన్ ఇం. వి. (వ్యవ.)(parathion) పురుగులను చంపుట కుపయోగించు నొక గాఢమైన మందు.

పరాత్పరుఁడు నం. విశే. శ్రేష్ఠుల కందరికి శ్రేష్ఠుడు (భగవంతుడు).

పరాభవ నం. వి. అరువది సంవత్సరములలో నొకటి.

పరామర్శము నం. వి, 1. చక్కగా విమర్శించుట. 2. విచారించుట.

పరామితి నం. వి. (గణి.) ప్రసక్త సందర్భమున నియమితముగా ఉండి యితర సందర్భములందు మార్పు చెందు పరిమాణము, ప్రసక్త నియతాంకము(parameter),

పరాయణము నం. వి. 1. ఆశ్రమము. 2. అత్యాసక్తి. విశే. అభీష్టమైనది.

పరారి వి. ఊరు విడిచి పారిపోయినవాడు హిం. ఫరార్.

పరార్థవాది నం. వి. వకీలు.

పరావర్తకము నం. వి. (భౌతి.) కాంతికిరణము ప్రతిఫలింప చేయు వస్తువు (Reflector).

పరావర్తనకోణము నం. వి (భౌతి.)ఒక కాంతి కిరణము పరావర్తక తలముపైబడి పరావర్తితమైనపుడు పరావర్తిత కిరణము లంబముతోచేయు కోణము, (Angle of reflection)

పరావర్తనదూరదర్శిని నం. వి. (భౌతి.) దూరముననున్న కాంతిభవ స్థానమునుండి వచ్చు కాంతి కిరణములను దర్పణముచే కేంద్రీకరించి వస్తువును చూపుదూరదర్శిని (Reflecting telescope).

పరావర్తనము నం. వి. (భౌతి,) కొన్నితలము లపైబడి కిరణములు క్రమముగ వెను దిరుగుట (Reflection).

పరాసనము నం. వి. 1. చంపుట. 2. హింస.

పరాసువు నం. విశే. చచ్చినవాడు.

పరాస్తము నం. విశే. 1. అపజయ మొందినది. 2. నిరాకరింపబడినది.

పరికరము నం. వి. 1. ఉపకరణము, సాధనము. 2. సమూహము. (అలం.) ఒక అర్థాలంకారము.

పరికరములు నం. వి. (గృహ.) సామాన్య సామగ్రి (Equipments).

పరికర్మ సం. వి. (గణి) (సామాన్యముగ) చేయబడినది. (పరిమితార్థములో) అంక గణితమందు చేయబడు సంకలనవ్యవకలన గుణన విభాజనములవంటి క్రియ(Operation).

పరికర్షణము సం. వి. దేహమునందలి మురికి పోగొట్టుట

పరికించు వై. క్రి. 1. పరీక్షించు. 2. విచారించు

పరికేంద్రము సం. వి. (గణి) పరివృత్త కేంద్రము (Circumcentre).

పరిక్లోమములు సం. వి. (జం.) కీటకముల ఉరఃపంజరమునకు గల బాహ్య కంకాళములో ప్రక్కలనున్న కైటిన్‌పట్టములు ఉరః పంజరములో నుండు రెండు పొరలు గల అస్తరు ఒక పొర ఊపిరితిత్తులపైన, మరియొకపొర ఉరః కుహరము చుట్టును ఉండును (pleura).

పరిక్షిప్తము సం. విశ. అంతటచుట్టబడినది

పరిక్షేపణ సం. వి. అతిసూక్ష్మ ద్రవ్య కణములు గాలిలో ధూళికణములు వంటివి కాంతిని అటునిటుచిమ్ముట(Scattering)

పరిఖ సం. వి. అగడ్త.

పరిగణనీయము సం. విశ. (గణి.) ఒక ప్రమాణమునకు కచ్చితముగా కొన్ని రెట్లుండునది (Commensurable).

పరిగతము సం. విశ. (గణి.) ఒక క్షేత్రము యొక్కశీర్షములగుండాపోవునది(Circumscribed).

పరిగె వి. 1. మత్స్యవిశేషము. 2. కోసిన చేనిలో దిగబడిపోయిన వెన్నులు.

పరిగ్రహించు సం. క్రి. ప్రేమతో తీసికొను.

పరిఘము సం. వి. 1. లాటీకఱ్ఱ. 2.ఆయుధ విశేషము.

పరిఘోషము సం. వి. 1.ఉరుము.2.ప్రమోత

పరిచయపత్రము సం. వి. (వాణి.) కంపెనీ స్థాపించుటలోగల యుద్దేశములు, కంపెనీ నిర్వహణమునకు చేసిన ఏర్పాట్లు మొదలుగా గల విషయములగూర్చి పెట్టుబడిదారులకు చట్టము రీత్యా బహిరంగప్రకటన చేయవలసిన ఒక సమాచారపత్రము (కంపెనీల చట్టము ప్రకారము దీనిలో వ్రాయు తప్పులకు నిర్దేశకులు వ్యక్తిగతముగ బాధ్యులగుదురు )

పరిచయము సం. వి. 1.ఎరుక. 2.స్నేహము.

పరిచరుఁడు సం.వి. 1,కావలియుండుభటులు.

పరిచారిక సం వి. సేవకురాలు.

పరిచ్ఛేదము సం వి. 1. గ్రంథభాగము. 2. ఆశ్వాసము. 3. మేర.

పరిజనము సం. వి. పరివారము.

పరిడోలకము సం. విశ. (వృక్ష.) పుంకేసరము యొక్క కాడ పుప్పొడి తిత్తి వెనుక భాగమున నుండి పుప్పొడి తిత్తి అన్ని వైపులకు తిరుగు నవకాశము గలది (Versatile).

పరిఢవము వై. వి. 1. హెచ్చు. 2. అతిశయము. సం ప్రథిమా.

పరిఢవించు వై. క్రి. 1. అతిక్రమించు. 2. ధరించు.

పరిణతము సం. విశ, పరిపాకముపొందినది.

పరిణద్ధము సం. విశ. 1, కట్టబడినది. 2. విశాలమైనది.

పరిణయము సం వి. వివాహము.

పరిణామము సం. వి. 1. మారురూపు. 2. క్షేమము. (అలం.) ఒక అలంకారము. (జీవ.)పురాతన కాలములోనున్న సాధారణ జీవులు క్రమమైన మార్పులు చెంది నేటి ఉన్నతప్రాణులేర్పడినవనువాదము. వికాసము (Evolution).

పరిణాహ నాడీ మండలము సం. వి. (జం.) కేంద్రనాడీ మండలమునుశరీరముయొక్క వివిధ భాగములతో కలుపు నాడీకూటము.

ఈ మండలములో ప్రమస్తిష్క నాడులు, మైపవనాడులు, సహావేదననాడులు అను మూడు తరగతుల నాడు లుండును (Peripheral nervous system).

పరిజేత సం. వి. మగడు.

పరితము వై. వి. కోయిల, సం. పరభృత్.

పరితోషము సం. వి. మిక్కిలి సంతోషము.

పరిత్యాగము సం. వి. పొత్తుగా విడిచి పెట్టుట.

పరిత్రాణము సం. వి. రక్షణము.

పరిదేవనము సం. వి. 1. దుఃఖముతో పలికెడు మాట. 2 దుఃఖము.

పరిధానము సం. వి. ధోవతి

పరిధి సం వి. 1. పరిధి. 2 సూర్యాది పరివేషము. 3. వరదగుడి 4 సున్న నెక్కచుట్టుగీత సం. వి. (గణి.) వృత్తమున కెల్లగానుండు రేఖ. (Circumference).

పరిధిఫలకము సం. వి (భౌతి.) వరుస అంకెల వర్గమూలముల నిష్పత్తిలో వ్యాసములు గల ఏక కేంద్ర వృత్తముల వరుసతో కూడిన గాజుఫలకము(Zone plate). ఏకాంతరముగ ఆవర్తుల రేఖలకు నల్లరంగు పూయవలెను. ఈ గాజు పలకకు కాంతిని కేంద్రీకరించు లక్షణమున్నది).

పరిపంథి సం, వి, 1. శత్రువు. 2. దారగొట్టు దొంగ.

పరిపక్వము సం. విణ. సంపూర్ణముగా వఖివృద్ధి చెందినది (Mature).

పరిపథము సం. వి. (భౌతి.) విద్యుచ్ఛక్తి ప్రవహించు మార్గము (Circuit).

పరిపరి విణ. బహుప్రకారము.

పరిపాటి సం. వి. వరువడి, పొరిచి, క్రమము.

పరిపాలక ప్రతినిధులు సం. వి. (రాజ.) కేవలము కంపెనీ పరిపాలన చేయుటకు నిర్దేశింపబడిన ప్రత్యేకమైన పరిపాలక సంస్థలు. (ఇవి మన దేశములో చాల కాలము పనిచేసి 1858 సంవత్సరపు కంపెనీల చట్టము ననుసరించి కొన్ని అంశములకు లోనైనవి)

పరిపాలకుడు సం. విణ చక్కగా పాలించువాడు

పరిపాలనము సం వి. ప్రభుత్వనిర్వహణము, పరిపాలనా నియంత్రణ, పరిపాలన అధుపులు, పరిపాలకుడు = ప్రభుత్వపరిపాలనా నిర్వాహకుడు, ప్రబంధకుడు,

పరిపాలనా వ్యవహార న్యాయస్థానము సం. వి పరిపాలనా వ్యవహారములను పరీక్షించు న్యాయస్థానము.

పరిపాలనాశాసనము సం. వి. ప్రభుత్వ వ్యవహారములకు సంబంధించిన శాసనము.

పరిపూరితము సం విణ. పవిత్రమైనది.

పరిపూర్ణత సం. వి. సంపూర్ణత

పరిప్లవము సం. వి. సిరుకోడి.విణ కదలునది.

పరిభాష సం. వి. శాస్త్రకారులు చేయు సంకేతము,

పరిభాషణము సం. వి. నిందాసహితమైన వాక్యములు, ఆలాపము.

పరిభ్రమణ కండరము సం. వి. (జం) ఒక భాగముపై మరియొక భాగము త్రిప్పుట కుపయోగపడు కండరము (Rotator Muscle).

పరిభ్రమణము సం. వి. (భౌతి., గణి.) చక్రమువలె ఒక వస్తువు తనలో తాను చుట్టు తిరుగుట. (ఇది భ్రమణమునకు విరుద్ధము)

పరిభ్రమము సం. వి. అంతట తిరుగుట.

పరిమళ ద్రవ్యములు సం. వి. (వ్యావ.) సువాసన గల ద్రవ్యములు (Spices), ఉదా. ఏలకులు, లవంగములు. కుంకుమ పూవు మొదలగునవి.

పరిమళము సం. వి. మంచివాసన.

పరిమాణము నం.వి. కొలత, పరిమితి. (గణి.) ...తో సంబంధములేనికొలత, ఒక వస్తువు ...క్క భారము లేదా అది ఆక్రమించు చోటు (Magnitude). రాశి ఒక వస్తువులో నున్న ద్రవ్యరాశి (Quantity). (రసా., భౌతి.) వస్తువుయొక్క కొలత, ఉరవు.

పరిమాణాత్మకము నం. విశే. (రసా.) రాసాయనిక ద్రవ్యఘటకముల రాశినిష్పత్తిని తెలియ జేయునది (Quantitative)

పరిమాణాత్మక విశ్లేషణము నం వి. (రసా) ఒక యౌగిక మందున్న మూలద్రవ్యముల పరిమాణముల నిర్ణయించుట. (Quantitative analysis).

పరిమాణార్థకములు నం .వి. (వ్యాక.) 'అంత ఇంత, ఎడు' అనునవి (శేరెడు, దోసెడు).

పరిమాయిచు క్రి. సంహరించు, చంపు.

పరిమితఋణబాధ్యత నం. వి. (అర్థ. శాస.) ఒక కంపెనీ దివాలా స్థితిలో నున్నప్పుడు పెట్టుబడివారుల ఋణబాధ్యత శాసన ప్రకారము తమ తమ వాటా ధనమునకు పరిమితమై యుండు పద్ధతి. (Limited Liability).

పరిమితమైన వోటింగు పద్ధతి మి. వి. (రాజ.) అల్పసంఖ్యాకులకు ఎన్నికలలో ప్రాతినిధ్యము లభించుటకై ఏర్పరిచిన ఎన్నిక పద్ధతి.

పరిమృత ప్రాణులు నం. వి (జీవ.) పూర్వ మెప్పుడో యుండి ఇప్పుడు లేని ప్రాణులు (Extinct organisms).

పరియాచకము వై వి. పరిహాసము, ఎగతాళి. నం. పరిహాసకః.

పరియు క్రి. 1, తప్పు 2. నశించు, 3. మీది భాగము సారహీనమై రాలిపోవు.

పరిరంభము నం. వి. కవుగిలింత.

పరిలసికము నం. వి. (ఆం.) కర్ణప్రావరములో నుండు లసికారసము(Perilymph)

పరివట్టము వై. వి. భగవంతున కర్పించి ప్రసాదముగా తలకు చుట్టుకొను బట్ట, ఆ వట్టము, పరివేష్టన, నం, పరివేష్టః.

పరివర్తకము నం. వి. (భౌతి) ఒక వోల్టేజి గల విద్యుత్ప్రవాహమును ఇంకొక వోల్టేజి కలుగుదానిగా మార్చుపరికరము (Transformer).

పరివర్తనము నం. వి. 1, మార్పు. 2. చుట్టి వచ్చుట (భౌతి.) మార్చుట. ముఖ్యముగా ఏకముఖముగా ప్రవహించుచున్న విద్యుత్తును ఆవర్తి విద్యుత్తుగామార్చుట(Conversion). ఈ పరికరము ఏకముఖ (Commutator) అనబడును. (భౌతి.) త్రిప్పుట (Turn). (గణి) ఒకపద్ధతినుండి మరియొక పద్ధతికి మార్చు విధానము (Conversion Transformation).

పరివర్తనీయము నం విశే. (రసా, భౌతి.) ఇటునటు ప్రవర్తించగలది(Reversible)

పరివర్తనీయత నం. వి. (రసా.) ఇటునటు ప్రవర్తింపగలుగుట. (Reversibility).

పరివర్తిత శిలలు నం. వి. (భూగో). పీడనము వలన నీటి ప్రవాహమువలన వేడి వలన స్వరూపములలో మార్పుచెందిన శిలలు. పాలరాళ్ళు. నాపరాళ్ళు. వేల కొలది సంవత్సరములు భూగర్భములో నుండి మారిపోయిన నిక్షేప శిలలు,

పరివసథము నం. వి. ఊరు.

పరివారము నం. వి. 1, దండు. 2. కత్తి యొర. 3. పరిజనము.

పరివిత్తి నం. వి. తమ్మునికి పెండ్లియైన తనకు లేకుండెడి యన్న. దూ. పరవిత్తుడు.

పరివృఢుడు నం. విశే. ఏలిక, రాజు.

పరివృతము నం. విశే, చుట్టబడినది,

పరివృత్తకేంద్రము నం. వి. (గణి.) త్రిభుజ శీర్షములగుండా పోవు వృత్తము యొక్క

కేంద్రము. పరికేంద్రము (Circum-centre).
పరివృత్తము నం, వి.(గణి)ప్రధాన క్షేత్రము యొక్క శీర్షములగుండా పోవు వృత్తము (Circum-circle).
పరివేత్త నం వి అన్నకన్న ముందు పెండ్లాడిన తమ్ముడు.
పరివేశిత గర్తములు నం. వి. (వృక్ష.) చుట్టును అంచుగల గుంటలు (Bordered pits). (దారునాళములలో కొన్నిటి కిట్టి బలవర్ధక నిర్మాణము లుండును).
పరివ్యాసార్థము నం వి. (గణి.) ఒక సమతల చిత్రము చుట్టు లిఖించబడిన వృత్తము యొక్క వ్యాసార్థము(Circum-radius)
పరివ్రాజకుఁడు నం వి సన్యాసి.
పరిశిష్టము నం. విశ. చివరకు మిగిలినది.
పరిశీలకుడు నం. విశ (రసా.) శోధకుడు (Observer).
పరిశీలనము నం. వి. (రసా.)వస్తుతత్వమును తెలిసికొనుటకుచేయుశోధనము, మిక్కిలి శోధించుట (Observation).
పరిశుద్ధ (మైన)ఆల్కహాలు వి. వి. (రసా) నీరులేనిఆల్కహాలు(Absolute alcohol).
పరిశోధన నం.వి. ప్రకృతి మొదలగువానిలోని క్రొత్త రహస్యములను తెలిసికొనుటకు చేయు కృషి (Research).
పరిశ్రమ నం. వి. 1. శ్రమము. 2 కర్మాగారము మొదలైనవి (Industry).
పరిషత్తు నం. వి. సమితి, సభ.
పరిషేచనము నం. వి. పుడిసిట నీళ్ళుపోసికొని భోజన పాత్రాదులచుట్టు విడుచుట.
పరిష్కరించుట నం. వి. 1 అలంకరించు. 2. తగాదాలు చక్కదిద్దు. (రసా.) శుద్ధముగాచేయుట (Refinement),
పరిష్కారము నం. వి. తీర్పు, నిర్ణయము
పరిష్కృత ధాతువు నం. వి. (రసా.) శుద్ధి ప్రక్రియకు గరిచేయబడిన ధాతువు (Fine metal)
పరిష్కృతము నం. విశ. 1 చక్కబెట్టబడినది 2. అలంకరించబడినది
పరిసరము నం వి. 1. సమీపము. 2. దావు. 3. వైశాల్యము.
పరిసరములు నం.వి.(గృహ.) 1. పరిస్థితులు. 2. చుట్టుపక్కలు. ఇరుగుపొరుగు (Environments).
పరిస్తంభము నం వి (వృక్ష) పత్ర ఫలకము యొక్క ఉపమూలలో కాండము చుట్టును కనుపునకు ఆవరించిన పత్రము (Amplexicaul).
పరిహారము నం వి. విడుపు. యోచనము
పరిహార్యము నం. వి. హస్త కంకణము. విశ. విడువదగినది
పరీక్ష నం వి. (రసా) ఒక రాసాయనిక ద్రవ్యమును గుర్తించుటకు చేయు ప్రయోగ ప్రణాళిక (Test).
పరీక్షా ప్రయోగము నం, వి. (భౌతి, రసా) ఒక సిద్ధాంతము సత్యమో కాదో నిరూపించుట కుద్దిష్టమైన ప్రయోగము(Trial experiment.)
పరీతము నం. విశ. చుట్టుకొనబడినది.
పరీధావి నం వి. అరువది సంవత్సరములలో నొకటి.
పరువము వై, వి. ప్రాయము,యౌవనము. నం. పర్వమ్.
పరువు నం, వి. 1. వెదురుగనుపు. 2. సముద్రము.
పరువు వి. 1. ధావనము, పరుగెత్తుట. 2. కోసుదూరము. దూ. పరుగు.
పరువు వై. వి. 1. పరిపాకము 2.గౌరవము నం భరః.
పరుషము నం. విశ. 1. నిష్ఠురము 2 నిష్ఠుర వాక్యము. (వ్యాక.)క, చ, ట, త, ప,లు.

పరుసవేది వై. వి. స్పర్శవేధి, ఇనుమునంటి బంగారుముచేయు రసము. సం. స్పర్శవేధి.
పరేతరాట్టు సం. వి. యముడు.
పరోక్షము సం. విశే. 1. ఎదుటలేనిది, చాటున నున్నది.
పరోక్ష(మైన)ఎన్నిక మి. వి. (రాజ కార.) ఓటర్లు ఎన్నుకొనిన ప్రతినిధులచే శాసన సభ్యులనుగాని, అధ్యక్షునిగాని ఎన్ను కొనుట.
పరోక్షపుపన్ను మి. వి. (అర్థ) పన్ను చెల్లించువానికి తెలియకయే చెల్లించునట్టి పన్ను ఉదా. అమ్మకపు పన్ను.
పరోఢ సం. వి. ఇతరుని పెండ్లాడిననాయిక
పర్జన్యము సం. వి. 1. ఉరుమెడు మేఘము, 2. ఉరుము.
పర్జన్యుడు సం. వి. వర్షాధిపతి.
పర్ణము సం. వి. ఆకు పత్రము.
పర్ణములు సం. వి. (వృక్ష.) ఫెరనులు (Ferns). పర్ణాంగములు; టెరిడో ఫిటములను తరగతిలో నొక ఉపతరగతికిచెందిన పర్ణము మొక్కలు.



పర్ణశాల సం. వి. ఆకుటిల్లు.
పర్యంకము సం. వి. మంచము.
పర్యటనము సం. వి. తిరుగుట.
పర్యవసానము సం. వి. సమాప్తి.
పర్యస్తము సం. విశే. 1. తల క్రిందు చేయ బడినది. 1. విసరబడినది.
పర్యాప్తము సం. వి. 1 యథేష్టము, 2. తృప్తి. 3 సామర్థ్యము.
పర్యాప్తత్వము సం.వి. (గృహ.) సరిపోవుట (Adequacy). సరిపోయినట్టి=(Adequate).
పర్యావరణము సం.వి. (భూగో). ఒక ప్రాణి చుట్టును నుండు శీతోష్ణాది బాహ్యపరి స్థితులు (Environment).
పర్యావరము సం. వి. (జం.) జలీయకాళ స్తంభముయొక్క బయటిపొర (Pericarp)
పర్యుదంచనము సం. వి. అప్పు
పర్యుషితము సం. వి. చద్ది. విశే. ఎక్కువ కాలముంచబడినది.
పర్వతారణ్యములు సం. వి. (భూగో.) పర్వతములయందు పెరుగు వడవులు [కొండల యెత్తునుబట్టి అరణ్య వృక్షములు మారు చుండును].
పర్వము సం. వి. 1. పండుగ. 2. సమూహము 3 అమావాస్య లేక పున్నమ. (వృక్ష) కణుపుల మధ్యనుండు కాండ భాగము (Internode). గ్రంథి.
పర్వవేలాతరంగము సం. వి. (భూగో) అధికమైన పోటు, అమావాస్యనాడు పౌర్ణమివాడు సూర్యుడు చంద్రుడు భూమి ఒకే వరుసలో నుండు నప్పుడు సూర్యచంద్రుల ఆకర్షణ శక్తిచే సముద్రపు నీటి మట్టములో గలిగిన అధికమైన పోటు.
పర్సెంటు ఇం (Percent) నూటికి నూటిలో
పల్లు వి. 1. పఱ్ఱునేల ఊషరక్షేత్రము. నిస్సారమగు భూమి. 2 ఉప్పుపండునేల.
పలక వై. వి. 1. కేడెము. 2. చెక్క. 3 వ్రాయదగిన సాధనము. సం. ఫలకః.
పలకము వై. వి. చిన్నమంచము, కుక్కి. సం. పల్యంకః.
పలపైతృకము సం. వి. శ్రాద్ధమున మాంసము నుపయోగించు పూర్వకాలపు కర్మ
పలము సం. వి. 1. నిష్కము, మూడు తులములు. 2. మాంసము.
పలలము సం. వి. 1. మాంసము, 2. బురద
పలవరము వై. వి. 1. ప్రలాపము 2 స్వప్న భాషణము. సం. ప్రలాపః.

పలాయనము సం. వి. పారిపోవుట.

పలాశము సం. వి. 1. ఆకు 2. ఆకుపచ్చ. 3 మోదుగు.

పలాస్త్రి వై. వి. వ్రణములకంటించు మలాము పట్టి. (గృహ) మందు రాసిన గుడ్డ దెబ్బమీద పుండుమీద వేయు పట్టీ లేదా బెణికిన స్థలముమీద వేసిన పట్టీ (Plaster)

పలితము సం. వి 1. నరపు. 2. నరవెంట్రుక 3 బురద.

పలు వి. దంతము విశ. అనేకము, విస్తారము.

పలుకరించు క్రి మాటాడు. రూ పల్కరించు

పలుకు క్రి. మాటాడు. అను. వి. 1. వచనము 2. నింద. 3. విద్య. 4. తునుక.

పలుకుంజెలి వి. సరస్వతి.

పలుకుం దత్తడి వి. చిలుక.

పలుకుబడి వి. ఉచ్చారణము వి. (గృహ.) ధనము, ప్రాబల్యము, మాట చెల్లుబడి (Influence).

పలుకుబడి క్షేత్రములు బి. వి. (రాజ., చరి.) సామ్రాజ్యవాద దేశములు యితర దేశములలో ఏర్పరుచుకొనిన ఆర్థిక రాజకీయములైన పలుకుబడి క్షేత్రములు. (ఈ క్షేత్రములలో అధినివేశ రాజ్యములకు విశిష్టమైన ఆర్థిక రాజకీయాధికారము లుండును. పలుకుబడి క్షేత్రము పేరునకు మాత్రము స్వతంత్ర రాజ్యముగ పరిగణించవచ్చును.)

పలుగోలు వి. పండ్లపొడి.

పలుగాకి విశ. దుష్టుడు.

పలుగు వి, 1. గడ్డపలుగు. 2. స్ఫటికము. (వ్యవ.) గునపము (Crowbar).

పలుగుంద్రు సర్వ. పలువురు. పెక్కండ్రు. రూ. పలువుంద్రు.

పలుచ విశ. 1. దళసరికానిది. 2. వెలితియైనది.

పలువ విశ పలుగాకి

పలువెత్తు విశ. పలువురకు పుట్టినవాడు.

పల్యంకము సం. వి. 1. పాలకి. 2. మంచము. 3 యతులు లోనగువారి యానము.

పల్యంకిక సం. వి పాలకి, పల్లకి

పల్యాణము సం. వి. పసులపైవేయు అంబారి.

పల్ల వై విశ. పాటల (కపిల) వర్ణము గలది. సం. పాటలః.

పల్లటిల్లు క్రి. 1. చలించు, 2. వ్యత్యస్తమగు. వై వి 1 తెల్లబోవు. 2. ఎజ్జావారు. రూ. పల్లటిలు.

పల్లవము సం వి 1. చిగురు. 2. చిగిరించిన కొమ్మ. 3 కోకచెరగు. 4. విరివి.

పల్లవించు సం. క్రి. ఇగుర్కొత్తు, చిగురుకొను.

పల్లవితము సం. విశ. 1. చిగురించినది. 2. విరవియైనది.

పల్లవుండు సం. వి విటుడు.

పల్లా హిం. వి. 120 శేర్ల మానము.

పల్లాయనము వై. వి. 1, స్నేహము. అప్తత. 2. జీను (కొందరు). సం. పల్యాణమ్.

పల్లి సం. వి. 1. పల్లె 2. దేశము. 3. బల్లి.

పల్వలము సం. వి. పడియ.

పవడపు దీవులు వై. వి. (భూగో.) పవడపు పురుగుల గుల్లలచే సముద్రపు అడుగు భాగమున నేర్పడిన దీవులు. (హిందూ మహాసముద్రములోని లక్షదీవులు. మలి దీవులు ఈ కోవకు చెందినవి).

పవడము వై. వి. 1. పగడము. 2. ప్రవాళము, సం. ప్రవాళః.

పవడించు క్రి. శయనించు. రూ పవ్వడించు, పవళించు.

పవతుండు వి. పగతుడు. శత్రువు.

పవనము సం. వి. 1, గాలి. 2. తూర్పెత్తుట. చెరుగుట.

పవనస్థితి సం. వి. (భూగో.) కొలది కాల పరిమితియందుండుశీతోష్ణస్థితి (Weather)

పవాడము వై. వి. 1 కోపముతో నేరము చేసినవాడు చేసిన దానిని గూర్చి చేయు నిందారోపణము. లేదా నాలుక కోసుకొనుట మొదలగు సాహసకృత్యము.

పవి సం. వి వజ్రాయుధము.

పవిష్ట సం. వి. (రసా) రసాయన శాస్త్ర ప్రయోగములందు ద్రవ ద్రవ్యములపై చర్య జరిగించుటకుపయుక్తమైన గాజు పాత్ర (Flask).

పవిత్రము సం. వి 1. జందెము. 2 నీరు. 3. ఆవు నెయి. విశే. పరిశుద్ధము

పవిత్రపరీక్షణము సం వి. (శాస) 1. సత్య నిష్ఠతో చేయు గంభీర శపథము. 2 భగవంతుని పేర ఒట్టుపెట్టుకొనుట. కష్టము లేనివారు చేయు సత్యనిష్ఠ ప్రకటన.

పవ్వడి వి. 1. పదును. 2. ప్రకోప 3. దండు

పశుగ్రాస సస్యములు సం. వి (వ్యావ) పశువుల మేతకొరకుపయోగపడు పైరులు (Fodder crops) ఉదా గినీగడ్డి, నేపియర్ గడ్డి, జనుము, లూసర్న్ మొ॥.

పశుపతి సం. వి. శివుడు.

పశుపాలనము సం. వి. (వ్యావ) ఉన్ని, పాలు, మాంసము క్రొవ్వు మొదలగు వాని కొరకు పశువులను పెంచుట (Cattle rearing)

పశువు సం. వి చతుష్పాదము, గొడ్డు.

పశ్చిమము సం. వి. (జీవ.) వెనుక నున్నది. (Posterier) .

పశ్చకపోల మహోర్బుదములు సం వి. (జం.) కపోల ద్వారమున కిరుప్రక్కల నుండు ఉత్పశ్చ కపాలాస్థులకు గల ఉబ్బిన గుండ్రమగు భాగములు(బొడుపులు) (Occipital condyles).

పశ్చాత్తాపము సం. వి. విప్రతీసారము, వెనుక చింతించుట, అనుతాపము.

పశ్యతోహరుడు సం. వి. కమసాలె, పచ్చెకాడు వ్యు. చూచుచుండగనే దొంగిలించువాడు.

పశ్చిమపూర్వుడు సం వి శిశువు. ముక్కంటి

పస వి 1 చాతుర్యము. 2 సారము. 3. సమృద్ధి .

పసదనము వై. వి కృతజ్ఞతతో నిచ్చు పారితోషికము సం. ప్రసాదనమ్

పసరు వి. 1. ఆకు నలిపిన రసము 2. ఆకుపచ్చన విశే. ఆకు పచ్చనిది.

పసరుపల్లులు వి. (వ్యావ.) పిళ్ళపురుగులు (Plant bugs),

పసి వి. 1 పశ్వాదుల మీసెగాలి, 1 పువ్వు మీసగాలి విశే. లేత. వై. వి. గోగణము గోవులు. సం పశుః.

పసిండి వి. 1 బంగారు. 2. ధనము.

పసిబిడ్డ వి. (గృహ) శిశువు. చంటిబిడ్డ (Infant child).

పసిమి వి. ఎరుపు మించిన పసుపువన్నె.

పసిరిక వి. 1, పసరువన్నె. 2, పచ్చపిట్ట.

పసుపు వి (వ్యావ) ఇది ఒక దుంపజాతి సంబార ద్రవ్యము (Turmeric). అల్లపు కుటుంబము (Zingiberaceae) లోని curcuma longa అను మొక్కను వ్యవసాయదారులు పైరు చేయుదురు. ఈ మొక్కల దుంపలను ఎండబెట్టి పసుపు తయారు చేయుదురు.

పసుపుచుక్క వి (గృహ) కన్ను గ్రుడ్డులో ఈ చుక్క ఉన్నచోట ప్రతిబింబము పడిన అదిస్పష్టముగా కనబడును (Yellowspot).

పస్తము వి. ఇల్లు.

పస్తు వై. వి. లంకణము, ఉపవాసము. సం. సత్రస్థః.

పళ్లిక వై. వి. పల్లిక, సం. బిలకా.

పళ్ళెము వై. వి. పళ్ళెము. పళ్ళెరము, భోజనపాత్రము. తాంబాళము. సం. బిలకా.

# పా

పాంచజన్యము నం. వి. విష్ణుశంఖము.

పాంచాలి నం వి. 1 ద్రౌపది (పాంచాల రాజపుత్రిక). 2. బొమ్మ.

పాంజేబులు వై. వి. కాలికి ధరించుకొను గొలుసులు.

పాండితి నం. వి. పాండిత్యము.

పాండిమము నం. వి. తెలుపు.

పాండ్యుఁడు వై. వి. పాండ్యదేశపు రాజు, నం. పాండ్యః.

పాండురము నం, విశే. తెల్లనిది.

పాండురోగము నం. వి. (గృహ.) పాలి పోవుట, రక్తహీనత (Anemia).

పాండువు నం. వి. 1. పాండురోగము. 2 పాండురాజు. నం. వి. (వృక్ష). పత్రలకము హరితవర్ణము లేక తెల్లగా నుండుట (Chlorosis).

పాంథుఁడు నం. వి. పథికుడు. తెరువరి. బాటసారి.

పాంశువు నం. వి. 1, దుమ్ము. 2. ఎరువు. రూ. పాంసువు.

పాంసనుఁడు నం. విశే 1. దూషకుడు. 2. చెరుపువాడు.

పాంసుల నం వి. రంకులాడి.

పాఁకుడు వి. 1. మాలిపాకుడు 2 నీళ్ళ మీది పాకుడు, నీటిపై పెరుగు తీగె.

పాఁచి వి. 1. పండ్ల మురికి. 2 పాలతీగె. (మజ్జిగ చిక్కన చేయు తీగె).

పాఁడి వి. పాలు.

పాఁత వై. వి.1.వస్త్రము. 2,జీర్ణవస్త్రము. విశే. బహుకాలమునాటిది. రూ. ప్రాఁత. నం. పురాతనమ్.

పాఁతఱ వి,1.ధాన్యముంచెడిగొయ్యి. 2.నిధి.

పాఁతు వై. క్రి, పూడ్చు. నం. పత్.

పాఁపజగము వి. నాగలోకము.

పాఁపఱేఁడు వి. నాగరాజు,

పాకము నం. వి 1. పరిపక్వము. 2. పంట. (అలం) కావ్యపాకము(కావ్యపాకములు: ద్రాక్షా కదళీ నారికేళ పాకములు).

పాకశాసని నం వి. 1. అర్జునుడు. 2, జయంతుడు వ్యు. పాకశాసనునికొడుకు.

పాకశాసనుఁడు నం వి. ఇంద్రుడు వ్యు. పాకుడను రాక్షసునిపరిమార్చినవాడు

పాకశాస్త్రము నం, వి ఆయుర్వేదమున నిది యొక భాగము.

పాకాన్నము నం. వి. పెండ్లిలో మూడవ నాటి విందు. రూ. పాకెన, పాకెన్న.

పాకీవాఁడు వి. (గృహ.) కక్కసు దొడ్లను శుభ్రము చేయువాడు (Scavenger).

పాకీకుఁడు నం. వి. పిట్టల వేటకాడు.

పాగా వి. 1. తలగుడ్డ. 2. అశ్వశాల. రూ. పాగ.

పాగా వై. వి. పాపకోళ్ళు, కఱ్ఱతో చేసిన పాదుకలు. నం. పాదుకా. వి. 1, గుఱ్ఱముల సాల. 2. తలపాగ.

పాగు వై. వి. చక్కెరపాకము. నం పాకః.

పాచకము నం వి. (జం.) జఠరరసమందు కల సేంద్రియమండము (Pepsin).

పాచకి నం. వి. వంటలక్క.

పాచిక నం. వి. జూదమాడెడు అడ్డసాళ్ళు.

పాచితము వై. వి. ప్రాయశ్చిత్తము.

పాచినము వై. వి. విరేచనము.

పాచు క్రి. 1. చక్కెడలించు, 2.తొలగించు.

పాట వి. 1. సంగీతము. 2. వేలముపాట.

పాటకము నం. వి. 1. పట్టాకత్తి. 2. సేనా నివేశము:

పాటచ్చర యామిక న్యాయము నం. న్యా. దొంగను గస్తి తిరుగుటకు నియమించినచో వాని దొంగతనముపట్టువారుండరను రీతి.

పాటచ్చరుఁడు సం.వి.దొంగ వ్యు. మునుగు వేసికొనినట్లు కనపడకుండ తిరుగువాడు.

పాటన వి 1. అలంకారము. 2. అవరణము

పాటనము సం వి. చీల్చుట.

పాటము వై. వి కెంపుల నాణెము చూచుటకు తగిన యెండ. సం. ప్రభాతమ్.

పాటలము సం వి. తెలుపు మించిన యెరుపు

పాటవము సం. వి. 1 ఆరోగ్యము.2,శక్తత

పాటి వి. సామ్యము. విణ. సమము.

పాటించు క్రి. 1 ప్రమాణముగా గొను. 2. ప్రకటించు. 3. ఆదరించు.

పాటినేలలు వి. (వ్యవ) పురాతన గ్రామ కంఠములందలి మన్నుతో నేర్పడిననేలలు (Old village site soils)(వీచేలో పొటాసియ నత్రితము ($Kno_3$) కొంచె మెక్కువగా నుండును అందుచే పాటిమన్ను కూడ ఎరువుగా నుపయోగింపబడుచుండును.)

పాటిరేవు వి. దిగినడచిపోదగిన రేవు.(కాల్నడతో పోదగిన రేవు.).

పాటు వై. వి. 1. కష్టము. 2. శ్రమము, 3. పడుట. 4. అలయడగుట 5. అలపెచ్చుగుట. సం. పత్, పాతమ్ (అర్థ.) శ్రమ, వాఛించిన ఏవస్తువునైనను ఉత్పత్తిచేయుటకు చేయబడు యత్నము (Labour).

పాటుయూనిట్లు మి. వి. (అర్థ.) సొంత శ్రమనే ఉపయోగించి పనిచేయుకుటుంబములు లేదా కొంతమంది శ్రామికుల సమూహము (Units of labour).

పాట్‌లక్ ఇం వి. (గృహ.) (Pot-luck). ఒక స్థలమునకుమిత్రులు భోజనము లేదా వంటకములను తెచ్చుకొని కలసివేడుకగా భుజించుట.

పాఠము సం. వి. 1. చదువు.2.వేదపఠనము,

పాఠశాల సం. వి. బడి.

పాఠి సం. విణ. పఠించువాడు. వి పీపు.

పాఠీనము సం. వి. ఒకరకమైన చేప.

పాఠ్యగ్రంథము సం వి విద్యాలయములలో విద్యార్థులకు పఠనీయముగా నిర్ణీతమైన గ్రంథము (Text book).

పాఠ్యప్రణాళిక సం వి. (గృహ.) విద్యాశాలలందును, కళాశాలలందును విద్యనుపదేశించుట కుపకరించు విషయముల జాబితా (Syllabus).

పాఠ్యాంశములు సం. వి. (భౌతి.) ఏదేని కొలుచుట కుపయోగించు ఉపకరణము (థర్మామీటర్ వంటి) పైచిహ్నితమైనకొలత గురుతుల గుర్తించుట (Readings).

పాడగము వై. వి. స్త్రీల కాలియందె. సం. పాటకః.

పాడి వి. 1. ధర్మము, న్యాయము. 2 స్వభావము 3. వ్యవహారము.

పాడు వి 1. పాటినేల. 2.శూన్యగ్రామము క్రి పాటపాడు.

పాడె వి. శవయానము.

పాడ్యమి వై. వి. మొదటి తిథి,సం,ప్రథమా,

పాణింధమము సం. వి. 1. కొలిమితిత్తి, 2 చీకటి 3. ఒక రకమైన వాద్యము.

పాణి సం. వి. మనికట్టు మొదలు చాచిన వ్రేళ్ళతో కూడినచేయి,

పాణిగృహీతి సం. వి. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము,

పాణిగ్రహణము సం. వి, వివాహము.

పాణివడము వై. వి. అమ్ములపొది. సం. బాణపాత్రమ్.

పాణిశలాకలు సం. వి, (జం.) అరచేతికుండు ఎముకలు (Meta-carpals),

పాత సం. విణ. 1. కాచువాడు. రక్షకుడు, 2. త్రాగువాడు.

పాతకము సం. వి. మహాపాపము (పంచమహాపాతకములు : స్వర్ణస్తేయము

సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, ఇవి చేయువారి తోడి సహవాసము).

పాతము సం. వి. 1. పతనము, పడుట.

పాతరలాడు క్రి. 1. నర్తించు, 2 గంతులు వేయు.

పాతాళము సం. వి క్రిందిలోకము.

పాతివ్రత్యము సం. వి. పతివ్రత యొక్క శీలము

పాత్ర సం. వి. (భౌతి) ద్రవ్యముల నిలువ యుంచుటకుపయోగించునది (Vessel).

పాత్రము సం. వి. 1. యోగ్యము 2 భోజనము 3. నాటకవేషము. సం. వి. (భూగో.) శిలాప్రదేశములలో సహజముగ పాత్రవలె ఏర్పడిన ప్రాంతము. (ఇట్టి ప్రాంతములతో నీరు నిండి యుండ వచ్చును. లేదా వానలు లేనిచో పొడిగా నుండవచ్చును,)

పాత్రలు సం, వి. (గృహ.) ఉపకరణములు, వంట గిన్నెలు (Utensils).

పాథస్సు సం. వి, 1. జలము 2. అన్నము.

పాథేయము సం. వి. అన్నము. బియ్యము లోనగు దారి బత్తెము.

పాథోధి సం. వి. సముద్రము

పాదము సం. వి. (గణి.) త్రిభుజ శీర్షముల నుండి భుజములకు గీయబడిన లంబముల పాదములకు సంబంధించినది (Pedal).

పాదట్టు వి. (పాదు+తట్టు) వాసములకు పట్టు బూసి. బూజు. రూ. పాదొట్టు.

పాదత్రిభుజము సం. వి. (గణి.) చరణ త్రిభుజము, త్రిభుజమునందలి లంబ పాదములు శీర్షములుగా గల త్రిభుజము (Pedal triangle).

పాదపము సం. వి. చెట్టు

పాదము సం. వి. 1. పాదు. 2. కిరణము. 3. పద్యమునందలి ఒక చరణము. 4, 1/4వ వంతు. 5. వేరు. సం. వి. (గణి.) సమతలములలో అక్షద్వయముచే వేరు చేయబడిన నాలుగుభాగములలో నొకటి (Quadrant)

పాదమూలాస్థి సం. వి. (జం.) మడమ ఎముకల కూటము (Tarsus).

పాదరసము వై. వి పారదము. రసము. సం. పాదరసః.

పాదశలాకలు సం. వి. (జం.) పాదముల కుండు ఎముకలు (Meta-tarsals).

పాదు వై. వి. 1. కుదురు, ఆలవాలము. 2. నిలకడ. 3. ఆశ్రయము. సం. పాదః. పదమ్

పాదుక సం. వి. పావకోళ్ళు, చెప్పులు.

పాదుషా వి. రాజు హిం. బాద్ షాహ్.

పాదోదకము సం. వి. మేఘము.

పాద్యము సం.విశే. పాదము కొరకైన నీళ్ళు

పానకము సం. వి. బెల్లముతో మిశ్రితమైన పానీయము.

పానకము వై. వి. ఫలరసము. సం.పానకమ్,

పానము సం వి. 1. త్రాగుడు 2. త్రాగుడు గిన్నె. వై. వి. పానపట్టము. లింగపీఠము. సం. పానీయవృత్తమ్.

పానుపు వి. పడక, మంచము. 2. పరుపు.

పాన్ కేకు జం. వి, (గృహ.) (Pan-cake). పెనము మీదవేయు అట్టు, మైదాపిండి. గుడ్డు పాలు చక్కెరతో తయారుచేసినఅట్టు

పాప వి 1. శిశువు, 2. కంటి నల్ల గ్రుడ్డు లోని ప్రతి బింబము.

పాపట వి. కేశవీధి. సీమంతము.

పాపటపుచట్టము వి. (వ్యవ) అంతర కృషికి పనికివచ్చువిదే శపుపనిముట్టు, పాపటపు చట్టము. (దీనిని పశువులులాగును.)(Plant junior hoe).



**పాపటము** వి. గొర్రు పైరు మీద - గాదము కొట్టుటకు దున్నెడు పనిముట్టు,

**పాపడు** వి. బాలుడు, పురుషశిశువు.

**పాపము** సం. వి. దుష్కృతము కలుషము.

**పాపిల్లా** ఇం. వి. (జీవ.) (Papilla) ప్రాణి శరీరములందు మొక్కలందుండు కణుపు వంటి పెరుగుదల.

**పాపిస్టు** ఇం. వి. (చరి.) (Papist) పోపు సంప్రదాయవాది. రోమన్ కాథలిక్.

**పాపోసు** వై. వి. ముచ్చె, సం పాదపోషః.

**పామ** సం. వి. గజ్జి.

**పామరుడు** సం. విణ. 1. మూర్ఖుడు. అజ్ఞుడు. 2. నీచుడు.

**పాము** వి. సర్పము. 2. కష్టము. క్రి, రుద్దు.

**పాములపిడారము** వి. (వ్యావ.) పుట్ట.

**పాయ** వి. 1. ఖండము. 2. ఒక నదిలో నుండి చీలిన శాఖ.

**పాయము** వై. వి. ప్రాయము. వయస్సు. సం. ప్రాయః.

**పాయపట్టము** వై. వి. కాలిఅందె. సం. పాదపట్టమ్.

**పాయసము** సం. వి. పరమాన్నము వ్యా. పయస్సుతో వండినది: పాసెము. సం. వి (రసా.) (Emulsion) ఒక ద్రవమును ఇంకొక దానిలో కొల్లోయిడ్ స్థితిని పొందునట్లు చేయబడిన అవలంబితము (Suspension).

**పాయింట్ ఆఫ్ ఆర్డరు** ఇం. వి. (రాజ., శాస.) (Point of order). చర్చనీయాంశ విషయమునకు సంబంధించి లేదని లేక సభ్యుల వడవడి క్రమముగా లేదని ఆక్షేపించుట

**పాయింట్ ఫోరు కార్యక్రమము** ఇం. వి. (రాజ., చరి.) అమెరికా సంయుక్త రాష్ట్రాధ్యక్షుడు ఆసియా ఖండ దేశముల ఆర్థిక సాంఘికాభివృద్ధికై ప్రవేశ పెట్టిన ప్రణాళిక.

**పాయు** క్రి. 1. ఎడబాయు 2 తొలగు.

**పాయువు** సం. వి. గుదము

**పారంగతుడు** సం. విణ. దరిచేరినవాడు

**పారంపర్యము** సం. వి. కులక్రమము, అనుస్యూతము.

**పార** వి. (వ్యావ.) వ్యవసాయదారుడు నేలను పైపైని త్రవ్వుటకుపయోగించు నొకవిధమగు ఇనుప పనిముట్టు (Spade)


పార

**పారగమ్యము** సం. విణ. (రసా.) చొరనిచ్చునది (Permeable).

**పారణ** సం. వి. ఉపవాసముండి మరునాడు చేయు భోజనము. పారణము.

**పారతంత్ర్యము** సం. వి. పరాధీనత. వ్యతి. స్వాతంత్ర్యము.

**పారదర్శకము** సం. వి. (భౌతి.) కాంతి కిరణములను తన గుండా పోనిచ్చునది (Tranparent).

**పారదము** సం. వి. (రసా.) సాధారణముగ ద్రవస్థితిలోనుండి వెండివలె తెల్లగా ప్రకాశించు ధాతువు (Mercury). ఇది ఆవర్త క్రమ పట్టికలో రెండవ వర్గములోనిది).

**పారదీయము** సం. విణ. (రసా.) పారద (పాదరస) సంబంధమైనది (Mercurial).

**పారభాసకము** సం. విణ. (భౌతి.) అస్పష్టముగ పారదర్శకమైనది (Translucent).

**పారము** సం. వి. 1 ఆవలిదరి. 2. సమీపము.

**పారలౌకికము** సం. వి. పాయసము, పరమాన్నము విణ. పరలోక సంబంధమైనది.

**పారవశ్యము** సం. వి. 2. విస్మృతి. 2. పరవశత్వము.

**పారసైడ్** ఇం. వి. (వ్యావ.) (Paracide) విత్తులకు పురుగు పట్టకుండ నుపయోగపడు నొక మందు.

**పారమ్పర్యము** సం. వి. (వృక్ష.) కలికాంతః పత్ర పారమ్పర్యము, మొగ్గలో నున్న చిరుతయాకులు పరస్పరముగ సమర్చబడి యున్న విన్యాసము (Vernation).

**పారాణి** వి. కుంకుమ మొదలగు వానితో పాదములకు చేయు అలంకారము.

**పారాయణము** సం. వి. అంతయు చదువుట పారమును పొందుట.

**పారారబ్బరు** ఇం. వి. (వ్యవ.) (Para-rubber). జెముడు కుటుంబమునకు (Euphorbiaceae)చెందినHeavea braziliensis అను చెట్టు పాలనుండి ఈరబ్బరును తయారుచేయుదురు.

**పారావతము** సం. వి. పావురము.

**పారావారము** సం. వి. 1.ఈవలావలిదరులు. 2. సముద్రము.

**పారాశరి** సం. వి. 1.వ్యాసముని. 2. ముని. 3. శుకమహర్షి.

**పారి** వై. వి. 1. తడవ, సం. పర్యాయః. 2. ప్రహరికాచువాడు. సం. ప్రహరీ. వి. మన్ను.

**పారికాంక్షి** సం. వి. ముని, తపస్వి

**పారికాపు** వి. 1. పరిచరుడు. 2. ప్రహరి కాచువాడు.

**పారిజాతము** సం. వి. వేలుపుచెట్టు. (పారిజాతము మందారము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము-ఇవి దేవ వృక్షములు).

**పారితోషికపువాటా** మి. వి. (వాణి.) నిధులలో నున్న ప్రాతలాభముల సొమ్మును మూలధనముగ మార్చినపుడు ప్రాత వాటాదారులకు తమ వాటాల కనుగుణముగ లభించు నిధిలోని వాటా.

**పారితోషికము** సం. వి. బహుమతి.

**పారిపార్శ్వికుడు** సం వి. (అలం.) సూత్రధారుని చెంతనుండి అతడు చెప్పెడుసర్వాంశములను పరిష్కరించువాడు, మారిషుడు

**పారిప్లవము** సం వి. చలించునది,లోలము.

**పారియాత్రికము** సం. వి. భారతదేశము లోని కులగిరులలో నొకటి.

**పారిశ్రామికక్షేత్రములు** సం. వి. (వాణి.) ప్రభుత్వాధ్వర్యవము క్రింద నెలకొల్పబడి కొన్ని చిన్నతరహా పరిశ్రమలకు ఒకే ప్రదేశములో స్థానరము నిచ్చి, వానికి కావలసిన రవాణా, ముడిపదార్థములు మొదలయిన విషయములతో కొన్ని ప్రత్యేకమైన సదుపాయములను సమకూర్చుచున్న కొన్ని ప్రదేశములు. (మొదటి పారిశ్రామిక క్షేత్రము ఢిల్లీ యొద్దనున్న ఓఖ్లాలో 1958 లో స్థాపింపబడెను).

**పారిశ్రామిక బ్యాంకు** మి. వి. పరిశ్రమల అవసరములకు అప్పుల నిచ్చు బ్యాంకు.

**పారిశ్రామిక రసాయన శాస్త్రము** సం. వి. (రసా.) భారీ వస్తూత్పత్తికి ఆవశ్యకమగు రసాయనిక ప్రక్రియల చర్చించుశాస్త్రము (Industriai chemistry).

**పారిశ్రామిక విప్లవము** సం. వి. (చరి.)18వ శతాబ్దియందు ఇంగ్లాండు ఐరోపా దేశములలో పారిశ్రామిక రంగములలో జరిగిన తీవ్రమైన మార్పులు.

**పారిశ్రామికసంఘములు** సం. వి. (అర్థ.) కొందరు కార్మికులుగాని శ్రామికులుగాని కొందరి నాయకత్వమున ఐకమత్యముతో తమ హక్కులను కాపాడు కొనుటకై నెలకొల్పుకొనిన సంఘములు (Labour unions).

**పారిశ్రామికుడు** సం వి. పరిశ్రమల స్థాపించి నిర్వహించువాడు (Industrialist)

**పారిష్** ఇం. వి. (చరి.) (parish). ప్రత్యేక స్థానిక క్రైస్తవప్రార్థనాలయము(చర్చి). క్రైస్తవమతగురువు కలిగి ఆచర్చికి చెంద

వలసిన ప్రత్యేకపు పన్నులు కట్టుచున్న బిటను దేశములో భూవిభాగము.

పారిషదుఁడు నం. వి 1. శివభటుడు. 2. రాజున కనుచరుడు. 3. సభ్యుడు.

పారిస్ గ్రీన్ ఇం. వి (వ్యవ.) (Paris Green) కీటకములను నాశనము చేయు నొక విధమగు పాషాణపు మందు,

పారిహారికుఁడు నం విణ పరిహారము చేయువాడు.

పారీణుఁడు నం విణ. పారము ముట్టిన వాడు, మిక్కిలి నేర్పరి.

పారుపత్తెము వి దేవునికి దొంతనము వారికి రావలసిన ధనము ప్రజలనుండి రాబట్టెడి అధికారము, రాబడి. వ్యయము వీనిపై అధికారము.

పారుష్యము నం వి. పరుషవచనము పరుషత్వము.

పార్టీ ఇం. వి (Party) పక్షము. (వ్యావహారికభాషలో రాజకీయ పక్షమునకు వాడబడుచున్నది).

పార్టీటికెట్టు ఇం వి. (రాజ, శాస.) (Party ticket). ఎన్నికలలో పోటీచేయుటకై రాజకీయ పక్షము తమ అభ్యర్థుల కిచ్చు అధికార పత్రము.

పార్టీవిధానము మి.వి (రాజ.) పక్షవిధానము ప్రభుత్వము పార్టీలపై నాధారపడి యుండుట.

పార్థక్యతలము నం. వి. (భౌతి.) రెండు వస్తువుల విభాగించుతలము (Surface of Separation).

పార్థివ నం. వి అరువది సంవత్సరములలో నొకటి (19 వది).

పార్థివము నం. విణ పృథివీ సంబంధమైనది. నం. వి. గుల్లము.

పార్థివుఁడు నం. వి. రాజు. వ్యు. పృథివి

పార్థుఁడు నం. వి, 1. రాజు. 2. అర్జునుడు,

పార్లమెంటరీ ప్రభుత్వము మి వి శాస (రాజ., పరి.) సంసదీయ ప్రభుత్వము, మంత్రి వర్గము కాని, కార్యవర్గముకాని ప్రధాన శాసనసభకు బద్ధలైనట్టి ప్రభుత్వము.

పార్లమెంటు ఇం. వి. (శాస రాజ.) (Parliament) సంసత్తు ప్రజాప్రతినిధి సభ, ప్రధాన శాసన సభ.

పార్వణము నం. వి. పిండప్రదానము. విణ. పర్వసంబంధమైనది.

పార్వతి నం. వి. 1. గౌరి (పర్వతపుత్రి), 2 ద్రౌపది,

పార్శ్వకపోలాస్థి నం. వి (జం.) పుఱ్ఱెకు పైభాగమున ప్రక్కపై పునున్న ఎముక (Parietal bone)

పార్శ్వచ్యుతి నం. వి. (భౌతి.) ఒక యానకము నుండి బహిర్గతమయ్యెడికిరణములు పొందు స్థానచలనము (Lateral displacement).

పార్శ్వము నం. వి. 1, ప్రక్క. 2. సమీపము. (భౌతి.) ఒక వస్తువుయొక్క ఒక భాగము (Side). విం. విణ. (జీవ.) ప్రక్కలనుండి బయలుదేరినది. (Latral).

పార్శ్వవాహి నం. వి (భౌతి.) విద్యుత్ప్రవాహము యొక్క ఒకభాగమునుఇంకొక దిక్కునకు మళ్ళించు విద్యుద్వాహకము (Shunt).

పార్శ్వవ్యత్యాసము నం. వి (భౌతి.) ఒక వస్తువు యొక్క కుడిభాగము ప్రతిబింబములో ఎడమ భాగము గను, వస్తువుయొక్క ఎడమభాగము ప్రతిబింబములో కుడిభాగముగను కనిపించుట (Lateral inversion).

పార్శ్వసిర నం, వి. (వృక్ష.) పత్రఫలకము పైనున్న మధ్య ఈనెనుండి ప్రక్కలకు బయలుదేరు ఈనె (Lateral vein).

**పార్ష్ణి** నం వి. 1. ఉన్మత్తురాలు. 2 మడమ. 3. దండు వెనుక

**పారు** క్రి 1. ప్రవహించు. 2 పరువెత్తు.

**పారుడు** వి బ్రాహ్మణుడు.

**పారువేట** వి దసరానాడు ఉత్సవ విగ్రహములను వేటకు తీసికొని పోవునట్లై తీసుకొనిపోవు ఉత్సవము.

**పాలగొట్టములు** వి (గృహ.) సూక్ష్మ రక్తనాళములు ఇవి శృంగముల మధ్యలో నుండును (క్రొవ్వు ఆహారము జీర్ణమైన తరువాత వీనిచే రక్తములోనికి పంపుకొనబడును) (Lacteals).

**పాలను బలపరుచుట** వి. (గృహ) పాలతో పోషణపదార్థములను కలుపుట (Fortifying milk), ఉదా. 'డి' విటమిన్ కలిపిన పాలు (Vitaminised milk)

**పాలపండ్లు** వి. పుట్టుదంతములు పుట్టిన తరువాత మొదటిసారి వచ్చిన పండ్లు (Milk teeth). (ఆరు లేదా పదు సంవత్సరముల ప్రాంతములో పాలపండ్లూడిపోయి స్థిరమైనపండ్లు వచ్చును).

**పాలపుంత** వి ఆకాశములో నక్షత్ర సముదాయముతో కూడి కాంతిమంతముగ కనిపించు మార్గము, ఆకాశగంగ (Milky way).

**పాలపూస** వి. తెల్లని గాజుపూస

**పాలరాళ్ళు** వి (భూగ) చలువరాయి. భూగర్భములో పెక్కు వేల సంవత్సరములణగియుండి పాలరాళ్ళుగా మారిననిక్షేప శిలలు.

**పాలవంటిద్రవము** వి. (గృహ.) నూనెల నీటిలో కాని క్షారములలో కాని కలిసినప్పుడు నురుగు వచ్చి పాలవలె కనబడు ద్రవ మేర్పడును. దానిలో చమురు కరుగక చిన్న చిన్న కణములుగా నేర్పడి సబ్బునురుగువలెను పాలవలెను ఉండు చిక్కని ద్రవముగా అది తయారగును (Emulsion).

**పాలవిరుగుడునీరు** వి (గృహ) విరిగిపోయిన పాలలో కోవాను వేరుచేసిన తరువాత వచ్చు నీరు (Whey)

**పాలవెల్లి** వి 1. పాలసముద్రము. 2. పాలపుంత.

**పాలసుడు** వై విశ. బాలిశుడు, మూర్ఖుడు నం బాలిశః.

**పాలించు** క్రి 1 ఏలు. 2. రక్షించు

**పాలిండ్లు** వి. (వి. బహు) స్తనములు. పాలకు కుండ్లు వంటివి

**పాలికాపు** విశ 1. పాలేరువాడు. 2. భాగస్థుడు (వ్యవ.) కొంత పాలు ఫలసాయమును పుచ్చుకొని తనతోపాటు పనిచేయుట కొప్పుకొనిన రైతు. (Sharing partner)

**పొలిట్ బ్యూరో** ఇం. వి (రాజ.) (Polit. Bureau) రష్యా కమ్యూనిష్టు పార్టీ విధానములను నడుపు కేంద్ర సంఘము.

**పాలు** వై. వి. 1. క్షీరము 2. చెట్లయందు గలుగు తెల్లని రసము నం. పయః. వి. భాగము వంతు

**పాలుమాలిక** వి 1. విలంబనము. 2. బద్ధకము. రూ. ప్రాలుమాలిక.

**పాలెగాడు** వి 1. చిన్న జమీందారుడు. గుత్తగాడు. మొఖాసాదారుడు.

**పాలేరు** వి, పాలికాపు.

**పావకుడు** నం. వి అగ్ని.

**పావడ** వి. 1 పరికిణి. 2. ధౌతవస్త్రము.

**పావనము** నం. విశ. పవిత్రము.

**పావని** నం. వి. 1. ఆవు. 2. భీముడు. 3. ఆంజనేయుడు. విశ. పవిత్రురాలు.

**పావి** వై. వి. పాపి. నం. పాపి.

**పావు** వై. వి. 1. వరహాలో నాల్గవ భాగము. 2 నాల్గవ భాగము. నం. పాదః.

పావురాయి వై. వి, పావురము. సం. పారావతః

పాశము సం వి. త్రాడు.

పాశి సం వి. 1, వరుణుడు, 2 యముడు.

పాశికుఁడు సం విశే. పిట్టల వేటకాడు.

పాశుపతము సం. వి. 1. పశుపతి (శివుడు). అధిదైవతముగా గల అస్త్రము 2. పశుపతి మతము.

పాశ్చాత్యుఁడు సం. విశే. 1. పడమటివాడు. 2. వరుణుడు.

పాషండము సం. వి. వేదబాహ్యామతము.

పాషాణము సం. వి, 1, రాయి. 2. విషద్రవ్యము

పాశ్చురైజేషన్ ఇం వి, (శౌతి.) (Pasturization). ఒక పదార్థములో కొన్ని క్రిములు వశించుటకు సరిపోవునంత కాలము సరియైన వేడి కలిగినట్లు కాచుట లేక మరిగించుట,

పాస్‌పోర్టు ఇం వి. (శాస.) (Pass-port), విదేశ ప్రయాణపత్రము. విదేశములకు పోవుటకై ప్రభుత్వము పౌరునకిచ్చు అగికార పత్రము.

పాళము వై. వి. 1. లోహాపుకడ్డీ. 2. కొలది 3, హద్దు, సం, పాలమ్ పాంమ్,

పాళి వై వి. జూదమాడుపలక. సం. పాళికా, పాలీ.

పాళి సం వి. 1. అంచు, 2. గురుతుచోటు 3, వరుస.

పాళియము వై. వి. 1. కాపలి. 2. పాళెగాని ప్రదేశము (పట్టణము). 3. దండుటు. రూ. పాళెము. సం. 1. పాలనమ్. 2. పల్లి, 3. బలమ్.

పాళీ వి. వ్రాసెడి యినుప కలము యొక్కమొన. రూ, పాళి.

# పి

పింక్డ్‌సీమ్ ఇం. వి. (గృహ.) (pinked-Seam). నులిపోగుల అంచులో దారము లూడిపోకుండ నుండుటకై వంకలుగా కత్తిరించిన అంచుల కలయిక కుట్టు,


పింక్డ్‌సీమ్

పింగము సం. వి. గోరోజనమువంటి వన్నె (కొంచెము వలుపు కలిసిన పసుపు వన్నె).

పింగలి విశే.1.వెనుకటిది.2. వెనుకటివాడు.

పింగళ సం. వి. 1.దక్షిణ దిక్కు నందలి ఆడేనుగు.2.అరువదివత్సరములలోనొకటి

పింగళుఁడు సం. వి. 1, అగ్ని, 2. శివుడు.

పింగాణీ వి. ఒక దినుసు తెల్లమన్ను. చీనామన్ను.

పింగాణిపాత్రలుసామి. వి. (గృహ.) చీనామట్టితో తయారైన ప్లేట్లు, కప్పులు, సాసర్లు మొదలగునవి (Crockery).

పించెము వై. వి. నెమలిపురి. సం. పింఛమ్.

పింఛను వై. వి. (వ్యావ.,రాజ.) ఉపకార వేతనము,ఉద్యోగముచేసినపనినుండి తొలగిన తరువాత ప్రభుత్వము నుండి దొరకు భరణము (Pension).

పింజ సం. వి. 1. దూది. 2. పసుపు. 3. గుంపు.

పింజనము సం, వి. దూదేకు విల్లు,

పింజరము సం. వి. బంగారు.

పింజె వై. వి. వస్త్రపుకుచ్చె, దోవతి కొంగుకుచ్చిళ్ళు, సం పింజా.

పిండము సం. వి. 1. బ్రదుకుతెరువు. 2. పితృదేవతల కిచ్చెడు అన్నపుముద్ద. 3. గర్భము, 4. సమూహము. సం. వి. (గృహ) గర్భములోని శిశువు. (Foetus embryo).

పిండి వై. వి. పిష్టము. సం. పిష్టమ్, పిండిః

పిండి వై వి (రసా) కర్బను హైడ్రోజను ఆక్సిజనులు కలిసిన ఒక సమ్మేళనము (Starch).

పిండితము సం విశ. 1. ముద్దగా చేయబడినది. 2. ఒకచో చేర్చబడినది.

పిండినల్లులు వి. (వ్యావ.) పిండి పురుగులు (Mealy bugs)

పిండిపెట్టుట వి. (గృహ.) నూలు కమీజుల కాలర్లకు కప్పులకు చిక్కని పిండిరాచి వేడి ఇస్త్రీతో ఇస్త్రీచేయునది. కప్పులను కాలర్లను ఎక్కువ బిరుసుగా చేయుటకు దీనిని ఉపయోగింతురు (Cold starch).

పిండు క్రి, 1. పాలుపితుకు. 2. రసము పిండు. 3. తడిసిన బట్ట పిండు వి, 1, గుంపు 2, చెండు,

పింపిళ్లు వి. బాలక్రీడా విశేషము.

పికము సం, వి. కోయిల

పికులు క్రి. (వ్యావ.) చినుగు. రూ. పిగులు.

పికెటింగ్ ఇం. వి. (రాజ., వ్యావ.) (Picketing), నిరోధన, చేయుచున్న పనిని వద్దని శాంతియుతముగ చెప్పుట. పని మాన్పించుటకై పనిచేయుచున్నచోట తిష్ఠవేసికొనియుండుట, కొన్ని రాజకీయార్థక సాంఘిక లక్ష్యములను సాధించుటకై ప్రజాసహకారము కొరకు ఈ పద్ధతిని అవలంబింతురు.

ట్లు ఇం వి. (రాజ.) (pickets) 1. అడ్డగించువారు. 2. సైనికరక్షకదళము.

పిక్క వై, వి. 1. చిరుతొడ,జంఘ. 2. గింజ సం 1. పిండికా. 2. స్పృక్కా.

పిక్కచెదరు క్రి. 1. చెదరు 2 భయపడు,

పిక్కటిలు క్రి. 1, వర్ధిల్లు, 2. నిండు.

పిగ్మీలు ఇం. వి. (చరి.భూగో,) (pygmies). ఆఫ్రికాదేశములోని పొట్టి మనుష్యులు. కాంగోప్రాంతవాసులు.

పిచండము సం. వి. కడుపు.

పిచండిలుడు సం. విశ. పెద్ద బొజ్జ కలవాడు.

పిచుమందము సం వి. వేపచెట్టు, వేము.

పిచ్చలించు క్రి. 1 అతిశయించు. 2.భయపడు.

పిచ్ఛికకుంటు వి. అనూరుడు. విశ. కాళ్ళులేనివాడు.

పిచ్చ వై. విశ. తక్కువ (పిచ్చకుంచము) వై వి. 1. వెఱ్ఱి 2,వృషణము. సం. 1. పిత్తమ్ 2. పిచ్ఛా.

పిటకము సం, వి. 1. పుండు, 2.చిన్నగంప,

పిటేలు వి. పిడుగులు పడునప్పటి ధ్వన్యనుకరణము. రూ. పిటెలు, పిటెల్లు.

పిట్టపిడుగు వై. విశ అనివార్యము, వై.వి. 1. పెద్ద పిడుగు 2 హఠాత్సంఘటన.

పిట్యూటరీ మాంసగ్రంథులు మి. వి.(గృహ.) పీనస మాంసగ్రంథులు, పోషగ్రంథులు (Pituitary glands)

పిట్యూట్రిన్ ఇం. వి. (జం) (Pituitrin). పోషగ్రంథి తయారుచేయు అంతస్స్రావము (Hormone) పోషగ్రంథి నిస్సారము.

పిడి వి. 1. పిడికిలి. 2. కత్తిలోనగు వాని పిడి, 3. నూలిపిడి 4. అడుజంతువు.

పిడికోల వి. మేడి.

పిడియము వి, బాకు. రూ. పిడెము,

పిడివాదము వి (వ్యావ.) తన మాటయే చెల్లవలెననుట మూర్ఖవాదము,



పిడిసీల వి. (వ్యావ.) నాగలిచే పట్టుకొనుట కుపయోగించు మేడియొక్క సీల(Handle.)

పిడిసూది వి. (గృహ.) రంధ్రము పిడిసూధి చేయు సూది అలంకారపు కుట్లలో రంధ్రము చేయుట కుపకరించు సూదివంటి పరికరము(Cillet.)

**పిడుగు** వై. వి. అశని నిర్ఘాతము. సం, శిదురమ్.
**పిడుచ** వి. 1. ముద్ద. 2. కబళము,
**పిణ్యాకము** నం. వి 1. గానుగపిండి. 2. ఇంగువ.
**పిణ్యాకములు** నం. వి. (వ్యవ.)పిండి యెరువులు (Oil cakes).ఉదా. ఆముదపుపిండి వేరుసెనగ పిండి మొదలగునవి.
**పిత** నం. వి జనకుడు (కన్నవాడు, వడుగు చేసినవాడు, చదువుచెప్పినవాడు,అన్నము పెట్టినవాడు, శరణొసగినవాడు.)
**పితరుఁడు** వై. వి తండ్రి. నం. పితా.
**పితరులచుక్క** వి, మఘానక్షత్రము.
**పితరులు** వై వి. పితృదేవతలు.రూ.పితాళ్ళు
**పితలాటము** వి. మోసము రూ పితలాటకము
**పితామహి** నం. వి తండ్రితల్లి.
**పితామహుఁడు** నం. వి. 1. తండ్రికితండ్రి 2. బ్రహ్మ.
**పితుకు** క్రి. పశువుల పాలుపిండు.రూ సిదకు
**పితృతంత్రము** నం. విశ. (గృహ.) తండ్రి నుండి తనకు దక్కిన హక్కు ననుసరించి గృహ యాజమాన్యమును నిర్వహించు పురుషునికి సంబంధించినది(patriarchal). నం, వి. (చరి.) పితృఅధికారము, పితృ వంశీయుల అధికారము గల సాంఘిక వ్యవస్థ.
**పితృమేధము** నం. వి తలిదండ్రులకు చేయు అంత్యకర్మ.
**పిత్తకోశము** నం, వి. (గృహ.) చేదుకట్టె, పైత్యరసమును నిలువచేయు సంచి, పిత్తాశయము (Gall bladder),
**పిత్తము** నం. వి. ఒక ధాతువు (వాత పిత్త శ్లేష్మము లనునవి త్రివిధధాతువులు.)
**పిత్తలము** నం వి. ఇత్తడి.
**పిత్తాశయము** నం. వి., (జం.) కాలేయము నుండి ఊరు పైత్యరసమును నిలువచేయు తిత్తి, పైత్యరసము చేరు సంచి (Gall bladder).
**పిత్రార్జితము** నం, వి పైతృకసంపత్తి. తండ్రివలన గాని లేక పెద్దలవలన గాని ప్రాప్తించిన ఆస్తి.
**పిత్ర్యద్రవ్యావిచ్ఛిన్నత** నం, వి (జీవ.) అనువంశిక లక్షణములు గల సంయోగ కణములలోనున్న జీవద్రవము తరతరము లకు ఎడతెగకుండ ప్రవహించుననుట. (వెయిన్ మాన్ అను శాస్త్రజ్ఞుడీ తము చేసెను) (Continuity of germ-plasm).
**పిత్ర్యద్రవ్యము** నం. వి. (జీవ) అనువంశికమునకు భౌతికాధారమైన పదార్థము, వర్ణేషి, (Germ-plasm) (వ్యావ.) తను ద్రవ్యము (Somatoplasm).
**పిత్ర్యము** నం విశ. పిత్రార్జితము,తండ్రిచే సంపాదింపబడినది.
**పిత్ర్యసూత్రములు** నం, వి. (జీవ.)క్రోమోజోములు, జీవకణము విభజన చెందునపుడు రాని అష్టిలో నేర్పడు క్రోమోటిన్ కడ్డీలు (Chromosomes).
**పిధానము** నం. వి. (జీవ.) మూత, కొన్ని చేపల మొక్క పుప్ఫాంములను మూసియుంచు పైకవచము (Operculum).
**పినద్ధము** నం.విశ.1.కట్టబడినది. (వస్త్రము) 2. తొడుగబడినది. (కవచము).
**పినాకము** నం. వి, 1. శివునివిల్లు. 2. త్రిశూలము.
**పినాకి** నం. వి. శివుడు.
**పిన్న** విశ. చిన్న.
**పిన్ని** వి. పినతల్లి.
**పిపాస** నం. వి. దప్పిక.
**పిపీలిక** నం. వి. చీమ.
**పిప్పిక** నం.వి. 1. పండ్ల పాచి, దంతమలము 2. ఆడుకాటుకపిట్ట.

**పిప్పిపదార్థము** లేదా పొట్టుపదార్థము వి. (గృహ). ఆహారములోని పిప్పి పదార్థములు (Roughage). (అవి మలబద్ధకము లేకుండ చేయును.)

**పిప్పెట్టు** ఇం వి (రసా) (Pipette). ఆయతనాత్మక రాసాయనిక విశ్లేషణ యందు ద్రవముల నియతాయతనము గ్రహించుటకై నిర్మించబడిన గొట్టమువంటి పరికరము (కొలి) ద్రవముల నొక కొలతలో తీసికొనుట కుపయోగపడు పరికరము.

**పిమ్మట** అవ్య. 1 మునుపు. 2. పరోక్షమందు. వి. మనోవ్యథ.

**పిరమిడ్లు** ఇం.వి. (చరి.) (Pyramids) ఈజిప్టులోని పెద్దరాతి కట్టడములు. ఇవి త్రికోణాకారములో ప్రాచీనకాలపు ఈజిపు చక్రవర్తులైన ఫారోలకు స్మారక చిహ్నములుగా కట్టబడినవి (వీనిలో కెల్ల పెద్ద పిరమిడు 'గిజే' పిరమిడు 6 మైళ్ళ పొడవులో 484 అడుగుల ఎత్తు 13 1/4 ఎకరముల వైశాల్యముతో నైలునది యొద్ద నున్నది.)

**పిరి** వి. మెలి, వెంటి. దూ. పురి

**పిఱికి** వై. విశ. భయశీలుడు నం. భీరుకః.

**పిరికిపంద** వి. బెదురుపోతు. పిరికి(Coward).

**పిఱికిమెకము** వై. వి. జింక.

**పిఱుతివియు** క్రి. (పిరుదు+తివియు) వెనుదీయు. జంకు.

**పిఱుసము** వై. వి. పరుషభావము. నం. పరుషమ్.

**పిలక** వి. 1. మొలక. 2. పిలకజుట్టు.

**పిలకలు** వి. (వృక్ష.) అరటి మొదలగు మొక్కల కాండము చుట్టును బయలుదేరు చిన్న చిన్న మొక్కలు (Suckers). దుంపలేక ప్రకాండభాగమునుండి పుట్టి సహజముగ తొడిగి మొక్కలుగ నేర్పడి పెరుగు శాఖలు (Suckers). ఉదా. అరటి. దూ. పిలుక, పిల్క.

**పిలుకుమూచు** క్రి. మరణించు.

**పిల్ఛ్నిక్కర్** ఇం. వి (గృహ) (Pilch knicker) ఇలాస్టిక్ వేసిన జాంగియా.

**పిల్ల** వై. వి. 1. పశ్వాదుల సంతతి. 2. పడుచు. విశ. చిన్నది. నం. పీలుకః.

**పిల్లము** నం వి. తడికన్ను.

**పిల్లమెఱము** వి. తలక్రిందుగ వేయుగంతు పల్లటి.

**పిల్లాకము** నం వి. పక్షిపిల్ల.

**పిల్లాడి** వి స్త్రీ కాలిప్రేలినగ.

**పిశంగము** నం. వి. (రసా) లాగి రంగు గలది. (Brown) నం.వి. కపిలవర్ణము.

**పిశాచము** నం. వి. 1 దేవయోని విశేషము. 2.భూతము.

**పిశితము** నం. వి. మాంసము.

**పిశునుఁడు** నం. విశ. 1. కొండెగాడు. 2. హీనుడు వి. నారదుడు.

**పిష్టము** నం. విశ. (రసా.) చూర్ణముగా చేయబడినది (Pulverised).

**పిష్టకము** నం. వి. 1. కంటిరెప్పలు, 2. పిండివంట.

**పిష్టద్రవ్య సస్యములు** నం. వి. (వ్యవ.) పిండి పదార్థమునిచ్చు పైరులు (Starch crops). ఉదా. ఆలుగడ్డ, కఱ్ఱపెండలము మొదలగునవి.

**పిస** వి. 1. అవివేకము. 2. క్రూరత్వము. 3. కామము.

**పిసరు** విశ. స్వల్పము.

**పిసాళము** వి. 1. వికాసము. 2.పరిహాసము. 3. దొంగయెత్తు.

**పిసిడి** విశ. పిసిని, పిసినారి.

**పిహితము** నం. వి. 1. కనురెప్పమూత. 2 (అలం.) ఒక అర్థాలంకారము. విశ. కప్పబడినది.

**పిళ్లారి** వి. వినాయకుడు. త. పిళ్ళైయార్.

పీకు క్రి. 1. పెరుకు. 2 తీసివేయు.

పీకె వి. 1. నాగస్వరము లోనగు వాద్య ముఖమున చొప్పించు క్రోవిపుల్ల. 2. త్రాగగా మిగిలిన పొగచుట్ట (చుట్టపీకె)

పీకదాను వి. తమ్మపడిగము, నమలిన తాంబూల ముమియు పాత్ర.

పీచమడచు క్రి. 1. సంహరించు 2. పొగరణచు, అహంకా॰ మణచు

పీచువేళ్ళు వి. (వృక్ష.) తల్లి వేరు ప్రత్యేకముగ లేకుండ అన్నియు నారవలెనుండు వేళ్ళు (Fibrous roots).

పీటముడి వి. గట్టిముగ వేయబడ్డ ముడి.

పీటవెట్టు క్రి. లేవక యొక చోటనే పాదుకొని యుండు

పీఠభూమి సం. వి. (భూగో.) లోయల మధ్య నుండు విశాలమైన భూమి. (Plateau).

పీఠము సం. వి. 1. ఇల్లు కట్టుటకు వేసిన పునాది స్థానము (Plinth), 2. పీట.

పీఠసంయోగము సం. వి. (వృక్ష.) ఒక గది మాత్రమే గల అండాశయములో క్రింది భాగమున పుష్పాసనము పై నేర్పడిన జరాయువు మీద పీఠసం నొకబీజాండ ముండు స్థితి యోగము (Basal placentation).

పీఠిక సం. వి. 1. మేలైన పీఠము. 2. గ్రంథ ప్రారంభమున వ్రాయు ఉపోద్ఘాతము.

పీడ సం. వి. బాధ.

పీడన సం. వి. (భూగో.) వాతావరణము యొక్క బరువు.

పీడనబలము సం. వి. (భౌతి.) ఒక వస్తువును కుదించికొని పోవునట్లు నొక్కు బలము (Compression force).

పీడనము సం. వి. రాయిడి ఒత్తిడి. 1. సం. వి. (భౌతి.) ప్రేషము (Pressure,) 2 ఒక చదరపు పరిమాణముపై నుండు బలము.

పీడ్యమానము సం. వి పీడింపబడుచున్నది.

పీత వి. ఎండ్రకాయ.

పీతనగము సం. వి. (జం.) భ్రూణము ఏకభిత్తిక గోళదశయందున్నప్పుడు ఆద్యాంత్రముఖమునకు బిరడావలె నుండు అండపీతముతో నిండిన జీవకణములు (Yolk Plug).

పీతము సం. వి. పసుపురంగు. విశే. త్రాగబడినది.

పీతాంబరుడు సం. వి. పచ్చవలువ ధరించువాడు, విష్ణువు

పీథువు సం. వి. సూర్యుడు. వ్యు. కిరణములచే నీటిని పీల్చువాడు,

పీనము సం. విశే. బలిసినది. వి. సంతోషము.

పీనల్ కోడ్ ఇం. వి. (శాస.) (Penal code). శిక్షాస్మృతి. దండస్మృతి. పీనల్ స్టాట్యూట్ (Penal statute) = శిక్షాస్మృతి. పీనల్ = దండన సంబంధమైన.

పీనజ్వరము సం. వి. జలుబు పడిశముతో వచ్చు జ్వరము. (ఇది ఒక రకపు ఎలర్జీ వలన కలుగు జ్వరము). (Hay fever).

పీనసము సం. వి. పడిసెము.

పీనాహము సం. వి. తాగాడి.

పీనుగు వి. శవము.

పీనోధ్ని సం. వి. పెద్దపొదుగు గల యావు.

పీయూషము సం. వి. 1. అమృతము. 2 జున్ను.

పీల విశే. బక్క.

పలికాఁడు వి. చుక్కాని పట్టువాడు.
పటుకము నం. వి. పక్షిపిల్ల.
పలువు నం. వి. వి. 1 పనుగు. 2. అమ్ము. 3 ప్రమాణువు 4. గోగు. 5 ఱేకు.
పల్పుపురుగులు వి. (వ్యావ.) చెట్టుచేమల వివిధభాగములనుండి రసమును పీల్చు కొను పురుగుజాతులు. ఉదా. నల్లి కుటుంబమునందలి నీళ్ళపురుగులు. పిండి పురుగులు, మొక్కపేను, కొన్ని పొలుసు పురుగులు మొదలగునవి (Sucking insects).
పీవరము నం. విశే. బలిసినది. వి. తాబేలు.

# పు

పుంకేసరనాళము నం. వి. (వృక్ష.) కింజల్కము లన్నియు కలిసి గొట్టముగా నేర్పడిన నిర్మాణము (Staminal tube)
పుంకేసరమకుటము నం.వి. (వృక్ష.) కొన్ని పుష్పములు కింజల్కములపై నగుపడు రోమములు మొదలగు ప్రవర్ధకములు (Staminal corona).
పుంకేసరవలయము నం. వి. (వృక్ష.) ఇది పుష్పములలో ఆకర్షణపత్రములలోపల నుండుమూడవవలయము(Androecium. పువ్వులలో నున్న కింజల్కముల కన్నిటికి ఈ పదము వర్తించును.
పుంఖము నం వి. 1, బాణపుపిడి, 2. పింజ
పుంఖానుపుంఖము నం. విశే. పరంపరగా, ఒకదాని వెంట నింకొకటి. ఉదా. శంఖారవంబులు పుంఖానుపుంఖంబుగా.
పుంగవము నం. వి. వృషభము.
పుంగవుఁడు నం. వి. (సమాసమున ఉత్తర పదమైనచో) శ్రేష్ఠుడు.
పుంజనేలలు వి. (వృక్ష.) మాగాణి లేక పల్లపునేలలు, నీరు విస్తారముగ పెట్టి వరి సాగుచేయు నేలలు (Wet lands).
పుంజన్యము నం. వి. (జీవ.) పురుషసంయోగి కణము (Male gamete).
పుంజన్యధానివృంతము నం. వి. (వృక్ష.) పుం రేణుకోశములు గల శాఖ (Antheridiophore).
పుంజఫలము నం. వి. (వృక్ష.) ఒకే పుష్పము నందు బయలుదేరి, విభక్తకమైన అండాశయము నుండి తయారైన పండు(Aggregate fruit), (ఉదా. సీతాఫలము). చూ. సమూహఫలము.
పుంజము నం. వి. ప్రోవు, గుంపు. రాశి.
పుంజీ వి నాలుగు.
పుంజము వై. వి. 1. ముప్పది యెనికల నూలు. 2. నులక మంచపు కాళ్ళకట్టు తాడు. నం. పుంజః.
పుంజు వి. 1. కోడిపుంజు, కాలజ్ఞము.
పుంట వి. నంధ్య. చూ. పూఁట.
పుండరీకము నం. వి. 1 తెల్లదామర. 2. ఆగ్నేయపు దిక్కునందలి యేనుగు. 3. శార్దూలము.
పుండరీకాక్షుఁడు నం వి. విష్ణువు.
పుండు వి. కురుపు, వ్రణము
పుండ్రము నం. వి. 1. నలుపు గలిగిన ఎఱ్ఱ చెరుకు. 2. తెల్లదామర.3.నుదుటిబొట్టు.
పుంత వై. వి. 1. ఇసుకదారి.2. కాలిబాట. నం. పంథాః.
పుంభావము నం. వి. 1. పురుషత్వము. 2. ప్రౌఢిమము.
పుంరేణుకోశము నం. వి. (వృక్ష.) బ్రయోఫిటములు, టెరిడోఫిటములు అను ఉద్భిజ్జ వర్గములలో నేర్పడు పురుషభాగము (Antheridium). (దీనిలో పురుషరేణు

పులు (యాగుకు.)

పుంలింగము సం. వి. (వ్యాక) పుంస్త్వ బోధకమైన శబ్దము-రాముడు, కృష్ణుడు మొ, నవి.

పుంశ్చలి సం. వి. రంకులాడి.

పుంసవనము సం. వి. 1. గర్భచిహ్నము గల్గినంతనె పురుషుడు పుట్టవలెనని చేయు కర్మము 2. క్షీరము, పాలు.

పుక్క వి. బుగ్గ.

పుక్కిటిపురాణము జాతీ. పుక్కిటి నుండి (నోటినుండి) వెలుపడు వ్యర్థపు పలుకులు నమ్మదగని కథ

పుక్కిలి వి. బుగ్గలోపలి భాగము.

పుచ్ఛడిక వి. 1. సిగ్గరి, 2. సిగ్గు.

పుచ్చు క్రి. 1. ఆజ్ఞాపించు, 2. గ్రహించు. 3 పుచ్చిపట్టు 4 పంపించు. వి.ఆముదపు మడ్డి.

పుచ్చుకోలు వి. 1.ప్రతిగ్రహము. 2. పుచ్చుకొనుట.

పుచ్ఛము సం. వి. తోక.

పుచ్ఛశిఖదాహకము సం. వి. (రసా.) గబ్బిలపు రెక్కవలె వెడల్పుగా నుండువాయు బహిర్గమనద్వారము గల దాహకము (Bat's wing burner).

పుచ్ఛసంబంధి సం. విశే. (జం.) తోకకు సంబంధించినది (Caudal).

పుట వి. పొరట, కాగితమందొకవైపు.

పుటభేదనము సం. వి. పట్టణము రూ. పుటభేదము,

పుటము సం. వి. 1.పూలబుట్ట. 2 దొప్ప. 3. లోహాదుల పుటము వేయుట.

పుటాకారము సం విశే. (భౌతి.) గోళకేంద్రమున కెదురుగా నున్నది (ఉపరితలము). పరావర్తనతలముగాపనిచేయునది. (దర్పణము). లోతైనది పల్లనది (Concave)

పుటాకారపు అర్ధచంద్రాకృతిసం.వి. (భౌతి.) ద్రవపదార్థము యొక్క స్వతంత్రతలము లోని పుటాకారవక్రాకృతి (Concave meniscus).

పుటాకార కటకము సం. వి. (భౌతి.) మధ్యభాగము పలుచగ నుండి అంచుల వద్ద మందముగ నుండు కటకము (Concave lens).


పుటాకార

పుటికట వై. వి. గంప. సం పిటకః. కటకము

పుట్ట వి. 1. వల్మీకము, 2. చిన్నపొద. 3. స్థానము. ఉదా. "రోగముల పుట్ట".

పుట్టకాలు వి. బోదకాలు.

పుట్టకీటు వి. (వ్యావ) పుట్టగోడ.

పుట్టకొక్కు వి. పుట్టగొడుగు, ఛత్రాకము

పుట్టచూలు వి. వాల్మీకి మహర్షి.

పుట్టతేనె వి. పుట్టలో పెట్టిన పెరతేనె.

పుట్టు క్రి. సంభవించు, జన్మించు.

పుట్టుగొడ్డు విశే. పుట్టుక మొదలు గొడ్డుతనము గలది.

పుట్టుగ్రుడ్డి వి. పుట్టుక మొదలు గ్రుడ్డివాడైనవాడు.

పుడమి వై. వి. భూమి. సం. పృథివీ.

పుడమికానుపు వి. 1. సీత. 2.చెట్టు,

పుడమితాలుపు వి. శేషుడు. వ్యు. భూమిని ధరించువాడు.

పుడిసెడు విశే కుదియపట్టిన చేరలో సగము పరిమాణము గలది.

పుడుకు క్రి. 1. కొంచెముగా ఇచ్చు. 2. నిమురు, 3. పిసుకు, 4. కొంచెముగా గ్రహించు.

పుడుకుగల్లు వి. చింతామణి. వ్యు. చానము చేయు రాయి.

పుణ్యక్షేత్రము సం. వి దివ్యక్షేత్రము.

పుణ్యజనుడు సం. వి. 1. నైరృతి. 2. రాక్షసుడు. 3. పుణ్యపురుషుడు.

పుణ్యభూమి సం. వి.వింధ్యహిమాచలమధ్య

సీమ (ఆర్యావర్తము).
పుణ్యము సం. వి. 1.ధర్మము. 2.సుకృతము
పుణ్యాహము సం. వి. పుణ్యదినము.
పుణ్యాహవాచనము సం. వి. 1. అశుద్ధి నివారక కర్మము. 2. వైవాహి కర్మ ప్రారంభమున మంగళార్థము సేయు కర్మ.
పుత్తడి వై. వి. అపరంజి. సం పుటమ్.
పుత్తెంచు క్రి. (పుచ్చు + తెంచు) పంపు పుచ్చు.
పుత్రకామేష్టి సం. వి పుత్రునికోరి చేయు యాగము.
పుత్త్రిక సం. వి. 1. కూతురు. 2. బంగారు బొమ్మ.
పుత్త్రుఁడు సం. వి. కొడుకు, పున్నామ నరకమునుండి రక్షించువాడు పుత్త్రులు పండ్రెండుగురు; ఔరసుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు, గూఢోత్పన్నుడు, అపవిద్ధుడు, కానీనుడు, సహోఢజుడు క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, జ్ఞాతిరేతుడు).
పుదీనాపువ్వు వి. (వ్యవ.) (Spearmint) తులసి కుటుంబము(Labiatae)నకు చెందిన (Mentha viridis) అను పుదీనా మొక్క ఆకునుండి దీనిని తయారు చేయుదురు ఇది ఒక పరిమళద్రవ్యముగను, ఓషధిగను ఉపయోగింపబడుచుండును. ఈ మొక్క ఆకులతో పచ్చడి చేసికొని తినుచుందురు.
పునరుక్తి సం.వి. చెప్పినదే చెప్పుట (అలం) ఒక వాక్యదోషము.
పునరుత్పత్తి సం. వి. (జీవ.) భాగములను మరలసృష్టించుకొనుట (Regeneration) సంతానోత్పత్తి (Reproduction).
పునరుద్ధరణ (ము) సం.వి. మరలఉద్ధరించుట.
పునర్జీవనోద్యమము సం. వి. (చరి.) క్రీ. శ. 14 15. శతాబ్దములలో పశ్చిమ యూరోపున సాంస్కృతికాదిరంగాలలో జరిగిన వికాసము. (ఈ పునర్జీవనోద్యమము మూలమున మానవుడు మూఢవిశ్వాసముల చీకటి తెరను చీల్చుకొని, కేవలము మతగురువులపై ఆధారపడక, క్రొత్త ఆత్మవిశ్వాసము, లౌకిక జ్ఞానము, శాస్త్ర విజ్ఞానము సంపాదించెను. పునర్జీవనోద్యమముతో ప్రపంచ చరిత్రలోని ఆధునిక యుగము ప్రారంభమగుచున్నది ఈ ఉద్యమము ప్రప్రథమముగా ఇటలీ దేశములో ప్రారంభమైనది. [Renaissance].
పునర్నవము సం. వి గోరు వ్యు. తీసివేసినను మరల వచ్చును.
పునర్బీమా వి. (వ్యాప) భీమాపూచీ నిచ్చిన సంస్థ ఆ పై భీమాకు సంబంధించిన వస్తువు లను మరియొక సంస్థలో భీమా చేసి కొనును దీనిని పునర్భీమా యందురు.
పునర్వసు సం. వి. ఒక నక్షత్రము.
పునర్విచారణ సం. వి. (శాస) ప్రత్యాలోచన (Review).
పునశ్చరణము సం. వి. మంత్రము మొక్క పునః పునః పఠనము,
పునస్సన్నివేశకము సం. వి. (గృహ). తిరిగి ఏర్పాటుచేయుట, మరల సవరించుట, తిరిగి సిద్ధపరచుట. (Rearrangement).
పునాసకారు వి (వ్యవ) ఎండకారు, రేవతి అశ్వని.భరణి.కృత్తిక,రోహిణి, కార్తెలు, ఏప్రిల్, మే నెలలు, వసంతఋతువు (premonsoon period)
పునాసపంట వి. (వ్యవ) మే నెల మొదలు ఆగష్టు నెలలోపల చేయు పునాసరకముల వరిసాగు (paddy third crop)
పునాసలు వై. వి. పునర్వసు నక్షత్రమందు సూర్యుడుండినపుడు చల్లిన ధాన్యము.
పునీతుఁడు సం విశే. పవిత్రుడు, శుద్ధుడు.
పునుఁగు వి. పునుగుపిల్లివలన కలుగు సుగంధద్రవ్యము.

పుసుక వి. తలపుఱ్ఱె, తలయెముక.
పున్నమ వై. వి. పూర్ణిమ. సం. పూర్ణిమా. ప్రా పున్నామా.
పున్నాగము సం. వి. 1. పొన్న 2.ఇంద్రుని ఏనుగు. 3 పురుషశ్రేష్ఠుడు.
పున్నెము వై. వి. పుణ్యము. రూ. పున్నియము సం పుణ్యమ్.
పుప్పుస ధమని సం. వి (గృహ.) కుడిజఠరికనుండి ఊపిరితిత్తులలోనికి చెడ్డ రక్తమును కొనిపోవునాళములు (Pulmonary artery)
పుప్పుస ప్రసరణము సం. వి. (గృహ.) రక్తము గుండెనుండి ఊపిరితిత్తులకు చేరి తిరిగి ఊపిరితిత్తుల నుండి గుండెకు చేరునరకు జరుగు రక్తప్రసరణము (Pulmonary circulation)
పుప్పుస సిరలు సం. వి (గృహ.) ఊపిరితిత్తులలో నుండి శుభ్రపరచిన రక్తమును ఎడమ కర్ణికలోనికి గొంపోవు నాళములు (pulmonary vein))
పుప్పుస సం. విశ. (జం.) ఊపిరితిత్తులకు సంబంధించినది. (pulmonary).
పుప్పొడి వి (పూ+పొడి) పుష్పములందలి ధూళి.
పుప్పుసము సం. వి. (జం). క్లోమము, ఊపిరితిత్తి (Lung).



పుప్పుసోదరనాడి సం. వి. (జం.) ప్రాణేశ నాడి పుప్పుసములు (pneumogastric (కప్ప) nerve). (ఇది పదియవ కపోలనాడి. స్వరపేటిక హృదయము, ఊపిరితిత్తి, ఉదరము అనువానికి ఈ నాడిపోవును).
పుబ్బ వి. పూర్వఫల్గునీ నక్షత్రము. త పుబ్బె.
పుయిలోట వి వెనుదీయుట, సంకోచము.
పురందరుడు సం. వి ఇంద్రుడు.వ్యు.శత్రుపురముల నాశమొనర్చువాడు.
పురంధ్రి సం. వి. కుటుంబిని,స్త్రీ.
పురఃకర్ణాస్థి సం వి. (జం) శ్రవణ ప్రావరములో నున్న ఎముక భాగము(pro-otic).
పురంజించు వై. క్రి. విజృంభించు. రూ. పురణించు.
పురపాలకీకరణము సం. వి. (వాణి.) ఒక పరిశ్రమను పురపాలక సంఘము అధీనము చేసికొనుట. (సాధారణముగ విద్యుచ్ఛక్తి,నీటి సరఫరా, పాలసరఫరా, ఊరిలో ఒక చోటునుండి మరియొకచోటికి పోవు బస్సు రవాణా,పురపాలక వర్గము యొక్క ఆధీనములో నుండును )
పురము సం. వి. 1. పట్టణము. 2. శరీరము 3. ఇల్లు.
పురస్కారము సం, వి. 1. ముందిడుట. 2. పూజనము.
పురస్కృతము సం. విశ. పూజింపబడినది.
పురాకృతము సం. విశ. పూర్వకర్మమునే చేయబడినది (శుభాశుభ కర్మము).
పురాణపురుషుడు సం. వి విష్ణువు.
పురాణము సం. వి. సర్గము, ప్రతిసర్గము. వంశము, మన్వంతరము వంశానుచరితము అను నైదు లక్షణములు గల గొప్ప గ్రంథము, పురాణములు పదునెనిమిది. అవి—బ్రహ్మ పద్మ విష్ణుభాగవత నారదీయ మార్కండేయాగ్నేయ భవిష్యత్ బ్రహ్మవైవర్త లింగ వరాహ వాయు స్కాంద వామన కూర్మ మత్స్య గరుడ బ్రహ్మాండములు.
పురాణములు సం. వి. ( చరి. ) ప్రాచీనేతిహాసములతో కూడిన పదునెనిమిది మహాకావ్యములు. సూర్య చంద్ర వంశపు రాజుల వంశావళులు, మహర్షుల వంశావళులు చెప్పు హైందవధర్మకావ్యములు. వీనికిని మహాభారతమునకును సన్నిహిత

సంబంధము కలదు. పురాణములలో ముఖ్యమైనవి గరుడ కూర్మ మత్స్య-- అగ్ని మార్కండేయ పద్మ బ్రహ్మ వైవర్త విష్ణు భాగవతస్కాంద శివ లింగ భవిష్యత్ పురాణములు.

పురాణించు వై. క్రి. 1. వర్ధిల్లు 2. విజృంభించు నం. పురాణమ్. నం. క్రి. పురాణము చెప్పు

పురాతత్వశాస్త్రము నం. వి. (చరి) ప్రాచీన వస్తుశాస్త్రము. (Archaeology). పురాతత్త్వశాస్త్రజ్ఞుడు=పురాతత్త్వశాస్త్రము తెలిసినవాడు(Archeaologist)

పురాతనకఠినశిలాపర్వతములు నం. వి. (భూగో.) పర్వతప్రాంతములలో కొన్ని పగుళ్ళ మూలముగ పర్పడిన కఠిన శిలా పర్వతములు.

పురాతనము నం. విశ. ప్రాతది.

పురి వి. 1. మెలి. 2, నెమలి పించము. 3. ఆక్రమణము

పురికొను క్రి. వ్యాపించు

పురికొలుపు క్రి. ప్రేరేపించు.

పురీతత్తు నం, వి. ప్రేవు.

పురీషనాళము నం. వి. (జం.) అన్నవాహిక యొక్క చివరి భాగము. (Rectum) దీనిలో మలముండును పురీషనాళ సంబంధి =Rectal.

పురీషము నం. వి. మలము.

పురుగు వై. వి. క్రిమి, పురువు. నం.పులకః,

పురుడించు క్రి. పోలికయగు.

పురుడు వి. జాతము, జాతాశౌచము. విశ. సమానము.

పురులోము క్రి. పరాక్రమము చూపు.

పురుషకారము నం. వి. పురుషప్రయత్నము.

పురుషాంతరము నం. వి. తరము.

పురుషార్థములు నం. వి. ధర్మార్థకామ మోక్షములు.

పురుషుడు నం. వి. 1. మనుష్యుడు. 2. పరమాత్మ

పురుహూతుడు నం. వి ఇంద్రుడు. పూర్వి యజ్ఞముల౦ దెక్కువగ పిలువబడువాడు.

పురోగమనము నం. వి. ముందుకు వెళ్లుట, ప్రగతి, అభ్యుదయము.

పురోడాశము నం. వి. 1. యజ్ఞార్థమైన అపూపము. సోమలతరసము. 2. హుతశేషము,

పురోనితంబాస్థి నం. వి. (జం.). తుంటి ఎముకలలో నొకటి (pubis).

పురోహితుడు నం వి. 1. యాజ్ఞికుడు 2, పౌరోహిత్యముచేయు బ్రాహ్మణుడు.

పుర్వాంగికము నం వి. (జం.) పోషి సంజీవము చుట్టును అంగములు గల నోటి వంటి అవయవము (polyp).




పుఱ్ఱి విశ. ఎడమ.

పుఱ్ఱె వి. (గృహ.) తల ఎముకల (సుకుమారము యొక్క) గూడు(Cranium).

పులకండము వి. కండ చక్కెర, కలకండ.

పులకము నం. వి. 1. పులగము. 2, పురుగు.

పులకరము వై. వి. 1. జ్వరము. 2. గగుర్పాటు. నం. పులకః.

పులి విశ. 1. నల్లని. 2. పులిసినది. వి, శార్దూలము.

పులికోచ వి ఒక విషజాతి సాలెపురుగు,

పులిత్రేపు వి అజీర్ణపుత్రేపు.

పులినము నం. వి. ఇసుక తిన్నె.

పులిమోర వి. (వ్యావ.) పులుసులోనగునవి కలిపిన అన్నము, చిత్రాన్నము. పులి

యోగిరము (పుల్లని అన్నము).(వ్యావ.) పులిహోర.

పులు వి. 1. తృణము. 2. రత్నమాలిన్యము. (పులుగడిగిన ముత్యము).

పులుఁగు వి. పిట్ట,

పులోటజము సం. వి. గొడుగు,

పులోమజ సం. వి. శచీదేవి. వ్యు. పులోముని కూతురు,

పుల్కసుఁడు సం. వి. 1. బోయ. 2.మాల. 3. అధముడు. రూ. పుల్కసుఁడు.

పుల్ల విణ పులుపు గలది వి. పుడక.

పుల్లవిరుగుడు తెగులు వి. (వ్యావ.) చెట్ల కొమ్మలు, రెమ్మలు నీరసించి ఆకులు రాలిపోయి యెండిపోవుట (Die back disease). ఉదా. నారింజ, మామిడి మొ. ఇది యొకజాతి శిలీంధ్రము వలన కల్గును

పుల్లసిలు క్రి. భయాదులచే వివర్ణమగు. భయపడు. రూ పుల్లసిల్లు.

పుల్లావు వి. కపిలగోవు.

పువు వై వి.పుష్పము రూ.పువ్వు నం పుష్పమ్.

పువుఁబోఁడి వి. అందగత్తె. రూ.పువ్వుబోడి. పూబోడి.

పువ్వారలు వి. (జం.) మొప్పలు. నీటిలో నివసించు జంతువు (చేప మొ.) యొక్క శ్వాసావయవములు (Gills).

పువ్వువిలుతుఁడు వి. మన్మథుడు. రూ. పువ్విలుతుడు.

పుషితము సం. విణ. 1. పోషింపబడినది. 2. పుష్టము.

పుష్కరము సం వి. 1. మెట్టతామరదుంప 2. తామర. 3. ఆకాశము. 4. నీరు. 5, తొండముచివర. 6. ఒక ద్వీపము. 7. పంద్రెండేండ్ల కొకసారి వచ్చు జీవనదుల పండుగ.

పుష్కరిణి సం. వి. 1. తామరకొలను, కోనేరు, 2. ఆడేనుగు.

పుష్కలము సం. విణ. 1. శ్రేష్ఠము. 2. సమృద్ధము.

పుష్టి సం వి. 1. బలుపు, సమృద్ధి.

పుష్పంధయము సం. వి. తుమ్మెద.

పుష్పకము సం. వి. 1. కుబేరుని విమానము. 2. రత్నకంకణము. వి. (వృక్ష.) ముండక పుష్పమంజరిలోని పూవు (Floret).

పుష్పకరండకము సం. వి. (గృహ.) పువ్వులను పెట్టుకొను కూజా, పువ్వులనమర్చు గిన్నె (Flower vase or bowl).

పుష్పకోరకము సం. వి. (వృక్ష.) పూమొగ్గ (Flower bud).

పుష్పగుచ్ఛదండము సం. వి. (వృక్ష) పుష్పమంజరి యొక్క ప్రధానాక్షము (Peduncle).

పుష్పచిత్ర ఫలకము సం. వి. (వ్యావ.) రమ్యముగా పూలమొక్కలచే ఏర్పరుపబడిన వివిధాకారములు గల మడులు (Ornamental flower beds).

పుష్పదళ రహితము సం.వి. (వృక్ష )ఆకర్షక రక్షక పత్రముల రెండువరుసలలో నొకటి గాని రెండునుగాని లోపించినది (Apetalous).

పుష్పదళవిన్యాసము సం. వి. (వృక్ష.) పుష్పదళములగు రక్షకపత్రములుఆకర్షణ పత్రములు వాని అంచులతో పరస్పరముగా నమర్చబడిన తీరు (Aestivation)

పుష్పనిర్మాణచిత్రము సం. వి, (వృక్ష.) పుష్పములోని వివిధ దళముల కూర్పును తెలియచేయు పటము(Floral diagram)

పుష్పపథకము సం, వి. (గృహ.).పువ్వుల చిత్రములతో తయారుచేసిన నమూనా (Floral design).

పుష్పపరాగము సం. వి. (వృక్ష.) పుప్పొడి (pollen). పరాగ రేణువులు =pollen grains.

పుష్పపరికోశము నం. వి (వృక్ష..)పుష్పము యొక్క రక్షకపత్రములకు, ఆకర్షణ పత్రములకు భేదము లేక రెండును ఒకే మాదిరిగా నున్నచో ఆ రెండు వలయము లకు ఈ పదము వర్తించును. పుష్పని చోళము (perianth)

పుష్పమంజరి నం. వి. (వృక్ష) పూలగుత్తి (Inflorscence).

పుష్పము నం వి. 1.సుమము, పూవు. 2 (స్త్రీ) రజస్సు.

పుష్పయుతములు నం వి.(వృక్ష.) పుష్పించు మొక్కలు (phanerogams). (సంవృత బీజకములు, వివృతబీజకములు).

పుష్పరసము నం. వి. మకరందము.

పుష్పరహితము నం. వి. (వృక్ష) పుష్ప ములు పండ్లు, గింజలుగాక వేరొకమాదిరి అవయవముల ద్వారా పునరుత్పత్తి చేసి కొను మొక్కలు (Cryptogams). ఈ మాదిరి మొక్కలకు పునరుత్పాద కావ యవములు పైకి స్పష్టముగా నగుపడవు (థాలోఫిటములు, బ్రయోఫిటములు. టెరిడోఫిటములు).

పుష్పవంతులు నం. వి. సూర్యచంద్రులు.

పుష్పవతి నం. వి. రజస్వల, ముట్టుత.

పుష్పవృంతము నం. వి. (వృక్ష.)· పువ్వు యొక్క తొడిమ (Pedicel) పుష్పవృం తము కల=(Pedicellate).

పుష్పశరుడు నం. వి. మన్మథుడు.

పుష్పసమయము నం. వి. వసంతఋతువు

పుష్పసూత్రము నం వి (వృక్ష.) పువ్వు యొక్క సమిష్టి, లింగము. పుష్పదళ ముల సంఖ్య, వాని కలయిక, అండకో శము యొక్క స్థితి మున్నగు వానిని తెలియచేయు సూత్రము. (Floral for mula).

పుష్పోదికములు నం. వి. (గృహ.) పుష్ప ముల కొరకు, రమణీయత కొరకు పెంచ బడు మొక్కలు (Flowers and plants) ఉదా గులాబి, క్రోటనులు మొ.

పుష్పాలంకరణము నం. వి. (గృహ.)పువ్వు లను ఆకులను చేర్చి వివిధాకార పాత్రలలో కాని గాజుగిన్నెలలో కాని అలంకార ముగానమర్చుట(Flower arrangement)

పుష్పాసనము నం. వి. (వృక్ష) పుష్ప పీఠము, పుష్పవృంతము యొక్క వెడ ల్పయిన పీఠమువలె నుండు భాగము. దీనిపై పుష్పదళములమర్చబడియుండును (Torus or thalamus or receptacle)

పుష్పిణి నం. వి. పుష్పవతి.

పుష్యము నం. వి. 1. ఒక నక్షత్రము, 2. పౌషమాసము.

పుష్యరాగము నం. వి తెల్లని యొకమణి

పుస్తకము నం. వి. పొత్తము.

పుస్తె వి. తాళిబొట్టు.

పుళిందుడు నం. వి.బోయ (భాషాజ్ఞానమే లేక అడవిలో తిరుగు బోయ).

# పూ

పూంచు క్రి. 1 పూనించు. 2.ధరించు. రూ. పూనుచు, పూన్చు,

పూచు క్రి. పూను.

పూట వి. 1. సంధ్య. 2. సమయము. 3. దినము. 4. పూచీ, 5. తాకట్టు.

పూటకాపు విశే. 1. జవాబుదారు. 2. ప్రతిభువు.

పూటపడు క్రి. ఒకనికి బదులు అపని నేను చేసెదనని ఒప్పుకొను.

పూడులు విశే. అనేక సంవత్సరములు. రూ. పూండ్లు. (జాతీ. పండ్లు పూండ్లు.).

పూత వి. 1. చందనము. 2. పాలగచ్చు.

పూఁదట వి. పుష్పసమయము, వసంత ఋతువు.
పూఁదేనియ వి. మకరందము.
పూఁప వి. 1. పూనిక. 2. సత్తువ. 3. శౌర్యము.
పూగము నం. వి. పోక.
పూచి వి. 1. బాధ్యత. 2. కార్యభారము, దూ. పూచీ.
పూచినతంగేడు (జాతీ.) సిరిసంపదలతో తులతూఁగు—సంసారము.
పూచు వై. క్రి. 1. పుష్పించు. 2. నిస్సారమగు. 3. గొడ్లకు తప్పు సుళ్ళు కల్గు.
పూజ నం. వి. 1, సపర్య. 2. అర్చన.
పూజనీయుఁడు నం. విశే. పూజింపదగినవాడు.
పూజె వై. వి. ఘటాదుల మీది చిత్రము. నం. పూజా
పూజారి వి. పూజచేయువాడు, అర్చకుడు.
పూటము వి, బరువు.
పూడి వై వి. చిన్నగ్రామము. నం. పూర్.
పూడిక వి. నూతిలో అడుగున పేరుకు పోయిన మన్ను.
పూడ్రెటు ఆం. వి. (వ్యవ). (Poudrette). మానవ పురీషము నుండి వాసనలేకుండ తయారుచేసిన పొడి ఎరువు.
పూతము నం. విశే, పరిశుద్ధమైనది.
పూతిగంధము నం. వి. దుర్గంధము.
పూతిదోష విరోధి నం.వి. (గృహ.) కుళ్ళును విరుగుడు చేయునది (Antiseptic), ఉదా. డెట్టాల్, ఫినైల్ మొదలగునవి.
పూతిభుక్కు నం. వి. (జీవ) కుళ్ళినపదార్థములపై పెరుగు జీవి (Saprophyte).
పూదియ వి. బంగారుపూవ,
పూనిక వి. 1. యత్నము. 2. సన్నాహము. 3. పట్టుదల.
పూనీరు వై. వి. పన్నీరు. నం. పుష్పనీరమ్.
పూను క్రి. 1. కడగు. 2. ధరించు 3. వహించు.
పూనూనె వి. సంపెంగనూనె.
పూప వి. 1. పూసిందె, 2, శిశువు. 3. కంటిపాప. విశే. లేత,
పూపము నం. వి. అపూపము, అప్పము.
పూయము నం. వి. 1. చీము. 2. పీనుగు.
పూయు క్రి. అలదు. మెత్తు.
పూరకకోణము నం. వి. (గణి.) దత్తకోణముతో కలసి ఒక సమకోణమయ్యెడి కోణము (Complementary angle).
పూరకము నం. వి. ఊపిరి నిండించుట. విశే. నించునది.
పూరగించు వై. క్రి. నెరవేర్చు. దక్కు.
పూరణము నం. వి. 1, నించుట. 2 గుణించుట. 3 పూర్ణము. 4. బూరెలు మొదలగు పిండివంటలలో చేర్చెడు పప్పు బెల్లము ముద్ద. వి. (భౌతి.) 1. విద్యుదీకరణము (Charge). 2. ఆవేశము. 3. భరణము.
పూరము నం, వి. జలప్రవాహము.
పూరి వి. 1. తృణము. 2. మృగముల చనుపాలు.
పూరుషుఁడు నం. వి. మనుష్యుడు.
పూరేడు వి. ఒకరకము పక్షి.
పూర్ణకీటకదశ నం. వి. (జం.) రెక్కలతో ప్రౌఢస్థితిలో నున్న కీటకదశ (Imago).
పూర్ణపాత్రము నం. వి. 1. దోపు. 2. ఉత్సవసమయమున సంతోషముచే వస్త్రాభరణాదిక మపహరించుట. 2. వస్తుసంపూర్ణపాత్రము.
పూర్ణభాజనము నం. విశే. (జం). అండము సంపూర్ణముగా జీవకణములుగా విభజన చెందునట్టి (Holoblastic).
పూర్ణము నం. వి. (గణి.) భిన్నముకాని అంకము (Whole number). విశే. 1. పరి

పూర్ణము. 2. కల్పితమైనది.

పూర్ణాంకము సం వి. (గణి.) భిన్నముకాని సంఖ్య (Integer).

పూర్ణాంశభాగము సం. వి. (గణి.) సంవర్గమానములోని పూర్ణాంకభాగము. (Charactaristic.)

పూర్ణానకము సం. వి. 1. తప్పెట. 2. పూర్ణపాత్రము.

పూర్ణాహుతి సం. వి. హోమాంతమందు ప్రీతికై పరమద్రవ్యాదులతో చేయు హోమము.

పూర్ణిమ సం. వి. పున్నమ, అఖండచంద్రుడుగలది

పూర్తము సం.వి. నూతిని, చెరువును త్రవ్వించుట, గుడి కట్టించుట, తోట నిర్మించుట, అన్నము పెట్టుట. విశ. నింపబడినది.

పూర్‌లా ఇం. వి. (శాస) (Poor-law). దారిద్ర్య నివారణచట్టము, దరిద్రులకు సంబంధించిన శాసనములు,

పూర్వ సం. వి. తూర్పు.

పూర్వకుహరము సం. విశ. (జం.) ముందు భాగము దొప్పగానున్న (Proceolous). వెన్నుపూసలకున్నట్లు.)

పూర్వజన్యావర్తనవాదము సం. వి. (జం.) తన జాతియొక్క పూర్వపరిణామదశలను మార్పుచెందని రూపములలో ఒక ప్రాణి తన జీవిత చరిత్రలోకనపరచుననుసిద్ధాంతము (Recapitulation theory).

పూర్వపదము సం. వి. (గణి.) నిష్పత్తిలోని మొదటి పదము (Antecedent).

పూర్వపుంపక్వము సం.విశ.(వృక్ష.) పుష్పములో నున్న కింజల్కములు కీలాగ్రము కంటె ముందుగా పక్వదశకువచ్చిన (స్థితి) (protandrous).

పూర్వము సం. విశ. మొదటిది. (జం.) ముందుగానున్న (Anterior).

పూర్వయుగము సం. వి. (చరి.) చరిత్ర వ్రాయుటకు లిఖితాధారములు లేని కాలము.

పూర్వ స్త్రీ పక్వము సం. విశ. (వృక్ష.) పుష్పములోనున్న కింజల్కముల కంటె ముందుగా దానిలో నున్న అండకోశము పక్వ స్థితికి వచ్చిన(స్థితి) (Protogynous).

పూర్వాంగ సంబంధము సం. విశ. (జం) శరీరము ముందరి అవయవములకు సంబంధించినది (Brachial).

పూర్వాంగ జాలకము వి. పూర్వాంగములో ప్రవేశించుటకు ముందు ఏర్పడిన నాడుల యొక్క వల (Brachial plexus).

పూర్వాభాద్ర సం. వి. ఇరువదియైదవ నక్షత్రము.

పూర్వాషాఢ సం. వి. నీటిరిక్క. (27 నక్షత్రములలో నిరువదవ నక్షత్రము).

పూర్వాహ్ణము సం.వి. దివ పూర్వభాగము. రేపగలు.

పూర్వోత్తర (ము) సం. వి. 1. ఈశాన్య దిగ్భాగము. 2. ముందువెనుక,

పూలము సం. వి. గడ్డికట్ట.

పూషుడు సం. వి. సూర్యుడు.

పూస వి. 1, పూరె. 2. మణి. 3. వ్రేలులో నగు వాని కీలు.

పూసగ్రుచ్చినరీతి జాతీ. వివరముగా.

# పృ

పృక్తము సం. విశ. కూడుకొన్నది.

పృచ్ఛ సం. వి. ప్రశ్నము.

పృచ్ఛించు సం. క్రి. ప్రశ్నము చేయు, అడుగు.

పృతన నం. వి. దండు. 242 రథములు, 243 ఏనుగులు, 729 గుఱ్ఱములు, 1215 కాల్బలము గల సేన.

పృథక్కరణము నం. వి (భౌతి.) కలిసి యున్న రంగులను విడదీయు ప్రక్రియ (Despersion).

పృథక్పక్వత నం. వి. (వృక్ష) ఒక పుష్పములోనున్న కింజల్కములు అండకోశము వేర్వేరు సమయములలోపక్వస్థితికివచ్చుట (Dichogamy).

పృథగ్జనుఁడు నం. వి. 1. నీచుడు. 2. మూర్ఖుడు.

పృథగ్విధము నం. విశే. పెక్కు విధములు గలది

పృథివి నం. వి. పృథ్వి. భూమి. వ్యు. పృథు చక్రవర్తిచే చక్కచేయబడినది, విశాలమైనది.

పృథుకము నం. వి. 1. అడుకులు. 2. శిశువు.

పృథుక్రిములు నం. వి. (జం) చదునుగా తేపువలె నుండు క్రిములు(Platyhelminthes).

పృథులము నం. విశే, విరివియైనది.

పృథువు నం. విశే, గొప్పది. వి. ఒకరాజు.

పృదాకువు నం. వి. 1. పులి. 2. పాము. 3. తేలు,

పృశ్ని నం. విశే. కిరణము. విశే. 1.పొట్టిది. 2. చిన్నది

పృషతము నం.వి. 1. దుప్పి. 2. నీటిబొట్టు విశే. బ్రహ్మబిందువుతో కూడినది.

పృషత్కము నం. వి. అమ్ము. బాణము.

పృషదంశకము నం. వి. మార్జాలము.

పృషదశ్వుఁడు నం. వి. వాయువు.

పృష్టము నం. విశే. అడుగబడినది.

పృష్ఠకటి సంబంధము నం. విశే. (జం.) వీపు నడుమునకు సంబంధించినది(Dorso-lumbar)

పృష్ఠనితంబాస్థి నం. వి (జం.) తుంటి ఎముకలలో నొకటి (Ilium).

పృష్ఠఫలకము నం. వి. (జం) కీటకముల ఉదరపంజరము యొక్క ప్రతిభాగమునకు గల బాహ్యాకంకాళములో పృష్ఠభాగమున నుండు కైటిన్ పట్టము (Tergum).

పృష్ఠము నం. వి. 1. ముడ్డి. 2. పెండు. 3 వీపు. 4 వెనుకప్రక్క. విశే. (జీవ.) పైభాగమునకుగాని, వెన్నుభాగమునకు గాని సంబంధించినది. (Dorsal). క్రింది భాగమునకుగాని, రొమ్ము భాగమునకు గాని సంబంధించినది (Ventral).

పృష్ఠమేరువు నం. వి. (జం.) పృష్ఠవంశిన జంతువుల భ్రూణముఅభివృద్ధిచెందునప్పుడు దేహకుహరము యొక్క పృష్ఠభాగమున ఏర్పడిన ఊచవంటి నిర్మాణము దీని చుట్టును తరువాత వెన్నుపాము ఏర్పడును, మేరుమంత ప్రాణులకు ముఖ్య లక్షణముగా జీవకణ కోశములతో నేర్పడిన కడ్డీ. దీని స్థానమున పృష్ఠవంశిస ప్రాణులలో వెన్నెముక ఏర్పడును(Notochord)

పృష్ఠలగ్నము నం. విశే. (వృక్ష.) కింజల్కము యొక్క దండము పుప్పొడితిత్తి వెనుక భాగమున అంటుకొని యున్న (స్థితి ) (Dorsifixed).

పృష్ఠవంశము నం. వి. (జం.) వెన్నెముక (Vertebral Column-Backbone).

పృష్ఠవంశినము నం. వి. (జం.) వెన్నెముక గల జంతువు (Vertebrate).

## పె

పెంకు వి. 1. ఇంటి కప్పున కుపయోగించు ఒడుబిల్ల. 2. కుండముక్క. 3 తలపెంకు.

పెంకెతనము వి. చెప్పినమాట వినకుండుట, మూర్ఖత.

పెంచు క్రి. పోషించు.

పెంట వి. 1. మేకలులోనగు వాని పేడ. యూ పెంట్రిక 2 ఇంటి పెంట, చెత్త కసవు

పెంట వై. వి. పేట, శాఖానగరము. సం. పింతా.

పెంటి వి. పశుపక్ష్యాది స్త్రీ జాతి.

పెండ వి. పేడ.

పెండియము వి పెండెము, దొడ్డివాకిటికి పెట్టు పెండెము.

పెండిలి వి. వివాహము యూ. పెండ్లి.

పెండ్లము వి. భార్య యూ. పెండ్లాము.

పెండ్లి వి. వివాహము.

పెందలకడ విశ. ప్రొద్దుపోకమునుపు, యూ. పెందలాడ.

పెందిరువడి వి. గరుడుడు (వైష్ణవపరిభాషయందు.)

పెందెరువు వి. రాజమార్గము.

పెంపు వై. వి. 1. సమృద్ధి. 2. నాశము. 4. గౌరవము. 4 మహాత్త్వము. 5. నాశముచేయు సం. 1. వృధ్, 2. భంజ్

పెకలు క్రి. 1. పెల్లగిలు, 2. ప్రయాణమగు

పెక్కణము వై. వి. 1. అభినయముతోడి నృత్యము. 2. మల్లరంగము. సం. ప్రేక్షణమ్.

పెక్కు వై. సర్వ. అనేకము. సం. పుష్కలమ్.

పెచ్చు వి. 1. అతిశయించు, 2. కొనరు. 3. బెరడు. విశ. అధికము.

పెటిషన్ ఆం. వి. (Petition) అర్జీ.

పెటుకుమాట వి. విరసపుమాట.

పెట్టు క్రి. 1. నాటు. 2. ఉంచు. 3. ఇచ్చు. 4. మోపు.

పెట్టుడు వి. ఈవి.

పెట్టుబడి వి (అర్థ.) మూలధనము (Capital) ఒక సంస్థకు చెందినశాశ్వతమైనవియు తదితరమైనదియునగు ఆస్తి యంతటిలో నున్న సొమ్ము, పెట్టుబడి పలుకములుగ సేకరింపబడియుండవచ్చును. వాటాలు ఋణపత్రములవలననే కాక గతసంవత్సరములలో ఆర్జించిన లాభములో వాటాదారులకు పంచిపెట్టని భాగములు కూడ బెట్టి సమకూర్చవచ్చును. ఒకపారిశ్రామికమైన లేక వాణిజ్య సంబంధమైన ఆర్థికమైన సంస్థ పనిచేయుటకు ఉపయుక్తమగుచున్న మొత్తము ధనము, మూలధనము, ఋణములు, వాటాదారులకు పంచి ఇయ్యని లాభములనిధి ఇవియన్నియుకలిసిన మొత్తము.

పెట్టుబడి ఆస్తి వి. (అర్థ.) వ్యాపారమును నడపుటకు ఉపయోగించు ఆస్తి, యంత్రసామగ్రులు (Capital assets).

పెట్టుబడిదారి విధానము మి. వి. (అర్థ.) ధనస్వామ్యము, ఆర్థిక రంగములో వైయక్తికముగ పెద్దతరహా పెట్టుబడు లను పెట్టు విధానము. (ఒక్కొక్కప్పుడు లాభమే ముఖ్యోద్దేశముగ గల ఈ విధానములో కార్మికులకు ఇక్కట్లు సంభవింపవచ్చును.(Capitalism).

పెట్టుబడిదారు వి. (అర్థ) సంస్థకు కావలసిన ధనము నిచ్చినవాడు.

పెట్రిషియన్ ఆం. వి. (చరి.) (Patrician)· కులీనుడు, ప్రాచీన రోమను సామ్రాజ్యమునకు చెందిన ఉన్నత వంశీయ పౌరుడు.

పెట్రోలు ఆం. వి. (Petrol) భూగర్భమున లభించు తైలము. మోటారు బండ్లు మొ. వానికి ఇంధనముగా వాడుదురు.

పెట్లకంబము వి. ఆదురువేటుగొట్టము, మందు కూరి ప్రేల్చుగొట్టము.

పెట్లు వి. పెట్టులు, దెబ్బలు, క్రి. కాలిపోయి ప్రేలుడుతో పగులు.

పెట్లుప్పు వి. లవణ విశేషము.

పెడ వై, విణ 1. పెద్ద. 2. వెనుకటివి. 3. విపరీతము. సం. వృద్ధః.

పెడక వై. వి. కత్తి ఆకు మొదలగువాని వెనుక భాగము. సం. పృష్ఠకమ్.

పెడకేలు వై. వి. వెనుకకు త్రిప్పినభుజము.

పెడదారి వై. వి. తప్పుత్రోవ.

పెడనెల వి. తీ వ్రరి.

పెడబాయు క్రి. ఎడబాయు, వేరుపడు.

పెడబొబ్బ వి. యుద్ధమునం దుత్సాహముచే చేయు ధ్వని, విపరీత ధ్వని

పెడమరలు క్రి. వెనుకకు తిరుగు. రూ. పెడ మర్లు.

పెడనగము వి. మౌర్ఖ్యము, మూఢత్వము.

పెథాలజీ ఇం. వి. (Pathology). రోగలక్షణ శాస్త్రము, రోగనిదాన తంత్రము.

పెద్ద వై, వి. 1. వృద్ధుడు 2. జ్యేష్ఠుడు, 3. అధికుడు. 4 శ్రేష్ఠము, 5 దీర్ఘము. 6 అత్యంతము. సం. వృద్ధః. పృథుః.

పెద్దకర్మ మి వి. మరణించిన వ్యక్తికి హిందువులు ఒక పక్షములోపల చేయు శ్రాద్ధ కర్మ.

పెద్దకారూ వి. (భూగో.) దక్షిణాఫ్రికా లోని ఉన్నత పీఠభూమి, కేపుకాలనీ సముద్రపు ఒడ్డున రెండు మెట్లుగా దిగుచున్నది, వీనిని పెద్దకారూ, చిన్నకారూ అందురు (Great-Karoo).

పెద్దగుద్దలి వి. (వ్యవ.) గొప్పు త్రవ్వుట కుపయోగించు పారసంటి చేతి పనిముట్టు (Big hand- hoe).

పెద్దతల విణ. పెద్దగా నుండి కార్యము నడపించువాడు.

పెద్దనిద్దుర వై. వి మరణము. దీర్ఘనిద్ర.

పెద్దనెల వి. జ్యేష్ఠమాసము,

పెద్దపోగు వి. (గృహ.) కూర్పుసేయుట. టాకాసేయుట, పొడుగుకుట్లతో కుట్టుట (Tocking)

పెద్దమ్మ వై వి 1 జ్యేష్ఠాదేవి. 2. పెద్దతల్లి.

పెద్దరోగము మి వి కుష్ఠువు

పెద్దివారము మి తి. బుధవారము.

పెద్దవిన్నపము వి. 1. చెవుడు 2 గొప్ప మనవి.

పెన వి. 1. మెలిక. 2. బంధము.

పెనంకువ వి. 1. మేళనము. 2. చుట్టుకొనుట, 3. వివాదము, కలహము

పెనంగు క్రి 1. పెనగొను. 2 చుట్టుకొను 3 మారాడు 4. యుద్ధముసేయు.

పెనపరి విణ (పెనపు + అరి) వివాదశీలుడు

పెనము వి. అప్పముల కాల్చు ఇనుప రేకు.



పెనికుట్టు

పెనికుట్టు వి. (గృహ.) సూదికి దారమును చాల సారు చుట్టి పువ్వులు ఆకులతో నమోనానుకుట్టుట (Bullion stitch),

పెనుపు వి. పెంపు ఆధిక్యము, వృద్ధి.

పెనుమనసము వి. (పెనుపు + మనసము) కాశీ. వారణాసి.

పెనుమినుకులు వి. వేదము.

పెనులోయ వి. (భూగో.) నదీ ప్రవాహము వలన కలిగిన శిలల నడుమ లోయ లేక కందకము (Canyon).

పెనువెల్లి వి. ఏకార్ణవము జలప్రళయము

పెన్న వై, వి. పినాకినీ నది. సం. పినాకినీ

పెన్సిలిన్ ఇం. వి. (Pencillin) కొన్ని రోగములను నివారించుటకు వాడుమందు.

పెప్టోనులు ఇం. వి. (గృహ.) (Heptones) మాంసకృత్తులు సగము జీర్ణమైన అవస్థలో జనించు ద్రవ్యములు.

పెప్పర్మింటు ఇం, వి (వ్యావ) (Peppar-mint) తులసి కుటుంబమునకు చెందిన Mentha piperata అను మొక్క ఆకుల నుండి దీనిని తయారుచేయుదురు. (ఇది పరిమళద్రవ్యముగను ఓషధిగను ఉపయోగపడును.)

పెయ్య వి. పత్స, ఆడుదూడ రూ. పేయ.

పెర వి తేనెతెట్టె.

పెరటితోటలు వి.(వ్యావ.) ఇండ్లలో దైనందినావసరములకు పనికివచ్చుటకై వేయబడు కూరగాయల తోటలు (Kitchen-gardens)

పెరిక్లిస్ యుగము మి వి. (చరి.) పెరిక్లిస్ పరిపాలనలో (క్రీ. పూ 5 వ శతాబ్దము) ప్రాచీన గ్రీకు సంస్కృతి ఏథెన్ నగరములో పరిపూర్ణ వికాసము చెందుటచే ఈ కాలమునకు 'పెరిక్లిస్' యుగ మని పేరు వచ్చెను.

పెరిస్కోపు ఇం. వి. (భౌతి) (Periscope) పై భాగములలో జరుగు విషయములను క్రింది నుండి తెలిసికొనుట కుపకరించు పరికరము.

పెరుగు క్రి. వృద్ధిచెందు, ఎదుగు వి. దధి. విణ. వృద్ధుడు.

పెరుగుట వి. ఎదుగుట, వృద్ధిపొందుట (Growth).

పెరుమాళ్ళు వి విష్ణువు. త. పెరుమాళ్.

పెలుకుట క్రి. భయాదులచే అంగము విలవిలలాడు.

పెలుచ వి 1. అతిశయము. 2. ఆధిక్యము 3. కాఠిన్యము అవ్య గట్టిగా.

పెల్ మెట్ ఇం వి (గృహ) (Pel-met). గుమ్మము మీద తెరలను అమర్చు చట్రము



పెల్ మెట్

(ఇది చెక్కలతో గాని లోహములతో గాని చేయబడును. తెరవేయుటకుపయోగించిన తీగ లేదా కొయ్యను పైకి కనిపించకుండ చట్రములో నమర్చునది).

పెల్ల వి మట్టిగడ్డ.

పెల్లలక్క వి. (రసా.) ముడిలక్కను కరగించి వడపోసిన ద్రవము పెల్లలవలె ఏర్పడిన లక్క (Shell-lac).

పెల్లు వై. వి. హెచ్చు. విణ. అత్యంతము. సం. బహుళమ్.

పెళుచు వై. విణ. 1. మూర్ఖుడు. 2. విరసము. 3. తేలికగా విరుగునది. సం. పరుషమ్.

పెళ్నము వి. మద్యము చేయుటకై కలిపిన పిండి.

# పే

పేట వై. వి, 1. శాఖానగరము. 2. నగరము. 3. నగరములోని భాగము. సం. పింతా.

పేడ వి. గోమయము. రూ. పెండ.

పేడపురుగులు వి. పేడయందుండు నొకరకము రెక్కపురుగులు, లద్దెపురుగులు (Grubs).

పేక వి. 1. వస్త్రముల నేతయందలి అడ్డనూలు 2. చీట్లపేక.

పేచకము సం.వి. 1. గుడ్లగూబ. 2. ఏనుగు తోకమొదలు.

పేట వి. హారములో నొక సరము.

పేటు వి. 1. చేతవట్టు. 2. పర్వత శిఖరము

పేటెంటు ఇం. వి.1. (వాణి., కాన.)(Patent) ఒక వస్తువును ఒకే సంస్థ ఉత్పత్తిచేయుటకు ప్రభుత్వము తెల్పిన సమ్మతి. 2.

శాసన రీత్యా వ్యక్తికి సంస్థలకు ఒక వస్తువునందు లేక వస్తువు నుత్పత్తిచేయు విధానమునందు నిర్ణీతకాలము వరకు గల స్వామ్యము. అనుకరణచే నితరులు వంచించకుండుటకు ఈ స్వామ్యము ఇయ్య బడును. వి (శాస.) ప్రత్యేకమైన హక్కు, సర్వస్వామ్యము. పేటెంటుచేయుట = సర్వస్వామ్యములు పొందుట.

పేడి వై. వి నపుంసకుడు, సం షండః.

పేడె వై. విశ. మీసము గడ్డము లేనివాడు; నపుంసకుడు.

పేద వై వి 1. దరిద్రుడు. 2. భటుడు. 3. అశక్తుడు సం. వ్యర్థః.

పేను వి. తలలో పెరుగు సూక్ష్మప్రాణి, యూకము.

పేపల్ బుల్ ఇం. వి (చరి.) (papal-bull) రోమన్ కాథలిక్ మతాధినేత అయిన 'పోప్' జారీచేయు శ్రీముఖము, ఆజ్ఞా పత్రము.

పేబిల్లు ఇం. వి. (వ్యావ) (pay-bill) వేతన పత్రము. బరావత్తు.

పేము వి. వా. (ప్రేము). బెత్తము.

పేయము సం. వి. 1. నీళ్ళు. 2. పాలు. విశ. త్రాగదగినది.

పేరంటము వి.పసుపు బొట్టులకు శుభకార్య సమయమున ముత్తైదువుల పిలుచుట. వారుచేయు కార్యము. వా. పేరంట్రము

పేరంటాలు వి. 1 పరలోకమున నున్న ముత్తైదువ. 2. పేరంటమునకు వచ్చిన ముత్తైదువ.

పేరణము వి. 1. పేరణి 2. అంగి, కవచము

పేరణి వి. కడవమీది నృత్యము.

పేరలాక్సు ఇం. వి. (గణి.) (parallax) స్థానభేదభ్రమ.

పేరిమి వి. 1. ప్రేమ, 2. గౌరవము. 3. అతిశయము.

పేరు వి. 1 నామము. 2 కీర్తి 3 దండ (కాసులపేరు). క్రి. ముద్దకట్టు

పేరుంగరము వి. ముద్రిక, పేరు చెక్కిన ఉంగరము.

పేరుకొను క్రి. 1. పేరుపెట్టి పిలుచు. 2. పంచించు.

పేరుచు క్రి. 1. ఒకటిపై నొకటి యేర్పరుచు. 2. అతిశయించు.

పేరుడు వి. ఘనీభవించుట.

పేరోల్ ఇ. వి. (వ్యావ) (pay-roll) వేతనదారుల పట్టీ.

పేర్పు వి. అనేక వస్తువుల క్రమ (అనగా ఒకదానిపై నొకటి) విన్యాసము (pile). ఉదా. వోల్టాపేర్పు (ఇందు జింకు వెండి బిళ్ళలు ఒకదానిపై నింకొకటి ప్రతి బిళ్ళపై ఉప్పు నీటిలో ముంచబడిన ఒత్తు కాగితపు ముక్కనుంచి పేర్చుదురు. వెండి బిళ్ళలన్నియు, జింకు బిళ్ళలన్నియు వేర్వేరుగ రెండు తీగలతో అతికించినచో ఈ రెండు తీగల కొనలనుండి విద్యుచ్ఛ్రవాహమును పడయవచ్చును).

పేలవము సం. విశ. పలుచనిది, కోమలమైనది.

పేశచోలము సం. వి. (జం) చారలు గల కండరముల యొక్క పొరలపై కప్పియుండు పొర (Sarcolemma).

పేశలము సం. విశ: 1. నేర్పుగలది. 2. చక్కనిది. వి. 1. కోయిల. 2. రోకలి.

పేశి సం. వి. 1. గ్రుడ్డు. 2. కత్తియొర. 3. మాంసపుముద్ద.

పేషకము సం. వి. (రసా.) చూర్ణకరణ యంత్రము (pulverisor).

పేషణము సం. వి. (రసా) చూర్ణముగా చేయుట. ఖనిజముల నుండి ధాతువుల తయారుచేయు విధానములలో మొదటిది పేషణము-నూరుట (pulverisation).

పేషణి నం. వి. సన్నెకల్లు.
పేసెము వై. వి పండ్లలోని గుజ్జు. నం. పేశీ. పేశి.

# పై

పైంట్ ఇం. వి. (గృహ.)(Pint)·పం|డెండు ఔన్సుల పరిమాణము—అనగా రెండు టీ కప్పులకు సమానమైనది ఇంచుమించు అర్ధ శేరు,
పైఁట వై. వి, పయట. నం, పైతా.
పైఁడి వి బంగారు. 2. ధనము,
పైడీఁకంటి వి. 1. చిన్నగూబ.2. కంఠమున పెట్టుకొను బంగారు కంటె.
పైఁడిచూలాలు వి. వసుంధర. భూమి.
పైఁడిఱేఁడు వి. కుబేరుడు.
పైఁడినెలఁత వి లక్ష్మి.
పైకము వి. ధనము, నం. వి. కోకిలగుంపు.
పైకుట్టు వి. (గృహ.) రెండుమడతలను లేక అంచులను కలిపి దగ్గరగావేయు మీది కుట్టు(Top-sewing or Over-sewing).
పైగంబరు హిం. (చరి.) మత|ప్రవక్త
పైతామహము నం విశ పితామహ సంబంధ మైనది,
పైతృకము నం, విశ. పితృసంబంధమైనది.
పైతృష్వసేయుఁడు నం. వి. తం|డ్రితోడ బుట్టినవాని కొడుకు (మేనత్తకొడుకు)
పైత్తము నం. విశ. పైత్యము, పిత్తము వలన కలిగిన వ్యాధి.
పైత్యరసము నం, వి. (జం.) కాలేయము నుండి ఊరురసము(Bile).(ఇది పిత్తాశయ ములో నిలువచేయబడును.)
పై|త్రము నం. విశ, పితృసంబంధమైనది.
పైదలి వి. స్త్రీ. దూ. పయిదలి.
పైర వి దక్షిణపుగాలి, గాలి.
పైరము వి ఆవు.
పైరు వి, సస్యము.
పైరుల యెకిమీఁడు వి, 1. చం|ద్రుడు. 2. ఓషధీశుడు.
పైరెక్స్ పాత్ర మి. వి. (గృహ.) నిప్పు మీద లేక విద్యుచ్ఛక్తి కుంపటిమీద వంట చేయుట కువయోగించగల వళసరి గాజు గిన్నె (Pyrex-dish).
పైరెత్రమ్ ఇం. వి. (వ్యవ.) (pyrethrum). కీటకములను నాశముచేయు నొక విధ మగు మందు. (దీనిని బంతి కుటుంబము నకు చెందిక ఒక జాతి మొక్క పూవు నుండి తయారుచేయుదురు).
పైరైట్ ఇం. వి. (భూగ) (pyrite). గంధ కము కలిగిన ఒక లోహఖనిజము.
పైశాచము నం. వి. ఒక విధమగు అధమ వివాహము. విశ. పిశాచసంబంధ మైనది.
పైసరము వి. రతి.

# పొ

పొంకము వి. 1. పొందిక, 2. సౌందర్యము,
పొంగటినెల వి మార్గశీర్ష మాసము (పొంగలి+నెల). పొంగలిపండుగ వచ్చు నెల.
పొంగటి పండుగ వి. మకర సం|క్రాంతి.
పొంగట్టు వి (పొన్ను+గట్టు) మేరుగిరి.
పొంగలి వి. 1, పాలు చేర్చి పొంగించునట్టి అన్నము, 2, పొంగలి పండుగ.
పొంగారు |క్రి. 1 సందడించు.2.విజృంభించు.
పొంగిలి వి. పశుల ఆహారము.

పొంగు వి. 1. సంతోషము. 2. సముద్రపు పోటు. 3, అటలన్ను, క్రి. 1, సంతోషించు. 2. ఉబ్బు.
పొంచు క్రి మరుగుననుండి కనిపెట్టియుండు.
పొంటె అవ్య కొఱకు అను ప్రత్యయార్థమున వచ్చునది.
పొంత వై. వి. 1 తీరము. 2, సమీపము. సం. ప్రాంతః.
పొంతనము వి. (పొందు + తనము) 1. గ్రహమైత్రి. 2. పోలిక.
పొందు వి. 1. మైత్రి. 2. సంధి 3. అనుకూల్యము.
పొందుకాఁడు విఱ. స్నేహితుడు.
పొంపిరివోవు క్రి. అతిశయించు, వర్ధిల్లు.
పొక్కలి వి ఎత్తుడు ప్రాయ్యి.
పొక్కిలి వి. 1. బొడ్డు. 2. గుంట.
పొక్కు వి. 1. బొబ్బ. 2. ఎండి లేచినపెల్ల. 3. జనశ్రుతి. క్రి. 1. దుఃఖించు. 2.బొబ్బలేచు.
పొగచూరు క్రి. పొగపట్టు.
పొగడ వై. వి. వకుళ వృక్షము. సం.వకుళః
పొగడ్త వి స్తుతి. మెప్పు.
పొగమంచు వి (భౌతి.) గాలిలో వెగురుచుండు పొగదుమ్ము నలుసులపై తేలియాడు ద్రవించిన నీటియావిరి బిందువుల సమూహములు (Fog and mist).
పొగమల్లె వి. (వృవ) ఇది తరచు పొగాకు మొక్కల వేళ్ళ నుండి సారమును గ్రహించుచు పెరుగు సంపూర్ణ పరపుష్ట మగు మొక్క (Orobanche cernua)


పొగమల్లె

పొగను క్రి. కుములు.
పొగరు వి. 1. గర్వము.2.పొంగు.3. మెండు
పొగాకు వి. (వృవ.) వంగ కుటుంబము Solanaceae నకు చెందిన Nicotiana tabacum అను మొక్క యొక్క ఆకులు (Tobacco) (వీనిలో నికోటిన్ (Nicotine) అనునది ముఖ్యమైన క్షారకము, పొగ త్రాగుటకును నస్యము, జర్దా మొదలగునవి తయారుచేయుటకును కొన్ని వైద్యవిషయములకును పొగాకు ఉపయోగింపబడుచుండును ఇది ఉద్రేకమును మత్తును కలిగించు ద్రవ్యము. చెట్లకు పట్టు చీడపురుగులనశింపచేయును)
పొగాకుకషాయము మి. వి (వృవ.) కీటకములను నాశనము చేయుటకు ఉపయోగించుటకై పొగాకును నీటతో నుడకబెట్టి తీసిన కషాయము(Tobacco decoction).
పొగులు క్రి, పరితపించు, రూ. పొవులు.
పొచ్చెము వి. 1. కపటము, 2. న్యూనత.
పొట వై. వి. 1. దొప్ప పుట సం. పుటమ్.
పొటకరించు క్రి. అతిశయించు.
పొటమరించు క్రి. 1. బొబ్బలేచు. 2. చిగురుపుట్టు.
పొటాసియమ్ ఇం,వి. (రసా.) (potassium) చెట్టుచేమలకు కావలసిన ప్రధానాహార ద్రవ్యములలో నొకటి. క్షారధాతువులలో నొకటి. (ఇది నీటిపై తేలును. కత్తితో కోయదగినంత మెత్తగా నుండును, వెండివలె తెల్లగా నుండును).
పొతేలు వి. మగగొఱ్ఱె. రూ. పొట్టేలు, పొట్టెలు.
పొట్ట వి. 1. కడుపు. 2. పరిపొట్ట.
పొట్టియ వి. తేలు.
పొడకట్టు క్రి. సాక్షాత్కరించు, కనబడు.
పొడసీడ వి. సంధులో నుండి కొద్దిగా గనిపించు ఎండవలన ఏర్పడు నీడ.
పొడవు వి (గణి.) రెండు బిందువుల మధ్య దూరము (Length).

పొడిచెత్తపద్ధతి వి. వి. (వ్యవ.) పశువులకు పనికిరాని గడ్డిగాదములు, చెత్త, ఎండిన కలుపు మొక్కలు, రాలుటాకులు మొదలగు వానిని పరచి పశువులశాలలో మూత్రముతో తడిసిన తరువాత దానిని ఎరువు కుప్పలో చేర్చిచీకనిచ్చుపద్ధతి (Dry refuge sysrem).

పొడిప్రాంతము వి. వి. (శాస.) మర్యాదివే ధము గల ప్రాంతము (Dry-zone).

పొడిమట్టి పద్ధతి వి. వి. (వ్యవ.) ఎరువుగా నుపయోగించుకొనుటకు పశువుల మూత్రమును జాగ్రత్తపెట్టు నొక పద్ధతి. (ఈ పద్ధతిలో పశువుల శాలలో నుండన పొడి మట్టిలో పశువుల మూత్రము ఇంకు చుండును)

పొడిశుభ్రత వి వి. (గృహ.) ఉన్ని, పట్టు మొదలగు రంగు దుస్తులను నీరు ఉపయోగించకుండ శుభ్రము చేయుట. ఉదా పెట్రోల్ లేదా సుద్దపొడిచే శుభ్రము చేయుట (Dry-cleaning).

పొత్తర వై. వి. 1. ఆకులు పూలు లోనగు వాని కట్ట. 2, పితృకార్యము లందు బ్రాహ్మణుల కిచ్చు బియ్యము మొ వి గల విస్తరి. సం. పత్రమ్.

పొత్తి వై, వి, 1, మెత్తని పలుచని పాత గుడ్డ. రూ. పొత్తిక. 2 బొమ్మచీర. 3, అరటిపట్టముదుత. సం. పుత్రికా.

పొత్తు వి. 1. స్నేహము, సంగతి, 2, అవిభక్తత.

పొత్తువు వై. వి సరస్వతి. సం. పుస్తకమ్

పొత్తెము వి. గరిడీసాలలో క్రిందపరచు ఎఱ్ఱమన్ను.

పొద వి, చిన్న చెట్ల గుంపు.

పొదక వి పెద్దగొంతు

పొది వి. 1. గుంపు. 2. అమ్ములపొది. 3, మంగలిపొది.

పొదుగు వి పశ్వాదులకు పాలుండుచోటు ఊధము.

పొదుగు క్రి. 1. క్రమ్ము. 2. రత్నాదులు చెక్కు, 3. పక్షులు గ్రుడ్లను రెక్కలతో కప్పు.

పొదుగుపెట్టె వి. (వ్యవ.) కోడి గ్రుడ్లను పెడిమిపై పొదుగుట కుపయోగించు పెట్టె (Incubator).

పొదుపు వి. 1. అనవసరముగ వ్యయము చేయకుండుట. 2. వృద్ధి.

పొదుపు వి. (గృహ) అనవసరముగ ఖర్చు చేయకుండుట. (అర్థ) అనుభోగమును కనీసముగ చేసికొని కొనుగోలుశక్తిని దాచిపెట్టుకొనుట (Thrift Economy)

పొనుగు విశ. నిస్తేజము. కాంతిలేమి. వి. వ్రణవిశేషము,

పొనుగుపడు క్రి. 1. నశించు, శూన్యమగు 2. కప్పువడు. 3. పాడుబడు.

పొన్న వై. వి. పున్నాగవృక్షము. సం, పున్నాగః.

పొన్నరి విశ. మనోజ్ఞము,

పొన్నాడ వి. ఒక తెగ చిరుతపులి

పొన్ను వి. 1. బంగారు 2. కట్టుగా వేయు లోహవలయము.

పొర వి 1. పలుచని చర్మము. 2.కపటము 3. మడత

పొరచి వి. చేబదులుగా తెచ్చుకొన్నది.

పొరపు వి. భేదము.

పొరబారుట వి (గృహ) గొంతుకపడుట, ఆహారము గాలిగొట్టములోనికి పోయి వచ్చో కలుగుస్థితి (Choking).

పొరి వై. విశ. 1. అత్యంతము. 2. దృఢముగా. 3. క్రమముగా. 4 మాటిమాటికి

పొరిగొను క్రి. చంపు, నాశముచేయు,

పొరుగు వి ప్రక్క, ఇరుగునకు ప్రక్క, సమీపము.

పొల వై. వి. 1. మాంసము. 2. దుర్గంధము. 3. చేపమీది పొట్టు సం. పలమ్.

పొలంతి వి. స్త్రీ. రూ. పొలఁతుక, పొలతి.

పొలఁతుక వి. స్త్రీ. మా పై

పొలపరి విణ. జాడ తెలిసినవాడు.

పొలమరి వి. పొలముకాపు.

పొలము వి. 1. పైరు పెట్టునేల. 2. ఊరు. 3. జాడ. 4 విధము.

పొలయలుక వి. (పొల్ల + అలుక) ప్రణయ కోపము.

పొలయు క్రి 1. సంచరించు. 2 సమీపించు 3 ప్రవేశించు.

పొలసు వై. వి 1. మాంసము. 2. మాంసపు దుర్గంధము. 3. చేపమీది పొట్టు సం. పలమ్

పొలసు రెక్కల పురుగులు వి. (వ్యావ) (Lepidoptera) ఈ కుటుంబములో నిరుపు గుల రెక్కలపై సులభముగా రాలిపోవు పొలుసు వంటి పొర యుండును ఈ కుటుంబములో పరుపు రెక్కల పురుగులు (Moths) అనియు, నిలువు రెక్కల పురుగులు లేక సీతాకోక చిలుకలు (Butter flies) అనియు రెండు తరగతుల కీటకములు గలవు. ఉదా, ఎఱ్ఱగొంగళిపురుగు వరిపీక పురుగు, వరిచొక్కాయి పురుగు నారింజ పచ్చ పురుగు మొ,

పొలసురేకులు వి. (వృక్ష) ఉల్లి మొదలగు గడ్డల కుండు తెల్లని పొలల వంటి ఆకులు (Scale leaves).

పొలి వై. వి. 1. లాభము 2 బలి. సం 1 ఫలమ్ 2. బలిః వి నష్టి, తరుగు,

పొలికలను వి. యుద్ధభూమి.

పొలికలుగు వి. లాభము కలుగు. (ఇది ధాన్యాదుల కొలత ప్రారంభపుమాట)

పొలికేక వి పెద్దకేక

పొలిమేర వి, 1, రెండూళ్ళను వేరుచేయు సంహద్దు, ఎల్ల.

పొలియు క్రి. నశించు, సమయు,

పొలివెంటి వి. శుష్కగోమయము.

పొలివేయు క్రి బలివేయు,

పొలుపు వి, 1. విలాసము 2. అందము,

పొల్ల వై. వి. గింజపట్టనిధాన్యము. విణ. వ్యర్థము. సం. పలాలః,

పొల్లుఁదనము వై. వి. పౌరుషహీనత.

పొల్లులు వి. వ్యంజనములు, హల్లులు

పొసఁగు క్రి. 1. అనుకూలించు. 2. ఒప్పు. 3. సిద్ధించు,

పొసఁగుడు వి. ప్రాప్తి. 2. స్నేహము.

# పో

పోఁక వై వి. వక్క. సం. పూగః.

పోఁకగంజి వై. వి. కాచు.

పోఁకముడి వి. నీవి, స్త్రీల కట్టుకోక ముడి,

పోఁకు వి, మంచుకప్పిన గడ్డి.

పోఁకొత్తు వి, అడకొత్తు, పోకలను కత్తిరించు సాధనము,

పోఁగు వి. 1. దారము. 2. చెవినగ.

పోఁచ వి. గడ్డిపరక.

పోఁచి వి. మనికట్టు మీది చోటు.

పోఁచీలు వి. ఆడువారి ముంజేతి నగలు.

పోఁడిమి వి. 1. ఒప్పు. 2. సంపద. 3. విధము. 4. సౌఖ్యము,

పోఁత వి. 1. పోయుట. 2. కరిగిన లోహాదుల పోత. 3. వృక్షాదులకు నీళ్లపోత.

పోఁత యినుము వి. (రసా.) బ్లాస్టు ఫర్నేసు నుండి సూటిగా ఘనీభవింపచేసినయినుము (Cast iron).

పోక వి. నడత, గమనము.

పోకడ వి. గమనము 2. నాశము.
పోకడపెట్టు క్రి. 1. నాశముచేయు. 2. విక్రయించు.
పోకలాఁడు విశ. కపట వర్తనము గలవాఁడు.
పోగండుడు సం. విశ. వికలమైన శరీరము గలవాడు.
పోగర వి. అగసాలెవాని పనిముట్టు.
పోగుతీఁత వి. (గృహ.) పోగులు తీసి హెమ్ స్టిచ్ కుట్టుట (Drawn thread work).


పోగుతీఁత

పోచికోలు వి. (వ్యావ.) 1. నిష్ప్రయోజకుడు. 2. ఊరక ఏవేవో వాగువాడు.
పోచిల్లు వి. శకునము చూచుటకై యిరుగు పొరుగిండ్ల మీద అక్షతలు నీళ్లు చల్లుట రూ. ప్రోచిల్లు.
పోటకత్తి వి (వ్యావ.) పొడవైన పిడితో వంపు తిరిగి యుండు చిన్నకత్తి. (ఇది కొమ్మలను నరకుట కుపయోగించును) (Bill-hook).


పోటకత్తి

పోటకము వై. వి. స్ఫోటకము. పెద్దమ్మవారు, ఒడలెల్ల బొబ్బలు లేచువ్యాధి. సం. స్ఫోటకః.
పోటముంజు వి. పుట్టగోచి
పోటరి విశ. హంవీరుడు, శూరుడు.
పోటి వి. 1. స్పర్ధ. 2. ఊతగానిల్పిన స్తంభాదికము.
పోటు వి. 1. పొడుచుట. 2. యుద్ధము 3. శౌర్యము 4. పెద్దఅల.
పోటుముట్టు వి యుద్ధసాధనము.
పోడుసాగు వి. (వ్యావ.) ఇది మెట్ట సేద్యములో నొక అనాగరిక పద్ధతి. అడవి నరకి, కంపలను, ఆకులను, అలములను అచటనే కాల్చి, నేలను దున్నకుండ విత్తులను చల్లి పైరుచేయుట. ఏటేట క్రొత్త యడవి నరకి విత్తులను చల్లుచుందురు. (Shifting cultivation).
పోతము సం. వి. 1. పక్షిపిల్ల. 2. పదేండ్ల యేనుగు. 3 ఓడ.
పోతరము వి. క్రొవ్వు.
పోతవణిజుఁడు సం వి. ఓడ బేరగాడు.
పోతు వి. 1. పశుపక్ష్యాదులలో పురుషజాతి. 2. ఆబోతు. 3. ఎనుబోతు. 4. ఎద్దు.
పోతుకరడు వి. పెద్ద అల.
పోతురౌతు వి. యముడు
పోత్రము సం. వి 1. పందిమూతి. 2. నాగటి దుంప మోన.
పోయనీరు ఇం వి. (రాజ) (Pioneer) దస్యాకమ్యూనిష్టు పార్టీ బాలసభ్యుడు.
పోయు క్రి. 1, పట్టు. 2. విడుచు. 3. సంధించు.
పోరంబోకు హిం. వి. (వ్యావ.) సాగుబడికి రాని నేల. శిస్తుకట్టని భూమి (Waste land).
పోరచి వి. 1. కాముక. 2. లంచము. విశ. వ్యర్థము.
పోరాటము వి. జగడము. కలహము యుద్ధము.
పోరామి వి. 1. స్నేహము. 2. ప్రేమము. ఆప్తత.
పోరితము వి. 1. స్పర్ధ. 2. పోరాటము.
పోర్టు ఇం. వి. (వాణి.) (Port). ఓడ రేవు. ప్రయాణికులు సామానులు ఎక్కుటకు దిగుటకు వీలయిన సదుపాయములన్నియు గల రేవు.
పోర్టుఫోలియో ఇం. (రాజ.) (Pyrt-folio). మంత్రిమండలిలోని మంత్రి క్రింద నుండు ప్రత్యేక పరిపాలనా శాఖ.
పోఁడు విశ. బాలుడు.
పోటి విశ. ఆడపిల్ల, బాలిక.

పోలింగ్ ఆఫీసరు ఇం. వి (రాజ.) (polling officer). ఓట్లు వేయు స్థలము నొద్ద తోడ్పడు అధికారి.

పోలింగ్ కేంద్రము మి. వి ఎన్నికలలో ఓటు వేయుటకు నిర్ణయింపబడిన స్థలము (polling-booth)

పోలిక వి. సామ్యము.

పోలిగమీ ఇం. వి (గృహ.) (polygamy) బహుభార్యాత్వము. ఒకతెకన్న ఎక్కువ భార్యలు కలిగియుండుట.

పోలీసు ఇం వి. (రాజ) (police). రక్షక భటుడు.

పోలెవాడు వి (వ్యావ) వ్యాధుడు.

పోవు క్రి. 1. వెళ్ళు. 2. నశించు. 3. యత్నించు. 4, కలయు.

పోషక కవచము నం. వి. (వృక్ష.) బీజకణ మాతృకోశిక లుండు గదిచుట్టును రక్షణ కొరకేర్పడు ఒకటి రెండు పొరలు గల జీవకణసంహతి (Tapetum), ఉదా. పుష్పాడి తిత్తుల అరలలో నుండునట్లు.

పోషకగ్రంథి నం. వి (జం) మస్తిష్కము నకు క్రింది భాగమునకుండు ఒక ముఖ్య మగు గ్రంథి (pituitary body)

పోషకపదార్థములు నం. వి. (గృహ) శరీరము పెరుగుటకు సహాయపడు పదార్థములు (Nutrients)s ఉదా. పిండి. చక్కెర పదార్థములు, మాంసకృత్తులు, లవణములు.

పోషణ నం, వి. (గృహ) తిన్న ఆహారము ఒంటికి పట్టుట (Nourishment)

పోషాహారము నం, వి, (జీవ) శరీరపోషణ నిచ్చు ఆహారము (Nutrition).

పోషితృపాదపము నం వి. (వృక్ష) పరాన్న భుక్కును పోషించు మొక్క, పోషిత (Host plant).

పోషిసంజీవము నం. వి. (జం.) పూర్వాంగ కము, పాలిప్ (Hydranth) .

పోష్యము నం విణ. పోషింపదగినది,

పోసనము నం. వి, 1. క్షీరము. 2. పైపూత 3. కాంతి,

పోస్టు ఆఫీసు ఇం. వి. (వ్యావ) (post-office). తపాలా ఆఫీసు.

పోస్టు ద్వారా వ్యాపారము (వాణి) క్రేత విక్రేతలు ఒకరినొకరు చూచుకొనకపోస్టు ద్వారా క్రయాదేశము పంపిన వారికి పోస్టుద్వారానే సరుకుల నందజేయు పద్ధతి (సరుకుల విషయమై అవసరమైన జ్ఞానము అనుభోక్తల కున్నప్పుడు ఇట్టి వ్యాపారము సాధ్యమగును )

పోహణ వి. (పోహము) 1. కూర్పు 2. నేర్పు

పోళీ వై. వి. (పోలీ) బొబ్బట్లు (భక్ష్యవిశేషము )

## పౌ

పౌండు ఇం, వి. (Pound). 1, 16 ఔన్సుల కొలత. 2. 20 షిల్లింగులు చూ. పౌను.

పౌజు వై. వి. దండు, బారు. నం. పుంజః.

పౌగండుడు నం. వి. బాలుడు.

పౌత్రి నం. వి. మనుమరాలు.(కొడుకు లేక కూతురు కూతురు).

పౌత్రుడు నం. వి. కొడుకు కొడుకు.

పౌనఃపున్యము నం, వి మరల మరల చెప్పుట (Frequency)

పౌను ఇం. వి. ఇంగ్లాండులో తూకమునకు వాడుకలో నున్న కొలమానము లేక ఒక నాణెము (pound), చూ. పౌండు.

పౌరనీతిశాస్త్రము నం. వి. పౌరధర్మ శాస్త్రము. నగరము లేక దేశము లేక

ప్రపంచము యొక్క సభ్యుడుగా పౌరుడు గడపవలసిన ఉత్తమ జీవితమును తెలుపు శాస్త్రము

పౌరసత్వము నం. వి. (పౌర. రాజ.) రాజ్యమందు పౌరు డనుభవించు హక్కులు నెర వేర్పవలసిన విధుల సముదాయము.

పౌరసేన నం. వి. ఆవ్యాసర సమయము లందు దేశరక్షణ కొఱకు స్థాపింపబడిన పౌరుల సైన్యము (Militia).

పౌరాణికుఁడు నం. వి. పురాణము తెలిసిన వాడు, పురాణము చెప్పువాడు.

పౌరుఁడు నం. వి. (పౌర, రాజ) పురజనుడు, నగరవాసి. ఒక రాజ్యమందు శాశ్వతముగా నివసించుచు అందలి పౌరహక్కులను అనుభవించువాడు.

పౌరుషము నం వి. 1. పురుషము. 2. పురుష ప్రయత్నము. పురుషవ్యాపారము. 3, పరాక్రమము.

పౌరుషేయము నం. విశే. పురుషుడు చేసినది (వేదములు పౌరుషేయములు కావు).

పౌరోహిత్యము నం. వి. పురోహితుని కార్యము.

పౌర్ణమాసి నం వి పున్నమ.

పౌర్ణమి నం. వి (భూగో.) సూర్యుడు. భూమి, చంద్రుడు ఒకే తలములో నున్నప్పుడు సూర్యుని కాంతి చంద్రుని అర్ధ భాగముపై పడగా చంద్రుడు భూమిపై నున్న వారలకు పూర్తిగా కనిపించుట.

పౌలస్త్యుఁడు నం. వి. పులస్త్య బ్రహ్మ వంశమువాడు.1 కుబేరుడు 2.రావణుడు.

పౌలోమి నం. వి. శచీదేవి.

పౌషము నం. వి. పుష్యమీనక్షత్ర సహిత పూర్ణిమ గల నెల, పుష్యమాసము.

పౌళి నం. వి. ఉడికిన గుగ్గిళ్లు.

# ప్యా

ప్యాసుబుక్కు ఇం వి.(అర్థ) (Pass-book) బ్యాంకు చలానాపుస్తకము. బ్యాంకులో కాతాదారునికిగల సొమ్ముఎప్పటికప్పుడు తెలియచేయు పుస్తకము.

# ప్యూ

ప్యూనిజడ్జీ ఇం. వి. (శాస) అదనపు న్యాయమూర్తి.

ప్యూరిటన్లు ఇం. వి. (చరి.) (puritans). ప్రొటెస్టెంటు క్రైస్తవులలో సనాతనాచారపరులు.

# ప్ర

ప్ర నం. ఉప మిక్కిలి అను అర్థము గల ఉపసర్గ.

ప్రంది వి. (వ్యావ.) 1. శుల్కము. 2. కన్యాశుల్కము.

ప్రకందము నం.వి (వృక్ష) అల్లము.పసుపు మొదలగు మొక్కలకు భూమిలో నుండు కాండము (Rhi zome).

ప్రకంపనుఁడు నం. వి 1. మిక్కిలి బలము గల గాలి. 2. ఒక రాక్షసుడు.

ప్రకటన నం, వి. (వాణి.) సరకులకు సంబంధించిన సమాచారము అనుభోక్తలకు ఇష్టముగురీతిని వారికి అందచేసి, వారి ప్రోత్సాహమును చూరగొనుట.

ప్రకటనము నం. వి. వెల్లడించుట,

ప్రకరణము నం. వి. 1. ప్రస్తావము. 2. గ్రంథభాగము. 3, ఒక తెగ రూపకము.

ప్రకరము సం. వి. గుంపు విశ. చెదిరినది.
ప్రకర్షము సం. వి. 1. మేలు 2. అతిశయము
ప్రకాండము సం. వి. చెట్టుబోదె. ఉత్తర పదమైనచో శ్రేష్ఠ వాచకము ఉదా పండిత ప్రకాండుడు=పండిత శ్రేష్ఠుడు
ప్రకాండవ్యూహము సం. వి. (వృక్ష.) మొక్కకు భూమిపై నున్న కాండము, కొమ్మలు, ఆకులు మొదలగు భాగముల సముదాయము (Shoot system).
ప్రకామము సం విశ. 1. ఇచ్చివచ్చినట్లు 2. మిక్కిలి కామము గలది.
ప్రకారము సం. వి. 1. విధము. 2. పోలిక.
ప్రకాశ నిరోధకము సం. వి. (భౌతి) కాంతి కిరణములను నిరోధించునది. అపారదర్శకము (Opaque).
ప్రకాశము సం. వి. వెలుగు. విశ. బయలు పడినది.
ప్రకాశానువర్తి సం. విశ. (వృక్ష.) వెలుతురు వచ్చు దిక్కునకే పెరుగు స్వభావము కలది (Positively heliotropic).
ప్రకాశానువర్తనము సం వి. (వృక్ష.) వెలుతురు వచ్చు దిక్కునకు తిరుగుట (Heliotropism).
ప్రకాశాపవర్తి సం విశ. (వృక్ష.) వెలుతురు నుండి విముఖముగా పెరుగు స్వభావము కలది (Negatively heliotropic).
ప్రకీర్ణకము సం. వి. 1. విరివి. 2. వింజామరము. 3. గుఱ్ఱము.
ప్రకృతము సం. విశ. 1. చక్కగా చేయబడినది 2. ప్రకరణము వలన పొందబడినది.
ప్రకృతవ్యయము సం. వి. (వ్యవ.) సంవత్సరము పొడుగునను ఆయా పనులకు వలయువ్యయము(Current expenditure)
ప్రకృతి సం. వి. (వ్యాక.) 1. ప్రత్యయము చేరకముందటి శబ్ద రూపము 2. భౌతవర్గము. 3. స్వభావము. 4. అవ్యక్తము, (స్వామి. అమాత్యుడు. మిత్రుడు. కోశము రాష్ట్రము. దుర్గము, బలము-ఇవి సప్త ప్రకృతులు).
ప్రకృతి శాస్త్రములు సం. వి. (జీవ) వృక్ష శాస్త్రము, జంతుశాస్త్రము, భూగర్భ శాస్త్రము మొదలగునవి ప్రకృతికి సంబంధించినశాస్త్రములు(Natural Sciences)
ప్రకృతి సిద్ధ మండలము సం. వి. (భూగో.) ఒకే ఒక నైసర్గిక స్వరూపము. శీతోష్ణ స్థితి. ఉద్భిజములు కలిగియున్న భూప్రాంతము.
ప్రకృష్టము సం. విశ, ప్రకర్షము గలది. శ్రేష్ఠమైనది.
ప్రకోపము సం. వి. హెచ్చు, ముమ్మరము.
ప్రకోష్ఠము సం. వి. 1. తొట్టికట్టు 2. ముంజేయి.
ప్రక్కయెముకలు వి. (గృహ.) రొమ్ము ప్రక్క యెముకలు (Ribs).
ప్రక్రమము సం. వి. 1 క్రమము. 2. ఉపక్రమము, 3. తరువాయి
ప్రక్రాంతము సం. విశ, కడవబడినది.
ప్రక్రియ సం. వి. 1. అధికారము. 2. ప్రకరణము. 3. మేలైన కార్యము వి. (భౌతి. రసా). క్రియల లేదా కార్యముల వరుస, ఒక పనినిచేయు రీతి (Process). వి.(గణి). గణితశాస్త్ర సిద్ధాంతముల నుపయోగించు విధానము (Operation).
ప్రక్షిప్తము సం. విశ. 1. చేర్చబడినది. 2. సరిచేయబడ్డది.
ప్రక్షేపణ సం. వి. (గణి.) పైకి విసరుట (Projection) జ్యామితీయ శాస్త్రములో సమాంతర కేంద్రాభిముఖ కేంద్రప్రసారి కిరణముల వ్యవస్థసాయమున ఒక చిత్రము యొక్క అన్ని బిందువులకు అనుగుణములగు ఇతర బిందువులు గల

మరి యొక చిత్రమును వేరొక తలముపై పడునట్లు చేయుట.

ప్రఖరము నం. వి. 1. గుఱ్ఱపు కవచము 2.కంచరగాడిద విశ. మిక్కిలివాడియైనది,

ప్రఖ్యుఁడు నం. వి. సమానుడు. (ఉత్తర పదమైనచో).

ప్రగడ వె.వి. ప్రధాని, రూ. ప్రగ్గడ, ప్రెగడ ప్రెగ్గడ. నం ప్రఘనః, ప్రా జ్ఞః. ప్రధానః

ప్రగల్భుఁడు నం విశ. ప్రౌఢుడు.

ప్రగుల్ఫాస్థి నం. వి. (శం.) మడమ ఎముకలలోనొకటి (Fibulare or calcaneum).

ప్రగ్రహము నం. వి. 1. చెరసాల. 2. త్రాసు. త్రాడు 3. పగ్గము.

ప్రగ్రీవము నం వి. ఒరగు దిండు.

ప్రఘణము నం. వి 1. తలవాకిలి ప్రక్కనుండు చిన్నగది. 2. ఇనుపగుదియ. రూ ప్రఘాణము.

ప్రచండపవనములు నం. వి ((భూగో.)పశ్చిమ 'ఇండీజ్' దీవులలో సంభవించు మహా వక్రవాతములు (Hurricanes)

ప్రచండము నం. విశ. మిక్కిలి వాడిమిగలది.

ప్రచక్రము నం వి. పయనమైన సేన.

ప్రచురము నం. విశ. వెల్లడియైనది, విస్తారమైనది.

ప్రచేతసుఁడు నం. వి. వాల్మీకిముని తండ్రి. విశ. గొప్పమనస్సు గలవాడు

ప్రచోదనము నం. వి. (భౌతి) హఠాత్తుగా క్షణికముగా నారోపింపబడిన బలము (Impul e), చూ. అఘాతము.

ప్రచ్ఛన్నము నం. విశ. కప్పబడినది

ప్రజ నం. వి. జనము, సంతతి.



ప్రజంఘకండరము నం వి. (శం) పిక్క ఎముకపైనుండు బలమైనకండరము ప్రజంఘకండరము(కప్పు) (Gastrocnemius muscle)

ప్రజనము నం. వి. చూలు.

ప్రజాత నం. వి. బాలెంత,

ప్రజాతి నం. వి. (జం.) జంతుజాలమును వర్గీకరించుటలో నొకముఖ్య విభాగము (Phy:um)

ప్రజాపతి నం. వి. బ్రహ్మ. (చరి.) 1. యుద్ధ సమయములందు కులపతులపై నుండు సైనికాధికారి, 2. గ్రామపెద్ద.

ప్రజాసత్వముల మహజరు మి వి. (చరి) క్రీ శ. 1628వ సంవత్సరములో ఇంగ్లండు పార్లమెంటు సభ్యులు స్టూవర్టు రాజైన ప్రథమ చార్లెస్ రాజునకు సమర్పించిన నివేదిక. ఇందు రాజు ప్రజల అనుమతి లేకుండ పన్ను విధింపరాదనియు, అకారణముగ ప్రజలను నిర్బంధించకూడదనియు సైనికులు ప్రజలయిండ్లలో మకాము చేయరాదనియు నివేదించుకొనిరి (Petetion of rights)

ప్రజాసౌకర్య పరిశ్రమలు నం. వి. (అర్థ, వాణి, శాస.) ప్రజల సౌకర్యము ప్రధాన కర్తవ్యముగ పనిచేయు పరిశ్రమలు (ఇట్టి పరిశ్రమలు లాభమే తమ ముఖ్యోద్యేయమనుకొనకుండునట్లు ప్రభుత్వము నియంత్రించును. ఒక పరిశ్రమ ప్రజాసౌకర్య పరిశ్రమ యౌనోకాదో నిర్ణయించుటకు ముఖ్యమైన లక్షణము ఇట్టి పరిశ్రమ ఉత్పత్తిచేయు సరకు లేక సేవ మానవాళికి ఉపయోగపడునట్టిదై యుండవలెను ఇవి సాధారణముగ చాల మూలధనము కలవై యుండును. సాధారణముగ ఇవి పనిచేయు ప్రాంతములలో వీనికి గుత్త అధికారము ఉండును. (ఉదా. రైల్వేలు, పాలు, విద్యుచ్ఛక్తి, నీటిసరఫరా, రోడ్డు రవాణా).

ప్రజాస్వామ్యము నం.వి. (రాజ; చరి; పౌర.) ప్రజాప్రతినిధుల ప్రజానుమతము ప్రకా

రము పరిపాలించుట, ప్రజాప్రభుత్వము.

ప్రజ్ఞ నం. వి. బుద్ధి, సామర్థ్యము.

ప్రజ్వలనతాపక్రమము లేదా ప్రజ్వలన బిందువు నం వి (రసా.) వేడి ఎక్కించి నచో మండగల ద్రవ్యము. ప్రజ్వలించు తాపక్రమము (Ignition point)

ప్రజ్వలనము నం వి. మండుట. వి. (భౌతి.) ఒక మండగల వస్తువును జ్వలన స్థితికి తెచ్చుట (Ignition) వి (రసా.) కాల్చుట.

ప్రణతి నం. వి 1. వినమ్రత, 2. నమస్కారము.

ప్రణయము నం. వి. 1. ప్రేమము, 2. వినయము.

ప్రణయిని నం. వి. ప్రియురాలు.

ప్రణవము నం. వి. ఓంకారము.

ప్రణాదము నం వి. 1. అనురాగముచే కల్గిన ధ్వని 2. పెద్దధ్వని.

ప్రణాళి నం. వి. 1. నీళ్ళుపోవుదారి. 2. క్రమము. రూ. ప్రణాళము.

ప్రణాళిక నం. వి. ముందుగా రూపొందించుకొనిన కార్యక్రమ విధానము (Plan).

ప్రణితము నం. విశ. 1. ఉంచబడినది. 2. ధ్యానము చేయబడినది.

ప్రణిధి నం. వి. వేగులవాడు.

ప్రణిపత్తి నం వి. అభివాదము. మ్రొక్కు.

ప్రణిహితము నం. విశ. పొందబడినది.

ప్రణీతము నం. వి. మంత్రముచే సంస్కరింపబడిన అగ్ని.

ప్రణుతము నం. విశ. మిక్కిలిపొగడబడినది.

ప్రతంతువు నం. వి. (వృక్ష.) బ్రయోఫిటముల తరగతికి చెందిన నాచు మొక్కల సిద్ధబీజము మొలకెత్తినప్పు డేర్పడినబహుశాఖలు గల సూత్రము (Protonema).

ప్రతతి నం. వి. 1. సమూహము. 2. తీగ. 3. విరివి.

ప్రతాపము నం. వి. 1. తేజము. 2. వేడిమి.

ప్రతారణము నం వి. మోసపుచ్చుట.

ప్రతి నం అవ్య. 1 సమానము. 2. మారు. 3 ఒక్కొక్క.

ప్రతికక్షులు నం. వి. (రాజ) ఎన్నికలలో శాసనసభకు స్వల్ప సంఖ్యలలో ఎన్నుకొనబడిన రాజకీయ పక్ష సభ్యులు. (వీరు అధికారపక్ష నాయకుల చర్యలను వారి ప్రభుత్వ పరిపాలనలోని లోపములను విమర్శించుచు తమ విమర్శలతో ప్రభుత్వ పాలనములో తోడ్పడుదురు).

ప్రతికారకము నం. వి. (రసా.) ప్రతిక్రియను ప్రాదుర్భవింపచేయు ద్రవ్యము. రాసాయనిక శోధనాగారములలో అరలలో నుండు ద్రవ్యము లన్నియు ప్రతికారకములే (Re-agent). వి మారుసేత ప్రతికృతి. రూ. ప్రతీకారము.

ప్రతికారిత లోలకము నం. వి. (భౌతి.) ప్రతికృత లోలకము, శీతోష్ణస్థితుల కనుగుణముగ తనపొడవును తనకుతానే సరిదిద్దుకొను లోలకము. (Compensated pendulum).

ప్రతికూలము నం. విశ. అనుకూలముకానిది.

ప్రతికూల వాణిజ్యావశేషము నం. వి (అర్థ.) ఒక దేశము యొక్క ఎగుమతుల విలువ దిగుమతులకన్న తక్కువగ నుండుట.

ప్రతిక్రియ నం. వి. (భౌతి) ఒక క్రియకు విరుద్ధముగా జరుగు మరియొక క్రియ. (గణితశాస్త్రము) (రసా) రసాయనిక ద్రవ్యముల మధ్యజరుగు మార్పు (Reaction).

ప్రతిక్రియోష్ణత నం. వి. (రసా) అణుభారముల యౌగికముల మధ్య రాసాయనిక ప్రతిక్రియ జరుగునపుడు బహిర్గతమగు (విచూషితమగు) తాపరాశి (Heat oi Reaction)

ప్రతిక్షేపము నం. వి (గణి) ఒక రాశి స్థానమున మరియొక రాశిని వ్రాయు విధానము (Substitution) వి. (భౌతి.) వెనుకకు నెట్టబడుట,తుపాకిని పేల్చుటలో గుండు ముందుకు నెట్టబడిన సమయము వనే తుపాకి వెనుకకు నెట్టబడుట(Recoil)

ప్రతిగృహీత నం వి. దానము పుచ్చుకొను వాడు.

ప్రతిఘటనము నం. వి మారొడ్డుట.

ప్రతిఘాతనము నం. వి, చంపుట.

ప్రతిచక్రవాతము నం. వి. (భూగో.) ప్రతి చక్రవాతము గల ప్రదేశము మధ్యలో వాయుపీడనము ఎక్కువగ నుండి. ప్రదేశపుటంచులలో బయలుదేరు సుడులు తిరుగుచు బయటికి పోవును

ప్రతిచక్రవాతములు నం. వి. (భూగో.) అధికపీడన ప్రదేశికలు. ఇందు ఉత్తరార్ధ గోళమున పవనములు సవ్యముగాను, దక్షిణార్ధగోళమున అపసవ్యము గాను వీచును. (వీని వలన చక్కని పవనస్థితి యేర్పడును).

ప్రతిధ్రువకణములు నం. వి. (వృక్ష) మొక్కల భ్రూణస్యూనములో ప్రబీజాధారమునకు దగ్గరగా నుండు మూడు జీవకణములు (Antipodal cells).

ప్రతిధ్వని నం. వి. మారుమ్రోత (ప్రతిధ్వానము) వి. (భౌతి.) ప్రయాణము చేయునప్పుడు కొన్ని ఆటంకములవలన పరావర్తనము చెంది వెనుకకు వచ్చుధ్వని పరావర్తిత ధ్వని (Echo).

ప్రతినిధి నం, వి. ఒకనికి బదులుగా వచ్చిన వాడు. వి (వ్యావ.) కొంతమంది ప్రజలు కలిసి తమ కార్యని ర్వహణమునకై ఏర్పరుచుకొనిన పెద్ద.

ప్రతినిధి ప్రభుత్వము నం. వి. (రాజ., చరి, పౌర.) ప్రజామోదముతో ఎన్నుకొనబడిన శాసనసభ్యులచే నిర్వహింపబడిన శాసన పక్షము శాసనసభకు బాధ్యత వహించి పరిపాలించు ..

ప్రతిపక్షము నం. వి. (రాజ) శాసనసభలో ప్రభుత్వ పక్షమునకు ఎదురు పక్షము (Opposition Party)

ప్రతిపత్తి నం. వి. 1. సామర్థ్యము,2. ప్రాప్తి 3. లాభము,

ప్రతిపత్తు నం. వి. పాడ్యమి.

ప్రతిపదార్థము నం వి ప్రతిశబ్దార్థము. ఖండాన్వయము.

ప్రతిపాదనము నం . 1. తెలుపుట 2, నిరూపించుట. 3. మొదలిడుట. 4 ఇచ్చుట

ప్రతిఫలచర్య నం, వి. (జం) ఇచ్ఛానుసారముగా కాక తనంతటతానే ఒక ప్రేరణకు ప్రత్యుత్తర మిచ్చు చర్య (Reflex action).

ప్రతిబంధకము నం. వి అడ్డగించునది.

ప్రతిబంధము చేయు వ్యాధులు మి. వి. (గృహ.) వ్యాధులు రాకుండ తప్పించుట. ఆహారలోపము వలన కలుగు వ్యాధులు రాకుండ తప్పించుకొనుట (Preventable diseases). ఉదా.(Deficienc diseases) ఎఱ్ఱనాలుక, కండ్లజబ్బు మొదలగునవి.

ప్రతిబలము నం. వి. (భౌతి.) ఒక వస్తువుపై ప్రయోగించిన బలముల ఫలముగ ఆ వస్తువులో ప్రాదుర్భవించిన అంతర బలములు (Stress).

ప్రతిబింబము నం వి. 1. ప్రతిమ 2. ప్రతిఫలనము, వి. (భౌతి) అద్దము మొదలయిన వానియందు అగుపడు వస్తువుల ప్రతిఫలిత బింబము. వస్తువును బోలిన దృశ్యము (Image).

ప్రతిభ నం,వి. అప్పటికప్పుడు వికసించుబుద్ధి.

ప్రతిభావిశేషము నం, వి. (గృహ.) వ్యక్తిత్వము. ఆకారము. (Personality).

ప్రతిరూపము నం. వి. (భౌతి) నమోనా, ఏదేనిభవనము. నౌక, ఇంజను.యంత్రము తయారుచేయుటకు ముందుగా సిద్ధపరుప బడు చిన్ననమోనా (Model).

ప్రతిలోమ వర్గ నియమము నం. వి. (భౌతి) గురుత్వాకర్షణ నియమము (Inverse Square Law). ఒక్కగురుత్వాకర్షణమే కాక వైద్యుతాయస్కాంతాకర్షణలు కూడ ఈ నియమము ననుసరించును.

ప్రతివాది నం. వి. వాదికి ప్రతిపక్షమువాడు

ప్రతివిద్యుచ్చాలకబలము నం. వి. (భౌతి.) విద్యుద్ఘటములో కొన్ని పరిస్థితులలో విద్యుత్ప్రవాహస్థాపనమునకుఅవసరమగు విద్యుచ్చాలకబలమునకు ఎదురుగ జనించు విద్యుచ్చాలకబలము (Back electromotion force). దీనిచే విద్యుద్ఘటమందు ప్రవాహము తగ్గిపోవును,

ప్రతివ్యాపార పవనములు నం.వి. (భూగో.) కర్కాటక, మకర రేఖల. యొద్దనుండి ఉత్తర దక్షిణ ధ్రువవృత్తముల యొద్ద నున్న అల్పపీడన ప్రదేశమునకు వీచు పవనములు. (ఇవి వ్యాపారపవనముల దిక్కునకుగాక వ్యతిరేకముగా వీచుచుండును)

ప్రతిశ్రయము నం. వి. 1. కొలువుకూటము 2. గృహము.

ప్రతిశ్యాయము నం. వి. పడిసెము రూ ప్రతిశ్య.

ప్రతిషేధము నం.వి. వ్యతిరిక్తముగ, చెప్పుట ప్రతిష్టంభము.

ప్రతిష్ఠ నం. వి. 1. గౌరవము 2. చోటు వి. (గృహ.) 1. గౌరవము (prestige), 2. మానము. 3. ప్రతిభ. వి. (వాణి) ప్రజల దృష్టిలో ఒక వ్యాపార సంస్థకు గల ఖ్యాతి (Status). ఆ సంస్థయొక్క లాభములు దీనిపై చాలవరకు ఆధారపడి యుండును. కనుక దాని మిగత ఆస్తులతో పాటు దీనిని కూడ లెక్క చూచుకొనుట పరిపాటియైనది.

ప్రతిస్థాపకములు నం వి (అర్థ.) ఒకదాని బదులు మరియొకటి ఉపయుక్తము కాగల రెండు వస్తువులు ఉత్పాదన రంగములో ఒక ఉత్పత్తిస్థానమునమరయొకటి ప్రవేశ పెట్టుటకు వీలయినచో ఆ రెంటిని ఒకదాని కొకటి ప్రతిస్థాపకము లందురు అట్లే అనుభోగరంగమున ఒక వస్తువు బదులు మరియొకటి సేవించి అదే ఉపయుక్తిని అనుభవించ గల్గినచో ఆ రెండు వస్తువులు ఒకదానికి మరయొకటి ప్రతిస్థాపకములు. ఉదా. కాఫీ, టీ

ప్రతిస్థాపన నం. వి. (భౌతి రసా) ఒక వస్తువు స్థానములో దానికి బదులు ఇంకొక దానిని ప్రవేశపెట్టుట (Substitution). వి. (భౌతి) ఒకదానిచోటుతో దానిని తీసి వేసి యింకొక దానిని పెట్టుట (Replacement).

ప్రతీహారుఁడు నం వి. ద్వారపాలకుడు, పడిహారి.

ప్రతీకారము నం. వి. (గృహ.) ప్రతిఘాతము (Reaction).

ప్రతీచి నం. వి పడమర.

ప్రతీతి నం.వి. ప్రసిద్ధి.

ప్రతీపుఁడు నం. వి. శత్రువు.

ప్రతోళి నం. వి. పెద్దవీథి.

ప్రత్తిరేవడినేలలు వి. (వ్యవ.) కృష్ణరేవడి నేలలు. ప్రత్తి సాగుచేయుట కుపయోగ పడు ఒక విధమగు బంకనేలలు (Black cotton soils).

ప్రత్యక్షప్రజాస్వామ్యము నం. వి. (చరి. రాజ.) ప్రజలు ప్రతినిధులద్వారా గాక స్వయముగా పరి పాలించుట. పూర్వకాల గ్రీసుదేశపు ప్రత్యక్ష ప్రజాప్రభుత్వము.

ప్రత్యక్షమైనపన్ను వి. (అర్థ) విధింపబడిన పన్ను భారమును ఇతరులపైకి త్రోసి వేయుటకు వీలులేనట్టి పన్ను.

ప్రత్యక్షపు ఎన్నికలు వి. (రాజ.. పౌర) ఓటర్లు తమ నియోజకవర్గము నుండి సరాసరి తమ ప్రతినిధులను ఎన్నుకొనుట

ప్రత్యయము సం. వి. 1. నమ్మకము. 2. ఉద్దేశ్యము 3. జ్ఞానము. (వ్యాక.) స్వతంత్ర ప్రయోగము లేనిది. స్వతంత్రముగ ఏ అర్థమును ఈయనిది. కృత్ ప్రత్యయములు తద్ధిత ప్రత్యయములు మొ,నవి. ఇవి పదములపై చేర్చబడును ఉదా. రాముడు, 'డు' ప్రత్యయము వన్నెకాడు ఇందు. 'కాడు' ప్రత్యయము

ప్రత్యర్థి. సం. వి. శత్రువు

ప్రత్యవేక్షణ సం. వి. (భౌతి., రసా) జాగ్రత్తతో చూచుట, ఇట్టి సావధానమైన చూపు విజ్ఞానశాస్త్రములకు మూలాధారము. ప్రకృతిలో జరుగు సంఘటనల యథాతథముగ గుర్తించుట (Observation).

ప్రత్యానయనబలము సం. వి, (భౌతి) సమతులితస్థితిలో నున్న వస్తువును ఆ స్థితి నుండి కొంచెముగ తప్పింప చూచినప్పుడు ఆ వస్తువును మరల తొంటిస్థితికి తే ప్రయత్నించు చ్యుతి. (Displacement). విరుద్ధముగాపనిచేయుబలము (Restoring force).

ప్రత్యామ్నాయము సం. వి. బదులు, మారు

ప్రత్యావర్తక విద్యుత్ సం. వి. (భౌతి.) ఒక ఆవృత్తిని వెంబడించి తనదిశను మార్చుకొను విద్యుత్ప్రవాహము (Alternating current).

ప్రత్యుత్తరము సం. వి. (జీవ) ప్రేరణననురించి ప్రాణి కనబరచు ప్రతిచర్య (Response).(గృహ)జవాబు(Response)

ప్రత్యుత్థానము సం. వి. అభ్యుత్థానము.

ప్రత్యుత్పత్తి సం. వి. (జం.) సంతానోత్పత్తి (Reproduction)

ప్రత్యూషము సం.వి వేగుజాము.

ప్రత్యేక నియోజకము సం. వి. (చరి రాజ. కుల మత లైంగిక వృత్తి భేదముల నాధారముగ తీసికొని ఎన్నికలలో ప్రాతినిధ్యమిచ్చుట.

ప్రత్యేక వివరణము సం. వి. (గణి) సామాన్య వివరణమునందలి వచనమును ఒక పటమునకు సంబంధింపచేసి ప్రత్యేక పదములలో తెలుపువచనము (Particular enunciation).

ప్రథ సం. వి. ప్రఖ్యాతి

ప్రథమ (మా) అక్షనిరూపకము సం. వి. (గణి.) ద్వితీయాక్షమునుండి ఒక బిందువు దూరము (Abscissa).

ప్రథమచికిత్స సం. వి. (గృహ.) డాక్టరు రాకమునుపే వెంటనే చేయవలసిన చికిత్స (First aid).

ప్రథమము సం, విశ. 1. ముఖ్యము. 2. మొదటిది.

ప్రథమమూలము సం. వి. (వృక్ష) గింజలలో నుండు ప్రాథమిక అక్షములో భూమిలోనికి పెరుగుభాగము ఇది ద్విదళబీజకములలో తల్లివేరుగా వృద్ధిచెందును (Rodicle).

ప్రథమ రూప సంబంధము సం. విశ. (జీవ.) ఒక భాగముగాని ఒక అవయవముగాని సంపూర్ణముగా అభివృద్ధి చెందక యుండునది (స్థితి) (Rudimentary).

ప్రథమశాఖ సం. వి. (వృక్ష.) గింజలలో నుండు అంకురము యొక్క ప్రధానాక్షములో ప్రకాండమును నిర్మించు భాగము (Plumule).

ప్రదక్షిణము నం. వి. దేవాలయములందు కుడివైపునకు చుట్టివచ్చుట

ప్రదరము నం. వి. 1. బాణము 2. ఆడు దానికి కలుగు రక్తస్రావ రోగము.

ప్రదర్శకుఁడు నం. విశ. చూపువాడు

ప్రదర్శనము నం. వి. విశదముగ చూపుట.

ప్రదానము నం. వి. ఇచ్చుట, ఈవి.

ప్రదేశము నం. వి. స్థలము, చోటు.

ప్రదేహము నం. వి. (వృక్ష) బీజాండము యొక్క ముఖ్య శరీరము (Nucellus).

ప్రదోషము నం. వి. 1. మునిమాపు. 2. మిక్కిలి దోషము.

ప్రద్రావణము నం వి. (రసా) ఖనిజము నుండి ధాతువును వేరుచేయుటకు ఖనిజ మును కరిగించుట (Smelting).

ప్రధాన (నా) అక్షము నం. వి (వృక్ష.) భిన్నపత్రమునకుగాని పుష్పమంజరికిగాని కల ముఖ్యమగు కాడ(Main rachis).

ప్రధానమంత్రి నం.వి. (రాజ, శాస.) మంత్రి వర్గనాయకుడు, కేంద్రమంత్రి వర్గనాయ కుడు,

ప్రధానము నం. వి. 1. ముఖ్యము. 2 ముందిచ్చుసొమ్ము. 3 వివాహోత్సవము వధువున కలంకారాదుల నిచ్చినిశ్చయించు కొనుట. 4. పరమాత్మ.

ప్రధానసంఖ్య నం. వి. (గణి) ఒకటి తప్ప మరి యేఇతరసంఖ్యచేతను తెగని సంఖ్య 3, 7, 11, 17, 19, వంటివి. ఒకటికాక ఇతర కారణాంకములు లేని సంఖ్య (Prime number).

ప్రపంచ (చా) ఆరోగ్యశాఖ నం. వి. (వరి., రాజ.) ఐక్యరాజ్య సమితి అధ్వర్య వమున ప్రపంచములోని వివిధదేశముల ప్రజల ఆరోగ్యాభివృద్ధికై కృషిచేయు చున్న సంస్థ,

ప్రపంచము నం, వి. 1. లోకము. 2. సంసా రము, 3, విరివి.

ప్రపంచించు నం. క్రి. విరివిచేయు.

ప్రపితామహుఁడు నం. వి. ముత్తాత.

ప్రపౌత్రి నం వి. ముమ్మనుమరాలు. పౌత్రుని కూతురు.

ప్రపుల్లనము నం. వి. (రసా) చూర్ణముతో కప్పబడినట్లగుట. కొన్ని లవణములు గాలిలో వాని సంయోగజలమును కోలు పోయి చూర్ణమగుట. ఇది చెమ్మగిల్లుట (Deliquescence) కు విరుద్ధసంఘటన (Efflorescence)

ప్రఫుల్లము నం. విశ. బాగుగా వికసించినది (సంఫుల్లము)

ప్రబంధము నం వి. కావ్యము.

ప్రబలము నం వి. చిగురు విశ మిక్కిలి బలము గలది.

ప్రబీజాధారము నం. వి. (వృక్ష) బీజాండము యొక్క ప్రదేహము (Nucellus), అండ త్వక్కులు సంధిరేఖ (Raphe) ఈ మూడును కలియుచోటు (Chalaza).

ప్రబుద్ధము నం విశ. సంఫుల్లము.

ప్రబ్బు క్రి. 1 వ్యాపించు. 2. అతిశయించు 3. నిండించు. 4 కలయు.

ప్రభ నం. వి. 1. వెలుగు. 2. సూర్యుని భార్య. 3. కుబేరుని నగరము.

ప్రభంజనుఁడు నం. వి. గాలి. వ్యు.వృక్షాదు లను బాగుగ విరుచువాడు.

ప్రభవప్రమాణ పత్రము నం. వి. (వాణి.) దిగుమతియగు సరకు ఏ దేశములోతయా రైనదో తెలియచేయు పత్రము. (ఇట్టి పత్రమును ఎగుమతి దేశపు ప్రభుత్వశాఖ గాని, కస్టమ్స్‌వారుగాని ఛేంబర్ ఆఫ్ కామర్స్ వారుగాని యిత్తురు.)

ప్రభవము నం. వి. పుట్టుక, సంభవము

ప్రభవస్థానము నం. వి. (భూసా.) పుట్టుచోటు దొరకుచోటు, ఆకరము, (Source).

ప్రఘాతము సం. వి. పరువాత, పేరుజాము.

ప్రఘాపము సం.వి 1 ప్రతాపము. 2. తేజము

ప్రఘాసిని సం.వి.(జం). చర్మము యొక్క పైపొర(Epidermis).

ప్రభుత్వ నగరాభివృద్ధి సంఘము సం. వి. నగరమును మంచి కట్టడములతో ఉద్యానవనములతో క్రమపద్ధతిని అభివృద్ధి చేయుటకు ప్రభుత్వ మేర్పాటుచేసిన సంస్థ (City Improvement Board).

ప్రభుత్వ పరిపాలనా నివేదిక సం. వి.(రాజ., పరి.) ప్రభుత్వ పరిపాలనా పరిస్థితులను పురోగమనమును తెలుపు పీఠిక, పరిపాలనా వ్యవహార నివేదిక.

ప్రభుత్వము సం. వి. (రాజ.) పరిపాలనము. రాజ్యము యొక్క ఆదర్శములను అమలులో పెట్టుటకై ఏర్పడినసంస్థ. సర్కారు (Government).

ప్రభుత్వాంగములు సం. వి (రాజ., పౌర.) శాసన, కార్యవర్గ, న్యాయశాఖలు.

ప్రభుపీడనా పరిపాలనము సం వి. (రాజ.) ప్రభువర్గ పరిపాలనము గావించుచున్న శిష్టజను లధికార గర్వముతో కాలక్రమేణ స్వార్థపరులుగ మారి, వారు దుష్ట ప్రవర్తనచే శిష్టజన సత్తాకమును ప్రభుపీడన తంత్రముగ మార్చుదురని అరిస్టాటిల్ అభిప్రాయము.

ప్రభువర్గ పాలనము సం. వి. (రాజ.) అరిస్టాటిల్ అరిస్టా.) రచించిన ప్రభుత్వచక్రములలో నొకటి. నిరంకుశ రాజ్యతంత్రముతో ప్రజలు విసుగుచెంది శిష్టజన సత్తాకము నేర్పరుచుకొందురని అరిస్టాటిల్ అభిప్రాయము.

ప్రభుసత్తాకము సం. వి. (రాజ., శాస., పరి.) స్వామిత్వము. ఆంతరంగిక బాహ్య ప్రభుత్వ స్వాతంత్ర్యము. ఇతర రాజ్యములకు లోబడక స్వతంత్రముగా రాజ్యాంతరంగ ప్రభుత్వ వ్యవహారములలో సంపూర్ణాధికారము కలిగియుండుట (Sovereignty).

ప్రభృతి సం. వి. మొదలగు.

ప్రభ్వాదేశ సం. వి. ఉత్తరువులు (రాజ.) యజమాని ఉత్తరువులు.

ప్రమ సం. వి. యథార్థజ్ఞానము.

ప్రమత్తుడు సం. విశే. ప్రమాదపడినవాడు.

ప్రమథనము సం. వి. చంపుట.

ప్రమద సం. వి. యౌవనాది మదముగల స్త్రీ.

ప్రమదావనము సం. వి. అంతఃపుర స్త్రీలు విహరించు ఉద్యానవనము.

ప్రమస్తిష్క గోళార్థకములు సం. వి. (జం.) ప్రమస్తిష్కము యొక్క మృదువైన అండాకారము గల రెండు గోళ భాగములు (Cerebral hemispheres).

ప్రమస్తిష్క నాడీముడులు సం. వి. (జం.) మెదడువలె దాని స్థానమున పనిచేయు నాడులతో ఏర్పడిన ముడివంటి నిర్మాణములు (Cerebral ganglia).

ప్రమస్తిష్క నాడులు సం. వి. (జం.) మెదడు నుండి బయలుదేరి వివిధభాగములకు పోవు నాడులు (Cerebral nerves).

ప్రమస్తిష్కము సం. వి. (జం.) మెదడులో మధ్యమునున్న ఒక ముఖ్య భాగము (Cerebrum).

ప్రమస్తిష్క వృంతయోజము సం. వి. (జం.) మజ్జికము (Medulla) నుండి ప్రమస్తిష్క గోళార్ధముల వరకు దృక్కాండముల (Optic lobes) క్రిందనుండి వ్యాపించు తెల్లని స్తంభాకార నాడీ పదార్థములు(Crura-cerebri).

ప్రమాణ (పు) కొలతలు వి. (గృహ) సరాసరి కొలతలు, సగటు పరిమాణము (Standard measurements).

ప్రమాణద్రావణము సం. వి. (రసా.) నియత రాశి ప్రాచుర్యము గలద్రావణము (Standard solution)

ప్రమాణము సం వి. 1 ప్రత్యక్షాది జ్ఞాన కారణము. 2, సత్యము. 3 మేర. 4. కొలత. 5. శాస్త్రము. వి. (భౌతి.) కొలతకు ఆధారమగునది (Standard). ఉదా. సెవర్సులో సంరక్షింపబడుచున్న మీటర్ దండము తక్కిన ప్రపంచములో వాడుకలోనున్న మీటర్ బద్దలకు ప్రమాణము. వి (గణి.) ఏకాంకము కొలతల కుపయోగించు మూలప్రమాణము(Unit)

ప్రమాణములు సం. వి. నియమిత పద్ధతులు (Norms).

ప్రమాణీకరణము సం. (వాణి.) ఉత్పత్తి చేసిన సరకుల నాణెతను నిర్ణయించుట దీనివలన లాభము: ఒక ప్రమాణ నిర్ణయము జరిగిన పిమ్మట ఆ ప్రమాణము కల్గినవన్నియు అదే నాణెము గల సరకు అని నిర్ధారణ చేయవచ్చును

ప్రమాణీకృతము సం. విశ. (భౌతి.) ప్రమాణముగా చేయబడినది (Standardised).

ప్రమాదము సం. వి. (గృహ.) హఠాత్తుగా కలిగిన కష్టము (Casuality).

ప్రమాది సం. వి. అరువది సంవత్సరములలో నొకటి. (13 వది).

ప్రమాదీచ సం. వి. నలువదియేడవ సంవత్సరము.

ప్రమీల సం. వి. 1. కునికిపాటు. 2. మళయాళదేశపు రాణి

ప్రమేఖలము సం. వి. (జం.) శరీరమున కొంతభాగముపై చుట్టును ఏర్పడు పట్టీ వంటి గ్రంధికణజాలము (Clitellum). ఉదా. వానపాము.

ప్రమేయము సం. విశ. యథార్థముగ నెరుగదగినది. విశ. (భౌతి) నిరూపించవీలయినది (Theorem). విశ. (గణి) తెలిసికొనవలసిన విషయమును గురించిన వాక్యము (Proposition). ఉదా. త్రిభుజము యొక్క మూడు కోణములును రెండు సమకోణములకు సమానము. వి. (గణి.) కొన్ని స్వతంత్ర, స్వతంత్ర చల రాసుల మధ్యగలసంబంధము(Function)

ప్రమేయలేఖనము సం. వి (గణి.) ప్రమేయముగా వ్రాయు విధానము (Functional notation)

ప్రమోదూత సం. వి. నాల్గవ సంవత్సరము,

ప్రయివేటు కళాశాల మి. వి. (వ్యావ.) విశ్వవిద్యాలయము ఆధ్వర్యమునగాక, స్వతంత్రముగ ఏర్పడిన ఒక ప్రత్యేక సంస్థచే గాని వ్యక్తులచేగాని నడుపబడు కళాశాల

ప్రయివేటురంగము వి (అర్థ, రాజ.) దేశములోని పరిశ్రమలు రాజ్యాధీనములో గాక వ్యక్తుల ఆధీనములో నుండుట.

ప్రయుతము సం. వి. దశలక్ష సంఖ్య.

ప్రయోగము సం. వి. 1. నడపుట. 2. కార్యకరణము. 3. ప్రయత్నము వి. (భౌతి.) క్రొత్త విషయములను తెలిసికొనుటకు గాని ఒక సిద్ధాంతమును సరిచూచుటకు గాని చేయు పరీక్ష (Experiment). వి. (గణి.) శాస్త్ర ప్రయోగము. శాస్త్ర న్యాయము నుపయోగించుట (Application).

ప్రయోగశాల సం. వి. (భౌతి.) విజ్ఞాన సముపార్జన కుద్దిష్టమైన ప్రయోగములు గావింపబడు మందిరము. (Laboratory), వి. (భౌతి., రసా.) ప్రయోగాత్మకముగా సత్యాసత్యములను చర్చించు ప్రదేశము (Laboratory)

ప్రయోగసిద్ధ సాంకేతికము సం.వి. (రసా.) కేవల ప్రయోగము వలన లభ్యమైన

రాసాయనిక సాంకేతికము (Emperical formula).

ప్రయోగాత్మకము నం. విశే. (భౌతి.) ప్రయోగమునకు సంబంధించినది, అనుభవ సిద్ధమైనది (Practical). చూ. ప్రయోగము

ప్రయోజకుఁడు నం. విశే. కార్యము నెర వేర్చువాడు.

ప్రయోజనము నం. విశే (గృహ) ఉద్దేశము. కారణము (Motive). (అర్థ) వ్యక్తి యొక్క వాంఛలను అవసరములను తీర్చు శక్తి (Utility).

ప్రయోజనము,- విలువ (మూల్య) సిద్ధాంతము వి. (అర్థ.) వ్యక్తి యొక్క అవసరములు తీర్చు శక్తి నిబట్టి రాశి యొక్క విలువ (మూల్యము) నిశ్చయింపబడును రాశి తక్కువ యున్నచో మూల్యమధికము. అవసరములకన్న రాశి (వస్తువు) అధికముగ లేక సులభముగ లభించినచో విలువమూల్యము క్షీణించును

ప్రరోహము నం వి. మొలక. (వృక్ష.) మొక్కకు భూమిపై నుండు కాండము (Shoot)

ప్రలంభము నం వి. వంచనము

ప్రలాపము నం. వి. 1. అర్థరహిత వాక్యము. 2. పలవరము.

ప్రలోభనము నం వి. 1. మృగాదుల పట్టుటకై పెట్టు మచ్చు. 2. ఆశపెట్టుట.

ప్రల్లదము వి. 1. దుర్భాషణము. 2 దుష్కృత్యము.

ప్రవక్త నం. వి 1. చక్కగా మాటాడువాడు. 2. మతప్రవక్త.

ప్రవచనము నం. వి 1, వేదము. 2. గొప్ప మాట, (గణి) విషయ విపులీకరణము (Exposition).

ప్రవణత నం. వి. (భౌతి.) ఒకరాశి దూరముతో మారురేటు (Gradient). ఉదా. ఎత్తుతో భారమితి పాదరస స్తంభ దైర్ఘ్యము మారు రేటు.

ప్రవణుఁడు నం. విశే. 1. నమ్రుడు. 2. సమర్థుడు.

ప్రవరుఁడు నం. విశే 1. శ్రేష్ఠుడు.

ప్రవర్తకము నం వి. (రసా) ఇంజనును చలనములో పెట్టు పరికరము, ఒక రాసాయనిక ప్రక్రియను ప్రవర్తించునటు చేయునది (Starter). ఉదా. జింకు, అయొడినుల మిశ్రచూర్ణముల మధ్య రాసాయనికపు మార్పును ప్రవర్తింపచేయునవి కొన్ని ఉదక బిందువులు. ఉదకము కలపకముందు రాసాయనిక వికారము దృష్టిగోచరము కాదు

ప్రవర్తన నం. వి. (గృహ) నడవడి. నడత (Behaviour).

ప్రవర్ధకము నం. విశే. (భౌతి.) ధ్వనినిగాని విద్యుచ్ఛక్తినిగాని ఎక్కువ చేయునది (పరికరము, వృద్ధినొందించునది Amplifier.)

ప్రవర్ధనము నం. వి. (వృక్ష) అభివృద్ధి (Development). వి. (వ్యవ.) విత్తులు, పిలకలు, దుంపలు, కొమ్మలు, అంట్లు మొదలగు వాని ద్వారా కావలసినన్ని మొక్కలనువృద్ధిచేయుట (propagation)

ప్రవల్హిక నం. వి. గూఢార్థప్రబంధము చూ. ప్రహేళిక.

ప్రవాదము నం. వి. కారణము లేకయే వ్యాపించిన మాట.

ప్రవాసము నం. వి. పరదేశవాసము, పరదేశ గమనము.

ప్రవాహము నం. వి. 1. వెల్లువ. 2. పరంపర వి. (భౌతి.) ప్రవహించునది (Current).

ప్రవాహి నం. వి. (రసా.) ప్రవహించు స్వభావము గల ద్రవ్యము, చలన స్వేచ్ఛ

గల అణువుల కూర్పు అయిన ద్రవ్యము (Fluid). ఉదా. ద్రవములు వాయువులు

ప్రవాహిత నం. వి (భౌతి.) ఇటునటు చలించుటకు స్వేచ్ఛగల అణువులుగలిగి యుండుట (Fluidity).

ప్రవాళము నం. వి. 1. పగడము. 2 చిగురు. 3. వీణాదండము.

ప్రవాహమాపకము నం. వి. (భౌతి.) విద్యుత్ప్రవాహమును ఆంపియర్లలో కొలచు పరికరము (Ammeter).

ప్రవిభాజి నం. విశే. (వృక్ష) శీఘ్రముగా విభజనచెందు శక్తిగలది(జీవకణ సంహతి) (Meristematic),

ప్రవీణుఁడు నం. విశే నిపుణుడు,

ప్రవృత్తి నం. వి 1.నడక. 2. ప్రవేశము. 3. బ్రతుకుతెరువు,

ప్రవ్రజితుఁడు నం. వి. సన్యాసి,

ప్రవ్వ నం. వి. కుండ

... భా వి. ( ... ) అనుకూలగరిష్ఠ జనసంఖ్య. విస్తీర్ణమునుబట్టి, పారిశ్రామికోత్పత్తినిబట్టి, సహజసంపదనుబట్టి ఒక ప్రదేశమువం దుండదగిన అత్యంతానుకూల గరిష్ఠ జనసంఖ్య.

ప్రశంస నం. వి. మెప్పు, స్తుతి ప్రస్తావించుట,

ప్రశస్తి నం. వి. 1. ప్రసిద్ధి, 2. పొగడ్త

ప్రశుక్రకోశములు నం. వి. (జం) శుక్రజనన క్రియ జరుగుటకు ముందు వృషణములో నుండు సంయోగ కణములు (Spermatogonia),

ప్రశ్వాసరంధ్రము నం.వి. (జం.) కీటకముల శరీరములో నుండు శ్వాసనాళికలు బయటికి తెరచుకొను ఒక రంధ్రము. ఉభయచర జంతువులలో మొప్పల చీలిక యుండుగది బయటికి తెరచుకొను రంధ్రము (Spiracle).

ప్రష్ట నం. విశే. అడుగువాడు.

ప్రసంగము నం. వి. ఉపన్యాసము.

ప్రసన్నము నం. విశే. 1. నిర్మలము. 2 సంతుష్టము.

ప్రసరణము నం. వి అంతట వ్యాపించుట వి. (భౌతి.) కాంతికిరణముల ప్రయాణము (Propagation).

ప్రసరసంధి నం. వి. (జం) జారుడుకీలు, వరుసగా నమర్చిన చిన్న ఎముకలు ఒకదానిపై నొకటి జరుగుచుండు కీలు (Gliding Joint). ఉదా. అరచేతిఎముకలు

ప్రసవపూర్వము నం విశే. (గృహ) కాన్పుకు ముందున్నది (Antinatal or prenatal).

ప్రసవము నం. వి. 1. కానుపు. 2.పుష్పము 3. పుట్టుక. 4. పండు. 5. బిడ్డ.

ప్రసాదనము నం. వి. 1. తేర్చుట 2. అన్నము.

ప్రసాదము నం. వి. 1, అనుగ్రహము 2. ప్రసన్నత. 3. భగవంతునికి నివేదించిన అన్నము.

ప్రసాధనము నం. వి. వస్త్రాద్యలంకరణము.

ప్రసాధని నం. వి. దువ్వెన,

ప్రసారణము నం. వి. (భౌతి.) ధ్వనులను ప్రసారము చేయుట (Broad-casting).

ప్రసారము నం. వి. వ్యాపనము. నం. వి. (భౌతి.) రేడియోతరంగములను వ్యాపింపచేసి దాని ద్వారా మాటలను సంగీత ధ్వనులనుఆకాశములోనికిపంపుట(Broad-casting).

ప్రసారయంత్రము నం. వి. (భౌతి.) ధ్వనులను ప్రసారము చేయు యంత్రము (Transmitter).

ప్రసూత నం. వి. బాలెంతరాలు.

ప్రసూతి నం. వి. కానుపు, పుట్టుక.

ప్రసూనము నం. వి. 1. పువ్వు. 2. ఫలము,

ప్రసేకము నం.వి. చల్లుట.

ప్రస్తరము సం. వి. 1. రాయి. 2 రత్నము. 3. చిగుళ్ళు మొదలగువానిచే ఏర్పరిచిన సెజ్జ.

ప్రస్తరించు సం. క్రి విస్తరించు.

ప్రస్తరీభూత ప్రాణిశాస్త్రము సం. వి (జీవ.) శిలాజములుగా నిలిచియున్న వృక్షవృక్ష జంతువులను గూర్చి తెలియజేయు శాస్త్రము (Palaeontology).

ప్రస్తారము సం. వి. ఛందశ్శాస్త్రమునందలి గురు లఘువుల గుణకారము వి (గణి.) కొంత సంఖ్యగల వస్తువునుండి వానిని అన్నిటినిగాని లేదా వానిలో నొకభాగమునుగాని తీసికొని ఏర్పరుపగల విన్యాసము. ఒక గుంపులోని వస్తువుల ఎన్ని విధముల వేర్వేరు విన్యాసముల క్రింద కూర్చుటకు వీలగునో అన్ని విన్యాసములను కూర్చుట (permutation). ఉదా a, b, c అను మూడు వస్తువులకు abc, cab. acb, cba, bac, bca అను ఆరు విన్యాసముల నీయవచ్చును.

ప్రస్తావన సం. వి. (నాట.) 1 నాటకము లందు నాంది తరువాత వచ్చు సూత్రధారుడు, నటి గావించు సంభాషణము. (ఇందు కవి, నాటకేతివృత్తము ప్రస్తావింప బడును, 2. ప్రస్తావము.

ప్రసుప్తి సం వి స్వాపము.

ప్రస్థము సం. వి. 1 తలాము. 2, కొండ చరియము.

ప్రస్థానము సం. వి. 1. ప్రయాణము. 2. శాస్త్రము.

ప్రస్ఫురణము సం. వి (భౌతి, రసా) కాంతి కిరణములు పైబడినపుడు ప్రకాశించు గుణముగల కొన్ని ద్రవ్యముల గుణము (Fluorescence).

ప్రస్ఫోటనము సం. వి. 1 చేట. 2. దెబ్బ.

ప్రహరణము సం. వి. 1. ఆయుధము. 2. బాణము. 3 కొట్టు.

ప్రహారము సం. వి, 1. దెబ్బ. 2. జాము.

ప్రహారి వై.వి ప్రాకారము. సం ప్రాకారము.

ప్రహసనము సం వి. 1. ఒక రూపకము. 2. పెద్దనవ్వు 3. పరిహాసము.

ప్రహస్తము సం. వి. చప్పట, చపేటము.

ప్రహితము సం. విశ. వింటినుండి విడువబడినది.

ప్రహేళిక సం. వి. గూఢార్థకావ్యము.

ప్రహ్లాదము సం. వి. సంతోషము.

ప్రళయము సం. వి. 1. కల్పాంతము. 2. అపాయము, 3. మృత్యువు. 4. మూర్ఛ.

# ప్రా

ప్రాంకురము సం. వి (వృక్ష) గింజలో నుండు ప్రాథమికాక్షము యొక్క భూమి పైకి పెరుగు కొన (Plumule)

ప్రాంగణము సం. వి. ముంగిలి.

ప్రాండకోశము సం. వి. (జం.) అండము తయారగు కోశము (Oogonium).

ప్రాంతము సం.వి. 1. తీరము. 2.సమీపము సం. వి. (భూగో.) పెద్ద భూభాగము, ప్రత్యేక నైసర్గిక లక్షణములు కలిగి, ప్రత్యేక శీతోష్ణస్థితి, జంతువృక్ష సంపదలు గల భూభాగము. (రాజ.) పరిపాలనా సదుపాయమునకై విభజింపబడిన రాజకీయ భాగము

ప్రాంతరము సం, వి. 1, అడవి. 2. తొఱ్ఱ. 3. ఎడారితోవ. 4. పొలిమేర.

ప్రాంతీయభావము సం. వి. (రాజ.) ఒకే ప్రాంతమున నివసించుచు, ఒకేజాతి, ఒకే భాష ఆచార సంప్రదాయములు కలిగిన

ప్రజలు ఆ ప్రాంతముపై ప్రత్యేక సంకుచితాభిమానమును పెంచుకొనుట.

ప్రాంశువు నం. విజ. పొడుగైనది.

పాకీకుడు వి. పాకుడు.

పాగిబర్భీము వై. వి. (ప్రాత+కబ్బము) వేదము.

పాజెదులపెట్టె వి. సూర్యుడు.

పాత వై. వి. 1. భృత్యుడు. 2. జీర్ణ వస్త్రము, వస్త్రము విజ. 1. బహుకాలము నాటిది, పూ. ్వము, పురాతనము నం. భృత్యః, వస్త్రమ్, పురాతనమ్

పాబడు వై. క్రి. 1. అలవడు. సిద్ధించు. 2. పాతఇల్లు, మాయు,

పాకృతము నం. వి. ఒకానొక భాష.

పాకృతికావస్థా సిద్ధాంతము నం. వి. (రాజ.,చరి.) రాజ్యము. శాసనము లేని కాలములో మానవుని ప్రాకృతికావస్థను గురించి క్రీ.శ. 17, 18 శతాబ్దములలో హాబ్సు, రూసో లాక్ అను రాజకీయ శాస్త్రవేత్తలు వ్రాసిన సిద్ధాంతములు.

ప్రాకృతిక గోత్రము నం. వి.(వృక్ష.) ముఖ్యమగు కొన్ని సమానలక్షణములుగల కొన్ని కుటుంబముల సమూహము, స్వాభావిక గోత్రము.

ప్రాకృతిక వరణము నం వి. (జీవ.) ఏదైన నొక ప్రత్యేక పర్యావరణము(Environment). లో చావక నిలిచి యుండుటకు బాగుగా తగియున్న ప్రాణులను ప్రకృతియే ఎన్నుకొనుట(Natural selection)

ప్రాకృతుఁడు నం, విజ. 1. పామరుడు. 2. హీనుడు.

ప్రాక్టరు ఇం. వి. (Proctor). విశ్వవిద్యాలయముల విద్యార్థులు క్రమపద్ధతిలో నడుచుకొనునట్లు చూచు అధికారి, విశ్వవిద్యాలయక్రమశిక్షణాధికారి.

ప్రాక్తనము నం. విజ., 1. ప్రాతది. 2. పురాతనము.

ప్రాక్తనజన్మ నం. వి. పూర్వజన్మ.

ప్రాక్సీ ఇం వి (Proxy). 1. బదిలీదారు, 2 ప్రతినిధి. 3. వకీలు.

ప్రాగల్భ్యము నం. వి. 1 ప్రగల్భత్వము. 2. స్త్రీల యొక్క ఒకరకము శృంగార చేష్ట.

ప్రాచి నం. వి. తూర్పు.

ప్రాచీనబర్హి నం. వి. ఇంద్రుడు.

ప్రాచీన శిలాయుగము ,, వి. (చరి.) శిలాయుగపు మొదటి భాగము. ఈ కాలమునాటి రాతి పనిముట్లు మొరటుగా నుండెను నాటి మానవులకు వ్యవసాయము. బట్టలు ధరించుట. అగ్నిని ఉపయోగించుట తెలియదు, వీరు పచ్చిమాంసమును, కాయలను, కందమూలములను వండక యే తినుచుండిరి స్థిరనివాసములు లేక భ్రిమ్మరులై తిరుగుచుండిరి.

ప్రాచీనావీతము నం వి. కుడిభుజము మీదుగా ఎడమపార్శ్వమున వ్రేలెడు జందెము (పితృకర్మలలో ఇట్లు వేసికొందురు).

ప్రాచ్యము నం విజ తూర్పుదిక్కు నందలిది

ప్రాజాపత్యము నం. వి. 1 అధికారము, 2. ఒకరకమైన వివాహము.

ప్రాజెక్టు ఇం. వి. (వ్యాప.) (Project). యోజన, ప్రణాళిక.

ప్రాజ్ఞుఁడు నం. విజ. 1. సమర్థుడు. 2. పండితుడు

ప్రాడ్వివాకుఁడు నం.వి. తగవరి,న్యాయము తీర్చువాడు.

ప్రాణగొడ్డము వై. విజ. ప్రాణహింసకము. నం. ప్రాణకుట్టః.

ప్రాణము నం. వి. 1. గాలి. 2. హృదయమందలి గాలి, ఉసురు.

ప్రాణవాయుయుతశ్వసనము సం. వి. (వృక్ష) ప్రాణవాయువును తీసికొని బొగ్గుపులుసుగాలిని వదలివేయు శ్వసన క్రియ (Aerobic respiration)

ప్రాణవాయు రహిత శ్వసనము సం. వి. (వృక్ష) ప్రాణవాయువును తీసికొనకుండనే బొగ్గుపులుసు గాలిని వదలివేయు శ్వసనక్రియ (Anaerobic respiration)

ప్రాణాహారము సం. వి. ప్రాయోపవేశము

ప్రాణాయామము సం. వి. నాసికాముఖములయందు సంచరించెడు వాయువును మంత్ర పూర్వకముగా నిరోధించుట.

ప్రాణి ఏకాంతరోత్పత్తి క్రమము సం. వి. (జీవ) ప్రాణి జీవితమున లింగ సంబంధమును లింగసంబంధము కానిదియునగు రెండు దశలు నొకదాని తరువాత నొకటి వచ్చుట(Alternation of generations)

ప్రాతిపదికము సం. వి. ప్రత్యయము చేరక ముందున్న శబ్దరూపము.

ప్రాతర్వమనము సం. వి. (గృహ.) వేవిళ్ళు, గర్భిణీ స్త్రీలకు మొదటి నెలలో నుండు కడుపులోని వికారము (Morning sickness)

ప్రాథమికము సం. విశ. ముఖ్యమైనది. ప్రధానమైనది, మొదటిది (Primary).

ప్రాథమిక (కా) అక్షము సం. వి. (వృక్ష.) బీజ భ్రూణములో నుండు అక్షము (Primary axis). (అది ఒకవైపు ప్రకాండము గను రెండవవైపు ప్రాథమిక మూలము గను పెరుగును)

ప్రాథమిక (విద్యుత్) ఘటము సం. వి. (భౌతి.) రాసాయనిక ద్రవ్యముల మధ్య ప్రతిక్రియలు ప్రభవస్థానములుగా పనిచేసి విద్యుత్తు నుత్పాదించు ఘట్టము(Primary cell).

ప్రాథమిక దారువు సం. వి. (వృక్ష) పెరుగని కాండముకాని లేతగా నున్నపుడు దాని వాహికాపుంజములలో మొదటనున్న దారువు (Primary xylem).



ప్రాథమిక మూలము ప్రాథమిక దారువు సం. వి. (వృక్ష.) ఉపదారువు ప్రధానమగు వేరు (Primary Root or Radicle).

ప్రాథమికసత్వములు సం. వి. (రాజ) రాజ్యాంగ శాసనము ప్రకారము ప్రతి పౌరునకు గల ప్రాథమిక హక్కులు, మూలాధికారములు.

ప్రాథమిక స్వీకృతము సం. వి. (గణి.) ఉపపత్తి లేకుండగనే స్వీకరింపబడిన ప్రాథమిక సత్యము (Postulate).

ప్రాదుర్భావము సం. వి. పుట్టుక.

ప్రాదేశము సం. వి. చాచిన బొటనవ్రేలు చూపుడువ్రేలి నడిమి కొలత, జానెడు.

ప్రాపణము సం. వి. ప్రాపించుట.

ప్రాపు వై. వి. ఆశ్రయము.సం ప్రాపణమ్ ప్రాపః.

ప్రాబల్యము సం. వి. 1. ప్రబలత్వము. 2. బలిష్ఠత.

ప్రాబల్యము సం. వి. (భౌతి.) పనిచెయుటకున్న సామర్థ్యము (Strength). (బలముగా నుండుట

ప్రాభవము సం. వి. ప్రభుత్వము.

ప్రాభృతము సం. వి. కానుక.

ప్రామాణికవేళ సం. వి. (భూగో) దేశము మధ్యనున్న రేఖాంశమును తీసికొని దానికి అగుకాలము లెక్కించి దేశమంతటికి అదియే కాలముగ నిర్ణయించిన కాల ప్రమాణము.

ప్రామాణికుఁడు సం. విశే. 1. సత్యము తప్పనివాడు. 2. మేరమీరనివాడు. 3 శాస్త్రము నెరిగినవాడు.

ప్రామాణ్యము సం. వి. 1. దృష్టాంతము. 2 సాత్యము.

ప్రామిడి వై. వి (ప్రాము + ఇడి) క్రౌర్యము విశే. క్రూరుఁడు.

ప్రామినుకులు వి. (బహు.) వేదము.

ప్రాము వై. క్రి 1 పూయు, రాచు తుడుచు. 2 ఖండించు, 3. పులుము.సం. ప్రమృజ్.

ప్రాయము సం. వి. 1. వయస్సు 2 బాహుళ్యము 3. చావు.

ప్రాయశ్చిత్తము సం. వి 1. పాప పరిహారమునకై చేయుకర్మము. 2. ప్రతీకారము.

ప్రాయి వి. 1 భాగ్యము. 2. పౌరుషము 3. సౌమంగల్యము.

ప్రాయికము సం. విశే. 1. సామాన్యము. 2. తరుచు.

ప్రాయోగిక రసాయనశాస్త్రము సం వి. (రసా.) శాస్త్రభావముల, సిద్ధాంతముల సార్థక్యము గ్రహించుట కుద్దిష్టమైన ప్రయోగముల వివరించు శాస్త్రము.

ప్రారబ్ధము సం.వి. జన్మము కలిగించుపూర్వ కర్మము. విశే. ఆరంభింపబడినది.

ప్రార్థనాసమాజము సం. వి. (చరి.) ఆత్మారామ్ పాండురంగ అనునతనిచే ప్రారంభింపబడి, న్యాయమూర్తి మహాదేవ గోవింద రానడే భండార్కర్ల ద్వారా హైందవ సమాజములోని వెనుకబడిన తరగతులలో నిది వ్యాప్తిచేయబడెను. ఈ సమాజోద్యమము 19వ శతాబ్దములో భారతదేశము లోని సాంస్కృతిక సాంఘిక పునరుజ్జీవనోద్యమములోని అంతర్భాగము,

ప్రాలంబము సం. వి. మెడనుండి రొమ్మున వ్రేలు హారము.

ప్రాలు వి. 1. తలఁబ్రాలు. 2. బియ్యము

ప్రాలుమాలు క్రి 1. సోమరితనముపొందు.

ప్రాలేయము సం. వి మంచు.

ప్రావ వై వి. దోషము, సం. పాపమ్.

ప్రావరణము సం. వి. 1 ఉత్తరీయము. 2. ముసుగు.

ప్రావసాదక కండరము సం. వి ( జం ) అవయవములకు క్రిందికి దించుట కుపయోగపడు కండరము (Depressor muscle).

ప్రావిడెంటు ఫండు ఆం వి.(శాస) (provident fund). భవిష్యన్నిధి, అపదర్థనిధి. ముందు జాగ్రత్తకొరకు ఏర్పాటు చేయబడిన నిధి ఉద్యోగి ఉద్యోగము నుండి విరమించునప్పుడు పారితోషికముగా ప్రభుత్వముగాని సంస్థగాని ఇచ్చు నిధి. ఈ నిధికి ఉద్యోగికూడ ఉద్యోగములో నున్నంతకాలము ప్రతిమాసము తన వేతనములో కొంత శతాంశము ఇయ్యవలసి యుండును.

ప్రావీణ్యము సం. వి నేర్పు

ప్రావృట్టు సం. వి. వర్షఋతువు రూ. ప్రావృష.

ప్రావృతస్నాయువు సం వి. (జం.) తుంటికీలునకు గల స్నాయువు (Capsular ligament). ఇది చుట్టును అమర్చబడియుండును,

ప్రాశనము సం. వి. కుడుపు, భోజనము.

ప్రాశితము సం విశే. 1. భుజింపబడినది. 2. త్రాగబడినది,

ప్రాశ్నికుఁడు సం. వి. సభ్యుడు, విశే. ప్రశ్నచేయువాడు.

ప్రాసము సం.వి. 1. పద్యపాదమున రెండవ యక్షరము, 2. ఈటె.

ప్రాసాదము సం. వి. 1. దేవాలయము. 2. రాజగృహము.

ప్రాసికుఁడు సం. విణ. ఈటెకాడు.

ప్రాస్తారిక కణజాలము సం. వి. (జీవ.) అధిచ్ఛదీయ కణజాలము. పెగవులు నోరు మొదలగు వాని మీఁదిపొర (Epithelial Tissue).

ప్రాహ్ణము సం వి. ఉదయాదిగ పదె గడియల వఱకు గల కాలము, లేఁగలు.

# ప్రి

ప్రిదులు వై. క్రి. 1, సడలు 2. విరియు. 3. తగ్గు. 4. ఊడు. 5.జారు. 6. తొలగు. సం. ఖిద్, ప్రవ్ర.

ప్రిఫరెన్సుబాండ్లు ఇం. వి. (preference bonds). సామాన్యవాటాలకు లాభము పంచుటకు పూర్వము నిర్ణీతమైన వడ్డీని పొందు ఋణపత్రములు.

ప్రియ సం. వి. ప్రియురాలు,

ప్రియంగుపు సం. వి. 1. కొఱ్ఱధాన్యము. 2. నల్లావలు. 3. కుంకుమము.

ప్రియంవదుఁడు సం. విణ. ఇచ్చక మాడు వాడు. ప్రియవాది.

ప్రియము సం. విణ. 1. ఇష్టము. 2. హెచ్చు వెలగలది.

ప్రియవాదిక సం. వి. వివాహాది ప్రయుక్త మంగళవాద్యము.

ప్రియాంబిల్ ఇం వి (Preamble). ప్రస్తావన, సంధానము యొక్కగాని., చట్టము యొక్కగాని ముఖ్యోద్దేశముల గుఱించి విశదీకరించిన ఉపోద్ఘాతము.

ప్రియాలము సం. వి. ఒక విధమగు మామిడి చెట్టు రూ. ప్రియాళువు.

ప్రియుఁడు సం వి. ప్రాణనాథుడు.

ప్రివిలేజ్ ఇం వి (శాస.)(Privilege). ప్రత్యేకాధికారము

ప్రివీకౌన్సిలు ఇం.వి (శాస.)(Privy council) రాజు యొక్క మంత్రాలోచన సభ.

# ప్రీ

ప్రీణనము సం.వి. తృప్తి పుట్టించుట.

ప్రీతి సం.వి. 1. సంతోషము. 2. స్నేహము.

ప్రీతిదత్తము సం వి. అత్తమామలచే ప్రేమచే నియ్యబడిన స్త్రీధనము.

ప్రీమియము ఇం. వి. (వాణి.)(Premium). జీవితభీమా చేసినవాడుని ర్దిష్టకాలాంతము వరకు చెల్లించు వాయిదాల సొమ్ము అడితిసొమ్ము, కంపెనీల వాటాలకు వాటాల విపణిలో గిరాకి ఎక్కువగ నున్నప్పుడు వాటాల యొక్కగాని, ఋణపత్రముల యొక్కగాని ముఖమూల్యము అదనముగ వసూలుచేయు సొమ్ము. భీమాకు చెల్లించవలసిన సొమ్ము.

ప్రీవీపర్సు ఇం. (శాస.) రాజభృతి.

# ప్రు

ప్రుంగుడు వి. తెల్లకుష్ఠము.

ప్రుచ్చు క్రి. పుష్పిఫట్టు. రూ. పుచ్చు.

ప్రువ్వు వై. వి. పురుగు. సం. పులకః,

ప్రుష్వము సం. వి. 1. వానకాలము, 2. నీటిబొట్టు.

# ప్రె

ప్రెగడ వై. వి. 1. మంత్రి. 2. ప్రధాన పురుషుడు. రూ. ప్రెవడ. ప్రెగ్గడ, పెగడ. సం. ప్రఘసః ప్రకృష్టః. ప్రధానః.

ప్రెబ్బొత్తి వి.అ. (పేరు+బొత్తి). 1. నిశ్చయముగా, 2. పెద్దగుంపుగానున్నది(అని కొందరు).

ప్రెయిరీలు ఇం. వి (భూగో.) (Prairies). ఉత్తరఅమెరికాలో విశాల సమశీతోష్ణపు పచ్చిక బయళ్ళు.

ప్రెషర్ కుక్కర్ ఇం.వి (గృహ.) (Pressure Cooker). ఆవిరి ఒత్తిడిచే వండుపాత్ర

ప్రెస్ ఇం. వి. (భౌతి.) (Press) వస్తువులను ఒత్తిడి వలన కావలసిన రూపములోనికి తీసికొను వచ్చు యంత్రము. (రాజ.) పత్రికా ప్రపంచము, ముద్రణ యంత్రము.

ప్రెస్ సెన్సార్ ఇం. (రాజ )(Press-Censor పత్రికలలో వార్తలు ప్రచురించుటకు ముందు ప్రభుత్వోద్యోగులచే పరిశీలింప బడుట.

ప్రెస్సర్ ఫూట్ ఇం. వి. (గృహ.) (Pressure foot) కుట్టు యంత్రము లోని ఒక భాగము. బట్టలు కుట్టునప్పుడు కుట్టు లో కుట్టు సరిగా పడునట్లు సూది క్రింది బట్టను అదిమి పెట్టు భాగము.

ప్రెస్సర్ ఫూట్
మెషిన్ పాదము

# ప్రే

ప్రేంకడము వై. వి. ప్రియాళు వృక్షము. రూ. ప్రేంకణము. సం. ప్రియంగుః.

ప్రేంఖ సం. వి. 1. డోల. 2. పర్యటనము. 3. నృత్యము. 4. అశ్వగతి.

ప్రేంఖనము సం. వి. 1. ఊగుట. 2. పర్యటనము. 3 ఒకేపాత్రము గల రూపకము

ప్రేంఖితము సం. విశే. ఊగింపబడినది

ప్రేపుఁడు విశే. అధికుడు.

ప్రేక్షణము సం. వి. 1. నేత్రము. 2 నృత్యము 3, చూచుట.

ప్రేక్షణికుఁడు సం. విశే. ప్రేక్షకుడు, చూచువాడు

ప్రేచు వై. క్రి. ప్రేరేపించు

ప్రేతపురము సం. వి. యమపట్టణము.

ప్రేతము సం. వి. 1. భూతము. 2. ఏనుగు.

ప్రేతవనము సం. వి. శ్మశానము, ఒలికిమిట్ట

ప్రేపు వై. వి. వేగుజాము,

ప్రేము వి. వేత్రము, బెత్తము. రూ. పేము.

ప్రేముడి వై. వి. స్నేహము. సం. ప్రేమన్

ప్రేయసి సం. వి. ప్రియురాలు.

ప్రేరకత్వము సం. వి. (భౌతి.) ఒక విద్యుత్పరిపథమందు విద్యుత్ప్రవాహ తీక్ష్ణతను మార్చుటచే ప్రేరేపించబడు విద్యుచ్చాలక బలమును ప్రదర్శించు ధర్మము (Inductance).

ప్రేరణము సం. వి. ఇతరులను చేయుమని యుద్బోధించుట.

ప్రేరణము సం. వి. (భౌతి.) కేవలముగ సమీపమున నుండుటచేతనే ఇంకొక వస్తువునందు ఒక వస్తువు కలుగచేయు క్రియ (Induction)

ప్రేరణార్థకము నం. వి. (వ్యాక.) ఒకడు మరియొకనికి దేనినైనను చేయించుటను తెలుపు క్రియ, ఉదా. ఉపాధ్యాయుడు బాలునిచే పుస్తకమును చదివించెను,

ప్రేరణి నం వి. ఒక రకమైన నృత్యము,

ప్రేరిత విద్యుత్ప్రవాహము నం. వి. (భౌతి.) అయస్కాంతపు దొడల మధ్య నొక రాగి తీగను కదలించిన యెడల ఆ తీగలో విద్యుత్ప్రవాహము ప్రేరితమగును (Induced current).

ప్రేరితస్పందనము నం. వి (భౌతి) ఒక వస్తువులో ఇంకొకదానిచే ప్రేరేపింపబడిన స్పందనము (Forced oscillation)

ప్రేరేపణ నం. వి. 1. చలింపచేయుట. 2. ప్రోత్సాహము (Motivation).

ప్రేలణ వి. పేలలు. చూ పేలాలు

ప్రేలు క్రి. 1 వదరు. 2. వేగు. 3. వేగి యుబుకు. 4. చప్పుడు చేయుచు బ్రద్దలగు.

ప్రేషకము నం. వి. (భౌతి.) ఇంకొక చోటికి పంపునది (Trasmitter). ఉదా. రేడియో ప్రేషకము.

ప్రేషకుఁడు నం. విశే. పంపువాడు,

ప్రేష్యుఁడు నం, వి 1, భృత్యుడు విశే. పంపదగినవాడు.

## ప్రై

ప్రైవేటు పాఠశాల మి. వి. ( వ్యావ. ) ప్రభుత్వముచేగాక స్వతంత్ర సంస్థలు లేక వ్యక్తులచే నడుపబడు పాఠశాల, ఖాస్గి పాఠశాల.

ప్రైవేటు బిల్లు ఇం. వి. (శాస.) (private-bill) ప్రభుత్వ పక్షము నుండి కాక అనధికార శాసన సభ్యునిచే ప్రవేశ పెట్టబడిన చిత్తు చట్టము.

ప్రైషము నం. వి. 1. ప్రేషణము. 2. మర్దనము. 3 క్లేశము. 4, ఉన్మాదము.

## ప్రొ

ప్రొటెక్టరేట్ ఇం. వి. (రాజ) (protectorate). రక్షక పరపాలన.

ప్రొటెస్టాంటులు ఇం. వి. (చరి.) (Protestants) రోమన్ కాథలిక్కు మతాచారములను ఐహికాధ్యాత్మిక విషయములలో 'పోప్' యొక్క అధికారమును ధిక్కరించిన క్రైస్తవులు. క్రీ.శ. 1529 నుండి ఈ తెగ వ్యాప్తిలోనికి వచ్చెను.

ప్రొద్దు వై, వి 1. సూర్యుడు 2. కాలము. 3. దినము. నం. బ్రధ్నః.

ప్రొద్దుగల్లు వి. సూర్యకాంత శిల.

ప్రొద్దుఁగొడుకు వి. 1. యముడు. 2. రాహువు. 3. శని. 4. కర్ణుడు. 5. సుగ్రీవుడు.

ప్రొద్దులనెల వి. ప్రసవమగు నెల.

ప్రొయ్యి వి. పొయ్యి.

## ప్రో

ప్రోఁగు వి. పోగు.

ప్రోక్షణము నం. వి. (నీళ్ళు). 1, చిలుకరించుట. 2, (యజ్ఞమునందు) పశువును వధించుట.

ప్రోచు వై. క్రి. అన్నపానాదు లొసగి పోషించు, నం పుష్.

ప్రోటాన్ ఇం. వి. (రసా) (proton) ధన విద్యుత్తు యొక్క అణుప్రమాణము.

ప్రోటోజోవా ఇం. వి. (జీవ) (protozoa) అతిసూక్ష్మములైన ఏకకణ జీవులు.

ప్రోఢ వై. విశ. 1. ప్రౌఢ స్త్రీ 2. ప్రౌఢుడు 3. నిపుణుడు. 4. ఉపాయశాలి సం. 1. ప్రౌఢా. 2. ప్రౌఢః.

ప్రోతము సం. వి. వస్త్రము. విశ. కుట్టబడినది. వి. (గృహ.) పేక, బట్టనేతలో అడ్డముగా వేయు నూలు (Weft or Woof).

ప్రోథము సం. వి. 1. గుఱ్ఱపు ముక్కు, 2. గర్భపిండము. 3 పిరుదు, విశ. ప్రసిద్ధికెక్కినది,

ప్రోది వై వి. 1. పోషణము. 2, వైభవము 3. శోభ

ప్రోదిగొను క్రి. పోషించు, కాపాడు.

ప్రోభూజకము సం. వి. (వృక్ష.) ఏకకణో ద్భిదముల హారితకణములో నుండు మాంసకృత్తు. దానిచుట్టును పిండిపదార్థపు పొరకల గుండ్రని నిర్మాణము (pyrenoid).

ప్రోయాలు వి. (ప్రోలు+ఆలు) 1.ఇల్లాలు. 2. ఆడుది.

ప్రోలిటేరియటు ఇం. వి. (రాజ.) (proletariat). శ్రామిక వర్గము.

ప్రోలు వై. వి. పట్టణము, సం. పురీ, పూర్

ప్రోషము సం. వి. కాల్చుట.

ప్రోషితభర్తృక సం.వి (అలం.) ప్రియుడు దేశాంతరగతుడై యుండ ఖేదము చెందు నాయిక.

ప్రోషితుఁడు సం. విశ. దేశాంతరగతుడు.

ప్రోహము సం. వి. 1. కూర్పు. 2, నేర్పు 3 ఏనుగుకాలు.

ప్రోహుఁడు సం. విశ, 1, తార్కికుడు. 2. సమర్థుడు.

# ప్రౌ

ప్రౌఢ సం. వి. పదునెనిమిదేండ్లకు పైబడిన వయస్సుతోడి సంపూర్ణ యౌవనముగలది

ప్రౌఢము సం. విశ. 1. పెరిగినది. 2 వయస్సు వచ్చినది, 3. నేర్పుగలది.

ప్రౌఢి సం. వి. 1, సామర్థ్యము. 2, నేర్పు. 3. వృద్ధి. 4. గర్వము,

ప్రౌఢుఁడు సం. విశ. 1. నిపుణుడు. 2, ప్రవృద్ధుడు.

ప్రౌష్ఠపద సం. వి. పూర్వాభాద్రానక్షత్రము.

ప్రౌష్ఠపదము సం. వి. భాద్రపదమాసము.

# ప్ల

ప్లంబర్ ఇం. వి. (గృహ.) (plumber). సీసపు పని చేయువాడు, నేడ్రెజ్ నీటి గొట్టముల వతుకువాడు.

ప్లక్షము సం. వి, 1. జువ్విచెట్టు, 2. రావిచెట్టు. 3. ఒక ద్వీపము

ప్లవ సం వి, ముప్పదియైదవ సంవత్సరము.

ప్లవంగ సం. వి. నలుబది యొకటవ సంవత్సరము.

ప్లవంగము సం. వి. 1. కోతి. 2. కప్ప, వ్యు. దాటుచు పోవునది.

ప్లవనము సం.వి. (ఖని.) ద్రవపదార్థములో తేలియాడుట (Flotation).

ప్లవము సం. వి. 1 తెప్ప. 2.కప్ప. 3 కోతి.

ప్లవుఁడు సం. వి. అంత్యజాతివాడు,

ప్లాటినమ్ ఇం. వి, (రసా.) (Platinum). వెండివలె మెరయు తెల్లని, ఒసువైన ధాతువు. (ఇది శ్రేష్ఠధాతువులలో నొకటి. చాల అరుదుగా దొరకును. ప్రేరక వస్తు రూపమున చాల చురుకుగా రాసాయనిక ప్రక్రియల ప్రవర్తింపచేయును.

ప్లాటినమ్ కజ్జలి మి. వి. (రసా.) నలుపు రంగు గలిగి సూక్ష్మకణములలోనికి విభక్తమైన ప్లాటినమ్ ధాతువు (Platinum black). (ఇది చాల చురుకైన ప్రేరక ద్రవ్యము).

ప్లానింగ్ ఇం. వి, (అర్థ.) (Planning). యోజన, ఆర్థిక సామాజిక రంగములలో కొన్ని ధ్యేయములను సాధించుటకొరకు ప్రభుత్వము తన పైని, ప్రజలపైని కొన్ని నిబంధనలను విధించి నడిపించుట.

ప్లాస్టిక్ ఇం. వి. (plastic) బొమ్మలు, డబ్బాలు మొ. వాటిని తయారుచేయుటకు వాడు కృత్రిమ పదార్థము.

## ప్లి

ప్లీట్లు ఇం. వి. (గృ.)(pleats) పెద్ద బట్టను చిన్న చిన్న మడతలుగా ఒక దానిమీద నింకొకదానిని మెట్లవలెఅమర్చి కుట్టుట.




ప్లీహము సం వి. హృదయమున ఎడమ ప్రక్క నుండు మాంసగోళము. సం. వి. (జీవ.) అధరాంత్రము వెనుక భాగమున నుండు ఎఱ్ఱని గోళాకారపు గ్రంథి (Spleen).

## ప్లు

ప్లుతము సం. వి, 1. మూడు మాత్రల కాలముగల స్వరము. 2. అశ్వగతి విశేషము.

ప్లుష్టము సం. విశే. దహింపబడినది.

## ప్లూ

ప్లూటో ఇం. వి. (Pluto). సూర్యునిచుట్టు తిరుగు ఒక గ్రహము.

## ప్లె

ప్లెబిసైట్ ఇం. వి, (రాజ.) (Plebiscite). జనవాక్కు, ప్రజాభిప్రాయ సూచన, రాజకీయ సమస్యల పరిష్కారములో వానికి సంబంధము గల ప్రజాభిప్రాయమును ఓట్ల ద్వారా తెలిసికొనుట.

## ప్లే

ప్లేగు ఇం. (గృహ.) (plague). ఒక భయంకరమైన అంటువ్యాధి, ఇది మహామారి గ్రంథి జ్వరము.

ప్లేపాన్ ఇం. (గృసా.) (play pan).

ప్రాకెడి చిన్న పిల్లలకుపడిపోకుండ ఆటకై ఏర్పరిచిన స్థలము.

ప్లేఫేర్ ప్రాథమిక స్వీకృతము మి వి.(గణి) ఒక సరళ రేఖకు సమాంతరముగా దత్త బిందువు నుండి ఒకే సరళరేఖను నిర్మింప గల మూడి ప్రాథమిక స్వీకృతము(Playfair's Postulate).

## ప్లో

ప్లోతము నం. వి. 1. గాయమునకు కట్టు గుడ్డ. 2. బట్ట

ప్లోషము నం.వి. దహనము. రూ. ప్రోషము

## ఫ

ఫ ఒక యక్షరము.

ఫకీరు హిం. వి. (పకీరు) మహామ్మదీయులలో బైరాగి.

ఫక్కి నం. వి. రీతి.

ఫణము నం. వి. పాము పడగ.

ఫణి నం. వి. సర్పము. వ్యు ఫణము గలది.

ఫణితము నం. వి. వాక్కు, శబ్దము. విశ. చెప్పబడినది.

ఫణితి నం వి. 1. వాక్కు. 2. పాడెడు పద్ధతి.

ఫలకము నం. వి. 1. పలక, వ్రాతపలక. 2. కేడెము, డాలు.

ఫలకవచము నం. వి. (వృక్ష.) పండుపై భాగమున నున్న తొక్క.

ఫలకృషి నం. వి. (వ్యవ.) పండ్లతోటలను పెంచుట (Fruit culture).

ఫలదళము నం. వి. (వృక్ష) పుష్పములో నున్న స్త్రీ భాగము యొక్క దళములలో నిది యొకటి (Carpel). (ఇది విడిగా నున్నచో ప్రతిఫలమునకు ఒక అండాశయముండును).

ఫలదీకరణము నం. వి. (జీవ.) పునరుత్పాదన క్రియలో రెండు భిన్నముగా నుండు (సామాన్యముగా స్త్రీ పురుష) సంయోగి కణములు (Gametes) సమ్మిళితమై సంయుక్త బీజము (Zygote) ఏర్పడుట. (Fertilization).

ఫలము నం. వి. 1. పండు. 2. పంట, 3. ప్రయోజనము. 4. లాభము. వి. (రసా) భౌతిక రసాయనిక ప్రక్రియల యొక్క పర్యవసానము (Effect). వి. (గణి.) కొన్ని రాసులపై గణితశాస్త్ర విధానముల నుపయోగించిన లభించు రాశి (Result).

ఫలశర్కర నం వి. (వృక్ష.) సాధారణముగా తియని పండ్లలో నుండు చక్కెర (Fructose).

ఫలసాయము వి. (వ్యావ.) పండినపంట.

ఫలితము నం.విశ. ఫలించినది. విశ (భౌతి.) 1. రెండుగాని ఎక్కువగాని బలములచే సంఘటితమైనది (బలము) (Resultant). 2. రెండు సదిశరాసుల సంకలనమైన (ఫలము) (Vectors). వి. వృక్షము.

ఫలితోష్ణోగ్రత నం. వి. (భౌతి.) వివిధోష్ణతలు కలిగిన పదార్థముల కలయికచే నేర్పడు మిశ్రమము యొక్క ఉష్ణోగ్రత (Resultant temperature).

ఫలినము నం. విశ. పండ్లుగలది (వృక్షము)

ఫల్గునుఁడు నం. వి. అర్జునుడు.

ఫల్గువు నం. విశ. నిస్సారమైనది.

ఫసలీ హిం. వి. మహమ్మదీయుల సంవత్సరము
ఫసలు హిం. వి. (వ్యావ.) 1. పంట. 2 ఋతువు. 3, కాలము. 4. జరుగుచున్న సంవత్సరము.

# ఫా

ఫాణితము సం వి. కండచక్కెర,
ఫారెన్‌హీట్ ఇం. (భౌతి) (Fahrenhiet.) నీరు గడ్డకట్టు ఉష్ణోగ్రత 32° గను నీరు మసలు ఉష్ణోగ్రత 212° గను ఉండు తాపక్రమమును కొలుచు ఒక పద్ధతి.
ఫాలనేత్రుఁడు సం వి. ముక్కంటి.
ఫాలము సం వి, నెత్తి, లలాటము,
ఫాలోపియన్ గొట్టము మి. వి. (గృహ,) గర్భకోశమునకు ఇరు ప్రక్కల గల నాళములు (Fallopian tube.) ఇందులో గర్భోత్పత్తి యగును.
ఫాల్గునము సం. వి. పండ్రెండవ మాసము.
ఫాసిజమ్ ఇం. వి ( రాజ. ) (Fascism). నిరంకుశ జాతీయ రాజ్యవాదము. (జాత్యున్నతి, దేశోన్నతికై ప్రజలు ప్రభుత్వపు ప్రత్యక్ష పరిశీలన క్రింద పాటుపడవలయును. ఆర్థిక పురోభివృద్ధి వీరిముఖ్య లక్షణము గాదు.

# ఫి

ఫిక్సెడుడిపాజిట్లు ఇం. వి. (అర్థ) (Fixed-deposits) స్థావర నిక్షేపములు, బ్యాంకులో నిర్ణీత కాలాంతము వరకు విధిగా ఉంచవలసిన నిక్షేపములు, ఇట్టి నిక్షేపములపై ఎక్కువ వడ్డీ వచ్చును.
ఫియోర్డులు ఇం. (భూగో.) (Fiord). ఇరుకు మూతి సముద్ర శాఖలు, ముఖ్యముగా స్వీడను దేశ తీరప్రాంతములోని సముద్ర శాఖ,
ఫిరంగి వి. పిరంగి.
ఫిర్కా హిం. వి. తాలూకాలోని భాగము.
ఫిర్యాదీ హిం. విశ. మొరపెట్టువాడు.వాది,
ఫిర్యాదు హిం. వి, మొర, విన్నపము,
ఫిలమెంటు ఇం. వి. (భౌతి) (Filament). ఎలక్ట్రిక్ బల్బులలో నుండు సన్నని తీగ చుట్ట.

# ఫీ

ఫీడ్‌డాగ్ ఇం. వి. (గృహ.) (Feed dog). కుట్టుమిషనులో గల పండ్లవంటి ఒక భాగము. బట్టలు కుట్టునప్పుడు కుట్లు సమానముగా నుండునట్లు చేయుటకై బట్టను జరుపుట కుపకరించు పండ్లు గల భాగము.



మిషనుమీద బట్టను జరుపునది

## ఫు

ఫుల్లము సం. విశే. వికసించినది.

ఫుల్లరీకము సం. వి. 1. ఒకానొక దేశము. 2. పాము.

## ఫూ

ఫూత్కారము సం. వి. 1. పాము బుసకొట్టుట. 2. ఊదుట,

## ఫె

ఫగాట్ స్టిచ్ ఇం. (గృహ) (Faggot stitch). రెండు బట్టలనుచేర్చి అలంకారపు కుట్టుతో కుట్టినది.

ఫెర్రెలు సూత్రము ఇం. వి. (భూగో.) పవనములు వీచుటనుగురించి చెప్పు శాస్త్రము. అధిక పీడన ప్రదేశములనుండి అల్ప పీడన ప్రదేశములకు వీచునప్పుడు పవనములు ఒక వైపునకు త్రోయబడి, ఉత్తరార్థ గోళమున కుడివైపునకును దక్షిణార్థ గోళమున ఎడమవైపునకును మరలుటచే ఉత్తరార్థ గోళమున ఈశాన్య వ్యాపార పవనములు నైఋతి వ్యాపార పవనములు. దక్షిణార్థ గోళమున ఆగ్నేయ వ్యాపారపవనములు వాయవ్య వ్యాపార పవనములు కలుగుచున్నవి.

ఫెల్స్పారము ఇం. వి. (భూగ.) (Felspar). అల్యూమినియం యొక్కయు, పొటాసియమ్, సోడియమ్ ఖటికములలో ఒకటి రెండు ధాతువుల యొక్కయు సంయోగ శైలికము (Double silicate)

## ఫే

ఫేనము సం. వి. 1. సముద్రపు నురుగు. 2. నురుగు, చొంగ.

ఫేనిలము సం. విశే. నురుగుకలది. వి. 1. కుంకుడు. 2. రేగుపండు.

ఫేబియన్ సామ్యవాదము ఇం, (రాజ.) ఫేబియన్ సమాజభాగము, వర్గ సంఘర్షణ లేకుండ సామ్యవాద సిద్ధాంతములను సాధింపవచ్చునను వాదము.

ఫేరవము సం వి నక్క. రూ. ఫేరువు.

ఫేల సం. వి. ఎంగిలి రూ, ఫేలము, ఫేలి.

## ఫై

ఫైర్అలారమ్ ఇం (భౌతి.) (Fire alarm) నిప్పంటుకొనినప్పుడు చేయబడు సూచన.

## ఫొ

ఫొరమెన్ మాగ్నమ్ ఇం. (గృహ.) (Foramen magnum), మెదడు పెట్టెనుండి వెన్నెముక గొట్టములోనికిగల మార్గము. తలకు వెనుక క్రిందిభాగమున గల ఆక్సిపిటల్ఎముకలో 1 1/2అంగుళాల వెడల్పుగల రంధ్రము. దీని ద్వారా మెదడునుండి వెన్నుపూస నరములు పారును.

ఫొటోగ్రఫీ ఇం. వి, (రసా.) (Photography). ఛాయాచిత్రమును తీయు కళ.

ఫోలిక్ ఆసిడ్ ($B_6$) ఇం·(గృహ) (Folic acid) ($B_6$) జీర్ణశక్తినివృద్ధిచేసి విరోచనములు నరికట్టు విటమిన్.

## ఫౌ

ఫౌజ్ దార్ హిం (చరి.) సైన్యమును పరిపాలించువాడు, సైనికాధికారి.

## ఫ్యూ

ఫ్యూజ్ ఇం. (భౌతి) (Fuse) విద్యుద్వలయములో ప్రవాహబలము రక్షణపు హద్దును మించినపుడు అగ్ని ప్రమాదములు రాకుండ కరిగిపోయి ప్రవాహమును ఆపివేయు తీగె.

## ఫ్రా

ఫ్రాంఛైజ్ ఇం వి (రాజ.) (Franchise). ఎన్నికలలో వోటు వేయు అధికారము.

## ఫ్రీ

ఫ్రీజింగ్ ఇం. వి (గృహ.) (Freezing). ఆహార వస్తువులను శీతలీకరణ యంత్రములో నీరు గడ్డకట్టుఉష్ణోగ్రత వద్ద పెట్టి వానిలోని తేమను గడ్డకట్టునట్టు చేయుట

## ఫ్రె

ఫ్రెంచిముడి ఇం. వి. (గృహ.) చుక్కలవలె వేయు ఒక విధమైన అలంకారపు కట్టు (French Knot).



ఫ్రెంచిముడి

ఫ్రెంచిసీమ్ ఇం. (గృహ) (Frenchseam). సన్నని బట్టల అతుకులలో దారపు కొనలు కనబడకుండ రెండు సార్లు త్రిప్పికుట్టిన అతుకు. రేగిన పోగులు కనబడకుండ ఉల్టాసీదాల వైపు కుట్టిన అతుకు.



ఫ్రెంచిసీమ్

## ఫ్ల

ఫ్లష్ టాంక్ ఇం.వి. (భౌతి). (Flush tank). మరుగు దొడ్డులను కడుగుట కుపయోగపడు ఒక టాంక్.

## ఫ్లె

ఫ్లెక్సిబిల్ సంవిధానము వి. (రాజ, చరి, శాస,) సరళ రాజ్యాంగము. రాజ్యాంగమును శాసనసభ్యులు సా రిటితో మార్పుచేయగల్గినట్టి సంవిధానము

## ఫ్లో

ఫ్లోరినము ఇం. వి (రసా.) లవణజనకము లగు మూల ద్రవ్యములలో నొకటి. ఆ వర్గము లో మొదటి చురుకైన ద్రవ్యము (Flourine).

## బ

బ ఒక యక్షరము.

బంక వి. 1. చెట్లయందు కలుగు జిగట వస్తువు. 2. గ్రహణి.

బంక కొండి గరుప నేలలు వి (వ్యవ) బంక రేణువులు నూటికి 40 వంతులును, సన్న వండలి రేణువులు నూటికి 50వంతులును గల నేలలు (Clayey loamy soils).

బంకగరుములు వి. (వ్యవ.) బంక నేలల కును. గరుప నేలలకును మధ్యరకముగా నుండు నేలలు (Clay loams)

బంకనేలలు వి. (వ్యవ.) జిగురుస్వభా వము హెచ్చుగా గల నేలలు (Clay soils).

బంకు వి. సందు వీథి, విణ. 1. శూరుని వలె నటించువాడు. 2. కావలివాడు.

బంకోలు వై. వి, ఇన్నుఖయిదీలను పంపు ద్వీపాంతరము.

బంగనబయలు వై. వి. (బయలు + బయలు) బట్టబయలు, రూ. బంగరబయలు(వ్యావ.)

బంగరు వై. వి. బంగారము.సం. శృంగారః.

బంగారము వై. విణ. దుర్లభము.వి స్వర్ణము

బంగారుతీఁగెలు వై. వి. ఒక జాతి వడ్లు,

బంగీ హిం వి, తపాలులో వచ్చువస్తువులకట్ట

బంజరు హిం. వి. బీడునేల.

బంజరుభూమి వి. (వ్యవ.) సాగుబడికి పనికిరాని భూమి.

బంటి అవ. లోతును దెలుపు ప్రత్యయము, మోకాలిబంటి కుత్తుకబంటి మొదలగునవి

బంటు వై. వి. (భటుడు) 1. సేవకుడు. 2. భక్తుడు. శే. శూరుడు. సం. భటః.

బంటూలు వి (వరి) దక్షిణ ఆఫ్రికా నీగ్రోలు.

బండ వి. 1. వెడల్పగురాయి. 2. పొట్టి రోకలి వై. వి. ఘోరకృత్యములచే బిచ్చ మెత్తెడు ఒక నీచ జాతి. రూ. బండడు. సం. ఖండః. విణ. అరిగినది.

బండగు వై. వి. బోను. సం బంధకః.

బండగుఁడు వై. విణ. బండడు, అకతాయి. సం ఖండః.

బండము వై, వి. వస్తువు, (తినుబండములు). సం, భాండః.

బండరువు వై. వి. (భండారువు), బొక్క సము, రూ. బండారము, బండారు. సం. భండారః.

బండవలము వై. వి. 1 సామర్థ్యము. 2. సంచి మొదలు, మూలధనము.సం, భాండబలమ్.

బండారి వి. బొక్కసమున కధికారి.

బండారు వి. పసుపుపొడి.

బండి వి. 1. శకటము 2. రథము,

బండికల్లు వి. రథచక్రము,

బండిగిల్లు క్రి. 1. కడగండ్లుపడు. 2. బండి తలక్రిందుగ బోల్తాకొట్టు.

బండి రిక్క వి. రోహిణీ నక్షత్రము.

బంతి వి. చెండు, కందుకము. వై. వి. 1. పంక్తి. 2, పది. సం, పంక్తిః.

బంతికట్టు వి. కుప్ప నూరుచునపుడు ఎడ్లవరు సకు కట్టెడి పలుపు, పశువుల నొక త్రాడుతో కట్టు.

**బంతి గిన్నె కీలు** వి. (జం.) ఒక ఎముక యొక్క గుండ్రని తల మరియొక ఎముకకు గల గిన్నెలో నమరి అన్ని వైపులకు కదుపుటకును చక్రము వలె తిరుగుటకును వీలుగా నుండు కీలు (Ball and socket joint).

**బంద్** హిం. వి. బంధించుట, సమ్మెకొరకు అంగళ్ళు మూయుట.

**బందన** వై. వి. జిగట, గోదు. సం. బంధనమ్.

**బందా** వై. విశే. 1. ఖయిదీ, బంట్రోతు. 1, సేవకుడు సం. బద్ధః.

**బంది** వై. వి. నిర్బంధము, చెర. సం. బంధీ.

**బందికాఁడు** వి. బందిపోటు దొంగ.

**బందిఖానా** హిం. వి. చెరసాల (బందిగము).

**బందు** వై. వి. 1. పెట్టె మొదలగువాని మూలల బిగించు తగడు. 2. గోపనము 3. ఆవరణము. 4. కట్టివేత. సం. బంధః. వి. బోరువ పక్షి.

**బందుగుఁడు** వై. వి. బంధువు సం. బంధుః.

**బందె** వై. వి. (బంధము) 1. పశువుల చెర. 2. నిర్బంధము. 3 పసుల కిచ్చెడుదండుగ. సం. బద్ధః. బంధీ

**బందోబస్తు** హిం. వి. కట్టుదిట్టము, ఏర్పాటు.

**బంధకము** సం. వి. 1, చెరసాల 2, మార్పు. 3 కుదువ. 4. ప్రతిజ్ఞ. 5. ఆనకట్ట.

**బంధక మృత్తిక** సం. వి. (వ్యవ) బంకరేణువులలో సూక్ష్మదర్శిని సహాయమున గూడ నగపడని సూక్ష్మమగు రేణు సముదాయము(Colloidal clay). నేల యొక్క స్నిగ్ధత హెచ్చుగ దీనిపై నాధారపడి యుండును.

**బంధకవిత్వము** సం. వి. చక్రము, ఖడ్గము, రథము మొదలగు వాని యాకృతులుగ పద్యములు వ్రాయుట.

**బంధకి** సం. వి. 1. రంకులాడి. 2. ఆటకత్తె. 3 ఆడేనుగు.

**బంధనము** సం. వి. 1 కట్టు, 2. చెర. 3, తొడిమ. 4. కట్టెడు సాధనము. (నొక్కుడు) బంధనము





**బంధనములు** సం. వి (గృహ). తెరచుకొని యున్న రెండు పట్టీలను దగ్గరకు (కొంకి) బంధనము చేర్చి బంధించునవి ఉదా. గుండీలు, హుక్కులు మొదలగునవి (Fasteners).



**బంధన రంజన ముద్రణము** సం వి (గృహ.) మధుర, జయపూర్, జామనగర్, అద్దకాలు, బట్టకు దారములతో ముడులువేసి రంగువేయుట (Tie and dye print).

**బంధము** సం. వి. (రసా.) ఒక యౌగికమందు ఘటకములుగా నున్న పరమాణువుల మధ్యనుండు ఆకర్షణశక్తిని సూచకముగా కల్పించబడు లంకె (Bond).

**బంధితజలము** సం. వి. (వ్యవ.) తల్లిపదును, నేలలో సహజముగ మట్టి రేణువులను పట్టుకొని వదలకుండు తేమ (Hygroscopic moisture).

**బంధుత్వము** సం. వి. (రసా.) రాసుల సమూహము (Affinity). (గృహ.) చుట్టరికము, సంబంధము (Relationship).

**బంధుర** సం. వి. వేశ్య.

**బంధురము** సం. విశే. 1, ఒప్పిదమైనది. 2, వంగినది. 3. ఉబ్బెత్తయినది, దట్టమైనది.

**బంధులుఁడు** సం. వి. 1. రంకుటాలికొడుకు. 2 వేశ్య యింటి సేవకుడు.

**బంధూకము** సం. వి. మోదుగ పూవు మోదుగ.

బంబ వై. విశ. స్థూలము, పెద్దది. సం బృంహా.
బంబోతు విశ.(బంబ+పోతు)బలిసినవాడు.
బంభరము సం. వి. తుమ్మెద.
బకపాత్ర సం. వి.(రసా.)వస్తువులను స్వేదించుట కుపయోగించు పాత్ర. (Retort).
బకపాత్ర స్తంభము సం. వి. (రసా.) బకపాత్రను కదలకుండ బంధించుట కుపయోగపడు ఇనుప పీట మీద బంధించబడిన ఇనుప కడ్డీ (Retort stand).
బకము సం, వి. కొంగ. రూ. బకోటము.
బకాయి హిం. వి. చెల్లింపవలసిన సొమ్ము
బక్క విశ. కృశించినది, శుష్కము.
బక్షీ హిం. వి. ( జాతీ, చరి. ) ఇచ్చువాడు, మొగలు ప్రభుత్వాధికారులలో సైన్యపు వేతనము లిచ్చు ఉద్యోగి.
బగ్గము పాడు విశ.(పాడు+పాడు)మిక్కిలి పాడైనది
బచ్చలి వి, శాకవిశేషము.
బచ్చు వై. వి. వైశ్యుడు, వెండి బంగారముల నాణెము చూచువాడు. సం. వైశ్యః.
బచ్చెన వై, వి. 1, పూత. 2, వర్ణము, 3. గుర్తు. 4, మోసము. సం. ప్రచ్ఛన్నః,
బజ్జి వి. ఎనిచి వలుచనగా చేసిన కూర.
బజ్జాఉము వై. వి. వ్యభిచారము సం. వ్యభిచారః.
బటాలము వై. విశ. గొప్ప, ఆడంబరము. సం. భటాచారః.
బటువు వై. వి. 1. గుండ్రని యుంగరము. 2. గుండ్రని తలగడ. 3. గుండ్రనిది. వై. విశ. దృఢము. సం. వర్తులః,
బట్ట వి. 1, పశువుల మేని చార. విశ. వెండ్రుక లూడినది. 'బట్టతల' వై. వి. వస్త్రము. సం. పటః.
బట్టల దొంతర్లు వి. (గృహ.) బట్టల తానుల మూటలు (Bales).
బట్టి వి. 1. వాగ్ధోరణి 2.అవము.3.పలుకు నేర్పు.
బట్టుకాడు వి. 1. చిలుక. 2. గోరువంక. వ్యు. పలుకునేర్పు కలది.
బట్టీ వి. (రసా )ద్రవ్యముల నావిరిగానూర్చి ఆ ఆవిరిని చల్లచేసి తిరిగి ద్రవముగా మార్చు యంత్రము (Still).
బట్టు వై. వి. 1. వంది. 2. పాఠకుడు. సం. భట్టః
బట్టె వి. కాలువ.
బడబ సం. వి. 1. ఆడుగుఱ్ఱము. 2. బ్రాహ్మణ స్త్రీ. 3. తాన్పుకత్తె.
బడలిక వి. అలసట.
బండాలు హిం. వి. గర్వము, డంబము.
బడి వి, 1, పాఠశాల. 2. క్రమము అవ్య. వెంబడి.
బడితోటలు వి. (వ్యవ ) బడిపిల్లలకు ప్రకృతి జ్ఞానము గరపుటకు పాఠశాలల ఆవరణములలో పెంచు తోటలు(School gardens).
బడియ వి చిన్న దుడ్డుకఱ్ఱ.
బడిశము సం. వి. గాలము.
బడుగు వి. పీనుగు. విశ. 1, కృశము. 2. అశక్తుడు.
బడువ విశ. పల్లపునేల, రూ. బాడువ,
బడ్జెటు ఇం. వి. (అర్థ., శాస.) (Budjet). ఆదాయ వ్యయముల అంచనా, రాబోవు సంవత్సరపు ఖర్చు నిర్ధారణకై గతసంవత్సరముల ఆదాయవ్యయములనుబట్టి అంచనా సిద్ధముచేసి శాసనసభలో ప్రభుత్వముచే ప్రవేశపెట్టబడు ఆదాయవ్యయముల అంచనాల పట్టీ.
బతము వై. వి. వ్రతము. సం. వ్రతమ్.
బత్తళిక వి. అమ్ములపొది. రూ. బత్తడిక, బత్తళి.

బత్తా ఇం. (వ్యావ.) (Batta) బత్తెము, నెల జీతములుగాక పౌరుగూళ్లకు ప్రయాణము చేయు సమయములందిచ్చుచుండెడి ప్రత్యేక వేతనము.

బత్తుఁడు వి. కంసాలివారి పట్టపు పేరు వై. వి. భక్తుడు. సం. భక్తః.

బత్తెము వై. వి. భోజనమునకై యిచ్చు ద్రవ్యము సం. భృతిః, భృత్యమ్.

బదనామి హిం. వి. చెడ్డపేరు.

బదనిక వై. వి. చెట్టుమీద మొలచు ఓషధి విశేషము సం. వందానికా. (వృక్ష.) పరాన్నభుక్కుగా జీవించు ఉద్భిజ్జము (Parasitic Plant).

బదర వి. 1. సగులు. 2 తునక.

బదరి సం. వి. 1. రేగుచెట్టు. 2 ప్రత్తిచెట్టు 4. ఒక పుణ్యక్షేత్రము

బదరికము సం. వి. పెట్టె.

బదులు వి. 1. అప్పు. 2. మారు. ప్రతి.

బద్ద వై. వి. 1. కాయ యొక్క ఖండము 2. వెదురబద్ద 3. చీలిక. సం. భిత్తః.

బద్దించు క్రి. 1 కొలిచినదిమళ్ళీ కొలుచు 2. లెక్కపెట్టు.

బద్దు వి. బొంకు.

బద్దె వై. వి. 1 వస్త్రము మొదలు. 2. అపరకర్మము చేయునపుడు జంధ్యమువలె వేసికొను వస్త్ర ఖండము (బద్దియ). సం. వస్తిః. పట్టికా.

బధిరుఁడు సం. విణ. చెవిటివాడు.

బన్నము వై. వి. 1. అవమానము. 2. ఆపద. సం. భగ్నమ్.

బన్నసరము వై. వి. వివిధములగు మణులు గ్రుచ్చిన హారము. రూ. వన్నసరము బన్నసరి.

బభ్రువు సం. వి. 1. కపిలగోవు. 2. అగ్ని. 3. బట్టతలవాడు. విణ. 1. పచ్చనిది 2. రోగము వలన బట్టతల కలవాడు.

బమ్మ వై. వి. పలువ సం. బ్రహ్మ.

బమ్మరించు వై. క్రి. తిరుగు, భ్రమించు.

బమ్మెరవై. వి. భ్రమము భ్రాంతి. సం. భ్రమః.

బయలు వై. వి. 1 బహిఃప్రదేశము. 2. ఎడారి విణ. శూన్యము. సం. బహిః.

బయకాఁడు వి. గాయకుడు.

బయానా హిం. వి. ఒక ఒడంబడికను పురస్కరించుకొని ఇయ్యవలసిన సొమ్ములో ముందుగ నిచ్చు సొమ్ము. (Advance).

బయాస్ బైండింగ్ ఇం. వి (గృహ) (Bias Binding). పైపింగు ఏటవాలుగా కత్తిరించిన సన్నని పేలికను అంచునకు మొదట కుట్టి సగముగా ముడిచి కుట్టుతో ముగించినది.

బయసి వై. వి. 1. మర్యాద, గౌరవము. 2. దయ. 3 భాగ్యము.

బయోకెమిస్ట్రీ ఇం. (గృహ) (Bio-chemistry). శరీర సంబంధమైన రసాయన శాస్త్రము

బయ్యంకలు వి. వేవిళ్ళు.

బయ్యఁడు విణ. మందుడు.

బరడు వై. వి. కరుకైన చెట్టు పట్ట

బరణి వై. వి. కరాటము. సం. భరణీ.

బరవసము వి. 1. ధైర్యము. 2. ఉత్సాహము. సం. పరవశః.

బరాజ్ ఇం. (వ్యావ., అర్థ., భూగో.) (Baraz) నీటిపారుదల వసతులకై నదిలోని నీరును భద్రము చేయుటకై కట్టిన కట్టడము.

బరాతము హిం. వి. లిఖితపూర్వకమైన ఆజ్ఞ

బరాబరి వి. హెచ్చరిక విణ. సరియైన.

బరావర్దు హిం. వి. 1. జీతముల బిల్లు. 2. ఉజ్జాయింపు. 3. మదింపు.

బరి వి. పార్శ్వము.

బరికాఁడు వి. మావటివాడు.

బరిటె వి. గరుకైన ఎండు తాటి మట్ట.

బరిగోల వి. 1. బాణము, 2. ఏనుగును పొడిచి బెదరించుటకైన ఉక్కు వేణు దండము.

బరిజోగి వి పాములవాడు

బరిణెపురుగు కుటుంబము వి (వ్యవ., కీట.) అక్షింతలపురుగు (Epilachna Punctata) తాటాకుతెగులు పురుగు (Rice hipsa-Hispa armigera) గండకబరిణె పురుగు (Oryctes rhinoceros), ధాన్యపునుసి పురుగు (Sitophilus oryzae) మొదలగునవి (Coleoptera) కుటుంబమునకు చెందిన కీటకములు.

బరిన వి. బడిత.

బరుజు వి, గజ్జె.

బరువు వి. (గణి., భౌతి) ఒక వస్తువుపై పనిచేయుభూమ్యాకర్షణబలము (Weight)

బర్తరఫు హిం జాతీ (వ్యావ.) ఉద్యోగము నుండి తొలగించుట

బర్పింగ్ ఇం. (గృహ.) (Burping). చంటి బిడ్డకు పాలుపట్టిన తర్వాత భుజము మీద వేసకొని వీపుపై కెమ్మదిగా తట్టుట. (ఇట్లు చేయుట వలన పాలలో మన్న గాలి బుడకలు బయటికి వచ్చును).

బర్హము నం, వి. నెమలిపురి.

బర్హి నం. వి. 1. నెమలి. 2. దర్భ.

బర్హిస్సు నం, వి. అగ్ని.

బలము నం. వి. 1. సత్తువ. 2. సైన్యము.

బలవియోజనము నం. వి (భౌతి) ఒక బలమును రెండు ఘటక బలముల ఫలముగా ప్రదర్శించుట (Resolution of forces).

బలసూదనుఁడు నం. వి. ఇంద్రుడు.

బలాక నం. వి. పెద్ద కొక్కెర.

బలాహకము నం. వి. మబ్బు.

బలి నం. వి. 1. దేవత యెదుట మృగాదుల నరకుట. 2. కప్పము. 3. కానుక. విశే. బలము గలవాడు.

బలిపుష్టము నం. వి. కాకి.

బలిభుక్కు నం.వి. 1. కాకి. 2. ఊరపిచ్చుక.

బలియుఁడు వై. విశే. బలవంతుడు. నం. బలీయస్.

బలిష్ఠము నం విశే. మిక్కిలి బలము గలది

బలీయము నం. విశే. ఎక్కువబలము కలది (బలి, బలీయము, బలిష్ఠము).

బలీయ (మైన) లక్షణము నం వి. (జీవ) శిశువులో ప్రవేశించిన రెండు పరస్పర వ్యత్యాసము గల లక్షణములలో ఒక లక్షణము (తండ్రి నుండి వచ్చినదిగాని, తల్లినుండి వచ్చినదిగాని) మాత్రమే పైకి కనబడునది (Dominan character)

బలీవర్దము నం వి. ఎద్దు.

బలు వై. విశే. 1. సమాసమందు బలువు శబ్దమున కేర్పడు రూపము. 2. గొప్పది. 3. బలము కలది,

బలుఁడు నం. వి. బలరాముడు. విశే. బలము గలవాడు.

బల్ల వి. 1. కూర్చుండుటకయిన ఎత్తుపలక. 2. కడుపులో దుర్మాంసపు బిళ్ళ. 3. కుంచము.

బల్లకట్టు వి. 1. అడుగు వెడల్పైన పడవ. 2. కాలువలో నిటునటు మనుష్యులు దాటెడు సాధనము.

బల్లదుప్పటి వి. (గృహ.) టేబిల్ మీదపరచు బట్ట (Table cloth).

బల్లిదము వై. విశే (బలిష్ఠము) మిక్కిలి బలముగలది. నం, బలిష్ఠమ్.

బల్లిదుఁడు వై. విశే. మిక్కిలి బలముగలవాడు. నం బలిష్ఠః.

బల్లిదురాలు వై. విశే. మిక్కిలి బలముగలది.

బల్లెము వై. వి. అలుగులు గల బాణము. 2, ఈటె. నం. భల్లః.

బవంతము వి. కపటము.

బవంతి వి. 1. చిత్రవర్ణము. 2 ఇల్లు.
బవరము వై. వి. యుద్ధము. నం ప్రహార.
బవిర వి. గుండ్రని కర్ణభూషణము వై వి. 1. వలయము 2. భ్రమ
బవిసి వై, వి భాగ్యము, గౌరవము. రూ. బైసి, బగిసి. నం భవిష్యమ్.
బసవఁడు వై. వి. వృషభము.
బసివి వై వి, శివునకు పరిచర్య చేయుటకై చిన్నతనమునందే యర్పింపబడిన స్త్రీ. నం. పశుపి.
బస్ట్ ఇం (గృహ.) (Bust). ఊర్ధ్వభాగము. స్త్రీలకు నడుమునకు పైభాగము, రొమ్ము
బహిఃకపచము నం వి (వృక్ష) ఫలకపచము యొక్క పై పొర (Epicrap).
బహిఃప్రసరము నం. వి. (జీవ.) జీవకణములో నున్న కోశరసముపై నుండు పొర (Ectoplasm).
బహిఃశ్వసనము నం వి (జం) బొగ్గుపులుసు గాలిని బయటికి వదలివేయు క్రియ (Expiration)
బహిఃస్తరము నం. వి (వృక్ష.) వేరు. కాండము మొదలగు వానిపై నుండు ఒక జీవకణము మందము గల పై పొర (Epidermis).
బహిత్రము నం. వి ఒక రకము ఓడ.
బహిరంగము నం. వి. వెలుపలి అవయవము విశ. బయలు పడినది.
బహిరారంభ (దారువు) నం. వి. (వృక్ష.) దారువులో ఆది దారువు కేంద్రమునకు దూరముగా నున్న స్థితి (Exarch).
బహిర్జాతము నం. వి. (వృక్ష) బయటనే (ఉపరితలముననే) పుట్టినది (Exogenous)
బహిర్లాపి నం. వి. ఒకరకము విషమ సమస్య.
బహిర్వేశనము నం. వి. (గణి.) కొన్ని రాసుల స్థితులనుబట్టి బయటనున్న రాసులను నిర్ణయించుట (Extrapolation.).
బహిశ్చర్మ జనకము నం వి (వృక్ష,) పెరుగుచున్న అవయవముల ముఖ్యముగా శాఖల వేళ్ళ కొనల యందు గల ప్రతి జాలక జీవకణ జాలములలోని పైవరుసనున్నది (Dermatogen). (ఇది బహిశ్చర్మమును ఉత్పత్తి చేయును ఇది ఒక జీవకణ మంత మందముగ నుండును )




బహిష్కరణము నం. వి. వెలివేయుట
బహుకణజీవులు నం వి. (జం.) శరీరము అనేక జీవకణములతో నేర్పడి వేరువేరు జీవకణజాలములు గల జంతువులు (Metazoa).
బహుకరుఁడు నం విశ ఖలపువు. కళ్ళము నూడ్చు వాడు.
బహుకాష్ఠకము నం. వి. (వృక్ష.) పత్ర ఫలకములో ప్రధాన మగు ఈనెలు ఒకటి కంటె నెక్కువ కలది (Multicostote).
బహుతత్త్వవాదము నం. వి (రాజ) ప్రభుసత్తాకము కేవలము రాజ్యముననే కాక రాజ్యములోని యితర సంస్థలకు కూడ కలదను వాదము (Pluralistic theory).
బహుదళయుతము నం, విశ. (వృక్ష.) విడి విడిగా నున్న అకర్షణ పత్రములు కలది (పుష్పము) (polypetalous).
బహుధా నం. అవ్య. అనేకవిధముల.
బహుధాన్య నం వి. పండ్రెండవ సంవత్సరము
బహునాడీ దాహము నం వి. (గృహ,) ఒక వ్యాధి. దీనిచే శరీరమంతటిలోను నాడులు బాధ కలిగించును (polyneuritis).
బహుపదము నం. విశ. (గణి.) అనేక పదములు కలిగినది, బహుపద యుక్త బీజ

గణిత సమాసము (Multinomial). నం. (గణి.) అనేక పదములు కలిగిన సమాసము (polyonomial).

బహుపరమాణుకము నం. విశే. (రసా.) అనేక పరమాణువులు ఘటకములుగా గలది, పరిస్థితి (polyatomic)-ఉదా గంధకపు అణువులలో 8 గంధకపరమాణువు లున్నవి. $S_8$.

బహుపాదము నం. వి. మఱ్ఱి చెట్టు.

బహుభుజము నం. వి (గణి.) ఒక సమతలములో బహు భుజములు, కోణములచే నేర్పడు క్షేత్రము (polygon).

బహుభుజి నం. వి. (వృక్ష.) బహుశాఖీయము (Multiparous)

బహుమతి నం. వి కానుక, బహుమానము

బహుమానము నం. వి, (గృహ) కానుక, ప్రతి ఫలము (Reward).

బహు రక్షక పత్ర యుతము నం. విశే, (వృక్ష.)విడివిడిగా నున్న రక్షక పత్రములు కలది. (polysepalous).

బహురూపత నం. వి. (రసా.) ఒకే రసాయనిక ద్రవ్యము అనేక స్ఫాటిక రూపముల దాల్చుట (Polymorph s m). ఉదా. గంధకము మోనోక్లినిక, రాంబికు రూపములలో కలదు.

బహురూపత నం. వి. (జం) రెండు కంటె ఎక్కువ రకములైన రూపములు ఒకే ప్రాణిలో నుండుట (polymorphtsm). ఉదా ఒబీలియాలో, ఒబీలియా పూర్వాంగకములు, కుడమ సంజీవములు, ఛత్రికా కోరకములు కానవగును.

బహురూపము నం. వి. ఊసరవెల్లి.

బహురోమము నం. వి. మేక.

బహులవణాధారీయము నం. వి. (రసా.) ఒకటి కన్న ఎక్కువ లవణాధార గణములతో సంయోగించ గలది (polybasic).

బహువర్ధ్యక్షకము నం వి. (వృక్ష) ప్రధానాక్షము కొంత పెరిగి ఆగిపోవుచు మరల దాని ప్రక్కనుండి శాఖలు బయలుదేరి ఆగిపోవుచు నుండు నిర్మాణము గలది (Cymose).

బహువార్షికము నం. వి. చాల యేండ్లు జీవించు మొక్క (వృక్షము)(Pe ennial)

బహువిఖండనము నం. వి. (జం.) సిద్ధబీజాణు భవనము(Sporulation) ఏకకణ జీవులు కొన్ని పరస్థితులలో సిద్ధ కోష్ఠములుగా నేర్పడి, అనేక సిద్ధబీజములుగా విభజన మొందుట (Multiple fission).

బహువిదారణ ఫలము నం. వి. (వృక్ష.) శుష్కఫలములలో పగిలి గింజలను పెద చల్లు పండ్లలో నిది యొకటి. ఇది రెండు కంటె నెక్కువ భాగములుగా పగులును (Capsule).

బహువు నం. విశే. అధికము. పెక్కు.

బహువ్రీహి నం. వి. అన్యపదప్రధానమైన సమాసము, ఉదా. నీలగళుడు- నీలమగు కంఠముగలవాడు. - శివుడు

బహుశాఖీయ మధ్యారంభ మంజరి నం. వి. (వృక్ష.) ఈ పుష్పగుచ్ఛములో పుష్పదండము ఒక పుష్పముతో అంతమై అట్లే దాని చుట్టును చాల పుష్పమంజరులు బయలుదేరును (Polychasial cyme).

బహిశ్చర్మము నం. వి. (జం) భ్రూణము యొక్క తొలిదశలో నున్న బయటి ఆద్య స్తరము లేక జీవకణములపొర(Epiblast or Ectoderm).

బహుసంయోజకము నం విశే. (రసా.) (సంయోజనీయ) అనేకములైన ఉదజని పరమాణువులతో సంయోగించగలది లేదా అనేకములైన ఉదజని పరమాణువులను ప్రతిష్ఠాపించగలది (Multivalent)

బహుసంలగ్నము సం వి. (వృక్ష). పుష్పాది తిత్తులు విడివిడిగా నుండి దండములతో కలిసి కింజల్కములు రెండు కంటె నెక్కువ కట్టలుగా నున్నది (Poly-adelphous).

బహుళనిష్పత్తి సం. వి. (గణి.) రెండు నిష్పత్తులలోని పూర్వపదముల లబ్ధము పరపదముల లబ్ధము వరుసగా పూర్వపర పదములుగా నుండునిష్పత్తి (Compound ratio).

బహుళపక్షము సం వి. చీకటిపక్షము వ్యతి. శుద్ధపక్షము.

బహుళ ప్రతినిధి నియోజకవర్గము సం వి (పౌర., రాజ) ఒక నియోజక వర్గము నుండి ఒకరి కంటె ఎక్కువ మంది ప్రతినిధులను ఎన్నుకొనుట,

బహుళము సం. వి 1. ఆకాశము. 2, కృష్ణపక్షము. విశే. 1. అధికము. 2. తరచు, (వ్యాక) ఒకప్పుడు కలుగుట ఒకప్పుడు కలుగ కుండుట ఒకప్పుడు వైకల్పికముగా నుండుట, ఒకప్పు డింకొక విధముగా నుండుట,

బహుళ వోటింగు పద్ధతి మి. ., (రాజ.) పౌరుని బహుళశాఖ్యతలు దృష్టియందుంచుకొని, ఒకే పౌరుడు, ఒకటి కంటె ఎక్కువ వోట్లు వేయుటకు అధికారము కలిగియుండుట, (ఈ పద్ధతి బెల్జియంలో గలదు, భారతదేశములో 1935వ చట్టము ప్రకారము పట్టభద్రులకు భూస్వాములకు నీ అధికార మియ్యబడెను) (Plural voting).

బహూకరణము సం. వి. బహుమానము,

బహ్వమ్లీయము సం విశే. (రసా.) ఒకటి కన్న ఎక్కువ అమ్లగణములతో సంయోగించ గలది (Poly-acidic)

బళాయి వై. విశే, బలవంతుడు సం. బలవాన్

## బా

బాండుంగు సమావేశము వి. (రాజ) క్రి శ, 1947వ సంవత్సరము ఏప్రిల్ నెల 17వ తేదీన జరిగిన ఆసియా ఆఫ్రికాదేశ ప్రతినిధుల సమావేశము.

బాండు ఇం. (అర్థ, శాస.) (Bond). ఒప్పుదలపత్రము, ఋణలేఖ్యము,

బాండువ వై, వి. కుండ. సం, భాండః.

బాండెడ్ గిడ్డంగులు మి. వి. (వాణి.) కస్టమ్స్ శాఖ వారి యాజమాన్యముక్రింద పని చేయు అధికారము పొందిన గిడ్డంగులు. (ఇట్టి గిడ్డంగులలో నిల్వ యుంచుకొనినందువలన ప్రత్యేక ప్రయోజనములు. దిగుమతి సుంకములు చెల్లించిన మేరకు సరకు తీసికొనిపోవచ్చును, విలువైన సామగ్రి నిల్వచేయుటకు అవసరమైన సాధనసామగ్రి యుండును, సాంకేతిక నిపుణుల పర్యవేక్షణ కూడ వీనియందు గల వస్తువులకు లభించును.)

బాంధకినేయుడు సం. వి. రంకులాడి కొడుకు.

బాంబు ఇం. వి. (Bomb). అస్త్రాయుధము.

బాంబ్ కెలోరీమీటర్ ఇం,(గృహ.) (Bomb's calorimeter), ఆహారమువలన శరీరమునకు లభ్యమగు ఉష్ణతా పరిమాణమును కొలచు యంత్రము.

బాఁకు వి 1. బాణము. 2. కటారి,

బాఁతి వి. 1. అధికము. 2. ప్రీతి.

బాఁపఁడు వై. వి. బ్రాహ్మణుడు. సం. బ్రాహ్మణః,

బాఁపత వి. బ్రాహ్మణి.

బాకా హిం. వి. కాహళ యను ఊదు వాద్యము.

బాకినోటిమెకము వి. సింహము.

బాక్టీరియా ఇం. వి (జీవ.) (Bacteria) కణ నిర్మాణ మున్న ఆదిమజీవరాసులు.

బాగములు వై. వి. పూగములు, పోక చెక్కలు, వక్కపొడి.

బాగరి వి. 1. సౌందర్యవంతుడు, 2. అందగత్తె.

బాగు వై. వి. క్షేమము విశే. యోగ్యమైనది. సం. భగః.

బాగుదార వై. వి చిన్నకత్తి

బాగ్దాదు ఒప్పందము వి. (చరి., రాజ.) బ్రిటను, ఇరాక్, ఇరాను. టర్కీదేశముల మధ్య జరిగిన అన్యోన్య రక్షణకు సంబంధించిన ఒప్పందము. ఈ బాగ్దాదు ఒప్పందము మొదటి 5 సంవత్సరముల వరకు అమలులో నుండి తరువాత అమలులో నుండుటకు సభ్యుల యిష్టముపై ఆధారపడి యుండునట్లు నిర్ణయించిరి. కాని క్రీ. శ. 1958వ సంవత్సరము జూలై 14వ తేదీని ఇరాక్ రాజైన ఫైసల్ దుర్మరణముతో ఇరాక్ ఈ సైనికకూటమి నుండి విడిపోయెను. ఇరాక్ పైని చెప్పబడిన నియమము లేమియు పాటించలేదు ఈ ఒప్పందము మొదటిసారిగా క్రీ. శ 1955వ సంవత్సరము ఫిబ్రవరి 24వ తేదీని బాగ్దాదు నగరమున టర్కీ ఇరాక్ దేశాల మధ్య జరిగెను. తరువాత పై చెప్పబడిన తక్కిన దేశాలు సభ్యులుగా చేరెను. అమెరికా సంయుక్త రాష్ట్రములు దీనిలో చేరలేదు.

బాజా వై. వి. 1. కాంతి, వెలుతురు. 2. ప్రక్క

బాజుబందు వై. వి. 1. భుజబంధము. 2. భూషణము. సం. బాహుబంధః.

బాటకము వి. (అర్థ.) స్వో యోగము నందున్న గృహమునకుగాని భూమికిగాని చెల్లింపవలసిన సొమ్ము అర్థశాస్త్రములో భూసార తారతమ్యముల, కారణముగ ఒక భూమికి మరి ఒక దానికంటె లభించు అధికలాభము, భూమి తదితర ఉత్పత్తి సాధనములు దుర్లభము లగుటచే అవి లభించినవారు అనుభవించు అదనపు లాభము, ఆదాయము.

బాడబము సం. వి 1. బడబాసమూహము. 2. బడబానలము.

బాడిగ వై. వి. 1. కూలి. 2. అద్దె. సం. భాటకః.

బాడిత వై. వి కొయ్యను చెక్కుపనిముట్టు రూ, బాడిస. సం. బాడాసుః,

బాడుగ వై. వి. అద్దె, భాటకము, భూమిపైగాని, భవనములపైగాని, వస్తువులపైగాని, వాటి ఉపయోగము కొరకై చెల్లించు ధనము,

బాడుగ నియంత్రణము వి. (అర్థ) ఇంటి యజమానులు అద్దెకు ఇచ్చు ఇండ్లు, వానికి ఇచ్చు బాడుగను ప్రభుత్వము నియంత్రించుట.

బాడుగోలు విశే. 1. మానహీనుడు, 2. వార్తలు తెచ్చువాడు,

బాడె వై. వి. బురద, అడుసు. సం. పంకమ్

బాఢము సం. వి. ప్రతిజ్ఞ. విశే. పెల్లు, అధికము.

బాణము సం. వి. అమ్ము.

బాణలి వై. వి. వేచుట లోనగువానికి ఉపయుక్తమగు లోహపాత్ర. సం. భాండావలః.

బాణసంచు, మి. వి. దీపావళినాటి రాత్రి. తుపాకి మందుచేర్చి కాల్చెడు మతాబులు పూలవత్తులు మొదలగునవి.

బాణాగ్రరూపము సం విశే (వృక్ష) బాణము యొక్క కొనవలె నుండునది (ఆకు) (Sagittate).

బాణాసనము సం. వి. విల్లు

బాతిని హిం.వి.ఒ హాస్యముగావంపబడుదూత.

బాదరబందీ వి (వ్యావ.) జంజాటము.

బాదరము వి. కర్ణాటకపు తుపాకీ చెవి.

బాదరాయణుఁడు సం. వి. వ్యాసుడు,

బాధిర్యము సం. వి. బధిరత్వము. చెవుడు

బాధ్యతాయుత ప్రభుత్వము సం వి. (రాజ., (పరి, పౌర) పార్లమెంటరీ (సంసదీయ) ప్రభుత్వ విధానములో కార్యవర్గము శాసనసభకు బాధ్యత వహించుట.

బాన వై. వి. కడవ. సం. భాండః.

బానసీఁడు విశే వంటవాడు.

బానిస వి. దాసి, తొత్తు.

బాబా వై వి గుఱ్ఱము. సం బడబా,వాహః.

బాబారౌతు వై. వి కుబేరుడు

బాబు వై. వి. 1. పూజ్యుడు. 2; తండ్రి. సం. భావ్యః.

బాము వై. వి. 1. జన్మము. 2. శోకము. 3 ఆపద. సం. భవః.

బాయికాటు ఇం. (వాణి., అర్థ.) (Boy-cott) బహిష్కారము. ఒక ధ్యేయము సాధించుటకై కొందరు వ్యక్తులు కలసి ఎదుటివానితోగాని, ఎదుటి వారితోగాని. ఏవిధమైన వర్తక వ్యాపార సంబంధములు పెట్టుకొనమని నిశ్చయించుట. (ఈ సాధనము నుపయోగించుటయేగాక తరువాత దానియర్థమును విస్తరించి, ఏదైన ఒక వ్యక్తిని గాని వర్గమును గాని పూర్తిగా బహిష్కరించుట యని చెప్పుచున్నారు. ముఖ్యముగా కార్మికులు యజమానుల యెడను కార్మిక వర్గ సంఘర్షణలలో సాధారణముగ ఉపయోగించుచున్నారు. క్రీ. శ. 1880లో ఇంగ్లండులోని కాప్టెను బాయికాటును మొదటిసారిగా బహిష్కరించుటచే నీపేరు వాడుకలోనికి వచ్చెను).

బాయిలర్ ఇం. వి. (భౌతి.) (Boiler). ద్రవపదార్థమును మరగపెట్టుట కుపయోగించు పాత్ర.

బారసాల వై. వి నామకరణము బాలసారె

బారసి వై వి. ద్వాదశి. సం. ద్వాదశీ. సం. ద్వాదశాహః,

బారాది విశే అధికము. అనేకము.

బారి వై. వి 1. హింస. 2. నిర్బంధము.

బారిసము వి వాలకము

బారు వై. వి 1. గుంపు, 2 వరుస సం. వారః.

బారువ వై, వి. ఇరువది మణుగులు సం. భారః.

బారోస్కోప్ ఇం వి. (భౌతి) (Baroscope) వాయు సాంద్రతలోని మార్పులను తెలియ చెయు యంత్రము.

బార్హతము సం, వి ములక ఫలము.

బార్హద్రథి సం. వి. జరాసంధుడు.

బార్హస్పత్య మానాబ్దము సం. వి. ఒక రాశి యందు బృహస్పతి నివసించి యుండు కాలము. (ఇది వింధ్యపర్వతమున కుత్తరమున వ్యవహారములో గలదు. సంవత్సరమునకు 361 దినములు).

బాల సం వి. పదునారేండ్లకు లోబడిన పిల్ల

బాలట్ ఇం. (రాజ.) (Ballot) లిఖిత సమ్మతి లిఖితపూర్వకముగ నియోజనము. చీట్లు వేసి అభిప్రాయమునుసూచించుట, రహస్య నియోజనము.

బాలెట్ పెట్టె ఇం. (రాజ) ఓట్లపెట్టె,బాలటు పత్రములు వేయు పెట్టె,

బాలెట్ పేపరు ఇం. (రాజ.. శాస.) (Ballot paper). ఓటు కాగితము, నియోజన పత్రము.

బాలతృణము సం. వి. పచ్చిక.

బాలన్సుచక్రము మి. వి. (భౌతి) గడియారము మరలో నొక భాగము (Balance wheel).

**బాలాజీ** వై. వి. శ్రీ తిరుపతి వేంకటేశ్వర స్వామికి బైరాగులు వాడు పేరు. సం. బాలా.

**బాలారిష్టము** సం వి. పుట్టినది మొదలు 12 సంవత్సరముల లోపున బాలబాలికలకు కలుగుకీడు, మరణము.

**బాలిశము** సం. వి. తలగడ (బాలీసు).

**బాలిశుఁడు** సం. విశే. 1. మూర్ఖుడు. 2 బాలుడు.

**బాలెంత** వి. బిడ్డను గన్నది, ప్రసూత, (బాలెంతరాలు)

**బాలెన్సు** ఇం. (గృహ.) (Balance). 1 తుల. త్రాను, తక్కెడ. 2, శేషము 3, మిగిలినది.

**బాలేయము** సం వి. గాడిద.విశే. మెత్తనిది.

**బావ** వై. వి. తోడ పుట్టిన దాని మగడు. సం. భావుకః.

**బావి** వై. వి. 1. నుయ్యి. 2. దొరువు. 3. చెరువు.

**బావిలీ** వి. స్త్రీలు చెవికి పెట్టుకొను నగ.

**బావుటా** హిం, వి. జెండా.

**బావురు** వి. ఏడ్చుట యందలి ధ్వని.

**బావురుఁబిల్లి** వి. బావు రని కూసెడు పెద్ద గండుపిల్లి,

**బాష్పక్రియ** సం. (గృహ.) ఆవిరి పెట్టుట, వెల్ వెట్ దుస్తులను సాపుచేయుటకు ఆవిరి పెట్టుట (Steaming).

**బాష్పనపాత్ర** సం వి. (రసా.) ద్రవములు వేడిచేసి ఆవిరిగా మార్చుటకుపయోగించుకుటక వంటి పాత్ర (Evaporating dish)

**బాష్పము** సం. వి. 1. కన్నీరు.2.ఆవిరి. వి. (భౌతి.) ఘన, ద్రవ ద్రవ్యముల ఆవిరి, సందిగ్ధ తాపక్రమము క్రిందనుండి క్షేపము వలన ద్రవీభవించుటకు వీలుగా నున్న వాయువు (Vapour).

**బాష్పవాయువు** సం. వి. వాయురూపముగ వ్యాపించి కండ్లమంట, కన్నీళ్ళు కలిగించెడి ఒక రసాయనిక పదార్థము. (అల్లరి మూకలను చెదరగొట్టుటకు పోలీసులు దీనిని ప్రయోగింతురు) (Tear gas).

**బాష్పశీల ద్రవములు** సం. వి, (భౌతి )చురుకుగా బాష్పీభవనము చెందెడి ద్రవములు (Volatile liquids)

**బాష్పీభవన గుప్తోష్ణత** సం. వి. (భౌతి.) ఉష్ణోగ్రత మారకుండ ఒక గ్రాము ద్రవ్యమును ద్రవస్థితి నుండి వాయు స్థితికి మార్చుటకు అవసరమగు కాలరీలలో ఉష్ణ రాశి (Latent heat of vopourisation)

**బాష్పీభవనము** సం. వి. (భౌతి.) ద్రవద్రవ్యములు అన్ని ఉష్ణోగ్రతల యొద్దను నెమ్మదిగాను, క్రమముగాను వాయుస్థితిని పొందు మార్పు (Vapourisation).

**బాష్పోత్సేక మాపకము** సం. వి. (వృక్ష.) ఉత్స్వేదనామాపకము. (మొక్క భాగములలో నుండి నీరు ఆవిరిగా బయటికి ఎంత వేగముగా పోవుచున్నదో కొలచు సాధనము (Potometer).

**బాస** వై. వి. 2.భాష. 2. ప్రతిజ్ఞ. 3.ఒట్టు. 4. సంకేతము. సం. భాషా.

**బాసట** విశే. సహాయము.

**బాసనము** వి. పచనపాత్రము.

**బాసవాలు** వై. వి. 1. వేలుపు. 2. ఋషి. వ్యు. పలుకే ఆయుధమైన వాడు.

**బాసికపట్టు** వి. పద్మాసనము. (వ్యావ.) బాసీపట్టు.

**బాసికము** వి. పెండ్లియందు వధూవరుల నొసట కట్టెడు మౌక్తికహారము, లలామకము.

**బాహాటము** వై. విశే. బహిరంగము. సం, బాహ్యాటమ్.

**బాహిరపోవు** క్రి. మూర్ఛిల్లు.

**బాహిరము** వై. విశే. బయలుపడినది.

బాహుకుఁడు సం. వి. 1. ఆశ్వపరుడు. 2. నలుడు. 3. కీచకుడు 4. పుణ్యశ్లోకుడు
బాహుజుడుఁ సం. వి. రాచవాడు.
బాహుపురి మి. వి కేయూరము.
బాహుమూలము సం. వి చంక.
బాహులము సం వి. 1. బాహుత్రాణము. 2. కార్తీక మాసము
బాహులేయుఁడు సం. వి. కుమారస్వామి.
బాహువు సం. వి. భుజము.
బాహ్యము సం. విఆ. (గణి) వెలుపలనున్నది (Exterior)
బాహ్యకంకాళము సం. వి. (జం) జంతువు యొక్క శరీరమునకు బయట నుండు ఎముకల గూడు (Exo-skeleton).
బాహ్యకము సం. వి. (జం) కొన్ని యవయవములకు. ముఖ్యముగా మస్తిష్కమునకు పైనుండు పొర (Cortex).
బాహ్యకోణము సం. వి. (గణి) ఒక త్రిభుజములో ఒక భుజమును పొడిగింపగా నేర్పడు బయటనున్న కోణము(Exterior angle)
బాహ్యత్వచాజాడ్యము సం. వి. (గృహ.) కాచబింబము మెత్తనగు వ్యాధి, ఆహారములో వైటమిన్ "A," తక్కువైన ఈ వ్యాధి కలుగును.
బాహ్యపటలము సం. వి. (గృహ) కన్ను గ్రుడ్డునకు పైపొర (Sclerotic layer).
బాహ్యపరాన్నజీవి సం. వి (జీవ) పోషిత జీవి (Host) యొక్క శరీరముపై వెలుపలి భాగమున నివసించు పరాన్నజీవి (Ectoparasite).
బాహ్యవృత్త కేంద్రము సం. వి (గణి) త్రిభుజ బాహ్య వృత్తము యొక్క కేంద్రము (Ex-centre).
బాహ్యవృత్తము సం. వి. (గణి) ఒక త్రిభుజమునందలి మూడుభుజములను (అవసరమైనచో పొడిగించగా ఏర్పడిన భుజములను) తాకుచు త్రిభుజమునకు వెలుపలనున్నవృత్తము (Escribed circle).
బాహ్యస్పర్శవృత్తము సం. వి. (గణి.) ఒక వృత్తమును బాహ్యముగా స్పర్శించు మరియొక వృత్తము(Exterior tangential circle).
బాహ్యోత్సర్గము సం వి. (జం.) శరీరము బయటికి తెచుకొను ఉత్సర్గనాళికలు గలది (Ectonephric).
బాహ్వస్థి సం. వి. (జం) దండయెముక, మోచేతిపై యెముక, భుజపు టెముక (Humerus).
బాహ్లికము సం, వి.1. ఇంగువ. 2. కుంకుమ పువ్వు: 3. ఒక దేశము
బాళి వి. వాంఛ. కాంత..

# బి

బింకము వి. 1. గర్వము. 2.నిక్కు. బిగువు.
బిందియ వి పాత్రము. దూ. బిందె.
బిందుగలని సం. వి. (రసా.) ఒక ద్రవమును చుక్కలు చుక్కలుగా క్రిందికి పడనిచ్చు పరికరము (Dropping funnel).
బిందుతంత్రము సం. వి. 1. చదరంగము. 2. నెత్త పలక.
బిందుపథము సం. వి. (గణి.) దత్తనియమముల ననుసరించి చలించు బిందువు యొక్క మార్గము (Locus).
బిందువు సం, వి. 1. నీటిబొట్టు. 2. చుక్క. 3. సున్న. సం. (గణి.) స్థితి మాత్రము కలిగి, పొడవు వెడల్పు మందము లేని ఆకృతి (Point).

**బింబము** నం. వి. 1. ప్రతిమ. 2, ప్రతిబింబము. 3. దొండపండు. 4. చంద్ర సూర్యమండలము నం. వి. (వృక్ష.) కొన్ని పుష్పములలో అండాశయము క్రింద నుండు గుండ్రని పళ్ళెము వంటి దిమ్మ (Disc)

**బింబపుష్పకము** నం. వి. (వృక్ష) బంతి కుటుంబపు మొక్కల పుష్పమంజరిలో గొట్టము వంటి ఆకర్షణ పత్ర వలయము గల పుష్పం (Disc floret ortubular fl- wer).

**బింబోష్ఠి** నం. వి. 1. దొండపండువంటి పెదవి గల స్త్రీ. 2. స్త్రీ.

**బికారి** వై. విణ. బిచ్చగాడు, దరిద్రుడు. వికృతవేషధారి నం. వికారి.

**బికిరము** వై. వి 1. వేడికోలు.2.బిచ్చము, నం. వికరమ్.

**బిక్క** వై. విణ. 1. నిరుపేద. 2, బెదురు గలది. నం. భిక్షుకమ్. 2. భీరుకమ్.

**బిగమీ** ఇం (గృహ.) (Bigamy), ద్విభార్యాత్వము లేక ద్విభర్తృత్వము. ఇద్దరుభార్యలను గాని భర్తలను గాని కల్గి యుండుట రూ. బైగమి, బిగమి.

**బిగి** వి 1. బిగువు, 2. గర్వము.

**బిగువు** వి. బిఱ్ఱు బిగిసి (Tension).

**'బి' గ్రూపు విటమినులు** ఇం. (గృహ) (B-group or B-Complex vitamins) తయామిన్, రైబోఫ్లేవిన్, నయాసిన్, ఫోలిక్ ఏసిడ్, "బి" విటమిన్ మొదలగునవి.

**బిజాగు** క్రి. బొంకు.

**బిడారము** వి. వాసస్థానము, విడిది,

**బిడారు** వి. 1. వాస స్థానము. 2. చనుప. 3. లంబాడీ తండా. 4. ఎడారులలో వరుసగా పోవు లొట్టియల గుంపు,

**బిడాలకము** నం. వి. 1. పునుగు చట్టము. 2. కంటిమందు 3. పిల్లి.

**బిడాలము** నం. వి. 1. పిల్లి 2 కనుగుడ్డు

**బిడియము** వి. సిగ్గు

**బిడుపు** వి అవకాశము.

**బిడౌజుడు** నం వి. ఇంద్రుడు.

**బిడ్డ** వి. 1. సూనుడు. 2. కూతురు.

**బిడ్డకుట్టు** వి ప్రసవవేదన.

**బిత్తరము** వి. 1. శృంగారచేష్ట. 2. ప్రకాశము. విణ. 1. సరసము, 2. చంచలము,

**బిత్తరపోవు** క్రి. దిగ్భ్రమచెందు, చలించు

**బిత్తరి** వి. శృంగార చేష్ట గల స్త్రీ.

**బిత్తల** వి. దిసమొల

**బిత్తిరి** (వ్యావ.) వి మాయ.

**బిద్ధము** వై. విణ 1. పగిలినది 2. భిన్నము. నం. భిన్నమ్

**బిద్దు** క్రి, చచ్చు

**బిద్దె** వి. దుర్గతి, నరకము

**బిబ్** ఇం (గృహ.) (Bib). చిన్న పిల్లలకు రొమ్ముమీద వాలునట్లు మెడకు కట్టు చిన్న బట్ట, చొల్లు ఆహారపదార్థములు బట్టలమీద పడకుండ నుండుటకై పైని వేయు చిన్న దుస్తు.

**బిబ్బి** వి. తురుష్కుల అంతఃపుర స్త్రీ. హిం, బీబీ.

**బిబ్బోకము** నం. వి నాయకకు గర్వాతిశయముచేత ఇష్టవస్తువునందేనియు కల్గు అనాదరము,

**బిభీషణము** నం విణ. భయంకరము. వి. భయపరుచుట.

**బిభీషిక** నం. వి 1. భయము. 2, బెదరించుట.

**బిభ్రమిష** నం. వి. (గణి భౌతి) ఒక వస్తువు యొక్క భ్రమణ ఫలపు కొలత. ఒక బిందువునకు సాపేక్షముగ ఒక బలము యొక్క బిభ్రమిష - ఆ బలమును ఆ బిందువు నుండి ఆబలము పనిచేయు రేఖకు

గీయుండిన లంబముచే గుణింపగ లభ్యమగు ఫలము (Moment).
బిమ్మటి వి 1. వివశత్వము. 2. సంకోచము.
బిరబిర విణ శీఘ్రముగ. బిరాన.
బిరుదము సం వి. సామర్థ్య చిహ్నము. బిరుదు, శౌర్యచిహ్నము, పట్టము.
బిరుదులాఁడు విణ, ప్రతిజ్ఞాపరుడు.
బిరుసు వి. కాఠిన్యము
బిఱ్ఱువిగియు క్రి మిక్కిలి బిగిసికొను.
బిఱు వి. 1. బిగువు. 2. ఉద్ధతి.
బిలబిలాకులు వి. (వ్యావ.) ఒకజాతి పిట్టలు.
బిలము సం. వి. 1. రంధ్రము. 2. గుహ.
బిలమెట్లు వి. (వ్యావ.) బిల్లచెప్పులు.
బిలిబిలి వి. (వ్యావ.) ముద్దుముద్దు.
బిలియను ఇం. వి. (Billion). నూరుకోట్లు.
బిలువము వై. వి. మారేడు పండు, సం. బిల్వః.
బిలేశయము సం. వి. 1. పాము. 2. ఎలుక.
బిల్ల వి. 1. ఖండము. 2. సూర్యచంద్రాదుల బింబము. 3. గుండ్రని తలగడ. 4. మెడ లోనగు చోట్ల లేచు నెత్తురుగడ్డ. 5. తపాలుబిళ్ళ.
బిల్లగోళ్ళు వి. బాలక్రీడ.
బిల్లవాలు వి. చక్రాయుధము.
బిల్మకత్తా హిం వి. 1. కొన్ని రాసులుకలిసిన మొత్తము. 2. మొత్తము.
బిల్లిక వి. సూర్యచంద్రుల బింబము.
బిల్లు ఇం (వాణి) (Bill) చిత్తుచట్టము. హుండీ పత్రము, చీటీ, లెక్క, విక్రేతృ పత్రము
బిల్వము సం వి. మారేడు.
బిషప్ ఇం. (చరి) (Bishop) క్రైస్తవమత గురువు, పాదిరీలపై అధికారి.
బిస వి 1 యంత్రము. 2. యంత్రపు కీలు
బిసము సం.వి. తామరతూఁడు, తామర తీగ.
బిసాతు హిం. వి. శక్తి- బలము
బిసిని సం వి. 1. తామరకొలను. 2. తామరతీగ.
బిస్తము సం వి. మాడ, సువర్ణము.
బిస్తీ హిం. వి. తోలుసంచులతో నీళ్ళు మోయువాడు.
బిస్మత్ ఇం. వి (రసా.) (Bismuth) ధాతు మూలద్రవ్యములలో నొకటి, ఆవర్త క్రమపట్టికలో ర్వ వర్గమునకు చెందినది.
బిస్మిల్లా హిం వి. (చరి.) అల్లానామముపై మహమ్మదీయ ప్రార్థన.
బి. హెచ్. సి. ఇం.(వ్యావ.)(కీట.)(B.H.C.) (Benzenehexa-chloride) కీటక నాశనమున కుపయోగింపబడు నొక రాసాయనిక ద్రవ్యము.

## బీ

బీటు వి. పగులు రూ. బీటి.
బీటవోవు క్రి. పగుళ్ళువారు.
బీగము వి తలుపు మువ్వగు వానికి పేయు తాళము.
బీగముచెవి వి. తాళము తీయు సాధనము.
బీచ్ ఇం వి. (Beach). సముద్రపు ఒడ్డు.
బీజకణకోశము సం. వి. (వృక్ష.) సిద్ధబీజాశయము, సిద్ధబీజము లుండు గది(Gonidangium or sporangium).
బీజకణజనకము సం. వి. (వృక్ష) సిద్ధబీజము లను ఉత్పత్తిచేసి, అలైంగిక పద్ధతిలో పునరుత్పత్తిచేయు ఉద్భిజ్జ భాగము (Sporophyte).
బీజకణపత్రము సం. వి. (వృక్ష.) సిద్ధబీజము లను వహించు పత్రము (Spyrophyll).
బీజకణభవనము సం. వి. (జం.) ఏకకణ జీవులలో బీజాణువులు ఉత్పత్తియగు విధము (Sporulation).

బీజకణమాతృకోశిక నం. వి. (వృక్ష.) పుప్పొడి కణములు భ్రూణస్యూనమువంటి సిద్ధబీజములను ఉత్పత్తిచేయు తల్లి జీవ కణము (Spore mother cell).

బీజకణము నం. వి. (జీవ) సిద్ధబీజము: నిరోధకశక్తి గల పైపొరతో కూడిన జీవకణము (Spore). (ఇది స్వయముగా నొక క్రొత్త ప్రాణిగా అభివృద్ధి చెంద గలదు).

బీజకోశము నం. వి. (జీవ) అండాశయము, అండములను స్త్రీ బీజములను ఉత్పత్తి చేయు స్థలము (Ovary).

బీజఖండము నం. వి. (జం.) మలేరియా వ్యాధికి కారణమగు రోగజీవి జీవనచక్ర ములో మనుష్యుని రక్తములో నగుపడు దశలలో నొకటి (Merozoite)

బీజగణితము నం. వి (గణి.) అంకెలను బీజములను ఉపయోగించి చేయుగణితము గణిత శాస్త్రములో నొక విభాగము (Algebra).

బీజచోలము నం. వి. (వృక్ష) రక్షణకొరకు గింజపై నుండు రెండు పొరలలోబయటిది (Testa).

బీజచ్ఛదము నం. వి. (వృక్ష.) బీజోపాంగము, గింజను అంటిపెట్టుకొని యుండు, దాని పై భాగమును ఆవరించియుండు నిర్మాణము (Aril). ఉదా. సీమచింతగింజ జాజికాయ. నం. (వృక్ష.) రక్షణకొరకు గింజపై నుండు రెండు పొరలలోనిది అంతశ్ఛోలము, (Tegmen).

బీజదళములు నం. వి. (వృక్ష.) బీజ పత్రములు. (గింజలోని భ్రూణ భాగములలోనివి యొక భాగము. ఇవి అల్బుమిన్ సహిత బీజము లలో పలుచని ఆకులవలె నుండును, అల్బుమిన్ రహిత బీజములలో ఆహారపదార్థ ముతో ఉబ్బి పప్పుబద్దవలె నుండును (Cotyledons).


బీజదళములు

బీజనాభి నం. వి. (వృక్ష.) బీజాండము బీజ బంధముతో కలిసిన చోటు (Hilum).

బీజపత్రోపరిభాగము నం. వి. (వృక్ష.) బీజ దళములకు పైనుండు ప్రథమ శాఖ భాగము (Epicotyl).

బీజపుచ్ఛము నం. వి. (వృక్ష.) గింజ కొకచివర నేర్పడు టోపి వంటి నిర్మాణము (Caruncle) ఉదా. ఆముదపు గింజ.


బీజపుచ్ఛము

బీజబంధకము నం. వి. (వృక్ష) బీజాండ మును అండాశయములోనిజరాయువుతో కలిపి యుంచు కాడ (Funicle).

బీజము నం. వి. 1. విత్తనము. 2. విత్తుట. 3. ముష్కము. 4. హేతువు. 5 రేతస్సు.

బీజాండము నం. వి. (వృక్ష.) అండాశయ ములో నుండు తెల్లగ్రుడ్డు వంటి నిర్మాణము (Ovule) (దీనిలో భ్రూణ స్యూన మేర్పడును. భ్రూణ స్యూనములో అండము తయారగును. ఫలదీకరణమైన తరువాత బీజాండము గింజగా మారును.)

బీజానుగుణనము నం. వి. (జం.) దోమ శరీరములో జరుగు మలేరియా రోగజీవి జీవిత దశలు (Sporogany).

బీజానుఘటము నం. వి. (జం.) బీజాణు పూర్వదశలో నున్న కోష్ఠిత సంయుక్త బీజము విభజన చెందగా నేర్పడిన ఒక్కొక్క జీవకణము (Sporoblast).

బీజాణుజనకము నం. వి. (వృక్ష.) సిద్ధ బీజములను ఉత్పత్తి చేయు ఉద్భిజ్జ భాగము (Sporophyte).

బీజాణుజవర్గము నం. వి. (జం.) పరాన్న భుక్కులగు ఏకకణ జంతువుల కేర్పరచిన

తరగతి (Sporozoa). (బీజాణు దళ దీని జీవిత దశలలో ఒకటి.)

**బీజానుపూర్వదళ** సం. వి. (జం.) ధాత్ర బీజములను ఉత్పత్తి చేయబోవు తోషిత సంయుక్త బీజము (Sporont) ఉదా.మలే రియా రోగ జీవి జీవిత చరిత్రలో.

**బీజావాపము** సం వి. విత్తుట.

**బీజాశయము** సం వి. (జం.) పునరుత్పాద కావయవము. వృషణము లేక అండా శయము (Gonad).

**బీజోద్భిదములు** సం వి. (వృక్ష) గింజల నుండి ఉత్పత్తియగు మొక్కలు(Spermatophyta) (సంవృత బీజములు= Angiosperms). (వివృత బీజకములు= Gamnosperms).

**బీజ్యుఁడు** సం విశ. మంచి కులమున పుట్టిన వాడు.

**బీడు** వి. 1. బీటి నేల (దున్నని నేల). 2. లోహము. విశ. నికృష్టము.

**బీతు** వై. వి. భయము: సం. భీతిః.

**బీద** వై. విశ. దరిద్రుడు, రూ. పేద. సం. భీతః.

**బీభత్సము** సం. విశ. అసహ్యమైనది. వి. నవరసములలో నొకటి.

**బీభత్సుఁడు** సం. వి. అర్జునుడు విప్పచ్చుడు. విశ వికారము గలవాడు.

**బీరము** వై వి. వీర్యము. శౌర్యము.

**బీరజము** వై వి. (బీజము) అండకోశము. ముష్కము. సం. బీజమ్.

**బీఱు** విశ. వ్యర్థము.

**బీఱువడు** క్రి. వ్యర్థమగు.

**బీఱువాఱు** క్రి. బీరువడు.

**బీఱువోవు** క్రి. 1. వ్యర్థమగు. 2. బలహీనమగు

# బు

**బుంగ** వి. చిన్న మూతి గల పాత్ర.

**బుంగనామము** వి. నడుమ ఎడము లేక తీర్చిన తిరుమణి.

**బుక్క** వి. వస్త్రములను వాసనకట్టు గంధపు పొడి. పటవాసకము రూ. బుక్కా.

**బుక్కనము** సం వి. కుక్కకూత

**బుక్కము** సం. వి. శ్రౌతమునందుపయోగించు మాంసము

**బుకాపకీరు** హిం. వి. బీదవాడు. విశ. దిక్కులేనివాడు.

**బుక్కాము** వి. పుష్పొడి, సుమనోరజము.

**బుక్కుకీపింగ్** ఇం (అర్థ) (Book-keeping) వర్తక వ్యవహారములను క్రమపద్ధతిలో లిఖితరూపములో నుంచుట. (ఇట్లు చేయుటవలన ప్రయోజనమైనాడు వ్యాపార సంస్థ యొక్క ఆర్థిక పరిస్థితి విశదముగ తెలిసికొనవచ్చును)

**బుగులుకొను** క్రి. 1. గుబాళించు. 2. చిప్పిలు 3. విజృంభించు. 4. వ్యాపించు.

**బుగ్గ** వి. 1. చెక్కిలి. 2. నీటిబుడగ. 3. సంతతధారగా పై కుబికి వచ్చు నీరు.

**బుగ్గబావి** వి (భూగ) ఒత్తిడివలన నీరు పైకి ఉబికివచ్చెడు బావి(Artesiantwell). భూమి అంతర్భాగమున గల నీటి ఊటలను నూతులు త్రవ్వి లేక గొట్టముల ద్వారా పైకి తెప్పించుట, నాళముల వలన ద్వార మేర్పరిచినచో దానంతట వదే భూతలమునకు వచ్చు భూగర్భములో నున్న నీరు. (భూగర్భములో నున్న పీడన వలన ఈనీరు త్రోవ చూపినంతనే పైకి వచ్చును)

**బుగ్గి** విశ. బూడిద.

బుచ్చి విశే. చిన్న.
బుజ వై. వి. భుజము. సం. భుజః.
బుజ్జగము వి. ఇచ్ఛకము. ఉపలాలనము,
బుటా హిం. వి. వస్త్రముల మీద వేయు పువ్వు.
బుడతకీచులు వి. పోర్చుగీసు దేశస్థులు. (Portuguese).
బుడము వి. మొదలు.
బుడిపి వి. 1. మ్రాని యందలి ముడి, కనుపు 2. బొప్ప.
బుడుక వి. మునక
బుడుత వి. 1. బిడ్డ, బాలుడు. విశే. పొట్టి. (బుడుతడు.)
బుడుబుడుక్క వి. డుబుడక్క
బుడ్డ వి. 1. అండవృద్ధి. 2. నీటిబుగ్గ.
బుక్తి వై. వి. 1. భోగము. 2. భోజనము
బుత్తి వై. వి. 1. భోగము. 2. భోజనము. సం. భుక్తిః.
బుద్ధి వై. వి బుద్ధి, మతి. సం బుద్ధిః.
బుద్ధి సం. వి. (గృహ.) తెలివి తేటల. (Intelligence).
బుద్ధిమంతుడు సం. విశే. బుద్ధిగలవాడు
బుద్ధుడు సం. వి. 1. బుద్ధదేవుడు. 2. విద్వాంసుడు.
బుద్బుదనము సం. వి. (రసా.) బుడగలతో మరుగుట, రాసాయనిక ప్రక్రియలో బుడగలతో ఏదేని వాయువు ద్రవ్యములనుండి బయటికి వెడలుట (Effervescence)
బుద్బుదము సం. వి. నీటిబుగ్గ,
బుధుడు సం వి. 1. ఒక గ్రహము (Mercury). 2. విద్వాంసుడు. 3. వేలుపు
బున్సెన్ జ్వాల సం. వి. (రసా.) బున్ సెన్ చే కనిపెట్టబడిన ఒక బర్నర్ నుండి లభించు శిఖ (Bunsen flame).
బున్సెన్ దాహకము సం వి. (రసా.) బున్సెన్ అను రాసాయనికునిచే తయారుచేయబడిన ఇంధన వాయు జ్వలన నాళము (Bunsen burner)
బుభుక్ష సం. వి. భుజింప నిచ్ఛ. ఆకలి.
బుభుత్స సం. వి. బోధ గొన నిచ్ఛ.
బుయ్యారము వి. బంధనాలయము, చెరసాల,
బురకా హిం. వి. ముఖమును కప్పునట్టి వస్త్రము.
బురజ వి. చిరుగజ్జె.
బురుక వి. బిడ్డ, విశే. పొట్టి.
బురుకడు విశే. వామనుడు, పొట్టివాడు
బురుజు హిం. వి. కోటగోడయందుండెడు దిబ్బ.
బుఱ్ఱ వి. 1. కొబ్బెరకాయ మొదలగువాని చిప్ప. 2. ఎండిన సొరకాయ, 3. పాములవాని నాగసరము. 4. క్రోవి. 5. పుఱ్ఱె 6. తాటిటెంక, విశే. పెద్ద.
బుఱ్ఱటక్కొమ్ము వి. చిమ్మనగ్రోవి.
బుఱ్ఱబాడిస వి. రాలు చెక్కెడు బాడిస.
బుఱ్ఱి వి. తరిపియావు.
బులియను ఇం. (అర్థ) (Bullion). మేలిమి బంగారము లేక వెండి.
బులుపు వి. సుఖము, సంతోషము,
బుల్డోజర్ ఇం. (వ్యవ) (Bull-dozer). అడవిని నరకి చెట్లను వేళ్ళతోసహా పెకలించి నేలను సాగుచేయుట కనుకూలముగా చేయు యంత్రము.
బుల్స్ ఇం. (అర్థ) (Bulls). సాహసిక వ్యాపారములో ధర పెరుగు నని ఆశించి ఆశ ఫలించినచో లాభము పొందు ఒక కంపెనీ వాటా వ్యాపారులు
బువ్వ వి. అన్నము
బువ్వము వి. 1. పెండ్లివారి సహభోజనము. 2. ఆహారము,
బువ్వముబంతి వి. వివాహము నందు నాల్గవ నాడు బంధువులు స్త్రీ పురుషాదులు ఒకటిగా కూర్చుండి భుజించుట.
బుస వి. పాము యొక్క పూత్కారము.

బుసము సం. వి. 1 పొల్లు 2. పొగడ తీసిన పెరుగు. 3. బూగర. సం. వి. (వృక్ష.) వడ్లగింజపై నుండు రెండు ఊకపొరలలో చిన్నది (Palea). (పెద్దది "అవకుంబనము" (Lemma) అనబడును).
బుసి సం. వి. ఉప్పుమ ఉమ్ముద్రము నదుము నుండు వరుసో త్పాన నది.
బుసిపోవు క్రి. నశించు,

# బూ

బూజు వి. తడివస్తువులపై గల బుసి, కర దూపము. వి. (వృక్ష.) శిలీంధ్రము యొక్క శరీర మేర్పడు సూక్ష్మతంతువుల సముదాయము (Mycelium). (గృహ.) నిలువవేసిన ఆహార పదార్థములలో చెమ్మ వేడిమిచేత బూడిద వర్ణపు మచ్చ లేర్పడుట (Mildew). (ఇదే విధముగా చెమ్మగిల్లిన బట్టలను కొద్దిరోజులు దేనిలోనైన వేసి మూసి యుంచిన వానిపై కూడ ఈ విధపు మచ్చలు తయారగును. ఒక విధమగు శిలీంధ్రములు పెరుగుట వలన ఈ మచ్చలు ఏర్పడును).
బూక విజ. బూటకము.
బూగర వి. 1. రాగి మొదలగు ధాన్యములపై గల పొట్టు. 2, కరం దూపము.
బూచి వై. వి భూతము సం, భూతః
బూచులకోడు వి. శివుడు.
బూటకము వి, మాయ, వంచన,
బూటక్కాడు విజ. వంచకుడు, మాయావి.
బూటేదారీకళ వి. (గృహ.) పూవుల కుట్లపని. అందమైన కుట్టుతో చిత్రములను తయారుచేయుట. (Embroider y)
బూడిద వై, వి. 1. కట్టెలు మొదలగునవి కాలిగా మిగిలిన భస్మము. 2. గోమయ భస్మము సం. భూతిః
బూతము వై . వి. భూతము, పిశాచము, సం. భూతః,
బూతు వి. 1. కుచ్ఛితపు తిట్టు. 2 బట్టువాడు
బూది వి. పాలకుండ.

బూపె వై. వి. చతుర్దశి తిథి. సం, భూపః,
బూఫే భోజనము ఇం. (గృహ.) ఎవరంతట వారు వడ్డించుకొని గుంపులుగా కలసి లేదా కూర్చుండి భుజించుట (Beffet dinner). (స్థలము తక్కువ యుండి ఎక్కువమంది యున్నచో ఇటువంటి ఏర్పాటు చేయబడును.)
బూమియ వై. వి. 1. మారువేషము. 2. మాయ, వంచన. సం. 1. భూమికా. 2. భ్రామకః.
బూర వై వి. 1. పూర, కాహళ మను వాద్యము. 2. నాగస్వరమునకు సుతి యిచ్చు వాద్యము. సం. పూరిః.
బూరండు వై. విజ. విజృంభించిన వాడు.
బూరకాలు వి. బోదకాలు.
బూరగొమ్ము వి. ఊదుకొమ్ము.
బూరటు వై. వి. ఉబ్బుట. సం పూరః.
బూరుగు వి. శాల్మలి వృక్షము. రూ.బూరువు,
బూరుగుదూది వి. (గృహ.) పట్టుప్రత్తి (Kapok).
బూర్జువా ఇం. (రాజ., అర్థ) మధ్య తరగతి ప్రజలు సామంత తంత్రపు కాలములో ఉన్నత ప్రభు వంశమునకు చెందని కాయకష్టముచేసి జీవించెడి ప్రజలను. (దీనిలో వర్తకులు, శిల్పులు, వైద్యులు న్యాయవాదులు కూడ చేర్చబడిరి ఇట్లు సంబోధించుచుండిరి.
బూల వి. తాటిమ్రానిలోని మెత్తనిభాగము.
బూలి విజ. 1. నిస్సారమైనది. 2. బెండు.

# బృ

బృంద సం. వి. తులసి, హరిప్రియ,
బృందము సం. వి. సమూహము,
బృందారకుఁడు సం. వి. వేలుపు, విశ. మనోజ్ఞుడు.
బృంహితము సం. వి. ఏనుగు గీక, ఘీంకారము.
బృహతి సం. వి. విశ్వావసుని వీణ. విశ. గొప్పది.
బృహత్కుక్షి సం. విశ. పెద్ద కడుపు వాడు.
బృహత్తు సం. విశ. గొప్పది.
బృహద్ధమనకందరము సం. వి. (జం.) ధమనస్కంధము యొక్క రెండు భాగములలో నొక భాగము. ఇది పొట్టిగా గుండెకు పైగా నున్న భాగము, ధమనీస్కంధాంతము(Bulbus aorta or synangium).
బృహద్ధమన కుహరము సం.వి. (జం.)ధమన మూలము (Pylangium) యొక్క లోపలి భాగమును ఒక కుంతల కవాటము అసంపూర్ణముగా రెండు అరలుగా విభజించును. వీనిలో కుడివైపున నున్న అర (Cavum aorticum).
బృహద్ధమని సం. వి. (జం.) హృదయము నుండి మంచి రక్తమును తీసికొని పోవు పెద్ద రక్తనాళము (Aorta).
బృహద్బీజము సం వి. అండవృద్ధి.
బృహద్భానువు సం. వి అగ్ని
బృహన్నల సం. వి. అజ్ఞాతవాసమందలి అర్జునుని పేరు.
బృహన్మరీచము సం. వి. మిరెపకాయ.
బృహన్మస్తిష్కము సం. వి. (జం.) పెద్ద మెదడు (Cerebrum).
బృహస్పతి సం. వి. 1. సురగురుపు. 2. గురుడు.
బృహస్పతివారము సం. వి. గురువారము.

# బె

బెంగ వి. 1. విరహవ్యథ. 2. కూత.
బెంగకొట్టు క్రి. 1. వాపోవు. 2. బెంగకొను.
బెంచిమాజిస్ట్రేటు ఇం. (వ్యావ.) (Bench-magistrate) జీతముతీసికొనకుండ న్యాయ విచారణచేయు గౌరవ న్యాయమూర్తి.
బెండ వి. ఒక తెగ శాకము.
బెండగిల్లు క్రి. 1. పెల్లగిల్లు. 2. ప్రయాణమగు.
బెండు వి. బెలుగు. విశ. నిస్సారము.
బెండుచాప వి. (గృహ.) బెండువలె (నొక్కి) వలుచగా చాపవలె తయారుచేసిన అట్ట (Linoleum), (దీనిని నేలమీదగాని బల్లల మీదగాని వేయుట కుపయోగింతురు.)
బెండుమానిసి వి. బలహీనుడు.
బెండువడు క్రి. బలహీనత చెందు.
బెందడి వి. (వ్యావ.) 1. ఒక రకముకంకర. 2. అడుసు.
బెగడు క్రి. భయపడు, రూ బెగ్గడు, బెగ్గడువడు, బెగ్గడిలు.
బెగ్గలము వై. వి. భయాదులచే అవయవములు స్వాధీనత తప్పుట, విహ్వలము. సం. వి క్లబః
బెగ్గిలు వై. క్రి. 1. విహ్వలించు. 2. భయపడు. 3. చింతించు. 4. చలించు, 5. బెదరు.
బెగ్గురు వి. సారసపక్షి. రూ. బెగ్గురము.
బెటాలియన్ ఇం. వి. (Battalion) సైన్యములో ఒక విభాగము.
బెట్టు విశ. 1. తీక్ష్ణము, 2. సేంద్రము.

యూరోప్ దేశములోని పెద్ద భూస్వాములు (Barons)

బేరము సం. వి. ప్రతిమ. వై. వి వ్యాపారము, వెలకడుగుట. సం. వ్యవహారః.

బేరరుచెక్కు ఇం (అర్థ.)(Bearer cheque) పేర్కొనబడిన వ్యక్తి లేక మరియెవరైనను వసూలు చేసికొనగల చెక్కు. (ఇట్టి చెక్కు సొమ్ము చెల్లించునపుడు బ్యాంకువారు సొమ్ము తీసికొను వానిని గుర్తుపట్టవలసిన అవసరము లేదు.

బేరియమ్ ఇం. (రసా.) (Barium) ఒక మూల ద్రవ్యము, క్షారమృద్ధాతువులలో నొకటి.

బేరిల్ ఇం (భూగ.) (B eryl) వైడూర్యము

బేరీజు హిం. వి. రాబడి మొత్తము, లెక్క వివరము.

బేరుండము వై వి. భేరుండము, గజముల తన్నుకొనిపోవు పక్షి.

బేరైట్ ఇం. (భూగ.) (Baryte) బేరియమ్ సల్ఫేటు కలిగిన ఖనిజము.

బేల వై. విశ. 1. మూఢురాలు 2. ముగ్ధ. 3. మూఢుడు. 4. గోల. 5. అమాయకుడు. సం. భేలః.

బేలరి విశ. మోసకాడు.

బేలు వి. మోసము, వంచన.

బేవారసు హిం. విశ. నాథుడులేని, హక్కుదారుడు లేని.

బేషము వై. వి. వండ్లలోపలి గుజురు. రూ పేసెము. సం. పేశీ, పేశః.

బేసరి వి. ఒకరకము ముక్కెర, అడ్డబాస.

బేసల్ మెటబోలిజమ్ ఇం. (గృహ.) Basal metabolism) శరీరము కదలిక లేని సమయమున కావలసిన పోషణ శక్తి. జీవధారణ మూలకచయాపచయ క్రియ.

బేసి విశ. విషమము, సమముకానిది, విశ. (గణి.) సరిగాని సంఖ్య(Odd). 1, 3, 5, 7 వంటివి. చూ. (అయుగ్మ సంఖ్య).

బేసికంటి వి. ( బేసి + కన్ను ) ముక్కంటి.

బేసికైదువుజోదు వి. అసమశరుడు, మన్మథుడు.

బేసిక్ ఆక్సైడులు ఇం (రసా.) ఆమ్లములతో తటస్థీకరణము నొందిన లవణములు, జలమును ఏర్పరచెడి లేక నీటియందు కరిగి క్షారముల నేర్పరచెడి ఆక్సైడులు(B asic oxides).

బేసిక్ ఎడ్యుకేషన్ ఇం. వి. (వ్యావ.) (Basic-Education) ప్రాథమిక విద్య విద్యతో సమానముగ ఏదైన వృత్తి నేర్పు విద్య.

బేస్తు వి (వ్యావ.) పేకాట, జూదమునందలి కొద్ది గెలుపు.

బేహారము వై. వి. వ్యాపారము. రూ. బెహారము.

బేహారి వై. వి. వ్యాపారము తెలిసినవాడు, వణిజుడు.

## బై

బై ఎలెక్షన్ ఇం. వి. (రాజ.) ( Bye election) ఖాళీపడిన శాసనసభ సభ్యత్వమునకు జరుగు ఎన్నిక.

బైకలు (వ్యావ.) వి. బయ్యంకలు, వేవిళ్ళు.

బైజ వి. 1. అజ్ఞానము. 2. అర్థములేనిమాట.

బైడాలము వి. కోపము. రూ. బయిడాలము

బైనోరల్ ఇం. వి (B inoral). 1. వినుట. 2. వినిపించుట.

బైబిల్ ఇం. వి. (మత.) (B ible) క్రైస్తవ ధర్మ గ్రంథము.

భైరవాసము వై. వి. ఉత్తరీయము, బహిర్వాసము, సం. బహిర్వాసః.

బైరాగి వై. వి. విరక్తుడైన తీర్థవాసి. సం విరాగీ.

బైసణ వి. పిణసొరకాయ చెక్క బంధనము. దూ. బయిసణ.

బైసి వై. వి. 1. గౌరవము. 2. భాగ్యము. దూ బయిసి. బవిసి, బగిసి, సం భూయసీ.

బైసుక వి. ప్రతిజ్ఞ దూ బయిసుక.

## బొ

బొంకణము వి విబూది సంచి. దూ, బొక్కణము, బొక్కణ

బొంకరి విశే. బొంకులాడువాడు.

బొంకు వి. కల్లమాట. క్రి. కల్లలాడు.

బొంగరము వై. వి. త్రాడుచుట్టి యాడెడు ఆటవస్తువు. సం. భ్రమరకమ్.

బొంగు వి. ఎండిన లావు బోలు వెదురు.

బొండ వి. తప్పుచేసిన వారి కాలు చేతులకు తగిలించు కొయ్య. ద్రుపదము, (బొండ కొయ్య).

బొండము వి. పెచ్చుతో కూడిన టెంకాయ, కొబ్బరి బొండము. దూ, బొండాము, బొండలము, బొండ్లము. బొండ్లాము,

బొండిగ వి తొడిమ.

బొండుమల్లె వి. గుండుమల్లె

బొంజెము వి. ముండ్లకంపతో అల్లి కట్టువ కమర్చెడు తడిక.

బొంత వై. వి. దట్టముగా కుట్టిన గంత. విశే. పెద్ద. సం బుంథా.

బొంతకాకి వి. మాలకాకి.

బొంతకుట్టు వి. (గృ.) బొంతను కుట్టు పద్ధతి.



బొంతరటి వి. పెద్ద కాయల అరటి.

బొంతు వి. జొన్నలు మొదలు వాని యడుగు నుండు పొట్టు.

బొంద వి. 1. రంధ్రము. 2. చాటి మొదలకు చిన్న చెట్టు. 3. గుంట.

బొందకోల వి. మల్లులు ధరించు నొక ఆయుధము

బొందనము వి. కవచము. దూ బొందళము.

బొందళము వి చూ పై.

బొంది వి మేను,

బొందియ వి అరటిదూట, దూట. దూ. బొందె.

బొందు వి. 1. దారము. 2. చొక్కాయ ముడివేసెడు చిన్ననాడా.

బొక్క వై. వి. 1. బిలము, కన్నము 2. శవమునుపూడ్చెడు గొయ్యి. సం భూకః.

బొక్కసియ వై వి. బొక్కెన, గుఱ్ఱములకు దాణాపెట్టు సంచి. సం భక్షణమ్.

బొంకులాడు వి. 1. కప్పగాడు, 2. ఎలుక.

బొక్కసము వి. 1. వంటసాల. 2. ముల్లె. 3. ధనాగారము.

బొక్కి విశే. తొస్స, బోసి, మాంసము లేనిది.

బొక్కిరొమ్ము వి. మాంసము లేని రొమ్ము.

బొక్కిస వి. బట్టలపెట్టె,

బొక్కిసా వి. చిన్నమూట.

బొక్కు క్రి. నోట నిండుగ వేసికొని నములు. వి. నిండిన నోరు.

బొగడ వి. 1. చూచుకము. 2, మంచపు కోడు. 3. శిఖరము. 4. గంధపట్టెమీది గుబ్బ. 5. చెరువుకట్టలో పడిన చిన్న బెజ్జము.

బొగ్గరపు నేలలు వి. (వ్యవ.) కొద్దికాలము వర్షము లేకపోయినచో తేమ మిగుల తగ్గిపోవు నేలలు (Sandytype soils).

బొగ్గరము వి. (వ్యావ) ఉక్కుతో కూడిన వేకిమి,

బొగ్గు వి మండి చల్లారిన కట్టెతునుక, అంగారము.

బొచ్చె వి. 1. కుండలోనగు వాని పెంకు. 2. తలపుఱ్ఱె.

బొజంగు వై. వి (భుజంగుడు) విటుడు. సం. భుజగః.

బొజ్జ వి కడుపు

బొజ్జదేవర వి వినాయకుడు

బొటనవ్రేలు వి. అంగుష్ఠము. రూ బొటమన వ్రేలు, బొటవ్రేలు, బొట్టనవ్రేలు, బొట్టవ్రేలు,

బొటిమ వి. మొటిమ.

బొట్టము వి, గోచి, లంగోటి.

బొట్టియ వై. వి. 1. బాణపు ములికి. 2. కొడుకు. 1 కూతురు. సం. 1. క్షేత్రీ. 2. పుత్రః. 3. పుత్రి.

బొట్టు వై. వి. 1. తిలకము. 2. చుక్క. సున్న. 3. మంగళ సూత్రమున కూర్చు స్వర్ణాభరణము. సం. 1. పుండ్రమ్. 2. బిందుః 3. వృత్తమ్.

బొడిప వి, చెట్లయందలి బుడిపి.

బొడ్డనబావి వి. నడుమ పిల్లనూయిగల కోనేరు, దిగుడుబావి.

బొడ్డు వి 1. నాభి. 2. నూతిచుట్టు పెట్టిన గోడ.

బొడ్డుచేరులు వి. (గృహ) నాభిగొట్టము. బొడ్డుత్రాడు (Umbilical cord).

బొణిగ వి. 1. సరకుతో నున్న చేతిసిద్దె. 2. బొంతు విడని జొన్న మొదలగు ధాన్యము. 3. పశువు మెడనుకట్టు గంట.

బొత్తాము ఇం.వి. గుండీ.బొత్తాను(Button)

బొది వి. ఓడ నిర్మాణమగు చోటు.

బొద్దింక వి (జం) కీటకములలో నొక జాతి (Cockroach)



బొద్దింక

బొద్దు వి. 1 గోడ అంచు. 1. పేముబొద్దు 3 గడ్డి. బొద్దు.

బొప్పఁడు వి. మూఢుడు.

బొప్పి వి. బుడిపి.

బొబ్బ వి 1 పొక్కు 2 సింహనాదము,

బొబ్బమెకము వి సింహము, గర్జించు మృగము

బొమ వి. 1, కనుబొమ, 2. ప్రతిమ. రూ. బొమ్మ.

బొమముడి వి. కోపముచే కలిగెడు కను బొమల ముడి, భ్రుకుటి.

బొమిక వి. 1. ఎముక. 2. బొకె.

బొమికము వి. కిరీటము. రూ. బొమ్మికము, బొమ్మిడికము.

బొమ్మ వై. వి. 1. కనుబొమ. 2. బిరుద చిహ్నము. 3. అవమానచిహ్నము. 4. ప్రతిమ. 5. బ్రహ్మ. విశ. అల్పము. సం. 1. భ్రూ. 2. ప్రతిమా. 3. బ్రహ్మ.

బొమ్మచుక్క వై. వి, కానరానిచుక్క, అభిజిన్నక్షత్రము.

బొమ్మపెట్టు క్రి. వెక్కిరించు.ఉదా.''దేవతా మణులకు బొమ్మ పెట్టు క్రియ మర్దల తాళనినాద పద్ధతిన్'' (రా మా భ్యు దయము),

బొమ్మర వై. వి. భ్రాంతి.

బొమ్మరము వై. వి. బొంగరము సం. భ్రమరః.

బొరాక్సు ఇం. వి. (భూగ.) (Borax) ఒక ఖనిజము.

బొరిగ వి. గడ్డి పెల్లగించెడు గొద్దలి.

బొరుగు వి. 1. వేపుడుచట్టి. 2. కణితి మృగము.
బొరుగులు వి పేలాలు. రూ. బొరుపులు.
బొఱియ వి 1 బిలము. గొయ్యి 2. ఎండిన బొండ్లము
బొల్లఁడు వి బొల్లిగుఱ్ఱము.
బొల్లి విశ. 1. తెల్లనిది, 2. తెల్లనివాడు.
బొల్లిగ్రద్ద వి. గరుడుడు.
బొల్లు వి. అసత్యము బొంకు.
బొసిక వి టెంకాయ మీది తోలు.
బొసుక విశ. బలిసినది, ఒలిసినవాడు.
బొళ్ల వి. బోలు. విశ. శూన్యము, ఉత్తది.
బొక్కపాయి వి. కల్లుత్రాగు తాటాకువాయ

## బో

బోఁకి వి 1. పాత్రము (నిందార్థమున). 2. తలపుఱ్ఱె. 3 జలగడుగు దోనె.
బోఁకె వి. బొమికె, శల్యము.
బోఁటి విశ. వంటి, వంటివాడు, పోలినవాడు
బోగము వై. వి. 1. లంజె వెల. శుల్కము. 3. విక్రయము. సం. భోగః.
బోగి వి. సంక్రాంతి పండుగకు తొలిదినము
బోటి వి. 1. స్త్రీ. 1. చెలికత్తె.
బోటు వై. వి. కొండ మొదలగు వానియం దుబ్బుగానుండు చోటు. విశ. 1. ప్రౌఢుడు 2 దుర్మదుడు. సం స్ఫుటః, ప్రౌఢః.
బోడతరము వి. ముండిని (చెట్టు)
బోడపత్రము వి.(వ్యావ)హామీలేని దస్తావేజు
బోడిక వి. 1. బాలకుడు 2 సేవకుడు.
బోడిగ వి. (వ్యావ.) 1. బిందెవంటి కుండ 2. గాజు గిన్నె.
బోణీ వి. మొట్టమొదటి అమ్మకము.
బోద వై. వి. పక్షిలోనగు వాని పిల్ల. పోతము. సం. పోతః.
బోదకాలు వి. వ్యాధిచే వచ్చు ఏనుగు కాలు వంటి కాలు.
బోదియ వి. 1. ప్రకాండము. 2. మిరప చేల యందు కాలువ లేర్పరిచి కట్టిన కట్ట 3 స్తంభముల మీది దూలముల క్రింద నుండు పీట,
బోదె వి. (గృహ) గుమ్మము దగ్గర కాళ్ళు తుడుచుకొనుటకు వేయు నార చాప లేదా ఇనుపజాతి చాప (Door mat).
బోధకరుఁడు సం. వి. వేకువను రాజుల మేల్కొలిపెడు వాడు, వైతాళికుడు.
బోధకుఁడు సం. వి ఉపాధ్యాయుడు.
బోధము సం. వి, తెలివి.
బోధి సం. వి.1. రావి. 2. సమాధివిశేషము.
బోనకత్తియ వై. వి. (బోనము + కత్తియ) అన్నము వండి పెట్టునది, దాసి.
బోనము వై, వి. అన్నము సం భోజనమ్.
బోనము పెట్టె వై. వి. తోలుకప్పిన గుండ్రని పెట్టె.
బోనసు ఇం. (అర్థ.,శా) (Bonus). భీమా కంపెనీలు తమ పట్టాదారులకు, తదితర వ్యాపారసంస్థలు తమవద్ద పనిచేయు వారికి నొసగు బహూకృతిద్రవ్యము
బోను వి. మృగాదులను పట్టు కృత్రిమ యంత్రము, ఎలుకలబోను.
బోమన్స్ సంచి లేక తిత్తి ఇం. (గృహ.) ఈ తిత్తిలో రక్తము మలినపదార్థములను తీయుటకు వడగట్టబడును (Bowman's Capsule).
బోము వి. బలవంతము.
బోయ వి. కిరాతుడు, కైవర్తుడు,
బోయత వి. కిరాత స్త్రీ. రూ. బోయెత. (చెంచెత వలె).

బోయరులు బం. (చరి.) ఆఫ్రికా దేశము నకు వలస వచ్చిన డచ్చివారు (Boers).

బోర వి. 1. రొమ్ము. 2. పెద్దరెక్క తలుపు.

బోరగిలు క్రి. రొమ్ము భూమి నాను.

బోరన విణ. శీఘ్రముగా.

బోరప్రాఁకుడు వి. పాము.

బోరసైట్ బం వి (భూగ.) (Boracite) మెగ్నీషియమ్ బోరేటు, మెగ్నీషియమ్ క్లోరైడ్ కలిగిన ఒక ఖనిజము.

బోరాన్ బం. వి (రసా.)(Boron). ఒక మూల ద్రవ్యము. (అధాతు స్వభావము కలది వెలిగారమందు ఘటకముగా నుండును. ఆవర్త క్రమ పట్టికలో 3వ వర్గము లోనిది. అత్యల్పప్రమాణములో మొక్క లకు కావలసిన మూలద్రవ్యములలో నిది యొకటి. పరమాణు సంఖ్య 5గా గలఒక అలోహ మూలకము.)

బోరికామ్లము నం. వి. (రసా.) బోరాన్ త్రిఆమ్లజనిదము నీటిలో కరిగిన ఏర్పడు ఆమ్లము (Boric acid).

బోరుకలఁగు క్రి. మ్రోగు.

బోరుకాడించు క్రి. స్నానము చేయించు.

బోరుకాడు క్రి. బిడ్డలు స్నానముచేయు.

బోరెంపోతు విణ. (వ్యావ.) 1. తిండిపోతు. 2. బలవంతుడు.

బోరెము వి.(వ్యావ.) 1. దూదిలోనగు వాని మూట 2. గోనెపట్టాలతో నమర్చిన గుండ్రని గాదె.

బోరేట్ బం. (రసా.)(Borate) బోరికామ్లము యొక్క సోడియమ్ లవణము

బోర్ట్ బం. (భూగ.) (Bort) వజ్రజాత్యకము. కర్బనము యొక్క అసంపూర్ణ స్ఫటికీకరణ రూపము.

బోర్డు బం. (వ్యావ.) (Board) సంఘము కార్యనిర్వాహక సంఘము.

బోర్డోమిశ్రణము బం. (వ్యావ.) ఇది శిలీంధ్ర సంబంధమగు తెగుళ్ళను నివారించుట కుపయోగింపబడుచుండును 1 పాలు మైలతుత్థము 1పాలు పొడిసున్నము 100 పాళ్ళ నీటిలో కలిపి దీనిని తయారుచేయు దురు (Bordeaux mixture).

బోర్నైట్ బం. (భూగ.) (Bornite) ఒక తామ్ర ఖనిజము.

భోజము నం వి. బాలెంత బోళము.

భోలు విణ. లోపల నేమియు లేనిది, గుల్లం డొల్ల.

బోలె వి 1. తలపుజ్జె. 2. ఓటికుండ. 3. కుండబొచ్చె.

బోలెడు విణ. (వ్యావ.) లెక్కపెట్ట లేవన్ని.

బోల్షివిజమ్ బం. వి. లెనిన్ నాయకత్వమున రష్యా దేశమున సంఘస్వామిత్వము గల ఆర్థిక రాజకీయ సార్వజనిక పరిపాలన స్థాపించుటకు అవలంబించిన తీవ్ర వామ పక్ష సిద్ధాంతము.

బోసి వి పండ్లూడినది.

భోళా విణ. కపటములేనిది, హిం. భోలా.

## బౌ

బౌండ్ ఓపెనింగ్ బం. (గృహ) (Bound opening) పై పింగు వేసి ముగించిన తెర యిక.



బౌండ్ ఓపెనింగ్

బౌద్ధధర్మము నం. వి. (చరి.) గౌతమ బుద్ధునిచే (క్రీ. పూ. 566-486) బోధింపబడిన ధర్మము. గౌతమబుద్ధుని తరువాత అశోక చక్ర వర్తి కాలములో ఈ ధర్మము ఒక్క భారత దేశములోనే కాక విదేశములలో కూడ వ్యాపించెను గౌతమబుద్ధుడు బోధించిన ధర్మము, ప్రపంచములోని సుఖదుఃఖములకు మానవుడు చేయు చున్న కర్మయే మూల కారణమని సుఖ

దుఃఖములకు అతీతుడై మానవుడు సన్మార్గము ద్వారా జ్ఞానియై, సంపూర్ణ నిర్వాణము పొంది జన్మరాహిత్యము పొంద వచ్చునని బోధించు ధర్మము.

బౌద్ధభిక్షుణి సం. వి. (వరి) బౌద్ధ సన్యాసిని.

బౌద్ధము సం. వి. బుద్ధుడు స్థాపించిన మతము.

బౌద్ధసంఘము సం. వి. (వరి) బౌద్ధభిక్షుల సంఘము.

బౌద్ధులు సం. వి. బుద్ధమతస్థులు.

## బ్యా

బ్యాంకరు ఇం వి (అర్థ) (Banker) పరాయి ఇతరుల ధనమును తనవద్ద పదిలపరిచి అవసరమైనవారికి తగురీతిని ఋణము లిచ్చి, వానిపై వచ్చు వడ్డీ వలన లాభము చెందువాడు

బ్యాంకు ఇం (అర్థ) (Bank) ఇతరుల ధనమును సేకరించి, అవసరమగు వారికి ఋణముల నిచ్చు సంస్థ చూ. బ్యాంకరు.

బ్యాంకునోటు ఇం. వి. (అర్థ.) (Bank-note) రొక్కమునకు బదులు వాడు బ్యాంకు పత్రములు

బ్యాంకురేటు ఇం వి. (అర్థ.) (Bank-rate) దేశములోని కేంద్ర బ్యాంకు మిగిలిన బ్యాంకులకు ఋణముల నిచ్చు వడ్డీ రేటు రీడిస్కౌంటు రేటు దేశములోని వడ్డీ రేట్లు, వస్తువుల ధరల మట్టము దీనిపై చాలా ఆధారపడి యుండును.

బ్యాంకు సంధాన పట్టిక మి. వి. (వాణి.) ఖాతాదారునికి బ్యాంకునకు మధ్య జరిగిన వ్యవహారములన్ని బ్యాంకు ఖాతాలోను ఖాతాదారుని పుస్తకములలో ఒకే సమయమున వ్రాయక పోవుట వలన వచ్చు వ్యత్యాసమును రుజువుచేసి సంధానము చేయు పట్టిక.

బ్యాటర్. ఇం (గృహ) (Batter) జారుగా కలిపిన పిండి.

బ్యాలెన్సు ఇం. వి. (అర్థ.) (Balance) అవశేషము, ఖాతా నిల్వ జమాఖర్చుల తౌల్యానంతరమున కనబడు ఆస్తి లేక ఋణశేషము.

బ్యాలెన్సుషీటు ఇం. వి. (అర్థ.) (Balance Sheet) తోలన పట్టీ, నిర్ణీత కాలానంతరమున వ్యాపారసంస్థకు గల ఆస్తులను, అప్పులను వేరువేరుగ సూచించు పట్టీ. (దీనివలన సంస్థ యొక్క నికరమైన ఆస్తి, నిజమైన ఆర్థిక పరిస్థితి తెలియును.

## బ్యూ

బ్యూరెట్ ఇం. వి (భౌతి.) (Burette) ద్రవములను కావలసిన కొలతలో తీసికొనుటకుపయోగపడు ఒక పరికరము.

## బ్ర

బ్రతుకు వి. 1. జీవనము. 2. జీవనోపాయము

బ్రద్ద వి. తునుక, చీలిక,

బ్రద్దలవారు వి. వేత్రహస్తులు.

బ్రధ్నుడు సం. వి. 1. సూర్యుడు. 2. శివుడు.

బ్రమము వై. క్రి. భ్రమించు, బమ్మెరవోపు

బ్రయోఫైటా ఇం. వి. (వృక్ష.) (Brayophyta)

బ్రయోఫిటములు ఈ తరగతికి చెందిన ఉద్భిజ్జములు సూక్ష్మోద్భిదముల కంటె హెచ్చు శ్రేణికి చెందినవి. పాచిజాతి మొక్కలు (Mosses and liverworts)
బ్రహ్మ నం. వి. నలువ వ్యు. ప్రజలను వృద్ధి బొందించువాడు (నవబ్రహ్మలు.- భృగువు, పులస్త్యుడు, పులహుడు అంగిరసుడు, అత్రి క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు మరీచి).
బ్రహ్మచర్యము నం వి. మొదటిఆశ్రమము.
బ్రహ్మచారి నం. వి. బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించువాడు.
బ్రహ్మణ్యము నం. విశ. 1, బ్రాహ్మణులకు హితమైనది. 2. గంగరావి.
బ్రహ్మబంధువు నం విశ. 1. నీచుడు 2. నీచ బ్రాహ్మణుడు.
బ్రహ్మబిందువు నం. వి. వేదపారమందలి నోటితుంపర.
బ్రహ్మభూయము నం. వి. బ్రహ్మత్వము.
బ్రహ్మము నం.వి. 1. హంసుడు. 2. వేదము. 3. పరమాత్మ. 4, తపము.
బ్రహ్మమేఖలము నం. వి. బ్రహ్మచారులకు ముంజిగా నుపయోగపడు తృణము.
బ్రహ్మయజ్ఞము నం వి. వేదపాఠము.
బ్రహ్మరంధ్రము నం, వి, నడునెత్తి.
బ్రహ్మరథము నం.వి.మృతినొందిన సన్న్యాసులను తీసికొని పోయెడు వాహనము,
బ్రహ్మవర్చసము నం. వి, సదాచారాధ్యయన సమృద్ధి.
బ్రహ్మవర్చస్సు నం వి బ్రాహ్మణతేజము.
బ్రహ్మవాది నం. వి వేదాంతి
బ్రహ్మసమాజము నం. వి. (చరి.) క్రీ. శ. 1820వ సంవత్సరములో రాజారామమోహనరాయిచే వంగరాష్ట్రమున స్థాపింపబడిన సమాజము (భగవంతుడు ఒకడే యని సకల మానవ సౌభ్రాత్రమును బోధించుధర్మము. ఈ సమాజము విగ్రహారాధనను నిషేధించును )
బ్రహ్మసర్పము నం వి నలికండ్లపాము.
బ్రహ్మసువు నం. వి, 1. మన్మథుడు 2. మరీచి. 3 నారదుడు.
బ్రహ్మసూత్రము నం. వి. యజ్ఞోపవీతము.
బ్రహ్మహత్య నం. వి. విప్రుని చంపుట (మహాపాతకములలో నొకటి).
బ్రహ్మాంజలి నం. వి. వేదాధ్యయన కాలమందలి మ్రొక్కు.
బ్రహ్మాండము నం. వి, భూగోళఖగోళాదికము, అందలి లోకములు చరాచరాఖిలము.
బ్రహ్మారణ్యము నం. వి. వేదపారభూమి.
బ్రహ్మావర్తము నం. వి. ప్రస్తుతపు ఢిల్లీ నగరమునకు వాయవ్యభాగపు దేశము.
బ్రహ్మాసనము నం. వి. ధ్యానోపాయ భూతమైన పద్మస్వస్తిక దండాద్యాసనములు.
బ్రహ్మి నం. వి 1. సరస్వతి. 2 పొన్నగంటి కూర. దూ. బ్రాహ్మి.

## బ్రా

బ్రాంతి వి. ప్రేమ. విశ. 1. అధికము. 2. దుర్లభము.
బ్రాడ్‌గేజు రైలు మార్గము వి. వి. (భూగో.) సమతలప్రదేశములలో నుండు రైలు మార్గము. (దీనికి రైలు పట్టాల మధ్య 5'—6" దూరముండును).
బ్రామాప్రెస్ ఇం. వి. (భౌతి.) (Bramah Press) నీటి ఒత్తిడి ప్రహారమువలన పని చేయు ఒక విధమైన ప్రెస్.
బ్రాసో ఇం. (గృహ.) (Brasso) అలంకారపు

ఇత్తడి సామానులను పాలిష్ (Polish) చేయుటకు ఉపయోగించు ద్రవము లేక పొడి

బ్రాహ్మణబ్రువుడు సం. వి. జాతిమాత్రోప జీవియైన బ్రాహ్మణుడు, చెడిపోయిన బాపడు.

బ్రాహ్మణము వి. 1. బ్రాహ్మణ సమూహము. 2. వేదభాగము.

బ్రాహ్మణములు సం. వి. వైదిక ధర్మ గ్రంథములు, యజ్ఞతంత్రములను,పురాణ గాథలను చెప్పు ధర్మ గ్రంథములు.

బ్రాహ్మణార్థము సం. వి. పితృకార్యము లందు భోజనమునకు పోవుట.

బ్రాహ్మణుడు సం. వి. పారుడు.

బ్రాహ్మణ్యము సం. వి. 1. బ్రాహ్మణ కర్మము, 2. బ్రాహ్మణ భావము.

బ్రాహ్మము సం. విశే. బ్రహ్మ సంబంధమైనది. వి. విద్యయు నాచారమును గల వరుని పిలిచి పదగానసహితముగ వస్త్రాదు లచే నలంకరించి పూజించి, కన్య నిచ్చి చేయు వివాహము.

బ్రాహ్మి సం. వి. 1. సరస్వతి, 2 బాపన పేమ. 3. పొన్నగంటి.

బ్రాహ్మ్యము సం. వి. 1, ఒక తరగతి వివాహము. 2. బ్రహ్మత్వము.

## బ్రి

బ్రిగేడు ఇం. (రాజ) (Brigade) సైనిక వాహిని, రెండు లేక రెండు కంటెఎక్కువ జనులు గల పటాలము, బ్రిగేడియరు-వాహినీపతి, బ్రిగేడియరు-మేజరు బ్రిగేడియర్-జనరల్, మహావాహినీపతి.

## బ్రు

బ్రుంగు క్రి. 1. పూడు. 2 మదుగు, 3. మునుగు,

బ్రుంగుడు విశే. 1. మరిగినది, 2. మునిగినది.

బ్రుంచు క్రి. బ్రుంగచేయు.

బ్రుయ్యు క్రి. నశించు.

బ్రుషి సం. వి. వ్రతస్థులు కూర్చుండు దర్భాసనము. రూ. బ్రుసి.

## బ్రూ

బ్రూసైట్ ఇం. వి. (భూగ.) (Brucite) మెగ్నీషియమ్ హైడ్రాక్సైడ్ కలిగిన ఒక ఖనిజము.

## బ్రో

బ్రోమిన్ ఇం. వి. (రసా.) (Bromine) ఒక అలోహమూల పదార్థము. (At no : 35) అధాతుమూలద్రవ్యము - హేలోజన్ (లవణ జనకముల) వర్గమునకు చెందినది దానికి గల ఎఱ్ఱరంగువలన ఆ పేరు వచ్చినది.

బ్రౌనియన్‌గతి ఇం. వి. కొలాయిడల్ సొల్యూషన్‌లోని అణువుల రాపిడివలన నేర్పడిన ప్రత్యుద్ధగతి (Brownian motion)

# బ్లా

బ్లాంచింగ్ ఇం. వి. (గృహ) (Blanching) మరగించిననీటిలో ముంచితొక్క తీయుట

బ్లాకుడెవలెప్‌మెంటు ఆఫీసర్ ఇం. వి. (రాజ.) (Block-development officer) బ్లాకు అభివృద్ధి ఉద్యోగి బ్లాకు పంచాయతీ ముఖ్య కార్య నిర్వాహకునిగా ప్రభుత్వముచే నియమింపబడిన ఉద్యోగి. (' . D. O.')

బ్లాకు పంచాయతీ సమితి మి వి (వరి. రాజ) గ్రామ పంచాయతీలకు, జిల్లా పరిషత్తులకు మధ్య నుండు స్థానిక సంస్థ.

బ్లాస్టుఫర్నేస్ ఇం వి. (రసా.) (Blast furnace) ఇనుము కలిగిన ఖనిజములను కరిగించుటకుపయోగించు కొలిమి, గాలి కొలిమి,

# బ్లె

బ్లెన్డ్ ఇం. వి. (భూగ) (Blende) జింక్ సల్ఫైడ్ కలిగిన ఒక ఖనిజము.

# బ్లౌ

బ్లౌస్ ఇం. వి. (గృహ) (Blouse) జాకెటు. (ఇది చీరపై వేసికొనెడి దుస్తు)

# భ

భ ఒక యక్షరము:

భంగజాత వివరము సం. వి. (వృక్ష) దారు కణ సంహతిలో నొక్కొక్కప్పుడు కణ భిత్తికలు జీర్ణించి పోవుట వలన నేర్పడిన కుహరము (Lysigenous cavity)దీనిలో నీరు, గాలి,పరిమళపు నూనెలు మొదలగు వవి నిలువ యుండును.)

భంగము సం. వి. 1. చెరుపు. 2. అవమానము. అల. 4, రోగము.

భంగి సం. వి. విధము.

భంగించు సం. వి. క్రి భంగపరుచు.

భంగుర సం. విశ. (రసా.) సులభముగా పొడియగు గంధకము వంటి ద్రవ్యము (Brittle).

భంగురము సం. వి. 1.నశించునది. 2. వంకరైనది.

భంజకము సం. విశ. విరుచునది, చీల్చునది

భంజక స్వేదనము సం, వి, (రసా.) ఒక ద్రవ్యములు రాసాయనిక విఘటనముతో పాటు స్వేదించుట (Destructive distillation)

భంజనము సం. వి. విరుపు. సం. వి. (రసా.) విడగొట్టుట, బద్దలుగొట్టుట(Breaking) వేడిచేసి రాతి నూనెలో నుండు సంకీర్ణ కర్బనోదజని యౌగికము సరళ యౌగికములుగా మార్చుట.

భంజళి సం. వి. పాము వలె వంకరగాపోవు గుఱ్ఱపు నడక. రూ. భంజళిక.

భండనము సం. వి. 1. యుద్ధము. 2 దుశ్చేష్ట.
భండారము సం. వి. బొక్కసము.
భండుఁడు సం. వి. 1. ఆకతాయి. 2. దుశ్చేష్టుడు
భంబ సం. వి. 1. ఆకాశము. 2. నక్షత్రము.
భక్తము సం. విశే. భాగింపబడినది. వి. 1. అన్నము, 2. పూజ. 3 భాగము.
భక్తి సం. వి. 1. సేవ. 2. భయముతో కూడిన స్నేహము 3. భాగము.
భక్తుఁడు సం. వి. భక్తిగలవాడు,
భక్షక కణములు సం. వి. (జం) శ్వేత కణములు (Phagocytes) సూక్ష్మజీవులు తిని వేయు జీవకణములు (Leucocytes).
భక్షణము సం. వి. తిండి
భక్ష్యము సం. వి. భక్షణీయము, తినుబండము (పంచభక్ష్యములు:- భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము.)
భగము సం. వి. 1. ఆడుగుఱు. 2. సంపత్తి 3. వైరాగ్యము 4 తెలివి. 5. వీర్యము. 6. కీర్తి. 7. మహాత్త్వము.
భగవంతుఁడు సం. వి. 1 విష్ణువు. 2. శివుడు. 3. బుద్ధుడు. విశే. సన్మానితుడు.
భగవతి సం వి 1. సరస్వతి. 2. పార్వతి 3. గంగ. విశే. పూజ్య స్త్రీ.
భగవద్గీత సం వి మహాభారతములోని అంతర్భాగమైన వేదాంత గ్రంధము.
భగిని సం. వి. సహోదరి
భగ్నము సం. విశే. భంగ మొందినది.
భజనము సం. వి. 1. సేవించుట. 2. భాగించుట.
భజమానము సం. విశే. 1. సేవించునది. 2. భాగించునది.
భజించు సం. క్రి. 1. సేవించు 2. భాగించు.
భజిష్యము సం. విశే. 1. సేవింపదగినది. 2. భాగింపదగినది.
భటుమము సం. వి. దినము యొక్క పదునేనవ భాగము.
భటుఁడు సం. వి. బంటు, సేవకుడు, పనివాడు.
భట్టారకుఁడు సం. వి. 1. సూర్యుడు 2. ముని. 3. నాట్యపరిభాషయందు రాజు
భట్టిని సం. వి. (నాట్యపరిభాషయందు) 1. రాజు భార్య. 2. బ్రాహ్మణునిభార్య
భట్టుఁడు సం. వి. 1. పాఠకుడు. 2. బట్టువాడు.
భద్రత సం వి. (గృహ.) 1 నిర్భయత్వము 2. కాపాడఁబడుట. 2 నిర్భయముగా నుండుట.
భద్రతా సంఘము సం. వి. (చరి., రాజ.) ఐక్యరాజ్య సమితి ముఖ్య కార్య నిర్వాహక సంఘము. (దీనిలో పదునొకండు గురు సభ్యులుందురు. వీరిలో 5 గురు శాశ్వత సభ్యులు, వీరు అమెరికా సంయుక్త రాష్ట్రము, బ్రిటను, రష్యా, ఫ్రాన్సు, చైనాదేశముల ప్రతినిధులు తక్కిన ఆరుగురు సభ్యులను ఐక్యరాజ్య సమితి సాధారణసభ 2 సంవత్సరముల వరకు ఎన్నుకొనును. వీరందరికి తమఅంగీకారమును సూచించుచు వోటు వేయు అధికారము కలదు, కాని శాశ్వత సభ్యుల లో నేఒక్కరైనను భద్రతా సంఘములో చర్చించుచున్న విషయము, అంతర్జాతీయ శాంతి భద్రతలకు హాని కలుగునని తమ ప్రభుత్వము భావించినచో తమకు గల 'వీటో' అను విశేష నిషేధాధికారముచే ఆ విషయముపై చర్చ జరుగకుండ చేయ వచ్చును.)
భద్రశ్రీ సం. వి. చందనము, గంధము.
భద్రాకరణము సం. వి. ముండనము.
భద్రాసనము సం. వి. రాజపీఠము,
భద్రుఁడు సం. వి. వీరభద్రుడు. విశే. మేలు కొని యుండు వాడు.

భయానకము సం. వి. 1. పులి. 2 రాహువు, 3, భయానకరసము.
భరటుఁడు సం. వి. 1. కూలివాడు. 2. కుమ్మరి.
భరణము సం. వి 1. భరించుట. 2.జీతము 3 కూలి.
భరణి సం. వి. 1. రెండవ నక్షత్రము, 2. బరిణె.
భరణ్యము సం. వి. 1, కూలి. 2. జీతము.
భరతము సం. వి. 1. నాట్యము. 2. భరత పిట్ట. 3. భరత ఖండము,
భరతవాక్యము సం వి (నాట.) నాటకము చివర ఉండు మంగళ వాక్యము.
భరము సం. వి. 1. పరువు. 2, అతిశయము. 3. బరువు. 4. బారువ.
భర్గుఁడు సం. వి. శివుడు.
భర్జనము సం. వి. 1, వేచుట. 2. ధ్వంసము
భర్జించు సం. క్రి. వేచు.
భర్త సం. వి. మగడు. విణ. ప్రోచువాడు.
భర్తృదారకుఁడు సం. వి. (నాట్యపరిభాష యందు) యువరాజు,
భర్తృదారిక సం. వి. (నాట్య పరిభాష యందు) రాజు కూతురు.
భర్త్సనము సం.వి. బెదరింపుమాట, గద్దింపు
భర్మము సం. వి. 1. బంగారు. 2 జీతము.
భల్లము సం.వి. 1. ఎలుగుగొడ్డు 2.బల్లెము.
భల్లవత్ సం. (వృక్ష.) బల్లెపు రూపు గల (ఆకు) (Lanceolate).
భల్లాతకి సం. వి, జీడి చెట్టు.
భల్లుకము సం. వి, 1. భల్లము. 2. ముల్లు. 3. కోతి. రూ. భల్లూకము.
భవంతి వి. (వ్యావ.) ఇల్లు. రూ. బవంతి,
భవదీయము సం. విణ. నీది.
భవనము సం. వి. ఇల్లు
భవనాసి వి. (వ్యావ.) 1. విచ్చగాని గిన్నె 2, అక్షయపాత్ర.
భవము సం. వి. 1, జాము, పుట్టుక. 2 ప్రాప్తి. 3. సంసారము.
భవాని సం. వి. పార్వతి.
భవికము సం. వి. మేలు, శుభము.
భవిలుఁడు సం. విణ. నటుడు.
భవిష్యత్తు సం. విణ. కాగలది.
భవిష్యము సం వి. 1. శుభము. 2.భాగ్యము
భవుఁడు సం, వి. శివుడు.
భవ్య సం. వి సార్వతి, హైమవతి.
భవ్యము సం. విణ 1. శుభమైనది, 2, యోగ్యమైనది. వి. ఎముక.
భషకము సం, వి. శునకము.
భసలము సం. వి. తుమ్మెద,
భసితము సం. వి. భస్మము.
భస్త్రు సం. వి. 1. కొలిమి తిత్తి 2 తోలు తిత్తి రూ. భస్త్రి.
భస్మము సం, వి బూడిద.
భస్మాంగుఁడు సం. వి. శివుడు.
భస్మిక అయనులు సం. వి (రసా.) ధన విద్యుత్తుతో కూడిన అయనులు (Basic ions)
భస్మీకరించు సం. క్రి. బూడిదగా చేయు.

## భా

భా సం. వి. 1. సూర్యకిరణము.2.సూర్యుని వెలుగు.
భాండము సం. వి. 1. తొడవు. 2. మట్టి పాత్రము. 3. వస్తువు.
భాండాగారము సం వి. బండారము. బొక్కసము.
భాగదూషు సం. వి. (వరి). ప్రాచీనార్యుల కాలములో ధాన్యపుపంటల పైవిధించెడి కిస్తు
భాగధేయము సం. వి. 1. భాగ్యము. 2. కప్పము.

భాగఫలము సం వి. (గణి.) ఒక రాశిని వేరొక రాశిచే భాగింపగా వచ్చు ఫలము (Quotient).

భాగము సం. వి. 1. పాలు, వంతు, వాటా. 2. భాగ్యము.

భాగస్వామి సం వి. (వాణి) వ్యాపార సంసలు మొ. వానిలో భాగము గలవ్యక్తి (Partner)

భాగస్వామిత్వము సం.వి.(వాణి ,శాస.)ఉమ్మడిగా గాని, అందరి తరపున ఒకనిచే గాని నిర్వహింపబడు చుండెడి వ్యాపారము వలన లభ్యమగు లాభములను పంచుకొనుటకు గాను ఒడంబడిక చేసికొనిన వ్యక్తుల మధ్యనున్న సంబంధము, లాభనష్టములను భాగస్వాములు నియత నిష్పత్తిలో గాని, అది లేనిచో సమానముగ గాని పంచుకొందురు చట్టరీత్యా ఒక భాగస్వామి చేయు పనులకు మిగిలిని వారు వైయక్తికముగను, సమష్టిగను అపరిమిత బాధ్యత కలిగి యుందురు.

భాగహారము సం వి. (రసా , గణి ) భాగించుట, అంకగణిత ప్రధాన పరికర్మలలో నొకటి (Division).

భాగినేయుఁడు సం వి. 1. భగినీపుత్రుడు. 2. మేనల్లుడు

భాగీరథి సం. వి. గంగ (వ్యు. భగీరథునిచే భూమికి తేబడినది).

భాగ్యము సం. వి. అదృష్టము, సుకృతము. విశే. భాగింపదగినది.

భాజకము సం వి. (గణి.) ఒక రాశిని భాగించురాశి (Divisior),

భాజనము సం. వి పాత్రము, యోగ్యము.

భాజనము సం. వి. (జీవ.) సంయుక్త బీజము (Zogote)జీవకణములుగా విభజన మగుట (Cleavage).

భాజ్యము సం. విశే. (గణి.) భాగింపబడవలసిన రాశి (Dividend).

భాటకము సం. వి. 1. ఇంటిపన్ను. 2. బాడిగ.

భాణము సం. వి. నాటకభేదము.

భాణికము సం. వి నాటిక. (ఒక అంకము, హాస్యము, ప్రణయకలహము,కారణము, దూషణాదులు కలది).

భాతి సం. వి. 1. కాంతి. 2 రీతి.

భాద్రపద సం. వి: 1. ఉత్తర భద్రపదా నక్షత్రము. 2. ఇరువది యారవది.

భాద్రపదము సం. వి. భాద్రపద మాసము.

భానువు సం. వి. 1. సూర్యకిరణము. 2. సూర్యుడు.

భామ సం. వి. స్త్రీ.

భామము సం. వి. 1. కోపము. 2. రోషము. 3. సూర్యకిరణము.

భామిని సం. వి. 1. క్రీడాసమయమందు కోపము చూపెడు స్త్రీ. 2. స్త్రీ.

భాముఁడు సం. వి. 1. సూర్యుడు 2. బావ.

భారకము సం. వి. 1. మేనిబరువు. 2. బారకింపు.

భారకుఁడు సం. వి. బరువు మోసెడి కూలివాడు, భారవాహుడు.

భారజలము సం. వి. (రసా ) మామూలు నీటికంటె పది శాతము అధిక సాంద్రత గల నీరు (Heavy water).

భారత ఉపరాష్ట్రపతి సం. వి భారత సర్వసత్తాక రాజ్య ఉపాధ్యక్షుడు, రాజ్యసభాధ్యక్షుడు.

భారతము సం. వి. 1. వ్యాసభట్టారక ప్రోక్తమైన పంచమవేదము. 2. భరత ఖండము.

భారత సంచిత నిధి సం. వి. ప్రభుత్వముచే నిల్వచేయబడునిధి.(Consolidated fund of India).

**భారత సంవిధాన సభ** సం. వి. (రాజ.,చరి.) భారత రాజ్యాంగ నిర్మాణ సభ. 1946వ సంవత్సరము డిసెంబరు 9వ తేదీ నుండి 1949వ సంవత్సరము నవంబరు 26వ తేదీ వరకు భారత రాజ్యాంగమును తయారు చేసిన సభ. భారత రాజ్యాంగము తయారు చేసిన తరువాత ఈ సభ పరిసమాప్తి నొందినది.

**భారత సంస్థానాధీశుల సభ** సం. వి. (చరి.) క్రీ. శ. 1919వ సంవత్సరపు ఇండియా చట్టము ప్రకారము భారత సంస్థానాధీశులకని, క్రీ. శ. 1921వ సంవత్సరములో నేర్పరిచిన సభ.

**భారతి** సం. వి. 1. సరస్వతి. 2. వాక్కు.

**భారద్వాజము** సం. వి. ఏట్రింత, ఒకపక్షి.

**భారమితి** సం. వి. (భౌతి.) వాతావరణ పీడనమును కొలుచు ఒక పరికరము (Barometer). (భూగో.) వాయుపీడనము కొలుచు సాధనము. పాదరసముతో తయారుచేసిన భారమితిలో 30" పొడవు గల గాజుగొట్టము పాదరసము గల ఒక పాత్రలో నుండును. వాయుపీడనము ఎక్కువగుకొలది, పాదరసము గాజు గొట్టము లోనికిపోవుచుండును.

**భారము** సం. వి. 1. బరువు. 2. బారువ. సం. (భౌతి.) ఏదైన వస్తువుపై నున్న బరువు (Load).

**భారయష్టి** సం. వి. కావడిబద్ద.

**భారలేఖిని** సం. వి. (భౌతి.) పీడనమును కాగితముపై గ్రాఫ్‌గా గీసి చూపు యంత్రము (Barograph).

**భారవాహుఁడు** సం. వి. 1. భారము మోయువాఁడు. 2. నిర్వాహకుడు.

**భారాత్మక విశ్లేషణము** సం. వి. (రసా.) ఒక యౌగికములో నున్న మూలద్రవ్యముల భాగముల ప్రత్యేక నిర్ణయము (Gravimetric analysis).

**భారాత్మక సంయోగము** సం. వి. (రసా.) రాసాయనికముగ కలియగల ద్రవ్యముల నియత భారముల సంయోగము (Combination by weight).

**భారీపరిశ్రమలు** మి. వి ఇనుము ఉక్కు మొ., వానికి సంబంధించిన పెద్దపరిశ్రమలు (Large Scale Industries).

**భారోదజని** సం. వి. (రసా.) పరమాణు భారముగల ఉదజని (Heavy hydrogen) (దీనికి డోయ్‌టీరియమ్ అని కూడ పేరు గలదు).

**భార్గవి** సం. వి. 1. లక్ష్మి. 2. పార్వతి.

**భార్గవుఁడు** సం. వి. 1. శుక్రుడు 2. పరశురాముడు.

**భార్య** సం. వి. అగ్నిసాక్షిగ పరిణయమాడిన పెండ్లాము. వ్యు. భరింపదగినది.

**భార్యాటికుఁడు** సం. వి. భార్యమాట జవదాటనివాఁడు.

**భావ** సం. వి. ఎనిమిదవ సంవత్సరము.

**భావజుఁడు** సం. వి. మన్మథుడు.

**భావన** సం. వి. 1. తలపు, యోచన, 2. వాసనకట్టుట.

**భావము** సం. వి. 1. అభిప్రాయము. 2. మనోవికారము. 3. పుట్టుక. 4. ధాత్వర్థరూప క్రియ. 5. సత్తు. 6. స్వభావము. సం. (గృహ.) ఊహ, సామాన్యమైన ఊహ, భావన (Concept).

**భావార్థకము** సం. వి. (వ్యాక.) స్వభావ సిద్ధమును తెలుపునది. ఉదా. దొంగ దొంగతనము.

**భావి** సం. విశే. భవిష్యత్తు, కాగలది.

**భావితము** సం. విశే. పొందబడినది.

**భావిని** సం. వి. 1. భావముగల స్త్రీ 2. అందకత్తె.

భావిసూచన సం. వి. (భౌతి) రాబోవు కాలములోని వాతావరణము మొదలగు వాని పరిస్థితి సూచించుట (Forecast)

భావుకుడు సం. వి. (నాట్య పరిభాషయందు) విద్వాంసుడు.

భావుకము సం. వి. శుభము.

భావుకుడు సం. వి. తోడపుట్టిన దాని మగడు, బావ.

భావ్యము సం. వి. అవశ్యము కాదగినది.

భాష సం. వి. 1. మాట. 2. ప్రతిజ్ఞ. 3 ప్రమాణము. 4. వ్యవహార యోగ్యమైన వాక్యాదికము. 5 సంస్కృతాది భాష. వి భాస.

భాషాభేషజాలు సం వి. (వ్యావ.) భాషా విషయమైన భేదాభిప్రాయములు.

భాషితము సం వి. మాట.

భాష్యము సం. వి. సూత్ర వ్యాఖ్యాన గ్రంథము.

భాసనము సం. వి. (రసా.) బేరియం సల్ఫైడ్ వంటి ద్రవ్యములు కొన్ని కొంత సేపు వెలుతురు కెదురు పెట్టి మరల చీకటి లోనికి తెచ్చి వెలుతురును ప్రదర్శించుట (Phosphorescence).

భాసమానము సం. విశే. ప్రకాశము గలది.

భాసిల్లు సం క్రి. ప్రకాశించు

భాసుడు సం వి 1. సూర్యుడు. 2. ఒక సంస్కృతనాటక కవి.

భాసురము సం వి. పటికపురాయి. విశే ప్రకాశించునది.

భాస్కరుడు సం. వి. 1. సూర్యుడు. 2 అగ్ని

భాస్వంతుడు సం. వి. సూర్యుడు, విశే. ప్రకాశించువాడు.

భాస్వరము సం వి (రసా.) కత్తితో కోయ గలినంత మెత్తగా నుండు కొంచెము పసుపురంగు గల అధాతు మూలద్రవ్యము (Phosphorus). (వ్యతి) స్ఫురము, చెట్టు చేమల ముఖ్యాహార ద్రవ్యములలో నొకటి.

భాస్వరితము సం. వి. (రసా) ఫాస్ఫారికామ్లము నుండి ఉత్పన్నమగు లవణము (Phosphate).

భాస్వరుడు సం. వి. సూర్యుడు.

## భి

భిండిపాలము సం. వి. ఇనుప యలుగు కఱ్ఱ దూ. భిండివాలము.

భిక్ష సం. వి. బిచ్చము, బికిరము.

భిక్షుకుడు సం. వి. బిచ్చగాడు.

భిక్షువు సం వి. సన్న్యాసి, బ్రహ్మచారి. (చరి.) బౌద్ధ సన్యాసి.

భిత్తము సం. వి. తునక, శకలము.

భిత్తి సం. వి. 1. గోడ. 2. భేదనము 3. జత్తిలి.

భిత్తిక సం. వి. 1. పిసుగు. 2 గోడ.



భిత్తిచ్ఛేదక విదారణము

భిత్తిచ్ఛేదక విదారణము సం. వి. (వృక్ష.) బహు విదారణఫలము కోష్ఠముల మధ్య నుండు గోడలపై పగులుట (Septicidal dehiscence).



భిత్తిభంజము సం వి (జం.) కొన్ని అపృష్ఠ వంశిన ప్రాణులలో ప్రేగు యొక్క కుహరములోనికి చొచ్చుకొని నిలువుగా మునిగి యున్న భిత్తిభంజము గోడవంటి భాగము (Typhlosole) ఉదా. వానపాము.

భిద సం. వి. 1. భేదము. 2. భేదోపాయము

భిదురము సం. వి. వజ్రాయుధము.

భిన్నపత్రము సం. వి. (వృక్ష.) మధ్యాక్షము ఒకసారి విభజన చెందింది. దాని వలన వేరు వేరు ఉపపత్రములు గల ఆకు (Compound leaf).



భిన్నపత్రము

భిన్నము సం. విశే. 1 పగిలినది, చీలినది. 2, వేరుపడినది, సం. వి. (గణి.) ఒక రాశిలోని భాగము (Fraction).

భిన్నయుగ్మ గుణదములు సం. వి. (జీవ.) సధర్మమ్ములగు క్రోమొసోములపై నుండు గుణులలో ఏకాంతర లక్షణములకు కారణము అయిన గుణులు (Genes). ఉదా. పొడుగు పొట్టి మొదలగునవి (Allelomorphs).

భిన్నసంఖ్య సం. వి. (గణి) (Fractional number). చూ. భిన్నాంకము.

భిన్నాంకము సం. వి. (గణి.) ఒకటిలోని భాగము (Fractional number).

భిల్లుఁడు సం. వి. బోయవాడు.

భిషక్కు సం. వి. వైద్యుడు.

భిస్స సం. వి. అన్నము.

భిస్సట సం. వి. మాడన్నము.

## భీ

భీ సం. వి. భయము,

భీకరము సం. వి. భయంకరము.

భీతము సం. విశే, భయము నొందినది. వి. వెరపు.

భీతి సం. వి. భయము, బెదురు.

భీతుఁడు సం. విశే. 1. పేద. 2. భయపడినవాడు.

భీమము సం. వి. భయానకరసము.

భీమసేనుఁడు సం. వి. 1. మారుతి. 2. వృకోదరుడు.

భీమా వి. (అర్థ.) ఆకస్మికముగ సంభవించు ఆపత్తుల నుండి కాని సంఘటనల నుండి కానీ కొంత వరకు ఆర్థికముగ తేరుకొనుటకు ఉపయోగించు ఒక న్యాయసమ్మతమైన పూచీదారు విధానము. ఇం.(గృహ) అభయము.అభయ పత్రము(Insurance)

భీముఁడు సం, వి. 1. ధర్మరాజు సోదరుడు 2 శివుడు. విశే. భయంకరుడు,

భీరుకుఁడు సం. విశే. వెరపరి రూ. భీలుకుడు

భీషణము సం. వి భీమము. విశే. భయంకరము

భీష్మము సం. విశే. భయానక రసముగలది. విశే భయంకరమైనది.

భీష్ముఁడు సం. వి. 1. శంతను పుత్రుడు. 2. శివుడు. విశే. భయంకరుడు.

## భు

భుక్తము సం, విశే. 1. తినబడినది. 2.అనుభవింపబడినది.

భుక్తి సం. వి. 1. భోజనము. 2.అనుభవము,

భుగ్నము సం. విశే. 1.వంగినది, వంకరైనది. 2. విరిగినది.

భుజంగభుక్కు సం. వి. నెమలి. వ్యు. పాములను తినునది.

భుజంగమము సం. వి. పాము. వ్యు. భుజముతో పాకిపోవునది.

భుజంగుఁడు సం. వి విటుడు,

భుజకీర్తి సం. వి. బాహుపురి, కేయూరము.

భుజము సం. వి. (గణి.) సమతల క్షేత్రములో వరుసగానున్న రెండు కోణబిందువుల కలుపగావచ్చు సరళరేఖ (Side).

సం. వి. చేయి.
భుజసంధి సం. వి. (జం.) భుజపు కీలు, చెయ్యి ఎముక భుజపు ఎముక కలిసిన భాగము (Shoulder joint).
భుజి సం. వి అగ్ని, వ్యు. సర్వమునుభుజించు వాడు.
భుజిష్య సం. వి. 1. పరిచారిక. 2. వేశ్య.
భుజిష్యము సం. వి.చేతకట్టుకొను తోరము.
భుజిష్యుడు సం. వి. పరిచారకుడు. విశ. స్వతంత్రుడు.
భువనము సం. వి. 1. జగము. 2.ఆకాశము. 3 ఉదకము,
భువనేశ్వరము సం. వి. చుట్టుబవంతి.
భువి సం. వి. 1. భూమి. 2. స్థానము.

# భూ

భూ సం. వి.భూమి. (సమాసములందే)
భూకంప భాగము సం వి. (భూగ )భూమిలో కంపించిన ప్రాంతము (Earth quake belt).
భూకంపము సం. వి. (భూగ ) అగ్ని పర్వతముల వలన గాని లేక భూపటలము యొక్క అంతర్భాగమునజరుగు మార్పుల వలన గాని కలుగు తీవ్రమైన భూమి యొక్క కదలిక.
భూకము సం. వి. 1. బొక్క. 2. కాలము
భూఖండములు సం. వి. (వ్యవ.) తునుకలుగా నున్న భూభాగములు (Blocks of land).
భూగతకాండము సం. వి. (వృక్ష.) గుప్త కాండము, కొన్ని మొక్కలకు నేలలోపల నుండు కాండము(Under-ground stem)
భూగరిష్ఠపరిమితి సం. వి. (అర్థ) ఒక వ్యక్తికి ఇంతకంటె ఎక్కువ భూమి యుండరాదని శాసించుట.
భూగోళము సం. వి. భూమండలము.
భూగోళశాస్త్రము సం. వి. భూమి యొక్క ఉపరితలము గాని నైసర్గిక స్వరూపము, నైసర్గిక,రాజకీయ విభాగములు, శీతోష్ణస్థితి, వ్యుత్పత్తి, ప్రజా విస్తరణము మున్నగు వానినిగురించితెలుపుశాస్త్రము
భూచరము సం. వి. (జం.) భూమిమీద నివసించునట్టిది,భూసంబంధము(Terrestrial)
భూజము సం. వి. వృక్షము.
భూజాని సం. వి. 1. విష్ణువు. 2. రాజు.
భూతకాలము సం. వి. కడచిన కాలము.
భూతద్దము వి. (భౌతి.) చిన్నవస్తువులను కొన్ని రెట్లు పెద్దవిగా నగుపరుచుఅద్దము(Magnifying glass).


భూతద్దము

భూతధాత్రి సం. వి, భూమి, వ్యు. జీవులనన్నిటిని ధరించునది.
భూతము సం. వి. 1.పృథివ్యాది భూతములు (ఇవి:-పృథివి, అప్పు, తేజము, వాయువు. ఆకాశము.) 2. పిశాచాది. 3.కృష్ణచతుర్దశి. విశ. 1. కడచినది. 2. పొందబడినది.
భూతాత్మము సం. వి. దేహము.
భూతి సం. వి. 1. ఐశ్వర్యము, సంపత్తి 2. పుట్టుక. 3. భస్మము.
భూతికము సం. వి. 1.వాసనగడ్డి. 2.చీపురు కసవు.
భూతేశుడు సం. వి. శివుడు
భూదానోద్యమము సం వి. భూదానోద్యమము మహాత్మాగాంధీ శిష్యుడైన ఆచార్య వినోబాభావే ఆధ్వర్యమున నడుపబడుచున్నది. ఆచార్య వినోబాభావేకు భూములే కాక, పూర్తి పల్లెలు

భూదానమీయబడినవి. భూదానోద్యమము భారతదేశము స్వతంత్రముపొందిన తర్వాత భారతదేశములో శాంతియుతముగాసామ్యవాదసిద్ధాంతముఅనుసారము ఆర్థిక విప్లవము తెచ్చుటకు తోడ్పడుచున్నది. మొదటి భూదాన యజ్ఞము ఆంధ్రప్రదేశ్ లోని తెలంగాణము నకు చెందిన పోచంపల్లి గ్రామమందు క్రీ శ. 1951 సంవత్సరము ఏప్రిల్ 18వ తేదీని శ్రీ రామచంద్రా రెడ్డిచే చేయబడినవి.

**భూపటలము** సం వి. (భూగో.) భూమి యొక్క పైభాగము.

**భూపతి** సం. వి. నేలరేడు, రాజు.

**భూపరిభ్రమణము** సం. వి. (భూగో.) సూర్యునిచుట్టు భూమి తిరుగుట. 365 1/4 రోజులు కక్ష్య భ్రమణము (భూమి ఇట్లు తిరుగుటలో ఒక నిర్దిష్టమైన త్రోవను పోవును ఈ మార్గమునకు గ్రహపథము లేక కక్ష్య అని పేరు, ఒకసారి భూమి సూర్యునిచుట్టు తిరుగుటకు ఒక సంవత్సరము కాలము పట్టును).

**భూభుజుఁడు** సం. వి. రాజు,

**భూభృత్తు** సం వి. 1. రాజు 2 కొండ

**భూభ్రమణము** సం. వి. ( భూగో. ) అక్ష భ్రమణము. భూమి తనచుట్టు తాను తిరుగుట, (ఒకసారి భూమి తనచుట్టు తాను తిరుగుటకు 24 గంటల కాలము పట్టును.)

**భూమధ్యరేఖ** సం. వి. (భూగో.) భూగోళ కాతమునకు లంబముగానుండు వృత్తము లన్నింట పెద్దది నిరక్షరేఖ, నాడీరేఖ, ధ్రువముల సమ మధ్యముగా భూమి యొక్క ఉపరితలమున నున్న 'ఊహా వృత్తము'. (ఇది ఉత్తర దక్షిణ ధ్రువములకు 90 ° దూరమునఉన్నది) (Equator).

**భూమి** సం వి నేల, చోటు, పృథివి. (భూగో.) భూగోళములోని వాయువు నీరు కానటువంటి దృఢమైన పదార్థము, నేల.

**భూమిక** సం. వి 1. మారువేషము 2. రచన.

**భూమికామందు** వి. (వ్యావ.) భూస్వామి, భూమిపై సొంత హక్కుగల యజమాని (Land owner).

**భూమికోణము, భూకోణము** సం వి. (గణి.) భూమి నానుకొని యున్నకోణము, ఆధార కోణము (Base angle).

**భూమిగతము** సం విశ (వృక్ష.) భూమిలో నున్నది (Under ground).

**భూమిజ** సం వి సీత వ్యు. భూమినుండి జన్మించినది.

**భూమిజుఁడు** సం. వి. 1. అంగారకుడు. 2. నరకాసురుడు

**భూమితిశ్రేఢి** సం. వి (గణి.) వరుస పదముల నిష్పత్తి సమముగా నుండు శ్రేఢి. గుణోత్తర శ్రేఢి (Geometrical progre - sssion).

**భూమిపన్ను** వి. (అర్థ.) ప్రభుత్వముచే భూమిపై విధింపబడిన పన్ను (Land tax)

**భూమి సీలింగు** మి. వి ఆస్తి రూపమున నున్న సేద్యపు భూమి కమతముల పరిమితి నిర్ణయించుట.

**భూమిస్పృశుఁడు** సం. వి. కోమటి.

**భూమ్యంతర్భాగ జలప్రదేశము** సం. వి. (భూగ.) భూమిలోపలభాగమునఅంతర్వాహినిగా పారుచుండిన నీటి ప్రదేశము.

**భూమ్యాకర్షణము** సం. వి. ( గణి., భౌతి.) ఏ వస్తువుపైనైన గల భూమి కేంద్రాకర్షణశక్తి (Gravitation).

**భూయస్సు** సం. విశ. అధికము.

**భూయిష్ఠము** సం. విశ. మిక్కుటము.

**భూరి** సం వి. బంగారు. విశ. అధికము.

**భూరిమాయము** సం. వి. నక్క. వ్యు. పెక్కు మాయలు గలది.

**భూశాయి** సం. వి: (వృక్ష.) నేలపై ప్రాకు

నట్టిది (Prostrate).
భూశాస్త్రము నం. వి. (వ్యవ.) నేలల పుట్టు పూర్వోత్తరములు, సంఘటనము, ఒకణము లను గూర్చి తెలియజేయు శాస్త్రము (Soil Science).
భూష నం. వి. భూషణము, తొడవు.
భూషణము నం. వి అలంకరణము.
భూషించు నం. క్రి. స్తుతించు
భూషితుఁడు నం. విశే. అలంకరింపబడిన వాడు.
భూసంధి నం. వి. (భూగో.) రెండుసముద్రములమధ్య సన్నగ పోవుచు భూస్థలముల కలుపు రేఖ (Isthmus).
భూసురుఁడు నం. వి. నేలవేలుపు, బ్రాహ్మణుడు.
భూస్తారి నం. వి. (వృక్ష.) సన్నముగా, పొడువైన పర్వములతో కణుపుల పెద్ద వేళ్లు కలిగి భూమిపై ప్రాకుశాఖ భూప్రసార (Runner).
భూస్తారిక నం. వి. (వృక్ష.) ఆకు పంగ నుండి బయలుదేరి పొట్టిగా లావుగా భూమిపై గాని, నీటి మట్టమున గాలి ప్రాకుచు చివర దొంతరల నంటి ఆకులు గల కాండము (offset).


భూస్తారిక

భూస్ఫోటము నం. వి. పుట్టగొడుగు.

## భృ

భృంగము నం. వి. తుమ్మెద, షట్పదము.
భృంగరాజము నం. వి. 1. గండు తుమ్మెద. 2. గుంటగలిజేరు.
భృంగారము నం. వి. 1. బంగారు పాత్రము. 2. గుంటగలిజేరు.
భృంగి నం. వి. శివభృత్యులలో నొకడు.
భృగువు నం. వి. 1. ఒకముని. 2. కొండచరియ 3. శుక్రుడు. 4. శివుడు.
భృతకుఁడు నం. వి. కూలివాడు.
భృతము నం. విశే. భరింపబడినది.
భృతి నం. వి. 1. కూలి. 2 మోచుట. 3 విలువ.
భృత్య నం. వి. కూలి.
భృత్యుఁడు నం. వి. సేవకుడు, పనివాడు.
భృశము నం. విశే. అధికము.
భృష్టము నం. విశే. వేచబడినది.
భృష్టి నం. వి. 1. పాడడవి. 2. వేపుడు.

## భే

భేకము నం. వి. 1. కప్ప, మండూకము. 2. మేఘము
భేకశిశువు నం. వి. (జం.) చిరుకప్ప. కప్పయొక్క జీవితదశలలో చేపవలె నుండు మొదటి డింభ దశ (Tadpole).


భేకశిశువు

భేకి నం. వి. ఆడుకప్ప.
భేదనము నం. వి. భేదించుట. నం. (గృహ.) విడదీయుట, చీల్చుట, విభజన, బ్రద్దలు చేయుట (Splitting.)
భేదము నం. వి. 1. భేదము. 2. విశేషము. 3. వేరుపాటు. 4. ఒక ఉపాయము. నం. వి. (రసా.) మార్పు, భేదము (Change). నం. (గణి.) ఒక రాశినుండి వేరొక రాశి తీసివేయగా మిగిలినది (Difference).
భేద్యము నం. విశే. భేదింపదగినది.

భేరి నం. వి. దుందుభి.
భేరుండము నం. వి. ఒక పెద్ద పక్షి.
భేల నం వి పేల, ముగ్ధ.
భేలుఁడు నం. విశే. 1. మూర్ఖుడు. 2. చలించువాడు.
భేషజము నం. వి. ఔషధము వ్యు భిషక్ సంబంధమైనది.

## భై

భైక్షము నం వి. 1. భిక్షాసమూహము. 2. భిక్షాద్రవ్యము.
భైరవము నం. వి. 1 భయానకరసము. 2. భయము.
భైరవి నం. వి. 1. పార్వతి. 2. ఒకానొక రాగము.
భైరవుఁడు నం. వి. 1. శివుడు 2. శునకము. విశే. భయానకరసము గలవాడు.
భైషజ్యము నం. వి. భేషజము.

## భో

భోక్త నం. విశే 1. భుజించువాడు. 2. బ్రాహ్మణార్థము చేయువాడు.
భోక్తవ్యము నం విశే. 1, భుజింపదగినది 2 అనుభవింపదగినది.
భోగగృహము నం వి పడకిల్లు.
భోగము నం వి. 1. సుఖము, సంతోషము. 2. పాముపడగ. 3. ధనము. 4. వేశ్యాదుల కిచ్చెడువెల. (భోగములు ఎనిమిది: గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము)
భోగవతి నం. వి. 1. పాతాళము. 2. పాతాళమందలి నది విశే, భోగముగలది
భోగి నం. వి. 1. పాము. 2. రాజు. 3 భోగిపండుగ. 4. మంగలి.
భోగించు నం. క్రి. 1. సుఖించు. 2. అనుభవించు
భోగిని నం వి, 1. ఆడుపాము. 2, వేశ్య. 3. పట్టాభిషిక్తురాలుకాని రాజు భార్య.
భోగ్యము నం. వి 1 ధనము. 2. ధాన్యము. విశే. భోగింపదగినది
భోజనపట్టి వి (గృహ.) భోజన పదార్థములను తెలియచేయు జాబితా (Menu).
భోజనము నం. వి ఆహారము, సాపాటు.
భోజ్యము నం. విశే. భుజింపదగినది
భోషాణము వి. పెద్దపెట్టె.

## భౌ

భౌగోళిక ధ్రువములు నం. వి. (భూగో.) భూమియొక్క ఉత్తరదక్షిణధ్రువములు. (Geographic poles of the earth)
భౌగోళిక ధ్రువాంశవృత్తము నం. వి. (భూగో.) భౌగోళిక ధ్రువములచే సూచింపబడు నిట్టనిలువసమతలము (Geographic meridian).
భౌగోళికాక్షము నం. వి. (భూగో.) భౌగోళిక ధ్రువములను కలుపు సరళరేఖ (Geographical axis).
భౌతికధర్మము (గుణము) నం. వి. (రసా., భౌతి.) ద్రవ్యము యొక్క సాంద్రత, స్థితి మొదలగు గుణములు.
భౌతిక భూగోళ శాస్త్రము నం. వి. భూమి

...యొక్క నైసర్గిక స్వరూపమును గురించి తెల్పు భూగోళశాస్త్రము.

భౌతికము నం. విశే. (భౌతి.) శక్తి, ద్రవ్యమయమగు ప్రపంచమునకు సంబంధించినది, లేదా వాని అనుశీలనకు సంబంధించినది. (Physical) నం. వి. ముత్తైము, విశే. భూసంబంధమైనది.

భౌతిక రసాయన శాస్త్రము నం. వి. (రసా.) రాసాయనిక ప్రక్రియలపై భౌతిక పరిస్థితుల ప్రభావమును పరీక్షించు శాస్త్రము (Physical Chemistry)

భౌతికలక్షణములు (నేలయొక్క) నం. వి. (భూగ., భౌతి.) నేలయందలి అంతరావకాశము, అంతరజలము, మట్టి బరువు, రంగు, వాసన, స్నిగ్ధత, సంకోచ వ్యాకోచములు, ఉష్ణత మొదలగు లక్షణములు (Physical properties of the soil).

భౌతికవికారము నం. వి. (రసా.) ద్రవ్యముల రాసాయనిక సంఘటనము మారకుండ శక్తిప్రభావము వలన ద్రవ్యమునందు కన్పట్టు మార్పు (Physical Change)

భౌతికశాస్త్రము నం. వి. (భౌతి.) శక్తియొక్క, ద్రవ్యము యొక్క ధర్మముల (రాసాయనిక ధర్మముల విడిచిపెట్టి) పరిశీలించు శాస్త్రము (Physics) భౌతిక లక్షణములను చర్చించు శాస్త్రము. నం. వి. (రసా.) ద్రవ్యము, శక్తి వీని ధర్మములను వీని పరస్పరాత్మక సంబంధమును తెలియచెప్పు శాస్త్రము (Physics).

భౌతికశోష నం. వి. (వృక్ష.) నిర్జల స్థలములలో మొక్కలకు నీరు లభించని స్థితి (Physical drought).

భౌతిక సంఘట్టనము (నేలయొక్క) నం. వి. (భూగో., భౌతి.) నేలయందున్న మట్టి రేణువులు, సేంద్రియ పదార్థము, నీరు, గాలి మొదలగు భౌతిక ఘటకముల కూర్పు (Physical structure of the soil).

భౌతికహరణశక్తి నం. వి. (వ్యవ.) మట్టికి కొన్ని యూరియా ద్రవ్యములు నీటితో క్రిందికి దిగి నష్టమైపోకుండ వానిని హరించి పట్టి యుంచగల సహజ శక్తి (Physical absorption)

భౌమవారము నం. వి. మంగళవారము.

భౌమాయస్కాంతధ్రువములు నం. వి. (భౌతి.) భూమిపై నూహింపబడిన అయస్కాంత ధ్రువములు (Magnetic poles of the earth).

భౌమాయస్కాంతము నం. వి. (భౌతి.) భూమికి సంబంధించిన అయస్కాంతత్వము (Terrestrial magnetism).

భౌముడు నం. వి. 1. అంగారకుడు. 2. నరకాసురుడు. వ్యు. భూమికి పుత్రుడు.

భౌమ్యానువర్తనము నం. వి. (వృక్ష.) భూమి వైపునకే పెరుగు స్వభావము (Geotrophism).

భౌమ్యాపవర్తి నం. వి. (వృక్ష.) భూమినుండి విముఖముగా పెరుగు స్వభావము కలది (Negatively geotrophism).

భౌరికుడు నం. వి. బంగారు నాణెపు కోశము నధికారి.



భ్రంశము నం. వి. 1. చలించుట. 2. జారుట.

భ్రకుంసుడు నం. వి. స్త్రీవేషము వేసికొని యాడెడు పురుషుడు. రూ. భ్రుకుంసుడు.

భ్రకుటి నం. వి. కనుబొమ. రూ. భ్రూకుటి.

భ్రక్షము నం. వి. తన తప్పును కప్పిపుచ్చుట.

భ్రమ నం. వి. 1. మైకము. 2. భ్రాంతి. 3.

సందేహము.

భ్రమకము సం. వి. (భౌతి.) ఒక వస్తువు భ్రమణఫలమునుకొలుచురాశి (Moment)

భ్రమణకాలము సం. వి. (భౌతి.) ఒక వస్తువు ఒక అక్షముపై తిరుగుచు మరల తొంటి స్థానమునకే వచ్చుటకు పట్టుకాల వ్యవధి (Period of rotation).

భ్రమణము సం. వి. 1. తిరుగుట 2. తుమ్మెద సం. వి. (భౌతి., గణి.) పరిభ్రమణమునకు విరుద్ధముగ ఒక వస్తువు ఇంకొకదాని చుట్టు ఒక కక్ష్యలో తిరుగుట (Revolution). ఉదా. భూమి సూర్యునిచుట్టు తిరుగును సం. (గణి.) ఏదైన బిందువు చుట్టుగాని సరళరేఖ చుట్టుగాని తిరుగుట (Rotation).

భ్రమము సం. వి. 1. భ్రాంతి. 2. తిరుగుడు, 3. నీటితూము.

భ్రమరకము సం. వి. 1. తుమ్మెద. 2. బొంగరము,

భ్రమరకీటన్యాయము సం. న్యా. ఒకపదార్థమును తీవ్రముగ భావించి దాని యట్లే తానగు రీతి.(తుమ్మెద పురుగుం దెచ్చి తన గూటిలోనుంచి దాని చుట్టు తిరిగి ధ్వని చేయుచుండగా ఆ పురుగు దీనియ.దే మనస్సు నిల్పి తుమ్మెద యగునను రీతి)

భ్రమరము సం. వి. 1. తుమ్మెద. వి.ముంగురులు.

భ్రమరాంబ సం. వి. అంబ, పార్వతి.

భ్రమి సం. వి (భౌతి.) శరీర కేంద్రమం దొక కుహరమును కల్పించుకొని ఒక ప్రవాహి గ్రహించు భ్రమణము (Vorten motion). (పర్యాయ పదము, భ్రమరకము).

భ్రమించు సం. క్రి. తిరుగు, పరిభ్రమించు.

భ్రమయుగ్మమంజరి సం. వి. (వృక్ష.) ఇది ఒక ప్రత్యేక పుష్ప మంజరి, ద్విశాఖీయమధ్యారంభ మంజరి సంక్షిప్తముకాబడి భ్రమయుగ్మమంజరి ఇది ఏర్పడును. దీనిపుష్పములకువృంతము లుండవు. తులసి కుటుంబము మొక్కల కిది కానవగును (Verticil-Laster)



భ్రష్టము సం. విశే. జారినది.

భ్రష్టుఁడు సం. విశే. 1. వెలివేయబడిన వాడు, వ్యాధుడు. రూ. భ్రష్టు.

## భ్రా

భ్రాంతము సం. విశే. భ్రాంతి నొందినది.

భ్రాంతి సం. వి. మిథ్యామతి, ఉన్నది లేనట్టును లేనిది ఉన్నట్టును తలచుట.

భ్రాజితము సం. విశే. ప్రకాశము నొందినది.

భ్రాజిష్ణువు సం. విశే. ప్రకాశించువాడు.

భ్రాత వి. తోడబుట్టినవాడు.

భ్రాతృవ్యుఁడు సం. వి. 1. తోబుట్టినవాని కొడుకు. 2. శత్రువు.

భ్రామరము సం. వి. భ్రమరములు గూర్చిన తెల్లని తేనె.

భ్రామరి సం. వి. పార్వతి.

భ్రాష్ట్రము సం వి.మంగలము, వేపుడు చట్టి

## భ్రు

భ్రుకుంసుఁడు సం. వి. భ్రకుంసుడు, స్త్రీవేష ధారియై నటనముచేయు పురుషుడు.

భ్రుకుటి సం. వి. బొమముడి. రూ. భ్రూకుటి

# భ్రూ

భ్రూణ నం. వి. చూలాలు.
భ్రూణగుదము నం. వి (జం.) బహిశ్చర్మము లోనికి పెరుగుట వలన ఏర్పడిన అన్న వాహిక యొక్క చివరి భాగము (Proctodaeum).
భ్రూణస్యూనము నం. వి. సంయుక్త బీజము భ్రూణముగా పెరుగుసంచి(Embryo sac)
భ్రూణము నం. వి. గర్భము, బిడ్డ,శుక్లశోణిత పిండము. (జీవ.) ఫలదీకరణమైన అండము. దానితరువాత అభివృద్ధిదశలు. గింజలోనుండు అంకురము, బీజదళములు, సయుక్త బీజము (Embryo).
భ్రూణమూలచోలము నం. వి. (వృక్ష.) అంకురము యొక్క ప్రథమ మూలముపై నుండు ఒర. (Coleorhiza).
భ్రూణాగ్ర చోలము నం. వి. (వృక్ష.) అంకురము యొక్క ప్రథమశాఖపై నుండు ఒర (Coleoptile).
భ్రూభంగము నం. వి. బొమముడి.
భ్రూపు నం. వి. కనుబొమ్మ.

# మ

మ ఒక అక్షరము.
మంకు విశే. మూర్ఖుడు. మొండి.
మంకెన వి. 1 బంధూకము, మోదుగు. 2. ఎద్దు మీద నీళ్ళబింకెలు ఆనుటకై వేయు బెత్తపు బుట్టల జత.
మంగల[1] వి. క్షౌరముచేసి జీవించు జాతి.
మంగల[2] నం. వి. 1. పతివ్రత, 2. దుర్గ.
మంగలకత్తిరూపు వి. కృత్తికానక్షత్రము.
మంగలము వి. వేపుడు చట్టి.
మంగలి వి. అంబష్ఠుడు.
మంగలికోళ్లు వి. సన్నాయి. వ్యు. మంగలి ఊదు గొట్టము.
మంగళ నం. వి. పార్వతి.
మంగళదేవత నం. వి. లక్ష్మి.
మంగళము నం. వి. శుభము, క్షేమము.
మంగళవారము నం. వి. వారములలో మూడవది.
మంగళసూత్రము నం. వి. మాంగల్యము, పుస్తె,
మంగళహారతి వై. వి. మంగళకరమైన హారతి.
మంగళాశాసనము నం. వి. దీవెన, ఆశీర్వాదము.
మంగళుడు నం. వి. కుజుడు.
మంగు వి. 1. మాలిన్యము. 2. మొగమునందు పుట్టు నల్ల పొడ. రూ. మాఁగు. మంగుఁడు, మాగుఁడు. 3. మిగులపండుట.
మంచిపాము వి. నాగుపాము.
మంచుకారు వి. హేమంత ఋతువు.
మంచుగుబ్బలి వి. మంచుకొండ.
మంజరి నం. వి. 1. చిగిరించిన లేతకొమ్మ. 2. పూగుత్తి. 3. పెద్దముత్తెము.
మంజడి వై. వి. 1. చిత్రవర్ణ వస్త్రము నీల వస్త్రము. నం. మాంజిష్ఠమ్.
మంజిష్ఠ నం. వి. మిక్కిలి ప్రకాశించు ఎరుపు.
మంజిష్ఠారాగము నం. వి. గాఢానురాగము.
మంజీరము నం. వి. అందె,
మంజులము నం. వి. 1, పాచి, శైవలము. 2. పొదరిల్లు. విశే. ఒప్పిదమైనది.
మంజుశ్రీ నం. విశే. బుద్ధుడు.
మంజూరు హి. వి. 1. చెల్లుబడి. 2. సమ్మతి.
మంజూష నం. వి. పెట్టియ. పెట్టె.
మంట వి, 1. రోషము. 2. జ్వాల. 3. చురుకుమను నొప్పి.

మంటమారి విజ. జ్వలనశీలుడు. కోపశీలుడు

మంట[1] నం. వి ఉసిరిక.

మంట[2] వి. 1. శాఖ, చిన్న కొమ్మ 2 చీల నుండ.

మండకంచము వి. అంచు కట్టిన కంచము.

మండనము నం వి. 1. భూషణము. 2. అలంకరించుకొనుట

మండపము నం. వి. చవికె. చావడి.

మండము నం. వి 1 మీగడ. 2. గంజి. (వృక్ష) పిండి పదార్థము (Starch)

మండలము నం. వి. 1. దేశము. 2. పరివేషము. 3. విలుకాడు రెండు కాళ్ళను మండలాకారముగ నుంచి నిలుచుండుట 4. సూర్య చంద్రబింబములు. 5. సమూహము.

మండలాకారము నం విజ. (వృక్ష.) వలయాకారము గలది. పత్ర ఫలకము (Orbicular).

మండలి నం. వి. 1. సమూహము 2. వర్షత్తు 3. సూర్యుడు. 4. పాము.

మండలిత రాజ్యములు నం. వి. (రాజ) రాజ్య మండలములో సభికత్వము గల రాజ్యములు.

మండలేశ్వరుడు నం. వి. రాజు.

మండాడు క్రి. దైన్యముతో యాచించు.

మండి వి. 1. ఒక కాలు నేల మోకరించుట. 2. సరకులు మొత్తముగ విక్రయించు చోటు.

మండిగమ్ము వి. వాకిటిక్రింద అడ్డు కొయ్య.

మండితుడు నం. విజ. అలంకృతుడు.

మండు క్రి. 1. జ్వలించు. 2. ఈర్ష్యాదులచే తపించు. 3. ఎగసిపడు.

మండువా వి. చదురముగ స్తంభముల మీద నుంచినది, ఒక బవంతి నడుమ వాన నీరు పడుటకు, వెలుగు నిచ్చుటకు తగిన ఖాళీ భాగము. హిం. మండ్వా.

మండూకము నం. వి కప్ప.

మండూరము నం వి ఇనుప చిట్టెము.

మండెము వై. వి. మర్మపు ప్రదేశము.

మంద్రాటము వి. సంతానము

మంతనము వై. వి. 1. ఆలోచన 2. ఏకాంతము. 3. రహస్యము. నం మంత్రణ.

మంతరసాని వై వి. ప్రసవ మంత్రముల తెలిసినది, సుఖప్రసూతిచేయు ఉపాయము నెరుగు దాది. రూ మంతుసాని, మంత్రసాని.

మంతవ్యుడు నం. విజ. ఆలోచింపదగిన వాడు.

మంతిరి వై వి. మంత్రి, ప్రధానుడు నం మంత్రీ.

మంతువు నం వి. 1. తెలివి. 2. అపరాధము. 3. రాజు. 4 మనుష్యుడు.

మంత్రణము నం. వి. రహస్యాలోచనము. వికృ. మంతనము

మంత్రము[1] నం. వి. 1, గాయత్రి. మొ. వి. 2. రహస్యము 3 అధర్వణ వేదము.

మంత్రము[2] వై. వి. 1. ప్రసవోపాయము. 2 జాల విద్య

మంత్రసాని వై. వి (గృహ) చూ. మంతరసాని (MidWife)

మంత్రి నం. వి 1 ధీసచివుడు. 2. సహాయుడు.

మంథనము నం. వి 1. త్రచ్చుట. 2. కవ్వము.

మంథరజ్జువు నం వి. తరిత్రాడు. కవ్వపు త్రాడు.

మంథరము నం. విజ. 1. చొరవలేనిది. 2. మెల్లగా పోవునది. 3. వంకరైనది. వి. కవ్వము.

మంథానము నం వి. కవ్వము.

మంథుడు నం. వి సూర్యుడు.

మంద వి. 1. ఊరిబయట పసులుండుచోటు. 2. గొల్లపల్లె. 3. పశు సమూహము.

మందట వి 1. అణకువ. 2. సమీపము.
మందడి వై. వి గుఱ్ఱపుసాల. నం మందురా.
మందదహనము నం. వి. (రసా.) మెల్లగా ఆక్సిజనితో సంయోగించుట (slow combustion).
మంద్రపోయాలు వి. గొల్లవి
మందము¹ నం. వి, గుద్దకాలమున వాహన యోగ్యమైన గజజాతి,
మందము² విశ. దట్టము, స్థూలము.
మందరము నం వి 1. కవ్వపు కొండ. 2 మందారమును కల్ప వృక్షము. విశ అలసము
మందల వి. 1. మేర 2 విషయము 3. జీవము. 4 మనుషుల 5 సమీపము
మందలించు క్రి 1, చెప్పు 2. ఆజ్ఞాపించు. 3. మనవిచేయు. 4. హెచ్చరించు.
మందస వై. వి; మంజూష. పెట్టె. నం మంజూషా,
మందస్మితము నం. వి. చిరునగవు.
మందాకిని నం వి, 1. గంగ 2 అనువదేశ్యస్త్రీ.
మందాక్షము నం వి. సిగ్గు
మందాగ్ని నం. వి, అగ్నిమాంద్యము జఠరాగ్ని సన్నగిల్లుట.
మందారము నం వి 1, జిల్లేడు. 2, పారిజాతము.
మంది వి. 1, కాల్బలము. 2. జనసమూహము. 3, పరిజనము.
మందిరము నం. వి. 1. ఇల్లు 2. పట్టణము. 3. దేవగృహము, 4. దేవపీఠము.
మందు వి. 1. ఔషధము. 2. ఉపాయము.
మందుఁడు నం. వి. శని, విశ. 1, అల్పుడు. 2 మూర్ఖుడు. 3. వ్యాధిగ్రస్తుడు
మందుమల వి. 1. మందు చెట్లుండు కొండ 2. ద్రోణ పర్వతము, హిమవత్పర్వము.
మందురా వి. చంద్రుడు
మందులమారి విశ. మర్లుమందు పెట్టువది. మర్లు మందులు పెట్టువాడు.
మందెమేలము వి, 1. ఉపేక్ష. 2. చనవు. 3 స్నేహము. 4. గర్వము.
మండోదరి నం వి. రావణుని భార్య. దూ. మందోదరి.
మందోష్ణము నం వి. కొంచెము వేడిమి
మంద్రము నం. విశ. గంభీరమైనది. (శబ్దము.)
మంపిల్లు క్రి మత్తిలు.
మంపు వి మత్తు, మైకము.
మంపుగొను క్రి. మత్తిల్లు
మండనము వి. దహనము.
మంథము నం వి. పొగ.
మకరందకోశము నం వి. (వృక్ష.) పుష్పములో తేనె ఉండు స్థలము లేక తేనె ఉత్పత్తిచేయు గ్రంథి (Nectary)
మకరందము నం. వి పుష్పరసము, మరందము
మకరకుండలము నం. వి మొసలి ముఖమే ఏర్పడజేసిన కర్ణభూషణము.
మకరకేతనుఁడు నం. వి. మన్మథుడు.
మకరతము నం. వి. మరకతమణి. దూ. మరకతము,
మకరతోరణము నం. వి మొసలి రూపము గల తోరణము,
మకరము నం, వి. 1. మొసలి. 2. ఒక నిధి. 3 ఒక రాశి.
మకరరేఖ నం. వి (భూగో.) భూమధ్యరేఖకు దక్షిణమున 23 1/2° లో ఉన్న రేఖ (Tropic of Capricorn).
మకరాలయము నం. వి. సముద్రము
మకరిక నం. వి. మకరికాపత్రము, స్త్రీలకు చెక్కిళ్ళపై లత్తుకతో వ్రాయు మకరరూపమగు రేఖ.
మకిల వై. వి. 1. మాలిన్యము. 2. నలుపు. నం. మలినమ్,

మకుటము నం. వి. కిరీటము రూ ముకుటము

మకురము నం. వి. 1. అద్దము రూ. ముకురము 2. కుమ్మరిసారె త్రిప్పెడు కఱ్ఱ.

మకురుతనము వి మౌర్ఖ్యము.

మక్కళించు క్రి. 1. తిరుగుకొను. 2. సరిపడు. 3. సరిపోలు, 4. ఉబ్బించు. వ్యాపించు.

మక్కి విణ. నిస్సారము, బెండు.

మక్కికిమక్కి వి. (వాడ.) ఉన్నదున్నట్లు. ఉదా. 'తెల్గు సేయుచో మక్కికిమక్కియన్నటుల మార్చిన కావ్యము శ్రావ్యమెట్లగున్' అసలుకు సరియైన నకలు.

మక్కు వి. 1. మాలిన్యము. 2. చింత అంబలితో బొమ్మలకు పెట్టు అతుకు 3. కాంతిహీనత. 4. కఱ్ఱలు మొ. వాని పగుళ్ళలో మెత్తు రంపపు పొడి. క్రి. చచ్చు.

మక్కువ వి. కూరిమి, స్నేహము.

మక్తా హిం వి. రైతు ఈనాందారుకు ఇచ్చు ధాన్యాదికము, గుత్త.

మక్షిక నం. వి. ఈగ.

మక్షికాడింభము నం వి. (జం.) ఈగ గ్రుడ్డు నుండి మొదట బయటికి వచ్చిన పాకుడు మక్షికాడింభము పురుగు (Maggot).

మఖము నం. వి. యజ్ఞము.

మఖవంతుడు నం. వి. ఇంద్రుడు.

మగటిమి వి. పౌరుషము.

మగడు వి. 1. పురుషుడు. 2. భర్త. 3. రాజు. 4. శూరుడు.

మగధుడు నం. వి. 1. మగధదేశపువాడు. 2. వంశావళి చదివెడివాడు. రూ మాగధుడు, మధుకుడు.

మగనాలు వి. ( మగని+ఆలు ) పతిపత్ని. కుల స్త్రీ.

మగమానికపువాలు వి. వజ్రాయుధము.

మగమానికము వి. వజ్రము.

మగతాయి వి. వజ్రము.

మగిడి వి. పాములవాడు ఊదెడు వాద్యము

మగియించు క్రి. సంహరించు, రూ. మగ్గించు

మగుడ అవ్య. (పునరర్థకము)మరల, వెండియు.

మగులు వి. గోడమీది కప్పు, మదురు.

మగువ వి. స్త్రీ.

మగ్గము వి. సాలెవాడు నేసెడు యంత్రము.

మగ్గరి వి. సాలెవాడు.

మగ్గు క్రి. ఉక్కచే చెమ్మగిలి చెడు, పరిపక్వమగు.

మగ్నము నం. విణ. మునిగినది. వి (రసా) నేల నుండి ముక్కలు తీసికొను మూల ద్రవ్యములలో ఒకటి (Magnesium).

మగ్యారుకుర్తా హిం వి. (గృహ.) చేతులతో సహా కత్తిరించి కుట్టిన అంగీ.

మఘ నం. వి. పదియవ నక్షత్రము.

మఘము నం వి. యజ్ఞము

మఘవుడు నం. వి. ఇంద్రుడు, మఘవంతుడు,

మచ్చరిక నం. వి. ప్రశస్త వాచకము మతల్లిక,

మచ్చిక వి. 1. స్నేహము. 2. మోహము.

మచ్చెకంటి వి. (మచ్చెము+కన్ను) చేపల వంటి కన్నులు గల స్త్రీ.

మచ్చెము వై. వి. చేప. నం. మత్స్యః.

మచ్చ వి. 1. గాయపుగుర్తు. 2. పుట్టుమచ్చ.

మచ్చతెగులు వి. (వ్యవ) ఆకులపై ఎరుపు. గోధుమ, నల్లని రంగు గల మచ్చలేర్పడు రోగము.

మచ్చరమాయు క్రి. నశించు.

మచ్చరము వై. వి. విరోధము, ద్వేషము. నం. మత్సరః.

మచ్చరి వై. విణ. మాత్సర్యశీలుడు.

మచ్చరికము వై. వి. 1. పోటి. 2. ద్వేషము

**మచ్చు** వి. 1. మీదకట్టుముడ తేని మిద్దెటిల్లు. 2. చొక్కా పొడి 3. మైదు. 4 వన్నె సరి చూచుకొనుటకు అగసాలెవాడిచ్చు వెండి బగారము ముక్క.

**మజ్జ** నం వి. 1, చెట్టుచేవ. 2. ఎముకల యందలి నేయి.

**మజ్జనము** నం. వి. స్నానము.

**మజ్జాద్రవ్యము** నం. వి. (గృహ.) క్రొవ్వు పదార్థములు. నెయ్యి, వెన్న, నూనె మొ.వి (Fats)

**మజ్జాయౌగికములు** నం వి. (రసా) క్రొవ్వులనుండి ఉత్పన్నములగు కర్బన యౌగికములు(Aliphatic Compounds)

**మజ్జారజ్జువు** నం, వి. (జం) వెన్నుపాము. సుషుమ్నా నాడి మెదడునుండి వెన్నెముక గుండా దాని చివరవరకు గల నాడుల త్రాడు (Spinal cord).

**మజ్జిగ** వై. వి. చల్ల, నం. మార్జికా.

**మఠము** వై. వి. పరదేసులు, సన్న్యాసులు మొ.వారు నివసించు గృహము.

**మటిక** వి. గోరుచిక్కుడు. రూ మట్టిక.

**మటుమాయము** వి (మాయము + మాయము)మిక్కిలిమాయము, బొత్తిగా కనిపడకుండ జేయుట.

**మట్ట** వి. 1.కొబ్బరి, తాటిమొ. వాని ఆకుల కొమ్మ. 2, మొ. అవు వానితోక.

**మట్టపలక** వై.వి. శిల్పులు మట్టము చూచెడి పలక. నం. మఠఫలకమ్.

**మట్టమధ్యాహ్నము** మి. వి. (మధ్యాహ్నము + మధ్యాహ్నము) పట్టపగలు,

**మట్టము**[1] వై, వి. కొలది. విశే. 1. సమము 2 కొంచెము. 3. పొట్టి. నం. మఠమ్.

**మట్టము**[2] వి. (గణి.,భౌతి.) పరితలము (Level).

**మట్టసము** వై. విశే. 1. కురుచైనది. 2 పరిమితము.

**మట్టితైలము** మి. వి. కిరోసిన్ నూనె.

**మట్టియ**[1] వి. (స్త్రీ) కాలి రెండవ వ్రేలి నగ. రూ. మట్టె మెట్టె

**మట్టియ**[2] వై. వి. మట్టి. నం. మృత్.

**మట్టు**[1] క్రి. త్రొక్కు. వి. 1. త్రొక్కుడు. 2 కుదురు. 3 ప్రదేశము.

**మట్టు** వై. వి. మితి, పర్యంతము, విశే. తక్కువ, మితము

**మట్టుపడు** వై. క్రి 1.అడగు 2.కుదురుపడు.

**మట్టుపెట్టు** క్రి 1. సహరించు, చంపు. 2. త్రొక్కు.

**మఠము** నం వి. సన్న్యాసులు మొ వారుండు చోటు.

**మడ** వి ప్రవాహమార్గము.

**మడక** వి 1 మడుపు చలువబట్ట, 2 అరక

**మడతి** వై వి, మదవతి, (స్త్రీ). నం. మండయంతీ–అలంకరించుకొనునది,

**మడత** వి. (గృహ.) ముడత (Crease)

**మడతఇస్త్రీబల్ల** వి. (గృహ.)దుస్తులు ఇస్త్రీ చేయు సన్ననిమడతబల్ల (Skirt board).



**మడతబందుకీలు** వి, మడత ఇస్త్రీబల్ల. (జీవ.) తలుపువలె ముడుచుటకు వీలగు కీలు, ఉదా. మోచేతి కీలు (Hiuge-jont).

**మడతశిలలు** వి. (భూగో.)భూకంపము వలన భూమి పైభాగమున మడత లేర్పడి ఉద్భవించిన పర్వతములు.

**మడత్రొక్కు** క్రి. తాటాకులు దొంతిగా అడగ ద్రొక్కు. (మడగన్ + త్రొక్కు.)

**మడమ** వి. గుదికాలు. చీలమండ అడుగు భాగము.

**మడవు** క్రి. 1, నిష్ఫలమగు. 2.విముఖమగు

**మడి** వి. మడుగు వస్త్రము. విశే. పరిశుద్ధము సమాసమునందు మడుగు శబ్దమునకు

ఆదేశమగు రూపము, ఇనుమడి మొ. (వ్యావ.) సమమట్టముగా నున్న నేలలో నాలుగువైపులను ఉడ్డుకట్లుగల భాగము (Plot of cultivable land).

మడికట్టు క్రి ఆచారమునకై అంచువేయ బడిన వస్త్రము ధరించు వి 1. పల్లపు చేను. 2 ఆచారార్థము మడికట్టు ధరించుట

మడికాసు వి వెండి,

మడిగట్టు వి చేనుగట్టు

మడిచేలు వి. (మడిచిన+చేలు) వైష్ణవ స్త్రీలు ముందునుండి యెత్తి వెనుకకు పెట్టుకొను కోక కీలు

మడిమంచె వి. బలహీనము.

మడియఁడు విశే. మూఢుడు.

మడియాలు వి రజకి. చాకలి. రూ. మడేలు,

మడియు క్రి. మరణించు.

మడివాలు వి. రజకుడు

మడిసంది వి. బాహుమూలము, చంక,

మడుఁగు క్రి. అడుగు. ఎంగు. వి 1 గుణము 2. కొలను 3. 8 వీసెలు. రూ. మడువు, మడ్గు, మణుగు, మణువు.

మడుపు వి. మడత, ఆకుచుట్టలు.

మడ్డి వి. నూనె మొ. వాని మడ్డి. విశే. 1. మూఢుడు. 2. అపరిశుద్ధుడు (గృహ.) (Scum) 1. బట్ట లుతుకునపుడు సబ్బు చాలకున్న మురికి కణములు తయారు అయి బట్టకు తెలుపునీయవు 2 చక్కెర పాకము పట్టునపుడు గరిటెడు పాలువేసి పొంగించిన చక్కెరలోని మురికి మడ్డిగా ప్రక్కలకు తేలును. దీనిని తీయకున్నచో చక్కెర పాకము తేటగా నుండదు.

మణి నం వి 1. పచ్చరాయి. 2. ముత్యము. 3. మనికట్టు.

మణికారుఁడు నం. వి రత్నములను సాన బట్టువాడు.

మణిగము వి, అధికారము. రూ. మణియము.

మణిప్రవాళము వి. రెండు భాషలు కలిసిన కవిత్వము.

మణిబంధము: మణికట్టు వి. (గృహ). అరచేతికి మోచేతికి మధ్యనున్న కీలు (Carpus).

మణిబంధాస్థి నం. వి. (జం) చేతి మణికట్టులోనున్న ఎముకల సముదాయము (Carpus)

మతంగజము నం. వి. ఏనుగు.

మతంగుఁడు నం. వి. 1. ఋషి, 2. మాదిగవాడు.

మతకము వై. వి కపటము, మాయ. నం. మంత్రకః.

మతకరి విశే మాయావి (మతకము+అరి)

మతము నం వి 1. అభిప్రాయము. 2. కులాచారము, సద్ధతి. 3. శాస్త్రము, 4. సమ్మతి, (త్రిమతములు. ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, షణ్మతములు. వైష్ణవము, శైవము, శాక్తము, గాణాపత్యము, కాపాలికము, సౌరము).

మతయుద్ధము నం. వి. (చరి.) మతము ఆధారముగా తీసికొని ఒక మతమునకు చెందినవారు అవమానముతో ఇతర మతస్థులపై ప్రకటించు యుద్ధము.

మతసంస్కరణోద్యమము నం. వి (చరి.) క్రీ. శ. 1517 సంలో రోమన్ కాథలిక్ మతసంస్థలోని లోటుపాట్లను విమర్శించుచు "మార్టిన్ లూథర్" అను జర్మన్ ఆచార్యుడు లేవదీసిన క్రైస్తవ మతములోని తిరుగుబాటు.

మతల్లిక నం వి. శ్రేష్ఠవాచకము, ఉదా. లతామతల్లిక.

మతి నం. వి. 1. తలపు. 2. శాస్త్ర చింతనాదులచే గలుగు అర్థనిర్ణయ జ్ఞానము. వికృ. మది

మతుబర్థకము నం. వి. (వ్యావ.) కలవాడు. కలది అను అర్థమునందు వచ్చు ప్రత్యయ

ములు, ఉదా. చెలిమికాడు-చెలిమికత్తియ చదువు + అరి—చదువరి. బోయ + త —బోయత.

మత్కుణము నం. వి. 1 నల్లి. 2. కొమ్ములు లేని యేనుగు.

మత్కుణుఁడు నం. వి. గడ్డము మీసము లేనివాడు.

మత్తకాశిని నం వి.మదముచే ప్రకాశించుస్త్రీ.

మత్తవారణము నం వి. 1 ఒరగుదిండు, 2. మదపు ఏనుగు.

మత్తి వై. వి 1. కామము, 2. అవివేకము నం. మదః.

మత్తు వై. వి. మంపు, మదము; నం. మత్తా, మదః.

మత్తుఁడు నం. విశే. మదించినవాడు.

మత్సరము నం. వి. మచ్చరము, క్రోధము.

మత్స్యపాలనము నం. వి. (వ్యావ.) ఆహారముకొరకు వివిధ జాతుల చేపలను పెంచి అభివృద్ధి చేయుట (Pisciculture).

మత్స్యము నం. వి. చేప.

మథనము నం. వి త్రచ్చుట.

మథితము నం. వి. నీళ్ళు కలియని మజ్జిగ; విశే. త్రచ్చబడినది.

మదకలము నం. విశే. మత్తుచేత అవ్యక్త మధురమైనది; వి. మదపుఏనుగు.

మదనము నం.వి. 1. ఆమని వసంతకాలము 2. ఉమ్మెత్త.

మదనుఁడు నం. వి. మన్మథుడు,

మదము నం. వి. 1. క్రొవ్వు. 2. రేతస్సు. 3. గర్వము. 4. కస్తూరి.

మది వై. వి బుద్ధి, మనస్సు. నం. మతిః.

మదించు వై. క్రి. 1. వెలయూహించు. 2. నంతళిల్పించు.

మదింపు వై. వి. వెల నిశ్చయించుట, అంచనా

మదిమది వై. వి. 1. నెమ్మది, శాంతి. 2. అనాలోచనము.

మదిర నం. వి. కల్లు.

మదురువు వై. వి. 1. మత్తు. 2. కల్లు. నం. మదిరా.

మద్దతు హిం. వి. ప్రోత్సాహము, అండ (Support).

మద్దెల వై. వి. పాటకు తోడుగ వాయించు చర్మవాద్యము: నం. వి. కల్లు.

మద్యసారము నం. వి. 1. (రసా.) పిండి వస్తువుల పులియబెట్టుట వలన లభించు మత్తుకలిగించు ద్రవము, ఇది యొకకర్బన యౌగికము (Alcohol). 1. (గృహ) మత్తునిచ్చు పానీయము, ఉదా. సారా. కల్లు, విస్కీ (Alcohol).

మద్యార్కము నం. వి. (రసా.) మద్యసారము (Spirits).

మధుకము నం.వి.ఇప్పచెట్టు,చూ మధూకము.

మధుకరము నం. వి. భిక్షాన్నము. 2. తుమ్మెద

మధుకోశపీఠము నం. వి. (రసా.) నీటి వాయువుల సంగ్రహించుటకు ఉపయోగపడు పరికరము (Beehive shelf).

మధుజని నం. వి. (రసా.) రక్తములో అధికముగా నున్న చక్కెరనుండి కాలేయము తయారుచేయు ఒక విధమగు పిండి పదార్థము. ఇది కాలేయములో నిలువ చేయబడును.

మధుపము నం. వి. తుమ్మెద.

మధుపర్కము నం. వి. 1. పెరుగుతో కలపిన తేనె. 2. పెండ్లిలో వధూవరుల కిచ్చెడు నూతన వస్త్రము

మధుమక్షికాపాలనము నం. (వ్యావ.) తేనె కొరకు తేనెటీగలను పెంచుట (Apiculture).

మధుమేహము నం. వి. మూత్ర రోగము (Diabetes).

మధుర నం. వి. ఒక పట్టణము.

మధురము నం. వి. విషము. విశే. తియ్యనిది. ఇంపైనది.

మధురస నం. వి. ద్రాక్ష.

మధురిపుడు నం. వి. విష్ణువు.

మధులిహము నం. వి. మధుపము తుమ్మెద.

మధువశి నం. వి. (జం) ఇన్స్యులిన్ సర్వకిణ్వ గ్రంధి నుండి స్రవించు అంతఃస్రావము, (ఇది రక్తములో నుండవలసిన చక్కెర పరిమితిని అదుపులో నుంచును (Insulin).

మధువశి గ్రంధులు నం. వి. (జం.) సర్వకిణ్వ గ్రంధిలో మధువశిని తయారుచేయు జీవకణ కూటములు(Islands of lang: - hans).

మధువు నం. వి. 1.నీరు. 2.పాలు. 3.తేనె 4. కల్లు. 5 వసంతర్తువు. 6. చైత్రమాసము

మధూకము నం. వి. ఇప్ప చెట్టు.

మధూచ్ఛిష్టము నం. వి. మయినము.

మధూలిక నం. వి. పుప్పొడి.

మధూళి నం. వి. 1. కల్లు. 2. పూదేనె.

మధ్య నం. వి. పదుమూడేండ్ల నుండి పదునెనిమిది వరకు వయస్సు గల కన్య.

మధ్యకవచము నం. వి. (వృక్ష.) ఫల కవచము యొక్క మధ్యపొర (Mesocarp)

మధ్యంతర ఎన్నికలు మి. వి. (రాజ.) నిర్ణీత కాలమునకు ముందు శాసనసభ లేక లోక్ సభ రద్దయినపుడు జరుగుఎన్నికలు(Mid-term elections).

మధ్యగతము నం.వి. (గణి.) ఒక త్రిభుజము యొక్క కోణ బిందువును దానికి అభిముఖముగా నున్న భుజము యొక్క మధ్య బిందువుతో కలుపు రేఖ.

మధ్యగుహ (చెవి) నం. వి. (జం.) చెవి యొక్క పటల గహనము (Membraneous laybrinth) నకు సంబంధించిన నంచి వంటి భాగము (Vestibule).

మధ్యచ్ఛేదనము నం. వి. (గణి.) అడ్డుకోత (Cross-section).

మధ్య పటలము నం. వి. (గృహ) చూపులో కాంతి కిరణములు కన్ను గ్రుడ్డులో దీని ద్వారా లోపలికిపోవును (Choroid).

మధ్యప్రాచ్య దేశముల కూటమి మి. వి. (చరి.) బాగ్దాద్ ఒడంబడిక కమ్యూనిజమ్ పశ్చిమ ఆసియాలో (మధ్య ప్రాచ్య దేశములలో) విస్తరింపకుండుటకై జరిపిన సంధి ఒప్పందము.బాగ్దాద్ ఒడంబడిక నుండి ఇరాక్ దేశము విడిపోయిన తరువాత తక్కిన నాలుగు దేశములైన బ్రిటన్, టర్కీ, ఇరాన్, పాకిస్తాన్ కమ్యూనిజమును అరికట్టుట తమ ముఖ్య లక్ష్యమని పునరుద్ఘాటించుచు తిరిగి చేసికొనిన రక్షణ సంధి ఇరాన్, టర్కీ, పాకిస్తాన్ రాజ్యాలతో అమెరికా సంయుక్త రాష్ట్రములు వేరు వేరు రక్షణ ఒప్పందములు కమ్యూనిజమును అరికట్టుటకై చేసికొనినవి. M. E. D. O. (మీడో) C. E. N. T. O, (సెంటో)

మధ్యమ నం. వి. నడిమిత్రేలు. (గణి.) రెండురాసుల మధ్య నుండెడిది(Medial.)

మధ్యమము నం వి. నడుము, (గణి.) రెండు పదముల మధ్య చొప్పించబడిన పదము (Mean).

మధ్యమ మస్తిష్కము నం.వి.(జం.) మెదడులో దృక్పాళులకు (Optic lobes) ముందు నున్న మెదడు యొక్క మధ్య భాగము (దీనిలో మెదడు యొక్క మూడవకుహర ముండును (Diencephalon or thalamencephalon).

మధ్యములు నం. వి. (గణి.) అనుపాతములో నున్న నాలుగు రాసులలో మధ్యనున్న రెండు రాసులు, $\frac{a}{b} = \frac{c}{d}$ అను అనుపాత

ములో a, b, c, d, అను నాలుగు రాసులు గలవు. వీనిలో b, c లను మధ్యములు అందురు (Means).

**మధ్యవర్తి** నం. వి ఇరుపక్షముల మధ్య వ్యవహారము నడుపువాడు (Mediator)

**మధ్యవర్తిత్వము** నం. వి. (వ్యాప., శాస.) రెండు పక్షముల మధ్య వచ్చిన సంఘర్షణలను తీర్చుటకు ఏర్పడిన శాసన సమ్మతమైన ఒక పద్ధతి. ఇరుపక్షముల వారు ఒక మధ్యవర్తిని ఎన్నుకొనవచ్చును లేదా వారు రువురు ఒక్కొక్కరిని ఎన్నుకొనవచ్చును. ఇద్దరు మధ్యవర్తులున్నప్పుడు ఇంకొక నిర్ణాయకుని (అంపైర్) ఎన్నుకొందురు.

**మధ్యశిర** నం. వి. (వృక్ష) పత్రఫలకములో మధ్యగా దట్టముగా, స్పష్టముగా నుండు ఈనె, మధ్యఈనె (Mid-rib).

**మధ్యశ్లేషము** నం. వి. (జం) అంతర్గుహినములలో బహిశ్చర్మమునకు అంతశ్చర్మమునకు మధ్య ఏర్పడు జెల్లీ వంటి పదార్థము (Mesogloea).

**మధ్యస్తంభము** నం. వి. (వృక్ష) కాండములో గాని, వేరులోగాని అంతశ్చర్మముతో కలిపి దవ్వ వరకును ఉండు జీవకణ సంహతులు (Stele).

**మధ్యస్తంభిక** నం. వి. (వృక్ష.) శిలీంధ్రముల యొక్కయు, బ్రయోఫిటముల యొక్కయు సిద్ధ బీజాశయములలో మధ్య నగపడు చిన్న స్తంభము వంటి రిక్త (వంధ్య) జీవకణజాలము (Columella).

**మధ్యస్తరము** నం వి. (జం) భ్రూణములో బహిశ్చర్మమునకు అంతశ్చర్మమునకు మధ్య నుండుజీవకణముల పొర (Mesoblast or mesoderm).

**మధ్యస్థుఁడు** నం. విశే. ఇరుకక్షలకు న్యాయము చెప్పువాడు, నడుమనుండువాడు.

**మధ్యాంత్రము** నం. వి. (జం.) కీటకముల అన్నవాహిక యొక్క రెండవ భాగము. మధ్య ప్రేగు (Mesenteron).

**మధ్యాభిసరము** నం. విశే. (వృక్ష) గుండ్రముగా నున్న పుష్పమంజరిలోని పువ్వులు పరిణాహమున ప్రారంభించి క్రమముగ మధ్య వరకు వికసించు విన్యాసము గలది (Centripetal).

**మధ్యారంభము** నం. విశే. (వృక్ష.) పుష్పమంజరిలో నున్న పువ్వులు మధ్యనుండి ప్రారంభించి క్రమముగ పరిణాహము వరకు వికసించు విన్యాసముగలది(Centrifugal).

**మధ్యారంభ (దారువు)** నం. వి. ఆదిదారువు మధ్యగా నున్న స్థితి (Mesarch).

**మధ్యాహ్నము** నం. వి. పట్టపగలు, దినము నడిమి భాగము.

**మధ్యాహ్న రేఖలు** నం వి. (భూగో.) రేఖాంశములు. ఉత్తర, దక్షిణ ధ్రువముల గుండా పోవు వృత్తములు.

**మననము** నం. వి. చింతన.

**మనము**[1] నం వి. బుద్ధి, మనస్సు.

**మనము**[2] సర్వ. నీవును, నేనును.

**మనసరి** వై. విశే. 1. బుద్ధిమంతుడు. 2. అభిమానవంతుడు, నం. మనస్విన్.

**మనసిజుఁడు** నం. వి మన్మథుడు.

**మనస్కరించు** నం క్రి. ఇష్టపడు.

**మనికి** వి. వాస స్థానము.

**మనియార్డర్** ఇం. వి (శాస.) (Money-order). దూర ప్రదేశమునకు ద్రవ్యము పంపుటకు తీసికొను ఆజ్ఞ. ఈ యాజ్ఞానుసారము ద్రవ్యము దూర ప్రదేశమున ఉన్న వ్యక్తికి చెల్లింపబడును.

**మనీషి** నం. వి. విద్వాంసుడు.

మను క్రి 1. జీవించు. 2. వర్తించు. వి. 1. మన్ను. 2. నేల.
మనుగడ వి. 1. జీవనము. 2. జీవనోపాయము.
మనుగుడుపు వి అల్లియము, క్రొత్త పెండ్లి కుమారునకు అత్తగారుచేయు విందు
మనువర్తి వి. (వ్యావ.) వితంతువున కిచ్చెడు భరణము.
మనువు వి. 1. జీవనము. 2. వర్తనము. 3. మగడు. 4. కాపురము. 5. పెండ్లి.
మనువులు నం. వి. స్వాయంభువుడు (సృష్టికర్త.) స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుడు, భౌచ్యుడు (పదు నాల్గురు).
మనుష్యుడు నం. వి. మానిసి, మానవుడు
మనోజ్ఞత నం. వి. (గృహ.) 1. ఆకర్షించు శక్తి. 2. రంజింపచేయు శక్తి. 3. సౌందర్యము (Charm).
మనోజ్ఞము నం. విశే. 1. హృద్యము. 2. అందము.
మనోరథము నం. వి. కోరిక.
మనోహరము నం. వి. బంగారు. విశే. 1. హృద్యము. 2. అందము.
మన్నన వై. వి. సమ్మానము, గౌరవము నం. మాననమ్
మన్నీడు వి. ప్రభువు.
మన్ను[1] వై. వి. 1. మృత్తు. 2. నేల.
మన్ను[2] వి. 1. ఒకజాతి జింక. 2. ఒకరకపు యుద్ధ సాధనము 3. (భూగో. వ్యావ.) రాళ్లు విశ్లేషము నొందుట వలన ఏర్పడి, పల్లపు ప్రదేశములలో కూడుకొని కొంత సేంద్రియ పదార్థముతో గలసి, యిదివరకు పెక్కు మార్పులను పొంది, యింకను పెక్కు మార్పులను పొందుచున్న వివిధ పరిమాణములు గల శిలాచెణు సంచయము ఇట్టిమట్టిచే నాక్రమింపబడిన ప్రదేశము వ్యవసాయదారులచే 'నేల' యన బడును భూమి క్షేత్రము.
మన్నెకాడు వి సామంతరాజు.
మన్నెము వై. వి 1. కొండల మధ్య గల భూమి 2 సన్మానించి యిచ్చిన భూమి, రూ. మాన్యము, మన్యము నం మాన్యమ్
మన్నెముల్లు వి. పశ్వాదుల కాళ్ళలోని మల్లెలు (పుసవులు) తీయు ముల్లు రూ. మల్లెముల్లు.
మన్మథ నం వి అరువది సంవత్సరములలో ఇరువది తొమ్మిదవది.
మన్మథుడు నం. వి. మారుడు. విష్ణువు కుమారుడు. వ్యు. బుద్ధిని కలవరము చేయువాడు.
మన్యువు నం.వి. 1. క్రోధము, 2. శోకము 3. యజ్ఞము.
మన్వంతరము నం. వి. డెబ్బది యొక్క దివ్య యుగములు.
మప్పు వి. మరపు. క్రి. నేర్పు.
మబ్బు వి. 1. మేఘము. 2. చీకటి. 3. అజ్ఞానము.
మభ్యపెట్టు వై. క్రి. 1. మోసపుచ్చు. 2. ఉపాయముగ దాటవేయు.
మమకారము నం. వి. 1. ప్రేమ. 2. నాది యను అభిమానము.
మమత నం. వి. ప్రేమము, అభిమానము.
మమ్మ అవ్య. ప్రశంసార్థకము. రూ. మమ్మా మమ్మరే. మమ్మారే.
మమ్మీ ఇం. వి. (చరి.) (mummy). 1. శవము, 2. సువాసన ద్రవ్యములతో కుళ్ళిపోకుండ ఉంచిన శవము.
మమ్ము వి. సముద్రముపై ఓడలకు విఘాతముగ వీచు సుడి గాలి.

మయము నం. వి. 1. ఒంటె 2. కంచర గాడిద.

మయి వి. 1. దేహము 2 విధము. 3 పార్శ్వము. 4. తడస. రూ. మై.

మయికొను క్రి. సమ్మతించు.

మయిలారు వి. ఒక కులదేవత.

మయుఁడు నం. వి. అమర శిల్పి.

మయూఖము నం. వి. 1.కిరణము 2 కాంతి 3. జ్వాల.

మయూరకము నం. వి. మయిలు తుత్తము.

మయూరము నం. వి. నెమిలి. 2. నెమిలి జుట్టు.

మయోసిన్ ఇం. వి. (గృహ.) (Myosin) మాంసకండరములలోని ఒక మాంసకృత్తు

మర వి. తిరుగుడు చీల, కీలు. (భౌతి.) 1. మరలు కలిగిన మేకు (మైల). 2.సర్పిలా కారముగ నున్న గాడికల స్తూపము (Screw).

మరకతము నం. వి. (రసా.) పచ్చ. బెరిలి యమ్, అల్యూమినియమ్ సిలికేట్ (Emerald). (ఇది మణుల(రత్నముల)లో ఒకటి, చాల విలువగలది.)

మరకాఁడు వి. నావికుడు.

మరగాలు వి. కృత్రిమ పాదము.

మరగొట్టము వి. (వ్యవ.) కొంచెము లోతు నుండి నీరు తోడుటకు ఉపయోగించు చేతి యంత్రము (ఒక రేకు గొట్టములో నొక యిరుసును, దాని చుట్టును ఒక మర చుట్టును దీనిలో అమర్చబడి యుండును.)



మరగొట్టము

మరచుట్టు వి. తిరుగుడు చీల.

మరచుట్టు గొట్టము వి. (వృక్ష.) కుంతల నాళము. దారునాళములలో మరచుట్టు వలె నున్న బలవర్ధక నిర్మాణములు గల గొట్టము (Spiral vessel).

మరణ సుంకములు వి. (అర్థ.) ఒక వ్యక్తి మరణము తరువాత వారసులకు సంక్ర మించు ఆస్తిపై ప్రభుత్వము వసూలుచేయు పన్ను.

మరిమేకు వి. తిరుగుడు చీల.

మరమ్మతు వి. (గృహ.) చినిగిపోయినట్టి బట్ట లను సరిచేయుట ఉదా. రఫ్ఫుచేయుట (Mending).

మరామత్తు హిం. వి. (గృహ.) చినిగిన వానిని లేదా ఊడి పోయిన భాగమును తిరిగి కుట్టుట (Repair)

మరిచము నం. వి. మిరియము. రూ. మరీ చము.

మరీచి నం. వి. 1. కిరణము. 2. వెలుగు. 3. ఎండమావులు. 4. ఒక ప్రజాపతి.

మరుఁడు నం. వి. మన్మథుడు.

మరుత్తు నం. వి. వేలుపు, గాలి.

మరులు వి. 1. పిశాచము. 2. మోహము. 3. వలపు. 4. తీరని ప్రేమ.

మరులుమాతంగి వి. త్రొక్కిన తోడనే మరులు పుట్టించెడి ఓషధి.

మరువకము నం. వి. మరువము, వాసన మొలక.

మరువు నం. వి. 1. కొండ. 2. ఎడారి.

మర్కటము నం. వి. కోతి.

మర్త్యుఁడు నం. వి. మనుష్యుడు

మర్దనము నం. వి 1. పిసుకుట. సంవా హనము. 2. నూరుట.

మర్దలము నం. వి. మద్దెల.

మర్మము నం. వి. జీవస్థానము, ఆయువుప

మర్యాద సం. వి. 1. కట్టుపాటు 2. తీరము 3. సమ్మానము.
మర్షము సం. వి. ఓరుపు, క్షమ.
మర్సిరైజ్ ఇం. వి. (గృహ) (Mercerize) నూలుకు మెఱుగు పెట్టుట, నూలును పట్టువలె మెఱయునట్లు చేయుట.
మఱక వి. 1. కఱ, 2 మేకపడ్డ. (రసా.) నూనె మొ.వానిచే కలుగుమచ్చ (Stain)
మఱకువ వి. అజ్ఞానము.
మఱి అవ్య. వెండియు, ఇంకను, అనంతరము.
మఱిమఱి అవ్య. అత్యంతము, మఱియు మఱియు
మఱుఁగు వి. మఱుఁగు చోటు. క్రి. 1. డాగు, చాటగు. 2. సంతాపించు.
మఱుకువ వి. సంతాపము.
మఱుగుజ్జు విణ. మిక్కిలి పొట్టివాడు.
మఱువ వి. కుండ.
మఱువకందు వి. కుంభ సంభవుడు. అగస్త్యుడు.
మఱువు వి. 1. కవచము. 2. మర్మము. 3 చాటు.
మఱుసంజ వి. సాయం సంధ్య.
మల వి. పర్వతము. త. మలై.
మలఁకవాలు వి. పాదరసము.
మలఁగు క్రి. తిరుగు వంకరగు.
మలఁపు వి. నర్తనము.
మలక వి. 1 ఱరక. 2. మూకుఁడు.
మలచము విణ. 1. అధికము. 2. గొప్పది.
మలప వి. దూడచచ్చి పాలిచ్చెడి ఆవు.
మలబద్ధము సం. వి. (గృహ.) విరేచనము సరిగాకాకపోవుట (Constipation).
మలమల వి. 1. మాడుట. వేగుట యందు అగు ధ్వన్యనుకరణము.
మలమానము సం. వి. అధిక మానము.
మలము సం. వి. 1. పేడ. రెట్ట, విష్ఠ. 2. మురికి. 3.పాపము. 4. దోషము. (వస., శుక్లము. రక్తము. మజ్జము,మూత్రము విష్ఠ, పింజూషము. నఖము. శ్లేష్మము. అశ్రువు. దూషిక. స్వేదము అని. 12 రకములు.)
మలయజము సం.వి. చందనము.
మలయ మారుతము సం వి. కమ్మగాడ్పు
మలయము సం. వి. 1. ఒక కొండ. 2 ఆరామము.
మలయమ్మ వి. (మల + అమ్మ) పార్వతి.
మలయిక వి. విహారము.
మలయు క్రి. 1. తిరుగు. 2. పెనగు 3. వ్యాపించు. 4.ఉద్రేకించు. 5. ఉద్యమించు
మలామా హిం. వి. (రసా.) పై పూత. ఒక ధాతువుపై వేరొక ధాతువును పొరగా పరచుట, ఉదా. బంగారమును వెండి మీద గాని రాగిమీదగాని పూత పూయుట (Plastering).
మలారము వి. 1. మట్టిగాజుల గుది. 2. వీధుల నూడ్చు పెద్దపొరక. సమ్మార్జని.
మలికితము వి. సందేహము.
మలిగండ్లు వి. మలిచి ఎత్తదగిన రాళ్ళు.
మలినము సం విణ. 1, మాసినది. 2. నల్లనిది
మలిమ్లుచము సం. వి. 1. దోమ 2. మలమాసము.
మలిమ్లుచుఁడు సం.వి. 1. దొంగ 2. అగ్ని.
మలీమసము సం. విణ. మాసినది వి. ఇనుము
మలు విణ. రెండవది (తొలి. మలికానుపు.)
మలుగు క్రి. ఆరిపోవు.
మలుచు క్రి. 1. తరిమెన పెట్టు. 2. రాతిని తొలుచు.
మలేరియా ఇం. వి. (గృహ) (Malaria). చలి జ్వరము. (ఈజ్వరము దోమ కుట్టుట వలన కలుగును.)
మల్ల వి. సుట్టి కంచము.
మల్లకము సం. వి. ప్రమిద.

మల్లడి వి. 1. పరితాపము. 2. పెనకువ గ్రుద్దులాట. 3. మిక్కుటము.
మల్లడిగొను క్రి 1. పెనగొను. 2. గుంపు కూడు.
మల్లము నం వి. మల్ల.
మల్లయుద్ధము నం వి పోరాటము, జెట్టి పోరాటము, కుస్తీ మొ. నవి.
మల్లిక నం. వి. మల్లె తీగ.
మల్లు వై. వి. 1. కోతి 2 మల్లుడు. జెట్టి నం. మల్లః.
మల్లుఁడు నం. వి. జెట్టి
మల్లె వై. వి. మల్లె పువ్వు. నం మల్లీ మల్లికా.
మవ్వము వి. కోమలత, సౌకుమార్యము.
మశకము నం. వి. దోమ.
మశహరి నం వి. దోమతెర. రూ. మశకహరి
మశూచకము నం. వి. (గృహ.) స్ఫోటకము. అమ్మవారు. (Small-pox) (ఇది అంటు వ్యాధి. నీటి ద్వారా వ్యాపించును)
మశూచిక నం. వి. స్ఫోటకము.
మషి నం. వి. కాగితముపై వ్రాయు మసి (సిరా.)
మషీమణి నం. వి. మసి బుడ్డి, మషిఘట (సిరా బుడ్డి).
మస వి. విలాసము, తళుకు,
మసఁగు క్రి. రేగు, విజృంభించు.
మసక వై. వి. 1. ఇంచుక నలుపు. 2. మునిచీకటి, నం. మేచకః.
మసకము వి. 1. పాములపొందు. 2. రతి, సంభోగేచ్ఛ, సంభోగము.
మసకొను క్రి. (మసకము + కొను) సంభోగేచ్ఛగొను.
మసనము వై వి. శ్మశానము. నం. శ్మశానమ్.
మసలిక వి. మాంద్యము, విణ. అలసము.
మసలు క్రి. 1, అలస్యముచేయు, నీళ్ళు సలసలకాగు.
మసలుట క్రి. (భౌతి.) ద్రవమంతయు ఒకానొక స్థిరమైన ఉష్ణోగ్రత యొద్ద ద్రవస్థితి నుండి వాయుస్థితికి మార్పు నొందుట (Boiling)
మసలుస్థానము వి. (భౌతి.) ఒక ద్రవ పదార్థము ద్రవస్థితి నుండి వాయుస్థితికి మారుటకు ప్రారంభ మగునప్పటి ద్రవము యొక్క ఉష్ణోగ్రత. క్వథనాంశము (Boiling point).
మసి వై. వి. 1. చూర్ణము 2. నలుపు. 3. బొగ్గు నం మషి.
మసీదు వి. తురకల ప్రార్థనాలయము.
మసుర నం. వి 1. వేశ్య 2 చిరుసెనగలు
మసృణము నం విణ. 1. చిక్కనిది. 2. నునుపైనది.
మసోదా వి (వ్యావ.) చిత్తువ్రాసినది. రూ. ముసాయిదా.
మస్కరి నం వి. సన్యాసి, యాచకుడు.
మస్టరుపట్టికలు వి. (శాస.) సైనికదళ వివరములను తెలుపు పట్టికలు (Muster rolls).
మస్తకము నం. వి. శిఖరము. రూ. మస్తము.
మస్తిష్క కుహరములు నం వి. (జం) మెదడుయొక్క వివిధభాగములలో నుండు గుహలు (Ventricles of the brain).


మస్తిష్కము

మస్తిష్క పుచ్ఛము నం. వి. (కప్ప) (జం.) మెదడుయొక్క నిలువుకోత త్రికోణాకారముగ నుండు మస్తిష్క వెనుక భాగము (దీని తరువాత వెన్నుపాము ఉండును) (Medulla oblongata).
మస్తిష్కము నం. వి. తల మెదడు. (జం.) మెదడు (Brain) (పుఱ్ఱెలోనున్న భాగ

స్థలములో ఇది అమరియుండును.) వెన్నుపాము దీనితో కలసియున్న వెనుక భాగము.



పటము (1)
మస్తిష్కము
(కప్ప)
పృష్ఠదృశ్యము
దృక్కాళులు
మజ్జకము
ప్రమస్తిష్కము
అనుమస్తిష్కము



పటము (2)
మస్తిష్కము
(కప్ప)
పురదృశ్యము

మస్తిష్కాగ్రాస్థి సం. వి. (జం) పుర్రెలో ముందుభాగమున పైని నాసాస్థుల చేతను పార్శ్వలలాటాస్థుల చేతను, క్రింది శిరోస్థి చేతను, అసంపూర్ణముగా కప్పబడియుండు గొట్టమువంటి ఎముక (Sphenethmoid).

మస్తు వై. వి. 1. సమృద్ధి. సం. మృష్టః. 2. మదము, సం మత్తామదస్థః.

మహంతు వి. దేవస్థానమునకు ధర్మకర్తృత్వము జరిపించెడు బైరాగి.

మహతి సం. వి. 1. నూరు తంతులు గల నారదమహర్షి వీణ. 2. (వ్యాక.) స్త్రీవాచక శబ్దసంజ్ఞ. విశే. గొప్పది.

మహత్తమము సం. వి. (గణి) దత్తరాసు లన్నిట పెద్దది (Maximum).

మహత్తు సం, వి. 1, దొరతనము. 2. గొప్పతనము. 3. (వ్యాక.) పురుషవాచక శబ్ద సంజ్ఞ.

మహనీయుఁడు సం. విశే. గొప్పవాడు.

మహమ్మదు వి. (చరి.) ఇస్లాము మత ప్రవక్త (క్రీ. శ 590-632),

మహలు హిం వి. 1. దేశములోని భాగము 2. రాజమందిరము.

మహల్ వారీ పద్ధతి వి. (చరి.) భూమి మొత్తమును సమష్టిగా ఒక గ్రామములోని కొందరు రైతులుగాని, లేక గ్రామస్థు లందరుగాని దున్నుచు ప్రభుత్వము నిర్ణయించిన పన్నును మొత్తముగా అందరును కలిసి చెల్లించుట (ఈ పద్ధతి పంజాబు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రములలో నున్నది.

మహసూలు వి (వ్యావ.) సస్యసంగ్రహణము. కోత. కుప్పవేత, నూర్పిడి, ఎనుగబోత, ఎండబోత మొ. వ్యవసాయపు పనులు (Harvest).

మహస్సు సం. వి. 1. తేజము. 2. వెలుతురు. 3. యజ్ఞము. 4. ఉత్సవము,

మహాంగము సం. వి. 1. లొట్టిపిట్ట. 2. పందికొక్కు.

మహాకాలుఁడు సం, వి. 1. శివుడు. 2. శివ భటుడు.

మహాచక్రవాతము సం. వి. (భూగో.) అల్పపీడన ప్రదేశములో చెలరేగు తీవ్రమైన తుఫాను (Cyclone) దీని ముఖ్య లక్షణములు: గంటకు 90 నుండి 130 మైళ్ళ వేగము గల సుడిగాలి. దీని వ్యాసము 50 నుండి 900 మైళ్ళు. ప్రయాణవేగము గంటకు 20 నుండి 30 మైళ్ళు. విపరీతమైన వర్షపాతము. సుడిగాలి యొక్క కేంద్రములో వాయుపీడన చాల తక్కువగ నుండును.)

మహాత్ముఁడు సం. విశే. 1. గొప్ప ఆత్మ కలవాడు. 2. గొప్పవాడు.

మహాదేవుఁడు సం. వి. శివుడు.

మహానసము సం. వి. వంటయిల్లు. ఖానసము

మహాపథము సం. వి. 1. ప్రాణాంతము. 2. రాజమార్గము.

**మహాప్రళయము** సం. వి. లోకనాశము

**మహాబలము** సం. వి. సీసము.

**మహాబీజమాతృకణము** సం వి. (జం.) స్త్రీ సంయోగి కణమును ఉత్పత్తిచేయు జీవకణము

**మహాభారతము** సం. వి. (చరి.) భారత వంశీయులైన కౌరవ పాండవుల యుద్ధమును గురించి తెల్పు 1,00,000 శ్లోకముల మహాకావ్యము. (ఈబృహద్గ్రంథము కౌరవ పాండవుల యుద్ధమును గురించియే కాక, ధర్మార్థకామమోక్షములను గురించియు తెల్పుచున్నది. హైందవులచే భగవదవతారముగ భావింపబడు శ్రీకృష్ణుడు ఈకాలమునకు చెందినవాడుగా భావింపబడుచున్నాడు. మహాభారత యుద్ధ సమయమునందు శ్రీకృష్ణుడు భారత వీరుడైన అర్జునునకు బోధించిన నీతిధర్మము "భగవద్గీత" యను నామముతో మహాభారతములో అంతర్భాగముగా నున్నది, అందుచే మహాభారతము పుణ్యకావ్యముగ ఎంచబడుచున్నది. మహాభారతము వేదవ్యాసునిచే రచింపబడినది. కాలక్రమమున ఎన్నో విషయము లందు చేర్చబడినవి. మహాభారతమును "పంచమవేదము" అని కూడ పిలుచుచున్నారు).

**మహామాత్రులు** సం. వి. (చరి) మౌర్య ప్రభుత్వోద్యోగులు (సాధారణముగ నగర పరిపాలకులుగా నియమింపబడుచుండిరి).

**మహాముని** సం. వి. 1. గొప్పముని. 2. బుద్ధుడు.

**మహామృగము** సం వి. ఏనుగు.

**మహాయానము** సం. వి. (చరి.) బౌద్ధధర్మము క్రీ. పూ. 1వ శతాబ్దమున ఆంధ్ర దేశమున మొదటిసారిగా వెలువడి, 2వ-శతాబ్దారంభములో ఆచార్యనాగార్జున, ఆర్యదేవ, అసంగ, వాసుబంధులచే ఉత్తర హిందూస్థానమున ప్రచారము చేయబడెను బుద్ధుడు భగవంతుని అవతారమని, ప్రతిమానవునకు బోధిసత్త్వుడగుటకు అవకాశములు కలవని, విగ్రహారాధన చేయవచ్చునని, విముక్తి పొందుటకై బుద్ధుడు చెప్పిన సన్మార్గముల వలననే కాక మంత్రోపదేశము వలనను విముక్తి పొందవచ్చునను వాదము. మహాయాన ధర్మము స్తూపములను బౌద్ధ విగ్రహములను ఆరాధింపవచ్చునని ఆదేశించుచున్నది

**మహారథుఁడు** సం. వి. పదునొకండు వేల విలుకాండ్రతో పోరు యోధుడు.

**మహారాజులు** సం, వి. వీరు పదునార్గురు:- గయుడు, అంబరీషుఁడు, పృథువు, మరుత్తుంతుడు, మరువత్తు, మహోత్రుడు, పరశురాముడు, శ్రీరాముడు, దిలీపుడు నృగుడు, రంతిదేవుడు, యయాతి, మాంధాత, భగీరథుడు, శశిబిందువు, అనంగుడు.

**మహారాత్రము** సం. వి. అర్ధమరేయి.

**మహాలక్ష్మి** సం. వి. 1, సరస్వతి. 2. లక్ష్మి, నారాయణశక్తి.

**మహాలయము** సం. వి. మహాలయామావాస్య

**మహావంశము** సం. వి. సింహళ దేశపు చరిత్రను గురించి తెలుపు పాళీగ్రంథము (క్రీ. శ. 5వ శతా.).

**మహావాక్యము** సం. వి. రెండు సామాన్య వాక్యముల సంబంధము కలది.

**మహావాతము** సం. వి. 1. గాలితో గూడిన పెద్దవాన. 2, పెద్ద వాతరోగము.

**మహావీరుఁడు** సం.వి. (చరి.) జైనతీర్థంకరుడు, చివరి (24వ) జైనమత ప్రవక్త.

**మహాశయము** సం. వి. సముద్రము,

మహాశయుఁడు నం. విశ. గొప్ప అభి ప్రాయము కలవాడు
మహాశూద్రి నం. వి. గొల్లది.
మహాసముద్ర ప్రవాహమునగతి నం. వి (భూగో) నీటిపై బలముగా వీచు గాలి ధాటిచే నీటిని ఒకచోటి నుండి మరియొక చోటికి పారునట్లు చేయుట (Drift.)
మహాసముద్రప్రవాహములునం.వి.(భూగో) ఉష్ణత యందలి భేదముచే కలిగిన సముద్ర ధారలు. 1. కవోష్ణ ప్రవాహములు. దేశముయొక్క శీతోష్ణస్థితిని సమశీతలముగా నుండునట్లు చేయును, 2, శీత ప్రవాహములు, దేశముయొక్క శీతోష్ణస్థితిని చల్లగా నుండునట్లు చేయును.
మహాసేనుఁడు నం వి. కుమారస్వామి.
మహాస్థానము నం. వి. పేరోలగము, నిండు సభ.
మహి నం. వి. పుడమి, భూమి.
మహిక నం.వి. మంచు; మిహిక. హిమిక.
మహితము నం. వి. శివుని శూలము. విశ. గొప్పది, పూజ్యము.
మహిమ నం వి. 1 గొప్పతనము. 2. ఐశ్వర్యము.
మహిషము నం. వి. ఎనుబోతు.
మహిషి నం. వి. 1. పట్టపుదేవి. 2. బఱ్ఱె.
మహిళ నం. వి. స్త్రీ
మహీరుహము నం. వి. వృక్షము.
మహేంద్రము నం. వి కుల పర్వతములలో ఒకటి.
మహోక్షము నం. వి. ఆబోతు
మహోదయము నం. వి. 1. కన్యాకుబ్జము. 2 ఆధిపత్యము, 3.అభివృద్ధి.4.మోక్షము
మహౌషధము నం. వి. 1. శొంఠి, 2, గొప్ప ఔషధము.
మళయాళము వై. వి. మలయాద్రి చుట్టును గల దేశము.
మళిగ వి. సరకులు మొత్తముగా అమ్మెడు అంగడి.
మళ్ళు క్రి. మరలు.

# మా

మా[1] నం. వి. 1. లక్ష్మి, 2. తల్లి.
మా[2] వై. విశ. మిక్కిలి. నం. మహాన్.
మాంగనీస నం. వి. (రసా.) మొక్కలు నేలనుండి తీసికొను మూలద్రవ్యములలో ఒకటి( Manganese ).
మాంగల్యము నం. వి. 1. మంగళత్వము. 2. తాళిబొట్టు.
మాంగ్లింగ్ ఇం. వి. (గృహ.) (Mangling) బట్టలను శుభ్రముచేయు యంత్రములో బట్టలను పిండి ఇస్త్రీచేయు వేరొక భాగము
మాంగ్లెర్ ఆక, వి. (గృహ) ( Manglre ) బట్టలుతుకు యంత్రమునకు మీది భాగమున గల రెండు సాఫైన గుండ్రనికఱ్ఱలు అమరిక (ఇది బట్టలను యంత్రములో శుభ్రముచేసిన తరువాత, నీటిని పిండుటకు ఉపయోగించు భాగము.)
మాంజిష్ఠము నం. వి. 1. ఎరుపు మించిన పసుపు వన్నె. 2. అట్టి వన్నె గలది.
మాండెమాస్ రిట్ ఇం. వి. శాన. (Mandamus writ) ప్రవర్తకాధి లేఖ, న్యాయస్థానము నుండి దిగువ న్యాయ స్థానమునకు వచ్చు ఆజ్ఞ.
మాంత్రికుఁడు నం. వి. మంత్రజ్ఞుడు.
మాందాళి వి. 1. పచ్చపట్టు చీర. 2.కృత్రిమ మరకతము.
మాంద్యము నం. వి. 1. ఆలస్యము, 2. జాడ్యము.

**మాంధాత** సం. వి. ఒక రాజు.

**మాంసకృత్తులు** సం. వి. (జీవ. రసా.) ఆహార పదార్థములలో ఒక ప్రధాన వర్గము (ఇందు కర్బనము, ఉదజని, ఆమ్లజనితో పాటు ముఖ్యముగా నత్రజని, తరువాత గంధకము, భాస్వరము కూడ నుండును) (రసా) శరీర పోషకములగు నత్రజని కూడి యుండిన కొన్ని సమ్మేళనములు (Proteins). (గృహ..) కండరాభివృద్ధిచేయు ఆహారము. పెరుగుదలకు తోడ్పడు ఆహారము, పుష్టినిచ్చు ఆహారము, బలమునిచ్చు ఆహారము (Proteins

**మాంసకృత్తివిలయకము** సం. విశే. (ఇం) మాంసకృత్తులపై పనిచేయునది. (Proteolytic).

**మాంసలఫలము** సం. వి. (వృక్ష.) కండగాని గుజ్జుగాని కల పండు (Fleshy fruit)

**మాంసలుడు** సం. విశే. బలిసినవాడు.

**మాకు** వి. ్రమాను.

**మాగాయ** వి. మామిడికాయ.

**మాగు** క్రి. కమియబండు. వి. మాలిన్యము

**మాగుడు** వి. కసటు, నలుపు.

**మాటీనంగ** వి. కాముకి

**మాటు** వి. కాంతి, తగులము

**మాటుమడుగు** క్రి. జంజాటము మాని నిశ్చబ్దమగు.

**మాడు** క్రి. దగ్ధమగు. వి. 1. ఇంటి యొక్క భాగపు కప్పు. 2. అడుగంటి మాడిన అన్నము మొ. వి.

**మాడెము** వై. వి. మండెము, సం. మండలము

**మాతు** వి. చదరంగపు ఆటయందు బంటుతో కాక ఇతర బలముతో రాజును కట్టుట.

**మాకందము** సం వి. మామిడి చెట్టు.

**మాకొను** క్రి. కాటువేయు, కరచు.

**మాగాణిపైరు** వి. (వ్యవ.) పల్లపు పంట.

**మాగాణిభూములు** వి. (వ్యవ.) నంజనేలలు Wet lands).

**మాగ్నాకార్టా** ఇం. వి. (Magana carta) మహాధికార పత్రము క్రీ శ. 1215 వ సంవత్సరము జూన్ 15వతేదీని ఇంగ్లండు రాజైన "జాన్" రాజు ఇంగ్లండులోని సామంత ప్రభువులకు తద్వారా ప్రజానీకమునకువ్రాసి యిచ్చిన ప్రజాస్వామ్య పత్రము ఈ పత్రము ఇంగ్లండు ప్రజాస్వామ్య సంవిధానములో గొప్ప మైలురాయిగా భావింపబడుచున్నది. ఈ మహా పత్రము ప్రకారము 'జాన్' రాజు ఇంగ్లండులో మత స్వాతంత్ర్యమునకు, శాస్త్రసమ్మతముగ విచారించి ప్రజలను దండించుటకు, ప్రజల ఆమోదముతో పన్ను విధించుటకు, ప్రజల ఆస్తి హక్కులను గౌరవించుటకు అంగీకరించెను.

**మాఘము** సం. వి. మాఘమాసము.

**మాజిక్ లాంతరు** ఇం (భౌతి.) (Magic-lantern). వస్తువుల ప్రతి బింబములను తెరపై బడునట్లుచేయు యంత్రము.

**మాజీ** హిం. విశే. ముందుండి యిప్పుడులేని ఉదా. మాజీ మంత్రి. (ex-).

**మాట** వి. 1. పలుకు, వచనము. 2. నింద. వృత్తాంతము.

**మాటకారి** విశే. 1. వాగ్మి. 2. వాచాటుడు

**మాటలమారి** విశే. వాచాటుడు.

**మాటికి** అవ్య- అడుగడుగునకు.

**మాటినీకోట్** ఇం. వి. (గృహ) (Mateneecoat) చిన్న పిల్లలకు ఊలుతో అల్లిన వదులు అంగీ.

**మాటు** వి. 1 మరుగు 2. వేటకాని దాగుడు పల్లము, 3. టంకపు పొడి. 4. తడవ. క్రి అతికించు, మాగువేయు.

**మాటువడు** క్రి. మరుగుపడు.

**మాడ** వి. అరవరా, వదిరూకలు.

మాడపట్టు వి. తలమీద ఎదుటి వెనుకటి ఎముకల కూడికలు ( Fontanelle )
మాడుగు వి. హార్మ్యము. త. మళిగై.
మాడువు వి. హార్మ్యము.
మాఢ్యుఁడు సం. విణ.- సిరితో గూడినవాడు
మాణవకము సం. వి. ఇరువది పేటల మణిహారము.
మాణవకుఁడు సం. వి. 1. బాలకుడు, శిశువు 2. దుష్టుడు.
మాణవ్యము సం. వి. బాలురగుంపు.
మాణిక్యము సం. వి. కెంపు.
మాత సం. వి. 1. తల్లి. 2. లక్ష్మి. 3 పార్వతి (పంచమాతలు;- రాజుభార్య, గురుభార్య అన్నభార్య, భార్యజనని, స్వజనని).
మాతంగము సం. వి. ఏనుగు.
మాతంగి సం. వి. 1. పార్వతి. 2. వసిష్ఠుని భార్య.
మాతంగుఁడు సం. వి, మాదిగవాడు.
మాతరపితలు సం. వి. మాతాపితలు, తల్లిదండ్రులు.
మాతరిశ్వుఁడు సం. వి. గాలి: వ్యు. ఆకాశమున వృద్ధినొందువాడు.
మాతలి సం. వి. ఇంద్రుని సారథి.
మాతాపితలు సం. వి, తల్లిదండ్రులు, కన్నవారు (Parents).
మాతాలి వి. జలశాల,
మాతామహి సం. వి, తల్లి తల్లి, అమ్మమ్మ.
మాతామహుఁడు సం, వి. తల్లితండ్రి, తాత
మాతుల సం వి. మేనమామభార్య. ఘా మాతులి, మాతులాని.
మాతులాని సం. వి. చూ. మాతుల.
మాతులుంగము సం. వి. మాదీఫలము.
మాతులేయుఁడు సం. వి. మేనమామకొడుకు
మాతృక సం. వి. 1. తల్లి. 2. దాది. 3. పార్వతి. 4. అసలు గ్రంథము.
మాతృకలు సం. వి. బ్రాహ్మి. మహేశ్వరి. కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి చాముండి.
మాతృతంత్రము సం. వి. ( గృహ ) 1. వంశపారంపర్యముగ స్త్రీ హక్కుదారు అగుట. 2. స్త్రీ యాజమాన్యముతో గృహ నిర్వహణము జరుగుట. 3. (వర) తల్లి అధికారముగల సాంఘిక వ్యవస్థ (Matriarchal).
మాతృత్వము సం. వి. (గృహ ) తల్లితనము (Motherhood),
మాతృద్రవము సం. వి. (రసా.) ఒక ఘనమును ద్రావణము నుండి స్ఫటీకరణముచే వేరుచేయగా మిగిలియున్న ద్రవము (Mother-liquor).
మాతృమూలము సం. వి. ( వృక్ష ) తల్లి వేరు (Tap-root)
మాతృష్వసేయి సం వి. తల్లితోడబుట్టిన దాని కూతురు.
మాతృష్వసేయుఁడు సం. వి. తల్లి తోడబుట్టిన దాని కొడుకు
మాత్ర[1] సం. వి. 1. కొండెము. 2. అక్షరావయవము. 3. కొలది. 4. త్రుటి.
మాత్ర[2] వి. 1. చిన్నమందుండ. 2. బాట. సారుల సామానుసంచి.
మాత్రము సం. వి. 1. అవధారణము అదియే 2. కొలది
మాత్సర్యము సం. వి. చలము, మత్సరము.
మాత్స్యన్యాయము సం న్యా. పెద్ద చేప చిన్న చేపను తిను నను న్యాయము.
మాద వి. పాపురోగము.
మాదవళము వి. 1, కపిల వర్ణము, 2.కపిల వర్ణముగల చీర. ఘా. మాదళము.
మాదిగ వై వి. చెప్పులు కుట్టి జీవించు జాతి కురటుడు, గోహింసకుడు. సం. మాతంగః
మాదిరి వి. 1. సామ్యము, సం. విధము. 2. (గృహ,) మోస్తరు, నమూనా కత్తిరించు

కుగాని కుట్టుటకుగాని తయారు చేసిన మాదిరి (Pattern or Plan).

మాదిరితీయుట వి. (గృహ.) ఒక నమూనా నుపయోగించి నకలు తీయుట (Tracing).

మాదృశుఁడు నం. విశే. నావంటివాడు.

మాద్రి నం. వి. పాండురాజు భార్య.

మాధవకబళము నం వి (వ్యావ) మధుకర సంబంధమైన ముద్ద, భగవంతుని స్మరించుచు అడిగెడి భిక్షాన్నపుముద్ద (మాధవకవళమని వాడుక)

మాధవకము నం. వి. ఇప్పపువ్వుకల్లు. చూ మాధ్వీకము.

మాధవము నం వి 1, వైశాఖమాసము. 2. వసంతఋతువు

మాధవి నం. వి. పూలగురివెంద. 2. కల్లు 3, తేనె. 4. లక్ష్మి. 5. కుంకెనకత్తె

మాధవుఁడు నం. వి. లచ్చిమగడు. విష్ణువు.

మాధురి నం వి 1, మాధుర్యము. 2. కల్లు

మాధుర్యము నం. వి. 1. తీపు. 2 పతులు మొ. నవి వచ్చుటకు బోయ వేయు ఈల. 3. శృంగారచేష్ట.

మాధ్యమము నం. వి. (భౌతి.) యానకము ఏదేని యాంత్రిక కార్యఫలమును తన ద్వారా ప్రసరించనిచ్చు ద్రవ్యము, ఉదా ధ్వనికి గాలి యానకము, అలకు నీరు యానకము (Medium).

మాధ్యమికము నం. వి. నడిమిది, మధ్యస్థమైనది. (Intermediate).

మాధ్యస్థ్యము నం. వి. మధ్యస్థుడు చేయు తీర్పు.

మాధ్వి నం. వి. 1. మద్యము. 2. మకరందము.

మాధ్వీకము నం. వి. చూ మాధవకము.

నా వై. వి. రెండు తవ్వలు, నాలుగు శోలలు. నం, మానమ్.

నం. వి. మన్నన.

మాననీయము నం. విశే. మన్నింపదగినది. పూజింప దగినది.

మానము నం వి. 1 త్రాసు. 2. కొలది (ఇది త్రివిధము: తులామానము, అంగుళీమానము ప్రస్థమానము). 2. చిత్తౌన్నత్యము. 3 గర్వము. 4, స్త్రీలకు పురుషుల యెడ కలుగు కోపము 5.(గణి.) 1 కొలత 2 స్కేల్.కొలబద్ద (Measure) 3. రాసులు పరిమాణములను కొలుచు పద్ధతి.

మానవతి నం. వి. మానము గల స్త్రీ. అభిమానము గల స్త్రీ.

మానవశాస్త్రము నం. వి మానవుని శారీరక మానసిక నిర్మాణ వర్ణనాశాస్త్రము(Anthropology).

మానవి నం. వి. మానవ స్త్రీ.

మానవుఁడు నం. వి. మనుష్యుడు. వ్యు. మనువు వలన జన్మించిన వాడు.

మానసము నం వి. 1. ఒక కొలను (మానస సరస్సు) 2. మనస్సు.

మానసికాభివృద్ధి నం. వి. (గృహ.) బుద్ధి వికాసము. మనో వికాసము (Mental development.)

మానసౌక(స)ము నం. వి. హంస

మాని నం.విశే. మానముగల వాడు.

మానికదారి వై. వి. 1, వేశ్య. 2. మాణిక్య ధారిణి.

మానికము వై. వి. కెంపు, రత్నము. నం, మాణిక్యమ్.

మానితము నం. విశే. మన్నింపబడినది. సన్మానితము.

మానిని నం. వి. మానవతి.

మానిసి వై. వి. 1. మనుష్యుడు. 2. పురుషుడు. 3. స్త్రీ. 4. భటుడు.

మాను క్రి. విడుచు. విశే. మనోజ్ఞము. వి. మ్రాను యొక్క రూపాంతరము.

మానుషి సం. వి. మనుష్య స్త్రీ.
మాన్యము సం. వి. 1. సన్ను లేక అనుభవించునట్లు సన్మానించి యివ్వబడిన భూమి. 2 కొండల నడుమ అరణ్యముల మధ్య గల భూమి (రోగభూయిష్ఠమగు భూమియని కొందరు.) రూ మన్నియము మన్నెము.
మాన్ టెల్ పీస్ ఇం. వి. (గృహ) (Mantel piece). నిప్పు గూటి మీది అరుగు వంటి భాగము, నిప్పు గూటిమీద గోడలోనికి అమర్చిన రాతిబల్ల.
మాన్‌సూన్ డ్రిఫ్టులు ఇం. వి. (భూగో.) (Monsoon Drifts) ఋతుపవనముల ధాటిచే కలిగిన హిందూమహా సముద్ర ప్రవాహములు.
మాన్ హోల్ ఇం. వి. (గృహ.) (Man-hole) మనుష్యుడు దూరగల రంధ్రపు సూర్గము, భూమిలోని నీళ్ళ గొట్టములు, సూరేజు గొట్టములు మొ. వాని దగ్గరకు చేర్చు మార్గద్వారము.
మాపక శ్రేణి సం.వి. (గణి.) క్రమాంకితమైన గురుతులుగల కొలుచుపరికరము(Scale).
మాపు క్రి. పోగొట్టు. వి. 1. రాత్రి. 2. సాయంకాలము 3. మైల,
మాపుడు వి. మైల, మలినము.
మామ వై. వి 1 తల్లిసోదరుడు, మేనమామ. 2. అలుమగలతండ్రి, శ్వశురుడు. 2. తండ్రితోబుట్టుపుత్ర, సం. మామకః.
మామకీనము సం. విణ. నాది.
మామకుడు సం. విణ. 1. నా వాడు. 2. పూజ్యుడు.
మామిడల్లము వి. (వ్యవ.) పచ్చిమామిడి కాయ వాసనగలిగి అల్లమువలె నుండు దుంప (ఇది పసుపు కుటుంబము (Zingiberaceae)నకుచెందిన Curcuma amada అను మొక్క యొక్క దుంప) (Mango ginger).
మామిడి వి. మామిడిచెట్టు. రూ॰ మావి
మామిడీ ఈగ వి. (వ్యవ., కీట.) ఒక రకమైన ఈగ (Mango-fly, Chaetodacus incisus) ఈ ఈగ యొక్క డింభము మామిడికాయలను తొలుచుట వలన అవి కుళ్ళును.)
మామూలు హిం. వి. 1. వాడుక, అలవాటు 2. వాడుకగా నిచ్చెడు విత్తము, బహుమతి
మాయ సం వి. 1. అవిద్య 2. ఇంద్రజాలాదివిద్య. 3. ఒక పట్టణము వి. (గృహ.) మావి. పిండపుసంచి(Placenta)
మాయకాడు విణ. వంచకుడు, మాయావి.
మాయము వి మాయ. కనికట్టు, కనుకట్టు
మాయలాడి మి విణ. స్త్రీ టక్కులాడి.
మాయలాడు మి. విణ మాయ కాడు.
మాయావి సం. విణ మాయదారి, మాయలు కలవాడు, రూ. మాయకుడు, మాయి.
మాయి సం॰ విణ. చూ. పై.
మాయించు క్రి. 1. సంహరించు 2. కాంతిహీనముచేయు.
మాయు క్రి 1. మలినమగు. 2 నశించు
మాయురె అవ్య. బళీ బాపురే.
మాయువు సం. వి. పైత్యరోగము.
మాయురము సం. వి. నెమిళ్ళ గుంపు. విణ. మయూర సంబంధమైనది.
మారకపు కంట్రోలు మి వి (అర్థ) విదేశీ నియమ వినియంత్రణ విదేశీనాణెములను దేశీయనాణెములతో మారకముచేసికొను టలో ప్రభుత్వపు ఆంక్షలు.
మారకపుధర వి (అర్థ.) వినిమయమానము (ఒక దేశపు చెలామణి ద్రవ్యమునకు గల విలువ తేడానుబట్టి ఈ ధర నిర్ణయమగును
మారకపు బ్యాంక్, వినిమయబాంక్ మి. వి. (అర్థ) విదేశ ద్రవ్యముల వినిమయము ముఖ్యకర్తవ్యముగాగల బాంక్.

మారకము నం. వి. 1. అంటువ్యాధి. 2 దేగ. వ్యు. చంపునది,
మారకము[2] వి (అర్థ)వినిమయము.ఒకదేశపు ద్రవ్యమునకు మరియొక దేశపు ద్రవ్యములో గల విలువ.
మారకుఁడు నం. విశ. చంపువాడు,
మారణము నం. వి. చంపుట.
మారాటము వి. 1. కలహము. 2 యుద్ధము
మారాము వి. 1. మర్మము 2. గారాబము. 3 పెంకెపట్టు.
మారాముళ్ళు వి. తేనిపోని చిక్కులు తంటాలు.
మారి[1] స్త్రీ. వి. 1. మసూరిక, స్ఫోటకము. 2. పార్వతి. 3. జనక్షయము. 4. ఒక గ్రామదేవత.
మారి[2] అవ. తాచ్ఛీల్యమునవచ్చు ప్రత్యయము ఉదా కొట్లమారి. మొ నవి.
మారిమసగు క్రి. 1. చంపు. 2 హింసించు.
మారిష నం. వి. దక్షుని తల్లి.
మారిషుఁడు నం. వి (నాట్య సంప్రదాయము నందు) ఆర్యుడు, పూజ్యుడు, పారిపార్శ్వకుడు.-
మారు వి. ప్రతి.
మారుఁడు నం. వి. మన్మథుడు.
మారుతము నం వి వాయువు,
మారుతి నం. వి. 1. స్వాతి నక్షత్రము. 2. భీమసేనుడు. 3. హనుమంతుడు,
మారేడు వి. బిల్వము.
మారొటోరియం ఆం వి. (శాస.,అర్థ.)(Moratorium) అత్యవసర పరిస్థితులలో తాత్కాలికముగ ఋణములను తీర్చనవసరము లేదని ప్రభుత్వము జారీచేయు ఆజ్ఞ.
మార్క్ ఆం. వి. (Mark) 1. గుర్తు. 2. బడి పిల్లలు గెలుపునందు పొందెడుగుణములు
మార్కెట్ ఆం. వి.(Market)విపణి,బజారు, క్రయ విక్రయములు జరుగు ప్రదేశము.
మార్కొను క్రి. ప్రతిఘటించు. ఎదుర్కొను,
మార్గణము నం. వి 1. వెదకుట 2 యాచించుట 3 బాణము. వ్యు. గుం వెదకుచు పోవునది
మార్గణుఁడు నం. విశ. యాచకుడు.
మార్గము నం వి. 1. త్రోవ, తెరువు. 2. అన్వేషణము. 3. మార్గ కవిత్వము
మార్గశీర్షము నం. వి తొమ్మిదవ నెల.
మార్గ్యము నం విశ 1 వెదకదగినది 2. తుడువదగినది.
మార్చు క్రి. 1. పడ్డించు. 2. బదిలీచేయు
మార్జకము నం వి (రసా.) రసాయనశాస్త్రమున ఇంధన వాయువునుండి తారును, ఎమ్మోనియాను, గంధకోద జనిదము (Sulphurated hydrozen)ను తొలగించుటకు ఉపయోగపడు పరకరము (Scrubber).
మార్జనము నం వి. 1. శుద్ధి. 2 తుడుచుట.
మార్జని నం. వి చీపురుకట్ట.
మార్జారము నం. వి. పిల్లి. రూ మార్జాలము.
మార్జాలకబళన్యాయము నం. న్యా. పిల్లి భోజనముచేయువాని వద్ద కూర్చుండి వాడు తీసికొను కబళములన్నియు తన నిమిత్తమేయని తలచెడు రీతి
మార్జాలము నం. వి , రూ. మార్జారము,
మార్జించు నం క్రి. తుడుచు.
మార్టిన్ లూథర్ ఆం. వి (చరి.) (Martin Luther)ఒక క్రైస్తవ సన్యాసి క్రీ. శ. 1483-1546) ప్రొటెస్టెంట్ క్రైస్తవ మతమును స్థాపించినవాడు. భగవంతుని యందు దృఢ విశ్వాసమున్న యెడల మానవుని సమస్త పాపములు క్షమింపబడునవియు పోప్‌లకు ముడుపులు చెల్లించుట వలన మోక్షము ను సాధించలేమనియు అతడు వాదించెను,
మార్తాండుఁడు నం. వి. సూర్యుడు.

మార్తుఁడు వి. శత్రువు,

మార్దంగికుఁడు సం. వి మృదంగము వాయించువాడు,

మార్దవము సం వి. మృదుత్వము

మార్ద్వీకము సం వి. ద్రాక్షసారాయి.

మార్పెట్టు క్రి ఎదిరించు,

మార్షల్ ప్రణాళిక మి. వి (చరి, అర్థ.) రెండవ ప్రపంచ యుద్ధ కారణముచే ఆర్థికముగ దెబ్బ తిన్న పదునేడు పశ్చిమ-యూరప్ దేశములకు యూరప్ పునరుద్ధరణకై అమెరికా చేసిన ఆర్థిక సాహాయ్యము. (ఈ ఆర్థిక సాహాయ్య ప్రణాళిక అమెరికా కార్యదర్శి అయిన మార్షల్ అను నతడు క్రీ శ. 1947లో ట్రూమన్ సిద్ధాంతమును దృష్టి యందుంచుకొని తయారుచేసెను. అందుచే దీనిని 'మార్షల్ ప్రణాళిక' యని యందురు.)

మారు క్రి. 1. ఎదుర్కొను. 2. చంపు. విశ. 1. ప్రతి. బదులు. 2, తడవ.

మారుమూల వి వాడుకలేని చోటు.

మారుమోఁత వి. ప్రతి ధ్వానము.

మారొడ్డు వి ప్రతిఘటనము, క్రి ఎదిరించు.

మాల[1] వై. వి పూదండ, 2. వరుస.

మాల[2] వై. వి. చండాలుడు. సం. మాలః

మాలంకషము సం. వి. సముద్రము.

మాలఁడు వై. వి. చండాలుడు. సం. మాలః.

మాలకరి వై. వి, 1, దండలు కట్టువాడు. 2, తోటమాలి. సం. మాలాకారీ.

మాలఁగబోతు వి. సోమరి

మాలగుడు వి. అలసత్వము,

మాలతి సం. వి. 1. ఒకానొక స్త్రీ. 2, జాజి తీగ.

మాలము సం. వి. బర్బరజాతి.

మాలి[1] సం. వి, మాలాకారుడు. విశ.మాల గల వాడు.

మాలి[2] ం. తోటకాచువాడు,

మాలిక సం. వి 1. పూదండ. 2. వరుస. 3. పిరజాజి. 4. కంఠాభరణము 5.కూతురు

మాలికుఁడు సం, వి 1. మాలకరి. 2. తోట మాలి, 3 చిత్రకారుడు,

మాలిన్యము సం వి. మలినత,

మాలిమి వి 1 ప్రేమము, వాత్సల్యము 2. ఓడనడపు శాస్త్రము.

మాలిమికాఁడు వి ఓడనడపు శాస్త్ర మెరిగిన వాడు,

మాలీషు హిం. వి. గుఱ్ఱమును తోముట.

మాలు క్రి. చెడు, నశించు.

మాలుగు వి. 1. ఏనుగుల భుజముల మీది తడి మడత 2. సోమరి తనము,

మాలూరము సం. వి, 1. మారేడు చెట్టు. 2. వెలగ చెట్టు.

మాలెత వి. (మాల+ఎత) మాలది,

మాల్గుజారీ విధానము వి. పెద్ద భూకమతములు గల సాగుబడిదార్లను యజమానులుగ గుర్తించి వీరిని వారివారి ప్రాంతములలో శిస్తు చెల్లించుటకు బాధ్యులుగచేసి, వారి కుటుంబమునకు మాల్గుజారీ అధికారము ప్రభుత్వముచే వంశపారంపర్యముగ నీయబడుట. (ఈ ఆచారము మధ్య ప్రదేశ్ లో విస్తారముగ నుండెను.)

మాల్తస్ ప్రజావృద్ధి సిద్ధాంతము మి. వి. (అర్థ) ఆహారోత్పత్తి కంటె ఎక్కువ వేగముతో జనాభా పెరుగునను సిద్ధాంతము.

మాల్యము సం వి. 1. పుష్పమాలిక. 2. పుష్పము.

మాల్యవంతము సం. వి. మేరు పర్వతమునకు పడమట గల ఒక కొండ.

మావటము వి. ఏనుగులపాకలకట్టు.

మావి వి, 1. గర్భస్థ పిండమునకు మీద కప్పికొని యుండు తోలు సంచి, జరాయువు. 2. మామిడి,

మావు వి. గుఱ్ఱము. 2. అశ్వసంగమము.

మాపుమోముకాఁడు వి. కింపురుషుడు.

మాషము సం. వి. 1. మినుములు. 2. అయిదు గురిగింజల యెత్తు.

మాసటి వి ఊరుడు, మల్లుడు. రూ. మాస టీడు, మాస్టీడు. విణ. శ్రేష్ఠుడు.

మాసము సం. వి. నెల (చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము భాద్రపదము, ఆశ్వయుజము, కార్తీకము మార్గశీర్షము, పుష్యము, మాఘము, ఫాల్గునము అని 12 తెలుగు మాసములు). మాషపరిమాణము.

మాసరము సం విణ. 1. పొడవైనది. 2. వ్యాపించినది. 3. అందమైనది.

మాసి[1] వై. వి మాసిసి. సం. మానుషః.

మాసి[2] వి. 1. మసి. 2. మురికి.

మాసిక వి. 1. అతుకు 2. చిక్కు. (గృహ) దుస్తులకురంధ్రము పడిన దాని మీద అదే రకపు బట్టను వేసి కుట్టుట (Patch).


మాసిక

మాసికకుట్టు వి. (గృహ.) ఎంబ్రాయిడరీ నమోనామీద వేరు రంగు ముక్కలను వేసి కుట్టుట (Patch work).

మాసిక జేబు వి (గృహ.) కోట్లకు, కమీజులకు ముక్క వేసి కుట్టిన జేబు (Patch pocket).

మాసికము సం. వి. ఆబ్దికమువరకు నెల నెల చేసెడు శ్రాద్ధము. విణ. మాస సంబంధమైనది.

మాహాత్మ్యము సం. వి. గొప్పతనము

మాహిషము సం. వి. దున్నపోతు, బఱ్ఱె-లకు సంబంధించినది- పెరుగు మొ. వి.

మాహేయి సం వి. గోవు.

మాహేయుఁడు సం. వి. 1. అంగారకుడు. 2. నరకాసురుడు.

మాళిగ వై. వి. మేడ రూ, మాడుపు. సం. మాలికా.

# మి

మింగడ వి. కాగిన పాలమీద తెట్టె. రూ. మీగడ, మీవడ.

మించు వి. 1. విద్యుత్తు. 2. కిరణము. 3. ప్రకాశము. 4. కాలిమట్టె. 5. ఆధిక్యము క్రి. 1. అతిశయించు. 2. దాటిపోవు.

మించుఁగాలు వి కుడి పాదము.

మించుఁబోడి వి. మెరుపువలె మనోజ్ఞురాలగు స్త్రీ. రూ. మించుఁబోడి.

మింజువలె హిం. అవ్య. మొత్తములో ఒక పాలు.

మింటితెరుపరి వి.సూర్యుడు.

మింరుఁడు సం. వి. విటుడు,

మిండఁడు వై. వి. 1. మింరుడు, 2. పురుషుడు. విణ. అధికుడు. రూ. మిండగాఁడు మిండగీఁడు. సం. మిండః.

మిండతుమ్మెద వి. మగ తుమ్మెద.

మిండతికము వి. జారత్వము.

మిక్కటము విణ. మిక్కిలి, అతిశయము. రూ. మిక్కుటము.

మిక్కిలి విణ. 1. అధికము. 2. శ్రేష్ఠము.

మిక్కిళికంటివేల్పు వి. ముక్కంటి.

మిగత వి. శేషము.

మిగులు క్రి. 1. అతిశయించు. 2. శేషించు. 3. పట్టుమీరు. రూ మిగులు.

మిఠాయి హిం. వి. తియ్యని పిండివంట. రూ మిఠాయి.

మిటారము వి. నిక్కు, అతిశయము.

మిటారి వి అతిశయముగల స్త్రీ. విశ. విలాసవతి, నిక్కుగలది.

మిట్ట వి ఉన్నత భూమి. విశ. ఉన్నతము.

మిట్టమిట్టు వి. (మిట్టు + మిట్టు) అత్యున్నత భూమి.

మిట్టు క్రి. ఎగురు, మిట్టిపడు, ఎగిరిపడు.

మిడి వి. మిట్టిపాటు, గర్వము. విశ. 1. మిడిసిపాటు గలది, 2. ఉన్నతము.

మిడిగ్రుడ్డు వి. పైకుబికిన కనుగ్రుడ్లు.

మిడినాగు వి. ఎగిరి ఎగిరిపడు పాము. రూ మిడునాగు.

మిడిమేలము వి. గర్వము, అహంకారము

మిడియ వి. వేద వాక్యము.

మిడిసిపాటు వి. మిట్టిపాటు.

మిడుఁగు వి. అగ్నికణము.

మిడుఁగుఱుఁబురువు వి. మిణుగురు పురువు ఖద్యోతము.

మిడుకు వి. జీవము. క్రి. 1. త్రుళ్ళు. 2, పరితపించు. 3 సంచరించు.

మిడుచు క్రి. 1. పిండు. 2. మెటికవిరుచు

మిడుత వి, శలభము.

మిడుత కుటుంబము వి. (వ్యవ., కీట.) ఖరిమిడుతలు. జొన్న మిడుతలు, జట్టి మిడుతలు మొ. కీటకములు ఈకుటుంబము నకు చెందినవి.

మిణకరము వి. ఏమియు తోచక ఉరుకులు

మితంపచుఁడు నం. విశ. లోభి.

మితము నం. వి. కొలదియిడబడినది, పరిమితము.

మితి నం. వి. పరిమితి, గడువు.

మిత్తి వై. వి. 1. మృత్యుదేవత, చావు. 2, వడ్డి. నం 1. మృత్యుః. 2. మితిః.

మిత్తిగొంగ వి మృత్యుంజయుడు శివుడు,

మిత్తిపోలు వి. కేతువు

మిత్రమండలి రాజ్యములు నం. వి (చరి.) రెండవ ప్రపంచ యుద్ధములో పాల్గొనిన ప్రజాస్వామ్య రాజ్యములు, ఇంగ్లండు. ఫ్రాన్స్, అమెరికా సంయుక్త రాష్ట్రములు

మిత్రుఁడు నం వి 1 హితుడు. 2. సూర్యుడు.

మిథునము నం వి. 1. ఆలుమగల జత 2. ద్వయము 3, మిథునరాశి.

మిథునీకరణము నం. వి. (జం.) పురుషప్రాణి నుండి స్త్రీ ప్రాణి శరీరములో శుక్ర కోశములను ప్రవేశపెట్టు తాత్కాలిక లైంగిక సమ్మేళనము (Copulation).

మిథైల్ బ్రోమినము ఇం. వి. (వ్యవ.) (Methyl bromide) కీటకములను నాశనముచేయు విషవాయు ప్రయోగము నిమిత్తము ఉపయోగపడు రసాయనిక ద్రవ్యములలో నిది యొకటి.

మిథ్య నం. అవ్య మృష, అసత్యము.

మిథ్యాదృష్టి నం. వి నాస్తికత్వము, ఇహలోకమే కాని పరలోకము లేదనెడు బుద్ధి.

మిథ్యా ప్రతిబింబము నం. వి (భౌతి.) తెరపై పట్టుటకు రాని ప్రతిబింబము (Virtual image).

మిథ్యామతి నం. వి, భ్రాంతి.

మిద్దియ వి 1. చదునుగా, గారచేసిన ఇంటి కప్పు. 2. తామరదుద్దు. రూ. మిద్దె.

మిద్దె వి. మా. మిద్దియ.

మినమిన వి. కాంతి, వెలుతురు,

మినమినసివాఁడు వి గరంగరనివాడు, మేదురుడు. చక్కనైనున్నవైనవాడు.

మినహాయింపు హిం. వి. తగ్గింపు, తీసివేత.

మినిట్ ఇం. వి (గణి.) (Minute) 1. డిగ్రీలో అరువదియవ భాగము. 2. గంటలో అరువదియవ భాగము.

మినిట్ ఆఫ్ డిస్సెంట్ ఇం. వి. (శాస.) (Minute of dissent) భిన్నాభిప్రాయము పురపాలక సంఘ సమావేశములలో, తదితర సమావేశములలో, మొత్తము మెజారిటీ తీర్మానము ఆమోదింపబడిన 48 గంటలలోగా తమ వ్యతిరేకమును తెలియపరచుచు బోర్డు అధ్యక్షునకుగాని. మునిసిపల్ చేర్మన్ కుగాని వ్రాత మూలకముగా అందజేయు విజ్ఞప్తి.

మిను వి. ఆకాశము. రూ. మిన్ను.

మినుకు వి. 1 కిరణము. 2. తాలిబొట్టు. 3 మినుకు మినుక్కు మను కాంతి. 4. వేదము.

మినుకుఁజేడియ వి. సరస్వతి.

మినుకులబరణి వి. సూర్యుడు, వ్యు. కాంతులకు బరణివంటివాడు.

మినుచూలు వి. వాయువు.

మినుము వి. మినుపపైరు, మాషము.

మిన్న వై. వి రత్నము. విశే. శ్రేష్ఠము.

మిన్నక అవ్య.1, ఊరక.2 అప్రయత్నముగ.

మిన్ను వి. ఆకాశము. రూ. మిను.

మిన్నువాఁక వి. ఆకాశగంగ, మిన్నుకొలకు.

మిన్ను విఱిగి మీఁదపడుట వి. జాతీ. ఆపత్తు తటస్థించుట.

మిమ్మటము విశే. మిక్కుటము, ఎక్కువ.

మిర సం. వి. మేర, హద్దు, మర్యాద.

మిరాశీ హిం. వి. 1. స్వల్పమైన తీర్వా గల భూమి. 2. పారంపర్యముగ వచ్చిన పొత్తు. రూ. మిరాస్.

మిరియము వై వి. కారముగల సంబారు వస్తువు. రూ. మిరెము. సం. మరిచమ్. (వృ.వ.) Pepper piparaceae అనుకుటుంబమునకు చెందిన Piper nigrum అను తీగ యొక్క ఎండిన పండ్లు. (కూర సంబార ద్రవ్యముగను, ఓషధిగను ఉపయోగించుదురు.)

మిరెపకాయ వి. బృహన్మరిచము రూ. మిరపకాయ.

మిర్మిట్లు వి. మిఱుమిట్లు.

మిఱుమిట్లు వి (మిట్లు + మిట్లు) కన్నులు మిక్కిలి మిట్టుటలు (చెదరుట).

మిఱుమిట్లుగొను క్రి. కన్నులు మిక్కిలి చెదరు, చిరుతలు కవియు, చిరుతలు క్రమ్ము.

మిఱ్ఱు వి. ఉన్నత భూమి.

మిఱ్ఱుచూపు వి ఊర్ధ్వ దృష్టి.

మిలమిల వి. అధిక కాంతి ఉదా "మిలమిలని ప్రొద్దు పొడుపున, తళతళమను కాంతి దిగ్వితానము నిండెన్."

మిలాయించు హిం, క్రి. కలుపు.

మిళిందపన్హ వి (చరి.) పాళీభాషలో వ్రాయబడిన బౌద్ధధర్మ గ్రంథము. ఇ-డో గ్రీక్ రాజైన మిళిందునకును బౌద్ధమత గురువైన నాగసేనునకును జరిగిన సంవాదము.

మిలియను ఇం. వి. (Million) పది లక్షలు.

మిల్లి వి. మిక్కిలి చిన్న గరిటె.

మిల్లు ఇం. వి. (Mill) యంత్రము.

మివులు క్రి మిగులు.

మిశ్రణము సం. వి. (రసా.) మిశ్రము చేయుట, కలుపుట (Blending).

మిశ్రసన్నము [illegible] వి. (గణి.) పూర్ణాంకమును భిన్నము మును గల రాశి, ఉదా, [illegible] వి. (Mixedfraction)

మిశ్ర [illegible] ఆర్థికవ్యవస్థ సం. వి. (అర్థ.) వైయుక్తిక రంగములోనేగాక ప్రభుత్వ రంగములో కూడ పరిశ్రమలు పనిచేయు ఆర్థిక వ్యవస్థ.

మిశ్రమము సం. వి. (రసా.) రెండు లేక ఎక్కువ మూలకములుగాని, సమ్మేళనములుగాని సహజధర్మములను కోల్పోకుండ కలిసియుండు పదార్థసమూహము (Mixture).

మిశ్రమ సేవ్యము సం. వి. (వ్యావ.) రెండు గాని రెటింకంటె ఎక్కువగాగాని పైరులను గలిపి సాగుచేయుట, ఉదా. మొక్కజొన్న, కంది, మెట్టవరి, కంది, ప్రత్తి మొ. వి. (Mixed cropping)

మిశ్రమము సం. విశ. కలిసినది. రూ. మిశ్రితము. వి. (రసా.) అనేక లోహముల కలయిక, మిశ్రలోహము (Alloy)

మిష సం. వి. కపటము.

మిస వి. కాంతి.

మిసమిస వి. మెరయుట యందగు అనుకరణము.

మిసిమి వి. నూతన కాంతి.

మిసిమింతుడు విశ. అలసినవాడు, శ్రాంతుడు.

మిసుకు క్రి. చలించు, కదలు.

మిహి విశ. 1. శ్రేష్ఠము. 2. నున్ననిది. 3. క్రొత్తది.

మిహిక సం. వి. మంచు.

మిహిరాణుడు సం. వి. శివుడు.

మిహిరుడు సం. వి. 1. సూర్యుడు. 2. చంద్రుడు. 3. వాయువు. 4. వృద్ధుడు.

మిళిందము సం. వి. తుమ్మెద.

మిళితము సం. విశ. 1 మెలిక. 2 పేనబడినది. 3. కలిసినది.

మిళ్ళ వి. మిల్లి.

మిళ్ళెంతలు వి. (వ్యావ.) దగా, మోసము వంచన.

## మీ

మీఁగడ వి. పాలమీది తెట్టె, పాల నుండి వేరుచేయుటకు వీలగు వెన్నతో గూడిన భాగము. (Cream).

మీఁగడతీసిన పాలు వి. (వ్యావ.) మీగడ యంత్రముతోగాని, మరియొక విధముగాగాని మీగడ తీసివేయబడిన పాలు (Skimmed milk.)

మీఁగడమర వి. (వ్యావ.) పాలనుండి మీగడను వేరుచేయు యంత్రము (Cream Separator).

మీఁగాలు వి. పాదోపరిభాగము, పాదము యొక్క పై భాగము.

మీఁదిసాకిరి వి. ఉత్తరసాక్షి.

మీఁదు వి. 1. ఉపరిభాగము. 2. భవిష్యత్కాలము. 3. దేవతకుకట్టినముడుపు (మీఁదుకట్టు)]

మీఁదుమిక్కిలి విశ. కడుమిక్కిలి. రూ. మీఁదిమిక్కిలి.

మీట వి. 1. అదిమెడు మర 2. పత్తపు ప్రమానిలో త్రొక్కుడు భాగము.

మీటర్ ఇం.వి. (గణి.) (Metre) పొడవును కొలుచుటకు ఉపయోగించు ప్రమాణము

మీటర్‌గేజ్ రైల్‌మార్గము ఇం.వి. (Metre Gauge Railway) చిన్నపట్టణములు కొండ ప్రాంతములు మొ. స్థలములలో వేయు రైలుమార్గము (దీనికి రైలు పట్టాల మధ్యదూరము 3' — 3½' ఉండును ఈ రైలు మార్గము మలుపులెక్కువగానున్న చోట్ల వేయుదురు).

మీటు క్రి. 1. పొడుచు. 2. కుట్టు. 3. ఎగజిమ్ము వి 1. పెంపు. 2. ఉద్రేకము విశ. అధికము.

మీథము సం. విశ. విడువబడినది. (మూత్రము)

మీద్ద వి. నలికండ్ల పాము.

మీనకేతనుఁడు సం. వి. మన్మథుడు.

మీనపుచ్ఛదాహకము సం. వి. (రసా.) చేపతోక ఆకారముగల వాయునిర్గమన ద్వారముగల దాహకము (Fish-tail burner).

మీనము సం. వి. 1. చేప. 2. మీనరాశి (Pisces).
మీనరము సం. వి. మొసలి, మకరము.
మీనవల్లంకి వై. వి. ఒకానొకపిట్ట. రూ మీనవల్లఁకి. సం. మీనవల్లి కా.
మీనురూపురిక్క వై. వి రేవతి నక్షత్రము.
మీమాంస సం వి. (వేదాం.) 1. విచారణ. 2. కర్మబ్రహ్మ ప్రతిపాదక శాస్త్రము.
మీఱు క్రి. అతిక్రమించు, కడచు.
మీలనము సం వి కనుమూయుట.
మీలితము సం. విశే. మూయబడినది.
మీవడ వి. మీగడ.
మీసకట్టు వి. మీసముయొక్క యేర్పాటు.
మీసము వి. శ్మశ్రువు. మగవాని పై పెదవి మీది వెంట్రుకలు. (బహు.) మీసలు, మీసాలు.
మీసర వై. వి. మృగశీర్ష.
మీసరము విశే. | శేష్ఠము, మేలైనది.
మీసలబువ్వ వి. జాతి. పైకి వటారము లోపల లొటారము(మీసాలకు పెరుగుతో గూడిన బువ్వ పట్టించుకొనిబయటకువచ్చి మీసలు దువ్వకొనుచు పెరుగు జిడ్డును వర్ణించుట )

# ము

ముంగ వై. విశే మూక మూగవాఁడు. రూ. మూఁగ మూగి, మూకుఁడు. సం. మూకః.
ముంగట వి. 1. ముందర, ముందుచోటు 2. పూర్వకాలము.
ముంగమురము వి. ముంజేతి కంకణము. రూ, ముంగమురాము, ముంగమురారి. ముంగైమురారి.
ముంగర వి. ముక్కర, అడ్డబాస.
ముంగాలు వి. ముందుకాలు.
ముంగి వి. ముంగిస, నకులము.
ముంగిముశాతనము వి. (వ్యావ.) మాట లాడని మూర్ఖుని స్వభావము.
ముంగిలి వి. (ముంగల+ఇల్లు). 1. అంగ ణము. 2. బయలు.
ముంగురులు వి. (ముందు + కురులు.) నొసటిపై గ్రుచ్చిన యొంటెదు ఉంగరపు వెంట్రుకలు.
ముంగొంగు - వి. (ముందు + కొంగు)చెంగు కొన.
ముంగొంగు పసిఁడి వి. జాతి. ముంగొంగు బంగారము, ముంగొంగుననున్న బంగా రమువలె సులభముగా నభీష్టమును తీర్చు నది. ఉదా. ముగొంగు పసిడి శ్రీరంగ శాయి.
ముంగోపము వి, వి, ముక్కోపము. ఓర్పు లేక తటాలున వచ్చు కోపము.
ముంగోపి మి. విశే. ఓర్పులేక తటాలున కోపము చేసికొనువాడు.
ముంగోలు విశే. (ముందు+కోలు) మొద టిది, ప్రాథమికము.
ముంచు క్రి. 1. మునుగజేయు. 2. అతిక్ర మించు, దాటిపోవు.
ముంజము సం. వి. ముంజగడ్డి.
ముంజి వై. వి. బ్రహ్మచారి కట్టుకొనెడు ముంజదర్భ మొలత్రాడు, గడ్డిమొ త్రాడు. సం మౌంజి.
ముంజె వి. లేత తాటికాయలోని గిఞ రూ. ముంజియ.
ముంజేయి వి. (ముందు+చెయి) ముంగే
ముంజూరు వి. ముందుచూరు.
ముంఢ వి. 1. ముండమోపి,విధవ.2. శే

ముండకము సం. వి. (వృక్ష.) బంతి చేమంతి, సూర్యకాంతము మొ. మొక్కల పుష్పగుచ్ఛము వంటిది (ఈపుష్పగుచ్ఛమందలి పువ్వులకు వృంతము లుండవు. అవి చుట్టును ఉన్న నిపత్రచక్రముచే రక్షింపబడుచుండును. ఇది 'మధ్యాభిసార' పుష్పగుచ్ఛముల తరగతిలో ఒకటి (Capitulum or head). అసత్యముండకము = False head).


ముండకము


ముండకము (అసత్య)

ముండనము సం. వి. 1. క్షౌరము. 2. సంరక్షణము.

ముండము సం. వి. తల.

ముండరి విశే. వేశ్యా సంగమశీలుడు.

ముండి సం. వి. మంగలి.

ముండితుఁడు సం. విశే. బోడియైనవాడు.

ముండుఁడు సం. వి. రాహుగ్రహము. విశే. తెగినకాళ్ళు చేతులు కలవాడు.

ముండ్లజెముడు వి. (వృక్ష.) కంటాలము, బ్రహ్మజెముడు జాతికి చెందిన మొక్క (Cactus).


ముండ్లజెముడు
బ్రహ్మజెముడు

ముంత వి. చిన్న మాని పాత్రము.

ముంతమామిడి వి. జీడిమామిడి.

ముందర వి. 1. మునుపు. 2. మొదలు. 3. ఎదురు.

ముందటికాళ్ళకుఁ బందెములువేయుట వి. జాతి. రాఁబోవు దానికి అడ్డు చెప్పుట.

ముందలచీర వి. తలపాగ.

ముంపు వి. 1. ముంచుట. 2. గుంపు.

ముకద్దమా హిం. వి. వ్యవహారము.

ముకాసా హిం. వి. పన్ను లేకుండగ ఈయబడిన గ్రామము. రూ. మొఖాసా.

ముకు వై. వి. నాసిక. రూ. ముక్కు.

ముకందము సం. వి. 1. ఎఱ్ఱదామర. 2. నిధి. 3. ఒకానొకమణి.

ముకుందుఁడు సం. వి. విష్ణువు. వ్యు. మోక్షము నిచ్చువాడు.

ముకుటము సం. వి. మకుటము, కిరీటము.

ముకురము సం. వి. అద్దము.

ముకుళము సం. వి. అరవిరి మొగ్గ.

ముకుళించు సం. క్రి. ముడుగుడు. మోడ్చు.

ముకుళితము సం. విశే. ముకుళించినది.

ముక్కంటి వి. త్రిలోచనుడు శివుడు.

ముక్కంటిచుక్క వి. ఉత్తరభద్రపదా నక్షత్రము, ఆర్ద్రానక్షత్రమని కొందరు.

ముక్కంటిచెలి వి. కుబేరుడు.

ముక్కంటిపండు వి. కొబ్బరికాయ.

ముక్కడి వి. (మూఁగు + కాఁడి) అనేకులకు ఒక పెట్టున తగిలెడి వ్యాధి(సాంక్రామికామయము). 2. దుక్కి చాలించి నిలిపిన అరకల మొత్తము.

ముక్కఱ వి. ముంగర.

ముక్కాలిపీఁట వి. మూడుకాళ్ళపీట. రూ. ముక్కాలి పీఁట.

ముక్కాకలఁదేఱు క్రి. మిగుల సమర్థుడగు.

ముక్కారు వి. మూడుకారులు.

ముక్కిఁడి విశే. ముక్కు పోయినవాడు.

ముక్కోణము మి. వి. మూడు కోణములు (త్రిభుజము).

ముక్కోపము వి. (వ్యావ.) ముంగోపము.

ముక్కోల వి. త్రిదండము, మూడు కోలలు కలిపి కట్టిన దండము.

ముక్త సం. వి. 1. ముత్తెము. 2. రంకుటాలు. విశే. ముక్తి నొందినది.

**ముక్తకణ నిర్మాణము** సం. వి. (వృక్ష.) ఒక జీవకణ సంహతిలో విడివిడిగా జీవకణము లేర్పడి యుండుట(Free cell formation)

**ముక్తపద గ్రస్తము** సం. వి. (అలం.) విడిచిన పదమే అవ్యవధానముగా మరల మరల వచ్చుట, ఉదా. ''మేరు ధరాధరధీరా ధీరా శ్యానందకర''.

**ముక్తసరి** హిం. విశే. సంగ్రహమైన.

**ముక్తాయింపు** వి. 1. ముగింపు. 2. వాద్యముతోను ఆటలతోను గూడినపాట. 3. పాట వెనుక వాద్యము.

**ముక్తావళి** సం. వి. ముత్యాలదండ

**ముక్తి** సం. వి. మోక్షము, విడుపు, విమోచనము.

**ముక్తిచతుష్టయము** సం. వి. సామీప్యము, సాలోక్యము, సారూప్యము, సాయుజ్యము,

**ముక్త్యారు** హిం. వి. స్వతంత్రాధికారమును పొందినవాడు.

**ముక్త్యారునామా** హిం. వి. స్వతంత్రాధి కార పత్రము.

**ముఖకుహరములు** సం. వి. (జం.) నోరు (Buccal cavity).

**ముఖపథము** సం. వి. (జం.) బహిశ్చర్మము లోనికి పెరుగుటచే ఏర్పడిన అన్నవాహిక యొక్క ముందరి భాగము. (Stomodaeum).

**ముఖపాకము** సం. వి. (గృహ.) నాలుక పూత (Red-tongue)విటమిన్ '$B_{12}$'లేక ఛి' లోపము వలన కలుగు వ్యాధి (Stomatitis).

**ముఖము** సం. వి. 1, మొగము. 2. నోరు. 3. మాట. 4. ముందటి భాగము.

**ముఖరము** సం. విశే. 1. మ్రోగునది. 2. అసంబద్ధవచనము లాడునది.

**ముఖవలయము** సం, వి. (జం.) నోరుచుట్టును ఉండు ప్రదేశము (Peristome).

**ముఖశాల** సం. వి. మొగసాల, మోసల, తలవాకిటి చావడి.

**ముఖశ్వసనము** సం. వి. (జం.) నోటితో గాలిపీల్చి వదలివేయుట(Buccal respiration).

**ముఖస్థముగా** వి (వ్యావ.) [illegible].

**ముఖాముఖి** సం. విశే. ఎదురెదురుగా.

**ముఖాసా** హిం. వి. మాన్యము, శిస్తులేని భూమి

**ముఖ్యమంత్రి** సం. వి. (శాస., రాజ., పౌర.) మంత్రివర్గ నాయకుడు, రాష్ట్ర ప్రధాని. రాష్ట్ర మంత్రివర్గ నాయకుడు.

**ముఖ్యము** సం. విశే. ప్రధానము.

**ముఖ్య సంఖ్యలు** సం. వి. (గణి.) ఎన్ని? అను ప్రశ్నకు సమాధానము నిచ్చు 1,2, 3 4 వంటి అంకెలు(Cardinal numbers) (చూ. క్రమిక=Ordinal)

**ముఖ్యాక్షరేఖ** సం. వి. (భౌగో.) ధ్రువమును. గోళ కేంద్రమును కలుపురేఖ (Perpendicular axis).

**ముఖ్యావసరమైన అమినో ఆసిడ్స్** మి. వి. (గృహ.) ఇప్పటికి 22 అమినో ఆసిడ్స్ కనుగొనబడినవి. వీనిలో 8 మానవునకు భోజనము ద్వారా ముఖ్యముగా లభించవలెను. ఇవి శరీరములో తయారుచేయబడవు. మిగిలినవి శరీరములో తయారగును. కనుక వాని వలన లోపము కలుగదు. (Essential amino acids).

**ముగితి** వై. వి. 1. ముక్తి. 2. విడుదల. సం. ముక్తి.

**ముగియు** క్రి. మరణించు, అయిపోవు.

**ముగుద** వై. వి. (స్త్రీ). సం. ముగ్ధా.

**ముగురు** సర్వ. (మూడు+గురు) మువ్వురు. రూ. ముగ్గురు, మువురు, మూగురు. మూవురు.

ముగ్గు వి మ్రుగ్గు.

ముగ్గొయ్య వి. (ముందు + కొయ్య) అగ్రదండము. విణ. అసాధ్యము.

ముగ్ధ నం. వి 1. ముదిత. 2. ఒక నాయిక వికృ ముగుద.

ముచ్చలిక హిం. వి. ( వ్యావ ) ఒడంబడిక (Settlement). రైతు భూస్వామికి వ్రాసి యిచ్చు ఖత్తు.

ముచ్చి వి. చిత్రకారుడు

ముచ్చిచ్చు ద్వి. వి. (మూడు+చిచ్చులు) త్రేతాగ్ని (గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని).

ముచ్చిరి విణ. దుఃఖము నొందినవాడు.

ముచ్చిరితనము వి. మనోవ్యథ.

ముచ్చిరు క్రి. శోకించు.

ముచ్చిలిక వి. రైతు భూమిఖామందునకు వ్రాసి యిచ్చెడు సాగుమరతు పత్రము, ఒడంబడిక, ముచ్చలిక.

ముచ్చిలి వి. ముచ్చిలిగుంట, పెడతల యందలి గుంట

ముచ్చిలించు క్రి. దొంగలించు.

ముచ్చిలిపాటు వి. కునికిపాటు.

ముచ్చె వై. వి. మీగాలు గుదికాలు కప్పుకొను చెప్పు. నం. మోచకా.

ముచ్చెబంగారు వి. కాకి బంగారు.

ముచ్చ వి ముడ్డిపూస.

ముచ్చట వి 1. వృత్తాంతము. 2. గుసగుస 3 కోరిక.

ముచ్చటముడి వి. అల్లికతో గూడిన సిగముడి.

ముచ్చట్లు వి. 1.(మూడు +చోట్లు)మూడు ప్రదేశములు. 2. భార్యాభర్తలు గాని, తలితరులుగాని అనురాగముతో ఆడుకొనెడు సంభాషణాదికము.

ముచ్చు వి. 1. దొంగ, మ్రుచ్చు 2. అరటి పువ్వులోని కాడ.

ముచ్చౌకము వి. 1. పండ్రెండు (3 × 4). 2. మూడు చౌకములు.

ముజుముదారు హిం వి, లెక్కలను పరిశీలించు ఉద్యోగి.

ముజ్జిడ్డు వి. తెరపికాని చిక్కు.

ముజరా హిం. తిరిగి రావలసిన పైకము మొ వి.

ముటము వి. ముద్ద పిడుక.

ముటాలు వి. (వ్యావ.) వంట కట్టియలు.

ముట్టడము వి. ముట్టణము. ని. బంధము.

ముట్టడి వి. శత్రువులను చుట్టుముట్టుట.

ముట్టు క్రి 1. పరిగ్రహించు. 2 తాకు 3. ముట్టడించు. 4. కడముట్టు. వి. 1 సాధనము. 2. స్త్రీరజస్సు (ముట్టు అగుట =ఋతుస్రావము) వి. (గృహ.)(Menstruation)

ముట్టుకోలు వి. ముట్టడి.

ముట్టుగోడ వి. అండ గోడ, తన్ను గోడ.

ముట్టుత వి. రజస్వల.

ముట్టుపడు క్రి. సంతాపించు.

ముట్టునందు వి. వెలుపలికి దారిలేని సందు

ముట్టె వై. పశ్వాదుల మూతి, పంది ముక్కు. నం. ముఖమ్.

ముట్టెతోఁపు వి. (వ్యావ.) నిదానములేని తొందర.

ముఠా హిం. వి. 1 కొన్ని గ్రామములు కలిసిన సంస్థానము 2. జనసమూహము.

ముడి వి. 1. గ్రంథి, 2. చెట్టు మొ. ని ముడి. 3. దారములోని ముడి. 4. వెండ్రుకల ముడి. 5. గొంతుముడి. 6. కలహము. విణ. 1. అఖండము. 2 వికసింపనిది.

ముడి కట్టలు కట్టుట వి. ( వ్యావ) విత్తులను గడ్డి వెంచెలతో కట్టలుగాకట్టుట (Bundling).

ముడికాఁడు విణ. ధూర్తుడు, వంచకుడు.

ముడిగిబ్బ వి. అబోతు.

ముడిపదార్థములు వి. (అర్థ, భూగో.) అనుభోగయుక్తమగు వస్తువులను తయారుచేయుటకు కావలసిన పదార్థములు.
ముడిబట్ట వి. అంచు కమ్ములులేని బట్ట.
ముడియ వి. మూట.
ముడిపడు క్రి. 1. పెనగొను. 2. అతిశయించు. 3. సంధిల్లు.
ముడుంబ వి. (వ్యావ.) 1. చిక్కు. 2. ఉమ్మడి (ఉత్తర సర్కారులలో వాడుక.)
ముఁడుగు వై. క్రి. 1. సంకోచించు. 2. చేష్టలుడుగు. నం. ముకుళనమ్.
ముడుతలు వి. (గృహ.) నలుగుట, సాపులేకపోవుట, చర్మము లేదా బట్టల ముడుతలు (Wrinkles.)
ముడుతలువడనిది వి. (గృహ.) ఉతికినపుడు నలుగనిది (Dipdry-Finish).
ముడుపు వి. శుభకార్యాదుల ఆరంభమున ధనము ముడిచి మీదు కట్టిన మూట, ముల్లె.
ముడుసు వి. ఎముక.
ముడ్డి వి. అపానము, గుదము.
ముణుకరాములు వి. (వ్యావ.) ఎటుతోచని స్థితి (గోదావరి ప్రాంతమున వాడుక).
ముతరాచ వి. సవారీలు, వాహనములు మోయు ఒక శూద్ర జాతి. చూ. ముత్రాసి, ముత్తిరాసి.
ముతుక [illegible] ముదుక.
ముత్తైదువ [illegible] వి. సుమంగళి.
ముత్తికగము వి. కడుపుమీది మూడు వళులు.
ముత్తవ వి. వృద్ధ పితామహి, ముత్తవ్వ. ప్రపితామహి.
ముత్తాత వి. వృద్ధ పితామహుడు, ప్రపితామహుడు.
ముత్తి వై. వి. మోక్షము. నం. ముక్తి.
ముత్తిగ వి. (మూడు+తిగ) తొమ్మిది.
ముత్తియము వై. వి. ముత్యము. నం. మౌక్తికమ్, ముక్తా.
ముత్తుము వి. మూడు తూములు.
ముత్తైపురికొక్కునేల వి. చైత్రమాసము (చిత్తా నక్షత్ర యుక్తము).
ముత్తెపువులాఁడి వి. ఆకాశగంగ.
ముత్తెసరము వై. వి. ముత్యాలహారము.
ముత్తైదువ వి. ముత్తయిదువ.
ముత్యము వై. వి. చూ. ముత్తియము.
ముత్యాలమ్మ వై. వి. ఒక గ్రామదేవత.
ముదము నం. వి. సంతోషము.
ముదల వి. ఆజ్ఞ, సెలవు.
ముదలకించు క్రి. 1. ఎత్తిపొడుచు. 2. మార్కొను.
ముదలపెట్టు క్రి. ఆజ్ఞాపించు.
ముది వి. వార్ధకము. ముదిమి, ముసలితనము.
ముదిగారము వి. మౌర్ఖ్యము.
ముదిత నం. వి. ముద్దియ, స్త్రీ.
ముదిమి వి. ముసలితనము.
ముదియ వై. వి. స్త్రీ. [illegible] ముద్దియ, నం. ముగ్ధా.
ముదిసి [illegible] క్రి. [illegible] ము పొందు.
ముదిపడు [illegible] వి. ముసలి పెటులు.
ముదురుపరి [illegible] వి. ధాన్యము.
ముదుగు విశే. దళసరియగు.
ముదురు క్రి. కాయపరిణామించు, వర్ధిల్లు.
ముదునరి విశే. ముదుకడు.
ముద్గము నం. వి. పెసలు.
ముద్గరము నం. వి. ఇనుప గుదియ, సమ్మెట.
ముద్ద వి. కబళము, పిండము, పిడుచ.
ముద్దటిహుండి వి. (అర్థ.) కొంతకాలవ్యవధిలో పైకము చెల్లింపవలసిన హుండీ.
ముద్దతు హిం. వి. కాలపరిమితి.
ముద్దయ్య వై. వి. (ముద్దు+అయ్య) కుమారస్వామి.
ముద్దర వై. వి. ముద్ర, అచ్చు. మొహరు.

ముద్దరాలు వి. ముగ్ధ(స్త్రీ).
ముద్దాడు క్రి. చుంబనాది పూర్వకముగా లాలనచేయు, ఆదరించు.
ముద్దాయి హిం.వి. నే. మ్మ మోపబడినవాడు
ముద్దు వై. వి. 1, ప్రేమము, అదరము. 2 మనోజ్ఞరతి. చుంబనము.
ముద్దెరాడు వై. విశే. ఏమియు తెలియని వాడు. నఘ. ముగ్ధ
ముద్దుగుమ్మ వి. మనోజ్ఞురాలు. 2. స్త్రీ
ముద్దుటుంగరము వి. అక్షరములు చెక్కిన ఉంగరము. చెక్కిన, ఉంగరము, సం. ముద్రాంగుళీయకమ్.
ముద్ర సం. 1. సంజ్ఞాక్షరములు చెక్కిన ఉంగరము. 2. అందలి అక్షరములు, 3. అచ్చు.
ముద్రణము సం. వి. ముద్రించుట.
ముద్రణాలయము సం. వి (వ్యావ) పత్రికలు పుస్తకములు, కరపత్రములు మొ. వి. ముద్రించు స్థలము.
ముద్రవేయుట వి. (గృహ.) గుర్తువేయుట (Stamping).
ముద్రాకాస్థి నఘ. వి. (జం.) కప్పయొక్క స్వరపేటికలో ఉన్న రెండు మృదులాస్థి నిర్మాణములలో నిది యొకటి Cricoid cartilage). రెండవది దర్వికాస్థి(Arytenoid cartilage).
ముద్రిక సం. వి. ముద్దుటుంగరము,
ముద్రితము నఘ. విశే. 1. ముద్రింపబడినది. 2. ముకుళింపబడినది.
మునగ వై. వి. మునగ, శిగ్రువృక్షము.
మునసబు హిం. వి. 1. గ్రామాధికారి, 2. న్యాయాధికారి.
మున(మ)సబ్ దారులు హిం. వి. మొఘల్ పరి.) మొగలు సైనికోద్యోగులు. మొగలు సైన్యమునకు కావలసిన సైన్యములను సమకూర్చుటకై తగిన వేతనములేక జాగీరులిచ్చి నియమించిన సైనికోద్యోగులు.
ముని సం. వి. 1 ఋషి. 2, అవిసెచెట్టు
మునికోల వి కో , ఎద్దుల నదలించు కోల. రూ. ములుకోల
మునిమాపు వి. ( మును + మాపు ) ప్రదోషము, సంజ.
మునిముచ్చు వి. (ముని + ముచ్చు) పళ్ళెంతో హారుడు, చూచుచుండగనే దొంగలించు వాడు.
మునిషీ హిం. వి. 1. చదువుచెప్పువాడు. 2. లేఖకుడు.
మునిసిపాలిటి ఇం. వి పరి,) (munici-pality) పురపాలక సంఘము.
మునిసిఫ్ హిం. ( పరి. ) (Munisiff) న్యాయాధిపతి.
ముసు వి. 1. పూర్వకాలము. 2. ఆరంభము 3. అంతము.
మునుగు క్రి. 1. మునుకవేయు. 2. మరణించు. 3. మరుగుపడు.
మునుక వి. మునుగుట, మునుకవేయుట.
మునుకు క్రి. 1. సంతాపించు 2. మారు పలుకు.
మునుగట్టు వి. తూరుపుకొండ.
మునుము వి. 1. పైరు క్రొత్తకేర్పరచుకొన్న మితి. 2. ఎదురు. 3. సేనాముఖము. 4. తరమధనము.5. ఎదుటిచోటు.
మున్నాడి అన్యులముందుగా. రూ. మున్నాడి.
మున్నరక వి. 1. తొలిదిక్కు. 2. ధైర్యము.
మున్నీటిచూలి వి. క్షీరసాగరకన్యక, లక్ష్మి.
మున్నీరు వి. (ముసు + నీరు) సముద్రము.
మున్షీ హిం. వి. (పరి.) వ్రాతకాడు
ముప్పరువునేల వి. మూడు క్రోసుల దూరము.
ముప్పర్ధు హిం. వి. చిరా అవయవాలు లేనివరుస పద్దుల పాత్రము.

ముప్పిడి వి. బాకు.
ముప్పిరిగొను క్రి. పెనగొను.
ముప్పు వి. 1 వార్ధకము, 2 విపత్తు.
ముప్పె వి (వ్యావ.) వ్యాధుడు.
ముప్పోకలాఁడు వి. (మూడు + పోకలు + ఆఁడు) త్రిగుణాత్మకుడు, భగవంతుడు.
ముముక్షువు విణ. 1. విడువనిచ్చగలవాడు, 2. మోక్షముపొందు కోరిక గలవాడు.
ముమూర్షనం వి. చావనిచ్ఛ.
ముమ్మడుఁగు విణ. మూడురెట్లు, ముమ్మడి ముబ్బడి.
ముమ్మరము విణ అధికము.
ముమ్మొనవాలు వి (మూడు + మొనవాలు) త్రిశూలము.
ముమ్మోటు విణ. (మును + మోటు). మూఢాగ్రేసరుడు.
ముయ్యేడ వి. (మూడు + అడ). ఆరుమాని కలు.
ముయ్యెలగుట్ట వి. (మూడు + ఎల్ల + గుట్ట) 2. మూడు ఎల్లలు కలియుచోటు. 2 మూడుదారులు కలియుచోటు. 3, త్రికము (ఎల్లశబ్దమున కిచట స్థానమని అర్థము)
ముయ్యేఱు వి. త్రిపథగ, గంగ
మురనం. వి. మరువము వాసనగలమొక్క.
మురజము నం. వి. మృదంగము.
మురడించు క్రి. తిరస్కరించు,
మురబ్బ హిం. వి (మురబ్బా). 1. అల్లపు మురబ్బాయను లేహ్యము 2. పెంకితనము.
మురళి నం. వి. 1. పిల్లనగ్రోవి, 2. ఒక విధమైన గుఱ్ఱపునడక.
మురళ్చు క్రి. 1. తిరస్కరించు. 2 హేళనచేయు.
మురారి నం. వి. 1. కృష్ణుడు. 2. ఒకానొక సంస్కృతకవి.
మురాళము వి. దిగదుడుపు.
మురి వి. 1. గర్వము. 2. నడక యందలి కులుకు.
మురికిపేట వి. నగరములలో పేద ప్రజలు క్రిక్కిరిసి నివసించువాడ (Slum).
మురికి వాయువు గొట్టము వి. (గృహ.) చెడు వాయువును పైకిపంపు గొట్టము. ఫ్లష్ కక్కసు గొట్టమునుండి గాలిలోనికి కట్టిన పొడవుపాటి గొట్టము. దొడ్డిలో నుండి చెడువాయువులను తొలగించునది. మురుగుగొట్టము (Soil pipe).
మురిడీగొలుసు వి ముంజేత వేసికొనెడి బంగారుగొలుసు (మెలికలు గలది).
మురిపెము వి. 1. విలాసము. 2. శృంగార గర్వము. 3 నడక యందలి కులుకు 4 సంతోషము.
మురియ వి ముక్క, తునుక.
మురియు క్రి 1. గర్వించు 2. సంతోషించు.
మురుగు వి. 1. ముంజేతి నగ, 2. అల్లిక వేసిన బంగారుకమ్మి.
మురువు వి. 1. గర్వము. 2, శృంగార గర్వము. 3. సౌందర్యము.
ముర్ముదము నం. వి. 1. కుమ్ము. 2. సూర్యుని గుఱ్ఱము.
ముర్ముదుఁడు నం. వి మన్మథుడు. వ్యు. అందర నావరించువాడు
ముఱి విణ. 1. అల్పము. 2. కుత్సితము.
ముఱికి వి. కల్మషము, మాలిన్యము.
ముఱికినాడు వి ఒకదేశము. రూ. ముల్కి నాడు.
ముఱిముఱి విణ. కొంచెము కొంచెము.
ముఱియు క్రి 1. గర్వించు. 2. సంతోష ముతో పొంగు.
ముఱుగుకాలువ వి. (గృహ.) గొట్టముల ద్వారా ముఱుగు నీటిని పారవేయు కాలువ (Drainage sewage).
ముఱుగ్రోవ వి ముఱుగుగ్రోవ, దుర్గంధ మగు కాలి.

ముజ్జు వి. చూలైన ఆవు ము. వాని చన్నులు పిదుకగావచ్చు జిగట పదార్థము (ముఱ్ఱుఁబాలు).

ములికి వి. 1. బాణము. 2. బాణపుటలుగు. 3. బొంగరము కొననుండు ఇనుపముక్క. రూ. ముల్కి.

ములు వి. 1. కంటకము, 2. త్రాసుముల్లు. 3. వరి మొ. వాని ముల్లు. రూ. ముల్లు (బహు) ముళ్ళు.

ములుకత్తి వి. ముల్లు తీసెడు కత్తి,

ములుకోల వి. ఎడ్లను పొడిచెడి మునికోల.

ములుగు[1] వై. బొక్కసము. నం. మూలకమ్

ములుగు[2] క్రి. మూలుగు.

ములుచ విశే. 1. ధూర్తుడు. 2. హెలితి, తక్కువ.

ములుము వి. బావుల నీళ్ళచే పండించు పొలము.

ములుసూపు క్రి. 1. అతిశయించు. 2. మీఱు, 3. త్రాసు ముల్లు బరువువైపు ఒరగు.

ముల్క్ హిం. వి. (వరి.) దేశము.

ముల్కి హిం వి. (వరి.) 1. స్వదేశీయుడు, స్వదేశవస్తువు.

ముల్లియ వై. వి. మూట, ముడుపు. నం. మూలమ్.

ముల్లియవిప్పు వి, మూటల దొంగ.

ముల్లు వి. ము. ములు.

మువ్వ వి. మూడు గిరలవంటి సందులుగల పెద్దగజ్జె,

మువ్వంచ విశే. మూడు పంచలుగలది.

మువ్వకోడె వి. మువ్వపసరము. కాడికిని గంటకును క్రొత్తగా అలవరించెడి ఎద్దు

మువ్వదోనె వి. అడుగు బంటిపలకగలదోనె,

మువ్వన్నెకాఁడు వి. సూర్యుడు.

మువ్వన్నె మెకము వి. పెద్దపులి.

మువ్వన్నెవిల్లు వి. ఇంద్రధనుస్సు.

ముప్పీసము వి మూడు వీసములు,

ముషలకపుపంపు వి. (వ్యావ) ఒక విధమైన నీటిపంపు (Piston Pump) (దీని లో గొట్టము, ముషలకము కవాటములు ప్రధాన భాగములు).

ముషలకము నం. వి. (భౌతి.) వాయు పదార్థములను గాని ద్రవపదార్థములను గాని ఒకే వైపునకు నెట్టు ఒక యంత్రభాగము (Piston),

ముషిణి నం. వి విషముష్టి (ఓషధి,) (దీని రసము చర్మరోగములను పోగొట్టును).

ముషితము నం. విశే. దొంగలింపబడినది.

ముష్కము నం. వి. 1. వృషణము. 2. మొత్తము.

ముష్కరుఁడు నం. విశే మొక్కలుడు, కుటిలుడు.

ముష్టి నం.వి. 1 కత్తిపిడి, 2. పిడికిలి, 3. (వ్యావ) బిచ్చము.

ముష్టింపచుఁడు నం విశే. దరిద్రుడు. పిడికెడు బియ్యము మాత్రమే వండుకొను వాడు.

ముసద్ది హిం. వి. లెక్కవాడు, లేఖకుడు.

ముసద్దీపేచి హిం, వి. వ్రాతరుసుము ముట్టనిచో వ్రాతకాడు వ్రాతయందు చేయు లోపము.

ముసనాబు వి. అందలము ప్రక్క తెర.

ముసరు క్రి. 1. వ్యాపించు. 2. కమ్ము. 3. కవియు.

ముసలము నం వి. రోకలి,

ముసలి నం. వి. 1. ఉడుము. 2. బలరాముడు విశే. వృద్ధుడు.

ముసాబు వి. నానుడు వాన. రూ. ముసావు.

ముసాయిదా హిం. వి. చిత్తువ్రాత, మతలబు

ముసి వై. వి. బొంకు. నం. మృషా.

ముసించు వై. క్రి. నశించు.

ముసిఁడి వై. వి. ముషి చెట్టు.

ముసినగవు వి. చిరునగవు.

ముసిముసినవ్వు వి. చిరునగవు, దరహాసము.

ముసుండి సం. వి. 1. ఆయుధము. 2. కొనలు లేక ఇనుప గుదియ.

ముసుఁగు వి. కప్పడము, అవకుంఠనము.

ముసుపు వి. [illegible]

ముస్త సం. వి. [illegible]

ముస్తాబు హిం. విశే. సిద్ధమైనది. అయిత్తము చూ. ముస్తాబు దుస్తులు ఆభరణములు ధరించి సిద్ధపడుట.

ముస్తీదు [illegible] చూ. ముస్తాదు.

ముస్తె వై. వి. తుంగగడ్డ. సం. ముస్తా.

ముహుః సం. అవ్య. మాటికి మాటికి.

ముహూర్తము సం. వి. 1. పండ్రెండు క్షణముల కాలము 2. రెండు గడియల కాలము.

ముళ్ళకాడ వి. (గృహ.) ఇంగ్లీషు పద్ధతిలో భోజనము తినుటకు ఉపయోగించు ఒక గరిటె (Fork).

ముళ్ళమాటలు వి (జాతీ) కటువుమాటలు.

ముళ్ళయతి మి వి. నారదుడు, సన్న్యాసి (ముడులు పెట్టుయతి.)

ముళ్ళు వి. మారాముళ్ళు, చిక్కులు.

## మూ

మూఁక వి. 1 సమూహము. 2 దండు.

మూఁకుడు వి. మట్టిమూత, శరావము.

మూఁగ వై వి. 1. మూగవాడు. విశే. మాటాడలేనిది (Dumb) 2. దోమ. సం మూకః.

మూఁగతీట వి. ఒడలిపై దట్టముగ పేలిన తీట.

మూఁగు క్రి. వ్యాపించు.

మూఁడు సర్వ. రెండు నొకటి. క్రి. 1. నంభవించు. 2. ముగియు.

మూడుపూవులాఱుకాయలు వి. (జాతీ). అభివృద్ధి అతిశయ కథనము. (ఇక్లే మూడు మాటలాఱు తప్పులు అనగా ఎక్కువ తప్పులని అర్థము.)

మూఁత వి. 1 మూకుడు. 2. బిరడ. 3. కనురెప్ప మూఁత.

మూఁపు వి. భుజ శిరస్సు. అంసము.

మూఁపురము వి. ఎద్దుభుజశిరము, కకుదము.

మూక తంత్రము సం. వి. (రాజ.) ప్రజాస్వామ్యము కూడ కాలక్రమేణ అరాజకపు మూక తంత్రముగ మారునని గ్రీక్ రాజనీతిజ్ఞుడయిన అరిస్టాటిల్ వాదము.

మూగురు సర్వ. ముగ్గురు

మూగేలు వి. చుంచు. చూ. మూగీలు.

మూచూచు క్రి. (మూతి+చూచు) మూర్కొను, వాసన చూచు.

మూజవాని వి. (వ్యావ) నోటి మాట.

మూట వై. వి ముడియ, ముల్లె.

మూదమంచు వి. దట్టమగు మంచు.

మూఢుఁడు సం. విశే. 1. మొండి. 2. మోటు 3 మొద్దు, తెలివిలేనివాడు.

మూతము సం వి. రాజులు చేతిక్రిందనుంచు కొనుతలగడ. విశే. కట్టబడినది.

మూతి వై వి. నోటి పైభాగము, ముఖము, సం. ముఖమ్.

మూత్రకృచ్ఛ్రము సం. వి. 1. ఉబ్బరము నీరుకట్టు తెవులు 2. అతి మూత్రము.

మూత్రకోశము సం. వి. ఉచ్చబుడ్డ, నీరుతిత్తి.

మూత్రజనన మండలము సం వి. (జీవ.) మూత్రముతో సంబంధము గల అవయవములు, పునరుత్పత్తితో సంబంధము గల అవయవములు కలసియున్న మండలము. (Urinogenital system)

మూత్రనాళము సం. వి. (జీవ.) మూత్ర పిండములనుండి ఉచ్చార మార్గమై [illegible] గాని, మూత్రపుసంచిలోనికి [illegible] మును తీసికొనిపోవు గొట్టము (Ureter)

మూత్రనాళికలు సం. [illegible]) మూత్రమును తీసికొని పోవు [illegible] గొట్టములు (Urinary Tubles).

మూత్రపిండములు సం. వి. (జీవ) [illegible] రక్తమునుండి మూత్రమును తయారు చేయు అవయవములు రక్తమును శుద్ధి చేసి మూత్రమును వేరుచేయు రెండు పెద్ద గ్రంథులు (Kidneys).

మూత్ర మార్గము సం. వి. (జీవ) మూత్రపు సంచి నుండి మూత్రమును బయటికి పంపు గొట్టము (Urethra).

మూత్రము సం. వి. ఉచ్చ, కాలుమడి.

మూత్రాశయము సం. వి. తోలుసంచి (Bladder) (మూత్ర నాళముల ద్వారా మూత్రము మూత్రాశయమునకు కొని పోబడును: మూత్రము మూత్ర పిండము లోకి వేరుపడిన తర్వాత మూత్రనాళ ముల ద్వారా మూత్రాశయముతో కూడి కొనును.) (జీవ.) మూత్రము చేరు సంచి (Urinary bladdar).

మూత్రించు సం. క్రి. కాలుమడుచు.

మూదల వి. (మోల + తల) ప్రమాణము.

మూదేవి వి. (వ్యావ.) పెద్దమ్మ.

మూన వి. వస్త్రగాలితముచేయగా పాలక మిగిలినది, పొల్లు.

మూను క్రి. వస్త్రగాలితముచేయు.

మూనాళ్ళపట్టపగలు వి. జాతీ. మూడు రోజుల మధ్యాహ్నము, స్వల్పకాలము.

మూర వి. రెండు చేతుల కొలది.

మూరకోల వి. అరగజము బద్ద.

మూరిఁబోవు క్రి. విజృంభించు.

మూరుకొను క్రి.[illegible]

[illegible] క్రి. (భూగో) పొదరు నేలలు

మూర్ఖము సం. [illegible] మౌర్ఖ్యము గలది.

మూర్ఛ [illegible] రోగాదులచేత స్మృతి [illegible]

మూర్ఛన సం. వి సంగీతమునందు క్రమముగా సప్తస్వరముల ఆరోహణావరోహణములు.

మూర్ఛాలుఁడు సం. విశే. మూర్ఛరోగి.

మూర్తి సం. వి. 1. శరీరము. 2. దేవుని స్వరూపము. 3. ప్రతిమ.

మూర్తికళ సం వి (చరి) విగ్రహాదులు చెక్కు శిల్ప విద్య(Sculpture).

మూర్తిపటము సం. వి (జీవ.) కనుగ్రుడ్డు పొరలలో అన్నిటి కంటె లోపలనున్న పొర. (ఇది వెలుతురును శీఘ్రముగా గ్రహించును. అందుచే నిది దృష్టికి అవసరమగు ముఖ్యావయవము (Retina)

మూర్ధము సం. వి. తల.

మూర్ధాభిషిక్తుడు సం. వి. 1. క్షత్రియుడు 2. చక్రవర్తి (శిరస్నానం దభిషేకము చేయబడినవాడు)

మూల[1] సం. వి. మూలానక్షత్రము.

మూల[2] వి 1. విదిక్కు. 2. కోణము: 3. సందు 4. కొప్పు.

మూలకందము సం. వి. (వృక్ష.) తల్లివేరు గాని దాని శాఖగాని అహారముతో ఉబ్బి యున్నది (Root tuble).

మూలకందికలు సం. వి. (వృక్ష.) వేళ్ళపై నుండు బుడిపెలు లేక మొటిమలు (Root tubercles).

మూలకము సం. వి. (రసా.) ఎట్టి రసాయనిక క్రియలచేతను భిన్న ధర్మములు గల సూక్ష్మపదార్థములుగా విభజింపవీలుగాని పదార్థము.

**మూలకేంద్రము** సం. వి. (గణి.) మూడు వృత్తముల నుండి లభించు మూడు జతల వృత్తముల మూలాక్షములు అనుషక్తము లగు బిందువు. కేంద్రము లన్నియు ఒకే సరళ రేఖలో లేని మూడు వృత్తములను లంబముగా ఖండించు వృత్తము యొక్క కేంద్రము.

**మూలగ** వై. వి. ఎముకల మధ్యనుండు మాంససారము, మజ్జ. సం. మూలగః.

**మూలదుంప** మి.-వి. 1. మొదటిగడ్డ. 2. మొదటి కారణము.

**మూలద్రవము** సం. వి (రసా.) పరాసాయనిక ప్రక్రియలవలనను విశ్లేషించ వీలుగాని ద్రవ్యము (Element)

**మూలధనక్షామనిధి** సం. వి. (వాణి.) ఒక వ్యాపార సంస్థ యొక్క దైనందిన వ్యవహారములవలన కాక అసామాన్యముగ సంస్థకు వచ్చు లాభమువలన కలిగిన నిధి ఉదా. ఒక పాతయంత్రమును చాలఎక్కువ ధరకు అమ్మినచో, కాతాలలోని దాని విలువకన్న అదనముగ లభించిన సొమ్మును ఇట్టినిధిలో వేసెదరు. సాధారణముగ ఇట్టి నిధిని వాటా విలువల న్యూనీకరణ వంటి నష్టములను తుడిచివేయుటకు ఉపయోగింతురు.

**మూలధనము** సం. వి. (అర్థ.) ఒక వ్యాపార సంస్థ యొక్క కార్యక్రమము కొనసాగుటకు అవసరమైన ధనము. దీనిని కంపెనీ వాటాలవలనగాని ఋణ పత్రములవలన కాని, అప్పువలన కాని, గత సంవత్సరములలో కలిగిన లాభాంశముల వలన కాని సేకరింపవచ్చును.

**మూలధనశుల్కము** సం. వి. (అర్థ.) మూలధన రూపములోనున్న ఆస్తిపై ప్రభుత్వము విధించు పన్ను.

**మూలపీడనము** సం. వి. (వృక్ష.) వేరులో నుండు అంతశ్త్వచికలోని జీవకణములు వాని యందున్న ఆహార ద్రవములను దారువులోనికిని దాని నుండి కాండముల లోనికిని సంపుటలో కలుగు ఉమ్మడి ఒత్తిడి.

**మూలమట్టము** వి. మూలలను సరిచూచు మూడు మూలల చట్టము



మూలమట్టము

**మూలము** సం. వి. 1. వేరు. 2. ఊడ. 3. మొదలు. 4 (గణి.) ఒక రాశిని అదే రాశిచే కొన్నితడవలు గుణించగా లభించు లబ్ధము. దత్తరాశికి సమానము కాగా మొదటిరాశిని దత్తరాశికి మూలమందురు (Root). ఉదా. (Root) x=a అను సమీకరణమును సంతృప్తి చేయు x యొక్క విలువ

**మూలరక్షకము** సం. వి. (వృక్ష.) వేరుటోపి వేరులకొనలందు కొన్ని పొరలుగా ఏర్పడు టోపి వంటి నిర్మాణము. ఇది సున్నితమైన వేరుకొనను కాపాడు చుండును) (Root-cap).

**మూలరోమములు** సం. వి. (వృక్ష.) చిన్న వేళ్ళ మూల రక్షకమునకు కొంచెము మీదుగా అగపడు సూక్ష్మమైన రోమములు. ఇవి నేలలోనున్న ద్రావణము లను పీల్చుకొను చుండును (Root-hairs)


మూల రోమములు

**మూలశాయి** వి. వజ్రముష్టి.

**మూలశేడు** సం. నిర్ఋతి. కోణపుడు.

**మూలవ్యయము** సం. వి. (అర్థ.) చేయదలచిన కృషికి కావలసిన సాధన సామగ్రి కొరకు మొదట ఒకేసారి వ్యయము చేయు ద్రవ్యము. (వ్యాప.) ప్రారంభము

నకు పెట్టుబడి పెట్టుబడి(Capital Investment).

**మూలవ్యూహము** నం. (వృక్ష) మొక్కకు భూమిలో నున్న వేళ్ళ సమూహము (Root-system).

**మూలసిద్ధాంతము** నం. వి (గణి) నిరూపణ అవసరములేకుండ స్వీకృతమైనసిద్ధాంతము (Axiom).

**మూలాంకురము** నం. వి. (వృక్ష) గింజలో నుండు ప్రాథమికాకుము [illegible] క్రింది కొన(వేరుగా మొలకెత్తునది) (Radicle)

**మూలాంగములు** నం [illegible] (వృక్ష.) వేరువంటి అంగములు (Rhizoids).

**మూలాక్షము** నం వి. (గణి [illegible] [illegible] [illegible] [illegible] [illegible] సమానముగ నుండు [illegible] [illegible] [illegible]

**మూ[illegible]** నం. వి. 1. [illegible] ముపేరు

[illegible] [illegible] కూయు

**మూ[illegible]కరణము** నం. వి. (అర్థ) ఒక దేశపు ద్రవ్యమును విదేశీ ద్రవ్యముతో పోల్చిచూచిన మొదటిదానికి గల విలువను శాసనరీత్యా తగ్గించి వేయుట, ఉదా ఒక రూపాయకు 1 షిల్లింగ్ 10 పెన్నీల విలువ నుండి 1 షిల్లింగు మాత్రమే లభించునట్లుచేయుట. రూపాయ మూల్య న్యూనీకరణమగును. దేశపు ఎగుమతులను ప్రోత్సహించుటకు న్యూనీకరణముగావింతురు(Devaluation).

**మూల్యము** నం. వి. 2. వెల. 2. జీతము 3. (భౌతి.)విలువ ఒక రాశి యొక్క విశిష్ట నిర్ధారిత ప్రమాణము(Value) 4. (గణి.) గణిత భౌతికశాస్త్రములలో మన మొకరాశికి ఇచ్చు లేదా కనుగొనవలసిన విలువ (Value). రాశియొక్కపరిమాణము (magnitude).

**మూల్యహీన విక్రయము** నం. వి. (వాణి, గిట్టుబాటు ధ కన్న తక్కువధరకు సరకుల నమ్ముట (దీనికి ముఖ్యముగ [illegible] ఉద్దేశములు [illegible] భారీ యెత్తున చేసిన ఉత్పత్తి [illegible] స్వదేశ[illegible] అమ్మలేక ఇతర దేశములకు [illegible] ధరలకు ఎగుమతిచేయ [illegible] కారణము. [illegible] [illegible] దిగు [illegible] [illegible]పరిశ్రమలు అంతమొందును. [illegible] ఇతర దేశముల పరిశ్రమలు ఏ ధరకు సరకులను అమ్మినను కొనక తప్పదు)

**మూవ** నం. వి మువ్వ

**మూష** నం. వి మూస.

**మూషకము** నం వి 1. ఎలుక. 2. పంది కొక్కు.

**మూస** వి (రసా.) ద్రవ్యములను వేడిచేయుటకు ఉపయోగించు (పింగాణితో గాని, ఇనుము, రాగి, ప్లాటినమ్‌వంటి ధాతువులతో గానిచేయబడిన) కుటకవంటిపాత్ర (Crucible)

**మూసిక** వి. మంగళసూత్రమునందు తాళి బొట్టునకు ఇవలావల కూర్చి కట్టుకొను నానుక్రోవి.

**మూసిగంతలు** వి. కనుమూసిగంతలు, బాలికలకు సంబంధించిన ఒక రకమైన ఆట.

## మృ

**మృగణ** నం. వి. వెదుకుట.

**మృగతృష్ణ** నం. వి. మరీచిక, ఎండమావులు.

**మృగదంశకము** నం. వి. 1. కుక్క. 2. ఎలుగు.

మృగధూర్తకము నం వి. నక్క
మృగనాభి నం. వి మృగమదము, కస్తూరి.
మృగమదము నం. వి కస్తూరి
మృగము నం. వి. 1. జింక. 2 అడవి యందు తిరిగెడు పసుగు 3. మృగశీర్ష నక్షత్రము.
మృగయ నం. వి. 1. వేట 2. వెదకుట.
మృగయుఁడు నం వి. బోయ
మృగరాజ్ నం వి సింహము.
మృగవాహనుఁడు నం వి. జింక రౌతు (వాయువు).
మృగశిర నం. వి. అయిదవ నక్షత్రము.
మృగాంకుడు నం. వి. చంద్రుడు వ్యు. లేడి గుర్తుగా గలవాడు
మృగ్యము నం. విశ. వెదుకదగినది.
మృడాని నం వి పార్వతి
మృడుఁడు నం. వి శివుడు. వ్యు భక్తులను సంతోషపెట్టువాడు.
మృణాలము నం. వి. 1. వట్టివేరు. 2. తామరతూడు.
మృణ్మయపాత్రలు నం వి. మట్టితోచేసిన పాత్రలు (Earthen ware)
మృణ్మయశిల నం. వి. (భూగ.) 1. అల్యూమినియమ్. 2. మట్టిగల శిల చూ. మృత్తికాశిల
మృతజీవుఁడు నం. వి. చచ్చినను కీర్తి వహించిన వాడు.
మృతము నం. విశ. చచ్చినది. యాచనావృత్తి.
మృతి నం. వి. చావు.
మృత్తిక నం. వి. 1.మన్ను. 2.తొగరిమన్ను.
మృత్తికాశిల నం. వి. (భూగ.) మృత్తికతో నేర్పడిన రాయి, స్వచ్ఛమగు మృత్తిక "స్ఫటశైలితము" అనబడును. $Al_2(SiO_2)_3$ దీనిలో అల్యూమినియమ్, శైలితము ఉండును (Clay stone).
మృత్పరికరవిజ్ఞానము నం. వి. (రసా.) చీనమట్టితో పాత్రలు మొ. వస్తువులు తయారుచేయుటకు వలయు జ్ఞానము (Ceramics).
మృత్యుంజయుఁడు నం. వి శివుడు, మిత్తి గొంగ వ్యు. మృత్యువును జయించినవాడు
మృత్యువు నం. వి. 1. చావు. 2. మరణాధిదేవత
మృత్స్న నం వి మంచిమన్ను
మృధము నం వి యుద్ధము.
మృదంగము నం. వి 1. మద్దెల 2. తప్పెట. 3 సద్దు.
మృదుకోణ జీవకణసమితి నం వి (వృక్ష) కణకవచము మృదువుగానున్న జీవకణజాలము (Paren chyma)
మృదుగంధకము నం వి (రసా) ప్లాస్టిక్ గంధకము, క్వథనాంకమును చేరిన గంధకమును నీళ్ళలో పోసిన లభ్యమగు బంకవలె సాగు గంధకము (Plastic sulpher).
మృదుజలము నం. వి. (గృహ) నిర్మలమైన నీరు, సబ్బు నురుగు తేలికగా వచ్చునట్లు చేయు నీరు (Soft water).
మృదుతానిక నం. వి. (జం.) వెన్నుపాము పై నుండు పలుచని పొర (Piamater).
మృదులము నం. విశ. మెత్తనిది. మృదువు.
మృదువిరేచనకారి నం. వి. (గృహ.) బలహీనముగా నున్నవారికిని, మలబద్ధకము గల వారికిని కొంచెముగా విరేచనము లగుటకు మందు లేక విరేచనముల కనుకూలముగ ఆహారమిచ్చుట (Laxative): కడుపును శుభ్రము చేయుటకై యిచ్చినచో దీనిని (Purgative) అందురు.
మృదువు నం. విశ. మెత్తనిది.
మృద్వణుకోశములు నం. వి. (వృక్ష.) సూత్రోద్భిదములు, ఉద్భిజ్జములలో ప్రథమ తరగతికిచెందినవి (Thailophyta)

మృద్వామ్లము సం. వి. (రసా)రాసాయనిక బలములేని ఆమ్లము, ఉదా. కర్బనామ్లము.

మృష సం. అవ్య. బొంకు.

మృషావాది సం. వి కల్లరి.

మృష్టము సం. విశే. కడుగుట మొ.వానిచేత శుద్ధమైనది (మృష్టాన్నము).

# మె

మెంచే వై. వి. తురక. సం. మ్లేచ్ఛః.

మెంటో మెకిలియన్ ఆం. వి (జం.) (Mento meckelian) భేకశిశువు యొక్క క్రింది దవుడలో దంతాస్థి ప్రక్కనున్న చిన్న ఎముక.

మెండియము వి. చూపుడు ప్రేలి ఉంగరము. రూ. మెండెము.

మెండీఁడు వి. చూపుడుప్రేలు, తర్జని.

మెండు వి. 1. ఆధిక్యము, అతిశయము. 2. మిఱ్ఱు.

మెండుకొను క్రి. 1. అతిశయించు. 2. నిండుకొను. విజృంభించు.

మెంతులు వై. వి. ఒక సంబారపు దినుసు. (వ్యావ.) ఇవి యొక దినుసు సంబార ద్రవ్యములు (Fenugreek). ఇవి (Leguminosae) అను కుటుంబము యొక్క ఉపకుటుంబమగు Papilionaceae కి చెందిన Trigonella foenum graecum అను మొక్క యొక్క గింజలు సం. మెంధీ

మెకమెకపడు క్రి. ఉద్ధతిపొందు.

మెకానిక్ ఆం. వి. (Mechanic.) యంత్రములను నడిపించుటకు అవసరమైన జ్ఞానము కలవాడు.

మెకెల్సు కార్టిలేజ్ ఆం. వి. (Meckel's cartilage,) భేకశిశువు యొక్క క్రింది దవుడలోనున్న మృదులాస్థి భాగము.

మెక్కు క్రి. తిను. భక్షించు.

మెగ్నీషియమ్ ఆం. వి. (రసా.) (Magnesium,) వెండివలె ప్రకాశించు తెల్లని ధాతువు.(ఇది గాలిలో ముట్టించిన ఉజ్జ్వల కాంతితో మండును) (మహాబా తీగ).

మెచ్చు వి. 1. శ్లాఘన. 2. ప్రేమము. క్రి. శ్లాఘించు.

మెచ్చులచెట్టు వి. కల్పవృక్షము.

మెచ్చులాఁడి వి. మెచ్చుకొనదగినస్త్రీ. విశే. మెచ్చుకొనదగినది.

మెచ్చులాఁడు విశే. మెచ్చుకొనదగినవాడు.

మెజారిటీ ఆం వి (Majority) 1. అధిక భాగము. అధిక సంఖ్య, అధిక సంఖ్యాక పక్షము. 2. యుక్త వయస్సు.

మెజారిటీ వయస్సు మి. వి. (శాస) వ్యవహార యోగ్యమైన వయస్సు తనకుసంబంధించిన వ్యవహారముల విషయములలో శాసనరీత్యా వ్యవహరింపగల వయస్సు.

మెట్టిక వి. 1 సోపానము. 2. ప్రేలిగనుపు. రూ. మెట్టు. మెట్టిక.

మెట్ట వి. నీరాన లేక పండెడు చేను, మెరక పొలము.

మెట్టతామర వి. స్థలపద్మము.

మెట్టసేద్యము వి (వ్యావ.) నీరుపెట్టకుండ కేవలము వర్షాధారమున నే సస్యములను పెంచుట (Dry cultivation).

మెట్టినిల్లు వి. స్త్రీ యొక్క అత్తవారియిల్లు.

మెట్టు వి. 1. వీణా సోపానము. 2. పులి కడుగు, 3. సుంకము తీయు ఘట్టము, 4. కొండ. క్రి. త్రొక్కు.

మెట్టుఁబ్రాలు వి. తలఁబ్రాలు.

మెట్టుకు అవ్య. తుదకు. మొత్తమునకు.

మెట్లగుంటక వి. (వ్యావ) చేనులో చాళ్ళ మధ్య అంతర కృషి చేయుట కుపయో



మెట్లగుంటక

గించు పనిముట్టు(డీనినిపశువులులాగును). (Stepped harrow).

మెడ వి, కంఠము. రూ. మెడకాయ

మెడవాలు వి చాకలవాడు, చాకలి.

మెడిదము వి ధ్వని.

మెడుదు వి పులిసిన మజ్జిగ.

మెణతరి వి 1. బ్రహ్మచారి. 2. నేర్పరి (అని కొందరు).

మెతుకి వై. విశే. 1. మృదువైనది. 2 మందము.

మెతుకు వి. అన్నము, అన్నము యొక్క కణము.

మెత్త వై. వి. పరుపు, దూదివేసి కుట్టిన విశ్ర నం, మృదుః

మెత్తఁబడు వై క్రి. లొంగిపోవు, అణగు.

మెత్తు వి. 1. మన్నుతో దళముగా పూసిన పూత. 2 అలుకుట క్రి అలుకుదట్టముగ పూయు.

మెదడు వై. వి. తలయందుండు క్రొవ్వు (గృహ). నాడీ కణసముదాయము. సం. మేదస్ (Brain).

మెదలు క్రి. కొంచెము చలించు. సంచరించు.

మెదుక వై. విశే. మందుడు,

మెదుగు క్రి. 1. ధాన్యము పొట్టు పోవ నలగు. 2. నలగు.

మెదుగుడు వి. ప్రాత వస్త్రము.

మెన్షియస్ వి. (చరి.) చైనా వేదాంతి (ఇతడు కన్ఫ్యూషియస్ బోధనలను ప్రజామోదముగాచేసెను (క్రీ పూ 372-289).

మెప్పు వి. 1. మెచ్చు. 2. వరము. 3. ప్రీతి

మెయి అవ్య. తృతీయా విభక్తియందు ఒకచో వచ్చు ప్రత్యయము. వి. 1. విధము. 2. పార్శ్వము. 3. వెంబడి. 4. భూమి, మహి. 5, దేహము.

మెయికొను క్రి. సమ్మతించు.

మెయితాలుపు వి. ప్రాణి, శరీరి.

మెయిపాలు వి. సమభాగము.

మెయిమఱపు వి. పారవశ్యము.

మెయిమఱువు వి కవచము.

మెయివడి వి. 1. సమ్మతి. 2. సౌమ్యత.

మెరక వి మెట్ట నేల.

మెరమెర వి. 1. మనోవ్యథ. 2 సంశయము. 3. భేదము.

మెఱఁగు వి మించు, మెరుపు. 2.అధికప్రభ

మెఱచు క్రి. తళుక్కని ప్రకాశించు.

మెఱపుఁదీఁగ వి. తీగవంటి మెఱపు.

మెఱము క్రి. నాటిన ముల్లును కటునటు కదల్చు.

మెఱమెచ్చు వి. (మెచ్చు+మెచ్చు). 1. మిక్కిలి మెచ్చు 2. ఇచ్ఛకమునకైన పొగడ్త.

మెఱవడి వి. 1. అతిశయము, హెచ్చు. 2, గౌరవము.

మెఱవణి వి ఊరేగింపు.

మెఱికలు వి. పొట్టు వీడి వీడని బియ్యము

మెఱికె విశే (వ్యావ.) అందరికంటె అధికుడు.

మెఱియఁడు విశే. చలింపనివాడు.

మెఱియత విశే. చలింపనిది,

మెఱుఁగు వి. 1. కాంతి, వెలుతురు. 2. కిరణము. 3. బంగారు,-వెండి మొ. నగలకు పెట్టుతళుకు. 4. పొగరింపు (ఉబ్బుట)

మెఱుఁగు పెట్టుట వి. (గృహ.) తీర్చి దిద్దుట. దేనికైనను చివర ఇచ్చు మెరుగు, సరిచేసి ముగించుట(Finishing touches); ప్రాత వస్తువులకు మెరుగు పెట్టుట, కమీజ మొ. బట్టలకు మెరుగు ఇచ్చుటకై మైనమును గంజిలో కలిపి పెట్టి ఇస్త్రీచేయుట.

మెఱుఁగుఁబోఁడి వి. (మెఱుఁగు+బోఁడి) మెరుపువలె మనోజ్ఞురాలగు స్త్రీ

మెఱుఁగుడు పురువు వి. మిడుఁగుఱుఁ బురువు.

మెఱుఁగురిక్క వి. 1. ప్రవాళము. 2. కాంతిగల చుక్క

మెఱుఁగురాయి వి. వెండికి మెరుగు పెట్టు రాయి

మెఱుము క్రి. 1. మెఱచు 2. పొడుచు.

మెలఁకువ వి. 1. మేలుకొనుట. 2. వర్తనము. 3, జీవనము. 4. జాగ్రత్త.

మెలఁగు క్రి. వర్తించు, సంచరించు.

మెలఁచు క్రి, మెలగజేయు.

మెలఁత వి. (స్త్రీ). రూ. మెలఁతుక, మెల్త

మెలక వి. కపటపు వంచన.

మెలకు క్రి. జ్వలించు.

మెలవు క్రి. ప్రవర్తింపజేయు, నడపు. వి. 1. జాగరూకత. 2. చాతుర్యము.

మెలయు క్రి. 1. జాగరూకతతో వర్తించు. 2 పెనగు (కలసిమెలసి).

మెలి వై. వి. మెలిక, చిక్కు. సం. మిశ్రితమ్

మెలిగొను క్రి. పెనగొను.

మెలిదారము వి. రాళ్ళ పనివారు దిండు ప్రక్క కొయ్యలకు కట్టు బిగిదారము.

మెల్ల విశే. 1. ఒరగినది (చూపు) (మెల్లకన్ను). 2. మెల్లైనది క్రి. విశే. 1. మెల్లగా. 2. నిశ్శబ్దముగా.

మెల్లకంటి విశే, కాకి.

మెల్లె వి 1. చివర, 2. మొనత.

మెసఁగు క్రి. తిను. రూ. మెసవు.

మెసానిక్ లాడ్జి ఇం వి. Mesonic Lodge, (వ్యావ.)ఒక విధముగు గోప్యమతసంఘము.

మెహసత్ హిం. వి. 1. జవాబుమతి. 2. పాటు. 3. కష్టము.

# మే

మేండము సం వి. పొట్టేలు.

మేండ్రించు క్రి. 1. భేదించు. 2. నశింపచేయు.

మేంథి సం. వి మెంతి.

మేఁక వై. వి. ఆడుమేక. సం. మేకః.

మేకతిండి వి. తోడేలు. వ్యు. మేకలు తిండిగా గలది.

మేకపోఁతు వి. ఛాగము.

మేకపోఁతు గాంభీర్యము వి. వి. జాతీ. మేకపోతు ధైర్యమువంటి ధైర్యము, లోపల పసలేకుండుట.

మేఁకరాసి వై. వి. మేషరాశి,

మేకవన్నె పులి వి. జాతీ. మేకవలె సాధువుగా గాన్పించుచు క్రూర స్వభావము కలది.

మేకసౌరము వై. వి. స్వరవిశేషము. గాంధారము.

మేఁగు క్రి. 1. పూయు, లేపనముచేయు. 2. ఆవరించు,

మేఁడి వై. వి. నాగటిదుంప వెనుక నిలిపిన కొయ్య. సం మేధీ,

మేఁడికోరు వై. వి. సేద్యముచేయు వానికిచ్చు భాగము.

మేఁడిచీల వి. మేడి జారిరాకుండ వేసిన చీల

మేఁడిపాలు వి. మేడికోరు.

మేఁత వి. పశువుల ఆహారము,

మేఁతరి విశే. తిండిపోతు. వి. కొందరు శిల్పులలో ముఖ్యుడు. రూ. మేతరీడు.

మేతము సం. వి. ఛాగము.

మేకు వి. 1. శూలము. 2. చీల.

మేకొను క్రి. 1. సమ్మతించు 2. యత్నించు.

మేకోలు వి. 1. అంగీకారము, సమ్మతి. 2. పూనిక.

మేఖల సం. వి. 1. స్త్రీలు ధరించు ఎనిమిది పేటల మొలనూలు. 2. కొండనడుము. 3. ఆయుధము జారకుండ మణికట్టున గట్టు కట్టు.

**మేఖలకన్యక** సం. వి. నర్మదానది. వ్యు. మేఖల పర్వతమునుండి పుట్టినది.
**మేగలి** వి. సన్నాహము, యత్నము,
**మేఘనాదము** సం. వి. ఉరుము.
**మేఘనాదుఁడు** సం వి. రావణుని కొడుకు.
**మేఘపుష్పము** సం.వి. 1. నీరు. 2. కృష్ణుని తేరుగుఱ్ఱములలో ఒకటి.
**మేఘము** సం. వి మబ్బు.
**మేఘాస్థి** సం వి. వడగల్లు,
**మేచకము** సం. వి. 1. చీకటి. 2. నెమలి పురికన్ను. విశ. నల్లనిది.
**మేజిస్ట్రేట్** ఇం వి (Magistrate) తాలూకా జిల్లా స్థాయికి సంబంధించిన న్యాయాధిపతి
**మేజువాణి** హిం వి. 1. విందు. 2. భోగము. వాండ్ర మేళము 3. భోగమువాండ్ర ఆటస్థలము.
**మేజోడు** వి. (వ్యావ.) పాదరక్షలకు లోపల వేయు వస్త్రకవచము.
**మేట** వి. ఎక్కలి, దిబ్బ.
**మేటరి** విశ, శ్రేష్ఠుడు.
**మేటి** వి. 1. గడ్డివామి. 2. అధిపుడు. విశ. శ్రేష్ఠము.
**మేటిల్లు** క్రి. అతిశయించు.
**మేడ** వి. సౌధము,
**మేడము** వై. వి. 1. యుద్ధము. 2. సంయోగము (మేళనము),
**మేడి** వి. అంజూరు, అత్తిచెట్టు.
**మేడుపడు** క్రి. అజ్ఞతనొందు.
**మేదకము** సం. వి పెళ్ళెము, మద్యము చేయుటకైన పిండి.
**మేదకుఁడు** విశ. 1. మెత్తనివాడు. 2. కపటము లేనివాడు.
**మేదర** వి. వెదురుచాపలు. మొ.వానిని అల్లి జీవించు ఒక జాతి.
**మేదస్సు** సం. వి. మెదడు.
**మేదావి** వి. ఔపాసనాగ్ని మసి.
**మేదిని** సం. వి. భూమి.
**మేదురము** సం. విశ. 1. చిక్కగానుండి నునుపైనది. 2 అధికమైనది.
**మేదోమయకణజాలము** సం. వి, (గృహ.) క్రొవ్వుకణజాలము (Fatty Tissue).
**మేధ** సం వి. ధారణాశక్తి గల బుద్ధి.
**మేధావి** సం విశ. ధారణాశక్తి గల గొప్ప బుద్ధి కలవాడు. వి. చిలుక.
**మేధి** సం. వి పశువులను కట్టునట్టి స్తంభము
**మేధ్యము** సం విశ. పవిత్రమైనది. పూతము.
**మేన**[1] సం. వి. మేనక.
**మేన**[2] వి. తోడబుట్టిన దాని యొక్కయు, తల్లిదండ్రులతోడబుట్టినవారి యొక్కయు దేహసంబంధము, ఉదా. మేనకోడలు, మేనత్త.
**మేనఱికము** వి. తండ్రి తోడబుట్టిన వాని యొక్కయు తల్లి తోడబుట్టిన వాని యొక్కయు. దేహసంబంధ భావము.
**మేనా** వి. (వ్యావ.) పల్లకి, సవారి.
**మేని** వి. కాంతి.
**మేను** వి. 1. శరీరము. 2. జన్మము, 3. పార్శ్వము.
**మేనేజర్** ఇం. వి. (Manager,) వ్యాపార సంస్థయొక్క పరిపాలకుడు. 2. కార్య నిర్వాహక సంస్థలో పనిచేయించుటకు బాధ్యుడైన అధికారి.
**మేమఱుగు** వి కవచము. రూ. మేమఱువు. మైమఱువు.
**మేయర్** ఇం. వి. (పౌర.) > Mayor, పుర పాలకాధ్యక్షుడు, నగరాధ్యక్షుడు, పౌరాగ్రణి. నగరపాలక సంఘాధ్యక్షుడు.
**మేర** వై. వి. 1. ఎల్ల. 2. మర్యాద. 3 క్రమము. 4. ఏర్పాటు. 5.దూరము. సం. మీరా.
**మేరమీఱు** క్రి. దాటు, అతిక్రమించు.

**మేరుపుచ్ఛము** సం. వి. (జం.) భేకశిశువు శోకలోనున్న కీకసలు కలసిపోయి పొడ పైన కడ్డీవలె ఏర్పడుఎముక(Unostyle).

**మేరుమంతములు** సం. వి. (జం.) తాత్కాలికముగా గాని శాశ్వతముగాగాని వెన్నెముక గల జంతువులు (Chordata).

**మేరువు** సం. వి. 1. మేరుపర్వతము. 2. శిఖరము నందుంచెడి మణి. 3. హార మధ్యమునందు వ్రేలెడు మణి.

**మేరుశీర్షము** సం. వి. (జం.) మజ్జాముఖము. పై మెదడునకును వెనుబామునకును మధ్యలోనున్న భాగము (Medulla oblongata).

**మేలమాడు** క్రి. పరిహాసముచేయు.

**మేలిమి** వి. 1. అపరంజి. 2. ఆధిక్యము.

**మేలు** వి. 1. క్షేమము, శుభము. 2. వలపు 3. పుణ్యము, సుకృతము, 4. లాభము

**మేలుకట్టు** వి. 1. మెట్టు. 2. చాందినీ.

**మేలుకొలుపు** క్రి. మేలుకొనజేయు.

**మేలుతరము** విశే. శ్రేష్ఠము.

**మేలుపడు** క్రి. వలపుగొను.

**మేలుమచ్చు** వి. మేడ, చంద్రశాల.

**మేలుమేలు** అవ్య. బెబాను.

**మేలురాసి** వి. తూర్పెత్తిన ధాన్యపుప్రోవు.

**మేలువంగడములు** వి (జీవ.) అభివృద్ధి చేయబడిన రకములు (సస్యజాతులు, జంతువులు) (Improved strains)

**మేలువాడు** విశే. వలపుకాడు

**మేల్దాపరి** వి. వేశ్య.

**మేల్బంతి** వి ఒరవడివ్రాయు, మాదిరికి మీద వ్రాసిన వ్రాత, ఒజ్జబంతి.

**మేవడి** వి. 1, నమ్రత. 2. ఉపాయము. విశే తగినది. ఉచితము.

**మేషము** సం వి. 1. మేక. 2. పొట్టేలు. 3 మేషరాశి (Aries).

**మేహము** సం. వి. ఒక రోగము.

**మేళకము** సం వి కూడిక.

**మేళగాడు** వి. 1. మేళము వాయించువాడు. 1. వేశ్యాకాంతల-వెనుక మేళము వాయించువాడు.

**మేళగించు** వై. క్రి. 1. జతగూడు,కలియు 2. శ్రుతులు కలుపు రూ. మేళవించు.

**మేళము**[1] వి. 1. నాదస్వరాది వాద్యముల జత. 2. వేశ్యల ఆట.

**మేళము**[2] సం. వి. 1. కూడిక 2. రాగాన గుణముగ స్వరస్థానములందు మెట్లు కుదర్చుట. 3, వేశ్యాది జనసమూహము.

## మై

**మై** వి. రూ. మయి. 1. దేహము. 2. విధము. 3. పార్శ్వము. 4. తడవ.అవ్య. తృతీయా విభక్తి ప్రత్యయము.

**మైకము** వి. మత్తు.

**మైజారు** సం. వి. చెరగు, రూ. మయిజారు.

**మైటోకాండ్రియా** బం. వి.(జీవ.) (Mitochondria,) చయాపచయ క్రియలతో సంబంధముకలిగి కోశరసములో నున్న శకముమైన ఆకారముగల జీవద్రవ్యములు

**మైత్రావరుణి** సం. వి, అగస్త్యుడు. వ్యు మిత్రావరుణుల వలన గలిగినవాడు.

**మైత్రి** సం. వి. 1. మిత్రభావము,స్నేహము 2. అనూరాధ. 3.యతిమైత్రి. 4 (రసా రాసాయనిక ఆకర్షణ (Affinity).

**మైథునము** సం. వి. 1. గ్రామ్యధర్మము 2, కూడిక, సంయోగము,

**మైదానము** హిం. వి. బహిః ప్రదేశము,

మైదు వై. వి. 1, మాయ. 2. మైకము. 3. వశ్యౌషధము, చొక్కుపొడి, సం. మాయా. మదః.
మైనము వై. వి. తేనెతెట్టె నుండి తీయు వస్తువు, సిక్థకము, తేనెపట్టునుండి లభ్యమగు మెత్తని ద్రవ్యము, సం. మదనః.
మైనర్ ఇం వి. (Minor.) స్వాతంత్ర్యమునకు తగిన ఈడురానివాడు.
మైనాకుఁడు సం. వి. హిమవంతునికొడుకు, మేనకాత్మజుడు.
మైనారిటీ ఇం. వి. (పౌర., శాస) Minority 1. బాల్యదశ. 2. అల్పసంఖ్యాక పక్షము
మైపూఁత వి. అంగరాగము.
మైరవము సం. వి. (జం) వెన్నెముకకు గాని, వెన్నుపామునకుగాని, సంబంధించినది. మేరువు = వెన్నుపాము, (Spinal)
మైరేయము సం. వి. చెంకు రసమువచేసిన కల్లు.
మైల వై. వి. 1. అశుచిత్వము. 2. మాలిన్యము. 3. చీకటి, మలిన వస్త్రము. సం మలినమ్.
మైలకోపి వి. మురళి.
మైలారి వి. 1. కోముటుల నడిగికొని జీవించువాడు 2. క్షుద్రదేవతనుపూజించువాడు (కొందరు).
మైలావు వి. పొగ చాయగల ఆవు.
మైలు ఇం. వి. (Mile,)అరక్రోసుదూరము 8 ఫర్లాంగులు.
మైలుతుత్తము వి. (వ్యవ.) ఇది మొక్కల తెగుళ్ళకు ఉపయోగింపబడు మందులలో ఒకటి, రాగి గంధకము, ఆమ్లజని దీనిలో కలిసియుండును (Copper Sulphate).
మైవడి వి. 1, విధము. 2. సమ్మతి. 3. సౌమ్యత.
మైసాక్షి వై. వి. పొగవేయుట కుపయోగించు మందు వస్తువు.
మైసూరుజాతిఎడ్లు వి. (వ్యవ.)పశువులలో నొక మంచి రకపు జాతి.

# మొ

మొంటె వి. బాలికలాడుకొను చిన్న చేట.
మొండి వై. విశే. 1. చేతులు కాళ్ళులేనివాడు. మూర్ఖుడు, మూర్ఖురాలు. 3, మొక్కపోయినది. 4. పట్టిది. సం. ముండమ్.
మొండికట్టె వై. వి. మొండితనము గలవాడు.
మొండెపుగాము వై. వి. రాహువు.
మొండెపురక్కసుఁడు వై వి. కబంధుడు.
మొండెము వై. వి. తలతెగిన కళేబరము, కబంధము. సం వి. ముండమ్. (గృహ.) భుజము క్రింది తుంటిపై భాగము, కబంధము, ఊర్ధ్వకాయము (Trunk).
మొకద్దమా హిం. వి. వ్యవహారము.
మొకమాలు వి. మేలగుపట్టు.
మొకము వై. వి, ముఖము. సం.ముఖమ్.
మొకరము వి. స్తంభము, గడెమ్రాను.
మొకరరు హిం. విశే. నిర్ణయింపబడినది.
మొకరి విశే. 1. మ్రోగువది, 2. అసంబద్ధవచనము లాడునది. సం. ముఖరమ్.
మొక్క వై. వి. మొలక. దూ. మోక = చిన్న చెట్టు. (వ్యవ.)ఉద్భిజ్జము, చెట్టు.వృక్షము (Plant)
మొక్కఁడు విశే. 1. బలిసినవాడు. 2. కఠినుడు.
మొక్కజొన్న వి. ఒక విధమగు జొన్న.
మొక్కడి వి. చిన్న కొమ్ములుగల పసుగు. దూ. మొక్కడీడు.
మొక్కపోవు క్రి. 1. మొనమడగిపోవు 2. భంగపడు.

మొక్కరము వి. మొకరము.

మొక్కలము వై. వి 1. శౌర్యము, 2. ధైర్యము. ముష్కరత్వము, ఉత్సాహము. సం. ముష్కరః.

మొక్కలి వై. విు. 1. మూర్ఖుడు 2. శూరుడు. రూ. మొక్కలికాఁడు. మొక్కలీఁడు, మొక్కటీలుఁడు.

మొక్కలికాఁడు విు. ముష్కరుడు.

మొక్కలీఁడు విు. మొక్కలి.

మొక్కలుఁడు వై. విు. మొక్కలి. సం. ముష్కరః.

మొక్కళి వై. వి 1. ఈడిగ.2. ముందు వెనుక జూడనివాడు. 3 తళుకు.

మొక్కు క్రి నమస్కరించు, వి. మ్రుడుపు రూ. మ్రొక్కు.

మ్రొక్కుబడి వి. దేవతలకిచ్చెదనని మ్రొక్కుకొనిన కానుక.

మొఖాసా హిం. వి. 1. శిరువలేని భూమి చిన్న జమీందారి.

మొగ వై. వి. 1. ద్వారము 2 వాకిలి,3. అప్రాణివస్తు ముఖము. 4. మొన. సం ముఖమ్.

మొగకొను క్రి. ఎదురగు.

మొగచాటు విు. వెగటు. వి. ముసుగు.

మొగడ వై వి. మొగ్గ. సం. ముకుళమ్.

మొగడు వి. ఇంటినడికొప్పు.

మొగతప్పు క్రి. పిరు తివియు, వెనుతీయు

మొగదల వి. ఎదురు. ముందర.

మొగపిటికి వి. మొగము(+పిటికి) ఈ బేలు వ్యు. మొగముచూచుటకు పిరికితనము కలది.

మొగముట్టు వై. వి. అశ్వముఖాలంకారము సం. ముఖపట్టమ్.

మొగమోట వి. దాక్షిణ్యము, ముఖప్రీతి. రూ. మొగమోటము, మోమోటము

మొగరంబము వి. తుమ్మెద

మొగరము వి. వ్యూహము రూ మొగ్గరము.

మొగరించు క్రి 1.ఆక్రమించు 2. ఎదిరించు.

మొగలి వి. గేదంగి, కేతకి.

మొగలివాకిలి వి. తలవాకిలి, హజారము.

మొగలేఖ వి. సుపర్ణముఖినది.

మొగపడము వై. వి. ఏనుగు మీద కప్పెడు నల్లకంబళము, సం. ముఖపటః.

మొగవాళము వి. ఇల్లుమొ, వాని ముందటి భాగము.

మొగసరి వై. వి. మొగముట్టు. సం. ముఖసరః.

మొగసల వై. వి, 1. నగరి తలవాకిటి చావడి. 2. ఏనుగులశాల. సం ముఖశాల.

మొగాళము వి. (వ్యావ.) నదీసముద్రాదుల ముఖము.

మొగి వై. వి 1. మొత్తము, సమూహము. 2. పూనిక, 3. విధము

మొగిలి వై. వి. నల్లి. సం. మత్కుణః.

మొగుచు క్రి. ముడుచు.

మొగుడు వై. క్రి. ముకుళించు.

మొగులు వి. మేఘము. రూ. మొగిలు, మొయిలు.

మొగులుదారి వి. ఆకసము.

మొగులువిరి వి. జలము, మేఘ పుష్పము.

మొగ్గ వై. వి. 1. ముకుళము, వికసించని పుష్పము 2. శిరముపాదములతో జేర విల్లువలె వెలికిల వంగుట. సం. ముకుళమ్.

మొగ్గంట్లు వి. (వ్యావ.) గోతెములోగాని, నేలలోగాని పెరుగుచున్న మొక్కకు. వృద్ధిచేయదలచిన మొక్కయొక్క మొగ్గలను అతికించి పెంచబడిన మొక్కలు.

మొగ్గరము వి. వ్యూహము.

మొగ్గలము విు. మొక్కలము.

మొగ్గవిచ్చు క్రి. 1. వికసించు. 2. యథాయథలగు. 3. విచ్చిపోవు.

మొగ్గు వి. గౌరవము. క్రి. బరువు వైపు వంగు.

మొటిమ వి. యౌవనమునందు ముఖమున లేచు గుల్ల. విశ. మొటిమె, బొటిమ.

మొట్టమొదలు వి. (మొదలు+మొదలు) అన్నిటికిని మొదలు.

మొట్టికాయ వి. తలమీద పిడికిటి పోటువు. మొట్టు.

మొద్దె వి ఒకరకపు మత్స్యము.

మొత్త వి. వాకిటిలోపలి ప్రక్క గోడ,

మొత్తము వి. సమూహము, వెరసి, టోకు (గణి) అసలు వడ్డీలు కలుపగా వచ్చు మొత్తము (Amount) దత్త రాసు ను కలుపగా వచ్చు మొత్తము (Total) రాసులు మొత్తము (Sum)

మొత్తు వి. దెబ్బ క్రి. 1. మోదు కొట్టు, నరుకు.

మొత్తుకోళ్లు వి. పెడబొబ్బ.

మొత్తులాడు క్రి కొట్లాడు

మొదటి వి, (గృహ,) 1. ప్రథమము. 2. ముఖ్యమైనది. 3. ఆదిమము (Primary) ప్రాథమికము, ఆదికాలికము (Primitive)

మొదటినమూనా,ఆదినమూనా వి. (గృహ) జాకెట్టు, ఫ్రాక్ మొ.దుస్తులనుకత్తిరించుటకు ఉపయోగించు నమూనా Boice-block Pattern)

మొదలారి వి. అరవ శూద్రులలో ఒక తెగ (ముదలియార్, మొదలియార్).

మొదలు వి. 1. ఆది. 2, పూర్వము. 3. మూలము. 4 మూలధనము. 5. ప్రభృతి.

మొదలుకొను క్రి. 1. యత్నించు. 2. ప్రారంభించు.

మొదలెత్తు క్రి. సమూలముగ నశించు,

మొదవు వి. పాడియావు.

మొదుకన వి. 1. కరకు దనము. 2, బరువు

మొద్దు వై. వి. మ్రానిమోడు. విశ. 1. మూఢుడు. 2. వాడిలేనిది. సం ముగ్ధః.

మొన వి. 1. అగ్రము. 2. దండు. 3. సేనాముఖము,

మొనకట్టు వి, ఉత్సాహము.

మొనకాఁడు వి సేనాధిపతి. విశ. 1. శూరుడు. 2 ముఖ్యుడు.

మొనపు వి పూనిక. క్రి, 1. పూనజేయు. 2. కలుగజేయు.

మొనయు క్రి. 1 యత్నించు, పూను. 2 జనించు 3. నశించు.

మొన్న వి. (మొదల+నాడు) కడచిన దినమునకు ముందు దినము).

మొప్పలు వి. చేప మెడ కిరు ప్రక్కల నుండు ద్వారములు.

మొప్పె విశ. 1 మూర్ఖుడు. 2. కడు,

మొఫసిల్ ఇం వి. (భూగో,) (Mofussil,) జిల్లాలోని పల్లె ప్రాంతములు

మొమెంటమ్ ఇం.వి (గణి భౌతి)(Momentum) గతి భారము, వేగము ప్రయాణ దూరముల లబ్ధము

మొయిలు వి. మేఘము.

మొర వి, పశ్వాదుల దీర్ఘ ముఖము. దూ. మోర, మొరచ,

మొరపనేల వి. రాతినేల.

మొరము వి. సన్నని రాయి, గులకరాయి.

మొరుములు వి (వ్యావ,) చేటచే తనవైపు కోడగా వచ్చిన పెద్ద గింజలు, గుండ్రలు,

మొఱ వి. ఆర్త ధ్వని. మొఱ్ఱ.

మొఱఁగు వి. 1. కుక్కకూత. 2.మోసము. విశ. వంచకుడు. క్రి. పొందు.

మొఱత వి. న్యూనత. విశ. హీనము.

మొరకతనము వి. దౌష్ట్యము (మొరకుని స్వభావము.)

మొఱకు వై.విశ, మూర్ఖుడు. సం. మూర్ఖః.

మొఱటు వై. విశ. మోటు.

మొఱటి విశ. అంగన్యూనత, మొఱ్ఱి.

మొల్జీ విశ. చూ. మొలి.
మొల వి. 1. కటి ప్రదేశము. 2. చీల. 3. త్రాసుముల్లు.
మొలక వై. వి. 1. మొక్క. అంకురము. 2. వ్రణమునందు పెరుగు దుర్మాంసము. విశ. లేత. సం. మూలికా.
మొలక బంగారు వై. వి. పుట్ట బంగారు (పుట్టలో పురువులవలన కలిగినది.)
మొలతెంచు క్రి. పుట్టు. సంభవించు.
మొలత్రాడు వి పురుషుని కటి సూత్రము.
మొరదట్టి వి, మొలకట్టుకాసె (మల్లుల పోరాట మందు మొలను ధరించునది.)
మొలనూలు వి. ఆడువారు అలంకారార్థము ధరించెడు కటి సూత్రము.
మొలాము వి. 1 బంగారు మొ. వాని పూత 2. వుంటికి పూసెడు మందు,దూ.మలాము మోలము.
మొల్ల వి. కుందము (మల్లె జాతికి చెందినది).
మొల్లమి వి. సాంద్రత.
మొల్లము[1] వి. తరచు, అధికము.
మొల్లము[2] వై.వి. ధనము. సం. మూల్యమ్.
మొవు వి. 1. తాటి మొ. వాని ముకుత. 2. పీడని లేత ఆకు. దూ, మొవ్వు.మోవు.
మొసలి వి నక్రము, మకరము.
మొసలికాటు వి. మొసలి నోరు గల కత్తిపిడి కొన
మొసలి దోరణము వి. మకర తోరణము.
మొసలిరాశి వి, మకరరాశి,
మొసలివాపోగులు వి. మకర కుండలములు.
మొసలివాయి వి. మొసలికాటు.
మొహతాదు హిం. వి గ్రామపు నౌకరు. దూ. మోతాదు,
మొహదా వి. అడ్డకత్తి. పట్టిసము.
మొహములు హిం.వి. మొకమలు.
మొహరము హిం. వి తురకల పీర్లపండుగ.
మొహరించు క్రి (వ్యావ) మోహరించు.
మొహరీ వి, తులమెత్తు స్వర్ణముద్రిక, 30 చిన్నముల ఎత్తు బంగారు నాణెము.
మొహరు హిం. వి. ముద్ర.

# మో

మోఁకరించు క్రి. మోకాళ్ళ నేలనూని ముందరికొరగు, మోకరిలు.
మోఁకాలు వి, (మోపు+కాలు) జానువు
మోఁచేయి వి. (మోపు+చేయి) కూర్పరము.
మోఁత వి. బరువు.
మోఁద వి. మోదు (దెబ్బ)చేతకట్టిన నెత్తురు గడ్డ.
మోఁదు క్రి. కొట్టు, వి. దెబ్బ,
మోక వై. వి. మొలక. మొక్క.
మోకు వి, లావుత్రాడు.
మోక్షము నం. వి. 1, కైవల్యము. 2.మోచనము, విడుపు. 3. ముక్తి.
మోఘము నం. విశ. వ్యర్థము.
మోచ నం. వి. 1. అరటి. 2, బూరుగు.
మోచక నం. వి. మచ్చ.
మోచకము నం, విశ, విడుచునది, వి, 1. అరటి, 2, మునగ,
మోచనము నం, వి, విడుపు, 2, మోక్ష. కాలము,
మోచితము నం, విశ, విడిపింపబడినది,
మోచు క్రి. 1, అను 2. ఊను, వహించు,
మోజా వి, (వ్యావ,) ఆకు చెప్పులు,
మోజు హిం, వి. ఇష్టము, సమ్మతి, వాంఛ.
మోట వి.(వ్యావ.) కపిలె. (నూతినుండినీరు తోడుటకు ఉపయోగించు సాధనము. దీనికి తోలుతో తయారు చేయబడిన గూన తొండము ముఖ్యభాగములు, (Mhote).

మోటనము సం. వి. 1. బ్రద్దలు చేయుట, 2. గాలి.

మోటబరి వి. బరువు మోసెడి ఎద్దు.

మోటార్ ఆం వి. (భౌతి.) (Motor) విద్యుచ్ఛక్తి వలన తిరుగు యంత్రము.

మోటించు క్రి. పోటీగా (అనికగా) నిలుపు.

మోటు వై. వి. 1. మొద్దు 2 తట్టువ గుఱ్ఱము. 3. పందికెదుట మనుష్యాకారముగ నిల్పిన కపటలక్ష్యము. విశే. మూర్ఖుడు. సం. మూఢః.

మోటుకాఁడు వి. దళపతి.

మోట్టాయితము సం. వి. ప్రియుని కథాదుల యందు మనసు తగిలియుండుటచే చెవిగోకుకొనుట మొ. స్త్రీల శృంగార చేష్ట.

మోడము వి. మేఘావరణ, మందారము.

మోడి వి. 1. బిగువు. 2. బింకము. 3. గడికాదులు ముగ్గవాలి పాదసమీప మందుంచిన వస్తువు నెత్తుట. 4. వ్రాత వైఖరి, గొలుసుకట్టు వ్రాత.

మోడు వి. 1. మొద్దు. 2. తల నరికిన చెట్టు రూ. మ్రోడు. మొరడు.

మోడుపడు క్రి. కునుగు, మొక్కవోవు. మోడగు, ఖండితమగు

మోడుపు వి. నతి, మోడ్పుట.

మోతాదు హిం. వి. మొహాతాదు, ఒక్కసారి యిచ్చెడు. మందుకొలత.

మోతుబరీ హిం. వి. మంచిస్థితి.

మోతుబరు హిం. విశే. స్థితిపరుడైన, గొప్ప. ఘనతగల.

మోద వి. తమలపాకుల కట్ట.

మోదకము సం. వి. కుడుము లడ్డు.

మోదము సం. వి. 1. వాసన. 2. సంతోషము

మోది వి. (వ్యావ.) వెచ్చమిచ్చువాడు.

మోదుగు వి. కింశుక వృక్షము. రూ. మోదువు

మోపాది వి. అపాయము.

మోపి వి. ముండమోపి, విధవ.

మోపిక వి భారము, బరువు.

మోపు క్రి. 1. మోయచేయు, ఆరోపించు. (నిందమోపు). వి. 1. గడ్డిమోపు. 2. నింటి నారి. విశే. అధికము.

మోపెట్టు క్రి. ఎక్కుడు,

మోము వై. వి. మొగము. సం. ముఖమ్.

మోమోటము వి 1. దాక్షిణ్యము, కనికరము 2. మనస్సంకోచము రూ. మొగమాటము

మోయిను హిం వి, 1. కితి. 2. బత్తె

మోర వి పశ్వాదుల ముఖము. ముట్టె.

మోరయిల్లు క్రి. మోము మీదికెత్తు.

మోరత్రోపు వి. వైముఖ్యము.

మోరపొక వి. చిన్నగోడల యిల్లు చోపిడి.

మోరు వి, పర్వత శిఖరము.

మోర్సింగ్ హిం. వి నోటి దగ్గర పెట్టి వాయించు తంత్రీవాద్యము.

మోలకము వై. వి. మూర్ఖత్వము. సం మూర్ఖతా.

మోలము వి. మోలాము, కరిగిన బంగారు మొ. వానిపూత.

మోవి వి, పెదవి.

మోవు వి. మోవ్వు, లేత ఆకు,

మోష సం. వి. దొంగతనము.

మోషకుఁడు సం. వి. దొంగ.

మోసము వై. వి. 1. దొంగతనము. 2. ప్రమాదము. 3, వంచన సం. మోషః.

మోసరిక వి. (వ్యావ.) అంకురము,

మోసల వై. వి. నగర తలవాకిటి చావడి. రూ. మొగసాల. సం, ముఖశాలా.

మోసు వి, 1, మొలక. 2. తునక. 3. అందము

మోసులెత్తు క్రి. పుట్టు, కలుగు.

మోస్తరు వి. (వ్యావ.) 1. మాదిరి. 2 స్వభావము.

మోహన సం. వి. ఒకానొక రాగము.

మోహనము సం. వి. మూర్ఛ.

మోహము నం. వి. 1, అజ్ఞానము. 2. వలపు. 3. మూర్ఛ.
మోహించు నం. క్రి. 1, సొమ్మసిలు. 2 అజ్ఞానము పొందు, 3. వలచు.
మోహరము వి. ముగ్గరము, వ్యూహము,
మోహిని నం. వి. 1. మోహింపజేసెడు స్త్రీ. 2. దేవత 3. పిశాచ స్త్రీ.
మోళా హిం. వి. 1, రీతి 2. తరగతి.
మోళీ వి. (వ్యావ.) గారడివాని విద్య.

# మౌ

మౌంజి నం. వి. ముంజదర్భ మొలత్రాడు. ముంజీ.
మౌంజె హిం. వి గ్రామము క్రింద చేరినపల్లె, సివారు.
మౌకలి నం. వి. కాకి.
మౌక్తికము నం, వి. ముత్తియము
మౌఖరి నం. వి. ముఖరత్వము, వాగుట.
మౌఖికము నం. విశే. (శం.) నోటి సంబంధము గలది (Oral).
మౌఢ్యము నం, వి. 1. మూఢభావము, 2. గురు శుక్ర గ్రహముల అస్తమయము. శుభకార్య నిరోధము.
మౌద్గలి నం. వి. మౌకలి. కాకి.
మౌనము నం. వి. మాటాడకుండుట.
మౌని నం. వి. మౌనవ్రతుడు. ముని,
మౌరజికుఁడు నం.వి. మృదంగము వాయించువాడు.
మౌరి వి. నాగసరము. నాదస్వరము, రూ. మవురి.
మౌర్ఖ్యము నం. వి. మూర్ఖత్వము.
మౌర్వి నం. వి. అల్లెత్రాడు,
మౌల్యము నం. వి. మూల బలము.
మౌష్కర్యము నం. వి. ముష్కరత్వము. దార్ష్ట్యము.
మౌహూర్తికుఁడు నం. వి. జోస్యుడు.
మౌళి నం. వి. 1. కొప్పు. 2. కిరీటము. 3. సిగ. (ఉత్తరపదమైనచో శ్రేష్ఠార్థకము.)
మౌళికము నం, వి. (రసా )ఒకేపరమాణువు వలె ఆచరించుచు ఒకే సమ్మేళనము నుండి మఱియొక సమ్మేళనమునకు మార్పు లేకుండపోయెడి పరమాణు సమూహము (Radical).

# మ్యు

మ్యునిసిపల్ చైర్మన్ శం. వి. (పౌర.) (Municipal chairman) పురపాలక సంఘాధ్యక్షుడు.

# మ్ర

మ్రుంగు క్రి క్రుంగు. గ్రాలు.
మ్రందిలి విశే. నొచ్చినది.
మ్రందు క్రి. 1. చచ్చు, 2. చదియు. 3. నొచ్చు. 4. సోలు.
మ్రక్కు క్రి. 1. నవయు. 2. చచ్చు.
మ్రగ్గు క్రి. 1. చచ్చు. 2. నష్టమగు. 3. విహ్వాలించు.
మ్రదిమము నం. వి. మృదుత్వము. మెత్తనై.
మ్రబ్బు వి, మబ్బు.

## మ్రా

మ్రాఁకు వి. మాను, చెట్టు.
మ్రాఁగన్ను వి. (మ్రాఁగు+కన్ను) సోలిన కన్ను.
మ్రాను వి. మాఁకు.
మ్రానిపోటు పులుగు వి. వడ్రంగి పిట్ట, మ్రానుగోయిల.
మ్రానుద్రిమ్మరి వి. కోతి.
మ్రానుపడు క్రి. స్తంభించు.
మ్రాలు క్రి. సోలు, మ్రాలుదెంచు.

## మ్రి

మింగు క్రి. కబళించు.
మ్రింగుడుపడు క్రి. కబళితము గు.

## మ్రు

మ్రుక్కు విశే. ముక్కిపోయినది.
మ్రుక్కడి విశే. స్వల్పము.
మ్రుగ్గు వి. రంగవల్లి. రూ. ముగ్గు
మ్రుగ్గులు వి. (వ్యావ.) పేచీలు, చిక్కులు.
మ్రుచ్చిలి వి. దొంగతనము.
మ్రుచ్చిలించు క్రి. అపహరించు, దొంగిలించు
మ్రుచ్చిలిపోటు వి. నిదురించుచుండగా పైబడి చేయు యుద్ధము.
మ్రుచ్చు వై. వి. 1. దొంగ. 2. అరటి పువ్వులోని కేసరము. రూ. ముచ్చు. వెం. మోషః. విశే. మోసగాడు
మ్రుచ్చుగోర వి. పెద్దదొంగ.
మ్రుచ్చుపోవు క్రి. కొల్లపోవు, చోరపోవు.
మ్రుచ్చుపొద్దు వి. అర్ధరాత్రము.

## మ్రొ

మ్రొగ్గబఁడు క్రి. 1. మోకరించు. 2 మ్రొగ్గతిలబడు. 3, మ్రొగ్గతిలు. 4. ముందు వకుపడు.
మ్రొగ్గు క్రి. మోకరిల్లు. వి. ఎక్కువ. రూ. మొగ్గు.

## మ్రో

మ్రోఁగు క్రి. 1. మొరయు. 2. శబ్దించు. రూ. మ్రోవు.
మ్రోఁత వి. ధ్వని.
మ్రోడు వి. 1. మొద్దు, స్థాణువు. 2. మూర్ఖుఁడు.
మ్రోయు క్రి. 1. మొరయు. 2. మ్రోగు
మ్రోల వి. 1. ఎదురు. 2. ముంగల.

## మ్లా

మ్లానము సం. విశే. వాడినది.
మ్లాని సం. వి. (పుష్పాదులు). 1. వాడుట. 2. మురికి.

## మ్లి

మ్లిష్టము సం. విశే. 1. స్పష్టముకానిమాట 2. గొణుగుడు మాట.

## మ్లే

మ్లేచ్ఛముఖము సం. వి. రాగితామ్రము. వ్యు. మ్లేచ్ఛజాతి వ్యక్తి ముఖముపలె ఎఱ్ఱనైనది.
మ్లేచ్ఛుఁడు సం. వి. 1. ఆచారహీనుడు. 2. పాపరతుడు 3. నీచజాతివాఁడు.

## య

య ఒక అక్షరము.
యంత సం.వి. 1. సారథి. 2. మావటివాడు.
యంత్రణము సం. వి. 1. బంధనము. 2. రక్షణము. 3. నియమనము.
యంత్రము సం. వి. 1. కీలు పనిముట్టు. కష్టము తగ్గుటకై సులభముగ చేయుట కేర్పడిన సాధనము. 2. బీజాక్షరచక్రము 3. తిరుగలి.
యంత్రాంగము సం.వి. సిబ్బంది, పరివారము (Machinery).
యంత్రితము సం. విశే. కట్టబడినది.
యకృతఉణ్ణుకములు సం. విశే. (జం.) కీటకముల అన్నవాహికలో అంతర్జఠరము తర్వాత భాగముపై నుండు వేళ్ళవంటి నిర్మాణములు. (Hepatic caecae).
యకృతకేశికా భాజిమండలము సం. వి. (జం) హృదయమునకు రక్తమును తీసికొని వచ్చు సిరకాలేయములో కేశికలుగా చీలి, మరల దానినుండి వేరుసిరలు ఏర్పడుట. (దీనిలో పూర్వోదరసిర, యాకృతసిర ముఖ్యమైనవి). (Hepatic portal system)
యకృత్తు సం. వి. 1. కాలేయము. 2. కార్జము.
యక్షరాట్టు సం. వి. 1. జక్కులరేడు. 2. కుబేరుఁడు.
యక్షిణి సం. వి. 1. గతించిన వృత్తాంతములందెల్పు విద్య. 2. కుబేరుని భార్య. 3. యక్షుని భార్య.
యక్షుఁడు సం. వి. 1. కుబేరుఁడు. 2. ఒక దేవ జాతివాడు.
యక్ష్మము సం. వి. క్షయరోగము
యజనము సం. వి. 1. యజించుట. 2. యజ్ఞముచేయుట
యజమానుఁడు సం. వి. 1. గృహపతి. 2. యజ్ఞకర్త
యజ్ఞపురుషుఁడు సం. వి. విష్ణువు
యజ్ఞము సం.వి. 1. యాగము. 2. వేలిమి 3. క్రతురాజము. (బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము మనుష్యయజ్ఞము ఇవి పంచయజ్ఞములు). విశ్వ. అన్నము

**యజ్ఞోపవీతము** సం. వి. 1. జంధెము. 2. యజ్ఞసూత్రము.

**యజ్వ** సం. వి. విధ్యుక్తముగా యజ్ఞము చేసినవాడు.

**యతనము** సం. వి. యత్నము. వికృ. జతనము.

**యతి** సం. వి. 1. పద్యవిశ్రమస్థానము, 2. సన్యాసి,

**యథాక్రమము** సం. వి. అవ్య. క్రమమునతిక్రమింపక.

**యథాజాతుఁడు** సం, విశే. 1. మూర్ఖుడు. 2. జ్ఞానము లేనివాడు.

**యథాతథపు ఒడంబడిక** మి.వి.(చరి.,రాజ.) రెండు రాజ్యములమధ్య సమస్యా పరిష్కారముకాక పూర్వము తాత్కాలికముగ నేర్పరుచుకొనిన ఒడంబడిక,

**యథాతథము** సం. అవ్య. ఎట్లున్నదో అట్లు.

**యథాయథలు** సం. అవ్య. చెల్లాచెదరు.

**యథార్థత** సం. వి. (గణి., భౌతి., రసా.) ప్రయోగఫలము కచ్చితముగా నుండుట (Accuracy). సం. వి. (భౌతి., గణి.) ప్రతియోగ లబ్ధమైన ఫలము కచ్చితముగా శుద్ధముగా ప్రమాదరహితముగా నుండుట. (Precision).

**యథార్థప్రతిబింబము** సం. వి. (భౌతి.) తెరపై పట్టుటకు అనువగు ప్రతిబింబము.(Real-image).

**యథార్థము** సం. విశే. 1 సత్యము. 2 ఉన్నరూపు.

**యథార్థవర్ణుఁడు** సం. వి. 1. చారుడు, వేగువాడు,

**యథేచ్ఛము** సం. విశే. ఇచ్ఛవచ్చినట్లు.

**యథేష్టవ్యవహారపద్ధతి** సం. వి. (వాణి. అర్థ. రాజ.,చరి.) 1. ప్రభుత్వ నిరోధరహిత స్వాతంత్ర్య వ్యాపారపద్ధతి. 2. వ్యక్తిస్వామ్యవాదములలో నొకటి.(Laissez faire).

**యదృచ్ఛ** సం. వి. ఇచ్చుపొప్పు.

**యదృచ్ఛావిజ్ఞుఁడు** సం. వి. దబ్బాటు సాక్షి, ప్రసంగవశమున తనంతట తానే వచ్చిన సాక్షి.

**యద్భవిష్యుఁడు** సం. విశే. కాగలదికాక మానదని స్వప్రయత్నము చేయనివాడు.

**యమకము** సం వి. 2. శబ్దాలంకారము. 2. సంయమము.

**యమకీటము** సం వి. కుమ్మరిపురుగు.

**యమధాటి** సం. వి. 1. జముదాడి, 2 ఒక రకమైన ఆయుధము.

**యమధారము** సం. వి. ఇరుప్రక్కలవాదర గల కత్తి,

**యమపత్ని** సం. వి. ఐరావతి,

**యమము** సం. వి హింసాదులనువిసర్జించుట.

**యమళము** సం. వి.1 జంట, 2 యుగళము.

**యమళశిశువులు** సం. వి. 1. జంటశిశువులు 2. కవలపిల్లలు,

**యమళిక** సం. వి. ఒక చర్మవ్యాధి.

**యమి** సం. వి. 1. ముని, 2. హంస.

**యముఁడు** సం. వి. 1. కాలుడు, 2. శని, వికృ. జముడు.

**యమున** సం. వి. 1.యమునానది.2 పార్వతి వికృ. జమున.

**యవనము** సం. వి, 1 యవనుల దేశము. 2, పందెపు గుఱ్ఱము.

**యవనిక** సం. వి. 1. తెర. 2. తెరచీర. సం. (గృహ.) తెర, పరదా, మరుగునిచ్చుటకై కిటికీలకు ద్వారములకు వేయుపరదా లేక తెర (Curtain). వికృ. జవనిక.

**యవలు** సం. వి బార్లీ యనెడు ధాన్యము.

**యవాగువు** సం వి. నూకలగంజి.

**యవీయసి** సం. వి. చెల్లెలు.

**యవీయస్సుఁడు** సం. వి. 1. తమ్ముడు. 2చిన్నవాడు.

యశఃపటహము నం. వి. డంకా, ఒక రకమైన వాద్యము.

యశదము నం. వి. (రసా.) తుత్తునాగము. కొంచెము నీలిరంగు గల తెల్లని ధాతువు (Zinc) (ఇది అనర్తక్రమ పట్టికలో రెండవ వర్గములో నున్నది)

యశదరజము నం. వి (రసా) సన్నపొడిగా చేయబడిన తుత్తునాగము. (Zinc dust).

యశము నం. వి. కీర్తి.

యశస్వి నం. విశ. కీర్తిగలవాఁడు.

యష్ట నం వి. యజ్ఞకర్త.

యష్టి నం. వి. 1. హారముపేట. 2. చేతికఱ్ఱ. 3. చెఱకుపుకాడ.

యష్టిక నం. వి నూఱుపేఁల హారము.

# యా

యాంత్రికలాభము నం. వి. (భౌతి.) ఒక పౌండు భారమునకు సమమైన యత్నమునుచేసి 10 పౌనుల భారమునకు సమానమైన నిరోధమును అతిక్రమింపగలుగుదుమేని చేకూరు యాంత్రిక లాభము 10, నిరోధమునకు యత్నమునకు గల నిష్పత్తియే యాంత్రిక లాభము.

$$\text{యాంత్రిక లాభము} = \frac{\text{నిరోధము}}{\text{యత్నము}}$$

(Mechanical advantage).

యాంత్రికశాస్త్రము నం. వి. (భౌతి.) వస్తువులపై బలముల చర్యను గురించి చర్చించు శాస్త్రము (Mechanics). (ఇందు గతిశాస్త్రము (Dynamics), స్థైతికశాస్త్రము (Statics) ఇమిడి యున్నవి,)

యాగము నం. వి. యజ్ఞము.

యాచకుఁడు నం. వి. 1. భిక్షుకుడు. 2. వేడువాడు.

యాచన నం. వి. దైన్యముతో వేడుట.

యాజకుఁడు నం. వి యాజ్ఞికుడు.

యాజ్ఞికుఁడు నం. వి. 1. పురోహితుడు. 2. యజ్ఞమును నడుపువాడు.

యాత నం. వి తోడికోడలు. విశ. పోవువాడు.

యాతన నం. వి. తీవ్రవేదన.

యాతము నం. విశ. పోలునది, గతము.

యాతయామము నం. విశ జీర్ణించినది.

యాతధానుఁడు నం. వి. రాక్షసుడు.

యాతువు నం వి. 1 బాటసారి 2 యముడు. 3. రాక్షసుడు. 4. వాయువు.

యాత్ర నం. వి 1. పోవుట. 2. పుణ్యక్షేత్రముల కేగుట. 3. జాతర.

యాదస్సు నం. వి. 1. క్రూరజలజంతువు. 2. నీటిదయ్యము. 3. నది. 4. నీరు.

యాదోనాథుఁడు నం. వి. సముద్రుడు.

యానకము నం. వి. (భౌతి) వెలుతురుధ్వని ప్రసరించుటకు (ప్రయాణించుటకు) కావలసిన మధ్యమందు వస్తువు. (Medium).

యానము నం. వి. 1. పోవుట. 2. దండెత్తిపోవుట. 3. వాహనము. 4. యానపాత్రము. జనులెక్కిపోయెడి ఓడ.

యానోడ్ ఆం. (భౌతి.) (Anode) విద్యుత్తు ప్రవేశించు కొన.

యాపనము నం. వి. 1. కాలయాపనము. కాలము గడుపుట. 2. తిరస్కారము.

యామము నం. వి. జాము, మూడు గంటల కాలము.

యామళము నం. వి. యమళము, జంట.

యామి నం. వి. 1. కుల స్త్రీ. 2. తోడబుట్టినది.

యామిని నం. వి. రాత్రి.
యామ్య నం. వి 1. దక్షిణపు దిక్కు. 2. భరణీ నక్షత్రము.
యామ్యోత్తరము నం వి, (భౌతి) అయస్కాంతధ్రువ వృత్తము. (Magnetic-meridian) 2 అయస్కాంత సూచి. 3. ఒక ప్రదేశమందు నిశ్చలముగా నుండునప్పుడు దాని అక్షము సూచించు నిట్టనిలువు తలము
యాయావరము నం. వి 1 ధాన్యయాచన. 2. అశ్వమేధ పశువు
యాయి నం. విశే. పోవువాడు.
యావ వి. (వ్యావ.) 1. ధ్యానము. "నాపుత్రుని పై యావపాటినది. 2. దృష్టి.
యావత్ నం. అవ్య. అంతము.
యావదనంతము (గణి.) అనంతము వరకు (Adinfinitum).
యావనాళము నం వి జొన్న.
యాసము నం. వి. లక్క.
యావసము నం. వి గడ్డివామి.
యాశోదేయుఁడు నం. వి. యశోద కొడుకు, శ్రీకృష్ణుడు.
యాష్టికుఁడు నం విశే దుడ్డుగఱ్ఱ ఆయుధముగా గలవాడు వి. యోధుడు.

## యి

యియక్షువు నం. విశే. యాగముచేయకోరువాఁడు.
యియాసువు నం. విశే పోవనిచ్ఛగలవాడు.

## యీ

యీస్ట్ ఇం (గృహ.) (Yeast) మద్యసారము (ఖమీర్) కల్లు మడ్డి, పులియ బెట్టిన చక్కెర వస్తువులలో తయారగునది. (ఇది "బి" వైటమినులకు సంబంధించిన పదార్థము. ఇది చూర్ణముగాను మాత్రలుగాను అమ్మబడును.)

## యు

యుక్తము నం. విశే. కూడుకొన్నది, తగినది. వి. కార.
యుక్తవయస్కుఁడు నం. (గృహ.) పదుమూడు పందొమ్మిది సంవత్సరములకు నడుమ వయస్సు గలవాడు (Adolscent)
యుక్తి నం. వి. 1. కూడిక. 2 ఉపాయము 3. న్యాయము.
యుగంధరము నం. వి. బోలుకఱ్ఱ.
యుగపత్ నం. అవ్య. ఏకకాలమున.
యుగము నం. వి. 1 జత. 2. బార. 3. కాడి 4. యుగములు నాల్గు 1. కృత. 2 త్రేతా 3. ద్వాపర. 4. కలియుగములు.
యుగళశిశువులు నం. వి. యమళ శిశువులు జంటపిల్లలు.
యుగాంతము నం వి. మహాప్రళయము.
యుగ్మక ఖండములు నం. వి. (జం) ఫలదీకరణమైన తర్వాత అండము యొక్క తొలి విభజనలలో ఏర్పడు జీవకణములు (Blastomeres).
యుగ్మము నం. వి. జంట. (భౌతి., గణి) స్థితిశాస్త్రమునకు చెందిన పదము. ఒకే వస్తువు మీద సమాంతరముగను, విరుద్ధ దిశలలోను పనిచేయు సమాన బలముల జంట, ఒకే వస్తువుపై విరుద్ధ దిశలలో పనిచేయు సమాంతర బలములు. (Couple)

యుగ్మవేశ్మఫలము నం. వి. (వృక్ష.) రెండు గదులు గల శుష్క అవిదారణ ఫలము. ఇది అధఃస్థిత ద్విఫల దళాండాశయము నుండి తయారైనది ఉదా. క్రొత్తిమిరి కుటుంబములోని మొక్కలు (Cremocarp).

యుగ్మశాఖీయము నం. విశే. (వృక్ష.) అగ్రకోరకము రెండుగా చీలి రెండు కొమ్మలు బయలుదేరినది (Dichotomous).

యుగ్మైకగుణము నం. వి. (జీవ.) రెండును ఒకే లక్షణ కారణములగు గుణదములు సంయుక్త బీజములోనున్న స్థితి కలది (Homozygous).

యుగ్మోభయగుణము నం. వి. (జీవ.) పరస్పర విరుద్ధ లక్షణ కారణములగు గుణదములు రెండును సంయుక్త బీజములోనున్న స్థితి కలది. (Heterozygous).

యుగ్యము నం. వి. 1. గజాదివాహనము. 2. కాడి మోసెడి యెద్దు.

యుజ్యజనకము నం. వి. (జీవ.) సిద్ధమైన యుజ్య కోశము ఏర్పడు విధానము. (Gametogenesis).

యుజ్యమాతృకణము నం. వి. (జీవ.) ఒకటి గాని ఒకటి కంటె నెక్కువగాని యుజ్య కోశములను ఉత్పత్తిచేయగల తల్లి జీవకణము. (Gametocyte).

యుజ్యము నం. వి. (జీవ.) సిద్ధమైన పునరుత్పాదక జీవకణము (పురుష = శుక్ర ధాతువు. స్త్రీ = అండము.) (Gamete).

యుటోపియా ఇం. (పరి, రాజ.) (Utopia) కల్పితమైన ఆదర్శలోకము.

యుటోపియా సమాజవాదము మి వి. (రాజ., అర్థ) క్రి. శ. 18, 19 వ శతాబ్దముల లోని సంఘసంస్కరణ రచనలు

యు. డి. సి. ఇం (రాజ) ఉన్నతశ్రేణి గుమాస్తా. (Upper Division Clerk)

యుతము నం. విశే. కూడుకొన్నది.

యుధిష్ఠిరుడు నం. వి. ధర్మరాజు అజాతశత్రుడు.

యుద్ధము నం. వి. 1. కయ్యము, 2. పోరు

యురేనస్ ఇం. వి (Uranus) సూర్యుని చుట్టు తిరుగు గ్రహములలో ఒకటి.

యురేనియమ్ ఇం. వి (రసా.) (Uranium) రేడియో ధార్మికతను ప్రదర్శించు పదార్థము (Radio active Element),

యువ నం. వి. 60 సంవత్సరములలో తొమ్మిదవది. విశే. వయసువాడు.

యువగండము నం. వి. మొటిమ.

యువతి నం. వి. 1. జవరాలు, యువతి. 2. పసుపు.

యువరాజు నం. వి. 1. చిన్నరాజు, రాజు తర్వాత రాజ్యమున కర్హుడైనవాడు. 2. కర్ణుడు.

# యూ

యూకము నం. వి. 1. చీరపోతు. 2. పేను.

యూకలిప్టస్‌నూనె ఇం. (రసా.) (Eucalyptus oil) ఇది జామి కుటుంబము (Myrtaceae) నకు చెందిన Eucalyptus globulus, E. citriodora అను చెట్ల యాకుల నుండి తీయబడు అస్థిర తైలము.

యూథము నం. వి. సజాతీయ పశుసమూహము, పశుపక్షిసమూహము.

యూనిట్ ఇం. వి (గణి.) (Unit) ఏకాంకము- రాసులను కొలుచుట కుపయోగించు మానము.

యూపము నం. వి. యజ్ఞమునందు పశుబంధనార్థము నాటిన పైపట్టలేని పాలకొయ్య

యూరపు ఆర్థిక సహకార సంస్థ చూ.

మార్షల్ ప్రణాళిక.

**యూరపు ఉమ్మడి విపణి** మి.వి (వరి.,రాజ) ఫ్రాన్సుదేశాధ్యక్షుడైన డీగాల్ పశ్చిమ యూరపు దేశముల ఆర్థికాభివృద్ధికై సూచించిన ఆర్థిక సహకారపద్ధతి.

**యూరపు పునరుద్ధరణ కార్యక్రమము** మూ. మర్షల్ ప్రణాళిక.

**యూరియా** ఇం. (రసా) (Urea) మిహాము నం. మూత్రము లో నుండు వ్యర్థజని సంబంధమైన లవణాధారము.

**యూషము** నం వి. కట్టుచారు, పప్పుకట్టు.

**యూస్టాషియన్ ట్యూబ్** ఇం. (జీవ) (Eustachion tube) చెవిలోపలి భాగము పేరు

# యొ

**యొక్క** అవ్య. సంబంధ షష్ఠియందు వచ్చు ప్రత్యయము.

# యో

**యోక్త్రము** నం. వి. పసువుల మెడ పలుపు.

**యోగవరుడు** నం. వి ఆంజనేయుడు.

**యోగపట్టము** నం. వి. యోగులు జంధెము వలె వేసికొను వస్త్రపుపట్టె రూ. యోగపట్టె

**యోగము** నం. వి. 1 ప్రాణాయామాదికము 2 కూడిక. 3. ఔషధము 4. ప్రయత్నము.

**యోగవాగలు** వై. వి. యోగపాదుకలు, సిద్ధులు తమ యోగబలముచే నంతరిక్షమున బోవునపుడు ధరించు పాదరక్షలు.

**యోగానుపాతము** నం (లీ గణి.) a b= c : d అయిన a+b:b=c+d·d అను దానిని యోగానుపాతమందురు (Compounds).

**యోగాభ్యాసము** నం. వి. (యోగ) జీవాత్మ పరమాత్మ సంయోగము పొందుటకు జేయు నభ్యాసము.

**యోగి** నం. వి. యోగాభ్యాసము జేయు పురుషుడు.

**యోగితము** నం వి పిచ్చికుక్క.

**యోగిని** నం వి. 1. [illegible] కత్తె. 2 యోగాభ్యాసముచేయు స్త్రీ విక. జోగిణి.

**యోగ్యత** నం వి అర్హత

**యోగ్యము** నం. విశ 1 తగినది. 2 నేర్పు గలది.

**యోచన** నం. వి. ఆలోచన.

**యోజన** నం వి. 1 కూర్పు. 2 ఆలోచన.

**యోజనము** నం వి. 1. ఆమడ. 2. ఆలోచనము

**యోజి** నం. వి (వృక్ష., జీవ) కింజల్కము యొక్క కాడి పుప్పొడి తిత్తుల వెనుక కూడపెరిగియున్న భాగము(Cannective)

**యోజితము** నం వి (గణి.) లెక్క కలియగూడుట, సంకలనము విశ కూర్పబడినది.

**యోధ** నం. వి యుద్ధము చేయువాడు. రూ. యోద్ధ. యోధుడు.

**యోని** నం.వి. 1. ఆడుగుఱి. 2 కారణము.

**యోష** నం. వి. 1. బోటి. 2 ఆడుది. రూ. యోషిత. యోషిత్తు.

# యౌ

**యౌకము** నం. వి. ఊపిరి కుట్టు.

**యౌవతము** నం వి. యువతీ సమూహము.

**యౌవనము** నం వి. పదియారు మొదలు ఏబది సంవత్సరముల వఱకు గల

ప్రాయము. దూ. జవ్వనము.

యౌవరాజ్యము సం. వి. (రాజ.) యువరాజు యొక్క దొరతనము.

# ర

ర ఒక యక్షరము అవ్య. నీచ, మిత్రోద్దేశములయందు అగు అంతాగమము, ఏలర, ఏమిర మొ.

రండ వై. వి. వ్యభిచారిణి. సం. అంగః, రంకః.

రంకుటాలు వి. వ్యభిచరించు స్త్రీ

రంకువు సం. వి. తెల్లని వెంద్రుకలును మెత్తని తోలును గల జింక.

రంగఁడు వై. వి. 1. శ్రీరంగడు. 2. సం తెరువూాళ్ళు.

రంగము సం. వి. 1. సత్తు 2. యుద్ధభూమి. 3. నాట్యస్థానము. 4. శ్రీరంగము. 5. రంగు.

రంగరి వి రంగువేయువాడు.

రంగరించు క్రి. ఔషధ చూర్ణములో తేనె. మొ వానిని చేర్చి కలుపు.

రంగవల్లి సం. వి. 1. రచించిన ముగ్గు 2. నాగవల్లిపట్టు.

రంగు వై వి. 1 ఛాయ, కాంతి. 2. సొంపు సం, రంగః.

రంగుదినుసులు వి రంగునిచ్చు వస్తువులుగా నుపయోగపడునవి.ఉదా.నీలి మొ (Dyes)

రంగుపంటలు వి. (వ్యావ.) 1. నీలి. 2. జాబరా. 3. చిరువేరు.

రంజకుఁడు సం. వి. 1. రంజించువాడు 3. రంగువేయువాడు చిత్రకారుడు.

రంజనకిరణములు సం వి. (భౌతి.) ఒక శూన్యావరణములో నుంచబడిన బుడ్డాగ్రము నుండి వెలుతురు ఎలక్ట్రాను కిరణ సంక్తి ఒక వస్తువుపై బడినప్పుడు ప్రాదుర్భవించు తేజః కిరణ విశేషము. (Rontgen rays).

రంజనము సం. వి (గృహ.) రంగువేయుట. ఛాయవేయుట. (Dyeing).

రంజనము సం. విశ. రంజించునది. వి. ఇంగిలీకము.

రంతము వి తుపాకి చెవిని కాల్పుటకు పెట్టెడు మందు.

రండ సం. వి. విధవ.

రంత సం. విశ. క్రీడించువాడు.

రంతు వై. వి. రతి, క్రీడ. సం రతిః.

రంతుకాఁడు విశ. క్రీడాపరుడు.

రంధి వి. (వ్యావ.) పేచీ, "వారిరువురకు రంధిపెరిగినది". చింత. వై. వి. ఆసక్తి తత్పరత. సం. రక్తిః.

రంధ్రకము సం. వి. బొగ్గుముక్కపై గాని, కార్కుల బెండు బిరడాలకుగాని కన్నములు పొడుచు పనిముట్టు. (Borer)

రంధ్రము సం. వి. 1. కంత, సందు. 2. దూలు.



రంధ్రముల కుట్టు (గృహ.) అలంకారపు కుట్లలో రంధ్రముల నేర్పరుచు కుట్టు. (Eyelet-stitch).

రంధ్రాన్వేషణము సం. వి. రంధ్రములను అన్వేషించుట (తప్పులు వెదుకుట యని వాడుకలోని యర్థము.)

రంధ్రిణములు సం. వి. (జం.) స్పంజి జాతికి చెందిన (జలచరములు) జంతువులు (ఈ జాతి జంతువుల శరీరమున అనేక రంధ్రము లుండును.) (Porifera).

రంపి వి. అతి దారుణమగు చప్పుడు.
రంపెలాండి విశ. రాక్షసుల్భృత్యములుకల(స్త్రీ)
రంభ నం. వి. 1. ఒకానొక అచ్చర 2. అరటి చెట్టు.
రంహస్సు నం. వి వేగము. విశ. వడిగలది
రకము వి. 1. సరకు 2. వస్తువు. 3. జాతి విశ సుందరము.
రక్కసి వై. వి. రాక్షసి, రాక్షసుడు, రక్కసీడు. నం రక్షసః
రక్కెన వై వి. 1. రాక్షస (స్త్రీ) 2 రక్కెన చెట్టు విశ. అయుక్తము. నం రాక్షసః
రక్కొను క్రి. 1. వర్ధిల్లు 2. తెలుకొను. 3. సంభవించు.
రక్తకణము (ఎఱ్ఱకణము) నం వి (జం.) రక్తములోనున్న ఎఱ్ఱని కణములు (Erythrocyte) (Red blood corpuscles)
రక్తకణములు నం వి. (జం.) రక్తద్రవములో విడివిడిగానుండు జీవ కణములు, (Blood corpuscles).



రక్తకుండు నం.వి. అను రక్తకణములు రాగము గలవాండు.
రక్తకుహరము నం. వి. (జం.) రక్తమున్న దేహకుహరము (Haemocoele).
రక్తచందనము నం. వి ఎఱ్ఱ చందనము,
(రక్త) ద్రవపదార్థము నం. వి. (జం.) సామాన్యముగా రక్తములోనున్న ద్రవ పదార్థ భాగము.(Plasma)రసకళ.Plasma membrane.
రక్తవర్షము నం. వి. (భూగో.) గాలిలో నుండు దుమ్ముచే ఎఱ్ఱగామారిన వర్షపు నీరు. (ఈఎఱ్ఱదుమ్ము జర్మనీ ఇటలీలలో ఎక్కువగా నుండును,)
రక్తప్రసరణ మండలము నం. వి. (జం.) శరీరములో రక్తము ప్రవహించు నాళములు, నాళికలు, కేశికలు, గుండె. (Circulatoay system or Vascular-system).
రక్తఫల నం. వి. దొండచెట్టు.
రక్తము నం. వి. 1. నెత్తురు. 2. కుంకుమ. 3. ఎరుపు.
రక్తరుధిర కణములు నం. వి. (జం.) రక్తములోనున్న ఎఱ్ఱని కణములు. (Red blood corpuscles),



రక్తరుధిర కణములు శ్వేతరుధిర కణములు

రక్తసంబంధుల విరోధము నం.వి (గృహ) 1.సన్నిహితులతోపోటీ.2.పాలిపగ (Sibbing rivals)
రక్తస్రావము నం వి. (శీవ.) రక్తము వెలువడుట. (Hemorrhage) (ఇది శరీరములో జరిగిన చాల అపాయకరము.)
రక్తాక్షి నం. వి. హిందూ సంవత్సరములలో నొకటి (58వది).
రక్తాయితము నం. వి. (భూగో) లోహకామ్ల జనితము($F_2O_3$ ఇనుము యొక్క అమ్ల జనితము) గల ఖనిజము (Hematite). ఇది ఎఱ్ఱనేల కారంగును కలుగ జేయును.
రక్తి నం. వి. అనురాగము.
రక్తిమ నం. వి రక్తవర్ణము
రక్తోష్ణత నం.వి. (భౌతి.) ఒక వస్తువు ఎఱ్ఱగా కాలినపుడు అదివెదచల్లువేడి.(Red heat)
రక్ష నం. వి. 1. రక్షణము. 2. లక్క.
రక్షక దీపము నం. వి. (రసా.) బొగ్గు గనులలో ఎల్లప్పుడు నుండు మీథేన్ వాయువును అగ్ని ప్రమాదమునకు లేపకుండ వెలుగు నిచ్చు మానె దీపము, (Safety lamp) (ఇది డేవీచే నిర్మితమైనది.)
రక్షక పత్రవలయము నం. వి. (వృక్ష.) పువ్వు యొక్క అక్షముపై నుండు పువ్వు

వస్త్రవలయములలోనిది. అన్నిటి కంటె క్రిందిది. రక్షక వస్త్రములనన్నిటిని కలిపి వ్యవహరించు సాముదాయక పదము. (Calyx).

రక్షకుఁడు నం. విశే. రక్షించువాడు.

రక్షణ నం. వి. (గృహ) కాపాడుట, (Protection).

రక్షణ సుంకములు మి. వి. (అర్థ) దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించుట, కొఱకు విదేశములనుండి దిగుమతి చేసికొను వస్తువులపై అధికముగా వసూలుచేయుదిగుమతి పన్నులు.

రక్షస్సు నం. వి. రాక్షసుడు.

రక్షితవ్యము నం. విశే. 1. రక్షింపదగినది 2, గోప్యము.

రగులు క్రి. మంట యెత్తు, మండు.

రచన నం. వి. నిర్మాణము, రచనము. నం వి. (రసా.) పరమాణువుల స్వభావము, సంఖ్యయేకాక, అవి యౌగికమందు అమర యున్న తీరును తెలుపు విన్యాసము. (Constitution). నం. వి (భౌతి) ఒక వస్తువు యొక్క అవయవ విన్యాసము. (Structure). నం. వి. (రసా). యౌగిక ముల విషయములో రచన యనగా వాని ఘటకాంగ విన్యాసము. (Structure).

రచనాత్మకము నం. విశే. (రసా) రచనా సంబంధమైనది (Structural).

రచనానదృశ నం వి. (జీవ.) మూల నిర్మాణములో ఒకే మాదిరిగా నుండుట చేయుపనులు వేరుగా నుండవచ్చును (Homology).

రచనాసాంకేతికము నం.వి. (రసా.) యౌగికము యొక్క రచనను తెలుపు సాంకేతికము. (Constitutional formula).

రచనోష్ణత నం. వి (రసా.) ఒక అణుభారము యౌగికము (సంయోగమును), మూలద్రవ్యములనుండి ఏర్పడునప్పుడు బహిర్గతమైన లేక తీసికొనబడిన తాపరాశి (Heat of formation).

రచ్చ వై. వి. 1. కలకల ధ్వని. 2. గోష్ఠి 3. కలహము. 4. మండపము 5. మొగసాల నం. రాజమార్గము. 7. బాధ.

రచ్చకొట్టము వై. వి. రాజకూటము. నం. రథ్యాకూటః.

రజకి నం. వి. చాకలి.

రజకుఁడు నం. వి. చాకలివాఁడు.

రజతనత్రితము నం. (రసా.) రజతము, నత్రజని, అమ్లజని గల లవణము. (Silver nitrate) (మొక్కలకు చీకు తెగులుపట్టకుండవిత్తులను దీని ద్రావణములో తడుపుదురు.)

రజత ప్రమాణము నం వి. (అర్థ) వెండి మారకపు ప్రమాణముగా నుండుట.

రజతభరణము నం విశే (రసా.) వెండితో కలిసినది. (Argentiferous).

రజతము నం వి. 1 వెండి. 2. హారము విశే. తెల్లనిది (భూగ.) ఒక లోహము (Silver) నం. వి (రసా.) వెండి ధాతువులలో ఒకటి. (Argentum). నాణెములలో ఉపయోగపడు ధాతువు.

రజతాద్రి నం. వి. 1. వెండి కొండ.2 కైలాసము.

రజతోత్సవము నం. వి. సంస్థలకు 25 సంవలు నిండిన సందర్భమున చేయు ఉత్సవము (Silver jubilee);

ర

జని నం. వి. రాత్రి.

రజనీజలము నం. వి. మంచు.

రజము నం. వి. చూ రజస్సు.

రజస్వల నం. వి. ముట్టుది.

రజస్వలయగుట క్రి. (గృహ.) తారుణ్యావస్థ. స్త్రీలలో ఋతుస్రావ మారంభమగుట. (Puberty)

రజస్సు నం. వి 1 రజోగుణము. 2.దుమ్ము 3. స్త్రీ జస్సు 4 పుప్పొడి.

రజ్జకులు నం వి (చరి) మౌర్య కాలము నాటి రాజోద్యోగులు, రాజప్రతినిధులు

రజ్జువు నం. వి. 1, త్రాడు. 2. స్త్రీ జడ.

రజ్జాయి వి చలికి కప్పుకొనెడి దుప్పటి

రజ్జు క్రి ప్రేలు వి, 1. వ్యర్థ భాషణము 2. గర్వము.

రజ్జులాఁడి విణ 1. వ్యర్థ భాషణురాలు. 2 ఆత్మస్తుతి పరురాలు

రజ్జులాఁడు విణ. 1. వ్యర్థ భాషణుడు. 2 ఆత్మస్తుతి పరుడు.

రటనము నం వి, 1. ధ్వని 2. మ్రోత.

రట్టడి విణ. నింద్యము.

రట్టు వి. 1 దూఱు. 2.నింద. వై. వి ఉపద్రవము.

రడ్డి వి. రెడ్డికి మొదటి రూపము. రూ. రెడి.

రణపెంకి వి (వ్యావ) మిగుల మొండిపట్టు కలవాడు.

రణబేరు వి. పందెపు కోడి పుంజు.

రణము నం వి. 1, యుద్ధము. 2. మ్రోత

రతము నం వి 1.సురతము.2 సంయోగము.

రతి వి. 1. రతనాల తూనికయందు రెండవ యెత్తు. 2. మణుగునం దిరువది యైదవ భాగము, నం.వి. 1. సురతము 2, మన్మథుని భార్య. 3. అనురాగము.

రత్నగర్భ నం. వి. భూమి.

రత్నగర్భుఁడు నం. వి. 1. సముద్రుడు. 2 కుబేరుడు.

రత్నము నం. వి 1, మణి. 2 స్వజాతియందు శ్రేష్ఠమైనది (నవరత్నములు—మౌక్తికము, పద్మరాగము, వజ్రము,ప్రవాళము మరకతము, నీలము, గోమేధికము, పుష్యరాగము, వైడూర్యము.)

రత్నాకరము నం. వి. సముద్రము.

రత్ని నం. వి. మూర, మోచేయి మొదలు పిడివరకు గల కొలత.

రత్నిన్ నం. వి. ప్రాచీనార్యుల కాలమున రాజసూయయాగము చేయునపుడు రాజుతో సమానముగా కొన్ని యజ్ఞవిధులందు పాల్గొను అధికారులు. (సేనాని గ్రామణి, భాగదూఘ, క్షత్రియ, గోవికర్తనుడు, పాలగాలుడు తక్షుడు, రథకారుడు మొ॥).

రథకారుఁడు నం. వి. తేరుచేయువాడు, వడ్లవాడు.

రథము నం వి 1. అరదము. 2, శరీరము

రథాంగము నం. వి 1. రథచక్రము 2. చక్రవాకము.

రథి నం. వి. రథము నెక్కువాడు,

రథ్య నం. వి. 1. రథసమూహము. 2. రాజమార్గము 3, మార్గము.

రథ్యము నం. వి. రథము నీడ్చు గుఱ్ఱము.

రదనము నం. వి. దంతము.

రద్ది వి అల్లరి, గొప్పధ్వని.

రద్దు వి. 1 తీసివేత, కొట్టివేత.

రన్ ఎండ్ ఫెల్‌సీమ్ ఇం (గృహ.) (Run and fell seam) ఒక ప్రక్క కూర్పు, వేరొక రన్‌ఎండ్ ఫెల్‌సీము ప్రక్క పటవాలు కుట్లతో కుట్టిన అతుకు. (రెండు పోగులు రేగియున్న అంచులను కలిపి కుట్టుట. (Seam).



రప్పు వి. పోగు తీయుట.

రప్పుతీఁత వి. (గృహ.) డార్నింగ్ (Darning) చిరిగిన బట్టమీద చిరుగు కనబడకుండ ఆ బట్టనేతవంటి కుట్లను ఉపయోగించి బట్టలో కలిసిపోవునట్టి కుట్టు.



రప్పుసాధనము

రప్పుసాధనము వి. (గృహ.) రప్పు

తీయునప్పుడు ఉపయోగించు గుండ్రని పరికరము. (Darning ball).

రబ్బర్ ఇం. వి. (Rubber). 1. ఒక రకపు చెట్టు నుండి తీయుజిగటవంటి పదార్థము. 2. ఆపదార్థముతో చేయబడిన వస్తువు

రబ్బరుదుప్పటి వి. (గృహ.) చిన్నపిల్లలకు పడకమీద వారు మూత్రము చేసిన పడక తడియకుండుటకై ఉపయోగము పర బట్ట. (Mackintosh). (ఇది నీటితో తడియనిది.)

రభసము నం. వి. 1.వడి. 2. వేగము

రమ నం. వి లక్ష్మి

రమణ వై. విశే. 1. ఒప్పిదము. 2. ప్రీతి. నం. రమణమ్. రమ్యమ్.

రమణము నం. విశే. మనోజ్ఞము.

రమణి నం. వి. 1. అందమైన స్త్రీ, 2. నాయకుని రమింప జేయునట్టి స్త్రీ 3. స్త్రీ

రమణీయము నం విశే 1. ఒప్పునది 2 మనోహరమైనది.

రమణుఁడు నం. వి 1. మగడు. 2. మన్మథుడు. విశే సౌందర్యవంతుడు.

రమించు నం. క్రి. క్రీడించు.

రమ్యము నం. విశే ఒప్పిదమైనది.

రయము నం వి. 1. వేగము 2. ప్రవాహము

రల్లకము నం. వి. కంబళి.

రవ వై. వి. 1. తునుక. 2. అణువు. 3. వజ్రము. 4. లేశము. నం. రవః, లవః.

రవణము వై. వి. భూషణము. నం. రమణమ్. నం. మ్రోగునది.

రవము నం. వి కంఠధ్వని.

రవసెల్లా వై. వి. మిక్కిలి సన్నబట్ట.

రవళి వై. వి. మిక్కిలి సన్నబట్ట.

రవాణా హిం. వి. 1. పంపుట. 2. జాబు పోదగిన గ్రామము.

రవి నం. వి. 1. సూర్యుడు. 2. జీవుడు.

రవుతు వి. గుఱ్ఱము నెక్కువాడు. దూ. రౌతు.

రవ్వ వై. వి. 1. అల్లరి. 2. అపకీర్తి. నం. రవః.

రశన నం. వి పదియారు పేటలుగల స్త్రీ మొలనూలు.

రశ్మి నం, వి. (భౌతి.) 1 కిరణము 2. కాంతి. 3. వెలుగు.

రస నం వి 1. నాలుక. 2. రసాతలము

రసజ్ఞుఁడు నం. వి. పండితుడు. విశే. రుచి నెరిగినవాడు. కళాసౌందర్యవేత్త.

రసదాడి వై. వి. (వృక్ష) ఒకరకము చెరకు. 2. ఒకరకము అరటి. నం. రసదాళికా.

రసదారువు నం వి. (వృక్ష) పెద్దపెద్ద వృక్షకాండముల దారువులో నీటిని లవణ ద్రావణమునను ప్రసరింపజేయు దారు భాగము (Sapwood or alburnum).

రసధాని నం. వి. (జీవ) జీవకణములో జీవన వ్యాపారముల ఫలితముగా వచ్చిన రసముచే నిండియుండు సూక్ష్మమైన సంచి (Vacuole)

రసన నం వి. నాలుక.

రసభరితము నం. విశే. (వృక్ష.) రసముతో నిండినది. (Succulent).

రసభ్రమణము నం. వి. (జీవ.) జీవకణములోనున్న జీవరసమువర్తులాకారముగ తిరుగుచుండుట. (Cyclosis)

రసము నం. వి. 1. పాదరసము 2. నీరు 3. పండ్ల రసము. (శృంగారము, హాస్యము కరుణము, వీరము, రౌద్రము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము. నవరసములు).

రసమిశ్రమము నం. వి. (రసా.) పాదరసముతో కలిసిన మిశ్రమము. రసమిశ్రలోహము (Amalgam).

రసవాదము సం. వి. పాదరసమును కట్టి బంగారము చేసెడి విద్య. (రసా) నీచలోహములను బంగారముగా మార్చుట కుద్దిష్టమైన కళ.(Alchemy)

రససింధూరము సం. వి. (రసా) ఎఱ్ఱని రంగుగల గంధక పాదరసముల సంయోగము (Red Sulphide of mercury).

రసాతలము సం. వి. పాతాళలోకము అధోలోకము

రసాయనపద్ధతి సం. వి (రసా.) రసాయన క్రియాసంబంధమైన పద్ధతి (Chemical process).

రసాయన వృథక్కరణము (నేలయొక్క) సం. వి. (భూగో., రసా) నేల యొక్క రసాయన సంఘట్టనమును నిర్ణయించుట. (Chemical Analysis of the soil)

రసాయనము సం. వి. 1. జరావ్యాధులను పోగొట్టెడి మందు. 2. మజ్జిగ

రసాయన శాస్త్రము సం.వి (రసా) పదార్థ నిర్మాణములను గూర్చియు అవి చెందు మార్పులనుగూర్చియుచర్చించు శాస్త్రము (Chemistry).

రసాయన సంఘట్టనము (నేలయొక్క) సం. వి. (భూగో.,రసా.) నేల యందుండు వివిధ రసాయన ద్రవ్యములు. వాని పరిమితి. (Chemical composition of the soil).

రసారోహణము సం. వి. (వృక్ష.) వేళ్ళ నుండి పోషక ద్రావణములు ఆకులలోనికి కాండముల ద్వారా పైకి ఎక్కుట. (Ascent of sap).

రసాలము సం. వి. 1. చెఱకు 2. మామిడి.

రస్సి, వై, వి. (జం )చీము సం రసః.

రసి సం. వి. (జం) గడ్డకట్టిన రక్తము నుండి వేఱుపడి, జీవకణ కోశములుగాని తంత్వి (Fibrin)గాని లేకయుండు ద్రవము (Serum).

రసిక సం వి. వెరకుడాలు. విశ. రసికురాలు.

రసీదు ఇం వి. (Receipt) సొమ్ములోనగునవి ముట్టినట్లు వ్రాసియిచ్చెడు పత్రము. చెల్లు పత్రము

రస్తా హిం వి. మార్గము.

రస్సి వి. (వ్యావ.) రాఁడి.

రహటము సం వి. నూలు వడుకు యంత్రము, రాట్నము.

రహదారి హిం వి. సామాన్యముగ నందరు పోదగిన దారి-మార్గము.

రహస్యోద్యోగ బృందము సం. వి. శాస. (వ్యావ.) ప్రభుత్వముచే రహస్యపుపనులు చేయుటకు నియమింపబడిన ఉద్యోగులు. (దేశములోని విద్రోహచర్యలు, కుట్రలు ఇతర దేశపు కుట్రలు, దోపిడులు మొదలగునవి కనిపెట్టుట వీరి విధి.)

రహస్యపు బ్యాలెట్ మి. వి. (రాజ.)రహస్యముగా వోట్లునిచ్చుపద్ధతి(Secret ballot)

రహస్యము సం. వి. ఏకాంతము. విశ. దాచదగినది.

రహస్యవ్యాపారము సం. వి. (వాణి.) వాణిజ్యపు సుంకములను చెల్లించకుండ అక్రమ వ్యాపారము నడుపుట

రహస్యవ్యాపారి సం. వి. (వాణి ) ప్రభుత్వముచే నిషేధింపబడిన సరకులను దొంగతనముగ ఎగుమతి దిగుమతి చేయువాడు. వాణిజ్యపు సుంకములను చెల్లించకుండ రహస్యముగా సరకులు తెచ్చువాడు.

రహి వి. 1 జ్ఞానము. 2.రక్తి, సంతోషము. 3. ఆసక్తి.

రహించు క్రి. 1. ఒప్పు. 2 వర్ధిల్లు.

రహితము సం. విశ. విడువబడినది.

# రా

రా వై. వి. రాచ శబ్దములకు మీది వర్ణము లోపింపగా మిగిలిన రూపము. క్రి.= రమ్ము.

రా వి. ర అను దాని రూపాంతరము, విణ. రాండు. శబ్దమునకు మీది వర్ణము లోపింపగా మిగిలినది, నీచ సంబోధ నార్థకము (ఏమిర.)

రాంకవము నం విణ మృగ రోమములతో చేయబడినది (సాలువు).

రాంచీ ఆం. వి. (వరి) (Ranch) అమెరికా దేశములో పశువులను పెంచు విశాలమైన గడ్డి మైదానము, పశుశాల.

రాఁపు క్రి. నిప్పు అంటుకొను, రగులు

రాఁబట్టు క్రి. 1. ఇచ్చిన దానిని మరల దీర్చి కొను. 2. సేకరించు,

రాక నం. వి. 1. సంపూర్ణకళలు గల చంద్రునితో గూడిన పున్నమ. 2. ఒక దేవత. వి. ఆగమనము.

రాకాసి వై.వి. రాక్షసి, రక్కసి.నం. రాక్షసః.

రాకెట్ ఆం. వి. (భౌతి) (Rocket) కొన్ని ద్రవ్యములు మండుటచే వేడిన శక్తిచే అంతరిక్షములోనికి గొనిపోబడు వస్తువు

రాక్షస నం. వి. అరువది సంవత్సరములలో 49వ దాని పేరు.

రాక్షసము నం. వి. బలాత్కారమున కన్య నపహరించుకొనివచ్చి చేసికొనెడి పెండ్లి.

రాక్షసి నం. వి. రక్కసి.

రాగము నం వి. 1 అనురాగము. 2.రంగు 3. మాత్సర్యము, 4. సంగీతమున నాట మొ॥ రాగము.

రాగరజ్జువు నం. వి. మన్మథుడు.

రాగసూత్రము నం. వి. త్రాసు త్రాడు.

రాగి వి. ఒక విధమైన పైరు. వై. వి. తామ్రము. నం. విణ. 1. అనురాగము కలది. 2. ఎరుపుగలది,

రాగిల్లు నం. క్రి. రంజిల్లు.

రాచ వై. విణ. రాజ సంబంధి. నం. రాజన్.

రాచకురుపు వి రాచపుండు.(Carbuncle).

రాచఠీకము వి. రాజభావము.

రాచవీడు వి. రాజధాని.

రాము క్రి. 1. ఒరసికొను. 2. రుద్దు,

రాజకము నం వి 1. రాజసమూహము, 2 క్షత్రియ జాతి సమూహము.

రాజకీయ పక్షము నం. వి. (రాజ) రాజ్యములో జాతి పురోగమనము కొఱకు కొన్ని రాజకీయార్థిక. సామాజిక సిద్ధాంతములు కలిగి, వానిని సాధించుటకై ఉమ్మడిగా ఐక్యములో వ్యవహరించుపౌరసమువాయము. ఎన్నికలప్పుడు వారి ప్రత్యేక రాజకీయ పక్షలక్ష్యములను సాధించుటకై పోటీచేయు పక్షము రాజకీయ పార్టీ.

రాజగృహము నం వి. నగరు.

రాజతంత్రజ్ఞుఁడు నం. వి. రాజతంత్రము తెలిసినవాడు.

రాజతంత్రము నం. వి. (రాజ) రాజరికము రాజుచే పరిపాలింపబడు ప్రభుత్వ విధానము.

రాజతంత్రము నం. వి. (రాజ.)కూటనీతి.

రాజధాని నం.వి రాజు నివసించునట్టిప్రధాన నగరము. (రాజ.,వరి,) ముఖ్యపట్టణము.

రాజనీతిజ్ఞత నం. వి. (రాజ.) పరిపాలన విద్య. రాజ్య నిర్వహణ విద్య.

రాజనీతిశాస్త్రము నం వి రాజ్యము, ప్రభుత్వమును పౌరులను గురించి తెల్పుశాస్త్రము

రాజన్యుఁడు నం.వి. క్షత్రియుడు.

రాజభరణము నం. వి. భారత ప్రభుత్వము సంస్థానాధిపతులకుయిచ్చుధనము (Privy Purse).

**రాజమల్లుఁడు** సం. విశ. పొగరుబోతు.
**రాజమార్గము** సం. వి. రథములు పోదగిన విశాల మార్గము.
**రాజయక్ష్మము** సం. వి. క్షయరోగము.
**రాజరాజు** సం వి. 1. చక్రవర్తి. సార్వభౌముడు. 2. దుర్యోధనుడు. 3. చంద్రుడు.
**రాజసము** సం. విశ. రజోగుణమువలన కలిగినది.
**రాజసూయము** సం వి, ఒక రాజు తక్కిన రాజుల గెలిచి చేసెడు యజ్ఞము.
**రాజహంస** సం. వి. 1. రాయంచ. 2. ఎఱ్ఱని ముక్కు కాళ్ళుగల హంస. 3.మధురముగ బలుకు హంస.
**రాజాంశము** సం. వి (వ్యాప) ఒక వ్యక్తి మరయొకనికి సంక్రమింపజేసిన హక్కు లేక శేషాధికారమునకు ప్రత్యామ్నాయముగ. రెండవవాడు చెల్లించవలసిన ద్రవ్యము. ఉదా. ఒక వస్తు నిర్మాణము వకైగాని లేదా ఒకగనిని త్రవ్వి ఖనిజమును తీసి అమ్ముటకుగాని హక్కును పొందినవాడు ఆ హక్కును తనకు సంక్రమింపచేసిన వానికి చెల్లించు మొత్తము.
**రాజాన్నము** సం వి. 1. రాజనము, ఒకరకమైన పరిధాన్యము 2. రాజులు భుజింపదగిన అన్నము.
**రాజి** సం. వి 1. పంక్తి. 2. రేఖ.
**రాజితము** సం. విశ. ప్రకాశితము.
**రాజిల్లు** సం. క్రి ప్రకాశించు.
**రాజీ** హిం. వి. తగవు తీర్చుకొనుట (Compromise).
**రాజీనామా** హిం. వి. 1. ఒప్పందము. 2. ఉద్యోగాదులను ఇష్టము మీద విడుచుట.
**రాజీవము** సం. వి. తామర.
**రాజు** సం. వి. 1. రేడు, రాచవాడు. 2. ఇంద్రుడు. 3. చంద్రుడు.
**రాజ్ఞి** సం వి. రాణి.
**రాజ్యపాలుఁడు** సం. వి. (పౌర., రాజ.) పరిపాలకుడు.
**రాజ్యమండలము** సం. వి. (రాజ. చరి.) కొన్ని ధ్యేయములను సాధించుటకై ఏర్పడిన సర్వసత్తాక రాజ్య సమ్మేళనము. ఒడంబడికవలన ఏర్పడిన రాజ్యసమితి (Confederation).
**రాజ్యము** సం. వి. (పౌర.,రాజ.) నిర్దిష్టమైన భూభాగము కలిగి,సువ్యవస్థిత ప్రజలపై శాసనాధికారములు కలిగి ఆంతరంగిక సర్వసత్తాకములో శాస్త్ర రాజ్యములకు లొంగక స్వతంత్రముగా నుండు సంస్థ.
**రాజ్యాంగ నిర్దేశక సూత్రములు** సం. వి. (శాస) కొన్ని శిఫారసు సూత్రములు. భారత సంవిధానమందు నాలుగవభాగమున నీ సూత్రములు విశదీకరింపబడినవి భారత రాజ్య పరిపాలనా కర్తవ్యవిధానము బోధించు మూలాధారములు. (ఈ సూత్రములను న్యాయ స్థానములందు నిర్బంధముగ అమలు పఱుచుటకు వీలు లేదు ) (Directive principles).
**రాజ్యాంగములు** సం. వి. (రాజ.) రాజు మంత్రి, చెలికాండ్రు, భండారము, పట్టణము, కోట, సైన్యము అనునవి ఏడు.
**రాటనము** వై. వి నూలు వడికెడియంత్రము రూ. రాట్నము, రాటణము. సం.రహాటః
**రాటు** వై. వి ఉపద్రవము. సం రాష్ట్రమ్.
**రాట్టు** సం. వి. రేడు.
**రాడికల్ పార్టీ** ఇం. వి.(Radical Party) తీవ్రపక్షము.
**రాణ** వై. వి. రక్షణ. సం. రమ మ్.
**రాణి** వై వి. రాజ్ఞి, భార్య.
**రాణించు** వై క్రి. ఒప్పు, పమ్మతించు.

రాణివాసము వై. వి. 1. అంతఃపురము. 2. రాజు భార్య.
రాణువ వి. 1 దండు. 2 పరివారము.
రాతినార వి. (రసా.) నారవలె నుండు పొటాసియమ్, మెగ్నీషియం సిలికేటు ఖనిజము. (Asbestos).
రాత్రి నం. వి. సూర్యాస్తమయము నుండి సూర్యోదయము వరకుగల కాలము.
రాత్రించరుఁడు నం వి. రాక్షసుడు. వ్యు. రాత్రులందు తిరుగువాడు.
రాత్రిదుస్తులు మి వి (గృహ) పైజామాజత మొదలగు రాత్రిదుస్తులు (Night-dress)
రాత్రిమణి నం. వి. చంద్రుడు.
రాధ నం, వి. ఒక గొల్లస్త్రీ, కర్ణుని పెంపుడు తల్లి.
రాధేయుఁడు నం. వి. కర్ణుడు.
రాద్ధాంతము నం. వి. సిద్ధాంతము. స్థిరమైన పక్షము.
రాన్‌డీర్ ఇం. వి. (భూగో) (Ran-Deer) ధ్రువపుజింక, ఉత్తర దక్షిణ ధ్రువములలో ప్రయాణ సౌకర్యములకై ఉపయోగింపబడు జింక.
రాపడు క్రి. 1. స్తంభించు. 2. గట్టిపడు.
రాపాడు క్రి. రాయు.
రాపులుఁగు వి. రాబందు.
రాఫిల్ ఇం. వి. (Raffle) టికెట్లు అమ్మి బహుమతులు పంచు విధానము.
రాబడి వి. ఆదాయము.
రాబీపంటలు వి (వ్యవ.) శీతకాలములో నాటబడి వసంతఋతువులో కోతకువచ్చు పంటలు.
రాబ్బిధాన్యము వి. రెండవ ధాన్యము.
రామ నం. వి. స్త్రీ. వ్యు. గీతకాదుల చేర్చి రమించునది.
రామకృష్ణ మిషన్ ఇం. వి. (చరి.) (Ramakrishna Mission). క్రీ. శ. 1896వ సంవత్సరములో స్వామి వివేకానందునిచే నీసంస్థ వంగరాష్ట్రములో స్థాపించబడినది. (ఈ సంస్థ 19, 20 శతాబ్దములలో హైందవ ధర్మ పునరుద్ధరణకై చాల కృషి చేసినది. రామకృష్ణపరమహంస బోధనలను వ్యాపింప జేయుటకు సకల మానవ సౌభ్రాతృత్వము పెంపొందించుటకు విదేశములలో కూడ ఈ సంస్థ పాటుపడుచున్నది శ్రీరామకృష్ణుని అనుయాయులు సన్న్యాసులుగా భగవత్సేవకు తమ జీవితమును అంకితము చేయవచ్చును)
రామచంద్రామోట (వ్యవ.) రామచంద్రరావుగారిచే నిర్మింపఁబడిన ఒక విధమగు మోట (Ramachandra lift)
రామఠము నం. వి. ఇంగువ.
రామతమ్మ వి చిలుక.
రామదాసు వి. ఒకపిట్ట.
రామబాణము నం. వి తాటాకులోనగు పుస్తకములు తొలిచెడి పురువు.
రామరాజ్యము నం వి. రాముని రాజ్యము సుఖమైన రాజ్యమని వాడుక యందలి యర్థము
రామానుజకూటము నం. వి. వైష్ణవుల రాకపోకల కేర్పడిన యిల్లు.
రామాయణము నం. వి. రఘువంశీయుడైన శ్రీరామచంద్రుని కథను తెల్పు పుణ్యకావ్యము. (శ్రీరామచంద్రుని భగవదవతారముగ హిందువులు భావించుచుందురు. వాల్మీకి మహర్షిచే రచింపబడిన ఈ గ్రంథము క్రీ పూ. 2530 - 1950 ప్రాంతములలో రచింపబడినదిగా చరిత్రకారులు భావించుచున్నారు. రామాయణము వలన మనకు ఆర్యులు మొదటిసారిగా వైదిక ధర్మమును, సంస్కృతిని దక్షిణాపథమున వ్యాపింపజేసినట్లు తెలియుచున్నది.)

రాముఁడు సం వి. 1 రఘురాముడు. 2. బలరాముడు. 3. పరశురాముడు.

రామేశ్వరము సం. వి. దక్షిణ దిశనున్న యొకానొక గొప్ప పుణ్యక్షేత్రము.

రామ్‌పర్ ఇం.వి. (గృహ) (Romper) చిన్న పిల్లలకు వేసవి కాలములో వేయు వదులు చెడ్డీ, పట్టీలు వేసిన బీచ్ నిక్కరు.



రామ్‌పర్

రాయఁడు వై వి రాజు.

రాయలు సం. రాజా.

రాయబారము వై. వి. దౌత్యము.

రాయబారి వై. వి. (రాజ.. వరి) రాజ్య ప్రతినిధి తన దేశము పక్షమున ఇతర దేశములలో నుండు ప్రభుత్వ ప్రతినిధి, రాజదూత

రాయసకాఁడు వి.జాబులు వ్రాయు నుద్యోగి వ్రాతకాడు, కార్యదర్శి.

రాయసము వి. కార్యదర్శిపని.

రాయి వి శిల.

ర్వాయిడీ వి. ఉపద్రవము, విపత్తు.

రాయితీ హిం. వి. తగ్గింపు, చౌక.

ర్వాయు క్రి. 1. ఒరయు 2 కమ్ము, 3. వ్రాయు. 4. కలహించు.

రాల సం. వి. (రసా.) టర్పెంటైన్‌ను స్వేదించుట వలన లభ్యమగు ఘన ద్రవ్యము. (దీనికే రోజిన్ అని పేరు (Rosin) లేదా ఈ రోజిను ఏ వర్గమునకు చెందునో అట్టి వర్గములోని ఏ ద్రవ్యమైన కావచ్చును. (ఇవి వృక్షములనుండి ఉత్పన్నమగును).

రాలు క్రి. 1, పడలు. 2. పడు, గళితమగు

రాలుగాయ విశే. 1. తుంటరి. 2. చెట్టునుండి పడినకాయ.

రావడీ వి. ఉపద్రవము, హావడి, విపత్తు.

రావము సం. వి. 1. రవము, 2. ధ్వని.

రావి వి 1. అశ్వత్థము. 2. రావిచెట్టు.

రావిరేక వి బిడ్డలకు జడను గట్టు నగ

రావు వై. వి అధిపతి, రాజు. సం. రాజా.

రాశి సం వి 1. రాసి 2 నికాయము. సమూహము. 3 మేషాది రాసులు (అర్థ.) పరిమాణము. మొత్తము (గణి.) సంభావించుట కనువైన విషయము వస్తు సముదాయము (Quantity).

రాష్ట్రపట్టిక సం వి.(రాజ) భారత సంవిధానములో రాష్ట్రాధికారములను తెలుపు పట్టిక.

రాష్ట్రపతి సం వి. (భావ.,రాజ.,వరి.,) భారత రాజ్యాధిపతి. అధ్యక్షుడు (President).

రాష్ట్రపునర్నిర్మాణ (శాసనము) చట్టము సం. వి. (వరి.) క్రీ. శ. 1956లో భారత ప్రభుత్వ మీ చట్టము ప్రకారము భాషాయుక్త రాష్ట్రముల నేర్పరుచుటకు ఆమోదించినది.

రాష్ట్రపునర్నిర్మాణ సంఘము సం.వి. (వరి) దేశములో భాషాప్రయుక్త రాష్ట్రములు స్థాపించుటకు పూర్వము ఆ సమస్యను పరిశీలించుటకై భారత ప్రభుత్వము శ్రీ ఫజల్ అలి అధ్యక్షతను క్రీ. శ.1953 సం. ఏర్పరిచిన సంఘము (ఈ సంఘములో సర్దార్. కే. ఎమ్. పణిక్కరు, పండిత హృదయనాథ కుంజ్రూగార్లు సభ్యులుగా నుండిరి. వీరు క్రీ. శ. 1955వ సం. లో సెప్టెంబరు 30 తేదిని తమ నివేదికను ప్రకటించిరి.)

రాష్ట్రము సం. వి. 1.దేశము,2.ఉపద్రవము

రాష్ట్రియుఁడు సం. వి. నాట్య పరిభాషలో రాజు పెండ్లము తోడ బుట్టినవాడు.

రాసక్రీడ సం.వి. 1. ఒకానొక క్రీడ. 2,సల్లాపము. 3, పరిహాసము. 4, ధ్వని.

రాసభము సం, వి, గార్దభము, గాడిద.

రాసము సం. వి. గోపకుల క్రీడ.

రాసాయనికము సం. విశే. (రసా.) రసాయన శాస్త్ర సంబంధమైనది. (Chemical).

రాసాయనిక తుల్యాంకము సం. వి. (రసా.) ఉదజని పరమాణు భారమునకు రాసాయనికముగా తుల్యమైన ద్రవ్య భారము. (Chemical equivalent).

రాసాయనికవికారము సం. వి. (రసా.) తొలిద్రవ్యముల నుండి నూతన ద్రవ్యములను జనింపజేయు మార్పు. (Chemical change).

రాసాయనిక వియోగము సం. వి. (రసా.) సంయోగపదార్థము సూక్ష్మ పదార్థములుగా విడిపోవు రాసాయనికమైన మార్పు (Chemical decomposition).

రాసాయనిక సంయోగము సం. వి. (రసా.) మూల ద్రవ్యములు కలియునప్పుడు క్రొత్త పదార్థము లేర్పడెడి రాసాయనికమైనమార్పు. (Chemical combination)

రాసాయనిక స్థానభ్రంశము సం. వి. (రసా.) సమ్మేళనములోని ఒక మూలకమును తొలగించి దాని స్థానమును మఱియొక మూలకము ఆక్రమించుకొను రసాయనికమైన మార్పు (Chemical displacement).

రాసాయనికాకర్షణము సం. వి. (రసా.) పదార్థములలో వివిధ మూలక పరమాణువుల మధ్య నుండెడి పరస్పరాకర్షణ. (Chemical attraction).

రాసులు వై. వి. ఇవి పండ్రెండు మేషము, వృషభము, మిథునము కర్కాటకము, సింహము, కన్య, తుల వృశ్చికము, ధనస్సు మకరము, కుంభము, మీనము.

రాహిత్యము సం వి. రహితభావము, లేకుండుట.

రాహుతు వై. వి. గుఱ్ఱపు రౌతు. సం. రాహుత్తః.

రాహువు సం. వి. ఒక ఛాయాగ్రహము, దలగాము.

## రి

రింఖ సం. వి 1. గుఱ్ఱపుడెక్క. 2. అశ్వగతి విశేషము. 3. నృత్యము.

రింఖణము సం. వి. జారుట, స్ఖలనము, రూ. రింగణము.

రింగు వి. 1. రెక్కలగాలిచప్పుడు. 2. వస్త్రపు కుచ్చె.

రించోళి సం. వి. సమూహము.

రింజ ? మల్లబంధ విశేషము కాలుపట్టవచ్చిన వానిని కాలు తప్పించి సందిట మెడ బోదివి పట్టెడి పట్టు.

రింబ వి. రిమ్మ, పిచ్చి.

రికము అవ. భావార్థక ప్రత్యయము. రూ. టికము. ఉదా. చుట్టరికము.

రికరింగ్ ఆం. వి. (గణి.) (Recurring) మరల మరల వచ్చునది.

రికాబు ఎముక వి. (శం.) మధ్య చెవి భాగములో నున్న స్తంభికకు ఒకవైపున అంటియుండు చిన్న కోమలాస్థి బొడిపె. (Stapes).

రికామీ (గ) హిం. విశే. పనిపాటు లేకుండ తీరికగా.

రికెట్సు ఆం. వి (వైద్య.) (Rickets) అస్థిమార్దవ రోగము. విటమిన్ 'డి' (vitamin D) లోపమువలన కలుగువ్యాధి (ఎముకల బలహీనత, సాధారణముగా చిన్న పిల్లలకువచ్చు వ్యాధి. వంకర కాళ్ళు మొ.)

రిక్క వై. వి. నక్షత్రము. సం. ఋక్షమ్.

రిక్క దారి వి. ఆకాశము.

రిక్కు వి. లోక త్రిప్పుట యందగుధ్వన్యను కరణము.
రిక్తము సం. విశే. శూన్యము, వట్టిది.
రిక్థము సం. వి. 1. ధనము 2. హిరణ్యము, (శాస.) మ-ణ సమయమున విడిచిన ఆస్తి (లెగసీ Legacy బిక్వెస్టు bequest).
రిణము సం. వి. రక్కు. చూ ఋణము.
రిక్షా ఇం వి. (వ్యావ.) (R ckshaw' ఒక వాహనము.
రిచ్ కేక్ (ఫ్రూట్ కేక్) ఇం. వి. (గృహ.) (Richcake or fruit cake) కిస్మిస్, బాదాము, పిస్తా మొదలగు వానినివేసి తయారుచేసిన కేకు.
రిచ్చ వై. వి. నిశ్చేష్టత.
రిజర్వుడు అరణ్య ప్రాంతము మి వి.(శాస) ప్రభుత్వమునకు సంపూర్ణాధికారము గల అరణ్యములు.
రిజర్వుబ్యాంకు ఇం. (శాస ,అర్థ.) (Reserve Bank) భారతదేశము యుక్క కేంద్ర బ్యాంకు ఈ దేశములోని చెలామణిని, ఆర్థిక పరపతిని తనకుగల అధికారముతో క్రమపద్ధతిని నడుపుట కేర్పడిన బ్యాంకు.
రిజల్యూషన్ ఇం. (వ్యావ.) (Resolution) తీర్మానము.
రిజిడ్ సంవిధానము మి. వి. (రాజ వరి శాస) కఠిన రాజ్యాంగము.సామాన్యశాసనవశచే తేలికగ మార్చుటకు వీలులేని రాజ్యాంగము (ఈ రాజ్యాంగ శాసనమును మార్చుటకు తగిన నియమములు పాటింపవలయును. ఉదా. భారతదేశము. అమెరికా సమాఖ్య రాజ్యాంగములు).
రిట్ ఇం. (శాస) (Writ). ఆజ్ఞ. ఆజ్ఞాపత్రిక లిఖితపూర్వకముగా ఆజ్ఞ జారీ చేయుట.
రిటర్నింగ్ ఆఫీసరు ఇం. (శాస.) (Returning officer) ఎన్నికల అధికారి.
రిత్త వై. విశే. 1. రిక్తము. 2. కల్ల. 3. కారణములేనిది. అవ్య. ఊరక. సం. రిక్తమ్.
రిత్తవోవు క్రి. వ్యర్థమగు.
రిత్తిక వై. వి. మరదలు. తమ్మునిభార్య.
రినోవేషన్ ఇం (గృహ.) (Renovation) ప్రాతవానిని క్రొత్తవిగా చేయుట.
రిపబ్లిక్ (రాజవరి) (Republic). గణరాజ్యము సర్వస్వతంత్ర ప్రజాప్రభుత్వము. ఈ రాజ్యాంగ పద్ధతిలో రాజరికమునకు స్థానము లేదు
రిపువు సం. వి. శత్రువు.
రిప్ప వి వెలితి, లొట్ట.
రిబేటు ఇం (అర్థ) (Rebate). తగ్గింపు, చెల్లించిన సొమ్ములో కొంత తిరిగి యిచ్చివేయుట, అన్నరోజుకు సొమ్ము చెల్లించినందుకుగాని, ఎప్పుడును తమ యొద్దనే సరకులు కొనునట్లు చేయుటకుగాని చెల్లింపవలసిన సొమ్ములో కొంత తగ్గించుట.
రిమాండుచేయుట మి. క్రి. (శాస.) కోర్టు యొక్క ఆజ్ఞతో పోలీసు అధీనములోకై దీని తిరిగి ఉంచుట.
రిమ్మ వి. ఉన్మాదము. చూ. రింబ.
రిరంస సం. వి. రమింపనిచ్ఛ
రిరంసువు సం. విశే. రమింపనిచ్ఛగలవాడు.
రిరక్ష సం. వి. రక్షింపనిచ్ఛ.
రిరక్షువు సం. విశే. రక్షింప నిచ్ఛగలవాడు.
రివట వి. రెమ్మ, ఉపశాఖ. చూ రివ్వ.
రివాజు హిం. వి. మామూలు, వాడుక.
రివ్వు వి. శీఘ్రము (రివ్వుమని-ఎగురుటందలి ధ్వన్యనుకరణము).
రిష్టము సం. వి. 1. క్షేమము. 2 అశుభము. 3. అభావము.
రిష్ట సం. వి. 1. అశుభము. 2. పెద్దకత్తి.

# రీ

రీకాలు ఇం. (రాజ.)(Re-call) ప్రతినిధులను తొలగించుట, శాసనసభా ప్రతినిధులు అసంతృప్తికరముగ ప్రవర్తించినచో, వారి నియమిత కాలమువరకు ముందే వారి నియోజకులు, శాసనసభనుండి తొలగించగల హక్కు. (ఈ పద్ధతి స్విట్జర్లాండ్ వందున్నది)

రీడిస్కౌంటుచేయుట మి. క్రి. డిస్కౌంటు చేసిన ఒక బిల్లును బ్యాంకు మరియొక బ్యాంకులో సాధారణముగ కేంద్ర బ్యాంకులో డిస్కౌంటు చేసికొని, మిగత సొమ్ము అవసరము కొరకై పొందుట.

రీఢ నం. వి. తిరస్కారము, శోకనము.

రీణము నం. విశ. కారినది.

రీతి నం. వి. 1. తెరగు. 2. మేర. 3. ఇత్తడి. 4 కావ్యశైలి పద్ధతి (కావ్యశైలి త్రివిధము., పాంచాలి, గౌడి, వైదర్భి.)

# రు

రుంజ వి. వర్ణవాద్య విశేషము.

రుండము నం, వి. మొండెము.

రుంద్రము నం. విశ. 1. ఎడముగలది. 2. విరివియైనది.

రుక్క హిం. వి. చిన్నచీటి.

రుక్కు నం. వి. 1. కాంతి. 2. సూర్యకిరణము. 3. ఇచ్ఛ.

రుక్మకారుఁడు నం. వి. స్వర్ణకారుడు.

రుక్మము నం.వి. 1. బంగారు. 2.లోహము

రుక్మిదారి నం. వి. బలరాముడు.

రుగ్ణము నం. విశ. విరిగినది

రుగ్మత వి రోగము.

రుచకము నం. వి. 1. మాల్యము, 3. మంగళ ద్రవ్యము.

రుచి నం. వి. 1. ఇచ్ఛ. 2. చవి. 3. కాంతి. 4. సూర్యకిరణము.

రుచి నం. వి. (రసా.) నాలుకతో గుర్తించబడు వస్తుగుణము. ఉదా. పులుపు, తీపి, చేదు.

రుచిఁగాయ విశ. ఊరుగాయ.

రుచిరము నం. వి. ఒప్పిదమైనది, రూ. రుచ్యము.

రుజ నం. వి 1. రోగము, 2. చెరుపు.

రుజావు హిం. వి. సాక్ష్యము.

రుటము వై. విశ. 1. రూఢము. 2. గట్టిది. నం. రూఢమ్.

రుట్టు నం. వి. కోపము, రోషము.

రుతము నం. వి. మృగపక్ష్యాదుల ధ్వని.

రుత్త వి. నాశము.

రుత్తు క్రి. కొట్టు.

రుదితము నం వి. రోదనము.

రుదురిక్క వై. వి. రుద్రాక్ష. శివభక్తుల తావళపు పూస రూ. రుదురాక.

రుద్దు క్రి. పులుము, తోము.

రుద్దుడు వి. తోముకము.

రుద్రభూమి నం. వి. శ్మశానము.

రుద్రవాతము నం. వి. (వైద్య. గృహ.) మెదడులో రక్తనాళములు పగిలి రక్తస్రావమువలన కలుగు వ్యాధి (Apoplexy)

రుద్రాక్షమాల నం. వి. అక్షమాల.

రుద్రాక్షము నం వి. రుద్రాక్షపూస.

రుద్రాణి నం. వి. పార్వతి

రుద్రుఁడు నం. వి.. శివుడు.

రుధిరము నం.వి. 1.నెత్తురు. 2.సిందూరము

రుధిరోద్గారి నం. వి. సంవత్సరములలో నొకటి (57వది.)

రుద్ధము నం. విశే. 1. అడ్డగింపబడినది. 2, చుట్టబడినది.

రుబ్బు క్రి. రుబ్బుగుండుతో మెదుపు.

రుమ నం. వి. 1. ఉప్పు పండదగిన నేల, 2. సుగ్రీవుని భార్య.

రుమాలు హిం. వి. చేతిగుడ్డ, తలగుడ్డ.

రుమేనియన్‌కుట్టు (గృహ.) ఎంబ్రాయిడరీ నమూనాలో ఆకులను, పుష్ప రేకులను నింపు ఒకరకపు కుట్టు (Rowmanian stitch).



రుమేనియన్ కుట్టు

రురువు నం. వి. నల్లచారల దుప్పి.

రువాటము వి. 1, కాంతి. 2. వెలుతురు.

రువాణము వి. విలాస విశేషము,

రువ్వ వి. 1. దమ్మిడి, పైస.

రువ్వము వై. వి. చెప్పినదే మరల చెప్పుట, అవృత్తి, తద్భ. నం. రూపావృత్తమ్.

రువ్వు క్రి. విసరవైచు వై. వి. వల్లె, తత్స. నం రూపావృత్.

రుష నం. వి. రోషము.

రుషితము నం. విశే. చెక్కబడినది.

రుసి వై. వి. ఋషి.

రుసుము హిం. వి. 1. లంచము. 2. లాభము 3. ఫీజు. 4. కమీషను.

రుసుము వి. (గణి.) లిఖితమూల్యము నుండి తగ్గించిన మూల్య శాతము. (Rebate).

# రూ

రూక వై. వి. 1. ధనము. 2. చిన్న మొత్తు 3. వెండి బంగారముల నాణెము. నం రుక్మమ్.

రూక్షమ్ నం. విశే. 1. కఠినమైనది. 2. ప్రేమ లేనిది.

రూఢము నం. విశే. 1. ప్రసిద్ధికెక్కినది. 2, నిశ్చయింపబడినది. 3. మొలకెత్తినది.

రూపకము నం. వి. 1. నాటకము. 2. అరక్షరముల కాలము గల తాళభేదము. 3. రూపము. 4 రూపకాలంకారము.

రూపడగు క్రి 1. చచ్చు 2. వశించు.

రూపనిర్మాణశాస్త్రము నం. వి (జీవ) శరీరము, దానిరూపము, ఏయే అవయవములతో నిర్మింపబడినదో, అవిచేయు పను లేవో తెలియజేయుశాస్త్రము (Morphology).

రూపభేదము నం వి. (జం.) ఒక ప్రాణి డింభదశ నుండి ప్రౌఢదశ వరకు అభివృద్ధి చెందినపుడు వివిధ దశల రూపములలో విశిష్టమైన భేదముండుట. (Metamorphosis).

రూపము నం. వి. 1. ఆకారము 2. చక్షురింద్రియ గోచరము. 3. సౌందర్యము. 4. అగ్నిగుణము. 5 స్వభావము.

రూపరి విశే. సౌందర్యవంతుడు, అందకత్తియ

రూపఱు క్రి. 1. చచ్చు 2. అంగవిహీనమగు.

రూపాంతరత నం వి (రసా) ఒకేరాసాయనిక ధర్మములను కలిగి వేరువేరు భౌతిక ధర్మములను కలిగియుండు కొన్ని మూలకముల ధర్మము. (Allotropy) నం. వి. (రసా.) మూల ద్రవ్యములు అనేక రూపములలో నుండుట. ఉదా. గంధకము రాంబిక్, మోనోక్లినిక్ రూపములలో నుండును (Allotropism)

రూపాంతరము నం. వి. (గృహ.) ఒక నమూనా నుపయోగించి వేరువేరు కుట్టు

లను కత్తిరించుట. ఉదా. కాడిన్ బ్లాక్ మాదిరి నుపయోగించి. జాకెట్లు, కమీజు ఫ్రాకు మొదలగు వానిని కత్తిరించుట. (Adaptation).

రూపాంతరీకరణము సం. వి. (శాశ.) ఒక వస్తువు యొక్క రూపమును ఇంకొక రూపమునకుమార్చుట ఉదా. రాంబిక్ గంధకమును వేడిచేసి మోనోక్లినిక్ రూపముగా మార్చుట. (Transformation).

రూపాజీవ సం. వి. వేశ్య-రూపమే బ్రతుకు తెరువుగాగలది.

రూపాయ. వై. వి. (అర్థ.) పదునారు అణాల నాణెము. సం. రూప్యమ్.

రూపించు సం. క్రి. నిరూపించు.

రూపు వై. వి 1. ఆకృతి. 2. రీతి. 3. సౌందర్యము. 4. కన్యకల మెడలందు కట్టెడి బొట్టు.

రూపుమాపు క్రి. చంపు, నాశనమొనర్చు.

రూషితము సం. విశ. 1. ధూళి మొదలగు వానిచే గప్పబడినది. 2. కుంఠితము.

# రె

రె అవ్య. ప్రశంసనార్థక శబ్దముల కనుప్రయుక్తమగునది. "అంరె, బాపురే",

రెంచ వి. (జూదమునందు) రెండు.

రెంట వి. రెండగుట. ద్వైధము

రెంటబ్రాగుడు వి పసుగు, ద్విపము. రెంటెతో బ్రాగునది.

రెంటము వి. అంటవేతబట్ట. మడుపు.

రెండు వి 1. భేదము. వేరుపాటు. 2. ద్వయము.

రెంబ వి. రెమ్మ, ఉపశాఖ.

రెక్క వి రెక్క, పక్షిపింఛ.

రెక్క రేకు వి వేంను ఇనుప నాగలితో దున్ను నపుడు బాలుమండి పైకి తేచిన మట్టి వెల్లను తిరుగవేయు భాగము. (Mould-board.)

1. కర్రు
2. రెక్క రేకు

రెక్కొను క్రి. 1. వర్ధిల్లు. 2. రేయుకొను.

రెగ్మా సం.(వృక్ష)(Regma)ఇది వేశ్మపోటి ఫలములలో నొకటి. ఈ ఫలము ఒక్కొక్క గింజ కల భాగములుగా ఎండిన తరువాత విడిపోవును. ఉదా. ఆముదపు కాయ.

రెచ్చోలు విశ. అగడాలమారి.

రెచ్చు క్రి. విజృంభించు

రెట్ట వి. 1 పక్షిమలము. 2. భుజము.

రెట్టి వి. 1 రెట్టింపు. ద్విగుణము. 2. గుణము, 3. ముణుగు

రెట్టు వి. ముతకబట్ట

రెడ్ క్రాస్ ఇం. (Red-cross) యుద్ధములో గాయపడిన సైనికులకు సేవచేయుదళము (ఈ దళమువారు క్రీ. శ. 1864లో జరిగిన జెనీవా ఒప్పందము ప్రకారము యుద్ధము జరుగు స్థలములకు వెళ్ళి చినభ్యంతరములేక సైనికులకు సేవ చేయును. వీరు ఎఱ్ఱని క్రాసుగుర్తు ధ్వజము ధరించుటచే ఈ పేరు కలిగెను.)

రెడ్డి వి. కాపువారి పట్టపు పేరు

రెడ్డిగము వి. ముడుచుకొన్న యొక కాలి తొడపైన మోకాలు మీదుగా ముడుచుకొన్న మరియొక కాలిపాదము మోపి ఆ కాలిని వీపు అంగవస్త్రముతో నీడ్చి కట్టుకొని కూర్చుండుట. రూ. రెడ్డికము,

రెప్పము వై. విశ. పూర్ణము, నిండినది. సం. పూర్ణమ్.

రెప్లమ్ ఇం. (వృక్ష.) (Replum). కూటస్ఫుట ఫలములో నున్న అపత్యమైన మధ్యాంతము.

రెఫరెండమ్ ఇం. (రాజ., పౌర.) (Referendum). శాసనసభ కావించిన నిర్ణయములను ప్రజామోదము పొందుట కొరకు ఎన్నికల ద్వారా ప్రజాభిప్రాయము తెలిసికొనుట.

రెమ్ము క్రి. ఒడిసి బిగుచు, ఒడియు.

రెయి వై. వి రాత్రి దూ. రేయి. సం రాత్రి

రెలుచు క్రి. ఆకులు పువ్వులుకోయు, గిల్లు చిదుము.

రెల్ల వి. 1. మెతుకు. 2. ఎన్నులో ఒక ముక్క.

రెవెన్యూ ఇం (అర్థ) (Revenue) ఆదాయము, రాజ్యము యొక్క ఆదాయము. రాజ్యము యొక్క మొత్తము రాబడి.

రెవెన్యూబోర్డు ఇం. (అర్థ .శాస) (Revenue board) రెవెన్యూ వ్యవహారములపై అధికారముగల సంస్థ.

రెసిడెంటు ఇం. (రాజ) (Resident) స్థానికుడు, బ్రిటిష్ పరిపాలనములో స్వదేశ సంస్థానములందుండిన ఇండియా ప్రభుత్వ ప్రతినిధి.

## రే

రే వై. వి. రేయి, కి కృ రూపాంతరము రాత్రి

రేంజ్ ఇం. వి. (Range) వ్యాప్తి, వ్యాప్తి పరిమితి.

రేగు వి. 1 విజృంభించు. 2. పైకిలేచు. 3. ఉద్రేకించు 4. హుంకరించు. వి. బదరీ వృక్షము.

రేబగలు వి. రోజు, అహోరాత్రము.

రేక వి. తాటాకు మట్టతో గట్టిన దొప్ప. వై. వి. గీరజాలు, పంక్తి. సం. రేఖా, లేఖ.

రేకంటు వి (రేయి + కంటు) సూర్యుడు వ్యు. రాత్రికి శత్రువు.

రేకు వి. 1 పువ్వుదళము. 2. దుప్పటిలో సగము. 3. ఒలతారు. 4. ఈక. 5 అంచు కమ్ములులేని వస్త్రము.

రేఖ సం. వి. 1 దగ్గరదగ్గరగా నున్న వృక్షాదుల పంక్తి. 2. ప్రాణి పాదతలము అందలి గీర, గీర. (గణి.) స్థితి, పొడవుమాత్రము కల్గి వెడల్పు మందములేని ఆకృతి (Line) పొడవు కలిగి మందము వెడల్పు లేనిది. (Curve.)

రేఖాంశవృత్తము సం వి. (భూగో.) ఉత్తర దక్షిణ ధ్రువములగుండపోవు గోళ కేంద్ర ఊహా వృత్తములు.

రేఖాగణితము సం.వి.(గణి.)గణితశాస్త్రములోని ఆకృతుల ధర్మములను చర్చించు ఒక విభాగము. (Geometry).

రేఖా చిత్రసాంకేతికము సం వి. (రసా.) యౌగికమందు పరమాణువు లెట్లు పరస్పర బంధితములైనవో తెలుపు సాంకేతికము. ఉదా. సల్ఫ్యూరికామ్లము (Graphic formula)

రేఖా వర్ణమాల సం. వి. (భౌతి) రేఖామయమైనవర్ణమాల (Line spectrum).

రేగడ వి బంకమన్ను.

రేగడినేల వి. (భూగ.) కొన్ని రకములైన శిలలు అతి సూక్ష్మ రేణువులుగ పగిలి నదీ గర్భము నందుండినట్టి ఒకరకమైన మట్టి. అది నీటితో కలిసినపుడు ముద్దగ తయారై దానిని వివిధ స్వరూపములకైన తయారుచేయవచ్చును. (ఇట్టి మట్టిని ఇటికలు పెంకులు, కుండలు మున్నగునవి తయారుచేయుట కుపయోగింతురు.)

రేచకము నం. వి. ఊపిరి విడుచుట.
రేచిక్క వి (వ్యావ.) తల తిక్క, విసువు.
రేచితము నం వి. వంకరలేక వేగముతో బోయెడి యశ్వగతి.
రేచీకటి వి. రాత్రి కన్ను తెలియమి, నిశాంధ్యము
రేచీఁకు విశ రాత్రికానని వాడు
రేటు ఇం. (గణి) (Rate) ఒక నిష్పత్తి, ఒక వస్తువు విలువ.
రేడియన్ ఇం (గణి.)(Radian) (త్రైజ్య కోణము). వృత్త వ్యాసార్ధముతో సమాన మైన పొడవు గలిగిన చాపము కేంద్రము వద్ద నేర్పరిచెడి కోణము.
రేడియస్ ఇం. (జీవ.) (Radius) మోచేతి క్రింది రెండు ఎముకలలో కుడి ప్రక్కది.
రేడియేల్ ఇం (జీవ) (Radiale) మణికట్టులో నున్న ఎముకలలో అన్వ్రతిక క్రిందనున్న ఎముక.



రేడియోధార్మికత నం వి. (భౌతి., రసా.) కొన్ని రాసాయనిక మూల ద్రవ్యముల (యూరేని యమ్, థోరియమ్ మొ.) స్వయం ప్రేరిత విచ్ఛేదనము. ఇందు అల్ఫా (α-) బీటా (B-) గామా (γ-) కిరణములు బయటికి చిమ్మబడును. (Radio-activity). రేడియో అల్లా (కప్పు) రేడియల్ అల్నేర్ పాతిశలాకలు
రేణము వి. దూడపేడ.
రేణుక నం వి. 1 గంధ ద్రవ్యము. 2 జమదగ్ని భార్య.
రేణువాసము నం. వి. తుమ్మెద-పుష్పొడిలో నుండు నది.
రేణుమయము నం. విశ. (రసా.) సెనగ బద్ద అంత చిన్నచిన్న ముక్కలుగా చేయబడి నది (Granulated) ఉదా. రేణుమయ తుత్తునాగము (Granulated zinc).
రేణువు నం. వి. 1. చూర్ణము, ధూళి. 2. నలుసు నలక.
రేతము నం. వి. 1. వీర్యము, శుక్లము 2. పాదరసము. రూ. రేతస్సు.
రేతోవాహిని నం. వి. (జం.) వృషణము నుండి బయటకువచ్చు గొట్టము (Vasdeferens) (Vasae fferentia.)
రేనాఁడు వి. దేశ విశేషము, సీమ.
రేను వి. రేగు (బదరీ వృక్షము)
రేపకడ వి. ప్రాతఃకాలము.
రేపుఁడు విశ. బోయ.
రేఫము నం. వి. రవర్ణము. విశ. అధమము.
రేయు క్రి. 1. విజృంభించు. 2. ఖండించు.
రేయెండ వి. వెన్నెల.
రేవ నం వి నర్మద నది.
రేవంతుఁడు నం. వి. అశ్వశిక్షకుడు.
రేవఁడు వి (రేవు + అడు)చాకలివాడు.
రేవతి నం వి. 1 ఇరువది పదవ నక్షత్రము. 2. బలరాముని భార్య
రేవలచిన్ని వి. (వృక్ష.) ఒకరకమైన ఓషధి.
రేవు వి. 1. నద్యాదులయందు దిగవలెనన్న కావలెననన నడుచుట కేర్పరిచిన దారి 2. నీలాటి రేవు. 3. పాటి రేవు. 4 ఓడలలోని సరకులు ఎగుమతిచేయు చోటు. 5. రేగు చెట్టు.
రేవుజక్కి వి గాడిద.
రేవుపోషక ప్రదేశము వి. (భూగో.) సముద్ర తీరమున వర్తక వ్యాపారములకు అనువుగా నున్న భూమి.
రేవుబోయ వి. ఓడనడుపువాడు.
రేషనలైజేషన్ ఇం.(వాణి.) (Rationalisation) సుసంబద్ధీకరణము. ఒక పరిశ్రమను నిర్వహించు విధానములో ఉచితస్థితిని కనుగొని దానిని ఆచరణలో పెట్టుట.

రేషనింగు ఇం. (వాణి.) (Rationing) అర్థ సమమునకు సరిపోవు ఉత్పాదనలేనపుడు, మానవుని కనీసములైన అవసరములను తీర్చు వస్తువుల సరఫరా విషయములో ప్రభుత్వము విధించు అంశాపూర్వక విధానము, (యుద్ధసమయములో బియ్యము, ఒట్ట వగైరా వస్తువుల పట్ల ప్రభుత్వము రేషనింగు అమలులో పెట్టును.)

రేషము హిం. (వృక్ష.) నార, పీచు, పోగు, (Fibre).

రేసు వి. చులకన. విణ. చులుకనిది.

# రై

రై సం. వి 1. ధనము. 2, హిరణ్యము.

రైక వి. రవిక.

రైజోపస్ ఇం వి. (జీవ.) (Rhizopus) తడిగా ఉన్న రొట్టె మీద పెరుగు బూజు

రైతు వి. సేద్యకాడు,

రైతువారి శిస్తువిధానము వి.వి. (అర్థ.,చరి.) ఈ పద్ధతి మొదటి సారిగా రాష్ట్రమందు సర్ థామస్ మన్రో క్రి. శ. 1800లో ప్రవేశపెట్టెను,ఈ పద్ధతిప్రకారము రైతు నిర్ణయించిన శిస్తును మధ్యవర్తుల ద్వారా కాక నేరుగా ప్రభుత్వమునకు చెల్లించ వచ్చును.

రైలు ఇం (Rail) ఇనుపపట్టా (వ్యవహార మున పొగ బండి.)

రైవతుఁడు సం. వి. శివుడు,

# రొ

రొ అవ్య (స్త్రీ) సంబోధనమందు ప్రయుక్త మగునది. (అక్కరొ, ఇంతిరొ.)

రొంజుడు వి. ప్రలాపము. వదరుట,

రొంతి వి. నడుము యొక్క పార్శ్వ భాగము.

రొంప వి. పడిసెము.

రొంపి వి. అడుసు, బురద.

రొంపిదుక్కి వి నీళ్ళుఅడుసుగా దున్నుట.

రొక్కపుదొర వి. కుబేరుడు.

రొక్కము వై. వి. 1. నగదు, చేతివెల. 2. సమూహము. సం. ఋక్థమ్.

రొక్కించు వై. వి. రొక్కపరుచు.

రొట్టియ వై. వి. రొట్టె. సం, రోటికా.

రొచ్చు వి. 1. అడుసు. 2. మాలిన్యము. 3 అపవాదము.

రొట్ట వి. 1. అకలు ప్రోపు. 2. ఉపశాఖ

రొడ్డు వి. పులుపు. విణ. పులిసినది.

రొద వై. వి. కలకలధ్వని. సం. రుతమ్.

రొప్పు క్రి. 1.కూయు, రోషించు. 2. వెంబ డించి పరిగెత్తించు, తరుము.

రొమ్ము వై. వి. వక్షము దూ. ఱొమ్ము..సం. ఉరస్.

రొమ్ము పడిసెము వి. (వైద్య.. గృహ) గుండె జలుబు. (Bronchitis).

రొయి వి. కట్టెనిప్పుమీది నిగురు. దూ.రొయ్యి

రొయ్య వి. చిరుచేప, పొడవు మీసములుగల చేప.

రొల్లు క్రి. ప్రలాపించు.

రొష్ట వి. (వ్యావ.) 1.నిష్ఠురము. 2.అప్రతిష్ఠ.

# రో

రో వై. వి. 1.కుదువ. 2. చేబదులు. 3.వేళ్ళ కిచ్చు శుల్కము. రూ. రోయి. సం. రై

రో సం. వి. ధనము.

రోకటిబండ వి. 1. శతపది, ఒక పురుగు. 2. పొన్నులేని చిన్న రోకలి.

రోకలి వై. వి. దంచుసాధనము. ముసలము. సం. గోకిలః.

రోజా వి. వగరింపు.

రోత వి. 1. ఏవము. 2 ఎబ్బెరికము.

రోకము సం. వి. 1. ఓడ. 2. రంధ్రము. 3. వెలుగు. 4. కదలిక. 5. రొక్కపు టమ్మకము

రోకు వి. వికాసము.

రోగనిర్భయత సం. (జీవ.) రక్షణశక్తి. శరీరములో. రోగమును కలిగించు జీవులు ప్రవేశించి రోగములు కలుగజేయకుండ విరోధించుశక్తి. (Immunity)

రోగనిరోధకశక్తి సం. వి. (జీవ.) రోగము. నెదుర్కొని దానిని జయించుశక్తి.

రోగము సం. వి. వ్యాధి.

రోచన సం. వి. 1. గోరోజనము. 2. ఎఱ్ఱ గలువ. ఉత్తమ స్త్రీ.

రోచనము సం. విశే. ప్రకాశించునది.

రోచిష్ణువు సం. విశే. ప్రకాశించువాడు.

రోచిస్సు సం. వి. 1. కాంతి. 2. సూర్య కిరణము.

రోజు వై. వి. 24 గంటలు, దినము భూమి తన అక్షముపై పడమటనుండి తూర్పునకు తనచుట్టును 360° తిరుగుటకు తీసికొను వ్యవధి. సం. రోచిః

రోజు హిం. వి. దివసము.

రోజ్‌బర్నర్ ఇం. (రసా.) (Rose burner). ఒక విధమైన బర్నరు.

రోటు వి. ఈచ.

రోటుపోవు క్రి. ఈచపోవు.

రోడ్డు ఇం. వి. (Road). మార్గము, రస్తా.

రోదనము సం. వి. శోకము ఏడ్పు. 2. కన్నీరు.

రోదము సం. వి.భూమ్యాకాశము మధ్యము

రోదసి సం. వి. 1. మన్ను. 2. మిన్ను.

రోధస్సు సం. వి. తటము, తీరము.

రోధించు సం. క్రి అడ్డగించు.

రోపణము సం.వి. మోపుట. (సందారోపణ).

రోమంథము సం. వి. నెమరు.

రోమన్ కేథలిక్కులు ఇం. వి. (roman catholics)ఐహికాధ్యాత్మిక విషయము లలో పోపు అను మత గురువును అధి నేతగా అంగీకరించిన క్రైస్తవులు.

రోమను పంచాంగము మి. వి. (భూగో., చరి.) రోమన్ లేక క్రైస్తవపంచాంగము (ఈ పంచాంగము ప్రకారము సంవత్సర మునకు 365 రోజులుండును తక్కువ పడిన 1/4రోజును నాలుగు సంవత్సరముల కొకమారు "లీపు ఇయరు" నేర్పఱచి ఆ సంవత్సరమునకు 366 రోజులు వచ్చు టకై ఫిబ్రవరి నెలకు ఆ సంవత్సరములో 29 రోజులు నిర్ణయించిరి. రోమను పంచాంగము ఇప్పుడు అంతర్జాతీయ పంచాంగముగా అందరు గుర్తించుచు న్నారు. (roman calendar).

రోమము సం. వి. ముఖము, శిరముతక్క తక్కిన దేహములోగల వెండ్రుక.

రోమశము సం. వి. 1 పంది. 2. గొఱ్ఱె. విశే. ఒడలిపై నెక్కువ వెండ్రుకలుకలది.

రోమహర్షణము సం. వి. రోమాంచము.

రోమాంచము సం. వి. రోమములు గగు ర్పొడుచుట, పులకరము.

రోయి వై. వి. మూ రో. 1. వేశ్యకిచ్చెడు శుల్కము. 2. పందెము. కుదువ. 3. చేబ దులు. 4. ఎరవు.

రోయు క్రి. 1. రోతపడు 2. వెదకు. 3. నిందించు.

రోలంబము సం. వి తుమ్మెద.

రోలు క్రి. 1. విలపించు 2. బాధపడు. వి. రోలు. ఉలూఖలము.

రోవెలఁది ద్వ. బోగముది.

రోషణుఁడు సం. విశే. కుపితుడు.

రోషము సం. వి. 1. కినుక. 2. రోసము.

రోస్థి సం. వి. (జం.) కపాలమునకు అడుగు భాగమున నుండు T ఆకారముగల ఎముక (బ్రహ్మలిపిలో "రో" అను అక్షరము T వలె నుండును). (Parasphenoid).

రోహణము సం. వి. 1. ఎక్కుట. 2. ఒక కొండ.

రోహము సం. వి ఎక్కుట, 2. మొలక.

రోహిణి సం. వి. 1. నాల్గవ నక్షత్రము. 2. తొమ్మిదేండ్ల కన్యక. 3. బలరాముని తల్లి

రోహితము సం. వి. 1. కుంకుడు పువ్వు. 2. నెత్తురు. 3. ఎరుపు. 4. ఎఱ్ఱచేప.

రోహితాశ్వుఁడు సం. వి. 1. అగ్ని. 2. హరిశ్చంద్రుని కొడుకు. రూ. 1. రోహితాశ్వుడు. 2. లోహితాస్యుడు.

రోహిషము సం. వి కొండగోగ్గి, ముత్యము

## రౌ

రౌండు టేబిల్ సమావేశము మి. వి. (చరి., రాజ.) ఇండియా రాజకీయ సమస్యలను పరిష్కరించుటకై బ్రిటిష్ ప్రభుత్వము లండనులో క్రి. శ. 1930-33 సం. లలో జరిపిన సమావేశములు. (Round Table Conference)

రౌచికుఁడు సం. వి. మృదుమధురముగ కవిత రచించువాడు.

రౌడి హిం. వి. దుష్టస్వభావము గలవాడు

రౌతు వై. వి. రావుతు. రాహుత్తు రవుతు సం రాహుత్తః.

రౌద్రము సం. వి. 1. భయంకరము. 2 తీక్ష్ణము. వి. 1. ఎండ. 2. రౌద్రరసము 3. దినము యొక్క మొదటి భాగము.

రౌద్రి సం. వి. ఏబది నాల్గవ సంవత్సరము.

రౌప్యకరణము సం. వి. (రసా.) వెండికళాయి పూయుట.(Silvering). ఉదా. అద్దములు.

రౌప్యము సం. వి రూప్యము యొక్క రూపాంతరము. బంగారు, వెండి, లోనగు వాని నాణెము.

రౌరవము సం. వి. నరక విశేషము విశే. భయంకరము.

రౌలు క్రి. రవులు, రగులు

రౌహిణేయుఁడు సం. వి. 1. బలరాముడు. 2. బుధుడు.

రౌహిషము సం. వి. 1. కామంచిగడ్డి (తృణ విశేషము). 2. కొండగోగ్గి.

## ఱ

ఱ ఒక అక్షరము, శకటరేఫము.

ఱంకు వై. వి. జారత్వము. సం రంకః.

ఱంకులరాట్నము వై. వి. బాలికలు ఎక్కి త్రిప్పించెడి వలయాకారపు యంత్ర విశేషము (రంగుల రాట్నము).

ఱంకె వి. 1. కేక. 2. వృషభధ్వని 3

ధ్వని రూ. ఱంకియ.

ఱంతు వి. 1. కలకలధ్వని. 2, సంబరము. 3. మాట, 4. గజిబిజి.

ఱంపము వి. క్రకచము, పలకలులోనగు వానిని కోసెడు సాధనము.

ఱంపిల్లు క్రి. 1. వ్యాపించు, 2. వర్ధిల్లు విజృంభించు, అతిశయించు.

ఱంపు వి. కలశము. రచ్చ.

ఱంపె వి. 1. తోలుకోసెడు సాధనము. 2. తాటాకులు మట్టగించి కోసెడు సాధన విశేషము.

ఱక్కు క్రి. గీరు. వి. గీర. గీటు.

ఱప్ప వి. చిన్నరాయి.

ఱవ్వ వి. 1. నింద, 2. దూఱు.

## ఱా

ఱాగ వై. వి. ఱాగిణి. విశే. 1. ధూర్తుడు. 2 ఉద్ధతుడు. నం. లంకా,

ఱాతిగుండె వి. కఠిన హృదయము.

ఱాతినార వి. ఒక ఓషధి.

ఱాతినార-నారరాయి వి. (గృహ. భూగ.) ఇది లవణముల నారతో తయారు చేసిన అట్టవంటి రేకు. (నిప్పుతో నిది కాలదు). (Asbestos).

ఱాతివాలు వి. వజ్రాయుధము,

ఱాయి వి. శిల.

## ఱి

ఱింగు వి. రెక్కల గాలి చప్పుడు,

ఱిచ్చపడు క్రి. చేష్టలుదక్కు, బ్రామ్పడు.

ఱివ్వ వి. ఎగయుట యందగు ధ్వన్యను కరణము.

ఱివ్వున అవ్య. తటాలున, శీఘ్రముగ.

## ఱె

ఱెప్ప వి. కనురెప్ప.

ఱెక్క వి. పక్షము.

ఱెల్లు వి. తృణ విశేషము, శరము.

ఱెల్లుచూలి దే. వి. కుమారస్వామి, శర జన్ముడు.

## ఱే

ఱేచే వి. శునక విశేషము (ఱేచుకుక్క).

ఱేడు వి. దొర. మగడు, అధిపతి.

## ఱొ

ఱొడ్డ విశే. ఎడమ (ఱొడ్డచేయి).

ఱొమ్ము వై. వి. వక్షము. నం. ఉరస్.

## ఱో

ఱోలు క్రి. 1. బాధచే వలచు. 2. విలపించు. వి. ఉలూఖలము.

ఱోలుగాలి వి. పెద్దగాలి.

# ల

ల ఒక యక్షరము, ద్వితీయాది బహువచనముల వచ్చు ప్రత్యయము, ఉదా.వనము లన్, గృహములన్.

లంక సం. వి. 1. లంకాదేవి. 2. ఒకానొక రాక్షసి. 3. రావణుని పట్టణము. 4. రంకులాడి, వి. దీవి.

లంకణము వై. వి. రోగకాలమందు ఉపవాసము. రూ. లంకనము. సం. లంఘనమ్.

లంకించు వై. క్రి. పెనవేయు, తగులు, అవమానించు

లంకియ వై. వి. బంధము. తగులుపాటు లంకె

లంగము సం. వి. సంయోగము.

లంగరు వై. వి. ఓడనిలుపు అనుపసాధనము సం. లాంగలమ్,

లంగా వి. (వ్యావ) 1. అంగదట్టము. 2. పావడ.

లంగుఁడు సం. వి. విటుడు.

లంగోటి హిం. వి. గోచి,

లంఘనము సం. వి, 1. దాటు. 2. లాగు 3. గుఱ్ఱపు దూకుడు. సం. (గృహ.) తిండి లేక మాడుట (Starvation).

లంచగొండి విశే. లంచముగొనువాడు. వై. వి. కార్యార్థమిచ్చు సొమ్ము

లంజ సం. వి. వేశ్య.

లంటఁడు వి. (వ్యావ.) గుండుపట్టి ముండు వాడు.

లండి విశే. కుత్సితుడు,పెసుగు,కుత్సితురాలు.

లంద విశే. పెద్ద తొట్టివాడు. ఫి. చర్మకారులు తోళ్ళు నానవేసెడి తొట్టి.

లంపట వి, 1. ఆపద. 2. ఆపద.

లంపటా వి. దాసీపుత్రుడు.

లంబ సం. వి. దుర్గ, లక్ష్మి

లంబకర్ణము సం. వి. మేక. విశే. వ్రేలాడెడి చెవులు గలది.

లంబకేంద్రము సం. వి. (గణి.) త్రిభుజము లోని లంబములు ఖండన మగు బిందువు (Ortho-centre).

లంబకోణ త్రిభుజము సం. వి. (గణి.) ఒక కోణము లంబకోణముగాగల త్రిభుజము (Right angled triangle).




లంబనము సం. వి వ్రేలుడు

లంబము సం వి (గణి.) ఒక సరళరేఖతో సమకోణముచేయు సరళరేఖ (Perpendicular).




లంబాడి హిం. వి. ఒకానొక జాతి.

లంబి వి. కుటుంబము,

లంబిక సం. వి. కొండనాలుక.

లంబిత, లంబకోణీయము సం. విశే. (గణి.) ఒక దాని కొకటి లంబముగా ఖండించు కొనెడిది. (Orthogonal).

లంబు వై. వి. దీర్ఘ్యము. గొప్పతనము.సం. లంబః,

లంబుషము సం. వి. ఏడుపేటల ముత్యాలహారము.

లంబోదరుఁడు సం. వి. వినాయకుడు.

లంభనము సం. వి, 1. తిట్టుట. 2 దొరకుట.

లకుచము సం. వి. గజనిమ్మ రూ. లికుచము

లకుమిక వి. చేపలబుట్ట పిట్ట, తిట్టిభము.

లకోటా హిం. వి. ఉత్తరమునుంచు కాగితపు సంచి

లకోరి వి. క్రూర వ్యాఘ్రము, ఒక తెగనాణెము

లక్క వై. వి. ఒకచెట్టు బంక. సం లాక్షా (వ్యావ) (Lac coccuslacca) అను ఒక జాతి కీటకములను కుసుమ, రేగు, పలాస్త్రీ మొ. కొన్ని జాతుల చెట్లపై వృద్ధిచేసి అవి ఏర్పరుచుకొను గూళ్ళనుండి ఈ ద్రవ్యము ఉత్పత్తిచేయుదురు.

లక్కనము వై. వి లక్షణము, గురుతు. సం. లక్షణమ్.

లక్కపరిశ్రమ మి. వి. (వ్యావ) లక్కకొఱకు లక్క పురుగులను వృద్ధిచేసి పెంచి లక్కతీయుట (Lac indust y)

లక్క పిడత వై. వి లక్కతో చేసిన బుడిగ.

లక్కి వై. వి లక్ష్మి. సం లక్ష్మీ.

లక్కిమి వై వి లచ్చి.

లక్కుమనుఁడు వై వి. లక్ష్మణుడు. సం. లక్ష్మణః

లక్ష సం. వి 1 నూరువేలు. 2. నియుతము

లక్షణ సం. వి. ఒక శబ్ద వృత్తి

లక్షణము1 సం. వి. గురి. గురుతశాస్త్రము.

లక్షణము2 సం. వి. (రసా., భౌతి) ఒక వస్తువునకు లేదా ద్రవ్యమునకు నియతముగా నుండి, ఆవస్తువును (ద్రవ్యమును) గుర్తించుటకు అవశ్యకమైన ధర్మము. (Characteristic).

లక్షణము3 సం. వి. (గృహ.) 1. గుణము. 2. స్వభావము (Trait).

లక్షము సం వి. 1. గురి. 2. రవము. 3. వ్యాజము.

లక్ష్మము సం. వి. 1 చిహ్నము. 2. మచ్చ. 3. ముఖ్యము.

లక్ష్మి. సం. వి 1. రమాదేవి. 2. సంపద. 3. వస్త్రభూషణాదులశోభ. 4. మెట్టదామర

లక్ష్యము సం. వి. 1. గురి. 2. లెక్క.

లగడ వి. దేగ.

లగాము హిం. వి. కళ్లెము.

లగాయతు హిం. వి. మొదలు.

లగుడము సం. వి. దుడ్డుకఱ్ఱ, దండము.

లగువు వై. వి గంతు. విశే. తేలిక, చులకన సం. లంఘః, లఘుః.

లగ్గ వై. వి. కోటను ప్రాకుట. సం. లంఘః

లగ్గదింపు వి. కోటపైనుండి శత్రువులపై దొర్లించు జాతిబండ.

లగ్గు వి మేలు. వ్యతి. ఎగు.

లగ్నము సం. వి (వృక్ష) కింజల్కము యొక్క దండము పుప్పొడితిత్తి పొడవున అంటుకొనియున్నస్థితి కలది. (Adnate).

లగ్నము సం వి మేషాదిరాసుల ఉదయము విశే. తగులుకొన్నది

లఘిమ సం వి. లఘుత్వము.

లఘిష్ఠము సం. విశే. 1. మిక్కిలి చులుకనైనది. 2. మిక్కిలి తక్కువైనది

లఘుకోణ త్రిభుజము సం. వి (గణి) మూడు కోణములు లఘుకోణములుగా గలిగిన త్రిభుజము. (Acute angled triangle).

లఘుకోణము సం. వి. (గణి.) సమకోణము కన్న చిన్నదియగు కోణము. (Acute angle).

లఘుచాపరేఖ సం వి (గణి.) అర్ధవృత్తము కన్న చిన్నదగు చాపరేఖ. (Minor arc).

లఘుతమావశేషము సం. వి (గణి.) ఒక అంకెను మరియొక అంకెచే భాగింపఁగా మిగిలెడి శేషములన్నింటచిన్నది (Least residue).

లఘుధాతువు సం. వి (రసా) సాంద్రత చాల తక్కువగానుకడు ధాతువు ఉదా. మెగ్నీషియమ్ ఎల్యూమినియమ్, సోడియమ్, పొటాసియములు నీటి మీద తేలునంతటి చులకనివి. (Light metal).

లఘుపరిశ్రమలు సం వి. (గృహ. .వాణి.) చిన్నతరహా పరిశ్రమలు (Small scale industries).

లఘువాల్వ మి.వి.(భౌతి.) లఘు కవాటము. (Acronvalve).

లఘువు సం. విశే. 1.చులకనిది, 2.వడిగలది. వి. 1. ఒకమాత్ర, ఒక మాత్రకాలమున పలకబడినది.

లాఘువేలప్రవాహము సం. వి (భూగో.) శుద్ధ బహుళ పక్షములందలి అష్టమీతిథుల యందు సముద్రపు నీటిమట్టము సూర్యు డొక వైపు, చంద్రుడు మరియొక వైపు ఆకర్షించుటచే కలిగిన అధికమైనపాటు

లాఘ్వాంత్రము సం. వి. (గృహ.) చిన్న ప్రేవునకు మొదటిలో వంగియున్న భాగము (Deuodenum)

లచ్చి వై. వి. లక్ష్మి. స. పద. సం. లక్ష్మి

లచ్చనము వై. వి. 1. లక్షణము.2,గురుతు 3. వ్యాకరణశాస్త్రము.

లజ్జ సం వి సిగ్గు

లత్తు వి. తొట్టి. గాడి. వడియ.

లడాయి హిం. వి దెబ్బలాట.

లడ్డు వై. వి. లడ్డువు, (లడ్వము) చక్కెర పాకుతో చేసిన భక్ష్యము (లడ్డుకము)

లత సం, వి. 1. తీగ. 2. ముత్యాలహారపు పేట. (వృక్ష.) తీగ. ఏదైన ఆధారమును ఊతగొని ప్రాకు మొక్క

లతకూన మి వి. లేత తీగవంటి స్త్రీ

లతాంతము సం. వి. పువ్వు.

లతిక సం. వి. 1. తీగ 2 నూరు పేటల హారము.

లత్తుక వై. వి, లక్క. సం, లాక్షా

లద్ది వి గుఱ్ఱము మొదలగువాని మలము

లపనము సం. వి. 1, ముఖము. 2. నోరు. 3. మాట

లప్ప వి, రాశి. విశే. కండకలది.బలిసినది.

లప్పము వై. వి. కఱ్ఱల సందులకు మెత్తు సుద్ద ముద్ద.

లబ్బీలు హిం. వి. ఒకానొక తురక జాతి

లబ్ధము సం. విశే. పొందబడినది.వి (గణి.) భాగహారము చేయగా నేర్పడు సంఖ్య.

లబ్ధము సం. వి. (గణి.)అంకగణిత ప్రక్రియలో నొకటి (Product).

లబ్ధి సం. వి. లాభము.

లభ్యము సం. విశే. 1. లభింపదగినది. 2. యుక్తము. 3 ప్రాప్యము.

లయ సం, వి. నృత్తగీత వాద్యములు సమముగా నుండుట. 1. స్వరగీతముల కనుగుణముగా తాళమువేయుట (Rhythm). 2. తౌర్యత్రికసామ్యము 3. మోహము

లయకారి విశే. వంచకుడు.

లయము సం. వి. 1. నాశము. 2. ఆలింగనము. 3. నీటి వట్టివేరు.

లలంతిక సం. వి. కంఠహారము.

లలన సం. వి. విలసనశీలయగు స్త్రీ.

లలటపార్శ్వాస్థి సం. (శరీ) పుఱ్ఱెలో పైభాగమును ఏర్పరుచు ఎముకలలో నొకటి. అది లలాటాస్థి,పార్శ్వాస్థి అను రెండు ఎముకలుకలిసి ఏర్పడినది. (Frontoparietal bone).

లలాటము సం. వి. నదురు.

లలామము సం. వి. 1,గురుతు. 2,చుక్కము 3, తొడవు. 3, నొసటిబొట్టు. 5, తోక. 6. గుఱ్ఱము (ఉత్తరపదమైనచో శ్రేష్ఠము).

లలి వి. 1. ప్రేమము. 2. ఒయారము. 3 క్రమము. 4. ఉత్సాహము.

లలితము సం. వి. సౌకర్యముచే అంగవిన్యాసరూపమగు స్త్రీల-శృంగారచేష్ట. విశే. మనోజ్ఞము, ఈప్సితము.

లవంగము సం. వి. కరావుపూ.

లవంగములు సం. వి. (వ్యవ.) (వృక్ష) ఇవి Myrtaceae అను కుటుంబమునకు చెందిన Engenia caryophyll అను మొక్కయొక్క పూల మొగ్గలు. (ఈ మొగ్గలువికసించక పూర్వమేకోసిఎండబెట్టుదురు (Cloves). లవంగములు తాంబూలమందును, వైద్యములందును, వరి

మళ సంబార ద్రవ్యముగను ఉపయో గింపబడుచుండును వీని నుండి ఒక విధ మగు నూనెను తయారు చేయుదురు (Clove oil).

లవంఁదరు ఇం. (వృక్ష) (Lavender) ఇది పరిమళము నిచ్చు అస్థిర తైలములలో నొకటి. దీనిని తులసి కుటుంబము (Labiatae)నకు చెందిన Lavendul Sp. అను మొక్కల పూవులనుండి తీయుదురు

లవణజనకము నం. వి (రసా) ఈ వర్గము నకు చెందిన ఫ్లోరిన్, క్లోరిన్, బ్రోమిన్, అయొడిన్‌లలో క్లోరిన్ సోడియముతో కలసి లవణము నిచ్చునని తెలియుటచే వీనికి లవణ జనకములని పేరు వచ్చినది (Halogen).

లవణజలము నం వి (రసా.) లవణము పాలు ఎక్కువగా కలిగియున్న నీరు (Brine).

లవణనిగరణశక్తి నం. వి. (వృక్ష ,భూగో.) నేల యందలి నీటిలో కరిగి యుండు లవ ణములను మట్టిరేణువులు కొన్నిటిని హెచ్చుగను, కొన్నిటిని తక్కువగను ఆకర్షించుశక్తి (Salt absorption power)

లవణము నం. వి (రసా.) లోహము, అలోహములచే నేర్పడిన సమ్మేళనము ఒక లవణాధారము. ఆమ్లము లోని హైడ్రొజన్‌ను తప్పించి, ఆస్థానము నాక్ర మించి మిగిలిన ఆమ్ల భాగముతో కలి యగా నేర్పడు క్రొత్త సమ్మేళనము. (Salt).

లవణము నం. వి. ఉప్పు, సైంధవ, సౌవర్చ, కాచ, బిడా, సముద్ర లవణములని పంచ లవణములు.

లవణి వి. బిగువు.

లవనము నం.వి. పైరులోనగు వాని కోత.

లవనను ఇం. వి. జీవనార్థమై యిచ్చు సొమ్ము (Allowance).

లవము నం. వి లేశము, భిన్నాంకములోని పై అంకె

లవము నం. వి (గణి.) భిన్నములోని మీది భాగము. 2/3అను భిన్నములో 2అనునది లవము (Numerator).

లవలేశము నం. వి. అత్యంతాల్పము

లవాజిమా వి. గ్రామసేవకుల జీతములకై తీసికొనబడు పన్ను.

లవిటి వి 1 రెక్కమొదలు. 2. చెవిటి.

లవిత్రము నం వి కొడవలి, లిక్కి

లశునము నం. వి. వెల్లుల్లి (వృక్ష.) ఉల్లి మొదలగు మొక్కలకు భూమిలో నేర్పడు గడ్డ. (ఇది రసముతో కూడిన శల్క పత్రములతో పొరలుగా నేర్పడి యుం డును. (Bulb).

లష్కరు హిం. వి. దండు.

లసికాకోటరములు నం. వి. (జీవ.) శోష రసముండుస్థలములు (Lymph sinuses).

లసికారసము నం. వి. (జీవ.) జీవకణజాల ములో నున్న జీవకణములు మునిగియుండు తెల్లరక్తకణములతో కలసియున్న ద్రవ పదార్థము. (Lymph).

లసికా హృదయములు నం. వి. (జీవ.) గుండెవలె సంకోచవ్యాకోచములచే శోష రసమును ప్రసరింపచేయు నిర్మాణములు (Lymph hearts).

లసితము నం. విశే ప్రకాశించునది.

లసుకు క్రి. నాశనముచేయు.

లస్తకము నం. వి. 1. పిడికట్టు. 2. వింటి నడుము.

లస్పరు ఇం.వి. (గృహ) గాజుదీపాల ఆధా రము, కొమ్మల దీప స్తంభము. గాజుతో తయారు చేయబడిన అలంకారదీపా ధారము (దీనిని గదులలో వ్రేలాడగట్టు దురు.) (Chandelier).

లహరి సం. వి. 1. పెద్దఅల, 2. పిచి.

# లా

లాంగలము సం. వి నాగలి.

లాంగూలము సం వి. తోక.

లాంగూలతరణన్యాయము సం. న్యా. కుక్కతోకపట్టుకొని గోదావరి యీదవనుకొని

లాంఛనము సం వి. 1 గురుతు. 1, నామము 3. వివాహాదులందలి మర్యాదలు.

లాండుఅలియనేషన్ చట్టము మి. వి (శాస) వ్యవసాయదారులు భూమి నితరులకు మార్చుటకు వీలులేకుండ శాసించుచట్టము. (Land alicnation Act)

లాండ్‌మార్ట్‌గేజి బ్యాంక్ ఇం. వి. (అర్థ) (Land mortgage bank). భూమి తనఖా బ్యాంకు వభివృద్ధిచేసికొనుటకు భూమిని తాకట్టు పెట్టుకొని అప్పులనిచ్చు బ్యాంకు

లాఁక వి. పక్షియీక.

లాఁకకట్టె వి. పెడరెక్కలు విరిచికట్టినకట్టు.

లాఁగ రంధ్రము, బొరియ.

లాఁగడాఁగుడు వి. సర్పము, వ్యు. బొరియ అందు దాగుకొనునది.

లాఁగరి వి. చెవి.

లాఁగు వై. వి. 1. చల్లడము. 2. మల్లబంధము. 3. లంఘనము. సం. లంఘః.

లాఁచు క్రి. 1. వ్యాపించు. 2 పొంగు. 3. డాకొను.

లాఁత వి. 1. లాయుట. 2. విజృంభించుట.

లాఁతి వి. 1. ఇతరము. 2. వేరు.

లాఁతు విశే. అధికము.

లాఁపరా వి. (లాపు+రాయి) జలదారి ముఖమున తృణాదికము చొరకుండ వేయు గండ్లరాయి.

లాక వి. లాకబద్ద(పడుగునందు చొప్పించు బద్ద)

లాకకట్టు వి లాకలతోడ చుట్టి యుంచిన పడుగు

లాకు ఇం వి. (Lock) కాలవయందిటునటు వచ్చెడి ప్రవాహము నాపుచు వెలువరించుచు నుండు అడ్డతలుపుల కట్ట

లాకౌట్ ఇం వి. (Lock out) మూసివేత, సమ్మెలు. మొ. వని జరిగినపుడు కర్మాగారములను యజమానులు మూసివేయుట)

లాక్ష సం వి లక్క.

లాక్షణికుఁడు సం విశే. 1. లక్షణజ్ఞుడు, 2. శాస్త్రకారుడు.

లాక్షారసము సం. వి. పారాణి

లాగము వై. వి. లాఘవము సం లాఘవమ్.

లాగు క్రి. ఆకర్షించు. వి 1. విధము. 2. ఆకర్షణము. 3. సమ్మతి

లాగూను ఇం. వి. (భూగో.)(Lagoon) సముద్రమునుండి పర్వతశ్రేణిచేవేరుచేయబడిన నీటి ప్రదేశము.

లాఘవము సం. వి. 1. లఘుత్వము 2. ఆరోగ్యము.

లాజము సం. వి. 1. వట్టివేరు. 2. సానబియ్యము.

లాజలు సం. వి. పేలాలు.

లాటము సం. వి. 1. చిలుక. 2 ఒకానొక దేశము

లాటారీఇం. వి.(Lottery)చీట్లుకలిపివస్తువుల నమ్ముట.

లాటారీ ఇం. (వ్యావ.) (Lottery)1. పందెపు జూదము: 2. చీట్లువేసి నిశ్చయించు పందెము.

లాటీ వై. వి. దుడ్డుకఱ్ఱ

లాటు ఇం. వి.(Lot)పలములోని భాగము. గుట్ట.

లాడము వి. గుఱ్ఱపు గిట్టలకు గొట్టు ఇనుప బిళ్ళ. రూ. లాళము

లాఠీ వి. పెద్దపుండు. బలి.

లాడీబేడీ వి. (వ్యావ ) మూట ముల్లె

లాతము వి. 1. చేతి బెత్తము. 2. సన్న్యాసుల చేతి దండము.

లాదు వి. (వ్యావ.)కట్టడములలో పంపుల కాధారముగా కట్టు కట్టడము.

లాపము సం. వి. శోకము.

లాప్పులు ఇం. (వరి.) (Kapps) యూరపు మంచు ఎడారులలో నివసించు మానవులు లాప్ లాండ్ (Lapland) దేశస్థులు.

లాబీ ఇం. వి. గోష్ఠి ప్రదేశము. 2. శాసన సభ్యుల గోష్ఠి. 3. తమప్రక్కకు త్రిప్పుకొనుటకు సభ్యులు చేయు ప్రయత్నము.

లాభనష్టములఖాతా మి.వి. (వాణి ) నిర్ణీత కాలాంతమున ఒక సంస్థచేసిన నికరపు లాభమును కన్గొనుటకు ముపకరించుఖాతా (సంస్థ యొక్క రాబడులు ఒక వైపున ఖర్చులు రెండవ వైపున వేసి మొదటి దానిలో రెండవది తీసినలాభమో,నష్టమో మొత్తము తెలును.

లాభము సం. వి. (అర్థ)పరిశ్రమల వలన కాని వ్యాపారముపలనకానిఖర్చులుపోను మిగిలిన నికరపు ఆదాయము,విక్రయించుటకు కావలసిన అన్ని వ్యయములు పోగ మిగిలిన సొమ్ము. సం. వి. క్రయ విక్రయములందు వచ్చు హెచ్చు ధనము అధికముగా పొందబడినది.

లామార్కిజ్జం ఇం. (జీవ ) (Lamarckism) సంపాదిత లక్షణములు అనువంశికముగా వచ్చుచుండుటవలన జీవపరిణామము కలుగుచున్నదని లామార్క్ అను శాస్త్రవేత్త చేసిన సిద్ధాంతము.

లాయము వై. వి గుఱ్ఱపుశాల. సం అలాయః.

లాయర్ ఇం వి. (lawyer) న్యాయవాది.

లాయిల్లాసా హిం. వి. శ్రమము.

లాయు క్రి విజృంభించు.

లాల సం. వి. చొంగ

లాలనము సం. వి బుజ్జగము,ముద్దుచేయుట.

లాలము వి. ఉల్లారు క్రింది జాలరు.

లాలసము సం. వి. అధికేచ్ఛ. ఔత్సుక్యము

లాలా జలగ్రంధులు సం. వి. (జం.) ఉమ్మిని ఉత్పత్తిచేయు గ్రంధులు (Sal v iry-glands). )ఇవినోటికి ఇరుప్రక్కల దవడలలో ఉండును )

లాలాజలనాళము సం వి (జం ) లాలాగ్రంధుల నుండి ఉమ్మినీటిని తీసికొనివచ్చు గొట్టము. (Salivaryduct).

లాలాజలము సం (జం ) నోటిలో ఊరెడి నీరు, ఉమ్మినీరు. (Saliva).

లాలాటికుడు సం. వి ప్రభువృదయము కనిపెట్టువాడు.

లాలి వి. ఉయ్యాల.

లాలిత్యభావము సం. వి లలిత భావము.

లాలూచి హిం వి. 1. ఆశ్యాశ 2. నైచ్యము

లాలోచి వి (వ్యావ.) లోపాయికారి.

లావణము వి. క్రొత్తగావచ్చిన సేవకుని పట్టికలో వ్రాసికొనుట.

లావణ్యముసం వి. అవయవకాంతిని శోభము.

లావనము సం. వి. కోయుట.

లావరి విశే. (లావు + అరి)బలవంతుడు.

లావా ఇం. (భూగ ) (lava) శిలాద్రవము. అగ్నిపర్వతముల నుండి రాయికరగి ప్రవహించు అత్యధికోష్ణోగ్రతకల ద్రవము.

లావాదేవీలు హిం వి. వర్తకవ్యాపారములలో ఇచ్చి పుచ్చుకొనుట.

లావు వి. 1. బలము. 2. అతిశయము. సామర్థ్యము విశే. స్థూలము.

లావోత్సు చైనా వేదాంతి.

లావకము సం. వి. నెమిలి.

లావకుడు సం. వి ఆటగాడు.

లాసము సం. వి. నృత్యము. రూ. లాస్యము.

లాసిక సం. వి ఆటకత్తె.

లాస్యము సం.వి. నృత్యము, తౌర్యత్రికము.

లాహిరి వి. మత్తు.

## లి

లింగడు వై. వి. జంగమయ్య. శివభక్తుడు, లింగము ధరించువాడు.

లింగపీఠము సం. వి. పానవట్టము.

లింగబలిజెలు వి. లింగధారులగు బలిజ కులమువారు.

లింగము సం.వి 1 లింగధారుల సజ్జకాయ. 2.పానవట్టముమీది శివమూర్తి. (గృహ.) ఆడమగ భేదము, స్త్రీ పురుష జాతిలో ఒకటి (Sex).

లింపాకము సం వి. పండు.

లింపాకుడు సం. వి. మూర్ఖుడు.

లికుచము సం. వి. 1. గజనిమ్మ. 2. గంగరేగు.

లిక్క వి. కొడవలి.

లిక్ష సం. వి. ఈరు.

లిఖించు సం. క్రి. వ్రాయు.

లిఖితము సం. విశే. వ్రాయబడినది. వి. అక్కరము.

లిఖిత సంవిధానము సం. వి. (రాజ., శాస.) రాజ్యాంగ వ్యవస్థ. నిబంధన పూర్తిగ లిఖిత పూర్వము చేయుట, ఉదా. అమెరికా సంయుక్త రాష్ట్రముల, భారతదేశ ఫ్రాన్సు దేశముల సంవిధానములు.

లిఖితుడు సం. వి. 1. పాణి. 2. ఒక ముని.

లిగ్నైన్ ఇం (వృక్ష.) (Lignin) ఇది మొక్క క్లిష్ట నిర్మాణము గల గట్టి రసాయన పదార్థము. జీవకణ కవచములుగాని, జీవకణ భాగములుగాని, అవసరమైన చోట్ల ఈ పదార్థముచే నేర్పడిన పొరలతో దృఢముగా నగును.

లిట్మస్ ఇం. (రసా.) (Litmus) ఆమ్లములు తగిలిన ఎఱ్ఱగాను, క్షారములు తగిలిన నీలముగాను మారెడి ఒక ద్రవ్యము.

లిద్ది వి 1 పడిసెముచే ముక్కుడచుకొనుట 2. రోటిలో గొట్టెడు గూటము.

లిపి సం వి. వ్రాత.

లిప్తకము సం. వి. విషము పూసిన బాణము విశే. పూయబడినది.

లిప్తము సం. విశే 1 పూయబడినది 2. భుజింపబడినది.

లిప్స సం. వి. ఇచ్ఛ. వాంఛ.

లిబ్బి వి. 1. పాతర. 2. రాశి. 3. నిధి. 4 ప్రోగు, ధనము.

లిబ్బిదొర వి. శ్రీదుడు, కుబేరుడు.

లిబ్బిపడతి వి. లక్ష్మి.

లిమ్మ వి. ఈగల దోలు రెమ్మ.

లియ్యము వై. విశే. లయించినది. సం. లీనః.

లివ వి. లాఘవము.

## లీ

లీజియన్ ఆఫ్ ఆనర్ ఇం. (చరి.) (Legion of Honour) ఒక ఫ్రెంచి బిరుదము.

లీటర్ ఇం. వి (Litre) ద్రవపదార్థములను కొలుచుటకు వాడు ఒక ప్రమాణము- గ్యాలనులో షుమ్మారింట రెండుభాగాలు.

లీఢము సం.విశే. 1. నాకబడినది. 2. తాకబడినది

లీనము సం. విణ. లయించినది, కరగినది.
లీల సం.వి. 1, క్రీడ. 2. క్రియ.3.శృంగార చేష్ట. 4. రీతి.

# లు

లు (వ్యాక) ప్రథమా బహువచనము.
లుంగ వి. 1. బట్టలచుట్ట. 2. వస్త్రభారము,
లుంగము సం వి, మాదీఫలము.
లుంగి వి. 1. తురకల మొలబట్ట. 2.మాదీఫలము. 3. కుల్లాయి, కుప్పసములు చేర్చి కుట్టిన పావడ.
లుంటాకుఁడు సం. వి. దొంగ.
లుంఠనము సం. వి. 1 భూమిమీఁదపొర్లిక 2. గుఱ్ఱపు పొర్లిక.
లుకిలుక వి, 1 పరిగెత్తుట. 2. పురుగులు తొలుచునపుడు గలుగు ధ్వన్యనుకరణము.
లుక్క సం వి. వెలితి, లోపము.
లుగచెడు క్రి. 1. హీదయగు. 2.బాగుతప్పు.
లుగసాను హిం వి. నష్టము (లుగ్సాను.)
లుడుగు వి. పసుల మెడను గట్టు గంట.
లుప్తము సం. వి. దొంగ సొమ్ము. విణ. లోపించినది. కోయబడినది.
లుబ్ధకుఁడు సం. వి. 1. పిసినిగొట్టు, లోభి. 2. బోయవాడు.
లుబ్ధుఁడు సం. వి. 1. బోయ. 2.లోభి పిసినిగొట్టు.
లులాయము సం. వి. దున్న.
లువి వి. తక్కువ.
లులితము సం. విణ. చలించినది.
లులిపడు క్రి.1.అణుగుడుపడు. 2 .హీనమగు
లుల్లిగాఁడు వి. 1. హీనుడు. 2 అధముడు.

# లూ

లూటి వి. 1. కొల్లగొనుట. 2.ఉపద్రవము. 3.వ్రణరంధ్రము, దొడయందలి వ్రణము.
లూడుపులు వి పాదరక్షలు.
లూత సం. వి. 1.సాలెపురుగు. 2. రోగము.
లూనము సం. విణ. కోయబడినది.
లూలామాలము వి. వంచన.
లూషిక సం. వి. సాలెపురుగు.
లూసర్న్ ఆం. (వ్యవ.)(Lucerne)ఇదిపశువులకు ప్రశస్తమైన మేతపైరు(Lucerene-alfa - alfa medicago sativa). ఇది Papilionaceae అను కుటుంబమునకు చెందిన మొక్క.

# లె

లెంక వి. సేవకుడు.
లెంకి వి. సేవకురాలు.
లెంప వి. ప్రక్క, చెంప.
లెంపకాయ వి. చెంప దెబ్బ.
లెక్క దే. వి 1. లక్ష్యము. 2. సంఖ్య. 3. పద్దు సం 1. లక్ష్యమ్. 2. లేఖా.
లెక్కగొను క్రి. లెక్కించు, లక్ష్యపెట్టు.
లెక్కపెట్టు క్రి. లెక్కించు, ఎన్నికచేయు.
లెగ్గింగ్స్ ఆం. (గృహ.) (Leggings) మేజోళ్ళతోసహా చేయబడిన నిక్కరు.
లెప్ప వి. గురి. రూ. లెప్పము.
లెస్స వి. క్షేమము. విణ. శ్రేష్ఠము.
లెస్సఁదనము వి. యోగ్యత, మంచితనము.
లెస్సవాఁడు విణ. యోగ్యుడు.

# లే

లే విశే. (లేత) అల్పము. (వ్యాక.) లేత శబ్దమునకు మీదివర్ణము లోపింపగా మిగిలిన రూపము.

లేఁక వి. లెంక.

లేఁగ వి. (లేత + కానుపు) క్రొత్తగాబుట్టిన దూడ.

లేఁగడియావు వి. లేతదూడగల యావు.

లేఁగసువు వి బాలతృణము

లేఁత విశే. 1. లేతది 2, చులకన. 3. సుకుమారము.

లేఁబగలు వి. (లేత + పగలు). ప్రాహ్ణము.

లేఁబరువు విశే లేత పయసుగల కాయ,

లేఁబోక వి (లేత + పోక) మందగమనము

లేఁబ్రాయము వి. (లేత + ప్రాయము) బాల్యము.

లేఁబ్రొద్దు వి. (లేత + ప్రొద్దు)అపరాహ్ణము,

లేక వై వి 1 జాబు. 2 మిక్కిలి చేరికగల వృక్షాదుల వరుస, 3 సమూహము. సం లేఖా.

లేకరి వి. లేఖకుడు

లేకి వి. రాలిన ధాన్యపు గింజలు విశే, అప్రయోజకుడు

లేకి బ్రతుకు వి 1 పరిగె గింజలు ఏరుకొని బ్రతుకువాడు 2 నీచమగు బ్రతుకు.

లేకివాఁడు విశే. 1. పరిగె గింజలేరుకొని బ్రతుకువాడు. 2, అప్రయోజకుడు.

లేఖ సం వి 1. మిక్కిలిచేరికయగువృక్షాదుల పంక్తి 2. లిపి 3 జాబు.

లేఖగము సం. వి ఆకసము.

లేఖనము సం. వి. లిపి, వ్రాత

లేఖని సం వి. వ్రాయుకలము. రూ. లేఖిని,

లేఖనికుఁడు సం. వి. 1. జాబుకొనిపోవువాడు. 2. తన గురుతిడి యొకనిచే వ్రాయించువాడు.

లేఖర్షభుఁడు సం. వి ఇంద్రుడు.

లేఖుఁడు సం. వి. వేలుపు.

లేఖ్యపత్రకము సం. వి. తాటిచెట్టు.

లేఖ్యము సం వి. వ్యవహార విషయమగు వ్రాత.

లేచు క్రి. 1. నిద్రతెలియు, మేలుకాంచు 2 ఉబ్బు 3 పొటమరించు.

లేజీడెజీసిచ్ ఇం.




(గృహ.)(Laizy-daizy stich) ఒక్కొక్క గొలుసు కుట్టుతో పువ్వులు ఆకులు మొదలగు వానిని ఉపయోగించు కుట్టు ఒక గొలుసు కుట్టు.

లేట వి 1 కొమ్మ 2 శాఖ.

లేతమొగమువడు క్రి 1. విముఖమగు. 2. దైన్యపడు.

లేటు ఇం విశే (Late) 1 వెనుకటిది. 2, మరణించినది. 3 ఆలస్యము.

లేడి వి జింక రూ. లేటి.

లేదు వి, ఎలుగుబంటి.

లేదుబంటి వి బొంకు.

లేపకుఁడు సం. వి. పూయువాడు.

లేపనము సం. వి. 1. పూత. 2. అలుకుట. 3. భోజనము.

లేపరము సం. వి. (రసా) పూతపూయుట, (Plating).

లేపు క్రి. లేవ చేయు వి. 1. పడకమీదపరచు పరపు. 2. జూలు.

లేబరము విశే. 1. శూన్యము. 2. వ్యర్థము.

లేమ వై. వి. స్త్రీ. సం రామా.

లేమరి వి. వెఱ్ఱివాడు.

లేమరులు వి. ప్రథమాసురాగము.

లేమి వి. దారిద్ర్యము, లేమిడి, ఉండమి.

లేలిహానము నం. వి. సర్పము, వ్యు మాటి మాటికి నాలుక చాచునది.

లేవ వి. గుఱ్ఱపు తలాటము.

లేవడి వి లేమిడి.

లేవిడి హిం. వి, 1 అవమానపఱచుట 2. సంకెళ్ళువేసి దొంగను వీధివీధికి త్రిప్పుట. (రూ. లేవుడి)

లేశము నం వి. కొంచెపు దనము. విణ కొంచెము,

లేసు వై. విణ. చులకన, సులభము, నం. లేశః.

లేహనము నం వి. 1, అవలేహము 2, నాకుట.

లేహము నం. వి భోజనము.

లేహ్యము నం. వి నాకి భుజింపదగిన మందు.

# లై

లైబ్రరీ ఇం వి (Library) పుస్తక భాండాగారము,

లైసెన్సు ఇం. నామ. (L cenee) ప్రభుత్వపు అనుమతి, అనుజ్ఞ (పరిశ్రమలు స్థాపింపవలెనన్న ఇది అవసరము అట్లే మోటారు వాహనములను నడుపుటకు కూడ ప్రభుత్వానుమతి అవసరము)

# లొ

లొంత వి. కొన.

లొంగు క్రి లోకువగు, వెనుదీయు,లోబడు.

లొంప వి. 1. కొంప. 2. చిన్నయిల్లు. 3. టొంప.

లొక్కు వి (వ్యావ.) లోకువ.

లొగడ వి. క్షోభము, కలగుండు.

లొచ్చు వి తక్కువ. విణ. న్యూనము.

లొజ్జు వి. తక్కువ, విణ. న్యూనము

లొటారము వి. 1. బొక్క, 2. శూన్యత

లొటిపిట వి. ఒంటె. రూ. లొటిపిట్ట, లొట్టిపిట, లొట్టిపిట్ట.

లొట్ట వి. పల్లము విణ. అణగినది,

లొట్టి వి కల్లుదిసెడి ముంత.

లొట్టిముచ్చు విణ. త్రాగుబోతు.

లొడిత వి. ప్రాదేశము,జుత్తిలి,రూ లొడితివి.

లొడుగు వి. ఆవు మెడగంట.

లొడ్డు విణ. రొడ్డు.

లొత్త వి. లొట్ట

లొద్ద వి. రాశి, ప్రోవు

లొద్ది వి. లోయ.

లొద్దుగు వై. వి. లోధ్రవృక్షము. నం. లోధ్రః.

లొల్ల వి. దున్నిన నేలను సమముచేయు బల్ల.

లొల్లి విణ. 1, తఱచు. 2. అధికము. వి. అల్లరి.

లొసుకు వి. (వ్యావ.) వెలితి.

# లో

లో అవ్య. నిర్ధారణ షష్ఠియందు వచ్చు ప్రత్యయము లోపల లోన శబ్దములకు వృత్తియందు మీది వర్ణములులోపింపగా మిగిలిన రూపము. ఉదా. లోజూపు, లోబడు మొదలగునవి.

లోకువ విణ. అధీనము, తక్కువ

లోఁగిలి వి. ముంగిలి.
లోఁగడ వి. గతకాలము.
లోఁగు క్రి. 1. అడగు 2. లోకువగు. 3. వెనుదీయు. 4. చొచ్చు.
లోఁచు క్రి. వ్రేలుతో కెల్లగించు.
లోఁతు వి. మిక్కిలి పల్లము.
లోఁబడు క్రి అధీనమగు.
లోకజనని నం. వి. 1. జగము తల్లి. 2. లక్ష్మి 3. గంగ.
లోకనము నం. వి. వీక్షణము.
లోకబాంధవుఁడు నం. వి. సూర్యుడు.
లోకమాత నం వి 1. జగము తల్లి, 2. లక్ష్మి. 3 గంగ
లోకము నం. వి. 1. చరాచరము. 2 జనము. 3 కుటుంబము.
లోకములు నం. వి. స్వర్గమర్త్య పాతాళములు భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము ఈ యేడును ఊర్ధ్వలోకములు అతలము, వితలము సుతలము, రసాతలము, మహాతలము తలాతలము, పాతాళము. ఈ యేడును అధోలోకములు.
లోకసభ నం. వి. (రాజ., రాజ, పౌర) భారత ప్రజల దిగువ సభ. పార్లమెంటు దిగువ సభ.
లోకసమ్మతము నం వి. చంద్రుని గొడుగు
లోకసేవాసంఘము నం. వి. (రాజ.) ప్రభుత్వోద్యోగ నిర్ణయ సంఘము, ప్రభుత్వోద్యోగము లిచ్చునప్పుడు అభ్యర్థి యొక్క యోగ్యతలను పరీక్షించు సంఘము. (Public Service Commission)
లోకాభిరామాయణము వి. లోకములోని విశేషాంశముల ముచ్చట.
లోకాయతము నం. వి. ఒక నాస్తికమతము.
లోకాలోకము నం వి 1. చక్రవాళ సర్వతము, భూమిచుట్టుకొనియుండు కొండ.
లోకోక్తి నం. వి. 1. నానుడిమాట. 2. ప్రకారు. 3. సామెత.
లోచకము నం. వి. 1. దీపపుకొందురు. 2. బొట్టు 3. వింటియల్లెత్రాడు.
లోచకుఁడు నం వి బీరావార్ప్రతుడు
లోచనము నం వి. నేత్రము.
లోచెయి వి అంచేయి విఙ, మర్మము తెలిసిన వాడు.
లోటి వి. నీరు పెంచె, చిన్న పాత్రము.
లోటు వి. నష్టి, లోపము.
లోరనము నం వి. (గృహ) గుండ్రముగా చుట్టుటకు వీలుపడుకట్టి ముడుచుకొను చీరెలను ఉతికినతర్వాత సాగతీసినతుకట్టకు మట్టి అరపెట్టెదరు (Roller).
లోడి వై. వి. లగుడము, మద్దుకట్టె, మల్లులు సాధనమునకై త్రిప్పు మద్దు కొయ్య.
లోడు వి. 1 అనుదువిల్లు, ఒరగుదిండు.
లోతు వి (భౌతి) పైనున్న నొకబిందువుఒకస్థిర బిందువునకు క్రిందుగానున్న దూరము (Deprh).
లోధ్రము నం వి. లొద్దుగచెట్టు.
లోను వి 1. లోపల. 2. మొదలు. విఙ. లోకువ.
లోపము నం.వి 1 తక్కువ. 2.మరుగుపాటు.
లోపల అవ్య. నిర్ధారణ షష్ఠియందు వచ్చు ప్రత్యయము. వి లోను, అంతరము.
లోపాయకారి విఙ రహస్యముగా నొకరి పక్షమువనున్నది.
లోప్త్రము నం. వి దొంగిలించిన సొమ్ము.
లోభము నం. వి. 1. కక్కుఱితి 2. వితలాటకము. 3. పిసినితనము.
లోభి నం. విఙ. లుబ్ధుడు.
లోమము నం. వి. తనూరుహము. వెండ్రుక. రూ. రోమము.

**లోమశుఁడు** నం. వి. శరీరమందెల్ల నిడు వెండ్రుకలు కలవాఁడు.

**లోయ** వి. 1. కొండపగులు 2. పర్వతశిలల మధ్యభాగము.

**లోల** నం. వి. 1 నాలుక 2. లక్ష్మి. విశ. 1. కదలునది 1. మిక్కిలి యిచ్ఛగలది

**లోలంబము** నం. వి తుమ్మెద, రోలంబము.

**లోలకము** నం వి. (భౌతి.) దారమునకు కట్టబడిన ఒక బరువైన కణము (Pendulum).


లోలకము

**లోలము** నం. వి. 1. చలనము. 2. కంపనము,

**లోలితము** నం. విశ. ఊచబడినది.

**లోలుపుఁడు** నం.విశ.మిక్కిలి ఇచ్ఛగలవాఁడు.

**లోవ** వి. 1. ఇంటిచూరు. 2. రథ పీఠము మీది చట్టపు అంచు 3. లోయ.

**లోవయినము** విశ కడచినది.

**లోవి** వి వంటకుండ, స్థాలి, పచనపాత్ర.

**లోవు** క్రి. లొంగు, లోగు.

**లోష్టము** నం. వి) మంటిగడ్డ.

**లోహుండి** వి. వంటకుండ.

**లోహకారకుఁడు** నం వి. కమ్మరి.

**లోహచూర్ణము** నం. వి. (రసా.) ఇనుపరజము, చూర్ణముగాచేయబడిన ఇనుము (Iron filing).

**లోహజిత్తు** నం వి. వజ్రము.

**లోహపునేలలు** మి వి. (వ్యావ.) ఇనుము సంబంధమగు ద్రవ్యములు హెచ్చుగాగల నేలలు (Ferrugenous soils).

**లోహము** నం. వి. బంగారు, వెండి, ఇనుము మొదలగునవి, ఖనిజము (రసా.) ఇనుము, (మానవులకు మిక్కిలి ఉపయోగము గల ధాతువు ఇది ఆవర్తక్రమమందు నికెల్ కోబాల్టులతో పాటు 8వ వర్గములో నుండును).

**లోహము** నం. వి. (భౌతి) పారదర్శకము కాని ఉష్ణవాహకము, విద్యుద్వాహకము. మరి కొన్ని ధర్మములు కలిగిన మూల ద్రవ్యము.

**లోహయుగము** నం. వి. (చరి.) నవశిలా యుగము తర్వాత కాలము (ఈ కాలము నాటిమానవులు తమ పనిముట్లను, ఆయుధములను లోహముతో చేయుచుండిరి)

**లోహలుఁడు** నం. విశ. నత్తి వాడు,స్ఫుటము గాని మాటలుగలవాఁడు.

**లోహస్ఫటికము** నం. వి. (రసా) ఇనుము పొటాసియం సల్ఫేట్ల (గంధకితముల) సమ్మేళనము (Iron alum).

**లోహాభిసారము** నం వి. యుద్ధసన్నద్ధుడైన ప్రభువునకు ఇచ్చు హారతి,

**లోహితకము** నం. వి కెంపు,

**లోహితము** నం. వి 1. రక్తచందనము. 2. 2. సింధూరము. 3. నెత్తురు

**లోహితాంగుఁడు** నం. వి. అంగారకుడు.

**లోహితాస్యుఁడు** నం. వి. హరిశ్చంద్ర నృపాలుని కొమరుడు. యా. రోహితాస్యుడు. (లౌహితాశ్వుడని కొందఱు.)

# లౌ

**లౌకికము** నం.విశ. లోకవ్యవహారసిద్ధమైనది.

**లౌకికుఁడు** నం.విశ. లోకవ్యవహారదక్షుడు,

**లౌక్యము** విశ. (వ్యావ.) లౌకికము.

**లౌల్యము** నం. వి. లోలత్వము.

**లౌహము** నం. విశ. లోహవికారమైనది.

**లౌహిత్యము** నం. వి. ఎఱ్ఱన, ఎఱుపు.

# వ

వ ఒక అక్షరము.

వంక వై. వి. 1. వంకర. 2. వాగు. సం. వక్రః.

వంక వి. 1. దిక్కు. 2. పక్షము.

వంకకత్తి వి. (వ్యావ) కొడవలి వంటి వంపు తిరిగిన కత్తి Scythe)·

వంకము సం. వి 1. ఏటి రెండు దరుల నడుము 2. గుఱ్ఱమునకు కళ్లెము పెట్టుచోటు

వంకకత్తి

వంకర వై. వి వక్రత్వము.

వంకరటింకర విణ నానావిధ వక్రత.

వంకాయ వి. (వంగ + కాయ) వంగకాయ, వార్తాకము.

వంకి వై. వి బాకు, సం. వక్రి.

వంకీ వై. వి. స్త్రీలు సందిట ధరించు నగ సం. వక్రి.

వంకె వి. చిలుక కొయ్య.

వంగ వై. వి. వంగచెట్టు! సం. వంగమ్.

వంగఁదీయు క్రి వంచు.

వంగడము వై. వి. వంశము. రూ. వంగసము. వై (వ్యావ.) పశుజాతినుండిగాని, వృక్షజాతినుండిగాని ఎంచబడిన ప్రత్యేక లక్షణములుగలతరగతి(వంశము) (Strain) ప్రత్యేక లక్షణములను కలిసియున్న ఉపజాతిలోని రకము.

వంగము సం. వి. 1. తగరము, సత్తు, 2. వంగ. 3. వంగదేశము.

వంగలేపనము సం. వి. (రసా.) ఇనుమునకు, ఇత్తడికి రాగికి తగరపు కళాయి పూయుట. (Tinning).

వంగు వై. క్రి. ముందటికి వాలు.

వంచకము సం. వి. నక్క. విణ. మోసము చేయునది.

వంచకుఁడు సం. విణ. మోసకాడు.

వంచన సం. వి. మోసము.

వంచ విణ. 1. ముఖ్యము. 2. ఒకటి.

వంచోడించు క్రి. బెదరు.

వంజుల సం. వి ఎక్కువగా పాలిచ్చుఆవు.

వంజులము సం. వి. అశోక వృక్షము.

వంజెఱఁగు వి. స్త్రీల పార్శ్వచేలాంచలము.

వంజ వై. వి. వంధ్య, గొడ్రాలు సం. వంధ్యా వి. గొడుగులోపలి శలాకల కాసరాగా నేర్పరిచిన కమ్ములు.

వంట వి పాకము.

వంటకట్టియలు వి. వంటకట్టెలు, వంటచెఱకు.

వంటకము వి. అన్నము

వంటచెఱకు వి. వంటకట్టియలు,

వంటచెఱకుచెట్లు వి (వ్యావ.) వంటకట్టెల నిచ్చు వృక్షములు. ఉదా సరుగుడు మొదలగునవి(Fuel trees).

వంటవృత్తి వి వంటచేసి జీవించునది

వంటయింటికుందేలు (జాతీ) స్వాధీనమైనది.

వంటరాయి వి. మన్ను వండిచేసిన మణి విశేషము.

వంటరి వి.(వంట + అరి) వంటకాడు, వంటలక్క.

వంటలక్క వి. వంటకత్తె.

వంటి విణ. బోటి, పోలిక.

వంటియము వి, (వండెము) ఒకని క్రింది రాజ్యమునందు కొంత భాగము.

వంటు వి. అనుకూల్యము.

వం[త్రము వి. మందులసంచి.

వంఠుఁడు సం వి. బ్రహ్మచారి. విణ. పొట్టివాడు.

వండ సం. వి. రంకుటాలు. విణ. మొండి.

వండ వి. 1. ఆపద. 2. చెరువులోనగు వాని యడుగున నుండెడి యొండిన బురద.

**వండలి** వి. (వ్యావ) వర్షకాలమున నదులు మొదలగువాని బురదనీటిలో కలిసి తేలు చుండు మృదువైన మట్టి (Alluvium).
**వండలినేలలు** వి.(వ్యావ )నదీ ప్రవాహముల వలన నేర్పడువండ్రుమట్టిగల డెల్టానేలల వంటి నేలలు (Alluvial soils).
**వండు** క్రి. వంటచేయు. వి. వండలి.
**వంత** వి. వ్యథ, ఏడ్పు సంతాపము.
**వంతు** వి. 1. భాగము, 2. వరుస. 3. సామ్యము. 4. పోటీ.
**వంతెన** వి. పటిపైకట్ట, వారధి
**వంద** సర్వ. నూరు,
**వందనము** సం. వి 1. పూజ. 2 స్తోత్రము. 3 నమస్కారము.
**వందఱ** వి శకలము (చిందఱవందఱ).
**వందఱలాడు** క్రి ఖండించు.
**వంద్రువు** సం. విశే గోత్రనామములు చెప్పి పాదములు సోక మ్రొక్కువాడు.
**వంది** సం వి. స్తుతిచేసి జీవించువాడు.
**వందు** క్రి. సంతాపించు
**వందరు** క్రి శోకించు, క్లేశపడు.
**వందేమాతరం ఉద్యమము** సం. వి. (రాజ.) క్రీ.శ. 1905 సం. లో బ్రిటిషు వైస్ రాయి అయిన 'కర్జన్' ప్రభువు వంగ రాష్ట్రమును విభజించినప్పుడు ఐక్య వంగ రాష్ట్రపునః స్థాపనకై భారతీయులుగావిం చిన తీవ్రాందోళనము. ఈ ఆందోళనము కొనసాగించుచున్నప్పుడు "శ్రీ బంకించంద్ర చటర్జీ" రచించిన" వందేమాతరం" భారతదేశమాతకు మ్రొక్కెదనను నినా దములు చేయుటచే నీ అందోళనకు వందే' మాతరం' ఉద్యమమని పేరు వచ్చెను ఈ ఉద్యమము జరుగు సమయములో క్రీ శ. 1906వ సంవత్సరములో జాతీయ కాంగ్రెసు మహాసభ కలకత్తాలో సమా వేశమై వందేమాతరం గీతమును రాష్ట్ర గీతముగ గుర్తించినది.
**వంద్యుఁడు** సం. విశే. నమస్కరింప దగిన వాడు.
**వంధ్య** సం. వి గొడ్రాలు, గొడ్డుటావు విశే. ఫలింపనిది.
**వంధ్యకేసరము** సం. వి. ఫలప్పాదశక్తి లేని పుంకేసరము (Staminod ).
**వంపు** వై వి వంగుట విశే. వంగినది. సం. భంగః. వక్రః.
**వంశము** సం వి. 1 కులము 2 వాసము (వెదురు). 2 పిల్లనగ్రోవి. 3. వెన్ను గాడి. 4. సమూహము. 5. ఒక పురాణ లక్షణము.
**వంశకము** సం వి. అగరుచెక్క, అగరు గంధము
**వకము** సం. వి. బకము, కొంగ
**వకవకలు** వి. వకావకలు, వికావికలు, బ్రద్దలు.
**వకాలతునామా** హిం. వి. ముఖ్త్యారునామా ఒకరి తరపున వ్యవహరించుటకు న్యాయ స్థానమునందు అధికారము పొందుట.
**వకుళము** సం వి. పొగడచెట్టు .
**వక్క** వై, వి. ఉడకబెట్టిన పోకచెక్క.సం. వల్కః.
**వక్కణ** వై. వి 1 వివరము వ్యాఖ్యానము 2. జాబునందు మొదటవ్రాయు గౌరవ బిరుదముల పద్ధతి సం. వ్యాఖ్యానమ్.
**వక్కరము** వై విశే వక్రము, సం. వక్రమ్.
**వక్కరాలు** వై. వి. కుటిలస్త్రీ.
**వక్కరించు** వై. క్రి. తిరుగబడు వక్క రించు.
**వక్కాణము** వై. వి. 1, వ్యాఖ్యానము. 2 సమాచారము. సం. 1.వ్యాఖ్యానమ్. 2, వృత్తాంతమ్.
**వక్కాణించు** వై. క్రి నొక్కివచించు.
**వక్కి** విశే. బక్క చిక్కినది.

వక్కిఁకట్టియు విశే. బక్కవాడు.
వక్కు క్రి. 1 కృశించు 2 అడుగంటు
వక్త నం విశే 1. విశేషముగ మాటలాడు వాడు వాచాలుఁడు 2.పండితుడు.
వక్తవ్యము నం విశే. మాటలాడ దగినది
వక్రము నం విశే (గణి) వంకరగా ఉన్నది (Curved)
వక్రతమములు నం. వి. "ఐ, ఔ" లు (ఎ, ఏ, ఒ, ఓ లు వక్రములు)
వక్రతావ్యాసార్థము నం వి. (భౌతి) ధ్రువ గోళ కేంద్రముల మధ్యదూరము (Radius of curvature)
వక్రదర్పణము నం. వి. (భౌతి.) నతోదరముగాగాని ఉన్నతోదరముగ గాని ఉన్న ఉపరితలముగల దర్పణము (Curved mirror).
వక్రము నం. వి వంకి వంకర. విశే క్రూరమైనది.
వక్రము నం వి (గణి) వంకరగా నున్న రేఖ, ఋజురేఖకానిది, ఒక సమీకరణమును తృప్తిపరుచు రేఖ ఏదైన (అది ఋజురేఖయైన కావచ్చును) వక్రమని పించుకొనును (Curve).
వక్రములు నం వి ఎ, ఏ, ఒ, ఓ లు (వంకరగా నుండునవి)
వక్రరేఖ నం. వి. (గణి) ఒకే దిక్కులేని రేఖ (curved line),
వక్రావర్తము నం వి. (వృక్ష) గుజ్జుపు నాడమువలె వంగి యున్నది (బీజాండము) వక్రావర్తి (Campylotropous). బీజాండము



వక్రిమము నం, విశే. పిఁగుల వంగినది.
వక్రీభవన గుణకము నం వి. (భౌతి) కాంతి కిరణము ఒక యానకము నుండి ఇంకొక దానిని ప్రవేశించినప్పుడు పతనకోణ జ్యాకు వక్రీభవనకోణ జ్యాకుగలనిష్పత్తి (Index of refraction).
వక్రీభవన దూరదర్శిని నం. వి. (భౌతి) కాంతి కిరణముల వక్రీకరించి వెలుతురును కేంద్రీకరించు కటక విన్యాసము గల దూరదర్శిని (Refracting telescope).
వక్రీభవనము నం వి (భౌ) ఒక యానకము ద్వారా పయనించు కాంతికిరణములు వేరొక యానకమును జొచ్చునప్పుడు వాని పథములలో కల్గు వక్రత (Refraction). వక్రీభవనము



వక్రీభూతము నం విశే (భౌతి.) వక్రీభవనమును చెందినది (Refracted).చూ వక్రీభవనము
వక్రుఁడు నం వి 1. శని 2. అంగారకుడు.
వక్రోక్తి నం వి 1 ఒక అలంకారము. 2. అన్యార్థకల్పన మొన ప్ర. 3. వంకర మాట
వక్తృత్వము నం. వి ప్రసంగ చాతుర్యము.
వ ము నం. వి. నోరు. ముఖము.
వక్షము నం. వి, రొమ్ము
వక్షోరుహము నం, వి స్తనము.
వగ వి. 1. సంతాపము, చింత. 2. రీతి.
వగకాఁడు విశే విలాసవంతుడు.
వగుచు క్రి శోకించు. విచారించు.
వగదెగు క్రి పరిష్కృతమగు, సవరింపబడు.
వగపు వి. శోకము
వగర్పు వి. శ్వాసరోగము.
వగరుచు క్రి. నిట్టూర్చు
వగలాఁడి విశే విలాసవతి.
వగైరా హిం వి. మొదలగునవి, ఇత్యాది
వగ్గు క్రి. వక్కు
వగ్రహము నం. వి కంపు (అవగ్రహము.)
వచక్నువు నం. వి. 1. వక్త, సభలోనిర్భయముగా మాటాడునతడు.2.బ్రాహ్మణుడు.
వచనము నం. వి. మాట.

వచము నం. వి. చిలుక.

వచ్ఛ వై. వి. వాంఛ. నం. వాంఛా.

వచ్చు క్రి సమీపమునకు నడుచు.

వచ్చుబడి వి రాబడి, లాభము.

వచ్చురాములు వి (వచ్చుట + రామి.) రాకయు, రామియు.

వజీరు హిం. వి. మంత్రి, వజీర్.

వజ్జిరము వి. 1. వజ్రము. 2 మత్స్యము.

వజ్రగుణకారము నం.వి. (గణి.) అంకెలను అడ్డువరుసలో గుణించుట(Cross-multiplication) (చూ. అడ్డగుణకారము)

వజ్రతుండుఁడు నం. వి గరుడుడు వ్యు వజ్రము వంటి ముక్కుగలవాఁడు.

వజ్రనిష్పత్తి నం. వి. (గణి.) ఒక ఋజు రేఖపై క,చ, ట,త అను నాలుగు బిందువు లున్న యెడల కచ, టత / కత, టచ అను నిష్పత్తికి ఆబిందువులవజ్రనిష్పత్తియని పేరు(Cross-ratio)చూ.అడ్డనిష్పత్తి. A, B,C, D ఒక వరుసలో నున్న బిందువులు A B C D

$\frac{AB}{CB} \neq \frac{AD}{BC}$ అయినప్పుడు $\frac{AB}{CB} \Big| \frac{AD}{CD}$

ఇది A,C యొక్క వజ్రనిష్పత్తి.

వజ్రభిదువు నం. వి. నల్లి.

వజ్రము నం. వి. (రసా.) గనులలో దొరుకు కర్బనము (బొగ్గుయొక్క పారదర్శిక స్ఫాటికరూపము (Diamond).

వజ్రము నం. వి. 1. రవ్వ. 2. వజ్రాయుధము 3. కట్టులు మొదలగు వానిని అతికించు బంక.

వజ్రసీవనము నం వి. (గృహ) ఒక దాని మీద మరొక్క పట వాలు కుట్టుతో చిత్రములను కుట్టుట (Cross-stitch)

వజ్రసీవనము

వజ్రాలయము నం. వి. వెండి కొండ.

వజ్రి నం. వి. 1. ఇంద్రుడు. 2. బుద్ధుడు. 3. ఆకుజెముడు.

వజ్రోత్సవము నం. వి సంస్థకు 60 సం. లు నిండిన సందర్భమునచేయు ఉత్సవము (Diamond jubilee).

వజ్జ వై వి. ఉపాయము, వెరవు నం. వ్యాజః.

వటకము నం. వి. వడియము.

వటము నం. వి. 1. త్రాడు. 2. మఱ్ఱి. 3. గవ్వ

వటారి వై. విశ. సమర్థము. నం. వటుతరః.

వటి నం వి. 1. త్రాడు. 2 వటము.

వటువు నం. వి. బ్రహ్మచారి, బాలకుడు.

వట్ట వి. 1. చెంకుగానుగకు వేసెడు అడ్డ ద్రాను. 2. వృషణము.

వట్టము వి. మారకము:చిల్లర మార్చునపుడు పెట్టు నష్టము. (Discount).

వట్టి విశ 1. రిక్తము. ఉపయోగములేనిది. 2. అసత్యము.

వట్టిగొడ్డుచాకట్టు (జాతీ.) వ్యర్థమైన చాకిరి.

వట్టివేళ్ళు వి ఇవితృణకుటుంబము Graminae నకు చెందిన Vetiveria zizanoides అను మొక్కల వేళ్ళు (Cus cus) (ఇవి చాల పరిమళము నిచ్చును. వీనినుండి అత్తరువు కూడ తీయుదురు.)

వట్టు క్రి. ఇంకు, కృశించు.వి వరగు, ఎండిన వక్కు.

వట్రు వై విశ. గుండ్రము నం. వృత్తమ్.

వట్రము వై. విశ. కురుచ, హ్రస్వము, వి, వక్కాకు తిత్తి.

వట్రించు వై. క్రి. పెడమోమువడు, వెను దీయు.

వట్రిలు వై. క్రి. కలుగు, సంభవించు.

వట్రుతలము నం. వి. (గణి.) సమతలము గానిది (Curved surface).

వర్తువ వై. వి. గుండ్రము. సం. వర్తులమ్.

వటర వై. వి. వటారి, సమర్థుడు. సం. పటుతరః.

వడ వి 1. తాపము, వేడిమి 2. భయ్యము, 3 అలసట.

వడలంబము వి (భౌతి.) ఏ వస్తువునైన నిటారుగా నున్నది లేనిది తెలిసికొనుటకు ఉపయోగపడు పరికరము. (Plumbline).

వడంకు క్రి. వణకు. చలించు.

వడంకుగుబ్బలి వి. హిమాలయము, మంచు పర్వతము

వడంకుతోవ వి. ఉత్తరాయణము.

వడగండ్లు వి. (భూగో.) మంచు ముక్కలు ఆవిరియై పైకెగసిన నీరు చాల త్వరిత గతిని చల్లబడి వానగా భూతలముపైబడుటకుముందే నీరు మంచుగ మారి భూమిపై బడును.

వడగల్లు వి. (వడ + కల్లు) వానరాయి.

వడగాలి వి. నిప్పుగాలి. వడగాడ్పు.

వడగొట్టు క్రి. వడగాము. వేడిమిచేసొమ్మసిలు

వడదెస వి. ఉత్తరపు దిక్కు.

వడదోలు వి. 1 పేటకాడు, గవుండ్లవాడు కప్పుకొను తోలు క్రి. వడగాలి వీచు.

వడపప్పు వి. నానబెట్టిన పెసరపప్పు.

వడపిందెలు వి. ఊరవేసిన మామిడిపిందెలు.

వడంబోత వి (రసా) ద్రవ పదార్థముల నుండి కరగకయున్న ఘనపదార్థములను వేరుచేయుపద్ధతి (F.ltration).

వడంబోతసంఘము వి వి. (వ్యావ.) చేయబడినపని శాస్త్రోక్తముగ, సక్రమముగ జరపేర్పబడినదో లేదో యని పరిశీలించుటకు ప్రత్యేకముగ ఏర్పరుపబడిన సంఘము.

వడంబోసినద్రవము వి వి. (రసా) వడబోత కాగితము నుపయోగించి ద్రవమును వడబోసినప్పుడు క్రిందికి దిగిన స్వచ్ఛమైన ద్రవము (Filtrate)

వడము వై. వి. 1. మోకు. 2. దండ. సం. వటః.

వడిముడి వి. వృకోదరుడు, భీముడు.

వడలు క్రి. సుక్కు, వాడు.

వడలుతెగులు వి (వ్యావ.) మొక్కవేళ్ళకు పట్టు బూజు తెగులు. (ఇది పట్టుటచే మొక్క వాడిపోవును) (Wilt diseae)-

వడారము విశ. మొదలంట, బొత్తుగా.

వడి వి. 1. వేగము. 2 కాలము 3. శౌర్యము. 4. దాంమువిడి. వై. వి. పద్యయతి. సం. వళిః.

వడియంగట్టుట క్రి. (వ్యావ.) నేలపైని లోపలను అధికముగా నిలిచియుండు నీరు పోవునట్లు చేయుట వడుపు (Drainage).

వడియు క్రి. 1. కారు. 2. కృశించు

వడుకు క్రి. దూదిని నూలుగా తీర్చు (వ్యావ.) మోసముగద్రవ్యార్జనముచేయు

వడుగు వై. వి. ఉపనయనము, బ్రహ్మచారి సం. వటుకః.

వడుపు వి. వడియుట

వడువు వి. విధము, రీతి.

వడును వి. బట్టలు చలువ చేయుటలో నందిచ్చి వంకరగా తోలగుట.

వడ్డి వై. వి వృద్ధి. సం. వృద్ధిః.

వడ్డికాసులవాడు వై. వి. తిరుపతి వేంకటేశ్వర స్వామి.

వడ్డిబ్రతుకు వి. వృద్ధిజీవిక, వడ్డితోజీవనము చేయుట.

వడ్డి వై. వి. (గణి.) సొమ్మునుపయోగించుకొన్నందుకు అదనముగానిచ్చు సొమ్ము (Interest) (అర్థ.)వృద్ధి. ఒకరివద్ద తీసికొనిన పైకమును ఉపయోగించుకొనినందుకు ప్రతిఫలముగ చెల్లించు అధిక ద్రవ్యము (Interest).

వడ్రంగి వై. వి. 1. వడ్లవాడు. కొయ్య పనిచేయువాడు. 2. పక్షివిశేషము. రూ. వడ్లంగి. వర్ధకిః.
వడ్లచిలుక వి. (వ్యవ)నిలువచేసిన వడ్లను పాడుచేయు ఒకవిధమగు రెక్కల పురుగు (Sitotroga cerealella).
వణము నం. వి. 1. గవ్వ. 2. తోట,
వణిక్సమాజము నం.వి. వర్తకశ్రేణి. (Trade guild)
వణిజుఁడు నం వి. వర్తకుడు.
వతంసము నం. వి. సిగంబతి, పూగమ్మ. రూ. అవతంసము,
వతను హిం. వి. వాడుక, మామూలు, రివాజు.
వత్త వి. వరుగు.
వత్తి వై వి దీపపు వత్తి.
వత్సతరము నం. వి. వయసుగలకోడె,
వత్సదంతము నం. బాణము.
వత్సనాభి నం. వి. ఒక విషవస్తువు.
వత్సము నం. వి. 1. ఏడాదిలోపు దూడ. 2. రొమ్ము,
వత్స ము నం. వి. ఏడాది.
వత్సలము నం. వి. వహ్ని. తృణాగ్ని.
వత్సలుఁడు నం. విణ. వాత్సల్యము(దయ) గలవాడు
వదంతి నం. వి. గాలిమాట, గూమాను, ప్రకారు
వదనము నం. వి. నోరు, ముఖము.
వదరు వై క్రి. ప్రేలు. నం. వక్త్ర.
వదలు క్రి. శిథిలమగు, పట్టువీడు.
వదాన్యుఁడు నం. విణ. మిక్కిలియిచ్చు వాడు, ఉదాత్తుడు.
వదాలము నం. వి. నీటిసుడి.
వది వి. ఏనుగు మొదలగువానిని బట్టుటకై త్రవ్వబడిన వల్లము.
వదినె వై. వి. అన్నభార్య, మగని తోబుట్టువు, మేనత్తమేనమామలకూతురు భార్యఅక్క. నం వధూని.
వదులు విణ. బిగుతుకానిది.
వధము నం. వి. చంపుట.
వధువు నం. వి పెండ్లాము, పెండ్లికూతురు. కోడలు నం. వి. (గృహ) పెండ్లికొమరితె, క్రొత్తగా పెండ్లియైన యువతి (Bride).
వధూటి నం. వి, 1. కన్యక. 2 కోడలు.
వధూవరులు నం. వి పెండ్లి దంపతులు.
వధ్యుఁడు నం. విణ. చంపదగినవాడు.
వనచంద్రికాన్యాయము నం. న్యా. అడవి గాచినవెన్నెలయనురీతి. (నిష్ప్రయోజన మని యర్థము).
వనచరము నం. వి. కోతి
వనజము నం. వి. తామర, ఫ్యా నీటియందు పుట్టినది.
వనట వి. శోకము.
వనధి నం. వి. కడలి.
వనపాలుఁడు నం. వి. తోటకాపు.
వనపు వి. వనలు.
వనబంధము నం. వి. సరస్సు, కోనేరు.
వనభోజనము నం. వి. (గృహ.) క్రీడకై వేరే స్థలమునకు కొంతమంది కలిసి ఆహారపదార్థములనుతీసికొనిపోయి లేదా వండుకొని భుజించుట.
వనమహోత్సవము నం. వి. (వ్యవ.)చెట్ల పండుగ. సంవత్సరమునకొకసారిక్రొత్త వృక్షములను నాటు పండుగ. (ఇది మన దేశములో ఇటీవల సుమారు 15 ఏండ్ల నుండి ఆచారములోనికి తీసికొని రాబడి నది, వనములను పెంపొందించుటకై వృక్ష ములు నాటు ఉత్సవము. ఈఉత్సవము భారతదేశములో మొదటిసారిగా శ్రీ కనయ్యాలాల్ మున్షీచే క్రి, శ, 1950లో ప్రారంభింపబడెను.

వనమాల సం. వి. ఆకులు పువ్వులు చేర్చి కట్టిన హారము.
వనమాలి సం. వి. విష్ణువు.
వనరు క్రి. విలపించు, శోకించు.
వనస్పతి సం. వి. 1. పూయక కాచెడిచెట్టు. 2 చెట్టు
వనాటము సం. వి. వనమునందు చరించు జంతువు.
వనిత సం. వి. స్త్రీ. మిక్కిలి అనురాగము గల స్త్రీ.
వనేచరము సం. వి. వానరము
వనౌకసము సం. వి. వానరము
వన్నియ వై. వి. కాంతి, రంగు, ప్రసిద్ధి మేలిమి. రూ. వన్నె సం. వర్ణః
వన్నెకత్తియ విణ. రూ. వన్నెకత్తె.
వన్నెకత్తె విణ. విలాసవతి.
వన్నెకాఁడు విణ. విలాసవంతుడు
వన్నెలాడి విణ. వన్నెకత్తె.
వన్నెలాఁడు విణ వన్నెకాడు.
వన్యము సం. విణ. వనమునందు బుట్టినది
వప సం. వి. 1. కడుపులో బొడ్డుక్రింద నుండు ఉలిపొరవంటి క్రొవ్వు 2 రంధ్రము
వపనము సం. వి. క్షౌరము, అయుష్షర్మము
వపువు సం. వి. 1. శరీరము. 2. చక్కని రూపము
వపోతి సం. వి. (జం) క్రొవ్వు (Adipose)
వప్త సం. విణ విత్తెడివాడు. సం. వి తండ్రి.
వప్రక్రీడ సం. వి. ఏనుగు మొదలగువవి దంతములతో కుంభములతో భూమిని కోరాడెడి లీల.
వప్రము సం. వి. 1. కోటకొరడు, కోట. 2. కొండనెత్తము. 3. తీరము.
వమథువు సం. వి. వమనము, వాంతి.
వమనము సం. వి. డోకు, వమథువు.
వమనేచ్ఛ సం. వి (గృహ.) వికారము, వాంతివచ్చునట్లుండుట (Nausea)
వమ్ము వై. వి. నాశము విణ, వ్యర్థము. సం. వ్యర్థః.
వయనశలాకము సం. వి (గృహ.) నాడె. ఒట్టునుచేయునప్పుడు నూలుకండెలను అటు ఇటు తీయు సాధనము (Shuttle).
వయనము సం వి (గృహ) నేతనేయుట. దారముతో ఒట్టనుచేసి తయారుచేయుట (Weaving).
వయసు సం. వి. ప్రాయము, యౌవనము.
వయస్య సం. వి. చెలికత్తె.
వయస్యుఁడు సం. వి చెలికాడు
వయాళి వై. వి. వాహ్యాళి. విహారము రూ. వయ్యాళి సం. వాహ్యాళి.
వయోజనవిద్య సం వి. (వ్యావ.) ప్రౌఢ యౌవనులైన వ్యక్తి బాల్యమందు విద్యనేర్వని వారికి ఈడువచ్చిన తర్వాత విద్యనేర్పుట (Adult education).
వయోజన వోటింగుపద్ధతి మి. వి (రాజ.) యుక్త వయస్సువచ్చిన స్త్రీపురుషులకెల్లరకు వోటువేయు అధికారము కలిగియుండుట. (Adult franchise). (ఇండియాలో 21 సంవత్సరములు యుక్త వయస్సుగా భావింపబడుచున్నది.)
వయోజనులు సం.వి. ఈడుదాటిన వ్యక్తులు వయస్సు వచ్చిన వారు(Adults).
వయ్యంది వి. కుంపటి.
వయ్యము విణ. వ్యర్థము.
వరండము సం వి. 1.మొగమందలి మొటిమ. 2. నోరడికెడి తెవులు. 3. గడ్డివామి 4. సమూహము
వరఁకు వి. చిక్కు, సంకటము.
వరఁగలించు క్రి. ప్రకాశించు,
వరఁత వై. వి. 1. పసు. 2. వల్లము. 3. ప్రంత. సం. ప్రశ్న.
వరకట్నము వి. (గృహ.) పెండ్లి బేరములో వధువు తరఫున వరునికి ఇచ్చు ధనము.

వరకు వి. బంగారములోనగువాని రేకు.
వరజు వి. నాగటి చాలు, సీత.
వరట నం. వి. ఆడుహంస, వి. పేడయెండిన చెక్క.
వరణ నం. వి. కాశీనగరమునకు త్తరమున గల ఏఱు.
వరణము నం. వి. 1. వరించుట. 2. చుట్టుకొనుట, ప్రహరి (గృహ) ఎన్నిక ఎంచుట, ఎన్నుకొనుట (Selection).
వరత్ర నం. వి 1. టంగువారు. 2 ఏన్గు నడుము, తోలు మోకు,
వరద నం. వి. 1. పెండ్లి కాని పడుచు. 2 దుర్గ. వై. వి. వెల్లువ. నం ప్రవహ
వరదుఁడు నం. విశ, 1. సమర్థకుడు. 2 మిగులదయాళువు.
వరబడి వి. 1. కఱవు 2 వానలేమి, వరపు
వరము నం. వి. కోరిక, వరించుట
వరవర్ణిని నం. వి 1 భర్తయందనురాగము గల్గియుండు ఉత్తమ స్త్రీ 2. పసుపు.
వరపు వై వి దాసి, దాసుడు నం. భరటః భరటా
వరవుడు వి. దాస్యము.
వరహా వై. వి వరాహముద్రగల బంగారు నాణెము. నం. వరాహః
వరాంగము నం. వి. 1. ఏనుగు. 2. తల,
వరాకము నం. వి 1 పెద్దకత్తి. 2 యుద్ధము
వరాకుఁడు నం విశ. పేరులేనివాడు. (స్త్రీ. వరాకి.)
వరాటకము నం. వి. 1. గవ్వ. 2. తామర, దుద్దు, 3. మోకు.
వరాటి నం. వి. ముతకవస్త్రము.
వరారోహ నం వి. ఉత్తమ స్త్రీ, పెద్ద పిరుదులు గల స్త్రీ,
వరాశి నం. వి. (వరాసి.) 1. శ్రేష్ఠమైనకత్తి. 2. ముదుగుకోక.
వరాహము నం. వి, 1. పంది. 2, వరహా. 3. క్రోతి. 4. కొండ.
వరాళి నం. వి. 1. చందమామ. 2 ముతకబట్ట.
వరి వై. వి. వడ్లు, శాలిధాన్యము.
వరినేలలు వి, (వ్యవ.) నీరు సుబభముగ పాఱుచు దుమ్ముచేసి వరినాటులకు ఎక్కువ అనుకూలముగా నుండు నేలలు (Paddy-soils)
వరిపీకపురుగు వి. (వ్యవ) ఇది వరి కొంకులకు పట్టి పిలకలను దొలుచుటచే వాని మొవ్వలు చచ్చిపోవును ఎన్ను లెండిపోయి తెల్లగానగును (Rice stem-borer),
వరివస్య నం వి. సేవ.
వరిష్ఠము నం. విశ మిక్కిలి శ్రేష్ఠమైనది, వి. మిూయము
వరిష్ఠుడు నం. విశ మిక్కిలి శ్రేష్ఠుడు.
వరుఁడు నం వి. 1 పెండ్లికొడుకు 2. రాజు విశ శ్రేష్ఠుడు.
వరుగు వి. ఎండవేసినకాయ మొదలగునవి.
వరుటము నం. వి తలుపు గడియ.
వరుణము నం వి 1. నీరు. 2. గనము యొక్క నాలుగవ భాగము
వరుణుఁడు నం. వి, 1. పడమటి దిక్కునకు అధిపతి. 2. నీటి ఱేడు
వరుమానము విt (అర్థ) వచ్చుబడి, రాబడి.
వరువడి వి. 1. వాడుక, 1 విధము. 3, బాల బాలికలు వ్రాయుటకు ఉపాధ్యాయుడో. వడి పెట్టుట. మా ఒరవడి.
వరువాత వై · అవ్య. ప్రాతఃకాలము. నం, ప్రాతః.
వరుస వి. 1. శ్రేణి, 2, పరంపర క్రమము. 3 బంధుత్వ క్రమము 4, వంతు.
వరూథము నం వి. 1. కవచము 2. సదనము 3. చక్రపు కమ్ములు.
వరూథిక నం. వి. (వృక్ష) తృణధాన్యముల లోను, గడ్డి జాతికి చెందిన ఇతర ఉద్భిజ్జ

ముల గింజలలోను గల ఏక బీజదళము
(Scutellum).

వరూథిని నం వి దండు, సేన.

వరేణ్యము నం. విశే. 1. ముఖ్యము. 2 కో దగినది

వరేణ్యుఁడు నం విశే ముఖ్యుఁడు.

వర్గము నం విశే (గణి) వర్గమే కలిగి అంత కన్న ఎక్కువ ఘాతము లేనిది (Quadratic)

వర్గనిష్పత్తి నం వి. (గణి) రెండు రాసుల వర్గముల నిష్పత్తి (Duplicate ratio)

వర్గప్రతినిధారకము నం వి (రసా.) విశ్లేషణ రసాయన శాస్త్రమందు ఒక వర్గమునకు చెందిన అయనుల ప్రతిక్షేపించు రాసాయనిక ద్రవ్యము(Group reagent), ఉదా మొదటి వర్గమునకు చెందిన సీసము, వెండి పాదరసము. అయనుల ప్రతిక్షేపించునది హైడ్రోక్లోరికామ్లము

వర్గము నం వి (రసా.) సమాన ధర్మములు గల ద్రవ్యముల సమూహము (Group) నం (జీవ) తరగతి (Class) నం (గణి ఒక రాశిని ఆరాశిచేతనే గుణించగా లభించు లబ్ధము (Square) నం 1 వి. సజాతీయ సమూహము 2 తెగ 3 అధ్యాయము, 4 కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనునవి అరిషడ్వర్గములనబడును

వర్గమూలనిష్పత్తి నం. వి (గణి) రెండు రాసుల వర్గమూలముల నిష్పత్తి (Sub-duplicate ratio).

వర్గమూలము నం వి (గణి) దానిచేతనే దానిని గుణించిన ఇష్టరాశినిచ్చు రాశి నాలుగుచేతనే నాలుగును గుణించిన 16 లభ్యమగును. 16 కు వర్గమూలము. 4 (Square-root).

వర్గయుక్కులు నం వి. "ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ లు.

వర్గసమీకరణము నం. వి. (గణి) అవ్యక్త రాశి ద్వితీయ పరిమాణములోగల సమీకరణము, ఒకపదము యొక్క వర్గమును కలిగియున్న సమీకరణము, ఉదా. $ax^2 + bx + c = o$ (Quadratic equation).

వర్గీకరణ(ణో)ద్భిజ్జ శాస్త్రము నం వి. (వృక్ష.) ఉద్భిజ్జములను తరగతుల క్రమముగ వర్గీకరణము చేయుటను గూర్చి తెలియజేయు శాఖ (Taxonomy or Systamatic Botany).

వర్గీకరణము నం. వి. (జీవ.) జీవకోటిని భాగములుగా, ఉపభాగములుగా, తరగతులుగా, కుటుంబములుగా విభజించుట. (Classification). నం. వి (గృహ.)రకరకముల బట్టలను విడదీయుట, బట్టలుతుకుముందు రంగు బట్టలను, తెల్ల బట్టలను, మురికి బట్టలను వేరుచేయుట (Sorting).

వర్గు నం వి పేరు వరుసగా వ్రాసినలెక్క. (వర్గువు).

వర్చస్సు నం వి. 1. కాంతి 3. రూపము.

వర్జనము నం. వి. 1. విడుపు 2. ఈవి.

వర్జితము నం. విశే వర్జింపబడినది.

వర్జ్యపదార్థములు నం వి అనవసరమై విసర్జింపదగిన పదార్థములు.

వర్జ్యము నం. వి. విడువదగిన దోషయుక్త కాలము విశే. విడువదగినది. త్యాజ్యము.

వర్ణకణములు నం. వి (వృక్ష.) ఇవి ఆదిలవములలో నొకటి, జీవకణమునకు రంగు నిచ్చు ఆదిలవములు (Chromoplasts).

వర్ణకము నం. వి. (రసా.) రంగు నిచ్చు ద్రవ్యము(Pigment).నం. వి చందనము, చందనపుపూత. వర్ష. ప్రత్యయము.

వర్ణకల్పన నం. వి. (గృహ.) రంగుల కలయిక, రంగులపోలిక(Colour-scheme).

వెచ్చదనమునిచ్చు రంగులు (Warm-colours), చల్లదనమునిచ్చు రంగులు (Cool colours)

వర్ణగ్రాహకములు నం వి (గృహ) బిడ్డలకు తల్లిదండ్రుల పోలికలనిచ్చు జీవకణములలోని క్రోమాటిన్ ముక్కలు (Chromosomes).

వర్ణద్రవ్యము నం వి (వృక్ష) మొక్కల భాగములకు రంగునిచ్చు పదార్థము (Pigment) (వర్ణపాంతము, మొ.॥).

వర్ణనము నం. వి స్తోత్రము, వస్తుగుణములను వివరించుట.

వర్ణప్రబంధకము నం. వి. చరి.(రాజ)శరీరము యొక్క రంగు జాతి మూలముగ కలుగు ప్రతి బంధకము. ఉదా అమెరికా రాష్ట్రములలో నీగ్రోలను చూచుపద్ధతి.

వర్ణబంధకము నం. వి. (గృహ) మోర్డెంట్ (Mordant) బట్టలకు రంగును సంగా పట్టించునది ఉదా పటిక, ఉప్పు మొ॥ చూ వర్ణస్థాపకము.

వర్ణమాపకము నం. వి. (రసా.) ద్రావణములో రంగునిచ్చు ద్రావ్యముల రంగు యొక్క గాఢతనుబట్టి ఆద్రావ్యముల సాంద్రతను నిర్ణయించు పరికరము Chromometer .

వర్ణమాల నం. వి అక్షర సమామ్నాయము. (భౌతి.) కాంతి విశ్లేషణము వలన ఏర్పడిన ఏడురంగుల సముదాయము (Spectrum) తెల్లని వెలుతురును పట్టకముచే విరిచి ఒక నిలువుచీలిక ద్వారా చిన్న దూరదర్శినితో చూచినప్పుడు అగపడు రేఖల పరంపర.

వర్ణమాలాదర్శికము నం వి.(భౌతి)(Spectroscope) చూ. వర్ణమాల.

వర్ణమాలా మాపకము (నం, వి,భౌతి.) (Spectrometer) వర్ణమాల.

వర్ణమాలాలేఖిని నం వి (భౌతి) (Spectrograph) చూ వర్ణమాల.

వర్ణము నం. వి. 1 అక్షరము. 2. రూపము. 3. రంగు 4. బంగారు. 5.పూత 6.జాతి 7. నాలుగు వర్ణములు, బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్ర జాతులు. 8. కులము.

వర్ణవిపథనము నం. వి. (భౌతి) వివిధ వర్ణముల కాంతి కిరణము వివిధముగా వక్రీభవించుటచేతఆకిరణము లొక బిందువునొద్ద కేంద్రీకరించకుండుట. (Chromatic aberration)

వర్ణస్థాపకము నం. వి (రసా) బట్టలకు రంగువేయునపుడు ఆ రంగులను ప్రోగులలో లగ్నమగునట్లుచేయగల రసాయనిక ద్రవ్యము (Mordant) ఉదా ఎల్యూమినియమ్ హైడ్రాక్సైడ్.

వర్ణాటుడు నం.వి 1.గాయకుడు, 2. ముచ్చి చిత్రకారుడు 3 స్త్రీవంన బ్రతుకువాడు.

వర్ణి నం.వి 1. బ్రహ్మచారి. 2. వ్రాతకాడు. 3 ముచ్చి

వర్ణుడు నం వి. కుమారుడు.

వర్తకతాటకము నం. వి. (అర్థ) విదేశములో వ్యాపారము సలుపునపుడు ఎగుమతుల దిగుమతుల అంత్యఫలితము. విదేశవాణిజ్యావశేషము, (ఇది అనుకూలముగ గాని ప్రతికూలముగ గాని యుండును).

వర్తకపుఖాతా వి. (వాణి.) సంస్థ యొక్క స్థూలలాభమో, నష్టమో తెలియజేయు ఖాతా. లాభనష్టముల ఖాతావేయుటకు ముందు ఈఖాతాను తయారుచేయవలెను

వర్తకము నం వి. వాణిజ్యము, వ్యాపారము, బేహారము.

వర్తకుడు నం.వి. వ్యాపారి.

వర్తనము నం. వి. 1. నడవడి. 2. జీవనము

వర్తని నం. వి. త్రోవ, కాలిబాట.

వర్తమానము నం. వి. వృత్తాంతము విశ. జరుగుచున్నది.
వర్తి నం. వి 1. వత్తి. 2. కంటికాటుక, విశ. వర్తించువాడు.
వర్తులము నం విశ. గుండ్రనిది
వర్త్మము నం వి. 1. మార్గము 2 కనురెప్ప
వర్ధంతి నం. వి మహాపురుషుల ఆబ్దికము (Death Anniversary).
వర్ధకకోరకము నం. వి. (వృక్ష.) శాఖగా వృద్ధిచెందు మొగ్గ (Vegetative bud).
వర్ధక శరీరము నం. వి (వృక్ష) మొక్క యొక్క భాగములలో ఫలరుత్పాదక అవయములుగాక శరీర వ్యాపారములు నిర్వర్తించు తక్కినభాగము(Vegetative body).
వర్ధకి నం. వి వడంగి
వర్ధకీయవ్యాప్తి నం. వి. (వృక్ష) వర్ధకీయ భాగముల (శాఖలు పత్రములు మొ॥) ద్వారావృద్ధి జెందుట.(Vegetative propagation)
వర్ధనము నం. వి. 1. పెరుగుట 2 నరకుడు.
వర్ధనాపస్థకము నం. వి. (జం) బీజాణుజ వర్గమునకు చెందిన జంతువు(Sporozoan), యొక్క జీవిత చరిత్రలో ఆహారమును గ్రహించి పెరుగుచుండుదశ ఉదా మానవ రక్తకణములలోనభివృద్ధిచెందు మలేరియా రోగజీవి (Trophozoite)
వర్ధని నం. వి. చీపురుకట్ట.
వర్ధిత నం. విశ. (గణి.) పొడిగించిన,
A B C
AB రేఖ C వఱకు వర్ధితమైనది=పొడిగించబడినది (Produced)
వర్ధిష్ణువు నం. విశ. వృద్ధిబొందువాడు.
వర్మ నం. వి క్షత్రియులు నామాంతమున పెట్టుకొను గుర్తు.(శర్మ గుప్త మొదలగు వవి వలె.)
వర్మము నం. వి కవచము.
వర్య నం. వి తనంతట మగని వరించు స్త్రీ. విశ ముఖ్యరాలు.
వర్షచ్ఛాయ నం వి. (భూగో.) కొండను దాటినతర్వాత వర్షః పవనములు పొడియగుటచే కొండల యొక్క రెండవ వైపున వర్షము కురియని ప్రదేశము. ఈ ప్రదేశములలో వర్షము తక్కువగా నుండును
వర్షధర్యరు నం. వి. అంతఃపురపు కావలివాడు
వర్షము నం వి 1. వాన 2 పేడితము. 3 ద్వీపము. 4. సంవత్సరము.
వర్షదహనము నం. వి. (భూగో.) సూర్యకిరణోష్ణము వలన భూమిపైనున్న నీరు చెమ్మ ఆవిరిగామారి పైకెగసి, చల్లబడి, వర్షపాతముగ భూమిపై పడుట.
వర్షపాతాతపశైథిల్యము నం. వి. (భూగో) వర్షము, గాలి, ఎండ అను వానిచేత భూమి ఉపరితలమున కలుగు అరుగుదల.
వర్షాశనము నం వి. 1 ప్రభువులు, పండితులు. కవులు మొదలగు వారికి సంవత్సరమున కొకతూరి యిచ్చెడు సంవత్సర గ్రాసద్రవ్యము. 2 వార్షికము
వర్షీయుడు నం. విశ మిక్కిలి వృద్ధుడు
వర్ష్మము నం వి 1. శరీరము 2 మిక్కిలి చక్కని రూపము. 3. కొలత.
వఱ వి. మేర, హద్దు.
వఱగొడ్డము వి. 1. వంకరమాట, 2. మర్యాద నతిక్రమించుమాట.
వఱడు వి. పెద్దజాతి నక్క.
వఱత వి. వెల్లువ, ఏరు. రూ. వఱద.
వఱద వి వెల్లువ, నీటికాలువ.
వఱద కాలువలు వి. వర్షము వచ్చునప్పుడు మాత్రమే నిండి పొలములకు నీటి వంద జేయు కాలువలు.

వఱదగుడి వి. సూర్యచంద్రాది పరివేషము, గాలిగుడి.
వఱపు వై. వి. వానలేమి నం వర్షాభావః.
వఱలు క్రి. 1. ప్రకాశించు, ఒప్పు. 2 వ్యాపించు
వఱువట్లు వి. మిక్కిలి వట్టులు (ఎండుటలు)
వఱువాత వై. వి, ప్రాతఃకాలమున, నం. ప్రాతః.
వఱ్ఱు వి. 1. ప్రవాహము. 2 అతిశయము
వల వి. 1. చేపలుపట్టు జాలము 2 సమాసమునందు వలను శబ్దపు రూపము. ఉదా వలను+కడ=వలకడ
వల వై. వి కామము నం వల్.
వలంటీర్ ఆం. వి. (Volunteer) నిస్స్వార్థముగా ముందుకు వచ్చి పనిచేయువాడు. స్వచ్ఛంద సేవకుడు. రూ. వాలంటీర్
వలఁతి వి. స్త్రీ
వలకట్టు వి. అనుకూలపరచు,
వలకడ వి. (వలను+కడ) దక్షిణపుదిక్కు
వలకాఁక వి. మన్మథ తాపము
వలకాఁడు వి. వలపుకాడు.
వలకేలు వి. కుడిచెయ్యి.
వలగొను క్రి. ప్రదక్షిణముచేయు. తిరిగివచ్చు
వలగ్నము నం. వి. నడుము.
వలచు వై. క్రి. కోరు, కామించు నం, వాంఛ్. క్రి. వాసనవేయు
వలజము నం. వి. 1. వరిమడి. 2, పైరు. 3, యుద్ధము. 4. పురద్వారము.
వలతి వి 1 స్థానము 2. ఇల్లు.
వలదు వి. ఆధిక్యము. అవ్య వద్దు.
వలదొర వి. మన్మథుడు.
వలన అవ. పంచమీ విభక్తి ప్రత్యయము.
వలనము నం. వి. 1. కంటిపాప తిరుగుడు. 2. తిరుగుడు. సంచారము.
వలనము నం. వి. (వృక్ష.) మొగ్గలోనున్న ఆకు ముడుచుకొని యుండుస్థితి(Ptyxis)
వలను వి. 1. ప్రక్క. 2 ఉపాయము, నేర్పు 3, శకునము. 4 ప్రదక్షిణము 5. ఉచితత్వము 6. ఒప్పిదము 7 అనుకూల్యము. విశ 1. కుడి. 2 యుక్తము
వలనొప్పు క్రి. అనుకూలించు
వలపక్షము వి (వ్యావ.) (వలను+పక్షము) పక్షపాతము.
వలపలగిలక వి. రేఫము,
వలపు వై. వి. చొక్కు, కామము వి. వాసన నం వల్, వాంఛా.
వలపుకత్తె విశ. కాముకుడు.
వలపుకాఁడు విశ కాముకి.
వలభి నంః వి. 1. ముంజూరు 2 చంద్రశాల
వలమానము నం, విశ. తిరుగుచున్నది
వలము వి. 1, స్థౌల్యము 2 విస్తారము.
వలమురి వి. దక్షిణావర్త శంఖము
వలమురితాలుపు వి విష్ణువు.
వలయదంతగిరి నం వి. (వృక్ష.) పత్ర ఫలకము యొక్క అంచు అర్ధచంద్రాకారము గల దంతములతో నుండుట (Crenate)
వలయపరీక్ష నం.వి. (రసా.) ఏదేని ద్రవ్యములలో మిశ్రితమై నైట్రేటు లవణమున్నదో లేదో నిరూపించు శోధనము. (Ring test)
వలయము నం వి కడియము, వృత్తము విశ గుండ్రనిది
వలయములు నం వి. (జం.) ప్రాణుల శరీరమునైన గనబడు ఉంగరములవంటి భాగములు, (Annuli).
వలయితము నం. విశ. చుట్టబడినది.
వలయినములు నం వి. (జం.) శరీరముపైకి ఉంగరముల వరుసలో నేర్పడినట్లు కనబడుచు లోపల దానితో సరిగాఖండములు గల క్రిములు(Annelida or Annulata) ఉదా. వానపాము మొ.
వలయు క్రి. ఇష్టమగు, యుక్తమగు, హితమగు.

వలవంత వి. 1. మన్మథవ్యథ. 2.సంతానము
వలస వై. వి. రాజోపద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకేగుట నం. పరవాసః
వలసదేశము వి. (రాజ.,వరి.) పరాధీన దేశము పేరొక రాజ్యపరిపాలన క్రింద నున్న దేశము ఉపనివేశన రాజ్యము. 2. ఇతరదేశ ప్రజలు వలసవచ్చి నివాస మేర్పరుచుకొనిన రాజ్యము (Colonies)
వలసరాజ్య స్వపరిపాలన వి. (రాజ.,వరి.) దేశరక్షణ విదేశవ్యవహారములుగాక అంతరంగికముగా వలసరాజ్య ప్రజలకు శాఖ్యతాయుత స్వపరిపాలనము (Dominion status)
వలసవచ్చినవాఁడు వి. (రాజ.,వరి.) వలస దేశములో నివాసమేర్పరచుకొనినవాడు అన్యదేశమును ఆక్రమించి నివాస మేర్పరుచుకొనినవాడు,
వలాహకము నం వి. 1. మేఘము. 2.కొండ
వలి వి 1 కంపము. 2. శైత్యము. నం. వి కడుపుమీది ముడుత, ముడుత.
వలికి వి. జెగ్గురుపక్షి.
వలిగొను క్రి చలిగొను. వణకు.
వలితంప్రడి వి. ఆకసము.
వలితము నం విశే. 1. చుట్టబడినది. 2. చలనమొందినది
వలిపము వి సన్నని తెలుపుబట్ట.
వలిపిఁడిగొట్టు విశే. వడకువాడు.
వలిమల వి. మంచుకొండ.
వలిమొలక వి. భీమసేనుడు.
వలియు క్రి సన్నగిల్లు, ఎత్తువడు
వలీముఖము నం.వి. వానరము.
వలుఁద ప్రా విశే. స్థూలము. దూ. వల నం. బలదా.
వలుకు వి. 1. తగవు. 2. ఫలాదుల బహుమానము.
వలువ వి. సన్నవస్త్రము, బట్ట.

వలె అవ్య. పోలె (ఉపమావాచకము).
వలెవాటు వి. వల్లెవాటుగా వైచుకొనిన ఉత్తరీయము,
వల్కలము నం వి. చెట్టుమీది పట్ట.
వల్కవము నం. వి. పట్టనార నారచీర.
వల్గువు నం. వి. రెప్పమీది వెంట్రుక విశే. చక్కనిది,
వల్మీకము నం వి పుట్ట.
వల్లకాడు వి. శ్మశానము. నానావిధముల పాడు చెయునది
వల్లకి నం. వి వీణ
వల్లడి వి. ఆకారణముగు నాపద. విపత్తు.
వల్లన వి వేదములులోనగువానినివల్లించుట
వల్లభము నం వి మేలుజాతి గుఱ్ఱము విశే. ప్రియమైనది.
వల్లభుడు నం విశే. ప్రియుడు, స్వామి.
వల్లరి నం. వి. చిగిరించిన లేతకొమ్మ, తీగ.
వల్లవుఁడు నం. వి. గొల్లవాడు
వల్లి నం.వి 1. తీగ, 2.సుబ్రహ్మణ్యేశ్వరుని భార్య.
వల్లించు క్రి మరలమరల పఠించు.
వలియ వై.వి. వింటినారి నం వల్లిక.
వల్లూరము నం. వి. 1. పందిమాంసము. 2. ఎండినచేప. 3 చవిటినేల. 4. అగ్ని.
వల్లె వి. చెప్పినది మరలచెప్పుట 2 వరుణుని పాశము 3. రజ్జువు, త్రాడు. అవ్య అంగీకారము తెలుపునది.
వల్లెవేయు క్రి. మరలమరల పఠించు
వశ నం. వి. ఆడేనుగు.
వశంవదుడు నం విశే లోకువయగునట్లు మాటాడువాడు.
వశక్రియ నం వి వశీకరణ యంత్రము వశముచేసికొనెడు మంత్ర తంత్రాది కర్మము.
వశము నం. వి స్వాధీనము.
వశవర్తి నం. విశే. విధేయుడు.

వశీకరణము నం. వి. మందు మ్రాకులచేత లోకువగాచేసికొనుట.

వశ్యత నం. వి. (గృహ.) సరిపడకపోవుట కొంతమందికి కొన్ని వస్తువులు అను కూలముగావు అట్టి ఆహారముతినునప్పుడు లేదా వస్తువులను ధరించినప్పుడు దాని ఫలనఅపగుణములు కనబడును (Allergy)

వషట్కారము నం వి. అగ్నియందు వేయు హవిరాదిత్యాగము.

వషట్కృతము నం విశ. అగ్నియందు వేల్వ బడునట్టిది (హవిస్సు).

షస నం వి. బొడ్డుక్రిందనుండు ఉల్లి పొర వంటి క్రొవ్వు.

వసంతదారువు నం. వి. (వృక్ష) కాండ ములో వసంత కాలమున ఉత్పత్తియైన దారువు (Spring wood)

వసంతము నం వి. 1. చైత్రవైశాఖ మాస ములు 2. ఒకానొక రాగము. వి వసు వును సున్నమును కలిపిన యెఱ్ఱతీర్లు

వసతి నం. వి. 1 ఇల్లు. 2 ఉనికి.

వసనము నం. వి. 1. వస్త్రము 2. ఉనికి

వసారా వి పంచాది, పంచ

వసి వై. వి కొనచెక్కినకొయ్య. ముల్లు నం. వ్రశ్చ

వసిగొను క్రి. పూను, ఉత్సహించు.

వసివాళ్ళు వి. (వసివాడు + లు) మిక్కిలి వాడుటలు.

వసుంధర నం. వి. భూమి

వసుదేవుడు నం వి. కృష్ణునితండ్రి, ఆనక దుందుభి

వసుధ నం. వి. ~~భూమి~~ వ్యు వసువును (బంగారమును) ధరించునది.

వసులు క్రి. తొలగు, విరియు.

వసువు నం. వి. బంగారు, ధనము, రత్నము

వసువులు నం. వి. గణాధి దేవతలు, అష్ట వసువులు అపుడు, ధ్రువుడు, సోముడు అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు. అనలుడు, ప్రభాసుడు.

సూలు హిం. వి ఆదాయము, జమ

వస్తాదు హిం. వి ఉపాధ్యాయుడు, కసరత్తు నేర్పువాడు, పయిలువాను.

వస్తి నం వి. 1 బద్దె 2. పొత్తికడుపు.

వస్తుకాచము నం. వి (భౌతి.) ఒక చాక్షుష పరికరమందు (దూరదర్శిని లేదా సూక్ష్మ దర్శిని) ప్రత్యవేక్షణీయక వస్తువునకుతరు వాతనున్నది కటకముగాని కటక సమ్మే ళనముగాని (Object glass).

వస్తుదార్ఢ్యము నం వి. (భౌతి) పదైనవస్తువు [illegible] గట్టిదనము (Strength of the material)

వస్తుధావనము నం. వి. (గృహ) బట్టలను శుభ్రముచేయుట, బట్టలనుదికి శుభ్రము చేయుట, చాకలిపని (Laundry)

వస్తుపత్రము నం వి (వాణి.) దిగుమతి సరకు లను తాము తీసికొని పోవుటకు ముందు దిగుమతిదారు నింపవలసిన పత్రము (దీనిలో సరకు వివరములు, సుంకములు చెల్లింపబడెనా అను విషయములన్నియు వ్రాయవలెను.)

వస్తుప్రదర్శనము నం వి అప్పుడప్పుడు వ్యాపారులు ఒకచోట వివిధ వస్తువులను ప్రదర్శించి విక్రయించు చోటు (Exhibition)

వస్తుమార్పిడి వి. (అర్థ.) సరకునకు బదులు సరుకుపుచ్చుకొనుట.

వస్తువు నం. వి. పదార్థము (నాట్య పరి భాషలో) కథలేక ఇతి వృత్తము. నం.వి. (భౌతి., గణి.) ద్రవ్యమయమైనదయు ఆకృతిగలదియునగు రూపము. (Body) నం వి. (భౌతి.) ఇంద్రియములకు గోచర మైన లేదా గోచరముగుటకు సమర్థమైన విషయము (Object).

వస్త్రఘాతము నం. వి. (గృహ.) బట్టలను బాది ఉతుకుట, మురికిపోవుటకై బట్టలను రాతిపై బాదుట, లేక కఱ్ఱతో బట్టలను బాదుట. (ఈ మోటు పద్ధతిని ఉతికిన బట్టలు త్వరలోచినుగును) (Beating of clothes)

వస్త్రము నం. వి. బట్ట, వలువ.

వస్త్రము దణ (అద్దకము) నం. వి. (గృహ.) బట్టలమీద చిత్రములనుఅద్దుట(Printing)

వస్నస నం. వి. సన్ననినాము.

వహతి నం. వి. 1 ఎద్దు 2 నది 3 గాలి.

వహనము నం. వి. 1. పడవ, ఓడ. 2. స్నాయువు.

వహనము నం. వి. (భౌతి.) ఒక చోటునుండి ఇంకొకచోటికిమోసికొనిపోవుట (ఆమోసికొని పోబడినది ద్రవ్యముకావచ్చును, తాపముకావచ్చును విద్యుత్తు కావచ్చును) (Conduction)

వహి నం.విశే. వహించువాడు. వి. 1. లెక్క పుస్తకము 2. విధము.

వహేలనము నం.వి హేళనము,తిరస్కారము

వహ్ని నం. వి. అగ్ని.

వహ్నిశిఖము నం. వి. కుంకుమ పువ్వు.

వళక్షము నం. వి. తెలుపు

వళావళి వి కుటూహలము.

వళి నం. వి. కడుపుమీది ముడుత.

వళిరుడు నం. విశే. మెల్లకంటివాడు.

వళుకు వి తగవు.

## వా

వా దై. వి నోరు, వాదర. రూ. వాయి నం. వాక్

వాంచు దై. క్రి వంగజేయు. వంచు, నం. భంజ్.

వాంఛ నం. వి. కోరిక.

వాంఛితము నం. విశే. కోరబడినది.

వాంతము నం. విశే. వెడల గ్రక్కబడినది.

వాంతి నం. వి. డోకు

వాఁక దై. వి. ఏరు. విశే. వంకర.

వాఁగు దై. వి. 1. సెలయేరు. 2. సేవ. వం. వాహః దై. క్రి. ప్రేలు.

వాఁగులు దై. వి. 1. అలలు. 2. సెలయేళ్లు.

వాఁచు దై. క్రి. 1. ఏకరు. 2 ఊదు.

వాఁడి వి. 1. పదను 2. శౌర్యము, విశే. తీక్ష్ణము, క్రూరము.

వాఁడు అమనుజుడు (మహదర్థక ప్రథమైక వచనము) వారిరి, దై. వి. అధికమైన కోరిక.

వాకట్టు వి. వాగ్బంధన క్రియ

వాకబు హిం. వి. దర్యాప్తు, విచారణ.

వాకొను క్రి. అరచు. మాటాడు.

వాక్యము నం. వి. భావముగల పదసముదాయము.

వాక్యూమ్‌క్లీనర్ ఇం. (గృహ.) (vaccum cleaner) ఇది దుమ్ముతీయు విద్యుచ్ఛక్తి యంత్రము, తివాసీ మొదలగువాని నుండి దుమ్ముతీయుట కుపయోగించు గాలిలేనట్టి యంత్రము.

వాక్రుచ్చు క్రి. 1. పేరుచెప్పు. 2. చెప్పు. 3 శబ్దించు.

వాకిలి వి. గృహద్వారము.

వాగ నం.వి. కళ్ళెమునకు తగిలించు పగ్గము.

వాగట్టు వి.(వాయి+కట్టు)చిత్రకారునికుంచె

వాగాయిత్రము దై. వి. వాగ్వివాదము. నం. వాగ్వాదః.

వాగుర నం. వి. మృగపక్ష్యాదులను బట్టు ఉరి. ఉచ్చు, వల.

వాగ్మి నం వి. 1. చిలుక, 2. బృహస్పతి. విశే. యుక్తియుక్తముగా మాటాడువాడు.

వాఙ్మయము నం. వి. భాష.
వాఙ్మూలము నం. ఒ న్యాయస్థానములందు సాక్షులు చెప్పినవిషయము, సాక్ష్యము
వాచంయముఁడు నం. వి, మౌని (ముని.)
వాచకము నం. వి. 1 వాక్యార్థమును తెలిపెడి శబ్దము 2. తరగతి పఠన్య పుస్తకము,
వాచస్పతి నం. వి. సురాచార్యుడు, బృహస్పతి
వాచస్పత్యము నం. వి. ఒక నిఘంటువు పేరు
వాచాటుఁడు నం విశే. వదరుబోతు.
వాచాలుఁడు నం. వి. వదరుబోతు.
వాచికము నం. వి. సమాచారము, వర్తమానము.
వాచ్యము నం విశే చెప్పదగినది.
వాచఱచు క్రి మొఱపెట్టు.
వాచవి వి. రుచి చూచుట
వాజపేయము నం. వి ఒకానొక యాగము.
వాజము నం వి 1. నెయ్యి, 2. నీరు. 3 రెక్క.
వాజి నం. వి గుఱ్ఱము.
వాజ వి రోత.
వాజమ్మ వా వి. దద్దమ్మ. అంబేర,
వాటచారి నం వి బాటసారి, పాంథుడు.
వాటపద్దెము వి. (వ్యావ) ఆటవిడుపు పద్యము.
వాటము విశే. 1 జారుపుగా నుండునది 2. అనుకూలమైనది.2 పొందికైనది.
వాటము నం వి. 1. తోట. 2 త్రోవ. 3. ఇండ్లవరుస, 4. భాగము.
వాటాదారు హిం వి. (వాణి.) వ్యాపార సంస్థలలో వాటాలు కల వ్యక్తి (Share holder).
వాటాహక్కు నష్టము వి. (వాణి) వాటాదారుడు, వాటాలపై కట్టవలసిన సొమ్మును గడువులో చెల్లింపనిచో కంపెనీ నిర్దేశకులు అతనిని వాటాదారుగ తొలగింతురు ఇట్లు హక్కు నష్టము చేసిన వాటాలపై ఇదివరకే చెల్లించిన సొమ్మును కంపెనీ తిరిగి యియ్యక పోవుటయేకాక, ఆ వాటాలను మరియొకనికి అమ్ముట కూడ జరుగును.
వాటిక నం వి 1. తోట. 2. ఇండ్ల వరుస.
వాటరాయి వి. దొంగలు విసరివేయుటకు వరి తీసికొనుపోను రాయి,
వాటులాడు క్రి కొట్టులాడు, పోట్లాడు
వాడ వై. వి ఇండ్లవరుస, వీథి, నం, వాటీ. వాటః.
వాడఁబాఱు క్రి వడలు, వాడు.
వాడకట్టు వి వాడ
వాడకపు సరకులు వి (అర్థ) వాడుకొనుటకు అనువైన వస్తువులు
వాడకము వి వెచ్చము
వాడగాలి వి మలయమారుతము.
వాడవదినె వై వి. కులట, స్వైరిణి.
వాడి వత్తులగు క్రి మిక్కిలి కృశించు.
వాడు వి వాడుట, వాడిపోవుట. క్రి. ఉపయోగపరచు, మ్లానమవు.
వాడుక వి. 1 ఉపయోగము. 2. పాడి 3. రివాజు 4. అభ్యాసము.
వాడుక వి (గృహ.) క్రమము, పరిపాటి, నియతచర్య (Routine).
వాణి నం. వి. 1. పలుకు. 2. సరస్వతి.
వాణిజుఁడు నం. వి. సార్థవాహుఁడు.
వాణిజ్యబ్యాంకు మి. వి. (వాణి.) సాధారణ వ్యాపారములకు వివిధ సేవల వలన తోడ్పడుబ్యాంకు (Commercial Bank)
వాణిజ్య మండలము నం.వి. (వాణి.)వ్యాపారస్థుల సంఘములు, ప్రభుత్వమునకు వ్యాపార విషయములలో సలహాలిచ్చుట. తమ ఇక్కట్లను ప్రభుత్వమునకు నివేదించుట ఇట్టి మండలముల ముఖ్యోద్దేశము.

వాణిజ్యము సం. వి. (అర్థ) వ్యాపారము వర్తకము. సరకులను లాభముల కొఱకు అమ్మే వృత్తి.

వాణిని సం. వి ఆటకత్తె, ముగ్ధ.

వాతగానివాఁడు వి. బట్టలకు రంగు వేయువాడు రంజకుడు.

వాతఘ్నము సం. వి. ఆముదపుచెట్టు వృ. వాతమును పోగొట్టునది.

వాతనిరపేక్షక్రిములు సం. వి (గృహ.) గాలి లేకుండ జీవించు క్రిములు (వీనిని సెప్టిక్ టాంకులకు ఉపయోగింతురు. ఇవి విసర్జితములను నిరపాయముగ నొనర్చును.). (Bacteria-Anaerobic).

వాతప్పు వి (వాయి+తప్పు) నోట వెలువడిన తప్పుమాట.

వాతము సం వి 1. గాలి, 2. వాతనాడి నీరసించిన రోగము.

వాతరంధ్రములు సం. వి. (వృక్ష) వృక్ష కాండముపై బెరడులో నగపడు పగుళ్ళు (వీనిగుండా వాయు ప్రసారము జరుగుచుండును) (Lenticles)

వాతరోగము సం. వి. (గృహ) వాతము చేత నేర్పడు రోగము. (సాధారణముగ ఈ నొప్పులు శరీరమునందు కీళ్ళ వద్ద ఏర్పడును). (Rheumatism).

వాతవాఁడి విశ. అప్రియుంవదుడు, దురుసుగామాటాడువాడు. (వాత+వాడి+కలవాడు).

వాతానుకూల్యకరణ యంత్రము సం. వి (భౌతి.) వాతావరణమును కావలసినట్లు చల్లగాగాని, వేడిగాగాని మార్చెడి యంత్రము. వాతస్థితి నియంత్రక యంత్రము. (Air Conditioner).

వాతావనీతములు సం. విశ. (వ్యవ). పుట్టిన చోటినుండిగాలిచే నెగుర గొట్టబడి దానిచే వేరొకచోట నేర్పడిన నేలలు. (Drift-Soils).

వాతాయనము సం వి. గవాక్షము. జాలకము

వాతాయనము సం వి. (భౌతి.. గృహ.) ఇండ్లలో మనము విడుచుగాలి బయటకి పోవుటకు ఏర్పరిచినకిటికీ. (Ventilator).

వాతావరణము సం. వి. (భౌతి) భూమిని ఖగోళములోని మరియే రాశినిగాని ఆవరించియుండు వాయు మండలము. (Atmpsphere).

వాతావరణశాస్త్రము సం వి. (వృక్ష.) శీతోష్ణములు, వర్షపాతము ఆర్ద్రత మొదలగువానిభేదములకు చెట్టుచేమలపైనుండు ప్రభావమును తెలియజేయు శాస్త్రము (Climatology).

వాతికాను వై వి (వాయి+కాన). 1. లంచము 2 సూడిద.

వాతూలము సం వి. 1. గాలిస్త్రీ 2. సుడిగా

వాతెఱ వి. పెదవి

వాత్య సం. వి. సుడిగాలి.

వాత్సల్యము సం.వి. (గృహ.) పుత్రాదులందు గల ప్రేమము, మాలిమి.

వాదవము సం వి 1, వీణాది చతుర్విధ వాద్య ధ్వని. 2. మ్రోయించుట.

వాదము సం వి 1. వాగ్వివాదము, తగవు 2. రసవాదము, సం వి. (భౌతి) ఒక శాస్త్రము యొక్క తత్వముల నిర్వచనము, ఉదా పరమాణువాదము.(Theory) (గణి. శాస్త్రములోని మూల విషయముల విపులీకరణ, (Theory).

వాదర వై. వి. (వాఁడి+దార) కత్తియొక్క పదునుగల అంచు.

వాది సం. వి. తగవునకుపోయినవాడు. విశ. వాదించువాడు.

వాదిత్రము సం, వి. 1. తతము. (వీణ మొదలగు) 2. ఆనద్ధము (మద్దెల మొదలగు) 3. సుషిరము (పిల్లఁగ్రోవి) 4. ఘనము,

తాళములు మొదలగునవి. అను వాద్య చతుష్టయము, వాద్యధ్వని.

వాదు వై. వి. 1, వాదము. 2. నింద. 3. దావా. 4. పంతము.

వాదోడు విశే. మాటకుసాహాయము.(వా + దోడు). (వేదోడువాదోడు).

వాద్యము సం. వి. వీణలోనగునవి.

వాన వి. వర్షము.

వానతాళ్ళు వి. వర్షధారలు.

వానకోయిల వి. 1. చాతకపక్షి. 2. ఒకరకము. షాము.

వానపాము వి. ఎఱ్ఱ. మహీలత.

వానప్రస్థము సం. వి. ఒక ఆశ్రమము(మూడవది).

వానము సం. వి. 1. కుట్టుపని. 2. చాప 3. సారంగము.

వానరము సం. వి. కోతి.

వానవుఁడు సం. వి. వినాయకుడు

వానస్పత్యము సం. వి. పూచికాచెడు చెట్టు

వానము సం. వి. 1. గొరుగుట 2. విత్తుట. 3. నేయుట.

వాపసు హిం. వి. 1. మరలనిచ్చివేయుట. 2. తిరస్కారము.

వాపి సం. వి. నడబావి, దీర్ఘిక, దిగుడుబావి

వాపితము సం. విశే. 1. విత్తబడినది, 2. నేయబడినది. 3. గొరుగబడినది.

వాపు వై. వి. వీణాది వాద్యము వాయించుట. చూ వాయింపు

వాపుచ్చు క్రి. నోరు తెరచు, వచించు.

వాపోక వి. ఏడ్పుట, అరచుట

వాపోవు క్రి. అరచు, ఏడ్చు.

వామ సం. వి. ఉత్తమస్త్రీ.

వామదేవుఁడు సం. వి. శివుడు,

వామనము విశే. లేతది,

వామనగాయ వి. ఊరుగాయకు ఉపయుక్తమగు ఒక దినుసుకాయ.

వామనుఁడు సం. వి. విష్ణువు. విశే. పొట్టివాడు

వామము సం. వి. ధనము విశే. 1. ఎడమ. 2. సుందరము. 3. హ్రస్వము.

వామలూరము సం. వి. (వామలూరువు) పుట్ట,

వామి సం. వి. ఆడు గుఱ్ఱము: వి. ప్రోగు, రాశి

వాము వి. 1 ఓమము 2. బంధుత్వము, (వ్యావ.) (Omum). ఇది తంచుఓషధిగను, అమిదుగా తాలింపు ద్రవ్యముగను ఉపయోగపడుచుండును. వాము Umbelliferae అను కుటుంబమునకు చెందిన Carum copiticum అను మొక్క యొక్క పండ్లు. (ఈ మొక్కను Bishop s weed అందురు).

వాయ వై. వి 1, రోటిలో నొకతడవ పోయు ద్రవ్యము. 2. కొండసందిచ్చిన నేల. సం. భాగః.

వాయుదంతము సం. వి. 1, సాలెవాడు. 2 నేత, సరికట్టెడు పలక.

వాయనము సం. వి. వ్రతోద్యాపన కాలమందు ఉపాయనముగనిచ్చు మోదకము.

వాయము విశే. వ్యర్థము.

వాయసము సం. వి. కాకి

వాయి వై. వి. 1. నోరు. ముఖము. 2. ఖడ్గధారా. సం. వాక్.

వాయింట వి. ఒక దినుసుకూరాకు, బ్రా.

వాయిదా హిం. వి. గడువు, మితి, న్యాయాధిపతి విమర్శనకై నియమించిన దినము.

వాయిదా సొమ్ము హిం. వి. ( వ్యవ., అర్థ. ) చెల్లించవలసిన సొమ్ములో కొంత భాగము. ఉదా. ఏదైన విలువగల వస్తువును కొని దానిధరను కొన్ని దఫాలలో చెల్లించుట. (Instalment).

వాయివాదర వై. వి. వంకయుగల కత్తి.

యువాకోశము నం. వి. (జం) ఊపిరితిత్తి నిర్మాణములోనున్న ఒక్కొక్క సూక్ష్మమైన గాలిగది. (Alveolus)

వాయుగతిశాస్త్రము నం. వి. (గణి.) వాయు సంబంధమైన గణితశాస్త్రము. (Aerodynamics).

వాయుచూషకము నం. వి (రసా.) సీసాల నుండి కాని ఇతర పాత్రలనుండిగాని గాలిని లాగుట కుపయోగించు ఉపకరణము. (Aspirator).

వాయుచ్ఛత్రరచన నం. వి. (వృక్ష.) కొన్ని శుష్కఫలములకు బీజములకు గాలిలో నెగురుటకు వీలుగానుండు రెక్కలు, రోమములు మొదలగునవి గొడుగువలె నుండు ఏర్పాటు. (Parachute mechanism).

వాయుతాపకము నం వి, (రసా.) వేడిగాలిచే వేడిచేయుటకు ఉపయోగపడు రాగితో చేసిన పెట్టెవంటి పరికరము. (Air oven)

వాయుదిశసూచని నం విశే (భౌతి) గాలి ఏ దిక్కునుండి ఏ దిక్కునకువీచుచున్నదో తెలుపు పరికరము



వాయుదిశాసూచని

వాయుద్రవ్యహరణ శక్తి (నేలలు) నం వి (రసా.) నేలలో సంచరించు వాయువునుండి కొన్ని వాయుద్రవ్యములను హరించు శక్తి. ఉదా, అమ్మోనియా కర్బన ద్వ్యామ్లజనిదము మొదలగునవి. (Absorption capacity of gases)

వాయుద్రోణి నం. వి (రసా.) రాసాయనిక పరిశోధనాలయమందు, వాయువులసంగ్రహించుటకు నీటిలోనున్న నీటితొట్టె (Pneumatic trough).

వాయుధారకము నం. వి. (రసా.) వాయువును సంగ్రహించి యుంచుటకు ఉపయోగించు స్తూపాకార పాత్ర (Gas holder)

వాయుపదార్థము నం వి. (భౌతి. రసా) నిశ్చిత రూపము, ఘనపరిమాణము లేని పదార్థము (Gas)

వాయుపరాగసంపర్కము నం వి. (వృక్ష) గాలి యొక్క సహాయముచే పరాగ సంపర్కము జరుగుట (Wind-pollination on Anemophily).

వాయుపూరకము నం వి. (భౌతి.) వాయువుచే నింపు యంత్రము. (Inflator).

వాయుమాపకము నం. వి (భౌతి.) వాయుపదార్థముల సాంద్రతను కొలుచుట కుపయోగపడు పరికరము. (Aerometer).

వాయుయంత్రము నం. వి. (వ్యావ.) ఈ యంత్రమునందు ఎత్తైన స్తంభమువంటి నిర్మాణము దాని పైకొనను రేకులతో చేయబడిన గాలిచక్రము తిరుగుచుండును. ఒక పొడవైన ఇనుప ఊచ సహాయముతో చక్రమున కొకనూతిపై నీటిపంపునమర్చి నీరు పైకి తోడుచుందురు (Wind-mill).

వాయురేచకము నం. వి. (భౌతి.) ఒకపాత్ర నుండి గాలిని పైకిపంపు యాంత్రిక సాధనము. (Exhaust pump), గాలిని తీసివేయు యంత్రము (Air pump).

వాయువిజ్ఞానశాస్త్రము నం. వి. (భౌతి.) వాయు సంబంధమైన విజ్ఞానము. (Aerology).

వాయువు నం. వి. (భూగో.) గాలి యొక్క చలనము. నం వి. గాలి.

వాయుసమవస్థితము నం. విశే. (భౌతి.) శీతోష్ణ వికారములులేకుండ ఒకచోటులోనున్న గాలి ఇంచుమించు ఒకే తాపక్రమములో నుంచబడినస్థితిగలది. (Air conditioned).

వాయోడు త్రి. (వా+ఓడు) మాట పిరికి యగు, పలుకుటకు భయపడు.

వాయ్వవకాశములు నం. వి. (వృావ) గాలితోనిండియుండు స్థలములు. (Air-spaces).

వార వి. (లెక్కలలోని)ఎక్కువ తక్కువలు.

రంటు ఇం. వి. (రాజ.) (Warrant) ఒకనిని పట్టుట కధికారపత్రిక. 1. ఆజ్ఞ 2. తొందరపని.

వారకము నం. వి. గుఱ్ఱపు నడక. విణ వారించునది వి. తాకట్టు లేని కాలమందు వడ్డిలేకుండ నుపయోగార్థ మితరులకిచ్చి ఉన్నకాలమందు మరల పుచ్చుకొను ధనాదికము.

వారకాంత నం. వి వేశ్య.

వారకుట్టు వి. (గృహ) చిన్న పటవాలు కుట్లతో ముడుతను బట్టకతుకుట.(Hemming).

వారడి వి. తేడా, నష్టి.

వారణము నం. వి. 1 నిరోధము. 2 ఏనుగు

వారణాశి నం వి కాశీ.

వారధి నం వి, వంతెన.అడ్డకట్ట (ఈ అర్థము తెలుగునందే).

వారము నం. వి. 1. సూర్యాదివాసరము. 2. తడవ. 3. సమూహము. వి వారువము, గుఱ్ఱము (కొందరి యర్థమందును వారశబ్దము. నం. వ గవే గ్రహించిర).

వారసత్వనిర్ణయశాసనము మి వి (చరి. రాజ) క్రీ. శ 1701వ సంలో బ్రిటిష్ పార్లమెంటుతమరాజవంశీయులరాజ్యాధికార వారసత్వపు వాక్కులు నిర్ణయించు అధికారము బ్రిటిష్ పార్లమంటునందు కలదని శాసించిన చట్టము. బ్రిటిష్‌పార్లమెంటు ప్రజాస్వామ్యహక్కులలోముఖ్యమైన చట్టము.

వారసత్వము వి. (వ్యావ.) సక్రమముగ సంక్రమించెడి యాస్తి.

వారసు హిం. వి. వంశపరంపరలో మిగిలిన ఆస్తికికర్త.

వారాశి నం. వి. నీటికుప్ప, సముద్రము.

వారాహి నం వి. 1. ఒక మాతృక. 2,అడవియాడు పంది.

వారి నం వి నీరు,

వారిచరము నం. వి చేప మొ,

వారిజము నం. వి 1 తామర. 2. శంఖము 3 ఉప్పు.

వారిత్రము నం. వి గొడుగు, వాన నీటినుండి రక్షించునది

వారిదము నం. వి మేఘము వ్యు. నీటినిచ్చునది,

వారిధి నం. వి. వారాశి, సముద్రము

వారిమసి నం. వి. మేఘము వ్యు. నీరు దిసినిమసివలె నల్లగా చేయును.

వారు వై. క్రి. ఉడుగు. వడియు. సర్వ. వాడునకు బహువచనము. నం వార్.

వారుణి నం, వి. 1. పడమటి దిక్కు. 2 సారాయి,

వారువము వై. వి. గుఱ్ఱము, రూ.వార్వము నం. వారః.

వార్చు క్రి. 1. ఆచమించు. (వారుచు). 2. క్షాళించు.

వార్డు ఇం, వి (Ward) కొన్ని యిండ్లు లేక వీధులు కలిసిన భాగము.

వార్డెను ఇం (Warden) ప్రతిపాలకుడు. కళాశాలల విద్యార్థి వసతి గృహముల ప్రతిపాలకుడు, ఒకప్రదేశములోని నౌకా సైనిక స్థానములు కాపాడుట కొరకు ప్రభుత్వముచే నియమితుడైన ఉద్యోగి

వార్త నం, వి. వృత్తాంతము, సమాచారము వర్తనము.

వార్తము నం. విణ. రోగము తీరినది. వి. 1. అనామయము,ఆరోగ్యము. 2 పొల్లు,

వార్తాకము నం. వి. వంగ.

వార్తాపత్రిక నం. వి. (వ్యావ.) వార్తలప్రచారము కొరకు నడుపబడు పత్రిక, దినపత్రిక ప్రతిదినము ప్రచురింపబడు పత్రిక వారమునకొకసారి ప్రచురణమగు సంకీర్ణపత్రిక, పక్షపత్రిక పదునైదు దినములకు ఒకసారి ప్రచురింపబడు పత్రిక, మాసపత్రిక నెలకు ఒకసారి ప్రచురణమగుపత్రిక

వార్తాపహుఁడు నం వి. 1. కావడి మోసెడువాడు 2. సందేశహరుడు.

వార్తికము నం. వి ఉక్తానుక్త దురుక్తార్థములను వ్యక్తము చేయు గ్రంథము. వ్యాకరణ శాస్త్రమున సూత్రకారునిచే చెప్పబడని విషయములను చెప్పు గ్రంథము

వార్తికుఁడు నం వి. వార్తావహుడు.

వార్తకము నం వి. వృద్ధత్వము.

వార్ధి నం. వి సముద్రము

వార్ధుషికుఁడు నం. విఱ. వడ్డికిచ్చి బ్రతుకువాడు, కుసీదుడు.

వార్షికము కాన ఏటేట నియ్యబడు సొమ్ము

వార్షికము నం విఱ. 1. సంవత్సర కాలపరిమితి గలది. వానకాలమున బుట్టినది

వార్షికవలయము నం. వి (వృక్ష) వృక్షము యొక్క ప్రకాండములోపల ఏడాదికొక్కసారి యేర్పడు దరువలయము (Annul ring).

వార్షికవ్యయము నం. వి (అర్థ) సంవత్సరము పొడుగునను ఖర్చుపడు ద్రవ్యము (Annual expenditure).

వాలకము వి. 1. రూపు 2. పంచన 3 వేషము.

వాలపాశ్య నం వి. జడబిళ్ళ.

వాలము నం. వి తోక 2 కత్తి.

వాలము వై. వి. బెబ్బులి.

వాలాయము విఱ అనివార్యము, అవశ్యము, నిరంతరము, వి. నిర్బంధము.

వాలారు విఱ. (వాలు+అరు) వాడియైనది

వాలిండి వి. (వాలు+ఇండి) 1. తోకలేని కోతి 2. తోకలేనిది.

వాలిక విఱ. 1. దీర్ఘము. 2 వాడియైనది.

వాలిశుఁడు నం వి పిష్ణువు.

వాలు వై వి. కత్తి, దైర్ఘ్యము. నం. వాలః. క్రి. 1 అతిశయించు. 2 క్రిందికిదిగు దూ ప్రాలు (గణి) ఒక దత్తసరళరేఖకు ప్రథమాక్షమునకు మధ్యగల కోణము యొక్క టాంజెంటు (Tangent) (Slope gradient)

వాలుక సం. వి. ఇసుక.

వాలుగ వి. ఒక రకముచేప.

వాలుగంటి వి స్త్రీ దీర్ఘములైన కన్నులుగల స్త్రీ.

వాలుచూపు వి. ఓరచూపు.

వాలుప్రొద్దు వి. అపరాహ్ణము.

వాలుపుఁడు వి. శూరుడు

వాలుమొగ్గ వి. (వ్యావ) 1. పిల్లిమిరియము 2 మొగ్గ, పిల్లిమొగంతు

వాల్లభ్యము నం వి దొరతనము.

వాల్వు ఇం. వి (భౌతి) (Valve) ప్రవాహమును ఒకదిశలోనే పోనిచ్చు పరికరము.

వావి వి బంధుత్వము

వావిక వి. కుత్తుక మెడలోని గంట.

వావిరి వి క్రమము, అనుగతి, ఉత్కర్షము. విఱ అధికము.

వాపురము వై వి. గుల్మము. దూ. వారుపము, వాప్యము నం వారః

వాశితము నం. విఱ. వాసన కట్టబడినది

వాషర్ ఇం. వి. (గృహ) (washer) నరుమబెజ్జముగల మయిళ్ళ నీటి కుళాయిని మూసినప్పుడు నీరు కారకుండ మరను బిగించుటకుపయోగించు తోలుబిళ్ళ.

వాస వి వాసము (వెదురు)

వాసంతము నం. విఱ వసంత సంబంధమైనది. వి. 1. ఒంటె 2. కోయిల. 3.

తెమ్మెర

వాసంతి నం. వి. అడవి మొల్ల, పూలగురివెంద

వాసకము నం.వి, ఇల్లు.

వాసక సజ్జిక నం. వి. (అలం) పతి వచ్చు వేళకు శయనాదు లలంకరించు స్త్రీ (వాసవసజ్జిక).

వాసగృహము నం. వి. భోగగృహము కాపురముండెడి యిల్లు.

వాసన నం వి. 1. గంధము. 2. సంస్కారము. (రసా.) ముక్కుచే గ్రహింపబడు జ్ఞానము (odour)

వాసనమొలక వి. (వృక్ష) మరువము

వాసము నం. వి 1. వస్త్రము. 2, ఇల్లు (ఆవాసము). వి. వెదురు.

వాసరము నం. వి దినము.

వాసవుఁడు నం వి. ఇంద్రుడు.

వాసి వి. 1 ఉత్తమత్వము. 2. ఆధిక్యము. 3. ప్రసిద్ధి. 4. బాగు. 5. పరిమితి 6. లాభము.

వాసితము నం. విశే. 1. వాసితము. 2 వాసనకట్టినది.

వాసుకము నం. వి. వైకుంఠము.

వాసుకి నం. వి. 1. సర్పరాజు. 2. మృగపక్షిధ్వని.

వాసుదేవుడు నం. వి. కృష్ణుడు. వ్యు. వసుదేవకుమారుడు.

వాసువు నం.వి. (నాట్యపరిభాషలో) బాలిక

వాసెక్టమీ ఇం.వి. (Vasectomy) సంతానము కలుగకుండుటకు పురుషులకు చేయు ఆపరేషను.

వాసెగ్రోలు వి. పిల్లనగ్రోవి, వంశి,

వాసెన వై. వి. ఆవిరి పోక యెసటి పాత్ర మూతికి కట్టినగుడ్డ—సం. వాసః

వాస్తవము నం వి సత్యము

వాస్తవికము నం. విశే. నిజమైన, (గణి) (Actual) నం. విశే (భౌతి) వస్తువు యొక్క ఉన్న ఉనికి (కాల్పనికకు విరుద్ధము).

వాస్తవ్యము నం. విశే, వసింపదగినది.

వాస్తవ్యుఁడు నం వి. గృహస్థుడు.

వాస్తుకుడు నం. వి. వాస్తు పురుషుడు.

వాస్తుపతి నం. వి వాస్తోష్పతి ఇంద్రుడు.

వాస్తువు నం. వి. 1. ఇండ్లు మొదలైనవి యేర్పరుపదగిన నేల. 2. ఇల్లు.

వాస్తుశాస్త్రజ్ఞుడు నం. వి. శిల్పి, వాస్తు శాస్త్రము తెలిసినవాడు.

వాస్తుశాస్త్రము నం. వి. దేవాలయములు. గృహములు. సౌధములు నిర్మించుట యందు యుక్తాయుక్తముల దెలియజేయు శాస్త్రము, వాస్తుకళ, శిల్పశాస్త్రము. కట్టడములలో నేర్పరితనము (Architecture).

వాహకత నం. వి. (భౌతి.) వహించుటకుగల సామర్థ్యము(Conductivity) మా. వాహకము

వాహనము నం.వి. ఎక్కదగిన ఏనుగులోనగునది.

వాహము నం. వి. 1. గుఱ్ఱము. 2 ఎద్దు 3. భుజము.

వాహసము నం. వి. 1, సర్పము. 2. తూము కాలువ.

వాహికోశములు నం. వి. (వృక్ష.) దారు నాళముల మధ్యను చుట్టును ఉండు దట్టమైన కణకవచములు గల చిన్నకణములు (Tracheids).

వాహిని నం.వి. 1. నది. 2. సేనావిశేషము: 81 రథములు, 81 ఏనుగులు, 243 గుఱ్ఱములు, 405 కాల్బలము గలది.

వాహినీనాళసూపము సం. వి (వృక్ష) వాహినీ పుంజములన్నిటిచే నేర్పడిన స్తంభమునంటి నిర్మాణము.



వాహినీపతి సం. వి. 1. సముద్రుడు 2. సేనాపతి.

వాహినీపుంజము

వాహినీపుంజము సం. వి. (వృక్ష) వాహినీనాళికూర్చము వేరులోనుండి ఆకులలోనికి పోషక ద్రావణములను పంపుటకును ఆకులోనుండి వివిధభాగములకు ఆహారమును పంపుటకును గొట్టములుకల నిర్మాణము (Vascular Bundle).

ఆదిదారువు
అనుదారువు
పథ
అధోవాహికణ సమితి
ఊర్ధ్వకోణ సమితి

వాహ్యాళి సం. వి. 1. స్వారి. 2. విహారము.

వాళి వై. వి. 1. పశువులుపోవు దారి 2. వాడిక క్రమము సం. వాటీ.

## వి

వి సం. విశేషార్థము. వ్యతిరేకార్థమునిచ్చు ఉపసర్గ (విఖ్యాతి, వితంతు మొదలగునవి) సం. వి. పక్షి.

విమ్ ఇం.వి.(Vim) (గృహ.) చేతులు కడుగుకొనుటకు కుళాయి అమర్చిన బేసిను పాత్రలు మొ. వానిని శుభ్రపరచుకొనుటకు నుపయోగించు పొడి.

వింగడము వై. విశే. 1. విస్తీర్ణము 2 సుందరము. 3. తారుమారైనది. సం. వికటః. వ్యంగ్యః.

వింజామరము వి. (వెల్ల + చామరము) తెల్లని చామరము, సురటి.

వింజము వై. వి. వింధ్య పర్వతము. సం. వింధ్యః.

వింటు వి. వినుట.

వింటికోల వి 1. రాళ్ళుపనివాండ్ల యొక్క పని. 2. ధనురాకారమగు పనిముట్టు.

వింటిరాశి మి. వి ధనూరాశి.

వింత వి. అబ్బురము, ఆశ్చర్యము, విశే. 1. చిత్రము. 2. అసదృ. 3. అవ్యక్తము. 4. క్రొత్త.

విందు వి. 1. ఆతిథ్యము చుట్టములులోనగువారికిడు భోజనము 2 చుట్టము, అతిథి.

వింధ్యము సం. వి ఒక పర్వతము.

వింశతి సం. సర్వ. ఇరువది.

వికచము సం. విశే. 1. వికసించినది. 2. వెంట్రుకలులేనిది. సం. వి. కేతువు

వికటము సం. విశే. 1. వికృతమైనది. 2. మిక్కిలి వంకరైనది.

వికత్థనము సం విశే. ఆత్మస్తుతి.

వికర్తనుడు సం వి. సూర్యుడు.

వికర్బనీకరణము సం. వి. (రసా) ఒక యౌగికమందుగల కర్బనమును ఉచిత రాసాయనిక ప్రక్రియలచే తొలగించుట. (Decarbonisation)

వికర్షణ సం. వి (భౌతి.) ఒకదాని కొకటి దూరముగ పోవుట. (Repulsation).

వికలము సం. విశే. విచ్ఛేదము నొందినది.

వికలాంగుడు సం విశే. అంగహీనుడు.

వికల్పము సం వి. 1. భ్రాంతి. 2. మారుదల

వికసనము నం. వి. వికాసము

వికసించు నం. క్రి. వికాసముపొందు, విరియు.

వికస్వరము సం. విశే. వికసించునది, సంపుల్లము.

వికారము నం. వి. 1. మారురూపు. 2. తెవులు

వికారి నం. విశే. వికారముగలది. వి. ముప్పది మూడవ సంవత్సరము.

వికావికలు విశే. చెల్లాచెదరు, పటాపంచలు.

వికాసము నం. వి. తెలివి

వికిరణము నం. వి. (రసా.. భౌతి.) కిరణపుంజము (Radiation) (భౌతి.) ఎట్టి పదార్థము సహాయము లేకయే శూన్యప్రదేశము ద్వారా వేడిగాని వెలుతురుగాని వ్యాపించు విధానము (Radiation)

వికిరము నం. వి 1 ఖండము 2. పక్షి 3 శ్రాద్ధకాలమందు నిమంత్రితులు భుజించిన పిదప విస్తరికి ముందు వేసెడు అన్నాదికము. 4. నూయి

వికిరించు క్రి (భౌతి.) కిరణ ప్రసారముగానించు (Radiate)

వికిరణము నం. వి. వెదచల్లుట.

వికీర్ణతాపము నం. వి (భౌతి.) ఒక వస్తువునుండి పరిసరములకు వెదచల్లబడిన తాపము. (Radiant heat).

వికృతము నం. విశే. వికారము నొందినది. రోత యైనది.

వికృతి నం. వి. 1. ఇరువది నాల్గవ సంవత్సరము 2. వికారము 3. విస్మృతి నం. వి. (భౌతి.) బలప్రయోగము వలన ఒక వస్తువు ఆకారమునందు తేబడిన మార్పు. (Strain) ఒక ప్రతిబలముచే ఒకవస్తువులో గోచరించు విరూపత యొక్క విస్తారము, (Strain). బహిర్బలములు కారణముగ ఒక ఘనపదార్థమునకు సంభవించు వికారరూపము.

వికేంద్రాభిముఖము నం. వి. (భౌతి.) ఒక బిందువునుండి ప్రసరించునది (Divergent)

విక్కవిరియు క్రి (విరియు+విరియు) మిక్కిలి విరియు

విక్కు క్రి. 1 విజృంభించు, 2. గర్వించు

విక్రమ నం. వి పదునాల్గవ సంవత్సరము,

విక్రమము నం. వి. 1. అధిక బలము, 2. శౌర్యము

విక్రముఁడు నం. వి 1. విక్రమార్కరాజు. 2. విష్ణువు

విక్రయము నం. వి. అమ్మకము

విక్రయికుఁడు నం. వి. అమ్మువాడు.

విక్రాంతి నం వి విక్రమము,

విక్రీడితము నం విశే మిక్కిలి ఆడబడినది.

విక్రీతము నం. విశే విక్రయింపబడ్డది

విక్రేతకౌశలము నం వి. (అర్థ.) వస్తువిక్రయములో నేర్పు

విక్లబుఁడు నం. విశే. భయశోకాదులచే కాళ్ళు చేతులు విలవిలపోవువాడు.

విక్షవము నం వి. 1. తుమ్ము 2 దగ్గు.

విక్షేపణము నం. వి (భౌతి.) చెదిరిపోవుట (Dispersion)

విక్షేపము నం వి. ఎగరవేయుట, కదలిక, విసరివేయుట (గణి.) ఒక సరళరేఖయొక్క చివర బిందువునుండి మరియొక సరళరేఖపై గీయబడిన లంబముల మధ్యదూరము (Projection).

విక్షిప్తము నం విశే. విసరివేయబడినది, ఎగురవేయబడినది,

విఖ్యాతి నం. వి. మిక్కిలి ప్రసిద్ధి.

విఖ్యుఁడు నం. విశే. ముక్కుపోయినవాడు. నడ్డిముక్కువాడు.

విగడియ వై. వి గడియలో అరవదవభాగము. 24 సెకనులు నం. వి. ఘటికా.

విగతము నం. విశే. బొత్తిగాపోయినది

విగమము నం. వి. 1. నాశము. 2. విభజనము

విగళనము నం. వి మిక్కిలి జారుట.

విగాహము సం. వి. స్నానము.

విగుర్వించు క్రి.(విఱుచు+విఱుచు)చక్కగా విరుచు.

విగ్రహము సం. వి 1. శరీరము 2. విభాగము. 3 బొమ్మ, మూర్తి 4. యుద్ధము

విఘటనము సం. వి. (రసా.) యౌగికములను ఘటకముల క్రింద విడగొట్టుట. (Decomposition) సంయోగమునకు విరుద్ధము).

విఘాతము సం. వి 1. అడ్డంకి 2. చెరువు 3 పెద్దదెబ్బ

విఘ్నము సం వి అంతరాయము అడ్డు

విఘ్నరాజు సం. వి. వినాయకుడు.

విచక్షణత సం. వి. నేర్పు

విచక్షణుడు సం. వి. విద్వాంసుడు. సం. విశే. నేర్పరి

విచక్షణాధికారములు సం వి. (రాజ.శాస) శాసనరీత్యా అధికారియొక్క విచక్షణా వివేకములకు వదలివేసిన అధికారములు (Discretionary powers)

విచలనము సం. వి. (భౌతి) ఋజుమార్గము తప్పిచరించుట. (నడచుట) కాంతికిరణము గాలిలోనుండి ఏదేని స్ఫటికమును ప్రవేశించినపుడు దాని మార్గముపంపు అగును దానికి'విచలనము' అనిపేరు(Deviation) (గణి) ఒక సిద్ధరాశినుండి దూరముగా పోవుట. (Deviation).

విచారణ సం వి. చర్చ పరిశీలన.

విచారము సం వి. 1. సంతాపము, శోకము, 2. ఆలోచనము.

విచార్యము సం. విశే. విచారింపదగినది.

విచికిత్స సం. వి. సంశయము.

విచిత్రము సం. వి. ఆశ్చర్యము. సం. విశే. చిత్రవర్ణముకలది.

విచూషణ వర్ణమాల సం. వి. (భౌతి.) ఒక కాంతి ప్రభవ స్థానమునుండి కాంతి కిరణములు ఒక ద్రవ్యముద్వారా పంపినపుడు అందలి కొన్ని కాంతికిరణములను ఆ ద్రవ్యము మ్రింగివేసి వానిస్థానమున వర్ణమాలలోవల్లని (చీకటి) చారల నుద్భవింపచేయునది. (Absorption spectrum)

విచ్చేయు క్రి. వచ్చు, విజయముచేయు.

విచ్చలవిడి విశే. యథేచ్ఛము. వి. స్వాతంత్ర్యము.

విచ్చు క్రి. విరియు, విడజేయు.

విచ్చుకత్తి వి. ఒరదూసినకత్తి

విచ్చుటాకు వి చెవ్వాకు ఒక చెవి నగ.

విచ్ఛిత్తి సం. వి. 1. ఎడబాటు. 2. వస్త్ర భూషణాదులు కొలది యైనను ఒప్పిదము గలుగజేయు స్త్రీల శృంగారచేష్ట. 3. పూత. 4 నరుకుడు.

విచ్ఛిన్నఖండములు సం. వి. (వ్యవ.) ఒక ఖండముగాలేక విడివిడిగానున్న భూభాగములు. (Scattered holdings).

విచ్ఛిన్నము సం. విశే. 1. ఎడబడినది, నరుకబడినది. 2. పూయబడినది.

విచ్ఛేదము సం.వి 1. ఎడబాటు 2.నరుకుడు.

విజయ సం.వి. 1. గౌరి. 2 దినము యొక్క ఆరవభాగము. 3 ఇరువదియేడవ సంవత్సరము

విజయదశమి సం.వి. ఆయుధములు పూజించెడు ఆశ్వయుజ శుద్ధదశమి.

విజయుడు సం వి. 1. అర్జునుడు. 2. విష్ణుద్వారపాలకులలో నొకడు.

విజాతి సం వి. 1, వేరుజాతి. 2. విశేషజాతి.

విజాతిపదములు సం. వి. (గణి.) వివిధ జాతులకు చెందిన పదములు. (Unlike terms).

విజాతీయము సం. వి. (రసా.) భిన్నజాతులకు చెందిన ఘటకములుగలది.(Heterogenous).

విజిగీష నం. వి. మిక్కిలి జయింపనిచ్ఛ.
విజగీషువు నం విశే. మిక్కిలి జయింపనిచ్ఛ గలవాడు.
విజృంభణము నం. వి ఎగసిపాటు, ఉద్రేకము చెలరేగుట.
విజృంభితము నం విశే. వికసించినది సంపల్లము.
విజ్ఞప్తి నం.వి విజ్ఞాపన విన్నపము,
విజ్ఞాతుఁడు నం. విశే. ప్రసిద్ధుడు.
విజ్ఞానము నం. వి. శాస్త్రాదుల యందలి విశేషజ్ఞానము.
విజ్ఞాన శాస్త్రము నం. వి. శాస్త్రీయ పద్ధతులతో వస్తుతత్త్వమును గురించి సహేతుకముగా తెలిసికొన్న జ్ఞానరాశి(Science)
విజ్ఞుఁడు నం. వి. 1 సమర్థుడు. 2. మిక్కిలి తెలిసినవాడు.
విజ్ఞు క్రి. వ్యాపించు.
విజ్జోడు విశే. జోడుకానిది, సరికానిది.
విటంకము నం. వి ఇంటి ముంజూరు నందలి గువ్వ గూడు.
విటకత్తె వి. విటుకులాడి. విశే. రంకులాడి
విటకాఁడు నం.వి. విటుడు.
విటతటము విశే. తారుమారు. (రూ విట తాటము).
విటపము నం. వి. 1. చివురించిన కొమ్మ. 2. చిగురు 3. కొమ్మ 4. బోదెలేనిచెట్టు
విటపి సం. వి. చెట్టు వ్యు. విటపములు కలది
విటమిన్ $B_{12}$ ఇం వి. (గృహ.) (Vitamin $B_{12}$) ఒక విధమగు రక్తహీనతను తొలగించు విటమిన్. (ఇది ఉపద్రవకరమైన పాండు రోగమును తొలగించును $B_{12}$ లోపముపలన పాండుఃరోగము కలుగును ఇది కాలేయ కల్కములో నుండును).
విటమినులు ఇం. వి. (గృహ) (Vitamins) ఆరోగ్యమును పొందజేయు ఆహారములు 'ఎ' 'బి' 'సి' 'డి' మొ. విటమినులు.
విటరాయుఁడు వై. వి. విటశ్రేష్ఠుడు.
విటి నం. వి. మూ. విటకత్తె.
విట్చరము నం. వి. ఊరబంది.
విట్టు సం. వి. మలము.
విడంబనము నం. వి. 1. అనుకరించుట. 2. వేడబము, మోసపుచ్చుట.
విడవలి వి బోదకనువు. ఇండ్లను కప్పుగడ్డి.
విడాకులు వి (వ్యావ) భార్యాభర్తల ఎడబాటునకై వ్రాసుకొనిన పత్రము.
విడి వి. 1. ప్రతాపము, పరాక్రమము. 2. కోపము. విశే ఒంటరి.
విడికొట్టపు పద్ధతి వి. (వ్యావ) పశువులను కొట్టములో కట్టకుండ విడిగా వదలి శ్రేష్ఠమగు పశువుల యెరువు తయారు చేయు పద్ధతి (Loose box system)
విడిగోలు వి. మారుపు విశే. పనితెనిది
విడిదల వి. విడియుచోట, నిడిసినచోటు.
విడిది వి పెండ్లికి తరలివచ్చిన పెండ్లివారు విడిసిన చోటు
విడిముడి వి. ధనము. (విడియు + ముడి).
విడియము వై. వి. తాంబూలము. రూ. విడియ, వీడెము, విడ్యము, వీడ్యము. నం. వీటికా.
విడియు క్రి. 1. బాటసారులు దారిలో నొకచోట దిగు. 2. జారు నడలు.
విడిపడు క్రి. తెగనుండి వేరుపడు, నిఃబంధము నూడి తొలగు.
విడు క్రి. వీడు
విడుపరి విశే. పరిత్యాగ శీలుడు, వదాన్యుడు దాత.
విడ్డూరము వై. విశే. మూర్ఖము. వై. వి. 1. మొండితనము, 2. ఇక్కట్టు. 3.వింత (వ్యావ.) సం: విడ్వరమ్.
విడ్వరము నం. వి. ఉపద్రవము.
వితండము నం. వి. ఔననువది కాదని వాదించెడు వాదము. (వితండవాదము).

వితంతువు సం. వి. విధవ. వ్యు. తంతువు (సూత్రము) లేనిది

వితంసము సం. వి. మృగపక్ష్యాదుల బట్టు ఉరిత్రాడు,

వితథము సం. విణ. అసత్యమైనది.

వితరణము సం. వి. ఈవి.

వితరణి సం. వి. [illegible]

వితర్కము సం. వి. ఊహ, తర్కించుట.

వితర్ది సం. వి. వేదిక. అరుగు

వితలము సం. వి. ఒక అధోలోకము.

వితాకు వి. 1. వెరవెరపాటు, 2. పారవశ్యము, 3. ఎరాకు

వితానము సం. వి. 1. సమూహము, 2. మేలుకట్టు సం. విణ. చొరవలేనిది.

వితావిత వై. విణ. వృథా వృథా. మిక్కిలి వ్యర్థమైనది.

వితీర్ణము సం. విణ. దాటబడినది.

విత్తనము వి. గింజ

విత్తము సం. వి. ధనము. సం. విణ. 1 విచారింపబడినది 2 తెలియబడినది.

విత్తుల సంస్కారము సం. వి. (వ్యవ. కొన్ని జాతుల విత్తుకు వానిని చల్లి మునుపు చేయవలసిన ప్రత్యేక ప్రక్రియలు (Seed treatment).

విత్తుల స్వచ్ఛత సం. వి. (వ్యవ.) కములో గాని విత్తులు కలిసిలేకుండ ఆరోగ్యమైన విగానుండుట (Purity of seed)

విదగ్ధుఁడు సం. విణ. నేర్పరి. చొరవకాడు,

విదరము సం. వి. చీల్చుట.

విదళితము సం. విణ. విదళనముచేయబడినది

విదారకము సం. వి. చెలమ, పిల్లనూయి సం. విణ. చీల్చునది.

విదారణము సం. వి. చీల్చుట, హింస. (రసా.) పెద్ద చప్పుడుతో ప్రేలుడు (Explosion).

విదారణము సం. వి. (వృక్ష.) కొన్ని వృక్షఫలములు, పుష్పాది విత్తులు పగులు పద్ధతి. (Dehiscence).

విదాహము సం. వి. మిక్కిలి దప్పిక.

విదిక్కు సం. వి. రెండు దిక్కుల నడుమ.

విదితము సం. విణ. తెలియబడినది.

విదియ వై. వి. రెండవతిథి సం. ద్వితీయా.

విదురుఁడు సం. వి. ధృతరాష్ట్రుని తమ్ముడు. విణ. తెలిసినవాడు.

విదురుచు క్రి. విదుల్చు, విదిలించు.

విదుషి సం. వి. విద్వాంసురాలు.

విదూషకుఁడు సం. విణ. పరులను దూరువాడు పరిహాసకుడు. సం. వి. నాయకసఖుడు.

విదేశము సం. వి. ఇతర దేశము.

విదేశాంగనీతి సం. వి. (రాజ., వని) విదేశ వ్యవహారముపట్ల అవలంబించు రాజనీతి. (Diplomacy).

విదేశమారకము మి. వి. (అర్థ.) అంతర్జాతీయ వాణిజ్యము జరుగునపుడు వివిధదేశములు తమతమ ఋణములను తీర్చుకొనుటకు వాడు మారకము. (Foreign exchange)

విదేశీయుఁడు సం. విణ. ఇతర దేశస్థుడు.

విదేశవాణిజ్యప్రతినిధిదత్తక్రయపట్టిక సం. వి. (వాణి.) విదేశములలోనున్న వాణిజ్య ప్రతినిధి సరకుల విలువ, బంగీల సంఖ్య ఉత్పత్తిస్థానము మొదలైన విషయములపై ఇచ్చు క్రమపట్టిక (Consuler invoice).

విద్దె వై. వి. చదువు. విద్దియ సం. విద్యా.

విద్య సం. వి. 1 చదువు. 2. జ్ఞానము.

విద్యార్థి సం. వి. చదువు కోరువాడు.

విద్యమానము సం. విణ. వర్తమానము.

విద్యుచ్ఛక్తి సం. వి. (భౌతి.) ఘర్షణశక్తి, రాసాయనికశక్తి మొదలగు వానినుండి లభించు ఒకవిధమైనశక్తి (Electricity).

విద్యుచ్ఛక్తి కుంపటి మి. వి. (గృహ., భౌతి) విద్యుచ్ఛక్తితో వంటచేయుట కుపయోగించు పరికరము.

విద్యుత్తు నం. వి. మెరపు.
విద్యుత్పేటిక నం. వి. (భౌతి) విద్యుద్ఘట ముల వరుస.
విద్యుత్సంచయమానకము నం. వి (భౌతి.) పరిపథముద్వారా ప్రవహించిన విద్యుచ్ఛక్తిని కొలచు పరికరము (Voltametre).
విద్యుత్ స్ఫులింగము. విద్యుల్లత నం వి (భౌతి) విద్యుత్ ధ్రువములను రెండింటిని దగ్గరగా తీసికొని వచ్చినప్పుడు ఏర్పడు మెరపు (Electric spark).
విద్యుదగ్రము నం. వి (భౌతి) విద్యు ద్వాహకాగ్రము (Electrode).
విద్యుదయస్కాంతము నం. వి (భౌతి) విద్యుత్ప్రభావమువలన ప్రేరితమైన అయస్కాంత గుణము కలిగిన ఇనుము లేదా ఉక్కు దంతము (Electric magnet).


విద్యుదయస్కాంతము

విద్యుదయస్కాంతత్వము నం. వి. (భౌతి) విద్యుదయస్కాంతము యొక్క భావము. (విద్యుదయస్కాంతముగా నుండుట)
విద్యుదయస్కాంతికక్షేత్రము నం. వి (భౌతి.) విద్యుదయస్కాంతిక బలప్రభావమును ప్రదర్శించుచోటు (Electro magnetic field.)
విద్యుదుత్సర్గనాళము నం. వి. (భౌతి) శూన్యములో విద్యుదుత్సర్గము జనింపజేయు నాళము. (Dishcharge tube).
విద్యుదుత్సర్గము నం. వి. (భౌతి) విద్యుత్తు ఒక స్థానమునుండి బయటకు ఉద్గమించుట లేదా ప్రవహించుట (Electrical discharge).
విద్యుదుపకరణము నం వి. (గృహ., భౌతి.) విద్యుత్ప్రవాహముతో పనిచేయు పనిముట్లు. (Electric appliances).
విద్యుద్ఘటము నం వి. (భౌతి) రసాయనాభిక్రియవలన విద్యుచ్ఛక్తినుత్పత్తిచేయు ఒక పాత్ర. (Cell).
విద్యుద్దర్శకము నం. వి. (భౌతి) విద్యుదావేశమును గుర్తించుటకుపయోగించు సాధనము (Electroscope)
విద్యుద్బంధకము నం వి. (భౌతి.) విద్యుత్ప్రవాహనిరోధక పదార్థము. విద్యుత్ స్థాపకము (Insulator).
విద్యుద్వాహకము నం వి (భౌతి) విద్యుత్ప్రవాహకము. (Conductor)
విద్యుద్విచ్ఛేదనము నం. వి (భౌతి రసా) ఒక విద్యుద్విశేష ద్రవ్యము (లవణము, ఆమ్లము, క్షారము) నీటిలో కరిగి అయనులుగా విడిపడుట
విద్యుద్విభజనము నం. వి (భౌతి.) విద్యుచ్ఛక్తివలన లవణద్రావణములు పొందు రాసాయనిక మార్పు. (Electrolysis).
విద్యుద్విశ్లేష్యము నం విశే (భౌతి .రసా) లవణములు, క్షారములు, ఆమ్లములలో విద్యుత్ప్రవాహమును విద్యుదగ్రములకు కొనిపోగల ద్రవ్యవిశేషము. తనద్వారా విద్యుత్తు ప్రవహించునపుడు రెండు విద్యుదావిష్ట భాగములుగ వేరువేరుగా చలించునట్లు విడదీయబడు ద్రవ్యము (Electrolytic).
విద్రధి నం వి. కడుపులోని బల్ల.
విద్రవము నం. వి. యుద్ధభూమి నుండి పారుట. రూ. విద్రావము.
విద్రావితుఁడు నం. విశే, యుద్ధభూమి నుండి పారినవాడు.
విద్రావ్యము నం. విశే (భౌతి. రసా) ఒక ద్రావణములో కరగుటకు సమర్థమగునది (Soluble).
విద్రుతము నం. విశే.-కరగబడినది.
విద్రుమము నం. వి. పగడము, పగడపుచెట్టు

విద్వాంసుఁడు నం. వి. చదువరి, విశే. ఎరుకగలవాడు

విద్విషుఁడు నం వి శత్రువు.

విద్వేషణము నం, వి. విరోధము.

విధము నం. వి. ప్రకారము, విధి.

విధవ నం, వి పెనిమిటిలేనిది, అనాథ.

విధాత నం వి. 1, బ్రహ్మ. 2. మన్మథుడు.

విధానపరిషత్తు నం. వి. (శాస.,రాజ.) రాష్ట్ర ద్విసదనపు విధానమండలిలోని ఎగువ సభ.

విధానము నం. వి. 1. చేయుట. 2. ఆజ్ఞ

విధానసభ నం. వి (శాస., రాజ.) రాష్ట్ర ప్రతినిధి సభ, రాష్ట్ర ద్విసదనపు విధాన మండలిలోని దిగువ సభ.

విధి నం. వి. 1. విధాత. 2. కాలము. 3. చేయుట. 4. భాగ్యము,

విధుంతుదుఁడు నం. వి. రాహుగ్రహము,

విధుతము నం. విశే. కదలింపబడినది. రూ, విధూతము.

విధురము నం. వి. ఎడబాటు, విరహము, వైకల్యము.

విధురుఁడు నం. వి. భార్యా వియోగమైన వాడు.

విధులు నం. వి. ( పౌర., రాజ. ) పౌరుడు రాజ్యమువట్ల తానున్న సమాజమువట్ల నెరవేర్చవలసిన బాధ్యతలు.

విధువనము నం, వి. కదలించుట.

విధువు నం. వి. 1, చంద్రుడు. 2. విష్ణువు. 3 బ్రహ్మ. 4. శివుడు.

విధూతము నం, విశే. విడవబడినది.

విధూననము నం. వి. 1. రాల్చుట, దులుపుట. 2. తీసివేయుట.

విధేయుఁడు నం.విశే. వినయము గలవాడు,

విద్ధము నం, విశే. తొలగింపబడినది, త్రోయబడినది.

విధ్వంసకచర్య నం. వి, (నాశనము చేయువని) సమ్మెకాలమున కార్మికులు ద్వేషముచే యజమానుని ఆస్తిని నష్టపరుచుట. ప్రభుత్వము నెడల ద్వేషముచే ప్రభుత్వ కర్మాగారములను రక్షణకొరకైన సిబ్బందులను నాశనము చేయుట. శత్రువుల ప్రేరేపణచే దేశము యొక్క రక్షణ వ్యవస్థను నాశనము చేయుట. దేశ ద్రోహ చర్య. (Sabotage).

విధ్వంసనము నం. వి. మిక్కిలి ధ్వంసము.

వినత నం. వి గరుత్మంతుని తల్లి.

వినతము నం విశే వంగినది.

వినతి నం. వి నమస్కారము.

వినమ్రము నం. విశే మిక్కిలి వంగినది. నం. వి. తగరము (వినమితము).

వినయము నం.వి, 1. అడకువ, 2. గురుశిక్ష.

వినాయకుఁడు నం. వి. 1. విఘ్నేశ్వరుడు. 2. బుద్ధుడు. 3. గురువు.

వినాశము నం. వి. చేటు.

వినికి వి వినుట, రూ, వినుకలి.

వినిమయము నం. వి వస్తువుల మారుపు. విరాయింపు, మారకము.

వినియుక్తము నం. విశే, (భౌతి.,గణి.,రసా.) వినియోగించబడినది. (ఏ శాస్త్ర జ్ఞానమైనను, ఒకవస్తువు నిర్మాణమందు ఉపయోగమునకు తేబడినచో దానిని వినియుక్త జ్ఞానమందురు). (Applied).

వినియుక్త రసాయన శాస్త్రము నం. వి. (రసా.) పారిశ్రామిక ద్రవ్యముల నిర్మాణమునకు వినియోగింపబడు రసాయన శాస్త్రజ్ఞానము. (Applied Chemistry).

వినియుక్త శాస్త్రము నం. వి. (రసా., భౌతి.) దాని ప్రయోజనమునకేకాక ఇంకొక ప్రయోజనమునకై వినియోగింపబడు శాస్త్రము. (Applied Science).

వినియోక్త నం. వి. ఉపయోగించువాడు, వాడుకొనువాడు, కొనుగోలుదారు (Consumer).

వినియోగదారులు సం. వి. వస్తువులను ఉపయోగించువారు. (Consumers).
వినియోగము సం. వి. ఉపయోగము. (అర్థ.) అనుభోగము.
వినియోజకుఁడు సం. వి. అనుభోక్త, ఉపయోగించువాడు. (Consumer).
వినియోజకుల సహకార సంఘము సం. వి. (అర్థ.) అనుభోక్త సహకార సంఘము అనుభోక్తలు సరసమైన ధరలకు వస్తువులు లభించుటకై ఏర్పాటు చేసికొన్న సహకార సంఘము (Consumers' Co-operative society).
వినీతుఁడు సం. వి. 1. జితేంద్రియుఁడు. 2. గురువుచేత శిక్షింపబడినవాడు. 3. విధేయుడు. వి వర్తకుడు.
విను క్రి. ఆకర్ణించు. వి. ఆకాశము. రూ. విన్ను.
వినుకెంపు వి. సూర్యుడు. వ్యు. విన్నునకు కెంపువంటివాడు, ద్యుమణి.
వినుచూలి వి. వాయువు.
వినుప్రోలు వి. స్వర్గము.
వినువాఁక వి. గంగ.
వినోదక్రీడ సం. వి (గృహ.) మనోరంజనమును కలుగజేయు సాధనము. (Recreation).
వినోదము సం. వి. విలాసము, క్రీడాదుల చేత ప్రొద్దు పుచ్చుట.
విన్నఁబడు వై. వి వెలవెలబారు.
విన్నఁబాటు వై. వి. వైవర్ణ్యము.
విన్నన వై. వి. వైవర్ణ్యము, న్యూనత. సం. ఖిన్నమ్.
విన్ననువు వై. వి. నేర్పు, సాధనము. సం. విజ్ఞానమ్.
విన్నము సం. విశ. తెలియబడినది, పొందబడినది.
విన్నాణము వై. వి. నేర్పు. అప్పిదము. సం. విజ్ఞానమ్.
విన్నాణి వై. వి. సన్యాసి. సం. విజ్ఞానీ.
విన్యస్తము సం. విశ. ఉంచబడినది.
విన్యాసము సం. వి. ఉంచుట. రచనము. సం. వి. (రసా.) వస్తువులను ఒక క్రమము ననుసరించి అమర్చుట (Arrangement).
విపంచి సం. వి. వీణ: (విపంచిక).
విపణము సం. వి. విక్రయము.
విపణి సం. వి. అంగడి, అంగడి సరకు, వర్తకుడు.
విపథనము సం. వి. మనము చూచుదిక్కు నుండి సాధారణస్థితి తప్పియుండుట. చూచువానిగతి వేగమునుబట్టి వస్తువుగతి దిశయందగపడు మార్పు భూమి కాంతి వేగముల నిష్పత్తి పరిమితమగు, కారణమువలన ఒకనక్షత్రము యొక్క స్థానము నందున్నట్లు అగపడుస్థానచ్యుతి (Aberration).
విపత్తు సం. వి. ఆపద.
విపర్యయము సం.వి. 1. మార్పు. 2 భ్రాంతి. సం. వి. (గణి.) ఒక దానికి విరుద్ధమైనది. (Converse). ఒకసిద్ధాంతములోని దత్తాంశము ఉపపాద్యముగాను ఉపపాద్యము దత్తాంశముగను గల మరియొక సిద్ధాంతము.
విపర్యస్తము సం. విశ. తారుమారైనది, వ్యత్యస్తమైనది.
విపర్యాసము సం. వి. (భౌతి.) తలక్రిందగుట. (Inversion). ఉదా. విపర్యాసిత బింబము (Ieverted image.)
విపశ్చిత్తుఁడు సం. వి. విద్వాంసుడు.
విపాకము సం. వి. పరిపాకము. విశ. పాకము చెడినది. (రసా) చక్కెర అసంపూర్ణముగా ఆమ్లజనీకరణము చెందినపుడు సారాయము, బొగ్గుపులుసుగాలి ఏర్పడుట. (Fermentation).

విపినము సం. వి. అడవి.
విపుల సం వి. భూమి.
విపులము సం విశ. విస్తారమైనది.
విప్పారు క్రి. విరివిచెందు, వికసించు.
విప్పు వి 1. వికసనము. 2. వైశాల్యము. 3. బాహుళ్యము క్రి విడుచు ఇం. (రాజ.) శాసనసభలో ఒక రాజకీయపక్ష ప్రబోధకుడు, ప్రేరేపకుడు. (Whip).
విప్రకర్షము సం వి దూరము, దవ్వు
విప్రకారము సం.వి.తిరస్కారము, హేళనము
విప్రకృతుఁడు సం. విశ. తిరస్కరింపబడినవాడు.
విప్రకృష్టము సం. విశ, దూరము, దవ్వు.
విప్రతిపత్తి సం. వి. 1. కలత, సంతాపము. 2 విరోధము.
విప్రయాణము సం. వి. పలాయనము.
విప్రయోగము సం. వి. స్త్రీ పురుషుల ఎడబాటు.
విప్రలంభము సం.వి. 1. విరహము, 2. మిక్కిలి వంచనము.
విప్రలబ్ధ సం. విశ. వంచింపబడినది. (అలం) సంకేత స్థలమున ప్రియునిగానక మోసపోయి వ్యాకులత చెందు నాయిక.
విప్రలాపము సం వి. అసంబద్ధమగు వచనము
విప్రవినోది సం. వి. వినోదవృత్తిచే జీవించు బ్రాహ్మణులలో నొకతెగ.
విప్రుఁడు సం. వి. బ్రాహ్మణుడు, హారుడు.
విప్లవకారులు సం వి. (వ్యావ.) విప్లవము లేపినవారు.
విప్లవము సం వి. (వ్యావ.,చరి.,రాజ.,అర్థ) తీవ్రపరివర్తనము, రాజ్యాక్రాంతి సం. వి. కొల్లమొదలగుదేశోపద్రవము విపత్తు
విబుధుఁడు సం. వి. విద్వాంసుడు.
విబూది వై. వి. విభూతి, భస్మము. సం విభూతి.
**విభక్తము సం. విశ వేరుచేయబడినది.**
విభక్తఫల దళము సం (వృక్ష.) విడివిడిగానున్న ఫలదళములుగలది.(Apocarpous)
విభక్తాండకోశము సం. (వృక్ష.) విభక్తఫల దళములతో నేర్పడినఅండకోశము (Apocarpous Pistil).
విభక్తాండాశయము సం (వృక్ష) విభక్త ఫలదళములు గల అండాశయము (Apocarpous Ovary)


విభక్తాండాశయము

విభక్తి సం వి (వ్యాక) శబ్దముల పరస్పర సంబంధమును దెలియజేయునది.
విభజనము సం వి. వేరుచేయుట,
విభవ సం. వి. రెండవ తెలుగు సంవత్సరము
విభవము సం.వి సంపద, ఐశ్వర్యము.
విభాకరుఁడు సం. వి. 1. సూర్యుడు. 2. అగ్ని.
విభాగపత్రము సం. వి. పాటాలజాబితా
విభాగము సం. వి. పాలు, భాగము
విభాజకము సం. విశ. విభజించునది సం. వి. (గణి) భాగించునది (Divisor).
విభాజనగుణకము సం. వి (రసా) సంపర్కములోనున్న రెండుకలిసిపోని ద్రావములయందుగల ద్రావ్యసాంద్రతల నిష్పత్తి. (Partition coefficient).
విభాజనము సం. వి. (రసా) రెండు కలిసిపోనట్టియు ఒకదానితో నొకటి సంపర్కములోనున్నట్టియు ద్రవములకు మధ్య ఒకద్రావ్యముయొక్క రాశి పంచబడుట. (Partition).
విభాజితము సం. విశ. వేరుచేయబడినది సం. విశ. (గణి.) భాగింపగావచ్చినది.
విభాజ్యకణములు సం. వి. (వృక్ష) విభజన చెందుశక్తిగల జీవకణములు (Meristematic cells).
**విభాజ్యము సం. విశ. భాగింపదగినది.**

**విభాజ్యము** నం. వి. (గణి.) భాగించబడెడు రాశి.

**విభాతము** నం. వి. ప్రభాతము, వేకువ.

**విభావము** నం. వి. 1. పరిచయము, 2. (అలం.) రసోత్పాదనకారణము.

**విభావరి** నం. వి. 1. రాత్రి. 2. కుంటెనకత్తె. 2. పసుపు.

**విభావసుఁడు** నం. వి. 1. సూర్యుడు. 2. అగ్ని

**విభాష** నం. వి. (వ్యాక.) వికల్ప విధి. సంధి ప్రవర్తించుట, ప్రవర్తింపకుండుట. ఉదా. పూచెంగలువలు, పూచెగలువలు పూచెన్గలువలు.

**విభీషణము** నం. విశే. మిక్కిలి భయంకరమైనది.

**విభుఁడు** నం. వి. 1. ప్రభువు, సర్వవ్యాపకుడు. 2. బ్రహ్మ. 3. శివుడు.

**విభూతి** నం. వి. తిర్యక్పుండ్రధారులు ధరించెడి భస్మము. 2. ఒక ఐశ్వర్యము.

**విభేదములు** నం. వి. (జీవ) ఒకే జాతికి చెందిన ప్రాణులలో నిర్మాణమునందును శరీర వ్యాపారములయందును గల భేదములు (Variations).

**విభ్రమము** నం. వి. 1. నివ్వెరపాటు, భ్రాంతి 2. శృంగారచేష్ట.

**విమందనము** నం. వి. (భౌతి.) మందగిల్లునట్లు చేయు, వేగము తగ్గించు (త్వరణమునకు విరుద్ధము.) (Retarding).

**విమందితవేగము** నం. వి. (భౌతి.) తగ్గించబడిన ప్రవేగము. (Retarded velocity)

**విమతుఁడు** నం. వి. శత్రువు. విశే. విరుద్ధమతము గలవాడు.

**విమర్శనము** నం. వి. విచారణ.

**విమలము** నం. విశే. నిర్మలమైనది.

**విమాత** నం. వి. సవతితల్లి.

**విమానము** నం. వి. వ్యోమయానము. వ్యు. 1. ఆకసమున సంచరించునది. 2. చక్రవర్తి సౌధము 3. ఓడ, గర్భగుడిపై గల గోపురము. (భౌతి.) గాలిలో ప్రయాణించు ఓడ. (Air-craft, Aeroplane)



విమానము

**విమానవాహకము** నం. వి. (భౌతి.) విమానములు దిగుటకు ఎగిరిపోవుటకు అనువైన ప్రదేశముకలిగినఓడ (Air-craft carrier)

**విముఖత్వము** నం. వి. వైముఖ్యము.

**విమేదాభములు** నం. వి. (రసా.) క్రొవ్వు వంటి సేంద్రియపదార్థములు (ఇవి నీటిలో కరగవు) (Lipoids).

**విమోచనము** నం. వి. మిక్కిలి విడుపు. ఉద్వాసనము.

**విమోటనము** నం. వి. (భౌతి.) ఒక తీగను గాని కొంచెము నులిపినపుడు అది మరల తొంటిస్థితిని తీసికొనుట కుపయోగించు బలము, (Torsion).

**విమోహము** నం. వి. వలపు.

**వియచ్చరుఁడు** నం. వి. ఖేచరుడు. వ్యు. ఆకసమున సంచరించువాడు.

**వియత్తలము** నం. వి. (రాజ.) అంతర్జాతీయ శాంతిభద్రతలు ప్రత్యేగదేశరక్షణ, శాంతి భద్రతలు, దృష్టియందుంచుకొని ఏర్పరచిన అంతరిక్ష విమాన మార్గములు నం. వి. నభస్థలము.

**వియమము** నం. వి. 1. హింసాదులను విసర్జించుట. 2. దుఃఖము.

**వియోజనము** నం. వి. (భౌతి.. గణి.) వేరు చేయుట. (సంయోజనమునకు విరుద్ధము). ఉదా. ఒక ఫలితబలమును రెండు ఘటకబలములుగా వేరుచేయుట. (Resolution)

వియ్యంకుఁడు వై. వి. వియ్యము పొందిన వాడు.

వియ్యము వై. వి. వైవాహిక సంబంధము. సం. వివాహః.

విరంజన చూర్ణము సం. వి. (గృహ.) రంగును విడదీయు పొడి, బట్టను తెలుపు చేయుట కుపయోగించు పొడి సం. వి. (రసా.) రంగును తొలగించుట కుపయోగ పడు క్లోరిన్ మిశ్రితమైన సున్నము (Bleaching powder)

విరంజనపు నీరు మి. వి (గృహ.) తెల్ల బట్టలమీద మరకలు తీయుటకు ఉపయోగింపదగినది. (Javelle water).

విరంజనము సం. వి. (గృహ.) బట్టలను తెలుపుచేయుట. సం వి (రసా) రంగును లేకుండచేయుట. (Bleaching).

విరక్తి సం. వి. విరాగము, వైరాగ్యము.

విరచితము సం. విశే. విశేషముగ రచింప బడినది.

విరజ సం. వి. వైకుంఠమందలి నది.

విరజాజి వి నవమల్లికా కుసుమము

విరతము సం. విశే. 1. వెలుగు లేనిది. 2 మిక్కిలి విరతి బొందినది. ఉడిగినది, మర లినది.

విరతి సం. వి. విరామము, యతిస్థానము,

విరవిరవోవు క్రి. విలవిలపోవు, విహ్వలించు

విరసము సం. విశే. రసములేనిది, విరుద్ధ రసము గలది.

విరసోక్తి సం. వి. పరుషోక్తి.

విరహము సం. వి విరాళి.

విరహి సం. వి. విరహముగలవాడు.

విరహిణి సం వి, విరహముగల స్త్రీ,

విరహోత్కంఠిత సం. వి. (అలం) వేళకు నాయకుడు రాకుండుటచే విరహముచే తహతహపడు నాయిక.

విరళము సం. విశే. ఎడమైనది.

విరళ వాయువులు సం వి. (రసా.) వాతావరణములో మిక్కిలి అరుదుగా దొరకు ఆర్గాన్, క్రిప్టానీవంటి వాయువులు. (Rare gases)

విరళీకరణము సం వి. (భౌతి) ఏదైన వస్తువు వేగముగా చలించునప్పుడు దానికి వెనుకనున్న వాయువు పలుచబడుట. (Rarefaction).

విరాజమానము సం. విశే, మిక్కిలి ప్రకాశించుచున్నది.

విరాట్టు సం వి. 1. ఆదిదేవుడు 2. క్షత్రియుడు. 3. గరుత్మంతుడు.

విరామ బిందువు సం వి (భౌతి) ఏ బిందువు వద్ద ఒక స్పందించు వస్తువు చలనరహితముగా నుండునో అట్టిబిందువు (Resting point)

విరామము సం. వి. 1. విశ్రాంతి, 2. యతి స్థానము.

విరావము సం. వి. మ్రోత.

విరాళము వై. వి. వలపు. వి. ఒక విధమైన పన్ను. చందా.

విరాళి వై. వి. భక్తి, వలపు. సం. విరహః. విరాలః.

విరి వి. పువ్వు.

విరించి సం వి. బ్రహ్మ.

విరిఁబోఁడి వి. పుష్పమువలె మనోజ్ఞమైన స్త్రీ

విరియఁబాఱు క్రి. 1. వికసించు. 2. పగులు.

విరుద్ధము సం. విశే, విరోధము గలది,

విరూపణము సం. వి. (భౌతి.) సమాంతర సమతలములు సమాంతరముగనే మిగిలి యుండునట్లు ఒక వస్తువులో కలిగిన వికారము (Shear).

విరూపాక్షుఁడు సం. వి. శివుడు.

విరూపితము సం. విశే. (భౌతి,) రూపము వికారముగాచేయబడినది.

విరేచనము సం వి. భేది, పాసనము.

విరేచనములవ్యాధి నం. వి. (గృహ) అతిసారము (Diarrhoea)
విరోచనుఁడు నం. వి. ప్రహ్లాదుని కొడుకు
విరోధచర్య నం. వి. (రాజ) యుద్ధము ప్రకటించుటకు తగినంత కారణముగా నెంచదగినచర్య
విరోధము నం. వి. పగ, ఎడబాటు.
విరోధి నం. వి. 1. పగవాడు 2. ఇరువది మూడవ సంవత్సరము
విరోధికృత్తు నం.వి. నలువదియైదవ సంవత్సరము.
విరోహము నం. వి. (వృక్ష.) భూమిలో నుండు భూస్తారి. (stolon)


విరోహము

విరివి వి విస్తృతి విశే. విస్తృతము, వెడల్పైనది.
విఱుగు క్రి. 1. తునియు, 2. పాకముచెడు. 3. వెనుదీయు
విఱుగుడు వి. విరిగిన వస్తువు, విశే. విరుపైనది.
విఱ్ఱవీఁగు క్రి. మిక్కిలి నిక్కు.
విలంబనము నం. వి. జోగు, వ్రేలుట.
విలంబశూకి నం. వి. (వృక్ష.) క్రిందికి వ్రేలాడుచుండు శూకి పుష్పమంజరి (Catkin)


విలంబశూకి

విలక్షణము నం. వి. కారణము లేని యునికి. విశే. విశేషమైన లక్షణము గలది
విలక్షుఁడు నం. విశే. 1. సిగ్గరి 2. ఆశ్చర్యపడినవాడు.
విలగ్నము నం. వి. సన్ననినడుము. విశే. చక్కగా తగిలినది.
విలపించు నం. క్రి. అడలు. అంగలార్చు.
విలయము నం. వి. ప్రళయము.
విలసనము నం. వి. 1. ప్రకాశము 2 క్రీడ
విలాతి వి. 1. దేశము. 2. పరదేశము. హిం. విలాయత్.
విలాపము నం. వి. దుఃఖముతోడి మాట.
విలాసము నం వి. ఒయ్యారము, సొగసు. 3. జాబుమీదవ్రాయు చిరునామా.
విలాసిని నం. వి. 1. విలాసవతియైన స్త్రీ. 2. వేశ్య.
విలియవేయు క్రి. సరిచూచు. దూ. విలియావేయు.
విలియా వి (వ్యావ) రుజు,
విలీనద్రావణము నం వి. (రసా) ద్రావ్యము చాల తక్కువగా నున్న ద్రావణము. (Weak solution, diluted solution)
విలీనము నం. విశే. 1. కరిగినది. 2. నశించినది, 3. దాగినది.
విలుచు క్రి వెలయిచ్చి కొను.
విలువ వి (గృహ. అర్థ.) వెల, మూల్యము. (Value)
విలేపనము నం. వి చందనాదుల పూత.
విలేపని నం. వి (రసా.) బల్లపరుపుగనుండు గరిటె (ఋగ్వేదములో ఈ అర్థమునిచ్చుపదము) 'అభ్రి' (Spatula)
విలోకనము నం. వి. చూపు.
విలోడనము నం. వి (రసా.) కదల్చుట, (Stirring)
విలోమచలత్వము నం వి (గణి.) రెండు రాసులు తమ గుణన ఫలము అచలమగునట్లు మారుచుండుట. (Indirect Variation or Inverse Variation).
విలోమనిష్పత్తి నం. వి. (గణి.) ఒక నిష్పత్తిలోని పూర్వాపర పదములను తారుమారు చేయగా నేర్పడు నిష్పత్తి వ్యుత్క్రమ సంఖ్యల నిష్పత్తి $\frac{a}{b}$ అనులోమ నిష్పత్తియైన $\frac{1}{a}$ $\frac{1}{b}$ విలోమ నిష్పత్తి యగును, (Inverse Ratio)

విలోమము నం. విశే. అవరోహణ క్రమము గలది. వి 1. పాము 2. కుక్క.
విలోమానుపాతము నం. వి. (గణి.) ఒక పెరుగుచున్న రాశిపై నాధారపడిన ఇంకొకరాశి తగ్గుచు వచ్చిన యెడలగాని, లేదా అటునుండి ఇటుగాని ఆ రెండు రాసుల మధ్యగలిగిన అనుపాతము విలోమానుపాతము.ఒక వాయువు కొక్క అయతనము దానిపైని ఒత్తిడి హెచ్చు కొలది తగుచుండును. అందుచే వాయువు యొక్క అయతనము ఒత్తిడి విలోమాను పాతములో నున్నవని వ్యవహారము.వ్యతి రేకముగా మారు రెండు రాసుల సంబంధము (Inverse proportion).
విల్లు వి ధనుస్సు.
వివక్ష నం వి. చెప్పవలెనను కోరిక.
వివరణము నం.వి. వివరము. వ్యాఖ్యానము
వివరము నం. వి. రంధ్రము.
వివరసూచి నం. వి. (గృహ.) వివరముల పట్టి, వివరములను చూపునది.(Calender)
వివరించు వై. క్రి. వక్కాణించు.
వివర్ణనము నం. వి. (గృహ.) 1. తెలుపు చేయుట. 2. రంగు పోగొట్టుట. (Bleaching).
వివర్ణుఁడు నం. విశే. 1. అధముఁడు. 2. వెల్లబారినవాఁడు.
వివర్తనము నం. వి. (భౌతి) మార్గము వక్రమగుట, వక్రీభవనము. కాంతి కిరణములు ఒక యానకము నుండి ఇంకొక దానిలోనికి ప్రవేశించునపుడు వానికి సంభవించు వంపు (Diffraction).
వివశుఁడు నం. విశే వశము తప్పినవాఁడు
వివస్వంతుఁడు నం వి. సూర్యుఁడు.
వివాహము నం. వి. పెండ్లి. (బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము అని వివాహములు అష్ట విధములు).
వివాహోచ్ఛేదము నం. వి. (గృహ) విడాకులు, వివాహము రద్దుచేయుట కోర్టు – ద్వారా వివాహమును, రద్దుచేయుట (Divorce)
వివిక్తము నం విశే ఏకాంతము రహస్యము.
వివిధవస్తు భండారము నం. వి. (వాణి) గుండుసూది మొదలు ఏనుగు వరకు వస్తువులు ఒకేచోట లభించు పణ్యశాలలు (Emporia).
వివృతబీజకము నం. వి (వృక్ష) నగ్న బీజకము, గింజపై రక్షణ నిచ్చు పొరలేని మొక్క. (Gymnosperm).
వివృతము నం. విశే. తెరవబడినది
వివేకము నం వి. జ్ఞానము, విచారము.
వివేచకము నం. వి. (గణి.) $b^x$ —bac అను సమాసమును $ax^x + bx + c$ అను సమాసము యొక్క వివేచకము అందురు. ద్విఘాత సమీకరణ మూలముల గుణములను చర్చించుటకు సహాయపడు ఒక సమాసము. (Discriminant).
వివేచనము నం. వి. వివేకించుట, విమర్శించి చూచి మంచి చెడుల నెరుగుట.
వివ్వచ్ఛుఁడు వై వి. అర్జునుడు నం. బీభత్సు.
విశంకటము నం విశే. విరివి గలది.
విశదము నం. వి తెల్లనిది, స్పష్టమైనది.
విశయము నం. వి 1. వాసస్థానము. 2. సంశయము.
విశరఘాతము నం. వి. చంపుట. బాధించి చంపుట.
విశల్యకరణి నం. వి. విరిగిన ఎముకల నతుకు ఓషధి. (దీనితో చేరనవి. సంధానకరణి, సౌవర్ణ్యకరణి. సంజీవకరణి.)
విశసనము నం. వి. 1. చంపుట. 2. కత్తి

**విశసించు** సం. క్రి సంహరించు.

**విశాఖము** సం. వి. విలుకాడు రెండు పాదముల నడుమ జేనెడెడముగ నిలుచుట. విశే. శాఖలు లేనిది

**విశాఖుఁడు** సం వి షణ్ముఖుడు.

**విశారదుఁడు** సం. విశే. విద్వాంసుడు నేర్పరి.

**విశాలము** సం. విశే. విరివియైనది.

**విశాలసముద్రశాఖ** సం. వి. (భూగో.) ఒక పెద్ద ప్రవాహముగ నది సముద్రములో పడు స్థలము (Estuary).

**విశాలాక్షి** సం. వి హైమవతి, పార్వతి.

**విశిఖ** సం. వి. 1. రాజ మార్గము 2. పార

**విశిఖము** సం. వి. బాణము.

**విశిష్టగురుత్వము** సం. వి (భౌతి.) ఒకవస్తువు యొక్క ద్రవ్యరాశికి అదే ఘనపరిమాణము గల నీటి ద్రవ్యరాశికి గల నిష్పత్తి. సమాయతము గల నీటికంటె లేదా మరి యేదియైనను ప్రమాణముగ తీసికొనిన ద్రవ్యము కంటె సమ ప్రేష తాపక్రమ పరిస్థితులలో ఒక వస్తువు భారము ఎన్నిరెట్లు ఎక్కువ ఉండునో తెలుపు సంఖ్య. (Specific gravity)

**విశిష్టము** సం. విశే. 1. కూడుకొన్నది. 2. మిక్కిలి విశిష్టమైనది.

**విశిష్టాధికారము** సం. వి. (శాస.) ప్రత్యేకాధికారము, రాజునకు రాష్ట్రపతికి, రాజ్యపాలురకు, సంవిధానము ప్రకారము ఉండు అసామాన్యాధికారములు (Prerogatives)

**విశిష్టోష్ణత** సం. వి. (భౌతి) తాపోగ్రత $1^{0}$c హెచ్చుటకవసరమగు ఉష్ణరాశికిని ఒక గ్రాము నీటి తాపోగ్రత $1^{0}$c హెచ్చించుటకవసరమగు ఉష్ణతా రాశికిని గల నిష్పత్తి (Spcific heat).

**విశీర్ణము** సం. విశే. 1. వదలినది. 2. కృశించినది.

**విశుఁడు** సం వి. 1. వైశ్యుడు 2. మనుష్యుడు.

**విశృంఖలము** సం. విశే అడ్డులేనిది.

**విశేషకము** సం. వి నొసటి బొట్టు. విశే. విశేషింపజేయునది.

**విశేషణము** సం. వి. (వ్యాక) గుణవాచక శబ్దము.

**విశేషము** సం వి 1. అతిశయము 2 హెచ్చు 3. భేదము.

**విశేష్యము** సం. వి. (వ్యాక.) వస్తువాచక పదము కేవలనామము.

**విశ్రమము** సం వి. 1. పద్యవిరామము. 2. ఊరట, విశ్రాంతి.

**విశ్రాణము** సం. వి. ఈవి, దానము

**విశ్రావనము** సం. వి. మిక్కిలి ప్రసిద్ధి.

**విశ్రుతి** సం. వి. 1. ప్రసిద్ధి, 2 ప్రవాహము

**విశ్రుతుఁడు** సం. విశే. వాసికెక్కినవాడు.

**విశ్లేషణక్రియ** సం. వి (జీవ.) అపచయ క్రియ ఉదా శ్వాసక్రియ (Katabolism-analysis)

**విశ్లేషణజ్యామితి** సం. వి. (గణి.) ఇదియొక గణితశాస్త్రభాగము ఇందు ఋజురేఖలు, వృత్తములు, దీర్ఘవృత్తములు, వీని జ్యామితీయ ధర్మములు చర్చింపబడును. (Analytical geometry).

**విశ్లేషణము** సం. వి. (గణి) విషయ విభజన పద్ధతి. (Analysis) (రసా) ఖనిజమందు ధాతునిష్పత్తి నిర్ణయము (Assaying) విడదీయుట (Analysis).

**విశ్లేషరసాయనశాస్త్రము** సం. వి. (రసా.) ద్రవ్యఘటకముల విడదీసి గుర్తించు రసాయనశాస్త్రశాఖ (Analytical chemistry).

**విశ్లేషము** సం. వి. ఎడబాటు

**విశ్వ** సం. వి. భూమి.

**విశ్వంభరుఁడు** సం. వి. విష్ణువు.

**విశ్వకర్మ** సం. వి. దేవశిల్పి.

విశ్వకేతువు నం. వి. అనిరుద్ధుడు. వ్యు. పెక్కుధ్వజములు కలవాడు.
విశ్వజనీనము నం. విశే. సర్వజనులకు హితమైనది
విశ్వతోముఖము నం. విశే. అంతట వ్యాపించినది, సర్వతోముఖము
విశ్వనాథుడు నం. వి. కాశీక్షేత్రవాసియగు శంకరుడు
విశ్వము నం. వి. లోకము, విశే. నమస్తము నం.వి. (భౌతి.) [illegible] ప్రపంచము (Universe)
విశ్వసనీయము నం. విశే. విశ్వసింపదగినది
విశ్వసృజుడు సం. వి. బ్రహ్మ.
విశ్వస్త నం వి. విధవ (కేశములుకలది).
విశ్వస్తము నం విశే. విశ్వసింపబడినది
విశ్వాసరాహిత్య తీర్మానము నం.వి, (శాస., వ్యావ మంత్రిమండలి పరిపాలనా విధానమునుగాని లేక ఒక సంస్థయొక్క కార్యనిర్వాహక వర్గమునుగాని తీవ్రముగ విమర్శించుచు వారి సామర్థ్యములో సమ్మకము లేదని శాసన సభ్యులేకాక ఇతర సభ్యులు ప్రవేశపెట్టు తీర్మానము.
విషఘ్నములు నం. వి. (జం.) రక్తములో నుత్పత్తియగు విషసంహారక ద్రవ్యములు (Antitoxins).
విషణ్ణుడు నం.విశే. విషాదమునొందినవాడు.
విషధరము నం. వి పాము. 2. మేఘము, (విషము=నీరు, విషము).
విషపడిశెము వి. (గృహ) శ్వాసనాళమునకు సంబంధించిన అంటుజ్వరములు, జలుబులు. (infléuenza)
విషపుయెరలు వి వి. (వ్యవ.) ఎలుకలుమొ. వానిని చంపుటకు ఉపయోగించు విషము కలిపిన ఆహారములు. (Poisonous baits)
విషమబాహు త్రిభుజము నం. వి. (గణి.) మూడు భుజములు భిన్నదైర్ఘ్యములు (వేర్వేరు కొలతలు) కలిగిన త్రిభుజము, విషమభుజత్రిభుజము(Scaline triang'e)
విషమము నం విశే. సమము కానిది.
విషమవలయము నం. విశే. (రసా.) కర్బనవలయ యౌగికములందు వలయములో ఒకటిగాని ఎక్కువ గాని కర్బన పరమాణు స్థానములు ఇతర పరమాణువులచే నాక్రమింపబడిన వలయములు గలది (Hetro cyclic).
విషమాక్షుడు నం వి శివుడు వ్యు. బేసి కన్నులు కలవాడు.
విషమాహారము నం. వి (గృహ) తగు పాళ్ళలో లేని ఆహారము. అనుచితాహారము, బలము నీయని ఆహారము. (Ill balanced diet)
విషమించు నం.క్రి విరోధించు. వ్యతిరేకించు
విషము నం. వి 1. గరళము 2. జలము.
విషయము నం.వి గ్రంథాదులందు దెలియు నంశము
విషరక్తత నం. వి (గృహ) విషరక్తమును కలిగించుట రక్తములో విషములు చేరియుండిన రోగము (Toxaemia)
విషాణము నం. వి. కొమ్ము, పందికోర
విషాదము నం.వి. ఖేదము, దుఃఖము.
విషువత్తు నం వి. రేయిపగలు సమమైన కాలము
విషువత్తులు నం. వి. (భూగో.) సమరాత్రిందిన కాలములు, మార్చి 21 వ తేదీన, సెప్టెంబరు 23 వ తేదీన మట్ట మధ్యాహ్న సూర్యుడు మన భూమధ్యరేఖకు నడినెత్తిపైనుండుటచే ఆ రెండుపోజులలో భూమికంతకును అహోరాత్రములు సమానముగా నుండుట (Equinox).
విషూచి నం. వి. (గృహ) వమన విరేచన వ్యాధి (కలరా).

విష్కంభము సం. వి 1. అడ్డంకి, 2. గ్రహయోగము 3. గొళ్ళెము. (అలం) నాటకాంగము

విష్కిరము సం.వి.1.పక్షి. 2.కోడి, 3.నెమలి

విష్టపము సం. వి. లోకము.

విష్టరము సం. వి. 1, ఆసనము. 2 మ్రాను, 3. దర్భ పిడికిలి.

విష్టరశ్రవుఁడు సం. వి విష్ణువు వ్యు. దర్భ పిడికిళ్ళవంటి చెవులు గలవాఁడు.

విష్టి సం. వి. (వరి.) బేగారి, ప్రతిఫలమివ్వకుండ బలవంతముగా పనిచేయించుకొనుట సం వి. కూలి, వెట్టి.

విష్ఠ సం. వి. మలము.

విష్ణుపదము సం. వి ఆకసము, పాలకడలి

విష్ణుపది సం. వి. గంగ. వ్యు. విష్ణుపాదమే పుట్టుకకు కారణముగాగలది

విష్ణువు సం వి విశ్వమంతట వ్యాపించి యుండువాఁడు, వెన్నుఁడు.

విష్వక్సేనుఁడు సం, వి. విష్ణు సేనాధిపతి.

విసనకఱ్ఱ వి తాళవృంతము.

విసరణము సం. వి. (భౌతి,రసా.) ఒక వాయువు ఇంకొక … నిలోనికిగాని ఒక ద్రావ్యము మరొ … వములోనికిగాని ప్రవసించుట. (D ffusion).

నినరము సం వి. సమూహము.

విసర్గనాళికలు సం. వి. (జం.) రక్తములో నుండి నత్రజని సంబంధమగు అనవసర పదార్థములనుతీసికొను నాళికలు(Malp - ghian tubules)(ఇవి మూత్రపిండములలో నుండును )

విసర్గప్రావరము సం. వి. (జం.) మూత్ర పిండములోనున్న మూత్ర నాళికలు ఒక్కొక్కటి చివర . ఉబ్బియుండు రెండు పొరలుగల సంచి. (Malpighian capsule).



విసర్గప్రావరము కేశికాజూటము

విసర్గము సం.వి. 1. త్యాగము, విసర్జనము, 2 విసర్జనీయము. (ః)

విసర్జనము సం.వి ఈవి విడుపు. సం. (జీవ) చయాపచయక్రియలో నేర్పడిన వ్యర్థ పదార్థములను శరీరమునుండి బయటికి విడుచుట,వ్యర్థపదార్థము (Excretion)

విసర్జనములు సం వి. (వ్యావ.) మొక్కల శరీరమునుండి బయటికి త్రోసివేయబడు జిగురు ద్రవ్యములు మొ॥ (Excretions).

విసర్పిప్రతిరోధము సం. వి. (భౌతి.) తీగ చట్టబడిన గొట్టముపై ఇటునటు జారునట్లుఅమర్చబడిన కాలర్ సహాయమున అతిగచూపు విద్యున్నిరోధమును హెచ్చించుటకును తగ్గించుటకు నువయుక్తమగు పరికరము.(Sliding resistance)

విసారము సం. వి. 1 చేప. 2 కొయ్య.

విస్తరణ సం వి. (గణి) ఒక సమాసమును విప్పి శ్రేణిగా వ్రాయుట (Expansion)

విస్తారము సం. వి. 1, విరివి. 2.పీఠము. 3. సమూహము.

విస్తృత సం, విశే. విరివియైనది,

విస్రు వై. వి. వాసన, దేహమునగల్గు దుర్గంధము. సం. విస్రంస.,

విస్ఫురీకరణము సం. వి. (రసా ) నూనెలు క్రొవ్వు మొదలగు వానిలోనున్న క[illegible] నామ్లముల సంయోగింపజేసి లవణముల వంటి సంయోగద్రవ్యములుగా మార్చుట (Esterification)

విస్ఫారము సం. వి. వింటిమ్రోత విశే. మిక్కిలి అధికమైనది.

విస్ఫులింగము సం. వి. అగ్నికణము.

విస్ఫోటము సం, వి. బొబ్బ, పొక్కు.

విస్మయము సం. వి. ఆశ్చర్యము, వింత.

విస్మరణము సం. వి. మరుపు.

విస్మృతము సం. విణ. మఱపు నొందినది.

విస్మృతి సం. వి. మఱపు.

విస్రంభము సం. వి. 1 నమ్మకము, స్నేహము 2. జగడము

విస్రబ్ధము సం. విణ. 1 నమ్మబడినది. 2. అణగినది 3 శాంతినొందినది. 4 అత్యంతము.

విస్రస సం. వి. జర, ముసలితనము

విహంగమము సం. వి. పులుగు, పక్షి. రూ. విహాగము

విహరణము సం. వి. విహారము

విహసితము సం. వి. వ్యంగ్య ధ్వనిగల నవ్వు.

విహాయసము సం. వి. ఆకసము.

విహారము సం. వి. వేడుకగా దిరుగుట.

విహితము సం. విణ. విధింపబడినది.

విహ్వలత సం. విణ. బాధవలన తపన.

విహ్వలించు సం. క్రి. భయాతురులచే అవయవ స్వాధీనము తప్పినవాడు

విళంగీలు వి. హేళనముతో కూడిన తిట్లు.

విళంబము సం. వి. విలంబము, ఆలస్యము.

విళంబి సం. విణ. విలంబము చేయువాడు వి. ముప్పదిరెండవ సంవత్సరము.

## వీ

వీఁక వి. 1. గర్వము 2 ఉత్సాహము. 3. ఉన్నతి 4. శౌర్యము 5 యుద్ధము నుండి పారుట.

వీఁగు క్రి. 1. వెనుదీయు. 2 యత్నించు. 3 ఉత్సహించు

వీఁడు సర్వ. ఈ మనుష్యుడు

వీఁపు వి. వెనుకమేను, వెన్ను.

వీకాశము సం. వి. 1 ప్రకాశము 2. ఏకాంత స్థలము.

వీకు వి. 1. పద్ధతి. 2, ఉన్నతి. 2. పరాక్రమము 4 ప్రయత్నము.

వీక్షణము సం. వి. అవలోకము, ఈక్షణము.

వీక్ష్యము సం. వి. ఆశ్చర్యము. విణ. చూడదగినది.

వీచయనము సం. వి. వెదుకుట.

వీచి సం. వి. తరంగము

వీచు క్రి. గాలి విసరు.

వీచోపులు వి. (వీచు + చోపులు) వింజామరలు.

వీజనము సం. వి. సురటి, విసనకఱ్ఱ.

వీటి వి. కొల్ల, లూటీ

వీటిఁబుచ్చు క్రి. వ్యర్థపుచ్చు, నష్టపరచు.

వీటో ఇం. వి. (రాజ., శాస.) (Veto) 1. ప్రతిషేధము 2 విశేషాధికారము. 3. రద్దు, ప్రతిపాదన నైనను త్రోసి పుచ్చు అధికారము.

వీడు వి. 1, పురము 2 కట్నము 3. దండు విడిసినచోటు 4. దొమ్మరగుంపు క్రి. వదలు, సడలు, భేదమగు, నిర్గమించు. విడిపోవు

వీడుకొను క్రి. పోయివచ్చెదనని చెప్పుకొని వదలు.

వీడుకోలు వి. పోవ ననుజ్ఞ.

వీడుపట్టు వి. శిబిరము, విడిది, వాసస్థానము.

వీణ సం. వి. విపంచి, తంత్రీవాద్యము. రూ. వీణాము వీణె, వీణియ

వీణము వై. వి. వలిపము, సన్ననివస్త్రము, సం. వయనమ్,

వీణియ వై. వి. 1. కస్తూరి మృగము యొక్క బొడ్డుకాయ 2, వీణ సం. వీణా

వీతము సం. విణ. పోయినది సం. వి. అంకుశపుపోటు 2. సత్తులేని పన్ను

వీతరాగి సం. వి. విరాగుడు, వైరాగ్యము గలవాడు.

వీతి నం వి. 1. పరుగు. 2. తిండి. 3. జిగి, 4. గుఱ్ఱము,
వీతిహోత్రుఁడు నం. వి, అగ్ని.
వీతెంచు క్రి విసరు
వీథి నం వి. 1. ఇండ్లవరుస, వరుస, రాజమార్గము, అంగళ్ళవాడ 2 ఏకాంక నాటకము. ఉదా శ్రీనాథునివీథినాటకము
వీను వి 1. ప్రసిద్ధి 2. చెవి.
వీర నం వి పెనిమిటి, పుత్రులుగల స్త్రీ.
వీరంధరము నం. వి. 1. నెమలి 2. పులుల పోట్లాట
వీరజయంతిక నం. వి యుద్ధమందలి వీరుల నృత్యాదికము
వీరడి వి. తిక్క, వెఱ్ఱి
వీరణము వై. వి. చర్మవాద్యము నం వీర ధ్వానః.
వీరపత్ని నం. వి. వీరుని భార్య.
వీరపాణము నం వి. యుద్ధ ప్రారంభమున అవసానము, వీరులు చేయుగోష్ఠిపానము కల్లు త్రాగుట
వీరభద్ర పళ్ళెరము మి వి మిక్కలి పెద్ద పళ్ళెము. హరివాణము
వీరభద్రుఁడు నం. వి 1. వీరభద్రుడను ప్రమథుడు 2. ఏకాదశ రుద్రులలో నొకడు, 3, శివుని కొడుకు.
వీరమధ్యములు నం. వి శత్రువీరుల పేళ్ళు చెక్కి శూరులు బిరుదుగా కాలి పెద్ద వ్రేల ధరించు ముద్రికలు.
వీరము నం. వి. పరాక్రమము, వీరరసము. తూ బీరము.
వీరముద్దియలు వై. వి. వీరముద్రిక, వీర మధ్యములు నం వీరముద్రికా.
వీరవైష్ణవుఁడు నం వి. వైష్ణవమున మిక్కలి పట్టుదల గల ఒక తెగ విష్ణుభక్తుడు.
వీరశైవుఁడు నం వి శివమతమున మిక్కలి పటుదల గల ఒక తెగ శివభక్తుడు.
వీరసువు నం వి వీరుని గన్నతల్లి.
వీరాశంసనము నం. వి భయంకర యుద్ధ భూమి
వీరాసనము నం, వి 1. దేనిమీదను ఆనుకొనక కూర్చుండుట 2 రాత్రిపూట కత్తి చేబూని కావలి యుండుట.
వీరుఁడు నం విశ శూరుడు.
వీరుధము నం వి. 1. చిగురుగొమ్మ. 2 పొద.
వీర్యము నం వి, 1 పరాక్రమము, తేజము. ప్రభావము 2. రేతస్సు.
వీఱిఁడి విశ. అవివేకి, వెఱ్ఱి.
వీలము ఇం వి. (జం) (Velum) ఛత్రికలో ఛత్రము యొక్క అంచులో పలికిముడుచు కొనియున్న భాగము
వీలు వి. అనుకూల్యము, క్రమము
వీలునామా వి. (వ్యావ.) మరణ శాసనము.
వీవధము నం వి. 1 కావడి. 2. త్రోవ. 2. బరువు,
వీవన వై. వి. సురటి. తూ వీవెన నం వ్యజనమ్, వీజనమ్.
వీవరి వి వాయువు
వీసబడి వి. గ్రామమునందు భాగ ప్రకారము గలిగిన భూస్వాతంత్ర్యము.
వీసము వి. రూకలో పదునారవ భాగము.
వీసర వి, వెలితి, కొరత.
వీసరపడు క్రి. వెలితిపడు.
వీసె వై. వి. నలువదిపలములు తూ. వీసియ

## వు

వుల్ఫ్‌సీసా ఇం వి. (రసా.) రెండు మెడలు గల సీసా. (Woulfe bottle).

# వృ

వృంతమధ్యకము నం వి (వృక్ష) రెండు అభిముఖ పత్రముల యొక్క వృంతమూలములమధ్యనుండు కొండభాగముపైగలది. (Inter-petiolar)

వృంతము నం.వి. 1.తొడిమ 2.చూచుకము.

వృంతసహితపత్రము నం. (వృక్ష.) వృత వృంతముగల ఆకు (Petiolate leaf).

వృంతాంతరికము నం (వృక్ష.)పత్రవృంతమునకు కాండమునకు మధ్యగలది (Intra-pitiolar).

వృకము నం. వి 1. తోడేలు. 2. కుక్క.

వృకుఁడు నం. వి. పెద్దకడుపుగలవాడు.

వృకోదరుఁడు నం వి భీముడు.

వృక్క-కేశికాభాజి మండలము నం వి (జం.) మూత్ర పిండములో ప్రవేశించు వృక్క కేశికాభాజి సిరలోనికి తెరచుకొను ఊరుసిర, నితంబసిర, అధరమహాసిరలోనికి తెరచుకొను వృక్కసిర, ఈ మండలమున ముఖ్యమైన రక్తనాళములు. (Renal portel system).

వృక్క సంబంధము నం. విఽ. (జం.) మూత్ర పిండములతో సంబంధము గలది. (Renal)

వృక్కాకృతి నం. (వృక్ష) మూత్ర పిండాకృతి (ఆకు, గింజ మొ॥) (Reniform)

వృక్షము నం. వి. చెట్టు. నం. (వృక్ష) చాల ఎత్తుగా, లావైన కాండము, ఎక్కువ దారువుతోదృఢమైన శాఖలుగల మొక్క. (Tree)

వృక్షరుహాము నం. వి. (వృక్ష.) వృక్ష శాఖలపైఁగి ంజ లు పడి మొలచిన మొక్క. (ఇది పరాన్నభుక్కు కాదు). ఉదా. కొన్ని ఆర్కిడములు (Orchids) (Epiphyte).


వృక్షరుహాము

వృక్షరేఖ నం వి (భూగో.) ఒకప్రాంతములోని చెట్ల యొక్క గరిష్ఠోన్నతిని సూచించు ఊహారేఖ.

వృక్షవాటిక నం వి. 1. ధనికుల గృహములయందలి ఉపవనము. 2 చిన్నతోట.

వృక్షశాస్త్రము నం. వి. (వృక్ష) వనస్పతి శాస్త్రము, ఉద్భిజముల (మొక్కల) జీవిత విశేషములను గూర్చి తెలియ జేయు శాస్త్రము. (Botany).

వృక్షసంబంధమగు చమురులు మి. వి (వ్యావ) వృక్షము యొక్క ఏ భాగము నుండియైనను లభించు నూనెలు(Vegetable oils).

వృక్షామ్లము నం. వి. చింతపండు.

వృక్షాహార సంబంధము నం వి (వృక్ష.) సాధారణమగు నిరింద్రియ పదార్థములతో కిరణజన్య సంయోగక్రియ(Photosynthesis)చే ఉద్భిజములవలెఆహారమును తయారుచేసికొనునది, (Holophytic).

వృక్ణము నం. విఽ. 1. విరిగినది. 2. కోయబడినది

వృజినము నం. వి. పాపము, దోషము. క్లేశము. విఽ. వక్రము. రూ. వృజనము

వృతి నం. వి. 1. వర్ణించుట. 2. చుట్టుట.

వృతుఁడు నం విఽ. వరింపబడినవాడు.

వృత్తఖండము నం. వి. (గణి) ఒక సరళరేఖచే వృత్తము నుండి వేరు చేయబడిన వృత్తభాగము. (Segment).

వృత్తము నం. వి. 1. నియత గణములును యతిప్రాసములుగల పద్యము 2. వర్తన 3 జీవనము. విఽ. వర్తులమైనది. కొంచెము గట్టియైనది. (గణి.) ఒక సమ

తలములో ఒక స్థిరబిందువు నుండి ఒకే దూరములో చరించు బిందువు యొక్క పథము. (Circle)

వృత్తాంతము సం. వి. 1. వర్తమానము, 2. కథ. 3. ప్రస్తావము.

వృత్తి సం. వి. 1 జీవనోపాయము. 2. నడవడి. 3. సమాసము. 4. వివరణ గ్రంథము.

వృత్తికళ సం. వి. ఒక వృత్తికి సంబంధించిన కళ, నేర్పు.

వృత్తికళా శిక్షణ కేంద్రము సం. వి. వృత్తికి సంబంధించిన శిక్షణ నిచ్చు స్థలము.

వృత్తికారుడు సం. వి 2 వ్యాకరణ సూత్రములకు లఘు వివరణము వ్రాయువాడు. 2. ఒక వృత్తిని చేయువాడు.

వృత్తీయమానము సం. వి (గణి.) రేడియనులకు (Radian) సంబంధించిన మానము. (Circular measure).

వృత్రము సం వి 1. చీకటి. 2. కొండ 3. శబ్దము 4. మేఘము.

వృత్రహుడు సం. వి. ఇంద్రుడు. వృ వృత్రాసురుని చంపినవాడు.

వృథ సం. అవ్య. వ్యర్థము

వృథాఅద్దె మి వి. (అర్థ.) ఉత్పత్తి ప్రకారముగాక అంగీకారము ప్రకారము గనులపై చెల్లించెడి కనీసపు అద్దె. (Minimum Royalty)

వృద్ధ సం వి. ముసలిది.

వృద్ధత్వము సం వి ముసలితనము. (Senility)

వృద్ధము సం విశే. 1. వృద్ధిబొందినది. 2 ముదిసినది.

వృద్ధి సం. వి. 1. పెరుగుట. అభివృద్ధి. 2. వడ్డి.

వృద్ధిచెందని పిల్లలు (గృహ.) ఎదుగుటలో గాని, తెలివితేటలలోగాని వెనుకపడిన పిల్లలు (క్షీణపరిణత శిశువులు). (Retarded Children).

వృద్ధు సం. విశే. 1. ముసలివాడు. 2. తెలిసినవాడు.

వృశ్చికచోరన్యాయము సం న్యా. దొంగవాడు రహస్యముగ కన్నము వేయుచుండ తేలుకుట్టినచో నోరు మూసికొని చప్పుడు చేయక తిరిగి పోవునను రీతి.

వృశ్చికము సం వి 1. తేలు. 2 వృశ్చిక రాశి.

వృశ్చికవానరన్యాయము సం న్యా. అసలే కోతి, దాని వికారచేష్టలతోపాటు తేలు కుట్టినచో మరింత వికారముగ గంతులు వేయునను రీతి.

వృశ్చికాకార మధ్యారంభ మంజరి సం. వి (వృక్ష) తేలు ఆకారముగా నుండు ఏకశాఖీయ మధ్యారంభ మంజరి. (Scorpoid cyme).



వృశ్చికాకారం

వృషణము సం. వి. బీజము, ముష్కము.

వృషణయుజము సం వి. మధ్యారంభమంజరి (వృం) వృషణ శరీర భిత్తికకు వ్రేలాడునట్లుంచు దానిపై నున్న పొర (Mesorchium).

వృషదంశకము సం. వి మార్జాలము, పిల్లి. రూ. వృషదంశము.

వృషభము సం వి 1. ఎద్దు, బసవన్న. 2. వృషభ రాశి

వృషలి సం. వి 1. స్వైరిణి. 2. విధవ.

వృషము సం. వి. 1. ఎద్దు. 2. ధర్మము.

వృషలి సం వి. 1. గొడ్రాలు. 2 చచ్చుడు బిడ్డలు గలది. 3. శూద్రి. 4. కన్యక.

వృషలుడు సం. వి. 1. పాపాత్ముడు. 2. శూద్రుడు 3. చంద్రగుప్తుడు

వృషాకపాయి సం. వి. 1. లక్ష్మి. 2. పార్వతి. 3. శచి. 4. స్వాహా.

వృషాకపి సం. వి. 1. విష్ణువు. 2. శివుడు. 3. అగ్ని.

వృషుఁడు సం వి 1 వీర్యవృద్ధి గలవాడు 2 ఇంద్రుడు.

వృష్టి సం. వి. వర్షము, వాన.

వృష్ణి సం. వి. 1. పొట్టేలు. 2. ఒక గొల్లవాడు 3 కృష్ణుడు. 4. ఇంద్రుడు. 5. వహ్ని.

# వె

వెంగలి వై విశే. మూఢుడు. జడుడు. సం వికలః.

వెంచె వి ప్రవాహము, మడుగు రూ. వెంచము.

వెంట వి 1. దారి. 2 వేట, 3, విధము. అవ్య వెంబడి

వెంటము వి. కుతూహలము, తమి

వెంటి వి కసవుపిరి.

వెంత్రువ వి. ఒక రకము ముంగి,

వెండి వి. రజతము. అవ్య మరియు (వెండియు).

వెంద్రుక వి. కేశము రూ వెంట్రుక.

వెంపర వి. హింస. పీడనము

వెంబ వి. విశాలము.

వెంబడి అవ్య. వెంట.

వెంబర విశే దుష్టుడు,

వెంబరవిత్తు విశే దుష్టాగేసరుడు,

వెకలి వై. విశే వెఱ్ఱివాడు, సం వికలః

వెక్క వి. వేడిమి.

వెక్కసపడు క్రి సహింపకుండు.

వెక్కసము విశే. 1 అధికము.2.దుర్లభము

వెక్కిరించు వై. క్రి హేళనముచేయు.

వెక్కిలి వై. వి. (ఎక్కిలి) విదాహము. సం హిక్కా.

వెక్కురు వై. విశే వికారము పట్టినవాడు. సం, వికారీ.

వెగచు క్రి, వెక్కివెక్కి యేడ్చు.

వెగటు వై. విశే. విరసము. సం. వికటః.

వెగడు వై. వి. తడబాటు. సం, వికటః.

వెగ్గలము విశే. అధికము.

వెగ్గలీఁడు విశే. అధికుడు.

వెచ్చించు వై. క్రి. (వెచ్చముచేయు.

వెచ్చ వి. కాక, వేడిమి. సం ఊష్మ.

వెచ్చకాఁడు వి విటుడు. విశే, మిక్కిలి వెచ్చముచేయువాడు.

వెచ్చము వై. వి, 1 ఇంటికివలయు తినుబండములు రొక్కమియక అప్పు దెచ్చుకొనుట. 2. వ్యయము. సం. వ్యయః.

వెజ్జు వై. వి వైద్యుడు సం. వైద్యః.

వెట్ట వై. వి. వేడిమి. సం ఉష్ణః.

వెట్టకారు వై. వి. వేసవి.

వెట్టము వై. వి శత్రువు,

వెట్టి వై వి కూలిలేక చేయుపని సం. విష్టిః

వెట్టివాఁడు వి. వెట్టిపనిచేయువాడు.

వెడి వై విశే. 1. అల్పము. 2 వికృతము. 3, వ్యర్థము. సం వ్యర్థః

వెడఁగు వి 1 వికారము. 2. అవివేకము. సం. వికటః,

వెడఁద విశే. విశాలము.

వెడలు క్రి. బయలుదేరు, విశాలము

వెడవెడ విశే. 1. అత్యల్పము, 2 మృదువు.

వెడ్డరి వై వి. వంచకుడు.

వెడ్డు వై. వి కపటము, సం. విడంబః.

వెడ్డుపెట్టు క్రి. వంచించు.

వెణుతురు వై వి కరీర వృక్షము, వెలుతురుచెట్టు. సం వేల్లంతరః.

వెత వై, వి. వ్యథ.

వెతకు క్రి. గాలించు, అన్వేషించు.

వెద వి 1. కొప్పు. 2. విత్తుట. 3. పశుపక్ష్యాదుల కలయిక.

వెదగొఱ్ఱు వి. విత్తులువేసెడు గొఱ్ఱు.

వెదురు వై. వి. వేణువు సం. వేణుకః.

వెనకయ్య వై. వి. వినాయకుడు సం. వినాయకః.

వెనకు క్రి వెనుకు.

వెనిషియన్ బ్లైండ్స్ ఇం. (గృహ) (venetian blinds) రవాణాకులతలుపులు కిటికీ నుమూయుట కుపయోగించు పట్టీలవంటి చెక్కలులేదా రేకులతో అమర్చినపర్దాలు (వీనిని ప్లాస్టిక్‌తోకూడ తయారుచేయుదురు)

వెనుక వి. 1. పశ్చాద్భాగము. 2. పడమర. 3. పిమ్మట. 4 ఉపేక్ష. అవ్య. వెంబడి.

వెనుకబడిన తరగతులు వి. (రాజ.) భారత దేశ సామాజిక వ్యవస్థలో వెనుకబడిన జాతులు. (Backward classes).

వెనుకటి ఆధారము మి వి (గృహ) పుట్టు పూర్వోత్తరములు వంశ పారంపర్యము. (Back ground)

వెనుకటివాడు వి. తమ్ముడు.

వెనుకటివానకారు వి. (వ్యవ.) అక్టోబరు, నవంబరు నెలలు హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనురాధ కార్తెలు శరదృతువు (Post-monsoon period).

వెనుబడు క్రి. శోకించు.

వెనువెంట అవ్య. మిక్కిలి వెంబడి

వెన్న వై. వి. (వెల్ల + నెయ్యి) మిసిమి, నవనీతము.

వెన్నంటు క్రి. వెంబడించు.

వెన్నపూస వి. వెన్నముద్ద.

వెన్నపడుగు వి. ఒకరకము వస్త్రము.

వెన్నముచ్చు వి. వెన్న దొంగ.

వెన్నాడు క్రి. వెంబడించు.

వెన్ను వి. 1. కంకి. 2. ఇంటి వడికొప్పు. 3 వీపు.

వెన్నుడు వై. వి విష్ణువు సం. విష్ణుః

వెన్నుతెగుళ్లు వి (వ్యవ.) సస్యముల కంకులకుబట్టు తెగుళ్ళు (Ear-head diseases).

వెన్నునంటు వి. అర్జునుడు (వెన్నుని + అంటు = కృష్ణుని మిత్రము).

వెన్నుబాము వి (గృహ.) వెన్నుపూసలో పాము ముఖ్యమైనన ము. (Spinal cord)

వెన్నెల వి (వెలి + అల) చంద్రిక.

వెన్నెలగుత్తి వి. చంద్రుడు.

వెప్పు వి. వేడిమి.

వెమ్ము క్రి. తపించు. సంతాపించు.

వెరవరి విశే. నేర్పరి. ఉపాయశాలి.

వెరవిడి విశే ఉపాయహీనుడు

వెరవు వి 1. ఉపాయము. 2. జీవనోపాయము 3. విధము 4. వశము.

వెరవేకి వి 1 విరహతాపము. 2 భయజ్వరము.

వెరసి వి లెక్క, మొత్తము.

వెరసు వి. అంకెల వరుస.

వెఱ వి 1. చింత. భయము యా వెఱగు.

వెఱగొందు క్రి. ఆశ్చర్యపడు.

వెఱచఱచు క్రి భయపడు.

వెఱపించు క్రి. అదలించు, అడలగొట్టు, అదలించు.

వెఱపిడి విశే. భయములేనివాడు

వెఱబొమ్మ వి పశుపక్ష్యాదులకు వెరపు గలిగించు బొమ్మ

వెఱవెఱపాటు వి నివ్వెఱపాటు.

వెఱ్ఱి వి. పిచ్చి. అవివేకము విశే. పిచ్చివాడు.

వెఱ్ఱికంకితెగులు వి (వృక్ష) నక్కతోక తెగులు. (ఇది కొన్ని తృణధాన్య జాతులకు సంభవించు వెన్ను తెగుళ్ళలో నల్పకణికము (Seikolets) లకు


వెఱ్ఱికంకి తెగులు

గిఁజ లేర్పడుటకు మామగా ఆకుపచ్చని పోగులు బయలుదేరి, వెన్ను నక్కతోక వలె కుచ్చుగా నుండును ) (Green ear disease).

వెఱ్ఱిబాగులు వి. వెఱ్ఱివాడు, తెలివిలేనివాడు.

వెల వి. (అర్థ.) ధర, ఖరీదు, సాధనములచే పదార్థములలోనుండు మూల్య పరిమాణమును నిర్ణయించుట.

వెల వి కొనువస్తువులకిచ్చు విలువ, వస్తువులకు జెప్పు ధర.

వెలఁగ వి కపిత్థము

వెలఁది వై విణ నిర్మలము, ప్రసన్నము వి స్త్రీ.

వెలఁదుక వి (వెలఁది+ఉక) ఆడుది, వెలది.

వెలకట్టుట క్రి (గృహ) విలువను స్థాపించుట విలువ నిశ్చయించుట. మూల్యనిర్ణయము (Evaluation).

వెలచు వై క్రి. శుభ్రపరచు

వెలనాడు వి ఒకానొక దేశము.(ప్రదేశము) రూ వెల్నాడు.

వెలమ వి. వెలమజాతి

వెలయాలు వి (వెల+ఆలు) వేశ్య

వెలయించు వై క్రి. వెల్లడించు. ఆవిష్కరించు. ప్రకటించు

వెలయు వై. క్రి. ఒప్పు. ప్రకాశించు, ఆవిర్భవించు.

వెలవెలఁబాఱు క్రి వివర్ణమగు, తెల్లపోవు

వెలారించు క్రి వెడలగొట్టు, బాధించు.

వెలార్చు క్రి. బయలుపఱచు

వెలి వి 1. బహిః ప్రదేశము 2. వెలివేయుట విణ బాహ్యము. వై, వి. తెలుపు విణ. తెల్లనిది సం ధవళము.

వెలికిలు క్రి. తిరుగబడు. వీపు క్రిందుగా పరుండు.

వెలిగారము వై.వి. గవ్వచౌకము. టంకము. సం. ధవళక్షారః. (గృహ ,రసా ) టంకణము, సిల్కు బట్టలను తేటగా చేయుటకును ఒట్టల మీది మచ్చలు తీయుటకును ఉపయోగించెడి రాసాయనిక ద్రవ్యము. (ఇది బోరికామ్లము యొక్క సోడియపు లవణము). (Borax)

వెలిగిడ్డి వి కామధేనువు.

వెలిగుల్ల వి శంఖము

వెలిగొండ వి. కైలాసము

వెలిగొరు వి ఐరావతము.

వెలితి వి. తక్కువ.

వెలిదుక్కి వి నానతడి దుక్కి

వెలిపుచ్చు క్రి. బయలుపరుచు.

వెలిబూది వి విభూతి

వెలిమ్రాను వి కల్పవృక్షము

వెలియు క్రి 1. వానకురిసినిలుచు. 2 చాయ యెత్తిపోవు.

వెలివాడ వి మాలపల్లె

వెలివిరియు క్రి 1 ఉబుకు. 2 పారు, అలముకొను రూ వెల్లివిరియు.

వెలివెలు వి చంద్రుడు

వెలిసె వి. 1. ఇంటిచూరు. 2. అటక.

వెలుఁగు వి 1 కిరణము. 1. ప్రకాశము.

వెలుక వి. (వెలి+ఉక) తెల్లన.

వెలుచ వి. పాము రూ వెల్చ.

వెలుచు క్రి వెడలుచు, తోలు, నడపు.

వెలుతురు వి 1. ఎండ. 2. ప్రకాశము

వెలువడు క్రి (వెలి+పడు) బయలుపడు బయలుదేరు

వెల్లఁకి వి గడ్డ (వేరువెల్లకులు)

వెల్లడి వై వి. ప్రసిద్ధి.

వెల్లి వై,వి ప్రవాహము, పరంపర, తెలుపు. సం వేల్లి.

వెల్లివాక వి. గంగ.

వెల్లివిరియు క్రి. 1 వ్యాపించు 2. ఉబుకు. 3 ప్రకటితమగు.

వెల్లువ వి. 1. వరద. అధికప్రవాహము. 2 సేన.
వెస వై. వి. వేగము. విశ. శీఘ్రముగ నం విస్పృః. వాజః,
వెసనము వై. వి వ్యసనము.
వెసల వి వంటకుండ.
వెళ్లు క్రి వెడలు, నిర్గమించు.

# వే

వే నర్వ పదినూఱులు. వేలు, సహస్రము విశ. ఆదేశము. వై. వి వేగముగ
వేంచేయు మి క్రి. 1. వచ్చు. 2. కూర్చుండు 3. పోవు
వేంద్రము వి తాపము
వేఁకటి వి. గర్భము.
వేఁకరము వి ఉపద్రవము.
వేఁకి వి. 1. జ్వరము 2 వేడిమి. 3. అగ్ని.
వేఁగు క్రి. తపించు,
వేఁగి వై. వి. పులి నం వ్యాఘ్రః.
వేఁచు క్రి. వేగజేయు. ప్రేలుచు.
వేఁట వి. 1. మృగయ. 2. పొటేలు, మేక పోతు
వేఁటగిరి వి వేటకాడు.
వేఁడి వి. 1. తాపము. 2. చురుకు. 3. వాడిమి. 4. ప్రకాశము.
వేఁడికంటి వి. ఉగ్రాక్షుడు. శివుడు.
వేఁడికోలు వి. యాచన.
వేఁడిగాలిపెట్టె వి. (రసా.) ద్రవ్యశోషణ మున కుపయోగపడు రాగిరేకుచే చేయ బడిన పెట్టె (Hot oven)
వేఁడినీటిజలలు వి. (భూగో.) ఉత్తర అమె రికాలోని రాకీపర్వతమండలమన కొలం బియా మైదానములలోగల వేడి నీటి బుగ్గలు (Hot water sprtngs).
వేఁడినీటి బుగ్గలు వి. (భూగో.) తప్త ఝురులు, భూమిలోనికి ఇంకిన నీరు చాల లోతునకు పోయి వేడియై మరియొక భూభాగమునుండి పైకివచ్చుట. (ఈ వేడి నీటి బుగ్గలు ఎత్తుగా నీటిని చిమ్ముచు ఆవిరిని కలిగించును ఈనీటిలోలోహ పదార్థము లుండుటచే నీ నీరు రోగములు పోగొట్టును.
వేఁడివేలుపు వి. 1. వహ్ని. 2. సూర్యుడు.
వేఁడు క్రి. ప్రార్థించు.
వేఁదుఱు వి. ఉన్మాదము.
వేఁపి వి కుక్క.
వేఁపు వి. వేపుడు.
వేఁపుడు ముక్కలు వి (గృహ) తీపి లేక కారవు బజ్జీలు 2 వేచిన కూరముక్కలు (Frilters).
వేకువ వి. వేగుజాము.
వేగ వై వి. వడి విశ త్వరితము,
వేగంటి వి. ఇంద్రుడు (వే + కన్ను)
వేగపాటు మి. వి. సంభ్రమము.
వేగము నం వి జవము, త్వర. (గణి. భౌతి) ఒకవస్తువు స్థలచలనము యొక్క రేటు (Velocity)
వేగరి వి. వేగువాడు. చారుడు.
వేగవృద్ధి నం. వి. (గణి., భౌతి) త్వరణము లేదా వేగము వృద్ధిచెందెడు రీతి. (Acceleration).
వేగి నం. వి గుఱ్ఱము విశ, వడిగలది.
వేగిరపాటు వై వి వేగపాటు.
వేగిరము వై. వి. వేగము, విశ. త్వరితము.
వేగు క్రి. తెలతెలవారు. శుభోదయమగు వి. 1 రాజ్యసమాచారము, 2, చారుడు,
వేగుఁజుక్క వి. శుక్రుడు.

వేగురు వి వేయిమంది.
వేగువాఁడు వి. చారుడు.
వేటు వి వేయుట దెబ్బ దూ వ్రేటు.
వేడబము వై. వి. వేషము, మాయ వంచన నం. విడంబః.
వేడుక వి 1. సంతోషము 2 వినోదము 3 కుతూహలము.
వేడుకకత్తె వి. జారిణి స్త్రీ రంకుటాలు.
వేడుకకాఁడు వి జారుడు
వేడెము వై. వి. మండలగతి, వేష్టనము. సం. వేష్టనమ్
వేణి నం వి. 1 అనేక ప్రవాహముల కూడిక. 2. కాలువ. 3 వేనలి (సర్పాకారముగల జడ)
వేణుకము నం. వి 1. ఏనుగును బొడిచెడు బరిగోల. 2. గనులదోలు మునికోల.
వేణువు నం. వి. వెదురు, పిలనగ్రోవి.
వేతనము నం. వి, భృతి. కూలి, చేసినపనికి ప్రతిఫలముగ నిచ్చు ద్రవ్యము, జీతము.
వేతనముల స్థాయి మి వి (అర్థ.) వేతన ప్రమాణము.
వేతసము నం. వి పేము
వేత్త నం. విశ. తెలిసినవాడు
వేత్రము నం వి. చేతికఱ్ఱ, బెత్తము.
వేత్రహస్తుఁడు నం వి ప్రతీహారుడు, చోపుదారు, పడిహారుడు
వేదండము నం, వి ఏనుగు.
వేదన నం వి ఏనుగు.
వేదన నం. వి. నొప్పి.
వేదము నం. వి. దీనిచేత ధర్మాధర్మముల నెరుగుదురు తొలిచదువులు, ఇవి నాల్గు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అథర్వణవేదము ప్రాచీన భారత ఆర్య (ఇండో-ఇరానియనుల) ధర్మ గ్రంథములు, ఋక్ వెదము :— 1017 వేద మంత్రములసంహితము, వేదము లన్నిటిలోను పురాతనమైనది. ఋక్ వేదమంత్రములకు, పాఠశీక (ఇరానియనుల ధర్మగ్రంథమయిన) ధ్యాన శ్లోకములకు సన్నిహిత సంబంధము గలదు సామవేదము—వేదమంత్రములకు స్వరములు కల్పించిగానరూపమును చూపు సంహిత. యజుర్వేదము.— వైదిక తంత్రములను గురించిచెప్పు సంహిత. అథర్వణ వేదము;- వేదసంహితలలో చివరిది. ఈ సంహిత భూత ప్రేత మంత్రములతోను చారిత్రిక విషయములతోను కూడి యున్నది
వేదాంతి నం వి. వేదాంతము తెలిసినవాడు.
వేది నం. వి. 1. వేదిక, తిన్నె 2. విద్వాంసుడు. విశ. తెలిసినవాడు.
వేదు వి. వెగటుమాటలు, వాసన.
వేద్యము విశ తెలియదగినది.
వేధ నం. వి. నలువ. బ్రహ్మ
వేధించు నం క్రి. బాధించు
వేధ్యము నం వి. గురి విశ. తొలగించదగినది
వేనలి వై. వి వేణి, కొప్పు, కేశకలాపము. జుట్టు నం. వేణీ.
వేను వి. చాటుమాట.
వేపథువు నం వి. కంపము, స్వరకంపము.
వేమఱు అవ్య వేమారు, మాటిమాటికి దూ (వేమారు, వేమరు)
వేము వి వేపచెట్టు
వేయంచులవాలు వి. విష్ణుచక్రము.
వేయు క్రి వైచు, కొట్టు దూ. వ్రేయు.
వేరము వై వి విరోధము. నం. వైరమ్.
వేరమి వై. వి. విరోధము.
వేరు వి. చెట్టుయొక్క మూలము.
వేరుచీకు తెగులు వి (వ్యవ.) కొన్ని మొక్కలవేళ్ళకు బూజు తెగుళ్ళు పట్టుటచే ఆ మొక్కలు వడిలిపోవు రోగము. (Root rot) ఉదా. ప్రత్తి కంది. మొః
వేరుపురుగు వి. వేరునుపట్టి చెట్టును నాశనము చేయునట్టి పురుగు.

వేరువిత్తు విశే. నాశకుడు.
వేఱిడి విశే అవివేకి రూ. వీఱిడి
వేల నం వి 1 చెలియలికట్ట పొలిమేర. 2 అనాయాస మరణము 3 బుధుని భార్య 4 దాస్యము
వేలము వై. వి. 1. శిబిరము 2 కత్తి. 3. వేగము. 4. వేలముపాట నం, వేలా
వేలముపాట వి. (వ్యావ) బహిరంగ క్రయములో ఎవరు ఎక్కువ ధరకు కొను టకు ఇష్టపడిన వారికి సరకు అమ్ముపద్ధతి
వేలిమి వి హోమము, రూ వ్రేల్మి, వేల్మి.
వేలు వి. వ్రేలు యొక్క రూపాంతరము
వేలుచు క్రి. హోమాగ్నియందు నెయ్యి మొదలగు వానిని సమర్పించు.
వేలుపు వి. దేవత, దేవతాస్త్రీ 2 జోస్యము.
వేలోర్మి నం. వి (భూగో.) నదీసముద్ర సంగమము వద్ద వైశాల్యము తక్కువగు టచే నీరుగోడవలె లేచి కదులుట (Tidal-wave).
వేల్పుటెంకి వి. స్వర్గము. వ్యు దేవతలకు నివాసస్థానము
వేల్పుఱొజ్జ వి బృహస్పతి.
వేల్పుడు వి పూజ, సపర్య
వేల్పుదాయ వి అసురుడు. వ్యు దేవతలకు శత్రువు.
వేల్పుటోనము వి అమృతము.
వేల్పువెజ్జు వి. దేవవైద్యుడు.
వేల్లనము నం వి. చలనము, వేష్టనము
వేల్లితము నం. విశే కదలింపబడిన
వేవిలి వి. పొలము. విశే.దున్నినది (పొలము)
వేవిళ్ళు వి. భక్షణాది వాంఛగలుగు గర్భ లక్షణము, దౌహృదము.
వేవు క్రి. వేగు.
వేశంతము నం. వి. నీళ్ళుగలచిన్న పల్లము. పడియ
వేశము నం వి 1 వేశ్యవాడ. 2 ఇల్లు 3 వేషము
వేశవారము న. వి. పంట సంబారము
వేశ్మప్రక్రియ నం వి (రసా) గంధకామ్లము తయారుచేయు ప్రక్రియలో సల్ఫర్ డయాక్సైడ్ (Sulpher dioxide) ఆక్సిజన్ (Oxygen) నైట్రోజన్ (Nitrogen) ఆక్సైడ్లు నీటి ఆవిరి కలియునట్లుచేసి రాసాయనిక ప్రక్రియ పూర్ణమగునట్లు చేయుటకుపయోగించు సీసపు గోడలతో చేయబడిన పెద్ద పెట్టెలలో జరిగించు ప్రక్రియ. (Chamber process).
వేశ్మము నం వి. సదనము, ఇల్లు.
వేశ్మస్ఫోటి నం వి, (వృక్ష) ఒక్కొక్క గింజకల ఏకస్ఫోటులుగా (Mericarps) పగులు శుష్క ఫలము (Schizocarp).
వేశ్య నం వి. భోగముది వ్యు అలంకారము చేత శోభిల్లునది
వేషము నం, వి, వేసము, వస్త్రభూషణాద్య లంకారము, మారువేషము
వేష్టనము నం వి 1 చుట్టుకొనుట, పాగ 2 చెవివెలుపలి భాగము. 3. ఒడ్డాణము.
వేష్టించు నం క్రి. పరివేష్టించు.
వేష్టువ వై. వి ధోవతి నం వేష్టితమ్.
వేసంగి వై. వి వేసవి, నం వైశాఖః.
వేసట వి శ్రమము అలసట
వేసడము వై వి కంచరగాడిద, రూ. వేసరము నం, వేసరః
వేసరి విశే. బాధించువాడు
వేసరు క్రి 1 దుఃఖించు 2. కంటగించు, నొచ్చు.
వేసవి వై. వి వెసవి కాలము
వేస్ట్‌లైన్ ఆం (గృహ)(Waist line)నడుము మధ్యము కడుపు దగ్గర సన్నని భాగము.
వేళ నం వి. సమయము, కాలము.
వేళము వై. విశే. త్వరితముగ.రూ. వైళము.

వేళాకోళము వి. ఎకసక్కెము, పరిహాసము, ఎగతాళి (అని పాడుకొలు)

# వై

వైకల్పికము సం. విశే. వికల్పము భ్రాంతి మారుదలవే గలిగినది. (వ్యాక) వికల్పముతో గలుగునది

వైకల్యము సం. వి వికలత్వము

వైకుంఠము సం. వి. విష్ణుస్థానము, అభయస్థానము.

వైకుంఠుడు సం. వి 1. విష్ణువు 2. ఇంద్రుడు.

వైకృతము సం విశే వికృతినొందినది

వైఖరి సం. వి వాక్యరూపమైన వాక్కు.

వైఖానసుఁడు సం. వి. 1. వానప్రస్థుడు. 2 విష్ణ్వంశకులలో నొకడు

వైచిత్ర్యము సం. వి. విచిత్రత, వింత.

వైచు క్రి. విసంవేయు, ఎగరవేయు, రువ్వు

వైజననము సం. వి. ప్రసవమగు నెల.

వైజయంతము సం. వి ఇంద్రుని నగరు.

వైజయంతి సం. వి 1. టెక్కెము 2. విష్ణుమాలిక. 2 విష్ణు ప్రాకారము

వైజాతి వై. వి. ఒకతెగ వైశ్యజాతి.

వైజ్ఞానికుఁడు సం విశే. 1. నేర్పరి 2. విశేషజ్ఞానముగలవాడు.

వైటింగ్ ఇం (గృహ) (Whiting) ఇది తెల్లని పొడిద్రవ్యము దీనిని అలంకారపు వెండి సామానులను పాలిష్ (Polish) చేయుట కుపయోగింతురు,

వైట్ పేపరు ఇం. వి.(రాజ.)ప్రభుత్వమువారు పరిపాలనా విషయములను గురించిపార్లమెంట్ (పార్లమెంటు) సభ్యులకు పంపు-పత్రము.

వైఢమము విశే వైళము, శీఘ్రము.

వైడూర్యము సం వి ఒక విధమగు రత్నము పిల్లి కన్నతనము.

వైణపము సం వి. వెదురు బియ్యము.

వైణికుఁడు సం. వి. వీణవాయించువాడు

వైతనికుఁడు సం. వి కూలికినివాడు

వైతరణి సం వి నరకమునందుండు విష్ణునది.

వైతాళికుఁడు సం వి. వేకువను రాజులకు మేలుకొలుపు పాడువాడు.

వైదగ్ధ్యము సం వి నేర్పు

వైదర్భి సం వి 1 దమయంతి 2 రుక్మిణి

వైదికము సం విశే వేదమునందుచెప్పబడినది

వైదికుఁడు సం వి వేదము తెలిసినవాడు.

వైదుషి సం వి పాండిత్యము దూ. వైదుష్యము

వైదేహకుఁడు సం వి బట్టువాడు, వంది.

వైదేహి సం వి 1. సీత 2 నరకురాలు.

వైద్యము సం వి రోగచికిత్సా శాస్త్రము,

వైద్యుఁడు సం వి చికిత్సకుడు, వెజ్జు

వైద్యుతము సం విశే. (భౌతి) విద్యుత్సంబంధమైనది (Electric)

వైద్యుతక్షేత్రము సం వి (భౌతి) విద్యుత్తుయొక్క ఉనికిని కనబడుచుచోటు. (Electric field).

వైధవ్యము సం వి ముండమోపితనము,

వైధేయుఁడు సం విశే. మూర్ఖుడు.

వైనతేయుఁడు సం. వి. గరుడుడు, వినతాతనయుడు, అనూరుడు.

వైనము వై. వి వివరణము, ఉపాయము కారణము, క్రమము, విధము. దూ వయినము సం వివరణమ్

వైపుల్యము సం. వి విపులత్వము.

వైభవము సం. వి. విభవము, సంపద

వైమనస్యము సం. వి. 1. దుఃఖమనస్కుని భావము, 2. పొదపు. 3. అభిప్రాయ భేదము.

వైమాత్రేయుఁడు నం వి. సవతితల్లి కొడుకు

వైమానికము నం. విశే (భౌతి) విమాన యాన సంబంధమైన. (Aeronautical)

వైమానికుఁడు నం విశే. విమానమెక్కి సంచరించువాడు.

వైముఖ్యము నం. వి విముఖత్వము, వ్యతిరేకత

వైయాకరణుఁడు నం. వి. వ్యాకరణశాస్త్ర పండితుడు.

వైయాత్యము నం వి దిట్టతనము,

వైరము నం, వి. విరోధము.

వైరవులు వి అంగారము, కట్టెనిప్పు.

వైరశుద్ధి నం. వి. ప్రతీకారము, పగతీర్చు కొనుట.

వైరస్ ఇం వి (జీవ) (Virus) సూక్ష్మదర్శినిలో చూడలేనంతటి సూక్ష్మజీవులు

వైరస్యము నం వి వి. సత్వము, వెగటు.

వైరాగి నం. వి బైరాగి

వైరాగ్యము నం. వి వేష యేచ్ఛారహితత్వము లౌకిక సుఖములం దిచ్ఛలేమి

వైరి నం, వి, శత్రువు.

వైర్లెస్ ఇం వి (భౌతి.) (Wireless) తీగెలు లేకుండ సంచేశముల పంపు యంత్రము మా, రేడియో.

వైవధికుఁడు నం. వి. భారవాహకుడు కావడి మోయువాడు.

వైవర్ణ్యము నం. వి, వైవర్ణత, వెల్లబాటు.

వైవస్వతుఁడు నం,వి, 1. యముడు. 2, శని,

వైవాహికము నం. విశే. వివాహ సంబంధమైనది.

వైశసము నం వి- కీడు.

వైశాఖము నం వి 1. వైశాఖమాసము. 2, కవ్వము 3 విలుకాని స్థానము.

వైశారద్యము నం వి. నేర్పు.

వైశాల్యము నం వి విశాలత్వము, వెడల్పు (గణి.) తలపరిమాణము (Area)

వైశికము నం. వి. 1 కపటము 2. బోగము తనవు. విశే దూష్యము

వైశికుఁడు నం వి. వేశ్యాలోలుడు.

వైశేషికము నం. వి.(తర్క) తర్కశాస్త్రము సప్తపదార్థముల చెప్పునట్టిది.

వైశ్యుఁడు నం వి, కోమటి.

వైశ్రవణుఁడు నం. వి, కుబేరుడు.

వైశ్వదేవము నం. వి. విశ్వదేవతలనుగూర్చి చెసెడు హోమాదికము

వైశ్వానరుఁడు నం వి అగ్ని.

వైషమ్యము నం. వి ఒడుదొడుకు, విషమభావము.

వైష్ణవము నం. విశే. విష్ణుసంబంధమైనది. వి. ఒక మతము.

వైష్ణవుఁడు నం. వి విష్ణుభక్తుడు.

వైశిక వై. వి కపటము. నం, వంచకః.

వైస్రాయి ఇం. వి. (రాజ) (Viceroy) రాజప్రతినిధి. సామంతదేశములలో వలస రాజ్యములలో అధిరాజ్య రాజ ప్రతినిధి.

వైహాళి వై. వి. పెద్దనభ, నం. విహారః.

వైళము విశే. త్వరితముగ.

# వో

వోటరు ఇం. వి. (రాజ.) (Voter) ఎన్నుకొను వాడు, వోటు నిచ్చువాడు, నిర్వాచకుడు.

వోటు ఇం. వి (రాజ, రాజ.) (Vote) సమ్మతి ఎన్నికలలో అభిప్రాయమును సూచించుట. ఎన్నికపత్రము.

వోల్టామీటర్ ఇం.వి (భౌతి.) (Voltameter)- విద్యుద్విభజనము చేయుట కుపయోగించు సాధనము.

వోల్టు ఇం. వి. (Volt) విద్యుచ్ఛక్తిని కొలచుటలో వాడు ఒక ప్రమాణము.

# వ్య

వ్యంగకము సం. వి. కొండ, పర్వతము
వ్యంగము సం. వి. వ్యంజనచేత దెలియదగిన యర్థము, ఒక అర్థభేదము
వ్యంజకము సం. వి. 1. వ్యంగ్యార్థమును దెల్పు శబ్దము. 2 అభినయము.
వ్యంజన సం. వి. ఒక శబ్దవృత్తి
వ్యంజనము సం. వి. 1 కూర, దప్పళము. 2 లేహ్యము.
వ్యంజితము సం. విశే. బయలుపరుపబడినది, ప్రకటితము
వ్యంసకుఁడు సం. వి. మోసకాడు
వ్యాలసికుఁడు సం. వి. గారడివాడు
వ్యక్తము సం. విశే. తెల్లమైనది, తెలియబడినది.
వ్యక్తి సం. వి. జాతికివేరై ఆ జాతికి ఆశ్రయమైన రూపము.
వ్యక్తిచరిత్ర సం. వి. (జీవ.) ఒక ప్రాణి యొక్క అభివృద్ధి వృత్తాంతము. (Outogeny)
వ్యక్తిస్వామ్యవాదము సం. వి. (రాజ) వ్యక్తిత్వవాదము వ్యక్తిగత వ్యవహారములలో రాజ్యము కలుగజేసికొనరాదను వాదము. (సమష్టి సామ్యవాదమునకు హేగల్ రచించిన నిరంకుశ రాజ్యవాదమునకు వ్యతిరేకము).
వ్యక్తీకరణము సం. వి. చేతనత్వారోపణము జీవారోపణము, (Personification).
వ్యక్తుఁడు సం. విశే. విశారదుడు.
వ్యగ్రుఁడు సం. విశే. వేగిరపడువాడు. ఒకటమనము తగిలినవాడు.
వ్యజనము సం. వి. విసనకఱ్ఱ వీవన.
వ్యతికరము సం. వి. సంతాపము, వ్యసనము పరస్పర మేళనము.
వ్యతిక్రమము సం.వి. అతిక్రమము
వ్యతిరిక్త సం. విశే. వేరుపడినది. మారుపడినది.
వ్యతిరేకము సం. వి (గణి) ఏ విషయమునకైనను విరుద్ధము (Anti-) సం. వి. వేరు వ్యతిరేకాలంకారము.
వ్యతిరేక సంవర్గమానము సం. వి. (గణి.) సంవర్గమానమునకు వ్యతిరేకమైనది ప్రతిఘాతాంకము (Antilogarithm).
వ్యతిరేకాత్మక ప్రయోజనము సం. వి (అర్థ) వస్తురాశి అవసరముకంటె అధికముగానున్నప్పుడు వస్తు అనుభోగమువలన సుఖమునకు బదులు కలుగు ఇబ్బంది
వ్యతిరేచనము సం. వి. (గృహ.) భేదమును కనబఱుచు, తేడాలనుచూపు, వ్యత్యాసమును ప్రదర్శించు. (Contrasting).
వ్యతిపాతము సం. వి 1. యుద్ధమున వెనుదీయుట. 2. తారుమారు.
వ్యత్యయము సం. వి. 1. తడబాటు 2 వైపరీత్యము, 3 తారుమారు
వ్యత్యస్తము సం. విశే. వ్యత్యాసపడినది.
వ్యథ సం. వి బాధ, క్లేశము, ఆయాసము.
వ్యధము సం. వి. తొలిపుచ్చుట.
వ్యథితము సం. విశే. బాధింపబడినది, తొలిపుచ్చబడినది.
వ్యధ్వము సం. వి చెడ్డత్రోవ.
వ్యపదేశము సం. వి. 1. మిక్కిలి కపటము. 2. కులముపేరు చెప్పుట.
వ్యభిచరించు సం. క్రి. తప్పి చరించు, రంకుపోవు.
వ్యభిచారము సం. వి. చీకటి తప్పు, తప్పి చరించుట.
వ్యయ సం. వి. ఇరువదవ తెలుగుసంవత్సరము
వ్యయము సం.వి. వెచ్చము, ఖర్చు.

వ్యయస్కాంతనము సం. వి (భౌతి.) (వి + అయస్కాంతనము) అయస్కాంతము యొక్క అయస్కాంత గుణమును పోగొట్టుట (Demagnetisation)
వ్యర్థము సం విణ వమ్ము. అప్రయోజకము
వ్యవకలనము సం వి (గణి) తీసివేత అంక గణితప్రక్రియలలోనొకటి (Subtraction)
వ్యవచ్ఛేదము సం. వి 1. ఖండించుట, భాగించుట. 2. బాణగమనము.
వ్యవధానము సం వి అవకాశము, మరుగు
వ్యవధి సం వి. 1. మేర. 2 అవకాశము
వ్యవసాయశాస్త్రము సం. వి. (వ్యవ.) క్షేత్ర కృషి) జంతుకృషి యను రెండు ప్రధాన శాఖలను గురించి తెలియ జేయుశాస్త్రము. (Agriculture).
వ్యవసాయ పరిశోధనాస్థానము సం వి. (వ్యవ.) సస్యములకు చెందిన కొన్ని సమస్యలను పరిశోధించు స్థానము
వ్యవసాయ పరిశోధనాలయము సం. వి (వ్యవ.) వ్యవసాయ సంబంధమైన విషయముల గూర్చి ప్రయోగములుచేసి వానిఫలితములను తెలిసికొను చోటు (Agricultural research laboratory)
వ్యవసాయ బ్యాంకు సం వి. (వాణి.) వ్యవసాయదారులకు ప్రత్యేకించి అప్పులనిచ్చు బ్యాంకు
వ్యవసాయము సం. వి. ప్రయత్నము కృషి.
వ్యవసాయవిస్తరణ సం. వి. (వ్యవ.) ఉత్తమ వ్యవసాయ విధానములను పరిశోధనల ఫలితములను వ్యవసాయదారులకు తెలియజేసి వారిచే వాటిని ఆచరణలో పెట్టించుట (Agricultural extension)
వ్యవసాయార్థికశాస్త్రము సం వి (వ్యవ.) వ్యవసాయమునకు కావలసిన పెట్టుబడి రాబడి లాభము మొదలగు విషయములను గూర్చి తెలియ జేయు శాస్త్రము (Agricultural economics).
వ్యవసితము సం వి నిశ్చయము విణ అనుష్ఠింపబడినది
వ్యవస్థ సం. వి. శాస్త్ర రూపిత నియమము.
వ్యవహర్త సం. వి న్యాయాధిపతి విణ. కార్యకర్త. వ్యవహారికుడు.
వ్యవహారము సం. వి 1 తగవు 2 న్యాయము 3. వాడుక. 4. జూదము.
వ్యవహితము సం విణ. వ్యవధానము కలది
వ్యవాయము సం. వి. 1 తేజము, వెలుతురు 2 మరుగు 3 మైథునము
వ్యష్టి సం. వి ఒంటరివాటు వ్యతి సమష్టి.
వ్యసనము సం వి. 1 ఆపద. 2. ఆసక్తి. 3 పాపము. 4 కుతూహలము, వేడుక. 5. కామ క్రోధాదులవలన బుట్టినదోసము
వ్యస్తము సం. విణ. వేరుపడినది. 2. వ్యాపించినది
వ్యళీకము సం. వి. 1. అప్రియము 2. అసత్యము. 3. బాధ. 4 సిగ్గు 5. అచ్చెరుపాటు 6 మోసపుచ్చుట. 7. కామినీజనాపరాధము
వ్యళీకుడు సం. వి. విటుడు, ముండరి.

# వ్యా

వ్యాకరణము సం వి. శబ్దశాస్త్రము.
వ్యాకీర్ణము సం విణ చెదరినది.
వ్యాకులము సం. విణ. కలతనొందినది.
వ్యాకృతి సం విణ 1. వేరుపరుచుట, విశదపరుచుట. 2. భాషాంతరీకరణము.
వ్యాకోచ కండరము సం వి (జీ.) కీలు నందలి ఎముకలను సమరేఖలోనికి తెచ్చు కండరము. (Extension muscle),

వ్యాకోచమాపకము నం. వి. (భౌతి.) సాధారణముగా తాపప్రభావమున ద్రవముల వ్యాకోచ పరిమాణముల కొలుచు పరికరము (Dilatometer)

వ్యాకోచము నం విణ వికసించినది రూ వ్యాకోశము, వ్యాకోషము (భౌతి) కొన్ని కారణముల వలన వస్తుపరిమాణములలో కలిగిన వృద్ధి (Expansion).

వ్యాఖ్య నం. వి. అర్థ వివరణము.

వ్యాఖ్యాత నం విణ. వ్యాఖ్యానముచేసినవాడు

వ్యాఖ్యాతము నం. వి వ్యాఖ్యానము చేయబడినది, చెప్పబడినది.

వ్యాఖ్యానము నం. వి, వివరణము, అర్థ వివరణము.

వ్యాఘాతము నం, వి. విఘ్నము, దెబ్బ.

వ్యాఘూర్ణనము నం వి. తిరుగుడు

వ్యాఘ్రము నం. వి. వేగి, పులి.

వ్యాజనము నం. వి. కపటము, నెపము.

వ్యాజ్యెము వి. (వ్యాజ్యము) తగవు, దావా.

వ్యాథము నం. వి వాలము.

వ్యాధి నం. వి. తెవులు, రోగము.

వ్యాధితుఁడు నం విణ. తెవులుగొంటు.

వ్యాధినిరోధకాహారము నం. వి. (గృహ) రోగములను దూరముచేయు ఆహారము జీవితమును కాపాడు ఆహారము, ఆరోగ్యమును పెంపొందించు ఆహారము (Protective foods).

వ్యాధుఁడు నం. వి బోయవాడు.

వ్యానము నం వి. వ్యానవాయువు,శరీరమునందంతటను వ్యాపించిన ఒక వాయువు.

వ్యాపనము నం. వి వ్యాపించుట, (భౌతి) ప్రసరణము. (Propogation).

వ్యాపాదనము నం, వి. చంపుట, ద్రోహము తలచుట.

వ్యాపాదితము నం. విణ. చంపబడినది.

వ్యాపార (పు) కమతములు వి. (వ్యవ) పెద్దయెత్తున పాశేరువాంద్రతో రోజువారీ కూలీలతో పెక్కుపశువుల జతలతో గాని, యంత్రముల సహాయముతోగాని లాభము కొరకు సాగుచేయబడు కమతములు(Commercial holdings)

వ్యాపార పవనములు నం. వి., (భూగో.) ఉష్ణమండలములో భూమధ్యరేఖవైపు వీచు పవనములు. (పూర్వము వ్యాపారముచేయు నావికులకు ఇవి ఉపయోగకరముగ నుండుటచే వీనికీపేరు కలిగెను) (Trade winds)

వ్యాపారము నం.వి. 1.పని 2. ఉద్యోగము

వ్యాపారి నం వి మాధ్వబ్రాహ్మణుడు. విణ వ్యాపారము గలవాడు.

వ్యాపృతి నం వి. వ్యాపారము.

వ్యాప్తము నం విణ. 1. వ్యాపించినది. 2. ప్రసిద్ధికెక్కినది,

వ్యాప్తి నం. వి. 1. ప్రసిద్ధికెక్కుట. 2. అతివ్యాప్తి.

వ్యామము నం వి. 1. బార. 2. పొగ.

వ్యామోహము నం. వి. అత్యంతమోహము.

వ్యాయతము నం. విణ, 1. దృఢమైనది 2. దీర్ఘమైనది.

వ్యాయామము నం. వి. 1. క్రమము, 2. సాము. 3. నిలువు. 4. బార.

వ్యాయోగ్యము నం వి. ఒక విధమగు కము.

వ్యాలోలము నం. విణ మిక్కిలిచలించునది.

వ్యావర్తకమూలధనము నం. వి. కార్యక్రమ ప్రచలన మూలధనము, వ్యాపారము యొక్క దైనందిన కార్యక్రమములకు, ముడిసరకులు కొనుటకు. వానిని ఉత్పత్తి చేయుటకు, భవనముల అద్దె, ఉద్యోగుల జీతములు మొదలగు వానికి ఉపయోగపడు మూలధనము.

వ్యావర్తనము సం. వి. 1. వెనుకకు మరలుట. 2 చుట్టుట.

వ్యావహారికుఁడు సం. వి. మంత్రి, సచివుడు.

వ్యావృతము సం. విణ. వెనుకకు మరలినది చుట్టబడినది రూ. వ్యావృత్తము.

వ్యావృతి సం. వి. కోఁవి దయ్యము.

వ్యాసంగము సం వి. మిక్కిలి ఆసక్తి.

వ్యాసక్తుఁడు సం. విణ మిక్కిలి ఆసక్తిగొన్నవాడు.

వ్యాసపీఠము సం. వి. గ్రంథములనుంచి చదువుకొనుట కనుపగు కొయ్య పీఠము.

వ్యాసము సం. వి. విరవి. ఏదేని యొకవిషయమును విరవిగా వ్రాయుట (గణి.) వృత్తకేంద్రముగుండాపోవు జ్యా (ఇది వృత్తములోకెల్ల మిక్కిలి పెద్ద జ్యా) (Diameter).

వ్యాసార్థము సం. వి. (గణి.) వృత్తము యొక్క వ్యాసములో సగము, వృత్తకేంద్రమును, పరిధిలో నొక బిందువును కలుపగానేర్పడు సంళరేఖా ఖండము, (Radius)

వ్యాసుఁడు సం. వి. పరాశరుని కొడుకు, ద్వైపాయనుడు.

వ్యాహతము సం. విణ. 1. మిక్కిలికొట్టబడినది. 2, వ్యర్థమైనది.

వ్యాహారము సం. వి పలుకు, వచనము.

వ్యాహృతము సం. విణ. వచించబడినది.

వ్యాళగ్రాహి సం వి పాములవాడు.

వ్యాళము సం. వి. 1. పాము. 2 పులి. విణ. క్రూరమైనది. రూ వ్యాడము.

## వ్యు

వ్యుత్క్రమ నిష్పత్తి నియమము సం వి. (రసా.) ఒక మూలద్రవ్యపు నియత భాగముతో సంయోగించు మరి రెండు మూలద్రవ్యముల భారములు. ఈ రెండు పరస్పరము సంయోగించునపుడు కూడ భారములు అనునియమము. (Law of reciprocal proportion).

వ్యుత్క్రమము సం. వి. క్రమవిపర్యయము

వ్యుత్క్రమసంఖ్య సం. వి. (గణి) ఒకటిని లబ్ధముగానిచ్చు గుణకము, 6కు 1/6 వ్యుత్క్రమ సంఖ్య (Recpirocal).

వ్యుత్థానము సం. వి. 1. సమాధినుండి మరలుట. 2. ప్రతికూల ప్రవర్తనము. 3 మిక్కిలిలేచుట,

వ్యుత్పత్తి సం వి 1. వ్యుత్పత్త్యర్థము. 2. పాండిత్యము.

వ్యుత్పన్నము సం వి. (గణి.) ఒకదానినుండి పుట్టినది లేదా ఏదేని గణిత పరికర్మ ఫలముగ లభించినది. 36అను అంకె 6 యొక్క వర్గకరణమువలన లభించినది అందుచే 36, 6 యొక్క వ్యుత్పన్నము.

వ్యుత్పన్నుఁడు సం. వి.ణ. శాస్త్రాది జన్య పరజ్ఞాని, పండితుడు.

వ్యుత్పాదకము సం. విణ. వ్యుత్పత్తిని కలిగించునది,

వ్యుషితము సం. వి. చల్ది.

వ్యుష్టము సం. వి. వేగుజాము.

వ్యుష్టి సం. వి. ప్రయోజనము.

## వ్యూ

వ్యూఢము సం. విణ. 1. ఉంచబడినది. వ్యూహముగానుంచబడినది. 2. విశాలమైనది, దట్టమైనది.

వ్యూతి సం. వి. నేత,

వ్యాధయుద్ధము సం. వి. (వరి.) సంకుల సమరము

వ్యూహము సం.వి, 1. మిక్కిలిఊహ, ముగ్గము. 2, సమూహము.

# వ్యో

వ్యోకారుఁడు సం. వి. కమ్మరి, ఇనుమువని చేయువాడు.

వ్యోమకేశుఁడు సం వి శంకరుడు.వ్యు ఆకాశము జట్టుగా గలవాడు

వ్యోమగామి సం వి. గ్రహాంతరములకు అంతరిక్ష నౌకలో (Space ship) ప్రయాణము చేయు వ్యక్తి (Austronaut).

వ్యోమచారి సం. వి. పక్షి వ్యు. ఆకాశమున చరించునది.

వ్యోమధూమము సం. వి. మేఘము.

వ్యోమము సం. వి. 1. ఆకసము. 2. నీరు.

వ్యోమయానము సం వి. ఆకాశమునందు తిరుగు విమానము.

# వ్ర

వ్రంత వి. పల్లము.

వ్రక్క వై. వి, చెక్క. ఖండము.

వ్రక్కవాఱు క్రి చీలు, నరుకుఁబడు.

వ్రచ్చు వై. క్రి. చీల్చు.

వ్రజము సం. వి. 1, పసులమంద. సమూహము. 2. త్రోవ. 3. పసులకొట్టము.

వ్రణము సం. వి గాయము, గద్ద, కురుపు.

వ్రతము సం. వి. నియమము, నోము, ఉపవాసాది పుణ్యకర్మము.

వ్రతి సం. వి వ్రతము కలవాడు.

వ్రయ్యు వై. క్రి. బ్రద్దలగు.

# వ్రా

వ్రాఁత వి. దస్తూరి, లేఖనము.

వాతము సం. వి సమూహము, గుమి.

వ్రాత్యుఁడు సం. వి. ఉపనయనాది సంస్కారములు లేని బ్రాహ్మణుడు.

వ్రాయసము వి. వ్రాత, లేఖ.

వ్రాయి వి, 1. అక్కరము. 2. గీటు. 3. పాచికమీది బొట్టు.

వ్రాలు వి. (వ్రాయి బహువచనము) సంతకము (చేవ్రాలు). క్రి. 1. క్రిందికి దిగు 2. తగ్గు, 3. ఒరగు.

# వ్రీ

వ్రీడ సం. వి. బిడియము, సిగ్గు.

వ్రీలు క్రి. చీలు.

వ్రీలువడు క్రి. దౌర్బల్యముపొందు.

వ్రీహి సం. వి. 1. వడ్లు. 2. ధాన్యము.

వ్రీహ్యాగారము సం. వి. 1 గాదె. 2. వడ్లకొట్టు.

# వ్రే

వ్రే వై. వి. గొల్లకులము సం వృష్ణిః.
వ్రేఁక వి. అతిశయము, హెచ్చు.
వ్రేఁకటి వి. గర్భము, చూలు.
వ్రేఁకన వి బరువు.
వ్రేఁగు వి బరువు.
వ్రేఁడు వై. వి గొల్లడు సం వృష్ణిః.
వ్రేఁత వై. వి. గొల్లది.
వ్రేపల్లియ వి. గొల్లపల్లె.
వ్రేలు క్రి. క్రిందికి ఊఁగాడు వి. అంగుళి.
వ్రేలుచు క్రి. కడుగు, వ్రేలఁజేయు.
వ్రేల్మి వి. వేలిమి. హోమము, యజ్ఞము.
వ్రేల్మిడి వి. చిటిక, త్రుటి.

# శ

శ ఒక అక్షరము.

శంక నం వి సందేహము భయము. విచారము.

శంకరుఁడు నం వి శివుడు. విణ. సుఖమును గలుగజేయువాడు.

శంకించు నం క్రి. సందేహించు, భయపడు రూ. శంకిల్లు.

శంకితుఁడు నం. విణ సందేహమందినవాడు భయమందినవాడు.

శంకువు నం వి (గణి.) ఒక స్థిరబిందువు మీదుగా పోవుచు ఒక స్థిరరేఖను ఖండించుచు చలించెడి సరళరేఖచే నేర్పఱుపబడిన ఘనరూపము ఒక భుజమును ఆధారముగా గొని దానికి సాపేక్షముగ నొక త్రిభుజమును చుట్టు త్రిప్పినచో ఏర్పడు నొక ఘనవస్తువు. (Cone).

శంకుచ్ఛేదము నం. వి. (గణి.) శంకువును ఒక సమతలము ఖండించునపుడు ఏర్పడు ఆకారము (Conic section).

శంకాకారవృక్షము నం. వి. (వృక్ష) చాల ఎత్తుగా శంకువు ఆకారముగా పెరుగు వృక్షము (Conifer). ఉదా పైరు దేవదారు మొదలగునవి

శంఖనఖము నం. వి. నత్తగుల్ల.

శంఖపాణి నం. వి. విష్ణువు. వ్యు. శంఖము చేతియందు ధరించువాడు.

శంఖము నం. వి 1 గుల్ల 2. నొసటి యెముక. 3. ఒక నిధి

శంఖిని నం. వి. స్త్రీ జాతి విశేషము.

శంప నం. వి మెరుపు రూ సంప.

శంపాలత నం. వి. మెరుపు తీగ.

శంబరారి నం. వి, మన్మథుడు.

శంబలము నం. వి 1. దారిబత్తెము. 2. మాత్సర్యము. రూ. 3 సంబళము.

శంబూకము నం. వి. 1. కప్ప చిప్ప 2 నూక, రూ, శంబుకము.

శంభళి నం. వి. కుంటెనకత్తె.

శంభువు నం. వి. 1. బ్రహ్మ. 2. విష్ణువు. 3. శివుడు. 4. బుద్ధుడు. రూ. శంభుడు.

శంస నం. వి. 1. మాట. 2. స్తోత్రము. 3. ఇచ్ఛ.

శంసనము నం. వి. 1. చెప్పుట. 2. స్తుతించుట. 3. ఇచ్ఛించుట

శకటము నం. వి. 1. బండి. 2. శకట వ్యూహము.

శకము నం. వి 1. ఒకని పరిపాలనతో జేరిన సంవత్సరము. 2. ఒక జాతి.

శకలము నం. వి. 1. చెట్టుపట్ట, నార. 2. ఖండము.

శకుంతము నం. వి. పక్షి. రూ. శకుంతి.

శకునము నం వి. 1. శుభసూచక నిమిత్తము. 2. పక్షి.

శకుని నం. వి. 1. పక్షి. 2. దుర్యోధనుని మేనమామ.

శకులము నం. వి బేడిసచేప.

శకృత్తు నం వి విష్ఠ.

శక్తి నం వి (గణి., భౌతి) అచల స్థితిని గాని, ఒకేదిక్కుగా చలించెడి స్థితినిగాని కలుగజేయు బలము, (శక్తి వివిధ రూపములలో నుండును ఉదా. యాంత్రిక, తేజః, విద్యుత్. ఉష్ణ, అయస్కాంత, రసాయనిక, శబ్దశక్తులు మొదలైనవని. (Energy) నం. వి. 1. బలిమి 2. చిల్లకోల, 3. పార్వతి ఇచ్ఛాది శక్తులు మూడు (జ్ఞాన, క్రియ, ఇచ్ఛ). ఉత్సాహాది శక్తిత్రయము (ఉత్సాహ శక్తి ప్రభుశక్తి, మంత్రశక్తి)

శక్తిజనక పదార్థములు నం వి. (గృహ) శక్తిజనకాహారము 2. వేడిమి పుట్టించు ఆహారము 3. శాకనిచ్చు ఆహారము. (Energy giving foods)

శక్తిధరుఁడు నం. వి. కుమారస్వామి.

శక్తిపరిమాణము నం వి. (గృహ) విశాలత, యోగ్యత సామర్థ్యము, తాహతు (Capacity or ability)

శక్తిసమతులనము నం వి (రాజ.) 1. వివిధ రాష్ట్ర బల తోలనము 2. పరాక్రమ సమతోలనము. (Balance of power)

శక్తుఁడు నం. విశే. శక్తిగలవాడు.

శక్మ నం.వి (గణి.భౌతి.) ఒక బలక్షేత్రము లేదా విద్యుత్‌క్షేత్రములో నుండు ఏదేని బిందువు యొక్క శక్మ అనగా ద్రవ్య సంచయము యొక్కగాని ఒక ఏకాంకమును ఆ బిందువు వద్దకు తెచ్చుటకగుపని. (potential)

శక్యము నం. విశే. సాధ్యము. అలవి.

శక్రుఁడు నం. వి ఇంద్రుడు. వ్యు దుష్టజయమందు శక్తుడు.

శచి నం. వి ఇంద్రుని భార్య.

శఠుఁడు నం. విశే. కుత్సితుడు. మోసకాడు.

శణము నం. వి. జనుము 2 బాణము

శతకము నం. వి. నూరు పద్యములుగల గ్రంథము విశే. నూరు సంఖ్యగలది.

శతము నం. వి. పంద, నూరు.

శతకోటి నం వి. వజ్రాయుధము,

శతఘ్ని నం వి. 1. నాలుగు మూరల విడివి గల ఇనుపముండ్లకఱ్ఱ 2 ఫిరంగి.

శతధృతి నం. వి. 1 బ్రహ్మ. 2 ఇంద్రుడు.

శతపత్రము నం వి. తామర.

శతపది నం వి కట్లజెఱ్ఱి రోకటిబండ

శతభిషము నం. వి. ఒక నక్షత్రము.

శతమన్యువు నం.వి ఇంద్రుడు. వ్యు. నూరు యజ్ఞములుచేసినవాడు

శతమానము నం. వి. 1. నూటికొలది. 2. పుస్తె. మంగళసూత్రము.

శతహ్రాద నం. వి. 1. మెరుపు 2. వజ్రాయుధము.

శతాంగము నం. వి. యుద్ధరథము.

శతానందము నం. వి విష్ణురథము.

శతానందుఁడు నం వి. 1 బ్రహ్మ,2.విష్ణువు.

శతాంశపద్ధతి నం. వి. (గణి.) ఒక్కొక్క భాగము నూరు విభాగములుగా చేయబడెడి పద్ధతి. (Centismal system).

శతారము నం వి. వజ్రాయుధము.

శతావధానము నం. వి పందమందికి కోరిన విషయములపై పద్యములను ఆశువుగా చెప్పు అవధానప్రక్రియ. (అట్టి ప్రజ్ఞ కలవాడు శతావధాని).

శత్రర్థకము నం.వి. (వ్యాక.)వర్తమాన కాలబోధకమైన అసమాపకక్రియ, ఉదా.వచ్చుచుండెను. వ్యవహారమున 'తు' అనునది చేర్చివాడుదురు. ఉదా. వస్తున్నాడు, పోతున్నాడు).

శత్రువు నం. వి. పగతుడు.

శని సం. వి. నవగ్రహములలో పడవ గ్రహము (Saturn).

శనివారము సం. వి. పడవ వారము (ఆది వారము మొదలుకొని).

శనైశ్చరుఁడు సం. వి. శని వ్యు. మెల్లగా నడచువాడు,

శపథము సం. వి. ఒట్టు, రూ. శపనము.

శపించు సం. క్రి. తిట్టు

శఫరి సం. వి. ఎగసిపడెడు చేప రూ. శఫరము

శబరుఁడు సం. వి. 1. బోయ 2. శివుడు.

శబరాలయము సం. వి. 1. బోయపల్లె, 2. పక్కణము

శబలము సం. వి. చిత్రవర్ణము.

శబ్దము సం. వి. 1. ధ్వని 2. వ్యాకరణ శిక్షితమయిన పదము

శబ్దగ్రహము సం. వి. 1. చెవి 2. శబ్దజ్ఞానము.

శబ్దశాస్త్రము సం. వి. (వ్యాక.) వ్యాకరణ శాస్త్రము.

శమంతకమణి సం. వి. విష్ణువాసము నందలి మణి.

శమనము సం. వి. శాంతి పథము. రూ. శామనము.

శమనుడు సం. వి. యముడు.

శమము సం. వి. శాంతి, కామక్రోధాదులు లేక యడగి యుండుట.

శమించు సం. క్రి. అడగు.

శమి సం. వి. జమ్మిచెట్టు విశే. శమముగల వాడు.

శమీధాన్యము సం. వి. కాయధాన్యము

శయనము సం. వి. శయ్య, నిద్ర

శయనీయము సం. వి. శయ్య. వ్యు. శయనింపదగినది.

శయము సం. వి. 1. శయ్య 2. చెయి. 3. పాము.

శయాళువు సం. వి. పెనుబాము విశే. నిద్రపోతు రూ. శయతుడు

శయ్య సం. వి. 1. పడక, 2. పదగుంఫనము. 3. విధము.

శరజన్ముఁడు సం. వి. కుమారస్వామి.

శరణము సం. వి. 1. రక్షకము. రక్షణము, 2. గృహము

శరణార్థుల పునరావాసము సం. వి. (చరి., రాజ.) ప్రభుత్వ పీడనవలన ఇతర దేశము లకుతరలివచ్చిన అల్పసంఖ్యాక వర్గప్రజల శరణు చొచ్చిన దేశము వసతి ఉద్యోగ సౌకర్యములు, జీవనాధారములు, ఏర్పరుచుట. ఉదా. పాకిస్తాన్ నుండి తరలివచ్చిన అల్పసంఖ్యాకవర్గములకు భారతదేశము కల్పించిన పునరావాస వసతులు.

శరణార్థులు సం. వి. (రాజ., శాస.) చూ. కాందిశీకులు.

శరణు సం. వి. 1. రక్షకము, శరణాగతి. 2. నమస్కారము రూ. శరణము.

శరణుచొచ్చు మి. విశే. శరణాగతి పొందు,

శరణ్యుఁడు సం. విశే. శరణు చొరదగిన వాడు.

శరత్తు సం. వి. 1. ఒక ఋతువు (ఆశ్వయుజ కార్తిక మాసములు) వెన్నెలకాలము. 2. సంవత్సరము. రూ. శరద.

శరత్‌దారువు సం. వి. (వృక్ష) కాండములో శరత్కాలమున ఉత్పత్తియైన దారువు. (Autumn wood)

శరధి సం. వి. 1. విల్లు. సముద్రము.

శరభము సం. వి. 1. మీగండ్ల మెకము. 2. ఒంటెపిల్ల.

శరము సం. వి. 1. బాణము. 2. రెల్లు, 3. జలము.

శరవ్యము సం. వి. గురి, లక్ష్యము.

శరారి సం. వి. బాతు.

శరారువు సం. విశే. ఘాతకము, చంపునది.

శరావము సం. వి. 1. మూకుడు. 2. మూక.

శరీర నిర్మాణము సం. వి. (జీవ.) శరీరము యొక్క అవయవములలోపలినిర్మాణము. (Anatomy-Internal anatomy) బాహ్య నిర్మాణము (External morphology).

శరీరనిర్మాణ విజ్ఞానము సం. వి. (జీవ) ఒక ప్రాణియొక్క అవయవముల లోపలి నిర్మాణమునకు సంబంధించిన జ్ఞానము (Anatomy).

శరీరము సం. వి. దేహము.

శరీరవర్ధకములు సం. వి. (గృహ.) దేహాభివృద్ధినిచేయు ఆహార పదార్థములు శరీరమును పెంపొందజేయు పదార్థములు. పెరుగుదలకు తోడ్పడు పదార్థములు (Body Builders).

శరీరాభివృద్ధి సం. వి. (గృహ) అవయవాభివృద్ధి శరీరము పెరుగుట. (Physical growth).

శరీరి సం. వి. ప్రాణి

శర్కర సం. వి. 1. చక్కెర. 2. మొరము 3. వ్రయ్య.

శర్కరిజము సం. వి. (వృక్ష.) పిండి పదార్థమును చక్కెరగాజేయు మండలము (Diastase).

శర్మము సం. వి సంతోషము

శర్వరి సం. వి రాత్రి.

శర్వుడు సం. వి. శివుడు వ్యు. ప్రళయ కాలమున భూతముల హింసించువాడు.

శలకము సం. వి. సాలెపురుగు.

శలభము సం. వి. మిడుత.

శలము సం. వి. 1. ఏదుపందిముల్లు 2. ఏదు పంది. రూ. 1. శలలము 2. శలవి

శలాక సం. వి. 1.గొడుగు లోనగువాని కమ్మి వీణ మొదలగువాని వాయించు క్రోడువు. 2.బాణము. 3. ఎముక. 4. ఏదు పంది.

శలాకలు, శంకువులు సం. వి. (జం) కంటిలోని మూర్తి పటము యొక్క బయటి పొరలోనున్న అధిచ్ఛద జీవకణములు. (వీనికి శీఘ్రగ్రహణశక్తి గలదు) (Rods and cones).

శలాటువు సం. విణ పండనిది (కాయ).

శల్కపత్రములు సం. వి (వృక్ష) ఇవి సాధారణముగా భూమిలోనున్న కాండముల కణుపులపై పొలుసులవలె నుండును. వీనికి పత్రహరితముండదు(Scale leaves)

శల్కము సం. వి. 1. ఖండము 2. నార. 3.చేప పొలుసు.

శల్కములు సం వి. (వృక్ష) కొన్ని మొగ్గలకు రక్షణ కొఱకై పైనిగోధమరంగుగో ఎండిపోయి అగుడు బిరుసైన నిర్మాణములు. (Scales). (ఇవి సాధారణముగా శీతకాలమున ఆకు రాలు మొక్కల కుండును).

శల్యపృష్ఠము సం వి (జం) వీనిచర్మములపై ముండ్లు అధికముగా నుండును. ఇవి సముద్రములో నుండు జంతువులు ఈ శల్యపృష్ఠము జంతువులలో ప్రత్యేకమైన రక్తప్రసరణ మండలముగాని విసర్జకమండలము గాని లేదు (Echinodermata). ఉదా శల్య తారక. (Star-fish)



శల్యభస్మము సం. వి (వ్యవ) ఎముకల బూడిద. (Bone ash).

శల్యము సం వి. 1. ఎముక 2 బాణము, చిల్లకోల 3 విషము. 4 మేకు 5 ఏదు పందిముల్లు.

శల్యములు సం. వి. (వృక్ష) మొగ్గగాని, శాఖగాని, ముళ్లుగామారిన నిర్మాణములు (Spines)

శల్యాధిస్ఫురితము సం. వి. (వృక్ష) ఎముకల పొడినుండి తయారుచేయబడు అధి

స్ఫురితము (Bone super-phosphate)

శవము నం. వి. 1. పీనుగు. 2. జలము. వి. నబము

శశకము నం. వి. కుందేలు. రూ శశము.

శశధరుఁడు నం. వి. చంద్రుడు. వ్యు. శశమును ధరించువాడు.

శశాంకుఁడు నం. వి. చంద్రుడు.

శశాదనము నం. వి. డేగ. వ్యు. కుందేళ్లను చంపునది.

శశోర్ణము నం. వి. కుందేటి వెంట్రుకలతో నేసిన కంబళి.

శష్కులి నం. వి. చక్కిలము. బయటిచెవి.

శష్పము నం. వి. 1. లేతకసవు. 2. ప్రతిభాహాని

శసనము నం. వి. యజ్ఞమందలి పశువధము.

శస్తము నం. వి. శుభము. విశే. శుభకరము. స్తుత్యము. శ్రేష్ఠము.

శస్త్రము నం. వి. 1. ఆయుధము 2. ఇనుము.

శస్త్రి నం. వి. చురకత్తి. మాదిగకత్తి విశే. శస్త్రముగలవాడు.

## శా

శాంకరుఁడు నం. వి. 1. వినాయకుడు. 2. కుమారస్వామి వ్యు. శంకరుని కొడుకు.

శాంతము నం. విశే. శాంతిబొందినది. నం. వి. 1. కామ క్రోధాది రాహిత్యము. 2. ఉపశమనము. 3. తొమ్మిది రసాలలో నొకటి

శాంతి నం. వి. శమనము

శాంబరి నం. వి. 1. మాయ 2. రతీదేవి.

శాంభవి నం. వి. పార్వతి.

శాకకృషి నం. వి. (వ్యావ.) కూరగాయల తోటలను పెంచుట (Vegetable cultivation).

శాకము నం. వి. 1. కూర. 2 టేకు చెట్టు. 3. ఒక ద్వీపము.

శాకిని నం. వి. ఒక తెగ పిశాచ స్త్రీ

శాకునము నం. వి. శకున శాస్త్రము.

శాకునికుఁడు నం. వి. పక్షుల వేటకాడు.

శాక్కరము నం. వి. ఎద్దు రూ శాక్వరము.

శాక్తుఁడు నం. వి. శక్తి మత ప్రవర్తకుడు. రూ శాక్తేయుడు.

శాక్యముని నం. వి. శాక్య బుద్ధదేవుడు.

శాక్యసింహుఁడు నం. వి. శాక్యముని, బుద్ధుడు.

శాఖ నం. వి. 1. చెట్టుకొమ్మ 2. వేదభాగము 3. చేయి.

శాఖలేనిమంత్రి నం. (రాజ.) ప్రత్యేక పరిపాలనశాఖకు నిర్దేశింపబడని మంత్రి (Minister without Portfolio)

శాఖానగరము నం. వి. ఉపనగరము, పేట

శాఖామృగము నం. వి. కోతి. వ్యు. చెట్ల కొమ్మలపై తిరుగు మృగము.

శాఖావిన్యాసము నం. వి. (వృక్ష) ప్రకాండముపై కొమ్మలు బయలుదేరు తీరు (Mode of branching).

శాఖి నం. వి. 1. వృక్షము. 2. వేదము. వ్యు. శాఖలు కలది.

శాటి నం. వి. 1. కాషాయవస్త్రము. 2. దుప్పటి. రూ శాటిక.

శాఠ్యము నం. వి. శఠత్వము, కపటము.

శాణము నం. వి. సానరాయి. రూ శాణి.

శాతకుంభము నం. వి. బంగారు వ్యు. శతకుంభ పర్వతమున బుట్టినది.

శాతము నం. వి. సుఖము. విశే. 1. వాడి చేయబడినది 2. కృశించినది. (గణి.వ్యాప.) రెండు రాసులమధ్యగల నిష్పత్తి నినూరుచే గుణింపగా వచ్చు ఫలము. (Percentage)

శాతోదరి నం. వి. 1. కృశించిన కడుపుగల స్త్రీ. 2. స్త్రీ.

శాత్రవము నం. వి. 1. శత్రుత్వము. 2. శత్రుసమూహము.
శాత్రవుఁడు నం. వి. శత్రువు.
శాద్వలము నం. విశే. లేతపచ్చిక కలది. రూ. శాడ్వలము.
శాపము నం. వి. 1. తిట్టు, 2. ఒట్టు,
శాబకము నం. వి. కూన. రూ. శాబము,
శాబ్దికుఁడు నం. వి. వైయాకరణుడు, శబ్దశాస్త్రము తెలిసినవాడు.
శామనము నం. వి. 1. శమనము, 2 వధము
శారద నం. వి. 1. సరస్వతి. 2. పార్వతి,
శారదము నం. వి. సంవత్సరము. విశే. శరత్కాలమున బుట్టినది.
శారము నం. వి. 1. చిత్రవర్ణము. 2. జూదపుసారె.
శారి నం. వి. గోరువంక రూ. 1, శారిక. 2. జూదపు సారె.
శారిఫలము నం. వి. నెత్తపలక, చదరంగపు పలక.
శారీరము నం. వి. కంఠస్వరము.
శార్ఙ్గము నం వి విష్ణువు విల్లు, విల్లు, వ్యు శృంగముతో జేయబడినది.
శార్ఙ్గి నం. వి. విష్ణువు. వ్యు శార్ఙ్గము కలవాడు,
శార్దూలము నం. వి. పులి.
శార్వరము నం. వి కటిక చీకటి
శార్వరి నం. వి. 1, రాత్రి. 2, అరువది సంవత్సరములలో నొకటి,
శాల నం. వి. ఇల్లు,
శాలి నం. అవ్య. ఒక ప్రత్యయము (ధీశాలి) నం. వి. వరి.
శాలికుఁడు నం. వి. సాలెవాడు.
శాలీనుఁడు నం. విశే. దిట్టతనములేనివాడు
శాల్మలి నం. వి. 1, బూరుగచెట్టు, 2. సప్తద్వీపములలో నొకటి.
శాశ్వతదంతములు నం. వి. (గృహ.) పాలపండ్లు ఊడిన తర్వాత వచ్చినపండ్లు. (parmanent teeth).
శాశ్వతమనోవర్తి వి శాస. భర్తవిడాకులిచ్చిన భార్యకు శాశ్వత పోషణార్థమై యిచ్చు ధనము.
శాశ్వతము నం. విశే. నాశనములేనిది.
శాశ్వత (మైన) శిస్తువిధానము వి. (చరి. శాస.) బ్రిటిషు ఈస్టు ఇండియా కంపెనీ రెండవ గవర్నరుజనరలు అయిన "కార్న వాలీస్" ప్రభువు, వంగ,బీహారురాష్ట్రములలో క్రీ శ. 1793 నం.లో ప్రవేశపెట్టిన భూమి పన్నుల మదింపు. ఈస్టు ఇండియా కంపెనీ ప్రభుత్వమునకు. జమీందారులెల్ల తమ అధీనములోనున్న భూములపై సాలు కెంత శిస్తు చెల్లించవలయునో శాశ్వతముగానిర్ణయించిరి. (Permanent settlement)
శాసకుఁడు నం. విశే. శాసించువాడు.
శాసనకర్తృత్వము నం. వి. (రాజ శాస.) ప్రభుత్వాంగములలో నొకటి. రాజ్యములో శాసనములు చేయు అధికారవర్గము, శాసనసభలు. (Legislatures)
శాసనమండలి నం వి (రాజ.) ఎగువ సభ (Legislative Council).
శాసనము నం. వి. రాజుచేసిన దానముకై వ్రాసియిచ్చిన కవులు. చట్టము, 2. ఆజ్ఞ. 3. శిక్షించుట,
శాసనసభలు నం వి. (రాజ., శాస.) శాసనములుచేయ,సవరించు సభలు.(ప్రజామోదముతో ఎన్నుకొనినవైనవో, ప్రభుత్వ పరిపాలనా విధానమును, ఆర్థిక విధానమును పరిశీలించు అధికారము లుండును).
శాసించు నం. క్రి 1. ఆజ్ఞాపించు 2.శిక్షించు
శాస్త నం. విశే. శాసించువాడు.
శాస్తి నం. వి 1. శిక్ష, 2. పలుబడి. 3. ఆజ్ఞ. 4. శాస్త్రము.

శాస్త్రజ్ఞుఁడు సం. వి. శాస్త్రీయ పద్ధతిని పాటించి వస్తుతత్వమును అన్వేషించు శక్తి కలవాడు.(Scientist).

శాస్త్రము సం. వి. నియమిత గ్రంథము. సం. వి. (గణి., భౌతి., రసా.) గమనించిన విషయములను క్రోడీకరించి విషయతత్వ నిర్ణయముచేసి సూత్రముల నిర్మించి ధర్మముల నుగ్గడించినది. (Science).

శాస్త్రవిదుఁడు సం. విశే. శాస్త్రము తెలిసిన వాఁడు.

శాస్త్రి సం. వి. శాస్త్రము తెలిసినవాడు.

శాస్త్రీయము సం. విశే. శాస్త్రసంబంధమైనది

శాస్యము సం. విశే. శాసింపదగినది.

## శి

శింఘాణము సం. వి. 1 ఇనుప చిట్టెము 2. చీమిడి. రూ. సింహాణము.

శింజ సం. వి. 1. వింటినారిమ్రోత 2.అందెల చప్పుడు.

శింజానము సం. విశే. శింజా ధ్వనిగలది.

శింజితము సం. వి. భూషణముల ధ్వని.

శింజిని సం. వి. 1 వింటినారి. 2 కాలియందె.

శింశుప సం. వి. ఇరుగుడు చెట్టు

శింశుమారము సం. వి. 1.మొసలి.2.నీరుకోతి

శిక్యము సం. వి. కావడి యుట్టి, ఉట్టి.

శిక్ష సం. వి. 1. దండనము. 2. విద్యాభ్యాసము 3 దండన. 4.శాస్తి (Punishment)

శిక్షించు సం. విశే. 1. శాసించు. 2. మందలించు. 3 దిద్దు,

శిక్షితుఁడు సం. విశే. 1. దండింపబడినవాడు. 2. నేర్పరి.

శిఖ సం. వి. 1. జుట్టు. 2. సిగ. 3. కొన

శిఖాతరువు సం. వి. దీప స్తంభము.

శిఖావంతుఁడు సం. వి. అగ్ని. సం. విశే. జుట్టుముడికలవాడు.

శిఖావళము సం. వి. నెమలి.

శిఖండకము సం. వి. నెమలిపురి, పిల్లి జుట్టు రూ. శిఖండము.

శిఖండి సం. వి. 1. ధృష్టద్యుమ్నుని అన్న, 2. నెమలి. 3. నెమలిపురి. 4. కోడి 5. బాణము

శిఖరము సం. వి. 1. కొండకొన. 2. చెట్టుకొన. 3. కొన.

శిఖరి సం. వి 1. కొండ. 2. చెట్టు.

శిఖరిణి సం. వి 1. చల్లపులుసు. 2.ఉత్తమస్త్రీ 3 రోమావళి. 4. సిగరి. 5. వృత్తవిశేషము

శిఖి సం. వి. 1. అగ్ని. 2. నెమలి. 3.కోడి. 4 చెట్టు 5. బాణము.

శిఖిముఖి సం. వి. చెకుముకిరాయి.

శిఖివాహనుఁడు సం. వి. కుమారస్వామి.

శితము సం. విశే. 1. వాడియైనది. 2. బక్కయైనది.

శితాగ్రములు సం.వి. (వ్యావ.) గులాబి, రేగు మొదలగు మొక్కలకుండు ముళ్ళు (Prickles).

శితి సం. విశే. 1. తెల్లనిది. 2 నల్లనిది.

శితికంఠుఁడు సం. వి. శివుడు. వ్యు. నల్లని కంఠము గలవాడు.

శిథిలము సం. విశే. సంధులు వదలినది, శ్లథము.

శిపివిష్టుఁడు సం. వి. 1. విష్ణువు. 2. శివుడు 3. బట్టతలవాడు. 4. కుష్ఠురోగి.

శిఫ సం. వి. ఊడ. పడుగొమ్మ.

శిబిక సం. వి. పల్లకి.

శిబిరము సం. వి. దండు విడిసినచోటు.

శిర సం. వి. 1. నరము. 2 ఈనె

శిరము సం. వి. 1 తల. 2 శిఖరము, 3 పైభాగము, రూ. శిరసు, శిరస్సు.

శిరసావహించు నం. క్రి. తలదాల్చు.

శిరస్కము నం. వి. 1. బోమిడికము, 2. కిరీటము.

శిరస్త్రము నం. వి. శిరస్త్రాణము. ఇనుప టోపి.

శిరాలుఁడు నం. విణ. లావు నరములుగల వాఁడు.

శిరీషము నం. వి. దిరిశెనము.

శిరోగృహము నం. వి. చంద్రశాల.

శిరోజము నం. వి. తలవెంట్రుక.

శిరోదంతి నం. వి. (వృక్ష.) సూదిగా దంతములవలెనున్న పత్రాగ్రము. (Cuspidate)

శిరోధి నం వి. మెడ.

శిరోరుహము నం. వి. తలవెంట్రుక.

శిరోవారము నం. వి. (గణి.) ఒక త్రైతిజబుజు రేఖమీద నుంచబడినది ఇది కుండలీకరణమువలె ప్రయోగింపబడును. $a+\overline{b+c}$ ఈ $(\overline{b+c})$పై అడ్డుగీత శిరోవారము. (Vinculum).

శిల నం. వి. రాయి. 2. సెలయేరు. దూ. సిల.

శిలాతైలము నం. వి. (గృహ.) పెట్రోల్. ఉన్ని, సిల్కు, బట్టలను శుభ్రముచేయుటకు మరకలుతీయుట కుపయోగించు నూనె శిలాతైలములోని సులభముగా ఆవిరి అయ్యెడి భాగము. (Petrol).

శిలాద్రవము నం.వి. (భౌతి.) అగ్ని పర్వతము నుండి రాయికరిగివచ్చు ద్రవము (Lava).

శిలాపుత్రము నం. వి పొత్రపురాయి. రుబ్బు రాయి.

శిలాయుగము నం. వి. (చరి.) (ఆది) మానవుడు రోజు వాడు పనిముట్లను ఆయుధములను తయారుచేయుటకు రాతిని ఉపయోగించిన కాలము.

శిలావిశ్లేషము నం. వి. (భౌతి.) రాళ్లు శిథిలములై చూర్ణముగానగుట. (Disintegration of rocks)

శిలాస్ఫటికము నం. వి. (భూగ.) ఆరు కోణములుగలస్వచ్ఛమగుస్ఫటికము. (Quartz) (దీనిలో శైలము (si). ఆమ్లజని ($O_2$) ఉండును). (Rock crystal).

శిలి నం. వి. 1. ఆడుఎల్లి. 2 బాణము.

శిలీంధ్రపుతుట్టె వి. (వృక్ష.) సన్నని సూక్ష్మ జంతువులచేసే ఏడి (Hyphae) శిలీంధ్రము యొక్క ముఖ్య శరీర భాగముగనుండు నిర్మాణము (Mycelium of the fungus)

శిలీంధ్రము నం. వి. 1. అరటిపూవు. 2 పుట్టగొడుగు.

శిలీంధ్రములు నం. వి (వృక్ష.) సూత్రోద్భిదముల తరగతిలో నొక ఉపతరగతికి చెందిన ఉద్భిదములు (వీనికి పత్రహరితము ఉండదు, అందుచే నివి పరాన్నభుక్కులుగను. పూతి భుక్కులుగను జీవించుచుండును.) (Fungi (sl) Fungus)

శిలీంధ్రశాస్త్రము నం. వి. (జీవ.) శిలీంధ్రములు మొదలగు సూక్ష్మ జీవులనుగూర్చి తెలియజేయుశాస్త్రము (Mycology).

శిలీముఖము నం. వి. 1. బాణము. 2. తుమ్మెద.

శిలోచ్చయము నం. వి. కొండ.

శిల్పము నం. వి. చిత్తరువువ్రాయుట, శిల్పుల పని మొదలగునవి.

శిల్పి నం విణ. శిల్పకారుడు. బొమ్మలు చెక్కువాఁడు.

శివ నం. వి. 1. పార్వతి. 2. నక్క.

శివంకరుఁడు నం. విణ. శుభకరుడు.

శివకము నం. వి. 1. పసులగట్టు గూటము. 2. మేకు.

శివతాతి నం. విణ. శివశంకరుడు.

శివము నం. వి. 1. శుభము. 2. సుఖము 3. మోక్షము.

శివుఁడు నం. వి. ఈశ్వరుడు. ముక్కంటి.

శిశుకము నం. వి. 1, శిశువు. 2 ఉలుచమీను 3. మొసలి.

శిశుకీటకము నం వి. (జం.) రెక్కలు పునరుత్పాదకావయవములు లేకుండ, ప్రౌఢ కీటకమువలెనుండు కీటకదశ (Nymph).

శిశువు నం. వి. బిడ్డ.

శిశుసంరక్షణ నం వి. (గృహ.) చంటిబిడ్డను జాగ్రత్తగా పెంచుట (Child care).

శిశుసంరక్షణశాల నం. వి. (గృహ.) పసిబిడ్డలకు కావలసిన సంరక్షణలుచేయు వైద్యశాల, (Baby Clinic).

శిష్టి నం. వి. ఆజ్ఞ.

శిష్టుఁడు నం.విశే. 1. సదాచార సంపన్నుడు. 2. విధేయుడు.

శిష్యుఁడు నం. వి. విద్యకొరకుచేరి సేవించుచు శిక్షింపబడువాడు.

శిస్తు హిం. వి. (వ్యవ., శాస.) భూస్వామికి కౌలుదారుగా నిర్ణయింపబడిన అద్దె, పన్ను. (ధనరూపముగాగాని ధాన్యరూపముగాగాని) (Rent).

## శీ

శీకరము నం. వి. 1. తుంపరము. 2, ఏనుగు తొండము. శివఁపుట్టు మనము.

శీఘ్రపాతి నం. వి (వృక్ష) మొగ్గనుండి విప్పుకొనిన వెంటనే రాలిపోవునట్టిది. (ఆకులు. మొ.) (Caducous).

శీఘ్రము నం. వి. వడి. విశే. వడిగలగి,

శీత నం. వి నాగటిచాలు. రూ. సీత.

శీతకము నం. వి. చలికాలము నం. వి. (రసా.) ద్రవబాష్పములను శీతలీకరించి ద్రవముగా మార్చుట కుపయోగించు పరికరము, (Condenser). మా. స్వేదకము.

శీతకరుఁడు నం. వి. చంద్రుడు. చలివెలుగు.

శీతకారు మి. వి. (వ్యావ.) డిసెంబరు జనవరి నెలలు, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ అను కార్తెలు. హేమంత ఋతువు (Winter season).

శీతకిరణుఁడు నం, వి, చంద్రుడు.

శీతనగము నం వి. హిమాచలము.

శీతభానుఁడు నం, వి. చంద్రుడు,

శీతమండలము నం. వి. (భూగో.) ఉత్తరార్ధములో ఆర్కిటిక్ వృత్తములోని ప్రాంతములు, దక్షిణార్ధములో అంటార్కిటిక్ వృత్తములోని ప్రాంతములు. ఈ ప్రాంతములలో సూర్యకిరణము లెల్లప్పుడు చాల ఏటవాలుగ ప్రసరించుటచే వేసవి కాలములోకూడ చల్లగనే యుండును. చలికాలములో విపరీతమైన చలిగనుండును.

శీతమయూఖుఁడు నం. వి. చంద్రుడు వ్యు. చల్లని కిరణములు కలవాడు

శీతము నం. విశే. 1. చల్లనిది. 2. అలసమైనది.

శీతము నం. వి (జం.) అలలవలె కదులుచుండుపొర.(Undulating membrane).

శీతయుద్ధము నం. వి. (చరి., రాజ.) ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము రష్యాకమ్యూనిస్టు కూటమి, పశ్చిమ మిత్రమండలి కూటమి మధ్య ప్రపంచములో తమ ప్రభావ క్షేత్రములు పెంపొందించు కొనుటకై జరుగుచున్న తీవ్రమైనపోటీ, వేరుగ యుద్ధమునకు దిగక జరుగుచున్న పోటీ (Cold war)

శీతలము నం విశే. చల్లనిది.

శీతలీకరణము నం. వి (భౌతి.) చల్లచేసి తాపక్రమమును తగ్గించుట, (Cooling).

శీతస్వాపనము సం. వి. (జం.) చ-నము లేని స్థితిలో చలికాలమును గడుపుట (Hibernation).
శీతాంశుండు సం. వి. చంద్రుడు.
శీతోష్ణస్థితి సం. వి. (భూగో) ఒక ప్రదేశము లోని అనేక సంవత్సరముల వాతావరణము యొక్క సగటుస్థితి. పవనస్థితి యొక్క సగటు అయా ప్రదేశముల యందు గురియు వర్షము మంచు వాయువు యొక్క ఉష్ణోగ్రత వాయువులో నున్న తేమ మొదలగు పరిస్థితులు (Climate)
శీధువు సం. వి. 1. పక్వమైన రసముచే చేసినకల్లు 2. ఏనుగు కన్నులందు పుట్టు మదము
శీర్ణము సం. విశ. సడలినది, సన్నగిల్లినది
శీర్షకము సం. వి. శిరస్త్రాణము, కిరీటము, శీర్షణ్యము.
శీర్షము సం. వి. తల. (గణి) భూమి కెదురుగా నుండు కోణబిందువు (Vertex).
శీర్షసంబంధము సం. విశ. (జం.) తలకు సంబంధించినది.
శీర్షిక సం. వి. వ్యాసము మొదలగు వానికుంచు పేరు.
శీర్షోన్నతి సం. వి. (గణి) భూమి నుండి శీర్షబిందువు యొక్క దూరము. (Altitude)
శీర్షోరము సం. వి. (జం) తలరొమ్ము కలిసినది. (Cephalo-thorax).
శీలనము సం. వి. దివ్యగ్రంథముల పరీక్ష.
శీలము సం. వి. 1. స్వభావము. 2. మంచి నడత.
శీలించు సం. క్రి. 1. పరిశీలించు. 2. వాడుకపరచు.

# శు

శుంఠి సం. వి. సొంటి.
శుంఠుడు సం. విశ. మూఢుడు రూ. శుంఠ.
శుండ సం. వి. 1. తొండము. 2. కల్లు. 3. వేశ్య.
శుండాలము సం. వి. ఏనుగు.
శుంభత్ సం. విశ. ప్రకాశించునట్టి.
శుకము సం. వి. చిలుక.
శుకవాహుండు సం. వి. మన్మథుడు.
శుక్కు సం. వి. శోకము.
శుక్తి సం. వి. 1. ముత్తెపుచిప్ప 2 శంఖము 3 నత్తగుల్ల. 4. పుత్తెపెంచిక.
శుక్త్యంబు బిందున్యాయము సం. న్యా. ముత్యపుచిప్పలోబడ్డ నీటిబిందువు ముత్యమగు నమరీతి.
శుక్రకోశము సం. వి. (జం.) పురుష శరీరములో కార్యరూపముగా ముఖ్యమై లైంగికమైన జీవకణ కోశము, శుక్రరేణువు. (Sperma ozoon)
శుక్రగృహము సం. వి. శుక్రకోశములను ఉపయోగార్థము నిలువయుంచు కొనుటకు స్త్రీప్రాణి శరీరములోనుండు సంచి. (Seminal receptacle or Spermatheca)
శుక్రగ్రంథి సం. వి. (జం.) శుక్రకోశములను ఉత్పత్తిచేయు గ్రంథి. వృషణము (Testis)
శుక్రజననము సం. వి. (జం.) ఆది బీజాణు కోశములనుండి శుక్రకోశములు ఉత్పత్తియగు విధానము. (Spermato-genesis)
శుక్రధాని సం. వి. (జం.) ఒక మరియొక వానపాము నుండి గ్రహించిన శుక్రకోశములను నిలుపయుంచు కొనుటకు వానపాము శరీరములో నుండు సంచి.

(Spermatheca)

శుక్రమాతృకణము నం వి (జం) పురుషుని శరీరములో శుక్రకోశములను ఉత్పత్తి చేయు జీవకణము (Spermaocyte).

శుక్రము నం వి 1. రేతస్సు 2 కంటిపువ్వు

శుక్రవారము నం. వి. భృగు వారము వారములలో నొక దినము.

శుక్రశిష్యుడు నం వి రాక్షసుడు,

శుక్రాశయము నం. వి (జం) స్త్రీ ప్రాణి శరీరములో ప్రవేశపెట్టువరకును పురుష ప్రాణి శరీరములో శుక్రకోశములను నిలువ యుంచుకొను సంచి (Seminal Vesicle).

శుక్రుడు నం, వి. 1 అసుర గురువు. వ్యు తెల్లనివాడు, అగ్ని వ్యు. తేజస్సు కలవాడు.నవగ్రహములలోనొకటి (Venus)

శుక్ల నం. వి. అరువది సంవత్సరములలో నొకటి

శుక్లపటలము నం. వి. (జం.) కనుగ్రుడ్డుపై నున్న మూడు పొరలలో అన్నిటికంటె పైనున్న పొర (Seclerotic coat).

శుక్లము నం వి. 1. వెండి 2. తెలుపు 3 మాసమునకు పూర్వపక్షము.

శుచి నం వి. 1. అగ్ని, చిచ్చు, 2 ఉపధాశుద్ధుడైన మంత్రి: 3. గ్రీష్మ ఋతువు. విణ తెల్లనిది, పరిశుద్ధమైనది.

శుద్ధగతిశాస్త్రము నం. వి. (భౌతి.) వస్తువుల ద్రవ్యరాశినిగాని వానిపై ప్రవర్తించు బలమునుగాని పరిగణించుకుండ వస్తువుల చలన ప్రకారముల చెప్పుంచుశాస్త్రము. (Kinetics) ఉదా. గెలిలియో వస్తుపతన నియమములు.

శుద్ధత నం. వి. (రసా.) శుద్ధముగానుండు స్థితి (Purity).

శుద్ధము నం. విణ. 1. తెల్లనిది. 2. దోషము లేనిది. 3. బాగుచేయబడినది; 4. కేవలము.

శుద్ధస్వరము నం. వి. (భౌతి.) ఉపస్వరములు కలగలుపులేకుండ వినబడుస్వరము. (Pure note)

శుద్ధాంతము నం వి 1. అంతఃపురము 2 అంతఃపురస్త్రీ.

శుద్ధి నం. వి. 1. శోధనము 2 మార్జనము 3. కడగుట, 4. పవిత్రత.

శునకము నం వి కుక్క

శుని నం. వి. ఆడుకుక్క.

శుభంకరుడు నం. విణ. శుభమునుచేయువాడు.

శుభంయువు నం. విణ. శుభముతోగూడుకొన్నవాడు.

శుభకృత్తు నం.వి. అరువది సంవత్సరములలో నొకటి.

శుభదంతి నం వి, వాయవ్యదిశయందున్న పుష్పదంతమను దిగ్గజమునకు భార్య.విణ. చక్కనిపండ్లుగలది, సుదతి,

శుభము నం వి మంగళము

శుభాకాంక్షలు నం, వి. స్నేహితులు మొ. వారికి శుభములు కలుగవలెనని కోరుకొనుచుసంపులేఖాపత్రములు(Greetings)

శుభ్రము నం విణ. తెల్లనిది 2 ప్రకాశించునది

శుభ్రాంశువు నం వి. చంద్రుడు. రూ శుభ్రాంశుడు.

శుల్కము నం. వి 1 సుంకము 2. ఉంకువ. 3. వేశ్యకిచ్చుధనము

శుల్బము నం. వి 1. రాగి. 2. త్రాడు.

శుశ్రూష నం. వి. 1. విననిచ్ఛ. 2. సేవ; 3, చెప్పుట.

శుశ్రూషకుడు నం.వి. శుశ్రూషచేయువాడు, శిష్యుడు, సేవకుడు.

శుష్కపరీక్షణ నం. వి. (రసా.) గుణాత్మక రాసాయనిక విశ్లేషణప్రక్రియయందు జరిగించు ప్రథమాంశము, (Dry test).

శుష్కఫలము నం. వి. (వృక్ష.) కండలేని కాయ (Dry fruit) (దీని ఫలకవచము ఎండిపోవును).
శుష్కము నం. వి. వంటచెరకు. విశ. ఎండినది. వట్టి.
శుష్యించు నం. క్రి. 1. ఎండు. 2. ఇంకు.
శుష్మము నం. వి. 1. బలిమి. 2. తేజస్సు. 3. నిప్పు.

## శూ

శూకము నం. వి. 1. తేలుకొండి. 2 వరముల్లు. 3. కనికరము నం. వి. (వృక్ష.) కొన్నిరకముల ధాన్య గింజల చివరనుండు ముల్లువంటి అంగము (Awn).
శూకలము నం. వి. రక్షింపబడని దుష్టాశ్వము
శూకి నం. వి. (వృక్ష.) ఇది ఏక వర్ణ్యతుక పుష్పమంజరులలో నొకరకము పుష్పములకు కాడలులేని సామాన్య ఏకవర్ణ్యతుకము.
శూద్ర నం. వి. శూద్రజాతి స్త్రీ
శూద్రి నం. వి. శూద్రుని భార్య
శూద్రుడు నం. వి. నాలవజాతివాడు
శూనారము నం. వి. 1 కుక్కపాలు. 2. పాముగ్రుడ్డు
శూన్య ప్రదేశము నం. వి. (భౌతి.) ఏ వస్తువు లేని ప్రదేశము. (Vacuum).
శూన్యము నం. వి. (గణి.) సున్న = మూల్యరహితము (Null) గాలి తీసివేసిన చోటు (Vacuum) నం. వి. సున్న. విశ. పాడు.
శూన్యవాది నం. వి. సర్వము నాస్తి యనువాడు.
శూన్యీకరణము నం. వి. (రసా.) ఒక పాత్రను గాలి పంపు సహాయమున గాలి లేకుండ చేయుట. (Evacuation).
శూరుడు నం. వి. సూర్యుడు విశ. యుద్ధమునకు భయపడనివాడు, ప్రౌఢుడు
శూర్పము నం. వి. చేట.
శూర్పణఖ నం. వి. రావణుని చెల్లెలు.
శూల నం. వి. 1. కొఱ్ఱు. 2 వేశ్య.
శూలదంతము నం. వి. (గృహ.) పన్ను వేరు. (Fang)
శూలపాణి నం. వి. శివుడు వ్యు. శూలము చేతియందుగలవాడు.
శూలము నం. వి. 1. ముమ్మొనవాలు. 2. కొక్కెము. 3 ఒక రోగవిశేషము.
శూలి నం. వి. శూలపాణి.

## శృ

శృంఖల నం. వి. 1. మగవాని మొలనూలు. 2. ఏనుగు కాలి సంకెల. దూ శృంఖలము
శృంఖలాప్రక్రియ నం. వి. (రసా.) ఒక మార్పు వెంబడి ఇంకొకటి గొలుసుకట్టుగా జరిగెడి ప్రక్రియ. (Chain reaction)
శృంఖలితము నం. విశ. సంకెల వేయబడినది.
శృంగకము నం. వి. (జం). సూక్ష్మమైన వ్రేలువంటి నిర్మాణము. ముఖ్యముగా పృష్ఠవంశిక. ప్రాణుల చిన్నప్రేగు లోపలనున్న పొరపై శృంగకములుకాననగును (Villus)
శృంగద్వితము నం. వి. (జం.) భేక శిశువు యొక్క శ్వాసనాలికా చాపములకు ఎదుట నుండు ద్వితచాపములోనిది. ఒక భాగము (Gerotophyl).
శృంగము నం. వి. 1. కొమ్ము. 2. కొండకొమ్ము. 3. చిమ్ముసగ్రోవి. 4. ఊదుకొము. ల్మ. దొరతనము.

శృంగములు నం. వి. (జం.) ద్విసాధనము (Hyoid apparatus) లో నున్న కొమ్ముల వంటి భాగములు (Comus).
శృంగబేరము నం. వి అల్లము.
శృంగవక్రసరస్సు నం. వి. (భూగో.)నదీ ప్రవాహములో వంకరలు తిరుగుచు శృంగ వక్రమువలె పాఱు నదీ సమీప తీ ము. నది 'U' వలె ప్రవహించి మధ్యప్రాంత మును సారవంతముగ తయారుచేయును.
శృంగాటకము నం. వి. చదుకము, నాలుగు త్రోవల కూడలి
శృంగాయితము నం. వి (భూగ ) ఇది ఒక విధమగు ఖనిజము.ఇది స్ఫటామ్లజనిదము లోహామ్లజనిదము ఎక్కువగానుండుమగ్న లోహ, ఖటిక. సంయుజ్య శైలితము (Horn blend)(ఇది నల్లని కొమ్మువంటి రంగుగానుండుటచేత దీనికాపేరు కలైను.)
శృంగారము నం వి. 1. నవరసములలో నొకటి. 2. అలంకారము. వికృ. సింగారము.
శృంగారయోని నం. వి. మన్మథుడు.
శృంగారవనము నం. వి. ఉద్యానవనము
శృంగారి నం. వి. 1. విటుడు. 2.ఏనుగు. విశ. శృంగారము కలవాడు. వి. సింగారి
శృంగి నం .వి. 1. పావమీను. 2 ఏనుగు 3. కొండ. 4. ప్రమాను.
శృంగిణి నం. వి. ఆవు.
శృతము నం.విశ. కాచబడినది, పాలు నేయి లోనగునవి.

# శే

శేఖరము నం. వి. సిగదండ, (ఉత్తరపద మైనచో) శ్రేష్ఠము
శేముషి నం. వి. బుద్ధి, మనీష.
శేవధి నం వి. నిధి. రూ. సేవధి.
శేష నం వి అనుగ్రహించి యిచ్చినఅక్షతలు సేస.
శేష తోలనపట్టిక నం వి. (వాణి )సంస్థ యొక్క కాతాలు సరిగ వ్రాయబడినట్లు రూఢి చేసికొనుటకు తయారుచేయుకాతా నిల్వల పట్టి (Trial balance).
శేషము నం.వి. మిగులు,(గణి ) ఒక రాశిని మరియొక రాశిచే భాగింపగా మిగులు రాశి. (Remainder) (రసా.) వడబోత కాగితముపై నిలిచి యుండు ఘన పదార్థము (Residue).
శేషశయనుఁడు నం. వి. విష్ణువు.
శేషశైలము నం. వి. తిరుమల.
శేషసిద్ధాంతము నం. వి. (గణి.) ఒక ప్రమేయము నొక సమాసముచే భాగింపగా లభించు శేషమును గురించి తెలియజేయు సిద్ధాంతము (Remainder Theorem).
శేషాంత్రము నం వి (జం ) చిన్నప్రేవులలో ఆంత్రముఖము తరువాత నున్న భాగము (Ileum)
శేషాచలము నం వి తిరుమల.
శేషాద్రి నం. వి తిరుమల.
శేషాధికారములు నం. వి. ( రాజ.,శాస ) సంవిధాన చట్టములో కేంద్రప్రభుత్వము నకు రాష్ట్రప్రభుత్వమునకు విభజింపగా మిగిలిన అధికారములు. అనిర్దిష్టాధికారములు(Residuary powers) (ఇవి కేంద్ర ప్రభుత్వమునకు చెందును).
శేషుఁడు నం. వి. వేయిపడగలు గల సర్పరాజు.

## శై

శైక్షుఁడు నం. వి. క్రొత్తగా చదువు ప్రారంభించిన శిష్యుడు.

శైత్యము నం. వి. 1. చలువ, 2. జలుబు

శైథిల్యము నం. వి. (భూగో.) భూమి ఉపరితలముపై గల నేలలు. శిలలు నదీప్రవాహములచే, తదితర ప్రాకృతిక మార్గముల ద్వారా తరిగిపోవుట.

శైలధన్వుఁడు నం. వి. శివుడు, గట్టు విలుకాడు.

శైలము నం. వి కొండ. వ్యు. శిలలు దీని యందు గలవు. నం. వి. (భూగ.) నేల యందుండు (ఉప) అధాతువులలో నిది యొకటి.

శైలాలి నం. వి, నట్టువుడ, నటుడు.

శైలూషి నం. వి. ఆటకత్తె, నటి.

శైలూషుఁడు నం. వి ఆటకాడు. నటుడు.

శైవము నం. వి. శివుని ప్రధాన దైవముగా నెంచు మతము.

శైవలము నం. వి. నీటిపాచి. రూ శైవాలము శేవలము.



శైవలములు నం. వి (వృక్ష) నీటిలో పెరుగు మొదటితెగకి ఉద్భిజ్జములు (Algae).

శైవలిని నం. వి ఏరు, నది.

శైవుఁడు నం. వి. శివభక్తుడు శైవలము

శైశవము నం వి. (గృహ) శిశుత్వము బాల్యము.

## శొం

శొంఠి వి. (వ్యవ) ఎండిన అల్లము, సొంటి (Dried ginger).

## శో

శోకము నం. వి. దుఃఖముచే తపించుట. వగపు.

శోచనము నం. వి. వగచుట.

శోచనీయము నం. విశ. శోకింపదగినది రూ. శోచితవ్యము, శోచ్యము.

శోచిస్సు నం. వి. 1. సూర్యకిరణము. 2. మంట.

శోచిష్కేశుఁడు నం. వి. అగ్ని. వ్యు. జ్వాలలే జుట్టుగా కలవాడు.

శోణము నం. వి. 1. ఎరుపు. 2. ఒకనది. 3. నిప్పు.

శోణరత్నము నం. వి. కెంపు.

శోణితము నం. వి. రక్తము.

శోణిమ నం. వి. ఎరుపు. రూ. శోణిమము.

శోధకుఁడు నం. విశ. శోధించువాడు.

శోధనానాళము నం. వి, (రసా.) శోధనాగారములో ద్రవ్యోన్వభావ పరీక్షకుపయోగించు గాజుగొట్టము. (Test tube).

శోధనము నం. వి. (రసా.) ఒక ద్రవ్యమును శుద్ధముచేయుట. (Purification), నం వి. శుద్ధిచేయుట, పరిశోధించుట, వెదకుట.

శోధని నం. వి. చీపురుకట్ట

శోధితము నం. విశ. శోధింపబడినది.

శోఫ నం. వి. వాపురోగము. నం వి. (గృహ) వంజువ్యాధి. నీరు పట్టుట (Oedema) ఆహారములో మాంసకృత్తుల లోపమువలన కలుగు వ్యాధి.

శోభ నం. వి. 1. వస్త్రభూషణాదులచే గలుగు కాంతి. 2. కాంతి. 3. ఇచ్ఛ
శోభకృత్తు నం. వి. అరువది సంవత్సరములలో నొకటి.
శోభనము నం. విశే. సుందరమైనది. వి. గర్భాధానము(ఈయర్థము తెనుగునందే)
శోభితము నం. విశే. ప్రకాశమొందినది.
శోభిల్లు వం. క్రి. ప్రకాశించు.
శోషకతైలములు నం.వి (గృహ )ఏ వస్తువునకైనను పూసినచో గాలిపారి త్వరలో నారి, పొరకట్టిపోయి ఆ వస్తువునకు జిడ్డు లేకుండచేయు నూనెలు, (Drying oils) ఉదా. సీమ అవిసెనూనె (Linseed oil).
శోషణపాత్ర నం. వి. (రసా.) తేమను తొలగించుపాత్ర. (Dessicator)
శోషణము నం. వి. 1 ఇంకుట, ఎండుట. నం వి (రసా.) తేమను తొలగించు విధానము (Dessication).
శోషణము నం. వి 1. శోషరోగము. 2. క్షయరోగము
శోషరసమండలము నం వి (జీవ ) లసికా మండలము శ్వేతధాతుమండలము, శోషరసముండు కుహరముల నాళికలు. (Lymphatic system)
శోషించు నం క్రి ఇంకిపోవు.

## శౌ

శౌండికుఁడు నం. వి. కల్లు అమ్మువాడు.
శౌండుఁడు నం. విశే. 1. కల్లుత్రాగుటలోనగువానిచే మత్తిల్లినవాడు. 2.నేర్పరి.
శౌచము నం. వి. శుచిత్వము
శౌరి నం. వి. కృష్ణుడు. వ్యు. శూరుని మనుమడు.
శౌర్యము నం వి శూరత్వము. ప్రౌఢిమము.
శౌల్కికుఁడు నం. వి. శుల్కాధ్యక్షుడు.

## శ్చ్యో

శ్చ్యోతము నం. వి. 1. జలాదిధార. 2. కారుట.

## శ్మ

శ్మశానము నం. వి. మసనము, ప్రేతభూమి, వల్లకాడు
శ్మశానవైరాగ్యము నం. వి. (జాతీ.) శ్మశానమున నిలిచినప్పుడు కలుగు వైరాగ్యము (ఆ వైరాగ్యము తరువాత నిలువదు. ఇట్లే ప్రసూతి వైరాగ్యము, పురాణ వైరాగ్యము అను వానిని చెప్పుదురు).
శ్మశ్రువు నం.వి. గడ్డము మీసము.

## శ్యా

శ్యామ నం. వి. 1. నడియౌవనముగల స్త్రీ. 2. యమున. 3. రేయి. 4. నల్లని స్త్రీ. 5 కాళికాదేవి. వికృ. చామ.
శ్యామము నం. వి. 1, మిరియము. 2. ఆకుపచ్చ. 3. నలుపు 4. మబ్బు.
శ్యామల నం. వి పార్వతి. విశే. నల్లనిది
శ్యామలము నం. వి. నలుపు. విశే నల్లనిది.
శ్యామాకము నం. వి. 1. చాముల. 2. ఒకరకమైన ధాన్యము.
శ్యామిక నం. వి. చీకటి, నలుపు.

# శ్యై

శ్యైతము సం వి తెలుపు.రూ శ్వేతము.
శ్యైనము సం. వి వేగ. వ్యు. వేగముగా బోవునది.

# శ్ర

శ్రద్ధ సం. వి అక్కఱ. 2. ఆసక్తి.
శ్రద్ధధానుఁడు సం. విశే. శ్రద్ధగలవాడు.
శ్రద్ధనము సం వి. కట్టు. కూర్పు
శ్రద్ధాళువు సం. వి. వేవిళ్ళుకల స్త్రీ. విశే శ్రద్ధగలవాడు. ఆసక్తి కలవాడు.
శ్రమకము సం విశే (గృహ) పాటు పడెడు స్వభావము కలది పనిచేసెడు స్వభావము గలది. (Industrious)
శ్రమణుఁడు సం. వి (చరి.) బౌద్ధ భిక్షువుగా బౌద్ధసంఘములో చేర్చుకొనక పూర్వము బౌద్ధ ధర్మ సూత్రములను అభ్యసించుచున్న బాల సన్యాసి.
శ్రమదానము సం. వి. సాంఘికాభివృద్ధి కార్య క్రమములలో నిస్స్వార్థముగ కాయ కష్టము చేయుట.
శ్రమము సం వి 1. అలసట. 2. అలవాటు. 3 సాము.
శ్రమవిభజనము సం. వి. (అర్థ, వాణి.) అవసరమునుబట్టి ఒక కార్యమును వివిధాంశములుగ విభజించి. పనివాండ్రందరచే ఒక్కొక్క అంశము చొప్పున చేయించుట. ఉదా. కుర్చీలు చేయుటలో 10 మందిని వినియోగించిన నెల్లరును కుర్చీ మొత్తమును తయారుచేయక, ఒకడు కుర్చీ కాళ్ళను తయారుచేయుచుండ మఱియొకడు చిత్రిక పట్టుచుండుట. మిగిలిన వారు కూడ మిగిలిన అంశములను పూర్తి చేయుట. దీనివలన ఉత్పాదన పెరుగుట ఎవరిపనిలో వారికి నేర్పు ఏర్పడుటవంటి లాభములు చేకూరును.
శ్రమవిభాగతత్త్వము సం. వి (అర్థ). శ్రమ విభజనము చేయవలసిన పనిని వీలైనన్ని భాగములుచేసి ఒక్కొక్క భాగమును ఒక్కొక్క శ్రామికుడు చేయుట. (దీనివలన వస్తూత్పాదనము నేర్పుతోను పెద్ద ఎత్తునను జరుగును)
శ్రయణము సం. వి. ఆశ్రయించుట.
శ్రవణప్రావరములు సం వి. (జం) శబ్దమును గ్రహించు ముఖ్యావయవములను కప్పియుంచి రక్షించు సాధనములు. శబ్దము గ్రహించు బిలములు (Auditory capsules).
శ్రవణ బిందువు సం వి. (జం) చెవిలోని పటల గహనమునకు అస్తరుగానుండు అవిచ్ఛిన్న జీవకణములలో కొన్ని చాల పొడవుగానుండి, ఒక్కొక్క కణమునకు ఒక్కొక్క శ్రవణ రోమము (Auditory hair) ఉండును అట్టి జీవకణముల గుంపు శ్రవణ బిందువు అనబడును (Accoustic spots).
శ్రవణము సం. వి. 1. చెవి. 2 వినికి. 2. నక్షత్రములలో నొకటి.
శ్రవణీయము సం. విశే. వినదగినది.
శ్రవము సం. వి. చెవి.

శ్రవిష్ఠ సం. వి ధనిష
శ్రవ్యము సం. విశ (శ్రౌతి) చెవి గ్రహింప దగినది. (Audible)



శ్రాంతి సం. వి. ఊరట. విశ్రాంతి. అలసట.
శ్రాంతుఁడు సం వి. యతి. విశ. విశ్రాంతి పొందినవాడు. అలసినవాడు.
శ్రాద్ధదేవుఁడు సం వి. యముడు.
శ్రాద్ధము సం. వి. పితృకర్మము వ్యు. శ్రద్ధతో చేయబడినది
శ్రామిక సంఘవాదము సం వి. (రాజ) సామ్యవాద సిద్ధాంతములలో నొకట. సంఘ పురోభివృద్ధికి శ్రామిక సంఘములు మూలాధారములనియున్నవాదము. పెట్టుబడి దారులుండరాదని వీరి అభిమతము. (Syndicalism)
శ్రావణము సం. వి 1. వినిపించుట 2. ఒక మాసము. 3. పట్టుగట్టువంటి చిన్న పనిముట్టు (Forceps)
శ్రావ్యము సం. విశ వినదగినది.



శ్రితుఁడు సం విశ ఆశ్రితుడు సేవితుడు
శ్రియఃపతి సం. వి. విష్ణువు లక్ష్మీభర్త.



శ్రీ సం. వి 1. లక్ష్మి 2 సంపద, ఐశ్వర్యము 3. కాంతి 4. అలంకారము. 5 విషము.
శ్రీకంఠుఁడు సం. వి శివుడు, కాలకంఠుడు.
శ్రీకరుఁడు సం విశ సంపత్కరుడు
శ్రీకార్యము సం వి. గుడిపారుపత్తెము.
శ్రీఖండము సం. వి. చందనము.
శ్రీచూర్ణము సం. వి తిరుచూర్ణము.
శ్రీదుఁడు సం. వి కుబేరుఁడు.
శ్రీధరుఁడు సం వి. విష్ణువు.
శ్రీనివాసుఁడు సం. వి. విష్ణువు. వేంకటేశ్వరుడు.
శ్రీపతి సం. వి. విష్ణువు. 2. రాజు.
శ్రీపుత్రుఁడు సం. వి. మన్మథుడు. సిరిచూలి.
శ్రీఫలము సం. వి. మారేడు.
శ్రీమంతము సం. విశ. 1. సంపదకలది. 2. ఒప్పిదముకలది.
శ్రీమంతుఁడు సం. విశ సంపదకలవాడు.
శ్రీముఖ సం. వి అరువది సంవత్సరములలో నొకటి.
శ్రీముఖము సం వి. పెద్దలు వ్రాసిపంపుపత్రిక
శ్రీశైలము సం వి. పవిత్రశివక్షేత్రము. సిరిగట్టు. (కర్నూల్ జిల్లాలోనిది).



శ్రుతము సం వి. 1. వినికి. 2. శాస్త్రము. విశ. వినబడినది.
శ్రుతి సం. వి. 1 వేదము. 2. చెవి. 3. వినికి

## శ్రే

శ్రేఢి నం. వి. ఒక నియమము ప్రకారము అమర్చబడిన సంఖ్యల క్రమము (Progression)

శ్రేణి నం. వి. వరుస. (గణి.) ఒక దత్త న్యాయము ప్రకారము వ్రాయబడిన పదముల సముదాయము దత్తన్యాయము ననుసరించి వ్రాయబడిన రాసుల సముదాయము (Progression)

శ్రేణిక నం. వి. గుడారము

శ్రేయము నం. వి. 1. శుభము 2. ధర్మము. రూ. శ్రేయస్సు.

శ్రేయోరాజ్యము నం. వి (రాజ.) సామాన్య ప్రజల శ్రేయస్సునకై ఉచితమైన సాంఘిక ఆర్థికసంస్కరణము. సదుపాయములు కలిగించు రాజ్యము.

శ్రేష్ఠధాతువు నం. వి. (రసా.) వాతావరణ పరిస్థితులకు చెక్కు చెదరని గుణములుగల ధాతువు. (Nobel metal) ఉదా. వెండి. బంగారము.

శ్రేష్ఠి నం. వి. కులమందు శ్రేష్ఠుడైన శిల్పి. కోమట్ల బిరుదు. విశే. కులశ్రేష్ఠుడు. వికృ. చెట్టి.

శ్రేష్ఠుడు నం. వి. కుబేరుడు. విశే. మేలిమి పొందినవాడు

శ్రేష్ఠ్యము నం. వి. మేలిమి, శ్రేష్ఠత్వము.

## శ్రో

శ్రోణము నం. వి. (జం.) తుంటి సంబంధమైనది. కటిసంబంధమైనది (Pelvic).

శ్రోణి నం. వి. పిరుదు, మొల.

శ్రోణిచక్రము నం. వి. (జం.) తుంటికి సంబంధించిన ఎముకల కూర్పు, నితంబమేఖలము (Pelvic girdle)

శ్రోణిఫలకము నం. వి. మొల.

శ్రోణుడు నం. వి. పిచ్చుకకుంటు, కుంటివాడు

శ్రోణ్యులూఖలము నం. వి (జం.) నితంబమేఖలమునకు ఇరుప్రక్కలనుండు గిన్నెవంటి లోతైన భాగము (దీనిలో తొడ ఎముక మొక్క తల అమరి యుండును).

శ్రోత నం. విశే. వినువాడు

శ్రోతవ్యము నం. విశే. వినదగినది.

శ్రోత్రము నం. వి. చెవి.

శ్రోత్రియము నం. విశే. అల్పముగా పన్ను ఇచ్చు పొలము.

శ్రోత్రియుడు నం. వి. వేదము చదివిన బ్రాహ్మణుడు.

## శ్రౌ

శ్రౌతము నం. విశే. వేదమందు విధింపబడినది.

శ్రౌతసూత్రములు నం. వి. వైదిక ధర్మగ్రంథము.

## శ్ల

శ్లక్ష్ణుడు నం. వి. 1. అల్పుడు. 2. ప్రియము పలుకువాడు.

శ్లథము నం. విశే. శిథిలమైనది, వదులైనది.

## శ్లా

శ్లాఘ సం. వి. 1. ప్రశంస. 2. పరిచర్య 3. ఇచ్ఛ.
శ్లాఘించు సం. క్రి. పొగడు.
శ్లాఘనీయము సం. విశే. పొగడదగినది. రూ. శ్లాఘ్యము.

## శ్లి

శ్లిష్టము సం. విశే. శ్లేషతో కూడినది.
శ్లిష్టి సం. వి. 1. కౌగిలింత. 2. అంటుకొని యుండుట.

## శ్లీ

శ్లీలము సం విశే. 1. సంపదగలది. 2. సభ్యత కలది.
శ్లీలుఁడు సం. వి. అదృష్టవంతుడు.

## శ్లే

శ్లేష సం వి. (అలం.) 1. ఒక అలంకారము కావ్యగుణములలో నొకటి 2. కలయిక.
శ్లేషగ్రంధి సం. వి. (జం.) ఆడపురుగుల జననేంద్రియ భాగములలో నుండు ఒక విధమైనగ్రంధి. గ్రుడ్లు ఒకదాని నొకటి అంటుకొని యుండుటకై దీనినుండి సిమెంటువంటిద్రవము స్రవించుచుండును (Collecteral gland).
శ్లేష్మకళ సం. వి. (జం.) ప్రేగులోపలి భాగమున నుండు అస్తరు (Mucous membrane). ఈ పొర యందలి జీవకణములు శ్లేష్మమును ఉత్పత్తి చేయును. సం. (జం.) ప్రేగు యొక్క గోడలలో నున్న నాలుగు పొరలలో లోపల నుండు మొదటి పొర(Mucosa) ఉపశ్లేష్మకళ = రెండవపొర (Sub-mucosa).
శ్లేష్మము సం. వి. కఫము.
శ్లేష్మలుఁడు సం. విశే. కఫరోగము గలవాడు. శ్లేష్మణుడు.

## శ్లో

శ్లోకము సం. వి. 1. సంస్కృత పద్యము. 2. కీర్తి.
శ్లోక్యుఁడు సం. విశే. మెచ్చదగినవాడు.

## శ్వ

శ్వపచుఁడు సం. వి. చండాలుడు. వ్యు. కుక్కను వండుకొనువాడు.
శ్వభ్రము సం.వి. రంధ్రము, బెజ్జము.
శ్వవృత్తి సం. వి. సేవ, కుక్కబ్రతుకు.
శ్వశురుఁడు సం. వి. మామగారు.
శ్వశురులు సం. వి. అత్తమామలు.

శ్వశుర్యుఁడు నం. వి. 1. మగని సోదరుడు. 2 భార్యసోదరుడు.
శ్వశ్రువు నం.వి. అత్తగారు.
శ్వశ్రూభిక్షా న్యాయము నం. న్యా. కోడలు లేదనినవాని కద్దుతగిలి అత్త స్వతంత్రురాలై తానులేదనినరీతి.
శ్వశ్రేయసము నం. వి. శుభము, సుఖము
శ్వసన నియంత్రిక నాడిముడి పుఱ్ఱెనుండి బయటికి వచ్చినతరువాత ప్రాణేశనాడిపై నగువడు ముడి. (Vagus ganglion).
శ్వసనము నం. వి. శ్వాసము వాయువు.
శ్వసనమూలములు నం వి. (వృక్ష.) రొంపి నేలలలోను సముద్రపునీరు నిలువయుండు నేలలలోను పెరుగు కొన్ని మొక్కలకు వేళ్ళనుండి శాఖలుబయలుదేరి గొట్టముల వలె నేలపైకిపొడుచుకొనివచ్చును (Breathing roots or pneumatophores).
శ్వసితము నం. వి. శ్వాసము.

# శ్వా

శ్వానము నం. వి. కుక్క
శ్వాపదము నం.వి. 1 పులి 2. వన్యమృగము
శ్వావిధము నం వి. ఏదుపంది.
శ్వాసకాసము నం. వి. ఉబ్బసముతోడి దగ్గు
శ్వాసత్వక్ కుహరము నం. వి. (జం.) ధమన మూలములో బృహద్ధమన కుహరము ప్రక్కనున్న అర (Cavum pulmocutaneum) ఇది ఎడమవైపున నుండును
శ్వాసనాళము నం. వి. (జం) ముఖకుహరమునుండి ఊపిరితిత్తులలోనికి గాలిని తీసికొనుటకు వదలుటకు ఉపయోగించు గొట్టము. (Trachea)
శ్వాసమండలము నం. వి. (జం.) ప్రాణవాయువును పీల్చుకొని బొగ్గుపులుసు గాలిని వదిలివేయు క్రియలో సంబంధించిన అవయవములు. (Respiratory system).
శ్వాసము నం వి. 1 ఊపిరి 2. ఉబ్బసము 3. వాయువు
శ్వాసావరోధన నం. వి. (గృహ.) ఉక్కిరిబిక్కిరియగుట, ఊపిరి యాడకపోవుట, (Suffocation).

# శ్వే

శ్వేత నం. వి. 1. గవ్వ 2 స్ఫటికము.
శ్వేతకణములు నం. వి. (జం) రక్తములో నున్న తెల్లజీవకణములు(White carpuscles or leucocytes).
శ్వేతగరుత్తు నం. వి. శ్వేతపత్రము, హంస
శ్వేతతప్తము నం. విశ. (రసా.) తెల్లని కాంతి ఇచ్చు వరకు కాల్చబడినది.(White hot).
శ్వేతద్రవ్యము నం.వి.(జం.)వెన్నుపాములో బయటి భాగమునసుండు నాడీకణజాలము (White matter)
శ్వేతము నం. వి. 1. వెండి 2. తెలుపు. 3. కైలాసము 4. ఒకద్వీపము.
శ్వేతవాహనుఁడు నం. వి. 1. చంద్రుడు. 2. అర్జునుడు.

## ష

ష ఒక అక్షరము.

షండము సం. వి. 1. తామర లోనగువాని సమూహము 2. అబోతు.

షండుఁడు సం. వి. పొగ్గడికాడు, పేడి

షట్కము సం.వి. ఆరు.

షట్కర్మములు సం వి. యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహములు.

షట్కర్ముఁడు సం.వి. షట్కర్మలుగలస్మార్త బ్రాహ్మణుడు.

షట్పదము సం. వి, తుమ్మెద. వ్యు. ఆరు కాళ్ళుకలది.

షడాననుడు సం. వి. కుమారస్వామి. షణ్ముఖుడు వ్యు ఆరు ముఖములు కలవాడు.

షడ్జము సం. వి. సంగీతమున సప్తస్వరములలో నొకటి.

షడ్డకుఁడు సం.వి. తోడియల్లుడు.

షడ్బిందువు సం. వి. మండ్రగబ్బ.

షడ్భాగము సం. కప్పము.

షడ్భుజి సం. వి. (గణి.) ఆరు సరళరేఖలచే నేర్పడు క్షేత్రము (Hexagon)

షరతు హిం. వి. ప్రతిబంధము.

షరా హిం. వి. నోటు, గమనిక, చిట్టచివర వ్రాయు అనుబంధము.

షరాబు హిం. వి. 1. వెండి బంగారు నగల వ్యాపారము. 2. డబ్బువసూలుచేయువాడు. రూ షరాపు

షర్టు ఇం.వి. (గృహ.) (Shirt) కమీజు, కుర్తా అంగీ

షష్టి సం. వి. అఱువది

షష్టిక సం. వి అరువది దినములలో పండు ధాన్యము.

షష్ట్యంశపద్ధతి సం. వి. (గణి.) లంబకోణము 90 డిగ్రీలగను, డిగ్రీని 60 మినిట్లుగను, మినిట్‌ను 60 సెకండ్లుగను పరిగణించెడి పద్ధతి (Sexagesimal system)

షష్ఠము సం విశే. ఆరవది.

షష్ఠి సం. వి. పక్షమందు ఆరవ తిథి. విశే. ఆరవది.

## షా

షాడబము సం. వి. మధురాది రసము, తీపి మొదలైన రుచి.

షాడవము సం. వి. ఆరు స్వరములుగల రాగము.

షాణ్మాతురుఁడు సం. వి. కుమారస్వామి వ్యు. ఆర్గురు తల్లులు కలవాడు.

షాహుకారు హిం. వి. (అర్థ.) ఏదేని కృషికి వలయు సొమ్మునుగాని వస్తుసామగ్రినిగాని కొంతవడ్డీపై అప్పుగ నిచ్చువాడు. పెట్టుబడిదారు(Money lender or merchant)

## షి

షింటోమతము మి. వి. (వరి.) జపాన్ దేశములో ఆదినుండి వచ్చుచున్న మతము.

షిప్‌యార్డ్ ఇం.(వాణి.) (Ship-yard) నౌకానిర్మాణ స్థావరము.

షిఫాన్ ఇం. వి. (గృహ.) (Chiffon) 1. ఇది ఉల్లిపొరవంటి ముడుతలుగల పట్టుబట్ట. 2.దూదివలె మెత్తగాను తేలికగానుఉండు కేక్.

షిష్కబాబ్ ఇం.వి. (గృహ) (Shish-kabab) ఇనుపఊచకు చుట్టబెట్టి కాల్చిన కైమా ఉండ.

## షూ

షూరిటి ఇం. (శాస.అర్థ) (Surety) జామీను దారుడు, హామీదారుడు. ఒక పనిచేయుటకుగాని ఒకరు చెల్లించవలసిన బాకీతాను చెల్లించుటకుగాని పూచీ తీసికొనువాడు.

## షె

షెడ్యూలు ఇం వి. (శాస ,వాణి.) (Schedule) అనుసూచి పట్టిక

షెడ్యూలుకులములు మి (శాస) అనుసూచికలో వ్రాయబడిన నిమ్నజాతి కలములు

షెడ్యూలు తెగలు (శాస) అనుసూచికలో చేర్చబడిన ఆదివాస జాతులకు చెందిన తెగలు,

## షే

షేర్లు ఇం. (అర్థ ,వాణి.) (Shares) వాటాలు. కంపెనీలో భాగములు,

## షో

షోడశము సం. వి. పదునారు. విణ. పదునారవది. వి. చనిపోయినవానికి పదునొకండవ దినమువచేయు శ్రాద్ధవిశేషము.

## ష్ఠి

ష్ఠీవనము సం వి. 1. ఉమియుట, 2. స్రవించుట

## స

స ఒక యక్షరము.

సం సం. వి. సంస్కృతము నందలి 'సమ్' అను దానికి వచ్చిన రూపము. చక్కని, మిక్కిలి, అను అర్థము లిచ్చు ఉపసర్గ.

సంకటపడు మి క్రి. ఇరుకుపడు, శ్రమపడు

సంకటపాటు మి. వి. ఇరకుపాటు, సంకట పడుట.

సంకట సం. వి, ఇరుకు, రూ. కష్టము.

సంకటములు సం. వి. పలువిధములైన వ్యాధులకూడిక, రోగముల క్లిష్టపరిస్థితి. (Addisons' disease),

సంకటి వి. రాగిపిండి లోనగు వానితో వండిన సంకటము, అ బలి.

సంకరజీవి సం. వి. (జీవ.) ఒకటిగాని యంతకంటె ఎక్కువగాని అనువంశిక లక్షణముల భేదముగల తల్లిదండ్రుల యొక్క సంతానము (Hybrid).

సంకరము సం వి. భేదము తెలియని కూడిక

సంకర్షణుఁడు సం. వి బలరాముడు.

సంకలనము సం. వి. (గణి.) 1. కూడిక. 2. అంకగణిత ప్రక్రియలలో నొకటి. సం. వి, సంఖ్యలనుకూడుట. (Addition)

సంకలనరాశి నం. వి. (గణి.) విడిరాసులను కూడగా లభ్యమగురాశి (Sum).

సంకలితము నం. విశే. 1. కూడబడినది. 2. నేలయందు పాతినది.

సంకలిత యౌగికము నం. వి. (రసా.) రెండు యౌగికముల సంకలనము వలన ఏర్పడు యౌగికము (Addition compound)

సంకలియ వై. వి. శృంఖల. రూ. సంకెల నం. వి శృంఖలా.

సంకల్పము నం. వి మనోవ్యాపారము, ఎన్నిక.

సంకాశము నం. విశే. సమానమైనది. సమీపమైనది.

సంకీర్ణ మంత్రివర్గము నం వి. (రాజ ,పరి పౌర) మిశ్రమ మంత్రివర్గము ఏ ఒక్క పక్షమువారు అధిక సంఖ్యాకులుగ లేనప్పుడు వివిధపక్షములతో నేర్పడిన మంత్రి వర్గము, వివిధ ప్రాతినిధ్య మంత్రివర్గము

సంకీర్ణ మిశ్రమ ప్రభుత్వము నం వి. (రాజ పౌర.) వివిధపక్షములు కలిసిన ప్రభుత్వము

సంకీర్ణము నం.వి. ఒకటితోనొకటి కలిసినది

సంకీర్ణ లవణము నం వి. (రసా.) కొన్ని లవణములు కలిసినపుడు ఆమ్ల పదార్థాధార భాగములక్రొత్త విన్యాసములతో నేర్పడు లవణము, ఉదా. $2KCN+Ag(CN)=KAG\ (CN)_2$ పొటాసియమ్ సైనైడ్ సిల్వర్ సైనైడ్లు రాసాయనికముగ సంయోగించి పొటాసియమ్ లవణాధార భాగముగను సిల్వర్ సైనైడ్ -ఆమ్ల భాగముగను ఏర్పడిన లవణము లభించును. ఇది సంకీర్ణలవణము. (Complex salt).

సంకు వై. వి. శంఖము. నం. శంఖః.

సంకుచితము నం విశే సంకోచము నొందినది, ముడుచుకొన్నది.

సంకుమదము నం. వి. జవ్వాజి.

సంకులము నం. విశే. 1. పూర్వోత్తర విరుద్ధమైనది (మాట). 2 సంకీర్ణము.

సంకువు నం వి. జవ్వాజి పిల్లి.

సంకెల వై. వి. సంకలియ. సం శృంఖలా.

సంకేతము నం వి. 1 పేరు 2 ఏర్పాటు. 3 సంజ్ఞ. 4. ఒడబాటు. ముందుగా మాటాడుకొని యేర్పరచుకొనిన స్థలము నం వి. (భౌతి ,రసా ,గణి) చిహ్నము. d వృత్త వ్యాసమునకు చిహ్నము 'x' వృత్త వ్యాసార్థమునకు సంకేతము H ఉదజనికి సంకేతము (Symbol)

సంకేతించు నం. క్రి. 1. పేరుపెట్టు. 2. ఏర్పాటు చేయు. 3 నిర్దేశించు.

సంకోచకకండరము నం. వి. (జం.) ద్వారముల యందుండి కవాటము వలెపని చేయు కండరము. (Sphincter muscle)

సంకోచనావకాశము నం వి. (జం.) ఏకకణ జీవులలో నీరు అనవసర పదార్థములుచేరి యుండు రజర్వాయరు. (ఆనియమిత కాలములో బయటికి నెట్టివేయబడు చుండును). (Contractile vacuole).

సంకోచము నం వి. 1. ముకుళీభావము. 2. సంక్షేపము.

సంకోచించు నం. క్రి. 1.సంకోచమునొందు. 2 అనుమానించు, జంకు.

సంక్రందనుఁడు నం వి. ఇంద్రుడు.

సంక్రమణము నం వి. సూర్యుడొక రాశి నుండి మఱియొక రాశికి ప్రవేశించుట నం. వి. (భౌతి.) ఒక చోటగల స్థితి, దశ, రీతి విషయము అను వానినుండి మరొకచోట గలస్థితి, దశ, రీతి విషయము అనువానికి మార్పు.(Transition). నం. వి. (రసా.) దాటుట (Transition), ఉదా. రాంబిక్ గంధకము 96⁰ డిగ్రీల యొద్ద మోనోక్లినిక్ రూపమునకు సంక్రమణముచేయును.

సంక్రమించు నం. క్రి. 1. చొచ్చు. ప్రవేశించు. 2. ఆక్రమించు.
సంక్రాంతి నం. వి. మేషాది సంక్రమణము.
సంక్షారణము నం. వి. (రసా) మెల్ల మెల్లగా తినివేయబడుట (Corrosion). ఉదా. గాలిలో పెట్టిన ఇనుము క్రమముగా త్రుప్పగును. ఆమ్లము సంపర్కముతో ఎల్యూమినియమ్ మెల్లగా తినివేయబడును క్షారజలము ఇనుమును తినివేయును.
సంక్షిప్తము నం. విశే. సంక్షేపింపబడినది
సంక్షేపము నం. వి. సంగ్రహము.
సంక్షేపించు నం. క్రి. సంగ్రహించు.
సంక్షేమము నం.వి (పౌర) క్షేమము (Welfare).
సంక్షోభము నం. వి. కలత, వ్యాకులత, దుఃఖము.
సంఖ్య నం. వి లెక్క (గణి.) ఒక రాశిలో నున్న వస్తువు లెన్నియో తెలుపు సంజ్ఞ ఒక రాశిపరిమాణ మెన్ని ప్రమాణములో తెలియజేయు సంజ్ఞ. (Number).
సంఖ్యము నం వి యుద్ధము.
సంఖ్యాశాస్త్రము నం. వి. (గణి.) విషయములకు సంబంధించిన లెక్కలను సంగ్రహించి పొందుపరచి, వాని లక్షణ నిర్ణయముచేసి వ్యాఖ్యానించు శాస్త్రము (Statistics)
సంగడము వి. జెట్టి సాధన కుపయోగపడు ఇనుపగుండు.
సంగడము వై. వి. 1. సంగతము, స్నేహము నం. సంగతమ్. 2. చేరిక, సమీపము. 3 పరివారము. 4. సేన. 5. జత, నం సంఘాతమ్.
సంగడి వై. వి. 1. సంగతి. 2. స్నేహము, జత. 3. దగ్గర పార్శ్వము. వెనుక. 4 సమూహము 5. విధము రే రెండు తాటి బొందలుచేర్చి కట్టిన తెప్ప.
సంగడికాడు వి. మిత్రుడు. బ. సంగడీడు.
సంగతము నం. వి. స్నేహము, చేరిక. విశే. యుక్తము.
సంగతి నం. వి. 1. చేరిక. 2. జ్ఞానము 3. సమాచారము.
సంగమడుగు వి. ఊరికి సమీపముగనున్న మడుగు.
సంగమబిందువు నం. వి. (గణి) రేఖలు కలిసికొను బిందువు. (Point of concurrence).
సంగమము నం. వి. కలయిక, సంయోగము. నం. (జం.) రెండు భాగములు, కలిసియుండుట సామాన్యముగా రెండు ఎముకలు కలిసియుండుట. (Symphysis) నం. వి. (గణి.) ఒకే బిందువుతో రేఖలు కలిసికొనుట (Concurrence).
సంగమల వి. (రసా) చలువరాయి, స్ఫటికరూపకణమయమైన సున్నము రాయి. (Marble).
సంగమించు నం. క్రి. కలియు.
సంగము నం. వి కూడిక.
సంగరము నం. వి. 1. యుద్ధము. 2. ప్రతిజ్ఞ
సంగలన పద్ధతి నం. వి. (రసా.) పదార్థములను కరిగించి నెమ్మదిగా చల్లార్చు పద్ధతి, ద్రవీకరణ పద్ధతి. (Method of fusion).
సంగాతకత్తె వై. వి చెలికత్తె.
సంగాతకాడు వి చెలికాడు. సంగాతి.
సంగాతము వై. వి. చెలిమి, సంగతము, నం. సంగతమ్.
సంగి నం. విశే. సంగమము కలవాడు.
సంగీతము నం వి గానము.
సంగోరు వి. సగముపాలు.
సంగోళిత గ్రంథి నం వి. (జం.) నిసేచన ప్రణాళమునకు క్రిందనున్న గ్రంథి (Conglobate gland).

సంగ్రహము సం. వి. చక్కగా గ్రహించుట సంక్షేపము, సంగ్రహించుట
సంగ్రామము సం. వి యుద్ధము,
సంగ్రాహము సం.వి. పిడికిలి, పిడికిట బట్టుట
సంఘట్టనము సం. వి కూరుట, రాపిడి సం. వి. (రసా.) సమ్మేళనములోని పదార్థములనిష్పత్తులు. (Composition)
సంఘసనము సం. వి. (భౌతి. రసా)ఒక ద్రవ బాష్పమును చల్లారబెట్టి ద్రవముగా మార్చుట. (Condensation).
సంఘనితము సం. విశ. (భౌతి, రసా.) చల్లగాచేసి ఘనముగా మార్చబడినది (Condensed)
సంఘ నియమావళి సం. వి. (వాణి) కంపెనీల అంతర ప్రవృత్తిని నియమించు నిబంధనలను సంపూర్ణముగ విశదీకరించు ఒక నియమావళి. (దీనిలోని ముఖ్యాంశములు, వాటాలు, వాని వర్గీకరణము, యంత్రసామాగ్రి ఎప్పటికప్పుడు నూతనముగా నుంచుట, పారిశ్రామిక సామర్థ్యము తక్కువగల స్థలను మూసివేసి ఎక్కువగా నున్నవాని చేతనే పనిచేయించుట, మొదలగు పనులన్నియు రేషనలైజేషన్ అను పేరుతో పిలువబడును విస్తారాహ్వానములు, వాటాలను స్టాకుగా మార్చుట, కంపెనీ ఋణములు, నిర్దేశకులు; వారి యోగ్యతలు, మొదలగు విషయములు) (Articles of Association).
సంఘము సం. వి. 1. ప్రాణి సమూహము 2. గుంపు,
సంఘర్షణ సం వి. (భౌతి.)ఒక వస్తువుఇంకొకదాని ఢీకొనుట. (Collision). ఉదా వాయువులందుండు అణువులు వాని ఉష్ణతాశక్తి కారణముగ సాధారణముగ అనవరతము చలించుచు ఒక దానితో నొకటి ఢీకొనుచు సంకుల స్థితిలో నుండును (Collision).
సంఘర్షము సం వి. 1. ఒరయిక. 2. పోటీ. 3 వివాదము.
సంఘాత మరణము సం. వి. గుంపులుగా చచ్చుట.
సంఘాతము సం. వి. 1. సమూహము. 2. దట్టి దెబ్బ.
సంఘీభవించు సం క్రి. ఒకటిగా కూడు. గుంపు గూడు.
సంచయన బిందువు సం వి. (గణి.) ఒక బిందువున కిరువాగున ... సంచయములోని బిందువులు అనంతముగానున్న దానిని సంచయ బిందువందురు. (Point of accumulation).
సంచయనము సం వి. 1 చచ్చిన రెండవ దినమున ఎముకలు ప్రోగుచేయుట. 2. ప్రోగుచేయుట సం వి. 1. ప్రోగు, కూడబెట్టుట 2. సమూహము, సంగ్రహము, పొదుపు చేయుట, ఆదాచేయుట, కూడబెట్టుట. (Saving). (గణి.) కలయిక (Combination).
సంచరణము సం. వి. సంచారము, తిరుగుట, నడుచుట.
సంచాయక ఘటము సం. వి. (భౌతి.)విద్యుచ్ఛక్తిని నిక్షేపించి యుంచుటకు వీలైన విద్యుద్ఘటము లేదా ఘటమాల.
సంచారి సం.విశ. తిరుగువాడు.
సంచారిక సం. వి. కుంటెనకత్తె
సంచిపి గుడ్డలుమొదలైనవానితోగుట్టినతిత్తి.
సంచిక వై. వి. చేర్చికట్టి కుట్టిన పుస్తకభాగము. సం. సంచయః.
సంచికట్టు విశ. సంచికట్టుకొని అదేపనిమీద ప్రవర్తించువాడు. వైద్యుడు.
సంచికపోషకద్రవ్యము సం. వి. (వృక్ష.) నిలువ యుంచుకొనబడిన ఆహార పదార్థము (Reserve food material).

సంచితము సం. విశ. కూడబెట్టినది. ప్రోగు చేయబడినది.

సంచితమూలధనము సం. విశ. (వాణి.) అవిస్తార మూలధనము, వాటావిలువలో కంపెనీ సాధారణముగ రాబట్టుకొనని భాగము. ఉదా. ఒకవాటావిలువ రూ. 100 రూ. అయిన అందులో రూ 80 మాత్రమే వాటాదారుల కట్టవలయునను కొందము. మిగిలిన రూ. 20లు కంపెనీ ధ్రువీకరణ సమయమున కాని వాటాదారుడు కట్టనక్కరలేదు. దీనినే సంచిత మూలధనమందురు.

సంచిమొదలు వి. మూలధనము.

సంచు వి. 1. జాడ. 2. అందము 3. విధము

సంజీవకము సం. వి. (జం) ముఖ్యముగా అంతర్గుహీన జీవులలో అలైంగిక పునరుత్పత్తిలో నేర్పడిన కూటములో (Colony) నున్న ఒక్కొక్క అఖండమగు జీవి (Zooid) ఉదా. ఒబీలియా.

సంజీవకరణి సం వి. జీవమునిచ్చు ఓషధి

సంజీవి సం. విశ. జీవమును కలుగజేయునది

సంజ్వరము సం వి కాక, వేడిమి,

సంజె వై. వి. సంధ్య. సం. సంధ్యా.

సంజోత వి రెండు ప్రక్కల తాకెడు డుబుడుక్క నడిమి త్రాడు.

సంజ్ఞ సం. వి. 1. సైన, 2. పేరు. 3 తెలివి పరిభాష. 4 సూర్యునిభార్య.

సంజ్ఞ సం. వి. (గృహ.) 1. అభినయము. ఉ. చేష్ట. 2. చేష్టలచే అభిప్రాయమును తెల్పుట (Gesture).

సంజ్ఞప్తి సం. క్రి. 1. చంపుట 2. విన్నవించుట,

షంజ్ఞలు సం. వి. (గణి.) రాసులు ధనరాసులో ఋణరాసులో తెలియజేయుట కుపయోగపడు గుర్తులు + అనునది ధనరాసులను తెలియజేయుట కుపయోగించు గుర్తు — అనునది ఋణరాసులను తెలియజేయుట కుపయోగించు గుర్తు (Signs).

సంజ్ఞువు సం. విశ. ముట్టికాళ్ళవాడు దొడ్డికాళ్ళవాడు.

సండీనము సం వి. మీదికెగురుట

సంత వై. వి 1. నిర్ణయింపబడిన దినమున నుంచెడుబజారు 2 వేవపారము వి. చెంత.

సంతకము సం. వ్రేవాలు.

సంతతము సం. విశ 1. ఎల్లప్పుడు 2 ఎడతెగనిది రూ. సతతము.

సంతతి సం వి. 1. కులము, 2. సంతానము, 3. పుత్రపౌత్ర పారంపర్యము. 3. వరుస.

సంతన వై. వి. సంధానము. చేరిక, సం. సంధానమ్.

సంతనకట్టు క్రి 1. చేరు, సంఘీభవించు. 2. ఆయత్తపడు.

సంతనచేయు వై. వి ప్రోగుచేయు.

సంతపడు వై. క్రి ఒద్దికపడు

సంతమసము సం. వి అంతటనిండిన చీకటి.

సంతరించు క్రి. 1. సమకూర్చు, సేకరించు. 2 రచించు 3. ధరించు 4. కలిగించు.

సంతర్పణము సం. వి తృప్తిపరుచుట.

సంతసము వై. వి సంతోషము. రూ. సంతోసము, సంతోసము సం. సంతోషః.

సంతాగారము సం. వి. (వరి) గణప్రముఖుల సమావేశ స్థలము.

సంతానచతుష్కశివంచేలు మి. వి. (గృహ) నలుగురుబిడ్డలు ఒకే కాన్పులో కలుగుట (Quadruplets).

సంతానము సం. వి. 1. బిడ్డ. పుత్రపౌత్ర పారంపర్యము, కులము, 2 ఒక కల్పవృక్షము.

సంతాపము సం. వి. కాక, వేడిమి.

సంతాపించు సం. క్రి. మిక్కిలి తపించు,

సంతు వై. వి. సంతతి. సంతానము, కులము. సం. సంతతిః.

**సంతృప్తము** సం. విశే (భౌతి.) వాతావరణ విషయమై ఒక నియమితమైన ఉష్ణోగ్రత యందు. అది ఇముడ్చుకొనగలిగినంత నీటి యావిరినికలిగినది(వాయువు)Saturated

**సంతృప్తద్రావణము** సం. వి (భౌతి) ఒక ద్రావణము ఒక నియతతాపక్రమము నొద్ద అది లీనముగావించుకోగలిగినంత ద్రావ్యము ను కల్గినది. (Staturated solution). (రసా) ఒక ఉష్ణోగ్రతవద్ద మరికొంత ద్రవ్యము నేమాత్రము కరిగించుకొనలేని స్థితియందున్న ద్రావణము (Saturated solution)

**సంతోసము** వై. వి. సంతసము.

**సంతోషము** సం. వి. సంతసము, ముదము.

**సంతోసము** వై. వి. సంతసము.

**సందంశము** సం. వి. (భౌతి.) పట్టుకారు (Vice). ఒక వస్తువును దౌడలమధ్యన కదల కుండ పట్టియుంచు పనిముట్టు. దగ్గర బడు నట్లుచేయు వీలుగల దౌడలుగలపరికరము (Clamp). (ఇది పరిశోధన శాళములు మెదలైనవానిని కరిచిపట్టుకొని స్థిరముగ నుంచును)

**సందడి** వి. 1. ఒరసికొను జనసమూహము 2 జనసమూహధ్వని. 3, అతిశయము, విశే. సంకులము.

**సందడించు** క్రి. సందడిగొను సందడిపడు.

**సందరము** వై. వి. సముద్రము. మున్నీరు. రూ. సంద్రము. సం సముద్రః.

**సందర్భము** సం. వి. 1. ప్రబంధము కూర్పు 2. సమయము.

**సందర్భించు** సం క్రి. సమయమగు.

**సందానము** సం. వి, పసువులగట్టు దా మెన.

**సందీ** వై. వి. 1. సందు. 2. దండచేయి. సం సంధిః.

**సందికడియము** వి.సందిట ధరించుకడియము.

**సందిగ్ధతాపక్రమము** సం. వి. (భౌతి. రసా.) ఏ తాపక్రమనుమువద్ద ఒక ద్రవ్యరాశిద్రవ రూపమున ఉన్నదో, వాయురూపమున ఉన్నదో తెలిసికొన వీలుండదో అట్టి తాప క్రమము (Critical temperature).

**సందిగ్ధప్రేషము** సం వి. (భౌతి, రసా) సందిగ్ధ తాపక్రమమునొద్ద ఒకవాయురాశి ప్రసర ణించుటత్తిడి(Critical pressure).

**సందిగ్ధము** సం. వి సందేహమైనది. (గణి.) కచ్చితముగా నిర్ధారణచేయుటకు వీలుపడ నిది (Ambiguous)

**సందిగ్ధాయతనము** సం. వి. (భౌతి, రసా) సందిగ్ధ తాపక్రమమునొద్ద ఒక వాయు రాశి గ్రహించు ఆయతనము (Critical volume).

**సందియము** వై వి. సందెహము. సంశ యము, సం. సందేహః.

**సందలి** వి. దండచేయి

**సందలిదండ** వి. కేయూరము బాహుపురి.

**సందు** వై. వి. 1. సంది. 2. ఇరుకువీధి, 3. సొరంగము 4. ఎడము. 5. సందర్భము, సం. సంధిః.

**సందుకట్టు** వి. మధ్యకాలము.

**సందుకొను** క్రి 1. వ్యాపించు 2 కూడు. 3 పరిగ్రహించు.

**సందె** వై. వి. సంధ్య. సంజ. సం సంధ్యా.

**సందెజాము** వై. వి. సంధ్యాకాలము. సం. సంధ్యాయామః.

**సందేశము** సం వి. సమాచారము, వార్త.

**సందేశహరుఁడు** సం వి దూత.

**సందేహము** సం. వి సంశయము.

**సందోహము** సం. వి. గుమి, గుంపు

**సంద్రము** వై.వి. సందరము. సం. సముద్రః

**సంద్రావము** సం వి. యుద్ధముగలన బారుట. పలాయనము రూ సందానము.

**సంద్రుఁడు** వై వి. సముద్రుడు, సం. సముద్రః.

సంధ సం. వి. 1. ప్రతిజ్ఞ. 2. మేర, 3. సంధ్య
సంధాత సం. విణ. కూర్చువాడు.
సంధానకరిణి సం. వి. చెడిన అవయవములను కూర్చు ఓషధి.
సంధానప్రక్రియ సం. వి. (రసా.) ఒక ద్రవ్యమును ఇంకొక దాని చూర్ణముతో పొదిగి వేడి చేసి ఈ రెండవ ద్రవ్యము మొదట దానిపై దృఢముగా అతికికొను ఘట్లుచేయు ప్రక్రియ (Cementation). ఉదా. ఇనుపకడ్డీలను బొగ్గులో పొదిగి వేడెక్కించి ఉక్కుగా మార్చుట,
సంధానము సం. వి. కూర్చుట. సం. వి (రసా.) రెండు ధాతువులను ఎఱ్ఱగా కాల్చి అతుకుట. (Wilding).
సంధానవాహినులు సం. వి. (జం.) శరీరముపైనున్న కవచము నుండియు ఉత్సర్గనాళికల నుండియు రక్తమును తీసికొని వచ్చు రెండు రక్తనాళములు (Commissural vessels) ఉదా. వానపాము.
సంధాయక కణజాలము సం. వి (గృహ) ఒకదానిని మరియొకదానితో చేర్చిఅతుకు కణజాలము. (Connective tissue)
సంధాయకుఁడు సం. విణ. సంధాత.
సంధి సం. వి. 1. కూడిక. 2. శత్రువులతోడి పొందు. 3. సందు. 4. సొరంగము 5. రూపకముల యందొక అంగము. (వ్యాక.) ముందరి పదము యొక్క చివరి యక్షరము తరువాతి పదము యొక్క మొదటి అక్షరము ఒకదానితో నొకటి కూడుకొనుట. ఉదా. వాడు + అన్నము తినెను = వాడన్నము తినెను.
సంధి సం. వి. (జం.) కీలు, వేరుగానున్న రెండు ఎముకలు గాని గట్టిపడిన భాగములుగాని కలియుచోటు (Joint).
సంధించు సం. క్రి. కూర్చు. రూ. సంధిల్లు,
సంధితము సం. విణ. కూర్పబడినది.
సంధిత్సు సం. వి. సంధిచేసికొను కోరిక.
సంధిపారయుతములు సం. (జం.) వేరువేరు భాగములు కలిసి ఏర్పడిన కాళ్లు గల జంతువులు (Arthropoda). ఉదా. పీతలు, కీటకములు మొదలగునవి.
సంధిరసము సం. వి. (జం.) బంతిగిన్నె కీలువంటి కీలులో ఎముకల మధ్యనుండు రసము (Synovial fluid).
సంధిరేఖ సం. వి. (వృక్ష.) ఉదావర్త బీజాండమునకు బీజబంధము కలసియున్నంతవరకు ఏర్పడిన చాలు. (Raphe).
సంధివాతము సం. వి (గృహ.) సంధుల వాపులు, నొప్పులు దీర్ఘవ్యాప్తమగు కీళ్ళనొప్పులు. (Rheumatism).
సంధులు సం. వి. (గృహ.) కీళ్లు, ఒక ఎముకను మరియొక ఎముకనుకూర్చునవి. (Joints).
సంధోశము సం. వి. (గృహ.) పట్టుకారు. నిప్పును లేక చేతితో అంటరాని వస్తువులను తీయుటకు ఉపయోగించు పరికరము (Fire tongs or fire-irons).
సంధ్య సం. వి. 1. ప్రొద్దుపుట్టుటకు ముందైదు ఘడియల వరకును, ప్రొద్దుక్రుంకిన వెనుక మూడు ఘడియలు వరకును గల కాలము 2. సంధి. 3. ప్రతిజ్ఞ
సంధ్యానిద్ర సం. వి. (గృహ.) 1. చీకటి పడెడి సమయమందు నిద్రపోవుట. 2. ప్రసూతి సమయమున గలుగజేయు మైకము. (ఇందుకై మార్ఫిన్, స్కోపోలమిన్ ఆల్కాలాయిడ్ల మిశ్రమమునిత్తురు) (Twilight sleep).
సంపగియ వై. వి. చంపకము. రూ. సంపగి, సంపెగ, సంపగి. సం. చంపకః.
సంపతిల్లు వై. క్రి. సమృద్ధమగు.
సంపత్తి సం. వి. సంపద, సంవృద్ధి.
సంపత్తు సం. వి. ఐశ్వర్యము. రూ. సంపద.

సంపన్నము సం. విశే. సంపదతో గూడినది. సమృద్ధమైనది.
సంపర్కము సం. వి కలయిక, చేరిక.
సంపాతము సం వి. (గణి) 1 ఒకే స్థలమునుగాని లేదా కాలమునుగాని ఆక్రమించుట. 2.ఒకదానితోనొకటి పూర్తిగా సరిపోవుట. (Coincidence)
సంపాదకుఁడు సం. విశే. సంపాదించువాడు.
సంపాదనము సం వి. గడించుట.
సంపాదితము సం. విశే. సంపాదింపబడినది
సంపాదిత లక్షణము సం. వి (జీవ.) బాహ్యపరిస్థితుల వలన ఒక ప్రాణి జీవితములో ఏర్పడిన లక్షణము (Acquired character).
సంపాద్యము సం. విశే. సంపాదింపదగినది
సంపాసారి వై. వి. కోమటి. సం. సంభార చారి.
సంపీడనము సం. వి. (భౌతి.) ఏదైన వస్తువు వేగముగా చలించునప్పుడు వాయువు ముందుకు నెట్టబడుటచే పీడనము వృద్ధి చెందుట. (Compre sion).
సంపీడ్యత సం. వి. (భౌతి) పైబలములు ప్రయోగించినపుడు కదించుకొనిపోవుటకు వస్తువునకు గల ప్రాపీడ్యము. పీడనము వలన ఘనపరిమాణము తగ్గెడి ధర్మము (Compressibility)
సంపు క్రి చంపు.
సంపుటము సం వి. 1. బరిణె. 2. ముకుళనము.
సంపుటించు క్రి ముకుళించు,
సంపూరకకోణము సం. వి (గణి) దత్తకోణముతో కలిసి రెండు సమకోణము సంపూరక కోణములు లగుకోణము.(Supplimentary angle)
సంపూర్ణ పరపుష్టములు సం వి (వృక్ష) ఇవి ఇతర జాతుల మొక్కలపై పూర్తిగా సాధారపడి పరాన్న భుక్కులుగా పెరుగు మొక్కలు వీని వేళ్ళు నేలనుండి సారమును తీసికొనజాలక ఇతర జాతుల అంగములనుండి పోషకరసమును హరించుచుండును (total parasites) ఉదా. సీతమ్మవారి తోఁములు (Dodder) అవమల్లె మొదలగునవి
సంపూర్ణసంధి సం. వి. (జం) చలసంధి. అన్ని వైపులకును ఎముకలు స్వేచ్ఛగా తిరుగుటకు వీలుగానున్నకీలు (Perfect joint).
సంపూర్ణాంతర పరావర్తనము సం వి.(భౌతి) రెండు యానములను విడదీయు సమతలము నొద్ద జరుగు పరావర్తనము. (Total internal reflection)
సంపృక్తము సం. విశే. సంయుక్తము. కలిసినది.
సంపెఁగ వై. వి. సంపగియ, సం చంపకః.
సంపెట వై వి. ఇనుమును సాగగొట్టు పెద్ద సుత్తి. రూ. సమ్మెట. సం. శింబళీ.
సంపత్తి వై. వి. లెక్కసరిచూచు పెద్ద కంఠము సం. సంప్రధిః
సంప్రతించు క్రి 1 లెక్కసరిచూచు. 2. ఇతరులతో ఆలోచించు.
సంప్రదాయము సం వి. గురుపారంపర్యము.
సంప్రధారణ సం. వి. సమర్థించుట.
సంప్రహారము సం. వి. 1. యుద్ధము. 2. గమనము.
సంప్రాప్త పౌరసత్వము సం. వి. (రాజ) పరదేశ పౌరసత్వపు హక్కులు పొందుట. తానుండిన విదేశములో ఆదేశపౌరునిగా గుర్తింపబడుట, కృతనాగరకుడు.
సంప్రోక్షణము సం వి. 1. చిలుకరించుట. 2 పరిశుద్ధము చేయుట 3 విగ్రహాదులకు జీవప్రతిష్ఠచేయుట.

**సంబంధము** నం. వి. 1. చుట్టరికము. 2. కూడిక.

**సంబంధి** నం. వి. చుట్టము. విశే. సంబంధము కలవాడు.

**సంబడము** వై. వి. సంబళము, దినబత్తెము. బత్తెము, జీతము రూ. సంబళము. నం. శంబలమ్.

**సంబడీంచు** క్రి. వల్లపడు, తెప్పిరు. రూ. సంబళించు.

**సంబరము** వై. వి. సంభ్రమము, వేగిరపాటు సంతోషము, పండుగ రూ. సంబ్రమము. నం. సంభ్రమః

**సంబరి** అవ్య. తొలగుము. రూ. సంబళి.

**సంబలము** నం. వి. శంబలము, జీతము బత్తెము

**సంబవులు** వై. వి. సంభరుపు, పావకోళ్లు, పాదరక్షలు. నం. సభరుః.

**సంబళము** వై. వి. సంబడము.

**సంబళించు** క్రి. సంబడించు.

**సంబళిక** వి. వక్కాకుతిత్తి. రూ. సంబెళి.

**సంబాగువు** వి. పసుదాటు సాధనము.

**సంబాధము** నం. వి. 1 ఇరుకు. 2. సంకటము.

**సంబారపు ద్రవ్యములు** వై. వి. (వ్యవ.) ఆహార పదార్థములలో అవసరమునుబట్టి రుచిని, పరిమళమును, ఆహార యోగ్యతను ఎక్కువచేయుటకు చేర్చబడుచుండు వస్తువులు (Spices and condiments).

**సంబారము** వై. వి. సంభారము. కూరలలో వేసెడి రసవర్గము. రూ. సంబారు. నం. సంభారః.

**సంబాళించు** వై. క్రి. 1. ఆదరించు. 2. నెరవేర్చు.

**సంబాళిగలు** వై. వి. పావకోళ్లు, పాపోసులు.

**సంబుద్ధి** నం. వి. సంబోధనము.

**సంబెళి** వి. సంబళిక.

**సంబోధనము** నం. వి. పిలుపు. ఆహ్వానము.

**సంభరుపు** నం. వి. సంబాళిగలు రూ. సంభరుక.

**సంభవము** నం. వి. 1. పుట్టుక. 2. హేతువు. 3. కూడిక.

**సంభవించు** నం. క్రి. సంభవిల్లు.

**సంభళి** నం. వి. కుంటెనకత్తె రూ. శంభళి.

**సంభారము** నం. వి. 1. సమూహము. 2. పదార్థ సంచయము.

**సంభారములు** నం. వి. (గృహ.) పచ్చళ్లు, ఊరుగాయలు మొదలైనవి 2. పలుకులు, లవంగములు దాల్చినచెక్క మొ॥ మసాల పదార్థములు. (Condiments).

**సంభావన** నం. వి. 1. తలపు 2. సమ్మానము. 3. ప్రసిద్ధి (వ్యాక.) ఊహ.

**సంభావనీయము** నం. విశే. సంభావింపదగినది. రూ. సంభావ్యము

**సంభావించు** నం. క్రి. తలంచు.

**సంభావితము** నం. వి. (గణి.) ఏదైన ఒక ఘటన (విషయము) సంభవించుటకు గల అవకాశము విశే. సంభావింపబడినది (Probability).

**సంభాషణము** నం. వి. చక్కగామాటలాడుట.

**సంభాషించు** నం. క్రి. చక్కగమాటాడు.

**సంభూతము** నం. విశే. పుట్టినది.

**సంభృతము** నం. విశే. 1. చక్కగా భరింపబడినది 2. చక్కగా ధరింపబడినది.

**సంభృతి** నం. వి. చక్కగా భరించుట. 2. చక్కగా ధరించుట.

**సంభోగము** నం. వి. 1 మంచిసుఖము 2. సురతము.

**సంభోగించు** నం. క్రి. 1. కలయు 2. రమించు.

**సంభ్రమము** నం. వి. (గృహ.) 1 సంబరము, 2. వేగిరపాటు. 3 భయము. 4. ఆదరము.

**సంభ్రమించు** నం. క్రి. వేగిరపడు.

**సంమేళనములు** నం. వి. (వాణి.) విడివిడిగ నున్న ఉత్పాదక సంస్థలుకాని వ్యాపార సంస్థలుకాని నిర్దిష్టమైన లక్ష్యములను

సాధించుటకై ఒకేసంస్థగ వ్యవహరించుట, చూ. సమ్మేళనములు.
సంయతము సం విశే. కట్టబడినది.
సంయత్తు సం. వి. యుద్ధము.
సంయమనము సం వి. 1. బంధనము. 2 వ్రతము.
సంయమని సం. వి. యముని పట్టణము
సంయమము సం. వి. హింసాదులవలన విరమించుట. చూ సంయామము.
సంయమి సం. వి. ముని. వ్యు. సంయమము కలవాడు.
సంయుక్తజలము సం. (వ్యావ) నేలయందు రాసాయనికముగ కూడియున్న నీరు (Combined waters).
సంయుక్తదళ పుష్ప యుతములు సం. (వృక్ష) ఆకర్షణపత్రములు కలిసియున్న పుష్పములుగల మొక్కలు (Sympetalae or gamopetalae)
సంయుక్తదళయుతము సం. (వృక్ష.) కలిసియున్నఆకర్షణపత్రములుగలది (Sympetalous or gamopetalous).
సంయుక్తపరాగకోశము సం (వృక్ష) పుష్పములోని కింజల్కముల దండములు విడివిడిగానుండు పుప్పొడితిత్తులు కలిసియున్న స్థితి (Synogenesious).
సంయుక్తఫలదళము సం. వి. (వృక్ష) కలిసియున్న ఫలదళములుగల (స్థితి) (Syncarpous)



సంయుక్తఫలము సం. వి. (వృక్ష.) ఒక పుష్పము సంయుక్తమాత్రమేగాక పుష్పగుచ్ఛ ఫలదళము -మంతయు ఒకే పండుగా తయారైనది (Composite or multiple fruit). ఉదా. పనస, అనాస మొ.
సంయుక బీజము సం. వి. (జీవ. పురుష సంయోగి స్త్రీ సంయోగి కలిసి ఏర్పడిన జీవకణము (Zygote) సం. వి. (వృక్ష) ఫలదీకరణమైన అండముతో నేర్పడిన జీవకణము (Oospore).
సంయుక్తము సం విశే. కూడుకొనినది.
సంయుక్తరక్షకపత్రము సం. వి. (వృక్ష.) కలిసియున్న రక్షక పత్రములు గలది. (Gamosepalous).
సంయుక్తరాష్ట్రములు సం. / వి. (పౌర రాజ.) సమ్మేళన రాష్ట్రములు. ఫెడరల్ రాష్ట్రములు.
సంయుక్తసమావేశము సం (రాజ) ద్విసభా విధానముగల రాజ్యములలో రెండు శాసనసభలు ఒక విషయమును చర్చించుటకు ఒకే స్థలములో సమావేశమగుట
సంయుక్తాండకోశము సం. (వృక్ష.) కలిసియున్న ఫలదళములుగల అండకోశము. (Syncarpous pistil).
సంయుక్తాండాశయము సం (వృక్ష) కలిసియున్న ఫలదళములతో నేర్పడిన అండాశయము (Syncarpous ovary).
సంయుక్తాక్షి సం. (జం) దృష్టికిసంబంధించిన మూలపదార్థములు అనేకములుగా కలిసి ఏర్పడిన కన్ను (Compound eye).
సంయుగము సం. వి యుద్ధము.
సంయుగ్మముచెందుట సం. (జం.) రెండు ఏకకణజీవులు తాత్కాలికముగా కలిసి వానిలోనున్న క్రోమాటిన్ పదార్థమును పరస్పరముమార్చుకొనుట(Confagation
సంయుగ్మి సం. (జం). సంయుగ్మము చెందు ప్రాణులలో నొకటి (Conjugant).
సంయుతాక్షము సం. (వృక్ష) యొదటి నుండియు ఒకే మొగ్గనుండి కాక, ఒకటి కంటె నెక్కువ మొగ్గలనుండి ఏర్పడిన కాండము. (Sympodium)

సంయుతైకవర్ధ్యకము నం. (వృక్ష.) రెమ్మ గెల శాఖలుగలపక వర్ధ్యకుక పుష్పమంజరి. (Panicle).

సంయోగకణము నం (జీవ.) సంతానోత్పాదక సంయుతైక జీవకణము(Germ cell) వర్ధ్యకము

సంయోగభారనియమము నం వి. (రసా.) ప్రతి మూల ద్రవ్యమునకు ఒక నియత భారము డును. ఆ భారములోనే అది ఇతర మూలద్రవ్యముల నియత భారము లతో సంయోగించును అను నియమము (Law of combining weight).

సంయోగభారము నం వి (రసా) ప్రమాణముగ తీసికొనిన ఒక మూల ద్రవ్యరాశితో ఇంకొక మూలద్రవ్యము సంయోగించు భారము (Combining weight)

సంయోగము నం. వి. కూడిక, నం. వి (రసా) 1 రెండు ద్రవ్యములు రాసాయనికముగనుపయోగించుట(Combination 2 కొన్ని మూలకముల రసాయన సమ్మేళనమువలన నేర్పడిన పదార్థము (Compound).

సంయోగసాంకేతికములు నం. వి. (రసా.) రసాయన పదార్థములలో నున్న మూలకములను వాని నిష్పత్తులను సూచించు సూత్రములు(Formulae of compounds

సంయోగానుపాతము నం. వి (రసా.) రాసాయనికముగ సంయోగించు ద్రవ్యముల రాశి నిష్పత్తి (Combining proportion).

సంయోజకము నం. వి. (భౌతి. రసా) ఒక ప్రయోగపంకరమునకు సౌకర్యార్థము తగిలించబడిన ఇంకొక అంగపరికరము శీతకము వెనుక తగిలించిన వక్రకశంక్వాకార నాళము (Converter). నం. వి. (రసా.) ఒక పనికి ఉద్దిష్టమైన పరికరము ఇంకొక పనికి ఉపయోగపడునట్లు చేయుటకై తగిలించు ఉపకరణము (Adapter).

సంయోజనాత్మకమైన నం. విశే. (గృహ.) (రసా) మూలద్రవ్యముల మధ్య రాసాయనిక సంయోగమును సంభవింపజేయుట (Synthetic).

సంయోజితము నం విశే 1.మరియొకదానితో కూర్చబడినది 2.సంయోగశక్తి (Valency)

సంరంభము నం వి. 1. నేగిరపాటు. 2. ఆటోపము

సంరబ్ధము నం విశే. సంరంభము నొందినది.

సంరావము నం. వి. మ్రోత.

సంరూఢము నం. విశే. పెరిగినది.

సంలగ్నము నం వి. (వృక్ష) పుష్పములో నున్న ఒక భాగములోనున్న అంగములు ఒకదానితో నొకటి కలిసియున్న స్థితి (Cohesion) ఉదా. పుంకేసరములు ఒకదానితో నొకటి కలిసియున్న స్థితి.

సంలాపము నం వి ప్రీతితోడ పరస్పర సంభాషణము.

సంవత్సరము నం వి ఏడు

సంవర్గమానపూర్ణాంకము నం. వి. (గణి.) సంవర్గమానములోని పూర్ణాంక భాగము (దశాంశ) ఘాతాంక పూర్ణాంకము. (Mantissa).

సంవర్గమానము నం.వి (గణి.) ఘాతాంకము లఘుగణకము, ఒక ఆధార సంఖ్యను, ఏ ఘాతమునకు హెచ్చించిన, ఇచ్చినదత్తసంఖ్య వచ్చునో ఆ ఘాతమును సూచించు సంఖ్య ఇది దత్తసంఖ్య యొక్క సంవర్గమానము లేక ఘాతాంకము లేక లఘుగణకము అనబడును (Logarithm).ఉదా. $M = a^x$. ఇందు M = దత్త సంఖ్య a = ఆధార సంఖ్య, X = సంవర్గమానము, లేదా ఘాతాంకము, లేదాలఘుగణకము

y=Mx అయినా xను y యొక్క సంవర్గ మానము, లేక ఘాతాంకము అందురు.

సంవర్తము నం. వి. ప్రళయము.

సంవర్ధకము నం వి. (రసా) ఛాయాచిత్ర ఫలకము (పత్రము) పై కెమరాలో ఏర్పడిన ఋణచిత్రమును కంటి కగపడు నట్లు కడిగిచేయుయాగికము (Developer

సంవసధము నం. వి ఊరు

సంవహనము నం వి. (భౌతి) పారప్రేషణము ముఖ్యముగా ద్రవములందు తాపమును గాని విద్యుత్తును గాని ప్రవాహములచే ద్రవ్యమంతట వ్యాపింపజేయుట (Convection).

సంవహనీయ వర్షము నం. వి. (భూగో) వర్షవహనము భూమధ్యరేఖకు ఇరు ప్రక్కలనుండు ఉష్ణప్రదేశములలో నీటితో నిండిన వాయువు పైకిపోయి వర్షరూప మున తిరిగి భూమిపైబడుట

సంవాదము నం. వి. 1 సమాచారము 2. ప్రశ్నోత్తర రూపమగు సంభాషణము.

సంవాహుడు నం. వి. 1. మోయువాడు. 2. తొడలు పిసుకువాడు.

సంవాహనము నం. వి. 1. చక్కగా మోయుట 2. ఒడలు పిసుకుట.

సంవిత్కల్పము నం వి. (వ్యావ, శాస) వాస్తవికముగ న్యాయబద్ధమైన సంవిత్తు (కాంట్రాక్టు) లేనప్పటికిని న్యాయనిర్వ హణకు పక్షములమధ్య నారోపింపబడు సంవిత్తు (Quasi-contract).

సంవిత్తు నం. వి. 1 జ్ఞానము. 2. సంకేతము 3. ప్రతిజ్ఞ 4. అంగీకారము, 5. ఆచారము. 6. యుద్ధము. 7. సంభాషణము రూ. సంవిత్తి.

సంవిధాన న్యాయశాస్త్రము నం. వి. (శాస.) రాజ్యాంగమునకు సంబంధించిన న్యాయ శాస్త్రము.

సంవిధాన బద్ధ రాజతంత్రము నం. వి (రాజ., చరి, పౌర) రాజ్యాంగబద్ధమైన రాచరికము. రాజు నిరంకుశముగ పరిపాలించక రాజ్యాంగ శాసనము ప్రకారము బాధ్యతాయుతముగా పరిపాలించుట

సంవిధానము నం వి (రాజ, శాస) రాజ్యాంగ శాసనము ప్రభుత్వము ప్రజల హక్కులను, బాధ్యతలను, పరిపాలనా విధానమును రాజ్య ఆర్థిక, సాంఘిక వ్యవస్థలను స్పష్టపరచు చట్టము రాజ్యపరిపాలకులకు పరిపాలనా విధానములో మార్గదర్శిగా నుండు చట్టము

సంవిధాన సభ నం వి. (రాజ., చరి. రాజ్యాంగ నిర్మాణ సభ. రాజ్యాంగ పరిషత్తు.

సంవీతము నం. వి. హారమువలె వేసికొనిన జందెము.

సంవృతబీజకము నం. వి (వృక్ష) ఆవేష్టిత బీజకము. గింజపై రక్షణనిచ్చు పొరలు గల మొక్క. (Angisperm).

సంవృతము నం. విశ. చుట్టుకొనబడినది. ఆవృతము.

సంవేగము నం వి. సంభ్రమము, వేగిరపాటు. నం (జీవ) ప్రేరేపణ (Impulse)

సంవేగాత్మకము నం విశ. (గృహ) సులభముగా మనోవికారము పొందు నట్టిది. (Emotional).

సంవేదకనాడులు నం. వి. (జం) జ్ఞానేంద్రియముల (చర్మము, నాలుక, కన్ను, ముక్కు, చెవి) నుండి కేంద్ర నాడీమండలమునకు ప్రేరేపణలు పంపు నాడులు. జ్ఞాననాడులు. (Sensory nerves).

సంవేశిని నం. వి. మొగసాల.

సంవ్యానము నం. వి. 1. ఉత్తరీయము. 2. వస్త్రము.

సంశప్తకుఁడు నం. వి. తిరుగనని యొట్టు పెట్టుకొని యుద్ధముచేయు వాడు.
సంశయము నం. వి సందేహము.
సంశయించు నం. క్రి. సందేహించు.
సంశయిత నం. విజ సంశయించువాడు.
సంశోధనము నం. విజ (గణి) తప్పును దిద్దుట (Correction).
సంశోధితము నం. విజ. (గణి.) దిద్దబడినది. (Corrected) చూ సంశోధనము.
సంశ్రయము నం. వి ఆశ్రయము
సంశ్రయించు నం క్రి. ఆశ్రయించు.
సంశ్రవము నం వి అంగీకారము
సంశ్రితము నం విజ ఆశ్రయింపబడినది.
సంశ్లిష్టము నం విజ కౌగిలింపబడినది,
సంశ్లేషణక్రియ నం. వి. (జీవ.) చయక్రియ (Anabolism synthesis) ఉదా. కిరణ జనసంయోగక్రియ.
సంశ్లేషము నం. వి. కౌగిలింత (వ్యాక) ద్రుతము తరువాతి హల్లుతో కూడికొనుట ఉదా. పూచెన్గలువ.
సంశ్లేషించు నం. క్రి. కౌగిలించు.
సంసక్తము నం. విజ. చేరినది.
సంసక్తి నం. వి చేరిక
సంసత్తు నం, వి కొలువుకూటము.
సంసరణము నం వి. 1. సంసారము 2. బాట. 3. యుద్ధప్రారంభము.
సంసరించు నం. క్రి. 1. పుట్టు. 2 జరుగు. 3 పోవు
సంసర్గము నం. వి. సంబంధము చేరిక.
సంసారము నం. వి. 1. ఆలుబిడ్డలతోడ యునికి. 2. ప్రపంచము,
సంసారి నం. వి. సంసారము కలవాడు. గృహస్థుడు.
సంసృతి నం. వి సంసారము.
సంసృష్టము నం. విజ సంసర్గము పొందినది.
సంసృష్టి నం. వి. సంసర్గము,
సంస్కారము నం. వి. 1. చక్క జేయుట. 2. శవమును దహించుట. 3.అనుభూతార్థ స్మృతిపాకము. రూ. సంస్క్రియ.
సంస్కృతము నం వి. దేవభాష. విజ. చక్కజేయబడినది, వ్యాకరణ శిక్షిత మైనది. పక్వము చేయబడినది.
సంస్కృతి నం. వి. (గృహ.) 1. ఉత్పన్నత 2 నాగరికత. (Culture).
సంస్క్రియ నం. వి. సంస్కారము.
సంస్తరము నం వి. 1. చిగుళ్ళులోనగు వానిచే నేర్పరచిన పడక. 2, యజ్ఞము.
సంస్తవము నం వి 1 పరిచయము. 2. స్తుతి
సంస్త్యాయము నం. వి. 1. ఇల్లు, 2. విరివి. 3. సమూహము.
సంస్థాత నం. విజ. చక్కగా నిలుచుండు వాడు.
సంస్థానము నం. వి. 1. సన్నివేశము. 2. చతుష్పథము. 3. చిన్నరాజ్యము. 4. మృత్యువు
సంస్థానాధీశ్వరులసభ నం వి. (చరి.) 1919వ సం॥ము ఇండియా ప్రభుత్వపు చట్టము ప్రకారము క్రీ.శ. 1921వ సం॥ ములో నీ సభ స్థాపింపబడెను.
సంస్థితము నం విజ.1.వచ్చినది. 2. చక్కగా నుండినది.
సంస్థితి నం.వి. 1. చావు 2 చక్కనియునికి.
సంస్ఫోటము నం: వి యుద్ధము,
సంహతము నం. విజ. చక్కగా చేరినది,
సంహతి నం. వి. 1. సమూహము. 2. కలయిక. 3. సత్తువ
సంహననము నం.వి. 1.శరీరము. 2.చంపుట. 3. కలయిక.
సంహరణము నం. వి. చంపుట. రూ. సంహారము.
సంహర్త నం. విజ. సంహరించువాడు. రూ. సంహారకుడు.

సంహిత సం. విశ. 1. వర్ణసంయోగము. 2. ధర్మశాస్త్రము. విశ. సంధింపబడినది.
సంహృతము సం. విశ. సంహరింపబడినది మరలింపబడినది.
సంహృతి సం. వి. 1. సంహారము, 2. మరల్చుట.
సకర్మకము సం. వి. (వ్యాక.) కర్మము యొక్క ప్రశ్నను కలిగించు క్రియ ఉదా రాముడు రావణుని చంపెను. (ఎవరిని చంపెనన్న ప్రశ్న కలుగుచున్నది. కాన చంపెను అన్న క్రియ సకర్మకము.)
సకలము సం. విశ. 1. సర్వము 2. కలతో గూడినది.
సకి వై వి. సఖి. చెలి. (స్త్రీ) రూ. సకియ సం. సఖీ.
సకిన వై .వి. 1 కృత్రిమపక్షి. 2. కీచుబిళ్ళ 3. బొమ్మ. రూ. సగిన. సం. శకునః.
సకినపుఁబులుగు వి. పైడికంటి.
సకినము వై. వి. శకునము, శుభాశుభ సూచక నిమిత్తము, శుభాశుభ సూచక వాక్కు. సం. శకునః.
సకినలమంచము వి. 1. చిత్రపుపనిచేసిన మంచము. 2. పరుండి కదలునపుడు కిర్రుమని ధ్వనిచేయు మంచము.
సకిలించు క్రి. గుఱ్ఱముకూయు. రూ. సగిలించు
సకుఁడు వై. వి. సఖుడు, చెలికాడు. సం. సఖా.
సకృత్తు సం. విశ. అరుదు.
సక్తము సం. విశ. ఒకదానియందు లగ్నమైనది (మనసు).
సక్తువు సం. వి. పేలపిండి
సక్థి సం. వి తొడ.
సక్రమబహుభుజి సం. విశ. (గణి.) కోణములు, భుజములు, వేరువేరుగా నుండెడి బహుభుజి (Regular polygon).
సక్రియము సం. వి. (గృహ.) 1. చురుకుదనముగలది. 2. పనిచేయ సమర్థమగునది (Active).
సఖి సం. వి. 1. సకి. చెలికతె 2. స్నేహితుడు, సహాయుడు రూ. సఖుడు.
సఖికోశములు సం. వి (వృక్ష.) అధోవాహినిలో నుండు జల్లెడ గొట్టములకు ప్రక్కను సహాయకారిగానుండు ఒక్కొక్క జీవకణకోశము (Companion cells)
సఖ్యము సం. వి. చెలిమి.
సగంధుఁడు సం. వి స్నేహితుడు.
సగటు వై. వి. చదరంగమున శకటము. (గణి.) రాసుల మొత్తము, రాసుల సంఖ్య మధ్యగల నిష్పత్తి (గణి) సరాసరి (Average). సం శకటః, సంఘాతః.
సగతు వి. గుఱ్ఱపు పల్లమునకు రతనాలతో చేసిన తీగ మోడిపని.
సగము వై. వి. 1. స్వామి 2. అర్థము. రూ. సవము, సాము. సం. సామి.
సగోత్రుఁడు సం. వి. దాయ.
సగ్గారి వై. వి. సృగాలము, నక్క. రూ. సగ్గాలము.
సగ్గిసముగ్గిసలు వి. (బహు.) ఉడ్డు గుడుపు.
సగ్గు క్రి. అడగు తగ్గు, రూ స్రగ్గు.
సగ్గు బియ్యము వి. (వ్యావ) సాగో అను చెట్టు పాలనుండి తయారుచేయబడిన కృత్రిమధాన్యము (Sago) ఇవి Metroxylon sagu M Rumphi, M. leave అను తాల (Palma) కుటుంబమునకుచెందిన మొక్కల కాండములలో నిలువచేయబడిన పిండిపదార్థము నుండి తయారుచేయబడినవి ఈ మొక్కలు సుమిత్రా. జావా బోర్నియో దీవులలో విస్తారముగ నుండును. ఈకుటుంబమునకేచెందిన Caryota urens (Indian sago) అను మొక్కనుండికూడ ఇవి తయారగును. Tapioca(కఱ్ఱ పెండలము Manihot utilissima) అను మొక్క వేళ్ళలో

నిలువచేయబడిన పిండితో కూడ సగ్గు బియ్యము తయారుచేయుదురు).

సగ్గెత వి. చెంబు.

సచివాలయము సం. వి. (రాజ) ప్రభుత్వము యొక్క ముఖ్యకార్యాలయము మంత్రి మండలి పరిపాలన వివిధ శాఖలకు చెందిన ప్రభుత్వ కార్యవర్యులుండు కచ్చేరి

సచివుఁడు సం. వి. 1. మంత్రి. 2. స్నేహితుడు 3. సహాయుడు.

సచ్చము వి. చిల్లరరొక్కపుఅప్పు, చేబదులు.

సచ్చు క్రి. చచ్చు

సచ్ఛిద్రము సం. విశే. (రసా) రంధ్రములు గలది (Perforated-porous).

సచ్ఛూద్రుఁడు సం. వి. మంచియాచారము గల శూద్రుడు.

సజలము సం. విశే. (రసా.) ఎక్కువ నీటితో కలిసినది. (Diluted)

సజాతి సం. (గణి.) ఒకే జాతికి చెందిన, ఒకే ఘనతకలిగిన (Like).

సజాతిపదములు సం. వి. (గణి.) ఒకే జాతికి చెందిన పదములు (Like terms)

సజాతీయ సం. విశే. (రసా) సమానజాతి స్ఫటికములు కలది (Homogeneous).

సజాతీయత సం. (చరి, రాజ) భాష, మతము, ఆచారము, సాంప్రదాయములు, చరిత్ర యొక్క బంధముగల ప్రజలు (Nationality).

సజీవావరణ సం. వి. (వ్యవ.) సీమచింత, తుమ్మ, గోరంట కత్తినార మొక్కలు మొ. వానితో పెంచిన ఆవరణ. (Live fence).

సజ్జ సం. వి. 1. కవచము. 2. అలంకారము

సజ్జకి సం. వి. పడకటిల్లు.

సజ్జనుఁడు సం. వి. 1. మంచి కులమున బుట్టినవాడు. 2. మంచివాడు.

సజ్జితము సం. విశే. 1 కవచము తొడిగినది. అలంకరింపబడినది.

సజ్జుఁడు సం. విశే. 1. కవచము తొడిగిన వాడు. 2. అలంకరింపబడినవాడు.

సజ్జ వై. వి. 1. గంపెలు 2. శిరోగృహము 3. సూతికాగృహము. 4. ఆయితము. వి బుట్ట, సం. 1. సస్యమ్. 2. సదనమ్.

సజ్జకట్టు విశే. ఆయితము.

సజ్జకము విశే. మనోజ్ఞము

సజ్జనకోల వి. బెత్తము.

సజ్జరసము వై. వి. ఒక ధూపపు ద్రవ్యము సం. సర్జరసః.

సజ్జాకారము వై. వి. సర్జక చెట్టునుండి తీయు ఉప్పు. సం సర్జక్షారః.

సజ్జారము వై. వి. ఏనుగును కట్టుచోటు. సం సామజాగారమ్.

సట వై. వి. కపటము. మోసము. సం. వి. 1. సన్న్యాసుల జడ. 2. జూలు.

సడపు క్రి. అపహరించు.

సడలు వై. క్రి. 1. ఊడు. 2. జారు. 3. వదలు. వి వదులుట. రూ. సళ్లు సం. శ్లథ్.

సడి వి. 1 అపకీర్తి, నింద. 2. జాడ. 3. ధ్వని.

సడించు క్రి. దంచు.

సడింపులు వి. చక్కగా దంచిన బియ్యము.

సడికియ వి. కుక్క మెడబ్రాడు. రూ. సడికె.

సడిసన్న విశే. 1. ప్రసిద్ధిగలది. 2. నింద లేనిది.

సడుగులు వి. 1. నడుము కీళ్లు. 2. వంకర మాటలు.

సడ్డ వై. వి. 1. అక్కర 2. లక్ష్యము. సం. శ్రద్ధా. సాధ్యమ్.

సడ్డకుఁడు వై. వి. తోడియల్లుడు. రూ. షడ్డకుడు. సం. షడ్డకః.

సణుగు వి. బాధ, క్రి. గొణగు.

సత వై. వి. సప్త, ఏడు. రూ. సతా. సం. సప్త.

సతనాల్కలజేజే వి. అగ్ని. సప్తజిహ్వుడు. వ్యు. ఏడు నాలుకలున్న దేవుడు.

సతతము సం. విణ. ఎల్లప్పుడు. ఎడతెగనిది. రూ. సంతతము.

సతతహరితవనములు సం. వి. (భూగో) మధ్యధరా తీరమందలి అడవులు (Ever-green forests) (ఈ వృక్షములు ఆకులు రాల్చవు).

సతము వై. వి. శాశ్వతము. సం. శాశ్వతమ్

సతి సం. వి. 1. పతివ్రత స్త్రీ. 2. పార్వతి. (చరి) చనిపోయిన భర్త చితిలో ప్రవేశించి ప్రాణముల విడుచు హైందవ స్త్రీ

సతీర్థ్యుడు సం. వి. కూడ చదువువాడు సహపాఠి.

సత్కారము సం. వి. సమ్మానము. రూ సత్కృతి, సత్క్రియ.

సత్కరించు సం. క్రి. సమ్మానించు.

సత్త వై. వి. సత్త్వము, శక్తి. రూ. సత్తువ

సత్తముడు సం విణ. అందరికంటె మంచి వాడు శ్రేష్ఠుడు.

సత్తరువు వై. వి. సత్రము, అన్నప్రదాన గృహము. సం, సత్రమ్.

సత్తా వై (సర్వ) పత, పడు. సం. సత్త. వై వి. శక్తి సం. సత్వమ్.

సత్తి వై. వి. 1. శక్తి. 2. ఒక ఆయుధము. 3. కాళి. 4. బలము. 5. వశిష్ఠుని కుమారుడు. సం. శక్తిః.

సత్తివాలువు వి. కుమారస్వామి, శక్తిధరుడు

సత్తు వై. వి. సత్త్వము, సత్యము సారము. వి సీసము. సం. విణ. (సత్) ఉన్నది 1 చదువరి 2. శ్రేష్ఠము. 3 సత్యము. 4 సాధువు. వి. 1. నక్షత్రము. 2. సత్యము

సత్తువ వై. వి. దేహబలము. సం. సత్త్వమ్

~~సత్తువచేయుట~~ క్రి. (వ్యవ.) చెట్టుచేమలు తీసి కొనదగు ఆహారద్రవ్యములను ఎరువు రూపమున భూమికిచేర్చుట Manuring.

సత్పథము సం. వి. 1. మంచిమార్గము. 2. నక్షత్రమార్గము.

సత్యంకారము సం. వి. క్రయవిక్రయముల గట్టిమాట. జట్టి, 2. సత్యంకృతి.

సత్యకదృష్టి సం. వి. (జీవ) అష్ఠిలోనుండు నిజమైన కదష్ఠి (Plasmosome).

సత్యఫలము సం.వి (వృక్ష.) అండాశయము మారిపండుగాతయారైనది (True f.uit)

సత్యము సం వి. 1. నిజము. 2. ఒట్టు. 3. కృతయుగము. 4. బ్రహ్మలోకము.

సత్యాగ్రహము సం. వి. (చరి, రాజ.) తాను చేయుచున్న పని ధర్మయుక్తమైనదను దృఢవిశ్వాసముతో ఎదుటి వారిని సత్యాహింసా మార్గముల ద్వారా శాంతియుతముగ ఎదిరించుట.

సత్యానృతము సం. వి. వర్తకము. వ్యు. కొంత నిజము, కొంతకల్లతో కూడినది.

సత్యాపనము సం. వి. సత్యంకారము సం. వి. (శాతి) సత్యమని రుజువు పరుచుట. (Verification).

సత్రము సం. వి. అన్నదానగృహము, బాట సారుల విడిదియిల్లు

సత్రి సం. వి ఎడతెగక దానముచేయువాడు

సత్త్వము సం. వి. 1. సత్త, బలము. 2 స్వభావము. 3. ఒకగుణము 4. జంతువు.

సత్త్వము సం. వి. (రసా.) ఒకవస్తువు యొక్క పనిచేయగలసారము (Active principle)

సత్వరము సం. విణ. త్వరితము.

సదనము సం. వి. ఇల్లు.

సదమదము విణ. నలిగినది. రూ. సదసద.

సదమదముచేయు క్రి. నలచు, చంపు.

సదము సం. వి. సభ. రూ. సదసు, సదస్సు.

సదర్ హిం. వి. (చరి) 1. అధ్యక్షుడు. 2. మొగలు చక్రవర్తుల కాలములో ధర్మాదాయముల విషయములలోను మతవ్యవహారములందును సలహానిచ్చు ఉద్యోగి.

సదస్సు సం. వి. 1. రాజసభ. 2. సభ.

సదస్యమునం వి పెండ్లి మూడవనాటి బ్రాహ్మణుల మహాదాశీర్వాద సభ.
సదస్యుఁడు సం వి 1. సభ్యుడు యజ్ఞ విధి ఓ పరీక్షాధికారి.
సదా సం అవ్య ఎల్లప్పుడు.
సదాగతి సం వి. 1 వాయువు 2. మోక్షము 3 సూర్యుడు 4 సర్వేశ్వరుడు.
సదాజలతాలువలు మి వి. (భూగో).1. పటి కాలువలు. 2 నదికి ఆనకట్ట కట్టి, నీటిని ఆపి ఎప్పటికి ఎండిపోకుండ ఏర్పరచిన సరస్సు
సదాము విశ స్పృథము
సదాతనుఁడు సం వి 1. విష్ణువు 2 శాశ్వతుడు.
సదావృత్తి సం వి. బైరాగులు మొదలగు వారికిచ్చు వంట సామగ్రి.
సదాశివుఁడు సం. వి. శివుడు.
సదిశ సం, వి (గణి) 1. దిశ. 2. పరిమాణములు కలిగిన ఒకరాశి (Vector).
సదుపాయము సం. వి సౌకర్యము, అనుకూలము (ఈ యర్థము తెలుగులోనే కలదు.)
సదృశము సం. వి. (గణి.) అనురూపము. సం. విశ. సమానము, తగినది. (Corresponding).
సదృశ సమ్మేళనములు సం వి (వాణి.) ఒకే పారిశ్రామిక ప్రక్రియ లేక దశలలో పని చేయుచున్న సంస్థలు ఒకటిగ వ్యవహరించుట
సదేశము సం వి. సమీపము.
సద్దు వై. వి. శబ్దము, చప్పుడు. సం. శబ్దః.
సద్మము సం. వి. గృహము.
సద్యము సం. అవ్య. అప్పుడు, తత్క్షణము.
సద్యోజాతము సం. విశ. (రసా) అప్పుడే పుట్టినది (Nascent) ఉదా. జింకు ధాతువు సల్ఫ్యూరికామ్లమందు పడవేసిన వెంటనే ఆర్ద్రావణములచే జనించు ఉదజని యొక్క స్థితి.
సధర్మక్రోమొసోములు మి. వి. (జీవ) తండ్రినుండి ఒకటి తల్లినుండి ఒకటి వచ్చి ఒకే ఆకారము గలిగి జతగానున్న క్రోమొసోములుHomologous chromosomes.
సధర్మము సం, విశ. 1. సమానము. 2. ధర్మముతో కూడినది.
సధూపము సం. విశ (రసా) పొగలెగయునది, పొగలు వెలిగ్రక్కుడునది. ఉదా. గాఢ నత్రికామ్లము.
సనాతనుఁడు సం. వి 1. బ్రహ్మ 2. విష్ణువు. 3 శివుడు విశ. శాశ్వతుడు.
సనాథము సం. విశ కూడుకొన్నది.
సనాభి సం. వి. జ్ఞాతి, విశ, సమానుడు.
సని వై. వి శని. సం శనిః.
సనీడము సం. వి సమీపము విశ నీడముతో గూడినది.
సనె వి. నూరెడు రాయి. రూ. సనెకలు, సన్నె, సన్నెకలు.
సన్న వై. వి. సంజ్ఞ, సైగ. సం. సంజ్ఞా.
సన్నగాఁడు విశ. అల్పుడు. రూ. సన్నపువాడు.
సన్నగాలి వి. మందమారుతము, పిల్లగాలి.
సన్నగిల్లు క్రి. సన్నమగు, క్షీణించు, తగ్గు రూ. సన్నగిలు, సన్నవారు.
సన్నద్ధుఁడు సం విశ. 1 కవచము తొడిగినవాడు. 2. ప్రయత్నపడినవాడు.
సన్నము వి, సూక్ష్మత్వము విశ. సూక్ష్మము.
సన్నహనము సం వి. 1 కవచము. 2. యత్నము. రూ. సన్నాహము
సన్నాయి వి.నాదస్వరము,హిం షహ్‌నాయి,
సన్నాసి వై. వి. సన్యాసి. సం. సన్యాసీ.
సన్నాహము సం వి సన్నహనము.
సన్ని వి. తుపాకికొనను చెక్కియుంచుబాకు వంటి కత్తి, రూ. సన్నీ.

సన్నికర్షము సం. వి. సమీపము.
సన్నికృష్టము సం. వి. సమీపము. విణ. సమీపించునది.
సన్నిధానము సం. వి. 1. సమీపము 2 ఆశ్రయము.
సన్నిధి సం. వి. సమీపము.
సన్నిపాతము సం విణ. (గణి, భౌతి.) ఒక స్థానమునే ఆక్రమించునది. (Coincident). సం. వి. జన్ని, సన్నిపాత జ్వరము, సంధి, కలయిక.
సన్నిభము సం విణ. సమానము.
సన్నివిష్టుఁడు సం.విణ 1. సమీపించినవాడు. 2 కూర్చున్నవాడు.
సన్నివేశనము సం. వి (గృహ.) 1. అమరిక. 2 సవరణ. 3. సర్దిపెట్టు. 4. ఇల్లు (Arrangement).
సన్నివేశము సం.వి (గృహ.)స్థితి, స్థానము, అవస్థ (Situation)
సన్నిహితకోణము సం వి (గణి.) ఒక కోణము యొక్క ఒక భుజమును రెండవ వైపు పొడిగించగా నేర్పడు రెండవ కోణము (Adjacent angle).
సన్నిహితము సం. విణ. సమీపించినది.
సన్నుతము సం.విణ.చక్కగా స్తుతింపబడినది.
సన్నుతి సం. వి. చక్కనిస్తుతి,
సన్నుతించు సం, క్రి. స్తోత్రముచేయు.
సన్నె వి సనె, సన్నెకల్లు.
సన్మానము సం. వి గౌరవము. రూ. సమ్మానము.
సన్మానించు సం. క్రి. గౌరవించు రూ. సమ్మానించు.
సన్న్యస్తము సం. విణ. 1. సన్న్యసింపబడినది. 2. సమర్పింపబడినది. 3.ఉంచబడినది.
సన్న్యాసము సం. వి. కామ్యకర్మముల విడుపు, ఒక ఆశ్రమము.
సన్న్యాసి సం. వి. సన్న్యసించినవాడు.
సన్న్యాసిని సం. వి. సన్న్యసించిన స్త్రీ
సపక్షఫలము సం. వి (వృక్ష) అవిదారణ ఫలములలోనిది యొకటి ఒకటిగాని రెండుగాని



గింజలను కలిగి ఊర్ధ్వస్థితి సపక్షఫలము గల ద్వి, త్రిఫలదళములుగల అండాశయమునుండి ఇది తయారగును. గాలిలో నెగురుటకు దీనికి రెక్కలవంటి సాధనము లుండును (Samara)
సపత్ని సం వి. సవతి.
సపత్నుఁడు సం. వి శత్రువు,
సపర్య సం వి. 1. పూజ. 2. సేవ,
సపాట వి. మట్టము, సమము, రూ. సపాటము.
సపిండీకరణము సం.వి. చచ్చిన పండ్రెండవ దినమున చేయు శ్రాద్ధము.
సపిండుఁడు సం. వి ఏడు తరముల లోపలి జ్ఞాతి.
సపీతి సం. వి సహపానము
సప్త సం వి. ఏడు తంతులుగల వీణ. పరివాదిని.
సప్తకము సం సర్వ. ఏడు. విణ. ఏడవది.
సప్తతంతువు సం వి. యజ్ఞము.
సప్తతి సం వి. డెబ్బది.
సప్తపథ సం. వి. (జంతు) గళము, నోరు, గొంతుగొట్టము, నిగళము (Pharynx). ఈ రెంటికిని మధ్య నున్న అన్నవాహిక యొక్క భాగము (Oesophagus)ముక్కు నోటిద్వా ముకళియుద్వారము Throat.
సప్తమము సం. విణ. ఏడవది.
సప్తమి సం. వి. పక్షమునందు ఏడవతిథి. విణ. ఏడవది.
సప్తహస్తుఁడు సం. వి. అగ్ని.
సప్తాశ్వుఁడు సం. వి. సూర్యుడు. త్రీ. ఏడు గుఱ్ఱములు గలవాడు.

సప్తి సం. వి. గుఱ్ఱము.
సప్పము వై. వి. సర్పము, సం. సర్పః.
సప్పపుఁజుక్క వై. వి. ఆశ్లేష.
సఫలము సం. విణ. 1. ఫలముతోఁగూడినది. 2. సార్థకము.
సఫ్రాజెటు ఇం. (రాజ. చరి.) (Suffragette) స్త్రీలకు వోటింగు హక్కు కావలెనని ఆందోళనచేయు స్త్రీ.
సఫ్రేజ్ ఇం. (రాజ.) (Suffrage) ఎన్నికలలో ఓటుచేయు అధికారము.
సబ్‌పోనా ఇం. (శాస.) (Subpoena) కోర్టులో హాజరు కమ్మని ఉత్తరువు.
సబము వై. వి. శవము, పీనుగు, సం. శవః
సబళము వి. ప్రాసాయుధము. ఈటె.
సబాము వై. వి. స్వభావము. సం. స్వభావః
సబుడివిజను ఇం. వి. (పౌర.) (Sub-division) జిల్లాపరిపాలనలోని అంతర్భాగము.
సబ్బండు వి. 1. అనేక విధములగలది. ఉచ్చావచము. 2. కల్ల.
సబ్సిడీ ఇం. వి. (Subsidy) రైతులకు పారిశ్రామికులకు ప్రభుత్వము చేయు ధన సహాయము.
సబ్బు వి. జిడ్డును పోగొట్టు ఒక కార పువస్తువు (Soap).
సబ్బుబంక వి. (గృహ.) సబ్బుపొడిని నీటిలో కలిపి వండినజిగట పదార్థము, ఇదినీటిలో తేలికగా కరగిపోయి, బట్టలను సులభముగాఉదుకుటకు సహాయపడును, (Soap gelly).
సబ్బురాయి మి. వి. (రసా.) రాతిచిప్ప రాయి, బలపము రాయి (దీనికి టాల్క్ అని పేరుకూడ కలదు. రాసాయనికముగ నిది ఆమ్లమెగ్నిషియమ్ సిలికేట్.) (Soap Stone).
సబ్రహ్మచారి సం. వి. సహపాఠి. 2 సాటి.
సభ సం. వి. 1. కొలువుకూటము. 2 సమూహము 3 జూదము.
సభక్తృక సం. వి. మగనాలు ముత్తైదువు.
సభాజనము సం. వి. ఉత్తములు లోనగువారి నాలింగనాదులచే సంతోషపరచుట.
సభాసదుఁడు సం. వి. సభాస్తారుఁడు సభయందుండు ధర్మజ్ఞుడు.
సభాహక్కులకమిటీ మి. వి. (శాస.) శాసన సభల ప్రత్యేకపు హక్కులు నిర్ణయించు కమిటీ.
సభికుఁడు సం. వి. 1. సభాసదుడు. 2. జూదమాడించువాడు.
సభ్యుఁడు సం. విణ. 1. సభయందుండువాడు. మంచివాడు.
సమ సం. వి. సంవత్సరము.
సమంజసము సం. వి. న్యాయము ఒప్పిదము.
సమకట్టు క్రి. యత్నించు. సేకరించు, సిద్ధపరచు. ఏర్పరుచు, చేయు, వి. కవచము.
సమకలనము, ఏకీకరణము సం. వి. (గణి.) అపకలనమునకు వ్యతిరేక చర్య (Integration).
సమకురు క్రి. లభించు, సిద్ధించు. రూ. సమకూడు, సమకూరు.
సమకొను క్రి. సమకురు.
సమకోణము సం. వి. (గణి.) సంపూర్ణ భ్రమణ జనితమైన కోణములో నాలుగవ భాగము, (Right angle).
సమకోణీయము సం. విణ. లంబకోణ విశిష్టమైనది (Orthogonal).
సమకోలు వి. సమకూరుట.
సమక్షము సం. విణ. నయన గోచరమైనది. ఎదురు.
సముఖండత సం. (జం.) జంతువు యొక్క శరీరము సముఖండములుగా నుండుట (Metamerism).
సముఖండములు సం. వి. (జం.) వరుసగా విభజన చెందుచు రేఖాశ్రేణివలె సన్న

కొన్ని జంతువుల శరీరము యొక్క ఒకా నొక భాగము (Segment metameres).

**సమగణీయము** నం.వి.(రసా.) కర్బనయౌగిక (సంయోగ)ములలో ఒక $CH_2$—గణము అంతరముగల యౌగిక పంక్తికి చెందినది (Homologous).




**సమగ్రము** నం విశే.సమస్తము, సంపూర్ణము.

**సమగ్రిమ** నం.వి. సమగ్రత యూ సమగ్రిమము

**సమఘాతత** నం. (గణి.) చరరాసుల ఘాత సూచకల మొత్తము అన్ని పదములలో సమముగానుండుట (Homogeneity).

**సమఘాతసమాసము** నం.వి (గణి.) రాసుల ఘాతముల మొత్తము సమానముగా నుండుసమాసము(Homogeneous expression).

**సమఘాతసౌష్ఠవసమాసము** నం వి. (గణి.) సమఘాతత, సౌష్ఠవము అను నీ రెండు ధర్మములను కూడ కలిగిన సమాసము. (Homogeneous symmetrical expression).

**సమచతుర్భుజము** నం. వి. (గణి.) సమకోణములులేక అభిముఖ భుజములు సమాంతరముగను నాలుగు భుజములు సమదీర్ఘముగను ఉండు జ్యామితీయాకారము (Rhombus).

**సమజాతము** నం. విశే. (జీవ.) అవయవముల పనులువేరుగానున్నను వానిఉత్పత్తి ఒకటిగా గలది. (Homologous).

**సమజ్ఞ** నం. వి. కీర్తి. యూ సమాజ్ఞ.

**సమజ్య** నం. వి. 1. సభ. 2. కీర్తి,

**సమతలము** నం. వి. (గణి.) రెండు ఖండించు కొను సరళరేఖలను పూర్తిగ ఇముడ్చుకొనగలిగిన తలము. తనలోని ఏ రెండు బిందువులనైనను కలువగా నేర్పడు సరళరేఖకు పూర్తిగా కలిగియుండు తలము. (Plane).

**సమతలస్థితము** నం. వి. (గణి.) ఒకే సమతలముపై నుండుట.

**సమతాపరేఖ** నం. వి. (భూగో) తాపక్రమముమారనిస్థితిలో ఒత్తిడితో వాయువు యొక్క అవాతనమందలి మార్పునుచూపు రేఖ(Isothermal).నం.వి. భౌతి వాయువు తాపక్రమమునకు ఒత్తిడికిమధ్యగల సంబంధము తెలుపు రేఖ (Isothermal)

**సమతాళము** నం. (గృహ) సమ్మతమైన. హెచ్చు తగ్గులులేకుండ సరియైన విధముగానున్నది (Rhythm).

**సమతులితము** నం విశే. (గృహ) సరసమానమైనది. చలించనిది, నిశ్చలమైనది. నిదానము గలది. (Balanced) నం.వి. (రసా.) రెండువైపుల సమాన భారము గలది (Counterporsid).

**సమతులితాహారము** నం. వి. (గృహ.) సక్రమాహారము,ఉచితాహారము,శరీరము పెరుగుటకు తగుఆహారపదార్థము.మిశ్రాహారము (Balanced diet).

**సమదర్శి** నం. విశే. సమముగాజూచువాడు.

**సమద్విఖండనరేఖ** నం. వి. (గణి.) రెండు సమభాగములుగా ఖండించు రేఖ(Bisector)

**సమద్విపార్శ్వము** నం (వృక్ష.) ఆకునకు రెండువైపులను సమానముగా వెలుతురు తగులునట్టి అందుచే వాని రెండు వైపులనుసమానమగు అంతర్నిర్మాణము గలది (ఆకు) (Isobilateral leaf).

**సమద్విబాహువు** నం. విశే. (గణి.) రెండు భుజములు సమానముగానున్నది. (Isosceles).

సమద్విబాహు త్రిభుజము సం. విశ. (గణి) రెండు భుజములు సమానముగనుండు త్రిభుజము (Isosceles triangle).

సమధికము సం. విశ. మిక్కిలి అధికము.

సమధిగమము సం. వి. పొందుట

సమన్వితము సం. విశ. కూడుకొన్నది

సమన్సురిట్టు ఇం. వి (శాస) (Summons writ). అధికృతాహ్వానలేఖ కోర్టులో హాజరు కమ్మని యిచ్చు ఆజ్ఞ

సమపక్వ పుష్పములు సం. వి. (వృక్ష.) ఒకేసమయమున పక్వమువకువచ్చు పుప్పొడి తిత్తులు, కీలాగ్రముకల ఉభయలింగ పుష్పములు (Homogamous flowers)

సమపదము సం వి విలుకాడు రెండుకాళ్లు సమముగా పెట్టి నిలుచుట.

సమబహుభుజి సం. విశ (గణి) అన్నిభుజములును సమానముగానున్న బహుభుజి (Equilateral polygon)

సమబాహువు సం. విశ. (గణి.) సమాన భుజములుగలది (Equilateral).

సమబాహుచతుర్భుజము సం. (గణి.) నాలుగు భుజములు సమానముగనుండు చతుర్భుజము (Rhombus)

సమబాహు త్రిభుజము సం. (గణి.) మూడు భుజములు సమానముగనుండు త్రిభుజము (Equilateral triangle).



సమబాహు త్రిభుజము

సమభారరేఖ సం. వి. (భూగో.) ప్రేషము (ఒత్తిడి) మారని పరిస్థితులలో తావక్రమముతో వాయువు యొక్క ఆయతన మందలి మార్పును చూపురేఖ (Isobar)

సమభారరేఖలు సం. వి. (భూగో.) సముద్రపుమట్టమున సనుపీడన ప్రదేశముగుండ పోవు ఊహారేఖలు.

సమము సం. విశ. 1. సమానమ్ము. 2. సాధువు:

సమయము సం వి 1. కాలము. 2. ఆచారము. 3. ప్రతిజ్ఞ, ఒట్టు.

సమయు వై. క్రి. చచ్చు. నశించు.

సమరథుఁడు సం. వి. ఒక విలుకానితో సరిగా నిలిచి పోరెడి యోధుడు.

సమరము సం. వి యుద్ధము. వ్యు. మరణముతో కూడినది.

సమరసము సం. వి. అభేదము.

సమరూపము సం. విశ (రసా) సమానమైన స్ఫటిక రూపముగల (Isomorphic or isomorphous). ఉదా. సోడియం, పొటాసియం క్లోరైడ్లు రెండును క్రమరూపముగల స్ఫటికము.

సమరూపత సం. వి. (రసా.) సమానమైన స్ఫాటికరూపము గలిగియుండుట. (Isomorphism).

సమర్థనము సం. వి. పట్టినది తగినట్లు నెరవేర్చుట.

సమర్థము సం. విశ. 1. అన్వయయోగ్యమైన యర్థముకలది. 2. హితమైనది.

సమర్పణ (ము) సం. వి. సమర్పించుట. ఇచ్చుట.

సమర్థుఁడు సం. విశ. నేర్పరి.

సమర్యాదము సం. వి. సమీపము. విశ. మర్యాదతో కూడినది.

సమలంబచతుర్భుజము సం. వి. (గణి). ఒక జత భుజములు సమాంతరముగానుండు చతుర్భుజము (Trepezium).

సమవర్తి సం. వి. యముడు. వ్యు. అందరియెడ సమానముగనుండువాడు.

సమవర్షపాతరేఖలు సం. వి. (భూగో.) సమవర్షపాతముగల ప్రదేశములన్నిటిని కలుపు రేఖలు.

సమవలయము సం. విశ. (రసా.) కర్బన వలయ యౌగిక సంయోగములందు భిన్న జాతి పరమాణువులులేనిది Homocyclic.

సమవాయము నం. వి. 1. సమూహము, 2 కూడిన సంబంధము.

సమవృత్తీయము సం విశ. (జీవ.) అవయవముల ఉత్పత్తి వేరుగానున్నను అవి చేయు పనులు ఒకటిగాగలది. (Analogous).

సమవేతము నం విశ. సమవాయము నొందినది.

సమశిఖము నం. (వృక్ష) ఇది "మధ్యాభిసారి", పుష్పగుచ్ఛముల తరగతిలో నొకటి, ముఖ్యాక్షముపై క్రిందనున్న పువ్వులకు పొడవైన వృంతములును క్రమముగా పైనున్న పువ్వులకు చిన్న చిన్న వృంతములు ఉండుటచే పువ్వులన్నియు దీనిపై ఒకేమట్టముగ నుండును (Corymb)



సమశిఖము

సమశీతోష్ణస్థితి నం. వి. (భూగో) ఉత్తరార్ధములో కర్కాటకరేఖకు ఆర్కిటిక్ వృత్తమునకు మధ్యనున్న ప్రదేశములోను, దక్షిణార్ధములో మకరరేఖకు అంటార్కిటిక్ వృత్తమునకు మధ్యనున్న ప్రదేశములోను ఉన్న శీతోష్ణస్థితి. (ఈ ప్రదేశములో సూర్యుడు అన్ని ఋతువులలోను ఏటవాలుగ ప్రసరించుటచే వేడి చలి కూడ మోతాదుగ నుండును).

సమష్టి నం వి. మొత్తము.

సమష్టిబాధ్యత నం. వి. (శాస.) మంత్రులు చేయు పనులకు మంత్రివర్గము ఉమ్మడిగ శాసనసభకు లేక విధానసభకు బాధ్యత వహించుట.

సమష్టివాదము నం వి (రాజ.) రాజ్యస్వామ్యవాదము, స్వామ్యవాద సిద్ధాంతములలో నొకటి, ఆర్థిక విషయములందు ప్రజల శ్రేయస్సు దృష్టి యందుంచుకొని దేశములో ముఖ్యపరిశ్రమలను ఉత్పత్తి స్థానములను ప్రభుత్వ రంగములోనికి, కేవలము లాభము కొరకుగాక ప్రజల అవసరములను బట్టి నడిపించ వలయునను వాదము (Collectivism).

సమష్టిసాగుబడి మి. వి (వ్యవ.) సహకార పద్ధతులలో సాగుబడిచేయుట, ఉమ్మడి సాగుబడి, సాగుబడిచేయువారందరు తమ తమ భూములను ఒకటిగాచేసి సాగుబడిచేసి వచ్చిన లాభమును ఒక నిశ్చిత నిష్పత్తిలో పంచుకొనుపద్ధతి (Collective farming).

సమసతము వై వి. సమం ? ము.

సమసనము నం. వి. 1. సంక్షేపము 2. సమాసము, పదముల చేరిక.

సమస్తము నం. విశ. సర్వము.

సమస్థానీయములు నం వి. (రసా) ఆవర్తక్రమపట్టికలో ఒకే గడిలో నుండు మూల ద్రవ్యములు (Isotopes).

సమస్థిత క్షేత్రములు నం. వి (గణి) సరూపముగానుండి సంగత శీర్షములను కలుపగా లభించు సరళరేఖలు అనుసక్తములయ్యెడి క్షేత్రములు. (Homethetics, Similar and similarly situated figures)

సమస్య నం. వి. కైవదము పద్యపూరణమునకై ఇచ్చు పద్యపాదము. (గణి.) గణితశాస్త్ర సంబంధమైన చిక్కు ప్రశ్న (Problem).

సమస్వరము నం. వి. 1. శ్రావ్యమైనది. 2. స్వరసమ్మతిగల ఒకదానితో నొకటి సరిపడునట్లుగా అమర్చునది (Harmonious).

సమాంగత నం. వి. (రసా) అవే అవయవములు కలిగియుండుట (Isomerism). చూ సమాంగము.

సమాంగము నం. వి (రసా.) అవయవములు అవే అయినను విన్యాసము భిన్న

ముగనుండు యౌగికము. (Isomers)


ఉదా. $CH_3\ CH_2\ OH — CH_3\ O\ CH_3$
ఆల్కహాల్ ఈథర్

సమాంచలము నం. విశే. (వృక్ష.) ఆకు యొక్క అంచు గీతవలె సమముగా నున్నది (Entire).

సమాంతర చతుర్భుజము నం. (గణి.) చతుర్భుజము యొక్క నాల్గువైపులు సమాంతరముగానుండునది. (Paralellogram).


సమాంతరచతుర్భుజము

సమాంతరరేఖలు నం వి. (గణి) ఒక తలములో రెండు వైపులను ఎంత దూరముగా పొడిగించినను కలియని రేఖలు (Parallel lines).

సమాంతర శిరా విన్యాసము నం. (వృక్ష) పత్ర ఫలకముపై నుండు ఈనెలు ఒకదాని కొకటి సమాంతరముగా నున్న స్థితి. (Parallel venation)

సమాకలనము నం. (గృహ.) జమ. జమ కట్టుట, బ్యాంకు అకౌంటులో డబ్బును జమచేయుట (Credit).

సమాక్షవృత్తములు నం వి (గణి.) జతలు జతలుగా ఒకేమూలాక్షముగలవృత్తసముదాయము. (Coaxial circles).

సమాఖ్య నం. వి 1. కీర్తి. పేరు 2, బందుకట్టు,

సమాఖ్యరాజ్యాంగము నం వి (రాజ.వరి) సంఘ రాజ్యము తమ శాశ్వత శ్రేయస్సుకై కొన్ని రాజ్యములు ఒక కేంద్ర ప్రభుత్వము క్రింద సంఘముగా నేర్పడి, కేంద్రమునకు ఆర్థిక విదేశాంగ వ్యవహారములు, రాకపోకలు. దేశ రక్షణాధికారములు మాత్రము ఇచ్చి. అంతరంగికముగ స్వతంత్రముగా నుండు రాజ్యముల రాజకీయ సమ్మేళనము (Federal Government).

సమాగతము నం విశే. 1. చక్కగావచ్చినది. 2. పొందినది

సమాగమము నం. వి. 1, చక్కనిరాక. 2. పొందిక.

సమాఘాతము నం, వి. 1. యుద్ధము. 2. వధము.

సమాచారము నం.వి, 1. చక్కగా నడుపుట 2. వృత్తాంతము.

సమాజము నం వి 1. మనుష్యుల గుంపు. 2. సభ. 3. ఏనుగు.

సమాజవికాస కార్యక్రమము నం. వి. (పౌర.) గ్రామీణ ప్రజల సర్వతోముఖాభివృద్ధికి భారత ప్రభుత్వము ప్రజల సహకారముతో వ్యవసాయమును రవాణా సౌకర్యములను కల్పించుటకు సాగించుచున్న కార్యక్రమము (Commmunity Development Corporation).

సమాధస్థలము నం విశే (రసా) చదునుగా నున్న క్రింది భాగము గలది (Flat bottomed).

సమాధానము నం. వి. 1. చక్కగానుంచుట, 2. అంగీకారము.

సమాధి నం. వి మనోలయము, నియమము.

సమానపక్షము నం. (వృక్ష.) ఉపపత్రములు సరిసంఖ్యలో నున్నది (భిన్నపత్రము (Paripinnate).


సమానపక్ష

సమానము (సజాతీయము) నం (గణి.) ఒకే జాతికిసంబంధించినది, ఒకేఘాతసంఖ్యకలిగినది(Like). వై. వి. సమ్మతి. నం వి. నాభియందలి వాయువు. విశే. తుల్యము.

సమాపతము నం. విశే. 1. ముగించినది. 2. చంపునది.

సమాప్తము నం విశే. 1. ముగిసినది. 2. చచ్చినది.

సమాప్తి నం. వి. 1. ముగియిక. 2. చావు.

సమాప్తించు నం. క్రి. 1. ముగించు 2 చంపు

సమాయతనరేఖ నం వి (భౌగో) ఆయతనము స్థిరముగానున్నప్పుడు తాపక్రమముతో వాయువు ప్రేషమంవలిమార్పును చూపురేఖ (Isochore).

సమావేశము నం వి. ఒకచోటగూడుట,ప్రవేశము.

సమాశ్రయము నం. వి. (రాజ ,పరి.) మిశ్ర కూటమి.

సమాసకము నం. వి. శుద్ధాంధ్ర పదముల సమూహము.

సమాసము నం. వి సమర్థములగు పదముల ఏకీభావము. 2. సంక్షేపము. 3 చేరిక (గణి.)రాసులసమూహము(Expression)

సమానోపయుక్తి నం. వి (అర్థ) అనుభోగించిన వస్తురాశి యంతటివలన కలిగిన మొత్తము ఉపయోగిత.

సమాహారము నం వి. చెదరినవి ప్రోగు చేయుట,సంక్షేపము. రూ.సమాహరణము

సమాహితుఁడు నం. విశే. 1. చక్కగా ఉంచబడినవాడు. 2. అంగీకరింపబడినవాడు. 3, సమాధియందున్నవాడు.

సమాహ్వయము నం. వి. 1. పేరు. 2 ప్రాణి. 3. ద్యూతము 4. యుద్ధము

సమితి నం.వి. 1 సమూహము.2 యుద్ధము

సమిత్తు నం వి. యుద్ధము, పోరు,

సమిధ నం. వి. చిరుగుఁ వంటచెరకు.

సమీకము నం. వి. యుద్ధము, వ్యా. పర - స్వరము కదియించునది.

సమీకరణము నం. వి. ఒకటిగా చేయుట. సమానముగాజేయుట (గణి.) రెండురాశి సముదాయముల మానత్వమును తెలుపునది (Equation).

సమీక్షణము నం. వి. చక్కగాపరిశీలించుట.

సమీక్ష్యకారి నం విశే చక్కగా యోచించి పనిచేయువాడు

సమీచీనము నం. వి సత్యము. పరిశుద్ధము తగినది

సమీపము నం వి చేరువ.

సమీపించు నం క్రి చే వచ్చు

సమీరణుఁడు నం. వి 1. వాయువు 2. బాటసారి. వ్యు. లెస్సగా చరించువాడు.

సమీరము నం.వి సమనయనీయ పవనములు స్థలసమీరము, ముద్ర సమీరము.

సమీరితము నం విశే. 1. చక్కగాపోయినది. 2. పార వేయబడినది

సమీరుఁడు నం వి. వాయువు.

సమీహ నం. వి కోరిక.

సమీహితము నం వి కోరంబడినది.

సముఖము నం. వి. ఎదురు,

సముచితము నం విశే. మిక్కిలి తగినది.

సముచ్చయము నం వి. 1. చెదరిన వానినొకటిగా ప్రోగుచేయుట. 2. ( వ్యాక.) విడివిడిగా నున్నవాని కొకదాని యందన్వయము కల్గించుట, ఉదా. అతడును అతెయు

సముచ్ఛేదనవిధానము నం. (వృక్ష.) కొన్ని బహు విదారణ ఫలములలోని గింజలు, ఫలము గాలికి కదలినపుడు వెదజల్లబడు విధము. (Censer mechanism).

సముచ్ఛ్రయము నం. వి. 1. మిక్కిలి పొడుగు 2. విరోధము. రూ. సముచ్ఛ్రాయము.

సముత్థానము నం. వి. ప్రయత్నము.

సముదయము నం వి 1. చక్కని యుదయము 2 సమూహము. 3, యుద్ధము. నం. వి. (భౌతి.)ఒక వస్తువుల గుంపు లేదా సమూహము. (Aggregate). (గణి ) రాసుల సమూహము, (Aggregate).

సముదాయించు క్రి. ఓదార్చు.
సముద్గకము సం. వి. బరణి.
సముద్ధతుఁడు సం. విశే. గురువుచే శిక్షింప బడినవాడు, దుడుకువాడు.
సముద్ధూళించు సం. క్రి (విబూది) పూసికొను
సముద్రతీర శీతోష్ణ స్థితి సం వి (భూగో) సముద్రతీరములలో గల శీతోష్ణస్థితి (ఇట్టి శీతోష్ణస్థితి గల ప్రదేశములతో గరిష్ఠ కనిష్ఠ ఉష్ణోగ్రతలలో ఎక్కువభేదము కనబడదు దీనికి భూమికి నీటికి గల విభిన్నమైన ఉష్ణగ్రాహక శక్తి కారణము.)
సముద్రనవనీతము సం వి చంద్రుడు
సముద్రపవనము సం. వి. (భూగో.) సముద్రము నుండి భూమిపైకి వీచెడి గాలి (Sea breeze.)
సముద్రపుపోటుపాటులు వి. (భూగో.) సూర్యచంద్రుల ఆకర్షణశక్తిచే సముద్రమందలి నీటిమట్టము ప్రతిదినము రెండుసార్లు హెచ్చును. రెండు సార్లు తగ్గుట. (పాటు = సముద్రపు నీరు హెచ్చుట. పోటు = సముద్రపు నీరు తగ్గుట.)
సముద్రము సం. వి. సాగరము.
సముద్రయానభీమా మి వి. సముద్రములపై సరకులను పంపునపుడు వానిని భీమా చేయు పద్ధతి. (Insurance of Naval goods).
సముద్రశైవాలము సం. వి. (వృక్ష.) సముద్రపు నీటిలో పెరుగు నాచువంటి మొక్కలు. (Sea weeds).
సముద్ర సంగమము సం. వి. (భూగో.) నదులు సముద్రమున కలియు స్థలము.
సమున్నద్ధుడు సం. విశే గర్వి, చదువని తమ్ను చదువరిగా నెంచుకొనువాడు.
సమున్నము సం. విశే. తడిసినది.
సమూరి సం. వి. (రసా.) హైడ్రాయిడ్ యొక్క గొట్టమువంటి శాఖలకు లోపల నుండు చిన్న చిన్న అణువులుగల కణజాలము. (Coenosarc).
సమూహఫలముసం వి (వృక్ష.) ఒకే పుష్పములో వివిధ కాండకోశము నుండి తయారైన ఫలసమూహము(Etacrio). ఉదా సీతాఫలము,సంపంగి,


సమూహఫలము

సమూహము సం. వి. గుంపు. (గణి) రాసులసమూహము (Group).
సమృద్ధి సం వి. 1. మిక్కిలి సంపద. 2 నిండు 3. అభివృద్ధి.
సమేతము సం విశే. కూడుకొన్నది.
సమేలము వై. వి. 1. సమ్మేళనము 2. ఒద్దిక, చేరిక. సం సమ్మేళనమ్.
సమోయుదులు ఇం (భూగో.) (Samoyeds) ఆసియా మంచు ఎడారులలో నివసించు మానవులు.
సమోష్ణరేఖలు సం.వి. (భూగో.) భూమిపై సమమైన ఉష్ణోగ్రతను చూపు ఊహారేఖలు (భూగో) సముద్రపు మట్టమున నున్నటుల లెక్కించి నప్పుడు సమోష్ణత గల ప్రదేశములగుండ పోవు ఊహారేఖలు
సమ్మతము సం విశే ఇష్టమైనది, అంగీకృతమైనది. సం. వి (గృహ) స్వీకరణ, అంగీకారము. (Acceptance)
సమ్మతి సం వి. అంగీకారము, ఇచ్ఛ.
సమ్మతించు సం. క్రి. అంగీకరించు. రూ. సమ్మతిల్లు.
సమ్మదము సం. వి సంతోషము.
సమ్మర్దము సం. వి. 1. రాయిడి, రాపిడి 2. గుంపు.
సమ్మానము సం.వి. గౌరవము,సత్కారము
సమ్మానించు సం. క్రి. గౌరవించు.
సమ్మార్జనము సం. వి. 1. శోధనము. 2. అలుకు. 3. ఊడ్చుట.

సమ్మార్జని సం. వి. చీపురుకట్ట.

సమ్మాళికలు వై. వి. పాదరక్షలు. సం. సంవాహికః.

సమ్మితము సం. విశే. 1. సమానము. 2. సమానమైన పరిమితి గలది.

సమ్మియ వై. వి. 1. సమయము. 2. కట్టుబాటు. రూ, సమ్మె, పనిచేయువారు పని చేయక కట్టుకట్టి తిరుగుబాటుచేయుట. సం. సమయః.

సమ్ముఖము సం. వి. ఎదుటి.

సమ్ముదము సం. వి. మిక్కిలి సంతసము.

సమ్మె వై. వి. కార్మికులుగాని, శ్రామికులు గాని ఏకగ్రీవముగ పనిచేయకుండ ఆగి పోవుతిరుగుబాటు.(Strike).సం.సమయః

సమ్మెట వి. పెద్దసుత్తె ముద్గరము వై వి శ.

సమ్మేళనము సం.వి. కలయిక,సమావేశము

సమ్రాట్టు సం. వి. చక్రవర్తి.

సయనోగాన్ ఇం (రసా.) (Cynogas),ఉదజనయనికామ్లముగల వాయువు. (ఇది నిలువచేసిన ధాన్యములను పాడుచేయు పురుగులను నాశనముచేయుట కుపయోగించును).

సయ్యాట వి. (సయి+ఆట). 1. సహక్రీడ. 2. కేలి. 3. సల్లాపము. రూ.సయ్యాటము

సయ్యాటలించు క్రి. పరిహసించు,

సయ్యోద్ద వి చేరిక,స్నేహము రూ.సయ్యోద్ధ

సరంగు వి. నావికుడు,

సరంధ్రత సం. వి. (రసా.) సూక్ష్మమైన రంధ్రములు కలిగియుండుట (Porosity) ఉదా. మట్టి కూజా.

సరకు వి. 1. అమ్మదగిన వస్తువు. 2. వస్తువు 3. లక్ష్యము (అర్థ.)అనుభోగ్యమైఅమ్మ టకు సిద్ధముగానున్న వస్తువు.

సరకుడాలరు మి. వి. (అర్థ.) సరకుమార్పిడిలో ఓకే ప్రమాణమగు విలువగలడాలరు (Dollar sterling).

సరకులనుకూడబెట్టుట (వాణి) వ్యాపారస్థులు తమయొద్దనున్న సరకును అనుభోక్తలకు ప్రభుత్వమునకు తెలియకుండ కూడబెట్టి కొలది కొలదిగ అమ్ముచు అసాధారణమైన లాభములు పొందుపద్ధతి (Black-marketing).

సరగు వై. వి. శీఘ్రము. సం స్రాక్,శీఘ్రమ్

సరఘ సం. వి. తేనెటీగ.

సరటము సం. వి. తొండ.

సరడు వై. వి. 1 సరండము. స్త్రీలమెడను ధరించు బంగారు అల్లిక తీగ 2. నూలు దారము. సం. సరండః.

సరణశ్రేణి సం. వి. (గణి) ఒకదానిపైని ఒకటి జారుటకు వీలుగా వమర్చిన రెండు లఘుగటక చిహ్నిత మాపక శ్రేణులుగల కొలుచుయాంత్రికపరికరము.(Sliderule

సరణి సం వి 1.త్రోవ 2 వరుస. 3.విధము.

సరదారు వై వి. శూరుడు. రౌతు. సం. శరధారి

సరదు క్రి. సమముగాపంచు

సరఫరా హిం. వి. (వ్యావ.) అందచేయుట.

సరబడి వి. ద్వారము,

సరమ వై. వి. క్రమము సం. వి. 2. విభీషణునిభార్య. 2. ఆడుకుక్క.

సరము వై, వి. స్వరము,ముకుగాలి.షడ్జాది. స్వరము. సం. స్వరః, సం.వి. 1. హారము 2. గమనము,

సరవి వి. క్రమము వరుస.,

సరస వి. సమీపము.

సరసము సం. విశే. రసముతోగూడినది.

సరసర వై. విశే. మిక్కిలి శీఘ్రముగ,

సరసౌతఫలము సం. వి (వృక్ష) పువ్వుమంజరి అంతయు కలిసి తయారైన ఫలములలో నిది



సరసౌతఫలము

యొకటి. (దీనిలో ప్రధానాక్షము మాంస లముగా నుండును (sorosis), ఉదా. అనాస, పనస, మల్బరి

సరసి సం. వి కొలను. రూ, సరసు సరిస్సు.

సరసిజనాభుఁడు సం. వి. విష్ణువు.

సరసిజభవుఁడు సం. వి బ్రహ్మ.

సరసిజము సం. వి. తామ రూ. సరసిజము

సరసిజాతము సం. వి. తామర.

సరసీరుహము సం. వి తామర.

సరసు క్రి, సరిదు. సం. వి సరసి.

సరసుఁడు సం. విణ. రసికుడు.

సరస్వతి సం వి. 1. పలుకుచెలి. 2. పలుకు. 3 ఒక నది.

సరస్సు సం వి. సరసి.

సరళము సం. వి. (గణి.) ఏకఘాతీయము. (Linear).

సరళపుష్పములు సం. వి. (వృక్ష) పుష్ప దళవలయములో ప్రతి వలయములో నున్నముఖ్యముగా రక్షకపత్రములు ఆకర్షణక (సత్రములు) దళములు. ఒకే మాదిరిగానున్న పువ్వులు (Regular flowers).

సరళము సం. విణ. ఔదార్యము గలది. వంకర కానిది రూ. సరాళము. సం. వి. (గణి.) 1. లంబము 2. శాఖలు లేని ఋజురేఖ. (Normal). (వ్యాక.) గ, జ, డ, ద, బలు. సరళములు.

సరళరేఖ సం. వి. (గణి.)ఒక చలన బిందువు ఒకేదిక్కుగా చలిచునప్పుడేర్పడిన బిందు పథము. (Straight line).

సరళ (మైన) వడ్డీ వి (గణి) అసలుతో కలియని వడ్డీ (Simple interest).

సరళావర్తగతి సం. వి. (భౌతి) ఒక వర్తులపు పరిధి వెంట ఏకరూపముగ చలించుచున్న బిందువునుండి గీయబడిన లంబము యొక్క పాదము అపరులపు వ్యాసము పై గ్రహించు చలనరీతి (Simple hormonic motion).

సరాగము వి. ఒద్దిక సం. విణ. రాగముతో గూడినది

సరాతి వి గోడవలె గుడారము చుట్టు వైచిన తెర.

సరాసరి వి సరసి చూడగానైన సమత్వము.

సరి వై వి. హారము, గుచ్ఛము. విణ 1. సమము, యుక్తము. 2. సమాప్తి. పూర్ణముగా అవ్య అంగీకారార్థము. సం. సరిః.

సరించు సం. క్రి పోవు.

సరికట్టు క్రి. సరిపడు.

సరికడచు క్రి. ముందు మించు, మీరు.

సరిగ వై వి 1. హారము 2. జరి. సం. సరికా, స్రక్.

సరికొను క్రి చంపు

సరిచేయు వై . క్రి. చక్కజేయు, నాశము. చేయు (భౌతి.) పరికరములను ఉపయుక్తముగాచేయు (Adjust).

సరిచూచు వై . క్రి. సంప్రతించు.

సరిచూచుట క్రి. (గణి.) ఒక ప్రవచనము గాని సమీకరణముగాని సరిగానున్నదియు లేనిదియు చూచుట (Verification).

సరితూఁగు క్రి. సమానమగు.

సరిత్తు సం. వి. నది.

సరిత్పతి సం. వి. సముద్రుడు.

సరిదాఁకు క్రి, దృష్టాంతమగు.

సరిపడు వై . క్రి అనుకూలమగు యుక్తమగు, అసమానమగు.

సరిపెట్టు క్రి. 1. సరిచేయు. 2. చంపు.

సరిపోవు క్రి. 1. సమానమగు 2. సమాధానమగు, 3. అయిపోవు 4 నశించు.

సరిప్రొద్దు వై. వి అర్ధ రాత్రము.

సరియు వ. పగుళ్ళుర్చాన సందు, సందు.

సరిహదు వి. మేర. రూ. సరుదు.

సరీసృపము సం. వి. పాము. ప్రాకుడు జంతువు.

సరీసృపములు సం.వి. (జం) చల్లని నెత్తురు చర్మముపై పెంకువలె నుండు గట్టి నిర్మాణములు, ఊపిరి తిత్తులు, రెండు బృహద్ధమన చాపములుగల పృష్ఠవంశిన జంతువులు (Reptilia). ఉదా బల్లి, తొండ మొసలి పాము, తాబేలు. మొ.

సరుగు క్రి. పెరుగు, వర్ధిల్లు.

సరుగుడు వి. (వృక్ష) సరవిచెట్టు. రూ, సరువుడు.

సరుడు వి. 1. బాణము. 2. గరిలేని బాణము.

సరుదు వి ఎల్లి. 2. వరద.

సరూపక్షేత్రములు సం. వి. (గణి.) ఒకదాని కోణములు మరియొక దాని కోణములతో వరుసగా సమానముగ నుండు వాని సదృశ భుజముల నిష్పత్తి సమానముగా నుండు సరళరేఖాత్మక క్షేత్రములు.(Similar figures).

సరూపత సం.వి. (గణి.) ఒక సమతలములోని ఒక క్షేత్రములోని



కోణములు రెండవ సరూపత్రిభుజములు క్షేత్రములోని కోణములకు వరుసగా సమానముగను. ఒకదానిలోని భుజములు రెండవ దానిలోని భుజములకు వరుసగా సమాన నిష్పత్తిలోను ఉండు ధర్మము (Similarity)

సరూపతాకేంద్రము సం. వి (గణి) సమస్థిత క్షేత్రములలోని సంగత శీర్షములను కలుపగా నేర్పడు సరళరేఖలు అనుషక్తములగుబిందువు. Centre of similitude.

సరెండరు విలువ మి.వి. విడుదలమూల్యము. భీమాచేసిన వ్యక్తి ప్రీమియము వాయిదాలను చెల్లించుటకు శక్తిలేక కాని ఇతర కారణములవల్లగాని. భీమా వదలుకొని పట్టా దాఖలా సొమ్ము రాబట్టుకొనదలచినచో ఆనాటికిదానికిగల విడుదల విలువ. (Surrender-value).

సరేసు వి. ఒక దినుసుబంక. వజ్రము అనబడునది వి (రసా.) కల్లుకుకల్లు అతికించు బంక పదార్థము. (ఇది పశువు, డెక్కలు ఉడికించి తయారుచేయబడును). (Glue).

సరోజము సం వి. 1. తామర. 2 తామర కొలను.

సర్కస్ ఇం. వి. (Circus) క్రీడాకారులు జంతువులు ప్రదర్శించు సాహసోపేతమగు వినోద ప్రదర్శనము.

సర్కారు హిం వి. 1. ప్రభుత్వము. 2. జిల్లా, పరగణా, ప్రభుత్వమువారు.

సర్క్యూటుకోర్టు ఇం. వి. (శాస.) (Circuit court) సంచార న్యాయస్థానము.

సర్క్యూటు జడ్జి ఇం. వి. (శాస.) (Circuit judge) సంచార న్యాయమూర్తి.

సర్గము సం. వి. 1. అధ్యాయము. 2. విసర్జనము. 3. నిశ్చయము 4. స్వభావము. 5 సృష్టి.

సర్జము సం. వి. (వృక్ష) సాధారణముగా శంక్వాకార వృక్షముల కాండములలో నుండు పసుపురంగు గల ఘనపదార్థము. (ఇది నీటిలో కరుగదు. సారాయము టర్పెంటైన్‌లలో కరుగును). (Resin). సం వి. మద్ది.

సర్జములు సం వి. (వృక్ష.) మొక్కలనుండి విసర్జింపబడు ద్రవ్యములలో నివి యొకటి (Resins).

సర్జరసము సం. వి. (గృహ.) అరపూస, దీనిని సబ్బు చేయుటలో ఎక్కువగుటకును కొంచము రంగు నిచ్చుటకును ఉపయోగింతురు ఇవి కొన్ని చెట్ల మొక్కలు స్రవించు రసమునుండి జనించును(Rosin).

సర్టాక్సు ఇం. వి. (అర్థ) (Sur-tax) సరకుల మీద విధించిన పన్నుపై వేరొక పన్ను విధించుట.

సర్టిఫికెట్టు ఇం. వి (Certificate) యోగ్యతా పత్రము. నిదర్శనపత్రము. ప్రమాణ పత్రము.

సర్పంచ్ హిం.వి. (రాజ) గ్రామపంచాయతి అధ్యక్షుడు

సర్పము సం. వి. పాము, సప్పము.

సర్పి సం. వి. 1. నేయి 2. జలము. 3. రోగవిశేషము.

సర్పిల కవాటము సం. వి. (జం) మెలికలు తిగియుండు కవాటము (Spiral valve)

సర్పిళనాళము సం. వి. (రసా.) మెలికలు గల గొట్టము.

సర్పిలము సం వి. (గణి.) స్క్రూధారవలె పైకి చుట్టుకొని పోవు రేఖ. స్ప్రింగు ఆకారము గల రేఖ. (Helix).



సర్పిలములు

సర్వంసహ సం. వి. భూమి.

సర్వజనీనము సం. విశే. అందరకు హితమైనది

సర్వజిత్తు సం. వి. అరువది సంవత్సరములలో నొకటి.

సర్వజ్ఞుడు సం. వి. 1. బుద్ధుడు. 2. శివుడు. విశే. అన్నియు నెరిగినవాడు.

సర్వతోభద్రము సం వి నాలుగు ప్రక్కల వాకిండ్లు గల రాజగృహము.

సర్వతోముఖము సం. వి. 1. ఆకాశము. 2. జలము.

సర్వతోముఖుడు సం. వి. 1. అగ్ని. 2. బ్రహ్మ 3 శివుడు.

సర్వత్ర సం. వి అవ్య. అంతట.

సర్వథా సం అవ్య. అన్నివిధములు.

సర్వదా సం. అవ్య. ఎల్లప్పుడు.

సర్వపక్ష సమావేశము సం. వి. (వ్యావ.) అన్నిపక్షములు చేరి జరుపు సభ (All Parties Conference).

సర్వభక్షకము సం. వి. (జం.) అన్ని రకములైన ఆహారమును తినునట్టిది. (Omnivorus).

సర్వభక్షకుడు సం. వి. అగ్ని.

సర్వమంగళ సం. వి పార్వతి.

సర్వము సం. (సర్వ.) సమస్తము, అంతయు

సర్వల సం, వి చిల్లకోల, శర్వల

సర్వసమానము సం. విశే. (గణి.) అన్ని అంగములు ఒకదానికొకటి వరుసగా సమానముగా నున్నది (Identical Congruent).

సర్వసమీకరణము సం. వి. (గణి.) రాసులప్పనాధారపడని సమీకరణము. (Identity).

సర్వ సామాన్య మానవ హక్కుల ప్రకటన వి. (పరి..రాజ) ఐక్యరాజ్య సమితి ఆర్థిక సాంఘిక సభ, సాధారణ సభా సమ్మతముతో నీ ప్రకటన క్రీ. శ. 1948లో కావించినది (ఈ ప్రకటన ప్రకారము ప్రపంచములోని ప్రతిమానవునకు ప్రతిజాతికి స్వతంత్రముగా బ్రదుకుటకు హక్కు గలదు ప్రపంచములో నేదేశమందైనను జాతి, మత లైంగిక విచక్షణ, బానిస వ్యాపారము, బానిస తనము, పసిబాలుర శ్రమ ఉండరాదు).

సర్వాంగీణము సం విశే. 1. ఎల్ల యవయవములసంబంధముతో గూడినది. 2. ఎల్ల యవయవము లందు వ్యాపించినది.

సర్వాధికారశాసనము సం. వి. (శాస..చరి) ట్యూడరు రాజగు ఎనిమిదవ హెన్రీ కాలములో బ్రిటిష్ పార్లమెంటు ఇంగ్లండు రాజుకు లౌకిక వ్యవహారము లలోనేగాక మతవిషయములలో గూడ సర్వాధికారము కలదని ఆమోదించిన చట్టము.

సర్వార్థసిద్ధుడు సం., వి. శాక్య బుద్ధుడు

సర్షపము సం. వి. ఆవాలు

సలక వి. 1. చిన్నగోనె 2. కొన్ని ప్రదేశ ముల ధాన్యము కొలమానము.

సలగ వి పాలు. రూ. సలప.

సలహా హిం వి. ఆలోచన.

సలాక వై. వి. శలాక. కమ్మి సం.శలాకా

సలాపము వి. సముద్రములో ముత్తెపుచిప్ప లేరుట.

సలి వి. చప్పుడు, సందడి.

సలించు వై క్రి. చలించు సం, చల్.

సలితము విశే అల్పము.

సలిగ వి. ప్రావు

సలిలము వై. వి. కొలువుడు కానిని కొలువు నుండి త్రోయుట. సం. చాలితమ్.

సలిలము సం. వి. నీరు.

సలుగ వి. ధాన్యము కొలుచునపుడు గురు తుకై యుంచుకుప్ప. పెచ్చు. రూ.సలువు

సలుగు వై. వి. శుల్కము. పదుపంది. రూ సలువు. సం, శల్యకః,

సలుపు క్రి. చేయు. రూ. చలుపు.

సల్లకి సం. వి. అందుగుచెట్టు.

సల్లాపము సం. వి. పరస్పర సంభాషణము. రూ. సల్లపనము

సవ వి. జాడ.

సవడి వి. సవ్వడి.

సవితి వై. వి. సపత్ని. సం. సపత్నీ.

సవతితల్లి వి. మారుతల్లి, విమాత.

సవతు వై. వి. సమత, సామ్యము. సం. సమత్వమ్,

సవదరించు వై. క్రి ధరించు, తాల్చు.

సవనము సం. వి యజ్ఞము.

సవము వై వి. సగము. సం సామి.

సవము సం. వి. యజ్ఞము, జన్నము

సమవయస్కుడు సం. వి. స్నేహితుడు. విశే. సమాన వయస్సు కలవాడు

ససర వి చక్కనైనది, చదునైనది. రూ. సనరస

సవరణ వి. 1. వాహనాద్యలంకరణము. 2. పరికరము 3. సేవ. 4. సౌమ్యము. రూ. సవరణము.

సవరణచేయు క్రి సవరణించు, వాహనా దుల నలంకరించు

సవరించు క్రి 1. అలంకరించు. 2. చక్క బరుచు 3. కూర్చు. 4. తాల్చు, చేయు.

సవరింత వి సవరింపు

సవరిల్లు క్రి. అందమగు.

సవరుచు క్రి. సవరించు.

సవాయి వి. 1. మేహరోగము 2. పడవపెద్ద మోకు.

సవారి హిం వి. ప్రశ్న. యుక్తిప్రశ్న.

సవాలు హిం. వి ఎదుర్కొనుట, ప్రతిఘట నము (Challenge).

సవి అవ్య అని, అని చెప్పి.

సవిత సం వి. 1. సూర్యుడు. 2. తండ్రి. రూ. సవితృడు.

సవిత్రి సం. వి. 1. తల్లి. 2. ఆవు.

సవిధము సం, వి. సమీపము, సవేశము.

సవ్యము సం. విశే. 1. ఎడమ. 2. కుడి. 2. ప్రతికూలనము.

సవ్వడి వి సవడి,

ససి వి. 1. బాగు 2. ఆరోగ్యము. 3 నిగ్గు.

ససువు విశే. సాధువు.

సస్తనములు సం.విశే. (జం) పాలిచ్చుజంతు వులు (Mammals)

సస్యపరివర్తనము సం. వి. (వ్యవ.) ఆయా పైరులను తగినరీతిని మార్చుచు సేద్యము చేయుట (Rotation of crop).
సస్యము సం. వి. పైరు. యా. శస్యము.
సస్యసంగ్రహణము సం. వి. (వ్యవ.) పైరు పంటకు వచ్చిన తర్వాతచేయు పనులు. (Harvest etc. of crops)
సహ సం. వి. భూమి.
సహకార నిరాకరణోద్యమము సం. వి. (చరి,రాజ.) మహాత్మాగాంధి భారతదేశ స్వాతంత్ర్యము సాధించుటకై మొదటి సారిగ భారత జాతీయ కాంగ్రెసు పార్టీ విధానములో క్రీ.శ. 1920వ సం॥ లో ఈ యుద్యమమును ప్రవేశపెట్టెను. భారతీయులు శాసనసభలలో ప్రవేశించరాదనియు ఇంగ్లీషు విద్యావిధానము ప్రకారము పాఠ్య ప్రణాళికలున్న పాఠశాలలకు, విద్యాలయములకు వెళ్ళరాదనియు విదేశవస్త్రములు వాడరాదనియు, ఈ యుద్యమము అంశములు విధించెను. (Non co-operation).
సహకార పరపతి సంఘము మి. వి. (అర్థ.) సహకార సంఘ సభ్యులకు ప్రత్యేకావసరముల కొరకు తక్కువ వడ్డీకి ఋణముల నిచ్చుసంస్థ(Co-operative credit society
సహకార పాడిపరిశ్రమ కేంద్రము మి. వి. సహకార దధిమంధన గృహము. సహకార పద్ధతులపై పాల పరిశ్రమ నడుపుట (Co-operative dairy farm).
సహకారము సం. వి. వ్యష్టి,సమిష్టి బాధ్యతలను గుర్తెరిగి వ్యక్తులు సంఘముగాచేరి పరస్పర సాహాయ్యక భావముతో పని చేయుట. సం. వి. తియ్యమామిడిచెట్టు.
సహకార వ్యవసాయ క్షేత్రములు సం. వి. (వ్యవ.) కొందరు కర్షకులు ఒకటిగాచేరి పెద్ద యెత్తున ఒకచోట వ్యవసాయము చేయు క్షేత్రము (Co-operative Agricultural lands).
సహకార శిలీంధ్రములు సం. వి. (వృక్ష.) చెట్టువేళ్ల నాశ్రయించి పెరుగుచు వాని వేళ్ళకు నత్రజనినిచ్చునొకతరగతి శిలీంధ్రములు (Mycorrhiza).
సహకార సంఘములు సం. వి. (అర్థ.) ఒకరి కొకరు సహాయము కొరకేర్పడిన సంఘములు. (ఈ సంఘములద్వారా కృషికి కావలసిన వివిధ వస్తుసామగ్రిని ధనరూపముగాని వస్తురూపముగాని పొంద వచ్చును (Co-operative societies).
సహకార సంస్థలు సం. వి. (అర్థ). సహకారము నిచ్చుటకై నేర్పడిన పెద్ద సంఘములు. (Co-operative Institutes).
సహకార(పు) సేద్యము సం. వి. (వ్యవ.) కొందరు వ్యవసాయదారులు ఒకే భూఖండమున పరస్పర సహాయముతో చేయు సేద్యము, (Co-operative farming).
సహకారి సం. విశే సహాయుడు.
సహగమనము సం వి. 1. కూడ బోవుట. 2. భర్తతో భార్య చితిజొచ్చుట.
సహచరి సం.వి. 1. భార్య 2.స్నేహితురాలు. విశే. కూడదిరుగునది.
సహచరుడు సం. వి. మిత్రుడు. విశే. కూడ దిరుగువాడు.
సహజ సం. వి. తోడ బుట్టినది.
సహజజ్ఞానము సం. వి. (జం.) వివేకముతో గాని అనుభవముతో గాని నిమిత్తము లేనట్లు జంతువులు తమ సహజమైన ప్రేరేపణ సాయముతో ప్రవర్తించుట. (Instinct).
సహజము సం. వి. స్వభావము, విశే. కూడ బెట్టినది. (శాపీ.) ప్రకృతికనుగుణమైనది. (Narmal).

**సహజశక్తి** సం. వి. (రసా.) ఒక యౌగికమందు అంతర్నిహితమైన శక్తి (Intrinsic energy).

**సహజసత్వములు** సం. వి. (రాజ.,చరి.) ప్రాకృతికమైన హక్కులు ప్రాకృతికాధికారములు, జన్మతః లభించిన హక్కులు, వాక్స్వాతంత్ర్యము, మతస్వాతంత్ర్యము, కుటుంబసత్వము, జీవించుటకు గల హక్కులు.

**సహజీవన పద్ధతి** సం. వి. (రాజ. చరి) భిన్న రాజకీయ సాంఘిక దృక్పథములు కలిగియుండియు శాంతియుతముగ సహనముతో జాతీయాంతర్జాతీయ సమస్యల పరిష్కారములలో ఒకరితో నొకరు సహకరించుట, రెండవ ప్రపంచ యుద్ధానంతరము కమ్యూనిస్టు రష్యా సహకారము కోరి, బ్రిటిష్ ప్రధానమంత్రి అయిన సర్ 'విన్‌స్టన్ చర్చిల్' అమెరికా సంయుక్త రాష్ట్రాధ్యక్షులైన 'ఐసన్ హోవరు' ప్రతిపాదించిన విదేశాంగ నీతి పద్ధతి (Co-existence)

**సహజీవనము** సం. వి. (వృక్ష) ఒక తరగతి ప్రాణియు మరియొక తరగతి ప్రాణియు కలిసి పరస్పర లాభదాయకముగా జీవించుట (Symbioais).

**సహజీవి** సం. వి. (జం) సహజీవనముచేయు ప్రాణులలో ఒకటి. (Symbiont).

**సహధర్మిణి** సం. వి. భార్య.

**సహనము** సం. వి. ఓర్పు.

**సహపాఠి** సం. వి. కూడ చదువువాడు. సహాధ్యాయి

**సహవాసము** సం. వి. 1. కూడనుండుట 2. స్నేహము

**సహవేదననాడులు** సం. వి. (జం.) పరిణాహనాడీ మండలమునకు చెందిన ఒక తరగతి నాడులు. (Sympathetic nerves).

**సహశిక్షణము** సం. వి. బాలబాలికలు కలసి చదువుకొనుట. (Co-education).

**సహసమన్వయము** సం. వి (భౌతి.,గణి రసా) ఒకదానితో నింకొకదానిని సంబంధమునకు తెచ్చుట. రెండిటి మధ్య ఆనురూప్యమును గాని సంబంధమును గాని స్థాపించుట.

**సహస్రదంష్ట్రము** సం. వి పాఠీనము, వేయి కోరలుగల చేప.

**సహస్రపత్రము** సం. వి కమలము, తామర.

**సహస్రపాదుఁడు** సం. వి. 1. విష్ణువు. 2. సూర్యుడు

**సహస్రము** సం. వేయి.

**సహస్రాంశువు** సం. వి సూర్యుడు వేవెలుగు.

**సహస్రాక్షుఁడు** సం. వి. ఇంద్రుడు. వేగంటి

**సహస్రారము** సం. వి. షట్చక్రములలో నొకటి. (ఇది శిరస్సునందుండును).

**సహాధ్యాయుఁడు** సం. వి సహపాఠి.

**సహాయకోశికలు** సం. వి (వృక్ష) భ్రూణస్యూనములో అండకణమునకు చెంత యొక వైపుననుండు కణములు ఇవి ఫలదీకరణమునకు సహాయపడును. (Synergids).

**సహాయనిరాకరణము** సం. వి (చరి) శాంతియుత సహాయ నిరాకరణము, (భారతదేశ స్వాతంత్ర్యమునకై మహాత్మాగాంధీ బ్రిటిష్ ప్రభుత్వమువట్ల అవలంబించిన పద్ధతి).

**సహాయుఁడు** సం. వి. 1. తోడగువాడు 2. స్నేహితుడు.

**సహించు** క్రి. ఓర్చు.

**సహితము** సం. విశే. కూడుకొన్నది. అవ్య. (తెనుగున) సహార్థకము. ఉదా. సయితము.

**సహిష్ణువు** సం. విశే. ఓర్పువాడు.

**సహృదయుఁడు** సం. విశే. మంచిమనస్సులవాడు.

సహోదరుడు సం. వి. తోడబుట్టినవాడు.
సహోదరి సం. వి. తోడబుట్టినది.
సహ్యము సం. వి. 1. ఆరోగ్యము. 2 ఒక కొండ. విశే. సహింపదగినది.
సళించు క్రి. దుఃఖించు.
సళువు క్రి. వ్రణము మొ వి. పోచెత్తు రూ. చేలువు. విశే. భారమైనది.
సళ్ళు వై. క్రి. సడలు, సం. శ్లథ్.

# సా

సా వై. విశే. సగము, సమాసమునందు 'సాము' శబ్దమునకు అన్త్యాక్షరశేషము లోపింపగా మిగిలిన రూపము, ఉదా. సామేను. సం. సామి.
సాంకవము సం. వి. సంకుమదము, జవాజి.
సాంకాలిక సం. వి. ప్రతిదినము వచ్చువడ్డీ.
సాంకేతికము సం. వి, (రసా.) ఒక వస్తువు యొక్క రాసాయనిక సంఘట్టనమును తెలియజేయు సంకేతము (చిహ్నము) ల కూర్పు (Formula) (గణి) రాసులకు మారుగ వాడెడి గుర్తు (Symbol).
సాంకేతికములు సం వి. (రసా) రసాయన మూలద్రవ్యములను సూచించు గుర్తులు (Symbols)
సాంఖ్యకశాస్త్రము సం. వి. ప్రజల యొక్క సామాజికవర్గముల యొక్క సాంఘికార్థిక పరిస్థితులనుగురించి క్రమపద్ధతిలో విషయములను సేకరించుశాస్త్రము (Statistics) రూ సాంఖ్యకశాస్త్రము.
సాంఖ్యిక వస్తుగుణనియమము సం వి (వాణి.) ఒక కర్మాగారములో ఉత్పత్తి చేయుచున్న వస్తువులన్నియు ఒకే రకమైనవేయని రుజువుచేసి కొనుటకు సాంఖ్యక శాస్త్రప్రయోగము, (ఇట్టి ప్రయోగము ప్రస్తుతము చాల కర్మాగారములలో ప్రవేశపెట్టినారు).
సాంగత్యము సం వి. కూడిక.
సాంఘికము సం వి (గృహ) కలుపుగోలుతనము. విశే 1. స్నేహబుద్ధిగలది. 2. సహవాసేచ్ఛగలది (Social)
సాంఘికభద్రత సం. వి. సామాజిక శ్రేయో రాజ్యము తన పౌరులకు వార్ధకము. రోగము, నిరుద్యోగము మొ॥ సమయములలో కలిగించు వసతులు.
సాంఘికశాస్త్రము సం వి. మానవునకు, మానవసంఘములకు గల సన్నిహిత సంబంధమునుగురించి బోధించుశాస్త్రము.
సాంత్వనము సం. వి ఓదార్పు, అనునయము.
సాంత్వము సం. వి. 1. సామోపాయము. 2, దాక్షిణ్యము.
సాంద్రత సం. వి. (భౌతి.) ఒక వస్తువు యొక్క ద్రవ్యరాశికిని, దాని ఘనపరిమాణమునకును గల నిష్పత్తి (Density). (భౌతి .రసా) ద్రవ్యరాశికిని ఆయతనమునకును గల నిష్పత్తి లేదా ఏకాంకాయతనములోనుండు ద్రవ్యరాశి

$$\text{సాంద్రత} = \frac{\text{ద్రవ్యరాశి}}{\text{ఆయతనము}}$$

(భౌతి) ఒక ఏకాంకపు ఆయతనములో నుండెడు అణువులు లేక అయనులు (Concentration)
సాంద్రతాపాత్ర సం. వి. (భౌతి) సాంద్రతను కనుగొనుటను ఉపయోగపడు పాత్ర (Specific gravity bottle)
సాంద్రతామాపకము సం వి (రసా భౌతి.) ద్రవముల సాంద్రతను కొలుచుపరికరము (Pyhnometer),
సాంద్రము సం. విశే. దట్టమైనది.

సాంద్రీకరణము నం. వి. (భౌతి. రసా.) ఒక ఏకాంకము విస్తీర్ణముగల చోటులో ద్రవ్యరాశిని ఎక్కువచేయుట (Concentration).
సాంపరాయము నం. వి. 1. యుద్ధము. 2 ఆపద. 3. రాగలకాలము. రూ సంపరాయము.
సాంపరాయికము నం. వి. యుద్ధము. రూ. సంపరాయికము.
సాంప్రతము నం. అవ్య. 1. యుక్తము. 2. ఇప్పుడు.
సాంప్రదాయక ప్రతినిధిత్వము నం. వి (రాజ., చరి.) సాంఘిక ప్రాతినిధ్యము రాజ్య శాసనసభలలో రాజకీయ పక్ష భేదములపై గాక కులమత వైషమ్యములు ఆధారముగాతీసికొని ప్రాతినిధ్యమిచ్చుట
సాంబ్రాణి[1] వి (వ్యావ.) ఇది Styrax benzoin అను చెట్టుయొక్క కాండమునుండి లభించు చమురు పదార్థము. ఇది ధూప ద్రవ్యముగ ఉపయోగములోనున్నది ఒక విధమైన ధూపద్రవ్యము. రూ సాంబ్రాణి
సాంబ్రాణి[2] వై. వి. ఉత్తమాశ్వము. సం. సమ్రాట్.
సాంయాత్రికుఁడు నం వి ఓడవర్తకుడు
సాంయుగీనుఁడు నం విణ. యుద్ధమునందు నేర్పు గలవాడు.
సాంవత్సరికము నం. వి. ఆబ్దికము. విణ సంవత్సరాంతమున జరుగునది.
సాఁకు క్రి. కాపాడు. పెంచు.
సాఁగు క్రి 1 దీర్ఘమగు దండాకారముగ నేలపైప్రాలు. రూ చాగు
సాఁబాలు వి. సగముపాలు.
సాకతము వి.1. ఊరడింపు 2.అనుగ్రహము.
సాకిము వి. 1. ఉత్సవము. 2. సెపము. రూ సాకు.
సాకల్యము నం వి. సకలత్వము.అంతయు
సాకిరి వై. వి సాక్షి.
సాకు వి నెపము రూ. సాకము.
సాక్షాత్కారము నం. వి. ఎదుటనగపడుట.
సాక్షి నం విణ చూచువాడు
సాక్ష్యము నం. వి సాక్షి కనినదిని చెప్పినది
సాగరము[1] వి. నేయి మొ నవి నింపిన సిద్దెల జోడు.
సాగరము[2] నం. వి 1. సముద్రము 2. ఏనుగు చెవియందలి మదము.
సాగు క్రి. 1 పోవు ప్రసరిల్లు. 2. యత్నించు. రూ. చాగు (వ్యావ.) దుక్కి మొ. పనులుచేసి విత్తనములు చల్లుటకు నేలను సిద్ధముచేయుట (Tillage).
సాగుబాటు వి జరుగుపాటు.
సాగుబడి వి. 1 సేద్యము. 2. సాగుపాటు.
సాగనంపు క్రి. పయనించు వారిని కొంత దూరముకొనిపోయి విడుచు.
సాచివ్యము నం.వి.సచివత్వము మంత్రిత్వము.
సాజాత్యము నం. వి. 1. సజాతిత్వము. 2. పోలిక.
సాజము వై. వి. సహజము. నం. సహజః.
సాటి వి ఒకవస్తువునిచ్చి మనొకటి మార్చు కొనుట, వినిమయము,పరివర్తనము. రూ. సాటూ, సాటూకోటి.
సాటి విణ సమానము రూ. సాటిక.
సాతు వై. వి. 1. సార్థకము. 2. వర్తకజన సమూహము నం. సార్థమ్.
సాత్త్వికము నం. విణ. సత్త్వగుణమువలన కలిగినది.
సాదన వై వి. సాధనము. అభ్యాసము. నం. సాధనా.
సాదనకాఁడు వి. మల్లుడు.
సాదనజోదు వి మల్లుడు.
సాదనము నం వి. ఇల్లు. రూ. సదనము.
సాదము[1] వి. అన్నము.

సాదము² నం. వి. 1. శ్రమ. 2. నాశము. 3 ప్రాపు.
సాది నం వి. 1. గుఱ్ఱపు రౌతు 2. మావటీడు. 3 సారథి
సాదు వై విణ సాధువు మంచివాడు మంచిది నం. సాధుః
సాదృశ్యము నం వి పోలిక.
సాధకము నం విణ సాధించునది
సాధన నం. వి (గణి) గణిత సమస్యను పరిష్కరించుట (Solving) 1 సాధించుట 2 ఉపకరణము.3. ఉపాయము (భౌతి) పరిశోధనాగారములో ఉపయోగపడు పంకరము (Apparatus) (భౌతి, గణి, రసా) పనిచేయు పరికరము. ఉదా తూచుటకు త్రాసు (Appliance).
సాధనీయము నం. విణ. సాధింపదగినది.
సాధర్మ్యము నం వి పోలిక.
సాధారణ నం వి. అరువది సంవత్సరములలో ఒకటి.
సాధారణ నం విణ (గణి) సర్వ విషయములకు సంబంధించినది (General) వి. (రసా) విశేషమునకు విరుద్ధము (Normal). ఉదా ఉదజని పరమాణువు యొక్క సాధారణస్థితి
సాధారణోద్భిదము నం వి (వృక్ష) అన్ని వసతులు అనుకూలముగా నుండుస్థలములో పెరుగు మొక్క (Mesopnyte)
సాధించు నం. క్రి. నెరవేర్చు
సాధించుట నం. వి (గణి) 1 సమీకరణములలోని అజ్ఞాతరాసులను కనుగొనుట 2. గణితసమస్యలను పరిష్కరించుట (Solvtng).
సాధిష్ఠము నం. విణ 1 మిక్కిలి పదిలము మిక్కిలి మంచిది
సాధీయసుఁడు నం. విణ. 1. ఎక్కువ హితవర, 2 ఎక్కువమంచివాడు. 3. చక్కనివాడు.
సాధ్యము నం విణ. సాధింపదగినది రూ. సాధనీయము.
సాధ్యహారము నం. వి. (వ్యవ.) గుప్తాహారము (Available plant food).
సాధ్వసము నం. వి భీతి.
సాధ్వి నం. వి. పతివ్రత.
సాన వై. వి. శాణము, మణుల ఎచ్చు తగ్గులు మొదలైనవి పోపుటకై గాచెడిరాయి. కత్తులు నూరెడి రాయి, గంధము తీసెడి రాయి నం శాణః.
సానటోరియమ్ ఆం. వి (గృహ) (Sanatorium) ఆరోగ్యవరము. ఆరోగ్యము కొరకు రోగులు పోయెడి చోటు,
సాని వై. వి. 1. మంత్రసాని 2 అడిపురాలు. 3. వేశ్య 4. భార్య నం.స్వామినీ
సానిక వి. మట్టికంచము, మల్ల.
సానుకూలవాణిజ్యావశేషము నం. వి. (వాణి) ఒకదేశము యొక్క ఎగుమతుల విలువ దిగుమతుల విలువకన్న ఎక్కువనుండుట.
సానుమంతము నం. వి. కొండ వృక్షచరియలు కలది.
సానువు నం వి 1. కొండనెత్తము 2. కోన, త్రోవ. చరియ.
సాన్నిధ్యము నం. వి. సామీప్యము.
సాపడు క్రి భుజించు.
సాపత్న్యము నం. వి. 1. సపత్నీత్వము. 2 పగ.
సాపాటు వి భోజనము.
సాపాటురాముఁడు వి. (వాడు) తిండిపోతు.
సాపేక్షసాంద్రత నం వి (భౌతి) శాంతమ్యా సాంద్రత. ఒక ఘనద్రవ్యముగాని ద్రవద్రవ్యముగాని సమాయతనములో నీటికన్న ఎన్నిరెట్లు బరువో సూచించు అంకె. ఉదా. పాదరసపు సాపేక్ష సాంద్రత = 13.6 అనగా 1 క్యూబిక్ సెంటిమీటర్

పాదరసము క్యూబిక్ సెంటీమీటర్ నీటి కన్న 13.6 రెట్లుబరువు (Relative density)

సాక్షపదీనము సం. వి. చెలిమి: వ్యు ఏడు మాటలలోలేక ఏడుఅడుగులలో కలుగునది

సాఫల్యము సం. వి. సఫలత్వము.

సామంతతంత్రము సం. వి (చరి ) క్రీ శ. 10వ శతాబ్దివరకు యూరప్‌లోని ఆర్థిక సాంఘిక, రాజకీయ పరిస్థితులు, భూమి నాధారముగ తీసికొని రాజునకు సామంత ప్రభువులకు ప్రభువునకు రైతునకు గల సాంఘిక రాజకీయ హక్కులు విధులు నిర్ణయించిన సామాజిక వ్యవస్థ.

సామంతరాజ్యము సం. వి. (చరి., రాజ.) పరాధీనరాజ్యము, అన్యతంత్రరాజ్యము,

సామంతుఁడు సం. వి. ఒక దేశపు ఎల్లలకు చేరకనున్న రాజు.

సామగ్రి సం వి. 1 సమగ్రత. 2 ఉపకరణము. 3. వస్తుసంభారము.

సామజము సం. వి. ఏనుగు. వ్యు. సామవేదమువలన పుట్టినది.

సామము సం. వి. 1. ఒక వేదము 2. మంచిమాట 3. ఒక అనుకూలోపాయము

సామయిక పవనములు సం. వి. ఎల్లప్పుడు ఒకే సమయమున వీచు పవనములు.

సామరస్యము సం. వి. సమరసత్వము.

సామర్థ్యము సం. వి. 1. నేర్పు. 2. యోగ్యత (భౌతి.) పనిచేయు రేటు. (Power) (గృహ ) బలము. సత్తువ.

సామాజిక శాస్త్రము సం. వి. మానవుని సామాజిక సాంస్కృతిక వ్యవస్థలను గురించి చెప్పు శాస్త్రము (Sociology).

సామాజిక సంవిధానసిద్ధాంతము సం. వి. (రాజ.,చరి.) సామాజికమైన ఒడంబడిక, ప్రభుత్వము ప్రజల సామాజికమైనఒప్పందముచే జరిగెననియు రాజ్యము యొక్క సత్తాకము ప్రజల సమష్టియిష్టమనియు క్రీ.శ. 18వశతాబ్దము నకుచెందిన ఫ్రెంచ్ రాజకీయశాస్త్రజ్ఞుడు 'రూసో' వ్రాసిన సిద్ధాంతము.

సామాజికుఁడు సం. వి. 1 సమాజమందుండువాడు. 2. సభ్యుడు 3. ప్రేక్షకుడు.

సామాను హిం వి. వస్తువు సామగ్రి.

సామాన్య కారణరాశి సం. వి (గణి.) దత్తరాసులన్నింటనున్న కారణాంకము.(Common factor).

సామాన్యకృషి సం వి (వ్యవ ) వరి, జొన్న, కంది, ప్రత్తి, చెరకు మొ సస్యములను పైరుచేయుట(Agronomy or cultivation of field crops).

సామాన్యగుణిజము సం. వి. (గణి ) 27, 54 అంకెలకు 9సామాన్యగుణిజము( Common multiple).

సామాన్య(పు)త్రాసు వి (భౌతి.) కండముచే చేయబడి సామాన్యముగా వాడుకలో నున్న త్రాసు (Common balance).

సామాన్యపత్రము సం. వి (వృక్ష.) పత్రఫలకము ఒకేముక్కగానున్న ఆకు (Simple leaf)

సామాన్యపార్శ్వస్థము-స్పర్శరేఖ సం. వి. (గణి.) రెండువృత్తములు తనకొకేవైపున నుండునట్లు రెండింటిని తాకెడి సరళ రేఖ (Direct common tangent).

సామాన్యఫలము సం. వి. (వృక్ష ) ఒక ఫలము ఏకఫలదళము గల అండకోశము నుండి కాని, సంయుక్తాండకోశమును డి కాని తయారై ఒకే పుష్పమునందు బయలుదేరిన పండు (Simple frouit).

సామాన్యమధ్యసస్పర్శరేఖ సం వి. (గణి.) తన కిరువైపులనున్న రెండు వృత్తములను తాకెడు సరళరేఖ ( Transverse common tangent).

సామాన్య మధ్యారంభ మంజరి నం.వి పుష్ప దండముపై మూడు మొగ్గలుండివానిలో మధ్యనుండు మొగ్గ పెద్దదిగను,ముందుగా వికసించునదిగను ఉన్న పూలగుత్తి (Simple cryme).


సామాన్య మధ్యారంభ మంజరి

సామాన్యము నం. వి సామ్యము.విణ.సాధారణము. (గణి.) కొన్ని రాసులన్నింటికి సంబంధించినది (Common).

సామాన్యలవణము నం వి (రసా.) ఒక ఆమ్లమునందలి హైడ్రోజన్ పరమాణువులను పూర్తిగాతొలగించుటవలన ఏర్పడెడి లవణము (Normal salt).

సామాన్య వివరణము నం. వి. (గణి.) ఒక సిద్ధాంతమును సాధారణ పదముల తెల్పు ప్రవచనము (General enunciation).

సామాన్యస్పర్శరేఖ నం. వి. (గణి.) రెండు వృత్తములను తాకెడిసరళరేఖ (Common tangent).

సామాన్యైక పర్ధ్యక్షకము నం. వి. (వృక్ష) పుష్ప మంజరి యొక్కముఖ్యాక్షము పొడవుగా నుండును.పువ్వులు ప్రక్కల నుండి బయలుదేరి చివరకు రానురాను చిన్నవిగా నుండును. పుష్పములకు కాడలుండును (Simple raceme)


సామాన్య ఏక పర్ధ్యక్షకము

సామి వై. వి. 1. స్వామి. 2 రాజు 3. పెనిమిటి. 4. కుమారస్వామి. నం. స్వామి.

సామీప్యము నం. వి. సమీపత్వము, దగ్గర.

సామీరి నం.వి.1.హనుమంతుడు. 2.భీముడు.

సాము వై. వి. 1.సగము.2.వ్యాయామము నం 1. సామి. 2. శ్రమ.

సాముకంటిమక్క వి. పుబ్బనక్షత్రము.

సాముదాయిక సహకారసేద్యము మి. వి. ఈ విధానములో వ్యక్తి తవనద్దనున్న భూక్షేత్రములను, వ్యవసాయపు పనిముట్లను, పశువులను, సహకార సంఘమునకు ఇచ్చివేసి సహకార సంఘములో సభ్యుడుగ చేరవలెను. సేద్యముచేసినపుడు తన కష్టమునుబట్టి రైతుకు మజూరి ఈయబడును.రైతుకుతన భూకమతముపై గాని వ్యవసాయపు పనిముట్లపైగాని, పశువులపై గాని ఆస్తిహక్కులుండవు

సాముద్రికము నం విణ. 1.భాగ్యాదిసూచిక 2. దేహలక్షణములను తెలుపునది. 3. సముద్ర సంబంధమైనది.

సామెత వై. వి. లోకోక్తి. నానుడి. నం. సామ్యోక్తి.

సామేను వి. సగము మేను.

సామ్యము నం. వి సమత్వము, పోలిక.

సామ్రాజ్యము నం. వి. 1. సమ్రాట్టుతనము 2. సమ్రాట్టుకు లోబడినదేశము.

సామ్రాజ్యవాదము నం. వి. (చరి.) సామ్రాజ్యములకు దోహదమియ్య వలెనను వాదము, సామ్రాజ్యము ఉండవలెనను వాదము.

సామ్రాణి వై. వి సాంబ్రాణి.

సాయంకాలము నం. వి. మునిమాపు

సాయంతనము నం విణ. సాయంకాలసంబంధమైనది.

సాయకము నం వి. 1 బాణము. 2. కత్తి.

సాయము[1] వై. వి. సాహాయ్యము.

సాయము[2] నం. వి. 1. సాయంకాలము. 2. బాణము.

సాయుజ్యము నం. వి 1. సహయోగము. 2. ఒక విధమైన మూర్తి.

సాయుధ సార్జంట్ వి. వి. (శాస.) శాసన సభలలో క్రమశిక్షణ పాలించుటకు, తప్పు చేసిన వారిని అరెస్ట్ చేయుటకు నియుక్తుడయిన అధికారి.

సారంగము సం. వి 1. జింక. 2. ఏనుగు. 3. తుమ్మెద. 4 వానకోయిల.

సారంగి వి ఒకవాద్యవిశేషము.

సారఘము సం వి. నేయివంటి వర్ణముగల తేనె.

సారణము వి. ఒక తెగ జేగ.

సారణి సం. వి. 1. కాలువ. 2.షడ్జస్వరము. 3. పలికెడితంతి. (భౌతి) సమాచార దత్తాంశములను సంక్షిప్తముగా తెలియజేయునది (Table).

సారణీబద్ధము సం. విశ. (భౌతి, గణి) చూ. సుసారణి, (Tabular).

సారథి సం. వి 1. తేరునడపువాడు. 2. నియంత.

సారము సం. వి. 1. జవము. 2 ధనము. 3. న్యాయము. 4 బలిమి. 5. చేవ 6. మూలగ విశ శ్రేష్ఠము.వి.(గృహ) ఫలత్వము. 7. ఫలించుశక్తి (Fertility).

సారమేయము సం. వి. కుక్క.

సారసము సం. వి. 1. తామర.2. బెగ్గురుపక్షి

సారస్యము సం. వి. సరసత్వము.

సారస్వతము సం. విశ సరస్వతీ సంబంధమైనది. వి. 1. వాఙ్మయము. 2. భాష

సారాయి వై వి. సుర. మద్యము రూ సారాయము. సం. సారః.

సారి వి. తడవ.

సారించు సం. క్రి. 1. చాచు. 2. విసరు. 3. సరిచేయు.

సారువా వి. వానకాలమున నీటి యాధారమున పండు పల్లపు పంట.

సారువాపంట వి. (వ్యవ.) వరి మొదటి పంట. సాధారణముగ వేసవిలో ఫలితమునకు వచ్చు వరిపంట(Paddy first crop)

సారూప్యము సం వి. 1. సమానరూపత్వము 2. ఒక విధమైన ముక్తి.

సారె[1] వి. 1. కూతు నత్తగారింటికి పంపునపుడు ఇచ్చెడు వస్తువులు. 2. కుమ్మరవాని చక్రము. (గృహ) వధువు అత్తగారింటికి పోవునపుడు తీసికొనిపోవుసామగ్రి వధువు స్వగృహమును నిర్మించుకొనుటకై తలిదండ్రులు సహాయార్థమిచ్చు గృహ సామగ్రి

సారె[2] వై. వి. 1. శారి. 2. పగడశాలకాయ 3. పాచిక. 4. గోరవంక.

సారెకు అవ్య. మాటిమాటికి.

సారెలు వి. వీణెమెట్లు.

సార్థకము సం విశ సఫలము,

సార్థకాంకము సం. వి (గణి.) గణనలోనికి తీసికొని రావలసిన అంకె (Significant figure).

సార్థము సం. వి. 1. జంతుసమూహము. 2. వర్తకజన సమూహము. విశ. అర్థముతో కూడినది

సార్థవాహుఁడు సం వి వర్తకుడు. విశ. ముఖ్యుడు.

సార్వత్రికము సం. వి. (భౌతి., గణి., రసా) 1. అన్ని విశేషముల నిమిడ్చుకొనినది. 2 సర్వవ్యాపకమైనది. (Universal).

సార్వభౌమము సం. విశ. ఉత్తర దిక్కున నుండు ఏనుగు.

సార్వభౌముఁడు సం. వి చక్రవర్తి. వ్యు. సమస్త భూమిని ఏలువాడు.

సాల వై. వి శాల. ఇల్లు, సావడి. సం. శాలా.

సాలగ్రామము సం వి. విష్ణుమూర్తిచిహ్నిత శిల. రూ. శాలగ్రామము.

సౌలడ్ ఆం. వి. (గృహ) (Salad) పచ్చికాయగూరలను తరిగి పచ్చడినలెతినునది. ఉదా. టమేటాలు. ఉల్లిపాయలు, కాబేజ్,

కారెట్ మొ. వానిని నిమ్మరసము చల్లి పెట్టినది.

సాలభంజిక సం. వి. బొమ్మ పుత్తళిక.

సాలము సం. వి. 1. వృక్షము. 2. ప్రాకారము 3 మద్దిచెట్టు.

సాలవృకము సం వి. 1 కుక్క. 2. కోతి 3. తోడేలు. 4. నక్క.

సాలినాయిడ్ ఇం (భౌతి.) (Solinoid) స్ప్రూపాకారముగ చుట్టబడిన రాగితీగచుట్ట.

సాలీఁడు వి. 1. సాలెవాడు 2 సాలెపురుగు.

సాలు[1] వి. 1. ఉన్నిబట్ట. 2. సన్నని వస్త్రము రూ సాలువు

సాలు[2] హిం. వి. సంవత్సరము

సాలుసరి విశే. ప్రతి సంవత్సరమునకు సంబంధించినది. (Annual).

సాలె వై వి. శాలిక నేతనేసి జీవించు ఒక జాతి. సం శాలికః.

సాలెపురుగు వై. వి ఒకజాతి పురుగు. సం. జాలపటః.

సాలెవాఁడు వి. తంతువాయుడు, నేతరి.

సాలోక్యము సం వి. 1 సమానలోకత్వము. 2. ఒక విధమగు ముక్తి

సాల్వడు క్రి 1. ఒరగు 2., నిస్సారమగు.

సల్వేషన్ సేవ మి. వి. (చరి.) క్రైస్తవమత సైన్యము. (Salvation army).

సావలి వి. డుబుడక్కవాడు. రూ సావలీడు.

సావాసము వై. వి సహవాసము, పొత్తు. సం. సహవాసః.

సావాసి వై. వి. 1. చెలికాడు. 2. అంతఃపురపు కావలివాడు. సం. సహవాసీ.

సాతి వి కాలము.

సావిత్రి సం. వి. 1. సరస్వతి. 2. పార్వతి. 3. సత్యవంతుని భార్య.

సావు వి చావు

సాసువులు వి ఆవాలు.

సాహసము సం. వి. 1. తెగువ. దండోపాయము.

సాహసించు సం. క్రి. తెగించు.

సాహాయ్యము సం.వి. 1. తోడుపాటు 2. సహాయత్వము. 3. స్నేహము.

సాహిణము వి. గుఱ్ఱపుశాల.

సాహిణి వి. గుఱ్ఱపువాడు, సాహిణీ.

సాహితి సం వి. 1 అర్థజ్ఞానము. 2. కూడిక, రూ. సాహిత్యము.

సాహేబు హిం.వి. 1. ప్రభువు. 2 సాయబు, సాయిబు.

సాహో వై అవ్య. చోపుదారుచేయు హెచ్చరిక. సం.. స్వామిన్ ! హో !

సాళగము సం. వి. తిలతండులన్యాయమున నైన రాగమేళము.

సాళగించు సం. క్రి మిళితమగు

సాళగింపు సం వి మేళనము

సాళువము వి. ఒకతెగడేగ రూ. సాళ్వము.

సింకింగ్ ఫండ్ ఇం. వి. (అర్థ.) (Sinking fund.) మజ్జననిధి, ఋణవిమోచననిధి, ప్రభుత్వముగాని, వ్యాపారసంస్థగాని, అప్పులను తీర్చుకొనుటకు ఏటేట ఈనిధికి తమ ఆదాయమునుండి కొంత సొమ్ము చేర్చుచుందురు అప్పుగాని దానిపైవడ్డీగాని ఈనిధిమండి చెల్లింతురు.

# సి

సింకేర్యాన్ ఇం వి. (జీవ.) (Synkaryon). సంయుక్త బీజములోనున్నఅష్ఠి (Zygote nucleus).

సింగఁడు వై. వి. 1. నృసింహుడు. 2. ఎరుకువాడు. సం. సింహః.

సింగపుఁబీట వై. వి. సింహాసనము.

**సింగము** వై. వి. సింహము. సం. సింహః.
**సింగాణి** వై. వి. 1. కొమ్ములతోచేసినవిల్లు, 2. విల్లు.రూ సింగిణి. సం.శార్ఙ్గమ్,శృంగిణీ
**సింగారము** వై. వి. శృంగారము, అలంకారము. సం. శృంగారః.
**సింగారి** వై. వి. శృంగారవతి.
**సింగి** వై వి. ఎరుకుది. సం. శృంగి,
**సింగినాదము** వై. వి. 1. పొడ, దుప్పికొమ్ముతోచేసిన సుషిరవాద్యము 2.వేళనాదులయందు ఉపయోగించు వాడుకపదము (సింగినాదము జీలకఱ్ఱ).
**సింగిలీకము** వి. పెద్దనల్లకోతి
**సింగిల్ ట్రాన్స్ఫరబుల్ వోట్** ఇం. వి (రాజ.) (Single transferable vote) ఏకైకసంక్రమణీయమగువోటు.( ఈవోటు ఎన్నికకు నిలిచిన అభ్యర్థులయెడ తన అభిమతక్రమమును సూచించును).
**సిందురము** వై. వి. 1. సిందూరము. 2. కుంకుమ, 3.వావిలిచెట్టు.సం. సిందూరమ్. సిందువారః.
**సిందువారము** సం. వి. వావిలిచెట్టు.
**సిందూరము** సం. వి కుంకుమ, చెందిరము
**సింధురము** సం. వి. ఏనుగు వ్యు. కణతల నుండి మదము కారుచుండునది
**సింధువు** సం. వి. 1.ఒకనది. 2.సముద్రము 3. ఏనుగు. 4. నదము. 4. ఒకదేశము
**సింసన్‌రేఖ** మి వి. (గణి.) పరివృత్తము మీది ఏదైన బిందువునుండి త్రిభుజభుజములకు గీయబడిన లంబముల పాదములకు సంబంధించిన సరళరేఖ(Simson's line)
**సింహద్వారము** సం. వి తలవాకిలి.
**సింహనాదము** సం. వి. వీరుల గర్జనము.
**సింహము** సం. వి. 1. కేసరి. సింగము. 2. ఒకరాశి. 3. శ్రేష్ఠము. (సమాసోత్తరపదమైనచో).
**సింహసంహననుడు** సం విశే సర్వాంగ సుందరుడు.
**సింహావలోకనము** సం. వి. పర్యవేక్షము. జరిగినపనిని తిరిగిచూచుట.
**సింహాసనము** సం వి. సింహ ముఖమే ర్పరచిన స్వర్ణ రత్నమయోన్నత పీఠము,
**సిక** వై. వి శిఖ, జుట్టు రూ సిగ
**సికత** సం వి ఇసుకనేల, మొరపనేల, (రసా) ఇసుక (రాసాయనికముగ నిది సిలికన్ ద్వ్యామ్లజనిదము) (Silica)
**సికాముంగరము** వి. ముద్దుటుంగరము, మొహరుగల యుంగరము.
**సిక్తము** సం విశే. తడిసినది.
**సిక్థము** సం. వి. 1. మైనము. 2. మెతుకు.
**సిగ** వై. వి. సిక సం. శిఖా
**సిగబంతి** వి శేఖరము, సికదండ.
**సిగము** వై. వి. శివము, ఆవేశము. రూ. సిగము. సం. శివా,
**సిగర** వై. వి. శిఖరిణి, చల్లపులుసు రూ. గర.
**సిగరము** వై. వి శిఖరము, సం శిఖరమ్.
**సిగ్గరి** విశే. సిగ్గుకలవాడు.
**సిగ్గఱి** విశే సిగ్గులేనిది.
**సిగ్గు** వి, స్త్రీత్వాదులచే గలుగు మనస్సంకోచము, లజ్జ, బిడియము.
**సిగ్నల్** ఇం వి. (Signal), 1. సంకేతము 2. గుర్తు, సూచన.
**సిట్రికామ్లము** ఇం. వి. (రసా) ఇది నిమ్మ దబ్బ మొ. పులుపు పండ్ల రసములోనున్న సేంద్రియామ్ల ద్రవ్యము. 'నిమ్మపువ్వు' అనునది దీని ఘనద్రవ్యము.
**సిడము** వి. 1. ధ్వజము. 2. ధ్వజస్తంభము,
**సిడి** వి. 1, ఏతవు మ్రాను. 2. అంకుశము.
**సిడిముడి** వి. (వ్యావ.) రోషము- చిదిముది,
**సిత** సం. వి. 1. చక్కెర. 2 తెల్ల గంక.
**సితపక్షము** సం. వి శుక్లపక్షము.

**సితము** నం. విశే. 1. తెల్లనిది. 2. కట్టబడినది.

**సితాఖండము** నం. వి. (గృహ) కలకండ, పటిక బెల్లము, (Sugar candy),

**సితాభము** నం. వి. కర్పూరము. రూ. సితాభ్రము.

**సితుఁడు** నం. వి. శుక్రుడు. విశే. తెల్లనివాడు.

**సిద్ధాయము** వై. వి. 1, వెచ్చపు సొమ్మునందు కూడబెట్టిన ధనము. 2 శిస్తు నం. సిద్ధాయః

**సిద్దె** వి. బంగవరెనోలుతో కుట్టిన పాత్రము రూ. సిద్దియ.

**సిద్ధగృహము** నం. వి. (గృహ.) ఒక చోటి నుండి మరొక చోటికి జరుపుటకు వీలగునట్లు కట్టిన ఇల్లు. (Pre - fabricated house).

**సిద్ధబీజము** నం. వి. (వృక్ష.) బీజాణువు. పుష్ప రహితములగు ఉద్భిజ్జములలో పునరుత్పాదనచేయు జీవకణము (Spore).

**సిద్ధము** నం. విశే. 1 ఆయితమైనది. 2. ఈడేరినది.

**సిద్ధాంతము** నం. వి. 1. స్థిరమైన పక్షము 2. నవవిధ జ్యోతిష గ్రంథములు (గణి) గణిత ప్రవచనము నందలి సత్యమును నిరూపణచేయ నుద్దేశించినది. నిరూపణ చేయ వీలైన ప్రాథమిక స్వీకృతముకాని గణిత ప్రవచనము (Theorem) (గణి., భౌతి. రసా) నిరూపించబడవలసిన తత్త్వము లేదా ఉపపత్తులచే ఋజువుచేయబడవలసిన ప్రమేయము,

**సిద్ధాంతి** నం. విశే. 1. జ్యోతిషము తెలిసిన వాడు. 2 తత్త్వ శాస్త్రము తెలిసిన వాడు

**సిద్ధాంతీకరించు** నం. క్రి. సిద్ధాంతముచేయు

**సిద్ధాయము** నం. వి. సిద్ధాయము, కప్పము.

**సిద్ధార్థము** నం. వి. తెల్లావాలు.

**సిద్ధార్థుఁడు** నం. వి. శాక్య బుద్ధుడు.

**సిద్ధార్థి** నం. వి. అరువది సంవత్సరములలో నొకటి.

**సిద్ధాహారము** నం. వి. (వ్యవ.) నేలయందున్న నీటిలో కరిగి వెంటనే సస్యములకుపయోగపడు ఆహారము. (Readily available plant food)

**సిద్ధి** నం. వి. 1. ఈడేరుట 2. అణిమాద్యష్టసిద్ధులు.

**సిద్ధుఁడు** నం. వి. అణిమాది సిద్ధులు పొందిన వాడు,

**సిధ్మము** నం. వి. సిబ్బెము, బొల్లి.

**సినీవాలి** నం. వి. 1. చంద్రకళ కానవచ్చెడి అమావాస్య. 2. పార్వతి.

**సిప్సెలా** ఇం. వి. (వృక్ష) శుష్క అవిదారణఫలము (దీనిలో ఒక గది మాత్రమే యుండును. దానిలో ఒక గింజ మాత్రమే యుండును, ఇది అధఃస్థిత, ద్విఫలవళాండాశయము నుండి ఏర్పడినది) ఉదా. సూర్యముఖి

**సిబ్బి** వి ఇత్తడి మూకుడు.

**సిబ్బితి** వి సిగ్గు

**సబ్బితకత్తె** విశే. సిగ్గుగలది.

**సిబ్బెము** వై వి. సిధ్మము. దేహమున గలుగు తెల్లపొడ, శోఫ రూ. సిబ్బియము

**సిమెంటు** ఇం వి. (Cement), గోడలు, ఇండ్లు మొ. వి కట్టుటకు, వాటికి పై పూతగా పూయుటకు తయారుచేయబడిన సున్నపు పొడివంటి పదార్థము

**సిర** నం. వి. 1. నాడి. 2 ఈనె (జం) శరీరమునుండి గుండెకు రక్తము తీసికొనిపోవు రక్తనాళము. (Vein).

**సిరంగుఁడు** వై. వి. శ్రీరంగనాథుడు. నం. శ్రీరంగః.

**సిరంగము** వై. వి. శ్రీరంగము.

**సిరముము** వై. వి. శిర. తల. నం, శిరః

**సిరా** హిం. వి. వ్రాయుటకు ఉపయోగించు. చాయ. సం. శిరః.

**సిరాకోటరము** సం. వి. (జం) (కప్పలో) గుండె కాయ యొక్క పృష్ఠభాగమును కప్పియుంచు త్రికోణాకారముగల కుహరము. శరీరముమండి తెచ్చినచెడురక్తము దీనిలోనికి చేరును (Sinus venosus)

**సిరాపరిఖ** సం. వి. (జం.) ఎముకలోగాని మరి యితర కణజాలములలోగానిఏర్పడిన కుహరము. (Sinus).

**సిరి** వై. వి 1. శ్రీ, లక్ష్మి. 2 సంపద. 3. శోభ. సం. శ్రీః.

**సిరిగంధము** వై. వి. శ్రీచందనము. సం. శ్రీగంధః

**సిరిగట్టు** వై. వి. శ్రీశైలము.

**సిరిచూలి** వి. మదనుడు.

**సిరిమంతుఁడు** వై. విశే. శ్రీమంతుడు,సం. శ్రీమాన్.

**సిలబస్** ఇం. వి. (Syllabus) పాఠ్యప్రణాళికా సంగ్రహము.

**సిలుగు** వి. చిక్కు.

**సిలువ** వి. క్రీస్తును బంధించి వధించిన కొయ్య (Cross).

**సిలువాకారము** మి. వి. (వృక్ష.) X వలె నున్న ఆకర్షణ పత్రపలయము. (Cruciform).

**సివఁగి** వి. చివగి, సివ్వంగి, సింహకః.

**సివము** వి. సిగము. దేవతావేశము.

**సి' విటమిన్** ఇం. వి. (గృహ.) (Vitamin 'C' 1. పళ్ళచిగుళ్ళ బలహీనతను తొలగించు విటమిన్. 2. శరీరకణజాలముల బంధనమునకు తోడ్పడు విటమిన్

**సివిల్** ఇం. వి. (Civil) వ్యావహారికము దివానీ.

**సివిల్ కోర్టు** ఇం వి (శాస) (Civil court) సివిల్ దావాలను పరిష్కరించు న్యాయస్థానము. ఆస్తి సాంఘిక వ్యవహారములు పరిష్కరించు న్యాయస్థానము.

**సివిల్ ప్రొసీజర్ కోడ్** ఇం. వి. (శాస) (Civil procedure code), సివిల్ వ్యవహారస్మృతి, ప్రజలు ధర్మమునుగురించి, అధికార స్వత్వములను గురించి కలుగు వివాదములను పరిష్కరించు విధానములను చూపుశాసనము, వ్యావహారికస్మృతి సంహిత.

**సివిల్ లిస్ట్** ఇం. వి. (శాస.) (Civil list). ప్రభుత్వోన్నతాధికారుల జాబితా.

**సివిల్ సర్వీస్** ఇం. వి. (శాస.) (Civil service), వ్యావహారికోద్యోగము, పరిపాలనకు చెందిన ఉద్యోగము.

**సివిల్ హక్కులు** మి. వి. (శాస.) వ్యవహారమునకు సంబంధించిన హక్కులు.

**సిసువు** వై. వి. శిశువు, పసిబిడ్డ. సం. శిశుః

**సిస్పృక్ష** సం వి. స్పృశింపనిచ్ఛ.

**సిస్తు** వై. వి. 1. అందము, 2. పన్ను. సం. శస్తమ్, శిష్టమ్.

**సిళ్లు** వి. బిరిగోల, సిడులు.

# సీ

**సీ[1]** అవ్య. జుగుప్సార్థమందు చెప్పుమాట.

**సీ[2]** వై. వి. శ్రీ.

**సీకాయ** వి. జిడ్డును పోగొట్టెడి యొకానొకకాయ.

**సీకారి** వై. వి. పాట పాడువాడు, గాయకుడు. సం. శ్రీకారి.

**సీత** సం. వి. 1. శ్రీరాముని భార్య. 2. నాగటి చాలు. 3. ఆకాశ గంగ.

సీతాకోకచిలుక వి. పెద్దరెక్కలుగల యొక పురుగు. (జం) కీటకములలో నిది



సీతాకోకచిలుక

యొక జాతికి చెందినది. (ఇది రంగురంగుల రెక్కలతో పగటిపూట తిరుగుచుండును)

సీతాఫలము నం. వి ఒకానొక పండు

సీతు వై. వి. 1 చలి. 2. చలికాలము. దూ సీతువు నం. శీతమ్.

సీత్కారము నం వి ఓసుగు, బాధచే గలుగు ధ్వని.

సీదరము[1] వి. దా ద్రవ్యము

సీదరము[2] వై. వి. 1. పాము. 2. పాము కుబుసము, నం శ్రీధరః.

సీద్రము వై వి. చూ. సీదరము.

సీమ[1] వి. 1. దేశము 2. ప్రదేశము. 3. రాజ్యము. 4 పరదేశము.

సీమ[2] నం. వి 1 ఎల్ల 2. పెదతల.

సీమంతము నం. వి. 1 పాపట. 2. గర్భిణి స్త్రీలకు చేయు ఒక శుభకర్మము.

సీమంతిని నం. వి స్త్రీ

సీమాటి వై. వి. భాగ్యశాలినియగు ఆడుది. నం. శ్రీమతీ.

సీరము నం. వి నాగలి.

సీరపాణి నం. వి. హలాయుధుడు, బలరాముడు.

సీరానెవాద ఇం.వి. (భూగ) మంచుకొండలు. ఉత్తర అమెరికాలోని మధ్య పర్వత శ్రేణులు,

సీరారబ్బర్ ఇం.వి.(వ్యావ) (Caera rubber) చెముడు కుటుంబము (Euphorbiaceae) నకు చెందిన Manihot glaziovi అను మొక్కపాలనుండి ఈ రబ్బరు తయారు చేయుదురు.

సీరి నం. వి. సీరముకలవాడు. బలరాముడు,

సీల వి. చీల.

సీలమండ వి, చీలమండ.

సీలియా ఇం వి (గృహ) (Cilia) 1. సన్నని రోమములు 2. కనురెప్పలయంచలి రోమములు.

సీవనము నం వి కుట్టుట.

సీవని నం. వి సూది.

సీవిరి వి 1 వింజామరము. 2. ఆలవట్టము.

సీసకము వి 1 కిరీటము. 2- ఒకవిధమైన వల్లబంధము

సీసపత్రము నం వి (రసా) పల్చటి రేకులుగా కొట్టబడ్డ సీసము (Lead foil).

సీసము[1] నం వి (రసా) కత్తితో కోయబడునంతటి మెత్తగానుండు ధాతువు. దీని రంగు నీలి ధూసరముల మధ్యనుండును. ఇది ఆవర్తక్రమపట్టిక నాల్గవ వర్గములో నుండును (Lead).

సీసము[2] వి 1. ఒకరకపు పద్యము. 2. ఒకానొక మల్లబంధము.

సీసవేశ్మవిధానము నం. వి. (రసా) సీసపు గోడలుగల పెద్దతొట్టెలలో సల్ఫ్యూరికామ్లమును తయారుచేయు విధానము (Lead chamber process)

సీససిందూరము నం. వి. (రసా.) చక్కని ఎఱ్ఱరంగుగల చూర్ణము ఇది ద్విసీసత్రి ఆమ్లజనిదము ($Pb_2 O_3$) (Red lead).

సీసపాషాణితము నం వి. (వ్యావ.) ఇది కీటకములను నాశనముచేయుటకుఉపయోగించు ఒక విషపదార్థము. దీనిలో సీసము కాలము, ఆమ్లజనియుండును (Lead arsenate).

సీస్మోగ్రాఫ్ ఇం. వి. (భూగో.) (Seismograph). భూకంపములను కొలుచు యంత్రము.

# సు

సు సం అవ్య. మంచి మిక్కిలి అను అర్థముల నిచ్చు ఉపసర్గము ఉదా. సుగంధము

సుంకము వై. వి. 1. శుల్కము అమ్ముడు సరకునకు దొరతనము వారికిచ్చుపన్ను 2. తరుగు 3. ప్రతిబంధము సం. శుల్కమ్

సుంకరి వి సుంకము తీయువాడు రూ సుంకరీడు, సుంకిడు.

సుంకు వి 1. కంకిమీదిపూత 2. గుగ్గిళ్ళపై తవుడు. రూ, సుంకము.

సుంత విశ. ఇంచుక, రూ. ఇసుమంత.

సుందరి సం. వి. చక్కని స్త్రీ.

సుందరుఁడు సం. విశ. చక్కని వాడు.

సుకము వై. వి సౌఖ్యము రూ. సుగము. సం. సుఖమ్.

సుకవాసి వై. విశ కష్టపడకుండువాడు. సం. సుఖవాన్.

సుకరము సం. విశ. సులభము.

సుకలుఁడు సం. విశ, దాతయు భోక్తయు నైనవాడు.

సుకిని వై. వి. సుఖముగల స్త్రీ సం. సుఖినీ

సుకుమారము సం విశ. కోమలము. (జం) ఒబీలియా (Obelia) జలీయ శాఖశిఫ, జలియాశాఖ స్తంభము దాని యొక్క వివిధ భాగములు కలిసినప్రాణి. హైడ్రాయిడ్ చెట్టు.

సుకుమారుఁడు సం. విశ. కోమలమైనవాడు.

సుకుమారి సం విశ. కోమలమైనది.

సుకృతము సం. వి. 1.పుణ్యము. 2 శుభము

సుకృతి సం. విశ. 1. పుణ్యుడు. 2.శుభుడు.

సుక్కురుఁడు వై.వి. శుక్రుడు. సం. శుక్ర.

సుఖము సం. వి. 1. సౌఖ్యము. 2. స్వర్గము.

సుఖరోగము సం. వి. మానవుల మర్మావయవములకు సంబంధించిన వ్యాధి. (venereal disease).

సుఖవాసి సం విశ సుకవాసి.

సుఖి సం విశ సుఖము గలవాడు.

సుగము వై వి సుకము. సం సుఖం.

సుగడి విశ. సరసుడు.

సుగ్గడితము విశ, సుఘటితము. తరమైన నేత.

సుడి వి 1. జలావర్తము, నీటిసుడి 2. రోమావర్తము, వెంట్రుకలసుడి 3 అనిలావర్తము, గాలిసుడి.

సుడిఁబడు క్రి. సుడిపడు, సుడిగొను, చుట్టుకొను.

సుడిగట్టు వి. చక్రవాళ పర్వతము.

సుడిగాలి వి వాత్య (భూగో) మిక్కిలి వేగముతో గుండ్రముగా గిరగిర తిరిగెడు గాలి,

సుడిగుండము వి. జలావర్తము గిరగిర వేగముగా తిరిగెడు నదిలోని నీరు.

సుడిగొట్టు వి గాలి.

సుడిగోరు వి తంతి మీటుటకై వ్రేలికి తగిలించుకొను లోహపు గోరు.

సుడియ వి. తమలపాకుల బరువులో సగము. విశ —తులువ

సుడియు క్రి. చుట్టిచుట్టి వీచు, చుట్టుకొను.

సుడివడు క్రి. 1. చుట్టుకొను. 2.కలతపడు. 3. చలించు.

సుడివాలు వి. చక్రాయుధము.

సుడివోపు క్రి. వ్యర్థమగు.

సుత[1] అవ్య. మొదలుకొని, ప్రభృతి. ఉదా. అదిసుత, నాటిసుత.

సుత[2] సం. వి. కూతురు.

సుతరాం అవ్య. (వ్యావ.) బొత్తిగా. రూ సుతరాము. సుతలాం.

సుతి వై. వి. శ్రుతి, కంఠస్వరాదులకు సహాయమగు తంత్రి మొ. వాని ధ్వని సం శ్రుతిః.
సుతుఁడు సం వి కొడుకు
సుత్తె వి లోహములను సాగగొట్టు సాధనము. రూ. సుత్తియ.
సుత్రాముఁడు సం వి. ఇంద్రుడు.
సుద వి. 1 కొవ 2 తుల.
సుదతి సం. వి స్త్రీ. వ్యు. చక్కని పలువరుస కలది.
సుదర్శనము సం వి విష్ణు చక్రము.
సుదాయము సం వి పెండ్లియందు అల్లునికిచ్చెడు అరణము
సుదూరము సం విణ మిక్కిలిదవ్వు
సుద్ది వై. వి. తెల్లమన్ను సం శుద్ధమ్
సుద్దగించు వై క్రి సరిపరుచు
సుద్దపొడి వి (గృహ.) మరకలు తీయుట మొ. పనులకు ఉపయోగించు శుద్ధమైన పొడి (French chalk)
సుద్దము వై. విణ. శుద్ధము, నిర్దోషము. సం. శుద్ధమ్.
సుద్ది వై. వి 1, శుద్ధి. సం శుద్ధిః 2. వృత్తాంతము, మాట సం సూక్తిః.
సుధ సం. వి. 1 అమృతము. 2. పాలు. 3, సున్నము. 4 ఇటుక.
సుధర్మ సం. వి. దేవసభ.
సుధాంశువు సం. వి. చంద్రుడు, అమృతకిరణుడు.
సుధాకరుడు సం. వి. చంద్రుడు.
సుధి సం వి. విద్వాంసుడు.
సునాయాసము సం విణ. మిక్కిలి సులభము.
సునాసరుఁడు సం. వి. ఇంద్రుడు. రూ శునాశీరుడు. వ్యు. గొప్ప సేనకలవాడు.
సున్న వై. వి. 1. శూన్యము. 2. అనుస్వారము. 3. అభావము.
సున్నగిల్లు వై. క్రి. గుండ్రమగు.
సున్నపుతేట వి (రసా) సున్నమునునీటిలో కంగించి తేరబెట్టినచో లభ్యమగు పై తేట (Lime water).
సున్నపుపాలు వి. (రసా., కొంచెము పాలవలె చిక్కగానుండు సున్నముకలిసిననీరు. (Milk of lime).
సున్నపుబట్టీ వి (రసా.) సున్నపు రాయి కాల్చి సున్నమును తయారు చేయు కొలిమి (Lime kiln)
సున్నపురాయి వి. (రసా) ఇది భూమిలో దొరుకు ఒక ఖనిజము. ఇది రాసాయనికముగ కాల్షియం కార్బొనేట్, దీనినుండి సున్నమును తయారుచేయుదురు. (Lime stone).
సున్నము వై. వి. (రసా) 1. సున్నపురాయి గాలికెదురు పెట్టి కాల్చిన వచ్చు భస్మము Calcium oxide = lime ఇందు ముఖ్యముగా నుండు రాసాయనిక ద్రవ్యము. ఇది క్షారగుణములు గల చూర్ణము. 2 చూర్ణము, తెల్లని ఆకారము గల మన్ను సం. చూర్ణమ్.
సున్ని వై. వి నలుగునకై చేసిన పిండి నలుగు పిండి. సం. చూర్ణమ్.
సున్నితపు త్రాసు వి. (భౌతి.) ప్రయోగశాలలో ఉపయోగించెడి సున్నితమైన త్రాసు. (Physical balance).
సున్నితము వై. విణ. 1. మిక్కిలి కోమలమైనది. 2. కచ్చితము, సం. సునిహితము.
సుపర్ణుఁడు సం. వి. గరుత్మంతుడు. వ్యు. మంచి రెక్కలు గలవాడు.
సుపర్వుఁడు సం, వి. వేలుపు.
సుపాణి వై. వి. 1. ముత్తెమందలి శుభ్రమైన నీరు. 2. శుభ్రమైన నీరు. 3. ముత్తెము, రూ. సుప్పాణి. సం. సుపానీయమ్.
సుప్తి సం. వి. నిద్ర, 2. తిమ్మిరి.

సుప్రతీకము నం. వి. ఈశాన్యదిక్కు సందలి ఏనుగు.

సుప్రీమ్ కోర్టు ఇం. (రాన.) Supreme court). ఉన్నత న్యాయస్థానము, కేంద్ర ప్రభుత్వమునకును, రాష్ట్ర ప్రభుత్వమునకును మధ్యవచ్చు తగాదాలను రాష్ట్ర ఉన్నత న్యాయ స్థానముల తీర్పుల పై వచ్చు 'అప్పీళ్లను' అంతః రాష్ట్రాధికారములను గూర్చిన తగాదాలను,సంవిధానాధికారములను గూర్చిన తగవులను తీర్పు చేయు న్యాయస్థానము. అఖిల భారత న్యాయస్థానము.

సుబ్బు క్రి. బయలుసడు.

సుబ్రహ్మణ్యుఁడు నం. వి. కుమారస్వామి.

సుభగ నం. విశే. 1. మనోహరురాలు 2. భాగ్యవతి.

సుభిక్షము నం. విశే. 1. సులభభిక్షముగలది. 2. కరువు లేనిది.

సుమంగళి నం వి. ముత్తైదువ, సువాసిని.

సుమనస్సు నం వి. 1 పువ్వు. 2. వేలుపు. 3. విద్వాంసుడు.

సుమము నం. వి పువ్వు, కుసుమము.

సుమారు హిం. వి. కొంచె మెచ్చుతగ్గు. ఇంచుమించు. (గణి.) సరియైన విలువకు దగ్గరగా నుండు విలువ. (Approximate)

సుమాళము వి. సంతోషాదులచే గలుగు పారవశ్యము.

సుమాళించు క్రి. సుమాళమునొందు.

సుముఖుఁడు నం. వి విద్వాంసుడు. విశే. ప్రసన్నుడు.

సుమేరుజ్యోతి నం. వి. (భూగో.) ఉత్తర ధ్రువమువద్ద కనిపించు ఎఱ్ఱని ఉషఃకిరణములు..

సుమేరువు నం. వి. మేరుపర్వతము. వ్యు. శిఖరములచే నక్షత్రాదులను వహించునది.

సుర[1] వి. గాలిసుడి. 2. గాలి.

సుర[2] నం. వి. కల్లు విశే. పెద్ద.

సురంగము నం వి. సొరంగము.

సురఁటి వి వట్రువ విసనకఱ్ఱ

సురకాని వి కానిలో నాల్గవభాగము.

సురక్షితారణ్యములు నం. వి ఈ అరణ్యములపై ప్రభుత్వమునకేకాక ప్రజలకుకూడ హక్కు లుండును

సురగలి నం. వి కామధేనువు.

సురగాలి వి సుడిగాలి

సురజ్యేష్ఠుడు నం వి. బ్రహ్మ.

సురతము నం వి స్త్రీపురుషుల కలయిక, రతి.

సురతాణి వై వి. 1. ఇంద్రుడు. 2 ఇంద్రాణి. నం. సురత్రాణః.

సురదీర్ఘిక నం. వి. గంగ.

సురద్విషుఁడు నం. వి. అసురుడు. వ్యు. దేవతలకు శత్రువు.

సురనిమ్నగ నం. వి. దేవగంగ.

సురపతి నం వి. ఇంద్రుడు.

సురపున్నాగము నం. వి. ఒకజాతిపొన్న చెట్టు. సురపొన్న.

సురభి నం. వి. 1. కామధేనువు. 2 ఆవు. 3. వాసనగలువ. 4. సంపెంగ. విశే. 1 మంచివాసనగలది. 2. మనోజ్ఞమైనది.

సురభీకరించు నం క్రి. మంచివాసన కలదిగాచేయు.

సురభిళము నం. విశే మంచివాసనగలది.

సురమాయి విశే మిక్కిలి నల్లనిది.

సురమాలి విశే. గాలి నించినది (తలగడ).

సురలు నం. వి. వేలుపులు

సురలోకము నం. వి. స్వర్గము.

సురాచార్యుఁడు నం. వి. బృహస్పతి.

సురాలయము నం వి. 1. మేరుగిరి 2 స్వర్గము.

సురాళము వి. 1. భూతావేశముచే తల త్రిప్పుట. 2. కోపావేశము.

సురాళించు క్రి. దిగదుడుచు.

సురిగ వి. చిన్నకొమ్ము.
సురియ వై వి చురియ, చురకత్తి. సం. ఛురీ, ఛురికా.
సురియాళు వి మాలవాడు. రూ సులేయాళు
సురుఁగు క్రి. 1. అదృశ్యమగు. 2. పారు. 3 జాడగాబోవు. 4 చలించు
సురుడు వి. దివిటీకి మారుగా కాల్చి పట్టుకొనెడు వెలుతురు కట్టెలకట్ట.
సురోదము. నం వి. కల్లు సముద్రము
సులభము నం విశ సుఖముగా లభించునది.
సులువు వై. విశ. చులకనైనది. రూ సుళువు నం సులభః.
సులోచనము నం. వి కటియద్దము.
సువర్చలవణము సం. వి సోడియంనైట్రేట్ (ఇది చిలీదేశములో గనులలో దొరుకును) (Salt-petre)
సువర్ణము నం వి 1. బంగారు. 2. మాడ. విశ. మంచివర్ణముకలది.
సువారము వై. వి వంట నం. సూపకార్యమ్
సువాసిని నం. వి. 1. ముత్తయిదువ. 2. పేరంటాలు
సుషమ నం వి. మిక్కిలిశోభ.
సుషమము నం విశ. 1. మనోజ్ఞమైనది. 2 సమానమైనది.
సుషి నం వి బెజ్జము.
సుషిరము నం. వి. 1. బెజ్జము 2. బెజ్జములుగల పిల్లనగ్రోవి మొదలగు వాద్యము.
సుషుప్తి నం వి ఒడలెరుగని నిద్ర.
సుషుమ్న నం. వి. ఒకనాడి.
సుస్తి వై. వి. 1 సోమరితనము, 2. జబ్బు. నం అస్వాస్థ్యం.
సుహృదుఁడు నం. వి మిత్రుడు.
సుళువు వై విశ. సులువు,
సుళ్ళమారి విశ. 1. సుడులుకలవాడు, 2. చుట్లు బెట్టువాడు.

# సూ

సూకరము నం.వి. పంది. రూ. శూకరము.
సూకాయము నం వి. (వృక్ష.) ప్రయోపిక ముల తరగతికి చెందిన ఉద్భిజ్జములలో నేలపై బల్లపరుపుగా, ఆకుపచ్చనిరంగుతో నుండి, అడుగున మూలాంగములుగల నిర్మాణము. సూత్రోద్భిదములకు కూడ నివి వర్తించును (Thallus). సూకాయకము (Prothallus)
సూక్ష్మక్రిములు నం. వి. (గృహ.) కంటికి కనిపించనిమిక్కిలి చిన్నక్రిములు సూక్ష్మదర్శనిద్వారా చూడగల సూక్ష్మక్రిములు (Bacteria micro-organisms).
సూక్ష్మఖండములు నం. వి. (జం.) భ్రూణములో మొదటి విభజనల ఫలితముగా నేర్పడుచిన్న జీవకణములు(Micromeres స్థూలఖండములు = పెద్ద జీవకణములు (Megameres).
సూక్ష్మగ్రాహకము నం. విశ (భౌతి ,రసా.) బయటి ప్రభావములకు చురుకుగా, నిశితముగా ప్రతీకరించునది. (Sensitive).
సూక్ష్మగ్రాహ్య(హి)త నం. వి. (భౌతి.)ఎంత చిన్న విషయములనైన తెలిసికొనుట (Sensibility).
సూక్ష్మజీవులు నం వి. కంటికి కనిపించనిజీవరాసులు(ఇవికంటికికనబడవు. భూతద్దముతోనే వీటిని చూడనగును) (Bacteria).
సూక్ష్మతంతువులు నం. వి. (వృక్ష.) బూజులు అనబడు తరగతికి చెందిన శిలీంధ్రముల శరీరమేర్పడు సన్నని సూత్రములు (Hyphae).
సూక్ష్మదండికలు నం. వి. సూక్ష్మజీవులు. జీవాణువులు (Bacteria)

సూక్ష్మదర్శిని నం. వి. (భౌతి.) కంటికగపడని సూక్ష్మము లైన వస్తువులను పెద్దవిగా చూపు సాధనము (Microscope),



సూక్ష్మదర్శిని

సూక్ష్మనాళిక నం. వి. (భౌతి.) చాల సన్నని కాలువ కలిగినగొట్టము (Capillarytube)

సూక్ష్మనిర్మాణము నం. వి. (జీవ.) శరీరము యొక్క వివిధావయవములలోగల జీవ కణ జాలముల చరిత్ర (Histology)

సూక్ష్మము నం. వి. అణువు. విశే. సన్నము.

సూక్ష్మశిర నం. వి. (వృక్ష.) పత్రఫలకములో నుండు ఈనెలలోనుండు అతి సూక్ష్మమైన ఈనె (Veinlet).

సూక్ష్మకేష్ఠి నం. వి. (జం.) కొన్ని ఏకకణ జీవులపునరుత్పాదక క్రియతో సంబంధము గల చిన్న జీవకణస్థానము (Micronucleus).

సూక్ష్మీకరణము నం. వి (గణి.) కఠిన సమావసముదాయములను గణితశాస్త్ర ప్రక్రియలనుపయోగించి సూక్ష్మీకరించు విధానము (Simplification).

సూచకము నం. వి. 1. సూది. 2. నక్క 3. కుక్క. 4. కాకి 5. పిల్లి. (రసా.) ఆమ్ల క్షారములతో రాసాయనికముగా కలిసిన మిశ్రమము యొక్క ఆమ్లధర్మమునుగాని క్షారధర్మమునుగాని సూచించు పదార్థము (Indicator).

సూచకుఁడు నం. విశే. 1. కొండెగాడు 2. బోధచేయువాడు.

సూచన నం. వి. 1. జాడ. 2. గ్రుచ్చుట. 3. తెలుపుట. 4. చూపు.

సూచి నం. వి. సూది. రూ. సూచిక, సూచిని, (గణి.) ఘాతమును సూచించు సంఖ్య. (Index). (భూగో.) సూచిక. (భౌతి.) 1. ఏదైన కొలుచు పరికరముల కొలత గురు లనుచూపు సూదివంటి సాధనము. 2. దిక్కును సూచించుసూది (Needle).

సూచించు నం. క్రి. జాడగా తెలియజేయు.

సూచిక నం. వి. (గణి.) ఒకరాశి ఏఘాతమునకు హెచ్చింపబడినదో సూచించు (తెలుపుచేయు) సంఖ్య (Index). ఉదా. an ఇచ్చట a ఒకరాశి, n సూచిక, a అను రాశి nవఘాతమునకు హెచ్చింపబడినదని సూచించును

సూచీకటాహన్యాయము నం. వి. (న్యా.) ఒక పనివానికి గాబొకటియు, సూది యొకటియు చేయమని చెప్ప అతడు కొంత కాలమునకు సూది యిచ్చి, గాబిమ్మని తొందర చేసినప్పుడు రెంట నొకటి యిచ్చియుండ రెండవ దానికింత తొందరేల యనినరీతి.

సూచ్యంగము నం. వి. (జం.) సంచివంటి జీవకణము నుండి పొడుచుకొని వచ్చి గ్రుచ్చుకొను సూత్రము (Nematocyst)

సూచ్యాకారము నం. వి (వృక్ష.) ముల్లు వలె సన్నముగా పొడవుగా సూదిగా నుండునది, (Acicular)

సూటి వి. 1 గురి. 2 విధము.

సూటికాడు విశే. 1, గురికాడు. 2. అందగాడు.

సూటిపడు క్రి సరిరాకు

సూడిగములు వి గాజులు, చేతికడియములు.

సూడిద వి కానుక.

సూడు వి 1. పగ 2, పగవాడు.

సూడుకాఁడు వి శత్రువు

సూతకము నం. వి. 1, పురుడు, జాతాశౌచము, 2. మైల, మృతాశౌచము.

సూతి నం. వి. 1.పుట్టు, 2. ప్రసవకము:

సూతిక నం. వి. బాలెంతరాలు.

సూతుఁడు సం వి. (చరి.) ఆర్యుల కాలము నాటి రాజుయొక్క రథసారథి రాజు యుద్ధయాత్రలకు వెళ్ళునప్పుడు రథము తోలుటయే కాక, ఉత్సాహము కలిగించు వీరోచితగాథలు ధర్మములు బోధించుట సూతుని కర్తవ్యముఖ్య కర్తవ్యము.

సూత్రక్రిములు సం వి (వ్యావ) కంటికగపడని అతి సూక్ష్మమైన పలిక పామువంటి క్రిములు. (ఇవి నేలలో ఉండి మొక్కల కాండములను తొలిచి పాడుచేయును ఈ జాతి జంతువుల శరీరము సన్నగా, పొడవుగా, గుండ్రముగా నుండును వీని శరీరము ఖండములుగా విభజింపబడి యుండదు.) (Nematodes)

సూత్రధారుఁడు సం. వి 1 నాటకము లాడించు ముఖ్యనటుడు 2.నడుపువాడు 3. వడ్రంగి

సూత్రపడు మి క్రి. జతపడు.

సూత్రము సం వి 1 నూలిపోగు. 2. జన్నిదము 3 ఏర్పాటు. 4 శాస్త్ర సూచన గ్రంథము. (గణి.) కొన్ని పదములతో నేర్పడు సమీకరణము. (Formula). 6 కొన్ని దర్మముల నుగ్గడించు ప్రవచనము.

సూత్రములు సం. వి (గృహ) నియమములు (Principles)

సూత్రించు సం. క్రి. సూత్రముచేయు.

సూదంటురాయి వి అయస్కాంతము.

సూదనము సం. వి. చంపుట విణ. చంపునది.

సూదము సం వి వండినపప్పు

సూది వై. వి సూచి,గుడ్డలుకుట్టు సాధనము. సం. సూచీ

సూదుఁడు సం. విణ. వంటవాడు.

సూన సం. వి. 1. కూతురు. రూ. ప్రసూన. 2 కొండనాలుక. 3 వధస్థానము.

సూనగాఁడు మి. విణ. చంపువాడు.

సూనరి మి. విణ. 1. చంపువాడు. 2. పూలమ్మువాడు.

సూనము సం వి. ప్రసవము పూవు. విణ. శూన్యము

సూనుఁడు సం. వి. 1. కొడుకు, 2.తమ్ముడు 3 సూర్యుడు రూ ప్రసూనుడు.

సూనువు సం. వి. 1. కొడుకు 2. కూతురు

సూనృతము సం.వి. శుభము. విణ ప్రియము సత్యము నైనది.

సూపము సం. వి. వండినపప్పు.

సూపకారుఁడు సం. విణ. వంటవాడు. రూ. సూపుడు

సూఫీమతము మి వి (చరి) ఇస్లామ్ మతములోని సూఫీ వేదాంతవాదము. ఆత్మ పవిత్రతతో మోక్షము సాధింపవచ్చునన్నియు బాహ్యోపారాధనతో నిమిత్తము లేదను వాదము.

సూబా హిం వి (చరి) మొగలు సామ్రాజ్యములో అంతర్భాగమగు పరిపాలనా ప్రదేశము (సూబేదారు=సూబాను పరిపాలించువాడు=సిపహాలారు).

సూబెరిన్ ఇం వి (వృక్ష) (Suberin) రెండు రెండు కణముల భిత్తికలలోగల ఒకవిధమగు క్రొవ్వుకపదార్థము(ఇది ఉష్ణతావాహకముకాదు. నీటినిచొరనీయదు).

సూయాణము వై. వి. శత్రుభయంకరమైన దండయాత్ర (సూచీయానభవమని కొందరు) సం సూయానమ్.

సూరణము సం వి కందగడ్డ.

సూరి సం. వి కందగడ్డ.

సూరి సం వి 1. సూర్యుడు 2 పండితుడు.

సూరెలు వి. బహు. పార్శ్వము.

సూరెపాసు వి అలపట్టము. గుడ్డతోకట్టిన వీవన.

సూరెగిల్లు క్రి ప్రక్కకు కదులు.

సూరేకారము వి. పొటాసియ నత్రితము పెట్లుప్పు. (Salt peter)(దీనిలో నత్రజని, పొటాసియం, ఆమ్లజని కలిసియుండును. ఇది మొక్కలకు ఎరువుగా ఉపయోగపడును)

సూర్యుడు నం. వి. వెలుగు రేక.

సూర్యకాంతము నం. వి. సూర్యరశ్మిసోకిన ద్రవించు ఒకరాయి.

సూర్యగ్రహణము నం. వి. రాహుకేతువులలో నేదైన ఒక బిందువు భూమికి వెనుకగా వచ్చినచో సూర్యకిరణములు భూమిపై సోకక సూర్యగ్రహణము కలుగును.

సూర్యతనయ నం. వి. యమున.

సూర్యతనయుడు నం వి. 1 శని 2 కర్ణుడు.

సూర్యదృశ్యగతి నం.వి. (భూగో)సూర్యుడు పోవుచున్నట్లు కనబడు మార్గము.

సూర్యపటము నం వి ఒకరకము మేలు మొకములు వస్త్రము.

సూర్యానువర్తిని నం వి ప్రొద్దు తిరుగుడు చెట్టు.

సూల వై. వి శూలరోగము. నం శూలా.

సూనకము వి. స్త్రీలు తలను ధరించెడు తిరుగుడు బిళ్ళ.

సూనరి విణ సున్నము పూయువాడు. లేపకుడు.

## సృ

సృక్వము నం. వి. పెదవిమూల, కొవి రూ. సృక్వి.

సృగము నం. వి. 1 విసిరెడుబాణము అయుధము. 2. సాగు.

సృగాలము నం వి నక్క.రూ. శృగాలము.

సృజన నం. వి. సృష్టి.

సృణి నం. వి. అంకుశము.

సృణిక నం. వి. సొంగ. రూ. సృణీక.

సృతి నం. వి 1. త్రోవ. 2. రేఖ. (గణి.) ఒక స్థిర బిందువును ఒక చల బిందువుతో కలుపు బుజురేఖ (Radius vector)

సృష్టి నం. వి. 1 సృజించుట. 2. ప్రకృతి. 3. స్వభావము.

సెంటిగ్రేడ్ ఇం. వి. (భౌతి.)(Centigrade ) 1. నీరుగడ్డకట్టు తాపక్రమము శూన్యాంకముగను, నీరు మసలు తాపక్రమము శతాంకముగనుగల తాపోగ్రతనుకొలుచు ఒకపద్ధతి,

## సె

సెంటీమీటర్ ఇం వి (Centimetre) ఒక మీటరు కొలమానములోనూరవభాగము.

సెంటు[1] ఇం. వి. (Cent) 1. ఎకరములో నూరవభాగము. 2. డాలరు నాణెములో నూరవభాగము.

సెంటు[2] ఇం. వి (Scent) 1. వాసన. 2. సుగంధ ద్రవ్యము.

సెంట్ జాన్ అంబ్యులెన్స్ శిక్షణ ఇం. వి. (వ్యావ.) రెడ్ క్రాస్ దళ శిక్షణ.

సెంట్రల్ హీటింగ్ ఇం. వి. (గృహ.)(Central heating). గదులను వెచ్చచేయుట, చలికాలములో నివసించు గదులలోని ఉష్ణత తగ్గకుండుటకై గొట్టములద్వారా వేడి ఆవిరి లేదా వేడినీరు పారు నట్లమర్చుట

సెక వై. వి. శిఖ, జ్వాల, వేడిమి. రూ సెగ, సెవ. నం. శిఖా.

5. మునికోల యందలి ఇనుపముల్లు. 6. బాణము. 7. వ్రణము నుండి చీము వ్యాపించు రంధ్రము. సం. 1. శు.రి. 2. శల్యమ్.

సెలకట్టె వై. వి. బాణము.

సెలగ వి. రెమ్మ.

సెలగు క్రి. ఖండించు. రూ. చెలగు, సెలవు.

సెలగొమ్మ వి. ఉపశాఖ.

సెలగోల వి. 1. పసుల మేపువాని కట్టె. 2. కల్లు గీచువాని కత్తి.

సెలపంది వి. ముండ్లపంది

సెలపుండు వి. నారి కురుపు.

సెలయు క్రి. విజృంభించు. రూ. చెలియు.

సెలయూట వి. కొండయూట.

సెలయేఱు వి నిర్ఝరము కొండయేరు.

సెలవాఱు క్రి. సెలవేయు.

సెలవి వై. వి. పెదవి మూల, సృక్వి.

సెలవిచ్చు క్రి. ఆజ్ఞాపించు.

సెలవిల్లు వి సెలను బద్దలతో చేసిన విల్లు. రూ. సెలను విల్లు.

సెలవు క్రి. సెలగు. వి. 1. ఆజ్ఞ. 2. ఉపయోగము.

సెలను వి ఒకానొక చెట్టు.

సెలెక్టు కమిటీ ఇం. (వ్యావ.) (Select Committee) ప్రత్యేకోపసంఘము, శాసనసభలు ఒక చట్టమును గురించి ప్రత్యేకముగ పరిశీలించుటకు ఏర్పరచినసంఘము.

సెలెనియమ్ ఇం. వి. (రసా.) (Selenium) గంధకము వర్గమునకుచెందినఉపధాతువు

సెల్యులోజ్ ఇం. వి (వృక్ష.) (Cellulose) అన్ని వృక్షములలో జీవకణముల గోడలలో నుండు ద్రవ్యము, ఇది కర్బనము. ఉదజని ఆమ్లజని ఘటకములుగా గల రాసాయనిక సంయోగము.

సెల్యులోయిడ్ ఇం వి (రసా) (Celluloid). ప్రత్తిని నత్రికామ్లములో ముంచి కడిగి ఆ వచ్చిన ద్రవ్యమును కర్పూరముతో కలిపి కరగించిన లభ్యమగు ద్రవ్యము.

సెల్లా వై. వి సన్నని వస్త్రము-(రవసెల్లా). సం చే. మ్

సెల్లుఁడు వై. వి శల్యుడు. (నకుల సహదేవుల మేనమామ) సం. శల్యః.

సెల్వ్యాలు ఇం వి (భూగో) భూమధ్యరేఖ ప్రాంతపుఅరణ్యములు (Sylvan-silvan)

సెస్సు ఇం.వి. (శాస)(Cess) చిల్లరపన్నులు.

సెస్‌పూల్ ఇం. వి (గృహ.) (Cess pool) మురికినీటి గుంట, (దీనిని అప్పుడప్పుడు శుభ్రము చేయకున్న, చుట్టుపట్ల భూమిలోపలి నీటి వాగులు సూక్ష్మక్రిములతో నిండి అపాయములను కలుగజేయును.)

## సే

సేంద్రియ పదార్థము సం. వి. (జీవ.) మొక్కలకుగాని, జంతువులకుగాని సంబంధించినశరీరపదార్థము(Organic matter) (వ్యవ.) ప్రాణుల శరీరమునకు సంబంధించిన పదార్థము. నేలలో నున్న సేంద్రియ పదార్థము, చాల వరకు చెట్టుచేమల యొక్క రాలిన ఆకులు. చేర్చబడు ఎరువులు, చనిపోయిన జంతువుల శరీర భాగములు మొ. వానిచే నేర్పడినది.

సేంద్రియపు ఎరువులు మి. వి. (వ్యావ.) సేంద్రియ పదార్థము హెచ్చుగా నున్న యెరువులు (Organic manures).

సేంద్రియ మండలములు సం. వి. (వృక్ష.) చయాపచయ క్రియలకు ఉత్తేజమునిచ్చు నత్రజనిసంబంధమగు ప్రత్యేక రసాయన పదార్థములు (Enzymes) (ఇవి జీవరసముచే నుత్పత్తిచేయబడును ఇవి నీటిలో కరగును)

సేకము నం వి. తడుపుట, చల్లుట.

సేకరణ వై. వి. (గణి) విషయము లను పరీక్షకొరకు ప్రోగుచేయుట (Collection of Data)

సేకరము వై.వి సంగ్రహము సం. స్వీకారః

సేకరించు క్రి తెప్పిరిల్లు. వై. క్రి. సంగ్రహించు

సేగి వి. నష్టి. కీడు.

సేచనము నం వి. చల్లుట తడుపుట

సేతువు నం. వి. నీటికట్టు.

సేద వై.వి. శ్రమము బడలిక, నం. స్వేదః.

సేద్యము వై. వి. కృషి, వ్యవసాయము. నం. సేత్యమ్.

సేద్యకాఁడు వి. కృషీవలుడు

సేప నం. వి. దండు. విశే. అధికము, చాల.

సేసము వి. చిన్నయులి. చీరణము.

సేనాని నం. వి. కుమారస్వామి, సేనాధిపతి.

సేనాముఖము నం. వి. 1. 3 రథములు, 3 ఏనుగులు 9 గుఱ్ఱములు, 15 కాలిబంట్లుగల సేన. 2. సేనకు ముందుభాగము.

సేపు వి కాలము.

సేమంతిక నం వి. చేమంతి.

సేమము వై. వి. క్షేమము, శుభము. నం క్షేమమ్.

సేరు వి. ఒక కొలత.

సేల వై. వి. చేల, వస్త్రము. నం. చేలమ్.

సేవ నం. వి. శుశ్రూష, కొలువు.

సేవకుఁడు నం. వి. కొలువుకాఁడు,

సేవనము నం వి. 1. కొలువు 2. కుట్టు.

సేవని నం వి. (జీవ). రెండు భాగములు కలియుచోట ఏర్పడినరేఖ (Suture).

సేవనీసంయోగము నం వి. (వృక్ష.) అండాశయములో నొకగదిమాత్రమేయుండును పత్రదళముయొక్క రెండు అంచులు కలిసిన సేవనిమీదజరాయువుఏర్పడును (Marginal placentation) (అధర సేవనిపై on the ventral suture).

సేవింగ్సు డిపాజిట్లు ఇం. వి. (Savings deposits) ఇట్టి నిక్షేపములపై కొలదివడ్డీ వచ్చును, కానిఈనిక్షేపములనుండిసొమ్ము తీయుటకు ఖాతాదారుడు కొన్ని నిబంధనల ననుసరించవలసి యుండును.

సేవింగ్సుబ్యాంకు ఇం.వి. (Savings bank) పొదుపుబ్యాంకు చిన్నచిన్న మొత్తములు దాచుకొనుటకు ఏర్పరిచిన బ్యాంకు, (మన దేశములో ఇట్టి బ్యాంకులు పోస్టాఫీసులలో పనిచేయుచున్నవి. ఇట్టి బ్యాంకు నుండి ఖాతాదారుడు కొన్ని నియమములకు కట్టుబడి తన పైకము తాను ఉపసంహరించుకొనగలడు.

సేవించు నం, క్రి. కొలుచు

సేవ్యప్రణాళిక నం. వి (వ్యవ.) తన కనుతమును ఆ భూస్వభావమును తనకున్న వస్తు సామగ్రినిబట్టి ఏఏటేట తాను అచట వేయవలసిన పైరు. దానికి చేయవలసిన పనులు ఖర్చు మొదలగు వానితో ముందుగా తయారుచేయవలసిన అంచనా ప్లాను (Cropping scheme).

సేవ్యము నం. విశే. సేవింపదగినది.

సేవ్య విధానములు నం. వి. (వ్యవ.) వివిధ వ్యవసాయపద్ధతులు (Systems of cultivation), మెట్ట సేద్యము, దంపసేద్యము. తోట సేద్యము మొదలగునవి

సేస వై. వి. 1. అక్షత. 2. సేసప్రాలు. 3. పాపట. నం. శీర్షమ్.

సేసప్రాఁలు వి. తలఁబ్రాలు.

సేసకొప్పు వి. కొండెసిగ.

సైలేజి ఇం. (వ్యవ.) (Silage). పశువుల మేతకొఱకు పెంచుజొన్న, మొక్కజొన్న గంటె మొదలగు పైరులను వెన్నులలో గింజలు ముదరక మునుపే మొక్కలను కోసి, పాతరవేసి, నిలువచేసిన మేత. గ్రామ్యము.

# సొ

సొంటి వై. వి. శుంఠి, ఎండిన అల్లము. సం శుంఠీ.

సొంతు వై. వి తప్పు. దోషము సం. శుంఠలం.

సొంతకమతము వి (వ్యవ.) సొంతముగా సాగుచేసికొనుచున్న వ్యవసాయదారుని భూవిస్తీర్ణము (Owner's holding).

సొంతము వై విణ. స్వతంత్రము, స్వకీయము. సం. స్వతంత్రమ్.

సొంపు న. 1. సమృద్ధి. 2, సంతోషము. 3. ప్రసన్నత 4 సుఖము 5. సౌందర్యము

సొంపిల్లు క్రి సొంపగు. రూ సొంపిలు.

సొగటాలు వి, పగడసాలాట, నెత్తవలశ.

సొగటు వి. వాడిపోపుట.

సొగవు వై వి చొక్కు, పారవశ్యము, సం. సుఖమ్,

సొగయు వై. క్రి. 1 చొక్కు. పరవశత్వ మందు 2. మూర్ఛిల్లు

సొగసు వై. వి. అందము. సం. సుకాశ్.

సొగసుకత్తె విణ అందకత్తె.

సొగసుకాఁడు వి. విటకాడు. విణ అందగాడు

సొగియుంచు వై. క్రి సుఖించు.

సొగియు వై. క్రి. ఇంపగు,

సొచ్ఛెము వై. వి. 1. అధికము. 2. నిర్మలత్వము. సం. వృద్ధి. స్వచ్ఛమ్.

సొటసొట వి. కార్శ్యము

సొటసొటవోవు క్రి. కృశించు.

సొట్ట వి. చొట్ట.

సొట్టమొన వి. (వృక్ష.) ఆకు యొక్క అగ్రము మొనదేరియుండక మధ్యసొట్ట వలె నున్నది. (Retuse apex)

సొత్తు వై. వి 1. సత్వము, హక్కు. 2. సొమ్ము సం స్వత్వమ్, సత్వమ్.

సొద వై. వి. చితి, పీనుగును కాల్చుటకు పేర్చిన కట్టెల ప్రోగు. సం. చితా.

సొన వి. 1 గ్రుడ్లులోని జెన. 2 ఆకుల కాయలమీది నూగు. 3. ఊటకాలువ.

సొన్నము వై. వి. స్వర్ణము, బంగారు సం. స్వర్ణమ్

సొన్నారి వి. కనుసాలి.

సొఒగు వై. వి చక్కదనము. సం సుభగః

సొబగుడు వై. విణ చక్కనివాడు,

సొమ్మ వై. వి. మూర్ఛ సం. శ్రమః.

సొమ్మగొను క్రి. మూర్ఛిల్లు రూ. సొమ్మ. వోవు. సొమ్మసిల్లు.

సొమ్ము వై. వి. 1. స్వము. 2. ధనము. 3. ఆభరణము. 4. గోధనము 5 అధీనవస్తువు

సొరంగము వై. వి. సురంగము, గుహవలె తొలిచిన రంధ్రము. సం. సురంగః.

సొరగు క్రి. లీనమగు.

సొరదోఁకి వై. విణ. దురాచారుడు. సం. సురద్రోహి.

సొరవు విణ. కృశము.

సొరము వై, వి స్వరము. సం. స్వరః.

సొరిది వి. వరుస, క్రమము

సొరుగు క్రి మూర్ఛలు.

సొఱ వి. తుంబి. రూ. సొర, సొర.

సొలపు వి. 1, పారవశ్యము. 2. విముఖత్వము.

సొలయు క్రి. 1. మూర్ఛిల్లు. 2. వెనుదీయు 3. వైముఖ్యమందు. 4 వైరస్యమొందు

సొలయిక వి. వైముఖ్యము, పారవశ్యము

సొలిసిటరు ఇం. వి. (శాస) (Solicitor) కోర్టులోనున్న వ్యాజ్యముల గురించి ఒకని తరపున శ్రద్ధవహించుటకు నేర్పరచిన న్యాయవాది.

సొలిసిటరు జెనరలు ఇం. వి. (శాస.) (Solicitor general) ఇంగ్లండులోని ప్రభుత్వ న్యాయవాది.

సొవ వి జాడ. 2 నవ. 3. గుసగుస.

సొసాయించు క్రి. ముందలించు, హెచ్చరించు

## సో

సోఁకు క్రి. 1. తగులు. 2. గ్రహమూవేశించు వి. 1. స్పర్శము 2. రాక్షసుడు.

సోఁకుఁజుక్క వి. మూలా నక్షత్రము.

సోఁకుబొజ్జ వి. శుక్రుడు

సోఁకుదయ్యము వి. వాయువు.

సోఁకులఱేఁడు వి. నైరృతి.

సోఁకుడు వి. 1. స్పర్శము. 2 గ్రహావేశము. 3. పిశాచము. 4. రాక్షసుడు.

సోగ వి. దీర్ఘము.

సోడియనత్రితము సం. వి. (వ్యవ.) ఇది ఎరువుగా నుపయోగపడును. దీనిలో సోడియము నత్రజని ఆమ్లజని కలసియుండును. (Sodium nitrate).

సోడియము ఇం. వి. (రసా.) (Sodium) ఉప్పులోనున్న ధాతు భాగమగు మూల ద్రవ్యము (మొక్కల కిది యావశ్యకము)

సోడు వి. 1 బ్రహ్మరంధ్రము. 2. మాడపట్టు

సోఢ నం. వి. ఓపువాడు, ఓర్పువాడు.

సోణము వి నాసామూలము, ముక్కుమొదలు

సోద వి. గచ్చు. గార

సోదన వై. వి 1. శోధనము, గాలింపు 2 శకునార్థము రామాయణాది గ్రంథము లందు దారము వేసి శోధించుట. నం. శోధనమ్.

సోదరి నం. వి. తోడపుట్టినది.

సోదరుఁడు నం. వి. తోడపుట్టినవాడు

సోదర్యుఁడు నం. వి సోదరుడు.

సోదె వై. వి. రాగలమేలు కీడులను గూర్చిన ప్రశ్నము రూ. సోదియ. నం. చోద్యమ్.

సోదెకత్తె వై. వి సోదెచెప్పునది.

సోదెము వై. వి. చోద్యము, ఆశ్చర్యము రూ. సోద్దెము, చోద్దెము నం చోద్యమ్.

సోన వి. సన్నని వాన, వాన

సోపనము వై. వి. సోపానము, మెట్టు. నం. సోపానమ్

సోపప్లవుఁడు నం వి రాహువుచే పట్టబడినవాడు (చంద్రుడు లేక సూర్యుడు)

సోపానము నం. వి మెట్టు.

సోపు వి (గృహ) పోపు సంబార ద్రవ్యముగను ఓషధిగను ఉపయోగపడుచు డును. ఇది Umbelliferae కుటుంబమునకు చెందిన Pimpenella aniseum అను మొక్క యొక్క ఎండినపండ్లు (Anise).

సోప్ప్లేటు ఇం. వి. (గృహ.) (Soup plate) ఇంగ్లీషు పద్ధతిని భోజనము పెట్టునప్పుడు చిక్కని రసమును వడ్డించుటకు ఉపయోగించు పళ్ళెరము.

సోబ వై. వి. శోభ. సిబ్బెము, బొల్లి. నం. శోభా. రూ. సోబె, సోబియ.

సోబనము వై. వి. శోభనము. మంగళము. నం శోభనమ్.

సోబె వై. వి. చూ. సోబ.

సోమ వై. వి 1 శ్రమము. 2. పరాక్రమము. రూ సోమము. నం. శ్రమః. స్తోమః.

సోమధార నం వి. ఆకాశగంగ, పాలపుంత.

సోమపీథి సం. వి. 1. సోమపానముచేయువాడు. 2. సోమయాజి. యజ్ఞముచేసినవాడు.
సోమము వై. వి. పరాక్రమము. సం. వి. 2. తిప్పతీగ. 2. జలము 3 కర్పూరము 4. సోమరసము.
సోమరి విణ. అలసుడు, మందుడు.
సోమలత సం. వి. 1 తిప్పతీగ. 2. సోమరసము తయారుచేయు తీగ.
సోమవారము సం. వి వారములో రెండవ దినము.
సోమసూత్రము సం. వి. పానవట్టమునుండి నీళ్లుపోవుద్వారి.
సోమాసి వై. వి సోమయాజి,సోమయాగము చేసినవాడు సం సోమయాజీ.
సోమించు వై. క్రి 1. సరిపోలు 2.పరాక్రమించు. 3. విజృంభించు. 4. వ్యాపించు. సం. సమః, స్తోమః
సోమిదమ్మ వై. వి. సోమయాజి భార్య. సోమిసాని.
సోము వై. వి. 1. సుఖము, 2. కోరిక, విణ అసక్తము. సం. 1. సుఖమ్. 2. సమీహా.
సోముడు సం. వి. 1. చంద్రుడు, 2. శివుడు. 3. కుబేరుడు. వాయువు.
సోమోద్భవ సం. వి. నర్మదానది.
సోయగము వి. చక్కదనము.
సోరణము వి. గవాక్షము. సోరణగండ్లు, కిటికీ.
సోల వి 1. ఒక కొలత, 2, నికుంచకము. 3 కైపులో నాల్గవవంతు
సోలము మత్తు, చొక్కు.
సోలు క్రి వివశత్వమునంది వ్రాలు, చొక్కపడు.
సోషలిజం ఇం వి. (రాజ.) (Sccialism) సామ్యవాదము, సమాజవాదము, ప్రజల సమిష్టి లాభము కొరకై సంఘములోని ఆర్థిక వ్యవస్థలు రాజ్యాధీనములో నుండవలయునియు, సంఘములోని ధనమును సమన్వయపరచి ప్రజలందరునుఅనుభవించునట్లు ప్రభుత్వము చూడవలయుననియు చెప్పు సిద్ధాంతము, దేశములోని సంఘసేవలు ప్రజల శ్రేయస్సుకై ప్రజలఉమ్మడి పలుకుబడి క్రింద నుండవలయునను వాదము.(సోషలిస్టు(Socialist) = సామ్యవాద సిద్ధాంతములను నమ్మువాడు.

## సౌ

సౌందర్యము సం. వి. చక్కదనము.
సౌకర్యము సం. వి. 1. అనాయాసము, సులభము. 2. సుకరభావము
సౌకుమార్యము సం. వి. సుకుమారత్వము.
సౌఖశాయనికుడు సం. వి. రాజుల నిద్రమేలుకొలుపువాడు. విణ 1.సుఖనిద్రయాయని ప్రశ్నించువాడు. 2.సౌఖసుప్తికుడు
సౌఖ్యము సం. వి. సుఖము.
సౌగంధికము సం. వి. చెంగలువ.
సౌగంధ్యము సం. వి. వాసన.
సౌచికుడు సం. వి. కుట్టుపనివాడు.
సౌజన్యము సం. వి. సుజనత్వము, మంచితనము.
సౌత్ సీ బబుల్ ఇం. వి. (చరి ) (South Sea Bubble) క్రీ శ. 18వ శతాబ్దములో దివాలా తీసిన ఇంగ్లీషు కంపెనీ.
సౌదామని సం వి. మెరపు. రూ. సౌదామిని.
సౌదాయికము సం. వి, స్త్రీ కిచ్చిన ధనము.
సౌధము సం. వి. 1. రాజగృహము. 2. మేడ
సౌధసోపానన్యాయము న్యా. న్యా. మెట్ల

న్నియు నెక్కకుండ నొకసారిగ మేడ నెక్కుట కష్టమను రీతి.
సౌనికుఁడు నం. వి. మృగ పక్ష్యాదుల చంపి విక్రయించి జీవించువాడు.
సౌప్తికము నం. వి. 1. నిద్రించుటలోనగు సమయములందు శత్రువులపైబడి చంపుట. 2. భారతము నందొక పర్వనామము
సౌభాగినేయి నం. వి. భాగ్యవతి కూతురు.
సౌభాగినేయుఁడు నం. వి భాగ్యవతికొడుకు
సౌభాగ్యము నం. వి. 1. అందము. సంభ గత్వము. 2. వైభవము.
సౌభ్రాత్రము నం. వి. మంచి తోడపుట్టు తనము.
సౌమనస్యము నం. వి 1. సుమనోభావము. 2. తృప్తి.
సౌమ్య నం. వి. 1. అరువది సంవత్సరము లలో నొకటి. 2. కొంచెము సబ్బుద్రావణముతో కలిపిన వెంటనే కొంత సేపు నిలుకడగా నుండు నురుగునిచ్చు జలము యొక్క గుణము. 3 మృదుత్వము(Soft)
సౌమ్యగంధ నం. వి. గులాబిపూవు
సౌమ్యుఁడు నం. వి. బుధుడు. విశే. 1. తిన్ననివాడు. 2. ఒప్పినవాడు.
సౌరభము నం. వి. 1. తావి, వాసన. 2. ఎద్దు. 3. కుంకుమము.
సౌరభేయము నం. వి. ఎద్దు.
సౌరభేయి నం. వి. ఆవు.
సౌరభ్యము నం. వి. 1. వాసన. 2. ఒప్పిదము 3. గుణగౌరవము.
సౌరసంవత్సరము నం. వి. (భూగో., పరి.) 365 రోజులు, భూమి సూర్యుని చుట్టు తిరిగి వచ్చు కాలము.
సౌరి నం. వి. 1. శని. 2. యముడు. వ్యు. సూర్యునికుమారుడు
సౌరికుఁడు నం. వి. కల్లమ్మువాడు.
సౌరు వి. 1. అందము. 2. విధము. రూ. సవురు.
సౌవర్ణకరణి నం. వి. ఒక ఓషధి. (ఇది తాకినది బంగారమగునందురు).
సౌవిదల్లుఁడు నం. వి అంతఃపురపు కావలి వాడు. రూ. సౌవిదుడు
సౌవీరము నం. వి. (రసా) మెర్క్యూరిక్ క్లోరైడ్ – పారద ద్విహారిదము, ఒక పరమాణువు పాదరసముతో రెండు క్లోరిన్ (హారిన) పరమాణువులు కలిసి ఏర్పడిన పారద యౌగికము (Corrosive sublimate)(ఇది బలమైన సూక్ష్మజీవినాశకము)
సౌవీరలవణము నం. వి. (రసా,)పాదరసము క్లోరిన్‌తో చేర్పడిన లవణము (Mercuric chloride),(విత్తులను దీని ద్రావణములో నానబెట్టి నాడినచో, మొక్కలకు చీకు తెగులు పట్టదు).
సౌశీల్యము నం. వి. సుశీలత్వము. మంచి ప్రవర్తన.
సౌష్ఠవము నం. వి. 1. సుష్ఠుభావము. గట్టి తనము. 2 గొప్పదనము. 3.నిండుదనము (గణి,) ఒక కేంద్రమునకుగాని. అక్షము నకుగాని ఇరువైపులనున్న భాగములు సర్వసమానముగనుండుధర్మము (Symmetry).
సౌహార్దము నం. వి. సుహృద్భావము, స్నేహము. రూ. సౌహృదము, సౌహృద్యము, సౌహార్ద్యము.

## స్క

స్కందుఁడు నం. వి. కుమారస్వామి.
స్కంధపత్రిక నం. వి. 1.గందపెట్టె. 2.తలుపు కమర్చెడిపట్టి.
స్కంధము నం. వి. 1. భూజము. 2. చెట్టు

బోదె. 3. యుద్ధము. 4. సమూహము. 5, శరీరము. నం. వి (వృవ.) బోదె ప్రకాండము (Trunk).
స్కంధశాఖ నం.వి. ప్రమాని మొదటికొమ్మ.
స్కంధావారము నం. వి. 1. దండు విడసిన చోటు. 2. దండు.
స్కన్నము నం. విశే. జారినది.
స్కర్వీ (సీతాదము)నం. (గృహ.)(Scurvy) 'సి'విటమిన్ లోపమువలన కలుగువ్యాధి. చిగుళ్ళవాపు,పండ్ల నుండి రక్తముకారుట, (ఈ వ్యాధి ఖటిక (Calcium) లోపము వలనకూడ కలుగవచ్చును.
స్కల్ప్టర్ నం.(చరి.)(Sculptor)తక్షకుడు. విగ్రహములు చెక్కు శిల్పి.

## స్కే

స్కేలు (గణి.) (Scale): శ కాలమానము, విషయములను పటములు సహాయ్యమున చూపించునప్పు డుపయోగించు నిష్పత్తి.

## స్కై

స్కైస్క్రేపర్స్ నం.వి. (Sky-scrapers) ఆకాశసౌధములు.మిక్కిలి ఎత్తైనమేడలు. అమెరికాలోని 30,40అంతస్థులసౌధాలు

## స్ఖ

స్ఖలనము నం. వి. 1 జారుట. 2. తొట్రుపాటు.
స్ఖలించు నం.క్రి. 1. జారు. 2. తొట్రుపడు.
స్ఖలితము నం.విశే. 1. జారినది. 2. తొట్రుపడినది. నం. వి. 1. తొట్రుపాటు. 2. మోసము.

## స్ఖా, స్టా

స్ఖాలిత్యము నం. వి. స్ఖలితభావము. 2 పొరపాటు.
స్టాంపు నం (వాన.) (Stamp) ముద్ర, బిళ్ళ
స్టారుచేంబరు నం వి (చరి )(Star chamber) ఇంగ్లండు రాజుల ప్రాచీనన్యాయస్థానము.

## స్టీ

స్టీమర్ నం. వి. (గృహ.) (Steamer). 1,ఆవిరితో వండు పాత్ర. ఉదా. ఇడ్లీపాత్ర 2. ఆవిరితోనడుచు ఓడ.

## స్టె

స్టెప్పీలు నం. వి. (భూగో.) (Steppees). సమశీతోష్ణపు వర్షాక మయన్ను (ఇచ్చట వృక్షములు పెరుగవు, దక్షిణసైబీరియా, ఆగ్నేయ యూరప్‌లో నున్నవి.)

స్టెప్సిన్ నం. వి. (జం.) (Steapsin) మేదః పాచకము (Stearin + papsin) క్రొవ్వు పదార్థములను ఆసంబంధమగు ఆమ్లములుగను, గ్లిసరీనుగను విడదీయ సేంద్రియ మండము.

స్టెర్లింగ్ కూటమి నం. వి. (చరి.) ఈ కూటమికి చెందు దేశములలో మారకము వ్యత్ములు పౌండుల విలువలో చెల్లింపవలయును.

స్టెర్లింగ్ ప్రాంతము నం వి (అర్థ.) పౌండు చెలామణి ప్రాంతము.

## స్ట్రా

స్ట్రాన్షియమ్ నం వి. (రసా) (Strontium) కాల్సియమ్ వర్గమునకు చెందిన మృత్ ధాతువు.

## స్త

స్తంబము నం. వి. బోదెలేని చిన్న చెట్టు, దుబ్బు.

స్తంబేరము నం. వి ఏనుగు.

స్తంభకణావళి నం. వి. (వృక్ష.) ఆకులపై భాగమున ఉండు బహిశ్చర్మము క్రింద రెండు, మూడు వరుసలుగా, నిలువుగా, హరితకణములతో నిండియుండు జీవకణ సముదాయము (Palisade tissue).

స్తంభజనకము నం. (వృక్ష.) పెరుగుచున్న అవయవముల కొనలయందు గల ప్రవిభాజక జీవకణజాలములలో నిది అంతస్త్వచిక జనకము క్రింద నుండును. (Plerons) ఇది వాహిని స్తంభమును (Vascular cylinder) ఉత్పత్తి చేయును.

స్తంభనము నం వి. 1. ప్రమాను వడచేయుట. 2. మంత్రశక్తిచే ప్రకృతి శక్తుల నడగచేయుట, (జలాగ్ని వాయు స్తంభములు మొదలగునవి)

స్తంభము నం. వి. 1. కంబము. 2. ప్రమానుపాటు. నిశ్చేష్టత. నం.వి. (భౌతి., రసా.) పాదరసముతో నింపిన భారమితి గొట్టములో నిలిచియున్న పాదరసోన్నతికి స్తంభమని పేరు (Column). అట్లే థర్మామీటరులో కూడ నిది యుండును. నం. వి. (రసా.) వాయువుల తడిని ఆర్పుటకు ఉపయోగించు కాల్సియం క్లోరైడ్, కాల్సియం ఆక్సైడ్ మొదలైన ద్రవ్యములతో నింపిన గొట్టము (Tower).

స్తంభయిత నం. విశే. స్తంభించువాడు.

స్తంభసంయోగము నం వి. (వృక్ష.) అండాశయములో మధ్య నిలువుగా స్తంభమువలె నున్న జరాయువు (Placenta) పై బీజాండములు ప్రతి గదియందును అమర్చబడియుండు విధము ఊచకూర్పు. (Axile placentation).

స్తంభాకారాధిచ్ఛదము నం. వి (జం) నిలువుగా నొకటి ప్రక్క మరియొకటి స్తంభమువలె నమర్చబడిన పొడవైన జీవకణముల పొర (Columnar epithelium) (కన్ను ప్రేగు లోపల అస్తరుగా నున్న పొరలో దీనిని చూడనగును).

స్తంభిక నం: వి. (జం.) శ్రవణ ప్రొషకములో నున్న చిన్న కడ్డి వంటి ఎముక

(Columella).

స్తనంధయ సం. వి. పాలు|త్రాగు ఆడుబిడ్డ.

స్తనంధయుఁడు సం. వి. పాలు|త్రాగు మగ బిడ్డ.

స్తనదూరీకరణము సం. వి. (గృహ) తల్లి పాలుమాన్పించుట, సంవత్సరము దాటిన తరువాత శిశువును తల్లిపాలు మరపించి యితర ఆహారముపై ఆధారపడునట్లు అలవాటు చేయుట (Weaning).

స్తనము సం వి. కుచము.

స్తనయిత్నువు సం. వి. 1. మబ్బు 2. ఉరుము.

స్తనితము సం. వి. ఉరుము.

స్తన్యదము సం. వి. (జం.) పాలిచ్చుజంతువు క్షీరదము. (Mammal).

స్తన్యము సం. వి చనుపాలు.

స్తబకము సం. వి. పూగుత్తి.

స్తబ్ధము సం. విశ. 1. అడగినది, ముడిగినది. 2. కదలికలేనిది.

స్తబ్ధరోమము సం. వి. పంది.

స్తరము సం. వి. (భౌతి.) పొర. ఉదా. రాతిపొర.

స్తవనీయము సం. వి. పొగడదగినది. స్తుతింపదగినది.

స్తవము సం.వి. స్తోత్రము.

## స్తి

స్తిభి సం. వి. 1. అడ్డు, నిరోధము. 2. సముద్రము. 3. గుత్తి.

స్తిమితము సం. విశ. 1. కదలనిది. 2. తడిసినది. 3. నెమ్మది కలది.

## స్తు

స్తుతము సం. విశ. స్తోత్రము. చేయబడినది.

స్తుతి సం. వి. స్తోత్రము.

స్తుతిపాఠకుఁడు సం వి. బట్టువాడు.

స్తుత్యము సం. విశ. స్తుతింపదగినది.

## స్తూ

స్తూపపృష్ఠము సం. వి. తాబేలు. వ్యు. దిబ్బవంటి వీపు కలది.

స్తూపము సం.వి. మట్టి మొదలగువాని దిబ్బ.

## స్తే

స్తేనుడు సం. వి. దొంగ.

స్తేమము సం వి. 1,తడియుట. 2.స్నేహము.

స్తేయము సం. వి. దొంగతనము.

స్తేయి సం. వి. దొంగ.

## స్తై

స్తైన్యము సం. వి. దొంగతనము.

స్తైమిత్యము సం. వి. 1. నిలుకడ 2. తనివి. 3. తేమ.

## స్తో

స్తోకకము సం.వి. 1. ఒకరకమైనవిషయము. 2. వానకోయిల. విశే. అల్పము. వ్యు. వానబొట్టును కోరుకొనునది.

స్తోత్రము సం. వి. పొగడ్త.

స్తోమము సం. వి. 1. సమూహము. 2. స్తోత్రము. 3. యజ్ఞము

స్తోమ్యము సం. విశే. పొగడదగినది

## స్త్రీ

స్త్రీ సం. వి. ఆడుది.

స్త్రీఘోషము సం. వి. వేకువ.

స్త్రీజన్యము సం. విశే. (వృక్ష.) అండకణము. స్త్రీసంయోగకణము (Female gamete)

స్త్రీధనము సం. వి. పెండ్లి మున్నగు సమయములలో స్త్రీకిచ్చిన ధనము.

స్త్రీధర్మిణి సం. వి. ఋతుమతి, చెరుగు మూసినది.

స్త్రీరేణుకోశము సం. వి. (వృక్ష.) బ్రయొఫైటములు, టెరిడోఫైటములు అనుఉద్భిజ్జ తరగతులలో చేర్పబడు స్త్రీ భాగము (Archegonium)(దీనిలో గ్రుడ్డు-అండము తయారగును).

స్త్రీలింగము సం. వి. (వ్యాక.) స్త్రీత్వబోధక శబ్దము. ఉదా. లక్ష్మి, సీత మొ.

## స్థ

స్థండిలము సం. వి. వ్రతనియమమున మన్నవాడు పండుకొనుటకు దర్భాదులు పరచిన భూమి. అగ్నిహోత్ర ముంచుటకై సంస్కరించిన భూమి.

స్థగితము సం. విశే. కప్పు

స్థగితము సం విశే. 1. కప్పబడినది. 2. కూర్పబడినది.

స్థపతి సం. వి. 1. శిల్పి, 2. అంతఃపురపు కావలివాడు. విశే. శ్రేష్ఠుడు.

స్థలజము సం. (వృక్ష.) నేలమీదపుట్టి పెరుగునది. (Terrestriat).

స్థలపవనము సం. వి. (భూగో.) రాత్రులయందు సముద్రముపై నున్న శవోష్ణ వాయువు పైకి లేచుచున్నపుడు, భూమి ఉన్న శీతవాయువు సముద్రము పైకి వీచుట.

స్థలము సం.వి. 1. మెట్టనేల. 2. చోటు.

స్థలవాయువు సం వి (భూగో.) భూమిపై నుండి సముద్రముపైకి వీచుగాలి (Land Breeze).

స్థవిరుఁడు సం. విశే. ముసలివాడు.

స్థవిర సం. వి. ముసలిది.

స్థవిష్ఠము సం విశే. 1. మిక్కిలి స్థూలము. 2. మిక్కిలిగొప్పది.

స్థవీయము సం. విశే. 1. రెండింటిలో మిక్కిలి స్థూలము. 2. గొప్పది. 3. గట్టిది.

## స్థా

స్థాండిలుఁడు సం వి. స్థండిల భూమియందు శయనించినవాడు. భా. స్థండిలశాయి.

స్థాణువు సం. వి. 1. మేకు. 2. శివుడు, 3. కొమ్మలులేని చెట్టు ప్రోడు. విశ. స్థిరమైనది.
స్థాత సం. విశ. ఉండువాడు.
స్థాతవ్యము సం విశ ఉండదగినది.
స్థానచ్యుతిదూరము సం. వి. (భౌతి.) ఒక చోటి నుండి మరయొక చోటికిసయనించిన దూరము (Displacement).
స్థానభ్రంశము సం. వి. (గృహ.) 1. కీలు స్థానము తప్పుట. 2. కీలు తప్పించుట. 3. పట్టు వదిలించుట. 4. బెణికించుట. (Dislocation).
స్థానము సం వి. 1. చోటు ఉనికి. 2 విలు కాని యుద్ధ మప్పటి నిలుకడ.
స్థానాంతరీకరణము సం. వి (భౌతి) ఒక వస్తువుమ ఒక చోటునుండి ఇంకొకచోటికి మార్చుట. (గతిశాస్త్రము.) ఇంకొక చోటికి తరలించుట (Translocation).
స్థానాపతి సం. వి 1. మధ్యవర్తి, దూత 2. పారుపత్తె కాడు.
స్థాని సం. విశ స్థానము కలది.
స్థానిక(పు)నేలలు మి. వి (వ్యవ.) మట్టి రేణువులు చాలవరకు అవి పుట్టినస్థలము వందే కూడుకొని ఏర్పడిన నేలలు (Sedentary or local soils).ఉదా ఎర్ర చెక్కునేలలు. కంకరనేలలు మొదలగునవి.
స్థానికుడు సం. వి. స్థానాధిపతి, గుడి పారుపత్తెకాడు.
స్థానికులు సం. వి. ఒక స్థలమునకు చెందిన వారు.
స్థానీయము సం. వి పట్టణము.
స్థాపత్యుడు సం. వి. హెగ్గడి, షండుడు. అంతఃపురపు కావలివాండ్రలో నొక తెగ.
స్థాపకుడు సం. విశ. స్థాపనము చేయువాడు.
స్థాపనము సం. వి, 1. నిలుపుట. 2, సమాధి చేయుట. 3. స్థాపించుట.
స్థాపితము సం. విశ 1. నిలుపబడినది. 2, నిశ్చయింపబడినది. 3. స్థాపింపబడినది,
స్థాయి సం. విశ. ఉండునది. ఒక వస్తువు చలి చునప్పుడు కంపన సంఖ్య తో హెచ్చుచు తగ్గుచు నుండెడిది. సం. వి. రసమునకు పూర్వరూపమైన రిత్యాది
స్థాయిభావము(భౌతి.)సరోచ్చత (Pitch).
స్థాయిత్వము సం. వి. (భౌతి.) మార్పులేక తనము (Stablity).
స్థాయిసంఘము సం. వి (శాస.) ఒక సంస్థను లేక వ్యవహారమును ప్రత్యేకముగాచూచుటకు నియమించిన కార్యనిర్వాహక సంఘము.
స్థాయిసేన సం వి. రాజ్యములో శాశ్వతముగ నుండు సేన
స్థాలము సం. వి. కంచము,
స్థాలి సం. వి. వంటకుండ.
స్థాలీపులాకన్యాయము సం. న్యా. ఉడుకు చున్న కుండెడు అన్నమునకు ఒక మెతుకునుపట్టి చూచుటవలె ఒక దానినిబట్టి పూర్ణవిషయ మెరుగుట.
స్థావరము సం. విశ. (భౌతి.) కదలనిది. చలనము లేనిది, స్థిరము, మార్పులేనిది. (Stationery). సం. వి. 1. వింటినారి. 2. కొండ. 3. వృద్ధత్వము.
స్థాసకము సం. వి. 1. బొట్టు. 2. మైపూత. 3. నీటిబుగ్గ.

## స్థి

స్థితము సం. విశ. 1, ఉన్నది. 2. నిలుచున్నది. 3. నిశ్చయింపబడినది. 4. ప్రతిజ్ఞ చేయబడినది,
స్థితి సం. వి. 1. ఉనికి, 2, కూర్చుండుట.

3. నిలుకడ. 4. మేర. సం. వి. (రసా.) 1. అవస్థ (Phase) 2. ఘన, ద్రవ, వాయు, ద్రవ్యావస్థలలో నొకటి. 1. ఒక వస్తువు యొక్క ఉనికి. రీతి (State). 2. అది ఆక్రమించిన స్థానము. (భౌతి.) ఏవస్తువు అయినను ఉన్న విధము, అవస్థ (Mode of existence)

స్థితికోష్ఠము సం. వి (జం) వెన్నెముకగల చాల జంతువులలో స్థిరమైన స్థితిని కలుగచేయు అవయవముచ్ఛత్రికలో అంగకముల మొదటనుండు సూక్ష్మమైన గుళికలు (Lithocyst or statocyst),

స్థితిశక్తి సం. వి. (భౌతి) దాని స్థితినిబట్టి ఒక వస్తువునందు నెలకొనియుండు శక్తి (Potential energy.)

స్థితిశాస్త్రము సం. వి. (భౌతి.) సమతులిత స్థితిలోనున్న బలములనుగురించి, చర్చించు భౌతికశాస్త్రభాగము (Statics). ఇది యాంత్రికశాస్త్రము (Mechanics) లో అంతర్భాగము.

స్థితిస్థాపకత సం. వి (భౌతి.) పై బలముల వలన ఒక వస్తువు వికారమునకు లోబడినను బలముల ఉపసంహారము ఫలముగ తన తొంటి స్థితిని స్వీకరించు గుణము (Elasticity). ఉదా. రబ్బరుబంతి.

స్థితిస్థాపకస్థితి సం. వి. (గృహ.) సాగుడు శక్తి కలది (Elasticity).

స్థిర సం వి భూమి.

స్థిరతైలములు సం. వి (వ్యవ) గాలి పారినను ఆరి, హరించిపోకుండ స్థిరముగానుండు నూనెలు (Fixed oils). ఉదా నూవుల నూనె, ఆముదము.

స్థిరనిష్పత్తి నియమము సం. వి. (రసా) ఒక్క యౌగికములోనుండు మూల ద్రవ్యముల రాసులు ఎల్లప్పుడును ఒకే నిష్పత్తిని కలిగియుండునను నియమము (Law of constant proportion).

స్థిరము సం. వి 1. కొండ. 2. చెట్టు. 3. మోక్షము- విశ. నిలుకడైనది, కదలనిది.

స్థిరరాశి సం. వి (గణి.) రాశి $f=ml$ అను గతిశాస్త్ర నియమములో m (వస్తువు యొక్క ద్రవ్య సంచయము) మారనిరాశి (Constant).

స్థిరవారము సం. వి. శనివారము.

స్థిర విద్యుత్ సం. వి. (భౌతి.) ప్రవహించని అనగా ఒక వస్తువుపై ప్రోగైన విద్యుత్తు (Static electricity)

స్థిరాస్తి మి. వి. ఒక చోటినుండి మరియొక చోటికి తీసికొనిపోవుటకు వీలులేని(భూమి ఇల్లు, తోటలు మొనవి) ఆస్తి (Immovable property).

స్థిరుడు సం. వి. శని.

## స్థూ

స్థూణ సం. విశ. 1. స్తంభము. 2. ఇనుప ప్రతిమ.

స్థూపశంఖువు సం. వి (గణి) భూమి వృత్తాకారముగాగల క్రమమైన శంఖువు (Right circular cone).

స్థూపము సం. విశ. స్తంభాకారముగనున్న నిర్మాణము (Cylinder).


స్థూపము

స్థూలకోణ జీవకణసమితి సం. వి. (వృక్ష.) కణకవచము

యొక్క మూలలందు దట్టముగాగల జీవకణజాలము (Collenchyma)

స్థూలగ్రాసములు సం. వి. (వ్యవ.) పశువుల మేత దినుసులు (Roughages). ఉదా పచ్చగడ్డి, పరిగడ్డి, జొన్నదంటు మొ.

స్థూలనాసము సం. వి పంది.

స్థూలమానము సం. వి. (గణి.) స్థూలమైన అనగా కచ్చితముకాని కొలత (Approximation).

స్థూలము సం. వి గుడారము. విణ. బలిసినది. (గణి.) యథార్థమునకు దగ్గరగా నుండునది. అందాజు.

స్థూలలక్షుఁడు సం. విణ. 1. మిక్కిలి యీవికాడు. 2. మిక్కిలి తెలివిగలవాడు.

స్థూలారుంధతీ న్యాయము సం. న్యా. అరుంధతీ నక్షత్రము చిన్నది, కావున దానిని చూచుటకై పెద్ద నక్షత్ర మొకటి దానిని చూపించి దానిసమీపముననున్నదని చూపు పట్టిరీతి.

స్థూలాష్ఠి సం. వి. (జం.) కొన్ని ఏకకణజీవులలో ఆహార వ్యాపారములకు సంబంధించిన పెద్ద జీవకణ స్థానము (Macro-nucleus).

స్థూలోచ్ఛ్రయము సం. వి. 1. పెద్దరాయి. 2. బొటిమ.

## స్థే

స్థేమము సం. వి. శరీరబలము. సత్తువ.

స్థేయుఁడు సం.వి. 1. తీర్పరి.2. పురోహితుడు. విణ మిక్కిలి స్థిరుడు.

## స్థై

స్థైర్యము సం. వి. స్థిరత్వము..

## స్థౌ

స్థౌల్యము సం. వి. స్థూలభావము, లావుతనము, మొద్దుతనము.

## స్న

స్నపనము సం. వి. స్నానము.

స్నపితము సం. విణ. స్నానముచేసినది.

స్నపము సం. వి. కారుట.

స్నస సం. వి. సన్నవరము.

## స్నా

స్నాతకుఁడు సం. స్నానశీలవ్రతుడు. బ్రహ్మచర్యము పూర్తికావించి గృహస్థధర్మమునకు వచ్చువాడు.

స్నాతకోత్సవము సం. వి. విశ్వవిద్యాలయములలో పట్టభద్రులకు పట్టప్రదానము గావించుటకు ఏర్పాటైన సభ (Convocation).

స్నాతుఁడు సం విణ. స్నానముచేసినవాడు.

స్నానము సం. వి. మునుక.

స్నానీయము సం. వి. నలుగుపిండి.

స్నాయువు సం. వి. సన్ననరము. సం (జం) ఎముకలను కలిపియుంచు ఆధారకణజాలముతో నేర్పడిన పట్టె, సంధి, బంధనము (Ligament)

## స్ని

స్నిగ్ధము సం. విశే. 1. స్నేహముగలది. 2. మునుపుగలది. 3. చిక్కనగలది.

స్నిగ్ధవయనము సం. వి. (గృహ.) నునుపు నేత,బట్టకు మెరుపు నునుపునిచ్చు ఒక విధమైన నేత (Satin weave)

స్నిగ్ధుఁడు సం. వి. స్నేహితుడు.

## స్ను

స్నుతము సం. విశే. కారినది.

స్నుష సం. వి. కోడలు.

## స్నే

స్నేహనము సం. వి. (భౌతి.) కందెనవేయుట ఘన వస్తువులమధ్య రాపిడినితగ్గించుటకు నూనెలవంటిద్రవ్యములపూయుట (Lubrication)

స్నేహము సం. వి. 1. చెలిమి. 2. చమురు

స్నేహించు సం. క్రి. చెలిమిచేయు

స్నేహితుఁడు సం. వి. చెలికాడు.

## స్ప

స్పంజింగ్ సం (గృహ.) (Sponging) స్పంజితో శుభ్రముచేయుట, స్పంజి లేదా తడిబట్టలతో అద్దుట.

స్పందనము సం వి (భౌతి) ఒక బిగించియున్న వీణతీగవంటి దానిని చేతితో లాగి విడిచిపెట్టినప్పుడు ఆతీగ ఇటునటు చేయు ఊగులాట. ఒక వస్తువు దాని విశ్రాంతి స్థితినుండి ఇటునటు చలించి మరల మరల విశ్రాంతి స్థానమునకు వచ్చు చలనపురీతి. (Vibration)

స్పందము సం. వి. ఇంచుక కంపము. చూ. స్పందనము.

స్పర్ధ సం. వి. (అర్థ, వాణి) అనుభోక్తలెల్లరుతమసరుకులనే కొనవలెనని ఉత్పాదకులు తమలో తాము పోటీపడుట ఉత్పాదన తక్కువగానున్న సరుకుకొరకు అనుభోక్తల మధ్యగల పోటీ, మొదటి పరిస్థితిలో ధరలు తగ్గుట. రెండవ పరిస్థితిలో ధరలు పెరుగుట జరుగును. సం వి. 1. పోటీ, 2. పోలిక. 3. క్రమసమున్నతి.

స్పర్శకణము సం వి. (జం.) బహిశ్చర్మము క్రిందనుండు జ్ఞాననాడీకణములు. (Tactile cells).

స్పర్శజ్యా సం. వి. (గణి.) ఒక వృత్తమును రెండు స్పర్శరేఖలుతాకెడి బిందువు గుండ పోవు జ్యా (Chord of contact).

స్పర్శనము సం వి. 1. తాకుడు. 2. ఈవి. 3. వాయువు.

స్పర్శబిందువు సం. వి. (గణి.) ఒకదానినొకటి స్పర్శించుకొను రెండు రేఖలపైనుండు సామాన్య బిందువు. (Point of

contact).
స్పర్శము సం. వి. 1. 1. తాకుడు. 2. ఈవి. 3. వ్యాధి.
స్పర్శరేఖ సం. వి. (గణి.) (Tangent) ఛేదన రేఖ యొక్క అవధి (Limit).
స్పర్శవిషములు సం. వి. (వ్యవ.) కీటకముల యూపిరి గొట్టములను మూసివేసి వానిని నాశనము చేయు విషములు. (Contact poisons).
స్పర్శవృత్తములు సం. వి. (గణి.) ఒక వృత్తమును స్పర్శించుచున్న మరియొక వృత్తము. (Tangential circle)
స్పర్శవేది సం. వి. పరుసవేది, ఇనుమును బంగారు చేయు రసశిల.
స్పర్శసూత్రములు సం. వి. (జం.) కొన్ని కీటకముల తల ముందు భాగమున నుండు పొడవైన సూత్రములవంటి అవయవములు (Antennae)(వీనితోనవి స్పృశించి వస్తువులను తెలిసికొనగలవు).
స్పష్టము సం. విశే. వెల్లడియైనది.

## స్పా

స్పాంజ్ కేకు ఇం. వి. (గృహ.) (Sponge cake) గాలి బుడగలతో నిండి దూదివలె మెత్తగా నుండునట్లు కాల్చిన పలహారము (ఇది మైదాపిండి, గ్రుడ్డుసొన. చక్కెర మొ. వానితో తయారుచేసిన వంటకము).

## స్పీ

స్పీకరు ఇం. (శాస., రాజ.) (Speaker) శాసనసభాధ్యక్షుడు, లోకసభ లేక రాష్ట్ర విధాన సభాధ్యక్షుని, బ్రిటన్ కామన్సు సభాధ్యక్షుని సాధారణముగ స్పీకరని అందురు.

## స్పృ

స్పృక్కు సం. వి. స్పర్శము.
స్పృశించు సం. క్రి. తాకు.
స్పృశ్యము సం. విశే. తాకదగినది.
స్పృష్టము సం. విశే. తాకబడినది.
స్పృష్టి సం. వి. తాకుడు.
స్పృహ సం. వి. కోరిక.
స్పృహణీయము సం. విశే. కోరదగినది. రూ. స్పృహ్యము.

## స్ప్రి

స్ప్రింగ్ ఇం. (భౌతి.) (Spring) వలయముగా చుట్టబడిన తీగ. (దీనిలో తీగచుట్ట, కొక్కెము, ముఖఫలకము (Dial) అనునవిముఖ్యభాగములు.
స్ప్రింగ్‌కాటా మి. వి. (వ్యవ.) బరువైన వస్తువులను తూచుట కుపయోగించు ఒక విధమగు ఇనుపకాటా (Spring balance)
స్ప్రింగ్‌బాలన్స్ ఇం. వి. (భౌతి.) Spring balance) స్ప్రింగ్‌తో చేయబడిన త్రాసు.

## స్ఫ

స్ఫట నం. వి. పాముపడగ.

స్ఫటము నం. వి. (రసా.) అల్యూమినియమ్ అనబడు ధాతువు (Aluminium). (ఇది మొక్కలకు సూక్ష్మప్రమాణములో కావలసిన మూల ద్రవ్యము).

స్ఫటసూచులు నం. వి. (వృక్ష.) కొన్ని మొక్కల జీవకణములలో నేర్పడు సూదుల వంటి ఖనిజ స్ఫటికములు (Raphides) ఉదా. చేమ, కంద మొదలగునవి.

స్ఫటసూచులు

స్ఫటి నం. వి పాము వ్యు. పడగగలది.

స్ఫటికజలము నం. వి. (రసా.) పదార్థస్ఫటికములలోనుండు నీరు (Water of crystallisation).

స్ఫటికము నం. వి. 1 ఒక తెల్లని రాయి. పటికము (రసా.) సమతలములచే నేర్పడు ఘనరూపము (Crystal).

స్ఫటికశిల నం. వి. (రసా.) షష్ఠకోణీయ స్ఫాటిక రూపము గల సిలికన్ ద్వ్యామ్లజనిదము $SiO_2$ కార్ట్జ్ స్ఫటికము (Crystal sand)

స్ఫటికీకరణము నం. వి. (రసా.) హెచ్చు ఉష్ణోగ్రతలో సంతృప్తముగానున్న ద్రావణమును చల్లార్చి స్ఫటికములు చేయు విధానము (Crystallisation).

## స్ఫా

స్ఫాటికజలము నం. వి. (భౌతి.) కొన్ని లవణ స్ఫటికముల రచనలో ఇమిడియుండు జలము (Water of crystallisation).

స్ఫాటికశిలలు నం. వి. (భూగో.) పరివర్తిత శిలలు.

స్ఫాతి నం. వి. వృద్ధి.

స్ఫారము నం. వి. 1. చలనము 2. అధికమైనది. రూ. స్ఫారము.

## స్ఫి

స్ఫింక్సు ఆం. (చరి.) (Sphinx) ప్రాచీన ఈజిప్టులోని రాతికట్టడము మానవ శిరస్సు సింహశరీరముగల కట్టడము, (వీటిలో అన్నిటికంటె పెద్ద స్ఫింక్స్ 18'-8" ముఖము. 5'-7" ముక్కుతో నైలునది తీరమునమున్నది.)

స్ఫీతము నం.విశే. 1. అధికమైనది. 2. బలిసినది.

## స్ఫు

స్ఫుటనము నం. వి. భేదించుట.

స్ఫుటము నం. విశే. 1. స్పష్టమైనది. 2. వికసించినది, నం. వి. పాముపడగ.

స్ఫురణము నం.వి. 1. అదరుట. 2. తోచుట.

స్ఫుర(త్) పంచామ్లజనిదము నం. వి. (వ్యావ.) దీనిలో స్ఫురము ఆమ్లజని కలిసియుండును, ఇది ఎముకలయందు హెచ్చుగానుండును (Phosphorous pentoxide).

స్ఫురము నం. వి. (రసా.) భాస్వరము. మొక్కలకు కావలసిన ముఖ్యమైన మూల

ముల ద్రవ్యము లలోనిది యొకటి (Phosphorous).

స్ఫురించు సం. క్రి. 1. అదరు. 2. తోచు.

స్ఫురితము సం. విణ. 1. అదిరినది 2. తోచినది.

స్ఫులింగము సం. వి. మిడుగురు రూ. నిస్ఫులింగము సం. వి. (భౌతి) ఒక అంతరము గుండ ప్రవహించు వైద్యుతోత్సర్గము. (Spark).

## స్ఫూ

స్ఫూర్తి సం. వి. 1. అదరుట. 2. తోచుట. 3. వన్నె. 4. కాంతి.

## స్ఫో

స్ఫోటకము సం. వి. మశూచికము అమ్మవారు.

స్ఫోటనము సం. వి. (జీవ) శరీరము నుండి మొగ్గలుగా బయలుదేరి సంతానము ఉత్పత్తియగుట, (Budding). సం. వి. (రసా.) వేడి చేసినప్పుడు కొన్ని లవణములు కరకరయను ధ్వనితో పేలుట, (Decrepitation). (లవణములో నున్న వాయువిశేషముగాని, నీరుగాని బయటికి వెడలుటలో ఈ ధ్వని వినబడును).

స్ఫోటము సం. వి భేదించుట.

స్ఫోటిత తామ్రము సం. వి. (రసా.) రాగి ఖనిజము నుండి రాగిని సాధించు ప్రక్రియలో చివరి దశలోని రాగి కరగియున్న ధాతువు నుండి సల్ఫర్ డైయాక్సైడ్ వాయువు పైకి ఉబుకుటచే బొబ్బలుగా ఏర్పడిన పైతలము గల రాగి ముడి ధాతువు (Blister copper).

## స్మ

స్మయము సం. వి. 1. గర్వము. 2. ఆశ్చర్యము.

స్మరణము సం. వి. తలంపు. జ్ఞప్తి.

స్మరహరుడు సం. వి. శివుడు. వ్యు. మన్మథుని హరించినవాడు.

స్మరాంకుశము సం. వి. పెంచి దిద్దిన గోరు.

స్మరుడు సం. వి. మన్మథుడు, మరుడు,

స్మర్త సం. విణ. స్మరించువాడు.

## స్మా

స్మాకింగ్ ఆం. (గృహ.) కుచ్చిళ్ళమీద అలంకారపు కుట్లు వేయుట (Smoking honey-comb).



స్మాకింగ్

స్మారకము సం. వి. 1. జ్ఞప్తి తలపు, స్మరించుట, 2. స్మృహ.

స్మారితుడు సం. విణ. 1. తలపు సాకిరి. 2. స్మరించునట్లు చేయబడినవాడు.

స్మార్తము సం. విణ. స్మృతి సంబంధమైనది

## స్మి

స్మితము సం. వి. 1. అధరమందుమాత్రము ప్రకాశించుచిరునవ్వు. 2. తెలనవ్వు. రూ. స్మితి.

## స్మృ

స్మృతమునం. విశే. తలపబడినది సం. వి. 1. తలపు. 2. ధర్మశాస్త్రము. 3. బుద్ధి.

## స్మే

స్మేరము సం. విశే. 1. కొంచెము నవ్వువది. 2. వికసించినది.

## స్య

స్యందనము సం. వి. 1 కారుట, 2. జలము, 3. రథము.

స్యందము సం. వి. కారుట.

స్యంది సం.విశే. కారునది.

స్యందిని సం. వి. చొంగ.

స్యన్నము సం. విశే. కారినది. స్రుతము.

## స్యా

స్యాలిక సం. వి. భార్యతోపుట్టినది. రూ. శ్యాలిక.

## స్యూ

స్యూతము సం. వి. పల్లిక. విశే. కట్టబడినది.

స్యూతి (భ్రూణము) సం. వి. కుట్టు. 2. సంతతి. సం. వి. (జం.) జంతువు యొక్కపిండముపెరుగు టలోనిదియొకదశ స్యూతిభ్రూణము (Castrula). భ్రూణము (కప్ప)



యొక్క జీర్ణకోశ కుహరము చుట్టును బహిశ్చర్మము, అంతశ్చర్మము అను వానితోకూడి రెండు పొరలనంచి యుండును, జీర్ణకోశకుహరము బయటికి ఆద్యాంత్ర ముఖము ద్వారా తెరచు కొనును.

స్యూనము సం. వి. స్యూతము.

స్యూనిక సం.వి.(జం.) మధ్యగుహా (చెవి) యొక్క క్రింది భాగము (Sacculus).



స్యూనిక దళిక శంఖము అంపుల్లా (కప్పచెవివటలగహానము)

## స్ర

స్రంసనము సం. వి. 1. క్రిందపడుట. 2. జారవిడుచుట.
స్రగ్గు క్రి. అడగు, తగ్గు.
స్రగ్వి సం. విశే. పూదండగలవాడు.
స్రజము సం. వి. పూలదండ.
స్రవంతి సం. వి. నది, ఏరు.
స్రవణము సం. వి. కారుట. రూ. స్రవము. స్రావము.
స్రష్ట సం. వి. బ్రహ్మ.
స్రస్తము సం. విశే. జారినది.

## స్రా

స్రావకము సం. విశే. కారునది.
స్రావణము వి. అగసాలెవాని ఒక కొరముట్టు
స్రావము సం. వి. కారుట. సం. (గృహ.) ఊట. గ్రంధిజనిత స్రావము (Secretion)
స్రావి వి. జారునది.

## స్రు

స్రుక్కు క్రి. 1. వెనుదీయు. 2. భయపడు. 3. ముడుగు. 4. ముడుతపడు 5. తగ్గు. 6. దుఃఖించు. 7. చింతించు. 8. మూర్ఛిల్లు 9 సంకోచించు. వి. 1. చిక్కు 2 దుఃఖము, 3 శోకము. సం వి. మిల్లివంటి యజ్ఞోపకరణము.
స్రుతము సం విశే. కారినది.
స్రుతి సం. వి. కారుట.
స్రువము సం. వి. ఒక యజ్ఞోపకరణము. హోమ సాధనమైన కొయ్యగరిటె.

## స్రో

స్రోతస్విని సం. వి. నది వ్యు. ప్రవాహము కలది.
స్రోతస్సు సం. వి. 1. ప్రవాహము, ఏరు 2. నీరువచ్చు తూము.

## స్వ

స్వకీయము సం. విశే. తనది. రూ. స్వకము. (వ్యతి. పరకీయము).
స్వగృహము సం. వి. (గృహ.) 1. నివాస స్థలము, ఇల్లు. 2. తనగృహము(Home).
స్వచ్ఛందము సం. విశే. స్వతంత్రము.
స్వచ్ఛము సం. వి. తెలుపు. విశే. తెల్లనిది
స్వజనుఁడు సం. వి. తనవాడు, జ్ఞాతి.
స్వతంత్రత సం.వి. (గృహ.) తన యిష్టప్రకారము, ఇష్టానుసారముగ చేయగల్గుట (Independency).
స్వతంత్రము సం. విశే. సొంతము. (గణి.) మిగిలిన రాసులతో సంబంధములేనిది.
స్వతంత్రించు సం. క్రి. ఇతరుల యనుమతి లేక తానుగా ఏర్పడు.

స్వతంత్రుఁడు నం. విశే. ఒకరిపై ఆధారపడకుండ నుండువాడు తన్ను తాను పోషించుకొనువాడు.

స్వతంత్రప్రజ్వలనము నం. వి. (రసా.) ఒక వస్తువు తనంతతానే మండిపోవుట (Spontaneous combustion).

స్వత్వము నం. వి. హక్కు. వి. సొత్తు (వ్యాక.) ద్రుతముకు సంధియందు బిందుసంశ్లేషము రానప్పుడు మార్పు చెందక అట్లేయుండుట. ఉదా. పూచెనుగలువ.

స్వదేశము నం. వి. (గృహ.) తాను నివసించు దేశము (Home country)

స్వదేశ సంస్థానములు నం. వి. (చరి.) భారతదేశము స్వతంత్రరాజ్యముకాక పూర్వము భారతదేశములో నుండెడి సామంత రాజ్యములు (వీని పరిపాలకులు బ్రిటిష్ ప్రభుత్వ పరిరక్షణ క్రింద సామంతులుగా నుండిరి).

స్వనము నం. వి. శబ్దము, నిస్వనము.

స్వనితము న. వి. ఉరుము. విశే. మ్రోగినది.

స్వపరాగ సంపర్కము నం. వి. (వృక్ష.) ఒక పుష్పములోనున్న పుప్పొడి అదే పుష్పములోనున్న అండకోశ కీలాగ్రముపైగాని, ఆ మొక్క మీదనేయున్న మరయొక పుష్పములోని అండకోశ కీలాగ్రముపైగాని పడుట (Self pollination) (స్వపరాగఫలదీకరణము=Self-fertilization).

స్వప్నము నం. వి. 1. కల. 2. నిదుర.

స్వభాను నం. వి. అరువది సంవత్సరములలో నొకటి.

స్వభావము నం. వి. స్వాతన్త్ర్యము, పుట్టుకతో వచ్చు గుణము

స్వభువు నం. వి. 1 విష్ణువు. 2. శివుడు. వ్యు. స్వయముగ పుట్టినవాడు

స్వము నం. వి. 1 ధనము. 2. తాను. విశే. తనది.

స్వయంధనోపకల్పము నం. వి. (అర్థ. వాణి.) మూలధనము సేకరించుకొనుటకు వాటాల, నమ్మ పద్ధతిగాక సంస్థ యొక్క అధిక లాభములనే ఉపయోగించుకొనుట, పంచిన లాభమును సంస్థ యొక్క నిధులలో కొంతవరకు వేసి, మిగిలిన మొత్తమును వాటాదారులకు పంచి పెట్టుట పరిపాటియైనది, అట్లు నిధులలో వేసిన సొమ్మును కూడ మూలధనమువలె ఉపయోగించుకొనుట పరిపాటియైనది, దీనివలనముఖ్యమైన లాభమేమన ఋణదాతలకు లాభాంశము కాని, వడ్డీ కాని ఇవ్వ అవసరము లేదు, దీనివలన ఒక ప్రక్క సంస్థయొక్క ఆర్థిక స్థైర్యము పెరుగుచుండ, రెండవ ప్రక్క వడ్డీగాను, లాభాంశముగాను, సంస్థ వహింపవలసిన మొత్తము మాత్రము మారదు

స్వయంప్రకాశము నం. విశే. (భౌతి.) తనంతటతానే వెలుగువిచ్చునది (Luminous).

స్వయంభువు నం. వి. 1. బ్రహ్మ. 2 విష్ణువు. 3. శివుడు. 4. మదనుడు.

స్వయంవంధ్యత నం. వి. (వృక్ష.) పుష్పములోని పుంకేసరములుగాని, స్త్రీ కేసరములుగాని అదే పుష్పములో ఫలదీకరణమునకు పనికిరాకుండుట (Self sterility)

స్వయంవర నం. వి. తనంతట భర్తను వరించు స్త్రీ.

స్వయంవరము నం. వి. తనంతట భర్తను వరించుట.

స్వయంసంతృప్తి నం. వి. (గృహ.) తృప్తి చెందుట, తనలో తాను తృప్తి చెందుట (Self-content).

స్వయంసమృద్ధత నం. వి. (అర్థ.) కుటుంబము నందుగాని, దేశము నందుగాని, యున్న ప్రజలందరికి. అన్నవస్త్రాదులకు కావలసిన దినుసులు కొరతలేకుండ ఉత్పత్తి

యగుచుండుట (Self-Tufficiency)
స్వయంసమృద్ధము నం.వి.(గృహ) స్వయం పూర్ణమైనది (Self-contained).
స్వయంసేవకదుకాణములు మి వి. (వాణి.) విక్రేతలులేనిదుకాణములు, క్రేతలు యిట్టి దుకాణములలోనికి పోయి సరకులను తీసికొని నిష్క్రమణ ద్వారము వద్దనున్న గుమాస్తాకు పైకము చెల్లించుదురు (అనగా వస్తువును గూర్చిన విషయములు వర్ణించుటకు దుకాణములో ఎవరును ఉండరు దీని వలన సరకులను అందించు వారికి అమ్మువారికి నిచ్చు జీతములఖర్చు ఉండక పోవుటవలన సరకులు చౌకగా లభించు అవకాశమున్నది )
స్వరక్షణ నం. వి (గృహ.) తన్నుతాను రక్షించుకొనుట (Self defence)
స్వరపేటిక నం. వి. (జం) శబ్దమును ఉత్పత్తి చేయు అవయవములు గల గది వంటిభాగము (Larynx) నం వి. (గృహ.) ఇది గొంతులో కొండనాలుకకు క్రింది భాగమున గలదు. ఇది మనుష్యులకు మాటలాడుటకు ముద్రాశాస్త్రులకు దర్శకాన్కి ఆధారమై యుండును. (Voice box).


స్వరపేటిక (కప్ప)

స్వరమాపకము స్వనద్విభుజము నం వి (భౌతి.) ధ్వనిని కొలుచు సరికరము (Sonometer).
స్వరమాపని నం. వి. (భౌతి) అనునదవ సంఘటన నుపయోగించి ఒక స్వరము యొక్క స్వభావమును నిర్ణయించుట కుపయోగపడు ఉపకరణము (Sonometer).
స్వరము నం. వి. 1. కంఠధ్వని. 2. ముక్కుగాలి 3. అచ్చు (అకారాది) ఉదాత్తానుదాత్త స్వరితములు (వేదములోని). 4. షడ్జాది సంగీత స్వరములు ఏడు. నం. వి. (భౌతి) సంగీత ధ్వనులలో ఒక నియత ధ్వనిని సూచించు చిహ్నము(Note). నం. వి. (భౌతి) ధ్వని యొక్క గుణము (Tone).
స్వరములు నం వి (భౌతి.) వినుట కింపైన ధ్వనులు (Notes).
స్వరాట్టు నం వి. 1. బ్రహ్మము. 2. ఇంద్రుడు.
స్వరాత్మకము నం వి. (గణి.) శ్రేఢి వేనివ్యుత్క్రమసంఖ్యలు అంక శ్రేఢిలో నుండునో అట్టి సంఖ్యల పరంపర (వరుస) (Harmonic).
స్వరూపము నం వి. 1 స్వభావము. 2. రూపము.
స్వరోచ్ఛ్రిత నం వి (భౌతి) ధ్వని యొక్క తీవ్రత (Pitch).
స్వర్గము నం వి. దేవలోకము.
స్వర్ణకారుడు నం. వి కమసాలి
స్వర్ణది నం వి వేల్పుటేరు, ఆకాశగంగ.
స్వర్ణపత్రము నం వి (రసా.)బంగారముతో చేయబడిన పలుచటి రేకు (Gold leaf).
స్వర్ణ ప్రమాణము నం. వి (అర్థ) ప్రమాణపు నాణెములలో నిర్దిష్టభారముగల బంగారమునుంచి అట్టి నాణెములు వాడుకలో నుంచు ద్రవ్యప్రమాణ పద్ధతి. 1914 కు పూర్వము ఇట్టి ప్రమాణము అమెరికా,జర్మనీ దేశములలో అమలులో నుండెను.
స్వర్ణము నం. వి. బంగారము. యా. సువర్ణము. నం వి (రసా.) బంగారము (Gold),నాణెములు చేయు ధాతువులలో మిక్కిలి విలువగల ధాతువు, ఆవర్తక్రమ పట్టికలో మొదటి వర్గములోనిది
స్వర్ణలోహ ప్రమాణము నం. వి. (అర్థ.)

ద్రవ్యప్రమాణములో ఇది యొక ప్రమాణము, ఇందు స్వర్ణలోహము ప్రమాణముగ నుండును. ఇందు బంగారు నాణెముల చెలామణి యుండదు. కాని దేశములోని బంగారమును ప్రమాణముగ కలిగి, అంతకంటె ఎక్కువ ద్రవ్యము దేశములో లేకుండెను. 1927 తరువాత కొంత కాలము మనదేశములో ఈ ప్రమాణము అమలులో నుండెను

స్వర్ణవినిమయ ప్రమాణము సం. వి. (అర్థ) దేశమునందలి సామాన్యపు నాణెమును బంగారములోనికి కాక స్వర్ణ ప్రమాణము గల మరియొక దేశపు నాణెములోనికి మార్పిడి చేసికొనుటకు వీలుగల ద్రవ్యప్రమాణపద్ధతి.

స్వర్ణోత్సవము సం. వి. సంస్థలకు 50 సంగలు నిండిన సందర్భమునచేయు ఉత్సవము (Golden jubilee).

స్వర్భానుఁడు సం. వి. రాహువు.

స్వల్పము సం విశ. మిక్కిలి అల్పము.

స్వస సం. వి. తోడపుట్టునామె.

స్వస్తి సం. అవ్య. శుభము.

స్వస్తికము సం వి. 1 చదుకము. 2. మంగళ వస్తువు. 3 పాముపడగమీది నల్లనిరేఖ. 4 ఒక గుర్తు.

స్వస్థము సం విశ నెమ్మదిగా నుండునది.

స్వస్రీయ సం. వి. మేనకోడలు.

స్వస్రీయుఁడు సం. వి మేనల్లుడు.

## స్వా

స్వాంతము సం. వి. 1. మనస్సు. 2 గుహ.

స్వాగతము సం. వి 1. కుశలప్రశ్నము. సుఖముతోడి రాక. 2. ఒక రకమైన వృత్తము.

స్వాతంత్ర్యము సం. వి. స్వతంత్రత. వ్యతి. పారతంత్ర్యము.

స్వాతి సం వి. 1. సంజ్ఞాదేవి. 2. నక్షత్రములలో నొకటి.

స్వాదనము సం. వి. 1. పానము. 2. రుచి చూచుట

స్వాదుముకుళములు సం వి. (జం.) రుచిని గ్రహించు జీవకణముల గుంపులు (Taste buds).

స్వాదుధన్వుఁడు సం. వి. తియ్యవిలుకాడు. మన్మథుడు.

స్వాదుపిండము సం. వి. (జం) సర్వకిణ్వికడుపు అంత్ర మూలముచే నేర్పడిన మడతలో నుండు గ్రంథి (Pancreas). (ఇది మధురసమును ఉత్పత్తిచేయును. దీనిలో సర్వకిణ్వములు ఉండవచ్చును).

స్వాదువు సం. విశ. 1. ఇంపైనది. 2. తియ్యనిది. 3. మంచిది

స్వాదూదము సం. వి మంచినీళ్ళ సముద్రము

స్వాధీనుఁడు సం. విశ. తనకు లోబడైన వాడు.

స్వాధీనపతిక సం వి. స్వాధీనుడైన పెనిమిటి గల నాయిక.

స్వాధ్యాయము సం వి. 1. వేదాధ్యయనము 2. వేదము. 3. జపము.

స్వాధ్యాయి సం వి. వేదాధ్యయనముచేయు వాడు.

స్వానము సం. వి. ధ్వని. రూ. స్వనము.

స్వాపతేయము సం. వి. ధనము.

స్వాపము సం. వి. 1 శయనము. 2 అజ్ఞానము.

స్వాభావికపు ఎరువులు వి. (వ్యవ) స్వతస్సిద్ధముగా లభించు ఎరువులు (Natural manures) ఉదా. పశువుల మూత్రము పచ్చిరొట్ట మొ.

స్వాభావికము సం విణ స్వభావముచేతకలిగినది.

స్వాభావికవర్గీకరణము సం. (జీవ.) మొక్కలను గాని జంతువులనుగాని వాని వాని సహజ స్వభావములనుబట్టియు, పరిణామ దృష్ట్యా వానికిగల పరస్పర సంబంధము ననుసరించియు తరగతులుగా విభజించిన క్రమము (Natural classification).

స్వాభావికాయస్కాంతము సం. (భౌతి.) సహజముగా అయస్కాంతశక్తిని కలిగిన పదార్థము (Natural magnet).

స్వామి సం. వి 1. ఒడయడు. 2. కుమారస్వామి. విణ. అధికారి.

స్వామిని సం. వి. అధికారిణి.

స్వామ్యము సం. వి. హక్కు (Right) అధికారము.

స్వారస్యము సం. వి. (గృహ) నాజూకు, సుకుమారము (Daintiness).

స్వారాజ్యము సం వి స్వర్గలోకపు దొరతనము.

స్వారాట్టు సం వి. ఇంద్రుడు.

స్వారి వి. వాహ్యాళి.

స్వార్థకము సం వి (వ్యాక.) తద్ధితప్రత్యయములు చేరిక ముందున్న అర్థమే చేరినతరువాతకూడ ఉండునట్టిది. ఉదా. చిరుత చిరుతుక, అరమర—అ. మరిక.

స్వార్థత్యాగము సం (గృహ) స్వార్థమును త్యాగముచేయుట (Self sacrifice).

స్వార్థపరము సం. వి. (గృహ.) ఎప్పుడును తన్ను గూర్చిన తలంపులనే కలిగియుండుట (Self-centered)

స్వార్థపరత సం. వి. (గృహ) తన బాగును చూచుకొనుట (Selfishness).

స్వాస్థ్యము సం. వి. 1. నెమ్మది. 2. స్వార్థత.

స్వాహా సం. వి అగ్నిభార్య.

# స్వి

స్విన్నజలము సం వి శుద్ధము చేయబడిన నీరు (Distilled water).

స్విన్నము సం. విణ. 1. స్వేదముతో కూడినది. 2. కరగినది.

# స్వీ

స్వీకర్త సం. విణ. స్వీకరించువాడు,

స్వీకరించు సం. క్రి. అంగీకరించు.

స్వీకారము సం వి. అంగీకారము.

స్వీకృతము సం. విణ అంగీకరింపబడినది,

స్వీయ సం. వి. పతియందుమాత్రమను రాగము గల నాయిక. వ్యతి పరకీయ.

స్వీయము సం. విణ. తనది. వ్యతి. పరకీయము.

# స్వే

స్వేచ్ఛాజలము సం. వి. (వ్యవ). అదనపు పదును. మొక్కలు వేళ్ళచే దీసికొనుటకు వీలుగానుండు మట్టి రేణువులపై పొరగా నంటియుండునీరు (free water).

స్వేచ్ఛావ్యాపారము సం. వి. (అర్థ.) ప్రభుత్వ నియంత్రణ కాని జోక్యము కాని లేని వాణిజ్యము.

స్వేదగ్రంథులు సం. వి. (గృహ.) ఇవి శరీ

రము నుండి కేశనాళికలద్వారా మలిన పదార్థములను నీటితో సహా పీల్చుకొని చెమటరూపమున శరీరము మీదికి విడిచి పెట్టును (Sweat glands)

స్వేదనము నం. వి. (రసా.) మిశ్రమము లోని ద్రవపదార్థము నావిరిగా మార్చి ఆవిరిని చల్లార్చు ద్రవీభవింపచేసి స్వచ్ఛమైన ద్రవమును బడయు విధానము. బాష్పశీల మైన ద్రవమును ఆవిరిగా మార్చి తిరిగి చల్ల చేసి ద్రవముగా మార్చుట (Distillation)

స్వేదనశోధనము నం. వి (రసా.) స్వేదనముచే నొక ద్రవమును శుద్ధపరచుట (Rectification)

స్వేదని నం. వి పెనము.

స్వేదము నం. వి చెమట.

స్వేదజము నం. విశే. చెమటవలన పుట్టినది (పేను మొదలగునవి).

# స్వై

స్వైరి నం. విశే. స్వతంత్రుడు. రూ. స్వైరుడు.

స్వైరిణి నం విశే రంకులాలు, జా. స్త్రీ.

# హ

హ ఒక యక్షరము.

హంకారము వై. వి. 1. అహంకారము. 2. అభిమానము నం. అహంకారః.

హండ నం. వి. వెడల్పునోరుగల పెద్ద పాత్రము రూ. పలుండీ.

హంత నం విశే. హింసించువాడు.

హంభ నం. వి. గోధ్వని. ఆవు అరపు.

హంవీరుడు నం. వి. క్షత్రియుడు. విశే శూరుడు.

హంస నం. వి. 1. అంచ. 2. యోగి. 3. పరమాత్మ. 4. తెల్లగుఱ్ఱము. 5. శరీర వాయు విశేషము. రూ. హంసము.

హంసకము నం వి. కాలియందె.

హంసి నం. వి. ఆడుహంస.

హంసుడు నం వి 1. సూర్యుడు. 2. జీవుడు. 3. విష్ణువు 4. శివుడు. 5. లోభగుణము లేని రాజు.

హక్కు హిం. వి. బాధ్యత.

హక్కులచట్టము, వి. (రాజ.) ఇంగ్లండు పార్లమెంటు 1689 వ సం లో ప్రజాస్వామ్యమును చాటుచు చేసిన శాసనము, ఇంగ్లండు సంవిధానములో ముఖ్యమైన చట్టము.

హక్కులు వి. (పౌర, రాజ.) రాజ్యములో పౌరుడనుభవించు అధికారములు. ఈ హక్కులు రాజ్యముచే గుర్తించి పోషింపబడునవిగా నుండును.

హజ్ హిం. వి. (వరి.) మక్కాకుతీర్థయాత్ర పోవుట, మక్కాను దర్శించుట.

హజారము వి. ఆస్థానమండపము. రూ. అజారము, హజురు, హాజారము

హజ్జ వి. పాదము. రూ. అజ్జ.

హట్టము నం. వి. అంగడివీధి.

హఠము నం వి. 1. పట్టు. 2. బలాత్కారము. 3. ఒకయోగము.

హఠవాది నం. విశే. పట్టుపట్టి సాధించువాడు

హడపము వి. అడపము, వక్కలాకులుంచు కొను బరణి.

**హతి** నం. వి దెబ్బ ఉ. హతి.

**హతుఁడు** నం. విశే. 1. కొట్టబడినవాడు. 2. మనసు చెడినవాడు.

**హత్తి** వై. వి. ఏనుగు రూ అత్తి. నం. హస్తి

**హత్తు** క్రి. అత్తు

**హత్య** నం. వి. చంపుట.

**హదను** వి. అదను

**హద్దు** వి. 1. మేర. ఆజ్ఞ.

**హననము** నం. వి. చంపుట, హత్య.

**హనీకోంబ్** ఇం వి. (గృహ.) (Honey-comb) 1. తేనెపట్టు, తేనెటీగలు తేనెను కూర్చు గూడు. 2. ఒక విధమైన ఎంబ్రాయిడరీ కుట్టు, దీనిని కుచ్చులమీద తేనె పట్టు గదులవలె వచ్చునట్లు కుట్టుదురు.

**హనుమ** వై. వి హనుమంతుడు నం. హనుమాన్

**హనుమంతుఁడు** నం. వి. ఆంజనేయుడు. రూ. హనుమానుడు.

**హనువు** నం. వి. 1. చామ. 2. ఆయుధము 3. చెక్కిలి మీది భాగము నం. (జం.) పైదవుడ ఎముకలలో నొకటి. దీనికికూడ పండ్లు ఉండును. కీటకముల నోటిభాగము లలో నొకటి (Maxilla).

**హయము** నం వి. గుఱ్ఱము. వ్యు త్వరగా పోవునది.

**హరణము** నం. వి 1 హరించుట. 2. అరణము. 3. భాగహారము.

**హరశోతము** నం.వి. (వ్యవ.) అస్వచ్ఛమగు ఘటిక గంధకితము.(Gypsum). (Casoy) చౌటి నేలలను బాగుపరచుటకు దీనిని నేలలో చేర్చుదురు.

**హరించు** నం. క్రి. అడచు. రూ. అడగు, హరియించు.

**హరి** నం. వి. 1. విష్ణువు 2. ఇంద్రుడు. 3. సూర్యుడు. 4. చంద్రుడు. 5. యముడు. 6. గుఱ్ఱము. 7. కోతి 8. పాము. 9. గాలి. 10. కప్ప 11. చిలుక. 12. బంగారువన్నె.

**హరిత పత్రము** నం. వి. (వృక్ష.) ఆకుపచ్చని యాకు (Foliage leaf).

**హరితరేణువులు** నం వి (వృక్ష) పత్ర హరితములోనున్న రేణువులు (Chlorophyll granules)

**హరినము** నం. వి (రసా) ఉప్పులోనున్న ఉపధాతు భాగము (Chlorine). (ఇది మొక్కలకు అవసరమైన ప్రధాన మూల ద్రవ్యములలో నొకటి)

**హరిప్రియ** నం. వి 1. లక్ష్మి. 2. భూమి. 3 తులసి 4, ఏకాదశి.

**హరివాసరము** నం. వి. ఏకాదశి

**హరిహయుఁడు** నం వి. ఇంద్రుడు.

**హరిగ** వి కేడెము, డాలు. రూ అరిగ.

**హరిచందనము** నం వి. 1 చెందిరము. 2. వెన్నెల 3. కల్పవృక్షము.

**హరిజనుడు** నం. వి. అంటరానివాడు. (అస్పృశ్యులకు గాంధీ పెట్టిన పేరు.)

**హరిణము** నం. వి. జింక. విశే. తెల్లనిది.

**హరిణి** నం. వి. ఆడుజింక. విశే. ఆకుపచ్చ వన్నె గలది.

**హరితము** నం. వి. 1. ఆకుపచ్చవన్నె. 2. పచ్చ గుఱ్ఱము. 3. పచ్చపిట్ట. నం. వి. శాకము, కూరాకు.

**హరితాళము** నం. వి. పసుపు రంగుకల ఒక ఖనిజము. వి. హరిదళము, దళము

**హరిత్తు** నం వి, 1. దిక్కు. 2. ఆకుపచ్చ వన్నె. 3. పచ్చగుఱ్ఱము.

**హరిదశ్వుఁడు** నం. వి సూర్యుడు. వ్యు. పచ్చగుఱ్ఱములు కలవాడు.

**హరిదళము** వై. వి. హరితాళము. రూ అరిదళము.

**హరిద్ర** నం. వి పసుపు.

హరిబువ్వము వి. వివాహమైన నాలవనాటి రాత్రి పెండ్లి వారందరు కలిసి వేడుకగా భుజించుట, బూజము బలి అని వాడుక.
హరివాణము నం. వి. 1 పళ్ళెము, తట్టు.
హరుఁడు నం. వి. శివుడు
హరువు విశే. 1. మనోజ్ఞము నాణెము. రూ. హర్వు.
హరుసము వై. వి. హర్షము, సంతోషము. రూ. అరుసము. నం. హర్షః.
హరుసించు వై. క్రి. హర్షించు.
హర్త నం. విశే. హరించువాడు
హర్తాల్ హిం. వి. జాతి, (రాజ) నిరసన సంతాపమునకు సూచనభూతికి చిహ్నముగా సాగుచున్న వ్యవహార విలంబన, అంగళ్లను మూసివేయుట
హర్మ్యము నం. వి. మిద్దెటిల్లు
హర్యక్షము నం. వి. సింహము. వ్యు. పచ్చని కన్నులు కలది
హర్యక్షుడు నం. వి. కుబేరుడు
హర్షణము నం. వి. సంతోషించుట.
హర్షము నం. వి. సంతోషము
హలము నం. వి. నాగలి రూ. హాలము.
హలహలము నం. వి. పాలసముద్రమున పుట్టిన విషము. రూ. హాలహలము. హాలహాలము,. హాః హాలము హాః హాలము
హలాయుధుఁడు నం. వి. బలరాముడు.
హలాస్థులు నం. వి. (శరీ) నాసాస్థులకు పైన పుఱ్ఱెలో మూడు రేఖలుగల ఎముకలు (Vomers).
హలి నం. వి. 1. నాగలి. 2 బలరాముడు. 2. పొలముదున్నువాడు.
హలికుఁడు నం. వి. పొలముదున్నువాడు. రూ. హాలికుడు.
హల్య నం. వి. నాగళ్ళ సమూహము.
హల్లకము నం. వి. చెంగలువ.
హల్లకల్లోలము విశే. అల్లకల్లోలము.
హల్లీసకము నం. వి. స్త్రీలు పెక్కండ్రుచేరి మండలాకారముగ తిరుగుచుచేయు నృత్యము.
హల్లు నం. వి. వ్యంజనము (కకారాద్యక్షరములు).
హవణించు క్రి. 1. అలంకరించు 2. ధరించు 3 చక్కబరచు. 3 ఉంచు.
హవణిక వి. అలంకారము.
హవణిల్లు క్రి. 1. ప్రకాశించు. 2. విజృంభించు
హవణు వి. ఒప్పిదము
హవనము నం. వి. హోమము.
హవము నం. వి. 1. ఆజ్ఞ. 2. పిలుపు. 3. యజ్ఞము.
హవిస్సు నం. వి. వేల్చుటకు ఇగుర పెట్టిన అన్నము.
హవ్యవాహనుఁడు నం. వి. అగ్ని. రూ. హవ్యవాహుడు.
హసంతి నం. వి. కుంపటి. రూ. హసని.
హసనము నం. వి. హాసము.
హసనవాయువు నం. వి. (రసా.) పీల్చినచో హర్షమును జనింపచేయు నైట్రస్ ఆక్సైడ్ ఈ పేర వ్యవహరింపబడును (Laughing gas).
హసించు నం. క్రి. నవ్వు.
హసాదు వి. అవ్య. పెద్దల యాజ్ఞను విధేయులంగీకరించుటయందు దుష్ప్రయోగించునది. రూ. అసాదు.
హసితము నం. వి. పండ్లు కనబడునట్లు నవ్వెడి నవ్వు.
హస్త నం. వి. నక్షత్రముల యందొకటి.
హస్తకళలు నం. వి. (అర్థ) చేతిపనులు.
హస్తము నం. వి. 1. చేయి 2. తొండము. 3. మూర,
హస్తాకారము నం. విశే. (వృక్ష.) చేతివ్రేళ్ళ వలె చీలియుండునది (ఆకు) (Palmatifid)
హస్తి నం. వి. ఏనుగు. వ్యు. హస్తముకలది.

హస్తినఖుఁడు నం. వి. మావటీడు.
హస్తిని నం. వి 1 ఆడేనుగు. 2. ఒక స్త్రీ జాతి. (శంఖినీ, పద్మినీ, చిత్రిణీ జాతులితరములు )
హళఁది వై వి. 1. అళది పసుపు. 2 పసుపువన్నె. నం. హాలదీ.
హళహళి నం. వి. 1. త్వర. 2. కలకలధ్వని 2. శౌర్యము. రూ. హాళహాళిక. హాళాహాళి.

# హా

హా నం. అవ్య. ఆశ్చర్య సంతాపార్థకము రూ. హాహా.
హాంగర్స్ ఇం. వి. (గృహ) (Hangers) దుస్తులను ముడుతలుపడకుండ నఁచుటకు వ్రేలాడ దీయుటకు సుపయోగవడు కర్ర లేక ఇనుపతీగ చట్రములు
హాండిక్రాఫ్ట్స్ ఇం. వి (వాణి.) (Handicrafts) చేతిపనులు.
హాజారము వి. 1. హజారము 2. తలవాకిలి
హాటకము నం వి. 1. బంగారు 2.ఉమ్మెత
హాటకగర్భుఁడు నం. వి. బ్రహ్మ హిరణ్యగర్భుడు.
హాని నం. వి. 1. తక్కువగుట 2 కీడు.
హామిక వై. వి. అహామిక, మదము రూ. అమిక.
హాయనము నం. వి. 1. సంవత్సరము. 2 కిణము.
హాయి వి సౌఖ్యము 2. నెమ్మది.
హారకుఁడు నం. వి. 1. దొంగ 2 జూదరి.
హారతి వై. వి. ఆరతి. నం. ఆరాత్రికమ్.
హారతి కర్పూరము నం. వి. (వృవ.) (Lauraceae) అనుకుటుంబమునకుచెందిన Laurus camphor అను చెట్టువేళ్ళు కాండములనుండి ఈద్రవ్యమును అస్థిర తైలమును తీయుదురు (Camphor).
హారము నం, వి. 1. నూట యెనిమిది పేటల ముత్యాలహారము, 2. యుద్ధము, 3. మాల. (గణి.) భిన్నములోని క్రింది భాగము 1/2 అనుభిన్నములో 2అనునది 'హారము' (Denominaton).
హారాత్మకఖండము నం. వి. (గణి.) ఒక సరళరేఖా ఖండము అంతరముగాను, బాహ్యముగాను ఒకేనిష్పత్తిలో ఖండించబడుట (Hormonic section).
హారాత్మకశ్రేణి నం. విశే. (గణి ) వ్యుత్క్రమ రాసుల అంకగణిత శ్రేణిలో నుండెడి శ్రేణి. (Hormonic progression).
హారి నం విశే. 1. మనోజ్ఞము, 2. హరించువాడు, 3. హారముకలవాడు.
హారిద్రము నం. వి పసుపువన్నె.
హార్దము నం. వి. స్నేహము విశే. హృదయ సంబంధమైనది.
హార్బరు ఇం. (భూగో.) ఓడరేవు (Harbour).
హార్మోన్స్ ఇం.వి. (గృహ.) (Harmones) నిర్నాళ గ్రంథులలో ఊరు రసము., (ఇవి శరీర క్రియలను క్రమపరచును) అంతస్స్రావములు.
హార్యము నం. విశే. హరింపదగినది.
హాల నం. వి. సారాయి.
హాలము నం. వి. నాగలి. రూ. హలము.
హాలహాలము నం, వి హాలహలము.
హాలికుఁడు నం. వి. హాలికుడు.
హావడి వి. ఉపద్రవము. రూ. ఆవడి.
హావము నం. వి. భ్రూనేత్రాది వికారములచే కొంచెము తెలియదగిన మనోవికారము,

హాసనము: సం. వి. నవ్వు (ఆరు విధములు స్మితము, హసితము విహసితము, ప్రహసితము, అపహసితము, అతిహసితము).

హాస్యము సం. వి. 1. నవ్వు, 2. గేలి. 3. (అలం) ఒక రసము.

హాళి వి. ఆసక్తి.

# హి

హింగువు సం. వి. ఇంగువ,

హింగుళము సం. వి. ఇంగిలికము, ఎఱ్ఱని ఒక ద్రవ్యము.

హింగుళము సం. వి. (రసా) రససిందూరము, పాదరసము గంధకముగల యౌగికము(Cinnabar) (గంధకిద పారదము= మెర్క్యూరిక్ సల్ఫైడ్).

హిండనము సం. వి.1. వ్యాప్తి 2 భ్రమణము

హిండితము సం. విశ. వ్యాపించినది.

హింతాలము సం. వి. గిరికి తాటిచెట్టు.

హింస సం. వి. 1. చంపుట, 2 బాధించుట

హింసకుఁడు సం విశ. హింసించువాడు.

హింసనము సం వి హింసించుట.

హింస్రము సం. విశ, చంపునది.

హిక్క సం. వి. 1. ఎక్కిలి, 2 పైడికంటి యను పక్షి.

హిజరీశకము వి. (చరి) ఇస్లాము మత ప్రవక్త అయిన మహమ్మదు మదీనాకు క్రీ. శ. 622 లో పలాయన మైనప్పటి నుండి ఆరంభమగును. హిం. హిజ్రీ

హిజారు వి. కాలికి తొడిగికొనుచట్టు యూ. ఇజారు.

హితకార నిరంకుశ ప్రభుత్వము సం. వి. (చరి) క్రీ. శ. 17, 18 శతాబ్దములలో ఐరోపాఖండమును పాలించిన నిరంకుశ ప్రభువుల రాజ్యవిధానము

హితము సం. విశ. 1. వెనుకటికి మేలు చేయునది, 2. ధరింపబడినది. 3. పోయినది. 4. ఉంచబడినది, 5. తగినది, 6. ఇష్టము.

హితవు వై. విశ హితము, ఇతవు, మంచి

హితవరి వై. విశ ఇతవుచెప్పువాడు

హితైషి సం. విశ. మంచినికోరువాడు

హిమకరుఁడు సం వి చంద్రుడు.

హిమధాముఁడు సం. వి చంద్రుడు.

హిమపవనము సం వి (భూగో.) తీవ్ర మైనమంచు తుఫాను

హిమప్రపాతము సం వి (భూగో) తీవ్ర వేగముచే పెద్దమంచు శిలలు కరిగి కొట్టుకొని పోవుట (Avalanche).

హిమరేఖ సం. వి. (భూగో) ఎప్పటికిని మంచుకరగని పర్వతపు మట్టము

హిమవంతము సం. వి. చలిమల, హిమాలయము.

హిమవాలుక సం వి కప్పురము,కర్పూరము,

హిమశిఖరము సం వి. (భూగో.) ధ్రువముల ద్ద .ల్లప్పుడు మంచు కరడు గట్టి యున్న ప్రదేశము.

హిమశిలలు సం. వి. (భూగో.) సముద్రము పై తేలియాడు ఆర్కిటిక్ ప్రాంతపు మంచు గడ్డలు.

హిమాంబువు సం. వి. పన్నీరు.

హిమాంశువు సం వి చంద్రుడు.

హిమాని సం. వి హిమసమూహము.

హిమానీనదము సం వి కదలుచున్న మంచు, నది (ఈ నదులు కొండలోయలలో నేర్పడును. ఇవి చాల పొడుగుగా నుండి సంవత్సరమునకు కొద్ది అడుగులు మాత్రమే ఎత్తు ప్రదేశములనుండి దిగువగా పారును. ఉష్ణోగ్రత హెచ్చు అగుకొలది ప్రవాహవేగము హెచ్చగును.)

హిమిక సం. వి. మంచు.

హిరణ్మయము సం. విశే. బంగారుతో నిండినది.

హిరణ్యగర్భుఁడు సం. వి. బ్రహ్మ.

హిరణ్యము సం. వి. 1. బంగారు. 2. మాడ. 3. ధనము. 4. రేతస్సు. 5. గవ్వ.

హిరణ్యరేతసుఁడు సం. వి. 1. అగ్ని. 2. సూర్యుడు. రూ. హిరణ్యరేతుడు.

హిస్టీరియా ఇం. వి. (గృహ.) (Hysteria) సూతికా వాయువు మనో వికారంముచే అన్ని విధములైన నాడులు, అక్రమముగా పనిచేయుటచే కలుగు వికారపు చేష్టలు. (ఇది సాధారణముగా బలహీనము చేతను ఆశాభంగము చేతను యువతులకు వచ్చు వ్యాధి.)

## హీ

హీనధాతువు సం. వి. (రసా.) గాలికి, నీటికి సులభముగా మార్పు చెందగల ధాతువు (Basemetal). ఉదా. ఇనుము, రాగి, జింకు, సీసము.

హీనము సం. విశే. 1. తక్కువైనది. 2. దూరతగినది. 3. విడువబడినది.

హీనయానము సం. వి. (మత.) బుద్ధుడు మొదట బోధించిన ప్రకారమే బౌద్ధ ధర్మము ఉండవలయుననియు, బౌద్ధ ధర్మములో మార్పులు తేరాదనియు వాదించు సనాతన బౌద్ధ ధర్మము (ప్రతి మానవుడు బోధిసత్వుడు కాలేడని హీన యాన వాదుల అభిప్రాయము.)

హీనవృద్ధిన్యాయము సం. వి. ఉత్పత్తి పెరుగుటవలన ఖర్చులు పెరుగుచుండుట. (ఈ న్యాయము ఆచరణము లోనికి వచ్చినప్పుడు సగటు ఖర్చులు పెరుగుచుండును.

హీమోగ్లోబిన్ ఇం. వి (Haemoglobin) ప్రాణవాయువును గ్రహించి తీసికొనిపోవు రక్తమునందలి ఎఱ్ఱనిపదార్థము.

హీర సం. వి. 1. లక్ష్మి. 2. చీమ.

హీరము సం. వి. వజ్రమణి, గవ్వ.

హీలియమ్ ఇం. వి. (రసా.) (Helium) (సూర్యమండలము నందున్నట్లు 1868లో ఊహించబడిన) రంగు వాసన లేని ఒక జడవాయువు.

## హుం

హుంకారము సం. వి. హుమ్మని ధ్వనించుట రూ. హుంకృతి.

హుంకారించు సం. క్రి. హుమ్మని ధ్వనించు హుంకరించు.

హుండీ వి. (అర్థ.) దేశీయ వినిమయ ధన పత్రము.

హుటాహుటి వి. గమన వేగము. విశే. వేగవంతము.

హుడుక్క సం. వి. ఉడుక అనుచర్మ వాద్య విశేషము. రూ హుడక్కము.

హుతము సం. విశే. వేల్వబడినది.

హుతభుక్కు సం. వి. అగ్ని.

హుతవహుఁడు సం. వి. అగ్ని.

హుతాశనుఁడు సం. వి. అగ్ని.

హుమా వి. గుల్లము. రూ. హుమాయి.

హుషుమత్తు విశే. గొప్ప. రూ. హుష్మత్తు.

హుళిక్కి వి. అభావము. రూ. హుళికి.

## హూ

హూణము సం. వి హూణదేశము.

హూతి సం. వి. పిలుపు. రూ అహూతి.

## హృ

హృతము సం. విశే. హరింపబడినది. రూ. ఆహ్వానము,

హృతి సం వి. హరణము. రూ. అహ్వృతి.

హృత్కాష్ఠము సం. వి. (వృక్ష.) పెద్దపెద్ద వృక్షకాండముల దారువులో గట్టిగా నల్లగా నగుపడు దారు భాగము(Heart-wood or duramen)దీనిగుండా నీరుగాని ద్రావణములుగాని ప్రసరించవు.

హృత్కుంచనము సం. వి. (జం.) హృదయములోని కండర భిత్తికలన్నియులోని రక్తమును బయటకిప పుటకు సంకోచము నొందు స్థితి (Systole).

హృత్కోశము సం. వి. (జం.) గుండెకాయ చుట్టును ఉండు సంచి (Pericardium).

హృదయంగమముసం.విశే. మనస్సుకింపైనది.

హృదయము సం. వి. మనస్సు, గుండె, రొమ్ము. రూ. హృది. (జం) గుండెకాయ గుండె (Heart).

హృదయవ్యాకోచము సం. వి. (జం.) కండరములతో నేర్పడిన హృదయము యొక్క గోడలు ఒకసారి ముడుచుకొనినతరువాత తిరిగి యథాస్థితికివచ్చుట (Diastole)

హృదయస్పందనము సం. వి. (గృహ.) గుండెకొట్టుకొనుట (Heart beat).

హృదయాకారము సం. వి. (వృక్ష.) ఆకారములో హృదయమువలె లేత అరటుచుక్క వలెనున్నది (Cordate):

హృదయాళువు సం. విశే. మంచిమనస్సు కలవాడు.

హృద్యము సం. విశే. మనస్సు కింపైనది. మదికి హితమైనది.

హృదజ్జువులు సం. వి. (జం.) సూత్రదండకములు, గుండెలోనున్న కర్ణిక, జఠరిక కవాటముల యొక్క అంచులు జఠరిక యొక్క కండరములకు కలుపుతాళ్ళు (Chardae tendineae)

హృషీకము సం. వి, ఇంద్రియము.

హృషీకేశుడు సం. వి. విష్ణువు.

## హె

హెమ్‌స్టిచ్ ఆం. వి. (గృహ)(Hem-stitch)పోగుతీతపై వాడుకుట్టు.


హెంస్టిచ్

హెక్టార్ ఆం. వి. (Hectare)సుమారురెండున్నర ఎకరముల పొలము. [247 సెంట్లు కొలతగల భూభాగము.

హెగ్గడి వై. వి హేడకుడు, అంతఃపురపు

హెగ్గడికత్తె వై. వి. అంతఃపురపు కావలికత్తె

హెగ్గడికాడు వి అంతఃపురపు కావలివాడు.

హెచ్చరిక వి. 1. అవధానము. 2. సూచన. రూ. ఎచ్చరిక, ఎచ్చరము.

హెచ్చరిల్లు క్రి. ఎచ్చరిల్లు, వర్ధిల్లు.

హెచ్చు క్రి. అధికమగు. రూ. ఎచ్చు.

హెబియస్ కార్పస్ ఆం. వి.(శాస.)(Habeas

corpus) విచారణలేకుండ నిర్బంధించిన పౌరుని న్యాయస్థానమందు హాజరుపెట్టి నిర్బంధించుటకు కారణము తెల్పుమని కోర్టు యిచ్చు ఉత్తరువు.

హెలికాప్టర్ ఇం.వి (Helicopter) నిట్టనిలువున పైకివెళ్ళి దిగగల చిన్న విమానము.

## హే

హేజీబు వి. మంత్రి.

హేడుఁడు సం. వి. పొగ్గడి. సం. విశే. మూఢుడు.

హేతి సం.వి. 1. అగ్నిశిఖ, మంట. 2. సూర్య కిరణము. 3 ఆయుధము.

హేతువు సం. వి. కారణము.

హేమంతము సం. వి. ఒక ఋతువు, మంచు కాలము, మార్గశిర, పుష్య మాసములు హేమంత ఋతువు.

హేమము సం.వి. 1. బంగారు. 2. ఉమ్మెత్త.

హేమించు సం.క్రి. బంగారగు.

హేమకారుఁడు సం. వి. అగసాలెవాడు.

హేమాద్రి సం. వి. బంగారుకొండ మేరువు.

హేయము సం. విశే. 1. రోతయైనది. 2. విడువదగినది

హేరంబుఁడు సం. వి. విఘ్నేశ్వరుడు. విశే. శౌర్యముచే గర్వించినవాడు.

హేరవళి వి. పాదవస్నకోక.రూ. హేరావళి

హేరామి వి. హింసించుట.

హేరాళము సం. విశే. అధికము.

హేల సం. వి 1. భ్రూనేత్రాది వికారములచే చక్కగా తెలియదగిన మనోవికారము 2. తిరస్కారము.

హేలోజెనీకరణము సం. వి. (రసా.) ఏదేని ద్రవ్యమును లవణజనకముతో రాసాయనికముగ సంయోగించునట్లు చేయుట (Helogenation).

హేవాకము సం. వి, 1 ప్రౌఢిమ. 2. తెలివి.

హేవిళంబి సం. వి. అరువది సంవత్సరములలో నొకటి.

హేష సం. వి. గుఱ్ఱపుసకిలింత. రూ. హేషితము.

హేళనము సం. వి 1. ఎగతాళి. 2. తిరస్కరించుట.

హేళి సం వి. 1. సూర్యుడు. 2. ఆలింగనము.

## హై

హైందవధర్మము సం, వి. భారతదేశములో వైదిక ధర్మముల సంపర్కము వలన కలిగిన జీవితవిధానము.

హైందవ నాగరికత సం. వి. (చరి.) ఆర్య నాగరికత, ఆర్యానార్య నాగరికతల కలయిక వలన ఏర్పడిన విశేష భారత నాగరికత.

హైకోర్టు ఇం. వి. (శాస.) (High-Court). రాష్ట్రమందలి ఉన్నత న్యాయస్థానము. క్రింద కోర్టుల నుండి అప్పీళ్ళు వినుటకు, సంవిధానపు హక్కులు కాపాడుటకు అధికారము గల న్యాయస్థానము.

హైడ్రోజనేషన్ ఇం వి. (గృహ.) (Hydrogenation) నూనెలను నెయ్యివలె పేరుకొనునట్లు చేయుటకు ఉదజనిని తగు పాళ్ళలో కలుపుట (Dalda).

హైన్యము సం. వి. హీనత్వము.

హైపర్ హైటమినోసిస్ ఇం. (గృహ., వి)

(Hypervitaminosis) కొన్ని విటమినులు ఎక్కువగుటచే శరీరమునకు కలుగు హాని ఉదా. ఎండదెబ్బ.

హైపాన్‌థోడియం ఇం. వి. (వృక్ష) (Hypanthodium) ఇది ఒక



ప్రత్యేకపుష్పమంజరి హైపాన్‌థోడియం పుష్పదండము మొక్కపీనాతము (Swollen receptacle) ఒకకుహారమువలె నేర్పడి దాని లోపలి భిత్తికకు పుష్పము లుండును. పుష్పమంజరి పైభాగమున నొక రంధ్రముండును. ఉదా. అత్తి, రావి, మఱ్ఱి.

హైపో ఇం. వి. (Hypo) హైపో థయోసల్ఫేటు, ఒక గంధకముగల రాసాయనిక లవణము. సోడియమ్ థయోసల్ఫేటు.

హైబ్రిడ్ ఇం వి. (Hybrid) సంకర జాతికి చెందిన, మిశ్రమమైన, ఉదా. హైబ్రిడ్ జొన్నలు.

హైమనము సం. వి. మార్గశీర్షము. విశే. 1 మంచుచే కలిగినది. 2 బంగారుచే కలిగినది.

హైమము సం. వి. వేకువనుమంచుచే కలిగిన జలము. విశే. బంగారుచే కలిగినది.

హైమవతి సం. వి. 1. పార్వతి. 2. గంగ. 3. హిమవంతునిపుత్రిక.

హైయంగవీనము సం. వి. తొలినాడు చిలికి యెత్తిన ఆవు వెన్న లేక వెన్నకాచిన నేయి.

## హొ

హొంత వి. పరిశ్రమము.

హొంతకాఁడు వి. జెట్టివాడు.

హొంతకాఁరి జెట్టివాడు.

హొంబట్టు వి. బంగారుపట్టు.

హొన్ను వి. బంగారు, పొన్ను.

హొమ్ము విశే. స్థూలము. రూ. ఒమ్ము.

హొయలు వి. (ని. బహు.) విలాసము.

## హో

హోంరూల్ ఉద్యమము మి. వి. (చరి.) భారతదేశము బ్రిటిష్ సామ్రాజ్యములో అంతర్గతముగా నుండి భారతీయులకు స్వపరిపాలన కావలయునని క్రీ.శ.1916వ సం॥ శ్రీ అనిబిసెంటు సతి, గంగాధర్ తిలక్ నడిపిన ఉద్యమము.

హోడము సం. నావ, ఓడ.

హోత సం. వి. ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు, రూ. హోత్రి.

హోమము సం. వి. వేల్మి. యజ్ఞము.

హోర సం. వి. 1. అహోరాత్రము. 2. రాశ్యర్థము. 3. గుంట.

హోరాట వి. ఆటోపము.

హోరాహోరి వి. నిర్విరామము.

హోళిక స. వి. హోళీ, శత్యునిశేషము.

హోళీపండుగ వి. కామదహనము (ఫాల్గుణ శుద్ధ పూర్ణిమనాడు జరుగు పండుగ).

హోస్‌పైప్ ఇం. వి. (గృహ) (Hose pipe) నీరు పారించుట కుపయోగించు రబ్బరు గొట్టము. (ఈ గొట్టము ఒక కొనను కుళాయికి అమర్చి రెండవ కొనను నీరు పెట్టవలసిన స్థలమునకు లాగికొనిపోయి నీటిని పారనిచ్చుట కుపయోగింతురు).

## హౌ

హౌసు వి. సొగసు, ఒయ్యారము. రూ. హావుసు

## హ్యూ

హ్యూ ఇం. (గృహ.) (Hue) 1. వన్నె, ఛాయ, 2. కేక, అరుపు.

హ్యూమసము ఇం. వి. (వ్యవ.) సేంద్రియ పదార్థము చీకుటచే నేలలో నేర్పడు నొక విధమగు ద్రవ్యము (Humus).

## హ్ర

హ్రదము సం. వి. పటినడుమ లోతుగల చోటు, మడుగు.

హ్రసిష్ఠము సం. విశే. మిక్కిలి పొట్టిది.

హ్రస్వదృష్టి సం. వి. (శాస్త్రీ.) దగ్గరనున్న వస్తువులే కనిపించుదృష్టి (Short-sight) దూరపు వస్తువులు సరిగా కనిపించక పోవుట.

హ్రస్వము సం. విశే. కురుచ, పొట్టి.

## హ్రా

హ్రాదిని సం. వి. 1. వజ్రాయుధము. 2. ఏరు. 3. మెరుపు.

హ్రాసనము సం. వి. (శాస్త్రీ.) తగ్గించుట (Reduction). (రసా.) ఒక రసాయనిక యౌగిక మందలిఆమ్లజనిపాలునుతగ్గించుట.

## హ్రి

హ్రిణీయ సం. వి. 1. సిగ్గు. 2. రోత. రూ. హ్రిణీయ.

## హ్రీ

హ్రీ సం. వి. సిగ్గు.

హ్రీణము సం. విశే. సిగ్గునొందినది. రూ. హ్రీతము.

హ్రీణుఁడు సం. విశే. సిగ్గుపడ్డవాడు. రూ. హ్రీతుడు.

హ్రీబేరము సం. వి. కురువేరు.

## హ్రే

హ్రేష సం. వి. గుఱ్ఱపు సకిలింత, హేష.

హ్రేషితము సం. వి. హ్రేష.

## హ్లా

హ్లాదనము సం. వి. సంతోషించుట, సంతోషము. రూ. హ్లాదము.

హ్లాదితము సం. విశే. సంతోషింపబడినది.

## హ్వీ

హ్వీట్‌స్టన్ సేతువు మి. వి. (భౌతి.) ద్రవములు, ఘనములు విద్యుద్వాహకతను కనుగొనుట కుపయోగించు నిరోధకముల విన్యాసము. (Wheat-stone bridge).